





# చరిత్ర

హిందూ దేశ,ఆంధ్రుల,సాహిత్య,తత్వ

## ఆంధ్ర భాషా చరిత్రము- 1 ,2





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఆంధ్ర విశ్వకళాపరిషద్ గ్రంథమాల

( 18-వ ప్రచురణము )

శ్రీః

# ఆంధ్రభాషాచరిత్రము

కర్త:

చిలుకూరి నారాయణరావు, ఎమ్. ఏ., ఎల్. టి., పి హెచ్. డీ

సంస్కృతాంధ్ర కర్ణాటక భాషాధ్యాపకుఁడు,

రాయలసీమ కళాశాల, అనంతపురము.

1-వ భాగము.




వాల్తేరు.

1 9 3 7

మద్రాసు:

ఆనంద ముద్రణాలయమునందు

ముద్రితము.

 [రూ. 6-0-0

# పీఠిక.

అన్ని దేశములలోను జనులందఱును నొక్కటే భాష నెందుకు మాట్లాడరు? శబ్దములు మొట్టమొదట నెట్లుత్పత్తి నొందినవి? మాటకును నది తెలియజేయు వస్తువునకును గల సంబంధమేమి? ఒక మనుష్యునికిఁగాని, ఒక వస్తువునకుఁగాని, యున్న పేరే యేల యుండవలెను? మఱియొక పే రెందుకు లేదు?—ఇట్టి ప్రశ్నలు మనుష్యులు తమ భాషనుగుఱించి యాలోచింప మొదలుపెట్టిన నాఁటనుండియు కలుగుచునే యున్నవి. పూర్వకాలమున నిట్టి ప్రశ్నలకు సమాధానములు మతమునకు సంబంధించి యుండెడివి. దైవమో, ఏదో యొక పేరుగల దేవుఁడో భాషను సృజించినాఁడనియో, లేదా, దేవుఁడు జంతువులనన్నిటిని మొట్టమొదట సృష్టినందిన పురుషునియొద్దకు తీసికొనిపోఁగా, ఆ మనుష్యుఁడు వానికి పేళ్లుపెట్టినాఁ డనియో, సమాధానము చెప్పుచుండెడివారు. మనుష్యుఁడు చేసిన పాపములకును, నతని యహంభావమునకును దండనముగా మనుష్యులభాషలలో ననేకత్వము సంభవించినదని బైబిలు ప్రాచీన భాగమునందు తెలుపఁబడియున్నది. యూదు లిట్టి సామాన్యప్రశ్నములను గూర్చికాక స్వయంవ్యక్తములు కాని కొన్ని సంజ్ఞావాచకశబ్దముల లను గూర్చి విచారించుచుండెడివారు.

గ్రీకు వైయాకరణులుకూడ నిట్టి వ్యుత్పత్తులనుగూర్చియే వాదములు చేయుచుండిరి. కాని, వారి వ్యుత్పత్తులు శాస్త్రీయములుకాక, ధ్వనిసామ్యము ననుసరించి యుండెను. ఊహాచేత కిట్టించిన వ్యుత్పత్తులతో వారు తృప్తిపడుచుండెడివారు. అయినను, వా రిట్టి స్వల్పవిషయములనేకాక, మాటలు తాము తెలియఁజేయు భావములకు స్వాభావికములును, ఆవశ్యకములును నయిన చిహ్నములా? లేక, సాంకేతికములును, ఇచ్ఛాధీనముగ నేర్పరుపఁబడినవియు నయిన గుఱుతులా? ఆయా భావముల కాయామాటలనేకాని, ఇతర శబ్దముల నుపయోగింప వీలులేదా?—అనునిట్టి సామాన్య విషయములనుగుఱించి కూడ నెక్కువగా వాదములు చేసియుండిరి. ప్లేటో వ్రాసిన "క్రేటిలాస్" అను గ్రంథమువంటి గ్రంథములలో నిట్టి యనంతములయిన వాదములు కనఁబడుచున్నవి. వీని కొకదారియు నొకతెన్నును నుండదు; సిద్ధాంతము తేలదు. వారి వాదమున కాధారము తమ గ్రీకుభాష మాత్రమే యగుటచేత నొక సిద్ధాంతమును తేల్చుటకు వీలు లేకపోయినది. ఇట్టివాదములే చాలకాలమువఱకును జరిగినవి. పరస్పర సామ్యభాషాశాస్త్రమును గుఱించి (Comparative Philo-

logy) యొక శతాబ్దమునుండియు కృషి జరుగుచున్నను, నిప్పటికి నిట్టి ప్రశ్నలకు సరియైన సమాధాన మిదియని చెప్ప వీలులేదు. గ్రీసుదేశములో భాష స్వాభావికమనియు (phusei), సాంకేతికమనియు (thesei) వాదించువారు రెండు పక్షములుగా నేర్పడి ఘోరముగా వాదములు చేసినారు. సోక్రెటీసను తత్త్వవేత్త శబ్దమునకును వస్తువునకును స్వాభావికమైన సంబంధ మేమియు లేదని యొప్పుకొన్నను, నట్టి స్వాభావికసంబంధముగల భాషయొకటియావశ్యకమని యభిప్రాయపడినాఁడు. ఈ యభిప్రాయము ననుసరించియే బిషప్పు విల్కిన్సు మొదలయిన నవీనులు తాత్త్వికభాషానిర్మాణమునకుఁ బ్రయత్నములు చేసినారు.

పైని చెప్పఁబడిన వాదము లెంత మనోహరములుగా నున్నను, నవి శాస్త్రీయములని చెప్ప వీలులేదు. భాషావిషయముల నొకచోటఁ జేర్చి, వానిని వర్గీకరించి, అందువలన తేలిన సామాన్యసూత్రముల నేర్పరించుటయే భాషాశాస్త్రము చేయవలసిన పని. గ్రీకు వైయాకరణు లట్టిపనిని చేయలేదు. శాస్త్రీయముగా భాషావిషయమై తత్త్వదృష్టితో నాలోచించినవారు ప్రాచీనభారతవర్షీయులు. ప్రాచీనవేదభాష కొన్నిపట్టుల దుర్గ్రాహమయ్యెను; కాని, వేదమతప్రాబల్యముచేత మంత్రములలోని యొక మాత్రయైనను తప్పకుండ, తరువాతి తరములవారు వేదములను కాపాడుకొనుచు వచ్చినారు. స్వల్పవిషయములలోఁ గూడ వేదములలో నెట్టి వ్యత్యాసమును కలుగ లేదు. ఇందువలన ధ్వనులను సంస్కృతవైయాకరణులు స్థాన, కరణ, ప్రయత్నాది భేదములతో వర్గీకరణముచేసి, వ్యాకరణరూపముల నద్భుతముగా నేర్పరించి, కృత్రిమమును సాంకేతికమును నయినను, నల్పాక్షరత్వాసందిగ్ధత్వాది నియమములతో నాశ్చర్యకరముగ భాషాశాస్త్రమును రచించినారు. ఈ ప్రాచ్యపద్ధతికిని పాశ్చాత్యపద్ధతికిని చాల భేదమున్నది. పాణిన్యాదుల గ్రంథములను పఠించిన పాశ్చాత్యుల కీపద్ధతి యద్భుతావహమైనది. అందుచేత నే, సంస్కృత వ్యాకరణ సంజ్ఞలను పాశ్చాత్య భాషాశాస్త్రజ్ఞులు కూడఁ గొన్నిటి నవలంబించి యిప్పటికిని వానిని విడువలే కున్నారు.

ఐరోపాఖండములో భాషాశాస్త్రము మొదట గ్రీసుదేశములోను, తరువాత రోములోను చాల మందముగా నభివృద్ధి పొందినది. అరిస్టాటిలు మొట్టమొదట భాషాభాగముల నేర్పాటుచేసి, విభక్తియను నూహను బయలుపఱిచినాఁడు. ఈతఁ డారంభించినదానిని స్టోయికులు (Stoics) అను తత్త్వవాదులు సాగించినారు; వీరు కల్పించిన వ్యాకరణ విభాగములను, సంజ్ఞలను తరువాతివారు కూడ నవలంబించినారు కాని, యా సంజ్ఞలు లాటినుభాషలో నుండుటచేత, వానికి తప్పు టర్థములను కల్పించినారు. 'జెనికె' (genikē)

అనగా 'విశేషవిభక్తి' అను నర్థమున వాడినదానిని 'జెనిటివుస్' (genitivus) 'ఉత్పత్తివిభక్తి' అను నర్థమునను, 'ఐతిఆతికె' (aitiatikē) అనగా కర్మ విభక్తి యను నర్థము కలదానిని 'ఐతిఆఓమై' (aitiaomai) 'నిందించుచున్నాను' అను నర్థమునను వాడినారు. తరువాతికాలమున నలగ్జాండ్రియా పట్టణమున వైయాకరణులు బయలుదేరినారు. పూర్వకవుల కావ్యముల కర్థము దుర్గ్రాహముకాఁగా, వాని కర్థము చెప్పుటయే వీరి ముఖ్యోద్దేశమయ్యెను. వీరు విభక్తి విశేషములను గుఱించియు, మాటల యర్థములను గుఱించియు కృషిచేసి, సామ్యము, సామ్యరాహిత్యము, అను రెండు విషయములనుబట్టి యాయా విభాగములను చేసినారు. కాని, భాషాస్వభావమును గూర్చిన జ్ఞానము నలగ్జాండ్రియా వైయాకరణులుగాని, వారి ననుసరించిన తరువాతి రోముదేశపు వైయాకరణులుగాని వృద్ధిపొందింపలేదు. అందుచేత చాలకాలమువఱకును వ్యుత్పత్తి శాస్త్రము (నిరుక్తము) బాల్యావస్థలోనే నిలిచిపోయినది.

ఐరోపాలో మధ్య యుగమునఁ గూడ భాషాశాస్త్ర మభివృద్ధి పొందలేదు. చర్చి ప్రాబల్య మెక్కువగా నుండుటచేతను, చర్చి అవలంబించిన భాష లాటినుభాష యగుటచేతను, లాటినుభాషను, ఆనాఁటి నాగరకతనుగుఱించియు మాత్రమే యా కాలములో కృషిచేయుచుండెడివారు. కాని, ఈ లాటిను భాష నప్పటిపండితులు శాస్త్రదృష్టితో పరిశీలింపలేదు. ఒకదాని తరువాత నింకొకటిగాఁ బొడచూపుచుండిన దేశభాషలనుగుఱించి వారు మొదలే యాలోచింపలేదు.

మధ్యయుగ మంతరించిన వెంటనే యైరోపాలో జాతీయోజ్జీవనము కలిగినది. అందుమూలమున నన్నివిషయములందును విశాలదృష్టి యుదయించినది. లాటినుభాషకుఁ దోడుగా గ్రీకుభాషకుఁ గూడ ప్రాముఖ్యము కలిగినది. లాటినువాఙ్మయమున నుత్తమగ్రంథపఠనము మూలమున ప్రమాణ లాటినుభాషా పరిశోధనము హెచ్చయి వ్యాకరణముఁ గూర్చిన కృషి ప్రబలినది. పండితు లందఱు నప్పటినుండియు సిసిరో వ్రాసిన లాటిను భాషను పరమలక్ష్యముగా నుంచుకొని, యతనివలె వ్రాయుటకు ప్రయత్నములుచేయ నారంభించిరి. ఈలోఁగా దేశభాషలలో వాఙ్మయ సృష్టి కలుగుటచేతను, వాని ప్రాధాన్య మెక్కువ యగుచుండుటచేతను, నంతర్జాతీయ సహవాసమును వ్యాపారమును నభివృద్ధి యగుటచేతను, ఐరోపాలోని దేశభాషలను గూర్చిన వ్యాసంగ మభివృద్ధి యాయెను. ఈ కాలముననే ముద్రణ యంత్రనిర్మాణము జరిగినది. ఇందుమూలమున దేశభాషలను చదువుటకవకాశములు హెచ్చయినవి. బైబిలు ప్రాచీనభాగమునకు మూలము హీబ్రూ

భాషలో నుండుటచేత నానాఁటి మతాచార్యులు హీబ్రూభాషలో నెక్కు వగా కృషిచేయ మొదలుపెట్టిరి. హీబ్రూభాష స్వర్గములో దేవతలుమాట్లాడు భాష యను నభిప్రాయము స్థిరపడుటచేత, ప్రపంచములోని భాష లన్నియు హీబ్రూభాషాజన్యములే యను నభిప్రాయము కుదురుకొన్నది. హీబ్రూభాష సెమెటిక్ భాషా కుటుంబములోనిది. ఈ సెమెటిక్ భాషల స్వభావ మానాఁటివారికి తెలిసియుండలేదు. ఈ సెమెటిక్ భాషల నిర్మాణ మునకును, యూరోపియను భాషల నిర్మాణమునకును నెట్టి సంబంధమును లేకపోయినను, యూరోపియను భాషలు హీబ్రూభాషాజన్యములే యను నిశ్చ యముచేత, హీబ్రూ పదములకును యూరోపియను భాషా పదములకును నేదో యొకరీతిగా ముడిపెట్టుట కారంభించినారు. అందువలన భాషాశాస్త్ర మెన్నో దోషములపా లయినది. హీబ్రూభాషను కుడినుండి యెడమ వైపునకు వ్రాయుదురు; ఆ పద్ధతినుండియే యూరోపియను భాషలలో నెడమనుండి కుడివైపునకు వ్రాయుపద్ధతి పుట్టినదని యూహించినవా రగుటచేత, నెట్టి మాటలనయినను వానిలోని యక్షరములను, ధ్వనులను తారుమారు చేసి, మార్చి, చేర్చి, యర్థసామ్య మెంతదూరముగా నున్నను సరే, వారు యూరో పియను శబ్దములకు హీబ్రూ ప్రకృతుల నేర్పాటు చేయుచుండిరి. ఈ రీతిగా నెవరి యిష్టానుసారము వారు తమయూహల ననుసరించి వ్యుత్పత్తులను గల్పించి నను, నిందువలన భాషాశాస్త్రము మొట్టమొదట తప్పుత్రోవ త్రొక్కినను, కొంత కాలమునకు శబ్దజాలము నొకచోటఁ జేర్చి, వర్గీకరణము చేయుటచేత, తరువాతివారు కొంత నిదానముతో నాయా శబ్దములనుగుఱించి శాస్త్రీయ దృష్టితో నాలోచించుటకు మార్గ మేర్పడినది.

ప్రాచీన గోథానికు (జెర్మానికు) భాషలలో 'వుల్ఫిలా' అను నతఁడు వ్రాసిన బైబిలుయొక్క గాథికు భాషాంతరీకరణము మొదలయిన గ్రంథము లీ లోఁపుగా బయలుపడినవి. అదే సమయమున నాంగ్లో - సాక్సను (ప్రాచీ నాంగ్లభాష), జర్మను, ప్రాచీన ఐస్లాండికు భాషలలోఁ గూడ బైబిలు వ్రాయఁబడినది. ఇందు మూలమున 18, 19 శతాబ్దములలో నీ భాషా కుటుంబమునుగుఱించి చారిత్రాత్మక మగు వ్యాకరణము వ్రాయుట కవకాశ మేర్పడినది. అయినను నాకాలములో భాషాచరిత్రనిర్మాణముమీఁద దృష్టి తక్కువయనియే చెప్పవలెను. ఏదోయొకభాష పరిణామమునుగుఱించి యెక్కు వగా నాలోచింపక, యప్పటి విద్వాంసులు వ్యవహారములో నున్న యనేక భాషలలోని శబ్దజాలము నొకచోట చేర్చుటయందే శ్రద్ధవహించియుండిరి. ఇట్టివారిలో లీబ్నిజ్ అను తత్త్వవేత్త ముఖ్యుఁడు. ప్రపంచ మంతటికిని సామాన్యముగా నొక భాషను నిర్మింపవచ్చునని యాతని నిశ్చయమగుట

చేత, నతడు పీటర్ ది గ్రేట్ అను చక్రవర్తిని ప్రేరేపించి యాతని రాజ్యమున వాడుకలోనున్న యన్నిభాషలకును సంబంధించిన పదసముదాయములను సమకూర్పింపఁ బ్రయత్నించినాఁడు. కేథరీన్ (II) చక్రవర్తినికిఁగూడ నిట్టిపనియందు చాలకుతూహల ముండెడిది. ఈ రాజాదరమువలననే 'పల్లాసు' (1786-87), హెర్వాసు (1800-5), ఆడెలుంగు (1806-17), అనువారు తమ నానాభాషాకోశములను రచించినారు. ఈ నిఘంటువులలో లోపములు లేకపోలేదు. వీనిలో విమర్శదృష్టి లేదు. అన్నిభాషలను గుఱించియు నొకటే రీతిగా వీనిలో వ్రాయలేదు. నైఘంటుక విషయములే వీనిలో నెక్కువగాని, వ్యాకరణవిషయము లెక్కువగా లేవు. బైబలు గ్రంథము మాత్రమే వీని కాధారము. అయినను నీ కోశము లానాఁడు చాలముఖ్యములుగా నుండెడివి. వైయాకరణులు వానిని ప్రమాణగ్రంథములుగా తలంచి, వాని యాధారమునఁ బరిశోధనలు చేయుచుండిరి. ఈపరిశోధనములమూలముననే పందొమ్మిదో శతాబ్దమున భాషాశాస్త్రమునకుఁ గ్రొత్తజీవము వచ్చినది. ఇదిగాక, భాషాశాస్త్రమునకు శబ్దజాలముకాక వ్యాకరణమే ముఖ్యమని తలంచినవారిలో పైని చెప్పిన హెర్వాసు పండితుఁడే మొదటివాఁడని జ్ఞాపక ముంచుకోవలెను.

సామ్యభాషాశాస్త్రము (Comparative Linguistics) ఆరంభము కాకమునుపు భాషలనుగుఱించియు, భాషాబోధనముగుఱించియు నెట్టి యభిప్రాయము లుండెడివో కొంచె మాలోచింపవలసి యున్నది. అభ్యసింపఁదగిన భాష లాటిను. పండితులకుఁ బరిచయముండిన వ్యాకరణము లాటిను వ్యాకరణము. అందుచేత, వ్యాకరణమనిన లాటినుభాషావ్యాకరణమనియే చాలమంది యభిప్రాయమై యుండెను. ఇప్పుడు పిల్లలు నేర్చుకోవలసిన ముఖ్యవిషయములు దేశభాష, శాస్త్రము, చరిత్రము, మొదలయినవి; కాని, ఆకాలములో వీనిని బోధించుచుండలేదు; బదులలో లాటినుభాషావ్యాకరణమే ప్రధానపాఠ్యవిషయముగా నుండెడిది. ఇప్పుడు 'సెకండరీస్కూలు' అని చెప్పబడెడు పాఠశాలకు అప్పుడు—చాలకాలమువఱకు—'గ్రామరుస్కూలు' అనియు, డెన్మార్కు దేశములో 'లాటిన్‌స్కోలె' అనియు పేళ్లు. ఈపేళ్లు కలుగుటకు కారణము లాటినుభాషమీఁది యభిమానమే. సామాన్యముగా భాషాశాస్త్రము విషయమై లాటిను భాషాపఠనమునకుఁ గల ప్రాముఖ్యమునుగుఱించియే మనమిప్పుడాలోచింపవలసిన విషయము; ఈ లాటినుభాష భాషాశాస్త్రవిషయమున ననేకవిధములుగాఁ బ్రాముఖ్యమును వహించియుండెడిది.

లాటినుభాష ప్రకృతి ప్రత్యయ సంయోజనమువలన నేర్పడినది. అయినను నితరభాషా వ్యాకరణములనుగుఱించి ముచ్చటింపవలసి వచ్చినప్పు

ఆ భాషలకును లాటినునకును నెట్టి సంబంధమును లేని సందర్భములలో గూడ లాటిను వ్యాకరణసంజ్ఞల నుపయోగించుచు వచ్చినారు. ఇంగ్లీషు, డేనిషు, భాషలలో ద్వితీయా, చతుర్థీ, పంచమీ విభక్తి ప్రత్యయములు లేకున్నను నా భాషల వ్యాకరణములలో నా విభక్తులను జేర్చినారు. విచక్షణత లేకుండ నన్ని భాషల వ్యాకరణములలోను క్రియాప్రక్రియయంతయు లాటిను వ్యాకరణము ననుసరించి చేరినది. అందుకోసమే యాయాభాషల నిజస్థితికి మార్పు, కూర్పు, చేర్పులు కలుగవలసి వచ్చినది. ఆ యా భాషలలో లేని విషయములను లాటిను భాషలో నున్నవిగదా యని చేర్చుట, లాటినులో లేవను కారణముచేత నా భాషలలో నుండు విషయములను వదలిపెట్టుటకూడ జరిగినది. లాటిను వ్యాకరణ ప్రమాణముతో నితర భాషలను గూర్చి యోచించుట యిప్పటికిని నంతరించలేదు. చాల వ్యాకరణములలో లాటిను భాషావ్యాకరణదృష్టి యిప్పటికిని కనఁబడుచునే యున్నది.

లాటినుభాషను వ్రాఁతమూలముగా నేర్పుచు, నుచ్చారణమును గుఱించి శ్రద్ధ తీసికొనకపోవుటచేత నక్షరములే ప్రధానములయినవి కాని, ధ్వనులకుఁ బ్రాధాన్యము కలుగలేదు. పదియాఱవ శతాబ్దమునాటికే ఫ్రెంచి విద్వాంసులును, ఇంగ్లీషు విద్వాంసులును నొకటే లాటినుభాషలో పాండిత్యము సంపాదించియున్నను, నా భాషలో సంభాషణ చేయునప్పుడొకరిమాట లొకరికి బోధపడకుండ నుండెడివి. భాషింపబడునదే భాష, వ్రాఁతలోనున్నది భాషకు సరియైన గుఱుతు కాదు. భాషాజీవము నోటిలోను, చెవిలోను నున్నది; కలములోను, కంటిలోను లేదు, అను విషయము నానాఁటి విద్వాంసులు గ్రహింపలేదు. ఇందువలన భాషాతత్త్వము, భాషా పరిణామములఁగూర్చి సరియైన జ్ఞానము కలుగలేదు. ఒక భాషను మాట్లాడ నేర్చుకొనుట కవకాశములున్నను పండితులు దానిని చదువుటతోనే తృప్తిపడుచుండెడివారు. భాష ధ్వన్యాత్మకమను సంగతి పదియాఱవ శతాబ్దమునుండియును భాషాతత్త్వవాదులకు సంపూర్ణముగా నిప్పటికిని పట్టువడలేదు. స్వరశాస్త్రమును గుఱించి ఎక్కువగా నిప్పుడు కృషి జరుగుచున్నది. కాని, భాషను గుఱించి వ్రాసినప్పటికిని చాలమంది యక్షర విన్యాసమును గూర్చి యాలోచింతురుగాని, ధ్వని పరిణామమును గుఱించి యాలోచింపరు. వారు తాము వ్రాసినదానిని మరల చదువుకొన్నప్పుడు తబ్బిబ్బులు పడుటకూడ తటస్థించుచుండును. "పరిశోధకునికి సర్వశాస్త్ర శిక్షణము లేకపోవుటవలన ముఖ్యమయిన భాషాశాస్త్ర విషయములను, సూత్రములను, విడిచిపెట్టుటయో, తార్మారు చేయుటయో, జరుగుచున్నదన్నందు కనేకోదాహరణములను చూపవచ్చును. స్లీకరుపండితుఁడు లిథువేనియను భాషలోని స్వరములను గుర్తించకపోవుటయు, కుర్షాటుపండి

తుడు వానిని తెలియఁజేసినను తెలిసికొనలేక పోవుటయు నిందుకుఁ గారా-
ణము" అని స్వీటు తన 'Handbook of Phonetics' శిక్షాసంగ్రహము అను పుస్తకమున 1877 సం॥ రములో తెలిపిన అభిప్రాయ మిప్పటికిని వర్తించు చున్నది. ఈ రీతిగాఁ జెవికి సంబంధించిన శబ్దశాస్త్రముకంటె కంటికి సంబంధించిన శబ్దశాస్త్రము ప్రాముఖ్యమును బొందుటకుఁ గారణము లాటిను భాషాభ్యాసమునకు ప్రాధాన్యము నిచ్చుటయే యనిచెప్పుట కెట్టిసందేహమును లేదు.

మధ్యయుగములో లాటినుభాష నే యంతముఖ్యముగా నభ్యసించుటకుఁ గారణము జ్ఞానసంపాదనము నిమిత్తము కాదు; జ్ఞానసంపాదము నిమిత్తమైనయెడల నేదయిన నొక యాఫ్రికాదేశపు భాషనుగాని అమెరికా దేశపుభాషనుగాని పరిశోధింపవచ్చునుగదా. లాటినువలన నేదయిన ప్రయోజనము కలుగునని కాని, అందు మూలమున నాధ్యాత్మిక విజ్ఞానము కలుగునని కాని, యప్పటివా రాభాష నభ్యసింపలేదు. అట్టి యభిప్రాయమే యుండిసఁ బూర్వకాలపు లాటినువాఙ్మయమును గాని, తర్వాతికాలపు మత వాఙ్మయమునుగాని యాకాలమువారు పఠించియుందురు. లాటిను ప్రయోజనము పండితు లొకరితోనొకరు మాట్లాడుకొనుటమాత్రమే. లాటినుభాషను కొలఁదిగానో గొప్పగానో యభ్యసింపని వాఁ డానాఁటి పండితకోటిలోఁగాని, చర్చిలోఁ గాని చేరుట కర్హుఁడు కాకుండెను. అందుచేత వ్యాకరణమనిన శబ్దముల ప్రకృతి ప్రత్యయవిభజనమును చెప్పుశాస్త్రముకాదు. అదియొక కళ. పదముల నామ క్రియా విభక్తులను వర్ణించి వానిని సంభాషణలోను, వ్రాఁతలలోను, నుపయోగించుటయే యాభాషాసంపాదనమువలని ప్రయోజనము. 'నీ విట్లే యనవలెను, ఇట్లనకూడదు' అనిమాత్రమే పాఠశాలలలో బోధించుచుండిరి. శబ్దములను వల్లెవేయుట, సూత్రములను రుక్కవేయుట, వానిప్రకారము వ్రాయను మాట్లాడను నేర్చుకొనుట, ఇవే వ్యాకరణమునుయొక్క యుపయోగములు. భాషావిషయములను న్యాయముగా పరిశీలించుట వ్యాకరణమునకు విరుద్ధము. ఇందుమూలమున వ్యాకరణ మాజ్ఞాపించుశాస్త్రమయినదికాని, భాషామర్యాదను వర్ణించుశాస్త్రమయినది కాదు. ఈ ప్రకారముగా వ్యాకరణము ప్రయోజనములు సుశబ్దము నుపయోగించుట, యపశబ్దమును పరిహరించుట యనునవి. తరువాతికాలములో దేశభాషలకు వ్యాకరణములు పుట్టినప్పుడుఁ గూడ వాని ప్రయోజనమును నిట్టిదే యయి యుండినది.

శబ్దజాలము విషయమై కూడ నాకాలపువారి దృష్టి యీ మార్గమునే త్రొక్కినది. ఆకాలపు ఫ్రెంచి, ఇటాలియను సాహిత్యపరిషత్తులు ప్రకటించిన నిఘంటువులలో నుత్తమ వాఙ్మయమున వాడుట కర్హమని యీ పరిషత్తులు

తలంచిన శబ్దములు మాత్రమే చేరినవి. ఇప్పటి నిఘంటుకారులవలె వా రాయా భాషలలోఁ దమదృష్టిపథమునఁ బడిన పదముల నన్నిటిని చేర్చియుండ లేదు. అందుచేత నా నిఘంటువులలో నప్పటి వాడుకలోని శబ్దముల యర్థములను వివరింపక వానిని వ్రాసినవా రుండవలసినదని యుద్దేశించిన ప్రకార మర్థములను వివరించుచుండెడివారు.

భాష ఇట్లే వాడవలెను అని ఆజ్ఞాపించుటవలన చాల ననర్థములున్నవి. భాషల చారిత్రకపరిణామము, భాషకుసంబంధించిన మానసికశాస్త్రము, వీనిని గుఱించి తెలిసినవాఁ డాజ్ఞాపించువిధానము వేఱు. ఆరీతిగాఁ జేయకున్న సుశబ్దాపశబ్దపరిజ్ఞానము వైయాకరణుల యిచ్ఛాధీనమగును. అందుచేత నొకప్పుడు వాడుకప్రకారము సుశబ్దమయినది నిషేధింపఁబడవచ్చును. ఒక శబ్దమునకు వైయాకరణులు రూపాంతరమును గూడ నిచ్చినప్పుడు రెండింటికిని లేనిపోని భేదములను కల్పించుచుండెడివారు. ఆభేద మెంత యముఖ్యమయిన దయినను నావ్యాకరణములను చదువుకొనువారు చెమటలుకార్చుకొని వల్లెవేయవలసినదే. ఇట్టి సూక్ష్మభేదములను కల్పించినవారిలో ఫ్రెంచిసాహిత్యపరిషత్తు. వారు ముఖ్యులు; ఇంగ్లాండువారు పరిషత్తును స్థాపించుకొనలేదు; లేనిపోని సూక్ష్మపరీక్షలను చేయను లేదు. వారు తమభాషను సహజముగా పెరుగ నిచ్చినారు. అయినను ఇంగ్లీషు బడులలోను, వార్తాపత్రికాలయములలోను నప్పుడప్పుడు సుశబ్దాపశబ్దపరిజ్ఞానమునుగుఱించి సంకుచితాభిప్రాయములు బయలు వెడలుచునే యున్నవి. ఇప్పటికిని నిట్టి యభిప్రాయము లింగ్లాండులోనే యుండఁగా పదియెనిమిదో శతాబ్దమున నట్టి వున్నవనుట యొక యాశ్చర్యము కాదు.

లాటిను భాషాభ్యాసమువలన దేశభాషలకుఁ గొన్నియెడలఁ గీడు కలిగినది. లాటినుభాషామర్యాదకు విరుద్ధముగా నున్నను దేశభాషలు లాటిను వ్యాకరణసూత్రములనే యనుసరింపవలసియుండెను. మనుష్యుఁడు స్వభావముచేత పూర్వాచారపరాయణుఁ డగుటచేతను, బడిపంతు లట్టివారిలో నగ్రేసరుఁ డగుటచేతను, భాషలకు సహజాభివృద్ధి కలుగక కొంత నిరోధము కలిగినది.

పదునెనిమిదో శతాబ్దమునాఁటి గొప్ప వైయాకరణులు భాష సహజముగా ఉత్పత్తి యయినదా, కాదా, అను విషయమునుగుఱించి యెక్కువగా నాలోచించినారు. ఆదిమ మనుష్యు లందఱును నొకచోటఁ జేరి యీవస్తువులకును నీ భావములకును నీ మాటలను వాడుకొందమని పరస్పరము నేర్పాటు చేసికొన్నారను సిద్ధాంతమును రూసో పండితుఁడు ప్రతిపాదించినాఁడు. ఈవాదమునకుఁ బ్రబలమైన యాక్షేపణ లున్నవి. అంతకుఁబూర్వము భాష లేకుండ

కాలక్షేపము చేసికొనఁ గలిగిన మనుష్యులకు భాషను వాడుకొనవలెనను నక్కఱ యెట్లు కలిగినది? వారి కంతకుముందే యభిప్రాయ ప్రకటనమున కొక సాధనము లేకున్న నీ భావమున కీమాట యని యెట్లే యేర్పాటుచేసికొనఁ గలిగినారు? రూసో యభిప్రాయము భాషాచరిత్ర నిర్మాణమునకు ప్రయోజనకారి కాదు.

మాటలురాని స్త్రీ పురుషులు సహజములయిన ధ్వనులతోను నభినయముతోను, బలమైన భావములచేత ప్రేరితులై సహజముగానే యొకరీతి భాషను సంపాదించినారని కాండిలాక్ పండితుని యభిప్రాయము. అట్టి ధ్వనులు సామాన్య భావములకు సంకేతము లవుననియు, క్రొత్త భావము లుదయించిన కొలఁది నభినయముతోఁబాటు క్రొత్త ధ్వను లుత్పన్నములయి,మాట్లాడువారు కోరిన వస్తువులకును భావములకును గుఱుతు లవుననియు నాతని యభిప్రాయము. ఈ యాదిమ స్త్రీ పురుషులకుఁ గ్రొత్తధ్వనులను పుట్టించు శక్తి యుండకున్నను వారిపిల్లల నాలుక లింకను బాగుగాఁ దిరిగి క్రొత్త ధ్వనులను పుట్టింతురు. ఆ ధ్వనులనుబట్టియు,వారి యభినయమును బట్టియు వారి తలిదండ్రులా క్రొత్తధ్వనుల కర్థముల నూహించి, యాధ్వనులను తాముగూడఁ జేయుటకుఁ బ్రయత్నింతురు. ఈరీతిగా నంతకంతకుఁ దరములు గడచినకొలఁదిని క్రొత్త మాటలు పుట్టుచుండును. చాల తరములవారు శ్రమపడి సాధించిన ధ్వనిసముదాయ మొక భాషగా నేర్పడును అని కాండిలాకు నభిప్రాయము.

పదియెనిమిదో శతాబ్దమున నీ భాషాప్రశ్నములనుగుఱించి యెక్కువగా నాలోచించినవాఁడు జోహాన్ గాట్ ఫ్రీడ్ హెర్డరు అను విద్వాంసుఁడు. ఈతఁడు శాస్త్రీయమైన పరిశోధన మేమియుఁ జేయకపోయినను భాషాశాస్త్రోదయమునకుఁ గారణ మయినాఁడు. ఆతఁడు 1772 సం|| రమున "భాషోత్పత్తి" అను వ్యాసమును వ్రాసి, దానికి బహుమానమును పొందినాఁడు. ఆ వ్యాసమున నతఁడు భాష మనుష్యకల్పితమైనది కాదు; దైవదత్తము, అను నభిప్రాయమును ఖండించినాఁడు. దేవుఁడే భాషను నిర్మించి, మనుష్యుని మనస్సులోనికిఁ జొప్పించియున్న, నది యిప్పు డున్నదానికంటె సంపూర్ణముగాను తర్కశాస్త్రానుసారిగాను నుండియుండును. మనుష్యుల భాషలో నిప్పు డెంతో భాగము గందరగోళముగాను, క్రమరహితముగాను నున్నది. అందుచేత నది దైవనిర్మితము కాదు. మనుష్యకల్పితమే. మనుష్యుఁడు భాషల నిచ్ఛాపూర్వకముగాఁ గూర్చుండి సృష్టింపను లేదు. అది యతని యంతఃప్రకృతినుండి యావశ్యకమగుటచేత నుద్భవించినది. గర్భస్థ శిశువు భూమిపైఁబడుట కుబలాటము పడునట్లు, భాషకూడ మనస్సులో నుండి బయటికి వచ్చినది. తక్కిన జంతువులవలెనే మనుష్యుఁడుకూడఁ దన

భావములను ధ్వనులమూలముగా వ్యక్తముచేయును; కాని, భావ ప్రేరితమయిన ధ్వనుల మూలముననే భాషయంతయు నుత్పత్తియయినదని చెప్ప వీలులేదు. ఆ ధ్వను లెంతస్థిరముగా కుదురుకొనియున్నను, మనుష్యుఁడు తానయి కోరి యాయా ధ్వనుల నాయాయర్థములలో వాడకున్న నది మనుష్య భాష కానేరదు. జంతువులకంటె నొకమెట్టుపైగా నుండి, క్రొత్త శక్తులను సంపాదించుటవలన మనుష్యుఁ డధికుఁడు కాలేదు. తన సర్వశక్తులను వేఱు మార్గమున నభివృద్ధిపొందించుకొనుటచేత నతని కా యాధిక్యమువచ్చినది. మనుష్యుఁడు జంతువులకంటె బలములోను, నంతఃకరణము (instinct) లోను తక్కువవాఁడే; అయినను నతని కన్నియెడలను జంతువులకంటె శ్రద్ధ యెక్కువ. అతని సంపూర్ణ మనస్తత్త్వ మతనిని జంతువులనుండి వేఱుచేయు చున్నది. ఈ మనస్తత్త్వ మిట్టిదియని విభజించి తెలియఁజేయ వీలులేదు. మనుష్యుఁడు తన మనస్సులోనికి సర్వేంద్రియములద్వారా చొరఁబడు వేదనలలో నుండి యొకదానిని వేఱుచేసి, దానిపై శ్రద్ధనిలుపఁగలఁడు. ఒక మేఁకపిల్లను చూచి, దానికి ముఖ్యమైన గుఱుతు 'మే' అని యార్పుటయని యేర్పాటుచేసి కొని తరువాత మేఁకపిల్లను చూచునప్పుడు 'మే' అని ధ్వనిచేసి, దాని కాధ్వనినే పేరుగా నతఁడుకల్పించుకొనును. కనుక మేఁక 'మే' అని యఱచు జంతు వను నర్థము కలుగును. విశేష్యములు క్రియలనుండి పుట్టును. భాష దైవదత్తమే యైనచో మొదట విశేష్యములును దరువాత క్రియలును పుట్టియుండును. అనేకవిధములయిన భావములు మనస్సులో మెలఁగి యొకదానిలోని కింకొకటి సంక్రమించుచుండును. అందువలన మాటలకు సూక్ష్మమైన యర్థభేదములు కలిగి, యుత్ప్రేక్షలమూలముగాఁ గ్రొత్తశబ్దములు పుట్టుచుండును. ఇందు మూలమున నాకారము కనఁబడకుండ పులిమిన రంగులుగల యొకపట మేర్పడును. ఇదే తొల్లింటి భాషల స్వభావము. "భాషోత్పత్తికి మనుష్యుని హీన మనస్సంపదయును, వివిధభావము లొకదానిలోని కొకటి సంక్రమించుటయుఁ గారణము." ఇందువలన నాదిమ భాషలలో పర్యాయపదము లెక్కువగా నుండును. మనోదారిద్ర్యముతోఁబాటనావశ్యకపద సమృద్ధికూడ యాదిమ భాషల కొక లక్షణముగా నున్నది.

పైని తెలిపిన యాదిమభాషలు హెర్డరు నుద్దేశమునఁ బ్రాచ్యభాషలు. వానిలో హీబ్రూభాష ముఖ్యమైనది. హీబ్రూభాషయును, హోమరునాఁటి గ్రీకుభాషయును, నాదిమభాషకు దగ్గఱగా నున్నవని హెర్డరు నభిప్రాయము. కాని, ఇప్పుడు మన మాదిమభాషోత్పత్తియై నాగరకత యభివృద్ధియగుటకు లక్షలు, కోట్లు, సంవత్సరములు పట్టియుండవలెనని యనుకొనుచున్నాము.

హెర్డరు తలంచినట్లు భాష హీబ్రూభాషాస్థితికి వచ్చుట కతఁ డూహించిన రెండు, మూఁడువేల యేండ్లకాలము చాలదు.

హెర్డరు తన 'భాషోత్పత్తి' అను గ్రంథము మూలముననే భాషాశాస్త్ర జనకుఁడు కాలేదు. అతఁడు తన జీవితమంతయు నా శాస్త్రచర్చలను చేయుచు, నితరులను తన యభిప్రాయమునకు మార్చుకొన్నాఁడు. సహజమగు పరిణామ మన్నివిషయములలోను కలుగుచున్నదన్న యతని సిద్ధాంతమునే యాధారముగా జేసికొని తరువాతికాలపు "రొమాంటిసిస్టు" లను సాహిత్యపరు లతనిదేశమున నానావిధములైన విషయములను తమ భాషలోనికి పరివర్తనము చేసికొనిరి. వా రనేకదేశములవారి, అంతకుపూర్వ ముపేక్షింపబడిన పామరజనుల కవిత్వమును తమ భాషలోనికి భాషాంతరీకరించిరి. మధ్యయుగమునాఁటి జర్మనువాఙ్మయమును జర్మనుపామరకథలును జాల ముఖ్యములని హెర్డరు తలంచియుండెను. అందుచేత నతఁడు తరువాతికాలపు గ్రీకు •పండితుల కాధ్యాత్మిక గురువని చెప్పవచ్చును. భాషకును మానవజాతి యాదిమ కవిత్వమునకును గల సంబంధము నాతఁడు గుర్తించెను. మానవజాతి శైశవావస్థయందలి సంగీతమునకును, తరువాతి కృత్రిమకవిత్వమునకును గల భేదము నాతఁడు వెల్లడించినాఁడు. అతనిదృష్టిలో భాషయనునది వాఙ్మయమునకు సాధనము మాత్రము కాదు; భాషయే వాఙ్మయము. భాషయే కవిత్వము. ఒకజాతియొక్క ఆత్మ వా రుపయోగించు మాటలలో వ్యక్తమవును. హెర్డరు తన మాతృభాష నెక్కువగా పొగడుకొన్నాఁడు. అది గ్రీకుకంటె కొంచెము హీనమయిన దయినను, తక్కిన భాషలకంటె గొప్పది. తన జర్మను భాషలోని సంయుక్తవ్యంజనములు దానికొక ధీరగమనమును కల్పించును. తన భాష పరుగులువారక, జర్మనీదేశస్థునివలె గంభీరముగా నడచును. తన భాషలోని యచ్చులు వ్యంజనముల కాఠిన్యమును మృదువు పఱుచును; అందులోని యవిరామవ్యంజనములు భాషను శ్రుతిరంజకముగాను, మనోహరముగాను చేయును. దానిలోని మాత్రలు నిండుగను స్థిరముగాను నుండును; మాటలు రీవిగలిగి యుండును. జాతీయములు స్పష్టముగా నుండును. అయినను, ఆధునాతన జర్మనుభాష లూథరునాఁటిదానికంటెను, సువేబియను చక్రవర్తులనాఁటిదానికంటె నింక నెక్కువగను హీనముగా పరిణమించినది. అందుచేత దానిని పునరుజ్జీవింపఁజేసి, శక్తిమత్ప్రదభూయిష్ఠముగాఁ జేయవలెను. ఇట్టి యభిప్రాయములను ప్రకటించి, హెర్డరు గెటీ యను కవీశ్వరుని, రొమాంటిసిస్టులను తన దృక్పథమునకు మార్చుటయేకాక, పిన్నవారికి ప్రాచీనకావ్యముల శుష్కపఠనమునుండి పరిశోధనమార్గములోనికి దింపినాఁడు.

భావములను ధ్వనులమూలముగా వ్యక్తముచేయును; కాని, భావ ప్రేరితమయిన ధ్వనుల మూలముననే భాషయంతయు నుత్పత్తియయినదని చెప్ప వీలులేదు. ఆ ధ్వను లెంతస్థిరముగా కుదురుకొనియున్నను, మనుష్యుఁడు తానయి కోరి యాయా ధ్వనుల నాయాయర్థములలో వాడకున్న నది మనుష్య భాష కానేరదు. జంతువులకంటె నొకమెట్టుపైగా నుండి, క్రొత్త శక్తులను సంపాదించుటవలన మనుష్యుఁ డధికుఁడు కాలేదు. తన సర్వశక్తులను వేఱు మార్గమున నభివృద్ధిపొందించుకొనుటచేత నతని కా యాధిక్యమువచ్చినది. మనుష్యుఁడు జంతువులకంటె బలములోను, నంతఃకరణము (instinct) లోను తక్కువవాఁడే; అయినను నతని కన్నియెడలను జంతువులకంటె శ్రద్ధ యెక్కువ. అతని సంపూర్ణ మనస్తత్వ మతనిని జంతువులనుండి వేఱుచేయు చున్నది. ఈ మనస్తత్వ మిట్టిదియని విభజించి తెలియఁజేయ వీలులేదు. మనుష్యుఁడు తన మనస్సులోనికి సర్వేంద్రియములద్వారా చొరఁబడు వేదనలలో నుండి యొకదానిని వేఱుచేసి, దానిపై శ్రద్ధనిలుపఁగలఁడు. ఒక మేఁకపిల్లను చూచి, దానికి ముఖ్యమైన గుఱుతు 'మే' అని యార్చుటయని యేర్పాటుచేసి కొని తరువాత మేఁకపిల్లను చూచునప్పుడు 'మే' అని ధ్వనిచేసి, దాని కాధ్వనినే పేరుగా నతఁడుకల్పించుకొనును. కనుక మేఁక 'మే' అని యఱచు జంతు వను నర్థము కలుగును. విశేష్యములు క్రియలనుండి పుట్టును. భాష దైవదత్తమే యైనచో మొదట విశేష్యములును దరువాత క్రియలును పుట్టియుండును. అనేకవిధములయిన భావములు మనస్సులో మెలఁగి యొకదానిలోని కింకొకటి సంక్రమించుచుండును. అందువలన మాటలకు సూక్ష్మమైన యర్థభేదములు కలిగి, యుత్ప్రేక్షలమూలముగాఁ గ్రొత్తశబ్దములు పుట్టుచుండును. ఇందు మూలమున నాకారము కనఁబడకుండ పులిమిన రంగులుగల యొకపటము నేర్పడును. ఇదే తొల్లింటి భాషల స్వభావము. "భాషోత్పత్తికి మనుష్యుని హీన మనస్సంపదయును, వివిధభావము లొకదానిలోని కొకటి సంక్రమించుటయుఁ గారణము." ఇందువలన నాదిమ భాషలలో పర్యాయపదము లెక్కువగా నుండును. మనోదారిద్ర్యముతోఁబాటనావశ్యకపద సమృద్ధికూడ యాదిమ భాషల కొక లక్షణముగా నున్నది.

పైని తెలిపిన యాదిమభాషలు హెర్డరు నుద్దేశమునఁ బ్రాచ్యభాషలు. వానిలో హీబ్రూభాష ముఖ్యమైనది. హీబ్రూభాషయును, హోమరునాఁటి గ్రీకుభాషయును, నాదిమభాషకు దగ్గఱగా నున్నవని హెర్డరు నభిప్రాయము. కాని, ఇప్పుడు మన మాదిమభాషోత్పత్తియై నాగరకత యభివృద్ధియగుటకు లక్షలు, కోట్లు, సంవత్సరములు పట్టియుండవలెనని యనుకొనుచున్నాము.

హెర్డరు తలంచినట్లు భాష హీబ్రూభాషాస్థితికి వచ్చుట కతఁ డూహించిన రెండు, మూఁడువేల యేండ్ల కాలము చాలదు.

హెర్డరు తన 'భాషోత్పత్తి' అను గ్రంథము మూలముననే భాషాశాస్త్ర జనకుఁడు కాలేదు. అతఁడు తన జీవితమంతయు నా శాస్త్రచర్చలను చేయుచు, నితరులను తన యభిప్రాయమునకు మార్చుకొన్నాఁడు. సహజమగు పరిణామ మన్నివిషయములలోను కలుగుచున్నదన్న యతని సిద్ధాంతమునే యాధారముగా జేసికొని తరువాతికాలపు "రొమాంటిసిస్టు" లను సాహిత్యపరు లతనిదేశమున నానావిధములైన విషయములను తమ భాషలోనికి పరివర్తనము చేసికొనిరి. వా రనేకదేశములవారి, అంతకుపూర్వ ముపేక్షింపబడిన పామరజనుల కవిత్వమును తమ భాషలోనికి భాషాంతరీకరించిరి. మధ్యయుగమునాఁటి జర్మనువాఙ్మయమును జర్మనుపామరకథలును జాల ముఖ్యములని హెర్డరు తలంచియుండెను. అందుచేత నతఁడు తరువాతికాలపు గ్రీకు పండితుల కాధ్యాత్మిక గురువని చెప్పవచ్చును. భాషకును మానవజాతి యాదిమ కవిత్వమునకును గల సంబంధము నాతఁడు గుర్తించెను. మానవజాతి శైశవావస్థయందలి సంగీతమునకును, తరువాతి కృత్రిమకవిత్వమునకును గల భేదము నాతఁడు వెల్లడించినాఁడు. అతనిదృష్టిలో భాషయనునది వాఙ్మయమునకు సాధనము మాత్రము కాదు; భాషయే వాఙ్మయము. భాషయే కవిత్వము. ఒకజాతియొక్క ఆత్మ వా రుపయోగించు మాటలలో వ్యక్తమవును. హెర్డరు తన మాతృభాష నెక్కువగా పొగడుకొన్నాఁడు. అది గ్రీకుకంటె కొంచెము హీనమయిన దయినను, తక్కిన భాషలకంటె గొప్పది. తన జర్మను భాషలోని సంయుక్తవ్యంజనములు దానికొక ధీరగమనమును కల్పించును. తన భాష పరుగులువారక, జర్మనీదేశస్థునివలె గంభీరముగా నడచును. తన భాషలోని యచ్చులు వ్యంజనముల కాఠిన్యమును మృదువు పఱుచును; అందులోని యవిరామవ్యంజనములు భాషను శ్రుతిరంజకముగాను, మనోహరముగాను చేయును. దానిలోని మాత్రలు నిండుగను స్థిరముగాను నుండును; మాటలు రీవిగలిగి యుండును. జాతీయములు స్పష్టముగా నుండును. అయినను, ఆధునాతన జర్మనుభాష లూథరునాఁటిదానికంటెను, సుఏబియను చక్రవర్తులనాఁటిదానికంటె నింక నెక్కువగను హీనముగా పరిణమించినది. అందుచేత దానిని పునరుజ్జీవింపఁజేసి, శక్తిమత్ప్రదభూయిష్ఠముగాఁ జేయవలెను. ఇట్టి యభిప్రాయములను ప్రకటించి, హెర్డరు గెటీ యను కవీశ్వరుని, రొమాంటిసిస్టులను తన దృక్పథమునకు మార్చుటయేకాక, పిన్నవారికి ప్రాచీనకావ్యముల శుష్కపఠనమునుండి పరిశోధనమార్గములోనికి దింపినాఁడు.

శుద్ధమయిన భాష యేది? ప్రమాణ భాష యేది? ఆయాభాషలలో మిక్కిలి సమర్థమయిన దేది? అందమయిన దేది?—ఇట్టి ప్రశ్నలు సాధారణముగా సనాలోచితములుగా పుట్టుచుండును. ఇట్టివి శాస్త్రీయ ప్రశ్నలు కావు. అట్టి ప్రశ్నలమీఁదనే దృష్టినుంచువా రుత్తమమైన, సంపూర్ణమైన భాష యెట్లుండును, అను విషయమునుకూడ చర్చించుచుందురు. శాస్త్రపరిషత్తేదియు నిట్టి ప్రశ్న నాదరింపదు. అయినను బెర్లినుసాహిత్యపరిషత్తు వారు 1794 సం॥ రమున నుత్తమభాషాలక్షణ మేమి? యూరోపియను భాషలలో ముఖ్యమయినవానిలో దేని కీ లక్షణము పట్టును? అను విషయమునుగుఱించి పోటీ వ్యాసములను వ్రాయించినారు. అందులో డి. జెనిష్ అను బెర్లిను నగరములోని యొక మతగురువు బహుమానమును పొందెను. ఈ వ్యాసమునుగుఱించి నాఁటనుండి నేఁటివఱకు విద్వాంసులు తలంపనైనను దలంపలేదుగాని, యది తప్పక చదువవలసిన వ్యాసము. "మనుష్యుని బుద్ధియొక్కయు నీతియొక్కయు సారము భాషలో వ్యక్తమవును. మాటతీరులోనే మనుష్యుని స్వభావము తెలియునని ప్రాచ్యులు చెప్పుమాట సత్యము. అనాగరకుని మాట మోటుగాను, మొద్దుగాను నుండును; నాగరకునిభాష లలితముగా నుండును. గ్రీకువారి భావన సున్నితముగాను, ఆలోచన సరసముగాను నుండును. రోమనులు తాత్త్విక బుద్ధి కలవారుకారు; వారు కార్యసాధనపరులు. ఫ్రెంచివారు జనసమ్మానపాత్రులు; స్నేహభావము కలవారు. బ్రిటిషువారు గంభీరస్వభావము కలవారు. జర్మనులు తత్త్వైక దృక్కులు పై జాతుల స్వభావమెట్టిదో, వారి భాషకూడ నట్టిదే యని జెనిషు తన బహుమాన వ్యాసముయొక్క పీఠికలో వ్రాసిన వాక్యము లతని ననుసరించినవారు కాకపోయినను హంబోల్టు, స్టైన్థాలు, ఫిన్కు, బిర్న్, మొదలయిన భాషాతత్త్వవేత్తల గ్రంథములకు మేలుబంతులుగా నుండఁదగినవి.

భాషయనునది మన భావముల నితరులకు తెలియఁజేయు నొకసాధనము; ఆక్షణమున కలిగిన భావము నప్పటికిఁ దెలియజేసిన దాని యుపయోగము తీరి పోవును.

(1) శబ్దసంపద (2) శక్తి (3) స్పష్టత (4) శ్రావ్యత - అను నాలుగును భాషల ముఖ్యలక్షణములు. శబ్దసంపద విషయమై యాలోచించునప్పుడు, ఈ భాషలో వస్తువులకును భావములకును శబ్దము లెతవఱకు నున్నవి అను విషయమేకాక యున్నశబ్దములనుండి క్రొత్త శబ్దముల నెంతవఱకు కల్పించుకోవచ్చును అను దానినికూడ నాలోచింపవలెను. భాషయొక్క శక్తి నిఘంటువులలోను, వ్యాకరణములలోను వ్యక్తమవును. వ్యాకరణమెంత

సులభమయిన ఆ భాష యంతశక్తి కలిగియుండును; భాషాశక్తి జాతిశక్తిని, ఆ జాతిలో స్వతంత్ర గ్రంథములను వ్రాయఁగలిగినవారిని ననుసరించి యుండును. స్పష్టత శబ్దజాలము వ్యాకరణములమీఁద నాధారపడి యుండును. ముఖ్యముగా నది కారకము ననుసరించి యుండును. శ్రావ్యత స్వరవ్యంజనముల వలననే కాక, వాని సంయోజనమువలనఁ గూడఁ దెలియును. శ్రావ్యతా విషయమున సూక్ష్మవిషయములను కాక, మొత్తముమీఁద భాష చెవి కెట్లు గోచరించునో యాలోచింపవలెను.

ఈ లక్షణములనుబట్టి జెనిషు తన జర్మనుభాషను ఫ్రెంచిభాషతో సరిపోల్చి తనభాషకంటె ఫ్రెంచిభాషయే యుత్తమమయినదని నిష్పాక్షికముగ తెలిపినాఁడు. హెర్డరునకును, జెనిషునకును మాతృభాషయొక్కటే యయినను ఒకఁడభిమానప్రేరితుఁడై తనభాషను పొగడుకొన్నాఁడు. ఇంకొకఁడు తా నేర్పఱిచిన లక్షణములనుబట్టి తనభాషను నిరసించుకొని, శాస్త్రదృష్టిని ప్రకటించినాఁడు.

పందొమ్మిదో శతాబ్దారంభమున భాషాశాస్త్రనిర్మాణవిషయమునఁ గ్రొత్త దృక్పథ మేర్పడినది. పూర్వపరిశోధకులు కొన్నిభాషలనుగూర్చి మాత్రమే యాలోచించుచుండెడివారు. ఇపుడు ప్రపంచమందలి యనేకభాషల పరస్పర సంబంధమునుగూర్చియే కాక, యాయా ప్రత్యేకభాషల నిర్మాణమునుగూర్చియు, నాయాభాషలయందలి వ్యాకరణరూపముల చరిత్రమును గూర్చియు సూక్ష్మపరిశోధనము లారంభమయినవి. ఐరోపాఖండమున భాషలవిషయమున నీచారిత్రక దృష్టికిఁ గారణ మచటి శాస్త్రజ్ఞులకుఁ గ్రొత్తగా సంస్కృతభాషాపరిచయము కలుగుటయే. ఇంగ్లీషువారును ఫ్రెంచివారును నిండియాలోఁ బ్రభుత్వముకొఱకుఁ బెనఁగులాడుచుండిన కాలమున నింగ్లీషు విద్వాంసులును ఫ్రెంచివిద్వాంసులును నీదేశపు నాగరకతనుగూర్చియు, భాషనుగూర్చియు వాఙ్మయమునుగూర్చియుఁ దెలిసికొనఁ బ్రయత్నించిరి. ఫ్రెంచి మిషనరీ యగు కోర్డో (Coeurdoux) సంస్కృతపదములకును లాటినుపదములకును గల సంబంధమును దెలుపుచు నొకవ్యాసము వ్రాసెను. ఇంగ్లీషువిద్వాంసుఁడగు సర్ విలియమ్ జోన్సు భాషాశాస్త్రమున సంస్కృతము ప్రాధాన్యమునుగూర్చి వ్రాయుచు "సంస్కృతభాషా ప్రాచీనత విషయమై భేదాభిప్రాయము లుండవచ్చును; కాని, దాని నిర్మాణ మద్భుతమైనది. అది గ్రీకు భాషకంటె సంపూర్ణమైనది; లాటినుకంటె శబ్దసంపదయందు విశాలమయినది; గ్రీకు లాటిను భాషల రెంటికంటె నెక్కువ సంస్కారము నొందినది. దానికిని నీ రెండుభాషలకును క్రియాధాతువుల విషయమునను, వ్యాకరణరూపముల విషయమునను దగ్గఱ సంబంధము గలదు. ఈ సంబంధము యాదృ

శుద్ధమయిన భాష యేది? ప్రమాణ భాష యేది? ఆయాభాషలలో మిక్కిలి సమర్థమయిన దేది? అందమయిన దేది?—ఇట్టి ప్రశ్నలు సాధారణముగా సనాలోచితములుగా పుట్టుచుండును. ఇట్టివి శాస్త్రీయ ప్రశ్నలు కావు. అట్టి ప్రశ్నలమీఁదనే దృష్టినుంచువా రుత్తమమైన, సంపూర్ణమైన భాష యెట్లుండును, అను విషయమునుకూడ చర్చించుచుందురు. శాస్త్రపరిషత్తేదియు నిట్టి ప్రశ్న నాదరింపదు. అయినను బెర్లినుసాహిత్యపరిషత్తువారు 1794 సం॥ రమున నుత్తమభాషాలక్షణ మేమి? యూరోపియను భాషలలో ముఖ్యమయినవానిలో దేని కీ లక్షణము పట్టును? అను విషయమునుగుఱించి పోటీ వ్యాసములను వ్రాయించినారు. అందులో డి. జెనిష్ అను బెర్లిను నగరములోని యొక మతగురువు బహుమానమును పొందెను. ఈ వ్యాసమునుగుఱించి నాఁటనుండి నేఁటివఱకు విద్వాంసులు తలంపనైనను దలంపలేదుగాని, యది తప్పక చదువవలసిన వ్యాసము. "మనుష్యుని బుద్ధియొక్కయు నీతియొక్కయు సారము భాషలో వ్యక్తమవును. మాటతీరులోనే మనుష్యుని స్వభావము తెలియునని ప్రాచ్యులు చెప్పుమాట సత్యము. అనాగరకుని మాట మోటుగాను, మొద్దుగాను నుండును; నాగరకునిభాష లలితముగా నుండును. గ్రీకువారి భావన సున్నితముగాను, ఆలోచన సరసముగాను నుండును. రోమనులు తాత్త్వికబుద్ధి కలవారు కారు; వారు కార్యసాధనపరులు. ఫ్రెంచివారు జనసమ్మానపాత్రులు; స్నేహభావము కలవారు. బ్రిటిషువారు గంభీరస్వభావము కలవారు. జర్మనులు తత్త్వైకదృక్కులు. పై జాతుల స్వభావమెట్టిదో, వారి భాషకూడ నట్టిదే యని జెనిషు తన బహుమాన వ్యాసముయొక్క పీఠికలో వ్రాసిన వాక్యము లతని ననుసరించినవారు కాకపోయినను హంబోల్టు, సైన్థాలు, ఫిన్కు, బిర్న్, మొదలయిన భాషాతత్త్వవేత్తల గ్రంథములకు మేలుబంతులుగా నుండఁదగినవి.

భాషయనునది మన భావముల నితరులకు తెలియఁజేయు నొకసాధనము; ఆక్షణమున కలిగిన భావము నప్పటికిఁ దెలియజేసిన దాని యుపయోగము తీరి పోవును.

(1) శబ్దసంపద (2) శక్తి (3) స్పష్టత (4) శ్రావ్యత - అను నాలుగును భాషల ముఖ్యలక్షణములు. శబ్దసంపద విషయమై యాలోచించునప్పుడు, ఈ భాషలో వస్తువులకును భావములకును శబ్దము లెంతవఱకు నున్నవి అను విషయమేకాక యున్నశబ్దములనుండి క్రొత్త శబ్దముల నెంతవఱకు కల్పించుకోవచ్చును అను దానినికూడ నాలోచింపవలెను. భాషయొక్క శక్తి నిఘంటువులలోను, వ్యాకరణములలోను వ్యక్తమవును. వ్యాకరణమెంత

సులభమయిన ఆ భాష యంతశక్తి కలిగియుండును, భాషాశక్తి జాతిశక్తిని, ఆ జాతిలో స్వతంత్ర గ్రంథములను వ్రాయఁగలిగినవారిని ననుసరించి యుండును. స్పష్టత శబ్దజాలము వ్యాకరణములమీఁద నాధారపడి యుండును. ముఖ్యముగా నది కారకము ననుసరించి యుండును. శ్రావ్యత స్వరవ్యంజనముల వలననే కాక, వాని సంయోజనమువలనఁ గూడఁ దెలియును. శ్రావ్యతా విషయమున సూక్ష్మవిషయములను కాక, మొత్తముమీఁద భాష చెవి కెట్లు గోచరించునో యాలోచింపవలెను.

ఈ లక్షణములనుబట్టి జెనిషు తన జర్మనుభాషను ఫ్రెంచిభాషతో సరిపోల్చి తనభాషకంటె ఫ్రెంచిభాషయే యుత్తమమయినదని నిష్పాక్షికముగ తెలిపినాఁడు. హెర్డరునకును, జెనిషునకును మాతృభాషయొక్కటే యయినను ఒకఁ డభిమానప్రేరితుఁడై తనభాషను పొగడుకొన్నాఁడు. ఇంకొకఁడు తా నేర్పఱిచిన లక్షణములనుబట్టి తనభాషను నిరసించుకొని, శాస్త్రదృష్టిని ప్రకటించినాఁడు.

పందొమ్మిదో శతాబ్దారంభమున భాషాశాస్త్రనిర్మాణవిషయమునఁ గ్రొత్త దృక్పథ మేర్పడినది. పూర్వపరిశోధకులు కొన్నిభాషలనుగూర్చి మాత్రమే యాలోచించుచుండెడివారు. ఇపుడు ప్రపంచమందలి యనేకభాషల పరస్పర సంబంధమునుగూర్చియే కాక, యాయా ప్రత్యేకభాషల నిర్మాణమునుగూర్చియు, నాయాభాషలయందలి వ్యాకరణరూపముల చరిత్రమును గూర్చియు సూక్ష్మపరిశోధనము లారంభమయినవి. ఐరోపాఖండమున భాషలవిషయమున నీచారిత్రకదృష్టికిఁ గారణమచటి శాస్త్రజ్ఞులకుఁ గ్రొత్తగా సంస్కృతభాషాపరిచయము కలుగుటయే. ఇంగ్లీషువారును ఫ్రెంచివారును నిండియాలోఁ బ్రభుత్వముకొఱకుఁ బెనఁగులాడుచుండిన కాలమున నింగ్లీషు విద్వాంసులును ఫ్రెంచివిద్వాంసులును నీ దేశపు నాగరకతనుగూర్చియు, భాషనుగూర్చియు వాఙ్మయమునుగూర్చియుఁ దెలిసికొనఁ బ్రయత్నించిరి. ఫ్రెంచి మిషనరీ యగు కోర్డో (Coeurdoux) సంస్కృతపదములకును లాటినుపదములకును గల సంబంధమును దెలుపుచు నొక వ్యాసము వ్రాసెను. ఇంగ్లీషువిద్వాంసుఁడగు సర్ విలియమ్ జోన్సు భాషాశాస్త్రమున సంస్కృతము ప్రాధాన్యమునుగూర్చి వ్రాయుచు "సంస్కృతభాషా ప్రాచీనత విషయమై భేదాభిప్రాయము లుండవచ్చును; కాని, దాని నిర్మాణ మద్భుతమైనది. అది గ్రీకు భాషకంటె సంపూర్ణమైనది; లాటినుకంటె శబ్దసంపదయందు విశాలమయినది; గ్రీకు లాటిను భాషల రెంటికంటె నెక్కువ సంస్కారము నొందినది. దానికిని నీ రెండుభాషలకును క్రియాధాతువుల విషయమునను, వ్యాకరణరూపముల విషయమునను దగ్గఱి సంబంధము గలదు. ఈ సంబంధము యాదృ

చ్ఛికము గాదు. భాషాశాస్త్రజ్ఞుఁ డీ మూఁడుభాషలను సరిపోల్చునపు డవి యన్నియు నేకమాతృకనుండి యుత్పన్నములై నవని తలంపకపోఁడు. ఆ మాతృక నేఁడు లేకపోవచ్చును. ఇట్లే గాథికు, కెల్టికుభాషలును సంస్కృతముతో సాజాత్యము గలిగినవని యూహింపవచ్చును. ప్రాచీనపెర్షియను భాషయు నీ కుటుంబమునకుఁ జేరినదనియే చెప్పవచ్చును" అని తెలిపెను; కాని, యాతఁడు తన వాదమును సమర్థించుట కాయాభాషలందు తగిన కృషిని జేయ లేదు.

సంస్కృతభాషా పరిచయమువలన భాషాశాస్త్రమునకుఁ గ్రొత్త మార్గము ననుసంధింపఁ గృషిచేసినవారిలో 'ష్లెగెల్' (Schlegel) అను నాతఁడు ప్రథముఁడు. కాని, యీతఁడు తత్తద్భాషలయందలి పదము లే ధ్వని పరిణామ సూత్రములచే వేర్వేఱు రూపములఁ దాల్చినవో యను విషయ మును గూర్చి కృషిచేయక, పైకి స్పష్టముగఁ గానవచ్చు కొన్ని పోలికలను మాత్రము గుర్తించితృప్తినొందెను. అతఁడు చేసిన సిద్ధాంతములలో ముఖ్య మయినది ప్రపంచమందలి భాషలను (1) సంస్కృతముతో సంబంధించిన భాషలు (2) తక్కినవి, అను రెండు వర్గములుగా నేర్పఱుచుట.

ష్లెగెలు తరువాత నాతని మార్గమునఁ గృషిచేసినవారిలో బాప్ (Bopp), గ్రిమ్ (Grimm), రాస్క్ (Rask) అనువారు ముప్పురును ననేక భాషలతోఁ బరిచయముఁ గలుగఁజేసికొని, వానిలోఁ గొన్నిటికిఁ బ్రత్యేకముగ వ్యాకరణములను వ్రాసి యాయాభాషలకుఁ గల సూక్ష్మ సంబంధములను గుర్తించి భాషాశాస్త్రమున ధ్వనిపరిణామ సూత్రముల నేర్పఱుపఁ బ్రయత్నించిరి.

రాస్కు నభిప్రాయమున లిఖితాధారములులేని యా యా జాతుల చరిత్రమును భాషమూలముననే తెలిసికొన సాధ్యమగును. మతము, ఆచా రములు, రాజశాసనములు, సంస్థలు, అన్నియును నూఁటిపోవచ్చును; కాని, సాధారణముగ భాషమాత్రము స్థిరముగ నిలుచును. దాని స్వరూపము కొంత వఱకు మాఱవచ్చును; అయినను కొన్నివేల సంవత్సరములు గతించినను నా స్వరూపము గుర్తింపరానంత యెక్కువగ మాఱదు. ఒక భాష కితరభాషల తోడి సంబంధమును దెలిసికొనుటకు దాని నిర్మాణమును గూర్చి యాలోచింప వలయును గాని, ప్రత్యేక పదములనుగూర్చి యాలోచింపఁగూడదు. పదముల నొక భాషనుండి మఱియొక భాష యెరవు తెచ్చుకొనవచ్చును; కాని, వ్యాక రణరూపముల నెరవు తెచ్చికొనదు. మిక్కిలియుఁ జిక్కయిన వ్యాకరణ నిర్మాణముగల భాష మాతృకకు దగ్గఱగ నుండును. భాష యెంత సంకీర్ణమైన దైనను నందలి యత్యావశ్యకములగు పదము లితరభాషల పదములతో

సంబంధించి యుండినయెడల నా యీ భాషలు పరస్పరసంబంధము గలవని చెప్పవచ్చును. ఈ విషయమున సర్వనామములును, సంఖ్యావాచకపదములును ముఖ్యములు. రెండుభాషల యక్షరములందు (ధ్వనులయందు) సామాన్య పరిణామము కాన్పించుచున్నయెడల, నా భాషల నిర్మాణవిషయమున సాదృశ్యము కాన్పించుచున్నయెడల, నా భాషలకుఁ బరస్పరసంబంధము గలదని నిశ్చయముగఁ జెప్పవచ్చును.

ఈయభిప్రాయము ననుసరించి రాస్కు ఆర్యభాషాకుటుంబమున నంతర్భాగముల నేర్పఱిచెను. ద్రావిడభాషలకును సంస్కృతమునకును సంబంధములేదని మొదట తెల్పిన యాతఁడితఁడే. గ్రిమ్ (Grimm), బాప్ (Bopp) లాయాభాషలవిషయమున సూక్ష్మ విమర్శనములుచేసి, కొన్ని ధ్వని పరిణామ సూత్రముల నేర్పఱిచిరి. బాప్ (Bopp) భాషల నన్నిటిని మూఁడు వర్గములుగ నేర్పఱిచెను. (1) ధాతువులుగాని ప్రత్యయములుగాని లేని భాషలు : ఉదా. చీనాభాష. ఇట్టి భాషలయం దాయాపదములు వాక్యమునందున్న స్థానమును బట్టి యర్థస్ఫూర్తి కలుగును. (2) ఏకాక్షర ధాతువులుగల భాషలు: ధాతువు లితర ధాతువులతోఁ జేరి వివిధ వికారములను బొందుటచేత వివిధ వ్యాకరణ రూపము లేర్పడును : ఉదా. సంస్కృతము, మొద. (3) ద్వివర్ణక ధాతువులు గల భాషలు, లేక మూఁడు వ్యంజనములుగల ధాతువులు మూలముగాఁ గల భాషలు : ఉదా. అరబ్బీ, హీబ్రూ, మొదలయిన సెమిటికు భాషలు. ఇందా మూఁడు వ్యంజనముల యంతరమున వివిధాచ్చులుచేరి వ్యాకరణరూపము లేర్పడుచుండును. ఈ విభాగమును గూర్చి తరువాతికాలమున నభిప్రాయ భేదము లేర్పడెను.

పై వారితరువాత భాషాశాస్త్రమునఁ బేరుగడించినవాఁడు హుంబోల్టు (Wilhelm von Humboldt). ఇతని యభిప్రాయముప్రకారము భాష యొక వస్తువుకాదు; అది పరిపూర్ణత నొందినదికాదు. అది చైతన్యము. అది యూహలను దెలుపుటకు వాగింద్రియ మూలమున మనస్సు చేయుచుండు నిరంతరకృషి ... భాష యేకము; ప్రత్యేకపదములును వాక్యములును భాష కాఁ జాలదు. భాషను పదములుగ విభజించి సూత్రముల నేర్పఱుచుట యది మృతదేహ మనుకొని యిచ్చవచ్చునట్లు దానిని భేదించుటవంటిది. భాషలో నేదియు నిలుకడఁ గాంచియుండదు; అది చైతన్యవంతమై చలనాత్మకమై యుండును. భాష యొకచో నిలుకడఁ గాంచుటకుఁ దావులేదు. అది వ్రాఁత యందును నిలువఁ జాలదు. అందు నశించిన భాగమును మనస్సునందు పునఃస్సృష్టి చేసికొనుచుండవలెను. భాషయనునది భాషింపఁబడవలెను; ఇతరులకు బోధపడవలెను. లేకున్న దానికి వ్యక్తిత్వము లేకుండును. ఎంత యనాగరక

చ్ఛికము గాదు. భాషాశాస్త్రజ్ఞు డీ మూఁడుభాషలను సరిపోల్చునపు డవి యన్నియు నేకమాతృకనుండి యుత్పన్నములై నవని తలంపకపోఁడు. ఆ మాతృక నేఁడు లేకపోవచ్చును. ఇట్లే గాథికు, కెల్టికుభాషలును సంస్కృతముతో సాజాత్యము గలిగినవని యూహింపవచ్చును. ప్రాచీనపెర్షియను భాషయు నీ కుటుంబమునకుఁ జేరినదనియే చెప్పవచ్చును" అని తెలిపెను; కాని, యాతఁడు తన వాదమును సమర్థించుట కాయాభాషలందు తగిన కృషిని జేయలేదు.

సంస్కృతభాషా పరిచయమువలన భాషాశాస్త్రమునకుఁ గ్రొత్త మార్గము ననుసంధింపఁ గృషిచేసినవారిలో 'స్లెగెల్' (Schlegel) అనునాతఁడు ప్రథముఁడు. కాని, యాతఁడు తత్తద్భాషలయందలి పదము లే ధ్వని పరిణామ సూత్రములచే వేర్వేఱు రూపములఁ దాల్చినవో యను విషయమును గూర్చి కృషిచేయక, పైకి స్పష్టముగఁ గానవచ్చు కొన్ని పోలికలను మాత్రము గుర్తించితృప్తినొందెను. అతఁడు చేసిన సిద్ధాంతములలో ముఖ్యమయినది ప్రపంచమందలి భాషలను (1) సంస్కృతముతో సంబంధించిన భాషలు (2) తక్కినవి, అను రెండు వర్గములుగా నేర్పఱుచుట.

స్లెగెలు తరువాత నాతని మార్గమునఁ గృషిచేసినవారిలో బాప్ (Bopp), గ్రిమ్ (Grimm), రాస్క్ (Rask) అనువారు ముప్వురును ననేక భాషలతోఁ బరిచయముఁ గలుగఁజేసికొని, వానిలోఁ గొన్నిటికిఁ బ్రత్యేకముగ వ్యాకరణములను వ్రాసి యాయాభాషలకుఁ గల సూక్ష్మ సంబంధములను గుర్తించి భాషాశాస్త్రమున ధ్వనిపరిణామ సూత్రముల నేర్పఱుపఁ బ్రయత్నించిరి.

రాస్కు నభిప్రాయమున లిఖితాధారములులేని యా యా జాతుల చరిత్రమును భాషమూలముననే తెలిసికొన సాధ్యమగును. మతము, ఆచారములు, రాజశాసనములు, సంస్థలు, అన్నియును మాఱిపోవచ్చును; కాని, సాధారణముగ భాషమాత్రము స్థిరముగ నిలుచును. దాని స్వరూపము కొంత వఱకు మాఱవచ్చును; అయినను కొన్నివేల సంవత్సరములు గతించినను నా స్వరూపము గుర్తింపరానంత యెక్కువగ మాఱదు. ఒక భాష కితరభాషలతోడి సంబంధమును దెలిసికొనుటకు దాని నిర్మాణమును గూర్చి యాలోచింపవలయును గాని, ప్రత్యేక పదములనుగూర్చి యాలోచింపఁగూడదు. పదముల నొక భాషనుండి మఱియొక భాష యెరవు తెచ్చుకొనవచ్చును; కాని, వ్యాకరణరూపముల నెరవు తెచ్చికొనదు. మిక్కిలియుఁ జిక్కయిన వ్యాకరణ నిర్మాణముగల భాష మాతృకకు దగ్గఱగ నుండును. భాష యెంత సంకీర్ణమైనదైనను నందలి యత్యావశ్యకములగు పదము లితరభాషల పదములతో

సంబంధించి యుండినయెడల నా యీ భాషలు పరస్పరసంబంధము గలవని చెప్పవచ్చును. ఈ విషయమున సర్వనామములును, సంఖ్యావాచకపదములును ముఖ్యములు. రెండుభాషల యక్షరములందు (ధ్వనులయందు) సామాన్య పరిణామము కాన్పించుచున్నయెడల, నా భాషల నిర్మాణవిషయమున సాదృశ్యము కాన్పించుచున్నయెడల, నా భాషలకుఁ బరస్పరసంబంధము గలదని నిశ్చయముగఁ జెప్పవచ్చును.

ఈయభిప్రాయము ననుసరించి రాస్క్ ఆర్యభాషాకుటుంబమున నంతర్భాగముల నేర్పఱిచెను. ద్రావిడభాషలకును సంస్కృతమునకును సంబంధములేదని మొదట తెల్పిన యాతఁడేఁడే. గ్రిమ్ (Grimm), బాప్ (Bopp) లాయాభాషలవిషయమున సూక్ష్మ విమర్శనములుచేసి, కొన్ని ధ్వని పరిణామ సూత్రముల నేర్పఱిచిరి. బాప్ (Bopp) భాషల నన్నిటిని మూఁడు వర్గములుగ నేర్పఱిచెను. (1) ధాతువులుగాని ప్రత్యయములుగాని లేని భాషలు : ఉదా. చీనాభాష. ఇట్టి భాషలయం దాయాపదములు వాక్యమునందున్న స్థానమును బట్టి యర్థస్ఫూర్తి కలుగును. (2) ఏకాక్షర ధాతువులుగల భాషలు: ధాతువులితర ధాతువులతోఁజేరి వివిధ వికారములను బొందుటచేత వివిధ వ్యాకరణ రూపము లేర్పడును : ఉదా. సంస్కృతము, మొద. (3) ద్వివర్ణక ధాతువులు గల భాషలు, లేక మూఁడు వ్యంజనములుగల ధాతువులు మూలముగాఁ గల భాషలు : ఉదా. అరబ్బీ, హీబ్రూ, మొదలయిన సెమిటిక భాషలు. ఇందాయా వ్యంజనముల యంతరమున వివిధాచ్చులుచేరి వ్యాకరణరూపము లేర్పడుచుండును. ఈ విభాగమును గూర్చి తరువాతికాలమున నభిప్రాయ భేదము లేర్పడెను.

పై వారితరువాత భాషాశాస్త్రమునఁ బేరుగడించినవాఁడు హుంబోల్టు (Wilhelm von Humboldt). ఇతని యభిప్రాయముప్రకారము భాష యొక వస్తువుకాదు; అది పరిపూర్ణత నొందినదికాదు. అది చైతన్యము. అది యూహలను దెలుపుటకు వాగింద్రియ మూలమున మనస్సు చేయుచుండు నిరంతరకృషి ... భాష యేకము; ప్రత్యేకపదములును వాక్యములును భాష కాఁ జాలదు. భాషను పదములుగ విభజించి సూత్రముల నేర్పఱుచుట యది మృతదేహ మనుకొని యిచ్చవచ్చినట్లు దానిని భేదించుటవంటిది. భాషలో నేదియు నిలుకడఁ గాంచియుండదు; అది చైతన్యవంతమై చలనాత్మకమై యుండును. భాష యొకచో నిలుకడఁ గాంచుటకుఁ దావులేదు. అది వ్రాఁత యందును నిలువఁ జాలదు. అందు నశించిన భాగమును మనస్సునందు పునఃసృష్టి చేసికొనుచుండవలెను. భాషయనునది భాషింపఁబడవలెను; ఇతరులకు బోధపడవలెను. లేకున్న దానికి వ్యక్తిత్వము లేకుండును. ఎంత యనాగరక

భాషయైనను సంపూర్ణ చైతన్యముగల వ్యక్తియే. దానిని మాట్లాడువారి మనఃపరిణతి నది తెలియఁజేయును. భాషను మాట్లాడువారి మనఃపరిణామము ననుసరించి యా భాషయందును బరిణామము గలుగుచునే యుండును. ఈ పరిణామమునందు నూతనసృష్టి గలుగుచుండు నవస్థయు, నా సృష్టి మందగించి నిలుకడ కలిగిన యవస్థయు నను రెండవస్థ లుండును. మొదటి యవస్థయందు భాషాప్రయోజనమునుగూర్చికంటె భాషను గూర్చియే శ్రద్ధ యెక్కువగ నుండును. అందుచేతఁ గ్రొత్త వ్యాకరణరూపము లేర్పడుచుండును. రెండవ యవస్థయందా సంపూర్ణవ్యాకరణరూపములు శిథిలములయి యంతకంతకు నంతరించుచుండును. మనస్సు విషయప్రకటనమును గూర్చి యెక్కువగ నాలోచించునప్పుడు భాషనుగూర్చి యంత శ్రద్ధ వహింపదు. కావున, నీ యవస్థయందు భాష యెక్కువ మార్పులకు లోనగును. అభిప్రాయ ప్రకటనమే ముఖ్యమని తలంచి, వ్యాకరణరూపములందలి సూక్ష్మభేదముల నీ యవస్థయందు లక్ష్యపెట్టరు.

పందొమ్మిదవ శతాబ్దారంభమున నైరోపాయందలి భాషాశాస్త్రజ్ఞుల వ్రాఁతలయందు కొన్ని ముఖ్యవిషయములను గమనింపవచ్చును. (1) సంస్కృతభాషకుఁ బ్రాధాన్యము వచ్చెను. ఏ భాషయందలి రూపము చరిత్రమును దెలుపవలసినను మొదట సంస్కృతరూపము నెత్తుకొనవలెను. 'సంస్కృత భాషా పరిచయములేని భాషాశాస్త్రజ్ఞుఁడు గణితశాస్త్రము తెలియని జ్యోతిష్కుని వంటివాఁ' డని మాక్సుమ్యూల రనెను. (2) ఈ కాలమున శాస్త్రజ్ఞులా యా భాషలయందలి పోలికలను మాత్రము గుర్తించుచుండిరిగాని, భేదములను గూర్చి శ్రద్ధ వహింపలేదు. (3) ఆ కాలపు శాస్త్రజ్ఞులు సాధారణముగ వ్యవహారభ్రష్టములగు భాషలను గూర్చియే యెక్కువ కృషిచేయుచుండిరి. వ్యవహారమునందున్న భాషలనుగూర్చి యాలోచించునపుడైనను, వారు వానియందలి పురాతనరూపములను గుర్తించుటయందే యెక్కువ శ్రద్ధ వహించుచుండిరి.

పందొమ్మిదవ శతాబ్దమధ్యమున శాస్త్రజ్ఞుల దృక్పథమునఁ గొంత మార్పు కలిగెను. ఒక మూలభాష వివిధమార్గములఁ బరిణామమునొంది వివిధభాషలుగ నేర్పడియుండెనని వారు గ్రహించినను, భాష లేలమారును? సజాతీయములయిన యొకభాషకును మఱియొక భాషకును నంతటి భేదము గలుగుటకుఁ గారణమేమి? యను ముఖ్య విషయములనుగూర్చి వా రాలోచింపలేదు. బ్రెడ్స్ డార్ఫ్ (J. H. Bredsdorff) అనునతఁడు పదములయందలి మార్పులకు (1) తప్పుగా వినుట, తప్పుగా నర్థముచేసికొనుట (2) ఒకమాట యథాస్వరూపమున స్మృతికి రాకుండుట (3) వాగింద్రియము

లందలి దోషము (4) అలసత;- భాషయందలి మార్పులకు పదికి తొమ్మిది వంతున నిదియే కారణమని యాతని యభిప్రాయము (5) స్వరసామ్యమునుబట్టి క్రొత్త పదముల నేర్పఱుచుట (6) స్పష్టోచ్చారణమునకై ప్రయత్నము (7) నూతన భావప్రకటనావశ్యకత, అనునవి కారణములుగ నిరూపించి యున్నాఁడు. ఈ కారణములలోఁ గొన్నిటిని దరువాతివా రంగీకరింపలేదు.

ఈ కాలమున భాషాశాస్త్రమునఁ గలిగిన క్రొత్త పద్ధతి యీ శాస్త్రము భాష యేరీతిగా నుండవలెను, ఎట్టి భాష యుత్తమభాష యను విషయములను నిర్ణయించుట గాక, వృక్షశాస్త్రము మొదలగు శాస్త్రములందువలె భాష యందు కానవచ్చు వివిధవిషయములను క్రోడీకరించి, వర్గీకరించి, వాని స్వరూపము నున్నదున్నట్లు చెప్పుట. ఈ పద్ధతి ననుసరించి పందొమ్మిదవ శతాబ్దము మధ్యమున ననేక భాషల స్వరూపము నిర్ణయింపఁ బ్రయత్నములు జరిగెను ఆయా భాషల యథార్థస్వరూపములనుబట్టి మ్యాక్స్ మ్యూలరు (Max Muller) మొదలగువారు ప్రపంచభాషల నన్నిటిని వాని వాని లక్షణముల ననుసరించి వివిధభాషాకుటుంబములుగ నేర్పఱిచిరి. ఇట్లేర్పడిన యనేక కుటుంబములందలి ప్రత్యేక భాషల లక్షణములను, నొక భాషయందలి ధ్వనులు మఱియొక భాషయందు పరిణమించిన తీరును, ననుసరించి యీ కుటుంబములోని భాషలన్నిటికిని నొకమాతృక యుండవలెనని యూహించి, యీ మాతృభాష స్వరూపమును నిర్ణయింప విద్వాంసులు పూనిరి. అందు ప్రాచీన ఇండో-జర్మానిక మాతృభాషా నిర్మాణమును గూర్చి యెక్కుడు కృషి జరిగెను. ఇందుకొఱకు 'స్వరశాస్త్రము' (Phonetics) నెక్కువగ నభివృద్ధి చేసికొనసాగిరి. కాని, యీ మూలభాషానిర్మాణ విషయమున ననేక కారణములచే శాస్త్రజ్ఞులు కృతార్థులు కాలేదు. వారీవిషయమున నవలంబించిన పద్ధతి తీవ్రముగ విమర్శకు గుఱియైనది.

పందొమ్మిదవ శతాబ్దము నంతమువఱకును బాశ్చాత్యపండితులు భాషాశాస్త్రమునఁ జేసిన కృషినిగూర్చి యింతవఱకును సంగ్రహముగాఁ దెలుపఁబడినది. ఆ తరువాత నీ శాస్త్రమును గూర్చి నిరంతరకృషి జరుగుచునే యున్నది. నేఁడు భాషాశాస్త్రమున మఱియొక యుగ మారంభమయినదని చెప్పవచ్చును. ఈ క్రొత్తయుగమును గూర్చి విట్నీ (Whitney) "పూర్వకాలమున నశాస్త్రీయముగ పదముల వ్యుత్పత్తులను నిర్వచించుటకును నేఁటి పద్ధతికిని జాల భేదముగలదు. పూర్వు లేర్పఱిచిన వ్యుత్పత్తుల నిప్పటివారు కొన్నియెడల శాస్త్రసాధ్యము లని యొప్పుకొన్నను దగినంత ప్రమాణములేక, వానిని పరిగ్రహింపరు. ఎంత చిన్న విషయమైనను దానికి సంబంధించిన యితర విషయములనన్నిటిని నేఁటివా రొకచోఁ జేర్చుకొందురు. అనేక విషయముల

భాషయైనను సంపూర్ణ చైతన్యముగల వ్యక్తియే. దానిని మాట్లాడువారి మనఃపరిణతి నది తెలియఁజేయును. భాషను మాట్లాడువారి మనఃపరిణామము ననుసరించి యా భాషయందును బరిణామము గలుగుచునే యుండును. ఈ పరిణామమునందు నూతనసృష్టి గలుగుచుండు నవస్థయు, నా సృష్టి మందగించి నిలుకడ కలిగిన యవస్థయు నను రెండవస్థ లుండును. మొదటి యవస్థయందు భాషాప్రయోజనమునుగూర్చికంటె భాషను గూర్చియే శ్రద్ధ యెక్కువగ నుండును. అందుచేతఁ గ్రొత్త వ్యాకరణరూపము లేర్పడుచుండును. రెండవ యవస్థయందా సంపూర్ణవ్యాకరణరూపములు శిథిలములయి యంతకంతకు నంతరించుచుండును. మనస్సు విషయప్రకటనమును గూర్చి యెక్కువగ నాలోచించునప్పుడు భాషనుగూర్చి యంత శ్రద్ధ వహింపదు. కావున, నీ యవస్థయందు భాష యెక్కువ మార్పులకు లోనగును. అభిప్రాయ ప్రకటనమే ముఖ్యమని తలంచి, వ్యాకరణరూపములందలి సూక్ష్మభేదముల నీ యవస్థయందు లక్ష్యపెట్టరు.

పందొమ్మిదవ శతాబ్దారంభమున నైరోపాయందలి భాషాశాస్త్రజ్ఞుల వ్రాఁతలయందు కొన్ని ముఖ్యవిషయములను గమనింపవచ్చును. (1) సంస్కృతభాషకుఁ బ్రాధాన్యము వచ్చెను. ఏ భాషయందలి రూపము చరిత్రమును దెలుపవలసినను మొదట సంస్కృతరూపము నెత్తుకొనవలెను. 'సంస్కృత భాషా పరిచయములేని భాషాశాస్త్రజ్ఞుఁడు గణితశాస్త్రము తెలియని జ్యోతిష్కుని వంటివాఁ' డని మాక్సుమ్యూల రనెను. (2) ఈ కాలమున శాస్త్రజ్ఞులా యా భాషలయందలి పోలికలను మాత్రము గుర్తించుచుండిరిగాని, భేదములను గూర్చి శ్రద్ధ వహింపలేదు. (3) ఆ కాలపు శాస్త్రజ్ఞులు సాధారణముగ వ్యవహారభ్రష్టములగు భాషలను గూర్చియే యెక్కువ కృషిచేయుచుండిరి. వ్యవహారమునందున్న భాషలనుగూర్చి యాలోచించునపుడైనను, వారు వానియందలి పురాతనరూపములను గుర్తించుటయందే యెక్కువ శ్రద్ధ వహించుచుండిరి.

పందొమ్మిదవ శతాబ్దమధ్యమున శాస్త్రజ్ఞుల దృక్పథమునఁ గొంత మార్పు కలిగెను. ఒక మూలభాష వివిధమార్గములఁ బరిణామమునొంది వివిధభాషలుగ నేర్పడియుండెనని వారు గ్రహించినను, భాష లేలమారును ? సజాతీయములయిన యొకభాషకును మఱియొక భాషకును నంతటి భేదము గలుగుటకుఁ గారణమేమి ? యను ముఖ్య విషయములనుగూర్చి వా రాలోచింపలేదు. బ్రెడ్స్ డార్ఫ్ (J. H. Bredsdorff) అనునతఁడు పదములయందలి మార్పులకు (1) తప్పుగా వినుట, తప్పుగా నర్థముచేసికొనుట (2) ఒకమాట యథాస్వరూపమున స్మృతికి రాకుండుట (3) వాగింద్రియము

లందలి దోషము (4) అలసత;- భాషయందలి మార్పులకు పదికి తొమ్మిది వంతుల నిదియే కారణమని యాతని యభిప్రాయము (5) స్వరసామ్యమునుబట్టి క్రొత్త పదముల నేర్పఱుచుట (6) స్పష్టోచ్చారణమునకై ప్రయత్నము (7) నూతన భావప్రకటనావశ్యకత, అనునవి కారణములుగ నిరూపించి యున్నాఁడు. ఈ కారణములలోఁ గొన్నిటిని దరువాతివా రంగీకరింపలేదు.

ఈ కాలమున భాషాశాస్త్రమునఁ గలిగిన క్రొత్త పద్ధతి యాశాస్త్రము భాష నేరీతిగా నుండవలెను, ఎట్టి భాష యుత్తమభాష యను విషయములను నిర్ణయించుట గాక, వృక్షశాస్త్రము మొదలగు శాస్త్రములందువలె భాష యందు కానవచ్చు వివిధవిషయములను క్రోడీకరించి, వర్గీకరించి, వాని స్వరూపము నున్నదున్నట్లు చెప్పుట. ఈ పద్ధతి ననుసరించి పందొమ్మిదవ శతాబ్దము మధ్యమున ననేక భాషల స్వరూపము నిర్ణయింపఁ బ్రయత్నములు జరిగెను ఆయా భాషల యథార్థస్వరూపములనుబట్టి మ్యాక్స్ మ్యూలరు (Max Muller) మొదలగువారు ప్రపంచభాషల నన్నిటిని వాని వాని లక్షణముల ననుసరించి వివిధభాషాకుటుంబములుగ నేర్పఱిచిరి. ఇట్లేర్పడిన యనేక కుటుంబములందలి ప్రత్యేక భాషల లక్షణములను, నొకభాషయందలి ధ్వనులు మఱియొక భాషయందు పరిణమించిన తీరును, ననుసరించి యాకుటుంబములోని భాషలన్నిటికిని నొకమాతృక యుండవలెనని యూహించి, యామాతృభాష స్వరూపమును నిర్ణయింప విద్వాంసులు పూనిరి. అందు ప్రాచీన ఇండో-జర్మానిక మాతృభాషా నిర్మాణమును గూర్చి యెక్కుడు కృషి జరిగెను. ఇందుకొఱకు 'స్వరశాస్త్రము' (Phonetics) నెక్కుడుగ నభివృద్ధి చేసికొనసాగిరి. కాని, యీ మూలభాషానిర్మాణ విషయమున ననేక కారణములచే శాస్త్రజ్ఞులు కృతార్థులు కాలేదు. వారీవిషయమున నవలంబించిన పద్ధతి తీవ్రముగ విమర్శకు గుఱియైనది.

పందొమ్మిదవ శతాబ్దము నంతమువఱకును బాశ్చాత్యపండితులు భాషాశాస్త్రమునఁ జేసిన కృషినిగూర్చి యింతవఱకును సంగ్రహముగాఁ దెలుపఁబడినది. ఆ తరువాత నీ శాస్త్రమును గూర్చి నిరంతరకృషి జరుగుచునే యున్నది. నేఁడు భాషాశాస్త్రమున మఱియొక యుగ మారంభమయినదని చెప్పవచ్చును. ఈ క్రొత్తయుగమును గూర్చి విట్నీ (Whitney) "పూర్వ కాలమున నశాస్త్రీయముగ పదముల వ్యుత్పత్తులను నిర్వచించుటకును నేఁటి పద్ధతికిని జాల భేదముగలదు. పూర్వు లేర్పఱిచిన వ్యుత్పత్తుల నిప్పటివారు కొన్నియెడల శాస్త్రసాధ్యము లని యొప్పుకొన్నను దగినంత ప్రమాణము లేక, వానిని పరిగ్రహింపరు. ఎంత చిన్న విషయమైనను దానికి సంబంధించిన యితర విషయములనన్నిటిని నేఁటివారు పరిశోధింపక చేర్చుకొందురు. అనేక విషయముల

పరిశీలనము చేసినఁగాని నేఁడెవ్వరును సిద్ధాంతముచేయరు. భాషాశాస్త్రజ్ఞుఁడు నేఁడు శబ్దరూపముల నన్నిటినిఁ జేర్చి ప్రతిశబ్దము చరిత్రమును బ్రత్యేకముగ శాస్త్రపద్ధతి ననుసరించి యేర్పఱచుకొనును" అని చెప్పియున్నాఁడు. నేఁటి శాస్త్రజ్ఞులెన్నో స్వరపరిణామ సూత్రముల నేర్పఱచుకొని క్రొత్త సిద్ధాంతములను చేయుచున్నారు. నేఁడు వ్యవహారభ్రష్ట భాషలుకాక, జనవ్యవహారమందున్న జీవద్భాషలు పరిశోధనమునకు గుఱియగుచున్నవి. సంధి, స్వరము, అర్థపరిణామము, మొదలగు ననేకవిషయములనుగూర్చి విద్వాంసులు సూక్ష్మచర్చలఁ జేయుచున్నారు.

పాశ్చాత్య విద్వాంసులు భాషాశాస్త్ర విషయమునఁ జేసిన కృషి యమితముగ నున్నది. కాని, ద్రావిడభాషలను గూర్చిన పరిశోధనము చాల తక్కువ యనియే చెప్పవలెను. తమిళభాషను గూర్చి 'పోపు (Pope), మలయాళ భాషనుగూర్చి గండర్టు (Gundert), కన్నడమునుగూర్చి రైసు (Rice), కిట్టెలు (Kittel), తెనుఁగున బ్రౌను (Brown), మొదలగువా రాదియందు కొంత కృషిచేసియుండిరి. వారి తరువాత నీ ప్రత్యేకభాషల విషయముననను, నీ భాషల పరస్పర సంబంధము విషయముననను, ద్రావిడభాషా వర్గమునకును నితర భాషావర్గములకును గల సంబంధము విషయముననను నెక్కువ కృషి జరుగలేదు. కాల్డువెల్లు 1856 సం॥ ర ప్రాంతమున వ్రాసిన 'కంపేరెటివ్ గ్రామర్ ఆఫ్ ది డ్రవిడియన్ లాంగ్వేజస్' అను గ్రంథమే ద్రావిడభాషల పరస్పర సంబంధమును గూర్చియు, వానికిని నితర భాషావర్గములకును గల సంబంధమును గూర్చియు చర్చలుగల గ్రంథముగా నున్నది. దానినే నేఁటి వారు పరమప్రమాణముగా నంగీకరించుచున్నారు. కాని, కాల్డువెల్లు తనకు తమిళముతోమాత్ర మెక్కువ పరిచయము కలదనియు, తక్కిన ద్రావిడభాషలను బాగుగ నభ్యసించినవారు, తమతమ భాషలను ప్రధానముగఁ జేసికొనియాలోచించినయెడల వేఱు సిద్ధాంతములఁ జేయుట కవకాశ మున్నదనియు, అట్టి కృషిచేయుటకుఁ దగినవారీదేశపు పండితులే యనియు, ప్రత్యేక ద్రావిడభాషలనుగూర్చి యెక్కువ కృషి జరిగినఁగాని యీ విషయమున నిదమిత్థమని చెప్ప వీలులేదనియు తెలిపియుండెను. కాని, యాతఁ డాశించినట్లీవిషయమున దేశీయపండితు లెక్కువ కృషిచేసి యుండలేదు. ఇఁకముందు ఒక్కొక్క ద్రావిడభాషయొక్క చరిత్రమును దెలిసికొనఁ బ్రయత్నములు జరుగవలసి యున్నవి.

ఆధునిక భారతీయ భాషలలో బాంగ్లా (Bengali) భాషకు సునీత్ కుమార్ ఛాటర్జీ చరిత్రమును వ్రాసెను. మఱియే భారతీయ భాషకును నట్టి చరిత్రము బయలువెడలినట్లు కాన్పింపదు. ఆంధ్రభాష కట్టి చరిత్రమును

వ్రాయుటకు నాకుఁ జాలకాలమునుండియుఁ గోరికయుండినది. వ్యావహారికాంధ్రభాషోద్యమ మట్టి చరిత్రను వ్రాయుటకు సహకారియైనది. ఈ గ్రంథమా యుద్యమమున కొక ఫలమని చెప్పవచ్చును. వ్యావహారికభాష నేఁటివారి వ్రాఁతలయం దెల్ల వ్యాపించుచున్నదియుఁ దెలుపుట యప్రస్తుతము.

ఆ యుద్యమము నారంభించునపుడు గ్రామ్య లనియు నలాక్షణికములనియు పండితులు నిషేధించుచుండిన శబ్దములకును వ్యాకరణరూపములకును కవుల గ్రంథములనుండి ప్రయోగముల నెత్తిచూపవలసి వచ్చెను. దానికొఱకు కృషి యమితముగా జరిగినది. వ్యావహారికాంధ్రభాషా ప్రవర్తకు లట్టి పూర్వకవుల ప్రయోగములఁ జూపుటయే కాక నేఁటిగ్రంథకర్తలు తమ గ్రంథములందు నేఁటి వ్యవహారము నెట్లతిక్రమింపఁ జాలకున్నారో, పూర్వకాలపు భాషతో సరియగు పరిచయము లేకపోవుటచేత పూర్వకావ్యభాష ననుకరింపఁబోయి యెట్టి భ్రమ ప్రమాదములకు లోనై యెట్టి కృతకభాషను గల్పించి, భాషాభివృద్ధిని తన్మూలమున జ్ఞానాభివృద్ధిని లక్ష్యమునం దుంచుకొనక, యొకరితప్పుల నొకరెంచుకొనుటలోడనే కాలక్షేపము చేయుచున్నారో వివరింపవలసివచ్చినది. ఆ యుద్యమమువలనఁ బూర్వకాలపుభాషయందు వ్రాయుటవలన నెట్టి ప్రయోజనమును లేదనియు, భాషకు ముఖ్యప్రయోజనమగు నభిప్రాయ ప్రకటనమును, జనులందఱకెల్ల విద్యావ్యాప్తియు సిద్ధింపవనియు కొందఱికి నచ్చి, వ్యావహారిక భాషయందే గ్రంథములను వ్రాయఁజొచ్చిరి. వ్యావహారిక భాషావాదుల కృషిమూలమున నేఁడు క్రొత్తరీతి భాషారచన బయలుదేరినది. ఆ రచనలయందు లోపములు లేకపోలేదు. ఆ లోపముల నెట్లు సవరించుట యను విషయమును గూర్చి ప్రసంగించుట కిది తావుగాదు.

పూర్వకవుల ప్రయోగములే సాధువులనియు నర్వాచీనకవుల ప్రయోగములు దుష్టములనియు గ్రాంథికవాదు లందురు. కాని, పూర్వకవుల భాషాస్వరూపము నెవ్వరు నేర్పఱచియుండలేదు. ఆ లోపము దీర్చుటకుఁ బూర్వకావ్యముల నన్నిఁటిని పూర్వభాషా సంప్రదాయ సూచకములగు పూర్వకాలపు శాసనముల మూలమునను పూర్వకాలపు వ్రాఁతప్రతులమూలమునను సరిచేసి, వానిలోని భాషను వ్యాకరింపవలయును. ఆంధ్రభాషాచరిత్ర నిర్మాణమునకుఁ బూర్వ మిట్టికృషి యెంతయో జరుగవలసియున్నది. ఇప్పటి ముద్రిత గ్రంథములలోఁ గొన్ని పండిత పరిష్కృతములయినను పాఠపరిష్కరణము శాస్త్రీయముగ జరుగలేదు. కావున, నాయీ వ్యాకరణ

రూపముల వివిధ కాలావస్థలను గూర్చి యిదియే సిద్ధాంతమని చెప్పుట సాహసమే. కాని, యీ గ్రంథమున నాంధ్రభాషాచరిత్ర నిర్మాణమునకు దారితీయఁ బ్రయత్నించితిని. అందుకు నన్నయ భారతభాగము భాష నా నాఁటి శాసనముల మూలముననను, ఇంచుమించు నూఱు వ్రాఁత ప్రతుల సహాయముననను నిరూపింపఁ బ్రయత్నించితిని. ఈ గ్రంథమందలి 'పదునొకం డవ శతాబ్దమునాఁటి తెనుఁగుభాష'యను నధ్యాయ మాకృషికి ఫలము. అటు పిమ్మట ననేకాంధ్రకావ్యముల భాషయందు గానవచ్చిన వ్యాకరణ శేవి షములను సాధ్యమయినంతవఱకును గుర్తించి, వానిని వర్గీకరించి యా యా విషయముల ననుసరించి యేర్పఱిచితిని. నేఁటికిఁ బ్రకటింపఁబడిన శాసనముల నన్నిటిని బరిశీలించి యందలి ప్రయోగముల నాయా ప్రక రణములందు చేర్చితిని. వ్యావహారికభాష యేయే కాలములందు గ్రంథస్థ మగుచు వచ్చినదో నిరూపించితిని. కావ్యములందు చేరని వ్యావహారిక రూపములను నచ్చటచ్చట నుదాహరించితిని. పూర్వవైయాకరణులు వ్యాక రణ విషయమునఁ జేసిన కృషి నంతటి నుపయోగించికొంటిని. ఆంధ్రభాష కును దక్కిన ద్రావిడభాషలకును, ద్రావిడభాషా వర్గమునకును నార్య భాషావర్గమునకును గల సంబంధమును నాకుఁ దోఁచినట్లు వివరించితిని.

ఈ గ్రంథమునఁ గ్రియాప్రకరణము నవ్యయప్రకరణమును స్థలసం కోచముచే ననుకొన్నంత విస్తరించి వ్రాయుటకు వీలు లేకపోయినది. ఈ రెండు ప్రకరణములందును దెలుపవలసిన విశేషము లనేకములు మిగిలిపోయినవి. గ్రంథపునర్ముద్రణమున వానిని జేర్చెదను. శిశువుల భాష, స్త్రీల భాష, మాండలిక భాషలు, సాంకేతిక రహస్యభాషలు, మొదలగు మఱికొన్ని విష యములను గూర్చియు వివరింపక యాంధ్రభాషాచరిత్రము సంపూర్ణము కాఁజాలదు. వానిని గూర్చి యీ గ్రంథమునఁ దెలుపుటకుఁ దావు లేకపోయి నందుకుఁ జింతిల్లుచున్నాను.

ఈ గ్రంథరచనమునందు నా గురువుగారగు మహారాజశ్రీ రావుసాహేబు గిడుగు రామమూర్తి పంతులుగారు వాఙ్మయమునుండి గుర్తించికొని యుం డిన యనేక ప్రయోగముల నుపయోగించుకొన్నాను. ఆంధ్రభాషను గూర్చి వారికంటె నెక్కువ కృషి చేసిన వారు లేరు. వారే యీ యాంధ్రభాషా చరిత్రమును వ్రాయ నర్హులు. కాని, వారి జీవితములో ముఖ్యభాగ మం తయుఁ బండితులతోడి వాదములతోను, వ్యావహారికభాషా ప్రవర్తనోద్య మముతోడను గడచిపోయినది. మేమిద్దఱమును నొకచోటనుండి పనిచేయు నవకాశములు లభింపలేదు. అట్టిది సందర్భపడియుండిన, వారి యుపదేశాను

సారముగ నింకను నెక్కువగ భాషనుగూర్చి పరిశ్రమ చేసి యుందును. రామమూర్తి పంతులుగారికిని నాకును ప్రధాన విషయమగు ద్రావిడభాషలకును నార్యభాషలకును గల సంబంధమును గూర్చి యభిప్రాయ భేదము గలదు. నా వాదమును వా రంగీకరింపరని నాకుఁ దెలియును. కాని, యీ విషయమున నేను సేకరించిన సాక్ష్యమునంతటి నొకచోఁ జేర్చి చూపియున్నాను. అది సరిపోయిన సరిపోవుఁ గాక; సరిపోకున్న నింకను నా విషయమున నెక్కువ కృషి జరుగ వలసి యున్నదని మాత్రము చెప్పవలసియుండును. తమతమ వాదములే గెలువవలె నను పట్టుదల తత్త్వైకదృక్కుల కుండఁగూడదు. ఉన్న విషయములను పరామర్శింపక పిడిచిపెట్టను గూడదు. వారీ విషయమున నేను చూపిన సాహసమునకు హర్షింతురనియే నా నమ్మకము.

ఈ గ్రంథమున వివాదగ్రస్తములగు ననేక విషయములను గూర్చిన చర్చలు గలవు. అనేకులు నా యభిప్రాయములతో నేకీభవింపరని నాకుఁ దెలియును. కాని, యాయా విషయములను గూర్చి వ్యక్తిగతముగఁ గాక నిష్పక్షపాతముగ విమర్శింతురు గాక యని ప్రార్థించుచు పండితమండలి కంజలి యెత్తుచున్నాను. ఇందు లోపములును దోషములును లేవని తలంచునంతటి వెఱ్ఱినిగాను. లోపములున్నవి, దోషములు నున్నవి. ఆంధ్రభాషా చరిత్ర నిర్మాణమున కిది ప్రథమప్రయత్నము. మున్ముం దెవ్వరైన నీ మార్గమునఁ బనిచేసి యింతకంటెఁ బ్రామాణికమును సమగ్రమును నగు గ్రంథమును వ్రాయుట కిది దారియగును గదా యని సంతోషించుటకు మాత్రము నాకు స్వేచ్ఛకలదని మనవిచేసికొనుచున్నాను.

ఆంధ్రభాషాచరిత్రమునఁ దెలుపవలసిన విషయము లింక నెన్నియో యున్నవి. ఇప్పటికే గ్రంథము విస్తరించుటచేత నెన్నియో విషయములను జేర్పఁజాలనైతిని. • గ్రంథములోని కెక్కక మిగిలిపోయిన ప్రయోగసామగ్రిని నితర విషయములను నీకముం దెన్నడైన వేఱు సంపుటమున పొందుపఱుచుకొందును.

ఈ గ్రంథమును వ్రాయుటకు నాకుఁ దోడ్పడిన గ్రంథము లనేకములు గలవు. వాని నా యీ సందర్భములందు తెలిపియే యున్నాను. వానికి వాడిన సంక్షేప సంకేతములు సులభముగనే తెలియును గావున, వాని పట్టికను ప్రత్యేకముగఁ జేర్పలేదు.

ఈ గ్రంథమును వ్రాయుటకు నన్ను బ్రేరేచినవారు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి, ఎమ్. ఏ. (కేంబ్రిడ్జ్), డి. లిట్. గారు. ఆంధ్ర విశ్వ

రూపముల వివిధ కాలావస్థలను గూర్చి యిదియే సిద్ధాంతమని చెప్పుట సాహసమే. కాని, యీ గ్రంథమున నాంధ్రభాషాచరిత్ర నిర్మాణమునకు దారితీయఁ బ్రయత్నించితిని. అందుకు నన్నయ భారతభాగము భాష నా నాఁటి శాసనముల మూలముననుు, ఇంచుమించు నూఱు వ్రాఁత ప్రతుల సహాయముననుు నిరూపింపఁ బ్రయత్నించితిని. ఈ గ్రంథమందలి 'పదునొకం డవ శతాబ్దమునాఁటి తెనుఁగుభాష'యను నధ్యాయ మాకృషికి ఫలము. అటు పిమ్మట ననేకాంధ్రకావ్యముల భాషయందు గానవచ్చిన వ్యాకరణ శేవి షములను సాధ్యమయినంతవఱకును గుర్తించి, వానిని వర్గీకరించి యా యా విషయముల ననుసరించి యేర్పఱిచితిని. నేఁటికిఁ బ్రకటింపఁబడిన శాసనముల నన్నిటిని బరిశీలించి యందలి ప్రయోగముల నాయా ప్రక రణములందు చేర్చితిని వ్యావహారికభాష యేయేకాలములందు గ్రంథస్థ మగుచు వచ్చినదో నిరూపించితిని. కావ్యములందు చేరని వ్యావహారిక రూపములను నచ్చటచ్చట నుదాహరించితిని. పూర్వవైయాకరణులు వ్యాక రణ విషయమునఁ జేసిన కృషి నంతటి నుపయోగించికొంటిని. ఆంధ్రభాష కును దక్కిన ద్రావిడభాషలకును, ద్రావిడభాషా వర్గమునకును నార్య భాషావర్గమునకును గల సంబంధమును నాకుఁ దోచినట్లు వివరించితిని.

ఈ గ్రంథమునఁ గ్రియాప్రకరణము నవ్యయప్రకరణమును స్థలసం కోచముచే ననుకొన్నంత విస్తరించి వ్రాయుటకు వీలు లేకపోయినది. ఈ రెండు ప్రకరణములందును దెలుపవలసిన విశేషము లనేకములు మిగిలిపోయినవి. గ్రంథపునర్ముద్రణమున వానిని జేర్చెదను. శిశువుల భాష, స్త్రీల భాష, మాండలిక భాషలు, సాంకేతిక రహస్యభాషలు, మొదలగు నుఱికొన్ని విష యములను గూర్చియు వివరింపక యాంధ్రభాషాచరిత్రము సంపూర్ణము కాఁజాలదు. వానిని గూర్చి యీ గ్రంథమునఁ దెలుపుటకుఁ దావులేకపోయి నందుకుఁ జింతిల్లుచున్నాను.

ఈ గ్రంథరచనమునందు నా గురువుగారగు మహారాజశ్రీ రావుసాహేబు గిడుగు రామమూర్తి పంతులుగారు వాఙ్మయమునుండి గుర్తించికొని యుం డిన యనేక ప్రయోగముల నుపయోగించుకొన్నాను. ఆంధ్రభాషను గూర్చి వారికంటె నెక్కువ కృషిచేసిన వారు లేరు. వారే యీ యాంధ్రభాషా చరిత్రమును వ్రాయ నర్హులు. కాని, వారి జీవితములో ముఖ్యభాగ మం తయుఁ బండితులతోడి వాదములతోను, వ్యావహారికభాషా ప్రవర్తనోద్య మముతోడను గడచిపోయినది. మేమిద్దఱమును నొకచోటనుండి పనిచేయు నవకాశములు లభింపలేదు. అట్టిది సందర్భపడియుండిన, వారి యుపదేశాను

సారముగ నింకను నెక్కువగ భాషనుగూర్చి పరిశ్రమ చేసి యుందును. రామమూర్తి పంతులుగారికిని నాకును బ్రధాన విషయమగు ద్రావిడభాషలకును నార్యభాషలకును గల సంబంధమును గూర్చి యభిప్రాయ భేదము గలదు. నా వాదమును వా రంగీకరింపరని నాకుఁ దెలియును. కాని, యీ విషయమున నేను సేకరించిన సాక్ష్యమునంతటి నొకచోఁ జేర్చి చూపియున్నాను. అది సరిపోయిన సరిపోవుఁ గాక; సరిపోకున్న నింకను నా విషయమున నెక్కువ కృషి జరుగ వలసి యున్నదని మాత్రము చెప్పవలసియుండును. తమతమ వాదములే గెలువవలె నను పట్టుదల తత్త్వైకదృక్కుల కుండఁగూడదు. ఉన్న విషయములను పరామర్శింపక విడిచిపెట్టను గూడదు. వారీ విషయమున నేను చూపిన సాహసమునకు హర్షింతురనియే నా నమ్మకము.

ఈ గ్రంథమున వివాదగ్రస్తములగు ననేక విషయములను గూర్చిన చర్చలు గలవు. అనేకులు నా యభిప్రాయములతో నేకీభవింపరని నాకుఁ దెలియును. కాని, యాయా విషయములను గూర్చి వ్యక్తిగతముగఁ గాక నిష్పక్షపాతముగ విమర్శింతురు గాక యని ప్రార్థించుచు పండితమండలి కంజలి యెత్తుచున్నాను. ఇందు లోపములును దోషములును లేవని తలంచునంతటి వెఱ్ఱినిగాను. లోపములున్నవి, దోషములు నున్నవి. ఆంధ్రభాషా చరిత్ర నిర్మాణమున కిది ప్రథమప్రయత్నము. మున్ముం దెవ్వరైన నీ మార్గమునఁ బనిచేసి యింతకంటెఁ బ్రామాణికమును సమగ్రమును నగు గ్రంథమును వ్రాయుట కిది దారియగును గదా యని సంతోషించుటకు మాత్రము నాకు స్వేచ్ఛకలదని మనవిచేసికొనుచున్నాను.

ఆంధ్రభాషాచరిత్రమునఁ దెలుపవలసిన విషయము లింక నెన్నియో యున్నవి. ఇప్పటికే గ్రంథము విస్తరించుటచేత నెన్నియో విషయములను జేర్పఁజాల నైతిని. గ్రంథములోని కెక్కక మిగిలిపోయిన ప్రయోగసామగ్రిని నితర విషయములను నీకము౦ దెన్నడైన వేఱు సంపుటమున పొందుపఱచుకొందును.

ఈ గ్రంథమును వ్రాయుటకు నాకుఁ దోడ్పడిన గ్రంథము లనేకములు గలవు. వాని నా యా సందర్భములందు తెలిపియే యున్నాను. వానికి వాడిన సంక్షేప సంకేతములు సులభముగనే తెలియును గావున, వాని పట్టికను బ్రత్యేకముగఁ జేర్పలేదు.

ఈ గ్రంథమును వ్రాయుటకు నన్ను బ్రేరేచినవారు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి, ఎమ్. ఏ. (కేంబ్రిజ్), డి. లిట్. గారు. ఆంధ్ర విశ్వ

విద్యాలయ కేంద్రస్థానము బెజవాడలో నున్నపుడు వారికి నే నాంధ్రభాషా విషయమునఁ జేసిన కృషినిగూర్చి కొంత నివేదించితిని. వారును సంతోషించి యీ గ్రంథమును వ్రాయుమని సెలవిచ్చుటయే కాక, దీని నాంధ్ర విశ్వ విద్యాలయము పక్షమునఁ బ్రచురింపించు నవకాశముఁ గల్పించిరి. వారు విశ్వ విద్యాలయోపాధ్యక్షులుగ నుండినప్పుడు వ్రాయ నారంభించిన యీ గ్రంథము వారు మఱల నా స్థానమున నున్నపుడే ముద్రణమునంది ప్రకటనముఁ గాంచుట నాకు ముదావహముగ నున్నది.

గ్రంథముద్రణవిషయమున నతిశ్రద్ధవహించి నా కనేక విధములఁ దోడ్పడిన శ్రీ ఆనంద ముద్రణాలయమువారికి నే నెంతయుఁ గృతజ్ఞుడను. ఇట్టి గ్రంథమును ముద్రించుట కష్ట సాధ్యమయినపని. సాధారణమయిన మఱి యే ముద్రణాలయమువారికయినను నీ గ్రంథముద్రణ మసాధ్యమనియే చెప్పవచ్చును.

అనంతపురము,
1-11-1936.

చిలుకూరి నారాయణరావు.

# విషయ సూచిక.

విద్యాలయ కేంద్రస్థానము బెజవాడలో నున్నపుడు వారికి నే నాంధ్రభాషా విషయమునఁ జేసిన కృషినిగూర్చి కొంత నివేదించితిని. వారును సంతోషించి యీ గ్రంథమును వ్రాయుమని సెలవిచ్చుటయే కాక, దీని నాంధ్ర విశ్వవిద్యాలయము పక్షమునఁ బ్రచురింపించు నవకాశముఁ గల్పించిరి. వారు విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగ నుండినప్పుడు వ్రాయ నారంభించిన యీ గ్రంథము వారు మఱల నా స్థానమున నున్నపుడే ముద్రణమునంది ప్రకటనముఁ గాంచుట నాకు ముదావహముగ నున్నది.

గ్రంథముద్రణవిషయమున నతిశ్రద్ధవహించి నా కనేక విధములఁ దోడ్పడిన శ్రీ ఆనంద ముద్రణాలయమువారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. ఇట్టి గ్రంథమును ముద్రించుట కష్ట సాధ్యమయినపని. సాధారణమయిన మఱి యే ముద్రణాలయమువారికయినను నీ గ్రంథముద్రణ మసాధ్యమనియే చెప్పవచ్చును.

అనంతపురము,
1-11-1936.

చిలుకూరి నారాయణరావు.

# విషయ సూచిక.

**200-202**; ప్రకృతిభావనివారణము 202-203; ద్రుతస్వరూపము 203-207; అర్ధానుస్వారము 208-229; మూర్ధన్యాక్షరముల యుత్పత్తి 229-236; ఐకారము 236-244; శకటరేఫము 244-280; తెనుఁగు శబ్దములందలి ధ్వనుల మార్పులు 280-300; ఊఁత 300-302; స్వరము 301-304.

ఆంధ్రధ్వనులు, వాని యుచ్చారణము: తత్సమధ్వనులు: అచ్చులు, తద్భేదములు 304-308; హల్లులు 308-315; అచ్ఛికధ్వనులు 315-316.

నాలుగవప్రకరణము: సంధి: సంస్కృతసంధి: అచ్సంధి 319 - 320; హల్సంధి 320 - 322, విసర్గసంధి 323 - 324, స్వాదిసంధి 324.

ప్రాకృతసంధి: అచ్సంధి: సాధారణసంధి 325 - 326; సవర్ణదీర్ఘసంధి 326 - 327; గుణసంధి 327 - 329; వృద్ధిసంధి 329; యణాదేశసంధి 329-330; ఉద్వృత్తాచ్చులసంధి 331 - 333; నేఁటి యుత్తరహిందూస్థాన భాషలయందు సంధి 333.

ద్రావిడభాషలలో సంధి: 333 - 334; తమిళమునసంధి 334; ఆగమ సంధి 335 - 337; ఆదేశసంధి 337 - 338; లోపసంధి 338; బహుళసంధి 338 - 339.

మళయాళమున సంధి: అచ్సంధి 339; వ్యంజనసంధి 339 - 340.

కన్నడమున సంధి: స్వరసంధి 340 - 342; హల్సంధి 342 - 344; తెనుఁగునసంధి 344; అచ్సంధి 345; ఉత్వసంధి 346 - 349; ఇత్వసంధి 349-357; అత్వసంధి 357 - 359; ఇతరసంధి: దీర్ఘాచ్చులపై సంధి 359 - 360; ఆమ్రేడితసంధి 361 - 364; సమాససంధి 364 - 374; లోపసంధి 374 - 378; అనుకరణసంధి 378 - 383; తెనుఁగున హల్సంధి 383 - 387; ద్రుతసంధి 387 394; గసడదవాదేశము 394 - 401; గసడదవాదేశమా, పరుషాదేశమా? 401 - 405.

అయిదవ ప్రకరణము: ఆంధ్రశబ్దజాలము: వాక్యప్రధానత్వము; శబ్దజాల స్వరూపము 406 - 412; ధాతువాదము, క్రొత్తశబ్దముల సృష్టి 412-415; తత్సమపదములు: సంస్కృత సమములు 416 - 417; అకారాంత పుంలింగ శబ్దములు, మహద్వాచకములు 417 - 419; మహతీవాచకములు (419 - 420); మహతీత రామహద్వాచకములు 420 - 421;— అకారాంత నపుంసకలింగ శబ్దములు: మహద్వాచకములు 421 - 422; మహతీవాచకములు 422; మహతీత రామహద్వాచకములు 422 - 423;— ఆకారాంత స్త్రీలింగ శబ్దములు, మహద్వాచకములు, మహతీవాచకములు 423; మహతీత

శ్రీ

# ఆంధ్రభాషా చరిత్రము

## ఉపోద్ఘాతము.

ఆంధ్రభాష ద్రావిడభాషలలో నొకటిగా నేఁడు పరిగణింపఁబడుచున్నది. ద్రావిడభాషలకును ఇండో యూరోపియను భాషలకునుగల సంబంధమును గూర్చి వివిధాభిప్రాయము లున్నవి ఈ యభిప్రాయములు మఱియొక యధ్యాయమునందు వివరింపఁబడును ఆంధ్రభాష యిప్పటి స్వరూపముతో క్రీస్తుశకము 8-వ శతాబ్దమునుండియు నుండినట్లు నిదర్శనములు కానవచ్చుచున్నవి.

భరతవర్షమున వాడుకలోనున్న భాషలలో జనసంఖ్యనుబట్టి యాంధ్రభాష మూఁడవస్థానము నాక్రమించుచున్నది హిందీ బంగాలీ భాషల తరువాత నెక్కువ ప్రచారములోనున్నదియు నెక్కువ ప్రదేశమున వాడుకలో నున్నదియునగు భారతీయభాష యాంధ్రభాషయే ఈ వివరములు లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా, 4- పుటనుండి తీసికోఁబడినవి.

### ఆంధ్రము గృహభాషగానున్న వారిసంఖ్య.

| | 1891 సం॥ జనాభా. | 1901 సం॥ జనాభా |
|---|---|---|
| మధ్యపరగణాలు | 99,527 | 79,927 |
| చాంద | 69,000 | 71,789 |
| బస్తరు | 30,527 | 8,138 |

| | 1891 సం॥ జనాభా. | | 1901 సం॥ జనాభా. |
|---|---|---|---|
| బేరారు ... | 28,750 | .. | 23,006 |
| బంగాళారాజధాని ... | 11,522 | . | 14,226 |
| కటకము ... | 4,800 | .. | 6,292 |
| పురి ... | 4,307 | ... | 4,150 |
| ఒరిస్సాసామంతరాజ్యములు. | 2,525 | .. | 3,784 |
| | 11,632 | . | 14,226 |
| చెన్నరాజధాని | 12,017,002 | ... | 12,575079 |
| గంజాము | 722,87 | . | 342,9,10 |
| ,, (ఏజెన్సీ) | 3,366 | ... | 5,864 |
| విశాఖపట్టణము | 1,881,678 | ... | 1,999,791 |
| ,, (ఏజెన్సీ) | 113,052 | | 153,168 |
| గోదావరి | 1,914,769 | . | 2,099,417 |
| (ఏజెన్సీ) | 96,784 | | 119,503 |
| కృష్ణ | 1,739,326 | . | 2,015,815 |
| నెల్లూరు | 1,364,445 | ... | 1,385,097 |
| కడప | 1,139,891 | . | 1,160,567 |
| కర్నూలు | 717,140 | | 763,085 |
| బళ్లారి | 267,327 | | 282,791 |
| అనంతపురము | 570,921 | . | 333,796 |
| చెంగల్పట్టు | 242,737 | .. | 312,946 |
| ఉత్తర ఆర్కాడు | 842,880 | ... | 856,480 |
| సేలము | 360,915 | .. | 416,120 |
| బనగానపల్లి | 28,021 | ... | 26,139 |
| సండూరు | 1,463 | .. | 1,590 |
| | 12,017,002 | .. | 12,575,079 |

## గృహభాషగాఁ గాక యితర ప్రాంతములలో నాంధ్రమును మాటలాడువారి సంఖ్య.

| | 1891 సం॥ జనాభా. | | 1901 సం॥ జనాభా. |
|---|---|---|---|
| అండమాను నికోబారు దీవులు | | ... | 212 |
| అస్సాము ... | | ... | 5,259 |

| | 1891 సం॥ జనాభా. | 1901 సం॥ జనాభా. |
|---|---|---|
| బెలూచిస్థానము | | 36 |
| బంగాళారాజధాని | | 4,454 |
| బీరారు | 14,488 | 12,425 |
| అమరావతి | 3,593 | 3,221 |
| ఆకోల | 3,170 | 3,312 |
| ఎల్లిచిపురము | 1,225 | 1,315 |
| బుల్డాన | 2,750 | 2,606 |
| | 14,488 | 12,425 |
| బొంబాయిరాజధాని | 62,860 | 109,988 |
| బర్మా | | 96.601 |
| మధ్యపరగణాలు | 21,295 | 22,654 |
| కుడగు | 3,751 | 2,974 |
| చెన్నరాజధాని | 16,94,466 | 17,60,361 |
| మద్రాసు | 1,03,423 | 1,084,96 |
| కోయంబత్తూరు | 4,40,307 | 4,681,35 |
| నీలగిరులు | 4,332 | 4,391 |
| దక్షిణ ఆర్కాడు | 2,27,055 | 2,28,260 |
| తంజావూరు | 80,630 | 94,872 |
| తిరుచానపల్లి | 1,61,342 | 1,69,784 |
| మధుర | 3,67,61,3 | 3,94,358 |
| తిరునవ్వేలి | 2,59,048 | 2,59,936 |
| మలబారు | 20,309 | 19,587 |
| దక్షిణకనర | 2,096 | 1,340 |
| పుదుకోట | 10,797 | 11,066 |
| కొచ్చిరాజ్యము | 12,087 | 11,676 |
| తిరువాన్కూరు | 5,426 | 7,460 |
| పశ్చిమోత్తరపరగణాలు | .. | 203 |
| పంజాబు | | 7 |
| సంయుక్తపరగణాలు | | 640 |
| బరోదా | ... | 322 |

| | 1891 సం॥ జనాభా | | 1901 సం॥ జనాభా. |
|---|---|---|---|
| మధ్య యిండియా .. | ... | | 777 |
| రాజపుత్రస్థానము ... | .. | | 61 |
| | 17,96,860 | ... | 2,16,974 |

ఆంధ్రభాషతోసంబంధించిన చిన్నచిన్న మాండలికభాషలను మాట్లాడు వారిసంఖ్య యీక్రిందచూపఁబడినది.

| | | 1891 సం॥ జనాభా | | 1901 సం॥ జనాభా. |
|---|---|---|---|---|
| కోష్టూవు | ... | 3,827 | ... | 67 |
| సాలేవారి | ... | 3,660 | ... | ... |
| గోలరి | ... | 25 | .. | 22 |
| బేరాది | ... | 1,250 | . | .. |
| వడెరి | ... | 27,099 | ... | 3,860 |
| కామాఠి | ... | 12,200 | ... | 4,704 |
| మొత్తం | | 48,061 | | 4,704 |

పై యంకెలన్నిటినిగూడిన నాంధ్రభాషను దానియుప భాషలను మాట్లాడువారి సంఖ్యవచ్చును.

| | 1891 సం జనాభా | | 1901 సం॥ జనాభా. |
|---|---|---|---|
| ఆంధ్రము మాతృభాషగాఁగలవారు. | 17,938,980 | ... | 18,675,586 |
| ఆంధ్రేతర ప్రదేశములలో | 1,796,860 | .. | 2,016,974 |
| ఉపభాషలను మాట్లాడువారు | 48,061 | ... | 4,704 |
| మొత్తము. | 19,783,901 | ... | 20,697,264 |

ఆంధ్రులజనసంఖ్య గడచిన ముప్పదివత్సరములలో నీక్రిందిరీతిగా పెరిగినది.

(చెన్నరాజధానిలో 10,000 మందికి.)

| 1901 | 1911 | 1921 | 1931 |
|---|---|---|---|
| 3,706 | 3,769 | 3,772 | 3,768 |


మధ్యపరగణాలు
నిజాము రాజ్యము
I
II
III
IV
IV
IV
IV
IV
VII
VI
III
V
I ఓఢ్రము
II ఆదిమనివాసులు
III తెనుఁగు
IV కన్నడము
V తమిళము
VI మలయాళము
VII తుళు
అరవజిల్లాలలో తెనుఁగు మాతృభాషగాగలజనులు
15% కు పైన
10–15%
నిజాము రాజ్యము, మధ్యపరగణాలలో చుక్కలతో గుర్తింపఁబడిన దేశమున నాంధ్రుల సంఖ్యయే యెక్కువగా నున్నది.

# విస్తీర్ణము.

ఆంధ్రభాష ప్రచారములో నున్న ప్రదేశమునకు తూర్పుదిక్కున నంతయు బంగాళాఖాతమున్నది. దాని కుత్తరపు స్వాభావికమయిన యెల్ల ఋషికుల్యానది. ఆనది కుత్తరమునఁగూడ నాంధ్రులు వాసమేర్పఱచుకొని యున్నారు. ఋషికుల్యనుండి పడమటగా నాయెల్లపోయి తూర్పుకనుమలను దాఁటి నైఋతిమూలగా బస్తరు సంస్థానములోని సుంకము, బిజ్జితాలూకాల సరిహద్దయిన శబరీనదిని దాఁటి, శేలదిలగుట్టలవెంబడి జరగి యింద్రావతి వఱకుఁబోవుచున్నది. అక్కడనుండి యానది యొడ్డునసాగి, యది గోదావరిని గలియువఱకుఁబోయి, చాందాజిల్లా దక్షిణభాగ మంతటిని దనలో నిముడ్చుకొని, యింకను దూర్పుగ సాఁగి వూనుజిల్లా దక్షిణభాగమునంతటిని దనలోఁ జేర్చుకొనుచున్నది అచ్చటనుండి దక్షిణముగ మంజీరానది గోదావరియందు సంగమించు స్థానమువఱకునుబోయి యింకను దక్షిణముగసాఁగి బీదరు మండలమున కన్నడము ప్రచారములోనున్న ప్రదేశములోనికి చొచ్చుకొనిపోవుచున్నది. అచ్చటనుండి సరిగ దక్షిణముగ నైజామురాష్ట్రములోని యాఱు జిల్లాలను దనలోఁ జేర్చుకొని, తిరిగి బ్రిటిషు ఇండియాలోని బళ్లారి జిల్లాను సరిగ రెండుభాగములు చేయుచున్నది. ఆ తరువాత నది యట్లేసాగి యనంతపురము జిల్లా ద్వారా మైసూరుసంస్థానమును చొచ్చుకొని యందలి బెంగుళూరు, కోలారు, నందిదుర్గము, చిత్రదుర్గము జిల్లాలను దనలోఁ జేర్చుకొనుచున్నది. అక్కడనుండి యుత్తరఆర్కాడు, చెంగల్పట్టు జిల్లాల మధ్యభాగముగ సాఁగి తిరిగి బంగాళాఖాతమును జేరుచున్నది.

ఆంధ్రమున కుత్తరమున ఒటియాభాష, హాళబీ ఉపభాష, గోండీ, మరాఠీభాషలును, పశ్చిమమున మరాఠీ కన్నడములును, దక్షిణమున తమిళమును బ్రచారములోనున్నవి. ఆంధ్రమున కితరభాషలతో సంయోగము కలుగుకొన్నిచోట్ల నది చల్లచల్లగ వ్యాప్తమగుచున్నది. గంజామున కుత్తరమున నోరిస్సాలోను, మధ్యపరగణాలలోను, నైజామురాష్ట్రములోను, నది నానాఁటికిని విస్తరించుచున్నది. మైసూరు సీమలో కన్నడ మాంధ్రమును వెనుకకు తఱుము చున్నది.

# ఆంధ్ర భాషా చరిత్రము

## ఆంధ్రమునకు సంబంధించిన యుపభాషలు.

ఆంధ్రము మాతృభాషగానున్న ప్రదేశమునందంతటను నొకటే రూపమున నుండక యీషద్భేదములను గలిగియున్నది. సరిహద్దు ప్రాంతము లం దితరభాషలతో సంయోగము గలిగినచోట్ల నాయాభాషల శబ్దజాలమును, కొంచెము మట్టుకు భాషారూపమును నాంధ్రము సంగ్రహించుట వింతగాదు. గంజాముజిల్లాలో బరంపురము, ఛత్రపురము మొదలగు ప్రాంతములం దోఢ్రపుమాట లెక్కువగా నాంధ్రమున గలియుచుండును. ఉండెను అనుటకు ఉంటిడి యను రూపమిచ్చుట వింతగాఁ గానవచ్చును. బళ్లారి మొదలగు ప్రాంతము లందు 'కొఱకు,' అనుటకు 'కోస్కరము' అని తెనుఁగు 'కు' ప్రత్యయము నకును కన్నడపు ఓస్కర ప్రత్యయమునకును సమ్మేళనము కలిగినది. ఇట్టి కొంచెపు భేదములను పాటింపనిచో నాంధ్రభాష యన్నిప్రదేశములందును నొక్కతీరుననే యున్నదని చెప్పవచ్చును. ఏసనుబట్టియు పదములపై మాట్లాడువారుంచు నూఁతగలస్థానములఁబట్టియు పదములు వివిధ వికార ములను బొందుటయు స్వాభావికమే. ఇదిగాక యాయాప్రదేశముల చరిత్ర మును బట్టియు నందలి యన్యదేశీయుల ప్రాబల్యమును బట్టియు శబ్దజాలమును కొంతవఱకు వేర్వేరుగా నుండుట సంభవించును, ఏప్రాంతమునందైనను జీవ ద్భాష యెల్లప్పుడు నొక్కటే తీరున నుండుట యసంభవము. ఏప్రాంతపు భాషయయినను పరిశుద్ధమయినదని చెప్పుటకు వీలులేదు. గోదావరీ కృష్ణా మండలములవారిభాష యుత్తమమయినదనియుఁ బరిశుద్ధ మయినదనియుఁ గొంద ఱనుకొనుట గలదు. కాని, యిట్టి యభిప్రాయము కేవల మభిమాన ప్రేరితమని వేరే చెప్పనక్కఱలేదు.

జాతివర్ణములఁబట్టియు వృత్తులనుబట్టియుఁగూడ నుచ్చారణము మారు చుండును. ఏకకాలమునందే, ఏకప్రదేశమునందే వివిధములగు నుచ్చారణములు వినఁబడుట యనుభవసిద్ధము, మాటలతీరునుబట్టి యొకఁడు బ్రాహ్మణుఁడో, క్షత్త్రియుఁడో, వైశ్యుఁడో, శూద్రుఁడో, ఇతర జాతివాఁడో వెంటనే పోల్చు కొనవచ్చును. ఇదిగాక మాటతీరునుబట్టి యొకఁ డేమండలమువాఁడో కూడ తెలిసికొనవచ్చును. ఇట్టి యుచ్చారణభేదము లన్నియు నే భాషయందైనను స్వాభావికముగ నుండక తప్పదు. అంతమాత్రమున నవియన్నియు భాషా భేదములని యెంచరాదు.

అయినను, సాధారణాంధ్రభాషకు మిక్కిలి విలక్షణముగాఁ గనఁబడు కొన్ని యుపభాష లాంధ్రేతరప్రదేశములందు ప్రచారములోనున్నవి. మధ్య

పరగణాలలోని చాందాజిల్లాలో నాంధ్రభాషకు, కోంటావు, సాలేవారి, గోలరి అను పేళ్లున్నవి. ఈమూఁడును వేర్వేరగు నుపభాషలుగా నెంచుటకు వీలున్నను వానియుచ్చారణమును, సుప్తిఙంతవిధానమును నొక్కటీరుగనే యున్నవి. కర్నాటక దేశములోను. బొంబాయి యందును, నాంధ్రమునకు సంబంధించిన కొన్ని యుపభాషలు కలవు. అవి కొన్నివృత్తులకు సంబంధించినవారి యాంధ్ర భాషా వికారములుగా నున్నవి. బెల్గాము జిల్లాలో శేరాది, దాసరి, యనుభాషలును, బొంబాయి పట్టణమునందలి కామాఠీభాషయును, బొంబాయిరాజధాని, బేరారు మొదలగు ప్రదేశములలో సంచారశీలురగు నొకజాతివారు మాటలాడు వడరీ భాషయును నట్టివి ఇవియెవ్వియుఁగూడ సాధారణవ్యవహారభాష కెక్కువ విలక్షణముగ నుండక పోవుటచే వీనినిగూడఁ బ్రత్యేకోపభాషలుగాఁ బరిగణింప నక్కఱలేదు.

---

## గ్రాంథిక భాష, వ్యావహారిక భాష.

---

భాష కేవలము వాగ్రూపముగా నున్నంతకాలమును మార్పులను పొందుచుండుట సహజము. కాని, దానిని వ్రాతరూపమునఁ బెట్టిననాఁట నుండియుఁ గొంత స్థిరత్వ మేర్పడుచుండును వ్రాతను చదువనేర్చినవారు పూర్వకాలపు శబ్దస్వరూపమును నిలబెట్టుటకుఁ బ్రయత్నించుచుందురు. ఈ ప్రయత్నము సంపూర్ణముగా సాధ్యము కాకపోవచ్చును. లిఖిత భాషా స్వరూపము గూడ వ్యవహారభాష ననుసరించి మారుచుండుట యసంభవము కాదు. కాని వ్యవహారభాషయంత శీఘ్రముగ లిఖితభాష మాఱఁ జాలదు. కొన్నినాళ్ల కాభాషయందుత్తమగ్రంథములు వెలువడినచో నాగ్రంథముల యందలిభాష తరువాతివారికి మార్గదర్శకముగా నేర్పడును. దానికొక ప్రమాణత్వము గలుగును. సాధ్యమగు నంతవఱకుఁ దరువాతివా రాభాషనే యనుకరింపఁ బ్రయత్నింతురు. అయినను, వ్యవహారభాషనుబట్టి యాగ్రంథకర్తల గ్రంథములందలి భాషాస్వరూపమును మాఱుచుండును. భావములనుబట్టియు రుచులనుబట్టియు నాయాగ్రంథకర్తల నుడికారము మారుచుండుట వింత గాదు. అందుచేత నిదియే ప్రమాణ గ్రాంథికభాషయని నిరూపింప వీలు లేదు. తొలుదొల్త వ్యావహారికభాషయే గ్రంథస్థమై యుండినను నానాఁటికిని దానికిని గ్రాంథికభాషకును నంతర మెక్కువయగుట సంభవించి, యారెండును వేర్వేరుగ నేర్పడుచుండును. గ్రాంథికభాష మిక్కిలి మెల్లగ మాఱుచువచ్చుచుండ, వ్యావహారికభాష ముందంజవేయుచుఁ దన సహజమార్గమున మార్పులు

పొందుచుండును. ఏభాషకైనను నీగ్రాంధిక వ్యావహారికావస్థా భేదములు తప్పవు. ఇతరదేశములలో గ్రంథకర్తలీయంతరము నెక్కువగా నుండనీయక వ్యవహారమునే లక్ష్యముగ నుంచుకొని యుండ, భారతీయభాషలు గ్రంథస్థ భాషనే పరమలక్ష్యముగఁ జేకొనియుండుటచే వ్యవహారమునకును గ్రంథస్థ భాషకును మిక్కిలి యంతరమేర్పడినది. సంస్కృతభాషా ప్రాబల్య మిందుకు ముఖ్యకారణమని వేరే చెప్ప నక్కఱలేదు. సంస్కృతభాష పాణినీయాది వ్యాకరణములమూలమునను నిఘంటువులమూలమునను స్థిరీభూతమగుటచేతను, వ్యవహారభ్రష్టమగుటచేతను, నందు చాలవఱకు కెట్టిమార్పును గలుగకుండెను. కాని నాఁటనుండి నేఁటివఱకుఁ బ్రవాహరూపమున వచ్చుచున్న జీవద్భారతీయ భాషలుగూడ సంస్కృతభాషానుయాయులగుటచే గ్రంథస్థభాషకును వ్యవహార భాషకును నింతటి భేదమేర్పడినది. ఈ యంతరముండుట మంచిదా కాదా యనువివాద మన్నిభాషలయందును గలదు. అన్ని ప్రాంతముల యందును వ్యావహారికభాష పూర్వకాలపు గ్రాంధికభాషను గొంతవఱకైనను త్రోసి పుచ్చి, యాస్థానము నాక్రమించుకొనుచున్నది. ఇట్లుండఁ బూర్వగ్రాంధిక భాషతోడి పరిచయము సంపూర్ణముగ లేకపోవుటచేతను, వ్యవహారము నతిక్ర మింప సాధ్యము కాకపోవుటచేతను, గ్రంథకర్తలు కొన్నికృతకరూపములఁ గల్పించుకొనుట సంభవించుచున్నది. ఈ కృతకరూపములు కొన్నియెడల వ్యవహారములోఁగూడ స్థిరములగుట సంభవించుచుండును. ఈ రీతిగ నాంధ్ర భాషయందును వివిధములగు మార్పులు కలుగుచున్నవి. ఈ మార్పులన్నియు నేరీతిగ నేయే కారణములచేఁ గలిగినవో తెలియఁ జేయుటయే యాంధ్ర భాషా చరిత్ర ముఖ్యోద్దేశము.

## ఆంధ్రులు.

---

ఆంధ్రులను జాతివారినిగుఱించి మనకు వేదకాలమునుండియుఁ దెలియ వచ్చుచున్నది. ఐతరేయ బ్రాహ్మణమున నీక్రింది వాక్యములున్నవి. "తస్య హ విశ్వామిత్రస్యైకశతం పుత్రా ఆసుః; పంచాశత్ ఏవ జ్యాయాంసో మధుచ్ఛందసః; పంచాశత్ కనీయాంసః; తద్యే జ్యాయాంసో న తే కుశలమ్ మేనిరే. తాన్ అనువ్యాజహారన్ తాన్ వః ప్రజా భక్షీష్టేతిత ఏతేంధ్రాః పుండ్రాః శబరాః పుళిందా మూతిబా ఇత్యుదంత్యా బహవో భవంతి వైశ్వా మిత్రా దస్యూనామ్ భూయిష్ఠాః"—పైదానిప్రకార మాంధ్రులు విశ్వా

మిత్రుని సంతానమైనట్లును, వారు పుండ్ర, శబర, పుళింద, మూతిబాది జాతులతో దస్యులుగాఁ బరిగణింపఁ బడినట్లును దెలియుచున్నది మనుస్మృతిలో—
"కారవరం నిషాదాత్తు చర్మకారం ప్రసూయతే। వైదేహకా దంధ్రమేదౌ బహిర్గ్రామప్రతిశ్రయౌ" అని యున్నది. దీనిప్రకారము ఆంధ్రులు వైదేహకులకు జనించినవారనియు, వారు గ్రామములకు బయట నుండవలసిన వారనియుఁ దెలియుచున్నది. పురాణములలో నాంధ్రుల ప్రశంస గానఁబడుచున్నది. అంధ, ఆంధ్ర శబ్దములు రెండును గానవచ్చుచున్నవి. వాయు మత్స్యపురాణములలో నంధ్రులనుపేరును, వాయుపురాణమున నంధ్రియులను పేరును గానవచ్చుచున్నది. భాగవత పురాణమున చాణూరమల్లుఁ డాంధ్రుఁడని యున్నది. మెగాస్తనీసు అను గ్రీకు రాయబారి యాంధ్రులను పేర్కొని యున్నాఁడు. అశోకుని శాసనములందు ఆంధ్రశబ్ద మున్నది. అశోకుని గిర్నారు శాసనములందు 'అంధ పిరిందేషు' అనియు, షాబాజుగిఢీ శాసనములందు 'భోజపితినికేషు ఆంధ్ర పులిదేషు' అనియు నున్నది క్రీ పూ. 150 సంవత్సరపు హాథీ గుంఫా శాసనమున నాంధ్రవంశములోని మూఁడవరాజగు శాతకర్ణి పేర్కొనఁబడి యున్నాఁడు. ఇతఁడు కళింగరాజగు ఖారవేలునకు సమకాలికుఁడు. కృష్ణాజిల్లాలోని చిన్నచిన్న యను గ్రామమునకు సమీపమున కృష్ణానదికి దక్షిణమున సముద్రతీరమున నాంధ్రరాజగు యజ్ఞశ్రీ గౌతమీపుత్ర శాతకర్ణి 27 వ రాజ్య సంవత్సరపు శాసనమొకటి దొరకినది. పులమావి యను నాంధ్రరాజు నేడవరాజ్యసంవత్సరపు శాసనమొకటి కార్లేయొద్దను, మఱియొకటి భిల్సానగరము నొద్దను దొరకినవి. గుంటూరుజిల్లాలోని యమరావతియొద్ద గౌతమీపుత్ర శాతకర్ణి తరువాత రాజ్యమునేలిన వాసిష్ఠీపుత్ర శ్రీపులుమావి శాసనము చిక్కినది క్రీ శ. 554 లోని హరహ శాసనమునందాతఁ డాంధ్రపతిని జయించినట్లున్నది. విగ్రహపాలుని పంద్రెండవ రాజ్యసంవత్సరపు శాసనమున— "మహత్తమోత్తమకుటుంబి పురోగాన్ మేదాంధ్ర చండాల పర్యంతాం" అని యున్నది. దీని ప్రకారం మాంధ్రులు మేదులతోడను చండాలురతోడను చేర్పఁబడినట్లు దెలియుచున్నది. క్రీ. శ. 1115 సంవత్సరపు జాజల్లదేవుని రత్నపుర శిలాశాసనమున నాంధ్రకిమిడి, కోసలాంధ్ర కిమిడి యను నామములు గానవచ్చు చున్నవి. క్రీ. శ. 1171 సంవత్సరపు మునగిహాల్లు శాసనమున బిజ్జలుఁడు ఘూర్జర మగధ కళింగాంధ్ర సౌరాష్ట్ర వేంగీ రాజులను జయించినట్లున్నది. క్రీ. శ. 1358 సంవత్సరపు ఒక శాసనమున ముమ్మిడి నాయకునిగూర్చి "ఆంధ్రశ్రీశో దేశానంధ్రాన్ రక్షితుం" అని యున్నది. క్రీ. శ. 1368 సంవత్సరపు సింగనాయకుని అక్కలపూండి శాసనమున నాంధ్రదేశ ప్రశంస యున్నది. క్రీ. శ. 1466 సంవత్సరపు విరూపాక్ష

దేవుని శ్రీశైల తామ్రశాసనము సందాతనికి ద్రావిడాంధ్ర మహీపతి అను బిరుదమున్నది.

పై శాసనములఁ బట్టియు నితరాధారములఁ బట్టియు నాంధ్రులు తొలుత మ్లేచ్ఛులుగాఁ బరిగణింపఁ బడియు నానాఁటికి దేశమందంతటను వింధ్య పర్వత ప్రాంతములనుండి నానాముఖముల వ్యాపించి ప్రబలులై రాజ్యముల స్థాపించుకొన్నట్లును వారు వ్యాపించిన దేశమున కాంధ్రదేశమను సంజ్ఞ కుదురుకొన్నట్లును దెలియనగును. ఈ యాంధ్రదేశమును క్రీస్తు శకారంభ మున శాతకర్ణులను వారు జయించి రాజ్యమును సాగించినట్లు గొందఱు చెప్పు దురు. శాతకర్ణు లాంధ్రులేయను వాదముగూడ గలదు. ఈ శాతకర్ణులలో గౌతమీ శాతకర్ణులు, వాసిష్ఠీపుత్ర శాతకర్ణులు, మాఢరీపుత్ర శాతకర్ణులు, అను మూఁడు విధములవా రున్నట్లు రాజుల పేళ్లనుబట్టి తెలియనచ్చుచున్నది. ఈ యాంధ్రరాజ్యము తూర్పుతీరమునుండి పడుమటితీరమునకు వ్యాపించినదో పడుమటనుండి తూర్పుతీరమునకు వ్యాపించినదో యను విషయమై వివాదము లున్నవి. కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళ మాంధ్రరాజులకు మూలస్థానమను వా రాంధ్రులు పశ్చిమమునకు వ్యాపించినట్లు చెప్పుదురు. నాసిక మూలస్థాన మను వా రాంధ్రులు తూర్పునకు వ్యాపించినట్లు చెప్పుదురు.

ఇట్లాంధ్రులనియు నాంధ్రదేశమనియు వ్యవహరింపఁ బడుచున్న శబ్దము లాంధ్రరాజుల శాసనములందు కానరాకుండుట చిత్రముగా నున్నది. ఆంధ్రభాషయను పేరుగూడ నాంధ్రరాజుల శాసనములందు గానరాదు. తిక్కనకాలమునకును తెనుఁగున కాంధ్రనామమున్నట్టు నిదర్శనములు లేవు. ఆంధ్రరాజుల శాసనములన్నియుఁ బ్రాకృతమునం దున్నవి. ఇవి నాసిక కార్లేయను పశ్చిమతీర ప్రదేశములనుండి గోదావరీ కృష్ణానదీ మార్గముల ననుసరించి యిప్పటి యాంధ్రదేశమునకు గర్భమనదగు గుంటూరు సమీపమున నున్న అమరావతి, ధాన్యకటకము, నాగార్జునకొండ మొదలగు ప్రదేశము లందు నిబిడములై తూర్పు సముద్రతీరమున కృష్ణానదీముఖమువఱకు వ్యాపించి యున్నవి. ఈ శాసనముల భాష యాంధ్రభాష యనుకొనినచో నది నేటి తెలుఁగు రూపమును దాల్చువఱకు నెట్టి పరివర్తనములఁ బొందినదియుఁ దెలిసి కొన వచ్చును. ఈ యాంధ్రదేశపు భాష యెట్టిప్రాకృత మనువిషయమున వివిధాభిప్రాయములు కలవు. క్రీస్తు శకారంభమున నీ ప్రదేశమంతయు బౌద్ధమతాక్రాంతమై యున్నట్లు చరిత్రమువలనఁ దెలియుచున్నది. సింహళ ద్వీపమునం దేర్పడిన త్రిపిటకములను బౌద్ధ ధర్మగ్రంథములభాష పాలిభాష యని పిలువఁబడుచున్నది. ఈ పాలిభాష యెక్కడిదను విషయమును ఓల్డెన్ బర్గు పండితుఁడు తాను సంపాదించిన త్రిపిటకములను గ్రంథము రెండవ సంపుట

మగు బుల్లనగ్గసునకు వ్రాసిన పీఠికలో నీ పాలిభాష యశోకుని పుత్త్రుఁడగు మహేంద్రుని జన్మస్థానమగు నుజ్జయినీభాష కాదనియుఁ గళింగాంధ్ర దేశములం దాకాలమున బౌద్ధమతము మిక్కిలి ప్రచారములో నుండెననియు, బుద్ధఘోషుఁ డాంధ్రులకు సంబంధించిన బౌద్ధగ్రంథమగు నట్ఠకథను తెలుఁగుగ స్మరించినాఁడనియు, కావున నీ పాలిభాష యాంధ్రదేశమందలి ప్రాకృతభాషయే యనియు, నాంధ్రరాజుల శాసనముల భాషకును పాలిభాషకును నెక్కువభేదము లేదనియుఁ, గావున నాకాలమున నాంధ్రులభాష పాలిభాషగా నుండి యుండవలెననియు నభిప్రాయ పడియున్నాఁడు. ఈ యాంధ్ర శాసనముల లోని నాగార్జునకొండయందలి శాసనము లింకను బ్రచురింపఁ బడలేదు. మనకు లభ్యములగు నాంధ్రశాసనములలో నెక్కువగా లభించినవి నాసిక యందలి శాసనములు కావున వానియందలి భాష కుదాహరణముగ మూఁడవ గుహ పనారా వెనుకగోడపై ద్వారమునకుఁ బైగానున్న యీ శాసన ముదాహరింపఁ బడుచున్నది.

1. సిద్ధం[1] రఞో వాసిఠీపుతస[2] సిరిపుళుమాయిస సవచ్ఛరే[3] ఏకునవీసే 19 గిమ్హాణ[4] పఖే బితీయే 2 దివసే తేరసే 13 రాజరఞో గోతమీపుతస హిమవత - మెరు -

2 మదర - పవత సమసారస అసిక - అసక[5] - ముళక - సురఠ - కుకుర - అపరంత[6] - అనుప - విదభ - ఆకరావతి - రాజస విఝ - ఛవత - పారిచాత[7] - సహ్య - కణ్హగిరి - మచ - సిరిటన - మలయ - మహిద -

3 సెటగిరి - చకోర - పవతపతిస సవరాజలోక[8] మడల పతి - గహీతసాసనస దివసకరకర[10] విబోధిత కమల విమల సదిసవదనస తిసము ద - తోయపీతవాహనస పటిపుణ చదమడల ససిరీక -

4 వరవారణ వికమ చారువికమస భుజగపతి భోగపీన వాట[11] - విపులదీఘ సుదర భుజస[12] అభయోదక దాన కిలిన నిభయకరస అవిపన మాతు సుసూసక సువిభతతివగ దెసకాలస -

5. పోరజన నివిసెస సమసుఖ దుఖస ఖతియదప మానమదనస[14] సక - యవన - పల్హవ - నిసూదనస ధమోపజితకర వినియోగకరస కితాపరాధెపి సతుజనె అపాణహిసారుచిస దిజావరకుటుబ వివధ-

6. నస ఖఖరాతవస[15] నిరవసెసకరస సాతవాహన కులయస పతిథాపన [16]కరస సవమడలా[17] భివాదితచ రణస వినివతిత చాతువణస కరస అనెక సమరావజితసతుసఘస అపరాజిత విజయపతాక సతుజన దు - పధసనీయ[18] -

7. పురవరస కులపురిస పరంపరాగత విపులరాజసదస ఆగమాన[19]- నిలయస సపురిసానం అసయస సిరీయ్ - అధిఠానస ఉపచారాన[20] పభవస ఎక కుసస ఎకధనుధరస ఎక సూరస[21] ఎకబమ్హణస రామ-

8. కేస - వాజున - భీమసెన - తులపరకమస[22] ఛణఘను సవ-[23] సమాజకారకస నాభాగ -[24] నహుస - జనమెజయ - సకర - యయాతి - రా - మాబరీస - సమతెజస అపరిమితమ్ అఖయమ్ అచితమ్ అభుత[25] పవన - గరుళ -[26] సిధ - యఖ - రఖస - విజాధర - భూత - గధవ - చారణ-

9. చద - దివాకర - నఖత - గహ - విచిణసమరసిరసి జితరిపు సఘసనాగ[27] వరఖధాగగన తలమ్ అభివిఘాధస కులవిపులసిరి కరస **సిరి - సాతకణిస** మాతుయ మహా - దెవీయ[28] **గొతమియ బలసిరీయ** సచవచన దాన ఖమా[29] హింసా[30] నిరతాయ తప - దమనియ-

10. మొపవాస తపరాయ రాజరిసి మధుసదిమ్[31] అఖిలమ్ అను- విధీయమానాయ కారిత దెయ ధమ ... ... ...[32] సిఖరసదిసె తిరణ్హు - పవతసిఖరె విమ్[33] నర - నివిసెస మహిఢ్ఢీకలెణ ఎతచలెణ మహాదెవి మహా రాజమాతా మహారాజప్ × తామహీ[34] దదాతి నికాయస భదావని- యానం[35] ఖిఖుసఘస [36].

11. ఎతస చలెణస చితణ నిమిత[37] మహాదెవీయ అయకాయ సెవ- కామొ[38] పియకామొ చణట్ .. . . [39] పథెసనొ[40] పితుపతియొ ధమ సెతుస దదాతి గామ[41] తిరణ్హు పవతస అపరదఖిణపసె **పిసాజిపదకం**[42] సవజాత భొగనిరతి.

## పైదానిలో వివిధపండితులుచేసిన సవరణలు.

1. సిద్ధర. 2. °సిరపు.° 3. సవచ్ఛగే, సంవచ్ఛరే. ('వీ' లోని 'ఈ' స్పష్టముగా నున్నది. అశోకుని సాహస్రముశాసనములో 'సంవిచ్ఛల' అని యున్నది. ప్రాకృతములో 'అ' 'ఇ' గా మాఱుటగలదు 4. గిమ్హాణ. 5. అసిక - సుసక. 6. °పరాత°. 7. పరివాత°—— 8. 'లో' అంత స్పష్టముగా లేదు. 9. °మండల.° 10 రెండవ 'కర' లోని 'క' అంత స్పష్టముగా లేదు. 11. °పీనవట° 12. 'ర' ను పండితులు పూర్తిచేసినారు. 13. °సుసుణ° 14 'దస' లోని 'న' మీఁది తలకట్టు పరుండియున్నది. 'మదణస' అని లేఖకుని యుద్దేశమేమో. 15. °వంస.° 16. °పతిఠాప°,

'ధ' తోడిరూపమే సరియైనది. 17. °మండలాం°. 18 °ప్యసససియ° 19. °మానం°. 20. °చారాసం°. 21. °ఎకసూసస° - దీని నొక పండితుడు చదువక విడిచినాడు. 22. °పరాక°. 23. °చ్చ ణయనుస°. 24 °సభాగ°. 25. °భుతిం°. 26 °గిరుడ°. 27. °ణగి°. 28. °జవియ°. 29. °ఖమా°. లోని 'మా' మీఁది ఆత్వము సంశయాస్పదముగా నున్నది. 30. °హింసా° 31. వధూసదమ్. 32. °[కేలాస] ప [వతి]° - అని యొకరు పూర్తిచేసినారు. 33. °విమా[న]° - అని యొకరు పూర్తిచేసినారు. 34 పితామ, పితామ ('పి' మీఁదిగుడి యింకను కానవచ్చుచున్నది.) 35. °నియా°. °యానభి." 36. °సంఘుస°. 37. °చితినా°. 38. °సినాకామొ°. 39. °ణ [తా ... ... ... . దక్షిణా.] 40. °పరసరో°. 41. °గామం° 42. పిసాచి°.

నాసికయందలి యీ శాసనములో లేఖకుడు నున్నలను, జడ్డకారములను, ఏ ఓ లమీఁది దీర్ఘములను చెక్కక విడిచినాడు కొన్నిచోట్ల క్రింద యొత్తులు కానవచ్చుచున్నను నవి క్వాచిత్కములుగానే యున్నవి. ఈ శాసనములందు ఋ ౠ ఐ ఔ ః జ ఫ ష అను నక్షరములు కానరావు. చోథితి, ఒత్తరాహ అను పదములయందు హ్రస్వ ఒకారమును, చెతియ, నెకమ అను పదములయందు హ్రస్వ ఎకారమును నున్నవని యూహింపవగును. శవర్ణ మీశాసనములందు సాధారణముగ కానరాక సవర్ణముగానే యున్నది. శవర్ణము మాగధీ ప్రాకృతమునకు సంబంధించినది. అయినను కుశణ, శోర్పారగ, శక, సకశ = శకస్య అను పదములయందు శవర్ణము కానవచ్చుచున్నది. సాధారణముగ నేకాక్షర ద్విత్వములే కానవచ్చుచున్నను, ఙ్హ, న్హ, ఢ్హ, ర్ణ, ర్ప, లు కనఁబడుచున్నవి. పదమధ్యమందు కేవల మచ్చులుండుట 'మహా అరియక,' పులుమాఇ,' 'పఇఠి' అను పదముల మధ్యమందచ్చు కనఁబడుచున్నది ణకారముతో శబ్ద మారంభింపవచ్చును;

ఉదా. ణియాతితం (నిర్యాచితమ్)

## అచ్చులయందలి మార్పులు.

సంస్కృతమునందలి యచ్చు లీ క్రింది విధముగా నాసికయందలి యాంధ్ర శాసనములందు మారినవి.

అ = అ—పవతి (పర్వతి)

అ = ఈ—సవీచ్ఛరే (సంవత్సరే)

అ = ఇ—ససిరీక (చంచరీకి)

అ = ఒ—యొణకస (యవనకస్య)

అఉ = ఓ—చఉత్థ, ఛోత్థ (చతుష్పథ)

అప = ఓ—ఓవరకో (అపవరకః)

అయ = ఏ—పరిహారేర (పరిహారయథ)

అవ = ఓ—అనోమస (అనవమృశ్య); లోణ (లవణ)

ఆ = అ—అపరంత (అపరాంత), పురిసానం (పురుషాణాం), పరకమస (పరాక్రమస్య.)

ఇ = ఇ—సిద్ధం (సిద్ధం); వాసిగీ (వాసిష్ఠీ.)

ఈ = ఈ—ససరీక (చంచరీక.)

ఈ = ఇ—పతిగహ్యా (ప్రతిగృహీత = పతిగహీయ = పతిగయిహా = పతిగహ్యా.)

ఉ = ఉ—రిపు (రిపు.)

ఉ = ఇ—పురిస (పురుష.)

ఉ = ఈ— దీహితు (దుహితుః)

ఋ = అ—కణ్హగిరి (కృష్ణగిరి); వధి (వృద్ధి); గహపతి (గృహపతి.) తతియే (తృతీయే); పతిగహీత (ప్రతిగృహీత.)

ఋ = ఇ—సదిసే (సదృశే), కితాపరాధే (కృతాపరాధే.)

ఋ = ఇ = యి—పులమాయిస (పృథుమాతృకస్య.)

ఋ = ఉ—వుధిక (వృద్ధిక), సుజమాన (సృజ్యమాన), మాతు (మాతృ)

ఋ = ర—రసి (ఋషి); రతు (ఋతు).

ఋ = రు—రుతుం (ఋతౌ.)

ఋ = రి—రాజరిసి (రాజర్షి.)

ఏ = ఏ—నివిసేస (నిర్విశేష.)

ఏ = ఇ—మహిద (మహేంద్ర)

ఏ = ఆ—వాథవాసు (వాస్తవ్యేషు)

ఏ = ఓ—దొ (ద్వే), ఇచ్చట వకారసంయోగమువలన నిట్టిమార్పు గలిగినది.

ఐ = ఏ—వేజయంతియే (వైజయంత్యాః), వేశాఖమాసె (వైశాఖమాసె); చేతియ (చైత్య.)

ఐ = ఎ—నెకమ (నైగమ.)

ఐ = ఈ—ఏకీకస (ఏకైకస్య.)

ఓ = ఉ—ఏకునవిస (ఏకోనవింశతి.)
ఓ = ఓ—చకోర (చకోర) ; తోయ (తోయ.)
ఔ = ఓ—గోతమీ (గౌతమీ) ; పోర (పౌర) ; కోసిక (కౌశిక.)
ఔ = ఒ—ఒతరాహ (ఔత్తరాహ.)

## హల్లులయందలి మార్పులు.

క = క—కుల (కుల)
క = గ—గిలాన (క్లిన్నానాం.)
ఖ = ఖ—సుఖ (సుఖ.)
ఖ = ఘ—లేఘుక (లేఖక.)
గ = గ—గిరి (గిరి) ; నేకమ (నైగమ.)

గ = క—సకర (సగర) ఈ మార్పు పైశాచీభాష ననుసరించి యున్నది.

చ = చ—చకోర (చకోర.)
చ = స—సెటగిరి (చైత్యగిరి) ; ససికిక (చంచరీక.)
జ = జ—రాజ (రాజ.)
ట = ట—వాట (వాట.)
ట = డ—కుడుంబినియ (కుటుంబిన్యాః.)
డ = డ—మండల (మండల.)
డ = ళ—గరుళ (గరుడ) ; సోళస (షోడశ.)
ణ = ణ—బమ్హణస (బ్రాహ్మణస్య.)
ణ = న—పురిసానం (పురుషాణాం.)

త = త—గోతమీ (గౌతమీ) ; తతియే (తృతీయే) - ఈ రూపము పైశాచీభాష ననుసరించినది-

త = ట—పటిపుణ (ప్రతిపూర్ణ) ; కటా (కృతా) ; కుమారాటస (కుమారాతస్య.)

త = థ—ఏథ (ఏతత్.)

త = అ = య—పతిగయ్హ (ప్రతిగృహీత = పతిగహీఅ = పతిగహీయ = పతిగయిహ = పతిగయ్హ)

త = ద—సదకణి (శాతకర్ణి.)

త = డ—పడిక (ప్రతీక) ; అపడి దాతవా (అప్రతి దాతవ్యా.)
త = ర—సతరి (సప్తతిః.)
ధ = ళ—పుళుమాయిస (పృథుమాతృకస్య.)
ధ = ర—సురర (సురధ) ; పరిహారేర (పరిహారేధ.)
ధ = ద—మదనస (మథనస్య.)
ద = ద—దివసే (దివసే) మందర (మందర.)
ద = ర—తేరస (త్రయోదశ), బారసక (ద్వాదశక.)
ద = య—పాయూన (పాదోన.)
ధ = ధ—సిద్ధం (సిద్ధం.)

ధ = వ—నిధి (నివి) - ధకారము వకారముగమారుట వింతయే. నిధి= నిఇ, అయి వకారమాగమముగా నచ్చినది.

న = న—వాహన (వాహన.)

న = ణ—విచిణ (విచ్ఛిన్న) కుటుమ్బిణియ (కుటుంబిన్యాః) ; ణియుత (నియుక్తా) ; మహామతేణ (మహామాత్యేన) ; కుటుంబకేణ (కుటుంబకేన) ; మహాసేణాపతిణియ (మహాసేనాపత్న్యాః.)

ప = ప—పీత (పీత) ; పటిపుణ (ప్రతిపూర్ణ.)
మ = మ—పంచమే (పఞ్చమే) ; మందర (మందర.)
య = య—తోయ (తోయ) ; మలయ (మలయ.)
ఇ = ఇ—పవఇత (ప్రవర్తయిత్రు.)

య = చ—పారిచాత (పారియాత్ర) ; - ఈమార్పు పైశాచీభాష ననుసరించి యున్నది

య = జ—భరిజాయ (భార్యాయాః.)
ర = ర—రాజ (రాజ.)
ర = ల—నాలిగేరాన (నారికేలానాం.)
ల = ల—మలయ (మలయ.)
ల = ర—నాలిగేరాన (నారికేలానాం.)
వ = వ—దివసె (దివసె)
వ = బ—బితీయె (ద్వితీయె.)
వ = అ = య—భయంత (భవంతః = భఅంత = భయంత.)
వృ = ఉ—ఉసభదతేన (వృషభదత్తేన.)

శ = స—ఏకునవిస (ఏకోనవింశతిః); సాసనస (శాసనస్య) ; సుసూసా (శుశ్రూషా); నివిసేస (నిర్విశేష); సక (శక); వంస (వంశ) ; యస (యశస్) ;

సాతవాహన (శాతవాహన) ; నిరవసేస (నిరవశేష) ; సిరసి (శిరసి) ; దాసక (దాశక); బారసక (ద్వాదశక); సత (శత); సోళస (షోడశ); కోసిక (కౌశిక.)

శ్య = స్స—అపావేస (అప్రావేశ్యమ్) ; అనోమస (అనవమృశ్యమ్.)

ష = ఛ—చ్ఛరే (షష్ఠే)

ష = స—నిసూదన (నిషూదన); నహుస (నహుష); అంబరీస (అంబరీష) ; నివిసేస (నిర్విశేష) ; ఉసభదతేన (వృషభదత్తేన) ; సోళస (షోడశ.)

స = స—దివసె (దివసే) , సిధం (సిద్ధం) ; సమసారస (సమసారస్య )

ః = ఓ—గామో (గ్రామః) ; తతో (తతః.)

హ = హ—హిమవత (హిమవత్.)

హ = ఖ—ఖఖరాత (క్షహరాత.)

---

## సంయుక్తాక్షరములు.

---

క్త = త్త—వతవ్యో (వక్తవ్యః) ; విభతా (విభక్త.)

క్ర = క్క—వికమ (విక్రమ) ; పరకమ (పరాక్రమ.)

ఃఖ = ఖ్ఖ—దుఖ్ఖ (దుఃఖ.)

క్ష = ఖ—ఖహరాటస (క్షహరాతిస్య )

క్ష = ఖ్ఖ—అఖ్ఖయ (అక్షయ); ఉపరఖ్ఖితో (ఉపరక్షితః); పఖ్ఖే (పక్షే); అఖ్ఖయాం (అక్షయాం); యఖ్ఖ (యక్ష) , రఖ్ఖస (రాక్షస) ; నఖ్ఖత (నక్షత్ర) : దఖ్ఖిన (దక్షిణ.)

క్ష = ఖ—ఖేతస (క్షేత్రస్య); ఖతియ (క్షత్రియ) ; ఖఖరాత (క్షహరాత.)

జ్ఞ = ఞ—ఞాయతే (జ్ఞాయతే.)

జ్ఞ = ఞ్ఞ—యఞ్ఞ (యజ్ఞ) ; అఞ్ఞాతియ (ఆజ్ఞప్తాః) ; రఞ్ఞో (రాజ్ఞః.)

జ్ఞ = ణ—ఆణత్తం (ఆజ్ఞప్తమ్.)

జ్ఞ = న—ఆనపయతి (ఆజ్ఞాపయతి.)

జ్య = జ్జ—భోజ్జా (భోజ్యాః) ; సుజ్జమాన (సృజ్యమాన.)

త్త = య్య—దేయ్య (దత్త.)

త్ప = ప్ప—తప్పర (తత్పర.)

త్య = త్త—మహామత్తేణ (మహామాత్యేన )

త్య = చ్చ—అమచ్చ (అమాత్య.)

త్య = త్త = ట్ట—సెట్టగిరి (చైత్యగిరి = చెత్తగిరి = సెట్టగిరి.)

త్ర = త్త—నఖత్త (నక్షత్ర); చిత్తణ (చిత్రణ); సతుసఘస (శత్రుసంఘస్య), పుతస (పుత్రస్య)

త్త్ర = త్త—ఖత్తియ (క్షత్త్రియ.)

త్త్వ = త్త—సత్తకం (సత్త్వకమ్.)

త్స = స్స—ఉస్సవ (ఉత్సవ)

త్స = చ్ఛ—సంవచ్ఛరే (సంవత్సరే.)

త్స్య = చ్ఛ—మచ్ఛ (మత్స్య)

ద్య = జ్జ—విజ్జాధర (విద్యాధర)

ద్ర = ద్ద—చంద్ద (చంద్ర); మహింద్ద (మహేంద్ర); సముద్ద (సముద్ర.)

ద్వ = ద—దో (ద్వే.)

ద్వ = బ—బారసక (ద్వాదశక); బే (ద్వే.)

ధ్య = ఝ—వింఝ (వింధ్య)

బ్ద = ద్ద—సద్దస (శబ్దస్య)

భ్య = బ్భ—అబ్భంతరం (అభ్యంతరమ్)

ర్ఘ = ఘ్ఘ—దిఘ్ఘ (దీర్ఘ.)

ర్జ = జ్జ—అజ్జున (అర్జున); ధమ్మోపజ్జిత (ధర్మోపార్జిత.)

ర్ణ = ణ్ణ—చాతువణ్ణ (చాతుర్వర్ణ); పటిపుణ్ణ (ప్రతిపూర్ణ)

ర్త = త్త—నివత్తన (నివర్తన); వినివత్తిత (వినివర్తిత.)

ర్థ = ద్ద—చొద్దె (చతుర్థే)

ర్ధ = ద్ధ—గోవద్ధనె (గోవర్ధనే); ధనుద్ధరస (ధనుర్ధరస్య); వివద్ధనస (వివర్ధనస్య.)

ర్ప = ప్ప—దప్ప (దర్ప.)

ర్భ = బ్భ—గబ్భం (గర్భం); నిబ్భయ (నిర్భయ); వివబ్భ (వివర్భ.)

ర్గ = గ్గ—చతుగ్గబ్భం (చతుర్గర్భం)

ర్మ = మ్మ—ధమ్మ (ధర్మ)

ర్య = య్య—ణియ్యాచితం (నిర్యాచితం.)

ర్వ = వ్వ—గంధవ్వ (గంధర్వ); చాతువణ్ణ (చాతుర్వర్ణ); నివ్విసేస (నిర్విశేష); సవ్వ (సర్వ); పవ్వత (పర్వత.)

ర్శ్వ = స్స—పస్సే (పార్శ్వే)

ర్ష = స్స—వస్సపఖే (వర్షపక్షే); దుప్పధస్సనీయ (దుష్ప్రధర్షణీయ.)

ల్య = ల్ల—ముల్లేన (మూల్యేన.)

ఈక్రింది విభక్త్యంతములుగల రూపములు గానవచ్చుచున్నవి.

## ప్రథమైకవచనము.

---

సేవకామో (సేవాకామః); పియకామో (ప్రియకామః). ఆణత్తో (ఆజ్ఞప్తిః); సామకో (సామకః) నతివ్యో (నక్తన్యః); గామో (గ్రామః); ఓవరకో (అపవరకః); ఘరో (గృహం); ఉపరిఖితో (ఉపరిక్షితః)

---

## ప్రథమాద్వివచనమునకు బహువచనము.

---

ఫోడియో.

## తృతీయైక వచనము.

---

మెధునేన, వెణ్హుపాలేన, అవియేన; అమచేన, సివగుతేన, తాపసేన; ఉసభదతేన; పుతేన; నాసికతేన; సమణేన; కుటుంబకేణ; దణమేణ;—ఈ రూపములలో సంస్కృతములోని ఇన ప్రత్యయము చేరినది. కొన్నిచోట్ల సంస్కృతమునకు విరుద్ధముగా నకారమునకు బదులు ణకారము కానవచ్చుచున్నది. భమనదిన అను రూపమునందు నకారాంతశబ్దమునకు వలె రూపమున్నది.

---

## తృతీయా బహువచనము.

---

సంస్కృతమునందువలెగాక యిందు ఏభిః అను ప్రత్యయమునకు వికారమైన (ఏహి), అను ప్రత్యయము తృతీయా బహువచనమున చేరుచున్నది:—సమణేహి (శ్రమణైః), నాసేహి (నాసైః), భదాయనియేహి (భద్రాయనైః); పరిహారేహి (పరిహారైః): మహాసామియేహి (మహాస్వామిభిః) మాలయేహి (మాల్యైః), సహస్రేహి (సహస్రైః)—అకారేతరాజంత రూపములపై 'హి' మాత్రము చేరును:—చతుహి (చతుర్భిః), భిఖుహి (భిక్షుభిః)

## పంచమ్యేకవచనము.

ఇందు అత్ ప్రత్యయముతోని రూపములు కానుపించును:— ఖదా (స్కంధాత్); ఖధావారా (స్కంధావారాత్); భటారకా (భట్టారకాత్.)

పంచమ్యేకవచన షష్ఠ్యేకవచనములందు స్త్రీలింగాకారాంతశబ్దములకు వలె కొన్నిరూపములు గానవచ్చుచున్నవి:— అనువిధీయమానాయ (అనువిధీయమానాయాః), మాతియ (మాతుః); మహాదేవీయ (మహాదేవ్యాః); గోతమియ (గౌతమ్యాః), బలసిరీయ (బాలశ్రియాః); నితాయ (నిత్తాయాః); పరాయ (పరాయాః). కుటుంబినీయ (కుటుంబిన్యాః); నందసిరియ (నందశ్రియాః), మహా[illegible]య (మహా[illegible]ః), అంతేవాసినియ (అంతేవాసిన్యాః); పవయితాయ (ప్రవ్రజితాయాః), తాపసినియ (తాపసిన్యాః); భటపాలికాయ (భటపాలికాయాః), భారియాయ (భార్యాయాః), కుషణకమాతుయ (కుషణకమాతుః), ఉ[illegible]య (ఉ[illegible]యాః), మచ్ఛాయయా (మచ్ఛాయాయాః); భరిజాయ (భార్యాయాః), సేనాపతినియ (సేనాపతిన్యాః), వాసుయ (వాసోః) కణ్హాహినియ (కృష్ణాహేః), సఖమిత్రాయ (సఖమిత్రాయాః), వీసాయ (వింశత్యాః), ఉజెనియ (ఉజ్జయిన్యాః), బనారసియ (వారాణస్యాః) ఉపాసికాయా (ఉపాసికాయాః); విణ్హుపితాయా (విష్ణుపిత్రాయాః); జీవసుతాయ (జీవసుతాయాః), రాజమాతుయ (రాజమాతుః), పటిహారక్షియ (రక్షిణః); లోటాయ (లోటాయాః), అజ్ఞాతియ (అజ్ఞప్త్యాః); నగరసీమాయ (నగరసీమ్నః), నిగమసభాయ (నిగమసభాయాః)

పితుపతియో (పితుః పతేః), సేనాయే (సేనాయాః)· వెజయంతియే (వైజయంత్యాః)-అనురూపములును, పురిసదతాస (పురుషదత్తస్య), నదాసిరియావ (నందాశ్రియాః)- అనురూపములును, తసిల్ ప్రత్యయముతో, ఖేతాతో (క్షేత్రతః) అను రూపమును గానవచ్చుచున్నవి

---

## షష్ఠ్యేకవచనము.

రాజస (రాజ్ఞః), పతిస (పత్యుః), సాసనస (శాసనస్య) వాహనస (వాహనస్య), నగరస (నగరస్య), అమచస (అమాత్యస్య), సామకస (సామకస్య), సాతకణిస (శాతకర్ణినః), వసెఠస (వాసిష్ఠస్య), పవఇతస (ప్రవ్రజితస్య)- పై వానిలో స అను ప్రత్యయము శబ్దముల యంతముతో నిమిత్తము లేకుండ నుపయోగింపబడినది

## సర్వనామములు.

అమ్హేహి (అస్మాభిః); అమ్హ (అస్మాకం.)
ఏథ (ఏతత్); ఎతత (ఏతత్); ఏతో (ఏతత్) ?
ఏతహి, ఏతేహి (ఏతైః), ఏతస (ఏతస్య); ఇమేస (అస్య) ?
సో (సః); నేన (అనేన); య (యద్).

## అవ్యయము.

దాని (ఇదానీం.)

---

## సంధి.

అప + అవసితం = అపయవసితం.

---

## కారకము.

నమ భగవతస జినవరస బుధస (నమోభగవతే జినవరాయ బుద్ధాయ.)

## ఈక్రింది గ్రామముల పేళ్లు కానవచ్చుచున్నవి.

చలిసీలణ, నాసిక, ధంభిక, ధనపుర, ఘాకలేప, దాహనూకానగర, కేకాపుర, ఉజేని, కాపురాహార, చిఖలపద్ర, పిండీతకానడ, సువర్ణముఖ, రామతీర్థ, గోవర్ధన, శోర్పారగ, భరుకచ్ఛ, బెనాకటక, ధనకట, సామలిపద, సుదసన, నవనర, పిసాజపతకం.

## ఈక్రింది మనుష్యుల పేళ్లు కానవచ్చుచున్నవి.

ధమ్మదేవ, ఈంద్రాగ్నిదత, మాఢరీపుత, శివదత్తాభీర, అభీర, ఈశ్వరసేన, సకగివమ్మ, గణపక, రేభిల, విసవర్మ, సకసిక, శివమిత, రామణక, హలిదత, భటపలికా, వహవకసిరి, ఆరవలయ, ఆరియతణక, కపణణక

సదాసిరీ, సాదవాహన, కన్హా, మమ్మా, భవగోప, బోపకి, దామచిక, పులుమాఇ, ధణమ, సాతకణి, విణ్హుదత, ఉసహరాత, ఉతప, నహపాన, కీసీక, ఉషవదాత, గోతమిపుత, సదకణి, విణ్హుపాలిత, అవరకఖడి, సివగుత, మిధున, పుళుమవి, సవస.

---

## ఈక్రింది సంఘములపేర్లు కానవచ్చుచున్నవి.

---

ఉత్తమభాద్ర (యోధులసంఘము); (తేకిరసి, ఒక యతులసంఘము); భదాయనీయ (భిక్షుసంఘము); చతిక (ఒక భిక్షుసంఘము); కులరిక శ్రేణి (ఒక యాంత్రిక శ్రేణి,) తిలపిషక శ్రేణి, (వృత్తులకు సంబంధించిన సంఘములు.)

## పర్వతములు.

తిరణ్హు, గోవధన,

## నదుల పేళ్లు.

---

బాణ్ణశా, ఇగా, పారాదా, దమణ, తాపీ, కరబేణా, దహనుకా,

పైదానినిబట్టి యాంధ్రరాజుల శాసనములభాష పాలిభాషకు మిక్కిలి దగ్గఱగనున్నట్లుఁ దెలిసికోనవచ్చును. నాసికయాందేకాక నేటి యాంధ్రదేశమునఁ గానవచ్చిన యాంధ్రరాజుల ప్రాకృత శాసనముల భాషయుఁ బైదానికి పోలియుండును. ఆంధ్రదేశమున నశోకుని శాసనములు మొన్నటివఱకును దొరకలేదు. అనంతపురముజిల్లాలోని గుత్తి కేడుమైళ్ల దూరమునున్న యెఱ్ఱగుడి గ్రామమునకు సమీపమున చిన్నగుట్టలపై చెక్కఁబడియున్న యశోకుని పదునాలుగు శిలాశాసనములను నేను స్వయముగ ప్రథమముగఁ గనుగొని వాని ప్రతులనెత్తి చేదివితిని. అందలి రెండుశాసనముల నిక్రింద నుదాహరించుచున్నాను.

## ఏడవ శిలాశాసనము.

1. దేవానంపియే పియదసినే లాజా సవతా ఇఛతి.

(దేవానాంప్రియః ప్రియదర్శీ రాజా సర్వత్ర ఇచ్ఛతి.)

2. సవపాసండ వసేయు సవే హి తే సయమం భావసుధిం చా
(సర్వేపాషండా వసేయుః సర్వే హి తే సంయమం భావశుద్ధిం చ.)
3. ఇఛంతి జనేచు ఉచావుచఛందే ఉచావుచలాగే తే సవం ఏక [దేశం పి
(ఇచ్ఛంతి జనః తు ఉచ్చావచచ్ఛందః ఉచ్చావచరాగః తే సర్వం [ఏకదేశముపి.)
4. కఛంతి విపులె పి చు దానే అస నథి సయమే భావసుధి కిటనా తా
(కరిష్యంతి విపులమపి తు దానం యస్య నాస్తి సంయమో భావ [శుద్ధిః కృతజ్ఞతా.)
5. దిఢభతితా చా నిచే బాఢం
(దృఢ భక్తితా చ నీచా బాఢం.)

---

## తెనుఁగు.

---

దేవానాంప్రియుఁడు ప్రియదర్శిరాజు సమస్తజనులను తమ యిచ్ఛ వచ్చినచోట వసింపవచ్చునని కోరుచున్నాఁడు. వీరందఱును సంయమమును భావశుద్ధిని, కోరుదురుగదా. కాని జనులు వేర్వేరు కోరికలను, వేర్వేరు రాగములను కలిగియుందురు. వారు తమధర్మములలో అన్నిటినిగాని, కొన్నిటిని మాత్రముగాని నిర్వర్తింతురు. విపులమైనదానమును, సంయమమును, మనశ్శుద్ధియు, కృతజ్ఞతయు, దృఢభక్తియు లేనివారు తప్పక నీచులగుదురు.

## 11-వ శిలాశాసనము.

---

1. దేవానంపియే హేవం ఆహా నథి ఏదిసే దానె అదిసే ధయదాన [ధంమసంథవే
(దేవానాంప్రియః ఏవం ఆహా నాస్తి ఈదృశం దానం యాదృశం) [ధర్మదానం ధర్మసంస్తవః.)
2. ధంమస విభాగే ధంమసంబంధే తత ఏస దాసభటికసి.
(ధర్మసంవిభాగః ధర్మసంబంధః తతః ఏషా దాసభృతకే.)
సంమ్యాప్రటిపతి మాతాపితు సుసుస.
(సమ్యక్ప్రతిపత్తిః మాతాపిత్రృ శుశ్రూషా.)

2. తేన సంవచర వసంకర కేస నో కస పాజకయాయ.
(త్రింశద్ సంవత్సరే చాసంకృతం కీదృశం నఃకార్యస్య ప్రయోజ
[నాయ.)

3. పు ససాస తే కయం ఖు సవఛ లే యమాయా సంయేపధరయే.
(పున స్స శాస్తి కార్యంఖలు సంవత్సరేఽయమాజ్ఞా సంజ్ఞావ
[ధారితా.)

4. మాలభాయే మునీసాసస లేకా చు న మి తే కే పమే వృధం ఏ తే.
(మమలాభాయ మనుష్యశాసనలేఖా తు న మిత్రకే ప్రేమ
[వృద్ధం ఏ తే.)

5. దకనపిపుక దేవపిత కే నిగాసి సూభాపకమస ధ-
(దక్షిణ ... ... దేవపితరో నిగతాఃస్యుః శుభ ప్రక్రమస్య ధ-)

6. రామమోనేన సాకయే వా రతిమే ఏనకోయే కసవేనే.
(రా మమ అనేన సాకం యే వా అర్థతమాః యేనకేనాపి యా
[దృ కీదృశ్యా.)

వా పమయా.
(వా ఉపమాయా.)

7. అపి వ నం పవిఖో సధాకే పులె మోభో అశోకాయ చ.
(అపి వా అస్మాన్ ప్రవీక్ష్య శ్రద్ధాంకే పురా మమ అభవన్
[అశోకస్య చ.)

అధాయే ఏయం.
(అర్థాయ ఇయం.)

8. హావం యం పకమ హోభవం పు దక మహాధకా ఇమం పి.
(ఏవం యః ప్రక్రమో భవత్యభూత్ \ పునః దక్షిణ మహార్థకాః
[ఇమమపి.)

ఏకమోవ అ ఇ
(ఏకమేన అతి (ను ?) )

9. గవ్రో సి చే యిథం సభేతకి మోమపి ఛేచకేబాఢి రవివునే.
(గమిష్యంత్యంచేత్ ఇమం అభేస్యగ్రమపి చేత్స్యంతి భ్రా
[జనే)

జమే వుభా.
(నావుభా.)

10. యదేకే ఓనపేం భవాయే రం నహావా వాఉసో వా.
(యదేకే అవనిపా భవేయుః రాజానః యే వ్యాపృషో వా.)
వఘసి భాలపపధియా దేయా వివ
(వర్ధయిష్యంతి భాప ప్రవృద్ధ్యై ధియా వివ-)

11. దనే ఆడంపిప జనో దతి మభూడస లతపం ధనపియానె నావం-
(ర్ధనా అర్థమపి న జనో దత్త మభూత్తస్య ఇర్థానాం ధేపప్రియా
[విశ్వాలవ-)

యుఇ.
(ఋతవ్యాః.)

12. పంయున సుతిరా వృతాని చా సుసితవియే జయేయు
(ప్రజ్ఞాన సుస్థిర వృత్తాః చ సుశ్రావయితవ్యాః జయాయ.)
వధ ఏయే అం పయధాకదే.
(వృద్ధ్యై ఏవం ప్రయత్నే కృతం.)

13. సినువాయు హామేవ గచు పు సుసువియానహా భడే.
(సుశ్రావణేస అహామేవ గచ్ఛామి పునః శుశ్రావణాయ వా
[అహంభటః.)

ఆతిధకధా అపి ఆయే పినవా.
(యథా (తథా) కథమపి ఆగమిష్యామి పునర్వా)

14. సుసుమ ధంమశవ పవతితని యుయేచు దయాని యు దయితవయు.
(శుశ్రూషా ధర్మశాసన ప్రవర్తితాని యానియాని తు దత్తాని
[యాని దాతవ్యాని.)

సవే వేతివ్యయే.
(సర్వాణి వర్తితవ్యాని.)

15. యుధపధి యాచ్ఛే చాసోకాగువణోభి ఇయం సుసుసిత తపంతి
(యథాపథి యాదృశినః ఉపాసకారిణః అపి ఇమం శ్రావయిష్యంతి.)
పయాధ దేవానంపియు వనేన హా
(ప్రయుక్తాః దేవానాం ప్రియ వచనేన ఆ-)

16. ధ లంతేవాసిని యూరాసా ధంముసధి భికాని యుదానపవియు.
(ధ అంతేవాసినః యాదృశాః ధర్మపస్థాః భిక్షుకాః )
అనాని వేసుధా హాంవనిమ్మా అవమ

ములు గాన్పింపవు. క్రీస్తుశకము 4, 5, శతాబ్దములనుండియుఁ బల్లవరాజుల కాలమున సంస్కృతమునకుఁ బ్రాధాన్యముగలిగి ప్రాకృతముల ప్రచారము వెనుకపడినట్లు గాన్పించును. ఈలోఁగఁ బ్రాకృతము మార్పుఁజెందుచు వచ్చెను. దానికిని నితరభాషలకును వ్యవహారమునఁ దొలుతనుండియుఁ గలుగుచుండిన సంపర్కమువలన గ్రంథస్థాకృతిఁబోక ప్రాకృతమని గుర్తింపరాని యొకయవస్థ యేర్పడెను. ఈ తొల్లింటి ప్రాకృతమే మార్పునొందుచు నేటి యాంధ్రభాషగాఁ బరిణమించినదా? లేక వేఱేదో నా పరిణామక్రమ మెట్టిది? ఆ ప్రాకృతభాషా స్వరూపమెట్టిది? దానితోఁ జేరికయుఁ బొందిన యితర భాషల స్వరూపమెట్టిది? ఆంధ్రమునకును నితర ద్రావిడభాషలకును గల సంబంధమేమి?—అను విషయములను గూర్చిన చర్చ యీ గ్రంథమున నందందు గాన్పింపవచ్చును. ఆంధ్రము ప్రాకృతభాషా వికారమగునేమో యను దృష్టితో నీగ్రంథము వ్రాయఁబడుటచేఁ బ్రాకృత భాషలగూర్చిన ప్రశంస యించుకెక్కువగాఁ గాన్పించును.

ఈభాష కాంధ్రమనుపేరు నన్నయభట్టు విరచితమైన నందంపూడి శాసనమునఁ దొలుతఁ గానవచ్చుచున్నది. అందులో నారాయణభట్టు నాంధ్ర భాషాకవీశ్వరునిగాఁ జెప్పియున్నాఁడు. ఆనాటికే యీ భాషకుఁ దెనుఁగను నామము గూడ గలిగియుండెను. భారతమును తెనుఁగున రచింపుమని రాజరాజు తన్ను గోరినట్లు నన్నయభట్టు చెప్పియున్నాఁడు. ఈ తెనుఁగను పేరు స్వరూపమునుగూర్చి విచారింతము.

తెలుఁగనుపేరు త్రిలింగ శబ్దభవమని పండితుల యభిప్రాయము. ద్రాక్షారామ, శ్రీశైల, కాళహస్తులను మూఁడు ప్రసిద్ధ శైవక్షేత్రములకు నడుమనున్న దేశము త్రిలింగమనియు నదియే తెలుఁగుదేశమనియు [illegible] చెప్పియున్నారు. అంతకుఁబూర్వము కాకతీయులు రాజ్యముచేసిన దేశమునకుఁ ద్రిలింగమని యనుకొనుచుండినట్లు విద్యానాథకవికృతమగు ప్రతాపరుద్రీయమునఁ బ్రతాపరుద్రుఁడు త్రిలింగాధిపతియని చెప్పఁబడుటచేఁ దెలిసికొనవచ్చును. అంతకుఁ బూర్వము తెలుఁగుదేశమునకుఁ ద్రిలింగసంజ్ఞ యుండెనో లేదో తెలియదు. శాసనములం దీదేశమునకు తెలింగ, తెలుంగ, తిలుంగ, తిలంగ, తెలగ, తిలింగ, యనుపేళ్లు గానవచ్చుచున్నవి. శా. శ 1194 ప్రాంతముల రాజ్యమేలిన యాదవరాజగు రామచంద్రునికి "తెలింగ తుంగ తరూన్మూలన దంతావల" యను బిరుదముండినట్లు తెలుపఁబడినది. కుంతల దేశాధీశుఁడగు రాచమల్లదేవునకుఁ దెలగిలమారి యను బిరుదముండెను.

"పశ్చాత్పురస్తాదపి యస్య దేశౌ
ఖ్యాతౌ మహారాష్ట్ర కలింగసంజ్ఞౌ
వవాగుదక్ పాండ్యక కన్యకుబ్జౌ
దేశస్స తత్రాస్తి త్రిలింగనామా.
పురా త్రిలింగాన్ ప్రతిమంచి కొండా
వావానయన్ నాయకవంశ ముఖ్యౌ
తాభ్యాం వినిర్మాపితమాత్మ నామ్నా
పురం మహచ్చ ప్రథితేంధ్ర దేశే."

అను శ్లోకము ఎపి గ్రాఫియా ఇండికా 14-వ సంపుటమున వ్రాయఁబడియున్నది. శా. శ. 1539 సంవత్సరమున మీసర గండకతారిసాలువ తెలుంగురాయఁ డుండినట్లొక శాసనమువలనఁ దెలియుచున్నది. ప్రతాపరుద్రీయమున త్రిలింగశబ్దము వాడఁబడియున్నది. అల్లాఉద్దీనను తురుష్కరాజు తిలంగదేశమును జయించినట్లు తెలియుచున్నది. తిలుంగు బిజ్జలుఁడను వాఁడు నెల్లూర రాజ్యమేలిన తెలుఁగుచోడుల వంశములోనివాఁడు. ఈ రీతిగానున్న దేశపుపేళ్లను సంస్కృతీకరించి త్రిలింగశబ్దమును పండితులు కల్పించినారని యనుకొనుట కవకాశమున్నది.

తెలుఁగుశబ్దము త్రినగశబ్ద భవమని మఱికొంద ఱందురు. మహేంద్రము, శ్రీశైలము, కాళహస్తి యను మూఁడునగముల మధ్యనున్న ప్రదేశము త్రినగదేశమనియుఁ ద్రినగశబ్దమే తెనుఁగుగా మాఱినదనియు వారి యభిప్రాయము. త్రినగశబ్దమునందు లేని యనుస్వారము తెనుఁగుశబ్దమునం దుండుటయు, తెనుఁగుదేశమునకుఁ ద్రినగమను వ్యవహార మేనాఁడును లేకుండుటయు నీ వ్యుత్పత్తి కాధారము లేనట్లు తెలుపఁగలదు.

త్రికళింగ శబ్దభవము తెలుఁగని మఱికొంద ఱనుచున్నారు. త్రికళింగశబ్దము ప్రాకృతమున 'తిలలింగ' యని మాఱి తెలింగ, తేలింగ యను రూపములను పొందుట సాధ్యమేయయినను తెనుఁగుదేశ మంతటికిని త్రికళింగసంజ్ఞ లేకుండుటచే నీ వ్యుత్పత్తియు నిరాధారమగుచున్నది. త్రికళింగ మనున దిప్పటి గంజాము, విశాఖపట్టణము జిల్లాలును వానికి పడుమట మధ్య పరగణాలలోని కొంతభాగమును నయి యుండెను. నేటి ముఖలింగమున్న ప్రదేశమునకు మోదోగలింగే యను పేరు గ్రీకు చరిత్రకారుల వ్రాతలయందుఁ గాన్పించుచుండుటచే మోదో అనగా మూఁడగు అని అర్థము చెప్పి త్రికళింగమునకు మూఁడగు కళింగమని యర్థముచెప్పి యా త్రికళింగమునుండి తెలుఁగను పదము పుట్టినట్లు కేంబెల్ మొదలగు పాశ్చాత్య

పండితు లభిప్రాయపడిరి. మోదోగలింగ మనునది మధూకలింగ శబ్దభవము గాని మూఁడగు కళింగము అనుదాని మాఱురూపము కాదు. మూఁడగు కళింగమని త్రికళింగమున కెన్నడును వ్యవహారము లేదు.

తేనె + అగు, అనగా తేనెవలె తియ్యనిదగుటచే తెనుఁగయ్యెనని కొందఱును తెలి + అగు = తేలికయగు, లేక స్వచ్ఛమగునట్టిది కావున నీ భాషకుఁ దెలుఁగను నామము వచ్చెననియుఁ గొందఱి యభిప్రాయము. ఈ వ్యుత్పత్తి కేవలము స్వాభిమాన పూరితమని వేఱె చెప్పనక్కఱలేదు. తెన్ అనగా దక్షిణమని తమిళమున నర్థముండుటచే దక్షిణదేశపు భాషగావునఁ దెనుఁగనుపేరు గలిగినదని కొందఱనుచున్నారు. తమిళులకుఁ దెలుఁగువా రుత్తరమున నుండుటచేతను, తెలుఁగువారు తమ్ము దక్షిణదేశపు వారమని చెప్పుకొనుట యసంభవ మగుటచేతను నీ వ్యుత్పత్తికూడ సమంజసముగ లేదు.

కన్నడకవియగు నృపతుంగుఁడను రాజు తాను రచించిన కవిరాజ మార్గమను లక్షణగ్రంథమున గోదావరినుండి కావేరివఱకుఁగల ప్రదేశ మంతయుఁ గర్ణాటకసంజ్ఞను గలిగియున్నదని చెప్పియున్నాఁడు. కన్నడమునం దాదికవులగు పంప, రన్న, పొన్న, యనువారు వేంగీదేశవాసులయినట్లు వారి గ్రంథములవలనఁ దెలియుచున్నది. ఇంతేకాక పూజ్యపాదుఁడు (క్రీ. శ. 470) దండి (క్రీ. శ. 7-వ శతాబ్దము), నాగార్జున (క్రీ. శ. 8 శతాబ్దము), నాగ వర్మ (క్రీ. శ. 990), రాజాదిత్య (క్రీ. శ. 1120), మైదునరామయ్య (క్రీ. శ 1160), మోళిగయ్య (క్రీ. శ. 1160), మరుళదేవ (క్రీ. శ. 1160), మల్లి కార్జున పండితారాధ్య (క్రీ. శ. (1160), హరీశ్వర, రాఘవ, కెరెయపద్మరస (క్రీ. శ. 1165), చక్రపాణి రంగనాథ (క్రీ. శ. 1195), పోలాళ్వ దండనాథ (క్రీ. శ. 1223), భీమకవి (క్రీ. శ. 1369),—వీరును నిట్టివారు మఱికొంద ఱును తెనుఁగుదేశమువారు కన్నడమున గ్రంథములను రచియించియున్నారు ఓరుగంటియందును హంపీ - విజయనగరమునందును రాజులు తెలుఁగు కన్న డముల నొక్కరీతిగఁ బ్రోత్సహించియుండిరి. శ్రీనాథుఁ డానాఁటి వాడుకను బట్టి కాబోలు తెలుఁగును కర్ణాటభాష యన్నాఁడు. ఇప్డే కన్నడదేశము నందును తెనుఁ గెక్కువ ప్రచారములోనున్నది. నేఁటి కర్నాటక దేశమగు మైసూరు సీమయందలి కోలారు, బెంగుళూరు, చిత్రదుర్గము, నందిదుర్గము జిల్లాలయందు చాలవఱకుఁ దెలుఁగే ప్రచారములోనున్నది, దీనినిఁబట్టి కన్న డమువారును తెలుఁగువారును మొదటినుండియుఁ గలసియుండుటయేకాక యొకరిభాష నొకరు బోధపరచుకొనఁ గలిగియుండిరని యూహింపవచ్చును.

ఈ రెండుజాతులవారికిని బ్రాతవలెనే భాషయు నొక్కటియై యుండ నొప్పును. ఆచార వ్యవహారములందును మతాది సంప్రదాయములందును నీరెండు జాతులవారికిని నొకరీతి నైక్యముండినటుల గోచరించును. కన్నడ భాష యయిదువిధములుగా నున్నదనియు నందొకరీతి కన్నడమునకు దెళు గన్నడమను వ్యవహారమున్నదనియుఁ, దెళుగన్నడమనఁగా కన్నడులు తమ మూలస్థానమునువిడిచి దూరదేశములకుఁబోయి తమ భాషను తేలికగా నుచ్చరించుటవలనఁ గలిగినభాషయనియు, నొక కర్ణాటక లాక్షణికుఁడు చెప్పి యున్నాఁడు. ఇట్లే "కుండ" అనగా కొండలయందున్న కన్నడులు మాట్లాడు భాష కుడ గన్నడమనియు, కుడగన్నడమే నేఁటి కుడగు భాషగా వ్యవహార మందున్న దనియుఁ జెప్పుదురు. ఈ సాదృశ్యము ననుసరించి తెలుఁగన్నడము తెలుఁగుగా వ్యవహరింపఁ బడుచున్నదని యూహింపవచ్చును. శబ్దజాలము నందు దెలుఁగు కన్నడములకు నూటికి డెబ్బదివంతున సమానముగ నున్నది. అట్లే ప్రత్యయాది సంబంధమును మిక్కిలి దగ్గఱగనున్నది. ఈ కారణముల చేతఁ దెలుఁగు కన్నడము లొకప్పు డేకభాషగా నుండెననియు గాలక్రమ మున మాండలిక భేదమునుబట్టి యవి భిన్నము లయ్యెననియు నూహించుట కవకాశము గలదు.

తెనుఁగు శబ్దములోని గుప్రత్యయమును గూర్చి కొంతవిచారము చేయవలసి యున్నది. గు, కు, క, గ, క్, గ్, ంక్, ంగ్, కి, మొదలగు ప్రత్య యము లంత మందుగల భారతీయ భాషలనుగూర్చి విచారించినచోఁ దెలుఁగు శబ్దమునందలి గుప్రత్యయ తత్త్వము తెలియవచ్చును. దక్షిణ హిందూ దేశ భాషలలోఁ గన్నడమునకు "హవిక' యను మఱియొక పేరున్నది. తమిళ మును కొన్ని ప్రాంతములలో "సొలగ" లేక "షొలగ" యని పిలుతురు. "పుల్‌రంగ్" అనునది తమిళభాషామాండలిక భేదమగు బుర్గండీభాషకు మఱియొకపేరు. నీలగిరులలోఁ దమిళభాషా భేదమగు ఇరులభాషకు "ఎరిల గారు" అను మఱియొకపేరున్నది. తమిళభాషాభేదమగు కొర్వా భాషలో "ఎర్కగ" లేక "సింగ్లి" యనుపేరున్నది. కొర్వాభాషకు "కోడా-కూ", కోటా-కూ అనియు కొరగ, కొర్యా, కూర్యా, కోట్-కూ, యనుపేళ్లు గూడ నున్నవి. బడగభాషయనునది కన్నడభాషావికారము. దీనిని బడక్ అని కూడనందురు. కొడగుభాష కన్నడభాషావికారము. పేంగ్ అనునది తెనుఁగుతో సంబంధించిన "కుయి" అను భాషకు మాండలికభేదము. "కోయ్ లోంగ్" అనునది కోంకణీ మళయాళభాషల సమ్మేళనము వలనఁ గలిగినది. భత్కల్, బుత్కల్ అనుభాష మరాఠీభాషావికారమైన కోంకణీభాషా భేదము. "ధనగరీ" యనునది మరాఠీభాషకు మాండలిక రూపము. ఇట్లే

దేపరుక్, కాంగ్ సాంగ్, తోతిగ, యనునవి గూడ మరాఠీభాషా వికారములే.

టిబేటు దేశములోని భోటియా మండలమునందు గ్యారాంగ్ కైగిలి, డాన్జొంగ్-కా, యను భాషలున్నవి. ఇఁక బర్మాదేశములోఁ జాల వఱకు భాషలు కంఠ్య వర్గానుస్వారాంతములుగాఁ గానఁబడు చున్నవి. ఉదాహరణములు:—ఘొక, గకు, గుకు, హిరోఇలమ్‌గాంగ్, గన్నగ, హ-అంగ్ హ్మాంగ్, హ్మాంగ్, హామైంగ్, హామోంగ్, హార్ త్సెంగ్, హ్రాంగ్-ఖొల్, ఇంబంగ్, ఈషంగ్, జక్ తుంగ్, హు అల్నగో, క-హంగ్, కంగ్ కత్ లంగ్, ఖ-లోంగ్, ఖుగ్-నాన్, ఖుగ్నీ, ఖులుంగ్-ముదున్, ఖుక్‌లోంగ్ ఖ్యాంగ్ (చ్యాంగ్), ఖ్యాంగ్, క్లున్ లోంగ్, ఖానుంగ్, నుంగ్, కోమ్‌రోంగ్ కోల్హారెంగ్, కోతంగ్, కుక్‌లోంగ్, క్విన్‌పంగ్, క్వోయ్‌రెంగ్, (లీయాంగ్) లకూ, లల్లెంగ్, లాలుంగ్, లంగ్రోంగ్, లంగ్‌తుంగ్, లథంగ్, లాక్‌లంగ్ లెంగ్‌రెంగ్, మోాంగ్, లోంగ్, మోాషాంగ్, మ్రుంగ్, ములుంగ్, ముంగ్ ముంతుక్, నమ్‌సంగ్, నరింగ్, పల్లంగ్, పల్లెంగ్, ఫడంగ్, ర-అంగ్, రాబ-కన్వోగ్, రవంగ్, రేఅంగ్, రి-అంగ్, రోంగ్, రుబ్రంగ్, సైంగ్ బాంగ్, సెరంగ్, సెంకదాంగ్, సెంతుంగ్, షైయాంగ్, తాంగ్-ఖుల్, షామ్ తురాంగ్, సిన్లెంగ్, సీయంగ్, సొంగ్‌లోంగ్, స్త్రీఎంగ్, తఅంగ్, తబైంగ్, తబాంగ్, తబ్లెంగ్, తైచాంగ్, తైఖాంగ్, తపోంగ్, తరేంగ్, తవ్‌హ్వాంగ్, తయంగ్, తంయింగ్, త్లంత్ లంగ్, త్విలిఛంగ్, వెలాంగ్, యబైంగ్, యక్రైంగ్, యల్లెంగ్, యమ్‌లంగ్, యంగ్‌కాలెంగ్, యెమ్‌షాంగ్, రి అంగ్, అంగ్‌క, అక, అకో, ఆంగ్‌కూ, ఆంగ్‌వాన్-కూ (తబ్లెంగ్) అనుంగ్, నుంగ్, ఖునుంగ్, అయెంగ్, బెయ్కు, బోకి, ద-అంగ్, ద-ఎంగ్, దరాంగ్, పలాంగ్, దిగారు, దులేంగ్.

ఈ క్రిందిభాషలు టిబెటో- బర్మనుభాషా వర్గమునకుఁ జేరినవి:— గురుంగ్, విదంగ్, లీయంగ్, లోయ్‌లోంగ్, మంగ్, తోంగ్, లోంగ్, మ్హాంగ్, ఆర్లెంగ్, అరుంగ్, ఎమ్పోన్ ఛేపాంగ్, ఛిన్‌బోక్, చ్యాంగ్, ఖ్యాంగ్,

ఈ క్రిందిభాషలు అస్సాము దేశములోనివి:—ఛేకేరీ, ఛిబోక్, డైకో, ఖంగోయ్, కోన్యక్, మయాంగ్, మిలెనసంగ్, మించ్చాణంగ్, మియాంగ్‌ఖంగ్, మూాజుంగ్, వనాంగ్, అస్సిరింగియా, అసురింగ్, ఆతింగ్, ఆతోంగ్.

ఈక్రింది భాషలు నేపాళదేశములో వ్యవహారములో నున్నవి:— ఛింగ్‌తాంగ్, గోర్‌ఖాలీ, గోర్ఖియా, ఖాలింగ్, కూలుంగ్, ఖంబూ, వాలింగ్, ఠంబూ, బాహింగ్.

ఉత్తర హిందుస్థాన భాషలలో ఓఢ్రభాషావికారములగు గచికోలో, కంగాలి, ఉత్కలీ భాషలును, తూర్పు హిందీభాషావికారమగు "కలంగ" భాషయును పశ్చిమ హిందీభాషావికారములగు పింగళ్, డాండా భాంగ్, డాంగీ, భాషలును, బంగాళము, ఒరిస్సా, బేహారము, ఛోటానాగపూరు దేశములలో సంచారశీలురగు నొకజాతివారు మాట్లాడు "గుల్ గులియా" భాషయును, బంగాళాదేశములోని బంగ, హైజోంగ్, ఆబెంగ్, అరంగా, భాషలును, మార్వాడీ భాషావికారములగు ఢటకీ, డింగళ్, అనుభాషలును, నిట్టి ప్రత్యయములనే కలిగియున్నవి. కాంగ్రా యనునది పంజాబీ భాషా వికారము. అవాంకారీ, అవాంకీ, అనుభాష పశ్చిమోత్తర పరగణాలలోని కోహత్ జిల్లాలోనిది. ఇది లహండా భాషావికారము. గంగోలాయను భాష హిమత్పర్వత పాదమునందలి పహాడీభాషకు మాండలిక రూపమైన కుమానీ భాష యంతర్భాగము, డుంగరీ, ఢంకీ, యనునవి బెలూచిస్థానములోఁ బ్రచారమున నున్నవి. పశ్చిమోత్తర పరగణాలలోని హిందోర్కి భాషయందుఁ గూడ నీ ప్రత్యయము కనఁబడుచున్నది. వైగలీయను పిశాచభాష కాశ్మీర ప్రాంతమునందలిది. ఝాంగ్, ఢరంగార్, దిక్కూకాజీ, ఔరంగ్, ఉరంగ్ అనునవి ముండా భాషావిశేషములు.

బర్మాలో తలైంగ్ అనునొక భాషయున్నది. ఇది ఆష్ట్రో-ఏషియాటికు భాషా కుటుంబమునకుఁ జేరిన మోన్-ఖ్మేర్ శాఖకు సంబంధించినది. దీనిని మాట్లాడువారి సంఖ్య 224424. ఇది బర్మాలోని అమ్హర్స్టు, థాటోను జిల్లాలోఁ బ్రచారముననున్నది. తలైంగ్-కలసీ యనునొక భాష బర్మాలోని యామేథిను జిల్లాలో వాడుక యందున్నట్లు తెలియవచ్చుచున్నది. తలైంగ్ కయిన్, అను మఱియొకభాష బర్మాలోని చాలజిల్లాలలో వాడుక యందున్నట్లును దానిని 352466 మంది మాట్లాడుచున్నట్లును బర్మాదేశపు జనాభా లెక్కలవలనఁ దెలియుచున్నది. బర్మాలోని యుత్తర భాగమున తైలోంగ్ అనునొక భాషను 18074 మంది మాట్లాడుచున్నారఁట. అస్సాము దేశములో తురూంగ్ అను మఱియొక పేరుగల తైరోంగ్ భాషయున్నది. నేపాళదేశములో థూలుంగ్ అనునొకభాష మాట్లాడఁబడుచున్నది. బర్మాలోని తెలైంగ్ దేశమునకును తెలుఁగుదేశమునకును చిరకాలమునుండి వాణిజ్యాది సంబంధముండినట్లు బర్మాదేశపు చరిత్రమువలనఁ దెలియనగును. కాని తెలుఁగు భాషకును తెలైంగ్ భాషకును నేఁడెట్టి సంబంధమును సన్నిహితమైన దానిని కనిపెట్టుటకు వీలులేకున్నది. నేఁడు ప్రిజులిస్కీ మొదలగు పండితులు ఆష్ట్రిక్ భాషలకును ద్రావిడభాషలకును సంబంధమున్నట్లు తెలియఁజేయుచుఁ దద్విషయమై పరిశోధనములఁ గావించుచున్నారు. పరిశోధనముల మూలమున

ద్రావిడభాషలకును ఆఫ్రికా భాషలకును కొన్ని సంబంధములు నిరూపింపఁ బడినవి. ఈ పరిశోధనములవలన నీరెండు భాషాకుటుంబములకును సంబంధ మేర్పడిన యెడల నాఫ్రికా భాషలకే సంబంధించిన తెలైంగ్ భాషకును తెలుఁగుభాషకును సంబంధ మేర్పడవచ్చును. అసంబంధము తేలునటకును నీ విషయమై ఇదమిత్థమని చెప్పుటకు వీలు లేదు.

పైని వివరించిన గుప్రత్యయ విచారమునకు సంబంధించిన యొక విశేషము గలదు. ప్రాకృత వైయాకరణులు పైశాచీభాష కాంచీ, పాండ్య, పాంచాల, గౌడ, మాగధ, వ్రాచడ, దాక్షిణాత్య, శౌరసేన, కైకయ, శాబర, ద్రావిడ, బాహ్లీక, సహ్య, నేపాళ, కుంతల, గాంధార, సుదేష్ణ, ఘోట, హైవ, కనోజన, దేశములందుండునదని వివరించిరి. ఆర్యభాషల యందు ముండా, ద్రావిడ, భాషల సంబంధమువలన గలిగిన భాషావిశేష ములే పైశాచీ భాషలుగాఁ బరిణమించి యుండనచ్చునని హార్నెయర్ నెల్, సెనార్టు, పండితు లభిప్రాయపడియున్నారు. ఇంతకుముందు గుప్రత్యయాంత ములుగా వివరింపఁబడిన భాషలన్నియు పైశాచీభాషా ప్రదేశములందలి వని ప్రాకృత వైయాకరణులు తెలిపిన ప్రదేశములం దే సరిగానుండుట విచిత్ర ముగా నున్నది. గుణాఢ్యుఁడు బృహత్కథను పైశాచీభాషయందు వ్రాసి యుండెనను ప్రతీతియందు సత్యమున్నచో నాంధ్రభాష పైశాచీభాషా విశేషమై యుండవచ్చును. ఈ యూహాల కాంధ్ర వైయాకరణుల యభి ప్రాయమును దోడ్పడుచున్నది. ఇందువలన తెనుఁగుభాష నేఁడుగూడ కేవలము పైశాచీభాషతోనే సంబంధించినదని యనుకొనఁగూడదు. ఒక భాషయొక్క చరిత్రయం దెన్నో మార్పులు కలుగుచుండును. తనతో సంబంధించినట్టియు సంబంధింపనట్టియు నెన్నో భాషలతో దానికి సంపర్కము కలుగవచ్చును. అందుచేత నాభాష కేవలము మూలభాషా రూపముననే నిలిచియుండుట యసంభవము. అయినను నది మూలభాషా సూత్రముల ననుసరించియే మార్పులను బొందుచుండును. ఈ విషయమై తెనుఁగునకు సంబంధించినంత మట్టుకు మఱియొకచోట వివరింపఁబడును.

తెనుఁగుశబ్దమునుగూర్చి విచారించునపుడు భరతవర్షమునకుఁ దూర్పు తీరమున వరుసగా నంగ, వంగ, కళింగ, తెలింగ, దేశములున్నవను విషయము గోచరింపక మానదు. కలింగయనగా నెత్తైన దేశము, తెలింగయనఁగాఁ బల్లపు దేశమనియుఁ గళింగ తెలింగములు వాస్తవముగ నొక్కటే దేశమనియు, గొందఱు చెప్పుదురు. కళింగాంధ్రములకు భాషయొక్కటియే యని కుహార్న పండితుఁ డభిప్రాయ పడియున్నాఁడు. కలింగదేశపు బౌద్ధగ్రంథముల భాషయు

ఆంధ్ర దేశమునకు సంబంధించిన బౌద్ధమత గ్రంథమగు అట్ఠకథలోని భాషయు నొక్కటియే యయియుండు టీయూహాకాధారము.

క, గు, ప్రత్యయములు సంస్కృతములోని క ప్రత్యయమునకుఁ బ్రాకృతభాషా వికారములని చెప్పుట కవకాశమున్నది. మాదిగ, గోసగి, ఒడంగి, కోణంగి, పడ్రంగి, మొదలగు శబ్దములలోని ప్రత్యయములు సంస్కృతములోని క, కి, ప్రత్యయ వికారములే. మధ్యపరగణాలలోని తేల్ నదీ ప్రాంతమునుండి వచ్చినవారగుటచే తెలుఁగులను నామము కలిగినదని కొందఱు చెప్పుదురు. తైలికశబ్దభవము తెలుఁగని కొందఱి యభిప్రాయము. తెలివిగల వారు కావున తెలుఁగులను పేరు గలిగినదని కొందఱందురు. తెల్ అను పదము సంస్కృతములోని ధవల, తృప్త, దృప్త మొదలగు శబ్దముల ప్రాకృతవికారము కావచ్చును. ఈ వ్యుత్పత్తులన్నియు నూహామాత్రములు. తెలుఁగుశబ్దము వ్యుత్పత్తినిగూర్చి ఇదమిత్థమని చెప్పుటకు నేటికిఁదగిన యాధారములు లభింపలేదని మాత్రముచెప్పి యింతటితో విరమింపవలసి యున్నది. ఈ విషయమై "జనపదేలుప్; తదశిష్యం సంజ్ఞాప్రమాణత్వాత్." "లుబ్యోగా-ప్రఖ్యానాత్" "యోగప్రమాణేచ తదభావేఽదర్శనంస్యాత్," "ప్రధాన ప్రత్యయార్థవచన మర్థస్యాన్య ప్రమాణత్వాత్," అను పాణినీయ వచనములను స్మరింపవలసియున్నది.

తెనుఁగు భాషకుఁ దమిళదేశమునందు వడుగ, బడగ, యను పేర్లున్నవి. పోర్చుగీసువారు తెనుఁగును బడగేస్ అని పిలుచుచుండిరి. జర్మనులు దానిని వరుగ యనిరి. ఐరోపియనులు తెనుఁగును జెంటూ భాషయని పిలుచుచుండిరి. ఈపదము పోర్చుగీసు శబ్దముగు జెంటియో, (అనఁగా మ్లేచ్ఛుఁడు, క్రైస్తవేతరుఁడు) అనుపదమునకు వికారము.

తెలుఁగునకు సంబంధించిన కొన్ని వికార రూపములనుగూర్చి యింతకుఁ ముందుఁ దెలుపఁబడినది. వానికీ క్రింది యుదాహరణములు లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా 4-వ సంపుటమునుండి తీసికొనఁబడినవి.

---

## కోంటావుభాష.

---

ఒక మనిషికి యిద్దఱు పిల్లగాండ్లు వుండిరి. వాండ్లో చిన్నవాడు తండ్రితో అంటాడు, "తండ్రి, యేదో మాలమతది నాకు వచ్చేవలది అది యివ్వు." వెనకవాఁడు పిల్లనికి ధనము పంచి ఇచ్చిండు. వెనక కొన్ని దెవసాలకు చిన్నపిల్లడు అంత సొమ్ము జేమాజేషి దూరదేశానకు పోయిండు

యింక అక్కడా అవిచారముతో నడ్చి తన సంపత్తు పాడుగొట్టినాడు. తర్వాతా వాఁడు అంతా వ్రెడ్చినంక ఆ దేశములో లావుకరువు బడది. అందుకు, వానికి కఠినము బడది; అప్పుడు వాఁడు దేశములో ఒక్కమనిషి దగ్గిర పోయి వున్నడు. వాడే తేను వాని పందులు కాపేకొరకు తన చేండ్లోకి తోల్లాడు. అప్పుడు పందులు తినేది పట్టుతో వాడు తన పొట్ట నింపుకోవలె అని వానికి అనిపించింది, యింకా యెవ్వరు వానికి యివ్వలేదు. తర్వాతావాఁడు తెల్వి మీదికివచ్చి అన్నాడు; మాతండ్రి యింట్లో యెందరు సవుకరలకు పుష్కళంగా అన్నం వున్నది, యింకా నేను ఆకలితో చేస్తా. నేను లేశి నా తండ్రి దిక్కుకు పొయ్యేను. వానితో అనెను, "ఓతండ్రి, నేను యీశ్వరుని విరుద్ధం నీముందర పాపం జేసినాను; యిక్కడినుంచి నీ కొడుకును అనేటందుకు నేను యోగ్యని కాను. నీ ఒక్క నౌకరివానివలె నన్ను వుంచు."

---

## కామాశీభాష.

---

వక్క మనశికి ఇద్దరు కొడుకులు ఉండుండ్రి. చిన్నోడు తండ్రికి అంటడు "అయ్యా, నా అంతుకు యేమి జిందగి అస్తది అది నాకు ఇయ్యానా." మరి తాను అది ఇద్దక్కి పంచి ఇచ్చిండు. తోడ్యం దినాల్లు కాలే, ఇంతట్లా చిన్నకొడుకు తనది అంత హిస్స జేనూచేసి దూరం దేశంకు యెల్లిపోఇండు. అడ అంత ముల్క మజోలా యగరకొట్టిండు. యప్పుడు అంత ముల్క యగర కొట్టింఁడు అప్పుడు ఆ ఊరల్యాకా పెద్దకాలం పడిండ్యా. అప్పుడు తనకు తిండికి మోఁతాదు ఆయా. మరలా ఆడు ఆ ఊరల్యా దండ్యోడు దగ్యారపోఇ ఉండ్యా. మరి ఆడు ఆడ్కి తన శ్చేనులా పందులు మేపతనకు తోలిండు. పందులు తినేటి పొట్టు తిని పొట్టనింప తనకు తాను కబుల్ ఆయా గని అది బీ యవ్వరు ఇయ్యారు. యప్పుడు ఆడు సుద్దిమిద అచ్చా. అప్పుడు మనసులా అనకుండ్యా, "నా అయ్యా ఇంట్లా యంతమంది నౌకిర్ చేశి సుకంగా పొట్ట నింపుకుంతరు, ఇంకా నేను ఇడ ఉపాసం సస్తా. నేను ఇప్పుడు లేశి నాతండ్రి దగ్యార పోతా. ఇంక నేను ఆడ్కి అనేను, "అయ్యా, మీదీ వ దేవరుదీ అపరాధీ ఉన్నాను. దానికోసంకి మీకొడకు అనపించే కునతందుకు లాయక్ కాను. నీవు నాకు నౌకరోడు మేరగా ఉంచే" అప్పుడు లేశి తండ్రి దగ్యర్కి పోయా. ఆడ్కి దూరంకెల్లి కొడకు రాంగా తండ్రి సూశా. ఇంక గోశావచ్చి తండ్రి ఉర్కి అల్కుకున్యా. ఇంక ఆడికి ముద్దిచేకున్యా. మరలా కొడుకు తండ్రికి చప్యా, "అయ్యా, నీ ముంగట నేను సామిది

...తం చేసినా. గందుగోసంకి ఇప్పుడు మీకొడుకు అనిపించేకుంతనకు నాకు ...గ్గ అస్తది." మరలా తండ్రి నౌకర్ గాల్లకు చప్యాకీ, "మంచిబట్టలు తెండ్రి. ఇంక ఈడకి తొడగిపియుండ్రి. ఈడిచేతికి ఉంగ్రం పెట్టుండ్రి, ఇంక కాల్లకు పావసాలు తొడకుంతనకు ఇయుండ్రి, ఇంక మనము తిని చేసి ఆనందము చేస్తము, కారణము ఈనా కొడుకు సచ్చి ఇండ్యా, ఆడు ఇపొద్దులేశి అచ్చిండు ; ఆడు కారి పోఇండ్యా, గని ఇపొద్దునాకు దొర్కిండు." మరలా అల్లు తా ఆనందము చెయ్య తలగిరి.

---

## దాసరీ భాష.

---

ఒక్కొడొక్కొడ్ మనిశికె ఇద్దర్ నుగపిలగాళ్లు ఉండ్లి. వాళ్లోన చిన్నాపిలగడు తన తండ్రికె అనె. "తండ్రీ, నీ బడకల్లోన నాకె పచ్చ్యట్టి పాల నాకె ఈ". తండ్రివాళ్లోన తన బదక పంచిఇచ్చె. చిన్నాపిలగడు తన పాల తిస్కొని దూరము నాట్కపొయ్యి, శినా వద్దల్ ఆవలేదు, అంతట్లోన వాడు శన ఖర్చ్శేశి తనబదకంతా పాడశేసె. నాడు ఇట్ల శేశిన మంట్క ఆదేశంలోన పెద్ద్ కరవపడి వానికి ప్యాదర్కం వచ్చె. వాడు ఆదేశంలోన ఒగ మనిశికి పక్క చేక్రి జేరే. ఈ మనిశి వాని పందిలి మేపడన్కి తన చేనక తోలే. ఆడా ఆకల్గోని కళవళికుటి పంది తినేట పట్టు సుదా తినె కడపు నింపకుతుండె, ఆతె వాన్కి యవల్నించి ఏమీ చికకుండె. ఇట్ల తోడెం వద్దల్ పాయె ; తన ఎనకటి జ్యాలమం నెప్పయ్యి వాడు తస మన్సల్లోన అనె, "నాతండ్రి పక్క ఉండేట చాక్రిమంద్కి కడపు నిండి ఎక్కొయిటంత ఇరివెము చికతడి. ఆతె ఈడా నానూత్రన్కి ఆకల్గోని తస్తా. నా లేని నా తండ్రి తక్క పొయ్యిఅనె, "తండ్రీ నా ద్యావర్ది కర్మం తండ్రీకర్మం కటొక్న్. నాను నీ పిలగడంటని అనిపిచకోగడ దాన్కి భాగలేమ. నన ఒగ చ్యాక్రి మనిశి తిరశీ నీ పక్క పెట్టకో, "వాడు ఆనించి లేసి తన తండ్రినాడికి వస్తె ఎడు తండ్రి దూరంనించి వాని తూసి అంతకరణం పుట్టి ఉర్తపొయ్యి పట్టొని ముద్దాడె. అప్పడ పిలగడు తండ్రికె అనె, "తండ్రీ న ద్యావరముందలా ని ముందలా తప్పశేస్న, నన నీపిలగనంట్ పిలవకు. "దీన్కి తండ్రి తన చాక్రిమంద్కి అనె, "మంచిది ఏశెంతెచ్చి నా పిలగన్కి తొడగుండి, ఏలు ...న ఉంగరం ఏయిండి, కాళ్లోన్న చ్యప్పలు ఏయిండి, తినిపిచిదన్కి తయార

శేవిచ్చుండి, మాము తిని సంతోసం ఆతం. ఏమంటె ఈ నా పిలగడు తచ్చిండె, తిరగా జీవవచ్చెని తప్పిచ కోనండె, చిక్కినడు." దీని ఇని అందర్కి బాగఆయె.

ఈ యాళాకు వాని పెద్దపిలగడు చ్యాన్లాఉండె. వాడు ఇంట్లిపక్క వచినప్డు వాన్కి పాడ ఎడ్డిచోలి బట్టెడ్డి ఇనవచ్చె. వాడు చాక్రొల్యోన ఒగనిపిల్చి, "ఏయ్‌నడచింది"? అంటా అడిగె. దాన్కివాడు, "నీ తమ్మ," వచినాడు ? వాడు బాగ వచ్చి పట్టే కారణమ్ నీతండ్రి తినిపిచినాడుడు అంటా చెప్పె. దీని ఇని వాని పెద్దపిలగడు కోపమెయ్యి నోన్కి పాకపాయె. దానించి వన తండ్రి బేల్కి వచ్చినోన్కి దాఅంటని వాన్కి శన చపకోని, దాన్కి వాడు తనతండ్రికె అనె, "నా ఇన్నోడ్డల్లాకా నీ చాక్రీశేసి ఎప్ప డూ నీమాట మీరలేదు. ఎయినగనీ నా గెణెకాళ్ళు కూడపకోని తినిపిచిడ దన్కి నివ్వు నాకు ఎప్పడూ ఒగమ్యాకునుదా ఈయక్‌పోతివి. అతె లంజెల్ కాల్ సోబతీ కూడి నీ జింజిగెంత మింగెనంత్ ఈ నీ పిలగడు ఇంటకూ వచిన మంట్కి నివ్వు వానించి తినిపిచినావు." తండ్రి పిలగన్కి అనె, "నివ్వు పగ లెల్లానా పక్కుంటావు. నాత ఉండడంత నీదె తచ్చిని నీతమ్మడు, మల్లా జీవంత డాసెని తప్పిచ్కి పోయినోడు చికినడు, అంటని మాము సంతోసం ఏడ్డి మంచిది. ఉండది.

## బేరాదీ భాష-1.

---

ఒకనికొకనికి గిరెస్తనక్ ఉద్రుపటి బిడ్లె ఉడ్రి. వర్దానాన్ సణ్ణే, కొడక్ తన్ ఐకె అండె, "అయ్యా, నీజిందిగినాన్ నాకివసన్ పాల్ ఈయి," అంటండె. అయి వర్దానాన్ తన్ బదక్ పంచిశిదె. సణ్ణే కొడక్ తన్ పాల్ చికోని దూర్ రాజనక్‌పోయి బాళ్ నాడ్లె అగ్గల్యా. హంత్నాన్ వాడు మందుకేశి తన్ బదుక్తెల్ హాళ్ కేశడి. వాడు హిళ్ళకేశడ్డినైని ఆదేసనాన్ పెద్ద్ బరపడి వనికె బడతక్ వశా. వాడు ఆ దేసనాన్ బకన్ బల్లి చాక్రి చ్చి. ఈ గిరెస్తి వాంత్ పందల్ మేబసగ్ తన్ సేనక్ అంపిశిడె. అంద్ నర గనుటి కళవళస్తి పంది తాగ్‌హంతాది పొట్టోసుద్దె తిని బళ్ళి నిప్పికోతుడతె. అగితేన్ వానికె యార్నుటి ఏమీాశిక్కగల్యా. హిళ్ళకొంత్ యాశేమపోయి ఎనక్ అగింది నెనపగి వాడు తన్ మనసనాన్ అండె, "మాయయ్యా హెంత్తోచాకర వర్కె బళ్ళి నిప్పి సాలగనంత్ అన్నం శిక్యాయి, అగి హింద్ నానటూా సగరి సస్తాన్. నాను లేశి మాఅయ్య బల్లి పోయి, అయ్యా, నా దేవరదు పాపం అయ్యోన్ పాపం కట్టికోడాన్. నాను నీ కొడక్

అనిపించుకోగ చలూ లేదు. నత్ బక్ అళ్కోడక్ కతె నీ బల్లి పెట్టో." అరటు అందుటి లేశి తన్ అయ్యా బల్లి వసినావడ్, అయ్యా వాంత్ దూర్నుటి సూది పిరితివళి పారిపోయి పటికోని ముద్దిశిడి. అవడ్ కొడక్ అయ్యాక్ అండె, "అయ్యా, నాను దేవర్ బల్లి నీ బల్లి తప్పు కేశుడతె. నత్ నీ కొడక్ అంట 'బడరొద్ద్". దినికె అయ్యి తక్ చాకరికె అండె, "చలు పోశాక్ తెశి నా కొడక్కు వెడస్, బొట్టనాక్ ఉంగరం యయ్యి, కాలాన్ శెప్పల్ వెడస్, ఊటమ్ తయారం కేబ్స్. నాము తగి సంతోసగదమ్. యాలం టేక్ ఈ నన్ కొడక్ సశుడ్డె, మర్కాళి జీమగడాడ్? తెపిసికోడాడు, శిక్కిడి" దీత ఆలిసి ఎల్లారు సంతోసం అగిరి.

ఈ యాలేమ వన్ పెద్ద్ కొడక్ శేనాన్ ఉద్ది. వాడు గుడస్ బల్లి వశినావడ్ వానికి పాట్లా కుక్ సందా ఇనివశ్యా. వాడు ఆ చాకరినాన్ బకంత్ బదరి, "ఇదేమ్ అగ్గడాయి"? దాత్ అడిగితి. దానికె వాడు అండె, "నీ తమ్మడ్ బస్ డాడ్. వాడా చలూనాన్ ముట్టిందికారణనూ మీా యయ్యి ఊటమ్ కేబస్ డాడ్", అంట్ శెప్పిడి. దీత్ అడిగి ఆ పెద్ద్ కొడక్ శిట్ట్ కేశి నొనికె పోకయిడి. దన్నుటి వారయ్యి ఎలికివశి, "నొనికెదా," అంట్ వానికె బాళం శెప్పికోడి. దానికె వాడా తన్ ఐకె అండె, "నా ఇన్ని వరసల్ తన్కానీ చాకరి కేశి యండూా నీ మాత్ మీార్కగతి. ఇంతూానాను నా గెణేలు కూడికొని ఊటమ్ కేబసగ్ నివ్వు ఎండూనాకె బక్కమక్ సుద్దె ఇన కగతి కాదు. అగితేన్ సూళిగార్ సోబతి పట్టి నీ బదుక్ తెల్ల నుంగినంటా ఈ నీ కొడక్ గుడస్కవశిక్ బారక్ నివ్వువాన్ కడిశింద్ ఊటమ్ కే బస్డ్.' అయ్యి కొడక్ అండె, "నివ్వుపోగ తెల్లా నా హింమాల్ ఉడతావు. నా బల్లి ఉణ్ణిదెల్లా నీదే. సశిన్వాడ్ నీతమ్మడ్, తిరిగి జీమగడాడ్? తెపినుకోని పోని వాడ్, శిక్కాడ్, అంట్ నాము సంతోస్ అగతెమె పాడు ఉడాయి."

---

## పేరాది. 2.

## చండుకోలాట్.

రంగంత్ హుడిగేడ్ గోవిందనక్ శపకాడ్, "గోవిందా, రేవు ఆవక్కె ఉసల్ బైల్నాన్ చండుకోలాట్-ఆడగ్ బాళం హుడిగేల్ పోడార్. నాను ఆకడెగె. పోతాను. నివ్వు వస్తావు కాద్?"

గోవింద్:—"హూాంద్, అగితేన్ మాయవ్వ గుడసాన్ లేదు. దాన్ అపణి ల్యాక్ హెళ్ళి బత్తు? అది గడసక్ వశిన్ బళక్ నాను అడిగి ఒస్తాన్. అవ్వ ఎలికె పోనావళ్, "గుడస్ తిడిసి వక్కడూా పోవద్ద్" అంట్ నాకె అపణి కేసడాయి."

రంగ్:— మీా యవ్వ్ యాతక్ బస్తా [illegible] సాక్షక్. అంద్ ఆట్ ఒళెబార [illegible] చేంయదు? నాను అవడ్ [illegible] అగితెక [illegible] పక్ ఒదర్" అంటు నివ్వు మున్నా [illegible] బదలగ్. ఒస్తి? నీకి ఒసంద్ మవసా ల్యాకు [illegible] పోతాను."

గోవింద్:—"రంగా, నివ్వు హిళ్ళ్కె సంద్ [illegible]? ఖరా నిచ్, మా యవ్వ ఇవ్వు ఒసక్."

రంగ్:—"మీా యవ్వ్ ఎంద్ పాడాయి?"

గోవింద్:—"మా సినవ్వ్ కూత్ర మెయనాన్ చలూలేదు? దాన్ [illegible] డస్ పోడాయి."

రంగ్:—"హళ్లగితేన్ ఆదేమ్ లగ్గ్ ఒస్తాయి? అందునాల్ గళగలా కుప ర్భడి, దక్ పైని వసక్? దన్నుటి నివ్వు కుసర్భడు, నాను పోతాను. ఈపొద్ద్ ఆట్ ఒళె చమత్ అగతాయి."

---

# ఆర్య భాషలు.

---

### 1. ఇండో యూరోపియను భాష లీ క్రిందివిధముగ పాశ్చాత్య పండితులచే విభజింపఁ బడియున్నవి.

1. ఇండో ఐరేనియను శాఖ.
2. ఆర్మేనిక్ శాఖ.
3. బాల్టిక్ - స్లావిక్ శాఖ.
4. ఆల్బేనియన్ శాఖ.
5. హెల్లెనిక్ శాఖ.
6. ఇటాలిక్ శాఖ.
7. కెల్టిక్ శాఖ.
8. జర్మానిక్ లేక ట్యూటానిక్ శాఖ.

ఈ శాఖలలో మొదటిదగు ఇండో - ఐరేనియను లేక ఆర్య శాఖకు సంబంధించిన భాషలు మనకు ముఖ్యములైనవి. ద్రావిడభాష ఆర్యభాషలతో సంబం[illegible] ప్రాయము విమర్శింపవలసియున్నది కావున వానిని గూర్చి [illegible] యావశ్యకమగుచున్నది.

## 2. ఆర్యభాషల శాఖోపశాఖల నీ క్రిందివిధముగాఁ బండితులు నిరూపించి యున్నారు.

i. ఇండికు, ఇండియను, లేక ఇండో - ఆర్యభాషలు:—వేదభాష, సంస్కృతము, ప్రాచీన ప్రాకృత శాసనములలోని ప్రాకృతభాషలు, పాలి, పూర్వవాఙ్మయ గ్రథితములైన ప్రాకృతభాషలు, అపభ్రంశభాషలు, నేటి యార్యభాషలు, ఎళు, లేక, ప్రాచీన సింహళభాష, ఆధునిక సింహళభాష, ఆర్మీనియా, సిరియా, తుర్కీ, యూరోపు దేశములలోని జిప్సీభాషలు, ఈ వర్గములలో చేరినవి.

ii. దర్దికు, లేక పిశాచభాషలు, (అ) కాఫిర్-బాష్గలి, వై-గలా; వసీ-వెరి, లేక, ప్రేసున్; కలష, గవర్బతీ; పష్షై. (ఆ) ఖో-వార్, లేక, చిత్రాలీ. (ఇ) షిణ; కోహిస్తాని, కాశ్మీరీ; -యనుభాష లీ వర్గములోనివి.

iii. ఐరేనియను భాషలు; ఇవి యీ క్రిందిపట్టికలో చూపఁబడినవి.

3. దర్దికుభాష లిండో-ఆర్యవర్గమునకుఁ జెందని శాఖలై యివి పైశాచీభాష లగుటచే ద్రావిడభాషాచరిత్ర సందర్భమున వీనిని స్మరింపక తప్పదు. ఇవి కాశ్మీర దేశమునందును, కాశ్మీరమునకు ఉత్తర, వాయవ్య భాగములందనగా దర్దిస్థానము, చిత్రాల్, కాఫిరిస్థానములందు వాడుకలో నున్నవి. ఈభాషల మూలము ఇండో-ఆర్యభాషలగు లహండి, సింధీ, మున్నగుభాషలు కొంత వికారమును పొందినవి. ఈ భాషల నిప్పుడిరువదిలక్షల జనులుమాత్రము మాట్లాడుచున్నారు. అందు కాశ్మీర భాషను మాట్లాడువారి సంఖ్యయే పదలక్షలున్నది. కాశ్మీరీభాష దప్ప మిక్కిన దర్దికు భాషలందు వాఙ్మయములేదు. పందొమ్మిదవ శతాబ్దము వఱకునుగూడ నీభాషలు లిఖితరూపము నొందలేదు. కావున నీ భాషల ప్రాచీనరూపము దెలిసికొన వీలుకాకున్నది. ప్రాచీనకాలమునుండియు రాజకీయవిషయము లందును విజ్ఞానవిషయమునను కాశ్మీరమునకును నార్యప్రదేశములకును పరస్పర సంబంధమున్నది. కాని మిక్కిన దర్దికుభాషలుగల ప్రదేశములు పర్వతాక్రాంతములయి, చేర వీలులేకుండుటచే నందలి వారి భాషలు సంస్కృతముతోడను ప్రాకృతభాషలతోడను సంబంధము లేక నిలిచినవి. ప్రాచీన కాశ్మీరభాషయందు గ్రంథములు వెలువడినవి. గుణాఢ్యుఁడు రచించిన బృహత్కథ ప్రాచీన కాశ్మీరీభాషయందు రచింపఁబడిన దేమోయని యొకరూహించుచున్నారు. ఈగ్రంథ మాంధ్రరాజగు శాతవాహనుని యాస్థానమున వెలువడినదను ప్రతీతి యుండుటచే నీ యూహ సరియైనదిగాఁ దోఁపదు.

ఇండో - ఐరేనియను.
(ఆర్యభాషలు)
ఐరేనియను.
దర్దికు.
ఇండికు.
పెర్సికువర్గము.
అవస్తికు.
సిధికువర్గము.
తూర్పు ఐరేనియను
ప్రాచీన పెర్షియను.
?
?
సోగ్దియను
మధ్యకాలపు పెర్షియను (పహ్లావి.)
కేల్డియో పహ్లావి.
ఓసెటికు
యఘ్నోబి
ఘల్చభాషలు
కుర్దు భాషలు.
ఆధునిక పెర్షియను.
ఉత్తర, మధ్యపెర్షియను భాషలు.
ఆర్మూరీ బుర్గిస్తా.
పష్టో.
బలూచీ.

4. పైశాచ భాషలనుగూర్చి యెక్కువగా డాక్టరు గ్రియర్సన్‌గారు పరిశోధనములు గావించిరి. వారి యభిప్రాయములు "పైశాచ లాంగ్వేజెస్ ఆఫ్ నార్త్ వెస్టెర్న్ ఇండియా" (The Pisaca Languages of North-Western India) అను గ్రంథమున వివరింపఁబడియున్నవి. వాని సారాంశముమాత్ర మీక్రింద నీయఁబడినది.

రషియా దేశమునకు దక్షిణముననున్న మైదానములలో నిండో-యూరోపియను భాషలను మాట్లాడువారి పూర్వికు లార్యులనుండి విడఁబడిన ప్రదేశము 'ఖివ' యను పచ్చిక బయలని పరిశోధకులు విశ్వసించుచున్నారు. ఇచ్చట ఐరేనియనులకును, ఇండో-ఆర్యులకును పూర్వికులగు జాతివా రార్యభాషయను నొకభాషను చరిత్రకాలమునకుఁ బూర్వము మాట్లాడుచుండిరి. వా రక్కడనుండి బయలువెడలి, ఆక్సను, జక్సార్టెసు నదులమార్గము ననుసరించి ఖోఖందు, బదక్షను మీభూములఁ జేరిరి. అచ్చట వారిలోఁ గొందఱు తక్కినవారినుండి విడఁబడి, దక్షిణమార్గమును బట్టి, హిందూకుష్పర్వతముల సానువులమీదుగాఁ గాబూలు నదీప్రదేశమును జొచ్చిరి. అటనుండి వారు ఇండియా దేశపు మైదానములలోనికి వ్యాపించిరి. వీరే నేఁటి ఇండో - ఆర్యుల పూర్వికులు. ఆ కాలమున వారికి సామాన్యమగు నార్యభాషయం దగపడని ప్రత్యేక లక్షణములుండెను. కాలక్రమమున నవి నేఁటి ఇండో - ఆర్యభాషా లక్షణములుగఁ బరిణమించెను.

హిందూకుష్పర్వతముల కుత్తరమున నిలిచిపోయి, కాబూలునదీ ప్రాంతములకు వలసపోవని యార్యులు తూర్పునకును పడమటికిని వ్యాపించిరి. తూర్పునకుఁ బోయినవారు పామీరు పర్వతముల నాక్రమించిరి. వీ రిప్పుడు ఘల్చా భాషలను మాట్లాడుచున్నారు. పశ్చిమముగఁ బోయినవారు మెర్వ్, పెర్షియా, బెలూచిస్థానముల నాక్రమించిరి. నేఁడు వారి సంతతివారు ఘల్చా భాషలతో సంబంధించిన ఐరేనియను భాషలను మాట్లాడుచున్నారు. వీరు విడిపోవుచు, ఇండియావారికను బయలుదేరకప్పు డార్యులందఱు నొక్కటే భాషను మాట్లాడుచుండిరి. కాని ఐరేనియనులభాష తరువాతికాలమున వేరు మార్గమున పరిణామము నొందెను. కావుననే పామీరు పర్వతములందును పెర్షియాదేశమునందును మాట్లాడు భాషలకును, ఇండియాదేశపు ఆర్యభాషలకును జాల వ్యత్యాసము గలిగినది. ఐరేనియను భాషలు ప్రాచీనార్యభాషనుండి భిన్నగఁ బరిణమించినవిగను, ఇండో-ఆర్యభాషలు దానినుండి విడఁబడి ప్రత్యేక పరిణామము నొందిన శాఖగను తలంపవచ్చును.

ఈ దర్దికు, లేక పిశాచ భాషలకుఁ జాల ప్రత్యేక లక్షణములున్నవి. కొన్ని విషయములం దవి ఇండో - ఆర్యభాషలను బోలియున్నవి. తకారము

రేఫముగను, త్మ యను సంయుక్తాక్షరము తకారముగను మాఱుటయు, సంయుక్తాక్షరము దాని సంయుక్తకను భాషింపబడక దాని వెనుకనున్న హ్రస్వచ్చు ఉన్నట్లే నిలచి యుండుటయు వాని ప్రత్యేక లక్షణములలోఁ జేరినవి. ఐరేనియను భాషలలో 'స్మ' యనునది 'హ్మ' గ మాఱఁగా నార్యభాషలయందు 'స్మ' గానే నిలచిపోయినది. పైశాచభాషలు ఐరేనియను భాషయొక్కగాని ఇండో-ఆర్యభాషల యొక్కగాని సంపూర్ణ లక్షణములు లేవు. కావున నవి ప్రాచీనార్య భాషనుండి విడఁబడినాటికి ఇండో-ఆర్యభాషలు ప్రత్యేకముగ విడియుండలేదనియు, ప్రాచీనార్యభాష యప్పటికే నైరేనియను భాషామార్గమునఁ బరిణామమును నొందెనప్పటికిఁ గాని యా పరిణామము నైరేనియను భాషాలక్షణములన్నియుఁ గలుగు నంతవఱకుఁ జరుగలేదనియు నిండో-ఆర్యులు కాబూలు నదీ ప్రాంతములను బయలుదేరకప్పుడుండిన భాషాలక్షణములలోఁ గొన్నిటిని నిలుపుకొని యుండెననియు నూహింపవలసి యున్నది. అనఁగాఁ దొల్లింటి యార్యభాషనుండి ఇండో-ఆర్యభాషలు తొలుత విడిపడెను. మఱి కొంతకాలమునకు పైశాచభాషలు ప్రత్యేకమైనవి. ఆ పిమ్మట నార్యభాషయే తిన్నగఁ బరిణామము నొందుచు నైరేనియను భాషయైనది.

ఇండో-ఆర్యులు హిందూకుష్పర్వతములను పడమటి కనుమలద్వారా దాఁటిరి. కాబూలు నదీమార్గమున వారిండియాలోనికిఁ బ్రవేశించునప్పుడిప్పటి చిత్రాల్, గిల్గిత్ అను దేశములు, అనఁగా దర్దిస్థానము వారికెడమ ప్రక్కనుండెను. హిందుకుష్పర్వతముల మీఁదుగఁ జిత్రాలు దేశమునకు దిగి నుత్తరమున పామీరు పర్వతము లున్నవి. ఈ ప్రాంతమునందే ఘల్చా భాషలున్నవి. దర్దిక్ భాషలున్న ఐరేనియను లక్షణములన్నియు ఘల్చా భాషలను గలవు. ఈ ఐరేనియను ఘల్చా భాషలను ఇండో-ఆర్యభాషలను సమానములగు లక్షణములు కొన్ని ఐరేనియను భాషయందు గానరావు, కావున దర్దిక్ జాతులవారి పూర్వికులు 'దోర' మొదలగు కనుమలద్వారా నేటి తమ వాసస్థానమునఁ జేరిరని యూహింపవలసి యున్నది.

ఇట్లు దర్దిక్ జాతులవారు నేటి తమ పర్వత వాసస్థానమును జేరిన తఱువాత వారిభాష సొంత మార్గమున మాఱుచు నిండో-ఆర్య, ఐరేనియను భాషలకు విలక్షణమైన రూపమును బొందెను. వారిదేశము పర్వతాక్రాంతమై ఫలవంతము కాకపోవుటచే దానినెవ్వరును జయింపకయుండిరి. క్రీస్తుపూర్వము 327 వ సంవత్సరమున నలెగ్జాండరు, క్రీస్తుశకము 1398 వ సంవత్సరమున తైమూరును తమసైన్యములతో నీదేశము మీఁదుగ నిండియాకుఁ బోయినప్పుడు తప్ప మఱి యెవ్వరును వీరిజోలికి పోయినవారు లేకుండిరి. ఇండియా దేశములోని ప్రాకృతభాషలు శీఘ్రముగ మాఱుచుఁ గ్రొత్త

రూపములను బొందుచుండఁ బైశాచీభాష తన లక్షణముల వీడకుండుట యాశ్చర్యకరముగ నున్నది. వేదములలోఁ దప్ప నిండియాదేశములో మఱి యెచ్చటను గానరాని కొన్నిశబ్దములు నేఁటి పైశాచీ భాషలయందు చెక్కు-చెదరక నిలిచి యున్నవి.

పిశాచజాతులవారు సింధునదీమార్గమున నేఁటి సింధుదేశము వఱకును వ్యాపించినట్లు తెలియు చున్నది. అశోకచక్రవర్తి వ్రాయించిన శిలా శాసనము లాయాప్రాంతముల వ్యవహారమునందున్న భాషయందున్నవి. నేఁటి యూసుఫ్‌జాయి దేశమునందలి షాబాజుగఢీ యొద్దనున్న యశోకుని శాసనములందలి భాష పైశాచీభాషా రూపమును బ్రకటించు చున్నది.

5. ఇక నిండియాదేశమును బ్రవేశించిన ఇండో-ఆర్యభాషల చరిత్రమును గమనింతము. ఈభాషాస్వరూపము మనకు వేదములనుండి స్పష్టపడు చున్నది. వేదమంత్రములన్నియు నొక్క-చో ప్రదేశమున రచింపఁ బడినవి కావు. ఆఫ్ఘనిస్థానమునుండి యమునానదీ తీరమువఱకును గల ప్రదేశము నందవి రచింపఁ బడుచు వచ్చినవని పరిశోధకుల యభిప్రాయము.

ఆర్యులందఱు నొక్క-సారిగ భరతవర్షమునఁ బ్రవేశింపక తెరతెరలుగా వచ్చినట్లు తెలియుచున్నది. వీరిలో మధ్యదేశమునందలి యార్యులు వింధ్య పర్వతమువఱకును వ్యాపించిరి. ఈ మధ్యదేశమునందలి యార్యభాషలన్నియు నొక్క-టే లక్షణమును గలిగి యున్నవి. ఈ మధ్యదేశము చుట్టును మఱికొన్ని ప్రాకృతభాష లావరించుకొని యున్నవి. మధ్యదేశ భాషలకును వానిని చుట్టుకొనియున్న భాషలకును కొన్నిముఖ్యములగు భేదము లున్నవి మధ్యదేశభాషలయందు శషస లు, సకారముగా మాఱినవి. చుట్టునున్న భాషలను మాట్లాడువారు సకారమును బలుకలేరు. సకార మీ భాషలలోఁ గొన్నిటియందు షకారముగను, గొన్నిటియందు హకారముగను మాఱినవి. మధ్యదేశీయభాషలలో సంస్కృతములోని సుప్పులు లోపించి, ఆ ప్రత్యయముల స్థానమున వేరుశబ్దములే యుపయోగింపఁ బడుచున్నవి. ఈ శబ్దములు తమప్రత్యేక శబ్దత్వమును విడనాడి కేవల ప్రత్యయములుగ మాఱలేదు. చుట్టునున్న భాషలయందుగూడ నిట్లే సుప్ప్రత్యయములు లోపించి, వాని స్థానమునఁ బ్రత్యేకశబ్దములు వాడుకలోనికి వచ్చినను, ఆశబ్దములు తిరిగి ప్రత్యయములుగఁ బరిణమించుట సంభవించినది.

తిఙ్ విషయమునగూడ నీరెండు వర్గముల భాషలకును ముఖ్యము లయిన భేదములు గలవు. ప్రాచీన సంస్కృతములోని లఙ్ రూపములు లోపించినవి. సాధారణముగ క్రియల లడ్రూపములు వేర్వేరుభాషలయం దర్థభేదమును బొందినను నిలచియున్నవి. పూర్వకాలపు లుట్ లృట్ రూపములు

కొన్నికొన్ని భాషలయందు మాత్రము మిగిలినవి. 'భవిష్యతి' అనుటకుఁ గొన్ని భాషలలో 'భవితవ్యం' అను రూపము రూఢిగ నిలిచినది. అట్లె 'అగచ్ఛత్' అను లజ్ రూపమునకు బదులు 'గతః' అను రూపమే వాడుకలోనికి వచ్చినది. 'అహం అగచ్ఛం' అనుటకు బదులు 'మయాగతం' అని వాడవచ్చును. అప్పుడు 'గతం' అనుదానితో నెట్టి తృతీయారూపమును వాడినను అదిమాత్రము మాఱదు. 'తేనగతం' 'తయాగతం' 'జనైర్గతం' అని యీరీతిగా వాడుకొనవచ్చును. లేదా 'మే' మొదలగు ప్రత్యయములనైన నీసందర్భమున వాడుకొనవచ్చును. ఇట్టి ప్రత్యయములు పూర్వశబ్దములతో సమసించి ప్రత్యేకింప వీలులేక యుండును. అందుచేత మూఁడు పురుషములందును వేర్వేరు క్రియారూపము లేర్పడును. మధ్యదేశీయ ప్రాకృతభాషలలోఁ గ్రియారూపములకు మాఱుగ క్రియాజన్యవిశేషణములే మూఁడు పురుషములందును నెట్టిమార్పులును లేక వాడబడుచుండ వానికి చుట్టునుండు ప్రాకృతభాషలలో పురుషమునుబట్టియు వచనమునుబట్టియుఁ గ్రియారూపములు మాఱుచుండును.

ఈ లక్షణభేదముల ననుసరించి ఉత్తరహిందూస్థానభాష లీ క్రింది రీతిగా వర్గీకరింపఁ బడినవి.

(అ) బయటి అంతశ్శాఖ.

### I. వాయవ్య వర్గము.

1. లహందా
2. సింధి.

### II. దాక్షిణాత్య వర్గము.

3. మరాఠీ

### III. ప్రాచ్యవర్గము.

4. ఒడియా
5. బిహారీ
6. బంగాలీ
7. అస్సామీ

(ఆ) మధ్యాంతశ్శాఖ.

### IV. మధ్యదేశీయ వర్గము.

8. పూర్వహిందీ

(ఇ) లోపలి యంతశ్శాఖ.

V. మధ్య వర్గము.

9. పడమటి హిందీ
10. పంజాబీ
11. గుజేరాతీ
12. భీలీ
13. ఖాన్ దేశీ
14. రాజస్థానీ

VI. పహాడీ వర్గము.

15. తూర్పు పహాడీ లేక నైపాలీ
16. మధ్యపహాడీ
17. పడమటి పహాడీ.

6. ఋగ్వేదభాష వాడుకభాషగా నుండెను. అదియును దానికిసంబంధించిన తక్కిన వాడుకభాషలును బరిణామము నొందుచువచ్చెను. అందొకటి సంస్కృతభాషగ వైయాకరణులచే స్థిరత్వమునొందెను. తక్కినభాషలు మాఱుచునేయుండెను. ఆభాషలు ప్రాకృతమనుపేర వ్యవహరింపఁబడుచుండెను. వైదికప్రాకృతములకు, ప్రాథమిక ప్రాకృతములనియు, వీనినుండి తఱువాత నేర్పడిన ప్రాకృతములకు ద్వైతీయ ప్రాకృతములనియు, వానినుండి పరిణమించిన నేటి యార్యభాషలకుఁ దార్తీయ ప్రాకృతములనియు సంజ్ఞలను పరిశోధకు లిచ్చియున్నారు. ప్రాథమిక ప్రాకృతములందు సుప్తిఙ్ విధానము సంపూర్ణముగనుండెను. ఉచ్చారణకాఠిన్యముగల సంయుక్తాక్షరములు ప్రచారములోనుండెను. ద్వైతీయావస్థలో సుప్తిఙ్విధానము నిలిచియున్నను ఐ ఔలును కఠినసంయుక్తాక్షరములును లోపించినవి. పదమధ్యములందు హల్లులే లోపించి కేవలమచ్చులే నిలిచియుండుట సంభవించినది. ఇందువలన తార్తీయావస్థయం దీయచ్చులు కలిసి వేఱురూపములను బొందుటయో, వానిమధ్యమునఁ గ్రొత్తహల్లులు చేరుటయో సంభవించెను. సుప్తిఙ్ ప్రత్యయములు లోపించినవి. క్రొత్తసంయుక్తాక్షరము లేర్పడినవి.

పాలిభాష ద్వైతీయావస్థకుఁ జెందినది. బౌద్ధమతగ్రంథము లీభాషయందు వ్రాయఁబడినవి. ఈభాష గ్రాంథికము కాఁగానే స్థిరరూపమును బొందెను. కాని వ్యావహారిక ప్రాకృతము లింకను మాఱుచునే వచ్చెను. ఈ ప్రాకృతములుకూడ కొలఁదికాలములో గ్రంథస్థములయ్యెను. కాని పండితుల చేతుల్లలోఁబడి యీప్రాకృతములు సంస్కారమునుబొంద నారంభిం

చెను. కావున గ్రంథస్థ ప్రాకృతము లెంతవఱకు వ్యవహారరూపక భాష కుదాహరణములోఁ జెప్పవీలులేదు. కాని అశోకుని శాసనములవలనను నితరాధారములవలనను నీప్రాకృతములందు ప్రాచ్యప్రతీచ్య భేదములు రెండుండెనని చెప్పనగును శౌరసేనీభాష ప్రతీచ్యప్రాకృతము. మాగధీభాష ప్రాచ్యప్రాకృతము. ఈ రెండిటికిని మధ్యమున నుభయలక్షణసహితయయిన యర్ధమాగధీభాష యొకటియుండెను. జైనమతకర్తయగు మహావీరుఁ డుపయోగించిన భాష యిదియే. జైనగ్రంథము లీభాషయందే వ్రాయఁబడియున్నవి. ఈ యర్ధమాగధీభాషకు సంబంధించి ప్రతీచ్యభాషాలక్షణములకంటె ప్రాచ్యభాషాలక్షణములనే యెక్కువగాఁ గలిగియుండినభాష మాహారాష్ట్రీభాష. ప్రాకృతకవిత్వ మీభాషలో నెక్కువగ వెలువడినది.

సంస్కృతము వైయాకరణుల మూలమున స్థిరపడినట్లే, ప్రాకృతములు గూడ గ్రంథస్థములును లక్షణసిబద్ధములునై స్థిరత్వమునుబొందెను. కాని, వ్యావహారిక ప్రాకృతములు పరిణామము నొందుచునే యుండెను. ఈ ప్రాకృతములందాయా దేశముల శబ్దజాలము చేరుచు దేశ్యపదములసంఖ్య నానాఁటికిని ప్రాకృతములందు హెచ్చు కాఁజొచ్చెను ఈరీతిగఁ గొన్ని యపభ్రంశభాష లేర్పడెను. ఈ భాషలలో నాగరాపభ్రంశమను భాషయందు గ్రంథములు వెలువడజొచ్చెను. ఇట్లపభ్రంశభాషలయందే గ్రాంథిక వ్యావహారిక భేదములుకలిగెను. వ్యావహారికాపభ్రంశములు మాఱుచు వేర్వేఱు ప్రాకృతములుగ నేర్పడెను. సింధునదీ దక్షిణప్రాంతముల వాడుకలోనుండిన యపభ్రంశమునకు 'వ్రాచడ'మని పేరు. దీనినుండియే నేఁటి సింధీ, లహందా భాషలు పుట్టినవి. వీనితోఁ బైశాచభాషాసంపర్కముగూడఁ గలిగెను. నర్మదానదికి దక్షిణమున నరేబయాసముద్రమునుండి యొరిస్సావఱకును వైదర్భ లేక దాక్షిణాత్యాపభ్రంశభాష యుండెను ఈ దేశమునకు మహారాష్ట్రమని పేరు. ఈ దేశమందలి యపభ్రంశమును నితరాపభ్రంశమును నేఁటి మరాఠీభాషకు మూలములు దాక్షిణాత్యాపభ్రంశమునకుఁ దూర్పుగ బంగాళాఖాతమువఱకును నౌత్కల లేక యౌఢ్రాపభ్రంశముండెను. దాని నుండియే నేఁటి ఒటియాభాష జనించినది. ఔఢ్రభాష కుత్తరముగ కాశీవఱకును మగధాపభ్రంశముండెను. దీనినుండియే నేఁటి బిహారీభాష పుట్టినది. బిహారీభాషాంతర్భేదమైన 'మగహా'భాష పూర్వపు మాగధీభాషను స్మరింపఁ జేయుచున్నది. మాగధీభాషకుఁ దూర్పుగఁ బ్రాచ్యాపభ్రంశముండెను. ఇది నేఁటి బంగాలీభాషకు మూలము. ఈభాషయే యుత్తరముగ వ్యాపించి నేఁటి యస్సామీభాషగాఁ బరిణమించినది. అర్ధమాగధికి సంబంధించిన యపభ్రంశమునుండి నేఁటి తూర్పుహిందీభాష కలిగినది. ఇంతకుముందు పేర్కొనిన

నాగరాపభ్రంశమునుండి గుజరాతీభాష యేర్పడినది. ఈ యపభ్రంశభాషయే యింకను వ్యాపించి శౌరసేనాపభ్రంశముగఁ బరిణమించి నేఁటి పశ్చిమ హిందీ భాష యయినది. దీనితో సంబంధించిన దే 'టాక్క' యను నపభ్రంశమును నుప-నాగరాపభ్రంశమును నయియున్నవి. ఇవి పంజాబుదేశములోని మాండలిక భాషలకు మాతృకలయినవి. ఆవంత్యాపభ్రంశము దీనివికారమే. దీనినుండియే నేఁటి రాజస్థానీభాష కలిగినది.

ఇఁక నుత్తరదేశీయ భాషావర్గమునకు సంబంధించిన ప్రాకృతాపభ్రంశ భాషలు పేర్కొనఁదగిన వెవ్వియు లేవు. ఇక్కడి జనుల పూర్వికులు టిబెటో-బర్మను జాతులవారు. వీరికిని నార్యజాతులవారికిని సమ్మేళనము కలిగెను. అటుపిమ్మట పిశాచ లేక దర్దికు జాతులవా రాదేశమునఁ బ్రవేశించిరి. మధ్యాసియానుండి గూర్జరులొక యార్యభాషతోఁ బ్రవేశించిరి. అటుపిమ్మట రాజపుత్రస్థానమునుండి కొందఱందు చేరిరి. కావున నిచ్చటి భాషలు మిక్కిలి సంకరములై యుండుట సంభవించినది. రాజపుత్రస్థానమునుండి వచ్చినవారి భాషాలక్షణము లెక్కువగా నుండుటచే నిచ్చటి భాష కావంత్యాపభ్రంశము మూలమని చెప్పవచ్చును.

పైని వివరించిన ప్రాకృతభాషలయొక్కయు నేఁడార్యభాషలుగా గ్రహింపఁబడుచున్న వానియొక్కయు సంబంధ మీప్రక్కపట్టికయందు చూపఁబడినది.

## ద్రావిడభాషలు.

---

దక్షిణ యిండియా దేశమందలి ముఖ్యభాషలన్నియు ద్రావిడభాషా కుటుంబమునఁ జేరినవి. ఈ భాషలను మాట్లాడువారిసంఖ్య యించుమించు 570 లక్షలు.

ద్రవిడమనునది సంస్కృతపదమనియు దానినుండి ద్రమిడ, తిరమిడ, ద్రమిళ, దమిళ, తమిఴ్, తమిళ్, శబ్దములు పుట్టినవనియుఁ గొందఱభిప్రాయ పడుచున్నారు. మఱికొందఱు పాలిభాషయందు వ్రాయబడిన మహావంశమను గ్రంథమునందు దమిళశబ్దము కాన్పించుటచేఁ దానిని సంస్కృతీకరించి ద్రమిళ, ద్రవిడ శబ్దములుగా మార్చిరనియుఁ దమిళశబ్దమునుండియే తమిళము అను పదము కలిగినది కాని యది ద్రవిడశబ్దభవము కాదనియుఁ దెలుపుచున్నారు. ప్రాకృతవాఙ్మయమున దమిళ, దవిడ, యనురూపములు గాన్పించుచున్నను, దమిళయనునదే యతిప్రాచీనరూపము. దమిళ, దవిడ శబ్దములే ద్రమిల, ద్రమిడ, ద్రవిడ యను రూపములను దాల్చియుండునని వీరి

యభిప్రాయము. భాగవతపురాణమున ద్రమిళశబ్దము వాడబడియున్నది. వరాహమిహిరుఁడు బృహత్సంహితయందు ద్రమిడశబ్దమును వాడియున్నాఁడు, ప్రాచీన మళయాళభాషలో రచింపఁబడిన పురాణములందును మహాకూటమునొద్ద మంగళేశుఁడనురాజు స్థాపించిన శిలాశాసనమునందును (597-608), ద్రమిళశబ్దము కాన్పించుచున్నది. గ్రీకుచరిత్రకారుల గ్రంథములలో దరిమిచె, దమిరిచ యను రూపములు కానవచ్చుచున్నవి.

ఈ క్రిందివి ద్రావిడభాషలుగ నేఁ డెంచఁబడుచున్నవి. 1 తమిళము 2 మళయాళము 3 తుళు 4 కొడగు 5 తోద 6 కోత 7 కన్నడము 8 కురుఖు 8 మల్తొ 10 గోండి 11 కుఇ 12 కోలామి 13 తెలుఁగు 14 బ్రాహూఇ. ఇవిగాక మఱికొన్ని చిన్నమాండలికభాషలును ద్రావిడభాషావర్గములోఁ జేరినవి. ఈ భాషల పరస్పరసంబంధము ప్రక్కపుటలో నివ్వఁబడినది.

ద్రవిడశబ్దము జాతిపరముగ మనుస్మృతియందును, వరాహమిహిరుని బృహజ్జాతకమునందును, మహాభారతమునందును, ఇతర సంస్కృత వాఙ్మయమునందును స్మరింపఁబడియున్నది. శత్రుంజయమాహాత్మ్యమను గ్రంథమున ద్రావిడజాతివారు వ్రాత్యులయిన క్షత్త్రియులనియు. వృషభస్వామి పుత్త్రుఁడగు ద్రవిడుని తనయులనియుఁ దెలుపఁబడియున్నది. పంచ ద్రావిడులనియు పంచగౌడులనియు నొక వ్యవహారమున్నది. పంచద్రావిడులనఁగ నంధ్రులు, కర్నాటకులు, గుర్జరులు, తైలంగులు, మహారాష్ట్రులు నని చెప్పుదురు. కుమారిలభట్టురచించిన తాంత్రవార్తికమున నాంధ్రద్రావిడభాషయనునది పేర్కొనఁబడెనని బర్నెలు పండితుఁడు తానురచించిన దాక్షిణాత్య లిపి చరిత్ర (South Indian Paleography) మను గ్రంథమున వ్రాసియున్నాఁడు. ఇది సరికాదనియు "అథ ద్రావిడభాషాయాం" అని గ్రంథమునయున్నదానిని "ఆంధ్రద్రావిడభాషాయాం" అనిచదివి బర్నెలు భ్రమపడెననియు పి. టి. శ్రీనివాసఅయ్యంగారు తెలిపియున్నారు.

ద్రావిడభాషల పరస్పర సంబంధమునుగూర్చియు ద్రావిడభాషా కుటుంబమునకును నితరభాషా కుటుంబములకును గల సంబంధమును గూర్చియు వివరించుచుఁ గాల్డ్ వెల్ పండితుఁడొక యుత్కృష్టగ్రంథమును రచించియున్నాఁడు అతఁ డాగ్రంథమున ద్రావిడభాషల సమానలక్షణముల నేర్పఱిచి వాని యేకత్వమును జక్కఁగ నిరూపించియున్నాఁడు. ద్రావిడభాషాకుటుంబమునకును నితర భాషాకుటుంబములకును గల సంబంధమును గూర్చి యెక్కువగాఁ జర్చించి ద్రావిడభాషలకును ఇండోయూరపియను భాషలకును దగ్గఱ సంబధము లేదనియు, సిథియనుభాషాకుటుంబముతో వానికి సన్నిహితసంబంధముగలదనియుఁ దెలిపియున్నాఁడు. ఆతనికాలమున నే

మూలద్రావిడభాష.

పోపు మున్నగుపండితు లాతనియూహ సరికాదని యాక్షేపించియుండిరి. కాల్డ్వెల్ గారి సిద్ధాంతము పరిశోధకలోకమునందుకొలఁది కాలముక్రిందటివఱకును ప్రమాణముగఁ దలంపబడుచుండెను. కాని యిటీవల నాతనిసిద్ధాంతము విషయమై వివిధాభిప్రాయములు వెలువడినవి. ఈ విషయమై గ్రియర్సన్ పండితుఁడిట్లు వ్రాయుచున్నాఁడు.—"సిథియనుపద మంతసమంజసముగ లేదు. గ్రీకుగ్రంథకర్తల గ్రంథములలోఁ గనఁబడు సిథియనుపదములు స్పష్టముగ నైరేనియను భాషలలోనివి, అనఁగా నవి ఇండోయూరోపియను కుటుంబమునకుఁ జెందినవి. అయినను నాపద మాసియా యూరోపుఖండముల లోని ఇండోయూరోపియను సెమిటికు కుటుంబములకుఁ జెందనిభాషల కన్నిటికిని సామాన్యమగు పదముగ నుపయోగింపఁబడినది. ఇదిగాక యీభాషల నేవిధమునను నేక భాషాకుటుంబములోనికిఁ జేర్ప వీలులేదు. చీనా దేశము తత్ప్రాంత దేశములలోని యేకమాత్రాకములగు భాష లిండో - యూరోపియను కుటుంబమునుండి యెంత భేదించుచున్నవో, కాకసస్ ప్రాంతములందలి ఫిన్నులు, మాగ్యారులు మాట్లాడుభాషలనుండియు నంత భేదించుచున్నవి. ఆ భాషలయందు కాన్పించు సామాన్యలక్షణములు సాధారణముగ నన్ని భాషలయందును గాన్పించునవియే. వీని సామాన్యలక్షణములకంటె వీని యందుగల మహత్తరములగు మూలలక్షణములందలి భేదములే యెక్కువగ నున్నవి. ద్రావిడభాషల నిండియా దేశమునకు వెలుపలనున్న భాషాకుటుంబములతోఁ గలుపుటకుఁ జేసినప్రయత్నములు విఫలములయ్యెనని సాధారణముగఁ దలంపఁబడుచున్నది. కావున మనము వానిని ప్రత్యేకభాషా కుటుంబముగనే యెంచవలెను. ముండాభాషలతో ద్రావిడభాషలకు సంబంధము న్నట్లు పైకి కనఁబడును గాని యట్టిసంబంధము లేదు. ఇండోయూరోపియను కుటుంబముతో దగ్గఱ సంబంధమును జూపుటకుఁ జేసినప్రయత్నములుగూడ నట్లే విఫలములయినవి. ఇటీవల ద్రావిడభాషాకుటుంబమునకును బర్మాదేశము నందలి ఛిన్నులభాషకును గల సంబంధమునుగూర్చి యొకరు ముచ్చటించిరి గాని యా వాదము పండితులదృష్టి నాకర్షించినట్లు కనఁబడదు. ఆస్ట్రేలియా భాషలకును ద్రావిడభాషలకును సంబంధమున్నదని ఫ్రీడ్రికు మిల్లరుగారు ప్రతిపాదించిరిగాని యది సమర్థింపఁబడినదని యూహింపవీలులేదు" అని.

ద్రావిడభాషలకును నితరభాషా కుటుంబములకును గల సంబంధముఁ గూర్చి కాల్డ్వెల్ చర్చించినంత విపులముగ మఱియెవ్వరును జర్చించియుండ లేదు. ఆతఁడు ద్రావిడమునకును నిండో - యూరోపియను భాషలకును గల సంబంధమును గుర్తించియుండకపోలేదు. కాని యాసంబంధము చాల ప్రాచీన మైనదనియు, ఆర్యభాషలతోడి సంబంధముకంటె సిథియనుభాషలతోడిసంబంధ

ధము మిక్కిలిసన్నిహితమైనదనియు నాతనియభిప్రాయము. ఇండోయూరోపియను భాషలతో సంబంధము లేదని యాతఁడు చూపినవివరములతోఁ దఱువాతి పరిశోధకు లేకీభవించి యా సిద్ధాంతమునందు స్థిరమగు విశ్వాసమును గలిగియున్నారు. కాని, సిథియనుభాషా కుటుంబముతోఁగూడ ద్రావిడమునకు సంబంధము లేదని నారు కాల్డ్ వెల్ సిద్ధాంతమును త్రోసిపుచ్చియున్నారు. కాల్డ్ వెలును దక్కిన పండితులును ద్రావిడభాషలు మిక్కిలి ప్రబలములయినవనియు, వానిమూలమున భారతీ యార్యభాషలలో గొప్పమార్పులు గలిగినవనియు, నా మార్పుల మూలమున నాయా యార్యభాషల ప్రాచీనస్వరూపమే మాఱినదనియుఁ దలంచుచున్నారు. ద్రావిడభాషా ప్రాబల్యమార్యభాషలపై గలిగిన సందర్భములని తనకుఁ దోఁచినవానిని సునీత్ కుమార్ ఛాటర్జీ యను బంగాళీ పండితుడు తాను రచియించిన "బంగాళీ భాషోత్పత్తి తత్పరిణామమును"(The Origin and Development of the Bengali Language.) అను గ్రంథమున నిట్లు వివరించియున్నాఁడు:—

## 1. ఉచ్చారణము

1. ఈ రెండుకుటుంబములలోను ద్వ్యచ్ సంయోగముగల యచ్చులు చాల కొంచెముగా నున్నవి. ఉద్వృత్తాచ్చుల నడుమ య, వ, లను చేర్చి వైదికభాషయందును, సంస్కృతభాషయందును ప్రకృతిభావము లేకుండఁ జేసియుండుదురు. అచ్చులనడుమనుండు హల్లులు లోపించినప్పుడు ప్రాచీన ప్రాకృతభాషావస్థనుండి నేఁటివఱకును నిట్లే జరుగుచున్నది. జైన అర్ధమాగధీ భాషలో నుద్వృత్తాచ్చుల నడుమ యకారమును వ్రాయుచుండెడివారు. తక్కిన ప్రాకృతభాషలలో నాహల్లును వ్రాయకుండినను నుచ్చారణములో నది వినఁబడియుండవలెను. తాలవ్య, ఓష్ఠ్యాచ్చులనడుమ య, వ, లును నకారమును జేరుట ద్రావిడభాషలయందును గలదు

2. జోరుడు ధ్వనులు నేఁటి ఇండో - ఆర్యభాషలయందును గూడ నెక్కువగా లేవు. ఇండో-ఐరేనియనులోని 'జే', జే=Z, Zh, ధ్వని జ, ఝలుగ మాఱుట ద్రావిడభాషాసంపర్కమువలనఁ గలిగియుండును కాని ఘ, ఝ, ధ, భ, యను హల్లులు హకారముగా మాఱుట ఋగ్వేద భాషకు మూలభాషయగు నైరేనియనుభాషకు దగ్గఱగానుండిన యొక ప్రతీచీభాషకు లక్షణముగానుండెను. ఐరేనియను భాషలో జోరుడు ధ్వను లెక్కువగా నుండెను.

3. రెండు కుటుంబములందును మూర్ధన్యాక్షరము లున్నవి. ట, డ, ణ, ళ, ల యనునవి ద్రావిడభాషాధ్వనులు. ఇవి వేద, సంస్కృతభాషలయందు తప్ప మఱియే ఇండోయూరోపియను భాషయందును లేవు. ఆధునిక

ఇండోయూరోపియను భాషలలో స్వీడిషుభాషయందు రేఫదకారముల సంయోగమున డకారమేర్పడినది. ఇట్టి మూర్ధన్యీకరణమే ప్రాచీనమాగధీ భాషయందునుగలదు, మాగధియందు రేఫమునుండి లకారమును, రేఫ దంత్యాక్షరసంయోగమువలన మూర్ధన్యధ్వనియుఁ గలుగుచుండెను. రేఫము లకారముగ మాఱి దానితో దంత్యవర్గీయహల్లు చేరి, మూర్ధన్యవర్గీయ హల్లుగాఁ బ్రాచీన ఇండో - ఆర్యభాషలలో సహజముగనే మాఱి యుండును. ఇట్లే ఇండో - ఆర్యభాషలలో మూర్ధన్యాక్షరములు సహజముగఁ బ్రాచీనకాలమునుండియు నుత్పత్తియగుచుండుట కుదాహరణములు గాన వచ్చును. రెండచ్చుల నడుమనుండు డ, ఢ, లను ళ, ళ, లుగ నాధుని కార్యభాషలయందును బ్రాకృతభాషలయందును ద్రావిడ భాషయందు వలెనే కాననగును.

4, ద్రావిడభాషలయందువలెనే యాధునికార్యభాషలందును బ్రాకృతభాషలందును స్వరభక్తి, లేక విప్రకర్షముచేత సంయుక్తాక్షరములు విడఁబడుట సంభవించెను.

ఉదాహరణములు:— ప్రాకృతము- కిలేశ (క్లేశ); సినేహ (స్నేహ); హరిస (హర్ష); రతన (రత్న); సుమిణ (స్మరణ); పరాణ (ప్రాణ); బరామ్హణ (బ్రాహ్మణ); మొ.

తమిళము—పిరామ్మణన్ (బ్రాహ్మణ); శినేగమ్ (స్నేహం); మిత్తి-రన్ (మిత్రమ్); తిరు (శ్రీ); కిరుట్టినన్ (కృష్ణ); శందిరన్ (చంద్ర); మొ.

ద్రావిడభాషలలోఁ బదాదియందు సంయుక్తాక్షరము లుండవనియు, బదమధ్యమందు ద్విత్వాక్షరములుండునవనియు, నీలక్షణము ప్రాకృతభాషలకు ద్రావిడమునుండి కలిగినదని సాధారణముగ నొకయభిప్రాయము గలదు. కాని యతిప్రాచీనకాలమున ననఁగాఁ గ్రీస్తుపూర్వము చాలశతాబ్దముల క్రిందట నిండో - ఆర్యభాషలయందువలె ద్రావిడమునందును త్ర, ద్ర వంటి సంయుక్తాక్షరము లుండెననియు పదాదియందు ద్ర యను సంయుక్తాక్షరమును గలిగిన ద్రమిడ, ద్రవిడ శబ్దములు ప్రాచీన ద్రావిడశబ్దములే యనియు నా శబ్దములనుండి తమిఱ్ అనుపదము దమిఱ అనుపదము ద్వారా తమిళభాషలోఁ గ్రీస్తుతఱువాతఁ గలిగినదనియు దమిఱశబ్దమును పాలి, ప్రాచీనసింహళభాషలు దమిళ యను రూపముతో నెరవు తీసికొనినవనియు, నిట్లే దమిఱకం అనుపదము గ్రీకుభాషలో దమిరికేయనియు, లాటిన్ భాషలో దమిరిచెయనియు వ్రాయఁబడెననియు బ్లాకు పండితుఁ డభిప్రాయపడి యున్నాఁడు. కావున సంయుక్తాక్షరములు విడఁబడుట ఇండో - ఆర్యభాషలయందును ద్రావిడభాషలయందును నొక్కటేవిధమునఁ గలిగి

యుండెను. ప్రాచీన ఇండో - ఆర్యభాషలయందలి సంయుక్తహల్లులు హల్మైత్రి (Assimilation) వలన నేకస్వరూపమును ప్రాకృతభాషలయందు పొందుట ప్రాకృతభాషలయందే కలిగియుండవలెను. ఇట్లగుట ఇటాలికు భాషయందును మఱికొన్ని ఇండో-యూరపియను భాషలయందునుగూడ గలిగెను. కాని ఈ మార్పు ద్రావిడభాషలయందుకంటె నిండో - ఆర్య భాషలలో వేయిసంవత్సరములకుఁ బూర్వమే సంభవించెను ఇండో - ఆర్య భాషలచరిత్రమున ద్రావిడు లార్యభాషను చాల ప్రాచీనకాలముననే యవలంబించుటయు నార్యభాషలతో ద్రావిడమునకు సంబంధముగలుగుటయు దీనికి కారణమైయుండును.

చ, జ, లు, చే, జే లుగను, సకారము హకారముగను నచ్చులమధ్య నుండు పరుషాక్షరములు సరళాక్షరములుగను మాఱుటయును, నంత్యాచ్చులు లోపింపక నిలుచుటయును, మొదలగువిషయములందు ప్రాకృతభాషలకు ద్రావిడభాషాసంపర్కము కారణమని గ్రియర్సన్ పండితుఁడు చెప్పి యున్నాఁడు. కకారతకారములు గకార దకారములుగ నచ్చులమధ్యమున మాఱుట ప్రాకృతభాషలయందే సహజముగ గలిగియుండును. కొన్నిప్రదేశములలో ద్రావిడభాషాసంపర్కము గూడ నుండియుండవచ్చును.

## 2. శబ్దనిర్మాణము.

1. ఉపసర్గలు నానాఁటికి నిండో - ఆర్యులభాషలయందు లోపించినవి. తక్కిన ఇండో- యూరోపియను భాషలలో నుపసర్గలు సుప్రిక్స్ విధానమునఁ దోడ్పడినవి. సుప్రిక్స్ ప్రత్యయము లంతరించినపిమ్మట నింగ్లీషు, పెర్షియను, ఫ్రెంచి, బల్గేరియను, భాషలయందువలె నుపసర్గలు వానిస్థానము నాక్రమించెను. ధాతువులకర్థభేదము గలిగించు నుపసర్గలు పై భాషలలో నింకను నున్నవి. ప్రాచీన ఇండోయూరోపియనుభాషలలో నుపసర్గలు తొలుత నవ్యయములుగానుండి క్రియకుముందుగఁగాని వెనుకనుగాని చేరుచుండెను. ఇండో - ఆర్యభాషలలో నుపసర్గము సంపూర్ణముగ నంతరింప లేదుగాని యది క్రియకుఁ దరువాతనే వచ్చుటను గమనింపవచ్చును. ఇట్లే ప్రాకృతములందును నాధునికార్యభాషలయందును విశేష్యములనుండియుఁ గ్రియలనుండియుఁ బుట్టిన కొన్నిసహాయకపదను లుపసర్గలస్థానమునఁ జేరుటయు గమనింపఁదగును.

ఆధునికార్యభాషలలో సుబ్విధానము ద్రావిడభాషలందలి దానినెక్కువగఁ బోలియున్నది. బహువచనమున గణ, గులా (కులా), సబ్ (సర్వ), మాన (మానవ), లోగ్ (లోక), సకల, మొదలగుశబ్దములు

చేరుటయు మే, నూ (మధ్య), కో (కక్ష), తాయ్ (స్థామ), పాస్ (పార్శ్వ), సే (సహిత), దా (దిత), కా (కృత), మొదలగునవి విభక్తి ప్రతిరూపకావ్యయములుగ ద్రావిడభాషలయందువలె కానఁబడుచున్నవి. ఇట్లే బంగాళీ భాషలో హైతే, లాగియా, ధాకియా, దియా, యనునవియు నాధునికార్య భాషలలోని యిట్టిరూపములను క్రియావిశేషణములును త్వార్థకములునైన ప్రత్యయములుగ వాడఁబడుట ద్రావిడభాషా సంప్రదాయము ననుసరించి యున్నది. తమిళములో, కత్తియైక్కొణ్డు (కత్తిఁగొని), అవనోడు (వానితోడ), ఇన్ఱు, నిన్ఱు (నిలిచి), మొదలగురూపముల నీ సందర్భమున నుదాహరింప వచ్చును.

అమహద్వాచకములకుఁ జతుర్థీ - ద్వితీయా ప్రత్యయమగు నాధునిక ఇండో-ఆర్యభాషలలోని కో, కే, కు, ప్రత్యయములును ద్రావిడభాషలలోని కు ప్రత్యయమును జేరకుండుట రెండు కుటుంబములయందును గాన్పించుచున్నది.

పైని వివరించిన విషయములం దాధునికార్యభాషలకు ద్రావిడ సంపర్కము నూహించుటకు వీలున్నది. కాని యిట్టిమార్పులు ద్రావిడ భాషామూలముననే గలిగినవని చెప్ప వీలులేదు. ఆధునికార్యభాషలలోఁ బశ్చిమ హిందీభాషయందు 'కో', బంగాళీభాషయందు 'కే', ఒఱియాభాషయందు 'కు' అను ప్రత్యయములు ప్రాకృతభాషావస్థయందును నాధునికార్య భాషలయందును 'కక్ష'యను సంస్కృతపదమునుండి యేర్పడుటకును ద్రావిడ భాషలలోని కు ప్రత్యయమునకును నెట్టి సంబంధమును లేదు. ఈ ప్రత్యయములు రెండుకుటుంబములయందును బోలియుండుట కాకతాలీయన్యాయమున గలిగినదిగాని వేఱుగాదు. ఇట్లే బంగాళీభాషలోఁ బదునాల్గవ శతాబ్దమున వాడుకలోనికి వచ్చిన రా, గులా, (గులి) అను బహువచన ప్రత్యయములకును ద్రావిడభాషలలోని ఆర్, గళ్, ప్రత్యయములకును సంబంధముస్నదని చెప్పుట మిక్కిలి సాహసము. బంగాళీభాషలో (రా) ప్రత్యయమును ద్రావిడభాషలలో (ఆర్) ప్రత్యయమునుగూడ మహద్వాచకములతోడనే చేరినను నీరెంటికిని సంబంధమున్నదని చెప్పఁగూడదు.

ఆధునికార్యభాషలయందును ద్రావిడభాషలయందును విశేష్యములు విశేషణములుగ నుపయోగింప వీలగుట యీ రెండు కుటుంబములకును సామాన్యలక్షణముగఁ గొందఱు చెప్పుదురు.

ఉదాహరణము:—బంగాలీ: సోనార్ - బాటీ ; తమిళ్ : పొన్నిన్ - కుడమ్ = బంగారుగిన్నె. కాని యిట్టి వాడుక యింక ననేకభాషలలోఁగూడ నుండుటచే నది కేవల ద్రావిడభాషా లక్షణమేయని చెప్పఁగూడదు.

2. ఆధుని కార్యభాషలయందును ద్రావిడభాషలయందును గూడ విశేషణములకుఁ దరతమ భావను దెలుపు ప్రత్యయములు లేవు. ప్రాచీన ఇండో - ఆర్యప్రత్యయములగు ఈయస్, ఇష్ఠ; తర, తమ, అనునవి లోపించినవి. ఈ భావము, విశేష్యమును చతుర్థీ, పంచమీ, లేక సప్తమీ విభక్తుల యందుంచి దానితో విశేష్యజమైనట్టి కాని, క్రియాసంబంధమైనట్టి కాని యొక మాటను చేర్చుటవలనఁ దెలుపఁబడుచున్నది.

ఉదాహరణములు:—బంగాలీ: ఏర్ చేయే - ఖాలో = దీనిని చూచిన మేలు; సబార్ మాఝే ఖాలో = అన్నిటి మధ్యను మంచిది, మొ. ద్రావిడభాషలలోఁగూడ తర - తమభావమిట్లే తెలుపఁబడును. నేఁటి యిండో యూరోపియను భాషలలోఁ గొన్ని యెడల నీ భావము ప్రత్యయముల మూలముననే తెలుపఁబడుచున్నది.

ఉదాహరణము:—పెర్షియను : తర్, తరీన్ ; ఆర్మీనియను : కుఇన్ = గౌఇన్; ఆధునిక గ్రీకు : తెరోస్, తతోస్ ; రషియను: జెఇశిఇ, జీ ; ఇంగ్లీషు : ఎర్, ఎస్ట్. కొన్నియెడల తరతమ భావమునుదెలుపు ప్రత్యేకశబ్దములు వాడబడుచున్నవి.

ఉదాహరణములు:—ఇంగ్లీషు : మోర్, మోస్ట్ ; ఫ్రెంచి : ప్లుస్, లేప్లుస్ ; ఆధునిక గ్రీకు : ప్లెబస్, ఒ ప్లెబస్.

3. ధాతువులం దర్థభేదముల గలిగించుట కుపసర్గలు లోపించినందున నాధునికార్యభాషలయందును ద్రావిడభాషలయందును నొక్కటే తీరున త్వార్థకములును క్రియా విశేషణములును నవ్యయార్థములందు ధాతువులతోఁ జేరి ధాతుపల్లవము లేర్పడినవి.

ఉదాహరణములు:—సంస్కృతము: నిషద్; ఇంగ్లీషు: సిట్ డౌన్ ; బంగాలీ: బసియా పటా ; హిందీ : బైఠ్ జానా ; ఇంగ్లీషు : రబ్ ఆఫ్, బంగాలీ: ముచియా ఫేలా. ఇట్టి వాడుక ద్రావిడభాషలయందును గలదు.

4. ప్రాచీనార్యభాషలలోని దశవిధ లకారములందు చాలమట్టుకు లోపములు కలిగినవి. అట్లే యైరేనియను భాషలలోఁగూడఁ జాలవఱకు లకారము లంతరించినవి. వైదికభాషలో సోఽగమత్, సోఽగచ్ఛత్, స జగామ అను రూపములకుఁ బ్రాకృతములందు స గతః అను రూపమువికారము లగు సో గదో, సో గఓ, శే గడే, శి గయిల్ల, సు గఉ, సా గఅఉ, మొదలగు రూపములు గలిగెను. వానినుండియే యాధునికార్యభాషలయందు పశ్చిమ హిందీ సో గయవ్, గయా; బంగాలీ: సే గేల, మొదలగు రూపములు కలిగెను. ఈమార్పు ద్రావిడభాషా సంపర్కమువలన గలిగియుండును. ద్రావి

డములోఁ గ్రియ విశేష్యతుల్యమైయున్నది. ద్రావిడభాషలలోని లకారములు క్రియావిశేషణమునుండి జనించినవి. ఆర్యభాషా వికాసమునం దిండో - యూరోపియను సంపూర్ణక్రియారూపము లంతకంతకును లోపించి వానిస్థానమున క్రియావిశేషణ రూపములుచేరుట కానసగును. సంస్కృతములో కరిష్యతి యనుటకు కర్తా అనుటయు, కరిష్యామి అనుటకు కర్తాస్మి యనుటయు ద్రావిడభాషా వ్యవహారము ననుసరించి యున్నది. వైదికభాషలో సకృత్తుగాఁ గాన్పించు తవన్త్ ప్రత్యయము ద్రావిడభాషలలోని దవన్ ప్రత్యయమును బోలియున్నది.

ఉదాహరణము:—సంస్కృతము:కృత,కృతవంత్ ; తమిళము: శెయ్‌దు, శైదవన్. ఆధునిక మగధభాషలగు బంగాలీ, ఒతియా, మైథిలీ, మగహీ, భోజపురియా, భాషలయందు క్రియల లఙ్, లుట్, రూపము 'ధాతువు + భూత, లేక, భవిష్యత్క్రియాజన్య విశేషణము + సర్వనామప్రత్యయము'గా నుండుట ద్రావిడభాషలయందువలె నున్నది. క్రియల క్త్వార్థకరూపములతో సంపూర్ణక్రియలనుచేర్చి వాడుట యాధునికార్య ద్రావిడభాషలకు సామాన్య లక్షణము.

ఉదాహరణములు:—తమిళము: కొండువా; బంగాలీ: నైయా ఆఇ స = నీవ ఏసో; హిందీ: లాఓ = లే + ఆఓ. ఈ నుడికార మార్యభాషలకు ద్రావిడమునుండి సంక్రమించియుండును.

ప్రాచీనార్యభాషలలోని కర్మణి ప్రయోగమాధునికార్యభాషలలోఁ జాలవఱకు నంతరించినది. దానికిబదులుగ నేఁటి యార్యభాషలలో ద్రావిడము నందువలె 'పోవు, పడు, పట్టు, పెట్టు, తిను' అను నర్థములనిచ్చు ప్రత్యేక ధాతువు లుపయోగమున నున్నవి.

(5) ఆధునికార్యభాషలయందును ద్రావిడభాషలయందును ధ్వన్యనుకరణశబ్దము లనేకములున్నవి. వైదికభాషయం దిట్టివి చాలనరుదు. ఇవి ప్రాకృతావస్థనుండియు నానాఁటికి నధికమగుచు వచ్చినవి. ధ్వన్యనుకరణ శబ్దములు కోలుభాషలయందును నెక్కువగనున్నవి. బహుశః ఈ విషయమున కోలుభాషల సంపర్కమును నార్యభాషలకుఁ గలిగియుండును.

(6) రెండుకుటుంబములయందును 'ప్రతిధ్వనిశబ్దము' లెక్కువగ వాడుకలో నున్నవి. శబ్దమునకుఁ బౌత్రికముగఁ బునరుక్తికలుగును. పునరుక్త పదము నాద్యక్షరములు నియతముగనుండును. పునరుక్తపదమర్థరహితమైన దైనను మొదటిపదమునకు 'మొదలగు', 'పోలిన,' 'సంబంధించిన' అను మొదలగునర్థములఁ గలుగఁజేయుచుండును.

ఉదాహరణములు:—బంగాలీ : ఘోరాటోరో ; మైథిలీ : ఘోరా-తోరా; హిందోస్థానీ: ఘోడా-ఉడా; గుజరాతీ: ఘోడో - బోడో; మరాఠీ; ఘోడా-బీడా; సింహాళీ: అశ్వయా-బశ్వయా; తమిళము: కుదిరెయ్ - కిదిరెయ్; కన్నడము: కుదిరె - గిదిరె; తెలుఁగు: గుఱ్ఱము, గిఱ్ఱము.

ఇట్టిరూపములకును గుడ్డ - గుడుసు; పెట్టె - పేడ; కుండ - మండ; మొదలగు సమాసములకును భేదమున్నది. ఇట్టి సమాసములలో రెండవ మాట మొదటిపదమునర్థమునే కలిగిన ప్రాచీనపుమాట ; మీఁదఁ దెలిపిన వానిలో రెండవపద మర్థరహితము. ఇట్టి సమాసము లాధుని కార్యభాషల యందును గలవు.

ఉదాహరణములు:—కాపట్ - చోపట్ ; చాటీ - భాటీ ; మొ.

## III. వాక్యనిర్మాణము.

---

ఉచ్చారణ, శబ్దనిర్మాణములకంటె, వాక్యనిర్మాణము భాషల సంబంధ మును నిర్ణయించుట కెక్కువగ నుపయోగించును. వాక్యనిర్మాణవిధానము పరంపరాగతమై, చాలవఱకు మాఱకయుండును. క్రొత్తయుచ్చారణమును, శబ్దములందలి మార్పులును నితరభాషాసంపర్కమువలన సులభముగఁ గలుగ వచ్చును. వాక్యనిర్మాణవిషయమున ఆధునిక ఇండో-ఆర్యభాషలును ద్రావిడ భాషలును నైక్యమును వహించియున్నవి. శబ్దముల క్రమమును మార్చకుండ పదములకు పదములనుంచి తమిళువాక్యమును బంగాళీవాక్యముగనో, హిందీ వాక్యముగనో మార్చవచ్చును. కాని, పెర్షియను, ఇంగ్లీషువాక్యముల నట్లు మార్ప వీలులేదు. ఈ వాక్యనిర్మాణమునందలి యైక్య మీరెండు కుటుంబ ములకును బ్రాకృతముల కాలమునుండియుఁ గలుగుచువచ్చినది. పాలి ప్రాకృతభాషల వాక్యనిర్మాణమును గమనించినయెడల నీవిషయము బోధ పడఁగలదు. ఈ రెండుకుటుంబముల వాక్యములందును మొదట విశేషణముల తోడి కర్తయును, తరువాత విశేషణములతోడి కర్మమును, పిదప క్రియార్థ మును వివరించు పదములును, తుదను సంపూర్ణ క్రియాపదమును వచ్చును.

రెండు కుటుంబములందును కర్తృకర్మములను గలుపు అస్త్యర్థక ధాతువు లేకుండును.

ఉదాహరణము:—బంగాళీ : ఏ-టా ఆమాదేర్ బాటీ ; కన్నడము ; ఇదు నమ్మమనె ; తమిళము : ఇదు ఎంగలుడైయ వీడు ; తెలుగు : ఇది మాయిల్లు; బంగాళీ: మానుష్-టీ భాల; తమిళము: మనిదన్ నల్లవన్;

కన్నడము: మనుష్యను ఒళ్లేయనను; తెనుఁగు: మనుష్యుఁడు మంచివాఁడు.

నుడికారములో రెండు కుటుంబములకును మిక్కిలి దగ్గఱపోలికలున్నవి.

(i) 'అని' అను క్త్వార్థక శబ్దముల యుపయోగము:—బంగాళీ: బొలియా; తూర్పుహిందీ: బోల్-కే; మరాఠీ: మ్హణూన్; సింహళీ: కియా; తమిళము: ఎన్ఱు; కన్నడము: ఎందు; తెనుఁగు; అని.

(ii) క్రియల లోట్ రూపములకు మాఱుగ తుమున్నంతాది రూపములను వాడుట:—పశ్చిమహిందీ: యహ్ కామ్ కర్నా; కన్నడము: ఈకెలస మాడువుదు; తెనుఁగు: ఈపని చేయునది.

(iii) క్రియల లోడ్రూపమున కొకయర్థమున 'నిచ్చు' ధాతువు రూపములను వాడుట:—సంస్కృతము: వదాని; బంగాళీ: ఆమాకే బొలితే దేఓ; హిందోస్థానీ: ముఝే బోల్నేదో, తెనుఁగు: నన్ను చెప్పనిమ్ము, చెప్పనీ.

ఇండో-ఆర్యభాషల కీపోలిక లిండియాకు వెలుపలనున్న యిండో-యూరోపియను భాషలతో లేవు. ఈ విషయమున నార్యభాషలపై ద్రావిడ భాషల ప్రోద్బలమున్నదని చెప్పక తప్పదు.

## IV. శబ్దజాలము.

---

ఆర్యభాషలు భరతవర్షమును జొచ్చిననాఁటినుండియు నందు ద్రావిడ భాషాపదములు గలియుచునే యున్నవి. బ్రాహూఈ జాతివా రిండియాకు వెలుపలనున్న ద్రావిడజాతివారే. ఇరాను దేశములో నితర ద్రావిడభాషల వారుండుట యసంభవనుగాదు. వారితో నార్యులకు సంపర్కము కలిగి యుండును.

కాల్డ్వెల్, గండర్ట్, కిట్టెల్, మున్నగువారు ద్రావిడభాషలనుండి యార్యభాష లెరవుతీసికొన్న పదముల పట్టికల నిచ్చియున్నారు. ఇండో-యూరోపియను భాషలలో సమానపదములు లేని యార్యభాషలలోని దేశీయ పదములన్నియు ద్రావిడపదములై యుండును. కొన్ని కోల్ భాషాపదములునై యుండును. కొన్ని ద్రావిడ, కోల్ భాషలకు పూర్వదేశమందుండిన భాషల లోని పదములునునై యుండును."

కాల్డ్వెల్ పండితుఁడు ద్రావిడభాషలకును నిండో - యూరోపియను భాషలకును గల సంబంధమునుగూర్చి విపులముగఁ జర్చించి యా రెండు కుటుంబములకును నెట్టిసంబంధమును లేదనియు సిథియను భాషలతోడనే ద్రావిడభాషల కెక్కువసంబంధ మున్నదనియు నిర్ధారణము చేసెను. తనకు

సిథియను సంబంధములు కనఁబడిన చోట్లనెల్ల నిండో యూరోపియను సంబంధములుగూడఁ బొడగట్టుచునే యుండెను. ఆతఁడు వానినిగుర్తించి యుండక పోలేదు. కాని యాతని యభిప్రాయమంతయును సిథియను సిద్ధాంతము ప్రక్క కొరగియుండుటచే నాతఁ డిండో-యూరోపియను సంబంధముల నంగీకరింప లేకుండెనని యాతని గ్రంథమును చదివినవారికి స్ఫురింపకపోదు. విశేష్యముల బహువచన ప్రత్యయమగు నకారము, పదప్రత్యయ సంయోజనవిధానము, ద్వితీయావిభక్తి ప్రత్యయములగు మకార నకారములు, చతుర్థీవిభక్తి ప్రత్యయము, ఇన్ అను షష్ఠీవిభక్తిప్రత్యయము, అ, ఇంద్రె అను షష్ఠీవిభక్తి ప్రత్యయములు, ఇల్ అను సప్తమీవిభక్తి ప్రత్యయము, ఒందు, అంజు, ఎట్టు అను సంఖ్యావాచకములు, ఉత్తమ మధ్యమ పురుష సర్వనామములు ఆత్మార్థక సర్వనామము, సర్వనామముల బహువచన ప్రత్యయములు, నిర్దేశార్థక సర్వనామ విశేషణములు గౌరవార్థక సర్వనామములు, భూతార్థక తప్ప్రత్యయము, భూతార్థక్రియలయం దామ్రేడితము, భూతార్థకములగు ఇ, ద, ప్రత్యయములు, భవిష్యదర్థ బోధక ప్రత్యయములు, శబ్దజాలము,—ఈ విషయములఁ జర్చించిన సందర్భములనెల్ల నాతని కిండో యూరోపియను సంబంధములు కనఁబడుచునే వచ్చినవి. కాని యాతఁడు వాని నన్నిటిని నిరాకరించెను.

ఇటీవల జరిగిన పరిశోధనముల ఫలితముల మూలముచ గ్రియర్సన్ పండితుఁడు కాల్డ్వెల్ చేసిన సిథియను సిద్ధాంతము నెట్లు నిరాకరించెనో యింతకుముందు తెలుపబడియున్నది. సిథియను జాతిగాని, సిథియను భాషా కుటుంబముగాని, లేనప్పుడు సిథియను సిద్ధాంతము నిలుచుట కవకాశము లేదు కదా.

కాల్డ్వెల్ కాలమునకుఁ బ్రాకృత భాషలనుగూర్చికాని, ఆధునికార్య భాషలను గూర్చికాని పరిశోధనము లెక్కువగా జరిగియుండలేదు. ఇటీవల జరిగిన పరిశోధనముల ఫలితములను సునీత్ కుమార్ ఛాటర్జీ పైన వివరించి నట్లుగా నొక్కచోటఁ జేర్చియున్నాఁడు. ఆతఁడు చూపిన సంబంధములే కాక యింక నెన్నిటినో చూపవచ్చును. ద్రావిడభాషలు ప్రాకృతములుకావను కొనుటచే నార్యభాషలువేఱనియు, ద్రావిడభాషల ప్రోద్బలమువలన నార్య భాషలు ప్రాకృతములుగాను, నేఁటియార్యభాషలుగాను బరిణమించినవనియు చెప్పుట సంభవించినది. ప్రాచీన ఇండో-ఆర్యభాషలు నేఁటియార్యభాషలుగా మాఱుట యవి సహజముగ సొంతమార్గమునఁ బరిణమించుటచేతనైనను, ఇతరభాషల ప్రోద్బలముచేతనైనను కలిగియుండవచ్చును. నేఁటి పరిశోధకులు రెండవకారణమును దెలుపుచు ద్రావిడభాషల నార్యభాషలనుండి ప్రత్యే

కించుచున్నారు. వా రట్లు చెప్పుటకు ప్రాచీన ప్రాకృతభాషలు ప్రచార మునం దున్నకాలముననే ద్రావిడభాషలు నేఁటిరూపమునగాని తత్తుల్యమైన రూపమునగాని యుండెనని నిరూపింపవలసియున్నది. ప్రాచీనప్రాకృత భాషలకాలమునకు నేఁటిరూపమున ద్రావిడభాష లుండెననిచూపుట కెట్టి నిదర్శనములును లేవు. ఆనాఁడు దక్షిణదేశపు భాషలకు దాక్షిణాత్య యను పేరుండెను. మృచ్ఛకటికమున చందనకుఁడు పలికిన "కణ్ణాడకలహప్పవిఅం కరేమి" అనువాక్యము దాక్షిణాత్యభాష కుదాహరణముగ గనపడుచున్నది. మార్కండేయుఁ డీభాషలకు లక్షణాకరణత్వమును దెలిపి దానిని ర్చి వివరిం పలేదు. ఈ భాష శౌరసేనీభవమైన యావంతికి సంబంధించినట్లు లాక్ష ణికులు తెలుపుచున్నారు. ఇదిగాక దక్షిణదేశభాషలయందలి ప్రాకృ తములలో ద్రావిడప్రాకృత మొకటి యుపభాషగాఁ దెలుపఁబడి యున్నది. దాక్షిణాత్యయను ప్రాకృతమును ద్రావిడీప్రాకృతమును పైశాచీ భాషావికారములని కొందఱియభిప్రాయము. ఎట్లైనను నీవిషయమై ప్రాకృత లాక్షణికులుగాని ద్రావిడభాషలకు వ్యాకరణముల వ్రాసిన వైయాకరణులు గాని ద్రావిడభాషల ప్రాకృతత్వమునుగూర్చి విచారింపలేదు. ఇండియా దేశపుభాషలలో లిఖితరూపమున నున్నవానిలో సంస్కృతముతఱువాత ప్రాకృతములు మొదటివి. ఆ తఱువాత లిఖితములయినభాషలు ద్రావిడ భాషలు; తమిళములో 5 లేక 6 వ శతాబ్దమునుండియు గ్రంథములుకాన్పించు చున్నవి. అంతకుఁ బూర్వమే యా భాషయందు గ్రంథము లున్నవని కొందఱందురు గాని తగిన నిదర్శనములు లేకపోవుటచే నాయూహ నేఁడు విడనాడఁబడుచున్నది. తమిళముతఱువాత లిఖితమైనభాష కన్నడము (7 వ శతాబ్దము.) తఱువాత లిఖితమైనది తెనుఁగు (9వ శతాబ్దము.) తక్కిన భార తవర్షీయ భాషలన్నియుఁ బదునొకొండవశతాబ్దమున కీవల గ్రంథస్థము లైనవే. వానిలోఁ బశ్చిమహిందీభాషాభేదములగు బుందేలీ (12 వ శతా బ్దము); బ్రజ్ భాష, (1192); మరాఠీ (13 వ శతాబ్దముమధ్యమము); మళయాళము (13 లేక 14 వ శతాబ్దము); బంగాళీ (14 వ శతాబ్దము); కాశ్మీరి (14 వ శతాబ్దము); పంజాబీ (15 వ శతాబ్దము); గుజరాతి (15 వ శతాబ్దము); మైథిలీ (15 వ శతాబ్దము); అస్సామి, అవధీ లేక కోసలీ 16 వ శతాబ్దము); బఘేలీ (1563); ఒఱియా (17 వ శతాబ్దము) ఖస్కుర లేక నేపాలీ (17 వ శతాబ్దము); కనౌజీ (17 వ శతాబ్దము); సింధీ (18 వ శతాబ్దము); కుమాఊనీ (1790); గఢ్వాలీ (1876); - ఆయా భాష లలో నాయాకాలములందు ప్రథమగ్రంథములు వెలువడినట్లు తెలియవచ్చు చున్నది. అంతకుఁ బూర్వము వానిస్వరూప మెట్లుండెనో తెలిసికొనుట

కాధారములు లేవు. క్రీస్తుపూర్వము 3 వ శతాబ్దమునుండి క్రీస్తుశకము 5 వ శతాబ్దమువఱకును భారతదేశమందంతటను ప్రాకృతభాషలు ప్రచారమందుండినట్లు మనకుఁ దెలియును. నాఁటనుండి 6, 7 వ శతాబ్దముల వఱకు దక్షిణహిందూదేశమునందును, 12 వ శతాబ్దమువఱకును తక్కిన భారతవర్షమునందును ప్రచారమునం దుండినభాషల స్వరూపమెట్లుండెనో తెలిసికొనుట కాధారములు లేవు. అట్టిసందర్భమున ద్రావిడభాషలమూలమునఁ బ్రాకృతభాషలును నేఁటి యార్యభాషలును కలిగినవని యూహించుట సమంజసము కాదని తోఁచుచున్నది. కావున నా యభిప్రాయమునకుఁ దగినయాధారములు నిరూపింపఁబడువఱకును బూర్వలాక్షణికులతో నేకీభవించి ద్రావిడభాషలుగూడఁ బ్రాకృతభాషలే యనియుఁ దక్కిన ప్రాకృతభాషలెట్లు గలిగినవో ద్రావిడ భాషలును నట్లే గలిగినవనియుఁ బ్రాకృతభాషలపై ద్రావిడీ ప్రాకృతమున కెంతటి ప్రాబల్యము కలిగెనో ద్రావిడభాషలపైఁ గూడఁ దక్కిన ప్రాకృతభాషలవలన నంతప్రాబల్యము గలిగెననియుఁ బ్రాచీనార్యభాషలనుండి తక్కిన ప్రాకృతములవలె ద్రావిడభాషలును వికాసము నొందినవనియుఁ దలంచుచు నాదృష్టితోఁ బరిశోధనముల సాగించినచో ద్రావిడభాషాతత్త్వము తేలఁగలదని చెప్పుట సాహసము కానేరదు.

కాల్డ్వెల్ సిద్ధాంతమును గూర్చి విచారించుట యిచ్చట నప్రస్తుతము కానేరదు. ఆతఁ డేయే విషయములందు సంస్కృతమునకును ద్రావిడ భాషలకును సంబంధము లేదని తెలిపెనో యావిషయములందెల్ల ద్రావిడ భాషలకును బ్రాకృతములకును సంబంధము కానవచ్చుచున్నది. కాల్డ్వెల్ తన సిద్ధాంతమునకుఁ బోషకములుగఁ జూపిన యుపపత్తులును వానికి సమాధానములును నీక్రింద చూపఁబడుచున్నవి.

1. "ద్రావిడభాషలలోని శబ్దజాలమునందు సంస్కృతేతరభాగము సంస్కృతభాగముకంటె నెక్కువగానున్నది."

## సమాధానము.

కాల్డ్వెల్ సంస్కృతేతరభాగమనుకొన్నది నిజముగఁ బ్రాకృత భాగము. కేవల దేశ్యమని తలంపఁబడు ద్రావిడ శబ్దజాలము ప్రాకృత మార్గమున నెక్కువగ వికారమునొందినదై యున్నది. నిజముగ దేశ్యమైన భాగము కొలదిగనే యున్నదని పరిశోధనము వలనఁ దేలగలదు.

2. "ద్రావిడభాషలలోని సర్వనామ సంఖ్యావాచక శబ్దములును సుప్తిజ్ ప్రత్యయములును వాక్యనిర్మాణమును—అనఁగా భాషకు జీవమునఁ

దగినదంతయు—మొదటినుండియు సంస్కృతమునకును ద్రావిడభాషలకును వేర్వేరుగనున్నది."

## సమాధానము.

సర్వనామములు సంస్కృతమునకును ప్రాకృతములకును సమానములగు నిండో-ఇరేనియను భాషలనుండి వేర్వేరు మార్గములఁ బరిణామముల నొందివచ్చి యుండుటచే భేదముగలిగినది. సంఖ్యావాచకముల విషయమున నిండోయూరోపియను భాషలందును నేఁటియార్యభాషలయందును జాలపోలికలను జూపవచ్చును. వీనినిగూర్చిన ప్రశంస మఱియొకచోటఁ జేయఁబడును. సుప్తిఙ్ ప్రత్యయములు ప్రాకృత భాషలలోనే లోపించినవి. విభక్తిరూపము లన్నియు సామాన్యముగ నేకరూపమును దాల్చుటచే నావిభక్తి సంబంధమును దెలుపుటకుఁ గ్రొత్తమాటలు చెప్పఁబడుచు వచ్చినవి. ఈమార్పు ద్రావిడ భాషలయందువలెఁ బ్రాకృతనేటి యార్య భాషలయన్నిటి యందును గానవగుచున్నది. వాక్యనిర్మాణవిషయమున సంస్కృతమునందు పదప్రత్యయ సంయోజనము సంపూర్ణముగ నుండుటచే వాక్యములోని శబ్దముల స్థానము విషయమున నొకనియతి లేకుండెను. కాని ప్రాకృత భాషలయందును వాని పరిణామ రూపములగు నేఁటి భారతీయభాషలయందును ప్రత్యయములు లోపించుటచే వాక్యములోని శబ్దములస్థానము విషయమున నొకనిర్ణయ మేర్పడవలసివచ్చెను.

3. "ద్రావిడనిఘంటువులలో సంస్కృత పదజాలమెక్కువగ నున్నదని ద్రావిడభాషలు సంస్కృత భాషాజన్యములని తలంపఁగూడదు. ఆనిఘంటువులలో దేశభాషాపండితులు దేశ్యములను ప్రత్యేకించియే యున్నారు."

## సమాధానము.

శబ్దజాలమును తత్సమ, తద్భవ, దేశ్య, భాగములుగా విభజించుట ద్రావిడ భాషలలోనే కాక ప్రాకృతము లందును నున్నది. తత్సమము లనునవి సంస్కృతమునుండి క్రొత్తగా నెరవు తెచ్చుకొన్నట్టివి. అవి నిత్యజీవనమున సమస్తజనులకు సమస్త విషయములందును నుపయోగపడునట్టివి కావు. అవి మతము, విజ్ఞానము, శాస్త్రములకు సంబంధించినవి. కావున నవి సాధారణ జనులనోటిలోఁ బడి చివికిపోక నిలచియున్నవి. తక్కిన ప్రాకృతములనుండి వచ్చిన శబ్దజాలములోఁ గొంత మార్పుచెందక యట్లేనిలచినది. కాని సాధా

రణజనుల వ్యవహార ప్రవాహమునఁ బడి కొన్ని సంస్కృత ప్రాకృత శబ్దములు వర్ణలోప, వర్ణాగమ, వర్ణాదేశ, వర్ణవ్యత్యయముల మూలమునఁ గొంతవికార మును బొందినవి. వీనికే తద్భవములని పేరు. వీనికిని వీనిమాతృకలకును నింకను గొంతపోలిక నిలచియున్నది. కాని యీతద్భవములలోఁ గొన్నియింకను మార్పుల నొందుచుఁ దొల్లింటి మూలరూపములతో నెట్టిపోలికయు లేకుండ మాఱినవి. ఇట్టిపోలికలు గుర్తింపరాని శబ్దములనే వైయాకరణులును నిఘంటుకారులును దేశ్యములనిరి. ప్రాకృతభాషలలోని దేశ్యశబ్దముల కును నేఁటి యార్యభాషలలోని దేశ్యశబ్దములకును నిటీవల భాషాశాస్త్రమున గలిగిన యభివృద్ధిమూలమున మాతృకలు కనుగొనఁబడుచున్నవి. ద్రావిడ భాషల విషయమున నిట్టిపరిశోధన మింకను జరిగియుండలేదు. కాల్డ్వెల్ నాఁటనుండియు ద్రావిడ భాషలకును నార్యభాషలకును సంబంధము లేదను నభిప్రాయము స్థిరముగ నిలుచుటచేఁ బరిశోధకు లీవంకకుఁ దమదృష్టిని ద్రిప్పరయిరి. తక్కిన ద్రావిడభాషల మాటయెట్లున్నను నాంధ్రభాషను గూర్చి యీ విషయమై నేనుచేసిన పరిశోధనముల ఫలితమును మఱియొక యధ్యాయమునఁ జూపుచున్నాను. కాల్డ్వెల్ పండితుఁ డీసందర్భమున సంస్కృత ముతో సంబంధింపవని యిచ్చిన పదముల పట్టికను గూర్చి మాత్రమిచ్చట ముచ్చటించుట యుక్తము. అతఁ డాయాపదములకు సంబంధింపని సంస్కృత శబ్దముల నిచ్చుటచేఁ బోలికలు సరిగఁ గానరాకున్నవి. కాని యాపదములకన్ని టికిఁ దగిన సంస్కృత శబ్దములను నిరూపింపవచ్చును. ఈ క్రింది పట్టికలో కాల్డ్వెల్ ఇచ్చిన తమిళపదములు, ఆతఁడిచ్చిన సంస్కృతపదములు, వానికి సరియైన సంస్కృత పదములును వరుసగాఁ జూపఁబడుచున్నవి.

| తమిళము. | కాల్డ్వెల్ ఇచ్చిన సంస్కృతపదము. | సరియైన సంస్కృత పదము. |
|---|---|---|
| అప్పన్ ... .. | పితృ .. ... | అంబః |
| ఆయి ... ... | మాతృ ... ... | మాయి (హిందీ) |
| తాయి ... .. | మాతృ ... ... | ధాత్రీ |
| మగన్ ... ... | సూను ... ... | మహాన్ |
| మగళ్ ... ... | దుహితృ ... ... | మహతీ |
| తలెయ్ ... ... | సిరస్ ... ... | తల |
| శెవి ... ... | కర్ణ ... ... | శ్రవస్ |
| వాయ్ .. ... | ముఖ ... ... | వక్త్ర |
| మయిర్ ... ... | కేశ ... ... | శ్మశ్రు |

| | | |
|---|---|---|
| కెయ్ | హస్త | కర |
| వాన్ | దివ్ | ద్యొ్యామన్ |
| నాళ్ | దివస | నాళీ |
| ఇరవు | నక్ | రాత్రి |
| ఞాయిరు | సూర్య | ప్రా. ణేసర్ |
| తీ | అగ్ని | తేజస్ |
| నీర్ | అప్ | నీర, నార, |
| మీన్ | మత్స్య | మీన |
| మలెయ్ | పర్వత | మలయ |
| కల్ | అశ్మన్ | గ్రావన్ |
| ఇల్ | వేశ్మన్ | నిలయ |
| ఊర్ | గ్రామ | పూర్ |
| ఆనెయ్ | హస్తిన్ | అనేకప |
| కుదిరెయ్ | అశ్వ | ఘోట |
| నాయి | శ్వాన | శ్వాన |
| పఱి | సూకర | [illegible]పోత్రిన్ |
| పరవెయ్. | వయస్ | పారావత |
| కఱు | కాల | కృష్ణ |
| వెళ్ | శుక్ల | శ్వేత |
| శె | రక్త | శోణ. |
| పెరు | మహత్ | పృథు |
| శిఱు | అల్ప | శ్రథ్ |
| ఇన్ | మధుర | ఇక్షు. |
| తిను | భక్ష్ | తృణ్ |
| నిల్ | స్థా | నిష్ఠా |
| ఏఁగు | చర్ | ఇ |
| కొల్ | హన్ | క్రూ(ర) |

మొదలయినవి.

4. "ద్రావిడభాషలలో గ్రంథస్థలములుగాని వనేకములున్నవి. వీనిలో సంస్కృతపదములు లేనేలేవని చెప్పవచ్చును. సంస్కృతపదముల నుపయోగించుఁ గొన్ని భాషలలో నవి యంత యావశ్యకములు కావు. వానిని విడనాడినను నాభాషలకు లోపములేదు."

## సమాధానము.

గ్రంథస్థములుగాని ద్రావిడభాషలనుగూర్చి యెక్కువగాఁ బరిశోధనము జరుగలేదు. వీనిలో సంస్కృతపదము లెక్కువగా లేకుండుటకుఁ గారణము తెలుపాతికాలపు ఆర్య విజ్ఞాన మీభాషలను మాట్లాడు జాతులకుఁ జేరకుండుటయే. సంస్కృతిపదములుగాక తక్కిన శబ్దజాలమునకును, గ్రంథస్థములయిన భాషలలోని తద్భవ, దేశ్యశబ్దజాలమునకును సంబంధము పరిశోధకులు గుర్తించియే యున్నారు. సంస్కృత ప్రాకృతభవములైన శబ్దములను ద్రావిడభాషలు విడనాడఁ గలవనుట సరికాదు. గంజి, నీరు, అంబలి, కూడు; గరిటె, తెడ్డు, గిన్నె; కట్టెలు, విసనకఱ్ఱ, మంచము, చేప, గొడ్డలి, కత్తి; ఇల్లు, కొట్టు, అంగడి, అటక; మేక, గొఱ్ఱె, గుఱ్ఱము, గాడిద; అప్ప, అమ్మ, మామ, అత్త, బావ, అక్క:—ఇట్టి వందలకొలది సంస్కృత ప్రాకృత భవములను తెలుఁగువారు విడనాడఁ జాలరు.

5. "భాషానిర్మాణము:—శబ్దజాలముమాట యెట్లున్నను భాషానిర్మాణ విషయమున సంస్కృతమునకును ద్రావిడభాషలకును నెట్టి సంబంధమును లేదని చెప్పుచు కాల్డ్వెలు ఈ క్రింది విషయములను వివరించి యున్నాఁడు

1. "సంస్కృతములోని లింగమునకును ద్రావిడభాషలలోని లింగమునకును సంబంధమే లేదు. సంస్కృతములో లింగము శబ్దముల యంతములను బట్టియుండును. ద్రావిడభాషలలో నిది సహజలింగము. ఇందు శబ్దముల యంతములతోఁ బనిలేదు."

---

## సమాధానము.

---

సంస్కృతములోఁగూడ సంపూర్ణముగ శబ్దముల యంతముల ననుసరించి లింగమేర్పడునని తలంపవీలులేదు. అకారాంత శబ్దములలో దారాః వంటి శబ్దములు కొన్ని పుంలింగములు. ఇకారాంతములలో పుంలింగములును స్త్రీలింగములునుగూడ గలవు. అ, ఇ, ఉ, ఋ, లు అంతమందుగల శబ్దములు మూఁడు లింగములందును గలవు. ఇట్లే హలంతశబ్దములందుగూడ నొక నిర్ణయములేదు. కాని శబ్దముల లింగము ననుసరించి వానితోఁ జేరు విభక్తి ప్రత్యయములు మాఱుచుండుననుట నిజము. ప్రాకృతభాషలలో శబ్దముల యంతములు వివిధముగ మార్పుల నొందుటచే నేశబ్ద మేలింగమో నిర్ణయించుట కవకాశము లేకపోయినది. రానురాను నేఁటి యార్యభాషలయందు గొన్నిటిలోఁ దప్ప శబ్దములనుబట్టి తెలియఁదగిన లింగజ్ఞాన మంతరించినది.

ఈ లింగజ్ఞాన మున్నకోలఁది యార్యభాషలలోఁగూడ నెన్నియో తబ్బిబ్బులు గానవచ్చుచున్నవి. ద్రావిడభాషలలో లింగముల యవస్థయు నిట్లే యున్నది. ఆర్యభాషలలో లింగజ్ఞానము మిగిలియున్నంత మట్టుకు ద్రావిడభాషలలోఁ గూడ లేకపోలేదు. శబ్దమును వినినంతనే దాని యంతమునుబట్టి కొన్నిమాటల లింగమును ద్రావిడభాషలలోఁ దెలిసికొనవచ్చును. తెనుఁగులో తోయ్యాలి, పైదలి, కలికి, ముండమోపి, సంగనాచి, మారి, ఆలి, ఉగ్మలి, మొదలగు శబ్దములలోని ఇకారమును, మించుఁబోడి, వన్నెలాడి మొదలగు శబ్దములలోని ఇప్రత్యయమును, ఎఱుకత, కొఱవత, బోయత, మెలత, చాకిత, మాలెత మొదలగువానిలోని తప్రత్యయమును, పొలఁతి, పడతి, నాతి, గోతి మొదలగు వానిలో తిప్రత్యయమును, వెలఁది, మాలది, మొదలగువానిలోని ది ప్రత్యయమును స్త్రీలింగద్యోతకములుగ నున్నవి. బుడ్డ, బుడ్డి ; టెంప, టెంపి; పిచిక పిచికి, మొదలగు జంటలలో మొదటిది శబ్దరూపమునుబట్టియే పుంలింగమనియు రెండవది స్త్రీలింగమనియు ద్యోతకమగుచున్నది. ఇట్లే స్త్రీలపేళ్లను హ్రస్వము చేసి పిలుచునప్పుడు పాపి, సూరి, గురివి, వెంకి, మొదలగురీతుల ఇకారమును స్త్రీలింగ ప్రత్యయముగ వాడుట సర్వసాధారణము. ఇట్లే యితర ద్రావిడ భాషలయందును గలదు.

2,4. "సంస్కృతమునోవలె ద్రావిడభాషలలో విభక్తి ప్రత్యయములు లేవు. విభక్తి ప్రతిరూపకావ్యయములు మాత్రము ప్రాతిపదికములకుఁ జేర్పఁబడును. ఏకవచనములో విభక్తుల కేప్రత్యయములు చేరునో బహు వచనమునందును నవియే చేరును. ఏకవచనమునఁ బ్రాతిపదికమునకును, బహువచనమున బహువచన ప్రత్యయమునకును నివి చేర్పఁబడును. సంస్కృత ములో మూఁడు వచనములందును మూఁడు ప్రత్యయములు చేరును."

**సమాధానము.**

ఈ విషయమై యింతకుముందే కొంత వివరింపఁబడినది. సంస్కృతము లోని విభక్తిప్రత్యయములన్నియు వికారముల నొందుటయు విభక్తిజ్ఞాన మంతరించుటయుఁ దిరిగి విభక్తులను బోధించుటకుఁ బ్రత్యేకావ్యయములను బ్రాకృతములోను నేఁటి యార్యభాషలలోను నుపయోగింపఁ బడుటయు నింతకుముందు తెలిసికొంటిమి. నేఁటి యార్యభాషలలో సరిగ ద్రావిడభాషల యందువలెనే విభక్తివిధానము కాన్పించుచున్నది. ఒక్క యుదాహరణము చాలును,

హిందీ: రామ్; తెలుఁగు: రాముఁడు.

| | ఏక. | | బహు. | |
|---|---|---|---|---|
| | హిందీ | తెనుఁగు | హిందీ | తెనుఁగు |
| ప్ర. | రామ్ | రాముఁడు | రామ్-లోగ్ | రాములు |
| ద్వి | రామ్-కె | రాముని | రామ్-లోగన్-కె | రాములను |
| తృ | రామ్-సే | రామునిచే, రామునితో. | రామన్-లోగ్-సే | రాములచే, రాములతో |
| చ. | రామ్-కే | రామునికై | రామన్-లోగ్-కే | రాములకై |
| ప. | రామ్-సే | రామునికంటె | రామన్-లోగ్-సే | రాములకంటె |
| ష | రామ్-కే | రామునికి | రామన్-లోగ్-కే | రాములకు |
| స | రామ్-మే | రామునియందు | రామన్-లోగ్-మే | రాములందు |
| సం. | హేరామ్- | ఓరామ | హేరామన్-లోగ్ | ఓరాములారా |

3. "ద్రావిడభాషలలో నను మహద్వాచక శబ్దములకు బహువచనరూపములు లేవు. క్రియలలో నమహద్బహువచనము లింకను నడుదుగనున్నవి. సంస్కృతములో నట్లుగాదు."

## సమాధానము

తమిళములోఁ బూర్వకాలమున నెట్లున్నను నేఁటి తమిళమునందును నితర ద్రావిడభాషలయందును నిట్టివాడుక గానరాదు. ప్రాకృతావస్థలో నేకవచన బహువచన రూపములకు భేదము పోయినది. నేఁటి యార్యభాషలలోఁ గూడ నట్లే యున్నది. బహుత్వమును దెలుపుటకు నేఁటి యార్యభాషలయందు ప్రత్యేక సమూహవాచక శబ్దములుపయోగింపఁబడుచున్నది. అట్లే ప్రత్యేక ద్రావిడభాషలయందును గాన్పించుచున్నది.

5. "ఇండో యూరోపియను భాషలలోఁ గ్రియల కుపసర్గములు చేరుచుండును. ద్రావిడభాషలలో నుపసర్గములు లేవు. వానికిమాఱుగఁ బ్రత్యేక శబ్దములు పదముల తఱువాత చేరుచుండును."

## సమాధానము

ప్రాకృతభాషలలోనే యుపసర్గలు ధాతువులతోఁ గలసిపోయి వికారమునుబొందు, యవి యుపసర్గలను గుర్తులేకుండఁ బోయినవి. ఉపసర్గలతోఁ గూడిన సంస్కృతధాతువులు ప్రత్యేకధాతువులుగాఁ బ్రాకృతములో వెలసి

నవి. వానికిఁ బ్రత్యేకపదములు చేర్పఁబడుచు వచ్చినవి. నేఁటి యార్యభాష లలోను ద్రావిడభాషలలోనుగూడ నట్లే జరిగినది

6. సంస్కృతమునందలి విశేషణములకు విశేష్యములకువలె లింగ విభక్తివచనములనుబట్టి వేర్వేరురూపములు గలుగుచుండును. ద్రావిడభాష లయం దట్లుగాదు.

సమాధానము.

సంస్కృతమునందలి యీ విధానమును గూడఁ బ్రాకృతములందును మా ర్పుల నొందినది. ఈ విషయమున నేఁటి యార్యభాషలయందు వైవిధ్యము గాన్పించుచున్నది. సంస్కృతమునందు విశేషణము వచనమునందును విశే ష్యము ననుసరించుచుండ గౌడభాష లన్నిటిలోను ప్రథమేతరవిభక్తి ప్రాతి పదికమే యేక బహువచనములలో నొక్కరూపమున నున్నది. సింధీలో మాత్రము విశేషణముయొక్క స్త్రీలింగ బహువచనము విశేష్యము ననుస రించును. విశేషణములతోఁ జేరు విభక్తిప్రత్యయముల విషయమునఁ గూడ సంస్కృతమునకును నేఁటి గౌడభాషలకును గొంత భేదమున్నది. విశేష్యముల ప్రథమేతర విభక్త్యేకవచన ప్రాతిపదికము తూర్పుహిందీ, వ్రజభాష లలో'ఆ,' మరాఠీభాషలో'యా,'లతో నంతమైయుండగా విశేషణముల 'యా' రూపము 'ఆ' తో నంతమగుచున్నది. ఇట్టి నిట్టిభేదము లనేకము లున్నవి. ఇట్టి వ్యవహారము గౌడభాషలలో నుండుటకుఁ గారణ మాభాషలలో దీర్ఘాచ్చులతో నంతమగు పదము లుండుటయే. ద్రావిడభాషలలో దీర్ఘము లన్నియు హ్రస్వములగుటచే నీ విధానము నంతరించినది.

7. ద్రావిడభాషలలోఁ గ్రియాజన్య విశేషణముల నెక్కువగ వాడు దురు. సాధారణ విశేషణముల వాడుక చాల తక్కువ.

సమాధానము.

గౌడభాషలలోఁ గూడ, ముఖ్యముగఁ బశ్చిమ దక్షిణ గౌడభాషలలో నిట్లే యున్నది.

8. ద్రావిడభాషలలో నుత్తమపురుష బహువచనమున రెండు రూప ములున్నవి. అందొకటి మాట్లాడుచున్నవారిని కలిపియు (మనము), మఱి యొకటి మాట్లాడుచున్నవారిని విడిచిపెట్టియు (మేము) ప్రయోగింపఁబడును. సంస్కృతములో నిట్లులేదు.

సమాధానము.

ఈ విషయమై గ్రియర్‌సన్‌గారి ట్లు చెప్పుచున్నారు. "ఉత్తమ పురుష బహువచనములోఁ దమిళము, మళయాళము, కురుఖ్, కుఇ, తెలుఁగు అను ద్రవిడభాషలలోమాత్రము రెండురూపములున్నవి. కురుఖ్, కుఇ, తెలుఁగు అను భాషలలో నెదుటివారిని విడిచిన రూపమే తమిళ మళయాళము లలో వానిని చేర్చునట్టి రూపముగా నున్నది. ఇందువలన మూలద్రావిడభాషలో నుత్తమపురుష బహువచనమున రెండు రూపములుండెనని గలుగలేదని యూహింపవలసి యున్నది. కన్నడము, గోండు, బ్రాహూఈ భాషలలో నుత్తమపురుష బహువచనమున నొక్కరూపము మాత్రముండుట యీ యూహను బలపఱుచుచున్నది. కావున నుత్తమ బహువచనమున రెండు రూపము లుండుట మఱియొక భాషాసంబంధము సంపర్కమువలనఁ గలిగి యుండవలెను. ముండా భాషలయందు బహువచనమున రెండు రూపము లున్నవి. ద్రావిడ భాషలయందును రెండురూపము లుండుట యీ ముండా భాషల సంపర్కము మూలముననే యయి యుండును"

ఈ విషయమింకను 'సర్వనామప్రకరణము'న ముందు చర్చింపఁబడును.

9. ద్రావిడభాషలలోఁ గర్మణిప్రయోగము లేదు. సంస్కృత ములో నున్నది. కర్మణిభావము ద్రావిడభాషలలోఁ బ్రత్యేక క్రియలను జేర్చుటవలనఁ దెలుపఁబడును.

సమాధానము.

నేఁటి గౌడభాషలలో ద్రావిడభాషలయందువలె కర్మణిప్రయోగము మృగ్యముగా నున్నది.

10. ద్రావిడభాషలలో సముచ్చయార్థమున శత్రర్థకములును, క్త్వార్థ కములును వాడఁబడును. సంస్కృతములో సముచ్చయచిహ్నము ప్రత్యేక ముగ నున్నది.

సమాధానము.

నేఁటి గౌడభాషలలో ద్రావిడభాషలయందువలెనే యున్నది.

11. ద్రావిడభాషలలో నఞర్థక క్రియలున్నవి. సంస్కృతములో లేవు.

సమాధానము.

ప్రాకృతములలో నఞర్థకమగు నకారము ధాతువులతోఁ జేరుచు వచ్చి నది. నేఁటి సింధీభాషలో గ్రియారూపములోనే మార్పుగలిగి నఞర్థకము దెలుపఁబడుచున్నది.

12. ద్రావిడభాషలలో సంబంధార్థక సర్వనామములు లేవు. వాని యర్థమును దెలుపుటకు సంబంధార్థక క్రియాజన్య విశేషణములు వాడుకలో నున్నవి.

సమాధానము.

ద్రావిడభాషలలో సంబంధార్థక సర్వనామములు లేవనుట సరికాదు. యావను, ఎవన్, ఎవఁడు మొదలగునవి సంబంధార్థక సర్వనామములే. ఇవి సంస్కృతములోని యః అను సంబంధార్థక సర్వనామమునకు వికారములే. ప్రశ్నార్థక సర్వనామము ద్రావిడభాషలలో లేదనియు సంబంధార్థక సర్వనామమే ప్రశ్నార్థకముగ నుపయోగింపఁ బడుచున్నదనియుఁ జెప్పుట యుక్తము.

13. ద్రావిడభాషలయందలి వాక్యనిర్మాణపద్ధతి సంస్కృతమునకు భిన్నముగా నున్నదనుటకు సమాధానము లిదివఱకు జేయబడియే యున్నది.

## ద్రావిడభాషలయందు తెనుఁగున కీయఁదగిన స్థానము.

ద్రావిడభాషలన్నిటికిని మూలభాష యొకటి యుండవలెను. అట్టి భాషయొక్క లక్షణములు చాలమట్టుకు నేఁటి తమిళభాషయందు నిలిచి యున్నవనియు, కావున నదియే ప్రాచీనము ద్రావిడభాష యనియు కాల్డ్వెల్ మున్నగువారు తలంచియుండిరి. కాని యిటీవలి పరిశోధనముల మూలమునఁ బ్రాచీన ద్రావిడభాషాలక్షణములు తెలుఁగు మొదలగు భాషలయం దెక్కువగ నున్నవని తేలినది.

తమిళ మళయాళములు ఒకే భాషయొక్క రెండు శాఖలు. కన్నడము తమిళముతోఁ గొన్ని పోలికలను గలిగియున్నను నెక్కువ విషయములందు తెనుఁగుతో సంబంధించి యున్నది. తుళు, కొడుగు, తోద, కోత భాషలు తమిళకన్నడములకు మధ్యస్థానము నాక్రమించియున్నవి. కురుఖ్, మల్తొ భాషలకును నాస్థానమునే యివ్వవలెను. ఇవి, కోందుభాషలు తమిళమును కంటెఁ దెలుఁగునే యెక్కువ పోలియున్నవి. కోలామి, నాయకీ, భీలీ భాషలకుఁ గూడ నదియేస్థానము నీయవలయును. తెలుఁగుభాష తక్కిన ద్రావిడ భాష లన్నిటికంటె స్వతంత్రమగు స్థానము నాక్రమించుచున్నదని గ్రియర్సన్ పండితుని యభిప్రాయము.

తెలుఁగునకుఁ గల యీ ప్రత్యేకత్వమునకుఁ గారణమేమి? ప్రాచీన ప్రాకృతభాషల కిది తక్కిన ద్రావిడభాషలకంటె నెక్కువ దగ్గఱగా నుండుట యే యని యీ గ్రంథమును జదువుచున్నపుడు గోచరింపఁగలదు. ఆంధ్రభాషా

చరిత్రము వ్రాయునప్పు డొకవంక తక్కిన ద్రావిడభాషలకును మఱి యొకవంక ప్రాచీన ప్రాకృతభాషలు, నేఁటి యార్యభాషలకును గల సంబంధములను పోలికలను జూపుట యావశ్యకమగును. ఈ విషయమై పరిశోధనమును క్రొత్తగ నారంభించియుండుటచే నిందు గొన్ని స్ఖాలిత్యము లుండవచ్చును. చిన్నచిన్న వివరములలో నభిప్రాయభేదము లచ్చటచ్చట గలిగినను గ్రంథమును జేదివిన వెనుక మొత్తముమీఁద నాంధ్రభాషయు దానితో సంబంధించిన యితర ద్రావిడభాషలును ప్రాకృతభాషాభేదములే యను నభిప్రాయము పండితుల మనస్సునం దంకురించినచో నదియే నేను చేసిన కృషికిఁ బ్రతిఫలము కాఁగలదు.

# ఉపోద్ఘాతమున కనుబంధము.

(1) 1931-జనాభా నివేదికలో తెనుఁగును గూర్చి వ్రాయఁబడిన యంశము లీక్రింద సంగ్రహముగా చూపఁబడినవి:—

"మాతృభాషయనఁగా నేమి?"

"1921 - సంవత్సరమున జనాభా తీసికొన్నప్పుడు 'మీ మీయింట సాధారణముగా నేభాష మాట్లాడుకొందురు ? అని అడుగుచుండిరి. ఈ (1931) జనాభా సమయమున "నీ మాతృభాషయేమి ? " అని అడిగిరి. మాతృభాష యేది యను విషయమున నెవ్వరు నెట్టి సందేహమును పడనక్కఱలేదని యెంచుచుందురు. కాని, జాతులును భాషలును నొకదానితోనొకటి కలియుచుండు నీ దేశమున సాంఘికాచారములందును, మత నియమములందునువలె భాషా విషయమునఁ గూడ మాతృభాష యిదమిత్థమని చెప్పుట కష్టమగుచుండును. కావున, నీ విషయమున నెట్టి ప్రశ్ననువేయుట అను విషయమై నిర్ణయించుట కొంచెము కష్టమయ్యెను. సాధారణ మనుష్యుఁడు సరియైన ప్రత్యుత్తరమిచ్చుటకు సరియైన, సూత్రప్రాయముగనుండు ప్రశ్నను కోరుచుండును. కొందఱీ విషయమున నెట్టి ప్రశ్నకును లొంగకుండిరి. "తమిళుఁడు తెనుఁగు స్త్రీని పెండ్లాడిన వారిసంతానముభాష యేమగును?" అని యొకఁడు ప్రశ్నించును. గంజాము జిల్లాలో తెనుఁగును ఒఱియాయుఁ గలియుచోట, తెలుగు ఒఱియాభాషల రెండింటిని గూడ మాట్లాడు తెగలవారున్నారు. ఒకటే కుటుంబములోని జనుల పేర్లలో ఒఱియా పేళ్ళు, తెనుఁగు పేళ్లుకూడ వినబడుచున్నవి; తెనుఁగువారిలోనుండు ఇంటిపేళ్లు అట్టివిశేని ఒఱియా కుటుంబములలో వినఁబడుచున్నవి. అట్టి జనులు తమ మాతృభాష యేది యని యడిగినప్పుడు సరిగ చెప్పలేరు. తమ పూర్వులనుండి యీ విషయమై తెలిసి యుండలేదు; తెలిసికొనుటకు వారికిఁ జాలినంత విద్యయులేదు. చిన్ననాఁటనుండియు వారు రెండుభాషలను మాట్లాడుచునే యున్నారు. "నీ వింటిలో ఏ భాష మాట్లాడెదవు ? " అని తొలిసారి యడుగఁగా 'తమిళము' అని చెప్పినవాఁడు, నా యెదుటనే తిరిగి 'నీ మాతృభాషయేది?' అని యడిగినప్పుడు 'తెలుఁగు' అని ప్రత్యుత్తరమిచ్చెను. ఈతఁడు తెలుగువాఁడు; తెలుఁగురాని తమిళ స్త్రీని పెండ్లాడినాఁడు; కాఁబట్టి, గృహకృత్యములు సరిగ జరుగుటకు భార్యభాషను నేర్చికొని, ఇంటిలో తమిళమును మాట్లాడుచున్నాఁడు. కడపజిల్లాలో ఒక సూపర్వైజరు తన ప్రశ్నకు సరియైన సమాధానము చిక్కక, "నీ తల్లిపాలతో ఏ భాషను త్రాగినావు? " అని ప్రశ్నించినాఁడు. ఈ ప్రశ్నకు వెంటనే సరియైన సమాధానము వచ్చినది.

## ii. ఉపభాష.

ఒక భాష మాతృభాషగాఁ గలవారు కొందఱు ఇతరభాషాప్రదేశనివాసమువలనను, వ్యవహారవశమునను మఱియొక, లేక కొన్ని, భాషలను నేర్చియుండవచ్చును. అట్లు నేర్చిన యితర భాషల కుపభాషలని పేరు.

## iii. చెన్నరాజధానిలోని భాషలు.

చెన్నరాజధానిలో తమిళము, మళయాళము, తెనుఁగు, కన్నడము, తుళు, హిందూస్థానీ, అను ప్రాంతగలభాషలు లున్నవి. వీనిలో తెనుఁగన్నిటికంటె సుస్వరితమును, శ్రావ్యమునునై యున్నది. దీని నైరోపా భాషలలోని 'ఇటాలియను' తోఁబోల్చుట సరిగనే యున్నది. కాని, కొన్ని ఇటాలియను ఉపభాషలు చెవికసహ్యముగా నుండునట్లే, తెలుగునఁ గూడ నన్ని యుపభాషలును నొక్కరీతిగనే శ్రావ్యముగ నున్నవని చెప్ప వీలులేదు.

## iv. తెలుఁగుభాషకు సరిహద్దులు.

(అ) I తెలుగు-ఒరియా సరిహద్దు:— గంజాము జిల్లాలోను, విశాఖపట్టణము ఏజెన్సీలోను కొన్ని ప్రదేశములలో రెండు భాషలును సరిసమానముగ నూటికేఁబది వంతున నున్నారు; కొన్ని ప్రదేశములలో రెండుభాషలును నూటికేఁబదివంతును పొందియుండలేదు. సముద్రప్రాంతమందెల్ల తెనుఁగువారుండుట గమనింప దగినది ఋషికుల్యా ముఖద్వారముదాఁకను తెనుఁగువారున్నారు. కొన్ని రీతులుగ ఋషికుల్యా నదియు, దాని యుపనదులును ఒరియా భాషకు దక్షిణపు టెల్లయని చెప్పవచ్చును .. ..విశాఖపట్టణము ఏజెన్సీలో నారంగపూరు ఉత్తరభాగము, జయపురము, కోరపుట్టు తాలూకాలలో ఒరియాభాషయే ప్రధానమైనదని వలెను; కాని, యిచటఁగూడ నాభాష కోయమొదలగు భాషల ప్రదేశము నాక్రమించుచున్నదనియే చెప్పవలెను . విశాఖపట్టణము ఏజెన్సీకి దక్షిణముగ వచ్చినకొలఁదిని తెనుఁగుభాష ప్రబలముగ నున్నది, గూడెము, శిరివల్లి తాలూకాలలోను పాల్వాతాలూకా దక్షిణమునను తెనుఁగ ప్రధానభాషయని చెప్పవలెను.

(ఆ) II. తెలుఁగు - కన్నడముల సరిహద్దు:— ఈ యెల్ల ఉత్తరమున హగరీ నదియు దాని యుపనదియగు చిన్న హగరియు నని చెప్పవచ్చును. మడకశిరా తాలూకా పశ్చిమభాగము కొంచెము తప్ప అనంతపురము జిల్లా యంతయు తెనుగుఁ దేశమందే చేరుచున్నది. ఇచట తెనుఁగు సరిహద్దు మైసూరు సంస్థానములోనికి చొచ్చుకొని పోవుచున్నది. ఆ సంస్థానములోని కోలారు జిల్లాలోని జనులలో మూఁడువంతులలో రెండువంతులుమంది తెలుఁగునుమాతృభాషగా చెప్పికొని యున్నారు. ఈ యెల్ల హిందూపురమునుండి కుప్పమునకు నున్నదని చెప్పవచ్చును; కాని, యీ విషయము మైసూరు జనాభా లెక్కలవలన నిర్ణయము కావలసి యున్నది. ఈ యెల్ల సేలము జిల్లాలోని హోసూరు తాలూకా ఉత్తరపు భాగమును కోసికొనిపోయి, పుత్తూరు, చిత్తూరు, తిరుత్తని తాలూకాలలోని దక్షిణ భాగమునను తెనుఁగు ప్రదేశమునఁ జేర్చుచు, చిత్తూరు - ఉత్తరార్కాడు జిల్లాల సరిహద్దు ననుసరించి, చెంగల్పట్టు జిల్లాలోని తిరువళ్లూరు, పొన్నేరి తాలూకాలను తెనుఁగుదేశమునఁ జేర్చుచు, పులికాడు సరస్సునకు దక్షిణమున సముద్రమును గలియుచున్నది.

(ఇ) III. తెలుఁగు - అరవముల సరిహద్దు:— దక్షిణమున అరవదేశములో తెనుఁగునకెల్లను నిర్ణయింప వీలులేదు. తూర్పు-పడుమటి కనుమల మధ్యమునందెల్ల తెనుఁగు కొలదిగనో గొప్పగనో వ్యాపించి యున్నది. దక్షిణ ఆర్కాడు దక్షిణపు తాలూకాలలోఁదప్ప, తంజావూరుజిల్లా, పుదుకోట సంస్థానము, రామనాథ, శివగంగ జమీందారీలు, తామ్రపర్ణీనదికి దక్షిణముననున్న తిరునల్వేలిజిల్లా,—ఇచట నచట నన నేల, దక్షిణదేశమందెల్లెడల తెనుఁగు మాతృభాషగా విననచ్చుచున్నది. ఈ యెల్ల ఒక మార్గమును పట్టలేదు; కాని, రెండు విషయములుమాత్రము గమనింపఁ దగినవి— (i) మిట్ట ప్రదేశము ననుసరించుట (ii) రాయలసీమలోని నల్ల రేగడభూముల నాశ్రయించుట. తూర్పు తీరమునను, నదీముఖద్వారములను తెనుఁగు లేదు. తిరునల్వేలి, రామనాథ జిల్లాలలోని కనుమలకు తూర్పుననున్న ఎట్టిమట్టి భూములలో తెనుఁగువారు పలుచగను, సత్తూరు, శ్రీవిల్లిపుత్తూరు, శంకర నారాయణర్ కోవిల్, కోవిల్

పత్తి తాలూకాలలోని నల్లరేగడ భూములలో అధికముగను గానవచ్చుట గమనింపఁదగినది. ఇట్లే, మధురజిల్లాలోని తిరుమంగళము తాలూకా నల్లరేగడభూములకు ప్రసిద్ధి; ఇచట తెనుఁగువా రెక్కువగ నున్నారు. ఆ జిల్లాయందే మేలూరు తాలూకాలో పచ్చని భూము లున్నవి; ఇచట తెనుఁగువా రంతగా లేరు.......

(ఈ) IV. పడమటి తీరము:— ఈ తీరమున గూడ తెనుగువారు స్థిరనివాసము నేర్పఱచుకొని యున్నారు. దక్షిణ కనరా జిల్లాలోని 'కొరగ' లట్టివారు. వీరికొక రహస్య భాష యున్నది. ఇతరులు వినుచుండఁగా వారు దానిని మాట్లాడరు కాని, అది తెలుఁగును బోలియుండునని తెలియుచున్నది. శ్రీ రనంతపురమునుంచి యొక రాజు సేనతో నా ప్రదేశమునకు వచ్చియుండినట్లు వీరియందొక ఐతిహ్యమున్నది.

## తెలుఁగువారి యుపభాషలు.

తెనుఁగు మాతృభాషగాఁ గలిగి మఱియొకదాని నుపభాషగా వాడుచుండు తెనుఁగువారి సంఖ్య, తమిళము మాతృభాషగాఁ గలిగి యుపభాషల నవలంబించిన తమిళుల సంఖ్యకంటె నాలుగురెట్లెక్కువగా నున్నది. ఈ దేశమునందు తెనుఁగెంత విరివిగ వ్యాపించియున్నదో తెలియఁగలదు. హిందుస్థానీ భాష మాట్లాడువారికంటెను తెనుఁగు మాతృభాషగాఁ గలవా రెక్కువగ నేక ప్రదేశములందు వ్యాపించియున్నారు తెనుఁగువా రెక్కువగ నుపయోగించు నుపభాష తమిళము; కాని, తక్కిన భాషలు మాట్లాడువారు [illegible]గనో, గొప్పగనో తెనుఁగును మాట్లాడుచుందురు. గోదావరి, కృష్ణా జిల్లాలలో తెనుఁగెక్కువగా నుండుటవలన నిచటి వారి కుపభాషలు లేవు; పుదుక్కోట సంస్థానములో తెనుగువారిలో నూటికి తొంబది యెనిమిది మంది తెనుఁగునే యెక్కువ జీవనమునందు వాడుదురు .... తెలుగువారిని గూర్చి 'దక్షిణాపథ విహారి' యని వర్ణింపవచ్చును, [illegible] వారు."

## II

చెన్నరాజధానిలోని జనసంఖ్యలో ప్రతి 10,000 మందికి నానాభాషలు మాట్లాడువారి క్రింది విధముగ నున్నారు:—

| | 1931 | 1921 | 1911 | 1901 |
|---|---|---|---|---|
| తమిళము | 4,013 | 4,11 | 4,0 0 | 4 035 |
| తెలుఁగు | 3,768 | 3,772 | 3,769 | 3,706 |
| మళయాళము | 790 | 754 | 740 | 739 |
| ఒరియా | 392 | 368 | 383 | 468 |
| కన్నడము | 366 | 361 | 382 | 406 |
| హిందుస్థానీ | 260 | 234 | 233 | 230 |
| తుళు | 121 | 126 | 122 | 128 |

## III

## ఉపభాషలు (Dialects).

తెనుఁగు మాట్లాడువారు తమభాషకు పేర్లుగా చెప్పుకొనిన కొన్ని శబ్దములు:—

గంజాముజిల్లా దరుల (2);

విశాఖపట్టణము:—అఘ్రు (84); బగత (27); బోయ (13); చెంచు (277); ద్రవిడ (1, 487); ఏతవన్ (2); ఏతి (40); జోగి (6); మాల (313); మొసిరి (23); ముల్వాళి (2); రెడ్డి (10); క్షత్రియ (14); ఉపాప్పరు (2); వైష్ణవ (4); యాత(9).

తూర్పు గోదావరి-బసగొల్ల (7), దొమ్మర (43); వుప్పరి (1).

పశ్చిమ గోదావరి:—మోటు (3) ;

కృష్ణ:—రంగిరాజు (30); యానాది(10).

అనంతపురము:— జోగ (13).

బళ్లారి:—బాటక (3); వడ్డరు (20).

మధుర:—ముత్తువర్ (70).

కోయంబత్తూరు:—తోడియ (2); తొట్టియర్ (3).

## IV.

### ద్రావిడభాషా కుటుంబములో తెనుఁగునకుఁ గల స్థానము.

| వర్గము | భాష | ఉపభాష | మొత్తము సంఖ్య (000లు వదలఁబడినవి) 1931 | 1921 | 1911 | 1901 | 10,000 కింత 1931-లో |
|---|---|---|---|---|---|---|---|
| ద్రావిడవర్గము, | తమిళము | | 18,897 | 17,5[illegible]7 | 17,038 | 15,544 | 4,004 |
| | | ఇరుళ | 2 | 1 | 2 | 1 | ... |
| | | కొరవ,లేక యెరుకుల | 41 | 35 | 43 | 41 | 9 |
| | మళయాళము | | 3,727 | 3,226 | 3,099 | 2,861 | 790 |
| | కన్నడము | | 1,686 | 1,504 | 1,502 | 1,531 | 357 |
| | | బడగ | 43 | 40 | 39 | 34 | 9 |
| | తుళు | | 566 | 541 | 513 | 496 | 121 |
| | తోడా | | 1 | [illegible] | 1 | 1 | ... |
| | కోత | | 1 | 1 | 1 | 1 | ... |
| మధ్యస్థవర్గము, | కుయి, లేక కోందు | | 385 | 342 | 371 | 357 | 82 |
| | | జాతాపు | 20 | ... | ... | ... | 4 |
| | | పెంగో | 2 | ... | ... | ... | ... |
| | గోండీ | | 3 | 11 | 8 | 4 | 2 |
| | | కోయ్, లేక, కోయ | 79 | 46 | 49 | 47 | 17 |
| | ధ్రువ | | 2 | ... | ... | ... | ... |
| | కొండ | | 22 | 25 | 19 | 15 | 5 |
| | పర్జి, లేక, పోరోజ | | 39 | 52 | 59 | 26 | 8 |
| | | ఝోడియా | 5 | ... | ... | ... | 1 |
| ఆంధ్రవర్గము:— | తెలుఁగు | | 17,783 | 16,144 | 15,782 | 14,315 | 3,768 |

# సంస్కృత ప్రాకృతములు.

---

ఆంధ్రశబ్దముల వ్యుత్పత్తిని సరిగ నిర్ణయించుటకు సంస్కృత ప్రాకృత ధ్వనులకుఁగల సంబంధమును, ప్రాకృతాంధ్రముల ధ్వనులకుఁగల సంబంధమును ముందుగఁ దెలిసికొనవలెను. ఈ మార్పులను గమనింపక పరిశోధకులింతవఱకుఁ గేవల ద్రావిడదృష్టితోడనే వ్యవహరించియున్నారు. సంస్కృత ప్రాకృత దృష్టితోఁ గూడఁ బరిశోధనలను సాగించినచో నేమి తేలునో యను నుద్దేశముతో చేయఁబడిన కృషి కీ యధ్యాయము ఫలితము. ఇందు పొందుపఱుపఁబడిన దంతయు సిద్ధాంతమని తలంపఁ గూడదు. అది యాంధ్ర విద్వాంసుల దృష్టిని క్రొత్తమార్గమునకు మఱలింపఁజేసిన ప్రయత్నము గాని వేఱుగాదు.

ఈ క్రింది పట్టికలలో సంస్కృత ధ్వను లాయా ప్రాకృతములలో నెట్టి మార్పులఁబొందినవను విషయము నేఁటి కచ్చుపడిన ప్రాకృతవ్యాకరణముల సహాయమున నిర్ణయింపఁ బడినది. ఈ పట్టికలు పరిశోధకులకు మున్ముందుః సహాయపడఁగలవని తలంచెదను.

| సంస్కృతము. | మహారాష్ట్రీ | జైన మహారాష్ట్రీ | మహారాష్ట్ర అపభ్రంశ | అర్ధమాగధీ | మాగధీ | మాగధీ అపభ్రంశ | శౌరసేనీ | జైన శౌరసేనీ | ఆవంతీ | ఆభీరీ | నాగర | ఉపనాగర | పైశాచీ | చూళికా పైశాచీ | అ భ్రం. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఋ | ఋ | | | | | | | | | | | | | ఋ | |
| | అ | అ | | అ | అ | | అ | అ | అ | | అ, ఆ | | అ | | అ |
| | ఇ | ఇ | | ఇ | ఇ | | ఇ | ఇ | | | ఏ, ఈ, ఉ | | ఇ | | ఇ |
| | ఈ | ఈ | | | | | | | | | ఋ | | | | |
| | ఉ | ఉ | | ఉ | ఉ | | ఉ | ఉ | | | | | | | ఉ |
| | ఊ | | | | | | | | | | | | | | |
| | ఎ | | | ఎ | | | ఎ | | | | | | | | |
| | ఒ | | | | | | | | | | | | | | |
| | రి | రి | | రి | | | రి | రి | | | | | | | రి |
| | | | | | లి | | | | | | | | | | |
| ౠ | ఇ | | | | | | | | | | | | | | |
| | ౠ | | | | | | | | | | | | | | |
| | ఊ | | | | | | | | | | | | | | |
| | లి | | | | | | | | | | | | | | |
| | | | | | లి | | | | | | | | | | |
| ఐ | ఐ | | | | | | | | | | | | | | |
| | ఏ | ఏ | | ఏ | | | ఏ | ఏ | | | | | | ఏ | ఏ |
| | అ, ఇ | అ, ఇ | | అ, ఇ | | | | | | | | | | | |

| సం. | మహా. | జై. మ. | మ. అప. | అర్ధమాగధీ | మా. | మా. అప. | శౌర | జై. శౌర | ఆవంతీ | ఆభీరికీ | నాగర | పై. | మా. పై. | అప. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఔ | ఔ | | | | | | | | | | | | | |
| | ఓ | ఓ | | ఓ | ఓ | | ఓ | ఓ | | | | | | |
| అ | అ | అ | | అ | అ | | అ | అ | | | | అ | అ | అ |
| | ఇ | ఇ | | ఇ | ఇ | | ఇ | ఇ | | | | | | ఇ |
| | ఉ | ఉ | | ఉ | | | ఉ | ఉ | | | | ఉ | | ఉ |
| | ఎ | ఎ | | ఎ | ఎ | | ఎ | | | | | | | ఎ |
| ఆ | ఇ | ఇ | | ఇ | | | | ఇ | | | | | | ఇ |
| | అ | అ | | అ | అ | | అ | అ | | | | | | అ |
| | ఈ | ఈ | | ఈ | | | | | | | | | | ఈ |
| | ఉ | ఉ | | ఉ | | | ఉ | | | | | | | ఉ |
| | ఆ | ఆ | | ఏ | | | ఆ | | | | ఆ | | | |
| | ఓ | | | ఓ | | | | | | | | | | |
| ఇ | అ | అ | | అ | | | | | | | | | | |
| | ఉ | ఉ | | ఉ | ఉ | | | | | | | | | ఉ |
| | ఎ | ఎ | | ఎ | | | ఇ | | | | | | | |
| ఈ | ఆ | | | | | | | | | | | | | |
| | ఈ | | | ఈ | | | ఈ | ఈ | | | | | | |
| | ఊ | | | ఊ | | | | ఊ | | | | | | ఊ |
| | ఏ | ఎ,ఏ | | ఎ,ఏ | | | ఏ | | | | | ఏ | | ఎ |

| సం. | మహా. | జైన మహా. | మహా. అప. | అర్ధమా. | మా. | మా. అప. | శౌర. | జైన శౌర. | ఆవంతి | ఆభీరికీ | నాగర | పై. | చూ. పై. | అప. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఉ | అ | అ | | అ | | | అ | | | అ | అ,ఆ,ఉ | | | అ |
| | | ఇ | | ఇ | ఇ | | ఇ | ఇ | | | | | | |
| | ఉ,ఒ | ఉ | | ఉ,ఒ | ఉ | | ఉ,ఒ | ఉ | | | | | | |
| ఊ | ఏ | | | ఉ | | | ఊ | ఊ | | | | | | |
| | ఒ, ఉ | ఒ,ఉ | | ఒ, ఊ | ఏ | | ఏ | | | | | | | |
| | ఓ | ఓ | | ఓ | | | ఒ | ఓ | | | | | | |
| ఏ | ఏ | ఎయ్ | | | | | ఏ | | | | ఇ, ఈ, ఏ | | | |
| | | ఇ | | | ఇ | | ఇ | | | | | | | |
| | | అ | | | అ | | | | | | | | | |
| ఓ | ఓ | ఓ | | ఓ | | | | ఉ | | | | | | ఉ |
| | అ | అ | | | | | | | | | | | | |

| సం. | మ. | జై. మ. | నా. |
|---|---|---|---|
| స్న | ణ్హ | | |
| స్ప | ఫ | | |
| స్మ | మ్హ | మ్భ, మ్హ | |
| హ్న | ణ్హ | | |
| హ్మ | మ్హ | | |
| హ్య | జ్ఝ | | |
| హ్ర | ల్హ | | |
| హ్వ | భ | | |
| హ్ణ | ణ్హ | | |

**అచ్చుల విషయమునఁ గొన్ని విశేషములు.**

1. రేఫతో సంయోగమునొందిన సంయుక్తాక్షరములోని యొక హల్లు లోపించినప్పుడు సంయుక్తాక్షరమునకుఁ బూర్వమందుండు హ్రస్వాచ్చునకు దీర్ఘము వచ్చును.

2. అట్లే శ, ష, సలతో సంయోగమునొందిన సంయుక్తాక్షరములకుఁ బూర్వమందుండు హ్రస్వాచ్చులకును దీర్ఘము కలుగును.

3. శ్ర, ష్ర, స్ర, లకుఁ బూర్వమందుండు హ్రస్వాచ్చు విషయమునఁ గూడ నిట్లేయగును.

4. య, వ, శ, ష, స, లు ద్వితీయాక్షరముగాఁ గలిగిన సంయుక్తాక్షర పూర్వ హ్రస్వాచ్చుల విషయముునను నిట్లే యగును.

5. ఎ, ఒ, అను హ్రస్వవర్ణములుగూడఁ బ్రాకృతమునఁ గలవు. ఇవి సాధారణముగ ద్విత్వాక్షరములకుఁ బూర్వమందే యుండును.

6. మయట్ప్రత్యయ పూర్వ హ్రస్వాచ్చునకు దీర్ఘము కలుగును.

7. కొన్నియెడల ద్విత్వాక్షరములకనుస్వారము చేరుచుండును.

8. కొన్నియెడల ననుస్వారములోపించి, దాని పూర్వహ్రస్వాచ్చునకు దీర్ఘము వచ్చును.

9. కొన్నియెడల ప్రథమ హల్లుమీఁది హ్రస్వాచ్చునకు దీర్ఘము కలుగును.

10. కొన్నియెడల దీర్ఘాచ్చులు హ్రస్వము లగుచుండును.

11. కొన్నియెడల సంయుక్తాక్షరములకు విశ్లేషముకలిగి వాని మధ్యమున నొక యచ్చు చేరుచుండును.

12. అజాది శబ్దముల యాద్యచ్చునకుఁ గొన్ని యెడల లోపము గలుగును.

13. పదమధ్యమందలి యచ్చొకప్పుడు లోపించుటచే రెండుహల్లులు సంయోగమునొంది, సంయుక్తాక్షరములకుఁ గల్గు వికారముల నొందు మండును.

14. కొన్ని యెడలఁ బదమధ్యమందలి యచ్చు తాను కూడియున్న హల్లుతోఁగూడ లోపింగును

15. య, వ, లకు సంప్రసారణము గలిగి యకారము ఇకారముగను వకారము ఒకారముగను గొన్ని యెడల మాఱును. అట్లుమాఱిన యిత్వమేత్వమును ఉత్వమోత్వమును గూడఁబొందును.

16. 'అవ' 'ఓ'గను 'అయ' 'ఏ'గను మాఱును.

17. సంధియం దుద్వృత్తాచ్చులకు,ఒనఁగా నేకపదమధ్యమందలి హల్లు లోపింపఁగా మిగిలిన యచ్చులకు మహారాష్ట్ర్యాది భాషలయందు సంధి కలుగక యవి యట్లే నిలుచును. అపభ్రంశ భాషయం దాయుద్వృత్తాచ్చులకు వివిధముగ సంధికలుగుటయో,హాని మఖ్యముగ వేర్వేఱు హల్లులు, ముఖ్యముగ య, వ, లు, చేరుటయో సంభవించును సాధారణముగ సమస్త పదములందు అ, ఆ + అ, ఆ = ఆ; ఇ, ఈ + ఇ, ఈ = ఇ, ఈ ; ఉ, ఊ+ఉ, ఊ = ఉ, ఊ,లుగ సంధి నొందుచుండును. అ, ఆ + ఇ = ఏ ; అ, ఆ + ఉ = ఓ, గా సమస్త పదములందే సంధినొందును. అ,ఆ, లపై నసవర్ణాచ్చు చేరునప్పుడు సమాసములందు పూర్వాచ్చునకు లోపముగలిగి, యుత్తరాచ్చు మిగులును. సమాసములందును నుద్వృత్తాచ్చు లట్లేనిలుచుటయుఁగలదు. నఞ్ సమాస మందలి అ-కు బదులు ణ, నలును వచ్చును. ఒకొ్కకచోఁ బూర్వస్వరము నిలిచి పరస్వరము లోపించును ; ఒకానొకచో 'స్య'కుఁ బూర్వమందలి యకార మేకారమగును. ఉపభాషలగు నపభ్రంశ భేదములం దచ్చుల యందలి మార్పు లొకవిధముగ నుండవు. కొన్నియెడల నచ్చుల కనుస్వారోచ్చారణము కలుగును.

హల్లులనుగూర్చిన కొన్ని విశేషములు.

(1) ఒకప్పుడు సంయుక్తాక్షరములలోని మీఁదిహల్లు లోపించును. ఉదా. స్థల = థల.

(2) ఒకప్పుడనునాసికాక్షరములతోఁ గూడిన సంయుక్తాక్షరమున నను నాసికమునకు మాఱుగ ననుస్వారము వచ్చును. పఙ్క్తి = పంతి.

(3) ఒకప్పుడు సంయుక్తాక్షరములలోని మీఁదిహల్లు క్రింది హల్లుగ మాఱిపోవును. మౌక్తికమ్ = మోత్తిఅమ్.

(4) సంయుక్తాక్షరములలోని క్రింది హల్లు లొకప్పుడు మీఁది హల్లుగా మాఱును. అగ్ని = అగ్గి.

(5) కొన్ని సంయుక్త హల్లుల మధ్యమున నొక యచ్చు చేరును. తామ్ర = తంబిర.

(6) కొన్ని సంయుక్తాక్షరములందలి యొక హల్లు రెండవ హల్లకు రుయ్‌గా మాఱినప్పుడు దానికి వర్గద్వితీయాక్షర మాదేశమగును : నమస్కార = ణమొక్ఖార.

(7) కొన్నియెడల సంయుక్తాక్షరములు తమ స్థానములను మార్చుకొనును. గ్రీష్మ = గిహ్మ = గిమ్హ.

ఇట్టి విశేషము లింక నెన్నియో యున్నవి. అవి యాయా ప్రకరణములందు తెలుపఁబడును.

## సంస్కృత ప్రాకృతములు.

### క్రియలు.

వేదభాషలోఁ గ్రియాధాతువులకు దశవిధలకారములు, దశవిధవికరణములు, ఆత్మనే - పరస్మైపదవిభాగము, ఉపసర్గలతోడి కూడిక, మూఁడు వచనములు, నుండెడివి. లకారములలో లేట్టు సంస్కృతములోనే లోపించినది. తక్కిన లకారములలో లిట్, లుజ్, రూపములు ప్రాకృతములలో లోపించినవి. మిగిలినరూపములు వేర్వేఱు వికారములను పొంది, యనేక లకారము లేకరూపమును బొంది లకారజ్ఞానమే లోపించినది. ఉపసర్గలు ధాతువుతోఁ గలిసి వికారమునొంది, యిది యుపసర్గ, యిది ధాతువు, నని యేర్పఱించుటకు సాధ్యముకాకుండ నయినది. ఆత్మనేపద ధాతువులు పరస్మైపద ప్రత్యయములనే రాను రాను స్వీకరించి, తుదకొక్క పరస్మైపద ధాతువర్గముక్రింద నేర్పడినవి. మూఁడువచనములలో ద్వివచనము లోపించినది. ఈ రూపములన్నియు నేకరూపమును దాల్చుటచేఁ గ్రొత్తధాతువు లేర్పడి, లకారాదివిశేషములను దెలుపుటకుఁ గ్రొత్తశబ్దములను బ్రత్యయములను వానికిఁ జేర్పవలసి వచ్చినది. నేఁటియుత్తరహిందూస్థాన భాషల యవస్థ యిట్లేయున్నది. ఈ యవస్థ ద్రావిడభాషలలోని క్రియారూపనిష్పత్తి యవస్థనే పోలియున్నది.

ద్రావిడభాషలలోని ధాతువు లేకమాత్రాకములనియు, వానికిఁ గ్రమముగ త్రుతినుభగత్వమునకును, నుపవిభక్తిత్వమునకును, నకర్మక సకర్మకత్వమునకును, లింగ, పురుష, వచనములకును వరుసగఁ బ్రత్యయము లొకదాని

కొకటి జిగురుతో నంటించిన ట్లంటించుటవలన సంపూర్ణక్రియ లేర్పడుచున్న వనియు, నీ విధానము సంస్కృతములో లేదనియుఁ గాల్డువెల్ పండితుఁడు తెలిపియున్నాఁడు. సంస్కృతములో నీ విధానము లేదన్నమాట నిజమే కాని సంస్కృతముతో సంబంధించిన నేఁటి యార్యభాషలం దీవిధానమే కానఁబడుచున్నది. బంగాళీ భాషనుండి యీ క్రింది యుదాహరణముల నీయవచ్చును.

| | ధాతువు. | | అనుబంధము. | | పురుషవచన ప్రత్యయము |
|---|---|---|---|---|---|
| ఉత్తమపురుషను, ఏకవచనము: | సున్ | + | ఇ | + | హొఁ |
| | విను | + | చున్నా | + | ను, |
| మధ్యమ- | చల్ | + | అ | + | ఓఁ |
| | చల్ ఇంచు | + | చున్నా | + | వు. |
| ప్రథమ | చల్ | + | ఏన | + | ఏ |
| | చలించు | + | చున్నా | + | ఁడు |
| ప్రథమ | చల్ | + | ఇయ్ | + | ఆ |
| | చలించు | + | ఇ | + | ఎ(ను). |
| ఉత్తమ | జాణ్ | + | ఆయిల్ | + | ఓఁ |
| | తెల్ | + | ఇవెద్ | + | అను. |
| ప్రథమ | నేఉట్ | + | ఇ | + | ఆ |
| | నెవడు | + | ఇ | + | ఎ(ను). |

పై యుదాహరణములలో ధాతుప్రత్యయ సంయోగ మేకరీతిగ నుండుటను గమనింపవచ్చును. ఇట్లే యితరాధుని కార్యభాషలనుండియుఁ బ్రాకృతభాషలనుండియు నుదాహరణముల నియవచ్చును. కాల్డువెల్లు పధకము ననుసరించినచో 'నెవడెను' అను క్రియను విభజించి 'ఎ' పురుష - వచనప్రత్యయముగను, '- ఇ' లజ్ - ప్రత్యయముగను, '- అడ్' ఉపవిభక్తిగను, తొలఁగించి, 'నెవ్' అనునది ధాతువుగ నేర్పఱుపవలసి వచ్చును. బంగాళీ భాషలో 'నేఉట్' అనునదియు, తెనుఁగులో 'నెగడు, నెవడు' అను నదియు సంస్కృతమందలి 'నిర్+వృత్' అనువాని సంయుక్త రూపమునకు వికారమని శబ్దశాస్త్రజ్ఞులుకాని, సాధారణజనులకుఁ దెలియదు. బంగాళీలో 'నేఉ' - తెనుఁగులో 'నెవ్' అనునవి ధాతువులనుట సరికాదుగదా. అట్లే బంగాళీలోని 'సున్' అను ధాతువులో 'ను'అను వికరణ సంజ్ఞ చేరియున్నది.

సంస్కృతములో 'శ్రు' అనునది ధాతువు. దానికి వికరణచిహ్నమగు - 'ను' చేర్పఁగా 'శ్రుణు' అయి, బంగాళీ మొదలగుభాషలలో 'సున్' అనునదే ధాతువయినట్లు జనులకు గోచరించుచున్నది. అట్లే తెనుఁగున 'కొను' 'దును, దున్ను'లు వికరణచిహ్నమగు 'ను' తోఁజేరిన 'కృణు, ధును' ల వికారములని చెప్పినచో వింతగా నుండును. కాని, నేఁటి యార్యభాషల యందువలెఁ గొన్ని కొన్ని ధాతువులందు వికరణచిహ్నములు '-ను' ఒక్కటియేకాక యితరములును ద్రావిడభాషలయందును గానవచ్చుచున్నవి. ఈ రీతిగా నుపసర్గములును వికరణ సంజ్ఞలునే కాక మఱికొన్ని ప్రత్యయములును ప్రాచీనార్యభాషారూపములందలివి మేళగించి, వికారమునుబొంది, నేఁటిభాషలలోఁ గ్రొత్త ధాతురూపములను బొందినవని శబ్దశాస్త్రము నభ్యసించినవారికిఁ దెలియకపోదు.

తెనుఁగునందలి ధాతువులలోని తుదివర్ణము లెట్లు నిష్పన్నములైనవో, యా యా ధాతురూపము లెట్లు కలిగినవో యీ క్రింద వివరింపఁబడుచున్నది. క్రింది ధాతువులన్నియు శబ్దరత్నాకరమునఁ దేశ్యములుగ వివరింపఁబడియున్నవి. ఇవి సంస్కృత ప్రాకృత క్రియారూపముల వికారములని చూపుచు నేఁటి యార్యభాషలలోని ధాతువుల నిష్పత్తిక్రమమునే తెనుఁగుధాతువులకును జూపఁ బ్రయత్నింతును.

**ధాత్వంతముల విషయమున ద్రావిడభాషల పరస్పరసంబంధము.**

ధాతువుల కొననుండు వర్ణములు ధాతువులందలివి కావనియు, నవి క్రియారూపనిష్పత్తికి దోడ్పడు ప్రత్యయములనియుఁ గాల్డువెల్లు నభిప్రాయము. వీనిని తొలఁగించినయెడల మూలధాతువు కనఁబడునని యాతని యూహ. అట్టి ప్రత్యయముల నాతఁ డీ విధముగ వివరించియున్నాఁడు.

| | అకర్మక సూచకము. | సకర్మక సూచకము. |
|---|---|---|
| తమిళము: | గు, -ంగు (తె. గు,ఁగు) | క్కు (తెనుఁగు:—ంచు;- చు, |
| తమిళము: | చు, (తె.-చు) | చ్చు (తె.-పు.) |
| తమిళము: | దు, -ందు (తె.-చు.) | త్తు (తె.-చు,-పు.) |
| తమిళము: | డు, -ండు | ట్టు. |
| తమిళము: | బు, -ంబు | ప్పు. |

పై విధానమంతయు ద్రావిడభాషలలో నొక్క తమిళమునందును, గొంతవఱకు మళయాళమునందును గానవచ్చుచున్నది. సరళాక్షరము లకర్మకత్వమును బోధించుటయు, ద్విత్వపరుషాక్షరములు సకర్మకత్వ బోధకములగుటయు సాధారణముగ తెనుఁగు కన్నడములందు కానరాదు. తమిళమళయాళము లందయినను నీ విధానము నియతముగ లేదు. ఈ విషయమును

కాల్డువెల్లు కూడ గుర్తించియున్నాడు. ఆయనమాటలివి: "ద్రావిడభాషలలో ప్రతిభాషయందును ననేక ధాతువులు, వర్గములకు వర్గములే, అకర్మకత్వ సకర్మకత్వ విషయమున నెట్టి భేదమును గలిగియుండవు. మూలధాతువునకుఁ జేరు ననుబంధములందుగాని, నిర్మాణవిశేషమునందుగాని యకర్మక సకర్మకధాతువులకు భేదములేదు. అర్థమునుబట్టియే యవి యకర్మకములో సకర్మకములో తెలిసికొన నగును. ఉదాహరణమునకు - తమిళములో భూతకాలద్యోతకముగ - ఇ - కారము చేరుధాతువులన్నియు సకర్మకములు, సకర్మకములుఁ గూడ నగును. ఉదా. పణ్ణు - సక. పణ్ణుగిఱేన్, పణ్ణినేన్, పణ్ణువేన్ ; పేశు - అక. పేశుగిఱేన్, పేశినేన్, పేశువేన్.

రూపమునందు సకర్మకాకర్మకధాతువులకు భేదముండుట తక్కిన భాషలలో నంతగా లేదుగాని, తమిళమున నధికముగా నున్నది. కావున నుదాహరణములను ముఖ్యముగా తమిళమునుండి యిచ్చెదను" (కాల్డువెల్ : కం. వే. గ్రా. పు. 450).

ఇట్లుండుటచేఁ దెనుఁగు ధాతువులను దమిళధాతువులతోఁ బోల్చి చూచుటవలన లాభములేదు. కావున, ప్రాకృతమార్గమును బట్టినచో నేమయినఁ దేలునేమో ప్రయత్నించి చూడవలయును.

తెనుఁగు ధాతువుల నీ క్రింది విధముగ వాని యంతములనుబట్టి వర్గములుగ నేర్పఱుపవచ్చును. ఆయా వర్ణముల ప్రక్కకుండలములలోని యంకెలట్టి ధాతువులు శబ్దరత్నాకరములో నెన్నియున్నవో తెలుపును. ఈ ధాతువులన్నియు దేశ్యములుగనే శబ్దరత్నాకరకారుఁడు పరిగణించియున్నాఁడు. సాధ్యమగు చోట్లనెల్ల సంస్కృత మూలముల నేర్పఱుపఁ బ్రయత్నించిన యాతని యుద్దేశమున వీనికన్నిటికిని సంస్కృత ప్రాకృత మూలములు కానరావనియు, నవి కేవల దేశ్యములే యనియుఁ దప్పక తలంపవచ్చును. ఈ ధాతువుల కన్నిటికిని సంస్కృత సంబంధములగు మూలముల నేర్పఱుపవచ్చునని ప్రతిజ్ఞచేయుటకు వీలులేకున్నను, నూటికెనుబదివంతునకైన మన ప్రయత్నము సఫలముకాఁగలదని నా యభిప్రాయము.

| | | | | |
|---|---|---|---|---|
| ఁకు (20) ; | ంకు (10) ; | కు (62) ; | క్కు (34) | |
| ఁగు (5) ; | ంగు (15) ; | గు (58) ; | గ్గు (15) | |
| ఁచు (35) ; | ంచు (448) ; | చు (221) ; | చ్చు (22) | |
| ఁజు (7) , | ంజు (5) ; | జు (0) ; | జ్జు (2) | |
| ఁటు (9) ; | ంటు (5) ; | టు (11) ; | ట్టు (21) | |
| ఁడు (9) ; | ండు (11) ; | డు (34) ; | డ్డు (21) | ణు (1) |
| ఁతు (1) ; | ంతు (0) ; | తు (1) ; | త్తు (9) | |

ఁదు (8); ందు (12); దు (3); ద్దు (4)
ను (17), న్ను (4)
ఁపు (8); ంపు (11); పు (65), ప్పు (12)
ఁబు (0); ంబు (1); బు (0); బ్బు (9)
ము (32); మ్ము (17);
యు(113); య్యు (11);
రు (73); ఱు (22), ఱ్ఱు (3)
లు (119); ల్లు (118); ళు (1); ళ్లు (8)
వు (50); వ్వు (11);

పై యంతములే యావివచ్చు తఱచును బట్టి యీ క్రింది విధముగాఁ జూపఁబడినవి.

ంచు (488); ను (211); యు (133); లు (119); ల్లు (118); ఁగు (75); రు (73), పు (65), కు (62), వు (50). ఁచు (35); క్కు, డు (34); ము (32), ఱు (28), చ్చు (22), ట్టు ఙ్గు,(21); ఁసు (20), సు, మ్ము (17); ంగు, గ్గు (15); ండు, ప్పు (12); ంసు, ంపు, య్యు, వ్వు (11); ంకు (10); ఁటు, ఁడు, త్తు, బ్బు (9); ఁదు, ఁపు, ఙ్గు (8); ఁజు (7), ంజు (5); ద్దు, న్ను (4); దు, ఱ్ఱు (3); జ్జు (2); ణు. ఁతు, తు, ంబు, సు (1); జు, ంతు, ఁబు, బు (0).

పైని వివరించిన 1698 తెనుఁగు దేశ్యధాతువులలో నన్నియు మూలధాతువులని చెప్ప వీలులేదు. వానియం దేకధాతువులకు రూపాంతరములును, వానినుండి యర్థభేదములతో జనించిన యితరరూపములు నున్నవి.

## దేశ్యధాతువులు.

తెనుఁగున దేశ్యక్రియలని శబ్దరత్నాకరమునఁ జేర్పఁబడినవి, వానికిఁ గల రూపాంతరములు, వానినుండి పుట్టిన యితర భేదరూపములతో నీక్రింద పొందుపఱుపఁ బడినవి. ఇట్లు వర్గీకరింపఁగా 315 దేశ్యములని శబ్దరత్నాకరకారుఁడిచ్చిన క్రియావర్గము లేర్పడినవి. రూపమునందును, నర్థమునందును గల సామ్యమునుబట్టి యీ విభాగము చేయఁబడినది. ఈ వర్గీకరణ మన్నివిధములను సంపూర్ణమని కాని, తృప్తికరమనికాని చెప్ప వీలులేదు. అయినను మొత్తముమీఁద దేశ్యములని శబ్దరత్నాకరకారుఁడిచ్చిన ధాతువులు 250 నుండి 300 లకు మించియుండవని మాత్రము చెప్పవచ్చును.

## తెనుఁగునందలి దేశ్య మూలధాతువులు.

(1) అంకించు, (2) అంగవించు, (3) అంచు, అనుచు, అన్చు, పంచు, పనుచు, అనుపు, అంపు, పనుచు, పంపు; (4) అంజు, (5) అ (ఒ)ంటు,

అంటించు, అంటుసిల్లు, ఒట్టు, అ(హా)త్తు, అలఁదు, అద్దు, అతు(దు)కు, అందు:
(6) అగలు, ఔలు, అగలుచు, అగులు, పగులు, పగులుచు, పౌలు, పిగులు,
పీలు, ప్రీలు, అవియు; (7) అగు, కావించు; (8) అచ్చు, (9) అడ (ఁ, న)
ఁగు - చు; ఆఁగు, - చు, - ఁపు; ఆను, నాఁచు, అడ (ఁ) కించు;
(10) అడరు(చు), అదరు(చు), ఉదురు(చు), అక్రుచు, ఉదరు, కుదులు,
అడ (ద)లు(-చు), అడుకు, కదలు, క్రాలు, కసరు, మెదలు, విదలు, వదులు.
వసులు, విదులు(చు), విద్రుచు, విసుగు; (11) అడుగు, (12) అను, (13)
అమయు, - రు(చు), ఒప్పు (- ప్ము, - వ్వు), ఓము (- వు), (13) అమ్ము,
(14) అ (ఆ)రయు, రోయు; (15) అరుగు, (16) అఱచు, ఆర్చు (-ర్చు).
(17) అ (ఆ)ఱు, అఱుగు, అఱుచు (-పు), ఒగయు, రోయు, రాయు, రాచు,
ఱాచు, రాకించు, రాయించు; (18) అఱుపు (19) అఱాము, ఒరుము,
అలము; (20) అలఁగు(-చు, యు); (21) అలఁ దు(-ము)సు, (22) అలరు,
ఎలయు, వెల (లి)యు, ఎలగుచు, లేచు (-పు), బెలయు, వెలయు, బెళుకు;
(23) అలుకు, ఒలుకు; (24) అలుగు (-వు), (25) అల్లు (26) అవఘళించు,
(27) ఆఁటు (28) ఆను, ఆరు(చు); (29) ఇరకు, ఈఁకు (-చు); (30) ఇగు
(వు) రు (చు), ఇగి (వి) రించు, ఇగ్రుచు, చిగి (వి) రించు, చిగు (వు) రుచు.
(31) ఇంచు. (32) ఇందు, ఇనుము (33) ఇగి (వి) లించు, ఇగు (వు) లుచు.
(34) ఇగ్గు; ఈఁగు, వీఁగు. (35) ఇచ్చు, మిడుచు, విడుచు, విఱుచు, ఇడియు,
ఇఱియు, ఇ (ని-, సి-, ఈ-) లుగు, - గ్లు, ఈఁగు, (36) ఉక్కు, (37) ఇ
(ఈ) సడిలు (-ంచు), (38) ఈఁడు, ఈడిగిల్లు, ఈడు (చు); (39) ఈను,
(40) ఈసుచు (-ర్చు) ; ఏచు (-చ్చు) (41) ఉంకు, ఊఁకు, ఊఁకించు; ఉంకించు;
(42) ఉటంకించు. (43) ఉండు, ఉనుచు, ఉంచు (44) ఉచ్చు, ఉట్టు, ఊఁటు,
ఊడు, ఊడుచు, ఉడికిల్లు, ఉడుకు, ఊరు, ఊరుచు, ఒడియు, ఓడు, ఓడుచు,
ఓడిగిల్లు, ఉఱుకు, దూఁటు, ఎడియు, వడుచు; (45) ఉడుగు (వు), -చు,
ఉలుచు (-పు) ఒలుచు, ఒడుచు, ఉసువు, (46) ఉతు (దు) కు, ఉసుము.
(47) ఉప్పతి (రి, ళి)ంచు, (48) పొంగు, పొంగలించు, పొక్కు, పొగు (వు)
లు, పొడుము (-గు), పొదలు, పొదుగు (వు) , ఉప్పొంగు, ఉబుకు, ఉబ్బు;
(49) ఉమ్మలి (కి) ంచు, (50) ఉరడి (ణి, ళి, వడి, వణి) ంచు; (51) ఉరియు,
(52) ఉఱియు, కురియు. (53) ఉ (ఊ) ఱు. (54) ఉఱుము, ఉలియు, ఒలియు;
(55) ఊఁగు (-యు, - (పు) వు, (56) ఊఁచు. (57) ఊను, పూను, (చు, -
ంచు, (-చు) మొనయు (-పు). (58) ఎంచు, (59) ఎండు, (60) ఎక్కు,
ఎగ (గు) చు, ఎగయు, ఎవుచు, ఏచు, ఎగురు, నెగ (వ) యు, నెగచు, వెక్కు
విక్కు, వీఁగు, ఎగసిల్లు, ఎచ్చిరిలు, ఎచ్చిఱు, ఎసరు, ఎచరించు, ఎచ్చరించు.

ఎచ్చరికించు, ఎచ్చు, ఎత్తు, ఎగుగు, ఱేఁగు, ఱేఁచు, ఱేయు, వెక్కు, పెచ్చు, హెచ్చు, బ్రతు (దు) కు, వడుకు, లేచు; (61) ఎడపు (యు, రు, లు), ప్రిదులు, వెడలు, వెలుచు, విదురు, ప్రీలు, వెళ్లు; (62) ఎదురు (చు), ఎద్రుచు, ఎదిరించు; (63) ఎనయు, పెనయు; (64) ఎయిదు, ఎద్యు; (65) ఎ్వర (ఱ) ఁగు (66) ఎరియు, (67) ఎఱుఁగు, (68) ఎసఁగు (వు). (69) ఏఁగు (-ఁచు) (70) ఏడుచు, (71) ఏదు, (72) ఏమఱు (-చు, -ఱిల్లు); (73) ఏలు, (74) ఒందు, పొందు, ఒనరు, (-రించు), ఒనరుచు, పొనరు (చు), మొనరు, ఒప్పు (-ప్వు,-మ్ము), ఓము (-వు) ఒదుగు(వు); (75) ఒగ్గు, మొగ్గు, ఒడ్డు, గిడ్డగిల్లు, ఒత్తు, ఒత్తగిల్లు, ఒత్తిల్లు; (76) ఒదగు (లు), పొదలు, కొదవు, కొసరు; (77) ఉరలు ఒఱలు, ఱోలు, ఒరలు, దొరలు, రాలు (చు), లోఁగు (-చు), లోపు. (78) ఒలయు, లాయు; (79) ఒసఁగు (-పు), పొసఁగు. (80) ఓడు, ఓటిల్లు, ఓహాటిల్లు (81) ఓపు, ఓసుమ. (82) కంకు, కక్కు, క్రాయు; (83) కందు, (84) కర్చు (85) కట్టు. (86) కడఁ (ణ) ఁగు, (-చు, - పు), (87) కడుగు, కడ్గు, (88) కదియు, కదించు, కదియించు, కదుచు (- రు), కమి (చి) యు, కవించు, కవియించు, క్రమ్ము, కప్పు, కమ్మిరించు. (89) కనలు, కణరిలు, కసరు, కినియు, పొనలు; (90) కను, కాంచు, కాన్పించు; (91) కమరు (చు), కాలు (చు), కమలు, కుములు, కుమారిలు, కాఁగు (-చు, - ంచు), (92) కముచు. (93) కరఁగు (- ఁచు), (94) కఱచు (- పు), కాచు, కాయు. (95) కఱుకు, కొఱుకు, కఱచు, (96) కలఁగు (- చు), కలయు (- చు, - పు), కలుపు, క్రయ్యు; (97) కలుగు, (98) కవ్వు, కబళించు. (99) కసుగు. (100) కారు (- ఱు), కారుచు (- ర్చు). (101) కిసుకు. (102) కెఱు (లు) కు, కెలఁకు (- యు); (103) పొంచు, కుంటు, కుంచు, క్రుంగు, కంచు, కుది (సి) లించు, కుదించు, కుదియించు, కుదుచు, కుసురు (చు), కొంచించు, కొంజు, కొంజు, క్రుక్కు, కొంకు, క్రుంకు, కునుకు, కూరుకు, కూలు, కుప్పరించు (- లు), కు (గు) మ్మ, క్రుమ్ము (104) కుట్టు. (105) కుడుచు (- పు). (106) కులుకు, గులకరించు. (107) కుస్తరించు (108) కు (క్రు) ళ్లు. (109) కూడు (- రు), కూరుచు, కొఱలు (110) కూయు. (111) కెడపు (- యు), గెంటు, గెంటించు; (112) కెరలు, కేరించు, కేరు, క్రాలు. (113) కొందు, కోయు; (114) కొతు (గు) కు (115) కొను, (116) కొలుచు ( - (పు), కొలిపించు. (117) కోఁగు, గోఁకు, దోఁకు (- ఁగు), గొఱుగు, కోఱు, క్రొచ్చు, క్రొయ్యు, గ్రొయ్యుచు, (- చ్చు), గ్రుయ్యు (- చు), గివుఱు, గీఱు, చీఱు, చీలు, గీయు, గీఁకు (- చు), గిల్లు, అక్కు, (118) కోఁడు (119) క్రచ్చు. (120) క్రియ్యు, క్రుయ్యు, (120) క్రేఁటు.

(121) క్రోయు. (122) క్రోలు (చు). (123) గంటు (124) గతు(దు) కు. (125) గదుము, గద్దించు; (126) గాలించు, (127) గిట్టు, గిట్టించు. (128) గిఱు (లు) పు, (129) గీలు, (130) గుంజు (131) గుంపించు. (132) గెనయు. (133) గెబ్బు, గెలుచు, (134) గొంట (ణ) ఁగు. (135) గోఁజు. (136) గోరించు (137) గ్రక్కతిల్లు, గ్రక్కదలు. (138) చినుఁగు, చించు (- ంపు), చిందు, చిటిలు, చిట్లు, చితు (దు) కు, చిదియు, చిదుపు (- ము), చినుకు, చిప్పిల్లు, జొబ్బిల్లు, చిరుఁగు, చిలికించు, చిలుకరించు, చిలు (ఖు) కు, చీలు (- రు), గీరు, చీఱు, చిముడు, చెదరు, చె (సె) లగు (వు), చదియు, చదుపు, చిబుకు, చిముటు, జీరు, చెండు, చెడు, చెఱుచు (- పు), చెఱచు, చీఁకు, జూఁకించు; (139) చిమ్ము, జిమ్ము, చిఱుము, ఱిమ్ము, చిల్లు (140) చివ్వు, జివురు, చెక్కు, చెరువు, (141) చెందు, చెనకు (- యు) (142) చెప్పు, (143) చెలఁగు (- యు), చెల్లు, చేరు, చను, చ (స) లుపు, చారు, చాలు, చాలించు, జర (రు) గు, జర (రు) పు, చెరుగు, చెఱుము, చాలు, చాలించు, (144) చేఁదు (- ఁపు), (145) చ (స) చ్చు (-ంపు) (146) చతి (ది) కిలు (147) చదుము, చమరు, చఱచు, చముగు, చాఁచు, సడపు (148) చా (సా) ఁగు, చాఁచు (-ఁపు), చాఁగిల్లు, సాగు; (149) చాటు, చాటించు (150) చిక్కు (151) చాతు (152) చుండు, చూఁడు, సుడియు, సూడించు, సొక్కు, స్రుక్కు, సోలు, సొగపు, చొక్కు, సొలయు, సుంగు, పొగు, పొంగు, చొలయు, సొలయు, చుట్టు; (153) చొచ్చు, చొచ్చిల్లు, చొనుపు, చొప్పించు. (154) చూఁచు (- పు). (155) జ (ద) డియు, జుడు (ఱు) ఁగు, (156) జాడి (ళి) ంచు, జాఱు (చు). (157) జోకు, (158) జొరు (-కు). (159) డ (ద) ం (- గు, - చు, - పు) (160) డ (ద, త) క్కు, తప్పు, తగ్గు, దగ్గు, తఱుగు, జగ్గు, సగ్గు, స్రగ్గు, డాఁగు, (- చు), దాఁగు (- చు), డాఁగురించు, డా (దా) పలించు, దాపించు, డా (దా) యు, డిందు (- ంచు, - ంపు); డించు (- ంపు), డి (ది) గుచు, డే (దే) ఁకు, డొంకు (- ంగు), దొంగు, దొంగలించు, డయ్యు (161) డ (ద) బ్బు, (162) డీ (దీ) లు, డులుచు, డుల్లు, డొలుచు, డొల్లు, దులుపు, దొర్లు, దొరులు, దొలుపు, (163) డూ (దూ) యు, డ (ప) య్యు. (164) డెక్కు. (165) డె (దె) ప్పు, (166) డోఁకు. (167) తండు (168) తగు (- వు), తగు (వు) లు (చు), తాలు. (169) తిట్టు, తెడపు. తసుసు, (170) తెడయు, (171) తెనరు, తనుకు, దనుకు, తాఁకు, తాఁకించు, తన్ను, తాఁచు; (172) తనియు, తనుపు; (173) తెర (అ) లు (- చు), తఱటు, తటియు, తఱుము, తలఁకు, తెలఁకించు, తలఁగు, తలఁగు, తొలఁగు, తలవు, తలఁచు, తాలుచు. (174) తా (త్రా) గు, (175) తారు (చు), తారసించు

(- ల్లు); తాళు. (176) తాఱు. (177) తాలి (ళి) ంచు. (178) తిక్కు, తిగు (వు) చు; తిగి (వి) యు, తీయు, తొక్కు, త్రొక్కు, త్రిక్కు, తినుకు తేయు, తీయు. (179) తిట్టు, తెగ (న) డు. (180) తెను. (181) తిము (వు)రు (182) తిమ్ము (183) తిరియు, తిరుగు (-వు), దేవు, దేవురించు, త్రిప్పు, త్రిమ్మ రు. (184) తీండ్రించు, తీఁడిరించు (185) తీగు (ఱు) చు (-వు), తి(గి)ప్పు; దీటు (186) తుడుచు, తొడయు, త్రోయు, ద్రొబ్బు (187) తునియు, తునుఁ గు (-ను), త్రుంగు (-ంచు), టుఱుసు (188) తుప్పు (189) తఱఁగలించు, తు (తి)లకించు, తొంగలించు, (190) తుఱుగు, దుముకు, దూఁకు, దూపిల్లు (-ంచు) (191) తూఁగు (-ఁచు), ఊఁగు (-చు,)తొంగు, తోఁగు. (192) తూఱు (ఱు), దూఱు, దూఁటు, తూ(దూ)రు (ఱు)చు, దూర్చు, దోరు(చు), తూలు(చు). (193) తెంచు, త్రెంచు, తెగు(-వు), తెంపు, త్రెంపు, త్రెవ్వు, త్రెయ్యు, త్రమ్ము, త్రచ్చు (-వ్వు), త్రవ్వటించు. (194) తెండు, తేఁపు (195) తెప్పిఱు (-ఱిల్లు - ర్లు), తెమలు (చు), తెరలు (చు), తేలు (చు), తేలగిల్లు, త్రెనుచు, త్రేఁచు (196) తెఱచు (197) తెలియు, తెల (లు) చు, తేఁగ (ఱు) (చు). (198) తొట్రిల్లు, తొట్టు, తొట్టగిల్లు, తొడ (ణ, వ, ల, లు, ర) కు, తొడఁగు (రు); తొఱ (ల)ఁగు, త్రుళ్లు, త్రుళ్లగించు, తొలచు, తొలుచు, తొరలు (-చు,-ఇంచు), తోడు (-లు), తోలుచు, త్రోలు (199) తోఁచు (గు, వు, కు). (200) తోము (201) దున్ను, దును (202) దూఱు (203) దొరకు (-యు), దొఱయు. (204) నక్కు, నంకు (-ంగు) (205) నంజు (206) నగు (-వు), నవ్వు (207) నచ్చు, నమ్ము (208) నడ (డు) చు (-పు) (209) నత్తు (210) ననయు, ననుచు (211) నర (రి) యు (212) నఱకు, న (ను) ఱుము, నూఱు, నలఁగు, నలుగు, నుగ్గు, నల (లు) చు (-పు), నవయు. (213) నాకు (214) నాటు (-డు) (215) నానుచు (-పు), నిండు (-ంచు,-ంపు), నినుచు (-పు), నెర (ఱ) యు (216) నిక్కు, నిగు (వు) డు, నెగ (వ) డు, నిలుగు (-వు), నిగు (వు) డుచు, నిగ్గు, నెగ్గు, నీలుగు (-వు), నిట్రించు (-ల్లు), ఱిక్కించు, నిలుచు (-పు), నిలువరించు (217) నిముకు, నిము (వు) రు (218) నుచ్చు, నులియు, నులించు, నులుచు (-పు), నుసుము (219) నుడుగు (-వు) (220) నసలు, నుస (ను) లు (221) నుసుఁగు, నూకు, ను (నూ)ఱుచు. (222) నెట్టు (223) నెరుము, నేము (224) నేరు (-చు,-పు) (225) నొంచు, నొక్కు (-చ్చు), నొగులు (చు), పొగులు (చు), నోయు (226) నోము (227)పంకించు, పట్టు, పట్టించు, పడు, పడచు (-యు), పరవు, పుట్టు, పఱచు (-పు), పఱుచు (-పు), పాఱు (-ఱు), పదురు (228) పండు, పదు (లు) కు, (229) పంబు (-మ్ము), ప్రబ్బు (-మ్ము), (230) పను (లు) కు (231) పన్ను, పూను (చు)

(291) రొప్పు, రొల్లు, రోజు, అంతిల్లు (292) లసుకు (293) లాగు (-చు), లాగించు. (294) వండు (295) వదరు (296) వరగు, వఱలు, (297) వలచు (-యు),వాలు,వాడు (298) వలియు (299) వాను (300) వాను (301) వాగు (చు) (302) విచ్చు, విరియు, విజ్జు, విడు(చు), పీడు, విచ్చు, (303) విడియు (304) విను(చు) (305) విఱుగు (-చు) (306) విలుచు (307) విసుగు(వు) (308) విసరు,వీచు, వైచు. (309) వీలు (310) వెచ్చు(-మ్ము),వేగు(చు)(311) వారు, వెరజు (312) వెల(లి)యు (313) వేడు (314) వేచు (315) మఱచు వేస(సా)రు. (316) వేలుచు (317) వ్రాయు (318) వ్రేయు (319) సాకు (320) సోకు.

పై వివరించిన వర్గములలోని ధాతువులన్నియు దేశ్యములని శబ్ద రత్నాకరకారుని యభిప్రాయము. వీనిలో జాలవఱకు తద్భవములనియు, నవి యుత్తరహిందూస్థాన భాషలయందువలెనే తెనుగునను వికారము నొందినవనియు, ఆ వికారము చాల నెక్కువయగుటచే వాని ప్రాకృత సంస్కృతరూపములు చాల మఱుగుపడియున్నవనియు నీ క్రింద చూపబడు చున్నది. సంస్కృతములోని ధ్వనులు ప్రాకృతమునందును, ప్రాకృత భాషలయందలి ధ్వనులు తెనుగునను నెట్లు పరిణమించుచు వచ్చినవో స్వర వ్యత్యయములను గూర్చిన యధ్యాయమున వివరింపబడియున్నది. తెనుగు ధాతురూపములను గూర్చిన యితర విషయము లీక్రింద దెలుపబడుచున్నవి.

ధాతువులలో యీ రూపాంతరము లీక్రింది విధముగ గలిగినవి:

1. పాక్షికముగ ననునాసికత్వము పోయి పూర్వాచ్చు దీర్ఘమగుట- ఉదా. ఇంకు, ఈకు.

2. పదమధ్యహల్లు లోపించి పూర్వాచ్చు దీర్ఘమగుట: ఉదా. తనుకు, తాకు.

3. హల్లున కనునాసికత్వము గలుగుట: ఉదా. పిక్కు, పింగు.

4. వర్ణస్థాన వినిమయము: ఉదా. కోసు, గోసు

5. సంయుక్తములైన వేర్వేఱు హల్లు లేకరూపము నొందుట: ఉదా. ఇన్మడించు, ఇమ్మడించు; మఱలు, మళ్లు; వెడలు, వెళ్లు.

6. పరుషములు సరళములుగను,సరళములు పరుషములుగను మాఱుట: ఉదా. అతుకు, అదుకు; తిద్దు, దిద్దు.

7. పదాద్యచ్చు దీర్ఘమగుట: ఉదా. ఒడుచు, ఓడించు.

8. పదమధ్యాచ్చు దీర్ఘమగుట: ఉదా ఆరటించు, ఆరాటించు.

9. పదమధ్యాచ్చునకు లోపము: ఉదా. వెఱుకు, వెర్కు; ఇగురుచు, ఇగుర్చు.

10. సంయుక్త హల్లుల నడుమ నచ్చు చేరుట: ఉదా. క్రీడించు, కేరడించు.

11. (అ) అచ్చులయందలి పరివర్తనము:

i. పదాదిని.

అ - ఉ: అదరు, ఉదరు.

ఇ - ఎ: పెఱుగు, పీకు.

ఇ - ఉ: తిలకించు, తులకించు.

ఎ - ఏ: ఎసరు, ఏసరు.

ii. పదమధ్యమున.

అ - ఉ: అదరు, అదురు.

ఇ - ఇయ్: బిగించు, బిగియించు

12 హల్లులయందలి పరివర్తనము:

1 పదాదిని.

(అ) క్రొత్త హల్లు చేరుట: ఏంచు, పంచు; ఒత్తు - హత్తు.

(ఆ) చ—జ—గ: చిఱు, జిఱు, గీఱు.

జ—డ: జడియు, డడియు

ప—బ: పడు, పఱుచు

త—ద: తనుకు, దనుకు

ద—డ: దక్కు, డక్కు.

ప—మ: పెఱుగు. మెఱుగు

ప—వ: వెలుపించు, వెలుపరించు

ప—హ: పెచ్చు. హెచ్చు.

క్క—గ: మిక్కులు, మిగులు

ii. పదమధ్యమున.

(అ) మధ్యహల్ ద్విత్వలోపము, పూర్వాచ్చునకు దీర్ఘము: ఎచ్చరించు, ఏచరించు.

(ఆ) పదమధ్యమున క్రొత్తహల్లుచేరుట: ఉమ్మలించు, ఉమ్మలికించు.

(ఇ) పదమధ్య పరుషములు సరళము లగుట: అతుకు, అదుకు.

(ఈ) పదమధ్యహల్లులయందు మార్పులు:

క—మ: పొటకరించు, పొటమరించు

గ—వ: ఇగిరించు, ఇవిరించు.

డ—ణ: పుడుకు, పుణుకు.

డ—ర: ముమ్మడించు, ముమ్మరించు.
త—బ: గలతరించు, గలబరించు.
త—ద: నెతచు, నెదచు
ద—న: నెదకు, నెనకు
న—ర: చినుఁగు, చిరుఁగు
న—ల: తొనఁకు, తొలఁకు
బ—మ: సుబుకు, సుముకు.
బ్బ—మ్మ: ఇబ్బడించు, ఇమ్మడించు.
ర—ళ: ఉప్పరించు, ఉప్పళించు.
ఱ—ర: ఎఱఁగు, ఎరఁగు.
ఱ—ల: గిఱుకు, గిలుకు.
ల—డ—ళ: వెలుఁగు, బెడకు, బెళుకు.
ల—ర: రంగలించు, రంగరించు.
స—త: పోసరించు, పోతరించు

iii. పదాంతమున.

క—గ: తొలఁకు, తొలఁగు.
క్క—గ్గ: మ్రక్కు, మ్రగ్గు.
గ—య: చెలఁగు, చెలయు.
గ—వ: ఎసఁగు, ఎసవు
చను—చు: కడచను, కడచు.
కొను—కు: తాకొను, తాఁకు.
చు—ఇంచు: వెలారుచు, వెలారించు.
ఇంచు—ఇల్లు: తారసించు, తారసిల్లు
ప్పు—వ్వు: ఒప్పు, ఒవ్వు.
ర—ల: విదురు, విదులు.
వ—గ: అవు, అగు.
వ్వు—మ్ము: ఒవ్వు, ఒమ్ము.
స—ద: సరసు, సరదు.

పై పరివర్తనములను నట్టి యితర స్వర పరిణామమును బాటించినచోఁ దద్భవములని నిరూపింపవలసిన దేశ్యక్రియ లించుమించు మూఁడువందలు మాత్రము మిగులును. ఆయా ధాతువులయంతను లెట్లేర్పడినవో యీక్రింద నిరూపింపఁబడినది. ఈ నిరూపణ మాధునికార్యభాషల పరిణామమును నిరూ

పించిన శబ్దశాస్త్రజ్ఞుల మార్గము ననుసరించినదే కాని, ద్రావిడభాషలకుఁ ప్రత్యేకముగ నేర్పఱచినది కాదని గ్రహింపవలెను.

## 1.—ఁకు.

ఇది సంస్కృతమందలి 'కృ' అను ధాతువునుండి పుట్టినది. ఉత్తర హిందూస్థాన భాషలలోని 'క' కారంత ధాతువులు నిట్లే యేర్పడినవి: ఉదా హిందీ: ధ్యాన + కృ = ఝూంక్ కొన్ని మొదల 'కృ' ధాతువునకు 'ను' వికరణ సంజ్ఞ జేరి 'కృణు' అయి, 'కొను' గా తద్భవమయి, సహాయ ధాతువుగా నేర్పడి, యర్థానుస్వారయుక్తమగు 'కు' వర్ణకముగా మాఱినది. తాఁకొను, తాఁకు; తలకొను, తలఁకు; మునుకొను, మునుఁకు మున్నగునవిట్టివే. 'ఁకు' వర్ణక మర్థానుస్వారయుక్తమగుటకు దానితో సంస్కృతమునందో ప్రాకృతమునందో యనునాసికధ్వని యొకటి యుండుటయే కారణమయి యుండును.

### ఉదాహరణములు

1. అనునాసికము + కృ: యమ్ + కృ = ఈఁకు.

2. అనునాసికము + హల్లు + కృ: కృంత్ + కృ = గీఁకు; భింద్ + కృ = వీఁకు.

3. అనునాసికముగా మాఱు స్వభావముగల హల్లు + కృ: కృశ్ + కృ = కెలఁకు; స్తృ + కృ = * తొరఁకు, తొలఁకు, తొనఁకు; తృట్ + కృ = తొడఁకు, తొలఁకు, తొణఁకు; సాధ్ + కృ = నాఁకు.

4. ధాతువు + 'ను' వికరణ సంజ్ఞ + కృ: ధూను + కృ = దూఁకు.

5. క్రియాజన్య విశేషణము + కృ: భీత + కృ = బెడఁకు, బెళఁకు, వడ (ణ)ఁకు.

6. ఉపసర్గము + కృ: ఉద్ + కృ = ఊఁకు.

7. అవ్యయము + కృ: సీత్ + కృ = చీఁకు; ధూత్ + కృ = డోఁకు.

## 2.—ంకు.

1. అనునాసికము + కృ: యమ్ + కృ = ఇంకు.

2. అనునాసికము + ఇతర హల్లు + కృ: న్యఞ్చ్ + కృ = నంకు.

3. ఉపసర్గము + కృ: ఉద్ + కృ = ఉంకు.

4. అనునాసికముగ మాఱు స్వభావముగల హల్లు + కృ: అధస్ + కృ = డుంకు, డొంకు.

5. ధాతువు+కర్మణి ప్రత్యయమగు 'య' + క్ృ: డీ + య + కృ = డింకు; బ్రూ + య + కృ = బొంకు.

6. సంస్కృత ధాతువు కొననుండు తాలవ్య వర్గీయ హల్లు కంఠ్య వర్గీయ హల్లుగ మారుట: కుంచ్, క్రుంచ్ = కుంగు, క్రుంగు.

## 3. కు.

1. ధాతువు + వికరణచిహ్నము + కృ: రిశ్ + కృ = ఇఱుకు; రుహ్ + కృ = ఉఱుకు; ఉష్ + కృ = ఉడుకు; ఛిద్ + కృ = చితు (దు) కు; చివుకు; తక్ (తప్) + కృ = తనుకు, దనుకు ; తుష్ + కృ = తనుకు: వర్త్ (వృధ్) + కృ = వడకు; విష్ + కృ = వెతె (ద, న) కు; ధృ + కృ=దొరకు; నట్ + కృ = నడుకు; నశ్ (నష్) + కృ = నఱకు: నుద్ + కృ = నూకు; బ్రూ + కృ = పలుకు; విధ్ (వేధ్) + కృ = పితు (రు) కు ; పిష్ + కృ = పినుకు; పుట్ + కృ = పుడు (ణు) కు; భ్రశ్ + కృ = బెనుకు; వృధ్ (వర్ధ్) + కృ = బ్రతు (దు) కు; మిఙ్ఖ్ + కృ = మినుకు.

2. ఉపసర్గము + ధాతువు + కృ: ఉద్ + ధావ్ + కృ = ఉతు (దు) కు; ఉద్ + ప్లు + కృ = ఉబుకు, ఉద్ + స్థా + కృ = ఒలుకు; వి + లస్ + కృ = బెళుకు, మెలకు

3. ఉపసర్గము + ధాతువు: అధి + కృ = అడు (తు, దు)కు.

4. క్రియాజన్య విశేషణము + కృ: రుస్ + త + కృ = కులుకు; ఛిన్న + కృ = చినుకు, చిలుకు; ధృతి + కృ = తొడుకు, ధూ (ధు) త + కృ = తొలుకు, తొనుకు, తొణుకు.

5. క్వాద్యాపము + కృ: లయ + కృ = లసుకు

## 4. క్కు.

1. ఉపసర్గము + కృ: ఉద్ + కృ = ఉక్కు.

2. ధాతువు + కృ: ఏధ్ + కృ = ఎక్కు; క్రుఞ్చ్ + కృ = క్రుక్కు; చష్ + కృ = చెక్కు; సుఖ్ (శుష్) + కృ = చొక్కు, తిజ్ + కృ = తిక్కు; తుజ్ (తుడ్, ధృష్) + కృ = తొక్కు, త్రొక్కు; తజ్ + కృ = దక్కు; నక్ + కృ = నక్కు; నుద్ + కృ = నొక్కు; ప్లుష్ + కృ = పొక్కు; భుజ్ + కృ = బొక్కు; మ్లా + కృ = మక్కు; ముష్ + కృ = ముక్కు; విజ్ + కృ = విక్కు; శుష్ + కృ = స్రుక్కు; భ్రశ్ + కృ = వక్కు.

## 5. ఁగు.

1. ధాతువు+వికరణ చిహ్నము + కృ: అడ (ణ, న)ఁగు, ఆఁగు (అడ్); అలగు (అలస్); వీఁగు, ఈఁగు (విద్); ఎరఁగు, ఎఱఁగు (ఏష్); ఎసఁగు (-వు)

(ఇష్); ఏఁగు (ఇ); కరఁగు (ఘృ); కలఁగు (క్లిశ్); కా (క్రా)ఁగు (కాశ్); కోఁగు, గోఁకు (కృత్, కృంత్); గొడ (ణ)ఁగు (గుంజ్); చెలఁగు (చల్), చాఁగు (సాధ్); తునుఁగు (త్రుట్); తూఁగు (తుల్); తొరుఁగు, తొఱఁగు, తొడఁగు (స్తృ); పెరుగు, పెర్గు (వృధ్); పొసఁగు (పుష్); మడ (ణ)ఁగు, మడుఁగు, మడ్గు (మృద్); మసఁగు (మస్జ్); సరఁగు, సురుఁగు (సృ); తో (డో, దో)ఁగు (ధును).

2. ఉపసర్గము + ధాతువు + కృ: ఊఁగు (ఉద్వేజ్); ఒదుఁగు (ఉద్ధృ); ఒసఁగు (ఉపాస్); నీఁగు (నివృత్), పసఁగు (ప్రసృ); బెడగు, వెలుఁగు (విలస్).

3. క్రియాజన్య విశేషణము + కృ: కడ (ణ)ఁగు (కృత); చిను (డు)ఁగు (ఛిన్న); తొడఁగు (ధృత); తొలఁగు (తృత); పెనఁగు (పినద్ధ); మొఱ (ఱు)ఁగు, మ్రోఁగు (ముఖర)

4. ధాతువు + కృ: దాఁగు (ధా); మా (మ్రా)ఁగు (మ్లా); మూఁగు (ముష్); మే (మ్రే)ఁగు (మృజ్), రేఁగు (రిచ్); వీఁగు (విజ్); వే (వ్రే)ఁగు (వ్యధ్); సాఁగు (సాధ్).

5. తద్ధితము + కృ: మెసఁగు (ఆమిష్)

6. విశేషణము + కృ: లోఁగు (తుచ్ఛ). చూ. హిం. లుచ్ఛా.

పై యుదాహరణములలోని యర్ధానుస్వారోచ్చారణము (i) సహజముగ ననుస్వారయుక్తముగఁ బలుకు స్వభావము చేతను (ii) ధాతువులోనే యనునాసికముండుట చేతను (iii) - ను -, - నా -, - న్ -, అను వికరణ చిహ్నముల కలయిక చేతను సంభవించి యుండును

## 6.—ంగు.

1. ధాతువు + కృ: క్రుంగు (క్రుంచ్), డంగు, దంగు (దంశ్); డొంగు, దొంగు, (ధా); దొంగు (ముల్); త్రుంగు (త్రుట్); నంగు (నస్, చూ. నాసికా. హిం. నాస్తా); పొంగు (ప్లుత్); బ్రుంగు (బూ); మ్రుంగు (మృద్).

2. ఉపసర్గము + ధాతువు + కృ: ఉప్పొంగు (ఉత్ప్లుత్).

3. తద్ధితము + కృ: మ్రింగు (ఆ-మిష్).

4. విశేషణము + కృ: లొంగు (తుచ్ఛ; చూ. హిం. లుచ్ఛా).

## 7.—గు.

1. ధాతువు + కృ: అరుగు (ఋ); ఒదుగు (వ్యధ్); కసగు (కక్ష్, ఘష్); గొరుగు (క్షుర్); చెఱుగు (శూర్ప); చాగు (సాధ్); జరగు, సొరగు (సృ);

ది (డి)గు (డీ); త్రాఁగు (తృష్); తిరుగు (సృ); పెఱుఁగు (వృధ్); మ(మా)లుగు (మ్లా); ఱాలుఁగు (క్షయ్); అలుఁగు (రుష్); ఇలుఁగు (రిశ్); ఈఁగు (ఈజ్); ఈలుఁగు (లీ); మెదుఁగు (మృద్).

2. ధాతువు: అఁగు (భూ); తఁగు (స్థగ్).

3. ధాతువు + కర్మణి 'య' + కృ: బిఱుఁగు (బ్రూ).

4 క్రియాజన్య విశేషణము + కృ; కమఁగు (క్షాలిత); కలుఁగు (కృత), చెలఁగు, చెల్గు, సెలఁగు (*ఛిత్త, ఛిన్న), తల్గు (ధూత), తొడుఁగు (ధృత); నుడుఁగు, నొడుఁగు (నుత); పొదుఁగు (సృద్ధ); పొదుఁగు (పుష్ట).

5. ఉపసర్గము + ధాతువు + కృ: ఒర (ఱ)గు (ఉద్వర్త్); విసుఁగు (వ్యస్); వేఁగు (విలస్).

6. ఉపసర్గము + క్రియాజన్య విశేషణము + కృ: ఉడుఁగు (అప-, ఉపహత); ని (సి) లుఁగు (నిర్వృత).

7. అవ్యయము + కృ: విమ(ఱు)గు (పృథక్).

8.-గ్గు.

1. ధాతువు + కృ: ఇగ్గు (ఇజ్); గగ్గు (గద్); ద(డ)గ్గు (దహ్); డి(ది)గ్గు(డీ); నుగ్గు (నుద్); మ(మ్రు)గ్గు (మ్లా, మృచ్).

2. ఉపసర్గము + ధాతువు + కృ: నిగ్గు, నెగ్గు (నిర్వహ్).

9.-ఁచు.

1. క్ష్, చ్, శ్, ష్, స్- అంతమందుగల ధాతువులు: అలఁచు (అలస్); ఊఁచు (ఉజ్ఝ్), ఇది 'ఉద్ + కృ' నుండి పుట్టి గకారము చకారముగా మాఱుటవలన నైనను గలుగవచ్చును. కలఁచు (కలుష్); క్రాఁచు (కష్య); నాఁచు (నశ్); పూఁచు (పృచ్); రేఁచు (రిచ్), లాఁచు (లష్); వ్రేఁచు (వ్రశ్చ).

2. త్, థ్, ర్ మొదలగున వంతమందుగల ధాతువులు + య- వికరణ చిహ్నము; ఏఁచు (ఏష్య); చాఁచు (సాధ్య); నోఁచు (కుత్స్య); మెలఁచు (మిల్ + య); వేఁచు (వ్యధ్ + య).

3. ధాతువు + * అఛ్ = అస్ (*అఛ్ అను ధాతువు ధాతుకోశములలో లేకున్నను నట్టిదుండవలెనని శబ్దశాస్త్రజ్ఞులభిప్రాయపడుచున్నారు. ఈ ధాతుసంయోగమువలననే యాధునికార్యభాషలలోని చకారాంత ధాతువులు కొన్ని కలిగినట్లు వారు నిర్ధారించియున్నారు.) అడ(ణ)ఁచు, ఆఁచు

9. శ, ష, స, క్ష లంతమందు గల ధాతువుల కనునాసికోచ్చారణము కలుగుటవలన: ఉంచు (వస్).

## 11 -చు.

1. ధాతువు + ఇష్య: అడరుచు (ధృష్); అఱచు, అర్చు (రస్); అలరుచు (లష్).

2. ధాతువు + య (య-వికరణచిహ్నము, కర్మణి-య): ఏచు (వృధ్); కఱచు (కర్ష్); కాచు (కాశ్); కాలుచు (క్లమ్); కుదుచు (స్కుద్); కొలుచు (కూల్).

3. ఉపసర్గము + ధాతువు + ఇష్య: అలవఱుచు (అధిపత్); ఉలుచు (ఉల్లూ); ఎలరుచు (విలస్); ఏడుచు (విలప్); ఏమఱుచు (విస్మృ); ఒలుచు (అవలూ); ఓరుచు (అపధృ).

4. ధాతువున కనునాసికోచ్చారణము కలుగుటవలన: ఉనుచు (వస్).

5. క్రియాజన్య విశేషణము + ఇష్య: అగలుచు (ఖాత, ఘాత); అదలు (రు)చు (దారిత); కడచు, కదలుచు (గత); కెరలుచు (సృత); గెలుచు (జిత); చిముడుచు (*ఛింద, ఛిన్న); చీలుచు (*ఛిత్త, ఛిన్న).

6. తద్ధితరూపము + ఇష్య: ఇ (చి) గురుచు, ఇ (చి) గ్గుచు (శిఖర).

7. విశేషణము + ఇష్య: డు (దు) లుచు (శిథిల).

## (12)-చ్చు.

1. ధాతువు + య: ఎ (ఏ) చ్చు (వృధ్); గి (గు, గో) చ్చు (ఘృష్, కృష్); చొచ్చు (స్యూ); తెచ్చు (ధృష్, తృష్); నొచ్చు (నుద్); రిచ్చు (రిచ్); వచ్చు (వ్రజ్); విచ్చు (విచ్); వ్రచ్చు (వ్రశ్చ్)

2. ధాతువు + ఇష్య: నచ్చు (నర్మ).

3. ఉపసర్గము + ధాతువు: ఉచ్చు (ఉత్స్య).

## 13.-ఁజు.

ధాతువు+య: గోఁజు (ఘుష్); పో(ప్రో)ఁజు (పుంజ్); రాజు(రంజ్), రోఁజు (రుష్).

## 14.-ంజు.

1. ధాతువున కనునాసికోచ్చారణము: గుంజు (కృష్)

2. ధాతువు: పొంజు (పుంజ్)

## 15.-జ్జు.

ధాతువు + య: రజ్జు (రస్).

## 16.–ఁటు.

1. ఉపసర్గము + ధాతువు: ఊఁటు (ఉద్వర్త్, ఉత్థాన)

2. క్రియాజన్య విశేషణము: ఆఁటు (ఆర్త, ఆప్త); గీఁటు(క్షిప్త); దూఁటు (ధూత); దోఁటు (దుత్త); పొరఁటు (పృక్త).

3. క్రేఁటు (చూ. క్రేంకార); దాఁటు (చూ. ధాటీ).

## 17.–ంటు.

1. అనునాసికముగల ధాతుజన్య విశేషణము: ఎంటు (అక్త); కుంటు (కుంచిత, ఖంజిత, కుంఠిత); గంటు(*ఘ్నంత, హన్; ఘాత, ఖాత, ఖన్).

## 18.–టు.

1. ధాతువు: చాటు (సాట్).

2. ధాతువు + అట్: తెగటు (తృచ్).

## 19.–ట్టు

1. క్రియాజన్య విశేషణము: ఉట్టు (ఉద్వర్తిత, ఉత్థాపిత); నెట్టు (నిర్వృత్త); ఒట్టు (వర్తిత); కొట్టు (కుట్టిత); గిట్టు (క్లిష్ట, కృష్ట, ఘృష్ట); తట్టు (తాడిత, తష్ట); పట్టు (వర్తిత, పతిత); పెట్టు (వృత్త); మట్టు మెట్టు(మర్దిత). కట్టు (కృష్ట, కర్షిత); కిట్టు (కర్షిత); కుట్టు (కృష్ట, కుత్థ, కర్షిత); పెట్టు(ప్రహత).

2. తద్ధితరూపము: పుట్టు (చూ. పుత్త్ర); మొట్టు (ముష్టిత).

## 20.–ండు

క్రియాజన్య విశేషణము, (* చూఁడు శుష్ట, శుష్క) ; తేఁడు (తిష్ట, తిష్ఠిత) ; తోఁడు (ధృష్ట) , పేఁడు (పినద్ధ) : మూఁడు (మ్లష్ట); లోఁడు (లూత).

## 21.–ండు.

1. క్రియాజన్య విశేషణము: ఉండు (ఉషిత, * వుష్ట); చుండు (*శుష్ట, శుష్క); పండు (ఫలిత); మండు (మ్లష్ట); వండు (*పక్త, పక్వ); చెండు (ఖండిత, ఛిందిత); తండు (దండిత); పిండు (పిష్ట, వ్యథిత).

2. ఉపసర్గము + క్రియాజన్య విశేషణము: పరుండు (పర్యుషిత).

## 22.–డు.

1. ధాతువు: ఆడు (అట్); పాడు (పత్); పూడు(పూర్); పడు(పత్).

2. ఉపసర్గము + క్రియాజన్య విశేషణము: బెగడు, బెగ్గడు (బిజ్కృత, విహ్వాలిత).

3. క్రియాజన్య విశేషణము: ఇడు, ఇముడు (హిత,*హింత); ఓడు (అవహాత); చిముడు, (ఛిందిత,* ఛింత్త); చెడు (*ఛిత్త, ఛిన్న); తోడు (ధృత); వాడు (మ్లాత, మ్లష్ట); విడు (*భిత్త).

4. ఉపసర్గము + క్రియాజన్య విశేషణము: ఊడు(ఉత్పతిత, ఉత్పాటిత, ఉత్పాతిత); నిగుడు, నివుడు (నిర్హాపిత, నివృత్త, నిర్వృత్త); నెగ(వ)డు (న్యక్కృత, నిష్పృత, నిర్వర్తిత); పొగ(వ)డు (ప్రగీత, ప్రకృష్ట).

5. ఉపసర్గము + ధాతువు + అట్: ఊరడు (ఉచ్ఛ్వస్ + అట్).

6. తద్ధితరూపము: కూడు (చూ. కూట).

7. అవ్యయము + ధాతువు: తెగ(వ)డు (ధిక్కృత).

23. -డ్డు.

1. క్రియాజన్య విశేషణము: అడ్డు (అడ్డ).

2. ఉపసర్గము + క్రియాజన్య విశేషణము: ఒడ్డు (ఉపహిత).

24 -ణు.

తద్ధితరూపము: తెనమణు (శయన).

25. -తు.

క్రియాజన్య విశేషణము: పాఁతు (పాతిత).

26 -తు.

క్రియాజన్య విశేషణము: చాతు (సజ్జిత).

27. -త్తు.

1. క్రియాజన్య విశేషణము: అ(హ)త్తు (భక్త); ఎత్తు (ఇత); నత్తు (*నద్;*నత్త. చూ. నదన, నాద); మెత్తు (మృత్త, మృదిత); మొత్తు (ముష్టిత, మృదిత); రుత్తు (రుద్ధ).

2. ఉపసర్గము + క్రియాజన్య విశేషణము: ఒత్తు (ఉపహత, ఉద్ధత, ఉద్వర్తిత).

28. -ఁదు.

1. ధాతువు: అలఁదు (ఆర్ద్); చాదు (సాధ్); మోదు (మృద్ నీ ముష్టిత).

2. ఉపసర్గము + క్రియాజన్య విశేషణము: ఊఁదు (ఉద్ధ్మాత).

3. అవ్యయము+క్రియాజన్య విశేషణము: చీఁదు (సీత్కృత).

29.-ందు.

1. ధాతువు: కందు (క్రంద్); చిందు (ఛింద్); పొందు (స్పంద్, పద్).

2. ఉపసర్గము + ధాతువు: ఒందు (ఉపపద్).

3. క్రియాజన్య విశేషణము: కందు (క్లమిత) ; కుందు (కృశిత); కొందు (కృత్త); మ్రందు (మ్రక్షిత, మ్రష్ట).

30.-దు.

1. ధాతువు: ఎయిదు, ఎద్దు, ఏదు (ఏధ్).

2. ఉపసర్గము+క్రియాజన్య విశేషణము: సరదు (సంస్కృత, సంవృత).

31.-ద్దు.

క్రియాజన్య విశేణము: అద్దు (అర్దిత, ఆర్ద్రిత); బిద్దు (భిత్త); దిద్దు (ధృత, తరిత); రుద్దు (రుద్ధ).

32.-ను

1. న, ణ, ల, లతో నంతమగు ధాతువులు; అను (అన్, అణ్); కను (అక్ష్ణ్); చను (చల్); తిను (తృణ్); నాను (స్నా).

2. ధాతువు + - ను + -, - నా -, - న్ -, వికరణ చిహ్నము; కొను (కృణు); దును (ధును)

3. తద్ధితరూపము: ఆను (ఆభాన); ఈను (ఈజన); పూను (వహన); (వయన)

33.-న్ను.

1. ధాతువు + - ను - వికరణచిహ్నము: దున్ను (ధును)

2. క్రియాజన్య విశేషణము: పన్ను (*పన్న; పద్, పత్).

3. తద్ధితరూపము: ఎన్ను (హేలన); తన్ను (తాడన).

34. ు(పు.

సంస్కృతమున - 'ఆపయ' - అనునది ప్రేరణార్థమున ధాతువులతోఁ జేరుచుండును. హాపయతి, విజ్ఞాపయతి, మొద. దీనిలోని - అయ - ఒక్కటే ప్రేరణార్థమునుగలిగి, - ఆప్ - అనునది కేవలమనుబంధమయినను, సాధారణజనులకు - ఆప్ - అనునదియే ప్రేరణార్థమునఁ గలిగినట్లు తోఁచుటసంభవించెననియు, దానిని ధాతువులకు స్వేచ్ఛగాఁ జేర్చుటవలన నుత్తరహిందూస్థాన భాషలలో ప - కారాంత ధాతువులు గొన్ని యేర్పడె ననియు నా భాషాతత్త్వజ్ఞుల యభిప్రాయము. ద్రావిడభాషలలోను గొన్ని ప - కారాంత ధాతువులట్లే యేర్పడియుండవచ్చును.

1. ధాతువు + (ఆప్) చాఁవు (స్రాధ్); మలఁపు (మృద్); రేఁపు(రిచ్).
2. ఉపసర్గము+ధాతువు: ఆఁపు (ఆపహ్నృ); ఊఁపు (ఉపహ్నృ, ఉజ్ఝాప్).
3. తద్ధితరూపము + ఆప్: చేఁపు (సీధు).

### 35.-ంపు.

1. ఉపసర్గము + ధాతువు: నింపు (నిరాప్); పంపు (ప్రాస్).

2. ధాతువు + ఆప్: చింపు (ఛిదాప్); చంపు, సంపు (శవాప్); డింపు (డీ); తె (త్రెం) పు (త్రుట్, త్రష్, తఫ్); దంపు (దంశ్); పెంపు (వృధ్).

3. ఉపసర్గము + ధాతువు + ఆప్: అంపు (ఆజ్ఞాప్).

### 36.-వు.

1. ధాతువు + ఆప్: అఱపు (అశ్, అర్హ్); కఱపు (కృష్); చదుపు, చిదుపు, చెఱపు (ఛిద్); చలుపు, సలుపు, సళుపు (చల్); జరపు (సృ); తరపు (త్రా); తిఱపు (తృప్), నడ(డు)పు (నట్); నానుపు (స్నా;) నిలుపు (నిష్ఠ్, తిష్ఠ్); పఱపు (పత్); పఱుపు (ఫల్); మలపు, మెదుపు (మృద్); మూపు (మ్లుశ్); మెనుపు (మర్ష్); గిలు (ఱు) పు (క్షిప్).

2. ధాతువు + వికరణచిహ్నము + ఆప్: కలపు (చూ. కలయతి); చొనుపు (సృ, స్యూ).

3. ధాతువున ననునాసికము చేరుట: తనుపు (తృమ్ప్).

4. ఉపసర్గము + ధాతువు: ఓపు (అవాప్).

5. ఉపసర్గము + ధాతువు +ఆప్: అనుపు (ఆజ్ఞాప్); నెర(ఱ)పు (నిర్వర్త్); పాపు (అపాస్).

6. క్రియాజన్య విశేషణము + ఆప్: కడపు (ఘ్నత, క్షత), కొడపు (క్లిష్ట, కృప్త); కొలుపు (కృత); దులుపు, దొలుపు (ధూత); నుఱు(లు)పు (నుద్); పెనుపు (పినద్ధ).

7. ఉపసర్గము + క్రియాజన్య విశేషణము + ఆప్: ఉదు(లు)పు (ఉపహార్త).

### 37. - ప్పు.

1. ధాతువు+ఆప్: ఉప్పు (ఉష్); కప్పు (ఛద్); గుప్పు (క్షిప్); తప్పు (తర్); త్రిప్పు (స్తృ); దెప్పు (దిశ్); రొ (రు) ప్పు (రుద్, రుష్).
2. ఉపసర్గము + ధాతువు: ఒప్పు (అవాప్).
3. ఉపసర్గము + ధాతువు + ఆప్: విప్పు (వ్యస్).

### 38. - ంబు.

ఉపసర్గము + ధాతువు + అప్: పంబు (ప్రవృత్తి).

### 39. - బ్బు.

1. ధాతువు: గెబ్బు (గ్రహ్); డబ్బు, దబ్బు (డహ్. చూ. దహర; ఒటియా భాష, డక్కుచ్ఛి=పిలుచుచున్నాఁడు); ద్రొబ్బు (ద్రుహ్, దృమ్భ్).

2. ఉపసర్గము + ధాతువు: ప్రబ్బు (ప్రవహ్, ప్రవృత్, ప్రవృధ్. (ప్రనద్).

### 40-ము.

1. న, మ్ప, మ్భ, మ - లతో నంతమగు ధాతువులు: ఓము (వన్); తును (ఉ) ము (తృమ్ఫ్); చిరుము (జృమ్భ్); అదుము (దమ్); కదుము (క్రమ్).

2. ఉపసర్గము + ధాతువు: అరు (ల) ము (ఆక్రమ్); ఉనుము (ఉద్యమ్); ఒరుము (ఉపక్రమ్); పులుము (ప్రలుమ్ప్).

3. క్రియాజన్య విశేషణము: గదుము (గదితమ్); చదు (ఉ) ము, చిదుము, చెఱుము (* ఛిత్తమ్, ఛిన్నమ్); నోము (నుతమ్, * నుత్తమ్).

4. తద్ధితరూపము: నులుము (ఉన్మూలనమ్, ఉల్లీనమ్); పొడము (స్ఫుటమ్).

### 41.-మ్ము.

1. మకారాంతదాతువు: క్రమ్ము (క్రమ్); నమ్ము (నర్మ్).

2. క్రియాజన్యవిశేషణము: తుమ్ము (క్షుతమ్).

3. తద్ధితరూపము: చి (జి) మ్ము (స్యందనమ్, సేచనమ్); పమ్ము (ప్రవర్తనమ్, ప్రవహణమ్); ప్రమ్ము (పరివేషణమ్).

### 42.-యు.

1. క్ష, చ, ఛ, జ, ఝ, శ, ష, స-లతో నంతమగు ధాతువులు: అమయు (మక్ష్); అరయు (రక్ష్, లక్ష్); అలయు (అలస్); అవియు (వ్రశ్చ్); ఇఁడి (జి యు (రిశ్, రిష్); ఎలయు(లష్); ఏయు (ఇష్); కల (లి) యు (కృశ్, కర్ష్); కినియు (క్లి; క్లిన్న); కుదియు (కుత్స్); కూయు (కూజ్); కెడయు (కృశ్, క్లిశ్); క్రిక్కిఱియు (కృశ్ కృశ్);క్రోయు (క్రుంచ్); గీయు (కృష్,ఘృష్); తేయు (తిజ్, తిష్); డూ (దూ) యు (దుష్); దొర (ఆ) యు

(దృశ్); పరియు (పృష్); పాయు (భజ్, పాంస్, అపాస్); పొఱ (ఱి) యు (పృష్); పొలయు (ప్లుష్); పోయు (ప్రోక్ష్, ప్రోష్); మలయు (మ్లుశ్); మురి (ఱి) యు (మృశ్); రే (ఱే) యు (రిచ్, రిజ్); రోయు (రుష్, రుశ్); లాయు (లష్, లస్); వ్రేయు (వ్రశ్చ్).

2. ఉపసర్గము + ధాతువు: ఆరయు (ఆరక్ష్, ఆలక్ష్); ఉరి (ఱి) యు (ఉద్రిచ్); ఉలియు (ఉద్రస్); ఒడియు (అవధృష్); ఒలయు (ఉల్లస్); నెర (ఱ) యు (నిర్విశ్); బిగియు (విక్రుష్, విక్రుశ్); బెడియు (విదృశ్, విధృష్); బెర (ల) యు (విరచ్); మెఱయు (విలస్); వలయు (అవలష్); విరియు (విరిచ్); వెలయు (విలస్); వలియు (వ్యరిశ్).

3. ఉపసర్గము + ధాతువు + య: పెనయు (పి-, అపినద్ధ).

4. ధాతువు + ఇష్య: ఎగ (వ) యు (ఏధ్); కదియు (స్కంద్); కనియు (క్లమ్); కమియు (క్రమ్, క్లమ్); కవియు (క్రమ్); గునియు(క్వణ్); చదియు, చిదియు (ఛిద్); చెనయు (స్విద్); చెలయు, చెలయు (చల్); జడియు (చల్, శ్లథ్, శ్రథ్, శబ్ద్); నోయు (నుద్); పడయు (పత్, పద్); మదియు (వృధ్).

5. అవ్యయము + ధాతువు: ఎడయు (పృథక్కృ); సొలయు (సు-అలస్).

6. తుదియచ్చుపై యడాగమముగలుగుట: ఒడియు (ఉడ్డీ); మాయు (మ్లై, మ్లా); మి (వి) డియు (విడీ); ఒలియు (ఉల్లా).

7. ధాతువు + య: కోయు (కృత్); క్రాయు (గ్రివ్య); మోయు (వహ్య); బులియు (బ్రూయ), చూ. హిం. బూలా; బోల్; చూ. తెనుఁగు: బొల్లిమాట.)

8. విశేష్యము + స్య: తడయు (తటస్థా); మొరయు, మ్రోయు (ముఖరస్).

9. కృద్రూపము: తనియు (తృష్ణా); పులియు (పూతి); ముగియు మొనయు (ముఖ).

10. క్రియాజన్య విశేషణము + ఇష్య: వడియు (ఉదిత).

11. విశేషణము + ఇష్య: తెలియు (ధవల).

## 43.-య్యు.

ధాతువు + య: క్రయ్యు (కృష్); గ్రొయ్యు (కృశ్, క్రుంచ్); డ (ద) య్యు (దృమ్); దు (దు) య్యు(దుష్); త్రెయ్యు (త్రక్ష్); బ్రుయ్యు (భ్రశ్).

## 44.-రు.

1. చ, ర, శ, ష, స లంతమందుగల ధాతువులు: అమరు (మృశ్, మృష్); ఆరు (ఆస్, అట్); కసరు (కర్ష్, ఘర్ష్); కోరు (కర్ష్); చూరు (శుష్); తిము (వు) రు (త్వర్); పేరు (ప్రా. పుఅర్); వారు (వ్రశ్చ్).

2. ధాతువు: కేరు (గృా); తలరు, తూరు (స్తృ); తీ (తూ) రు (తృ); పేరు (పృా).

3. ఆమ్రేడితధాతువు: అడ (ద) రు, అదురు (అట్ అట్).

4. ధాతువు + కృ: ఎగురు (ఏధ్, ఏష్).

5. ధాతువు + ఇష్: ఎగురు (రుధ్); కమరు (క్లమ్); చిదురు, చీఱు, గీఱు (ఛిద్); తొడరు (తుడ్); పదరు (వద్), పదురు (పత్), విదురు, బెదరు, పీరు (భిద్); మసురు (మద్); ముదురు (వృధ్); ముసరు, మూరు (ముష్).

6. ధాతువు + అట్: ఎ (ఏ) సరు (ఏష్); కొసరు (కుంచ్); క్రమ్మరు (క్రమ్); చమరు (శమ్); పొకారు (భ్రాజ్); ముసరు (ముష్); వందురు (వ్యథ్); వద (న) రు (వద్).

7. ఉపసర్గము + ధాతువు: ఉదరు (ఉద్ + అట్); నిము (వు) రు (నిర్మృశ్).

8. ఉపసర్గము + ధాతువు + ఇష్: పారు (ప్రవృత్); వేస (సా) రు (వ్యస్).

9. ఉపసర్గము + క్రియాజన్యవిశేషణము + అట్: ఒ (పొ-, మొ) నరు (ఉపపన్న).

10. క్రియాజన్యవిశేషణము: చెదరు (ఛిద్ర).

11. క్రియాజన్యవిశేషణము + ఇష్: ఎడరు (విద్ధ).

12. క్రియాజన్యవిశేషణము + అట్: కదురు, కొదరు (ఖదిత, కృత); కుదురు, కూరు (కృత).

13. తద్ధితరూపము + కృ: డాకురు (దక్షిణ + కృ); చమరు (చపేట + కృ).

## 45.-ఱు.

1. ఋ, శ, ష, స, లంతమందుగల ధాతువులు: అ (ఆ) ఱు (అర్ష్); ఏమఱు (విస్మృ); కేఱు (కష్); దూఱు (దుష్); మాఱు (మ్లుశ్).

2. ఆమ్రేడితధాతువు: ఈడేఱు (ఇష్ ఇష్); దద్దఱు (త్వర్త్వర్).

3. ధాతువు + ఇష్: ఎచ్చిఱు (ఏష్); క్రమ్మఱు (క్రమ్); గివుఱు, గీ (చీ-,జీ-) ఱు (ఛిద్); జాఱు (సృ, స్రవ్, శ్లథ్); తా (తే) ఱు (త్యా).

4. ఉపసర్గము + ధాతువు: పాఱు (ప్రసృ).

5. ఉపసర్గము + ధాతువు + ఇష్; పాఱు (ప్రవహ్).

## 46.-ఱ్ఱు.

ధాతువు: జుఱ్ఱు (జుష్); కుఱ్ఱు (కూజ్, ఘుష్).

## 47.-లు.

1. క్రియాజన్య విశేషణము: అగ (గు) లు, ఔలు (ఖాత, ఘాత); అడ (ద) లు (చూ. హిం. డర్); ఈసడిలు (శిథిలిత); ఎచ్చిఱిలు (ఏషిత, * వృధిత); ఎడలు (*భి త్త, భిన్న); ఏలు (ఏధిత) ; ఒరలు, రోలు (రుదిత) ; కదలు, కుదులు (స్ఖలిత, స్కదిత, స్కుదిత) ; కనలు, కనారిలు (చూ. సం. కనల) ; కమలు, కాలు, కుములు, కుమారిలు (క్లమిత) ; కుదికిలు (స్కుదిత); కుప్పళిలు (గూర్విత) ; కుమ్మరిలు (కుంఫిత), కుసులు, కూలు (కుంచిత); కెరలు (కూజిత, క్రుద్ధ) ; క్రాలు(క్రాంత); క్రుంగిలు (కుంచిత); క్రోలు (గృహీత, కృష్ట) ; చిందిలు, (ఛిందిత) ; చికిలు (చకిత) ; చిటిలు; చిల్లు, దీ (డీ) లు, సడలు (శిథిల) ; చీలు (*ఛి త్త, ఛిన్న) ; చతి (ది)కిలు (సదిత) ; చాలు (సాధిత) ; తగు (వు) లు, తౌలు (స్థగిత) ; తర (ఱ) లు, తర్లు, తెర (ఱ) లు (తరిత) ; తూలు (ధూత) ; తొడికిలు (త్రుట్కృత, త్రుటీకృత) తొట్రిలు(తోత్కృతి, దుష్ట), దొంగిలు (తస్కరిత) ; నొగులు (నుద్+కృత); పగులు (భ క్త) ; పిగులు, పీలు, పెక (గ) లు, పేలు (* భి క్త, *భిద్ + కృత, భేదీకృత) ; పొదలు (వర్ధిత) ; పొరలు, పొర్లు (ప్రవ ర్తిత) ; పొగు (వు) లు ; (*ఫ్లుష్+కృతి) ; ప్రేలు (* బ్రూత, *వదిత) ; బ (వ) డ (ద, దు) లు, విదలు (బాధిత, భిద్+కృత); మా (మ్రా )లు,(మ్లాత);ముంగిలు (ముఖరిత); ము (మ్రు)చ్చిలు (ముషిత) ; రగు (వు) లు (రంజిత) ; ఱోలు (రాసిత) వఱలు (వ ర్తిత); వసులు (అపసృత; భిద్+కృత); వా (వ్రా) లు (అవపాత); వీలు (విహిత) ; విదులు, వెడలు, వెలలు (విక్రృత, వికల) ; వెలికిలు (బహిష్కృత); వే (వ్రే) లు (విధృత, వివృత) ; సోలు (శ్రమిత, శ్రాంత).

2. ఉపసర్గము+క్రియాజన్య విశేషణము : ఆగుబ్బతిలు (ఆగూర్విత).

## 48.-ల్లు

1. క్రియాజన్య విశేషణము : అల్లు (వల్లిత, వేల్లిత) ; ఉడికిల్లు (ఉష్ణీకృత) ; ఎగసిల్లు (ఏష్కృత) ; కంటగిల్లు (కంటకిత); క (త) త్తరిల్లు (త్వరిత);

క్రమ్మరిల్లు (క్రమిషిత); గిల్లు (క్షత, క్షిప్త); గూనుగిల్లు (ఖుంజిత, కుంచిత); చిప్పిల్లు (క్షిప్త); చెమ్మగిల్లు (తీమ్ కృత); చ (చె) ల్లు, తల్లడిల్లు (చాలిత); చాగిల్లు (సాధ్+కృత); చో (జో) బ్బిల్లు (క్షుభిత); రవణిల్లు (స్థానిత, స్థాపిత); డుల్లు, డొల్లు (శిధలిత), తారసిల్లు (ధర్షిత), తుప్పటిల్లు (తర్పిత); తొట్రిల్లు (త్రుటిత, దుష్ట); తేలగిల్లు (ధృత+కృత, తారిత+కృత), దండసిల్లు (దండిత); దద్దరిల్లు, దద్దిల్లు (త్రస్త, త్వరిత), దుంపిల్లు (* దూషాపిత), దుసికిల్లు (దుష్కృత); దూపిల్లు, దూపటిల్లు (తృషాపిత), నిట్రిల్లు (నిష్ఠిత); పిక్కటిల్లు (పృథక్కృత, వర్ధిత), చిప్పిల్లు (ఛిదాపిత), పెల్లగిల్లు (పృథక్కృత, భిద్+కృత); బంధీగిల్లు (బంధీ కృత), బాసగిల్లు (బలాత్కృత); బీటగిల్లు (పృథక్కృత); బొండగిల్లు (భింద్ + కృత); బెగ్గిల్లు, బెగ్గడిల్లు (భగ్నిత, విహ్వలిత); బొల్లు (*బ్రూత); బోరగిల్లు (చూ. హిం. బోల్నా); మందటిల్లు (మందిత); మంపిల్లు (మదాపిత), మేటిల్లు (మహిత); మోరటిల్లు (ముఖరిత); అంతిల్లు, రొల్లు (రటిత, రాసిత); లొగ్గడిల్లు (రుగ్ణ, రోగిత, * తుచ్ఛిత); సన్నగిల్లు (శ్లక్ష్ణీకృత); సొంపిల్లు (చూ సుందర); హెచ్చిల్లు, హెచ్చిరిల్లు (వర్ధిత, ఏష్+కృత, ఏధ్+కృత).

2. ఉపసర్గము+క్రియాజన్య విశేషణము : ఆవటిల్లు (ఆపతిత); ఊటడిల్లు (ఉచ్ఛ్వసిత); ఊసరిల్లు (ఉత్సరిత, ఉత్సారిత); అడిగిల్లు (అధస్కృత); ఏమఱిల్లు (విస్మృత); ఒడ్డ (త్తి) గిల్లు, ఒత్తిల్లు (ఉపహత); ఒల్లగిల్లు (ఉపహృత); ఓటిల్లు, ఓహటిల్లు (అవహృత); ఓడిగిల్లు, ఓరగిల్లు (అవహృత); దెప్పరిల్లు (ఆపాదిత, ఆపన్న, స్థాపిత); పరిఢవిల్లు (పరిష్ఠిత); పల్లటిల్లు (పర్యస్త); పాయగిల్లు (అపాస్త, భాగీకృత).

49.-ళు.

క్రియాజన్యవిశేషణము: తాళు (స్థాత, ధృత).

50.-ళ్లు.

క్రియాజన్యవిశేషణము: కు (క్రు) ళ్లు (కిర్ణిత); త్రెళ్లు (త్రుటిత); త్రుళ్లు (త్రుటిత, సృప్త); నెళ్లు (విధృత, విగత); సళ్లు (శ్లథిత).

51.-వు.

1. తుదిగకారము వకారముగ మాఱుట; ఉత్వముపై వగాగమము వచ్చుట. చూ. (గు, గు).

అఱువు (రిశ్); అలువు (రుష్); ఉడువు (ఉపహ్వా); ఊవు (ఊద్వీజ్); ఎసవు (ఏష్); ఒదువు (ఏర్ధ్); ఒసవు (ఉపాస్); ఓవు (ఉపహ్వా, ఉదాహ్వా); చెరువు (చక్ష్); చెలవు (ఛిద్); చదువు (శబ్ద్); తడవు (తడ్); తలవు (త్యా); తవు (స్థగ్), తొడవు (ధృత); త్రావు (తృష్); త (త్ర)వ్వు (తక్ష్, త్రక్ష్).

2. ధాతువు: అవు (భూ; ప్రాకృతము: ఓ, అఉ, అవు); పోవు (ప్రగ.)

## 52.-వ్వు.

ఒవ్వు (ఉదాహ్వా., అవహ్వా); కవ్వు (చూ. కవల); కివ్వు (క్లిశ్). చివ్వు (ఛిదాప్); త్ర (త్రె) వ్వు (త్రక్ష్).

## 53.-సు.

తెనుఁగున సు వర్ణాంతధాతువులు లేవు. 'సరసు' అనునొకటి శబ్దరత్నాకరమునఁ జేరినది. ఇది హిందూస్థానీ భాషనుండి చేరినదేమో. సంస్కృతమున దీనికి సంబంధించిన శబ్దములు 'సదృశ, సరస, సంవృష్' అని చెప్పవచ్చును.

## ధాతువులు.

తెనుఁగుధాతువులనొకచోఁ జేర్చిన దాతుకోశ మింకను నేర్పడలేదు; శబ్దరత్నాకరమునఁ జేరిన ధాతుసముదాయమే మన పరిశీలన కాధారముగఁ జేకొనవలసియున్నది. ఈ ధాతువులలో 1. మూలధాతువులు, 2. మూలధాతువులనుండి యనేకవిధములఁ బుట్టినధాతువులు, 3. కృత్తద్ధితరూపములనుండి పుట్టినధాతువులు, 4. ధ్వన్యనుకరణబోధకధాతువులు, నని నాలుగుతరగతులుగ నున్నవి. ఇవియన్నియు సాధారణముగ నాంధ్రవాఙ్మయమునఁ బూర్వకవులచే వాడఁబడినవై యున్నవి. కవిప్రయుక్తములుకాని ధాతువులు కేవలవ్యవహారస్థములైన ధాతువులును గొలఁదిగ నీనిఘంటువునఁ జేరకపోలేదు. పూర్వకవు లుపయోగించినధాతువులలోఁ గొన్ని నేఁడు వ్యవహారభ్రష్టములైనవి. వ్యవహారచ్యుతి నొందని కొన్నిధాతువులు నేఁడు క్రొత్తయర్థములను బొందినవి. ఇవిగాక ధాతునిర్దేశము చేయ వీలులేని కొన్ని క్రియారూపములు మాత్రము భాషయందు నిలిచియున్నవి.

తెనుఁగులోని ధాతువుల నీ క్రింది విధముగ వర్గములుగ నేర్పఱుప వచ్చును.

I. ప్రధానధాతువులు.
—1. ప్రధానధాతువులు—(i) కేవలధాతువులు. (ప్రాచీనార్యభాషలలోనివి).
(ii) ఉపసర్గసహితధాతువులు.
ప్రాచీనార్యభాషలలోనిధాతువుల కాయా వికరణచిహ్నములును, నితరచిహ్నములును జేర్చుటవలన నేర్పడినవి.
—3. సంస్కృతమునుండి చేరినధాతువులు (తత్సమములు, అర్ధతత్సమములు).
—4. వ్యుత్పత్తి సందేహముగల ధాతువులు (దేశ్యములు ?).

(I)I. ధాతుజధాతువులు.
1. ప్రేరణార్థకధాతువులు.
2. కృత్తద్ధితజన్యధాతువులు
(అ) తద్భవములు — (i) ప్రాచీనములు (ii) మధ్య, ఆధునిక కాలికములు.
(ఆ) తత్సమములు.
(ఇ) అన్యదేశ్యములు.
3. సమస్తములు, ప్రత్యయసహితములు.
4. ధ్వన్యనుకరణములు.
5. సందేహాస్పదములు.

**ఉదాహరణములు.**

I. 1. (i) ప్రాచీనార్యభాషలలోని ప్రధానధాతువులు: కేవలధాతువులు. తె. అచ్చు; బంగాళీ. అఛ్; ప్రా. అచ్ఛతి; ఇండోయూరోపియను * ఎస్కేతి; తె. కందు; బం. కాఁద్; సం. క్రంద్; తె. కఱ(చు), కా(గా)డు; బం. కాట్; సం. కృత్; తె. గుణించు; బం. గణ్, గుణ్; సం. గణ్; తె. చీఱు (లు); బం. చీఱ్; సం. ఛిద్; తె. తాకు; బం. ఢాక్ (చూ. తె. ఢాక); ప్రా. ఢక్క; తె. డులు (పు); బం;దుల్.సం. చూ. దోలా; తె. నాను, బం. నాహ్; సం. స్నా; తె. పాచు (ప్రాచిపోవు); బం.పచ్,సం.పచ్; తె.ఫుటుకు; బం. ఫాట్; ఫుట్; ప్రా. ఆర్య. స్ఫాట్ *; స్ఫుట్; తె. వంతు (ధాతువు?,)

బం. బ్లాట్; సం. వంట్; తె. పట్టు; బం.బట్; సం.వృత్; తె. బొల్లి(మాట) (ధాతువు?), బం. బోల్; సం బ్రూ; తె. వంచు; బం. భాజ్; సం. భంజ్ తె. సొగయు; బం. సోహ్, సం. శుభ్;- మొ.

I. 1. (ii) ప్రాచీనార్యభాషయందలి యుపసర్గ సహిత ధాతువులు: తె. ఉట్టు; బం. ఉఠ్; సం. ఉఠ్ సం. ఉద్-స్థా; తె. నెవ (ర) డు; బం. నిబా (హ్), సం. నిర్వహ్ మొ.

1. 2. ప్రాచీనార్యభాషాధాతువుల కితరచిహ్నములు చేరినవి: తె. కొను; బం. కిన్; సం. కృణు; తె. దును; బం. ధునే; సం. ధును మొ;

1. 3. సంస్కృతమునుండి చేరిన తత్సమములు: ఎట్టి సంస్కృతధాతువయినను తెనుఁగుప్రత్యయములతోఁ దెనుఁగునఁ జేరవచ్చును. సంస్కృతమునుండి చేరిన యర్థతత్సమములు: సంతసించు, బుజ్జగించు, ఆరడించు, తగు, తిను మొ.

1. 4. వ్యుత్పత్తి సందేహముగలధాతువులు: వీనినే దేశ్యములని పిలువవలసియుండును. ఇట్టి వతిప్రాచీనతద్భవములని యాధునికార్యభాషా తత్త్వజ్ఞుల యభిప్రాయము. వీని తద్భవత్వము నిరూపించుటకు వారు ప్రయత్నించుచున్నారు. ఇట్టి దేశ్యధాతువులు నేఁటి యార్యభాషలయందున్నవానికంటెఁ దెనుఁగున నెక్కువగ లేవు.

## II ధాతుజధాతువులు.

II. 1. ప్రేరణార్థక చిహ్నముతోఁ గలసి వికారము నొందినవి: తె. ఓకిలించు; బం. ఉగ్రా; సం. అవక్రియతే, తె. దాచు, బం. దా; తె. నప్పు; సంజ్ఞాప్యతే; ప్రా. ణప్పేఇ; హిం. నాపే; సం దాపయ; తె. మాపు; బం. మా; సం. మ్లాపయ; తె. పడయు; బం. పాటాయ్; సం. పాతయ; తె. గాలించు. బం.గాలే; సం. గాలయతి; తె. చెలయు; బం. చాలే, సం. చాలయతి; తె. నోయు; బం. నోయ్; సం. నామయతి మొద.

II. 2. కృత్తద్ధిత జన్యధాతువులు : (అ) తద్భవములు (1) ప్రాచీనములు. ఈ వర్గపు ధాతువులు విశేష్యములనుండియు, ధాతుజ విశేషణములనుండియుఁ గలిగినవి. ఇండో-ఆర్యభాషయందే విశేష్య, ధాతుజ విశేషణములనుండి క్రియారూపము గల్పింపఁబడుచుండెను. వానికిట్టి సందర్భములఁ జేరు-ఆయ-(కృష్ణాయతే మొద). ప్రత్యయము చేరకయే యవి క్రియారూపముల నొందుచుండెను. సంస్కృత వైయాకరణుల ప్రకార మెట్టి విశేష్యప్రాతిపదికమైనను క్రియాప్రాతిపదికముగ నుపయోగింపవచ్చును. ప్రత్యయసంయోజనము

వలనఁ గలిగిన క్రియారూపములు నానాఁటికి మార్పులఁజెంది, యాయా రూప మును బొందుటచే, ఉపసర్గ, ధాతు, వికరణ, ప్రత్యయ విభాగ మస్పష్టమగుచు వచ్చెను. ఈ లోపున భూతకాలధాతుజ కర్మణి విశేషణము ప్రాధాన్యము వహించెను. 'సో ఽగచ్ఛత్' అనుటకు 'స గతః' అనునట్టి రూపములే సాధార ణము లయ్యెను. ఈ-'త' ప్రత్యయము గల విశేషణములే ప్రాకృతమునను నేఁటి యార్యభాషలయందును బ్రత్యేక క్రియాప్రాతిపదికములుగ నిలుచు చుండ, పూర్వపు క్రియాప్రాతిపదికము లంతరించుచు వచ్చెను. ఈ-తప్ర త్యయము ప్రాకృతములయందు అ, య, డ, ర, ల, ళ లుగా మాఱుచు వచ్చెను. 'గత' అను రూపమున కా యా ప్రాకృతములందు 'గఅ, గయ, గద, గడ, గఇర, గఇల, గఇళ, అను రూపము లేర్పడెను- వీనిపైఁ దిరిగి పురుష, వచన, లింగబోధకములగు ప్రత్యయములు చేరుచు వచ్చెను. సంస్కృతభాషకుఁ బ్రాకృతములద్వారా నేఁటి యార్యభాషలయందు గలిగిన పరివర్తనమునకుఁ గారణము ద్రావిడభాషలతోడి సంపర్కమే యని కొందఱిమతము. సహజముగనే యిట్టి పరివర్తనము గలిగిన దని మఱికొందఱి మతము.

ఈ రెండవమతమే సమంజసమయినట్లు తోఁచుచున్నది. ప్రాచీన ప్రాకృతములు వ్యవహారభాషలుగ నుండిన నాఁటి ద్రావిడభాషల స్వరూ పమును దెలిసికొనుట కాధారములు లేవు. ద్రావిడభాషలస్వరూపము దెలిసి కొనుటకు శాసనాద్యాధారములు గోచరించిననాఁటికి ప్రాచీనప్రాకృతములు వ్యవహారభ్రష్టములై, కేవలగ్రంథములయు, వ్యాకరణములయు సాహాయ్యము ననే తెలిసికొన వీలగుచుండెను. సంస్కృతమును బ్రాకృతభాషలుగను, బ్రాకృ తములను నేఁటియార్యభాషలుగనుమార్పఁగలిగిన యాద్రావిడభాషాస్వరూప మెట్టిదియో తెలియదు. ద్రావిడభాషల సంపర్కమునఁ బ్రాకృతభాష లేర్పడిన వనుట సరికాదు. సంస్కృతమునుండి ప్రాకృతములుగలిగిన మార్గముననే ద్రావిడప్రాకృతమును నేల కలిగియుండరాదో తెలియదు. ఏయేపద్ధతులపై సంస్కృతమునుండి ప్రాకృతము లుప్పతిల్లినవో, యాపద్ధతులనే యవలంబించి నచో ద్రావిడభాషారూపములనుగూడ సంస్కృతజన్యములుగ నిరూపింప వచ్చును.

ఈ సందర్భమున నొక విషయమును మఱచిపోఁగూడదు. సంస్కృతము నుండియే ప్రాకృతములు పుట్టినవనుట పొరబాటు. సంస్కృతమును నొక ప్రాకృతభాషయే. దానిని సంస్కరించి వ్యాకరణబద్ధముగఁ జేయుటచే దానికి సంస్కృత మనుపేరు గలిగెను. దానితో సంబంధించినను, కేవలము దాని నుండియే యుద్భవింపని యనేక ప్రాకృతభాషలు ప్రచారమందుండెను.

16

వానిని పండితులు వ్యాకరించియుండలేదు. అట్టివానిలో ద్రావిడభాషావర్గ మొకటి. ఈ విషయము మఱియొకచోట నీ గ్రంథమున వివరింపఁబడి యున్నది.

ధాతుజ విశేషణములనుండియు, విశేష్యములనుండియుఁ గలిగిన క్రియా రూపములు మఱియొకచోట చూపఁబడియున్నవి. వీనిలోఁ జాలమట్టుకుఁ బ్రాచీనములే. ఆధునికకాలమునఁ దద్భవధాతువు లేర్పడుట యంతగా లేదు.

II. 2. (ఆ) తత్సమములు: ఇట్టిధాతువులు కొన్ని తెనుఁగు వాఙ్మయమునఁ జేరినవి. కరుణించు, దృష్టించు మొదలయినవిట్టి వాని కుదాహరణములు.

II. 2 (ఇ) అన్యదేశ్యజములలో హిందూస్థానీభాషనుండివచ్చిన వెక్కువగా నున్నవి. ఇట్టివానిలో రెండవవర్ణము సాధారణముగ దీర్ఘముగ నుండును. వీని యంతములందు—'ఆయించు—అను ప్రత్యయము చేరుచుండును.

అటకాయించు, అదమాయించు, ఉజ్జాయించు, కే (ఖే)టాయించు, గదమాయించు, గమాయించు, గుమాయించు, జమాయించు, జుమాయించు, చునాయించు, టలాయించు, దలాయించు, తటాయించు, తమాయించు; తుటాయించు, తుటారించు, దబకాయించు, దబాయించు, దమాయించు, నిభాయించు, పచారించు, పస్తాయించు, ఫుసలాయించు, పురాయించు, ఫర్మాయించు, బలకాయించు, బడాయించు, బిడాయించు, రంగాయించు, వాలాయించు, సతాయించు, సముదాయించు, సాసాయించు, మొద.

సాధారణముగఁ దెనుఁగుశబ్దములలో మొదటివర్ణముమీఁదనే ఊఁత ఉండును. కావున రెండవ మూఁడవవర్ణములు సాధారణముగ దీర్ఘములుగ నుండవు. అవి మూలభాషలో దీర్ఘములుగనున్నను తెనుఁగున హ్రస్వములగుటయు, రానురాను లోపించుటయు సంభవించును. ఈ విషయము తెనుఁగునందలి యూఁతనుగూర్చి చెప్పినప్పుడు ముచ్చటింపఁబడినది. హిందూస్థానీ మొదలగు భాషలనుండి తెనుఁగునఁ జేరిన శబ్దములందలి పదమధ్యదీర్ఘములు మాత్ర మట్లే నిలిచియున్నవి. కావున నివి చాల నవీనముగఁ దెనుఁగునఁ జేరినవని చెప్పవచ్చును.

అయినను, పదమధ్యదీర్ఘములుగల కొన్ని దేశ్యక్రియలును దెనుఁగున లేకపోలేదు. దువాళించు = గుఱ్ఱమును బరుగెత్తఁజేయు; నివాళించు = ఆరతెత్తు; పిసాళించు = ప్రకాశించు, పరిమళించు, వ్యాపించు మొద. మురాళించు = సురాళించు=దిగఁదుడుచు; సుమాళించు = ఎక్కువసంతోషము నొందు మొద. ఇట్టివియు నన్యదేశ్యములేమై యుండును. వీనిసంపర్కముచేఁ గేవల తద్భవధాతువులును బదమధ్యదీర్ఘము నొందవచ్చును. ఉదా. కళా

సించు, తళారించు, వెలారించు మొద. తద్భవ, దేశ్యశబ్దములందుండు సంయుక్తాక్షరములు సాధారణముగ నేకవర్ణద్విత్వములై యుండును. ఒకహల్లు వేఱుహల్లుతోఁ సంయోగముగలిగి శబ్దమం దున్నప్పు డట్టి శబ్ద మర్థతత్సమమో, యన్యదేశీయమో యై యుండవలెను. ఉదా:—త్రస్తరించు, మస్తరించు, కుస్తరించు, మొద.

కొన్నియెడల నన్యదేశ్యవిశేష్యములకును 'ఇంచుక్కు' చేరి తెనుఁగున క్రియాప్రాతిపదికము లేర్పడును. ఉదా:—టూకించు (హిం.టూకీ), టాకించు (హిం.టాకా). రంగరించు, రంగలించు, రంగాయించు.

భారతీయార్యభాషలనుండి కాక యితరమగు నిండో-యూరోపియను భాషలలో నింగ్లీషునుండి తెనుఁగెక్కువ శబ్దములను జేర్చుకొన్నది. ఆంగ్లవిశేష్యముల నెక్కువగ నాంగ్లవిద్య నభ్యసించినవారును, వారితో సంబంధముగలవారును, నాంగ్లప్రభుత్వముతో సంబంధముగలవారును నుపయోగించుచున్నారు. కాని యాంగ్లక్రియలు మాత్రము తెనుఁగున ధాతువులుగఁ జేరలేదు. ఇతరభాషాపదముల కింతమక్కుఁ జేర్చి వాడుకొనునట్లు తెనుఁగువారాంగ్లపదములకుఁ జేర్చుటలేదు. అట్లాంగ్లపదములను వాడవలసినప్పుడు వానిని 'చేయు' ధాతువుతోఁ జేర్చి వాడుకొనుచుందురు. ఎంజోయ్‌చేయు, ఎగ్జామిన్ చేయు, మొద. ఇట్లే హిందూస్థానీపదములను వాడునప్పుడును 'చేయు' ధాతువను ప్రయుక్తమగుచుండును. ఉదా:—రవానాచేయు, మాఫీచేయు, మొద.

II. 3, 4, సమస్తధాతువులు, ప్రత్యయసహితధాతువులు, ధ్వన్యనుకరణధాతువులు, వీనిపట్టికలు మఱియొకచో నియఁబడినవి.

II. 5. సందేహాస్పదములు, నష్టధాతువులు:

కా, కద, కదా, పద, పదము, పదఁడు; ఇంద, ఇందము; ఊరక; మిన్నక ; లేదు; కావున, కాన—ఈ మొదలగురూపములకును, పోరి, ఒగి, మొదలగు నవ్యయములకును, నిట్టివే మఱికొన్నిటికిని రూపము లసాధారణములుగ నున్నవి వీనిలోఁ గొన్నిటికి ధాతువు లున్నట్లు గానవచ్చినను నా ధాతువులనుండి యారూపము లెట్లు కలిగినవో తెలుపుట కష్టము. వానిని గూర్చి తెలిసికొనుటకుఁ బ్రాకృతభాషలయు, ఇతర ద్రావిడభాషలయు, సాహాయ్య మావశ్యకమగును.

కొన్నిధాతువులు సంస్కృత ధాతురూపములతోడనే యున్నను వానిని దేశ్యములుగఁ బరిగణించుచున్నారు: ఎడయు (బం. ఏత్, సం. ఏడ్) ; నడచు (బం. నట్, సం. నడ్, ప్రా. ఇ. ఆ. నృత్ ; ప్రా. నట్, నడ్) ; కుదియు (బం. కుద్, సం. కూర్ద్) ; ముడుచు (-ఁగు), ముడియు (బం. ముట్, సం.

ముడ్) ; సొపడు (బం. శొపడ్) ; అంచించు (బం. ఋచ్) ; కూఱు=దట్టించు (బం. కూట్) ; జోకు (బం. ఝూక్) ; బుడుఁగు, ముడుఁగు, (బం. డుబ్, బుట్) ; తుఱుము = చిన్నముక్కలుగ ఖండించు (బం. ఘుత్, ఘుర్, సం. ఘుర్వ = చంపు) ; పాటించు (బం. పట్) ; పింజించు, పొంజు (బం. పీజ్) ; పురపురఁ బొక్కు (బం. పుత్, సం. పుట్) ; పాతు (బం. పుట్, పూట్) ; మొద.

పాణినీయ ధాతుకోశమునుండి యీక్రింది వుద్ధృతములు : అగు (*అగ్); అంచు (* అచ్, అఞ్చ) ; ఆడు (* అట్) ; అడగించు (అడ్) ; అడ్డగించు ( * అట్ట్, అడ్డ్) ; అను (* అణ్, అన్) ; అణఁచు (* అణ్) ; అత్తు (* అత్) ; అదుము (* అద్) ; అంజు (* అఞ్జ్) ; అమయు (* అమ్) ; ఆచు (* ఆఛ్) ; ఎగురు, ఎగయు (* ఇఖ్, * ఇగ్, ఈఖ్, ఈహ్) ; ఏలు (* ఇల్) ; ఇయ్యకొను (* ఇష్) ; ఏఁగు, ఈఁగు, వీఁగు, ఇగ్గు (* ఈ,ఋ) ; ఈఁదు (* ఈజ్) ; ఈడాడు (* ఈడ్) ; (ఏయు * ఈష్) ; ఉరుకు (* ఉఖ్) ; కన్నడము: తుంబు (* ఉంభ్) ; కన్నడము: కత్తు (* కత్థ్) కమియు (* క్లమ్) ; కలియు, కలుపు (* కల్) ; (ఎండ) కాయు (* కాశ్) ; కుక్కు, క్రుక్కు (* కుక్) ; కూయు (* కుజ్, కూజ్, కూజ్); కుట్టు, కొట్టు (* కుట్ట్);కుడుచు (* కుడ్) ; కుసుకు (* కుస్) ; చేయు, కొను (* కృ) ; క్రుయ్యు(*కృశ్); కొఱుకు (*కృ్యా); క్రుంగు (*కుఞ్చ); క్రుఞ్చ); క్రుయ్యు, కెలయు (* క్లిశ్); చిక్కు (* క్షి) ; చా (చచ్చు) (* క్షై) ; కట్టు (* ఖట్); (కొబ్బరి) కోఱు, గోఱుగు (* ఖుర్ , ఖుర్) ; చీఱు, చీలు, చిఱుగు, చినుగు (* చిర) ; చుట్టు (* చుట్) ; (పొగ) చూఱు, చూడు (* చూర్) ; చేయు (* చేష్ట్) ; చంపు (* జ్ఞప్) ; త్రచ్చు (* తక్ష్) ; త్రుంచు (* తృమ్ఫ్) ; తిను (* తృణ్) ; త్రుళ్లు, త్రెళ్లు (* త్రుట్); నడచు (* నట్, నృత్) ; పడు (* పట్, పడ్, పత్, వృత్) ; పంచు (* పచ్) ; (పెట్టి) పోయు (* పుష్) ; పూచు (* పుష్ప్) ; పొరయు (* ప్రుష్ణ్) ; పొవయు (* ప్లుష్) ; బుక్కు (* బుక్క్) ; తమిళము:—పేసు (* భాష్) ; పూయు (* భూష్) ; బుడుఁగు, బ్రుంగు, మునుఁగు (* భృడ్) , మీటు (* మిట్) ; మూయు (* ముచ్) ; మోయు, మోచు (* ముష్) ; ముడియు, చూ. మూట, ముడి (* మూజ్); మేయు (*మేవ్, మ్లేవ్); మాయు (*మ్లై);వంగు (*వల్, వంచ్); వంచు (* వంచ్); వలగొను (* వల్) ; వ్రయ్యు, వ్రచ్చు(* వ్రశ్, వ్రశ్చ, వ్రద్) ; వేఁడు (* విడ్, వేడ్) ; వెదకు (* విద్) ; వెలయు (* విల్) ; వీచు (* వీ, వీజ్) ; చాటు (* శాడ్) ; చెప్పు (* శీభ్); సుడియు (* శుచ్) ;

చెలఁగు (* చల్, శ్రే) ; చెలయు (* శ్లిష్) ; సడలు (* షడ్, శ్లథ్); జరుగు (* సృ) ; ఓడు (* హ్రోడ్) ; మొద.

పై వానిలో గొన్ని సంస్కృతమందలి రూపములతోను, గొన్ని కొంచెము వికారరూపములతోను గానవచ్చుచున్నవి. సంస్కృతాంధ్రములం దొక్కటే రూపముండుటయు, నెట్టి వికారమును గలుగకుండుటయు వింత గాదు. భాషలచరిత్రమునందు కొన్ని మూలధాతువులు రూపము చెడక వచ్చుట గలదు. కొన్ని రూపములనుమార్చుకొన్నను తుదకు తొల్లింటి రూపమునే పొందుట సంభవించుచుండును. పైని వివరించిన ధాతువులు సమాన రూపములును సమానార్థములును గలవి. వానిలోఁ గొన్ని భ్రాంతి నిరూపితములు గావచ్చును. కాని, యీ భ్రాంతికిఁ గారణమును నిరూపింపవలసి యుండును.

పై రీతిగనే కేవల దేశ్యములని నిఘంటువునఁ జూపఁబడిన ధాతువులు తద్భవములైన యుత్తరహిందూస్థానభాషలతోఁ బోల్చిన నెఱుఁగనగును. ఉదాహరణములు—

ఉంకించు (సం. ఉద్గత, ప్రా. ఉగ్గఅ, బం. ఉగే) ; ఉజ్జాడు (ఝూటు, * ఉర్ఝూడ, బం. ఉజాడే) , ఉడుకు (సం. ఉష్ణ, ప్రా. ఉణ్హ, బం. ఉనాప); ఉబ్బు (సం. ఊర్ధ్వ, ప్రా. ఉబ్భ; సం. ఉద్భృత, *ఉల్బిత ప్రా. ఉబ్భఅ); బం. ఉబె, ఉభే) ; అమయు (సం. ఊష్మ, ప్రా. ఉమ, బం. ఉమాప); కావు (కాకి అర్చుట), సం. కథయతి, ప్రా. కహేఇ, బం. కహే, కయ్ ; కప్పు (సం. క్లృప్, పాలి. కప్పేతి) ; కూడు (సం. కూట, ప్రా. కూడ, బం. కుటాయ్ ; చీఱు, చీలు (సం. చీవర, ప్రా. చీఅర, బం. చిరే); తట్టు (సం. స్తబ్ధ?, ప్రా. థట్ట, థడ్ఢ, బం. ఠాటాయ్ ; చిలుకరించు (సం. క్షిప్, ప్రా. ఛిట్ట, బం. ఛిటాయ్); తడయు, చూ. తట్టు ; తేరు (సం. స్థిర, ప్రా. థిరాఇ, బం. థిరాయ్) ; సాచు (సం. పచ్, బం. పాకే) ; మూయు, చూ. సం. ముద్రా (* ముద్, బం. ముదే); చొక్కు, (సం శుష్క, బం. సుపాయ్; గోఁజు, (బం. గోంజా) ; చఱచు (బం. చటా) ; ఏఁగు, (బం. ఆగుఆ =. ఏగో) ; పాడు, (బం. పారు ఆ = పేరో ; మొద.

# ఉపసర్గములు—ప్రత్యయములు

## ఉపసర్గములు

సంస్కృతములోని యుపసర్గములు ప్రాకృతములోఁ బదములతో నేకమై వికృతినొందుచుఁ దమ యుపసర్జనత్వమును గోలుపోయినవి. నేఁటి యుత్తరార్యభాషలలోను, ద్రావిడ భాషలలోను నిట్లే జరిగినది. సంస్కృతములోని యుపసర్గములు నేఁడు భారతీయభాషలయందు గానరావు. ప్రతి, పరి,యను నుపసర్గములు మాత్రము వాడుకలోఁ దద్భవ దేశ్యములతోఁ గలసి యుపయోగింపఁబడుచున్నవి. ఉదాహరణములు:—ప్రతిమాట, ప్రతిపల్లె. కొన్నియెడల సంస్కృత శబ్దములతోఁ గూడఁ గ్రొత్తయర్థములం దీయుపసర్గ ముపయోగింపఁబడుచున్నది. ఉదా. ప్రతిమనుష్యుఁడు, ప్రతిగ్రామము. కొన్నియెడల నీ యుపసర్గము తుదియచ్చు దీర్ఘమును బొందును. ఉదా. ప్రతీమాట, ప్రతీమనుష్యుఁడు ఈదీర్ఘమువలన నర్థభేదము గలుగుచున్నది ఈ యుపసర్గమును బ్రత్యేక విశేష్యముగఁ గూడఁ బ్రయోగించుట గలదు. ఉదా. ఆమాటకు ప్రతిలేదు ; (అతనికిఁ) బ్రతి రఘువీరుఁ డొకఁడు (విజయ.); ఈపుస్తకము మున్నూఱుప్రతు లచ్చయినవి; ఈ యుత్తరమునకుఁ బ్రతివ్రాయించు ; యతికిఁ బ్రతి; ఎవ్వారు నీ ప్రతిలే రీభువనత్రయంబున. (హరి. ఉ-౧౦.ఆ); ఏను నీ ప్రతిగ నర్చన చేసెదఁగాని శాంభవికి. (జై. ౭. ఆ.) ఇట్లే పరిగొను = చుట్టుకొను; పరిపరి = చాలవిధముల; ఒకపరి = ఒకసారి; (వాడుకలో "ఒకసారి"యనియుఁగలదు); పోరిఁబోరి=పరిపరి;పరిఘూర్ణించు,పరిఘూతించు యనువానిలో పరియను నుపసర్గము గాన్పించుచున్నది 'అనసడి,' అపనమ్మకము, అపదూఱు, నిబద్ధి, నిబ్బద్ధి" మొదలగు వానిలో నుపసర్గములతోఁ గూడిన తద్భవపదములు చేరినవి.

ఈక్రింద నాయా యుపసర్గము లెట్లు ధాతువులతోఁ గలసి, వికారము నొంది, దేశ్యములుగఁ బరిగణింపఁ బడినవో తెలుపుట కుదాహరణము లీయఁబడుచున్నవి.

1. అతి = అడి. ఉదా. అడిసిగ్గు = అధికమైనసిగ్గు; అడిసిగ్గులు తమకంబులు నుడివ్రోవగ. మార్క. ౮. ఆ. అడి బీరపుఁ దులువగెలుచునట పాండవులన్. భార. ద్రో. ౪. ఆ. ; అడిత్రాగుడు = అతితృష్ణా = కఱవు. అడి త్రావుడనక యిప్పటి కడిఁదికి నేమాంసమైన గ్రక్కునఁ గొనిరండు; పంచ. నా. ౧. ఆ ; అచ్చాళు=అత్యాచార. ఆరూఢబలయుక్తి నచ్చాళుగాఁగ, ననికి సన్నద్ధులమై యుందమవల = విచ్చలవిడిగ; ఐమూల = అతిమూల.

ఇచ్చట మూల అను సంస్కృత పదము దిక్కు, కోణము అనునర్థములతోఁ దెనుఁగున వాడఁబడుచున్నది.

2. అధి = అడి-అడుపు, అడుకు, అతుకు = అధి + కృ = దగ్గఱచేరు; అలవరుచు = అధి + పత్ = దగ్గఱపడునట్లుచేయు; అడిగట్ట = అధికాష్ఠ = దాపుగానుంచినకట్ట; అడిగొట్టు = అధికృత (అధికారులు గర్వముగలవారగుటచేఁ గుత్సితుఁడను నర్థమువచ్చినది; అడియఁడు, అడిఆరి = అధికృతః = పని యందు నియోగింపఁబడినవాఁడు.

3. అను - అనుగు = అనుగః = కలసివచ్చువాఁడు = మిత్రుఁడు; అనువు, అనుము = అనుగం = కలసివచ్చునది, చేరికగానుండునది, అనువరి = అనుకారిన్ = చెప్పినది చేయువాఁడు.

4. అప—వాడుకలో దీనిని తద్భవదేశ్యములతోఁ గూడఁజేర్చిపలుకుట కలదు. ఉదా అపనమ్మకము, అపవాదుక. (అవనిపతులు పలువు రపపాడి నొక్కనిఁ దన్నుఁ బొదివికొనిన దరలక; మార్క. ౮ ఆ.)

ఆపు = అపహ్నా, పాపు = అపాస్, అపేమ్, అపే; పాయగిల్లు = అపేత, అపాస్త; ఉరలు, ఒరలు, రోలు = అపసృ, అవసృ.

5. అపి—పెనయు = పినహ్, అపినహ్.

6. అవ—అకఘళించు = అవకృలి, అవఘృష్ట: అవులించు = అవకృత; ఓరుచు = అవ + ధృ. ఓపు, ఒప్పు = అవాప్; ఒడియు = అవధృష్; అడగిల్లు = అవధృతి; ఒడ్డగిలు, ఒత్తగిల్లు, ఒత్తిల్లు, ఓడిగిల్లు, ఓరగిల్లు, ఓటిల్లు, ఓహటిల్లు = అవహృతి, అవహతి; ఒరలు, ఉరలు, రోలు = అవసృ, అపసృ; ఊడు = అవలూ; ఊగు, ఊవు, ఊగెమెల, మొద. = ఉద్వహ్.

7. ఆఙ్—అంచు = ఆఙ్ఞా; ఉచ్చలించు = ఆచ్ఛల్; ఆరటించు = ఆరట్; అంపు, అనుపు = ఆఙ్ఞాప్, అగము, అలుము = ఆత్ర; అరయు, ఆరయు = ఆరిష్, ఆలష్; ఆగుబ్బలు = ఆగూర్విత; ఆవటిల్లు = ఆపతిత; దెప్పరిల్లు = ఆపతిత, ఆపన్న; అచ్చెలము = ఆచ్ఛలమ్, అడియాలము = ఆధ్యాతమ్, (అధిద్యాతమ్?); ఆటంకము = ఆతంకము (అర్థభేదము గలిగినది); ఉత్తరము, ఆత్రము = ఆత్వరమ్.

8. ఉద్. - ఊఁకు, ఉంకు, ఉక్కు, ఉంకించు = ఉద్ + కృ; ఉతుకు, ఉదుకు = ఉద్ + ధావ్ + కృ; ఉబుకు, ఉప్పొంగు=ఉద్ + ప్లు + కృ; ఒలుకు = ఉద్ + స్థా; ఊగు=ఉద్ + వీజ్ + కృ; ఒదుగు = ఉత్ + ధృ + కృ; ఒరగు, ఒఱగు = ఉద్ + వృత్ + కృ; తోఁచు = ఉద్ + ఈ + అచ్ (ధాతువు, అస్); ఉత్తరించు = ఉత్కృ, ఉత్తృ; ఉప్పతించు = ఉత్ప

త్ ; ఉప్పరించు, ఉప్పరించు = ఉత్ప్లు ; ఊంకించు = ఉత్కృ, ఉత్సహ్ + కృ ; ఊటించు = ఉత్థా ; ఉచ్చు = ఉత్ చ్యు ; ఊటు, ఊడు = ఉద్వర్త్, ఉత్థా; ఉత్పతిత, ఉత్పాదిత, ఉత్పాటిత ; ఊరడు = ఉచ్ఛ్వసిత ; ఒత్తు = ఉద్ధత, ఉద్ - ధ్మాత ; ఊపు = ఉత్థాప్ ; ఉడుపు, ఉలుపు=ఉద్ధత, ఉద్ధృత, ఉపహత ; ఉనుము = ఉద్యమ్ ; ఉరియు = ఉద్రిచ్; ఉలియు = ఉద్రస్ ; ఒలయు = ఉల్లస్ ; ఉదరు = ఉద్ధృష్; ఊఱడిల్లు = ఉచ్ఛ్వసిత; ఊసడిల్లు = ఉత్సరిత, అపసరిత, అవసరిత; ఒడ్డగిల్లు, ఒత్తగిల్లు, ఒత్తిల్లు, ఓరగిల్లు = ఉద్ధృత, అవహృత, ఉపహృత, ఉపహత, అపహత, అపహృత: ఉక్కణము = ఉత్కట; ఉక్కరి = ఉద్+కారిన్ ; ఉక్కిరి బిక్కిరి = ఉత్కృత, భీకృత, ఉక్కివము = ఉత్కృతమ్ ; ఉక్కస = ఉత్కాస ; ఉత్తలము = ఉద్+ త్వరమ్ ; ఉదురు, ఉదుటు = ఉద్ధృతమ్; ఉప్పలి = ఉత్పాతః; ఉల్లసము = ఉత్త్రాసం, ఉత్ప్రాసం ; ఉవ్విళులూరు = ఉద్విజ్ ; ఉసురు = ఉచ్ఛ్వాస.

9. ఉప—ఒసంగు = ఉపాస్; ఉడుగు = ఉపహత + కృ; ఒనరించు = ఉపపద్; ఒడ్డు = ఉపహిత; ఒత్తు = ఉపహత, ఉద్ధత, ఉద్వర్తిత; ఒందు = ఉపపద్; ఊపు=ఉపహృ; ఉలుపు, ఉడుపు=ఉపహత, ఉద్ధత, ఉద్ధృత; ఒరుము= ఉపక్రమ్; ఒనరు, పొనరు, మొనరు = ఉపపన్న ; ఒడ్డగిల్లు, ఒత్తగిల్లు, ఒత్తిల్లు, ఓడిగిల్లు, ఓరగిల్లు = ఉపహృత, ఉపహత, అపహృత, అపహత, అవహృత, అవహత ; ఒల్లగిల్లు = ఉపహృత ; ఓడు, ఓటిల్లు, ఓహటిల్లు = అవహృత, అవహత, ఉపహృత, ఉపహత ; ఉపతాయి = ఉపస్థాయిన్.

10. దుర్—దురపిల్లు=దుర్ + రట్ ; దూంబఱ = దుర్భర; దూబ = దుర్బల.

11. ని—నీంగు = నివృత్ ; నిట్ట, నిట్ర = నిష్ఠా నిలుచు = నిష్ఠా ; నేటు = నిష్ఠా = నిశ్చయము, దృఢము.

12. నిర్—నిక్కచ్చి = నిష్కృతి ; నిక్కము=నిష్కృతమ్; నిక్కల= సం. నిష్కర్షణ ; ప్రాకృతము = నిక్కాల ; గీనికి శ. ర. లో (నిక్కము+ కల అని వ్యుత్పత్తి చెప్పంబడినవి. ఉదా. "నాకలనిక్కలయయ్యెడు శ్లోకిం పకుమమ్మ" అని యీంబడినది); నిగుడు, నివుడు, నెగడు, నెవడు = నిర్వాపిత, నిర్వృత, నిర్వృత్త; నిగ్గు, నెగ్గు = నిర్వహ్ + కృ; నిట్రు, నిట్టు = నిర్ ; నిట్టుపాసము, నిట్రుపాసము, అనువానిలో; నిప్పస్తు = నిరుపోషిత; నిబ్బరికము = నిర్భరికమ్; నిమురు = నిర్మృజ్ ; నిముకు = నిర్మృచ్ ; నిలుగు, నీలుగు = నిర్వృత + కృ; నివ్వెఱ = నిర్విణ్ణ ; నెమకు = నిర్మృగ్; నెమరు= నిర్మృశ్ ; నెరయు, నెఱయు = నిర్విశ్ ; నెరపు, నెఱపు = నిర్వర్త్ ; నెరసు = నీరస.

13. పరి—పరుండు = పర్యుషిత; పరిఢవిల్లు = పరిష్ఠాత; పల్లటిల్లు = పర్యస్త; పరిక=పరిగ = ప్రదక్షిణము (శ.ర. లో మ్రగ్గు అను నర్థము తప్పు.)

ఉ. "తిరుమల, కంచి, పుష్పగిరితీర్థములం జని కొంగుముళ్లతో నర ములు దంపతుల్ వడయ వారక కాన్కలువైచి యంతటన్, బరికలు, దృష్టి దీపములు పన్నినగద్దలుఁ బెట్టి యేమిటన్ గరమగు పుత్రవాంఛ కడగానఁగ లేక విచారఖిన్నులై. హంస. ౨. ఆ.) పరిచోళిక = పరిసారిక, ఒకమల్ల బంధము; పరిఢవము = పరిష్ఠాపనమ్;

14. ప్ర—పసఁగు = ప్రసృ ; పొగడు, పొవడు = ప్రగీత, ప్రకృష్ట; పంపు = ప్రాస్, ప్రజ్ఞాప్ ; ప్రబ్బు, పంబు, పమ్ము, పరువు, పర్వు, పాఱు = ప్రవృత్, ప్రవహ్, ప్రనద్ ; పులుము = ప్రలుంప్ ; పదను = * ప్రదను = ప్రతను = వాడి.

15. వి—బెళుకు,మెలకు, మెఱపు,వెలుగు,వెలయు; వెలుఁగు, ఎలరుచు= విలస్ ; వినుగు = వ్యస్ ? ఏడుచు = విలప్ ; ఏమఱచు = విస్మృ ; విప్పు = *వ్యస్ ; బిగియు = విక్రుష్, విక్రుశ్ ; బెడియు = విధృష్ ; బెలయు; బెరయు = విరచ్ ; విరియు = విరిచ్ ; వేసరు, వేసారు = వ్యస్, విసృ ; ఏమరిల్లు = విస్మృత.

16. సం—సమకూరు, సమకుఱు, సమకూడు, సమకోలు, సమ కట్టు = సం+కృ.

17. సు—సొలయు, సొలపు, సొలయిక = సు + ఆలస్ ; పొన్ను, హొన్ను = సువర్ణ.

18. ప్రతి—పయ్యెర, పయ్యర, పైర = ప్రతిచార ; పఱు, పై = ప్రతి ; (పై మాట. మొ.)

19. పర.—పరచిత్తపరస్త్రీ ; పఱ = పర ; గొప్ప = ఉ. పఱమొయిలు, భార. విరా. ౪. ఆ ; పఱమబ్బు, రుక్మాం. ౫ ఆ.

20. అభి—ఈ యుపసర్గము చేరి వికారము నొందిన తెలుఁగుపదములు కాన్పించలేదు: 'బిత్తరము' అనుపదము 'అభ్యంతర' శబ్దభవమగునేమో. హిందీలో దీనికి 'భీతర్' అని రూప మున్నది.

పైఁ జూపిన పదములన్నియు శబ్దరత్నాకరమున దేశ్యములుగా నిరూపింపఁబడినవి. సంస్కృతిధ్వనులు ప్రాకృతభాషలయందు పొందిన మార్పుల ననుసరించి యింకను నెక్కుడు ధాతువుల నిట్టివాని నేర్పఱింప వచ్చును.

తెనుఁగునందువలెనే నేటి యార్యభాషలయందును నుపసర్గతోఁ గూడిన ధాతువులు వికారము నొంది క్రొత్తధాతువు లయినవి. ఉదా

బంగాలీ, హిందీ, మొద. * ఉద్=ఉత్+స్థా= తెనుఁగు : ఉట్టు, ఉట్టిపడు, ఊట, ఊటించు మొద.

బంగాలీ;ఆచాట్ = ఆ భర్ద్ = తెనుఁగు : అచ్చాళు. బంగాలీ : ఉలహ్, ఉల్, ఉర్=ఉద్ + లభ్ = దిగు ; తెనుఁగు. ఉటియు, ఉలియు; బంగాలీ : నిహాల్, నిభాల్ = ముగియు, సం. నిర్ + వృత్ = తెనుఁగు : నెగడు, నెవడు, మొద.

తెనుఁగున నుపసర్గములు.

సంస్కృతమునందలి యుపసర్గముల రూపముగలవి కొన్ని తెనుఁగునను నితర ద్రావిడభాషలయందును గలవు. ఇండో-యూరోపియను భాషలలోని యుపసర్గములకును వీనికిని బోలికలేదనియు. సాధారణముగ 'మేల్కొను, కీడ్పడు' మొదలగు క్రియలయందలి 'మేల్ = మీఁదు; కీఴ్ = క్రిందు', అను నర్థములుగలవే ద్రావిడభాషలయం దున్నవనియు, నిట్టిశబ్దము లుపసర్గధాతువుల సంయోగమువలనఁ గలుగక విశేష్యధాతు సంయోగమువలనఁ గలిగిన వనియు, కాల్డ్వెలుపండితుఁ డభిప్రాయ పడియున్నాఁడు. ఈ యభిప్రాయ మునుగూర్చి యాలోచించుటకుఁ బూర్వము తెనుఁగున నుపసర్గములవలెఁ గాన్పించువాని నొకచోఁజేర్చుట యుక్తము.

1. అందు:—అందుబాటు, అందుబడి = సమీపము. ఇది స్థలవాచకమగు విశేష్యముగాని, గ్రహణార్థకమగు 'అందు' అనుక్రియగాని కానేరదు. ఇది సంస్కృతములోని 'అధి'ని బోలియున్నది; పై రెండుపదములును 'అధిపాత' శబ్దభవములై యుండవచ్చును.

2. అడ్డ:—అడ్డకత్తి, అడ్డకమ్మి, అడ్డగాలు, అడ్డచాఁపు, అడ్డపట్టు. అడ్డపట్టె, అడ్డపాప, అడ్డబాస, అడ్డమాను, అడ్డపాట్లు, అడ్డవాతియమ్ము, అడ్డవేడెము, అడ్డసాళులు, అడ్డాదిడ్డి మొద. వీనిల్లో 'అడ్డ-'కు నిరోధమను నర్థములేదు.

3. అఱ:—అఱచేయి, అఱకాలు, అఱగొండెతనము, అఱగొడ్డియము, అఱజాతి, అఱమర, అఱవఱలు మొద. వీనిలో 'అఱ'కు సగము, కొఱఁత, అనునర్థములుగాని 'అఱుగు = జీర్ణించు, క్షయించు' అను క్రియయర్థములుగాని లేవు.

4. అసి:—i. అల్పార్థకము: అసికోఁత, అసిగాయము;

ii. ఇత్యర్థకము: "అసియఱచేత నాతఁడటు లాపొసనంబును బట్టుకొన్న న, య్యసుకలెచేటలంజెరిగి యింపగుబియ్యముచేసి వేడ్కతో, నెసరులువ్రాసి వండ వెరవేర్పడ నయ్యశనంబు భూదివో, కసులకుఁబెట్టెఁ గన్దనిసి గ్రక్కుననాఁకలి దీఱునట్లుగన్."(-భోజరా. vi.)

iii. అసిఁబోవు, అసివచ్చు మొద.

ఇందలి 'అసి' విశేష్యముగాని, క్రియగాని కాదు.

5. ఆరు:—ఆరుదూలు, ఆరుదొండ, ఆరుపోరు:—ఇది 'కలుగు, నిండు' అనునర్థములు గల 'ఆరు' అను క్రియగాదు.

6. ఉడ్డ, ఉడ్డు:—ఉడ్డాడు, ఉడ్డాడించు, ఉడ్డగుడుచు.—ఇట్టి యర్థములందు దెనుఁగున నుడ్డయను పదము లేదు.

7. ఉబ్బు:—ఉబ్బటలూఁగు, ఉబ్బల్లూఁగు, ఉబ్బూఁతలూఁగు:—ఇందు 'ఉబ్బు' అనునది 'ఊఁగు' అనుక్రియకు సంబంధించినది కాదు. 'ఉద్' అను నుపసర్గమును బోలియున్నది.

8. ఉల్ల:—ఉల్లకుట్టు, ఉల్లడ, ఉల్లల:—ఇది 'ఉల్లము= హృదయము మనస్సు' అను శబ్దమునకు సంబంధించినది కాదు. 'ఉద్' అను నుపసర్గమును బోలియున్నది.

9. ఉవ్:—ఉవ్వాయి, ఉవ్విళ్లూరు, ఉవ్విళ్లుగొను, ఉవ్వు, ఉవ్వెత్తు:-ఇదియు 'ఉద్' అను నుపసర్గమును బోలినదే.

10. ఊఁచ:—ఊఁచముట్టు=నిశ్శేషము.

11. ఎగ:—ఎగఁగొట్టు, ఎగఁగ్రోలు, ఎగఁజల్లు, ఎగఁజేఁపు, ఎగఁదన్ను, ఎగఁబట్టు, ఎగఁబాఱు, ఎగఁబోయు, ఎగఁబ్రాఁకు, ఎగదువ్వు, ఎగనూఁదు, ఎగనూకు, ఎగనెత్తు, ఎగరోఁజు, ఎగవిఱుచు, ఎగవేయు, ఎగవైచు:—వీనిలో 'ఎగన్' అనునది 'ఎగు' ధాతువు తుమున్నర్థక రూపమైనను, నా ధాతువునుండి పుట్టినదను జ్ఞానము జనులయం దంతరించిపోవుచు దాని కుపసర్గభావ మంతకంతకుఁ గలుగుచున్నది.

12. ఎడ:—ఎడకట్టు = ఆఱినపుండు మఱల చీముపట్టు, చేర్చు; ఎడకారు = మాఘమాసము మొదలు జ్యేష్ఠమాసములోపల పండించెడు పంట; ఎడదవ్వు = అతిదూరము:—వీనికి 'ఎడము = అంతరము, అవకాశము అను నర్థము లేదు.

13. ఏడ్:—ఏడ్గడ, ఏడ్తెఱ:—ఇది అతిశయార్థముగల 'ఏఙ్' అను ద్రావిడపదమైనను నాజ్ఞానము తెనుఁగువారికి లేదు.

14. ఒడ:—ఒడఁగూడు, ఒడఁబడిక, ఒడంబడిక, ఒడఁబడు, ఒడఁబాటు:-ఇది సహార్థమున నుపయోగింపఁబడును. తెనుఁగున నీ యర్థమున 'లోడు' శబ్దముగలదు. కన్నడమున 'ఒడం, ఒడనె, ఓడు' అనియు, తమిళమున 'ఒడం' అనియు నవ్యయములు గలవు. తెనుఁగున 'ఒడ' అనున దవ్యయమని స్ఫురింపదు.

15. ఒడ్డ:—ఒడ్డగిల్లు, ఒడ్డగెడవు, ఒడ్డొలకము:—'ఒడ్డ'కు తెనుగున ధాతువులేదు. ఇది 'ఒడ్డు' అను ధాతువునుండి పుట్టినదికాదు.

16. ఒత్త:—ఒత్తగిల్లు, ఒత్తరము, ఒత్తిల్లు:—ఇది 'ఒడ్డ' వంటిదే.

17. ఒన:—ఒనగూడు ఇది 'ఒడ-' వంటిది.

18. ఒఱ:—ఒఱకటము, ఒఱకము, ఒఱకాటము, ఒఱగడ్డము, ఒఱగొడ్డము; దీనికిని విశేష్యమైన 'ఒఱ', క్రియయగు 'ఒఱఁగు' లకును సంబంధము లేదు.

19. కీడు-కీడ్పడు, కీడ్పాటు:—దీనికి 'కీడు = హాని' అను నర్థముతో సంబంధములేదు; 'కీళ్ = క్రింద' అనుదానినుండి పుట్టినది. ఈ యర్థమున నీ శబ్దమునకుఁ దెనుఁగునఁ బ్రత్యేకముగఁ బ్రయోగములేదు.

20. కై:—కైసేత, కైసేయు.-వీనిలో 'కై' అనుదానికి ప్రత్యేక ప్రయోగము లేదు. కై = చేయి, అనుపదముతో దీనికి సంబంధములేదు.

21. కొన } గొన }:—కొన (గొన) కొను—దీనిలోని 'కొన'కుఁ బ్రత్యేక ప్రయోగములేదు. కొన=చివర, అంతము, అనుపదముతో దీనికి సంబంధములేదు. దీనితో సంబంధించిన క్రియగూడఁ దెనుఁగునలేదు.

22. కొని.—కొనియాడు, కొనియాట.—దీనికి సంబంధించిన స్తుత్యర్థకక్రియ తెనుఁగున లేదు.

23. కోలు:—కోలుకొను, కోల్తల.—కొను, ధాతువులోఁగాని, మఱియొక తెనుఁగు విశేష్యముతోఁగాని దీనికి సంబంధములేదు.

24. గడి:—గడికాల్లు, గడిత్రాడు, గడివేలు, గడిదొంగ, గడిపోతు. ఈ యర్థములందు దీనితో సంబంధించిన విశేష్యముగాని, క్రియగాని తెనుఁగున లేదు.

25. గిర:—గిరవాటు=విసరుట.

26. తార:—తారకాణించు, తారకాణ.

27. త్రెక్:—త్రెక్కొట్టు, త్రెక్కొను, త్రెక్కోలు, త్రెక్కోలుగొను.—ఇది 'త్రెగు = తెగు' అను నర్థముగలది కాదు.

28. దా(డా):—దాపల, డాపల; ఇది 'దక్షిణ' శబ్దభవము. 'దా' కు ప్రత్యేక ప్రయోగము లేదు.

29. దిగ:—దిగఁదుడుచు, దిగఁద్రావు, దిగనాడు, దిగవిడుచు, మొద. చూ. ఎగ.

30. నిఱు:—నిఱుపేద మొద.

31. నివ్ ( = నిర్):—నివ్వెర, నివ్వెఱ, నివ్వెఱఁగు.

32. నూలు:—నూలుకొను, నూలుకోలు; "నూలు = దారము" అను పదముతో దీనికి సంబంధము లేదు.

33. పడి:—పడిగల్లు, పడికట్టు, పడిగాపు, పడితరము, పడియచ్చు, పడివాగె, మొద. దీనికిని 'ప్రతి' కిని సంబంధముండ నోపు.

34. పరి:—పరికాఁడు, పరిగొను, పరిభవము, పరిభవించు (-ల్లు), పరిమాఱుచు, పరిసెనము.

35. పఱి:—పఱిగొను, పఱివ్రాఁవు.

36. పిరు, పిఱు:—పిరుపీఁకు, పిఱుతివ్రుచు, పిఱువడ్డు, మొద. 'పిరు = వెనుక, అని ద్రావిడభాషలలో నర్థము. దీనికిఁ దెనుఁగునఁ బ్రత్యేక ప్రయోగము లేదు.

37. మెయి, మై, మఁఱు, మే,—: మెయికొను, మెయికోలు, మెయిపాలు, మెయి, మెయివడి, మెయి (మే)గలి

38. మెఱ:— మెఱమెచ్చు, మెఱవడి.

39. మడి:—మడిమంచ, మడిసంది.

40. మేలు:—మేలుకట్టు, మేలుకొను, మేలుచేయి, మేలుబంతి, మేలుమచ్చు; 'మేలు = పై' అను నర్థము ద్రావిడభాషల యందున్నను దెనుఁగున నా యర్థజ్ఞాన మంతరించినది.

41. సమ:—సమకట్టు, సమకుఱు, సమకూడు, సమకూరు, సమకొను సమకోలు.—ఇది 'సం' అను నుపసర్గము వికారమై యుండును.

42. సయి:—సై.—సైదోడు. ('సహ' అను నవ్యయమునుండి పుట్టినది.)

## ప్రత్యయములు.

భారతీయ భాషలలోని ప్రత్యయములఁ గూర్చిన పరిశోధనములందు హార్నెల్‌గా రుత్తరార్యభాషల ప్రత్యయములను గూర్చి చేసినది చాల ముఖ్యముగ నున్నది. ఆ పరిశోధన ఫలితములను నేఁటికి నెవ్వరును త్రోసిపుచ్చక ప్రమాణముగఁ జేకొనుచున్నారు. చిన్న చిన్న విషయములఁ దప్ప నాతని సిద్ధాంతములను బండితులందఱు నంగీకరించుచున్నారు. కాని, ద్రావిడభాషలయందలి ప్రత్యయములఁ గూర్చి విచారించిన వారిలోఁ బ్రథములును దుదివారును నగు కాల్డువెల్లుగారు మొదటినుండియుఁ దప్పు త్రోవనే త్రొక్కుటవలన వారికి తేలిన సిద్ధాంతములును విపరీతములుగనే

తెలినవి. సంస్కృతములో ద్రావిడభాషలకు సంబంధము లేదను దృష్టితోఁ బరిశీలించుటవలన నాతని కల్పిత్రింపులన్నియుఁ దప్పయినవి. పదములనుండి ప్రత్యయములను వేఱుచేయు సందర్భములందు వారు సిథియను భాషా ప్రత్యయములతో సంబంధించు ప్రత్యయములు వచ్చునట్లు ప్రయత్నించుట చేత, సంస్కృత ప్రాకృత భాషలతోడి సంబంధము తెగిపోయినది; ఎంత కష్టించినను సిథియను భాషలతోడి పొత్తు కుదిరినదికాదు. తరువాతి పరిశోధకు లును కాల్డువెల్లు ననుసరించియు సిథియాను భాషలతోడి సంబంధమును గానక, సంస్కృత ప్రాకృత భాషలతోడి సంబంధమును విచారింపక, కొంద ఱాస్ట్రేలియాభాషల వంకకును, గొంద ఱిండో - చీనాభాషలవంకకును, గొంద ఱాఫ్రికుభాషలవంకకును దృష్టిసారించి ప్రయత్నించుచున్నారు గాని, వారికింకను సరియైన సూత్రములభింపలేదు. కొందఱీ ప్రయత్నమంతయు వ్యర్థమని తలంచి ద్రావిడభాషలు ప్రత్యేకభాషా కుటుంబముగ నేర్పడవలె ననియు, వానికిని నితరభాషా కుటుంబములకును, సంబంధము గాన్పింప దనియుఁ జెప్పి తృప్తినొందుచున్నారు. ఇట్టి నిస్పృహఁ జెందకపూర్వము, ప్రాకృత భాషలతోడి సంబంధమును విచారించుట మంచిది.

ప్రాచీనార్య భాషలలోని ప్రత్యయము లనేక విధములుగ మార్పు నొందియు, కొన్ని యెడల సంపూర్ణముగ లోపించియు నేటి భారతీయ భాషల యందు గుర్తింపరాక యున్నవి. కాని, కొన్ని యింకను నట్లే మిగిలియున్నవి. ప్రయత్నించినయెడలఁ గొన్నిటినింకను పోల్చుకొనవచ్చును. కర్మ, బ్రహ్మ, శబ్దములు- అన్ అంతములనియు, జామ=జంబూ, ఆమ (వడ) = ఆమ్ర, అనియు, ఇప్పుడు సాధారణజనులకు గోచరింపదు. ఇట్లే 'పోట్ల-మారి' మొదలగు శబ్దములలోని 'మారి' ప్రత్యయము మతుప్ప్రత్యయవికార మని కాని,—కాఁడు, కత్తె, కోలు, మొదలగునవి 'కృ' ధాతుభవములని కాని, కొంతయూహ చేసినచోఁ దెలిసికొనవచ్చును. -ట, అట, అటము, అడము, అణము, ఆట, ఆటము, ఆడము, ఆణము మొదలగునవి సంస్కృతము లోని త ప్రత్యయ పరిణామరూపములనియు 'టి, డి,' మొదలగునవి తి ప్రత్యయ వికారములనియుఁ గొంత ప్రయత్నముతోఁ బోల్చుకొనవచ్చును. క, ఇక, అక, మొదలగు ప్రత్యయములింకను సంస్కృతమునందువలెనే నేటి కిని దెనుగున వాడుకలో నున్నవి.

ఈ క్రిందఁ దెనుఁగునఁ గనఁబడు కృత్తద్ధిత ప్రత్యయము లకారాదిగా చూపఁబడినవి. వానికి సంస్కృత ప్రాకృతములలోని రూపములును, నేటి యుత్తరహిందూస్థాన భాషలలోని రూపములును, ఇతర ద్రావిడ భాషలలోని రూపములును సాధ్యమయినంతవరకుఁ బొందుపఱుపఁ బడినవి.

## I. కేవల ప్రత్యయములు.

**1. తెనుఁగు: అ; సం. అ; ప్రా. అ.**

**i. భావార్థక ప్రత్యయము: కృత్తు**

ఇది చేరునప్పుడు ధాతువుతుది సరళము పరుషమగును; రేఫము టకారమగును. ఉదా. ఎఱుఁగు - ఎఱుక; ఊఁగు - ఊఁక; కడఁగు-కడఁక; కాఁగు-కాఁక; కూయు, కన్నడము; కూఁగు - కూఁక; ఊఱుడు - ఊఱుట; ఓడు - ఓట; కూరడు - కూరట; తిప్పురు - తిప్పుట; త్రిమ్మరు - త్రిమ్మట; వసరు - వసట; వేసరు - వేసట; తెరలు - తెరల; నిలు - నేల; పీలు - పీల; నెప్పు - నెవ ఉసలు - ఉసల.

2. అక; సం. అక; ప్రా. అ అ

నిలక (నిలు); తానుపోక = పోవుట (నిర్వ. vi. 21; iv. 4, 7); రాక (నిర్వ. iii. 49) అఱుక (అఱ్ఱు); అమరేంద్రుమీఁద రాక, హరి పట్టువడి పోక (నిర్వ. vii. 2)

**3.** అకము; సం. అకమ్.

i. **భావార్థము.**

అమరకము (అమరు); అమ్మకము (అమ్ము); అఱుకము (అఱు); ఎసకము (ఎసగు); ఒఱుకముఁ (ఒఱుఁగు), కాటకము (*కఱు. చూ. కఱవు); కాయకము (*కాయు), కుందకము (కుందు); చల్లకము (చల్లు); తోమకము (తోము); నమ్మకము (నమ్ము); పంచకము (*పంచు), పంపకము (పంచు); పన్నకము (పన్ను); పమ్మకము (పమ్ము); పరాచకము (పరిహాసకము); పాటకము(*పాటు); మసకము (మసఁగు); మాఱుకము (మాఱు); సజ్జకము (*సజ్జు);

ii. **స్వార్థము.**

కీలకము (కీలు); తమకము (తమకు = తమస్+క); నవకము (*నవకు= నవ్యక); బరకము (*బరకు=భారక); బూటకము (*బూటు=న్యర్థక); వాలకము (*వాలు=వాదక);

**4.** అగము. సం. అకమ్.

బుజ్జగము (*బుజ్జు = బుధ్);

**5.** అంటరము; సం. అన్త.

ఇల్లంట్రము (ఇల్లు); కోడంట్రము (*కోడ); పేరంట్రము (పేరు= పెద్ద)

**6.** అట; సం. అత; ప్రా. అత.

త్రొక్కటి (త్రొక్కు); నుక్కటి (నుక్కు); అలమట (అలము); **అలసట** (*అలసు = అలయు); త్రిప్పట (త్రిప్పు); మల్లట (**మఱలు** = ***మల్లు**); మాఱట (మాఱు); లంపట (లంపు).

7. అటము. సం. అతమ్. ప్రా. అటమ్.

i. కృత్.

ఒఱకటము (ఒఱఁగు); త్రవ్వటము (త్రవ్వు); ముఱకటము (*ముఱుకు);

ii **తద్ధితము.**

ఇఱుకటము; (ఇఱుకు) ఇల్లటము (ఇల్లు); కిమ్మటము (కర్మ); పాపటము (పాపు); పేరటము (పేరు) = పెద్దఱికము.

8. అడ. సం. అత. ప్రా. అడ.

i. కృత్తు.

కట్టడ (కట్టు.)

ii. **తద్ధితము.**

ఇల్లడ (ఇల్లు.)

9. అడము. సం అతమ్. ప్రా. అడ

i కృత్తు.

ఉంపడము (ఉంచు=ఉంపు); ఒత్తడము (ఒత్తు); కలపడము (కలపు); కాఁపడము (కాఁచు = కాఁపు); కుట్టడము (కుట్టు); కేరడము (కేరు); కేవడము (*కేవు= కేరు); కోఱడము (*కోఱు); చెక్కడము (చెక్కు); జావడము (*జావు); ప్రేలడము (ప్రేలు); ముట్టడము (ముట్టు); (కాశీ). v. 301; ప్రేలడములు, కేరడంబులు (పాండు iii. 43.)

ii. **తద్ధితము.**

ఈసడము (ఈసు); ఉక్కడము (ఉక్కు); చెంచడము (చంచు); **వేఱడము** (వేఱు); బొందడము (*బొందు).

10. అడి; సం. తి; ప్రా. డి.

i. కృత్తు—

ఎద్దడి; దందడి; బజ్జడి; మల్లడి; లొగ్గడి (లొగ్గు); వల్లడి.

ii. **తద్ధితము.**

రట్టడి (రట్టు) ; వారడి (* వాగు. చూ. హిం. వారా = భేదము, లోపము) ; వెల్లడి (వెలు = బహిస్), సండడి (సం. సంహతి, సంధృతి); పవడి, సవ్వడి (* శబ్ద).

11. అణ ; సం. అన.

సవరణ (సంవరణ) ; బైసణ (* బైసు).

12. అణము ; సం.-అన

ఉక్కణము(ఉప్కు), ముట్టణము (ముట్టు) ; రపణము ; (* రప్పు); లావణము (* లాగు).

13. అత: సం.-త

పొగడత (ఉ. రా. పు. 120)

14. అతము. సం. వృత్త ; త ; ప్రా. అత, అట.

i. కృత్తు.

సాకతము (సాకు).

ii. తద్ధితము.

కమతము, కమ్మతము (కర్మవృత్తమ్);

15 అంతము ; సం. ఇతమ్, బవంతము (భావితమ్).

16. అదము. సం త్వమ్ ; ప్రా. త్త ; ద

i. కృత్తు

ఒప్పందము (ఒప్పు).

ii. తద్ధితము.

ప్రల్లదము (పరుషత్వమ్).

17. అన. సం. అన ; ప్రా. అన.

i. కృత్తు

ఎగపన (*ఎగను=ఎగయు) ; = త్రెవ్వన (త్రెవ్వు); దాఁపన (దాఁచు, దాఁపు) ; వడ్డన (వర్ధన), ప్రేఁకన (ప్రేఁగు) ; సవరన (సంవరణ).

ii తద్ధితము.

ఉప్పన (ఉప్పు) ; ఏకన (ఏకు) : జోడన (జోడు) ; రజ్జన (రజ్జు) ; పుటపుటనై (పాండు. II. 35) ; నకనకనైనకాను (వరాహా IV-124) ; ప్రేఁకనిచన్నులు (కాశీ. VII. 159) ; మిలమిలని (కాశీ VII. 185) ; గిటగిటన (కాశీ. I. 100) ; మసమసకన (కాశీ. I. 93) ; నున్నన (హరవి.

II. 25) ; వెలవెలని (వేం. పంచ. పు. 61).

18. అనము ; సం. అన.

i కృత్తు.

ఒడ్డనము (ఒడ్డు) ; ఒప్పనము (ఒప్పు) ; కొట్నము (కొట్టు) ; చిమ్మనము (చిమ్ము); నాట్నము (నాటు); పాపనము (పాపు); పొంతనము (పొందు); పోసనము (* పూను = పూయు).

19. అపము ; సం. ఆప్తిక, లేక, ఆపిక.

i. కృత్తు.

పొలపము (పొలుచు) ; మొరపము (* మొరచు = మొరయు).

20. అమి ; సం. ఇమన్.

i. కృత్తు.

ఈఱమి (*ఈఱు) ; ఎడ్డమి (*ఎడ్డు) ; ఎలమి (ఎలయు) ; ఓటమి ఓడు) ; కూటమి (కూడు) ; పైకూటమి

ii. తద్ధితము.

మొల్లమి (మొల్ల) ; లేమి (* ఇల్).

iii. వ్యతిరేకార్థము.

ఒప్పమి (ఒప్పు) ; ఒల్లమి (ఒల్లు); చాలమి (చాలు) ; తీఱమి (తీఱు) ; నేరమి (నేరు) ; పోరామి (పోవచ్చు) ; కొఱగామి, చూపోపమి, వచ్చు రాములు.

21. అము. సం. అమ్.

i. కృత్తు.

అమరము (అమరు) ; ఆరటము (ఆ+రట్) ; ఆరడము (ఆ+రట్) ; ఆవటము (ఆపాతమ్) ; ఇక్కఱము (ఇఱుకు) ; ఎడ్డము (*ఎడ్డు); ఒగ్గము (ఒగ్గు); ఓటము (ఓడు); కారాకూరము ; పైసరము (పైసరు) ; కూటము (కూడు) ; తూఁకము (తూఁగు); బాదరము (బాదరు); బిత్తరము (అభ్యంతరమ్); మేళము (మిళ్) ; రపము (రప్) ; రెప్పము (రెప్పు) ; వాకము, వాటము (పాతమ్); వెంటము (వేఁడు) ; వ్రేఁకము (వ్రేఁగు) ; సోలము (సోలు) ; మలచము (మలచు); ఓహటము (అవహతమ్); బజాఱము (బజాఱు); వగరము (వగరు).

ii. తద్ధితము :

ఊతము (ఊత) ; జోతము (జోత) ; తీయము (తీ, తీయ) ; నొక్కఱము (నొక్కు) ; మవ్వము (మృదుత్వమ్) ; మేలము (మిాల్) ; మైకము (మద

కమ్) ; వాయము (వ్యర్థమ్) ; సాకము (సాకు) ; సెగ్గము (సెగ్గు) ; పదటము (పదటు).

22.— అర ; సం.—కర ;

పప్పర (పర్పర) ; మసర (మషీకర) ; చూ. ధూసర.

23.—అరము ; సం.—కర.

i. కృతు :

ఇంటరము, ఇంట్రము, (ఇటి) ; ఈండ్రము (ఇడు) ; ఎచ్చరము (ఎచ్చు) ; దాఁపరము (దాఁచు, దాఁపు) ; మిణుకరము (మిణుకు) ; వాచరము (వాచు).

ii. తద్ధితము ;

ఎత్తరము (ఎత్తు) ; ఒంటరము (ఒంటు) ; ఒత్తరము (ఒత్తు) ; కప్పరము (కప్పు) ; కావరము (కావు) ; కోటరము, కోట్రము (కోడ) ; డెప్పరము (డెప్పు) ; తీంట్రము (తీఁట) ; తీండ్రము (తీక్ష్ణము) ; తూపరము (తూపు) ; తెక్కరము (తెక్కు) ; దాపరము (దాపు) ; దెప్పరము (దెప్పు); నెప్పరము (నెప్పు) ; పోతరము (పోతు) ; పోసరము (* పోసు = పోతు) ; మంబరము (మంబరు) ; వట్టరము (వట్టు) ; వేండ్రము (వేఁడి) ; వేఁకరము (వేఁకి) ; సీదరము (* సీదు) ; సాగరము (సాగు) ; వెడసరము(* వెడసు).

24.—అరి ;సం.— కారికా.

అలవరి (అలవు) ; కరకరి (కరకు) ; దళసరి (* దళసు. చూ. వెళుసు); మనసరి (మనసు).

25.—అంజము ; సం. —కిం.

ఉల్లజము (ఉల్లు).

26—అల ;—ఆల ;—ఏల ; సం.—త ;—ఇత.

ఊయల, ఊయాల; ఊయెల, ఊయేల, ఉయాల, ఉయేల, ఉయ్యాల, ఉయ్యాాల, ఉయ్యెల, ఉయ్యేల (ఊచు సం. ఉఝ్షిత.)

27. —అలము. సం. త-. ఇత; ప్రా.-ల,- ఇల్ల.

కొందలము (కుందు).

ఇట్టలము (* ఇట్టు) ; ఉమ్మలము (ఉమ్ము) ; కావలము (కావు) ; నిట్టలము (నిడు) ; మొక్కలము (ముష్కరము) : వెగ్గలము (వెగ్గు, వెచ్చు)·

28.—అలి ; సం.—తి.

కావలి (కాచు, * కావు) ; కూడలి (కూడు).

29.—అలికము ; సం.—(అ) తి (కా)

ఉమ్మలికము (ఉమ్మ).

30. —అవ ; సం.— తవ్య.

చౌరవ (చౌరు) ; కలవ (కల) ; తడవు (తడ) ;

31.—అవము ; సం.—తవ్య.

బుజ్జవము (బుధ్).

32.—అవి ; సం. —తవ్య.

మనవి (మను) ; సరవి, ప్రావి (సృ) ;

33.—అవు ; సం.—అ+ఉ+కా.

ఉరవు (ఉరు); ఎగివు (ఎగు); కెడవు (కెడ); కెలవు (సం. ఖేల్); తగవు (తగు) ; చనవు (చను) ; నగవు (నగు) ; నెగవు (నెగు, ఎగు) ; పొడవు (పొడు) ; సెలవు (చల్) ; అగవు (అగు), నెరవు (నెరి) ; నెఱవు (నెఱి) ; నెళవు (నెల).

34.—అసము ; సం.—త్య.

గెంటసము (గెంటు) ; తారసము (తారు) ; రాయసము, వ్రాయసము (వ్రాయు) ; దీమసము (దీము) ; దీవసము (దీవు=ధీము=ధీరము) ; బరవసము (భార) ; వెక్కసము (వెక్కు).

35.—అసి ; సం.—త్య + ఇకా

రూపసి (రూపు.)

36.—అళము; సం; —అల = సంబంధ , ప్రా ఆల, అల,

జాపళము , బంగిళము , మూసిళము ,

37.—ఆగము ; సం.—అక.

సరాగము (సృ).

38.—ఆట. సం. వృత్త ; ప్రా. వట్ట, అట్ట, ఆట.

i. ఉరియాట. కారాట, కొనియాట, గోంజాట, తిట్టాట, తీర్థమాట, దండాట, పోరాట, బండాట, మాటాట, అంకాట, హోరాట, పొరలాట.

ii. బహువచనములమీఁద:—

ఇగ్గులాట, ఊగులాట, గుద్దులాట, చిమ్ములాట, చెరలాట, చెర్లాట, నవ్వులాట, పీకులాట, పెనఁగులాట, పోట్లాట.

39.—ఆటన. సం, వర్తన ; ప్రా. వట్టన,—ఆటణ.

గుంజాటన.

**40.**—ఆటము. సం. వృత్తకమ్ , ప్రా. నట్ట అమ్—ఆట అమ్.

అల్లాటము, ఇఱుకాటము, ఉడుకాటము, ఉబలాటము, ఎడాటము, ఒఱకాటము, కైలాటము, కొండాటము, కోలాటము, చరలాటము, చెరలాటము, జంజాటము, తగులాటము, పితలాటము, పెటికాటము, బూతాటము, బొచ్చాటము, మండాటము, మంద్రాటము, మారాటము, మాఱాటము.

**41.**— ఆటకము సం. వృత్తకమ్

వెల్లాటకము.

**42.**—ఆటు ; సం. వృత్త + ఉ + కా.

సబాటు.

**43.**—ఆడము ; సం ఆ_త్త ; అత్

పావాడము.

**44.**—ఆడి : సం.— అటి

మంజాడి.

**45.** —ఆణము ; సం.—అన.

రువాణము.

**46.**—ఆది. సం.—తి ప్రా.—ది.

నింపాది, బారాది (వృద్ధి) ; మోపాది ; పంచాది.

**47.**—ఆపము , సం. త్వ్య ; ఆ_ప్తికా.

కిలాపము (కల).

**48.**—ఆయ (ఎ) ము , సం. అక.

నాలాయము, నాలెము.

**49.**—ఆరకము. సం. కారకమ్.

కొలారకము (కొల).

**50.**—ఆరము.—సం.—కారకమ్.

ఒడ్డారము ; ఒయా (య్యా) రము, ఓయారము (ఓజస్).
తుటారము ; బిట్టారము ; మిటారము (మిష్ట);
లొటారము ; వటారము.

**51.**—ఆరి ; సం. కారిన్.

వటారి.

**52.**—ఆఱకము ; సం. కారకమ్.

ఒడ్డాఱకము.

53.—అలము ; సం. ఆల=సంబంధించిన.

బైడాలము ; వింటాలము.

54.—ఆళము ; సం. ఆల = సంబంధించిన.

కాతాళము, పిసాళము, సుమాళము, సురాళము.

55.—ఇ

ఇప్రత్యయాంత శబ్దములను సరిగ నేర్పఱుచుట కష్టమే అవి కేవలము ఇప్రత్యయాంతములో, హల్లుతో ఇ-కారము చేరిన ప్రత్యయములు గలవో ఏర్పఱుచు కొనవలయును. ఇకారాంత శబ్దముల పదప్రత్యయ విభాగ మాయా సందర్భములందు చేయఁబడును.

56. ఇక. సం.-ఇక.

i కృత్తు.

అమరిక (అమరు); అలయిక (అలయు); అల్లిక (అల్లు); ఆడిక (ఆడు); ఆనిక (ఆను); ఇమిడిక (ఇముడు); ఈనిక (ఈను); ఉరమరిక (ఉరమరు); ఊనిక (ఊను); ఎడయిక (ఎడయు); ఎనయిక (ఎనయు); ఎనిక (ఎను, ఎన్ను), ఎన్నిక (ఎన్ను); ఎసలిక (ఎసలు); ఏలిక (ఏలు); బందిక (*బందు); ఒడఁబడిక (ఒడఁబడు); ఒద్దిక (*ఒద్దు, ఒందు); ఒనరిక (ఒనరు); ఒమ్మిక (ఒమ్ము); ఓడిక (ఓడు); ఓపిక (ఓపు); కదలిక (కదలు); కలయిక (కలయు); కానిక (కాను); కుదిరిక (కుదురు); కుదిలిక (కుదులు); కూడిక (కూడు); కెడయిక (కెడయు); చిమిడిక (చిముడు); చీరిక (చీరు); చీలిక (చీలు); చాలిక (చాలు); చేరిక (చేరు); తాలిక (తాలు); తాళిక (తాళు); తీఱిక (తీఱు); తూనిక (*తూను), తెరలిక (తెరలు); తేలిక (తేలు); తొడరిక (తొడరు); నచ్చిక (నచ్చు); నమ్మిక (నమ్ము); నెరయిక (నెరియు); పన్నిక (పన్ను); పాలుమాలిక, పాల్మాలిక, ప్రాలుమాలిక, ప్రాల్మాలిక (పాలుమాలు, ప్రాలుమాలు); పూనిక (పూను), పొంచిక (పొంచు); పొందిక (పొందు); పొగడిక (పొగడు); పొదలిక (పొదలు), పొరలిక, పొర్లిక (పొరలు); పొలయిక (పొలయు); పొలియిక (పొలియు); పోలిక (పోలు); బడలిక (బడలు); బతిమాలిక (బతిమాలు); మలయిక (మలయు); మసలిక (మసలు); మాసిక (మాయు,*మాను); మూసిక (మూయు,*మూను); మోపిక (మోపు); సొలయిక (సొలయు); హెచ్చరిక, ఎచ్చరిక (హెచ్చరు, ఎచ్చరు); తోఁపిక; (తోఁపు); సొగయిక (సొగియు); వాడిక (వాడు).

ii తద్ధితము.

అఱ (ర) మఱి (రి) కరు [అఱ (ర) మ(ఱు)].

ఆమిక (ఆము); ఇగరిక (ఇగరు); కచ్చిక (కచ్చు) ; ఖండిక, ఖండ్రిక (ఖండ); గమనిక (గమన); చెందిరిక; చెంద్రిక (చెంద్ర = చంద్ర); చాఱిక

(చాలు); నాడిక (నాడు); పసిక (పస); పసిరిక (పసరు); వెంచిక (వెంచు); వెంటిక, వెంట్రిక (పేడ); పొనిక (పొన్న); బీటిక (బీట); బెత్తిక (బెత్తు); బొమిడిక (బొమిడ); బొమ్మిక (బొమ్మ); బోడిక (బోగు); మచ్చిక (మచ్చ); మూాదలిక (మూాదల); లత్తిక (లత్తు); వాలిక (వాలు); సానిక (సాన); హవణిక (హవణు)

## వైకృతములు.

అమ్మిక (అంబిక); ఇటిక. ఇట్టిక (ఇష్టక); ఎండ్రిక (ఎంద్ర); ఏడిక (ఏడు) ఏనిక (కన్నడము: ఆనె); కేళిక; కటిక; కట్టిక (కాష్ఠిక); కొండిక (*కొండ); కోటిక, కొట్టిక (కోష్ఠిక); గండిక, గండ్రిక (ఖండిక); చిటిక (చిట్ట); చెందిరిక (చంద్రిక); చేదిరిక (చేదర). జంతిక (యంత్రిక); జనులిక, జనుళిగ (యమళ); జవనిక (యవనిక); పటిక (స్ఫటిక); పరామరిక (పరామర్శిక); పల్లిక (పల్ల); పాచిక, పాసిక (పాచు), పుటిక, పుట్టిక (పుట); పొత్తిక (పొత్తు); బదనిక, వదనిక, బననిక (బదను); బుట్టిక (పుట); మన్నిక (మాన); మళిక (మాళ); మిత్తిక (మృత్తిక), విన్నపత్రిక (విజ్ఞాపన పత్రిక); నైసిక (*వైను); సంచిక (సంచయు); హామిక (హాము).

### 57. ఇకము; సం—ఇక.

ఒడికము = ఒద్దికము (ఒందు, *ఒద్దు);

కందళికము (కందళ); సలికము (స్వల్ప+ఇకము)

కలికము, కారికము. నలికము, బాసికము, బొమికము, బొమ్మికము, బొమ్మిడికము.

### 58. ఇకి; సం.—ఇక+ఇక.

#### i. కృత్తు.

చూడికి (చూాచు); ఉనికి (ఉను); పూనికి, పూన్కి (పూను);

పోలికి, పోల్కి (పోలు); మనికి, మన్కి (మను);వినికి (విను); వెలియునికి.

#### ii తద్ధితము.

ములికి (ములు).

### 59. ఇగ; సం.—ఇక.

ఒడ్డిగ (ఒడ్డు); నచ్చిగ (నచ్చు); నమ్మిగ (నమ్ము).

### 60. ఇగము; సం.—ఇకమ్.

ఊడిగము, ఉడిగము, కోడిగము, మండిగము, వల్లిగము, సూడిగము.

61. ఇజము; సం.—య.

బేడిజను.

62. ఇడి; సం.—ఇ+తి.

i. కృత్తు.

అలికిడి (అలుకు); ఒత్తిడి (ఒత్తు); తెలివిడి (తెలి); నుఱిపిడి (నుఱుపు); నూఱిపిడి (నూఱుపు); ప్రామిడి (ప్రాము); రాపిడి (రాచు); రాయిడి (రాయు).

ii. స్వార్థము.

ఉలిమిడి (ఉలుము); బచ్చిడి (బచ్చు); ఒరపిడి (ఒరపు); కడిమిడి (కడుము); కురిమిడి (కురుము); గెలివిడి (క. గెలివు); గొలిమిడి (గొలుము); చప్పిడి చప్ప); చలిమిడి (చలుము); చిరిమిడి (చిరుము) చిలిమిడి (చిలుము); చీమిడి (చీము); తూర్పిడి (తూర్పు); పంగిడి (పంగు); పసిఁడి (పసుము); పసిమిడి (పసును); బలువిడి (బలువు); మామిడి, మావిడి (మావు); వలిమిడి (వలుము); వెల్మిడి (*వెలుము).

iii. న్యూనార్థము.

ఉప్పిడి (ఉప్పు); తలవిడి (*తలవు); దోయిడి (దో);
ముక్కిడి (ముక్కు); లోఁతిడి (లోఁతు); వాలిఁడి (వాల).

63. ఇత సం.-ఇ+-త.

i. కృత్తు.

పొగడిత (పొగడు).

ii. తద్ధితము.

లోఁడిత.

64. ఇతము; సం.—ఇతమ్.

ఆయితము, ఆయిత్తము, ఇంపితము, పంచితము, పోరితము, బిగితము, మప్పితము, మలికితము, సలితము.

65 ఇంత; సం — అన్త.

దీనిని చేర్చునప్పుడు సంధియందు వివిధాగమాక్షరములు వచ్చును, అప్పగింత, ఆకలింత, ఆపులింత, ఇగిలింత; ఇచ్చగింత, ఉప్పిరింత, ఎకిరింత, ఎక్కిరింత, ఎచ్చరింత. ఒప్పగింత, ఓకిలింత, ఓసరింత, కలవరింత, కిక్కిరింత, కికురింత, కుసిలింత, కేకరింత, కొక్కరింత, క్రుళ్లగింత, గిలిగింత, గిలిగిలింత, చికిలింత, చక్కిలిగింత, చాగిలింత, చౌకళింత, జుడికిరింత, డాగురింత, త్రుళ్లగింత, త్రుళ్లింత, త్రుళ్లుమింత, దాఁగురింత, పటికిరింత, పలుకరింత, పల్కరింత,

**పవళింత**, పుకిలింత, పుక్కిలింత, పుడికిరింత, పుడిసిలింత, పుణికిరింత, బిబ్బరింత, బుజ్జగింత, బొబ్బరింత, సకిలింత, సగిలింత, సవరింత, సళుపరింత, సోలింత,

62.—ఇద; సం ఇ + త.

సూడిద [సూ(చూ)డు];.

63.—ఇదము; సం. ఇ + - త.

i. ఎల్లిదము, ఏలిదము, ఒప్పిదము, క్రొవ్విదము, తప్పిదము.

ii. చిన్నిదము (స్వర్ణితమ్); వెల్లిదము (వెల్లు); బెట్టిదము (బెట్టు); మెడిదము (* మెడు).

64.—ఇది; సం. ఇ + తి.

ఉఱిది (ఉఱు)

65.—ఇపము; సం. ఇ + ఆ_స్తిక.

మురిపము (*మురు); వ(వె)లిపము (వెల).

66.—ఇపి; సం. ఇ + ఆ_ప్తికా.

బుడిపి, బుడ్పి.

67.—ఇంపు; సం. ఆప్ + ఉ+క.

ఆమతింపు, ఆరగింపు, ఇనతాళింపు, ఒంటింపు, ఓరసింపు, కుమ్మరింపు, గుండ్రింపు (ఘూర్ణ), గోరింపు; చెంగలింపు; తాలింపు, తులకింపు, పట్టింపు, పలుకరింపు, బుడ్డగింపు, బెదరింపు, బెల్లింపు, బోడింపు. మందలింపు, మదింపు, ముగింపు, మొక్కలింపు, రూణింపు, సడింపు, సెగ్గింపు, హావణింపు.

68.—ఇమ; సం.—ఇమన్.

మొటిమ.

69,— ఇమము; సం. ఇమన్.

కలిమము, దలిమము.

70.—ఇమి; సం. ఇమన్ + ఇకా.

1.

అరిమి (అరు); ఒడ్డిమి (ఒడ్డు); ఓరిమి (ఒరు); ఓలిమి (*ఓలు); కలిమి (* కలు); కూరిమి (కూరు); తాలిమి; తాల్మి, (* తాలు); నేరిమి (నేరు); పోడిమి పోణిమి (పోలు); బడిమి (బడి); బ్రదిమి (* బ్రదు); మాలిమి (మాలు); మిసిమి (మిసుము); వేలిమి (వేలు);

ii. తద్ధితము:

అసిమి (* అసు); ఈరిమి (* ఈరు); కడిమి, కడ్మి (కడు); చెలిమి(చెలి); పసిమి (పసు); పేరిమి, పేర్మి (పేరు); మగఁటిమి (మగఁడు); మేలిమి (మేలు); మ్రుచ్చిమి, ఉ. హరి. i. 8 (మ్రుచ్చు); వాఁడిమి (వాఁడి); వేఁడిమి (వేఁడి); వే(ఱి) రిమి [వేఱు(రు)].

71.—ఇయ = ఎ = ఇ; సం. ఇక.

అగిసియ ( - సె); అంచియ ( -ంచె); అండియ ( -ండె); అంపియ ( -ంపె); అలసందియ (ందె) లు; అవిసియ ( - సె); అట్టియ ( - ట్టె); అద్దియ ( - ద్దె), అఱిసియ ( - సె); ఆణియ ( - ణె); అల్లియ (ల్లె). ఆనియ ( - నె); ఉదియ, ఉద్దియ (ఉద్దె); ఒంటియ ( -ంటె): ఒంకియ ( -ంకె); ఇండియ ( -ండె): ఇట్రియ ( -ట్రె); ఈటియ ( - టె); ఈడియ ( -డె), ఈనియ ( - నె); ఈరియ ( - రె); ఉరిడియ ( - డె); ఉఱియ ( - ఱె); ఎట వారియ ( - రె); ఎబ్బియ ( - బ్బె) ; ఎమ్మియ ( - మ్మె) ; ఏపియ ( - పె); ఒడిసియ ( - సె); ఒద్దియ ( - ద్దె); ఒట్రియ ( -ట్రె) ఒల్లియ ( -ల్లె); ఒలియ ( - లె); ఓదియ ( - దె); కంచియ ( -ంచె) కచ్చియ ( - చ్చె); కండియ ( - ండె); కంపియ( - ంపె); కచ్చియ ( - చ్చె); కట్టియ ( -ట్టె): కట్లియ ( - ట్లె); కరివియ (-వె); కరిసియ( - సె); కలివియ ( -వె); కవడియ( - డె); కవిలియ ( - లె); కారియ ( - రె); కార్తియ ( -ర్తె); కాఱియ ( - ఱె); కాలియ ( - లె) కాళియ ( - ళె) కాసియ ( - సె, స); కుంచియ( - ంచె); కుచ్చియ (-చ్చె); కుట్టియ( - ట్టె); కుంపియ, కుప్పియ(-ంపె, ప్పె); కుమ్మియ (- మ్మె); కొంటియ(-ంటె); కొట్టియ ( -ట్టె) ; కొండియ ( - ం డె); కొడిమియ ( - మె); కొడిసియ ( - సె); కోళిఁగియ ( - గె); కోడియ( - డె); కోలియ (-లె); కోళియ( - ళె); గజ్జియ( - జ్జె); గంటియ ( -ంటె) ; గండియ (-ండె) ; గడసియ (-సె) ; గడియ ( -డె); గరిఁటియ (-ఁటె) ; గిరిసియ ( -సె) ; గట్రియ ( -ట్రె); గాజియ ( -జె); గారియ ( -రె) ; గిడియ ( -డె) ; గిన్నియ ( -న్నె) ; గుండియ ( - ండె) ; గుడిసియ ( -సె) ; గేదియ ( -దె) ; గొట్టియ ( -ట్టె) ; గొట్లియ ( -ట్లె) ; గొడియ ( -డె) ; గొలివియ ( -వె) ; గ్రందియ ( - ందె) ; చవికియ ( -కె) ; చాళియ ( -ళె) ; చిక్కంటియ ( -ంటె) ; చిట్టియ ( - ట్టె): చిందియ ( -ందె) ; జంకియ ( -ంకె) ; చిన్నియ ( -న్నె) ; కంటియ ( -ంటె) ; కఱియ ( -ఱె) ; గద్దియ ( -ద్దె) ; గనియ ( -నె) ; గరిడియ ( -డె) ; గలఁతియ ( -తె) ; గినియ ( -నె) ; గుదియ ( -దె) ; గొఱియ ( - ఱె) ; గొట్రియ ( - ట్రె) ; గోనియ ( - నె) ; జంగియ ( - ంగె) ; జగి (వి) లియ ( - లె) ; జత్తిగియ ( - గె); జన్నియ ( - న్నె) ; జంపియ

(-ంపె) ; జాలియ (-లె) ; జాళియ (-ళె) ; జీడియ (-డె) ; జేడియ (-డె) ; జోలియ (-లె); టెంకియ (-ంకె) తంతియ (-ంతె);తక్కియ (-క్కె) ; తమ్మియ (-మ్మె) ; తలికియ (-కె) ; తలియ (-లె) ; తళియ (-ళె); తిన్నియ (-న్నె); తీఁగియ (-గె); తీనియ (-నె) ; తీవియ (-వె) ;తుట్టియ (-ట్టె) ; తెట్టియ (-ట్టె) ; తెలియ (-లె) ; తేనియ (-నె); తోట్టియ (-ట్టె); తోట్లియ (-ట్లె); తోస్సియ (-స్సె); తోమాలియ (-లె) ; త్రుట్టియ (-ట్టె) ; దండియ (-ండె) ;దంతియ (-ంతె) ; దిమ్మియ (-మ్మె) ; దివియ (-వె) ; దివ్వియ (-వ్వె) ; దీవియ (-వె); దుడ్డియ (-డ్డె) ; దేబియ (-బె); దోనియ (-నె) ; దోసియ (-సె) ; నల్లియ (-ల్లె) ; నాడియ (-డె) ; నూనియ (-నె) ; నెట్టియ (-ట్టె) ; నెడిమియ (-మె) ; నెఱియ (-ఱె) ; నెత్తియ (-త్తె) ; పక్కియ (-క్కె) ; పంచియ (-ంచె) ; పంజియ (-ంజె) ; పంటియ (-ంటె) , పట్టియ (-ట్టె) ; పడిదియ (-దె) , పడియ (-డె) ; పణిదియ (-దె) ; పన్నియ (-న్నె); పరటియ (-టె); పరికియ (-కె) ; పరిగియ (-గె) ; పత్తియ (-త్తె) ; పల్లియ (-ల్లె) ; పస్సియ (-స్సె) ; పాడియ (-డె) ; పాళియ (-ళె) ; పింజయ (-ంజె) ; పిందియ (-ందె) పీకియ (-కె) ; పుచ్చియ (-చ్చె) ; పుఱియ (-ఱె) పుత్తియ (-త్తె) ; పుల్లియ (-ల్లె) ; పుస్తియ (-స్తె); పూజియ (-జె) ; పూదియ (-దె) ; పూనియ (నె-) ; పెంకియ (-ంకె); పెట్టియ (-ట్టె); పెండియ (-ండె) ; పెడిసియ (-సె); పెమ్మియ (-మ్మె) ; పేడియ (-డె) ; పొట్టియ (-ట్టె) ; ప్రక్కియ (-క్కె) ; బట్టియ (-ట్టె) ; బట్లియ (-ట్లె) ; బడియ (-డె) ; బందియ (-ందె); బద్దియ (-ద్దె) ; బరికియ (-కె) ; బత్తియ (-త్తె) ; బాడియ (-డె) ; బిడ్డియ (-డ్డె) ; బిందియ (-ందె) ; బిద్దియ (-ద్దె) ; బూదియ (-దె) ; బూమియ (-మె) ; బూరియ (-రె) ; బొక్కనియ (-నె) ; బొట్టియ (-ట్టె); బొడియ (-డె) ; బొందియ (-ందె) ; బొచ్చియ (-చ్చె) ; బొత్తి (ఱి) య (-త్తె, ఱె); బోకియ (బోకె) ; బోదియ (-దె) ; బోలియ (-లె) ; మండియ (-ండె) ; మక్కియ (-క్కె) ; మట్టియ (-ట్టె) ; మల్లియ (-ల్లె) ; మాలియ (-లె) ; మిడియ (-డె) ; మిద్దియ (-ద్దె) ; ముచ్చియ (-చ్చె) ; ముట్టియ (-ట్టె) ; ముడిచియ (-చె) : ముల్లియ (-ల్లె) ; ముస్తియ (-స్తె) ; మొంటియ (-ంటె) ; మొట్టియ (-ట్టె) ; రంపియ (-ంపె) ; ఱంకియ (-ంకె) ; ఱంపియ (-ంపె) ; లంకియ (-ంకె) ; లంజియ (-ంజె) ; లద్దియ (-ద్దె) ; లాడియ (-డె); లొట్టియ (-ట్టె); వంచియ (-ంచె); వడియ (-డె); వందియ (-ందె); వదినియ (-నె) ; వదియ (-దె); వన్నియ (-న్నె) ; వత్తియ (త్తె) ; వల్లియ (-ల్లె) ; వాగియ (-గె) ; వానియ (-నె) ; వాసియ (-సె) ; విద్దియ (-ద్దె);

వీసియ (-సె) ; విణి (ని) య (-ణె ;-నె) ; వెలిచియ (-చె) ; వెలిసియ (-సె) ; నడికియ (-కె) ; నని (న్ని) య (-నె; - న్నె) ; సంపఁగియ (*చంపకిక;-ఁగె); సమ్మియ (-మ్మె) ; సారియ (-రె) ; సాలియ (-లె) ; సిద్దియ(-ద్దె) ; సుత్తియ (-త్తె) ; సురియ (-రె) ; సూరియ (-రె) ; సేవియ (-వె) ; సొజ్జియ (-జ్జె) ; సోదియ (-దె) ; సోబియ (-బె).

72.—ఇయము = ఎము ; సం. ఇకమ్.

అంకియ (-ంకె-) ; అండియము (-ండె-) ; అట్రియము (-ట్రె) ; అల్లియము (-ల్లె-) ; ఇల్లియము (-ల్లె-) ; ఊడియము (-డె-) ; ఎ (ఏ) క (క్క) స (సె) క (క్కి) యము (-కె, క్కె, క్క, క) ; కండియము (-ండె-) ; కడియము (-డె-) ; కత్తియము (-త్తె-) ; కన్నియము (-న్నె-) - కసియము (-సె, స్సె); కారియము (-రె-); కేడియము (-డె-); కొంచియము (-ంచె-); కొండియము (-ండె-) ; కొత్తియము (-త్తె-) ; గణియము (-ణె-) ; గవిలియము (-లె-) ; గల్లియము (-ల్లె-) ; గిరిసియము (-సె-) ; గూడియము (-డె-) ; గెంటియము (-ంటె-) ; గోడియము (-డె-) ; చిట్టియము (-ట్టె-); చెక్కియము (-క్కె-) ; చొల్లియము (-ల్లె-); జాలియము (-లె-) ; తంటియము (-ంటె-) ; తుండియము (-ండె-) ; తెట్టియము (-ట్టె-) తొచ్చియము (-చ్చె-) ; దండియము (-ండె-) ; దిబ్బియము(-బ్బె-) ; దోరియము (-రె-); నాఁడియము (-డె-) ; నాణియము (-ణె-) ; నెట్టియము (-ట్టె-) ; పట్టియము (-ట్టె-) ; పడిదియము (-దె-) ; పచ్చియము (-చ్చె-) , పట్టియము (-ట్టె-); పడిసియము (-సె-) ; పందియము (-ందె-) ; పాళియము (-ళె-) ; పరపత్తియము (-త్తె-) ; పల్లియము (-ల్లె-) ; పాగియము (-గె-) ; పాళియము (-ళె-) ; పించియము (-ంచె-) ; పిడియము (-డె-) ; పున్నియము (-న్నె,-నె-) ; పెండియము (-ండె-); పెల్లియము (-ల్లె-) ; పేరియము (-రె-) ; పెసియము (-సె-) ; పొచ్చియము (-చ్చె-) , పొత్తియము (-త్తె-) ; బత్తియము (-త్తె-) బల్లియము(-ల్లె-); బాగియము(-గె;)బిడియము (-డె-); బొండియము (-ండె-) ; బోరియము (-రె-) ; బోలియము (-లె-); మాఁడియము (* మాండలికము ; -డె-); మురియము -రె-);ముత్తియము (-త్తె-) ; మెండియము (-ండె-) ; మొండియము (-ండె-) వంటియము (-ంటె-) నడియము (-డె-) ; విడియము (-డె-) ; వీడియము (-డె-); విద్దియము (ద్దె-); వేడియము (-డె-) ; సిబ్బియము (-బ్బె-).

(అ) తెనుఁగున నియాంత శబ్దములు వేర్వేఱు రీతులఁ గలిగినవి.—

i. సం. - ఇక = ఇయ: పైఁజూపినవన్నియు నిందుకుదాహరణములు.

ii. సం. ఈయ = ఇయ: ద్వితీయ = విదియ ; తృతీయ = తదియ ;

iii. సం. సందేహ = తె. సందియము ;

iv. 'య' ఒత్తుగల శబ్దములకు స్వరభక్తి కలుగుట : కన్యా = కన్నియ ; విద్యా = విద్దియ ; పద్య = పద్దియము ; పుణ్య = పున్నియము.

v. వర్ణవ్యత్యయము కలుగుట: పాయసము= పాయెసము= పాసెయము = * పాసియము, పాసెము; యజ్ఞోపవీతమ్ = జన్నిదము = జందియము.

(ఆ) కొన్ని 'ఇయ' లు '- ఎ' లుగా మాఱవు.

డిగ్గియ, డిగియ, తునియ - పరియ, పఱియ, పుల్లియ, నుడియ, నుకియ, నుడియ; చఱియ, చెలియ, తునియ, డగ్గియ, సకియ.

(ఇ) కొన్నియెడల '-ఇయ' - 'ఇ' గ మాత్రము మాఱును.

సరియ (సరి); కాళంజియ (కాళంజి), ఉన్నియ (ఉన్ని); జన్నియ (జన్ని); ఉద్దియ (ఉద్ది); చక్కియ (చక్కి); చెలియ (చెలి);

(ఈ) కొన్నియెడల '-ఇయ' లు 'ఎ' లుగా మాఱి తాము లోపించినవి, దొన్నె, పగ్గె, సందె, జంకె

(ఉ) కొన్ని 'ఇయ' లు 'ఇ' లుగ మాఱి తాములోపించినవి:- గబ్బి, దొమ్మి, బ్రమ్మి, పిచ్చి, జవా (వ్వా) (ది); గంజి, పుంజ, బావంజి, ముంజి, గజ్జి, గూఁటి, సొంటి, పాటి, పొట్టి, దట్టి, ఒట్టి, బుట్టి, పుట్టి, మేఁడి, గండి, పిండి ఇత్తడి, కంబడి, కావడి, కైరవడి, కొడి, కోడి, గరుడి, పల్లటీ, దుప్పటీ, గుమ్మడి, జంజాడి, జముదాడి; తక్కిడి, మందడి, లౌడి (ణి), గిడ్డి, కామంచి, జడ్డి, దొడ్డి, కడ్డి, గుత్తి, తిత్తి, పొత్తి, మిత్తి, అళది, హాళది, చెయిది, సంది.

(ఊ) కొన్ని '-ఇ'యలు 'ఎ' లుగను 'ఇ' లుగను గూడ మాఱును; జోలియ (-లె,-లి); టెంకియ (-ంకె, - ంకి).

(ఋ) కొన్నియెడల '-ఇయ'లోని 'ఇ' లోపించి, యకారము వెనుకటి వర్ణముతో సంయోగము నొందును.

కన్నియ (కన్య); పల్లియము (పళ్యము); ముత్తియము (ముత్యము); దివియ (దివ్య); విడియము (విడ్యము); వీడియము (వీడ్యము).

(ౠ) 'తదియ' 'తద్దె' యగును.గాని, 'విదియ' 'విద్దె' గా మాఱదు.

73. - ఇయన =ఎన; సం. ఇక + అన.

కందియన ( - ందె - ) ; గొల్లియన ( - ల్లె - ).

74. - ఇరము. - సం. - ఇత.

జాపిరము, తీవిరము.

75. ఇరి; సం. ఇ + - తి

అలిపిరి, ఉలిమిరి, కసిమిరి, కింకిరి, కింగిరి, చలిమిరి, తిమిరి, తిమ్మిరి, నసిమిరి, నింపిరి, పొంపిరి, పందిరి, పిప్పిరి, బవిరి, బవ్రి; మూదిరి, మ్రాగ్రి, వలిపిరి, వాఁపిరి ; వావిరి.

76. - ఇలి; సం. ఇ + - తి.

అర్మిలి, ఆవిలి, ఇక్కిలి, ఇరిపిలి, ఒంపిలి, ఒడిపిలి,ఒత్తిలి, ఒందిలి, ఓకిలి, కమికిలి,కొడి (ణి)దిలి,గబ్బిలి, గాదిలి, గుప్పిలి, గుబిలి,గుమిలి, గ్రుక్కిలి,చిందిలి, చికిలి, చిమ్మిలి, చీఁకిలి, చెక్కిలి, చొక్కిలి, జంగిలి, జాబిలి (ల్లి) ; జిగిలి, జుట్టి (త్తి)లి; తొంగిలి, తొండ్లి, నక్కిలి, నర్మిలి; నుచ్చిలి, నెంజిలి, నొచ్చిలి, పట్టిలి, పందిలి, పికిలి, పిక్కిలి, పిడికిలి, పింపిలి,పుక్కిలి, పుడిసిలి, పుణికిలి, పెండిలి, పెండ్లి ; పొంగిలి, పొదిగిలి, బడిలి, మ్రాగిలి, మించిలి, ముచ్చిలి, లొడితిలి, వాకిలి, వావిలి, వింజిలి, వేవిలి, సందిలి,

77. - ఇవము; సం. ఇ + ఉ + క.

ఉక్కివము.

78. - ఇవి; సం. ఇ + ఉ + ఇక.

గెలివి, తనివి, తన్వి, తెలివి, నిడివి, విరి (తి) వి,

79. - ఇసము. సం. త్య.

బానిసము, బారిసము.

80. ట ; సం.-త.

'ట'ను ఏధాతువునకైనను చేర్పవచ్చును. క్రుంగుట (శ. ర.లో లేదు); పాండు iv. 48; కొనియాడుట (ఉ. హరి. iv. 69 అర్థ భేదము.)

81. - డు.

సం. - త + ఉక.

భావార్థమున 'ట' వచ్చు చోట్లనెల్ల 'డు' రావచ్చును. శబ్దరత్నాకరములో నీ క్రింది శబ్దములు మాత్రము భావార్థక డు - ప్రత్యయాంతములు చేర్పఁబడినవి.

అమ్ముడు, అఱుగుల్లు, అఱువుల్లు,అలుకుడు, అదుముడు, ఇంకుడు, ఉగ్గుడు, ఉప్పుడు, ఎక్కుడు, ఎగుడు, ఎనుపుడు, ఏరుగుడు, ఏఁకుడు, ఏదుడు, ఒత్తుడు, కక్కుడు, కదలుడు, కప్పుడు, కాఁగుడు, కాఁపుడు, కిముడు, కుట్టుడు, కొలువుడు, క్రాంగుడు, క్రుక్కుడు, క్రుమ్ముడు, గిల్లుడు, గీఱుడు, చిమ్ముడు, చిలుకుడు, చీరుడు, చీఱుడు, చెప్పుడు, చేఁపుడు, చోపుడు, జరుగుడు, జరుపుడు

జాఱుడు, దిగు (గ్గు) డు, తక్కుడు, తగులుడు, తడవుడు, తలఁగుడు, తాఁకుడు, తిరుగుడు, తెగుడు, తెలుపుడు, తొలఁగుడు, తోముడు, త్రాగు (వు) డు, త్రుంగుడు, త్రుప్పుడు, త్రేగు (వు) డు, త్రొక్కుడు, త్రోపుడు, దంగుడు దంపుడు, దాఁపుడు, దిగుడు, దిగ్గుడు, దూఁకుడు, దెప్పుడు, దోఁకుడు, దోఁపుడు నఱకుడు, నలుకుడు, నలఁగుడు, నానుడు, నిక్కుడు, నూకుడు, నెమ కుడు, నొక్కుడు, పట్టుడు, పాఱుడు, పిలుపుడు, పులుముడు, పెంపుడు, పెట్టుడు, పెరుగుడు, పేరుడు, పొదుగుడు, పొసఁగుడు, ప్రాకుడు, ప్రాముడు, ప్రేలుడు, మగ్గుడు, మూఁగుడు, మేనుడు, మ్రింగుడు, మ్రొక్కుడు, మ్రోఁ గుడు, రాపుడు, రుద్దుడు, రొంజ (ండు, ట్టు, ల్లు)డు, నడఁకుడు, వాలఱుగుడు; వెద (న) కుడు, వెలుపుడు, వేఁపుడు, వేల్పుడు, వ్రేఁపుడు, వ్రేలుడు, సోఁకుడు.

82. - ండు; సం. - అంత.

కలఁగుండు.

83. - త; సం. - త.

తెనుఁగున 'యు' వర్ణాంత ధాతువులపై నిది కలుగుచుండును. మేఁత, కోఁత, నొద.

II. ప్రత్యేక పదములుగ కాన్పించియు బ్రత్యయత్వమును బొంద నారంభించినవి.

1. కట్టు; సం. కృత.

బంధుకట్టు, వాకట్టు, నాడకట్టు, సజ్జకట్టు, సందుకట్టు.

2. - కడ; సం. కృత.

I. దేశార్థకము:

అఱకడ, మింగడ, మీఁగడ, మీనడ, ముంగడ, లోఁగడ, వలకడ, డాకడ, వెలిగడ, ఇడుగడ, ఎదురుగడ, కుఱుగడ, తలగడ, తల్గడ, (తలాడ), విడుగడ (నిర్వ. VII. 12)

II. కాలార్థకము:

పెందలకడ, రేపకడ, లోఁగడ.

III. భావార్థకము:

తేగడ, బరగడ, నిలుకడ, నిల్కడ, పోకడ, రాకడ, ఎత్తుగడ, ఏడుగడ, ఏడ్గడ, కట్టుగడ, కాపుగడ, చేసుగడ, తరుగడ, తేఱుగడ, దిద్దుగడ, పన్నుగడ, విడుగడ, విఱుగడ, చిలుకడ.

iv. వస్త్వర్థము:

గరగడ, తలగడ, తల్గడ (తలాడ).

3. - కర; సం. - కృత.

ఉడుగర, విడుగర.

4. - కల; సం. - కృత.

ముంగల, వెనుకల (వెనుకాల).

5. - కాటు; సం. - కృత.

వాకాటు.

6. - కాయ; సం. - కా + అకా.

తలకాయ, తిప్పకాయ, పిల్లకాయ, పెఱిగాయ, బుఱ్ఱకాయ, చంపకాయ, మొట్టికాయ, బుఱ్ఱకాయ, రాలుగాయ, లింగకాయ. లెంపకాయ, లొట్టకాయ, నున్నపుఁగాయ, గుండెకాయ, నీరుకాయ.

7. కొట్టు; సం. - కుట్ట్.

నుడిగొట్టు.

8. - కోలు; సం. - కృత.

'కొను' సహాయక్రియ గాఁగల యన్నిక్రియల నుండియు 'కోలు' అనుస దంతమందుగల భావార్థక విశేష్యములు పుట్టును. శబ్దరత్నాకరమున నీ క్రిందవి చేర్పఁబడినవి.

ఆడికోలు, ఇచ్చిపుచ్చికోలు, ఇయ్యకోలు, ఈకోలు, ఈనుకోలు, ఎత్తికోలు, ఎదురుకోలు, ఏటికోళ్లు, ఒప్పుకోలు, కలుపుఁగోలు, కొనుగోలు, చూఱకోలు, తగులుకోలు, తలకోలు, త్రెక్కోలు, దక్కోలు, దగ్గోలు, దీకోలు, డీకోలు దొరకోలు, నాఁచికోలు, నూలుకోలు, నెక్కోలు, నొచ్చుకోలు, పట్టుకోలు, పుచ్చుకోలు, పెట్టుకోలు, పేరుకోలు, పేర్కోలు, పొగడికోలు, ప్రబ్బికోలు, ప్రోచికోలు, బడికోలు, ముట్టుకోలు, మునుకోలు, మొయికోలు, మేకోలు, మేలుకోలు, మైకోలు, రెక్కోలు, రాలుకోలు, విడిగోలు, వీడుకోలు, వీడ్కోలు, వెన్నెలకోలు, వేఁడుకోలు.

9. - గరము; సం. - కృతమ్.

ఉలగరము, చెడగరము.

10. తట్టు; సం. - తప్త

విరిదట్టు.

11. - తనము. వేదము: త్వనమ్: ప్రా. త్తణమ్.

దీనిని సాధారణముగా భావార్థమునం దన్ని విశేష్య విశేషణముల తోడను జేర్చవచ్చును. ఉదా: అత్తగారితనము, ఊరకుండుతనము, మంచితనము, చెప్పరానితనము, ఎఱ్ఱదనము, మొ.

అలిగొండెతనము, కనుకుట్టుఁదనము, కలితనము, ప్రల్లదనము, మకురుతనము, వడికలతనము, కుక్కతనము (ఉ. రా పు. 124); బండతనము (చెన్నబ. I. 36) గోరతనము (కాశీ. IV. 91) కొయ్యతనము(కాశీ. IV. 94.)

12.—తరము ; వేదము : త్వరమ్.

పడితరము.

13.—తల ; వేదము : త్వన.

i. భావార్థము:—

అగుదల, అచ్చుదల, ఒరుదల, కూడుదల, కొనుదల, కోలుతల, కోల్తల, క్రమ్ముదల, చుట్టుదల, తగులుదల, తగ్గుదల, తప్పుదల, తాఁకుదల, తిరుగుదల, తీఱుదల, తెగుదల (నిర్వ. IX. 53), దిగుదల, పట్టుదల, బాడుదల, మందల, మించుదల, మూదల, మోపుదల, వాడుదల, విడుదల, ఎగుదల.

ii. ప్రదేశార్థము:

అవతల, ఇవతల, ఈతల, ఎగుదల, క్రిందల, బిత్తల, ముందల, నిడిదల.

14.—తెర ; వేదము :

ఏడ్తెర, మొద.

15.—పు ; సం. త్వ. = వేదము : త్వన.

సాళగింపులు (పాండు. iii. 43.)

16.—పట్టు ; సం. - ప్రస్థ. చూ, ఇంద్రప్రస్థ, మొద.

ఆటపట్టు, ఇంటిపట్టు, ఇంతనట్టు, ఏలముపట్టు, చేపట్టు, పిచ్చపట్టు; వెంటపట్టు, రచ్చపట్టు, విడిపట్టు, వింటిపట్టు, వీడుపట్టు.

17.—మట్టు ; సం. - ప్రస్థ.

విడిమట్టు.

18.—పెట్టు ; సం. - ప్రహత ?

పోఁబెట్టు.

19.—పాటు ; సం. - పాత.

I. భావార్థము.

(అ) ఆకులపాటు, ఆయాసపాటు, ఆయిత (త్త) పాటు, ఆరటపాటు. ఆసపాటు, ఇక్కుపాటు, ఇడుమపాటు, ఉత్తలపాటు, ఉదిరిపాటు, ఉలికిపాటు, ఎగసిపాటు, ఎదురుపాటు, ఏమఱుపాటు, ఏరుపాటు, ఏర్పాటు, ఒంటరిపాటు, ఒంటిపాటు, ఒడఁబాటు, ఓటుపాటు, ఓరపాటు, కట్టుపాటు, కప్పరపాటు, కలఁకపాటు, కష్టపాటు; కళవళపాటు, కింకిరిపాట్లు, కుతిలపాటు, కుదురుపాటు, కునికిపాటు. కొంకుపాటు, కొందలపాటు, కోలుపాటు, గగురుపాటు, గరుపాటు, చిందిలిపాటు, చిక్కుపాటు, చిడిముడిపాటు, చులుకపాటు, చేడ్పాటు, జాఱుపాటు, డిందుపాటు, తక్కువపాటు, తత్తరఱపాటు, తలపాటు, తిరుగుడుపాటు, తీఱుపాటు, తొంగలిపాట్లు, తొక్కటపాటు, తొట్రుపాటు, తోడుపాటు, తోడ్పాటు, త్రొక్కటపాటు, త్రోపాటు, దండపాటు, దిగులుపాటు, దిద్దుపాటు, దుఃఖపాటు, నివ్వెఱపాటు, పైపాటు, పొందుపాటు, బొమముడిపాటు, భంగపాటు, మాఱుపాటు, మిట్టిపాటు రాలుపాటు, ఱెప్పపాటు, లంకెపాటు, వీడుపాటు, వెక్కసపాటు, వెడఁగుపాటు, వెనుకపాటు, వెఱఁగుపాటు, వేగపాటు, వేగిరపాటు, వేఱుపాటు, సాగుపాటు, సాపాటు, సిగ్గుపాటు.

(ఆ) ఈక్రింది వానిలో సరళాదేశము కలిగినది.

ఎడఁబాటు, ఒల్లఁబాటు, కనుఁబాటు, జరుగుఁబాటు, తడఁబాటు, తెగఁబాటు, నగుఁబాటు, నవ్వుఁబాటు, మరలఁబాటు, విఱుగఁబాటు, వెడలఁబాటు, వెనుఁబాటు, గభ్బాటు, దెబ్బాటు.

(ఇ) ఈక్రింది వానిలో 'వ' కారమాదేశముగ వచ్చినది.

ఎరువాటు, ఒదుగువాటు, తగులువాటు, తిట్టువాటు, చీవాట్లు, నిగువాటు, పిడివాటు, పున్వాటు, పూటవాటు, బడిసివాటు, బ్రుంగుడువాటు, ముడివాటు, ఱిచ్చవాటు, వలెవాటు.

(ఈ) ఈక్రింది వానిలో 'పాటు' విశేషార్థములను దెలుపును.

i. విధము, రీతి:—

ఆదోకపాటు, ఒల్లెవాటు, గ్రుడ్డివాటు.

ii. కృషి : పొలము పాటు.

iii. పొందుట ; ఫలముపాటు.

iv. మార్గము ; వెనుకపాటు.

v. వైచుట ; గిరవాటు.

vi. కొట్టుట ; తెరువాటు.

20.—పోక; సం. - ప్రగ

ఆపోక, కోలుపోక, బమ్మెరపోక, వేఁగుఁ బోక, వేఁబోక, వాపోక,

21.—పోటు; సం. - ప్రహతం.

బందిపోటు, విరిపోటు.

22.—బడి; - సం. - వత్ + ఇక; వృత్తి.

i. భావార్థము:—

ఏలుబడి, ఒదవుబడి, ఒదుగుబడి, కట్టుబడి, కనుబడి, కొనుబడి, గిట్టుబడి, చెల్లుబడి, చేఁబడి, చాలుబడి, జరుగుబడి, తగులుబడి, తీరుబడి, దిద్దుబడి, పట్టుబడి, పలుకుబడి, పుట్టుబడి, పెట్టుబడి, పోబడి, మొక్కుబడి, మ్రొక్కుబడి, రాఁబడి, రోసుబడి, వచ్చుబడి, వఱబడి, వీసబడి, వెంబడి, సరబడి, సాగుబడి.

ii. తరబడి = తరముమార్గముచ.

iii. కోడిబడి = పిల్లలభక్ష్య విశేషము.

23.—వడి ; సం. వత్ + ఇక ; వృత్తి.

i. భావార్థము:—

ఇలు (ల్లు)వడి, ఉరవడి, ఒరవడి, (ఇదితప్పు, 'వరవడి' ఒప్పు), కైవడి, కోలువడి, చలువడి, తరువడి, నడవడి, నడువడి, పరువడి, మెఱువడి, మే(మై)వడి, లేవడి, ఆవడి, హానడి.

ii. సరవడి = ఎడ్లనుకట్టి చొప్ప మొదలగు వానిని తీసికొనిపోవు సాధన విశేషము.

24.—వణి ; సం; వత్ + ఇక ; వృత్తి.

పటవణి, లవణి, లావణి.

25.—వళి ; సం. - వత్ + ఇక ; వృత్తి.

ఆ (హా) వళి.

26.—మతి ; సం. - మత్ + ఇక ; వృత్తి ; మతి ;

ఎగుమతి, దిగుమతి.

27.—మర ; ప్రా. - అర = కలిగినది;- మతి.

విడుమర.

28.—మానము ; సం. - మాన.

తేమానము, వరుమానము.

- బడి, - వడి, వణి, వళి, - ఈ ప్రత్యయములన్నియు నేకార్థకములును నొకటితో నొకటి సంబంధించినవియునై యున్నవి. ఇవి సంస్కృతములోని 'వృత్తి' అను శబ్దము వికారములు. 'వృత్తి' ప్రాకృతమున 'వణి, వళి' గామాఱును. ఉత్తరహిందూస్థాన భాషల యందీ ప్రత్యయములున్నవి.

- మతి, - మానము, - అనునవి సంస్కృత ప్రత్యయములే తెనుఁగుననున్నవి.

- మర, - ఇది 'మతి' శబ్దభవమై యుండనోపును.

29.—బరము ; సం. - వర ; వృత్తి ; చూ. సం. కలేబరమ్.

లేబరము.

30. —బళి ; సం. - వృత్తి ; - వత్ + ఇక.

చాఁగుబళి (మను. V. 42).

31.—మాలము . సం. ప్రా. - ఆల = కలిగినది.

లూలామాలము.

32.—రి (ఱి)కము ; సం. అర = కలిగిన + ఇక.

ఇల్లరికము, ఎబ్బెఱికము, ఎఱుబఱికము, ఒప్పరికము, కన్నెఱికము, కోడంత్రికము, కోట(డ)ఱికము, చిన్నఱికము, చేతరికము, చుట్టఱికము, తొత్తఱికము, దాఁపఱికము, నెప్పఱికము, దొంగఱికము, నిబ్బరికము, పిన్నఱికము, పెద్దఱికము, పేదఱికము, బాపఱికము, మిండఱికము, మేనఱికము, లంజెఱికము.

33.—వరము ; సం. - అర = కలిగిన.

i. భావార్థము:—

ఉలవరము, కలవరము.

ii. ఇతరార్థములు:—

ఇలువరము (ఇలారము,) = ఇలువారము.

34.—వల, - పల ; సం. - వృత్త

ఈవల, ఆవల ఏవల, ఎవ్వల, దాపల, లోపల, వలపల, వెలుపల.

35.— వాయి ; సం. - ఉక + ఇక.

తరవాయి, తరువాయి, దిగువాయి, వఱువాయి.

36.—సరి ; సం. - సదృశ; ప్రా. సరిఅ.

కంటసరి, లగ్గసరి, లాలసరి.

### iii. సహాయక క్రియలు.

ధాతువుల యర్థమును వివరించుటకును, వానికి విశేషార్థములను గల్పించుటకును, గొన్నియెడల స్వార్థమునందును దెనుఁగున ననేక సహాయక క్రియలు వాడుకలోనున్నవి. కొన్నియెడలనివి విశేష్యములపైఁజేరి క్రొత్త సమస్తధాతువుల నేర్పఱుచుచుండును. ధాతువులతోఁ జేరునప్పుడవి కేవల ధాతువుల మీఁదనేకాక, వాని క్త్వార్థక, తుమున్నంతాది రూపముల మీఁదఁగూడఁ జేరుచుండును. ఈ క్రింది సహాయకక్రియలు తెనుఁగున నున్నవి. ఇవి ప్రత్యయములు కాక ప్రత్యేక ధాతు రూపమున నున్నను, వీనికిఁ బ్రత్యయ లక్షణములన్నియు నున్నవి. వీనికి సంస్కృత మూలము లింతకు ముందు తెలుపఁబడినవి.

1. అంటు.

విశేష్యములపై: అఁటుగంటు, తలయంటు, వెన్నంటు.

2. అంపు.

తుమున్నర్థకముపై: సాగనంపు.

3. అందు.

విశేష్యముపై: వియ్యమందు.

4. అగు.

విశేష్యములపై: ఊఁకువగు, తీలగు, దాఁపురమగు, పెంకిలియగు, పెంపగు, పొట్టు పొరలగు, బైలగు, రూపగు, వెలవెలనగు, వెల్లనగు, సదమదమగు, సరియగు.

5. అడఁగు.

విశేష్యములపై: ఉక్కు- ; గండు - ; గీటు - ; పొడవు -; రూపు - ; గోను.

6. అడఁచు.

విశేష్యములపై: చక్కు - ; చదురు - ; దిసంతు - ; నామము - ; పొడవు - ; మదము - ; వాఁడు.

7. అదలు.

అవ్యయముపై: గ్రక్కదలు.

### 8. అను.

ఇది సాధారణముగ ధ్వన్యనుకరణ శబ్దములపైఁ జేరును. ఇదిచేరునప్పుడు కొన్నియెడల 'మ' గాని, రేఫముగాని యాగమసంధ్యక్షరముగ వచ్చును.

'మ' ఆగమము: కనకనమను, గిటగిటమను, గుబ్బుమను, గ్రుక్కిక్కుమను, చిటచిటమను, చిటుపమను, చిటుకుపొటుకుమను, చిట్లుమను, జల్లుమను, దగదగమను, దడదడమను, దానదానమను, పెటపెటమను, బగ్గుమను, బావురుమను, మినుకుమినుకుమను, ముఱముఱమను, ముసముసమను, మిసమిసనును. రెపరెపమను, లొటలొటమను.

రేఫాగమము: గుబ్బురను, చిటుకురను, జల్లురను, దగ్గురను, మినుక్కురను.

మ,ర, రెండును నాగమము: చివుక్కురునును.

ఆగమములేక: గుటుక్కను, గ్రుక్కుమిక్కను, చిటుకను, చిటుక్కను, జల్లను, డమ్మను, మిడుకుమిడుకను, మినుమినుకను.

అకారాంతములపై యడాగమము: పెళపెళయను.

### 9. అఱు.

విశేష్యములపై: ఉక్కఱు, ఓటఱు, పాడఱు, రూపఱు, సిగ్గఱు.

### 10. ఆడించు.

విశేష్యములపై: బోరుకాడించు, వంచాడించు.

### 11. ఆడు.

ఇది విశేష్యముల యేకవచనముల మీఁదను, కొన్నియెడల బహువచనముల మీఁదను, ధాతువుల క్త్వార్థక తుమర్థక రూపములమీఁదను జేరుచుండును. కొన్నియెడల నవ్యయములమీఁదను జేరును.

i. విశేష్యముల యేకవచనములపై.

అట్టాడు, ఆటాడు, ఈఁతాడు: ఉడుకు-; ఉడ్డ-; ఉలివు-; ఉల్లసము-; ఎగ్గు-; ఎదురు-; కొట్టు-; కొల్ల-; కోడు-; క్రోడు-; గండు-: గినుము-; గిలుబు-; గోఁజు-; గోడు-; చిందు- : చిట్ట-; చిట్టుముట్టు; చెండుబెండు-; చక్కు-; చరలాటము-; చూఱ-; జంపు-; జగడము-; జలకము-; జూటు-; తడవు-; తిట్టు-; త్రోపు-; దాడి-; నట్టు, నడ-; నఱము-; నీరు-; నుగ్గు-; నుఱుము-; నెయ్యము-; పనుపు-; పాలు-; పీఁకుపీఁకు-; పీండిలి-; పేటు-; పోక-; పోరితము-; పోరు-; బాస-; బోరుకు-; మంద్ర-; మల్ల-; మాట-; మాఱు-; ముద్దు-; మేఁత-; మేలము-; మొఁడాడు-; అంకు-; అవ్వ-; వాదు-; వీడుజోడు-; వెన్ను-; వెరఁజు-; వేటం.

ii. బహువచన రూపములపై.

అబ్బాలు-; ఇగ్గులు-; ఈదులు-; ఊగులు-; ఎగురులు-; ఎగ్గులు-; ఏటులు-; నీలలు-; కనకనలు-; కాటులు-; కిలకిలలు-; కొట్టులు-; కొల్లలు-; క్రుమ్ములు-; గడగడలు-; గిజగిజలు-; గుంజులు-; గుజగుజలు-; గుదగుదలు-; గొణగొణలు-; గోరుపులు-; గోర్పిళ్లు-; గుద్దులు-; చిటచిటలు-; చిమ్ములు-; చిఱచిఱలు-; చూఱలు-; జీరులు-; చెకపికలు-; చెఱచెఱలు-; చల్లులు-; తకపికలు-; తన్నులు-; తఱతఱలు-; తార్పులు-; తికమకలు-; తిరితీపులు-; తచ్చనలు-; తుంపెసలు-; త్రోద్రోపులు-; దుముకులు-; దుముదుములు-; దేవులు-; దొమ్ములు-; నకనకలు-; నఱుకులు-; నేళ్లు-! పాతరలు-; పింపిసలు-; పింపిళ్లు-; పిరువీకులు-; పీకులు-, పెటపెటలు-; పెనగులు-; పోటులు-; ప్రాకులు-; బిత్తరములు-; మటమటలు-; మినమినలు-; మిలమిలలు-; ముఱముఱలు-; మెరమెరలు-; బుసబుసలు-; బెకబెకలు-; మొత్తులు-; మొఱమొఱలు-; లాగులు-; లుకలుకలు-; వందఱలు-; వాటులు-; వెంపరలు-; వక్కిరింతలు.

iii. క్త్వార్థకములపై సంధిలేకుండ.

అసియాడు, ఉరియాడు, ఒత్తియాడు, కెరలియాడు, కొనియాడు, దోగియాడు, త్రిప్పియాడు, తుళ్లియాడు, నటిచియాడు; విసరియాడు; వీగియాడు.

iv. క్త్వార్థకములపై సంధిగలిగి.

ఊగాడు; ఊవాడు; ఊటాడు, ఎక్కాడు; కదలాడు; కొండాడు; ఇచట 'కొండు' అనునది 'కొళ్' అను ద్రావిడధాతువు క్త్వార్థక రూపము; తెనుగున ప్రాచీనరూపము, 'కొనియాడు' నకు రూపాంతరము; కోరాడు; గునిసాడు; చెండాడు; చెరలాడు; చరలాడు, తట్టాడు, తట్టుముట్టాడు; తారాడు; తిరుగాడు; తునుమాడు, తూగాడు, తూటాడు; తూలాడు, తేలాడు; తొలకాడు; దోగాడు; పాతాడు; పెనగాడు; పొదలాడు; పొరలాడు; పొలసాడు; పోనాడు; మట్టాడు; మిట్టాడు; వడకాడు; వ్రేలాడు;

v. ధాతువుపై 'కొను' నకురూపాంతరమగు (క) చేరి.

జీరుకాడు, పారుకాడు.

vi. తుమున్నర్థకములపై.

చెడన్-; డి (దిి) గ (గ్గ) న్-; విడన్.

vii. అవ్యయములపై.

అల్లాడు; ఓలాడు.

12. ఆరు.

i. విశేష్యములపై: ఏపారు, ఒప్పారు, చల్లారు, జంపారు, తనుపారు, తీపారు, తెలుపారు, నిండారు, నిరాఘారు, నినుపారు, వెంపారు, పెనుపారు, పొంగారు, పొలుపారు, బెడంగారు, వాచారు.

ii. విశేష్యముల బహువచన రూపముపై: పొంపెసలారు.

iii. క్త్వార్థకములపై: అడంగారు, అణంగారు, నిగిడారు.

iv. ధాతువులపై: అలరారు, అసలారు, ఎలరారు, ఎసలారు, తనరారు, పొనరారు, వెలరారు.

13. ఆరుచు.

i. విశేష్యములపై: ఓదారుచు, నీరారుచు, పాలారుచు, పోకారుచు.

ii. బహువచన రూపముపై: అంగలారుచు.

iii. అవ్యయముపై: అల్లారుచు.

14. అఱు.

విశేష్యముపై: ఓటఱు.

15. ఆఱు.

విశేష్యములపై: గరుపాఱు, తెగటాఱు.

16. ఆఱుచు.

విశేష్యములపై: తెగటాఱుచు.

17. ఇచ్చు.

విశేష్యములపై: ఆనతిచ్చు, జట్టియిచ్చు, మొగమిచ్చు, వెన్నిచ్చు, సెలవిచ్చు.

18. ఇడు.

విశేష్యములపై: ఎక్కిడు, చొక్కిడు, పరువిడు, ముద్దిడు, మోపిడు. బహువచన రూపముపై: కొనలిడు.

19. ఉండు.

కూరుచుండు (దీనికి ధాతువేమో తెలియదు; 'కూరుచు' ధాతువై వచో 'కూరిచి+ఉండు' అని పదచ్ఛేదము; నిలుచుండు (నిలిచి+ఉండు);

తెన్నుండు (*తెన్ని+ఉండు); తొన్నుండు (*తొన్ని+ఉండు); పన్నుండు (*పన్ని+ఉండు.)

20. ఉబ్బు.

ఏకవచన రూపముపై: పుటముబ్బు.

బహువచన రూపముపై: క్రేళ్ళుబ్బు.

21. ఉఱు.

విశేష్యముపై: పెలుకుఱు, పెల్కుఱు.

22. ఉఱుకు.

ఏకవచన రూపముపై: చెమ్మయుఱుకు.

విభక్తి రూపముపై: కొఱంతనుఱుకు.

బహువచన రూపముపై: క్రేళ్లుఱుకు.

తుమున్నర్థక రూపముపై; డిగ (గ్గ) నుఱుకు.

23. ఊఁగు.

బహువచన రూపముపై: ఉట్టటలు-; ఉట్టిట్లు-; ఉట్టూఁతలు.

24. ఊరు.

ఏకవచన రూపముపై; నోరూరు, ముక్కూరు, వాలూరు.

బహువచన రూపముపై; ఉవ్విళులూరు.

25. ఊరుచు.

అవ్యయముపై; నిట్టూరుచు.

26. ఎక్కు.

విశేష్యముపై; దుద్దెక్కు.

27. ఎగయు.

విశేష్యముపై: పుటమెగయు.

28. ఎత్తు.

విశేష్యముపై: తలమెత్తు, తూరుపెత్తు, దండెత్తు, నోరెత్తు, పరుగెత్తు, పేడెత్తు, మొలకెత్తు, రేకెత్తు.

29. ఏఁగు.

విశేష్యముపై; ఎదురేఁగు.

30. ఒగ్గు.

విశేష్యముపై : పోటొగ్గు.

31. ఒడుచు.

బహువచనరూపముపై : ఓగులొడుచు.

32. ఒడ్డు.

విశేష్యముపై ; మాఱొడ్డు, ఎదురొడ్డు, మెండొడ్డు, వట్టొడ్డు.

33. ఒత్తు.

విశేష్యముపై : అచ్చొత్తు, ఇగురొత్తు, ఎదురొత్తు, చిగురొత్తు, తళుకొత్తు, పోఁకొత్తు, మాఱొత్తు.

బహువచనరూపముపై : కడలొత్తు, కొనలొత్తు.

34. ఒందు.

విశేష్యముపై : వెఱఁగొందు, వెలుఁగొందు.

35. ఒనర్చు.

విశేష్యముపై : జంకె—;

36. ఒడు.

విశేష్యముపై : మొగము—; మోః

37. ఓపు.

విశేష్యముపై : చూపు.

38. ఓము.

విశేష్యముపై : పురులు.

39. కట్టు.

విశేష్యముపై: అచ్చుకట్టు, అడ్డకట్టు, అరికట్టు, ఆఁకట్టు = ఆఁక + కట్టు; ఉట్టు-; ఒడి-; కడ-; కరుడు-; గర-; చెట్టు-; జడ-; తడ-; తుట్టె-; తూఁట-; తూఁటు-; తెట్టువ-; దడ-; దాఁటు-; దాయ-; దీటు-; దోయి-; పిండు-; పూదె-; పూపు-; పెంట-; పెట్ర-; కొలికి-; పొడ-; బిల్ల-; మల్లు-; మొగ-; మొన-; ములకి -: మోఁద-; వల-(=వలను)-; వెల్లువ.

బహువచన రూపముపై: తిరుపులు-; తెట్టెలు.

క్త్వార్థక రూపముపై: విఱిచికట్టు.
ధాతువుపై: తివురు.

తుమున్నర్థక రూపముపై ఎండఁ-; తగులఁ-; వడి - (=వడియన్); వడియఁ-;

ఉపసర్గ ప్రతిరూపముపై: ఎడ-; సమ.

40. కడచు.

విశేష్యముపై: సరి.

41. కడుగు.

విశేష్యముపై: జలగడుగు, గాడిగడుగు.

42. కంటు

విశేషణముపై: కసు—.

43. కను.

విశేష్యముపై: పొడగను.
ఉపసర్గ ప్రతిరూపముపై: మేలుకను.

44. కనుపు.

ఉపసర్గ ప్రతిరూపముపై: మేలుకనుపు.

45. కఱచు.

విశేష్యములపై: ఇలకఱచు, ఇల్కఱచు, ఒగుడుకఱచు.

46. కలఁగు.

విశేష్యములపై: గాతుకలఁగు (గాతు = ఘాతః); బోగుకలఁగు.

47. కలయు.

విశేష్యముపై: కత్తిరిగలయు.

48. కలుపు.

విభక్తిరూపముపై: నేలఁ (గలుపు)

49. కవియు.

విశేష్యముపై: ఆముకవియు, ముసురుకవియు.
బహువచన రూపముపై: చిరుతలుకవియు.

50. కాంచు.

విశేష్యముపై: పొడగాంచు.
ఉపసర్గ ప్రతిరూపముపై: మేలుకాంచు.

51. కుడుచు.

విశేష్యముపై: ఉడ్డుగుడుచు, ఊలనూలగుడుచు, తల్లడ-;
బహువచనరూపముపై: నకనకలుగుడుచు.

52. కుడుపు.

విశేష్యముపై: పోల్లుకుపు.

53. కునియు.

బహువచనరూపముపై: తుంపెనలుగునియు.

54. కులు.

విశేష్యముపై: చేకులు.
ఉపసర్గ ప్రతిరూపముపై: సమకులు

55. కూడు.

విశేష్యముపై: చేకూడు.
ఉపసర్గప్రతిరూపముపై: ఒడఁగూడు,ఒనగూడు, తలకూడు;సమకూడు.

56. కూయు.

బహువచన రూపముపై: పింపిళ్లుగూయు.

57. కూరు.

విశేష్యముపై: చేకూరు.
ఉపసర్గ ప్రతిరూపముపై: సమకూరు.

58. కూరుచు.

ఉపసర్గ ప్రతిరూపముపై: సమకూరుచు.

59. కొట్టు.

విశేష్యముపై: అండ - ; ఉలు - ; కడ - ; కనుపు - ; కిల -; కెర-; కొల్ల - ; గిల - : చీ - (దీనిపైఁజేరునపుడా ద్యచ్చునకు హ్రస్వమును కకారమునకు ద్విత్వమును గలిగి 'చిక్కొట్టు' అనియునగును); చాఁగఱ-; చుచ్చు-; జిఱ - ; త్రెక్కు - (దీనిపై నొక కకారము లోపించి 'త్రెక్కొట్టు' అనియగును. ) ; దినంతు - ; నట్టు - ; నడ - ; నెాడు -; పిడి - ; పొడి -; బల -; బుస - ; బెక్కు - (చూ. త్రెక్కు);

ii. తుమున్నర్థక రూపములపై: ఎండఁ ; - చెంగఁ - ; తెగఁ. పగులఁ - ; పోఁ.

iii. క్రియపై: రా.

iv. అవ్యయముపై: ఊఁ - ; జో.

60. కొను.

i. విశేష్యముపై: అంకె - ; అండ - ; అడ - ; అడుగోలు - ; ఒడ గోలు - ; అడ్డు - ; అన్ను - ; అరగలి - ; అరి - ; అసలు - ; ఆఁకలి - ; (- 'కలి' కి లోపము) ; ఆది - ; ఆదు - ; ఆము - ; ఆలి - ; ఇగురు - ; ఇమ్ము - ; ఇయ్యి - ; ఇరవు - ; ఇరులు - ; ఇఱుము - ; ఇవము - ; ఈయ - (యకు లోపమును) ; ఉజ్జ - ; ఉదియు - ; ఉదిరి - ; ఉదిల - ; ఉసి - ; ఊఁత - ; ఎర - ; ఎఱ - ; ఎస - ; ఐర - ; ఒర - ; ఓలమాస- ; కచ్చు - ; కడలు - ; కడి - ; కదు - ('కదువు' నకు రూ.) ; కను- దీనిపై; ననుస్వారము గూడ) ; కలఁగుండు - కల - ('కలఁత'లోని 'త' కులోపము); కారు - ; కాఱు - ; కాలు - ; కావి - ; కీలు - ; కుదుర - ; కుప్పిగంతు - ; కై - ; కొన - ; కొలువు - ; కొల్ల- ; కోలు - ; క్రొవ్వు - ; గంతు - ; గచ్చు - ; గడ్డు - ; గమి - ; గర - ; గిజగిజ - ; గిఱి - ; గుండు - ; గుడి - ; గుత్త - ; గుది - ; గుబులు - ; గుఱి - ; గురు - ; గువ్వకరి (కోలు) - ; గెలుపు - ; గోద - ; గోన - ; గ్రుక్క - ; చిందఱ - ; చిగురు - ; చీఁదఱ - ; చెఱ - ; చే - ; చలము - ; చవి - చాఁగఱ - ; చుట్టు - ; చూఱ - ; చూలు - ; జిగురు - జిడ్డు - ; జీబు - ; జంగ - . జజ్జు - ; జడ - ; జడి - ; జాదు - ; జాలి - ; జుజుఱు - ; డక్కు (చూ. త్రెక్కు) - ; డాఁ (దాఁ)గు ('ఁగు' లోపము) ; డా(దా) ; డెక్కు (చూ. త్రెక్కు); తక్కు (చూ. త్రెక్కు) ; తమి - ; తఱటు - ; తఱి - ; తల - ; తవులు - ; తావు - ; తికమక - ; తిక్క - ; తిమురు - ; తుఱుఁగలి - ; తూఁగు (ఁగు - లోపము) ; తెగులు -; తెలి - ; తెవులు - ; తే- ; తొం గలి- ; తొగరు - ; తొడు ; తొట్రు - ; తోడు - (-'డు' కులోపమును); త్రెక్కు - (దీనిపై 'కొను' చేరునప్పు డొక కకారమునకు; లోపము); త్రెక్కోలు - ; దక్కు - (చూ. త్రెక్కు); దమ్ము - ; దరి-; దళ -; దళము; దీటు -; దూయు - (యుకర్ధానుస్వారాదేశము); దొడ్డ- ; దొరఁకు - (కులో పము); దొరకు - (కు- లోపము) ; నట్టు - ; నడుకు (కు-లోపము); నులి-; నూలు - నెక్కు - (చూ. త్రెక్కు); నెట్టు - ;నెప్పు - ; నెమ్ము -; నెల - ; నెలవు-; నేటు - ; పగ - ; పట్టు - ; పదను-; పని - ;పను ; పరువు ; పస-; గర- ; పొటి - ; పొదు - ; పొలు - ; పిరి-; పిఱుందు; పుచ్చు ; పురి; పెల్లు-; పేరు - ; పొందు - ; పొద - పొరి - ప్రాఁచి (చి-లోపము) ; ప్రోది - ; ప్రోవు - ; బందన - ; బందె - ; బలుపు - ; బిగువు - ; బిమ్మిటి - ; బీతు - బుగులు - ; బోరు - ; మంద - ;మంపు - ; మట్టు - , మన్ని - ;

మబ్బు - ; మలఁపు - ; ముల - ; మల్లడి - ; మస - ; మాఁకొను (దీని వ్యుత్పత్తి తెలియలేదు) ; మాఱు - ; ముంపు - ; ముక్కు - (= ముందు, - ముఖము) ముట్టు - ; ముట్టుకోలు - ; ముడి - ; మునుము - ; ముప్పిరి - ; మురి - ; మెండు - ; మెదుక - ; మెలి - ; మొగ - ; మొదలు - ; మొన - ; రక్కు - (చూ. త్రెక్కు) ; రచ్చ - ; రెక్కు - (చూ. రక్కు); లంగ - ; రాగు - ; లెక్క - ; వడ - ; వడి - ; వల - ; వలి - ; వసి - ; వాక్కు - ; (ద్విత్వలోపము, ఒక ; క - లోపము) ; వెంటి - ; వెట్టి - ; వెను - ; వెన్నడి - ; వెల్లి - ; వ్రేటు - ; సందడి - సందు - ; సరకు - ; సరమ - ; సరి - ; సుడి - ; సూడు - ; సేద - ; సొమ్మ.

ii. బహువచన రూపములపై: ఉవ్విళ్లు - ; కవలు - ; తెట్టువలు - ; తెట్టెలు - : పల్లటీలు - ; వెనఁకువలు - ; వఱువట్లు - ; మిఱుమిట్లు - ;

iii. ధాతువులపై : అందు - ; అచ్చు - ; అడలు - ; అడుగు - ; అలము - ; ఆ - గుబ్బు - ; ఆడు - ; ఇముడు - ; ఉంచు - ; ఉరలు - ; ఎదురు - ; ఏలు - ; ఒంటు - ; ఒత్తు - ; ఒనవెట్టు - ; ఒప్పు - ; కూరు - ; క్రేఁటు - ; గదుము - ; గిలుబు - ; చుట్టు - ; తగులు - ; తారు - ; తాళు - ; తెఱ - ('తెఱచు' లోని చు - లోపము) ; తేఱు - ; తొట్టు - ; తోలు - ; దాఁగు - ( - గు - లోపము) ; దాఁటు - ; దా - ; నడుము కట్టు - ; నాటు - ; నిండు - ; నిలుచు - ; నొచ్చు - ; పండు - ; పెంచు - ; పెట్టు - ; పొదలు - ; బల - ('బలయు'లో యు - లోపము) ; బాఁదు - ; బాపు - ; మసలు - ; ముంచు - ; ముద్దుపెట్టు - ; ముసురు - ; మూరు - ; వాడు - ; వీడు - ; వేఁడు.

iv. క్త్వార్థములపై: ఆఁచి - ; ఆడిపోసి - ; ఎత్తి - ; త్రిప్పి - ; పుంజి - ; పొట్ట పోసి.

v. విభక్తిరూపముపై: వెనఁగొను.

vi. అవ్యయములపై: ఊఁ ( - ; కడు - ; డీ - ; దీ - ; పరి - ; పఱి - ; మును - ; మొయి - ; మే - ; మేలు - ; మై - ; లోఁ - ; సమ.

61. కొలుపు.

విశేష్యములపై: కై - ; పురి.

బహువచన రూపములపై: గుంద్రలు.

ధాతువుపై: వీడు.

ఉపసర్గ ప్రతిరూపములపై: మేలు -; సమ.

62. క్రమ్ము,

అవ్యయముపై: అఱు - ; నిట్ట.

63. క్రుచ్చు.

విశేష్యములపై: పేరు - ; వాక్.

64. చను.

విశేష్యములపై: కడ - ; తని.
విశేషణములపై: నిడు.
ఉపసర్గ ప్రతిరూపములపై: పిఱు.

65. చరించు.

విశేష్యములపై: ప్రహరి.

66. చఱచు.

విశేష్యములపై: బూది - ; వా -; వెఱ.
అవ్యయములపై: వెను.

67. చల్లు.

విశేష్యములపై: వెద - ; వెనుక.

68. చిందు.

విశేష్యములపై: వెద.

69. చీరు.

బహువచనరూపముపై: చట్టలు.

70. చుట్టు.

విశేష్యములపై: తరి - ; ప్రహరి - ; వల.

71. చూచు.

విశేష్యములపై: ఎదురు - ; పొడ - ; మూ - ; సరి.
తుమున్నర్థకములపై: చావఁ - ; తెగఁ - ; పాఱఁ.

72. చూపు.

విశేష్యములపై: తల - ; పొడ - ; ములు.

73. చెడు.

విశేష్యములపై: మొక్క-; రూపు.

74. చెందు.

విశేష్యములపై: మ్రాను.

75. చేయు.

విశేష్యముపై: అనువు -; అప్పన -; అఱవఱ -; ఆవటము -; ఆన -; ఇయ్యా -; ఉజ్జన -; ఉద్దియ -; ఎన్నిక -; ఎఱుక -; ఐదుపది -; ఒప్పన -; ఓటు -; కట్టడ -; కవి - ('కవియు' నుండి వి.); కాఁడు -; కై -; క్రేడి -; క్రేణి -; గిలుబు -; చిందఱవందఱ -; చిందఱ -; చిందువాఁదు -; చికిలి -; చక్కు -; చబుకు -; చలువ -; చల్ల -; చౌక -; జోక -; తచ్చన -; తటవట -; తరితీపు -; తఱటు -; తొందర -; తెలుపుడు -; త్రోపు -; దయ -; దరువు -; దాడి -; నుఱుము -; నేటు -; పప్పు -; పిరువీకు -; పూజె -; పెండిలి -; పొడి -; పొదుగు -; ప్రోది -; బాగు -; బగళంబు -; బారు -; బో - ('భోజనము' నకు వికృతి -); మంబరము -; మట్టు -; లాఁతి -; లెక్క -; వాకబు - హిం -; వాపను - హిం -; విజయం -; విరిపోటు.

ii. బహువచన రూపముపై : పోఁజులు.

iii. అన్యయముపై: చక్కఁ-; మలుకఁ-; విచ్-(విచ్చేయు); వేం -;

వేడుక -; సంతన -; సడ్డ -: సదమదము -; సరకు -; సరి -; సవరణ -; సవరింత -; సుద్ది.

76. చొచ్చు.

విశేష్యములపై: ఢొకారము -; తొఱఁగు -; నడు ('నడుమ' కు రూ.)

77. జాఱు.

విశేష్యములపై: కై.

78. తన్ను.

విశేష్యములపై : వెను -; వెన్ను.

79. తప్పు.

విశేష్యములపై : తలను -; మొగ -; మొన.

80. తవులు.

విశేష్యములపై : చే -; వెను -; సందు.

81. తాఁకు.

విశేష్యములపై : ఎడ - ; సరి - ;

82. తాఱు.

విశేష్యములపై ; కోడు - ;

83. తిరుగు.

విశేష్యములపై : గుడి - ; చిమ్మ - ; ప్రహరి - ; బ్రమరి - మొగ - ;

84. తివుచు.

ఉపసర్గ ప్రతిరూపములపై : పిఱు-.

85. తివియు.

ఉపసర్గ ప్రతిరూపములపై : పిఱు.

86. తీయు.

విశేష్యములపై : ఎడ - : ఓరు - ; కుచ్చె - ; వలస - ; వెనుక - ; వెను - , తుమున్నర్థకములపై ; దిగఁ - ; సాగ - ;
ఉపసర్గ ప్రతిరూపములపై : పిఱు-.

87. తీరు.

బహువచనరూపముపై : పౌఁజులు-.

88. తీరుచు.

బహువచన రూపముపై : పౌఁజులు-;

89. తుడుచు.

తుమున్నర్థకముపై: దిగఁ;

90. తూఁగు.

ఉపసర్గప్రతిరూపముపై :—సరి-;

91. తూలు.

బహువచనరూపముపై : తుప్పలు-;

92. తెగు.

విశేష్యములపై : ఎడ - ; కడ - ; వగ-;

93 తెంచు.

ఈధాతువు చేరునప్పుడు కొన్నిధాతువుల తుదివర్ణము లోపించును. ధాతువులపై : అగు - ; అడరు - ; అరుగు - ; అరు - : ఎత్తు - .

ఏఁగు - ; కప్పు - ; కవియు - ; క్రమ్ము - ; చను - ; చొచ్చు - ; చొత్తెంచు) ; తలకొను - ; నడ - (నడచు) ; నిగుడు - ; నెగయు - ; పఱి-; పఱచు) ; పాఱు - ; పొడ - (పొడుచు) ; పోవు - ; ప్రాఁకు - ; మొల -. మొలచు) ; మ్రాలు - ; వాడు - ; వీచు - (వీతెంచు).

94. తెచ్చు.

క్త్వార్థకముపై : తొడి - ; త్రోడి-;

95. తేఱు.

విశేష్యములపై : కడ - ; గడి- ; గురువు - ; పచ్చి - ; బయలు-; మ్రాను - ;

96. తేలు.

విభక్తిరూపముపై : తెప్పలఁ;

97. తొట్టు.

విశేష్యములపై : ఎక - (ఏగు) నకు కృద్రూపము క్రే - (క్రేవ కు రూ.)

98. తోఁగు.

విభక్తిరూపముపై : తోప్పఁ-.

99. తోలు.

తుమున్నర్థకముపై : పాఱఁ-;

100. త్రవ్వు.

విశేష్యములపై : కాలు-;

101. త్రావు.

తుమున్నర్థకముపై : ది (డి) గ (గ్గ)ఁ-;

102. త్రిప్పు.

విశేష్యములపై : బడి-;

103. త్రెచ్చు.

విశేష్యములపై : ఎడ-;

104. త్రొక్కు.

విశేష్యములపై : చిందు - ; వెనుక-;
తుమున్నర్థకముపై : విడఁ;

105. త్రోయు.

విశేష్యములపై : గుది-;

106. దాటు.

విశేష్యములపై : జవ-.

బహువచనరూపములపై : క్రేళ్లు- ; పల్లటీల్;

తుమున్నర్థకములపై : డిగ్గన్-;

107. దిగు.

విశేష్యములపై : పాళెంబు-;

108. నిలుచు.

విశేష్యములపై : పాదు-;

అవ్యయములపై : నిట్ట - ; నిట్టక-.

109. నీలుగు.

ఉపసర్గ ప్రతిరూపములపై : నిక్కి-,

110. పంచు.

విశేష్యముపై ; పని-.

111. పట్టు.

విశేష్యములపై : అడ్డ - ; ఎద్దు - ; కను - ; కోంత - ; చెట్ట - ; చెద - ; చెమట - ; చెఱ - ; చే - ; చల - (చలము) ; చూం - (చూపు); జన్నియ - ; తరి - ; దిమ్మ- ; బూజు- ; ముట్టుకోలు- ; లగ్గ - ; సూడు-;

విభక్తిరూపములపై : పగఁ-.

క్త్వార్థకముపై : కని-.

తుమున్నర్థకములపై : ఉక్క - ; కాఁ - ; కానఁ- ; తూఱుపాఱఁ -; రాఁ - ; వాగఁ.

112. పడు.

i. విశేష్యములపై: అంటు -; అంద-(అందము) ; అక్కజ - (= -ము); అక్కఱ - ; అగడు - ; అగ - (-అగ్గము); అగ్గ-(-అగ్గము); అచ్చెరు (వు)- ; అచ్చు - ; అడ్డ - ( = - ము) ; అడ్డి - ; అదవద - ; అనువు - ; అప్పు - ; అబ్బుర - ; అబ్బ్ర - ; అరి - ; అఱిముఱి - ; అఱుగు - ; అలమట - ; అల - ( = - వు) ; ఆఁక - ; ఆకుల - ( = - ము) ; ఆడిక - ; ఆతుర - ( - ము) ; ఆయాస - ( = - ము) ; ఆయిత - ( = - ము) ; ఆయిత్త - ( = - ము) ; ఆరట - ( = - ము) ; ఆఱడి - ; ఆస - ; ఇంట్ర - ( = - ము) ; ఇరవు - ; ఈచ - ; ఈడు - ; ఉగ్గు - ; ఉత్తల - ; ( = - ము) ; ఉరు - (ఉరువు) ; ఊఁచ - ; ఎడ - ; ఎత్తు - ; ఎద - ;

ఎదురు - ; ఎఱుక - ; ఏరు - ; ఏవ - ; ఒదుఁగు - ; ఒనరు - ; ఒలి - ; ఓజ - ; ఓటు - ; ఓలాకు - ; కక్కస - ( = - ము) ; కట్టు - ; కడమ - ; కప్పర - ( = - ము) ; కరఁగు - ; కలఁత - ; కలగుండు - , కల - ('కలయు' నకు విశేష్య రూపము) ; కలవర - ( = - ము) ; కలుచ - ; కల్లు - : కాంతాళ - ( = -ము) ; కాడు - ; కాటియ - ; కింకిరి - ; కిను - (కినుక) ; కీలు - ; కుంటు - ; కుక్కి - ; కుతిల - ; కుదురు - ; కుప్ప - ; కుఱుచ - ; కొంగోడు - ; కొంచె - ( = - ము) ; కొందల - ( = - ము) ; కొట్టు - ; కొతుకు - ; కోఁత - ; కోలు ; - క్రల్ల - ; క్రిందు - ; క్రుమ్ముడు - ; గగ్గోలు - ; గడిత - ( = - ము) ; గడుసు - ; గత - ( = - ము) ; గర - ; గుడుసు - ; గుణ - ( = - ము) ; గుత్తి - ; గుది - ; గుల్ల - ; గువ్వ - కుత్తుక -; గెంటు - ; గోడి - ; గోర - ; చిక్కు - ; చిందిలి -;చిడిముడి - ; చీకాకు - ; చెట్టు - ; చెఱి - ; చెవుడు - ; చేడ్ - ( = చేటు) ; చే - ; చటులు - ; చల్ల - ; చాఁపకట్టు - ; చాటు - ; చూఁకొడు - ; చూలు - ; చొప్పు - (చొప్పడు) - ; జిత - ( = - ము) ; జడను - ; జడ్డు - ; జతి - ; జతన - ; జతను ; జబ్బు - ; జోక - ; డిందు - ; డిగ్గు - ; డిల్ల - ; డీలు - ; తక్కువ - ; తగులు - ; తటకా - ; తట్టు - ; తత్తఱ - ( = - ము) ; తను - ( = తనువు) ; తప్పడు - ; తమక ( = - ము) ; తల - ; తల్లడ - ; తవులు - ; తహతహ - ; తాఱుమాఱు - ; తిట్టు - ; తిమ్మ - ; తిర - (తిరము) ; తిరి - ; తిరుగుడు - ; తీఱు - ; తీలు - ; తీవర - ; ( = - ము) ; తెగు - ; తొందర - ; తొక్కట - ; తెవులు - ; తేట; తెఱఁగు - ; తొర - ; తొట్రు - ; త్రొక్కట - ; త్రొక్కు - ; త్రొక్కుడు - ; త్రోపడు (త్రోపు) - ; త్రోపు - ; త్రుంగుడు - ; తోడు - ; తౌలు - ; త్రాడు - ; దండు - ; దక్కోలు - ; దిగులు - ; దీలు - ; దుఃఖ - ( = - ము) ; దూఱు - ; దొరకు - ; దోరగల్లు - ; నట్టు - ; నసువు - ; నఱుకుడు - ; నలఁగుడు - ; నల్ల - ; నింగి - ; నివ్వెఱ - ; నెఱి - ; పంపు - ; పట్టు - ; పదిల - ( = - ము) ; పని - ; పసు - ; పన్ను - ; పరము - ; పరాకు - ; పలుచ - ; పసా - పాటు - ; పాడు - ; పాయ - ; పాలు - ; పుల్ల - ; పూఁటు - ; పెంటి - ; పెట్టు - ; పెనఁగు - ; పెను ; ( - పెనువు) ; పేద - ; పొంక - ( = - ము) ; పొందు - ;పొగడ్త - ; పొడ - ; పొనరు ; పొమఁగు - ; పొను - ; పొర - ; పొలు - ( = నాశనము * 'పొలియు' నుండి); పొల్ల -; పొల్లు-; పో-('పోవు' ధాతువునుండి *'పోపు' అనురూపముండవలెను, )ప్రయాణ-(=-ము); ప్రాఁత-; ప్రాఁ- (ప్రాఁత) ప్రో-ప్రోపు బడలు-; బన్న - ( = - ము ) ; బయలు - ; బల - ( = - ము) - ;

చీఱు - ; బుడి - ; బెండు - ; బెగడు - ; బెదరు - ; బేలు - ; బ్రుంగుడు-; బ్రుంగు - ; మచ్చిక - ; మట్టు - ; మనికిత - (= - ము) ; మఱు - (మఱుఁగు) ; మాఁగు - ; మాటు - ; మాఁటు - ; మాఱు - , ముందు - ; ముచ్చట - ; ముట్టు - ; ముడి - ; మునుగుడు - ; మొకమొక - ; మొరమొర-; మెలి - ; మేదు - ; మైల - ; మొక్క - ; మొగ - ; ( = - ము) ; మొత్తు - ; మోడు- ; మ్రాఁగన్ను - ; మ్రాను - ; మ్రింగుడు - ; మ్రోడు - ; రాటు - ; రా - ( రాయి ) ; ఱిచ్చ - ; లంపట - (= - ము) ; వట్ర - ; వస - ( - ము )- ; వాట - ( = - ము); వాడుక - ; వాడు -; విచార - ; - (= - ము) ; విజ్జోడు - ; విడి - ('విడుచు' నుండి విశేష్యము); విడు - (విడువు) ; వితాకు - ; వీడు - ; వీలు - ; వీసర - ( = - ము) ; వెక్కస ( = - ము) ; వెగడు - ; వెచ్చ - ; వెడఁగు - ; వెడఁగురు - ; వెనుక - ; వెన్ను - ; వెఱఁగు - ; వెలు - ( వెలికి రూ.) ; వేగ - ; వేగిర - ; వేడుక - ; వేఱు - ; వ్రీలు - ; వ్రేఁగు - ; సంకట - (= - ము) ; సంజ - ; సంత - ; సంతస - ( = - ము ) ; సందడి - ; సందియ - ( = - ము ) ; సడలు - ; సముతు - ; సరి - , సూటి - , - సూత్ర - (= - ము) ; సెల - సాలు - ; సిగ్గు-.

ii క్త్వార్థకములపై: అడిచి-; అదిరి -; ఉట్టి-; ఉదరి-; ఉలికి -; ఎగసి-; కునికి-; మిట్టి-; మిడిసి.

iii. తుమున్నర్థకములపై : ఊడిగిలఁ-; ఉరలఁ-; ఒఱఁగఁ-; కడవఁ-; కదియఁ-; కలఁగఁ-; కలయఁ-; కాఁ-; కుదికిలఁ-; కూడఁ- ; కూర్చుండఁ-; కూల-; క్రమ్మఱఁ-; క్రయ్యఁ-; క్రుంగఁ-; చెదరఁ- ; చొరఁ-; డిగఁ-; తగులఁ-; తప్పులఁ-; తిరుగఁ-; తూఱఁ-; తెగఁ-; తెట్టగిలఁ-; తొట్టగిలఁ-; తేలగిలఁ-; తొట్రిలఁ- ; తొలఁ - ; దడియఁ - ; దిగఁ - ; నిండఁ - ; నిలఁ -; నిలువఁ - ; పెనఁగఁ - ; పొరలఁ - ; మగుడఁ - ; మరల - ; ముట్టఁ -, మురియఁ -; మోఁకరిల్లఁ - ; మ్రుంగఁ - ; మ్రొగ్గఁ - ; మ్రొగ్గతిల్లఁ -; లోఁ- (లోఁగు) ; విరియఁ - ; విరుగ-; వెడలఁ - ; వ్రయ్యఁ - ; వ్రేలఁ - ; స్రుక్కఁ.

iv. బహువచన రూపములపై:— అలుగులఁ - ; ఆపసోపాలు.-

v. విభక్తి రూపములపై : అలుగులఁ - ; కటకటఁ - ; కడఁ - ; చక్కఁ - ; జాలిఁ - ; తడఁ - ; తొడిఁ - ; నకనకఁ - ; వాటునఁ - ; మొత్తఁ; విన్నఁ - ; నుడిఁ.

vi. ఉపసర్గ ప్రతిరూపములపై :— ఒడఁ - ; కీడు - ; పిఱు - ; పై - ; బహి - ; మేలు.

vii. అవ్యయములపై ; మును - ; వెను-ఁ.

113. పఱచు.

విశేష్యములపై : ఆయ - (= - ను) ; చొప్ప - (చొప్పఱచు) ; ముట్టుకోలు - ; వెలు.

114. పాయు.

i. విశేష్యములపై : ఇండె - ; పఱియ - ; విరి - ; ప్రక్క -.

ii. విభక్తిరూపముపై : ఎడఁ - ; వెడఁ.

115. పాపు.

i. విశేష్యముపై : చలి.

ii. విభక్తిరూపములపై : ఎడఁ.

iii. బహువచనరూపముపై : చట్టలు.

116. వాఱు.

i. విశేష్యములపై : ఆవ - ; ఎఱ్ఱ - ; కందు - ; కూలు - ; కోచ - ; కోపు - ; గాజు - ; చాయ - ; చాలు - ; చుట్టు - ; జాలు - ; జాలు - ; జోరు - ; తిరుగు - ; తేలు - ; తెర - ; తెలతెల - ; తెల - ; తెల్ల - ; తెలు పు - ; దిగు - ; దొడ్డు - ; నంజు - ; నెత్తురు - ; పరువు - ; పోసు - ; పాయ; వీఁకె - ; పోఁగు - ; బలి - ; బీఱు - ; బుచ్చి - ; బూఁదు - ; బ్రమరి - ; మగ్గుడు - ; మూఁగుడు - ; మూఁగు - ; ముసుఁగు - ; వాఁడు - ; విరవిర - ; వెలరు - ; వ్రక్క - ; వ్రయ్య - ; సన్న - ; సెల - ,

ii. బహువచనరూపములపై : ఇసెటింతలు - ; ఉగ్గులు - ; క్రేళ్లు - ; గురువులు - ; చుమ్మలు - ; తీఁగలు - ; తొఱటలు - ; నుగ్గులు - ; పగుళ్లు - ; బీఁటలు.

iii. విభక్తిరూపములపై : కలఁకఁ - ; మెత్తఁ - ; వెలుకఁ - ; వెల్లఁ - ; వెలవెలఁ -.

iv. తుమున్నర్థకములపై : ఉరలఁ - ; ఒదుగఁ - ; కలఁగఁ - ; క్రుయ్యఁ - ; చొరఁ - ; తూలఁ - తెగఁ - ; తెరల - ; తొలఁగఁ - ; పలుకఁ - ; పాయఁ - ; పులియఁ - ; ముడుగఁ - ; మూఁగఁ - ; వాడఁ - ; విరియఁ - ; వెడలఁ -.

117. పుచ్చు.

i. విశేష్యములపై : చుఱు - ; పాపట - ; పాటు - , పొరి - ; పొఱి - ; (=పొలి - పొలియు) - ; పొలియు - ; పొల్ల - ; బుగులు - ; వా - (వాయి); వెలి - ;

ii. విభక్తిరూపములపై : గీటునఁ - ; వీటిఁ -.

iii. క్త్వార్థకముపై : పులిమి -.

### 118. పెట్టు.

i. విశేష్యములపై : అంకిలి -; అడవడి -; అడ్డ -; ఆఁక -; ఆయాస -; ఆయిత -; ఆరట -; ఉత్తల -; ఊఁదర -; ఎక్కు -; ఎడ -; ఎత్తు -; ఎన్నిక -; ఎస -; ఒర -; కక్కస -; కను -; కన్న -; కలగుండు -; కాటియ -; కికు (క్కు) రు -; కుతిల -; కూ - (కూయి); కొల్ల -; గంటు -; గీ- ; గాఁజు -; గోడి -; చూ-(చూపు); చొక్కు -; తడ -; తత్తఱ -; తల-; తల్లడ -; తహాతహ -; తిరి -; త్రోపుడు -; తోడు -; దందడి -; దబ్బు- ; దుఃఖ -; నచ్చు -; నలఁగుడు -; నులి -; పంపు -; పరువు -; పాలు -; పీఁట -; పుటు -; పెట్టె -; పెన -; పొడ -; పొరలు ; - పోకడ -; పోరు -; బలి -; బేలు -; మట్టు -; మభ్య -; మాఱు -; ముడి -; ముదల -; మెలి -; మొదలు -; మో - (మోపు); మ్రాను -; లంకె -; లెక్క -, లోడ -; వట్ర -; వడి -; వెచ్చ - (= - ము); వెడ్డు -; వెద -, వెలి -, వేగిర -; వేడె -; సంత -; సరి -;

11. బహువచన రూపముపై : ఎక్కులు—.

iii. తుముగర్థకములపై : ఎండఁ -; కూడఁ -; తగులఁ -;

iv. విభక్తిరూపములపై: చక్కఁ -, జాలిఁ -; పేటనఁ -; వడిఁ -;

v క్రియపై : జేపెట్టు

vi. అవ్యయములపై . పిఱు -; బహి-.

### 119. పెనఁగు.

విశేష్యములపై : మల్లు—.

### 120. పొంగు.

సంఖ్యావాచకముపై : ముప్పొంగు = మూఁడుపొంగులు పొంగు.

### 121. పొడుచు.

i. విశేష్యములపై : కికురు -; కిఱుకు -; కెరలు -; గగురు -; గుఱు -; చల -; నిట్ట -; పుల -; వెల్లి -;

ii. బహువచన రూపములపై : చిల్లులు—.

iii. క్త్వార్థకముపై : ఎత్తి—.

iv. అవ్యయముపై : తూ—.

### 122. పోయు.

i. విశేష్యములపై : ఆకు -; ఆను -; ఉరి -; కుట్టు -; చెమట -; తల ( - పు) ; పాఱు -; పోఁగు -; బార -; వాస - .

140. మిడుచు.

విశేష్యముపై : చిట్ట-.

141. మీాఱు.

విశేష్యములపై : తల -; పెంపు -; మట్టు-.

142. మొట్టు.

విశేష్యములపై [illegible]
తుమున్నర్థము [illegible]
[illegible]వలు

[illegible]మర -; చూఱ -; ఒల్ల -,
[illegible]-; నిదు (ద్దు)ర-; నిలు - (నిలుపు); పాపట-;
[illegible]రి(ఱి) - (=పొలి)-; పొఱదు-; పొలి-; పొల్ల-; బిమ్మిర-;
బాహిర-; బిత్తర-; బిమ్మిటి=; బిసి-; బీఱు-; బుగులు-; [illegible]
బొందు-; బొమ్మర-; బోసి-; మిడి-; మొక్క-; మొద్దు-; [illegible]
మోస-; రిత్త-; రోటు-; అంకు-; లొట్ట-; లోటు-; వం[illegible]
వమ్మి -; వలస -; వస -; వా - (వాయి); విరవిర -; విలవిల -; వీసర
వెచ్చ -; వెలవెల -; వెలవెలన -; వేఱు -; సరి -; సుడి -; సాట
సాట -; సిగ్గు -; సొమ్మి -;

ii. బహువచన రూపములపై : కుమ్మెలు -; గుసగుసలు -; చిల్లులు -; చక్కిలిగింతలు -, చొక్కిళ్లు -; దింపులు -; బీటలు -.

iii. విభక్తిరూపములపై : అసిఁ -; ఈచఁ -; కడకుఁ -; తెల తెలఁ -; మూఱిఁ -; విన్నఁ -; వీటిఁ -.

iv. క్త్వార్థకములపై : ఈచుక - (= ఈచుకొని); ఐ -; ఒరసి కొని -; కొం -; కొని -; తేలి -; విడి -;

v. తుమున్నర్థకములపై: ఈడన్ -;

. ఉపసర్గ ప్రతిరూపములపై: పఱి -; పిఱు -.

vii. అవ్యయముపై : ఒల్లఁ -.

124 ప్రాము.

విశేష్యములపై : కను -;

125. బిగియు.

అవ్యయములపై : బిఱ్ఱ-.

153. రేఁచు.

విశేష్యములపై : పెడ - ; పెర-.

154. రేఁపు.

విశేష్యముపై : పెర-.

155. వచ్చు.

విశేష్యముపై : ఎత్తు-.
క్త్వార్థకములపై : అచ్చి - ; ఐ - ; కొని - ; చుట్టి - ; తిరిగి-.

156. వట్టు.

[illegible]ముపై : నీరు-.

157. వలయు.

విశేష్యముపై: [illegible]

133. మాయు.

విశేష్యముపై: మచ్చు- ; రూపు-.

134. మారు.

విశేష్యముపై: పిలుకు- ; పొల-.

మార్చు. మారుచు.

పొ[illegible] [illegible] - ; పొల - ;

136. మ

విశేష్యముపై[redacted]లు - ; పిలుకు - ; పోరి - ; వ్రాలు - ; విసి-;

137. మాలుచు.

విశేష్యములపై : పోరి-.

138. మించు.

విశేష్యములపై : తల-.

139. మిగులు.

విశేష్యములపై : తల - ; మట్టు - ; వీను-.

140. మిడుచు.

విశేష్యముపై : చిట్ట-.

141. మీఱు.

విశేష్యములపై : తల - ; పెంపు - ; మట్టు-.

142. ముట్టు.

విశేష్యములపై : కడ - ; తుది - ; నీరు-.
తుమున్నర్థముపై : కూడ-.

143. ముడుఁగు.

విశేష్యముపై : ముచ్చ-.

144. ముడుచు.

విశేష్యముపై : పైఁడి-.

145. మూయు.

విశేష్యముపై : కను-.

146. మెఱయు.

విశేష్యముపై : బయలు-.

147. మొఱఁగు.

విశేష్యముపై : కను-.

148. మోఁదుచు.

విశేష్యముపై : చే-.

149. మోయు.

విశేష్యముపై : ముండ-.

150. మ్రింగు.

బహువచన రూపములపై : గుఱ్ఱలు - ; గుఱ్ఱిళ్లు-.

151. మ్రోయు.

విశేష్యముపై : ఎదురు-.

152. రేఁగు.

విశేష్యముల పై : ఎస - ; చిందఱ - ; చీఁదఱ-.
క్త్వార్థకముపై : చిమ్మి-.
అవ్యయముపై : [illegible]ల-.

153. రేఁచు.

విశేష్యములపై : పెడ -; పెర-.

154. రేఁపు.

విశేష్యముపై : పెర-.

155. వచ్చు.

విశేష్యముపై : ఎత్తు-.
క్త్వార్థకములపై : అచ్చి - , ఐ - ; కొని - ; చుట్టి - ; తిరిగి-.

156. వట్టు.

విశేష్యముపై : నీరు-.

157. వలయు.

తుమున్నర్థకముపై : కా-.

158 వాఁడు.

బహువచన రూపముపై : నులివాళ్లు-.

159. వాలు.

విశేష్యముపై : మొగ్గ-.

160. విచ్చు

విశేష్యములపై : చే - ; పురి - ; మొగ్గ-.

161. విడుచు.

విశేష్యముపై : జన్నియ-.
తుమున్నర్థకముపై : డిగ-

162. విను.

విశేష్యముపై : పని-.

163. విరియు.

విశేష్యములపై : విక్క-వెలి - ; వెల్లి-.

164. విసరు.

విశేష్యముపై : వెలి-.

165. వీఁగు.

అవ్యయములపై : విఱ్ఱి.

166. వెడలు.

విశేష్యముపై : బయలు-.

167. వెళ్లు.

విశేష్యముపై : కడ-.

168. వేయు.

విశేష్యములపై : అసర -; ఎత్తు -; గిరాటు-; డింక -; తూనిక-; దండూరా -; పిడి -; పెన -; లొట్ట -; వడి -; విలియ -; వెనుక -; వెలి-.

బహువచన రూపముపై : గడికాళ్లు.
క్త్వార్థకములపై : ఎత్తి -; తీసి-.
తుమున్నర్థకములపై : తెగ -; తేల -; పాఱ -; మొల -; సాగ-

169. వేఱు.

ఉపసర్గ ప్రతిరూపములపై : నెఱ-.

170. వైచు.

బహువచన రూపముపై : పల్లటీల్ -.
తుమున్నర్థకముపై : పాఱ-.

171. వ్రాలు.

విశేష్యముపై : కై -.

172. వ్రాలుచు.

విశేష్యముపై : కై -.

173. సాఁగు.

విశేష్యములపై : కొన -; తీఁగ-.

# ఆంధ్రలిపి.

భాషాచరిత్రమునకు లిపిచరిత్రముతో నంతగ సంబంధములేదు. భాషయనున దుచ్చరింపఁబడు నర్థవంతములగు ధ్వనుల సమూహము. లిపి యాధ్వనులను దూరముగ నుండువారికిని, రహస్యముగ వానియర్థము దెలిసి కొన నెంచువారికిని, కాలాంతరమున నా లిపిమూలమున నాయా ధ్వనులను పోల్చికొని వాని యర్థమును గ్రహింపనెంచువారికిని నుపయోగించుటకై యా యా భాషలను మాట్లాడు సంఘముల వారేర్పఱుచుకొను కొన్ని లిఖిత సంకేతముల సముదాయము. లిపి ధ్వనులను సంపూర్ణముగఁ దెలుపఁజాలదు. అది వానిని స్థూలముగఁ దెలుపఁ జాలునేకాని, తత్తద్వాగింద్రియ స్థానము లందు సరిగ నా యా ధ్వనులు పుట్టునప్పుడు గలుగు సూక్ష్మధ్వనిభేదములు దానివలన స్పష్టపడవు. భాషలయందు గలుగు మార్పుల కా యా స్థానములందు గలుగు సూక్ష్మభ్రంశమే కారణము. ధ్వనులు రానురాను మాఱుచుండ, లిపియంత శీఘ్రముగ మాఱకుండుటచేఁ గొంతకాలమున కేలిఖితాక్షర మే ధ్వనికి గుఱుతుగఁ బూర్వు లుపయోగించికొనిరో తెలిసికొనుట కష్టమగు చుండును. కాని, యాంధ్రమువంటి భాషలలో వ్రాతక్రమము సాధారణ ముగ ధ్వనుల ననుసరించుచుండుటచే నంతటిచిక్కులు కలుగకుండును. 'లచ్చన్న' అని వ్రాయునప్పుడు 'లత్సంన్న' యనియు, 'జ్ఞానము' నకు 'గ్నాన' మనియుఁ బండితులు కానివారు వ్రాయుచుందురు. వారివ్రాత యుచ్చారణము ననుసరించియున్నదని చెప్పవలయును. ఆంధ్రలిపియందు దంత్యతాలవ్య 'చ, జ' లకు ప్రత్యేకసంజ్ఞలు లేకపోవుటచే సాధారణు లుచ్చారణము ననుసరించియే వానిని వ్రాసికొందురు. శాసనములలో నచ్చ టచ్చట నిట్టి వర్ణక్రమము కాననగును.

ఈ గ్రంథమునం దాంధ్రలిపి చరిత్ర మనావశ్యకమైనను దానిని సంగ్రహముగ నీక్రింది పట్టికమూలమున దెలుపు టుచితము కాకపోదు. మొదటి పటమునుబట్టి భారతీయ భాషాలిపులన్నియు నేరీతిగ నాదిమార్య లిపినుండి వికారము నొందినవో వానివలనఁ దెలిసికొనవచ్చును. రెండవ పటమున దాక్షిణాత్యలిపుల వంశక్రమము తెలుపఁబడియున్నది.—

# రెండవ పటము.
## దాక్షిణాత్యలిపులు.



185-వ పుట కెదురుగ.

# నాలుగవ పటము.

నందంపూడి శాసనము : 11-వ శతాబ్దము.

నన్నయ రచితము : నారాయణభట్టున కిచ్చినది.





ఈప్రక్క 3-వ పటమునందాంధ్రాక్షరము లెట్లు రానురాను వికాసము నొందినవో చూపఁబడినది.

నాల్గవపటము రాజరాజ నరేంద్రుని నందంపూడి శాసనములోని యొక రేకునకుఁ బ్రతిబింబము. అందలి వ్రాఁత ప్రత్యేకముగ నిప్పటి యచ్చులిపిలో వ్రాయఁబడినది (క్రీ. శ. ౯౭౬).

అయిదవపటము నన్నయభట్టరచిత భారతాదిపర్వపీఠికలోని మొదటి మైదుపద్యములు నాతనినాఁటి లిపిలో నెట్లు వ్రాసియుందురో యానాఁటి శాసనాక్షరముల యాధారమున నూహించి నేను వ్రాసినది.

ఆఱవపటము తిక్కన కాలమునాఁటి కాకతి గణపతిదేవుని తామ్ర శాసనములోని యొక రేకునకుఁ బ్రతిబింబము (శా. శ. ౧౧౫౩).

ఏడవపటము అన్నవేమారెడ్డి వనపల్లి తామ్రశాసనములోని యొక రేకునప ప్రతిబింబము (శా. శ ౧౩౦౦).

పైపటముల మూలమున నాంధ్రలిపి నానాఁటికి నెట్లు మాఱుచు వచ్చినదో తెలియనగును. తాటియాకులపై గంటముతో వ్రాయు నాచారము మూలమున రానురాను చదరముగనుండు తెనుఁగక్షరములు గుండ్రముగఁ బరిణమించినవి అవి యచ్చువచ్చిన నాఁటివరకు మాఱుచునే యుండినవి. ఏచ్చువచ్చిన తరువాతఁగూడ వానియందు మార్పులు కలుగకపోలేదు. క్రీ. శ 1801 సంవత్సరపు ప్రాంతమున నచ్చుపడిన తెనుఁగు పుస్తకములను నేఁటి యచ్చుపుస్తకములతోఁ బోల్చిచూచిన నీ విషయము స్పష్టము కాఁగలదు తాటియాకులమీఁది లిపికిని, అచ్చులిపికిని జాల వ్యత్యాసము గలదు. చే, జే, లపై ౨ అను గుఱుతు క్రొత్తగా నచ్చులో కలిగినది. వెలుపల గిలుకరించు నాచార మచ్చుగ్రంథములనుబట్టి యంతరించినది. 'ఁ' అను నర్ధానుస్వార చిహ్నమొకటి క్రొత్తగాఁ జేరినది. నున్నపై వచ్చు హల్లునకు ద్విత్వము చేయుపద్ధతి పోయినది. ద్విత్వాక్షరము వెలుపల గిలుకరించుట యిప్పుడు భ్రష్టమయినది. గొలుసు కత్తుగ వ్రాయుట యిప్పటి విద్యార్థులయందంతగఁ గానరాదు.

## ఆంధ్రలిపి సంస్కారము.

ఆంధ్రలిపి చాలకష్టమైనదనియు, భారతీయ లిపులలో దానియందెక్కువ చిక్కులున్నవనియు, వేగము, వ్యవహారానుకూలత, క్షిప్తత నపేక్షించు నేఁటి నాగరకప్రపంచమున కది పనికిరాదనియు, దానిని ప్రస్తుతావశ్యకతల ననుసరించి సంస్కరించుకొన్నచో ననేక లాభములు గలుగఁగలవనియు నిప్పుడొక యభిప్రాయము బయలువెడలినది. ఆంధ్రలిపిలో నిప్పు

డచ్చు గూటమునందు 509 యక్షరములకు సంబంధించినవి. 10 యింగ్లీషంకెలు, 10 తెనుగంకెలు, 14 విరామచిహ్నములు, 5 ఇతర చిహ్నములు, రెండు కొటేషనుమార్కులు, 3 లీడర్లు, 8 అధో నిర్దేశకచిహ్నములు, మఱి 22 అనావశ్యక సంయుక్తాక్షరములు—మొత్తము 583 ప్రత్యేక సీసకాక్షరము లున్నవి. ఇందుమూలమునఁ దెనుఁగున నచ్చుకేసు మిక్కిలి యెత్తు, పొడవు, వెడల్పు గలిగియుండుటచే నచ్చు గూర్చువాఁ డెల్లప్పుడును నిలువబడి, యిటునటు దిరుగుచు, మీఁది కెగురుటాడుచు నెంతో శ్రమపడవలసి వచ్చుచున్నది. ఇందువలన అచ్చు, కాగితములు, కూలి, మొదలగు వానిపై వ్యయ మెక్కువ యగుచున్నది. ఈ యసౌకర్యములు లేకుండిన నాంధ్రగ్రంథ ప్రకటనము సులభమై విద్యావ్యాప్తికి మార్గ మేర్పడఁగలదు. ఇట్లే, తెనుఁగునకును గొన్ని భాషలకువలె టైపు-రైటింగు సౌకర్యముకలిగి, వర్తకమున నెంతో సహాయకారి కాఁగలదు. ఇంతటి లాభములతోఁగూడిన యాంధ్రలిపి సంస్కారమునుగూర్చి యాలోచింపకుండుట మంచిదికాదు.

ఆంధ్రలిపి సంస్కారమునకుఁ బూనక పూర్వము దానియందు గల లోపము లెవ్వియో విచారింపవలసియున్నది.

అక్షరములన్నియు నేదియో యొకపద్ధతినై నేర్పడకుండుట.

1. క, గ, చ, ఛ, ఝ, ఞ, డ, ఢ, త, థ, ద, ధ, న, భ, మ, య, ర, వ, శ, హ, ళ, క్ష—వీనిలోఁ దలకట్టులక్షరము తలకు తగిలియున్నవి.

2. ఘ, ప, ఫ, ష, స—వీనిలోఁ దలకట్టు లక్షరములనుండి వేర్పడి యున్నవి.

3. ఖ, జ, ట, ణ, బ, ల—వీనికిఁ దలకట్టులేదు.

4. ఐ, ఙ, ఇ—ఇవి ఒ, ఇ, లకు +, ◡, చిహ్నములఁ జేర్చుటవలనఁ గలిగినవి.

5. ట - ఇది ఉ కడుపులోని యడ్డగీఁతను తీసివేయుటవలనఁ గలిగినది.

6. ఛ, ఢ, థ, ఫ—ఈ యొత్తక్షరములు వాని సాధురూపముల పొక్కిలిలో నొత్తుచిహ్నమును జేర్చుటవలనఁ గలిగినది.

7. ఖ, ఘ, ఝ, ఠ, థ—వీనికిని వీని సాధురూపములకును బోలికలేదు.

8. భ—దీనిసాధు రూపమగు 'బ' కు తలకట్టులేదు ; దానికి ఒత్తు చేర్చు నప్పుడు తలకట్టును దగిలించవలెను.

9. ం, ర, ఠ, ఈ, ఝ, య ; అ, ఆ, ఊ ; ఇ, ఇ ; ట, ఉ, ఊ ; ఔ, ఔ ; ఎ, ఏ, ఐ, ప, ఫ, ఘ, మ, వ, హ, ష ; ఒ, ఓ, ఔ, ఙ, జ, బ, భ, ఋ, ౠ, చ, ఛ ; ద, ధ, థ, డ, ఢ, ఖ, శ, ళ, స, న ;—ఈ వర్గములం

దలి యక్షరములు క్రమముగ నొక్కటే మూలరూపమునుండి యేర్పడినవి. కాని, రూపసామ్యమునుబట్టి యుచ్చారణ సామ్యము స్ఫురించదు.

10. అ, ఉ, ఋ, ౡ, ఎ, ఒ, లనుండియే వానిదీర్ఘము లేర్పడినవి; కాని, 'ఇ' నుండి 'ఈ' కలుగలేదు

11. వ్రాతలో 'క' కు కన్నడమునందలి 'క' వంటి మఱియొక రూపము కూడ వ్యవహారమున నిలిచినది.

ii. గుణింతము.

(అ) అచ్చులు

1. క, గ, ఘ, చ, ఛ, ఝ, ఠ, డ, ఢ, త, థ, ద, ధ, న, ప, ఫ, భ, ర, వ, శ, ష, స, ళ—వీనికి, గుడి, గుడిదీర్ఘము, ఎత్వ, ఏత్వ, ఒత్వ, ఓత్వ, ఔత్వములు చేరునప్పుడు, తలకట్టుతొలఁగి యా స్థానముననే యాయాచిహ్నములు నిలుచును. ఉ, ఊ, ఋ, ౠ, ౡ, లు చేరునప్పుడు తలకట్టు కూడ నిలుచును.

2. ఈ, ఊ, ప, ఫ, ష, స, లకు దీర్ఘమాయక్షరముల మధ్యముగఁ బోవును.

3 క, గ, చ, ఛ, ఠ, డ, ఢ, త, థ, ద, ధ, న, భ, ర, వ, శ, ళ— వీనికి దీర్ఘమిచ్చునప్పుడు తలకట్టుపోయి, దానిస్థానముననే దీర్ఘచిహ్నముపై చేరును.

4. న, ణ లకు దీర్ఘము ఇ, ఈ, ఎ, ఏ, ఒ, ఓ, ఔ, లవలెఁ దలపైఁ గుడిప్రక్కఁ బ్రత్యేకముగఁ జేరును.

5. బ, ల - ల దీర్ఘము తలపై కుడిప్రక్క నక్షరమునకుఁ గలసిచేరును.

6. బ, ల, శ, ళ—వీని గుడిచిహ్నము తల కుడివైపున నక్షరము లోనికి పోవును.

7. 'ట' కుఁదలపై నచ్చులు చేరునప్పుడు పై నిలువుగీఁత తొలఁగి పోవును.

8. ను, య, ఘ, జ, ఝ, ట, బ—వీనికి దీర్ఘ మక్షరముతుట్ట తుదను చేరును.

9. 'య' కుగుడి ప్రత్యేకముగ నీయ నక్కఱలేదు. తలకట్టును దొలఁగించినఁ జాలును. 'యి' కి తుట్టతుదను 'ఆ' త్వసంజ్ఞ చేరుటచే 'ఈ' త్వమేర్పడును.

10. ప, ఫ, వ ల కుత్వము పాక్కిలిలోఁ జేరును ; తక్కినహల్లులకుఁ బ్రక్కను జేరును.

11. చేతివ్రాఁతలో 'ఒ' త్వము తలకట్టుస్థానమున ౧ అను ఒత్వ సంజ్ఞను జేర్చియు, ఏత్వఉత్వములను జేర్చియు రెండు రీతులుగఁ గలుగు చున్నది. అ + ఉ = ఒ కాని, ఎ + ఉలు 'ఒ' కానేరదు. కావున వీనిలోని రెండవ రూపములు విచిత్రములైనవి.

12. హకారముపై నచ్చులుగుణింతమునఁ జేగునప్పుడు తలకట్టుస్థానమున నాయాచిహ్నములఁ జేర్చి యొకవిధముగను, తలకట్టును నిలిపి అక్షరగడియ తుదిని జేర్చి మఱియొకవిధముగను రూపములేర్పడును.—ఇది హకారముపై నచ్చులు చేరువిధము.

13. ఘ, ఝ, లకు ఒ, ఓ, లు చేరునప్పుడు మూఁడేసి రూపములు:

i. తలకట్టు స్థానముఁజేర్చి ;

ii. తలకట్టును నిలిపి అక్షరము తుదకొమ్ముపైఁ జేర్చి,

iii. తలకట్టును తొలఁగించి, ఎత్వ ఉత్వ సంజ్ఞలుచేర్చి.

14. మ, య, ల పై ఒ, ఓలు చేరునప్పుడు తలకట్టుస్థానమునఁ జేరు; మొ, యొ, మో, యో, అని యగును. ఒత్వము చేరునప్పుడెత్వ ఉత్వములును, ఓత్వము చేరునప్పుడేత్వ, ఆత్వములును నీ యక్షరములపైఁ జేరుట విశేషము.

15. ఐత్వము హల్లునకు సగముపైని, సగము క్రిందను జేరును.

(ఆ) హల్లులు.

1. కప్ప, ఉప్పాడ, కుప్పి, శ్రీ, గుడ్డి, క్రూర, క్రేవ, మ్రోగు, అమ్ము, గుర్తు, కన్ను, మొదలగు వానిలోని సంయుక్తాక్షరములందచ్చులు క్రింది హల్లుతోఁ జేరవలసియున్నను మీఁది హల్లుతోఁ జేరియున్నవి ; కప్పు, కొప్పు మొదలగు పదములలోని సంయుక్తాక్షరములలో నుచ్చారణము నను సరించి క్రిందిహల్లులతోడనే చేరియున్నవి.

2. అర్థిఁ - అని వ్రాయుట ప్రాచీనలేఖన క్రమము ; అర్థఁ యనుట మధ్యయుగము నాఁటిది ; అర్థి యనివ్రాయుట నేఁటి యచ్చు యుగ మున నేర్పడినది. ఉచ్చారణమును బట్టి మూఁడును సరియైన రూపములు కావు. వరుసగ వాని యుచ్చారణములు అతిథ్ర్, అథ్ర్, అరిథ్, అని వ్రాఁతను బట్టి తెలుచున్నది.

3. ౖ, ౣ, ౢ, ౢ, ౖ, ్య, ్వ, ్ర, అను ఒత్తులు వాని మూలహల్లు లగు క, మ, న, ల, త, య, వ, ర, లనుండి భేదించుచున్నవి తక్కినహల్లు ఒత్తు లాయా హల్లుల తలకట్లను దొలగించుటచే నేర్పడుచున్నవి

4. 'దిక్షక్కము'లోని 'క్ష'కును, 'లక్ష'లోని 'క్ష'ను నుచ్చారణ భేద ము గలదు.

iii. ఉచ్చారణము ననుసరించి యుండని కొన్ని యక్షరములు.

1. ఐ— సంస్కృతమున అ, ఆ+ ఏ=ఐ। 'ఇ' 'ఈ' కారములకు వృద్ధి గలిగియు నైత్వ మేర్పడును. తెనుఁగున అ+ఇ= అయి=ఐ. ఆకారమును బట్టి ఐ=ఎ+ఇ. అరవ మళయాళములలో ఐ=ఎ+ఇ. తెనుఁగున 'ఐ' అనునక్షరము మరవ మళయాళ సంప్రదాయానుబోధి.

2. ఔ— సంస్కృతమున అ, ఆ+ ఓ=ఔ; 'ఉ' 'ఊ' కారములకు వృద్ధి కలిగియు నౌత్వమేర్పడును. తెనుఁగునను దక్కిన ద్రావిడ భాషలయం దును అ+ఉ=అవు=ఔ.

3. ఎ— సంస్కృతమున హ్రస్వ ఎ కారము లేదు ఏ కారమున్నది; అది, అ, ఆ+ఇ,ఈల సంధివలనఁ గలుగును; 'ఇ+అ'=య. తెనుఁగున ఇ+అ= ఇయ=ఎ (ముత్తియము, ముత్తెము, కన్నియ, కన్నె; మొ.) ఇ+అ=య అను సంధి 'ముత్తియము, ముత్యము' అనునప్పుడు గలదు. ఇది యేకపద మధ్య మందే కలుగును. సంధియందు కాదు.

4. క్ష— ఇది క కార ష కార సంయోగమువలనఁ గలిగినను నా సంయుక్తాక్షరము నుచ్చారణను మాఱినది.

5. జ్ఞ— ప్రాతయం దిట్లున్నను నుచ్చారణ మందిది 'గ్న, గ్న, గ్న, గ్గ, గ్గ,' లుగ వివిధ ధ్వనులతో వినఁబడుచున్నది.

6. చ'ద్ద'న్నము మొదలగు శబ్దములలోని హ్రస్వ'ఆ' కారమునకును వచ్చాను, తాటాకు మొదలగు శబ్దములలోని దీర్ఘ 'ఆ'కారమునకును దెనుఁగు లిపిలో సంజ్ఞలు లేవు.

7. ఋ, ౠ, ఌ ల యుచ్చారణమెట్టిదో తెనుఁగువారు మఱచినట్లు కానవచ్చును. కొందఱు దానిని 'రు'గను, గొందఱు 'రి'గను, సరిగ నుచ్చరిం చుచున్నా మనుకొనువారు అర్ధమాత్రాక 'అ' కారముతోడి 'ర్' గను నుచ్చ రించుచున్నారు.

8. త్స— దీనిని 'త్స'గా నెవ్వరు నుచ్చరించుటలేదు, దంత్య 'ఛ' కారముగ దాని నుచ్చరింతురు.

9. ఫ— కారమును కేవల స్పర్శముగఁ గొందఱుచ్చరింపరు; ప్రఫుల్ల, కఫము, మొదలగుశబ్దములను గొందఱు 'ప్రఫుల్ల, కఫము,' అని యుచ్చరించుట గలదు.

10. పదమధ్యాంతములందు గల 'ము'వర్ణము కొన్ని ప్రాంతములలో ననునాసికీకృత 'వు'వర్ణముగా వినఁబడుచున్నది. చెవుఁడు, రావుఁడు, వావుఁ, పావుఁ.

11. 'హ్లా'— వర్ణమును చదువుకొనని తెనుఁగువారును, చదువుకొనిన వారిలోఁ గొందఱును 'ల్ల, ంల్ల, మ్ల, హ్ల'లుగా నుచ్చరింతురు. ప్రహ్లా(ప్రల్లా,— ంల్లా,— మ్లా-హ్లా' దుఁడు; ఆహ్లా(-ల్లా,- ంల్లా,-మ్లా)దము.

12. 'హ్వ'- వర్ణమును, కొందఱు 'హ్వ'గను, కొందఱు 'వ్వ'గను నుచ్చరింతురు: గహ్వ (-హ్వ-గ వ్వ)రము.

13. 'హ్మ'- దీనిని 'హ్మ', 'మ్మ'లుగా నుచ్చరించుట గలదు: బ్రాహ్మ (-హ్మ,- మ్మ)ణుఁడు.

14. 'సీ' వర్ణమును గొందఱు 'శీ'గ వ్రాయుదురు: సీతారామయ్య.

15. పూర్ణానుస్వారముపై నచ్చు హల్లులకుఁ గొందఱు ద్విత్వమిచ్చె దరు; కొంద ఱీయరు: అనంతరావు, అనంత్తరావు

పై వివరించిన దానిని బట్టి యాంధ్రలిపి యన్ని కాలములందును నొకటే రూపముఁగలిగి యుండలేదనియు, వందలివర్ణము లన్నియెడలను నాయాధ్వను లను సరిగ నిరూపింప కున్నవనియు, లిపి యొక్క తెన్నున లేకుండుటచే దానిని నేర్చికొనుట చాలఁ గష్ట సాధ్యమనియు, నందు మూలమున విద్యావ్యాప్తి కాటంకము గలుగుచున్నదనియు, దానివలన వ్యవహార సౌకర్యము సంపూర్ణ ముగఁ జేకూరకున్నదనియుఁ గొందఱనవచ్చును. సంస్కార ప్రియులును, వ్యవ హారమే ముఖ్యమని తలంచువారును దానిని సంస్కరింపఁ బ్రయత్నింపవచ్చు ను. సంస్కార ప్రియులకును, సంస్కార విముఖులకును వారివారి దృష్టులలో భేదముండుటఁ బట్టి వారిరువురికిని సామరస్యమును గుదుర్చుట కష్టము. ఒకరికి లిపి యొక సాధనము మాత్రము, ఆ సాధనము వ్యవహారమున కెంత బాగుగ నుపయోగించిన నంత మేలని వారియభిప్రాయము. రెండవవారి కది పూర్వులు తమకొఱకు దాచిపెట్టిన యందముల రాశి; వ్రాఁతయనున దొకకళ. మనోహ రములగు నూహలను దాచుటకు మనోహరములగు నక్షరపు బరణులు గావ లెను. తెనుఁగక్షరములు ముక్తాఫలములవలె గుండ్రముగ నుండవలెనని వారి యభిప్రాయము. అవి యెల్లప్పుడును గుండ్రముగా లేవని శాసన పరిశోధకులు దెలిపిన, వారునమ్మరు; నమ్మినను చక్కఁబడినదానిని దిరుగ నేల పాడుచేయ

వలెనని వారి ప్రశ్న. బియ్యపుగింజపై సీసపద్యమును చిత్రించుట, భగవద్గీతాధ్యాయములను సన్నని తాటియాకులపై వ్రాసి, పూసలుకట్టి, జపమాలగ నేర్పఱచుట, మొదలగు రీతుల వ్రాత నుపయోగించినవారు, తెనుఁగువర్ణములను సంస్కరింపనెంచుట హాస్యాస్పదముగ గణింపకమానరు. గుండ్రని యక్షరములను వ్రాయుట ఎక్కువ శ్రమ, యెక్కువ కాలహరణము, అను మొదలగు నసౌకర్యములు వారిదృష్టిలోనంత యెక్కువ యైనవి కావు ఈ రెండు దృష్టులకును వైర మీ వ్రాత విషయముననే కాక సర్వ విషయములందును గలదు. ఈ పోరాటములో వ్యవహారదృష్టికి విజయము కలుగుననుటకు సందియము లేదు. లోకములో నందఱును గళాప్రియులును బండితులును గాఁజాలరు. వారికీవివాదముతో నంతగఁ బనిలేదు వ్యవహారమున నేదిమిక్కిలి యుపయోగకరమో వారు దానినే యనుసరింతురు పండితులును గొన్నాళ్లకు వారి దారినే పట్టుదురు. వెలుపల గిలుకరించుట యిప్పటికి చాలమట్టు కంతరించినది. ఎన్నఁడును భాషలోలేని యరసున్నకు 'ఁ' అను గురుతేర్పడినది. ఇట్టివన్నియో యుక్తివల గలిగినమార్పులే పండితుల కాదరణ పాత్రములైనవి. దంత్య చ, జ, లపై రెండుదాకె నుంచకుండినఁ గోపించువారెందఱో కలరు ఈ మార్పు చాల నవీనమైనదైనను వారి దృష్టికి యుచ్చారణ భేదమును దెలుపుటకుఁ జాలనావశ్యకము; కావున వారు దానిని పరిగ్రహించినారు; అగుచుతు ప్రాచీనమైనదని వారు తలంచుటమాత్రమే వింత

ఆంధ్రలిపి సంస్కార మెట్లు జరుగవలెనను ప్రశ్నముతో నాంధ్ర భాషా చరిత్రమునకుఁ బనిలేదు కలిగినమార్పులను గుర్తించుటయు, నున్న స్థితిని నిరూపించుటయునే దానిపని.

## II

## ఆంధ్రధ్వనులు.

సంస్కృతభాషకు వర్ణము లేఁబది. అందచ్చులు అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, ం, ః, అని పదునాఱు వీనిలో ౡకారము లేదని పాణినిమతము. ᳵక (జిహ్వామూలీయము), ᳵప (ఉపధ్మానీయము) లచ్చులలోఁ జేరవలెనని కొందఱిమతము. హల్లులు క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, బ, భ, మ, య, ర, ల, వ, శ, ష, స, హ, ళ,—అని ముప్పదినాలుగు. వీనిలో

* భాషధ్వని జాలము. అర్థవంతములైన ధ్వనులే భాష. కాని వైయాకరణులాయా ధ్వనులను వర్ణము లనుచున్నారు 'వర్ణ' సంజ్ఞ లిఖితాక్షరములకు మాత్రము చెల్లినను పూర్వమర్యాద ననుసరించి యాసంజ్ఞయు గ్రహింపఁబడినది.

'ళ' కారము సంస్కృతమునలేదని యొకమతము. సంయుక్తాక్షరమగు 'క్ష' కారము సంయుక్తవర్ణముగా వినఁబడక పోవుటచే దానిని ప్రత్యేకవర్ణముగఁ గొందఱు పరిగణించిరి.

ప్రాకృతమునకు వర్ణములేఁబది; అందచ్చులు: అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, ం ః, * అని పదునైదు. హల్లులు: క, ఖ, గ, ఘ, ఙ; చ, ౘ, ఛ, జ, ౙ, ఝ, ఞ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న; ప, ఫ, బ, భ, మ; య, ర, ల, వ, శ, ష, స, హ, ళ.—అని ముప్పదియైదు.

ప్రాకృత వర్ణసంఖ్యావిషయమున ననేకు లనేకవిధములుగ నభిప్రాయపడియున్నారు. ఆంధ్రశబ్దచింతామణికారునిమతమునఁ బ్రాకృతమునకు వర్ణములు నలువదిమాత్రము. ఈ మతమునే నేఁటివఱకు నాంధ్రవైయాకరణు లవలంబించియున్నారు. కాని, యీ సంఖ్య మహారాష్ట్రీప్రాకృతమునకు మాత్రము చెల్లునేమో. మహారాష్ట్రీప్రాకృత మొక్కదానికే ప్రాకృతమను సంజ్ఞ చెల్లదు. ప్రాకృతములు, మహారాష్ట్రీ, శౌరసేని, మాగధి, పైశాచి, చూళికా పైశాచి, అపభ్రంశము, అని యాఱుగలవని సాధారణాభిప్రాయము. కాని, యిది సరికాదు. ఈ యాఱును నిటీవలి ప్రాకృత కావ్యములందును, ప్రాకృత లక్షణగ్రంథములందును జేర్కొనఁబడిన ముఖ్య ప్రాకృతములు. కావ్యములలో నుపయోగింపఁబడు మహారాష్ట్రీ, శౌరసేనీ, మాగధీ భాషలలో జైనులు తమగ్రంథములందు వాడినభాషలు సాధారణ భాషలకు విలక్షణముగనుండి జైనమహారాష్ట్రీ, జైనశౌరసేనీ, అర్ధమాగధీ సంజ్ఞల నందియున్నవి. పాలిభాష యర్ధమాగధీ భాషాభేదమని కొందఱును, పైశాచీ భాషాభేదమని కొందఱును దలంచుచున్నారు. ఇవియేకాక ప్రాచ్యా, అవంతీ, బాహ్లికీ, శాకారీ, ఢాక్కీ, చాండాలీ, శాబరీ, ఆభీరికీ, సాక్కీ, నాగర, ఉపనాగర, వ్రాచడ, దాక్షిణాత్య, ద్రావిడాది ప్రాకృతములెన్నియో యాయా లక్షణగ్రంథములలో స్మరింపఁబడినవి. ఇవి యాయా ప్రధాన ప్రాకృతములకుఁ జేర్పఁబడి వానివాని వికారములుగఁ దెలుపఁబడియున్నవి. అపభ్రంశభాషయనున దొక్కటే కాదు. ప్రధాన ప్రాకృతములలో నొక్కొక్కదానికిని గొన్ని యపభ్రంశము లున్నవి. అట్లే పైశాచీభాషయందు పదునొకండు భేదములను రామతర్కవాగీశుఁడు తన 'ప్రాకృతకల్పతరు' వను లక్షణగ్రంథమందును, లక్ష్మీధరాదులు తమతమ ప్రాకృత వ్యాకరణములందు మఱి

* ప్రాకృతవర్ణములలోఁ జిహ్వామూలీయమును విసర్గమును జేర్చినాఁడు; అది పాలిభాషలో మాత్రము జిహ్వామూలీయముగఁ గానవచ్చుచున్నది. 'ఞ' విడచినాఁడు; ఇది సరికాదు.

కొన్నిభేదములను దెలిపియున్నారు. ఈప్రాకృతము లన్నిటిలోఁ గల వర్ణ సమూహము నెంచినచోఁ జైవివరించిన క్లోఁబది వర్ణము లేర్పడును వానిలో వివాదముకందున్న వర్ణములకుఁ గ్రమముగ నుదాహరణము లీక్రిందఁ జూపఁ బడినవి.

ఋ : అపభ్రంశము : తృణు = తృణమ్ (హేమచంద్రుఁడు 4, 329; నమిసాధు); సుకృదు (హేమచంద్రుఁడు 4, 329) సుకృదం (క్రమదీ; శ్వరుఁడు 5, 16) = సుకృతమ్; గృణ్హఇ = గృహ్ణాతి; గృహంతి = గృహ్ణంతి- గృహ్ణేప్పిణు = * గృహ్ణిత్వనమ్ = గృహీత్వా (హేమచంద్రుఁడు 4, 336; 341; 2 394, 438). కృదంతహో = కృతాంతస్య (హేమచంద్రుఁడు 4, 370, 4) చూలికా పైశాచి, ఖృత, ఖత=ఘృత (క్రమదీశ్వరుఁడు 5, 102).

ఎ : (1) ఐ = ఎ - మహారాష్ట్రి, అర్ధమాగధి. జైన మహారాష్ట్రి, శౌరసేని, మాగధి : తెల్ల = తైల.

మహారాష్ట్రి, జైన మహారాష్ట్రి, అర్ధమాగధి : చెత్త = చైత్రః (కర్పూరమంజరి 12, 4 9, విద్ధసాలభంజిక 25, 2, క్రమదీశ్వరుఁడు 19; ఆయారంగసుత్త 2, 15, 6, కప్పసుత్త).

మహారాష్ట్రి, జైన మహారాష్ట్రి : మెత్తీ = మైత్రీ (హాలుని సప్తశతి రావణవహ; క్రమదీశ్వరుఁడు 7)

మహారాష్ట్రి, జైన మహారాష్ట్రి, శౌరసేని. వెజ్జ = వైద్య (హేమ చంద్రుఁడు 1, 148; 2, 24; హాలుని సప్తశతి; విక్రమోర్వశీయము 47, 2; మాలవికాగ్నిమిత్రము 26, 5; కర్పూరమంజరి 104, 7), మహారాష్ట్రి, శౌరసేని : సెణ్ణ = సైన్య.

(2) ఏ = ఎ: మహా; అ మాగ, జై. మహా : పెచ్ఛఇ=ప్రేక్షతే హేమచంద్రుఁడు 4, 181; గౌడవహో, హాలుఁడు, రావణవహ; ఒవవా ఇయసుత్త); అ మాగ. పెచ్ఛణిజ్జ = ప్రేక్షణీయ : పెచ్ఛగ (ప్రేక్షక); జై. శౌర పెచ్ఛది (ప్రేక్షతే); శౌర పెక్ఖది (ప్రేక్షతే); మాగ. పెస్కది (ప్రేక్షతే); మహా అవెక్ఖి = అపేక్షిణ్; మహా-దుప్పెచ్ఛ = దుష్ప్రేక్ష్య = శౌర. దుప్పెక్ఖ = మాగ. దుస్పెస్క; దుబ్భెజ్జ (దుర్భేద్య); అ. మాగ. జై. మహా., శౌర., అప., : మెచ్ఛ (మ్లేచ్ఛ); మహా.: ఛెత్త (క్షేత్ర) = శౌర. ఖెత్త; మాగ. ఏశెక్ఖు (ఏషఖలు = ఏశేఖు).

(3) ఇ = ఎ : సాగర ఇతి = మహా. సాగరెత్తి; వేదము : యుష్మేషిధ = మహా. తుమ్హెద్ధ అ + ఇ = ఎ : మాగ. ఫుత్త కెత్తి (తుత్రక ఇతి).

ఐ : కైఅవ = కైతవ ; ఐరావణ (భట్టికావ్యము 13, 33).

ఒ : (1) ఔ = ఒ : మహారాష్ట్రి, జైనమహారాష్ట్రి : కోత్థుఅ = కౌస్తుభ (భామహుఁడు ; హేమచంద్రుఁడు ; గౌడవహో ; హాలుఁడు ; రావణవహ.) మహారాష్ట్రి, అర్ధమాగధి, జైనమహారాష్ట్రి, శౌరసేని, అపభ్రంశము : జొవ్వణ = యౌవన.

మహారాష్ట్రి : దోచ్చ = దౌత్య (హాలుని సప్తశతి 84). మహారాష్ట్రి, శౌరసేని : దొబ్బల్ల = దౌర్బల్య (గౌడవహో ; హాలుని సప్తశతి ; రావణవహ ; శాకుంతలము ; 63, 1) : జైనమహారాష్ట్రి : పవుత్త = ప్రపౌత్ర.

మహారాష్ట్రి, శౌరసేని : మొత్తిఅ ; జైన మహారాష్ట్రి : మొత్తియ = మౌక్తిక (గౌడవహో ; హాలునిసప్తశతి ; రావణవహ ; మృచ్ఛకటికము 70, 25 ; 71, 3 ; కర్పూరమంజరి, 73, 5; 82, 8 ; విద్ధసాలభంజిక, 108, 2).

మాగధి, అర్ధమాగధి, జైనమహారాష్ట్రి, జైనశౌరసేని, శౌరసేని, అపభ్రంశము : సోక్ఖ = సౌఖ్య (మార్కండేయుఁడు ; గౌడవహో, హాలుని సప్తశతి, రావణవహ ; కప్పసుత్త ; క్రమదీశ్వరుఁడు 9 ; ఓవవఇయసుత్త ; పవయణసార 381, 19, 20 ; 383, 75 ; 335, 69 ; కత్తిగేయణు పెక్ఖ 402, 261, 362 369 ; మాలతీమాధవము 82, 3 ; ఉత్తరరామచరిత్రము 121, 4 : హేమచంద్రుఁడు 4, 332, 1.) మాగధి : శోక్ఖ : ప్రబోధచంద్రోదయము, 28, 15 ; 56, 1 , 58, 16).

మహారాష్ట్రి, జైనమహారాష్ట్రి, శౌరసేని: సొమ్మ = సౌమ్య. (గౌడవహో, రావణవహ ; క్రమదీశ్వరుఁడు 7 ; రత్నావళి 317, 31 ; మహావీరచరితము 6, 8 ; ఉత్తరరామచరితము 31, 20; 62, 8 ; 71, 8 ; 92, 8 : అనర్ఘరాఘవము 149, 9 ; కంసవధమ్ 9, 2)

(2) ఓ = ఒ.

శౌర : అవహిదొమ్హి (అవహితోస్మి) ; మహా, అ మాగ, జై. మహా., ఒట్ఠ = ఓష్ఠ ; శౌర. ; అణ్ణొణ్ణ = అన్యోన్య , మహా, అ మాగ., శౌర. ; పఒట్ఠ (ప్రకోష్ఠ).

(3) తుది విసర్గము = ఓ + ఇ. ఎ = ఒ ; మహా. అణురాఒత్తి (అనురాగః ఇతి) ; పిఒత్తి (ప్రియ ఇతి) ; జై. మ. పురిసొత్తి (పురుషః ఇతిః ; గఒత్తి (గతః ఇతి) · కాలొవ్వ (కాలః ఇవ) ; జై. శౌర. సమొత్తి (సమ) ఇతి) ; చారొవ్వ (చార ఏవ) ; అ. మాగ. భారొవ్వ (భారః ఇవ) ; సోఒవ్వ (స ఏవ) ; శౌర. బమ్హణొజ్జెవ్వ (బ్రాహ్మణః ఏవ).

ఔ: సౌ అరియ = సౌదర్య ; కౌలవ = కౌరవ (హేమచంద్రుఁడు, ప్రాకృతచంద్రిక, చండుని ప్రాకృతలక్షణము.)

చే, జే: "చజౌతజ్జే ప్రాకృతేచ దంత్యాదేవ నసంశయః" అని యప్ప కవి తన ఛందోగ్రంథమునం దథోక్షజవచనముగ నుదాహరించినాఁడు. ఆ వ్యాకమునే యహోబలుఁడు వ్రాసినాఁడు. ఈ వాక్యము నిరాధారమని కొంద అందురు. కాని, ప్రాకృత భాషలను నుత్తర హిందూస్థాన భాషలను బరిశోధించిన జేమ్సు హోయర్నెల్ పండితులు ప్రాకృతమున దంత్య చే, జే, లుండెననియే యభిప్రాయపడి యున్నారు. వాని దంత్యోచ్చారణమును దెలుపుటకుఁ గొన్ని ప్రాకృతములలో వానివెనుక 'య్' కారమును జేర్చు చుండిరని వారి యభిప్రాయము. ఉదా. తిష్ట = య్చిష్ఠ; చిరమ్ = య్చిలమ్: జాయా = జ్యాఆ; య్చలఆ = చరక: య్చలఇ = చలతి, జ్యలఇ = జ్వలతి; మొదలగువానిలో చ, జ, ల దంతోోచ్చారణమును దెలుపుటకట్లు ప్రాకృతమునఁ జేర్చియుండవచ్చును. సంస్కృత శబ్దములందలి క్ష, చ, ప్చ చ్ఛ, జ, త్య, త్వ, త్స, ధ్య, ద్య, ప్స, ర్త్య, శ్చ, ష్వ, జ్యలు కొన్ని సందర్భములందు కొన్ని ప్రాకృతములలో చే, చ్చే, ఛ, చ్ఛే, లుగ మాఱుచుండును. అట్టి చ, ఛ, లు అ, ఆ, ఉ, ఊ; ఐ, ఔలతోఁ గలిసి దంత్యములయి యుండ వచ్చును.

క్ష: క్షుర = ఛుర: ఇక్షు = ఉచ్ఛూ, క్షుధా=ఛుధా; క్షమా=ఛమా; క్షత = ఛత; క్షణ = ఛణ: కక్ష = కచ్ఛ; పరీక్షా = పరిచ్ఛా; అక్ష=అచ్ఛ; తక్షతి = తచ్ఛఇ, తచ్ఛయి; వృక్ష = వచ్ఛ, మొద

చ : చరక = య్చలఆ: చలతి = య్చలఇ; చత్వర = చత్తర, మొద.

చ్య : పచ్యమాన = పచ్చమాన; ముచ్యతే = ముచ్చతి; రుచ్యతే = రుచ్చతి.

చ్ఛ : ఆచ్ఛల = అచ్చల మొద.

జ : వ్రజతి = వచ్చఇ.

త్య : అత్యంత = అచ్చంత; నృత్యతి = ణచ్చఇ, దౌత్య = దోచ్చ; వైయాపృత్య = వేయావచ్చ; సత్య = సచ్చ; నిత్య = నిచ్చ.

త్వ : చత్వర = చచ్చర; తత్త్వ = తచ్చ; కృత్వా=కిచ్చా; శ్రుత్వా = సోచ్చా; భుక్త్వా = భోచ్చా మొద.

త్స : ఉత్సాహ = ఉచ్ఛాహ; వత్స = వచ్ఛ; ఉత్సవ = ఉచ్ఛవ, సంవత్సర = సంవచ్చర మొద.

ధ్య : నేపథ్య = నేవచ్ఛ; రథ్యా = రచ్ఛా మొద.

ద్య : మాద్యతి = అప. మచ్ఛఇ

ప్స : ప్సాత = చాత, చాఅ; అప్సరా = అచ్ఛరా మొద.

ర్త్య : మర్త్య = మచ్ఛ

శ్చ : నిశ్చయ = ణిచ్ఛయ, ణిచ్ఛఅ; నిశ్చల = ణిచ్చల, దుశ్చరిత = దుచ్చరిఅ; హరిశ్చంద్ర = హలిచ్చంద, మొద.

ష్వ : పితృష్వసా = పిఉచ్ఛా, మాతృష్వసా = మాఉచ్ఛా మొద.

జ్య : రజ్యసె = అప. రచ్చసి.

ప్రాకృతమునందలి జ, జ్జ, జ్ఝ, లకు మూలములు సంస్కృతమునందలి క్ష, జ, జ్య, ద్య, ధ్య, ద్వ, ధ్వ, బ్జ య, య్య, ర్య, హ్య యనునవి. ఈ జ, జ్జ, జ్ఝ లును కొన్నియెడల దంత్యోచ్చారణము గలిగి యున్నట్లూహింపఁబడుచున్నది.

జ : జాయా = జ్యాఆ; జ్వలతి = జ్యలఇ.

జ్య : వాణిజ్యమ్ = వాణిజ్జం, రాజ్యమ్ = రజ్జం.

క్ష : క్షరతి = ఝరేఇ; క్షర్ = ఝురు; క్షీయతే = ఝిజ్జఇ, క్షీణ = ఝీణ.

ద్య : ద్యూత = జూద; అద్య = అజ్జ; ఉద్యాన = ఉజ్జాన.

ధ్య : ఉపాధ్యాయ = ఉఅజ్ఝాఅ; వింధ్య = వింఝ.

ద్వ : విద్వాన్ = విజ్జం.

ధ్వ : ధ్వజ = ఝయ; ధ్వని = ఝుణి; బుద్ధ్వా = బుజ్ఝా; సాధ్వస = సజ్ఝస.

బ్జ : కుబ్జ = కుజ్జో.

య : యమ = జమ; యది = జది; యథా = జధా; యౌవన = జొవ్వణ.

య్య : శయ్యా = సెజ్జా.

ర్య : ఆర్యా = అజ్జా; కార్య = కజ్జ.

హ్య : సహ్య = సజ్ఝ; గుహ్య = గుజ్ఝ దంత్య చ, జ, లు ప్రాచీన ప్రాకృతములందుండెడివనుటకు నిదర్శనము నేటి యార్యభాషలందును నవి కానంబడుటయే. నేటి మరాఠీ భాషయందు మాత్రమవి కానఁబడుచున్నవని యొకరనిరిగాని, యవి యింకను కాశ్మీరి, పశ్చిమ పహాడీభాషలు, మార్వాడీ భాషలలో మిక్కిలి ప్రచారమున నున్నవి. చ, జ, లేకాక వానియొత్తులగు ఛ, ఝ లు గూడ నాభాషలలో దంత్యోచ్చారణమును గలిగియున్నవి.

ః (విసర్గము) : ఇది పాలిభాషలో జిహ్వామూలీయముగ మాత్రము కనఁబడుచున్నది : దుఃఖో.

ఙ : ఈ యనునాసికాక్షరము ప్రాకృతమునందు లేదుగాని, దాని యుచ్చారణము 'మంగళో' మొదలగు శబ్దములందు కవర్గమునకు బూర్వము వినఁబడుచున్నది.

ఞ : రాజ్ఞః = రఞో: రాజ్ఞా = రఞా, ప్రజ్ఞా=పఞా; జ్ఞాతికానామ్= ఞాతికానం = ఞాతికాణం; అఞే = అన్యే, హంఞంతి = ఆలభ్యంతే, మొదలగు శబ్దము లశోకుని శాసనములయందును బాలి భాషయందును, మఱికొన్ని ప్రాకృతములందును గానవచ్చుచున్నది.

య : ఇది ప్రాకృతమునందు లేదందురు. కాని, యర్ధమాగధ్యాది భాషలయందిది యుద్వృత్తాచ్చుతోఁ జేరి పలుకఁబడును, గత = గఅ=గయ; కృత = కఅ = కయ, మొద.

శ : మాగధీ భాషయం దిది ప్రత్యేకముగ నున్నది. ఇది పైశాచీ భాషయందును గలదు. అశోకుని శాసనములనుండి యుదాహరణములు.

కాల్సిశిల, 4: దువాడస వశాభిసితేనా పియదశినా = ద్వాదశవర్షాభిషిక్తేన ప్రియదర్శినా.

కాల్సిశిల, 10 : శంథుత=సంస్తుత; పశవతి = ప్రసూతే.

12 : శాలావఢి = సారవృద్ధిః; శియాతి = స్యాదితి,

శవపాశడానా = సర్వపాషండానామ్; తశ = తస్య.

అతపశడ = ఆత్మపాషండః: పాశండ=పాషండ; శయా = స్యాత్; అపకలనశి=అప్రకరణే.

కాల్సిశిల, 13 ; లేఖాపేశామి = లేఖాపయిష్యామి.

ష: అశోకుని శాసనములనుండి: కాల్సిశిల, 10: యషో = యశస్: అపపలాషవే షియాతితి = అపపరిస్రవః స్యాదితి; ధంమ సుసుషా = ధర్మ శుశ్రూషా, పియదషి = ప్రియదర్శీ, ఏషే = ఏషః; షవం = సర్వమ్; ఉషుటేస = ఉత్కృష్టేన; కాల్సిశిల, హేడిషే = ఈదృశమ్: ధమష = ధర్మస్య; అదిష = యాదృశమ్; షంబధే = సంబంధే, దాష = దాస; షమ్యాపటిపతి = సమ్యక్ప్రతిపత్తిః; మాయపితిషు = మాతాపితృషు; షుషుషా = శుశ్రూషా ; షవామిక్యేన = స్వామినా ; షాధు = సాధు ; ఏతిషా = ఏతేషామ్ ; షంఖేయేకాలనం = సంశయకారణమ్ ; షిషాయా=తత్స్యాత్, మొద.

## అచ్చ తెలుఁగు.

'అచ్చ తెనుఁగు' అనుపదమును బట్టి వేఱొకచో విచారింపఁబడినది. తత్సమేతరమైన, అనఁగా సంస్కృతసమేతరమైన తెనుఁగు భాష యచ్చ

తెనుఁగని యనుకొన్నచో నా భాషయందు ప్రాకృతమునందున్న వర్ణములును దేశ్యమునకు విశిష్టములైన కొన్ని వర్ణములును జేరవలెను. కాని, ప్రాకృతమునందలి వర్ణములన్నియు నచ్చతెనుఁగునఁ జేరలేదు. అచ్చతెనుఁగునఁ బ్రాకృతమందలి ఋ, ః, ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ, శ, ష అను పదునాలుగు వర్ణములును లోపించినవి. భంగు, అవఘళించు, మఝ్ఝారే, ఠవర, ఢాక, ఢడియము, భోషాణము, మొదలగు శబ్దములలో నాయా మహాప్రాణవర్ణములు గాన్పించినను నట్టి యుదాహరణములు క్వాచిత్కముగ మాత్రమున్నవి. ఠ, ఢ లాదియందు గల శబ్దములు మాత్రము కొంచె మెక్కువగ నున్నవి. తక్కిన మహాప్రాణములును నన్యదేశ్యపదములఁ జేరి తెనుఁగు వ్యవహారమునఁ జొచ్చినవి.

సంస్కృత ప్రాకృతములలో లేని తెనుఁగక్షరములు ఎ, ఒ, చ, జ, ఱ, ఁ, అనునవని పారంపర్యక్రమమున నాంధ్రవైయాకరణులు వ్రాయుచువచ్చిరి. అందు ఎ, ఒ, చ, జ లు ప్రాకృతమునఁ గలవని పైఁ దెలుపఁబడియున్నది. శకటరేఫము సంస్కృత ప్రాకృతములందు లేదు. కాని, నేఁటి యార్యభాషలగు రాజస్థానీ, లహండా, సింధీభాషలలో ప్రత్యేకాక్షరముచేఁ జిహ్నితము గాకపోయినను గొన్ని సందర్భములందు రేఫమునకు మూర్ధన్యోచ్చారణము వినఁబడుచున్నది. ఈ మూర్ధన్యోచ్చారణ మాభాషలందాదినుండియు నున్నదో యిటీవలఁ గలిగినదో చెప్ప వీలులేకున్నది. ఈ శకటరేఫ విచార మీయధ్యాయముననే మూర్ధన్యాక్షరముల గూర్చి చర్చించునపుడు విపులముగఁ జేయఁబడును.

## అస్పష్టాచ్చులు (Neutral vowels)

ద్రావిడభాషలయందెల్ల నస్పష్టాచ్చులు గలవు. ఇవి పదముల యాది మధ్యాంతములయందు చేరుచు, పోవుచు వాని రూపములను మార్చుచుండును. తమిళమునందలి 'అరశన్, ఇరశన్, ఇరణ్డు, ఎత్తెక్కియ్, ఉలగు, మొదలగు శబ్దములందును, తెనుఁగునందలి, ఉరను, ఎరయు, ఎఱక, ఒలయు' మొదలగు శబ్దములందును మొదలచేరినయచ్చు లిట్టివే. తెనుఁగు పదముల మధ్యమున అకార ఉకారములు చాలవఱకు సనిర్ధారితములుగ నుండుటకు వానియుచ్చారణ మిట్టిదని తెలియకుండుటయే కారణము. ఉదా: నిలకడ, నిలుకడ; పడక, పడుక; పడమర, పడుమర మొద. పదాంతమందుండు నచ్చులు చాలవఱకు నిలుకడలేక యుండునవే. తెనుఁగుభాష యజంత భాషయని కొందఱందురు. నేఁటి తెనుఁగు చాలవఱకజంతమని చెప్పవచ్చునుగాని ప్రాచీనాంధ్రము తక్కిన ప్రాచీన ద్రావిడభాషల

లెఁజాలవఱకు హలంతముగానే యుండెను. నేఁడయినను, పదములతుది యత్వము వ్యవహారము నందును, సంధియందు నాఁడును నేఁడును గూడ లోపించుటగాననగును. అ, ఇ లవిషయమునఁ గూడఁ గొన్నిసందర్భములందు లోపనుకలుగుచున్నది.

ఇట్టి యస్పష్టాచ్చు లెక్కువగ పైశాచీప్రాకృత వికారములగు నేఁటి షినా, కాశ్మీరీ, సింధి మొదలగు భాషలయందు గాన్పించు చున్నవి. కాశ్మీరీ భాషయందు వీనిని మాత్రాచ్చులందురు. ఆ భాషయందీ మాత్రాచ్చుల పరివర్తనము వలనఁగొన్ని వ్యాకరణకార్యములును గలుగుచుండును.

ఈ యస్పష్టాచ్చులు తక్కిన ద్రావిడభాషలయందువలె—

1. పదాదిని ద్రావిడులుచ్చరింపఁజాలని 'ర, ల' లకూఁతిగా నిలుచు చుండును. ఉదా. అరను, ఇఱుకు, ఉలక మొద.

2. పదమధ్యమున ద్విత్వములు కాని సంయుక్తాక్షరములను విడదీయుఁటకుపకరించును. ఉదా. చందురుఁడు, ఈరసము మొద.

3. పదాంతమందు కొన్నియచ్చులు సాధారణముగ వ్యవహారము నందును, వాఙ్మయమునందును వ్యవహారమునందును సంధియందును లోపించు చుండును. ఉదా. భయంపడు, విజయంచేయు ; ధనం, ఫలమ్ మొద.

విభక్త్యాదివ్యాకరణరూపముల యుపధాచ్చులకుసాధారణముగలోపము రాదు. ఉదా. కలికి, కల్కియగును గాని, చలికి, చల్కికాదు; అందున, అంద్నకాదు. 'గనుకను' వ్రాఁతలో 'గన్క' అని వ్రాయుదురుగాని దాని యుచ్చారణము వాఙ్మయమునకును, వ్యవహారమునకునుగూడ విరుద్ధము.

ఈ యస్పష్టాచ్చులు పదములందు చేరుటవలనను, వానినుండి లోపించుటవలనను గొన్ని మాండలిక రూపము లేర్పడుచున్నవి. ఇట్లేర్పడిన రూపాంతరము లాయామండలములందు దమతొంటి యర్థములందే వ్యవహారమున నిలువవచ్చును. కొన్నిట నవి యర్థాంతరముల నందవచ్చును. కొన్ని కేవలము వ్యవహారమునందే నిలువవచ్చును కొన్ని యాయామండలముల కవులు వాడుటచే వాఙ్మయమున కెక్కవచ్చును. ఒకప్పుడు తొంటి రూపము భాషనుండి తొలఁగవచ్చును. ఒకప్పుడు పూర్వరూపమే నిలిచి, నూతన రూపము తొలఁగవచ్చును. కొన్నియెడల రెండు రూపములును నేకమండలమునందు వేర్వేఱర్థములందును, వేర్వేఱు విధములుగను వ్యవహారమునందు నిలువవచ్చును. ఉదాహరణములు:—

1. మాండలిక భేదములు, అర్థభేదము లేనివి: అనంతపురము: మొలక; ఉత్తరసర్కారులు: మొక్క, రాయలసీమ: ఆడ, ఉత్తరసర్కారులలోనగ్రవర్ణములవారు: అక్కడ.

2. తొల్లింటి రూపములు వ్యవహారభ్రష్టములయి, మాఱిన రూపములు నిలచుట: ఒఱపు, ఒప్పు: అలవ్రొవు, ఆపోవు.

3. తొంటి రూపములు వ్యవహారముననిలువగా మధ్యకాలమున నేర్పడిన రూపములు వ్యవహారభ్రష్టములగుట: అలముకొను, ఆముకొను; చుఱుకు, స్రుక్కు.

4. తొంటి రూపములును రూపాంతరములును వ్యవహారభ్రష్టములగుట: ఉదా. ఇలుకువ, ఇక్కువ = ఇలుకు, ఇక్కు = వాసస్థానము, ఉరవు, ఉవ్వ = ఒప్పిదము.

5 తొంటి రూపమును, నర్థమును జాలమఱుఁగుపడియుండుట: నాలి = ఆలి = హాలి = హావలి = నీచత్వము; చూ. కూలినాలి. ఇచట నొక నకారము పదాదిని చేరుటచే నీపదము వ్యుత్పత్తి మఱుఁగు పడినది

6. తొంటి రూపము చాల మఱుఁగుపడియుఁ బోల్చికొనుటకు వీలుగానుండుట: ఇలుకుపాటు = ఇక్కట్టు.

7. తొంటిరూపము వ్యవహారమున నిలచియుండ దానిరూపాంతరము ప్రత్యయముగా మాఱుట; అలరు=ఆరు; చూ. నిండారు, సొంపారు, మొద.

8. తొంటిరూపమును దాని రూపాంతరమును నర్థభేదములతో వ్యవహారమునందు నిలచుట; అడచు, అచ్చు, అణఁగు, అఁగు

9. ఏకమండలమునందు తొంటిరూపమును, దాని మాఱినరూపమును వివిధముగ వాడఁబడుట; మొలకెత్తు ('మొక్కెత్తు కాసు')

ద్రావిడభాషలు ప్రత్యేకభాషలుగఁ బరిగణింపఁబడుటకు ముఖ్యకారణములలో నీ యస్పష్టాచ్చుల మూలమునఁ గలిగిన మార్పుగూడ నొక కారణమై యున్నది.

## అచ్చుల పరస్పరాకర్షణము.

## (Harmonic sequence of vowels.)

సిథియను భాషలలో ననఁగా ఫిన్నిషు, తుర్కిషు, మంగోలియను, మంచూ భాషలలో నచ్చుల పరస్పరాకర్షణ సూత్రమొకటి కలదనియు, నందచ్చులు నాలుగు వర్గములుగఁ బరస్పరమైత్రి ననుసరించి యేర్పడియున్నవనియు, ధాతువునందుగాని, పదమునందలి యొకభాగమునందుగాని యున్న యచ్చు ననుసరించి యాపదము తక్కిన భాగమందో, యాపదమునకుఁ జేరు ప్రత్యయములందో వచ్చునచ్చు లాయా వర్గీయాచ్చులుగ మాఱుచుండు

వనియు, నిట్టి సూత్రమె ద్రావిడ భాషలయందు, ముఖ్యముగఁ దెనుఁగున నున్నదనియు, నందుచే ద్రావిడభాషలు సిథియనుభాషలకు సంబంధించిన వనియు, నార్యభాషలలో నట్టియచ్చుల యాకర్షణము లేకుండుటచే వాని కార్యభాషలతో సంబంధము లేదనియుఁ జెప్పుటకిది యొక నిదర్శనమనియు కాల్డువెలు చెప్పియున్నాఁడు. తెనుఁగున నీ సూత్రము ఇ, ఉ అను నచ్చులకు మాత్రమనువర్తించునని యాతఁడే వ్రాయుచు నుదాహరణములుగ నీక్రింది వానినిచ్చి యున్నాఁడు

కర్తి+లు=కత్తులు ; కర్తికి, కత్తులకు , కలుగు+ఇ=కలిగి ; కలుగుదును, కలిగితిని —కన్నడము : మాడుత్తేవె, మాడుత్తీరి, మాడిదెవు

ఈ విషయమును తెనుఁగు వైయాకరణులు 'ఇత్తునకు బహువచనంబు పరంబగునపుడుత్వంబగు : హరులు, గిరులు, కవులు మొద ' వికృతియందికా రాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనము పరంబగునపుడుత్వం బగు : కలుకులు, ములుకులు, చెలుములు, బలుములు మొద. "ఇకా రంబుమీఁది కు, ను, వు, క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు : హరిని, హరికిని, శ్రీని, శ్రీకిని వారిని, వారికిని, వచ్చితిని, వచ్చితిమి, వచ్చితివి, వచ్చి తిరి మొద." అను మొదలగు సూత్రములందు గుఱుతించి యున్నారు. కాని, ఈ సూత్రము సిథియను భాషలయందువలె సర్వసామాన్యముగాదు. పై సూత్రములకే యపవాదములుగ "ఉనుదంతమగు తెనుఁగు డుమంత మునకు నిగాగమము నిత్యముగానగును : మగనిని , తమ్ముని, అల్లుని, మొద." "డుమంతంబు మీఁది నువర్ణకంబు నుత్వంబున కిత్వంబగు: రాముని మొద"

"ఈ ధాతు యుష్మదర్థంబుల మీఁద వాని యుత్వంబున కిత్వంబు రాదు : ఈను, ఈము, ఈవు, ఈరు, ఈఁడు ; ఈకుము ; నీవు, మీరు, నీకు, మీకు," "కలడో పధ నపర్థాదుల యపోత్త మేత్వంబున కుత్వంబు గలుగదు: పందిరులు, పడికెళ్లు, రాసిపులు, తొమ్మిదులు" మొదలగు సూత్రములు చేయఁ బడియున్నవి. సిథియను భాషలలో ధాతువునందలి యచ్చులు పరుష, మృదు, అస్పష్ట భేదములచే మూఁడు విధములుగ నుండును ద్రావిడభాషలయం దట్టిభేద మచ్చులయందు లేదు అందచ్చుల పరస్పరాకర్షణ మాయా మిత్ర వర్గీయా చ్చులయందే కలుగుచుండును ఇదిగాక యందచ్చు లన్నిటికి నిట్టి మార్పుకలు గును. ఇంకను నందు ధాతువునందలి యచ్చునను సరించి ప్రత్యయములోనియ చ్చు మాఱునుగాని, ప్రత్యయగతాచ్చు ననుసరించి ధాతుగతాచ్చు మాఱదు. పైరీతి మా ర్పాభాషలయం దెట్టి యపవాదమును లేక కలుగుచుండును. ద్రావిడ భాషల కీవిషయములందు సిథియను భాషలతో నెట్టి సంబంధమును లేదు. తెనుఁగున మాత్రము ఇ, ఉ, ల విషయమునఁ గొన్ని సందర్భములం

దీ యచ్చుల యాకర్షణము కనఁబడుచున్నది. కొంతవఱకు నీ విషయమునందును భాష తెనుఁగును బోలియున్నది. కాని, తక్కిన ద్రావిడభాషలలో దేని యందైనను నిట్టి మార్పు కలుగు ననుట కాధారములు లేవు. ఈ యచ్చుల యాకర్షణశక్తి ననుసరించియే భాషాకుటుంబముల సంబంధమును నిర్ణయించినచో, నిట్టి యచ్చుల మార్పులఁ గలిగిన జర్మనుభాష నార్యభాషల నుండి తొలఁగించి, సిథియను భాషావర్గమునఁ జేర్పవలసియుండును.

ఈ యచ్చుల యాకర్షణము తెనుఁగునఁ గాన్పించుచున్నదని గ్రహించినను, నట్టి విశేషము సిథియనుభాషలని తలంపఁబడువానివలనఁ గలిగినదని తలంచుటకు వీలులేదు. ఈ సిథియను భాషలన్నిటి యందును నీ యాకర్షణము గానరాదు. ఇట్లుండ, ప్రాకృతభవములగు కాశ్మీరీ, షినా భాషలయందు, అందు ముఖ్యముగ కాశ్మీరీభాషయం దీ యచ్చుల యాకర్షణము సంపూర్ణముగ నున్నది ఈయాకర్షణము పైశాచీ భాషలన్నిటియందును గానవగును. ఇందు మూలమున ద్రావిడభాషలకును, అందును దెనుఁగునకును పైశాచీ ప్రాకృతమునకును గల సంబంధ మేర్పడఁగలదు ఈ విషయమై పరిశోధనములు జరుగవలసి యున్నవి.

## ప్రకృతిభావ నివారణము.

## (Prevention of Hiatus.)

ద్రావిడభాషలయందు రెండచ్చు లొకదానితరువాత నొకటి వచ్చినప్పుడు సంధియైన నగును; లేదా, ఆ రెండిటి మధ్యమున నొక హల్లాదేశముగనైన వచ్చును. అట్లాదేశముగ వచ్చు హల్లులలో య, వ, నలు ముఖ్యములైనవి. తెనుఁగున య, న, లాసందర్భములందు సాధారణముగఁ జేరుచుండును. ఉత్తునై నచ్చు వచ్చునపుడు సంధియగును; అనఁగా పూర్వ పరస్వరములకు పరస్వరమే కాదేశమగును. అత్వసంధి బహుళము; ఇత్వసంధి కొన్ని యెడల వైకల్పికము; కొన్ని యెడల సంధికాదు. సంధిరానిచోట యడాగమమువచ్చును. రాముఁడు + అక్కడ = రాముఁడక్కడ; మేన + అత్త = మేనత్త, మేనయత్త; దూత + ఇచ్చెను = దూతయిచ్చెను; మఱి + ఏమి = మఱేమి, మఱియేమి; చేసి + ఇచ్చెను = చేసియిచ్చెను.

తమిళములో భూతార్థక క్రియావిశేషణ చిహ్నమగు 'అ' కారము ఇకారాంతమగు క్త్వార్థకముపైఁ జేరునప్పుడు 'య' కారమైనను 'న' కారమైనను నాగమముగా వచ్చును. ఉదా: కట్టి+అ=కట్టియ, కట్టిన. తెనుఁగున నిట్టిచోట్ల నగాగమమే వచ్చును: కట్టిన, తమిళమున 'కట్టిన' 'కట్టియ' అనునవి మాండలికరూపములు. మండలభేదముచే తెనుగునఁ గూడ య, న కారములాగమములుగా వచ్చియుండెననుట కొక నిదర్శనము కలదు. కొట్టినాఁడు

కొట్ట్యాఁడు, అనునట్టి క్రియారూపములు మండలభేదమును బట్టి వాడుకయం దున్నవి. కొన్ని మండలములలో కొట్ట్యాడు, కొట్టేడు అనునవి వ్యవహారము నందున్నవి. కొట్ట్యాడు, కొట్టేడు, కొట్టాడు, వంటిరూపములు యడాగమము గలిగిన మాండలిక భాషల యందలివియు, కొట్టినాడు, కొట్టెంను, వంటిరూప ములు నగాగమము గలిగిన మాండలిక భాషలయందలి రూపములనియుఁ జెప్పవచ్చును.

ఏకపదమునందుగాక రెండుపదములు చేరునప్పుడు పూర్వపదము ద్రుతప్రకృతిక మైనచో 'కిషష్ఠి' యందు తప్పఁ దక్కిన యన్నిచోట్లను నచ్చు పరమైనప్పుడు ద్రుతము నిలిచి పూర్వపరస్వరములను ప్రత్యేకముగ నిలుచునట్లు చేయును.

ఈ సందర్భమున ద్రుతవిచారమును జేయవలసి యున్నది. ద్రుతమ నఁగా ద్రవించు, లేక, తొలఁగిపోవు స్వభావము గలదని యర్థము. అది సంధ్యా దికార్యములందు గావలసినప్పుడువచ్చి, యక్కఱ లేనప్పుడు లోపించుచుం డును. ఎప్పుడది కావలయును, ఎప్పుడక్కఱలేదు, అను విషయమునను, ద్రుత స్వరూప మెట్టిదను విషయమునను నభిప్రాయ భేదములు గలవు.

## ద్రుత స్వరూపము.

"ద్రుతాఖ్యోనః" (ఆంధ్రశబ్దచింతామణి); అనఁగా అత్వోయుక్తమగు నకారము ద్రుతము; "నకారంబు ద్రుతంబు" (బాలవ్యాకరణము; అప్పకవి); అనఁగాఁ బొల్లగు నకారము ద్రుతము; "నకారంబ సాధారణంబు ద్రుతంబు. ప్రత్యయాగ మాన్యయాత్మకమై యుత్వ విశిష్టమయిన నకారంబు ద్రుత సంజ్ఞకంబని యర్థము. ద్రుతమనఁగా నొల్లని యెడ మఱిఁగి పోవునదియనుట. ప్రత్యయాత్మకమైన నకారమునకు: తాను, నేను, ధనమును, వనమును, చదు వుచున్నాను, చదువఁగలను మొద; ఆగమాత్మకమైన నకారమునకు: అన్ని యును, తప్పుండును, మఱియును, ఏనియును మొ; వలయుచో నీ ద్రుతము నందలి యుత్వంబునకు లోపంబగు. ఉన్నాను, ఇత్యాదులయందు ద్రుతము నందలి యుకారంబునకు లోపంబుగలుగదు. శబ్దానుశాసనుఁడు 'ద్రుతా ఖ్యోనః' అని కేవల నకార గ్రహణము చేయుట ద్రుతమునకు స్థిరత్వ సిద్ధి కైయని తెలియవలయును" ప్రౌఢ వ్యాకరణము. 'ఇకార ఉకారములతోఁ గూడినదియు, పొల్లుగా నుండునదియు నయిన నకారము ద్రుతమనఁబడును. (ఆంధ్రభాషానుశాసనము.)

పైదానిని బట్టి ద్రుతస్వరూపమును గూర్చి యేకాభిప్రాయము లేద నుట స్పష్టము. న్, న, ను, ని, లు నాలుగును ద్రుతములుగ వేర్వేఱువైయా మణులచేఁ బరిగణింపఁ బడుచున్నవి. ప్రౌఢవ్యాకరణ కారునియభిప్రాయము

ననుసరించి నకారపు పొల్లుపై అ, ఇ, ఉ,లు ద్రుతమునకు స్థిరత్వము గల్పించుట కేర్పడినవని యనుకొని, నకారపుపొల్లే ద్రుతమని చెప్ప వచ్చును కాని, యా యా వ్యాకరణ సూత్రముల నేర్పఱుచునప్పు డాయా వైయాకరణులు న, ని, నులనుగూడ ద్రుతముగనే పరిగణింప వలసిన వారైరి.

**ద్రుత ప్రస్తావనగల యాంధ్రశబ్ద చింతామణిసూత్రములలోని విషయము.**

1. ప్రథమావిభక్తి, కూర్చి, కై, పట్టి, పట్టి, యొక్క. అనువిభక్తి ప్రత్యయములు, అ, ఏ, అను నేవార్థకములు; అంటయను కిలార్థకము, వింటిరి కంటిమి, వేండిరి మొదలగు తిఙ్మధ్యమములు; కాంచి, విచారించి, కాంచక, విచారింపక మొదలగు క్త్వార్థకములు; ఇంచుకయను కించిదర్థకమును; ఔర, బళీ, మజ్జా, అయ్యారె, మొదలగు ప్రశంసనార్థకములును; అద్దిర. ఓహో మొదలగు నద్భుతార్థకములును; కటకట, అక్కట, కట్టా, అయ్యో, మొదలగు సంతాపార్థకములును, ' అద్దిర ' ఓహో, మొదలగు ప్రశంసనార్థకములును అపుడు, ఇప్పుడు, ఎప్పుడు అను తదాద్యర్థకములును; ఏమిమొదలగు కిమర్థకములును; అంటయను కలార్థకమును; ఇంచుక, ఊఱక, మిన్నక, మొదలగు తూష్ణీ మాద్యర్థకములును; ఆదిశబ్దముచే అయ్యా, మొదలగు సంబోధనాద్యర్థకములును గళలు. కళలు కాని శబ్దములు ద్రుత ప్రకృతికములు.

2. ఆంధ్రపదాదిని 'యె' యను నెత్వవిశిష్టమైన యాద్యంలేష్ట ముండును; అది ద్రుత ప్రకృతికములకుం బరమందు వచ్చినచో సంధియందు దాని కచ్చువలెం గార్యమగును.

3. ద్రుతమున కచ్చుపరమగునపుడు లుక్సంశ్లేషములు లేవు.

4. వర్తమాన విహితమగు చు వర్ణముపై సంధి వైకల్పికముగా నగును; అనఁగా శత్రర్థక చు వర్ణము ద్రుత ప్రకృతికమని యభిప్రాయము.

5. ధాతుపదసంభవములగు విశేషణములతుది యుత్వముపై నగాగమము వచ్చును. ఈ నగాగమము నప్పకవి ద్రుతముగ భావించినాఁడు.

6. షష్ఠీసమాసమునం దుత్వముపై నచ్చు పరమగునపుడు నుమ్ వచ్చును. దీనిని గూడ నప్పకవి ద్రుతముగనే భావించినట్లు తోఁచును.

7. శత్రర్థరూప మధ్యమందలి నువర్ణముపై నుండు నుత్వమునకు లోపమును మిగిలిన నకారమునకుఁ బూర్ణబిందువును నగును. దీనినిబట్టి యిట్టి నువర్ణము గూడ ద్రుతసంజ్ఞకమని యప్పకవి యభిప్రాయపడినట్లు తోఁచుచున్నది.

8. ఆత్మార్థశబ్దములగు తాను, నేను, పదములందలి ద్రుతమునకు వైకల్పికముగ లోపమగును. తాను, నేను, లలోని తుది నువర్ణమాంధ్ర

శబ్దచింతామణికారుని యభిప్రాయమున ద్రుతసంజ్ఞకమైనట్లు స్పష్టపడుచున్నది

9 వాక్యాంత గతపదములందలి ద్రుతము వైకల్పికముగ లోపించును నీనిపై నప్పకవి వ్యాఖ్యచేయుచు దెనుఁగు పద్యములతుదిని గురువుండవలసినచోట్ల నలలపై నిత్యమును, ఉత్వమును లాక్షణికులు చేర్చిరని వ్రాసియున్నాఁడు

10. ద్రుతప్రకృతికముకంటె పరమయిన పరుషములు సరళములగును. ఆద్రుతము బిందువు కూడనగును. అట్లు ద్రుతము వికారము నొందకున్నను దానిపై సరళములే నిలుచును.

11. ద్రుతప్రకృతికము కంటె సరళస్థిరవర్ణములు పరమైనప్పుడు నవర్ణమునకు లోపము వైకల్పికముగ నగును.

12. ద్రుతప్రకృతికముకంటె సరళస్థిరవర్ణములు పరమైయుండ ద్రుతమునకు లోపము కలుగనప్పు డాద్రుతమునకుఁ బైహల్లుతో సంశ్లేషమును గలుగును దీనిని బట్టి 'న్' అనుహల్లే ద్రుతమయినట్లాంధ్ర శబ్దచింతామణికారుని యభిప్రాయమైనట్లు తోఁచుచున్నది

13 ఇట్టిసంశ్లేషమును బొందిన ద్రుతమునకు బదులు బిందువు నగునని కొంద రొక్కప్పుడు పలుకుదురు

14. సమాసములందన్నియెడలను ద్రుతమునకు లోపము గలుగును.

పైవానిలో (3), (6), (12)ల వలన 'న్' ద్రుతమనియు, (5) (8)లవలన 'న' వర్ణము ద్రుతమనియు; (4) (7) (9) (10) (11) లవలన ను వర్ణము ద్రుతమనియు, (9) వలన 'ని' వర్ణముగూడ ద్రుతమనియు నభిప్రాయము గోచరించుచున్నది

పైనివివరించిన సందర్భములందేకాక నామవాచకములలో కన్ను, పొన్ను (బంగారము), మను, పెను, మొదలగు కొన్ని శబ్దములపైఁ గొన్ని శబ్దములు పరమగునపుడు, కందెఱ, పొందామర, మంజల్లి, పెంజీకటి, మొదలగు సమాసములందువలె ద్విత్వలోపమును నుకార లోపమును గలిగి యాశబ్దములు ద్రుతప్రకృతికము లగుననియు, సంధియందును సమాసమునందును ప్రాఁజదువు, లేఁగొమ్మ, సరసపుంబలుకు, మొదలగు వానియందువలె నాగమముగా వచ్చిన నకారాంతముగల శబ్దములును ద్రుతప్రకృతికములగుననియు ననేకవిధముల వైయాకరణులు తెలిపియున్నారు. కావలసినప్పుడు వచ్చి, యక్కఱలేనప్పుడు లోపించునది ద్రుతమను నిర్వచనము చొప్పున ఉన్నాను లోని తుది నువర్ణము ద్రుతముకానేరదు. కన్దోయి, పెంజెలువు మొదలగుచోట్ల నువర్ణము కేవలము లోపింపదుగావున దానిని

గూడ ద్రుతమనఁ గూడదు. ప్రాఁజదువు, లేఁగొమ్మ, మొదలగువానిలోఁ దొలుత సువర్ణము లేకుండుటచేతను, వ్యాకరణ కల్పితమగు నుగాగమము వచ్చినను నది కేవలము లోపింపకుండుట చేతను నట్టి సందర్భములందును ద్రుతమున్నదని యనుకొనఁ గూడదు. ఈ రీతిగ సంపూర్ణముగ లోపింపఁ గల నకారమే అనఁగా 'న్' అనుపొల్లే ద్రుతమనియు, నిపొల్లుపైఁ గొన్ని యెడల అ, ఇ, ఉ లు చేరుటయు లోపించుటయుఁ గలుగుననియు, పదములందు సిద్ధములగు న, ని, ను లు ద్రుతములు కావనియు, నయినను నట్టి సిద్ధములగు కొన్ని న, ని, ను లకు ద్రుతమునకువలె వ్యాకరణకార్యములు గలుగుననియుఁ జెప్పవలసియున్నది.

ఇదిగాక నకారమునకు మాత్రము ద్రుతసంజ్ఞయేల యుండవలెనో, కావలసినప్పుడు నచ్చి, యక్కఱలేనప్పుడు మఱుఁగుపడు 'భయపడు' మొదలగు వానియందలి వైభక్తిక ముపర్ణమును, 'పందొమ్మిది' మొదలగు వానియందలి 'ది' వర్ణమును, 'క్రొత్త' మొదలగువానియందలి ద్విత్వాక్షరమును, 'ప్రాయిల్లు' మొదలగువానియందలి తిజ్ఞర్ణకమును, నట్టివి మఱికొన్నియును గూడ ద్రుతములని యేల యనఁగూడదో తెలియరాకున్నది. *

* పై రీతిగ ద్రుతవిచారము జేసినపిమ్మట బ్రహ్మశ్రీ సిద్ధాంతి సీతారామస్వామి శాస్త్రులవారు రచించిన "చింతామణి విషయ పరిశోధనము" అను గ్రంథము జూడఁ దటస్థించినది. వారందు ద్రుతి స్వరూపమునుగూర్చి విపులముగఁ జర్చించియున్నారు. ఆ గ్రంథమున వారు సిద్ధాంతము చేయనెంచినది చింతామణి నన్నయభట్టకృత మను విషయము కావునఁ దమ వాదమున కనుకూలముగ చింతామణి సూత్రములకు సంపోషకములు నన్నయ ప్రయోగములను సాధించుటకై తమ యుక్తి సంతతము వినియోగించియున్నారు. ద్రుత స్వరూపము నకారపు పొల్లే యను విషయమున వారితో నేకీభవింతుము. కాని, 'ను' వర్ణమునుగూడ ద్రుతముగనే చింతామణికారుఁడు తలంప లేదను విషయమున వారికిని మాకును నభిప్రాయ భేదము గలదు. చింతామణి పై వ్యాఖ్యల రచించిన వారిపయిన (నేటినున్న యితరులను శ్రీ శాస్త్రులవారుగూడ) నకారపు పొల్లునే కాక, ని, ను, వర్ణములనుగూడ ద్రుతముల రూపాంతరములుగనే పరిగణించియుండిరి. చింతామణిలో 'ద్రుతప్రకృతి' యను సూత్రము కిప్పుడు శాస్త్రులవారు క్రొత్త వ్యాఖ్యానమును జేయుచున్నారు. ద్రుతమనఁగా ద్రుతి [illegible]ంది నదని యిప్పుడు చెప్పుచున్న యర్థము. అనఁగా 'న్' పైనుండు యచ్చు తొలుత నుండెడి దనియు, ఆయచ్చు లోపింపఁగా మిగిలిన 'న్' మాత్రము ద్రుతమనియు వారు చెప్పుచున్నారు. వారివాదము చొప్పున ద్రుతి నందినది, అనఁగా మఱుఁగుపడినది అచ్చు కావున ఆ యచ్చే ద్రుత సంజ్ఞ నందవలసియున్నది గదా. అట్టియెడ నకారపు పొల్లును ద్రుతమనుట పొసఁగదు. సరే, నకారపు పొల్లే ద్రుతమని యొప్పుకొన్నను, మఱుఁగుపడి యుండిన 'న్' మీది యచ్చు తిరిగి కనఁబడుట కాటంకమేమి గలదు? కావున నకారపు పొల్లును ను

సంధికలుగనిచోట్ల స్వరముకంటె పరమయిన స్వరమునకు యడాగమము వచ్చి యారెండచ్చులను ప్రత్యేకముగనిలుపును.

య, వ, లులకు తెనుఁగున నిట్టిసందర్భములందు ట్, మ్, ర్, లు గూడఁ జేరుచుండును. ఉదా: పేరుటురము, గణగణమని, పేదరాలు.

వ్యవహారమునందు 'వ్' 'హ్' లు కూడనొకప్పుడు వచ్చును: ఉదా. ఆవూరు, పదిహేను మొ॥

వ్యవహారమునందు 'అ' 'ఈ' లకచ్చుపరమగునపుడుత్తమ వర్ణముల వారియందు యడాగమము కలుగదు: మాఅమ్మ, మీఅత్త; పామరజనుల వాక్కులయందు మాత్రము యడాగమము వినఁబడును: మాయమ్మ, మీయత్త.

---

వర్ణమును దద్వికారమగు నివర్ణమునుగూడ ద్రుతసంజ్ఞను పొందవచ్చునని తేలుచున్నది. ను వర్ణమును ద్రుతముగా నంగీకరించినయెడల చింతామణి కర్తృతా విషయమున నొక యాక్షేపము కలుగుచుండుటచే వారి వాదమార్గము ననుసరింపవలసివచ్చెను. 'ను' వర్ణము కేవల ద్రుతముగా నుండు ప్రయోగములు నన్నయ భారతభాగమున లేవని స్థాపించుటకు శాస్త్రిలవారు ప్రయత్నించుచు, ను వర్ణము గానవచ్చినచోట్ల సముచ్చయార్థమును జూపుచు నది సముచ్చయ 'ను' వర్ణముగాని ద్రుతముకాదని త్రోసిపుచ్చుచు వచ్చిరి. కాని, ను వర్ణము కేవల ద్రుతముగా నున్న నన్నయభట్టకృత భారత భాగమందలి ప్రయోగములఁ గొన్ని యీ క్రింద పొందుపఱుపఁ బడినవి

1 మ. జననీ శాపభయ ప్రపీడిత మహా-పన్నేంద్రులన్ సర్పయా
గమిత్రోద్ధత మృత్యువక్త్రగతులం - గాకుండఁగాఁ గాచె నం
దను నాస్తీక మునీంద్రు నమల సద - స్యుల్ సంతసంబంది బో
రనఁ గీర్తించిరి సంతత స్తుతి పదా - రావంబు రమ్యంబుగన్—ఆది. II. 227.

2 మధ్యాక్కర. తను మధ్య దానొక్క కన్య సురనదీ - తటమున నున్నఁ
గని వక్కన్యకఁ జూచి నీ విట్టి - కమనీయ రూప
వొంగర నా సుతునకు భార్య వగుమన్న - నొడఁబడి యియ్యు
యనియెఁ గావునను దానిని దగ వివాహ - మగుము నెయ్యమున.

ఆది. IV. 141.

మధ్యాక్కర. తడయక పుట్టిననాఁడ తల్లి చేఁ - దండ్రిచే విడువఁ
బడితి నిప్పుడు పతిచేతను విడువఁ - బడియెద నొక్కొ
నడుపులు వేయు నింకేల యిప్పాటి నోములు దొల్లి
కడఁగి నోచితిని గాకేమి యంచును - గందె డెందమున—ఆది. IV. 102

ఆ. వె. ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను
బెద్దగాల ముండఁ - దద్ద వగదు.— ఆది. IV. 66

ఇట్టి యుదావరణముల నింకను నీయవచ్చును.

## అర్థానుస్వారము

వైదిక సంస్కృత భాషలలో నచ్చుల కనునాసికత్వము గలుగుచుండెడిది. ఇట్టి యనునాసికాచ్చులను అఁ, ఇఁ, ఉఁ అని వ్రాయుచుండెడివారు. కొన్ని సందర్భములందు దీర్ఘాచ్చులును ననునాసికత్వము నొందుచుండెను : మహాఁన్ + అసి = మహాఁ అసి ; రశ్మీః + ఇవ = రశ్మీఁరివ ; సూనూః + యువన్ = సూనూఁర్యువన్ మొద (చూ. విట్నీ : సంస్కృత - వ్యాకరణము. పేరా 70 మొ. పేరా 209. మొ.) ఇట్టి సందర్భములం దచ్చు లనునాసికములుగ మాఱక, వాని తరువాత ననునాసికోచ్చారణము జనించుచుండెడిది. సంస్కృతమున వర్గీయాక్షరములకు ముందు 'ఙ, ఞ, ణ, న, మ' లను ననునాసికాక్షరములే యుండెడివి : య, ర, ల, వ, శ, ష, స, హ లకుముం దనుస్వార ముండెడిది. ప్రాకృతములందు హల్లులతోఁ గూడిన యనునాసికధ్వను లనుస్వారములుగ మాఱుటచేఁ గేవల మనుస్వార మందు నిలిచినది. శబ్దముల తుదనుండు మకారము లోపించి దానికి పూర్వమందుండు నచ్చున కనునాసికత్వము గలిగినది. గుజరాతీ, మరాఠీ భాషలలో తుది యచ్చులు కొన్ని, అనఁగా తుది మకారము లోపింపఁగా మిగిలిన ననుస్వారోచ్చారణమును గలిగియున్నవి : గుజరాతీ, కర్వుఁ (* కరి అవ్వఉం = కర్తవ్యకమ్); హాఁ (హాఁ, హఉం = అహకం అహం); మరాఠీ : శేఁ (సయం, శతమ్) ; మోతీఁ (మొత్తిఅం, మౌక్తికమ్) ; మొద నేఁటికొన్ని యార్యభాషలలో తుదియచ్చుల యనునాసికోచ్చారణము పోయినది

ప్రాకృతములందు ద్విత్వహల్లులు, అల్పప్రాణము + మహాప్రాణము, లేక అనుస్వారము + అల్ప, మహాప్రాణములు మాత్రము సంయుక్తములగుచుండెడివి. సంయుక్తాక్షరములకుఁ బూర్వ మందుండు నచ్చు సాధారణముగ హ్రస్వముగ నుండెడిది. రానురా నీసంయుక్తాక్షరములలో నొకహల్లు లోపింపఁగా దానికిఁ బూర్వమందుండు నచ్చుదీర్ఘమయి హల్లు అనుస్వారముతోఁ గూడియున్నచో ననుస్వారోచ్చారణము నందుచువచ్చినది. నేఁటి యార్యభాషలయం దట్లేయున్నది : పఞ్చ = పాఁచ్ ; అఙ్క = ఆఁక్ ; వఞ్ఝా = వంఝూ = బాఁఝు ; భాండీ = హాఁటీ ; పఙ్క = పాఁక్ మొద.

ప్రాకృతములందు కొన్నియెడల మూలమునందు ననునాసికముగాని యనుస్వారముగాని లేకున్నను నచ్చుల కనుస్వారత్వము గలుగుచుండెను : హిందీ : సత్య = సాఁచ్ ; నిద్రా = నీఁద్ ; సర్ప = సాఁప్ మరాఠీ : అశ్రు = ఆఁసూ ; మహిష = భైఁస్ ; ప్రాకృతము : వక్ర = వక్క = వంక ; పక్షిన్ = పక్షి = పంఖి మొద.

పై విషయము లాంధ్రభాష కెంతవఱకు ననువర్తించునో విచారింప వలసి యున్నది.

1. తుది మకార మనుస్వారమగుట: భయము + పడి = భయంపడి; విజయము+చేయు=విజయంచేయు: వ్యవహారమున : ధనము=ధనం ; భయము= భయం ; ముఖము = ముఖం, మొఖం, ముహం, మొహం ; పాము = పాఉఁ ; వాము=వాఉఁ మొ॥ తెనుఁగు వ్యవహారమునఁ బ్రయత్నించినఁ దప్పఁ దుది ము-వర్ణము నిలువదు.

2. పదమధ్య మకార మనుస్వారమగుట: కముఁజు=కౌఁజు; పముఁజు= పంజు; దుముకు = దూఁకు మొద, వ్యవహారమున : రాముఁడు = రావుఁడు; భీముఁడు = భీవుఁడు మొద

3. అనుస్వారయుక్త హల్లోపము, పూర్వాచ్చునకు దీర్ఘము:-అంక్క= ఆఁక (చూ అంకిలి); అహంకారః హంక్కార = * అంక్కార = ఆఁకరము; అణఁగు = అణ్గు =* అంగు = ఆఁగు; అణఁచు = అణ్చు =* అంచ్చు = ఆఁచు; అంట్టు = ఆఁటు; తనుకు = తన్కు =* తంక్కు = తాఁకు; దనుక = దన్క =* దంక = దాఁక; తంట్ట ; = తాఁట , తివుట = తివ్ఁట =* తింట్ట = తీఁట; తుంట్టికూర = తూఁటికూర, తుండ్డు = తూఁడు; తెంగ్గు = తేఁగు; తెండ్డు=తేఁడు; తొంగ్గు=తోఁగు; పిణ్డ=పెండ=పేఁడ; పెంట=పేఁట; పెండు = * పేఁడు; లంఘు=లంగ్గు=లాఁగు , లెంక్క = లేఁక, కుంక్కటి = కూఁకటి; పించము = పీఁచము, పుంట్ట = పూఁట; పొంజ్జు = పోఁజు; బొంక్కి = బోఁకి; మంగ్గు = మాఁగు; మింగ్గడ = మీఁగడ; తలయంప్పి = తలాఁపి; లొంగ్గు= లోఁగు; పంక్కు = పాఁకు(డు); గొంజ్జు = గోఁజు; ఉంక్కు = ఊఁకు; గండ్డి = గాఁడి; గండ్డు = గాఁడు మొద.

4 సహజముగ ననుస్వారము గలిగిన కొన్ని తెనుఁగు శబ్దములు:— నగ్న = నగ్గ = నంగి , దుక్క = దుంగ ; బుగ్గ = బుంగ , ఉగ్గు=ఉంగు ; కగ్గు = కంగు; కుగ్గు = కుంగు; మగ్గు = మంగు = మాఁగు, ఇగ్గు = * ఇంగు= ఈఁగు ; పిక్కు = పింగు, అజ్జ = అంజ ; అట్ట = అంట ; అట్టు=అంటు ; నట్టు = నంటు ; ఇక్షు = ఇచ్ఛు =* ఇచ్చు = ఇంచు ; ఉబ్బ = ఉంబ = ఉమ్మ;-ఇచ్చు= ఇంచు ; పగలిటి = పగలింటి మొద.

పై యుదాహరణములవలన ననుస్వారవిషయమున నాంధ్రభాష ప్రాకృతమార్గమునే యనుసరించుచున్నదని తెలిసికొనవచ్చును

తెలుఁగున ననుస్వారము సిద్ధమనియు, సాధ్యమనియు రెండువిధములని యు, సిద్ధసాధ్యానుస్వారములు తిరుఁగ బూర్ణార్ధ భేదములచే రెండువిధములుగ

నున్నవనియు నాంధ్రశబ్దచింతామణికారుఁడు తెలిపెను. ఒకప్పుడీ యనుస్వారమును బిందువని కొందఱు చెప్పుదురని యాతఁడే వచించెను. అప్పకవి పూర్ణానుస్వారమునకు దీర్ఘానుస్వారము, అఖండానుస్వారమనియు, నర్ధానుస్వారమునకు హ్రస్వానుస్వారమనియుఁ బేళ్ళుగల్పించెను. అప్పకవి కల్పించిన యీదీర్ఘ, హ్రస్వసంజ్ఞ లనుస్వారవిషయమునఁ దార్కాణయినట్లు దోఁపకపోదు. 'రెండ్డు' అనునప్పుడు హ్రస్వముగను, 'రేండు' అనునప్పుడు దీర్ఘముగను ననుస్వారము వినఁబడుచున్నది. హ్రస్వాచ్చుమీఁది యర్ధానుస్వారము దీర్ఘముగానే వినఁబడును. పెనంగు, తోలంగు మొద. అర్ధానుస్వారమనునది దీర్ఘము కావుననే యొక శబ్దములోని పూర్ణానుస్వార మర్ధానుస్వారమగు నపుడు పూర్వాచ్చునకు దీర్ఘము కలుగుచున్నది.

అనుస్వారమును గొందఱు బిందువని చెప్పుచున్నారను శబ్దానుశాసనుని వచనమున కప్పకవ్యాదులు తమకాలపు సంప్రదాయము ననుసరించి వ్యాఖ్యానము చేసికొనిరి బిందువనఁగా బొట్టనియు. సున్నయనియు నప్పకవి వ్రాసెను బొట్టనఁగాఁ జుక్క, పూర్వకాలమున ననఁగాఁ బంత్రెండవ శతాబ్దమువఱకును ననుస్వారము జుక్కగనే వ్రాయుచుండెడివారు. ఆ చుక్క నక్షరమునకుఁ బ్రక్కగాకాక తలపై నిలుపుచుండెడివారు. రానురానది వ్రాఁతయందు ప్రక్కకుఁ జేరికొనుటయేకాక నిండుసున్నగకూడఁ బరిణమించినది. రాజరాజనరేంద్రుని కాలమున ననుస్వారమును వ్రాయుపట్ల ననునాసికాక్షరములనే చాలవఱకు వ్రాయుచుండెడివారు: డజ్కలప్రాన్ణి, జరిపిఞ్చువారు; పూణ్టు; మీన్ద; మొద. బిందువును దలపై వ్రాయునాచారమును నాకాలమున నుండెను. తరువాతి కాలమునఁ బూర్ణానుస్వారమును వ్రాయవలసినప్పుడు సున్నపెట్టి దానిమీఁది హల్లునకు ద్విత్వ మిచ్చుచుండెడివారు. ఇంద్దుల, ఇంక్క ; మొద. ఖండానుస్వారమును దెలుపుటకు ద్విత్వములేని హల్లునుమాత్రము వ్రాయుచుండెడివారు; ఇంక మొద. ఈ యాచారమన్ని శాసనములందను నొక్కతీరున లేదు. చూ మూణ్టికి, ఒకణ్టికి మొద.

సంస్కృతమునందలి ఖండానుస్వారమును దెలుపుట కక్షరముతలపై 'రంగవల్లి' యను నర్ధచంద్రాకృతిగల గుఱుతు నుంచువాడుక గలఁదు.

ఓఁ; సంస్కరోతి ; మొద. ఇట్టి గుఱుతును దెనుఁగున నర్ధానుస్వారమునకు వాడుచుండిరో లేదో తెలిసికొనుట కాధారములులేవు. అర్ధానుస్వారమున కఱసున్న—అనఁగా 'ఁ' అను చిహ్నమును వాడుట చాల నవీనాచారము. తెనుఁగునకు ముద్రణసౌకర్యములు కలిగినతరువాత నీ గుఱుతేర్పడినదని చెప్పవచ్చును. ప్రాచీనశాసనములందును దాళపత్రగ్రంథము

లందును నర్ధబిందువుగాని, యఱసున్నగాని కాన్పింపదు. పైఁజెప్పినట్లు నిండుసున్నయే వాడుకయందుండెడిది; హల్లులకు ద్విత్వమును గల్పించుటచే నొకప్పుడు పూర్ణానుస్వారోచ్చారణమును దెలుపుచుండెడివారు. వ్రాయసకాండ్రర్ధానుస్వారము నుచ్చరింపనిపట్ల నెట్టి గుఱుతును నుపయోగించెడివారు కారు.

సిద్ధానుస్వారమనఁగా నాంధ్రమున నా శబ్దము వెలసిన నాఁటనుండియు శబ్దములందు గనఁబడుచున్న యనుస్వారము. సిద్ధపూర్ణానుస్వారమున కుదాహరణములు: పొంకము, ఇంతి; పొందు, సొంపు, మొద. సిద్ధార్ధానుస్వారమున కుదాహరణములు: వెలఁద, చెలఁగు, తలఁచు మొద.

సాధ్యానుస్వారమనఁగా సంధి, సమాసాది కార్యములచే శబ్దములందు గలుగు ననుస్వారము. ఇది సకారనకార స్థానములందు గూడరావచ్చును. సాధ్యపూర్ణానుస్వారమున కుదాహరణములు: క్రొంబసిఁడి, పందొమ్మిది, అందఱుకు, కెందోవ, చెంగల్వ, తళుకుంగజ్జలు, తలంబ్రాలు, పెనుఁగొండ, సంగోరు:—కెందమ్మి, చెంగలువ, ముంగొంగు, వంజెఱఁగు— మొదలగు శబ్దములందు పూర్ణానుస్వారము మొదటి నుండియు నున్నది గావున వానిని సాధ్యపూర్ణానుస్వారమున కుదాహరణములుగ నిచ్చుట తగదని తోఁచుమన్నది.

సాధ్యార్ధానుస్వారము ద్రుతము స్థానమునను, కొన్ని యెడల సాధ్యపూర్ణానుస్వారమునకు బదులుగను వచ్చుచుండును:—జలజాక్షుఁగొలుతు; తలఁబ్రాలు మొద.

ప్రాకృతములందును నేఁటి యార్యభాషలయందును ననుస్వారమొకహల్లునకైనను బూర్వమందు రావచ్చును. తెనుఁగునందది పరుషసరళములకుఁ బూర్వమందే కాన్పించును. తెనుఁగున మహాప్రాణములు లేవుగావున వానితోఁ బ్రసక్తి లేదు.* య, ర, ఱ, ల, వ, స, హ, శ లకుఁ బూర్వమునఁ దెనుఁగున బూర్ణార్ధానుస్వారములు రెండును నుండవు. 'న, మ' లకుఁ బూర్వమందనుస్వారసంజ్ఞనుంచి వ్రాయునాచారము తాళపత్త్రగ్రంథములందు గానవచ్చుచున్నది. అంన్న, అంమ్మ మొద.

దీర్ఘముపై నున్నది యర్ధానుస్వారముగాని పూర్ణముగాదు. అర్ధానుస్వారము 'అఁట, ఇఁక, చుఁడు' అనువానిలోఁ దప్పఁ బదముల తొలియచ్చుపైఁగాన్పింపదు.

తెనుఁగు పదములందలి యర్ధానుస్వారమును నిర్ణయించుట కయిదు మార్గములున్నవి. (1) ఆ పదములందలి యర్ధానుస్వారముతోఁగూడిన హల్లు పద్యముల ప్రాసస్థానమందు గనఁబడుట; లేదా' పద్యగణము సరిపోవుట కర్ధా

నుస్వారము పూర్ణానుస్వారమగుట; (2) శాసనములం దాయాపదము లర్ధానుస్వారచిహ్నముతోం గాన్పించుట; (3) లాక్షణికులును నైఘంటుకులును నాయాపదము లర్ధానుస్వారయుక్తములని చెప్పుట; (4) నేటివాడుకయందాయా పదములం దర్ధానుస్వారోచ్చారణము వినంబడుట ; (5) ఇతర ద్రావిడ భాషల యందును, ప్రాచీనార్వాచీనార్యభాషలయందును, తెనుంగు పదములతో సంబంధముగల పదములం దనునాసికముగాని యనుస్వారముగాని యుండుట.

వీనిలో మొదటి రెండుమార్గములును దెనుంగుపదములందలి యర్ధానుస్వారనిర్ణయమునకుం జాలవఱకుం దోడ్పడును. అర్ధానుస్వారజ్ఞానము నన్నయ, ఎఱ్ఱన, తిక్కన, నన్నెచోడుల గ్రంథములవలన నెక్కువనిశ్చయముగ సంపాదింపవచ్చునని తోంచుచున్నది. ఆ తరువాతికవుల గ్రంథములందు ప్రాసస్థానమున సాంకర్యము కలిగినది. అర్ధానుస్వార మేశబ్దమునను౦డవలెనను విషయమునంజాల తబ్బిబ్బులు గలిగినవి. ప్రాసముకొఱకును గణముల కొఱకును గొందఱుకవులు కల్పనాకర్తలు పడసాగిరి. కావున నర్ధానుస్వారనిర్ణయము పట్లం బైనుదాహరించిన కవుల గ్రంథములే ప్రమాణమగుచున్నవి. ఇతర కవుల గ్రంథములందలిపదములు పై వారిమార్గము ననుసరించుచో నా ప్రయోగములకు మఱింత బలము గలుగును; పూర్వకవుల ప్రయోగములచే స్థిరములుగాని యర్వాచీనుల ప్రయోగములు సందేహాస్పదముల క్రిందం జేర్పవలయును; అందుం బూర్వకవిప్రయోగవిరుద్ధములయినచో నర్వాచీనులకుం బ్రమాణము లేదనియే చెప్పవచ్చును. శాసనములం దర్ధానుస్వారమున్నయెడల నా కాలమున నాశబ్దమునం దర్ధానుస్వారమున్నదనియే నిర్ణయింపవచ్చును. ఇంక లాక్షణికులయు నిఘంటుకారులయు నుదాహరణములు పూర్వకవిప్రయోగములనుబట్టి విమర్శించుకొనవలసియున్నది. నేటివాడుకయం దర్ధానుస్వారము గొన్ని ప్రాంతములయం దున్నను నది పూర్వకాలమునుండియు నుండెనో, యిటీవలం గలిగెనో కనుగొనవలెను. ఇతర భాషలయందు మూలపదములలో ననునాసికానుస్వారముల నయుచ్చారణమున్నను దెనుంగునంగూడ నదియుండవలెనను నియమము లేదు. ఇతరభాషలయందలి యనుస్వారోచ్చారణమును దెనుంగువా రాదినుండియు విడిచియుండవచ్చును ; అనుస్వారములేని పదములంగొన్నిటిని క్రొత్తగ సానుస్వారముగ నుచ్చరించుకొనవచ్చును. అయినను నర్ధానుస్వారనిర్ణయమునం దుదిమూండు మార్గములను గొలందిగనైన నుపకరింపక పోవు.

ఈ క్రింది పట్టికలో శబ్దరత్నాకరకారుం డిచ్చిన యర్ధానుస్వారము గల పదములు చేర్పంబడినవి. వానికి శాసనములనుండియు, నతం డుదాహరింపని యితర గ్రంథములనుండియు పదములు చేర్పంబడినవి.

ప్రాసగణములచే నిర్బాధములైన పదములకును, దక్షిణహిందూదేశ శాసనావళి **(South Indian Inscriptions) IV, V, VI,** సంపుటములలో దొరకిన పదములకును నాశ్వాసాది సంఖ్య లీఁబడినవి. ఈ పట్టికలో × అను గుఱుతుగల పదము శ. ర. లో నియమింపఁబడినది కాదనియు, V అను గుఱుతు అప్పకవికూడ నుదాహరించెననియు, v అనునది యితర విధములఁ బట్టికలోఁ జేరినదనియుఁ, బ్రత్యేకముగ నంకెలుండినచో నవి శాలివాహనశకవత్సర సంఖ్యలనియు, రోమనుల అంకెలును పిదప నింగ్లీషు అంకెలును నున్నచో నవి దక్షిణ హిందూదేశశాసనసంపుటములసంఖ్యయు నందలి శాసనసంఖ్య యుననియుఁ దెలియవలెను. పదముతరువాత నెట్టి యంకెయు లేకున్నచో దానియం దనుస్వారమున్నదనుటకు నిఘంటుకారుఁడు తప్ప మఱే యెట్టి ప్రమాణమును లేదని తెలియవలెను.

ఈ క్రిందఁ జూపిన పదములందలి యర్ధానుస్వారములు ప్రాసస్థలములందుండుటచేతను నాయా పద్యముల గణానుసారముగ నవి నిండుసున్నలగుటచేతను, శాసనములందనుస్వారయుతములుగఁ గాన్పించుటచేతను యర్ధానుస్వారములు గలవిగ నిర్ణయింపఁబడినవి.

ఁక

ఆఁక (ద్రోణ. I. 201 ; నిర్వ. VII ; హరి. పూ. VII. 13 నృసిం. IV. 113; కుమా II. 849); ఉత్తరాఁక (కాళ. III , కాశీ VII); ఆఁకరము (ఆది. VIII. 203 ; రా. యు కాం.), ఆఁకలి (ద్రోణ II. 19, నృసిం. IV. 113 ; బసవ. 43) ; ఇఁక (ఆర. I. ) ; ఊఁకెర (బసవ. 239 పు. 10 పంక్తి ; 160 పు.) ; ఏఁకట (భీమ. II; మను. III), ఏఁకరు (రుక్మా. IV) ; కడఁక (విక్ర. III) ; కణఁక (భాగ V) ; కాఁక (జై. I) ; కాఁకర (బహులా. IV. 49); కూఁకె (శేష. I. ) ; కూఁకట (పండితా. 371 పు ; కళా. I ) ; జూఁక (భీమ. IV. 4-వ. అనుప్రాసము) ; తోఁక (భాగ. VIII ; పండితా. 343 పు; బసవ. 238 పు. 22 పం.), నాయఁ(ం)కరము (పాండు. I ; శా. శ. 1440, 1453) ; నూంకమ (శా శ. 1074); పోఁక (కుమా. II. 89 ; శా. శ. 1021, 1072, 1087, 1094, 1191 ; ద. ఇం. శా. IV. 102 ; V. 65); పోఁకముడి (ఉ. రా. VI) ; ప్రోఁక (పండితా. 72 పు ; బసవ. (174 పు. 5 పం.) ; మలఁక (కాశీ V), మూంకన (శా. శ, 1156) ; మూంకమ (శా. శ. 11) మ్రూఁక (ఆది VIII. 203 ; ద్రోణ. II. 136 ; ద్రోణ. III. 263 ; పండితా. 278 పు ; బసవ. 29 పు. 130పు. 22పం ; 160 పు. 11 పం) ; మేఁక (బసవ. 97 పు. 6పం ; శా. శ. 1152. 1178) ; మోఁకరించు (బసవ. 224 పు. 1 పం) ; మోఁకతెల్లు (భాగ. VIII).

రోఁకలి (నిర్వ. VII ; జై. I ) ; లేంక (శా. శ. 1268); వాఁక (బసవ; 130 పు. 22 పం.) ; వీఁక (ఆది. VIII. 203 ; అర. III. 312 ; భీష్మ. I. 254 ; ద్రోణ I. 201 ; II. 19, 136 ; అశ్వ. IV. 21 ; నిర్వ. IV. 55 ; VII; నృసిం. IV. 113 ; కుమా. II. 849 ; పండితా. పుటలు 72, 75, 153, 307, 347; బసవ 97 పు. 6 పం ; 230 పు. 22 పం; 239 పు. 12 పం.; భాగ. VIII. ; రా. బాలకాం.), వ్రేఁకన (ద్రోణ. I. 201) ; వ్రేఁకము (జై. I ).

ఁకా

నూంకాండి (శా. శ 1094) ; మాంకాసాని (శా. శ. 11 ) ; మోఁకాలు (రా. యు. కాం , రామా. యుద్ధ ; పండితా. 371, 372 ; బసవ. 224 పు. 1 పం.)

ఁకి.

వాఁకిట (పండితా. 278పు ; 343పు.) ; తాఁకించు (భో. VI) . మాంకినాయండు (శా. శ. 11.).

ఁకు

ఆంకులు (ద. ఇం. శా. V. 25) , ఊఁకు (భాగ. X ) , కలఁకులు (అర. III.) ; తేఁకువ (ద్రోణ II. 19 , భో. IV) , తొలఁకు (వా. V ; య. IV ; విష్ణుపు. VII) ; నడుఁకు (నిర్వ II ) ; పలఁకున (చంద్ర.) ; నాయఁకుఁడు (చంద్రా. II ) ; నూఁకు (పండితా 397పు ; బసవ. 15పు) ; వెనఁకువ (చంద్ర.), ప్రాఁకు (హరి పూ VII 13 , రా. యు. కాం.) ; బెడఁకు (కళా. IV ; వసు IV ) , మొలఁకువ (విరా. I. ) ; మ్రాఁకులు (అర III. 312 , ద. ఇం. శా. IV. 1021 , శా శ. 1087) ; *మ్రోఁకు (బసవ. 194పు 5పం.) ; వణఁకు (జై . VI , వా V ) వాఁకులు (రా. బాలకాం ) ; పలఁకులు (హరి ఉ. III) ; సాఁకు (బసవ. 67) , సోఁకు (కుమా. II. 89) . తాఁకు (ఆది VIII. 203 , భీష్మ I. 254 , ద్రోణ I. 201 ; II. 263 ; అశ్వ. IV. 21 , నిర్వ. IV. 55; VII ; నృ. IV. 113 ; పండితా. 75, 153, 372, 397 ; బసవ. 174 పు. 7 పం.).

ఁకొ

ఆఁకొను (పండితా. 347పు ; బసవ. 67పు.) ; ఊఁకొను (హరి. ఉ. III) ; తోఁకొని (బసవ. 29పు. 8పం ; భో. IV.) ; దొరఁకొను (భాగ. I. ); ప్రాఁకొను (వేమన శతకము).

ఁగ

ఈఁగ (పండితా. 1521 పు.) ; * ఈఁగరులోఁడు (కుమా. I. 492) ; గొజ్జఁగ (మను III), గొజ్జెఁగ (కళా. IV) ; చాఁగఅ (హరి ఉ VI), చాంగలమ్మ (శా శ. 1440) ; తుఱఁగలించు (విజ. III) ; నాఁగలి (హరి ఉ. VI 181) ; పాఁగము (పండితా. 398పు) ; బలఁగము (కళా. III) ; మండెఁగ (నైష VII) మాఁగను (కవిక. IV) ; లాఁగ (ఆశ్వ. II. 151), లేఁగ (బసవ. 239పు. 7 పం), వలంగలేటి (శా శ. 1191) ; వెలఁగ (భాగ X), సంపెఁగ (య. IV) ; నాఁగటి (పండితా. 29పు ; బసవ. 111పు 7పం)

ఁగా

నూఁగారు (హరి. పూ VI 180), మీఁగాలు (పండితా. 132) ; వీఁగారు (కుమా. II. 9)

ఁగి

కౌఁగిలి (పండితా. 144పు), చెనఁగి (హంస IV) ; జోడఁగి (పు. II)

ఁగు.

అనఁగు (హరి. ఉ IV) ; అనుఁగు (హరి. ఉ. III. ; శా. శ. 1235) ; ఆరఁగు (ఆము V), ఆరుఁగు (పాంచా IV) ; అలఁగు (భాగ. I) ; ఆఁగు=అణఁగు, నిషేధించు (ఆమ III; అశ్వ 216; కుమా I. 492; పండితా. 352 పు; రామా VIII), ఊఁగు (పండితా. 352పు); ఈఁగు (పండితా. 352పు; పాండు I) ; ఏఁగు (పండితా. 94, 132, 144, 352 ; కళా III) ; కడఁగు (హరి. ఉ V) ; కరఁగు (లక్ష్మీ III) ; కాఁగు (భాగ. IX) ; గొడఁగు (పాండు. IV) ; చనుఁగు (గాంచ V) ; చిరుఁగు (కాశీ VI) ; చెఱఁగు (రామా. VII), చెలఁగు (ఆను 77) ; చాఁగు (బసవ. 9, 11, 213 పు. 6 పం), చాఁగురె (విజ. II) ; జుమఁగు (చంద్రా II); జుణుఁగు (రామా. VIII) ; డాఁగు (కుమా I. 4, 492) ; తెఱఁగు (నిర్వ V), తునుఁగు (అచ్చ. అర కాం), తెఱఁగు (అచ్చ. యు. కాం.) ; తెలుఁగు (శా. శ. 1407 ; ద. ఇం. శా IV. 988) ; * తేఁగు (పండితా 352పు) ; తొడఁగు (శాంతి. II ; పండితా. 28, 371 ; భా. VII) ; తొరఁగు (విజ I) ; తొఱఁగు (కళా. VII) ; తొలఁగు (శివ I) ; తోఁగు (పండితా. 352పు ; పాండు. I ; కళా. III) ; దాఁగు (పండితా. 352) ; నలఁగు (ఉ. హరి. II ; V : కళా, IV) ; నలుఁగు (పాంచా. IV) ; నిసుఁగు (అచ్చ.

యు. కాం); నుఱుఁగు (రాజ. I. ); పలుఁగు (సభా. I ; ఉ హరి. II ); (కొమ్మన) పాంగుపూంఁడి (ద ఇం శా. V. 65); (గంగన) పాంగు (శా. శ. 1122); పెనఁగు (బసవ. 13పు); పెరుఁగు (మార్క. III ; పాండు. V ; హంస II); పొనుఁగు (లక్ష్మీ I ); పొసఁగు (ఉద్యో. IV ; హ. వ. II ; పాంచా. I ; శశాం.II ); బెడఁగు (వసు V ; కళా.III ; భాను. I , యుద్ధమల్లుని బెజవాడ శాసనము); మడఁగు (మార్క. VI. వ. అనుప్రాసము); ముఱుఁగు (ఉ. హరి. V. ; పా II ; రుక్మి. V ); మఱుఁగు (కళా. IV); ములఁగు (భీ IV); మిడుఁగుఱు (మార్క VI); మునుఁగు (ఆను. IV); ముసుఁగు (పర IV), మూఁగు (కళా. III ; పండితా. 94, 151, 352 పుటలు ; బసవ. 239పు. 7పం.); మెఱుఁగు (కర్ణ. II ; విజ. III ; భల్లా I. ); మొఱఁగు (భాగ. X. వ. అనుప్రాసము); మొఱుఁగు (అధ్యా. అ కాం), మ్రాఁగు (పూ. III); మ్రోఁగు (రామా. VIII ), రేఁగు (హరి. ఉ. VI. 181 ; పండితా 29, 352 పుటలు); లోఁగు (ఆశ్వ. II. 151 , కుమా. I 4, 492 ; పండితా. 371 పు ; కళా. III ; ఆను. V ), వాఁగు (శా. శ. 1440, 1483); వీఁగు (ఆది II. 84 ; కుమా.I. 4 ; పండితా. 151, 352, 371 పుటలు ; బసవ 111 పు. 7 పం.); వెడఁగు (అశ్వ. I. 195 ; అచ్చ. సుం. కాం.); వెలుఁగు (మార్క VII ; చంద్రా I ; శా శ 1076), వేఁగులవాడు (విక్ర. VIII. 57) ; వ్రేఁగు (హరి. ఉ. 181 , కుమా. II. 9); సురుఁగు (విక్ర. III).

ఁచ

కాఁచర (ఆం. భా. ద్వి. వ.).

ఁచా

నాంచారు.

ఁచి

ప్రాఁచి (బసవ. 70 పు )

ఁచు

అలఁచు (మార్క. V) ; ఆఁచు (కళా. I వ. అను ప్రాసము); ఊఁచు (కళా. I .) ; డాఁచు (పండితా. 82 పు.) ; తొలఁచు (పాండు. II ); త్రేఁచు (పండితా. 271 పు.) ; నలఁచు (రాఘ. II) ; పూంచు (పండితా. 271 పు. శశాం. IV) ; పెనఁచు (భో. II) ;*పోఁచు (పండితా. 82 పు) ; మలఁచు

(చంద్రా. II.) ; లాఁచు (హరిశ్చ. II.) ; లోఁచు (కళా. I.) ; వాఁచు (విష్ణు. VI) ; సయిఁచు (భాగ. ద్వి. III.)

ఁజు

కడఁజు (ఆం. భా. ద్వి. సిం.) ; గురుఁజు (విజ. II.) ; పరుఁజు (మను. IV.) ; రోఁజు (బసవ. 186 పు. 6 పం.) ; వెరఁజు (ఆము. IV )

ఁట

ఏఁట (అను. III. 104) ; ఒకంట (శా.శ. 1172) ; తీఁట (పండితా. 273, 307 పుటలు) , తూఁట (పండితా 102, 273 పుటలు) ; తోఁట (శా.శ. 1172, 1307, 1440) ; పూండోంట (శా. శ 1186) ; పూఁట (ద. ఇం. శా. 1018) ; పైఁట (పాంచా. V) , బీఁట (అచ్చ కిష్కి కాం.) ; వేఁట (ఉద్యో. IV. 107 ; బసవ. 79 పు. 24 పం , రా. యు. కాం ; భాగ. IX.) ; వేఁటగిరి (రా. వి. III.)

ఁటా

ఊఁటాకు (భాస్క అర. 197 )

ఁటి

ఁటి,- ఇఁటి,- ఇంటి,- ఇణ్టి-ఉన్నింటి (అర 1 95) ; ఒక్కంటి (విరా. I. 135 , ద ఇం. శా. V. 12); ఒకణ్టి. (ద ఇం శా. V 15); ఒక్కణ్టి(శా. శ. 1172) నూంటి( శా. శ 1281), ఏంబమిణ్టి( శా. శ. 1172) ; ఎదిణ్టి (శా.శ. 1172); పదింటి(ద.ఇం. శా. V. 12); యిన్నూంటి (ద ఇం శా. 4); యేంభదింటి (ద. ఇం. శా 15,17); *ఏఁటికి=ఏమిటికి (రంగరా. యు 321, కళా. III, భాగ. IV.); తాంటిపత్త్రి (శా శ 1181), తేఁటి (భాస్క అర. 197); పఁటి (ఆము. I.) ; పరఁటి (భో. VI); బోఁటి (రా. అర కాం); సుదఁటి (చంద్రా. II) ; సురంఠ (శా. శ. 1532) , సురఁటి (శశాం III , చంద్ర )

ఁటు

*కాఁటు (పండితా 102 పు.), క్రేఁటు (భల్లా I);గేఁటు (భాగ. IV.); తూఁటు (అను. III. 301) , దాఁటు (బసవ. 15 పు. 16 పం.) , * నాఁటు (ఉద్యో. IV. 407 ; బసవ. 15 పు 16 పం ; పండితా. 113 పు.) ; పొరఁటు (ఆము. IV) ; బేఁటు (అను V) ; మాఁటు (రంగరా. యు 321) ; *మీఁటు (ఉద్యో. IV. 497).

ఁడ

చోండనాణ్టి (ద. ఇం. శా. 1014 ; చాఁడయ్య (పండితా. I. 3553 పం.) ; మాండలు 1051) ; తూఁడరి (భో. VI.)

ఁడా

ఏఁడాది (ఉ. రా. VII ; శా. శ. 1172).

ఁడి

ఆండి (పెరుమాండి నాయుడు, ద. ఇం శా. IV. 974) ; బ్రమ్మాండి, భీమాండి (శా.శ. 1123); ఏఁడి=ఎక్కడనున్నాఁడు (అచ్చ. అ కాం ); చూఁడి (పండితా. 53 పు ), తాండిపతిరి (శా శ 1181) ; పసిఁడి (రాశీ V ), పహిండి (ద.ఇం శా. IV, 938;-శా. శ 1211, 1265 , 1275); ...ఁడి (ఆర V. 218 ; శా.శ. 1268) ; పిల్లాఁడి (కళా. VII.) ; పూండి (జీకిపూండి, ద. ఇం శా. V. 43, 74 ; శా. శ. 1192) ; పైఁడి (భాస్క అర 25) ; పోఁడి (ఆది. III. 112 ; ఆర. V. 28 ; బసవ. 76 పు II పం ; 87 పు 12 పం ; 316 పు; పండితా. 41, 210, 311 పుటలు) ; పోఁడిమి (విరా I 238 , V. 110 , ఉద్యో. III. IV. 35 ; భీష్మ III. 325 , ద్రోణ I 232 ; కర్ణ II 375, 392 ; కళా. III ); పూఁబోఁడి (భీ. I ); వాఁడిమి (ఆది. III. 12; విరా I 238 ; V. 110 ,ఉద్యో. III, IV 35; భీష్మ. III 325, ద్రోణ.I. 232 ; IV. 57, 202 ; కర్ణ. I ; II 392 ; శల్య I. 148 ; సౌ I; శాంతి II 11 , నిర్వ X.); వేఁడి, వేఁడిమి (విరా. V. 110 ; ఉద్యో. III, భీష్మ. III. 325; ద్రోణ I. 232; కర్ణ II 302 ; భో. I ; IV.)

ఁడు

ఆఁడు (పుంప్రత్యయము) ఆశ్వ. II 97 ; ఆఁడు= స్త్రీ (విరా I. 238, పండితా. 54, 210 పుటలు) ; - ఎఁడు=ఒరిమార్థక ప్రత్యయము (అడ్డెండు. శా. శ. 1189 ; 1006 ; ద. ఇం. శా IV 974 ; తివెండు, శా. శ. 1183 . తవ్వెండు, శా. శ 1114 , తూమెండు, శా శ. 1244 , పుట్టెండు, శా. శ. 1192 ; పుట్టెండు, ద. ఇం శా IV 773 ; తూమెండు, శా శ. 1205 ; ద ఇం. శా. V. 15 ; సోలెండు. శా శ 1154) , ఎక్కుఁడు (ఆర I 391 , V. 33 ; పండితా. 405 పు.) ; కాఁడు క్రి (పాండు IV);- కాఁడు = పుంప్రత్యయము (ఆర. V. 191 : ఆవజకాండు, కరడకాండు, కహాళకాండు, మద్యలకాండ్రు, శా. శ. 1172) ; చూఁడు = కాల్చు జై. V.); తూఁడు (విజ I.) , నింపుండు (కుమా I 217); నేఁడు (ఆది III 112;ఉద్యో IV. 35; భీష్మ. VI. III. 325 ; ఆశ్వ. II. 97. ద్రోణ I. 232);- నేండు (పుం ప్రత్యయము); శా. శ. 1191 ; ఏఁడులుఁ బూఁడులు (జై. IV. పాంచా. IV);* పోయుండు (కుమా. I. 217); బోండు (శా. శ. 1193); మూఁడు (ద్రోణ. IV. 27.202; కర్ణ II. 375 ; శల్య. I. 148; శాంతి. II. 11 ; హరి. ఉ. IV. 167; పండితా.

53, 113 పుటలు, రా. యు. కాం; శా. శ. 1072, 1268; ద. ఇం. శా. IV. 974) ; పదుమూఁడు (శా. శ. 1220); వేఁడు (ఆది. V. 218 ; అను. II. 280; బసవ. 66 పు ; 87 పు. 12 పం ; పండితా. 54, 319 పుటలు.

ఁత

అలఁత (కర్ణ IV: అని III), ఊఁత (అను VI ; శివ ఉ. III.) ; కడఁత (ఆం. భా. ద్వి ప) ; కూఁతలు (ద ఇం శా. IV. 938) ; కొఱఁత (అచ్చ. సుం. కాం) ; చేఁత (మను. III) ; చేఁతలికము (పంచ. నా. I) ; నేఁత (అను VI), పాఁతలు (బసవ. 72 పు 12 పం ); ప్రాఁత (మను III) ; ప్రాఁతకొ లేంతలు (శా. శ 1275), ప్రాఁత (ఉ. హరి. IV ; శా. శ. 1121); రోఁత (శివ. ఉ. II , భల్లా V.); లేఁత (మను. III , శివ. ఉ. II ; శా. శ. 1275) ; * వేఁతరు (మను. III)

ఁతి

కడఁతి (శుక. I) , * చేఁతిక (శివ ఉ II) ; లాఁతి (ఉ. హరి. IV.) వలఁతి (ఉద్యో. III)

ఁతు

అన్న ప్రాఁతు (ద. ఇం. శా. IV. 1380) ; లోఁతు (నిర్వ. VIII.) 49; బసవ I 74 పు. 12 పం) , కూఁతుఱు (శా. శ. 1005 ; కూన్తుఱు) (శా. శ. 1151, 1197).

ఁద

చీఁదఱ (హరి. ఉ. I. 103 ; భో. VI.) బెడఁద (రసి. V.) ; మీఁద (భీష్మ. I. 188 మాన. 61 , బసవ. 25 పు. 19 పం; 71 పు. 1 పం.); వలుఁద (బసవ. 136 పు;చెన్న. IV.); కడిఁది;) అర. III; కళా. VII); మఱఁది (భల్లా V; భాను. IV, శా. శ. 1163, 1453) ; మీఁది (శా శ. 1094, 1326, 1344) వెలఁది (హ. న. II; విజ. I)

ఁదు

అలఁదురు (విరా. I.) ; ఈఁదు (నిర్వ. VIII. 49); ఊఁదు (భీష్మ I. 188); * ఏఁదు (నృసిం. V. 12); ఏఁదుసు (ద. ఇం. శా. IV. 974 ; శా. శ. 1172, 1235), పిఱుఁదు (ఆది. IV.); మోఁదు (మాన. 61 ; నృసిం. V. 12. హరి. ఉ. I. 103, ఉ. హరి. VI) ; వెలఁదుక (అచ్చ. సుం. కాం.); వేఁదఱు (నృసిం. V. 12; లక్ష్మి. V).

ఁగె

గేఁదెలు (శా. శ. 1072.)

ండో.

పూండోంట (శా. శ 1186).

ంప

ప్రంపల్లి (శా. శ. 1220).

ంపు

* అచ్చంపు (నృసిం. I. 67), కాంపు (పంచ. వేం. IV, ద ఇం. శా V. 65; శా శ. 1043. 1056, 1072, 1481); కాంపురము (పంచ. వేం. IV.); చేంపు (చెన్న IV); తలంపు (ఉద్యో. I); తీంపురము (పంచ. వేం. IV); లోంపు (శా శ. 1307, 1319); దాంపురము (పంచ వేం. IV.) పోంపు చెన్న. IV); మూంపు (హరి. పూ VI. 180)

ంబో

ఆంబోతు (పండితా. 390, శా. శ. 1135), పూంబోండ (ఫ. I.)

భ

యేంభది (శా. శ. 1235); యేంభయి (ద ఇం. శా. V. 76), యేంభయును (శా. శ. 1172); యేంభ యేను (శా. శ. 1172)

పై ప్రయోగములను బట్టి యీ యీ పదములతో సంబంధించిన మఱికొన్ని పదములందును నర్ధానుస్వార ముండవలెనని నిర్ణయింపవచ్చును. కాని, వాని యీయీపదములకు బ్రమాణములు దొరకలేదని గ్రహింప వలెను. అంట, అఱ్ఱాంకలి; అలంతి; ఆంకట్టు; ఆంకత్రాళ్లు, ఆంకపడు, ఆంకపెట్టు. ఆంచికొను, ఆండంగి, ఆండది,—ఆండి, ఆండుకట్టు (—కూంతురు, —తోడు, పడుచు, —పాప, —పుట్టువు,—బిడ్డ), ఆమని, ఆందోంక (-పాటు), ఆంపు, ఆంబసి, ఇంగ, ఈండులాడు, ఊంక, ఊంకించు, ఊండుచు, ఊంకువగు, ఊంకొట్టు, ఊంగాడు, ఊంట, ఊంతెము, ఊంపు, ఊంపురము, ఎడంతాకు, ఎరంగుడు, ఎలుంగించు, ఎసరేంగు, ఏంకరి, ఎంకాకు, ఏనుంగు, ఏంబంద్రు, ఏంబది, ఏంబలము, ఏసరేంగు, ఓంకాంపు, కముంజు, కిరంచు, కలంత, కలంకులు, కలంగు, కలంచు, కలంత, కాంగుడు, కాండ, కాండి, కాంపడము, కాంపుడు, కాంపురము, కాంపురించు, కూంకరించు, కూంతి, కైచాంపులు, కైసేంత, కొఱంకులు, కొలంకులు, కోంత, కౌంగిలించు (-ంత; ంపు); కౌంజు, క్రాంక, క్రాంగు, క్రాంగుడు, క్రాంచు, క్రేంటుకొను, గీంతి, గొణంగు, గవంకులు, గాండి, గాండిగడుగు, గోంతి, గాండు. గూండు, గూండుబండి, గోంగులు, చెన్నంగి, చేంపుడు, చాంగిలింత, చాంగిల్లు, చివ్వంగి, చెరపం, చేంత్రాడు, చాంచు, చుండి, చుండు, దాంగనమ్రుచ్చులు, దాంగిలి మూంతలు

(—ముచ్చులు), డాఁగుడుమూఁతలు, దాఁగురించు (-౦త), దాఁగురు మూఁతలు, డాఁపు, తలఁచు, తలపోఁత, తాఁకుడు, తాఁకుడల, తలాఁపి, తల్లఁపి, తాఁబేలు, తీఁడిరించు, తుఱుఁగలి, తూఁటరి, తూఁటు, తూఁటి కూర, తునుఁగు, తొడఁకు, తొలఁకాసు, తోఁటకాఁపు, తేఁకు. తోఁటకూర, తోఁటీఁడు, త్రేఁపు, దాఁక, దాఁకొను, దాఁగనముచ్చులు, దాఁగిలిమూఁతలు (-ముచ్చులు), దాఁగురించు (-౦త), దాఁగు రుమూఁతలు, దాఁపన, దాఁపరము, దాఁపరించు, దూఁకలి. దూఁకు, దూఁ కొను, దూఁకుడు, దూఁట, దూఁలు, దూఁటుకొను, దూఁబెస, దేఁకు, దొరఁకు సన్న్యాసి, నలఁక, నలఁగుడు, నలుఁగుడు నాఁగెలు, నాఁగేలు, నాయఁకవాడి, నిఁగు, నెఱఁపులు, నెలఁత, నెలఁతుక, నేఁజెల్ల, నేఁతరి, నోఁచు, నోఁత, పడఁతి, పడఁ టు, పలుగాఁడి, పాఁత, పఁతు, పాఁప (-ము), పాసఁగు, పిరుపీఁకు, పీఁకు, పీఁక, పీఁచము, పునుఁగు, పులుఁగు, పూఁటకూళ్లు, పూఁపు, బాఁపత, బాఁపన, బాఁపడికము, పేఁరె, పేఁట, పేఁలు, పేఁడ, పేఁను, పేరఁటము. పేరఁటాలు, పొలఁతి, పొలఁతుక, పోఁత. బాఁగ, బాఁపడు, ప్రాఁకుడు. బెళఁకు, బెళుఁకు, బోఁక, బోఁకె, మలఁగ. మడఁక, మడఁచు, మడఁతి, మడఁతుక, మడుఁచు, మణఁగు, మరుఁగు, మనుఁగు, మఱుఁదలు, మలఁపు, మసఁగు, మాఁగు, మాఁటిసింగ, మాఁదిమణఁగు, మిడుఁగు, మిడుఁగు, మిణుఁగురులు, మీఁదు, ముక్కుఁపు, మూఁతి, మూఁపురము, మెలఁగు, మెలఁచు, మెలఁతుక, మేఁత, మోఁచెయి, మోఁతి, మ్రాఁకు, రేఁగడు, రేఁకుము, రేఁచు, రోఁజుడు, లాఁ గలి, లాఁగించు, లాఁగు, లాఁత, లాఁతె, లాఁపు, లోఁకువ, లోఁగడ, లోఁగలి, లోఁగిలి, లోఁబడు, వణఁకు, వాఁతి, వలఁకువ, వాఁత, వాఁపు, వెడఁద, వెరఁగు, వెఱఁగు, వేఁత, వేఁగ, వేఁటరి, వేఁపు, వేఁపుడు, వేసఁగి, వేఁబోక, వ్రాఁత, వ్రేఁకట, వ్రేఁచు, వ్రేఁత, వ్రేఁపు, వ్రేఁపుడు, సిగ్గేడి, సైఁపు, సైఁపుడు, సోఁకుడు.

ఈ క్రింది పదములలో శబ్దరత్నాకరమునఁ జరసున్న చేర్పఁబడినది. అందుఁ జాలాపదములకుఁ బ్రయోగము లీఁబడలేదు. ఇచ్చిన ప్రయోగములు ప్రాసస్థానమందు లేవు; గణములచే నిర్ణయింపఁ దగినవి కావు.

అడఁకువ, అడఁగారు, అడఁగు, అడఁచు, అనఁటి, అరఁటి, అరగూఁడు, అలఁదు, అలుఁగు, ఆఁగాకలి, ఈఁకె, ఈఁజేటి, ఈఁటియ, ఈఁటె, ఈఁద, ఈఁదర, ఈఁదాడు, ఊఁచె, ఊఁచబియ్యము, ఊఁచముట్టు, ఊఁది, ఊఁదర, ఊఁదువత్తి, ఊఁదువెండి, ఎఱుఁగు, ఎఱుఁగు, ఎలుఁగు, ఎల్లఁపి, ఏఁజెల్ల, ఏఁడికోల, ఏఁడుడి, ఏఁదరి, ఓఁక, ఓఁకలింత, ఔఁగు, కణఁకు, కణఁగు, కణఁ జము, కణఁజు, కణఁత, కణఁతి, కలుఁగు, కలుఁజు, కాఁచి, కాఁదారి, కాఁదారి

మూఁదారి, కీఁచు, కీఁచట్లు, కెలఁకు, కొఱఁతనుఱుకు,కోఁచి, కోఁడు, కోఁదాడు, క్రోఁతి, గాఁజర, గీఁకు, గీఁజు, గూఁటి, గోఁకు, గోఁకుడుపాలు, గోఁచి (-కట్టు, కాఁడు, - బాఁపఁడు), గోఁజాట, గోఁజాడు, గోఁజు, గోఁటు, గోఁదు, గోఁదుకు, గ్రాఁజ, చీఁకిలి, చీఁకు, చీఁద, చీఁదు, చీఁపురు, చెనఁటి, చెన్నఁటి, చెలఁది, చేఁతరాసి, చేఁతి = చేఁదుగల, చేఁద, చేఁదు, చాఁప, (-కట్టు,-గద్ద), చాఁపట్టు, చాఁపఱాయి, చాఁపలు, జాఁకించు, ఏఁకి, ఏఁకు, డాఁకొను, డోఁకు, డోఁగియాఁడు, డోఁగు, తరఁగ, తలఁకు, తలఁగు, తలఁగుడు, తాఁగలి, తాఁట (-కత్తె,-చమ్మఁడు), తాఁపు. తాగాఁడి, తూఁతకొమ్ము, తూని (నీ)ఁగ, తూఁపు. తేఁకు, తేఁజెట్టు, త్రోఁచిగాడు. తోఁచ; త్రోఁచు, తోఁ డెఁడే) లు, త్రోఁప, తోఁపిక, త్రాఁచు, దాఁగర, దోఁకిస, డోఁకు, దోఁకుడు, దోఁగాడు, దోఁగు, దోఁగురు, దోఁచు, దోఁటమ్ము, దోఁటి, దోఁటు, దోఁపరి, దోఁపిడి, దోఁపు, దోఁపుడు, నాఁగు, నాఁగురు, నాఁచు, నాఁపఱాయి, నుసుఁగు, నూఁక, నూఁగు, నూఁగుడు, పడఁతి, పరఁట, పాఁచి, పాఁపర, పీఁచర, పీఁచు, పీఁట, పుడుఁకులు, పొలఁకు, పోఁగు, పోఁచ, పోఁజు, ప్రాయిఁడి, ప్రేఁపుడు, ప్రోఁగు, ప్రోఁజు, బూఁజు, బూఁదు, మాఁడెము, ముక్కెఁడి, ముల్లుచిఁత, మూఁకుడు, మూఁగ, మూఁడుచు, మేఁగు, మేఁడి, మోఁద, మ్రేఁగు, రాఁజు, ఱాఁగ, ఱాఁగతుంగ, ఱేఁచు, లాఁక, లోఁడు, వాఁకుడు, వాఁగరత, వాఁగడుపు, వాఁపి, వాఁపిరి, వేఁకటి, వేఁకరము, వేఁకరి, వేఁకి, వేఁపి, వ్రాఁకుడు, సాఁగు, సాఁడు, సాఁతు, సైఁదము, సోఁగు, సోఁపు.

పై పదములలోఁ గొన్నిటియం దితరభాషా సంబంధమునుబట్టి యర నున్న లున్నవని నిర్ణయించు కొనవచ్చును.

అడఁకువ, అడఁగారు, అడఁగు, అడఁచు-తమి. అడఙ్గు; ఈఁదాడు - తమి. ఈన్దు; కడుఁదురు, కణుఁదురు - కన్న. కన్దురు, మళ. కడన్నల్; కడున్నల్; కాఁచి - కన్న. కాచి, కాంచి; కామంచ, కామంచి, కావంచి, కోఁతి - తమి. కోన్ది; గూఁడు - తమి. కూణ్డు; గోఁజాట, గోఁజాడు, గోఁజు - తె. కన్న. గుంజు; గోఁటు - కన్న. గోణ్టు; గోఁదు - హిం. గోంద్; తూఁత కొమ్ము - కన్న. తూన్తు; తేఁకు - కన్న. తేంగు; పీఁకు - తమి. పిడుంగు; బూఁజు, బూఁదు - తమి. పూంజి, పూంజు; సోఁపు - తమి. చోమ్పు.

ఇతరభాషాసంబంధము ననుసరించి కొన్నిపదములలో నఱనున్న యుండవలసినను, శబ్దరత్నాకరమున నట్టి పదములం దది చేర్పఁబడలేదు: గోద- కన్న. గోన్దె; చిలుక - కన్న. చిలంకు; బరుసు - తమి. పఱాణ్డు, పుఱాణ్డు, వఱిణ్డు; అలుగు - తమి. అల (లు)ంగు; కన్న. - అలుంగు.

ఇతరభాషాసంబంధమునుబట్టి యీక్రింది పదములలో నరసున్న యుండకూడకపోయినను శబ్దరత్నాకరమున నఱసున్నలు చేరియున్నవి: గోఁచి-కన్న. గోచి; చీఁకు - కన్న. చీఫు; తమి. చూప్పు; చీఁపురు - కన్న. చీపరి; తమి. చీ; చీక్కు; తోఁచు-కన్న. తోచు; తోఁపు - కన్న. తోపు; మళ. తోప్పు; తమి. తొగుప్పు, తోప్పు; దోఁకిస, దోఁకు, దోఁకుడు - కన్న. దోకరి; దోఁటి, దోఁటు-కన్న. దోటి; మళ. తోట్టి; పేఁట - కన్న. పేట; హిం. పేట్; మేఁడి - కన్న. మేడి; రేఁగు - కన్న. రేగు; రేఁగుడు - కన్న. రేగు; సాఁగు-కన్న. సాగు; సోఁగు - కన్న. సోగు; వేసఁగి - సం. వైశాఖ; సంపఁగె - సం. చమ్పక; చేఁత - సం. చేష్టా; పలుఁగు సం. స్ఫటిక.

ఈ క్రింది హిందూస్థానీ పదములలోఁ గూడ శబ్దరత్నాకరమున నఱసున్నలను జేర్చినారు:

గోఁదు (హిం. గోంద్); దూఁబఱ (హిం. దుబారా); పేఁట (హిం. పేట్); పోఁచి, పోఁచీ (హిం.పోచీ); బాఁకు (హిం. బాఖ); బాఁజు (హిం. బాజ్); లాఁపరా.

సాధారణముగ దీర్ఘాచ్చులపైఁ దెనుఁగునఁ బూర్ణానుస్వారము గాన రాదు; కాని, కొన్ని యన్యదేశ్యములపై నది నిలచియున్నది:

నాంచారు; బ్రాంది; మొద.

కొన్ని శబ్దములలోని యఱసున్నలను గూర్చిన విచారము:—

(1) అన్నిఁటి, ఒకఁటి,- ఈమొదలగు - 'ంటి' రూపాంతరములు గల శబ్దములలో నఱసున్నలను నిలుపవచ్చునా? శాసనములలో నాయా శబ్దములందు సున్న గనఁబడుచుండుటచేఁ జేర్పవచ్చుననియే తోఁచుచున్నది. శ. ర. లో 'ఎన్నఁడు'లో నఱసున్న యున్నది.

(2) 'ఎఁడు'- అను పరిమాణార్థక ప్రత్యయమునఁగూడఁ బైకారణము ననుసరించి యఱసున్నను జేర్పవచ్చునేమో!

(3) హీనార్థమున వచ్చు 'ఇడి' ప్రత్యయమున నఱసున్నఁ జేర్చుటకుఁ దగిన ప్రమాణములు కానరాలేదు. 'వాలిడి' మొదలగు శబ్దములను బట్టి యిది మహద్వాచకము కాదు; సాధారణముగ మహదమహద్వాచక శబ్దము లన్నిటికి నిది చేరును. కావున నిందుకుఁ దగిన ప్రమాణము దొరకువఱకు దీనిని నిరనుస్వారముగనే యెంచవలయును.

'ఆఁటు' అని శ. ర; నిర్వ. VII. 52-లో 'ఆటున' అని ప్రాసస్థాన మున నఱసున్న లేదు; - 'ఆఁటది' అనిశ. ర; 'ఆటదానికి' అని విరాటపర్వ మునఁ బ్రాసస్థానమున; 'ఊఁదు' (శ. ర.) ; బసవపురాణము - 15 పుటలో 'బూది' లోఁ బ్రాసయతి; ఎసఁగు (శ. ర.) ; శాంతి, III. 88-లోఁబిగువు ... నగములు .. ... వెల్లగు ... యె, సగు అనిపాఠము. మఱియొక ప్రతిలో 'యె, యొనగొనుఁ బురాస్థితిన,' అని పాఠాంతరము. ఈపాఠాంతరము నంగీకరించిన యెడల 'ఎసగు' లోని యఱసున్నకుఁ దగిన ప్రమాణము కొఱకింకను వెద కవలసి యుండును. ఏఁచు (శ. ర), విరా. III. 356-లో 'చూచుచు ...' ఆచపలాక్షి ... కీచక ... ఏచిన ; విరా. III. 44 - లో కీచక ..., వేచిన ..., ఏచిన ... కాచి ; ద్రోణ. V. 175. సీ. ఏచిదృష్టద్యుమ్నుఁ - డాచార్యు నుర మున ; శాంతి. III. 105-లో, తే. 'ఏచు తెఱఁగున నేచుచు-నీచకుటిల '; ఇందు ముద్రితపాఠమున 'ఏఁచు'అనియున్నది; అప్పుడు ప్రాససాంకర్యము కలుగును; ఇట్లే, నిర్వ. IV, 50. లో ప్రాసస్థానమున 'ఏచు'; 'ఏఁపు' (శ. ర.) ; అర. I, 294. సీ. పాపంగనోపక - యేపుటడని; అర. IV. 169 'సీ. ఏపునఁ నెప్పుడు-పాపం బునేయుచు'; విరా. III. 209 'క. మీాపనిచిన ... ఏపారిన . . ఆ, టోపము ... మ, హీపతి' ; ద్రోణ. I. 214 'క. రేపకడ . ఏపును ... ఆ, టోపంబున ... నన్నా, హాోపక్రను; ఇట్లే, ద్రోణ. III. 140; నిర్వ. VII. 30; నృసిం. IV. 73 ; హరి. పూ. VI - 30 ; VII. 127 - లలోఁ బ్రాసస్థానమున 'ఏపు'. ఒసఁగు (శ. ర.) ; ఆశ్వ. II. 121 - 'క. తగ నాకురు వృద్ధునకు నొ, సగె ... ; ముద్రితపాఠములో 'నొసఁగె' ; అప్పుడు ప్రాససాంకర్యము. భారతకవుల గ్రంథములలో 'ఒసగు' లో నఱసున్న కనఁబడలేదు. భర్తృహరి నీతిశతక ములో "నింగి .. ఒ, సంగు" అనియు, పండితారాధ్య చరిత్రము, 251 పుట ద్వి. "చాంగుభళా ... నుతులొ, సంగుచు"; 344, 345 పుటలు "జను లెల్ల దారమొ - సంగరాయనుచు," అనియున్నవి. భారతకవులకుఁ బ్రామాణ్య మున్నచో 'ఒసగు' లో నఱసున్న యుండఁగూడదు.

'గాఁటము' లో నఱసున్న యుండవలెనేమో! చూ. కళా. IV."నాఁటికి గాఁటపు ... పూఁ, దోఁటకు ... ఏఁటికి.

'చీఁకటి' లో నఱసున్న యుండఁగూడదు. విరా. II. 271; "క. నాకొ ఱఁత ... నీకొఱఁత ... లోకము ..., చీకటి" ; ఇట్లే, నిర్వ. VI. 107; కుమా. I. 198 లలో, బ్రాసస్థానమున చీఁకటి లో నఱసున్న లేదు.

'తాఁచు' (శ. ర.); హరి-పూ. VII. 87 లో ప్రాసస్థానమున, 'తాచు'.

'తీఁగ, తీఁగె' (శ. ర.); నిర్వ. VIII. 30లో 'తీగె ... రాగిల్లు'; కుమా. I. 445 లో 'తీగలు'; కవిక. VI. లో 'తీఁగ' అని సానుస్వారముగ నున్నది.

'తూఁగాడు' (శ. ర.) ; హరి. ఉ. VI. 168-లో 'తూగాడు ... వేగంబు';

'తూఁగు' (శ. ర.) నిర్వ. VIII. 30-లో 'తూగు'; కళా. II. హరి. పూ. II. పండితా. 352 పుట, లలో తూఁగు

'తోఁతెంచు', (శ. ర.); కర్ణ. III. 174 "క. కేతన ... తోతేరఁగ ... ద్యోతిత ... శ్వేత ...; శాంతి. V. 627. 'క. ఈ తెరువున ..., ఏ తెఱఁగున ..., ఆతత ..., తోతెంచును .." ఇట్లే, నిర్వ. VII. 44 ప్రాసము.

'దాఁపు' (శ. ర.) - అందే, 'దాఁపు' తో 'ప్రాసముగా నిబడినది.

'పరఁగు' (శ. ర.) - ద. ఇం. శా. IV. 675 - లో నిరనుస్వారము 'పరగు';

ఉ. హరి. V. లో 'పరగు'; మార్క. V. పరంగు.

'పేఁదటికము' నృసిం. V. 12 ; శాంతి. I. 97; కుమా. I. 323 లలో 'పేదటికము.'

'పోఁకు' (శ. ర.) హరి. పూ. VI. 10 - లో "పోకు ... వేకువ."

'వేఁకువ'-భాస్క. అర. 153; బసవ, 43 పుటలలో సానుస్వారము; దశ. III. 93. హంస II; - లలో నిరనుస్వారము. శ. ర. 'వేకువ' నిరనుస్వారమైనచో 'పోఁకు' లోఁగూడ నఱునున్న యుండఁగూడదు.

'బాఁతి, ప్రాఁతి'; (శ. ర.)-మాన. 24 "ఉ. జాతర ... ప్రాతిగ .. ఖ్యాతిగ .. స్వనోః పేతము ..." మాన. 118 క. ఆతఁడు . . ప్రాతిగ ... చేతో గతి ... పరి, స్ఫీతములు ...

'మాఁడు (శ. ర.) కుమా. I. 626 'మాడిన'; రా. సుం. కాం. "నేఁడు .. పోఁడి—మాఁడక".

'పీఁపు' (శ. ర.) - ఆది. II. 42. "క. ఆపన్నగ ... పీపున ... ద్వీపములు ... ది, శాపాలపురములు." ఇట్లే, నృసిం. IV. 181.

సార్థానుస్వార నిరర్థానుస్వార పదములకుఁ బ్రాసమున మైత్రి నంగీకరించుచో నీఁక పద్యగణములను బట్టి మాత్రమర్థానుస్వార నిర్ణయముఁ జేసికొన వలయును.

ఒకవేళఁ గొన్ని పదము లర్థానుస్వారముఁ గలిగిన నొకయర్థమును, నదిలేకున్న నింకొకయర్థమును బూర్వకాలమున నిచ్చుచుండెడివి. ఇప్పుడర్థాను

స్వారోచ్చారణము లోపించినను ప్రకరణమునుబట్టి యాయా యర్థములు గోచరించుచునే యుండును. కొన్ని యుదాహరణములు:—

అఁట = వృత్తాంతమును దెలుపు నొక యవ్యయము ; అట = అక్కడ, ఆవల ; అరుఁగు = తిన్నె ; అరుగు = పోవు ; అలుఁగు = ఖడ్గము, చెఱువు తూము, బాణపు ఉక్కుతునుక ; అలుగు = కోపించు ; ఆఁకరము = ఆగ్రహము ; ఆకరము = స్థానము, సమూహము ; ఆఁటు = చాలు, తాళు ; ఆటు = అదుపు, హాతి ; ఆఁడు = స్త్రీ ; ఆడు = చలించు ; ఈఁక = వెంట్రుక ; ఈక = ఈయక ; ఈఁగు = చొచ్చు, ప్రవేశించు ; ఈగు = ఇగ్గు ; ఊఁచు = ఊఁగఁజేయు ; ఊచు = రాలు ; ఊఁటు = దూఁటు, పొడుచు ; ఊటు = వానచినుకుల చెమ్మ ; ఊఁతము = పట్టు, అవలంబనము ; ఊతము. సం. = కుట్టఁబడినది ; ఊఁదర = కాయలు పండుటకు వేసినపొగ ; ఊదర = ఒకగడ్డి, ఒకధాన్యము ; ఏఁచు = కాఱించు ; ఏచు = అతిశయించు ; ఏఁట = సంవత్సరమున ; ఏట = పక్షము ; ఏఁడు = ఎవడు, సంవత్సరము ; ఏడు = 7 ; ఏఁపు = కాఱియ, బాధ ; ఏపు = అతిశయము ; ఒదుగు = తొలఁగు ; ఒదుగు = సమృద్ధమగు ; కలుఁగు = బొక్క ; కలుగు = అగు ; కాఁక = వేఁడిమి ; కాక = కాకుండ ; కాఁచి = ఒక చెట్టు ; కాచి = ఎండకాచి, కాయలు కాచి ; కాఁచు = కాఁగఁజేయు ; కాచు = ఎండకాచు, కాయలుకాచు, రక్షించు ; కాఁడు = క్రియ ; వాఁడు, కాఁడు మొద ; కాడు = శ్మశానము, అడవి ; కాఁపు = కర్షకుఁడు, నివాసి ; కాపు = కాచుట (కాయలు, ఎండ) ; రక్షించుట ; కురుఁజు = దూలము మీఁదిగుజ్జు, మంచె ; కురుజు = జున్ను, ఒకగ్రద్ద, బాణాసంచు, ఈఁకలు రాల్చినపక్షి ; కొఱఁకు = కంచె ; కొఱకు = ప్రయోజనార్థము ; కొఱఁత = తక్కువ, కొఱత = కొఱ్ఱున ; కోఁడు క్రి. = బియ్యము మొద. ; కోడు = మంచపు కోడు ; ఊరిదరినీటి పల్లము ; గాఁడి = నిడుపుగా త్రవ్వి తొలిచిన పల్లము ; గాడి = బండి ; గీఁత = రేఖ, గీత = పాట ; గోఁతి = స్త్రీ ; గోతి = గోయియొక్క ; చీఁకు = చప్పరించు ; చీకు = అంధుఁడు ; చెలఁగు = ఉత్సహించు ; చెలగు = ఖండించు ; చేఁత = చేష్ట ; చేత = చేతితో, చేతియందు ; చూఁడు = కాల్చు ; చూడుము ; డాఁగు = దాఁగు ; డాగు = గుఱుతు, మచ్చ ; తఱుఁగు = తగ్గు; తఱుగు = ఖండించు ; తాఁకు = మూర్కొను, స్పృశించు ; తాకు = కాలితాకు ; తాఁచు = తన్ను ; తాచు = చెక్కు, ఖచించు ; తోఁడు = కెల్లగించు ; తోడు = సహాయము ; దాఁక = వఱకు ; దాక = మట్టిపాత్ర ; దాఁపు = దాఁచు ; దాపు = సమీపము ; భయము ; నేఁత = నేయుట ; నేత. సం. నాయకుఁడు ; పలుఁగు =

స్ఫటికము ; పలుగు = దుర్జనుఁడు ; పాఁడి = క్షీరము ; పాడి = ధర్మము ; పాఁత = జీర్ణవస్త్రము ; పాత=సం. కాఁచువాడు , పాఁప=పాము సంబంధమైన; పాప = శిశువు ; కంటిపాప; పుడుఁకు=ఒకభక్ష్యము; పుడుకు=ఇచ్చు, వ్రేళ్లతో గ్రహించు ; పూఁచు = పూన్చు ; పూచు = పుష్పించు ; పూఁత = పూచుట ; పూత సం. = పవిత్రమయిన ; వెరుఁగు = వర్ధిల్లు ; వెరుగు = తెగు ; పేఁట = గ్రామము ; పేట = సరిగలోని చేరు ; పేఁటు = బీటిక ; పేఁటు = సరిగంచు ; పేఁడు. క్రి. = పేను ; పేడు = చిన్నచెక్క ; పొలఁకు = తృణశ్రేణి ; పొలకు = ఒకపండు ; పోఁక = పూగము ; పోక = పోవుట ; పోఁకు = గడ్డి ; పోకు=పోవకుము, నడవడి ; పోఁగు = దారపుపోఁగు ; పోగు = ప్రోగు ; ప్రాఁచి = ప్రాఁతది ; ప్రాచి = సం. తూర్పుదిక్కు ; మిడుఁగు = మిడుఁగురు ; మిడుగు = కఠినశిల ; మీఁది = మీఁదనున్న ; మీది = మీసంబంధమైనది ; ముక్కిఁడి = ముక్కులేనివాఁడు ; ముక్కిడి = ఒకచెట్టు ; మూఁడు = 3 ; మూడు = కలుగు ; రాఁజు = రగులు ; రాజు = ఏలిక ; రేఁపు = రేఁగఁజేయు ; రేపు = ఉదయము ; రోఁజు = ఎగశ్వాసము చేయు ; రోజు = దినము ; లాఁగు = లంఘనము ; లాగు = ఆకర్షించు ; లోఁడు = కెల్లగించు ; లోడు = ఒఱుగుదిండు ; వాఁపు = ఏకరు, శోఫ, ఊఁదు ; వాపు = వాయింపు ; వెలుఁగు = వెలుతురు ; వెలుగు = కంచె; వేఁగు = తపించు ; వేగు = ఉదయమగు ; వేఁచు = వేఁగఁజేయు, వేచు, ఎదురుచూఁచు, ప్రతీక్షించు మొద.

ఈ రీతిగ నర్థభేదములుండుటచే నా భేదములను దెలియఁజేయుట కఱసున్న నదిలోపించిన నేఁడును దప్పక వాడవలెనని కొందఱందురు. కాని యర్థభేదము ప్రకరణమునుబట్టి కలుగును ; అర్థము కేవలము శబ్దగతము కాదు. అఱసున్నగల యేకశబ్దమునకే యనేకార్థములున్నపుడును, నఱసున్నలు లేనిశబ్దముల కనేకార్థము లున్నప్పుడునుగూడ సందర్భమునుబట్టియే యర్థము నూహించికొనవలెను. ఉదా. అఱసున్న గలపదములు: ఈఁత = ఈఁతచెట్టు; ఈఁదుట ; - ఎలుఁగు = కంఠస్వరము, ఎలుఁగుగొడ్డు ; ఏఁడు = సంవత్సరము; ఏవఁడు ; - కురుఁజు=జున్ను ; ఒకగ్రద్ద, బాణాసంచా, ఈఁకలురాల్చిన పక్షి , గాఁడు = కామమదము ; (రామి) గాఁడు, మొద ; రేఁగు = విజృంభించు, ఒకచెట్టు ; రేఁచు = రేఁగఁ జేయు, ఒకకుక్క ; మొద.

అర్థానుస్వారము లేని యేకపదమున కనేకార్థములుండుట కుదాహరణములకై నానార్థనిఘంటువులను జూడవలయును. కొన్ని యుదాహరణములు: కాచు = ఎండ, కాయలు కాచు ; రక్షించు ; ఏదు = నశించు, ఏదుపంది ; కాటు = కఱచిన గాయము ; మాడియడుగంటుట ; కోడు =

బియ్యము మొద. కోడుట ; నీటిపల్లము ; తోడు = సహాయము ; పాలను పెరుగు చేయుటకు చేర్చుమజ్జిగ ; దాపు = సమీపము, భయము ; పాప = శిశువు, కంటిపాప ; పలుగు = దుర్జనుఁడు, ఇనుపతగడు ; పుడుకు = ఇచ్చు, వ్రేళ్లతో గ్రహించు ; పోకు = పోవకుము, నడవడి ; మొద.

ఈ క్రింది శబ్దములలో నఱసున్నలు లేవని ప్రాసము, గణము ననుసరించి నిర్ణయింపఁబడినది.

క.

ఆకులపడు (అర VII. 107) ; కాకులు (అర VII. 107); చీకటి (విరా. II. 271; నిర్వ. VI. 107 ; కుమా. I. 198); చీకాకు (నిర్వ. IV. 84) ; చీకు (అర. III. 352) ; పోకు (హరి. పూ. VI. 10) ; ప్రోక (కుమా. II. 94) ;

గ.

ఈగి (శాంతి II. 372); తూగు (నిర్వ. VIII. 30); తీగ (కుమా. I. 445); తీగె (నిర్వ. VIII, 30); తూగాడు (హరి. ఉ. VI. 168); పరగు (ద. ఇం. శా. IV. 675) ; వేగు = ఉదయమగు (భీష్మ. II. 167, 274 ; కాశీ. IV. 132 ; శాంతి. VI. 512) ; ఎసగు (శాంతి. III, 89) ; ఒసగు (ఆశ్ర. II. 121).

చ.

ఏచు (విరా. II. 356; III. 45; శాంతి. III. 105 ; ద్రోణ. V. 175 ; నిర్వ. IV. 150); కాచు (విరా. III. 45; కుమా. II. 687) ; చూచు (అర. I. 195; II. 86); తాచు (హరి. పూ. VII. 87); త్రోచు (కుమా. II. 687, 811); పాచు (అర, I. 195 ; కుమా. II. 687, 811) ; లేచు (అర. II. 86) ; వీచు (కుమా. II. 811) , వేచు (అను. III. 338; విరా. III. 45; అశ్వ. IV. 150); వైచు (కుమా. II. 811).

ట.

అటున (నిర్వ. VII. 52); ఏటు (విరా. III. 164); కాటుక (నిర్వ. VIII. 52); కీటు (నిర్వ. VIII. 52); చోటు (విరా. III. 164) ; జోటి (నిర్వ. IX. 91); పాటుబండి (హరి. పూ. V. 142); పాటు (విరా. V. 89); పోటు (విరా. III. 164; V. 89; కుమా. II. 609); మాటలు (విరా. V. 89; నృసిం. IV. 102) ; మేటి (నృసిం. IV. 102, హరి. పూ. V. 142); మోమోట (నృసిం. IV. 102); వీటికి (అర. VII. 37); వ్రేటు (విరా. III. 164.)

డ.

ఈడు (నృసిం. IV. 3); ఏడు=7 (అర. IV. 271; ఉద్యో. I. 224); ఓడు (ద్రోణ. V. 102); కాడు (కర్ణ. I. 111; కుమా. II. 626) ; కూడు (ఉద్యో. I.

224 ; ద్రోణ. V. 102) ; తోడు (ఉద్యో. I. 224, V. 102); పాడు (కుమా. I. 445); నూడు (కుమా. II. 626); వాడు (కుమా. II. 626); వీడు (కుమా. II. 626) ; నావుడు (శాంతి. IV. 139); వేడుక (ద్రోణ. I. 168; కుమా. II. 279).

త.

ఏతెంచు (అర. I. 191 ; VII. 195; ఉద్యో. III. 293; అశ్వ. III. 207 ; IV. 131 ; హరి. పూ. VI. 134; కోతులు (అను. III. 234); తోతెంచు (శాంతి. V. 627); తోతేరంగ (కర్ణ. III. 174 ; నిర్వ. VII. 44) ; పోతులు (హరి. పూ. VI. 134, 152); భ్రాంతి (మానస. 24, 120).

ద.

ఆదట (కుమా. I. 604); ఐదు (హరి.ఉ. VI. 48) ; గ్రక్కదల (అర. IV. 18) ; పేద (శాంతి I. 97; కుమా. I. 323) ; బూది (అర. IV. 412 ; కుమా. I. 869) ; వాదు (కుమా. I. 869) ; సేద (కుమా. I. 445).

ప.

ఏపు (అర. I. 294; IV. 169; ద్రోణ I. 214. III. 180. నిర్వ. VII. 30 ; నృసిం. IV. 73 ; హరి. పూ. VI. 30; VII. 127; విరాట. III. 210 ;) ఓపు (కుమా. I. 855, హరి. పూ. VII. 127) ; కాపించు (కుమా. I. 381) ; క్రేపు (హరి. పూ. VI. 30;VII. 127); అచ్చపు (నృసిం. I. 67); చూపు (అను. I. 48); తీపు (అర. VI ); తూపు (ద్రోణ. I. 253; అను. I. 48); తేప (అర. VII. 274; నృసిం. IV. 73); త్రోపు (కుమా. I. 381); ప్రోపు(అర. V. 126); ద్రోణ I. 253; మోపు (కుమా. I. 381); తీయపు (నృసిం. I. 67); రేపు (ద్రోణ, I 214) ; వీపు (ఆది. II. 42; నృసిం. IV. 181).

## మూర్ధన్యాక్షరములు యుత్పత్తి.

"ట, ఠ, డ, ఢ, ణ, ఱ, ఴ, ళ, ష, - యనుహల్లులు మూర్ధన్యములు. వీనిలో ద్రావిడ భాషలయందు ఠ, ఢ, ష, లు తప్పఁ దక్కినవి మిక్కిలి ప్రచారములో నున్నవి. సంస్కృతమునను నీధ్వనులుగలవు. సంస్కృత మూలమున నవి ప్రాకృతములద్వారా నేఁటి యార్యభాషలయందు వ్యాప్తిఁ గాంచినవి. ఈ ధ్వనులు మొదట నార్యధ్వనులు కావు. ద్రావిడ భాషా సంపర్కమువలన నార్యభాషలు వానిని పరిగ్రహించినవి. ఇట్లనుటకుఁ గారణములు:—

(1)మూర్ధన్యహల్లు లనేక ప్రాచీన ద్రావిడ ధాతువులందు ముఖ్యము లగునంగములు ; అవి ముఖ్యముగఁ దమిళమునం దొక ధాతువునుండి మఱియొక

ధాతువును బ్రత్యేకించుటకుఁ జాల నావశ్యకములు. సంస్కృతమున దంత్యములకు మాఱుగ మూర్ధన్యముల నుపయోగించుట, అందుముఖ్యముగ 'న' కారమునకు మాఱుగ 'ణ' కారమును వాడుట కేవల శ్రుతి సుభగత్వము కొఱకే.

(2) సంస్కృతముతో సజాతీయములగు ప్రాచీనభాషలలో దేనియందును నీమూర్ధన్య హల్లులు గానరాలేదు. అవి గ్రీకు, లాటిను, గాథికు, కెల్టికు, లిథుఏనియను, స్లవోనియను, ఆధునిక పెర్షియను భాషలలో లేవు. సంస్కృత భాషను మాట్లాడువారు సింధునదిని దాఁటి యార్యావర్తమును బ్రవేశింపక పూర్వము సోదరీభాషగానుండిన ఖ్యూనెఫారము పెర్షియను, లేక జెండుభాష యందును నివిలేవు. ఇట్లుండ ద్రావిడభాషలయందవి యార్యభాషాసంపర్కము గలుగక పూర్వమునుండియు ననాదిగా నెలకొని యున్నవి. అవి బ్రాహుఈ భాషయందును గలవు. సింధునదికిఁ బడుమటనుండు భాషలలో నా ధ్వను లున్నవనుటకు నిదర్శనములు లేవు కాని, యా భాషలు సింధునదిని దాఁటి ద్రావిడజాతులకుఁ బ్రాచీనకాలమున నునికిపట్టులుగ నుండిన దేశములను బ్రవేశించినంతనే యీ మూర్ధన్యధ్వనులు పొడచూపుచుండును. సంస్కృతమునందుకంటెఁ బ్రాకృతభాషలలో నీధ్వను లెక్కువ ప్రచారములో నుండుటయుఁ గమనింపఁదగిన విషయము.

(3) ద్రావిడవాఙ్మయకాలమునఁ సంస్కృతమునుండి ద్రావిడభాష లెరవుతెచ్చికొనిన పరుషోచ్చారణముగల ధ్వనులన్నియు ద్రావిడభాషా ధ్వనిసంప్రదాయము ననుసరించి మాఱిపోయినవి. ఉదాహరణమునకు సంస్కృతమందలి మహాప్రాణములన్నియు ద్రావిడతద్భవములం దల్పప్రాణములుగ మాఱినవి. ఊష్మములన్నియు మాఱినవి, లేదా లోపించినవి. పరుషాక్షరము లన్నియు సరళాక్షరములైనవి. సంస్కృతమందలి 'ష' కారమునుగూడ తమిళు లుచ్చరింపలేరు. ఇట్లుండ మిక్కిలి పరుషోచ్చారణముగల మూర్ధన్యాక్షరములను సంస్కృతమునుండి ద్రావిడు లెరవు తెచ్చికొని వానిని మార్చకుండ నుంచికొనిరనుట నమ్మదగినదికాదని తోఁచుచున్నది.

(4) సంస్కృతముతో తెనుఁగున కెక్కువ సంబంధమున్నది. తమిళమున కంతటిసంబంధము లేదు. మూర్ధన్యాక్షరములు సంస్కృత ధ్వనులైనచో నవి తెనుఁగునం దెక్కువగఁ గానరావలయును. కాని, యవి తమిళమునందే యెక్కువ ప్రచారము నందున్నవి.

(5) ద్రావిడ ధాతువులందలి దంత్యములకుమాఱుగ మూర్ధన్యములను జేర్చినయెడల గొప్ప యర్థభేదము గలుగును. ఉదాహరణములు:

కుది = గంతుట; కుడి = త్రాగుట; పుదెయ్ = దాఁగుట; పుడెయ్ = చెరఁగుట; కత్తు - ధ్వనిచేయుట; కట్టు = బంధించుట: కొత్తు = త్రవ్వుట; కొట్టు = తాడనముచేయుట; అరి=పండ్లతోఁగోఁకుకుట; అఱి= తెలియుట; అడి= నాశనముచేయుట; ఎన్ = చెప్పుట; ఎణ్ = లెక్కించుట; మనెయ్ = ఇల్లు; మణెయ్ = పీఁట; అరు = అరుదగుట; అఱు = కోయుట; అలు = ఏడ్చుట; కొల్ = చంపుట; కొళ్ = తీసికొనుట; తులెయ్ = అంతమగుట, తుళెయ్ తొలవేయుట.

ఈ రీతిగ ద్రావిడమునందు మూర్ధన్యములు ధాతుస్వరూప నిర్ణయము నందును, ధాత్వర్థనిరూపణమునకును, వ్యాకరణరూప నిర్మాణమునకును నత్యావశ్యకములు. సంస్కృతమునందలి మూర్ధన్యాక్షరములను దొలఁగించినను నాభాషకంత నష్టముగలుగదు; తమిళమునుండి వానిని దొలఁగించినచో సాధారణ వ్యవహారము నడచుటగూడ కష్టసాధ్యమగును.'' అని కాల్డ్వెలుగారు తమ యభిప్రాయమును వివరించిరి.

పై యభిప్రాయమును విమర్శింపకపూర్వము సంస్కృతములందును నాధునికార్యభాషలందును గల మూర్ధన్యాక్షరములఁ గూర్చి యార్యభాషలను విమర్శ దృష్టితోఁ బరిశోధించిన బీమ్సు పండితుని యభిప్రాయమును వివరించుట యావశ్యకము. (చూ: A Comparative Grammar of the Modern Aryan Languages of India, PP. 219—248.)

"దంత్యములును మూర్ధన్యములును నొకటే వర్గమునకుఁ జేరిన బలహీనమైనట్టియు, బలవంతమైనట్టియు రెండు శాఖలు. సంస్కారమును బొందిన సంస్కృతము బలహీనశాఖను, వ్యావహారిక భాషలగు ప్రాకృతములు బలవంతమగు మూర్ధన్యశాఖను నవలంబించినవని చెప్పవచ్చును.

ఈ విషయమై ప్రాకృత లాక్షణికుల యభిప్రాయమిట్లున్నది. వరరుచి సాధారణముగ దంత్యములు మూర్ధన్యములగుటనుగూర్చి ముచ్చటింపలేదు. దంత్యములు మూర్ధన్యములగుటకుఁ గొన్ని యుదాహరణములను మాత్ర మిచ్చియున్నాఁడు: ప్రతిసర = పడిసరో, వేతస = వేడిసో ; పతాక = పడాఅ ; (II. 8). వీనిలో 'ప్రతిసర' యనునది సాధారణముగ ప్రతి = ప్రా. పడి అను మార్పునకుఁ జెందినది. 'వేతస' శబ్ద మార్యభాషలలోనిది. (చూ. ల్యాటిను: విటెక్స్, విటిస్; (Vitex, Vitis) ప్రాచీన జెర్మానిక్కు: వీదా ; (Wida) ఇంగ్లీషు: విల్లో (Willow):—ఇట్లే, ల్యాటిను, సాలిక్స్ (Salix) ఆంగ్లోసాక్సను: సేలల్ (Seal):— ఇంగ్లీషు: శాలో (Sallow) ఆంగ్లోసాక్సను, వేలిగ్, (Welig); ఇంగ్లీషు: విల్లో (Willow):—ఈ మొదలగు పదములన్నిటిలో 'ల' కారమంతకుఁ బూర్వముండిన మూర్ధన్య 'డ' కారము

నను వికారమని యనుకొనవలెను. ఇందువలన సంస్కృతమందలి 'వేతస' శబ్దముల కంటెఁ బ్రాకృతమందలి 'వేడిసో' అనుశబ్దము నుచ్చారణమే సరియైనదని యనుకొనవలెను. ఇట్లే సంస్కృత 'పతాక' శబ్దమునకు ధాతువగు 'పత్' అనునది ప్రాకృతమునందు 'పడ్' అనియే యుండును. దీనితో ట్యూటానికు రూపములగు 'ఫల్లెన్ (Fallen)' 'ఫిఅల్లన్ (Fεallan)' 'వల్లెన్ (Vallen)' అనుపదములు సంబంధించినవగుటచే, పత్ ధాతువుకంటె 'పడ్' ధాతువే ప్రాచీనమైన దనుకొనవలెను. ఇట్లే దోలా, దణ్డ, దశన శబ్దములకంటెఁ బ్రాకృతమందలి డోలా, డండో, డసణో అను రూపములే ప్రాచీనములు.

సంస్కృతమునందలి 'ద' కారము ప్రాకృతమున 'డ' కారమయిన దనుట తప్పు. రేఫముతోడి పొత్తువలన 'ద' కారము 'డ' కారమయిన దనుటయు సంపూర్ణముగ సత్యముకాదు. దంత్యమూర్ధన్యాక్షరముల విషయమున సంస్కృతప్రాకృతములలో వైవిధ్యమున్నది.

(1) సంస్కృతమున దంత్యమును, ప్రాకృతాధుని కార్యభాషల యందు మూర్ధన్యము నుండవచ్చును, ఉదా. సంస్కృతము, 'పత్'; ప్రాకృతము: పడ, వడ, వల ; హిందీ: పడ్నా ; మరాఠీ: పడణే ; సింధీ: 'పడణు' ; బంగాలీ: 'పడణ' ; ఒఱియా: పడిబా మొద.

(2) సంస్కృతమున దంత్యము, ప్రాకృతమున మూర్ధన్యము, ఆధునికార్యభాషలయందు దంత్యమునుండవచ్చును: ఉదా. సంస్కృతము: దహ్ ; ప్రాకృతము: డహ్ ; హిందీ: దాహ్‌నా ; మరాఠీ: దాహ్ణే ; గుజరాతీ: దహఝువుం ; పంజాబీ: దఝ్నా, ' దహినా' ; సింధీ: దాహాణు, దాహు ; ఒఱియా: దాహ్‌బా ; బంగాలీ: దహాన్. ఆధునికార్య భాషలలో నిట్టిశబ్దములకు మూర్ధన్యములతోడి రూపాంతరము లున్నను, దంత్యోచ్చారణమే సర్వసాధారణము.

(3) సంస్కృత ప్రాకృతములందు దంత్యము, ఆధునికార్య భాషల యందు మూర్ధన్యము నుండవచ్చును. ఉదా:—సంస్కృతము: దంశ్ ; ప్రాకృతము: దంశ ; హిందీ: డంక్, డాంక్, డంస్నా ; మరాఠీ: డంఖ్ ; డణ్నే, డసాణ్ ; డాంఛ్, డాంఛ్‌ణే ; గుజరాతీ, మరాఠీ యందువలె, డాంసాణ్లే ; బంగాలీ: డాంశ్, డాంశా : సింధీ: పంజాబీ : డంగణు ; డంగణే, డంగు:—కొన్ని యాధునిక భాషలలో దంతోచ్చారణ మక్కడక్కడ నున్నను మూర్ధన్యోచ్చారణమే సర్వసాధారణము.

(4) సంస్కృత ప్రాకృతములందు మూర్ధన్యమును, ఆధునికభాషల యందు దంత్యమును నుండవచ్చును: ఉదా. సంస్కృతము: డప్, డమ్ప్,

డిమ్భ, మొద. ప్రాకృతమన్లో'; హిందీ: దాబ్నా, దబ్నా, దబావ్, దబేల్; మరాఠీ. దాబ్ణే; బంగాలీ: దాబన్; ఒటియా: దాబిబా; గుజరాతీ: దాబవు; పంజాబీ: దబ్బణా; సింధీ: దపణు; మొద. కొన్నియెడల నాధునికభాషలలో మూర్ధన్యోచ్చారణము వినఁబడినను దంత్యోచ్చారణమే సర్వసాధారణము.

ఈరీతిగా నెంతేని వైవిధ్యము గలదు. పైవిచారమువలనఁ దెలిసికొన వలసిన విషయములేమన: (1) సంస్కృతమునకు సంబంధించిన భారతీయేతర భాషలయందు మూర్ధన్యోచ్చారణము లేకపోలేదు. భారతవర్షమునందువలె నామూర్ధన్యోచ్చారణ మంతస్పష్టమైనది కాకపోయినను, దంత్యోచ్చారణముకంటె నది మూర్ధన్యోచ్చారణమునకు దగ్గఱగ నుండును. మూర్ధన్యోచ్చారణము లేకుండినచో సంస్కృతమందలి 'ద' కారము భారతీయేత రార్యభాషలందు లకారముగఁ గానఁబడుటకుఁ గారణములేదు. (2) సంస్కృత మందలి దంత్యములు ప్రాచీనమైనవనియు, ప్రాకృతాధునిక భారతవర్షీయ భాషలయందలి మూర్ధన్యము లర్వాచీనములనియు, ననుకొనఁగూడదు.

హార్నెర్నెల్ పండితుఁడు ద్రావిడభాషాసంపర్కమువలన సంస్కృతమునందు మూర్ధన్యములు చేరినవను వాదము నాదరింపక, యార్యభాషలందే కొన్ని తేలికయగు దంత్యోచ్చారణమును, కొన్ని పసుపమగు మూర్ధన్యోచ్చారణమును గలిగియున్నవని యనేకోదాహరణముల నిచ్చి సాధించియున్నాఁడు. ద్రావిడభాషల ప్రోద్బలమే కారణమైనచో సింధీ మొదలగు భాషలయందు తమిళమునందువలె, - ఇంక నెక్కువగనే-మూర్ధన్యోచ్చారణముండుటకును, ద్రావిడభాషలకు సమీపమందుండు ఒటియా మొదలగువానియం దంతయెక్కువగ లేకుండుటకును, గారణము కానరాదు.

పైదానివలన కాల్డువెల్లుచూపిన కారణములలో (2), (3), (4) లు పూర్వపక్షములయినవి. ఇఁక (1), (5) లు అనఁగా ధాతువులందు దంత్య, మూర్ధన్యాక్షరములు ప్రధానాంగములగుటచే నొకదానికి బదులుగ నింకొకటి చేర్చినచో నర్థభేదముగలుగునను వాదమును విమర్శింపవలసియున్నది. దీనికి రెండు విధములుగ సమాధానమును చెప్పవచ్చును:—

(1) సంస్కృతమునఁ గూడ దంత్యమునకు బదులుగు మూర్ధన్యమును జేర్చినచోఁ జాలనర్థభేదము గలుగును. దీనికి నూర్లకొలఁది నుదాహరణముల నీయవచ్చును. కొన్నిమాత్రమిచట పొందుపఱుపఁ పడినవి:—

అట్ = తిరుగుట
అత్ = సంపాదించుట
అడ్ = ప్రయత్నించుట
అద్ = తినుట
అణ్ = ఊపిరితీయుట
అన్ = సంచరించుట
అశ్ = తినుట
అస్ = ఉండుట, త్రోయుట
అష్ = కదలుట, ప్రకాశించుట.
ఆట్ = బెకబెక లాడుట
ఆత్ = తరువాత (వేదములోదీనికిఁ ప్రత్యేక ప్రయోగముగలదు).
ఇట్ = పోవుట
ఇత్ = ఒక యనుబంధశావ్యము
ఇడ్ = ప్రవాహము
ఇద్ = తప్పక (అవ్యయము.)
ఇన్ = బాధవలనఁ గలుగుధ్వని
ఇష్ = కోరుట.
ఏణ = జింక [ము
ఏన=ఒక సర్వనామపు ప్రాతిపదిక
కట = తుంగచాప
కత = ఒక చెట్టు
కటక = కడియము, వలయము
కతక = చిల్లగింజ, ఇండుబకాయ.
కటి = నడుము
కతి = ఎన్ని
కడక = సముద్రలవణము
కదక = అగడ్త
కణ్డ్ = సంతోషించుట
కన్ద్ = ఏడ్చుట, మొదలయినవి.
అటల = కదలని, స్థిరమైన
అతల = అడుగుభాగములేని.
అణు = అణువు

అను=ఒక అవ్యయము; ఒక అనార్యుఁ [డు]
అణక = చక్కని, తెలివిగల
అనక = పరాధీనమైన
ఆట = కదలుట
ఆత = ద్వారబంధము
ఆడి = ఒకజలపక్షి
ఆది = ఆరంభము
ఆణక = చిన్న
ఆనక = యుద్ధదుందుభి భేదము
ఆణవ = అణుసంబంధమైన
ఆనవ = దయగల, కరుణగల
అండ = గ్రుడ్డు
అంద = సంకెళ్లుచేయువాఁడు
ఇడా = ఒకఅగ్ని; ఒకనాడి.
ఇదా = ఇప్పుడు
ఉట = ఆకులు, గడ్డి, మొదలగునవి
ఉత = కుట్టఁబడిన, నేయఁబడిన; ఒక అవ్యయము
కఠ్ = దుఃఖముతో జీవించు
కథ్ = పలుకు, భాషించు.
కడ్=శోకహర్షములచే మనస్సునొ [చ్చు]
కద్ = తప్పయినది; ప్రశ్నార్థక [ప్రాతిపదికము.]
కడ = మూఁగ, తెలివితక్కువ
కణ్ = చిన్నదగు, అఱచు, పోవు
కన్ = తృప్తిచెందు, ఒప్పుకొను.
కణ = కణము
కన = చిన్న (చూ. కనీయస్)
కంట = ముల్లు
కంత = సంతోషముగల
కంఠ = మెడ

కంథా = బొంత
కండర = కండరము, మాంసగ్రంథి
కందర = గుహ
కండుక = ఒకమంగలి
కందుక = బంతి
కండు = దురద
కందు = వంటపాత్రము [ఒంటె]
కండోల = గంప ఉగ్రాణపు కొట్టు,
కందోల (-ట) = నీలిసరోజము
కిట్ = పోవు, సమీపించు, భయపెట్టు
కిత్ = చూచు, లక్షించు
కుట్ = చుట్టుకొను, వంగు, పగులు
కుత్ = పఱచు, వ్యాపింపఁజేయు.
మొదలగున వెన్నియైన నుదాహరింప వచ్చును.

(2) (అ) తెనుఁగుపదములందే యర్థభేదము లేక దంత్యములను మూర్ధన్యములుగ మార్చవచ్చును.

i. పదాదిని :

ట, త ; టంగు, తంగు ; టక్కరి, తక్కరి ; టెక్కు, తెక్కు, టక్కు, తక్కు ; టాటోటు, తాటోటు, టెంకి, తెంకి ; మొద.

డ, ద : డంగు, దంగు ; డంచు, దంచు, డక్కు, దక్కు ; డగర, దగర ; డగ్గఱ, దగ్గఱ ; డగ్గు, దగ్గు; డప్పి, దప్పి ; డాఁగు, దాఁగు ; డాపల, దాపల ; డించు, దించు ; డుయ్యు, దుయ్యు ; మొద.

ii. పద మధ్యమందు : డ, ద : అడఁగు, చూ. అదుము ; అడలు, చూ. అదరు ; కడఁగు, చూ. కదియు మొద.

iii. పదాంతమున = అలసత, అలసట మొద ;

[చూ. ఎద్దు—బహువచనము—ఎడ్లు.]

(ఆ) వేర్వేఱుద్రావిడభాషలయం దేకార్థమున నొకరూపము దంత్యముతోడను, నొకటి మూర్ధన్యముతోడను నుండుట:—

ఈ మార్పును కాల్డువెల్లుకూడఁ గుఱుతించియున్నాఁడు:—

| కన్నడను | తెనుఁగు |
|---|---|
| ట | త |
| అట | అంత |
| అట్టు | అత్తు |
| అణ్ణ | అన్న |
| బెణ్ణె | వెన్న |
| కణ్ణు | కన్ను |
| మణ్ణు | మన్ను |

| కన్నడము | తెనుఁగు |
|---|---|
| విణ్ణు | విన్ను - మొద. |
| త | ట |
| అత్తలు, ఇత్తలు, ఎత్తలు | అట, ఇట, ఎట |
| అంతు, ఇంతు, ఎంతు | అటు, ఇటు, ఎటు |
| అంథా, ఇంథా, ఎంథా | అట్టి, ఇట్టి, ఎట్టి |
| మాతు | మాట మొదలయినవి. |

పై చర్చవలన ద్రావిడభాషలనుండి సంస్కృతము మూర్ధన్యాక్షరముల నెరవు తెచ్చుకొనెనన్న కాల్డువెల్లు వాదము బలహీన మగుచున్నది.

## ఱ కా ర ము.

తక్కిన ద్రావిడభాషలలోనుండు 'ఱ' కారము తెనుఁగునందును నుండెనా యను విషయమును యుద్ధమల్లుని బెజవాడశాసనమునుగూర్చి విచారించునప్పుడు విద్వాంసులు చర్చించియుండిరి. ఱ, ఢ యను రెండు ప్రత్యేకములగు నక్షరము లాశాసనమునందు గానవచ్చుటచేఁ దక్కిన ద్రావిడభాషలయందువలెఁ దెనుఁగునను నాయక్షరముండెనని వారు స్థిరపఱిచిరి. అంతకు మించి తెనుఁగునందలి యీ ధ్వనినిగూర్చి యెక్కుడు విచారముకాలేదు.

'ఱ' యనునక్షరము బెజవాడ యుద్ధమల్లునిశాసన మాత్రేకాక యింకను జాల శాసనములందు గానవచ్చుచున్నది. యుద్ధమల్లుని బెజవాడ శాసనమున 'అఱిపుట, ఱస్సి' మొదలగు రూపములున్నవి. 'ఱచ్చువాన్తు' (1920 సం. శాసనావళి, నంబరు, 364); తాఱుగుమ్మిసీమ (ఎపిగ్రాఫియా ఇండికా V. 31); పఱుమటికట్టు (ఎపి. ఇం. VI. 34); ఱుల్లసీమ (ఎపి. ఇం. VI. 34); చోఱమహారాజు (ఎపి. ఇం. IX. 345); ఏఱువేల (ఎపి. ఇం. IX. 345); కఱపత్తి (ఎపి. ఇం. VI. 347); తాంకఱపొలము (ఎపి. ఇం. VI. 347); కొఱ్చుంకొన్తు (ఎపి. ఇం. IX. 98); మాఱ (ద. ఇం. శా. IV. 1083);—మొద.

'ఱ' కారము కేవల ద్రావిడధ్వనియనియు, ద్రావిడ భాషలకును నార్యభాషలకును సంబంధములేదనుట కిదియొక నిదర్శనమనియుఁ గొంద ఱందురు. ఉత్తర హిందూస్థానార్య భాషలలో నీధ్వని లేకపోలేదు. పహాఱీ, మార్వాఱీ, ఒఱియా, ఓర్ఛాఱీ, యను నార్యభాషల పేళ్లలోనే యీధ్వని వినఁబడుచున్నది. రాజపుత్ర స్థానప్రాంతమందలి యుప్పుగుట్టల వరుసగల ప్రదేశమందలి 'లహాండా' భాషలోను (లిం. స. ఇం. . భాగ. 1. VIII పుట.

) ; మరాఠీభాషకు సంబంధించిన బేరారు, మధ్య పరగణాలలోని కొన్ని
ండలిక భాషలందును (లిం. స. ఇం. VII. 22), ఛింద్‌వార, ఛటీస్‌ఘడ
ంతములందలి మాహారీ భాషయందును, పడుమటి పహాటీ భాషలోను,
భాషయందును, ఏ రేనియను భాషయగు 'ఓర్యాటీ' భాషయందును,
జస్థానీ, గుజరాతీ భాషలందును, మాళ్వాటీ భాషయందును, ప్రామా
హిందీ భాషయందును 'ఱ' యనుధ్వని చాల ప్రచారములో నిప్పటికి
న్నదని లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా సంపుటములనుండి తెలిసికొన
చ్చును. ఈధ్వని యాభాషలలో 'డ' కారము రెండచ్చులకు నడుమ
చ్చినప్పుడు వినఁబడుచున్నది. పదాదినిగూడ 'ఱ' యను ధ్వనివినఁబడుటకు
ఠాలీ భాషనుండి యా సంపుటములలో నుదాహరణము లీయఁబడియున్నవి.

ఆయా యార్యభాషలందు 'ఱ' యనుధ్వని ద్రావిడభాషా సంప
ర్కమువలనఁ గలిగియుండఁగూడదాయని యనవచ్చును. ఇండియాదేశమం
యు నెప్పుడో ద్రావిడజనాక్రాంతమైయున్నప్పు డట్టిసంపర్కముగలిగిన
ని చెప్పవచ్చునుగాని, ద్రావిడులు భారతవర్షమంతటను వ్యాపించి యుండి
రనియు, 'ఱ' కారముగల ద్రావిడశబ్దములకు సంస్కృతమున మూలములు
లేవనియుఁ జెప్పుటకుఁ బ్రమాణము చిక్కువఱకు నీప్రశ్నకాధారములేదనియే
చెప్పవలయును. విమర్శదృష్టితోఁ జూచినయెడల ఱకారము భారతీయభాష
లయందు సర్వసాధారణముగఁ గాన్పించుచున్నదనియు, నది భారతీయేతరార్య
భాషలందు సహజమైనది కాకున్నను, భారతీయభాషలయందు స్వతంత్రముగ
నుద్భవించినదనియుఁ జెప్పవలెనుగాని, ద్రావిడభాషల సాత్త్రగు దాని నితర
భాషలు స్వీకరించెనని చెప్పుట సరికాదనితోఁచుచున్నది.

సంస్కృతశబ్దములందలి ట, ఠ, త, ర, ళ, లనుండి కన్నడమున 'ఱ'
కారము పుట్టినదనుటకు శబ్దమణిదర్పణకారుఁ డుదాహరణముల నిచ్చి
యున్నాఁడు:—

ట:—ఘటికా (కన్న. గఱిగె ; తె. గడియ); ఘోటిక (కన్న.
గోఱిగె ; తె. గోడిగ) ; ధాటీ (కన్న. దాఱి ; తె, దాడి) ; లాటమ్ (కన్న.
లాఱం) ; లాటభాషా (కన్న. లాఱబాసె) ; ఘోటారూఢమ్ (కన్న. గోఱా
యిలమ్) ; కుక్కుటః (కన్న. కోఱి).

ఠ:—మఠికా (కన్న. మఱిగె) ; పేఠికా (కన్న. పేఱిగె).

త:—ప్రతిహస్త (కన్న. పఱిహత్తమ్) ; ప్రతీహారిన్ (కన్న. పఱి
హారి ; తె. పడిహారి, పణిహారి); ప్రతిపాదక (కన్న. పఱివాపుగె).

ర:—క్రూర (కన్న. కూఱు ; తె. కూళ ; ఝల్లరి (కన్న. ఝల్లఱి).

ళ (ఘళ):—తాళ (కన్న. తాఱు ; తె. తాడి) ; పులిన. (కన్న. పుఱిల్) ; కళమమ్ (కన్న. కఱవె) ; అర్గళమ్ (కన్న. అగుఱి) ; మన్యాళి (కన్న. మన్నఱి) ; అళికాబద్ధమ్ (కన్న. అఱిగెవద్దమ్) ; మొద.

ఇట్లే పళికం, పేళిగె, పీళిగె, గుళిగె, వరాళిం, రగళె, పుళిం, లంబళం, హూళిగె, అనుతద్భవము లందును ; ఇళివళియం, ఏళిదం, సూకుళి, ఓకుళి, కళఱు, వెళఱు, మఱుకుళి, అళియం, మాళిగె, జాళిగె, తళిగెయొళిర్, బళసు, బళసిగం, మొళె, తాళం, ఆళిసిదం, పేళిసిదం, కేళం, జూదాళి, అళిలె, తళవళం, మేళం; మాళం; తాళిగె, ఈళిగె. ఇఱుకుళి, - యీమొద దలగు శబ్దము లందునుగల కుళ ళకారములకు బదులుగ 'ఱ' కారమువచ్చును.

తెనుఁగునను గన్నడమునను గూడ 'ఱ' కారధ్వని నేఁడు పోయినది. అది యనేకవిధములుగ మాఱినదో, లేక యనేక విధములగు వర్ణములు పూర్వకాలమున 'ఱ' కారముగనుచ్చరింపఁ బడుచుండెనో నిర్ణయించుటకు సాధనసామగ్రి చాలదు. ఇతర ద్రావిడభాషలలోఁ దమిళ మళయాళము లందు నాఁడును నేఁడును, కన్నడ భాషయందు ప్రాచీనకాలమందును 'ఱ' కారము విన బడుచోట పదునొకొండవ శతాబ్దము నుండియు 'గ, ట, డ, ద, న, మ; య, ర, అ, ల, స, ళ' యనుధ్వనులు తెనుఁగున వినఁబడుచున్నవి. అంతకుఁ బూర్వ మెట్లుండెనో చెప్పుటకు తగినన్ని ప్రయోగములు కానరావు.

ఈక్రింది పట్టికలో నితరద్రావిడభాషలయందు 'ఱ' యనుధ్వని వినఁబడు సందర్భమునఁ దెనుఁగున గలుగుధ్వనుల కుదాహరణములుచూపఁ బడినవి. అందువలన 'ఱ' కారము తెనుఁగున నాయాధ్వనులుగ మాఱినదని యనుకొనఁగూడదు.

ఱ = గ.

పగులు (మళ. పఱుక్క, పగుక్క).

ఱ = ట.

ఏటిక, ఏట = గొఱ్ఱె, పొటేలు (తమి. ఏఱుగమ్); కూటువ; కూటము (తమి. కూఱు); గుంటఁడు (తమి. కుఱన్ద్రె) ; గొట్టము (తమి. మళ. కుఱల్); చటీలున (కన్న. చఱిలెనె); చుట్టు (తమి. చుఱులు, సూఱు; మళి. చూఱు) చేటు (తమి. మళ. కేఱ్) ; తట్ట (పండు) (కన్న. తఱల్) ; నెటిక (కన్న. నిఱి) ; పెటుకు (కన్న. పెఱకు) ; మట్ట (కొబ్బరి, తాటి మొద). (మళ. తమి. కన్న. తుళు. పాఱి) ; (మూల) ముట్టు (తమి. మళ. ముఱు).

## ట = డ.

అడత్త, అగడిత (కన్న. అగటి, అగట్, అగటిత, అగటితె, అగట్: అగత్తె); అడఁగు (కన్న. అట్; తమి. అటంగు); తమి. అటి = నశించు ; అడపు (కన్న. అటిప్వు, అటివు) ; అడలు (కన్న. తమి. మళ. అటల్; తుళు. అరతె); అడియు (తమి. మళ. కన్న. అటియు); అడుగు (తమి అటిన్దు); ఆడి (కోలు) (కన్న. ఆటి) ; ఆడు = పలుకు కన్న. ఏటు); ఇడిజారు (కన్న. ఇటి); ఈడు, ఈడుచు ఈడ్చు, (కన్న. ఈట్, ఇట్ ; తమి. ఈర్, ఇటి, ఇటు; మళ. ఇటి, ఈటుక్కగ); ఉడుగు (కన్న. తమి. మళ. ఉటు) ; ఉడుచు, ఊడుపు, ఊడ్పు (కన్న. ఉట్; తమి. ఉటు, మళ. ఉటు; తుళు. ఉర); (మట్టి) ఊడ (తమి. విటుదు, విట్ కన్న. బిటల్, బిటెల్, బీటల్, బీటెల్) ; ఊడిగము (తమి. ఉటవక్; ఊటియమ్. మళ. ఊట్, ఊటియల్; కన్న. తుళు. ఊటి, ఊటిగ) ; ఊడు (తమి. ఊట్) ; ఏడి కోల (మళ. ఈటుక్కోల్) ; ఏడు = 7 తమి. మళ. ఏటు; కన్న. ఏట్, ఏటు, ఓటు; దక్షిణమహారాష్ట్రము: యోటు; ఏడ్చు (తమి. మళ. కన్న. తుళు. అటుగు) ; ఒడ (యఁడు) (మళ. తమి. ఉటి= రాజాస్థానము; ఉటైయన్) ; ఒడికము (తమి. ఒటుక్కమ్); ఒడుకుడుడుకు (తమి. ఒటుక్కు); ఓడు(నీరు)(తమి. ఒటుగు, మళ. ఓటు); కడచు (తమి.మళ. కన్న. కటి) ; కడవాయను (మళ. కటవాయి) ; కడు (త. కటి, కటు) ; కడుగు (తమి. కఱువు ;) మళ కటుగు ; కడుగునీరు (తమి. కటునీర్) ; కడ్డి, - డ్డీ (తమి. కటి) ; కాడు = అడవి (కన్న. కాట్) ; కీడు (తమి. మళ. కీట్) ; కుండ (తమి. కుటిశె) ; కుడక (కన్న. కుటి) ; కూడిక (తమి. కుటు) ; కూడు. క్రి. (కన్న. కూట్, కూటు ; తమి. మళ. తుళు. కూరు) ; కూడు = తిండి (తమి. కూట్) ; కొడి, కొండె (తమి. కుటల్) ; (దీపపు) కొడి (తమి. కొటున్దు) ; కొడుకు, కోడె (తమి. కుటవు ; కుటక్కన్ఱు ; కుటమగన్) ; కోడి (తమి. మళ. కన్న. కోటి) ; కోడు (తమి. మళ. తుళు. కోటు) ; కోడు. క్రి. (తమి. కోటి) ; గడ (వెదురు. మొద) ; తమి. కటై ; మళ. కటె ; కన్న. గటె ; గడగడ (కన్న. గటగటనె) ; గడియ (కన్న. గటియు) ; గడ్డ = ప్రవాహము (మళ. కటమ్) ; గడ్డ = దుంప (తమి. మళ. కిటఙ్గు ; తుళు. కెరంగు ; కన్న. గడ్డె) ; గడ్డ (కట్టు) (తమి. కాట్) ; గడ్డి (తమి. కటిప్పుల్) ; గాడిద (తమి. కటుదై ; మళ. కటుదె ; కన్న. కత్తె) ; గిడస (తమి. మళ. కిటమ) ; గుడి (తమి. కుటి) ; గుడుగుడు (కన్న. గుటు గుటు) ; గొడ్డ (తమి. మళ. కుటవి) ; చాడి (మళ. చాటి) ; చిముడు (కిముట్) ; తడఁబడు (కన్న. తటు, తటుక్కు) ; తడి (డ) క (కన్న. తటి) ; తాడి ( - టి) (కన్న. తాట్) ; తొడకు, తొక్కు, తొక్కు (కన్న.

తుటి ; మళ. తోటి) ; తోడరు (కన్న. తోటల్) ; తోడీదోడి (కన్న. తుటిల్) ; తోడు (తమి. తోట్టమై) ; దడదడ (కన్న. దటదుటి) ; దడ ( - ళ) ము (కన్న. దటి) ; నాడు=దేశము (తమి. మళ. కన్న. నాట్) ; నిడుపు, నిలుపు, నిలుచు, నీలుగు (కన్న. నీల) ; నీడ (తమి. నిటల్. నీటల్, నెటల్, కన్న. నెటల్ ; మళ. నిటల్) ; నుడి, నుడువు (తమి. మళ. మొటి ; తుళు. కన్న. నుడి) ; నెగడు, నిగుడు (తమి. నిగట్ ; కన్న నెగట్); పండు (తమి. పటు) ; పడక = పతాక (కన్న. పటయి) (- వి; గె) ; పడి = నింద (మాట పడు (తమి. పటి) ; పడుక (కన్న. పట్కె) ; పడుకు (కన్న. పటుంకు) ; పడుగు (కన్న. పటి); పాడి, వాడి (తమి. పాటి) ; పాడు = గ్రామము (తమి. మళ. కన్న. పటువమ్, పటు) ; పాడు=చెడినది = (తమి. మళ. కన్న. తుళు (పాట్); పిడత (తమి. పిటా); పిడుక (తమి పిటుక్కై; మళ.కన్న. పిటుక్క;); పిడుచు (తమి. మళ. కన్న. పిటి; మహారా. పిళనేం); పూడు (మళ. పూటు; కన్న. పూట్); పొగడు (తమి. మళ. పుగట్; కన్న. పొగట్; తుళు. పుగర్); పొగడిక (కన్న. పొగట్కె) పొగడ్త (కన్న. పొగత్తె); పోడ (కన్న. పొటకు); పోడి (తమి. పూటి; మళ. పుటిది; కన్న. పుటిల్, తుళు. - పొడె) ; బడబడ (కన్న. పటపటి); బడలిక (తమి. వటలిక్కె);బడలు (తమి. పటిక్కై; మళ. వటుక్క; కన్న. బటల్) ; బడి, (తమి. మళ. వటి; కన్న. బటి) ; బాడిగ (కన్న. బాడ్గె) ; బూడిద (తమి పూటి) ; బోడడు (కన్న. బోటి). బోడసరము (కన్న. బోటతర) ; బోడి (మళ. పొటిన్; కన్న. తుళు. బోళ, తమి. బోటి); మడుగు (కన్న. మడ్గెసు); మడతి (తమి. మటి=చిన్న); మడుగు (తమి. మటుంగు) మాడ, శాసనములు, మాటి (తమి. మాట్టై;కన్న; మాటు; మిడి (గుడ్డు) (తమి. మిటి, ముటి); ముడి=కంటు (తమి. మళ. ముటి, ముటి. ముటిమ్) ; కన్న. మొటి; మళ. ముటి, ముటె ; ముడుగు (కన్న. ముటుగు; తమి. మూట్గు; మూరుకు; తుళు. మళ. ముక్కు; ముణ్ణు); మేడి (కోల) (తమి. మళ. మేటి) ; మోడి = మాట (తమి. మొటి) ; మోడు మ్రోడు (తమి. మొట్టై): వడవడ, బడబడ (తమి. వటవటి, వటువటు) ; వడలు (తమి. వటులు); వడి (తమి-వటి); వడియు (తమి. వటి); వాడుక (తమి. మళ.పటక్క, పటక్కు; కన్న. పటక-బటికె; తమి. వటక్కమ్, వటక్కు) ; విడుచు (కన్న. ఇటి; బిత్, బీత్; విటు, వీత్; మళ. వీటు, విటుక్కు. వీట్కుగ); వెడలు (మళ. తమి. తుళు. ఉటలు); వేడు (తమి. వేణ్డు, కన్న. బేట్; తుళు. బేడు) ; సుడి (కన్న. సుటి; తమి. చుడి, చురి, చుటల్, చూర్; తుళు. తుళి, సుళి) ; సుడియు (తమి-చుటులు.)

## ఱ = ద.

కద లు (మళ. కఱెక్క, తమి. కఱల్; కన్న. కఱలు); కదల్చు (కన్న. కఱల్చు); ఎదురునిలుచు (మళ. ఎఱునీల్క); ఎదుగు (మళ. తమి. కన్న. ఎఱు; తుళు. ఎర); అదటు (తమి-మళ. అఱట్టు; కన్న. అఱటు); అదలుచు (కన్న - అఱల్చు); ఒదుగు (కన్న. ఒఱు); కదుపు (తమి - కఱుము, కఱుపు); కదుము (తమి - కఱుము); క్రిందికి (తమి-కీఱక్కు); గదరు, గద్దించు (తమి-కఱఱు); గెనసు (కన్న. గెఱసు, గెణసు); పిదపిదన (తమి-విఱవిఱన); మెదపు (తమి-మెఱుగు); మెదుగు (తమి. మళ. మెఱుగు); వదులు (తమి-వఱలు):

## ఱ=న

ఉన్న (కన్న. ఉఱ); దునుకు (కన్న. తుఱిల్; తమి. తుఱి; మళ. తుని); పునుఁగు (తమి. మళ. కన్న. పుఱుగు); మునుఁగు, మునుఁగు, మునుక, బుడుక (కన్న. ముగ్గు. ముఱగు; తమి. ముఱుగు, మూగ్గు; మళ. అమిఱగ; తుళు. మురుంగు); మైనము (తమి. మళ. మెఱు; కన్న. తుళు. మేణ, కన్న. మయణ);

## ఱ=మ.

ఉమియు (మళ. ఉఱియుగ); ఉమ్ము, ఉమ్మి (కన్న. ఉగఱు); చిముకు (తమి. చీఱ్); చీమ (తమి. చీ, చీఱ్); దుముకు (తమి. తుఱి; కన్న. తుఱిల్; మళ. తుని).

## ఱ=య.

పోయు (తమి. మళ. పొఱి); ఉయ్యాల, ఊయల (తమి. ఊఞ్జల్; మళ. ఉఱిఞ్జల్); గోయి (తమి. మళ. కన్న. కుఱి); గీయు (తమి. కిఱి).

## ఱ=ర.

ఉరిడె (తమి ఉఱు, ఉఱువాన్); ఊరు (మళ. ఉఱమ్); ఒరయు(మళ. ఉఱియు); ఒరలు (మళ. ఉఱెక్కు); కారము (తమి. కాఱ్); చేరిక (తమి. కెఱుదుగై); తూరి (మళ. చుఱట్టు; కన్న. సూఱ్, సూఱు); నేరెడు, నేరేడు (కన్న. నెఱల్; నేఱల్); పురుగు (తమి. మళ. పుఱు; కన్న. పుఱ, పుఱు); పూరేడు (తమి. పూఱ్); పెరడు (తమి. పిఱక్కడై); పేరు=పెద్ద (తమి. పేఱ్) మూరర (తమి. ముఱమ్; కన్న. మఱ); హారువు (మళ. అఱగు).

## ఱ = ఱ.

అఱచు, అర్చు, ఏడ్చు (కన్న. అఱ్, తమి, అఱ్; మళ. అఱు); అఱు = నశించు (తమి. మళ. కన్న. అఱ్); అఱుగు (కన్న. అఱుగు);

ఒఱఁగు (మళ. ఉఱక్కు) ; కఱ్ఱు (తమి. మళ. కొఱు, కాఱు) ; కాఱు. క్రి. (కన్న. కాఱ్) ; కాఱు = నలుపు (తమి. కాఱగమ్) ; కుఱకుఱ (తమి. కుఱుక్కుఱుక్కు) ; కూర్పు (తమి. కఱిప్పు) ; కొఱ్ఱు, గొఱ్ఱు (తమి. కొఱు, కఱు) ; చిఱుగు (తమి. కిఱి, కీఱ్) ; నఱకు (తమి. నఱుక్కు) ; నూఱ్చు, నూర్పు (తమి. నూఱిల్) ; మఱుఁగు (కన్న. మఱు) ; ముఱకటించు (తమి. మళ. ముఱుక్కు) ; మూఱ (తమి. మళ. ముఱమ్, ముఱ ; కన్న. మొఱ ; మళ. ముఱి, ముఱె) ; మెఱుఁగు (మళ. మెఱు) ; మొఱఁగు (మళ. మూఱక్కు) ; వఱ్ఱు (కన్న. పొఱె, మఱ్ఱిను).

కొన్ని శబ్దములలో ఱకారము శకటరేఫముగ మాఱి, వెనుకనున్న హల్లుతోఁ జేరును; ఆ క్రా వడి ఒకప్పుడులోపించును:—

క్రమ్ము (తమి. కఱుము) ; క్రి, క్రీ, కి, కీ, క్రింద, కింద (కన్న. తమి. మళ. కిఱ్, కీఱ్) ; క్రుంగు, కుంగు (కన్న. కుగ్గు) ; క్రుక్కు (మళ. కుఱుక్కు) ; క్రుమ్ము (తమి. కుఱుంబు) ; క్రుళ్లు (తమి. కుఱై ; మళ. కుఱె ; కన్న. కొఱె) ; క్రొవ్వు (తమి. కొఱు, కొఱుప్పు) ; క్రోవి (కన్న. కొఱవి) ; క్రోవి (కన్న. కోఱ్) ; గ్రచ్చు, గచ్చు (మళ. కఱిచ్చి) ; గ్రొచ్చు (తమి. కుఱిప్పు) ; ప్రక్క, పక్క (కన్న. పఱ్క) ; తమి. పఱు) ; ప్రత్తి, పత్తి (తమి. పఱుత్తి ; కన్న. పఱ్తి) ; ప్రా, ప్రాఁత (మళ. తమి. కన్న. పఱ) ; ప్రుచ్చు, పుచ్చు (తమి. పుఱుచ్చు ; కన్న. పుఱి) ; ప్రొద్దు (తమి. పొఱుదు ; మళ. పొఱుదు ; పొఱ్ఱు; కన్న. పొఱ్ఱడె, పొఱ్ఱఱ్, పొఱ్ఱఱె) ; ప్రోలు (కన్న. పొఱల్ ; తమి. పొఱిల్) ; బ్రుంగు (మళ. పుఱగ్గు) మ్రింగు (తమి మిఱుంగు, ముఱుగ్గు) ; మొఱుఁగు, మ్రోఁగు (తమి. మళ. కన్న. ముఱుజ్గు ; తమి, ముఱుక్కమ్) ; మ్రుగ్గు (తమి. మళ. ముఱుక్కు) ; స్రుక్కు (తమి. చఱుగ్గు).

ఱ = ల

అగలు (అగలుచు) (తమి. అగఱ్, అగఱి, అగిళ్ ; మళ. అగిఱ్, అగిళ్, అగిల్ ; కన్న. అగఱ్ ; తుళు. అగఱ్. అగళ్) ; అలఁదు (తమి. మళ. ఎఱుదు) ; అలుగు, అలుక (తమి. మళ. కన్న. అఱల్) ; అడలు (తమి. మళ. కన్న. అఱల్ ; అలవు (మళ. అఱగు) ; ఉలిమిరి (మళ. ఉఱిజ్జి) ; ఊలమాలగుడుచు (కన్న. ఊఱల్ ; తమి. మళ. ఉఱలు) ; ఎల (కాయ) (మళ. ఈఱత్తెంగు) ; ఏలాడు, వ్రేలాడు (కన్న. ఎఱల్) , ఒలుకు (తమి. మళ. కన్న. ఒఱియు, ఒఱ్కు ; కలఁగు (మళ. కఱుజ్గు, కఱెక్క) ; కలి (కన్న. కఱి) ; కలియు (తమి. కఱుము, కఱువు) ; కీలుగంటు (తమి మళ. కన్న. కీఱ్) ; కూలు (మళ. కొఱియు) ; కొల్ల (తమి. మళ. కొఱ) ;

గుల్ల (మళ. కుఱి, కొఱి); గోల, గోలు, గోడు (కన్న. గోఱ్); చంక, చంకిలి, చక్కిలి (సం. కక్ష; తమి. చంక్కై; కైక్కుఱి; కన్న. కంకఱ్ కంకుఱ్; తుళు. కంకుళ); చీలు (తమి. కిఱి, కీఱ్); చెలువు (తమి. మళ. చెఱు); జల్లి (మళ. చాఱి; కన్న. జఱివె, జల్లె); తాల్మి (తమి తాక్షైన్మై); తేలు = వృశ్చికము (కన్న. చేఱ్, తేఱ్); నులిపురుగు (మళ. నూఱు, నుఱియు, నుఱు; తమి. నుఱై; కన్న. నొఱె, నుగుళ్); పలుకఁబాఱు (మళ. పఱుక్క); పలుకుఁగాయ (మళ. పఱుక్కాయ్, కన్న. పఱ్గి); పులగము (తమి. పుఱగు; మళ. పుఱగు, పుఱిక్కు, పుఱుజ్జు; కన్న. పుఱ్గి, పుఱ్గె; తుళు. పుర్గు); ప్రేలు, పేలు (తమి. మళ. కన్న. పేఱ్; తమి - పేశు); (ప్రాల్) మాలు (తమి. మళ. మాఱుక్క); లేచు (తమి. మళ. ఎఱు; కన్న. ఎఱ్, ఏఱు); లేపు (తమి. ఎఱుప్పు); లోఁగు (తమి. మళ. అఱు.; కన్న. అఱ్); లోఁతు (మళ. తమి. కన్న. ఆఱ; తుళు. ఆళి); ప్రీలు (తమి. విఱు, వీఱ్; మళ. వీఱు, విఱుక్క; కన్న. బిఱ్, బీఱ్); సులువు (తమి. చూఱుప్పు).

ఱ = స.

కసరు (తమి. కఱు); నుసుము (తమి. నుఱుమ్బు); పసపు (తమి. పఱుప్పు); మసకు, మసక (మళ. మఱుక్కు; కన్న. తుళు. మసకు).

ఱ = ళ.

అళాకు (తమి. కన్న. ఆఱాక్కు; తమి. ఉఱుక్కు); ఆళ్వారు (తమి. ఆఱ్వార్; మళ. ఆఱువార్; కన్న. ఆఱ్వార్); ఇళిజారు (తమి. ఇఱి; మళ. కన్న. ఇఱి); కళ్లె (కన్న. కొఱె); కూళ, కూళుఁడు (సం. క్రూర; కన్న. కూఱ్); కొళవి, కొళాయి (కన్న. కొఱాయి; తమి. కుఱాయ్); కొళంబు (తమి. కుఱుమ్బు); తళతళ (తఱ తఱ); తావళము (తమి. తాఱ్వడమ్); తాళము (తమి. తాఱ్, తాళ్; మళ. తాఱ్, త్రాళ్, తాపు, తాక్కుఱి, తఱుదు; కన్న. తాఱ్); తాళి (తమి. తాఱి); తాళు (తమి. మళ. తాఱు; కన్న. మళ. తాఱ్, తాఱు); దళము = సేన (కన్న. దఱ); దళవాయి (కన్న. దఱవాయి); నాళము, నాళి (కన్న. నాఱ, నాఱి); పాళి = వరుస (కన్న. పాఱి; సం. పాటీ. పాలి).

కొన్ని యెడల 'ఱ' కారము దానివెనుకనుండు హల్లుతో నేకమయినది (Assimilation); కొన్ని యెడల లోపించినది; కొన్ని యెడల ననుస్వారముగ మాఱినది:—

అంగు, హంగు (తమి. అఱగు); అక్కజము (తమి. అఱుక్కాఱు; కన్న. అఱ్కజ); అక్కఱ (కన్న. అఱ్కఱ్, అఱ్కఱు); అక్కిలి, అంకిలి

(తమి. మళ. కన్న. అఱుగు) ; ఇంకు (కన్న. ఇఱుకు) ; ఇగ్గు (తమి. ఇఱి. ఇఱు ; కన్న. ఇఱ్ ; మళ. ఇఱక్క) ; ఉద్దులు (తమి. ఉఱుద్దు ; మళ. ఉఱుజ్జు ; కన్న. తుళు. ఉద్దు) ; ఎక్కు (తమి. మళ. కన్న. ఎఱు) ; ఎచ్చఱిక, హెచ్చఱిక (కన్న. ఎచ్చఱ్) ; ఎత్తరము (కన్న. ఎత్తర్) ; ఎత్తు (కన్న. ఎత్తర, ఎత్తరవు; తమి. మళ. ఎఱు, ఎఱుమ) ; ఏతెంచు (కన్న. ఎత్తర్). ఒగ్గు (కన్న. ఒఱ్గు) ; కాలు = దగ్ధమగు (మళ. కఱల్) ; కుత్తుకఁ (తమి. - మళ. కఱుత్తు ; కన్న. కత్తు) ; కొత్తు = గ్రొచ్చు (తమి. కొఱుదు) ; గాబు (తమి. కఱమ్బు) ; గుగ్గిళ్లు (కన్న. పుఱ్గె, హుఱ్గి) ; చిక్కు (మళ. కుఱుక్కు) ; తగ్గు (కన్న. తఱ్గు); తొత్తు (తమి. తొఱువర్) ; దద్దడి (కన్న. దఱ్దఱె) ; దద్దురు (మళ. తఱదత్తం) ; నిగ్గు, నీఁగు (కన్న. నెఱ్గు, నెగఱ్; తమి. నిగుఱ్) ; నూక (తమి. నూఱై) ; పగులు (మళ. పఱుక్క. పగుక్క) ; పీఁకు, పీఁకు (మళ. పిఱు ; పొంగు (తమి. మళ. పుఱుజ్గు) ; పొక్కు (తమి. పొఱుక్కు ; మళ. పుఱుక్కు ; కన్న. పుఱ్గు ; తుళు. పొఱ్గు) ; బుగ్గి (తమి. పుఱుది) ; బ్రదుకు (కన్న. బఱ్దుంకు, బాఱ్కె) ; మాగిరి (కన్న. మఱ్గు) ; మిరియము (తమి. మిఱగు ; కన్న. మెఱసు) ; మెత్తు (తమి. మళ. మెఱుగు) ; మొగ్గ (తమి. మొఱట్).

## శకట రేఫము

'ఱ' యనునక్షరము ద్రావిడభాషలన్నిటియందును నాదికాలము నుండియుఁగలదు. తెనుఁగు కన్నడములలో నది యిప్పుడు ద్విత్వరేఫము నందును, ద్విత్వరేఫమునం దొక రేఫము లోపింపఁగా మిగిలిన చోటను దప్ప నితరస్థలములందు గానరాకున్నది. ఇప్పటి తమిళమళయాళములలో నది యిప్పుడు ననేకస్థలములందు గానవచ్చుచున్నది. తమిళ మళయాళములలోఁ గూడఁ గొన్ని శబ్దములందు రేఫశకటరేఫములను నిర్ణయించుటకు సాధ్యము కాకున్నది. ప్రాచీనాంధ్రకర్ణాటములందలి శబ్దములలోని శకటరేఫమును నిర్ణయించుట మఱియుఁ గష్టమైన పని. శ్రీనాథ పోతనల కాలమునాఁటికే శకటరేఫజ్ఞానము కొందఱుపండితుల గ్రంథములయందును గవుల గ్రంథములయందును మాత్రము కొలఁదిగ నిలచినది. వ్యవహారమునందు ద్విత్వశకటరేఫములందుతప్పఁ దక్కినస్థలములందు పదునాఱవశతాబ్దమునకు శకటరేఫ ముచ్చారణమందును వ్రాఁతయందును గూడ లోపించినదని చెప్ప వచ్చును. ఏది రేఫమో, యేది శకటరేఫమో యను విషయమై లాక్షణికులలో తగవులేర్పడినవి. అప్పకవి కొన్ని రేఫముల నుభయములుగఁ బేర్కొన

వలసినవాఁడయ్యెను. అనఁగా నాతనికిఁ గావ్యములం దొక్కటే శబ్దము నందు రేఫమొకచోటను, శకటరేఫ మింకొకచోటను గనఁబడె నన్న మాట.

శకటరేఫ నిర్ణయము చేయుటకుఁ బూర్వకావ్యములం దది యతిప్రాసములందు సునిబద్ధమయిన స్థలముల నేర్చికొనవలయును. పూర్వశాసనము లందు శకటరేఫములతో వ్రాయఁబడిన శబ్దములను క్రోడీకరించుకొన వలెను. ఇతర ద్రావిడభాషలలోఁ శకట రేఫములుగల తెనుఁగుశబ్దములకు సంబంధించిన పదములను వెదకికొనవలయును. ఇతర ద్రావిడభాషలలో నొకపదము శకటరేఫయుక్తముగఁ గానఁబడుచున్నను దెనుఁగునఁ గూడ నది శకటరేఫముతోడనే యుండవలెనను నియమము లేదు. కావున, యతిప్రాసములందు సునిబద్ధములైన శకటరేఫయుతపదములే మనకు శకటరేఫ నిర్ణయమున సహాయకారులు కాఁగలవు. రేఫశకటరేఫములఁ గూర్చి పూర్వకవుల గ్రంథములందు మతభేదము కలిగినప్పుడు పూర్వకవుల ప్రయోగము లుత్తరకవుల ప్రయోగములకంటెఁ బ్రమాణములుగ నంగీకరింపవలెను. కవులయినను నావశ్యకతనుబట్టి శకటరేఫమును యతిప్రాసములందు వాడిరి కావున నెన్నియో శకటరేఫయుక్తపదములకు సరియగు ప్రమాణములు గానరాకున్నవి. అట్టి పదములందలి రేఫశకటరేఫముల నిప్పటి కనిర్ధారితములుగ విడువవలసియున్నది.

ఈ క్రింద శకటరేఫములుగల తెనుఁగుపదములపట్టిక యీఁబడినది. ఆపట్టికయందు మొదల నక్షత్రసంజ్ఞ (*) గల పదముల నప్పకవికూడ తెలిపినాఁడనియు, § అను సంజ్ఞగల పదములు శబ్దరత్నాకరమున లేవనియు; నప్పకవీయమునందు మాత్రమున్నవనియు, + అను సంజ్ఞ మొదలఁ గల పదములు శబ్దరత్నాకరమునఁ గాని, యప్పకవీయమునఁ గాని లేవనియు, వాఙ్మయమున నాయా గ్రంథములందు గలవనియు, + అను సంజ్ఞ మొదలఁగల పదములు శాసనములందు గలవనియు, ‡ యను సంజ్ఞగల పదము లితరభాషా పదములఁ బట్టి యేర్పఱిచిన వనియు గ్రంథాశ్వాసపద్యసంఖ్యల తరువాత నక్షత్రచిహ్న మున్నచో నాప్రయోగము యతిప్రాస స్థానములలోనిది కాదనియు, ఆసంఖ్య తరువాత నానక్షత్ర చిహ్నము లేకుండిన నది యతి స్థానమునందో ప్రాసస్థానమునందో కానవచ్చుచున్నదనియు, ప్రత్యేకముగ నొసఁగఁ బడిన యంకెలవలన నాయాశాలివాహన శకసంవత్సరముల శిలా శాసనములం దాపదములు గానవచ్చుచున్న వనియు, గ్రంథ సంకేతము లేని రోమను అంకె తరువాతి సంఖ్య "దక్షిణహిందూదేశ శాసనావళి"

(South Indian Inscriptions) ఆయా సంపుటములలోని శాసనసంఖ్య యనియుఁ దెలియవలెను.

శకటరేఫముగల పదముల పట్టిక

అంకకాఱు - 1115, 1130, 1131, 1132, 1138, 1163; IV. 717.

*అందఱు-పూ. II. 67; పూ III. 202 : తి ; - 1263 (కన్న. అనిబర్ ; తమి. అనైవర్ ; చూ. కన్న అనితు; తమి. అనైత్తు ; మళ. అత్రయుం).

అందోఱు - ఆ. V. 168.

అంపఱ-ఆ IV. 20 ; ఉ. I. 170.

§ అంపఱు = ఓపు.

అక్కఱ - ఆర. VII. 343,367; ఉ VIII. 6; (కన్న. అక్కఱ (-ఱు,-తె.)

† అడఱు- 1132.

§ అద్దిఱ.

√ అఱ = గది. రూ. అఱ్ఱ

అఱ (లేక)- ఉ. VII. 183 ; బ. 57,100 ; ప. 77, 216.

† అఱ (కొనక)- కు II. 441.

* అఱ (చేయి, మొద.)- పూ.IX. 128 ; తి ; ప. 132; 237, 253 : బ 160, 200; అఱ = నగము - ఆ. III. 12; ఆర. II. 135 ; ఉ. VII. 87.

† అఱగంభం IV. 797.

† అఱదీపము - 1135.

అఱపోఱడు - ఆర. II.

† అఱమానిక - 1155.

§ అఱ మూఁతయిల్లు.

అఱుక - ఉ. IV. *

* అఱకడ - ఆ. VI. 114, 160 ; పూ. VII. 105 ; తి.

అఱకడము - జై. I.

* అఱకము. రూ. అఱుకువ, ఉ. IV. రూ. అఱ్ఱియము. రూ. అఱ్ఱెము.

§ అఱకమ్మట.

అఱగొండెతనము - భల్లా V. *

అఱగొడ్డియము,రూ.అఱగొడ్డెము.

* అఱగోఱ - ప. 260 ; భీ. II.

అఱచు-ఆర. II. III ; ఆర III. 153 ; తి; రామా. II (అను ప్రాసము) (కన్న. అఱఁ(ఱి)చు).

అఱజాతి = దుష్టుఁడు - పూ. V. 242 ; కు. I. 880.

§ అఱంటులు.

§ అఱటులు.

అఱడా - భాను. IV. * ; (రూ. అఱడు.)

అఱప - బ. 220.

అఱపు.

§ అఱపుకొనుట = దక్కించుకొనుట.

అఱమర. - తి. నిర్వ. IX; విక్ర. III.

అఱమరిక.

§ అఱమఱ

§ అఱము.

అ (నగి) ఱవ - తి. విరా. I. * ; అను. V. * (రూ. నఱవ, అఱ్ఱ.

అఱవదు = ఒక సస్యము - కాళ. III.

అఱవత - కాశీ. III. *

× అఱవపాఱులు - బ. 202.

√ అఱవము.

అఱవఱసేయు - ఉ. VI. *

* అఱవఱలు - ఆర. VI. 350; తి. భీష్మ. II.

* అఱవలు.

× అఱితిపూసలు - ప. 163.

× అఱిమి - బ. 68.

ె - నృ. IV. 43; కు. I. 171; తి. విరా. III భీష్మ II; బ 84, 171; ప. 73, 406.

* అఱిముఱిపడు.

√ అఱిమెనకుండలు.

√ అఱిసియ.

* అఱిసె.

* అఱు = తుయించు. (చూ. ఉక్కఱు, ఏపఱు, క్రచ్చఱు, పెంపఱు, పెల్లఱు, పొలుపఱు, చిట్టఱు, రూపఱు, సిగ్గఱు, మొద.) (కన్న. అఱు, ఆఱు.)

అఱు = అఱ్ఱు - కాశీ. III. *

అఱుఁదెవులు - తి. అను. III; * నిర్వ. IV. *

అఱుకువ - ఉ. IV. రూ. అఱకము.

అఱుక్రమ్ము=కవియు - రా. సుం.

* అఱుగు = జీర్ణించు; రూ. అఱువు.

§ అఱుగు = తిన్నె (శ. ర. ఆరుగు)

√ అఱుగుఁదెవులు.

√ అఱువుఁ దెవులు.

అఱుగుల్లు. జై. VII * రూ. అఱువుల్లు-తి. విరా. V* ; లక్ష్మీ. I.

√ అఱుగుడు.

* అఱువుడు. నృ. I. 4.

అఱుగువడు=తుయించు. పూ. V.

అఱుత(న్). ప. 104 ; హర. V. *

† అఱుతెంగూఱు.

√ అఱుపు.

† అఱుమనగల్లు-1346.

అఱుము-ఉ. VIII. 6 ; తి. ఉద్యో. III; భీష్మ. II.

* అఱువది-ఆర. VII. 36 ; ఉ. VIII. 269 ; తి ; (కన్న. అఱ-ఆఱు; తమి. మళ. ఆఱు.)

√ అఱువంద్రు.

√ అఱ్ఱు. రూ. అఱవ, నఱవ, నఱ్ఱు.

√ అఱ్ఱును = ముండ్లు మొదలగు వానిమోఁపు.

అఱ్ఱాఁక-కాళ. III *; కళా. I; కాశీ. VII. *

అఱ్ఱాఁకలి-భో. VI. *

అఱ్ఱాకు-మార్క. V; * ప్రభా. I. 6. *

√ అలవఱుచు.

§ అసుఱుసుఱను.

√ ఆకుఱాయి.

† ఆడ్లపట్టుమఱితి VI. 585.

√ ఆనుకఱ్ఱ.

ఆఱసి-జై. VII. *

ఆఱసిపడు-రా. బాల.

* ఆఱడిపోవు-తి. ఉద్యో. III; నిర్వ. II.*

× ఆఱాల-బ. 83.

§ ఆఱికెపంట.

* ఆఱు = ఉపశమిల్లు. నశించు.

—ఆఱు (నిండారు, సొంపాఱు, మొద. వానిలో శకట రేఫముండవలె నేమో. కన్న. ఆఱు ; తమి. ఏఱ్.)

* ఆఱు = 6-ఆ IV 18 ; కు. I. 580;771;-1135;1364. (తమి. మళ. కన్న. ఆఱు.)

√ ఆఱుగురు.

√ ఆఱుచు = ఉపశమింపఁజేయు, నశింపఁజేయు.

√ ఆఱుపు = ఆఱుచు.

* ఆఱుపు = కూఁత, య. II. *

† ఆఱువంగ్గల - IV. 1072.

√ ఆఱువాళ్లు. బ. కొంచెమెం తుట.

ఆఱువ్రుప. 1187.

ఆఱువేలు. VI. 628.

ఆఱుస - ఆం. భా. ద్వి. వై.

† ఆఱ్లపట్టు - VI. 584.

† ఇంతాఱచింగన - 1359.

* ఇందఱు - ఆ. VI. 153; కు. I. 161; (కన్న. ఇనిబర్; తమి. ఇనై వర్. చూ. కన్న. ఇనితు; తమి. ఇనై త్తు; తె. ఇంత.)

* ఇద్దఱు - నృ. I. 91; తి; - 1020, 1084, 1150, 1154, 1201, 1212, 1281, 1291, 1408.

× ఇఱవత్తుఁడు - బ. 46.

√ ఇఱి - ; (కన్న. ఇఱి.)

§ ఇఱిచను.

√ ఇఱికి = ఒకబాలక్రీడ.

† ఇఱియక - VI. 200.

* ఇఱియు = నలఁగు.

* ఇఱుకటము - నై. IV.

√ ఇఱుకాటము.

*ఇఱుకు - ఆ. II. 67; కు. I. 204; అచ్చ. సుం. కాం*; పంచ. నా. I. ; తి. నిర్వ. VII.*

√ ఇఱుక్రమ్మాను.

ఇఱుము=మఱుఁగు-భాగ. VIII.*

ఇఱుముకొను - రా-యు. కాం.

√ ఇఱులు = చీకటులు.

ఇఱులువడు - పూ. V. 242.

§ ఇఱుసు.

† ఇఱ్ఱలూగు - IV. 926.

† ఇఱ్ఱలూఱు - 928. 1135.

ఇఱ్ఱి - ఆ. V. *

ఇఱ్ఱింకులు - భీ. II ; నై. VII ; ఆము. IV.

ఇఱ్ఱిగోఱజము - మను. IV.

√ ఇఱ్ఱియలు=ప్రక్కలు, పార్శ్వములు.

† ఇఱ్లకాను = ఇఱ్లకయును - VI. 584.

ఇలకఱచు - ఆము. V * ; రా. యు. కాం. * (చూ. ఈలకఱచు).

ఈఱతాఱలు = వక్రము - అశ్వ. I.

ఈఱమి I జొంపము - కళా. *

ఈఱము = తఱచు, సాంద్రము:- విక్ర. VI షో. VIII. *

ఈలకఱచు = ప్రాణము బిగఁ బట్టు - తి. కర్ణ II.

చూ. ఇలకఱచు.

* ఉఱ్కుఱు - నృ. III. 52 ; విరా. V.

* ఉఱ్కెఱు.

ఉప్పఱట్లు. VI. 635.

§ ఉఱవి = తెగువ.

ఉఱవు = ఔచిత్యము ; - అర. IV 295 ; తి. ఉద్యో. III; రా. యు. కాం.

= దృఢము, స్థిరము:— చంద్ర. *

ఉఱియ = దిట్ట - అచ్చ. అర. కాం.

* ఉఱియు = కురియు.

√ ఉఱుపు.

* ఉఱు = శ్రేష్ఠమగు. (కన్న. ఉఱు.)

* ఉఱు = లక్ష్యపెట్టు ; - ఆ. VI. 194, 160 ; స. II. 305 ; అర. IV. 68 ; అర. VI. 320, 350 ; అర. VII. 36; తి. ఉద్యో. IV ; నృ. III. 52 ; నృ. IV. 135 ; & పూ. III. 102 ; పూ. V. 209 ; ఉ. I. 170 ; ఉ. VI. 180 ; ఉ. VIII. 269 ; కు. I. 235. I. ఉఱుఁద్రాళ్లు - వి. పు. VII * (రూ. ఉఱ్ఱుఁద్రాళ్లు.)

§ ఉఱుకఱు.

* ఉఱుకు - అర, VI. III ; నృ. IV. 41 ; పూ. VI. 89, 101, పూ. VII. 105; తి. ద్రోణ I ; సా. I ; బ. 189, 222. (శ. ర. " ఇది యచ్చ తెనుఁగు రామాయణమునందు లఘు రేఫయు క్రమముగాఁ బ్రయోగింపఁబడి యున్నది. అదిపొరపాటు. "

* ఉఱుత.

§ ఉఱుది.

* ఉఱుము - ఆ. VIII. 269 ; అర. IV 68 ; అర. VII. 123 ; కు. I. 235 ; ప. 237 ; తి. ద్రోణ. I. కాశీ. II ; ఉ. IV (అనుప్రాసము.)

† ఉఱువునేల - V. 1084.

* ఉఱువు = ఉఱుగొట్టుట (రూ. ఉఱ్ఱు), అర. VII. 367 ; అచ్చ. యు. కాం. II* ఉఱువు (కన్న. ఉఱువు = గొప్ప తనము, శ. ర. ఉరువు.)

× ఉఱువుళ్లు - తి.

ఉఱ్ఱటలూఁగు - పంచ. వేం. IV.

ఉఱ్ఱట్లూఁగు - ఉ. హరి. IV ; కాశీ. II.

√ఉఱ్ఱు.

√ ఉఱ్ఱుఁద్రాళ్లు.

† ఉఱ్వం (గొలిచితిమేని) = ఇతరులను - IV. 1270.

ఊఱట - ఉ. VII. 203 ; కు. I. 580 ; తి. విరా. II.

√ ఊఱడిల్లు.

* ఊఱడు. ఆ. IV. 18 ; ప. 145.

ఊఱించు - ప. 371.

† ఊఱు = గ్రామము - IV. 926.

* ఊఱు = సరిపోలు - పంచ. నా. III.

ఊఱు = స్రవించు. (కన్న. ఊఱు; ఒఱె ; తమి. ఊఱు ; మళ. ఉఱ.

తుళు. ఉయిలు, ఊజు, ఊను.)

* ఊఱుఁగాయ.

* ఎందఱు - తి ; (కన్న. ఎనిబర్ ; తమి. ఎన్నైనర్ ; చూ. కన్న ఎనితు ; తమి. ఎన్నైత్తు ; తె. ఎంత.)

✓ ఎగ్గుఱుతు.

ఎచ్చిఱు - జై. VIII ; పంచనా. I.

✓ ఎడతెఱపి.

✓ ఎడతెర్చి. తి. విరా. V.

† ఎడఱువ II 63.

ఎఱ = వానపాము, అను. II. *

† ఎఱక - IV. 677 ; 1151, 1243 ; ఎఱగ IV. 1034 ; - 1151, 1261 ; ఎఱకమ IV 731 ; - 1163 ; ఎఱమండండు IV. 677 ; ఎఱవరడి 1270 ; ఎఱపోతినాయండు 1267 ; ఎఱసుందరి 1390 ; ఎఱని 928 ; ఎఱియ 928, 1051, 1111, 1118, 1127, 1128, 1139, 1142, 1148, 1151, 1202 ; IV. 677 ఎఱియమనాయకుండు 1139, 1164 ; ఎఱియమసెట్టి 1151 ; ఎఱిని 1163 ; ఎ ఱియముత్తరాజులు 1203 ; ఎఱియన1153 ; ఎఱియ బోయుండు 1233 ; ఎఱియాంబ 1149 ; ఎఱియాంబికా 1163 ; ఎఱుసుందరి 1390 ; ఎఱ్ఱక 1151 ; IV. 717 ; ఎఱ్ఱకార్యగుంట 1262 ; ఎఱ్ఱబోయుండు 1233 ; ఎఱ్ఱమసెట్టి 1213, 1238 ; ఎఱ్ఱమనేండు 1261 ; ఎఱ్ఱంజెఱువు 1164 ; ఎఱ్ఱంగొంబనాథుండు 1241 ; ఎఱ్ఱమాచెన 1149 ; ఎఱ్ఱమోజు IV. 677 ; ఎఱ్ఱాబోండు 1257 ; ఎఱ్ఱిపోతు 1140 ; ఎఱ్ఱాభిధాన 1139 ; ఎఱ్ఱ్య 1258.

(కన్న. ఎఱె = రాజు ; తమి. ఇఱైవ ; మళ. ఇఱా.)

* ఎఱఁగు - కు. I. 30; బ. 71 ; (కన్న. ఎఱగు; తమి. ఇఱంగు, ఇఱైంజు; మళ. ఇరఙ్ఙు; తుళు. ఎరగు.)

✓ ఎఱ (గందు)

× ఎఱ చూపు - ఉ II. 142

† ఎఱదీపము - 1286.

× ఎఱపంది. బ. 55

× ఎఱమంట - పూ. II. 67 ; పూ. V. 150 ; ఉ. II. 142 ;

× ఎఱసంజ. ఉ IX. 244 ; ఉ. X. 184 ; రామా. V.

* ఎఱక - నృ. I. 54 ; కు. II 738 ; తి. - (కన్న. ఎఱకె ; తమి. ఇఱగు, ఇఱై, చిఱగు ; మళ. ఇఱగు. ఎగిఱు.)

ఎఱకల, ఉ. VIII. 48, 197.

ఎఱగొను = కోపగించు.

ఎఱచి. ఆ. V. 57 ; ఆర. IV. 295, తి. బ. 80.

ఎఱచిదిండి-అచ్చ. యు. కాం. *

ఎఱచి పిడుక.

ఎఱపఱికము.

ఎఱబఱికము. ఉ. రా. VI.

ఎఱవు.

ఎఱుఁగు-ఆ. IV. 67,70 ; ఆ.IV. 64 ; ఆ. VI. 102 ; ఆ. VIII. 115, 314 ; ఆ. ర. III. 46, 153, 179 ;

ఆర. V. 134 ; ఆర. VI. 320; ఆర. VII. 319, 343 ; నృ. III. 52 ; నృ. V. 77;పూ. I. 174; పూ. III. 202; పూ. VII. 234; ఉ. VII. 110 ; ఉ. X. 252 ; కు. I. 26, 161, 164, 171, 235, 667, 880; కు. II. 63; తి; బ. 48, 55, 160. (కన్న. తమి. మళ. అతి.)

* ఎఱుక-ఆ. III. 12, 202 ; కు. I. 164.

§ ఎఱికె-

ఎఱుకలు. నృ. IV. 135 ; నృ. V. 77.

ఎఱుకత - వీర. II. *

ఎఱుకసాని - వీర. II. *

* ఎఱుకు = కిరాతుఁడు. ఆ. V. 57; ఆర. I, 326 ఆర. V. 134; ఉ. VI. 180.

ఎఱుకువ - ఆర. II. 135.

* ఎఱుపు.

ఎఱ్ఱ, ఆర. III. రా. సుం. ; యు. కాం.

ఎఱ్ఱంగుట్టలు, VI. 229.

ఎఱ్ఱగొల్ల.

ఎఱ్ఱన - రా. యు. కాం.

ఎఱ్ఱపోతమ్మ.

ఎఱ్ఱవాఱు-నై. VIII; ఆము. V.

* ఏడ్డెఱ - పూ. V. 120; పూ. VIII. 46; ఉ. I. 170; ఉ. VI. 64; ఉ. VIII 269; కు. II. 169; తి.

ఏనూఱు 1109.

ఏమఱిపాటు.

ఏమఱిల్లు - కళా. I. *

* ఏమఱించు. శై. VI. *

ఏమఱు. ఆ. VI. 154; 194; ఆ. VIII. 314; ఆర. VI. 327 ; ఉ. VII. 110; తి.

ఏమఱుచు.

ఏమఱుబాటు - పర. IV. *; భో. V. *

* ఏఱు = ఎత్తు - తి, అశ్వ. IV.

* ఏఱు = నది. - కు. I. 651; బ. 180,—1131. 1168, 1326 (ఆలేఱు, ఈరేఱు 1172; కొండేఱు 1172; గాతమేఱు 1135, దోంగేఱు VI. 103; నంగ్గేఱు1168; రొాంగేఱు. 1131. (తమి. ఆఱ్;కన్న. ఏఱు.)

ఏఱుచు - బ. 180; ప, 352.

ఏఱువసీమ - 1018.

ఏఱూారి - 1150.

ఒక్కొఱ. ఆ. V. 260.

* ఒఱ. కు. I. 225. 235 (కన్న. ఒఱె. తమి. ఉఱై. మళ. ఉఱ; తుళు. ఒరె.)

* ఒఱకటము - ద్వి. భాగ. I. స్క౦.

* రూ. ఒఱకాటము, ఒఱగడ్డము, వఱగొడ్డము, వఱగొడ్డెము.

ఒఱకము - కాశీ. VII. * సురా.

ఒఱంగావిల్లి - 1172.

ఒఱగాలు.

ఒఱగు - పూ. III. 202; కు. I. 26; తి. ఉద్యో. III; కళా. VIII. హరిశ్చ. IV.(కన్న. ఉఱుగు, ఒఱుగు.)

ఒఱవు.
ఒఱగుబిళ్ల.
ఒఱగుబిళ్లవంక.
ఒఱటు - పూ. IX.
ఒఱపరి - జై. III.
ఒఱపిఁడి - విక్ర. III.
* ఒఱపు = సౌందర్యము అర. II. 135; తి. (శ. ర. ఒరపు).
ఒఱపు = ఒఱపిఁడి, బ. 105, 46.
ఒఱపులాఁడి.
ఒఱవెంకు.
ఒఱయు - ప. 66.
* ఒఱలు-నృ, IV. 28. తి.ద్రోణ. III; పా.V. (కన్న, ఒఱలు,)II*ఒఱవ-అర. II. 135. తి. విరా. IV. *
ఒఱవు = ప. 131.
ఒఱవంబడు. జై; VI. *
ఒఱుబీజము.
ఒఱు రేశ్వరుండు.
ఒఱ్ఱి - పాండు. IV,
ఒఱ్ఱికసిండ.
ఒఱ్ఱిన.
ఒఱ్ఱియు - చూ. అఱ్ఱు; రూ. ఒఱ్ఱె
ఒఱ్ఱు.
ఓఱపట్టెలు (కన్న. ఓఱె.)
కంచెఱ్ఱు. IV. 953.
కక్కుఱితి (కన్న.కక్కుల (-లి)తె)
కట్టైదుఱు.
కడపఱబోయుండు - 1286.
కడుఁదుఱు, రూ. కణుఁదుఱు (కన్న. కడన్దురు; మళ. కడ (-డు) న్నత.)

కనున్ఱత్రి 1149.
కనుపఱితి 1137.
కన్నఱ-రామా. II. *
కన్నఱి-ఉ. హరి. VI. *
కంమ్మఱ-1518.
కఱఁనలుపు-పూ. V (కన్న. కఱ, కఱె; మళ. కఱె; తమి. కఱై).
కఱకంఠుఁడు-అర. I. 326; కుమా. II. 884; తి; బ. 43, 221, 237. ప. 134.
కఱకరి-మను. IV. *
కఱకఱ (న్).
కఱకఱి-ఆము. V.
కఱకు-ఆ. VII. 224; ఉ. VII. 15; బ. 81, 217.
కఱకుట్లు.
కఱ్ఱకుట్లు.
కఱగళము, కు. I. 235.
కఱచు = అభ్యసించు ఆ. III. 12,202; V. 168; అర. IV. 163; కు. I. 203, 673; తి.
కఱచు=నోటితోపట్టు-ఆ. I. 146; ఆ. VIII. 273; నృ. IV. 43; తి; బ. 159, 238.
* కఱటి-ఆ. IV. 70; పూ. IX. 224.
కఱత-నృ. IV. 135.
కఱతలాఁడు-పూ. V.
కఱద-అచ్చ. అ.కాం.(రూ. కఱు దు-ఉ. X. ఈ రూపము తప్పేమో).
కఱదూపము-భీ. II.*
కఱనూనె.
కఱపు = బోధించు-ఆ. III. 32;

ప. II. 265 ; అర. VI. 320 ; అర. VII. 319.

కఱవ = ఒకమూలిక.

కఱవాడు = ఒకచేఁప.

కఱవు-తి. శాం. IV.

కఱి = పశుయోని.

కఱియ = కృష్ణవర్ణము - పాండు. V. *

కఱివేము.

కఱుకు = రాచు ; రాచినపొడి;-మను. IV.

కఱుకుట్లు-చంద్ర.

కఱుక్కు-ఉ. రా. VIII.*

కఱుగోల.

(గంగ) కఱుత - 1135, 1413, 1288;-IV. 1089.

కఱుదులు-ఉ. X. 252.

కఱుసేడు-1153.

(గంగ) కఱ్ఱ-1163, 1165, 1168; IV. 1314.

కఱ్ఱ=కొయ్య-1112 ; IV. 1288.

కఱ్ఱ = నలుపు-పూ. V.

కఱ్ఱపని-1084.

కఱ్ఱమడ = వెల్లగించు పనిముట్టు;-పంచ. నా. I.

కఱ్ఱి = అర్జునుఁడు, నల్లనివాఁడు;-పూ. IX.

కఱ్ఱినారాయణ=ఒకదైవము,-VI. 205.

కఱ్ఱియముదు-1172.

కఱ్యాముదు-1238.

కఱ్ఱు. చూ. కుదురు(కన్న. కాఱు; (తమి. కాఱు).

కఱ్ఱుగుద్దలి-కళా. IV.

కలిగఱ-1132.

కలింగఱ (మాదిరాజుం గారు) - 1380.

కల్పివిఱుఱ్ఱు-VI. 584.

‡ కసరుఱితి - 1275.

‡ కారపఱితి - 1278.

‡ కాఱకాడ - 1115.

* కాఱడవి - ఆ. IV. 18.

† కాఱి - పూ. IV. 143.

* కాఱియ = యాతన ; - ఉ. I. 163 ; ఉ. VI. 128.

* కాఱు = స్రవించు, రాలు ; - నృ. V. 95 ; బ. 83 ; ప. 145.

కాఱు - (వడ్లు, మొద.) చూ.

కాడు = అడవి ; (కన్న. కాఱు, గాఱు, కాడు.)

√ కాఱుకొను.

√ కాఱుచు.

కాఱునలుపు.

§ కాఱుపోతు.

కాఱోడ్డెము - ఆం. భా. ప్ర. వాక్య.

√

§ కిఱపు.

√ కిఱుఁజెప్పు.

కిఱ్ఱుఁజెప్పు - నై. VIII.

కిఱుకు = త్రిప్పు ; - నృ. IV. 28 ; జై. VI ; భాగ. X. పూ.

√ కిఱుదు.

కిఱ్ఱు - పూ. V. 255 (కన్న. కిఱ్ఱు.)

‡ కుంతఱు = కూఁతురు - 1055.

‡ కుంతులు = కూఁతురు - 1052 1390.

‡ కుమలుపుండి - 1120.

‡ కుమ్మెఱ - IV. 677.

కుఱఁగలి - జై. I.

* కుఱకుఱ - రామా. VII.

√ కుఱినువ్వులు.

కుఱు - ; (కన్న. తమి. మళ. కుఱు.)

§ కుఱు = కంటు.

* కుఱుకు = ప్రోవు, రాశి ; - తి. ద్రో. IV.

§ కుఱుగడ.

§ కుఱుగోను.

‡ కుఱుంగ్గలు, 1143, 1165.

‡ కుఱుంగంటి, 1165, 1256.

* కుఱుచ - ఉ. X. 252 ; తి ప. 45 ; - (కన్న. కుఱుచు.)

* కుఱుపు.

√ కుఱుబ = ఒకజాతి ; (కన్న. కుఱ (ఱు) బ, కుఱుంబ.)

కుఱుమట్టము - భాగ. VIII.

‡ కుఱుమఱజముండు - 1130, 1134 ; - IV. 98 ; IV. 717 ; IV. 1232.

√ కుఱుమూఁకు = ఇంటిమూల కప్పు.

§ కుఱుమాపు (చీర.).

† కుఱుకులు - తి.

§ కుఱులు = వెండ్రుకలు (శ. ర. కురులు.)

కుఱువు = తొడ ; - కు. I. 694 ; పాండు. V.

§ కుఱువలి.

కుఱ్ఱ - అచ్చ. బాలకాం. భాగ. VIII.

కుఱ్ఱఁడు - పర. I. *

కుఱ్ఱి - ఆర. VII. *

√ కుఱ్ఱు = కూయు.

‡ కూంతులు - 938 ; 10. ; 1074, 1084, 1132, 1138, 1149, 1150, 1151, 1154, 1155, 1157, 1166, 1249 ; IV. 1072.

‡ కూంత్తులు - 10. 1082, 1153, 1167.

‡ కూన్తులు - 1151.

‡ కొండపత్తి - 1262.

* కొందలు - తి ;

‡ కొర్లిమెఱవి. IV. 1281.

* కొఱ - ఆర. II. 135 ; కు. I. 161, 235 ; బ. 143 ; (కన్న. కొఱె ; తమి. కుఱై ; మళ. కుఱె ; తుళు. కొఱె.)

† కొఱగామి - నృ. V. 142 ; పూ. V. 240 ; తి ; ఉ. హరి. V.

† కొఱమాలిన - పూ. VII. 234.

√ కొఱఁకు (ఏకవచనమునఁ బ్రయోగము మృగ్యము.)

* కొఱఁత - నృ. IV. 52 ; పూ. I. 174 ; తి ;

కొఱకచ్చు - రామా. II. (కన్న. కొఱ.)

కొఱకు (న్) - కళా. II ; 1344, 1393.

* కొఱకొఱ - అచ్చ. బాలకాం.

† కొఱటన - ప. 108.

√ కొఱడ.

* కొఱడు = ఒకఆయుధము ; కు. I. 880 ; కళా. VIII ; వా. II.

√ —పాఱు.

¶ కొఱత (కన్న. కొఱతె ; కొఱన్తె.)

కొఱను, - చూ. కొఱఁకు పారిశ్చ. I. భా.

√ కొఱపము. రూ. గొఱపము.

† కొఱప్రాణము. ఆము. III.

√ కొఱముట్టు.

‡ (వెండయ) కొఱ (యములు) = ఒకపేరు - IV. 1048.

* కొఱలు = ఉండు - తి. స్త్రీ. II ; య. III.

√—= ప్రకాశించు.

√—= పొందు.

√ కొఱవ = ఒకజాతి; (కన్న. కొఱవ.)

¶ కొఱవంజి (కన్న. కొఱవంజి ; తమి. కుఱవంజి ; కుఱత్తి.)

√ కొఱవత.

* కొఱవి - అర. VI. 226 ; తి ; ఆ. VI.

√ కొఱవిచీమ.

కొఱవిదయ్యము - నై. II. *

† కొఱవ్రోవు - తి. అశ్వ. II. *

కొఱసంది=ఆయము, జీవస్థానము ; తి. నిర్వ. X.

కొఱు. విజ్ఞా. ప్రా. కాం. (రూ. కొఱ్ఱు.)

* కొఱుకు = కఱచు ; ఆ. VI. 201. (కన్న. కుఱుకు (- ంకు) ; తమి. మళ. కొఱి.)

√ కొకుఱు = మేహరోగము.

× కొఱుపడము - బ. 240.

‡ కొఱ్ఱుపుపాటి - 1267.

√ కొఱ్ఱ = ఒకచేఁప.

కొఱు = మేకు, శూలము, ఆ. IV. 269.

‡ కోనరాజు పఱనికొడ్కు - 1135.

* కోఱ = దంష్ట్ర - నృ. V. 95 ; పూ. IV. 143. (కన్న. కోఱె.)

కోఱడము = అపహాస్యము ; కు. I. 702.

‡ కోఱను - 1262.

¶ కోఱాడు (గొబ్బిళ్లు) - (కన్న. గూఱాడు ; తుళు. గోర్ ; మళ. కోట్టు.)

¶ కోఱిక (కన్న. కోఱికె.)

¶ కోఱు = కోయు (కన్న. కొఱె ; తమి. కొఱి ; మళ. కుఱె తుళు. కురె, కొరె.)

¶ కోఱు = భాగము (సం. గోఱు, మొద.) (కన్న. కోఱు ; మళ. గోఱు.)

క్రచ్చఱ (న్) - అర. VII. 367 ; నృ. IV. 135 ; తి.

క్రమ్మఱు - అర. VI. 327 ; కు. II. 491 ; బ. 143.

* క్రమ్మఱ (న్).

క్రిక్కిఱించు. తి - విరా. III.

‡ ఖాత్తఱనినేల - IV. 1288,

§ గడిదేఱు,

‡ గండఱాదిత్య. 1021.

గద్దఱి - ఉ. రా. VII. *

* గద్దఱికాఁడు (అచ్చ. సుం. కాం. *)

† గఱ - పూ. V. 120.

√ గఱవఱ - పూ. V. 120. (కన్న. గఱగు.)

¶ గఱగు (నేల) - (కన్న. గఱగు.)

√ గఱగొఱ (కన్న. గఱగు.)

* గఱి - కు. II. 692. (కన్న. గఱి; తమి. మళ. చిఱై, చిఱగు. తుళు. కెది.)

¶ గఱిక (కన్న. గఱికె.)

† గఱిగంటి - బ. 70

√ గఱిచిప్ప.

† గఱిడియలు, కు. I. 235.

√ గఱిబద్ద.

§ గఱిసె.

గఱుకు - నరసింహశతకము.

* గఱుగు = ఒకచెట్టు.

§ గఱుపాఱు.

గఱువ = పెద్ద. - స. II; ప్రభా. III. *

† గఱ్ఱి - పూ. V. 255.

గఱ్ఱు-కాశీ. IV. (కన్న. గఱ్ఱనె.)

√ గఱ్ఱె = చేపలుపట్టునొక సాధనము.

√ గిఱక = గిటక, పొట్టి.

¶ గిఱగిఱ (కన్న. గిఱ్ఱనె, గిఱ; మహారా. గిరగిరనేం.).

* గిఱి.

* గిఱికొను - ఉ. VI. 176.

¶ గిఱిగిట (శ. ర. గిరిగిట) ప. 166; 239.

* గిఱిగొను - తి. ఉద్యో. IV.

* గిఱిగొలుపు - తి.

× గిఱిడియలు - కు. I. 235.

√ గిఱిపిల్లాఁడి.

§ గిఱుక.

¶ గిఱుకు = వంకరగా గీయు(కన్న. కిఱుకు; తమి. మళ. కిఱుక్కు.)

గిఱుక్కు. చంద్రాం. II.

గిఱుపు = త్రిప్పు, కదలించు; ఆ. V. 164; నృ. I. 54; ఉ. II. 142; తి. నిర్వ. VII.

§ గిఱుమెట్లు.

గిఱ్ఱు. ద్విపదరా. అర. కాం. ద్విపదభాగ. X. (కన్న. గిఱ్ఱు.)

√ గివ్వుఱు, రూ. గీఱు.

√ గీఱ.

గీఱు - నృ. I. 95; కు. II. 348; ప. 352; లక్ష్మీ. I. (రూ. గివ్వుఱు; కన్న. తమి. మళ. కీఱు. తుళు. కీరు.)

√ గీఱుగాజులు.

√ గీఱుడు.

గీఱునామము - నీలా. III.

√ గుజాఱి.

‡ గుంటక ఱ - 1147.

† గుండము కత్తి - 1121.

గుఱక. (కన్న. కుఱుకె. గుఱకె, గు (గొ) ఱుకు; గొఱికె; తమి. కుఱట్టై) కొఱుక్కై; మళ. కుక్కు; కూర్క్కు.

§ గుఱుక.
* గుఱగుఱ.
§ గుఱపెట్టు.
* గుఱి. ఉ. II. 184. కు. II. 7 ; తి ; ప. 27. (కన్న. గుఱి.)
గుఱించు. కవిక. VI ; రామా. II.
√ గుఱికట్టు.
√ గుఱికాఁడు.
√ గుఱికొండి.
§ గుఱుకొండి.
గుఱికొను - రసి. IV.
గుఱిచి = చతుర్థీవిభక్తి ప్రత్యయము - పూ. II. *
గుఱుకొను - ఆ. V. 182 ; ఆ. VI. 102 : ఆ. VIII. 269, 314 ; నృ. V. 77.
గుఱుగుఱ్ఱు - నై. VIII. (కన్న. గుఱు.)
× గుఱుజంగలి - బ. 160.
గుఱుతు - కు. I. 26 ; మార్క. IV. (కన్న. కుఱుపు, గుఱ (-ఱు-) తు, గుర్తు, గొఱ్తు, తమి. కుఱుప్పు.)
గుఱుపొడుచు-రా. యు. కాం. *
గుఱుపెట్టు - అచ్చ. యు. కాం. *
గుఱుములు.
గుఱువల - ప. 347.
గుఱ్ఱము - పాండు. II ; - 1240.
గుఱ్ఱు. వాసి. I.
గెఱ. భాగ. I ; చూ. గిఱ, గీఱ.
‡ గొఱ్ఱిపత్తి - 1200.
§ గొఱక.
× గొఱకతేని - ప. 94.
√ గొఱకు.
× గొఱకుఁబడచు - నృ. VI. 86 ; లక్ష్మీ. IV.
√ గొఱపము. చూ. కొఱపము.
§ గొఱవంక.
* గొఱుగు (కన్న. గొఱుకు ; కొఱ.)
‡ గొఱిపత్తి - 1165.
గొఱియ - అర. IV, 295 ; తి ; బ. 58; 143 ; - 928; 1038, 1132, 1133, 1135, 1139, 1140, 1141, 1147, 1148, 1150, 1151, 1152, 1155, 1160, 1165, 1168, 1173, 11 ... ;—IV. 675, 677, 812, 916, 926.
‡ గొఱె-1182,1292; పాంచా. II.
‡ గొఱ్ఱె - 1243, 1269, 1275.
‡ గొఱ్ఱ్యె - 1225.
√ గొఱ్ఱియ.
√ గొఱ్ఱు. చూ. కొఱ్ఱు.
గోఱజము - మను. IV.
† గోఱు (కన్న. గోఱు = బరుకు; ఉగిర్).
చిచ్చఱ - తి. విరా. V.
చిచ్చుఱ - తి. విరా. IV.
√ చిఱచిఱ.
* చిఱి - రూ. చిఱ్ఱి.
§ చిఱిమి.
* చిఱు-(గాలి, గూబ. మొద.)- ఆ. V. 260 ; అర. VII. 343 ; కు. II. 7 ; తి ; బ. 96, 160 ; ప. 119 (రూ. కిఱి, చిఱి, చిడి (పి) ; కన్న. కిఱి, చిఱు ; తమి. చిఱు ; మళ. చి (చె) ఱు ; తుళు. కిరి, కిఝు, కిన్ని).

* చిఱుత = చిన్న. ఆ. IV. 269; న. II. 228; ఉ. VIII. 15; కు. I. 667; తి; బ. 81.

√ చిఱుత = చిన్నపులి.

√ చిఱుత = సాముకోల.

× చిఱుతనగోడు = ఒకబాలక్రీడ. చమ. III.

× చిఱుబంతి పసపు - భీ. II. * నై. II. *

‡ చిఱుమామిండి - 1132.

+ చిత్మామిండి - 1167.

చిఱుము - హరిశ్చ. I. భాగ. రా. అర. కాం. II.

√ చిట్ట = కోపము; చింపిరి.

చిట్టచిట్ట - వి. పు. VII. *; చూ. చెఱచెఱలాడు.

√ చిట్టి = ఒక కూరాకు.

√ చిట్టిపట్టె = ఒకబాలక్రీడ.

√ చిట్టు - చూ. చిట్ట.

చిఱుముట్టాడు తి. - విరా. II. భో. V; ఉ. హరి. IV; రా. యు. కాం.

√ చిఱుముట్టాడు = భేదించు.

* చీఱు = పిలుచు; కన్న. చీఱు అర్చు.

† చీఱు, చూ. గీఱు; కన్న. చీరు.

చీఱుచు - ప. 352.

† చెదఱు (-రు?); కన్న. చెదఱు; తమి. చిదఱు.

చెఱ - ఉ. VIII. 48; కు. II. 491; తి. శాంతి. II. (కన్న. సెఱె; తమి. చిఱై.)

§ చెఱక.

చెఱఁగు - తి. విరా. IV *; రామా. VII.*; నై. VII. (కన్న. సెఱగు; తమి. చిఱగు.)

చెఱకడము = బెల్లము - ఆము. II. *

చెఱకు = ఇక్షువు - ఉ. VI. 64; కు. I. 30; ఉ. హరి. VI; - 1123; రూ. § చెఱుకు.

‡ చెఱకుంబల్లి - 1132.

‡ చెఱకుటి - VI. 207.

+ చెఱకువాడ - 1124.

‡ చెఱకూరి - VI. 205.

* చెఱచు - పూ. II. 225; ఉ. VI. 225; తి; రూ. చెఱుచు - ఆ. V. 189.

√ చెఱచెఱలాడు.

చెఱపనఁజేట - జై. IV.

√ చెఱపు, రూ. చెఱుపు.

చెఱమ - మను. IV.

§ చెఱలాడు.

§ చెఱసాల.

* చెఱి - న. I. * రూ. చెఱు.

‡ చెఱుకుల (మల్లిరెడ్డి) - 1230.

§ చెఱుగు.

‡ చెఱుచు - IV. 812. (చెఱ్చు - 1165; - IV. 684.)

× చెఱుప - నృ. IV. 86.

* చెఱుము. రూ. చరుము, చమురు.

* చెఱువు - తి. శాం. III; బ. 181; - 1074, 1084, 1131, 1135, 1137, 1147, 1275, 1332, 1344 1518; - VI. 406; VI. 584

(కన్న. కెఱె ; మళ. చిఱె ; తమి. చిఱై.) గుండ్లచెఱువు 1248 ; చింతలచెఱువు 1172, 1248 ; చెంజెఱువు 1150 ; మొగడ్లచెఱువు, చెఱ్వ-1121, 1146, 1248;-IV. 1179.

× చేకుఱు-ఉ. హరి. V.

× చేకూఱు - ప. 352 (శ. ర. చేకూరు).

§ చేఱ.

* చేఱు = సరము. రూ. చేరు.

చేఱుకోల-తి. ద్రో. III ; ఉ.I.*

√ చేఱుగోందు.

√ చేఱులకోల.

* చఱచు - ఆ. II. 67 ; స. I. 209 ; పూ. VI. 89 ; పూ. VII. 125 ; పూ. IX. 128 ; కు. I. 850 (కన్న. తమి. మళ. అఱె).

‡ చఱకూరి-VI. 652.

చఱపు - కళా. VII. *

* చఱి-పూ. VII. 105 ; తి ; (రూ. చఱియ.)

‡ చఱుచు-1518.

‡ చఱువు-IV. 1281.

చాఁగఱ-హరిశ్చ. II. భా. *

* చాఱ=రేఖ (కన్న. చాఱ).

√ చాఱ=ఒక చేఁప.

* చాఱ=ఒక చెట్టు-మను. IV.

√ చాఱిక=రేఖ. చూ. చాఱ.

† చాఱు (రు?)-కన్న. చాఱు ; తమి. మళ. చాఱు, చేఱు.

చుఱచుఱ-పూ. II. 67, ఉ. VIII 98; కు. II, 509; తి. శల్య; ఉ. హరి. IV; ప. 132.

× చుఱపుచ్చు-ఉ. II. 142.

√ చుఱుకరి.

* చుఱుకు-నీలా. I; జై.IV, VI; రుక్మి. II; మను. III; రసి. V (కన్న. చుఱు, చుఱుకు ; తమి. మళ. చుఱుక్కు.)

చుఱుక్కు. ఆము. I.

చుఱుపుచ్చు-ఉ. II.

చుఱు-వి-పు. VII.

§ చూపఱ.

× చూపఱు. తి. కర్ణ. III.

* చూఱ-నృ.II. 67;తి. అను.IV.

‡ (నరేంద్ర) చూఱ (పండియ)-1213;-IV. 78.

‡ చూఱకాఱ - 1130, 1134, 1163, 1215; - VI 98.

‡ చూఱవల్లి (రాజు) - 1151.

‡ చూఱెకాఱ - VI. 197.

† చెఱగు (చేటతో) - కన్న. కేఱు; మళ. చేఱు.

చొఱ = చేఁపు; రా. యు. కాం. (కన్న. చొఱ; తమి. చుఱా ; మళ. ఇఱావు, చిఱాగు, చిఱావు, తుఱావు, త్రావు.)

చొఱ = బాలుఁడు. రా. సుం. కాం.

చొఱచొఱ - ఉ. IX. 184; ఉ. IX; భాగ. X. పూ.

చొఱిగాఱు = వ్యాధులు. - ఉ. హరి. IV. (ఏకవచనమున దీనికిఁ బ్రయోగము ?)

* చోఱ = ఒక చేఁప - ఉ. రా. V. చూ. చొఱ, చాఱ.

× చోఱబుడుత - చంద్ర. *
చోఱవాఁడు - ఉ. రా. VI. *
‡ చోఱామిత్తి - 1172.
‡ జంతుఱునాండు - 1410.
§ జఱుగు.
జిఱి - జై. V; రా. యు. కాం.
(రూ. జిట్టి - తి. కర్ణ. I.)
× జిఱకొట్టు - హరిశ్చ. I. భా.
§ జిఱజిఱి.
జిట్టిత్రాడు - హరిశ్చ. ద్వి. I. భా.
జిఱు - పంచ. వేం. IV. * (
ఱ.)
జిట్టున - భీ. VI.
✓ జిలకట్టి; రూ. జీలకట్టి, జిలకఱ,
జీలకఱ.
× జీఱికకల్లు. కు. I. 702.
- కన్న.
✓ జేగుఱించు.
× జేవుఱించు - మను. V *
జేగుఱు. విష్ణు - పూ. III. (రూ.
జేవుఱు.)
✓ జేవుఱుగండ్లు.
* జఱజఱి - అచ్చ. కిష్కిం. కాం.
§ జఱువు.
జఱభి - కు. I. 637; బ. 237;
తి. విరా. III; షో. IV.

✓ జట్టున (కన్న. జట్టనె).
§ జాజఱి.
§ జాఱు - (కళా. VII. *; ఉ. II; హరిశ్చ. II. భా.
హరి. VI. (కన్న. జాఱు; శ. ర.
"ఆధునికులుగొందఱు దీనిని లఘురేఫ
యుక్తముగ వ్రాసియున్నారు. అది
ఆదరణీయము కాదు.)
× జాఱుచు - ప. 150, 352, 371.
* జుంజుఱు - హరిశ్చ. II.
× జుఱుకు - ఆము. III.
§ జొఱజొఱ.
✓ జొఱీఁగ.
✓ జోఱు. (హిం. ఝోర్.)
✓ టెట్టి.
* డగ్గఱు. తి. భీష్మ. II.
✓ డుట్టుచ్చి.
తంబుఱ. ఉ. రా. VI. *
‡ తంటి = తంత్రి - 1286.
తత్తఱ - రుక్మాం. V.
తన్టి = తంత్రి - 1340.
తఱఁగు - అర. VII. 158 (కన్న.
తఱగు; తమి. చరుగు (-వు).
తఱక - భో. IV.
× తఱకు. క్రి. నృ. I. 91, కు.
II. 296.
తఱచు - స. II 305; అర. VII
223. (తి. రూ. తఱుచు).
తఱటు (శ. ర. నన్నయభట్టీయ
చ్ఛందస్సు; తి. అర. I).
✓ తఱతఱ - చూ. తత్తఱ.
పూ. IV. 10; పాండు.
IV; కాశీ. I. (రూ. తఱువు.)
✓ తఱపియాను.
తఱము - కు. I. 235; బ. 41.
* తఱలు - రా. యు. కాం; వా.
తఱలుచు - కళా I. *.
† తఱి = కొయ్య (కన్న. తమి.
మళ. తఱి.)

పరుగె(వె)త్తు; పన్నిరుగు(వు)రు; పాగ(వ)గా(వా)లు; పొగ(వ)డ; పొగ(వ)డు; పొగ(వ)యు; పగు(వు)లు; ప్రగ(వ)డ; పగి(వి)ది; పగ(వ)తుఁడు; పగ(వ)డము; బుజ్జగ(వ)ము; బగి(వి)ని; బందుగు(వు)డు; ఇరుగు(వు)రు; ము(మూ)ఁగు(వు)రు; ఏగు(వు)రు; ఆర్గు(ర్వు)రు; ఏడ్గు(డ్వు)రు; పలుగు(వు)రు; బిగి(వి)యు; మేళగి(వి)ంచు; మొగు(వు)డు; మిగు(వు)లు, మీఁగ(వ)డ; ముగ్గు(వ్వు)రు; రేగ(వ)డి; రగు(వు)లు; వేగు(వు)రు; త్రేగు(వు)డు; సగ(వ)ము.

పదాంతమున: కడుగు, కరుగు, కలుగు, చిరుగు, చెలగు, జిలుగు, తీగ, తోగ, తెగ, తగు, తోడుగు, తోఱఁగు, తలగు, త్రాగు, దుగ, దొసగు, దండుగు, దిగు, నిసుగు, నుడుగు, నూగు, నుడుగు, నురుగు, నాలుగు, పరుగు, పురుగు, పుట్టుగు, పెరుగు, పేగు, పొసగు, పొగ, ప్రేగు, ప్రోగు, పదుగు, పండుగ(వ), పండుగు(వు); బొండుగ, బొట్టుగు, బూరుగు, బడుగు; మూఁగ, ముదుగు, మెదుగు, మెసగు, మేగు, ముసుఁగు, మ్రేగు, మ్రోగు, మోదుగు, మొఱుఁగు, మనుగు, రాగి, లోగు, వాలుగ, విసుగు, వేసఁగి, సలుగు, సెలగు.

జ-స: పదాంతమున: తరాజు (త్రాసు).

జ - ద: పదాదిని: జ(ద)ల్లు, జి(ది)న్న; జు(దు)ట్టువు; జే(దే)ంద్ర.

పదమధ్యమున: పెరో(జ)దనము, బారి(జ)దము.

పదాంతమున: బూజు(దు), పిడుజు(దు), కైజు(దు).

జ - వ: విరజా(వా)ది.

డ - ణ: పదమధ్యమున: గొడ(ణ)గు, కొడు(ణు)గురు, కంకడా(ణా)యి, కడు(ణు)దురు, కడ(ణ)ఁక, తగడ(ణ)ము, వెడ(ణ)ఁద, జోడ(ణ)ఁగి, వెడ(ణ)క, పొడ(ణ)క, పోఁడి(ణి)మి, పురడి(ణి)ంచు, పుడి(ణి)కిళ్లు, కడ(ణ)ఁగు, నాతె(ణె)ము, పుడి(ణి)కిరించు, బెడ(ణ)కు, మిడు(ణు)కు, మిడు(ణు)ఁగురు, ముట్టడ(ణ)ము, వడ(ణ)ఁకు, మడు(ణు)ఁగు, పడ(ణ)కు, జుడు(ణు)ఁగు, కొడి(ణి)దిలి.

పదాంతమున: పిల్లాడి(ణి), పోఁడి(ణి) తాగాడి(ణి).

డ - న: పదమధ్యమున: దాడి(ని)మ్మ.

డ - ల: పదమధ్యమున: పొడు(లు)వ, పొడు(లు)చు, బందడ(ల)ము, వడి(లి)మము, చడి(లి)కి, గబ్బిడా(లా)యి, వేడ(ల)ము, వెడ(ల)లుఁ(చు).

పదాంతమున: ముంగడ(ల).

డ - ళ: పదమధ్యమున: బొందడ(ళ)ము, లాడ(ళ)ము, గొండ్లె(ళ్లె)ము, [illegible]ండ్లి(ళ్లి), వంచాడి(ళి)ంచు, చెడ(ళ)ఁగు, సంబడ(ళ)ము, క్రొత్తడ(ళ)ము, వడ(ళ)ము, జాడి(ళి)ంచు, దడ్డడ(ళ)ము, దడ(ళ)ము. కంకడా(ళా)యి.

పదాంతమున: పుత్తడి(ళి), మంజాడి(ళి), నాయకవాడి(ళి), హోవడి(ళి).

ణ - డ: పదాంతమున: పిల్లాణి(డి).

ణ - న: పదాంతమున: దుగ్గాణి(ని).

త - ట: పదాదిని: త(ట)ంగు, త(ట)క్కులాడి, త(ట)ంగువాఙు, త(ట)క్కు, తె(టె)ంకాయ, తె(టె)ంకి, తో(టో)పి.

పదమధ్యమున: జుత్త(ట్ట)నవ్రేలు.

పదాంతమున: లొత్త(ట్ట), గుంతి(ంట).

ద - గ: పదానిని: ది(గి)రిసెన.

ద - జ: పదమధ్యమున: జూద(జ)కాఁడు.

పదాంతమున: గాదె (జె), విరవాడి (విరజాజి), జాది(జి), జాదు(జు).

ద - డ: పదానిని: డిగనాడు, డయ్యు, డిగ్గియ, డాయు, డీకు, డీ, డీకొను(కోలు), డీలు, డీలువడు, డగర(ము), డగ్గఱ, డబ్బాటు, డా, డెందము, డొంకెన, డొంగు, డొప్ప, డిగఁద్రావు, డిబ్బిరుట్టు, డాగుడుమూఁతలు, డప్పి, డగ్గు, డుయ్యు, డాపు, డాగనమ్రుచ్చులు, డాగు, డేకు, డాగిలిమ్రుచ్చులు, డెప్పు, డెప్పరము, డిగు, డాపురము, డొఁగు, డంచు, డక్కు, డక్కొను, డిగఁబడు, డాగురించు, డూయు, డంగు, డబ్బర, డాయి, డిగువ, డొంగ, డగ్గఱు, డాపల, డొల్లు, డాచు, డోకు, డిమ్మరి, డించు, డాకలి, డాకొను, డిగ్గుడు, డించు.

పదాంతమున: గిద్దు (గిడ్డు).

న - ర: పదమధ్యమున: చిను(రు)గు, పన(ర)ఁటి.

న - ల: పదమధ్యమున: మును(లు)ఁగు.

ప—మ: పదమధ్యమున: సంపె(మ్మె)ట.

పదాంతమున: ఇంపు(మ్ము); కప్పు(మ్ము).

ప—వ: పదాంతమున: చప్ప(వ్వ).

బ—మ: పదాదిని: బు

పదమధ్యమున: గుబి(మి)లి, గుబు(ము)రు, ఉబ్బ(మ్మ)లి.

పదాంతమున: గులిబి(మి), రెబ్బ(మ్మ).

ఁబ, ంబ—మ: పదమధ్యమున: తాఁబే(మే)లు, తంబ(మ్మ) ళి (ళి), గుంబ(మ్మ)ము, తొంబ(మ్మ)న్నూఁఱు, సంబా(మ్మా)ళిగలు, సాంబ్రా(మ్రా)ణి, దంబి(మ్మి)డి, గుంబ(మ్మ)టము.

పదాంతమున : రింబ(మ్మ), రెంబ(మ్మ), పంబు(మ్ము).

మ—వ : పదమధ్యమున : రమ(వ)ణ. తటమ(వ)ట, చలిమి(వి)డి, నెమి(వి)లి, తమి(విఁ) దలు.

య—వ : పదమధ్యమున : పయిఁడి(పమిడి), కోయి(వి)ల, బయి(వి)సి, అయి(వి)క, బయి(వి)రిడేగ.

పదాంతమున : లోయ(వ).

ర—ల : పదమధ్యమున : చిరి(లు)క, వడ్ర(డ్ల)ంగి, తర(ల)ము, పొరి మారు(లు)చు, రంగరి(లి)ంచు.

పదాంతమున : పందిరి(లి), పొరి(లి), పిలుకమారు(లు)నుతరా(లా)ం, జరత (జలతారు).

ర—అ : పదాదిని : ర(అ)ంతిల్లు, రొ (ఒ)మ్ము, రే (ఏ)కు, రే(ఏ)కు మడఁచు, రె(ఎ)క్క, రె(ఎ)ప్ప, రే(ఏ)పు.

పదమధ్యమున : మారా(ఆ)టము, పరి(ఇ)ము, కారు(ఉ)చు.

పదాంతమున : నివ్వెర(అ), చేరు(ఉ), పలుమరు(ఉ).

ర—శ : పదమధ్యమున : నేహరము (నేవళము).

అ—ల : పదాదిని : ఓ (లో)డ్డు, ఓ (లో)డ్డి.

ల—న : పదమధ్యమున : తెలు(ను)ఁగు; పిలు(ను)ఁగు, గొలు(ను)ఁగు ములు(ని)కోల.

పదాంతమున : తొల(న).

ల—ణ : వెలు(ణు)తురు.

ల—ర : పదమధ్యమున : పాల(ర)డ, కావలి ( - విరి) బొట్టు.

ల—ళ : పదమధ్యమున : బల(ళ)కరము, ఎలు(ళు)కు, నులు(ళు)వు, సకలా(ళా)తు, జనులి(ళి)క, తలు(ళు)కు.

పదాంతమున : రవలి(ళి), ఒలా(ళా).

వ—బ ; పదాదిని : వి(బి)ద్దె(ము). వ(బ)దనిక, వీ(బీ)రము.

వ—మ : పదాదిని.

పదమధ్యమున : మావి(మి)డి, నావి(మి)ంట, తివు(ము)రు, సేవ(మ)ంతి.

వ—ప : పదాంతమున : చవ్వ(ప్ప).

వ—య : పదమధ్యమున : కవి(యి)త, అవు (చూ. అయి), పోవు (చూ. పోయి).

స—చే : పదాదిని : సా(చా)తాని, సె(చె)లయు, స(చ)ంపు, స(చ)చ్చు, స(చ)లుపు, సా(చా)గు. సా(చా)వు. సీ(చీ)ల, సీ(చీ)లమండ, సొ(చొ)ట్ట, సొ(చొ)లచు, సొ(చొ)లయు, సేవంతి (చేమంతి).

స—జ : పదాదిని : సో(జో)నంగి.

పదమధ్యాంతముల : గసిబిసి (గజిబిజి).

స—య : పదమధ్యమున : దోసి(యి)లి(ంచు).

హ—య : హి(యి) తవు, బహిర్వాసము (బయిరివాసము).

పై వివరించిన హల్లుల పరివర్తనము దేహ ల్లేహల్లుగ మాఱినదో తెలిసికొనుటకు వానివ్యుత్పత్తులను విచారింపవలెను. 'క్వచిద్గకారోవః' అను నాంధ్రశబ్ద చింతామణి సూత్రమునకుఁ గొన్నియెడల గకారము వకార మగుననియే కాక, వకారమును గకారమగునని యర్థము చెప్పవలెను. 'వేసఁగి (వైశాఖ)' మొదలగు శబ్దములలో గకారము వకారమగుచున్నది. పవడము (ప్రవాళ) ఇరువుగు, ముపురు, నలువురు, ఏవురు, మొదలగు వానిలో వకారము గకారమగుచున్నది. ఇట్లే కొన్నియెడల యకారము గకా రముగను గొన్ని యెడల యకారము గకారము నగుచున్నది. ఇతర హల్లుల విషయమునఁ గూడ నిట్లే గ్రహింపవలయును.

## IV. తెనుఁగు ధ్వనులకుఁ గలుగు మఱికొన్ని మార్పులు.

### (i) సంప్రసారణము.

కొన్ని తెనుఁగు పదముల మొదటనుండు 'ఒ' కారము 'వ' కార మగును.

ఒ(వ)ద్ద, ఒ(వ)డుచు, ఒ(వ)య్యారి, ఒ(వ)అలు, ఒ(వ)అగడ్డము, ఒ(వ)డుపు, ఒ(వ)గరు, ఒ(వ)ంటు, ఒ(వ)ద్దిక, ఒ(వ)ల్లెవాటు, ఒ(వ)సులు, ఉ(వ)స్తాదు, ఓ(వా)ర, ఓ(వా)మనగుంటలు, ఓమము(వాము), ఒ(వ)డ్డాసి, ఒ(వ)డ్డాణము, ఒ(వ)జ్జ(లు), ఒ(వ)ండ.

కొన్ని తెనుఁగు పదములతొలి 'వ' కారము 'ఒ' కారమగును : వ(ఒ)ర వడి(ఒడి), వంకి (ఒరికెము), ఒంజిలి (ధాతువు, వందు).

### (ii) అక్షరలోపము, పూర్వాచ్చునకు దీర్ఘము, (Compensatory lengthening).

క : రక్కసి (రాకాసి), కున్న(కూన), కుంకటి(కూఁకటి), కుప్ప(కూప) నము, కొట్టి (కోటి)కాఁడు, కొట్టి(కోటి).

గ : ముంగయి(ంగా) ముర్రారి, గిచ్చు(గీచు), గివు(గీ)రు.

చ : చిబు(వు)(చీ)కు, చిట్ట (చీట)కము.

జ : ముంజెయి (ముంజే), జొగ్గు(జోగు),జొత్తిగ (జోతిగ).

డ : పడవా(డా)లు, కడవ(డా)సము.

త : తిన్ని(తీని)య, తియ్య(తీయ), తువ(తూ)ర, తెమ్మ(తేమ), తొప్పి (తోపి), తుంటె(తూఁటె)కూర, తొయ్య(తోయ)లి.

ద : తెందెప్ప(ందెప)లు, దను(దా)క, దుయ్యి(దూయి), దువా (దో)రము.

న : నివులు (నీలు), నివ్వ(నీవ)రి, నుయ్యి(నూయి), నెయ్యి (నేయి), నెయ్య(నేయ)ము, నొవ్వు(నోవు).

ప : పల్ల(పాల)కీ, పించ(పీఁచ)ము, పికి(పీ)లి, పుంట (పూఁట), పురట, (పూఁట), పెండ(పేఁడ), పెంట(పేఁట), పొంజు(పోఁజు), పియ్యి(పీయి), పిగులు (పీలు).

బ : బొంకి(బోఁకి), బొడ్డ(బోడ)సరము.

మ : మండె(మాడె)ము, మంగు(మాఁగు), మింగ(మీఁగ)డ, ముడ్డి (మూడి), ముగ్గు(మూగు)రు, మెయి(మే)తాలుపు, మొవ్వు(మోవు), మొల (మో)క, మొగు(మో)డుచు, మొగ(మో)ము, మొగ(మో)సాల.

ర : రుదురక్క (రుదురాక), కరవ(రా)టము, రమ (రా)ణ, రెంటె (రేఁటె)ము.

ల : తలయంపి (తలాఁపి), తలగ(లా)డ, పెందలక (లా)డ, కలయంపి (కలాపి) ; లొంగు (లోఁగు).

వ : వయ్య(వాయ)ము.

శ : కశవ(శా)సము.

ఉ : ఉవ్వు(ఊవు).

(iii) స్థితి పరివృత్తి (Metathesis).

కొన్నియెడలఁ బదమందలి ధ్వనులు తమస్థానములను మార్చుకొనుచుండును. కుతకుత (తుకతుక), జోనడ (జోడన), చమురు (చరుము), నవ్వులాట (నవ్వుటాల), పిచ్చిలు (చిప్పిల్లు), పులికించు (పుక్కిలించు), వారువము (వావురము), తవర (వతర).

(iv) పరుషములు సరళములగుట (voicing), సరళములు పరుషములగుట (unvoicing).

క: పదాదిని; క(గ)డప ; క్రు(గ్రు)చ్చు, క్ర(గ్ర)ంత, కో(గో)న కోను, కు(గు)న్న.

పదమధ్యమున : కంక(ంగ)టి, తటా(డా)క(గ)ము, సకి(గి)న, సకి(గి)లించు, మొక్క(గ్గ)లము, దాక(గ)లి, మొక(గ)ము, మెక(గ)ము.

పదాంతమున: నమ్మిక(గ), మచ్చిక(గ), వక్కు(గ్గు), సిక(గ), సెక(గ).

చ : పదాదిని : చ(జ)ట్టిప.

పదాంతమున : కొంచు(ంజు), లొచ్చు(జ్జు), కచ్చె(జ్జె).

ట : పదమధ్యమున : గుటు(డు)క్కు, తటు(డు)కున, కోట(డ)రికము, కోటర(డంట్ర)ము, తూట(డ)రి.

పదాంతమున : మసటు(డు).

త : పదమధ్యమున : బ్రతు(దు)కు, నుతు(దు)క, మెతు(దు)కు, వెతు(దు)కు, చితు(దు)కు, గతు(దు)కు, చతి(ది)కిలు.

పదాంతమున : మొత్తు(మోదు), మెత్తు (మేదు). పఱత(ద).

(v) సమాసమున మొదటిపదము తుదియక్షరములును, రెండవపదము మొదటియక్షరములును నొక్కటిగనున్నయెడల నా రెంటిలో నొకటి లోపించును (Haplology).

ఆఁక + కట్టు (ఆఁకట్టు) ; చొప్పు + పఱచు (చొప్పఱచు) ; చూపు + పెట్టు (చూపెట్టు) మోపు + పెట్టు (మోపెట్టు) ; నిలుపు + పోవు (నిలుపోవు) ; అలవు + పడు(అలవడు) ; ఉరువు + పడు(ఉరువడు) ; చొప్పు + పడు (చొప్పడు) ; తనుపు + పడు (తనువడు) ; ఉరువు + పడు (ఉరువడు) ; చొప్పు + పడు (చొప్పడు) ; తేనువు + పడు (తనువడు) ; త్రోపు + పడు(త్రోపడు) ; పెనుపు + పడు(పెనుపడు) ; పోపు + పడు (పోపడు) ; ప్రోపు+పడు(ప్రోపడు) ; విడుపు + పడు(విడువడు).

పైవానిలోఁ గొన్నిట 'పడు' ధాతువు 'ప' కారమునకు 'వ' కారాదేశము.

(vi) పదమధ్యహల్లులమీఁది యచ్చులులోపింప, దగ్గఱపడిన హల్లులు సంయుక్తాక్షరములై, యందలి యొకవర్ణము రెండవవర్ణముగామాఱి ద్విత్వాక్షర మేర్పడును: (Assimilation.)

కురుఁజు(గుజ్జు), కొలఁది (కొద్ది), చలిది (చద్ది), చిరిమిడి (చిమ్మిలి), నఱుజు (నజ్జు), నెలకోను (నెక్కొను), పెరిమె (పెమ్మె), పడుక (పక్క),

పితరులు (పితాళ్లు), చెరచెర (చెచ్చెర), పింపిళులు (ళ్లు), పింపిసలు (పింపిళ్లు), ఖిడుచు (విచ్చు), వెడలు (వెళ్లు), మరలు (మళ్లు), మరవు (మప్పు), నగవు (నవ్వు), మునిమనుమ (-డు)-రాలు) (ముమ్మనుమఁడు)-రాలు ; సడలు(సళ్లు),

(vii) సంయుక్తాక్షరములనడుమ నొకయచ్చుచేరుట. దీనికే విప్రకర్షము, లేక వికర్షమని పేరు (Anaptyxis).

ద్వా(దువా)రము, ప్రా(పర)వు(పరవు), ప్రువ్వు(పురువు), మాంస్టీ(సటీ)ఁడు. ఆత్రము(ఆతరము), ఆళ్వా(ళువా)రు, స్రావి(సురవి).

ఔ = అవు అగుట విప్రకర్షము వలననే కావచ్చును: తౌ(తవు)డు, ఔ(అవు), కౌ(కవు)ఁగిలి, కౌ(కవు)జు, గౌ(గవు)౦డ్లవాఁడు, గౌ(గవు)ను, గౌ(గవు)ద, గౌ(గవు)సెన, చౌ(చవు)లు, చౌ(చవు)రు, చౌ(చవు)తు, చౌ(చవు)తి, చౌ(చవు)తా, చౌ(ఛవు)సాల, చౌ(చవు)సీతి, చౌ(చవు)డోలు, చౌ(చవు)దంతి, జౌజౌవ్వు (జవుజవు), జౌ(జవు)ను, జౌ(జవు)గు.

పైయుదాహరణములలో 'అవు' 'ఔ' గాకూడ మాఱియుండవచ్చును.

(viii) తాలవ్యీకరణము ; కంఠ్యములు తాలవ్యములుగ మాఱుట (Palatalization).

కి(చి)లుకు, గీ(చీ,జీ)ఱు, కంక(ంచ) రగాడిద.

(ix) ఆమ్రేడితము.

అల్లాడు (అల్లల్లాడు, అల్లలనాడు), అల్లిబిల్లి (అల్లికబిల్లిక)

(x) అనునాసికీకరణము. (Nasalization.)

చుకారాంత ధాతువులును, - ల్లు, అంతమందుగల ధాతువులును నొకప్పుడు 'ంచు' అంతములుగ మాఱుచుండును:

చొప్పరచు (రించు), నవరుచు(రించు), తత్తడిల్లు(ంచు), వర్తిల్లు(ంచు); మొదలైనవి.

(xi) పదమధ్యానుస్వారలోపము (Denasalization), పైహల్లునకు ద్విత్వము (Doubling).

క : డంకా(క్కా) ; బొంక(క్క)ణము, చంకి(క్కి)లి, ముంగ(క్క)ర, వెంగ(క్క)లి.

గ : ప్రంగ(గ్గ).

చ : కొరకంచు(చ్చు), కంచ(చ్చ)ర(డ)ము.

డ : రొండు(డ్డు)ఁడు ; గుండ(డ్డ).
ద : ఒంది(ద్ది)క.
(xii) ద్విత్వీకరణము (Doubling).
ఒకప్పుడు కారణములేకయే హల్లులకు ద్విత్వము వచ్చును :
వజీరుఁడు (వజ్జీరుఁడు) ; గుజరీ (గుజ్జరీ).

### ఊఁత.

ప్రతిభాషయందును పదములలోను వాక్యములలోను ఊఁతయనున దుండును. ఇది యాయాభాషలయం దొక్కొక్క రీతిగ వ్యక్తమగుచుండును, వేదభాషయందు ఉదాత్తానుదాత్తస్వరిత ప్రగ్రహ భేదములతో స్వరము మాఱుచుండును. ఈ వైదికస్వర మొకరీతి యూఁతయే. అది గానమునకు సంబంధించిన యూఁత (Musical accent) యని కొందఱ యభిప్రాయము. ఆస్వరమునందలి భేదము ననుసరించి యర్థభేదమును వ్యాకరణసంబంధము లందలి భేదమును గలుగుచుండును. ఛందోబద్ధములగు మంత్రములందట్టి స్వరము లేర్పడినను వైదికవ్యావహారిక భాషయందు వేఱొకరీతి యూఁత యుండియుండును. పూర్వకాలపు ఇండోయూరోపియను భాషలన్నియు స్వరప్రధానములని చెప్పుదురు. కాని, వ్యవహారమున నిట్టి స్వరముండెనని చెప్పవీలులేదు.

ఇట్లే భారతీయార్యభాషలయందు ఛందోబద్ధమగుభాషయందు గానము ప్రధానముగను, సాధారణ వ్యావహారిక భాషాపదములయందును, వాక్యము లందును గొన్ని యక్షరములమీఁదను పదములమీఁదనుగల యూఁత ప్రధానముగను నుండుటను గమనింపవచ్చును.

ఆంగ్ల భాషయందున్న యూఁతవంటిది భారతీయభాషలయందు లేదని కొందఱందురుగాని యా యభిప్రాయము సరికాదు. ఆ యూఁతయందలి మార్పుల ననుసరించియే యర్థభేదములును, శబ్దరూపములందలి మార్పులును గలుగుచుండును.

ద్రావిడ భాషలలోఁ గూడ పదములపై నొకవిధమైన యూఁత గలదు. తెనుఁగునందుగల యీయూఁతనుగూర్చి యిచటఁ గొంతవిచారింప వలసియున్నది. ద్రావిడ భాషలలో పదముల తొలియక్షరముపై నెప్పుడును నూఁతయుండునని కాల్డువెల్లు నభిప్రాయము. ఊఁతయున్న యక్షరము స్వరూపము సాధారణముగ మాఱదు; ఊఁత లేనిధ్వను లనేకపరివర్తనము లకు లోనై యొకప్పుడు లోపించుచుండును. అవి లోపించునప్పుడు సాధారణ

ముగ పూర్వాచ్చునకు దీర్ఘము వచ్చుచుండును. ఇంతకుముందు వివరించిన యాంధ్రధ్వనులయందలి మార్పుల కీయూఁత యుండుటయుఁ బోవుటయు నే ప్రధానకారణముఁగనున్నది. ఒక్కయుదాహరణము చాలును.

'ముఖమ్' అను సంస్కృత పదములో 'ఖ'పై నూఁతయున్నది. మొదటి యక్షరముపై లేదు. కావున దేశభాషలందు 'ము'లో'ఉ'త్వము'ఓ' త్వముగా మాఱినది. కాని, యీలోఁగా నూఁత మొదటి యక్షరము మీఁదికి వచ్చినది; అప్పుడు 'ఖ' మీఁది యూఁత తొలఁగుటచే 'ఖ' కారము 'హ' కారముగా మాఱుటయో, వకారమగుటయో, లేక లోపించుటయోకలిగినది. అందుచేత 'మొహమ్, మొవమ్, మొఅమ్' అనురూపములేర్పడినవి. తెనుఁగున నేఁటివ్యవహారమునందు 'మొహం', 'మొవం' అను నుచ్చారణము వినఁబడుచున్నది. ప్రాకృతమునందును బూర్వకాలపు ఆంధ్రమునందును 'మొఅం' అను నుచ్చారణముండెను. 'అ' కారము కూడ లోపింపఁగాఁ బూర్వాచ్చునకు దీర్ఘముగలిగి 'మోము' అనురూపమేర్పడినది. 'వలవదు, వలాదు, వలదు, వద్దు' అను రూపము లీయూఁత స్థానమునందలి మార్పుల వలననే కలిగినవి. 'నేవస్తా' 'ఒచ్చును' 'అందాఁకా' 'మొక్క' మొదలయిన రూపము లీయూఁతకు భ్రంశము కలుగుటవలననే యేర్పడినవి.

రెండుపదములు ప్రత్యేకముగా నున్నప్పుడు వాని తొలియక్షరములపై నూఁతయున్నను, నవి సమసించినప్పుడు మొదటి పదము మొదటి యక్షరముపై నూఁత ప్రధానమును, రెండవపదము మొదటి యక్షరముపై నూఁత యప్రధానము నగుచుండును. కావుననే ద్వంద్వసమాసమునందు పరుషములకు గ స డ ద వా దేశము కలుగుట సంభవించెను.

పద్యములలో శ్లేషకల్పనముఁ జేయవలసి వచ్చినపుడును నర్థవైచిత్రిని జూపనెంచినప్పుడును కవు లీయూఁత ప్రాధాన్యమును బాగుగ గ్రహించియున్నారు. ఈ క్రింది పద్యములో [1]అనునది ప్రధానమైన ఊఁతకును, [2]అనునది అప్రధానమైన ఊఁతకును, [0]అనునది యూఁత లేనందుకును గుఱుతులుగానుంచి రామాయణ భారతార్థములను తెలియఁజేయ వచ్చును.

రామాయణార్థము.

[1]ఎందు [1]వేఁట [2]రారె [1]యితరు [1]లోమన సు[2] తో
దార [2]సంగమంబుఁ [1]దప్పఁ [2]ద్రోఁచి
[1]తకట పాండు [2]రాజ[2]యశ [1]మెన్నవై [1]తతి
[2]క్రూర [1]దశరథేశ [1]కులము [2]రోయ.

భారతార్థము.

[1]ఎందు [1]వేట [2]రారె[1] యితరు [1]లేమనసుంతో

[1]దార [2]సంగమంబుఁ [1]దప్పఁ [2]ద్రోచి

[1]తకట [1]పాండు [2]రాజ [1]యశ [2]మెన్నవై [1]తతి.

[2]క్రూర దంశర [1]ఖేశ [2]కులము [1]రోయ.

అర్థచిత్రము నీ యూఁతమూలముగాఁ గలిగించిన వారిలోఁ జేమకూర వేంకటకవి ముఖ్యుఁడు. పై గుఱుతులనుంచి యీ క్రింది విజయవిలాసములోని పద్యము నర్థమును స్పష్టము చేయవచ్చును.

[1]అర [2]చందమామ ంనేలిన

[1]దార [2]గాఁ [1]నెన్నుదురు [2]నె[1]న్నుదురు [1]బిత్తరికిన్.

[1]బరువంపు [2]మొల్ల మొగ్గల

[1]దారగాఁ [1]బలుకుదురు [2]బలు [1]కుదురు [2]జవ్వనికిన్.

ఇట్లే 'రెండెడ్లబండ్లు తీసుకరా' అనువాక్యమును [1]రెండెడ్ల [1]బండ్లు [1]తీసుక[2]రా అని పలికినప్పుడు ఒంటెద్దు బండ్లను తీసుకొని రమ్మనుట యుద్దేశము కాదనియు, [2]రెం[1]డెడ్ల [2]బండ్లను [1]తీసుకరా అన్నప్పుడు మహిషములు పూన్చిన బండ్లను దీసికొని రమ్మనుట యుద్దేశము కాదనియు స్పష్టపడును.

పదములలోని యక్షరములమీఁది యూఁత యర్థగ్రహణమున నెట్లు ముఖ్యమో, వాక్యములలోని పదములమీఁది యూఁతయు నంతముఖ్యమైనదే. [1]దానిమాటకేమి, [1]దీనిమాట చెప్పు; [1]మగవాళ్లమాటకేమి, [1]ఆడవాళ్లమాట చూడండి; [1]దీనివల్ల[2] ప్రయోజనము లేదు, [1]ముప్పు కూడాను; [1]అక్క[2]డ దయిందా ? [1]ఇక్కడచూడు. ఈ రీతిగా నెన్నైనను నుదాహరణముల నూహించుకొనవచ్చును.

పద్యముల నడక కూఁతను బాటించుటవలన శ్రుతిసుభగత్వమును లాలిత్యమును నెట్లుకలుగునో తెలిసికొనుటకు "తెలుఁగు" పత్రికలో, గిడుగు సీతాపతిగారు మొదటి సంపుటము 5, 6 సంచికలలో (1920 సం॥ రము జనవరి ఫిబ్రవరి నెలలు) వ్రాసిన "ఛందోరహస్యదర్పణము" అను వ్యాసమును జదువవలెను.

స్వరము.

మన ముచ్చరించు ధ్వనులన్నియు నెగుడుదిగుడులులేక యొన్నఁడు నొక్కటే తీరున నుండవు. అవి యొకదానితరువాత నొకటిగఁ జైకిపోవుచుఁ

గ్రిందికి దిగుచు, నొక్కవరుస నడచుచు నలలయాకారము నొందియుండును. ఈ యెగుడు దిగుడులలోని భేదమువలననే భాష శ్రుతి కింపుగానుండును. రోఁకటిపాటవలె నొక్కటే విధమునఁ జదువుటవలనను మాట్లాడుటవలనను శీఘ్రముగ విను వారికి విసుగు గలుగును. ఉచ్చరితములైన ధ్వనులలోని యీ యెగుడు దిగుడులకే యుదాత్తానుదాత్త స్వరిత సంజ్ఞలను సంస్కృత వైయాకరణులు పెట్టియుండిరి. "ఉచ్చైరుదాత్తః", "నీచైరనుదాత్తః", "సమాహారః స్వరితః", "తస్యాదిత ఉదాత్త మర్ధహ్రస్వమ్" అని పాణిని వీనిని నిర్వచించినాఁడు.

ఈ స్వర మన్నిభాషలయందును నర్థభేదమును గల్గించుటయందు చాల ప్రాముఖ్యమును వహించి యుండును. కాని, దానిని సరిగబోధపడునట్లు వ్రాఁతలో నిరూపించుటకు సాధనసామగ్రి లేకపోవుటచేతఁగాఁబోలు వ్యాకరణములలో నీవిషయమును గూర్చి యంతగా ముచ్చటించుటకు వీలులేక పోయినది.

తెనుఁగువ్యవహారమున నీ స్వరభేదముచే నెన్నియేని నర్థభేదములు కలుగుచున్నవి. వ్యవహారమునఁ జాలభాగ మచ్చుల నుదాత్తానుదాత్త స్వరిత భేదములతోడను, అనునాసికాననునాసిక భేదములతోడను నుచ్చరించుట చేతనే జరగి పోవుచుండును. స్వరభేదముచే నర్థభేదము గలుగుటకుఁ గొన్ని యుదాహరణముల నిచ్చినఁ జాలును.

ఆఁ = సరే

ఆఁ = ఆలాగా?

ఆఁ = ఏమిచెప్పినావు?

ఆఁ = నీవుచెప్పినది నమ్మదగినదిగా లేదు.

ఆఁ = భద్రము! జాగ్రత్త!

ఆఁ = ఆయాసమును తెలుపును.

ఆఁ = చాలులే, చాలాచెప్ప వచ్చినావు.

ఆఁ = అట్లాగేమి?

ఆఁ = వింటున్నాను, చెప్పు.

ఈ రీతిగా నెన్నోవికారములను బొంది యచ్చులన్నియుఁ గావలసిన యర్థములను దెలుపు చుండును.

ప్రశ్న, ఆశ్చర్య, సందేహ, సంతాపాది విషయములన్నియు భాషయందీస్వరభేదముచేతనే కలుగునుగాని వ్యాకరణములం దీభేదములను నిరూ

పించుటకు సాధ్యము కాకపోయినది. శిక్షాగ్రంథములందు సంస్కృతము నందలి యీ భేదమును బూర్వులు గొంతవఱకు నిరూపించియుండిరి. నవీన పాశ్చాత్యభాషలనుగూర్చి యీ విషయమున విద్వాంసులు నేఁడెక్కువగఁ గృషిచేయుచున్నారు.

## ఆంధ్రధ్వనులు – వాని యుచ్చారణము.

### 1. తత్సమధ్వనులు.

*తత్సమ, తద్భవ, దేశ్యసంజ్ఞలచే వ్యవహరింపఁబడు శబ్దజాలమంతటిని గలిగియుండుటచే నాంధ్రభాషయం దాయా వర్గములందుగల ధ్వనులన్నియు నున్నవని చెప్పవలెను. ఆంధ్రధ్వనుల యుచ్చారణము సంస్కృతధ్వనుల యుచ్చారణమునే పోలియుండుననునూహచే, నాంధ్రధ్వనుల స్వరూపమును వర్ణించునప్పుడు సంస్కృత పరిభాషనే వైయాకరణము లుపయోగించు చున్నారు. కాని, సంస్కృతధ్వనులకు సంస్కృత వైయాకరణులుచేసిన స్థాన ప్రయత్నాది వివేకము నాంధ్రవైయాకరణు లాంధ్రధ్వనుల కింతవఱకును వివరించి యుండలేదు. సిద్ధాంతకౌముదియం దాయా సంస్కృత ధ్వనుల యుచ్చారణ మీక్రింది విధముగ వివరింపఁ బడియున్నది.

### 1. అచ్చులు, తద్భేదములు.

అ, ఇ, ఉ, ఋ, ఌ, ఏ, ఐ, ఓ, ఔ అనున వచ్చులు. వీనిలో అ, ఇ, ఉ, ఋ, అను నొక్కొక్కటియు హ్రస్వ, దీర్ఘ, ప్లుతభేదములచే మూఁడువిధములు గను, ఈ యొక్కొక్కభేదము ఉదాత్త, అనుదాత్త, స్వరితభేదములచే మూఁడువిధము లగుటచే, (3×3) తొమ్మిదిభేదములుగను, ఈ యుపభేదములు మఱల అనునాసిక, అననునాసిక భేదములచే (9×2) పదునెనిమిది భేదములు గను వివరింపఁబడినవి. ఌ-కారమునకు దీర్ఘము లేకుండుటచే నది హ్రస్వ, ప్లుత (2) × ఉదాత్త, అనుదాత్త, స్వరిత (3) × అనునాసిక, అననునాసిక (2) భేదములచే పండ్రెండువిధము లగుచున్నది. ఏ, ఐ, ఓ, ఔ, లకు హ్రస్వరూపము లేకుండుటచే నవియు (2×3×2) పండ్రెండు భేదములుగ నుండును. వైభేదముల నిట్లు ప్రస్తారముచేసి చూపవచ్చును.

అ, ఇ, ఉ, ఋ.

1. హ్రస్వ, ఉదాత్త, అనునాసిక
2. హ్రస్వ, అనుదాత్త, అనునాసిక
3. హ్రస్వ, స్వరిత, అనునాసిక
4. హ్రస్వ, ఉదాత్త, అననునాసిక
5. హ్రస్వ, అనుదాత్త, అననునాసిక
6. హ్రస్వ, స్వరిత, అననునాసిక

ఈ యాఱుభేదములును ఏ, ఐ, ఓ, ఔ, లకు లేవు.

7. దీర్ఘ, ఉదాత్త, అనునాసిక
8. దీర్ఘ, అనుదాత్త, అనునాసిక
9. దీర్ఘ, స్వరిత, అనునాసిక
10. దీర్ఘ, ఉదాత్త, అననునాసిక
11. దీర్ఘ, అనుదాత్త, అననునాసిక
12. దీర్ఘ, స్వరిత, అననునాసిక

ఈ యాఱుభేదములును ౡ-కారమునకు లేవు.

13. ప్లుత, ఉదాత్త, అనునాసిక
14. ప్లుత, అనుదాత్త, అనునాసిక
15. ప్లుత, స్వరిత అనునాసిక
16. ప్లుత, ఉదాత్త, అననునాసిక
17. ప్లుత, అనుదాత్త, అననునాసిక
18. ప్లుత, స్వరిత, అననునాసిక

'పై వానిలో హ్రస్వమనఁగా నొక్క మాత్రా కాలమున నుచ్చరింపఁబడు ధ్వని. మాత్రయనఁగా కంటి ఱెప్పపాటుకాలము; దీర్ఘమనఁగా రెండు మాత్రలకాలము; ప్లుతమనఁగా మూఁడుమాత్రలకాలము' అని లాక్షణికులు చెప్పుదురు. లక్షణము ప్రకార మావర్ణనము సరియైనను, వ్యవహారమున దీర్ఘమునకు రెండుమాత్రలకంటె నెక్కువకాలమును, ప్లుతమునకు మూఁడుమాత్రలకంటె నెక్కువకాలమును పట్టును. దూరాహ్వాన శంకాశ్చర్యాదులయందు ప్లుతము వినఁబడుచుండును. ఆహ్వానమున దూరమును బట్టియు, శంకాశ్చర్యాదులయందు భావముల యతిశయమును బట్టియు ప్లుతధ్వనికాలము మాఱుచుండును. కాని ౡ-కారమునకు దీర్ఘమే లేనప్పుడు ప్లుత మెట్లు కలుగునో తెలియరాదు.

ఉదాత్తానుదాత్త స్వరితము లననేమో సరిగ నిర్ణయించి చెప్పుట కష్టము. "ఉచ్చైరుదాత్తః"-బిగ్గరగా పలుకఁబడున దుదాత్తమని యీ సూత్రము నర్థము. అయినను నాగోజీభట్టు దీనికి వివరణముగ "తాల్వాదిషు

స్థానే పూర్ధ్వభాగే నిష్పన్నోఽచ్ ఉదాత్త సంజ్ఞ స్స్యాత్''-అనఁగా తాల్వాదిస్థానములందు పైభాగములందు కలుగు అచ్చు ఉదాత్తమను సంజ్ఞ కలిగియుండును— అని చెప్పినాఁడు. "తాల్వాదిషు" అనుదానికి "కంఠాదిషు" అని కొందఱు తాత్పర్యమును వ్రాసినారు. కాని, కష్ట మీవిషయమున లేదు; ఆయాస్థానముల యూర్ధ్వభాగము లననేమో యర్థము నిర్ణయించుటలో కష్టము కలుగును. ఇట్లే "నీచై రనుదాత్తః" అనుదానికి తగ్గులో పలుకఁబడున దనుదాత్తమని యర్థము చెప్పవలసి యున్నను నాగోజీభట్టు నభిప్రాయము చొప్పున "తాల్వాదిషు స్థానేష్వధోభాగే నిష్పన్నోఽచ్ అనుదాత్త సంజ్ఞ స్స్యాత్" అని యర్థము చెప్పవలెను. "సమాహార స్స్వరితః" అనుసూత్రమునకు "ఉదాత్తా నుదాత్తత్వే వర్ణధర్మౌ సమాహ్రియేతే యస్మిన్ సోఽచ్ స్వరిత సంజ్ఞ స్స్యాత్" అని నాగోజీభట్టు అర్థము చెప్పినాఁడు. ఏధ్వనియం దుదాత్తానుదాత్తములను వర్ణధర్మములు రెండును గలసియుండునో అది స్వరితసంజ్ఞ కలదియగునని దీనియర్థము. ఈ ధ్వనిలో ఎంతభాగ ముదాత్తము, ఎంతభాగ మనుదాత్త మను విషయమును నిర్ణయించుటకు "తస్యాదిత ఉదాత్త మర్ధహ్రస్వమ్" అను సూత్ర మేర్పడినది. అనఁగా స్వరితసంజ్ఞగల హ్రస్వాచ్చునందు మొదటి యర్ధమాత్ర ఉదాత్తమును, తక్కిన యర్ధమాత్ర అనుదాత్తమును ; దీర్ఘాచ్చునందు మొదటి యర్ధమాత్ర ఉదాత్తమును, తక్కిన ఒకటిన్నర మాత్రలును అనుదాత్తమును ; ప్లుతాచ్చునందు మొదటి యర్ధమాత్ర ఉదాత్తము, మిగిలిన రెండున్నర మాత్రలును అనుదాత్తమును అని యీ సూత్రము నభిప్రాయము. ఉదాత్తానుదాత్తస్వరిత సంజ్ఞలను గూర్చిన యష్టాధ్యాయీసూత్రములకు నాగోజీభట్టు చేసిన వ్యాఖ్యానము సరికాదని తోఁచుచున్నది. అకారాద్యచ్చుల కుదాత్తాది స్వరములు కలుగునప్పుడు తాల్వాది స్థానములం దూర్ధ్వ నీచభాగముల వలన స్థానభేదము కలుగునని చెప్ప వీలులేదు. ఉచ్చనీచలు ధ్వనికి సంబంధించినవే కాని, స్థానమునకు సంబంధించినవి కావని చెప్పవలెను. కాని, ఈ ఉదాత్తానుదాత్తత్వముల వలనఁ గలిగిన యుచ్చ నీచధ్వనులకును, సాధారణముగ వినఁబడు నుచ్చనీచధ్వనులకును నేదో భేదమున్నదనియే తోఁచుచున్నది. కాని, యది యెట్టి భేదమో నిర్ణయింప వీలులేదు. ఇంగ్లీషున వైదిక స్వరములకు acute, grave, circumflex అని అందురు. ఈ పదముల యర్థముకూడ స్పష్టము కాదు. ఉదాత్తానుదాత్తస్వరిత సంజ్ఞలు వైదికధ్వనులకు సంబంధించినవియు, ఉచ్చ, నీచ, సంజ్ఞలు సాధారణ వ్యవహార ధ్వనులకు సంబంధించినవియునై యున్నవి. వేదమునకు సంబంధించిన స్వరములు సంస్కృతమునందే లోపించినవని చెప్పుదురు. ప్రాచీన ప్రాకృతములందును నాధునిక ప్రాకృతము

లందును నవి లేకుండుట వింతకాదు. కావున నవి ద్రావిడభాషలయందును లేవు. వీనియం దాయా యచ్చులు ఉచ్చ, నీచ, సమానధ్వని భేదములచే (high, low, level) లేక ascending, descending, level మూఁడు విధములుగా నుండును.

అచ్చులన్నిటికిని అనునాసికానునాసిక భేదములు వేదమునందు గలవని ఋక్ప్రాతిశాఖ్యాయివలనఁ దెలియుచున్నది. కాని, యీ భేదమువలనఁ గలుగు ప్రయోజనమును గూర్చి యెచ్చటను వివరింపఁబడలేదు; ఆ విషయమై పరిశోధనములును జరిగియుండలేదు.

ఉదాత్తమున కక్షరము తలపై నిలువు గీఁతను, అనుదాత్తమున కక్షరము క్రింద అడ్డుగీఁతను, స్వరితమున కట్టి గుఱుతును లేకుండఁగను, ప్లుతమున కక్షరము ప్రక్క 3 అంకెనుంచియు, అనునాసికోచ్చారణమున కక్షరము తలపై ౘ అను గుఱుతు నుంచియు ప్రస్తరించిన యెడల నీ క్రింది వివిధోచ్చారణములు గల యచ్చు లేర్పడును

1. అ, అ, అ; అ, అ, అ; ఆ, ఆ, ఆ; ఆ, ఆ, ఆ; ఆ 3, ఆ 3, ఆ 3; ఆ3, ఆ3, ఆ3.

2. ఇ, ఇ, ఇ; ఇ, ఇ, ఇ; ఈ, ఈ, ఈ; ఈ, ఈ, ఈ, ఈ3, ఈ3, ఈ3; ఈ3, ఈ3, ఈ3.

3. ఉ, ఉ, ఉ; ఉ, ఉ, ఉ; ఊ, ఊ, ఊ; ఊ, ఊ, ఊ; ఊ3, ఊ3, ఊ3; ఊ3, ఊ3, ఊ3.

4. ఋ, ఋ, ఋ; ఋ, ఋ, ఋ; ౠ, ౠ, ౠ; ౠ, ౠ, ౠ; ౠ3, ౠ3, ౠ3; ౠ3, ౠ3, ౠ3.

5. ఌ, ఌ, ఌ; ఌ, ఌ, ఌ; ౡ3, ౡ3, ౡ3; ౡ3, ౡ3, ౡ3.

6. ఏ, ఏ, ఏ; ఏ, ఏ, ఏ; ఏ3, ఏ3, ఏ3; ఏ3, ఏ3, ఏ3.

7. ఐ, ఐ, ఐ; ఐ, ఐ, ఐ, ఐ3, ఐ3, ఐ3; ఐ3, ఐ3, ఐ3.

8. ఓ, ఓ, ఓ; ఓ, ఓ, ఓ; ఓ3, ఓ3, ఓ3; ఓ3, ఓ3, ఓ3.

9. ఔ, ఔ, ఔ; ఔ, ఔ, ఔ; ఔ3, ఔ3, ఔ3; ఔ3, ఔ3, ఔ3.

ఇట్లు ప్రస్తరితమైన 132 ఉచ్చారణములకును వేదములం దుదాహరణములు కానవచ్చునేమో వేదములోని ధ్వనులను గూర్చి పరిశోధనము చేయువారు తెలుపవలసియున్నది. సంస్కృతమునందు మాత్ర మీ భేదము లన్నియు లేవనియే చెప్పవచ్చును. అందు హ్రస్వ దీర్ఘ ప్లుత భేదములు గల అ, ఇ, ఉ, ఋ లును, దీర్ఘ ప్లుతభేదములు గల ఏ, ఐ, ఓ, ఔ లును గానవచ్చును. ఌ-కారమొక్క 'క్లప్' ధాతువునందు తప్ప నితరములందు గానరాదు. దానికి దీర్ఘ ప్లుతోచ్చారణములు లేవు. ఈ యచ్చులన్నిటికిని ఉదాత్తానుదాత్త స్వరితోచ్చారణములు లేవు గాని, ఉచ్చ, నీచ, సమాన స్వరములు గలవు. ప్రయోగములందు, అ, ఉ, లకు మాత్రము అఁ, ఆఁ, ఉఁ, ఊఁ అను ననునాసికోచ్చారణము కానవచ్చును; ఆ యుచ్చారణమైనను అంగీకారార్థకములగు నేకాక్షర, ద్వ్యక్షరావ్యయములఁ గొన్నిటియందు మాత్రము, అందును నా యచ్చులు పదాంతగతములైనప్పుడు మాత్రము వినఁబడును.

ప్రాకృతములందు శబ్దముల తుదిని అ, ఇ, ఉ, ల కనునాసిక ధ్వని గలదు. ముఖ్యముగ నిది నపుంసకలింగ బహువచన రూపములందు వినఁబడుచున్నది. ఉదా. వనా ఇఁ = వనాని, మొదలైన ధ్వనులకు ఉచ్చ నీచ సమాన భేదములు ప్రాకృతములందును గలవు. సంస్కృత ప్రాకృత ధ్వనులను గూర్చి తెలిసికొనుటకు మనకుఁ గేవలము గ్రంథములే యాధారము లగుచున్నవి. వ్యవహారమున నింక నెట్టి భేదములుండెనో తెలియదు. ఆధునిక ప్రాకృతములని చెప్పఁబడు హిందూదేశభాషలయందు వ్యవహారమున నచ్చుల యుచ్చారణమున వైవిధ్యమున్నది. గాని, యా భేదములన్నియు వ్రాఁత యందు గానరావు.

ఆంధ్రమునను గ్రాంథికభాషయం దుచ్చారణమునఁగల వివిధభేదములు గుర్తింపఁబడి యుండలేదు. కాని, వ్యవహారమున హ్రస్వ, దీర్ఘ, ప్లుత; ఉచ్చ, నీచ, సమాన; అనునాసికాననునాసికముల భేదములన్నియు వినఁబడును. ఈ భేదముల వలన నర్థభేదమును గలుగుచుండును. అనునాసికాననునాసికోచ్చారణములందు కాలక్రమమున మార్పులు గలిగినవి. ఆ మార్పులు అర్ధానుస్వార ప్రకరణమునఁ గొంతవఱకు వివరింపఁబడి యున్నవి.

హల్లులు.

అచ్చులకు వలె హల్లులకు హ్రస్వ, దీర్ఘ, ప్లుతభేదములను, భారతీయ వైయాకరణులు వివరింపలేదు. ఆధునికైరోపీయలాక్షణికులు హల్లులకును దీర్ఘత్వమును గల్పించియున్నారు. ద్విత్వహల్లులను వారు దీర్ఘ హల్లులుగ భావింతురు. ఈ యభిప్రాయముచొప్పున అక్క, అప్ప, మొదలగు పదము

లందలి కకార పకారాదులు దీర్ఘహల్లులని చెప్పవలయును. అవి దీర్ఘములు గావుననే యాద్విత్వము లోపించునపుడు వాని వెనుకటియచ్చు దీర్ఘమగు చుండును. కేవలహల్లు అర్ధమాత్రాకము. హల్లులకు ప్లుతముండుట యసంభవము. ఉదాత్తాది స్వరసంజ్ఞలును హల్లులకుచెల్లవు. అనునాసిక, అననునాసికభేదము య, ల, వ లకుమాత్రము గలదని సంస్కృత వైయాకరణులు తెలిపినారు. వేదభాషయందును, సంస్కృతమునందును గాకున్నను, ప్రాకృతములందు దక్కిన హల్లులకుఁగూడ ననునాసికత్వ ముండెనేమోయని యూహింపవలసియున్నది. సంస్కృతమందలి ద్విత్వాక్షరములును, సంస్కృతమునుండి సామ్యీకరణము (assimilation) వలన ప్రాకృతమున నేర్పడిన ద్విత్వాక్షరములందును మొదటిహల్లు కొన్నియెడల ననుస్వారముగ మాఱుట గలదు. ఉదా. సం. వక్ర=ప్రా. * వక్క, వంక; సం. నగ్న=ప్రా. * నగ్గ, నంగ; మొదలైనవి.

అజ్ఝల్లుల యుత్పత్తి స్థానములు.

సంస్కృత మందలి యాయా ధ్వనుల యుత్పత్తిస్థానములు సిద్ధాంత కౌముదియం దిట్లు వివరింపఁబడి యున్నవి.—

అ, క, ఖ, గ, ఘ, ఙ, హ, ః—కంఠము.

ఇ, చ, ఛ, జ, ఝ, ఞ, య, శ—తాలువు.

ఋ, ట, ఠ, డ, ఢ, ణ, ర, ష—మూర్ధము.

ఌ, త, థ, ద, ధ, న, ల, స—దంతములు.

ఉ, ప, ఫ, బ, భ, మ, ꣳప (ఉపధ్మానీయము) ఓష్ఠములు.

ఞ, మ, ఙ, ణ, న—నాసికకూడ

ఏ, ఐ—కంఠము, తాలువు.

ఓ, ఔ—కంఠము, ఓష్ఠము.

వ—దంతములు, ఓష్ఠము.

ꣳక (జిహ్వామూలీయము)—జిహ్వామూలము

అనుస్వారము—నాసిక.

పై స్థానవివరణము సంపూర్ణముగ స్వరశాస్త్రము ననుసరించిలేదు. అందుస్థానములతోఁబాటు కొన్నిటియందు కరణములును చేరియున్నవి. ఉపధ్మానీయములకు రెండు పెదవులును స్థానములనుట సరికాదు[1]. వానికి పై

* రేఫమునకును అనునాసికత్వము కలదు "అనుస్వారయమానాంచ నాసికా స్థానముచ్యతే" అని పాణినీయ శిక్ష.

1. "ఉపోపోపధ్మానఓష్ఠే" - అని ప్రాతిశాఖ్య. "సిద్ధమేజః సస్థానత్వాత్" అని వార్తికము.

పెదవి స్థానము, క్రిందిపెదవి కరణమునగుచున్నవి. ఏ, ఐ, ఓ, ఔ, లకు కంఠముగూడ స్థానమని చెప్పుట యుక్తముకానట్టు తోఁచుచున్నది[1]. ఏ ధ్వనియైనను కంఠద్వారముననే శ్వాసము బయటికివచ్చుటవలన నేర్పడుటచే, నన్నిధ్వనులకును కంఠము స్థానమగుచునే యున్నది. వకారమునకు పై దంతములు స్థానము, క్రింది పెదవి కరణము నగుచున్నవి[2]. జిహ్వామూలీయమునకు జిహ్వామూలము కరణము మాత్రమగుచున్నది; దానికి కకారముతోఁబాటు కంఠమే స్థానము. కాని, ప్రాతిశాఖ్యలో "ఇక్కాజిహ్వామూలే" అని జిహ్వామూలీయమువలెను కవర్గీయ హల్లులకును జిహ్వామూలమే స్థానమని చెప్పఁబడినది.

సిద్ధాంత కౌముదిలో కరణమును గూర్చిన ప్రశంసలేదు. కరణ ప్రకరణము ప్రాతిశాఖ్యలలోను పాణినీయ శిక్షలోను చేర్పఁబడియున్నది. స్థానముతోఁ గరణమునుగూడఁ దెలుపనిచో ధ్వనులయుత్పత్తి బోధపడదు. పైని వివరించిన స్థానములను గూర్చి సాధారణముగ తెనుఁగు వ్యాకరణములందు సరియగు జ్ఞానము లభింపకున్నది. అందు తాలువు, మూర్ధము, అను శబ్దముల యర్థము నెవ్వరును సరిగ గమనించినట్లు తోఁపదు. తాలువనఁగా దౌడయని యర్థముఁ జెప్పుచుందురు. దౌడయననది నోటికి ప్రక్కగోడ. అదిధ్వనికి స్థానము కాదు. ఈ విషయమును గ్రహించియే యొకరు తాలుశబ్దమున కర్థముఁ జెప్పఁబోయి, యదిమూర్ధమనిరి. * తాలువన మూర్ధమైనచో, మూర్ధమేమికావలెనో! ఈ స్థానములను గూర్చి తెలిసికొనుట కీక్రిందిపటము సహాయకారి కాఁగలదు.




1. ఏకారమునకు తాలువే స్థానము "ఇచశేయాస్తాలౌ" అని ప్రాతిశాఖ్య; ఓకారమున కోష్ఠమే స్థానము "ఉపోపోపధ్మా ఓష్ఠే" అనిప్రాతిశాఖ్య.

2 "వోదంతాగ్రైః" అని ప్రాతిశాఖ్య కరణప్రకరణము. శిక్షలో "దంతోష్ఠ్యోవః" అనిఉన్నను, దానికి "దంతసన్నికృష్టేఓష్ఠేభవః" అని యర్థము చెప్పకొమ్మన్నారు.

* బ్రహ్మశ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు. "వ్యాససంగ్రహము" అను రావుసాహేబు గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవ సందర్భమున ప్రకటింపఁబడిన సంచిక. (ప్రకాశకులు: తెలికిచెర్ల వేంకటరత్నము ఎమ్. ఏ., గుంటూరు. వెల. రు 7-8-0.) చూ. "తాలువన దౌడకాదు" అను వ్యాసము.

ఇందు కంఠబిలము, మృదుతాలువు, మూర్ధము, తాలువు, దంతమూలము, మీఁదిదంతము, మీఁది పెదవి, అనునవి స్థానములు. శాస్త్రదృష్టినాలోచించినచో కంఠమునుండి యారంభించిన నోటిపైకప్పు లోపలితలమంతయు ధ్వనియుత్పత్తికి స్థానమే యగును. కాని, యొకొక్క భాషయందలి ధ్వను లొకొక్క ప్రదేశమునుండి వెలువడు చుండుటచే నాయాభాషలయందలి ధ్వనులలో నీషద్భేదములు గలుగుచుండును. ఒక్క భాషయందే వేర్వేఱు కాలములందు భ్రంశమూలమున స్థానము మాఱుచుండుటచే ధ్వనులును మాఱుచుండును. నాలుకయు, క్రిందిపెదవియు కరణములు. కంఠమునుండి వెలువడు శ్వాసమును వివిధవికారములను బొందిన నాలుక యాయాస్థానములందు సంపూర్ణముగ నిరోధించి వదలుట వలనను, ఆయాస్థానములందు తగిలియుఁ దగులనట్లుండి యొరపిడితో జారనిచ్చుట వలనను, నోటి పైకప్పును స్పృశింపక దానికి వెవ్వేఱు దూరములందు నిలిచి వదలుచుండుటవలనను నాయాధ్వను లుత్పన్నము లగుచుండును. కావున, ధ్వనియుత్పత్తి విషయమున స్థానవివేక మెంతముఖ్యమో, కరణవివేకమును నంతముఖ్యమైనదే.

స్థాన, కరణముల మూలమున నుత్పత్తియగు నాయాధ్వనులను వివరింపకపూర్వము సంస్కృత వైయాకరణులు వివరించిన ప్రయత్నమును గూర్చి కొంత తెలిసికొనవలసియున్నది. సిద్ధాంతకౌముదిప్రకారము ప్రయత్నము ఆభ్యంతరము, బాహ్యము, నని రెండు విధములు. అందాభ్యంతరము మరల (1) స్పృష్ట (2) ఈషత్స్పృష్ట (3) వివృత (4) సంవృత - భేదములచే నాలుగు విధములు ఈ యాభ్యంతర ప్రయత్న భేదముల యర్థమెచ్చటను వివరింపఁబడలేదు. నానికిట్లర్థముఁ జెప్పికొనవలెనేమో. స్పృష్టమనఁగా కరణము స్థానమును సంపూర్ణముగ స్పృశించుట. కాది-మాంత పంచవర్గీయహల్లు లిట్టివి. ఈషత్స్పృష్టము లనఁగాఁ గరణము స్థానముతో స్పృశించియు స్పృశింపనట్లుండుట. అంతస్థములును (య, ర, ల, వ) ఊష్మములు (శ, ష, స, హ) నిట్టివి. కాని, వీనిలో నంతస్థములను మాత్రమే యీషత్స్పృష్టములుగ సిద్ధాంతకౌముది పేర్కొనుచున్నది. శ, ష, స, హ, లను గొంద అర్ధస్పృష్టములనుచున్నారు. వీని నుచ్చరించునపుడు గలుగుస్పర్శము సరిగ సగమని చెప్ప వీలులేకున్నను, య, ర, ల, లకంటె. వీనిస్పర్శ మెక్కువయనియే చెప్పవచ్చును. య, ర, ల, వ, లలోఁగూడ య, ర, ల, లస్పర్శముకంటె, వ-కారస్పర్శ మెక్కువగనే యుండును. కావున, వ - కారమును స్పర్శవిషయమున య, ర, ల, లతోఁ గాక, శ, ష, స, హ, లతోఁ జేర్పవలసియుండును.

ఆభ్యంతర ప్రయత్నమందు వివృత, సంవృత భేదములును గలవని సిద్ధాంతకౌముది తెలుపుచున్నది. ఈ రెండిటికిని స్థానకరణముల స్పర్శముతో నెట్టి సంబంధము నున్నట్లు కానరాదు. 'వివార' మనఁగా 'వెడల్పు'; 'సంవార' మనఁగా 'ఇఱుకు' వీనికే ఇంగ్లీషున Open, close, అనికాని, Broad, narrow అని కాని చెప్పుదురు. శ్వాసము బయటికి వచ్చు కంఠాది మార్గమును వెడల్పు చేయుట 'వివృత' ప్రయత్నమును దానిని ఇఱుకుచేయుట 'సంవృత' ప్రయత్నమును నని చెప్పవలెను. ఈ యర్థము సరియైనదైనచో ఊష్మముల కును స్వరములకును వివృతప్రయత్నమని చెప్పుట సరిపోదు. ఊష్మముల నుచ్చ రించునప్పుడు మార్గ మిఱుకుగ నుండుటచే వానికిఁగల ప్రయత్నము సంవృత మనియే చెప్పవలెను. స్వరములలో 'అ' కారమునకు ప్రక్రియాదశయందు వివృతప్రయత్నమనియు, ప్రయోగమునందు సంవృతప్రయత్నమనియు సిద్ధాంతకౌముది తెలుపుచున్నది.

ఈ విషయమున వ్యాఖ్యాత యేమేనితబ్బిబ్బు పడినాఁడో, లేక వైదిక స్వరముల యాభ్యంతర ప్రయత్నము నట్లే నిరూపింపవలెనో నిశ్చయింపలేము. బాహ్యప్రయత్నము (1) వివార (2) సంవార (3) శ్వాస (4) నాద (5) ఘోష (6) అఘోష (7) అల్పప్రాణ (8) మహాప్రాణ (9) ఉదాత్త (10) అనుదాత్త (11) స్వరిత — భేదములచే పదునొకండు విధములైనట్లు తెలుపఁబడినది. ఆయాహల్లుల బాహ్యప్రయత్నముల నీక్రిందిశ్లోకము వివ రించుచున్నది.

"ఖయాంయమః, ఖయః, ౘక, ౘపౌ, విసర్గః, శర, (ఏవచ)
ఏతే "శ్వాసాను ప్రదానా," "అఘోషా" శ్చ, "వివృణ్వతే"
కంఠ; మన్యేతు "ఘోషా," స్స్యుః, "సంవృతా," "నాదభాగినః"
అయుగ్మా, వర్గయమగా, యణ, "శ్చాల్పాసవ" స్స్మృతాః"

దీనియర్థము—"'ఖయ్యు'ల 'యమ్ము'లు, 'ఖయ్యు'లు, జిహ్వా మూలీయ, ఉపధ్మానీయములు, విసర్గము, 'శర్రు'లు—వీనికి శ్వాస, అఘోష, వివారప్రయత్నములు, తక్కిన వానికి ఘోష, సంవార, నాదప్రయత్నములు, వర్గములలో ప్రథమ, తృతీయ, పంచమవర్ణములు; ఆవర్గములలోనివే ప్రథమ, తృతీయ వర్ణముల 'యమ్ము'లు, 'యణ్ణు'లు - ఇవిఅల్పప్రాణములు; మిగిలినవి మహాప్రాణములని బోధ్యము."

'ఖయ్యు' లనఁగా పంచవర్గములలోని ప్రథమ, ద్వితీయవర్ణములు;— క, ఖ; చ, ఛ; ట, ఠ; త, థ; ప, ఫ—అనునవి ప్రాతిశాఖ్యయందు "ప్రతివర్గములోని మొదటి నాలుగు వర్ణములకంటెను, ఆ వర్గపు అనునాసి కము పరమయినయెడల, ఆయావర్ణములు ద్విత్వములగును: ఉదా. పలిక్క్నీః;

చక్ఖ్ఖ్నతుః ; అగ్గ్నిః ; ఘ్ఘ్నంతి ; మొదలైనవి. ఇట్లాగమముగా వచ్చిన వర్ణములకు "యమ్ము లనిపేరు" అని ప్రసిద్ధిగలదు. 'శర్రు' లనఁగా 'శ, ష, స' వర్ణములు. "యణ్ణు" లనఁగా 'య, ర, ల, వ' లు.

ఉదాత్తానుదాత్తస్వరితములను బాహ్యప్రయత్నములు సిద్ధాంతకౌముదిలో అచ్చుల విషయమున మాత్రము వివరింపఁబడినవి. ఇవి ప్రయత్నములయినప్పుడు హ్రస్వ, దీర్ఘ, ప్లుతములను, అనునాసికాననునాసికములను గూడ నేల ప్రయత్నములగఁ బరిగణింపఁగూడదో తెలిదు.

పై వివరణమును బట్టి యాయావర్ణములకుఁగల స్థానప్రయత్నము లీక్రింది పట్టికలో సంగ్రహముగఁ దెలుపఁబడినది. ఇట్టి పట్టికయే "ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము, సంపుటము ౧ - 1916 సం॥ ప్రచురణము - 404 - వ పుట" లో ఉన్నది. దానికిని దీనికిని గలభేదములు నక్షత్రచిహ్నములు (*) గలచోట్ల గమనింపఁదగును.

సిద్ధాంతకౌముది యందు వివరింపఁబడిన బాహ్యప్రయత్నములలో శ్వాసము, నాదము ; ఘోషము, అఘోషము ; అల్పప్రాణము, మహాప్రాణము—అను సంజ్ఞలను వివరింపవలసి యున్నది. శ్వాసమున కింగ్లీషులో Surd అనియు, నాదమునకు Sonant అనియుఁ జెప్పవచ్చునేమో. క, ఖ, చ, ఛ ; ట, ఠ ; త, థ ; ప, ఫ ;—ఇవి శ్వాసముగలవి. వీని నుచ్చరించునపుడు రెండు చెవులను మూసికొన్నచో ఝూంకారము వినఁబడదు. గ, ఘ ; జ, ఝ ; డ, ఢ ; ద, ధ ; బ, భ లు పై వానికి వరుసగ నాదముగల ధ్వనులు. వీని నుచ్చరించుచుఁ జెవులను మూసికొన్నచో ఝూంకారము వినఁబడును. ఈ ఝూంకారమే నాదము. ఙ, ఞ, ణ, న, మ, అను ననునాసిక ధ్వనులను, అనుస్వారమును, అంతస్థములగు అనునాసికాననునాసిక య, ర, ల, వ, లను, అచ్చులను, ఉచ్చరించునపుడుఁ గూడ నీ ఝూంకారము కలుగును గావున, నివియు నాదముగల వగుచున్నవి. కాని, సిద్ధాంతకౌముదియందచ్చులకు నాదము చెప్పఁబడలేదు. య, ర, ల, వ, లు నాదముగలవైనను వానికి సరిపోవు శ్వాసధ్వనులులేవు. ఇట్లే నాదయుతములగు నచ్చులకు సరిపోవు శ్వాసముగల యచ్చులునులేవు. వానికి శ్వాసమును గల్పించినచో నవి యేకాంతాచ్చు (Whispered vowels) లగును. ꣳక, శ, ష, స, ꣳప - లు శ్వాసముగలధ్వనులు. వీనిలో ꣳక, ꣳప లకు సరిపోవు నాదధ్వనులు సంభవములే యైనను లేవు. శ, ష, స, లకును సంస్కృతమున నాదధ్వనులు లేవు. ష (*sh*) కారమున కింగ్లీషున '*z*' అను నాదధ్వనిగలదు ; అట్లే 'స' (*s*) కారమునకు 'Z' అను నాదధ్వని గలదు. 'శ' - వర్ణ మింగ్లీషున లేదు గావున దానికి సరిపోవు నాదధ్వనియు నందులేదు.

| స్థానము | కరణము | ప్రయత్నము | | | | | | | | | | | ఆభ్యంతర ప్రయత్నము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | స్పృష్ట | | | | | ఈషత్ స్పృష్ట (అంతస్థ) | | వివృత అర్ధస్పృష్ట (ఊష్మ) | | వివృత అస్పృష్ట (అచ్చులు) | సంవృత (అచ్చులు) | |
| | | వివార శ్వాస అఘోష | | సంవార నాద ఘోష | | | సంవార నాద ఘోష | | వివార శ్వాస అఘోష | సంవార నాద ఘోష | ఉదాత్త అనుదాత్త స్వరిత | ఉదాత్త అనుదాత్త స్వరిత | బాహ్యప్రయత్నము |
| | | అల్ప ప్రాణ | మహా ప్రాణ | అల్ప ప్రాణ | మహా ప్రాణ | అల్ప ప్రాణ | అల్ప ప్రాణ | | మహా ప్రాణ | మహా ప్రాణ | | | |
| | | | | | | అను నాసిక | | | | | | అనునాసిక అననునాసి | నాసికవలనఁ గలిగిన భేదము |
| | | | | | | | | | | | హ్రస్వ, దీర్ఘ ప్లుత | హ్రస్వ | కాలమువలన భేదము. |
| కంఠము | జిహ్వామూలము | క | ఖ | గ | ఘ | ఙ | | ం | ఃక | హ | అ ౧౨౩ | అ ౧ | |
| తాలువు | * జిహ్వాగ్రము | చ | ఛ | జ | ఝ | ఞ | య | యఁ | శ | . | ఇ ౧౨౩ | | |
| మూర్ధము | * వెనుకకుమడచిన జిహ్వాగ్రము | ట | ఠ | డ | ఢ | ణ | ర | రఁ * | ష | | ఋ ౧౨౩ | | |
| * ఊర్ధ్వ దంతము | జిహ్వాగ్రము | త | థ | ద | ధ | న | ల | లఁ | స | ... | ఌ ౧౨ | | |
| * ఊర్ధ్వోష్ఠము | * క్రింది ఓష్ఠము | ప | ఫ | బ | భ | మ | ... | ... | ఃప | | ఉ ౧౨౩ | | |
| * ఊర్ధ్వదంతము | * క్రింది ఓష్ఠము | ... | .. | . | . | ... | వ | వఁ * | | .. | | | |
| * తాలువు | | ... | ... | ... | . | ... | .. | ... | | . | ఏ ౧౨ ఐ ౧౨ వీనియందుగూడ జిహ్వా కరణముగఁ బనిచేయుచున్నది. | | |
| * ఓష్ఠములు | | ... | ... | ... | .. | ... | ... | .. | ... | ... | ఓ ౧౨ ఔ ౧౨ | | |
| నాసిక | | | | | | అనుస్వార | | | | | | | |

ఘోషము, అఘోషము, అను పదముల కర్థమేమో స్పష్టముకాకున్నది. ఇంగ్లీషులోని Aspirate అనుదానికి ఘోషమనియు, Unaspirate అనుదాని కఘోషమనియు నర్థము చెప్పినచో ఒత్తక్షరములు ఘోషములును సాధు అక్షరములు అఘోషములునని చెప్పవలసియుండును. అప్పుడు ఖ, ఛ, ఠ, థ; ఫ, ఘ, ఝ, ఢ, ధ, భ - లు ఘోషములును, క, చ, ట, త, ప; గ, జ, డ, ద, బ - లు వానికి సరిపోవు అఘోషములును అగును. కాని, శ్వాసముగల ధ్వనులన్నియు నఘోషములనియు, నాదముగలవన్నియు ఘోషములనియు సిద్ధాంతకౌముది తెలుపుచున్నది. ఇదిగాక క, చ, ట, త, ప; గ, జ, డ, ద, బ, లు అల్పప్రాణములనియు, ఖ, ఛ, ఠ, థ, ఫ; ఘ, ఝ, ఢ, ధ, భ, లు మహాప్రాణములనియు నాగ్రంథమే తెలుపుచున్నది. కావున నల్పప్రాణ, మహాప్రాణములకు వరుసగ unaspirate, aspirate, అని యింగ్లీషునఁ జెప్పినయెడల ఘోషామహాప్రాణములకును అఘోషాల్పప్రాణములకును భేదములేకపోవును. కావున నిపుడు తేలనలసినది శ్వాసాఘోషములకును, నాదఘోషములకునుగల యర్థభేదము. ఈ భేదమేమో నిర్ణయించుట కష్టమే. ఈ జంటలలోని రెండు పదములు నేకార్థకములైన యెడల, వానిని వేర్వేఱ నుగ్గడించుట యనావశ్యకము. నాదమను నది ప్రయత్నము, ఘోషము దానిఫలము; శ్వాసము ప్రయత్నము, అఘోషము దాని ఫలము; - అని చెప్పినచో ఘోషాఘోషములను బ్రయత్నములలోఁ జేర్చుట తగదు.

ఁక, ఁప, హ, లను మహాప్రాణములని యనఁగూడినను, శ, ష, స, లు గూడ మహాప్రాణములనుట తగునేమో విచారణీయము. కాని, అల్పప్రాణముల నుచ్చరించు నప్పటికంటె శ, ష, స, ల నుచ్చరించునపు డెక్కువ ప్రాణము నుపయోగింపవలయుననుట స్పష్టము.

## II. ఆచ్ఛికధ్వనులు.

ఆంధ్రధ్వనుల స్థాన, కరణ, ప్రయత్నములు తత్సమ శబ్దములందు సంస్కృత ధ్వనులకువలె నుండునుగాని, తద్భవ దేశ్యములందు కొన్నివర్ణముల విషయమునఁ గొంత భేదముండును. ఎ, ఒ, చే, జే, ఱ, అను వర్ణముల విషయమున నీ భేదము కానవచ్చును. సంస్కృతమున ఎ, ఒ, లు దీర్ఘములేకాని హ్రస్వములుకావు. ప్రాకృతభాషల యవస్థనుండియు హ్రస్వ ఎ, ఒ కారములు ప్రచారములోనికి వచ్చినవి. ప్రాకృతమున ద్విత్వహల్లులకు పూర్వమందే హ్రస్వ ఎ, ఒ లుండు నని కొంద ఱుందురుగాని, ప్రత్యేకముగ నున్నప్పుడును నవి హ్రస్వముగ వినఁబడుట కలదనుటకు నిదర్శనములు గలవు. చే, జే, లు దంత్యములగు ప్రత్యేకవర్ణములని వైయాకరణులందురు. కాని, యవిత-కార స-కార సంయోగమువలనను, దకార జ- కార సంయోగము

వలనను గలిగిన సంయుక్తాక్షరములు. 'క్ష'కారము క-కార, ష-కార సంయోగమువలనఁ గలిగినదైనను, ఉచ్చారణమున నా రెండు వర్ణములును ప్రత్యేకముగ వినఁబడక యేకవర్ణముగ వినఁబడునట్లే 'త్స' 'ద్జ' వర్ణములేక వర్ణములగు చే, జే లుగ వినఁబడుచున్నవి. ద-కార జ-కారములకు సంయోగము గలిగినప్పుడు, ద-కారసంపర్కమువలన స-కారమునకునాదము గలిగి యింగ్లీషులోని 'Z' వంటిధ్వనిగ మాఱినది. ఇట్లే చే, జే లకు మాతృకలు మఱికొన్నియుఁ గలవు. ఇతరములైన యాదృచ్ఛిక ధ్వనులను గూర్చిన విచార మీ యధ్యాయమున వేఱొకచోటఁ జేయఁబడినది.

నాలుగవ ప్రకరణము

# స ం ధి

## సంస్కృత సంధి

### తెనుఁగునకుఁ గావలసిన సంస్కృత సంధిసూత్రములు

తెనుఁగున సంస్కృత సమాసములు గ్రంథములందు విరివిగఁ జేరినవి. కొన్ని సమాసములు వ్యవహారము నందును వినవచ్చుచున్నవి. సంస్కృతపదములు సమసించునపుడు గలుగు సంధివిధానము తెనుఁగునకుఁ గావలసినంత మట్టునకు తెలిసికొనవలసియున్నది. అట్టి సంధు లీక్రింద వివరింపఁ బడినవి:—

అచ్సంధి.

(1) ఇ, ఉ, ఋ, ఌ, అనునచ్చుల కసవర్ణాచ్చులు పరమైనప్పుడు వానికి వరుసగా య, వ, ర, ల, అను హల్లు లాదేశములగును: [1]

అతి + ఆశ్చర్యము = అత్యాశ్చర్యము; గురు + ఆజ్ఞ = గుర్వాజ్ఞ; పితృ + ఆదేశము = పిత్రాదేశము (ఌ + ఆకృతి = లాకృతి).

(2) క్షయ్య, జయ్య, శబ్దములు శక్యార్థకములు:[2] క్షయింప శక్యమైనది క్షయ్యము; జయింప శక్యమైనది జయ్యము. శక్యార్థము కాక యోగ్యార్థము గలిగినప్పుడు క్షేయము, జేయము, అనురూపములు గలుగును.

(3) 'క్రయ్య'మనఁగా కొనువారు కొందురనుబుద్ధి నంగడియం దుంచఁ బడినది. 'క్రేయ' మనఁగా విక్రయించుట కర్హమైనది.[3]

(4) అవర్ణమున కిసవర్ణాచ్చు పరమైనయెడల నా రెండచ్చుల స్థానమున పరమందున్న యచ్చునకు సంబంధించిన గుణమాదేశమగును: [4] ఇ, ఉ, ఋ, ఌ, లకు వరుసగా ఏ, ఓ, అర్, అల్, అనునవి గుణములగును :

ఉప + ఇంద్రుఁడు = ఉపేంద్రుఁడు, గంగా + ఉదకము = గంగోదకము; మహా + ఋషి = మహర్షి.

(5) అవర్ణమునకు ఏ, ఐ, ఓ, ఔ, లు పరమైనయెడల వానికి వృద్ధి యేకాదేశమగును. [5] ఇ, ఉ, ఋ, ఌ, లకు వరుసగా ఐ, ఔ, ఆర్, ఆల్, అనునవి వృద్ధులగును :

1. ఇకో యణచి. 2 క్షయ్యజయ్యౌ శక్యార్థే 3. క్రయ్యస్తదర్థే 4. అద్గుణః 5. వృద్ధిరేచి.

కృష్ణ + ఏకత్వము = కృష్ణైకత్వము; గంగా + ఓఘము-గంగౌఘము; దేవ + ఐశ్వర్యము = దైవైశ్వర్యము; కృష్ణ + ఔత్కంఠ్యము=కృష్ణౌత్కంఠ్యము.

(6) అక్ష శబ్దమునకు ఊహినీశబ్దము పరమగునప్పుడు 'ఊ' వర్ణమునకు వృద్ధియగును: [1] అక్షౌహిణి.

(7) అ, ఇ, ఉ, ఋ, ఌ, అనునచ్చులకు సవర్ణాచ్చులు పరమైనచో వానికి దీర్ఘముగలుగును: [2].

దైత్య + అరి = దైత్యారి; శ్రీ + ఈశుఁడు = శ్రీశుఁడు; విష్ణు + ఉదయము = విష్ణూదయము; పితృ + ఋణము = పితౄణము.

హల్సంధి.

(1) స, త, థ, ద, ధ, న అనుహల్లులకు శ, చ, ఛ, జ,ఝ, ఞ, అనుహల్లులు చేరినయెడల స, త, థ, ద, ధ, న, లు వరుసగా శ, చ, ఛ, జ, ఝ, ఞ, లుగామాఱును :[3]

శిరస్ + చుంబి = శిరశ్చుంబి; మరుత్ + చంచలము = మరుచ్చంచలము; బృహత్ + జాతకము = బృహజ్జాతకము; సరిత్ + ఝరి = సరిజ్ఝరి మొదలైనవి.

(2) స, త, థ, ద, ధ, న, అనుహల్లులకు ష, ట, ఠ, డ, ఢ, ణ, లు చేరినయెడల స, త, థ, ద, ధ, న, లు వరుసగా ష, ట, ఠ, డ, ఢ, ణ, లు గామాఱును:[4]

ధనుస్ + టంకారము=ధనుష్టంకారము; తద్ + డమరుకము=తడ్డమరుకము; ఘుష్యత్ + ఢంక = ఘుష్యడ్ఢంక మొదలైనవి.

(3) పదాంతములైన ట, ఠ, డ, ఢ, ణ, లకు పరముగానుండు స, త, థ, ద, ధ, నలు ష, ట, ఠ, డ, ఢ, ణ లుగా మాఱవు :[5]

షట్ + సమయములు = షట్సమయములు; షట్ + దానములు = షడ్దానములు; షట్ + న్యాయములు = షడ్న్యాయములు, మొదలైనవి.

కాని ట, ఠ, డ, ఢ, ణ లకు నవతి, నగరి, అనుపదములు పరమైనచో నాపదముల యాదినున్న నకారమునకు ణకారమాదేశమగును:[6]

షట్+నవతి=షణ్ణవతి; షట్ + నగరులు = షణ్ణగరులు.

---

1. అక్షాదూహి న్యుపసంఖ్యానమ్. 2. అక స్సవర్ణే దీర్ఘః.

3. స్తోశ్చునాశ్చుః. 4. ష్టునాష్టుః. 5. నప దాంతా ట్టో రనామ్.

6. అనామ్న గరినవతీనామితివాచ్యమ్.

తవర్గీయ హల్లులకు షకారము పరమైనయెడల ష, ట, ఠ, డ, ఢ, ణ, లు ఆదేశములు కావు:[1]

తద్ + షణ్ముఖుఁడు = తద్షణ్ముఖుఁడు; మొదలైనవి.

(4) క, చ, ట, త, ప; గ, జ, డ, ద, బ, ఖ ఛ, ఠ, థ, ఫ ఘ, ఝ, ఢ, ధ, భ; శ, ష, స, హ:-లు పదాంతమున వచ్చినయెడల వానికి యథాక్రమముగా గ, జ, డ, ద, బ, లు ఆదేశములగును:[2]

వాక్ + ఈశుఁడు=వాగ్ + ఈశుఁడు=వాగీశుఁడు; చిత్ + రూపము= చిద్ + రూపము = చిద్రూపము మొదలైనవి.

(5) హకారముతప్ప తక్కిన పదాంతములైన హల్లులకు అనునాసికాక్షరములు పరములైనయెడల అనునాసికాక్షరము వైకల్పికముగా నాదేశమగును:[3]

ఏతద్ + మురారి = ఏతద్మురారి; ఏతన్మురారి.

కాని, పరముగానున్న యనునాసికాక్షరము ప్రత్యయస్థమైనయెడల పూర్వహల్లు నిత్యముగా ననునాసికమగును:[4]

తద్ + మాత్రము = తన్మాత్రము, చిత్ + మయము=చిన్మయము.

(6) త, థ, ద, ధ, న, లకు లకారము పరమైన యెడల నవి లకారముగా మాఱును:[5]

తద్ + లీనము; తల్లీనము; తద్ + లయము = తల్లయము.

(7) 'ఉద్' అను నపదనువై 'స్థా' 'స్తంభ' అనుపదములు చేరునప్పుడు పూర్వసవర్ణమాదేశ మగును:[6]

ఉద్ + స్థాపనము = ఉత్థాపనము; ఉద్ + స్తంభనము = ఉత్తంభనము.

(8) క, ఖ, గ, ఘ; చ, ఛ, జ, ఝ; ట, ఠ, డ, ఢ; త, థ, ద, ధ; ప, ఫ, బ, భ-లకు హకారము పరమైనయెడల పూర్వసవర్ణము వైకల్పికముగ నాదేశమగును:[7]

వాక్ + హరి = వాగ్ఘరి; వాగ్హరి.

(9) వైవర్ణములు పదాంతములై, వానికచ్చులును, హ, య, వ, ర, లును కూడిన శవర్ణము పరమైనయెడల శవర్ణము ఛవర్ణముగామాఱును:[8]

---

1. తోఃషి. 2 ఝలాంజశోఽంతే. 3. యరోఽనునాసికేఽనునాసికోవా. 4. ప్రత్యయే భాషాయాం నిత్యమ్. 5. తోర్లి. 6. ఉదః స్థాస్తంభోః పూర్వస్య. 7. ఝయో హోఽన్యతరస్యామ్. 8. శశ్ఛోఽటి.

తద్ + శివుఁడు (పై (1) నియమముచే తజ్ + శివుఁడు, అని నిలువఁగా,—)

అనునాసికాక్షరములుతప్ప తక్కిన వర్గీయ హల్లులకును శ, ష, స, లకును, వర్గప్రథమ, ద్వితీయాక్షరములును, శ, ష, స లును పరమైనయెడల వానికి యథాక్రమముగా క, చ, ట, త, ప, శ, ష, స లు ఆదేశములగును:[1]

తజ్ + శివుఁడు = తచ్ + శివుఁడు = తచ్ఛివుఁడు, తచ్శివుఁడు.

అనునాసికవర్ణములుతప్పఁ దక్కిన వర్గీయ హల్లులకు అచ్చులును, య, ర, ల, వ, హ. ఙ, ఞ, ణ, న, మ, లును శవర్ణమునకు పరమైనను 'ఛ' కారమాదేశమగును:[2]

తద్ + శ్లోకము = తచ్ఛ్లోకము.

(10) రేఫమునకు క, చ, ట, త, ప; ఖ, ఛ, ఠ, థ, ఫ; శ, ష, స లు పరమైనయెడల రేఫమునకు విసర్గమాదేశము గావచ్చును:[3]

విసర్గమునకు వర్గప్రథమ ద్వితీయాక్షరములును శ, ష, స, లును పరమైన యెడల 'స' కారమాదేశమగును; శ, ష, స, లు పరమైనప్పుడు 'స' కారాదేశము వైకల్పికముగా నగును:[4]

పునర్ + తాడనము = పునః + తాడనము = పునస్తాడనము; అయస్ + పిండము = అయః పిండము; తపస్ + ఫలము = తపః ఫలము.

(11) సమ్, పుమ్, శబ్దములతోఁ గూడిన కకారమునకుఁ బూర్వము 'స' కారమాగమముగా వచ్చును:[5]

సమ్ + కర్త = సంస్కర్త; పుమ్ + కోకిల = పుంస్కోకిల.

(12) కవర్గ, పవర్గీయాక్షరములు పరమైనచో విసర్గమునకు వరుసగా జిహ్వామూలీయ, ఉపధ్మానీయము లాదేశములగును:[6]

తప≍ ఫలము; ప్రాత≍కాలము మొదలైనవి.

(13) హ్రస్వాచ్చునకు ఛకారము పరమైనయెడల పూర్వపదము తుదను 'త్' అనున దాగమముగా వచ్చును:[7]

స్వ + ఛాయ = స్వ + త్ + ఛాయ = స్వచ్ఛాయ; శివ + త్ + ఛాయ = శివచ్ఛాయ.

1. ఖరి చ. 2. ఛత్వ మమీతి వాచ్యమ్. 3. ఖరవసానయో ర్విసర్జనీయః. 4. విసర్జనీయస్య సః. 5. సంపుంకానాం సో వక్తవ్యః 6. కుప్వోః ≍క≍పౌ చ. 7. ఛే చ.

'ఆ'కు పరముగా 'చ' కారమువచ్చినను 'త్' ఆగమముగావచ్చును:[1]

ఆ + ఛాదనము = ఆ + త్ + ఛాదనము = ఆచ్ఛాదనము.

దీర్ఘాంతమైన పదముపై 'ఛ' కారము వచ్చినచో 'త్' అనునది వైకల్పికముగా ఆగమమగును:[2]

లక్ష్మీ + ఛాయ = లక్ష్మీఛాయ; లక్ష్మీచ్ఛాయ.

విసర్గసంధి.

(1) విసర్గమునకు సకారమాదేశమగును:[3]

పయః + సముద్రము = పయస్సముద్రము.

(2) విసర్గమునకు వర్గప్రథమ ద్వితీయాక్షరముల మీఁదను శ, ష, స, ల మీఁదను గల శ, ష, స లు పరమైనచో విసర్గము నిలుచును:[4]

మనః + క్షోభము = మనః క్షోభము మొదలైనవి.

(3) విసర్గమునకు శ, ష, స, లు పరమైనచో విసర్గము వైకల్పికముగానగును:[5]

పయః + శీతలము = పయశ్శీతలము, పయః శీతలము.

పాశ, కల్పక, క, కామ్య, శబ్దములు విసర్గమునకుఁ బరమైనచో 'స' కారము తప్పక యాదేశమగును:[6]

పయస్పాశము, యశస్కల్పము, యశస్కము, యశస్కామ్యము - పై శబ్దములు అవ్యయగతమగు విసర్గముపై వచ్చినచో 'స' కారమాదేశము కాదు:[7]

ప్రాతః కల్పము.

ఇ, ఉ, ఋ, ౠ, ఏ, ఓ, ఔ, హ, య, ర, ల, వ, లపైఁ గల విసర్గము మీఁద పై శబ్దములు పరమైనచో 'ష' కార మాదేశముగావచ్చును:[8]

సర్పిష్ + పాశము = సర్పిష్పాశము, సర్పిష్కల్పము, సర్పిష్కము, సర్పిష్కామ్యము—'ముహుర్, అనునవ్యయముపై నీ కార్యమురాదు:[9]

ముహుఃకాముఁడు—'నమస్, పురస్' అను గతిసంజ్ఞగల శబ్దములపై విసర్గమునకు సకారము వచ్చును:[10]

నమస్కారము, పురస్కారము.

---

1. ఆఙ్మాఙోశ్చ. 2. దీర్ఘాత్; పదాంతాద్వా. 3. విసర్జనీయస్యసః. 4. శర్పరే విసర్జనీయః 5. వా శరి. 6. పాశ, కల్ప, క, కామ్యేష్వితి వాచ్యమ్. 7. అనవ్యయస్యేతి వాచ్యమ్. 8. ఇణః షః. 9. ముహుసః కర్ణేష్వనవ్యయస్య, ప్రతిషేధః. 10. నమస్పురసోర్గత్యోః.

(4) తిరస్, అను నవ్యయముపై క, ప, వర్గీయాక్షరములు పరమైనచో 'స' కారాదేశము వైకల్పికముగానగును:[1]

తిరస్కారము, తిరస్కర్త; తిరఃకారము, తిరఃకర్త.

(5) సమాసమునందుత్తరపదమునందు లేని ఇస్, ఉస్, అంతములు గల శబ్దముల విసర్గమునకు 'ష' కారము నిత్యముగా నాదేశమగును:[2]

సర్పిస్ + కుండిక = సర్పిష్కుండిక; ధనుస్ + కపాలము = ధనుష్కపాలము; ధనుస్ + కోటి = ధనుష్కోటి.

(6) అకారమునకుఁ బరముగానుండు అవ్యయముకానట్టి శబ్దముతుది విసర్గమునకు కృ, కమ్, కంస, కుంభ, పాత్ర, కుశ, కర్ణి శబ్దములు పరమైన యెడల నిత్యముగా సకారమాదేశమగును:[3]

అయస్కారుఁడు, అయస్కాముఁడు, అయస్కంసము, అయస్కుంభము, అయస్పాత్రము, అయస్కుశ, అయస్కర్ణి.

(7) 'అధస్', 'శిరస్' శబ్దములపై సమాసమందు 'పద' శబ్దము పరమైన యెడల నిత్యముగా సకారమాదేశమగును:[4]

అధస్పదము, శిరస్పదము.

## స్వాది సంధి.

(1) 'అహాస్' మొదలగు శబ్దములపై 'పతి' మొదలగు శబ్దములు పరమైన యెడల వైకల్పికముగా రేఫమాదేశమగును:[5]

అహార్పతి, గీర్పతి, ధూర్పతి.

(2) 'అహన్' శబ్దము నకారమునకు సమాసమందు రేఫమాదేశమగును:[6] అహారహము; అహర్గణము.

(3) రేఫమునకు రేఫము పరమైనచో మొదటి రేఫమునకు లోపము కలుగును.[7]

రేఫలోపము కలుగునప్పుడు దానికి పూర్వమందున్న అ, ఇ, ఉ, లకు దీర్ఘమగును:[8]

పునర్ + రమణము = పునారమణము: మొదలైనవి—తుల్యబలవిరోధము కలిగినప్పుడు విసర్గము ఉకారముగామాఱి, అ + ఉ=ఓ, అగును:[9]

---

1. తిరసోఽన్యతరస్యామ్. 2. ఇసుసోస్సామర్థ్యే. 3. అతః కృ, కమి, కంస, కుంభ, పాత్ర, కుశా, కర్ణీష్వనవ్యయస్య. 4. అధశ్శిరసీపదే. 5. అహరాదీనాం పత్యాదిషు వా రేఫః. 6. రో సుపి. 7. రో రి. 8. ఢ్రలోపేపూర్వస్యదీర్ఘోఽణః. 9. విప్రతిషేధే పరం కార్యమ్.

మనస్ + రథము=మనః + రథము = మన + ఉ + రథము=మనోరథము.

## ప్రాకృతమున సంధి.

సంస్కృతమందలి హలంతశబ్దములన్నియుఁ బ్రాకృతమున నజంతము లయినవి. కావున ప్రాకృతమున నచ్సంధి మాత్రమే సిద్ధించుచున్నది. ఈ యచ్సంధియైనను నన్ని విషయములందును సంస్కృతమార్గము ననుసరించి యుండలేదు. ప్రాకృతసంధివిషయమున హేమచంద్రుని వ్యాకరణమునుండి యీ క్రింది సూత్రము లుద్ధరింపఁబడినవి. వాని కాతఁడిచ్చిన యుదాహరణ ములతోఁబాటు ప్రాకృత వాఙ్మయమునుండియుఁ గొన్ని యుదాహరణములు చూపఁబడుచున్నవి.

### 1. పదయోః సంధి ర్వా.

సంస్కృతమునకుఁ జెప్పఁబడిన సంధియంతయుఁ బ్రాకృతమున వైకల్పికముగ నగును: సం. వ్యాస+ఋషిః=వ్యాసర్షిః ; ప్రా. వాస + ఇసీ = వాసేసీ, వాసఇసీ ; ఇట్లే, విసమాయవ్వో, విసమ ఆయవ్వో ; దహసరో, దహి ఈసరో ; సాఊ అయం, సాఉ ఉఅయం ;

### 2. న యువర్ణ స్యాస్వే.

ఇ, ఉ, ల కసవర్ణాచ్చులు పరమైన యెడల సంధి కలుగదు: న వేరివగ్గే వి అవయాసో ; వందామి అజ్జ ; వఇరం.

"దణుఇంద-రుహిర-లిత్తో। సహఇ ఉఇందో నహప్పహావలి అరుణో।
సంఝూ-వహు-అవఊఢో। ణవ-వారిహరో వ్వ విజ్జులా పడిభిన్నో.

### 3. ఏదోతోః స్వరే.

ఏ, ఓ, లకు స్వరము పరమైనచో సంధి కలుగదు:
"వహు ఆఇ నహుల్లిహణే । ఆబంధంతీఎ కంచుఅం అంగే।
మయరద్ధయ-సర-ధోరణి। ధారాఛేఅవ్వ దీసంతి॥"
"అవమానుఅ పజ్జత్తే । భ-కళభ-దంతానహాసమూరుజుఅం ।
తం చేవ మలిఅ బిస-ద। ండ-విరసమాలక్ఖిమో ఏణ్హిం॥'
అహో అచ్ఛరిఅం.

### 4. స్వరస్యోద్వృత్తే.

వ్యంజనముతోఁ గూడిన స్వర మావ్యంజనము లోపింపఁగా మిగులును. అట్లు మిగిలిన యచ్చునకు ఉద్వృత్తాచ్చని పేరు. అట్టి యుద్వృత్తాచ్చునకు స్వరము పరమైనచో సంధి కలుగదు :

గంధ ఉడి ; కఉల ; ణారీఓ ; నిసా-అరో ; నిసి-అరో ; రజణీ-అరో ; మణు అత్తం;—ప్రాకృతమున సర్వకార్యములును బహుళము గనుక, ఒక ప్పుడు సంధి వైకల్పికముగా కావచ్చును.

కుంభఆరో, కుంభారో ; సు-ఉరిసో, సూరిసో.

ఒకప్పుడు సంధి నిత్యముగానగును : సాలాహాణో, చక్కాఓ.

### 5. త్యాదేః.

తిప్పులపై అనఁగా ప్రథమపురుష క్రియలు, మొదలగువానిపై సంధి రాదు : భవతి ఇహ ; హోఇ ఇహ.

### 6. లుక్.

స్వరముకంటె స్వరము పరమగునపుడు పూర్వస్వరము బహుళముగా లోపించును : తిఅస+ఈసో = తిఅసీసో ; నీసాస+ఊసాస = నీసాసూసాసా.

పై దానిని బట్టి సంస్కృత శబ్దములకుఁ గలుగు సంధు లన్నియుఁ బ్రాకృతశబ్దములకుఁ గలుగవని తెలియఁగలదు. సంస్కృతము ననుసరించిన సంధులయినను నియతముగఁ గలుగవు. ప్రాకృతమున మిగిలిన సంస్కృత సంధులను, సంస్కృతసంధి కలుగనప్పుడేర్పడు ప్రాకృతసంధిస్వరూపములు ఈ క్రింద ప్రదర్శింపఁబడుచున్నవి.

### 1. సవర్ణ దీర్ఘసంధి.

(అ) సంధియందు దీర్ఘము కలుగుట కుదాహరణములు :

పల్లవ శాసనము : మహారాజాధిరాజో = మహారాజాధిరాజః ; ఆర ఖాధికతే = ఆరక్షాధికృతాన్ : సహస్సాతిరేక = సహస్రాతిరేక ; వసుధాది పతయే=-తీన్ ; నరాధమో = నరాధమః.

మహారాష్ట్రీ : కఆవరాహ = కృతాపరాధ ; అర్ధమాగధి : కాలా కాల; జైనమహారాష్ట్రి : ఇంగియాకార ; జైనశౌరసేని : సురాసుర ; శౌరసేని : కిలేశానల = క్లేశానల ; మాగధి : యూదిఅలావమాణ = ద్యూతకరావమాన ; అపభ్రంశము : సాసాణల = శ్వాసానల ; మహారాష్ట్రి : పుహవీస = పృథివీశ ; అపభ్రంశము : అంసూసాసహిం = అశ్రూచ్ఛ్వాసైః ; మహారాష్ట్రి : ఈసి+ఈస (-సి=) ఈసీస (-సి).

(ఆ)-దీర్ఘమురానందు కుదాహరణములు :—

మహారాష్ట్రీ : ఉద్ధచ్ఛ = ఊర్ధ్వాక్షు ; కఇంద = కవీంద్ర ; జైనశౌరసేని ; అదిందియత్త = అతీంద్రియత్వ ; అర్ధమాగధి : గుణట్ఠి = గుణార్థిన్ ; జైన మహారాష్ట్రి : రత్తచ్ఛ=రక్తాక్ష ; శౌరసేని ; జమ్మంతరే=జన్మాంతరే : శౌర సేని : అణ్ణగ్గామంతల = అన్యగ్రామాంతర ; పల్లవశాసనము : అగ్గిట్ఠోమ వాజ

పేయస్సమేధయాజీ = అగ్నిష్టోమవాజపేయాశ్వమేధ యాజీ; అర్ధమాగధి: రాయమచ్చ = రాజామాత్య.

(ఇ) సంధి కాకుండ స్వరములు ప్రత్యేకముగా నిలుచుట కుదాహరణములు:

అర్ధమాగధి: సమణ-మాహణ - అఇహి = శ్రమణబ్రాహ్మణాతిథి; పువ్వవిదేహ-అవరవిదేహ = పూర్వవిదేహాపరవిదేహ; సఅంగ = స్వాంగ; సఅర్థ = సార్థ; ఖరవరుస అసిణిద్ధదిత్తఅ ణిట్ఠ అసుభ అప్పియ అకంతవగ్గూహియ = ఖర-పరు-షాస్నిగ్ధ-దీప్త - నిష్ఠా-శు-భా ప్రియ - కాంతవగ్నుభిశ్చ; పుఢవీ-దగ-అగణి = పృథివ్యుదకాగ్ని; ఇందణీల-అయసి-కుసుమ = ఇంద్రనీ-లాతసీ-కుసుమ; మణఅ గుత్తి, కాయఅ గుత్తి = మనోగుప్తి, కాయాగుప్తి; అర్ధమాగధి: సుర అసురా = సురాసురాః; సుర-అసుర-మణుయ-మహియా = సురాసుర మనుజమహితాః; జైనమహారాష్ట్రి: ఎగఅక్ఖర = ఏకాక్షర; అఇరేగ అట్ఠవాస = అతిరేకాష్టవర్ష.

సయల-అత్థమియ - జీవ-లోఅ = సక-లాస్తమిత - జీవ-లోక; జైన శౌరసేని: సవ్వ-అత్థేసు = సర్వార్థేషు; వందణ అత్థం = వందనార్థమ్;

అకిరియఆయ = అక్రియాత్మనః; సేలగ-జక్ఖ-ఆగుహాణ = శైలకయక్షారోహణ.

అర్ధమాగధి: మహాఅడవీ (జైనమహారాష్ట్రి: మహాడవీ); జైనమహారాష్ట్రి: ధమ్మ - కహ - అవసాణ = ధర్మకథావసాన; మహా-అక్కంద = మహాక్రంద.

అర్ధమా. మఈ-ఇద్ధి-గారవ = మత్య-బుద్ధి-గారవ.

అర్ధమా. బహు-ఉజ్ఝియ-ధమ్మియ = బహూజ్ఝితధార్మిక; బహు-ఉదగ = బహూదక; బహు-ఉప్పల = బహూత్పల; దేవకురు - ఉత్తరకురు = దేవకురూత్తరకురు; పవాళ-అంకురఅ = ప్రవాళాంకురక; పిఅ-అధర = ప్రియాధర; ధవల-అంసుఅ = ధవళాంశుక.

## 2. గుణసంధి.

(అ) సంధి కలుగుట కుదాహరణములు:

దిసేభ = దిసా+ఇభ = దిగ్+ఇభ; సందత్తేభమోత్తిఅ = సందష్టేభమౌక్తిక; పంచేసు = పంచేషు = పంచ+ఇషు; కిసోఅరీ = కృశోదరీ; సామోఅఅ = శ్యామోదక: గిరిలులిఓఅహి = గిరిలులితోదధి; అర్ధమా. శౌర. మహేసి = మహా+ఇసి = మహర్షి; మహా. శౌర. రాఏసి = రాఅ+ఇసి=రాజర్షి; సవ్వోఉయ = సవ్వ+ఉఉయ = సర్వ+ఋతుక=సర్వర్తుక; ణిచ్చోఉగ=ణిచ్చ+ఉఉగ = నిత్యఋతుక = నిత్యర్తుక; అణోఉయ = అనృతుక.

(ఆ) సంధి కలుగనందు కుదాహరణములు:

సవ్వ ఊవరిల్ల, సవ్వఉప్పరిల్ల=సర్వోత్పతిత ; పఢమ-సమయ-ఉవసంత= ప్రథమ సమయోపశాంత ; కక్కోల-ఉసీర ; ఆయరియ-ఊవజ్ఝాయ=ఆచార్యో పాధ్యాయ ; హెట్ఠిమ-ఊవరిమ ; వాయ-ఘణ - ఉదహి = వాతఘనోదధి ; కంఠసుత్త-ఊరత్థ = కంఠసూత్రోరస్థ ; అప్ప-ఉదయ = అల్పోదక ; దీవ-దిసా ఉదహీణమ్ = ద్వీప-ది-గుదధీనామ్ ; మహా-ఉదగ = మహోదక ; ఈఈమిగ- ఉసభ = ఈహామృగర్షభ ; ఖగ్గ-ఊసభ = ఖడ్గర్షభ ; జైనమహా. పవయణ- ఉవఘాయగ = ప్రవచనోప ఘాతక; సంజమ-ఉవఘాయ = సంయమోపఘాత; శౌర. వసంత-ఉస్సవ - ఉవాఅణ = వసంతోత్స వోపాయన ; విసజ్జిఅ-ఇసి- దారఅ = విసర్జితర్షి దారక.

(ఇ) సంధియందు పరస్వరము నిలుచుట కుదాహరణములు:

మహా. అప. గఇంద = గజేంద్ర ; అప. గఇందఅ ; శౌర. అప. ణరింద . మాగ. ణలింద = నరేంద్ర; అర్ధమా. శౌర. మాగ. మహింద = మహేంద్ర. అర్ధమా ; జై. శౌర. దేవింద = దేవేంద్ర. అర్ధమా ; జై. మహా ; జై ; శౌర. జిణింద = జినేంద్ర ; అర్ధ. జోయ్సింద = జ్యోతిషేంద్ర ; శౌర; మఇంద = మృగేంద్ర ; జై. మహా. మఇందజాల = మాయేంద్రజాల, అర్ధమా. ఎగిందియ = ఏకేంద్రియ ; అర్ధమా. సోఇందియ, ఘాణిందియ; జబ్భిందియ, ఫాసిందియ = శ్రోత్రేంద్రియ, ఘ్రాణేంద్రియ, జిహ్వేం ద్రియ, స్పర్శేంద్రియ; అప. జిభిందిఅ = జిహ్వేంద్రియ ; మహా. తద్దిఅ సిందు = తద్దివసేందు ; తిఅసీస = త్రిదశేశ ; జై. మహా. రాఈసర = రాజే శ్వర ; శౌర. పవ్వదీసర = పర్వతేశ్వర ; మహా. కణ్ణుప్పల = కర్ణోత్పల ; అర్ధమా ; జై. మహా. నీలుప్పల = నీలోత్పల ; శౌర. ణీలుప్పల ; మాగ. ణహుప్పల = నఖోత్పల ; మహా. ఖందుక్ఖేవ = స్కంధోత్క్షేప ; తామ్రశాస నము : పాతుక్ఖేవ = పాదోత్క్షేప ; అర్ధమా. గంధుద్ధుయ ; అప. గంధుద్ధుఅ = గంధోద్ధుత ; జై. మహా. రయణుజ్జల = రత్నోజ్జ్వల ; శౌర. మందమారు దువ్వెల్లిద = మందమారుతోద్వేలిత ; పవ్వదుమ్మొలిద = పర్వతోన్మాలిత ; మాగ. శవ్వుయ్యాణ = సర్వోద్యాన ; మహా. కఊసాస = కృతోచ్ఛ్వాస ; లీఢూస = లీఢోష ; గమణూసుఅ = గమనోత్సుక ; అర్ధమా. ఏగూణ = ఏకోన ; పంచూణ = పంచోన ; దేసూణ ; భాగూణ ; కోసూణ ; మహా. గామూసవ = గ్రామోత్సవ ; మహా ; జై. మహా ; శౌర. మహూసవ = మహోత్సవ ; శౌర. వసంతూసవ = వసంతోత్సవ ; అర్ధమా. ఉత్తమిడ్ఢి = ఉత్తమ + ఇడ్ఢి = ఉత్తమ + బుద్ధి = ఉత్తమర్ద్ధి ; దేవిడ్ఢి ; మహిడ్ఢి ; మహి

ద్ధియ; జై. మహా. విశేసువఓగో = విశేషోపయోగ; ఆవంతీ: అద్ధుఇఅ = అర్ధోదిత.

### 3. వృద్ధి సంధి.

ప్రాకృతమున వృద్ధిసంధి కానేకాదు, పరరూపసంధియే యగును. ఉదాహరణములు:

(అ) గామేణి = గ్రామ + ఏణి; మహా. ణవేలా = నవ + ఏలా; ఫుల్లేలా = ఫుల్ల + ఏలా; ఉక్కండి ఎక్కపాస = ఉత్కండితైకపార్శ్వ; శౌర. అవలంబిదేరావణహత్థ = అవలంబితైరావణహస్త; శిలాదలెక్కదేస = శిలాతలైకదేశ; కరుణెక్కమణ = కరుణైకమనస్; మహా. కుసుమొత్థఅ = కుసుమావస్తృత; పఢమోసరిఅ = పఢమ + ఓసరిఅ = ప్రథమాపసృత; బాహోమట్ఠ = బాహ + ఓమట్ఠ = బాష్పావమృష్ట; జలోలి = జల + ఓలి = జలావలి; వణోలి = వణ + ఓలి = వనావలి; పహోలి = పహా + ఓలి = ప్రభావలి; అర్ధమా; జై. మహా. ఉదఒల్ల = ఉదఅ + ఒల్ల = ఉదక + ఒల్ల = * ఉద్ర; అర్ధమా. ఉదఉల్ల = ఉదఅ + ఉల్ల = ఉదక + ఉల్ల; అర్ధమా. వాసేణొల్ల = వాసేణ + ఒల్ల = వర్షేణ + ఒల్ల; అర్ధమా. మాలోహడ = మాలా + ఓహడ = మాలా + అవహృత; మట్టిఓలిత్త = మట్టిఆ + ఓలిత్త = మృత్తికా + అవలిప్త; జై. మహా. జలోహ = జల + ఓహ = జలౌఘ; సంఠాణోసప్పిణి = సంఠాన + ఓసప్పిణి = సంస్థాన + అవసర్పిణి; శౌర. గుడోదన = గుడౌదన; వసంతోదార = వసంత + ఓదార = వసంతావతార; కరరుహోరంప = కరరుహ + ఓరంప.

(ఆ) పరరూప సంధి కానప్పుడు రెండచ్చులును ప్రత్యేకముగ నిలుచును. ఉదాహరణములు: మహా. వాఅందోలణ - ఓణవిఆ = వాతాందోలనావనమిత; అర్ధమా. ఖుడ్డగ - ఏగావలి = క్షుద్రకైకావలి; విప్పహాఇయ - ఓలంబ = విప్రహాజితావలంబ; జై. మహా. సభా - ఓవాస = సభావకాశ.

### 4. యణాదేశ సంధి.

ప్రాకృతమున యణాదేశసంధి రాదు. సంస్కృతములోనే సంధి గలిగి ప్రాకృతమున మాఱిన రూపములు వివిధ వికారములతోఁ గనఁబడును. ఉదాహరణములు:

(అ) అచ్చులు ప్రత్యేకముగా నిలుచుటకు:

మహా. ణహప్పహావలి అరుణ = నఖప్రభావల్యరుణ; రత్తిఅంధఅ = రాత్ర్యంధక; సంఝా - వహూ - అవఊఢ = సంధ్యావధ్వవగూఢ; అర్ధమా

'కావర' శబ్దమునకు రూపాంతరము. ఇదియు దేశ్యము కాదు. కావలము = పాపము, అని శ. ర. కారుఁడు వ్రాయుటయు సరికాదు.

"దేవపూజలఁ బొలివ్రోని - కావలంబు, బ్రాహ్మణోపాస్తిఁ బొలివ్రోని పాపచయము, నచ్యుతానంత గోవింద - హరిమురారి, యని తలంచిన యప్పుడ యడఁగిపోవు" విష్ణుపురాణము. 3-ఆ.

ఇందు 'కావల' శబ్దమునకు భీరుత్వమనియే యర్థము చెప్పవలెను.

సం. రాజన్ = ప్రా. రాజ = రాఅ = రాయ(చ) = హిందీ. రావ్, రాయ్ ; తెనుఁగు : రావు, రాయ.

సం. సూచికా = ప్రా. సూజిగా (సూదిఆ) = సూఇఆ = సూయిఆ = హిందీ : సూయీా, సూవీ ; తెనుఁగు : సూది.

సం. భేద = ప్రా. భేఅ = ప్రాచీన హిందీ. భేవ. చూ. తెనుఁగు : బెవడు, బెగడు, బెంగ మొదలైనవి.

తెనుఁగున 'పమిడి, పవిఁడి, పయిఁడి ; పోవు, క్త్వా. పోయి ; అవు, క్త్వా. అయి ; బావి, వ్యవహారము 'బాయి' ; ఆవిరి, వ్యవహారమున 'ఆయిరి' ; మొదలగువానియందు వకారము యకారముగాఁ గాని, యకారము వకారముగాఁ గాని మారుటవలన నేర్పడలేదు. ఉద్వృత్తాచ్చుల మధ్య వచ్చిన య, వల మూలమున నా భేదములు గలిగినవి.

(2) ఉద్వృత్తాచ్చులు రెండును గలిసి "ద్విత్వాంగు" లగుట (dip-thongs): ఇట్టి మార్పు అశోకుని శాసనములందు కానఁబడుచున్నది; స్థవిర = థఇర = థైర ; త్రయోదశ = త్రఇదస = త్రైదస ; మయూర = మఊర = మఉర = మౌర = మోర ; త్రయోదశ = తఏదస = తేదస ; ఉజ్జయినీ = ఉజ్జేనీ. ఇట్టి మార్పుల మూలముననే సంస్కృతమందలి ఐ, అయ, లు ఏ గను, ఔ, అవ, లు ఓ గను మాఱినవి. ప్రాకృతభాషాపరిణామమునఁగూడ నిట్టి మార్పులు కలిగెను :

సం. కదల = * కదిల = * కఇల = * కైల = కేల = హిందీ : కేలా; తెనుఁగు : చక్కరకేళి (అరఁటిపండు.)

సం. చతుర్ = ప్రా. చఉ = చౌ = చో ; సం. స్థవిర = ప్రా. థవిర = థఇర = థైర = థేర ; సం. బదర = బదుర = బఉర = బౌర = బోర ; బంగాళీ ; బోర్ మొదలైనవి.

(3) ఉద్వృత్తాచ్చులకు సంధి కలుగుట : ఉదాహరణములు :

సం. కుంభకార = ప్రా. కుంభ ఆర = కుంభార = కుంభర = కుమ్మర.

సం. ఆర్యవాట = ప్రా. అజ్జ ఆడ = తెనుఁగు : అజ్జాడ.

సం. ఉపాధ్యాయ = ప్రా. ఉఅజ్ఝాఅ = ఓఝ = తెనుఁగు : ఒజ్జ ; ఇంటిపేరు : వజ్ఝల.

సం. మల్లవాటి = ప్రా. మల్లఆడి (-ది) = తెనుఁగు. మల్లాది ; ఇట్లే ఒడ్డాది, మండాది మొదలైనవి.

ఉద్వృత్తాచ్చు లొకటి కొకటి పరమైనప్పు డిట్టి మార్పులు కలుగుట చేతనే, తొంటి రూపములు నేఁటి యార్యభాషలయందు మఱుఁగుపడియున్నవి. అదేరీతిగ ద్రావిడభాషలయందును జరిగినది. ఈ మార్పులను గుఱియుం దుంచికొని తెనుఁగు పదముల వ్యుత్పత్తుల నాలోచించినచో నూటికి డెబ్బది వంతునకైనను శబ్దరత్నాకరమున దేశ్యములుగ గుర్తింపఁబడిన పదములు వైకృతములే యని నిర్ణయింపవచ్చును.

**నేఁటి యుత్తరహిందూస్థాన భాషలయందు సంధి.**

నేఁటి యుత్తర హిందూస్థాన భాషలలో ననేకములందు సంస్కృత ప్రాకృత శబ్దముల యంతమందు గల యచ్చులు లోపించుటచే నవి సాధారణముగ హలంతములుగ నిలిచినవి. అ, ఇ, ఉ, అను నచ్చులు కొన్నియెడలఁ బదాంతములందు వినవచ్చినను నవి యతిబలహీనములై తొలఁగిపోవుచుండును. వానికచ్చుపరమైనయెడల పూర్వాచ్చుపోయి, పరమందున్న యచ్చు మాత్రము నిలిచి, పరరూపసంధి కలుగుచుండును. సింధీ, లహాండా భాషలు మాత్రమింకను నజంతములుగ నిలిచి యున్నను, వీని యందును బరరూప సంధియే కానవచ్చుచున్నది. నేఁటి యార్యభాషలయం దెల్ల నిట్టిసంధియే కలదు. సంస్కృతమందలి హల్సంధియు నేఁటి యార్యభాషలయందు లేదు.

**ద్రావిడ భాషలలో సంధి.**

పై రీతిగా సంస్కృతమం దనేకవిధములుగాఁ గనఁబడు చుండిన సంధి విధానమంతయు ప్రాకృతములందే (1) అచ్చులు ప్రత్యేకముగా నిలిచి వాని మధ్యమున నొక యాగమాక్షరము చేరుట (2) పరరూపసంధి గలుగుట, అను రెండు విధానములు మాత్రమే నిలిచినవి. నేఁటి యార్యభాషల యందును నదే విధాన మనుసరింపఁబడుచున్నది. ద్రావిడభాషలలోని సంధి కూడ నార్యభాషా సంప్రదాయానురోధియే కాని వేఱుగాదు.

ప్రకృతిభావనివారణమను శీర్షికక్రింద నీ విషయమై యింతకుముం దీ గ్రంథమున వివరింపఁబడియున్నది. ప్రకృతిభావమును నివారించుటకు ద్రావిడభాషలందు ఇండోయూరోపియను భాషలలోని సంప్రదాయమే యనుసరింపఁబడుచున్నదని కాల్డువెల్లు వ్రాయుచు నాయా పోలికలను వివ

రించి యున్నాఁడు. ఆతని కీ విషయమున సిద్ధియను భాషాసంప్రదాయము కనఁబడ లేదు.

కాల్డువెల్లి సంధి విషయమునసైనను ఇండో-యూరోపియను భాషల తోడి పోలికలను గుర్తించుట యాతని తత్త్వదృష్టిని వెల్లడించుచున్నది. కాని, ఆతనివలె నీపోలికలకొఱకు జెండు, గ్రీకు, లాటిను భాషలవంకకు మనము పరుగిడనక్కఱ లేదు. అంతకంటె సమీపమున నేయున్న ప్రాకృత భాషలయందును ప్రకృతిభావనివారణమునకు 'వ,య,'లు చేరుచుండుటను మనము గమనించితిమి. 'వ'అనునది 'మ'గను, 'మ'అనునది 'న'గను మాఱుట ద్రావిడభాషలయందు సహజమే. కావున, వ, మ, న, లోకవంకను యకార మొకవంకను ప్రకృతిభావనివారణమున ద్రావిడ భాషలయం దుపయోగపడు చున్నది. మళయాళములో ఇకారముతో పదములు కనఁబడుచుండుటచేత నకారము ఇకారముగాను, ఇకారము యకారముగాను మాఱినవని కాల్డువె ల్లభిప్రాయపడినాఁడు. కొన్ని సందర్భములలో నకారమునకు బదులుగ ఇకారము మళయాళమునఁ గనఁబడుచున్నను, ఇకార మెన్నఁడైనఁ బ్రకృతి భావనివారణమున నుపయోగపడినట్లు మనకుఁ దెలియదు. కావున ఇకా రము యకారముగ మాఱినదనియు, మ, న, వ, ఇ, య, లన్నియు నేక వర్ణపు వికారములే యనియుఁ జెప్పుట సరికానట్లుతోఁచుచున్నది.

### తమిళమున సంధి.

తమిళమున సంధికి 'పుణర్చ్చి' అని పేరు. అది నాలుగువిధములుగా నుండును :—

1. హలంత శబ్దము తుదిహల్లునకుఁ బరమందున్న యచ్చు చేరును. ఇట్టి సంధికి 'ఇయల్బు ప్పుణర్చ్చి' యని పేరు. ఇదిసంస్కృతములోని 'ఫలమ్+ అత్ర = ఫలమత్ర' అను దానిలోని సంధి వంటిది. ఉదా. నిలమ్+ఇరుక్కి- ఱదు = నిలమిరుక్కిఱదు మొదలైనవి.

2. రెండు పదములు సంధియందు గలియునప్పుడు పూర్వవర్ణమునకుఁ గాని, పరవర్ణమునకుఁగాని వికారములు కలుగ వచ్చును. దీనికి 'వికారప్పుణ ర్చ్చి' అని పేరు. ఈ వికారము మూఁడు విధములుగా నుండవచ్చును: (i) 'తోన్ఱల్' లేక ఆగమాక్షరములు చేరుట (ఆగమసంధి) ; (ii) 'తిరిదల్' లేక ఒక వర్ణమునకు మఱియొకవర్ణ మాదేశ మగుట (ఆదేశసంధి); (iii) 'కెడుదల్' ఒక వర్ణముగాని, వర్ణములుగాని లోపించుట (లోపసంధి).

ఈ మూఁడు విధములఁ గాక మఱి యొక విధముగఁ గూడ సంధి కావ చ్చును. (బహుళ సంధి.)

## I. ఆగమ సంధి.

ఈ సందర్భమున రెండు విషయములను జ్ఞప్తియం దుంచుకొనవలెను. (i) రెండచ్చులు చేరియున్నప్పుడు వానికిఁ బ్రకృతిభావము కలుగదు. (ii) షష్ఠీతత్పురుష సమాసమునఁ బూర్వపదము తుది యచ్చునకుఁ బరమందుండు క, చ, త, ప లకు ద్విత్వము కలుగును. పూర్వ పరపదములకుఁ గేవల విశేషణ విశేష్య సంబంధమున్నను, పూర్వపదమున వర్ణలోపము గలిగినను నీద్విత్వము కలుగదు.

### కొన్నియాగమ సంధి సూత్రములు.

(1) ఏకాజ్విశిష్ట హలంతపదమందలి యచ్చు హ్రస్వమై దానికి మఱియొక పదము తొలియచ్చు పరమైనచో పూర్వపదాంత్యహల్లునకు ద్విత్వము కలుగును. ఈ సంధి సంస్కృతములోని 'సన్నచ్యుతః' మొదలగు వానిని పోలినది. ఇట్లే తెలుఁగున 'దివ్యశక్తిన్నరుడుగ, రెండున్నర, అన్నిష్టసఖ' మొదలగు సంధి రూపము లేర్పడుచుండును.

ఉదా. మణ్+అరిదు = మణ్ణరిదు ; పొన్+అరుమై = పొన్నరుమై ; మొదలైనవి.

(2) పూర్వపదాంత్యాచ్చునకు మఱియొకపదము తొలియచ్చు పరమగునప్పుడు ప్రకృతి భావమును నివారించుటకు 'య'గాని 'వ'గాని యాగమముగా వచ్చును. ద్రావిడభాషలయందెల్ల నీ 'య,వ' వర్ణము లాగమాక్షరములుగ నున్నవి. కొన్ని ద్రావిడ భాషలలో నితర వర్ణములును నాగమములుగ రావచ్చును. సంస్కృతమునందలి యణాదేశ సంధికిఁ బ్రాకృతమున గలిగిన పరిణామ మీసందర్భమున స్మరింపఁ దగినది.

(అ) ఇ, ఈ, ఐ,లకచ్చు పరమగుచో యడాగమ మగును : ఉదా. ఇని+ఉణ్ణు = ఇనియుణ్ణు. తీ+ఎరియుమ్ = తీయెరియుమ్ ; కై +ఐ = కైయై మొదలైనవి.

(ఆ) ఎ, ఏ, ల కచ్చు పరమగుచో 'య'గాని 'వ'గాని యాగమముగ రావచ్చును : ఉదా. అరశనే+అవన్ = అరశనేయవన్.

(ఇ) తక్కిన యచ్చుల కచ్చు పరమగు నప్పుడు 'వ'కారము మాత్రమాగమ మగును : ఉదా. అదు+ఏ = అదువే; వర+ఇల్లై = వరవిల్లై, మొదలైనవి.

(3) నిర్దిష్టార్థక విశేషణములగు అ, ఇ, ఉ, లకుఁ గాని ప్రశ్నార్థకమగు 'ఎ'కారమునకుఁగాని హల్లుపరమైనచో నాహల్లునకు ద్విత్వము కలుగును. ఉదా. అ+మనిదన్ = అమ్మనిదన్ ; ఇ+వీడు = ఇవ్వీడు ; ఎ+వగై = ఎవ్వగై, మొదలైనవి.

పై వానికచ్చు పరమగునపు డాగమముగావచ్చిన యకారమునకో వకారమునకో ద్విత్వము కలుగును. ఉదా. అ+ఇరుమ్బు = అయ్యిరుమ్బు; ఇ+ఊర్ = ఇవ్వూర్ మొదలైనవి.

అ, ఇ, ఉ,ల రూపముతో నిర్దిష్టార్థక విశేషణములును, 'ఎ' అను రూపముతో ప్రశ్నార్థక విశేషణమును సంస్కృత ప్రాకృతములందు లేకుండుటచే నిట్టి సంధి కాభాషలలోఁ బ్రసక్తి లేదు. కాని, సంస్కృతమున 'ఆ+ఛలమ్= ఆచ్ఛలమ్' మొదలగు సంధి రూపము లీసందర్భమున స్మర్తవ్యములు.

తెనుఁగున 'త్రికంబు మీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వము బహుళంబుగానగు; ద్విరుక్తంబగుహల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు ' ననుసూత్రములందు పై విషయమే వివరింపఁబడి యున్నది.

(4) అచ్చుపకుఁ బరమందున్న క, చ, త, ప, లకు ద్విత్వముగలుగును. ఉదా. మట్టి + కారియమ్ = మట్టిక్కారియమ్; ఇన్ద + శత్తమ్ = ఇన్దచ్చత్తమ్, మొదలైనవి. ఈ సూత్రము సర్వత్ర వర్తింపదు:

I. ప్రశ్నార్థ కావధారణార్థక శబ్దములపై ద్విత్వముకలుగదు: ఉదా. అవనా కొడుత్తాన్; అవనే కొడుత్తాన్.

II. సంబోధన ప్రథమారూపముపై ద్విత్వము కలుగదు: ఉదా.అణ్ణా! కొడుమ్.

III. సంపూర్ణ క్రియా పదముమీఁదను ద్విత్వము కలుగదు: ఉదా. శెన్దై తమ్బి!

IV. సంబంధార్థక క్రియాజన్య విశేషణముపై ద్విత్వముకలుగదు: ఉదా. ఓడినకుదిరై.

V. విశేషణముగ వాడఁబడు ధాతురూపముపై ద్విత్వము కలుగదు: ఉదా. ఆడు కాల్.

VI. సర్వనామముపై ద్విత్వముకలుగదు: ఉదా. అదు పెరిదు.

VII. విశేష్యముల విభక్తి రూపములపై ద్విత్వము కలుగదు: ఉదా. అవనోడు పో; ఎనదు తలై.-ఈ విషయమున సాధారణముగ ద్విత్వీకరణమొక మార్గము ననుసరించిలేదు. అందును బూర్వపరపదములలో నొకటిగాని రెండుగాని సంస్కృత శబ్దములగుచో ననేకవిధములుగ నీ సంధికార్యము కలుగుచుండును. కాని, పూర్వపదము పరపదమునకు సంబంధార్థమున వచ్చినపుడు పూర్వపదాంత్యవర్ణమునకు లోపము కలిగినపుడును బరమందుండు క, చ, ప, త లు ద్విత్వము నందుచుండునని సామాన్యముగఁ జెప్పవచ్చును.

(5) య, ర, ఴ, లకు పరమగు క, చ, త, ప, లు సాధారణముగ ద్విత్వము నందుచుండును: ఉదా. పొయ్ + చెల్వమ్=పొయ్చ్చెల్వమ్; నీర్ + కుమిఴి = నీర్క్కుమిఴి మొదలైనవి.

(6) ఏకాజ్విశిష్టపదముల తుదినుండు య, ఐ, లకు పరముగవచ్చు ఞ, మ, న, లకు తఱచుగ ద్విత్వముకలుగును: ఉదా. మెయ్ + ఞానమ్ = మెయ్ఞ్ఞానమ్. తెనుఁగున నిట్టి ద్విత్వముకలుగదు. సరళాదిపదము పరమైనచో నొకప్పుడు సరళవర్ణమునకుఁ బరుషవర్ణ మాదేశమగుచుండును.

II. ఆదేశ సంధి.

(1) పదాంత మందలి మకారమునకు క, చ, త, లు పరమగుచో మకారమునకు ఙ, ఞ, న, లు వరుసగా నాదేశమగును: ఉదా. ఎమ్+కళ్ = ఎఙ్గళ్; పావమ్ + శెయ్దేన్ = పావఞ్జెయ్దేన్; పణమ్ + తన్దాన్ = పణన్దన్దాన్ మొదలైనవి.

తెనుఁగున నిట్టిమార్పు ద్రుతమునకుఁ గలుగుచుండును. ద్రుతము పూర్ణబిందువుగా మాఱునప్పు డాబిందువునకుఁ బరమందుండు వర్గీయహల్లునకు సంబంధించిన యనునాసికధ్వని కలుగుచుండును. తళుకుంగజ్జెలు, పెంజెఱువు, బెళుకుండెక్కలు, చేయందొడరు, ఇహముంబరమున్ - మొదలగు నుదాహరణములఁ బూర్ణబిందువు ననునాసికధ్వనులను గమనింప వచ్చును.

(2) తమిళమున ణ, ళ, కారములకు క, చ, త, ప, లు పరమగుచో ణ, ళ, లకు 'ట' కార మాదేశమగును: ఉదా. ఉళ్ + పిరవేశిత్తాన్ = ఉట్పిరవేశిత్తాన్; నాళ్ + తోఱుమ్ = నాడోఱుమ్ (ఇచట 'త' కారమునకు లోపము కూడఁ గలిగినది.)

(3) నకార లకారములకు క, చ, త, ప లుపరమగుచో న, ల, ల స్థానమున 'ఱ' కారమువచ్చును: ఉదా. పొన్ + శాడి = పొఱ్శాడి; పొన్ + తగడు = పొఱ్ఱగడు (ఇచట తకారముగూడ వికారము నొందినది); కల్+ కూడమ్ = కఱ్గూడమ్; కడల్ + తిరై = కడఱ్ఱిరై (ఇచట తకారము శకటరేఫముగ మాఱినది. ద్విత్వ శకటరేఫమునకు 'ట్ర' లేక 'త్ర' అనునుచ్చారణము కలుగును.)

ప్రాచీన తమిళ వాఙ్మయమున నిట్టిమెడల ఆయ్దమ్ (ஃ) కూడ చేరుచుండును. కొన్నిమెడల ఆయ్దము శకటరేఫ స్థానమునఁ జేరును.

(4) ల, ళ, లకు నకార మకారములు పరమగుచో నవి వరుసగ న, ణ లుగ మాఱును. 'ళ' కు 'ణ' ఆదేశమగునపుడు న, మ లుగూడ ణకారములగును. లేదా, నకారము లోపించును. మకారము లోపింపదు:—ఉదా.

నల్ + నూల్ = నన్నూల్; అరుళ్ + నాదన్ = అరుణాదన్; కల్ + మలై = కన్మలై; ముళ్ + ముడి = ముణ్ముడి, మొద.

(౫) ణ కుఁ బరమందు వచ్చిన నకారము ణకారముగ మాఱును. నకారమునకుఁ బరమగుచో వట్లే నిలుచును. ఉదా. కణ్ + నీర్ = కణ్ణీర్. తన్ + నలమ్ = తన్నలమ్. ఒకప్పుడు ద్విత్వహల్లున నొకహల్లు లోపించును;

## III. లోపసంధి.

(1) మొదటి యచ్చు హ్రస్వమగు ద్వివర్ణయుతపదములందుతప్ప తక్కిన పదముల తుదినుండు ఉకారమునకు 'కుట్రియలుగర', మనిపేరు. దీనిపై నచ్చు పరమగునపు డాయుకారము లోపించును. ఉదా. మాడు + ఉణ్డు = మాడుణ్డు. కాని, పశు + ఉణ్డు = పశువుణ్డు ('పశుణ్డు' అనికాదు). కొన్ని యెడల ద్వివర్ణాత్మకములై తొలుత హ్రస్వముగల యుకారాంతపదములపై నచ్చుపరమగుచో నొకప్పు డా తుది యుకారమునకు లోపము కలుగవచ్చును. ఉదా. ఇదు + ఎన్న = ఇదెన్న.

తెనుఁగున నుత్వసంధి నిత్యము. తమిళమున నాగమముగావచ్చు 'వ' కారము తెనుఁగున శబ్దగతమై విభక్తి ప్రత్యయ మగుచున్నది. తమి. పశు; తెనుఁగు: పశువు మొద.

(2) మకారమునకు మకార నకారములు పరమగుచో పూర్వ మకార మునకు సాధారణముగ లోపము కలుగును. ఉదా. కాలమ్ + మాఱుమ్ = కాలమాఱుమ్; నామమ్ + నల్లదు = నామనల్లదు (ఇట్టిలోపము కావ్యము లందు మాత్రము కాన్పించును).

తెనుఁగున పద్యాదులు పరమగునపుడు ముపర్ణకమునకు లోప పూర్ణ బిందువులు విభాషనగును. పద్యాదులనుటచే నన్నియెడలను నీలోపము కలుగదు. భయపడు, భయపెట్టు, అని యగునుకాని 'భయచెందు' అని కాదు. అట్లే కర్తృవాచి ముపర్ణకమునకుఁ దెనుగున లోపముకలుగదు. 'గజము వడియె' అని యగును కాని, 'గజపడియె' అని కాదు.

## IV. ప్రకీర్ణక సంధి, శేక బహుళసంధి.

తమిళమున సంధివశమునఁ గలుగు మార్పులనన్నిటి నిచట వివరింప వీలులేదు. రెండు విషయములను మాత్రము తెలిపి తృప్తిపడవలసి యున్నది.

(1) సమాసమునందు సూత్రీకరింపవీలులేని కొన్ని మార్పులు కలుగును. పనై + కాడు = పనంగాడు. ఇచట ఐత్వమున కనునాసికవర్ణ మాదేశ ముగ వచ్చినది.

(2) కొన్నియెడల పదగత వర్ణములు లోపించును. ఉదా. తిరువుళ్ళమ్, తిరువుళమ్ ; ఇల్లాదవన్, ఇల్లాన్, ఇలాన్ (ఇట్టి లోపము కావ్యభాషయందు తఱచుగఁ గాన్పించును).

**మళయాళమున సంధి.**

మళయాళమున సంధి, స్వరసంధి యనియు వ్యంజనసంధి యనియు, రెండువిధములు. స్వరసంధి ఆగమసంధి లోపసంధియని రెండువిధములు. ఆగమసంధియందు సాధారణముగ య, వ అను వ్యంజనములు చేరుచుండును.

వకారాగమమున కుదాహరణములు: పల + అణ్డుం=పలవాణ్డుం ; అ + ఇడం = అవిడం; చెద్ద+ఆరై = చెద్దవారై.

యకారాగమమున కుదాహరణములు: అల్ల + ఓ=అల్లయో ; వన్న+ ఆళ్ = వన్నయాళ్ మొదలైనవి.

అకార లోపమునకు: ఇల్ల + ఏదుం = ఇల్లేదుం ; వెణ్ణకట్ట + ఉణ్ణి=వెణ్ణకట్టుణ్ణి మొదలైనవి.

యకారాగమము తాలవ్యాచ్చులపై స్వరము పరమగునపుడు కలుగును: వటి + అరికె = వటియరికె ; తీ + ఇతు=తీయితు ; తల + ఓడు=తలయోడు; కై + ఉట్టు = కైయుట్టు మొదలైనవి.

వకారాగమ మోష్ఠ్యస్వరములపై స్వరముపరమగునపుడు కలుగును: తెరు + ఉం = తెరువుం ; పోగున్ను + ఓ = పోగున్నువో ; పూ + ఆడ = పూవాడ ; కో +ఇల్=కోవిల్ మొదలైనవి. కాని, ఉండో + ఎన్ను=ఉండోయెన్ను మొదలైనవి.

ఆకారముపై వకారి మాగమమగును: వా + ఎన్ను = వావెన్ను ; వృథా + ఆక్కి = వృథావాక్కి; ఈ కాలమున నిట్టి సందర్భములందు యకారముగూడ నాగమముగా వచ్చును: ఒల్లా + ఇతు = ఒల్లాయితు ; భక్త్యా + అవన్ = భక్త్యాయవన్ మొదలైనవి.

సంధియందు నిత్యముగ లోపించు స్వరమున 'కరయుకార' మని పేరు. ఎనిక్కు + అల్ల = ఎనిక్కల్ల ; కణ్ణు + ఎడుత్తు = కణ్ణెడుత్తు మొదలైనవి. కాని, 'అతు' అనునది 'అతువుం' అగును. ఈ రెండురూపములును సాధువులె.

**వ్యంజన సంధి.**

వ్యంజన సంధియందు లోప, ఆదేశ, ద్విత్వములు కలుగుచుండును.

లోపము: వళం + ఆక్కుక = వళాక్కుక ; భిన్నం + భిన్నమాయ్ = భిన్నభిన్నమాయ్ ; చెయ్యు + వేణం = చెయ్యేణం ; అజ్జు + నిన్ను = అజ్జున్ను ; చెయ్యాదె + కణ్ణు = చెయ్యాణ్ణు ; కీటు + పెట్టు = కీటోట్టు మొదలైనవి.

ఆదేశము:—ఒకవ్యంజనమునకు మఱియొక వ్యంజనము పరమగునపుడు వ్యంజనాదేశము కలుగును. ఈ యాదేశము సాధారణముగ ననునాసికాక్షరములపైఁ గలుగుచుండును. ఉదా. మణ్ + చిర = మంజిర ; అలిన్ + కీఴు = అలింగీఴు ; ఎన్ + పోట్టి = ఎంబోట్టి ; వరుమ్ + తోరుమ్ = వరున్దోరుమ్ ; చాగుమ్ + నేరం = చాగున్నేరమ్ ; పెరుం + కోవిల్ = పెరుంగోవిల్ మొదలైనవి. అనునాసికేతరాక్షరముల కాదేశము క్వాచిత్కముగాఁ గనఁబడుచున్నది. ఉదా. ఎణ్ + దిశ = ఎణ్డిశ ; విణ్ + తలమ్ = విణ్డలమ్ ; మున్ + కాట్చు = ముల్కాట్చు ; పిణ్ + పాడు = పిల్పాడు ; నెల్ + మణి = నెన్మణి ; ఉళ్ + మోహమ్ = ఉన్మోహమ్.

ద్విత్వము: తాలవ్యహ్రస్వాంతములకును, దీర్ఘస్వరములకును పదములతుది ఉకారములకును, నొక యక్షరము పరమగునప్పుడు ద్విత్వము తఱచుగనగును: తీ + పట్టి = తీప్పట్టి ; పిలా + కీఴు = పిలాక్కీఴు ; పుల్లి + పులి + తోల్ = పుల్లిప్పులిత్తోళ్ ; పుదు + చోల్ = పుదుచ్చోల్ ; పోర్ + కళం = పోర్క్కళం ; పట + జనం = పటజ్జనం : వట్ట + శరం = వట్టశ్శరం.

ఏకస్వర యుక్తమగు హలంత శబ్దముపై స్వరము పరమగుచో ద్విత్వమగును: ఉదా. కణ్ + ఇల్ల = కణ్ణిల్ల ; మొదలైనవి.

ద్విత్వమునకు లోపముగలిగి సమాసములందు ప్రయోగింపఁబడును: ఉదా. మణల్ + తిట్ట = మణత్తిట, మణత్తిట్ట ; కడల్ + పురం + కడల్ పురం, కడప్పురం ; మక్కళ్ + తాయం = మక్కళ్తాయం, మక్కత్తాయం=

## కన్నడమున సంధి.

### 1. స్వరసంధి.

(1) అ, ఇ, ఉ, ఎ, లకు స్వరము పరమగునపుడు సంధితఱచుగ నగును: ఉదా. అచ్చు + ఆనె = అచ్చానె ; దాటి + ఇట్టం = దాటిట్టం ; నుత్తు + ఓవె = నుత్తోవె ; సేసె + ఇక్కిదం = సేసిక్కిదం.

నామరూఢిచెడుచో నట్లు స్వరసంధి చేయఁగూడదు: పటు + ఏక వాక్యం = పటువేకవాక్యం ('పటేకవాక్యం' అనికాదు.) ; విధు + ఇదు = విధువిదు ('విధిదు' అనికాదు.) ; కుడు + ఇల్ల = కుడువిల్ల ('కుడిల్ల' అనికాదు).

(2) ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఐ, ఓ లకు స్వరము పరమగునపుడును షష్ఠీవిభక్తియందు వచ్చు అకారముపై అవధారణార్థక ఎకారము పరమగు

నపుడును యడాగమమగును: ఉదా. ఆ + ఇర్ద = ఆయిర్ద; కవి + అర్ = కవియార్ ; స్త్రీ + ఎంబ = స్త్రీయెంబ ; పసె ఇర్దం = పసెయిర్దం ; ఉఘే+ఎందు=ఉఘేయెందు ; జో + ఎందు=జోయెందు ; ఆతన + ఎ = ఆతనయె ; మొదలైనవి.

(3) పదమునకు ఇకార మాదియందుగల ప్రత్యయము పరమగునపుడును అకారాంత ధ్వన్యనుకరణశబ్దముల కచ్చుపరమగునపుడును యడాగమమగును: ఉదా. శుద్ధ + ఇసిదం = శుద్ధయిసిదం ; నిర్ణ + ఇసిదం = నిర్ణయిసిదం ; ఒర + ఇసిదం = ఒరయిసిదం ; మేళ + ఇసిదం = మేళయిసిదం ; పటపట + ఎందు = పటపటయెందు, మొదలైనవి.

(4) ఉ, ఊ, ఋ, ౠ, ఓ, ఔ, ల కచ్చుపరమగుచో నారెండచ్చులకును నడుమ వకార మాగమముగా వచ్చును. కన్నడపదముల కిట్టిసందర్భములందు వచ్చు నాగమవర్ణము వకారముగాక యకారముగూడ కావచ్చును ; కాని,పైయచ్చు లంతమందుగల సంస్కృత పదములపై 'వ'కారము మాత్ర మాగమముగా వచ్చును: ఉదా. విభు+ఇళెయొళ్ = విభువిళెయొళ్ ; కర్తృ+ఆద=కర్తృవాద ; ౠ+ఇత్తం = ౠవిత్తం ; గో + అం = గోవం ; గ్లౌ + అం = గ్లౌవం మొదలైనవి.

ఇ, ఈ లకు ఇ, ఈ లుపరమగు నప్పుడును వ - కారమాగమము కావచ్చును: ఉదా. ఈ + ఇదు = ఈవిదు ; ఈ + ఇవు = ఈవివు ; (ఇ + ఇదు = 'ఇవిదు' కూడఁ గావచ్చును.)

కన్నడపదములపై నాగమ య, వ లకు బహుళముగ లోపము కలుగును: ఒత్తె + ఇట్టం = ఒత్తిట్టం ; ఒత్తెయిట్టం ; మాతు + ఎల్లం = మాతెల్లం, మాతువెల్లం ; సొవడు + ఒందు = సొవడొందు, సొవడువొందు మొదలైనవి.

(5) ప్లుతోచ్చారణమునందును ఎ, ఏ, ఒ, ఓ, లు నిపాతములగు నప్పుడును, అవధారణ, విశంకార్థము లందును, ఎ, ఏ, ఒ, ఓ, ల కచ్చు పరమగునపు డట్టివర్ణములు నాగమములు కావు. పూర్వపరాచ్చులు ప్రకృతి భావముననిలుచును: ఉదా. నిపాతము: ఎలె + ఇదత్తె = ఎలెఇదత్తె. - అవధారణము: నుడిదనో + అదు=నుడిదనో అదు; ఆతనె + అంబుజోదరం=ఆతనె అంబుజోదరం. - విశంక: ఆనెయొ + అద్రియొ=ఆనెయొ అద్రియొ. - ప్లుతోచ్చారణము: కు, కూ, కూ, కి, ఎందు కోటి కూగితాగళ్ ; మొదలైనవి.

(6) శ్లాఘానుశ్లేషార్థములందువచ్చు 'ఓ'కారము మీఁదను, అంగీకారార్థకమగు 'ఎమ'శబ్దము మీఁదను, ఆశ్చర్యార్థకమగు 'ఆ'కారము మీఁదను;

ఖేదార్థకావ్యయములమీఁదను నచ్చు పరమగునపు డాగమవర్ణములు చేరవు, అచ్చులు ప్రకృతిభావమున నిలుచును:

ఉదా. శ్లాఘ: ఎంతెంతో అః కబ్బ మొళ్ళిత్తాయ్తు.-ఆక్షేపము: ము త్తినో ఇందె కోంబె ధూళిపటం.-'ఏమ'శబ్దమునకు: నిమగ క్కేమ అబ్జగర్భనాయుం శ్రీయుం; అంగీకారార్థ కాకారమునకు: పాలా అమర్దా ఇనిమగడా ఆనా ఇమ్మడియా ఎరట్కుదిరెయా ఇర్బర్గైక్కెనుహా! ఖేదమునకు: అయ్యో, అక్కటా, ఇంద్రంగె కేడాయ్తె?- మొదలైనవి.

(7) పొఱ, ఒళ, పొస, పటి, ఎళ, అనుపదములపై నచ్చుపరమగుచో సంధికాక పూర్వపరాచ్చులు ప్రకృతిభావమున నిలుచును: ఉదా. పొఱ అడి; ఒళఆట్టం; పొసఅడకె, పటిఅలగు, ఎళ అంచె.

(8) కరె + అల్; ఇర + అదె; అనువాని సంధివిషయమునను, పద్యార్థ వాక్యావసానములందును, సంస్కృతవాక్యముల కనుకరణమందును, ధ్వన్యనుకరణ శబ్దములమీఁదను, పూర్వాచ్చునకు ఋకారము పరమగునప్పుడును ప్రకృతిభావము వైకల్పికముగ నగును: కరె అల్, కరెయల్; ఇరఅదె, ఇరదె.-వాక్యావసానమున: కః? కేనార్థి? కోదరిద్ర ఎనితుమనితుమం ధర్మజం సూఱెగొట్టం; - అనుకిరణ విసంధి: "కవక్కవ ఎలెఎలె ఉఊ పుగల్ పుగలెందు. అనుకరణ సంధి: ఛంమెంబ. ఘటఘ టెంబ; - ఋకార విసంధి: ఎసెగుం ఋజ్వాగతం కణ్గొళిసుగు మళవట్టిర్ద ఋజ్వాగతం; ఋకారసంధి: సరసమృజు వీరనెందు.

(9) వర్ణములకు సంధిని గూర్చునపు డశ్లీలార్థము స్ఫురింపకుండఁగను, సంధివైకల్పికముగి దాయని ప్రసిద్ధమగు సంధిచేడకుండఁగను జూచికొనవలెను. సంధియందు రెండురేఫములను గాని, శ్రుతికటువులగు వర్ణములను గాని చేర్పఁగూడదు: బంధ్రామర్, విద్వత్త్రీస్నయము, ఇట్టి సంధులను బరిహరింపవలెను.

(10) అవధారణార్థక 'ఎ' కారము తన నియతార్థమునఁగాక యితరార్థమునఁ బ్రయోగింపఁబడినప్పుడును, 'అరె'అను పదము సగమను నర్థమునఁగాక యల్పార్థమునఁ బ్రయోగింపఁబడినప్పుడును సంధిచేయవలెను: ఉదా. అనియతావధారణము; మామరనల్లదిల్ల, తనిగంపిన మల్లిగె 'యల్లదిల్ల'. - అల్పార్థకమగు 'అరె' కు: కురుపతియం విష్ణు బెడిదం ధరెయరెయం.

## హల్సంధి.

(1) సంధియందు పరపదము నాదియందుండు క, త, ప, లు బహుళముగ గ, ద, బ, లు గామాఱును: ఉదా. పటి + కన్నడ = పటిగన్నడ;

కణ్ + తెఱవు = కద్దెఱవు ; కణ్ + పని = కణ్బని. - బహుళమనుటచే 'తలెకట్టు, బెసెకోల్, ఒళకయ్, ఏడుపండి' మొదలగు వానియందు క, త, ప, లకు గ, ద, బా దేశము లేదు. చ, ట, లకు జ, డ, లెన్నడును రావు: ఉదా. కడుచాగి, కణ్చల్లం, కడుటక్కు, మాణికటెక్కె, మొదలైనవి.

(2) ఒర్, ఇర్, పదములమీఁదను, శకటరేఫస్థానముల వచ్చిన రేఫముమీఁదను, డకారస్థానమున వచ్చిన ఱకారముమీఁదను, క, త, ప, లకు గ, ద, బ, లు రావు: ఉదా. ఒక్కై, ఒత్తుత్తు, ఒప్పిడి ; ఇక్కోడి, ఇత్తలె, ఇప్పత్తు, మాఱ్ + కోరల్ = మాక్కోరల్ ; మాఱ్ + తలె = మాత్తలె ; బేఱ్+పట్టం = బేప్పట్టం ; కాడు + కిచ్చు = కాట్కిచ్చు ; కాడు + తుఱు = కాట్తుఱు ; కాడు + పురం = కాట్పురం మొదలైనవి.

'కెళగణ' శబ్దమున కాదేశముగ వచ్చు 'కిఱ్' అనుదాని ఱకారము నకుఁ బరమగు క, త, ప, లకును గ, ద, బ, లు రావు: కిఱ్కొటె.

(3) అచ్చులకును, పొల్లులగు హల్లులకును బరమగు ప, బ, మ, లకు బహుళముగ వకార మాదేశమగును: ఉదా. అచ్చులకు (i) పకారము పరమైనందుకు: ఎళ + పెఱె = ఎళవెఱె ; బెళె + పొల = బెళెవొల. - (ii) బకారము పరమైనందుకు: కడు + బెళ్పు = కడువెళ్పు. - (iii) మకారము పరమైనందుకు: మర + మణిగం = మరవణిగం మొదలైనవి. - పొల్లగు హల్లునకు : (i) నీర్ + పొనల్ = నీర్వొనల్ (ii) మెయ్ + బసవు = మెయ్ వసవు ; (iii) మెల్ + మాతు = మెల్వాతు మొదలైనవి - ఆదేశవ్యంజనము నకు వత్వము రాదు: ఇర్ + బాళ్ = ఇర్బాళ్ ('ఇర్వాళ్' అనికాదు) ; ఇర్ + పడి = ఇర్పడి ('ఇర్వడి' అనికాదు.) ; ఇర్ + పొడె = ఇర్పొడె ('ఇర్వొడె' అనికాదు )

వకారాదేశము బహుళమనుటచే 'కణ్బేటం, కణ్బేను, కర్బెడరె ; నుడుబాడు ; బాళ్మనె ; పాల్మనె ; కత్తురి మిగం ; కయ్పుఱె ; పూపుణుంబు ; పల్పఱె' మొదలగు వానిలో వకారాదేశము కలుగలేదు.

(4) య, ల లకుఁ దప్ప తక్కిన వ్యంజనములకుఁ బరమగు సకారము బహుళముగ, స, చ, ఛ, లుగ మాఱును. (i) నుణ్ + సర = నుణ్చర. (ii) పొన్ + సురిగె = పొంజురిగె ; మున్ + సూర్ = ముంజూర్ ; మున్ + సెఱుంగు = ముంజెఱుంగు. (iii) పదినెణ్ + సాసిరం = పదినెణ్ఛాసిరం ; ఇర్ + సాసిరం = ఇర్ఛాసిరం ; నూఱ్ + సాసిరం = నూఱ్ఛాసిరం మొదలైనవి.

బహుళగ్రహణముచే 'కణ్సోలం, మేణ్సుర, బెళ్సరి, కళ్సవి, బాయ్సవి, మెయ్సవి, బల్సోనె, కల్సెరె, మెల్సరం మొదలగువానియందు సకారమునకు మార్పు కలుగదు.

(5) న్, ణ్, ల్, య్, ళ్, అనుహల్లు లంతమందుగల యేకాజ్విశిష్టనామప్రాతిపదికములలోని యచ్చు హ్రస్వమగుచో వాని కచ్చు పరమగునపుడు పదముతుదిహల్లునకు ద్విత్వము కలుగును: ఉదా. బెన్ + అప్పళిసె = బెన్నప్పళిసె ; పెణ్ + అంతెవ్రుల్ = పెణ్ణంతెవ్రుల్ ; కల్ + ఎల్లం = కల్లెల్లం ; మెయ్ + అ = మెయ్య; ముళ్ + ఆగి=ముళ్ళాగి.

(6) న్, ణ్, ల్, య్, ళ్ అంత మందుగల యేకాజ్విశిష్ట క్రియా పద ప్రాతిపదికములకు 'అల్' అనునది చేరునప్పుడు ద్విత్వము కలుగదు ; కొన్ని యకారాంతములగు నేకాజ్విశిష్టక్రియాప్రాతిపదికములకును, ద్విస్వరవిశిష్టమగు 'ఆరయ్' అనుదానికిని ద్విత్వము వైకల్పికముగనగును ; ఉయ్, నెయ్, సుయ్, బయ్, అనువానికి స్వరము పరమగుచో వ్యతిరేకార్థక రూపములమీఁదను ద్విత్వము తప్పకవచ్చును ; 'ఆరయ్' అనుదానికిఁ దప్పఁ దక్కినవానికి 'ఎ' అను ప్రత్యయము చేరునప్పుడు ద్విత్వము కలుగదు: ఉదా. (i) ఎన్ + అల్ = ఎనల్ ; ఉణ్ + అల్ = ఉణల్ ; కొల్ + అల్ = కొలల్. (ii) పొయ్ + అల్ = పొయల్ ; పొయ్యల్ ; కొయ్ + అల్ = కొయల్, కొయ్యల్ ; ఆరయ్ + అల్ = ఆరయల్, ఆరయ్యల్ ; (iii) ఉయ్యం, నెయ్యర్, సుయ్యయ్, బయ్యవు. (iv) ఎనె, కొలె, ఉణె ; మొదలైనవి.

(7) 'కళ్' అనుదానియందు తప్ప న్, ణ్, ల్, య్, ళ్, అంత మందుగల యేకాజ్విశిష్టధాతువులకు వ్యతిరేకార్థక ప్రత్యయము పరమగు నప్పు డాహల్లులకు ద్విత్వము తప్పకకలుగును: ఉదా. (I) ఎన్నం ఎన్నర్ ; ఉణ్ణం, ఉణ్ణర్ ; మెల్లయ్, మెల్లర్, బయ్యెన్, బయ్యెవు ; కొల్లెన్, కొల్లెవు ; (ii) ఎన్నదె, తిన్నదె, ఉణ్ణదె, ఒల్లదె, బయ్యదె, కొళ్లదె. (iii) కళల్‌పాదం, కళల్‌బందం, కళదె బందం మొదలైనవి.

## తెనుఁగున సంధి.

"పూర్వ పరస్వరంబులకుఁ బరస్వరం బేకాదేశంబగుట సంధి నాఁబడు" అని చిన్నయసూరి నిర్వచించినాఁడు. ఇందువలనఁ దెనుఁగున సంధియన నచ్సంధి మాత్రమనియు, నందును, బరరూపసంధి మాత్రమే యనియు నాతని యభిప్రాయమని స్పష్టపడుచున్నది కాని, ద్రుతముపై బరుషములకు సరళాదేశము, గసడదవాదేశము, లోపసంశ్లేషవిధులు, ఆమ్రేడితసంధి, క్రొత్తాదులు, ప్రాతాదులు మొదలగువాని కేర్పఱచిన విధులు, వీనినన్నిటి నాలోచించినచో నాతని నిర్వచనము సమగ్రము కాదని తోఁపకపోదు.

సంధినిర్వచనమున కేవలస్వరమునే ప్రధానముగఁ దలంచుట సరికాదు. ఆంధ్రమున నన్నికాలములందును నన్నిపదములును నజంతములుగానే యుండెనని చెప్పవీలులేదు. తమిళ కన్నడములందువలె ప్రాచీనాంధ్ర శబ్దములలోఁ గొన్ని హలంతములుగఁ గూడనుండెను. కావునఁ, తెనుఁగున హల్సంధికూడ నున్నదని గ్రహింపవలసి యుండును.

'వ్యవహారమునఁ గొన్నియెడలఁ బూర్వరూపసంధియుఁ బ్రకృతిభావమును గూడ గాన్పించుచుండును: ఉదా. చేప్పేఽంత సులభముకాదు చేయడము; మాఽమ్మ. 'చెప్పేటంత' అను రూపము సాధారణముగఁ గాన్పించుచున్నను, లోకములో 'చెప్పేఽంత' అనికూడ వినఁబడుచున్నవి. అట్లే, 'మాయమ్మ' అను నుచ్చారణము వినఁబడుచున్నను అది పామరజనోచ్చారణమయినట్లును, 'మాఽమ్మ' అనునది యుత్తమజాతులవారి యుచ్చారణమయినట్లును గోచరించును.

ఇట్లే సంస్కృతమునందలి 'మౌక్తికమ్' మొదలగు పదములు ప్రాకృతమున 'మోత్తిఅమ్' మొదలగు రూపములఁ దాల్చి తెనుఁగున 'ముత్తిఅమ్' అయి, పదమధ్యమందున్న ఉద్వృత్తాకారము పూర్వస్వరమగు ఇకారముతోఁ గలిసి, యణాదేశ సంధి గలిగి 'ముత్యము' అను మొదలగు రూపము లేర్పడుచున్నవి.

ఇట్లు ప్రాకృతమునందుఁ గొన్నియెడల సంస్కృతసంధులు కొన్ని కానవచ్చుచున్నను, తెనుఁగు గ్రంథములలో సాధారణముగ బరరూపసంధియు, సంధిరాహిత్యము యడాగమమును, ప్రాతిపదికశబ్దములపై నకారయుక్తోకార స్వరము హాళికేయమును మాత్రము గాన్పించుచున్నవి.

## అచ్సంధి

తెనుఁగున తత్సమ శబ్దములు గాని, ఆచ్ఛికశబ్దములుగాని ప్రథమా విభక్తియందు సాధారణముగ అ, ఇ, ఉ, అను హ్రస్వములలో నంతమగుచుండును. ఏకారాద్యంతములును దీర్ఘములునగు సంస్కృతశబ్దములు తెనుఁగున తత్సమములు అగునప్పుడు వానిదీర్ఘము నిలుచుటచే నట్టి దీర్ఘస్వరాంత పదములును గొన్నికలవు: ఉదా. క్ష్మా, శ్రీ మొదలైనవి. ఇట్టి దీర్ఘాంతైకాక్షర శబ్దములన్నియుఁ దెనుఁగునఁ దత్సమములు కావు: ఉదా. మా, ధీ మొదలైనవి. సంస్కృతమునందలి ఊకారాంతైకాక్షర శబ్దములన్నియుఁ దెనుఁగునఁ దత్సమములు కాలేదు: ఊ = శివుఁడు; కూ = కురూపియగుస్త్రీ; గూ = మాలిన్యము; జూ = వేగము, సరస్వతి; దూ = బంగారము; ధూ =

కంపము. భూ, భ్రూలకు ప్రథమైక వచనమునఁ బ్రత్యేకరూపములు గలిగినవని చెప్పఁదురుగాని యవి ప్రథమారూపములగునో కావో చెప్పవీలులేదు. ఆచ్ఛికములగు ఆకారాంత, ఈకారాంత శబ్దములును గొన్నికలవు: నవలా, లకోరీ, మొదలైనవి. ఇయాంతములగు నాచ్ఛిక శబ్దములు హ్రస్వ ఎకారాంతములు నగును: వన్నియ, వన్నె మొదలైనవి. క్రియారూపములన్నియు అ, ఇ,ఉ, లతో నంతమగును. చెప్పక, చేసి, కొట్టుదురు మొదలైనవి. ఒకప్పుడీ యంతములు ద్రుతముతోఁ గూడియుండును: చేయన్, వింటిన్, చేయుదున్, మొదలైనవి. ఎకారాంతములగు కొన్ని సంపూర్ణక్రియారూపములు ద్రుత ప్రకృతికములగును. చెప్పెన్, మొదలైనవి. కొన్నికావు: వచ్చితివె ? మొదలైనవి. అ, ఆ, ఎ, ఏ, ఒ, ఓ, లంతమందుగల యవ్యయములును గొన్ని కలవు: అక్కట, ఆహా, బాపురె, బాపురే, ఓహొ, ఓహో మొదలైనవి.

పైని వివరించినట్టియు నితరములయినట్టియు నజంతశబ్దముల తుది స్వరమునకు మఱియొక స్వరము పరమైనయెడల నారెండుస్వరముల స్థానమునఁ బరస్వరముమాత్రము నిలుచుటకుఁ దెనుఁగున సంధియను నామమును వైయాకరణులు విధించియున్నారు. సంధికలుగనిచోట నారెండు స్వరములకును మధ్యమున 'య్' అనునది యాగమముగావచ్చి వాని ప్రత్యేకత్వమును నిలుపుచుండును. గ్రాంధికభాషయందు యడాగమము కాన్పించుచున్నను, పూర్వస్వరమునకు ఉ, ఊ, ఒ, ఓ, లు పరమగునపుడు వ్యవహారమున 'వ' కారముగూడ నాగమముగ వచ్చుట వినఁబడుచున్నది: ఆ వూరు, ఈవుండ,ఏవ్రొాడ, మఱివ్వొకటి మొదలైనవి. దీర్ఘాచ్చులపై నచ్చులు వచ్చునప్పుడొకచో నెట్టియాగమమును రాకుండుట వ్యవహారమున గమనింపవచ్చును: నూ ఊరు, మీా అమ్మ, నీ అక్క, మొదలైనవి.

తెనుఁగున నచ్ సంధి నీక్రింది వర్గములుగా నేర్పఱుపవచ్చును: ఉత్వ సంధి, ఇత్వసంధి, అత్వసంధి, ఇతరసంధి - అని.

### (1) ఉత్వసంధి.

1. " ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధియగు. "

రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు ; మేము + ఉంటిమి = మేముంటిమి ; వాఁడు + ఇచ్చెను = వాఁడిచ్చెను ; భీముఁడు + ఈతఁడు = భీముఁడీతఁడు ; కాముఁడు + ఆతఁడు = కాముఁడాతఁడు ; వాఁడు + ఊరకొనెను = వాఁడూరకొనెను, మొదలైనవి.

(2) "ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణములందున్న యుకారమునకు సంధివైకల్పికముగా నగును."

నన్నున్ + అడిగె = నన్నడిగె; నన్నునడిగె;-నాకొఱకున్ + ఇచ్చె = నాకొఱకిచ్చె, నాకొఱకునిచ్చె; నాకున్+ఆదరువు=నాకాదరువు; నాకునాదరువు: నాయందు+ఆశ = నాయందాశ, నాయందునాశ.

అని చిన్నయసూరి నిర్వచించి యుదాహరణముల నిచ్చెనుగాని, యా యుదాహరణములలో నన్నున్ అనుదాని రూపాంతరమగు 'ననున్' పైనచ్చు చేరినప్పుడు సంధియై 'ననడిగె' అను రూపము సిద్ధింపదు. ఇట్లే మమున్ నినున్, మిమున్, తనున్, తమున్ అనురూపముల మీఁదను స్వరము పరమగునపుడు సంధికలిగి, మమడిగె, నినడిగె, మిమడిగె, అనురూపములు సిద్ధింపవు. అట్లే 'రామున్ + అడిగె' అనునవి కలిసి 'రామడిగె' అను సంధిరూపము సిద్ధింపదు. *

'అందు' అనునది కళయగు విభక్తిప్రతిరూపకావ్యయమగుకళ కావునఁ, దాని నీసూత్రముక్రింద నుదాహరింపఁగూడదని తోఁచుచున్నది. 'నాయందు నాశ' యను నుదాహరణమున 'ఉన్' అనునది సముచ్చయార్థకము. 'అందు' అనువిభక్తి ప్రత్యయముపై స్వరముపరమైనప్పుడు సంధి వైకల్పికమన్నచో 'నాయందు యాశ' అనురూపము సాధువు కావలసివచ్చును.

ప్రథమేతరవిభక్తిప్రత్యయాంతశబ్దములు ద్రుతాంతము లయినప్పుడే చిన్నయసూరి సూత్రము వర్తించును. శత్రర్థక చువర్ణాంతములును ద్రుతప్రకృతికములే కావున ముందు చెప్పఁబోవు "ఇఁకాదులకుఁదప్ప ద్రుత ప్రకృతికములకు సంధిలేదు" అను సూత్రమునకుఁ బైసూత్ర మపవాదముగాఁ జెప్పఁబడినదని గ్రహింపవలెను. అనఁగాఁ జిన్నయసూరి మతమున ద్రుతప్రకృతికములం దిఁకాదులకును, ప్రథమేతర విభక్తులలో ఉకారాంత ద్రుతప్రకృతికములైన వానికిని, శత్రర్థక చువర్ణమునకును సంధి వైకల్పికమని చిన్నయసూరి యభిప్రాయము. "డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాషనగు"; "ఇకారంబు మీఁది కు, ను, వు, క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు" అను సూత్రముల ప్రకారము కు-విభక్తి కాదేశముగా వచ్చిన 'కి' వర్ణమునకును పై "ప్రథమేతర విభక్తి సూత్రము వర్తించునని తెలిసికొనవలెను: రామునికిచ్చె, రామునికినిచ్చె; హరికిచ్చె; హరికినిచ్చె. కాని, చిన్నయసూరి 'కి' వర్ణకమును ప్రత్యేకించి యేమ్యాదులలోఁ జేర్చినాఁడు-అట్లుతేఁడు చేర్చుట సరికానట్లు తోఁచుచున్నది. ఈ విషయ మా సూత్రముక్రింద చర్చింపఁబడును.

* ఈ విషయమునుగూర్చిన చర్చ ద్రుతమునుగూర్చి విచారించినపుడు విపులముగాఁ జేయఁబడినది.

(3) "కుఱు, చిఱు, కడు, నడు; నిడు శబ్దముల అ, డ, ల కచ్చుపరంబగు నపుడు ద్విరుక్తటకారంబగు" నని చిన్నయసూరి వ్రాసెను. ద్విత్వశకటరేఫము నుచ్చారణను 'ట్ర' గా ద్రావిడభాషలందుండుననియు, తెనుఁగున ట్ర = ట్ట యగుననియు శకటరేఫవిచారసందర్భమునఁ దెలుపఁబడెను. హల్లుపై నచ్చు వచ్చునపుడు డాహల్లునకు ద్విత్వము కలుగుననియు మఱియొక సందర్భమునఁ దెలుపఁబడెను. చిఱ్ + ఎలుక = చిఱ్ఱెలుక = * చిట్రెలుక = చిట్టెలుక, యని శబ్దశాస్త్రము ప్రకారము చెప్పవలెను. ఇట్లే, కుఱ్ + ఉసురు = * కుఱ్ఱుసురు = * కుట్రుసురు = కుట్టుసురు అయినది. నిడు శబ్దమునకుఁ బూర్వరూపము 'నిఱ్' అనునది. నిఱ్+ఊరుపు = * నిఱ్ఱూరుపు = * నిట్రూరుపు = నిట్టూరుపు అయినది. ఇందుకు నిట్రుపాసెను (భీమ. II. 100) అనురూపమే నిదర్శనము. కడు, నడు, శబ్దములఁగూర్చి మఱియొక విధముగఁ జెప్పవలసియున్నది. సంశివర్ణాంతములగుపదములు విశేషణములుగ వాడఁబడినప్పుడు ద్రావిడ భాషలయందు వాని వాని ద్విత్వ పరుషాక్షరములగును. ఈ సూత్రము ననుసరించియే నడు, నిడు, శబ్దములపై నచ్చు పరమగు నపుడు ద్విరుక్తటకారమగుట.

ఉదా. నట్టడలు (శకుం. పరి. II పు. 36); కట్టాఁపులు (హరవి. III. 158);

'కడు' అను పదముపై నచ్చుపరమగునపుడు ద్విరుక్త టకారమొక్కప్పుడు రాకుండుటయుఁగలదు. "కడునెండ యెక్కఁనతను, నుడుగిక యచ్చనుప నడిచి యుగ్రాటవిలో" (భార. ఆర. ౨.) "కడు నధికుఁడొండొఁ దొడరినఁ బొడిచిన నోడిచినను బురుషు పురుషగుణంబే, ర్పడఁగాక"(భార. సభా. 1 అ) ఇది వ్యస్తపదములకుఁ గలిగిన సంధిరూపములనియు ద్విరుక్తటకారము సమాసమునందు వచ్చుననియు సమాధానముఁ జెప్పుదురుగాని, చిన్నయసూరి యీసంధి సమాసములందు గలుగునని చెప్పలేదు. ప్రౌఢవ్యాకరణకారుఁడు "చిట్టడవిచిట్టి" అని సూత్రించి 'చిట్టెలుక, చిట్టడవి, చిట్టాముదము, చిట్టుడుకు, మొదలగువానియందలి మొదటిపదము 'చిట్టి' గాని 'చిఱు' కాదని యూహించెను. ఆ పక్షమున నిత్యసంధి నంగీకరింపవలసియుండును. 'చిట్టి' శబ్దములోని యొక టకారము వైకల్పికముగా లోపించును:

ఉదా. చిటి పోటి మాటలు, చిటిచాప, మొదలైనవి.

(4) ఉదంత నామంబున కనుకరణంబునందు వుగాగమంబగు" అని చిన్నయసూరి.

ఉదా. ఇయం ధేనుః + అనె = ఇయం ధేనువనె. ఇట్టిసందర్భములందు శైవకవులు రేఫాగమముతో సంస్కృతమునందువలెఁ బ్రయోగములఁ జేసి

యున్నారు. వారి ప్రయోగముల ప్రకారము 'ఇయంధేనురనె' అనుపదియు సాధువగును.

(5) సంస్కృత సుబంత ప్రత్యయములగు 'ఐస్', భిస్, ఓస్ లపై వచ్చిన పదాద్యచ్చు పరమగునప్పుడు శివకవులు సకారమునకు లోపాదేశము చేసి యున్నారు.

ఉదా. జాతులు మాత్రానుసంధాన గణ వి-నీతులుగాన 'యనియత గణైః' రనియును (పండితా).

(6) ఉడుంతొ సంస్కృత క్రియాపదముపై 'అను' ధాతువు ప్రయుక్త మైనచో తెనుఁగునందు వలెనే నిత్యసంధియగును.

ఉదా. సుఖయామ్యోస్తంచు (ప్రభా. V. 34.)

(7) ఉడంత తెనుఁగు శబ్దములను సంస్కృత శబ్దములతోఁ జేర్చి తెనుఁగు వైయాకరణులు సంస్కృతమునందువలె సమాసములఁ గల్పించి యున్నారు.

ఉదా. ఉండ్వనగాగమంబులు, పేర్వాదులు, ఎర్వాదులు, మొదలైనవి.

(8) కొన్నిచోటుల నువ్వుముపై సంధిసేయకయుఁ గొందఱు కవులు ప్రయోగించి యున్నారు.

ఉదా. "ఎవ్వారు ఎవ్వరైన నెరి-నన్నుఁ గనుంగొని"—(సానం. 43.)

## ఇత్వసంధి.

(1) "ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు. ఏమి, మఱి, కిషష్ఠి, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి ఇవి యాకృతిగణంబు. ఉదా. ఏమి+అంటివి = ఏమంటివి, ఏమియంటివి, మఱి + ఏమి = మఱేమి, మఱియేమి; హరికిన్ + ఇచ్చె = హరికిచ్చె, హరికినిచ్చె"—చిన్నయసూరి.

ఉత్వసంధిని వివరించు సందర్భమున ప్రథమేతరవిభక్తి... (య)ందున్న యుకారంబునకు సంధివైకల్పికంబుగానగు నను సూత్రమున షష్ఠీవిభక్తిక 'కు' వర్ణకమునకు వైకల్పికసంధి ప్రాప్తించినది. దాని స్థానమున వచ్చిన 'కి' వర్ణకమునకును వైకల్పికసంధి యాసూత్రమువలననే ప్రాప్తించుచున్నది. షష్ఠియందు 'కి' వర్ణకమును జిన్నయసూరి ప్రత్యేకముగాఁ జెప్పలేదు.

ఏమి, మఱి, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి, అనువానిపై నచ్చుపరమైనపుడు నన్నయభారతమున సంధిలేకుండుటయే కాన్పించుచున్నది. కావున, 'తద్వత్తదాదిజస్య' అను చింతామణిసూత్రము నన్నయప్రయోగములకు

విరుద్ధముగా నుండకపోయినను, తదాదులకు సంధియగుటకు నన్నయభారత భాగమున నుదాహరణములు గానరావు.

(2) "మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధియగును.

ఉదా. ఏలితివి + అపుడు = ఏలితివపుడు; ఏలితి + ఇపుడు=ఏలితిపుడు; ఏలితిరి+ఇపుడు = ఏలితిరిపుడు" అని చిన్నయసూరి. ఆంధ్రశబ్దచింతామణి— "నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః" అని ఉత్తమపురుష వ్యతిరిక్తములైన, అనఁగా మధ్యమ, ప్రథమపురుషక్రియలయందిత్తునకు సంధి నిత్యముగా నగు నని చెప్పుచున్నది. కాని, నన్నయభారతమున "అంతఁ గొంద అధికహాస్యంబు సేసిరి, యడవినేమి రోసెదనిరి గొంద, ఱు" "క్రమము వడసియొక్క సమ యంబు సేసిరి, ఒనరదానితెఱఁగు వినుము తల్లి" యనియు, శ్రీనాథుని నైషధమున "కూర్చుండిరి యెుండొరుం గదిసి"యనియు, నింక నిట్లే యితర కవుల గ్రంథములందును బ్రథమపురుషక్రియలయం దిత్తునకు సంధిలేకుండఁ బ్రయోగములు గాన్పించుచున్నవి. శ్రీనాథుని వై ప్రయోగము నాక్షేపిం చుచు నాతఁడటు 'కానక, చేసె'ననియుఁ, 'బరపురుషక్రియలఁ బ్రకృతిభావము గలదే "? యనియు నప్పకవి వ్రాసియున్నాఁడు. ఈ యాక్షేపణకు సమాధాన ముగా నహోబలపండితుఁ డధర్వణుని "ప్రథమే చోత్తమేచైవ క్రియేతోవా భవేచ్ఛ్వ్యతిః, నిత్యమన్యస్య వికృతౌ" అనుకారిక నుదాహరించి ప్రథమ పురుషక్రియలయందలి యిత్తునకును సంధివైకల్పికమేయని సమర్థించినాఁడు. ఉత్తమ పురుషక్రియలయందలి యిత్తునకు సూత్రముప్రకారము సంధి వైకల్పికమగుటచేత 'చేసితి నచ్యుతార్చనము, చేసితచ్యుతార్చనము; కొలిచితి నబ్ధిజన్, కొలిచితబ్ధిజన్' అను సంధిరూపములును నహోబలపండితునికి సమ్మ తము లయ్యెను.

ప్రథమపురుషక్రియలయం దిత్తునకు సంధివైకల్పికముగా కనఁబడు చుండుటచేతనే యధర్వణుఁడు "ప్రథమేచోత్తమేచైవ" అని చింతామణి సూత్రమును సవరింపవలసినవాఁడయ్యెను. కొందఱట్లు చేయక 'అనుత్తమ పురుష' అనుచోట పురుషశబ్దమునకుఁ బ్రథమపురుషమని యర్థముఁ జెప్పి కొనియుఁ *, గొందఱు 'వాక్యాంతమందును బాదాంతమందును సంధిలేమి దోషము కా'దని మనస్సునకుఁ దృప్తికలిగించికొనియు, నెట్లెట్లో సమాధాన ములఁ జెప్పియున్నారు. మొదటిసమాధాన మధర్వణుని సవరణను, రెండవ సమాధానము చింతామణిసూత్రమును స్థిరపఱుచుచున్నవి. చింతామణి సూత్రము సమాపకక్రియలకు వర్తించునదిగావున వానితో నెప్పుడును వాక్యములంత మగుచునే యుండును; ఆ తరువాతఁ గొన్ని యితరశబ్దములు

* గుప్తార్థ ప్రకాశిక. పు. 34.

చేరినను వాక్యమును సమాప్తము చేయునది సమాపకక్రియయేకదా. ఎన్ని సమాధానములు చెప్పుకొన్నను తుదకు ఫలితమొక్కటే యగుచున్నది. ప్రథమపురుష క్రియలయందలి యిత్తునకు సంధివైకల్పికమనియే తేలుచున్నది. ప్రయోగములను బట్టి మఱియొకరీతిగఁ జెప్పవీలులేదు.

ఇత్వ మంతమందుగల సమాపకక్రియలు భూతార్థమును దెలుపును. అవి ఉత్తమ,మధ్యమ పురుషైక బహువచనములందును, ప్రథమా బహువచనమునందును నుండును.

ఉదా. చెప్పితిని, చెప్పితిమి; చెప్పితివి, చెప్పితిరి; చెప్పిరి. వీనిలో నుత్తమపురుషైక వచనక్రియపై సంధిలేకుండఁగనే ప్రయోగములు కాన్పించుచున్నవి. సూత్రముప్రకారము కొలిచితినబ్ధిజక్, కొలిచితబ్ధిజక్ అను రెండురూపములును సాధువు లగుచున్నవి. అవి సాధువులని తలంచియే యహోబలుఁడ ట్లుదాహరించి యున్నాఁడు. 'కొలిచితబ్ధిజక్' అనురూపము ప్రయోగానుసారి కాకున్న చింతామణిసూత్రమున కతివ్యాప్తిదోషము పట్టును. "ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలే"దను నర్థమును సూచించు సూత్రము చింతామణియందు లేకపోవుటచేతను, నుత్తమపురుషైక క్రియాపదముల యిత్తునకు సంధిగల ప్రయోగములు లేకుండుటచేతను నీదోష మనివార్యమే యగుచున్నది. ఈ దోషమును వారించుటకే బ్ర. శ్రీ. వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రులుగారు పూర్వవైయాకరణు లెవ్వరును నూహించియుండని యొక క్రొత్తపక్షి నవలంబించి యున్నారు. వారి వాద సారమిది: "చేసితిని, చేయుదును, చేయును, చేసెడిని, చేసెదును మొదలగు క్రియలతుదినుండు ని, ను, లు ప్రత్యయనిష్ఠములు. ఇవి ద్రుతప్రకృతికములు. అనఁగా ద్రుతముతోఁ గూడినప్పుడు వానిరూపములు చేసితినిన్, చేసితినినను, చేయుదునున్, చేయుదునును, చేయునున్, చేయునును, చేసెడినిన్, చేసెడినిని, చేసెదునున్, చేసెదునును" అనురీతిగ నుండును. వీనిలో నుత్తమపురుషైకారాంత క్రియారూపముల విషయమిచట విచార్యము. చింతామణిసూత్రము ప్రకార మిట్టియిత్తులకు సంధి వైకల్పికము. సంధియగునప్పటిరూపము 'చేసితి నిప్పుడు' అనునట్టిది; సంధికానిరూపము 'చేసితినినిప్పుడు' అనునట్టిది" అని. 'చేసితిని నిప్పుడు' వంటిరూపము 'అంటిని నిందఱకు' (ఆది. IV. 108) అనునది నన్నయభారతమున నొక్కటిమాత్ర మున్నది. అదియే శాస్త్రులవారి వాదమంతటికి నాధారము. ఈప్రయోగమున 'అంటినిన్' అను దానిలోని నకారము సముచ్చయార్థకమన్నచోఁ వీరివాదమునకు మఱి యాధారము లేకుండును. ప్రకరణమును బట్టి యది సముచ్చయార్థబోధకముగనే తోఁచుచున్నది.

"ఏను నీయింతియునుగాని - యెఱుఁగ రన్య, లర్థిఁ గణ్వమహాముని యాశ్రమంబునందు గాంధర్వవిధి వివా-హమునఁ గరము, నెమ్మిఁ జేసితి దీని పా-ణిగ్రహణము. అన్యులెఱుఁగమిఁ జేసి లోకాపవాద, భీతి నెఱిఁగియు నిత్తన్విఁ - బ్రీతిదప్పి యెఱుఁగనంటిని నిందఱ - కిప్పుడెఱుఁగఁ, జెప్పెనాకాశ వాణి యచ్చెరువు గాఁగ." 'దీనిపాణిగ్రహణము చేసితిని; ఈతన్వి నెఱుఁగ నంటిని కూడాను,' అని 'అంటినిన్' అను క్రియ కర్థము. ఈవ్యాఖ్యానము శ్రీ శాస్త్రులవారు మఱియొక సందర్భమునఁ జేసిన వ్యాఖ్యానమున కనుగుణము గానే యున్నది. * కావున నుత్తమపురుషైక వచనస్థ ఇత్తునకు 'ని'వర్ణము ప్రత్యయ నిష్ఠముకాని ద్రుతము కాదన్నచో సంధినిత్యమనియు, దానికి ద్రుతత్వము నాపాదించినచో సంధిరాదనియు నిర్ణయింపవలసియున్నది. పూర్వ వైయాకరణులందఱును 'ని'వర్ణమును ద్రుతముగనే పరిగణించిరి.

'ఐతిమి యిందఱమున్ (ఆది. VIII. 91); ఉండితిమి యొరులెఱుఁగ కుండ (ఆది. VI. 239), అపహరించితిమని (ఆర. II. 67) అను నన్నయ ప్రయోగములు చింతామణి సూత్రానుసారులై యున్నవి. ప్రథమా బహు వచన క్రియలందలి యిత్వమునకు సంధివైకల్పికమని యింతకుముందు నిరూపింపఁబడినది. కావున నింకను మిగిలిన మధ్యమ పురుష క్రియలయం దిత్తునకు సంధి నిత్యమని తేలుచున్నది. ప్రయోగములును నీసూత్రము ననుసరించియే యున్నవి.

(3) "క్త్వార్థంబయిన యిత్తునకుఁ సంధిలేదు" అని చిన్నయసూరి.

క్త్వార్థ కేకారమునకు సంధిలేదని లాక్షణికు లనుటయే కాని, యీసంధి వైకల్పికమనుటకు పదుమూఁడవ శతాబ్దమునుండియు కావ్యములందు ప్రయోగములు గలవు. తొలుత 'ఇ' త్వము శుద్ధమగు నచ్చు కాదు; దానికి 'ఇయ్'. అను నుచ్చారణముండెను. కావుననే సంధియందు 'య' కారము స్పష్టపడు చుండెను. కాని కొంతకాలమున కది శుద్ధ ఇకారముగా మాఱెను. అప్పుడు క్త్వార్థ కేకారమునకే కాక యన్ని యికారములకును సంధికలుగుచుండెను. 'ఇయ్' అను నుచ్చారణము మిగిలినచోట్ల సంధియందు 'య' కార మిప్పటి కిని వినఁబడుచున్నది. ఇట్లే నన్నయభట్టుకాలమున నేమ్యాదులయందలి యిత్తును, ప్రథమ, ఉత్తమ క్రియాపదములందలి యిత్తును శుద్ధాచ్చు కాక 'ఇయ్' అను నుచ్చారణమునే కలిగి యుండెను. రానురాను గొన్నియెడల నది శుద్ధాచ్చయి సంధి కూడఁ గలుగుచు వచ్చినది.

క్త్వార్థ కేకారసంధి కుదాహరణములు:

* చింతామణి విషయ పరిశోధనము, పేరా 133.

మ. వెలిచిట్లంబుధి నాథనందనులు (తిక్క. నిర్వ.) దీనినొకను, వెలి నిట్లంబుధి నాథనందనులు " అని దిద్దినారు.

పాల్కురికిసోమన బసవపురాణము: ఏవేళవెలుచుండుము (పు. 31); ఊచవ్రాయున్న భావమున (పు. 105); ఎలుఁగు వినేతెంచి (పు. 153); ఏతెంచారగించె, కలిగున్నదనుచు (పు. 160); కట్టైగసల్లంత; పులుగఱ చుమియుచు, ఏటుఁగడీల్లడే (పు. 202); కలిగుండువాఁడు (పు. 185); అంజలి సుంచెత్తు నమ్మాత్రలోన (పు. 215); మొదలైనవి.

గీ. పతికిఁ గైదువులందిచ్చు రతి విధమున. (ఆము II. 22)

క. చాపము నాకందిమ్ము (భార. విరా. II.)

సీ. చీరఁజించిచ్చువారి దీవించువారు (ఆము. VI. 85.)

క. నీతోఁ, గదిసిపుడు జూదమున గెలి, చెదను, (ఉ. నై. 19.)

క. వానిం, గాలునికందిచ్చె రౌద్రఘనచాయుగతిన్ (ఉ.హరి. I.143.

ఉ. వాతెర తేనియజాలు జిహ్వ కందిచ్చి (కృష్ణలీ. 29.)

మ. అదివీక్షించర్జునుం డాహరిం, దూలించెన్ (చిత్రభా. VIII. 24.)

క. సుందరులు పసిఁడికోరల, నందీ నందందయాని (పద్మ. II. 19.)

క. కేలివన వసుమతినుం, డేతెంచెన్ సరఘాసంఘాతము (పాండు. (V. 252.)

శా. అభ్రచరద్విమానగుఁడనై యుండుండి (పాండు. IV. 300.)

క. శిబి తన, కాయము కోసిచ్చెనన జగంబులవినమే.

క. ఎత్తిఁగెత్తిఁగి బ్రహ్మహత్యా, దురితంబున నీమపంబు దూఁకొనె (భాగ. *. II. 930)

క. ఇతనికి నెల్లపనులు నెఱుఁగించిపుడే (ఉద్యో. I. 38).

క. చాపము నాకందిమ్మనుడు (విరా. IV. 112.)

ఉ. ఇచ్చునెడం బదార్థమడిగిచ్చునో (విజ. I. 59); అవవలసనటిఁగా కెఱుఁగవా యొకనూటనె మర్మకర్మముల్ (విజ. 161); రాజులచిత్తము లైలియరావెటు వ్రాయెటు వచ్చునోకదా (నారం. II.).

చ. లెక్కవ్రాసిచూ, చదయతఁ గోలుకాఁడగుచు ... చూ, చది యును గాక (హంస. IV. 30).

అంటాఁడు = అంటి + ఆడు (చెన్నమల్లుశ. 25); కౌఁగిలందిమ్మను నేమొ (శుకచ. పు. 9); అందీక (కాశీ. V. 161); అడిగితిననో (నా.

పంచ. VI. పు. 124); అలసాడు (రాధికా. III. 110); ఉడిగింటికి (రాధికా. III. 35); ఒనరిం చెదురేఁగుదెంచినన్ (జైమి. V. 71.); కూడాడు (పాండు. II. 95); చూచిటురమ్ము (హంస); చూచనలను (చిత్రభా. VI. 29); చెప్పంపిన మాట (విష్ణుపు. VI. 210); చెప్పంపఁడే ప్రభా.); చేసలరు (రాధికా. III. 116); తూలాడు (శకుం. పరి. II. పు. 25); తొడిగేసి (చిత్రభా. VII. 26); తోలాడు (శకుం. పరి. II. పు. 23); నమ్మింటి (ప్రభులిం. పు. 59); సానువులనుండే తెంచు (విష్ణుపు. II. 323); పట్టేడ్వకు (రాధికా. II. 113); పెనగాడి (నిర్వ. III. 25); పొంచుండి (నీలాసుం. పు. 7); పోయిటతెత్తున్ (విష్ణుపు. VI. 82); త్రవ్వెలుక (విష్ణుపు. VI. 110); ఆడాడి (విష్ణుపు. IV. 97); ఎతిఁగెతిఁగి (రాజశే), మొద లయినవి.

మఱికొన్ని యిత్వ సంధుల కుదాహరణములు.

గీ. వెనుక ట్టుల నిలిపి తక్కినవి రెండుఁ బదియుమూఁడవు తావునఁ గుసురుపఱిచి (అప్ప. II. 302).

సీ. పల్లవపుటా ర్చిడగరాదు (వసుచ.).

క. బలు లేమిచేత వేసరు, చెలికిం జిపిటంబులీయఁ జేకొని కృపఁతో గలిమిచ్చినావు (అప్ప. IV. 411).

చ. వదలక యాతనింట శని - వారమునం బరదేశివైష్ణవుల్ (ఆము. I. 82).

గీ. వలివెయొంటాల్లైతో (ఆము. II. 52); నిట్టతాడువం టతివ (ఆము. V. 53).

గీ. పాలకడ ల్లుఁడును బక్కిడాలుతేఁడు (ఆంధ్ర. దేవ. 7.)

క. ఇట్టిందురు మట్టిందురు, వెట్టులు, నీలోని నలువు విషరాశిసుమీ (కవిజనమనో. పుట 57).

శా. కపటేర్ష్యాది క్రియాదోషముల్, మాతండ్రాన సహింపరాదు (కాళ. శత. 52).

క. రయంబునఁ గోల్కొని వా, నరదము దునిమెన్. (జైమిని. VII. 19)

సీ. శుద్ధ పార్ష్ణులుగాన చూవె దీనంఘ్రులు గరియాధపతి యానగరిమఁ గెలిచె (నైష. III. 202).

గీ. కంటవత్తిడుకొని సైరిక ప్రభుండు.

గీ. కాఁపుఁగోడలు గంచంత కాఁపురంబుఁ, బాలవంటకులంబుఁ గాడ్పు టేచి యుటికె (పాండు. III. 81.)

సీ. కృపణస్వభావుండనైనట్టి యేనేడ, నిఖిలావనీశ్వరైన యిందిరా దేవికి నెనయంగ నిత్యనివాసుడై యొప్పు నవ్వాసుదేవుఁడేడ (భాగ. X. ఉ. 1016).

ఆ. వె. సత్త్వంబుమెఱసి రాతిరెల్ల నుఱక పవనతనయుఁ డరిగె (ఆది. VI. 160).

గీ. పరగ నేనాజ్ఞ నింద్రియప్రతతి నడచు నట్టి భీమేశ్వరుఁడు మాకు నభయ మొసఁగు. (భీమ. IV. 83.)

అతనంత (ప్రభులిం. I. పు. 23); అనఁటాకు (పాండు. III. 76); అమ్మాజమ్మ (పాండు. I. 68); అఱువదేను (భార. కర్ణ. II.); అరఁటాకు (యయా. పు. 4); అలవె (రాధికా. I. 25); ఆనతిమ్ము (భార. విరా. I.); ఆనతిచ్చు (వరాహ. I. 66; పాండు. III. 45); ఇంటాతని (నా. పంచ. I. పు. 43); ఇట్టితండు (భార. విరా. II.) ఎంగిలటన్న (రాధికా. III. 122); కబ్బము లెన్నోయుండఁగా (రాధికా. I. 7); ఎప్పటట్ల (చెన్నబ. పు. 15); ఎలమంచిలాదిగా (కేయూర. I. 26); పత్తి రీగొడ్డునందు (బసవ. పు. 61).

ఏటావలి గిలిగింతలు (సారం. II. పు. 28); ఏఁడాదిచటన్ (ఉ. రా. పు. 148); కం చేడువాడలు (బసవ. పు, 33) కనుదో యొలయన్ (భార. శల్య. I.); బాలిక నెఱికురుల్ బారెడేసయ్య (ప్రభులిం. పు. 76); కాళిందైన (రామరా. పు. 64); కిందాకు = కింది + ఆకు (కుచేలో. I. 80); కెమ్మో వాన (రాధికా. II. 112); కోనేటమ్మ (రామరా. పు. 271); గిండనంగ (కృష్ణరా. IV. 105); (తెలివ్రా గెలివ్రా (రాధికా. I. 19); గుడ్డవ్వ (హరవి. II. 87); చెక్కలేమని (ఉ. రా. I. పు. 11), చొఱొక్క (భోజరా. VI. 77); చెలిమిఁకఁజాలు (రాధికా IV. 68); చెల్మింతులు(రాధికా. I. 132); చెర్మడలి(విక్ర. I. 73); డెబ్బదేను (భార. ద్రోణ IV.) తల్లేఁటికిఁ దండ్రియేల(రాధామా. II. 28), తాటాకుల చప్పుళ్లు (వరాహ. III 55); తాటాకులలోన వ్రాసిరి (తారాశ.); తిత్తొల్చి (కాశీ. VI 184); తెలనాకులు (పాండు. I, 29); దుప్పటొకింత (రాధికా. II. 107); పంచీటెలు (మను. IV. 110; రామాభ్యు. II. 28); పదార్వన్నెపసిండి (విజయ.) పనేమి (చెన్నబ. పు. 54); పడఁ తర్ఘ్యపణ్యముల్ (బసవ. పు. 116); పయిఁడంచు (సారం. I. పు. 15); పిడికిలా = లి + ఆ (రాధికా. II. 40); పెండ్లరుగుఁ

(రాధికా. I. 76 ; యయా. పు. 4) ; పెండ్లాడె (పాండు. III. 80); పెండ్లైన నాఁటనుండి (వరాహ. III. 30) ; పెండ్లాడి (వరాహ. IX. 128) ; పెద వెత్తి (కువల. III. పు. 48) ; పైఁడందెలు (రాజశే. I.) ; పోలసాడు (విక్ర. I. 95) ; మనవెఱ్ఱు దెల్పెదో (రాధికా. IV. 39) ; మనవెంత (రామరా. పు. 202) ; మట్టాకు (జైమి. భా. VIII. 140, 147) ; మాయలాడని = డి + అ(మను. III. 109); మీఁదాకు (కుచే. I. 80) ముక్కంటగు (రామరా. పు. 63) ; మేధావైన (రామరా. పు. 100) ; మోవదర (రాధికా. IV. 68) ; మోవుక్కింత (రాధికా. I. 108) ; రీతిట్టి (రామరా. పు. 261) ; ఎటు వంటి రూప నేదిక్కునకేఁగె (పద్మపు. III. 149) ; వాకిలరికట్టిన (రాధికా. IV. 6) ; వెండుంగరము (హంస. IV) ; వెట్టాటలు (విష్ణు. పు. III. 276); సరా=రి+ఆ (రాధికా. III. 14) ; సాటగు (-టి + అ) ; వానరదము ; దీనంఘ్రులు ; ఎవ్వనింట ; సకలశుభములుశౌరిచ్చు ; అతనాలు మొదలైనవి.

అనుకరణమున సంస్కృత క్రియాపదముల తుదియికారమునకు సంధి కావచ్చును. " నాదత్తముపతిష్ఠ " తని (వరాహ. XII. 67).

చెవి + ఆకు = చెవ్వాకు (మను. IV. 110) - ఇచట నిత్యసంధియు వకారమునకు ద్విత్వమును గలిగినవి.

ఇత్తుపై నవర్ణము చేరునప్పుడు గొన్ని యెడల అ్వ (ఞ) వర్ణము వచ్చును; తాటాకులలోన వ్రాసిరి (తారాశ.) నీకరయన్ వానము లేక యీ చిలిపిమఱతాకేమి ప్రాపయ్యెడున్ (జై. ఱ.) కొన్నియెడల అవర్ణము వచ్చును. కొబ్బరాకు, మామిడాకు మొదలైనవి.

ఆది+అన్న = ఆదెన్న (శకుం-పరి. I. పు. 6.) ఇచట 'అ్వ' (ఞ) కు మాఱుగ 'ఎ' వ్రాసి 'ఎ' తోడనే యతి స్థానమున మైత్రిని గవి కల్పించి నాఁడు. కాని దీని యుచ్చారణము అ్వవర్ణముతోఁ గూడినదే. ఇట్లే, చిట్టి + అయ్య, బుల్లి+అన్న ; జానకి + అమ్మ మొదలైనవి. కొన్నియెడల నిట్టిచోట్ల సంధియం దకారమే వినఁబడుచున్నది. గౌరమ్మ, లక్ష్మమ్మ, భారతమ్మ (బుచ్చయ్యలో చవర్ణము తాలవ్యము).కవిత్రయము వారి గ్రంథములం దిట్టి ప్రయోగములు క్వాచిత్కముగఁ గనఁబడుచున్నవి. 'తెలివ్రెందు' అను తిక్కన ప్రయోగము నికార సంధి కుదాహరణముగఁ జూపుదురుగాని యచట శబ్దము 'తెలివ్రు' గాని 'తెలివి' కాదు. అట్లే శ్రీనాథాదులు ప్రయోగించిన 'మగ నాలు' అనునది కిన్న. (తెనుఁగు?) మగన + ఆలు అను పదములు కలియుట వలన నేర్పడిన దనవలెను. 'ఇది యొకటేల,' 'ప్రొయ్యెడుదు' అను తిక్కన ప్రయోగములు తప్పుపాఠములు. వీనికి 'ఇది యొకఁడేల,' 'పోవిడుదు' అను

నవి సరియైన పాఠములు. ఇట్లే, రావాకు, మఱ్ఱాకు మొదలగు వానియందు అ్వ (ఆ) కారమును, మామిడాకు, కొబ్బరాకు మొదలగు వానియందు 'ఆ' కారమును వినఁబడు చున్నవి.

## అత్వ సంధి.

(1) "అత్తునకు సంధి బహుళముగానగు" అని చిన్నయసూరి; 'వాతః' అత్తునకు సంధి వైకల్పికమని ఆంధ్రశబ్దచింతామణి. బహుళ మనఁగా కొన్ని యెడల నిత్యముగానగుట; కొన్ని యెడలఁ గాకుండుట, కొన్ని యెడల వైకల్పికముగా నగుట; కొన్నియెడల నీ విధములలోఁ నెట్లును గాక మఱియొక తీరుననగుట; అని యర్థము. వైకల్పిక మనఁగా ఒక వ్యాకరణ కార్యము పర్యాయమున వచ్చుటయు రాకుండుటయునని యర్థము 'వా' యను సంజ్ఞకు బహుళమని యర్థము చెప్పుకొన్నఁ దప్ప చింతామణి సూత్రమునకవ్యాప్తి దోషము కలుగును. ఆ సంజ్ఞకు వైకల్పికమని యర్థము చెప్పుటయే వైయాకరణ మతమయినట్లు తోఁచుచున్నది. తెనుఁగున నత్తునకు సంధి బహుళమే కాని వైకల్పికము కాదు.

i. నిత్య సంధి:—(అ)మానుష సంజ్ఞావాచక శబ్దములపై 'అప్ప, అమ్మ, అక్క, అన్న, అయ్య' మొదలగునవి చేరునప్పుడు సంధి నిత్యము: సీతక్క, అప్పయ్య, మొదలైనవి. 'రామన్న' అన్నప్పుడు 'అన్న' భ్రాతృ వాచకము కాదు. 'రామన్' అను ప్రాతిపదికముపై 'అ'కారము చేరినది. అట్లే, 'రామయ్య' లోని 'అయ్య' పితృవాచకము కాదు. 'అ' 'పై' యశ్రుతి గలిగి 'రామయ' అయి, 'రామయ' రామాయ, రామయ్య అను రూపములు గలిగినవి. రామప్ప, కొండమ్మ.

(ఆ) కొన్ని విశేష్యములపై : తామర+ఆకు = తామరాకు ('తామర యాకు' అని కాదు).

ii. సంధ్యభావము : (అ) సంబోధనాంతములపై సంధిరాదు : రాముఁడ+ఇదిగో=రాముఁడ యిదిగో; కాని, కొందఱు కవులు సంబోధనాంతములపై సంధి చేసియున్నారు. ఉదా. ఎఱుఁగర జైనులారెన్నఁడు మీరు, ఒడులా రేటికి (బసవ పు. 154, 215.) మొదలైనవి. (ఆ) అవధారణార్థకాకారముపై సంధి రాదు; వాఁడ యేఁగెను.

(ఇ) ఇతరస్థలములందు వెలయాలు, మొదలైనవి.

iii. వైకల్పిక సంధి :

(అ) స్త్రీవాచక, తత్సమాంత శబ్దములపై నచ్చు పరమగు నప్పుడు సంధి వైకల్పికము : వచ్చెఁబోయిన నాప్రాణవల్లభనుచు (ప్రభా. II. 19);

తిచ్చె (ఆము.); గంగనుకాసె (ఆము. II. 9); శ్రీరంగభర్తంచు (ఆము. VI. 108); అట్టు ప్రీతియై తిరుగు నయ్యావని దేవుఁడు (పద్మ పు. IV. 8); వెలి ప్రపంచము మిథ్యని తెలిసి (రామస్త. 8.) గంగావలి నుండి (రామరా. పు. 302); వార్తతని (రామరా. పు. 419); పరమాత్మందురు (వరాహ. XI. 3); పంచిన నలువు (రాధికా. IV. 22); సీతఁదన దారని; వీరమాతట (జైమిని); పరమాత్మందురు (వరాహ.) దూతని (కవిక.); చేష్టుడిగె (ఆము.) పేర్తిని; మిథ్యని (పద్మపు.)-ఇట్టి వ్యావహారమున, 'ధరెక్కువైనది, శ్రమెం దుకు, వేళయింది,' మొదలగు సంధిరూపములు కాన్పించు చున్నవి.

(ఆ) విశేషణమైనట్టియు, షష్ఠీవిభక్త్యాత్మకమైనట్టియు నకారాంత శబ్దము మీఁదను, నకారాంతములగు గొన్ని యకారాంత క్రియారూపముల మీఁదను, కొన్నియవ్యయముల కచ్చు పరమగు నప్పుడు సంధి వైకల్పికము:- ఉదాహరణములు :

విశేషణములు : పిన్నోడలు (భోజరా. VI. 329); వేఁటమ్మోలు (మను. IV. 103); వింతందము (రాధామా. III. 42); పెద్ద పిన్నంతరవుల సంప్రీతినుంచి (శకుం. పు. 83); కనినాదగ (రాధామా. II. పు. 28); పౌండ రీకమన్నది (పాండు. II. 166), కిన్నంతి, విన్నంతి (రామరా. పు. 24); కట్టి నాతఁడు (రామరా. పు. 447); పుట్టినిల్లు, మెట్టినిల్లు (రామరా. పు. 456); ఒకప్పుడు (రామాభ్యు; VII. 190); ఒక్కోరణంబు (మను. IV. 58); మేనత్త; మేనల్లుఁడు; చిన్నన్న; పెద్దన్న, ఎఱ్ఱావు, దొడ్డమ్మ, మొదలైనవి.

షష్ఠ్యర్థక రూపములు : రాజులొద్ద (ఆద. I. 5); తల్లి దండ్రులొద్ద (భార. ఆది. VI); తిన్నాళ్ల తిప్పలు (వరాహ. III. 65); తామరస నేత్రు లిండ్ల (మను. II. 73); చందమామల్లుఁడు (నారం. I. పు. 5, 55); చింతాకు (పాండు. V. 39); జొన్నటుకులు (పద్మపు. X. 240); మామన్న (రామరా. పు. 360); ఈనెలంతి లలాటంబు లేనెలంత. విజయ.); సురారులమ్మ (భాగ వ.); సత్యమాహేశ్వరులిండ్ల (బసవ. పు. 116); గతిహీనులిండ్ల (బసవ. పు. 155); ఇతరులిండ్లైన (బసవ. పు. 171), వేల్పులొడయుడు, శుభక్తులిండ్ల(బస వ. పు. 240): మాభక్తులొద్ద బడుగులాగురు (బసవ. పు. 10?); పురోహితు లనుమతము (బసవ.) అన్యాయములు, నీ, కన్నాగతి లేకున్నాను-గను కీ మగు వన్ (శశి. పు. 29.); ఇంతెందుకు మొదలైనవి.

క్రియా రూపములపై : "అసమాపక క్రియలు : కాకేమి ? చెప్పకుం డెను ; పాలువ్రొకుండె (హర. VI. 225).

(2) సమాపక క్రియలు : ఇందువిగా. (ఉ హరి I 63); నిలగర రోయి (ఉ. రా. పు 79); తగుకోరి (హరి III. 53), ఎవ్వఁడవుగారె (హరి. III. 571); ఎవ్వఁడుగోరి (ఉ. హరి. III. 43).

కొన్ని విశేష్యములపై : మేడెక్కెను, నెలెంగ, చింతాకు

పై యుదాహరణములలో సంధి లేనందు కుదాహరణములను యడాగమము చేసి యేర్పఱుచు కొన వచ్చును.

వైకల్పికసంధిరూపములలోఁ గొన్నిట సంధిగల రూపముల కొక యర్థమును, సంధిలేని రూపముల కర్థభేదమును గలిగినవి. దొడ్డమ్మ యనఁగా తల్లియక్క ; దొడ్డయమ్మ యనఁగా నుదారబుద్ధి గలస్త్రీ ; పెద్దమ్మ యనఁగా జ్యేష్ఠాదేవియను నర్థమును గలదు, దొడ్డమ్మయను నర్థమునను దానికి గాడుక గలదు ; పెద్దయమ్మ = పెత్తనము వహించినస్త్రీ ; చిన్నల్లుఁడనఁగా నల్లుండ్రలో చిన్నవాఁడు ; చిన్నయల్లుఁడనఁగాఁ జిన్న వయస్సు గల యల్లుఁడు ; వయస్సెక్కువ యైనను కనిష్ఠయైన కూఁతురుమగఁడు చిన్నల్లుఁడే యగును ; మోటెద్దనఁగా మోటలాగెడి యెద్దు ; మోటయెద్దనఁగా పనికి లొంగని యెద్దు ;-ఇట్లే యర్థభేదములను బ్రయోగములను బట్టియు, వ్యవహారమును బట్టియుఁ దెలిసికొనవలెను. అర్థభేదము కలుగని చోట్ల సంధ్యభావరూపములు వ్యవహారమున లోపించినవి : ఉదా. చింతయాకు, మీఁదయుత్తు, మేన యల్లుఁడు, తెల్లయావు మొదలైనవి.

IV. సంధి నుఱియూకరీతిగా నగుట.

(అ) మానవ సంజ్ఞావాచకాకారాంత శబ్దములపై సంస్కృత పదాది నుండు నవర్ణము చేరునప్పుడు సవర్ణదీర్ఘసంధి కలుగును: ఉదా నన్నయార్యుఁడు, నన్నపార్యుఁడు, మాదమ్మాంబ (కళా I. 29); గౌరమాంబ (కళా. I. 39); కొండమాంబ (కళా I 83); కొండమాంబిక (కళా. I. 102); ఇట్లే, లప్పలాచార్యులు మొదలైనవి.

(ఆ) కొన్ని విశేష్యములపై : తామర+ఆకు = తామరాకు

## ఇతర సంధి.

### I. దీర్ఘాచ్చులపై సంధి

(1) ఆ, ఈ, ఊ, ఏ, ఓ లపై నచ్చు పరమైనచో గ్రంథములందు సంధి కలుగకపోవుటయేకాక యడాగమము గూడ వచ్చును : వాఁడా యా పోవువాఁడు ; నేనేయనెను ; బలాత్కారా యిటువస్తు, వాఁడేయేడ్చెను ; నీవు రావూయేమో, మొదలైనవి.

వ్యవహారమునఁ గొన్నియెడల నీయచ్చులపై సంధి కలుగక యచ్చులు ప్రత్యేకముగా నిలుచును. యడాగమము రాదు. 'మాఅమ్మ, మీఆవు' కాని 'మాయిల్లు, మీయావు ; వాడు వస్తేయేమి, రాకపోతేయేమి'. (ఇచ్చట నగాగమము కూడ వచ్చును ; వస్తేనేమి, చస్తేనేమి.)

(2) హ్రస్వ ఎకారముపై నొకొప్పుడు వ్యవహారమున సంధి కలుగును: ఆపెట్టె+ఇక్కడికి తీసుకురా = ఆపెట్టిక్కడికి తీసుకురా. గ్రంథములం దిట్టి సంధి కానరాదు.

(3) ఏయచ్చుతోనైనను బరమైయున్న ఋకారము కలియదు. యడాగమమును రాదు : ఆ ఋషి పుత్రుఁడు (ఆది. II) ; నవ్ ఋషులు (పాండు. II. 207)-ఇది 'సన్నృషులు' అని కాదు.

(4) ఓకారముపై ననుధాతువు పరమైనప్పు డొకానొకచో ఓత్వము నకు హ్రస్వమును, ద్విత్వ మకారాగమమును గలుగును : వీఁడుగో+అని = వీఁడు గొమ్మని.

(5) "అది, అవి శబ్దంబుల యత్తునకు వృత్తినిలోపంబు బహుళంబు గనగు"- ఉదాహరణములు : నా+అది = నాది, నాయది; నా+అవి = నావి, నాయవి ; ఇట్లే, నీది, నీయది, మీది, మీయవి, తనది, తన యది మొదలైనవి.

'కాఁపు+అది' అన్నప్పుడు 'కాఁపుది' అని గ్రంథములందు సిద్ధించును గాని, వ్యవహారమునందువలె 'కాఁపది' అని సంధి కలుగవచ్చును ; చూ. ఆఁడది ("అది యాఁడది యని చూడకుము మిగుల డాయఁగ వచ్చెన్" (యయాతి) నా, మా శబ్దములపై అన్న, అమ్మలు కలిసి వాని యత్వమునకు లోపము కలుగు నపు డర్థభేదము గలుగును. నాన్న = తండ్రి ; మాఅమ్మ = తండ్రితల్లి; 'నా'శబ్దముమీఁద 'అన' చేరి సంధి కలుగకున్నను నర్థభేదము కలుగును. నాయన = తండ్రి. 'కాఁపునది' అను ననిష్టరూపమును గలుగదు.

నాది, మాది అనుచోట్ల బూర్వరూపసంధి కలిగినదని యైనఁ జెప్ప వచ్చును.

(6) "అంద్వవగాగమంబులం దప్ప నపదాది స్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు.—ఉదా. మూర+ఎడు = మూరెడు ; వీసె+ఎడు = వీసెడు ; అర్థ+ఇంచు = అర్థించు ; నిర్జి+ఇంచు = నిర్జించు - అంద్వవగాగమంబులు పరంబు లగునపుడు యథాసంభవముగా గ్రహించునది. రాములందు, రాములయందు ; ఎనిమిదవది, ఎనిమిదియవది- ఇచట వైకల్పికము ; హరి+ అందు = హరియందు-ఇచ్చట సంధిలేదు ; మొదలైనవి.

మువర్ణాంత శబ్దములపై అందువర్ణకము పరమైనచో నొకప్పుడు నవర్ణ మాగమముగా వచ్చును: ఉరమునయందు గన్నులు (భార. అర. VI.); అనిమిషనాయకత్వమునయం దభిషిక్తుఁడవై (భార. అర. V.); విదర్భ దేశమునయందు (నైష. III.); దైవంబునయందు (మార్క. III.); పిండదాన సమయంబునయందు (హరి. పూ. II.); తనువునయందు (భార. అర. III.); చెనటి దేహంబునయందు (మార్క. III.); పటమ్మునయందు (పాండు. V.); కాశీఖండమున "నిండు జవ్వనంబునయందు; గోలోకమునయందు; కాశీపురాంగణంబునయందు; మహాశ్మశానమునయందు; ఉడుపథంబునయందు; కటిభాగమునయందు; తన్మధ్యమునయందు; త్రేతాయుగంబునయందు; యదువంశమునయందు" మొదలగునవి.

పరిమాణార్థకమైన 'ఎడు' వర్ణకము పరమైనప్పు డన్నియచ్చులకును సంధి నిత్యముగా వచ్చును, గాని యది చేరునప్పుడు కొన్ని శబ్దముల తుదివర్ణము లోపించు చుండును: ఉదా. దోసిలి+ఎడు=దోసెడు; పిడికిలి+ఎడు = పిడికెడు; గుప్పిలి+ఎడు = గుప్పెడు; సందిలి+ఎడు=సందెడు; పట్టిలి+ఎడు=పట్టెడు; కొణిదిలి + ఎడు = కొణిదెడు. ఈ లోపము 'ఇలి' అంత మందుగల శబ్దములందు మాత్రము గలుగునేమో, కంచము+ఎడు=కంచెడు; విస్తరి+ఎడు= విస్తెడు; అని సంధి కాదు.

కొన్ని శబ్దములపై 'ఎడు' వర్ణకము చేరకయే పరిమిత్యర్థము కలుగును: పదలము చక్కెర; అమడ దూరము; గజముగుడ్డ మొదలైనవి.

## ఆమ్రేడిత సంధి.

(1) "అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱుచుగనగు- ద్విరుక్తముయొక్క పరరూప మామ్రేడితమనంబడు. తఱచుగననుటచే నొకానొకచోట వైకల్పిక సంధియుం గలదని తాత్పర్యము-ఔర + ఔర=ఔరౌర; ఆహా + ఆహా = ఆహాహా; ఎట్టూ + ఎట్టూ = ఎట్టెట్టూ; ఓహో+ఓహో = ఓహోహో; ఏమి + ఏమి = ఏమేమి, ఏమియేమి (ఏమ్యాదుల అను సూత్రముచే వైకల్పికసంధి.)-ఏఁగియేఁగి అనుచోట క్త్వార్థ కేకారగసంధి.

(2) ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్త టకారంబగు. ఉదా: కడ + కడ = కట్టకడ; ఎదురు + ఎదురు = ఎట్టయెదురు; - కడ, కొన, ఎదురు, చివర, తుద, తెన్ను, తెరువు, నడుము, పగలు, పిడుగు, బయలు, మొదలు ఇత్యాదులు కడాదులు. వీనికి మిట్టు, మధ్యాహ్నము, అడుగు, మీను, చీఁకటి,

తిన్నె, తేట, నిలువు, దొ(తో)రువు, చుమ్మ అను వానినిగూడఁ జేర్చికొన వలెను. వీనిలో సంధియందు ద్విరుక్త టకారము భృశార్థమున వచ్చును.

వీనియందెల్ల సంధిరూపమున ప్రథమావయవముగ నున్నపదములు సంధివశమున వచ్చినవికాక, ప్రత్యేకపదములనియే చెప్పవలసి యుండును. ఆ పదములు కొన్నియెడలఁ దెనుఁగునందును గొన్నియెడల నితర ద్రావిడ భాషలయందును గాన్పించుచుండును. వానిలోఁగొన్ని యితర ద్రావిడభాషల యందు వ్యస్తప్రయోగముఁ గలిగినవైనను దెనుఁగున నిట్టి సమాసరూప ములందే కనఁబడుచున్నవి.

తెనుఁగు. కట్ట (కడ); కన్న. కట్ట = కడ (కట్టుత్తర = తుదిప్రత్యుత్త రము; కట్టపంజర = తుదినున్నపంజరము); - తెనుఁగు: కొట్ట (కొన); కన్న. కొట్ట = తుది; - తెనుఁగు: చిట్ట (చివర), చివర=* చివ్ర=* చిఱ్ఱ=* చిట్ర=* చిట్ట; - తెనుఁగు: తుట్ట (తుద); కన్న. తుట్ట- = కడకొన; తెనుఁగు: తుట్ట మర (=బొత్తిగా) = తుట్ట + అమరక్ = తుదచేసువఱకు. తెట్ట (తెన్ను = తెరువు); చూ. తమి. తెట్టత్తెళియ = విస్పష్టముగా; తెట్టత్తెఱిక్క- = మఖ్యాసు విరియు; - తెనుఁగు: నట్ట (నడుము); కన్న. నట్ట = మధ్యముననున్న; నట్ట గొంబు = మధ్యనున్నకొమ్మ; తమి. నట్టమ్ = నిట్ట - నిలువు; - తెనుఁగు: పట్ట (పగలు); తమి. పట్టప్పగల్ (ఇాదు 'పట్ట' కుతగిన యుదాహరణము దొరకలేదు; తమిళములో 'పఱ్ఱఱు' అను తుమున్నర్థక రూపమున్నది; దానికి తెగిన, పగిలిన, అనునర్థముగలదు. పఱ్ఱ = పట్ర = పట్ట, అను రీతి మార్పు గలిగియుండనచ్చును.) - తెనుఁగు: పిట్ట (పిడుగు); కన్న. పిట్టు = పిడుగు; - తెనుఁగు: బట్ట (బయలు); కన్న. బట్ట = శూన్యము, బయలు;- తెనుఁగు: మొట్ట (మొదలు); కన్న. మొట్ట=సరిగానున్నది; కన్నడమున 'మొట్ట'కు రూ పాంతరము 'మట్ట', చూ. తెనుఁగు: 'మట్ట' (మధ్యాహ్నము); 'మిఱ్ఱు' కు తెనుఁగుననే 'మిట్ట' యను రూపాంతరమున్నది. అట్లే 'మిట్ట' (మీను) లోఁ 'మిట్ట' యనున దొకవిధమగు చేపకుపేరు. అట్లే, తిన్నెకు 'తిట్ట' యను రూపాంతరము 'పోఁ' గు అనునర్థమునఁ దెనుఁగుననే కలదు. తెనుఁగు: తెట్ట (తేట)దీనికి ద్రావిడభాషలయందు 'తేఱు' అనునది ధాతువు; దీనినుండి 'తెఱ్ఱ' కలిగి* 'తెట్ర' = 'తెట్ట' యనురూపము పుట్టినది.- తెనుఁగు: నిట్ట (నిలువు) * తెనుఁగుననే నిలువునకు 'నిట్ట' యనురూపాంతరము గలదు. - తెనుఁగు: తొట్ట (దొరువు) ; 'దొరువు' తొలుతపరుసాది; దానికి కన్నడమున 'తొత్తె' 'తొట్టె' అను రూపాంతరములు గలవు. కన్న. తొట్టె = తెనుఁగు: తొట్ట;- తెనుఁగు; చుట్ట (చుమ్మ) తెనుఁగున చుట్టయన్నను చుమ్మయన్నను నర్థ

మొక్కటే; తెనుఁగు; అట్ట (యడుగు); కన్న. అడు, క్రియాజన్య విశేషణము: అట్టు; తెనుఁగు: చిట్ట (చీఁకటి); కన్న. చిట్టు, చిట్టిను, తెనుఁగు: చిట్లించు=కన్నులు మూయు మొదలైనవి.

పైదానినిబట్టి యామ్రేడితసంధిరూపములని చెప్పఁబడు పై సమాసములో పూర్వపదములు సంధి వశమున వచ్చినవి కావనియుఁ బ్రత్యేకముల యినను బరపదములకు రూపాంతరము లనియు, ఇచ్చట నామ్రేడిత ప్రసక్తిలే దనియుఁ దేలుచున్నది. ఇదిగాక, యిట్టిచోట్ల ద్విరుక్త టకారరూపములేకాక, భృశార్థమునందే పరపదములో సమానార్థములుగల యితరపదములును రావచ్చును: బట్టబయలు, బటాబయలు, బటాకబయలు, బటారుబయలు; నిట నిలువు, నిటాకనిలువు, నిటారునిలువు; చిట్టచీఁకటి, చిటాకచీకటి, చిటారుచీఁకటి, చిమ్మచీఁకటి, మొదలైనవి. ఇట్టి రూపములనన్నిటిని "అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు" అనిచెప్పి చిన్నయసూరి "అందదుగు, ఇట్టింకులు, ఇల్లిగ్గులు, చెల్లచెదరు, చెల్లాచెదరు, తుత్తుమురు; తుత్తునియలు, మిఱుమిట్లు, ఇత్యాదు లెఱుఁగునది" అని చెప్పెనాఁడు. వీనియందును నామ్రేడిత ప్రసక్తిలేదు. పై సమాసములందలి పూర్వపదములు ప్రత్యేకములు గాని, సంధివశమున వానికారూపములు గలుగలేదు. ఆ పదములు తెనుఁగునఁ గాకున్నను నితరద్రావిడభాషలయందుండి, అవి ద్రావిడభాషలకు సామాన్యములనుటను దెలుపుచున్నవి. కన్న. అందు = అదుకు; తెనుఁగు: ఇవురు = ఇవ్రు =* ఇఱ్ఱు = ఇంకు; తెనుఁగు: ఇవులు = ఇవ్లు = ఇల్లు = ఇగ్గు; సంస్కృతము: ఛిద్ర = * ఛిదర్, చెదల్, చెదర్ = చెదరు; చెదల్ = చెదల =* చెద్ల = చెల్ల; - కన్న. తుత్తు = తుమురు = తునియ= తునుక = ముక్క;- కన్న. తమి. మిఱ్ఱు = తెనుఁగు: మిట్టు = ప్రకాశించు; మొదలైనవి. ఇట్లే తుందుడుకు, తుందునుకలు.

భృశార్థంబునఁ గాక యితరార్థములందును నామ్రేడితము వచ్చును. అట్టియెడ సంధియం దనేకవిధములగు నాగమాక్షరములు వచ్చుచుండును: ఉదా. కోటానకోటులు, కోటానంగోటులు, లక్షలకులక్షలు, లక్షలు లక్షలు; వేలకువేలు, వేలువేలు; వందలకు (నూర్లకు) వందలు (నూర్లు); చెరచెర, చెచ్చెర.

(3) "ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబు గానగు".

ఉదా. అప్పటికిన్ + అప్పటికిన్=అప్పటప్పటికిన్, అప్పటి కప్పటికిన్; అక్కడన్ + అక్కడన్ = అక్కడక్కడన్, అక్కడనక్కడన్ ; ఇంటన్ +

ఇంటన్ = ఇంటింటన్, ఇంటనింటన్; ఊరన్ + ఊరన్ = ఊరూరన్, ఊర నూరన్, మొదలయినవి.

ఇంచుక, నాఁడు, ఇత్యాది శబ్దముల కామ్రేడితము పరమైనచో వాని యంతిమాక్షరము వైకల్పికముగా లోపించును: ఇంచుక + ఇంచుక = ఇంచించుక, ఇంచుకించుక; నాఁడు + నాఁడు = నానాఁడు, నాఁడునాఁడు; - కాని, నేఁడు + నేఁడు = నేనేఁడు; జేపు + జేపు = జేజేపు మొదలగు రూపములు కలుగవు.

(4) "ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముడుజ్జులకు లోపంబు విభాషనగు.

ఉదా: ఉండుము + ఉండుము = ఉండుండుము, ఉండుముండుము.

కొట్టుఁడు + కొట్టుఁడు + కొట్టుకొట్టుఁడు, కొట్టుఁడుకొట్టుఁడు.

ఆమ్రేడితంబు పరంబగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘంబగును.

ఉదా: లెమ్ము + లెమ్ము = లెమ్ములెమ్ము, లేలెమ్ము; పొమ్ము + పొమ్ము= పొమ్ముపొమ్ము, పోపొమ్ము; తెమ్ము + తెమ్ము = తెమ్ముతెమ్ము, తేతెమ్ము; రమ్ము + రమ్ము=రమ్మురమ్ము, రారమ్ము, కమ్ము + కమ్ము = కమ్ముకమ్ము, కాకమ్ము; కొమ్ము+ కొమ్ము = కొమ్ముకొమ్ము, కోకొమ్ము - ఇట్లే. రారండు, పోపొండు మొదలయినవి.

'ఇమ్ము' నకామ్రేడితము పరమగునపుడు కృతహ్రస్వమునకు దీర్ఘము రాదు. ఇమ్మిమ్ము ('ఈయిమ్ము' అని కాదు. అట్లే 'ఈయిండు' అనియుఁ గాదు).

## సమాససంధి.

(1) "సమాసంబునందు ద్రుతంబునకు లోపంబగు" - చిన్నయసూరి. "ద్రుతస్య సర్వత్రలుక్ సమాసేషు" అను చింతామణి సూత్రమున కిది తెనుఁగు. తెనుఁగున సమాసముల నహోబలపండితుఁడు తత్సమసమాసములు, మిశ్రసమాసములు, సమాసకములు, ననిమూఁడువిధములుగ నేర్పాటుచేసెను. కేవల తత్సమపదముల సమాసము తత్సమసమాసము; తత్సమాచ్ఛికపదముల సమాసము మిశ్రము; సమాసమునఁ బదములన్నియు నాచ్ఛికములైనచో నది సమాసకము. వీనికుదాహరములుగ రాముని గుణములు, ఆతని యాకృతి, సీతారాముల ప్రాపు, వారిపెంపు, వీరిసొంపు, - మొదలగునవి తెలుపఁబడినవి. వీనియందు ద్రుత ప్రసక్తి లేకపోయినను, రాముని, ఆతని, సీతారాముల, వారి, వీరి అనుశబ్దములు షష్ఠీస్థానమున నిలిచిన ద్వితీయా రూపము లనుకొని, ద్వితీయయందు ద్రుతరూపమున వచ్చు నువర్ణము నాశంకించికొని, ఆ నువర్ణమునకు

లోపము కలుగునని యహోబలుఁడు సమర్థించినాఁడు. ఈ సమర్థనము సరికాదనియు, నువర్ణము ద్వితీయావైభక్తిక ప్రత్యయ నువర్ణమనియు, నది ద్రుతప్రకృతికము కావున ద్రుతము లోపింపఁగా మిగిలిన రూపము లతో రామును గుణములు, సీతారాములనుఁ బ్రాపు, వారినిఁ బెంపు, వీరిని సొంపు, ఇట్టి రూపములు సాధువులు కావలసివచ్చుననియు శంకించి యొక రీయుదాహరణములు సరియైనవి కావని చెప్పుచున్నారు. - ఈ పక్షమున నాంధ్రశబ్దచింతామణి చొప్పున నహోబలుఁ డిచ్చిన వైసమాసరూపము లకు గతిలేకపోవును. కాని, యాలోచించినచో నహోబలుని సమర్థనము సరియైనది కానట్లే తోఁచుచున్నది. ఆతఁడిచ్చిన షష్ఠీరూపములందు ద్రుత ప్రసక్తియే గోచరింపదు; కావున తల్లోపప్రసక్తియు గలుగదు. లేని ద్రుతము నూహించుకొని, దానికి లోపమును గల్పించుట సూత్రార్థమును సమర్థించు నుత్సాహము వలనఁ గలిగినదికాని మఱియొకటి కాదు. వైసూత్రమున కుదాహరణము లహోబలుఁ డిచ్చిన ''మాటనేర్పు = మాటన్ నేర్పు; పడగదాల్పు = పడగన్ దాల్పు'' అను రీతి నున్నవానినే చింతామణి సూత్ర ముద్దేశించినట్లు తోఁచుచున్నది ఇట్టి యుద్దేశముతో డనే కావలయుఁ జిన్నయసూరి 'ఎల్లయర్థములు, ఎల్లకలుషములు' అని యుదాహరించి యూరకొన్నాఁడు. మాటనేర్పు, పడగదాల్పు వంటి రూపము లనుగూడ నాతఁ డుదాహరింపకుండుట విచార్యము. ఉదాహరించినను ద్రుతమునకు సమాసమున నిత్యలోపము నవి సాధింపఁజాలవు. 'నేర్పు' అనున దుత్తరపదమగుటచే స్థిరవర్ణము పరమగుటచేత ద్రుతమునకు మాఱుగ నచట బిందువు నిలుచుట కవకాశము లేకపోయినది. 'పడగదాల్పు' అనునది సరియగు రూపమో 'పడగఁదాల్పు' అనునది సరియగు రూపమో నిర్ణ యించుట కాధారములగు ప్రయోగములు కానరావు ''సర్వ పర్యా యంబయిన యెల్ల శబ్దంబు ద్రుతాంతంబయిన యవ్యయంబు'' గావున సమాసమందు దాని ద్రుతమునకు లోపము గలిగినది. ఈ యెల్ల శబ్దమున ''కసమాసంబున విశేష్యమునకు ముందు ప్రయోగంబులే'' దని చిన్నయ సూరి యభిప్రాయము కాని, శ్రీనాథుఁడు 'ఎల్లన్ శిష్యులఁగొంచు వత్తునా' (భీమ. II.) అని ప్రయోగించియున్నాఁడు. ఈ ప్రయోగముపై లక్ష్యముంచియే ప్రౌఢవ్యాకరణ కారుఁడు ''సర్వ పర్యాయంబగు నెల్ల శబ్దమునకు సప్తమియు, విశేష్యంబులకుముందు ప్రయోగంబును జూప ట్టెడు'' నని సూత్రించియున్నాఁడు. సూత్రము రెండవభాగమును బట్టి 'ఎల్లయందు' అను ప్రయోగము గ్రహింపఁ బడుచుండుటచే 'ఎల్ల' శబ్ద మవ్యయము కాకపోవుచున్నది. అయినను వైసూత్రవిచారమున ఎల్ల శబ్దము

నవ్యయత్వముతో మనకుఁ బనిలేదు. ఎల్ల శబ్దము వంటిదియు నెల్లవిధముల నవ్యయమైనట్టియు 'కడున్' అను ద్రుతాంతావ్యయమునకును సమాసమున ద్రుతము వైకల్పికముగనే లోపించును గాని సూత్రమందు విధింపఁబడి నట్లు నిత్యముగ లోపింపదు. కడుగొప్ప, కడుంగొప్ప, అను రెండు రూపములును సాధువులే. ఇందు మొదటిది సమాసమునకును రెండవది, యసమాసమునకును నుదాహరణము లనరాదు. 'ఎల్లశిష్యుల' వలెనే 'కడుంగొప్ప' యు సమాసమే. కావున, సూత్రోద్దిష్టమగు సమాసములు నిత్యలోప విషయకములుగావు. కాని,

(2) "సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబులేదు." అనఁగా 'ఎల్లనుశిష్యులు' కడునుగొప్ప, చిగురును గయిదువు, తలను బ్రాలు మున్నగు రూపము లుండవు.

(3) "తలఁ బ్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపములేదు" అని చిన్నయసూరి "సమాసంబుల ద్రుతంబునకు లోపంబగు" ననఁగా నిత్యముగా నగునని యూహించి ప్రత్యేకసూత్రమును జేసినాఁడు. "తలఁబ్రాలు, ఒడిఁబ్రాలు, సేసఁబ్రాలు, ఊరఁబంది, ఊరఁబిచ్చుక" అను సప్తమీతత్పురుషసమాసములందు ద్రుతము సంపూర్ణముగ లోపింపలేదు; అదిబిందువుగ మాఱియున్నది. పూర్ణబిందువుతో "తలంబ్రాలు, ఒడింబ్రాలు, సేసంబ్రాలు" అనురూపము లుండవచ్చునుగాని "ఊరంబంది, ఊరంబిచ్చుక" అను రూపములుండవచ్చునో కూడదో తెలియదు; ప్రయోగములు మృగ్యములు. తోడఁ బుట్టువు, తోడంబుట్టువు, తోఁబుట్టువు, అనునవి తృతీయాతత్పురుష సమాసము లనవచ్చును. "ఒల్లఁబాటు, ఒడఁబాటు" అనువానిలోని "ఒల్లన్, ఒడన్" అనునవి "ఒల్లు; * ఒడు" అనుధాతువుల తమున్నర్థక రూపములు, ద్రుతాంతములు. ఇట్టి సమాసములలో "పిల్లఁ గ్రోవి (హరి. పూ. VII. పు. 181); పిల్లనఁ గ్రోవి; కోటానంగోటులు (కళా. II. 141); బొడ్డునంబంటి, ఒమ్మునంబంటి, మొదలగు వానిని గూడఁ జేర్పవలెను. కోటాన కోటులు, బొడ్డనబావులు (ప్రభా. IV. 55); బొడ్డునబంటి, ఒమ్మునబంటి మొదలగు ద్రుతలోపముగల సమాసములును గలవు.

(4) ఇట్లు సమాసములందు ద్రుతమునకుఁ జాలప్రాముఖ్యముండుటచేతనే సహజముగ ద్రుతప్రకృతికములుకాని పదములు పూర్వపదములై యుత్తరపదముతో సమసించునప్పుడు ద్రుతప్రాయమగు నుగాగమమును విధింప వలసి వచ్చెను.

i. "సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగు నపుడు నుగాగమంబగు: ఉదా. చిగురు + కయిదువు = చిగురును గయిదువు. తళుకు+గజ్జెలు = తళుకునుగజ్జెలు సింగపు + కొదమ = సింగపును గొదమ; ఉన్నతంపు + గొడుగు = ఉన్నతంపును గొడుగు. సమాసమున ద్రుతమునకు స్వత్వము లేదుగావున నీరూపము లుండవు" లోపసంశ్లేష బిందువులు సందర్భమునుబట్టి వచ్చును: చిగురుంగయిదువు, చిగురుఁగయిదువు, చిగురున్గయిదువు; తళుకుగజ్జెలు, తళుకుం గజ్జెలు తళుకున్గజ్జెలు; సింగపుంగొదమ, సింగపుఁగొదమ, సింగపున్గొదమ; ఉన్నతంపుగొడుగు, ఉన్నతంపుంగొడుగు, ఉన్నతంపు న్గొడుగు.

ఈ సూత్రములోని 'పుంపు'లు "కర్మధారయంబునందు ము వర్ణకంబునకుం బుంపులగు" ననుసూత్రముచేఁ గలుగుచున్నవి: ఉదా. సరసము + మాట = సరసపుమాట, సరసంపు మాట; విరసము + వచనము = విరసపు వచనము, విరసంపు వచనము మొదలైనవి. వీనికి "సరసపున్మాట, సరసంపున్మాట; విరసపున్వచనము, విరసంపున్వచనము" అని రూపాంతరములుకూడ నగును.

ము వర్ణమునకుఁ బుంపులు కర్మధారయేతరసమాసములందును వచ్చును. గుఱ్ఱపుజీను, కన్నపుదొంగ, ఆకాలపు వాన, కయ్యపు వెఱపు మొదలైనవి. ఇట్టి ప్రయోగములు భారతేతరగ్రంథములందే కాన్పించుచున్నవి. ము వర్ణకేతర వర్ణములమీఁదను పుంపు లాదేశాగమాత్మకముగఁ జేరును-తామరపాకు మోదుపాకు, మొదలయినవి.

ii. ఉదంతమగు తద్ధర్మార్థక విశేషణమున కచ్చుపరంబగునపుడు నుగాగమంబగు" - చేయు + అతఁడు = చేయునతఁడు : చేసెడు + అతఁడు = చేసెడునతఁడు (ఈ సూత్రమును గూర్చిన విచారము అచ్సంధి విషయమునఁ జేయఁబడినది.)

iii. "షష్ఠీసమాసమునం దుకార ఋకారంబులకచ్చు పరంబగు నపుడు నుగాగమంబగు" నని చిన్నయసూరి. ఉదా. రాజు + ఆజ్ఞ = రాజునాజ్ఞ; విధాతృ + ఆనతి = విధాతృనానతి. ఈ నుగాగమమునకు లోపము గలుగునని ప్రౌఢవ్యాకరణకారుని నవరణము. ఈ నవరణమునకు మఱికొన్ని యుదాహరణములు:

కట్టఱుత (మను. IV. 6); ఏటలవి (మను. IV. 44); పట్టంబరములు (ఉ. రా. V. పు. 97); ఱేకందము (అహ. సం. పు. 2); గెలుపాన (వరాహ. XI. 109); ఏనుఁగఱుత (పద్మపు. VI. 87); చోటందము (రాధికా. III. 113); మోమందము (రాధికా. III. 137); పట్టమేనుఁగు

(పాండు. I. 77); - ఇట్లే గోకులమిల్లలు (హరి. పు. V.); నిర్జరోత్తమ బింబంబొప్పు (ఉ. హరి. VI); మొగమందము (రుక్మి. V.); బచ్చింట (పాండురం. III.); శిరసందము (కళా. VII.); నిషధరాజంతవాని (నైష.) గట్టురాజల్లుఁడు (రామాభ్యు.) వెన్నునియన్ను + అన్న = వెన్నుని యన్నన్న (విజయ. I.) దీనిని బట్టి షష్ఠీసమాసమున నుత్తున కచ్చు పరంబగునపుడు నుగాగమ మర్వాచీనకావ్యములందు బహుళముగ బరిణమించెనని తెలిసి కొనవచ్చును. ఋకారమున కచ్చుపరమగుచో నుగాగమము నిత్యముగనే కాన్పించుచున్నది.

iv. "ఉదంత స్త్రీ సమంబులకును ఋంపులకు నదంత గుణవాచకంబులకును 'తనంబు' పరంబగు నపుడు నుగాగమంబగు"—పై (i) లో ఉదంతములకును స్త్రీ సమంబులకును బరుషములు పరమగుచో నుగాగనుము గలుగునని చెప్పఁబడియుండఁగా పరుషాదియగు 'తనము' పరమగునప్పుడు మఱల నుగాగమమును విధించుట పునరుక్తిగఁ గాన్పింపవచ్చును. కాని, (i) లో సమాసవిషయమున నుగాగమము విధింపఁబడినది. ఇచట 'తనము' ప్రత్యయ మను భావముతోఁ జిన్నయసూరి యీ సూత్రమును చెప్ప వలసి వచ్చెను. కాని, 'తనము' అనునది తెనుఁగునఁ గేవల ప్రత్యయమా యను విషయమున సందేహము కలుగకమానదు. చేతఁగాని తనము, అత్తగారి తనము, ఒకరిని చూచియోర్వలేక యసహ్యించుకొను తనము— ఇట్టివానియందు 'తనము' భావమను నర్థమున వాడఁబడిన ప్రత్యేకపదము గనే గోచరించుచున్నది. కావున, 'తనము' పరమైయున్నను నది సమాస విషయమే కాని పదప్రత్యయసంయోజనవిషయము కాదు. అందుచే నొక రీతిగఁ బై సూత్రము పునరుక్తమే యనుకొనవచ్చును. పూర్వోక్తసూత్ర ములం దుకారాంత ఋకారాంత పదములపై సమాసమున నుగాగమము విధింపఁబడుచుండఁగా నీ సూత్రమున నదంతగుణవాచకముల మీఁదను, 'తనము' పరంబగునపు డాయాగమమే విధింపఁబడుట విశేషము. ఉదాహరణములు: సొగసుందనము. సొగసుఁ దనము, సొగసున్దనము; సరసపుంద నము, సరపుఁదనము, తెల్లందనము, తెల్లఁదనము, తెల్లన్దనము. "ఎఱ్ఱంజెఱువు" (ద. హిం. శా. IV. 704) మొదలగు ప్రయోగములను బట్టి 'తనము' పర మగు నప్పుడే కాక యితరపదములు పరమైయున్నను నుగాగమము కలుగ వచ్చును.

"నానాదేసిం పెక్కంద్రు" (ద. హిం. శా. IV. 939): మొదలగు ప్రయోగములను బట్టి పై కార్యము లికారాంత పదములపైఁ గూడఁ గలుగ వచ్చునని గ్రహింపవలెను.

"తెల్లందనము" మొదలగు వానిలో నాగమ నువర్ణమునకుఁ బూర్ణబిందువు రావచ్చును గాని యర్ధబిందువును వచ్చుటకుఁ బ్రయోగములు గానరాలేదు. ఇట్లే 'పెనుంగొండ' అను దానికి, 'పెనుఁగొండ,' యనురూపాంతరము కానరాదు. కొన్ని యెడల (తమ్ముఁ గుఱ్ఱలు,అల్లుఁ గుఱ్ఱలు) మొదలగు వానియం దర్ధానుస్వారము కాన్పించుచున్నను నవి డుజ్వర్ణవిషయకములు గావున నఱసున్నలు కాన్పించుచున్నవేమో.

అదంతవిశేషణములనైఁ బ్రయోగములందు పరుషములకు గసడదవాదేశము కాన్పించుచున్నది గాని సరళాదేశము కాన్పించలేదు: పెద్ద + కాలము = పెద్దగాలము మొదలైనవి. అట్లే 'ఎఱ్ఱ+తనము = ఎఱ్ఱదనము' అగునుగాని 'ఎఱ్ఱందనము' అని కాదని తోఁచుచున్నది. కాని, "ఎఱ్ఱ+చెఱువు" అనునప్పుడు పూర్ణబిందువు వచ్చి 'ఎఱ్ఱంజెఱువు' అని శాసనములందు గానవచ్చుచున్నది పూర్ణబిందువు రానప్పుడు 'ఎఱ్ఱసెఱువు' అని కావలసి యుండును; నేఁటి వ్యవహారమున గసడదవాదేశమే వినఁబడుచున్నది.

(3) "కర్మధారయంబులం దుత్తున కచ్చుపరంబగు నపుడు టుగాగమంబగు" నని చిన్నయసూరి చెప్పుచు, కఱకు + అమ్ము = కఱకుటమ్ము; నిగ్గు+అద్దము = నిగ్గుటద్దము; సరసపు + ఉలుక = సరసపుటలుక అను నుదాహరణముల నిచ్చెను మదపుటేనుఁగు, ముద్దుటుంగరము, పోతుటీఁగ, పెంకుటిల్లు మొదలగునవియు నుదాహరణము లగును.

ప్రౌఢవ్యాకరణకారుఁ డీ సూత్రమును సవరించుచుఁ గర్మధారయేతర సమాసములందును, తద్వ్యతిరిక్తస్థలములందును నీ టుగాగమము వచ్చునని చెప్పి కొన్ని యుదాహరణముల నిచ్చియున్నాడు. ఈ యాగమము నిత్యముకాక బహుళమనియు, టుగాగమమేకాక యితరాగమమును వచ్చుననియు టుగాగమ ముకారాంతవ్యతిరిక్తస్థలములందును, కర్మధారయేతర సమాసములందును వచ్చుననియు సవరింపవలసి యున్నది. ఉదాహరణములు:

i. కర్మధారయేతరసమాసములందు: వేల్పుటావు, ముద్దుటుంగరము, పోతుటీఁగ, పెంకుటిల్లు.

ii. బహుళమనుటకు: తప్పడుగు (హరి. పూ. VIII పు. 186); పట్టపేనుఁగు (ఉ రా. V. పు. 97): పట్టమేనుఁగు (పాండు. I. 77); పొదరిల్లు, పొదరుటిల్లు; చిగురాకు, చిగురుటాకు మొదలయినవి.

iii ఉకారాంత వ్యతిరేకశబ్దములనై: నిద్రాటిల్లు, పల్లెటూరు, దుక్కిటెద్దు, తేనెటీఁగ, పక్కటెముక ; పడకింట్లు (రాధికా II. 12) ; మొదలయినవి.

వీనిని పేర్వాదులలోఁ జేర్చుకొనవలయునన్న సరిపోవచ్చును; కాని, ఉకారాంత పదములనే పేర్వాదులలోఁ జేర్చుకొనవలయునని చిన్నయసూరి యభిప్రాయమైనట్లు కనఁబడుచున్నవి. పేర్వాదులకును కర్మధారయమున టుగాగమము బహుళమే కాని, వైకల్పికముకాదు: చిగురు + అడుగులు = 'చిగురుటడుగు' (పాండు. III. 179), లగునుగాని, చిగురడుగులను ప్రయోగము కానరాదు.

వాలు + అమ్ము = వాలురమ్ము (హరి. పూ. IX. పు. 204); పాము + అమ్ము = పాపరమ్ము (యయా.) అనుచోట్ల రేఫాగమము గలిగినది.

"పేదాది శబ్దంబుల కాలుశబ్దము పరంబగునపుడు కర్మధారయము నందు రుగాగమంబగు. పేద+ఆలు = పేదరాలు ; బీద+ఆలు=బీదరాలు; - పేద, బీద, ముద్ద, బాలెంత, కొమ, జన, అయిదువ, మనుమ, గొడ్డు, ఇవి పేదాదులు. ఇందు జవ్వని శబ్దంబునకు జవాదేశంబని యెఱుంగునది. ఏకాంతమునందు నున్న జవరాండ్రని ప్రయోగము," - చిన్నయసూరి.

ఆలుశబ్దమునకు 'స్త్రీ' యనిమాత్ర మర్థము; 'ఒకఁడు చేపట్టిన ఆలు' అను నర్థములుగల సమాసములందు మాత్రము దానికి భార్యయను నర్థము కలుగును. నా యాలు, నీయాలు, అతని యాలు, విష్ణువునాలు మొదలయినవి.

పై పేదాది శబ్దముల కాలుశబ్దము పరమగునప్పుడు 'ర(అ)' అనునది రెండువిధములుగ ద్రావిడభాషలయందు రావచ్చును: (1) బహువచన రువర్ణకముపై షష్ఠీవిభక్తియందు; కన్నడము: అవర్, అవర, ధీమంతర్, ధీమంతర; (2) షష్ఠ్యేకవచనముపై-కన్నడము: అదు, అదఱ మొదలయినవి. ఇట్టి యత్వవిశిష్టరేఫము సంబంధార్థమున నచ్చును. పేదర + ఆలు: బీదర+ఆలు అని తెనుఁగునను నట్టి రాగమము వచ్చినదన్నచో దానికి 'పేదలకు (బీదలకు) సంబంధించిన స్త్రీయని యర్థము చెప్పకొనవచ్చును. అప్పుడవి షష్ఠీతత్పురుష సమాసములగును. కాని, తక్కిన ముద్ద మొదలగు పదములపై నాలు పదముచేరిన సమాసముల కిట్టియర్థము జెప్ప వీలులేదు. కాఁబట్టి పేదరాలు, బీదరాలు అనువానికి పేదయైనస్త్రీ, బీదయైనస్త్రీ అనియే యర్థము చెప్పుట యుక్తము.

పేదాదులలో పేద, బీద అనునవి ప్రత్యేకపదములు; విశేషణము లయినను విశేష్యములుగఁగూడ వానిని వాడవచ్చును; కాని, యవి విశేష్యములగునపుడు మహన్మహత్యర్థములు రెంటియందును వాడఁబడును: వాఁడు పేద, ఆమె పేద. కాని, ప్రత్యేకముగ 'స్త్రీ' యనునర్థమున వాడవలసినప్పుడు 'ఆలు' పదమును వానిపై చేరును. మహదర్థమును స్పష్టము చేయవలసిన

యెడల 'వాఁడు' అను పదముచేరును. పేదవాఁడు. బాలెంత, కొమ, అయి దువ అనుపదములు స్వయముగా స్త్రీ వాచకములయినను మరల వానిపై 'ఆలు' పదము చేరుచున్నది. ఇట్లు చేరుట యనావశ్యకమయినను వ్యవహార మున నాలుశబ్దము కూడిన సమాసరూపములును నేర్పడి గ్రంథముల కెక్కి నవి. 'ముద్ద' పదము 'ముగ్ధా' శబ్దభవము; అయినను దాని కాయర్థమునఁ దెనుఁగునఁ బ్రత్యేకముగ వాడుక లేదు. 'ముద్ద' యనఁగా పిండమను నర్థ ముండుటచే నారెండర్థములను వేఱుపఱుచుట కాలు శబ్దమును జేర్చుట యావశ్యకమై యుండవచ్చును. గొడ్డుఁదనము మగవానికిఁ గాక స్త్రీకే యుండ వచ్చును గావున 'గొడ్డు' పైఁగూడ 'నాలు' పదము చేరుట యనావశ్యక మయి నను వ్యవహారమునను దన్మూలమున గ్రంథములందును దానిపై నాలుశబ్దము చేరినది. 'యువ' శబ్దభవము ప్రాకృతమున 'జువ=జుఅ'; ఇది పుంలింగశబ్దము. సంస్కృతమున దీనికి స్త్రీలింగమున 'యువతిః, యువతీ' అనురూపములు గలుగును. దీనినుండి ప్రాకృతమున 'జువఇ, జువఈ; జువది, జువదీ; జుఅది; జుఅదీ, జోది' యనురూపములు గలుగును. ప్రా. "జోది"నుండి తెనుఁగున 'జోటి'యను పదము కలిగినది. తెనుఁగున 'జవ్వని' యనుపదము గలదు. దీనికిఁ బ్రాకృతమున 'జవ్వణి, జొవ్వణి, యనురూపములు గలవు; ఈ ప్రాకృత రూపములకు సంస్కృతమున 'యౌవనీ' యనురూపముండవలెను; కాని, లేదు. 'యౌవన' యను విశేషణమునుండి ప్రాకృతభాషల మాట్లాడువారు 'యౌవనీ' యను స్త్రీలింగరూపము నేర్పఱుచుకొని యుందురు. 'జవ్వని' శబ్ద మునకుఁ దెనుఁగున 'జవ' యనున దాదేశముగ వచ్చినదని చిన్నయసూరి చెప్పెను. కాని, 'జవ' అనునది ప్రాకృతమందలి 'జొవ్వ' (సం * యౌవ) అను రూపమునుండి పుట్టియుండును. అవి మహన్మహాత్మ్యర్థముల సామాన్యరూప మున నుండియుండును. 'జవ' అనుపదము 'ముద్ద'యను పదమువలెనే తెనుఁ గున వ్యస్తముగఁ బ్రయోగింపఁబడక 'ఆలు'శబ్దముతోఁ గూడియే వ్యవహార మునఁ జేరినది. 'అయిదువ' పదము సంస్కృతమందలి 'అవిధవా' శబ్దము; ప్రాకృతమున దానికి 'అఇదువా' అనిరూపము.

(4) "కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబునగు. ఉదా: ధీర + ఆలు = ధీరు రాలు; గుణవంత + ఆలు = గుణవంతురాలు మొదలయినవి." చిన్న యసూరి.

ధీర, సమర్థ, ప్రియ మొదలగు పదములెట్టిశబ్దమును జేరకయే మహతీ వాచకము లగుచున్నను దెనుఁగు వ్యవహారమునఁ బుహరుక్తముగ నాలు శబ్దము చేరుచున్నది. లేదా. తెనుఁగున 'మూర్ఖు, వృద్ధు' మొదలగు రూప

ములవలె 'ధీరు, సమర్థు, ప్రియు' మొదలగునవియు మహన్మహత్యర్థములకు సామాన్యముగఁ బ్రథమైకవచనమున నేర్పడియుండవచ్చును. అప్పుడత్వమును ప్రత్యేకముగ విధింపనక్కఱలేదు. అట్లే 'గుణవంతు, బుద్ధిమంతు' మొదలగునవియు నొకప్పుడు ప్రథమైకవచనరూపములుగ నుండి యుండును. మనుష్యసంజ్ఞావాచకముగ నేటి వ్యవహారమున 'హనుమంతు' అనురూపము వినఁబడుచున్నది. ప్రాకృతమునను కన్నడమునను 'వత్' ప్రత్యయముకంటె 'మత్' ప్రత్యయమే యెక్కువ ప్రచారమందున్నది. 'గుణమంతి' అను రూప మాభాషలయందు సాధువు, తెనుఁగు వ్యవహారమునను 'గుణమంతుఁడు, గుణమంతురాలు' మొదలగు రూపములు గలవు.

అత్వమున కుత్వమైనదని చెప్పకొనవలసినయెడల నాకార్యము తత్సమములమీఁదనేకాక, యాచ్ఛికపదములమీఁదను గలుగునని చెప్పవలెను: ఉదా. నేస్తము (ము-లోపము)+ఆలు=నేస్తురాలు. ఉకారాంత పదములమీఁదను రుగాగమము వచ్చును: ఉదా. గేస్తు+ఆలు=గేస్తురాలు. ఒకప్పుడు మువర్ణాంత శబ్దములపై 'నాలు'పదము చేరునపుడు ము వర్ణమునకు పు వర్ణమాదేశముగ వచ్చి రుగాగమమగును; వీయము + ఆలు = వీయపురాలు. ఇకారాంత పదములపై నాలు శబ్దము చేరదు.

(5) "ఉదంతమగు తద్ధర్మార్థక విశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు"నని చిన్నయసూరి. ఉదా. చేయు + అతఁడు = చేయునతఁడు; చేసెడు + అతఁడు = చేసెడునతఁడు"—ఈ సూత్రమునకు విరుద్ధముగానున్న, "అమరుల్కడ వినోదముచూపు సమయమాంత్రికు నోర వెడలగ్ని (వెడలు + అగ్ని) దీప్తులనఁగ" (హంస. V.) అను నుదాహరణమును గుప్తార్థ ప్రకాశికారుఁ డుదాహరించెను. కాని, యిట్టివి కకర్త్రి ప్రయోగములనుటకు సందేహములేదు. అవి వ్యవహారవిదూరములు. పూర్వకవి సమ్మతములు గావు. వ్యవహారమున 'చేసే, చేసేటి' మున్నగురీతి నీరూపములు కాన్పించుచున్నవి.

పై చిన్నయసూరి సూత్ర మాంధ్రశబ్ద చింతామణిలోని "నస్స్యా త్తద్ధర్మే" అనుదానిక తెనుఁగు. ఈ సూత్రము తప్పనియు "సస్యాత్ తద్ధర్మే" అనియే చింతామణికర్త హృదయమనియు బ్ర. శ్రీ. వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులవారనుచున్నారు. అనఁగా తద్ధర్మార్థకారమునకు సంధిరాదని చింతామణిసూత్రము చెప్పచున్నదని వారి యభిప్రాయము. తద్ధర్మార్థకారమనుటచే తద్ధర్మార్థక ధాతుజ విశేషణముల యొక్కయేకాక, తద్ధర్మార్థక సమాపక క్రియారూపముల యత్వమునకును నీవిధి చెల్లుననియు శ్రీశాస్త్రులవారి యభిప్రాయము. తద్ధర్మార్థక సమాపకక్రియారూపముల యంత్యాచ్చుల

విషయమున నగు సంధికార్యములు చింతామణిలోని యితరసూత్రములచే సిద్ధించుచుండనే యుండఁగా ఈసూత్రమందు పునరుక్తిగా నా విషయమునే చింతామణి యుగ్గడించెననుట సరికాదు. ఈ పునరుక్తిదోషము శంకించియే కావలయుఁ బై చింతామణిసూత్రమును వ్యాఖ్యానించిన వారందఱును "నః స్యాత్" అను పాఠము నే యంగీకరించిరి. 'నస్యాత్' = సంధిరాదు, అను పక్షమున 'చేయు + అతఁడు' అన్నప్పుడు తిద్ధర్మార్థక విశేషణములు కళలు కావున 'చేయుయతఁడు' అని యడాగమము వచ్చి యనిష్టరూప మేర్పడవలసి యుండును. ఈ యనిష్టమును నివారించుటకు "తిజ్వ్యర్థ్య శేషషష్ఠీ" తి సూత్రము చేతను "అన్యే ద్రుతి ప్రకృతయః" అను సూత్రముచేతను తద్ధర్మార్థక ధాతుజ విశేషణములు ద్రుతప్రకృతికములని శ్రీశాస్త్రులవారు చెప్పకొనవలసి వచ్చినది. "తిజ్వ్యర్థ్యే" తిసూత్రమునందలి ధాతుజ విశేషణములను స్మరింప నంతమాత్రముచేత నవి ద్రుతిప్రకృతికములని చింతామణికర్త తలంచెననుట సరికాదు. వీనిస్మరణ లేనట్లే సందేహ, ప్రశ్న చిహ్నములగు ఎ, ఏ, ఒ, ఓ, ల స్మరణయు నాసూత్రమునందు లేదు. అవి 'ఆద్యా' అనుపదముచే నిరూపింపఁబడిన వందురేని తద్ధర్మార్థక విశేషణములును 'ఆద్య'ములలోనేల చేరఁగూడదో తెలియదు. "ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు" అను సూత్రము చొప్పున 'చేయున్ (విశేషణము) + అతఁడు' అన్నప్పుడు 'చేయు + అతఁడు' అని నిలిచి 'చేయతఁడు' అని సంధి కావలెను గదా. ఇట్టి యనిష్టరూపమును వారించుటకే "నః స్యాత్" అనుసూత్రము చింతామణియందు చేరినదనియు, ఆ పాఠమునే యాగ్రంథమునకు వ్యాఖ్యానములను వ్రాసినవారందఱు ననుసరించిరనియు గ్రహింపవలెను. ప్రకరణమును బట్టి నిషేధసూత్రమే యచట సమంజసమని వాదించుటయు సరికాదు. ఒకయనిష్టరూపము కలుగుచుండఁగా వెంటనే దానిని వారించుటకు "నః స్యాత్" అని సూత్రించుట యసందర్భము కాదు. చింతామణిపక్కి నాలోచించినచో మఱియొక ప్రకరణమునఁ జెప్పవలసిన సూత్రము లంతకుముందు చెప్పవలసినకార్యముల కనుకూలించినచో ముందుగనే ప్రకరణమును తప్పించిచెప్పట తద్గ్రంథకర్త యవలంబించిన పద్ధతియే. ఆ గ్రంథమున హల్సంధిపరిచ్ఛేదమున క్రియాపరిచ్ఛేదప్రక్రియ చాలవఱకు దొరలినదే కదా. శాస్త్రులవారివాదము నొప్పకొన్నను చిన్నయసూరి సూత్రము నొప్పకొన్నను కలుగునట్టి కార్యమేమో ఒక్కటే.

(6) "అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునందగు"-అని చిన్నయసూరి. ఉదా. నాయందున్ + కరుణ = నాయందలికరుణ; ఇందున్ + జనులు= ఇందలిజనులు; ఎందున్ + వారు = ఎందలివారు.-ఎందుశబ్దమున కలిగాగమంబు కొందఱు లేదందు"రని చిన్నయసూరి చెప్పెను. పై సూత్రమాంధ్రశబ్ద

చింతామణిలోని 'జేరలిచ' అనుదానికి తెనుఁగుచేత భారతమున 'ఉల' అను నాగమము కాన్పించుచున్నది గాని 'ఉలి' అని కాన్పించలేదు. 'అలి'గాగమమునకు యతిప్రాసస్థానములందు ముద్రితప్రతులం దయినను ప్రయోగములు దొరకలేదు. 'అందులో' అను వ్యవహారరూపము 'అందుల' నుండి యేర్పడి యుండవచ్చును. 'ఉల' అనునది కన్నడమందలి 'ఉళ్ల' = ఉన్న, కలిగిన, అనురూపమునకు వికారము. 'అందుల' అనఁగా 'అందున్న' అని యర్థము. 'అలి' కూడ 'అల్లి'కి రూపాంతరమనియు నది ప్రదేశార్థకమనియుఁ జెప్పవచ్చును. కాని, దానికి విశేషణముగఁ గన్నడమందును ప్రయోగములేదు. కావున, 'ఉల' గాఁగమమే సరియైన దనవలెను. 'అందలి' అను రూపము వ్యవహారమునలేదు; 'అందుల' అనికూడ వ్యవహారమున లేదుగాని, దానివికారమగు 'అందులో' అనురూపము కాన్పించుచున్నది. 'అందలి, ఇందలి, ఎందలి' అనునవి యెన్నడైన గ్రంథములందుగాని, వ్యవహారమునగాని యున్నవా యను విషయము సందేహాస్పదమే. 'ఎందు' పైఁగూడ 'ఉల' గాగమము గ్రంథములందు భారతకాలము నుండియు నున్నది. చూ. 'పదునొకండవశతాబ్దమునాఁటి తెనుఁగుభాష' యను నధ్యాయమున సంధి ప్రకరణము.

చిన్నయసూరి 'ఎందు' పై నలిగాగమము కొందఱు లేదండ్రని చెప్పుటచే దానికి వైకల్పికత్వమును గల్పించి 'ఎందువారు' అను రూపముగూడ నుండునని కొందఱందురని గుప్తార్థ ప్రకాశికా కారుఁడు వక్కాణించుట పొరపాటు.

(7) సమాసములందు హలాదిపదము పరమగు నప్పుడు పూర్వపదము తుదిహల్లుకంటె వివిధములగు నాగమములు వచ్చుచుండును.

ఉదా. అర్ధమరేయి (పాంచు. III. 71); నడు + రేయి = నడికిరేయి (మను. I. 56); పిన్నటనాఁడు; క్రిందటింజాయ (కళా. I. 166) మొదలగు వానిని యథాప్రయోగంబుగ గ్రహింపవలెను. అర్ధమపగలు, తిన్నటతెరువు మున్నగు రూపములు లేవు.

## లోపసంధి.

(1) ద్రుతమునకు సరళస్థిరములు పరమైనచో నొకప్పుడు దానికి లోపముగూడఁ గలుగును.

ఉదా. వచ్చెను + గోవులు = వచ్చెగోవులు; మెఱసెను + ఖడ్గము = మెఱసెఖడ్గము.

(2) "అవసానంబున ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగును."

ఉదా. వాఁడువచ్చెన్, వాఁడువచ్చె.

(3) "హలవసానంబులు పరంబులగునపు డేమి శబ్దముయొక్క యికారంబునకు లోపంబు వైకల్పికంబు". - ప్రౌఢవ్యాకరణకారుఁడు. "వాఁడు వచ్చెనే?" అనుచో 'వచ్చెనేమి?' అనియర్థమని యాతని యభిప్రాయము.

(4) "హలవసానంబులు పరంబు లగునప్పుడు లు, రు, వర్ణకంబుల యుత్వంబునకు లోపము వైకల్పికముగానగు" ప్రౌఢవ్యాకరణము. వానికచ్చు పరమైనచో నుత్వలోపము గలుగును గావున, నీసూత్రము హల్లుపరమైనను నాలోపమును విధించుచున్నది. అవసానమున ననఁగా గుర్వంతపద్యముల యవసానమున ననియర్థము.

(5) హలవసానములు పరములు కాకున్నను పదాంత లు, రు వర్ణముల తుది యుత్తునకు లోపము గలుగును: నేలఁబడి పొరల్ కూయిడు ; గుడిసొచ్చు గుడివెడల్ (పండితా.)

(5) "అను, కొను, చను లోనగు ధాతుజవిశేషణముల యంత్యోకారమునకు హల్లు పరంబగునపుడు లోపంబు వైకల్పికంబు" - ప్రౌఢ వ్యాకరణము.

ఉదా. అన్నిష్టసఖి, అన్నసుర, కొన్నొక్కరుక్కలు, చన్తొల్లిన మొదలయినవి విప్రసతికి నగాఱువేడఁజన్ వరములు (నన్నయ. సభా) ఎదురు కొన్వేడ్క (బసవ. పు. 28); భాషాప్రణీతి మన్నడు బల్లగోల (బసవ. పు. 169).

(6) కొన్నియెడల నితరపదముల తుదిస్వరములకును లోపముగిలుగును:

ఉదా. వెల్వెరియ (బసవ. పు. 12); నేఁడ్వంతనాఁ డొకఁడు (బసవ. పు. 101) : త్రావ్వేన (బసవ. పు. 169); ఇట్లే పాల్కురికి సోమనాదులు: వసివాళ్వాము; కడివ్రోయిన వాళ్ ముడునంగ, గుక్కిళ్ళింగు.

(7) పాల్కురికి సోమనాదులు కుర్య (=కురియు), తివ్య (=తివియు); నుస్లు (=నుసులు) అనురీతిగ పదమధ్యగతాచ్చులకు లోపమును గల్పించి యున్నారు.

(8) "కొన్నిచోట్ల షష్ఠీ సమాసమునందు కారమున కచ్చు పరంబగునపుడు నుగాగమంబునకు లోపంబునగు" ప్రౌఢవ్యాకరణము.

ఉదా. గోకులమిల్లులు, బచ్చింట మొదలయినవి.

(9) "ప్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబు గానగు:"

చింతామణిలోని 'జేరలిచ' అనుదానికి తెనుఁగుచేత భారతమున 'ఉల' అను నాగమము కాన్పించుచున్నది గాని 'ఉలి' అని కాన్పించలేదు. 'అలి'గాగమమునకు యతిప్రాసస్థానములందు ముద్రితప్రతులం దయినను ప్రయోగములు దొరకలేదు. 'అందులో' అను వ్యావహారరూపము 'అందుల' నుండి యేర్పడి యుండవచ్చును. 'ఉల' అనునది కన్నడమందలి 'ఉళ్ల' = ఉన్న, కలిగిన, అనురూపమునకు వికారను. 'అందుల' అనఁగా 'అందున్న' అని యర్థము. 'అలి' కూడ 'అల్లి'కి రూపాంతరమనియు నది ప్రదేశార్థకమనియుఁ జెప్పవచ్చును. కాని, దానికి విశేషణముగఁ గన్నడమందును ప్రయోగము లేదు. కావున, 'ఉల' గాఁగమమె సరియైన దనవలెను. 'అందలి' అను రూపము వ్యవహారమున లేదు; 'అందుల' అనికూడ వ్యవహారమున లేదుగాని, దానివికారమగు 'అందులో' అనురూపము కాన్పించుచున్నది. 'అందలి, ఇందలి, ఎందలి' అనునవి యెన్నడైన గ్రంథములందుగాని, వ్యవహారమునగాని యున్నవా యను విషయము సందేహాస్పదమే. 'ఎందు' పైఁగూడ 'ఉల' గాగమము గ్రంథములందు భారతకాలమునుండియు నున్నది. చూ. 'పదునోకండవశతాబ్దమునాఁటి తెనుఁగుభాష' యను నధ్యాయమున సంధి ప్రకరణము.

చిన్నయసూరి 'ఎందు' పై నలిగాగమము కొందఱు లేదండ్రని చెప్పుటచే దానికి వైకల్పికత్వమును గల్పించి 'ఎందువారు' అను రూపముగూడ నుండునని కొందఱందురని గుప్తార్థ ప్రకాశికా కారుఁడు వ్యాఖ్యానించుట పొరపాటు.

(7) సమాసములందు హలాదిపదము పరమగు నప్పుడు పూర్వపదము తుదిహల్లుకంటె వివిధములగు నాగమములు వచ్చుచుండును.

ఉదా. అద్దమరేయి (పాంచు. III. 71); నడు + రేయి = నడికిరేయి (మను. I. 56); పిన్నటనాఁడు; క్రిందటింజాయ (కళా. I. 166) మొదలగు వానిని యథాప్రయోగంబుగ గ్రహింపవలెను. అద్దమపగలు, తిన్నటతెరువు మున్నగు రూపములు లేవు.

## లోపసంధి.

(1) ద్రుతమునకు సరళస్థిరములు పరమైనచో నొకప్పుడు దానికి లోపముగూడఁ గలుగును.

ఉదా. వచ్చెను + గోవులు = వచ్చెగోవులు; మెఱసెను + ఖడ్గము = మెఱసెఖడ్గము.

(2) "అవసానంబున ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగును."

ఉదా. వాఁడువచ్చెన్, వాఁడువచ్చె.

(3) "హలవసానంబులు పరంబులగునపు డేమి శబ్దముయొక్క యికారంబునకు లోపంబు వైకల్పికంబు". - ప్రౌఢవ్యాకరణకారుఁడు. "వాఁడు వచ్చెనే?" అనుచో 'వచ్చెనేమి?' అనియర్థమని యాతని యభిప్రాయము.

(4) "హలవసానంబులు పరంబు లగునప్పుడు లు, రు, వర్ణకంబుల యుత్వంబునకు లోపము వైకల్పికముగానగు" ప్రౌఢవ్యాకరణము. వానికచ్చు పరమైనచో నుత్వలోపము గలుగును గావున, నీ సూత్రము హల్లుపరమైనను నాలోపమును విధించుచున్నది. అవసానమున ననఁగా గుర్వంతపద్యముల యవసానమున ననియర్థము.

(5) హలవసానములు పరములు కాకున్నను పదాంత లు, రు వర్ణముల తుది యుత్తునకు లోపము గలుగును: నేలఁబడి పొరల్కూయిడు ; గుడిసొచ్చు గుడివెడల్ (పండితా.)

(5) "అను, కొను, చను లోపగు ధాతుజవిశేషణముల యంత్యోకారమునకు హల్లు పరంబగునపుడు లోపంబు వైకల్పికంబు" - ప్రౌఢ వ్యాకరణము.

ఉదా. అన్నిష్టసభ, అన్నసుర. కొన్కొర్కులు, చన్శోభవ మొదలయినవి విప్రసతికి నాలుపేడఁజన్ వరములు (నన్నయ. సభా) ఎదురు కొన్వేడ్క (బసవ. పు 28); భాషాప్రణీత మన్నము బల్లగోల (బసవ. పు. 169).

(6) కొన్నియెడల నితరపదముల తుదిస్వరములకును లోపముగలుగును:

ఉదా. వెల్వరియ (బసవ పు. 12); నేఁడ్వంతనాఁ డొకఁడు (బసవ. పు. 101) : త్రాడ్వేన (బసవ. పు. 169); ఇట్లే పాల్కురికి సోమనాదులు: వసివాళ్వాము; కడివ్రోయిన వాళ్ ముడునంగ, గ్రుక్కిళ్ళింగు.

(7) పాల్కురికి సోమనాదులు కుర్య (=కురియు), తివ్య (=తివియు) ; నుస్లు (=నుసులు) అనురీతిగ పదమధ్యగతాచ్చులకు లోపమును గల్పించి యున్నారు.

(8) "కొన్నిచోట్ల షష్ఠీ సమాసముకం చుకారమున కచ్చు పరంబగునపుడు నుగాగమంబునకు లోపంబునగు" ప్రౌఢవ్యాకరణము.

ఉదా. గోకులమిల్లులు, బచ్చింట మొదలయినవి.

(9) "ప్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబు గానగు:"

ఉదా. ప్రాఁత+ఇల్లు = ప్రాయిల్లు, ప్రాఁతయిల్లు; లేఁత+దూడ = లేదూడ, లేఁతదూడ; పూవు + రెమ్మ = పూరెమ్మ, పూవురెమ్మ - ఈ యుదాహరణములలో లోపప్రసక్తియున్నట్లు తోఁచదు. 'ప్రాఁత'కు 'ప్రా' అనునది పూర్వరూపము; తమి. 'పఴ', 'పాఴ్' = తెనుఁగు: ప్రా. అట్లే 'లే' అనునది 'ఎలప' రూపాంతరము, 'పూవు'నకు 'పూ' రూపాంతరము. తక్కిన ద్రావిడభాషలలో 'పూ' అనియే రూపము. కర్మధారయ షష్ఠీసమాసములందు వలెనే యీపదములపై సంధియందు నుగాగమము వచ్చును. నుగాగమము వచ్చుట కుదాహరణములు: ప్రాఁగెంపు; లేఁగొమ్మ; పూఁదోఁట; మీఁగడ; కెందామర; చెందొవ మొదలగునవి. మీ, కెమ్, చెమ్ అనున వితర ద్రావిడభాషలలో ప్రత్యేకపదములు సమాసమందు తత్సమము పరమగు నపుడును నిశ్లేయగును: ముంగోపము, వింజామరము (మున్, విల్ అనునవి ప్రత్యేకపదములు) కెంధూళులు, కెంజడలు మొదలయినవి.

క్రొత్త, శబ్దమునఁ దొలియచ్చుమీఁది 'త్త'కు 'ప్రాఁత' యందు వలె లోపము బహుళముగా నగునని చిన్నయసూరి చెప్పెను. 'క్రొత్త'కు పూర్వరూప మితర ద్రావిడభాషలలో 'కొఴ', 'కోఴ్' అనునవి. అవి తెనుఁగున 'క్రొ' అనురూపము నొందును. క్రొత్త, ప్రాఁత. లకు వ్యుత్పత్తి "క్రొత్త గొఱగొఱ, ప్రాఁతబఱబఱ" అనుసామెత యందున్న 'కొఱ' 'పఱ', లను బట్టి యూహింపవచ్చును. ద్రావిడమున 'ఴ' కారము 'ఱ' గామాఱును. కావున, సమాసమున క్రొత్త శబ్దమునందు లోపము కలుగునని శబ్దశాస్త్రము ప్రకారము చెప్పఁగూడదు. కొఴ్ + చాయ అను పదములకు సంధి కలుగునప్పుడు ఴకార చకారములకు సంశ్లేషమును చకారమునకు సవర్ణాదేశమును, ఴ, జల చేరికవలన ద్విత్వ జకారమును (Assimilation) అందొక జకారము స్థానమున ననునాసికమును గలిగి 'క్రొంజాయ' యను రూపమేర్పడును. అట్లే కొఴ్+కారు = కొఴ్కారు = క్రొక్కారు; క్రొంజెమట, క్రొంబసిఁడి, క్రొత్తావి, క్రొగ్గండి, క్రొన్నన, క్రొమ్మావి మొదలయినవి. ఇట్టి మార్పు లన్నిచోట్లను గలుగవు: క్రొత్తాత, క్రొక్కుండలు మొదలగు సంధిరూపములు లేవు.

క్రిందు + కడుపు, కాలు, తొడ = క్రిఁగడుపు, క్రిఁగాలు, క్రిఁదొడ అని లాక్షణికులు చెప్పుదురు. కాని, యిచట పూర్వపదము 'క్రి' అనునదియే; 'క్రి' అనుపదము తమిళము నందలి 'కీఴ్' అనుపదమునకు వికారము: 'కీఴ్' + కడుపు = కీఴిడుపు, కీఴ్గిడుపు, * క్రిగ్గడుపు, * క్రింగడుపు, క్రిఁగడుపు - అని ధ్వనిపరిణామము గలిగినది. క్రిఁబెదవి మొదలగు సంధి రూపములు కలుగవచ్చునో, కూడదో, నిర్ణయించుట కష్టము.

(11) "పద్యాదులుపరంబులగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణ బిందువులు విభాషనగు" - ఈ సూత్రవిచారము హల్సంధి ప్రకరణమునఁ జేయఁబడినది.

(12) "మధ్యమపురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాషనగు. ఉదా : చూడుము + నన్ను = చూడు నన్ను, చూడుము నన్ను ; ఇటుః + చూడుము=ఇటుఁచూడు, ఇటుచూడుము-" చిన్నయసూరి.

"మధ్యమపురుష మువర్ణంబున కచ్చుపరంబగునపుడును గొన్నియెడల లోపంబు చూపట్టెడి : ఉదా. ఆడుము + ఇదె = ఆడిదె ; చెప్పుము + అనినన్ = చెప్పనినన్" - ప్రౌఢవ్యాకరణము.

"వ్యతిరేక మధ్యమ మువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాషనగు. ఉదా : నమ్మకుము + ఇట = నమ్మకిట, నమ్మకుమిట"-చిన్నయసూరి.

"ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ పుడుఙ్ములకు లోపంబు విభాషనగు. ఉదా : ఉండుము + ఉండుము=ఉండుండుము, ఉండుముండుము ; కొట్టుఁడు + కొట్టుఁడు = కొట్టు కొట్టుఁడు, కొట్టుఁడు కొట్టుఁడు.

(13) 'ము' విభక్త్యంత శబ్దములపైఁ గొన్ని హల్లులు పరము లగునపుడు మువర్ణములోని యుత్వము లోపించుటయు, మకారమొకప్పు డనుస్వారముగ మాఱుటయు గలుగును. కొన్నియెడల నీ యనుస్వారము లోపించును. కొన్నిశబ్దములపై నీ యనుస్వారము వ్యవహారమున వినఁబడినను గావ్యములందు గానరాదు. కొన్నియెడలఁ గావ్యములందును వ్యవహారమునందును గూడ నీ యనుస్వారము లోపింపదు. కష్టపఱుచు (నిర్వ. II. 86) ; తోరణకట్టు (కళా. III. 8) ; త్వరితపడు (హరవి. III. 189) ; పరిభవపడు (కుమా. భా. II. 931) ; వేగపడు (నిర్వ. VII. 29) ; వేగిరపడు (హరి. పూ. VIII. పు. 192) ; విజయంచేయు (నిర్వ. VII. 135 ; కాశీ. V. 117); విజయంచేయు = వేంచేయు (పాండు. II. 19.)

పైవానిలో విజయంచేయు, వేంచేయు, లకు విజయచేయు, వేచేయు అనురూపములు గ్రంధములలోను వ్యవహారమునను గూడ లేవు ; విజయం చేయు, వేంచేయు, ల వంటివే 'భోజనంచేయు', భోంచేయు అనునవి. ఇవి వ్యవహారమునమాత్ర మున్నవి. గ్రంధములలో లేవు. మువర్ణకలోపము కర్తృవాచిశబ్దములందు గలుగదు : గజముపడియె.

(12) కర్మధారయమునందేకాక యితర సమాసములందును మువర్ణకంబునకుఁ బుంపులగును:—కాలపుహోంతకాఁడు (మను. III. 59) ;

మోటుంపుఁ దెరువు (పద్మ పు. V. 13); నాల్కడపుంబేసము (హరవి. IV 46); కల్పవృక్షపుంగొమ్మ (పాండు. I. 60); నాయఁకరపుంబట్టము (పాండు. IV 145); నారికేడంపు బొండాలు (హరవి. VI. 55); చకోరంపుఁ బిల్లలు (శకుం. పరి. II. పు. 29); సింగపుంబొది (శకుం. పరి. I. పు. 17); త్రిప్పటంపుంబల్లలు (వరాహ. V. 38); పవనంపుఁ గొదములు (కళా. I. 186).

షష్ఠీసమాసమునందు ము వర్ణకమునకుఁ బుంపులురాకుండుట పూర్వకవి సంప్రదాయము. ఈ సంప్రదాయమునుగూడ కావలసినపు డర్వాచీన కవులనుసరించిరి. ఒకప్పుడు 'గారాము' శబ్దములోని ము వర్ణకమునకుఁ గర్మధారయమున 'బు' కూడవచ్చును: గారాబుఁబట్టి (కళా. I. 84.)

(13) "సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బహుపసరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు" ననియు, విధాన సామర్థ్యంబున దీనికి లోపము లేదనియుఁ జిన్నయసూరి చెప్పెను. కాని, యీ క్రింది యుదాహరణములం దాగమ నువర్ణమునకు లోపము కాన్పించుచున్నది. బొడ్డుబంటిగా (వరాహ. X. 58); నడుదెసన్ (వరాహ. X. 135); తేజుకూన (పాండు. III. 6); -వీనిని నలుగడాదులలోఁ జేర్చికొనవలెనేమో. "తామర పూఁ జెఱసాల" (శకుం. పరి. II. పు. 32) యిట్టి యాదాద్యంత శబ్దములందును నుగాగమము వచ్చును.

### అనుకరణసంధి

(అ) సంస్కృత ప్రథమైకవచన రూపములపై.

(1) "విసర్గంబున కనుకరణంబున లోపంబగు. ఉదా. వర్ధతాం శ్రీః + అనియె = వర్ధతాం శ్రీయనియె-" చిన్నయసూరి. రక్షతుహరిః + అనియె = రక్షతుహరి యనియె; గచ్ఛతు రామః + అనియె = గచ్ఛతురామ యనియె. "ఉందతనామంబున కనుకరణంబునందు వుగాగమంబగు" ఉదా. ఇయం ధేనుః + అనె = ఇయం ధేనువనె "- చిన్నయసూరి.

"సా కద్రూః + అనె; ఇయంగౌః + అనె" అనుచోట్ల సంధి యెట్లగునో తెలియదు. సాకద్రువనియె, ఇయంగోవనియె, అని యగునేమో.

వీరశైవకావ్యములందు ఇ, ఈ, ఉ, ఊ, ఔ లతో నంతమగు శబ్దముల ప్రథమైకవచనమున వచ్చు విసర్గ మనుకరణమున రేఫముగా మాఱుటఁ గానఁనగును: రక్షతు హరిరనియె, వర్ధతాం శ్రీరనియె, ఇయంధేనురనియె, సా కద్రూరనియె, ఇయంగోరనియె మొదలగునవియు పాల్కురికి సోమనాథుని ప్రయోగముల ననుసరించి సాధువులగును. ఇదుదంత నపుంసకలింగ సంస్కృత శబ్దములకుఁ బ్రథమైక వచనమున విసర్గముండదు గావున

ననుకరణంబున వీనిపై రేఫాగమము గలుగదు: ఇదంవారి + అనియె = ఇందవారి యనియె ; ఏతన్మధు + అనియె = ఏతన్మధువనియె. ఒకప్పు డుదంత సంస్కృత నపుంసకలింగముపై నచ్చు పరమగునప్పు డాయచ్చు ప్రత్యేకముగ నిలుచును : దూషితశ్చాపిపాదాంబు అన,

రేఫాంత, సకారాంత శబ్దములకుఁ బ్రథమైకవచనమున వచ్చు విసర్గమునకును జై కార్యములు గలుగును : ఇదంమనస్ + అనియె = ఇదం మన యనియె ; ఇయంపూర్ +అనియె = ఇయంపూయనియె, ఇయంపూరనియె.

సకారాంత శబ్దమునందలి తుది సకారమున కనుకరణమున లోపము రాకున్నను రాకపోవచ్చును : ఇదం మమ ధనుస్ + అనియె = ఇదం మమ ధనుస్సనియె.

"అనుకృతిని నమశ్శబ్దము తుదియత్తున కోత్వంబు విభాషనగు : ఉదా. తుభ్యంనమః + అనె = తుభ్యంనమయనె, తుభ్యనమోయనె. ఈ కార్యము లాతిచోసహితము గనంబడియెడి : ఉదా. గతానుగతికోలోకో యటంచుఁ" చిన్నయసూరి.

(2) "అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనంబగు. ఉదా: కిం తత్ + అనియె = కింతత్తనియె; కస్త్వమ్ + అనియె = కస్త్వమ్మనియె-" చిన్నయసూరి. "జ్ఞాతిశ్చేదనలేన కిమ్మనెడి వాచారూఢి సత్యమ్ముగన్" (వసు. III.); "అత్మార్థం పృథివీం త్యజేత్తనెడు వాక్యం బశ్రుతంబే నృపా" (కాశీ. IV.)

"అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాష నగు. ఉదా. దాసోహమ్ + అనె = దాసోహమ్మనె, దాసోహమనె; తత్కర్తవ్యమ్ + అనె = తత్కర్తవ్యమ్మనె, తత్కర్తవ్యమనె-" చిన్నయసూరి.

ఆకారపూర్వమగు ప్రథమైకవచనమున వచ్చు శబ్దములతుది నకారమునకు మీఁదవివరించినకార్యములు గలుగవు: ఉదా. ఆగచ్ఛతుభవాన్ + అనియె = ఆగచ్ఛతుభవాననియె; స విద్వాన్ + అనియె = స విద్వాననియె, మొదలైనవి.

(ఆ) ప్రథమా, ద్వితీయా, ద్వివచన రూపములపై.

(1) ప్రథమా ద్వితీయా ద్వివచనమునను, ఇకారాంతోకారాంత సప్తమ్యేక వచనమునను 'ఔ'వచ్చినయెడల దానిపై అనుధాతువు చేరునప్పుడు సంధి యెట్లుకలుగునో చెప్ప వీలులేదు: తౌ రామలక్ష్మణౌ + అని; ఇచట అనుధాతువులోని అత్వ మట్లే నిలువవచ్చును: రామలక్ష్మణౌ అని- లేదా,

వకారమాగమముగ రావచ్చును; రామలక్ష్మణౌవని; ఔత్వమున కత్వము కలిగి వకారమునకు ద్విత్వము కలుగవచ్చును: రామలక్ష్మణవ్వని; లేదా, ఔత్వమునకు వృద్ధిరావచ్చునేమో! రామలక్ష్మణావని; హరౌ అని, హరావని, మొదలైనవి.

ద్వివచనమున ఈకారము వచ్చినచో యడాగమము గలుగును: హరీయని; ఊకారము వచ్చినచో అకారము ప్రత్యేకముగా నిలుచును; లేదా, వకారమో, యకారమో ఆగమముగా వచ్చునేమో ! తౌతరూ అని (-వని, యని).

(2) ప్రథమా ద్వితీయా బహువచనమున దీర్ఘపూర్వమగు విసర్గమున కనుకరణమున విసర్గము లోపించి యడాగమ మగునేమో; ఏతే రామాః + అని = ఏతే రామాయని (?); హరతుబాధాః + అని = హరతుబాధా యని.

అకార పూర్వక విసర్గాంత ప్రథమా ద్వితీయా బహువచనరూపముల మీఁదను, షష్ఠ్యేకవచనరూపములమీఁదను 'భ్యస్' అను ప్రత్యయము మీఁదను అనుకరణమున విసర్గమునకు లోపము గలుగును. విసర్గమున కోత్వమాగమముగాని కావచ్చును: ఉపవిశంతు భవంతయని; వీజంతు మరుతయని, వీజంతు మరుతోయని; ప్రవహంతి నద్యయని, ప్రవహంతి నద్యోయని; సాహచర్యమ్విదుషః + అని=సాహచర్యమ్ విదుషయని (-షోయని); నమోహరిభ్యయని, (-భ్యోయని) మొదలైనవి.

(3) తృతీయైకవచన 'ఇన, నా, ఆ' ప్రత్యయములమీఁదను, షష్ఠ్యేకవచన 'స్య' ప్రత్యయముమీఁదను యడాగమము గలుగును: రామేణ-, హరిణా-, మరుతా-, రామస్య-, యని.

(4) తృతీయా బహువచన 'ఐస్, భిస్' ప్రత్యయములమీఁదను, షష్ఠీసప్తమీ ద్వివచన ప్రత్యయమగు 'ఓస్' మీఁదను ననుకరణమున రేఫాగమము గలుగును: రామైరని, హరిభిరని, ఆవయోరని. 'భిస్' పై విసర్గలోపమును యడాగమమును గలుగునేమో!- హరిభియని.

(5) సప్తమీ బహువచన 'సు' ప్రత్యయముపై ననుకరణమునఁ బరరూపసంధియైనను, యణాగమ సంధియైనను గావచ్చును: హరిషని, హరిష్వని; లేదా, ఉత్వముమీఁదనే యడాగమము కావచ్చును. యద్విప్ర సంధ్యాదిషు కర్మసు యనఁగ (పండితా. దీక్షా.)

(6) ద్వితీయావిభక్తి ప్రత్యయమగు 'అమ్' మీఁదను, తృతీయా, చతుర్థీ, పంచమీ విభక్తి ద్వివచన ప్రత్యయమగు 'భ్యామ్' మీఁదను, 'తుభ్యమ్' అను యుష్మచ్ఛబ్ద చతుర్థ్యేకవచనముమీఁదను అను ధాతువు చేరునపుడు మకారమునకు ద్విత్వము బహుళముగా నగును: ఉదా వందే

రామమ్ + అని = వందేరామనుని, వందేరామమ్మని; వందేత్వామని, వందే త్వామ్మని; నమస్సీతారామాభ్యామని, నమస్సీతారామాభ్యామ్మని; నమస్తుభ్యమని, నమస్తుభ్యమ్మని; మొదలైనవి.

(ఇ) తక్కిన సంస్కృత శబ్దములన్వైపై.

పైని వివరించిన సంస్కృత శబ్దములపైఁ గాక యితరములమీఁద నను ధాతువు చేరునప్పుడు సాధారణముగ నాయాయంతిములుగల విభక్తిరూపములకు వలెనె సంధిగలుగును. కిమ్మనకుండ, రక్షోమనుని, ఆవర్తంతేయని, రక్షతని (రక్షత్వని ?) మొదలైనవి.

[ఈ క్రింది యుదాహరణములు పండితారాధ్యచరిత్రము దీక్షాప్రకరణము నుండి యెత్తి వ్రాయఁబడినవి: అనియతగణైరనియు; ప్రాసోవాయనియు; యతిర్వాయనియు; భూత్యై నప్రమదితవ్యమనియు; అగ్నేస్సముద్ధయాయనియు; త్రిపుండ్రస్య చ ధారణంబ(మ్మ)నియు; నైవ ప్రమదితవ్యమనియు; విమృజ్యాంగాని సంస్పృశేత్తినఁగ; దేవానాం త్రయాయుషమ్మనఁగ; న చ పునరావర్తతె యన ('ఆవర్తతేయన'; అనవచ్చునా ?) విరజా విపాప్మాయనంగ; తత్ఫలం కోటి గుణితంబనంగ; న సంశయో యన; మంత్రితం భస్మ ధారయేత్తనఁగ; స ఏష భస్మ జ్యోతియ (-ర) నఁగ; జ్యోతిర్భవత్యేవయనఁగ; మాత్వాహవామహే యనఁగ ('హవామహా యనఁగ' అనవచ్చునా?) భస్మచ్ఛన్నయనఁగ; భస్మోద్ధూళితంబన; వైశ్యదేవేశ్వ రార్చనేయన ('అర్చఁయన' అనవచ్చునా?); ధృతత్రిపుండ్రయనఁగ; త్రిపుండ్రం బ్రాహ్మణో యనంగ; విద్వానినంగ; మనసాపి నలంఘయేత్తనఁగ; శ్రుత్యావిధీయతే యనఁగ ('విధీయత యనఁగ' అనియు ననవచ్చును); యస్మాత్తినంగ; తత్త్యాగీయనంగ; పతితోభవేత్తన; సురవిప్రాణామనంగ; వర్తులం నృపవైశ్యయోరనఁగ; అర్ధచంద్రంతువాయనంగ; శూద్రాణామనంగ; అర్ధచంద్రాకృతి రనఁగ; అన్యేషామనంగ; ఊర్ధ్వపుండ్రకంబన; అగ్నిదగ్ధేన భస్మనాయనఁగ; త్రిపుండ్రాంకం ప్రశస్యతేయన; ససర్జన లలాటంహి తిర్యక్కనంగ; అధీతం శ్రుతం తేనయన; యేన విప్రేణ శిరసియన; అభావేనా తథా విప్రయనఁగ; భస్మనైవ ప్రకుర్వీతయన; నకుర్యాన్మృత్తికాగిభిరన; ఏతదన్యత్ర రమతే యనఁగ; మయావక్తుం నశక్యతేయనఁగ; మునీంద్రా బ్రహ్మవాదినోయన; భస్మ సంత్యజ్య కుర్వన్ననంగ; అన్యత్సమాహితా యనఁగ, భస్మదత్తం మయాపురాయనఁగ; ఊర్ధ్వ పుండ్రం ద్విజాః కుర్యు రనఁగ; భిద్యతే యమకింకరైరనఁగ; మనుష్యాః పాపకర్మిణో యనఁగ; కీర్తితం చాంకుశాధిభి రనఁగ; పాషండోపహత నా (విసర్గలోపము); నధార్యం వైదికైర్జనైరనఁగ; నపహే త్వామకారత యనఁగ (విసర్గలోపము); నాధికుర్వంతి దగ్ధాంగనా (దగ్ధాంగమ్ + నా; మకారలోపము); నాంకయే ద్విప్రోయనంగ; దేవతాయుధలాంఛనైరనఁగ; పతత్యేవ నసంశయో యనఁగ; నాంగం దహేత్తిన; దేవతాయుధ లాంఛనై రనఁగ; నకుర్యాదంకనం నరో యనఁగ; కుర్యాచ్చ చక్రాద్యైరనంగ; నపంభాష్య ద్విజాదిభిరనఁగ; నదహే చ్చక్రపూర్వకైరన; ప్రవాసయేత్తిన; కస్యచి ల్లాంఛితో మర్త్యయన; నాధికారీ న లాంఛితో యనఁగ; అస్పృశ్యాయనంగ (విసర్గలోపము); నదర్శ

నీయాయన (విసర్గలోపము); ఏతాని రుద్రాక్షాణియనఁగ; రుద్రాక్ష ధరశ్శుచి యనంగ; వైశ్వ దేవే సురార్చనే యనంగ; యద్విప్ర సంధ్యాదిషు చ కర్మసు యనంగ; శ్చాపి వా క్రియతే యనంగ; కింపునర్మానవాదయో యని; రుద్రాక్షవలయా యనంగ; రుద్రాక్షభూషణా యనఁగ; జటామండలధారిణీ యనఁగ; త్రిపుండ్రావలి యుక్తాంగి యనఁగ (యుక్తాంగీ - దీర్ఘమునకు హ్రస్వము); రుద్రాక్షమండనైరనఁగ; శుద్ధాత్మాయనఁగ; త్రిపుండ్రకో దివ్యైరనఁగ; శుశుభే సతతో విష్ణురనగ; అధర్వ శిరశ్శిఖేయను; అక్షమాలా విభూషితాయనఁగ (విభూషితాః + అనఁగ); సర్వే తపస్వినోయన; గంధ పుష్పాక్షతాదిభిరను; పాదోదకం పురభిద (=దే. యనఁగ, పపుః కామంగణేశ్వరా ( = రాః) యనఁగ, భూమిభాగాశ్చ యే శుభా ( = శుభాః) యనఁగ; దూషిత శ్చాపిపాదాంబు అన; సుయజా యజామహే యనఁగ; లంఘ యామ్యహమాత్మనో యనఁగ; విన్యస్తముకుటేష్వనంగ; భవేయురనఁగ; కించిసనఁగ; సభూమిం విశ్వతో వృత్వాయనఁగ; పద్భ్యాంభూమిరన; వ్యర్థానిస్యురనఁగ; - మొదలయినవి. వీని నాయా సూత్రముల కడ నను సంధించుకొనవలయును.

## II. తెనుఁగు పదములపై ననుకరణము

(1) సాధారణముగఁ దెనుఁగు పదములపై 'అను' ధాతువుచేరునప్పుడు తెనుఁగున నచ్సంధియందు గలుగు విధానమే యనుసరింపఁబడును: వచ్చెనని, చేరువయని, చెప్పుమాయని, చెప్పవేయని మొదలయినవి.

(2) ఆశ్చర్య, సంతాపాద్యర్థకావ్యయములపై సాధారణముగ యడాగమము కలుగును: ఉదా. ఊయని, ఓయని, కోయని, చేయునొక్కో (-కో్కం) యని, ఇదిగో (-గో) యని, బళి (-ళీ, - ళిరె, - ళీరె - ళారె) యని, ఓహో యని మొదలయినవి.

ఉకారాంతాశ్చర్యాద్యర్థ కావ్యయములపై సంధియగును: ఉహ్హు+ అని = ఉహ్హని; మొదలయివి.

(3) హలంత ధ్వన్యనుకరణశబ్దముల తుదిహల్లునకు ద్విత్వము కలుగును. ఉదా. జుమ్మని, గ్రక్కని, చట్టని, జడ్డని, జల్లని, డిగ్గని, మొదలైనవి.

(4) (అ) తక్కిన ధ్వన్యనుకరణశబ్దములలో నకారాంతములపై ననుకరణమున యడాగమముగాని, మగాగమముగాని కలుగును. ఉదా. బగబగయ (-మ) ని; బుగబుగయ (-మ) ని; కటకటయ (-మ)ని; తెకతెకయ (-మ) ని; దొడదొడయ (-మ)ని; గోణగోణయ(-మ) ని; కుతకుతయ(-మ) ని; కనకనయ (-మ) ని; తపతపయ (-మ) ని, బగబగయ (-మ) ని; గబగబయ (-మ) ని; గుమగుమయ (-మ) ని; సరసరయ (-మ) ని; బఱబఱయ (-మ) ని; కలకలయ (-మ); బుసబుసయ (-మ) ని; వెళవెళయ (-మ) ని; తహతహయ (-మ) ని.

(ఆ) ఉకారాంత ధ్వన్యనుకరణశబ్దములపై ననుకరణమున సంధియైన నగును, లేదా, మగాగమమైన వచ్చును: ఉదా. చంగని, చంగుమని; బగ్గని,

బగ్గుమని;గొబ్బని, గొబ్బుమని; బోరని,బోరుమని; జల్లని, జల్లుమని;హోరని, హోరుమని; కతిల్లని, కతిల్లుమని; పుటుక్కని, పుటుక్కుమని;తటాలని, తటాలుమని: మొదలయినవి.

(౪) ఇ, ఈ, ఊ, ఏ, ఓ లంతమందుగల ధ్వన్యనుకరణ శబ్దములపై ననుకరణమున యడాగమము మాత్రము వచ్చును. ఉదా. చికిచికియని; దుడి దుడియని; నెళినెళియని; జిలిబిలియని, కసిమసియని; గసిబిసియని; హాళాహాళియని; హరీయని; బేయని (వ్యవహారమున 'బేమని'), పురేయని, కొక్కొక్కొయని; ఊహూయని మొదలైనవి. 'హరీమను' అనుప్రయోగము 'చచ్చు' అనునర్థమున వ్యవహారమునఁ గలదు.

(5) ఒక్కొకచో ననుకరణమున రుగాగమమును గలుగును. ఉదా. దిగ్గురని; చిటుకురని మొదలయినవి.

## తెనుఁగున హల్సంధి.

తెనుఁగున నొకరీతి హల్సంధి కానవచ్చుచున్నది. ఇది సంస్కృతమందలి హల్సంధివంటిదికాదు. తెనుఁగునఁ బూర్వకాలమునఁ దక్కిన ద్రావిడ భాషలయందువలెనే కొన్నిశబ్దములు హలంతములుగా నుండెను. అట్టివానిపై హల్లు పరమగునపు డాహల్లులకు సంయోగము గలుగుచుండెను. అట్లు కలిసిన రెండుహల్లులును నొక్కటేయైనయెడల నా హల్లునకు ద్విత్వమును, సాధారణముగ నాద్విత్వాక్షరమున నొకహల్లునకు లోపమును గలుగుచుండెను.రానురా నీమా ర్పజంతములపై హల్లుచేరునప్పుడును సంభవించెను, అప్పుడు పదాంతమందలి యచ్చునకు లోపముగలిగి, పిదప ముందటివలెనే హల్సంధియగుచుండెను. ఈవిధమగుమార్పు గలుగుచుండెనని యంగీకరించిన యెడల బహుళవిధి క్రిందికివచ్చు ననేక సంధులకొక త్రోవయేర్పడును. ఇట్టి సంధులు కావ్యములం దనేకముగ 'గాన్పించుచున్నవి. కాని, కొన్ని వ్యవహారమున మాత్రము నిలిచినవి.

### ఉదాహరణములు.

(1) అచ్చుమాత్రము లోపించుట: పేర్పడ్డ (మను. I. 43) ; పెను+బైలు=పెన్బైలు (వరాహ. X. 135); వారు + వారల = వార్వారల (రాధామా. III. పు. 42) ; నగళ్లు + లోనికిన్ = నగళ్లోనికిన్ (రాధామా. III. పు. 42) ; దొడ్డ + రా = దొడ్రా; గిడ్డి + రా = గిడ్రా (వైజ. I. 23) ; బొడ్డు + రత్నంబు = బొడ్రత్నంబు (వైజ. I. 23) ; ఎటు + రా=ఎట్రా; చుట్టి+రా(న్) = చుట్రా (వ్యవహారమున: చుటూరా) గట్టు+రాచూలి = గట్రాచూలి (జై మి.భా.VII. 9); మొగ్గల+చేపట్టు=మొగ్గల్చేపట్టు (పాండు.

IV. 168), పోరు+నుహిషున్=పోర్నహిషున్ (పాండు. V. 25); అఁట + అట్రా (కవిక. IV. 152); గుక్కిళ్లు + మ్రింగు=గుక్కిళ్ మ్రింగు (కాశీ. III. 206; IV. 123); రాజాము + కోట = రాజాంకోట; ఈ లోపము క్రియాపదములందలి తుది రేఫము మీఁదను గలుగును: చూచెదర్ (కాశీ. III. 202); ఎఱుఁగుదుర్ (హరి. పూ. VIII. పు. 194) పొందర్ (పాండు. IV. 277.) ఇట్లే కన్నీళ్లు మొదలయినవి.

పదములతుది రు, లు, వర్ణము లందలి యుత్వము వైకల్పికముగా లోపించుచుండును: పలువుర్, పలుకుల్, మొదలయినవి.

(2) అచ్చుతోడి హల్లోపము: చాపు + పరువు = * చాప్పరువు = చాపరువు (మను. IV. 45); కూయి + వెట్టు = * కూయ్వెట్టు = కూవెట్టు (వరాహ. II. 98); చేయి + చాపంగ = * చేయ్చాపంగ = చేచాపంగ (వరాహ. II.); రావి + రేక=రావ్రేక=రారేక (వరాహ. VI. 6), చూపు+ చాయ = * చుప్చాయ = చూచాయ (మను. V. 27); నెలవు + కొను = నెలవ్కొను = నెలకొను = * నెల్కొను = నెక్కొను (పాండు. III. 184); కెంపు + ధూళి=కెంధూళి (మను. I. 38); కెంధరణి, అని యనవచ్చునేమో; కాని యట్టిరూపములు గావ్యములందుగాని వ్యవహారమునఁగాని కానరావు. కొంత + దాఁక = కొందాఁక (వరాహ. VI. 27). ఇట్లే, వెలక్కాయ,ములక్కాఁడ మొదలఘనవి వ్యవహారమున నున్నవి.

(3) అచ్చుతోఁ గూడిన హల్లున కదేహల్లు పరమైనప్పు డచ్చులోపించి. ద్విత్వము కలిగి, ద్విత్వమున నొకహల్లునకు లోపమును :

కొన్ని + నాళ్లు = కొన్నాళ్లు (మను. III. 43); చూపు + పట్టు = చూపట్టు (శకుం. పరి. II. పు. 21); తోపు + పడు = తోపడు (మను. III. 22, 23); చూపు + పెట్టు = చూపెట్టు (మను. IV. 37); మోపు + పెట్టు = మోపెట్టు (తిక్కన); కన్ను + నీరు = కన్నీరు (పాండు. II. 4); చూపు + పట్టు = చూపట్టు (పాండు. I. 64); దాఁక + కొన్న = దాఁకొన్న (ఉ. హరి. II. 122); క్రొత్త + తావి = క్రొత్తావి (నిర్వ. VIII. 25); కాని, "క్రొత్తలిరులు, క్రొత్తాత" అనునిట్టి రూపములు గావ్యములందు గాని, వ్యవహారమునందుగాని కానరావు; చొప్పు + పడు = చొప్పడు (నిర్వ. V. 16); కాని, 'వెచ్చ + చమురు = వెచ్చమురు అని కావ్యము లందు కానరాదు, వ్యవహారమున వినఁబడుచున్నది.

(4) పై రీతి నజ్ఝల్లోపములు గలుగునప్పుడు సంధియందు మఱికొన్ని మార్పులును గలుగుచుండును :—

i. 'న' కారమనుస్వారమగుట : కోని + పోయి = కోంపోయి (ఉ. రా. పు. 114) ; కాని, తింపోయి, చంపోయి, అనురూపములు గలుగవు.

ii. 'న' కారముపై ద్రుతము మీఁదవలెఁ బరుషములకు సరళాదేశము గలుగును: కొన్ని + కినిసి = కొన్గినిసి (పాండు. IV. 147) ; చవిగొను + పిమ్మట = చవిగొన్బిమ్మట (కాశీ. III. 206) ; మను + పెంటి = మన్బెంటి, చను + కట్టు = చన్గట్టు, చన్దోయి, చన్గప్పు, చన్బాలు, మొదలగు సంధులు కానవచ్చుచున్నవిగాని, యీమార్పు సార్వత్రికము కాదు ; అన్బిమ్మట, కొన్గోమటి మొదలగు రూపములు గావ్యములందును వ్యవహారమునందును గూడఁ గానరావు. క్రిందు + తొడిమ = క్రిందొడిమ (పాండు. IV. 3) ; మ్రాను + కన్ను = మ్రాన్గన్ను (శకుం. పరి. III. పు. 48) ; "క్రాన్దీఁగ" యగునేమో తెలియదు.

iii. కొన్నియెడల 'న' కారమర్ధానుస్వారమై, మీఁది పరుషములు సరళములగును : మ్రాను + కన్ను = మ్రాఁగన్ను (కాశీ. II.) ; - కాని, "క్రాఁదీఁగ" అని యగునేమో తెలియదు ; కాను + చుమయ్య = కాఁజుమయ్య (మను. V. 4).

iv. తక్కినచోట్లఁ గొన్నియెడల గ స డ ద వాదేశము వచ్చును: క్రాలు + కన్నులు = క్రాల్గన్నులు (పాండు. II. 89).

v. కొన్నియెడల పదమునందలి సిద్ధార్ధానుస్వారముపైనున్న హల్లు లోపింపఁగా నర్ధానుస్వారముపైఁ బరుషములకు సరళాదేశము గలుగును ; స్థిరాక్షరము పరమైనయెడల నర్ధానుస్వారము కూడ లోపించును: లేఁత + కరువలి = లేఁగరువలి (కళా. I. 140) ; లేఁత + తీఁగ = లేఁదీఁగ (కుమా. భా. II. 9) ; లేఁత + పగలు = లేఁబగలు ; ఈ మార్పు 'లేఁత' యను శబ్దము మీఁదనే కలుగును గాఁబోలును. వ్రాఁత + చదువు = వ్రాఁజదువు అని కాదు.

vi. కొన్నియెడల హల్లోపముకలిగి పూర్ణానుస్వారమాగమముగా వచ్చును : క్రొత్త + పెరుగు = క్రొంబెరుగు (శకుం. పరి. I. పు 20) ; క్రొత్త + పండ్లు = క్రొంబండ్లు (పాండు. I. 118) ; క్రొత్త + పంట = క్రొంబంట (పాండు. II. 111) ; క్రొత్త + పుట్టము = క్రొంబుట్టము (పాండు. III. 74) ; క్రొత్త + తలిరు = క్రొందలిరు (నిర్వ. VIII. 25) ; కాని, 'క్రొందాత' అను రూపము కనఁబడదు, వినఁబడదు కూడను. ఈ మార్పొక్క 'క్రొత్త' శబ్దము మీఁదనే కలుగునట్లు తోఁచుచున్నది. మెత్త + పఱుపు = మెంబఱుపు, అని కాదు. క్రొత్త శబ్దముపై 'మ' కారము వచ్చిన

యెడల 'త్త' కు లోపమును, మ కారమునకు ద్విత్వమును గలుగును. క్రొమ్మంటలు (విష్ణుపు. II. 49); ఇట్లే, క్రొమ్మావి, క్రొమ్మెఱుఁగు మొదలయినవి.

vii. కొన్నియెడల హల్లోపము గలిగి యర్ధానుస్వారమాగమముగా వచ్చును: క్రేవ + కన్ను = క్రేఁగన్ను (నిర్వ. I. 55; కుమా. భా. II. 101).

(viii) 'క్రిందు' శబ్దముపై హల్లుపరమగునపుడు గొన్నియెడలఁ బైమార్పులు గలిగి, 'క్రి' లోని యిత్తునకు దీర్ఘము గలుగును: క్రీఁగడ్డు (శకుం. పరి. II. పు. 36); క్రీనీడ, మొదలయినవి.

(ix) ఒకప్పుడు పదము తుదియచ్చు లోపింపఁగా మిగిలినహల్లు పరమందున్న హల్లుగానో, పరమందున్నహల్లు పూర్వహల్లుగనో మాఱును. పదాదిని దీర్ఘాచ్చున్నయెడల నది హ్రస్వమగును: మూల + మూల = ముమ్మూల (ఉ. హరి. II, 122); ఇది కడాదులలోఁ జేరదు. చూ. కడాదుల సూత్రము వెఁ జర్చ.

(x) కొన్నియెడల పూర్వవర్ణము పైనుండు స్వరములోపించి పూర్వహల్లు పరహల్లుగను, ఒకప్పుడు ణకారము నకారముగను మాఱును: వేఁడి + నీళ్లు = వేన్నీళ్లు; చలి + నీటన్ = చన్నీటన్; పేఁడ + నీళ్లు = పేణ్ణీళ్లు; రెండు + నెలలు = (రెణ్ణెలలు) రెన్నెలలు; రెండు + నాళ్లు = (రెణ్ణాళ్లు) రెన్నాళ్లు మొదలయినవి.

(ix) 'క్రొవ్వెద' (కుమా. భా. II. 332; మను. III. 84) అనురూపమెట్లు గలిగినదో తెలియదు.

(5) ఒకప్పుడు పూర్వపదము తుదిహల్లునకు లోపము గలుగక, యుత్తర పదము నాదిహల్లే లోపించును.

ప్రొద్దు + పుచ్చి = ప్రొద్దుచ్చి (రంగారా. III. 251); కన్నము + వేయు = కన్నమేయు; గంతులేయు (చెన్న బ 88); కోపము + పుట్టఁగా = కోపముట్టఁగా (రంగారా. II. 104); ప్రోవు + పెట్టు = ప్రోవెట్టు (కుమా. భా. II. 253); తలఁబ్రాలు + పోయు = తలఁబ్రాలోయు (దశావ. పు. 322); ఇట్లే వ్యవహారమున - బొట్టెట్టుకొను మొదలైనవి.

పెట్టు (ఎట్టు); వెంట (ఎంట); పోసికొను (ఓసుకొను); వేయు (ఏయు); వచ్చు (ఒచ్చు) మొదలగు రూపములు వ్యవహారమున నున్నవి. ఇవి కావ్యములలోఁ గూడ కాన్పించుచున్నవి.

సీ. కలువక్రొవ్విరిడాలు - బెళుకుబేడిసమీలు, మెఱుఁగెట్టి కనుదోయి మఱచెనొక్కొ- (నిర్వ. వి. రా).

చ. కెరలక క్రమ్మరింప నడుగెంటనె నిల్చునొకింత నూఁకినన్ (పాండు. I. 114).

ద్వి. శ్రీరామరాను యీచెడుబుద్ధిచెప్పి యోరామ యెవరు నీ యును రోసికొనిరో (మృత్యు. పుట. 23).

సీ. విలపించి పాదముల్ విదలించుకొనువారు నిండ్లలోపల గంతు లేయువారు. (శశి. పుట 60.)

క. పెండ్లికొచ్చిన, రాకొమరుల బ్రతుకుచూడు రాక్షసనాథా. (శశి. పుట. 74.)

(ఇందు సంప్రసారణము గలిగినది.)

(6) సంధియందు పదముల యాద్యక్షరము శేషించుటయు నుత్తర పదము నాద్యక్షరమునకు లోపద్విత్వాది కార్యములు గలుగుటయు ప్రాఁతాదులవిషయమునను క్రొత్తశబ్దము విషయమునను గాక యితర శబ్దములకును గలుగును.

పది + తొమ్మిది = పందొమ్మిది; తొమ్మిది + పది = తొంబది; వంక + చెఱఁగు = వంజెఱఁగు; నగము + కోరు = సంగోరు; నిండు + నెఱ = నివ్వెఱ; నిండు + వెఱఁగు = నివ్వెఱఁగు; నెఱ + తఱి = నెత్తఱి; నెఱ + నడుము = నెన్నడుము; నెఱ + మది = నెమ్మది; నెఱ + వడి = నెవ్వడి మొదలైనవి.

పై వానిలో 'పదికి' 'పన్', 'తొమ్మదికి' 'తొమ్' అనునవి ప్రాతిపదికములు. వానిపై ద్రుతముమీఁదవలె సరళాదేశము కలిగినది. 'వంక' కు 'వజ్' ప్రాతిపదికము; అందు 'జ్' ద్రుతతుల్యము. 'నిండు' శబ్దమునకు ప్రాతిపదికము 'నిఱ్' దీనిపై 'వెఱ' 'వెఱఁగు' లుచేరి, సామ్యమువలన 'ఱ'కారము మీఁది హల్లుగామాఱి, నివ్వెఱ, నివ్వెఱఁగు అను సంధిరూపము లేర్పడినవి. "నెన్నడాదుల నెఱియగు" నని ప్రౌఢవ్యాకరణకారుఁ డనెనుగాని 'నెఱ' కు ప్రాతిదికము 'నెఱ్' అనునది. అది 'నిఱ్' అనుదానికి రూపాంతరము. "నెఱ్ + తఱి, నడుము, మది, వడి" మున్నగుపదములుచేరి సామ్యాకర్షణము గలిగి నెత్తఱి, నెన్నడుము, నెమ్మది, నెవ్వడి, మొదలగు సంధిరూపము లేర్పడినవని చెప్పవలెను.

## ద్రుతసంధి.

(1) "ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు. ఇఁక, ఇఁగ, ఎట్టకేని, ఎట్టకేలకు ఇవియిఁకాదులు"—అనిచిన్నయసూరి.

ఉదా. వచ్చున్ + ఇపుడు=వచ్చునిపుడు ; చూడన్ + అయితి=చూడనయితి ; ఉండెడిన్ + అతఁడు = ఉండెడినతఁడు.

'ఇఁగ' అనునది ప్రయోగములందు గానరాదు ; వ్యవహారమున నది 'ఇగ' 'ఇహ' అనురూపములనున్నది. 'ఎట్టకేలకు' అనుదానిలోని 'కు' వర్ణము షష్ఠీప్రత్యయసదృశమగుటచేఁ బ్రథమేతరవిభక్తులందు చేరును. 'ఎట్టకేని' యను దానియందు, 'ఏని' అను అప్యర్థకపదము ద్రుతప్రకృతికము. 'అపి శబ్దార్థస్యేతః' అను సూత్రము చెప్పున 'ఏన్' అను రూపమును సిద్ధించు చున్నది. 'ఏన్' లోని నకారపుపొల్లును ద్రుతమే యగుచున్నది. కావున 'ఏనిన్' 'ఏని' 'ఏన్' 'ఏ' అనునవి నాలుగును అప్యర్థకములే. కాఁగా, 'ఆతఁ డేని సీతఁడేని వచ్చును; ఆతఁడేని రాముఁడేని వచ్చును; ఆతఁడే సీతఁడే నగును; ఆతఁడే హరియే వచ్చు; ఆతఁడేఁ గృష్ణుఁడేఁ దప్పకవచ్చును; అనునిట్టి సంధికార్యములు గలుగును. 'ఏని' శబ్దముపై నచ్చు పరమగునపుడు ద్రుత మునకు లోపమురాదు. కావున 'ఏని'శబ్ద మిఁకాదులలోఁ జేరుటకు వీలు లేదు. తుదకు ఇఁకాదులలో 'ఇఁక' ఒక్కటిమాత్రము మిగిలినది. గణమునకుఁ దావు లేకపోయినది. కాని, ఇఁకాదిగణమును నిలుపుటకు 'ముందట' అనుపదము 'నిఁక' తోఁ జేర్పవచ్చును. దీనిపై ద్రుతమునకు సంధివైకల్పికము: "ఇట్టిదైన మనకు - నిందుండగానేల, యరిగి ముందఱున్నయంద యుండి యెఱిఁగి, దీనితోన - యిప్పరోచను గాల్చి, పోదమనిన ధర్మ - పుత్త్రుఁడనియె'—ఆది. VI. 153. "ధర్మతనయ మీరాక ముం-దఱ నెఱుఁగు, జామదగ్న్యుఁడు నిర్మల-జ్ఞానదృష్టి" (అర. III. 128) "ముంద ఱరదముడిగి మేను విదపడిగియెద" (భార. శల్య. I.)

ప్రథమేతరవిభక్తి శత్రర్థక చువర్ణములందున్న యుకారముమీఁది ద్రుతమునకును, ఇఁకమీఁది ద్రుతమునకును దప్పఁ దక్కిన ద్రుతప్రకృతిక ములకు సంధిలేదని చెప్పవలెను.

(2) "అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగానగు"—చిన్నయసూరి. ఉదా. వాఁడువచ్చెను, వాఁడువచ్చెన్, వాఁడువచ్చె.

దీనివలన 'ను'వర్ణము ద్రుతమునకు స్వత్వరూపమని తేలుచున్నది. ద్రుతము 'ను'స్వరూపము కాదనియు నకారపు పొల్లేయనియు నొకయభి ప్రాయము గలదు. "ద్రుతాఖ్యోనః" అను చింతామణి సూత్రము చెప్పున అత్వవిశిష్టమగు నకారము ద్రుతమయినట్లు తత్కర్త్రభిప్రాయము కనఁబడు చున్నది. ను స్థానమున వచ్చిన 'ని'వర్ణమును ద్రుతసంజ్ఞను బొందవచ్చునని

కూడ ననుకొనవచ్చును. దీనిని గూర్చిన చర్చ ద్రుతస్వరూప విచారసమయ మునఁ జేయఁబడినది.

గుర్వంతపద్యముల, అనఁగా, కందము, ఉత్పలమాల, చంపకమాల, మత్తేభవిక్రీడితము, శార్దూలవిక్రీడితము, ఉత్సాహము, మాలిని, స్రగ్ధర, మహాస్రగ్ధర, మున్నగు వానియంతమున ద్రుతముండెనేని నది నకారాపు పొల్లు గానే యుండునుగాని 'ను' అనికాని 'ని' అని కాని యుండదు.

(3) "కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబును గానంబడియెడి."- చిన్నయసూరి. ఉదా: అదియునున్గాక, దివంబునున్బోలె మొదలైనవి. ఇచట 'అదియును, దివంబును' అనువానిలోని 'ను'వర్ణము సముచ్చయార్థకమనియు, అది ద్రుతాంతము గావున 'అదియునున్, అదియునును' 'దివంబునున్, దివంబునును' అనునవియే ద్రుతసహిత రూపములనియు బ్ర శ్రీ. సీతారామ శాస్త్రులవారివాదము. ఈ ద్రుతముపై మరల నకారము కాన్పించినయెడల 'అదియునునున్, అదియునునును; దివంబునునున్, దివంబునునును;' అను రూపము లేర్పడవలసి యుండును. ద్రుతద్విత్వమునకుఁ బ్రయోగములు గాన్పించుచుండుటచే 'వాడు న్నున్నున్నున్న, వీడు న్నున్నున్నున్న, రాము న్నిన్నిన్నిన్ని, భీమున్నిన్నిన్నిన్ని, కొట్టవలె న్నన్నన్నని యనుకొన్నారు' అను నిట్టి ప్రయోగము సాధువు కావలసి యుండును.

(4) ద్రుతప్రకృతికము మీఁది పరుషముల కనఁగా క, చ, ట, త, ప, లకు సరళములగు, అనఁగా పరుసగా గ, జ, డ, ద, బ లాదేశము లగును: ఉదా:

పూచెను + కలువలు = పూచెను గలువలు; తోఁచెను + చుక్కలు = తోఁచెను జుక్కలు; చేసెను + టక్కులు = చేసెను డక్కులు; నెగడెను + తమములు = నెగడెను దమములు; మొగిడెను + పద్మములు = మొగిడెను బద్మములు.

(5) పై రీతిగ పరుషముల కాదేశముగా వచ్చిన సరళములకు ముందున్న ద్రుతమునకు మాఱుగ బిందువు (పూర్ణబిందువుగాని, అర్ధబిందువుగాని) వచ్చును. లేదా, యా సరళవర్ణము ద్రుతముతో సంశ్లేషము నొందును. ఇచట ద్రుతమనఁగా నకారపు పొల్లనియే గ్రహింపవలెను. అట్లుగాక, స్వత్వరూప మగు 'ను'వర్ణమునే గ్రహించినచో 'పూచెన్నులువలు' అని కావలసి వచ్చును. కావున నిచట సంశ్లేషము కలుగుననుటకంటె స్వత్వరూపమగు 'ను'వర్ణము మీఁది ఉత్వము లోపించుననుట యుక్తము. ఉదా: పూచెను గలువలు, పూచెంగలువలు, పూచెఁ గలువలు, పూచెన్గలువలు; తోఁచెనుజుక్కలు, తోఁచెంజుక్కలు, తోఁచెఁజుక్కలు, తోఁచెన్జుక్కలు: చేసెను డక్కులు, చేసెండక్కులు, చేసెఁడక్కులు, చేసెన్డక్కులు; నెగడెను దమములు, నెగడెం

దమములు, నెగడెఁదమములు, నెగడెన్దమములు; మొగిడెను బద్నములు, మొగి
డెం బద్నములు, మొగిడెఁబద్నములు మొగిడెన్బద్నములు — ఈ యుదాహరణ
ములలో సంశ్లేషరూపము వ్రాఁతవిషయమున రూపాంతరముగాని యుచ్చా
రణవిషయమున దానికిని పూర్ణబిందువు తోడిరూపమునకును భేదములేదు
చేసెన్దక్కులు, మొగిడెన్బద్నములు, అనుచోట్ల నకారమునకుఁ బరమందున్న
హల్లువర్గమునకుఁ జెందిన యనునాసికాక్షర ముచ్చారణమున నుండును: చేసె
ణ్డక్కులు, మొగిడెమ్బద్నములు; వ్రాఁతయందును నీ వర్ణక్రమము కాన్పించు
చున్నది.

(6) ద్రుతమునకుఁబరమైనపరుషములకాదేశములుగావచ్చినసరళములు
గాక, యితరములైన గ, జ, డ, ద, బ లును స్థిరవర్ణములును పరమైనయెడల
నాద్రుతమునకు లోపముగాని, సంశ్లేషము (నువర్ణములోని ఉత్వమునకు
లోపము) గాని కలుగును. స్వత్వరూపముగూడ నుండును. ఉదా: వచ్చెను
గోవులు, వచ్చెగోవులు, వచ్చెన్గోవులు; మెఱసెను ఖడ్గము, మెఱసెఖడ్గము,
మెఱసెన్ఖడ్గము.

దీనినిబట్టి ఆదేశ సరళములుకాని గ, జ, డ, ద, బ లు పరమగునపుడు
ద్రుతమునకు బిందువు గలుగదు. ఇట్లే ఖ, ఛ, ఠ, థ, ఫ లకు ఘ, ఝ,ఢ,
ధ, భ,య, ర, ఱ, ల, వ, శ, ష, స, హ, ళ,లకు పూర్వమందున్న ద్రుతస్థాన
మున బిందువును గలుగదు.

(7) వర్గయుక్కులును (అనఁగా ప్రతివర్గములోను రెండవ, నాల్గవ,
యక్షరములు-ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ, లు), ఆదేశములుగా
వచ్చినవికానట్టి. గ, జ, డ, ద, బ లును ద్రుతమునకుఁ బరమైనచో నొక
ప్పుడు ద్రుతమునకు మాఱుగఁ బూర్ణబిందువును గలుగును. ఉదా: వచ్చెను
ధాత్రీపతి, వచ్చెధాత్రీపతి, వచ్చెంధాత్రీపతి, వచ్చెధాత్రీపతి; పాడెను
గంధర్వుఁడు, పాడెన్గంధర్వుఁడు, పాడెంగంధర్వుఁడు, పాడెఁగంధర్వుఁడు.

కన్ + దోయి = కన్దోయి, కందోయి, కన్నుదోయి, కనుదోయి -కన్ను
మొదలగు శబ్దములలోని తుదినువర్ణము ద్రుతమని చిన్నయసూరి తలంచి
నట్లు కనఁబడుచున్నది. చెందొవ, కెందామర, కెందమ్మి, మొదలగునవి'కందోయి'
వంటివే.

(8) అఁట, ఇఁక, చుఁడు, శబ్దంబులందప్పనుడి తొలిహ్రస్వంబుమీఁద
ఖండబిందువును ద్రుతంబునకు లోపంబునులేవు: ముంగొంగు, క్రొంబసిఁడి,
కందోయి, అనునవి తొలి హ్రస్వము కలిగి యాహ్రస్వముపై ద్రుతమున
కాదేశముగా వచ్చినపూర్ణబిందవును కలిగి యున్నవి. అవి యట్లే యుండును

గాని, ముఁగొంగు, క్రొంబసిఁడి,కఁదోయి, అనురూపములు కలుగవని యర్థము. సిద్ధమైన ఖండ బిందువులు నుడి తొలిహ్రస్వములపై అఁట, ఇఁక, చుఁడు, అనుశబ్దములలో మాత్రమున్నవి. వీనిలో 'అఁట' అనునది 'అనుట' కును, ఇఁక (*ఇనుక=కన్న. ఇన్ను) కును, చుఁడు 'చుండు' అనుమధ్యమ పురుషబహు వచన క్రియకును సంశ్లేషరూపములు. ఇందలియఁజనున్నలు లోపించినహల్లు స్థానమున వచ్చినవి. ఇఁక సాధ్యములైన యర్థానుస్వారములు నుడితొలిహ్రస్వ ముల మీఁద నుండవు.

(9) తాను, నేను, పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబులేదని చిన్నయ సూరి చెప్పెను. ఇట్లుచెప్పుట "గసడదవాన్యః ప్రథమా మాత్రాదాత్మా స్మదోర్విసైవై తే" అను చింతామణి సూత్రము ననుసరించియున్నది. కాని, తాను, నేను, పదములు ద్రుతప్రకృతికము లగునా కావాయను విషయమున లాక్షణికులం దభిప్రాయభేదముగలదు. అవి ద్రుతప్రకృతికములనుటకుఁ దగిన ప్రయోగములు నన్నయకృత భారతభాగమునఁ గానరావు. 'నేను' నకు మాఱుగ 'ఏను' పదమునే నన్నయ ప్రయోగించియున్నాఁడు. తాను బ్రబో ధించె నేక - తమ ననుఁ బ్రీతిన్" (ఆది VI. 151); "శ్వేతకి! నీ తపము నకేఁ, బ్రీతాత్ముఁడ నయితి (ఆది VIII. 244); "జనయిత్రీ! యేఁగృ తార్థ - జన్ముఁడ నైతిన్" (ఆర I. 359); "మాయాశ్రమ మిందులకున్, న్యాయనిధీ, మూఁడుయోజ - నంబులుగల దేఁ, బోయెద" (ఆర III. 99); అని ముద్రిత ప్రతులందు సరళాదేశముతోడను, నర్థానుస్వారముతోడను బ్రయోగములు గాన్పించుచున్నవి. కాని, యీ పాఠము లాపదముల ద్రుత ప్రకృతికత్వమును నిర్ణయింపఁజాలవు. "తాను ప్రబోధించె; ఏప్రీతా త్ముఁడ; ఏ గృతార్థుఁడ; ఏవ్రాయెద; అనియున్నను నీప్రయోగములకు బాధ లేదు. "ఏలతామమ్ము నెఱిఁగెడు" (ఆది. VII. 231) అను ప్రయోగమున స్థిరవర్ణము పరముకాఁగా 'తాను' పదములోని 'ను' వర్ణము లోపించియున్నది. కావున, ఏను (నేను), తానుపదములపై పరుషములు పరమైనప్పు డందలి నువర్ణము లోపింపవచ్చుననియు,లుప్తశేషము సంపూర్ణపదమువలెనే ప్రథమా విభక్తియం దుండుననియుఁ, గావున గసడదవాదేశమేవచ్చునుగాని సరళా దేశమును తత్సంబంధములగు వ్యాకరణకార్యములును గలుగవనియుఁ జెప్ప వలెను. తిక్కనప్రయోగము లీయూహనే బలపఱుచుచున్నవి.

"నీచెప్పిన పెద్దలు ద్రోణాచార్యులు మొదలుగాఁగ - ననిఁ గొల్లనివా రైచన్న వారలంగొని, యేచక్కం బెట్టువాఁడ - నేపాండవులన్"

[ఉద్యో. II. 250.]

ఈ పద్యమున రెండవపాదమునకు 'రై' చేరనివారింగొని, యేచక్క-బెట్టువాఁడనేఁ బాండవులన్ " అని పాఠాంతరమున్నది. భారతకవుల గ్రంథములందు ప్రథమపైఁ బరుషములకు గ స డ ద వా దేశము నిత్యము; బహుళము కాదు. కాఁబట్టి నాల్గవపాదమున మొదటి 'ఏ' అనునది 'ఏను' శబ్దపర్యాయముగాదు. ఐనచో 'ఏనక్కఁబెట్టువాఁడనే' అని యుండవలెను. 'ఏను శబ్దము ద్రుతప్రకృతిక మనుకొన్నచో 'ఏఁజక్కఁబెట్టువాడను " అని యుండవలెను. రెండు పక్షములందును ప్రాసము కుదురదు. కావున 'కొనియే' అనదానిలోని తుది ఏకారమవధారణార్థకముగాని, ప్రశ్నార్థకముగాని కావలెను 'చక్కఁబెట్టు వాఁడనేఁ బాండవులన్' అనుచోట 'ఏ' కారము 'ఏను' శబ్దపర్యాయము కావలెను. 'ఏను' శబ్దము ద్రుతప్రకృతికమైనచో నీ ప్రయోగము సాధువేయగును. కాని, ఆ పదము ద్రుతప్రకృతికత్వము నీప్రయోగము నిర్ణయింపఁ జాలదు. 'ఏఁబాండవులన్' అన్నను పద్యమునర్థమునకు హానిలేదు. ఇఁక 'తాను, నేను (ఏను)' పదముల ద్రుతప్రకృతికత్వమును నిర్ణయింపఁగల భారత ప్రయోగమొక్కటి మాత్రమున్నది. అది—

"కవదొనలును గాండీవము, నవలనిడంబనుపు, ముంద-అరదముడిగు, మే
ను విదపడిగియెద శుభకర, మవు నివ్విధమిట్లు సేయు-మనుఁడునతండున్"

[శల్య. II.]

అనునది. ఇందు, ఏను విదప డిగియెద, అనుచోట 'ప' కు 'వ' ఆదేశముగ వచ్చుటచే 'ఏను' ద్రుత ప్రకృతికము కానట్లు తెలియుచున్నది. ఇది యాంధ్రశబ్దచింతామణి సూత్రమునకు విరుద్ధముగ నుండుటచే పండితులనేకవిధముల నీపాఠమును సవరింపఁదొడఁగినారు. 'ఏనుబిడప' అని సరళా దేశము చేసి ప్రాసస్థానమందును 'వబయోరభేదః' అనుదానిని పట్టించి కొందఱు సమాధానపడుదురు. కాని, వ, బ, ప్రాసమున కుదాహరణములు భారతమున మృగ్యములు. గుప్తార్థప్రకాశికాకారుఁడు 'ఏన విదప డిగియెద' అని ఏనుశబ్దముపై నవధారణార్థక 'అ' కారమును చేర్చి చదువుకొనుమనిరి; కాని, అవధారణార్థక చిహ్నముపైఁ గాని ప్రశ్నార్థక చిహ్నముపైఁ గాని గ స డ ద వా దేశము రాదుగావున నీసవరణయు సరిగలేదు. ఇట్టి సందేహముండియే కాఁబోలు 'ఏను వెనుకడిగియెద' నని వ్రాఁతప్రతులం దున్నదనియు నాతఁడు వ్రాసియున్నాఁడు. తిక్కన కాలార్థమున 'వెనుక' అనుదానినుపయోగింపలేదు. కావున, వ్రాఁతప్రతులయం దట్టిపాఠమున్నను నది గ్రహింపఁదగినది కాదు.

పై విచారమునకు ఫలితమేమనఁగా: తాను, నేను పదములు ద్రుతప్రకృతికములు కావు. ప్రథమావిభక్తియందు వాని నువర్ణము వైకల్పిక

ముగ లోపించును. కన్ను, చెన్ను, మొదలగు శబ్దములమీఁద నెట్లో యట్లే వీనిమీఁదను గసడదవా దేశమగును, గాని సరళాదేశము రాదు. ఈ గసడదవాదేశము పూర్వకవులయందు కనఁబడుచున్నను, దరువాతికవు లొకప్పుడు వానిని ద్రుతప్రకృతికములుగఁ దలంచి సరళాదేశముచేయ మొదలిడిరి. ఆంధ్రశబ్దచింతామణి యట్లు సరళాదేశమును గవులుచేయుచుండిన కాలము నాఁటిది. కావుననే తాను, నేను పదములపై గసడదవాదేశమును నిషేధించుచున్నది.

(10) "కొన్నియెడలఁ బ్రామాణికప్రయోగంబులం ద్రుతంబున కచ్చు పరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి" ఉదా. అతనిద్దైన్యశక్తిక్కను దుగ (భార. ఆర. I.); సర్వమున్నతని దివ్యకళామయమంచు (భాగ. స్క. VII.), సర్వాంగుని న్ననుభూత (ఉ. హరి. VI.); పయ్యెదను న్ననువైన చేతులన్ (మను. III.): క్షోభమునొందెదె, న్నివ్విధమున (ఉ. హరి. VI.); తారొక్కన్న కోట్లంబలె, న్నరుశోభా విభవాకరంబులగుచున్ (కళా. VII.); తుదియందు న్నిదినాకుఁ జెప్పుము (పద్మ. ఉ. ఖ. 1. 157); పిట్టవలెం బొరలి పొరలి పిలుచు న్నిఁక నేనెట్టు భరియింతు (ఉ. నై. పు. 25); శ్రీయుతుండై యన్యులకు, న్నెయెడఁ గీడాచరించు (కుచే. III. 55); ఇట్టి ప్రయోగముల నెన్నిటినైన నీయవచ్చును. వ్యవహారమున 'రెండున్నర' మొదలగురూపము లిట్లు కలిగినవే.

(11) "తెలుఁగుఁ గర్మధారయ సమాసంబునం బెన్వాదుల కడహల్లున కచ్చుపరంబగు నపుడు ద్విత్వంబు గానంబడియెడి". ఉదా. పెను+అరదము= పెన్నరదము, మొదలైనవి.

(12) "ప్రాసంబున మకారంబు పరంబగుచో మకారాదేశంబగు" - ప్రౌఢవ్యాకరణము. ఉదా. కమ్మని లతాంతములకు మొమ్మసి (భార. ఆది. VII) : మొదలయినవి.

(13) 'వచ్చుచున్నవాఁడను' వంటిక్రియారూపములోని తుది నువర్ణముకాని, 'వచ్చుచున్నవాఁడన్' లోని నకారపు పొల్లుగాని ద్రుతమగును. దానిపైఁ బరుషములు పరమైనచో సరళాదేశమును బిందు సంశ్లేషములును అవసానము పరమగునపుడు లోపమును గలుగును 'వచ్చుచున్నాను' వంటి క్రియారూపములలోఁ గూడ 'ను' వర్ణము ద్రుతమే కావలయును. దానిపై పరుషములను నవసానమును బరమైనప్పుడును గ్రాంధికభాషలో సరళాదేశ బిందు సంశ్లేషములును, లోపమును కానంబడవు. కాని, వ్యవహారమున నా కార్యములు కలుగుచున్నవి. "ఇదుగో వస్తున్నా; వస్తున్నాఁగదూ; 'వస్తున్నాం

గదూ' అనునట్టి రూపములలో నర్థానుస్వారోచ్చారణము కొన్ని మండలముల వాడుకలో వినఁబడును. కొన్నిట వినఁబడదు.

### గ స డ ద వాదేశము.

గ స డ ద వాదేశమునుగూర్చి లాక్షణికు లనేకమతములను వెల్లడించినారు. "ఆత్మాస్మచ్ఛబ్దములఁ దప్పఁ గేవలప్రథమా విభక్తిపైఁ గచటతప లకు గసడదవ లగును. వికృతి శబ్దమునకుఁ బరమందుండు సంస్కృతపరుషములకు గసడదవలు రావు; ద్వంద్వ సమాసమునందు పదమునకంటెఁ బరమయిన పరుషములకు గ స డ ద వలు వచ్చును—ఆంధ్రచింతామణి. "ప్రథమాంతముమీఁదను, కాకువు, సంబోధనము, అవ్యయములందును, గర్మధారయమునందును, అచేతనార్థక శబ్దములమీఁదను వచ్చుపరుషములకు గ స డ ద వలు వైకల్పికముగా నగును."—అథర్వణుఁడు. "సంస్కృతసమశబ్దాది సకారమునకు ప్రథమపై వకారము గలుగును; ప్రాసయందు గలుగదు; యతియందు వికల్పము"-అనికొందఱు. యతిప్రాసముల రెంటి యందును 'స' కారమునకు వకారము వికల్పముగా వచ్చును, అనికొందఱు "యతియందు తప్పకవచ్చు" నని కొందఱు; "అంతటను తప్పకవచ్చు" నని మఱికొందఱు. "ద్వంద్వసమాసమందు తప్పఁ దక్కిన సమాసములందు పరుషములు గ స డ ద వలు కావు; ప్రథమకంటెఁ బరములగు పరుషములు వికల్పముగా గ స డ ద వలు కావు"-హరికవి. "ద్వంద్వసమాసములందు పదమునకంటెఁ బరమయిన పరుషములకు ద్రావిడభాషలయం దన్నియెడల గ స డ ద వా దేశమగును, తత్పురుష సమాసములందు కాదు" - కాల్డువెల్లు.

రెండచ్చులకు మధ్యమునఁ బడిన పరుషము సరళమగుట ద్రావిడ భాషా సంప్రదాయము కావున ద్వంద్వ సమాసమునఁ బరుషములు సహజముగ గసడదవ లగుననియుఁ, దత్పురుష సమాసమునందు మొదటి పదము నర్థము రెండవ పదములోనికి సంక్రమించు చున్నది గావునఁ దమిళమునఁ బరుషమునకు ద్విత్వము కలుగుటయు, నితర ద్రావిడ భాషలయందు కేవల పరుషము నిలుచుటయు సంభవించుచున్నదనియు కాల్డువెల్లు నభిప్రాయము.

పైయభిప్రాయములను విమర్శింపక పూర్వ మీవిషయమునఁ బ్రామాణికులగు నన్నయ. తిక్కన, యెఱ్ఱాప్రెగడల గ్రంథములందు పద్యముల ప్రాసస్థానములలో గసడద వాదేశమునకు సంబంధించిన విషయము లీక్రిందఁ బొందుపఱుపఁ బడినవి.

#### (1) ప్రథమమీఁది గసడదవాదేశము.

ఆది. VI. 204. చేసమరికొనుచు; విరా. IV; 30. నే, ర్పుగలదె; ఉద్యో. I. 143. శ్రీవాలింపంగ; II. 243. వేపోసిన; 310. కల్పకంబుగరము;

నకు ; 221. ఐతెలివి ; అశ్వ. III. 113. చే, సితగ ; ఆశ్ర. II. 134. పం, చిపురజనంబు ; నిర్వ. III. 77. ఐతగు ; V. 35 ఎ, క్కకడుక ; VI. 23. ఐ చేసెద; VIII. 24. కానరా, కపగిది; 84. ఐ పాలించెను; సౌప్తి. II. 113. సృజియించుట, కైతోయము; శాంతి. V. 519. శరీరంబున, కైతోఁగునె.

(ii) సంబోధనములపై.

అర. VII. 284. ఓ కర్ణ! కర్ణ. II. 327. నిశ్కృష్టాతునిమెద; శాంతి. V. 559. మహా, త్మాతెలిప్పెంద; అను. I. 210. త, ల్లీకృపసేఁత; II. 147. ఓకాశ్యపి; III. 180. అధి, పాకలిగిన, IV. 23. పు, త్రా తెచ్చు అశ్వ. I. 115. నృ పాతెలియఁగ; మౌస. 215. మునినా, థాచేటును.

(iii) అవధారణార్థకముపై.

ఆది. I. 58. పర్వ, ంబకడుక; ఉద్యో. I. 321. ఇంతేపో; III. 45. అ, ల్లేపోనిత్తురు; భీష్మ. II. 7. ఒకం, డతటికి; ద్రోణ. V. 93 ఒక్కపె, ట్టపరగి; కర్ణ. III. 292. ఖాండవం, బేతెలిప్పెంది; నిర్వ. VI. 122 అప్పా, టతనకు.

(iv) కొన్నిశబ్దములపై.

చేకొను: ఆది II. 51: ఆది. IV. 129; ఆది V. 144; సభా. II. 67; భీష్మ. III. 296; సౌప్తి. I. 103; శాంతి. IV. 333; శాంతి. IV. 596.

కైకొను: అర. VI. 169; శల్య. II. 249; అశ్వ. I. 87 నిర్వ I. 80; V. 84; IX. 92.

చేకుఱు: అర VI. 169; భీష్మ III 396.

తోకొను: అర. III. 220.

పోపడు: అర. VI. 190; శాంతి. III. 249.

తోతెంచు: నిర్వ. VI. 44.

పాలుపడిన: శాంతి. V. 493.

(v) కొన్ని అవ్యయములపై.

విరా. II. 89. వేచని; ఉద్యో. I. 358. కా, నతగక; III. 25. వే, గతెగం; IV. 387. వేపోయి; కర్ణ. I. 88. వేతూలును; III. 128. వేతునిమిన; శల్య. I. 241. వేగతోలఁగ; సౌప్తి. I. 163. వేకదియక. శాంతి. II. 66. ఏ, లతోడంగె; అశ్వ. I. 107. వేతెత్తుక ; నిర్వ. VI. 114. వేతురగంబులన్ IX. I. వేకొని. భీష్మ. II. 316. వేతటియంగ ;

వచ్చుటయు రాకుండుటయుఁ గలుగుచుండె ననవచ్చును. గసడదవాదేశమునకు శాసనములనుండి కొన్ని యుదాహరణములు:—

ద. ఇం. శా. 281, 688 తల్లిదండ్రులు; 666 శ్రీగోలుఁగొండవడాలు కాటనిక, కమలదళాక్షి వెన్నమ ప్రకాశను గాంగ్గ, 667, 677. నెయి వ్రాయఁగలవాండు; మానెండు వ్రాయంగలవాండు; 672, అంత్తగాలము, అందు ప్రసిద్ధిగ, దేవులు దివ్యమైయుండంగ; 675 నాయకుండ్గు వి, ట్స్నతుండు, జగజ్జగషుండు వేమ్మిశ్రెం; విద్యాలలనుండు గంటండు; మహామతిగంటని; 677. అమిత్రతాంశుండు పయఃపయోధి; 715 బోయుండుదన; 737 తీఱు వెట్ట, 784 ధనము వెట్టలేక; 799. ఇరువుటి ( = ట్టి); వి త్తినాలువారే పొలమునను; 929 అంత్తగాలము; 974. మూండువ్రుట్లు; 1108 అంబుజాస్య గోమలి; 1114 దేవభణ్డారువు సొచ్చి; 1115. వెయి వ్రాంక మూంకులు, 1169. పరమపవిత్రుణ్డువాత్రుణ్డు; 1190, రెణ్డుగట్టిన; 1226 దయసేసెరి, V. 151 మూండువ్రుట్లు సేను, 167 ముప్పండ్డుము సేను; 192 అందువరగిన; 1105. ఏనుమాడలువెట్టి; 1148 ధారాపూర్వ్వకముసేసె, 1202 ఎంత్త గాలము; 1204. ఇంత్తపట్ట = ట్ట, VI 217 బోయుణ్ణుగను, మొదలైనవి. భారతేతరకవులలో నిక్రింది సందర్భములందుఁ గూడ గసడదవాదేశము రాకుండఁ బ్రథమస్థానములందు ప్రయోగములు కాన్పించుచున్నవి

(1) కొన్ని శబ్దములపై.

ఆము. IV. 204. కూపెట్టిన; V 131. మేకొని, శృంగా. I 177. మేకొని; ఉ. హరి. I 99. చేపట్టక; III 153; కళా. III. 137 చేపడఁ బట్టి; కళా. IV. 110. పైకొన్న VIII 206 పైపై; కావ్యా. II 38. చూపట్టును; కువల V. 73 కేయూర. III. 87. తోకొని, గౌరన. హరి. I. 1840. మైకొనక; గౌరనహరి. II. 653. చెపడ్డ; నిరంకు, II. 53. తనయుని, పైకరుణ; నిలాను III. 97. పైకొని; పృషిం. I 32. పైపడు; పండితా. పుట. 124, పైచని; పుట. 142. వాచఅచుచు; పైవడి; 366 పు. పైపడు; పరమ. I. 36. దాకొని; II. 137. చెప్పట్టుట; చూపట్టుము పాండు. I. 308. పైకొలుపు; IV. 27 పైపై, బసవ. పుట 34 చావుక్కలాక! పుట. 51. తూపొడ్వఁ గూడునే; పుట. 73. పైచను; భాగ IX. 38. పైపై; X. (I) 309. వాపోవఁగ, 722, 1136. పైకొని; భాస్క. రామా. బాల. 202. వేకడ; యుద్ధ. 200. పొంగ, దుపడుంగావున, పను. II 90 తే, టపడం గాంచెద; వాసిష్ఠరా. III. 70. చేలప్పి; V. 77 తూంగొని; విజ్ఞా. వ్యవ. 36. వాకొను.

(ii) సముచ్చయ దీర్ఘములపై.

ఉ. హరి IV. 235, 236, ఏ, మీఁపాడగానవే; నిరం. II 22. బా, రాపది గచ్చి . .

(iii) మఱికొన్ని క్రియలపై

కళా. III. 131 వే, రుకదా.

(IV) విభక్తికము పర్ణము లోపింపగాఁ బైవచ్చిన సంధులు

కళా III 259. ప్రయా, సకదు.

(v) మఱికొన్ని షష్ఠీ కర్మధారయ సమాసములు

ఇందు. IV. 25, రాకొమరుఁడు, కళా. 107. రాకొమరుఁడు; కుమా. IV. 19. వేలుపు,రాకూరిమి

గసడదవాదేశమును గూర్చిన విధులు ప్రాఁస్థానములందు చిక్కులఁ గల్గించఁగా పర్యాచీపకవు లాయాదేశము వైకల్పికమనియు, బహుళ మనియు ననుకొన్నచో నాచిక్కులు తొలఁగునను నుద్దేశముతోఁ బకటఁగొన్నిచోట్ల బాటింపరైరో, ఆయా పాఠములు ప్రక్షిప్తములో. వీనికిఁ బాఠాంతరము లున్న జో నిర్ణయించుటకు వీలు లేదుగాని, యీయా ప్రయోగములను జూచి కావలయుఁ గొందఱు లాక్షణికులు గసడదవాదేశము బాహుళిక మనియే లక్షణము నేర్పఱచిరి ఈ క్రింది ప్రయోగములు ప్రమాద జనితము లని తోఁచుచున్నవి:—

ఇందు VI 95. ను. కామిన్మకజ్యావనం, బు చతుర్దిక్కులునిం

నరస. III 21. క. ... మహామహులని మనం బు నరిజ్వలితంబు

..గము III. 65 క ... ఆ, హాగట్టినది

పాండు III. 87 సీ . కాంచినగురు నెఱి - వేచాంచఁజారితంత

భాస్క. రామా యుద్ధ. 323.

చ. వికృతముఖులైన మర్కటుల వేషము లక్కట నీవునూచి భీతుంబుచి వచ్చి నోరికోలఁదుల్ నచరించెదు..

భాస్క. రామా. యుద్ధ 2166

మ. అకటా యెవ్వను మున్నెఱుంగని మహీయంబైన మర్మంబు వీఁడు కృతఘ్నుండయిచెప్పె...

మనుచ. II. 16. మ ... కా, శికురుత్క్షేత్ర ... ('కాశిః' అను నికారాంతపదము గూడ నున్నది. చూ. ఉణాది IV. 119.)

రసికజనమనోభిరామము : పుట. 63. ఆశ్వా. IV.

క. అపుడంగు .. నాడి పరీక్షసేసి. ('నాడిః' అను నికారాంత శబ్దము గూడ కలదు. చూ. కాదంబరి ; బాలరామాయణము. లేదా, 'నాడిపరీక్ష' షష్ఠీసమాసమని చెప్పికొనవచ్చును.)

వరాహపు. VIII. 12. క ..తత్పర, మైసలిపి ..

కై, చే, తో, చూ, శబ్దములపై వచ్చుపరుషాదిగల పదములతో ధాతు పల్లవము కలిగినయెడల గసడదవాదేశము రాదు ; కై, చే, లు ప్రథమలుగా నున్నచో నాదేశము వచ్చును

కైసేయు, చేసేత, చేసమరు, చేపట్టు, చేపట్టు, కైకొను, తోకొను, చూపట్టు మొదలగునవి.

ద్వంద్వసమాసమందు గసడదవాదేశము వచ్చునుగాని, పూర్వపదము తుదివర్ణములోపించి సమాస మేర్పడు నప్పుడును, తుదివర్ణము దీర్ఘమగునప్పుడును నాదేశమురాదు : అందచందములు, అప్పచెల్లెండ్రు

వ్యవహారమునందు ద్వంద్వ సమాసములలో క, తల కాదేశము నేడును గానవచ్చుచున్నది : తల్లిదండ్రులు, కూరగాయలు—

పామరజనుల మాటలందు 'చ' కు 'స' దేశము కానవచ్చుచున్నది. ఈ యాదేశ మన్నియెడలను నందు గానవచ్చును : ఉప్పసెల్లెలు, వాడునాతో సెప్పినాడు, ఏమనిసెప్పినాడు, రెండు సెంపకాయలు మొదలయినవి

శాసనములందు 'తల్లితండ్రుల'ను రూపమును గానవచ్చుచున్నది. వ్యవహారమందు నేడును గొండలుళ్లే యుచ్చరింతురు.

గసడదవాదేశము పూర్వకాలమునఁ జాల తఱచుగ జనుల యుచ్చారణమున నుండియుండెను. కొన్ని మండలములం దాదేశముగా వచ్చిన గసడదవలే పదాది వర్ణములను భ్రమగలుగుటచేఁ గొన్ని పదములకు మాండలిక భేదము లేర్పడెను —

క—గ : కడప, గడప ; క్రుచ్చు, గ్రుచ్చు ; క్ర(గ్ర)కంటె;) (గు)న్న ; మొదలయినవి.

చ—స : చేమంతి, సేవంతి, చ(సం)క, చ(స)లుపు, చ(స)ను, చా(సా)ఁగు మొదలయినవి.

త—ద : తిద్దు, దిద్దు, తిన్నె, దిన్నె, తూ(దూ)ఁటు మొదలైనవి.

ప—వ : పంచు (చూ. వంతు); ప(వ)దరు; పఱత, వఱద; (లో)పల, వల(ను); పగ్గము, వాగె; పా(వా)టు; పన్ను, వాను; పాయ, వాయ; పిక్క (టిల్లు), విక్కు, వీకు, తమి; పిన్ , తె. వెను(క); పెల్లు, వెల్లి (విరియు); ప్ర (వ్ర)య్యు ; పెట్టు, చూ. వ్రేటు మొదలయినవి.

గ, స, డ, ద,వాదేశమా ? పరుషాదేశమా ?

తెనుఁగునఁ బరుషములకు గ, స, డ, ద,వాదేశము గలుగు సందర్భములు పైని వివరింపఁబడినవి. కాని, కొన్నియెడల పరుషములకు గ, స, డ, ద, వాదేశము కలిగినదా, లేక గ, స, డ, ద, వ,లకు ద్రావిడభాషా సంప్రదాయానుసారముగఁ బదాదియందుఁ గ్రమముగ, క, చ, ట, త,పలు వచ్చి, మరలనా క, చ, ట, త, ప లు రెండు స్వరములమధ్యఁ బడఁగా వానికిఁ బూర్వమందుండిన గ, స, డ, ద, వ లను నుచ్చారణము కలిగినదా యను సందేహము కలుగుచుండును. క, ట, త,ల విషయమున సరళాదేశమునకును గ, డ, దాదేశమునకును (ద్రుతమునకు బిందు, లోప, సంశ్లేషములు కలుగుట యందు తప్ప) భేదను కానరాదు. బిందు, లోప, సంశ్లేష కార్యములు ద్రుత విషయకములు గావున గ, డ,ద ల యాదేశమును బాధింపవు. కొన్ని పదములు పరుషాదులా, సరళాదులా, యను విషయమున సందేహము లుండనే యున్నవి. వ్యుత్పత్తిని బట్టి యాలోచించినచోఁ బరుషాదులని మన మనుకొను కొన్ని పదములు సరళాదులనియే చెప్పవలసియుండును. అట్లే, చ, పలు స, వలుగ మాఱునని వైయాకరణులు చెప్పు విషయమునఁ గూడ నూహింపవలయు నేమో ! కొన్ని యుదాహరణములను మాత్రమిచ్చి యీ ప్రకరణమును ముగింప వలసియున్నది.

ఈ క్రింది పదముల వ్యుత్పత్తిని బట్టి యవి తొలుత సకార మాదియందు గలిగినవనియే చెప్పవలసియుండును :

చన్ను, సం. స్తన ; చచ్చు, సం. శవ్, కన్న. సాయు ; చక్కెర, సం. శర్కర; చట్టము, సం. శాస్త్రమ్ ; చదువు, చప్పుడు, సం. శబ్ద : చాఁగు, రూ. సాఁగు, కన్న. సాగు; చాతాని, రూ. సాతాని; చాటించు, రూ. సాటించు; కన్న. సాఱు, తమి. శాత్తు; చారు, సం. సార; చావు, సం. శవ; చుప్పనాక, సం. శూర్పణఖా; చూఁడి, సం. సూతికా; చూఁకురు, సం. శోక ; చూఱు, కన్న. సూర్ ; చొక్కు, సం. శుష్క, కన్న. సొక్కు; చొట్ట, రూ. సొట్ట, కన్న. సొట్ట; చోడు, రూ. సోడు; చటులు(పడు),చూ.సడలు, సం. శిథిల,కన్న. సడులు; చెత్త (చెత్తారము), కన్న. సదె; చప్పన (రుచి), కన్న. సప్పన్న; చంబ (కాయ), కన్న. సంబె; చయ్యన, కన్న. సయ్=తిన్నన; చెల్లు, కన్న. సల్ ; చమురు, కన్న. సవరు; చవి=రుచి, కన్న; సవి; చవుడు, చౌడు, కన్న. సవళు, సవుళు, సౌళు; చలి, కన్న.

సళి; (నాఁగేటి) చాలు, కన్న. సాలు; చిక్కు, కన్న. సిక్కు, సిలుకు; చిక్కటి, కన్న. సిక్కటి; చిట్టి, కన్న. సిట్టు, చిడి (లి)పి, కన్న. సిడి; చేరు, కన్న. సారు, సేరు; చీమిడి, కన్న. సిమ్బళ; చిప్ప, మరాఠీ. శిమ్పా, కన్న. సిమ్పు; చిమ్ము, కన్న. సిమ్పిసు; (బట్ట) చుమ్మ, కన్న. సింబి, సివిడి; చిక్కు, కన్న. సిక్కు; చీఁదు, కన్న. సీన్; చీకు=చప్పరించు, పీల్చు, కన్న. సీపు, చీర (పేను), కన్న. సీర్, చీఁదరించు, కన్న. సీవరిసు; చీలు, కన్న. సీళు; చుట్టు, కన్న. సుట్టు, సుత్తు; చూడు=కాలు, కన్న. సుడు; చూఱ, కన్న. సూఱె; చెక్కు=చెఱువు, కన్న. సెక్కు; చెఱఁగు, కన్న. సెఱఁగు; చెఱ, కన్న. సెఱె; చెలఁది, కన్న. సెలది; సెలన్ది; (నీరు) చేదు=తోడు, కన్న. సేదు, సేన్దు; చొట్ట, రూ. సొట్ట, కన్న. సొట్ట;(గడ్డి) చొప్ప, కన్న. సొప్పె; మొదలయినవి.

స, వ,ల విషయమున నింత కంఠోక్తిగఁ జెప్ప వీలు లేదు. అయినను నీక్రింది యుదాహరణములను గమనించినచోఁ గొన్ని తెనుఁగు శబ్దములు తొలుత వకారాదిగ నుండి, తరువాత పకారాదు లయ్యెనని యూహింప వచ్చును.

పక్కు, రూ. వక్కు; పనవు, చూ. వనరు; పరుస, చూ. వరుస; పఱత, చూ. వఱత, వఱద; పసను = ఎఱుపు మించిన పసపువన్నె; చూ. వసంతము; పిదుకు, సం. విధ్, వేధ్; పీలు, చూ. వ్రీలు; పట్టు, పెట్టు, సం. వృత్, వర్త్; పెడలు, ప్రిదులు, చూ. వెడలు; పెన్న (నది)సం. వేణికా; ప్రాకృతము, వేణ్ణా చూ. వేనలి; పెఱుగు, పెక్కు, చూ. వెక్కసము; పెల్లు, చూ. వెల్లువ; మొదలయినవి.

ద్రావిడభాషల సరళాదేశ, గ, స, డ, ద, వాదేశ విషయమున గుర్తింప వలసిన కొన్నివిషయములు గలవు. తమిళమునఁ బదాదిని టకారముండదు కావున నాదేశవిషయమున క, చ, త, ప, లు మాత్రము సంధియందు గ్రహింపఁబడినవి. కన్నడమున పదాదిని టకారము కనఁబడుచున్నను దానికి డకార మాదేశముకాదు; చకారమునకును జకారముగాని సకారముగాని యాదేశముగరాదు; సకారమునకు చ, ఛ, జ, లాదేశము లగును. కావునఁ గన్నడమున నాదేశమునకు గుఱియైన హల్లులు క, త, ప, లుమాత్రమే. తమిళమునను పదాదిచకార ముచ్చారణమున చ, శ, లకు మధ్యముగ వినఁబడుచు సవర్ణసదృశమగు శవర్ణమును బోలియుండుటచే చవర్ణమునకు విధింపఁబడిన సంధికార్యములు శ (స) వర్ణమునకే యనిగ్రహింప వచ్చును. కావున, తమిళము నందును క, చ, ట, త, ప, లలో క, త, ప, లకు మాత్రమే వికారము కలుగుచుండును. తెనుఁగునను క, త, ప, ల విషయమున మాత్రమే యాదేశమును రూఢిగ (బహుళమనియైనను) చెప్పవలసి యున్నది.

తమిళమున మకారముపై వచ్చు క, చ, త, ప లకు మాత్రము గ, జ, ద, బలువిధింపఁ బడియున్నవి. అచ్చునకుఁ బరమగు క, చ, త, ప, లకు గ, జ (స), ద, బ (వ), లాదేశములుగారాక, వానికి ద్విత్వము కలుగుచున్నది. ద్విత్వము గలుగని సందర్భములం దవి యెట్టివికారము నొందక నిలుచుచున్నవి. కావున నీ విషయమున తెనుఁగుకన్నడము లోకమార్గమును, తమిళము వేఱుమార్గమును బట్టినవని చెప్పవలయును.

తమిళమున రెండచ్చుల నడుమఁబడిన పకారము వకారమగుచుండును. తెనుఁగు కన్నడము లందును కొన్నిసందర్భములందుమాత్ర మట్లగును. వకారమునకు పకారమాదేశ మగుటమాత్ర మే ద్రావిడభాషయందును గాన్పింపదు. పాదులగు ద్రావిడ శబ్దముల కితరభాషలలో మూలములు వ-కారాదులై యున్నను, ద్రావిడభాషలలో నవి ప-కారాదులుగనే స్థిరపడి తక్కిన పా-ది పదములందువలెనే సంధియందు మఱల వ-కారాదేశము నొందుచున్నవి. అట్టి సందర్భములందు మూలమందలి వ-కారము మఱలఁ గాన్పించుచున్నదని యైన ననుకొనవచ్చును. స-కారవిషయమున నట్లు చెప్పుటకు వీలులేదు. ఏక ద్రావిడభాషయందే యేకపదము చా-దిగఁగాని సా-దిగఁగాని యుండవచ్చును. అట్టియెడల నాపదము చ-కారాదియా, స-కారాదియా యని వ్యుత్పత్తిని బట్టి తప్ప నిర్ణయింప వీలుండదు. కన్నడమున స-కారాదులగు శబ్దములకు మూలమందు సకారమే యుండుటచేతను, అట్టి సకారాది పదములు గొన్ని తెనుఁగున చా-దులుగ వినఁబడుచుండుటచేతను, తెనుఁగున స-కారమునకు చకారాదేశము కలుగుచున్నదనియుఁ జెప్పవచ్చును. మూలమందు సకారాదులైన శబ్దములు తెనుఁగున చా-దులగునపు డవి దంత్య చకారాదులగును. ఇట్టి దంత్య చకారమునకు తెనుఁగు వ్యవహారమున (పామరజన వ్యవహారమే యనుకొనవచ్చును) సకార మిప్పటికిని వినఁబడుచున్నది. ఇందుచేతనే కావలయు "తెనుఁగులమీఁది సాంస్కృతిక ః కుషములకు గ స డ ద వ లురావు" అను సూత్రమేర్పడినది. కాని, ఈసూత్రము సర్వత్ర వర్తింపదు. మీరల్గోపించిన, పెంపు వరీక్షింపమొ, ముల్లోక విభుండు సక్రి, మొదలగుచోట్ల సాంస్కృతిక క, ప, చ లకు గ, వ, స లాదేశములుగఁ గాన్పించుచున్నవి. ఇందువలన దంత్య చకారాదుల కయినను తాలవ్య చకారాదుల కయినను తెనుఁగున నాదేశము తెనుఁగుల మీఁదనేకాక సాంస్కృతిక శబ్దములమీఁదను వినఁబడుచున్నది. తెనుఁగున దంత్యచకారమునకు నాదేశము నిత్యమనియు, తాలవ్య చకారమున కైచ్ఛికమనియుఁ జెప్పవలయు నేమో!

క, చ, ట, త, ప లకు గసడదవ లాదేశములగుట ద్రావిడ భాషల యందేకాక ప్రాకృతమునందును నేఁటి యుత్తరహిందూస్థాన భాషలయందును గానవచ్చుచునే యున్నది. ప్రాకృతమునందు రెండచ్చుల నడుమఁబడిన క, ట, త, ప, లు గ, డ, ద, బ, లుగ మాఱుట సుప్రసిద్ధము. ఉదా: సం. కోకిల, ప్రా. కోగిల; సం. కీట, ప్రా. కీడో; సం, శకటిక, ప్రా. సగడిఅ; సం. కటుక, ప్రా. కడుఅ; సం. ఆగత, ప్రా. ఆగదో; సం. మతి, ప్రా. మది; సం. పిపాసా, ప్రా. పివాసా; సం. ప్రాపయతి, ప్రా. పావేది మొదలయినవి.

రెండచ్చులమధ్యఁబడిన క, ట, త, ప, లు గడదవలుగ మాఱుట నేఁటి యార్యభాషలయందును గాన్పించుచున్నది. కాని, యనేక శబ్దములలో నీ గడదవ లింకను బలహీనములయి తుదకు లోపించినవి: ఉదా. సం. కుంభకార, ప్రా. కుంభగార, కుంభఆర, మరాఠీ. కుంభార్; సం. ఘట, ప్రా. ఘడ; హిం. ఘడా; మరాఠీ. ఘడా; సింహాళీ, ఘటో; సం. కీటక, ప్రా. కీడఅ, మరాఠీ. కిడా, గుజరాతీ కీడో, హిం. కీడా; సం. కర్పట, ప్రా. కప్పడో, హిం. కప్డా, మరాఠీ, గుజరాతీ: కాపడ్; సం. శీతల, ప్రా. సీదళ, సీఅళ, మరాఠీ, సిళా, గుజరాతీ, సిళా; సం. దీపః, ప్రా. దీవ్రో, మరాఠీ, దివా; సింహాళి, దివ; సం. కూపః, ప్రా. కూవ్రో; సం. తాపయ, మరాఠీ, తావ్నే; కాశ్మీరీ తావున్ మొదలయినవి.

సంస్కృతమందలి చకారము చేకారమగుటను గూర్చి చే, జే ల దంత్యత్వమును గూర్చి విచారించునప్పుడు ముచ్చటించి యుంటిమి. ఈ దంత్య చేవర్ణమింకను బలహీనమయినది, అనఁగా స్పృష్టమైన దంత్య చేవర్ణము ఈషత్స్పృష్టమైన దంత్య సవర్ణముగ మాఱినది. ఈ మార్పు ద్రావిడభాషలయందేకాక యాధుని కార్యభాషలయందును గలిగినది. ఈ విషయమును వరరుచి మార్కండేయులు తమ ప్రాకృతవ్యాకరణములందు తెలిపియే యున్నారు. భారతవర్షము నుత్తరమందును నీశాన్యమందును సంస్కృత తాలవ్య చ, జ, లు తాలవ్య చ, జ, లుగనే నిలిచినవి. కాని, దక్షిణమున మరాఠీయందును, పడుమట సింధియందును నవి దంత్య చే, జే, లైనవి. సింధీ, మరాఠీ భాషలు ప్రచారమందున్న ప్రదేశములకు మధ్యముగ వ్యాపించియున్న రాజస్థానీ,

గుజరాతీ భాషలయందవి స, జ్జ (Z) లుగా మాఱినవి. అట్లే, సింహాళీ భాష యందును మార్పుకలిగినది. ఉదా: సం. చోర; హిం. చోర్; మరాఠీ; చోర్; సం. చక్రీ; ప్రా. చక్కీ; మాల్వాలీ. సక్కి మొదలయినవి. ఈ మార్పు పద మధ్యమందును, అనఁగా పరుషములు రెండచ్చుల మధ్యమున పడినప్పుడును గలిగినదికాని, అచటి గ, స, డ, ద, వ, లు సాధారణముగ లోపించి, వాని స్థానమున నచ్చులుమాత్రము నేఁటి యార్యభాషలయందు నిలిచినవి.

ఈ మార్పు, అనఁగా పరుషములకు గ, స, డ, ద, వ, లు గలుగుట సంధి యందును గలుగును. సంధియందు పరపదాది హల్లు రెండచ్చులనడుమఁ బడుటచే ప్రత్యేకపదములందు గలిగిన మార్పులే వానికిని గలిగినవి.

అయిదవ ప్రకరణము.

# ఆంధ్ర శబ్దజాలము



ఇంతవఱకును ఆంధ్రమందలి ప్రత్యేక ధ్వనులనుగూర్చియు, నాధ్వనులు దగ్గఱఁగఁ జేరునప్పుడు గలుగు వికారములను గూర్చియు వివరించియుంటిమి. కాని, కేవలధ్వనులసముదాయము భాషకాఁజాలదు. కా, కీ, గూ, సే, అని యీ రీతిగా ధ్వనుల నుచ్చరించుట వలన నెట్టి యభిప్రాయమును తెనుఁగున స్ఫురింపదు. ఏకధ్వనిగాని, అట్టిధ్వనుల సముదాయముగాని యర్థవంతమయినప్పుడే యది భాషాసంజ్ఞ నొందుచున్నది. భాష మనోగతాభిప్రాయములకు గుఱుతు. మనయభిప్రాయముల నితరులకుఁ దెలుపుటకుఁగాని, యొకరి యభిప్రాయములను మనము గ్రహించుటకుఁగాని భాషతోడ్పడును. మానసికముగ నభిప్రాయ మెప్పుడును సంపూర్ణముగనే యుండును; దానిని ధ్వనిరూపముగ సంపూర్ణముగ బహిర్గతము చేయునది వాక్యము. కావున భాషయందు వాక్యమే ప్రధానాంశము. అభిప్రాయమును సంపూర్ణముచేయని ధ్వనులుగాని, పదములుగాని యెన్నియున్నను వాక్యము కానేరదు. అభిప్రాయమును సంపూర్ణముచేయు నొక్క పదమైనను వాక్యమగును. ప్రతి సంపూర్ణవాక్యమునందును కర్త, కర్మ, క్రియ అనున వన్నియు వ్యక్తము కానక్కఱలేదు. 'పో' అనున దొక్కటేక్రియాపద మైనను, ఏకాక్షర యుక్తమైనను నదివాక్యమే. ఇది యకర్మకక్రియ గావున కర్మను తెలుపుటకు వీలులేదు. కాని ఆ క్రియయందే 'నీవు' అను కర్తృపదము లీనమై యవ్యక్తముగనున్నది. దానిని వ్యక్తముచేసినను అభిప్రాయమున నెట్టి భేదమును గలుగదు. అట్లే, 'తే' అనునప్పుడు 'తెచ్చు' ధాతువు సకర్మకమగుటచే కర్తృకర్మ వాచక పదములు రెండును నవ్యక్తములుగ క్రియాపదము నందులీనము లై యున్నవి. ఆ రెండింటిని తెలిపినను నభిప్రాయమున భేదము కలుగదు. కాని, కర్మనుగూడ తెలిపినయెడల నభిప్రాయ మొకప్పుడు మఱింత స్పష్టము కావచ్చును. 'తే' అని చెప్పునప్పుడు తత్పూర్వము తేవలసినవస్తువు స్పష్టపడి యుండినయెడల నాకర్మ పదమును స్పష్టముచేసినను చేయకున్నను నొక్కటే. కర్తృపదము తెనుఁగున సాధారణముగ ఉత్తమ, మధ్యమపురుష క్రియల యందే లీనమై యుండుటచేత నట్టిక్రియల కర్తలను స్పష్టముచేసినను చేయకున్నను నొక్కటే; కాని, యర్థము చక్కగ విస్పష్టము కానప్పుడు కర్తృపదమును స్పష్టముచేయవలసివచ్చును. ఇద్దఱెదురుగా నున్నప్పుడు 'పో' అన్నచో నాయిద్దఱిలో నెవరు పోవలయునో తేలదు; 'ఎవరు పోవలెను?' అను

ప్రశ్న పుట్టును. అప్పుడు 'నీవు' (అని నిర్దేశించి) పో, అని యభిప్రాయము నుస్పష్టము చేయఁబడును. ప్రథమపురుషమునందు కొన్నియెడల కర్తృపదముకాని, దాని వచనలింగములుగాని స్పష్టముకావు; కావున కర్తృపదమును స్పష్టము చేయవలసియుండును. 'వచ్చెను; వచ్చును' అనునప్పుడు 'వాఁడు, అది, అవి, ఆమె' అనువానిలోనేది కర్తృపదమో స్పష్టముకాదు కావున కర్తృపదమును స్పష్టము చేయవలెను. ఒకప్పుడొక్క కర్తృపదమే సంపూర్ణ వాక్యార్థమును తెలుపఁగలదు; అప్పుడది దానిని వాక్యమనియే చెప్పవలెను. 'ఎవరు వచ్చినారు?' అను ప్రశ్నకు 'నేను' అను ప్రత్యుత్తరమునఁ గర్తృ పదమొక్కటియే యున్నను నది వాక్యమే యగుచున్నది. అట్లే కర్మపదమొక్కటికూడ వాక్యము కాఁగలదు. రాముఁడెవరిని చంపెను? రావణుని. ఇచట 'రావణుని' అనునది వాక్యమే. అవ్యయములును నిట్లే ప్రత్యేకముగ సంపూర్ణ వాక్యార్థములను దెలుపఁగలవు. 'చదువు' అని ఆజ్ఞాపించినప్పుడు చదినినది వినఁబడకుండినచో 'గట్టిగా' అనియందుము. అప్పుడది, (నీవు) గట్టిగా (చదువుము) అనుసంపూర్ణ వాక్యార్థమును గలిగి వాక్యమే యగుచున్నది.

కర్తృ, కర్మ, క్రియాపదములతో నన్నియుఁగాని, కొన్నిగాని స్పష్టపడి యభిప్రాయము సంపూర్ణమును స్పష్టము నైనచో వాక్యమనుసంజ్ఞను బొందుచున్నది. "పరస్పరసంబంధముగల పదముల సముదాయము వాక్యము" అని నిర్వచించుట తప్పు "నేను నిన్న నీతో రహస్యముగా చెప్పినమాట" అనునప్పుడందలి పదములన్నియుఁ బరస్పరసంబంధము కలిగియేయున్నవి, కాని ఆపదసముదాయము వాక్యము కానేరదు. అట్టిపదము లెన్నికూడినను నభిప్రాయము సంపూర్ణము కాకపోవుటచే వానికి వాక్యత్వము సిద్ధింపదు. "కర్త్రాదులతోఁ గూడిన క్రియాపదము వాక్య" మనుటయు సరికాదు. కర్త్రాదులు లేకున్నను క్రియాపదమునకు వాక్యత్వము సిద్ధించుననియు, క్రియాపదము లేకున్నను కర్త్రాదులకే వాక్యత్వము కలుగుననియు ఇంతకుముందు స్పష్టము చేయఁబడినది. ఆయాపదములు లోపించినను,వ్యక్తవాక్యమందవి యంతర్భాతములై యుండుటచే వాని నధ్యాహారము చేసికొనవలయునని యనవచ్చును. కాని, యా పదములు వ్యక్తములు కాకపోవుటచే నవి వాక్యమున నంతర్భాగములుగ గణింపఁబనిలేదు. అవి వ్యక్తము కానంతవఱకును వాక్యనిర్వచనమున వానితో మనకుఁ బనిలేదు.

వాక్యములు సంపూర్ణవాక్యము లనియు నసంపూర్ణవాక్యము లనియుఁ గొందఱు భేదమును గల్పించుచుందురు. ఇది సరికాదు. అభిప్రాయము సంపూర్ణమైననే వాక్యమగుచున్నది. కావున సంపూర్ణవాక్యమనుట పునరుక్తి

యగును; అసంపూర్ణమైనది వాక్యమనుట యసంబద్ధమగును. ఇట్లే, తెనుఁగున వాక్యములు సామాన్యవాక్యములు, సంశ్లిష్టవాక్యములు, మహావాక్యములు నని మూఁడుభేదములను గల్పించుటయు సరికాదు. వాక్యమునందు సంపూర్ణ క్రియాభావ మొక్కటేయుండును. సామాన్యాది మూఁడుభేదములును నింగ్లీషు మర్యాద ననుసరించినను నీవిషయమున నాంధ్రమునకును దానికిని సామ్యము లేదు. ఇంగ్లీషున 'క్లాజ్' (clause) అనుదానిలో నర్థమసమగ్రముగా నున్నను నందొకకర్తయు సంపూర్ణక్రియయుఁ దప్పకయుండును. తెనుఁగున నట్టి సంశ్లిష్ట (complex) వాక్యము లుండవు. ఇంగ్లీషునందలి 'కాంపౌండ్ సెంటెన్సు' ననుసరించి తెనుఁగున మహావాక్యమనున దుండునని చెప్పఁగూడదు. ఇంగ్లీషున ఒక సముచ్చయముచేఁ గలుపఁబడిన ప్రత్యేకవాక్యములకు కాంపౌండ్ సెంటెన్సనిపేరు. తెనుఁగున 'మఱియు' మొదలగు సముచ్చయార్థకావ్యయములచే రెండు ప్రత్యేకవాక్యములను గలుపుట సంప్రదాయముకాదు. ఇంగ్లీషునఁ గూడ సామాన్య, సంశ్లిష్ట, మహావాక్యములను విభాగను వైయాకరణ కృతముగాని, సహజముకాదు. వాక్యమే భాషకు మూలాంశము. అట్టి వాక్యమును భాషాభాగములుగ విభజించుట గూడ వైయాకరణులు చేయు నట్టిపనియే. వారి విభజనము సరికావచ్చును; కాకపోవచ్చును. కాని, యట్లు చేయుట యస్వాభావికము; కృత్రిమము. జనులు తమవ్యవహారమున నెన్నడు నట్లు చేయరు. అట్టివిభజనముతో వారికి పనిలేదు. వస్తువుల లేక భావముల పరస్పరసంబంధము, వానికి మనుష్యులతోఁ గల సంబంధము, ఇవియే భాషకు ముఖ్యములు. ఇట్టి సంబంధములతోడనే యభిప్రాయములును వానిని బహి రంగముచేయు ధ్వనిరూపకవాక్యములును వ్యక్తమగుచుండును. అట్టిసంబంధ ములను విడిచి పదములును బ్రత్యయములును బ్రత్యేకముగ నిలువఁజాలవు.

కాని, వైయాకరణులు శాస్త్రసౌకర్యముకొఱకు వాక్యములను కొన్ని యంశములుగ విభజింతురు. ఆ యంశములు నామపదములనియు, విశేషణము లనియు, క్రియాపదములనియు, అవ్యయములనియు నాలుగువర్గములుగ విభ జింపఁబడును. ఈ వర్గములలోని శబ్దములన్నియు ప్రాతిపదిక ప్రత్యయములుగ విభజింపఁబడును. నిఘంటువులలో నామపదముల ప్రథమైకవచనరూపము లును, క్రియాపదముల ధాతురూపములును, అవ్యయములును, విశేషణముల రూపములును జేరును. ఆయాపదముల సంబంధములు వ్యాకరణములలో వివరింపఁబడును. ఆయాభాషాభాగములన్నియు ధాతువులనుండి యేర్పడునని వైయాకరణులమతము. ఈ మతము ప్రకారము ప్రతిభాషకును దొలుతఁ గొన్ని మూలధాతువు లుండెను. ఆధాతువులకుఁ బ్రత్యయములు చేరుచు శబ్దములయ్యెను. ఆశబ్దములకూడికవలన వాక్యము లేర్పడెను. ఇట్లు చెప్పుటయే

యనాదివైయాకరణ సంప్రదాయమగుటచే నావిధానమునే యనుసరించి, ధాతువులనుండి శబ్దములు కలిగినవనియు, ధాతువులకును శబ్దములకును ప్రత్యేకస్థితి గలదనియు నంగీకరించి, నిఘంటువులలోని కెక్కిన పదజాలమును గూర్చి విచారింతము.

తెనుఁగునందలి పదముల సంఖ్యను నిర్ణయించుసందర్భమునఁ గొన్ని ముఖ్యాంశములను గమనింపవలసియున్నది. (1) ఒకధాతువునుండి యుద్భవిల్లిన పదములన్నిటి నొక్కపదముగ గ్రహింపవలెనా? లేక వానిని ప్రత్యేకపదములుగ గ్రహింపవలెనా? ఉదాహరణమునకు కృష్ధాతువునుండి పుట్టిన కృషి, కృషికుఁడు, కర్షకుఁడు, కర్షణము, మొదలగు పదములను ప్రత్యేకపదములుగఁ బరిగణింపవలెనా? కూడదా?

(2) ఒకధాతువునకు రూపాంతరము లున్నప్పుడు అట్టి రూపాంతరములను ప్రత్యేకపదములుగఁ బరిగణింపవలెనా? కూడదా? ఉదా. అగు, అవు, తగు, తవు; మొదలయినవి.

(3) పదములకు రూపాంతరము లున్నప్పుడు అట్టి రూపాంతరములు ప్రత్యేకపదములగునా, కావా? ఉదా. ఏతము, ఏతాము; ఇనుకు, ఇంకు; ఉతుకు, ఉదుకు; ఏను, నేను మొదలయినవి.

(4) ధాతువులనుండి యుత్పత్తియగు క్రియారూపములు ప్రత్యేకపదములగునా, కావా? ఉదా. అగు, అగుఁగాక, అగుఁబొమ్ము, కావుత, కాక, కాని మొదలయినవి.

(5) నామపదముల ప్రథమైకవచనేతర విభక్తిరూపములు ప్రత్యేకపదము లగునా? నేను, మేము, నన్ను, మమ్ము, నాతో, మాతో, మొదలైనవి.

(6) రెండు ప్రత్యేకపదములు చేరి సమాసముగా నేర్పడిన పదమును ప్రత్యేకపదముగఁ బరిగణింపవలెనా? ఉదా. అంకపాంకములు, అంకవన్నె, ఆఁడుపడుచు, పడకటిల్లు మొదలయినవి.

(7) ఒక్క పదమునకే యనేకార్థము లున్నప్పుడు వాని నొక్కొక్కయర్థమునఁ బ్రత్యేకపదముగఁ బరిగణింపవలెనా, యక్కఱలేదా? కాని, మాటు, పాట, కోట మొదలయినవి.

(8) సంస్కృతమునందును తెనుఁగునందును పదమొక్కటియై యర్థములు వేఱయినప్పుడు దానిని ప్రత్యేకపదములుగఁ బరిగణింపవలెనా, కూడదా? శబ్దరత్నాకరమున నుభయములుగ నిరూపింపఁబడిన పదములన్నియు నిట్టివి.

(9) ధాతువుల సకర్మ కాకర్మక రూపములును, స్వార్థక ప్రేరణ కర్మ ణ్యర్థక రూపములును ప్రత్యేకము లగునా, కావా? ఉదా. అగు, కావించు; పడు, పఱుచు; ఓడు, ఓడించు; కలియు, కలుపు మొదలయినవి.

(10) ధాతువుతోఁ గాని, నామముతోఁ గాని సహాయక క్రియ చేరి యేర్పడిన ధాతువులు ప్రత్యేకములా, కావా? ఉదా. కొనియాడు, అడిచి పడు, తిట్టుకొను, అనువుపడు మొదలయినవి.

ఇట్టి ప్రశ్నలకు వివిధములగు సమాధానము లీయవచ్చును. కాని; సంస్కృతమునందును నితర దేశభాషలయందును గల నిఘంటువులలో నీ విషయమున నొకసామాన్యవిధాన మనుసరింపఁబడియుండలేదు. కావున నా యా భాషలయందలి పదములసంఖ్య యించుమించుగ నింతయై యుండ వచ్చునని నిర్ణయించుటకు వీలులేకున్నది.

ఒకభాషయందలి పదముల సంఖ్యను నిర్ణయించుటలో మఱికొన్ని చిక్కులున్నవి. ఆ భాషకు సంబంధించిన నిఘంటువు లెంత పెద్దవయినను నందా భాషయందలి శబ్దములన్నియు నున్నవని చెప్పవీలులేదు. సాధారణముగ గ్రంథస్థములైనపదములే నిఘంటువులందు చేరుచుండును. కేవలవ్యవహార గతములైన కొన్నిపదములును నందు చేరవచ్చును. కాని, యన్ని గ్రంథము లందలి యన్నిపదములును, వ్యవహారమునందలి యన్నిపదములును నిఘంటువు లందుచేరవు. మాండలికభేదములనుబట్టియు, వృత్తులభేదమునుబట్టియు సంఘమునందు నెలకొనియున్న శబ్దజాలము చాలకొంచెమే నిఘంటువుల కెక్కును. కావున నిఘంటువులందున్న పదజాలముకంటె సుమారుపదింతలయి నను నాభాషయందలి పదసంఖ్య యుండుననుకొనుట యత్యుక్తికానేరదు. కాని, సంఘమునందు జీర్ణింపని యనేకపదములుగూడ నిఘంటువుల కెక్కుట గలదు. అట్టిపదములు సాధారణముగ శాస్త్రములకును కళలకును సంబంధించిన వైయుండును. అవి దేశ్యపదములైనచో సరియే; లేకున్న, వాని నాంధ్ర పదములుగఁ బరిగణించుట చింత్యము. తెనుఁగునఁ జేరిన తత్సమపదములలో ననేకము లిట్టివి. ఇవిగాక గ్రంథకర్త లచ్చతెనుఁగులనుపేర క్రొత్తగ సృష్టి చేసిన కృతకశబ్దము లనేకములు నిఘంటువులలోఁ జేరుచుండును. ఇట్టివి దేశ భాషాప్రవాహమునఁ బడినచో సరియే; లేకున్న, వానిని భాషాపదసంఖ్య యందు చేర్చవచ్చునా యనువిషయము విచారణీయము. ఇవిగాక, ఒకానొక కాలమందు భాషయందుండి వానికి సంబంధించిన వస్తువులు లోపించుటచే తాముసులోపించినట్టి పదము లనేకములు నిఘంటువులందు నిలుచును. ఆ పదములొకప్పుడు క్రొత్తయర్థములనుగాని విశేషార్థములనుగాని సంపా దించుకొని నిత్యవ్యవహారమున నిలిచియుండును. అట్లుగాక ప్రాచీన వ్యవహార

మున మాత్రమే నిలిచిపోయినట్టి పదములను నిఘంటువులందు చేర్పదగునా యను విషయమును గూడ విచారింపదగును.

శబ్దజాలము రెండువిధములుగ నుండును. ఒకటివ్యక్తులకును, సంఘము నందలి చిన్నచిన్నగుంపులకును సంబంధించినది; రెండవది సంఘమున కంతటికిని సంబంధించినది. వ్యక్తికి సంబంధించిన శబ్దజాలము ఇతరవ్యక్తుల శబ్దజాలముకంటెఁ గొన్నివిషయములలో భిన్నముగనుండును; సంఘమంతటికిని సంబంధించినదానికంటె నది యింకను భిన్నముగ నుండును. కాని, వ్యక్తి సంఘమునం దొకయంశముగ నుండి యొకవిధముగ సంఘమునకుఁ బ్రతినిధిగ నుండుటచేత ననేకవిషయములం దాతనికిని సంఘమునకును శబ్దజాలము సామాన్యముగనే యుండును. కాని, కొందఱ కొకరీతిశబ్దజాలము పట్టుపడును; మఱికొందఱికి మఱియొక రీతి శబ్దములు పట్టుపడును. ఈ భేద మాయా వ్యక్తులు చిన్నప్పటినుండియుఁ దిరుగుచుండిన సంఘముభాష ననుసరించియుండును. గ్రంథకర్తల విషయమున వా రుపయోగించు శబ్దజాలము చాలవఱకుఁ దమకు సహజమైనదైనను గొంతవఱకు వారి సంస్కారమును బట్టియు, రుచిని బట్టియు నేర్పడుచుండును. ఒక గ్రంథమును సూక్ష్మముగఁ జదివి యా గ్రంథకర్త యే ప్రదేశపువాఁడో, యేకాలపువాఁడో కూడఁ గొంచె మెచ్చుతక్కువగఁ జెప్పఁగలుగుదుము.

శిశువు తనచుట్టుపట్ల నుండు వారిమాటలలోఁ గొంతభాగమునే తా నవ్యక్తముగఁ బల్కుటకుఁ బ్రయత్నించును. అందు కొన్నిటి నాతఁ డుచ్చరింప నేర్చికొనును. కొన్నియతని మెదడునందు మాత్రము ముద్రితములై యకస్మాత్తుగ నాతని జీవితమున నెప్పుడో ధ్వనిరూపమున వ్యక్తము కావచ్చును. శిశువు పెరిఁగిన కొలఁదియు నింక నెక్కుడు పదముల సేకరించుచుండును. ఈ పదజాల మతనియనుభవములోనికి వచ్చినవస్తువులకు సంబంధించినదియు, తనతో మాట్లాడు వారిమాటల ననుకరించునట్టిదియునై యుండును. ఇట్లాతఁడు నిత్యమును నెక్కుడు పదములను సేకరించుచునేయుండి, వానిలోఁగొన్నిటిఁ దన నిత్యవ్యవహారమున నుపయోగించియు, దానుపయోగింపని వానిలోఁగొన్నిటి నితరులుమాట్లాడు నప్పుడును బుస్తకములందును బోల్చికొనుచును నుండును. తన చిన్నయావరణమును విడిచి తన చిన్న సంఘముకంటె విశాలమగు సంఘముతోఁ గలిసి, తన మిత్రవర్గమును, శత్రువర్గమును, పరిచితవర్గము నెక్కువ చేసికొనుచు నాతఁడు తనశబ్దజాలము నెక్కువచేసికొనుచునే యుండును. ఇది యిట్లుండ నాతఁడు చిన్నతనమున నేర్చికొనినమాటలు కొన్ని సంఘమునుబట్టి మఱింతస్పష్టము లగుచుండును. కొన్నిజాఱిపోవుచుండును. తుదకువానిలోఁ గొన్నిటి నాతఁడు మఱచిపోవుటయు సంభవించును. అందుచేత ప్రతిమను

జని పదజాలమును స్థిరముకాక వృద్ధిక్షయములఁ బొందుచు మార్పుఁజెందు చునేయుండును. వ్యక్తివిషయముననెట్లో పదముల వృద్ధిక్షయము లాతని జాతివిషయముసను నట్లేకలుగును. భాషనిత్యమయినది; దానికి వృద్ధిక్షయములు లేవు, అనువాదమును గలదు. కాని, యానిత్యత్వము ప్రవాహరూపత్వమున సిద్ధించినది కాని భాష మొదటినుండియు నిలుకడగ నట్లే నిలిచియుండుటచేతఁ గలిగినది కాదు.

భాషలోని పదములకు ధాతువులు మూలము లనువాదము సరియైనది కాదనియు, * ధాతువులనునవి వైయాకరణకల్పితములనియును, ఒకభాషలోని పదములకు ధాతువులను వివరించుపట్ల వైయాకరణు లితరభాషా పరిజ్ఞానము లేకపోవుటచే నా ధాతువుల యథార్థస్వరూపమును నిరూపించుటకు తబ్బిబ్బులు పడుచుందురనియు, అట్లుధాతువుల నేర్పఱుచుటకు తామవలంబించిన మూలసిద్ధాంతము దోషస్పృష్టమైనచో నా భాషయొక్కయు దానితోసంబంధించిన భాషలయొక్కయు సంబంధములు మఱుఁగుపడునియు, ద్రావిడ ధాతువులను నిర్ణయించుటయందు కాల్డువెల్లును నతని యనుయాయులును ననుసరించినమార్గ మట్టిదోషమునకు లోనగుటచేత ద్రావిడభాషల తత్త్వమునుగూర్చి దురభిప్రాయములు గలుగుటకుఁ దావేర్పడెననియు మఱియొక చోట వివరింపఁబడినది. ధాతువులు భాషకుమూల మనువారిలో కొందఱు ప్రతిభాషకును ఆదియందే కొన్నిధాతువు లుండెననియు, వానినిమించి క్రొత్త ధాతువులు సృష్టింపఁబడవనియు, క్రొత్తపదముల సృష్టియనఁగా ఆదియందుండిన మూలధాతువులనుండి ప్రత్యయాదుల సంయోజనమువలనఁ గలుగు సృష్టియే యనియుఁజెప్పుదురు. సాధారణముగ క్రొత్తదేశ్యపదము లీరీతిగనే కలుగుచుండుననుటలోఁ జాలసత్యము కలదు. కాని, యొకప్పుడు భాషలోనుండు ధాతువులకు సంబంధించిన పదములును బుట్టుచుండుట గలదు. ఇట్టిపదములు సాధారణముగఁ జిన్నపిల్లల భాషలో ననేకములుగ నుప్ప

* విట్నీ 'ధాతువులనుండి భాష లుత్పన్నములైనవి' అను వాదమునకుఁ జూపినయుపపత్తులను గూర్చి, యెస్పర్సను ఇట్లు చెప్పుచున్నాఁడు. "Even granted that these three arguments given at different times, each of them in turn as the sole argument, must be taken as supplementing each other, the three - legged stool on which the root theory is thus made to sit is a very shaky one, for none of the three legs is very solid, as we shall soon have occasion to see." Jesperson : Language, its development, nature and origin, p. 368.

తెల్లుచుండును. ఈ సృష్టిబాలబాలికల మూఁడవయేఁటనుండి పండ్రెండవయేఁటి వఱకును గలుగుచుండును. మూఁడేండ్లనుండి సుమా రాఱేండ్లవఱకు వయస్సు గల పిల్లలు ఆటలయందును, తా మేకాంతముగ నున్నప్పుడును నిట్టిమాటలను గల్పించుచుందురు. కోపమువచ్చినప్పుడును నత్యుల్లాసముగ నున్నప్పుడును సాధారణముగ నిట్టి క్రొత్తపదములు వారినోటినుండి వెలువడుచుండును. ఈ సృష్టికి అనుప్రాసప్రియత్వము, బాలునియభిప్రాయమున సర్థము నను సరించిన ధ్వని, మాటలలోని వర్ణములను తారుమారుచేయుట, అనునవి ముఖ్య కారణములుగ నుండును. ఒకప్పుడు పూర్వమందున్న పదములకు కొంతమార్పు కలిగి క్రొత్తయర్థములు కలుగుచుండును. ఉదాహరణముగ నా పిల్లలుతమలో దాము క్రొత్తగఁ గల్పించుకొనిన కొన్నిపదములను పొందుపఱుచుచున్నాను. కృ— ఆడుపిల్ల; ఆమె తక్కిన పిల్లలవలెఁగాక వయస్సునకు తగినంత పొడవరి కాదు. వయస్సు అయిదేండ్లు. ఆమెకును ఆమె యక్కకును (వయస్సు ఎనిమి దేండ్లు) పోట్లాటపడి, అక్క కృ-ని "పొట్టిదానా!" అనునర్థమున "టింపి" అనిపిలి చినది. ఈ మాట తెనుఁగునలేదు. ఆ పిల్ల దానినెట్లుకల్పింపఁగలిగినది? "పొట్టి" అనుమాటను తిరుగ వేసినదా? అట్లయినచో "పొట్టి" అనుపదము 'టిపొ' అని కాని, 'టిప్పొ'అని కాని కావలెను. తెనుఁగుపలుకుబడిలో 'ఒ'కారాంతపదములు లేవు కావున అది 'టిప్ప' అగును; ఆ పదిము 'వక్ర, వక్క, వంక; బుగ్గ, బుంగ' మొదలగు పదములయందలి మార్పువలె 'టింప' అయినది; స్త్రీవాచ కము, నిందార్థము, అను కారణములవలన ఇ అను తద్ధితప్రత్యయముచేరి 'టింపి' అయినది. లేదా, బాలికయభిప్రాయము చొప్పున ధ్వనియర్థము ననుసరించి యుండవలెను. ఈ పేర తన్ను పిలిచినప్పుడు కృ—ఉడుకుకొనుట చేత నామె నేడ్పింపఁదలఁచినప్పు డింటివారందఱు నామె నట్లే పిలుచుచు వచ్చిరి. కృ—ఊరకొనలేదు. తినతమ్ముఁడు త న్నట్లు పిలిచినప్పుడు వానికి 'టిం పడు' అనుపేరు కల్పించినది. "టింపి" అనుపదమునకుఁ దనవిషయమున "పొట్టిబాలిక" అనునర్థము మా కుటుంబమున రూఢమైనది. కావున తాను నాయర్థము నంగీకరించి కృ—దానినుండి మహద్వాచకమును కల్పించినది. పదసృష్టి యింతటితో నిలువలేదు. తనయన్న తన్ను 'టింపి' యన్నప్పుడు వానిని 'లిప్పి' అని పిలిచినది. ఈపేరు పెట్టవలెనని యామె కెట్లు తోఁచినది? ఆమె 'అప్పి, లిప్పి, కొప్పి, సిప్పి' అని మఱియొకసారి యనుచున్నప్పు డా పదము వ్యుత్పత్తి గోచరించినది. ఆమె యన్నను మేము 'తండ్రి' యను వాత్సల్యా ర్థమున 'అప్ప' యని పిలుచుచుంటిమి. వానికి నామకరణమునాఁడు పెట్టినపేరు మఱుఁగుపడి 'అప్ప' అను పేరే కుదురుకొన్నది. మాకుటుంబమువారికేకాక మా పరిచితులకందఱకు వాఁడు 'అప్ప' అయినాఁడు. కృ—కు కూడ వాఁడు

'అప్ప' కాని, యిప్పుడు తన్ను 'టింపి' యనుటచేత—ఇప్రత్యయము వానిపేరికిని తగులుకొని 'అప్పి' అయినాఁడు. అర్థములేని యనుప్రాసము కలిగి 'అప్పి, లిప్పి, కొప్పి, సిప్పి' అను క్రొత్తపదములు సృష్టియైనవి. వీనిలో 'లిప్పి' యనుపదమునకు మావాఁడు గుత్తియైనాఁడు. వానిమీఁద తక్కినపిల్లలకు కోపము వచ్చినయెడల వాఁడు 'లిప్పి'యేకాక, 'లిప్పిగాడు' కూడనగును. 'లిప్పి' అనుపదము స్త్రీవాచకమను నభిప్రాయముచేతఁ గాఁబోలు మహత్త్వబోధకమగు - కాడు ప్రత్యయము చేరినది. ఆ పదమున కర్థమేమోయింతవఱకును నిర్ణయముకాలేదు. 'పిల్లలనేడ్పించువాడు, మొద్దువాఁడు, దుండగీఁడు' అనువానిలో నేదోయొక యర్థమున నది మాకుటుంబమున నుపయోగింపఁబడుచున్నది. - ఇప్రత్యయము స్త్రీప్రత్యయముగ నీ నింద్యార్థముననే 'లాడికి' 'గొలికి' యనుమాకుటుంబమున నేర్పడిన మఱిరెండు పదములలో వెలసినది. 'లాడికి' యనఁగా లొడలొడ మని యెడ తెగకుండ మాట్లాడు స్వభావము గలస్త్రీయనియు, 'గొలికి' యనఁగా తన కోరిక చెల్లువఱకును విడవకుండ నడుగుచుండు స్వభావముగల స్త్రీయనియు నర్థము లీపదములకుఁ గుదురుకొన్నవి. వీనిలో 'లాడికి' అనుక్రొత్త పదము తెనుఁగులో నెలకొని శబ్దరత్నాకరమున కెక్కిన 'లొటలొట, లొడలొడ' అను ధ్వన్యనుకరణ శబ్దములకు సంబంధించినది. 'గొలికి' పదఁము శబ్దరత్నాకరమున కెక్కకున్నను వ్యవహారమున సర్వత్రయున్న మిక్కిలి యుపయోగకరమగు 'గొలుకు' ధాతువునుండియేర్పడినది. ఈపదము లాబాలబాలికలకు వ్యాకరణ జ్ఞానముండి యిదిధాతువు, ఇదిప్రత్యయము, అని తెలిసి యుండుటవలన నేర్పడినవి కావు; సహజముగ వారినుండి యుప్పతిల్లినవి. ఇట్టిపదసృష్టి ప్రతి కుటుంబమునందును పిల్లలభాషలో గుఱుతుంచి వినినయెడల కలుగుచునే యున్నదని గోచరింపకపోదు. ఈసృష్టి పిల్లలు మాత్రము గుత్తగొనినది కాదు. అన్ని వయస్సులకుఁ జెందిన వారును అందు ముఖ్యముగ స్త్రీలును, ప్రతిభావంతులగు కవులును నిట్టి క్రొత్తపదములను గిల్పించుచునేయున్నారు. కాని, యిట్టిపదములలో నెన్ని భాషయందు నిలుచునను విషయమును నిర్ణయించుట కష్టము. భాషలో స్థిరముగ నెలకొన్న యనేకపదము లీపద్ధతుల ననుసరించి యేర్పడినవే. ఆంధ్రసంఘమున కల్పితములైన యనేకపదము లచిరకాలముననే యంతరించి యుండును. కాని, యట్టివానిలోఁ గొన్నియైనను సంఘము వాడుకయందు వ్యాపించుటకు సందేహము లేదు-మాపిల్లలు పరస్పరము కల్పించికొనిన పైపదములలో టింపి. గొలికి, లాడికి, యనుపదములు మాబంధువుల యిండ్లయందంతటనేకాక, మాకుంటుంబముతో దగ్గఱ పరిచయముగల కొన్ని యితరకుటుంబములందును వ్యాపించినవి. అవియింకను గొంతవఱకు వ్యా

పించి యేకవికైనను నచ్చినయెడల మున్ముందు ప్రకటింపఁబోవు నొక బృహ న్నిఘంటువులోని కెక్కఁగలవు.

కాని, క్రొత్తశబ్దములసృష్టి సాధారణముగ పూర్వము భాషయందున్న పదములకు సమాసములను గల్పించుటవలనను నేర్పడుచున్నది. అట్టిసమాస ములు బహువ్రీహులయినప్పుడు క్రొత్తయర్థములను బొందుచు, క్రొత్తవస్తు వులకును, క్రొత్తభావములకును గుఱుతులగుచుండును. కొంతకాలమున కా సమాసములందు వర్ణలోపాదులు గలిగి వాని సమాసత్వము మఱుఁగుపడుట యుఁ గలుగును. అట్లేర్పడినపదములు మఱలసమసించి మఱికొన్ని క్రొత్త శబ్దములకు మాతృకలగుచుండును. ఇట్లు మార్పుచెందినపదములకుఁ గొన్ని శతాబ్దములు గతించినపిదప వ్యుత్పత్తులను కనుగొనుట కష్టతరమే యగును.

ఈ రీతిగ పదములు కల్పితము లగుచున్నను వానిని సంఘమంగీకరించినఁ దప్ప నవిభాషయందు నిలువవు. సంఘము నిత్యవ్యవహారమున నవినెలకొనినఁ దప్ప నవి దేశ్యపదములు కాఁజాలవు. అట్లు ప్రవాహమునఁ బడిన పదములు (1) ఆభాష తనమాతృకనుండి విడఁబడిన నాఁటనుండియు వచ్చుచున్నపద ములు (2) ఆ తరువాతికాలమున తనతో సంబంధించి నట్టికాని, సంబంధించ నట్టికాని యితరభాషలనుండిచేరి దేశభాషా సంప్రదాయానుసారముగఁ గొంతవఱకు మాత్రము, అనఁగా మాతృకాజ్ఞానము నింకను దలఁపింపఁ జేయునంత వఱకు, మార్పు చెందినపదములు (3) క్రొత్తగా భాషయందు చేరి సర్వజన వ్యవహారమునఁబడక, దేశ్యప్రత్యయములను మాత్రము గ్రహించి, మాతృకాస్వరూపమును గోల్పోవని పదములు, అని మూఁడు విధ ములుగనుండును. వీనిలో మొదటివర్గపు పదములకు దేశ్యములనియు, రెండవ వర్గము వానికిఁ దద్భవములనియు, మూఁడవ వర్గమువానికిఁ దత్సమములనియు వైయాకరణులు పేళ్లనిచ్చియున్నారు. ఆంధ్రవ్యాకరణ సంప్రదాయము ననుసరించి తత్సమ శబ్దములు తెనుఁగున నేర్పడిన విధానమునుగూర్చి తొలుత విచారింతము.

## తత్సమ ప్రకరణము.

తత్సమములనఁగా సంస్కృత సమములును ప్రాకృత సమములునని చెప్పుచుందురు. సంస్కృత శబ్దములును ప్రాకృతశబ్దములును నెట్టివికారము నొందక తెనుఁగు ప్రత్యయములను జేర్చికొని తెనుఁగువారి నిత్యవ్యవహారము నందును గావ్యరచనయందును జొచ్చి తత్సమసంజ్ఞ నందుచున్నవి. ఈ విషయ మునఁ గేవల సంస్కృత ప్రాకృత శబ్దములను మాత్రమే లగ్రహింపవలెనో తెలియరాకున్నది. కేవలముఁ దెనుఁగులు కాని శబ్దము లితరభాషలనుండి

తెనుఁగునఁ జేరినవన్నియుఁ దత్సమములని చెప్పుటయే యుక్తమగును. అప్పు డన్యదేశ్యములును వికారమును బొందక తెనుఁగునఁ జేరునప్పుడు తత్సమములే యగును. వికారమును బొందినచోఁ దద్భవము లగును. కాని, యాంధ్ర వైయాకరణసంప్రదాయము ననుసరించి సంస్కృత ప్రాకృత సమములనే తత్సమములని యీప్రకరణమున వ్యవహరింతము.

## సంస్కృత సమములు.

సంస్కృతములోని యన్నిభాషాభాగములనుండియు శబ్దములు తెనుఁగునఁ జేరినవి. వానిని విశేష్యములు,విశేషణములు,సర్వనామములు, క్రియలు, అవ్యయములు నని వర్గీకరింపవచ్చును. వీనిలో సంస్కృతవిశేష్య విశేషణములు తెనుఁగునఁ జేరునప్పుడు కలుగు ప్రత్యయములును, నాప్రత్యయములు చేరక పూర్వ మేర్పడు ప్రాతిపదికరూపములును మాత్రము తత్సమ ప్రకరణమున సాధారణముగ వర్ణింపఁ బడుచున్నవి. ఆ సంప్రదాయము ననుసరించి యిచట సంస్కృతవిశేష్య, విశేషణములు తెనుఁగునఁ జేరునపుడు కలుగు మార్పులుమాత్ర మీ ప్రకరణమున వివరింపఁ బడును. తక్కిన సంస్కృత పదములకు, దత్సమ రూపములను గూర్చి యాయాసందర్భములందు చర్చింపఁ బడును.

సంస్కృత శబ్దముల లింగమునుగూర్చి నుడిరొకచోట వివరింపఁబడి యున్నది. కాని, యా లింగపరిభాష యంతయుఁ దెనుఁగున తత్సమములకు వర్తింపదు. సంస్కృతమున లింగము చాలమట్టుకు శబ్దగతము; తెనుఁగుననది యర్థగతము. తెనుఁగుననది యర్థగత మెట్లయినదియు లింగప్రకరణమున వివరింపఁ బడినది. తెనుఁగున మానవులందలి పురుషులను దెలియఁజేయు శబ్దములన్నిటికిని మహత్తులను సంజ్ఞ యేర్పాటు చేయఁబడినది. సాధారణముగఁ దెనుఁగునందలి తత్సమ మహద్వాచకముల మూలములన్నియు సంస్కృతమున పుంలింగములై యుండును. కాని, సంస్కృత పుంలింగ శబ్దములన్నియు మహద్వాచకములు కావు. సంస్కృత పుల్లింగ శబ్దములలో మహద్వాచకములు (రామ, హరి, విష్ణు, భాతృ, మొదలైన,వేకాక), స్త్రీ(దార), తిర్యక్ (సింహ, బిడాల వ్యాఘ్ర, సర్ప, కీట, మొదలయినవి), జడ (వృక్ష, ఘట, గిరి, మొదలయినవి) వాచకములును గలవు. మహద్వాచకములు కానివి యమహద్వాచకములు. వీనిలో స్త్రీ, తిర్య, గ్జడ వాచకశబ్దములు చేరియున్నవి. స్త్రీవాచకములమహద్వాచకములే యైనను వానికి మహతీవాచకములను ప్రత్యేకసంజ్ఞ గలదు. దార, కలత్ర, శబ్దములుతప్ప సంస్కృతమున, స్త్రీవాచక శబ్దములన్నియు స్త్రీలింగమునందే యుండును. కాని, స్త్రీలింగశబ్దములన్నియు స్త్రీ

వాచకములు కానేరవు. శాఖా, నిందా, మొదలగునవి స్త్రీలింగములయినను స్త్రీవాచకములు కావు. తిర్యగ్వాచకములకుఁగూడ మానవులకుఁగల స్త్రీపురుష భేదము వలెనే భేదమును గల్పింపవచ్చును. అప్పుడు మగతిర్యక్కులపేళ్లన్నియు పుంలింగములుగను, ఆఁడువాని పేళ్లన్నియు స్త్రీలింగములుగను నేర్పడును.

ఉదా: సింహః, సింహీ; వ్యాఘ్రః, వ్యాఘ్రీ; క్రోష్టః, క్రోష్ట్రీ; వ్యాలః, వ్యాలీ; చక్రవాకః, చక్రవాకీః, అజః, అజా; మొదలయినవి. - కాని సాధారణముగ స్త్రీత్వవివక్ష లేనప్పుడు ఆఁడు, మగ, తిర్యక్కులన్నియు పుంలింగమునందే వాడఁబడుచుండును. జడవాచక శబ్దములకు మాత్ర మిట్టిలింగ మని చెప్పవీలులేదు. అవి యేలింగమునందైన నుండవచ్చును. ఉదా:అశ్మా (పుం.) శిలా, (స్త్రీ) దృషద్ (నపుం.) ; ఆహవః (పుం.) ఆజిః, (స్త్రీ), రణమ్ (నపుం.); వృక్షః (పుం.) శాఖా (స్త్రీ); ఫలమ్ (నపుం.) - మొదలయినవి. ఈ విషయము లింగప్రకరణమున విపులముగఁ జర్చింపఁ బడియున్నది.

సంస్కృతమున విశేషణములు విశేష్యముల లింగ, వచన, విభక్తులను బొందుచుండును. తెనుఁగున నవి తత్సమము లగునపుడు తత్సమ విశేష్యముల లింగ, వచనములను మాత్రము పొందును. ఇదియు బహుళముగనే కలుగును గాని, కలుగవలెనను నియమము లేదు.

I. (1) అకారాంత పుంలింగ శబ్దములు.

(అ) మహద్వాచకములు.

(1) అకారాంత పుంలింగశబ్దములు మహద్వాచకములుగూడ నైనచో వాని తుదియత్వమున కుత్వము గలిగి, ఆ యుత్వముపై డుజ్వర్ణకము* చేరు చుండును. ఉదా: రామః, రాముఁడు, రాముండు ; బాలః, బాలుఁడు, బాలుండు మొదలయినవి.

(2) కొన్నియెడల నుత్వము మాత్రము చేరును. డుజ్వర్ణకము చేరక పోవచ్చును. ఉదా: మూర్ఖః, మూర్ఖుఁడు, మూర్ఖుఁ; దుష్టః, దుష్టుఁడు; దుష్టు; భ్రష్టః, భ్రష్టుఁడు, భ్రష్టు; నీచః, నీచుఁడు, నీచు ; గృహస్థః, గృహస్థుఁడు, గృహస్థు ; చార్వాకః చార్వాకుఁడు, చార్వాకు మొదలయినవి.-నన్నయభట్టః, నన్నయభట్టు; భట్టః, భట్టు - మొదలగువానిపై డుజ్వర్ణకము రాదనియే తోఁచుచున్నది. వ్యవహారమునఁగేవల ముత్వముచేరిన రూపములు సాధారణ ముగసంజ్ఞావాచకములందు వినఁబడుచున్నవి. ఉదా: రామదాసు,హనుమంతు,

---

* 'డుజ్' అనఁగా బిందుపూర్వక డుప్రత్యయమని చిన్నయసూర్యాదులు సంకేతించిరి. ఈ సంకేతము ప్రకారము జ-కారమిత్తుగాఁ గలవర్ణముల పూర్వమందు బిందువు చేరునని తెలియవలెను.

శ్రీనివాసు మొదలయినవి. నేఁటి సంజ్ఞావాచకపదములందు డుజ్వర్ణకము సాధారణముగ వినఁబడకున్నది. నేఁటి పురుషులను రామదాసుఁడు, హనుమంతుఁడు మొదలగురీతిగఁ బిలుచుటలేదు. అట్లుపిలుచుట గౌరవలోపముగ నొకప్పుడు తలంపఁబడుటయుఁ గలదు. కొంద ఱతివినయసూచకముగ డుజ్వర్ణకముతోఁ దమ్ము పిలుచుకొనుచుండుట క్రొత్తగ బయలుదేరినది. ఇతరులు తమ్మట్లు పిలువఁ జూచినచో నా వినయపరు లేమనుకొందురో తెలియదు. పూర్వకాలమునందు మహద్వాచకములగు సంజ్ఞాపదములపై డుజ్వర్ణకము చేరుట యరుదనియే చెప్పవలెను. ఆపదములు తత్సమము లగునపుడు ఆర్య, ఆచార్య, దీక్షితాది పదములఁ జేర్చియు, నాచ్ఛికములగునపుడు అప్ప, అయ్య అన్న, మొదలగు పదములఁ జేర్చియు వాడుచుండిరి. పూర్వకాలమున డుజ్వర్ణకము చేర్చినను గౌరవహీనమను నూహామాత్రము లేదనియే చెప్పవచ్చును.

[అకారాంత పుంలింగ శబ్దములపై నుత్వముచేరి ప్రథమైకవచనరూపమగుట ప్రాకృత సంప్రదాయము. అపభ్రంశాది ప్రాకృతములందును, నేఁటి కొన్ని యార్యభాషలందును నట్లే ప్రథమైకవచనరూపము కలుగును. ఉదా: రామః, మహారాష్ట్రీ, రామో ; అపభ్రంశము-రాము - మొదలైనవి. ఈ ఉకారాంత రూపములే తొలుతఁ గొన్ని మండలములందు ప్రథమైకవచన రూపములుగ నుండియుండును. అన్నంతరూపముల సామ్యమునుబట్టి (అనఁగా 'అశ్వత్థామన్' మున్నగు శబ్దముల సామ్యమునుబట్టి) రామన్, భీమన్, మున్నగు రూపములు కొన్ని మండలములం దేర్పడి రామండు, భీమండు, మున్నగు తత్సమశబ్దము లేర్పడియుండును. ఈ విషయము విభక్తి ప్రకరణమున మఱలఁ జర్చింపఁబడును.]

(3) కొన్నియెడల నకారాంత పుంలింగ శబ్దములపై నుత్వము రాదు; డుజ్జు మాత్రము వచ్చును. ఉదా: దేవండు, సోమండు, గరుడండు, ఆర్యండు, మాధవండు, ఉపాధ్యాయండు, నాథండు, మొదలైనవి. చూ. 'పదనొకండవ శతాబ్దమునాఁటి తెనుఁగుభాష' అను శీర్షికక్రింద విభక్తిప్రకరణము.—వ్యవహారమున నిప్పటికి నిట్టివాడుక వినఁబడుచున్నది. ఉదా: నరసింహఁడు, మొదలైనవి.—ఒకప్పుడు వ్యవహారమున నిట్టిచోట్ల పదగత వర్ణలోపమును వినఁబడును. ఉదా: నారాయఁడు మొదలైనవి. ఇట్టివి క్రిష్టఁడు మొదలగు వానివలెఁ దద్భవము లనుకొనవచ్చును.

(4) ఒకప్పు డుత్వ డుజ్జులలో నొక్కటియుఁ జేరదు. ఉదా: తాతః, తాత; - వ్యవహారమునను నిట్లే యొకప్పుడు వినఁబడును. ఉదా: అతనిపేరు సత్యనారాయణ; మా నారాయణ అనంతపురములో ఉన్నాడు.

(5) వ్యవహారమున సాధారణముగ మహద్వాచకములగు సంజ్ఞాపదముల కుత్వ డుజ్జులు చేరవు; అప్ప, అయ్య, అన్న, అను పదములు పదాంతాకారముమీఁదనే చేరును. అట్టియెడల సత్వసంధి నిత్యముగా నగును. ఉదా: రామప్ప, రామయ్య, రామన్న మొదలైనవి. కొన్ని సంజ్ఞావాచక పదములపై 'అన్న' అనునది చేరదు: నారాయణన్న, జగన్నాథన్న మొదలగు పేళ్లు వ్యవహారమున లేవు. రావు, రాజు మొదలగు పదములును సంజ్ఞావాచక పదములపై వ్యవహారమున వినఁబడుచున్నవి. ఉదా: నారాయణరావు, జగన్నాథరాజు మొదలైనవి. -రావు,-రెడ్డి,-శాస్త్రి మొదలగు పదములు సంజ్ఞావాచక పదములకుఁ జేరునప్పుడు పదాంతాకారమున కొకప్పుడు దీర్ఘము కలుగును. ఉదా: రామారావు, వీరభద్రారెడ్డి, భీమాశాస్త్రి మొదలైనవి.

(6) ఒకప్పుడు వ్యవహారమున సంజ్ఞావాచక పదములపై నిత్వము మాత్రము చేరును: నారాయణి మొదలైనవి.

(7) ఒకప్పుడు మహద్వాచకము లమహద్రూపములఁ దాల్చును. ఉదా: లక్ష్మీకాంతము, వెంకటరత్నము మొదలైనవి.

(8) రెడ్డి, సెట్టి మొదలగు పదము లకారాంత పుంలింగ మహద్వాచక శబ్దములపైఁ జేరునప్పుడును నిత్వము కలుగును. ఉదా: రామిరెడ్డి, భీమిసెట్టి మొదలైనవి.-'గాఁడు' ప్రత్యయము చేరునప్పుడు నిత్లే యగును. ఉదా: రామిగాఁడు మొదలైనవి.

(9) దూతాదుల కుత్వడుజ్జులు వైకల్పికముగఁ జేరును. ఉదా: దూత, దూతుఁడు; అసుర, అసురుఁడు; యోధ, యోధుఁడు; శుంఠ, శుంఠుఁడు మొదలైనవి. పై శబ్దము లమహద్వాచకములకు విశేషణము లగునపుడు వాని కుత్వడుజ్జులు రావు. ఉదా: "సింగంబుదూతయగు జంబుకము" మొదలైనవి. 'అసుర'యను తత్సమ రూపమునకు 'అసురలు' అను బహువచన రూపము కలుగదు; 'అసురుఁడు' అను పదము బహువచనరూపమగు 'అసురులు' అనునదియే నిలుచును. సుర శబ్దమునకు బహువచనమునందు మాత్రము తెనుఁగునఁ బ్రయోగము కలదు. అప్పుడది స్త్రీసమముగ నుండును. ఉదా: సురలు, సురలను, సురలకు మొదలైనవి. సమాసమున దాని కుత్వడుజ్జులు కలుగును. ఉదా: భూసురుఁడు, భూసురులు, మొదలైనవి.

(ఆ) మహతీవాచకములు.

'దార' శబ్దము తప్ప అకారాంత మహతీవాచక పుంలింగ శబ్దములు సంస్కృతమున లేవు. 'దార' శబ్దము తత్సమమగునపుడు ప్రథమైకవచనమున 'దార' యని నిలుచును. సంస్కృతమున దానికి బహువచనమున

మాత్రము ప్రయోగము కలదు: దారాః, దారాన్, మొదలైనవి. తెనుఁగున దారశబ్దమున కంతగఁ బ్రచారము లేదు.

(ఇ) మహతీత రామహ ద్వాచకములు.

అకారాంత పుంలింగములగు మహతీత రామహద్వాచక శబ్దములకు అకారాంత నపుంసకలింగ మహతీత రామహద్వాచకములకు వలెనే ప్రథమైకవచన రూపములు గలుగును. అనఁగా నవి పుంలింగశబ్దములైనను నపుంసకలింగశబ్దములుగనే పరిగణింపఁబడును.

(1) ఒకప్పుడు వానిపై ము వర్ణము మాత్రము చేయును. ఉదా. దర్పః, దర్పము; మోహః, మోహము; క్రోధః, క్రోధము; గర్వః, గర్వము; వృక్షః, వృక్షము; సింహః, సింహము; కీటః, కీటము; శరః, శరము; అంసః: అంసము; మొదలైనవి.

(2) ఒకప్పుడు కొన్ని యకారాంత పుంలింగ మహతీత రామహద్వాచక శబ్దములు ప్రథమైకవచనమున స్త్రీ సమములు మాత్రమగును. ఉదా: దర్భః, దర్భ; కుశః, కుశ; పనసః, పనస; కుండః, కుండ మొదలైనవి - 'కుశ' శబ్దమునకు 'నీరు' అర్థమగునపుడు 'కుశము' అను రూపము కలుగును. 'పనస' శబ్దము వైకృతము కావచ్చును.

అకారాంత పుంలింగములగు సంవత్సరముల పేళ్లన్నియుఁ దత్సమము లగునపుడు స్త్రీ సమములగును. ఉదా: ప్రభవ, విభవ, శుక్ల, ప్రమోదూత, ఆంగీరస, శ్రీముఖ, భావ, ఈశ్వర, బహుధాన్య, విక్రమ, తారణ, పార్థివ, వ్యయ, ఖర, నందన, విజయ, జయ, మన్మథ, ప్లవ, పరాభవ, ప్లవంగ, కీలక, సౌమ్య, సాధారణ, ప్రమాదీచ, ఆనంద, రాక్షస, నళ, పింగళ, క్రోధన, అక్షయ.

(3) ఒకప్పు డిట్టి శబ్దములకు ము - వర్ణముగాని, స్త్రీ సమత్వముగాని వైకల్పికముగఁ గలుగవచ్చును. ఉదా: అంశః, అంశ, అంశము; అలకః, అలక, అలకము; అక్షతః, అక్షత(లు), అక్షతము(లు); అపోహః, అపోహ, అపోహము; అపకర్షః, అపకర్ష, అపకర్షము; అవగ్రాహః, అవగ్రాహ, అవగ్రాహము; ఆభాసః, ఆభాస, ఆభాసము; రసాభాసః, రసాభాస, రసాభాసము; అర్థః, అర్థ, అర్థము; ఆదర్శః, ఆదర్శ, ఆదర్శము; కలహంసః, కలహంస, కలహంసము; కరుణః, కరుణ, కరుణము; కాసః, కాస, కాసము; కర్మధారయః, కర్మధారయ, కర్మధారయము; క్షోభః, క్షోభ, క్షోభము; గద్యః, గద్య, గద్యము; ఘాతః, ఘాత, ఘాతము; ఘోషః, ఘోష, ఘోషము; తత్పురుషః, తత్పురుష, తత్పురుషము; తరంగః, తరంగ, తరంగము; దిగ్భ్రమః, దిగ్భ్రమ,

దిగ్భ్రమము; నిష్కర్షః, నిష్కర్ష, నిష్కర్షము; పరామర్శః, పరామర్శ, పరామర్శము; పరిశ్రమః, పరిశ్రమ, పరిశ్రమము; పురుషః (ప్రథమాది -), పురుష, పురుషము; భ్రమః, భ్రమ, భ్రమము; ప్రశ్నః, ప్రశ్న, ప్రశ్నము; ప్రయాగః, ప్రయాగ, ప్రయాగము; ప్రాసః (ఛందస్సున), ప్రాస, ప్రాసము; అనుప్రాసః, అనుప్రాస, అనుప్రాసము; బోధః, బోధ, బోధము; సర్గః, సర్గ, సర్గము; ఉపసర్గః, ఉపసర్గ, ఉపసర్గము; విసర్గః, విసర్గ, విసర్గము; విమర్శః, విమర్శ, విమర్శము; మధ్యః, మధ్య, మధ్యము, వధః, వధ, వధము ; వేగః, వేగ, వేగము; మాంజిష్ఠః, మాంజిష్ఠ, మాంజిష్ఠము; శ్వాసః, శ్వాస, శ్వాసము; హంసః, హంస, హంసము; యమధారః, యమధార, యమధారము; శోషః, శోష, శోషము.

(4) ఒకప్పుడు పదాంతాకారమున కుత్వముకూడఁ గలుగును. ఉదా: వర్గః, వర్గ, వర్గు, వర్గము; భీభత్సః, భీభత్స, భీభత్సు, భీభత్సము; మొదలైనవి. 'వర్గు'పై వుపర్ణము చేరి 'వర్గువు' అనికూడ నగును.

(5) ఒకప్పుడు ము వర్ణమును, ఉత్వమునుమాత్రము వైకల్పికముగ నగును. ఉదా : రూపః, రూపు, రూపము; మొదలైనవి.

(6) కొన్నియెడల నుత్వ వువర్ణములును, ముపర్ణమును వైకల్పికముగ నగును. ఉదా : ధర్మః, ధర్మము, ధర్మువు; వర్గః, వర్గము, వర్గువు; భండారః, భండారము, భండారువు (భండారు అను రూపమును గలదు).

(7) కొన్నియెడల నుత్వ, వువర్ణములుమాత్రము వచ్చును : అపష్టః, అపష్టువు = కాలము ; ప్రతికూలము.

## I (2) అకారాంత నపుంసకలింగశబ్దములు.

### (అ) మహద్వాచకములు.

కొన్ని యకారాంత నపుంసకలింగశబ్దములకు మహద్విషయం దమహద్వాచకములకు వలె మువర్ణమును, అకారాంత పుంలింగ మహద్వాచక శబ్దములకు వలె నుత్వడుజ్ఞులును గూడఁ గలుగును. ఉదా : మిత్రమ్, మిత్రము, మిత్రుఁడు; ప్రధానమ్, ప్రధానము, ప్రధానుఁడు; శరణమ్, శరణము, శరణుఁడు; పాత్రమ్, పాత్రము, పాత్రుఁడు; ఆస్పదమ్, ఆస్పదము, ఆస్పదుఁడు మొదలైనవి.-ప్రధాన శబ్దమునకు 'ప్రధాని' యనియు మహదర్థమున రూపము గలదు. అట్లే 'శరణ' శబ్దమునకు 'శరణు' అనియు రూపము గలుగును.

## (అ) మహతీవాచకములు.

కలత్రశబ్దము తప్ప సంస్కృతమున మహత్యర్థ కాకారాంత నపుంసక లింగశబ్దములు లేవు. తక్కిన యమహద్వాచకములకు వలె 'కలత్ర' శబ్దమునకును ప్రథమైకవచనమున మువర్ణము చేరి 'కలత్రము' అను రూపమేర్పడును.

## (ఇ) మహతీతరామహద్వాచకములు.

తెనుఁగు వైయాకరణులు స్త్రీ, తిర్యగ్జడవాచకములకు మాత్రము మహత్సంజ్ఞను చెప్పియున్నారు. కాని, భావ, గుణ, కర్మాది వాచకపదములును నమహద్వాచకములనియే చెప్పవలెను. ఉదా : బహుత్వము, జ్ఞానము, కిల్బిషము, కల్మషము, హసనము, గీతము, ఔచిత్యము, కులము, స్థలము, శతము, సహస్రము మొదలయినవి.

(1) అకారాంత మహతీతరామహద్వాచక పదములు పుంలింగములైనను, నపుంసక లింగములైనను, తెనుఁగు వ్యవహారమున నపుంసకలింగములుగనే పరిగణింపఁ బడును. పుంలింగములు నమహద్వాచకము లయిన శబ్దములను గూర్చి పైని తెలుపఁబడినది.

(2) అకారాంత నపుంసక లింగములగు మహద్వాచకశబ్దములపై సాధారణముగ * ము-వర్ణము చేరును. ఉదా : జ్ఞానము, సహనము, పుష్పము, ఫలము, మూలము మొదలయినవి.

(3) కొన్నియెడల నపుంసకలింగాకారాంత మహతీతరామహద్వాచకములపై మువర్ణము వైకల్పికముగ లోపించును. ఉదా : అంతఃకరణ(ము); ఆకర్షణ(ము); అన్నప్రాశన(ము); అభిలాష(ము) (నమ్) అర్పణ(ము); ముద్రణ(ము) ; ఆవాహన(ము) ; విసర్జన(ము) ; అవలంబన(ము) ; ఆచ్ఛాదన(ము); ఆలంబన(ము); అవకర్షణ(ము); అవగాహన(ము) ; ఆవగణన(ము); అవధీరణ(ము) ; ఆదరణ(ము) ; ఆరోహణ(ము) ; అవరోహణ(ము) ; ఆరాధన(ము); ఆరోపణ(ము); ఆర్జన(ము); ఆలాపన(ము) ఆలోడన(ము) ; ఆవేదన(ము) ; ఆస్ఫోటన(ము) ; ఆస్వాదన(ము) ; ఇషణ(ము) ; ఉజ్ఝన(ము) ; నిరీక్షణ(ము) ; ఉడుప(ము) ; ఉచ్చాటన(ము); ఉత్పాదన(ము); ఉత్సారణ

* ము-వర్ణ మమహత్తులకుఁ బ్రథమైక వచనమునఁ జేరు ప్రత్యయమని తెనుఁగు వైయాకరణులందురు ; కాని, యది సంస్కృత ప్రత్యయమగు మకార మనుకొనుటయే సమంజసమని తోఁచుచున్నది. మకారముపై నుత్వమును జేర్చుట మకారస్థిరీకరణార్థము. వ్యవహారమున నీ యుత్వము తేలిపోయి పొల్లమకారముమాత్రము వినఁబడు చుండును. ఉదా: ఫలమ్, పనస్. మొదలయినవి.

(ము) ; ఉద్ధ(ద్ధా)రణ(ము) ; సంబోధన(ము) ; ఉద్బోధన(ము) ; (ఉద్ ; ప్ర ) వర్తన(ము) ; ఉద్వీక్షణ(ము); సమీక్షణ(ము) ; నిరీక్షణ(ము); ఉపగూహన(ము) ; ఉత్సాహ(ము) = ఒక పద్యము ; ఉద్దీపన(ము) , ఉద్వాసన(ము) ; ఉద్వేజన(ము) ; ఉద్వేష్టన(ము) ; ఉన్మీలన(ము) ; ఉపగూహన(ము); (ఆ, ఉప, ప్రతి, సం,) పాదన(ము) ; ఉపబృంహణ(ము) ; ఉపసర్పణ(ము); ఉపసర్జన(ము) ; ఉల్లంఘన(ము) ; ఔపాసన(ము) ; కుంకుమ(ము) (కుంకుము, అనియునగును) ; గర్జన(ము) ; ఖేలన(ము) ; ఐషణ(ము) ; చోదన(ము) ; చరిత(ము) ; చరిత్ర(ము) , చిహ్న(ము) ; తర్జన(ము) ; దూషణ(ము) ; నిరసన(ము) ; నిరాకరణ(ము) ; నిరూపణ(ము) ; నిర్ధారణ(ము) ; నివారణ(ము) ; పారాయణ(ము) ; ప్రచ్ఛాదన(ము); బోధన(ము) ; భర్జన(ము); రక్షణ(ము) వర్ణన(ము) ; వాదన(ము) ; స్థాపన(ము) ; విజృంభణ(ము) ; స్ఫురణ(ము) ; స్మరణ(ము), మొదలైనవి.

(4) కొన్నియెడల పదాంతాకారముపై నుత్వము వైకల్పికముగఁ జేరును. ఉదా: శరణము, శరణు మొదలయినవి.

(5) కొన్నియెడల నీ యుత్వముపై వువర్ణము బహుళముగ నగును. ఉదా : అంతరము, అంతరువు మొదలయినవి.

(6) కొన్ని శబ్దముల తుది మువర్ణమునకు లోపము గలిగి స్త్రీ వద్భావము రాదు. ఉదా: ఉన్నమనము, ఉన్మాథనము, ఉపనయనము, ఉపాకరణము, ఉపాయనము, మొదలయినవి.

## II ఆకారాంత స్త్రీలింగ శబ్దములు.

ఆకారాంత శబ్దములన్నియు సాధారణముగ సంస్కృతమున స్త్రీలింగములు. అవి తత్సమము లగునపుడు వాని తుది దీర్ఘమునకు హ్రస్వము కలుగును. ఉదా: రమా, రమ; శాఖా, శాఖ; విద్యా, విద్య; మొదలయినవి.

### (అ) మహద్వాచకములు.

సంస్కృతమున నాకారాంత మహద్వాచక శబ్దములు లేవు.

### (ఆ) మహతీవాచకములు.

ఆకారాంత మహతీవాచకముల తుది దీర్ఘమునకు హ్రస్వము కలుగును. ఉదా : రమా, రమ; ఉమా, ఉమ; భామా, భామ మొ.

(ఇ) మహతీతరామహద్వాచకములు.

(1) మహతీతరామహద్వాచకాకారాంత స్త్రీలింగ శబ్దముల తుది దీర్ఘమునకు సాధారణముగ హ్రస్వము కలుగును. ఉదా: శాలా, శాల; విద్యా, విద్య; క్షమా, క్షమ; శాఖా, శాఖ మొదలైనవి.

(2) కంధరా, విధా, నాసికా, భిక్షా, దంష్ట్రా, గ్రీవా, పాదుకా, ఉల్కా,అన్వేషణా, అర్చనా, అర్థనా, అర్దనా,గర్జా, నిస్పృహా, పతాకా,విచారణా, మొదలగు శబ్దము లాకారాంత స్త్రీలింగము లయినను వాని తుది దీర్ఘమునకు హ్రస్వము కలిగి కంధర, విధ, నాసిక, భిక్ష, దంష్ట్ర, గ్రీవ, పాదుక, ఉల్క, అన్వేషణ, అర్చన, అర్థన, అర్దన, గర్జ, నిస్పృహ, పతాక, విచారణ, అను రూపములనే కాక యకారాంతామహద్వాచకములవలె మువర్ణముతోడిరూపములను గూడఁబొందును: కంధరము, విధము, నాసికము, భిక్షము, దంష్ట్రము, గ్రీవము, పాదుకము, ఉల్కము, అన్వేషణము, అర్చనము, అర్థనము, అర్దనము, గర్జము, నిస్పృహము, పతాకము, విచారణము, మొదలైనవి.

కంధరా, విధా, శబ్దములు కంధరః, విధః, అనురూపములతోఁబుంలింగ శబ్దములుగఁ గూడనున్నవి. అప్పుడు వానికి మువర్ణముతోడి రూపములు కలుగుటకు సందేహములేదు. స్త్రీలింగమగు కంధరాశబ్దమునకు 'మెడ' యనిమాత్ర మర్థము. పుంలింగమగు 'కంధర' శబ్దమునకు మెడయనునర్థమేకాక, మేఘము, ఒకవిధమగుగడ్డి, ఒకవిధమగు కూర, అనునర్థములు గూడఁగలవు. మెడయను నర్థము లేనప్పు డాశబ్దమునకు 'కంధరము' అనియే తత్సమరూపము గలుగును. అట్లే, స్త్రీలింగ 'విధా' శబ్దమునకు ప్రకారము, రకము, సంపద, అభివృద్ధి, ఏనుఁగు మొదలగు వానియాహారము, లోనికిచొచ్చుట, కూలి, పని అను నర్థములుగలవు. పుంలింగమగు 'విధ' శబ్దమునకు నై యర్థములన్నియుఁ గలవు గాని కూలి, పని, యనునర్థములు లేవు. కావున నాయర్థములందు 'విధ' అను తత్సమరూపమునుమాత్రము వాడవలెనని తోఁచుచున్నది. కాని, తెనుఁగున నట్టి తత్సమ రూపము ప్రయోగమునందుగాని వ్యవహారమునఁ గాని కానరాదు.

'విద్వత్తా' శబ్దము 'విద్వత్త' యగును. వ్యవహారమున దానిపై నుత్వము చేరి 'విద్వత్తు' అను తత్సమ రూప మేర్పడును.

మీననేత్రి, పద్మనేత్రి, మున్నగుసమాసరూపములు వ్యాకరణవిరుద్ధములని కొందఱందురు. కాని, యట్టివి గ్రంథములందును. వ్యవహారము నందును గాన్పించుచున్నవి. పాణినీయవ్యాకరణమున వానికి గతిలేకున్నను సారస్వత వ్యాకరణము ప్రకారమవి సాధువులగుచున్నవి.

కొన్ని చెట్లపేళ్లు స్త్రీలింగములయినను నవి తత్సమములగునపుడు పర్యాయమున స్త్రీవద్భావమును, నమహద్భావమును బొందును. ఉదా : అజగంధిక (ము), అజమోద (ము), అజినపత్ర (ము), ఇక్షుగంధ (ము) మొదలైనవి.

ఇట్లేకొన్ని భక్ష్యముల పేళ్లకును గలుగును. ఉదా : అడ్డరిక (ము) మొదలైనవి.

ఇట్లే నక్షత్రనామమగు 'శ్రవణా' శబ్దమునకు 'శ్రవణ, శ్రవణము' అను రెండు తత్సమ రూపములును గలవు.

III. ఇకారాంత శబ్దములు.

సంస్కృతమున నికారాంత శబ్దములు పుం, స్త్రీ, నపుంసక లింగములు మూఁడింటను నుండును. పుంలింగములు: హరి, కవి, అలి, కిరి మొదలయినవి. - స్త్రీలింగములు: భూమి, మొదలయినవి. - నపుంసక లింగములు: వారి, దధి, మొదలయినవి.

ఇకారాంత మహద్వాచక శబ్దములన్నియు పుంలింగమునందే యుండును. మహతీవాచక ఇకారాంత శబ్దములు స్త్రీలింగములుగానే యుండును.

ఇకారాంత శబ్దము లేలింగమును గలిగి యున్నను, మహదమహద్వాచకములలో నెవ్వియైె యున్నను వానిపైఁ బ్రథమైకవచనమున నెట్టి విభక్తి ప్రత్యయముగాని, ఆగమ వర్ణముగాని చేరదు.

IV. ఈకారాంత శబ్దములు.

సంస్కృతమున నీకారాంత శబ్దములన్నియు స్త్రీలింగములై యుండును. వానితుది దీర్ఘమునకుఁ బ్రథమైకవచనమున హ్రస్వము గలుగును: గౌరీ, గౌరి; నదీ, నది; వల్లీ, వల్లి మొదలయినవి. ఈకారాంత శబ్దము లెన్నడును మహద్వాచకములు గావు.

V. ఉకారాంత శబ్దములు.

(1) అకారాంత సంస్కృత శబ్దముల వలెనే ఉకారాంత శబ్దములును మూఁడు లింగములందు నుండును. ఉదా: పుంలింగశబ్దములు: విష్ణుః, శంభుః, మనుః, ప్రభుః, ఇక్షుః, క్రతుః మొదలయినవి. స్త్రీలింగ శబ్దములు: ధేనుః, రజ్జుః, తనుః, రేణుః, ప్రియంగుః మొదలయినవి. - నపుంసకలింగ శబ్దములు: శ్మశ్రు, జాను, వసు = ధనము; స్వాదు, అశ్రు, జతు, త్రపు, తాలు, కసేరు, దారు, వస్తు మొదలైనవి.

(2) ఉకారాంతములగు సంవత్సరముల పేళ్లపై వు వర్ణము చేరక యువి యట్లేనిలుచును. ఉదా: ధాతు, విషు, చిత్రభాను, స్వభాను, విశ్వావసు.

### (1) ఉకారాంత పుంలింగ శబ్దములు.

#### మహద్వాచకములు.

(1) ఉకారాంత మహద్వాచక పుంలింగ శబ్దములపై డుజ్వర్ణకము వైకల్పికముగ చేరును. ఉదా : ఇక్ష్వాకుఁడు, విష్ణుఁడు, శంభుఁడు, ప్రభుఁడు, దయాలుఁడు, అమృతాంశుఁడు మొదలైనవి.

(2) డుజ్వర్ణకము చేరనప్పుడు వాని తుదియుత్వము తేలికయైనదగుటచే దానిని నిలుపుటకు వు వర్ణ మాగమముగాఁ జేరును. ఉదా ; ఇక్ష్వాకువు, విష్ణువు, శంభువు, ప్రభువు, దయాళువు, అమృతాంశువు మొదలైనవి.

(3) ఒకప్పుడు కొన్నిశబ్దములపై డుజ్వర్ణకను చేరక కేవల వువర్ణము మాత్రము చేరును. ఉదా : మనువు ; కురువు (రాజు) ; రాహువు ; ఆరురుక్షువు మొదలైనవి - మనుఁడు, కురుఁడు, రాహుఁడు, ఆరురుక్షుఁడు, అను రూపములు కలుగవు.

### (2) అమహద్వాచకములు, మూఁడులింగములు.

అమహద్వాచక ఉకారాంత పుం, స్త్రీ, నపుంసకలింగశబ్దములపై వు వర్ణము చేరును. ఉదా : స్త్రీలింగములు: ధేనువు, రజ్జువు, తనువు, రేణువు మొదలైనవి - నపుంసకలింగములు : శ్మశ్రువు, జానువు, స్వాదువు, వసువు, అశ్రువు, జతువు, తాలువు, కసేరువు, దారువు, వస్తువు, మొదలైనవి.

రాహు, బాహు, శబ్దములు పుంలిగములు. 'రాహుఁడు' అనురూపము కలుగునో లేదో తెలియదు కాని, రాహువు, బాహువు, అనురూపములు సుప్రసిద్ధములు. వు వర్ణము చేరక రాహు, బాహు, అనురూపములను ప్రథమైక వచనమునఁ గవులు ప్రయోగించిరి. ఉదా: పర్వము లేకయును రాహు భానునిఁ బట్టెన్ ; బాహప్పళించి మొదలైనవి.

### VI. ఊకారాంతశబ్దములు.

(1) ఊకారాంత శబ్దములు సాధారణముగ స్త్రీలింగములు మాత్రమగును. అవి మహ దమహద్వాచకములలో నేవియైనను, తత్సమము లగునపుడు వాని తుదిదీర్ఘమునకు హ్రస్వమును, అట్టి హ్రస్వ ఉకారముపై ప్రథమైక వచనమున వు వర్ణాగమమును గలుగును. ఉదా: అధిభూః = అధిభువు ; ఆగూః, ఆగువు; అ (ఆ) లాబూః, అ(ఆ)లాబువు ; కండూః, కండువు కచ్ఛూః, కచ్ఛువు ; కర్కంధూః, కర్కంధువు ; కుహూః, కుహువు ; ఖర్జూః ఖర్జువు ; ఖలపూః, ఖలపువు ; జుహూః, జుహువు ; దిధిషూః, దిధిషువు ; పిత్రూ

ప్రసూః, పితృప్రసువు ; పునర్భూః, పునర్భువు ; ప్రసూః, ప్రసువు ; వర్షాభూః, వర్షాభువు; వధూః, వధువు ; శ్వశ్రూః, శ్వశ్రువు మొదలైనవి.

(2) అగ్నిభూ, ఆత్మభూ, స్వభూ, స్వయంభూ, శబ్దములు పుంలింగములైనను వానికి అగ్నిభువు, ఆత్మభువు, స్వభువు, స్వయంభువు, అనియే తత్సమ రూపములు: కర్కంధూ, ఖలపూ, శబ్దములు పుంలింగములై కర్కంధుః, ఖలపుః అనియగును. వానికిఁగూడ కర్కంధువు, ఖలపువు, అనియే తత్సమ రూపములు.

(3) 'కద్రూ' (=నాగమాత) శబ్దమునకు కద్రువు, కద్రువ, అను రెండు తత్సమ రూపములును గలుగును ; వానిలో 'కద్రువు' అనురూపమే ప్రాచీనమైనట్లు తోఁచుచున్నది.

(4) "పృథ్వీవాచి భూ శబ్దమునకు భువియగు: భువి, భువులు, భువిని; భువులను." - అని చిన్నయసూరి. 'భువి' శబ్దము భూ శబ్దమునకు సప్తమ్యేకవచన రూపము. ఇట్లే, సరసి, హృది మొదలగు సప్తమ్యేకవచన రూపములు విభక్తి ప్రత్యయములు చేరుటకు ప్రాతిపదికము లగుచున్నవి. ఈ రూపములు తొలుత ప్రథమైక వచనమునఁ బ్రయోగింపఁబడకపోయినను దరువాతి కాలమున ప్రథమా విభక్తియందును వాడఁబడుచువచ్చినవి.

## VII. (1) ఋకారాంత శబ్దములు.

ఋకారాంత శబ్దములు మూఁడువిధములుగఁ గాన్పించుచున్నవి: (1) మనుష్యుల సంసారసంబంధములను దెలుపునవి. ఇవి మహద్వాచకములును, మహతీ వాచకములు నని రెండు వర్గములుగనున్నవి. మహద్వాచకములు: పితృ, భ్రాతృ, భర్తృ, జామాతృ, జనయితృ, దేవృ,నప్తృ.—మహతీ వాచకములు: ఉపమాతృ, దుహితృ, ననాంద్రృ, మాతృ, యాతృ, స్వసృ. (2) 'చేయునట్టి' అను నర్థముగల తృ ప్రత్యయము చేరినశబ్దములు. ఉదా: అనుష్ఠాతృ, అనుగంతృ, అనుమంతృ, అపహర్తృ, అభియోక్తృ, అలంకర్తృ, ఉపదేష్టృ, ఉపద్రష్టృ, ఉపభర్తృ, కర్తృ,కామయితృ, కారయితృ, క్రేతృ, క్షత్తృ, గంతృ, గ్రహీతృ, ఛేత్తృ, జాగరితృ, జేతృ, త్వష్టృ, దాతృ, దోగ్ధృ, ద్రష్టృ, ద్వేష్టృ, ధ్యాతృ, ధాతృ, నియంతృ, నియోక్తృ, నిర్మాతృ, నిహంతృ, నేతృ, పరివేష్టృ, పోతృ, ప్రణేతృ, ప్రతిగ్రహీతృ, ప్రయోక్తృ, ప్రష్టృ, భవితృ, భోక్తృ, యంతృ, యోద్ధృ, రక్షితృ, రంతృ, వక్తృ, విక్రేతృ, విమాతృ, వేధృ, శాస్తృ, సవ్యేష్టృ, సంస్థాతృ, సవితృ, స్తంభయితృ, స్మర్తృ, స్రష్టృ, స్వీకర్తృ, హంతృ, హర్తృ, హోతృ మొదలైనవి. (3) - తృ ప్రత్యయాంతములు కాని శబ్దములు. ఉదా: నృ.

పై వానిలో మొదటి వర్గములోని పితృ, భ్రాతృ, జామాతృ, దేవృ, శబ్దములు పుంలింగములు, మహద్వాచకములు; వీనికి మహతీవాచకము లగు స్త్రీలింగరూపములు లేవు - అనఁగా వానికి 'పిత్రీ, భ్రాత్రీ, జామాత్రీ, దేవ్రీ' అనురూపములు గలుగవు. జనయితృ శబ్దమునకు 'జనయిత్రీ' అను స్త్రీలింగరూపము గలదు. దేవృశబ్దము తెనుఁగున తత్సమము కాదు - అనఁగా 'దేవ' అను తత్సమ రూపము గలుగదు. 'దేవరుఁడు' అను రూప మకారాంత పుంలింగమగు దేవరశబ్దమునుండి కలుగుచున్నది. 'దేవృఁడు' అనురూపము శబ్దరత్నాకరమున నున్నది. ప్రయోగము లేదు. నప్తృ శబ్దము స్త్రీలింగ మహతీవాచకముగఁగూడ వాడఁబడును; దానికి 'నప్త్రీ' అను స్త్రీలింగ రూపమును గలదు. ఋకారాంత స్త్రీలింగమహతీవాచక శబ్దములకు పుంలింగరూపములు లేవు. రెండవవర్గములోని శబ్దములనన్నిటిని నపుంసకలింగ శబ్దములుగ సంస్కృతమున వాడవచ్చును. వానికి స్త్రీలింగమున అనుష్ఠాత్రీ, అనుగంత్రీ, మొదలగు రూపములు గలుగును.

మూఁడవ వర్గమందలి 'నృ' శబ్దము తెనుఁగునఁ దత్సమమై 'న' అని కాదు; 'నరుఁడు' అనురూపము 'నర' శబ్దమునుండి కలుగును. లేదా 'నరుఁడు అనురూపము సంస్కృత ద్వితీయైక వచన రూపమునుండి కలిగినదని నైన నన వచ్చును. 'త్రీ' అంతమందు గల స్త్రీలింగశబ్దము లన్నియుఁ దెనుఁగునఁ దక్కిన యీకారాంత శబ్దములకు వలె దీర్ఘమునకు హ్రస్వము గలుగుట వలనఁ దత్సమములగును. ఉదా: జనయిత్రి, నప్త్రి, అనుష్ఠాత్రి మొదలైనవి.

(1) ఋకారాంత శబ్దములతుది ఋ - కారస్థానమున అత్వము నిలుచుట వలనఁ దెనుఁగునఁ దత్సమము లేర్పడును: అనఁగా నాయా శబ్దముల సంస్కృతము నందలి దీర్ఘాంతములగు ప్రథమైక వచనరూపములతుది దీర్ఘమునకు హ్రస్వము కలుగుటవలనఁ దెనుఁగున నవి తత్సమములగును. ఆ శబ్దము లేలింగమునందున్నను వాని తత్సమరూపము లిట్లే కలుగును: వానిపై మఱి యెట్టి విభక్తి ప్రత్యయములును జేరవు. ఉదా. పితృ. పుం. సం. ప్ర. ఏ. పితా, తత్సమము: 'పిత'; దుహితృ (స్త్రీ.); సం. ప్ర. ఏ. దుహితా. తత్సమము 'దుహిత'; నప్తృ (పుం. స్త్రీ). సం. ప్ర. ఏ. నప్తా; తత్సమము: 'నప్త'; కర్తృ (పుం. న.), సం. ప్ర. ఏ. కర్తా; తత్సమము: 'కర్త' మొదలైనవి. ఈ క్రింది తత్సమ రూపము లిట్లే కలిగినవి—

భ్రాత, భర్త, జామాత, జనయిత; ఉపమాత, ననాంద (ననంద), మాత, యాత, స్వస; అనుష్ఠాత, అనుగంత, అనుమంత, అపహర్త, అభియోక్త, అలంకర్త, ఉపదేష్ట, ఉపద్రష్ట, ఉపభర్త, కర్త, కామయిత, కార

యిత, క్రేత, క్షుత్త, గంత, గ్రహీత, ఛేత్త, జాగరిత, జేత, త్వష్ట, దాత, దోగ్ధ, ద్రష్ట, ద్వేష్ట, ధాత, ధ్యాత, నియంత, నియోక్త, నిర్మాత, నిహంత, నేత, పరివేష్ట, పోత, ప్రణీత, ప్రతిగ్రహీత, ప్రయోక్త, ప్రష్ట, భవిత, భోక్త, యంత, యోద్ధ, రక్షిత, రంత, వక్త, విక్రేత, విమాత, వ్రోఢ, శాస్త, సవ్యేష్ట, సంస్థాత, సవిత, స్తంభయిత, స్మర్త, స్రష్ట, స్వీకర్త, హంత, హర్త, హోత మొదలైనవి.

(2) "విధాతృ, ధాతృ, దాతృ, సవితృ, నేతృ, శబ్దంబులకు మహత్తుల కత్వస్త్రీన ద్భావంబులు విభాషనగు: విధాత, విధాతృఁడు. ధాత, ధాతృఁడు; దాత, దాతృఁడు; సవిత, సవితృఁడు; నేత, నేతృఁడు" - అనిచిన్నయసూరి చెప్పెను. వీనిలో 'ధాతృఁడు, దాతృఁడు, నేతృఁడు అను రూపములు శబ్ద రత్నాకరమున సంగ్రహింపఁ బడలేదు; కాని, ప్రౌఢవ్యాకరణమున వానిని గూర్చిన ప్రశంస లేకుండుటచే నారూపములు శబ్దరత్నాకర కారుఁడగు ప్రౌఢ వ్యాకరణ కారునికి సమ్మతములనియే తలంపవలసి యున్నది 'విధాతృ, సవితృ' శబ్దములకుఁ దప్పఁ దక్కినవానికి డుజ్జుతోడి ప్రథమైకవచన రూపములు గలుగు ననుటకుఁ బ్రయోగములు మృగ్యములు; వ్యవహారమున నట్టి శబ్ద ములు వినఁబడవు.

(3) 'పితృ' శబ్దమునకు 'పితరుఁడు' అను ప్రథమైకవచన తత్సమ రూపము గలదు. కాని, యది శబ్దరత్నాకరమున వైకృతముగ నిరూపింపఁబడి యున్నది. అది వైకృత మనుటకంటే సంస్కృత ద్వితీయైకవచనమునుండి పుట్టిన తత్సమరూపముగాఁ బరిగణించుట యుక్తము. నరుఁడు, దేవరుఁడు అను పదములు నిట్టివే యనవచ్చును గాని, యవి యకారాంత పుంలింగశబ్దము లగు నర, దేవర, శబ్దములకుఁ దత్సమరూపములనియుఁ జెప్పికొనవచ్చును.

## VIII. ఇతరాచ్చు లంతమందుగల శబ్దములు.

ఐకారాంత రై శబ్దమునకు 'రా' యను తత్సమరూపముగలుగునని చిన్న యసూరి చెప్పెనుగాని, యది శబ్దరత్నాకరకారుని యభిప్రాయముచొప్పున వైకృత మనుకొనుటయే యొప్పును; అట్లయినచో రాయీవి, రావెలఁది మున్నగువానికి మిశ్ర సమాసత్వము తప్పును. 'రా' తత్సమమైనచో 'రాయి' కూడ తత్సమము కావలయును. 'రై' అను రూపమునుగూడ చిన్నయసూరి తత్సమముగఁ బరిగ్రహించెను గాని దానికిఁ బ్రయోగములు మృగ్యములు.

ఓకారాంత గో శబ్దమునకు 'గోవు' అనునది తత్సమరూపము.

ఔకారాంత నౌశబ్దమునకుఁ దత్సమముగ 'నావ' అను రూపము గలుగును. గ్లౌ శబ్దమునకు గ్లా, గ్లో అను తత్సమరూపములను చిన్నయసూరి,

నిరూపించెను గాని, వానికిఁ బ్రయోగములు గానరావు. 'గ్లో' అను రూపము శబ్దరత్నాకరమున లేదు.

**హలంత శబ్దములు.**

సంస్కృతమున హలంత శబ్దములు 'చ్, జ్, త్, ద్, ధ్, న్, భ్, వ్, శ్, ష్, స్, హ్' అను హల్లు లంతమునఁ గలవిగా నుండును. వీనిలోఁ గొన్ని పుంలింగములు, కొన్ని స్త్రీలింగములు, కొన్ని నపుంసక లింగములుగా నుండును. హలంత శబ్దములు కొన్ని మహద్వాచకములుఁ గొన్ని మహతీతరామహద్వాచకములు నగునుగాని మహతీ వాచకములు హలంత శబ్దములందు లేవు.

(1) హలంత శబ్దములు పుం 'స్త్రీ' నపుంసక లింగములలో నెవ్వియైనను, మహద్వాచకములు, మహతీతరామహద్వాచకములలో నెవ్వియైనను, ఏహల్లు అంతమందు గల్గియైనను, తత్సమములగునపుడు సంస్కృతమునందలి వాని ప్రథమైక వచనరూపములు ప్రాతిపదికములగును. ఉదా.

చకారాంతములు: అన్వక్, ఋక్, గుడత్వక్, తిర్యక్, త్వక్, దేవద్ర్యక్, మృదుత్వక్, రుక్, లుక్, వాక్, శుక్, స్ఫిక్, స్రుక్.

జకారాంతములు: అశ్వయుక్, అస్రుక్, అహిభుక్, ఋత్విక్, తృష్ణక్, పరివ్రాట్, బలిభుక్, భిషక్, భూభుక్, భృతిభుక్, యక్షరాట్, యమరాట్, రాట్, రుక్, వణిక్, విభ్రాట్, విరాట్, విశ్వసృక్, సమ్రాట్, స్ఫిక్, స్రక్, స్వప్నక్, స్వరాట్, స్వారాట్, శతభిషక్, హుతభుక్.

తకారాంతములు: (1) అంభుభృత్, అగ్నిచిత్, అభిజిత్, ఆవృత్, ఉదశ్విత్, ఉపభృత్, కపాలభృత్, క్షుత్, క్ష్మాభృత్, గరుత్, చిత్రకృత్, జగత్, జతుకృత్, జరత్, తారకజిత్, జాగ్రత్, తనూనపాత్, త్రింశత్, నపాత్, పరభృత్, పాదు (దూ) కృత్, పిత్సత్, పృషత్, బృహత్, భూభృత్, మరుత్, మహత్, మారజిత్, యకృత్, యోషిత్, విపశ్చిత్, వియత్, విరోధికృత్, విషువత్, వేహత్, విద్యుత్, శకృత్, శుభకృత్, శోభకృత్, శ్వేతగరుత్, సంయత్, సమిత్, సర్వజిత్, హరిత్.

(2) మతుబంతములు: ఉదన్వత్ (నపుం.), ఉదన్వాన్ (పుం.); ఉరస్వత్ (నపుం.) ఉరస్వాన్ (పుం.); కకుద్మత్ (నపుం.); కకుద్మాన్ (పుం.); క్రియావత్ (నపుం); క్రియావాన్ (పుం.); గోమత్ (నపుం); గోమాన్ (పుం.); చక్రీవత్ (నపుం.); చక్రీవాన్ (పుం.); మఘవత్ (నపుం.); మఘవాన్ (పుం.); మరుత్వత్ (నపుం.); మరుత్వాన్ (పుం.); మాల్యవత్ (నపుం.); మాల్యవాన్ (నపుం.) విద్యావత్ (నపుం.) విద్యా

వాన్ (పుం.) ; శిఖావత్ (నపుం.) ; శిఖావాన్ (పుం.) ; శ్రీమత్ (నపుం.); శ్రీమాన్ (పుం.) ; వివస్వత్ (నపుం.) ; వివస్వాన్ (పుం.) ; శుక్తిమత్ (నపుం.) శుక్తిమాన్ (పుం.) ; సానుమత్ (నపుం.) సానుమాన్ (పుం.) హనుమత్ (నపుం.) ; హనుమాన్ (పుం.) ; హిమవత్ (నపుం.) హిమవాన్ (పుం)- మొదలయినవి.

దకారాంతములు: ఆపత్, ఉపనిషత్, కకుత్, గూఢపాత్, త్రికకుత్, దృషత్, ద్విషత్, పరిషత్, ముత్, మృత్, విపత్, శరత్, సంముత్, సంవిత్, సంపత్, హృత్.

ధకారాంతములు: క్షుత్, వీరుత్, సమిత్, శ్వావిధ్.

నకారాంతములు; (1) అన్-అంతములు:

(అ) పుంలింగములు: అకృష్ణకర్మా, అగ్రజన్మా, అర్యమా, అర్వా, అశ్మా, అధ్వా, ఆత్మా, ఊష్మా, ఇక్షుధన్వా, ఉక్షా, కదధ్వా, కృష్ణకర్మా, కృష్ణవర్త్మా, గ్రావా, జీవాత్మా, ద్వాదశాత్మా, ద్విజన్మా, ధూంత్మా, పరమాత్మా, పాప్మా, పృథురోమా, ప్రేమా, బ్రహ్మా, భూతాత్మా, మనుష్యధర్మా, యక్ష్మా, యజ్వా, యువా, రాజా, రాజయక్ష్మా, విశ్వకర్మా, వేమా, శర్మా, శ్లేష్మా, సుత్రామన్, సుధర్మా, సుపర్వా, స్వాదుధన్వా, హిమదామా.

(ఆ) నపుంసక లింగములు: అర్మ, అష్టాదశ, అహ, ఉపాకర్మ, ఊరు, పర్వ, కర్మ, క్లోమ, చర్మ, ఛద్మ, జన్మ, తర్మ, ద్విజన్మ, ధామ, నర్మ, నామ, నృపలక్ష్మ, పర్వ, ప్రేమ, బలిసద్మ, బ్రహ్మ, భస్మ, భూతాత్మ, మర్మ, కర్మాత్మ, రోమ, లక్ష్మ, లూమ, లోమ, వర్మ, వర్త్మ, వర్ష్మ, వేశ్మ, వేమ, వ్యోమ, శర్మ, శూష్మ, సధర్మ, సామ, స్థామ, స్థేమ, హేమ.

(2) ఇమనిజంతములు: అణిమా, గంభీరిమా, గభీరిమా, గరిమా, చారిమా, తనిమా, నీలిమా, పటిమా, పాండిమా, ప్రథిమా, మధురిమా, మహిమా, మ్రదిమా, శోణిమా.

(3) ఇన్-అంతములు: అనుజీవీ, అపకారీ, అధికారీ మొదలయినవి. అశ్వినా.

భకారాంతములు: కకుప్, అనుష్టుప్, త్రిష్టుప్.

వకారాంతములు : దివ్.

శకారాంతములు : అదృక్, త్రిద్యుస్పృక్, దృక్, భూమిస్పృక్, మర్మస్పృక్, విట్, స్పృక్.

షకారాంతములు: అహిద్విట్, కాష్ఠతట్, గోవిట్, తృట్, త్విట్, ప్రావృట్, రుట్, విట్, విప్రుట్, ద్విట్, వాహద్విట్, విద్విట్.

సకారాంతములు: (1) అస్ - అంతములు: అంధస్, అంభస్, అంహస్, అగౌకస్, అనస్, అనేహస్, అప్సరస్, అమృతాంధస్, అయస్, అర్ణస్, అవాసస్, ఆగస్, ఉచ్చైశ్శ్రవస్, ఉత్తరవాసస్, ఉన్మనస్, ఉరస్, ఉషస్, ఊర్ధ్వరేతస్, ఏనస్, ఓజస్, ఓకస్, కర్ణజలౌకస్, ఖురణస్, చక్షుశ్శ్రవస్, చక్షుస్, చటకాశిరస్, చేతస్, ఛందస్, జగచ్చక్షుస్, జ్యాయస్, తమస్, తరస్, తేజస్, దశనవాసస్, దృష్టరజస్, నగౌకస్, నభస్, పాథస్, ప్రత్యూషస్, ప్రచేతస్, భూయస్, మేదస్, మనస్, మహస్, మృగశిరస్, యశస్, యాదస్, రజస్, రంహస్, రహస్, రోదస్, రోధస్, వచస్, వయస్, వర్చస్, వాసస్, విమనస్, విహాయస్, శ్రవస్, సుమనస్.

(2) ఇస్ - అంతములు: అర్చిస్, ఉదర్చిస్, ఛదిస్, జ్యోతిస్, రోచిస్, హవిస్.

(3) ఈయస్ - అంతములు: అల్పీయస్, కణీయస్, బలీయస్, గరీయస్, సాధీయస్, కనీయస్, యవీయస్, వరీయస్.

(4) ఈస్ - అంతములు: ఆశీస్.

(5) ఉస్ - అంతములు: అరుస్, ఆయుస్, జటాయుస్, జరాయుస్, దీర్ఘాయుస్, ధనుస్; యజుస్.

హకారాంతములు: అనడ్వాన్, ఉపానట్, గోధుక్, గోలిట్, తురాషాట్, ప్రష్ఠవాట్, మధులిట్, స్నుక్.

**సంస్కృత హలంతశబ్దములు తెనుఁగున తత్సమములగు విధము.**

(1) సాధారణముగ నకారాంతములు కాని సంస్కృత హలంత శబ్దముల ప్రథమైకవచనరూపములే తెనుఁగునఁ బ్రథమా విభక్త్యేకవచన ప్రాతిపదికములగును. అప్పుడు తుదిహల్లునకు ద్విత్వమును, ద్విత్వముపై నుత్వమును జేరును. ఉదా. చ - అన్వక్కు, ఋక్కు, గుడత్వక్కు; జ - అశ్వయుక్కు, అసృక్కు, విరాట్టు; త - అంబుభృత్తు, అగ్నిచిత్తు, మహత్తు, సమిత్తు, హరిత్తు; ద - ఉపనిషత్తు, పరిషత్తు, శరత్తు; ధ - క్షుత్తు, వీరుత్తు, సమిత్తు; భ - కకుప్పు, అనుష్టుప్పు, త్రిష్టుప్పు; శ - దృక్కు, విట్టు, స్పృక్కు; ష - గోవిట్టు, తృట్టు, తృట్టు, త్విట్టు; స - అంధస్సు, అంభస్సు; ఆశీస్సు, ఆయుస్సు, ధనుస్సు, మహస్సు, యజుస్సు; హ - స్నుక్కు మొదలైనవి.

(2) దీర్ఘము మీఁది ద్విత్వహల్లులలో నొకటి కొన్నిశబ్దములందు లోపించును. ఉదా. వాక్కు, వాకు (విరాటు, రాటు, స్వరాటు, ప్రష్ఠవాటు; అనురూపములు కలుగునేమో తెలియదు).

(3) కొన్ని యెడల కొన్ని సంస్కృత హలంతశబ్దముల ద్వితీయైకవచన రూపముగూడ తెనుఁగునఁ బ్రథమైకవచన ప్రాతిపదికమగును. శబ్దమమహాద్వాచకమగునపు డాసంస్కృత ద్వితీయైకవచన రూపముపై నుత్వముచేరి తెనుఁగునఁ బ్రథమైకవచన రూపమగును. మహద్వాచకమైనచో సంస్కృత ద్వితీయైకవచన ప్రత్యయమందలి మకారములోపింపఁగా శేషించిన యత్వమున కుత్వమై, డుజ్ - ప్రత్యయముచేరి తెనుఁగున ప్రథమైకవచన రూపము గలుగును. ఉదా. చ-త్వక్కు, త్వచము; జ - హుతభూక్కు, హుతభుజుఁడు; ద - కకుత్తు, కకుదము ; ధ - వీరుత్తు, వీరుధము ; .

(4) కొన్నిశబ్దములకు సంస్కృత ద్వితీయైకవచనరూపముమాత్రము ప్రాతిపదికమగును. ప్రథమైకవచన రూపము ప్రాతిపదికమై ద్విత్వమును, ఉత్వమును గలుగవు. ఉదా. జ - భూభుజుఁడు (భూభుక్కు అనికాదు) ; భృతిభుజుఁడు (భృతిభుక్కు అనికాదు) ; విశ్వసృజుఁడు (విశ్వసృక్కు అనికాదు) ; స్రజము (స్రక్కు అనికాదు) ; త-పిత్సంతము (పిత్సత్తుకాదు) ; ద - ముదము (ముత్తు అనికాదు) ; సమ్ముదము (సమ్ముత్తు అనికాదు) ; శ - భూమిస్పృశుఁడు (భూమి స్పృక్కు అనికాదు); విశుఁడు (విట్టు అనికాదు); స - అగౌకసము (అగౌకస్సు కాదు); అమృతాంధసుఁడు (అమృతాంధస్సు కాదు); విహాయసము (విహాయస్సు కాదు); అవాససుఁడు (అవాసస్సుకాదు); ఉరసుఁడు (ఉరస్సు అని మహద్వాచక రూపము లేదు); ఊర్ధ్వరేతసుఁడు (ఊర్ధ్వరేతస్సు అను మహద్వాచక రూపములేదు). ఖురణసుఁడు (ఖురణస్సు అను మహద్వాచక రూపములేదు.); ష - అహిద్విషము (అహిద్విట్టుకాదు); అట్లే, అహిద్విషుఁడు ; విప్రుషము (విప్రుట్టు అనికాదు); వాహద్విషము (వాహద్విట్టు అనికాదు) ; కాష్ఠతక్షుఁడు (కాష్ఠతట్టు అనికాదు) ; హ - తురాషాహుఁడు (తురాషాట్టు అనికాదు) ; ప్రష్ఠవాహము (ప్రష్ఠవాట్టు అనికాదు) ; మధులిహము (మధులిట్టు అనికాదు) ; గోలిహము (గోలిట్టు అనికాదు).

మతుప్ప్రత్యయాంత శబ్దములన్నియుఁ వైయాత్రము ననుసరించి తత్సమము లగుచున్నవి: ధీమాన్(ప్ర. ఏ.), ధీమంతమ్(ద్వి. ఏ.), * ధీమంత (తె. ప్రా.), ధీమంతుఁడు; ఇట్లే, ధనవంతుఁడు, మొదలయినవి. హనుమచ్ఛబ్దమునకు హనుమంతుఁడు, హనుమానుఁడు, హనుమ యను మూఁడు తత్సమరూపములును గలవు. 'గరుత్మ' చ్ఛబ్దమునకుఁ గొన్ని ప్రాంతములందు 'గరుత్మానుఁడు' అను తత్సమరూపము వ్యవహారమున వినఁబడుచున్నది. విద్వచ్ఛబ్దమునకు నేఁటి యాంధ్ర, మద్రాసు విశ్వవిద్యాలయముల మూలమున 'విద్వాను' అను తత్సమరూప మేర్పడినది. దీనికిని 'విద్వాంసుఁడు' అను తత్సమపదమునకును నర్థభేదముకూడ నేర్పడినది. 'విద్వాన్' అను విశ్వవిద్యా

లయ పరీక్షయందు త్తీర్ణుఁడై నవాఁడు 'విద్వాను'; బాగుగ చదువుకొని జ్ఞానము సంపాదించినవాఁడు 'విద్వాంసుఁడు'.

(5) కొన్ని సంస్కృత హలంతముల తుదిహల్లులోపింపఁగా మిగిలిన రూపముగూడ తెనుఁగునఁ బ్రథమైకవచన ప్రాతిపదికమగును. అట్టి ప్రాతి పదిక మకారాంతమైనచో మహద్వాచకమగునపు డుత్వదుజ్జులును, నమహద్వా చకమగునపుడు మువర్ణమును జేరి తెనుఁగునఁ బ్రథమైకవచన తత్సమ రూపము లేర్పడును. ఉదా. త - జగత్తు, జగము ; స - అర్యస్సు, అర్యము ; ఉత్తర వాసస్సు, ఉత్తరవాసము ; ఛందస్సు (ఛందము అనురూపము శ. ర. లో లేదు. లాక్షణికులు వాడినారు); నభము (నభస్సు శ. ర. లో లేదు. ప్రయోగ మున్నదేమో) ; తేజస్సు, తేజము ; మనస్సు, మనము ; యశస్సు - యశము; రేతస్సు, రేతము ; శ్రవస్సు, శ్రవము ; వాసస్సు, వాసము ; సదస్సు, సదము ; రజస్సు, రజము. ఇంద్రజిత్ అను మహద్వాచకమునకు 'ఇంద్ర జిత్తు', 'ఇంద్రజి' యను రెండును దత్సమరూపములగును.

(6) కొన్నిటికి ద్విత్వరూపము రాక, తుదిహల్లు లోపింపఁగా శేషించిన యకారముపై నుత్వదుజ్జులుగాని, మువర్ణముగాని మాత్రము గలుగును. ఉదా: అల్పీయము, ఆగము, ఉచ్చైశ్శ్రవము, ఉన్మనుఁడు ; ప్రత్యూషము, బలీయము, మహామహుఁడు, విమనుడు, సర్పశిరము, స్థవీయము ; ఉపాన హము, గోధుమహుఁడు.

(7) కొన్నిటికి ద్విత్వరూపము రాక, ద్వితీయైకవచనము ప్రాతిపదిక ముగాఁ గలరూపములును, తుదిహల్లులోపింపఁగా శేషించినది ప్రాతిపదిక ముఁగాఁ గలరూపములును, గలుగును. ఉదా: ఊర్ధ్వరేతసుఁడు, ఊర్ధ్వ రేతుఁడు ; ప్రచేతసుఁడు, ప్రచేతుఁడు.

(8) నకారాంత శబ్దములలో అన్ - అంతముల తుది నకారము లోపింపఁగా, మిగిలిన తుది అకారముపై మహద్వాచకమైనచో నుత్వదుజ్జు లును నమహద్వాచకమైనచో ము - వర్ణమును చేరును. ఉదా: మహద్వా చకములు : అకృష్ణకర్ముఁడు, అర్యముఁడు, కృష్ణకర్ముఁడు, ద్వాదశాత్ముఁడు. ద్విజన్ముఁడు, భూతాత్ముఁడు, మనుష్యధర్ముఁడు, సధర్ముఁడు, సుత్రాముఁడు, సుత్వుఁడు, సుపర్వుఁడు, స్వాదుధన్వుఁడు, ఇక్షుధన్వుఁడు, హిమధాముఁడు.

అమహద్వాచకములు: అర్మము, అర్వము, అశ్మము, అష్టాదశము, అహము, అధ్వము, కదధ్వము, ఊరుపర్వము, ఊష్మము, అగ్రజన్ముఁడు, అగ్ర జన్మము, క్లోమము, గ్రామము, చర్మము, తర్మము, ద్విజన్మము, ధామము, ధూంక్ష్మము, నర్మము, నామము, నృపలక్ష్మము, పర్వము, పాప్మము,

పృథురోమము, బలిసద్మము, భస్మము, రక్తాశ్మము, రోమము, లక్ష్మము, లూమము, లోమము, వర్త్మము, వర్మము, వర్ష్మము, వేశ్మము, వేమము, వ్యోమము, శర్మము, శుష్మము, శ్లేష్మము, సధర్మము, సామము, స్థామము, స్తేమము, హేమము.

(9) కొన్ని అన్నంతశబ్దముల తుది నకారము లోపించి స్త్రీవద్భావము వైకల్పికముగఁ గలుగును. ఉదా: అమహద్వాచకములు: ఉపాకర్మ, ఉపాకర్మము; కర్మ, కర్మము; ఆత్మ, ఆత్మము; పరమాత్మ, పరమాత్మము; ప్రేమ, ప్రేమము; భూతాత్మ, భూతాత్మము; రాజయక్ష్మ, రాజయక్ష్మము.

మహద్వాచకములు: కృష్ణవర్మ, కృష్ణవర్మ్ముఁడు; జీవాత్మ, జీవాత్ముఁడు; ఆత్మ, ఆత్ముఁడు; పరమాత్మ, పరమాత్ముఁడు; భూతాత్మ, భూతాత్ముఁడు, విశ్వకర్మ, విశ్వకర్ముడు.

(10) కొన్ని అన్నంతశబ్దముల తుది నకారము లోపించి స్త్రీవద్భావము మాత్రము కలుగును: ఉదా. సామ, యజ్వ, యువ.

(11) బ్రహ్మన్ శబ్దము మహద్వాచకమయిన యెడల బ్రహ్మ అనియు, అమహద్వాచకమగుచో బ్రహ్మమనియుఁ దత్సమరూపములఁ బొందును.

రాజన్ శబ్దమునకు రాజే అనునది తత్సమరూపము; రాజు శబ్దమున జకారము దంత్యోచ్చారణము గలది.

శ్వన్ శబ్దమునకు సప్తమ్యేకవచనరూపమగు 'శుని' అనునది తెనుఁగునఁ బ్రథమైకవచనమునఁ దత్సమరూపము.

శర్మ, వర్మ శబ్దములు పుంలింగములు, మహద్వాచకములు నగుచోఁ దెనుఁగునఁ బ్రథమైకవచనమున శర్మ, వర్మ యనురూపములఁ బొందును. నపుంసకలింగములు నమహద్వాచకము లగుచో శర్మము, వర్మము, అను తత్సమరూపములఁ బొందును.

సుధర్మన్ శబ్దము సభకు పేరగుచో దానికి సుధర్మయను తత్సమరూపమేర్పడును.

(12) ఇన్నంతముల తుది నకారము లోపింపఁగా మిగిలిన ఇకారాంత రూపమే తెనుఁగునఁ బ్రథమైకవచనమున నిలుచును. లేదా, సంస్కృతమందలి వాని ప్రథమైక వచనరూపముల తుది ఈకారమునకుఁ దెనుఁగున హ్రస్వము కలుగునని యైనఁ జెప్పవచ్చును. ఉదా: అనుజీవి, ఉపకారి, అధికారి, మాని, జీవి, హస్తి మొదలయినవి.

(13) ఇమనిజంతముల తుది సకారము లోపించును. అట్లు లోపింపఁగా నిలిచిన రూపమైనను, దానిపై మువర్ణము చేరిన రూపమైనను దెనుఁగునఁ బ్రథమైకవచనమునఁ దత్సమమగును. ఇమనిజంతశబ్దములకుఁ గలుగు మువర్ణముతోడి రూపములు కొన్ని శబ్దరత్నాకరమున నిరూపింపఁ బడలేదు. అట్లే స్త్రీవద్భావరూపములును గొన్ని చూపఁబడలేదు. వానికారూపములు కలుగునో కలుగవో చెప్పవీలులేదు. ఉదా: అణిమ (అణిమము - శ. ర. లో లేదు); గంభీరిమ (గంభీరిమము - శ. ర. లో లేదు); గభీరిమ (గభీరిమము - శ. ర. లో లేదు); గరిమ, గరిమము; (చారిమ,-శ. ర. లో లేదు), చారిమము; తనిమ (శ. ర. లో లేదు), తనిమము; నీలిమ, నీలిమము; పటిమ (పటిమము-శ. ర. లో లేదు), పాండిమ, పాండిమము; ప్రథిమ, ప్రథిమము; మధురిమ, మధురిమము; మహిమ, మహిమము; (మ్రదిమ, - శ. ర. లో లేదు), మ్రదిమము; శోణిమ, శోణిమము.

(14) ఇస్ అంతమందుగల శబ్దముల తుది సకారము వైకల్పికముగా లోపించును; లోపింపనపుడు సకారమునకు ద్విత్వమును ఉత్వమును గలుగును. ఉదా: అర్చిస్సు, (అర్చి. శ. ర లో లేదు. "పల్లవపుటార్చిడఁగరాడు" అని వసుచరిత్ర ప్రయోగము); (ఉదర్చిస్సు - శ. ర. లో లేదు), ఉదర్చి; (ఛదిస్సు- శ. ర. లో లేదు), ఛది (జ్యోతిస్సు - శ. ర. లో లేదు), జ్యోతి; రోచిస్సు, (రోచి - శ. ర. లో లేదు); హవిస్సు, హవి.

(15) ఉస్ అంతమందుగల శబ్దముల తుది సకారము వైకల్పికముగ లోపించును. లోపము పొందఁగా నిలిచిన రూపముపై వు వర్ణము చేరును; లోపము కలుగనప్పుడు ద్విత్వమును ఉత్వమును గలుగును. కొన్నియెడల నీ రెండురూపములలో నొకటిమాత్రము కలుగును. ఉదా: అరుస్సు (అరువు అని కాదు); ఆయుస్సు, ఆయువు; జటాయువు (జటాయుస్సు అనికాదు); దీర్ఘాయువు (దీర్ఘాయుస్సు అని వ్యవహారమునఁ గలదు); ధనుస్సు, ధనువు; యజుస్సు (యజువు అని కాదు.) - ఆయుషమ్ మొదలగు సంస్కృతరూపములను బట్టి కావలయు "ఆయుష్షు" అని వ్యవహారమున వినఁబడుచున్నది.

(16) 'మృగశిరస్' అను సకారాంతశబ్దమునకు మృగశిర యనునది తత్సమరూపము; మృగశిరము అనురూపమును గలుగునేమో తెలియదు. మృగశిరస్సు, మృగశిరసు, అనురూపములు మాత్రము గలుగవు. వేధశ్శబ్దమునకు వేధయనియు, పురోధశ్శబ్దమునకు పురోధ, పురోధసుఁడు, అనియును దత్సమరూపములు; అనఁగా వేధుఁడు, వేధసుఁడు, పురోధుఁడు, అనురూపములు కలుగవు.

'శతభిషక్' అను జకారాంతశబ్దమునకు శతభిష, శతభిషము అను రెండు తత్సమరూపములును గలుగును. శతభిషక్కు అనురూపము కలుగదు.

'మహత్' అను తకారాంతశబ్దమునకు మహదర్థమునఁ దెనుఁగున రూపములేదు. 'మహంతు' అనునది యన్యదేశ్యము.

'సమిధ్' అను ధకారాంతశబ్దమునకు సమిధ యని తత్సమరూపము కలుగును.

'దోస్' అను సకారాంతశబ్దమునకు 'దో' యని తత్సమరూపము గలుగును.

"ఉ. తదీయదంతములు దోల నమర్చినఁ జూడనొప్పి రా
చెంగటఁ గాలదండములు చేకొనియున్న యమద్వయంబనన్"
(వి. పు. VII.)

నస్ శబ్దము 'నస'యగును. నాసిక యని యర్థము.

హకారాంతమగు అనడుహ్ శబ్దమునకు సంస్కృతమున ప్రథమైకవచనమున 'అనడ్వాన్' అనియు, ద్వితీయైకవచనమున 'అనడుహమ్' అనియు రూపములు. తెనుఁగున దాని తత్సమరూపమగు 'అనడ్వాహము' అనునది యా రెండింటియందును దేనినుండియుఁ గలుగలేదు.

ద-కారాంతమగు హృద్ శబ్దమునకును, వ-కారాంతమగు దివ్ శబ్దమునకును వాని సంస్కృతమందలి సప్తమ్యేకవచనరూపములు తెనుఁగునఁ బ్రథమైవచన తత్సమరూపము లగును: హృది, దివి.

(17) దకారాంత 'ఆపద్' శబ్దమునకు 'ఆపద, ఆపత్తి' అను తత్సమ రూపములు గలుగును. 'ఆపత్తు' అని వ్యవహారమునఁ గలదుగాని ప్రయోగము లందు లేదు. విపచ్ఛబ్దమునకు 'విపద' అను తత్సమరూపము గలుగదు; 'విపత్తు, విపత్తి' అనురూపములు గలవు. ఇట్లే 'ప్రతిపద్' శబ్దమునకు 'ప్రతిపద' అను తత్సమరూపములేదు; 'ప్రతిపత్తు' 'ప్రతిపత్తి' అను రూపము లున్నవి. సంపచ్ఛబ్దమునకు సంపద, సంపత్తు, సంపత్తి, అను మూఁడు తత్సమ రూపములును గలవు.

(18) సమాసము లందు హలంతశబ్దములకుఁ దత్సమరూపములు యథాప్రయోగముగ గ్రహింపవలెను: భూభుజుఁడు ('భూభుక్కు' కాదు); ఫణిభుక్కు ('ఫణిభుజము' కాదు). ఇట్లే యితరములును గ్రహింప వలెను.

(19) సంస్కృతావ్యయములు కొన్ని తెనుఁగునఁ దత్సమము లయినవి: ఉచ్చైస్, నీచైస్, నమస్ అనుపదములు సంస్కృతమున నవ్యయములు. వీనిలో మొదటి రెంటికిని ఉచ్చ, ఉచ్చము; నీచ, నీచము (గ్రాహము ఉచ్చలోనున్నది;

నీచలోనున్నది; ఉచ్చము, నీచములేనివాఁడు) అనురూపములు గలుగును. నమశ్శబ్దమునకు నమస్సు అని తత్సమరూపము గలుగును. ఇట్లే యిట్టి రూపములను దెలిసికొనవలెను. అందుకొన్ని వ్యవహారమున మాత్రమె యెక్కువ ప్రచారమందున్నవి.

ఉపాంశు: "గంజాహాల లుపాంశున భుజించు నధముల" ఆము. ४.

ఈషత్, ఈషత్తు; బహిస్ - బహి (బహిఁనెడు - "బహివడ్డ ద్విజున కల్పవుఁ బాచితంబిడి, పసిఁడిక్కై తావాని బంతిఁగుడిచి" - (ఆము. VI; బహి వెట్టు - "బహి పెట్టినతనియన్నమును ... అభోజ్యమండ్రు" - భార. శాం. I.) స్వయమ్, స్వయము; సమమ్, సమము; భూయస్, భూయస్సు (శ. ర); సద్యస్, సద్యో (- ద్యహా), సాక్షాత్, సాక్షాత్తు (గా); అవశ్యమ్, అవశ్యము; అనిశమ్, అనిశము; నిత్యమ్, నిత్యము; అజస్రమ్, అజస్రము; సంతతమ్, సంతతము; చిరమ్, చిరము; యావత్, యావత్తు (వ్యవహారమున అర్థభేదము; అంతయు నని యర్థము); అతి, అతి (వ్యవహారము; అతిగా తినకూడదు. అతీప్రతీలేకుండా పోయినాడు); ప్రతి, ప్రతి "ఎవ్వారు నీప్రతిలే రీభువన త్రయంబున" హరి. ఉ. X; "ఏను నీప్రతిగ నర్చనచేసెనఁగాక శాంభవిన్" జై. VIII; "ప్రతిరఘువీరుఁ డొకఁడు" విజయవి. మొదలయినవి); పరి, పరి (ఒకపరి; వ్యవహారము; ఒకపారి); లవణమ్, లవణము; ఉష్ణమ్, ఉష్ణము; శీతమ్, శీతము; ఆర్ద్రమ్, ఆర్ద్రము ఇట్లే.

(20) తెనుఁగు వ్యవహారమున ననేక సంస్కృతావ్యయములుచేరినవి: అద్యాఽపి, జన్మతః, జన్మనా, వినా, ప్రాయః, ప్రాయశః, సదా, సుష్ఠు, యుగపత్తు (గా), యావత్తు (అంతయు' ననునర్థభేదము కలిగినది), ఉపరి (ఉభయకుశలోపరి), తదుపరి, అన్యత్ర, ఏకత్ర, ఉభయత్ర, యత్రకుత్రాపి, కుత్రాపి, తత్రాపి,-వత్ = -వత్తు (గా); అన్యథా, ఏకైకశః, అల్పశః, నహి; 'నహి' కు తత్సమరూపము 'నహీ'; బహుధా, అన్యథా, తథా, సహస్రధా, శిరసా (-స్సా), మనసా (స్సా), వాచా (మాటయిచ్చినాఁడు); బహుశః, అనేకశః, (ఈ) రూపేణ, (అది కేవలము) వృథా; వృథాగాఖర్చయినది, వృథా శపింతురే; సర్వదా, సర్వత్ర, యద్యపి, ఏవంచ, కశ్చన (గాఁడు), యఃకశ్చన (గాఁడు), పదేపదే, అకస్మాత్తుగా, ద్వారా, అథవా, నమోనమః, క్వచిత్తు, కించిత్తు, కదాచిత్, క్వచిత్తు, కించిత్తు, కించ(పడు), కదాచిత్తు, యద్వా, క్రమేపి, క్రమేణ, అక్షరశః, సుతరాం(లాం), తత్త్వతః. స్వతః, తు, చత ప్పకుండా; అహోరాత్రము (అహోరాత్రస్య, -'శః, కాఁబోలును), సర్వాత్మనా, అతఃపరము, అన్యోన్యము, అంతరము, అకాండముగా, ఏతావతా మొదలయినవి.

(21) "భవచ్ఛత్రాదుల కింపు ప్రయోగంబులేదు" అని చిన్నయసూరి యాంధ్రశబ్ద చింతామణి ననుసరించి చెప్పెను - 'భవిష్యత్' అను శత్రంత రూపమునకు మాత్రము 'భవిష్యత్తు' అను తత్సమరూపము * శబ్దరత్నా కరమునఁ జేర్పఁబడినది. ఈరూపము వ్యవహారము నందును గలదు. నేఁటి గ్రంథకర్తయొకరు 'పూజ్య రాలా!' యను నర్థమున 'భవతీ' యని సంబోధించి నారు. ఇది తప్పు. "నపదాన్యవ్యయసుప్తిఙ్క్త్వాతుమునామ్, అనుకృతేఽస్తి వాక్యంతు", అను నాంధ్రశబ్దచింతామణి సూత్రముల ప్రకారము సంస్కృత మందలి పదములు కానియవ్యయములును, సుప్తిఙ్ ప్రత్యయాంతములును క్త్వా, తుము, నంతథాతురూపములును దెనుఁగునఁ దత్సమములు కావనియుఁ, కాని వాని ననుకరణమునఁ బ్రయోగింప వచ్చుననియుఁ దేలుచున్నది. ఈ సూత్రమునకు విరుద్ధముగా "కర్తు మకర్తు మన్యథా, కర్తు ముదారశక్తివి" రామాభ్యుదయము. "సర్వత్ర నిలింపకామినులవాడకుఁ గాఁపులు ప్రోదురు"; "ఆ బాలగోపాల మఖిలసద్వ్రజమును నానందముననుర్కి నతిశయిల్లె"; "జయ శీతాంశుకులావతంస నిషధస్వామీ" అని కవులుచేసిన ప్రయోగముల నహోబలుఁ డుదాహరించియున్నాఁడు.

### మతుబాంత శబ్దములు

సంస్కృతమున 'కలిగిన' అను నర్థమును గలిగిన ప్రత్యయములలో మత్ అనునదొకటి. దానికి 'వత్' అనియు రూపాంతరముగలదు. సంస్కృత మున మత్ - ప్రత్యయము కొన్ని సందర్భములందును వత్ ప్రత్యయము వేఱు సందర్భములందును వచ్చుచుండును.

(i) ఇది ఇతనికి (దీనికి) లేక ఇతనియందు (దీనియందు) కలదు అను నర్థమున మతుప్ప్రత్యయమువచ్చును.[1] ఉదా: గోమాన్ దేవదత్తః; వృక్షవాన్ పర్వతః, ఇట్లే - యవమాన్, ప్లక్షవాన్ మొదలయినవి. మతుబర్థక ప్రత్యయ ములు కొన్నియర్థములందు మాత్రమువచ్చును. (1) భూమార్థమున: రెండు మూఁడు యవగింజలను గలవాఁడు 'యవమాన్' కాఁడు. అట్లే, ఎక్కువ గోవులను గలవాఁడే 'గోమాన్'.

(2) నిందార్థమున. ఉదా: కకుదావర్తీ, సంఖాదకీ మొదలయినవి. (3) ప్రశంసార్థమున. ఉదా. రూపవతీ కన్యా. (4) నిత్యయోగార్థమున, అనఁగా

---

* 'భవిష్యత్' అనునది వర్తమానార్థకము కాదు గావున శత్రంతము కాదని కొందఱ మతము; కాని, చిన్నయసూరియు, గుప్తార్థ ప్రకాశికాకారుఁడును దానిని శత్రంతముగానే తలంచి యుదాహరించిరి.

1. తదస్యాస్త్యస్మిన్నితి మతుప్.

నిత్యగుణములను దెల్పునప్పుడు, ఉదా. క్షీరిణో వృక్షాః. (5) అతిశాయనార్థమున. ఉదా: ఉదరిణీ కన్యా; (6) సంసర్గార్థమున, అనఁగా ఒకదానితో కూడియున్న అనుసర్గమున. ఉదా: దండీ, ఛత్త్రీ. (7) అస్త్యర్థమున. ఉదా: అస్తిమాన్.

(ii) రస, రూప, వర్ణ, గంధ, స్పర్శ, శబ్ద, స్నేహ, భావముల గుణవాచకములపై మతుప్పు వచ్చును.[1] అట్లే, ఏకాచ్చులుగల శబ్దములమీఁదను మతుప్పువచ్చును. ఉదా. రసవాన్, రూపవాన్, వర్ణవాన్, గంధవాన్, స్పర్శవాన్, శబ్దవాన్; స్వవాన్.

(iii) మకారమంతమందుగాని యుపధావర్ణముగాఁగాని కల శబ్దములమీఁదను, అ, ఆ, లు అంతమందుగాని, యుపధాస్థానముసఁగాని కలశబ్దముల మీఁదను 'మత్' కు మాఱుగ 'వత్' వచ్చును. యవాదులపై 'వత్ రాదు' మత్ వచ్చును.[2] యవ, దల్మి, ఊర్మి, భూమి, కృమి, కుంచా, వశా, ద్రాక్షా, ధ్రాక్షా శబ్దములు యవాదులు. ఉదా: అంత్యమకారమునకు: కింవాన్; ఉపధామకారమునకు: లక్ష్మీవాన్; అంత్య అకారమునకు: జ్ఞానవాన్; అంత్య ఆకారమునకు: విద్యావాన్; అకార ముపధగాఁగల శబ్దములకు: యశస్వాన్; ఆకారమునకు: భాస్వాన్. - యవాదులపై: యవమాన్, మొదలయినవి.

(iv) అనునాసికములుతప్ప తక్కిన వర్గీయహల్లు లంతమందుగల శబ్దములపై వత్ ప్రత్యయము చేరును.[3] ఉదా: విద్యుత్వాన్.

(v) మతుప్ప్రత్యయము చేరుటవలన సంజ్ఞావాచక మేర్పడునపుడు వత్ ప్రత్యయము చేరును[4]. ఉదా: అహీవతీ, మునీవతీ మొదలైనవి.

(vi) సంజ్ఞావాచకము లగునపుడు ఆసందీవాన్, అష్ఠీవాన్, చక్రీవాన్, కక్షీవాన్, రుమణ్వాన్, చర్మణ్వతీ అనురూపము లేర్పడును.[5] సంజ్ఞావాచకములు కానప్పుడు వానికి ఆసన్నవాన్, అస్థిమాన్, చక్రవాన్, కక్ష్యావాన్, లవణవాన్, చర్మవతీ, అనురూపములు గలుగును.

(vii) ఉదన్వాన్ శబ్దము సముద్రమునకును, ఒకఋషి పేరుగను చెల్లును.[6]

(viii) మంచిరాజుపరిపాలనముగల దేశము 'రాజన్వతీ'. మంచిపరిపాలన ముద్దేశింపఁబడనప్పుడు 'రాజవాన్' అగును.[7]

ప్రాకృతమున మతుప్ప్రత్యయము.

సంస్కృతమున నీరీతిగాఁ గొన్నివిధుల ననుసరించుచున్న మత్, వత్, ప్రత్యయముల ప్రయోగసువిషయమై ప్రాకృతమున వ్యత్యాసము కలిగి

1. రసాదిభ్యశ్చ. 2. మాదుపధాయాశ్చ మతోర్వోఽయవాదిభ్యః. 3. ఝయః. 4. సంజ్ఞాయామ్. 5. ఆసందీవదష్ఠీవచ్చక్రీవత్కక్షీవ ద్రుమణ్వచ్చర్మణ్వతీ. 6. ఉదన్వానుదధౌచ. 7. రాజన్వాన్ సౌరాజ్యే

నది. మత్ వాడవలసిన చోట్ల వత్ ప్రత్యయమును, వత్ వాడవలసినచోట్ల మత్ ప్రత్యయమును ప్రాకృతభాషలయందు వాడఁజొచ్చిరి. ఉదా: అర్ధమాగధి: ఆయారమంత (దసవేయాళియ సుత్త, 633, 33), సం. ఆచారవత్ ; అర్ధమాగధి: చిత్తమంత (ఆయారంగసుత్త 2, 1, 5, 2 ; పుట 133, 33 ; 136, 3), సం. చిత్తవాన్ ; అర్ధమాగధి: వణ్ణమంత, గంధమంత, గంధమంత, రసమంత, ఫాసమంత, సం.వర్ణవాన్, గంధవాన్, రసవాన్, స్పర్శవాన్, (అయారంగసుత్త 2, 4, 1, 4 ; సూయగడంగసుత్త 565 ; జీవాభిగమసుత్త 26 ; పణ్ణవణా. 379 ; వివాహపణ్ణత్తి 144) ; అర్ధమాగధి: విజ్జామంత = సం విద్యావాన్ (ఉత్తరజ్ఝయణసుత్త 620 ; శీలమంత, గుణమంత, వఇమంత = సం. శీలవాన్, గుణవాన్, వాగ్వాన్ (ఆయారంగ సుత్త 2, 1, 9, 1) ; పుప్ఫమంత = సం పుష్పవాన్ ; బీయమంత = సం. బీజవాన్ ; మూలమంత = సం. మూలవాన్ ; సాలమంత = సం. శాలా వాన్ (ఓవ వఇయ సుత్త.) ; అపభ్రంశము: గుణమంత (ప్రాకృత పింగళ సూత్రాణి 1, 132, 2, 118) ; = సం. గుణవాన్ ; ధణమంత (ప్రాకృత పింగళసూత్రాణి 2, 45, 118) ధనవాన్ ; పుణమంత (ప్రా. పిం. సూ. 2, 94) = పుణ్యవాన్ ; పుణ్ణమంత (చండుని ప్రాకృతలక్షణము; హేమ చంద్రవ్యాకరణము) = సం. పుణ్యవాన్ ; అర్ధమాగధి: పన్నాణమంత = సం. ప్రజ్ఞానవాన్ (ఆయారంగసుత్త 1, 4, 4, 3 ; 1, 6, 4, 1); పత్త మంత = సం. పత్త్రవాన్; హారియమంత = హారితవాన్ (ఓవ వఇయ సుత్త) ; ధణమణ = సం. ధనవాన్ (చండుని ప్రాకృతలక్షణము 2, 20 ; పుట 45 ; హేమచంద్రవ్యాకరణము ', 159); భత్తివంత = భక్తిమాన్ (హేమచంద్ర వ్యాకరణము 2, 159).

తెనుఁగు వ్యవహారమునఁ బ్రాకృత సంప్రదాయము ననుసరించి 'మత్,' 'వత్' ప్రత్యయముల వాడుకయందు వ్యత్యాసము గలిగినది. కావున, 'బుద్ధివంతుఁడు, గుణమంతుఁడు' మొదలగు రూపములు తద్భవములని చెప్పవలసి యుండును.



# ఆచ్ఛిక వ్యాకరణము.

సంస్కృత సమేతరమయిన యాంధ్రభాష నాచ్ఛికమని వైయాకరణులు పిలుచుచున్నారు. తెనుఁగునందలి పదములు సంస్కృతసమములు, ప్రాకృతసమములు, సంస్కృత భవములు, ప్రాకృతభవములు, దేశ్యములు, అన్యదేశ్యములు అను వర్గములుగ విభజింపఁబడుచున్నవి. శబ్దరత్నాకరమునఁగల 35,055 పదములలోఁ 14,814 పదములు సంస్కృత సమములు; అనఁగా నూటికి 42 వంతున సంస్కృతశబ్దములు తెనుఁగు విభక్తి ప్రత్యయములు మాత్రము చేరినవి యా నిఘంటువున కెక్కినవి. 'ప్రా' అను సంజ్ఞతోనందు 'ఇంగలము' అనునొక్కపదముమాత్ర మున్నది. అది ప్రాకృతసమమని కాఁబోలు శ. ర. కారుని యభిప్రాయము. వానిలో 3891 పదములకు వై. అనఁగా వైకృతము లనుసంజ్ఞ నాతఁడుంచినాఁడు. ప్రాకృత సమములు, సంస్కృతభవములు, ప్రాకృతభవములు ననుమూఁడువర్గములును నీ వర్గములోనికి చేరినవి. అన్యదేశ్యములను గుర్తించుటలో నాతఁడు కొన్నిటికి 'అన్యదే.' యనియు, కొన్నిటికి హిం. (హిందూస్థానీ) అనియు, కొన్నిటికి 'ఆం.' (ఇంగ్లీషు) అనియు గుఱుతులుంచినాఁడు. ఇట్టిపదములు సుమారు 1800 కలవు. మిగిలిన వానిలో మిశ్రములు, అనఁగా సంస్కృతశబ్దములును దేశ్యములును కలిసిన శబ్దపల్లవములు, ధాతుపల్లవములు 170 ఉన్నవి; గ్రామ్యము లని యాతఁడు చెప్పిన 57 పదములునిట్టివే. ద్వయములు, అనఁగా వైకృతములును దేశ్యములును గలిసి శబ్దపల్లవములుగను ధాతుపల్లవములుగను నేర్పడిన పదములు 3227 కలవు. ఈ రీతిగ సుమారు 24000 పదములు సంస్కృతమునకును బ్రాకృతమునకును నన్యదేశ్యములకును సంబంధించినవి. మిగిలిన 11000 పదములలో 252 యుగళములు, అనఁగా నొకయర్థమున సంస్కృతమును వేఱొకయర్థమున దేశ్యమునయిన పదములు; 302 ఉభయములు, అనఁగా నొకయర్థమున వైకృతములు వేఱొకయర్థమున దేశ్యములునైన పదములు. యుగళములను ఉభయములను తత్సమ, తద్భవ పదములుగ నిరూపింపఁ గలిగినచో నింక 10500 పదములు దేశ్యములుగ నిలుచుచున్నవి. వీనిలో 4046 పదములు దేశ్యములని శబ్దరత్నాకరకారుఁడు నిరూపించిన ధాతువులనుండి యేర్పడినవి. ఈ దేశ్యధాతువుల యథార్థస్వరూపమును గూర్చి రెండవ ప్రకరణమున వివరింపఁబడియున్నది. ఇఁక మిగిలిన సుమారు 6000 దేశ్యశబ్దములకును గతియేమి? వానికి తెనుఁగున ధాతువులు కానరావు. వానిలోఁ గొన్నిటి కితరద్రావిడభాషలయందు మాత్ర

కలను జోల్చికొనవచ్చును; అయినను అట్టి వానిసంఖ్య యెక్కువగానుండదు. కావున వానిలో గొన్ని యన్యదేశ్యములును దక్కినవి తద్భవములు నయి యుండవలెను. కొన్నిటికి వ్యుత్పత్తిని నిర్ణయించుటయే కష్టము కావచ్చును. అట్టి వ్యుత్పత్తి నిర్ణయము చేయవీలులేని పదములను దేశ్యములక్రింద పరిగణించుట ప్రాకృత వైయాకరణ సంప్రదాయమేకాక యాధునిక కావ్యభాషలని పిలువఁబడు భాషలకు వ్యాకరణములను నిఘంటువులను వ్రాసినవారను సరించిన సంప్రదాయము కూడనై యున్నది. పండిత హరిగోవిందదాస శ్రేష్ఠ విరచిత 'పాఇఅసద్దమహణ్ణవో' (ప్రాకృతశబ్ద మహార్ణవము) అనుబృహన్నిఘంటువున 38190 పదములు చేరినవి. వీనిలో సుమారు 8000 పదములు కేవల రూపాంతరములు. మిగిలిన 30000 పదములలోను హేమచంద్రవిరచిత ప్రాకృతదేశీనామమాలలోని 5518 దేశ్యపదములును చేరినవి. అనఁగా నూటికించుమించిరువదిపదములు దేశ్యములు. కాని, హేమచంద్రుఁ డిచ్చిన పదములన్నియు దేశ్యములగునా యని భాషాశాస్త్రజ్ఞులు సందేహించుచున్నారు. ఇటీవల జరిగిన పరిశోధనలవలన వీనిలో ననేకములు దేశ్యములు కావని నిరూపింపఁబడినవి. ప్రాకృతముకంటె తెనుఁగు నేటి కింకను, సుమారు పదునేను శతాబ్దములయినను తర్వాతిదె కావున నది ప్రాకృత భాషావికారమే యైనచో తొల్లిటి ప్రాకృతావస్థనుండి యెంతో పరిభ్రష్టమై వికారము నొందియుండవలెను. తెనుఁగు వైయాకరణులందఱును నాంధ్రభాష సంస్కృతప్రాకృతముల వికృతియని యంగీకరించియున్నారు. ప్రాచీనాధునిక ప్రాకృతములు సంస్కృతాది ఇండోయూరోపియను భాషలతో సంబంధము గలవని యంగీకరించిన విషయమే. వానిలో మూలముతో సంబంధము లేదని తమకుఁ దోఁచిన యనేకపదములుండుటచే వాని ప్రాకృతత్వసిద్ధికి భంగము కలుగనేరదు. దేశ్యశబ్దములకుఁ బ్రాకృతాది భాషలతోఁ గల సంబంధమును గూర్చి విపులముగ పరిశోధనము జరిగియుండలేదు. ప్రాచీనాధునికాంధ్ర వైయాకరణులందఱును నాంధ్రభాష సంస్కృతప్రాకృతముల వికృతియని చెప్పి, కొన్ని యుదాహరణములను మాత్ర మిచ్చుటతో తృప్తినొందిరి. ఈ మధ్య బయలువెడలిన కాల్డువెల్లువ్యాకరణ మింగ్లిషులో నుండుటచే నది మన పండితుల కందుబాటులో లేకపోయినది. దానిని గొంతవఱకు నవగాహన చేసికొనిన యొకరిద్దఱు పండితులు మాత్రము పూర్వాంధ్రవ్యాకరణ సంప్రదాయమును విసర్జించి, ఆ సంప్రదాయముయొక్క తత్త్వమును లోతుగ నాలోచింపక యొక్కసారిగ కాల్డువెల్లు నభిప్రాయములను బ్రచారములోనికిఁ దెచ్చుటకుఁ బూనినారు. కాల్డువెల్లు నభిప్రాయమును తప్పక యాలోచింప వలసినదే; కాని, యంతటితో నూరకుండరాదు. ఆంధ్ర

పదములకును వ్యాకరణమునకును ప్రాకృతభాషలతోడి సంబంధము కుదుర నప్పుడు పూర్వాంధ్రవ్యాకరణసంప్రదాయమును తప్పక విడిచిపెట్టవచ్చును. కాని, యాంధ్రమునకుఁ బ్రాకృతముతోడి సంబంధమునుగూర్చి యెట్టి పరిశోధనములు నింతవఱకును జరుగలేదు. అసలు ప్రాకృతభాషాభ్యాసమే యాంధ్రదేశమునఁ దక్కువ. ప్రాకృతమనఁగా షడ్భాషాచంద్రిక, ప్రాకృత ప్రకాశికలలో వివరింపఁబడిన ప్రాకృతమని మన పండితుల యభిప్రాయము. నాటకములను మనవారు చదువుదురుగాని, దానిలోని ప్రాకృతమును గూర్చిన జ్ఞానమును సంపాదింపరు. ఆ ప్రాకృతవాక్యముల ఛాయను మాత్రము చదివి తృప్తిపడుదురు. ఆంధ్రభాషాతత్త్వ విచారము చేయఁబూను పండితు లీవిషయమై యెక్కువశ్రద్ధ తీసికొనవలసియున్నది. ఇంగ్లీషుబడులు బయలు దేరక పూర్వమువఱకును నాంధ్రదేశమునఁ బ్రాకృతభాషాభ్యాసము జరుగు చునేయుండెను. ఇటీవల నది లోపించినది. ద్రావిడేతర దేశములలో మాత్ర మిప్పుడును బ్రాకృతభాషలను గూర్చిన కృషి బాగుగ జరుగుచున్నది. ప్రాచీన ప్రాకృత గ్రంథములు ఇంతకుఁబూర్వము ప్రకటితములుగాని వెన్నియో బయటికి వచ్చుచున్నవి. అర్ధమాగధి, పాలి, అపభ్రంశాది ప్రాకృత గ్రంథము లెన్నియో నవీనముగ ముద్రింపఁబడినవి. విశ్వవిద్యాలయములలోఁ బ్రాకృత మైచ్ఛికముగఁ బఠింపఁదగు భాషగ నేర్పరుపఁబడినది. ఆంధ్రదేశ మునఁగూడ నట్టి కృషి, అంతకంటె నెక్కువకృషి జరుగవలసియున్నది. అట్టిది జరుగునంతవఱకును నాంధ్రభాషయొక్కయు, నితరద్రావిడభాషల యొక్కయు తత్త్వము నిర్ధారితము కానేరదు.

ఈసందర్భమున నొక్కమాట మాత్రము చెప్పవలసి యున్నది. తక్కినద్రావిడభాషలతోఁబాటు ఆంధ్రభాషలోని పదములన్నియు సంస్కృత ప్రాకృతజన్యములే యగునా యని యెవరైనఁ బ్రశ్నింప వచ్చును. పదము లన్నియు సంస్కృతప్రాకృతజన్యము లని యెవ్వరు ననఁజాలరు. సంస్కృతే యేతరభాషలనుండియు ననేకపదము లుత్తరహిందూస్థానభాషలలోనికివలె ద్రావిడ భాషలయందు చేరియుండవచ్చును. అట్టిపదములు మిక్కిలి యెక్కు వగ నున్నను ద్రావిడభాషల ప్రాకృతత్వమునకు భంగము వాటిల్లదు. పద ములయందు గలుగు మార్పులు ప్రాకృత సంప్రదాయానుసారముగ నున్న వాయని విచారించుట మాత్రము ముఖ్యమైనది. ఆంధ్రశబ్దచింతామణి కారుఁడుగూడ 'ఏషాతయోర్భవేద్వికృతిః' అనిచెప్పి వెంటనే యాంధ్రభాషవాని "నుపసర్పించు" చున్నదని తెలిపియున్నాఁడు. ఉపసర్పించుచున్న దనఁగా పదాదులయందు గలుగు వికారములందును, పలుకుబడియందును నాంధ్ర భాష ప్రాకృతమార్గమననుసరించుచున్నదని యాతని యభిప్రాయము.

మెఱుకు, మెఱుము; వెను, వెన్ను, వెనుఁబడు(-ఁబాటు;) వెనుక (చిక్కు, -చూపులమొకము, -టిపని, -టివాఁడు, -దీయు, -ద్రొక్కు, -పడు, పాటు, -మేను, మ్రాను, -ల, -వేయు, -కొను, -చఱచు, -తవులు, - దన్ను, -నీయు, - వెంట), వెన్క, వెనొక్కను, వెన్తవులు, వెన్నంటు, వెన్నడి (ంచు, -కొను), వెన్నాడు, వెన్నిచ్చు, వెన్నుకట్టె (గాఁడి, - దన్ను, -పట్టె, పాము, పూస, -బద్ద, -మ్రాను), వెన్బడు, వెన్పాటు; (348) పుచ్చు (కొను, - కోలు), (349) పుట్టు (క, -కల్లరి, -గట్టు, -గు, -గొడ్డు, -గ్రుడ్డి, -చెయువు, -పాప, -బడి, మచ్చ, -మూఁగ, వడుగు, -పు, - వెట్టి), పుట్టినిల్లు, పుట్నిల్లు (350) పుడు (ఱు) కు, పుడి (ఠి) కిరించు (- ంత), పుడి (ఠి) కిళ్లు, పుడుకుఁగల్లు (ఁ-దొడుకు, మ్రాను), (351) పులియు, పులి (కడుగు, - కూడు, - గంజి, - చించలము, - చింత, - చెంచలి, - చెవులాకు, - త్రేఁపు, - నీరు, - కిరి (కాయ), - పులి (కాయ), పులియఁబాఱు, పులియోర (- నపుగు), పుల్ల (కంద, - గూర, - దానిమ్మ, - న, - నీళ్లు, - ప్రత్తి, - ప్రబ్బ, - బచ్చలి, - మామిడి, - యుసిరిక, - వావిలి, - వెలగ, (452) పు(ఉ)లుము, ప్రాము (డు), (353) పూయు (ఁత) (354) పూడు, పూటము, పూడిక, పూడుఁబాము, పూడుచు (-పు), (355) పెంచు, పెనుచు, పెనుపడు (-పరి, - పారు), పెనుపు, పెను (ఁగొమ్మ, ఁబాము, - మసనము, - మినుకులు, మ్రాను, - వెల్లి,-శ్రేలు), పెన్నడపులుఁగు, పెంచుకొను, పెంపగు, పెంపారు, పెంపు (మీఱు), పెంపుడు, (356) పెట్టు, (ఁజెట్టు, - కొను, - కోలు, - డు, - బడి, - మందు, - వడు) (357) పెనఁగు, పెన, పెనఁకువ, పెనఁకువలుగొను, పెనఁగఁబడు, పెనఁగాడు, పెనఁగులాట (-లాడు), పెనఁగువడు, పెనఁగొను, పెనచు, పెనపరి, పెనపు, పెనయు, పెనవెట్టు (-వేయు), (358) పెరు (ఱు) ఁగు (వు) (డు), పెలుచ (న), పెల్చ (న), పెల్లిదము, పెల్లు (వై.) పెల్లుకొను, పేరుచు, పేర్చు, పేరాముదపుఁజెట్టు, పేరాముదము, పేరాముదాలు, పేరిమి (కాఁడు), పేర్మి, (359) పేఁడు, పేను, (360) పేరు (డు) (361) పేరుచు, పేరుపు (362) పే (ప్రే) లు, పేలపిండి, పేలలు, పేలుచు, ప్రేలుడు, (363) పొంగు, పొంగారు, పొంగునీళ్లు(-ప్రాలు), (364) పొంచు, పొంచిక (365) పొనలు, పొనుఁగువడు (366) పొరఁటు (367) పొరలు (చు), పొరలఁబడు, పొరలాట (లాడు), పొరలిక, పొరలుదండము (-వెట్టు), పొర్లుకట్టు, (368) పొలియు, పొలి (కలను, మేర, - యిక, - పుచ్చు,- వెట్టు, - వ్రాలు) (369) పొలుచు (-పు), పొలుపారు, (370) పొగు (వు) లు, పొగ (వ) (యు) (371) పోవు, పొమ్మను, పో, పోఁగొట్టు, పోక (డ), పోకడ వెట్టు, పోకలాఁడి (-లాఁడు), పోకాడు, పోకారుచు, పోకాలు, పోకు,పోనాడు పోపడు, పోఁబడి (-ఁబెట్టు, - రాని - రామి - వడి), పోవుదెంచు (372) పోయు,

పోఁత, (373) పోలు (చు), పోలిక (-కి), పోలుపొందు, పోలె, పోల్కి (374) పుర్వు (వు) చ్చు, పుర్వు (వు) ప్పి, (375) ప్రోఁ (పో)ఁజు, పోఁగు (376) బడలు బడలిక, బడలుపడు, (377) బిగియు, బిగ, బిగి (ంచు, -తము, బద్ద), బిగుచు (-తు, -వు), బిగువుకొను (378) బిజుగు (379) బులియు, బులుపు, (380) బెడ (ఙ)దుు, బెడియు, (381) బెడ (ఙ) శంగు, (382) బెదరు, బెదరించు(-ంపు) బెదరుపడు (-పోతు), (383) బెరయు, వెరసి, బెలయు, (384) బెనుకు (385) బొంకు, బొంకించు, బొంకు (లాఁడి - లాఁడు), (386) బొక్కు (ఁాడు),(387) బ్రతు (దు) కు, బ్రదికు, (388) బ్రుంగు (ఁడు) బ్రుంగుడుపడు (-వాటు), బ్రుంగుపడు, బ్రుంచు, బ్రుయ్యు (389) మంగు (డు), మాఁగు (వడు,-వాఱు), మాఁగుడు (వాఱు), (390) మంచు, మంట (-కము, -చమురు, -మారి), మంచునెల, మంద్రాము, మాఁడు (చు), (391) మందలించు (-ంపు), (392) మక్కు, మ్రుక్కు (393) మగుడు, మగుడఁబడు, మగుడుచు, మరలు, మరలఁబడు (-ఁబోవు -చు), మరి, మఱలు, మళ్లు, మఱి, మఱిమఱి, మఱియొకటి, మఱు (నాఁడు, -మాట, -మ్రోఁత,-స,-సంజ), మలుసంజ, మారు, మార్పు, మార్పాటు, మాప్పు, మార్పెట్టు, మార్మాట, మాఱికము, మాఱట, మాఱాట, మాఱాటము మాఱాడు, మాఱు, మార్కొను, మారు, (ఁదల్లి,-కొను, -చు, -దల, -నీళ్లు, - పడు, -ట్లు, -వు, -పెట్టు, మగఁడు, -మనువు, ది - మాట, మూల, -మొగము (వడు),-మ్రోఁత), మాఱొడ్డు, మడవు (394) ఁరగు, మక్కువ. మఱవు (395) మఱచు, మఱకువ, మఱపు (396) మఱుఁగు (దొడ్డి, - పడు, -పెరడు), మఱకువ, మఱువు (397) మలఁగు మలఁక (మెఱుపు), మలఁచు (-ఁపు),మలఁపుగొను, మలగొను (398) మలయు (-పు), మలయిక (399) మలుగు(-చు, -పు), (400) మసఁగు, మస (కము-కొను) (401) మసలు, మసలిక, మసలుకొను (402) మస (ఙ) ఁగు (-చు, త), మాటు (మణఁగు, -పడు), (403) మానుఁచు, -పు), (404) మాయు, (-పు) (405) మాలు (చు) (406) మించు (ఁగాలు, -దల), మీఱు, మిక్కులు, మిక్కిలి (వాఁడు, -కంటివేల్పు, -కన్ను), మిక్కుటము, మిగు (వు) లు(చు), మిగత, మిట్టు, మిట్ట, (మిఱ్ఱు, -పడు, -పాటు), మిట్టాడు, మిట్టించు, మిడి, (గ్రుడ్లు, -గ్రుడ్లవాఁడు, -నాగు, -పండ్లవాఁడు, -చేలము, -యు, వ్రాఁవు, -సిపడు, -సిపాటు), మిడుకు (-త), మిఱ్ఱు, మెట్ట (జీలుగు, -తమ్మి, పంట, వాలుపిట్ట (407) మినుకు, మిసు(ఙు)ఁగుఱు, మినమిన (లాడు), మిను(న్ను), మినుకు (ఁజేడియ, -మినుకుమను, -లబరణి, -లయిక్క), మినుక్కురను, మినుచూలు, మినుమినుకను మిన్నుకొలఁదు (-మన్ను, -వాఁక (ఁతాలుపు), మిన్నేఱు, మిన్వాక, మిర్మిట్లు, మిఱు (మిట్లు, మిట్లుగొను), మిలమిల (స,

-లాడు), మెలఁత (-తుక), మెలఁకు, మెఱచు (-పు), మెఱపుఁదీఁగె, మెఱయు, మెఱవడి, మెఱుఁగు (ఁబోఁడి, -మంఁబురుగు, -జెట్టి, -మనూనె, -వల్లులు, -రిక్క), మెఱుము, వెలుఁగు(తేఁడు), వెలుఁగొంకు, వెలుక (ఁబాఱు), వెలఁది, వెలఁదుక, వెలచు(వై.), వెలయు(వై), వెలరారు(వై), వెలరు (-వై), వెలరువాఱు (వై.), వెలవెల (ఁబాఱు, ఁబోవు, -న, -నగు, -నవ్రాపు,-పాటు), వెలవెల్లనగు, వెలి (గారము, గిడ్డి(వై), -గుల్ల(వై.), గారు, తిప్ప, -తుమ్మ, పము, -మావు, -మిడి, -మ్రాను, -యు), వెలుపెరు, వెల్కఁబాఱు, వెల్మిడి, వెల్ల (ఁబాటు, -బాఱు, -చఱపు, -న, -నగు), వెల్వెల(లుక,) ఁబాఱు, వెల్వెల్ల, వలిపము (-మల, -వెలుఁగు) (408) మీటు, మీటి (409) ముంచు (కొను), ముంపు (గొను), మునుఁగు (-కు) (410) ముట్టు, ముట్టఁబడు (-డము,-డి, -డించు,-ణము), ముట్టుకొను (-కోలు; గొను, పట్టు, పఱుచు, -త, -నీళ్లు, -పడు, పాటు), (411) ముడుచు, ముడి) కాఁడు, కాళ్ల వాఁడు, -గొను,-బట్ట,-బొను, -వడు,-వాటు,) పెట్టు, ముడియు (కొని, ముడు (ఁు) గు. వై. మూట. వై.), ముడుత, ముడుపరి, మ్రాలు (చు), ముడుపు, ముఱుగు, మ్రుంగు, మ్రాఁగు, (412) ముదియు, ముదిఁ గారము (-మి), ముదుక (ఁడు), ముదుసలి (413) ముదురు (414) మురియు, మురి, మురి కాఁడు, మురిప (-పె)ము, మురియఁబడు, మురువు (415) ము(మూ)లుగు (416) మూఁక (విప్పు), మూఁకుడు, మూఁగఁబాఱు (-తీట), మూఁగు, మూఁత (బల్ల), మూయు (417) మూఁడు (చు) (418) మెచ్చు (-పు), మెచ్చులచెట్టు (-లాడి, -లాఁడు), (419) మట్టు, మట్టాడు, మట్టుకొను (చేయు) -పడు, -పెట్టు, -మిగులు, -మీఱుఁ, మెట్టు, మెట్టెనిల్లు, మెట్టుఁ బ్రాలు (420) మెదుగు, మెతు(దు)క. (వై.), మెతు(గు)కు, మెత్త,వైఁబడు, ఁబాటు, ఁబాఱు, - గిల్లు, - న), మెత్తడము, మొత్తినగోడ, మె(మే)దించు (వై.) మదక (వై.) (గొను), మెదుగుడు, మెదుచు (వై.) మెదు(ను)పు, మెదువు (వై.), మేఁగు, మ్రేఁగు(వు) (421) మెదలు (చు) (422) మెలయు (-పు), మెలుచు, మిలమిల (లాడు, -న (423) మెసఁగు (వు-ఁ) మేయు (ఁత), మేఁతరి, మేఁతాడు, మేపు, మేపరి (424) మొ(మ్రొ)క్కు (బడి), మ్రొక్కుడు, మ్రొగ్గఁబడు, మ్రొగ్గతిల్లఁబడు, మ్రొగ్గతిల్లు, మ్రొగ్గు, మొఱఁగు, మోఁకటించు, మోఁకటిల్లఁబడు, మోఁకటిల్లు, మోఁకా రించు (425) మొట్టు, మొట్టికాయ, మోఁదు, మొత్తు (లాడు, - వడు, (426) మొనయు, మొన (కట్టు, -కాఁడు, -కొను, - గాలు - దప్పు) మును (కొను, -కోలు, -గట్టు, -పడు, -ము, - మునుకొను), మునొక్కను, మున్నడి, మున్నరక, మున్నాడి, మున్నీటిచూలి, మున్నీరు, మున్ను,

ముందర (-అ), ముందటిమ్రాను, ముందల, ముందు(-పడు) మూఁదల (427)
మొఱుఁగు, మ్రోఁగు, మొఱుఁగుడు, మొఱువు, మొఱ (-ట్టి), మ్రోఁగుడు,
మ్రోఁత, మ్రోయు (-వు) (428) మోయు (-చు, ఁత, -పు), మోపరి, మోపి,
(క, -డు), మోపుకాఁడు(దల), మోపెట్టు (429) రాఁజు, (430) రు(ఱు)వ్వు,
ఱూవు (431) రెమ్ము, ఱెమ్ము (432) రోఁజు(డు), రొంజుడు, (433) రోయు(ఁత),
రోఁతగించు (434) అక్కు (435) లాఁచు (ఁపు), కాని, లాఁగు (వై). లాఁతు,
(436) లాగు, లాగించు, లాగుకొను, లాగులాడు (437) వండు, వంట (కట్టె
యలు, -కత్తె, -కము, - చెఱకు, -చమురు, -యిల్లు, -యుప్పు, -రాయి,
-రి, -లక్క, -వాఁడు, -సరకు, -సాల), (438) వనరు, వంత, వందు (రు),
వనట (439) వగచు, వగ (కత్తె, -కాఁడు, -దెంచు, -దెగు, -పు, -లాఁడి,
-లాఁడు). (440) వచ్చు (బడి, -రాములు), రాఁబట్టు, రాక (డ), (రాకోట్టు.)
రావించు, (441) వట్టు, నట్టి (మాట), ఉత్త, (442) వడియు, వడ (ఁబోయు,
-పప్పు, - పిండెలు), వడిగట్టు (ఁబెట్టు), వడియఁగట్టు (-ఁబోఁత, - ఁబోయు),
వడుచు (-పు), ఓడు, ఓడ్చు, ఓడిగిల్లు, (443) వడఁకు, వడఁకాడు, వడకు
(గొండ). (444) వడలు, పడలు, బడలు, వదరు, వాడు(చు), వాడుదల,
(దెంచు, - పడు, పాఱు), విదులు (చు, - పు), వఱలు, (445) వలచు,
వలపు (కత్తె, -కాఁడు, -కీలు, -మోపరి, -రాయఁడు), వలయు, (446)
వలియు (447) వాను (448) వాము (449) వారు (చు, - పు), (450) విను,
వింట, వినికి(డి) వినుకలి (ఁకంటి), వినుచు, విన్కలి, (451) విరియు, విరి
(ఁబోఁడి, -దట్టు, -పోటు, -పోటుసేయు), విరియఁబడు (-ఁబాఱు, -ఁబోయు),
విరివాయు, విరివి (డి), విరివిలుకాఁడు, విఱిగి, విఱిచికట్టు, విఱివి, విఱుగఁబడు
(-ఁబాటు), విఱుగడ, విఱుగు(డు), విఱుచు (-పు), విడనాడు, విడి, విడిగోలు,
విడిచివాటుగుదియ, విడిదల, విడిది, విడిపట్టు (-మట్టు), విడివడు (-వాటుగు
దియ, -వేఁట, -వ్రావు), విడు (గడ, -గర, -గు, -చు, -త, -దల, -పరి, -వు,
-మర, -వడు), విడ్చు, విడ్వు, విప్పు, వీడు (కొను, -కోలుపు, -కోలు, -చు,
-జోడాడు, -జోడు, -పట్టు, -పడు, -పాటు, -వడు), వీడ్కొను, వీడ్కోలు,
వీడ్కోలుపు, వీడ్పాటు, వీడ్వడు, (452) విత్తు, విత్తనము, (453)
విలుచు, విలువ (కాఁడు) (454) వీచు, వీచోపులు, వీతెంచు, వీవన, వీవలి,
(455) వీలు(పడు) (456) వెచ్చు, వెచ్చ (న), వేఁగు, వేఁడ్రము, వేఁక
రము, వేఁకి, వేఁచు, వేఁడి(సు), వేఁడికంటి (-వెలుఁగు, వేలుపు), వెట్టి
(కారు, -చెవులతపసి, -ము), వెమ్ము. (457) వెఱచు, వెఱ (ఁ-గు), వెఱఁగు
పడు (పాటు), వెఱఁగొందు, వెఱచఱచు, వెఱపరి, వెఱపిఁడి, వెఱపు,
వెఱబొమ్మ, వెఱవెఱపాటు. (458) వేగు(వు) (ఁజుక్క, ఁబోక, జాము,

-రుఁజూక్క). (459) వేడు (క), వేఁడుకకత్తె (-కాఁడు, -జూగము, -పడు, -సేయు), వేడ్క (460) వే(వ్రే)లు, వ్రేలఁబడు, వ్రేలాడు, వ్రేలుకాడు, వ్రేలుచు, వ్రేలుడు. (461) వేలుచు, వేలుపు (ఁజెట్టు, -ఁదెరువు, ఁబెద్ద, -గమికాఁడు, -గాణ, -గిడ్డి, -జడదారి, -టెంకి, -టొజ్జ, -దాయ, -బానిస, -బాస, -బోనము, -మల, -మానికము, -ఱేఁడు, -సాని), వేల్పుడు. (462) వ్రాయు, వ్రాఁత (కాఁడు, -చావడి, -పని, -బల్ల, -నాకిరి), వ్రాయసకాఁడు, వ్రాయసము, వ్రాయి. (463) సడపు. (464) సురుఁగు, సొసుగు, స(స్ర)(గ్గ) స్రుక్క. (465) సోలు, సోలము, సోలింత.

పైని వివరించిన 465 వర్గములలోను 4046 పదములు చేరియున్నవి. ఈ 465 వర్గములను నిజముగ 320 వర్గములుగ సంక్షేపించవచ్చును (చూ. పుటలు 95-100) ఇవి యెట్లిన్ని పదములుగ విస్తరిల్లినవో రెండవప్రకరణమున వివరింపఁబడియున్నది. ఈ పదములకు మూలములైన ధాతువుల వైకృతత్వమును గూర్చియు నా ప్రకరణమునందే వివరింపబడినది.

ఉభయములు.

శబ్దరత్నాకరకారుఁడు కొన్ని యర్థములయందు అచ్చతెనుఁగును కొన్నియర్థములయందు సంస్కృతములునైన పదములుగాఁ దనకుఁ గనఁబడిన వాని నుభయములను పేరిడి యుదాహరించియున్నాఁడు. ఆతఁ డుభయములని నిరూపించి దేశ్యసంజ్ఞ నిచ్చినపదములు, దద్భవములగునేమో విచారింపవలసి యున్నది. ఆతఁ డుభయములని నిరూపించినవానిని (i) సంస్కృతమందలి యర్థములో ఛాయాభేదము గాన్పించుటచే దేశ్యములని యుదాహరించినవి. (ii) సంస్కృతమున గల యర్థము కేవలమును లేకుండుటచే దేశ్యములని యుదాహరించినవి (iii) వైకృతములని పోల్చికోఁ జాలకపోవుటచే దేశ్యములని యుదాహరించినవి - అని మూఁడువిధములుగ విభాగింపవచ్చును. ఉభయములని శబ్దరత్నాకరకారుఁ డుదాహరించి దేశ్యములుగఁ జూపెట్టినవి (i) అర్థభేదముగల తత్సమములు (ii) తద్భవములు (iii) అచ్చదేశ్యములునను మూఁడు విభాగములుగ విడదీయనచ్చునేమో యనునూహతో యీ క్రింది విచారము చేయఁబడుచున్నది.

(i) సంస్కృతమందలి యర్థములో ఛాయాభేదము.

(1) **అంకము:** "దే. ఆక్షేపము, సం. 9. యుద్ధము." ఉదా పొంకపుఁ గావ్యలక్షణము పోకడెఱుంగక దిట్టకూళలై, కొంకక వంకరర్థములు గూర్చి సభాస్థలిఁ బ్రౌఢులట్లుని, శ్శంకఁ జరించుచు సుకవిసంఘము పల్కుల మెచ్చకూరకే, యంకము సేయవచ్చు నయ్యల మున్నుగఁ బ్రస్తుతించెదన్."

౧.—మె.

పై పద్యమున 'అంకము' అనుటకు ఆక్షేపమని యర్థముఁ జెప్పనక్కఱ లేదు. యుద్ధము, జగడము, అని చెప్పికొనవచ్చును. అప్పు డాపదము సంస్కృతమే యగును.

(2) అత్త: మగనితల్లి, భార్యతల్లి; - సంస్కృతమున తల్లియనిమాత్ర మర్థము. తెనుఁగుననర్థములో ఛాయాభేదము కలిగినది.

(3) **అంకించు:** శ. ర. దే. అ. క్రి. ఉల్లసిల్లు. "వ. పంకజభవాండ మండపంబు సంకుసేసిన ఘోంకంబున నంకించుచు"—వసు. ర. ఆ" స. క్రి. I. ఆడించు, జళిపించు; ఎ. గీ. "ఖడ్గమంకింప వైష్ణవి కరముఁబట్టి, వాంఛితం బెద్దివేఁడుము వరములనిన" - జై. ౮. ఆ. 2. త్రిప్పు. "నెమ్మొగమడ్డమం కించి" నిర్వ. ౮. ఆ. "ఘనగదాదండ మంకించి"—జై. ౨. ఆ. 3. అపహరించు. "క, సంకెలలఁబడ్డవాగే, యంకింతురు నీదురాజ్య మర్థము వసువుల్"- కృష్ణా. ౨. ఆ.-ఈయర్థములన్నియు సంస్కృతమగు 'అంక' శబ్దము(=గురుతు) నకర్థ పరిణామములుగాని వేఱుగావు. 'అంకించు' అనఁగా 'గుఱుతించు. 'పంకజ భవాండ మండపంబు నంకించి' యనఁగా 'ముద్రించి' అని యర్థము చెప్పికొనవచ్చును. 'ఖడ్గమంకింపన్' అనఁగా 'ఖడ్గమునుబట్టి గుఱుతించి చూపఁగా' ననియర్థము. 'నెమ్మొగమడ్డమంకించి' యనఁగా 'అడ్డముగానుంచి గుఱుతుపడునట్లుచేసి' యని యర్థము; అట్లే 'గదాదండమంకిం' చుటయును 'అంకింతురు నీదురాజ్యము' అనఁగా 'నీ రాజ్యముపై తమ గుఱుతు నుంతురు' అనఁగా నాక్రమింతురు' అని యర్థము.

(4) **కూటము:** ఇది 'కూట' శబ్దమే యగును; అర్థము కొంచెము సంకుచితమై తెనుఁగునలేఁ గాన్పించుచున్నది, లేదా, 'కోష్ఠ' శబ్దభవమైనను గావచ్చును; ప్రా. కోట్ట = * కోట్మ = * కూట (ము).

(5) **కేక:** సంస్కృతమున 'కేకా' శబ్దము నెమలికూఁతను పేరు. ఎట్టి పెద్దకూఁతయైనను దెనుఁగున 'కేక' యని పిలువఁబడుచున్నది.

(6) **కోటి:** శ. ర. దే. = వేగు: సంస్కృతార్థము 'చివర' అనుదాని యర్థమునకు వ్యాప్తికలిగినది. చెడవిఱిగి యడవిఁబడి యెడ; నెడగట్టుల తుద లఁగోటియిడి లోఁగడకున్, దడుకు వ్రేడిపించి యోకుల; గుడిసెల వసియించె మంత్రి గురుభట యుతుఁడై" ఆము. ౭. ఇచట 'కోటియిడి' యనఁగా 'శత్రువులరాకనుఁ గొనుటకు ఎత్తైన స్థలములందు కావలివారినుంచి' అని యర్థము.

(7) **కోదండము:** శ. ర. దే. "బాలురను దండించుటకై పట్టుకొని వ్రేలాడునట్లు మీఁదఁగట్టెడు త్రాడు." సంస్కృతమున నీ శబ్దమునకు 'విల్లు'

అని యర్థము. ఈ యర్థము తొలుత వింటితాఁటికిని, పిమ్మట బాలురను శిక్షిం చుట కేర్పడిన తాఁటికిని సంక్రమించినది.

(8) గమనిక: శ. ర. దే. = విధము. సంస్కృతశబ్దమగు 'గమనిక' కు అర్థభేదము కలిగినది.

(9) గాత్రము: శ. ర. దే. = స్థూలము. సం. గాత్రము = దేహము అనునర్థమునకు పరిణామము కలిగినది. "అతఁడు మంచి 'ఒళ్లుగా ఉన్నాఁడు' అనఁగా స్థూలముగా నున్నాఁడని వ్యవహారమున నర్థము గలదు.

(10) గురువు: శ. ర. "దే. = వేగపు పరుగు." ఇది 'గురు' శబ్దభవము; ఎక్కువయని యర్థము; ఎక్కువయైన పరుగని ప్రత్యేకార్థము కలిగినది.

(11) తరము: శ. ర. దే. సంస్కృత ప్రాకృతములందలి యేకరూపములును వివిధార్థములునుగల 'తర' శబ్దము తెనుఁగున ననేకార్థములను సంపాదించుకొన్నది. తర, తమ, అను సంస్కృతావ్యయములు తెనుఁగునను నట్లే తెనుఁగు శబ్దములతోఁ గలసి ప్రయోగింపఁబడుచున్నవి. ఉదా. "బాలము ద్దుందెలి చూపులంగజుని తూపులలోపల మేల్తరంబులు" విజ.౧ ఆ.-సంస్కృతమున 'తర' అనునది విశేషణములపైఁ జేరునవ్యయమైనను దెనుఁగునఁ బ్రత్యేకముగ నాధిక్యార్థమున వాడుకలోనికి వచ్చినది. ఉదా. "నీయెఱుఁగని యవియు లేవు నిక్కపుఁదరముల్." భార. ఉద్యో. ౪. ఆ. "నరపుంగవులుగాని నరపుంగవులుగారు, తరమెన్న వరధర్మ ధర్మభృతుల" వసు. ౧. ఆ. "అత్తెర వేఁటకాండ్రు యమునాంబుతరంగ పరంపరాకృతిన్, ముత్తరమైన సూకర సముత్కరముంగని = మూఁడింతలధికమైన" మను. ౪. ఆ.

శక్యార్థమున తెనుఁగున 'తర' శబ్దము ప్రాకృతసమము; ప్రాకృతము: తర = సమర్థమగుట, శక్యమగుట (హేమచంద్రుని వ్యాకరణము ౪. ౮౬; 'ఓఘనిర్యుక్తి' అను ప్రాకృతగ్రంథము); ఉదా. "మీగు మద్భుజ శక్తికిం దరముగారు" ఉ. హరి. ౪.ఆ. "నాతరమా భవసాగరమీఁదఁగ" రామదాసు చరిత్రము. ఇది చేయడానికి నా తరముకాదు.

'పురుషాంతరము' అనునర్థమున 'తరము' నకుఁ బ్రకృతి ప్రాకృతమున 'తడ' అనునది. ఇది సంస్కృత 'తన్' ధాతువునుండి పుట్టినది. 'తడ' అనఁగాఁ బ్రాకృతమున విస్తారము చేయుట యని యర్థము సంతాన మనినను నిదియే యర్థము.

(12) తరుణము: శ. ర. "దే. సమయము" ప్రాకృతము: తరుణగ, తరుణయు = నవీనము. క్రొత్త; తెనుఁగున 'అప్పటికాలము; నవీనకాలము' అను నర్థవిశేషము గలిగినది.

(13) **తలము:** శ. ర. దే. = శక్యము. ఇది 'తరము' నకు రూపాంతరము. చూ. తరము.

(14) **తాత.** శ.ర. ప్రకారము 'తండ్రికిఁ దండ్రి' యను నర్థమున దేశ్యము-కాని, యిది యర్థవిశేషము నొందిన సంస్కృతమందలి 'తాత' శబ్దమే. 'తండ్రి' యనునది జనకునికి రూఢికాఁగా, తాత శబ్దము తండ్రితండ్రి; లేక తల్లితండ్రికి రూఢియైనది. లేదా; పూజ్యుఁడు అనునర్థమున నిది పితామహునికిని, మాతామహునికిని రూఢిగ్రమైన దనవచ్చును.

(15) **దండము :** శ. ర. " దే. నమస్కారము." చూ. 'సాష్టాంగ దండప్రణామములు.' అష్టాంగములును దండమువలె పడియుండునట్లు ప్రణామము చేయుట. ప్రణామార్థమున 'దండము'న కర్థవిశేషము గలిగినది.

(16) **దోణము :** " మల్లసాధన విశేషము ; మాను సుకరముగా చీలుటకై యక్కడక్కడ చెక్కిన మేకులను దిగఁగొట్టెడి యుపకరణవిశేషము ". - ఈ రెండును ద్రోణాకారమున నుండుటచే వాని కాయర్థవిశేషము కలిగియుండును.

(17) **మాత్ర :** సం. కొంచెము, కొలఁది. 'చిన్న మందు గుటిక' అను నర్థవిశేషము గలిగినది. ప్రా. మత్తా.

(18) **ముదితి :** శ. ర దే. - సంస్కృత శబ్దమునకే తెనుఁగున నర్థభేదము కలిగినదనవచ్చును. లేదా, సం. ముగ్ధికా + స్త్రీ = ప్రా. ముద్ధిఆ + ఇత్థి = * ముద్ధిత్థి. ముద్ధిత్తా = తెనుఁగు : ముదితి, అనియైనను జెప్పవచ్చును.

(19) **మేళము .** శ. ర. దే. కాని, సంస్కృతపదమగు మేళ = గుంపు, కూడిక, అనుదానికే అర్థభేదముకలిగి మంగలమేళము, భోగముమేళము మొదలగు నర్థములుగూడఁ గలిగినవి.

(20) **రంగము :** శ. ర. దే. పోదె. - సం. రంగము = నాటకరంగము ; నాటకరంగములో అనేక పాత్రములు నటించుచు ధ్వనిచేయునట్లు చేయుట యను నర్థవిశేషము గలిగినది.

(21) **లంక :** శ. ర. దే. దీవి. - ఇది 'లంకా' ద్వీపమను సంజ్ఞావాచక దేశనామమై, రామాయణ కథాప్రాబల్యమున ఎట్టి దీవికైనను బేరుగాఁ బరిణమించినది.

(22) **వరట :** శ. ర. దే. పేఁడయెండిన చెక్క ; ప్రా. వరహాడ ; వరహాడి అ = బయట వదలఁబడినది = పేఁడ.

(23) **వసంతము :** వసంతోత్సవమున వాడఁబడు పసుపును సున్నమును గలుపగా నెఱుపైన నీరు. తొలుత ఋత్వర్థము గలిగిన యీ పదమున కిర్థపరిణామము గలిగినది.

(24) **వసతి :** శ. ర. దే. సౌఖ్యము, సౌఖ్యకరము. సం వాసస్థానము. 'వాసయోగ్యమ'ని తెనుఁగున నర్థపరిణామము కలిగినది 'నీళ్ల వసతి,' 'తృణకాష్ఠములకు వసతి' మొదలగు వాని యందును నిట్టి యర్థపరిణామమే కలిగినది.

(25) **సీమ :** శ. ర. దే. దేశము; ప్రదేశము, రాజ్యము; - సం. ఎల్ల. సంస్కృత శబ్దమున కర్థపరిణామము గలిగినది.

**ఒకయర్థమున దద్భవము, ఒక యర్థమునఁ దత్సమమును,**

**తద్భవము దేశ్యముగా నిరూపింపఁబడినవి.**

(1) **అరి :** ఇది 'హృత' శబ్దభవము, ప్రాకృతమున 'హరి; హరిఅ' అని దీని రూపములు; పదాది హకారము లోపించి 'అరి' అయినది; 'హరింప బడినది, పన్ను, కప్పము', అను నర్థములఁ దెనుఁగున రూఢియైనది. అట్లే 'లాగఁబడినది = వింటినారి' అను నర్థముగూడ దానికిఁ గలిగినది. అరిఁ బోయు, అరికట్టు, అను పదములందును 'హృ' ధాతువు గోచరించుచున్నవి.

(2) **అలము :** ఇది 'లంబ్' ధాతుభవము; అర్థము: To be attached to, stick to, hold on to, to rest on అని ఆప్టే నిఘంటువు. ద్రావిడ భాషా సంప్రదాయానుసారముగ పదాది లకారమున కాధారముగఁ దత్పూర్వమున నకారము చేరినది; 'ంబ్' 'మ్మ్' = 'మ్ము' = ము అయినది. కించిదర్థభేదము కలిగినది.

(3) **అణి :** దీనికి 'దే. ముత్యపు గుండ్రఁదనము; మర్మము' అని శ. ర. కారుఁడు వ్రాయుట పొరపాటు. ఇది 'ఆదృత' శబ్దభవము; ప్రాకృతమున దీనికి 'ఆఢిఅ; ఆణిఅ' అని రూపములు; మేలైన, మాననీయమైన' అని యర్థము. ఆణికాఁడు, ఆణిపూస, ఆణిముత్యము మొదలగు పదములందీయర్థమే వర్తించును.

(4) **ఇందువు :** శ. ర. చిల్లచెట్టు, చిల్లగింజ; ఈ శబ్దము 'ఇంగుదీ' శబ్దభవమేమో. 'ఇంగుదీ' అనఁగా 'గారచెట్టు' అని శ. ర. కాని, చెట్ల పేర్లు తెనుఁగుదేశములో మండలములనుబట్టి మాఱుచుండుట గలదు.

(5) **ఉత్తరించు :** శ. ర. దే. = ఖండించు; ఇది, 'ఉద్ + దృ' అను నుపసర్గ సహిత ధాతువునుండి పుట్టినది.

(6) **అంగద** : ఇది 'అహంకృత' శబ్దభవము. శ. ర. లో దేశ్యమని యర్థము లీఁబడినవి. 1. ఆఁకలి. - "అఱుగునె యుక్కు-గుండు కడునంగద మ్రింగిన". - రా. అర. కాం. అహంకృతితో నని యర్థము చెప్పనొప్పును. 2. ఆపద. - "ద్వి. అంగదు యౌవరాజ్యమునందు నునిచి, యంగదలేని సౌఖ్యమునొందు మీవు" - రా. కిష్కిం. కాం. అహంకారములేని యని యర్థము చెప్పికొనవచ్చును. 3. ఉత్సాహము. "అంగదఁ దత్స్వయంవర మహామహావైభవకేళి వహాతికిన్, గ్రంగన గంటపైఁ గొడుపుఁ వ్రాలుట యెన్నడు నాఁటనుండియున్, సంగరముం గరంబు గమనంబున భావన సేయ వైరి యా, వంగళ కార్యనిష్ఠులయి మధ్యమలోకమునన్ మహీపతుల్." నై. 3. ఆ. - ఇచ్చటను 'అంగదన్' అనఁగా అహంకారముతో నని యర్థము చెప్పికొనవచ్చును. 4. ఉపద్రవము - "ఆకుఁదోఁటలు నుగ్గాడి యనఁటి తోఁట లెల్ల మల్లడిగొనఁ ద్రొక్కి, యుల్లి కంద పసుపుఁదోఁటలు జాగిలి కసవుబీళ్లు, చెఱకుఁదోఁటలు పండినచేలు దీర్చె; ఓ రాయఁడ! యీ యంగద కోరువలే కిటకు వచ్చె నూళ్లన్నియు". - నీలా. ౨. ఆ. ఇచట అంగద యనఁగా నహంకృతియనియే యర్థము. 5. కోపము. 'అ' య్యనిమిషనాథుఁ బట్టికొని యంగద వృత్రుఁడు మ్రింగె.' ఉద్యో. ౧. ఆ. సంస్కృతమున 'కోప సమన్వితః' అని యుండుటచే శ. ర. కారుఁడు కోపమని యర్థము వ్రాసెను. సంస్కృతమునుబట్టి తెనుఁగర్థములను నిర్ణయించుటకుఁ బూని యాతఁడు చాల పొరపాట్లఁ బడియున్నాఁడు. ఇచట 'అహంకారముతో' నని యర్థము చెప్పుటయే యొప్పును. 6. దుఃఖము. - "పొలకనణంబు జేని నీకఁ బూనఁగఁ జాలనటంచు నేలతో, య్యాలి కటివేల్పు హజ్జఁబడి యంగదతోఁ దన చందమంతయున్, బొలుపున విన్నవించుకొనఁ బోయెనొకోయన మబ్బు త్రోవకున్ బలువుగఁ గ్రమ్మి దుమ్మెసి పాతె వడిన్ సురగాడ్పు పెంపునన్." అచ్చ. కిష్కి. కాం. ఇచట 'అంగదతోన్' అనఁగా 'అహంకారముతో' అనియే చెప్పవచ్చును; కొంచె మర్థపరిణామమును నిచటఁ గలిగినది.

(7) **అంగము** - అందము. ప్రా. అంగ = సం. చంగ = సుందరము, మనోహరము.

(8) **అందువు:** శ. ర. దే. అందుగు (చెట్టు) = సల్లకీవృక్షము. ఇది 'అంధక' శబ్దభవము కావచ్చును.

(9) **అనయము** - ఇది ప్రాకృతభవము ; ప్రాకృతమున దీనికి మూలము 'అణ్ణయా' అనునది అది 'అన్వదా' శబ్దభవము. 'కోఈసమయమ్మే' అని 'పాఇఅసద్దమహణ్ణవో'లో నర్థము. తెనుఁగున నర్థభేదము గలిగి, ఎల్లప్పుడును అను నర్థము కలిగినది. శ. ర. లో దేశ్యమని యిచ్చిన యర్థముల కుదా

హారణము లన్నిటియందును 'అనయము' అనుపదమునకు 'ఎల్లప్పుడును' అను నర్థము సరిపోవును. 1. "అనిన విని యనుచితంబున కనయము శంకించియును" - భార. విరా. ౨. కాని, శ. ర. లో అత్యంతము అను నర్థము కలదు. అట్లే "మనమునఁ గలిగిన వివేకమహిమకు ననయంబుమెచ్చి" - పర. ౪ ఆ. లోకూడ. 2. "కనకపుఁ గుప్పలున్ మణినికాయములున్ ఘన ధాన్యరాసులున్, వినుత గజాశ్వ సంఘములు విశ్రుత గో మహిషాదికంబులున్, దన కధికంబుగాఁ గలిగి దాతయు భోక్తయునైనవాఁడు నా, కనయము భర్తగావలయు నంచొకభామిని కోరె నేడుకన్" - భో. ౧. ఆ. శ. ర. లో 'అవశ్యము' అను నర్థము కలదు. 3. "అది యేమి యెఱిఁగెంపుమని యాలతాంగి త, న్ననయంబు నడుగ నిట్లనియె నతఁడు" - శ. ర. లో 'మఱిమఱి' అని యర్థమున్నది. 'ఎల్లప్పుడు' నను నర్థమునకుఁ గొంచెము అర్థపరిణామము గలిగినది. 4 "ననయమ్ము వానిఁ గన్న నయమ్ము గలయింతి ననయమ్ముఁ దాల్చువా నన్నఁ జెనకి" - కా. ౪. ఆ. శ. ర. లో "సతతము" అను నర్థము సరిగనున్నది.

(10) అసి : శ. ర. దే. అల్పార్థకము; అసికోఁత, అసిగాయము మొదలైనవి. ఈ యర్థమున 'అసి' శబ్దము 'ఈషత్' శబ్దభవము కావచ్చును; లేదా, ప్రాకృతమందలి 'అసఇ = అస్వత్వ = అభావము, అవిద్యమానత' అను శబ్దమునకు వికారము కావచ్చును. 'అసియాడు' అను పదమునందు ఈషత్ = కొంచెము చలించు అని యర్థము గలదు.

అసిఁబోవు. " దే. తప్పిపోవు. 'అసిఁబోవుటెట్లు నా యసిఁబోవు మెకములఁ జించు నాచేయమ్ము చిలుకుటమ్ము' రామా. ౨. ఆ. " అని శ. ర. వ్యవహారమున అసిఁబోవుట యనఁగా 'తగియుండుట, ఒంటుట' అని యర్థము గలదు. ఉదా. వానికది అసిబోదు; - వాడిట్లుచేస్తే అసి పోతుందా ? = ప్రతీకారము కలుగదా అని గౌణార్థము. కొంచెముతో తీరునా ? అని రూఢ్యర్థము.

'అసి' అని ఇత్యర్థకమున నొక పదమున్నది. 'అని' అని యర్థము.

ఉదా. అసియఱచేత నాతఁడటులా పోసనంబును బట్టుకొన్న న
య్యాసుకకెు చేటలంజెరిగి యింపగు బియ్యముచేసి వేడ్కతో
నెసరులువ్రోసి వండి వెరవేర్పడ నయ్యశనంబు భూదివౌ
కసులకుఁ బెట్టెఁ గన్దనిసి గ్రక్కున నాఁకలిదీఱునట్లుగన్.

భో. ౬. ఆ..'అసి' అనున దీ ప్రయోగమునఁ గ్త్వార్థకము; 'సవి=అని (క్త్వా.)' వంటిది. క్త్వార్థకమగు'అసి'శబ్దము 'అస్' ధాతుజన్యము. 'ఉషిత్వా' శబ్దభవము. ప్రాకృతమున 'అసిఅ' ఉండి అని యర్థము.

(11) **అలము**: క్రియ. 'ఆలంబ్' అను సంస్కృత ధాతుభవము. శ. ర. లో దే. అని చూపఁబడినది. ఆప్తే నిఘంటువులో "ఆలంబ్. 1. To rest on, lean upon, support oneself on; 'శాఖామాలంబ్య; 2. To lay hold of, seize, take, 'అథాలంబ్య ధనూరామః 3. To support, hold on, take up, 'ఆధోరణాలంబితమ్'; 4. To win, conquer, over come, 'తస్య కవితా మచ్చిత్త మాలంబతే'; 5. To resort to, have recowrs to, take, assume, 'అమునే వార్థమాలంబ్య'; 'స్వాతంత్ర్యమాలంబ్య'; 'యశః శరీరం నవ మాలలంబే'; 6. To hang from, to be suspended, 'ముఖాలంబిత హేమసూత్రమ్', 7. To depend upon, 'తమాలంబ్య రసోద్గమాత్'; 8. To stretch forth; 9. To strike up (a tune or note) అని యున్నది. పై యర్థముల నీ క్రింది ప్రయోగములలో ననుసంధించుకొన వచ్చును.

"సులభమొ దుర్లభంబో యని చూడ నెఱుఁగవు కన్నదానిపై, నలముదు కామమా" భార. శాం. ౪. ఆ. (చూ. పై 2 అర్థము.)

"రక్కసులును గుంతఖడ్గ, కార్ముక ప్రముఖాయుధకలితభుజులు, కవచధారులు నయి కోటఁ గలయనలమ" - రా. యు. కాం. (చూ. పై. 2. అర్థము.)

"అతివ యత్యంత వివశయై యలమఁ గ్రోవి, తేఁటతేనియ తెలిసీటఁ దెలివితెచ్చు" - హ. న. 3. ఆ. (చూ. పై. 7. అర్థము.)

"అతఁడు మనుమని నందంద ప్రీతియడర, నలమి యాలింగనము సేసి," మార్క. ౮. ఆ. (చూ. పై. 7. అర్థము.)

విశేష్యము: "అలమునఁ దున్మువైవుఁడు" భార. అ. ౫ ఆ. = అలమికొని, (చూ. పై. 4. అర్థము.)

అలము. "శ. ర. శాకవిశేషము; 'అలములు దుంపలు నమలుచు' అచ్చ. సుం. కాం. - 'అలము' అనఁగా 'ఆకు' అని యర్థము. 'ఆకు, అలము' ఏకార్థకములు. కన్నడము, 'ఎలె' = ఆకు.

(12) **ఆలము**: శ. ర. దే. ఉపేక్ష; పై. యుద్ధము; "ఆలము నేసి నా తగుల మాఱడి పుచ్చఁగనేల బేల" - భార. విరా. ౨. ఇచట వైకృతార్థమునే చెప్పికొనవచ్చును; 'అల్లరి, జగడము చేసి' అని యర్థము.

(13) **అవలి**: శ. ర. దే. ఉపద్రవము; రూ. ఆవడి, హావళి; ఇది 'ఆపత్తి' శబ్దభవము. ఇది ప్రాకృత సంప్రదాయమున 'ఆవల్లి' యగును.

(14) **ఈడ :** శ. ర. దే. ఈచోటు ఇది - 'అత్ర' శబ్దభవము. ప్రా. ఇత్థ, ఏత్థ.

(15) **కంకణము :** శ. ర. దే. జలపక్షి విశేషము. సం. కంక=a heron (ఆప్టే నిఘంటువు) ; ప్రా. కంక.

(16) **కందు :** "శ. ర. దే. బిడ్డ," ఇది మనుష్యుల బిడ్డలకే కాక పశు పక్షిజాతుల పసిపిల్లలకును వర్తించును సం. 'కంద' శబ్దభవము కానోపును. వంశమునకు గోత్ర, మూలమని యర్థవిశేషము గలిగినది. 'కందల' మనఁగా గోత్రమొలక. మానవ పశు పక్షిజాతుల వంశములకుఁ గోత్రమొలక యను నర్థమున దీని నుపయోగింపవచ్చును.

(17) **కరము:** శ. ర. దే. అత్యంతము. కరవాఁడిచూపులు, కరవాఁడి నఖములు మొదలగు వానిలో 'కర' అనునది 'ఖర, శబ్దభవము; 'తీక్ష్ణ' మని యర్థము; అత్యంతార్థమున నదేయర్థము గల మఱియొక పదమును జేర్చుట భాషా సంప్రదాయము. కరము = అత్యంతము అని యవ్యయముగాఁ బ్రయోగింపఁ బడునపుడును నిది 'ఖర' శబ్దభవమే కావచ్చును. అర్థవిశేషము కలిగినది.

(18) **కరి:** "శ. ర. దే. నిదర్శనము; మేర; సాక్షి" ఈ పదము 'కర్ష' శబ్దభవము; ప్రా. కరిస, కరియు, కరిఅ; కరిఅ = తె. కరి = ఖీంచావ్, రేఖా కరణ్, అని 'పాఇఅ - సద్ద-మహణ్ణవో' లో హిందీ అర్థములు. గీఁతగీయుట; మేరపెట్టుట అని వానికిఁ దెనుఁగున నర్థము. ఈయర్థ మీక్రింది ప్రయోగములలో సరిపోవును: "తదీయతత్ఫలతకు హ్రస్వమాాటె కరి" - ఆము. ర. ౮; "ఖాండీరవంబుకరిగా" - హరి. పూ. ౭. ఆ. - "దినకరపవనాగ్నితుహినదీప్తులు కరిగాన్" - భార. ఆది. ౨ ఆ.

(19) **కల:** శ. ర. దే. స్వప్నము. ఇది 'కలుష' శబ్దభవము కానోపును. నిద్రకలుషితమయిన యవస్థయే కల. ప్రాకృతమున 'కలుష' శబ్దము 'కలయ' అగును. 'కలఁచు, కలఁత' అను పదములకుఁ గూడ నిట్లేవ్యుత్పత్తిఁ జెప్పవలెను.

(20) **కలి:** శ. ర. దే. పులియఁబెట్టిన కడుగునీరు. సం. కల్యా, ప్రా. కల్లా = మద్యము, కల్లు.

(21) **కస్తూరి:** శ. ర. దే. ఒక కుక్క పేరు. సంజ్ఞావాచక మగుటచే దీనిని గూర్చి విచారింప నక్కఱలేదు.

(22) **కళ:** శ. ర. దే. మూర్ఛ, కాని, 'కలఁత' యనియర్థము చెప్పవలెను. 'కళవళము' మొదలగు పదమునందును నిట్లే: 'కలుష' శబ్దభవము. ఉదా. "ధరము నీ మీఁదనిడి వార్ధిఁ దరుచునపుడు, హరునిమెడ కందె హరి

యురం బం దెఁ గెంపు, నమర సంఘము కళనొందె నహహా తెలిసె, ఘనజగ
త్కుక్షివగుటకా కమఠవర్య." - చంద్రా. ౧.

(23) కాపేయము: ఇది 'కృపణతా' శబ్దభవము. లోకములో 'కాపీ
నము' అని యీయర్థమందే యొకపదము వినఁబడుచున్నది. 'కాపీనము' అను
పదము 'కృపణ' శబ్దమునకుఁ బ్రాకృత రూపము.

(24) కైవారము: శ. ర. లో ఈపదమునకు 'గనిమయంచు' అనియున్న
యర్థము విచార్యము. అందు ప్రయోగము కానరాదు. "దీనికైవారమెంత"
అని వ్యవహారమున వినఁబడుచున్నది. చదరము, ఘనము, విరివి, విస్తీర్ణము
అనునర్థములందు వాడఁబడుచున్నది. 'కతివారమ్' = ఎన్నింతలు, అనుపదముల
నుండి కలిగియుండును. ప్రాకృతమున కతి = కఇ, కయి.

(25) కోటరము: శ. ర. దే. కోడంట్రము. ఇది 'కుమార (రీ)' శబ్ద
భవము. సం. కుమార = కన్నడము: కువర = * కువ్ర = కుఱ్ఱ = కుట్ర = *
కోట్ర = కోటర (ము).

(26) కోల: శ. ర. "దే = కండము, బాణము; వంటవట్టె, మగగుఱి"
ప్రాకృతము: కోల్ల = కట్టెముక్క; ఖోడ = సీమను నిర్ధరించు కాష్టము; 'అని
యంక భీమకోల' మొదలయినవి.

(27) కోలము: శ. ర. దే. 'వేషము' ఈ యర్థము తప్పు. వస్త్రము, [illegible]
అని యర్థము చెప్పవలెను. ప్రాకృతము: [illegible]ల = వస్త్రవిశేషము. "[illegible]
రంగస్థలంబున మిగులఁ బ్రౌఢి, మమునఁ గాళిక నీలికోలము [illegible]
మొగంబున రాలు నిప్పుకలనంగ, గుప్పులైరాలె మహి నిగ్రగోపత[illegible]లు"-
ఆను. ౪. నీలికోలమనఁగా నీలిచీరయని యర్థము.

(28) గడము: శ. ర. "దే. కుండలో నగువాని మూఁతి" ఇది 'ఘటక'
శబ్దభవము.

(29) గోణి: శ. ర. "దే. ఎద్దు" ప్రాకృతము: గోణం గోణా = ఆవు,
ఎద్దు.

(30) చీరి: శ. ర. "దే. లక్ష్యము" ఈయర్థము తప్పు. ఈపదము 'ఛిద్'
ధాతువునుండి పుట్టినది. చీరిక; చీలిక అనుపదములు దీనికి సంబంధించినవే.
ఇవియు 'ఛిద్' ధాతువునుండి పుట్టినవి. 'చీరి' అనఁగా చిన్న భాగము; అంశము;
అనియర్థము. 'చీరికింగొనఁడు' అనఁగా కొంచెపుభాగమునకు; కొంచెమని
యయినను దలంపఁడని యర్థము.

(31) తరి: శ. ర. "దే. సమయము" - ప్రాకృతము; తత్తియా =
సం. తావత్.

(32) తమి: శ. ర. "దే. త్వర, కుతూహలము, అపేక్ష; వలపు" - ఇది తమిస్రా శబ్దభవము = ప్రా. తమిస; తమియ; సం. తమశ్శబ్దముతో సంబంధముగలది. త ద్భవత్వమున నర్థవిశేషము గలిగినది.

(33) చౌరము: శ. దే. ర. "నాలుగు కానులనాణెము" 'చత్వార' శబ్దభవము కావచ్చును (?) ప్రా. చత్తార.

(34) తాళము: శ. ర. "దే. మల్ల బాధవిశేషము." సం. స్థాతమ్; ప్రా. ఠాడమ్ = తెనుఁగు: తాళము. స్థిరముగా నిలుచుండి మల్లునితోఁ బోరుట.

(35) తాళి: శ. ర. "దే. పతకము; హారము." ఇది స్థాలీ శబ్దభవము; ఫలకమని యర్థము.

(36) దండి: ఇది 'తృప్తి' శబ్దభవము కావచ్చును ప్రాకృతము: తత్తి=* తంతి = దండి.

(37) దళము: రూ. దడము, దట్టము; సం. దృఢ; ప్రా. దఢ, దడ్ఢ; దట్ట.

(38) దాయము: శ ర. "దే. పాచికలు, గవ్వలు మొదలగువాని యందలి పందెము" ఇది 'ద్వయ' శబ్దభవము. 'రెండు' అని యర్థము. పాచికలు పడినప్పుడు రెండు తిరుగఁబడుటవలన గెలుపు కలుగు ఆట; ద్యూతార్థమున నీ పదము రూఢిగ్రాయెనది.

(39) దుర్తాకము: శ. ర. "దే. = కపటము" ఇది 'ధూర్త' శబ్దభవము.

(40) నయము: ఇది 'నవ,' 'నత' అను రెండు సంస్కృత శబ్దములనుండియుఁ గలిగినది. సం. నవ = ప్రా. ణవ = తెనుఁగు: నయ = క్రొత్త; (కావున ప్రియము; వెలగలది) సం. నత = ప్రా. ణయ = తెనుఁగు: నయము; వంచఁబడినది; మలఁచఁబడినది; నునుపుచేయఁబడినది - ఈ [illegible] ర్థవిశేషములు గలిగినవి.

(41) నవకము: శ. ర. "దే మృదుత్వము". నవత్వము (=క్రొత్తఁదనము; లేఁతదనము;) అను సంస్కృత శబ్దముతో సంబంధించినది. ప్రాకృతము: ణవఖ = నవ (హేమచంద్ర వ్యాకరణము ౪. ౪౨ ౧).

(42) నస : సం. నాశ ; ప్రా. ణస; ణస్స ; తెనుఁగు: ఉపద్రవము అని అర్థవిశేషము.

(43) నాడిక : శ ర. "దే దేశము, సం. నట్ : ప్రా. నడ; తెనుఁగు విశేష్యము: నాఁడు=సంచారయోగ్యమైన ప్రదేశము, స్వార్థమున 'ఇక' ప్రత్యయము.

(44) **నామము** : ప్రా. ణామ = ప్రణామము; భక్తులకును బూజ్యుల కును నమస్కరించుటకు చిహ్నముగా ధరించిన గుఱుతను నర్థవిశేషమును బొందినది. అంతకంతకును అట్టి చిహ్నమునకే రూఢిగ్గామైనది.

(45) **నికటము** : శ. ర. "దే. నిర్బంధము." దీనితో ప్రాకృతమందలి 'ణిక్కట్ఠ = నిష్కృష్ట = కృశము, దుర్బలము, క్షీణము' అను పదమును, 'ణిక్కడ = కఠినము' అను పదమును పోల్పవచ్చును.

(46) **నికరము** : శ. ర. "దే. త్రోపుడు పోఁగా మిగిలినది." దీనికి 'అన్నిటిని ఎంచగా మిగిలినట్లు నిశ్చయింపఁబడినది' అని యర్థము చెప్పవలెను. 'ప్రాకృతము: ణికరణ = నిర్ణయము, నిశ్చయము; ణికరియ=సం. నికరిత=సారీకృతము; సర్వథా సంశోధితము' అను పదముల నీ పదముతోఁ బోల్పవలెను.

(47) **పట్టము** : శ. ర. 'దే. బిగుదు.' ప్రయోగము చూపఁబడలేదు. దీనితోఁ బ్రాకృతము: 'పట్ఠ = కుశలము, నిపుణము, ప్రధానము' అను పదమును బోల్పవలెను.

(48) **పట్టి** : శ. ర. దే. పంచమీ విభక్తి ప్రత్యయము; సంస్కృత మందలి 'స్పృష్ట్వా' అనునది ప్రాకృతమున 'పట్టి' అని యగును. తెనుఁగున నది 'పట్టి'యనుక్త్వార్థక రూపమగును. ఆ రూపమునే వైయాకరణులు పంచమీ విభక్తి ప్రత్యయమనిరి.

పుత్త్రుఁడు, పుత్త్రిక. అను నర్థమున నది 'వత్స' శబ్దభవము కావచ్చును. చూ. హిం. బేటా, బేటీ.

(49) **పణము** : శ. ర. "దే మల్లబంధ విశేషము." ఇది సంస్కృత శబ్దములగు 'పాటన; పాతన' మొదలగు వానిలో దేనికైనను ప్రాకృతమున గలిగిన 'పాడణ. పాఅణ' మొదలగు రూపములనుండ పుట్టియుండును.

(50) **పత్తి** : శ. ర. దే. ప్రత్తి. ఇది 'పత్త్రికా' నుండికాని, 'పత్త్రిత్రికా' నుండికాని పుట్టియుండును. పత్త్రికా = ప్రా. పత్తిఆ = తెనుఁగు: పత్తి; 'పత్త్రిత్రికా = పయత్తిఆ; పఅత్తి = పత్తి.

(51) **పర** : శ. ర. దే. పొడ. చూ. ప్రా. పయర = ప్రదర = విచారణము; పర, లేక పొర, చీల్పఁగా వచ్చినది

(52) **పరము** : శ. ర. దే. కట్టె బండిమీఁది పఱుపు మ్రాను. సం. ప్రస్థాపితా = ప్రా. పట్ఠావిఆ = * పట్ఠాఇఆ = తె. పట్టు(ము); గ్రామము లందు దీనిని పట్టుమనియే యందురు.

(53) **పరువు** : శ. ర. దే. ధావనము; క్రోసుదూరము. సం. ప్రధావ్ = ప్రా. పధావ = తెనుఁగు = పరువు. ఇది శకటరేఫయుక్తము కావలె నేమో. చూ. పఱచు.

(54) **పానకము** : శ. ర. దే. ప్రాకృతము : పాణగ = పేయద్రవ్యవిశేషము. అది చక్కెరపానకము, బెల్లపుపానకము, మొదలయినది మాత్రమే కానక్కఱలేదు. ఫలరసమును పానకమేయగును.

(55) **పరి** : శ. ర. దే తద్భవ. సం. 'పరి' ఉపసర్గ; తెనుఁగున వ్యస్తప్రయోగము. ప్రాకృతము : పరి = తిరిగి, మరల; సం. పర్యాయ = ప్రా. పరియాఅ. పరిఆఅ = తెనుఁగు : పరి.

(56) **పిండు** : శ. ర. దే. క్రి. పాలుపిండుట; ప్రా. పిడ్డ = సం. పీడయ్ = తెనుఁగు : పిండు; లేదా సం. విద్ధ = ప్రా. విడ్ఢ * పిడ్ఢ; పిండ్ఢ = తెనుఁగు : పిండు.

(57) **పుత్తళి**: శ. ర. దే. రూ. పుత్తడి = అపరంజి; అపరంజి; చూ. పిత్తడి, పిత్తళి, = ప్రా. పిత్తల, సం. పిత్తల. ఇత్తడి. వై. అనఁగా పీతలోహము, అట్లే, ప్రా. పుత్తళి = పచ్చని లోహము.

(58) **పేట**: శ. ర. దే. హారములో నొకసరము. సం. పృథక్ = ప్రా. పేఢ = వేఱైనది. హారములలో వేఱుగానుండుసరము. చూ. పేఱెత్తు, పేడెత్తు, పేడు, మొదలయినవి = వేఱగు, వేఱుగా లేచినవి.

(59) **పేటి**: శ. ర. దే. నడికట్టు; రూ. పేటీ; చూ. పట్టీ, పట్టి; పట్టిక; సం. పట్టికా; హిం. పేటీ.

(60) **పైకము**: శ. ర. దే. రెండుకాసుల నాణెము. సం. పాదికా, ప్రా. పాఇక్క; ఏదోయొక నాణెములో నాలుగవ భాగమును దెలుపునాణెము. ఆనాణెమునకిప్పుడు వ్యవహారము లేదు. ఈ పదము '**పావులా**' వంటిది. ఈనాణెమును బట్టి యీ పదమునకును 'ధనము' అనునర్థవిశేషము గలిగినది.

(61) **పిర్య**: శ. ర. దే. 'పిర' కు రూపాంతరము; పిర. దే = కానిలో నాలవ భాగము.

(62) **బుసి**: శ. ర. దే. నిగుడు; ప్రయోగము లేదు. 'నుసి' యని యర్థము చెప్పవలెను; మెత్తనిపొడియైనదని యభిప్రాయము. సం. బుసికా, ప్రా. బుసిఆ.

(63) **మందము**: శ. ర. దే. దట్టము, స్థూలము. చూ. సం. బంధ, ప్రా. మంధ.

(64) **మందారము**: శ. ర. దే మేఘావరణము, ప్రయోగము లేదు. 'మందాహార' శబ్దమునకుఁ దద్భవము కావచ్చును. మేఘావరణముచే వెలుతురు మందము = కొంచెముగా నుండుటను వ్యవహారమున మందారమను పేరుకలిగి యుండవచ్చును.

(65) **మనువు:** శ. ర. దే. జీవనము; వర్తనము; మగనివరించుట; మగఁడు. ప్రా. మణుఅ = సం. మనుజ = మనుష్యసంబంధమైన (జీవితము, వర్తనము, మొదలయినవి.)

(66) **మా:** శ. ర. దే. "మామయిచ్చెను మాయని మహినుతింప = శ. ర. బళి. - మహాచ్ఛబ్దమునకు 'మా' యను తద్భవరూపముగలదు. ఆయర్థముసే యీ యాశ్చర్యార్థకపదము సూచించుచున్నది.

(67) **ముండ:** శ. ర. దే. విధవ. వేశ్య. సం. ముండితా=ప్రా. ముండిఆ; ముండ = విధవ; దీక్షితుఁడు; పరివ్రాజకుఁడు.

(68) **ముకుటము:** సం. ముఖ్యపట - ప్రా. ముక్ఖవట = ముక్ఖాట= తెనుఁగు: ముక్కుటము = ముకుటము లేదా; సం. ముక్తపట=ప్రా. ముక్కవట = ముక్కాట = తెనుఁగు: ముక్కుటము - ముకుటము.

(69) **మేన:** చూ. మేనమామ; మేనబావ; మేనత్త. మేనమఱఁదలు. ఇది 'మైధున' శబ్దభవము. మహారాష్ట్రీ: మేఉణ; మేణ.

(70) **రతి:** శ. ర. దే. పచ్చులతూనికయందు దొకయెత్తు; మఱుఁగునఁదిపు వద్దైదవభాగము. - ఈపదము తెనుఁగున పదునేడవ శతాబ్దముకుఁబూర్వము కానరాదు. అప్పటికి ఐరోపీయులీదేశముతో వర్తకవ్యాపారములు సలుపుచుండెడివారు. కావున నీ పదము ఇంగ్లీషు 'రేటు' (rate) తో సంబంధించియుండునని లోఁచుచున్నది.

(71) **రసిక:** శ. ర. దే. = రసి = పుంటిచీము; రసప్రాయమైనది. అర్థవిశేషముగలిగినది.

(72) **వండ:** i. బురద. ప్రా. పంఙవిఆ = జలార్ద్రము, నీటిచే తడిసి పంకిలమైనది.

ii. ఆపద. ప్రా. వండఇఆ = పీడితము; ప్రా. వంధ = బంధము.

(73) వంద: శ. ర. దే. i. వందె = తృణతతి విశేషము. ii. **నూఱు:** శతము; - సం. వృంద; ప్రా. వంద. - శత; సహస్ర; శబ్దముల వ్యుత్పత్తినాలోచించినచో నవియు తొలుత సమూహార్థకశబ్దములై సంఖ్యార్థమున సంకేతింపఁబడినవనియుఁ దెలిసికొనవచ్చును. అట్లే 'వృంద' శబ్దభవమగు 'వంద' యనునదియు నూటికిఁ బర్యాయపదముగఁ దెనుఁగున సంకేతింపఁ బడియుండును. అట్లేసమూహార్థకమగు 'వంద' తెనుఁగునఁ దృణసమూహమునకు సంకేతముగ నిలిచినది.

(74) **వరటు:** శ. ర. దే. పేడయెండిన చెక్క. ప్రా. వరాడు; వరహాడిల = బయటికి పదలఁబడినది = పేడ

(75) **వాటము:** శ. ర. దే జాలుపుగనుండునది; 'వాటపుఁజెక్కిలి,' ii. అనుకూలమైనది. 'ఇచ్చోటు వేఁటకు వాటంబు'. iii. సక్తమయినది; 'నెయ్యంబు మనమున వాటమయినది iv. పొందికయినది. 'పవలి ప్రాయపు దొంటిగతి వాటముగా బిగియించి' v. ఓర. 'నిజకుటీరద్వారంబుల కుటీరంబు వాటంబుగా సేసి'.

'వాటము' అనునది సం. 'పాత' శబ్దభవమగును. ప్రా. పాడ, వాడ అర్థవిశేషములు గలిగినవి.

(76) **వారకము:** శ. ర. దే. 'లేని కాలమునందు వృద్ధ్యాదులు లేక యుపయోగార్థమొకని కిచ్చి కలిగిన కాలమునందు మరలఁ బుచ్చుకొను ధనధాన్యాదికము' అనునర్థము కిట్టింపుటర్థము. ఈ పదము 'పరకీయ' శబ్దభవము ప్రాకృతము. పారక్కేర; పారక్క. "వారణఘోటకఖాండా, గణంబులు మొదలుగాఁగ గల ధనములతో, సూరినుతయుండతఁడు నీ, వారకములుగాఁగ మన్ని పరగవుము బుద్ధిన్" భార. ఆది. 3. ఇచట వారకములనఁగా సొంతములుగాక యితరుల నుండి తనకుఁ జేరినవని యర్థము. అట్లే "పలుకుల చెలువంబు కలికి కెరములకు వారకమిచ్చితే వనగంధి" విక్ర. ౭. ఇందును 'పరకీయములుగఁ జేసితివా' యనియర్థము.

(77) **వారము:** రూపాంతరము 'వారువము; వార్వము; వాపురము'= గుఱ్ఱము. ఇది 'బడబా' శబ్దభవము. ప్రాకృతము: వడవా: వాడవ = ఆఁడు గుఱ్ఱము.

• (78) **వాలకము:** శ. ర. దే. 1. మోసము: 'వానివాలక మొక వీరవానర లలామము గన్గొని' - రామా. ౭. 2. వేషము. ప్రాకృతము: వాల; వాలగ = దుష్టమృగము. అమ్మవారిపండుగలు పీర్లపండుగలు మొదలగు సందర్భములందు వ్యాఘ్రాదుల వేషములను ధరించుట సుప్రసిద్ధము. మొదట నట్టివేషములకును బిదప వికారములగు నితరవేషములకును, అట్టివేషముల వలన నితరులు మోసపోవుచుండుటచే 'మోసము' నకును వాలకమను పదము చెల్లుచు వచ్చినది.

(79) **వాలిక:** శ. ర. దే. = దైర్ఘ్యము; - కాని; చూ. శ. ర. వాలు. వై. దైర్ఘ్యము.

(80) **వాసి:** దీని శ్రేష్ఠతరము అను నర్థమును దత్సంబంధములగు నర్థములును గలవు. ఇది 'వరీయసీ, శబ్దభవము కానోపును. ప్రా. వఈయసీ; వాయేసీ.

(81) **విరళము :** రూపాంతరము 'విరాళము' శ. ర. కారుఁడు 'విరాళము' యుగళమన్నాఁడు. ప్రాకృతమున 'ఆల' అను ప్రత్యయము సంబంధార్థమున వచ్చును. 'విరాళ' శబ్దమునకు *. 'వీరాల' = వీరులకు సంబంధించిన అనియర్థము. వీరులకర్పించు నుపాయనము 'విరాళ' మగును. విరాళము దానికి రూపాంతము.

(82) **విలాసము :** శ. ర. చిరునామా. ఇది యన్యదేశ్యమని శ. ర. కారుఁడే వ్రాసియున్నాఁడు ; అయినను విచార్యము.

(83) **వీటి :** శ. ర. దే. కొల్ల. ప్రత్యేకముగా ప్రయోగములేదు. వీటఁబుచ్చు; వీటఁబోవు అను క్రియల కుదాహరణములు గలవు. వాని యన్నియందును 'వృథా, వ్యర్థము' అను నర్థము పొందును. 'వీటి' పదము 'వ్యర్థ' శబ్దభవము. ప్రాకృతము : వెత్థిఆ = వ్యర్థికా ; వెట్టిఆ. విట్టిఆ = తెనుఁగు : వీటి. "వెట్టి" యను పదము దీనితోఁ సంబంధించినదే.

(84) **సంబరి:** శ. ర. దే. తోలఁగుసు.-'సంబళి, సంజరి, సెంబళి, శంబరి' అను పదములు 'చర్మకారి' శబ్దభవములు. ప్రాకృతము: చమ్మార; హిందీ: చమార్ ; తెనుఁగు: చెమ్మర, సంబరి, సంబర(-రి); మాదిగవారు గ్రామములోనికి వచ్చునపుడు 'మాదిగోఁడనమ్మో!' అని కేకవేయుచుఁ దనరాకను గ్రామజనులకుఁ దెలియఁజేయవలెనను నాచారము నేఁటికిని గలదు. అప్పుడుత్తమజాతులవారు వారిమార్గమునుండి తొలఁగిపోవుదురు.

(85) **సత్తు:** శ. ర. దే. సీసము. సీసమనునర్థము సరికాదు. సత్తు వేఱు; సీసము వేఱు. 'సత్తు' అన్యదేశ్యమయి యుండవచ్చును. చూ. తుత్తు(నాగము) 'తుత్తు' చీనాదేశపుమాటయని యొక నిఘంటుకారుఁ డన్నాఁడు.

(86) **సన్నము:** శ. ర. దే. సూక్ష్మత్వము; సం. అల్పము; కృశించినది. ఇది 'శ్లక్ష్ణ' శబ్దభవము; ప్రాకృతము; సణ్హ. దేశ్యార్థమునకును సంస్కృతార్థమునకును శ. ర. కారుఁడు భేదమును గల్పించుట యనావశ్యకము.

(87) **సీసకము:** శ. ర. దే. కిరీటము; ఇది 'శీర్షక' శబ్దభవము. ప్రాకృతము: సీసక, సీసగ. మల్లబంధవిశేషమను నర్థమునను నీ పదము 'శీర్షక' శబ్దభవమే; 'తలపట్టు' అని యర్థము.

(88) **సీసము:** శ. ర. దే. మల్లబంధవిశేషము. ఇదియును 'శీర్షక' శబ్దభవమే. ప్రాకృతము; సీసఓ. 'తలపట్టు' అని యర్థము.

(89) **సుత:** శ. ర. దే. ప్రభృత్యర్థకము; వ్యవహారమున 'కూడా' అని యర్థము. ఇది 'సార్థ' శబ్దభవము. ప్రాకృతము: సత్థ, సుత్థ.

(90) సేన: 'చాలా' అని వ్యవహారార్థము. 'చాలా'కు రూపాంతరము; 'సకల' శబ్దభవము, ప్రాకృతము: సఅల.

(91) సుక్కు: శుష్కము —'శుష్క' శబ్దభవము

(92) హాళాహాళి: దీనికి శ. ర కారుఁడు 'హాళహాళి' అను పదము రూపాంతరముగానిచ్చి దానిని సంస్కృతశబ్దముగా నిరూపించియే యున్నాఁడు.

(iii) అన్యదేశ్యములు తెనుఁగునఁజేరి సంస్కృతపదముల

పోలిక నొందినవి.

(1) అలక, (అలకన); హిం హల్కా = సూక్ష్మము; క. కురులు.

(2) ఆర: శ. ర. లో దీనికి 'గుణి' యని యర్థమున్నది. దీని గ్రంథము లందు దేశ్యముగా ప్రయోగమున్నట్లు కానరాదు వ్యవహారమున 'మేర' అనునర్థము గలదు. హిం 'హద్' తో దీనిని పోల్చవచ్చును 'ఆర' కిని 'హద్దు' కును అర్థభేదము లేదు.

(3) చిల్లము: శ. ర. "దే. హుక్కాను నిప్పుపెట్టుకొనెడు పాత్రము" చూ. చిలుము గొట్టము; హిం. చిలుమ్.

(4) నాగవాసము: ఇందు 'నాగ' శబ్దము 'లగ్న'శబ్దభవము. లగ్న = ప్రా. లగ్గ = *నగ్గ = తెనుఁగు, నాగ, 'తగిలించిన' అని యర్థము.

(5) నాళము: రూపాంతరము 'లాడము' ఈ యర్థమున 'నాళము' హిందూస్థానీపదము.

(6) బాదరము: రూ. బాదగు. దే. జానకిత్రాడుంచెడు కర్ణాటకపు తుపాకి చెవి. హిం. బాదర్.

యుగళములు.

శబ్దరత్నాకరమున 'కొన్నియర్థములందు దేశ్యములు కొన్నియర్థములయందు వైకృతములు వైవపదములుగఁ గన్పట్టెడు శబ్దములకు యుగళము లను సంజ్ఞ యివ్వఁబడినది. ఈ శబ్దముల దేశ్యార్థము వైకృతపదముల యర్థము ననుసరించి యున్నదో లేదో యీ క్రింద విచారింపఁబడును.

(1) అంచు: సం. ఆజ్ఞా = ప్రా. అణ్ణా: సం. అత్యంచ్, ప్రా. అఇంచ.

(2) అచ్చు: సం. అప్; ప్రా. అప్ప; అప్పెఇ. (3) అజ్జ: రూ. హజ్జ= ప్రా. పజ్జ = సం. పద్యా. (4) అట్టె: దే. గుంటకలోనగువానిదిండు, అనఁగా అడ్డుఁగట్ట; పాలి: అడ్డేతి. (5) అఱ: దే. గది; పెట్టెలోనగువానిలోపలి అఱ.- ప్రా. అర = పెట్టెలోనగువానియుంపలి అడ్డుబల్ల. ఇట్టిబల్ల పెట్టెను వేర్వేఱు

భాగములుగ విభజించును; కావున 'అఱ' అను పదము అట్టి భాగములకుఁ దెనుఁగున రూఢిమైనది. (6) ఆరె: దే. ధాతకీవృక్షము; ఆరెదేశమునుండి వచ్చినది గావున నీచెట్టునకాపేరు కలిగియుండును. దేశనామముగ 'ఆరె' వైకృతముగ నిరూపింపఁబడినది. (7) ఊరుచు = ఊరుపు: పైకి ఊడదీయు; ఊడు - హిం. ఉర్, సం. ఉత్థా, ప్రా. ఉత్థాఇఅ. పాలి: ఉత్థాపేతి. (8) కడిమి: కడ్మి, సం. గరిమన్. (9) కద: సం. కృతి; ప్రా. కత, కద. (10) ఎడ: సం. అత్ర; ప్రా. ఏత్థ; (11) ఒంట్లు: పురుషుల కర్ణభూషణము—ఉండలుగా ఉండునట్టిభూషణము. శ. ర. 'ఉండ' దేశ్యముగాఁ జూపఁబడినది. 'ఒంటు' అను పదము 'ఉండ'తో సంబంధించినది. ఈ రెండును 'గుంద్ర'కు రూపాంతరములు. 'గుంద్ర' శ. ర. లో వైకృతముగానే చూపఁబడినది. (12) ఒడ్డు: సం. అవపాత; అపవృత్త, ప్రా. ఓఅత్త. (13) ఓజ: సం. ఓజస్ (14) ఓలి: ప్రా. ఓలీ = కులాచారము, కులపరిపాటి; కులాచారము ప్రకారము వరుఁడు వధువున కివ్వవలసినసొమ్ము. (15) కచ్చించు, కిచ్చు: సం. కర్ష్. (16) కచ్చడము: చిన్నబండి; సం. కాశకటమ్. ప్రా. కాసఅడం. (17) కడప = గడప, ద్వారము; చూ. ప్రా. కడఇల్ల = దౌవారికుఁడు, ప్రతీహారి, ద్వారమునొద్ద కావలికాచువాఁడు. (18) కరువు: రూ. కరుగు: సం*కృ. ప్రా. కర = చేయునది. చేయఁబడినది; మఱియొకవస్తువును జేయుట కుపయోగించునది. అచ్చు. అని యర్థపరిణామము. (19) కఱ్ఱ; సం. కాష్ఠ (20) కాఁపు = అడవి (కాడు. వై.); ఋతువు, మునిమి = సం. కాల; చౌడు = సం. క్షార. (21) కాసె = తాయిదోలుచుపని; ఈ పనిని ఖాసీపర్వతప్రాంతపు జనులకు వృత్తి; ఆ ప్రాంతములనుండి వచ్చినవాఁడు 'ఖాసి; ఘాసి' వాసు; వాసుచేయుపని 'కాసె' పని; (22) కొట్టము = నృత్యవిశేషము; ప్రా. కడ్డ = కుతూహలము, కౌతుకము; విలాసము. (23) కొట్టు: సం. కుట్; ప్రా. కుట్ట, = కొట్ట. ఖుడ, ఖుట్ట, కొట్టుట, తాడనము చేయుట. (24) కొరడు: సం. క్షరిత; ప్రా. * ఖరిడ = జాఱిపోయినది; ధనురాకారము తొలఁగినది. (25) గచ్చు = కాంతి; సం. కమ్; చూ. కాల్గు, కాల్గుగంటి; 2. 'గారపూఁత' అను నర్థమున నన్యదేశ్యము; హిం. గచ్ఛ్. (26) గరువు: సం. గల్ల; ప్రా. గిల్ల = గిండస్థలము. (27) గరుసు: ఎల్ల, మేర; చూ. కడ (వై.) = దిక్కు, అంతము; (28) గసి = మేకు; సం. గ్రస్; ప్రా. గసిఅ = పట్టుకొన్నది; 'మేకు' చేయుపని యిదియే. (29) గుజ్జు: సం. క్రుశ్, క్రుంచ్, కుంచ్; ప్రా. గుజ్జ, గోజ్జ; = నలుగఁ గొట్టఁబడినది. (30) గుడి: చూ. గుంద్ర(న,-ము,) వైకృతములు. (31) గొప్పులు: చూ. కొప్పు, కోపు, కుప్ప మొదలయినవి; గొడుగువలె ఉబ్బెత్తుగా నుండునది; ప్రా. కుభా, గుంఫా, మొద.

(32) **చింద౯:** చీఁద౯గొను). సం. ఛిద్ర; ఛిద్, ఛింద్; ప్రా. ఛింద, ఛిందణ. (33) **చిల్ల:** ప్రా. చిల్ల, (34) **చెందిరిక,** చెంద్రిక: చంద్రాకారముగ నుండునది: సం. చంద్రికా. (35) **చేరు:** సం.* సృ. (36) **చేక్కుటి,** ప్రా. చక్ఖడిఅ = జీవితవ్యము, జీవనము. (37) **చేట్ట,** ప్రా. జత్తు, **జట్ట** = సం. జత్రు; అర్థభేదము కలిగినది. (38) **చోమ,** సం. శ్యామాక. (39) **చోరు** = పొరకతో కళ్లమునూడ్చు; సం. చాలయ్. (40) **చోఱ** = **రేఖ**; చూ. జోడ; ప్రా. చార = గతి, గమనము; త్రోవ; చోఱ, **జోడ,** అను పదములు ఒకగీఁతగాని, మఱియేదిగాని పోయిన మార్గమును దెలుపును. తుదకు ఆ గీఁతకే యర్థము రూఢియైనది; (41) **చొక్కు:** చూ. **సోఁకు** = తగులు, గ్రహాదులుసోఁకు; పరవశమగు; సం. స్పృశ్? (42) **జేడి:** ఇది 'వాన' అను నర్థమున వైకృతమనియు, 'బాధ' అను నర్థమున దేశ్యమనియు శ. ర. కారుఁడు; శ. ర. లో 'బాధ' యను నర్థమున నున్న ప్రయోగము: "వృథాలాప ప్రబంధంబులం జడివెట్టంబనిలేదు" కాని. యిచ్చటఁగూడ 'వృథాలాపప్రబంధములను గురియింప నక్కఱలే' దని యర్థము చెప్పవచ్చును - 'బాధ' యను నర్థము గౌణము. (43) **జేల్లు:** ఇది 'వాన' యనునర్థమున వైకృతము. ఉమిసినప్పుడు రాలు తుంపరలను నర్థమున దేశ్యమట. ఇట్లుభేదము కల్పించు టనావశ్యకము. (44) **జొన్న:** ఇది సస్యవిశేష, ధాన్యవిశేష వాచకమగునపుడు వైకృతము (45) **జోడు** = కవచము; సమానము; సం. యుక్త, యోజిత; ప్రా. జోడ; కవచమను నర్థమున శరీరముపై తగిలించుకొనినది అని విశేషార్థము. (46) **డాలు:** కాంతియను నర్థమున నిది యన్యదేశ్యము. చూ. హిం. డౌలు; డెక్కెము, అనునర్థమున దీనికి, 'డాలువాఱు' అనియీఁబడి వైకృతమని నిరూపింపఁ బడియు దేశ్యమని చెప్పఁబడినవి. (47) **తక్కు:** దీనికి 'తప్పు' అని యర్థము వ్రాయఁబడినది. 'తప్పు' వైకృతముగాఁ జూపఁబడినది. (48) **తుంట** = తునుక. చూ. సం. * త్రుట్. (49) **తుఱుము:** ఇదియును సం. త్రుట్ - ధాతువుతో సంబంధించినదే. (50) తుఁట; చూ. తుంట. (51) **తెలుపు:** క్రి. తెలియఁజేయు; ధావళ్యమనునర్థమున నిది వైకృతము - **తెల్లము** అనుపదము 'ధవళ' మను శబ్దమునుండి కలిగినది. తెలియు, తెలుపు, అను క్రియలును దీనితో సంబంధించినవే. (52) దండ = సమీపము; ఇది **'దాపు,** దాపించు, దాపలించు' మొదలగు పదములతో సంబంధించినది. ఇవియన్నియు శ. ర. లో దేశ్యములుగఁ దెలుపఁబడినవి. కాని, వీనిలో 'దాప రించు' అనుధాతువునందలి 'దా-' అనునది 'దక్షిణ' శబ్దముతో సంబంధించి నది. డా (దా) కడయనఁగా దక్షిణ పార్శ్వము. ఇతరాధునిక భారతీ యార్య

భాషలలో దక్షిణ శబ్దము దాహ్, డాహ్, దాహిన్ మొదలగు రూపముల నొందినది. (53) దట్టించు ; ఇది 'ధృష్' ధాతువునుండిపుట్టినది. సం. ధృష్ట. ప్రా. ధిట్ట. (54) దడ : ఇదియును 'ధృష్' ధాతువునుండి పుట్టినదే. (55) దడము = దట్టము : సం. దృఢ ; ప్రా. దఢ. (56) దళవరి = ధాన్యవిశేషను ; చూ. దాళువా (పంట). (57) దాళా : దీనికి శ. ర. లో దేశ్యార్థమున 'పడియొక్క హెచ్చు తక్కువ' యనియు, వైకృతార్థమున (నెయ్యి, నూనె, మొదలగునవి తీయు పాత్రములను గాని, యవియుంచియున్న పాత్రములనుగాని) సరిమెత్తుతాలను దడతట్టనుంచి తూఁచుట, యనియు తెలుపఁ బడినది. దేశ్యవైకృతార్థములకు భేదమేమియు లేదు. (58) దుడ్డు = డబ్బు, ధనము ; ఇది 'ద్వ్యర్ధ' శబ్దభవము ; ప్రా. దుఅడ్ఢ ; రెండున్నరయని మూలార్థము ; రెండున్నరకానులో ఏర్పానాణెముల వెలగల నాణెమని యర్థవిశేషము కలిగినది. ఆ నాణెము మూలమున ధనమను సామాన్యార్థముగూడఁ గలిగినది. (59) దోని : శ. ర. " దే. అల్పము. చూ. దోనమ్ము " 'దోనమ్ము, అనునది 'ద్రోణాంబక' శబ్దభవము. 'దోని + అమ్ము' అని విభాగము చేయుట తప్పు. (60) నట్టు. రూ. నాడు. ఇది 'నట్' అనుధాతువునుండి కలిగినది. జనులుసంచరించు (ప్రదేశము) అని యర్థము. (61) నలుపు : సం. * నష్; (62) నెమ్మి : సం. * నర్మ ; ప్రా. ణమ్మ. (63) పట్టించు : సం. ప్రస్థాయ్ . లేదా, స్ప్రష్ట = ప్రా. పట్ఠ. (64) పక్కియ = ఒకచెట్టు ; సం. ప్లక్ష, ప్రా. పక్ఖ. (65) పట్టు : సం. ప్రవృత్త ; ప్రా. పఉత్త ; (66) పడవ = యుద్ధము, ప్రలయము ; సం ప్రలయక , ప్రా, పడఅవ ; (67) పదురు = త్వరపడు ; సం. ప్ర + ద్రు. (68) పఱ : రూ. పఱ్ఱ ; సం. ప్రస్థా ; (69) పల్లటిల్లు : సం. పర్యస్తిత ; ప్రా. పల్లట్ట , పల్లత్థ (70) పసరు: సం. ప్రసర ; ప్రా. పసర ; (71) పసి : సం. పశు + ఇక = పశ్వికి = ప్రా. పస్సిఅ ; పశుసంబంధమైన జాడ ; మాంసము మొదలైనవి. చూ. పసిపట్టు, పసిగొను, పసిదిండి మొదలైనవి. (72) పాగ,పాగా : ఇవి యన్యదేశ్యములు. చూ. హిం. పగ్రీ, పగిడీ, మొదలైనవి. (73) పాట=1. సంగీతము ; సం. * పర్ 2. విధము: సం. పథ ; వర్త్మ. (74) పాపట : సం. ప్ర + అపాస్త ; ప్రా. * పాపట్ఠ. (75) పాలు = క్రి. తెల్లనగు ; చూ. సం. పలిత ; 2. భాగము, వంతు ; సం. * భజ్, భక్త, ప్రా. భత్త, * పఇల్ల. (76) పాళీ = కలము పాళీ ; ఇది యన్యదేశ్యము ; (77) పిచ్చ ; 'హీనము' అనునర్థమున నిది దేశ్యమనియు, 'పిచ్చి' అనునర్థమున వైకృతమనియు శ. ర; హీనార్థమున నుదాహరణము: " బ్రహ్మసంతతివాఁడవై పట్టణంబు, లంకగానుండి కేలఁగైలాసమెత్తి, ప్రబలితివి నీకులస్థాన గౌరవముల, కొచ్చెముగ నేల చొచ్చితి పిచ్చపనికి.

ఇచట 'పిచ్చపని' యనఁగా 'పిచ్చిపని' యనియే యర్థము చెప్పుకొనవచ్చును. 'పిచ్చి' పిత్త, లేక, పైత్యశబ్దభవము. ప్రా. పేచ్చ. (78) పిచ్చు=చింతవిత్తు; ఇది 'బీజ' శబ్దభవము; (79) పుత్తడి: బంగారము; ప్రా. పుత్తల; ప్రా. పిత్తల, ద్రా. పిత్తళి = ఇత్తడి; ప్రా. వృత్తల; తెనుఁగు: పుత్తడి = బంగారము. (80) పెంట: సం. పిండ; ప్రా. పేండ; తెనుఁగు: పేఁడ. (81) పేరణి = అంగీ; ఇది యన్యదేశ్యము. (82) పొడము=పుట్టు; సం. స్ఫుట; ప్రా. ఫుట, ఫుట్టణ, ఫుడ, ఫుడణ, ఫుడా, ఫుడిల, ఫుడిఆ, ఫుడ్డ మొదలైనవి (83) పొన్న=దృగ్గోచరమైనది; సం. స్ఫుటన; ప్రా. ఫుడణ (84) ప్రొవ: అనుకూలము, యుక్తము; సం. ప్రాప్త; ప్రా. పావ; (85) బండ = రాయి; సం. పాషాణ; ప్రా. పాహాణ్ణ, పాలణ్ణ; ద్రా. పాలణ్ణ; తెనుఁగు: బండ. (86) బండారు: చూ. (87) బండ. (88) బటువు: చూ. సం. వర్తుల; (89) బార: రెండుబాహువులు చాచిన కొలత; సం. బాహా. (90) బెత్తు = వెచ్చు; సం. * భిద్; * భిత్త = భిన్న; (91) బొంత = పెద్ద. చూ. బొంతరఁటి; సం. వృద్ధ = పెరిగిన = ప్రా. వుడ్ఢ = తెనుఁగు: బొంత (92) బొక్క: శ. ర. "నోరునిండిన పొడియగు తినుబండము (వాఁడు అడుకులు రెండుబొక్కలుబొక్కి పోయినాఁడు." సం. భక్ష్; ప్రా. భుక్క; తెనుఁగు: బొక్కు. (93) బొమ్మ = కనుబొమ; సం. పక్ష్మ; ప్రా. పహ్మ; పోమ్హ; (94) మంతు = ప్రసిద్ధి, చూ. మాట; కన్న, మాతు; హిం. బాత్; సం. వద్, వాద. (95) మట్టు = త్రొక్కు, మర్దించు; సం. మృద్; ప్రా. మడ్డ; (96) ముక్కు = చెడు; రూ. మ్రుక్కు, మగ్గు, మ్రగ్గు; వీనిలో 'మ్రగ్గు' అనుపదము వైకృతముగాఁ జూపఁబడినది. (97) మూఁగ = దోమ; ప్రా. ముఇంగ = కీటవిశేషము, దోమ; (98) మూవ: రూ మువ్వ; ప్రా. ముఅ = సం. మోదయ్; సంతోషము నిచ్చునది. (99) మెలయు: సం. * మిల్; కలియుటకై కదలు; (100) మొల్లము = తఱచు; సాంద్రత; సం. ముహు ర్ = ప్రా. ముఉల్ల; మోల్ల; (101) మోట = కపిలె; హిం. మ్హోట్; (102) రేక: ప్రా. రేహా. ఆ = విడిపత్రము; (103) వంజె: గొడుగుకామను వంచు నట్టిది; ప్రా. వంజ = సం. ఉన్నమయ్; (104) వట్రము = వక్కాకు తిత్తి; గుండ్రముగా నుండుటచే నిట్టిసంచి కీపేరు వచ్చినది; సం. వర్తుల; ప్రా. వట్టల; (105) వడి = వేగము; ఇది కన్న. ఓడు = పరుగెత్తు, ధాతువునకు సంబంధించి నది. పదాది 'ఒ'కారమునకు వకారోచ్చారణము సుప్రసిద్ధము. (106) వడువు= విధము; సం. * వృత్; వృత్త = ప్రా. వట్ట, * వడ్డ = మార్గము, విధము; (107) వాఁక = వంక; సం. వక్ర; ప్రా. వంక; (108) వాఁఖు = ఆకులు మొదలగువానిని చీల్చు; సం. భ్రశ్; వ్రశ్చ్; (109) విరాళము = పన్ను; ప్రా. వీరాల = వీరులకు సంబంధించినది; వీరుల కిచ్చుధనము; (110) వీణియ:

కస్తూరియుండు సంచి; సం. వీటికా; ప్రా. వీడిఆ, వీణిఆ; (111) వెలి: సం. బహిస్; (112) వెలుతురు=కాంతి; సం. విలాసిత; (113) వెల్లి: ప్రవాహము; సం. వివాహిత; ప్రా. * విఆవెల్ల; (114) సంగడము; జెట్టులు సాధనచేయు ఇనుపగుండు; హిం. సాంగ్డా; (115) సంపు = చంపు; చూ. సం. శవ; (116) సీదరము; సీద్రము = దారిద్ర్యము; సం. ఛిద్రమ్; (117) సుంకు: సం. శుల్క; ప్రా. సం. శుష్క. ప్రా. సుక్ఖ, సుంఖ; (118) సేకరించు: సం. శేఖరించు; అర్థవిశేషము గలిగినది.

## ధ్వన్యనుకరణ శబ్దములు.

ఇంక మిగిలిన శబ్దములను గూర్చి విచారింతము. వానిలో ననేకములు ధ్వన్యనుకరణశబ్దములు. ఇవి యేభాషయందయినను నుండవచ్చును. ఆయా ధ్వను లాయాభాషలను మాట్లాడువారు తమ శ్రవణేంద్రియమునకు గోచరించినట్లు గ్రహించుచుందురు. కొంచె మెక్కువ తక్కువగ ధ్వని సర్వమానవులకును నొక్కతీరుగనే గోచరించును. అవి ధ్వన్యనుకరణములుగ నున్నంతకాలమును వానితో మనకుఁ బనిలేదు. కాని, వానికి విశేషార్థములు గలిగి యందుండి యితరశబ్దములు బయలువెడలి వస్తువులకును భావములకును గుఱుతులుగ నేర్పడినప్పు డవి దేశ్యము లగుచున్నవి. కేవల మనుధాతువుతో మాత్రము ప్రయోగింపఁదగిన పదములు తెనుఁగున ననేకములున్నవి. శబ్దరత్నాకరమునున్న యట్టి ధ్వన్యనుకరణశబ్దము లీక్రింది వర్గములుగ నేర్పఱుపఁ బడుచున్నవి.

### i. ఆశ్చర్య, సంతాప, ఆహ్వానాద్యర్థకములు:

ఊ, ఓ, కో, ఒకో, ఒకొక్క, గొ, గో, దుట్టుచ్చి, డీ; ధే; బాపు, ఓయి, క్రియో; ఆహారె, ఉచ్చిచ్చిరె, ఓహోరే, చాఁగురె, పురె, పురే, బళారె, బళిరె, బళీరె, మాయురె, బళిర, బళిరయ్య, ఇసిరో, ఇస్సిరో; ఓచెల, ఓచెల్ల, ఒచ్చెల, ఏఁజెల్ల, బలా, బలే; ఇసీ, ఇస్సీ; అహహా, ఆహా, అహా, ఇహిహీ, ఈహీ, హిహీ, హూ, ఉహూహూ, ఒహూ, హూ, ఓహూ, ఉహ్హూ, కోహూ, బళా, బళి, బళీ.

### ii. కేవల ధ్వన్యనుకరణములు:

కొక్కరోకో, క్రింగు, చంగు, బగ్గు, చుచ్చు, తూ, గుప్పు, తుప్పు, గుబ్బు, దుమా, బే, అంబే, చుంయి, గుంయి, ఆవురు, ఉసూరు, జివ్వురు, ఉస్సురు, గూండ్రు, గోండ్రు, కాండ్రు, గుబ్బురు, గొబ్బు, నెటుకురు, బోరు, గింగురు, ఉట్టు, కిట్టు, గిట్టు, గుట్టు, చుట్టు, బుట్టు, జిఱ, జిఱ్ఱు, జిట్టు, గెల్లు, గొల్లు, చిల్లు, జిల్లు, బల్లు, బ్రుల్లు, కావు, కోవు, క్రేవు, చివ్వు, జివ్వు, బుస,

ఉస్సు, దిస్సు, బిస్సు, బుస్సు, జరీ, జరీలు, బిరీ, జల్లు, జుట్టు, జుం, జివ్వు, జువ్వు, జోరు, జోఱు, జౌజవ్వు, ఛేవు, డమ్, రింగు, ఱింగు, ఱిక్క, ఱిప్పు, ఱివ్వు, సట్టు, సువ్వి, హూరు, గిలుకు, బుగులు, గ్రుద్, గ్రుమ్, గ్రుక్క, చటా్, చయ్, జడ్, జల్, డిగ్.

iii. మధ్యవర్ణము గురువయిన ధ్వన్యనుకరణములు:

ఉచుక్కు, కచిక్కు, కటుక్కు, కతుక్కు, కఱుక్కు, కలుక్కు, గతుక్కు, గుబక్కు, తళుక్కు, తుటుక్కు, తటుక్కు, తుపుక్కు, దుబుక్కు, దుముక్కు, నఱుక్కు, పటుక్కు, పుటుక్కు, పొటుక్కు, బుటుక్కు, లటుక్కు, గిఱుక్కు, గుటుక్కు, గుడుక్కు, గుబుక్కు, చిటుక్కు, చిపుక్కు, చుఱుక్కు, జుఱుక్కు, బొళుక్కు.

కఠిల్లు, తటాలు, దుమాలు, పకీలు, పెఠిల్లు, గుబుల్లు, బగీలు, గబీలు, గుబాలు, గుబేలు, గుభీలు, చిటాలు, చివాలు, చటాలు, చటీలు, గణిల్లు.

iv. ఆమ్రేడిత ధ్వన్యనుకరణములు: ఆమ్రేడితమున మార్పునొందనివి:

కికకిక, కికాకిక, చికిచికి, తకతక, తుకతుక, తెకతెక, తొకతొక, నకనక, పకపక, పకాపక, పులుకుపులుకు, బొళుకుబొళుకు, చకచక, లుకలుక, వకవక, వికవిక, వికావిక.

బగబగ, బుగబుగ, దగదగ, దిగదిగ, నిగనిగ, పచ్చపచ, చిచ్చి, చిచ్చీ, గుజగుజ, కిచకిచ, కీచుకీచు, గిజగిజ, గుజగుజ, కటకట, తటతట, తొటతొట, పటపట, పుటపుట, పెటపెట, పొటపొట, మటమట, మిటమిట, దొడదొడ, బడబడ, బుడబుడ, బొడబొడ.

గుడిగుడి, దుడిదుడి, నడునడు, కిటకిట, గడగడ, గణగణ, గిటగిట, గుటగుట, గుడుగుడు, గొటగొట, గొణగొణ, చిటచిట, చొటచొట, చొడచొడ, జొటజొట, లొటలొట, లొడలొడ, వడవడ, వెడవెడ, సొటసొట.

పుతపుత, కనకన, కుతకుత, గనగన, గుదగుద, గునగున, గొదగొద, నదనద, కితకిత, పిదపిద.

తపతప, దొప్పదొప్ప, దబదబ, దుమదుమ, దిందిం, దిమిదిమి, గమగమ, గుబగుబ, గబగబ, గుమగుమ, చిమచిమ, డబడబ, రెపరెప.

కరకర, దిరదిర, దిర్దిర, దురదుర, పురపుర, హూరాహూరి, గరగర, గిరగిర, గురగుర, గొరగొర, చెరచెర, చెచ్చెర, చరచర, విరవిర, సరసర.

కఱకఱ, తఱతఱ, పఱపఱ, బఱబఱ, బిఱుబిఱ్ఱు, కిఱకిఱ, కుఱకుఱ, కొఱకొఱ, గఱగఱ, గుఱగుఱ, గుఱుగుఱ్ఱు, చుఱచుఱ, చొఱచొఱ, వెఱవెఱ, నుఱనుఱ, చిఱచిఱ, చిఱ్ఱచిఱ్ఱ.

కలకల, దులదుల, పలపల, పల్పల, పిలపిల, పొలపొల, మలమల, గిలిగిలి, బుగులుబుగులు, కవకవ, కిలకిల, కివకివ, కొలకొల, గలగల, గులగుల, గొలగొల, గోలుగోలు, చిలచిల, చిల్లుచిల్లు, చివచివ, చలచల, జలజల, జవజవ, డులడుల, రవరవ, ఱవఱవ, లవలవ, లివలివ, వలవల, విలవిల, వెలవెల, సలసల.

పసపస, బుసబుస, బొసబొస, ముసముస, తహతహ, తళతళ, పళపళ, పెళపెళ, నెళినెళి, గుసగుస, విసవిస, గళగళ.

v. **ఆమ్రేడితధ్వన్యనుకరణములు:** ఆమ్రేడితమునందు రూపము **మాఱి**నవి:—

చికమక, తికమక, ఖంగుకింగు, గ్రుక్కుమిక్కు, చిటుకుపొటుకు, ఠంగుఠింగు, గజిబిజి.

కటవెట, గొసటబీసట, తటమట. తటవట, గడబడ, గడిబిడి, చిటపొట, చిటపట, హుటాహుటి.

దడబడ, చిదగొద, సదమద, డబ్బుదుబ్బు, ఉసురసురు, ఉస్సురస్సురు, గిరిగిట, ఉల్లల, జులిబిలి, గలిబిలి, కసమస, కసిమసి, కిసమస, గసిబిసి, కళవెళ, హాళాహాళి.

ఇట్లు శబ్దరత్నాకమున కెక్కినవి మాత్రము 374 ధ్వన్యనుకరణ శబ్దములు తెనుఁగున నున్నవి.

చెట్లు, తీఁగలు, ధాన్యములు, మొదలయినవి.

వృక్షజాతులు పెరుగుట కవకాశముగల యీదేశమునం దెన్నియో రీతుల చెట్లు, తీఁగలు, ధాన్యములు, తుప్పలు, తృణములు, ఓషధులు మొదలగువానిపేళ్లు తెనుఁగున నుండుట యాశ్చర్యముగాదు. శబ్దరత్నాకరమున నిట్టి పేళ్లించుమిం చాఱునూర్లు చేర్పఁబడినవి. ఈపేళ్లు నాఁటికినేఁటికి నొక్కతీరున చిన్నమార్పులతో నిలిచియున్నవి. కాని, వీనిలోఁగొన్నిటిపేళ్లు మాఱినవో, యాయాజాతులు నశించినవో, లేదో, యవి యాయామండలములందు మాత్ర మింకను మిగిలియున్నవో తెలియరాదు. అట్టి కొన్నిపేళ్లు నాకుఁ దెలియనివి కొన్నిటి నిం దుదాహరించుచున్నాను.

చెట్లు: ఆవడ, ఇసుకమ్రాను, ఉట్లబొద్ది, ఉలిమ్రాను, ఊటబుడ్డి చెక్క, ఎనుపమోఁకాలు, ఎఱ్ఱచిపిడుక, కింపుదుమ్మ. కారుజేనము, కుమ్మరపోలిక చెట్టు, నులితడ, నెరవంజి, పానారము మొదలయినవి.

కూరాకులు: ఇసుకదాసరి, తరిగొట్ట, మొదలయినవి.

ఓషధులు: ఊకవబొడ్డు మొదలయినవి.

పొదలు, చిన్నచెట్లు: ఒడిదామర, ఒలిదామర, చలిదిమూట.

తృణములు: కుమ్మరపోనిక, క్రోలుకసవు, నాలికచేలు.

ధాన్యములు: ఇప్పపూరాజనములు, ఊటకల్లు, ఏనుఁగుకొమ్ములు, ఒడివిరిబ్రాలు, కారడుగులు, గోళ్లగొండి, చేమపూరాజనములు, తిరువరంగములు, నక్కతోఁకబియ్యము, నాగకేసరులు, పునుఁగురాజనాలు, లత్తుకబొత్తులు, వన్నెపూలు, సన్నమండిగెలు మొదలయినవి.

తీఁగలు: ఇసకబేలు, దూయుతీఁగ.

వేళ్లు: గావుకోడి, నక్కనరము మొదలయినవి.

పురుగులు, పాములు మొదలయినవి.

మనదేశమున పురుగులు, పాములు మొదలగునవియు ననేకజాతులవి గలవు. వీనికిఁ బూర్వకాలమున పేళ్లు వేఱెయుండెనో యేమో తెలియదు. ఈ క్రిందిపేళ్లు కల్పితములేమో :

చెవిచొరుపాము, పాదొట్టు పురుగు, వైజాతితొండ, సన్నపిల్లి మొదలయినవి.

జలజంతువులును బక్షులును నీదేశమున ననేకములు గలవు. కాని, వీనిపేళ్లు గ్రంథములలో నెన్నోయెక్కలేదు. పూర్వకాల మందలి యాయాజాతుల జలజంతువులును బక్షులును నేఁడాపేళ్లతోడనే వ్యవహరింపఁ బడుచున్నవో యేమో తెలియదు.

జంతువులు.

జంతువుల జాతులును నీదేశమున నెన్నియో యుండుట కవకాశము గలదు. కాని, వానిపేళ్లునాఁటికి నేఁటికి నొక్కతీరుననే యున్నవో లేవో చెప్ప వీలులేదు. 11, 12, 13 శతాబ్దపు శాసనములలో 'ఎడ్లు' శబ్దము పశుసామాన్యముగ వాడఁబడినది. 'ఇనుపయెడ్లు' అనుపదమందు కానవచ్చుచున్నది. దీనికి 'ఎనుములు, గేఁదెలు' అనునర్థముఁ జెప్పవలెనేమో. ప్రబంధకర్తలు కొన్నిపేళ్ల కల్పించినట్లు కూడఁగానవచ్చుచున్నది.

ఆఁబసి, ఆలతేఁడు, కన్నెలేడి, కొరనాసిగండు, జల్లిమెకము, పొడలమెకము, ముడిగిబ్బ.

'ఉడుపకుక్క' లిప్పు డున్నవో లేదో తెలియదు.

## నాగరికత.

తెనుఁగువారి నాగరికత మాఱినకొలఁదిఁ బూర్వకాలపు క్రీడలు, మల్లబంధములు, అలంకారములు, వస్త్రములు, భోజనములు, నింక నెన్నియోవిషయములకు సంబంధించిన పేళ్లు భాషనుండి లోపించినవి. వీనిలోఁ గొన్ని నూఱుమూల లందు నిలిచియున్నవేమో చెప్పవీలులేదు.

### బాలక్రీడలు.

ఈ క్రిందిబాల బాలికల క్రీడలు కేవలగ్రంథస్థములుగ నున్నవి. వాని స్వరూపము గూడ తెలియరాకున్నది.

ఆలంకిగుడి, ఈనెగాజులు, ఉడ్డపల్లంచి, ఉప్పగుండము, ఉవ్వాలపోటి, ఏలపాటలు, ఓటిల్లిచిందఱ, కుందికాళ్లు, గంజనగాలు, గట్టినబోది, గుంజనునుగు, గుంటచాళ్లు, గూవనాలు, గోడిపట్టెలు, చింపుపరువు, చిక్కనాబిల్లలు, చిమ్ముబిల్లలు, చిఱుతనగోడు, చిఱుతనబిల్లలు, చిత్రిపట్టె, జాబిళ్లు, తన్నుబిల్ల, తూరనతుక్కము, తూరనఁగోలలు, తూరనతుఁకములు, దూఱుదుంకెన, పిల్లగిఱులు, పిల్లదీపు, బొట్టనఁగోలలు, సిరిసింగణావత్తి మొదలయినవి.

### అలంకారములు.

పూర్వకాలమున స్త్రీపురుషులు ధరించుచుండిన యలంకారములెన్నియో (ఇంచుమించన్నియు ననవచ్చును) వానిపేళ్లు, స్వరూపములతోఁ గూడ మాఱిపోయినవి.

కనుపులగుండ్లు, కుండపోగులు, కోలాటకమ్ములు, గీఱుగాజులు, గౌడసరము, చిన్నిపూఁతేకులు, చిలుకతాళి, జిలిబిలిజల్లి, జల్లిపెండెము, తరగతిగుండ్లు, తిరుకాపు, దండచేరు, దోఁటిముక్కర, నానుక్రోవి, పంజులకమ్ములు, పల్లేరుఁబూవులు. పాలపూసలు, బబ్బిలికాయలు. ముంగమురము, మెడనూలు, రావిరేక, విచ్చుటాకు, సూలచేకట్లు మున్నగునవి.

ఈ క్రింది విప్పుడిప్పుడే వాడుకనుండి తొలఁగిపోవుచున్నవి:—చెంపసరులు, నాగపడగలదండ, నాగపడగలు, పాపటచేఱులు, పాపటబిందీలు, కొప్పుగొలుసులు, పాపటబొట్టు, పుడుకబావిలీలు మొదలయినవి.

## నష్టశబ్దములు

కవులు కల్పించిన శబ్దములుగాక తక్కిన తెనుఁగు దేశ్యశబ్దజాలమున తెనుఁగువారి వ్యవహారమునుండి లోపించిన యనేకపదములు నిఘంటువులలో మాత్రము నిలిచియున్నవి. ఆయా వస్తువులు లోపించుటవలన నాపదములును లోపించినవి; కొన్నిటికర్థభేదము కలిగినది; కొన్ని వికారములఁ బొంది తమ రూపమును మార్చుకొన్నవి. నిఘంటువులలో నిలిచిన నష్టపదములలోఁ గొన్ని నేఁడు తెనుఁగుదేశమున నేప్రాంతమునందయిన వాడుకలో నున్నవేమో తెలియదు. గ్రంథములలోని కెక్కిన కొన్నిపదములు గ్రాంథిక సంప్రదాయానుసారముగఁ గవులువాడినవి కొన్నియు, మాండలిక వ్యవహారమున మాత్రముండునవి కొన్నియునై యుండును. మాండలిక వ్యవహారమున నాయాపదములు గొన్ని నేఁడును నేమూలనో, యే చిన్న సంఘములోనో, నిలిచియుండుట యసంభవము కాదు. విశాలాంధ్రప్రపంచమున వెదకినచో నెక్కడనయిన వీనిలోఁ గొన్నియైనను నిలిచియుండవచ్చును. చేమకూర వెంకటకవి తన విజయవిలాసములో "కంగుల్ దీర్చిన పైఁడిణే అవిక" అని 'కంగు' పదమును బ్రయోగింపఁగా దాని కప్రయుక్తత్వదోషము పట్టినదని యెవరో యాక్షేపించిరఁట. దానిపై నాతఁడు దానిప్రయుక్తత్వమును సాధించుటకు దేశమునఁదిరుగుచు నొకగొల్లకుటుంబము పంచఁజేరెనఁట. అచట అత్తకోడలిని "బిడ్డకు కంగోస్తివా?" అని యడుగఁగా విని వేంకటకవి పరమానందభరితుఁడై 'కంగు' అనఁగా నేమని ప్రశ్నించెనఁట. దానికి "ఉగ్గు" అని యాయత్త అర్థము చెప్పెనఁట, ఆ యర్థము నాకవి తనపద్యమున కనుసంధించి "ఉగ్గుల్ దీర్చిన పైఁడిణేఅవిక" అనఁగా ముడుతలు పడకుండ నున్నఅవిక యని యర్థమును సమర్థించెనఁట. "బిడ్డలకుపోయు ఉగ్గు" అనునర్థముగల 'కంగు' పదమును 'ముడుత' అనునర్థమున సమర్థించుట సరికాకపోయినను, నాయాపదము లెక్కడనో వాడుకయందుండుననుటకీ కథ నిదర్శనముగా నున్నది. ఆంధ్రదేశమందంతటను జనపదవ్యవహారమున నాకు శ్రుతిగోచరముకాక, నిఘంటువులందును బూర్వకాలపు గ్రంథములందును మాత్రము గానవచ్చుచున్న కొన్నిశబ్దములను వేర్వేఱువర్గములుగ నీక్రింద పొందుపఱుచుచున్నాను.

## ధాతువులు

అంచు = ఆజ్ఞాపించు; అంజు = భయపడు; అగలు(చు) = పగులు(చు); 'అగు' ధాతువు వాడుకలోలేదు, 'అవు' నకే యెక్కువ ప్రచారము. అగు ధాతువులోని 'గు' వర్ణము 'వు'గ మాఱి, అవును, అవుర మొదలగు రూపములను, 'యు'గ మాఱి 'అయి, అయిన, అయితిని (-మి, -వి, -రి),

అయ్యెను, అయిరి, అయినది (-వి)' అను రూపములును, అవర్ణముదీర్ఘమయి 'ఆయెను, ఆయెలే' మొదలగు రూపములును, అవర్ణములోపించి 'గు' వర్ణమునకు 'కా' ఆదేశమయి 'కాక, కాని, కావించు' మొదలగు రూపములును కలిగినవి. 'అగుదెంచు, అగుర, అగుఁగదే, అగుఁబొమ్ము' మొదలగు రూపములు వ్యవహారమునుండి లోపించినవి.—అడరు, అడరుదెంచు = అతిశయించు; అడరుచు, అడరించు = అతిశయింపఁజేయు; అత్తు = కలుగు (ఇది 'కూడు' అనునర్థమున వ్యవహారమున నున్నది); అరయు = రక్షించు, చూచు; అరుగు=పోవు; అరు (గు) దెంచు = అభిముఖముగ వచ్చు; అఱు = క్షమించు; అఱుపు = దక్కించు; అఱును = ఆక్రమించు, ప్రతీక్షించు; అలఁగు = వెనుదీయు, సంకోచించు, శోకించు, శ్రమపడఁజేయు; అలఁదురు = దుఃఖించు, అలరు = సంతోషించు, అలరుచు = సంతోషింపఁజేయు, అలుకు = భయపడు, అవియు = చెడు, ఇంచు = ఇంపగు, కోరు; ఇడు = ఇచ్చు (ఈ ధాతువు పామరజనవ్యవహారమున 'ఉంచు' అనునర్థమునున్నది, 'ఆడనిడు' = అక్కడ ఉంచు), ఇ (ఈ) లుగు = చచ్చు, ఈఁకు = ఇంకు, ఈఁగు = చొచ్చు, ప్రవేశించు, తొలఁగించు, ఈగు = ఇగ్గు (ఈగు = ఓడు అనునర్థమున వ్యవహారమునఁగలదు. అది 'వీఁగు' ధాతువునకు వికారము. వీఁగుధాతువు గ్రామ్యమని యుత్తమవర్ణముల వా రనుకొందురు. వాఁడు వీఁగిపోయినాఁడు), ఈడు = చాఁగు, జాఱు, పిడుకు (ఈడు ధాతువునకుఁ బ్రేరణరూపముగు 'ఈడ్చు' వాడుకయందున్నది), ఉంకు = ఎగుకు, ఉడుగు = విరమించు (ఇది 'ఉంకి ఉడిగి' అను మాటయందు నిలిచినది), ఉడుపు = ఉడిగించు, ఉదరు = అదరు, చలించు, ఉమియు = ఉమ్ము (రాయలసీమలో నీధాతువు 'మూయు' గా మాఱినది, అక్కడ మూయకు ( = ఉమ్మకు), ఇక్కడ మూసినాఁడు = ఉమ్మినాఁడు; రైలుబండ్లలో 'క్రింద మూయకూడదు' అని వ్రాసియున్నారు); ఉరియు = మండు (వ్యవహారమున 'పుండు ఉరుస్తున్నాది' అందురు); ఉరువు = పరిహరించు, ఉఱు = కూడు, తగు, ఉలియు = ధ్వనించు; ఊఁకు, ఊఁకించు = ఉంకించు, ఉత్సహించు; ఊను = పూను, ఎగచు = పైకిత్రోయు, ఎగ(వ)యు = పైకెగురు, ఎగు (వు) చు, ఏఁచు = తఱుము, ఎడయు = విడివడు, ఎడపు = విడివడఁజేయు, ఎడరు = భగ్నమగు, ఎడలు = విడుచు, ఎనయు = పొందు, ఎనియు = కలిసికొను, ఎయిదు = వెంబడించు, అనుగమించు; ఎరఁగు = సాష్టాంగపడు, ఎరియు = మండు, ఎఱఁగు = దిగు, ఎలయు = చేరు, ప్రవేశించు, కలుగు, పొందు; ఎలరు = ఉత్సహించు, ఎలరుచు = ఉత్సహింపఁజేయు, ఎసగు = వృద్ధియగు, ఎసరు = మీఱు, ఏఁగు = పోవు, ఏఁగుదెంచు = అభిముఖముగవచ్చు, ఏచు = అతిశయించు, ఏదు = నశించు,

ఒందు = పొందు, ఒట్టు = కలుగు, ఉంచు, రగుల్చు, ఒడుచు = ఓడించు (వ్యవహారమున ఒడుచుకొను = అకస్మాత్తుగ బలవంతముగ లాగికొనిపోవు, అను నర్థమున నున్నది), ఒరుసు = కలయు, ఒఱలు, ఱోలు = విలపించు, ఒలయు = వ్యాపించు, ప్రవేశించు, కలుగు, కలయు, చేరు, చుట్టుకొను, ఒలియు = పెచ్చుఊడు, తోలురేఁగు, ఒసగు = ఇచ్చు (ఈ ధాతువు 'ఒసగులు' = కట్నములు, అనఁగా వధూవరుల కివ్వఁబడిన వస్తువులు అను నర్థమున వ్యవహారమందు గలదు), ఓము = కాచు, రక్షించు, కదురు = అతిశయించు, కనలు, కనారిలు = కోపగించు, కమియు = కవియు, కముచు = గ్రహించు, మ్రింగు; కసరు = చలించు, కసుగు = నలఁగు, నలఁచు; పులుము, బాధించు; కట్టు = సమీపించు, కివ్వు = చచ్చు, కెడపు = పడఁజేయు, త్రోయు, చంపు; కెడయు = చచ్చు, కొంచించు = సంకోచించు, కొందు = నజ్జుగనఱుకు, కొదరు = అతిశయించు, చెదరు, రేఁగు; కొఱలు = ఉండు, ప్రకాశించు, పొందు; కొలుపు = ప్రేరేపించు (పురికొలుపు మొదలగు శబ్దపల్లవ ధాతువులందిది సహాయక్రియగా వ్యవహారమునఁగలదు), కొసరు = విజృంభించు, క్రాలు = కదలు, ప్రకాశించు; క్రోయు = విషమముగాచాఁచు, క్రోలు = ఆస్వాదించు, త్రాగు; గీలు = స్రవించు, గెనయు= పుష్టియగు, గెబ్బు = గ్రహించు, చూతు = ధరించు, చిదియు = నలఁగు, చెలయు = విజృంభించు, జొరు = కొట్టు, డిందు = అడఁగు, డొంకు = ఇంకు, ఎండు; తక్కు = తప్పు, విడుచు (ఈ ధాతువు 'తక్కువ, తక్కిన' అను రూపములందు నిలిచియున్నది), తనుకు = కలుగు, జ్వలించు, ప్రకాశించు, తపించు; తలఁకు, తలఁకించు = చలించు; తలఁగు = తొలఁగు, తలరు = చలించు, చింతించు, కలఁగు, సంభ్రమించు, ఒప్పు; తలిరుచు = చిగుర్చు, తాలుచు = తిరికలుచేయు, దారములోనగు వానిని పేను; తిగి (వి) యు = తీయు, ఆకర్షించు; తిగు(వు)చు = తీయు, ఆకర్షించు; తిలకించు = ప్రకాశించు, ప్రసన్నతనొందు, చూచు; తివురు = కోరు, కుతూహలపడు, త్వరపడు, యత్నించు, మ్రాఁగు, కోపపడు; తెండు, తెనమణు, తేఁడు = శయనించు, తెలుచు = మ్రొక్కు, తేయు = అఱుగు, తొడయు = తుడుచు, కడుగు, తొడరు = కలుగు, యత్నించు, సక్తమగు, తొట్రుపడు, అనుసరించు, ఎదిరించు, తొడికిలు = ఒడియు, తొడుకు = పట్టు, ఒడియు, గ్రహించు; తొరఁగు = స్రవించు, ప్రవహించు, పడు, వ్రాలు; తొరలు = కలుగు, తొఱఁగు = విడుచు, దనియు = కూడు, దొరయు = అంటు, సమానమగు, కలుగు, పోలు; దొఱయు = పొందు, దోరు = చచ్చు, నంకు = నేలను కోరాడు, నడఁకు = కంపించు, ననయు = పూచు, నాఁచు = అపహరించు,

నినుచు, నినుపు = నించు (-ంపు), నీఁగు = నివర్తించు, నుడుగు, నోడుగు; నులుగు = చెప్పు, నుసుఁగు = తిరస్కరించు, నునుము = ఆకర్షించు; నెగ(వ)డు = అధికమగు, వర్ధిల్లు; నెగ(వ)యు = ఎగయు, నెమకు = వెదకు, నెరయు = నిండు, వ్యాపించు; నెఱ(ర)వు = నించు, నెఱయు = నిండు, నొగులు = ఎడలు, వికలమగు, నొగులుచు = ఎడలుచు, వికలముచేయు, నోడుచు = తప్పులుపట్టు, నోయు = నొచ్చు, నౌ = నవ్వు, పంబు; పమ్ము = అతిశయించు, పడచు; పడయు = పొందు, పద(దు)రు = త్వరపడు, పసవు; వై. = ప్రలాపించు, పసుకు = ఆగ్రహించు, పంగు. వై. = ప్రయుక్తమగు, ప్రవర్తిల్లు, ప్రసరించు, సిద్ధమగు, ప్రయాణమగు, ప్రవహించు, విహరించు; పరియు = తప్పు, చెడు, విఱుగు, పఱగు. వై. = ప్రసరించు, పఱుచు = పడఁజేయు (వ్యవహారమున నిది సహాయక్రియఁగా మాత్రమున్నది, భంగపఱుచు మొద.) పసఁగు, సాచు=తొలఁగించు, పొంటు=సిల్లిగురునట్లు కూరాకును వండు, ప్రబ్బు=వ్యాపించు, పొ(పో)కారు=నాశమగు, పొకాలు=వెడలు, పోవు; పొగులు=పరితపించు, కుములు; పొదలు=పెరుగు, వర్ధిల్లు, పొనరు=ఒనరు, కలుగు; పొనలు = మండు, పొర(ఱ)యు = కలుగు, పొంగు, పొలయు=ఒప్పు, పొలియు = చచ్చు, పొలుచు = ప్రత్యక్షమగు, కనఁబడు; బడియు = దిగఁదుడుచు, బలయు = పరివేష్టించు, బెరయు = కలుగు, చేరు, వ్యాపించు (ఇది యిప్పుడు 'వెరసి' = మొత్తము అను నర్థమున వ్యవహారమున నున్నది); బెలయు = వ్యాపించు, మడియు = చచ్చు, మసఁగు = విజృంభించు, మాడు = మెలయు, మార్చు = వర్ధించు, ముఱాళించు = దిగఁదుడుచు, మూరు = అతిశయించు, మ్రంగు = క్రుంగు, వ్రాలు, క్రుందు = చచ్చు, నొచ్చు, మ్రాలు = సోలు, మొనరు = ఒప్పు, మ్రేఁగు (-వు) = పూయు, రుత్తు = కొట్టు, రేయు = విజృంభించు, ఱేయు = అతిశయించు, లసుకు = నాశముచేయు, లాఁచు = కవియు, లాయు = ఉద్రేకించు, వందురు = క్లేశపడు, వఱలు = ప్రకాశించు, వాఁచు = ఊఁదు, వాయించు, వాను = కుండలుచేయు, విజ్జు = వ్యాపించు, వీఁగు = ఉత్సహించు, వెప్పు = తప్తమగు, వెంఁజొ = జొరుకొను, వెలలు = వెడలు, సడపు = అపహరించు, సరుగు = పెరుగు, వర్ధిల్లు, సొగటు = వాడు మొదలయినవి.

శబ్దపల్లవధాతువులు.

అంకించు = ఉల్లసిల్లు, ఆడించు, త్రిప్పు, అంగవించు = ఉత్సహించు, అతిక్రమించు, అందంబు గూడుకొను = కలసికొను, అక్కిలిపడు = కలఁతపడు, అగ్గపడు = అగపడు, ఎదుటపడు; అచ్చలించు = ఆగ్రహించు, అడలుకొను = అడలు, శోకించు, అరవాయిగొను = అధైర్యపడు, సంకోచించు,

**అరిగొను** = అడ్డపడు, అరిపడు = అఱుక్రమ్ము = కవియు, ఉల్లాడు = చేరువ చుట్టి చుట్టి తిరుగు (ఇపుడిది 'ఉల్లాడు' అనురూపమున నున్నది); ఉసఘుళించు = ప్రవర్తిల్లు, వ్యాపించు; ఉసలారు = అతిశయిల్లు, ఆగుబ్బతిలు = అతిశయించు, ఆగుబ్బుగొను = అతిశయించు, ఉడటిపోవు = తనియు, ఉలిగొను = అపహసించు, ఇగురొత్తు = చిగిరించు, అనురక్తమగు, ఇమ్ముకొను = వసించు, ఇరులుకొను = చీకటిపడు, ఇఱుముకొను = మఱుఁగుపడు, ఇసిఱింతలువాఱు = చలించు. ఈకొను = అంగీకరించు, ఈటువోవు = వ్యర్థమగు, శూన్యమగు, ఈడఁబోవు = వెనుదీయు, అపక్రమించు; ఈడాడు = మూర్కొను, ఉక్కడఁగు, ఉక్కఱు, ఉక్కుమడఁగు = బలహీనమగు, ఉగ్గడుగుడుచు = ఊపిరి త్రిప్పలేక బాధపడు, తకమకలాడు, ఉత్తలపడు = త్వరపడు, ఉత్తలపెట్టు = త్వరపెట్టు, ఉడ్డాడు = కలఁగు, ఉదరిపడు = అదరిపడు, ఉదియగొను = యత్నించు, ఉదరిగొను = వగచు, తపించు, ఉదిలకొను = పరితపించు, ఉప్పతించు = ఓర్వలేకతిట్టు, ఉప్పరించు = మల్లయుద్ధముచేయు, ఉమ్మలించు, ఉమ్మలికించు = తపించు, శోకించు, ఉర(వ)డించు = వేగిరపడు, ఉరలు, ఉరలఁబడు = దొర్లు, ఉరలఁబాఱు = చలించు, ఉరలుకొను = వీడు, ఉరువడు = నెఱవేరు, ఉలవరించు = తడిచేత నేలయుబుకు, ఉలివాఱు = చలించు, ఊఁకువగు = ఉంకించు, పొందుపడు; ఊపనిఁబాడు = తొలఁగు, పాఱు; ఊరార్చు = ఓదార్చు, ఊర్పోవు = ఊపిరివెడలు, ఊలమాలగుడుచు = తహతహపడు, ఊసరిల్లు = చిక్కు, కృశించు; ఎకదొట్టు = అతిశయించు, ఎక్కాడు = పురికొలుపు, ఎగ్గించు = అనాదరించు, ఎచరించు; ఎచ్చరికించు = హెచ్చరించు, ఎచ్చిరిలు = వర్ధిల్లు, ఎడత్రెచ్చు = ఎడతెగు, ఎత్తుదెంచు = దండెత్తివచ్చు, ఎత్తుపెట్టు = పురికొలుపు, ఎత్తుపోవు = చెడు, ఎరగొను = పరవశమగు, ఎఱగొను = కోపించు, ఎలరారు = అతిశయించు, ఎలుఁగించు? = ఆర్చు; ఎసకొను = వర్ధిల్లు, ఎసరేఁగు = విజృంభించు, ఎసలారు = అతిశయించు, ఎసవెట్టు = పురికొలుపు, ఏతెంచు = ఎదురుగావచ్చు, ఏపటించు = దుఃఖించు, ఏపారు = అతిశయించు, ఒ(అ)డగోలు గొను = అపహరించు, ఒప్పారు = ఒప్పు, ఒల్లగిల్లు = ఆదరింపఁబడనిదగు, ఒల్లఁబోవు = మూర్ఛిల్లు, ఓట(-టా)ఱు = నిస్సత్త్వమగు; ఓటిల్లు = సంకోచించు, ఓటుపడు (-వోవు) = ఓడు, ఓటుసేయు = భంగపఱుచు, ఓలగించు = కొలుచు, సేవించు, ఓలమాసగొను = మఱుఁగుపడు, ఓలాకుపడు = అలయు, ఓహటిల్లు = వెనుదీయు, కడలుకొను = అతిశయించు, కడలొత్తు = వ్యాపించు, కడిపోవు = చెడు, కదుగొను = అతిశయించు, కన్నడించు = ఉపేక్షించు, కప్పరపడు = సంభ్రమపడు, కసిమసఁగు = విజృంభించు, ఖండించు, చంపు, కిక (-క్కి) రించు, కికురువెట్టు (-వైదుచు) = వంచించు, కినువడు =

కోపించు, కుతిలపడు = బాధపడు, పెట్టు=బాధపెట్టు, కెరలుపొడుచు = వర్ధిల్లు, కై సేయు = అలంకరించు, పూజించు, కొందలించు=కలతఁపడు, కొంగొడువడు (-వోవు) = ఒడ్డగిల్లు, ఒఱగు, క్రేడి (-ణి) సేయు = పరిహసించు, క్రేతొట్టు= గట్టారయు, గండరించు = పుట్టు, గండాడు = రమించు, గిలుబుకొను = అపహరించు, గీటడఁగు = చచ్చు, గీటునఁబుచ్చు = అనాదరించు, గుఱుకొను = యత్నించు, గులకరించు = రమ్యమగు = గువ్వకరి (-కోలు) గొను = చుట్టుకొను, గెంటువడు = తప్పు, గొడకొను = అతిశయించు, గొనకొను = యత్నించు; గోరుపులాడు; గోర్పిళ్లాడు = ఎగురవేయు, పుట్టచెండ్లాడు; గ్రక్కతిల్లు = బెదరు, గ్రక్కదలు = మిక్కిలికదలు, చటులువడు=మొక్కవోవు, చిట్టాడు = సంచరించు, చిట్టలువొడుచు = సంభ్రమించు, చుఱువుచ్చు, చుట్టుకొను = కాల్చు, చెంగలించు = అతిశయించు, చెవిచ్చు = నమస్కరించు, చౌకళించు = నాలుగుకాళ్లు పైకెత్తి దాఁటు, జువ్వరించు = విజృంభించు, డవణించు = ప్రవర్తిల్లఁజేయు, కావించు, డవణిల్లు = ప్రవర్తిల్లు, ఒప్పు, డిందుపడు = అడఁగు, శమించు, సమాధానపడు, డొకాణము సొచ్చు = అంతరాళమునఁజేరు, తక్కొను = పూనుకొను, తనివోవు (-చను) = తృప్తిపడు, తుఱఁగలించు, తుఱఁగలిగొను = ప్రకాశించు, అతిశయించు, తూలపోవు = చిన్నపోవు, తొలఁగు = విడుచు, తొలఁగుచొచ్చు (-వోవు) = తప్పించుకొనిపోవు, తోఁతెంచు = కనఁబడు, ఉదయించు, ప్రత్యక్షమగు, వచ్చు, దువాళించు = పరుగెత్తు, దెప్పరిల్లు = ఆపదపడు, దైవాఱు = అతిశయించు, దొందడించు = సందడిపడు, దొరఁకొను = యత్నించు, మొదలుకొను, దొరకువడు = చిక్కుకొను, దొరకొను = లభించు, ననుపువడు = పొందుచేయు, నింగివడు = అస్తమించు, నినుపారు = నిండు, నూలుకొను, నూల్కొను = ఒప్పుకొను, కుదురుకొను, చక్కఁబడు, పురికొను, నెక్కొను, నెలకొను = పాదుకొను, నెప్పరించు = మూదలించు, నెప్పుకొను = పాదుకొను, నెఱపడు = సిద్ధించు, నేటించు, నేటుకొను = దృఢపడు, నేటుసేయు = నిశ్చయపఱుచు, నేలకుఁగోలకుఁదెచ్చు = క్రిందుమీఁదు చేయు, నెడుకొట్టు = మిణకరించు, పనివిను= ఆజ్ఞావశవర్తియగు, పనుగొను = గట్టిపడు, పఱిగొను = బారుతీరు, పరఢవించు = ప్రవర్తిల్లఁజేయు, నడపు, అతిక్రమించు, ధరించు; పరిఢవిల్లు (-ంచు)=ప్రవర్తిల్లు, నడచు, అతిశయిల్లు, పఱిగొను = అపహరించు, పఱివోవు = కొల్లవోవు, నశించు, పలాములుచేయు = పాడుచేయు, పసగరగొను = పీడించు, పిఱువీఁకులాడు = పెనఁగులాడు, పిఱువీఁకుసేయు = పీఁకులాడు, బాధించు, పిఱుఁదుకొను, పిఱుతివియు (-చు), పిఱుదీయు, పిఱువడు (-వెట్టు, -వోవు, -చను)= వెనుకకుపోవు, పిలుకుమారు (-లు) = చచ్చు, పిలుకుమార్చు (-ల్చు) = చంపు,

**పిసాళించు** = ప్రకాశించు, వ్యాపించు, పరిమళించు, పరిహాసముచేయు, **దొంగయెత్తువేయు**; పుల్లగిల్లు = భయపడు, పుల్లనడు = స్తంభించు, పుల్లసిల్లు = వివర్ణమగు, పూఱగించు, నై. = నెఱవేర్చు, పెట్రొలికిక్కు = పెడతెక్కలు విఱిచికట్టు, పెడఁబాయు = ఎడఁబాయు, పెలుకుఱు = విహ్వాలించు, పొంపిరివోవు = అతిశయించు, వర్ధిల్లు, పుట్టు, సంతోషించు, విజృంభించు, ప్రసిద్ధికెక్కు, పొంపెసలారు = ఒప్పగు, పొదవెట్టు = సూచించు పొనరారు = ఒప్పు, పొనుపడు = నిస్తేజమగు, పొరిగొను = చంపు, పొరిమారు (-లు)చు, పొరివుచ్చు = చంపు, పొరిమాలు; పొరివోవు = చచ్చు, పొఱసుపోవు = గాసిపడు; పొటివుచ్చు = కలఁచు, పొటివోవు = కలఁగు, పొ(పో)కారు = నాశమగు; పొ (పో) కారుచు = నాశముచేయు, పొ (పో) కాలు = పోవు, వెడలు; పొ (పో) కాలుచు = వెడలించు, పోకాడు = పోవు, నశించు; బగరంబుసేయు = తొలఁగించు, బడిద్రిప్పు = తిగఁదుడుచు, బీఱువడు (-వాఱు, - పోవు) = వ్యర్థమగు, బుడివడు = తొట్రుపడు, మనికితపడు = దుఃఖించు; మసఁగొను = సంభోగేచ్ఛగొను, ముచ్చిరు = శోకించు; ముదలకించు = మార్కొను, ముదలించు = అడుగు, మునళించు = తిరస్కరించు, మురిగొను = ఖండించు, మురించు = త్రిప్పు, ముఱకటించు = త్రిప్పు, ముసించు = చెడు, మూదలించు = తార్కాణించు, నిరూపించు; మూరిఁబోవు = అతిశయించు, మెయికొను, మేకొను = సమ్మతించు, కలుగు, అనుకూలించు, అంగీకరించు; మేండ్రించు = భేదించు; మేడముపొడుచు = యుద్ధముచేయు; మేడుప(-డ్ప)డు = అజ్ఞతఁబొందు; ర (రె) క్కొను = వర్ధిల్లు; రజ్జలాడు = పరుషోక్తులాడు రహించు = ఒప్పు, వర్ధిల్లు; రాకించు = మోదు; రోటుపోవు = ఈఁచపోవు; ఱెకుమడఁచు = అణఁగఁద్రొక్కు; లాఁతసేయు = ఉద్రేకించు, వంచాడించు = బెదరు, వలకట్టు = అనుకూలపఱుచు, వలచుట్టు, వలగొను = ప్రదక్షిణించు, వాక్రుచ్చు = చెప్పు, వాచఱచు = మొఱపెట్టు, వాచాడు = పరిదేవనముచేయు, విగుర్వించు = చక్కఁగా విఱుచు, విచ్చోటుసేయు = భేదించు, విరివాయు = పాయవడు, వీటఁబోవు = వ్యర్థమగు, వీఁడువాఁడాడు = మాఱుపాటునొందు, వీసరవోవు (-పడు) = కొఱంతపడు, వెలితిపడు; వెగడుపడు = తల్లడిల్లు, సడించు = దంచు, సదమదమగు = నలఁగు, సమకొను = లభించు, సళించు = దుఃఖించు, సెగ్గించు = రోఁతపడు మొదలయినవి.

## మహద్వాచక పదములు

అంకకాఁడు = చలముపట్టువాఁడు, అంగజాల = అంతఃపురపు కావలివాఁడు, అ (వ) ంటుకాఁడు = స్నేహితుఁడు, ప్రియుఁడు; అంపకాఁడు = విలుకాఁడు, అక్కఱగండఁడు = శ్రద్ధగలవాఁడు, అచ్చుకుప్ప = ధనవంతుఁడు,

అడపకాఁడు = తాంబూలపుతిత్తి మోయువాఁడు. అతగుఁడు = దుర్బలుఁడు, అన్నగళ = నపుంసకుఁడు, అన = అన్న, అప = అప్ప, అరిగాపు = కట్టు కావలి, అనఘుళుఁడు = వ్యాపకుఁడు, అళుకరి=భయశీలుఁడు, ఆణికాఁడు = మర్మజ్ఞుఁడు, ఈబరి (గొట్టు) = నిష్ప్రయోజకుఁడు, ఈవరి = ఈవికాఁడు, ఉక్కరి = బలవంతుఁడు, ఉక్కివుఁడు, ఉక్కిఁడు = కపటి, = ఉటంకి (-ంకు) = చోరవకలవాఁడు, ఉత్తి = ప్రతినిధి, ఉటియ=దిట్టతనము కలవాఁడు, ఉలుపి, ఉలుపఁడు=శోఫరోగి, ఊబ=పేడి, నపుంసకుఁడు; ఎకిమీఁడు = రాజు, ఎడపకాఁడు = తార్పువాఁడు, ఎత్తుబరికాఁడు = దొర, ఎలమికాఁడు = స్నేహితుఁడు, ఎల్లాపి = దోఁపిడిదొంగ, ఏతరి = దుర్నయపరుఁడు, ఒజ్జ = ఉపాధ్యాయుఁడు (ఈ మాట 'ఒజ్జబంతి' లో నిలిచియున్నది); ఒడయ (-యు)ఁడు = ప్రభువు, ఒఱటు = దుశ్శీలుఁడు, ఒఱపిఁడి = అయోగ్యుఁడు, ఒళవరి = మర్మజ్ఞుఁడు, ఔజు = పనివాఁడు, కట్టిఁడి=క్రూరుఁడు, కట్టుపకాసి (-సు) శూరుఁడు, అచలుఁడు; కన్నడిఁడు = ఉపేక్షించువాఁడు, కన్నటి = దుఃఖితుఁడు, కఱకరి= కఠినుఁడు, కఱటి = వంచకుఁడు, కిగ్గాడి. వై. = అంగేవ, కుదుపు = కుంటి (ఈ మాట 'కుదుపూకుంటి' అను జంటపదములో వాడుకయందున్నది), కేడ = ధూర్తుఁడు, కోఁచ = పిఱికి, గమికాఁడు = అధిపతి, గాలిగుడ్డు = పేద, గిరస = పంద, పాఱుఁబోతు, పిఱికి; గొంగ = శత్రువు, గొనబుకాఁడు = అందగాఁడు, గోడచేర్పు = జడుఁడు, గోవాళ్లు = యువ, చల్లచప్పుడు = జడుఁడు, చల్లజాపు = భయంకరుఁడు, చెలువుఁడు; = ప్రియుఁడు, చేబోఁడి = నిర్ధనుఁడు, చొడిగాఁడు = బోయ, వ్యాధుఁడు; చోఱవాఁడు = బాలుఁడు, జగిలెఁడు = తోడియల్లుఁడు, జావడి = చాకలవాఁడు, టంపు = నాగరికతకలవాఁడు, ఠంగణా = బాలుఁడు, తుడుపు = త్వరపడువాఁడు, తోరపన-గొఱవి = ఉభయభ్రష్టుఁడు, దరిబేసి = దీనుఁడు, దుడ్డె = బాలకుఁడు, ధూర్తుఁడు; దొంబులిగొట్టు = పిఱికి, దొడ్డకాఁడు = కొల్లపెట్టువాఁడు, దొరకు (-కోలు) సన్యాసి = దొంగసన్యాసి, నంటు = స్నేహితుఁడు, ననుపుకాఁడు = ప్రియుఁడు, నుడువరి= కూటకారి, నెప్పరి = ఉపాయశాలి, నెఱకాఁడు = పూర్ణుఁడు, నెఱసరి = శూరుఁడు, నొడికాఁడు = మాటనేర్పరి, నోరుమెంగ = మూఁగ, పరవాది = ఆత్రగొట్టు; పల్లాయనంబువాఁడు = ఆప్తుఁడు, పాఱుఁడు = బ్రాహ్మణుఁడు, పులుగరి = జాడయెఱిఁగినవాఁడు; పులసరి=గర్విష్ఠుఁడు, పెచ్చారి = మూర్ఖుఁడు, పెనపరి = వివాదశీలుఁడు, పైద = బాలుఁడు, పొడుప (ఁడు) = దుర్జను(డు) పొదడు, పొదిటి = పొట్టివాఁడు, పొలపరి = జాడతెలిసినవాఁడు, పొలమరి = పొలముకాఁపు, పొడువ, పొరుప = దుర్జనుఁడు, పోఱఁడు = పడుచువాఁడు (పిల్లలకథలలోని 'పోలిగాఁడు' వీఁడే), ప్రేవుఁడు = అధికుఁడు, బళాయి =

బలవంతుఁడు; బిగాది = ధూర్తుఁడు, బోగుబడి = దూఁబఱదింకి; మడియఁడు = మూఢుఁడు; మతకరి = మాయావి; మల్లామడి = పీడితుఁడు; మిసిమింతుఁడు = అలసినవాఁడు; ముచ్చిరి = శోకముగలవాఁడు; మురికాఁడు = గర్వి; ములుచ = మూఢుఁడు; మెణకరి = బ్రహ్మచారి; మెఱియఁడు = చలింపనివాఁడు; మేవడికాఁడు = నమ్రుఁడు; మొండరి = జడుఁడు, మొక్కుఁడు, బలిసినవాఁడు; మ్రుచ్చుగోద = పెద్దదొంగ; రజ్జులాఁడు = రజ్జులుపలుకువాఁడు; రుల్చల = జగడాలమారి; వటగ = నేర్పరి; వఱల = వృద్ధతపస్వి; వలఁతి = నేర్పరి; వాసిఁడు = కుబేరుఁడు, విఠాకుఁడు = నిశ్చేష్టితుఁడు; వీఱిఁడి, వేఱిఁడి = అవివేకి, వెట్టను = శత్రువు, వేసరి = బాధకుఁడు; సిబ్బితికాఁడు = సిగ్గరి; సూనరి = చంపువాఁడు మొదలయినవి.

### మహతీవాచక పదములు.

అ (న) ంటుకత్తియ = ప్రియురాలు, అడపకత్తె = తాంబూలపుతిత్తి మోయుఆఁడుది; అలరుఁబోఁడి = పువ్వువలె మృదువైనస్త్రీ; ఇంచుఁబోఁడి = చెఱకువలె మధురమైనస్త్రీ; ఉగ్మలి = స్త్రీ; ఎడపకత్తె = తాంబూలకత్తె; ఎలనాఁగ = లేఁతవయసుగల యమాయకురాలు; ఎల్లాపికత్తియ = దోపిడిదొంగ (ఆఁడుది), ఒజ్జసాని = ఉపాధ్యాయురాలు, ఒడయురాలు = ప్రభ్వి, కలికి = చక్కనిస్త్రీ; కొమ; కొమ్మ = స్త్రీ; కొమరాలు = యువతి, క్రాలుగంటి = ప్రకాశముగల కన్నులుగలస్త్రీ; గట్టివ (-వా) = గట్టిగా మాట్లాడు స్త్రీ; గరిత. వై. = గృహస్థ; గొంజ = గొడ్రాలు, చెలువ = సుందరి; జఱభి = అసతి; దొద్దకత్తి = కొల్లపెట్టుస్త్రీ; ననఁబోఁడి = పువ్వువంటిస్త్రీ, ననుపుకత్తె = ప్రియురాలు; నవల = ఆఁడుది; ననగూఁటి = కామోద్రేకముగల ఆఁడుది; నెలఁత (-తుక) = స్త్రీ; పడఁతి (-తుక) = యువతి; పైదలి = బిడ్డ, పొలఁతి (-తుక) = స్త్రీ; పోఱి = పడుచుది (పిల్లలకథలలోని 'పోలి' ఇదే); ప్రోయాలు = ఇల్లాలు; బోటి = ఆఁడుది; మడఁతి (-తుక) = స్త్రీ; మిసిమింతురాలు = అలసినస్త్రీ; మెఱియత = చలింపనిస్త్రీ; మెలఁతి (-తుక) = మృదువైనస్త్రీ; రజ్జులాఁడి = రజ్జులుపలుకుస్త్రీ; వలఁతి = స్త్రీ; వెలఁది (-దుక) = స్త్రీ; వెల్లాటకత్తె = జారిణి; సిబ్బితికత్తె = లజ్జావతి మొదలయినవి.

### మహతీతరామహద్వాచకములు

### భావ, గుణవాచకపదములు.

అంకము = ఆక్షేపము, అంకిలి రూ. అక్కిలి = కలత, అంజిక = భయము, అంజే = పాదము, అడ్డగింత, ఆపద; అంగద = ఆఁకలి; అంగము = అందము, అక్కటిక (ము) = కరుణ; అగ్గపాటు = ఎదురుపడుట; అచ్చేలము = ఆగ్రహము, అచ్చిక = కొఱఁత, అడియొత్తు = అడికట్టు;

అనరు = సంకటము; అన్నువ = అలఁతి, అల్పము, అరగలి = సందేహము, అరయిక = రక్షణము; అరితి = కూరిమి; అరిది = అశక్యము, అ(న)ర్మిలి = ప్రేమ, అఱిముఱి = సంభ్రమము ; అఱ్ఱేము = అజీర్తి; అలుకువ = కోపము; అరవాయి. వై. = అధైర్యము; సంకోచము, అవఘశము = వ్యాపనము; అసము=చేనవు, దర్పము, వై. యశము; అళుకు = భయము; ఆగుబ్బ = అతిశయము, ఆరడము = పూనిక, ఉత్సాహము; ఆదట = ప్రేమము, ఆ(హా)వడి (ళి) = ఉపద్రవము; ఇట్టలము = అగ్గలము, అధికము, ఇసిఱింతలు = చలనము; ఈటు = వ్యర్థము; శూన్యము; ఈలువు = పాతివ్రత్యము; ఉక్కివము = కపటము; ఉక్కు = బలము; ఉ (ఊ) డిగ(య)ము = దాస్యము; ఉడుకువ = విరతి; ఉత్తలము, ఉత్తలపాటు = త్వర, సంతాపము, ఉత్తి = ఈసు, ఉదరిపాటు = అదరిపాటు, ఉదిల = పరితాపము, ఉదుటు = ఉద్ధతి, ఉనుకువ = ఉనికి, ఉప (ప్ప) వడము = మేలుకొనుట, ఉప్పత = ఓర్వలేనితనముచేత ఆడిపోసికొనుట; ఉమ్మలము, ఉమ్మలిక= సంతాపము; ఉరవడి = అతివేగము; ఉఱవు. వై = ఔచిత్యము; ఉఱిది = దార్ఢ్యము; ఉలగ(వ)రము=తడిచేత నేలయుబుకుట; ఉలివు = మ్రోఁత; ఉవ్వు=పూనిక; ఊఁక = ఊఁగులాట; ఊఁకువ, = ఊనిక, పూనిక; ఊర్పోక= ఉబుసుపోక; ఎగపు=గర్వము; ఎగవు = ఎగురుట; ఎడమడుగు=వ్యత్యాసము; ఎడయిక = ఎడఁబాటు; ఎడరు = భంగము, ఎడ్డమి(-ము) = అడ్డంకి, విరోధము; ఎత్తికోలు = ప్రయత్నము, ఎనిక = ఎన్నిక, ఎఱచి = మాంసము, ఎరఁగుడు = సాష్టాంగపడుట, ఎఱబఱికము = రోఁత, ఎఱుకువ = జ్ఞానము, ఎలగోలు = కలకలము, ముందునడచుట, ఎలమి = సంతోషము, ఎలరువు= సంతోషము, ఎస = ఆధిక్యము, ఎసకము = వృద్ధి, ఏడ్తెఱ = అతిశయము, ఏతు = ఉద్ధతి, ఏదుడు = విడుపు (అని ఒకరు, ఇంకను విచారింపఁ దగినది. శ. ర.); ఏస = విజృంభణము, ఒంజి (- ంది)లి = దుఃఖము, ఒంటరము = విరోధము, ఒక్కెఱ. వై. ఉగ్రభావము, ఒ(పొ)చ్చెము = న్యూనత, అవమానము; ఒడికారము = ఉద్రేకము, ఒల్లమి = అంగీకరింపకుండుట, ఓట, ఓటమి = భయము, ఓటము, ఓటు, ఓటుపాటు = అపజయము, ఒలచెంగనాలు = భయము; ఓలాకు = అలయిక, ఓహటము = వెనుదీయుట, కంపు = వాసన, మంచివాసన; కడఁక = ధైర్యము, కడిఁది=ఆపద, కడిమి=అతిశయము, కనుకలి = సంభ్రమము, చూపు; కన్నడ, కన్నశివు = ఉపేక్ష, కన్నఱ = దుఃఖము, కప్పరము = తొట్రుపాటు, కరణి = విధము, కఱకఱి = బాధ, కలఁకువ = కలఁత, కలఁగుండు = కలఁత, క్షోభము; కసిఁడి = అల్పము (శూద్రుళలో 'కసిన్ని'; వ్యవహారమున 'కాస్త'); కసిమసి = తొట్రుపాటు, కళ =

మూర్ఛ, రెమ్మ; కాంతాళము = ఈర్ష్య, తాలిమిలేమి; కాయువు, కాయ్వు=
రక్షించుట, కాఱోడ్డెము = పరుషోక్తి, కావలము = పాపము, కక్కస =
మిక్కిలి కదియిక, కిముడు = అల్పము, కుతిల, కుతిలపాటు = బాధ; కెడయిక,
కెడవు = చచ్చుట, కెలవు = అనురాగము, కేరడము = ఉపేక్ష, తిరస్కారము;
కైసేఁత = అలంకరణము, కొందలము = కలఁత, కొడిమె=అపదూఱు, పాపము;
కొఁద = కొదవ, కొమరుఁదనము (ఁబాయము) = యౌవనము, కోలుతల =
ఎదుటనిలిచి యుద్ధముచేయుట, క్రొవ్విడి (-ణి) = ఉన్నతపదము, పరిహాసము;
గచ్చు = కాంతి, గరుసు=మర్యాద, మేర (నేఁటివ్యవహారమున గరుసు=బెట్టు);
గిటగిటన = అల్పము, గిలుబు = అపహరణము, గెగ్గలు = గేలి, పరిహాసము,
గెలుపము = గెలుపు, గొద = ఆఁకలి, గొదగొద = విరోధము, గొనబు =
అందము, గోహరు = ఉపద్రవము, గోహరి = పరాక్రమము, గౌలు = దుర్గం
ధము, గంధము; చిచ్చుఱ=అగ్నిమయము, విణ. చిట్టంటుచేఁతలు = విలాసము,
చిదగొద=భేదము, చిలువాయనము=చిల్లర, క్షుద్రము. చూడికి, చూడ్కి =
చూపు, చేడ్పాటు = నాశము, చేయలఁతి = సమీపము, చేవలఁతి = అధీనము,
జద్దు=కఠినహృదయత్వము, జోదురజోదురంబు = మిక్కిలి చాతుర్యము, జోదు
రము=అపౌరుషము, జోఁక=తత్తఱపాటు, డిందుపాటు=అడఁగుట, శమించుట,
సమాధానపడుట; తనకలి=చిక్కులుపెట్టుట, తనుపు=తాపము, తనివు=తృప్తి,
తమి=త్వర, తలిరుపు = చిగుర్చుట, తాపి=మర్మము, జోడ; తివుట = కోరిక,
తీఁపురము=ఆగడము, తుఱఁగలి = ప్రకాశము, తొడరిక=పూనుట, తొడుకు=
ఆవు, దొంగమేఁత; దగర, దగరము = మోసము, దనివు=కూడిక, దువాళము,
దువాళి=గుఱ్ఱపుపరుగు, దెప్పరము=ఆపద, దెప్పళికము=దుస్సహము, దొందడి=
సందడి, దొరకోలు=లభించుట, దోయిడి=శూన్యము, రిత్త; నంటు=స్నేహము,
ననుపు=స్నేహము, నయ=అందము, నలువు=ఒప్పిదము, ననగూఁడు = కామో
ద్రేకము, నాఁచికోలు=అపహరించుట, నిక్కము, నిక్కువము=నిజము, సత్యము;
నిక్కల=నిజము, నిగ్గడి=కఠినము, నీరుపంది=ఆలస్యము, నుడుగు(వు) = మాట,
నులుసు=న్యూనత, నూలుకోలు=ఒప్పుకొనుట, ఎఁజిలి=మనోవ్యథ, నెక్కొలు=
పాదుకొనుట, నెగపు(వు) = ఎగురుట, నెగు(-వు)లు=బాధ, నెట్టె=ఉద్ది, నెనరు=
ప్రేమ, నెప్పరము = వేగము, నెమకుడు=వెదకుట, నెమ్మి(క) = ప్రేమము,
నెర(ఱ)వు = పూర్తి, వ్యాపనము; నెరి = వక్రత, నెఱి = అందము, నెవ్వ =
దారిద్ర్యము, నేటు = నిశ్చయము, నేరమి = తెలియకపోవుట, నేరిమి=నేర్పు,
తెలియుట, నొడలదొంతి = సందేహము (ఇది కృత్రిమపదమేమో), పంతు =
మేలిమి, పగిది = విధము, పటవణి = వ్యాపారము; పదటము, పదటు=ఆత్రము,
పదడు=బూడిద, భస్మము; పరువడి=పర్యాయము, పరువము. నై. = ప్రాయము;

పఱు=సమూహము, పఱి=విధము, పఱిపఱి=పీడితము, పలపలన = నైర్మల్యము, కార్శ్యము; పల్లాయనము, వై.=ఆర్తత, పొనలు = సందేహము, పిఱుము = పరుషభానము, పెలుచే(న) = అతిశయము, పెల్లిదము = పెల్లు, పొంతము = పొందు, స్నేహము, పొనుపు = పరాక్రమము, పొరిచూపు = ఉగ్రదృష్టి, పొలపము = వ్యాపనము, పోకు = నడువడి, ప్రావ = పద్ధతి, బగళము=తోలఁగుట, బలకరము = కావలి, బలువిడి = విధము, బవిరి = గుండ్రము, బారాది= అధికము, బిమ్మిటి = వివశత, బుడిబుడి = తొట్రుపాటు, బెరికి = కొఱఁత, న్యూనత, బెరుకు = భేదము, బైజే = అజ్ఞానము, బైసుక = నియమనము, ప్రతిజ్ఞ; బోగు = పూనిక, బ్రాఁతి = ప్రేమ, అధికము, దుర్లభము; మండాటము = సంతాపము, మతకము = మాయ, మనికితము, మనికితపాటు = దుఃఖము; మల్లగుల్లము = వాదులాట, మల్లడి = పరితాపము, మల్లామడి = పీడితము, మస = విలాసము, మసకము = సంభోగేచ్ఛ, సంభోగము; మసరు= ఆవేశము, మాడికి (-డ్కి)=విధము, మీసరము=శ్రేష్ఠము (?), ముదల=ఆజ్ఞ, ముప్పు = వార్ధకము, ముప్పొత్తులు = అశ్రద్ధ, మురి=గర్వము, ముఱకటము= త్రిప్పుట, ముఱకము=నిక్కు, ఉద్ధతి; ముఱి=అల్పము, ముసి=బొంకు, మూదల, మూదలిక=తార్కాణము, నిరూపణము; మెడిదము=ధ్వని, మేగలి = పూనిక, మేముసు, మెయికోలు, మేకోలు=సమ్మతి, మేమెయి=అనాయాసము, మేవడి= నమ్రత, మేడము. వై. = కూడిక, మైదు. వై. మాయ, మైపోక = తేలిక, మొగి. వై = పూనిక, మొఱక = న్యూనత, మొఱకడము = దౌష్ట్యము, మోపాది = అపాయము, రజేన = గడన, సంపాదన; రజ్జన=ఆత్మస్తుతి; రజ్జులు= పరుషోక్తులు, రావడి = ఉపద్రవము, రహి = సంతోషము, రుత్త = నాశము, రెంట = రెండగుట, ద్వైవిధము; రెప్పము = పూర్ణము; రొంజుడు, రొండుడు, రొడ్డుడు, రొల్లుడు = ప్రలాపము, రొక్కారొక్కములు = బహువిధములు, ఉచ్చావచము; రోటు = ఈఁచ, ఱోచ్చు = తిరస్కారము, లత్త = దెబ్బ, ఆపద; లలి = క్రమము, ప్రేమ, లవణి = బిగువు, లాఁత = ఉద్రేకము, లాఁతు = అధికము, లివ = లాఘవము, లులి = తక్కువ, లెప్ప = గుఱి, లక్ష్యము, లొగ్గడి = కలగుండు, క్షోభము; లొజ్జు = తక్కువ, లొల్లి=తఱచు, ఘనము, వండ = ఆపద, వటారి = సమర్థము, వయ్యము = వ్యర్థము; వరఁకు, వరను = చిక్కు, వరబడి = కఱవు, వలదు = ఆధిక్యము, వళావళి = కుతూహలము, వాజే=రోఁత, వాని = వాఁడి, వాలాయము = నిర్బంధము, నిరంతరము (వాలాయించు = చెప్పినమాట వినిపించుకొనక తప్పుపనిచేయు అనునర్థమున వ్యవహారము కలదు); విడి=అరుణకాఁతి; ప్రతాపము, క్రోధము; విడిగోలు= మాఱుపు; వితా = వ్యర్థము; విరిపోటు=భేదము; వీఁక = ఉత్సాహము; వీసర=

కొంతెంత, వెలితి; వెంటము = వేడుక, కుతూహలము; వెంపర, వెంబర = పీడనము; భేదనము; వెగడు = తల్లడము; వెడ్డు = కపటము; వెతాలము = దుఃఖము; వెరవేకి = విరహతాపము; వేదుఱు = ఉన్మాదము; వేదు = వికట గంధము, గంధము; వేలిమి = హోమము; సంచు = జోడ, అందము, సజ్జకము = మనోజ్ఞము; సదమదము, సదసద = నలగుట; సదాటు = దృఢము; సమకోలు = లభించుట; సిబ్బితి = సిగ్గు; సెగ్గము, సెగ్గింపు, సెగ్గు = రోత; సైకము = సూక్ష్మము; సొరపు = కృశము; హాళి = ఆసక్తి; హొరంగు = విలాసము మొదలయినవి.

## మల్లబంధములు.

నాటి వ్యాయామ పద్ధతి, మల్లుపోరు, యుద్ధసరణి మొదలయిన వన్నియు నేడు మాసిపోయినవి. ఈ క్రింది మల్లబంధము లెట్టివో నేడు తెలియదు:—

ఉత్తరడొక్కరము, ఎడమడువు పరువడి, ఒంటియడుగు కత్తెర, కన్నాత; కాసెనిల్కడ, కుడియడుగుపరువడి, తడకాలు, దాటడుగుపరువడి, దాటడుగు మొన, దివిదారికొమ్ము, నఖకుపరువడి, పరిచాళిక, పిల్లమెలను, పిల్లేరు గంతు; పెట్లాగు; మొనగాలు; రొండినేట్టు; లోబిత్తరి; లోమొన; విసరు మొన; వెలిబిత్తరి; సందుసీసము; సరిబిత్తరము మున్నగునవి.

## భక్ష్యవిశేషములు.

ఈ క్రింది పూర్వకాలపు భక్ష్యము లెట్టివో తెలియదు:—ఇంచుమంచి; ఇడికుడక; ఉట్రవడియము; ఏలకికాయ; కడియపుటట్టు; కలవంటకము; చక్కెరబుగడ; చల్లకడి; చాపట్టు (నేటి 'చప్పాటీ' లేమో); తేనెతొల; నాన్తెల; నీగొట్టు; పాలకన్ను; పిండివంట; పూసకజ్జెము; పోకవేరు; బరిడెగవ్వ; వామనగాయ; వామనగొమ్ము; వెన్నపడిదము; వెన్నమెఱుగు; సారెసత్తులు మొదలగునవి.

## ఇతరములు.

అంక = ప్రక్క, పార్శ్వము; అంకెము = ఎద్దు మొదలగు వానిపై నొక పార్శ్వపుభారము (ఇప్పుడది 'గోనెసంచి' అను నర్థమున 'గోనె అంకెము' అని వ్యవహారమున నున్నది), అంకెవన్నియ (-న్నె) = గుఱ్ఱము నెక్కుట కిరుప్రక్కల నమర్చిన యినుపమెట్టు; అంగడి = అగసాలె పనిచేయుచోటు, కొలువు కూటము, సభ, న్యాయసభ (ఇప్పుడది 'సరకులమ్మెడుచోటు' అను నర్థమున మాత్రమున్నది), అంగమచ్చము = అడియాలము = గుఱుతు, అంచల = ప్రక్క,

అండ=ప్రక్క, అండియ(-ండె)=వసంతము లాడెడి క్రోవి; అండియ (-ండె)ము=అంకియము అకరు=తామరలోనగు వానిమద్దు; అక్కలి=అల, తరంగము; అజ్జ=అడుగు,పాదము; అట్టియ=గుంపు, సమూహము; అడ్డసాళులు=పాచికలు; అన=ఆనకట్ట; అన్న, అనరు=మర్మము, జీవస్థానము; అనుసు=గదికు వేయు ఇనుపక[illegible]యము; అమ్ము వేటు నేల = అమ్ముల యుపయోగము తగ్గిన యీకాలమున నీ పదమున కంతగా ప్రచారములేదు. అ(న)జవ=గొడ్డావు; అఱుదెవులు = క్షయరోగము; అఱుతి=సమీపము, అఱ్ఱు=మెడ (ఇది 'అందని పండ్లకు అఱ్ఱులుచాఁచుట' అను నానుడియందు మిగిలి యున్నది), అలవరి = అలంగము; వప్రము; • అవదు = బలహీనమైన (ఈ పదము తెనుఁగున నుండెనో లేదో విచార్యము. 'అమ్మునం దవదు పాములమోవను' అని నన్నయభారతమున గరుడోపాఖ్యానమున ముద్రితప్రతులలోఁ గాన్పించుచున్నది. వ్రాఁతప్రతులలో 'అమ్మునం దెపుడుఁ బాములమోవను' అని యున్నది) అసివాఱు = వాహ్యాళి (ఇది పెర్షియనుపదము; ఒకప్పుడు భాషలోనికి వచ్చి జాఱిపోయినది); ఆమని = వసంతర్తువు, ఋతువు; ఆవిలి = మాంత్రికుఁ డుపయోగించు కాచపాత్రవిశేషము; ఆళువరి చూ. అలువరి = అలంగము, వప్రము; ఇక్కము=ఇరుకటము; ఇక్కువ = ఉనికి; ఇరులు = చీఁకటి; ఇఱుము = మఱుఁగు; ఇఱ్ఱి = జింక; ఇఱ్ఱిగోరజము = మృగనాభి; ఇఱ్ఱియలు = ప్రక్క, పార్శ్వము; ఇలి = అర్థమేమో తెలియదు—పాముకు బలి ఈఁగకు ఇలి చిక్కదు, అని నానుడి; ఇల్లము = రెండు పలములు; ఇల్లి = ఉపవాసము; ఈకువ = తడి, ఆర్ద్రము; ఈగడ=జాడ; ఈమిరి = తడి; ఈరువారు. చూ. అసివాఱు; ఈఱతాఱలు = వక్రము, పరుషము; ఈఱమి(-ము) = చెట్ల, పొదలసమూహము; ఉంకువ=కానుక, ఉక్కణ(-ళ)ము = కావలి, రక్షణము; ఉగము = ఆయువు; ఉగ్గుడు = మేర, మర్యాద; ఉజ్జువకల్లు = అగ్నిపర్వతమునుండి వెడలినఱాయి; ఉట్రవడియము = ఒకవడియము; ఉడివ్రొవు = తొలఁగు; ఉదియ = యత్నము; ఉదిరి = అపరంజి; ఉప్పలవాయి = బొట్టస జుట్టన వ్రేళ్లనడుము; ఉప్పలి = కీడు, ఆపద; ఉ(హు)రుముంజి = ఒక దేశము (Ormuz); ఉల్లము = హృదయము; ఉల్లఱము = మనస్సునకు సహింపగూడనివి; ఊఁపురము = మూఁపురము; ఊళప = అడవిలోని చెట్లగుంపు; ఎకి(-క్కి) రింత = వాహనము; ఎట్టపోగు = దండు; ఎడ=స్థానము, హృదయము (ఎల్లెడల) అను సమాసమున స్థానార్థమున 'ఎడ' వాడుకయందున్నది), ఎడఁద, ఎడ్డ = హృదయము; ఎడ్డెన = భోజనపాత్రము లుంచుకొని భోజనముచేయు ఎత్తుపీఁట; ఎత్తనఁగోల = గోనెలెత్తి యెద్దులమీఁదవేయు సాధనమైనకఱ్ఱ. ఎత్తనఁగోలు = మొదలు, ప్రారంభము; ఎన = సమానము, సామ్యము; ఎల్లి = గొడుగు, ఛేపు; ఏగుపెండ్లి = పెండ్లియూరేగింపు; ఏదడి =

ఒకదినుసు ఎలుగుగొడ్డు; ఏరాది = ఒక గుఱ్ఱపుజాతి; ఒంటెపులి=ఒకమృగము; ఒగిదిగ = జపబిల్ల; ఒడపి = గండి; రంధ్రము; ఒడమి = ధనము; ఒడిపిలి = ఆహారవిశేషము; ఒరిగ = నమస్కారము; ఒఱవ = వంకర; ఒఱ్ఱు = గొప్పది; పెద్దది; ఓగి(యి)రము=ఆహారము (ఇది ఆఁడువారి పాటలలో మిగిలియున్నది); ఓమటి = అన్నము; ఓరవలి = వన్నె; ఓలగందము; = పూఁతపసపు; ఓలగము = కొలువు; ఓలము, ఓలిమి = వృక్షాదులచే మఱుఁగైనచోటు; దేహము; ఔజు = కాలువ; కంపె, కుంపె = తాంబూలపాత్ర, కచ్చు = ఱేకు; గర్వము; సిగబంతి, పెద్దవాసాము; కటుమరలు = చెక్కిళ్లమీఁది భాగములు, హనువు; కడలి = సముద్రము; కడలు = అల; కడవతీటు = వాద్యవిశేషము; క(ళ)వసము, కడా(ళా)సము = తోలు; కడాని = బంగారము; కడిమిడి = పచ్చికగల నేల; కణఁకు = ఇంగలము; కర = తీరము; కరడు = అల; కరి = మేర, సాక్షి; కరిది, కవడ = చర్మవాద్యవిశేషము; కలము = ఓడ; కలిమము = మాంసము, కలు=ఱాయి (ఇట్లు ద్విత్వలకారము లేకుండఁ బ్రత్యేకముగ లేదు; సన్నెకలు; రోఁకలి; వడగలి; మొదలగువానియం దున్నది); కవడె, ఉరుమ = తప్పెట; వాద్యవిశేషము; కవఱలు = పాచికలు; కాఁచారి; కాఁదారి మాదారి = అర్ధరాత్రము; కాపంతము = కుక్కనుగట్టెడుకొయ్య; కిరుసు = కత్తి; కిలాతము = గుఱ్ఱము; కురుజు = జున్ను; బాణపుసంచుభేదము; కుఱుకు = ప్రోవు, రాశి; కూచము = గూటము; స్తంభము; కెడ = పార్శ్వము; కెలను = ప్రక్క; కెళవు = దూరము; కొట్టె, కోటి = వేగు; కొణత = కుక్కనుగట్టెడు కొయ్య; కొణిఁగె = దిబ్బ; కుప్ప; కొమ = శాఖ (మకారద్విత్వము లేకుండ వ్యవహారము లేదు); కొరి = తెప్పనడిమివెండ్రుక; కోపు = నమస్కారము, నాట్యముతీర్పు, నిమిత్తము, విధము, సమయము; కోలము = వేషము (ఇప్పుడిది 'వేళాకోళము'న మిగిలియున్నది); కౌను = నడుము; క్రేవ = ప్రక్క; క్రేవు= సింహనాదమునందగు ధ్వన్యనుకరణము; క్రేళ్లు; బ. = ఉన్నతి; గండరువు = ఉన్నతి; గండారు = చెఱసాల; గద్దువ = గడ్డము; గనయము = పోఁకముడి; గమి = సమూహము; గరగడ = ఒకవిధముగుపాత్రము; గరువు = చెంప; గాలి. వై. తిండి; గిడియ = ఒక పటహము; గిడ్డి. వై. ఆవు; గీము. వై. ఇల్లు; గునామొలనూలు = బిడ్డలమొలనూలు; గుమికాఁడు = కాకి; గుబ్బలి = కొండ; గుమ్మెట(-త) = ఒక వాద్యము; గురు = ఒక జంతువు, గవయము; గురుసు, గుటికొండి = జీవస్థానము; గెంటసము = పరుషవచనము; గెడ = జత; సమీపము; ఒక వేఁటసాధనము; గొను, ఏనుఁగు; తమ్మటము = పెద్దకాళె; చకటి= కార్యము; దిక్కు; స్థానము; చట్టువ = ఱెక్క; చేదలు = ఆకాశము; చేదుకు= బురద; చేనుప = బిడారు; చోనపి = కలయంపి; చింధము = శంఖము; చిందిలి=

చలించినది, చిట్టంటులు = నఖదంతక్షతాదులు; చోదుగు = చెమ్మ, తడి; చోదుము = ఎండిన అరఁటిపట్ట; చౌకళింత = గుఱ్ఱము నాలుగుకాళ్లమీఁదను పరుగెత్తుట; జంగియ, జంగె = ఒకవిధమగు గజ్జె; జంగిలి = గోసమూహము; జరబు = పేలపిండి; జల్లి = సవరము, చామరము, కుచ్చు, జాలరు, కొప్పువల; జానము = గుఱ్ఱముమీఁది మెత్త; జావళిను = గుఱ్ఱపుతట్టు, జాళియ; జాళె, జాళెము, జాళియము = అశ్వగతివిశేషము; జోడఁగి = వేఁటకుక్క; జోడన, జోనక = అశ్వగతివిశేషము; జోబిల్లు = నమస్కారము; జోవ = జోలపాట; టెక్కి = చాసరికుళ్లాయి; డగర = పిశాచము; డగరము = కీడు; డాబ=జందెము వలె వేసికొనుతోలుపట్టె; డింగిల్లు=నమస్కారము; డెందము = హృదయము, ఉల్లము; డెప్ప = కొండనెత్తము; డొాకారము = అంతరాళము; తముకు = చర్మవాద్యము; తఱటు = కొరడా; తలము = ఏతము; తలిరు = చిగురు; తాజు = కుళ్లాయి; తాలిక = మెలిక; తీరుకు = ఒకనాట్యగతి; తేఁటి=తుమ్మెద; తోవ = కోణిగ, వలభి; దాళు = వర్ణలేశము, దోమటి=అన్నము; దెబ్బాటు = బలిష్ఠమైనవాన; దొడ్డ = కొల్ల; దోర = రాశి; నటవాలు; నట్వాలు=అశ్వగతివిశేషము; నడగఁడు = గుఱ్ఱము (కృతకమా?) నన = పువ్వు; ననకారు = వసంతర్తువు; ననసీరు = పూనీరు; నన్న = కుఱుచ; నరగ = వాద్యవిశేషము; నరియఁడు = నక్క; నఱుజు = అణువు; నల్ల = నెత్తురు; నల్లె = ? (శ. ర. కారునికిని దీనియర్థము బోధపడలేదు. "అంటసిల్లు" అనుపదము క్రింద నాతఁడీపద్యము నిచ్చియున్నాఁడు. "క. నేలకు నల్లెఁడు పొడవునఁ, గ్రాలుచుమును మెఱయుగురుని రథచక్రముల, క్కాలంబున సమరజయ శ్రీలోపము దెలియ నంటసిలఁబడియె నృపా.") నామరులు = పాచికలు; నింగి = ఆకాశము; నింట = జలపూరము; నిట్ట = ప్రవాహము; నిట్టు = ఉపవాసము, హోమము; నీఱు = భస్మము; నుజ్జు = క్షతినొందినది, నుడి = మాట; నుసము = కనరు; నెడిమె = ద్వీపము; నెత్తకమ్మ = పాచికల పందెము; నెత్తఱులు = పెద్దయలలు; నెత్తురుఁబ్రొద్దు = సంధ్యాకాలము; నెనడు = ఎముకలలోని క్రొవ్వు; నెప్పు= స్థానము, స్థైర్యము, ఉపాయము, గుచ్ఛము మొద. ; నెఱఁకు, నెఱను = మర్మము, జీవస్థానము; నెలగ = ధనము; నెలకట్టు = ఱాతి కట్టడపు నేల; నెలకువ = స్థానము; నెలవత్తి = పచ్చకర్పూరపు పలుకు; నేవళము, నేహారము = మణులుగ్రుచ్చిన హారము; నోడి = మాట; నౌకు = మొత్తు; పంగిడి, పంగెన = ఓదము, అవపాతము; పంచేకము = గుఱ్ఱపు వెనుకభాగము; పంచకరపాట్లు = అత్యధిక దుఃఖములు; పంజుల కమ్మలు = ఒకనగ, పడఁకు=సందు; పడఁత = హనువు; పడలు = రానులు; పడివాగె = గుఱ్ఱపు ఒక అలంకారము; పదచాళి = ఒక నాట్యము; పర = కంటిపొర; పరిక = మ్రుగ్గు, పరంగీలాగి =

ఒక కెంపు; పరఁట = ఏఱుఁబడుక, పర(న)ఁటి = వంటకుండ, పరచి = ఎరవు, యాచితకము; పరిసెనము = పక్షిగంతు, పఱగడ = ఇతరస్థలము, పార్శ్వము, పిర = కానిలో నాలుగవ భాగము, పుస్తు = దుర్గంధము, పూనె = బరణి, పొంగిలి = వక్షుల యాహారము, పొక్కు = గుఱుతు, పొదక = పెద్దధ్వని, పొన్న = దృగ్గోచరమైనది, పొన్నట్టు = అబక, చట్టువము; పొరచి = చేబదులు, ధనము; పొఱడు = గూను, పోరచి = కానుక; పోసనము = పాలు, వైపూఁత; ప్రవ్వ = కుండ, ప్రేపు = వేకువజాము, బంపు = పండ్లపాఁచి, పాఁకుడు; బగ్గి = బూడిద, బజ్జడి = ఒక నాట్యము, బడిలి = రంధ్రము, బడుగు = శవము; బదరికము = పెట్టె, బరువడి = గజ్జె, కింకిణి; బవిర = ఒక కర్ణాభరణము, బుజ = కుండలీకరణము, బూద = పాలకుండ, బేరజము = కుత్సితపు నడక మొదలైనవి. మడ = ప్రవాహమార్గము, మడ్డు = ఇనుపగుండు, మల్లరము = మదించినది, మిడియ = వేదవాక్యము, మిమ్మటము = మిక్కుటము, ముంగ( -ంగా, -ంగయి, -ంగై ) ముర(-రా) ము(-రారి) = ఒక విధమగు చేతి కడియము, ముబ్బె = నితంబపార్శ్వము, మురాళము = దిగఁదుడుపు, మువ్వంచ = మూఁడుపంచలు, మువ్వంటులు = నెలకులోపలి మూఁడు పురుడులు, మెణత = మెల్లె = చివక, మెయిపాలు = సమభాగము, మెఱియ = గుండ్రాయి, మేదావి = ఔపాసనాగ్ని, మసి, మొక(క్క)రము = స్తంభము, మ్రందిలి = నొచ్చినది, రాయిడిగిడిగిడి = ఒకవాద్యము, రేపకడ, గేపాడి = ప్రాతఃకాలము, లట్టు = పడియ, గాఁడి; లపక = ధనము, లాలు = ఎఱుపు, లెంట = పటికము, లేవ = గుఱ్ఱపు తలాటము, లొంక = కోన, లొండు = జలాశయవిశేషము, లొంప = అల్పగృహము, లొటారము = బొక్క (ఇది నేఁటి వ్యవహారమున 'లోపల లొటారము, బయట బటారము' అను నానుడి యందు నిలిచినది.) లొద్ద = ప్రోగు, రాశి, లొద్ది = లోయ, వంటెము = ఒకని క్రింది రాజ్యమునందు కొంతభాగము; వటారము, వటారు=నగరు; వయ్యాంది= కుంపటి; వఱువాతన్=ప్రాతఃకాలమున; వలతి = స్థానము; వలి = శైత్యము; వాడ = తావి; వారువము, వారము = గుఱ్ఱము; విడిముడి = ధనము; విరి = పువ్వు; వెంచ = మడుగు, హ్రదము; వెంట = కార్యము, విషయము మొదలయినవి. వెడ = అల్పము, వెన్నమడుగు = వస్త్రవిశేషము; వెన్నెలకోలు = నమస్కారము; వెఱక = వెండ్రుక; వెలుచ = పాము; వేనలి. వై.=జడ; వేలిమికట్టె = సమిధ; వేవిలి = పొలము; సంబళిక, సంబెళ = వక్కాకులతిత్తి; సగ్గిసముగ్గిసలు = ఉడ్డుగుడుపు, సజ్జనకోల = బెత్తము, సడికియ (-కె)=కుక్క మెడత్రాడు; సబ్బండు = అనేకభేదములుగలది, ఉచ్చావచము; సరబడీ = ద్వారము, సవ, సొవ = జాడ, సావి=కాలము, సీవిరి = వింజామరము, సుద =

తుద, సూడిగములు = గాజులు, సూరెలు = పార్శ్వము, సెర = నేత్రము నందలి రేఖ మొదలయినవి.

## పూర్వకాలపు యుద్ధమునకు సంబంధించిన పేళ్లు.

అంపకోల = బాణము; అని, ఎసలు, పడవ=యుద్ధము; అరిగ, దడిగ = కేడెము; ఉండసురియ, ఒడ్డగ, కొఱడు (కోల), దగరు, దోదుమి (మ్మి), సబిడీ సామంతరాగోల = ఆయుధవిశేషములు. కత్తళము, జీరా, జోడు, = కవచము; కత్తళీఁడు = కవచి; కాలరి = కాలుబంటు, కోవురము = శత్రువులను పట్టుటకు పొంచుట; క్రందుకయ్యము = ద్వొమ్మియుద్ధము; గాజాపరుజు = ఒకవిధమగు ఖడ్గము; చదలము=సైన్యము; టక్కెయము, టక్కెము, పడగ = ధ్వజము; తవిణ, డవిణ = డంకా; డా (దా) వరడంగి = ఫిరంగి, డొంకెన = ఒక ఈఁటె; దం (దెం) చనము = పెద్దఫిరంగి; దెప్పము = బాణాదులకెదుట నుంచిన కృత్రిమలక్ష్యము; దోఁటమ్ము = వంకరబాణము; న (నా) రాజి, నేజ (జా) = ఒకకత్తి; నఱుకుపరువడి=శస్త్రవిద్యావిశేషము; పడవాలు, పడాలు= సేనాధిపతి (ఇదియిప్పు డింటిపేరుగమాత్రమున్నది); పడిగల్లు=తుపాకిగుండు; పొలికలను = యుద్ధభూమి; బత్తడి (ళి) క = అమ్ములపొది; బ్రద్దపరి = పేౘము తోనల్లినకేడెము; లకోరి (-రీ) బాణము మొదలయినవి.

## మల్లుపోరికిసంబంధించినపదములు

అంజమెడపట్టు, ఉప్పరింత, ఎడమడుగుపరువడి, ఒంటియడుగుకత్తెర, కన్నాత, చాంగణ, కండణము, తిణింగి, కల్లము, కళవరము, కిర్లి, చేబ, దాఁటడుగుపరువడి (-మొన); పరిచాళిక, రింజ, లోమొన, లోలొంకి, వెలిబిత్తరి, సరిబిత్తరము మొదలగు మల్లబంధ విశేషములు; కవణకాఁడు = మల్లగమనమును దెలిసినవాఁడు, హొంతకాఁడు (-కారి) = జెట్టి; హొంత = మల్లపరిశ్రమము, నెట్టియము = జెట్టులపాగ (ఈ మాట యిప్పుడు ఇంటిపేరుగానున్నది; నెట్యము రామమూర్తినాయుడు, బరంపురము); కొణత, దో (ద్రో) ణ (ణా) ము, ఇవి మల్లసాధన విశేషములు మొదలయినవి.

## పూర్వకాలపు వస్త్రములు.

జీనపటము, జీబు, జేబు = ఆఁడుదానికట్టుఁగోక, పోరువ = సెల్లా; లుంగ=వస్త్రభారము; వెన్నమడుగు, వెన్నెలమడుగు= తెల్లనివస్త్రము; సుగ్గడితము = చక్కని నేఁతగలవస్త్రము మొదలయినవి.

## బాలబాలికల యాటలు.

అంజి, అక్కిబిక్కి దండ, ఇటికి, ఉడ్లపల్లంచి, ఓటెల్లు చిందఱ, కుందికాళ్లు, గట్టినబోది, గూవనాలు, చిందుఘరువు, చిక్కనాబిల్లలు, చిమ్ముబిల్లలు,

నెట్లు, చిఱుతనబిల్లలు, ఒక్కణి, జాబిల్లు, పిల్లగిఱులు, పిల్లమెఱుచులు, పిల్లేరుగంతు, బొట్టనఁగోలలు, బొమ్మరాలు, వ్రేలుబొట్టు, సిరిసింగఁదావత్తి, సిరిసింగన్నవత్తి మొదలయినవి.

## కొన్ని అవ్యయములు.

అంతవట్టు (ఇప్పుడు - మట్టు), అాదంవ = మఱిమఱి; అం (ఇం, ఎం) దనుక; అందు, ఇందు, ఎందు (ఈ మూఁడును నేఁడు -కు, -కొఱకు -తో, -లో, లతో కలిసి మాత్రమున్నవి); అం (ఇం, ఎం)దులకు; అచ (చో, చ్చో, చ్చ, చ్చో) టు; ఇట్లే ఇచటు, ఎచటు అనునవియు; అట = అక్కడ, అట = అట్టి; అటులు, అట్టువ్రాలె, అటె, అట్టె = అంట, అనయము; ఉప్పటి=మరల (ఇప్పుడు 'ఆ కాలపు' అను నర్థము మాత్రము మిగిలినది); అరముడి = మాటి మాటికి; అవారి, అవ్వారి, ఇంచుక; ఉద్ద = మిక్కిలి; ఊరక = ఊరక; ఉరువిడి; ఎట్టకునేని, ఎట్టకేని; ఎత్తిలి = గట్టిగా, ఎల్లి=ఱేపు, ఒండె, ఒాడేని, ఒాడొండ; ఒగి, మొగి, నలి; ఒయ్యన, ఓయన; ఓరంత ప్రొద్దు = దినమంతయు, ఓహరి నాహరి; కడు = ఎక్కువ; కరము = అత్యంతము; క్రచ్చఱ; గనప = పెద్ద; గ్రద్దన, తద్ద; తొరితొరి = లెస్సగా; నెట్టన, నెఱా, పదఁపడి; పొల = అల్ల, ఆ; పోని = పోలిన, ప్రెబ్బొత్తి = నిశ్చయముగా; బెట్టుబిల్లు = తటాలున, మయిమయి, మెయిమెయి, మైమై, మెయివడి, మైవడి; వసి- = మిక్కిలి; సవి = అని, చెప్పి మొదలయినవి.

అక(-క్క-)ట (-టా)! అజ్జారె! ఆకట! ఇసిరో! ఏఁజెల్ల! ఒకో(-క్కో,-క్కొ, -క్కో)! ఒచ్చెల! ఓచెల(-ల్ల)! కట(-టా,-ట్ట,-ట్టా)! కటకట (-టా)! కేఱయో! నల్లవె! నేఁజెల్ల! పురె(-రే)! మజ(-జా,-జ్జ,-జ్జా) (రె); మమ్మారె! మాయురె! సంబళి! మొదలయినవి.

**విభక్తిప్రత్యయములు:**—ప్రథమా బహువచనమున '-ండ్రు' తోడి రూపములు: అల్లుండ్రు, ఇరువుండ్రు మొద. ద్వితీయ: కుఱిచి, తృతీయ: మెయి, మై; చతుర్థి: పొంటె; పంచమి: కొలె, కోలె; సప్తమి: అందు, న (ఈ రెండిటికి మాఱుగ 'లో,' 'లోపల,' అనునవియే నేఁడు వాడుకయం దున్నవి; వనమందు, వనమునన్ వంటిరూపములు నేఁడు లేవు). సంబోధన: రో, రో (అమ్మరో, అక్కరో, మొదలగు రూపములు నేఁటివ్యవహారమున లేవు; నేఁడీ 'రో' ప్రత్యయము కొన్ని యవ్యయములమీఁదను, సర్వనామములమీఁదను, క్రియారూపములమీఁదను గానవచ్చుచున్నది: ఏమిరో, ఎవరురో మొద. ఇది 'అరో' కూడ నయినది: రారో, పోరో, ఏమరో మొద.); పూర్వకాలమున 'రో' ప్రత్యయము మహదమహద్వాచకముల వివక్ష లేకుండఁ

ప్రయోగింపఁబడుచుండెను; నేఁడది మహద్వాచకములమీఁద మాత్రము సాధారణముగ వినవచ్చుచున్నది: 'ఏమిరో' అని పురుషులను మాత్రము సంబోధింతుము); ఇట్లే క్రియారూపములు కొన్ని లోపించియు, నర్థవిశేషములను బొందియు మార్పుచెందినవి: 'రావే యీశ్వర, కావవే వరద' అనుచోట్ల మహదమహద్వివక్ష లేక యుపయోగింపఁబడుచుండిన 'ఏ' ప్రత్యయము నేఁడు మహతీవాచకములతోడనే ప్రయోగింపఁబడుచున్నది.

ఈ రీతిగ వ్యాకరణవిషయమున నేఁటి వ్యవహారమున లోపించియు, మాఱియు, నర్థపరిణామముఁ బొందియు నున్నరూపము లాయా ప్రకరణములందు వివరింపఁబడును.

### ఆచ్ఛిక శబ్దజాలము.

ఇఁకఁ దెనుఁగునఁ గల యాచ్ఛిక శబ్దజాలమును గూర్చి విచారింపవలసి యున్నది. ఇందు శబ్దరత్నాకరకారుని మతము ననుసరించియే దేశ్యములను వైకృతములను విడదీసి యా పిదప నాయా దేశ్యపదముల దేశ్యత్వమునుగూర్చి విచారింతము. అట్లాయాపదముల నేర్పరించుటలో వివిధవర్గముల క్రింద పదములను విడదీయుచు వానిని వాని యంతాక్షరముల ప్రకారము వ్రాయుచున్నాను. ఆ యంతములు ఁక, ంక, క, క్క; ఁకి, ంకి, కి, క్కి; ఁకు, ంకు, కు, క్కు అని యీరీతిగా అంతమునవచ్చు హల్లులపైఁ గల యచ్చుల ననుసరించి వ్రాయఁబడును.

### భావ, గుణవాచకములు.

### దేశ్యములు.

కలఁక, అంజిక, అందిక, అక్కటిక, అగ్గలిక, అచ్చిక, అరయిక, అలక, కినుక, కొదుక, కోరిక, చిదక, పుట్టుక, మఱక, రాక, వాడుక, వేదుక, వేడ్క, ఉక్క, గ్రుక్క, తిక్క, త్రిక్క; అనికి, కటికి, కోరికి (-ర్కి), బెరికి, దుక్కి, పొక్కి, మక్కి, వక్కి, హుళికి (-క్కి); తూఁకు, వరఁకు, వీఁకు; బొంకు, ఒడుదొడుకు, కళుకు, కిటుకు, గఱుకు, చీకాకు, చీకు, జీరుకు, (జీర్కు), తలు(-ళు)కు, దీ(డీ)కు, నిరుకు, నొకు, పిలుకు, బెళుకు, వలు(-ళు)కు, కిఱుకు, క్రిక్కు, తుక్కు (త్రుక్కు), వక్కు; ఒరిగ, వగ; గెగ్గ(లు); ఈగి, బిగి, సేగి; గొగ్గి; నూఁగు, మెఱుఁగు, వెర(-ఱ)ఁగు, వ్రేఁగు; పుట్టుగు, పొనుగు, బెడ(-శ)గు, మదుగు, సేగు; ఎగ్గు, జగ్గు, లగ్గు, వగ్గు, సిగ్గు, సెగ్గు; ఈచ, ఏచ, కుఱుచ, పలుచ, తులుచ, పెలుచ(-ల్చ), నిప్పచ్చ, పిచ్చ, ఱిచ్చ, వెచ్చ; మంచి; కూచి, పేచి, పోరచి; నిక్కచ్చి, పచ్చి, బుచ్చి; సంచు; తఱ(ఱు)చు; గచ్చు, ఱొచ్చు, లొచ్చు, వెచ్చు, హె(ఎ)చ్చు; బైజ, వాజ; ఉజ్జి; జజ్జు, నజ్జు, నుజ్జు, రజ్జు, లొజ్జు; తాఁట, అంట, కంట, తింట, పంట, వింట, వెంట; పాట

(అక్కఱపాట మొద.), అటమట, ఆదట, నుక్కట, నేట, పోట, బాసట, మల్ల(-ల్లా)ట, మాఱట, లంపట; చిట్ట, తొట్ట, బెట్ట, వెట్ట, చెనఁటి; గంటి; చక్కటి, చిటి, చీకటి, పాటి, పొదిటి, బిమ్మటి, వీటి, సాటి, సూటి; గట్టి, చిట్టి, వట్టి; అంటు, కంటు, గంటు, నంటు, అదటు, అబ్బాటు, అలవాటు, ఈటు, ఉదుటు, ఓటు, కాటు, చేటు, నీటు, పగచాటు, అగచాట్లు, పదటు, పాటు (అదిరిపాటు మొద.), పోటు, మసటు, రోటు, లోటు, సొగటు; గుటి కట్టు, గొట్టు, నిట్టు, పడికట్టు, పెట్టు, బెట్టు, ర(ఱ)ట్టు, ఎండ, వండ, అడ, ఇల్లడ, కట్టడ, తడ, పొడ, వడ, వెడ, గిడ్డ, జిడ్డ, దొడ్డ; వాఁడి (వాఱి), పోఁడి, వేఁడి; దండి; -పడి (అందుబడి మొద.), జ(ద)డి (అలజడి మొద.), ఆఱడి, ఆలుడి, ఆ(హా)వడి, ఉమ్మడి, ఎద్దడి, కసిడి, జడి, తొడి, దండడి, దొండడి, పొడి, మిడి, మోడి, రట్టడి, లేమిడి, లొగ్గడి, వడి, వల్లడి, వారడి, సడి, సందడి; బెండు; అగడు, అల్లుడు, అవడు, గాడు, గోడు, తెరలుఁగు, తొమ్మాడు, తోడు, దిద్దుడు, నల(-లు)ఁగుడు, నసగూఁడు, నెరడు, పురుడు, పొఱడు, మసడు, మాపుడు, వెగడు; దొడ్డు, బొడ్డు, లొడ్డు, లెడ్డు, సొడ్డు; క్రోణి; హావణు; అలఁత, ఈఁత; కొఱఁతి, కోఁత, తలపోఁత, నవఁత, నేఁత, నోఁత, పూఁత, పోఁత, మేఁత, లాఁత, లేఁత; ఇసిరింత(లు), బొంత, నుంత, హొరొంత; ఉప్పత, కొలత, నడత, పూత, పొగడ్త, బిస్త, మిగత, విడుత; ఉత్త, క్రొత్త, రుత్త, లాఁతి, అలఁతి; అరితి, ఐతి, కస్తి, కక్కుఱితి, నడితి (నడ్తి), బా(బ్రా)తి, వెలితి, సిబ్బితి; ఉత్తి; లాఁతు, లోఁతు; దిసంతు, పంతు, మంతు, వంతు; నిప్పస్తు, పుస్తు, బిగుతు; -ఒత్తు (అడకొత్తు మొద.), పొత్తు, బెత్తు; అంగద, ఆద, ఊద, కొద, గొద, చోద, నిడుద, బెడద, వలుద (వల్ద); దొద్ద; కడఁది కొలఁది (కొల్ది); ఇబ్బంది; అరిది, ముది; కొద్ది, ముద్ది; కందు; అరుదు, అ(హ)సాదు, వలదు; జద్దు; అలకన, ఉలకన, ఎన, కలాపన, గిటగిటన, చిన, చులుకన(-ల్కన), తచ్చన, తిన్నన, తిమ్మన, తులుచన, దట్టన, పలపలన, పలుచన, పాటన, పాన(లు), పిన, పుటపుటన, వెలుచన (-ల్చన), బసవన, మెల్లన, మెదుకన, ప్రన్నన; వలవలన, వెచ్చన, సన్నన; చిన్న, తిన్న, నన్న, నున్న, పిన్న, పున్న, ప్రన్న; చిని, జీని, పని; చిన్ని; చదును, జాను, వరను, అన్ను, చెన్ను, కుదుప, గనప, తేప, దూప, బడప; గొప్ప, చప్ప, డొ(దొ)ప్ప; తంపి; చిడిపి, చిలిపి, తీపి; చప్పి, డ(ద)ప్పి, నొప్పి; తలఁపు, లాఁపు, వేఁపు; ఇంపు, ఒంట్రింపు, కంపు, గిట్టింపు, జంపు, డి(ది)ంపు, తెంపు, నింపు, పంపు, వెంపు, పొంపు, మంపు, ముంపు, లంపు, సొంపు; అదుపు, అల్లారుపు, అదలుపు, అలపు, ఇడుపు, ఈడుపు, ఉఱుపు, ఊదుపు, ఎగపు, ఎలురుపు, ఏడుపు, ఏపు, ఏర్పు, ఐపు, ఒఱపు, ఒలుపు, ఓరుపు, కఱపు, కానుపు, కాపు,

కినుపు, కూరుపు(-ర్పు), కేరుపు, గగురుపు, గగురుపొడుపు, గునుపు, గెలుపు,
చఱపు, చాడుపు(-డ్పు), చెఱ(-ఱు)పు, జడుపు, జాఱుపు, తలిరుపు, తారుపు
తిరుపు, తీపు, తీరుపు, తుడుపు, త్రోపు, నడుపు, ననుపు, నరపు, నరుపు, నిడుపు,
నినుపు, నునుపు, నూఱుపు(-ర్పు), నెగపు, నోరుపు, పడపు, పనుపు, పూపు,
పూడుపు, పెనుపు, పేరుపు, పొడగానుపు, పొడుపు, పొదుపు, పొనుపు,
పొరపు, పొలుపు, బులుపు, మఱపు, మాఱుపు, మోడుపు, రాపు, రాలుపు,
ఱాపు, వగపు. వడుపు, వనపు, వఱపు, వలపు, వారుపు, వాలుపు, విడుపు,
విదురు(-లు)పు, విఱుపు, వెడలుపు, వెఱపు, వెలుపు, సళుపు, సొరపు, సొలపు;
కప్పు, చొప్పు, ముప్పు, మెప్పు, రిప్పు, విప్పు, వెప్పు; బంబ, రింబ; ఇంబు;
గిలుబు; ఆగుబ్బు, గబ్బు, జబ్బు, తబ్బిబ్బు, ప్రబ్బు; కడమ, చోడుమ;
చుమ్మ, జిమ్మ, తిమ్మ, రిమ్మ; తమి, పేదర్మి; -ము (అంకము, మొదలైనవి),
అనుము, ఇఱుము, కద్దుము, గినుము, ఆలము, ఈఱము, కలుము, గోము,
నుసము, నేరము, పిఱుము, బోము, వలము; ఒ(హో)మ్ము; గెలువము;
చదియ, నయ, లయ, తియ్య, ఉవ్వాయి, ప్రాయి, మాయి; అక్కర, అర
(అ)మర, ఒర, కుత్ర, కొంకర, తీంద్ర, తేర, డ(ద)బ్బర, నిత్ర, నివ్వెర,
వీసర, వెంపర; అఱమురి, అల్లరి, చిన్నారి, చీరి, తూరి, త్రస్తరి, నునుపరి,
నెరి, పొన్నారి, మారి, మురి, సారి; అనరు, కనరు, కికు(-క్కు)రు, కిసరు,
క్రూరు, గదురు, గొవరు, చౌరు, డొగరు, తపారు, తొత్రు, దేవురు,
వోఁగురు, నిట్రు, నీరు, నెనరు, నారు, పదురు, పొగ(వ)రు, మసరు, మాన
(-నే)రు, ఏగరు, వటారు, వాలారు, విసరు, సౌరు; కన్నఱ, కొఱ, చాఁగఱ,
చిందఱ, చీఁదఱ, తక్కఱ, తత్తఱ, నింకెఱ, నివ్వెఱ, వెఱ; నె(నే)ఱా;
ఒఱ్ఱి, చిఱ్ఱి, తెఱ్ఱి, బిఱ్ఱి; గిఱి, గుఱి, నెఱి; కుఱు కాఱు, జుంజుఱు (దుందుఱు),
బీఱు; ఒఱ్ఱు, చిఱ్ఱు; అంచల, అలుగుల, ఉదిల, ఎడసాల. విణ. ఎల, విణ, కల,
కుతిల, కొల, నవ్వటాల, ముదల, వెల; కొల్ల; అంకి(క్కి)లి, అరగలి,
ఆఁకలి, ఆలి, ఆ(హా)వలి, ఉప్పలి, ఏలి. విణ. ఒదిగిళ్లు (ఏక. ఒదిగిలి) ఒలి,
గిలి, చక్కిలిగిలి, జాలి, తనకలి, తుఱఁగలి, తొంగలి, పొలి, లలి, లులి,
వండలి, వలి, వినుకలి, సలి; ఇల్లి, బెల్లి, లొల్లి; కోలు (అందుకోలు),
అరులు, ఇరులు, ఉసులు, కడగండ్లు (ఏక. కడగలి ?) కోలు, గాలు, తీలు,
దిగులు, నెగు(వు)లు, బేలు, బోలు, మరులు, మేలు, మొదలు, వద(-దు,
-ను)లు, వీలు, హొాయలు; అడువ, అదువ, అన్నువ, ఊకువ, ఎన్నువ, ఏవ,
ఒఱవ, కొదవ, గొడవ, గోవ, చలువ, తెఱకువ, తేఁకువ, పందువ, ప్రావ;
లివ, లేవ, విలువ; చవ్వ, అవ్వ; ఆవి, తనివి, తావి, తెలివి, వావి; అనువు,
అన్నువు, అరువు, అలవు, ఆవునువు, ఈలువు, కఱవు, కాయవు, (-య్వు),

గిరవు(గీవు), గుఱువు, చెఱువు, చెలువు, జానువు, తనివు, తఱువు, తాఱ్వు, తోడరువు, దనివు, దోసవు, నలువు, నిలువు,నులివు;నోవ్వు, నో(నవ్వు), పఱువు, పోడువు, బటువు, బిగువు, ముఱువు, లావు, వెఱ(-ఱు)వు, సచువు, సళువు, హారువు; ఉవ్వు; ఎస, ఏస, కిక్కెస, కేకిస (లు), గిడస, తుంపెస (లు), పస, పిస, మస, మిస, వరుస;లెస్స;ఉసి,కసి, గాసి, బిసి;బోసి, వాసి,ససి; తుస్సి; ఉబుసు(ఊసు), ఔ(హౌ)సు, కసు. విణ, గడుసు, గరుసు, గుబుసు, గుసుసు, తోడుసు, నులుసు, నెరసు, పరుసు, బిసు(బు)సు, ఆ(హా)వళి, ఎగతాళి, దువాళి, బాళి, హాళి, క్రేళ్లు(ఏక?), డింగిళ్లు (ఏక. డింగిలి?), పోకిళ్లు (ఏక. పోకిలి?).

## వైకృతములు.

ఇవక, జోక; డాక, చక్కి, లెక్క; జంకు, ఱంకు; దుడుకు, దునుకు, కఱకు; లంగ; దగ, నాగ. విణ. పగ, మొగ, వేగ, సైగ; జిలుగు, జోగు, దండుగు, బాగు, సరగు, సొబగు; కలుచ; ఇచ్చ, కచ్చ, వచ్చ; గచ్చు; పూజ; పజ్జ; తేజు; గజ్జు, జజ్జు; -ట (ఓకరించుట మొదలైనవి): చప్పట, పల్లట, దిట, బూరట, సట; చెట్ట, దిట్ట, సొట్ట; కుంకటి (కూఁకటి); సొంటు, కసటు, పాటు, రహాటు, రాటు, వెగటు; గుట్టు; అసడ్డ, చెడ్డ, జడ్డ, సడ్డ, అడి-; ప్రేముడి, రూఢి, వెల్లడి, వడ్డి; గండు, బండు; కీడు, కాడు, చెవుడు, తప్పుడు, నిక్కువుడు, వాఁగుడు, సైఁపుడు; దారణ, పచరణ, పోహణ, ప్రేరేపణ, త్రాణ, రమ(-వ)ణ, (రాణ), వక్క(-క్కా)ణ, సైరణ; చేఁత, వాఁత; అప్పళింత, కొప్పరింత, కౌఁగిలింత, గోరగింత, చిటికరింత, పలవరింత, వెక్కిరింత, ప్రక్కలింత, చెంత, పొంత; కైత, కఱత, కత, జత, వెత; రిత్త, సత్త, మత్తా, ఆనతి, కీరితి, గణుతి, ముగితి, వసతి, సుతి; ఆసత్తి, పత్తి, బత్తి, బుత్తి, మత్తి, సత్తి; రంతు; తుఱుతు, పస్తు, బీతు, సవతు, జిత్తు; కఱద, బాద, మరియాద, సేద; నిద్దా; బంది; ప్రోది; బుద్ధి, సుద్ది; అసదు, కఱుదు, మైదు, వాదు, వావాదు; దుద్దు; అప్పన, అల్లన, ఆన, ఉప్పెన, ఒల్లన, గడన, గడసాదన, గుండ్రన, గుంపెన, గోసన, చిక్కన, చక్కన, జంకెన, జతన, జవరన, త్రచ్చన, దండన, నాన, పరుసన, క్రితిన, బోదన, మన్నన, రజన, వంచేన, వట్రన, విన్నన, సాదన, సోదన; సున్న; గని, తని, దోని, వాహిని, మన్ని, జడను, జతను; వాఁపు, సైఁపు; కౌఁగిలింపు, జోడింపు, తరకటింపు, పచరింపు, మన్నింపు, వంపు, వాయింపు; చూపు, చోపు, తనరుపు, ప్రాపు, ప్రోపు, బలుపు, రూపు, వాపు, సొగపు; డంబు, లంబు, జాదుర జాదురంబు, గొంబు; గబ్బు; ఉపమ, ఒరిమ, పెరిమ, సరిమ, సా(సో)మ; ఉమ్మ; తెమ్మ, సొమ్మ; తెల్లమి, నెయ్యమి, బలిమి, వేమమి;- అకము,- అగము,

-అటము,- ఆటము,- అడము,-ఆడము,-అణము,- అనము,-అము,- అరము, -ఆరము,- అలము,- ఇకము,- ఇగము,- ఇతము,- ఉరము,-కరము,-కారము, -తనము,- ము,- టికము, మొదలగు ప్రత్యయములతో నంతమగు పదములు; దురము, వేరము; వమ్ము; ఈయ, చాయ; ఇయ్యి; అబందర, ఊఁకర, దగర, జవర, జాతర, తందర, తొందర, తొర, దర, దార, నిదుర, నిద్దుర, బమ్మెర, వంకర, వట్ర, వడ్ర (-డ్ల), సెబ్బర (బ్ర); కరా. విణ., తరి, బారి; కొమరు, చదురు, చూకురు; ఒక్కఱ, చిందఱవందఱ, చిచ్చ (-చ్చు) ఱ, చెఱ, చుబ్బనచూఱ, చూఱ, పెఱ. విణ.; చిఱు. విణ.; తుట్టు; మకిల(మైల); గుల్ల, పొల్ల; కాఁగిలి, గేలి, చలి, జోలి, తెక్కలి, దూఁకలి, వెలి; చాలు; పెల్లు, పొల్లు; అగ్గువ, తేవ, దండువ, నిస్సత్తువ, రవ, వట్రువ, సత్తువ; రవ్వ; చవి, తీవి. పదవి, బలివి; అచ్చరువు, ఆదరువు, ఉత్తరువు, ఉఱవు, గుర్వు, చిత్తరువు, చెయువు (-య్వు), దండువు, దిటవు, బరువు, బలువు, లగువు, విన్ననువు, సులు (-ళు)వు, హితవు; దవ్వు, రువ్వు; ఆంతు, ఆస, క్రక్కస, తట్టస, వలస, వెస; కరకసా; బగి(వి)సి, బైసి, మాసి; ఈసు, ఎరుసు, గోసు, బరుసు, బెరసు, లేసు, సొగసు; తుస్సు; రహిఁవయా (-య్యా)ళి; విరళి, విరాళి.

## దేహావయవములు, దేహమునకుసంబంధించిన పదార్థములు.

## దేశ్యములు.

చెంక; ఎముక; కుతి ( - తు; - త్తి. - త్తు)క; గొంతుక; తొలుక; నెఱక; నాలి(లు)క; నాల్క; పునుక; వావిక; వెండ్రుక; డొక్క; డొక్క; కొ(క్రొ)ంకి; ప్రక్క; నెఱఁకు(-ను); అక్క; బొంగుగ; బుగ్గ; జానుగు; పే(ప్రే)గు; పొదుగు; మొ(మో)లుగు; ముచ్చ; ఎఱచి; చాచి; చుంచు; కొచు; బొచ్చు; అంజ; అజ్జ, గజ్జ, బొజ్జ, హజ్జ; చెమ(-మ్మ)ట; పాపట;అట్ట, గిట్ట, చట్ట, పొట్ట, రెట్ట; తుంటి; లవిటి; తొడ, దాడ, పూడ, మెడ; బుడ్డ; కొండి, గుటికొండి, రొండి; ఒడి; నడ్డి; సాఁడు; చో(సో)డు, నెనడు; బడ్డు, బొడ్డు; కడ(ణ)ఁత; పడ(ణ)త; మూతి; నెత్తి; గొంతు; గవుద, గౌద; బొంది; పిఱుఁదు; జెన; సొన; కను, కౌను, గూను, నెఱను, మేను, వీను; కన్ను; చెరఁప; చెంప, లెంప; చెట్టుప, చట్టుప, పూప; రె(ఱె)ప్ప; మూఁపు, వీఁపు; ఆబ, గూబ; దుబ్బ; ఉబ్బి; కొమ, చెర(ఱ)మ; బొమ్మ, దొమ్మ, బొమ్మ; ఊ(మూ)ఁపురము, కడ(ళ)వసము, కడా(ళా)సము, కుప(ప్ప - బు)సము, కూసము, చొబలము, నడుము, నడ్మ, నరము, పాచితము, ముడుము, సోణము; ఎమ్ము, కోలెమ్ము; తమ్మె; బుయ్య; పీయి, పియ్యి; కీసర, నర, మొర, మోర; ఊపిరి; కొరి, పురి; గగు(-గ్గు)రు, గరు, గోరు, నుదురు, నెత్తురు,

నెత్రు, నోరు; పిఱ్ఱ, బుఱ్ఱ, బొఱ్ఱ; పుఱ్ఱు; తల, మొల; మల్ల, నల్ల, బుల్ల; అంగిలి; చుల్లి; ఒడలు, కటుమరలు, చూలు, నొసలు; దవ, పెదవి, మూవి, మోవి; పే(ప్రే)వు, కుఱువు, గరువు(-సు); క్రొవ్వు; పుసి, ముడుసు, గరుసు; అంకిళ్లు, ఒళ్లు.

### వైకృతములు.

చంక; జంగ; ఉచ్చ; గౌరిజ(-సె); చప్పట; వట్ట; కుంకటి (కూఁకటి); కండ; ఎడ్డ; ఔడు; ఎడఁద, ఎద; కడుపు (కడ్పు), పొత్తికడుపు; అంగుష్ఠము, టికము, మీసము, రొ(ఱొ)మ్ము, చె(చే)యి (చెయ్యి); కోఱ; వంకి (క్కి)లి; చెవి, సెలవి; కరువు.

## జంతువులు

### దేశ్యములు

జింక; ఎలుక; జక్కి; కొక్కు; ఱేఁగ, ఆళుగ; చి(సి)వ(వ్వ)ఁ(ం)గి, జోడ(ణ)ఁ(ం)గి; ముంగి, జో(సో)నంగి; ఎలుగు; ఈఁచు; చుచ్చు; కడుఁజు; వేఁటు; ఱేటి (ఇది ఔపవిభక్తికరూపము; శ. ర. లో ప్రథమగా చూపఁబడినది); దూడ; తత్తడి; మొక్కడి, లేడి; వఱుకు; గోణి; దుంత; ఉడు(-ఱు)త; గిత్త; కడ (ఁడి- ణ, - ణి)ఁతి, సఁతి, క్రోఁతి, పోతు; గోద; ఇబ్బంది, పంది; లేదు; ఎద్దు; దున్న; మలప; వేఁపి; తఱపి, దుప్పి; క్రేపు; గిబ్బ; చింబు; ఉడుము, కిలాతము, జాగిలము, మొఱసడము, సింగిలీకము; పేయ, పెయ్య; గురు, గారు; న(అ)ఱ్ఱ; ఏదఱి; ఇఱ్ఱి, టిఱ్ఱి; తోఱ్ఱు; చీలి, పులి; కుందె(-ందే)లు; తోఁడె(-డే)లు; పొటే(-ట్టె, -ట్టే)లు; అ(న)ఱవ, వెంట్రువ; ఆవు, ఎలువు, మూవు, మొదవు, నాసి.

### వైకృతములు.

గోరక, కుక్క, నక్క, తురికి, కొండెంగ, గోడిగ, వేఁగి, ఏనుఁగు, సలుగు(-వు), పడ్డ, పరికాడు, సాంబ్రా(-ంబ్రా)ణి, హాత్తి, గాడిద, గున్న, కత్తలాని, ఎనుము, కటకరము, ఖాణము, గుఱ్ఱము, తిగరము, పసర(-ల)ము, వాలము, సింగము, కుదిర, కేసరి, సగ్గారి, తగరు, పిల్ల, తట్టువ, దుప్పి, మస్తీ.

## కూరాకుచెట్లు.

### దేశ్యములు

గురుగు, గురుజ, తురుజ, వాయి(వి)ంట, ఊడి, బొద్ది, చెంచలి; నెల్లి, తగిరిస.

వైకృతములు.

తుమ్మి, కూర (తోటకూర), కొతి(- త్తి)మిరి, చిటి(- ట్టి), గోళి.

పొదలు, చిన్న వృక్షములు.

దేశ్యములు.

బెండ, జిల్లె(- ల్లే)డు, తంగె(-ంగే)డు, వాలుడు, ఉచి(- చ్చి)రత, అంట్రింత, పత్తి, ప్రత్తి, కలబంద, మైద; ఉత్తరేను, ప్రబ్బ(లి), ఓమము, తగరము, దుత్తూరము, గగ్గెర, ఆకుపత్రి, గలిజె(- జే)రు, పల్లె(- ల్లే)రు, ఈల, వెంపలి, బలుసు.

వైకృతములు.

వంగ, గోరంట, వా(వ్రా)ంకుడు, ఉమ్మెత(- త్త), చేమంతి. గోను, సదాప, ఆముదము, దవనము, నేపాళము; గంజాయి, కాంచర, కొరవి, తొళసి.

ఉద్భిజ్జములకు సంబంధించినపేళ్లు.

దేశ్యములు.

తొంబక, గూక, పుడుక, పొరక, బొసిక, కంకి, పోకి, లేకి, మూ(మ్రూ)ంకు, ఆకు, ఈకు, దుంగ, ముంగ, చేగ(- వ), పటిగ, బొండిగ, నురిగ, నాంగు, నూంగు, చిదుగు, చొరుగు(- వు), మోలుసు, వెలుగు, గగ్గు(లు); నీయంచ, ఊచ, పీచు, గింజ, గుంజు, తాంట, దూంట, గంట, తొంట, పంట, కవట, జవట, రాట, రివట (రివ్వ, రెమ్మ), వేట; పొట్ట, మట్ట; చెట్టు, పొట్టు; మండ; ఊడ, వారడ; కురిడి; గడ్డి; తూండు; బెండు; గడు, పేడు, మొరడు (మ్రోడు, మోడు), రాడు; ప(ప్ర)త్తి; బొంతు; పొద; దూది; దుద్దు; ఈన; నన; మ్రాను, వెన్ను; క(క్ర)ంప; దుంప; కలప; పూప; చొప్ప, తప్ప, తుప్ప, రెంబ(- బ్బ, - మ్మ); దబ్బ, కొమ(- మ్మ), కోమ, తొడిమ; పొడుము, పస సము, ఫలసాయము, బియ్యము, బూసము, బొండ (- ండా, - ండల, - ండ్ల, - ండ్లా) ము, ముంగాము, ముక్కుటము, కాయ; టె(తె)ంకాయ; తప్ప కాయ; కొబ్బెర, తంకర, నార, బూగర; విరి, అకరు, కారు, గి(గు)జురు, చిగు(వు)రు, తలిరు, పసరు, పైరు, పొదరు, వేరు; తొఅ(- ట్ట), బుట్ట; గె(గొ)ల, తొల, బూల; తోలు, దిగ్గోలు, ములు; దవ, పలవ; చివ్వ, దవ్వ; ఎండువు (గు)లు; మొ(మో)వు (మొవ్వ), పాళ; పిసికిళ్లు.

వైకృతములు.

గుడక; మొక్క; తీంగ; పట్ట; దంటు; కాండ; మొగడ; బరడు; పూ; దుబ్బు; పుప్పము; సస్సెము, సేద్యము; జబర, బొబ్బర, పత్తిరి (పత్రి), తీవ; పువు(- వ్వ), పూవు.

## పుష్పములు.

### దేశ్యములు.

తొగ; మాదెన; అల్లి; తొస

### వైకృతములు.

తమ్మి, తామర, కలువ(కల్వ).

## ఉద్భిజ్జములు.

### 1. తృణములు.

### దేశ్యములు.

పచ్చిక, ఎరక, పూచిక, పొఱక; వెఱపు, పోకు; ఉలుగ, పొనుగు, పూచి; తుంటు; బరసట: అ ప్రెంత, ప క, బొగ, గాబ(పు), జంబు(-మ్ము); గాదము, మోదయము, కాండ్ర, దూసరి, పూరి, అగు(న్రు-)ను: తెల్లు; అంటెస, కిక్కస.

### వైకృతములు

పర్పాటకము; ఊదర, వెదురు.

## తీఁగలు.

### దేశ్యములు.

జిబిలిక; వెంకి, పుచ్చ; చిక్కుడు, రేఁగుడు; కోరింద; తంబ, కరభుజము దూసర, నల్లె(-ల్లే)రు; బీఱ, సొఱ(-ఱ్ఱ); ప్రబ్బలి, బచ్చలి; దోస.

### వైకృతములు.

ఏలకి; జాజి (జాది); దొండ; సోమి(మె)ద; కాఁకర, కట్ల, పొట్ల.

## సస్యములు.

### దేశ్యములు.

తఱక; వంకె; ఆరుగ, చెన(-న్న): ?. సనగి, సూగు (-వు) ప్రా. (పా) సఁగు, బరపట, చోడి; అఱవము; తమి (-వి,-వ్వి) డ; కంది, కాంబోది, జొన్న, కంబు, కుసుమ, చాము, జలము, బుడము, కుసుమము, జన (-ను)ము, నాము, మినుము, వెల (లు) వడము, నక్కెర, పెసర, పర, దినసరి, దూసరి, (వరి, కొఱ (-ఱ్ఱ) ఆవ, ఉలవ, - నూంప్రు (-గు), సంబావు, పునాస, అక్కుళ్లు ఆళ్లు.

### వైకృతములు.

వరగ, సనగ, సజ్జ, గోగుము, రాజనము, బొబ్బర, తొగి (-ప)రి, నివ (-వ్వ)రి (నీవరి), వరి, ధనియాలు, యవ(లు), సాసువు(లు).

### మూలములు.

#### దేశ్యములు.

వెల్లఁకి, ఇంజేటి, ఈఁజేటి, గొట్టి, చేమ, వెండలము, గాఁజర, పీచర, పెన్నేరు, ఉల్లి, కఱవ, నువు, నూవు, నువ్వు, గబ్బిస, గెనసు.

#### వైకృతములు.

చెంగల్వకోష్టు, శొంఠి, సదాముస్తె, పసుపు, వసనాభి, అల్లము, కచోరము, అతివస, వస.

### చెట్లు.

#### దేశ్యములు.

ఉసిరిక, ఓక, కరక, నూఁక, పేచిక, ములక, తుమి(-మ్మ)కి, వెలికి, వెలఁగ, మంగ, మ్రంగ, మొగలింగ, చిందుగ, తేగ, ముగ్గ, చెన్నఁగి (-ంగి), ఉల్లంగి, మోళంగి, విరిగి, నురిగి, గోఁగు (గోను), రేఁగు (రేను, రేవు), అందుగు; ఇందుగు, ఊడుగు, కానుగు, గఱుగు, గొణ (-లు) గు, చిలుగు, చందుగు, జిలుగు, జీలుగు, బూరుగు, మోదుగు, గ (గ్ర) చ్చ, మాచి, గ్రాఁజ, నీరిజ, కాజి, కుప్పింట, అంటి, అర (-న)ఁటి, ఎరువంటి, ఆయిటి, ఊటి, మోరటి, కలిగొట్టు, మిండ, ఇబ్బెడ, బండెడ, బొడ్డ, తాఁడి, జీడి, మేడి, ఇరుగు (వు)డు, ఉరుముడు, కుంకుడు, నేరె (-రే)డు, పులుగుడు, నురుగుడు, జిడ్డు, చొక్కణ, అత్తి, తుత్తి, అబ్బెంద, ఉలింద, ఏద, కొడిది, కొడ్డి, ఒద్ద, అంకెన, గి (ది)ంటెన, గుంపెన, మంకెన, మామెన, మోదన, విన్న, జిన్న జేన్న, పొన్న, దిన్న, ఇప్ప, ఇప్పి, పుప్పి, జు (దు) ట్టుపు, దబ్బ, గొబ్బి, కుసుమ, బుడమ, తుమ్మ, నిమ్మ, కొమ్మి, తమ్మి, దాసనము, పేము, బొగడము, బోడత (-స) రము, మోడము, వేము, సేళము, సోమిదము, తె (తె) ంకాయ, ఉండ్ర, ఉడుసర, కొబ్బెర, గార, చండ్ర, తాండ్ర, నెక్కర, పాపర, పేపరి, మండ్ర, ఆవిరి, కందారి, తుత్తిరి, పులిసరి, పులుగరి, పుల్లరి, ఔరు, గన్నె (-న్నే)రు, బీఱ, పలుమేరు, ఈల, చిల్ల, కత్తలి, చుక్కలి, పూలి, పెక్కలి, బొబ్బలి, మొగలి, అల్లి, కొల్లి, ఓడాలు, ఉవ్వ, రావి (-గి); జువ్వి, మోదువు, బూరువు, ఇదువు, అందువు, ఆకలివె, ఉండ్రస, ఎంగెస, కొక్కెస, బగిస; వేఁగిస, సెలను, మాదావళి, బిల్లు.

#### వైకృతములు

గొజ్జ (-జ్జె)ఁగ, చాఁగ, గేదఁగి, బొరంగి, బొట్టుగు, లొద్దుగు, మెంచ, కాఁచి, గురిజ, నారింజ, పొగ (వ)డ, ఈదాడు, కోఁదాడు, గుము (-మ్మ) డు, చె (జె) ముడు, తాడు, మా (రె) రేడు, చింత, ఇల్లింద, కసింద, కడప,

**జామ**, అంబాళము, అడ్డసరము, కంపిల్లము, కజ్జూరము, కాంచనము, గుగ్గిలము, తినాసము, ది (గి) రిసె (న)ము, బా (వా) రి (డి) జ (ఁ) ము, నారికడము, చనుపకము, గజ్జురము, పేృంకడ (న) ము, జమ్మి, కాసర, గంబు (-ంబూ) ర (-రా); కవిరి, ఉంబరు, ఒందారు, వెణు (-లు) తురు, చాఱు, కారుకొఱ్ఱి (-ల్లి), కట్ల, కంగేలి, తక్కిలి, ఇంగువ, లట్టువ (లట్వ), క్రోవి, బొట్టువు, అవిశ, పనస.

**పక్షులు.**

దేశ్యములు.

కరక, కుటాక, పిచ్చి(- చ్చు)క, ఉల్లంకి, లకుముకి, వలికి, డేగ, పోలుగ, గున్నంగి, పొన్నంగి, గుండగి, బెలంచి, పరజ, పుంజు, అడుజు, కిడుజు, కురుజు, కైజు, జిట్ట, పెట్ట, కనుబంటి, గాటి, గొంబడి, కరగు, పురె(- రే)డు, లగుడు, ఏటిరి(ట్రి)ంత, నెలాఁపు, డాబ, కంకణము, జుమ్మ, నమ్మి, నెమ్మి, ఉల్లాము, ఓరణము, కడపరము, గిబ్బిలము, చెంచడము. వాఁజము వేసడ(ర)ము, (వేస్ట్రము), సాళువ (- ళ్వ)ము, కంకణాయి, గబ్బిలా(- లా)యి, జీనువాయి, వెన్నడాయి, ఎబ్బెర, చీపర, పారి, బైరి, వైల, నమిలి, నెమలి, నెమ్మిలి, నెవిలి, చిలువ, జీనువ, బెళవ, బోరువ, గువ్వ

వైకృతములు:

గోరంక, చిలుక, లావుక, కాకి, కొంగ, అంచ, కొ(క్రొ)ంచ, కముఁజు (కౌఁజు, కంజు), కోరడు, గిడ్డ, చీఁద, చిండ, గ(గ్ర)ద్ద, గద్దు, గూబ, కేరజము, పరితము, పారువ(- ర్వ)ము (పావురము), సారణము, కొక్కరాయి, పావురాయి, కక్కెర, కొక్కెర, గోర, పె(బె)గ్గురు, కొంగె(- వె, - వి.-యి,-యె)ల, ఆడె(- డే) లు, జక్క(- క్కు)వ, తీతువు.

**జలచరములు.**

i. చేఁపలు

దేశ్యములు

బల్లెంక, తిఱికి, పోలుగ, హాలుగ(-వ), ముచ్చంగి, సొరంగి, మలుగు, వంజు, ఉరుజ, ఉణుజు, పుల్లరుజు, మెత్తడి, కఱవాడు, కొరద, చేఁప, రామ, వంజరము, వజ్జిరము; బొమ్మిడాయ, రొయ్య, చిత్తర, తువ(-వ్వ)ర, తూపర, తూర, కొఱ(ఱ్ఱ), చాఱ, చోఱ, తూల, జెల్ల, ఇల్లవ, పోలువ, మడవ, కాగిస, పొలస, బేడిస, మిసి, మట్టగిడుసు.

వైకృతములు.

ఉలుచ, చాఱ.

(ii) ఇతరములు.

దేశ్యములు.

నత్త, కప్ప, గోదురు, మొసలి, తాఁబే(-మే)లు.

వైకృతములు.

జలగ, ఎండ్రి, పీత, ఎండ్రకాయ.

కీటకములు.

దేశ్యములు.

మూఁగ, ఈగ, మిడు(ణు)ఁగు, వచ్చ, అడు(-ణు)జు, కడు(-ణు)జు, కొణ(-ణు)జు పిడుజు, పముజు, చిమ(-మ్మ)ట, తేఁటి చీడ, మిడుత, తుమ్మెద, చెలఁది, పిడుదు, ఈపి, ఎన్నెమ, గామ, చీమ, దోమ, నుసుమ, బూగర, ఈరు, మిణుఁగురు, నల్లి, బూసి, ఇ(ఉ)సుళ్లు.

వైకృతములు.

వడ్లచిలుక, చెలగము, కడు(ణు), దురు(కందురు), చెదలుఁ పురుగు(-వు) (పుర్వు, ప్రువ్వు).

సరీసృపములు.

దేశ్యములు.

ఎమిడిక, నల్లిక, వెలుచ(వెల్చ), నలికించు, త్రాఁచు, పెరజు, తొండ, నలికిరి, జెఱి(-ఱ్ఱి), ఊసరవెల్లి, చిలువ, గౌళి(గవుళి).

వైకృతములు

సప్పము; నాగు(-వు)రు(లు), బల్లి.

ఆహారము.

దేశ్యములు.

గటక, మెతుక, కూడు, పుడు(-ణు)కు(లు), ఓ (హో)ళిగ, జొఁగు, అప్పచి(చ్చి), నంజ, బజ్జి, ఓమటి, దోమటి, నిప్పటి, సంకటి, తోడంటు, అట్టు, ఒబ్బట్టు, నిప్పట్టు, ద్రబ్బెడ, కాడి, పాడి, తింపి; ఇడి, కడి, పచ్చడి, కూడు, నంజుడు, బెడస, మెడుద, ఇడ్డెన, కాను, జున్ను, తోఁప, పులుప, పప్పు, తోఁపు, కుడుపు, పప్పు, అంబళము, కుడుము, తొంగళము, పానకము, పొంగ రము, బెల్లము, మండ-(డా)ము, వంటకము, సైఁదము, కొట్ర, గోదారి, చేమిరి, అత్తెసరు, త్తైరు, తేఱ, ప్యోల(లు), చల్ల, అంబలి, పొంగలి, బువ్వ, చోవి, పులుసు, గుగ్గిళ్లు.

### వైకృతములు.

మండెఁగ, మజ్జిగ, పాగు, లడ్డు, దాణ, ఆమెత, గారి, పాకీన (ప్రాకెన, ప్రాకెన్న), అప్పడ(-ళ)ము, అప్పము, ఆపో(పో) స(సా)నము, ఆరోగిణము, ఓగి(-యి)రము, ఓరెము, కజా(-జ్జా)యము, కవణము, కాణము, గాసము, చక్కిలము, తిమ్మనము, పండేరము, పణ్యారము, పులగము, (పుల్గము), పూర్ణము, బోనము, మోదకము, లడ్డువము (లడ్వము), సాదము, పాయి, సిగర(-రి), చక్కెర, పంచదార, చారు, ఉక్కెఱ, జావ, వెలవ, బానసము = వంట, వంటసాల, బానసము = వంటపాత్ర.

### వస్త్రములు.

### దేశ్యములు.

నెఱిక, అవిక (త్రైక). చింకి(-ంపి), టెక్కె, గుడిగి, కోఁక, చెఱఁగు, చెంగు, గోఁచి, నేరాజు, పట్టు, తగటి, తరిటి, గోఁటు, తగటు, రెట్టు, పావడ, గుండ (గుడ్డ), గొంగడి, మడి, మడత, విత్త, దోవతి, తోప్పి, చాఁపు, జీ(జే)బు, కందళము, కుప(-ప్ప,-బు)సము, కూసము, గింజెము, చెకము, చలా(-ల్ల,-ల్లా)డము, జానము, తో(త్రో)పారము, పేరణి, -ణము, పక్కెర, పొట్టము, బొట్టము,వీణ(-ణా)ము, సుగ్గడితము; ఉల్లారు, కంగోరు, పీలి, పోరువ, వలువ (వల్వ), మునువు, వలువు, రేను(గుడ్డ), మాఁదాళి.

### వైకృతములు.

అంగరేకు, అంగి (-ంగీ), జిను (-లు)ఁగు (-వు), కచ్చ, పంజ, పయ(-య్యె)ట (పైట), దుప్పటి, ఉల్లడ, నుంజడి, పాఁత, గంత, పయ్యె (-య్యె)ద, చన్నుగప్పు, జముకాణము, కచ్చడము, దుప్ప(వ్వ)టము. పచ్చడము, పడము, పుట్టము, చీర, తెర, కుచ్చెల(-ళ్లు), సేల, సే(సా)లు, వేష్టువు, తివాసి, కంబళి.

### ఆభరణములు

### దేశ్యములు

కొలికి, ఆకు, వరకు, తీఁగ, ఒగిదిగ, పోగు, లు(లొ)డుగు, ఒంజ, బురజ, ఒంటు(లు), తమ్మంటు, చుట్టు, పట్టెడ, బుగడ, బాగడ, తగడు, తాయెత్తు, బొద్దు, జంపు(లు), కమ్మ, కంకణము, నేవడ(ళ)ము, నేహారము, పెండ(ండా,ండే)రము, సూసకము, ఒవిర, ముంగర, పేరు, ముక్కఱ, బిల్ల, తాలి, మావలి, జవ, లేవ, తొడవు, లొబ్బెస తాళి.

వైకృతములు.

సరిగ, దండ, సరడు, అందె, జుబ్బ, డాబు, ఒడ్డాణము, కలువడము, పతకము, పాడగము, పాయవట్టము, సవరము, అందియ, కంటసరి.

**మల్లబంధములు, మల్లసాధనములు.**

దేశ్యములు.

లోలొంక, చడి(-లి)కి, పట్టు, చాంగణ, కొణత, చేబ, కందణము, కల్లము, కళవరము, గాయమానము = ఒకశస్త్రవిద్య, తాళము, పణము, రెడ్డిగము, కిర్ల, కొక్కెన, తొక్కెన.

వైకృతములు.

డొకా(-క్క)రము.

**వాద్యవిశేషములు, తత్సంబంధములగు పదములు**

దేశ్యములు.

డుబుడక్క, చుయ్యంకి, తీగ, నరగ, చెఱంగు, చెంగు, గంట, గుమ్మెట (-త), కైముడి, బైసణ, కరిది, ఉరుమ, తుడుము, వీర(-రా)ణము, తారమారి, అగురు, ఒళవు.

వైకృతములు.

వాయిదము = వాద్యము, ఢక్క(-క్క), బూరగి, తప్పెట, పంబ, నాగసరము, నిస్సానము, కిన్నెర, బూర, మద్దెల

**ఆటలు**

దేశ్యములు.

ఇటికె, ఉంజి, నట్టు, పగడ, గుడ్డి, చక్కెణి, గొబ్బి, కత్తి, జిల్ల, ఉల్లి.

వైకృతములు.

చదరంగము, జూజ(-ద)ము, బొంగరము.

**నాట్యము.**

దేశ్యములు.

తీరుకు, బజ్జడి, సారు.

వైకృతములు.

పేరణి, జంత్రము, నాటకము, పె(ప్రె)క్కణము, పేంకణము, పేరణము, కట్టరము.

### అశ్వగతులు.

#### దేశ్యములు.

ఊలుక్కు, పుటము, దువాళము.

#### వైకృతములు.

చౌపుటము, నిబ్బరము.

### సంగీతము.

#### దేశ్యములు.

జతి, సువ్వాల, సువ్వలాల, జంపాలు.

#### వైకృతములు.

ఆలతి, సోదాన, కాయసు, తందనను, [illegible]వళిసు(లు), పరము, రాయి, జోల (-వ), దరువు.

### స్థలవాచకములు.

#### దేశ్యములు.

లంక; అటి (-ట్టి)క; ఇక్క; ఒలికి; కెలఁకు (-ను), కొఱఁకు (-ను), గవఁకు (-ను); బంకు; పడకు; విఱిగి; పరుగు (-వు); కాణయాచి (కాణాచి); అచ్చి; అంచు; గంజ, నంజ; ఊజ్జ, వరుజు; నుండట, మేట; కిట్ట, పుట్ట, మిట్ట, మెట్ట; లొట్ట (-ట); గుంటి· నోటు; తెట్టు. తొట్టు. నట్టు; [illegible]ండ; ఎ[illegible], ఎదురు గడ, కెడ, చేరుగడ, జాడ, పట్టడ, మడ, మేడ; అంగడి, కొట్టడి, గడి, పుల్లుడి; చౌ[illegible], [illegible]డు, వెరడు, పోడు, బీడు వీడు; పు[illegible]త; జగతి, వలతి; మంద; తుద, సుద; ఒ (వ) ద్ద, బిద్ద; గొంది; గది, బాది, వది, విడిది; లొద్ది; మీఁదు, క్రిందు; అన, మొన; సూతిని; లోను, వెను (-న్ను), తెన్ను, మిన్ను, విన్ను, వెన్ను; కొంప, లొంప; అరప; డెప్ప; తెఱపి, చేరుపు (-ర్పు), డా (దా) పు, తూరుపు, వైపు; నెప్పు; ఎడమ [illegible]నుము, గనిమ, సీమ; అలంగము, అళము, ఉప్పళము, ఎడము, ఆణియము, ఏనాదము, ఓలము, కందకము, కంపరము, కుప్పము, కురాళము, కయి (కై) వారము, కొలా (ల్లా) రము (కొలారు), క్రొత్తడ (-ళ) ము, గుడ్డ (-డ్డా) ము, డా (దా) పురము, తావలము, దద్దడము, నెత్తము, పల్లము, పాటకము, పోలము, బిడారము, బుయ్యారము, బొక్కసము, సాహిణము; లోయ; కయ్య; పై; ఓర, కర, కొండ్ర, పడమర, మట్ర, ఆడు (-ళు) వరి, ఉద్దరి, ఎడారి: గండారు, నగ (వ) రు, బిడారు, మోరు; ద (డ) గ్గఱ, పఱ, పాతఱ, వఱ, పఱ్ఱ, పుఱ్ఱ; అఱ్ఱు, మిఱ్ఱు; కోవెల, మసెల, మూల, మో[illegible]; ఎల్ల; కుఱుంగలి, గుబ్బలి, చెంగలి,

డా (దా) కలి, నలి; చదలు, నల్లిండ్లు, పలు, వెడలు; - ఇల్లు; అట్టువ, ఎగువ, ఏఱువ, కందువ, కురుప, క్రేవ, తో (త్రో) వ, నరవ, పడువ, పారువ, బడువ, బాడువ, లోవ, సడవ, స (సా) వ; దా, గవి; ఇరవు, ఇరువు, ఎడవు, తావు, తెరువు (ర్వు), దావు, నెలవు; పొరువు, బిడువు, రేవు, కోన, సరన, చవు (చా) కళి, వాళి.

వైకృతములు.

కలఁకు; ఉప్పరిగ, జగ; బగి; మాడుగు; కొ(క్రొ)ంచ, పంచ; రచ్చ; కంచి; కోట, పేట, బాట, గుట్ట; గట్టు; కొండ; కడ, పఱగడ; గడ్డ, గుడి; పల్లుడు; గుంత, సంత; అగడిత; వాఁగరత; అంతస్తు; ఒడ్డాది, వీది; సందు; ఉజ్జని; తిప్ప; గొంబ; గుబ్బ, దిబ్బ; దిమ్మ; పుడమి; అంకణము, అంతిపురము, ఎగ్గతము, ఏలము, కళ్లము, కొట్ట (-ట్టా)ము, కొండము, గాతము, గీము, గుండము, గు(గూ)డారము (గుడారు, గూడారు), గొల్లము, చదుకము, చౌపదము, జగము, తానకము, దక్కినము, దివాణము, దీము, దువారము, దేవళము, దోరము, పచా (-సా)రము, పట్నము, బందిగము, మసనము, మళయాళము, లాయము, వాగళ (-ళ్ల)ము, సజ్జారము, సారంగము, ఇమ్ము; వాయ, మేర; అంతిపురి, ఓవరి, దరి, దారి; చూరు, పసారు; కడపల, కొంచమల, మల, సాల; సోలు, బయలు, బైలు, పల్లు; కరువ, నడవ, మండువా; దీవి; తావు, మాడువు, సత్తరువు; దవ్వు.

పృథ్వీతత్త్వమునకు సంబంధించిన పేళ్లు.

దేశ్యములు.

పడుసు, పణకు, బండ; రేగ (వ) డ (డి); చగు (-వు)డు (చౌడు); చలుప; ఱప్ప; ఇసుము, దుమారము, దుము, మొరము (-ర్ము); దుమ్ము; రా (ఱా)యి; ఎక్కిలి; కల్లు.

వైకృతములు.

గులక; గొడిగ; మట్టి; నుద్ద; మన్ను; గరుము, లప్పము; కంకర; తొగరి; గరువు(-స).

**నీటికి సంబంధించిన పదములు.**

దేశ్యములు.

కరక, పుక్కి; చదుకు; బుడగ; నురుఁగు; చొదుగు; వెంచ; మాచు; ఱొచ్చు; కలుఁజు, నింటు; ఊట, నిట్ట; ఊటు; దొరుగండి; తడి, నుడి; లొండు; కరడు, వరఁత, వ్రంత; పఱకె; పఱద, బురద, వఱద, పంకెన, వాన, సోన; కొలను (-ల్ను); చిలుప; రొంపి; ఱొంపు; ఊబి, మ(మ్రు)బ్బు, చెలము

చెమ్మ; ఒప్పరము, కరడము, వసంతము; నెమ్ము, క(క్ర)య్య; ను(నూ)యి (నుయ్యి); జక్కర, తుట్ర, జవేరి; కోనె (నే)టు, జంబేటు; పఱ్ఱు, ఏఱు, వ్రాల్ల; అక్కలి, ఉబ్బలి, కడలి, వండలి, వెల్లి; ఆగడపలు, కడలు, దొరగడలు, మొగులు; కాలువ, ఈరువ, పఱవ, వరవ, వెల్లువ, దొరవి, దొరువు, నురువు; తల్లు, తుంపిల్లు, వంగుల్లు

వైకృతములు.

వాఁక; పంకి; కొలఁకు (-ను,-కువు); తరఁగి, వాఁగు, కుంట, గుంట, జడి; ఉప్పెన, జమున; పెన్న, తేమ; అంపాచారము, ఇగ (వ)ము, ఈము, కంకణము, సందర (-ంద్ర)ము, దమ్మ; తుంప (= ప్ప)ర (-రు), ఏరు, జెల, సెల; జాలు (వు); జ(ద)ల్లు, భావి, కె (కే)ళ (ళా) కు (కా)ళి.

వాయువునకు సంబంధించిన పదములు.

దేశ్యములు.

ఈద; గాడుపు; మమ్ము, ఈదర, తెమ్మెర, పయ (-య్య)ర (పైర), సుర; గాలి; వీవలి, కరువ (ర్వ)లి.

వైకృతములు.

సరము, ఉసుఱు.

తేజోవాచకములు.

దేశ్యములు.

కణఁకు; పొగ (-వ); నీడ; కొరడు, త్రాడు, పదడు, మిను, సొబను; మిన్ను, విన్ను; మెఱపు; నిప్పు; రొయి (-య్యి); ఊదర; ఆవిరి, కప్పిరి; దూగఱ; నిగు (వు)ఱు (నీఱు); వెన్నెల; ఎరగ (-వ)లి; వైరవులు (వైరాలు), కొఱవి; బుసి, గుడుసు, పిసాళి.

వైకృతములు.

సెక (-గ,-వ); చుక్క, రిక్క; గ్గి చిచ్చు, చిత్త, బూతి, కిత్తి (-త్తు), బూడిద (-డ్డ), పరిది, బూది, అగిని, సని, ఉబ్బ, పుబ్బ, ఆసము, ఇంగ (-ంగా,-ంగి) లము, ఉప్పరము, గాము, దయ్యము, దూపము, నీటిదయ్యము, పాటము, బనుమము.

గృహోపకరణములు, వృత్తిసాధనములు మొదలయినవి.

దేశ్యములు.

అదక, అబక, ఉతక, సులక(-ల్క), గిరక, గిఱక, గుంటక, చిత్రిక, తేటిక, దాక, పొరక, బత్తళిక, అలంకి, బొంకి; పక్క; లిక్కి, చిలుకు; అడ్డి

గ(లు), గానుగ, గొడ(-ణ)గ, నొగ, బొరిగ, నలగ(-వ), హ(అ)రిగ; అలుగు, కరుగు, గిడుగు, గొడుగు; ముగ్గు; పుచ్చు, గొణిజ(-ద); సజ్జ; కురుఁజు; పంజు; పరఁటు; వెంటు; చేట, సమ్మెట; అట్ట, గిట్ట, ఒట్ట, అరఁటి, దోఁటి నురఁటి; వెంటి; కుంపటి, చింగోటి, చిల్లోటి, తక్కటి, పల్లటి, పొరకటి, బరిటి; ఉట్టి, చట్టి, తట్టి, తొట్టి, లొట్టి; కీటు, కూటు, బొండ, అట్టెడ, గూడ, అరడ, గెడ, జల్లెడ; పట్టెడ, పాలడ, పాడ, బత్తెడ; గాఁడి; బండి, కోరడి, తిక్కడి, దూఁబిడి, నెగడి, పిడి, ముప్పిడి, సరవడి; సిడి; దడ్డి, బుడ్డి; గూఁడు; చెండు, ది(ద్రి)ఁడు; కొఱడు, కోడు, చరుగుడు, తాడు, దబ్బుడు, మొగడు, నురడు, అరిణ, వారిణ; పక్కణి; కరకణి; ఊడిగె, పణత, బడిత, మొణత; దుత్త, మొత్త; బవంతి, పుల్లతి; చేఁద; ప్రమి(-మ్మి)ద, బూద; కుంది, నెయ్యంది; పాది, పోది; వారధి, ఎడ్డెన, కందెన, గూన, డొంకెన దసెన, మరసాన, వంతెన, వాతెన, వీవన, దువ్వెన; ఐరేని, జీను; చాఁప; దుంప అగప, క(గ) డప, గొనప(-మ), తడప, తాప, తేప, దొప్ప; కలాఁపి, తల్లఁపి; కలయంపి, త్రంపి; చానపి; కోడుపు, కోపు, దూర్పు, తెలుపు, తాగుపు, పెలుపు, పానుపు, వానకోడుపు; కొప్పు, చెప్పు; డాబ, సిబ్బి; కోడమ, బొటిమ, బొడిమ; లిమ్మి; కొలిమి; కాపంతము, కమ(మ్మ)టము, కలువ(ల్వ)ము, కవ్వము, కూచము, కోదండము, గంటము, గనయము, గునపము, గుంబ(-మ్మ)ము, గొట్టము, గొండె(-ండ్లె)ము, చట్టువము, చిల్లము, చీరణ(-ర్ణ)ము, జుంజ (-ంజా)ము, తండసము, దబ్బనము, ద(ది)బ్బడము, దుందుము, దురాడము, దెంచనము, దో(ద్రో)ణ(ణా)ము, పడవలము, పాపటము, పెనము, బదరి కము, బలపము, బీగము, భోషాణము, మాద (-దా)నళము, మగ్గము, మల కడము, ముటము, మొక(-క్క)రము, అంపము, సేనము, హడపము, సంగ డము, సోరణము, స్రావణము; కొమ్ము; కొయ్య, డా(దా)యి, పో(ప్రో) యి(-య్యి) (ప్రోయి); తత్తెర, దాఁగర, పంట్ర, పోగర; ఉరి, జింజిరి, నారి, పరి, పిరి, ఏరు, ఓరు, కదురు, చీపురు, తేరు, దగరు, పన్నారు, పాలేరు, అఱ, పాఱ, వాగఱ; అజ్జ; కొఱు, కఱ్ఱు, కొఱ్ఱు, గొఱ్ఱు; తిత్తి, ఎత్తెల, ఒడి సెల, కోల, చీల, లొట్టి(ట్లె)ల, (తొట్ల), పల, వసల, సల, సీల; గల్ల, జల్ల; లొల్ల, ఉలి, కోడవలి, తిరుగలి, దాక(-గ)లి, పొక్కలి, మరవలి, లాలి, విడ వలి; జల్లి; కోఁతిపుల్లలు, అంతికలు, ఉద్దాలు, కొమరులు, గుండ్రలు, చాఁపలు, జతిగెలు, పాలెలు, పావటీలు, పూజెగులు, మగులు, ఆలోలు, లాకలు, లూడుపులు; దాకల్లు; అలవ, కట్టువ, కత్తువ, కో(క్రో)వ, సిలువ; జువ్వ; గండరువు, మేరువు, సంబాగువు; దోఁకిస, బిస, వాస(ము); తరకసా;

ఉత్తరాసి, కుసి, పిసి; ఇరుసు; బొలుసు, నెరసు, బొరుసు; కాసె; ఎత్తళి, మిళ్లి; పిళ్లు, సిళ్లు.

వైకృతములు.

గొరక, పలక, గుబక; సంజోక, సలాక, వంకి; గొడగ, పడగ; బండగు; కమ్మచ్చు; గుంజ, పింజ; సంపెట, పీట; బుట్ట, వట్ట, కంక(-ంగ)టి, త్రిక్కటి, దివ (-వ్వ)టీ; సగటు, ఓడ, గడ, గోడ, జల్లెడ, తక్కె(-క్కె)డ, అట్టడి, గుండు, జోడు, సరుడు, తె(త్రె)డ్డు, ద్రుడ్డు, దోరణ, బరణి, వంకిణి, అగద్త, ౦ణాత, బాడిత, తంతి, కత్తి, వత్తి, కుంద, సూది, దామెన, నిచ్చెన, దొన, సాన, గుబ్బ; ఉమి(మ్మి), అంకుసము, అందలము, అడ్డనము, అత్తెము, అద్దము, అరదము, ఆవము, ఉగ్గము, ఏత(-తా)ము, కంచరము, కంబము, కక్కసము, కగ్గము, కణజము, కరగసము, కరవటము, కరాటము, కల్లియ (-ల్లె,-ళ్య)ము, కొలపము, గాల(-లా)ము, గూట(-టా)ము, గొలపము, గోరోజనము, గోర జము, చిక్కము, తమగము, తొండము, దూలము, నిబ్బరము, పంజళము, పంజరము, పగ్గము, పదరము, పలకము, పొత్తరము, ప్రగ్గము, బంద(-ందా)ము, రాటన (-ట్న)ము, వంక (కా)ము, వడము, క(క్ర)క్కెర, కత్తెర, కటారి, కరాచురి, చు(చూ)రి(-రీ), ప్రహరి, బారి(-రీ), చేరు(-లు), కట్టి, జాల, కట్లి, కప్పలి, గుద్దలి, గొడ్డలి, నాగలి, రోకలి, కీలు, నాగె(-గే)లు, పావలు, సంబవులు, సంబా(-మ్మా)ళిగలు, కటువు, బాడిస, మందస.

యుద్ధమునకు సంబంధించిన పేళ్లు.

దేశ్యములు.

కోటి, కొట్టి, జిద్దు, అని, కలను, తూపు, తొడుపు, అడిదము, అత్త లము, కత్తళము, కయ్యము, చదలము, చిల్లాడము, జగడము, తరకసము, దెప్పము, బొందళము, బొమిడి(డీ)కము, మొగ(-గ్గ)రము, మోహరము, రంజ కము, సబళము, సిడము, సిరాణము, కంగారు, బాదరు, అంపలి, ఒలి, అంప-కోల, ఎసలు, విలు(-ల్లు), పడవ, కైదువు, మఱువు, కంగిస, బరిస, కిరుసు.

వైకృతములు.

లగ్గ, జముదాడి, సింగా(-ంగి)ణి, లగ్గడింపు, అంబు, గొనయము, జముదళము, నారసము, సూయాణము, కత్తివాతియమ్ము, జోడమ్ము, తరవరి, టారు, కరవాలు, వాలు.

వ్రాతకు సంబంధించిన పదములు.

దేశ్యములు.

ఆడి, వ్రాత, కలము, సంతకము, వ్రాయి, గీఱ, గెఱ, కవలు, వ్రాలు, వహి.

నైకృతములు.

లేక, పొరట, పడి, అక్కరము, అజ్జము, అట్టము, కడితము, కబ్బము, పన్నము, పొత్తము, ప్రోగబ్బము, బడితపారము, పనస.

**విఱుగుట, నలఁగుట, మొదలగు భావములకు సంబంధించిన పేళ్లు.**

దేశ్యములు.

చీలిక, తునుక, బీటిక, ముక్క, మొఱికి. కఱుకు, కళుకు, నగ్గు, నుగ్గు, నూచ, నఱుజు, బీట, తూఁటు, పే(బే)టు, నపిగొట్టు, దొండి, బగ్గుండి, పొడి, ఎదులుడి, తుత్రుంపుడు, బ్రుంగుడు, వంగుడు, విఱుగుడు, బొత్త, బొంద, బద్ద, బడపి, తుత్రుంపు, దుంకము, పొడుము, బెజ్జము; సురుము, పాయ, బదగ, బ్రద్దర, తిరి, తుమురు, వందఱ, చిల్లి, చిదురలు, చిదురు (-ద్రు)పలు, పాలు, దువ్వ, నుసి, నలుసు.

వైకృతములు.

చెక్క, వ్రక్క; చక్కు; గుండ; పిండి; తుండము; బద్ద, వ్రప్పు; తుండము, బెలము, సున్నము; వ్రయ్య; చిందఱ; గండరులు.

**సమూహ వాచకములు.**

దేశ్యములు.

కుఱుకు; తెగ(వ), తొగ(వ); తోఁట, అంట, తిట్ట; దండు; కీతి, దొంతి; మోద; గుది; లొద్ద; కోన, పన; చేను, ఊప; కప్ప, కుప్ప, తెప్ప, లప్ప; గుంపు, పదుపు(-వు); చిమ్మ; గమి, గుమి, వామి; అల్లము, ఈనము, కభాడము, కి(కీ)లారము, జొంపము తుటుము, మూవటము, సుడుసు; దిమ్ము; తంపర, దొంతర, దోర; కొటు, గుబు(-బు)గు, జుజులు; దాలి, పడలు; కవ(- వ్వ, - ప్ప), తోట్టువ; తెట్టువు, పదువు.

వైకృతములు.

ప్రోక; తిగ(-వ); పో(ప్రో)గు(-వు); జంట, జనుట, పంపు, కాడు, పఙ్క్తి; మంద; కాన; కెనుపు; తమ్మి, పొతము, బల్లము, బణ్ణము, పిందము, మొత్తము; బారు; జమ(-మి)లి; అడవి, పరుస, రసి, రాశి

**ధ్వనికి సంబంధించిన పదములు.**

దేశ్యములు.

కేక, నసుకు, పుసుకు, పొటుకు; సంగి; మాట, ముచ్చట; ను(నో)డి, సవ(వ్వ)డి; చప్పుడు; కూఁత, నత్తి; ఱంతు; బూతు; బద్దు; దీవ(-వె)న, పెలుచన; గోరప; ఱంపు; అఱపు, ఉఱుపు, పిలుపు; బొబ్బ; తిడిమ్మి; అలబలము

కంటసము, క్రొక్కాగము, ను(నో)శ్శికారము, బేరజము; కుయి (-య్యి), కూయి; ఒండ్ర, బద్దుర; చెనుపరి; నెగ్గుకు, పదుకు; డ(ద)బ్బఱ; పట్టు; విళంగిలు, సడుగులు, ఉలివు, హొరువు, తొగ్స, త్రస్స; త్రుస్సు; ఊళ; ఠ (త) వళి; పేళ్లు.

వైకృతములు.

గీఁక; తెనుఁగు; గ్రుచ్చు; సామెత, రొద; నాదు; సద్దు; ఉంబ; అఱవము, ఇచ్చకము. కన్నడము, పలము, పలవరము, రొదాళము, సకినము, సారము; బాస; కరుసు: రవళి(-లి), రవాళి.

**రుచులు.**

దేశ్యములు.

చేఁదు, వేఁదు; ఉప్పన, కమ్మన, చప్పన, తియ్యన, తీయన, పుల్లన; పుల్ల.

వైకృతములు.

కారము; తొగ(-వ)ర; ఒగరు.

రంగులు

దేశ్యములు.

వెలుక, జొత్తు, కందు, పంజళ, పల్పలన, పసను, కెంపు, తెలుపు, కప్పు, దోర, కత్తెరి, కావిరి, కారు, జేగు (వు)రు, తొగ(-వ)రు, పసరు, పుల, పుల్లు, నీలి, వెలి, బొల్లి, లాలు, చెన్వు, డాళు.

వైకృతములు.

పలుక, మసక; గంగు; పచ్చ; జాజు(-దు); మంజటి; రంగుపాణి; ఎఱ్ఱన, గవరన, చామన, తెల్లన, నల్లన, పచ్చన, పలుక (-ల్క)న, పచ్చన బచ్చెన, మసకన, వెలవెలన, వెల్ల; విన్న; ఎఱుపు, తెలుపు, నలుపు, పసుపు; కుసుమ, చామ, కసీసము, కుంకుమ, కుసుమసు, చామనము; పయ్య; వెలరు; కఱ; ఎఱ్ఱ, కఱ్ఱ; కవిల, తెల, నల; తెల్ల, పల్ల, వెల్ల; తెలి; మసి.

రోగములు.

**దేశ్యములు.**

వేఁకి, అక్కి; డ(ద)గ్గు; తీఁట; బొట్ట; తెమడ, దడ; ఉంగడి, నరిడి, నీరుడి, లాడి; చుండు, పుండు, రొండు(-డ్డు); చిరుగుడు, పారుడు, పు(ప్రు)ంగుడు, పొక్కుడు, మంగుడు; మోఁద, గా(గ్రా)ద, దురద, మాద; బేరి; లిద్ది; రొంప; కులుప, చొడిప; పుప్పి, కుఱుపు, వగరుపు; త్రుప్పు, పుప్పు; కునుము; ఉలుము, కదుము, కురము, చిడుము, చీము, పడిసెము, ఐర, దామర, పత,

పోర; ఆవిరి, మారి; కిసరు, తొండరు, వగరు; జిల, దూల, బల్ల; నలి, నాలి, నులి; అఱుదెవులు. తెగు(-వు)లు; కోవ, నవ; చెవ్వ, జవ్వు; గస, నస; క(గ)ళ్ల.

వైకృతములు.

రసిక; మక్క, జడ్డు; కంతి; కడి(-ణి)తి; చలిది(-ల్ది); దద్దు, సోబ; జలుబు; ఉబ్బసము, దొందము, సాచ(-స)నము, పోటకము, సిబ్బెము, దిమ్మ; ఓకర; దద్దురు; కామాల; వె(ఎ)క్కిలి; రసి.

కొలతలు.

దేశ్యములు.

పరక; పుట్టి; చిట్టి, పడికట్టు; ఆమడ, పడి; ముంత; జుత్తు; రతి; గిద్ద; జేన, పదును; అడిగము, ఇల్లము, ఎళ్లము, కలము, చవలము, చిన్నము, ధడియము, పణము, మరకము, వీసము; చేర, బార, మూర, వార; కుచ్చెల, కొల, కాలు, తవ్వ.

వైకృతములు.

ప్రక్క, మణుఁగు, అడ్డ, మాన, పంపు, ఏబులము (ఏబదలము), కుంచము, తులము, తూము, పదలము, పలము, పుంజము, మాసము, సేరు, సోల, జెత్తలి, బారువ, కోసు, వీసె.

కాలవాచకములు.

దేశ్యములు.

పూఁట, పుంట, ఏట, పురట, ఏఁడు, నాఁడు, నిరుడు, తతి, కంతు, ఏఁడాది, ఉగాది, తవన, ఆమని, అ(హ, ప)దను, మున్ను, రే(జే)పు, సేపు, తరుణము, కాఁదారి (మాఁదారి), పారి, చిత్తజి, తఱి, నెల, పగ(-వ)లు, సావి, గడువు.

వైకృతములు.

వేసఁగి(-వి), సంజ, గంట, చౌతి, సీతు(వు), తేది, పొ(ప్రొ)ద్దు, సరిప్రొద్దు, ప్రేపు, పున్నము, పాడ్యమి, అతివాసము, గడియారము, జాము, నిముసము, పక్కము, మూర్తము, లగనము, లగ్గము, తదియ, విదియ, రే(జే)యి, రెయి(రే), రాతిరి, అపరాత్రి, కారు, అమవ(-మా)న, నిసి.

పాత్రలు.

దేశ్యములు.

అటిక, పన(-ర)ఁటి, అరిమెనకుండ(లు) నగ్గెడ, గిండి, మూఁకుడు, పిడుత, కొడుము, గంగాళము, గడము, తాంబాళము, దబ్బడము, బందడ(-ల)ము, తపెల, వెసల, పక్కాలి, బాణలి, అంట్లు, ప్రవ్వ, లోవి.

## వైకృతములు.

అలకి, గరగ, తళిగ, పడిగ, లడ్డిగ, పోట, గట్టి, కుండ, బాన, చిప్ప, చెంబు, అరివాణము, ఆలాయము, కంచము, గోలెము, చెరవము, కప్పెర, కొప్పెర, మల్ల, కడవ, బొందువ.

## నాణెములు, ధనము, ధనసంబంధములగు పదములు.

### దేశ్యములు.

చివుక, నిరుకు, పోగచి, వెచ్చు, కేడ, మాడ, రవసి, చుంగుడు, దుడ్డు, క్రంత, అరిత్థ, టీపు, ముడుపు, అప్పు, నేబు, ఒడమి, సొమ్మను, తారగము, దమ్మము, దరణము, నాతము, వైకము, మొలాము, మోలము, హాంకము, సచ్చము, ఏందుర, పిర, కోరు, ఓలి, కూలి, ఉంకువ, కుదువ, ఎరవు.

### వైకృతములు.

పరక, ముచ్చొక, బాసిగ, బొట్టు, దమ్మిడి, వడ్డి, అణా, గుత్త, సొత్తు, ఏగాని, కాని, ఉలుప, డబ్బు, అరణము, జీతము, టంకము, పసదనము, బత్తెము, లంచము, సంబడ(-ళ)ము, సొమ్ము, రూపాయి, రో(యి), దినారి, సిరి, మొహరీ; బండారు, సావలా, రువ్వ, ఉద్దరువు, సంచకరువు, కాసు.

## పన్నులు మొదలయినవి.

### దేశ్యములు.

కానుక, పంజి, పన్ను, కప్పము, దాణము, పలచము, విర(-రా)ళము, అరి, ఇల్లరి, పుల్లరి, ఉంబళి.

### వైకృతములు.

పంగము, సిద్దాయము, సుంకము.

## లోహములు మొదలయినవి.

### దేశ్యములు.

తెంట, కేగడ, కేడ, మాడ, వైండి, సి ... , ... త్తిసి(-లి), సత్తు, కడాని, కెంపు, కుళుపు, గొతుపు, తుంపు, ఇండుప్ప, ఇనుము; కుందనము, తుతి (-త్తి) నాగము, మడికాసు.

### వైకృతములు.

రాగి, పలుగు, పచ్చ, కంచు, సుసా(-ప్పా)ణి, మిన్న, అ(హ)రిదళము, ఇంగిలి(-లీ)కము, చెందిర (-ంద్ర)ము, తగ(వ)రము, నవాసారము, పగ(-వ)డము, పటికము, పాదరసము, బంగ(-ంగా)రము, బండవలము, బండారము, బోళము, మానికము, మైలుతుత్తము, గతనము, సంచము, సిందు(-ందూ)రము, సొన్నము, కస్తూర, ఉదిరి, బంగారు(వు), సోరు.

### గంధము.

#### దేశ్యములు.

వాడ, గత్తు, గొత్తు, వేదు.

### ఎరువు.

#### దేశ్యములు.

పరచి, పేడ, గత్త, చెత్త, కనను, కలుపు, గాబు, దిబ్బ, గవతము, గొబ్బరము, చెదారము, కొప్పెర, ఎరువు.

#### వైకృతము.

కసవు.

### చెట్లు, సస్యములు, వ్యవసాయము, మొదలగువానికి సంబంధించిన పదములు.

#### దేశ్యములు.

చింక (లు), కొంక, డొంక, బంక, ఈడిక, ఈరిక, ఉముక, గఱిక, గొలక, చివక, చువక, మెఱిక (లు) నుంకు, ఆకు, చీకాకు, తడుకు, ప్రాకు, ముక్క (లు), సెలగ, ఎండుగు (లు), కద్దు, సాగు, కొలుచు, నెచ్చు, పిచ్చు, గుంజు, గుజ్జు, తోఁట, వఁట, జిట్ట, కట్టుగడ, సడ, క్రేడి; ఒగుడు, జాడు, తవు (తౌ) డు, నూఁగుడు, సాంబ్రాణి, కుడితి, వెద, గోఁదు, తొఁస, పుల్లెన, దొంపు, క (గ) నుపు, చీపు, పోపు, అత్తము, అనుము, ఆనుగము, ఏలారము, కనుము, గుఱుము (లు) జాజ (-జా) ము, తుకము, పానడము, మునుము, వళాగ్రము, విత్తనము, సేవ్యము, తొట్రు, పోతరి, కనురు, గుఱురు, జి(జీ)గు(వు)రు, పిసరు. తొట్టి, నాఱు, మొల్ల, పావలి, గొప్పలు, చాలు, చేరుడులు (చేరుళ్లు), పులు, పెసలు, పేలలు, ప్రాలు, బొరుగు (వు) లు, పిల్లు, పుల్లు, ముల్లు, మొదవ, చువ్వ, తసి, మోను.

#### వైకృతములు.

పెడక, పోక; తొక్క, వక్క, తప్పెట, పాపట, గొంటు, సద, పాదు, బందన, చికిని, ఆరబము, కడిలము, గండివనము, చికినము, దుండిగము, బాగము(లు), బీరిజము, బేసము, అమడలు, అక్షింతలు, తెట్టువ.

తెనుఁగునందలి యాదృచ్ఛిక శబ్దజాలమును బైవిధముగ వేర్వేఱు వర్గములుగ పదముల యంతముల ప్రకార మేర్పఱిచితిమి. ఏవర్గములోనికిని జేర్చుటకు వీలులేక నిలిచిపోయిన పదములు సుమారిన్నూఱు మిగిలినవి. కొలఁదిగ జాఱిపోయియు నుండును.

పై పదములలో దేశ్యములు వైకృతములు నను విభాగము చేయఁబడి నది. దేశ్యపదముల యంతములే వైకృతపదములకును నవే యర్థములలో వచ్చియుండుటను చదువరులు గమనించియుందురు. ఇదిగాక కొన్ని పదములు వైకృతములుగను, ఆ పదముల వికారరూపములే దేశ్యములుగను నిరూపింపఁ బడుటను గూడ గమనింపవచ్చును. దేశ్యములుగ శబ్దరత్నాకరకారుఁడు నిరూపించిన యనేకపదములు స్పష్టముగ వైకృతము లయియున్నవి. గొంచె మోపికతోఁ బ్రాకృత వర్ణపరిణామమును మనసునందుంచుకొని యాలోచించినచో నింకననేకములను వైకృతములని నిరూపింప వీలగును. కొన్ని యన్యదేశ్యములని 'యన్యదేశ్య పదజాలమను శీర్షిక క్రిఁద నిరూపింపఁబడినవి. దేశ్యములని శబ్దరత్నాకరకారుఁ డుదాహరించిన యనేక పదముల వైకృతత్వమును కొలఁది కాలములోఁ బ్రచురింపఁ బోవుచున్న నిఘంటువున నిరూపింపఁ బోవుచున్నాను.

## పైశాచీభాష

ప్రాకృత వైయాకరణులను ప్రాచ్యులు, ప్రతీచ్యులు నని రెండు శాఖలవారిగ విభజింపవచ్చును. వీరిలో వరరుచి మార్గానుయాయులు ప్రాచ్యులు; వాల్మీకి మార్గానుయాయులు ప్రతీచ్యులు. వరరుచి ప్రాకృత ప్రకాశికను వ్రాసెను. దీనికి భామహుఁడు వ్యాఖ్యను రచించెను. భామహుఁడు కాశ్మీరదేశస్థుఁ డగుటచే ప్రాచ్యులును బ్రతీచ్యులు నాతని ననుసరించుచుందురు. వరరుచి మార్గము ననుసరించినవారు రామశర్మ తర్కవాగీశుఁడు, మార్కండేయుఁడు ననువారు. రామశర్మ ప్రాకృతకల్పతరువును వ్రాసెను. మార్కండేయుఁడు ప్రాకృతసర్వస్వమును వ్రాసెను. మార్కండేయుఁడు అపభ్రంశమునుగూర్చి వ్రాయునప్పుడు ప్రాకృతకల్పతరువు నుండి శ్లోకముల నుదాహరించియుండుటచే రామశర్మకంటె తిరువాతి వాఁడనుట స్పష్టము. ఇతఁడు ఓఢ్రదేశవాసి. రామశర్మ తన వ్యాకరణమున కాధారములుగ లంకేశ్వరుఁడు, రావణుఁడు, అనువారి గ్రంథములఁ బేర్కొని యున్నాఁడు. ఇతఁడు 'ప్రాకృత కామధేను'వను గ్రంథమును వ్రాసినాఁడఁట. ఆతఁడే రావణుఁడను పేర నీ ప్రాకృతకామధేనువునకు 'ప్రాకృత లంకేశ్వర'మను వ్యాఖ్యను వ్రాసెనఁట. మార్కండేయుఁడు తనకుఁ బ్రమాణ గ్రంథములుగ శాకల్య. భరత, కోహల, వరరుచి, భామహ, వసంతరాజాదులను బేర్కొనియున్నాఁడు. వీరిలో శాకల్య, కోహలులను గూర్చి ప్రాకృతసర్వస్వమున నుదాహరింపఁబడిన శ్లోకములవలనఁ దప్ప మఱేమియుఁ దెలియదు. భరతుఁడు సుప్రసిద్ధుఁడు. వసంతరాజు ప్రాకృతప్రకాశికకు 'ప్రాకృత సంజీవని' యను వ్యాఖ్యను రచించెను. మార్కండేయుఁడే కాక కర్పూర

మంజరీ వ్యాఖ్యాకారుఁడగు వాసుదేవుఁడును నీతని గ్రంథములనుండి యుదాహరించి యున్నాఁడు.

ప్రతీచీ సంప్రదాయము ప్రకారము వాల్మీకి ననుసరించినవారిలో ముఖ్యులు త్రివిక్రమ, లక్ష్మీధర, సింహరాజ, హేమచంద్రులు. త్రివిక్రముఁడు ప్రాకృతవ్యాకరణమును, లక్ష్మీధరుఁడు షడ్భాషాచంద్రికను, సింహరాజు ప్రాకృత రూపావతారమును, హేమచంద్రుఁడు ప్రాకృతవ్యాకరణమును రచించిరి.

ఈ రెండు శాఖలవారి గ్రంథములకును జాలభేదములు గలవు. చిన్న విషయముల నటుంచినను, వారేర్పఱిచిన గణములలో నొకదాని కొకటి పొందదు; ముఖ్యముగఁ బైశాచీప్రాకృత విషయమున నీ రెండుశాఖలవారి గ్రంథములును బరస్పర విరుద్ధములుగ నున్నవి. వాల్మీకి చెప్పిన పైశాచి వరరుచి నిరూపించిన పైశాచి కానే కాదు. వాల్మీకి ఒక్క 'ద' కారము మాత్రము 'త'కారమగునని చెప్పెను. వరరుచి సంప్రదాయమువారు వర్గ తృతీయ, చతుర్థాక్షరము లన్నియు వర్గ ప్రథమ, ద్వితీయాక్షరము లగుననిరి. వాల్మీకి సంప్రదాయమువారు వరరుచిపైశాచిని వర్ణించిరి కాని, దానికి చూలికాపైశాచియను పేరిడి, మూఁడు సూత్రములను మాత్రము చెప్పి, దానిని పైశాచిలోని యొకచిన్న యవాంతరభేదముగ గణించిరి. వరరుచి సంప్రదాయమువారు పైశాచియం దేమభేదములను నిరూపించిరి. వీనిలో నేదియు ప్రతీచీసంప్రదాయము వారి పైశాచితో సరిపోదు.

హేమచంద్రుఁడు వాల్మీకి పైశాచిని వివరించుచు ననేకోదాహరణముల నిచ్చెను; కాని యా యుదాహరణముల నేగ్రంథములనుండి సంగ్రహించెనో తెలుపలేదు. అవి గుణాఢ్యుని బృహత్కథనుండి యుదాహృతములని కొందఱుపండితులు తలంతురు.

పైని వివరించిన రెండు సంప్రదాయములవారును ప్రాకృతము వ్యవహారభ్రష్టమయిన కాలమున తమ వ్యాకరణములను వ్రాసిరి. కావున వారికి ప్రాకృత కావ్యములే యాధారము లయ్యెను. ఆ గ్రంథముల నుపయోగించుటయందు ప్రాచ్యు లెక్కుడునైపుణ్యమును జూపిరి. వారు తాము చేకొన్న గ్రంథముల నామములను దెలుపుచు వచ్చిరి. ప్రతీచ్యులు తమ యుదాహరణముల నెందుండి చేకొనిరో తెలిపియుండలేదు. కావున వారి వ్రాఁతల కాధారము లెవ్వియో తెలియదు. ప్రాచ్యుల వ్యాకరణము లెక్కుడు ప్రమాణములుగా నున్నవి.

షడ్భాషలని చెప్పఁబడు ప్రాకృతములు గ్రాంథికములు. వానిలో నొక్కొక్కదానికిని ననేక వ్యావహారికరూపము లుండెను. వీనినిగూర్చి మనకం

తగాఁ దెలియదు. గ్రాంథిక ప్రాకృతములలోఁ గూడ పైశాచిని గూర్చి మనకుఁ దెలియునది చాలఁ గొంచెమే. పైశాచి యనునది ఒక్కటేయని కొందఱి యభిప్రాయము. కొందఱు చూలికాపైశాచి యను మఱియొక భేదమును దెలిపిరి. మార్కండేయుఁడు కేకయ, శౌరసేన, పాంచాల భేదములచే పైశాచి మూఁడు విధములనెను. ఆతఁడు 'కాంచీదేశీయ, పాండ్య, పాంచాల, గౌడ, మాగధ, వ్రాచడ, దాక్షిణాత్య, శౌరసేన, కైకయ, శాబర, ద్రావిడములని పైశాచి పదునొకండు విధములని కొందఱందురనియు, అందు తాను చెప్పిన మూఁడే గ్రాంథిక ప్రాకృతములనియుఁ జెప్పెను. లక్ష్మీధరుఁడు పైశాచిని (1) నియత పైశాచి, అనఁగా నాయా పిశాచజను లితర దేశములందు చేసి ఉగ వాడునది (2) పిశాచదేశజ పైశాచి, అనఁగా పిశాచజనులు తమ దేశమునందు వాడుకొనునది అని రెండువిధములుగ నుదాహరించెను. పాండ్య, కేకయ, బాహ్లిక, సింహ(సహ్య), నేపాల, కుంతల, సుధేష్ణ భోజ, గాంధార, హైవ, కన్నోజన (కాన్యకుబ్జ) దేశములు పిశాచదేశములని యాతని యభిప్రాయము. వీనిలో హైవ యనునది తుళువదేశమని లాసెనుగారి యభిప్రాయపడెను. భోజ యనుటకు బోట యనునది రూపాంతరము. బోట యనునది నేఁటి టిబెట్టు. సుధేష్ణదేశ మెద్దియో తెలియదు. తక్కినవి సుప్రసిద్ధములు.

రామశర్మ తర్కవాగీశుఁడు పైశాచిలో (1) కేకయ (2) శూరసేన (3) పాంచాల (4) గౌడ (5) మాగధ (6) వ్రాచడ (7) సూక్ష్మభేద (8) భాషా విశుద్ధ (9) అర్ధశుద్ధ (10) చతుష్పాద విశుద్ధ (11) అశుద్ధ అను పదునొకండు భేదములను దెలిపెను. వీనిలో మొదటి యేడును శుద్ధములు; తక్కినవి సంకీర్ణములు. సంకీర్ణములలో 55 భేదములుండవచ్చునని రామశర్మ యభిప్రాయము.

పైశాచీ భాష లనునవి పాలిభాషకు స్థానిక వికారములని సర్ జార్జ్ ఎ. గ్రియర్సనుగా రభిప్రాయపడుచున్నారు. అట్లనుకొనినఁ దప్పు ప్రతీచ్య సంప్రదాయము ననుసరించిన ప్రాకృతలాక్షణికులు తెలిపిన పైశాచీ భేదములలో భారతవర్షమున కుత్తరముననున్న భోటభాషయు, దక్షిణముననున్న పాండ్య, ద్రావిడ భాషలను జేరుటకు వీలులేదని యాతఁడు తెలిపియున్నాఁడు. * పాలిభాష మాగధీ ప్రాకృతము ప్రకృతిగాఁ గలది. అది యనేక ఇండో ఆర్యభాషలతో మిశ్రమమైనది కొన్ని విషయములందిందు పైశాచీ భాషల సంపర్కము కలిగినది. ఇదిగాక పాలిభాషకు జన్మస్థానమయిన తక్షశిలా

* The Home of literary Pali : Sir R. G. Bhandarcar's Commemoration Volume.

ప్రాంతము కేకయ దేశములోనిది. కేకయ పైశాచికము ప్రామాణిక పైశాచీ భాష యని లాక్షణికులందఱును నంగీకరించియున్నారు.

ఆంధ్రమునకు పైశాచీభాష మూలమని యొకయభిప్రాయము గలదు. గుణాఢ్యుఁడు తన బృహత్కథను శాలివాహనుఁడను నాంధ్రరాజునాస్థానమున పైశాచీభాషలో రచించెనని గాథగలదు. ఆంధ్రరాజుల శాసనములకును పాలిభాషకును దగ్గఱ సంబంధమున్నది. ఆనాఁటి యాంధ్రభాషయే యభివృద్ధిఁగొందుచు నితరభాషలతోడి సంపర్కమువలన నేఁటియాంధ్రభాషగాఁ బరిణమించియుండినయెడల నేఁటి యాంధ్రభాషకును పైశాచికిని సంబంధమును దెలిసికొనఁ బ్రయత్నించుట యుపయోగకారి కాకపోదు. కాని, ప్రాచీన పైశాచి కుదాహరణముగ బృహత్కథలోని వని తలంచి లాక్షణికు లుదాహరించిన రెండుమూఁడుపదములు తప్ప మఱేమియు మిగిలియుండలేదు. కావున, ప్రాచీనపైశాచీభాషలకుఁ బ్రతినిధులని సర్ జార్జి గ్రియర్సనుగారు నిర్ధారణ చేసిన నేఁటి దర్దికు(Dardic)భాషలనుగూర్చి తెలిసికొనుట యుక్తమగుచున్నది.

ఆర్యభాషాకుటుంబము ఇండో-యూరోపియను భాషలకు సంబంధించిన దనుట సుప్రసిద్ధము. ఆర్యభాషాకుటుంబము (1) ఐరేనియను లేక ఏరేనియను లేక ఏరోనో-ఆర్యభాషలు (2) ఇండో-ఆర్య, లేక సంస్కృతీయ ఇండో-ఆర్యభాషలు, అను రెండుశాఖలుగ విభజింపఁబడుచున్నది. వీనిలో ఐరేనియను భాషలు (i) పెర్షియను (ii) పెర్షియనుతప్ప తక్కినవి యనువర్గములుగ నేర్పడును. పైశాచీభాషలు పెర్షియనుకాని ఐరేనియనుభాషలకు సంబంధించియున్నవి. ఇవి (1) ఆఫ్ఘనిస్థానములోని లఘ్మాను (Laghman) ప్రదేశమున మాట్లాడఁబడు పాషాయీభాష (2) కొన్ని కాఫిరుభాషలు - వీనిలో బాష్గలీ (Bashgali), వయి (Wai), కలాషా భాషలు ముఖ్యములు. (3) చిత్రాలు దేశపు భాషయగు ఖోవారు (Khowar) (4) దానికి సమీపమున నున్న గిల్గిత్ దేశమునందు వాడుకలోనున్న షినా (Shina) అనునవి. ఈ షినాభాష పైశాచీభాషలలో దర్దు (Dard) వర్గమునకుఁ జేరినట్టియు, నన్నిటికంటె దక్షిణమున నున్నట్టియు కాశ్మీరభాషకును, నేఁడు పష్టో (Pashto) భాష కమితముగ లోఁబడుచున్న సింధునదీప్రాంతమండలియు, స్వాత్-కోహిస్థానమండలియు మిశ్రభాషలకును మూలముగ నున్నది. ఖోవారు భాష స్వతంత్రభాషగ నున్నది. కాఫిరుభాష లయిదయినను గలవు; వీనిలో వీనికి భాషాస్వరూపమునఁ జాలభేదము గలదు. మిక్కిలియుఁ బశ్చిమమున నున్న వసిన్ వెరి(Wasin-Veri) భాష శుద్ధ-ఐరేనియను భాషయగు మంజానిభాషతో స్వరసంప్రదాయమున కొన్నిపోలికలను గలిగియున్నది. ఈ పైశాచీభాషలన్నియు నేఁడు


పైశాచీ భాషలు
వ్యాపించిన మార్గమును
చూపు
పటము.
పిశాచజనుల
ఆదిమ నివాసము
పాంచాల
సంస్కృతభాష
యేర్పడిన
ప్రదేశము
వ్రాచడ
శౌరసేన
నేపాల
వింధ్యపర్వతము
ఐతరేయ
బ్రాహ్మణనాటి
ఆంధ్రులు
మగధ
కుంతల
దాక్షిణాత్య
పాండ్య
సింహళ

బ్రిటిష్ఇండియాకు వాయవ్యదిశను హిందూకుష్పర్వతములచే మూఁడు దిక్కులఁ జుట్టుకొనఁబడిన ప్రదేశము నాక్రమించి యున్నవి.

పైశాచీభాషల యీ యావిమప్రదేశము ప్రాకృతలాక్షణికుల యభిప్రాయమున కనుగుణముగనే యున్నది. మార్కండేయుఁడు (17-వ శతాబ్దము) కాంచీదేశీయ, పాండ్య, పాంచాల, గౌడ, మగధ, వ్రాచడ, దాక్షిణాత్య, శౌరసేన, కేకయ (కైకయ), శబర, ద్రావిడ, దేశములందు పైశాచీభాషలు మాట్లాడఁబడుచుండెనని తెలుపుచు నందు కైకేయ, శౌరసేన, పాంచాలదేశములందలి పైశాచీభాషలు నాగరములని, అనఁగా ప్రామాణికము లని చెప్పియున్నాఁడు. రామతర్కవాగీశుఁడు (17-వ శతాబ్దము) పైశాచీభాష కైకయ, ఛక్క (?) భేదములచే రెండువిధములుగ నున్నదనియు, మాగధ్యాది ప్రధానప్రాకృతముల యుచ్చారణము మాఱుటవలన అశుద్ధపైశాచికభాష లేర్పడుననియుఁ దెలిపియున్నాఁడు. లక్ష్మీధరుఁడు పైశాచీభాషలకు పాండ్య, కేకయ, బాహ్లిక, సింహ(శ?), నేపాళ, కుంతల, సుధేష్ణ, బోట, గాంధార, హైవ, కనోజనదేశములు స్థానములుగఁ జెప్పియున్నాఁడు.

పై పిశాచదేశములపట్టికలను బట్టి యొకపటము నేర్పాటుచేసికొనినచో వారు భారతవర్షమున వ్యాపించిన మార్గము తేటపడఁగలదు. అట్టిపటము వలన పిశాచజనులు రెండుమార్గములనుబట్టి యీ దేశమున వ్యాపించిరని తెలిసికొనఁగలము. సౌకర్యముకొఱకు కేకయ, బాహ్లికులు ప్రధాన పిశాచ జను లగుటచే నొకటి కేకయ మార్గమనియు, నొకటి బాహ్లికమార్గమనియు నందము. కేకయులు హిమవత్పర్వతపాదభూముల ననుసరించి సుధేష్ణ, హైమ, నేపాలమార్గమున బోటదేశమువఱకు వ్యాపించిరి. అచ్చట గొప్పపర్వతము లడ్డురాఁగా దక్షిణమునకు దిగి మగధదేశము నాక్రమించుకొనిరి. అచ్చటనుండి యొకశాఖ గౌడదేశమునకుఁ బోయెను. మఱియొకశాఖవారు పశ్చిమమునకు దారితీసి వింధ్యపర్వతములను జేరికొనిరి. ఈ వింధ్యపర్వత పరిసరప్రదేశములే యైతరేయబ్రాహ్మణకాలమునాఁటి యాంధ్రాది పిశాచజనుల కాటపట్టయి యుండెను. ఈ యాంధ్రశాఖ పశ్చిమమున నాసికవఱకును దక్షిణమునఁ గుంతలమువఱకును వ్యాపించెను. ఇట్లుండఁగా బాహ్లికులును బశ్చిమతీరమున దక్షిణమార్గ మనుసరించి ఛక్క, వ్రాచడ, శౌరసేనమార్గమున నాసికవఱకును వ్యాపించిరి. ఇచట కేకయ శాఖయగు నాంధ్రులకును బాహ్లికశాఖకును సంబంధము మఱలఁ గలిగెను. ఇచ్చటనుండి యీ పిశాచజనులు దక్షిణముగ నన్నిదిక్కులకును వ్యాపించిరి. అందు గొందఱు కనోజనమార్గమునఁ గుంతల దేశము నాక్రమించిరి. కొందఱు తూర్పుతీరమువఱకు వ్యాపించి కాంచీదేశము నుండి దక్షిణముగ తూర్పుసముద్రతీరము ననుసరించి వ్యాపించిరి. వీరే కాంచీ,

551-వ పుట కెదురుగ.


పైశాచీ భాషలు
వ్యాపించిన మార్గమును
చూపు
పటము.
పాంచాల
సంస్కృతభాష
యేర్పడిన
ప్రదేశము
నేపాల
శౌరసేన
వింధ్యపర్వతము
ఐతరేయ
బ్రాహ్మణనాటి
ఆంధ్రులు
మగధ
కుంతల
దాక్షిణాత్య
పాండ్య
సింహళ

బ్రిటిష్ఇండియాకు వాయవ్యదిశను హిందూకుష్పర్వతములచే మూఁడు దిక్కుల చుట్టుకొనఁబడిన ప్రదేశము నాక్రమించి యున్నవి.

పైశాచీభాషల యీ యాదిమప్రదేశము ప్రాకృతలాక్షణికుల యభిప్రాయమున కనుగుణముగనే యున్నది. మార్కండేయుఁడు (17-వ శతాబ్దము) కాంచీదేశీయ, పాండ్య, పాంచాల, గౌడ, మగధ, వ్రాచడ, దాక్షిణాత్య, శౌరసేన, కేకయ (కైకయ), శబర, ద్రావిడ, దేశములందు పైశాచీభాషలు మాట్లాడఁబడుచుండెనని తెలుపుచు నందు కైకేయ, శౌరసేన, పాంచాలదేశములందలి పైశాచీభాషలు నాగరములని అనఁగా ప్రామాణికము లని చెప్పియున్నాఁడు. రామతర్కవాగీశుఁడు (17-వ శతాబ్దము) పైశాచీభాష కైకయ, ఛస్క (?) భేదములచే రెండువిధములుగ నున్నదనియు, మాగధ్యాది ప్రధానప్రాకృతముల యుచ్చారణము నాటుటవలన అశుద్ధపైశాచికభాష లేర్పడునని యుఁ దెలిపియున్నాఁడు. లక్ష్మీధరుఁడు పైశాచీభాషలకు పాండ్య, కేకయ, బాహ్లిక, సింహ(శ?), నేపాళ, కుంతల, సుధేష్ణ, బోట, గాంధార, హైవ, కనోజనదేశములు స్థానములుగఁ జెప్పియున్నాఁడు.

పై పిశాచదేశములపట్టికలను బట్టి యొకపటము నేర్పాటుచేసికొనినచో వారు భారతవర్షమున వ్యాపించిన మార్గము తేటపడఁగలదు. అట్టిపటము వలన పిశాచజనులు రెండుమార్గములనుబట్టి యీదేశమున వ్యాపించిరని తెలిసికొనఁగలము. సౌకర్యముకొఱకు కేకయ, బాహ్లికులు ప్రధాన పిశాచ జను లగుటచే నొకటి కేకయ మార్గమనియు, నొకటి బాహ్లికమార్గమనియు నందము. కేకయులు హిమవత్పర్వతపాదభూముల ననుసరించి సుధేష్ణ, హైమ, నేపాలమార్గమున బోటదేశమువఱకు వ్యాపించిరి. అచ్చట గొప్పపర్వతము లడ్డురాఁగా దక్షిణమునకు దిగి మగధదేశము నాక్రమించుకొనిరి. అచ్చటనుండి యొకశాఖ గౌడదేశమునకుఁ బోయెను. మఱియొకశాఖవారు పశ్చిమమునకు దారితీసి వింధ్యపర్వతములను జేరికొనిరి. ఈ వింధ్యపర్వతపరిసరప్రదేశములే యైతరేయబ్రాహ్మణకాలమునాఁటి యాంధ్రాది పిశాచజనుల కాటపట్టయి యుండెను. ఈ యాంధ్రశాఖ పశ్చిమమున నాసికవఱకును దక్షిణమునఁ గుంతలమువఱకును వ్యాపించెను. ఇట్లుండఁగా బాహ్లికులును బశ్చిమతీరమున దక్షిణమార్గ మనుసరించి ఛస్క, వ్రాచడ, శౌరసేనమార్గమున నాసికవఱకును వ్యాపించిరి. ఇచట కేకయ శాఖయగు నాంధ్రులకును బాహ్లికశాఖకును సంబంధము మఱలఁ గలిగెను. ఇచ్చటనుండి యీ పిశాచజనులు దక్షిణముగ నన్నిదిక్కులకును వ్యాపించిరి. అందు గొందఱు కనోజనమార్గమునఁ గుంతల దేశము నాక్రమించిరి. కొందఱు తూర్పుతీరమువఱకు వ్యాపించి కాంచీదేశము నుండి దక్షిణముగ తూర్పుసముద్రతీరము ననుసరించి వ్యాపించిరి. వీరే కాంచీ,

దాక్షిణాత్య, పాండ్య, సింహళశాఖలవారు ఈ శాఖలవారు మఱలఁ బశ్చిమమునకు వ్యాపించి తొల్లిటి బాహ్లికశాఖవారితోఁ గలిసికొనిరి. కొందఱు సింహళమునకు దాఁటిపోయిరి. ఈరీతిగా వింధ్యపర్వతములకు దక్షిణప్రదేశమంతయుఁ బిశాచాక్రాంతమయ్యెను. వింధ్యపర్వతముల కుత్తరమున వారు హిమవత్పర్వతపాదభూములందును, మగధదేశమునందును సింధునదీమార్గమునఁ బశ్చిమప్రదేశములందును మాత్రము నిబిడముగ నెలకొనిరి.

ఇదియంతయును నార్యులకును నైరేనియనులకును మతవిషయమునులందు భేదాభిప్రాయములు గలిగి, కలహములు జనించుటకు ముందుగనే జరిగినది. ఆర్య - ఐరేనియనుల చీలికకు పూర్వమే, అనఁగా ఐరేనియనుభాష ప్రత్యేకవ్యక్తిత్వమును బొందక పూర్వమే యీపిశాచజను లిండియాయందు ప్రవేశించిరని గ్రియర్సను పండితుఁ డభిప్రాయపడుచున్నాఁడు. కావున పైశాచీభాషలు వైదికభాషకనంతరమును, ఐరేనియనుభాషకు పూర్వమునను గల ఆర్య - ఐరేనియనుభాషావస్థను దెలుపుచున్నవని యాతనితలంపు. కాని, యీ పిశాచజను లందఱు నేకకాలమున భారతవర్షములోనికి రాలేదు. వారు వివిధకాలములందు వేర్వేఱుగుంపులుగా నీదేశములోనికి వచ్చియుండిరి. ఆర్యులకును బిశాచజనులకును దమమాతృదేశమందే కలహము లేర్పడెను. కావునఁ దరువాతికాలమున నార్యులు భరతవర్షమును బ్రవేశించినప్పుడు వారికి తమతొల్లింటి శత్రువులతోడనే యుద్ధములు కలుగఁ జొచ్చెను. కాశ్మీరము లోనికిని దక్షిణదేశముల లోనికిని నీ పిశాచజనులు ప్రవేశించుట యిండియాలోనికిఁ బ్రవేశించుటకుఁ దరువాతనే జరిగియుండవలెను.

ఆర్యులకును ఐరేనియనులకునుగల యీ శత్రుత్వము ననుసరించియే మనువు పుండ్రక, ఓడ్ర, ద్రావిడ, కాంభోజ, యవన, శక, పారద, పల్లవ, చీన, కిరాత, దరద, ఖాస, జాతులవారిని వృషలులుగఁ బరిగణించియున్నాఁడు; వృషలశబ్దమునకు 'వ్రాత్య' అనునది పర్యాయపదముగ నున్నది. వృషలులును వ్రాత్యులును ననార్యులుగ మనువు వ్యవహరించియుండలేదు. ఆర్యమతమునుండి పరిభ్రష్టులయినవారే వృషలులని యాతని యభిప్రాయము. మనువు వివరించిన పై జాతులవారిలో యవన, శక, పారద, పల్లవ, చీన, దరదులు నేఁటి వాయవ్యపుపరగణాల కావలనున్న ప్రదేశములందలి వారనియు, వారిసంతతులవారు నేఁటికిని నాప్రాంతము లందున్నారనియు మనకుఁ దెలియును. ఐతరేయబ్రాహ్మణమున నాంధ్ర, పుండ్ర, శబర, పుళిందులు వ్రాత్యులుగను, విశ్వామిత్రసంతతివారుగను వర్ణింపఁబడుట యార్య, ఐరేనియనుల వైరము ననుసరించియే యైయున్నది. ఎట్లయినను నీ జాతులవారందఱికిని నార్యులకును గలసంబంధము నెవ్వరును నిరాకరింప

లేదు. విస్మరింపనులేదు. ఆర్యజాతులవారు వీరినందఱను పిశాచజనులని నింద్యార్థమున వ్యవహరించుట తమకుంగల శత్రుత్వము వలననే యని మన మెఱుంగఁ గలము.

ఆర్యులకును, ఐరేనియనులకును మతవిషయములను గూర్చియు నాచారములను గూర్చియు వివాదములు సంభవించెను. ఐరేనియనుభాషలో అసుర శబ్దమునకు సర్వశక్తుండగు నీశ్వరుండనియు, దేవశబ్దమునకు దుష్టభూతమనియు నర్థములు గలవు. ఆర్యభాషలం దీయర్థములు తారుమారైనవి. అం దసురుండనంగా దుష్టభూతము; దైవమనంగా పరమేశ్వరుండు. పిశాచశబ్దమునకు నిట్లే యార్య, ఐరేనియను భాషలయందు, పరస్పర విరుద్ధములగు నర్థములు గలవు. ఐరేనియనుభాషలో పిశాచమనంగా ప్రకాశించువాఁడు. ప్రకాశించునది, ప్రకాశము నను నర్థములు గలవు. సంస్కృత భాషయందు దీనికి దుష్టభూత మను నర్థము గలదు. పిశాచ శబ్దము ప్రాకృతమునందు 'పిసాళిఓ' అగును. తెనుగున పిసాళి, పిసాళించు, పిసాళము, మొదలగు పదములు ప్రకాశార్థమున నుండుటను గమనింప వచ్చును. ఆంధ్రులు పిశాచజాతివారనుటకు వారారాధించు అసిరమ్మ అను దేవతావాచక శబ్దమును, వారు దుష్టభూతమను నర్థమున నుపయోగించు దయ్యము అనుపదమును, ప్రకాశార్థమున వాడునట్టి పిశాచ శబ్దభవమగు పిసాళి యనుపదమును చక్కని నిదర్శనములుగ నున్నవి. వేదములం దసురులు పేర్కొనంబడియున్నారు. సురశబ్ద మసురశబ్దమునుండి తరువాతి కాలమున నేర్పడినది. కావుననే యసురులకును రాక్షసులకును పూర్వదేవత లను పేరు గలిగినది. అసురులు తాము పుణ్యాజనులను పేర వ్యవహరించుకొనుటచే పుణ్యాజనులను నామ మార్యభాషలం దసురులకు పర్యాయపదముగ వాడంబడుచు వచ్చినది.

ఆర్యులకును "అహూర" నామమున నైరేనియను భాషలలో నున్న పరమదైవమగు నసురు నారాధించువారికిని జాలకాలమువఱకు నిరంతరముగఁ బోరాటము గలిగెను. అందు గొందఱసురు లార్యులతో సంధిచేసికొని వారికి సామంతులుగ నార్యకుటుంబములం జెలంగిరి. వరుణుండట్టివాఁడు. అతండసురుండై నను నార్యదేవతలలోఁ జేరినాఁడు. ఇతఁడు తొలుత నింద్రునికి బలవద్విరోధియై, తత్పదము నాక్రమించుటకు కొంతకాలము ప్రయత్నించినట్లు ఋగ్వేదవాక్యములవలనఁ దెలిసికొనవచ్చును. కాని కొలఁదికాలమున కాతడంతరిక్షమున నాధిపత్యము నంగీకరించి యార్యఋతమును, అనఁగా ధర్మమును బరిపాలింప నంగీకరించెను. ఆతఁడు పంజాబు దేశమండలి యార్యుల రాజ్యములకును, హిమాలయ పర్వతములకావలనుండు నైరేనియనుజాతుల వారికిని నడుమనుండు దేశము నాక్రమించి యార్యులకుఁ దమశత్రువుల

నుండి యొత్తిడి కలుగకుండఁ జేయుచుండెను. నేఁటి యాఫ్ఘనిస్థానపు అమీర్ వంటి పదవి నాతఁడా కాలమునఁ గలిగియుండెనని తలంపవచ్చును.

ఇట్లే మరుత్తులుకూడ తొలుత నసురులుగా నుండిరి. తరువాత నార్య దేవతావర్గమున సామంతులైనను ముఖ్యస్థానమును వహించిరి. ఆర్యుల యితర శత్రువులలో "అహి" యనునసురు డైరేనియనులలో "అజిద హాక్" అనుపేర నున్నాఁడు. ఇట్లే "వృత్రుఁడు" ను నొక ఐరేనియను దేవతయే. ఆర్యుల శత్రువులగు "పణు" లను వారే "స్ట్రాబో" (Strabo) యను గ్రీకు వేదాంతి వర్ణించిన పార్నియను (Parmians) లని తలంపఁబడు చున్నారు. వారొకకీతి సంచారశీలురగు నైరేనియను జాతివారనియు, నేఁడు "అమూదర్య" (Amu Darya) యని పిలువఁబడు "ఆక్సను" (Oxus) నదీ ప్రాంతములం దుండిరనియు నాతఁడు దెలిపియున్నాడు. పారావతులు లేక పర్వత జాతులవా రార్యులతోఁ బోరాడిరని వేదములందు తెలుపఁబడిన జాతుల వారు స్ట్రాబో యుదాహరించిన "పరోవ్రైతై" (Parouetai) అనువారే యని "హిల్లేబ్రాండు" (Hille Brandt) పండితుని యభిప్రాయము.

ఆర్యుల శత్రువులలో "దస్యు" లనువారు ముఖ్యులై వారిని పలువిధముల బాధించినట్లు వేదములవలనఁ దెలియఁగలదు. "దస్యు" అను పదము ప్రాచీన పర్షియనుభాషయందును "ఎకమీనియన్" (Achemenian) శాసనములందును 'దహ్యు' అనురూపమునఁ గానవచ్చుచున్నది. అందాపద మునకు నీచార్థము లేదు. దానికి జనులు అని మాత్రమర్థము. కాని వేదమున క్రమక్రమముగ దానికి మొదట శత్రువులనియు, తర్వాత దుష్టపిశాచము లనియు నర్థము కలిగినది. దస్యులలోఁ గొందఱు కృష్ణత్వచులు, కొందఱు కారు. బహుశః భారతవర్షమున తొల్లింటి నివాసులై, ఆర్యాక్రమణము నడ్డగించిన జాతులవా రందఱికి నీపదము వాడఁబడియుండును. వా రార్యులకు లోఁబడిన పిదప వర్ణవిభాగమునందు చతుర్థవర్ణముగ 'శూద్రు' లనుపేర నార్యకుటుంబమునఁ జేరియుండురు. ఎట్లయినను 'ఎడ్వర్డు మేయరు' (Edward Meyer) మొదలగు పండితు లీదస్యులే ఐరేనియను జాతులకు సంబంధించి, 'కాస్పియన్' సముద్రమునుండి నేఁడు 'సిర్‌దర్‌యా' (Syr Darya) యని పిలువఁబడు 'యక్సార్టిస్' (Yaxartes) నదివరకు వ్యాపించియున్న, కిర్ఘిజ్ - తుర్కమన్ (Kirghir-Turkman) అను పచ్చికబయళ్లలో నివసించుచున్న 'దహాయే' (Dahae) అనువారని తలంచుచున్నారు. దస్యులు యుద్ధమునందు 'హేఽలయో' అని యార్చుచుండిరఁట. ఇది 'హేఽరయో' అనుదానికి వికృతి. రేఫమునకు లకారాదేశము చూలికాపైశాచియందు కలుగునని ప్రాకృత లాక్షణికులు తెలిపియున్నారు. ఈ సందర్భమున బాహ్లికయియా జాతివారిని

గూర్చి విచారింప వలసియున్నది, బ్రాహుయీభాష ద్రావిడభాషలకు సంబంధించినదని భాషాశాస్త్రజ్ఞులు తలంచుచున్నారు. కాని వీరిజాతిని గూర్చి వివిధాభిప్రాయము లున్నవి. ద్రావిడులు, సిథియనులు, పర్వతీయులగు తార్తారులు, అరబ్బులు, ఐరేనియనులును, ఈ జాతులవారందఱితోడను బండితులు బ్రాహుయీలకు సంబంధముఁ గల్పించుచున్నారు కొందఱు బ్రాహూయీ పదము 'బ - రోహీ' (పర్వతములకు సంబంధించిన) అను పర్షియను పదమునకు వికృతి యనుచున్నారు. ఇతరులు బ్రాహీం లేక బ్రాహిం అను నామాంతరములు గల 'ఇబ్రహీమ్'అను నొకపురుషుని సంతతివారే బ్రాహూయీ లని చెప్పుచున్నారు. కొందఱు వీరికిని 'జాగ్గల్, జాగ్డల్' అను సింగల్ నేఁటి 'జాటు' లకును సంబంధమును గల్పించుచున్నారు జాగ్డ లనువారు 'మెంగలులు (Mengals), బిజాంగోలు (Bizangos), జెహ్రీలు (Zehris) అను మూఁడు తెగలుగ నున్నారు. వీరిలో 'మెంగలు' తెగలోనివారలు 'జఘుర మెంగల్' (Zaghar Mengal) అనువారు మధ్య ఆసియాలోని 'సమర్కండ్' ప్రాంతమందలి 'జుగ్డు' (Zughd) జిల్లానుండి వచ్చిరిమని చెప్పుకొనుచుందురు. మెంగల్ పదములోని 'గల్' ప్రత్యయము చేరుండ 'మెన్' అనుపదము 'బెహిస్తున్' (Behistun) శాసనములలో 'డెరయస్' చక్రవర్తి తనరాజ్యము నుండి తరిమివైచిన యొకజాతివారికి పేరుగాఁ గానవచ్చుచున్నది. 'సజ్దీ' (Sajdi), 'సగి' అనువారు బ్రాహూయీలలోని రెండుతెగలవారు. వీరు ప్రాచీన గ్రీకుచరిత్రకారులు వర్ణించిన 'సగటే' (Sagatae), 'సాకీ' (Saki) జాతులవారుగ పండితులు తలంచుచున్నారు. బ్రాహుయీలు తమపూర్వులు 'అలెప్పో' ప్రాంతమునుండి వచ్చిరని చెప్పుదురుగాని దీని కాధారములేదు. ఆధునికసిద్ధాంతముప్రకారము వీరు ద్రావిడజాతికి సంబంధించినవారనియు, తమబంధువులకు దూరముగ నైరేనియను భాషలమాట్లాడు జనుల మధ్యమున నిలిచిపోయి చాలవరకు అరబ్బులభాషను, నాచారములను, నవలంబించుచున్నారనియుఁ దెలియుచున్నది. వీరికిని వీరితోఁ గలిసియుండు 'బెలూచీలు' 'ఫరాను' లకును దేహనిర్మాణమునఁ జాలభేదము గలదు.

ఇట్లు, బ్రాహుయీలను గూర్చిన వివిధాభిప్రాయములలో 'ఆపెర్టు' పండితుఁడు (Dr. Gustav Oppert) తెలిపిన యభిప్రాయము గమనింపఁదగి యున్నది. బ్రాహుయీ యను పదము పరత, పరద, అను పదములతో సంబంధించినదని యాతని యభిప్రాయము పరదశబ్దములోని తొలి'ప' కారము 'బ'కారమై దానిమీఁది యత్వము లోపించుటచే'బ్ర'గమారి 'బ్రాహుయీ' అను పద మేర్పడినదనియు, ఈ పరతులకును పరవరులకును మహారాష్ట్రదేశమందలి పరవారీలకును, పలమాన్ ప్రాంతమందలి పరహేయులకును, సంబంధ

ముగలదని యాతని యభిప్రాయము. పరదులకును బ్రాహుయియాలకును గల యీ సంబంధము నిశ్చయమైనచో నీ పరసుచరిత్రము ఋగ్వేదకాలము వఱకును బ్రాకుచున్నది. పరతశబ్దము భరతశబ్ద భవమగును. పైశాచీభాషయందు వర్గీయాక్షరములలోని, మొదటి నాలుగు వర్ణములకును తత్తద్వర్గ ప్రథమాక్షరము నిలుచును. కావున భరత అనుపదము పైశాచీ భాషయందు పరత యగుచున్నది.

భరతులు ఋగ్వేదమునఁ బేర్కొనఁ బడియున్నారు. సుదాసుఁడు త్రిత్సులకు నాయకుఁడు. ఇతని కెదురుగఁ బదిజాతులవారు కలిసి యుద్ధము చేసిరి. వారిలో భరతులు చాలముఖ్యులు. విశ్వామిత్రుఁడు తొలుత సుదాసునకుఁ బురోహితుఁడుగ నుండెనుగాని, యాతనితోఁ గలహించి భరతులకు ముఖ్యపురోహితుఁడుగఁ జేరెను. ఇదిగాక విశ్వామిత్రుని జాతివారగు కుశికులు భరతజాతికి దగ్గఱసంబంధముగలవారై యుండిరి. భరతులు విశ్వామిత్రునితో విపాశ, శుతద్రు, నదులయొద్దకుఁ జేరిరి. ఆ నదులప్పుడు పెద్దవఱదలలోనుండెనుగాని విశ్వామిత్రుని ప్రార్థనలవలన నవి భరతులకు దారియిచ్చెను. అయినను విశ్వామిత్రునికిఁ బ్రతిస్పర్ధియు, సుదాసునికిఁ బురోహితుఁడుగఁ జేరినవాఁడును నగు వసిష్ఠునిమంత్రసాహాయ్యమున త్రిత్సులకే జయము కలిగెను. ఈ యాఖ్యానము మనకుఁ జాలముఖ్యమైనది. విశ్వామిత్రుఁడెప్పుడును నార్యులకుఁ బ్రతిస్పర్ధిగనే వేదములందును బురాణములందును గాన్పించుచున్నాఁడు. విశ్వమునకమిత్రుఁడను నర్థముగల విశ్వామిత్రనామ మతని కందువలననే కలిగియుండవచ్చును. విశ్వామిత్రవంశమువారని తెలుపఁబడిన జాతులవారందఱును వ్రాత్యులు, అనఁగా నార్యధర్మమునుండి భ్రష్టులయినవారు అనిపిలువఁబడుటకు నిదియే కారణమయియుండును.

పురాణకాలము నాఁటికి భరతజాతివారు తమకంటె బలవంతులగు కురుజాతులలో లీనమైపోయిరి. మహాభారతమునఁ గురుసంతతికి మూలపురుషుఁడగు భరతుఁడు స్మరింపఁబడినాఁడు. కాని, భారతు లనుజాతి ప్రత్యేకముగఁ గానరాదు. ఒకప్పుడు ప్రత్యేకముగ నుండి పరస్పరవైరము గల కురులును భరతులును భరతుని సంతతివారనియే మహాభారతము తెలుపుచున్నది. కురువంశీయులు గూడ భారతవంశవర్ధనులుగనే యందు పిలువఁబడినారు. భరతుని తల్లియగు శకుంతల విశ్వామిత్రునికిని మేనకకును జనించి, కణ్వాశ్రమమున నార్యధర్మమునఁ బరివర్ధితయై, యార్యధర్మానుసారి యగు దుష్యంతునిఁ జేపట్టినట్టును, శకుంతలాదుష్యంతులకు భరతుఁడు పుట్టఁగా నాతనినుండి కురువంశము సాగినట్లును భారతమునఁ గల యైతిహ్యము తొల్లిఁటి వైరేనియను జాతులవారు తిరిగి భరతవర్షమున నైక్యమందినదియుఁ జాటు

చున్నదనుటకు సందియములేదు. ప్రాచీన భరత, పరత, పరద జాతివారు బ్రాహూఈలు, 'పరవర్', పారేయులు మొదలగు జాతులుగ నేఁడును నున్నారని యూహించుట కవకాశమున్నది

భరతులలో కానొక కాలమున నత్యుచ్చనాగరకదశయుం డుండెననుటకు నేఁడు సింధుదేశమున హరప్పా, మోహింజో - దరో యను ప్రదేశము లందు బయల్పడుచున్న ప్రాచీనపట్టణముల శిథిలములవలనఁ దెలియుచున్నది. అచ్చట బయల్పడుచున్న శిథిలములవలనఁ దెలియవచ్చు నాగరకత యార్యనాగరకత కాదనియు, నేఁటి బ్రాహుయీలకుఁ బురాతనపూర్వుల నాగరకతయనియుఁ బండితులు తలంచుచున్నారు. ఇచ్చట బయటఁ బడుచున్న కొన్ని నాణెములమీఁదను, తోళ్లమీఁదను, చెట్లపట్టలమీఁదను గొన్ని లేఖనములు గాన్పించుచున్నవి. వానిని జదువఁ బండితులు ప్రయత్నించుచున్నారు. వానియందలి విషయములు బయలుపడునవఱకును ని విషయమై యిద మిత్థమని చెప్పవీలులేదు.

ప్రాచీనపిశాచజనుల చరిత్రమునుగూర్చి విశేషములు పైని సంగ్రహముగ వివరింపఁబడినవి. ఆజనులు భరతవర్షమున నెట్లువ్యాపించినదియు నిరూపింపఁ బడినది. ప్రాకృత లాక్షణికులు భారతవర్షమునఁ బైశాచభాషలు మాట్లాడఁబడువని చెప్పిన యాప్రదేశములందలి యాధునికభాష లింకను గొంతవఱకుఁ బైశాచీ ప్రాకృతలక్షణములు గలిగియుండుట గమనింపఁదగి యున్నది. ఆదేశముల నేఁటిభాషలకును ద్రావిడభాషలకును నింకగొన్ని పోలికలు నిలిచియున్నవి. వానిని వివరింపకపూర్వ మార్యులకుఁ బూర్వమే ఈ దేశమునందు నెలకొనియుండిన పైశాచీ భాషలయం దార్యులు వచ్చిన తరువాత నెట్టిమార్పులు గలిగినదియుఁ గొంత చెప్పవలసియున్నది.

పిశాచజాతులవారగు నైరేనియను లీ దేశమున స్థిరనివాసముల నేర్పఱుచుకొని యంతకుఁబూర్వ మిచటనుండిన జాతులవారితో సఖ్యము నెఱపి వారిని తమలోఁ గలుపుకొనుచుండినకాలమున నార్యులును బ్రవేశింపఁజొచ్చిరి. ఇదియే వేదమంత్రముల నిర్మాణకాలము. ఇప్పటికే ఐరేనియనుభాషకును నీ యార్యులభాషకును భేద మేర్పడియుండెను. వారి మతాచారవిషయము లందు గొప్పయంతర మేర్పడెను. మతవిషయము లందలి భేదములచే నేఁడును నెట్టి వైషమ్యములు గలుగుచున్నవో చూచినయెడల నానాఁడవి యెంతటి శత్రుత్వమునకుఁ గారణములై యుండెనో యూహించుకొన వచ్చును. అందును నొకరిదేవుఁడు మఱియొకరికి దయ్యము, ఒకరి దయ్యము మఱియొకరికి దేవుఁడు నయిన సందర్భములం దాశత్రుత్వ మతితీవ్రమనుటకు సందేహముండదు. ఆర్యులకును అసురులు, పణులు, దస్యులు మొదలగు

వేళ్లతో నుండిన పిశాచజనులకును ఘోరయుద్ధములు జరిగెను. స్థానబలముచేఁ బిశాచజనులు తొలుత జయము నొందునట్లు గాన్పించినను, తుదకోడిపోయిరి. అందు గొంద ఱార్యులతో సంధి చేసికొనిరి. కొందఱు వేఱుస్థలములందు స్వతంత్రులుగ నిలిచిరి. పిశాచజను లార్యావర్తమున వ్యాపించినట్లు సూచింపఁబడిన రెండుమార్గములకును నీ పోరాటముగూడ కారణమై యుండును. ఆర్యులు గంగా - సింధు మైదానము నాక్రమించికొని, యచ్చటి నుండి గంగానదీతీరము ననుసరించి మగధదేశమువఱకును వ్యాపించిరి. ఈ ప్రదేశమునందే వేదభాషకుఁ గొంత విలక్షణమగు సంస్కృతభాష యేర్పడినది. అప్పటికే మగధదేశము పిశాచజనాక్రాంతమై యుండెను. పైశాచీభాషాసంపర్కమువలన సంస్కృతభాష పాలిభాషగా మాఱినదని కొందఱు పండితు లూహించుచున్నారు. ఈ పాలిభాష కేకయదేశమునందే, అనఁగా నేఁటి పశ్చిమోత్తరపరగణాల కావలి ప్రాంతమునందే, యేర్పడినదని మఱికొందఱు పండితుల యభిప్రాయము. బుద్ధుఁడును, పాణినియు విద్య నభ్యసించిన తక్షశిలావిద్యాపీఠ మీప్రదేశము నందుండుటయే యీయూహ కాధారము. పాలిభాష తక్షశిలాప్రాంతమున నేర్పడినను, మగధదేశమున నేర్పడినను దానికి పైశాచీభాషయే కారణమనుటలో నభిప్రాయభేదములు లేవు. సంస్కృతమునకుఁ బైశాచీసంపర్క మెక్కువకాని దానితో దగ్గఱ పోలికగల భాష పాలిభాష, పైశాచీసంపర్క మెక్కువ యగుటచే నేర్పడినది మాగధీ ప్రాకృతము.

ఇట్లుండగా సింధునదీమార్గము ననుసరించిన పిశాచజనులయందలి బాహ్లికశాఖవారు దక్షిణముగ సాగిరి. గుజరాతు ప్రాంతమునకు వచ్చువఱకును బైశాచీభాషలు నెలకొనెను. కాని గుజరాతునందు వీరి భాషకును పిదపవాత వచ్చిన సంస్కృతభాషకును సంపర్క మేర్పడి తన్మూలమున సంస్కృతలక్షణ మెక్కువగాఁగల శౌరసేని ప్రాకృత మేర్పడెను, పైశాచీ భాగమెక్కువయైనభాష శౌరసేనీపైశాచిక మయ్యెను. ఈలోఁగా మధ్యదేశము నార్యులాక్రమించికొని వింధ్య పర్వతములవఱకును సాగిరి. ఇచటి పిశాచజనులకును వీరికిని సంఘర్షణము గలిగెను. కొంతకాలమునకు వారు వింధ్యమును దాఁటిరి. వ్యాసుఁడు వింధ్యగర్వమును డంచుట యనెడు నైతిహ్యము దీనిని దెలుపుచున్నది. ఇచ్చటి పిశాచభాషకును సంస్కృతమునకును గలిగిన సంపర్కమునుబట్టి, ఆంధ్రులకును మహారాష్ట్రులకును సాధారణమగు నొకభాష మహారాష్ట్రి యనుపేర నేర్పడెను.

ఈ రీతిగ ప్రధాన ప్రాకృతములని ప్రాకృతలాక్షణికులు పిలుచిన మహారాష్ట్రి, శౌరసేనీ, మాగధీభాష లేర్పడెను. ఈ మూఁడు భాషలును

గ్రంథములకెక్కిన వగుటచే లాక్షణికులదృష్టి నాకర్షించినవి. వానిమూలమున నాధ్యమయినంతవఱకు సంస్కృతముతోడి దగ్గఱ సంబంధము నిలిచినది. గ్రాంథికములుగాని యితర వ్యావహారికభాషలకన్నిటికిని లాక్షణికులపభ్రంశమును పేరిడిరి. కాని, అపభ్రంశ మొక్క భాషకాదు. ప్రధాన ప్రాకృతములలో నొక్కొక్కదానికి ననేకాపభ్రంశరూపము లున్నవి. ఈ యపభ్రంశభాషలలోఁ గొన్ని తరువాతికాలమున గ్రాంథికములయినవి. ఇట్లు గ్రంథస్థములయిన వ్యావహారికభాషల నన్నిటిని లాక్షణికు లపభ్రంశ మనుపేర వ్యవహరించిరి. సంస్కృతమునకుఁ బూర్వమే యీ దేశమున నెలకొనిన పైశాచీభాషలు వ్యవహారమున ననేకములుగ నుండెనవి. వీనికిని దత్తత్ప్రాంతములం దుండిన యితర ప్రాకృతములకును గలిగిన సంపర్కమువలన నాధునికయుగమున ననఁగా క్రీ. శ 6-వ శతాబ్దము నుండియుఁ గ్రొత్త దేశభాష లుదయింపఁ జొచ్చినవి.

నేఁటిరూపమును దాల్చి గ్రంథస్థములు కాఁజొచ్చిన దేశభాషలలో మొదటివి ద్రావిడభాషలు. వీనిలో నాంధ్రము, కన్నడము, తమిళము, ముఖ్యములు. వీనియందు దించుమించు చేకకాలముననే (ఒకటిరెండు శతాబ్దములకీవల నావల) వాఙ్మయము వెలువడినది. పశ్చిమతీరము ననుసరించి వ్యాపించిన బాహ్లీక పిశాచజనులభాషకును, వింధ్యపాదము నాశ్రయించి వ్యాపించిన పిశాచార్యజనులభాషలకును గలిగిన సంపర్కమువలన పశుమటికనుమలకుఁ గొంచెముత్తరముగనున్న ప్రదేశమున నూతనభాషా సమ్మేళనము జరిగినది. ఈ సమ్మేళనము జరుగకపూర్వమే పైశాచీ జనులలోని యొకశాఖవారీప్రదేశమునుండి తూర్పునకుఁ దిరిగి తూర్పుసముద్రతీరమునఁ గాంచీదేశము వెంబడి దక్షిణదేశము నాక్రమించిరి. కొంతకాలమునకు వారు సింహళమును గూడఁ జొచ్చిరి. వీరే తమిళులు. వీరినుండి తరువాతకాలమున నొకశాఖ మఱల దక్షిణమునఁ బడుమరగ వ్యాపింపఁగా మళయాళభాష యేర్పడెను. మహారాష్ట్రాంధ్రకర్ణాటకములకు సామాన్యముగ నొకభాష యాంధ్ర సామ్రాజ్యకాలమునాఁటికి, అనఁగా క్రీ. పూ. 3-వ శతాబ్దమునుండి క్రీ శ. 3-వ శతాబ్దము వఱకు నుండుచు, మఱల వ్యవహారరూపమున విడిపోఁజొచ్చెను. ఈవిడిపోవుట కాయాజనులు వ్యాపించిన ప్రదేశములం దంతకుఁబూర్వముండిన భాషలతోడి సంపర్కమే కారణము. ఇట్లు విడిపోయిన భాషలే నేఁడు మరాఠీ, ఆంధ్రము, కన్నడము, అని వ్యవహరింపఁబడుచున్న భాషలు. ఈమూఁడింటిలో నాంధ్ర కర్ణాటకములు తొలుత కలిసి విడిపోఁగా, మరాఠిభాష తన స్థానమునందే నిలిచినది. కొంతకాలమున కాంధ్రకర్ణాటకములును విడిపోయి, తత్తత్ప్రాంతభాషలతోఁ గలిసి ప్రత్యేకత్వము నొందినవి.

పైని వివరించిన భాషావిభాగచరిత్రము భారతవర్ష చరిత్రమును, నాయా పూర్వప్రాకృతభాషల లక్షణమును, నేఁడాయాప్రాంతములందు నెలకొనియున్న భాషలలక్షణము ననుసరించి యున్నది. భాషాశాస్త్ర విషయముల నింతకంటె నెక్కువ నిశ్చయముగఁ జెప్పవీలులేదు. భాషాశాస్త్రమున దక్కిన భౌతికశాస్త్రములందువలెఁ బ్రత్యక్షప్రమాణములు మిక్కిలి కొంచెముగ నుండును. కావున నీ విషయమున ననుమానమే ప్రధానప్రమాణమగుచున్నది. ఆయాభాషాలక్షణములు కాలను గడచినకొలఁదియు జాడలుగ మాత్రము మనకు గోచరించుచుండును. ఆ జాడలనుబట్టి యూహించినచో ద్రావిడభాషలయందు పైశాచీప్రాకృతభాషాలక్షణములు కొన్ని పొడగట్టుచుండును. ఆ పైశాచీలక్షణము లాంధ్రభాషయందు సుస్పష్టముగఁ గాన్పించుచున్నవని మాత్ర మిప్పటికిఁ దెలిసిన పైశాచీభాషా లక్షణమునుబట్టి చెప్పఁగలము. లాక్షణికులు తెలిపిన యా లక్షణములను వివరించి యవి యాంధ్రమున నెంతవఱకుఁ గలవో విచారింతము.

ఆంధ్రభాషయందలి పైశాచీలక్షణములు.

(1) సం. జ్ఞ = పై. ఞ్ఞ; ప్రజ్ఞా = పఞ్ఞా; సంజ్ఞా = సఞ్ఞా; సర్వజ్ఞః = సవ్వఞ్ఞో; జ్ఞానమ్ = ఞ్ఞానం; విజ్ఞానమ్ = విఞ్ఞానం (హేమ. 8. 4. 303, ప్రా. పు. V. 9 = ఞ్జ; ప్రా. సర్వ. పు. 124 కేకయపైశాచిలో వైకల్పికము; ప్రా. క. కైకేయీపైశాచిలో నిత్యము).

తెనుఁగున పై. 'ఞ్ఞ'='ంయ', 'య్య' లుగామాఱినవి. సంజ్ఞా=పై. సఞ్ఞా= తె. సంయా (ట), సయ్యాట. సర్వజ్ఞ = పై. సరసఞ్ఞ = తె. సరవయ్య, సరయ్య (మనుష్య సంజ్ఞావాచకములు) సం. ఆజ్ఞాకార = పై. ఆఞ్ఞాకార= తె. ఆయకాఁడు; పైశాచిలో 'ఞ్జ' కూడ 'ఞ్ఞ' గ మాఱి యుండవచ్చును. ఉదా. లంజ = * పై లఞ్ఞ = తె. లయ్య; వంధ్యా = ప్రా. వంఝా = పై. వఞ్ఞ = తె. వయ్య (ము).

(2) సం. రాజ్ఞా, రాజ్ఞః, రాజ్ఞి = పై. రాచిఞా, రఞ్ఞా; రాచిఞో, రఞ్ఞో; రాచిఞి, రఞ్ఞి; (హేమ. 8. 4. 304; ప్రా. పు. X. 12; ప్రా. రూ, XX. 9; ప్రా. సర్వ. పు. 124 కేకయపైశాచి; రన్నా, రన్నో, రన్ని, అను రూపములును గలుగును; ప్రా. క. కైకేయీ పైశాచిలో రాజ్ఞా, రాజ్ఞః, రాజ్ఞి = రాచినా, రాచిన, రాచిని, అని నిత్యముగా నగును.

తెనుఁగున 'గాయ' అను తద్భవము పై. ఞ్ఞ=తె య్య అను మార్గమునఁ గలిగియుండవచ్చును. ఉదా, రాజన్. శబ్దమందలి జ=చ=య, అను మార్గమున నైనను గలిగి యుండవచ్చును.

(3) సం. న్య, ణ్య=పై. ఞ్ఞ;— సం. కన్యకా=పై. కఞ్ఞకా; (ప్రా. ప్ర. X. 10=ఞ్ఞా); సం. అభిమన్యుః=పై. అభిమఞ్ఞూ, సం. పుణ్యకర్మన్ = పై. పుఞ్ఞకమ్మో, సం. పుణ్యాహమ్=పై. పుఞ్ఞాహం (హేమ. 8. 4. 305; ప్రా. సర్వ. పు. 124 కేకయ పైశాచిలో వైకల్పికము; ప్రా. క. కైకేయీ పైశాచిలో నిత్యము.)

సం. కౌండిన్య=పై. కోండఞ్ఞ=తె. కొండయ్య (సంజ్ఞావాచకము); సం. మాన్య=పై. మాఞ్ఞ=తె. * మాయ, మా. మాయురే!—'కొండన్న' అను సంజ్ఞాపదము గూడ 'కౌండిన్య' పదభవమే, ఇది 'కోండణ్ణ' అను మహారాష్ట్రీ రూపము ద్వారమునఁ బైశాచిలో'ణ''న'గ మాఱుటచేఁ గలిగినది కొండయ్య కొండన్న, పదములలో అయ్య, అన్న, అను పదములున్నవని భ్రమకలుగు టచే నవి సమస్త పదములుగఁ దరువాతికాలములోఁ బరిగణింపఁబడుచు వచ్చి నవి.—సం. పుణ్యమ్=మహా. పుణ్ణిఅం=పై పున్నియమ్ = తె. పున్నియము, పున్నెము.

(4) సం. ణ=పై. న;—గుణగణయుక్తః = పై. గున - గన - యుత్తో; గుణేన=పై. గునేన (హేమ. 8. 4 306, ప్రా ల. III 42, ప్రా. ప్ర. X. 5; ప్రా. రూ. XX. 2 న, ణ=న; ప్రా సర్వ. పు. 123 ఇది కేవల కేకయ పైశాచీ లక్షణము, అట్లే ప్రా. క).

తెనుఁగున నీ లక్షణము సంపూర్ణముగా నున్నది. మహారాష్ట్రీ ప్రాకృతమునందును, తమిళ కన్నడములందును 'ణ' యుండు నట్టి పదములు తెనుఁగున నకారముతో గాన్పించుచున్నవి. తెనుఁగుపదములందెప్పుడు ణకారము కాన్పించినను దానికి రూపాంతరముగ నకారముతోడి రూపమును నుండును. - సం. గుణ = తె. గొనము; సం గుణిన్ = తె గొనయము; సం. ఆజ్ఞా = మహా. ఆణా, కన్న ఆణ = తె. ఆ ; కన్న ఎణ్ (ఇ) = తె. ఎని (మిది); కన్న. కణ్ణు, మణ్ణు=తె. కన్ను, మన్ను, తె . రూ అగు, తె. ఆణియ = రూ ఆనియ; మొదట ఒక వచనరూపమున ణకార మున్నను బహువచనమున నది నకారముగ మాఱుచున్నను: తె ఏ. కాణి, రూ. కాని; బహు. కానులు.

(5) సం. త, ద=పై. త;-సం. భగవతీ = పై. భగవతీ; సం. పార్వతీ= పై. పవ్వతీ; సం. శతమ్ = పై. సతం; సం మదనపరవశః = పై. మతనపరవసో; స. సదనమ్ = పై. సతనం; సం. దామోదరః = పై తామోతరో, సం. ప్రదేశః = పై. పతేసో; సం. వదనకమ్ = పై వతనకం, సం భవతు=పై. హోతు; సం. రమతాం = మహా రమదు=పై రమతు (హేమ. 8. 4. 307; ప్రా. రూ. XX. 3).

పదాది దకారము తమిళమునఁ దప్పక తకారమగును; కాని, తెనుఁగు కన్నడములం దీమార్పు సర్వత్ర జరుగలేదు. కొన్ని దకారాది పదములు మాత్రమందు తకారాదిగఁ గాన్పించుచున్నవి. ఉదా. దోష + * కృ=దునుకు, రూ. తునుకు; ద(త)నుకు, తాఁకు; దద్దటిల్లు, రూ. తత్తటిల్లు:—రాయల సీమలోఁ గొన్నియెడల నుత్తరజిల్లాలందు దకారాదులుగనున్న పదములు తకారాదులుగ నుచ్చరింపఁబడుచున్నవి. ఉదా. దిద్దు, తిద్దు; దొండకాయ, తొండకాయ; మొద. తమిళమునఁ బదమధ్యమందును నంతమందును రెండచ్చుల నడుమఁబడినట్టియు, ననుస్వారమునకుఁ బరముగ నున్నట్టియు తకారము తప్పక దకారముగ మాఱును; కాని, తెనుఁగు కన్నడములం దీమార్పు సర్వత్ర కలుగదు. సాధారణముగ నాస్థానములందు తకార ముచ్చారణమందు నిలుచును. ఒకవేళ నది దకారముగ మాఱినను తకారముతోడి రూపమే యెక్కువ ప్రచారమందుండును. దకారముతోడి రూపాంతరములట్టియెడల నర్వాచీనములని చెప్పవచ్చును. తకారముతోడి రూపాంతరములు లేని దకారయుక్త పదములు తరువాతికాలమునఁ దెనుఁగునఁ జేరియుండును. తకార మొకప్పుడు దకారముగ మాఱకుండనుండుటకు ద్విత్వము నొందుచుండును.

(6) సం. ల=పై. ళ; ఉదా. సం. శీలమ్=పై. శీళం; సం. కులమ్=పై. కుళం; సం. జలమ్ = పై. జళం; సం. సలిలమ్ = పై. సళిళమ్; సం. కమలమ్= పై. కమళం (హేమ. 8. 4. 308).

ఈ మార్పు తమిళ మళయాళములందును గన్నడమునందును నెక్కువగా నున్నను తెనుఁగునఁ గూడ లేక పోలేదు. (i) సంస్కృత లకారను ళకారముగ నుచ్చరింపఁ బడుట: ఉదా. అళి, అళిందము, అళీకము, అళిగర్దము, ఆళి, ఇళ, ఈళిక, ఈళితము, కరాళము, కళ, కళత్రము, కళింగ, కళేబరము, కాళయుక్తి, కాళి, కాళింగము, కాళింగి, కాళింది, కాళిక, కుళుత్థము, కేళి, క్షాళనము, క్షాళితము, క్ష్వేళ, గళంతిక, గళము, గళితము, గళ్య, గిళనము, గుళిక, గుళుచ్ఛము, గోళకుఁడు, గోళము, జోనళము, దంభోళి, దళనము, దళితము, దాళి, ధావళ్యము, ధవళము, నళ, నాళము, నాళి, నాళికేరము, నాళీకము, నీళ, నేపాళము, పింగళ, పింగళుఁడు, పుళిందము, పుళిందుఁడు, పాళి, ప్రవాళము, ప్రళయము, మంగళము, మంగళ, మధూళి, మిళిందము, మిళితము, మురళి, మేళకము, మేళనము, రాళము, వళి, వాహ్యాళి, విళంబి, వేళ, వ్యళీకము, వ్యాళము, సరళ(ము), సాళగము; సాళ్వుఁడు, సురభిళము, హేళనము, హేళి మొదలయినవి.

(ii) వైకృత దేశ్యపదములందు లకార రేఫస్థానములందు ళకారముగల పదములు; అలు(ళు)కు (కరి), అళఁది = హరిద్రా; ఆలు(-ళు)గ(-వ), ఆళు వారు, ఊళ, ఎల(-ళ) నీరు, ఒళవు (-వరి), ఓ(హో)ళిగ, కల(ళ) వర(ళ)ము, కల(ళ)వరిం(ళిం)చు; కళాయి, కళాసము, కళాసించు, కళుకు, కళ్ల, కళ్లము, కళ్లె(ళ్యె)ము, కాళంజి, కాళియ, కుళుపు, కుళ్లాయ, కు(కు)ళ్లు, కూళ, కూళుఁడు, కేళకుళి, కేళిక = నృత్యము, కోళె = కౌతూహలిక, ఖాళీ (-ళీ), గళక త్తెర, క(గ)ళ్ల, గళ్లెము, గాళకుఁడు, గుళిగ, గోళి, గౌళి; చాళియ, చొళ్లియము, జళి పించు, జళుకు, జాళించు, జాళియము, తళతళ, తళుకు, తళిగ(-య), తాళ గించు, తాళము, తాళి, తాళించు, తాళిసత్రి, తాళీకుఁడు, తాళు, తో[illegible], తోళసి, త్రుళ్లు, త్రెళ్లు, దళము, దాళిమ్మ, దాళీకుఁడు, దాళు, దాళువ(-వా), నాళము = లాడము, నెళము(-వరి), నెళినెళి, పళపళ, పళ్లె(ర)ము, పాళ(-ళా), పాళము, పాళెము, పాళి, పాళెగాఁడు, పిళ్లు, పిళ్లారి, పెళపెళ, పళుచు, పెళ్లెము, పోళీ, బళా, బళాయి, బాళి, బెళఁకు(ఁగు), బెళగుప్ప, బెళవ, బెళుకు, బొళుకు, బోళము, బోళా, మళిగ, మళ్లు, మాళిగ, మి[illegible], మేళము, మేళగించు, మోళంగి, వళాగ్రము, వళావళి, వళుకు, వాళి, విళంగీలు, వాయువిళంగములు, వేళము, వేళాకోళము, వైళము, సళుపు (- పరింత), సళువు, సాళువము, సుళువు, సేళము, సోళాదొప్పి, హాళది, హాళాహాళి, హాళి మొదలయినవి.

సంస్కృత లకారస్థానమున వచ్చిన ళకారమునకు ళుళమనియు, కేవల కన్నడ పదములందుండు సిద్ధళకారమునకు కుళమనియుఁ గర్నాటక వైయా కరణులు తెలిపియున్నారు. తెనుఁగునఁగూడ నీ ళుళ కుళభేదమును గమనింప వచ్చును. సంస్కృతమందలి యన్ని లకారములును ళకారములుగ మాఱవు. ఉదా. మాలా, శాలా, విలాస, మొదలగుపదములు తెనుఁగున మాళ, సాళ, విళాసము, అను రూపములను బొందవు. అట్లే కొన్ని తెనుఁగు పదములందలి లకారము ళకారముగఁగాని, ళకారము లకారముగఁగాని మాఱవు. ఉదా. 'జల్లు' 'జళ్లు' అనికాని, 'క్రుళ్లు' 'క్రుల్లు' అనికాని రూపాంతరములను పొందవు.

(7) సం. శ, ష=వై. స; ఉదా. సం. శోభతే = వై. సోభతి; సం. శోభనమ్ = వై. సోభనం; సం. శశీ=వై. ససీ, సం. శక్రః = వై. సక్కో; సం. శంఖః = వై. సంకో; సం. విషమః = వై. విసమో; సం. కృష్ణః = వై. కిసానో (హేమ. 8. 4. 309, ప్రా. రూ. XX. 6; ప్రా. సర్వ. పు 123 ఇది కేకయ పైశాచీ లక్షణము; ఇట్లే ప్రా. క.).

మహారాష్ట్రీ ప్రాకృతములోఁగూడ శ ష లు స గ మాఱును. మహా రాష్ట్రిలోఁ గలుగు నీ మార్పు పైశాచిలో కలుగదనియు హేమచంద్ర వ్యాక

రణమునందును ప్రాకృత రూపావతారమునను చెప్పఁబడినది. ఆ రెండు వ్యాక రణములలోను నీ మార్పు పైశాచియందు కలుగునని చెప్పుట పొరపాటగునా?

తెనుఁగున శ, ష, లు సకారముగ మారుట సుప్రసిద్ధమే. ఒకప్పు డట్టి 'స' కారము దంత్య చే జేవర్ణములుగఁ గూడ మారును: (అ) శ = స. పదాదిని:—ఉదా. శంఖః = సంకు; శంబలమ్ = సంబళము; శక్తి = సత్తి; శని = సని; శబ్దః = సద్దు, చేప్పుడు, శమీ = జెమ్మి, శకట = సగటు (చదరంగములో); శర్కరా = చేక్కెర; శాకము = సాగి(కూర); శష్కులి - చేక్కిలము, శాస్త్రము = చేట్టము; శిరము = సిరము; శీతః = సీతు; శుంఠి - సొంటి; శోక = చూకుఱు; శుక్రః = చుక్క; శూర్పణఖ = చుప్పనాక; శృంఖలా = సంకెల; శృంగారః = సింగారము; శృంగి = సింగి; శేఖరించు = సేకరించు, శ్యామా = చామ; శ్యామల = చామన: శ్రద్ధా = సడ్డ; శ్రీ = సిరి; శ్రేష్ఠిన్ = సెట్టి; శౌండికః = సొండి (వాఁడు).

ii. పదమధ్యమున: యశస్ = అసము; కుశలపీయము = కుసలాయ కము మొదలయినవి.

iii. పదాంతమున: ఆశా = ఆస; క్రోశః = కోసు; అక్రోశః = అక్కను మొదలయినవి.

(ఆ) ష = స. ఉదా. సంతోష = సంతోసము; ఈర్ష్యా = ఈసు; ఘర్షః=గస(గస), గాసి; ఘోషా = గోస, గోసు; ఘోషణ = గోసన మొద లయినవి.

* ష. స. లు శౌరసేనీ పైశాచికలో శవర్ణముగ మారునని ప్రాకృత కల్పతరువునం దున్నది; ఈ మార్పు తెనుఁగునఁ గలుగదు

(8) 'హృదయ' శబ్దమందలి యకారమునకు పకార మాదేశమగును; పై. హితపకం; "కింపి కింపి హితపకే అత్థం చింతియమానే" అను ప్రయో గము గుణాఢ్యుని బృహత్కథలోనిదఁట. (హేమ. 8. 4. 310; ప్రా. సర్వ. పు. 124. ప్రా. క. కేకయపైశాచి; ప్రా. ప్ర. X. 13 = హితఅకం; ప్రా. రూ. XX. 11). ఈ మార్పు తెనుఁగునఁ గలుగలేదు.

(9) టవర్ణమునకు తవర్ణము వైకల్పికముగా నగును: ఉదా. కుతుం బకం, కుటుంబకం (హేమ. 8. 4. 311.)

ఈ మార్పు తెనుఁగునఁ గానవచ్చుచున్నది. i. పదాదిని:—టంగు వాఱు (తంగువాఱు); ట(త)క్కరి; ట(త)క్కు; టా(తా)టోటు; టీకు, టేకు = తేకు; టోపి = తోపి, తొప్పి మొదలయినవి.

ii. పదమధ్యాంతములం దీమార్పు తెనుఁగు కన్నడములందు గాన్పించు చున్నది. తెనుఁగునఁ టకారముండుచోటఁ గన్నడమున తకారము నిలుచు చున్నది: ఉదా. తె. మాట, కన్న. మాతు ; తెనుఁగు. ఎట, కన్న. ఎత్త మొదలయినవి

(10) సం. - క్త్వా = పై. తూన; - ఉదా. గత్వా = గంతూన; రమిత్వా = రంతూన; హసిత్వా = హసితూన, పఠిత్వా = పఠితూన; కథిత్వా = కథితూన (హేమ 8. 4. 312, ప్రా. ప్ర. X 13 = తూనం; ప్రా. రూ. XX. 18 = తూనం, ప్రా. సర్వ. పు. 124 తూనం, కేకయ పైశాచి ; ప్రా. క. = తూనం).

తెనుఁగున '-తూ', కన్నడమున 'త, త్తే' లు శత్రర్థకములు: ఉదా. తె. చేస్తూ, కన్న. గెయ్యుత, గెయ్యుత్తా ; తె. వస్తూ, కన్న. బరుత (-త్త, -త్తా) మొదలయినవి. తొలుత నివి క్త్వార్థకరూపములుగానుండి, తరువాతి కాలమున 'ఇ' వర్ణము క్త్వార్థకచిహ్నముగ నెలకొనినప్పుడు శత్రర్థకము లుగ రూఢియై యుండవచ్చును. తెనుఁగున 'తు' వర్ణము 'చు' వర్ణముగ మాఱినది. తువర్ణము మొదటినుండియు వ్యవహారమున నున్నది. చువర్ణ చిహ్నముతోడి శత్రర్థక రూపములు గ్రంథముల కెక్కి, వ్యవహారభ్రష్టము లయినవి.—'తూన, తూనం' అను రూపములు '-చున్' అను శత్రర్థక వర్ణము ద్రుతప్రకృతికమగుటను సూచించుచున్నది. లేదా 'తూన,' 'తూనం' లలోని 'తు' వర్ణము కన్నడమందలి క్త్వార్థక చిహ్నములగు 'తు-, దు' లకు మూలములై యుండవచ్చును. ఈ కన్నడమందలి '-తు, -దు' లు తెనుఁగునఁ గొన్నియెడల ధాతువులలోనికే చేరుకొన్నవి.

(11) సం. - ష్ట్వా = పై. - ద్ధూన, - త్థూన; ఉదా సం * నష్ట్వా = పై. నద్ధూన, నత్థూన; సం. తష్ట్వా = పై. తద్ధూన, తత్థూన (హేమ 84. 313 ; ప్రా. రూ. XX. 19 = ట్ఠూన, - త్థూన)

కన్నడమున -డు, -ఱు లంతమంగు గలధాతువులకుఁ గ్త్వార్థకమున '-ట్టు' అనియగును. కన్న. * బిడు, క్త్వా. బిట్టు మొదలయినవి. ఇట్టి రూప ములను గొన్ని దెనుఁగున ధాతువులుగఁ బరిగణింపఁబడినవి.

(12) సం. - ర్య = పై. రియ , ఉదా. భార్య = పై. భారియా (హేమ. 8. 4. 314 ; ప్రా. ప్ర. X. 8 = రిఅ ; ప్రా. రూ. XX. 13 = రిఅ (క్వచిత్) ; ప్రా. సర్వ. పు. 124 = రిఅ, తత్పూర్వస్వరము హ్రస్వ మగును. భార్యా = పై. భరిఅ; ఇది కేకయ పైశాచీలక్షణము; - ప్రా. క. లోను ఇల్లే; శౌరసేనీ పైశాచికలోను ఇల్లే అని ప్రా. క.)

తెనుఁగు వ్యవహారమున నిత్యముగను, గ్రంథములందు కొన్ని యెడలను నీ మార్పు కలుగును. భార్యా = భారియ (వ్యవ.); కార్య = కాఱియ, చర్య = చెరియ (వ్యవ.); పర్యాయ = పరియాయము (వ్యవ.); హిం. ఫిర్యాదు = ఫిరియాదు; మర్యాద = మరియాద; ఆర్యవర్యా; = ఆరియవరియా; సూర్యుఁడు = సూరియుఁడు, సూరీఁడు (వ్యవ.); సూర్యపటము = * సూరియపుటము = సూరెపుటము.

(ఆ) సం. - స్న = పై. - సిన (వైకల్పికము), ఉదా. స్నాతమ్ = పై. సినాతం (హేమ. 8. 4. 314; ప్రా. ప్ర. X. 8. సన; ప్రా. రూ. XX. 13 = సిన (క్వచిత్); ప్రా. క. = సన, కైకేయీ పైశాచిలో).

తెనుఁగునఁ గైకేయీపైశాచియందువలె వ్యవహారమున స్న = సన; స్నానము = సనానము (వ్యవ).

(ఇ) సం: - ష్ట = పై, సట, ఉదా. కష్టమ్ = పై. కసటం (హేమ. 8. 4. 314; ప్రా. ప్ర. X. 6; ప్రా. క. లో కైకేయి పైశాచియందు; ప్రా. రూ. XX. 13 = సిట (క్వచిత్); ప్రా. స్వ. పు. 123, - కేకయ పైశాచిలో ష్ట, స్న, లకు వికర్షము నిత్యము, ఇతర సంయుక్తాక్షరములకు వికర్షము కలుగవచ్చును; కలుగక పోవచ్చును; ఉదా. వైకల్పికములకు - ధర్మపత్నీ = ధరమపతనీ, ధమ్మపత్తీ, చిహామనో, చిమ్మనో; - కలుగకుండుటకు- డిండిమః = టింటిమో; పండితః = పంటితో మొదలయినవి.—ప్రా. క. లో రత్న = రతన (కేకయ పైశాచిలో).

సం. ష్ట = పై. సట=తె. - సట. - సటు-సడు. ఉదా. కష్ట = కసటు, కష్టభ్రష్ట = గాసటబీసట. - కన్నడమున 'ష్ట'=సట, సటు, సుటు, సుడు, లుగా మాఱుట కెక్కువ యుదాహరణములు గాన్పించును.

'ష్ట' కాక యితర సంయుక్తాక్షరముల వికర్షము తెనుఁగున సుప్రసిద్ధము. అనఁగా అట్టి సంయుక్తాక్షరములు వికర్షమునొంది, మఱియెక్కువ మార్పునొందని రూపములు తెనుఁగున నిలుచును. ఉదా. అగ్ని = అగిని; చంద్రః = చెందురుఁడు; యాత్రా = జాతర; రత్నము = రతనము; దర్శనము = దరిసెనము మొదలయినవి.

(13) క్యప్ ప్రత్యయమునకు 'య్య' వచ్చును: ఉదా. సం. గీయతే, పై. గియ్యతే, దీయతే, పై. దియ్యతే, రమ్యతే, పై. రమియ్యతే; పఠ్యతే, పై. పఠియ్యతే (హేమ. 8. 4. 315).

తెనుఁగున యు - వర్ణాంతధాతువులు కొన్ని సంస్కృతమందలి క్య ప్రత్యయాంత రూపములనుండి యేర్పడినవి. అట్టి ధాతువులు సేఘుపు స్వ

యుకారాంతములయినచో-వానిపై మఱల 'పడుజీ' చేరునప్పుడు దీర్ఘమునకు హ్రస్వమును, యకారమునకు ద్విత్వమును గలుగుచుండును. ఈ మార్పు తెనుఁగున బహుళము; ఉదా. చేయఁబడు చెయ్యఁబడు మొదలయినవి. హ్రస్వస్వరపూర్వక యువర్ణాంతధాతువులం దీమార్పు కలుగదు: కవియు, కవియఁబడు మొదలయినవి. యుకారమునకుఁ బూర్వమందున్న స్వరము సంయుక్తాక్షరముతోఁ గలిసియున్నయెడల నీ మార్పుకలుగదు: వ్రాయు, వ్రాయఁబడు మొదలయినవి.

(14) 'కృ' ధాతువుమీఁది క్యప్ప్రత్యయమునకు 'ఈర' ఆదేశమగును. ఉదా. క్రియతే = కీరతే (హేమ. 8. 4. 316, ప్రా. XX. సూ. 1. 6.) ఇచట క్యప్ప్రత్యయమునకు 'ఈర' ఆదేశమయిన దనుటకంటె ఋ-కారమునకు వృద్ధిగలిగి క్యప్ప్రత్యయము లోపించినదనుట యుక్తమగును. క్రియతే, కీర్యతే = పై. కీరతే. తెనుఁగున నీమార్పు కలుగలేదు.

(15) యాదృశాది శబ్దములలో 'దృ' స్థానమున 'తి' వచ్చును: యాతిసో, తాతిసో, కేతిసో, ఏతిసో, భవాతిసో, అణ్ణాతిసో, యుమ్హాతిసో, అమ్హాతిసో (హేమ. 8. 4 317; ప్రా. రూ XX 10)

పైరూపములలోఁ గొన్ని తెనుఁగున మార్పునొంది చేరినవి. తెనుఁగున 'త' కారము టకారముగ మాఱినది: అట్టి, ఇట్టి, ఎట్టి, మీయట్టి, మాయట్టి మొదలయినవి.

(16) వర్తమాన క్రియా ప్రథమపురుషైకవచనమునవచ్చు 'తి, తే' ప్రత్యయముల స్థానమున 'తి' నిలుచును. ఉదా. వసుఆతి, భోతి, నేతి, తేతి. లపతి, అచ్ఛతి, గచ్ఛతి, రమతి (హేమ. 8, 4, 318-19; ప్రా. రూ. XX; 14.) ప్రాకృతములందు సాధారణముగా నాత్మనేపదప్రత్యయములు లోపించి యన్ని ధాతువులకును బరస్మైపద ప్రత్యయములే చేరుచుండును. ప్రథమపురుషైకవచనమున మహారాష్ట్రియందు 'ది' వచ్చును తెనుఁగున నమహద్వాచకములు కర్తలుగాగల క్రియారూపములు 'ద, దు' లతో నంతమగుట మహారాష్ట్రి లక్షణము 'తి, తు' లు సాధారణముగాఁ గన్నడమున నీ సందర్భమునఁ గానవచ్చుచున్నవి: ఉదా. బంతు = వచ్చినది (వ్యవహారమునఁ గన్నడమున నీ రూపము మహద్వాచకములతోఁడను గాన్పించుచున్నది); ఇత్తు = ఉన్నది మొదలయినవి.

(17) సం. భవిష్యతి = పై. హువేయ్య. (హేమ. 8, 4, 320; ప్రా. రూ. XX. 17); ఈ మార్పు తెనుఁగునలేదు.

(18) పంచమ్యేకవచన ప్రత్యయము 'ఆతో' లేక 'ఆతు' అగును: సం. దూరాత్ = పై. తూరాతో, తూరాతు (హేమ. 8. 4. 321; ప్రా. రూ. XX. 5). దీనినిగూర్చి తెనుఁగు విభక్తి ప్రకరణమునఁ దెలుపఁబడును.

(19) తద్, ఇదమ్ శబ్దముల తృతీయైక వచనరూపము పైశాచిలో 'నేన' అనియును, స్త్రీలింగమున 'నాఏ' అనియును నగును (హేమ. 8. 4. 322; ప్రా. రూ. XX. 7, 8.). వీనినుండి కలిగిన రూపములు తెనుఁగున లేవు.

(20) తక్కిన విధులన్నియు శౌరసేనియందువలెనే వర్తించును (హేమ. 8. 4. 322; ప్రా. ప్ర. X. 2; ప్రా. రూ. XX. 1. ప్రా. సర్వ. పు. 124 కేకయ పైశాచికి).

(21) సం. ర=పై. ల (ప్రా. ల. III. 42; ప్రా. సర్వ. పు. 126 లో ఇది శౌరసేనీ పైశాచీలక్షణము మాత్రము: ఉదా: సం. రుధిరమ్, పై. లుధిలం).

ఈ మార్పు తెనుఁగున సాధారణముగఁ గలుగుచున్నది. ఉదా. చిరిక, చిలుక; వడ్రంగి, వఢ్లంగి; తెరము, తలము; పొరిమాయుచు, పొలిమారు (లు) చు; రంగరించు, రంగలించు; పందిరి, పందిలి; పొరి, పొలి, పిలుకుమారు (-లు)చు; నుతరాం, నుతలాం; మొదలయినవి.

(22) సం ఇవ=పై. పివ (ప్రా. ప్ర. X. 4, ప్రా. సర్వ. పు 124 కేకయపైశాచిలో. ప్రా. క. లోనిట్లే. ఈ రూపము తెనుఁగున లేదు.

(23) సం. జ్ఞ = పై. చ్ఛ (ప్రా. ప్ర X. II; ప్రా. సర్వ. పు. 123.) ఉదా. సం. కార్య; మహా కజ్జ, పై. కచ్ఛ—తెనుఁగునఁ గొన్నిపదములందలి 'చ్ఛ' వర్ణమిట్లే కలిగినది. ఉదా. సం. కార్య, పై కచ్ఛ, తె. క్రిచ్ఛ (చూ. కయ్యాలక్రిచ్ఛ)

(24) 'కృప' ఇత్యాది శబ్దములందలి ఋకారమున కిత్వమగును (ప్రా. రూ. XX. 121 ప్రా. సర్వ; పు. 123. కేకయ పైశాచిలో; ప్రా. క. లో నిట్లే). ఉదా. సం. గృహమ్, పై. కిహం. సం. కృతక, తె. కిటుకు; సం.కృత్తి, తె. కిత్తి; సం-మృతి, తె. మిత్తి; సం. గృహమ్, తె, గీము మొదలయినవి.

(25) సం. యక్ ప్రత్యయము=పై,-య్య. - ప్రా. రూ. XX. 12). ఈ మార్పు చెందిన రూపములే కొన్ని తెనుఁగున ధాతువులయినవి.

(26) కేకయపైశాచిలో సం. క్వచిత్ = పై. కుపచి (ప్రా. సర్వ. పు. 126; ప్రా. `.) - ఉదా. పృధివీ = పుథుణీ; పక్ష్మ = ఖుమ; విస్మయ= పిసుమఅ; ప్రథమ = పృథుమ; సూక్ష్మమ్ = సుఖమం.

ఈ మార్పులలో విస్మయ=తె. వినుమాలను; అను రూపము మాత్ర ము తెనుఁగునఁ జేరినది.

(27) కేకయపైశాచిలో యుష్మ దస్మచ్ఛబ్దములకు మాగధియందు వలె రూపములు గలుగును. ఈ రూపములలో భత్వమునకు ఫత్వము రాదని కొందఱందురు. ఉదా. తుమం, తుంభే; హక్కే, అంభే మొదలయినవి. (ప్రా. సర్వ. పు. 125.)—ఈ రూపములు తెనుఁగున లేవు.

(28) (1) శౌరసేన పైశాచికలో సం. స = పై. శ;-ఉదా. మనుష్యః= మానుశే; హసతి = హశతి, పిశునః = పిశునే మొదలయినవి. ఈ మార్పు తెనుఁగున లేదు.

(2) చవర్గీయాక్షరములకు ముందు యకారము చేరును. ఉదా. ఛలమ్=పై. య్ఛలే ఈ యకారము చేరునని చెప్పుట చవర్గీయాక్షరముల దంత్యోచ్చారణసూచకమని బీమ్సు, హార్నెల్ పండితుల యభిప్రాయము. అది నిజమైనచో నీమార్పు తెనుఁగునందును గలదు

(3) కృతాదులకు కడాదులగును: ఉదా. కృత=కడే; మృత=మడే; గత = గడే,-మొదలయినవి. ఈ మార్పు తెనుఁగునను గలదు. సం. కృత = తె. కట్టు, కడచు మొద మృత = మడియు; గత=గ(క)డచు మొదలయినవి.

(4) స్థా ధాతుసంబంధి 'ష్ఠ'కు 'శ్త'యగును: ఉదా తిష్ఠతి=య్చిశ్తది; మొదలయినవి. ఈ మార్పు తెనుఁగున లేదు. ఇతరస్థలములందలి 'ష్ఠ'వర్ణము మహారాష్ట్రియందువలెనే మాఱును: ఉదా. యష్టిః=లట్ఠి; తెనుఁగు - లాఠము; ప్రా. క. లో స్థా ధాతుసంబంధమగు 'ష్ఠ'వర్ణము 'ఠ్ఠ'గా మాఱును: ఉదా. తిష్ఠతి = ఠ్ఠిరది (శౌరసేనిలో వలె 'చిట్ఠది' అని కాదు); - స్థితమ్ = ఠిఅం, అగును.

(5) త్త, త్థలకు ముందు శకారము చేరును: ఉదా మశ్ త్తే, ఇశ్ త్థీ, మొదలయినవి. తెనుఁగున 'మస్తు,' 'ఇస్త్రీ'ను రూపము లిట్లు గలిగినవే.

(6) సం. ద్ధ = పై. త్థ, ఈ మార్పు క్వచిత్తుగాఁ గలుగునని కొంద అందురు. ఉదా. అర్ధాసనమ్ = అద్ధాసనం = అత్థాశనం; - క్వచిత్తనుటచే పద్ధతి = పట్టతి. పద్ధతి శబ్దము తెనుఁగున 'పట్టు'గాఁ గానవచ్చుచున్నది.

(7) అకారాంతశబ్దముల ప్రథమైకవచనమున 'ఏ' యగును: ఉదా. మనుష్యః = మానుశే; పణః = పనే; - ఈ మార్పు కన్నడమున నెక్కువగా నున్నది; అం దనేకపదములు 'ఎ'కారాంతములుగా నున్నవి. గ్రామ్యార్థమునఁ జైశాచిలోఁ బ్రథమైకవచనమున 'ఈ' వచ్చును: ఉదా. శ్యాలః = శిఆలీ;

తక్కినచోట్ల 'ఏ' యగును, అని ప్రా. క.-ఇవర్ణము గర్వార్థమునఁ జేరుట తెనుఁగునను గలదు: రామిగాఁడు మొదలయినవి.

(8) అకారాంతశబ్దముల ద్వితీయా బహువచనమున వైకల్పికముగా 'ఏ' యగును. ఉదా. మానుశే, మానుశం; పనే, పనం; మొదలయినవి.

(9) 'అధునా' మొదలగు నవ్యయములకు 'అహుణి' మొదలగు రూపములగును: అహుణి, హకే, తుమే, మొదలయినవి. (ప్రా. సర్వ. పు. 127.)

(29) పాంచాలీపైశాచిలో 'ర' కు 'ల', 'ల' కు 'ర' యాదేశము లగుచుండును: ఉదా. సం. కేలీ = పై. కేరీ; సం. మందిరం = పై. మంతిలం మొదలయినవి. (ప్రా. సర్వ. పు. 127; ప్రా. క.) పాంచాల పైశాచికలో నీమార్పు నిత్యమనియు, గౌడ పైశాచిలో వైకల్పికమనియు ప్రా. క. తెనుఁగున నిట్టిమార్పు వైకల్పికము: ఉదా. కాతర = తె. కావరము, కాన లము మొదలయినవి.

(30) కౌక్షేయ, రాక్షస మొదలగు శబ్దములందు మాగధిలోవలె శౌరశేనీపైశాచికయందు క్షకారము 'స్క' యగునని ప్రా. క; ప్రా. సర్వ. ప్రకారము, 'క్ష' నిత్యముగా 'చ్ఛ' యగును. తెనుఁగున ప్రాకృతసర్వస్వ మందలి లక్షణమునను సరించి మార్పు కలుగుచున్నది.

(31) శౌరసేనీ పైశాచికలో పిబతి = పిఌతి యగును; 'పిపతి' అని కాదు. ప్రాకృతవ్యాకరణముల ప్రకారము పైశాచికి సంబంధించిన సూత్రములు పైని సంగ్రహముగ నిరూపింపఁబడి, ఆ సూత్రములు తెనుఁగున కెంతవఱకు ననువర్తించునో తెలుపఁబడినవి. పైశాచికిఁగల ప్రత్యేకలక్షణములను వివరించి హేమచంద్రుఁడు మహారాష్ట్రిలో కలుగు కొన్నిమార్పులు పైశాచిలో కలుగవని చెప్పియున్నాఁడు. ఈ మార్పుల విషయమునఁ దెనుఁగు కొంతవఱకు మహారాష్ట్రిప్రాకృతమును, గొంతవఱకు పైశాచీమార్గమును నవలంబించుచున్నది. ఇందువలనఁ దొలుత పైశాచీలక్షణముఁ గలిగియుండిన యాంధ్రభాష, తరువాత మహారాష్ట్రిప్రాకృత సంపర్కముచే దాని లక్షణములను గూడఁ గొన్నిటిని సంపాదించుకొన్నదని చెప్పవలసియుండును.

ప్రతీచీసంప్రదాయము ననఁగా వాల్మీకిసంప్రదాయము ననుసరించిన లక్ష్మీధరాదులు చూలికాపైశాచి యనుపేరఁ బైశాచికిఁ జిన్న యవాంతరభేదమగు పైశాచిని పేర్కొని కొన్నిసూత్రములను రచించియున్నారు. అవి తెనుఁగున కెంతవఱకు వర్తించునో చూతము.

## చూలికాపైశాచి.

(1) వర్గతృతీయ, చతుర్థవర్ణములకు నరుసగా నాద్య, ద్వితీయవర్ణము లగును. (హేమ. 8, 4, 325: ప్రా. ప్ర లో నిది పైశాచీలక్షణముగ నున్నది. X. 3; ప్రా. రూ. XX 1. 2; ప్రా. సర్వ. పు. 123 లో ఇది కేకయ పైశాచీలక్షణము; అప్లే, ప్రా. క. లో కూడను).

తెనుఁగున నీమార్పు ప్రా. ప్ర. ననుసరించి యుండుటయేకాక, వర్గీయానునాసికేతరాక్షరములన్నియు వర్గప్రథమాక్షరము లగుచున్నవి. కొన్నియెడల వర్గతృతీయాక్షరమును నిలుచుచున్నది

(2) సం. ర = చూ. పై. ల (వైకల్పికము) (హేమ. 8. 4. 326; ప్రా. రూ. XX 1; శౌరసేన పైశాచికలో నీమార్పు నిత్యమని ప్రా. క.) తెనుఁగున నీమార్పు వైకల్పికమే

(3) ఇతరాచార్యులమతమునఁ బదాదియందున్న వర్గతృతీయ చతుర్థ వర్ణములకు ప్రథమ ద్వితీయవర్ణములు రావు. 'యుజ్' ధాతువులోని 'జ'కార మునకు చకారము గలుగదు. (హేమ. 8. 4. 327.) తెనుఁగున కీ సూత్రము వర్తింపదు.

(4) తక్కిన విషయములందు చూలికాపైశాచి పైశాచివలెనే యుండును (హేమ. 8. 4. 328; ప్రా. రూ. XXI. 1).

ప్రాకృత ప్రకాశికలో పైశాచికిని చూలికాపైశాచికిని భేదము చెప్పఁబడలేదు.

ప్రాచీన పైశాచీ ప్రాకృతభాషలనుగూర్చి మనకింతకంటె నెక్కుడు విషయములు దెలియరాకున్నవి. కాని, ప్రాచీనపైశాచీ భాషలకు నేఁడు ప్రతినిధులుగా నిలిచిన యాధునిక పైశాచీ భాషలను గూర్చి యిపుడు సర 'జార్జ్ ఎ. గ్రియర్సను గారు ముఖ్యముగా నెక్కుడు కృషిచేయుచున్నారు. వారి వ్రాఁతలనుండి యాంధ్రభాషకు సంబంధించినంతవఱకుఁ గొన్ని విషయ ములను సంగ్రహింతము.

ఆధునిక పైశాచీభాషలలో కాశ్మీరీ భాషముఖ్యమైనది. ఇది హైందవ ప్రాచీన లాక్షణికులు తెలిపిన షీన, దరద భాషలకు సరిపోవుచున్నది. రెండ వది నేఁటి నేపాళదేశపుభాషయగు ఖాస్ - కురా యనునది. ఇది లాక్షణి కుల నేపాళభాషకు వికారము. మూఁడవవి సింధీ, లహండీ భాషలు. ఇవి పూర్వకాలపు వ్రాచడ ప్రాకృతమునకు సంబంధించినవి

## కాశ్మీరి.

తక్కిన పిశాచభాషలకంటె కాశ్మీరీ భాషకుఁ బ్రధానలక్షణము కాల్డువెల్లు ద్రావిడభాషలకు ముఖ్యలక్షణమని పేర్కొనిన యచ్చుల పరస్ప

రాకర్షణమును (చూ. పు. 200 - 202) హల్లులయందు కలుగు మార్పులును నయి యున్నది. ఈ భాషయందు అ, ఇ, ఉ, ఊ, అను మాత్రాచ్చులు పరమగునపుడు వానికిఁ బూర్వమందున్న యచ్చులన్నియుఁ దదనుగుణముగ మాఱి తీఱవలెను. ఈ మాత్రాచ్చులు ద్రావిడపదముల తుదియందుండు నస్పష్టాచ్చులను జాలవఱకుఁ బోలియుండును. కాశ్మీరియందు ఘ, ఝ, ఢ, ధ, భ, లు లేవు; వానికి మాఱుగ గ, జ, డ, ద, బ, లే వాడఁబడును. సం. ఘోటకః, కాశ్మీరీ: గుఱు. హిందీయందువలె కాశ్మీరీ భాషయందు మూర్ధన్యధ్వనుల వాడుక చాలతక్కువ; వానికి మాఱుగ దంత్యధ్వనులే ప్రచారమందున్నవి. కాశ్మీరిలో సంస్కృతమందలి చ, ఛ, జ, లు తెనుఁగునందువలె చే, ఛ, జే, లగును. సం చోరః, కాశ్మీరీ: చ్రూర్, సం. చలయతి, కాశ్మీరీ: చేలి, సం. జలమ్, కాశ్మీరీ:జేలం, మొదలయినవి. సంస్కృత శ, ష, లు ఐరేనియను భాషలయందువలె కాశ్మీరియందు 'హ' కారముగ, మాఱును. తెనుఁగునను నిట్టిమార్పుకలిగి హ కారము మఱల గ కారముగనో. క కారముగనో మాఱినది. ఉదా. సం. విలస్= * విలహ్ = * విలగ్ = తె. వెలుఁగు మొదలయినవి.

కాశ్మీరీ భాషయందు శబ్దగతలింగము లేదు; జాతిలింగము మాత్రమున్నది. అందు మహద్వాచకము లన్నియుఁ బుంలిగములు; మహతీ వాచకములన్నియు స్త్రీలింగములు. ద్రావిడ భాషలయందును నిదియే సంప్రదాయము. ద్రావిడ భాషలయందువలె కాశ్మీరిలో షష్ఠియందు 'కు' ప్రత్యయము వచ్చును. క్రియలకు సర్వనామ ప్రత్యయములు చేరి తత్తత్పురుష బోధకములగును. అందు ద్రావిడభాషలలోవలె వ్యతిరేక క్రియారూపములు గలవు; సంస్కృతమున నర్థమున, అక్, అ, లచేఁ దెలుపఁబడును. ప్రశ్నార్థమున అకారము క్రియతుదఁ జేరును. ఈ వాడుక ద్రావిడభాషలయందున్నది. సంస్కృతమున లేదు. తత్తత్ప్రత్యయములు కాశ్మీరియందు క్రియల కొకదానితరువాత నొకటిచేరి యర్థవిశేషములను చేకూర్చుచుండును. ఉదా. కరు = చేయఁబడెను; కరుమ్ = నాచేతఁ జేయఁబడెను; కరు - మ్ - అఖ = నీవునాచేఁ జేయఁబడితివి; కరు - మ్ - అఖ - ఆ ? = నీవు నాచేఁ జేయఁ బడితివా ? ఇట్లగుట కేవలము ద్రావిడసంప్రదాయమనుట స్పష్టము. తుమున్నర్థమున కాశ్మీరియందు 'ఉన్' ప్రత్యయము చేరుచుండును. ఇది కన్నడము, తమిళములలో 'ఉమ్' ప్రత్యయమునకును, తెనుఁగునందలి 'అన్' ప్రత్యయమునకును సరిపోవుచున్నది. ణిజర్థమునఁ గాశ్మీరిలోఁ బ్రత్యేకపదము నుపయోగింతురు. సంస్కృతమునందునలెఁ గ్రియారూపమధ్యమున నాగమవర్ణము చేరి ణిజర్థము కలుగదు. ఇది ద్రావిడ సంప్రదాయము ననుసరించియున్నది. ఉదా. కాశ్మీరీ: కరన - యివాన్ - చుహ్ = చేయ - వచ్చు - చున్నది.

## ఖాస్-కురా

ఇది నేపాళదేశపు ముఖ్యభాష. ప్రాచీన నేపాలభాషను లాక్షణికులు పైశాచీభాషగఁ బేర్కొనియున్నారు. ఈ భాషయందు క్రియారూపములలో మహత్త్వార్థక ప్రత్యయములు చేరును. ఇట్టి ప్రత్యయములు సంస్కృతమున లేవు. ఖాస్-కురాలో అఛ్-ధాతుజన్యమగు 'ఛ' అనునది క్రియలయందు వర్తమానార్థ బోధకముగఁ జేరుచుండును. దీనిని తెనుఁగునందలి -చు (న్న), కన్నడమందలి-ను లతోఁ బోల్పనచ్చును. ద్రావిడ భాషలయందు వలె నీ భాషయందు సంస్కృత దీర్ఘాంతశబ్దములన్నియు హ్రస్వాంతములగును. కాశ్మీరియందువలె నిందును ద్రావిడభాషల పోలికఁ బదమధ్యాచ్లోపమును గలుగుచున్నది. ఇందు షష్ఠీప్రత్యయము 'ఖ' అనునది. ఇది కన్నడమందలి-'కె, గె' లకు సరిపోవుచున్నది. ఈ భాషయందు మహద్వాచకముల ప్రథమా బహువచన రూపము 'రు' చేరుటవలన నేర్పడుచున్నది. ఉదా. ఏకవచనము: దేవ, బహువచనము: దేవరు. ఈ రు-ప్రత్యయము ద్రావిడ భాషలయందును నున్నది.

## సింధీ, లహండీ భాషలు.

సింధీభాషయందు పదములన్నియు నజంతములై యుండవలెను. వీని నెంత తేల్చిపలికినను నస్పష్టముగనైనను వినఁబడుచునే యుండును. కాశ్మీరియందువలె నిందును నచ్చుల పరస్పరాకర్షణమును, పదమధ్యాచ్లోపమును గలవు. ప్రాకృతములలో సంస్కృత సంయుక్తాక్షరము లన్నియు ద్విత్వాక్షరము లయినవి. కొన్ని యాధునికార్యభాషలలో నీ ద్విత్వాక్షరములలో నొకటి లోపించి, పూర్వాచ్చునకు దీర్ఘము కలుగుచుండును సింధిలో నట్లు కలుగనక్కఱలేదు. ఈ విషయమున సింధీభాష ద్రావిడభాషలను బోలియున్నది. ఇతర హిందూస్థాన భాషలందువలె పదమధ్య దకారము సింధిలో 'ఱ' కారముగ మాఱినది. ప్రాచీన వ్రాచడాపభ్రంశమందువలెను, ద్రావిడ భాషలయందు వలెను, దంత్యమూర్ధన్యాక్షరములందు చాల వ్యత్యాసములు గలిగినవి. ఇదిగాక రేఫసంయోగము గలుగుపట్ల త, ద, లు ట, డ, లుగ సింధియందు మాఱుచుండును. ఉదా. సం. పుత్త్రీ, సింధి, పుట్రు, ద్రా. పుట్టు (వు); నామవిభక్తులలో నొక్క షష్ఠీప్రత్యయము మాత్రము మిగిలి, తక్కినవన్నియు నంతరించినవి. తక్కిన విభక్త్యర్థములు ద్రావిడభాషలయందువలె విభక్తి ప్రతిరూపక పదముల సాహాయ్యమునఁ దెలుపఁబడును. చతుర్థీ, షష్ఠీ ప్రత్యయములగు-'ఖే,-ఖో' లేకమయినవి ఇవి ద్రావిడభాషలలోని 'కి, కు, కె, గె' లకు సరిపోవును. ఈ ప్రత్యయములు సంస్కృతశబ్దమగు 'కృతే' నుండి కలిగిన మహారాష్ట్రీ 'కఏ', అపభ్రంశము 'కఅహి'ల నుండికాని, సంస్కృత

మందలి 'కృతాత్' నుండికలిగిన అపభ్రంశమందలి 'కఅఉ' నుండికాని యేర్పడియుండును.

క్రియారూపములలో ద్రావిడభాషలకును సింధీ, లహాండాభాషలకును తుమున్నర్థక, వర్తమాన, భూతక్రియావిశేషణ, క్త్వార్థకరూపములందు సామ్యము కాన్పించుచున్నది. ఉదాహరణము:

| | మొదటి వికరణము | | రెండవ వికరణము. | |
|---|---|---|---|---|
| | సింధి | లహాండి | సింధి | లహాండి |
| తుమున్నర్థకము | హాలను=చేయను | హాలనే=చేయన్ | మారిణు=చంపను | మారిణో=చంపన్. |
| వర్త. క్రి. విశేషణము | హాలందో=చేయుచున్న | హల్దా=చేయుచున్న; గెయ్యుత్తా | మరిందో=చంపుచున్న, కన్న. కొల్లుత్తా | మరేందో=చంపుచున్న |
| భూత. క్రి. ,, | హాలిఒ=పోయిన | హాలేఆ=పోయిన | మారిఒ=చంపిన | మారేఆ=చంపిన |
| క్త్వార్థకము | హాలీ=పోయి | హాలీ=పోయి | మారే=చంపి | మారే=చంపి |

తక్కిన పైశాచీభాషలనుగూర్చిన విశేషము లంతగా దెలియరాకున్నవి. బెలూచీ మొదలగు నేటిభాషలలో బహువచనప్రత్యయముగు 'గళ్' కానవచ్చుచున్నది. ఉదా మొ-గళ్ = మొ-జనులు. కాని యేకవచనరూపమగు 'మొ' అనునది జొహిస్తుక్ ఫలక శాసనములందు కానవచ్చుచున్నది.

ఇంతవఱకును ద్రావిడభాషలకును కేవల పైశాచీభాషలకను మాత్రము పోలికలు వివరింపబడినవి. ఆపైశాచీ లక్షణములు తక్కిన ద్రావిడభాషల యందుకంటె నాంధ్రమున నెక్కుడుగా గలవని తెలుపబడినది. ఆంధ్రము పైశాచీభవమని యన్నంతమాత్రముచేత నది యన్నివిషయములందును పైశాచీలక్షణములను గలిగియుండవలె ననుగూడదు. అన్నిభాషల చరిత్రము నందువలె నాంధ్రభాషాచరిత్రమునందును నాభాష కెన్నియో యితర భాషల సంపర్కము కలిగినది. ఆయాభాషల లక్షణములు కొన్ని యాంధ్ర భాషకును సోకినవి. కాని, యాంధ్రభాష తనకు సహజమగు మూలపైశాచీ లక్షణమును విడిచిపెట్టలేదనిమాత్రము తెలిపి యీవిషయమును గూర్చిన ప్రస్తావనను ముగింపవలసియున్నది.

# తెనుఁగునఁ జేరిన యన్యదేశీయ శబ్దజాలము.



ఇంతవఱకును కేవలదేశ్యములుగఁ బరిగణింపఁ బడుచున్న శబ్దజాలమును గూర్చి విచారించియుంటిమి. ఆ దేశ్యపదములలోఁ గొన్ని యన్యదేశ్యములయినను నాంధ్రధ్వనిసంప్రదాయము ననుసరించి మార్పులఁ జెంది కేవలదేశ్యములుగ వాడఁబడుచుండుటను గనుగొంటిమి కాని. యనేకములగు నన్యదేశ్యము లర్వాచీనకాలమున నాంధ్రభాషాప్రవాహమునఁ బడినను నింకను వానికి తెనుఁగువారి నోటిరాపిడి యెక్కువగా తగులకపోవుటచేఁ దమ యన్యదేశ్యత్వమును విశదపఱచుచున్నవి. ఆంధ్రుల చరిత్రమునకును నీ పదములకును సంబంధమున్నదని వేఱ చెప్పనక్కఱలేదు. అట్టి యన్యదేశ్యములలోఁ జాలమట్టుకు పాలకపాలిత సంబంధమును బట్టియు, వాణిజ్యాది సంబంధమును బట్టియు ముఖ్యముగ హిందూస్తాని యింగ్లీషు భాషలనుండి తెనుఁగునఁ బ్రవేశించినవి తొలుత నారెండువిధములైన పదములను గూర్చియు విచారించి, పిమ్మట తక్కినభాషలనుండి చేరినవానినిగూర్చి విచారింతము.

## హిందూస్థానీ.

ఆంధ్రమునఁగల యన్యదేశ్యశబ్దజాలమున హిందూస్థానీపదములు ప్రాముఖ్యమును వహించియున్నవి. క్రీస్తుశకము నేఁడవ శతాబ్దమునకుఁ బూర్వమునుండియు నరబ్బులును, తుర్కీదేశస్థులును భారతవర్షముతో వాణిజ్యమును జరపుచుండిరి. వీ రోడలను నడపుకొని యానాఁటికిఁ దమకుఁ దెలిసిన ప్రపంచమంతటితోడను వాణిజ్యమును సాగించుచుండిరి కళింగాంధ్రదేశమునందు సముద్రతీరవాసులును మొదటినుండియు గొప్ప నావికులుగనుండి యితరదేశములతో వాణిజ్యమును సాగించుచుండినట్లు బౌద్ధ జాతకముల వలనను, నితర బౌద్ధగ్రంథములవలనను దెలియవచ్చుచున్నది. అరబ్బీలనుండియు, తుర్కీదేశస్థులనుండియుఁ దెనుఁగువా రోడలను నడపుటను నేర్చికొని యుండిరని కొందరు తలంతురు గాని, యాంధ్రులు సహజముగనే నావికవృత్తి కలవాటుపడియుండిరి. కాని, నావికశబ్దజాలమును జాలవఱకు నీ యరబ్బీ, తుర్కీదేశస్థులదే యవలంబించుచువచ్చిరి నేఁడు నర్సాపురము, కాకినాడ, భీమునిపట్టణము, బందరు మొదలగు రేవులలో నోడలునడపు

నావికు లీ యరబ్బీ తుర్కీ పదములనే యెక్కువగ నుపయోగించుచున్నారు. ఈ నావికపదముల పట్టిక వేఱొకచో నీయఁబడినది.

పదుమూఁడవ శతాబ్దమువఱకును జనసామాన్యమునకు అరబ్బీ, ఫారసీ, శబ్దములతో నంతగాఁ బరిచయము గలుగలేదనియే చెప్పవచ్చును. మహమ్మదీయులు అల్లాయుద్దీను దండయాత్రలోఁ బదుమూఁడవ శతాబ్దాంతమున దక్షిణ హిందూదేశమునఁ జొరఁబడిరి. నాఁటనుండియు వారి శబ్దజాలము కొలఁదికొలఁదిగఁ దెనుఁగునఁ బ్రవేశింప మొదలిడినది. శ్రీనాథుని కాలమునకుఁ గొన్ని యరబ్బీ, తురుష్కపదములు తెనుఁగునఁ జొచ్చినవి. పదునేనవ శతాబ్దమున రెడ్డిరాజులును వారి యాస్థానమునందలివారును నా భాషలను బాగుగ నభ్యసించుచు వచ్చిరి. మొదటి పానిపట్టుయుద్ధము జరుగు నాఁటికిఁ గొన్ని మహమ్మదీయ రాజ్యములు దక్షిణ హిందూదేశమున నెలకొని యుండినవి. మొగలాయిరాజ్యము ఢిల్లీలో సుప్రతిష్ఠితమగుటయు, మొగలాయి చక్రవర్తికి లోఁబడియు, లోఁబడకయుఁ గొందఱు నవాబులు దక్షిణమున రాజ్యముల నేర్పఱచుకొని హిందూరాజుల కొత్తిడి గలిగించుటయు, నీ యుప్పెన నరికట్టుటకై విజయనగరరాజ్య మెట్లు వర్ధిల్లినదియుఁ, దుదకు విజయనగర సామ్రాజ్యము మహమ్మదీయుల కెట్లు లోఁబడినదియు, నా తరువాత తురకలరాజ్యము చాలకాలమువఱకుఁ దెనుఁగుదేశమున నెట్లు సాగినదియు, మొదలగు విషయములు చరిత్రైకవేద్యములు. ఢిల్లీలో మొగలాయి చక్రవర్తి తన 'దర్బారు' నుండి 'హుకుము' లను 'జారీ' చేయుచుండ నీ దేశములోని 'జిల్లా' 'పరగణా', 'సుబా' లలో చిన్న 'నవాబు' లు తమ దర్బారులను సాగించుచుండిరి. వారు తమ 'తీరు' = బాణము, 'కమాను' = విల్లు, లతోడను నితర యుద్ధసామగ్రులతోడను దేశమును స్వాధీనముచేసికొని, తమ 'ఫర్మానా' లను 'ఖతెలు' చేయుచు, 'బురుజు' లుగల 'ఖిల్లా' లలో నుండి తమ 'లష్కరు' లను 'హజారీ' 'పాంచ్ హజారీ' ల యాజమాన్యమున 'లడాయి'కిఁ బంపుచు విజయముఁ గాంచుచుండిరి. రానురాను హిందూరాజు లోడిపోయి కేవలము 'జమీందారు' లై, ఢిల్లీచక్రవర్తికి వశులై యాతనికి 'నవాబ్-నాజీము' 'దివాను' ల మూలమున 'పేష్కసు' చెల్లించుచు, చక్రవర్తి యనుగ్రహమును సంపాదించుటకు 'నజరానా' లను బంపుచుఁ గాలక్షేపము చేయుచు వచ్చిరి. నేఁ డింగ్లీషు వచ్చినవాఁడు నాగరికుఁడుగఁ బరిగణింపఁబడుచున్నట్లే యానాఁడు ఫారసీ, అరబ్బీ, ఉరుదూ, భాషలను నేర్చినవారు నాగరికముద్రనంది, గౌరవపాత్రు లగుచుండిరి. మొగలాయీ ప్రభుత్వమునఁ గొంతవఱకు శాంతిపరిస్థితు లేర్పడినకొలఁదియు, మహమ్మదీయులును హిందువులును. బరస్పరసఖ్యమున మెలఁగుకొలఁదియు, వారి యాచారవ్యవహార

ములయెడ వీరికిని, వీరి యాచారవ్యవహారములయెడ వారికిని నభిమానము కలుగుచువచ్చెను. తెనుఁగువారు మహమ్మదీయుల 'పీర్ల' పండుగలలోను, నితరములగు నుత్సవములలోను పాల్గొనుచుండిరి. వివాహసంబంధములను బట్టియు తెనుఁగునందును హిందూస్థానీ భాషయందును గూడ మార్పులు గలిగినవి. తురకమురాని మహమ్మదీయు లెందరో యాంధ్రదేశమందున్నారు. తెనుఁగువారితోడి సంపర్కమువలన మహమ్మదీయుల భాషయు, మహమ్మదీయులతోడి సంపర్కమువలనఁ దెనుఁగుభాషయుఁ గొంతవఱకు మాఱుచు వచ్చినవి. తెనుఁగుసోఁకున మహమ్మదీయులభాష 'దక్షిణీ' భాషగాఁ బరిణమించినది. ఈ యన్యోన్య సంబంధ మిప్పటివఱకునుండెనేనిఁ దెనుఁగుభాషా స్వరూప మెట్లుండెడిదో చెప్ప వీలులేదు. ఈ లోఁగా నైరోపీయభాషల ప్రభావ మెక్కువయగుటయు, మహమ్మదీయుల ప్రాబల్యము క్షీణించుటయు గారణముగ నాంధ్రభాష నుడికారమున నిప్పుడిప్పుడు క్రొత్తమార్గమును బట్టుచున్నది. ఆంగ్లభాష నభ్యసించినవారి భాషయందేకాక, సంకేతుల భాషయందును నీ యాంగ్లీకరణ విధానము పొడసూపకపోలేదు.

తెనుఁగునఁ జేరిన మహమ్మదీయులభాషలోఁ దొలుతనుండియుఁ దుర్కీ, అరబ్బీ, ఫారసీ పదములు గలిసియే ప్రవేశించినవి. వానిలో నేవి తుర్కీపదములో, యేవి యరబ్బీపదములో, యేవి ఫారసీపదములో తెలిసికొని జన సామాన్య ముపయోగించి యుండలేదు. వారట్లుచేయుట యనావశ్యకమై యుండెను. తమ చుట్టుపట్లనుండువా రుపయోగించిన పదములనే జనులును వాడుకొనుచువచ్చిరి. వానిలోఁ గొన్ని తుర్కీపదములు:

కూలి (తుర్కీ: కులి); కుర్మా = మాంసపుకూర (కవుర్మా), ఖాను (కాన్, కఖన్); చెకుముకి (చక్‌మకి); చాకు (చకు); చిక్కుచాపలు (ఫారసీ: చిఫ్; తుర్కీ: చిఖ్); తుపాకి, తోపు (తుపక్, తోపక్); తాగాడి (తగార్); భక్షీ (పారసి: బఖ్‌సి; తుర్కి: బక్సి); బహద్దరు (బహాదుర); బీబీ (బిబి); బేగము (బేగుమ్); ముచ్చలకా (ముచల్కా); మషాల్చి (మశాల్చి); ఖజాంజి (ఖజాన్-చి) మొదలైనవి.

ఈ రీతిగా నాయాభాషలనుండి పదములను విడఁదీసి చెప్పవచ్చును. కాని, యవియన్నియు నొక్కటేవిధముగఁ దెనుఁగు వాగింద్రియములకు లోనై మాఱియుండుటచే నా పదములు తెనుఁగున నేవిధముగ మాఱినవో తెలిసికొని తృప్తిపడవలసి యున్నది.

## హిందూస్థానీ, అరబ్బీ. పెర్షియనుపదములు తెనుఁగునఁ జేరునప్పుడు కలుగు మార్పులు.

[హి=హిందూస్థానీ; అ=అరబ్బీ; పె=పెర్షియను.]

### I. అచ్చులు.

(1) (అ) పదాదిని:—నివార్ (నవారు); దివాలి (దవాలి).

(ఆ) పదమధ్యమందు: దాఖిల్, దాఖిలా (దాఖలా); దఖిల్ (దఖలు);

ఆఖర్ (ఆఖరు); రాతిబ్ (రాతబు).

(ఇ) పదాంతమున:—కఇద్ (కయిదు).

(2) హల్లోపము, పూర్వాచ్చునకు దీర్ఘము:—

హ్—హి. పహ్‌రా (పారా); తహ్‌బంద్ (తాబందు); బెహ్‌రహ్ (బెహారా); నామహ్ (నామా); పెహ్‌గస్త్ (పేగస్తు); కాయిదహ్ (కాయిదా); కార్‌ఖానహ్ (కార్ఖానా), బాగహ్ (బారా); డేరహ్ (డేరా); కబ్జహ్ (కబ్జా); తర్జుమహ్ (తర్జుమా); గంజీఫహ్ (గంజీఫా), బిమాహ్ (భీమా). హవాదహ్ (హవాదా), తన్ఖహ్ (తనిఖ); మసౌదహ్ (మసోయిదా); నమూనహ్ (నమూనా); హమేషహ్ (హమేషా); హంగామహ్ (హంగామా).

గ్—ఫారిగ్‌ఖతీ = పారిక్షత్, పారీకత్తు.

జ్—హవాదజ్ (హవాదా).

ద్—వహీద్ (వహీ).

(3) హల్లోపమయినను కొన్నిచోట్లఁ బూర్వాచ్చునకు దీర్ఘము రాదు:— మహ్‌తాబి (మతాబి).

(4) కొన్నిచోట్ల ‘అ’ కారాగమము వచ్చును:—అ. తక్రార్ (తకరారు); హి. శంకర్ (శంకరు); మెహ్‌నత్ (మెహనత్తు, హ-లోపమువలన ‘మేనత్తు’); మహ్‌జర్ (మహజరు); నక్ల్ (నకలు); మత్‌లబ్ (మతలబు); మొహ్‌ర్ (మొహరు); నజ్‌ర్ (నజరు); నిర్‌ఖ్ (నిరఖు); నక్‌ద్ (నగదు); దఖ్‌ల్ (దఖలు); మిన్‌హా (మినహా); ముజ్రా (ముజరా); మొహ్‌ర్‌బాన్ (మొహర్బానీ); షహ్‌ర్ (షహరు); ఫిక్‌ర్ (ఫికరు); షర్‌త్ (షరతు); భడ్వా (భడవ); అ. తక్రార్ (తకరారు)

(5) కొన్నిశబ్దములలో నాదాగమము వచ్చును:—తగహ్ (తగహా) అ. సలహ్ (సలహా); పాగ్ (పాగా); మజాక్ (మజాకా); మేజ్ (మేజా);

మోజ్ (మోజా); టకోర్ (టకోరా), మోట్ (మోటు, మూట), పర్ద్ (పరదా), ఫర్మాన్ (ఫర్మానా); కాజ్ (కాజా), గలాన్ (గలానా)

(6) కొన్నియెడల నిదాగమమగును:—కొత్మిర్ (కొత్తిమిరి), బేసర్ (బేసరి); అ. తుర్రా (తురాయి).

(7) కొన్నియెడల నీదాగమమగును:—మెహర్బాన్ (మెహర్బానీ); కిస్త్ (కిస్తీ); మంజల్ (మజిలీ), గోన్ (గోనీ); టపాక్ (టపాకీ), తన్ఖా (తనిఖీ); పైమాయష్ (పైమాయషీ).

(8) సాధారణముగా నంతమందుదాగమ మగుచుండును:—గిలాఫ్ (గలేబు); కఇద్ (కయిదు); శరఫ్ (శరాఫు), హుక్మ్ (హుకుము), మొహర్ (మొహరు); బుర్జ్ (బురుజు); రుస్మ్ (రుసుము), సర్రాఫ్ (సరాబు), రద్ (రద్దు); రఇయత్ (రైతు)

ఉత్తు పదమధ్యమందు చేరుటయుఁ గలదు:—మండ్వా (మండువా); ఖండ్వా (ఖండువా); మొహర్ర్ (మొహరిరు), బుర్జ్ (బురుజు).

(9) కొన్నిశబ్దములలో నెదాగమమగును:—గోన్ (గోనె).

(10) కొన్ని శబ్దములకు ము ప్రత్యయము చేరును:—కాగజ్ (కాగితము, - దము); కుందన్ (కుందనము), గజ్ (గజము), మైదాన్ (మైదానము); ఘడియాల్ (గడియారము), బరాత్ (బరాతము), పోట్లా (పొట్లము); అమానత్ (అమానతము), ఖందక్ (కందకము); గంగాల్ (గంగాళము), దఫ్తర్ (దస్తరము); దుకాన్ (దుకాణము); అంబార్ (అంబారము); ఆవా (ఆవము); గుంబద్ (గుమ్మటము); రోక్ (రొక్కము).

(11) కొన్నియెడల నచ్చు లోపించి, పూర్వాచ్చు దీర్ఘమగును:—తఅల్లుక్ (తాలూకు, విశే.); తఅల్లుకా (తాలూకా).

(12) కొన్ని శబ్దములలోని యచ్చులు లోపించును:—పె. తరాజ్ (త్రాసు); పె. తైయార్ (తయారు), పె. ముఆఫ్ (మాఫు). హి. హాలూఆ (హల్వా): అ. నక్కాషీ (నక్షి).

(13) కొన్నియెడల నచ్చులకుఁ బ్లుతి గలుగును:—అ. ఉహ్దా (హూదా).

(14) అచ్చుల పరివర్తనము:—

అ—ఆ: మసల్ (మసాలా), మమూల్ (మామూలు), కర్కూన్ (కార్కూను); సెమ్అ (సెమ్మా), అ. బత్ (బాతు), అవర్జా (ఆవర్జా); అ. తలబ్ (తలాబు); అ. ఖజీ (ఖాజీ); అ. దవా (దావా); అ. జుబ్బ (జుబ్బా).

అ, ఆ—ఇ, ఈ: రకాబ్ (రికాబు); సరిష్తా (సిరస్తా); సర్ - నామా (చిరునామా); ఫర్యాద్ (ఫిర్యాదు); ఫర్యాది (ఫిర్యాది); ముచల్కా (ముచ్చిలకా); పై మాయిష్ (పై మాయిషీ); జలేబి (జిలేబి); నషా (నిషా); దివట్ (దివిటీ); అ. గ (గి) లాఫ్ (గలీబు); కమ్ఖాబ్ (కీన్కాబు).

అ, ఆ - ఉ, ఊ: అ. ఖబర్ (కబురు); ఫర్మాఎష్ (పురమాయించు); ఖేవా (కేవు).

అ, ఆ - ఎ, ఏ : అ. గలాఫ్ (గలేబు); తక్యా (టెక్కా); రప్‌రప్ (రెపరెప).

అ, ఆ - ఒ, ఓ: మఖ్మల్ (మొఖమలు).

ఇ, ఈ - అ, ఆ: దఖిల్ (దఖలు); దాఖిల్ (దాఖలు); దాఖిలా (దాఖలా); ఆఖిర్ (ఆఖరు), రాతిబ్ (రాతబు); ఖాతిర్ (ఖాతరు); హాజిర్ (హాజరు); హాజిరి (హాజరీ); ముసాఫిర్ (ముసాఫరు); నాజిర్ (నాజరు); నివార్ (నవారు); దివాలి (డవాలీ); సాదిర్ (సాదరు); పెష్‌రిస్తే (పేరస్తు); ముస్తాజిర్ (ముస్తాజరు); వాకిఫ్ (వాకబు); మహ్‌తాబీ (మతాబా); హి. ఖిచిడీ (శ. ర. కిచ్చడి); హి. మియాన్ (మయాన = మధ్యము౦).

ఇ, ఈ - ఉ, ఊ: అంజిర్ (అంజూరు) ; వాసిల్ (వసూలు).

ఇ, ఈ - ఎ, ఏ : ఇకరార్ (ఎకరారు) , అ. కమిజ్ (కమేజు); తావిజ్ (తావేజు); హి. దండీ (దండె).

ఉ, ఊ - అ, ఆ: బర్-ఆవుర్ద్ (బరావర్దా), వుకుఫ్ (వాకబు); ముహ్‌మద్ (మహమ్మదు).

ఉ, ఊ - ఇ, ఈ : ఫుతూరీ (సితూరీ); హి. జుగ్ని (జగిని).

ఉ, ఊ - ఒ, ఓ : హులురాహులురీ (హోరాహోరి); ముర్చంగ్ (మోర్సింగు); సుహ్‌బత్ (సోబత్తు); ములతాద్ (మోంతాదు); ముకర్రర్ (మొకరరు); కర్కున్ (కార్కూను); ములాకిత్ (మొలాకత్తు); ఖుర్దహ్ (ఖోరదా); ముతబర్ (మోతుబరి); అ. నుసర్ (కొసరు), ముకద్దమహ్ (మొకద్దమా); నమూద్ (నమోదు); నమూనహ్ (నమోనా); నామూస్ (నామోషీ).

ఎ, ఏ - ఇ, ఈ : కాఎదా (కాయిదా); తాఎనాత్ (తయినాతు); ఫర్మాఎష్ (పురమాయించు); ఫాఏదా (ఫాయిదా); పాఎఖానా (పాయిఖానా), ఇష్తేహార్ (ఇస్తిహారు).

ఒ, ఓ - ఉ, ఊ : మోచి (ముచ్చి).

ఒ - ఔ : హౌజ్ (హౌసు).

అఇ - ఎ : ఉమ్మైద్‌వార్ (ఉమేదువారు).

అఉ, అహు-ఓ : పహుంచి (పోఁచీ), పె. రఉగన్ (రోగను=వార్నీసు).

ఇఆ - ఏ : మియానా (మేనా)

ఇఆ - ఈ : సాలియానా (సాలీనా).

ఉఆ - ఆ : ముఆఫ్ (మాఫు).

ఉఅ - ఓ : ముఅతాద్ (మోతాదు).

ఆఈ - ఈ : మిర్జాఈ (మిర్జీ).

(15) దీర్ఘాచ్చులు హ్రస్వములగుట.

ఆ - అ : తాఏనాత్ (తయినాతు); అ. సాఇస్ ('గుఱ్ఱపు' సైను); పె. చాబుక్ (చబుకు); హి. చాలాన్ (చలాను), ఆవార్జా (ఆసర్జా); ఆవాజా (అవాజా); బాదామ్ (బాదము); బాజార్ (బజారు); సలాహ్ (సలహా); రాహ్‌దారి (రహదారి); వాహ్‌వాహ్ (వహవ్వా).

ఈ - ఇ : రజాఈ (రజాయి).

(16) అచ్చు లంతస్థము లగుట.

ఆ - యా : బఆనా (బయానా).

ఉ - వ : ఉస్తాద్ (వస్తాదు), ఉసార (వసారా).

ఏ - య : అ. సాఏర్ (సాయరు); పె. నాఏబ్ (నాయబు).

ఒ - వ : చలాఒణి (చలావణి, చలామణి); హి. దేఒడి (దేవిడి); హి. పాఒ (పావు); హి. పాఒలా (పావు (వ)లా).

హల్లులు.

(1) హిందూస్థానీ, అరబ్బీ, పెర్షియను పదములుకొన్ని తెనుఁగునఁజేరి ద్విత్వము (Doubling) నొందును:—

కొత్ మీర్ (కొత్తిమిరి); అ (ఇ) తర్ (అత్తరు); అ. కిలా (కిల్లా); అ. కిమద్ (కిమ్మత్తు); పె. కతాన్ (కత్తాను). ఉజాడ్ (ఉజ్జాడు); హి. కమి (కమ్మీ); పె. కుమక్ (కుమ్మక్కు); కబా (కబ్బా), మదద్ (మద్దత్తు); గచ్ (గచ్చు); ముచలకా (ముచ్చ (చ్చి) లకా); మనా (మన్నా); పె. దబీర్ (డబ్బీరు); హాసిల్ (హాస్సీలు); అక్స్ (అక్కసు); అ. జిలా (జిల్లా); రఫు (రప్పు); నమక్ (నమ్మకము); హద్ (హద్దు); హి. ఉని (ఉన్ని); ఛప్పన్ (ఛప్పన్న); ఆధ్ (అద్ద); పాచ్ (పచ్చ), సాబున్ (సబ్బు); సాగు (సగ్గు); ముకద్‌మహ్ (మొకద్దమా).

(2) అసవర్ణాక్షరములు సంయుక్తము లయినప్పుడు వానిలోనొకటి రెండవదిగా (Assimilation) మాఱును: - గుంబద్ (గుమ్మటము); ఫర్ద్

(పద్దు); అ. కజ్యా (కజ్జా); తక్యా (టెక్కా); అ. మసాలె బాప (మత్తు బానా); అ. పన్హా (పన్నా); కచహేరి (కచ్చేరీ); కులాహు (వుల్లా).

(3) ద్విత్వాక్షరములలో నొకటిలోపించి, పూర్వాచ్చునకు దీర్ఘము కలుగును: ముషక్కత్ (మాశాకత్తు); తఅల్లుక్ (తాలూకు).

(4) ద్విత్వాక్షరములలో నొకటి లోపించినను, బూర్వ ప్రాన్ప చ్చున కొకప్పుడు దీర్ఘము కలుగదు: సర్రాఫ్ (షరాబు); కర్రా (కరాగు), అ. తుర్రా (తురా; తురాయి); ముకర్రర్ (మొకరరు); గిల్లావా (గిలాబా); సవ్వాబ్ (సవబు); అవ్వల్ (అవలు); హజ్జామ్ (హజాము); ఉమ్మైద్ వార్ (ఉమేదువారు); నవ్వాబ్ (నవాబు).

(5) వర్గప్రథమ తృతీయవర్ణములకు బదులుగ ద్వితీయ చతుర్థ వర్ణములు వచ్చుట: నిగాహ్ (నిఘా).

(6) వర్గద్వితీయ చతుర్థవర్ణములకు బదులు వరుసగ ప్రథమ తృతీయ వర్ణములు వచ్చుట: కచ్‌హేరి (కచేరి); ఛీంట్ (చీటి); మేఖ్ (మేకు); నత్ (నత్తు); గావమ్చా (గావంచా); ఛాతి (చాతి); ఛటాక్ (చటకు); ముక్తసార్ (ముక్తసరి); అఖ్రోట్ (అక్రోటు), బిఛానా (బిచానా), హి. డాల్ (డాలు); పె. ఖైరాత్ (కైరాతీ); పె. ఖూనీ (ఖూనీ); ఝూట్ (జూటి), ఝగ్డా (జగడము); ఝుండా (జెండా); ఝారీ (జారీ), ఝాలర్ (జాలరు); పేఠ్ (పేట), పాఖా (పాక); పంఖా (పంకా).

(7) పరుషములు సరళములగుట: సడక్ (సడుగు), నక్‌ద్ (నగదు), నకారా (నగారా); అ. తకాజా (తగాదా, తగాయిదా); ఆబ్ఖోరా (ఆబు గోరా); మున్సిఫ్ (మున్సబు); జాఫరాన్ (జాబురా, శ. ర.)

(8) సరళములు పరుషము లగుట: బచ్ఛాగాని (బచ్చా కాని), ఖానిగీ (కానికీ); అదబ్ (అదపు).

(9) పదమధ్యమున గొన్ని హల్లులు చేరుట:— కాంబ్రి (కంబళి), అ. ముసబ్బర్ (ముసాంబ్రము).

(10) పదములోని హల్లులు లోపించుట:— హమామ్ దస్తా (హమాం దస్తా); హల్వా (అల్వా); హరావళి (అరావళి), హమేషా (అమేషా), మజ్‌దూరి (మజూరి); దస్త్-ఖత్ (దస్కతు); హుష్యార్ (హుషారు); దర్ ఖ్-వాస్త్ (దరఖాస్తు); యాద్-దాస్త్ (యాదస్తు); మస్‌జీద్ (మసీదు); ముతసద్దీ (ముసద్దీ); రఇయత్ (రైతు).

(11) అనునాసికీకరణము:—ముసబ్బర్ (ముసాంబ్రము); పె. పాపజేబ్ (పాంజేబు); హుర్ముజ్ (హుసుముంజి); గామ్ఛా (గావంచా), మస్నద్ (మందస).

(12) అనునాసికము లోపించుట:—ఛింట్ (చీటి); మంజిల్ (మజిలీ).

**హల్లుల పరివర్తనము.**

క - గ: తకాజా (తిగాదా, తగాయిదా); నకారా (నగారా), నక్ద్ (నగదు).

క - ఖ: తన్ఖ్వాహ్ (తనిఖీ).

ఖ - హ: మఖ్మల్ (మొహమలు, శకర).

ఖ - క: ముఖ్తసార్ (ముక్తసరు); అఖ్రోట్ (అక్రోటు); ఖైరాత్ (కైరాతీ); ఖూన్ (కూనీ), చఖా (చాక), ఖంజా (కంజా), ఖేవా (కేవు); మేఖ్ (మేకు).

ఖ - గ: ఖస్ఖస్ (గసగసాలు).

ఘ - గ: బగ్ఘీ (బగ్గీ); చౌఘరా (చౌగర); ఘూఘ్రా (గాగర); ఘామత్ (గమ్మత్తు); ఘబ్రాహత్ (గాబరా); ఘేరా (గేరా).

ఘ - క: బెచిరాఘ్ (బేచిరాకు)

చ - శ: దేగ్చా (డేగిశా).

ఛ - చ: బిఛానా (బిచానా); గామ్ఛా (గావంచా), బర్ఛీ (బర్చీ); ఛాతీ (చాతి); ఛటాక్ (చటాకు).

జ - ద: తకాజా (తగాదా); ఆజుర్దా (ఆదుర్దా), జిన్స్ (దినుసు); అ. తావిజ్ (తావేదు, తాబందు); కాగజ్ (కాగితము); మఅజూన్ (మాదుము).

జ - గ: పిన్జాన్ (పింగాణి).

జే - స: పె. తరాజ్ (త్రాసు).

జే - జ: ఖజానా (ఖజానా); ఇజాఫా (ఇజాఫా); పె. అల్గోజా (అల్గోజా); పె. జగీర్ (జాగీరు).

ఝ - జ: తామ్ఝామ్ (టామ్జాన్); ఝాంట్ (జాటీ), ఝగ్డా (జగడము); ఝుండా (జెండా); ఝూరి (జారీ); ఝాలర్ (జాలరు)

ట - త: టట్ట్ (తట్టు); టోపా (తోపా).

ఠ - ట: పేంఠ్ (పేఁట)

ఢ - ర: ఢక్కేల్ (రకేల)

త - ట: తామ్‌ఝామ్ (టామ్‌జాన్); తక్యా (టెక్కా); పె. తంగ్ (టంగు).

థ - ర: థోక్ (రోకు).

థ - త: నథ్ (నత్తు).

ద - జ: గిర్దా (గిరజా); బర్ - ఆవుర్‌ద్ (బరాబర్జు).

ద - ట: గుంబద్ (గుమ్మటము).

ద - డ: దాగ్ (డాగు); దాబ్ (డాబు).

ధ - ఢ: ధోకా (ఢోకా); ధమ్కా (ఢంకా).

ధ - త: హి. ధడాకా (తడాకా).

ధ - ద: హి. ధడ్‌ధడ్ (దడదడ).

న - ల: నుక్సాన్ (లుక్సాను); నున్నతి (నుల్తి); నీల్, లీలా (నీల, సం. నీల).

న - ణ: ఆనా (అణా); దుకాన్ (దుకాణము).

ఫ - స: ధఫ్తర్ (దస్తరము).

ఫ - ప: రఫు (రప్పు).

ఫ - బ: మున్సిఫ్ (మున్సబు), సంజాఫ్ (సంజాబు); సర్రాఫ్ (సరాబు); ముల్తఫ్ (ముల్తబీ); వుకుఫ్ (వాకబు).

బ - ప: బున్యాద్ (పునాదు), బెతాబీ (బేతాపి); కస్బా (కస్పా).

బ - వ: కబుల్ (కవులు, కౌలు), మేజ్-బానీ (మేజువాణి); నబాత్ (నవాతు).

మ - న: తామ్‌ఝామ్ (టామ్‌జాన్).

మ - వ: మాఆమలా (మావలత్తు).

సం. య = జ = జ: అ. కజ్జా (కజ్జా).

య - ఏ: యార్ = మిత్రుఁడు (ఏర్పాయి); పె. యాకాయక్ (ఏకాయెకీ).

ర - ల: పె. గుజ్రి (గుజిలీ); పె. దార్చిని (దాల్చిని); అ. దరాలి (దలాలీ); జర్తార్ (జలతారు); జుర్మానా (జుల్మానా, శ. ర).

ర - డ: ఉజార్ (ఉజ్జాడు); నారా (నాడా).

ఱ - డ: బటాౘత్తా (బటాౘడా); పగ్డీ (పగిడీ); హాఱా హాఱి. (అడావడి, శ. ర. అడావుడి).

ల - స: పె. జుల్ఫా (జునపాలు).

ల - ర: అల్లాబల్లా (ఆదరా బాదరా); ఘడియాల్ (గడియారము).

ల - శ: కులాహ్ (కుల్లా, కుళ్లాయి).

ల - డ: అ. నాల్ (నాడు, లాడము).

వ - బ: గిల్లావా (గిలాబా); సవ్వాబ్ (సవబు); జవాబ్ (జవాబు).

వ - ప: తస్వీర్ (తస్పీరు).

వ - మ: హావాన్ద్ - దస్తా (అమాందస్తా).

వ - ఒ: మస్వదహ్ (మసోదా).

వా - ఆ: వారపార (ఆర్ పారు).

ష - స: ఇష్తిహార్ (ఇస్తిహారు); పె. షీషా (సీసా); పె. షికస్తా (సికస్తు); పె. నాష్తా (నాస్తా); హుష్యార్ (హుసారు, శ. ర.); ఖుష్ (ఖుసి, శ. ర.); మాలిష్ (మాలీసు); కుష్తి (కుస్తీ); కిష్మిష్ (కిస్మీసు); కషీదా (కసీదా); షహ్నాఇ (సొన్నాయి); దాఖ్త్ (దస్తు); షయితాన్ (సైతాను); పె. గుమష్తా (గుమాస్తా); అ. షత్రంజి (సత్రంజి); అ. షుమార్ (సుమారు).

ష - శ: మషక్కత్ (మశాకత్తు); షికస్త్ (శికస్తు), నిషాన్, నిషానీ (నిశానీ); షమ్ - అ (శెమ్మా).

ష - చ: షమ్లా (చమ్లా)

ష - ష: షహ్ర్ (షెహరు).

స - ష: అ తాసా (తాషా - మర్పా); సర్రాఫ్ (షరాబు); సైర్ (షైరు); అత్లస్ (అతలషు), పె. సఖ్త్ (షక్తు), పె. ఖేస్ (ఖేషు); పె. నామూస్ (నామోషి; శ. ర. నామూషి).

స - చ: కుర్సి (కుర్చీ), సితార్ (చితారు)

హ - ఖ: మునాహత్ (మశాఖత్తు).

హ - గ: తరాహత్ (తరగతి).

హిందుస్థానీ, అరబ్బీ, పెర్షియను పదములు తెనుఁగునఁ జేరునప్పుడు పైని చూపిన రీతిగ ననేకవిధములుగ మార్పుఁ జెందినవి. రూపములందలి యీమార్పులేకాక, యర్థములందును ననేకవిధములగు మార్పులు గలిగెను. అట్టిమార్పుల కీక్రిందఁ గొన్నియుదాహరణము లీయఁబడుచున్నవి.

హిం. బట్వారా=జమీనులోని యొక భాగము; వంతు, భాగము. తెనుఁగున 'పంచిపెట్టుట' యను నర్థము కలిగినది. జీతములు బట్వాడా చేసినారు.

అ. బదల్ = ఇచ్చిపుచ్చుకొనుట; తెనుఁగున 'అప్పు', ఋణము, అను నర్థము కూడవచ్చినది. నూఱురూపాయలు బదులు పుచ్చుకొన్నాఁడు.

అ. బద్లా=ఇచ్చి పుచ్చుకొనుట; పరిహారము. తెనుఁగున నిది లేదుగాని 'బదలాయించు' అను క్రియగలదు, 'బద్లీ' అనగా 'మార్చుట' అని యర్థము. 'బదిలీచేయు' అను నర్థమున 'బదలాయించు' ను వాడుచున్నారు.

పె. 'బర్ - తరఫ్' అను పదము విశేషణము. అర్థము, 'వేఱయిన, ప్రక్కనున్న, విడిచి పెట్టిన.' దానిని తెనుఁగువారు విశేష్యముగా 'పని నుండి తొలఁగించుట' యను నర్థమున వాడుచున్నారు.

అ. బుర్కా = కన్నులయొద్ద కన్నములున్న మేలిముసుఁగు. తెనుఁగున వదులుగా నుండు నెట్టి దుస్తునకైనను నీ పదమును వాడుచున్నారు. పరుపులకు కూడా తెనుఁగువారు బురకాలు తొడిగింతురు.

పె. బస్తా = ఒకవస్తువు చుట్టును చుట్టినది; మూట. తెలుఁగున మూఁట మాత్రమే. అదియును నొకానొక పరిమాణము గలమూట; కేవలము ముడి వేసినమూట బస్తాకానేరదు.

అ. బాకీ = మిగిలినది; దీనికి బహువచనము 'బకాయా' తెనుఁగున 'బాకీ' = ఋణము; బకాయి = మిగిలినది. అరబ్బీలో 'బకాఇ' = శాశ్వతత్వము, అమృతత్వము. 'బకాయా' అనున దేకవచనమనియు, 'బకాఇ' కిని 'బకాయి' కిని భేదము లేదనియుఁ దెలుఁగువారి భ్రాంతి.

అ. ఖాస్ = ప్రత్యేకమయిన, విశేషమయిన, సొంత; ఖాసా=మంచి, ఉదారబుద్ధిగల. 'శ. ర.' లో ఖాసా = దాసీపుత్త్రుఁడు: వెలమలు, రాచవారు ఉంచుకొన్న లంపతాలు=దాసీపుత్త్రులు, అనునర్థము సరిపోదు. సొంత నౌకరులు అని యర్థము చెప్పవలెను. అది ఖాసాగా నాదే = నిశ్చయముగా.

అ. ఖాతిర్ = హృదయము, నిశ్చయము, ప్రసాదము. తెనుఁగున దీనిని ఖాతరు = లక్ష్యము అను నర్థమున వాడుచున్నారు. వానికి ఏదీ ఖాతరు లేదు; వాడు నీ మాట ఖాతరు చేయఁడు.

పు. అస్వార్ = విహారము. తెనుఁగు, స్వారీ, సవారీ; గుఱ్ఱముపై పండితులు స్వారీచేయుదురు; ఇతరులు సవారి చేయుదురు. పెర్షియాలో బండ్లలోను, మోటారులలోను, విమానముల మీఁదను గూడ స్వారిచేయ వచ్చును. విహరింప యోగ్యమగు వాహనముగావున పల్లకికి 'సవారీ' అను పేరు వచ్చునది. బండ్లలో సవారీబండ్లు ప్రత్యేకముగఁ గలవు. పల్లకికే తెనుఁగున 'సవారీ' యందురుగాని యితర వాహనముల కనరు.

పె. షికార్ = వేఁట. తెనుఁగువారు చేతికఱ్ఱలు పట్టుకొని నడచుచు ఊరి బయటికి షికారు పోవుదురు. ఇటునటు నొక్కచోటనే తిరుగులాడుట కును 'షికారు' [illegible]

అ. షుమార్ = ఎంచుట, లెక్కపెట్టుట. తెనుఁగున నీ క్రిందివాక్యము లలో నర్థభేదమును గమనింపవచ్చును. సుమారు అయిదుగంటలయినది, నీళ్లువేడిగా ఉన్నవా? సుమారుగా ఉన్నవి; ఆయనకు రోగమెట్లున్నది? కొంచెము సుమారుగా ఉన్నది. సగటు సుమారు నూఱురూపాయలు ఖర్చయి నది, మొదలయినవి.

పె. అస్తర్ = అంచుకట్టుట; సున్నము మొదలయినవి మెత్తుట. తెనుఁగున ఒకబట్ట వెనుక (అంచుకే యను నియమము లేదు) మఱి యొక బట్టను జోడించి కుట్టుట యని యర్థము. తెనుఁగువారు గోడలకు సున్నము అస్తరు వేయరు.

అ. ఇకామత్ = వాసస్థానము, బస; తెనుఁగు 'ఇఖమత్తు = లాభ కరము, వాటము.

హి. అఖాడా = సభ, గరిడీ. దీనికి తెనుఁగున నీచార్థము కలిగినది; 'తుంటరి జట్టు' అని యర్థము. హిం. లో ఇంద్రసభకు 'ఇంద్రా కా అఖాడా' అనవచ్చును.

హి. ఉస్తాద్ = ఉపాధ్యాయుఁడు. హిందూస్థానీ యర్థము ననుసరించి పండితులును, నేనును ఉస్తాదులమే. కాని యా పదము తెనుఁగున 'వస్తాదు' గామాఱి, కసరత్తుచేసి దేహమును, దేహబలమును వృద్ధిచేసికొన్న జెట్టి యను నర్థము వచ్చినది.

అ. తాలిమ్‌ఖానా = బడి; తెనుఁగున దేహపరిశ్రమమున కేర్పడిన గృహము.

అ. కితాబ్ = పుస్తకము; తెనుఁగున 'బిరుదు'.

అ. అంబార్ = ఎట్టి తొట్టియైనను; తెనుఁగున అంబారీ = ఏనుఁగు మీఁదనుంచిన తొట్టి.

పె. రవాన్ = పోవుట, పరుగెత్తుట, ప్రవాహము. తెనుఁగు 'రవానా' = పంపుట.

పె. రుమాల్ = చేతిగుడ్డ, తువాలు; రుమాలి = తలపాగా. ఇప్పుడు తలకు తెనుఁగువారు 'రుమాలు' మాత్రము చుట్టుకొందురు.

పె. జబున్ = చెడిన, రోగముచెందిన. తెనుఁగువారి 'జబ్బు' పెర్షియా నుండి దిగినదేమో.

పె. జేర్ = బంగారము; జేరీ = బంగారు సంబంధమైనది. తెనుఁగున వెండిజేరీ, రాగిజేరీ, కూడ ఉన్నవి. పె. జేర్ తార్ = బంగారుతీగ; శ. ర. లో 'జేలతారు ద్వి. వి. (జలకము + తారు) వెండిబంగారముల నీరుపూసిన నూలి పోఁగు, సరిగ' అని యర్థమున్నది.

పె. జుల్ ఫ్ - చిన్నకురులు; తెనుఁగు 'జునపాలు' ఒకవిధముగ వంగిన తలవెనుకనుండు కురులుమాత్రము.

అ. అదబ్=మర్యాద, మంచినడవడి; తెనుఁగు 'అదపు. హిం. గద్దింపు, హెచ్చరిక, భయము' అని శ. ర.

పె. జియాద్ తి=ఎక్కువ; అభివృద్ధి; తెనుఁగు 'జాస్తి=అధికము, శ. ర.

పె. దర్జా = అంతస్తు, గది, పరిమాణము; తెనుఁగు = గౌరవము' ఉద్యోగమునకు తగిన అహంకారము.

పె. దిల్ = హృదయము; దిలాసా = ఓదార్పు, సుఖము. శ. ర. లో "హిం. హెచ్చరిక; ధైర్యము."

అ. దబ్బా = నూనెపోసికొను తోలుసిద్ది. తెనుఁగున, 'తంబరేల్ డబ్బా, కిరసనాయిలు డబ్బా' మొదలయినవి.

పె. దస్త్ = చేయి; దస్తు, దస్తూరి, దస్కతు, దస్తా మొదలగు తెనుఁగునఁ జేరిన శబ్దములలో 'చేయి' యను నర్థము మఱుఁగుపడినది.

హి. దుబారా = రెండింతలు. శ. ర. లో 'దూఁబఱ' అని ఒక యర మున్నను, ఒక శకటరేఫమును జొనిపినారు. దూయు + పఱ, అని పదచ్ఛే దము చేసినారు. 'దూఁబర' శబ్దము 'దుర్భర' శబ్దభవమైనను గావచ్చును.

పె. దొస్తీ = మైత్రి.. తెనుఁగు 'దోస్తీ'; కాని, దొస్త్ = మిత్రుఁడు, దొస్త్ దార్, దొస్త్ దారి, దొస్తానా, అనునవి తెనుఁగునఁ జేరలేదు.

పె. దివాన్: దీనికి అనేకార్థములున్నవి. తెనుఁగున నొక్క యర్థమునే గలిగి యున్నది.

అ. రఇయత్ = ప్రజ; తెనుఁగు 'రైతు = కర్షకుఁడు'.

అ. రజిల్ = శతుఁడు, నీచుఁడు. ఈ మాట తెనుఁగున లేదుగాని దీని నుండి వచ్చిన 'రిజాలా' అను విశేషణము వాడుకలో నున్నది. 'రిజాలాగొడ్డు, రిజాలామనిషి.'

అ. రకమ్ = గుఱుతు, చిహ్నము, ఆకారము; తెనుఁగు: తరగతి,వర్గము.

హి. రవా = ఇసుకరేణువు తెనుఁగు: రవంత; గోధుమరవ, 'బియ్యపు రవ' కాదు.

పె. బెష్ = ఎక్కువ, సుందరతరము; తెనుఁగున నర్థవిశేషము. అది భేషుగా ఉన్నది.

పె. పాకి = పరిశుభ్రత, పాతివ్రత్యము; పాకిజ - గి = పాతివ్రత్యము; తెనుఁగున 'పాకీవాఁడు' నీచుఁడయినాఁడు. మన పాయఖానాలు పరిశుభ్రము చేసి, తా నపరిశుభ్రముగ నుండును గనుక.

పె. పసంద్ = కోరిక, అంగీకారము; తెనుఁగు: పసందు = మిక్కిలి బాగు.

హి. పంఖా = పెద్దవిసనకఱ్ఱ; పంఖీ = చిన్నవిసనకఱ్ఱ; మొదట సది, పక్షి యీకలతోఁ జేయఁబడుచుండెను. సం. పక్ష, హిం. పంఖ్ = పక్షి యీక; తెనుఁగుదేశమున 'పంకా' లను కఱ్ఱబల్లకు దళసరిబట్టను చేర్చి, త్రాళ్లతో వ్రేలాడఁగట్టి లాగించుకొందురు.

హి. పొట్లా = పెద్దమూట; బస్తా; దీనికి తెనుఁగున 'పొట్లాలు' అని బహువచన రూపమువచ్చి, 'పొట్లము' అను నేకవచనరూపము కలిగినది. తెనుఁగులో పొట్లమునకుఁ బ్రత్యేకాకారమును బరిమాణమును నేర్పడినవి.

పె. పెచ్ = తగులుకొనుట, మరమేకు, యంత్రము, కుస్తీలో వస్తాదు లొకరినొకరు పడఁద్రోయుట కుపయోగించు నుపాయము; తెనుఁగున ఎదురుమాట, చిక్కు, కుతంత్రము, అను నర్థములు వచ్చినవి.

అ. హాసిల్ = ఫలసాయము, ఫలము, అనుమితి, లాభము, రాజు నాయము, రాఁబడి; తెనుఁగున హాసీలు = సుంకము.

అ. హిసాబ్ = లెక్కలు, గణితము; తెనుఁగు: ఇసేబు = అరువు బేరము.

అ. హాల్ = న్యాయము, ధర్మము, విధి, సత్యము, దైవము, అధికారము; తెనుఁగున 'హక్కు = ఒకవస్తువుపైఁ గల సొంతఅధికారము మాత్రము.

అ. హవాలా = స్వాధీనము, ఒక విషయమును గూర్చి తెలిసికొనుట; తెనుఁగు: హవాలా (బంట్రోతు) = ఎక్కడకుఁ బోయిన నచ్చట కాచుకొని యుండువాఁడు.

అ. తత్మిమ్ = పూర్తిచేయుట, పూర్తిచేయునది; తెనుఁగు: తతిమ్మా = మిగిలిన.

అ. మెహ్నత్ = శ్రమము, బుద్ధి, వ్యాయామము, కష్టము; తెనుఁగు: మెహనతు = కూలి, బహుమానము.

అ. తన్కీహ్ = శుభ్రపఱుచుట, కలహములను సరిచేయుట; తెనుఁగు: తనిఖీ = పరీక్షించుట.

అ. తౌజి = లెక్కలపట్టీ, లెక్కల వివరము; తెనుఁగు: స్వాధీనములో నున్న మైనరుల కిచ్చు ధనము.

పె. తహ్‌బంద్ = కుచ్చెళ్లుపోసి మొలకుకట్టుకొను బట్ట; తెనుఁగు: తాబందు = పరికిణీ, పావడ

హి. ఠికానా = బస, ఉండుచోటు; తెనుఁగు: టికానా = ఆశ్రయము.

పె. జవాన్ = పడుచువాఁడు, సేవకుఁడు, నగరరక్షకుఁడు; తెనుఁగు: జమాను = పొడవరియైన బలవంతుఁడు.

పె. ఖుద్ = స్వయము, సొంత; తెనుఁగులో 'ఖుద్దున' అని '-న' చేరినగాని యవ్యయము కాకున్నది.

దె. ఖున్ = నఱుకుట; ఖుని = చంపువాఁడు; తెనుఁగులో 'ఖూనీ' అను పదమునకే 'చంపుట, నఱుకుట' యని యర్థము వచ్చినది.

అ. షమ్లా=పాగా జరీఅంచు; తెనుఁగు=ఒక విధముగాఁ జుట్టిన పాగా.

అ. సందుక్ = ఎటువంటి పెట్టెయైనను; శవమునుంచు పెట్టె; తెనుఁగు: సందుగ = ఒక విధమైన చిన్న పెట్టె.

అ. జాబితహ్ = ప్రభుత్వనిబంధనలు; తెనుఁగు: జాబితా = పట్టీ.

అ. జిలా = భాగము, ప్రాంతము, ప్రక్క; తెనుఁగు: జిల్లా = మండలము; దేశభాగము.

అ. తరఫ్ = ప్రక్క, అంచు; తెనుఁగు: తరఫు = పక్షము; ఇది తెనుఁగున మహన్మహతీవాచకశబ్దములతోడనే వాడఁబడుచున్నది.

అ. అలుఫహ్ = జీతము, దినబత్తెము, విశ్రాంతివేతనము; తెనుఁగు: ఉలుపా = కట్నము, బహుమానము.

అ. ఉహ్‌దా = వృత్తి, పని; తెనుఁగు: హోదా = పెద్దస్థితి.

అ. ఫారిగ్‌ఖతి = విడుదలపత్రము; తెనుఁగు: ఫారెఖత్తు; అరబ్బీ భాషలో 'ఖత్' 'ఖతి' అనున వేర్వేరర్థకములు కావు.

అ. ఫుతురీ = మోసము, అక్రమము; తెనుఁగు: పితూరీ = ప్రభుత్వముపైఁదిరుగుఁబాటు.

పె. సర్‌బరాహ్ = వ్యవహారము; సర్‌ఫరాజ్ = గౌరవము; తెనుఁగున 'సరపరా' అని పై రెండుమాటలకును సరియగు నర్థము తెలియక, యింగ్లీషులోని 'సప్లై' అను నర్థమున వాడుచున్నారు.

పె. సర్ - ఆ - సర్ = ఈకొననుండి ఆకొనవఱకు; తెనుఁగు: సరాసరి = ఇంచుమించుగా; పెర్షియనులో 'సరాసరి' = విషయసంగ్రహము.

పె. రవారవీ = షుమార్ = ఎంచుట. తెనుఁగు: రమారమి = ఇంచుమించుగా.

హి. సర్ధా = శ్రద్ధ, విశ్వాసము; తెనుఁగు: సరదా = వేడుక.

అ. షరహ్, షరా = నియమము; తెనుఁగు: షరా = లఘువివరణము.

అ. కిఫాయత్ = చాలినంత, పొదుపు, ధనాధిక్యము. దీనినుండి 'కిఫాయితీ' విశేషణము. తెనుఁగున 'కిఫాయతుగా' = లాభకరముగా; కిఫాయితీ = లాభము.

హి. ఖాతా = పద్దుల పుస్తకము ; తెనుఁగు : ఖాతా = వ్యవహారసంబంధము.

హి. ఖట్టీక్ = పిట్టలను, జంతువులను వేఁటాడువాఁడు ; తెనుఁగు ; కటికవాఁడు = కసాయివాఁడు.

హి. ఘరానా = కుటుంబము, వంశము; తెనుఁగు : ఘరానా = గౌరవము గల.

అ. లాయక్ = శక్తిగల, మర్యాదగల, ఉదారమైన; తెనుఁగు : లాయకు = తగిన, ఒప్పిన.

అ. లగాయత్ = అంతమువఱకు ; తెనుఁగు : లగాయతు = మొదలుకొని.

పె. ఫిర్కా = జాతి, గుంపు; తెనుఁగు: ఫిర్కా = ప్రదేశము.

అ. కాయమ్ = నిటాకనిలబడు; తెనుఁగు : ఖాయము = శాశ్వతము; నిశ్చితము.

అ. కదమ్ = పాదము, కాలినడక; తెనుఁగు : కదము = గుఱ్ఱపునడక.

అ. కలాఇ = తగరపుఁబూత, వెల్లవేయుట; తెనుఁగు: కళాయి = తగరపుఁబూత మాత్రము.

అ. కబా = పొడుగైన అంగీ; తెనుఁగు: కబ్బా = చేతులులేని పొట్టికోటు.

పె. మాలిష్ = తిక్కుట, తోముట. మెఱుఁగు పెట్టుట; తెనుఁగు : మాలీసు = గుఱ్ఱములను తోముట మాత్రము.

ఇట్లే నూర్లకొలఁది హిందూస్థానీ, పెర్షియను, అరబ్బీపదములు రూపభేదములతోను, నర్థభేదములతోను దెనుఁగునఁ జేరినవి. వానిలోఁ గొన్ని

తెనుఁగున జీర్ణించుకొనిపోయి కేవలము తెనుఁగుశబ్దములవలెనే నిఘంటువుల కెక్కినవి. ఇట్టి వనేకములున్నను గొలఁది యుదాహరణములు మాత్ర మిచటఁ జూపఁబడు చున్నవి.

అంగము, అంగు, అంగూరు, అంచించు, అంచియ, అంచె, అంచన, అంచనదారుఁడు, ఉండా, అండి, అండియ, అండీ, అండె, అంబారి, అంబారము, అంబారు, అకారతుగా, అగాదు, అ.గావు, అడితి, అడిసాటా, అదుస, అడ్డీ, అత్తరు, అబిసీలు, అమరము, అమరకము, అమాంతము, అఱడా, అఱదు, అలక, అలకన, అసలు, ఆసివాలు, ఆదరబాదర, ఆయకట్టు, ఆయకము, ఆరకాటి, ఆస్తి, ఇలాయి, ఇస్తువు, ఉదిరి, ఉరుముంజి, ఉలకన, ఉలుప, ఉల్లాకు, ఉల్లారు, ఉవ్వాయి, కుందనము, కందకము, ఎకరా, తేజి(జీ), పటాణి, బాబా, కదము, స్వారి. బాతు(వు), బాజు, దోరువా, కూకీ, అరుజు, మొహాళము, బొప్పాయిపండు, బాద(దా)ము, బత్తాయి, బటానీ, బకాను, ఒంగి, పగిడి, నిమటాయి, తేకు, అనాస, డావరడంగి,ఆరె. పట్టా, మాగాణి, పిక్కారు, పాయకారి, నిముకళా, దాళువా, తూపరాణ(ణి), అపరాలు, అగాడి, ఆట్రగడలు, కైలు, కైలుదారి, ముచ్చిలిక, దురాయి, దావ, చావా, అరగండ, ఏలము, ఏలాము, గస్తీ(లు), దేశపాండ్య, మచ్చు(కత్తి), బురుమా, బరమా, బట్టీ, పాకి, పటుసాలె, దిమ్మెస, దరుజు, తోటి, తాపి, తాగాణి, ఆరెబొట్టె, ఎడారె, తాగాఁడి, ఆకు(రాయి), లోహాండి, మెల్లా, ముటాలు, బొక్కెన, బొక్కెస, బాండ్లి, బస, బంగల, పొత్రము, పేలా, పునాది, పింగాణి, పానంచా, పరంజ, పంజాయీ, తాళీ, తమరె, తబుకు, తనాబి, కటకటాలు, కిటికీ, కొటారము, కొణజా, కోర = గిన్నె, గిసి, చావడి జంజడ, మమ్నాయి, పేణీ, ఫ్రాకీ, నవాతు, తగవాణి, సొగటాలు, ఆసివారు, ఉపతాయి, గరిడి, అబిసీలు, మాఁతు, లాచి(చీ), సంచి, మొకమాలు, ముసనాబు, మాతాబి, బేసరి, బూర్నీసు, బురుసా, బిరికీ, బిందీ, బావిలీ(గొలుసు), బాజుబందు, బరుజు, బతీసీ, పోచీ, పైజేలు, పేరణి, పేరోజెము, పేట, పేటు, పిల్లాడి(ణి), పింపిణీ, పావాలు, పారాణి, పాపోసు, పాగ(గా), పాటీలు, పాణసి, పాణి, పా(ం)జేబులు, పరికిణీ, పరకాళా, పన్నా, పటా, నూలు, దుస్తు, దసిలీ, తోడా, తురా(యి), తాబందు, తాపిత, తాబు, అఱదు, అఱడా, కందువా, కత్తెరబావిలీ, కబాయి, కమ్మరు (బొందు), కలంకారి, గనీబు, అపరంజి, జంటి(టీ), మసరు, మన్న. మండి, బురుడా, అక్కసము, అక్కసు, అసరు, బాజే, బజేతు, పోటి, పారసి, పరారి, న(నా)రాజి, దారు, దురుసు, దురా(యి), దిమ్మెస, తేడా, తెక్కు, తిబిరి, తవాయి, తటకా, తండా, తంట(ంటా), అమిజి, ఆచూకి, ఆరెము, ఆసరా, ఉతాణి, కీత, కైపు, కైవు, కొడిగ, కోడి, ఖద్ది, అడ్డీ, కేవు, కేవరి,

కొలా(ల్లా)రు(బండి), కొల్లాబండి, పోళీ, పాలకీ, తండేలు, అమారు, మండీ, బోణీ, బదులు, బజాయి, పుర్సోణి, పద్దు, పట్టీ, దుకాణము, దినుస్సు, త్రాకట్టు, తరాసు(జు), అడితి, అసలు, ఆయకము, ఆస్తి, అహాకము, ఇస్తున్న, కిల్లాకు, కొరదా, కోపుదారుఁడు, గలబా(-బ), గల్బా, అగావు, అభిని, మస్తు, మజా, బోళా, బూలి, బరాబరి, బడ, పాళా, పరాయి, నికరము, నామకా, దుత్తాయి, జగా, కిఱుదు, కీస, కోరా, గయాళము, గయ్యాళము, గయాళు, అసాదు, పాదుసా(హి), పడాల, నకీబు, దవంత్రి, అజారము, ములుతారు, మలాక, మణిసిల, బొక్కిసా, బాబు, పొట్లము, పొత్తర, పాళీ, పరంగీలాగి, పట్టసారాయి, దట్టా, తుపాను, తస్స, గత్తర. గరాజు, గయా(య్యా)ళి, మొహర, బారా, పుంజీ, పావులా, పావు, దాళా, దమ్మిడి, త్రాసు, తులము, అణా, కంటలము, కంట్లము, గజము, అడ్డగ, బుక్కాము, బుక్క, ఊదువత్తి, తనుకు, ఆవజేము, మక్కా, మాగాని, బాజాలు, బంకోలు, తిరస్తు, మహాంతు, మసీదు, పౌజలు (తీరుచు), పుసలాయించు, పంపిణి, మాస్తీఁడు, (తగవు) గోరి, మలక, మరాటము, మందుభాయి, బోయి, బిబ్బి, బికారి, బికాసి, బాలాజి, బళాయి, బజాలి, పోకిరి, పరంగి, ముక్తాయింపు, బరాబరిక, ఖండువా, గాగర, గాజో పరుఁజు, గాటు, గాణీ, గార, గుండా, గుండీ, గలప, గాలి(మాట), గావు, గల్లి, గోహారు, గోడా, గోతము, గోలు, చిక(క్క)టారి, చిడుగుడు, చిత్తు, చిముటాలు(కొట్టు), చిరాకు, చిరునామ, చిలుకత్తు, చిల్లర, చీకాకు, చీటి, (చెంప)కల్లీ, చెకడా, చెకుముకి, (చెక్క)తాపి, చడ్డీ, చేగోడి (చూ-పకోడి); (చే)తముకు, (చే)బదులు, చబుకు, చవిలె, చాకీ, చాడి, చాడీ, జేబు, జట్టి, జేర, జోగా; జాళువా, జాళ్వా, జుమాయించు, జుమికీలు, జులుము, జుల్మాన, జూటు, జూఁటు(ఁదనము), జోలు, జోరావరి, టపాకాయ, టలాయించు, టీకము, టీకా, టీకు, టూకీ, టూకించు, టేఁకి, టేఁకు, టోకు, టోపి, రవరవ, ర(డ)వివ, డాకురు, డంకా, డక్క, డక్కి, డబ్బా, డబ్బి, డబ్బర, డాగు, రంజణ(-ని), రకము, రమ(మా)రమి, రవాయి రవాలు, రవగాలు, రస్తు, రాణువ, రుమాలు, రూపాయ, రొక్కము, రొకు. లండి, లండు, లకోరి(రీ), లగడ, లడి, లత్త, లాహిరి, లాహిరిమోదము, లాడ(-శ)ము, లుంగి, లుంగి, లూటి, లూటీ, లోట, లోడి, లోడీ, లోడు, లోపాయకారి, (లో)సబురు, వంకీ, వట్టము, వసార, వాయి, సురతాణి, సురమాయి, సూరెపాను, సెమ్మె, సెల్లా, సేరి, సేరు, సోఁపు, సోళాదొప్పి, హజారము, హాజురు, హద్దు, హాజారము, హిజారు, హుమాయి, హురుమత్తు, హురుముంజి, హుర్మంజి, హేజీబు, హేమాహేమీలు, హేరామి, సకళాతు, సగతు, సబిడీ, సముతు, సరకు, సరాతి, సరాసరి, సరపణి, సరివెణ, సరుదు, సస్కాని; సాయిల, సారంగి,

సారాయి, సారువా, సార్లా, సాలామిశ్రి, సాలు = సం. రము, సహారువు, సిరాజీ, సుకారి.

పైఁజూపిన శబ్దములన్నియు శబ్దరత్నాకరమునఁ జాలవఱకు దేశ్యములుగ నిరూపింపఁ బడినవి. కొలఁదిగ వైకృతములుగఁ జూపఁబడినవి. దేశ్యములుగఁ జూపఁబడిన పదములు దెనుఁగున జీర్ణించుకొనిపోవుటచే న ట్లానిఘంటుకారునికి గోచరించినవి. వైకృతములని యాతఁడు చూపినవి సంస్కృత ప్రాకృత భవములని నిరూపింప వలనుపడినను నవి హిందూస్థానీ మార్గమునఁ దెనుఁగునఁ జేరినవి కాని, హిందూస్థానీతోఁ దెనుఁగునకు సంబంధము కలుగక పూర్వము నుండియు నాంధ్రమున నుండినవి కావు. శబ్దరత్నాకరమునఁ జూపఁబడిన పదములలోఁ బైనుదాహరించిన పదములనే కాక యింక మఱి కొన్నిటిని గూడ హిందూస్థానీ మార్గమునఁ దెనుఁగునఁ జేరినవిగఁ జూపవచ్చును.

ఈ రీతిగాఁ జేరిన పదముల మూలమునఁ దెనుఁగువారి నాగరికతయాం దెట్టిమార్పులు గలిగెనో గ్రహింపవచ్చును. ఏయే విధములుగ నేయే పదములు దెనుఁగునఁ జేరినవో యీ క్రింది పట్టికల వలనఁ దెలిసికొన వచ్చును.

(1) జంతువులు, వానికి సంబంధించిన శబ్దములు.

అంబారి, ఎకరా, తేజి(-జీ), తట్టు, పటాణి, బాబా, కడను, కావా, కైజా, కో(ఖో) గిరి, స్వారి, నాలము, గులప, గులా(ల్లా)ము, గోడా, చౌడోలు, చౌతా, జీనము, జీను, టంగు (వాలు), టాకనా, టంగనా, టి(ం)గనా, రవాలు, లగాము, లాడ (శ)ము, హౌదా, సగతు,

(2) పక్షులు, చేఁపలు మొదలయినవి.

బాతు (వు), బాజు, దోరువా, కూకీ, అరుజు, జిబ్బటీ, జిబ్బడాయి, టేఁకి.

(3) చెట్లు, తీగలు.

మొహాళము, బొప్పాయ (పండు), బాద (దా) ము, బత్తాయి, బటాని, బకాను, బంగి, పోస్త (కాయ), పుదీనా, పగిడి, నిమ్మకాయి, దాల్చిని, తే(టే)కు, అనాస, ఆలు (గడ్డ), కిసుమిసు, అంగూరు, వావరడంగి, ఆరె, గులాబీ, జాజి, చౌకు, జాబుర, సరువు.

(4) వ్యవసాయమునకు సంబంధించినవి.

పట్టా, మహసూలు, మాగాణి, బిల్మక్తా, బంజరు, పోరంబోకు, పిక్కారు, పాయకారి, నిముకళా, దుంబాలా, దాఖవా, తూపరాణ (-ణి), తకావి, అంచన, అంచనదారుఁడు, అంబారము, అంభారు, అపరాలు, ఆగాడి, అత్ర

గడలు, ఇ (ఈ) నాం, కై (క్రై)లు, కౌలు, క్రైలుదారి, అజ (యి) మాయిషీ, అయకట్టు, జిరాయితి, రైతు, సేరి, సారువా.

(5) కోర్టులు, ప్రభుత్వము మొదలయినవి.

మహజరు, మహజర్నామా, ముసద్ది, ముద్దాయి, ముచ్చిలిక, బరత(ర)ఫు,బందిఖానా, దురాయి, అర్కారా, పర్వానా, ఫిర్యాదు, ఫిర్యాది, పేష్కషు, పేష్కరు, పితూరి, పారీఖత్తు, పాతా, పరమానా, నవుకరి, దుబాసి, దివాను, దావా, దావ, దారోగా, దస్తు, దస్తావేజు, దస్తరము, దస్త్రము, దస్ఖతు, దర్యాప్తు, తాబేదారు, తాకీదు, తహశ్శీలు (-దారు), తన (ని)ఖీ, తగాదా, అమీన్, అమలు, అమలుదారు, అనూని, అరదండ, ఇజారా, ఇరసాలు, ఇరసాలునామా, ఇలాకా, ఇస్తిహారు (-నామా), ఉమేజువారు, ఏలము, వేలము, ఏలాముకచే (చ్చే)రి, కిస్తీ (-బంది), కైఫీయతు, కొత్వాలు, గస్తీ, గస్తు, గస్తీలు, అర్జీ, దేశపాండ్యా, పటీ (టే)లు, ముకద్దం, బారాబలావతీలు, ఖజానా, ఖైదీ, ఖైదు, గుమాస్తా, చోపుదారుఁడు, జమాదారు, జప్తి, జప్తు, జమాబంది, జామీను, జుల్మాన, టపా(లు), డలాయతు, డవాలీ, రజా, రాజీ (-నామా), రుజువు, లవాజుమా, వకీలు, వర్ది, వసూలు, వాయిదా, వారసు, హక్కు(-దారు), హర్కారా, హాస్యీలు, హోదా; షరతు, షరాపు, సముద్దారు, సర్కారు, సాయరు, సిబ్బంధి, సిరాస్తాదారు, సిస్తు.

(6) వృత్తులు, వానికి సంబంధించిన పరికరములు మొదలయినవి.

బ(బు)రుమా, బిస్తి, బట్టె, పాకి, పటుసాలె, నగాను, నకాస్, నకాసి, దిమ్మెస, దలారి (-లి), దర్జీ, దరుజు, తోటి, తాపీ, తాపి, తాగాఁడి (-ణి), అరెబొల్లి, ఇస్తిరి, ఎడారె, కసాయి, కళాయి, కారుఖానా, ఆకు (రాయి), ములుతారు, (చెక్క)తాపి, చుక్కాను, డమాను, లంగరు, లాదు, నాదు, సరంగు.

గృహము, గృహోపకరణములు, వంటయిల్లు మొదలయినవి.

మేజా, మెల్లా, ముటీలు, భరంతు, బొక్కెన, బొక్కిస, బావిడీ=బావి, బాండ్లి, బస, బంగాళా, బంగల, పాత్రము, పేలా, తపే(బే)లా, పునాది, పింగాణి, పాప (వ)ంచ, పాయఖానా, పరంజ, వంజాయీ, పంకా, నవారు, దేకిచా, దబరా, తాళి, తాళీ, తమరె, తబుకు, తనాబి, అమానుదస్తా, అవుతుఖానా, అల్మారా, ఆయా, ఆషూర్ఖానా, ఇలాయి, కటకటాలు, కాగడా, కాసా, కిటికీ, కురిచీ, కూజా, కొటారు (-రము), కొటారి, కొణజా, కోర=గిన్నె, ఆవుకోర, గడవ (మ)ంచె, గసి, (క), చప్పరము, చావడి, జేంజడ, లోహండి,

బిచానా, బాలీసు, గారె, గచ్చు, గిలాబ, (చే) తముకు, చాకీ, చాకు, డబ్బర, డాబా, రంజణ (-ని), లోట; లోహండి, వసార, సెమ్మె, సఫ్టా, సరంబీ, సారువ.

తినుబడి వస్తువు.

నూజుం, మసాల, మిటాయి, మష్మాయి, పేణీ, పూరీ, పులావు, పకోడి, నస్తా, నవాతు, కిచ్చడి, కిచిడీ; తరవాణి, పేడా, గుడుపేప, బర్ఫీ, హల్వా, లడ్డూ, కోవా, పోళీ, చేగోడి, జిలేబి, జిల్లి, జేరబు, రొట్టియ (రొట్టె); లగడ, సోపు, సోరువా.

ఆటలు, వ్యాయామము మొదలయినవి.

సాగటాలు, అసివారు, ఉపతాయి, కసరతు, గరిడి, అబినీలు, నూంతు, దండ్యాలు, బస్కీలు; తాలీమ్, తాలీమ్ఖానా, వస్తాదు, ఫైల్మాను, కింకెలు, రింజ, లోడి, షికారు (-రీ).

వస్త్రములు; బట్టలతో కుట్టిన వస్తువులు.

లాచి(చీ), సంచి(చీ); ముకమాలు, గుసనాబు, నూతాని, కసరేసి, జుబ్బా, కబా, కబాయి, లుంగీ, షుర్వాను, షెరాయి, లాగు, మోజా, రుమాలు, పాగా, చెమ్లూ, మూలాబి, జలతారు, బూన్నెసు, బురకా, బుకునా, బుటు, బనాతు, బతినీ, రేశము, పేరణి, పేటు, పరికిణీ, గాగర, పరదా, పరకాళా, పన్నా, పటా, పటకా, నూలు, నాడా, నక్కి, కుస్తు, నిఫీ, తాజాసు, తాపిత, తాబు, అతలషు, అస్తరు, సుంకీ, కి(ఖ)ందువా, కుంకారి, కసీదా, కుడతా, కుతినీ, కుళా(ళ్లా)య(యి), గసిబు, గలేబు, ఇజారు, క(ఖ)ంఘవా, గోతము, చాందిని, జాలరు, చెక్కి, చంకువా, చొక్కా(య), పాగా, గోలా, చొాతు, జేబు, జరబాజు, జామారు, జాలరు, జాలి, టుబు, టోపి, రజాయి, రప్పు, రుమాలు, లంకరే, లంగోటి, లడి, లుంగి, లుంగి, లోపు, సెల్లా, సకళాతు, బనాతు.

కొన్ని విశేష్య, విశేషణ వాచకములు.

అల్కా, ఉలక, ఉలకన, మామూలు, మాఫు, మషాతు, మోటా, మోజు, మస్తరు, మన్న (-న్నా), ఘుస్కాతు, సుంకి, భర్తి, గేజాగు, బుగురు, బినాతు, అక్కసము, అక్కసు, దర్వాజా, బిరుడు, బాజు, బలాదూరు, బరావర్దు, బధనామ, బడాయి, బట్వాడా, ఒజీతు, బందోబస్తు, ఫర్మాయిషీ, ఫర్మా, పురుసత్తు, పోటీ, ఫైసలా, పుకారు, పరారి, నిషా, నిశాని, నిశాని, (నిజా)యితీ, నిగా, నారాజి, నాము(మూ)షీ, నాగా, ధూము, దారు, డోలు, మురుసు, దురా(యి), దిలాసా, కులాసా, దిమ్మస, దిమాకు, దాఖలా, దర్జా, దఖాస్తు, దఫా, దగా, దఖలు, తేడా, తె(టె)క్కు, తూలు, తిబిరి, తాహాతు,

తావేలు, తైపారు, తాకత్తు, తనాయి, తసిలీటు, తర్జుమా, తరహా, తరగతి, తర(రి) బియ్యతు, తయినాతి, తమాషా, తబ్దీలు, తప్సీలు, తఖ్వతు, తటకా, తకరారు, తండా, తంటా, అడావుడి, అదపు, అమిజి, అచూకి, ఆసాను, ఆసరా, ఉశాణి, ఉడ్డ(-డ్డా), ఉల్టా, కోరా (అనాహతము), ఎకరారు, క(ఖ) జ్యా, కా(ఖా)యిదా, కీత, కీస, కుమ్మకు, కుశాలు, కుసి(-షి), కూ(ఖూ)నీ, కైపు(-వు), కోడిగ (కోడీ), ఖద్ది, గప్పాలు, గమ్మతు, గడ్డీ, కేవు, కేవరి, కొలా(ల్లా)రుబండి, కొల్లాబండి,గాడీ. పాలకీ(కి), పల్లకీ(కి),నాలికి,తండా(ండే)లు, అమారు, ముజరా, బయావారి, పచారి, నమూనా, కిఫాయతు(తీ), కొరదా, గరుజే, గలబ(బా), గల్బా, కా(ఖ) యిలా, మోతాదు, మస్తు, మజా, భారి, బోళా, బేవారసు, బేలాయఖు, బేపరవా, బేమురమ్మతు, బేడాలు, బేజరూరు, బూలి, బాబతు బహాదరు, బరాబరి, బడ, ఫలానా, ఫక్తు, ఫామేదా, పూరా, పాళా, పసందు, పరాయి, పక్కా, నికరము; నామకా, నాముకా, నాదారు, నాజూకు, దుబారా, దుత్తాయి, దరోబస్తు, దరిమిలా, తాజా, తరఫ, తయారు, తమాషు, తతేమ్మా, జగా, అవ్వల్, అలాయిదా, ఆఖరు, ఆదుర్దా, ఉజాను, ఎకాయకీ, కంగాళీ, కచ్చా, కిటుదు, కోరా(బంగారు), గయా(య్యా)ళము, గయా(య్యా)ళి, గయాళు, ఆనాదు, అ(హ)మేషా.

మలాక, మణిశిల, బొక్కసా, బాబు, బస్తా, బంగి, పొట్లము, పొత్తర, పాళీ, పరంగీ, పట్టునారాయి, దట్టా, తోపరా, తుపాను, తస్స, కితాబు, కొరడా, చబుకు, గత్తర, గరీబు, గరాజు, మొహరా, పంపిణి, బజాయి, నాలాయఖు, -నామా (ఒక ప్రత్యయము), నామర్దా, ముక్తాయింపు, బరాబరిక, బజాఊ (మాట), (దు)స్సలహా, పోచి, కమ్మరుబొందు, నకిషీ, నుర్దతు, అరకు(ఖు), అభిని, మర్బిణి, పారా, మస్తకి, పిస్తా, ఓకు, మొలా(ల్లా)ము, మజూరి, ఖరా, ఖర్చు, ఖాయము, ఖాముఖా, ఖాయిలా, ఖాలీ(ళీ), ఖాసా, ఖుద్దు (న), ఖులాసా, ఖుల్లను, గాటు, గాబరా, గుండీ గుజస్తా, గుజాంతు, గుడారు, గుడుగుడు, గుమాను, గాలి (=నింద), గావు, గెల్లి, గొహరు, గోహరి, గోదు (-ందు), గోలీ, గోలు, గో(ఘో)షా, ఘాటు, చాందీ, చిందువ, చిడుగుడు, చిత్తు, చిముగా, చిరాకు, చిల్లర, చీకాకు, చౌడా, చెకుముకి, చోకీ. చందా, చంమగు, చక్కీ, చక్కీ (పంచదార), చాడి(డీ), చుక్కాను, చౌకీ, చౌకు, జబరు (దస్తీ), జాగా, జాడీ, జాయా, జాతి (చేయు), జాస్తి, జూటా, జేరు, బందు, జేంజో, జట్టు, జమ(-మా), జరతి, జలతారు, జరూరు, జవాబు (దారీ), జాగా, జాటీ, జోరా, జాడి (డీ), జాలు(ళు)వా, జావళి (ళీ), జాళువా, జాళ్వా, జులుము, జూటు, జ(జో) హారు(వు), జోరావరి, టస్సా, టాటోటు, టీకము, టీకా, టీకు, టూకీ, టోకు, టోలా, తవతవ, తికానా;

డబ్బా, డబ్బీ, డవలి, డల్లి, డాగు, డోలి, డోరములు (డోరాలు, డోరియా), డోలి, ధక్కాముక్కీ, యకాయకీ, యాదాస్తు, రకము, రద్ది, రద్దు, రమ (మా)రమి, రవాణా(నా), రస్తు, రివాజు, రోకు, లకోటా, లగాయితు, లత్తు, లద్ది, లాచారు, లాటీ, లాత(తా)ము, లాయఖు, లాయిలాసా, లాలూచి, లాహిరి (-మోదము), లుగ్సాను, లుచ్ఛా, లూటి(టీ), లేవిడి, లేవుడి, లోపాయకారి, (లో, వెలి) సబురు, వగైరా, వజ్జ, వట్టము, వాకబు, వాజిబీ, వాపసు, వార, వాఖు, విలాతి, సురమాయి, సురుమా, సుస్తి, సూరెపాను, సెబాసు, సోబతు, సోళాదొప్పి, హంగామా, హక్కుస్సు, హాజరతు, హద్దు, సరిహద్దు, హమాంబాపతు, హమేషా, హమేశత్తు, హల్కా, హవాలా, హాజరు, హాయి, హాలుసాలు, హిజారు, హిజరి, హుమా(యి), హుసారు, హేమాహేమీ, హేశామి, హైరాను, షరువు, షోకు, సందుకా, సగటును మారు, సగులు, సజావు, సదరు, సదరహీ, సబబు, సబురు, సముతు, సరంజాం, సరఫరా, సరాసరి, సరుదు, సరేను, సలహా, సలాము, సలీసు, సవాయి, సవారి, సవాలు, సహారువు, సాఫు, సామాను, సారాసా, సార్లా, సాలామిశ్రి, సాలు, సాహో, సికస్తు, సికా, సిఫారసు, సిలాజిత్తు, సివాయి, సివారు, సీసా, సుమారు.

### వ్యాపారము, వర్తకము మొదలయినవి.

ఖోణి, బేరీజు, బీమా, బరాతిము, బయానా, బడులు, బ(బా) జాఖు, బకాయ, బాకీ, ఫాయిదా, ఫురోణి, పద్దు, పట్టీ, పచారి, నిరకు, నమూ(మో)దు, నఫా, నగదు, నకలు, ఫిరాసత్తు, దుకాణము, దివాలా, దినుసు(స్సు), తాకట్టు, తరాను(-జు), త్రాసు, తెఖా, ఉయివా, అనామతు, అడితి, అడిసాటా, అసలు, ఫాయిదా, ఆదా, ఆయ(హా)కము, ఆస్తి, ఆసిందా, ఛిట్టా, ఆవర్జా, ఇజాఫా, ఇస్తువు, కాటా, కా(ఖా)తా, కిరానా, కిమ్మతు, కిరాయి, కిల్లాకు, కోపుదారుడు, అగావు, గంజు, ఖరీదు, గిరాక, గుజ(జ)రీ(రి), (చే)బదులు, చౌక, జట్టి, రవేను, రసీదు, రాయితి, రుసుము, లావాదేవి, వట్టము, సౌదాగరు, హుండీ, సరకు, సాట(-టా), సాటాకోటి, సావు(కారు).

### ఆభరణములు.

నత్తు, బేసరి, బులాకి, బెరిక, బాహుపురి, బిం, బావిలీ, బాజుబందు, బరుజు, పోచీ, పేరోజము, (Feroz diamond), పేట, పల్లాడి(-ణి), పాటీలు, పాణసి, పాణి, పా(०)జేబులు, తోడా, తురా(యి), అడుడు(-డా), కత్తెర బావిలీ, కమ్మరు, అపరంజి, జంటి(టీ), కమ్మగు, గుమ్మటీలు, (చెంప)కిల్లీ, చౌకట్లు, జిగిని, జావాహిరి, జమికీలు, రవ(వజ్రము), రివాయి, రాకి(గి)డి, వంకీ, సరిపణి(-పెణ).

మైపూతలు, శిరోలంకారము మొదలయినవి.

పింపిణీ, పారాణి, గిర(దా)జా.

వ్రాఁత.

కలము, కాగి(యి)త(ద)ము, సిరా, మేజా, - ఖత్తు, బాలబందు, దస్తూరి, దస్కతు, తాజాకలం, దస్తావేజు, నిసిందా, నిశానుదారు, చిరునామ, చీటి, జాబు, రుక్క, షరా, ఖరాఖత్తు.

కాలితొడుగు.

పైజామా, పాపోసు, ముచ్చె.

రాజులు, రాచనగరు.

మహలు, బురుజు, ఖిల్లా, దర్వాజా, పాదుసా(హి), పడాల, నజేరు, నజరానా, నకీబు, దేవిడీ, దర్బారు, దవంత్రి, కొజ్జా, అ(హ)జారము, తఖ్తు, తిరస్తు, జాగీరు, జమీ(ను), జమీన్(-దారు - దారీ), వజీ(జ్జీ)రు(ఁడు), వజీరుఁడు, సురతాణి, సుల్తాను, హజరతు, హజారము, హజురు, హవేలీ, హాజారము, హుకుం, హుజూరు, హేజీబు, సరదారు, సిక్కా(యుంగరము), సుబా, సుబేదారు.

నాణెములు, కొలఁతలు, కాలము, దూరము, సంఖ్యావాచకములు మొదలయినవి.

బారా, పుంజ, పావు, పావులా, పల్లా, నవటాకు, దాళా, దమ్మిడి, త్రాసు, తులము, తాకు, అడ, అడ్డ, సోల, తవ్వ, అణా; కంటలము, కంట్లము, కురుజీ, గజము, గడ్డగ, రూపాయి(య), బేడ, పాతిక, పరక, సీసము, కాని, ఏగాని, డబ్బు, పీసె, మణుగు, బారువ, సేరు, సవాసేరు, పలము, ఏబులము, ఘడియము, క్రోసు, ఖండి, చవిలె, టోలి, డోకడా, రాస్తా, కొక్కము, రోజు, నరహా, వరా, పస్కాని, సాలు, సాలీయానా, సురకాని.

భోగద్రవ్యములు.

బుక్కా(ము), ఊదువత్తి, అత్తరు.

వాద్యములు.

బాజా, బజంత్రీ, బాకా, సన్నాయి, డోలు, నౌబతు, ఢంకా, నగారా, తమును, అల్గోజా, అంజేసు, డంగురము, డక్క, డక్కి, డమాయి, డమారము, దవిణ, డోలు, దుంద, సన్నాయి, సారంగి.

### దేశములు, దేశభాగములు.

మక్కా, మాగాని, బస్తీ, బనారసు, బంకోలు, ఫిర్కా, పరగణా, తాలుకా, జిల్లా, కసుబా, కురాసాని, ఉరుమంజి, మరాటము, ఫా(పా)రసి, ఆరెము, హుురుముంజి, హుర్ముంజి, హురుమత్తు, పహరు, సిరాజి.

### మతసంబంధమైనవి.

మొహరము, మహంతు, మసీదు, ఫకీరు, పీర్లు, నమాజు, కాజి, గుమ్మటము, సరిగస్తు, సున్నతి.

### పురుషులు, స్త్రీలు.

మహాల్సి, మాష్టీడు, ములక, మరాటి, మందుభాయి, బోయీ, బూబు, బుక్కాఫకీరు, బిబ్బీ, బికారి, బికాసి, బాలాకి, బాతిని, బాతాఖాని, బాంది, బళాయి, బడాయిఖోరు, బజోటి, బకాలు, బంజారి, పింజారి, పోకిరి, పేచీఖోరు, పరాసుడు, పరంగి, నవుకరు, ధగిడీ, చినాలి, దులాబి, దగల్బాజీ, ఖామందు, గాజీ, గుండా, లాకురు, లమ్డు(-డీ), లాపతా, లబ్బీ, లమిడి, సైతాను, సాతాను, హరబ్బి, హాకీము, సాయిల, సాహేబు, సిద్ది, సుకారి.

### రంగులు.

మసరు, ఊదా, తోపు, జాఫరా, సఫేదు.

### యుద్ధము, ఆయుధములు, మొదలయినవి.

ఫౌజు, ఫౌజుదారు, బావుటా, బాణా, నగారా, దేవిడీ, దుముదారు, కవాతు, మచ్చు(కత్తి). మొహరా, బాకు, ఫరంగీ (-రిగి), పహరా, నేజా(-జ), నరాజి, దావరడంగి, జబుకజంగి, డంచన, తోపు, తేగా(కత్తి), తుపకి, తంగువాలు, ఉగాప్పు, ఘాటు(గుండు), కిరాచమారి, కైజాలు, చాకు, ఖంజా, గుమితి, గుమ్మిలి, జానకి, గాజోపరుంజు, చిక(క్క)సారి, చిలుకత్తు, జ(జె)ండా, జి(జీ)రా, జేవ్రాలుగండ్లు, జేజాయి, జేన,టక్కీయాసు, టెక్కెము, టెక్కెయము, టెక్కెము, డ(డ)వీణ, డాలువాలు, డాలు, డేరా, రాణువ, ని(రా)వుతు(త్తు), రౌతు, రావు(హు)తు(త్తు), రావుతుత్తుడు, లకోరి, లేజ(జా), లడాయి, లష్కరు, హాంసాయి, సన్ని(స్నీ), సబిసి, సరాతి, సిఫాయి, సురకోలి.

### మందుగుండు వినోదము.

మతాబు, బాణసంచా, పటాకి, టపాకాయ, హవాయి.

హిందుస్థానీ తెనుఁగుభాషలకుఁ గల సంబంధము పైయుదాహరణముల వలన నెంతదగ్గఱయయ్యెనో తెలిసికొనవచ్చును. ఈ సంబంధము ప్రత్యయముల నెరవు దెచ్చికొనుటయందును బ్రతిఫలించినది. ఈ క్రింది హిందూస్థానీ ప్రత్యయములు తెనుఁగుమాటలతోఁ గలిసి వ్యవహారమున కెక్కినవి.

(1) ఖత్తు: జీలుగు ఖత్తు.

(2) బాజ్: నవ్వులబాజీ, చెప్పుదెబ్బలబాజీ.

(3) వార్: పేరువారీగా, పిన్నపెద్దలవారీగా; మాసవారీ, నెలవారీ, దినవారీ.

(4) సరి: లగ్గసరి, దినసరి, నెలసరి.

(5) గిరి: అయ్యవారుగిరి, (ఇంగ్లీషుమాటతో) మేస్టరుగిరీ.

(6) దార్*: వ్యవసాయదారు.

(7) ఖోర్: కయ్యాలకోరు, నవ్వులకోరు, మాటలకోరు, తగవుగోరి.

(8) ఆయతీ: నిజాయతీ.

(9) గొట్టు < ఖోర్: చాడీగొట్టు, పిసినిగొట్టు.

(10) నామా: ఇంగ్లీషుమాటతో: - ఫయిలునామా.

* 'దార్' ప్రత్యయము 'ధృ' ధాతుభవమనుకొని తెనుఁగువారు దానిపై 'డుజ్'ను జేర్చుచున్నారు:

తహస్సీలుదారుఁడు, కోఁపుదారుఁడు, తహసీలుదారుఁడు, జామీను దారుఁడు. ఇట్లే కొన్ని హిందూస్థానీపదములపై డుజ్ప్రత్యయము చేరుచున్నది: పటేలుఁడు. ఈ పదమును కవులు 'పట్రీఁడు'గఁగూడ మార్చినారు.

కొన్నియెడల హిందూస్థానీ యుపసర్గములు తెనుఁగుపదములతోఁ జేరి వర్తించుచున్నవి: బేమర్యాద.

కొన్నియెడల హిందూస్థానీపదములు సంస్కృతోపసర్గములతోడను, పదములతోడను, ప్రత్యయములతోడను సమసించుచున్నవి: దుస్సలహా, సర్వదుంబాలా, వాసస్థాను, మహమ్మదీయులు.

కొన్నియెడల తెనుఁగుపదములతోఁ గూడి హిందూస్థానీపదములు సమాసములగుచున్నవి. చే-తిముకు, చే-జదులు, లో-సబురు, వెలి-సబురు, లో-పాయిషీ, ఉల్-ఫరాము, టాలాటోలితనము.

ఇంద్రుఁడుకూడ తురకవేషముతో 'బాబారాతు' అయినాఁడు.

హిందూస్థానీపదము లీరీతిగా తెనుఁగునఁ గొన్ని జీర్ణించికొనిపోయినవి. కొన్ని సగము జీర్ణించినవి. ఈ మాట విశేష్య, విశేషణ, అవ్యయ, సంఖ్యా వాచకశబ్దముల విషయముననే కాక క్రియాధాతువులకును వర్తించును. 'ఉంచించు' మొదలగు ధాతువుల యించుక్కు తెనుఁగుధాతువులవలెనేయుండి వానినుండి వేర్పాటుచేయ వీలులేకున్నది. 'తుటారించు' మొదలగువాని

కించుక్కు చేరినను వానిని హిందూస్థానీధాతువులుగఁ బోల్చుకొనవచ్చును. కాని, హిందూస్థానీనుండి యేర్పడిన ధాతువులు చాలవఱకు 'ఆయించు' అను నంతము గలిగియుండుటచే వానిని గుర్తింప వీలగుచుండును: ఉదా. అంజాయించు, చెలాయించు, మిలాయించు, టలాయించు, బనాయించు, బిడాయించు, ఫిరాయించు, ఫుసలాయించు, పస్తాయించు, రంగాయించు మొదలయినవి.

ఇంచుక్కు చేరనప్పు డితరాన్యదేశ్యములందువలె 'పడు, పెట్టు, చేయు' మొదలగు సహాయకధాతువులు చేరుచుండును: తంటాలుపడు, తంటాలుపెట్టు, సార్లాచేయు, బదిలీఅగు మొదలయినవి.

తెనుఁగుకవులకు అరబీ, తురుష్క, ఫారసీ, హిందూస్థానీ భాషాపదములను బ్రయోగించుట చాల నిష్టముగా నుండెను. ఆయా పదముల నెక్కువగ నుపయోగించినకొలఁదిని తమకవిత్వమునకు మెఱుఁగులు హెచ్చుచుండినట్లే వారు భావించిరి. గ్రంథములనుండి కొన్నియుదాహరణములను మాత్ర మిచ్చి యీ ప్రకరణమును ముగింపవలసియున్నది.

"మిహిపసిండి పరుంజు మొహదా కెలంకుల గావు గుజ్జరినన్నె కేవడంబు" - మను. IV; "రాణనొప్పారు పై రాణంబు సింగిణి తళుకు లకోరీల తరకసంబు" - మను. IV; అంచన (మను. V. 58); అరాబు (పాంచా. పరి. II. పు. 11); అలకన. విణ (పాండు. V. 31); ఆసివారు (మను. I. 11); ఈనాము (వరాహ. IV. 158); ఉలుపా (కళా. VI. 131); ఎకరాలు (మను. I. 40); కటారి (తొండమాన్. పు. 315); కాగిదమ్ములు (కృష్ణగా. II. 111); కడాని (పాంచా. పరి. I. పు. 1), కుల్లాయి (శ్రీనా. వీథి; పాంచా. పరి. I. పు. 8); కొజ్జా (భోజరా. IV. 319); ఖజానా (రంగారా. I. 141); ఖజ్జము (శకుం. పరి. II. పు. 43); ఖండా (కృష్ణరా III. 92, పాంచా. పరి. I. పు. 7); ఖరదాబాదా (రంగారా. I. 141); ఖుసి (హరవి. పీఠి. 22); గాగర (మను. VI. 31); గిముకాకరకులు (కవిక. III. 195); ఓసి గులామ (నా. పంచ. I. 19); జమీందారుల్ (రంగారా. I. 141); జెండా (హిం. ఝూండా; జడ - జెడ?); టొప్పి (ఉ. హరి. IV. 166); తాణము (పాండు. I. 109); తెసిలీనూలు (కళా. II. 15); తరటు చేసినట (పాండు. I. 163); తివాసి (పాంచా. పరి. I. పు. 1); తుఖ్ఖారము (మను. IV. 115); తుఖ్ఖారంపుతేజి (కళా); తురికీ (పాండు. I. 163); తేజులు (విక్ర. I. 99); దసలీ (కవిక. III. 195); దివాణము (పాండు. I. 109). దివాణానకు (రంగారా. I. 141); దస్తు (రంగారా. I. 141); దినుస్సు (కళా. IV. 80); దివాణము (హరవి. IV. 9); నకీబులు (మను. V. 42; దశావ;

IX. 112); పంజులు (మను. V. 44. పాంచా. పరి. II. పు. 13); పటాని (పాంచా. పరి. I. పు. 1; III. పు. 26); పోటి (భీమ. II. 88); పౌఁజు (వరాహ. XI. 102; తొండమాన్. పు. 312. మను. V. 44); బతినీ (కవిక. III. 195); బదుల్ (ఉ.రా. పు. 43); బసలకు (చెన్న.బ. పు. 107); బుక్కాము (మను. V. 100); బురుడా (యయా. పు. 74); బురుసాకుల్లాయలు (పాంచా. పరి. III. పు. 25); మండువాలు (మను. I. 40); మస్తేనుఁగు (పాంచా. పరి. IV. పు. 44); మాస్టీఁడు (రామాభ్యు. VI. పు. 124. VII. పు. 169); మురాయించెన్ (హరవి. III. 89); రుమాలు (వు) (పాంచా. పరి. I. పు. 7); లాలసరి (మను. IV. 115); లూటి (రామాభ్యు. VII. పు. 132); వజీరు. పాంచా. పరి. III. పు. 25); వేలము (శకుం పరి. II. పు. 45); సకలాతు (కవిక. III. 195); సరకారు (రంగారా. I. 141); సామాన్లు (హరవి. పీఠి. 27); సురకాని (పాండు. IV. 136.); సురధాణ (హరవి. పీఠి 22); సొన్నాటంకము (విక్ర. VI. 101. VIII. 50); స్వారి (ఉ. రా. I. పు. 16); హసాదు ఉ. రా. పు. 33); హురుముంజి (పాంచా. పరి. II. పు. 12) మొదలయినవి.

సీ. జతనంబుతోఁ దేటి సంచిణీ హసము భి
స్తీ దుముదారుగా నిగుడి నడువఁ
గలువలదొర చల్లగాలి వజీసులు
పూని రాస్తాను చపాను గొలువఁ
బెంపుమీఱు వసంత పేషువాహుజూరును
నుంచి చలానణి హాంశకుదెలుప,
నెమ్మికోవిల నిశానీ డోలగములు క
ర్నాచీడమారముల్ నాడుసేయ
సరణికావాలు రంగు జుల్బొపుటములు
రహిగ నటియించు చిలుక హిరాకి నెక్కి
కెంజిగురు సైపు కేలనంకించు కొనుచు
మదనుపాదుసహా దండువెడలె నపుడు. (దశా. పుట 19.)

క. భాయీ యిదె యొకనుడిలో, మా యనిపించెదను చూడు (ప్రబం. పుట. 49.)

చ. అక్కటా యని కుందు వెంగలిని గావుము నీకు సలాము చేసెదన్. (పార్వతీ. పుట. 80.)

## ఇంగ్లీషు.

హిందూస్థానీభాష తరువాతఁ దెనుఁగుపై నెక్కువ ప్రభావము గలిగిన యన్యదేశభాష యింగ్లీషు. తెనుఁగునఁ జేరిన యింగ్లీషుపదముల సంఖ్యనుగాని, వాని లక్షణమునుగాని నిర్ణయించుట కింకను సాధ్యముకాదు. క్షణక్షణమును క్రొత్తయింగ్లీషు పదములు తెనుఁగు నడ్డరాని ప్రవాహవేగమునఁ జేరుచున్నవి. ఇంగ్లీషుమాట లనినఁ గంటగించుకొను పండితులుగూడ వాని నుపయోగించి, తీరవలసి వచ్చుచున్నది. ఎంతయిష్టము లేకున్నను వారు, 'రైల్లో' ప్రయాణము చేయవలెను. 'మోటారుబస్సు' లెక్కవలెను, 'స్టేషనుకు'పోయి 'టిక్కట్లు' కొని, 'లగ్గేజి' తూపించి. 'బ్రేకు'లో వేయించి, 'తర్డుక్లాసు' 'కంపార్టుమెంటు'లో 'మెయిలు' లోనో 'ప్యాసెంజరు' లోనో పోవలెను. 'స్కూల్లో'కుఁ బిల్లలను పంపి 'నోటుబుక్కు'లు, 'పేనా'లు, 'పెన్సిళ్లు', 'రబ్బరు' మొదలగునవి కొనవలెను. కోర్టుకుపోయి లాయర్లకు ఫీజలిచ్చి, సమనుల నందుకొని, [illegible] వాటిని ఎగ్జిక్యూషను చేయించవలెను నేరము చేసినఁ బోలీసువారి యధీనమున నుండవలెను. పోస్టాఫీసునకుఁబోయి, స్టాంపులు, కార్డులు, కవర్లు కొని, వానిపై వ్రాసి పోస్టుచేయవలెను. మనియార్డర్లు పుచ్చుకొనవలెను [illegible] తప్పదు. ఇంటిలో లాంపులలో కిరసనాయిలు పోసి. [illegible] గ్రామఫోనులు వినవలెను; సర్కస్సులు చూడవలెను, సినిమాలకు పోవలెను. ఈ రీతిగా నెంతటి పూర్వాచారపరాయణుఁడైనను క్రొత్త వస్తువుల ప్రయోగమునకును, క్రొత్త భావముల యొత్తిడికిని నలవా[illegible] లేకున్నది. ఈ యాంగ్లభాషాప్రవాహము తెనుఁగు సీమలో నెప్పుడు నిలుచునో యెక్కడ నిలుచునో చెప్ప సాధ్యము కాదు.

ఈ ప్రవాహము నరికట్టుటకును క్రొత్తవస్తువులకుఁ [illegible] మాతృభాష ననుసరించి పేళ్ల నేర్పాటు చేయుటకును నేఁ ప్రయత్నములు జరిగినవి, జరుగుచున్నవి. వీనిలోఁ గొన్ని ఫలకారులైనవి; కొన్ని కాలేదు. 'కలెక్టరు' కు 'మండలకరగ్రాహి'యనియు 'మేజిస్ట్రేటు' నకుఁ '[illegible]' [illegible] సూపరింటెండెంటుకు [illegible] యనియు, [illegible] శకటమనియు, పోస్టాఫీసునకు [illegible] ప్రేషణాలయ మనియు, [illegible] నకుఁ దంత్రీవార్తాప్రేషణాలయమనియు, బైసికిలునకు [illegible] నియు, నిట్లుపేళ్ల నేర్పఱిచిరిగాని [illegible] పాత్రములు గాలేదు. కొన్నిపదములు - పొగబండి, [illegible], ఉపాధ్యక్షుఁడు, కార్యదర్శి, పత్రికా సంపాదకుఁడు, ఉపసంపాదకుఁడు, [illegible] గాలి, ప్రాణవాయువు మొదలగునవి నిలిచినవి. కాని, మనమెంతయడ్డు కట్టినను నింగ్లీషుపదములు తెనుఁగువారి వ్యవహారమున కెక్కకమానవు. బహు

లలోను, కళాశాలలలోను గొంతవఱకుఁ బండితులును నితరులును నింగ్లీషుపదముల ప్రవేశమును నిరోధింప నెంత ప్రయత్నించినను, నవి భాషయందు ప్రవేశించుట కితరమార్గములు లేకపోలేదు. అవి యాయితరమార్గములఁ బ్రవేశించి స్థిరపడిన పిమ్మట నేదియో గొప్ప విప్లవము ఇంగ్లీషంతటి బలముకలది, కలిగినఁగాని యాప్రవాహమాగదు. అప్పుడయినను నాయావస్తువులును భావములును దేశమునందంతరించినఁ దప్ప నాపదములును భాషనుండి తొలఁగవు. ఆంధ్రదినపత్రికను జూచినచో నీయాంగ్లప్రభావ మెంతవఱకు వ్యాపించినదో తెలియఁగలదు. ఈ దినమున (23. 6. 1933) వెలువడిన యాంధ్రపత్రికనుండి యీక్రింది పదము లుద్ధృతములు:—

అంకుశకో; అండు కంపెనీ; అండ్ సన్సు; అక్టోబరు, అడిషనలు (జిల్లా) మేజస్ట్రేటు; అడ్వాన్సు; అడ్వకేటు; అపీలు, అప్ కంట్రీను, అయిటములు, ఆరస్టు (చేయఁబడిరి), అసోసియేటెడ్ ప్రెస్, ఆంటీ ఎమాల్గిమేషన్ సొసైటీ, ఆంటి డంపింగుబిల్లు, ఆగస్టు, ఆఫీసు, ఆయిల్ క్యాన్, ఆర్డరు(లు), ఆర్డినరి, ఆస్ట్రోహంగేరియను, ఆస్పత్రి, ఇంజను, ఇండియా గవర్నమెంటు, ఇండియన్ ట్రాన్సుకాంటినెంటల్ - ఏర్వేసు; ఇంపీరియల్-ఏర్వేసు, ఇంపీరియల్ బ్యాంకు(నకి), ఇన్ఫీరియర్, ఇన్స్యూరెన్సు, ఇర్రిగేషను చీఫ్ఇంజనీరు, ఇమిటేషన్ డైమండ్, ఈస్టుఇండియాకాటన్ అసోసియేషన్, ఈస్టుఇండియా ఫిలింకంపెనీ, ఎండోమెంటుబోర్డు, ఎకరములు, ఎక్సుప్రెసు, ఎగ్జాస్టుపైపు, ఎక్సుపెల్లర్, ఎక్స్ప్రెస్, ఎగ్జిబిషన్, ఎలవెన్సు, ఎలెక్ట్రల్ కాలేజి, ఎస్టాబ్లిష్మెంటులు, ఎస్టిమేటు, ఎస్టేటు అడ్వైజరీకౌన్సిలు, ఏజంటు, ఏజెంట్లు, ఏజెన్సీ, ఏప్రిల్, ఏప్రియల్, ఏప్రెలు, ఏర్మోయిలు (బళ్లు), ఏర్వేసు, ఎలక్షను, ఏసిలోక్ బాడీసు, ఐరన్, ఐరన్అండ్ స్టీల్, ఓవర్సీరు, (అర) ఔన్సు, ఔన్సులు, కంట్రాక్టు, కన్ట్రిబ్యూషను, కమిటీ, కమిటీమెంబర్లు, కమిషనరు, (సైమను) కమిషను, కన్వెన్షనులోను, కరెన్సీ, కన్సర్వేటివు - యూనియన్, కన్సర్వేటీవు; కలెక్టరు, కవరు, కాంగ్రెసు, కాన్సోల్సు, కాపీ, కాఫీ, కామన్సు (సభ), కార్పొరేషను రేడియో, కార్డులు, కార్బాలిక్ (ద్రావకము), కాలేజి, కెనాలు, కెమికల్వర్క్సు, కేటలాగు, కేసులు, కోర్టు, కౌన్సిలరు, క్యాంపు, క్యాంపు కాటు, క్యాటలాగు, క్లాసు (పరీక్ష), క్రైస్తవట్రేడ్ - యూనియనులు, క్రైస్తవ మిషనరీ, క్రానుటాకీసు, క్లబ్బు, క్లిప్సు, క్లెయిములు, గనేరియా మిక్శ్చర్, గనోరియా, గనోరియాస్పెసిఫిక్, గవర్నమెంటు, గవర్నరు (పేట), గారంటీ, గిల్టుయెడ్జి సెక్యూరిటీలు, గ్యారంటీ, గోలు (హాకీ), గ్రాంటులు, గ్రాఫ్ఫోటో, గ్రేట్ఇండియన్ - (జ్యోతిషాలయము), గ్లాసోను; చర్చి, (విద్యుచ్ఛక్తి) చీఫ్ఇంజనీరు, చీఫ్సూపరింటెండెంటు, చైర్మను, ఛార్జి, (లాటీ)

ఛార్జి, జడ్జి, జడ్జీలు, జనరల్ అస్యూరెన్సు సొసైటీ లిమిటెడ్, జనరల్ (ముత్తయ్యా మొదలివీధి), జనవరి, జపాను, జర్మను, జస్టిస్‌పార్టీ, జామెట్రికల్ డ్రాయింగు, జాయింటు కమిటీ, జాయింటు పార్లమెంటరీ - కమిటీ, జాయింటుస్టాకు ఇన్‌స్యూరెన్సు కంపెనీ, జూన్, జులై, జెర్మన్, (అనధికార) జెయిలు విజిటరు, జ్యూయెలరి, టన్ను, (తెలుగు) టాకీ, (తెలుగు) టాకీ (చిత్రము), టాకీ (ప్రదర్శనము), టాకీ (భవనము), టాకీలు, టాకీఫిల్ము, టికెట్టు ఛార్జీలు, టీపార్టీ, టూత్‌పేస్టు, టెంపరరీ, టెలిఫోన్, టెల్లిగ్రాం (సాంకేతికములు), టైము, టోలుగేటు, టౌను, టౌనుహాలు, ట్రస్టీ, ట్రస్టు, ట్రాం, ట్రాన్సు ఇండియన్ ఏర్మెయిలు సర్వీసు, ట్రాన్సుఫరు (చేయుట), ట్రెజరీబాండ్లు, డాక్టరు, డాలర్సు, డిగ్రీలు, డిజైనింగు, డిటో, డిపాజిట్టు, డిపో, డిప్యుటేషను, డిఫర్డు, డిమాండు, డివిజను, డిశంబరు, డిసంబరు, డిస్కవుంటు, డెటిన్యూ, డెల్టా, డైరెక్టర్లు, డైహార్డులు, డోలరు, డ్రా (మాచి), డ్రైవింగుపుల్లి. థియేటరు, తేగీ, తే(యాకు), థియేటర్సు, ది సౌత్ ఇండియన్ కోఆపరేటివ్ - ఇన్సూరెన్సు సొసైటీ లిమిటెడ్, నవంబరు, నిల్ (nil), నెంబరు, నేషనల్‌సిటీ బ్యాంకు, నోటరీ, నోటీసు, న్యూ ఇండియా యిన్సూరెన్సు, పంపు, పబ్లికువర్క్సు, పబ్లికువర్క్సు ఎస్టాబ్లిషుమెంటు కమిటీ, పబ్లిక్ హెల్తు (శాఖ), పర్మెనెంటు సెటిల్‌మెంటు, పవర్ ఆఫ్ అటర్నీ, పవున్సు, పాప్లీను, పార్టీ (లు), పార్టునరుషిప్‌కోర్టు, పార్లమెంటు, పాలిసీలు, (యావజ్జీవ) పాలిసీలు, పాస్టుప్యాసింజరు, పిన్సు, పిల్గ్రిం ప్రొటెక్షన్ ఎండోమెంటు కమిటీ, పెయింటింగు, పేజీ, పేపరు, పైరోరియా, పొటాసియం సయనైడు, పోస్టుట్రస్టు, పోలీసులు, పోలీసు సర్వీసు, పోస్టు, పోస్టుకార్డు, పోస్టు (ఖర్చులు), పోస్టుబాక్సు, పోస్టేజి, పౌను, పౌనులు, ప్యాకెట్లు, ప్యాసింజరు, ప్యాసు (అయిన), ప్రా[illegible] (= [illegible]చినా[illegible]ములు), (తుంగభద్ర - సంగమేశ్వరం) ప్రాజెక్టులు, ప్రిన్సిపాలు, ప్రిఫరెన్సు, ప్రిఫర్డు, ప్రీమియము, ప్రీరికగ్నైజు (హిందూ) ఎలిమెంటరీ స్కూలు, ప్రెఫర్డు, ప్రెసిడెంటు, ప్రొప్రైటరు, ప్రొఫెసరు, ప్రొక్టరు, ఫండింగులోను, ఫాదరు, ఫాదరు (గుడులు), దరఖాస్తు, ఫారము, (నాలుగవ - మూడవ -) ఫారము, ఫిబ్రవరి, ఫిలుము, ఫిల్ము, ఫీజు, ఫూల్, ఫెడరల్ ఇన్స్పెక్టరు జనరలు, ఫెడరల్ (ప్రభుత్వము), ఫెడరల్ (రాజ్యాంగవిధానము), ఫెడరల్ రిజర్వ్ బ్యాంకు - రేటు, ఫెడరల్ (విధానము), ఫెడరేషను, ఫోటోగ్రాపు (తీయు), (ఫ్రాన్సు, ఫ్రీహేండు అండు మోడెల్ డ్రాయింగు, బడ్జెట్టు, బాండ్లు, బార్ (లాయర్లు), బార్(రు), అసోసియేషన్, బార్కు (= చెట్టుపట్ట), బార్లీ, బిస్కటు, బిషపు, బీట్ (పంచదార), బీరువా, బోనసు, (జిల్లా -, తాలూకా -) బోర్డు,

బోర్డు (మాధ్యమికపాఠశాల), (కేంద్ర) బ్యాంకి, బ్యాంకింగు (వ్యవహారము), బ్యాంకు (= ఒడ్డు), (అంతర్జాతీయ) బ్యాంకు, బ్యాంకులు, (జాతీయ - కేంద్ర) బ్యాంకులు, (సంస్థాపక) బ్యాంకులు, బ్యాటరీ, బ్రిటన్ అండ్ ఇండియా యూనియన్, బ్రిటిషు, బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్, బ్రిటీషు అఫీషియల్ వైరులెసు, బ్రిటిషుసినిమా (పరిశ్రమ), బ్రూస్(పేట), మణిఆర్డరు, మార్కెట్టు, మార్చి, మాస్టరు (బచ్చు), మింటు బార్గోల్డు, మిడిల్ స్కూలు, మిలియను, మిల్లు (గుడ్డలు), మిల్లు(లు), మిషను (Mission), మిస్ (రాజేశ్వరి), మీటింగు మునిసిపలు (సన్మానము), మునిసిపాలిటీ, మెంబర్లు, మెజారిటీ, మెడికలుహాలు, మెయిలు, మెషిన్ (పప్పు), మెషీనరీ, మే, మేజిస్ట్రేటు, (గౌరవ) మేజిస్ట్రేటు, మేనేజరు, మైనరు ఇర్రిగేషను, మైనారిటీ, మోటారు, మ్యునిసిపలు కౌన్సిలుహాలు, మ్యునిసిపల్ కౌన్సిలు ఎలక్షను, మ్యునిసిపల్హాలు, యింజక్షను, యిన్కార్పొరేటు (చేయబడినది), యినస్యూరెన్సు, యూనియను, యూనియన్ జాక్, యెలెక్ట్రిక్, రవుండు, రికార్డు (చేయు), రిజిస్టరు (చేయు), రిజిస్టర్డు (సంఘము), రిటర్న్ టిక్కెట్లు, రిట్రెంచుమెంటు కమిటీ, రిపోర్టు, రిఫరు (చేసిరి), రివరెండు ఫాదరు, రివిన్యూ (పద్ధతి, శాఖ), రిశీవరు, రుష్యా, రెడీ, రెవిన్యూబోర్డు, రెసిడెంటు, రెసిడెన్సీ (బజారు), రేంజర్సు క్లబ్బు (జట్టు), రేట్లు, రేటు, (చౌక) రేట్లు, రేడియో, రేడియో (యంత్రము), రేప్సీడ్, రైలు, రైల్వేకంపెనీ, రైల్వేలైను, రైల్వేస్టేషను, రైళ్లు, రైసు ఫ్యాక్టరి, (బ్రాడిస్) రోడు, రోడ్డు, రోల్డుగోల్డు, లా ఆర్డరులు, లాంగ్క్లాతు, లాండు రెవిన్యూ (పద్ధతి), లీస్టు, (రెండు) లెంగ్తులు (Horse race), లైటుహావుసు,సినిమా, లైట్లు, లైసెన్సు, లోయరు అండు హైయర్ గ్రేడ్సు, వరండా, వాటర్ పైపు, వి. పి., వైస్ ప్రెసిడెంటు, వ్రోట్లు, శాంక్షను, శాండల్ వుడ్ సబ్బు, శెక్రటరీ, షెల్లరు, సబ్ మేజిస్ట్రేటు, సబ్ రిజిస్ట్రారు, సబు డివిజను, సబ్బు, సర్కిలు, (ప్రతి) సర్కిలు, సర్క్యులరు, (వైమానికటపా) సర్వీసు, (వైమానిక) సర్వీసు, సర్వీసు, సవరం (Sovereign), సిటీ, సినిమా (నాటకరంగము - భవనము, - రంగము, - సుందరీమణులు), సినిమాస్టూడియో, సిమెంటు, సిల్కు, సివిలు సర్వీసు, సీనరీలు, సీళ్లు, సూపరింటెండెంటు, సెంట్రల్, సెంట్రలు ఈస్టను డివిజను, సెంట్రలు బ్యాంకులు, సెంట్రలు స్టేషను, సెకండు లైన్ బీచ్, సెక్యూరిటీలు, సెక్షను ( = మండల భాగము), సెటిల్మెంటురేట్లు, సెప్టెంబరు), సెల్ఫు స్టార్టరు, సెల్సు, సెషన్సు (విచారణ), సైంటిఫిక్ (బంగారుగాజులు), సైలెన్సర్, సోడా బైకార్బొనేటు, సోడియం బైకార్బొనేటు, సోల్ఏజెంట్లు, సోషలిస్టు, సౌత్ ఇండియన్ లిబరల్ ఫెడరేషను, స్కీము, స్కూలు, స్కూలుకమిటీ, స్కూలుఫైనలు,

స్క్వాయరు (square), స్క్వేరు, స్టర్లింగు, స్టాండర్డు, (అద్దం) స్టాండు, స్టాంపులు, స్టాక్ (సూరకము), స్టీమ్, స్టీమ్ నావిగేషన్, స్టీమరు (వార్తలు), స్టీల్, స్టేటు (కార్యదర్శి), స్టేటుమెంటు, స్టేషనరీ, స్టేషనులు, స్ట్రీటు, హండ్రెట్ (డ్) వైటు (- వెయిట్), హల్లన్లు, హాకీ (పందెములు, హార్బరు, హార్బరు డెలివరి, హార్సుపవరు, హాలు, హెడ్డాఫీసు, హైఫిడెలిటీ ఫోటోఫోను, హైస్కూల్సు, (ఇతర) హైస్కూల్సు, హోంము డిపార్టుమెంటు, హౌసింగు స్కీము. (467.)

ఆంధ్రదినపత్రిక జీవత్ప్రపంచములోని వార్తల నే దినదినము కాదిగ మాంధ్రదేశమున వ్యాపింపఁజేయుట కేర్పడినది. అది విదేశ శబ్దజాలము నడ్డగించు విషయమున మధ్యమార్గము నవలంబించినదని చెప్పవచ్చును. దాని విలేఖరులును, సంపాదకీయవర్గమును నొకకొంత పాండిత్యముగలవారును, చదువుకొన్న నాగరికులునుగాని సామాన్యులుకారు. ఇట్టి సందర్భమునఁ బండ్రెండుపుటలు మాత్రముగల యొక్కదినపు పత్రికలో, నిగట్టుకొని యింగ్లీషుపదములు దొరలకుండ వ్రాయసంకల్పించిన సంపాదకీయవ్యాసములు, ప్రహసనములు, ఇతరవ్యాసములుఁ జాలవఱకు పత్రికనాక్రమించియుండ, 467 ఇంగ్లీషుపదములందు జొరబడినవని తెలిసికొన్నచోఁ దెనుఁగుపై నాంగ్ల భాషకుఁగలిగిన ప్రభావమును జూచి యాశ్చర్యపడకమానము. ఆంగ్ల పదములు తెనుఁగు సంస్కృతములతో నెట్టి సమాసముల నొందుచున్నవో, యవి యెట్టివికారముల నొందుచున్నవో పై నుదాహరించిన పట్టికవలన బోధపడఁగలదు.

వర్తకవాణిజ్యములు, వాఙ్మయము, ఆధునిక విజ్ఞానశాస్త్రములు, కళలు, రాజకీయములు, చరిత్రము—ఇవి యవి యననేల, సమస్తవిషయములందును నితరప్రపంచముతోడి వ్యవహారమంతయు నింగ్లీషుమూలమున నేఁడు జరుగుచున్నది. పందొమ్మిదవశతాబ్దము నారంభమునుండి, నీశతాబ్దాంతమువఱకును నింగ్లీషువారితోడి వ్యవహారవశమున నీదేశమునకు వచ్చిన వస్తువులపేళ్లును, శాస్త్రసంబంధమగు కొన్ని పేళ్లును, ప్రభుత్వసంబంధములగు కొన్ని పేళ్లును దెనుఁగునఁ జేరినవి. ఇంగ్లీషు విద్య యీ దేశమున వ్యాపించిన, యింగ్లీషునాగరికత, యింగ్లీషు విజ్ఞానములతో సంబంధ మెక్కువయగుకొలఁది నాంగ్లపదజాలమును దెనుఁగున నెక్కువయగుచువచ్చినది. వైజ్ఞానికశబ్దజాలము మాత్ర మంతశీఘ్రముగ జనసామాన్యములోని కెక్కలేదు. జనసామాన్య జీవితముతో సంపర్కముకలిగిన సందర్భములందెల్ల నాంగ్లపదములు తెనుఁగునఁ జేరుచునే యున్నవి. ఈచేరినపదములలోఁ జాలవఱకుఁ దత్సమములుగనే యున్నవి. కాని, భాషలో జీర్ణించికొనిపోయిన తద్భవాంగ్లశబ్దముల సంఖ్యయు, నపరిహార్య వ్యావహారికములగు తత్సమాంగ్ల శబ్దముల సంఖ్యయు నెక్కువగనే

యున్నది. ఇట్టి శబ్దములతోడనే యాంధ్రభాషాచరిత్రమునకుఁ బ్రయోజనము. ఆంగ్లపదములు తెనుఁగునఁజేరి యెట్టిమార్పులనొందినవో యీ క్రింద వివరింపఁబడినది.

ఇంగ్లీషుభాషా లిపికిని దత్తద్వర్ణోచ్చారణమునకును జాల వ్యత్యాసము లున్నవి. ఆ లిపిలో నొకటే వర్ణమున కొక్కటే యుచ్చారణము, నొక్కటే యుచ్చారణమున కొక్కటే యక్షరమును సాధారణముగ లేవు.

a : father, main, gate, assistant, chairman మొదలయినవి.

e : me, her మొదలయినవి.

i : bit, bite మొదలయినవి.

o : oppose, not, note మొదలయినవి.

u: but, hut, tune మొదలయినవి.

c : cat, certain ; g : gem, get ; h : hare, heir.

s : see, has.

q, x : ఈ రెండును kw, ks ల యుచ్చారణమును గలిగియున్నవి.

ఇంగ్లీషున పదములలోని యక్షరములనుబట్టి యుచ్చారణము సాధారణముగ నుండదు. పదములోని స్థానము ననుసరించియు, 'స్వాంత' ననుసరించియు, వ్యుత్పత్తిజ్ఞానము ననుసరించియు, ననేకవిధముల నుచ్చారణము భేదించుచుండును. పుస్తకములను జదివి యింగ్లీషు నేర్చుకొనువా రక్షరముల ననుసరించి యింగ్లీషు పదముల యుచ్చారణమును నేర్చికొనుటయు, నింగ్లీషు స్వభాషగఁ గలవారియొద్ద శిక్షణము లేకుండుటయు, నింగ్లీషువారి యొద్దనేర్చికొన్నవారైనను సరిగ నాయా యుచ్చారణభేదములను గమనింపఁ జాలకుండుటయు, గమనించినను దమవాగింద్రియము లాయా యుచ్చారణములకు లొంగక తెనుఁగువాడుక కనుగుణముగ నాయా యింగ్లీషుధ్వనులు మారుచుండుటయు, నీమొదలగు కారణములచే నింగ్లీషుపదముల యుచ్చారణ మింగ్లీషు నభ్యసించిన తెనుఁగువారినోట ననేక వికారముల నొందుచు వచ్చినది. ఇఁక నింగ్లీషు గ్రంథముల పరిచయములేని సామాన్య జనులకుఁ జేరిన యింగ్లీషుపదముల యుచ్చారణము మాట చెప్పనక్కఱలేదు. అది కేవలము తెనుఁగు నుడికారమునకు లొంగిపోయినది. ఇంగ్లీషుధ్వనులను దెనుఁగక్షరములతోఁ దెలుపుటకు సాధ్యముకాదు. కావున సాధ్యమగునంతవఱకు నాయాధ్వనులను వర్ణించి యవి తెనుఁగునఁ బొందిన యుచ్చారణమును నిరూపింపఁ బ్రయత్నింపవలసి యున్నది. ఈ క్రింది గుఱుతులు 'ఇంటర్నేషనల్ ఫొనెటిక్ అసోసియేషన్' (International Phonetic Association) వా రేర్పాటు చేసినవి.

## అచ్చులు.

(1) ə - ఇది యస్పష్టమై యొకయచ్చు, a, e లు కొన్నిస్థలములలో నీయుచ్చారణముఁ గలిగి యుండును.

(2) ə : పైయచ్చునకు దీర్ఘము.

(3) ʌ - పైయచ్చులవంటిదే. అంతకంటె నెక్కువస్పష్టమైనది. ə, ɔ: లకు ఊఁతకలిగినప్పు డీయుచ్చారణము కలుగును.

(4) a : తెనుఁగు 'ఆ' కు సమానము.

(5) æ - తెనుఁగు చ'ద్ద' న్నము లోని యుచ్చారణము వంటిది.

(6) æ : తెనుఁగు 'తాటాకు' లోని రెండవ 'ఆ'కారోచ్చారణము వంటిది.

(7) ai : తెనుఁగు 'ఐ'కారోచ్చారణము.

(8) au : తెనుఁగు 'ఔ'కారోచ్చారణము, అంతకంటె హ్రస్వము.

(9) i - తెనుఁగు 'ఇ'కారోచ్చారణము.

(10) i : తెనుఁగు 'ఈ'కారోచ్చారణము.

(11) u ,, ఉ ,,

(12) u : ,, ఊ ,,

(13) ɛ : ,, ఏయ్ ,,

(14) ei : ,, ఎయ్ ,,

(15) ɔ : ఓష్ఠ్యమయినను 'ఒ'కారోచ్చారణమందుకంటె నోరు మఱి కొంచెము తెఱచికొనియుండును.

(16) ɔ : పైదానిదీర్ఘము.

(17) oi : తె. ఓయ్

(18) ou : తె. ఒవ్

## హల్లులు.

(1) b (బ్), g (గ్), k (క్); l (ల్), m (మ్), n (న్); f (ఫ్). r (ర్), s (స్), sh (ష్), w (వ్), y (య్) - ఈ ధ్వనులు తెనుఁగునందు వలెనే యించుమించుగ నుండును.

(2) ఈ క్రింది జారుడుధ్వనులు (fricatives) తెనుఁగునలేవు: f, tsh, dz, z, ʒ.

(3) t, d, లు ఇంగ్లీషున నాలుకచివర పండ్లకుదుళ్లను తాకుటవలనఁ గలుగుచున్నవి, తెనుఁగున 'త,ద'లు నాలుకచివర కేవలము పండ్లనే తాకుట వలనఁ గలుగుచున్నవి. తెనుఁగున 'త,ద'లు దంత్యములు. ఇంగ్లీషున దంత మూలీయములు. తెనుఁగున 'ట,డ'లు మూర్ధన్యములు. నాలుకచివర వెనుకకు మడఁగి తాలువు మధ్యభాగమును స్పృశించుటవలన నివి యేర్పడును. తెనుఁగునందలి 'త, ద, ట, డ' లింగ్లీషున లేవు.

(4) v: ఇది తెనుఁగు 'వ' కారముతో సరికాదు. తెనుఁగున వకారము 'ఓష్ఠ్యము'; ఇంగ్లీషున 'v' దంతోష్ఠ్యము; తెనుఁగు 'వ' కారముకంటె నెక్కువ శక్తితో నుచ్చరింపఁబడును.

పై వివరించిన ధ్వనులు తెనుఁగువారి నోటఁబడి యెట్లు వికారము నొందినవో తెలిసికొందము.

ə, ə:—తె. అ - అసిస్టాంటు, అటెండరు, అసెంబ్లీ.

తె. ఆ - అసిస్టాంటు, చైర్మాను.

తె. ఎ - అటెండురు, కంపెనీ.

తె. æ - చేర్మాను.

తె. ఇ - రివిన్యూ.

తె. ఏ - సర్క్యులేటు చెయిర్మేను.

ʌ - తె. అ - సర్క్యులేటు, సర్క్యులరు.

a: - తె. ఆ - లా, విత్డ్రా, లాయరు, హెడ్మాస్టరు, కారు.

తె. ఏ - మేస్టరు.

a e, æ - తే. అ - ఆక్టు, స్టాంపు, స్టాండు, హాటు, కంట్రాక్టు.

తె. ఏ - మేస్త్రీటు, మేజిస్ట్రేటు.

తె. యా - మ్యానేజరు, మ్యారేజ, మ్యాజిస్ట్రేటు.

తె. æ - కారేజి, మారేజ.

ai, - తె. ఐ - వైసురాయి, ప్రైవేటు, టైటిలు, మైలు. లైను, ప్లైను.

తె. అయి - ప్రయివేటు, మయిలు, లయిను.

au. - తె. ఔ - కౌన్సిలు, ఔన్సు, టౌటు, గౌను.

తె. అవు - కవున్సిలు, అవున్సు, టవుటు, గవును.

i. తె - ఇ - క్రిమినలు, సివిలు, కౌన్సిలు.

తె. ఈ - సర్వీసు, లీస్టు, సీసు, మిషనరీ, సెక్రెటరీ, ఇండస్ట్రీ, అఫీసు, అసెంబ్లీ, ఛీపుజస్టీసు, మైనారిటీ, మెజారిటీ, నోటీసు.

తె. ఉయి - వుయిలు.

తె. ఆ - కారేజి. మూరేజి.

తె. ఏ - లగ్గేజి.

తె. అ - మార్కెట్టు.

i - ఆ - మారకాటు,

ఓ - బిస్కోత్తు.

i : ఈ - ఫీజు; టీచరు.

u - ఉ - ఇన్స్యూరెన్సు, ఇష్యూ.

u : ఊ - యూరోపియను, ఇన్స్యూరు, షెడ్యూలు, యూనియను, బూటు.

ε : ఏ - చేర్మాను

ఐ - చైర్మాను.

ఎయి - చెయిర్మాను.

ei : ఐ - రైలు, రైల్వే, చైను.

ఏ - రైల్వే, కేసు, స్టేటుమెంటు, స్లేటు, లేసు, టేబిలు.

ఎయి - చెయిను, వెయిటింగురూము, రెయిలు.

ɔ - ఆ - లాకు, షాపు

ఓ - పోలీసు.

ɔ : ఆ - స్మాల్‌పాజు, ఆర్డరు, ఫారము,

అ - కలరా.

ఓ - రిపోర్టు, స్కాలర్‌షిప్పు.

oi : ఆయి - వైసురాయి, లాపాయింటు, పాయింటు.

ఓయి - బోయిలరు.

ou ఆ - గోదాము.

ఓ - ఫ్లోటు, అపోజు, నో కాన్ఫిడెన్సు.

హల్లులు.

(1) ఇంగ్లీషు పదముల తుదిహల్లులపై సాధారణముగ నుత్తు చేరుచుండును. అట్టియెడల నా హల్లులకుఁ బూర్వమున హ్రస్వాచ్చుండినచో వానికి ద్విత్వము కలుగును; దీర్ఘాచ్చుండినచో ద్విత్వమురాదు.

(2) శబ్దములతుది తాలవ్యహల్లులపై నిత్తు చేరును. ఉదా. బెంచి, విలేజి, మేరేజి, కాలేజి జడ్జి, చార్జి మొదలయినవి. ఇట్లు చేరిన యిత్తునకు బహువచనమున దీర్ఘము కలుగును; ఇత్తు ఉత్తుగ మాఱదు: బెంచీలు, విలేజీలు, కాలేజీలు, చార్జీలు.

(3) క, గ, న, ప, బ, మ, య, ర, ల, స, ష - ల యుచ్చారణము సాధారణముగఁ దెనుఁగున మాఱదు.

(4) ఇంగ్లీషున పదాదిని రేఫము స్పష్టోచ్చారణము గలిగియుండును; పద్యాంతమునం దస్పష్టాచ్చుగ మాఱును. పదమధ్యమందు రెండచ్చుల నడుమనున్నచో వినఁబడును, లేకున్న లోపించును. తెనుఁగున స్థానవివక్ష లేక రేఫ మన్నిచోట్లను స్పష్టముగ నిలుచును.

(5) ఇంగ్లీషునందలి thin వంటి పదములలోని th కారము 'త' గను, then వంటి పదములలోని th కారము 'ద' గను, t - కారము 'ట' గను, 'd' - కారము 'డ' గను, v - కారము 'వ' గను తెనుఁగున మాఱును.

(6) హకారమునకు తెనుఁగునందువలె నంత స్పష్టోచ్చారణము లేదు. అది యొకప్పుడు తెనుఁగున లోపించుటయుఁ గలదు.

(7) ఇంగ్లీషు : f = తె. ఫ, ప

,, z = తె. జే

,, ʒ = తె. జే

,, ts = తె. చే

,, dz = తె. జ్జ

మఱికొన్ని మార్పులు.

(8) పదాదినుండు సంయుక్తాక్షరములకుఁ బూర్వమొకప్పు డచ్చు చేరుచుండును: ఇస్కూలు, ఇస్క్రూ, ఇస్టాంపు.

(9) పదమధ్య మందును నట్టి సందర్భములం దచ్చుచేరుట గలదు: బారకాసు, ఎక్స్ట్రా, ఎకస్ట్రా, సెపార్టుమెంటు, జోయంటు, పోయింటు.

(10) కొన్నియెడలఁ బదమధ్యాచ్చు లోపించును: డిప్టీ, ప్రాంసరీనోటు.

(11) కొన్నియెడల స్వరభక్తి కలుగును: పెరిసిడెంటు, బురుసు (brush), బరాందీ, దరాము, విత్తుడ్రా.

(12) కొన్నియెడల హల్లోపము కలుగును; లోపము కలిగినప్పుడు పూర్వ హ్రస్వాచ్చునకు దీర్ఘము కలుగును : చీటి (Chintz).

(13) కొన్నియెడల నచ్చుతోఁగూడిన హల్లులును లోపించును: సూపరెంటు, మేస్త్రీటు, పెరిసెంటు (President).

(14) కొన్నియెడల 'డ' కారము 'ర' కారమగును: జర్జి (judge).

పై వివరించిన మార్పులన్నియు సాధారణముగాఁ గొంతవఱకయిన నింగ్లీషు మాట్లాడువారితోడ సంపర్కముగలవారి యుచ్చారణము ననుసరించినవి. ఇంగ్లీషు నాగరికత సోకని స్త్రీలనోటను, పామరుల నోటను బడి యవి యింకను మార్పులనొందినవి. మాయమ్మమ్మ 'ఇన్స్పెక్టరు' అనిపలుక లేక 'ఇనుపటుస్సు' అనుచుండెడిది. ఇదివేళాకోళము కొఱకుకాదు నిశ్చయముగ నామె యాపదము నుచ్చరింపలేకపోయెడిది. ఇట్టిమార్పులను గూర్చి తెలిసికొనుట కష్టసాధ్యము. ఆ మార్పు లాపదముల నుచ్చరించువారి వాగింద్రియసౌష్ఠవమును బట్టియు, వారి తిరుగులాడు సంఘమును బట్టియు నుండును.

తెనుఁగునఁ జేరిన యింగ్లీషు పదముల సంఖ్యను సరిగ నిర్ణయించుటకు సాధ్యముగాదు. ఆ పదప్రవాహము వర్దయువ్వెనవలె నాంధ్రమును ముంచి వైచుచున్నది. ఆ పదసముదాయములో నెన్ని స్థిరముగ నిలువఁగలవో, యెన్ని తొలఁగిపోవునో యిప్పుడు చెప్పవీలులేదు. ఇంగ్లీషునాగరికత తెనుఁగువారికి నంటినకొలఁది నాంగ్లపదము లాంధ్రమున నెక్కువ యగుచుండును. దానిపై నింత పుట్టినను నా శబ్దజ్ఞాన మంతరించును. కాని, హిందూస్థాని పదములకంటె నాంగ్లపదములఁగూర్చి యొక విశేషముగలదు. హిందూస్థాని పదములపైఁ దెనుఁగుఁ బ్రత్యయములుచేరి క్రొత్తధాతుప్రాతిపదికములును, క్రొత్త కృత్తద్ధితములును, గలుగఁగా నింగ్లీషు పదములపై నిట్టివి యెట్లుగలుగ లేదు. ఎటకాయించు, ఎటకాయింపు, మినహాయించు, మినహాయింపు, [illegible], పేరోజము మొదలగు రూపములవలె ఎంజాయించు, ఎంజాయింపు, కన్సిడరించు, కన్సిడరింపు మొదలగు రూపములు గలుగలేదు. తెనుఁగునం దాంగ్ల పదముల ప్రవేశము చాలనవీనమని యిందువలనఁ దెలిసికొనఁగలను.

తెనుఁగున నిత్యవ్యవహారమున నాంధ్రులు సంభాషణలందు తెనుఁగున నుపయోగించు ఇంగ్లీషు శబ్దములపట్టికలు పత్రికలందు ప్రకటింపబడినవి. ఈ పట్టికలు చాల నసమగ్రములు; అయినా విభాగములును సంపూర్ణములు గావు. ఇంచుమించు మూఁడువేల యాంగ్లపదములైనను దెనుఁగునఁ బ్రవేశించుటకుఁ బ్రయత్నించుచున్నవని రూఢిగఁ జెప్పవచ్చును.

## తెనుఁగువారి వ్యవహారమునఁ జేరిన యింగ్లీషు పదములు.

### ఉద్యోగములు, ఉద్యోగస్థులు

వైసురాయి, గవర్నరు-జనరలు, గవర్నరు, డిస్ట్రిక్టుమ్యా(మె)జిస్ట్రేటు, (మేస్త్రీటు), కలక్టరు, డిప్టీకలక్టరు, సబ్-మ్యా(మే)జిస్ట్రేటు (మేస్త్రీటు), ఆనరరీమేస్త్రీటు, బెంచిమేస్త్రీటు, విలేజమేస్త్రీటు, సెక్రిటరీ, అసిస్టాంటు సెక్రిటరీ, ప్రైవేటుసెక్రిటరీ, జాయింటుసెక్రిటరీ, హోము, ఫైనాన్సు, రెవిన్యూ, లా, ఎజ్యుకేషను, రెయిల్వే, ఇండష్ట్రీల, మెంబరు, డిపార్టుమెంటు, ఆఫీసరు, మ్యా(మే)నేజరు, సూపరెంటు, డైరక్టరు, డైరెక్టరు-జనరలు, ఇన్స్పెక్టరు, సబిన్స్పెక్టరు, ఇంజినీరింగు, మెడికలు, పోస్టు, టెలిగ్రాపు, రైల్వే, రెసిడెంటు, రిజిస్ట్రారు, అండరుసెక్రిటరీ, ఎస్టేబు(లు), క్లార్కు, ఆఫీసు, ఆర్డర్లీ, క్యాంపు, డిపిటీ, ఆఫీసరు, సూపర్వైజరు

### శాసనసభలు

ప్రెసిడెంటు, డిప్టీప్రెసిడెంటు, కౌన్సిలు, స్టేటుకౌన్సిలు, లెజిస్లేటివు-కౌన్సిలు, సెషను, సెక్షను, మెంబరు, అసెంబ్లీ, రిజల్యూషను, మోషను, బిల్లు, ఆక్టు, మువ్ (చేయుట), విత్‌డ్రా చేయుట, ఫ్రాములుచేయుట, సర్కులేటు చేయుట, ఎడ్జోర్నుమెంటు, ఎజెండా, సెకండుచేయుట, నామినేటెడు, ఎలెక్టెడు, ఎలెక్షను, వోటింగుఫ్రాంచైజు, బేలటుపెట్టె (-కాగితము), పోలింగుస్టేషను, నోటీసు, పబ్లికు, ప్రొసీడింగులు, మీటింగు, స్పెషల్ మీటింగు, కమిటీ, సబుకమిటీ, కోరము, క్యాండిడేటు, పార్టీ, ప్రొపోజిషను, మినిటు, మెజారిటీ.

### న్యాయస్థానములు.

హైకోర్టు, డిస్ట్రిక్టు-, సెషన్సు-, జడ్జీ-, కోర్టు, ఛీపుజస్టీసు, ప్యూనీజడ్జీ, కమీషనరు, ఛీపు-కమీషనరు, కేసు, హియరింగు, బారిస్టరు, లాయరు, ప్లీడరు, గౌను, ప్లీడింగు, క్రిమినలు, సివిలు, స్మాల్ కాజు, సమ్మను(లు), అప్పీలు, ఛార్జి, ఫీజు, జైలు, జైలరు, కన్విక్టు, నంబరు, స్టాంపు, ఎవిడెన్సు, అటార్నీ, అవార్డు, అసెసరు, [illegible], అరెస్టు, ఇష్యూ, ఇంజెంక్షను, ఎగ్జిక్యూషను, ఎక్సుపార్టీ, గార్డియను, మైనరు, మైనారిటీ, మేజరు, జడ్జి, జడ్జిమెంటు, జుడిషలు, జూరిస్డిక్షను, టైటిలు, [illegible], ట్రస్టీ, డిక్రీ, [illegible], పిటిషను, ప్రీవీకౌన్సిలు, పార్లమెంటు, ప్రాసిక్యూషను, ప్రొసీడింగ్సు, ప్రోబేటు, [illegible], ప్రోసెసు, బెయిలిఫు, రెవ్యూ, రిపోర్టు, రీజను, రిమాండు, లా, లారిపోర్టు, వుయిలు, వారంటు, సెంటెన్సు, స్టేటుమెంటు, షెడ్యూలు.

### స్థానికస్వపరిపాలనము.

యూనియను, మునిసిపాలిటీ, బోర్డు, నో-కాన్ఫిడెన్సు, కార్పొరేషను, కౌన్సిలరు, చేరుమేను, సెస్సు, టాక్సు, లోకల్ ఫండు.

లు.

సర్జను, డాక్టరు, లెక్చరరు, ప్రఫెసరు, మేస్టరు, హెడ్డుమేస్టరు, ఇంజినీరు, లాయరు, డ్రెస్సరు, ప్రిస్క్రిప్షను, టీచరు, క్లార్కు- మొదలయినవి.

వాహనములు, తత్సంబంధమయినవి.

కేరేజి, రైలు(బండి), మెయిలు, గూడ్సు(బండి), ట్రక్కు, వేగను, ఇంజను, బ్రేకు, డ్రైవరు, గార్డు; స్టీమరు; కారు, బస్సు, మోటారు, ట్రాము, ఎయిరోప్లేను, బెలూను, కండక్టరు, లైసెన్సు, పెర్మిట్టు, కంపార్టుమెంటు, కోచి, టిక్కెట్టు, పేసెంజరు, బైసికిలు, సైకిలు, మోటారుసైకిలు, పెడలు, చెయిను, బెల్లు, లైటు, జంక్షను, బోటు, స్టీమరుబోటు, లైను, పోర్టరు, స్టేషను-(మాస్టరు); సిగ్నలరు; లైటుహౌసు, సిగ్నలు, లాకు, వెయిటింగ్ రూము, ప్లాటుఫారము, లగ్గేజి.

వ్యాపారము మొదలయినవి.

గోదాము (godown), చెక్కు, టకీఫు, ఫార్డి, డిపాజిటు, డిపో, డిమాండు, డిస్కౌంటు, నోటు, ప్రామిసరీనోటు, ప్రానోటు, ఎక్స్చేంజి, బా(బ్యా)ంకి, మార్కెట్టు, రశీదు, షాపు, కంపెనీ, షేరు, స్టాకు, సప్లయి, మానేజరు, ఆర్డరు, అడ్వాన్సు, ఏజెంటు, ఎస్టిమేటు, కంట్రాక్టు, కమిషను, క్యాటలాగు, బాకు, బేలు, బిల్లు, మనియార్డరు.

స్కూళ్లకు, కాలేజీలకు సంబంధించినవి

ప్రిన్సిపాలు, ప్రొఫెసరు, లెక్చరరు, టీచరు, మేష్టరు, డ్రాయింగు, డ్రిల్లు, నోటుబుక్కు, ఎక్సరుసైజుబుక్కు, బౌండుబుక్కు, రిజిష్టరు, అటెండెన్సు, శేటు, లీవు, స్కాలరుషిప్పు, ఫ్రీస్కాలరుషిప్పు, పేనా, ఇంకుపేనా, పెన్సిలు, బ్లాకుబోర్డు, స్కూలు, బెంచి, ఫారము, క్లాసు, ప్రమోషను, రిజల్టు, పాసు, ఫెయిలు, టైముటేబిలు, గ్రాంటు, డి. ఇ. ఓ.; నంబరు, బ్లాకు, మార్కులు, లైబ్రరీ, స్లేటు, సర్టిఫికేటు, యూనివర్సిటీ సిండికేటు, సెనేటు (తెలుగు)-బోర్డు, ఎకాడెమికుకౌన్సిలు, కాన్వొకేషను, ఛాన్సెలరు, వైస్ ఛాన్సెలరు, రిజిస్ట్రారు, హై(మిడిల్, ప్రైమరీస్కూలు, హాస్టలు.)

వస్త్రములు మొదలయినవి

చీటీ(గుడ్డ) Chintz, ఫ్లానెలు, గ్లాస్కోలు, బూట్సు, స్టాకింగులు, మఫ్లరు, లాంగ్ క్లాతు, షర్టు, కోటు, కాలరు, నెక్టయి, బొత్తాములు, హాఫ్ఆరము, ఫుల్ ఆరమ్, టైలరు, గౌను, జాకెట్టు సూటు, పంట్లాము, క్యాలికో, కర్చీఫు, తువాలు.

మతసంబంధమైనవి.

ఈస్టరు, ఏసు, క్రీస్తు, కిరస్తానీ, క్రైస్తవులు, క్రిస్మసు, చెర్చి, పాదరి, ప్రీచరు, ప్రేయరు, బిషపు, బైబిలు, బ్యాప్టిస్టు, మిషను, మిషనరి, మైకల్మసు, కన్వర్టు మొదలయినవి.

ఆధునిక విజ్ఞానము ననుసరించి తెనుఁగునఁ జేరినవి.

అర్థమెటిక్కు, అస్ట్రానమీ, ఆల్జిబ్రా, ఆక్సిజను, హైడ్రోజను, నైట్రోజను, ఆసిడ్డు, కెమిస్ట్రి, కార్బను, కార్బానిక్ఆసిడుగాసు, గాసు, జామెట్రి, ట్రిగ్నామెట్రి, టెలస్కోపు, టెలిగ్రాపు, టెలిగ్రాము, వైరు, టెలిఫోను, థర్మామీటరు, పాయంటు, డిగ్రీ, బాటరీ, ఎలక్ట్రిసిటీలు, బల్బు, బెరామిటరు, రేడియో లాగరిదము, సయన్సు, అల్యూమినియము, గ్రామో ఫోను, టెలిఫోను, ఫొటగ్రాపు, హార్మోనియము, ట్యూన్ను, బ్యాండు, ఫిడేలు, ఎనామెలు, కన్సెట్టు (Concert), పియానో.

కొలతలు, మానములు, నాణెములు మొదలయినవి.

సెకెండు, మినిట్టు, టైము, టైమ్-పీసు, రిస్ట్‌వాచి, మైలు, ఫర్లాంగు, డ్రాము, దరాను, ఔన్సు, టన్ను, డజను, డాలరు, పౌను, పౌండు, షిల్లింగు, ఎకరా, తేద.

ఆటలు.

జాకీ, టెన్నిసు, ఫుట్-బాలు, హాకీ, క్రికెట్టు, బ్యాడ్-మింటను, రింగ్-టెన్నిసు, నెట్టు, గోలు, బౌండరీ, రన్ను, బ్యాటు, బాలు, గోల్-కీపరు, ఫార్వార్డు, ఫుల్-బ్యాకు, హాఫ్-బ్యాకు, ఔటు(అగు), అంపైరు, తురుపు, పోలో, స్టిక్కు, వికెట్టు; గ్లోవ్సు, లెగ్గార్డు, పింగ్‌పాంగు, బాస్కెటుబాలు, ఇస్పేటు, కళావరు, ఆఠీను, డైమాను.

ప్రభుత్వము.

ట్రేజరి, పించను, పోలీసు, లాకప్పు, సెంట్రల్‌జెయిలు, క్వార్టరు, ఇన్‌కమ్‌టాక్సు, ల్యాండుటాక్సు, డిమాన్స్ట్రేషను, డిపార్టుమెంటు, డివిజను, ప్రావిడెంటుఫండు, రికార్డు(-కీపరు), రివిన్యూ, రెగ్యులేషను, రిమిషను, లాన్సు, సర్వీ, సర్వేయరు, సర్క్యులరు, సర్వీసు, సర్టిఫ్యకేటు, శాంక్షను, సెటిలుమెంటు, సెటిలు(చేయు),

ఇతరములు.

కలరా, ప్లేగు, కనసు, కాడ్లివరాయిలు, కాఫి, టీ, కార్డు కార్కు, క్యాలెండరు, కేటత్రాడు (Cates), కొయినా, కోస్త్రా, క్లోరడైను, క్లోరఫారము, కెట్టిలు, కెరసనాయిలు, ప్లేటు, గ్లాసు, గిల్టు, బ్రూచి, గైషు, గేటు,

లాంపు, లైటు, చిమ్నీ, టంబ్లరు, టాపు, టాయిను, టోలుగేటు, ట్రంకు, టైపురైటింగు, టైపురైటరుమిషను (Machine), డ్రాయరు, టేబిలు, టీకువా, స్టాండు, డైరి, డెల్టా, నటుపైడు, బేరింగు, వి. పి., ఇన్స్యూరు, రిజిస్టరుచేయు, పోస్టు, పోస్టాఫీసు, పోస్టుమ్యాను, బుక్కుపోస్టు, ప్యాకెటు, పార్సెలు, నవల, పటాలము, పటాను, సోల్జరు, ఖారకాను, పెప్పరుమెంటు, సోడా, లైమ్‌జూను, లెమనేడు, ఆరెంజి, పైపు, పార్కు, ప్లాను, పళాస్త్రి, ప్యాను, ప్యానుబుక్కు, సేవింగ్సుబ్యాంకు, కోఆపరేటివ్ సొసయిటీ, బీరు, (beer), బ్రాందీ, విస్కీ, బురుసు (brush), బిస్కోతు, బిగిలు, బాంబు, మ్యూజియము, పార్కు, రూము, రీము, రబ్బరు, రోడ్డు, రూలు, రూలు(కఱ్ఱ), రిజిమెంటు, లిస్టు, లాటరి, లాంతెరు, లెటరు, లవండరు, వార్నీసు, సర్కసు, సోపు, సిమెంటు, హోటలు, హార్బరు, ఎస్టేటు, కాంగ్రెసు, కాన్ఫరెన్సు, కంటోన్మెంటు, న్యూసుపేపరు, ప్రొప్రయిటరు, టేపు, డిమ్మీ, డోసు(-గాడు), రీజన్, రైటరు, సీకు, సైడు, హెడ్డు.

**బుడతకీచుభాష.**

ఇంగ్లీషుపదముల తరువాతఁ దెనుఁగునఁ జేరినవానిలో పోర్తుగీసు పదను లెక్కువగానున్నవి. పోర్తుగీసులను తెనుఁగువారు బుడితకీచు(ను) లనుచుండిరి. వీ రీదేశమునకుఁ బదునాఱవ శతాబ్దారంభమున వర్తకమునకు వచ్చి, దేశముపై నధికారమును గూడ సంపాదింప యత్నించిరిగాని, 1668 సం॥ రమున మయిస్తఖానుఁడు వీరినోడించి, వారి యధికారమును నాశముచేసెను. బుడతకీనులతోడి సంపర్కమువలన నీ క్రింది పదములు తెనుగుఁన జేరినవి: అమారుత్రాడు (అమార్); అనాస, - అనారస - పండు (పోర్తు. అననస్); అల్పి (పోర్తు. అల్ఫినెతె); చేదర (పోర్తు. చదెయ్ ర. శ. ర. వై. తెప్పు) తువాలు, తువాల (పోర్తు. తోఅల్హ); కాఫీ (పోర్తు. కాఫె); సగ్గు - (రాయల సీమ; సబ్బు - ) బియ్యము (పోర్తు. సగు; బంగాలీ: షగు, షబు); బొత్తాము (పోర్తు. బొతాఒ); కమీజు (పోర్తు. చమీస); పీపా (పోర్తు. పిప); మఱిక = మచ్చ (పోర్తు. మార్చ); అల్మారా (పోర్తు. అల్మారిఓ); (తాళము) చెవి (పోర్తు. చావె; హిందూస్థానీ చాబీ); గరండాలు (పోర్తు. గ్రాదె); బాల్చీ (పోర్తు. బాల్దె); ఒలాందులు (పోర్తు. హొల్లన్దెజ్); తపేలా (పోర్తు. తాల్హ); జాలపు (గుండ) = విరేచనములు చేయుమందు (పోర్తు. జలాప); వెసల. చూ. విజయ విలాసము - 2 ఆశ్వా. (పోర్తు. వసిల్హ); బొప్పాయి (పోర్తు. పపైఅ); ఇస్త్రీ (బట్టలు) (పోర్తు. ఎస్తిరారు); గోదాము (పోర్తు. గుదాఒ); కప్తాను (పోర్తు. కపితాఓ); కోబీ = కేబీజ (పోర్తు. కోవె); పాదిరి (దొర) = మిషనరీ (పోర్తు. పాద్రె); గమేలా = ఒకపాత్ర (పోర్తు. గమేల్ల); బిస్కోతు (పోర్తు. బిస్కోయ్తో); సాంత్రానారింజ (పోర్తు. చింత్ర); మేస్త్రీ (పోర్తు. మెస్త్రె);

బొరిగ = గడ్డిత్రవ్వు చిన్నసాధనము (పోర్తు. బొరొగ); కాకాతువా = ఒకరీతిచిలుక (పోర్తు. కకతూ); కటారి (పోర్తు. కాతాన్); కానా = కాలువ (పోర్తు. కనో); తురుఫు (పేకాటలో) (పోర్తు. త్రావిఫ్); (పల్లకీ) బొంగు (పోర్తు. బోమ్) మొదలయినవి.

పరాస భాష.

ఫ్రెంచిభాషనుండి తెనుఁగునకు వచ్చినమాటలును గొలఁదిగనున్నవి: కుశిని, పరంగి, పరాసు, ఫిరంగి, ఫిరంగీచెక్క, కవాను = సైనికుల ప్రయాణము; నేఁడు సాధారణ ప్రయాణము.

ఒలాందుల భాష.

డచ్చివారి (ఒలాందుల) నుండి యేపదములు వచ్చినవో తెలియదు. ఒలాందు లనుపదము పోర్తుగీసువారిద్వారా తెనుఁగునఁ జేరియుండును. మెక్సికోదేశమందలి, 'గొయ్యా' పండు స్పానిషుభాషద్వారా తెనుఁగునఁ జేరినది.

ప్రాచీన భారతీయేతరభాషలనుండి వచ్చిన పదములు సంస్కృత ప్రాకృతముల మార్గమునఁ దెనుఁగునఁజేరుటచే వానిని తెనుఁగువారే యెరవు తెచ్చికొనిరని చెప్పవీలులేదు.

(1) ప్రాచీన పెర్షియను: పుథీ, పుథి, పూథి; ప్రాకృతము: పొత్థిఅ; ఐరేనియను (పహ్లవి) పోస్త = తోలు, పొర; ఇది 'పుస్త(క)' అని సంస్కృతీకరింపఁ బడినది; తెనుఁగు: పొత్తము.

ప్రాచీన పెర్షియను: పాఇల్ = కాలిబంటు; ప్రాకృతము: పాఇక్క; ఐరేనియను: పాఈక్; చూ. తెనుఁగు, పాయికరావు పేట.

ప్రాచీన పెర్షియను: ముచీ, మోచీ; ప్రాకృతము: మోచిఅ; పహ్లవి: మోచక్; తెనుఁగు: ముచ్చివాఁడు; ఆధునిక పెర్షియను: మోజా, మూజా; తెనుఁగు: మోజా.

(2) గ్రీకుభాషనుండి: దమ్మిడీ; ప్రాకృతము: దమ్మ, ద్రమ్మ; సంస్కృతీకరణము, ద్రమ్య; గ్రీకు: ద్రఖ్మే.

తెనుఁగు: సేమియా, సేవియా; హిందూస్థానీ: సివఇయా; గ్రీకు: సెమిద లిస్; ప్రాకృతము: * సిమిద.

(3) ల్యాటిను భాషనుండి: దీనారము (శ్రీనా. వీధి. వైజ. I. 92).

'తుత్తినాగము' చీనాభాషలోనిది; 'తే' యాకు చీనాభాషాపదము. ఇంగ్లీషు ద్వారా తెనుఁగునఁ జేరినది; 'బత్తాయి' బటేవియాదేశపుది. 'జవాజి' ఏదేశమునదో తెలియదు (మను. V. 57).

భారతవర్షీయాధునికార్యభాషల నుండియుఁ గొన్ని పదములు తెనుఁగునఁ జేరినవి. 'అగతా' ఓఢ్రపదము. 'జముఖాణము' (మను. V. 40) దక్షిణీపదము. గ్రాది, నవటాకు, బంగాళీ భాషలోనివి. మహారాష్ట్రీ భాషనుండి యనేక పదములు వచ్చినవి. కొన్ని యుదాహరణములు.

అఖతివాసి, ఆరెము, ఆరెకాపులు, ఆరెలిపి, ఆరెలెక్కలు, ఆరెభాష, ఉతాణి, కతాయించు, కాకురు, కోకోజి, తాణము (దంపుతాణెంటుసేయు - వరాహ. V. 6) ధాణుకపాలు, ధాణుధోడ, నివాడా, పటేలు, పింగాణి (చూ. పచ్చలపింగాణి. వరాహ. IV. 156); పిండారి, మెంతము, లకోటా. సాహెూ, సుర్, హాళిగ, హుమా, హుమాయి, పురోణి, ఖాణము (తియ్యఖాణము) ఉ. రా. II. పు. 11) మొదలయినవి.

## ద్రావిడభాషా పదములు.

ద్రావిడభాషలలోని పదములు చాలవఱకు ననాదినుండియు సంబంధముగలిగియున్నవే. అవి ప్రత్యేకభాషలుగా విడిపోయిన తరువాత రెండేసి భాషలు కలియు ప్రదేశములందు తప్ప నితర ప్రదేశములలో నంతగా నొకదానిలో నొకటి కలియలేదనియే చెప్పవచ్చును. అరవ కన్నడములనుండి మాత్రముకొలఁదిగ గ్రంథములందును వ్యవహారము నందును గొన్నిపదములు తెనుఁగునఁ జొచ్చినవి.

## అరవ పదములకు కొన్ని యుదాహరణములు.

అచ్చారము, అడిమె, అడియఁడు, అమంజా, ఆపము, కంగాణము, కప్పలి, కేపుమారి, కొల్లు, గోణము, అయ్యరు, జియ్యగు, తిరు, పితలాటము, మరకాలు, అళాకు, వెళ్లాయి మొదలయినవి.

## గ్రంథములనుండి.

చిఱుతొండ నింటికిన్ (హరవి. I. 15); తిరుచుట్టు మాలె (భీమ. III. 31); తిర్వీధులు (పాండు. IV. 184); తిరు (వారాధనము) (పాండు. II. 24); శ్రీసేనముదలియారి (పాండు. I. 1); తిరునామము (వై జ. 1. 29); వైతిరులు, మోరు (పాంచా. పరి. IV. పు 87); ముదివిళ్లఁడు, అళఘుసింగరి, యుప్పళియప్పయాళువారు, భట్టరు, పాటరు, వడఘునంబి యుప్పగారు (పాంచా, పరి. I. పు; 9); చూడుక్కుడుత నాంచారు, తిరునాళ్లు (శ. ర. తిరునాళ్ల) మను. I, 89. తొండరడిప్పొడి యాళువారు (పాంచా. పరి.) I. పు. 2); పిల్లగీర్లడియనికి („ „ పు. 4); తిరుమణిపాదలు („ „ పు. 9); బంగారు కాయి పోరంగకాయి (పాంచా. పరి. I);

కన్నడ పదములకుఁ గొన్ని యుదాహరణములు.

అంకఁకాడు, అడనట్టా, అరసు, కెలసము, గండపెండేరము, వళవు, ఒళవు, హులిక్కి, హెగ్గడి, హెగ్గాళ, హొన్ను, హొంబట్టు, హణిగెలు, కోసము, కోసరము మొదలయినవి.

గ్రంథములనుండి.

ఈ బిడారు మృగీమద శ్రీ. బిడారు (విజయ. I.); బిజమాడు దేవర; హావుదప్పా పాత్రరాయా (వై జ. I. 88); కమ్మబాగాలు (ఉ. రా. పు. 268); మొదలయినవి.

ద్రావిడభాషలలోఁ దమిళమునుండి వైష్ణవ సంప్రదాయము గల కవుల గ్రంథము లందనేకపదములు చేరినవి. కొన్ని యుదాహరణములు.

క. అడుగులకు మ్రొక్కు జనముల, నడియేన్ దాసోహమనెడి యార్భటు లెనగన్. (కృష్ణరా. విజ. పుట. 2)

గీ. తాళునే యలమేల్మంగతాయి (ప్రబం. పుట. 252.)

సీ. తుంబురు నారదాదులకుఁ బల్లకి ముందుకు సాని మేళములోన సంబళంబు (పార్వతీ.)



అయిదవ ప్రకరణమునకు

# అనుబంధము I.



నిఘంటువుల కెక్కక, వాఙ్మయమున వాడఁబడక, నిలిచియున్న తెనుఁగు శబ్దము లెన్నియో గలవు. వానిలో వేర్వేఱు వృత్తులకు సంబంధించిన శబ్దములనైన నొకచోటఁ జేర్చుట కింతవఱకుఁ బ్రయత్నములు జరుగలేదు.

ఈ క్రింద నాంధ్రదేశమునందలి నావికు లుపయోగించుపదముల పట్టిక మచ్చున కివ్వఁబడినది. "మాలీమ్‌శాస్త్రము" (The art of navigation) అనుపుస్తకమును నే నాంధ్రీకరించుటకుఁ గొన్నినెలలు మచిలీపట్టణమున నుండవలసివచ్చినది. అప్పుడు తెనుఁగు నావికులతో సముద్రముపై నావికులతో నోడలలో సబురులు పోవుచు వారు మాట్లాడు మాటలను గుర్తించి, వారివలన నే నాయా పదముల కర్థములను దెలిసికొని యొకపట్టికను వ్రాసితిని. ఆంధ్రపదజాలవిస్తారము నిర్ణయించుట కిట్టిప్రయత్నముల నెన్నిటినో యొందఱో చేయవలసియున్నదని తెలుపుటకును, అట్లు సేకరించుటయందుగల కష్టమును నిరూపించుటకును ఈ పట్టిక ననుబంధముగ నిచటఁ బొందుపఱుచుచున్నాను.

మనవా రోడలను నడపుటయం దనాదిగఁ బ్రసిద్ధి నహించియుండిరి. ప్రాచీనకాలపు టాంధ్రనావికశబ్దము లెవ్వియో తెలిసికొనుట కష్టమే. కాని, మనవారి కితరదేశనావికులతోడి సంబంధము కలుగుచురాఁగా, నా యితరదేశభాషాపదములనుగూడ నుపయోగింపసాగిరి. ఈ పట్టికలోనివి కొన్ని అరబ్బీపదములు; కొన్ని యింగ్లీషుపదములు; కొన్ని పోర్తుగీసు, డచ్చి, ఫ్రెంచి భాషలకు సంబంధించినవి. వీనిని బట్టి యాయా పదములు తెనుఁగువారి వ్యవహారమున నెట్లెట్టికాలమునఁ బ్రవేశించినదియుఁ దెలిసికొనవచ్చును.

# అ

**అంకారించుట** - To roll up a sail, to furl - తెరచాపను పైకి చుట్టి అది వ్రేలబడియున్న కఱ్ఱకు త్రాటితో కట్టి యుంచుట. చూ. అర్యా చేయుట, అబేస్ చేయుట.

**అకరాబు** - రెండు ముఖ్యదిశలకు సరిగా మధ్యనుండు దిక్కు.

**అంజాం త్రాళ్లు** - Jeers, halliards, downhauls, చాపలను, పర మానులను మీఁదికి లేవనెత్తుటకును, దించుటకును ఉపయోగించు త్రాళ్లు.

**అజ్జ** - Latitude - నిరక్షరేఖకు మీఁదుగాఁగాని, క్రిందుగాఁగాని, ఎన్ని డిగ్రీలుగా ఉన్నదో ఆ కొలత - చూ. అర్జ.

**అడైగోసి** - రెండుకొయ్యలు, పరమానులు, తెరచాపలు, ఉండి, ఒక కొయ్యమీఁదమాత్రమే గాపులూపులు గల ఓడ.

**అడ్డముగావచ్చు** - Athwart hawse - ఒక ఓడ ప్రమాదమువలన మరియొక ఓడ అనిమికి ముందుగా వచ్చి ఉన్నప్పటిస్థితి.

**అడ్డుగా** - athwart; across; "We discovered a fleet steering athwart us." ఒక నావ మార్గమునకు అడ్డుగా దూరములో పోవుట.

**అత్తువాలు** - palm - కేన్వాసుగుడ్డ కుట్టినప్పుడు ఉపయోగించు ఒక ఉపకరణము.

**అందవు చేయుట** - Bonnet; చిన్నగాలులలో చిన్నఓడల తెరచాపల అడుగుభాగమునకు కలిపికుట్టు చిన్నగుడ్డ; అట్టిగుడ్డను కలిపికుట్టుట.

**అదరగట్టుట** - lying to; to heave to; ఎదురుగాలులు వేయుచున్నప్పుడు తెరచాపలను ఒకదానికెదురుగా మరియొకదాని నమర్చి, సాధ్యమయినంతమట్టుకు ఓడ కదలకుండ ఒకేవద్దర ఉండునట్లు చేయుట.

**అదరడము** - Shivering - గాలిలో తెరచాప ఇటునటు కొట్టుకొనుట.

**అనిమి** - The fore part of a ship; నావకు ముందుభాగము.

**అనిమి అమరాలుతెగుట** - Run; నావ వెనుకప్రక్క అనగా అమరమునొద్ద ప్రక్కలురెండును మిక్కిలి సన్నమగుట.

**అనిమితట్టు** - Poop - అనిమికి దగ్గఱగా నున్నతట్టు ((deck) భాగము. చూ. అమరముతట్టు.

**అబేసుచేయుట** - 1. To sheet home - చాపనుపఱచి క్రిందికఱ్ఱకు సాధ్యమయినంతదగ్గఱగా అంటి ఉండునట్లు లాగిఉంచుట. 2. To hoist -

2. ఎత్తినకెరటము - "ఓడ రెండు ఓట్లమీఁదను సరాసరిగా నిలిచి, పోతున్నది." "అది రెండుఓట్లమధ్య లోతులోనికి దిగినది."

ఓడఢార్లుట - To moor ; రెండు లంగరులువేసి అమారులు బిగించి ఉండగా, ఓడ ఇట్టటు తూగుచు నీటిమీద నిలిచి ఉండుట.

కచ్చం అకరాబు - South-west by the Mariner's Compass - నైఋతిదిశ. చూ. సమకా.

కచ్చం అకరాబు జమ్నాకొచ్చాకు - South-west by west-కచ్చం అకరాబుకు అనఁగా నైఋతిదిశకు ఎడమవైపు 360 డిగ్రీలలో 32-వ వంతు డిగ్రీలు చూపు దిశ. చూ. సమకా.

కచ్చం అకరాబు డావుకొచ్చాకు - South west by south - కచ్చం అకరాబుకు అనఁగా నైఋతిదిశకు కుడివైపు 360 డిగ్రీలలో 32-వ వంతు డిగ్రీలు చూపు దిశ. చూ. సమకా.

కప్పలతాళ్లు - Tackle - కప్పీలలోనుండి దూర్చియుంచిన త్రాళ్ల సమూహము.

కమాను - Quadrant or sextant - క్వాడ్రాంటుకును సెక్స్టాంటు కును సామాన్యవాచకము.

కలిమికొయ్య - The third in order of the masts in a four-masted ship beginning from the stern mast-నాలుగుకొయ్యల ఓడలో అమరము దగ్గరనుండు కొయ్యనుండి లెక్కపెట్టగా, మూఁడవ కొయ్య.

కలిమి పరమాను - Bumkin కలిమికొయ్యతో సంబంధించిన పర మాను, అనగా తెరచాపలుకట్టుటకు ఉపయోగించు అడ్డుమానులు. చూ. సముద్రరిబోము.

* కళాసులు - ఓడమీద పనిచేయు కూలీలు.

కాకస్ - The direction on the Compass showing 1/64th part of 360 degrees. కంపస్సులేక సమకామీద 360 డిగ్రీలలో 1/64 భాగమును చూపుదిక్కు.

కాకాకస్-The direction on the Compass showing 1/128 th part of 360 degrees. సమకామీఁద 360 డిగ్రీలలో 1/128 వ భాగ మును చూపుదిక్కు.

- The hole over which the rudder stands. చుక్కాణి ఉండుబొక్కము.

కాను - The passage by which water on the deck flows out into the sea. తట్టుమీదచేరిన నీరు మరల పైకిపోవుట కేర్పరచినదారి.

కామ్‌చోడో - Avast ! ఏదైన జరుగుచున్నపని ఆపుచేయవలసినదని చేయు ఆ॥

కామిరీ - Cuddy, Birth, cabin. మాలీము, సరంగులు, పరుండుగది. ఇది అమరము దగ్గర ఉండును. చూ. అల్కా్క్, ఛత్రీ. రూ. కేమిరీ.

కాలువ - Narrows. రెండుగట్టులమధ్య నుండుదారి.

కిటికీరెక్కలు - Dead lights. తుపానువచ్చునని తెలిసినప్పుడు కేమిరీ గది కిటికీలను గట్టిగా మూసివేయు దళసరి బల్లలు.

కిఫలయి - West by the Mariner' s Compass. పడమర. చూ. సమకా.

కిఫలయి - జమ్నా - కొచ్చాకు - West by south - తూర్పుదిక్కుకు ఎడమవైపు 360 డిగ్రీలలో 32-వ వంతు డిగ్రీలను తెలియజేయు దిక్కు. చూ. సమకా.

కిఫలయి-జమ్నా-తీరు - West - South - West. కిఫలయికిని, కచ్చం అకరాబుకును సరిగా మధ్యనుండుదిక్కు. అనగా పడమరకును నైఋతికిని సరిగా మధ్యనున్నదిక్కు. చూ. సమకా.

కిఫలయి-డావు-కొచ్చాకు - West by North. పడమరకు కుడివైపు 360 డిగ్రీలలో 1/32 వంతు డిగ్రీలను చూపుదిక్కు. చూ. సమకా.

కిఫలయి-డావు-తీరు-West-North-West. ఉత్తరమునకును వాయవ్యమునకును సరిగా మధ్యనుండు దిక్కు. చూ. సమకా.

కుతిలీ - The doorway leading into the inside of the ship companion; ఓడ లోపలిభాగములోనికి అనగా తండాలోనికి పోవు ద్వారము. కుతిలీవైని పాలకాయలుండును. పాలకాయలమీద తరపాలు పఱచుదురు.

కేట్లు - Catheads; ఓడ అనిమి అమరముల యొద్దనున్న రెండు బలమైన దూలములు. లంగరును పైకి ఎత్తివేసి ఈ దూలములకు కట్టివేయుదురు.

కేటుకులాగడము - To fish the anchor. లంగరును అనిమి అమరాలకు మీదుగా లాగివేసిన తరువాత లంగరు పన్నులను తట్టుకు మీదుగా ఉండునట్లు చేయుట.

కేటుతండేలు - One of the boat swain - రింగినీ, లంగరు, మొదలైనవాటి పూచీగల నావఅధికారి. చూ. పెద్దతండేలు, చిన్నతండేలు, సాధారణముగా ఓడలో ముగ్గురు తండేళ్లుందురు.

కేబిరీ - Cabin. చూ. కాబిరీ.

కొచ్చాకులు - 1/32 Part of the Mariner's Compass-కంపస్సులోని 360 డిగ్రీలలోను 32-వ వంతు.

కొండగాలి అకరాబు - South-east ఆగ్నేయదిశ. చూ. నమకా.

కొండగాలి అకరాబు-జమ్నా-కొచ్చాకు - South-East by East - కొండగాలి అకరాబుకు అనగా ఆగ్నేయదిశకు ఎడమవైపు 360 డిగ్రీలలో 32-వ వంతు డిగ్రీలు గలదిక్కు. చూ. నమకా.

కొండగాలి అకరాబు-డావు-కొచ్చాకు - South -East by South - ఆగ్నేయదిశకు కుడివైపు 360 డిగ్రీలలో 32-వ వంతు డిగ్రీలు చూవుదిశ. చూ. నమకా.

కొడి - Leach - కొడులు; Leaches - తెరచాప అంచులు.

కొడి - A standard or flag; కొడికాయు To hoist a flag; కొడీ స్తంభము; a flag staff; కొడిమె = a ship or boat.

కొత్తకొయ్య - Jury mast - విరిగిపోయిన ఒకకొయ్యకు బదులుగా తాత్కాలికముగా ఉపయోగించుటకు ఎత్తిన కొయ్య.

కొయ్యసెల - Aloft - కొయ్యకు మిట్టమీఁది భాగము.

కొడేకొయ్య - Beacon - పల్లపు నీటి జాగాలోను, ఇసుక దిబ్బ మీఁదను, చిన్నగుట్టలమీఁదను, నావలకు అపాయము తెలిపే ఒక కొయ్య లేక స్తంభము. చూ. సైను.

కోతాంబొత్తలు - Limbers or Limber holes - తట్టు మీఁది నీరు వైకిపోవు బొక్కలు (కన్నములు).

క్వాడ్రాంటు - Quadrant - సూర్యుని స్థానమును కనుగొనుట కుప యోగించు ఉపకరణము. చూ. కమాను. రూ. క్వార్టరు.

క్వార్టరు - Quadrant - చూ. క్వాడ్రాంటు.

గందరాపెట్టకు - Steady ! - గాలి తిన్నగా వీచుచున్నప్పుడు ఓడ ఒక ముజరామీఁద వెళ్లుచుండగా "అదే ముజరామీఁద వెళ్లు, ఆ ముజరా తప్పించకు" అని చుక్కాణిదారుని ఆజ్ఞాపించుట.

గందరావెళ్లకు - Nothing off ! గాలి వీచుచున్న మార్గమునుండి ఓడను తప్పించవలదని చుక్కాణిదారునికి ఆజ్ఞ.

గావుటావులు - చిన్నచాపలు.

గాయి - North - ఉత్తరదిక్కు. చూ. సమకా.

గాయి-జమ్నా-కొచ్చాకు - North by West. గాయికి అనగా ఉత్తర దిక్కుకు ఎడమవైపు 360 డిగ్రీలలో 1/32 వంతు డిగ్రీలుగా ఉన్న దిక్కు. చూ. సమకా.

గాయి-జమ్నా-తీరు - North-North-West-ఉత్తరమునకును వాయవ్యమునకును సరిగా మధ్యనున్న దిక్కు. చూ. సమకా.

గాయి-డావు-కొచ్చాకు - Noth-by-East - ఉత్తరమునకు కుడివైపు 360 డిగ్రీలలో 1/32 వంతు డిగ్రీలుగా ఉన్నదిక్కు. చూ. సమకా.

గాయి - డావు - తీరు - North-North-East - ఉత్తరమునకును ఈశాన్యమునకును సరిగా మధ్యనున్న దిక్కు. చూ. సమకా.

గాయితాళ్లు - Guy - బరువైన వస్తువు దేనినైన నెత్తునప్పుడుగాని, దించునప్పుడుగాని ఇటునటు కదలకుండ పట్టి ఉంచు త్రాళ్లు.

గుడుగుడా-Hawseholes - అమారుతాళ్లు దూర్చుటకు ఓడకు రెండు ప్రక్కల నేర్పఱిచిన కన్నము. చూ. వట్రపుకాను, వట్రకాను.

గుబ్బాలు - Robands or ropebands - ఇవి జటలవలె అల్లిన పొట్టి తాళ్లు. వీని కొనలకు సూదులకు కన్నమువలె బెజ్జము లుండును. వీనితో చిన్న చదరపు చాపలను వాని వాని కఱ్ఱలకు కట్టుదురు.

గుమారు - Raft port - తండాలో పెట్టుటకు వీలు లేని పొడుగుపాటి దూలములను అమరమునొద్ద పెద్ద బెజ్జము చేసి దానిలో నమర్చి ఉంచుదురు. ఇందువలన ఆ దూలములలో చాలభాగము ఓడకు పైఁగా పోయియుండును. అట్టి బెజ్జమునకు 'గుమారు' అని పేరు.

గోనునరా ! - "ఓడ తిరుగబడి పోతున్నది; గోనునరా ! గోనున వస్తే ఓడ నిలుస్తుంది." గాలి ఓడకు ఒక ప్రక్కమీఁదనే గట్టిగా వీచుచున్నప్పుడు ఓడ ఒరిగి పోవును. అప్పుడు ఓడను మరి ఒక ప్రక్కకు త్రిప్పిన అది నిలుచును.

గోన్ బోడుదో! - About ship ! To luff - అనిమిని గాలి దారిలోనికి త్రిప్పుట. అట్లు త్రిప్పుచు ఓడలో వారు అను మాట.

గోన్ వెళ్లుట - Ieeway - గాలి తెరచాపలను నింపగా గాలిదారిగా ఓడనడచుట - చూ. డమాన్ వెళ్లుట.

చడాలు ఊడినకొన - Fag end - అతి తగుచుగా వాడుక అగుట చేత త్రాటికొన పురి విడిపోవును. అట్టికొన చడాలు ఊడినకొన. ఆ కొనకు పుర్వాను దారము వేసి కట్టుదురు. అట్లు కట్టుటకు చడాలు కట్టడమని పేరు.

చడాలు కట్టుట - పురి విడిపోయిన త్రాడుకొనలు పైన్వానుతో కట్టుట.

చాటలు - Flukes - లంగరులో వాడికొనలు (పన్నులు) మొద్దు అయిపోకుండ వానికి తగిలించిన గిన్నెలు.

చారుకట్లు - Fid 1. క్రింది కొయ్యమీఁద సెలకొయ్య (మీఁదికొయ్య) ఎత్తినప్పుడు అమీఁదికొయ్య బరువును ఆపుటకు ఏర్పరచిన కఱ్ఱ. ఇది ఒకప్పుడు ఇనుముతో కూడ చేయుదురు. దీని కొనకొనను భుజమువలె ఉండును.

2. కఱ్ఱమేకు - గట్టి కఱ్ఱముక్కను గుండుసూదిలాగు చేసి త్రాళ్లకొనల పురి విప్పుదురు. చూ. పావిడోలు.

చిక్కుతీయుట - To overhaul - చిక్కుపడిన త్రాళ్లను సరి చేయడము.

చిన్న తండేలు - One of the boat-swain - పెద్దతండేలు తరువాత అధికారి. చూ. పెద్దతండేలు, కేటు తండేలు.

చిలికీ - Rudder wheel - చిలికీ అనునది చుక్కాణిని త్రిప్పు యంత్రము. చుక్కాణి యొద్దనున్న భాగమున కంతటికిని చిలికీ అనియే అందురు.

చీడీ - Gangway - తండాలోను, తట్టు మీఁద కూడ మనుష్యులు వెళ్లుటకును వచ్చుటకును ఉండునట్టి మార్గము.

చుక్కబల్ల - పూర్వకాలమున క్వాడ్రాంటు, సెక్స్టాంటు. మొదలయిన ఉపకరణములు లేనప్పుడు వానికి బదులుగా ఒక బల్లముక్కను ఉపయోగించుచుండిరి. ఈ బల్లమీఁద కొన్ని గీఁతలుగీసి, ఒకొక్క గీఁతకు ఒకొక్క స్థలముయొక్క పేరుపెట్టి, బల్లకు అడుగున ఒకదారముకట్టి, దారమును ఆయా గీతలమీఁదికి త్రిప్పుచు అర్షను (లాటిట్యూడు) కనుగొనుచుండిరి. అట్టి బల్లకు చుక్కబల్ల అనిపేరు. ఇప్పటికిని చుక్కబల్లను అక్కడక్కడ ఉపయోగించుచున్నారు.

చుక్కాణి - Rudder - ఓడను ఇటునటు త్రిప్పు యంత్రము.

చుట్ట - Life-buoy - ఎవడైన నీటిలో పడినప్పుడు ఈ చుట్టను నీటిలోనికి విసరుదురు. సాధారణముగా బెండుతోఁగాని కఱ్ఱతోఁగాని చేయుదురు. దీనిమధ్యగా ఒకపొడుగుపాటి కఱ్ఱ అమర్చఁబడి ఉండును. ఈ కఱ్ఱకు క్రింది కొనను సీసము బరువు కట్టుదురు. మీఁదికొనకు ఒక బావుటాయును చిన్నగంటయును కట్టుదురు. పగటివేళ బావుటాచూచియు, రాత్రివేళ గంటచప్పుడు వినియు ఓడలోనివారు నీటిలోనివాఁడు ఉన్నస్థలమును పోల్చుకొందురు. ఈ చుట్టమీఁద వాడు కూర్చున్నను మునిగిపోకుండ ఉండునట్టు తేలికగానే దీనిని కట్టుదురు.

చెయినుబోల్తాపడుట - Elbow in the hawse - అమారు తనమీఁద తాను తిరుగఁబడి మెలతలు పడుట.

ఛత్రి - Awning, cuddy - మిక్కిలి ఎండగానున్నప్పుడు మనుష్యులకు ఎండ తగులకుండ, తట్టు ఎండచేత చెడిపోకుండ గొడుగువలె ఎత్తిన గుడ్డ.

జమ్నా = ఎడమప్రక్క - ఉదా. జమ్నా-బోడిద = ఓడకు ఎడమ ప్రక్క; గాయి-జమ్నా-తీరు = గాయికి ఎడమప్రక్కనున్న తీరు.

జమ్నా-బోడిద - Larboard - ఓడయొక్క ఎడమప్రక్క - ముఖము అనిమివైపు త్రిప్పియుండగా ఎడమవైపు ఉన్నప్రక్క - చూ. డావు - బోడిద.

జాటుకర్ర - Swab - చెడిపోయిన త్రాళ్లనన్నిటిని కుచ్చుగా కట్టి, తట్టు, కేమిరీలను బాగుచేయుటకు ఉపయోగించు చీపురు.

జీబీ - Jib - అనిమివద్దనున్న జీబీ - బోముకు తగిలించినట్టియు, ఓడలో అన్నిటికంటె ముందుగా ఉన్నటువంటియు పెద్ద తెరచాప. ఇట్టివి మూఁడునాలుగు ఉండును.

జీబీబోము - Jibboom - అనిమి వద్దనుంచి పైకి వ్యాపించియున్న ఒక కట్టె.

జేరు - Lee - గాలి ఏవైపు వీచుచున్నదో ఆ ఱక్క - చూ. మే (బోడిద). The ship is a - lee = నావ జేరు బోడిదగా నడుస్తున్నది. రూ. జేరా.

జేరా - Lee - రూ. జేరు.

జేరుదరి - Leeshore - గాలి ఏ వైపు వీచుచున్నదో ఆదరి.

జేరుబోడిద - Leeside of a ship - గాలి యేవైపుగా నావమీఁద ఎడుచున్నదో ఆ బోడిదలేక ప్రక్క.

టప్పా - Distance found out by the log - టప్పా - రాట్నమును బట్టి ఓడ నడచినదూరము - ఈ దూరములను లాగ్ పుస్తకములో ఎక్కించుదురు.

టప్పా - రాట్నము - Log - నావ యెంతవడిగా పోవుచున్నదో, అందు మూలముగా ఎంతదూరము నడచినదో తెలిసికొనుట కుపయోగించు ఉపకరణము. ఇది క్వాడ్రాంటు రూపముకలిగిన ఒక బల్లముక్క. దీని కుండ్రని అంచుకు సీసము అమర్చిఉంతురు. అందువలన అది నీటిలో ఇటు

నటు కదలిపోక నిలువుగా ఉండును. దీనికి సుమారు 120 ఫాదములు పొడవు గల దారము కట్టబడి ఉండును. దీనికే లాగ్ దార మందురు. ఈ దారముమీఁద 'నాట్లు' అనే భాగములు గు ర్తింపఁబడి ఉండును. ఈ దారము ఒక చక్రము నకు చుట్టిఉంచి, ఉపయోగించవలసి వచ్చినప్పుడు ఆ చక్రము మీఁదనుండి నులువుగా జారవిడుతురు.

టోపు - Cap - బలమైనట్టియు, దళసరియైనట్టియు ఒకబల్ల. దీనిలో రెండుబెజ్జము లుండును. అందులో ఒకటి చదరముగాను, రెండవది గుండ్రముగాను ఉండును. దీనితో రెండు కొయ్యలను కలిపి ఉంచుటకు వీలవును.

డమానులు - Laniards - చాపల క్రింది కొనలను బిగువుగా లాగి ఉంచు డమానుతాళ్లు. = a sail. డమాను మాసము = The sailing season.

డమాన్ వెళ్లుట - To make lee - way - చాప లెటువైపు గాలితో నిండిఉన్నదో ఆ వైపు నావ నడచుట - చూ. గోస్ వెళ్లుట.

డావు - The right side - కుడిప్రక్క, - "డావు బోడిద" = ఓడకు కుడిప్రక్క, - "గాయి డావుతీరు" = గాయికి కుడివైపు ఉన్నతీరు.

డావు బోడిద - Starboard - అనిమివైపు మొగము త్రిప్పిఉంచఁగా కుడివైపుఉన్న ఓడప్రక్క.

తక్కువ పదును - Neap-tide - సముద్రము తక్కువగా పొంగిఉండడము. చంద్రుడు రెండు, మూడు పావులలో ఉన్నప్పుడు నీటికి కలుగు పదును లేక పొంగు. చూ. హెచ్చుపదును = Spring tide.

తట్టు - Deck of a ship - నావయొక్క పైభాగము. తట్టువడు = To go aground.

తండా - Aboard or inboard, Hold - ఓడలోపలి ప్రదేశము తండుకోల = An oar = తెడ్డు.

తండేలు - Boatswain - నావమీఁద రింగినీ, చుక్కాణి, లంగరు, మొదలగు వానిమీఁద అధికారి. అట్టివారు సాధారణముగా ముగ్గు రుందురు. పెద్ద తండేలు, చిన్న తండేలు, కేటు తండేలు అని వారిపేళ్లు.

తయార్! - Ready about! - ఓడ కళాసులందరును ఏదైనా ఒక పనిచేయుటకు సిద్ధముగా ఉండుమని ఆజ్ఞ. చూ. తయార్ జాగా!

తయార్ - We are ready - తండేలు 'తయార్!' అని ఆజ్ఞ యిచ్చినప్పుడు కళాసులు 'తయార్' అందురు. అనఁగా సిద్ధముగా ఉన్నామన్నమాట,

తయార్ జాగా ! - Same as తయార్ ! Ready about !

తరపాలు - Tarpawlins - వెడల్పైన కేన్వాసు గుడ్డలు. వీటికి బాగుగా తారు పూయుదురు-వీనిని కుతిలీమీఁది పాలకాయలమీఁద పఱతురు. అందువలన వర్షము వచ్చినను మరి యేలాగో నీరు హెచ్చుగా నున్నప్పు డది తండాలోనికి వెళ్లకుండ నిలుచును.

తరము - List - ప్రక్కకు ఒరగుట - "ఓడ జేరుకు తరముగా ఉన్నది" = జేరుబోడిద వైపు ఒరగిఉన్నది.

తలారికొట్టు - Cockpit - జబ్బుగా ఉన్నవారు పడుకొనుటకు ఓడలో ఉండుగది - యుద్ధములో గాయములు తగిలినవానిని పూర్వ మీాగదిలో ఉంచుచుండిరి.

తాకి తేలుట - Afloat - ఓడ నేలకుతాకి ఉన్నప్పుడు నీరు హెచ్చయి తేలుట.

తాడు ఒత్తులుఅగుట - Loose - తాడు వదులగుట.

తాడు బారుచేయుట - To belay - తాడు ఒత్తాలుగా నుండిన బిగువుగా లాగుట.

తాడు చెరిసగము చేయుట - Bight - రెండు కొసలనుకలిపి తాడు దళముగా ఉన్నట్టు చేయుట.

తాడు వ్రెరా వేనుక పోవుట - Kink - అమారుగాని, మరి యేతాడు గాని మలతలు పడుట.

తిరగతి ఓడ - Brig - రెండు కొయ్యలుకలిగి ఆరెండింటికిని చాపలు, పరమానులు ఉన్నఓడ.

తిరగబడుట - Capsize - ఓడ ప్రక్కకు పడిపోవుట.

తిరగతి కొయ్య - అమరము దగ్గఱనున్న కొయ్య.

తీరు - Crane - బరువైన వస్తువులను మీాఁదికి ఎత్తుయంత్రము.

తీరులు - అకరాబులకును, తూర్పు, పడమర, ఉత్తరము, దక్షిణముల కును సరిగా మధ్యనుండు దిక్కులు. చూ. సమకా.

తీరుకర్రలు - Chestrees - ఓడప్రక్కలను అమర్చఁబడిన కట్టెలు. ముఖ్యమైన త్రాళ్లన్నియు ఈ కట్టెలలోని బెజ్జముద్వారా పోవును.

తూర్పు అకరాబు - North-east తూర్పునకును ఉత్తరమునకును సరిగా మధ్యనున్న దిక్కు. చూ. సమకా,

తూర్పు అకరాబు - జమ్నా - కొచ్చాకు - North - east by North- తూర్పు అకరాబుకు ఎడమవైపు 360 డిగ్రీలలో 1/32 వంతు డిగ్రీలుగా ఉండు దిక్కు. చూ. నమకా.

తూర్పు అకరాబు - డావు - కొచ్చాకు - North - east by East తూర్పు అకరాబుకు కుడివైపు 360 డిగ్రీలలో 1/32 వంతు డిగ్రీలుగా ఉండు దిక్కు. చూ. నమకా.

*తూలు - 1. Longitude-గ్రీనిచ్‌నుండి తూర్పుగానో పడమరగానో ఎన్ని డిగ్రీలు ఉన్నదియు తెలుపు కొలత.

2. Departure - ఓడ ఒక స్థలమునుండి తూర్పుగానో పడమరగానో ఎంతదూరము పోయినదియు తెలుపు కొలత.

తెప్ప - Raft - కొన్ని బల్లలను కలిపినట్టి, నదులలో దగ్గరదగ్గర దూరములకు పోవుటకు ఉపయోగించు బల్లకట్టు.

తేలిపోవుట - Adrift - ఓడను ఒకచోటస్థలములో ఉంచుటకు లంగరుకు బలము చాలకపోయిన ఆ ఓడ నీటిచేత నడచిపోవుట - చూ. లంగరు ఈడ్చుకపోవుట.

తొందర - Heave of the sea - హెచ్చుపదునుగా నున్నప్పుడు ఓడ మిక్కిలి వడిగా పోవుట.

తొగాలి - Scraper - చూ. ఇనుకరావు.

దండి = Stock beam or shank of an anchor - లంగరుయొక్క ఇనుపకొయ్య - రూ. దండీ.

దండీ - రూ. దండి.

దబరా - Capstern - త్రాళ్లు మొదలైనవి బరువుగా ఉండి వానిని ఎత్తుటకు మనుష్యులకు సాధ్యముకానప్పుడు ఉపయోగపడు యంత్రము. లంగరునుకూడ ఈ యంత్రముతోనే ఎత్తుదురు - చూ. మిసింబరు.

దబరాత్రిప్పు - To heave - లంగరునుగాని మరి దేనినిగాని దబరాతో మీదికి ఎత్తుట - "దబరా అబేస్ చెయ్యి."

దరచాప - Clue of a sail - చదరపు చాపలక్రింది కొనలు.

దరి - Beach - సముద్రమునంటి ఉన్న నేల.

దరిచూచుట - To make the land - కొయ్య సెలమీదికి వెళ్లి నేల సమీపముగా ఉన్నదియు లేనిదియు చూచుట.

దూద్‌పాలు - బొంబాయిలోని ఒక గొట్టము. బొంబాలోని నీటిని దూద్‌పాలు లాగుకొనఁగా లాడ్‌పాలు పైకి పంపించివేయును.

దూరము - Aloof.

దోనె - కోనచాపగల ఒంటికొయ్య ఓడ. చూ. పడవ.

నత్తరపాడా - Grapnell, kedge - చిన్నలంగరు - దీనికి దండి ఉండదు. నాలుగైదు పండ్లుమాత్ర ముండును. చిన్న పడవలను కలిపి ఉంచుటకు దీనిని వాడుదురు. రూ. నత్తరపొడా. (A kedge has a stock, but not a grapnell)

నాలుగుకొయ్యల మనవరి - A four-masted man-of-war - నాలుగు కొయ్యలును అన్నిటికిని చాపలు, పరమానులు గల మనవరి.

నిశానికొయ్య - నాలుగుకొయ్యల ఓడలో అనిమి దగ్గర ఉన్నకొయ్య.

నేజాపటాలు - Chain plates - ఓడ ప్రక్కలకు అమర్చబడిఉన్న ఇనుపరేకులు - వీనికి ముత్తాములు తగిలించఁబడి ఉండును.

నేరము - Ballast, kentledge - ఓడ మిక్కిలి తేలిపోయిన, తిరుగఁబడిపోవును. అందుచేత అది కొంతవఱకు నీటిలో దిగి ఉండవలెను. తండాలో సరుకు వేసినచో అట్లు దిగి ఉండును. కావలసినంత సరుకు లేనప్పుడు రాళ్లు, మన్ను, ఇనుపదుక్కలు మొదలయిన బరువును తండా అడుగున పడవేయుదురు. అట్టిదానికి నేరము అని పేరు.

పక్కీ - Slip - సత్తారుగా అనగా వాలుగా ఉన్న నేల.

పడవ - కోనచాపగల ఒంటికొయ్య ఓడ - చూ. దోనె.

పచ్చర్లు దిగఁగొట్టుట - Jamming - ఒక వస్తువును మరి రెండు వస్తువుల మధ్యను పెట్టి కదలకుండ బిగించుట.

పడకచెక్కలు - Dunnage - తండా అడుగున కన్నములుండిన నీరు, వచ్చి సామాను తడిసిపోకుండ వేసిన కట్టెచెక్కలు.

పన్ను - Fluke - లంగరుయొక్క వాడికొన.

పరాన్‌జీబీ - జీబీలలో ఒకభేదము - చూ. నవాయిజీబీ, సైతాన్ జీబీ, బోముజీబీ.

పరమాను - Yard - కొయ్యలకు అడ్డుగా ఎత్తినకట్టె - దీనిమీఁద చాపలు పఱచుదురు.

పలాను ఎత్తుట - పాతత్రాళ్లు పురివిప్పివేసి ఒక దగ్గర పడవేయుట.

పల్లమునకు వెళ్లుట - To observe the offing - సముద్రముమీఁద నీరు ఆకాశము కలిసియున్న స్థలమును చూచుట.

పాతఓడ - Hulk-నబురుకు మరి పనికిరాక ఒకమూల పడివేసిన ఓడ.

పాతబడుట - Broken backed - ప్రాఁతదయిగాని, ప్రమాదము వల్లగాని అల్లలాడుచు అనిమి అమరాలు క్రుంగిపోవుట.

పాలకాయలు - Hatches - కుతిలీమీఁద ఉన్న తలుపులు.

పాలకాయ బద్దెలు - Batten - పొడుగుపాటి సన్నని కఱ్ఱబద్ద. వీనిని పాలకాయలమీఁద తాపుదురు.

పాలకాయలకు బద్దెలువేయుట - To batten down the hatches - పాలకాయలమీఁద బద్దెలువేసి బిగించుట.

పావుడాయలు - Marling spike - త్రాళ్ల పురివిప్పుటకు ఇనుముతో గాని కఱ్ఱతోగాని చేసిన గుండుసూది.

పావిడోలు - Fid - చూ. చారుకట్లు.

పిలోతులు - Rullocks, bitts - తెడ్లు వేయుచున్నప్పుడు వానిని ఉంచుటకు ఓడప్రక్కలను ఉండు కన్నములు - చిన్న పిలోతులకు 'ముక్కులు' అని పేరు - చూ. ముక్కులు.

పురాలుకట్టుట, - చుట్టుట, - వేయుట, - Keekling, rounding, serving - త్రాటికిరాపిడి హెచ్చుగా తగులకుండ దానిచుట్టును పైని చుట్టుట.

పూటుతక్కువ ఓడ - Crank - బరువుచాలక నీటిమీఁద ఎక్కువగా తేలిఉన్న ఓడ.

పెద్దకొయ్య - నాలుఁగుకొయ్యల ఓడలో అమరమునుండి రెండవ కొయ్య - Mainmast.

పెద్ద తండేలు - Chief Commander in a ship - నావమీఁది అందఱిమీఁదను అధికారి.

పేటీలాను - Gasket - చాప ఎత్తినతరువాత కదలకుండ దాని చుట్టును వేసినత్రాడు.

పేటీవేయుట - To furl - చాప ఎత్తి పేటీలాను కట్టుట.

పొడుపు - Fore-and-aft-అనిమి అమరాలప్రక్కగా ఉన్న ఓడకొలత.

పొంతా(లు) - Bend - లంగరుకుగాని, మరిఒక త్రాడుకుగాని కట్టి ఉన్న త్రాడుకొన.

పొంతాలు ముడివిడియుట - To bend - పొంతాలువద్దనున్న ముడిని విప్పుట.

పొన్నా - Fore-castle - అనిమివద్ద తట్టుకుపైగా ఏర్పరచిన మరి ఒక ఎత్తుతట్టు - ఇచ్చట ఒకగది (birth) ఉండును. దీనిలో కళాసులు నిద్ర పోదురు.

పొర్లుట - To labour - సముద్రము అల్లకల్లోలముగా నున్నప్పుడు ఓడ ఇటునటు, పడుచు కొయ్యలకును, క్రిందిభాగమునకును కూడ అపాయము కలిగు స్థితిలో ఉండుట. చూ. రోలుమోపు అగుట.

పోటు - Flow tide. సముద్రముపొంగి హెచ్చుపదునుగా ఉన్నస్థితి. చూ. హెచ్చు పదును.

ఫిరంగిగంతలు - 1. Gratings - తండులోని క్రిందిగదులకు గాలి, వెలుతురువెళ్లుటకు పాలకాయలయొద్ద చిక్కుచాపలవలె ఉన్న కన్నములు - 2. Loop-holes - యుద్ధనావలలో ఫిరంగులు ఉంచుటకు పనికివచ్చు కన్నములు.

ఫిరాయించుట - About - ఓడ ఒకప్రక్కనుండి మఱియొకప్రక్కకు త్రిప్పుట.

బడికొయ్యలు - Bare poles - చూ. ఉత్తకొయ్యలు.

బత్తాయిలు - Lumpers - హార్బరులో ఓడ యున్నప్పుడు సరుకు దింపుటకును లోపలవేయుటకును ఎర్పరచిన కూలీలు.

బత్తికొయ్య - Lighthouse. దీపస్తంభము. దీనిలోని దీపమువలన రాత్రివేళ ఓడ ఏ స్థలములో ఉన్నదియు తెలియును.

బద్దలగుట - Bilge - ఓడపలకలు విడిపోవుట.

బరాసులు - Braces - తెరచాపలను గాలివైపు త్రిప్పుటకు ఉపయోగించు త్రాళ్లు.

బరాసులాగు - To brace to - గాలివైపులేని చాపలను వదలి, గాలికెదురుగా ఉన్నవానిని లాగిఉంచుట.

బాయర్ పరమాను - ఒకవిధమైన పెద్దపరమాను. చూ. పరమాను.

బార - Fathom - ఆరు అడుగుల కొలత.

బారుచేయుట - To belay - వదులుగా ఉన్నదానిని బిగువుగా ఉండునట్టు లాగుట.

బావు - Tiller - చుక్కానిని త్రిప్పుటకు ఉపయోగించు కఱ్ఱ.

బావుటా - Ensign - జెండా. ఇట్టి బావుటాలు అనేకము లుండును. దూరముగా ఉన్న ఓడలకు రంగులబావుటాలతో సంజ్ఞలు చేయుదురు. ఇదిగాక అన్ని ఓడలకునుఅది యే దేశపుదో తెలియఁజేయు బావుటా ఉండును.

బిగిలు ఊదుట - Call on the bugle - బూరా ఊదుట.

బుడిదీబొక్కలు - Scuppers - ఓడతట్టుమీఁదచేరిన నీరు మరల సముద్రములోనికి పోవుటకు ఏర్పఱచిన బొక్కలు - వీనికి సీసపురేకు అమర్చుదురు.

బుడిదీవేయుట - To sound - సీసపుముక్కను నీటిలో వదలి లోతు కనుగొనుట.

బురమాబొత్తా - Apron - ఫిరంగిగంతలద్వారా నీరు తట్టుమీఁదికి రాకుండ వేసిన సీసపుముక్క.

బూరా - Bugle - బిగిలు.

బొజ్జము - Leak - కన్నము.

బొజ్జము కోయడము - Scuttling - ఓడను ముంచివేయుటకుఁగాని ఇసుకలో దిగఁబడినప్పుడు దానిలోని సరుకు వేగముగా దింపుటకుఁగాని తండా అడుగునను, ఓడప్రక్కలను, పెద్దకన్నములు చేయుట.

బైసాపడుట - Aback - గాలి ఒత్తిడిచేత చాపలు కొయ్యలకు అంటుకొనిపోవుట.

బైసాపడకపోవుట - To miss stags - గాలిమార్గముగా అనిమి నడవకపోవుట.

బొణియాపోరీ - Dog watch - నావమార్గమును కనిపెట్టుచు నేల కనఁబడినను అపాయము రానున్నను తెలియఁజేయువాఁడు. వీఁడు తనస్థానమును వదలకూడదు. అట్లు కనిపెట్టుచుండువారిలో రాత్రి పండ్రెండుగంటలనుండి మధ్యాహ్నము పండ్రెండు గంటలవరకు నుండువాఁడు బొణియాపోరి. చూ. నందపోరీ.

బొంబా - Pipe - తండాలోని నీటిని పైకిపంపించు గొట్టము. దీనిలో రెండుగొట్టము లుండును. దూద్‌పాలు అనుగొట్టము నీటిని మీఁదికి లాఁగఁగా, లాడ్‌పాలు పైకి పంపించును.

బొంబాపట్టుట - Bale - తండాలోని నీటిని పైకి తోడివేయుట.

బోడిద - Board - ఓడప్రక్క - జిమ్మాబోడిద - ఎడమప్రక్క; డావుబోడిద = కుడిప్రక్క.

బోము - Boom - జీబీలు తగిలించు పెద్దకఱ్ఱ.

బోమ్‌జీబీ; లేక సైతాన్‌జీబీ - జీబీలలో ఒకభేదము.

బోయా - Buoy - ఇది ఒక పెద్దపీపా, లేక, కఱ్ఱదుక్క; దీనిని లంగరుకు కట్టుదురు. దీనిస్థానమునుబట్టి లంగరు నీటిలో ఎక్కడ ఉన్నదో తెలియును.

భూమితాకుట - To get stranded - నేలకు ఓడ తగిలి కదలకపోవుట.

మతలయి - East - తూర్పుదిశ. చూ. సమకా.

మతలయి-జమ్నా-కొచ్చాకు - East by North - మతలయికి ఎడమవైపు 360 డిగ్రీలలో 1/32 వంతు డిగ్రీలుగా ఉన్నదిక్కు. చూ. సమకా.

మతలయి-జమ్నా-తీరు - East-North-East - తూర్పు ఈశాన్యములకు సరిగా మధ్యనున్నదిక్కు. చూ. సమకా.

మతలయి - డావు - కొచ్చాకు - East by South - మతలయికి కుడివైపు 36 డిగ్రీలలో 1/32 వంతు డిగ్రీలుగా ఉన్నదిక్కు. చూ. సమకా.

మతలయి - డావు-తీరు - East-South-East - తూర్పుకును ఆగ్నేయమునకును సరిగా మధ్యనుండుదిక్కు. చూ. సమకా.

మనవరి - Man-of-war - తెరచాపలును, పరమానులును గల మూడు కొయ్యల ఓడ.

మరిమినీరు - Bilge water - ఓడు అడుగుభాగము బల్లపఱపుగా ఉండుటచేత బొంబాలోనికి వెళ్లకుండ నిలిచిపోయిన నీరు.

మసాలాకట్టుట - Siezing - రెండుత్రాళ్లనుగాని, ఒకటేత్రాటి లోనిభాగములనుగాని దారముతో కలిపి కట్టుట.

మాకు - Stem - అనిమిదగ్గఱ రెండుబోడిదలను కలుపుటకు ఉంచిన గుండ్రనిబల్ల. దీనిక్రిందికొనకు పరువా చేర్చఁబడును. మీఁదికొనమీఁద అనిమికొయ్య నిలుచును.

మాతు - Mouse - కొయ్యలను పట్టిఉంచు త్రాళ్లకొనలను ఉండు చిన్నబంతి లేక గుండు. చూ. సవాయి.

మాలీ - Shank painter - లంగరు ఎత్తివేసిన తరువాత దండీని, పన్నులను మీఁదికి ఎత్తిఉంచు చిన్నత్రాడు.

మాలీము - Pilot - ఓడను నడిపించు అధికారి. ఓడ సబురులో ఉన్నంతవఱకు ఓడలోనివ్యాపారందఱు నితనికిలోఁబడి పనిచేయవలెను. ఇతఁడు

లెక్కలుచేసియు, పరీక్షచేసియు, చార్టులుచూచియు, ఓడయొక్క, [illegible], తూలు, కాలము, స్థానము, మొదలయినవానిని కనుగొనుచు ఏ ముజరా మీఁద నడిపించవలెనో చెప్పను.

మిసింజరు - Messenger - లంగరు ఎత్తునపుడు దబరానత్తున అమారుకు చేరునట్లు చేయుత్రాడు. చూ. యారీ.

ముక్కులు - Davit - లంగరు ఓడప్రక్కలకు తగులకుండ మీఁదికి ఎత్తుటకు ఉపయోగించు పొడుగు కఱ్ఱ.

ముజరా - A point of the compass - కంపస్సులేక సమకా మీఁద చూపఁబడిన ఒక దిక్కు.

ముజరామీఁదికి తెచ్చుకోవడము - To right the helm - జమ్నా ఖోడిదకో, డావుఖోడిదకో, ఓడను త్రిప్పిన తరువాత చుక్కానిని సర్దుకొనుట.

ముతాకోడు-అకరాబు - North-west - వాయవ్య

ముతాకోడు-అకరాబు-జమ్నా-కొచ్చాకు - North-west by West - ముతాకోడు అకరాబుకు ఎడమవైపు 360 డిగ్రీలలో 1/32 వంతు డిగ్రీలుగా ఉండు దిక్కు. చూ. సమకా.

ముతాకోడు-అకరాబు-డావు-కొచ్చాకు - North-west by North - ముతాకోడు అకరాబుకు కుడివైపు 360 డిగ్రీలలో 1/32 వంతు డిగ్రీలుగా ఉండు దిక్కు. చూ. సమకా.

ముత్తాములు - Dead-eyes - చాపలను కట్టు కఱ్ఱలు పోవుటకు మూఁడేసి బెజ్జములు గల కఱ్ఱ దిమ్మలు.

మేఖోడిద - Windward - గాలి వీచువైపుకాక రెండవవైపు ఉన్న ప్రక్క. చూ. జేరుఖోడిద.

మొక్కులు - Bitts - చిన్నపిలోతులు. చూ. పిలోతులు.

మోజా - Spray - చూ. ఓటు.

యారీ - Messenger - చూ. మిసింజరు.

రంత్రాలు - Rat-lines-తట్టుదగ్గఱనుండి చాపలకు అడ్డముగా సమాన దూరములలో కొయ్యల కొనలవఱకును పోవుత్రాళ్లు - ఇవి నిచ్చెనవలె ఉపయోగించి కొయ్యల కొనలవఱకు నెక్కుటకు పనికివచ్చును.

రింగినీ - Rigging - ఓడ కొయ్యలకును, చాపలకును తగిలించియున్న త్రాళ్లకన్నిటికిని ఇది పేరు.

రింగినీ చేయుట - To rig - ఓడ త్రాళ్లనన్నిటిని ఎత్తి ఉంచుట.

రిగ్గింగులేని ఓడ - **Hull** - త్రాళ్లు ఏవియు లేకుండు ఓడయొక్క క్రింది భాగమునకు మాత్రము ఇది పేరు.

రింగు - లంగరు దండీ కొసకు త్రాడు కట్టుటకు ఉన్న రింగు.

రీపు - **Range of a cable** - అమారు ఎంత దూరమువరకు సాగి పోగలదో ఆ దూరము.

రూములు - **The eight points of the Compass; generally all the points of the Compass; Rhumblines** కంపస్సు లేక సమకా మీఁద చూపఁబడిన అష్టదిక్కులకును, ఒకప్పు డన్నిదిక్కులకును ఇది పేరు.

రోదా - **Sheave** - ఒకదిమ్మలో అమర్పఁబడిన త్రాడు జారుటకు ఏర్పరుపఁ బడ్డ చక్రము.

రోలు మోపు అగుట - **To labour** - చూ. పొర్లుట.

లంగరు - **Anchor** - దీనికి త్రాడు కట్టుటకు మీఁద రింగుగల ఇనుప దండీయును, దాని అడుగున వంగియున్న ఇనుపదుక్కయును, దుక్కకు రెండు కొనలను వాడియైన పన్నులును, ఈ పన్నులు మొద్దుకాకుండ వానిమీఁద చేటలును ఉండును. దండీయును, క్రింది ఇనుపదుక్కయును కలియుచోట ఏర్పడిన కోణములకు సంకలు అని పేరు. ఈ లంగరుకు కట్టిన త్రాటికి అమారు త్రాడని పేరు.

లంగరు ఈడ్చుకపోవుట - **A drift** - చూ. తేలిపోవుట.

లబ్బు అద్దములు - **The coloured glasses in the quadrant and the sextant** - క్వాడ్రాంటు, సెక్స్టాంటులలోని రంగుఅద్దములు.

లాగ్‌పలక - **Logboard** - ఒకదినమున సమాచారమంతయు అనఁగా ఏయే వేళలకు ఏ లాటిట్యూడు (అక్షు), ఏ లాంజిట్యూడు (తూలు)లలో ఉన్నదియు, గాలులు, త్రోవలో జరగిన ఇతరవిషయములు మొదలయినవి ఎప్పటి కప్పుడు వ్రాసికొనుటకు ఉపయోగించు నల్లబల్ల. ప్రతిమధ్యాహ్నము ఈ విషయముల నన్నిటిని లాగ్‌పుస్తకలోనికి ఎక్కింతురు.

లాగ్‌పుస్తకము - ఆ యా రోజులలో జరిగిన విషయములను లాగ్‌పలక మీఁదనుండి ఎత్తి వ్రాసి ఉంచుకొను పుస్తకము.

లాడ్‌పాలు - బొంబాలోని ఒకగొట్టము. తండాలోని నీటిని దూద్‌పాలు మీఁదికి ఎత్తఁగా, లాడ్‌పాలు పైకి పంపించును. చూ. బొంబా. దూద్‌పాలు.

లాతాలు - Beams - బల్లమైన దళసరి కఱ్ఱదుక్కలు. ఇవి ఓడను అడ్డుగా వేయబడి రెండు ప్రక్కలను కదలకుండ బిగువుగా నుంచును. వీని వలన తట్టుకుకూడ చాలబలము. లాతాలు తట్టుకు పై భాగమున ఉండును. చూ. వారులు.

లాసులు - Earings - మీదిలాసులు. ఈ చాపలమీఁది కొనలను పరమానులకు లాగి కట్టుతాళ్లు. sheets క్రిందిలాసులు. క్రిందికొనలను లాగి ఉంచునవి.

లింగీలు - Nippers - లంగరు ఎత్తునప్పుడు మిసింజరుత్రాటిని అమారుని కలిపికట్టుటకు ఉపయోగించు చిన్నత్రాళ్లు.

లోతు - (రెండు ఓట్ల మధ్యనుండునది) - Trough - రెండు పెద్దకెరటముల మధ్యను ఏర్పడిన లోతు. ఓడ ఈ లోతులో పడిన చాల దెబ్బతినును.

వట్రకాను. రూ. వట్రపుకాను - Hawse holes - చూ. గుడుగుడా.

వట్రపుకాను రూ. వట్రకాను.

వారులు - Beams - చూ. లాతాలు. లాతాలు తట్టుమీఁదుగా ఓడయొక్క రెండు ప్రక్కలను బిగించును. వారులు లోపలిభాగములో అనఁగా తండాలోనుండి బిగించును.

సంకలు - లంగరు దండీయును క్రిందిదుక్కయును కలియు దగ్గఱ ఏర్పడు కోణములు.

సత్తారు - Sloping - వాలుగా ఉన్న నేలకు 'సత్తారుగా ఉన్న నేల' అందురు. చూ. పక్క.

సందపోరీ - Dog-watch - మధ్యాహ్నము 12 గంటలనుండి రాత్రి పండ్రెండు గంటలవఱకు పారా ఇచ్చువాడు. చూ. బోణీయాపోరీ.

సబురు - Voyage, run - ఓడప్రయాణము. "ఓడలు రేవులో లేవు; సబురువెళ్లి ఉన్నవి." "ఏడాదికి ఒక ఓడ నాలుగు సబుర్లకంటె హెచ్చు వెళ్ల లేదు." "సబురుకు మాలీముకు 500 రూపాయలు ఇస్తారు." "తెనుగు ఓడలు ఒకొక్కప్పుడు చీనా, జపాన్, వరకూ సబురు వెళ్లుతవి." "దరివెంబడినే సబురు వెళ్లడము సులభము. నడిసముద్రముమీద కష్టము."

సముకా - The Mariner's Compass - ఇది ఏ స్థలముయొక్క దినను పూర్వాపరజనును తెలుపు గుండ్రని అట్ట. దీని సెంటరునుండి చక్కువ్యారెన్ను వఱకును గీతలుగీసి దీనిని 32 సమభాగములు చేయుదురు. ఈ గీతలకు రూము గీతలనిపేరు (Rhumblines). ఈ గీతలకొనలకు రూములనిపేరు (Rhumbs). రూములకు పోయంట్లు అని కూడ సంజ్ఞకలదు. ఒకపోయంటు మరిఒకపోయంటు

కును మధ్యభాగము అరలుగను (halves) పావులుగను భాగింతురు. సర్కాన్ఫరెన్సు అంతయు 360 డిగ్రీలుగా భాగింపఁబడి ఉండును గనుక రెండురూముల మధ్యను ఏర్పడిన కోణము 11 డిగ్రీల 15 మినిట్లు కొలతకలిగి ఉండును. ముఖ్య దిశలు నాలుగు: ఉత్తరము, దక్షిణము, తూర్పు, పడమర. వీనిలో రెండేసింటికి మధ్యగా మరినాలుగు దిక్కులు ఏర్పడును: ఈశాన్యము, ఆగ్నేయము, నైఋతి, వాయవ్యము. ఈ యెనిమిది దిక్కులే అష్టదిక్కులను పేర వ్యవహరింపఁబడుచున్నవి. ఇంగ్లీషులో పైనిచెప్పిన 32 రూములకును పేళ్లున్నవి. తెనుఁగులోఁగూడ ఆ పేళ్లకు సరియైనమాటలు ఉండుటయే కాకుండ, ఇంకను చిన్నభాగములకును పేళ్లు కలవు. ఈ పేళ్లన్నిటిని అరబ్బులనుండి మనవారు ఎరువు తెచ్చుకొన్నట్లు కనిపించును. రెండు ముఖ్యదిక్కులకు సరిగా మధ్యనుండు భాగమునకు 'అకరాబు' అని పేరు. ఒక అకరాబుకును దాని తరువాతి ముఖ్య దిక్కుకును సరిగా మధ్యనున్న దిక్కుకు 'తీరు' అని పేరు. ఒక తీరుకు దాని తరువాతి అకరాబుకుగాని, ముఖ్యదిక్కుకుగాని సరిగా మధ్యనున్న దిక్కుకు 'కొచ్చాకు' అనిపేరు. ఇంతటితో 32 భాగములైనవి. తెనుఁగుఓడలలోకూడ ఈ భాగములతోడనే కాలక్షేపము చేయుదురు. కాని యింకను చిన్నభాగములు చేయవలసివచ్చినప్పుడు, కొచ్చాకులో సగమునకు 'కాకన్' అనియు, కాకన్‌లో సగమునకు 'కాకాకన్' అనియు సంజ్ఞలు కలవు. వీనిప్రకారము సమకామీఁద 128 భాగములు ఏర్పడును. అందుచేత 'కాకన్' అనునది అరపోయింటుకును, 'కాకాకన్' అనునది పావుపోయింటుకును సమమవును.

దిక్కులపేళ్లు:—.

1. గాయి - North - ఉత్తరము.
2. గాయిడావుకొచ్చాకు - North by East.
3. గాయిడావుతీరు - North-North-East.
4. తూర్పు అకరాబు జమ్నాకొచ్చాకు - North-East by North.
5. తూర్పు అకరాబు - North-East - ఈశాన్యము.
6. తూర్పు అకరాబు డావుకొచ్చాకు - North-East by East.
7. మతలయి జమ్నాతీరు - East-North-East.
8. మతలయి జమ్నాకొచ్చాకు - East by North.
9. మతలయి - East - తూర్పు.
10. మతలయి డావుకొచ్చాకు - East by South.
11. మతలయి డావుతీరు - East-South-East.

12. కొండగాలి అకరాబు జమ్నాకొచ్చాకు-South-East by East.

13. కొండగాలి అకరాబు - South-East - ఆగ్నేయము.

14. కొండగాలి అకరాబు డావుకొచ్చాకు - South-East by South.

15. సోలీడావుతీరు - South-South-East.

16. సోలీడావుకొచ్చాకు - South by East.

17. సోలీ - South-దక్షిణము.

18. సోలీ-జమ్నాకొచ్చాకు - South by West.

19. సోలీ జమ్నాతీరు - South-South-West.

20. కచ్చం అకరాబు డావుకొచ్చాకు - South-West by South.

21. కచ్చం అకరాబు - South-West - నైఋతి.

22. కచ్చం అకరాబు జమ్నాకొచ్చాకు - South-West by West.

23. కిఫలయి జమ్నాతీరు - West-South-West.

24. కిఫలయి జమ్నాకొచ్చాకు - West by South.

25. కిఫలయి - West-పడమర.

26. కిఫలయి డావుకొచ్చాకు - West by North.

27. కిఫలయి డావుతీరు - West-North-West.

28. ముతాకోడు అకరాబు జమ్నాకొచ్చాకు-North-West by West.

29. ముతాకోడు అకరాబు - North - West-వాయవ్యము.

30. ముతాకోడు అకరాబు డావుకొచ్చాకు - North-West by North.

31. గాయి జమ్నాతీరు - North-North-West.

32. గాయి జమ్నాకొచ్చాకు - North by West.

పై పేళ్లలో 'డావు' అనునది 'కుడిప్రక్క' అనియు, 'జమ్నా' అనియు 'ఎడమప్రక్క' అనియు తెలుసుకొనవలెను. ఇట్లే 'కాకన్'నుకూడ తెలుపవలె ననిన ముఖ్యదిక్కులు, కొచ్చాకులు, తీరులు, అకరాబులు, వీనికి జమ్నా, డావుల భేదమును కల్పించియు, 'కాకాకన్'లను తెలుపుటకు పై వానికి 'కాకన్'లు కలిపి వానికి జమ్నా, డావు భేదములను కల్పించియు పేళ్లు చెప్పవలెను.

సముకాపెట్టె - Binacle - సముకా ఉండు పెట్టె. దీనిలో చిన్నముల్లు ఉండును. ఆ ముల్లుమీఁద అట్టె ఆటంకములేకుండ తిరుగును.

సమప్రక్కగా పోవుట - Abreast - రెండు ఓడలు ఒకదానిప్రక్కగా ఒకటి పోవుట.

సముద్దరిబోము - Bumkin - చూ. కలిమి పరమాను.

సవద్దరిబోము - Bowsprit - అనిమి వద్దనుండు దూలము.

సరంగు - Commander - ఓడయజమాని. ఇతనికి ఓడ నడిపించుటలో ఏమియు ప్రసక్తిలేదు. ఆ విషయమై ఇతఁడు జోక్యము కలుగజేసికోకూడదు. అది అంతయు మాలీముపని. సరంగుపని హార్బరులో ఉన్నప్పుడు సరుకు వేయించుట, దింపించుట, వ్యవహారము చేయుట మాత్రమే.

సవాయి - Mouse - చూ. మాతు.

సవాయిత్రాళ్లు - Shrouds - కొయ్యలకొనలనుండి ఓడకు రెండు ప్రక్కలకును కట్టిఉన్న పెద్దత్రాళ్లు. ఇవి కొయ్యలు కదలకుండ చేయుటయే కాకుండ, పెద్దచాపలు పరచుటకు కూడ పనికివచ్చును.

సవాయిజీబీ - జీబీలలో ఒకభేదము. చూ. జీబీ.

సాగలా - Fake - అమారుత్రాడుచుట్టు.

సికార్ బరాస్ - అంతకంటె గాలిలోనికి వెళ్లడమునకు అవకాశము లేని స్థితి.

సిందీచెక్క - Gunnel or gunwale - ఓడప్రక్కయొక్క మీఁది అంచు.

సీకువేయుట - To reeve - త్రాటిని కన్నములోనుంచి దూర్చుట.

సుత్తి - Maul - పెద్ద ఇనుపసమ్మెట.

సుబురుకేలీ: కఱ్ఱలు, తిరిగి ఈ అడ్డుగీతలమీఁద పొడవుగా ఒకకఱ్ఱనువేసి, క్రింది పొడవుకఱ్ఱ నీ మీఁదిదానినే బిగింతురు. మీఁదిపొడవుకఱ్ఱకు సుబురు కేలీ అని పేరు.

సురదాని - Caboose - ఓడలోని వంటగది.

సులుపు - చాపలును పరమానులును గల ఒంటికొయ్య ఓడ.

సూరిచెక్క - Gunnel or gunwale - చూ. సిందీచెక్క.

సైతాన్ జీబీ - చూ. బోమ్ జీబీ.

సైను - Beacon - చూ. కోడేకొయ్య.

సోలీ - South - దక్షిణదిశ. చూ. సమకా.

సోలీ జమ్నాకొచ్నాకు - South by West - సోలీకి ఎడమవైపు 360 డిగ్రీలలో 1/32 వంతు డిగ్రీలుగా ఉన్న దిక్కు.

సోలీ జమ్నాతీరు - South-South-West - దక్షిణమునకును నైఋతికిన్ని సరిగా మధ్యనుండు దిక్కు.

సౌలీ డావుకొచ్చాకు - South by East - సౌలీకి కుడివైపు 11 డిగ్రీల 15 మినిట్లు ఎడములో నుండు కొచ్చాకు.

సౌలీ డావుతీరు - South-South-East - సౌలీకిని ఆగ్నేయమునకును సరిగా మధ్యనుండు దిక్కు.

స్కూనరు - Schooner - రెండుకొయ్యలఓడ. ఈ ఓడలో ఒకకొయ్య మీఁదమాత్రమే చాపలు, పరమానులు ఉండును. రెండవకొయ్యమీఁద గాపుటాపులు మాత్రము ఉండును

హెచ్చుపదును - 1. Spring tide - చంద్రుఁడు ఒకటి, మూఁడు పోయంట్లలో ఉన్నప్పుడు సముద్రము హెచ్చుగా పొంగును. అప్పుడది హెచ్చుపదునులో ఉన్నదందురు.

2. సముద్రము పోటుగా ఉన్నప్పుడుకూడ హెచ్చుపదునుగా ఉన్నది అను వాడుక కలదు. చూ. పోటు.

అయిదవ ప్రకరణమునకు

# అనుబంధము II.



## అనంతపురము జిల్లాలోని గ్రామనామధేయములను గురించిన

# మీమాంస.

ఈ విషయము చాలకష్టమైనదే గాక అనేకులను ఆకర్షింపఁజాలదు. చాలపేర్లు కాలవశమున మారిపోయి వికారరూపమును దాల్చినవి. వాని మొదటిరూపమును నిర్ధరించుటకు చేయు నాలోచన కొంతవినోదము నియ్య వచ్చును. ఇందులో కష్టమేమనగా జనులు చెప్పుకొను అర్థములకును ఉచ్చారణలోనున్న పదజాలమునకుఁ గల శబ్దశాస్త్ర వ్యుత్పత్తికిని వ్యత్యాసము కనఁబడుచునే యుండును. చరిత్రసంబంధమైన నామధేయములు మారి, జనులవాడుకలోని ఐతిహ్యములను గురించిన పేరులు నిలిచియుండును. కొన్ని ప్రాచీన గ్రామముల గుర్తించుటయే కష్టము. కొన్ని గ్రామములే అదృశ్యములైనవి. కొన్నింటిపేర్లు పూర్తిగా మారినవి. కొన్ని తమిళ, కన్నడ, మహమ్మదీయ, ఆంగ్లభాషాసంపర్కముచే వికృతములైనవి. పై విషయమును వ్రాయఁదలచుకొనువాఁడు ఈ మార్పుల నన్నింటిని గమనింపవలెను. కావున కొన్ని గ్రామముల పేళ్లయర్థ మిదమిత్థమని తేల్పలేకపోవుటలో నాశ్చర్యము లేదు.

ఈ చర్చ అనేకవిధములుగా ఉపయోగకరమైనది. శబ్దోత్పత్తిశాస్త్రమునకు (Philology) ఇది చాల సాహాయ్యకారి. ప్రజల పరదేశగమనమును లేదా వలసల (Migration) ను గురించి పరిశోధించువారి కీచర్చ మిక్కిలి తోడగును. వివిధజాతు లెంతవఱకు దేశములో పలుకుబడి సంపాదించినవో ఇందువలన తెలిసికొనవచ్చును. గ్రామములు, పట్టణములు నెలకొల్పఁబడిన నివేశనములబట్టి, పూర్వుల అవసరము లేవో, ఎట్టిప్రదేశములు వారిదృష్టిలో వాసయోగ్యములో ఊహింపవచ్చును. ఏ రాజవంశీయులు ఏయే ప్రదేశములను చిరకాలము పాలించిరో, ఎవ్వరు దిగ్విజయయాత్రచే మాత్రమే తృప్తిపడి పోయిరో, లేదా ఓడి వెనుదిరిగిపోయిరో కనుగొనవచ్చును. ఘనులైన వ్యక్తుల యొక్కయు వంశములయొక్కయు చరిత్రలను కొంతవరకు అన్వేషింపవచ్చును. వివిధమతముల ప్రచారము, జనుల నాగరకతాసరళిని గ్రహింపవచ్చును. భిన్నజాతుల సంపర్కనివాసముల నెఱుంగవచ్చును.

మోద = ముద్రా = మొద్దా.

పట్నం = ప్రస్థానం లేక ప్రతిష్ఠానం.

తావళం = తావు - వ్రాలం = స్థానవ్రాలం.

చాదం = ప్రసాదం.

కదిరి = స్కదిక ? + ఇకా.

గూళ్యం = గోపాలికం = గోవాలియం = గూఆలియం = గూళ్యం.

కొన్ని గ్రామముల పేర్లు పూర్తిగా సంస్కృత పదములే.

ఉదా:—అగ్రహారం, ఇంద్రావతి, కల్యాణదుర్గం, కోమలి, చందన, ఛత్రం, నరసాంబుధి, (వెన్న) అహోబిలం, మాల్యవంతం, లేపాక్షి, హేమావతి, నగరు (ఊరు), సంగమేశ్వరం, అనంతపురం, అమరాపురం, కృష్ణాపురం, గరుడాపురం, గోవిందపురం, జయపురం, హనుమాపురం, ధర్మపురం, నారాయణపురం, భైరాపురం, మాలా, ముక్తాపురం, రాజాపురం, రామాపురం, వాసుదేవపురం, వీరాపురం, వెంకటాపురం, శ్రీకంఠాపురం, శ్రీరంగాపురం, సీతాపురం మొదలగునవి.

ఈ సంస్కృత నామములతో నున్న గ్రామములు ప్రాచీనమైనవి కావు. నాలుగైదు శతాబ్దముల లోపగడవి. కాలముఇంకను వానిని మార్ప లేదు. కాని మొదటి పదముయొక్క తుదిఅచ్చు మాత్రము దీర్ఘమయినది. ఉదా:—కృష్ణా (పురము), హనుమా (పురము). ఆ గ్రామములు ఇంకను వేయి సంవత్సరములకాలము నిల్చి, ఇంకొక విధమగు ప్రబలమైన మార్పు కలుగనియెడల, వాని పేరు లేరీతిగా ముందు మాఱగలవో ఈ దీర్ఘాచ్చు సూచించుచున్నది.

ఇతరనామములు తెలుగుపదములను సూచించునవి, లేక ద్రావిడ పదములను సూచించునవి. ఇవి తెనుగుజిల్లాలలోనే కాక ద్రావిడ దేశమునందును తక్కిన భారతదేశమునందు పలుచోట్లను కనఁబడుచున్నవి. బంగాలీ భాషలోఁ గూడ నీ పోలికలు కాన్పించుచున్నవి.

ఉదా:—కాడి = బం. కాటి, ఖాదివిషయ, ఖాటికా, ఖాడి.

ప్రాచీన బంగాలీ భాషలోని ఖాటా, లేక ఖాడా, అను పదము నూతన బంగాలీలో ఖాడీ అగుచున్నది. అనగా చిన్న యేటిని దాఁటు పడవ అని అర్థము. ఖాడీయే తర్వాత గాడి, హాడి, ఆడి, అడిగా మారినది.

అనంతపురము జిల్లాలోని కాటిగానికాల్వ, కొక్కంటి, కేకాటి, మొదలగునవి; కాడు అను పదమునుండి యైనవని వ్యుత్పత్తిని ఊహింపవచ్చును. కాడు = అడవి. ఖాష్ఠము నుండియే కాడు వచ్చియుండును.

2. అర్, ఆర్, ఎర్, ఏర్ అను పదములకు ఉత్తర హిందూస్థాన భాషలలో అర్థము 'సంబంధించిన', లేక 'కలిగియున్న' అని. బెంగాలీ: డాగర్ = పెద్ద; పెరిగిన; అస్సామీ: డాంగరీయ = ఎత్తయిన; ద్రావిడములోని ఆర్, ఏర్ అను పదములనుండి పైని సూచించిన అర్, ఆర్, ఎర్, ఏర్ పదములు వచ్చియుండవచ్చును గాని, ఈ గ్రామములున్నచోట కొన్నింటికైన దగ్గరదాపున ఎట్టి యేఱును లేకుండుటవలన, పై ద్రావిడోత్పత్తి వాదము దృఢపడదు.

ఉదా:—పై డేటి, ఆకులేడు, చిర్యేడు, తేకులేడు, దోసలేడు, ములకలేడు, దొడ్డేరి, ఇప్పేరు, కూడేరు, చాదలేరు, పడమటియాలేరు, పూలేరు మొదలయినవి.

3. వాయి: సంస్కృతములోని వాపి (=బావి) పదమునుండియే వాయి వచ్చినది. వాయిగ్రామ, రోళ్లవాయిక అను పేర్లు గుప్తశకములో దామోదరపూరు దానశాసనములలోను, దేవఖడ్గుని ఆష్రాఫ్ పూరు దానశాసనములోను కనఁబడుచున్నవి. ఇవి బంగాళా దేశములోనివి. తెనుగు వాయి (నోరు) పదమునుండియైన వాపి శబ్దము పుట్టి యుండవచ్చును-అనంతపురము జిల్లాలోని ఒరువాయి, పాలవాయి, మేళవాయి. వాడ, వాడి, ఆడ, ఆడి, ఆల. సం. వాట; బెంగాలీ-ఒరియా: పాడా, మరాఠీ-గుజరాతీ: వార్; ఉదా. ధార్ వార్, మార్ వార్. అనంతపురము జిల్లాలో: నిఘనవాడ, బొందలవాడ.

5. అరి: సం. గృహిక = ఘరియా; బంగాలి: హారి, తక్కిన చోట్ల 'అరి'. ప్రాచీనబంగాలీ: పురాణ వృందికాహారి. అనంతపురం జిల్లాలో, కామారి (పల్లి).

6. కొండ: సిలాకుండ (6-వ శతాబ్దిలోని తూర్పు బంగాలీ తామ్రశాసనములో) యస్. కె. ఛాటర్జీగారు 'కుండ' ను కొండ అని అర్థము చేసిరి. ఆ శాసనముల సంపాదకుఁడు ఆ పదమునకు చెరువు అని అర్థము చెప్పెను. కావచ్చును. అనంతపురములో ఎనిమిది గ్రామముల పేర్లకు 'కొండ' అని చేర్చబడినది. అవి కొండలకు సమీపముననే యున్నవి.

7. కుంట, కుంట్ల: సం. కుండ (= సరస్సు) ఈ జిల్లాలో 23 కుంటలు 5 కుంట్లలు ఉన్నవి.

8. క్రీ. త. 5-వ శతాబ్దపు తూర్పుబంగాలీ తామ్రశాసనములో ధ్రువిలాటి అని ఉన్నది. దానిని ధ్రువబిలవాటి అని ఛాటర్జీగారు చదివిరి. 'వటి' అనగా గృహము, లేక గ్రామము. లేదా తటి (=ఒడ్డు) నుండి ఇది ఏర్పడి యుండవచ్చును. అనంతపురముజిల్లాలో పామిడి, మోపిడి.

9. ముడి : సం. ధాతువు ముట్ = మడచు, చుట్టు, పెనగొను. 7-వ శతాబ్ది లోకనాథుని తిప్పేరదానశాసనములో 'కనామోటిక' అని యున్నది. ప్రాతబంగాలీలో కాణమోడియా. ఇప్పటి బంగాలీలో కాణముఱి. అనంతపురములో కల్లుముడి.

10. పోలు: బంగాలీ: పోర, పోల, పోల = పొలము. 10-వ శతాబ్దపు దేవఖడ్గ తామ్రశాసనములో 'ఉగ్రపోరక' అని యున్నది.

11. పఱ్ఱు = పర్తి, సం. పాటక, వాటక. ఇది 'ప్రస్థ'లో నుండి పుట్టియుండవచ్చును-ఇంద్రప్రస్థ. ఉత్తరదేశములో గోల్‌పారా. అనంతపురములో 'పర్తి'తో ముగియు పేర్లు 8 ఉన్నవి. 'పత్రి'తో ముగియున దొక్కటి.

12. జూల: బంగాలీ - హిందీలో - ఝూల్, ఝూల్ = వంక. లేదా బంగాలీలోని జోడా.

హిందీ: జోడా = కవలు, జత అను పదములనుండి వచ్చియుండవచ్చును.

అనంతపురముజిల్లాలో తబ్జూల, జూలకుంట, జూలకాల్వ.

13. గుడి: 11-వ శతాబ్దములోని అస్సాములో వైద్యదేవుని కమలీదానశాసనములో 'శిలాగుడి' అని యున్నది.

14. కులం, కోలం - వై శాసనములోనే 'కులాచాపడీ' (అనగా కొలనిచావడి) అని ఉన్నది. ఈ జిల్లాలో శికేరులం, మైసగోలం అని ఉన్నవి.

15. ఆలి: 12-వ శతాబ్దమునందు ప్రాగ్జ్యోతిషమండలి ధర్మపాలుని శాసనములో 'ఖగ్గాలి' అని ఉన్నది. అలి అనగా గట్టు అని అర్థము. అనంతపురం జిల్లాలో అగళి.

16. అల; ఆల: సం. వాట. ఆమిదాల, కురుమాల, కొట్టాల, గుండాల, చాబాల, పుప్పాల, మారాల, నంగాల.

17. మంచి: ధర్మపాలుని శాసనములో 'అమంచి' అని ఉన్నది. గచ్ఛి (=ఒక చెట్టు)లో నుండి ఇది పుట్టినది.

18. పాళ్యం, పాలెం, పాల, 1248 సంవత్సరములోని చిట్టగాంగ్ తామ్రశాసనములు నారపాల్య, కేతంగపాల అనియున్నవి.

కోనేటినాయనిపాళ్యం; నార్పాల; కేతంగపాలకును కేతగానికాల్వకును పోలిక చూడుడు.

19. గూడు, గూల, గోడు; సం. ఘోష: ఆవులదొడ్డి, ఉదా. గూళపాళ్యం.

20. పల్లి: ఇది భారతదేశమం దంతట నున్నది. బంగాలీలో భట్టపల్లి.

21. మిట్ట, మెట్ట: కన్నడం: బెట్ట; బంగాలీ: భిట్ట.

22. 12-వ శతాబ్దములోని కేశవసేనుని ఎదిల్‌పూర్ శాసనములో తాలపడా-పాటక అని యున్నది. తాడి-పట్టు (వాడ); తో పోల్చుడు. సత్రకాద్వి (ద్వ = ద్వీప = తె. దువ్వి, జువి, జువ్వి).

తర్వాత వివిధ గ్రామములకు నామధేయము లెట్లు వచ్చెనో కనుగొందము:—

1. చెట్లు, తీగలు, పొదలనుండి కొన్ని గ్రామముల పేర్లు ఏర్పడినవి. ఈ జిల్లాలో గ్రామములకు పేళ్లనిచ్చిన చెట్లివి. అడ్డ, అత్తి, అర్క (జిల్లేడు) ఆముదము, ఇప్ప, ఈత, చింత, చీకటిమాను, కానుగ, కొండకామెర్ల, గోరంట, చిత్ర, జువ్వి, జంబు, తాడి, తుమ్మ, తంగేడు, తొగర, టేకు, దోస, నారింజ, పుచ్చ, మత్తి, మర్రి, ములక, మేడి, మామిడి, రాగి (రావి), రేణి, వెదురు, వెలగ, వేము, సొరకాయ (హంచి = పరక).

2. చెట్లలోని భాగములనుండి కొన్ని నామధేయములు:-ఆకులు, చిగురు, పూలు, మాను, ముండ్లు. తోపు, తోట అని గూడ కొన్నింటికి పేరు గలవు. అమళ్లదిన్న. అమడుగూరు పదములకు ఆముదము గ్రామమని అర్థమైయుండును. కన్నడము: అమండ = ఆముదపుచెట్టు. లేక వానికి కవల (జోడు) గ్రామములనియైన యర్థము. కొన్ని గ్రామములపేర్లు ధాన్యనామములనుండి వచ్చినవి. ఉల్లి, కంది, కూరాకులు, కొఱ్ఱ, చామ, జొన్న, సజ్జ, సెనగ. గరిసెలపల్లెకు దానిలోని ధాన్యపుగరిసెనుండి ఆ పేరు వచ్చియుండును.

3. ఆయా నేలతీరునుబట్టి కొన్నింటికి పేర్లు కలిగినవి. కరూరు=నల్లమన్ను గ్రామము; కోడూరు = బురదప్రదేశము; చౌడూరు = చౌటినేల; నల్లూరు = నల్లనేల, నీలూరు = నీలిరంగుప్రదేశము, రేగటిపల్లి = రేగడి: ఎఱ్ఱగుడి = ఎఱ్ఱని పల్లప్రదేశము.

4. దిశలను బట్టి కొన్ని పేర్లు: వడుగూరు=ఉత్తరదిశనున్నపల్లి, యాలేరు= ఎల్లగా నున్నగ్రామము, వెలికొండ = బయటికొండ, వెలిదుర్తి = బయటిపల్లి, కొనకొండ్ల = తుదికొండ, లోచెర్ల = చెరువులోనిపల్లె, నడిమిదొడ్డి, తగ్గుపర్తి, దిగువపల్లి, ఎగువపల్లి, మునిమడుగు = మొదటికొలను, తలమర్ల = మొదటి గ్రామము, పిరవలి = కడపటిపల్లె. గ్రామము ఆకారమునుబట్టి కూడ పేర్లు: జుట్టూరు, వంకరకుంట.

5. రాళ్లనుబట్టి పేరులు:—కల్లు, కండ్ల, గుండు, బండ, తుదిగాగల పేర్లన్నియు నిట్టివే.

6. పెద్ద, చిన్న, ప్రాత, క్రొత్త అను విశేషణములనుబట్టి కొన్నింటికి పేర్లు వచ్చినవి.

7. కొండపేరిట వచ్చినవి: ఉదా. కొండ, మల, మెల, గిరి, అంత మందుగలవి.

8. ఊటలవలన కొన్ని:—మరుట్ల, ఎల్లుట్ల, ఊటకల్లు, దొనేకల్లు, జూలా కాల్వ, ఊటకూరు, ఉబచెర్ల వుూబిచెర్ల, వెదురుదొన.—వేడినీట యూటలు, దోసలుడికి, రావులుడికి.

9. కొలనులవలన:—కుంట, కుంట్ల, కలం, కోలం, దొన, మడుగు, 'వాయి, బెంచి ఈ పేరులు నై వర్గమునకు చేరినవి.

10. కాలువలు:—కాల్వ, జూల, దుళ్ల, కాతి, కాటి అను పేరిటి గ్రామములు కాలువల మూలమున వచ్చినవి.

11. కోటలు, దేవళములు, తిప్పలు వీని మూలమున కొన్ని.

12. నక్షత్రములపేర్లు:—చుక్కలూరు.

13. పశుపక్ష్యాదులనుండి వచ్చిన పేర్లు:— ఆవు: ఆలూరు; పులి: పాులి కుంట; పంది: పందికుంట; ఎనుము: పోతులకుంట - ఎనుములదొడ్డి; పాము: ఉరవకొండ, పాముదుర్తి; ఎలుగు: కరడికొండ; కోడి: కోడికొండ; మిడత: మిడుతూరు; ఈగ: ఈగదూరు; నక్క: నక్కలదొడ్డి; ఎద్దు: ఎద్దులపల్లి; కొంగ: కొంగనపల్లి; నెమలి: నెమళ్లపల్లి; తొండ: తొండపాడు; గుఱ్ఱం: గుఱ్ఱంబైలు.

14. శరీరములోని అంగములపేర్లు:—ముష్టూరు; భిక్షుముదొరకు స్థల మనిదైన కావచ్చును. జంతలూరు=దంతముల గ్రామము, లేదా వేశ్యలుండు ఊరనియైనఁ గావచ్చును. లేదా యంత్రములు తయారగు ఊరుగా నుండ వచ్చును, లేదా దున్నిన గ్రామమని అర్థమియ్యవచ్చును; చూ. జంతపట్టు. దంతగ్రామము అని అర్థము వచ్చుపట్ల బౌద్ధగ్రామమా యనుశంక ఉదయిం చును. జూటూరు = జుట్టూరు లేదా చుట్టూరు=గుండుగ్రామ మనవచ్చును. లేదా జూటూరు అనగా మోసగాండ్లు నివసించు గ్రామము కావచ్చును.

15. కొన్నింటి పేర్లు బంధుత్వ సంబంధములను బట్టి వచ్చినవి. చిన్న యక్కలూరు (అక్కల వూరు), లేక అర్క అనగా జిల్లేడుపల్లె గావచ్చును.

16. ఆహారవస్తువులనుబట్టి, పప్పూరు, చారుపల్లి.

17. జనుల వృత్తులనుబట్టి వచ్చినవి కొన్ని:—గాండ్లదిన్నె, గాండ్లపర్తి, గాండ్లవాండ్లపల్లి, అయ్యవారిపల్లి, ఈడిగవారిపల్లి, ఉప్పరపల్లి, తప్పెట్లవారి పల్లి, తలమర్లవారిపల్లి (మరలు చేయువారిపల్లె), సానిపల్లె, దాదులూరు,

మావటూరు, దండువారిపల్లె, దబురువారిపల్లె, మంగలమడక, కుమ్మరమల, కుంబరమాగెనహళ్ళి.

18. కొన్ని కుటుంబనామములు :—మద్దివారిగొంద, మడుగువారి గొంద, సలకంచెరువు, గైదంవారిపల్లి, గానివారిపల్లి, చల్లావారిపల్లి. చిల్ల వారిపల్లి, దాదుంవారిపల్లి, పెద్దనవారిపల్లి, ముక్కినవారిపల్లి, ముక్కండ్లవారి కోటపల్లి, ముండ్లవారిపల్లి, సానివారిపల్లి. ఈ కుటుంబములవారు చాల ప్రసి ద్ధిలో నుండిరి కాఁబోలు, కాని ఇప్పుడు వారిచరిత్ర వినుకిడిలో లేదు. ఇందులో సలకంతిమ్మరాజు మాత్రము కృష్ణదేవరాయలమీఁద తిరుగఁబడిన సేనానులలో నొక్కఁడు.

19. ఈ మండలము నేలిన రాజుల వంశనామములు కొన్ని గ్రామ ములకంటినవి.

ఇది తెలిసికొనుటకుముందు మండలచరిత్రమును కొంత ఎఱుఁగుట మంచిది.

పురాణకాలపు స్థలములు.

కల్యాణదుర్గమునకు మూఁడుమైళ్ల దూరములోనున్న ముదిగంటియం దును ఆ పట్టణమునకు ఉత్తరముననున్న పెద్దగుట్టయగు దేవూదులబెట్టలోను వందలకొలది రాతికట్టడములతోడి గోరీలున్నవి. అనంతపురము తాలూకాలో మాల్యవంతమునకు ఉత్తరమున బాటప్రక్క అట్టివి నాల్గున్నవి. బుక్క రాయసముద్రమునకు పోవు త్రోవలో ముసలమ్మకట్టవద్దనున్న దిబ్బలో నొక్కటి యున్నది. హిందూపురము తాలూకాలోని కొండాపురం, పూలేరు గ్రామములలో నిట్టివే ఒక్కొక్కటి గలవు.

గుంతకల్లు రైల్వేస్టేషనునకు నైఋతిమూలనున్న మెట్టులో నొక్కటి యగు విడపనకంటి కోటలో వేలుపుమడుగు గుట్టలఁలో, లత్తవరం కరకు ముక్కల ఎడమటి కొండలో, వజ్రకరూరికి పడమటనున్న చిన్నగుట్టలో ఉరవకొండ కొండలో, దానికి తూర్పు గుట్టలో, వెలికొండ కొండలో, ప్రాచీన శిలాయుగమునకు ముందిటి మానవనివాస చిహ్నములు కాన్పించుచున్నవి.

బూదిహాల్ అని పిలువఁబడు బూదికొండలోఁగూడ అట్టి కృతయుగ మానవ నివాసచిహ్నము లున్నవని తెలియుచున్నది. బూది అనగా బూడిద. బూడిద అను పదముతో సంబంధముగల గ్రామము లీ జిల్లాలో మరికొన్ని కలవు. గుత్తి తాలూకాలో బూదిగవి, హిందూపురము తాలూకాలోని బూదిలి, అనంతపురము తాలూకాలో బూదూడు, కదిరి తాలూకాలోని బూదనంపల్లి, కల్యాణదుర్గం తాలూకాలోని బూదిగుమ్మ, పెనుగొండ

తాలూకాలోని బూదచెర్ల. పురాణకాలపు మనుష్యనివాసముల పేర్లకు కొన్ని యుదాహరణములు. పంచానన మిత్రగారు 'పురాణభారత' మను తమ గ్రంథములో బళ్ళారిజిల్లాలోని యీ బూడిదదిబ్బలనుగురించి వ్రాయుచు, కప్పగల్లు విషయమై యిట్లు వ్రాసిరి. "ప్రాచీన నాగరకతగల దక్షిణ దేశీయులకును, ఔత్తరాహులకును సంఘర్షణము కలిగినప్పుడు జరిగిన దహనములను, లేదా పెద్దవిడిదలలను ఈ బూడిదరాసులు సూచించును."

బళ్ళారినుండి ధార్వాడ శిలలకుపోవు బాటలో 50 అడుగులు ఎత్తును నాలుగువందల అడుగుల చుట్టుకొలతయుఁగల పెద్ద భస్మరాశి ఆశ్చర్యమును గొల్పుచు నిప్పటికి నున్నది.

అశోకుని శాసనములు.

రాయదుర్గం తాలూకా సరిహద్దులలో ఇప్పుడు మైసూరికిఁ జెందిన అనంతపురము జిల్లా సరిహద్దు ప్రదేశములో కినఁబడిన అశోకుని శాసనములు ఈ ప్రాంతమున బౌద్ధమతము వ్యాపించియుండె ననుటకు నిదర్శనము. గుత్తికి ఏడుమైళ్ళ దూరములో ఎర్రగుడివద్ద నాచే బహిరంగపరుపఁబడిన అశోకుని శాసనములవలనఁ గూడ ఈ మండలము చారిత్రకప్రసిద్ధమైనదని తెలియుచున్నది.

అశోకుని కాలమునుండి క్రీస్తుశకము 7-వ శతాబ్దమున నలరాజులు పాలించినంతవఱకుఁగల ఈ మండల చారిత్రము మృగ్యమైనది.

గ్రామముల నామకరణములో నలవంశమువారు చేసినపని యేమియో నిశ్చయించుటకు వీలులేదు. అట్టి వంశ మొక్కటి యుండెననునదియు సందేహమే. ఈ వంశముయొక్క రాజులపేర్లు చారిత్రకులకు తెలియదు. అశోకుని తర్వాత ఈ మండలము నేలినరాజులలో నొలంబులు మాత్రమే చరిత్రకు తెలియవచ్చినవారు. వారు గుత్తివఱకు పాలించిరి. వారిపేరిట ఎట్టి గ్రామనామములును లేవు.

గంగవంశమువారి పాలనము తర్వాత రాజవంశనామములు గ్రామములకు వచ్చియుండుటను కనుగొననగును. నొలంబులైన వెనుక గంగవంశము వారే ఈ మండలమునకు రాజులు.

గంగలకుంట, గంగంపల్లి, గంగాదేవిపల్లి, గంగినేపల్లి, ఇవి గాంగులచే నుంపబడిన గ్రామనామములని ఊహింపవచ్చును. మరూరు, మగుట్ల అను పేర్లు గాంగ వంశకుడైన మారసింహుని పేరిట వచ్చియుండును. రాజాపురము పేరు ఆ వంశకుడైన రాజరాజనువాని పేరిట నుంచబడియుండును. కాని ఈ గ్రామ మెక్కడనున్నదో ఇప్పుడు స్పష్టము కాదు.

తర్వాత నీమండలమును చోళులు పాలించిరి. చోళసముద్రం, చోళే మర్రి, అనుపేరులు చోళరాజులనుండి వచ్చినవి. చోళూరు గూడ అట్టిదే అయియుండును. కాని ఆ పేరికి వ్యుత్పత్తి వేరు విధముగా ఈ వ్యాసమునందే ఇంకొక చోట సూచింపఁబడినది.

తర్వాత, పడుమటి చాళుక్య లీమండలము నాక్రమించుకొనిరి. గుత్తి కోటలో 1076 నుండి 1126 వరకు నేలిన 6-వ విక్రమాదిత్యుని శాసనమున్నది. త్రిభువనమల్ల విక్రమాదిత్యుఁడని ఆతని పేరు. మల్లాపురము, మల్లాగుండ్ల మల్లాకాల్వ, మల్లాపల్లి, మల్లేనిపల్లి, మల్లేపల్లి ఈ గ్రామము లాతని పేరిటవై యుండును.

తర్వాత 12-వ శతాబ్దములో హొయిసలులు వచ్చిరి. గుత్తిని జయించిన వీరబల్లాళుఁడు (1191-1213) వీరాపురమునకు తనపే రుంచియుండును.

తర్వాతిరాజులు యాదవులు. యాదవరాజు శింగన్న (1210-1247) శింగనమల, శింగనరము, యెఱ్ఱ శింగేపల్లి, యను వీనికి తనపేరు నుంచెను.

తర్వాతముహమ్మదీయులు ఈ ప్రాంతమునఁ జొరఁబడిరి. కాని ఆ కాలమున వారి పేరిట ఏ గ్రామములును నిలువ లేదు. అప్పుడు ఓరుగంటి కాకతీయుల యేలుబడిలో నీ మండల ముండినది. రుద్రాంబరాణి పేరిట రుద్రంపేట పేరు వచ్చియుండును. ఓరంగల్లు ముహమ్మదీయుల వశమైనతర్వాత విజయనగర హిందూసామ్రాజ్యము వన్నెకెక్కెను.

విజయనగరచరిత్రయే అనంతపురమండల చరిత్రమనికూడ చెప్ప వచ్చును. ఈ రాజుల పాలనమున ఈ మండలములో త్రవ్వఁబడిన చెఱువుల పేర్లన్నియు, విజయనగర రాజులయు రాణులయుసరదారులయు పేర్లనుబట్టివచ్చినవే రాయలసీమ అని పిలువఁబడుటకు అనంతపురమండలమే మిక్కిలి అర్హమైనది. సామ్రాజ్యముఖ్యపట్టణము బళ్ళారిమండలములో నుండిననుకూడ అనంతపుర మండలములోని గ్రామములకును చెఱువులకును ఆ రాజవంశీయుల పేర్లు నిలిచినట్లు బళ్ళారిమండలములో నిలువలేదు.

విజయనగరరాజులలో మొదటివాఁడు బుక్కరాజు; అతని పేరిట బుక్కపట్టణము, బుక్కాపురము, బుక్కచెర్ల, బుక్కరాయ సముద్రము అనునవున్నవి. అతనిమంత్రి అనంతరసు. అనంతపురనామ మీమంత్రినిబట్టియే వచ్చినది. ఇట్టి పేరులు మూఁడీమండలమున నున్నవి. ఒక్కటి మండల ముఖ్యపట్టణమగు అనంతపురము. రెండవది మడకశిరా తాలూకాలోను, మూడవది గుత్తి తాలూకాలోను నున్నవి కల్యాణదుర్గం తాలూకాలోని రాళ్ళ అనంతపురము గూడ ఈ మంత్రి పేరిట వచ్చినదేయై యుండును. హండే అనంతపురము చరి

త్రలో అనంతసాగరము బుక్కరాయసముద్రము చెఱువులను బుక్కరాజు సామంతుఁడగు చిక్కప్ప ఒడయరు అను నతఁడు నిర్మించె నని యున్నది. కాని బుక్కరాయసముద్రములోని ఒకశాసన మీా మంత్రిపేరు అనంతరను అని చెప్పుచున్నది.

బుక్కరాజునకు అనంతమ్మ యను భార్య ఉన్నట్లు కనఁబడదు. గంగా దేవి కంపరాయచరిత్రలో నామెపేరు దేపాయిఅనియు, కొన్ని తామ్ర శాసనములలో దేమాంబ యనియు నున్నది. అనంతసాగరమను పేరు నేఁడు అనంతపురముగా మాఱినది. వీర విరుపణ్ణ బుక్కరాజు కొడుకనియు, అతఁడు పెనుగొండలో సామంత ప్రభువుగా నుండెననియు చెప్పఁబడినది. విరుపాపురము అనుపేరు అతనివలన వచ్చినదేమో! విజయనగరరాజు లిచ్చిన కొన్ని దాన శాసనములలో ప్రాచీనగ్రామనామములు మార్చి క్రొత్తపేరులు పెట్టఁ బడినవిగాని జనులు ప్రాతపేరులను విడువలేదు. వేములపాడుగ్రామమునకు ప్రౌఢదేవరాయపురమనియు, కల్లూరుగ్రామమునకు దేవరాయపురమనియు నామకరణము చేయఁబడెను. కాని ఈ క్రొత్తపేరులు జనులవాడుకలోలేవు. ప్రౌఢదేవరాయని పేరిట నొక్క దేవరాయపురముమాత్ర మున్నది.

కృష్ణదేవరాయనికి ముందట ప్రభువగు నరసనాయకునిపేర నరసాపుర మను గ్రామములు అనంతపురముతాలూకాలోను, హిందూపురముతాలూకాలోను, కల్యాణదుర్గము తాలూకాలోను, తాడిపత్రి తాలూకాలోను కలవు. మడకశిరా తాలూకాలోను నరసాంబుధి యనుగ్రామ మున్నది.

అనంతపురము తాలూకాలోని కృష్ణాపురము, పెనుగొండ తాలూకాలోని కృష్ణాపురము, గుత్తితాలూకాలోని క్రిష్టిపాడు - ఇవి కృష్ణదేవరాయని పేరిట నుదయించిన గ్రామములు గావచ్చును. ఆయన నామధేయము పెట్టిన ఇతరగ్రామములను క్రొత్తపేరులు నిలువలేదు. కృష్ణరాయని కాలమునాఁటి బంగారు - తిమ్మరాజు పేరిట నాలుగు తిమ్మాపురములును, ఒక్క నీళ్ళులేని తిమ్మాపురమును గలవు. ఎఱ్ఱతిమ్మరాజుచెరువు గూడ ఈ కాలఁపునాఁటి యేప్రముఖుని పేరనో నిర్మింపఁబడియుండును.

సదాశివరాయని పేరిట ఎట్టి గ్రామములును కనఁబడవుగాని, అతని ప్రతినిధియగు రామరాజు పేరిట రామగిరి, రామరాజుపల్లి, మూఁడు రాంపురములును గలవు. తిరుమలదేవరాయపురము తిరుమలదేవరాయని పేర నున్నది. వెంకటాంపల్లి, వెంగలమ్మచెఱువు, నాగసముద్రము, ఈ గ్రామములు ఆర వీటి వంశములోని రాజుల పేరిటివి: ఆరవీడుగ్రామమే ఇప్పుడు తాడిపత్రి తాలూకాలో నొక కుగ్రామముగా మాఱినది. శ్రీరంగరాజుపేరిట శ్రీరంగా

పురమున్నది. గ్రామపు లెక్కలలో శింగనమలచెఱువు శ్రీరంగరాయల చెఱువు అని పిలువఁబడుచున్నది. వెంకటరాయునిపల్లి, వెంకటాపురము గ్రామములు వెంకటపతిరాయల పేరిటివై యుండును. ఈ కాలమున కొందఱు సేనాధిపతులును, ఇతర ప్రసిద్ధపురుషులుగూడ తమ పేరులతో గ్రామ నామ కరణము చేయించిరి. దానాయనిచెఱువు, నాగినాయనిచెఱువు, జగరాజుపల్లి, మల్లారెడ్డిపల్లి, కోనేటినాయనిపాళ్యం, తిమ్మానాయనిపాళ్యం, మద్దినాయని పాళ్యం ఇట్టివే. వీరిలో కోనేటినాయఁడు కొంత ప్రసిద్ధుఁడు.

అతడు 1652 సం॥ ప్రాంతమున నివసించిన పాళెయగాఁడు. పెను గొండకోటను బీజాపూరు సుల్తానులకు ఒప్పఁజెప్పినందుకు లంచముగా నీతనికి కుందుర్పి కోట యియ్యఁబడెను. కోనేటినాయునిచరిత్రకు సంబంధించిన మెకాంజీ లిఖితమంతయు ఇండియా ఆఫీసునకుఁ గొంపోఁబడినది. దాని నింతవఱకు నెవ్వరును జదువలేదు.

ఆరవీటి వంశపతనము పిమ్మట ఈ జిల్లా మహారాష్ట్రులయు, ముహమ్మ దీయులయు దండయాత్రలకు గుఱియయ్యెను. కొన్ని మహారాష్ట్ర నామ ములు గ్రామములకు కలిగినవి. మురారీరావు తండ్రి సిద్ధోజీకి హిందూరావని కూడ పేరుండెను. హిందూపురమును అతఁడే నిర్మించెనఁట. కాని విజయ నగరరాజుల బిరుదావళులలో నంతకుముందే 'హిందూరాయ సురత్రాణ' అను పదము కనఁబడుచున్నది. తన పేరిట గ్రామనామకరణము చేయుటకు మురారిరాయఁడు సంకల్పించుకొనలేదు. వానికి శత్రువులతో పోరాడు పనియే ఆజన్మమునుండినది. ఇంక గ్రామనిర్మాణమున కతని కవకాశ మెక్క డిది? అక్కాబమ్మ పేరిటనున్న అక్కాజంపల్లి, అప్పాజీపేట, లోకోజీపల్లి, విఠాపల్లి, ఇవి మహారాష్ట్రుల ఏలుబడికి గుర్తులు. పామిడిలోను, రొద్దంలోను, కొందఱు రంగారీ లుండుటతప్ప మహారాష్ట్రుల రాచఱికపు ఫల మీ మండల మున విశేషముగా కాన్పించదు.

ముహమ్మదీయు లీమండలమును పూర్తిగా జయించిరి. వారు మండల మునం దంతటను వ్యాపించిరి. ముహమ్మదీయ జనసంఖ్యలేని ముఖ్యగ్రామ మొక్కటియులేదు. ఈ మండలమునందలి ఒట్టు 894 గ్రామములలో 86 గ్రామములలో మాత్రమే ముహమ్మదీయులులేరు. బ్రాహ్మణేతరులయు, నిమ్న జాతులయు సంఖ్యతరువాత ముహమ్మదీయులసంఖ్య గొప్పది. ఆర్థికముగా వారి స్థితి ఇప్పు డంతమేలుగ లేకున్నను, వారి పలుకుబడి వృద్ధియగుటకు తగిన పరిస్థితు లేర్పడినవి. ముహమ్మదీయుల పేరిట పదునొకండు గ్రామములు గలవు అమీనాపల్లి, అల్లాపల్లి; ఖైరేవు, ఖాజ్జేపల్లి, ఖాదరుపేట, తురకపల్లి, ఫకీర్

పల్లి, షేక్‌సానివల్లి, సతార్లపల్లి, సైదాపురము, హుసేన్‌పురము, హుస్సేన్‌పురము. అలంపురము, బీజాపురము, సుల్తాను పేరిటివి. కరీంరెడ్డిపల్లి మహమ్మదీయుల మతవ్యాప్తిని సూచించును.

ఏ రాజులు వచ్చినను పోయినను, వాస్తవమునకు మండలమును పాలించుచుండినది పాళెయగారులే కావున వారినిగుఱించి తెలిసికొన్నఁగాని యీ వ్యాసము సమగ్రము కానేరదు. బ్రిటీషువారీమండలమును ఆక్రమించినప్పుడు ఇక్కడ ఎనుబదిమంది పాళెయగాండ్రుండిరి. అందులో నలుగురుమాత్రమే ప్రసిద్ధులు. అనంతపురము పాలియగారు, నడిమిదొడ్డి పాళెయగారు,' వజ్రకరూరియొద్ద కమ్మలదొడ్డి పాళెయగారు, తరిమెల పాళెయగారు వీరే ప్రసిద్ధులు. ఈ నలుగురును తుదకు జయింపఁబడిరి. అనంతపురము ఉదిరిపికొండ పాళెయగార్ల చరిత్రము మాత్రమే మనకు మిగిలియున్నది.

అనంతపురము పాళెయగారుని వంశము హండేహనుమప్పనాయునితో ప్రారంభమైనది. జయపురమని పిలువఁబడు హన్మాపురము బహుశః అతని పేరిటిదై యుండును. ఇతఁడు రామరాజు కాలమునాఁటివాఁడు. ఇమ్మడిహంపానాయుఁడు అతని కొడుకు. ఇతఁడు తల్లికోటయుద్ధములో తనువు త్యజించినమలకప్పనాయుని కొడుకు. కదిరితాలూకాలోని మలకవేముల ఇతని పేరిటదేమో? వానికొడుకుహంపానాయుఁడు. హంపాపురము వాని పేరిటనో వానితాత పేరిటనో వచ్చినది. సిద్దప్పనాయుఁడు, పవడప్పనాయుఁడు పై వాని కొడుకును మనుమడును. సిద్దప్ప అను చిన్నకొమారుని విడిచి పవడప్ప మరణించెను. అతని భార్య రామక్క పాళెమునుపాలించుకొనుచుండెను. ప్రసన్నప్ప, పవడప్ప, అని సిద్దప్ప కిద్దఱు కుమారులు. ప్రసన్నప్పకు ఉంపుడుకత్తెయగు వసంతమ్మ వలన నలుగురు కొడుకులు గలిగిరి కాని స్వభార్యకు సంతానములేదు. వసంతమ్మ తన ప్రియుని ఖూనీచేసినది. వానితమ్ముఁడు పవడప్ప పాళెయగారయ్యెను. పవడప్ప కొడుకు సిద్దప్ప పోకిరీ వసంతమ్మకొడుకు రామప్ప తిరుగఁబడి మురారిరాయుని తనకు సాహాయ్యము కోరెను రామప్ప పాళెయగారయ్యెను. వాని కొడుకు సిద్దప్ప. సిద్దప్పకు వాని బావమఱఁది బసప్ప సాహాయ్యముండినది. ఈ బసప్ప నైజామునుండి సిద్ధరాంపురమును జాగీరుగా సంపాదించెను. టిప్పూసుల్తాన్ సిద్దప్పనాయుని చెఱఁబెట్టనుగాని అతఁడు విడిపించుకొనెను. మఱల మఱల వీరిని జయించుట యేమని టిప్పూసుల్తాన్ ఈ వంశములోని మగవారినందఱిని ఉరితీసెను. పైఁజెప్పిన పేర్లుగాక ఈ పాళెయగార్లవలన వచ్చిన గ్రామనామములు సిద్దాపురము, సిద్ధరాంపురము, సిద్దరాళ్ళెర్ల, ప్రసన్నేపల్లి, బసాపురము అనునవి.

జోగినాయుఁడు ఉదిరిపికొండకు మొదటి పాళెయగారు. అతని కొడుకు తిమ్మానాయుఁడు. ఇతని పేరు తిమ్మవచర్లకు వచ్చినది. వానికొడుకు నరసానాయుఁడు.

నరసాపురము ఇతని పేరిటవచ్చినది. వానికొడుకు వేములనాయుఁడు. వేముల పాడు ఇతని పేరిటనైనది. ఇతని కొడుకు ముసలప్పకు ఇద్దఱు కుమారులు, పెద్ద వేమలనాయుడు, చిన్ననాయుడు అనువారు. రాయదుర్గం పాళెయగారు ముసలి కోనేటినాయుఁడు. ఇతఁడు పెద్దవేమనను ఓడించి పాళ్యమును తన దాయాది తిమ్మానాయుని కిచ్చెను.

బ్రిటిష్ వారు ఏ గ్రామమునకును తమపేరు నుంచలేదు. జనరంజకులైన కొందరు ఉద్యోగులపేర కొన్ని వీధులకును, ఇండ్లకును నామకరణము చేయఁబడి నది. అనంతపురములో జార్జిపేట, రీడ్ వీధి, గుత్తిలో మన్రోసత్రము ఇట్టివి.

దేశచరిత్ర పాలకుల జీవితములను బట్టియే రచింపఁబడుచుండుట యాచారమైనది. కాని గ్రామ నామధేయములను బట్టి చూచినచో పాల కులుగాకుండ జనులలో పేరుపెంపులు గలిగియుండిన మహనీయులెందఱో యుండిరనియు పాలకుల పేరులవలె అట్టివారి నామములుగూడ గ్రామముల పేరిట నిలిచిపోయినవనియు తెలియఁగలదు. పురుషులకేకాక స్త్రీలకుఁగూడ ఆ కీర్తి యబ్బినది. ఉదాహరణము:—

మలయనూరు, వంగనూరు, యెల్లనూరు, అప్పరాజుచెరువు, కేతగాని చెరువు, పంతులచెరువు, సోమనదొడ్డి, చెన్నరాయపట్నం, ఎల్లారెడ్డిపల్లి, కని సెట్టిపల్లి, కరిగానపల్లి, కొడపగానిపల్లి, గణపతిపల్లి, గొందిరెడ్డిపల్లి, గోవింద పల్లి, గౌకానపల్లి, చండిరెడ్డిపల్లి, చినగానిపల్లి, చిన్నరామన్నగారిపల్లి, చెన్న రాయునిపల్లి, చెన్నేకొత్తపల్లి, తిప్పాభట్లపల్లి, తిప్పేపల్లి, దేమకేతపల్లి, నర సంభట్లపల్లి, నాగిరెడ్డిపల్లి, నారెపల్లి, నారేమడ్డిపల్లి, బసినేపల్లి, బీచగానిపల్లి, బీరేపల్లి, బుడ్డారెడ్డిపల్లి, బుడ్డేపల్లి, బుళ్ళ్యాగారిపల్లి, బూగానపల్లి, బేతపల్లి, పోతులనాగేపల్లి, పోలేపల్లి, మారెడ్డిపల్లి, మలిరెడ్డిపల్లి, మద్దిరెడ్డిపల్లి, యజ్ఞ శెట్టిపల్లి, లింగారెడ్డిపల్లి, వీరవాహానపల్లి, ఓబుళంపల్లి, వ్రాబుళరెడ్డిపల్లి, సంకే పల్లి, ఆనందరావుపేట, చిత్రాయపేట, జోగన్నపేట, సుబ్బారావుపేట.

స్త్రీలపేరిట వచ్చిన నామములు:—అంకంపల్లి, ఆజంపల్లి, కోనంపల్లి, గంగంపల్లి, గంగాదేవిపల్లి, గోసేపల్లి, నరసంపల్లి, చెన్నంపల్లి, రాఘవంపల్లి, రాయంపల్లి, లక్ష్మంపల్లి, వంగంపల్లి, వెంకటంపల్లి, సోమందేపల్లి, ఎంకంపేట, పాపంపేట, సిద్ధంపేట.

మతముల పలుకుబడితో నేర్పడిన గ్రామనామములనుగుఱించి కొంత పరిశీలింతము. ఈ జిల్లాలో వ్యాపించిన మొదటిమతము బౌద్ధమతము. బుడ్డా రెడ్డిపల్లి, బుడ్డేపల్లి, బొజ్జిరెడ్డిపల్లి, ఇవి బుద్ధునిపేరు బెట్టుకొన్నవారినుండి కలిగి నవి. బుద్ధ అను పదమునకు వికృతులే 'బొజ్జ, బొజ్జి,అనునవి. ఈ గ్రామముల

నామకరణ సమయమున బౌద్ధమత మిచట నుండినదని కాదు; దేశములో నా మత మెంతవఱకు నాటుకొన్నదో ఇది తెలియపఱుచును. ఇప్పటికిని బుద్ధుని పేరిట, బుడ్డన్న, బొజ్జణ్ణ, బొజ్జయ్య, అను నామకరణములు సాధారణముగా నున్నవి. కుప్ప, కొప్ప, గుప్ప, గుబ్బ, గుమ్మ, దిమ్మె, దిమ్మ, తిప్ప, గుడి, గవి, తోపు పదములుగల గ్రామములు పూర్వము బౌద్ధుల స్థలములని నా విశ్వాసము. ఇచ్చట త్రవ్వకముచేసినచో ఇన్నాళ్లుగా లుప్తమయిన ఈ దేశచరిత్రమును వచించుట కాధారములు దొరకవచ్చును. బౌద్ధభిక్షువులు గవులలో నివసించెడువారు. గవి, కుప్ప, కొప్ప, గుబ్బ, గుమ్మ, ఇవన్నియు సంస్కృతపదమగు గుహానుండి వచ్చిన వికృతులే. బౌద్ధుల చైత్యములు, స్థూపములు, తిప్పలరూపమున నుండినవి. దిన్నె, దిమ్మ, తిప్ప, వీనికన్నింటికిని ఒకటే యర్థము. ఈ దిన్నెలు పురాతనమైనవి. ఈ స్థూపములు గుండ్రముగా నుండును. గుడి అనఁగా గుండ్రము అని అర్థము.

ఎఱ్ఱగుడియొద్ద అశోకుని శాసనములు లభించుటయు పై యూహను స్థిరపఱుచును. 'స్థూప'మునుండియే తోపువచ్చినది. ఉదా:—ఉత్తర దేశములోని 'సాంచితోప్'..

అనంతపురం జిల్లాలోని ఈ క్రిందిగ్రామములు బౌద్ధస్థలములు గావచ్చును:—బూదగవి, కొప్పలకొండ, దిమ్మగుడి, ఎఱ్ఱగుడి, బెళుగుప్ప, మద్దిగుబ్బ, బూదిగుమ్మ, భైరవునితిప్ప, అత్తికాలదిన్నె, అమళ్లదిన్నె, కంబాలదిన్నె, గాండ్లదిన్నె, గార్లదిన్నె, జంబులదిన్నె, జంకల్లేడుదిన్నె, బొందలదిన్నె, మర్రికొమ్మదిన్నె, సజ్జలదిన్నె, బుడ్డేపల్లి.

తర్వాత ఈ మండలమును ఆక్రమించినది జైనమతము. 1931 సెన్ససు లెక్కలమేరకు ఇప్పటికిని ఈ జిల్లాలో 1034 జైనులున్నారు. వీరు కొలదిమందియేయైనను జిల్లాయందంతట నున్నారు. కాకిగ్రామములో 288 మందియు, అమరాపురం గ్రామములో 125 మందియు నున్నారు. ఇంత మంది మరియితర గ్రామములలో నెక్కడను లేరు. వారు 20 గ్రామములలో నున్నారు. గుత్తి, ధర్మవరం తాలూకాలలో మాత్రము లేరు.

జిల్లాలో పలుచోట్ల జైనమత చిహ్నములు గలవు. అమరాపురం, తమ్మం దేహాల్లి, గుత్తి, కంబదూరు, అగళి, కొనకొండ్ల, పెనుగొండ, రత్నగిరులలో ఈ మతవ్యాప్తికి సాక్ష్యములు కలవు. కంబదూరు గొప్పజైనస్థలము. దానికి తర్వాతిది కొనకొండ్ల. కంబదూరులో జైనదేవాలయమున్నది, కాని ఇప్పుడచ్చోట జైన విగ్రహములు పూజింపఁబడుచుండలేదు. పెనుగొండలోని రెండుదేవాలయములలో నిప్పుడును జైన మతాచారము ప్రకారము పూజలు జరుగుచున్నవి.

జక్క (యక్ష), కంబ (స్తంభ), గాండ్ల పదములుగల గ్రామములో నొకప్పుడు జైనమత ముండినదని యూహింపవచ్చును. ప్రతితీర్థంకరునికిని రక్షకులుగా ఒక యక్షుడు ఒక యక్షిణియుండిరి. ప్రాచీన జైన దేవాలయములలో పెద్ద స్తంభములో కవిశేషము. గాండ్లవారు చాలకాలము జైనులుగా నుండిరి.

తర్వాత సంస్కరణము పొందిన బ్రాహ్మణమతము ఈ మండలమున వ్యాపించినది. బౌద్ధ జైన మతములకు ప్రతిగా నది వ్యాపించి ఆ రెంటిని పారద్రోలెను గాని ఆ మతములోని ముఖ్య సిద్ధాంతములను మాత్రము అవలంబింపక తప్పినదిగాదు. బ్రాహ్మణుడు తన ఎదుట సర్వమును జయించి దిగ్విజయము చేయుచు అన్ని మతములవారిని తన మతమున కలుపుకొనెను. కాని బ్రాహ్మణులు మాత్రము పలుకుబడియు సంపదభివృద్ధియు కలిగి మన లేదు. వారి సంఖ్యయు అల్పము. రాజులచే కొందఱు బ్రాహ్మణు లగ్రహారములు కొన్నమాట వాస్తవమే కాని వానిలో కొన్ని మాత్రమే ఇప్పుడు వారి స్వాధీనములో నున్నవి.

ఈ మండలములోని మొత్తము 894 గ్రామములలో 267 గ్రామములలో బ్రాహ్మణులు లేరు. 334 గ్రామములలో వారి సంఖ్య పదికంటె హెచ్చుగా లేదు, ఈ జిల్లాలో అన్నికులములవారి కంటె బ్రాహ్మణకులము వారిసంఖ్య తక్కువ. మహమ్మదీయులు కూడ బ్రాహ్మణ సంఖ్యకంటె ఆఱింతలు అదనముగా నున్నారు. జిల్లా మొత్తము జనసంఖ్య 10,50,411. అందులో బ్రాహ్మణులు 18,640 మందిమాత్ర మున్నారు. అనగా నూటికి (1.8) ఇద్దఱి కంటే తక్కువ; వేయింటికి 18 మంది. బ్రాహ్మణపదముతో చేరిన గ్రామము లీజిల్లాలో 6 గలవు. బ్రాహ్మణయాలేరు, బ్రాహ్మణపల్లి, అనంతపురం తాలూకాలో నున్నవి. ధర్మవరం గుత్తితాలూకాలలో ఒక్కొక్క బ్రాహ్మణపల్లియు, పెనుగొండ తాలూకాలో రెండును ఉట్టిపేరిటని గలవు. ఇందులో మూడు గ్రామములలో బ్రాహ్మణులే లేరు. ఒక్కదానిలో 5 మంది మాత్రమే కలరు. 5-వ గ్రామములో 6 మంది బ్రాహ్మణులును 6-వ గ్రామములో ఒక్క బ్రాహ్మణుడు మాత్రమే యున్నారు. ఈ జిల్లాలో బ్రాహ్మణ సంఖ్య క్షీణించి పోవుచున్నది.

గ్రామ నామములను బట్టి తెలియ వచ్చుచున్న హిందూదేవతల పేర్లివి. అహోబలనరసింహ (ఓబలసింగ అని మారినది), కృష్ణ, కేశవ (కాస, కేశా అనిమార్పు), గోవింద, నారాయణ, సీతారామ, సిద్ధరామ, వెంకట, తిరుమల, శ్రీరంగ, వాసుదేవ, హరి, హనుమాన్ లేక తిమ్మ, శ్రీ.

శైవ నామధేయములు గూడ కొన్ని గలవు. రొద్దం (రౌద్రం), భైరాపురం, భైరవునితిప్ప, భైరసముద్రం, విరుపాపురం, శ్రీకంఠాపురం. గంగాదేవి పేరిట గంగవరం ఉన్నది. బ్రహ్మకు పూజ లేకున్నను నతఁడు బ్రహ్మదేవిమర్రి; బ్రహ్మసముద్రం, బొమ్మిపర్తి గ్రామనామధేయములలో వ్యక్తమైనాఁడు.

బసవమతప్రాబల్యమున నేర్పడిన గ్రామముల పేర్లివి:—బసినేపల్లి, బసాపురం, బసవనహళ్ళి. వీరశైవులు, బౌద్ధులతోను, జైనులతోను, బ్రాహ్మణులతోను పోరాడిరిగాని బ్రాహ్మణమతము దానిని గూడ లోఁగొనుచున్నది.

క్రిస్టియను మతమున కీజిల్లాలో విశేషవ్యాప్తి కలుగలేదు. వారిసంఖ్య 6546. 184 గ్రామములలో వారున్నారు. కాని 101 గ్రామములలో వారి సంఖ్య పదికి మించలేదు. వారు హిందువులతో కలియక ప్రత్యేకముగా నున్నారు. వారి మతముపేరిట ఎట్టిగ్రామమును లేదు. క్రిష్టిపాడు క్రైస్తవ శబ్దమునుంచి వచ్చిన దనవచ్చును గాని దానిని కృష్ణపాడు అనుటయే సరి. ఆయూర 5 గురుమాత్రమే క్రిస్టియను లున్నారు.

కన్నడుల పలుకుబడి ఈ జిల్లాలో చాల కొంచెము. కన్నడపు గ్రామనామములు గూడ కొంచెమే. గడేహొతూరు, బేవినహాళ్ళి, బసవనహాళ్ళి, బొమ్మకొండహాళ్ళి, గూళిమోర్బాగలు, తమ్మడేహాళ్ళి, హాలికెరె దేవరహాళ్ళి పిల్లనహాళ్ళి, నుగ్గమ్మనహాళ్ళి, తిరుమలదేవరహాళ్ళి, ఉప్పరహాళ్ళి, వీరబొమ్మనహాళ్ళి, దొడఘట్ట. పోలేపల్లినంటిపేళ్లు పోలెయపల్లి అను కన్నడ పదముగా సమర్థించవచ్చునుగాని 'ఎ' అనునది దమపష్యమునవచ్చు గ్రామములు(ఉదా):— మోరెకట్టు. ఆంధ్ర దేశమధ్యమునఁగూడఁ గలవు. కొన్ని ఇటీవల మాత్రమును గూడ అవి తెనుఁగుపేరులనుట స్పష్టము. బందార్లహాళ్లి, కోటగారిహాళ్లి మొ. వానిలోని బహువచనము గుర్తులగు 'ల' "గారి" అనునవి తెనుఁగును పట్టి యిచ్చుచున్నవి. ఇవి కన్నడ దేశపు అంచున నుండుటవలన కన్నడు లీమండలమున పూర్తిగా జొరఁబడలేదనియు సరిహద్దున మాత్రమే యుండిరనియు స్పష్టమగుచున్నది. కాని పంపఁడు చెప్పినట్లు తన తండ్రి కిచ్చిన ధర్మవరము ఇప్పటి తాలూకా పట్టణము ధర్మవర మగునేని పై వాదము నిలువఁజాలదు. అట్లయినప్పుడు కన్నడులు క్రమముగా నీ మండలమును వదలిపోయిరనికాని కాలక్రమేణ తెనుఁగుభాష నవలంబించిరనికాని చెప్ప వలసివచ్చును. పూర్వమున తెనుఁగు-కన్నడముల ఉచ్చారణ సంప్రదాయ మొక్కటే యగుటచేత స్థలనామములు మార్పులేక అట్లే నిలిచియుండ వచ్చును. ఇప్పుడును కన్నడులు రెండు తాలూకాలలో మాత్రమే యున్నారు.

మడకశిర తాలూకా అంచులలో నూటికి 73 మందియు, కల్యాణదుర్గం తాలూకాలో 20·7 మందియు కలరు. మడకశిర తాలూకాలోని మొత్తము 62 గ్రామములలో 16 గ్రామములలో మాత్రమే కన్నడులు సగము మందికి పైగా నున్నారు. అట్లే కల్యాణదుర్గం తాలూకాలో 75 గ్రామము లలో 9 లో మాత్రమే సగము భాగమును, అంతకు పైఁబడియు కలరు. ఆ ప్రదేశములోని గ్రామనామములకే కన్నడపు వాసన గలదు. మధ్యదేశ మున నెక్కడనైన కన్నడము పేరి గ్రామమున్నయెడల తర్వాత జనులు అక్కడకు వెళ్ళి చేరిరని తలంపవలెను.

ఇప్పుడు కనఁబడుచున్న గ్రామనామముల స్వరూపమునుబట్టి యీచర్చ చేయఁబడినది. కాని, వాఙ్మయములోను శాసనములలోను నీ పేరులను కని పెట్టినచో లాభకరముగా నుండును. కాని, యీ వ్యాసములో దాని కంతటికిని చోటు చాలదు. అది వేఱుగ ప్రత్యేకమగు పరిశోధన కాఁగలదు. దానికి తగి నన్ని ఆధారము లింకను లేవు. కావున ఉన్న అల్ప స్వల్పపు ఆధారములనే ఆశ్రయింప వలసియున్నది.

వాఙ్మయమునుండి తెలియునవి.

1. ఆరవీడు (తాడిపత్రి తాలుకా) : తాత పిన్నమ కొడుకు సోమదేవుఁడు ఈ గ్రామమును పాలించుచుండినట్లు "రామరాజీయము" నుడువుచున్నది.

కుమార ధూర్జటి "కృష్ణరాయవిజయము"లో ఆర్వీటిబుక్కరాజు కృష్ణ రాయని తూర్పుదండయాత్రకు సాహాయ్యకుఁడుగా వెళ్లినట్లున్నది.

2. ఆకులేడు (అనంతపురం తాలూకా): "రామరాజవిజయము" లో సోమదేవుని గురించిన 'ఆకులపాటి ... ...విజయలక్ష్మీ సమక్షీకరణ లక్షిత' అను సమాసములోని 'ఆకులపాడే' యీ ఆకులేడు గావచ్చును.

3. ముదిగల్లు (కల్యాణదుర్గం తాలూకా) : ఈ కోటను పాలించినవారు విజయనగరరాజులను పలుమాఱు శ్రమపెట్టిరి. వారు దీనిని పలుమాఱు జయించిరి.

పై సోమదేవునికే 'ముదిగంటి ... ...విజయలక్ష్మీ సమక్షీకరణ లక్షిత' (రామరాజీయము) అనియు, 'ముదిగంటి వీరక్షేత్ర భారతీమల్ల' (కృష్ణరాయ విజయము) అనియు, బిరుదులు గలవు.

'ముదిగంటి దుర్గాధినాయకుఁ'డను బిరుదు రామరాజునకుఁ గలదు.

4. బుక్కరాయసముద్రం (అనంతపురం తాలూకా): నంద్యాల తాలూకాలో దేవరకొండయొద్ద చెఱువునకు తూర్పుభాగమున నీయూ రుండి న

దనియు రామరాజు తిరుమలరాజు ఎదుటికి నైజాంపాహాను ఓడించి పట్టి తెచ్చినందుకు హాండే హనుమప్పనాయుని కీగ్రామములతోఁ బాటు ఇయ్యఁబడిన దనియు హాండే అనంతపురము చరిత్రలోఁ గలదు.

అనంతపురము (అనంతపురం తా.) : బుక్కరాజు మంత్రి అనంతరసు త్రవ్వించిన చెఱువు అనంతసాగరమును బట్టి యీ పేరు వచ్చినది. దీని మొదటి పేరు అనంతసాగరమే. కాని అది బుక్కరాయసముద్రము చెఱువులో చేరి పోయినది. అనంతసాగరము అనంతపురముగా నెప్పుడు మారెనో తెలియదు. ప్రకృతమున్న అనంతపురము కొంతకాలముక్రిందట చాల దక్షిణమునకు జరిగినదని తెలియవచ్చుచున్నది.

6. పెనుగొండ : పిల్లలమర్రి పినవీరభద్రుని "జైమినీభారతము"లో సాళువ నరసింహరాజునకు 'పెనుగొండాద్యఖిలైక దుర్గహరణ ప్రేంఖత్ప్రతాపోదయా' 'పెనుగొండ దుర్గహరణ' అను సంబోధనమువలన విశేషణమున్నట్లు తెలియుచున్నది.

'పెనుగొండ సాధిణాహి ... ...విశ్వహితకారి తిమ్మయ యీశ్వరుండు' అని వరాహపురాణమునందు పెనుగొండ ప్రశంస కలదు. 'పెనుగొండ దుర్గసాధకు'డను బిరుదు రామరాయనికిని గలదు. వసుచరిత్రలో నిది గిరీశ శబ్దముచే శ్లేషింపఁబడినది.

7. గుత్తి : తూర్పునకు గుత్తిమార్గముగా రాజు సైన్యముల నడిపించె నని "రాయవాచకము" నందు గలదు. 'గుత్తిదుర్గనిర్భేదన' అని రామ రాయనికి బిరుదమున్నది. కృష్ణదేవరాయని అనంతరము గుత్తి దుర్గపాలకుఁడు తిరుగుబాటు చేసెనని దీనివలన ఊహింపవచ్చును.

8. బూదికొండ : దీనికి బూదిహాల్ అని మరియొక నామమని అనంత పురంజిల్లా గెజటీయరు తెల్పుచున్నది. ఈ రెండు పేర్లనుగల గ్రామ మేదియు జిల్లాలో నిప్పుడు కనఁబడదు. 'బూద', 'బూది' తో ప్రారంభమగు నామధే యములు కొన్ని ఉన్నవి. తూర్పు దండయాత్రలో కృష్ణరాయనికి ఈ బూది హాలుప్రభువు సాహాయ్యముచేసినట్లు "కృష్ణరాయవిజయము" నం దున్నది.

9. దొరెగల్లు (కదిరి తాలూకా) : "కృష్ణరాయ విజయములో"నిది 'తొరగల్లు' అని యున్నది. కృష్ణదేవరాయనికి దండయాత్రలలో తొరగంటి వారు సాహాయ్యముచేసిరని "రాయరాచకము"లో నున్నది. భట్టుమూర్తిపోష కుఁడగు అహోబల నరసింహుఁడు లేక ఓబళ నరసింహుఁడు 'తొరగంటి దుర్గరాజ్యస్థిర సింహాసన నివాసదీక్షానిధి' అని "నరసభూపాలీయము" లో పేర్కొనఁబడెను.

10. కొంకల్లు (మడకశిరా తాలూకా) : హండే హనుమప్పనాయునికి రామరాయలు తిరుమలరాయలు ఇచ్చిన గ్రామములలో నొక్కటగు కణికల్లు ఇదే కావచ్చును. శాసనములోని కణెయకల్లు ఇదే యగునేమో.

11. ధర్మవరము : కన్నడభారతములో పంపని తండ్రికి ఒక ధర్మవరము అగ్రహారముగా నిచ్చినట్లున్నది. బచ్చెసాసిరములో నిదియున్నట్లు చెప్పఁబడినది. ఇతర అగ్రహారములగు వసంత, కొట్టూరు, నిడుగుంది, విక్రమపురము, గుర్తింపఁబడినచో నిది నిజమగును.

12. జూటూరు (తాడిపత్రి తాలూకా) : 'జూటూరు సమరనిర్వాహకుఁ' డని రామరాయనికి బిరుదమున్నది. అక్కడ ఒక యుద్ధము జరిగియుండ వలయును.

13. రామగిరి (ధర్మవరము తాలూకా) : 'రామగిరిదుర్గ ప్రతిష్ఠాపకుఁ' డని "రామరాయవిజయము"లో రామరాయనికి విశేషణమున్నది.

# అనుబంధము III.



తెనుఁగు భాషయందలి పదముల సంఖ్య వృద్ధిపొందు మార్గము లనేకములున్నవి. ఉన్న దేశ్యపదములతో సమాసములను గల్పించి క్రొత్త పదముల నేర్పఱుచు కొనుట యొక మార్గము. ఇతరభాషాపదముల నెరవు తెచ్చుకొనుట మఱి యొక మార్గము. ఈ రెండు మార్గములలోఁ గొందఱ కొక మార్గమును గొందఱకు వేఱొకటియుఁ బ్రియతరముగ నుండును. సంస్కృత పండితులు తెనుఁగును దత్సమమయముగఁ జేయ నెంతురు. దేశికవులు దేశిపదముల సమాసములతోఁ గ్రొత్త యూహలఁ దెలుప నెంతురు. సాధారణ జనులకీ కవుల యిష్టానిష్టములతోఁ బనిలేదు. వారి కేపదములు సులభములో, యేవి యందుబాటులో నుండునో వానినే వాడుకొందురు. జనవ్యవహారమునఁ దత్సమపదములకుఁ బ్రచారము చాల తక్కువ. గొప్పకవులును దత్సమములను జాలవఱకుఁ బరిహరించుట యందే ప్రీతిని వెల్లడించిరి. సంస్కృతము నెడల వైముఖ్యమును జూపిన వారిలోఁ దమిళులు ముఖ్యులు.

తమిళులునందు సంస్కృత పదము లెంత తక్కువగ నున్నఁ గావ్య మంత యుత్తమ మయినదని లాక్షణికుల యభిప్రాయము. కన్నడమునం "దనుభవామృత" మను గ్రంథమున : 'సులిద బాళెయహణ్ణినందది, కళెద సిబరిన కబ్బినందది, యఱిది ఉష్ణద హాలినందది సులభవాగిహా, లలితవహా కన్నడద నుడియలి, తిళిదు తన్నొళు తన్న మోక్షవ, ఘటిసికొండరె సాలదే సంస్కృతద లిన్నేను?' అనఁగా నొలిచిన యరఁటి పండువలెను, పైతొక్క తీసిన చెఱకువలెను, చల్లారిన పాలవలెను సులభముగనున్న లలితమగు కన్నడ భాషను దెలిసి తనయందు దానే మోక్షమును సంపాదించుకొన్నచోఁ జాలదే? సంస్కృతము వేఱెకావలెనా? యని కవీశ్వరుఁడు చెప్పి యున్నాఁడు. అచ్చ తెనుఁగు ప్రబంధములఁ జేసినవారిలో మొదటివాఁడగు పొన్నిగంటి తెలగన్న—

ఉ. అచ్చ తెనుంగుపద్దె మొకటైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందు రది యెన్నుచుఁ బెద్దలు పొత్తమెల్లని
ట్లచ్చ తెనుంగున న్నొడువ నందుల చంద మెఱుంగువారు ని
న్నెచ్చరొ యబ్బురం బనరొ, మే లనరో కొనియాడరో నినున్.

అని యచ్చ తెనుంగు నెంతయో కొనియాడి యున్నాఁడు. మఱియొకకవి-

"తే-గీ. దేవతలభాష కావునఁ దెనుఁగుకన్న
సంస్కృతమె పెద్ద యని యంద్రు సరియె తెలిసె
రసికుఁ డగువాఁడు తనదుజాజుసిగలోనఁ
దులసినే యిడుకొనునో జాజులనె యిడునో?"

యని తెనుంగుయొక్క పరిమళమును గొనియాడి యున్నాఁడు.

ఇట్లాయా భాషల యందలి కవులు స్వాభిమానముచే నెన్ని చెప్పినను బరభాషా పదములు తమమాటలతోఁ, గలియకపోవు. పై తెలగన్న పద్యము లోనే యెనిమిది సంస్కృతపదములు మాఱువేషములతో దాఁగుడుపడి యున్నవి.

ఒక భాషనుండి మఱియొక భాషలోనికి వచ్చుపదములు చాలమట్టుకు నామపదములై యుండును. వర్తకవ్యాపారముల వలనను నితర సంబంధముల వలనను, నాయావస్తువుల పేళ్ళను మనము ముఖ్యముగ నెరవు తెచ్చుకొందుము. తరువాత వచ్చునవి క్రియలును విశేషణములును. ఎంతయో పరిచయమును మైత్రియుఁ గలిగినఁ గాని సర్వనామములు, సంఖ్యావాచకములు, అవ్యయములు, ప్రత్యయములును నెరవు తెచ్చుకోఁబడవు. ఇవి భాషకు మూలములు; అనాయాసముగ మనను నాకర్షింప వీని నుపయోగింతుము. అదియుఁగాక వీనికి నామరూపమించుకయైన లేదు. వీనిలో నొకవేళ నెంతయో యవసరమైనపుడు సర్వనామములు నామరూపముఁ గొంతవఱకుఁ గలిగి యుండుటచే నెరవు తెచ్చుకొనఁబడును. ప్రత్యయములు మాత్రము మఱియొక భాషయందుఁ జొరఁబడుట యసంభవము కాకపోయినను నెంతయో పరిచయ ముండినఁ గాని జరుగుట దుర్లభము.

పైఁ జెప్పఁబడిన రెండు విధములలోను శబ్దజాలమును వృద్ధిపఱుచుటకేమార్గము మంచిది యనువిచారము మనకుఁ గలుగకపోదు. కొందఱితర భాషాపదముల మనభాషలోనికిఁ జొప్పించి దానిని బాడుచేయు చున్నామని తలంప వచ్చును. కావలసిన యర్థమును సరిగఁ దెలిపినచో నొకపదముకంటె మఱియొకదాని యాధిక్యమెద్దియు లేదని మన మట్టివారికిఁ బ్రత్యుత్తర మీయవచ్చును. క్రొత్తపదము ప్రాఁతపదమువలె నందఱకు గ్రాహ్యము కాకపోయినచో నది తప్పక ననుపయోగమే. కాని యితరభాషాపదము మన భాషయందు నెలకొని యందఱకును బోధపడినచో స్వదేశపదము నదియును గూడ మంచివియే. స్వభాషాపదములనే సమాసము చేసి క్రొత్తమాట నేర్పఱిచినచో నది పరభాషాపదమువలె నందఱకును సుబోధము కాక పోయినపుడు స్వభాషాపద మనునాధిక్యము దానికిఁ గలుగనే కలుగదు. అందుచేత దేశ్యపదముల సమాసమును నితర భాషాపదమును గూడ జనులవాడుకను బట్టి

గ్రాహ్యమో యగ్రాహ్యమో యను విషయము తేలుచున్నది. ఇట్లు చెప్పుటచే నిచ్చకు వచ్చినరీతి నితరభాషాపదముల మనభాషలోనికిఁ జొప్పింపవలెనని యభిప్రాయము కాదు; గాని యొక యన్యభాషాపదము మనభాషలోనికిఁ జొచ్చి యందఱచేతను నంగీకృత మైనప్పుడు దాని గ్రాహ్యతాగ్రాహ్యతలఁ గూర్చి మఱి చర్చింప నవసరము లేదని దాని సూచన.

మన వైయాకరణులు తొలుతనుండియు దేశ్యాన్యదేశ్యపదవిభాగమును సరిగఁ జేయరైరి. కేతన 'ఎల్లవారికిఁ దెలిసెడి యాపలుకు లచ్చతెనుఁగు' లని 'తల, నెల, వేసవి, గుడి, నుడి, పులి, చలి' యను నుదాహరణములను, దేశితెనుఁగుల కుదాహరణముగ, ఎఱుకువ, నెత్తమ్మి, మఱకువ, మచ్చిక, నెన్ను, వీచోపులు ఆదియును జెప్పెను. ఈ విభాగ మంతసమంజసముగ లేదు. దేశితెనుఁగు లెల్లవారికిఁ దెలియుననే కాన నచ్చతెనుఁగులనుండి వీనిని వేఱుపఱుచుట యేలకో తెలియరాకున్నది. అప్పకవి విభాగ మింతకంటెఁ గొంతబాగుగ నున్నది.

తే. ఆంధ్రదేశపురస్థాయులైన సకల,
 జనములకును మఱుంగుదేశంబు లేక
 తేటతెల్లముగాఁ బల్కుమాటలెల్ల,
 నవని శుద్ధాంధ్రదేశ్యంబు లనఁగఁ బడును.

ఉదా. పాలు, పెరుఁగు, నేయి, ఉట్టి, ఱోలు, బిడ్డ, జోలి, అమ్మ, మొదలయినవి.

క. కేశవ యాంధ్రులు నానా, దేశంబులయందు నిలిచి తెలుఁగులె త్తి
 ద్దేశోక్తు లంటఁబలికిన, నాశబ్దము లన్యదేశ్యజాంధ్రము లయ్యెన్.

ఉదా. ఆలము, చివ్వ, కయ్యము, పోరు, బవరము, దురము, దొమ్మి, కలను.

(మనవా రెన్నిరీతుల దెబ్బలాడుచుండిరో. గమనింపుఁడు.) ఒంటరి, నెల, వేసవి, పల్కులు, వీనులు, ఱనుక, నెమ్మి మొదలయివి. కేతన చెప్పిన యచ్చతెనుఁగులు దేశితెనుఁగులుఁ గూడ నప్పకవి చెప్పిన యన్యదేశ్యజాంధ్ర ములలోఁ గనఁబడుచున్నవి. మొత్తముమీఁద నప్పకవి విభాగము కొంత బాగుగ నున్నదని తోఁపకపోదు. తెలుఁగువా రితరదేశములకుఁ బోయి యా దేశపు భాషలోని పదములను దమభాషలోఁ జేర్పఁగా నేర్పడినపదము లన్య దేశ్యజాంధ్రములని యప్పకవి యభిప్రాయము; ఇతరభాషలను మాట్లాడు వారు తెనుఁగుదేశమునకు వచ్చి తెనుఁగువారితో సంపర్కము గలుగుటవలన నాంధ్రమునఁ జేరిన పదములును నన్యదేశ్యజాంధ్రములనియే చెప్పవలసి యుండును. ఇదిగాక యప్పకవి శుద్ధాంధ్రదేశ్యములకును నచ్చతెలుఁగులకును భేదము కల్పించినట్లు తోఁచుచున్నది. ఎట్లన 'ఆంధ్రదేశ పురస్థాయులైన' అను పద్యములో నీ క్రిందిదానిని పరిచూచుకోవచ్చును.

క. నెలకొను సంస్కృత తత్సమ
ములు దొరలక తజ్జదేశ్యముల మాఁటను సం
ధిలి కేవలాంధ్రములునా,
నలరుఁ గృతుల నచ్చతెలుఁగులం(దు) తెలుఁగునన్.

కావ్యములలో సంస్కృత మాదిగాఁ గల భాషలనుండి పదముల కుప్పలుకుప్పలుగా నుపయోగించుట కలదుగాని సాధారణ సంభాషణలో నట్టి పదములు చాలఁ దక్కువగనే యుండును. పండితులైనవారు మాటలాడు నపుడుఁ గూడ నుపన్యాసములయందుఁ దప్పఁ దత్సమతద్భవములు సాధారణముగ దొరలనే దొరలవు. ఈ విషయమును గూర్చి పరిశీలించు బుద్ధి పుట్టి యిరువురు పండితులు సంభాషించుకొనుచుండఁగ రాత్రి యెనిమిదిగంటల నుండి పండ్రెండుగంటలవఱకు వింటిని. ఈ నాలుగు గంటలకాలములో వా రుపయోగించినమాటలలో 42 తత్సమతద్భవములు, 6 ఇంగ్లీషుపదములును, 8 హిందూస్థానీపదములును దొరలినవి. తక్కిన వన్నియు దేశ్యపదములే. కోర్టువ్యవహారములఁ గూర్చి వారు మాటలాడుచుండుటచే నీ యింగ్లీషు హిందుస్థానీపదములు వచ్చినవిగాని లేనిచో నవియు రాకయుండు నేమో— ఏది యెట్లున్నను దేశ్యపదములను సర్వసాధారణముగ వాడుకొనుటయుఁ దక్కినపదముల నంత సాధారణముగ వాడుకొనకపోవుటయు నిర్వివాదాంశము. గ్రంథస్థ మగుభాషయందుఁ గూడ దేశ్యపదములే చాల నెక్కువగ నుండు ననుటకు సందేహము లేదు. దీనికి నిదర్శనముగ మహాకవుల గ్రంథములనుండి దిఙ్మాత్రముగఁ గొన్ని పద్యముల నెత్తి వానియందలి సంస్కృత సమసంస్కృత సమేతరపదముల లెక్క వెట్టి చూపెదను.

నన్నయభట్టు.

మ. కురువృద్ధు ల్గురువృద్ధబాంధవు లనేకు ల్చూచుచుండ న్మదో
ద్ధురుఁడై ద్రౌపది నట్లు చేసినఖలుం దుశ్శాసనుం లోక భీ
కరలీల న్వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘ ని
ర్ఝర ముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

భార. సభా. 2. [27 సంస్కృతము, 19 తెనుఁగు.]

తిక్కన.

శా. ఏమీ! పార్థుఁడు నీవు దంటిమగలై యీనచ్చుకౌరవ్య సం
గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీర్పన్ బెద్ద మిత్త్రైక్కి మి
మ్మే మెల్లన్ వెఱఁ గంది చక్కఁ జెదను గా కీనారికం బోయి రా
భీమం డిత్తతి రిత్తమాటలకుఁ గోపింపందు నూ పెంపఱన్.

ఉద్యో. ఆ. 3. [7 సం. 40 తె.]

ఎఱ్ఱాప్రెగడ.

మ. తనకావించిన సృష్టి తక్కొరులచేతంగాదు నా నేముఖం
బునఁ దాఁబల్కినపల్కు లాగమములై పొల్పొందు నావాణి న
త్తనునీతం డొకరుండునాఁ జనుమహత్త్వాప్తిం గవిబ్రహ్మనా
వినుతింతుం గవితిక్కయజ్వనఖిలోర్వీదేవతాభ్యర్చితున్.

హరివంశము. [16 సం. 80 తె.]

మంత్రిభాస్కరుఁడు.

ఉ. ఈ కొఱగాని కార్య మిటు లెవ్వఁడొకో యనుకూలశత్రుఁడై
నీకుఁ బ్రియంబుగాఁ బలికె నీవును నిత్తెఱఁ గాచరింపఁగా
రాక తలంచిచూడ నిదిరాక్షసవంశవినాశకాలమో
కా కటుగాన నీకొనునె కాదనకీదృశ మెవ్వఁడేనియున్.

రామాయణము. అర. ఆ. 2. [8 సం. 36 తె.]

మారన.

ఉ. ఎక్కడనుండివచ్చె నతఁ డీతుహినాద్రికి వేడ్కనూని యే
నక్కట యక్కునూరు రుచిరాకృతి యాదట నేల చూచితిన్
మక్కువ నేల నాదుమది మన్మథుఁ డేచఁదొడంగె నాకయో
దిక్కెఁక నెవ్వరిచ్చట మదీయు లటంచు దురాశ యేఁటికిన్.

మార్కండేయపురాణము. ఆ. 5. [10 సం. 31 తె.]

నాచనసోముఁడు.

చ. తిరిసినకూడు తెచ్చి నలుదిక్కులబోడలు తిండివెట్టఁగాఁ
జెరిఁగినపట్టతోడ నొకవెంటపయిం దొరవ్రాలె నెవ్వరిన్
సరకుగొనందు పట్టుకొని చాఁగఱగొన్న బలే యెఱుంగుఁ ద
క్కరిబలుమోపుమోచు నయగారితనం బికపుట్టి గట్టినన్

చ. వెఱిగిలిగాక నీవు నొకప్రగ్గడవే సభ లుండుభంగి ము
న్నెఱుఁగనివాఁడవై భ్రమసి యెవ్వరిముందఱ నేమిమాటలో
యఱచిరి వారిజంకెలకు నంతటఁ జొప్పడి వచ్చి తిచ్చటన్
గఱువఁగవచ్చునే బలిమి గాడిదకుం బులితోలు గప్పినన్.

హరివంశము. [సం. 5. 68. తె.]

శ్రీనాథుఁడు.

ఉ. ఎట్టు పురాణము ల్పదియు నెన్మిదిఁ జెప్పితి వెట్టువేసముల్
గట్టితి వేర్పఱించి నుడికారము సాంపెసలార భారతం

పెట్టు రచించి తీవు ఋషివై ట్టయి తొక్కదినంబుమాత్రలోఁ
బొట్టకు లేక తిట్టెదవు పుణ్యగుణంబులరాశిఁ గాశికన్.

కాశీఖండము. [12. సం. 25. తె.]

బమ్మెరపోతరాజు.

శా. ఏరా దక్ష యదక్షమానస వృథా యీ దూషణం బేలరా
యోరీ పాపము లెల్లఁబో విడువురా యుగ్రాత్ముఁ జేపట్టురా
వైరం బొప్పదురా శివుం దలఁపురా వర్ణింపురా రాజితోం
కారాత్ముం డగుసీలకంఠుఁ దెగడంగారాదురా దుర్మతీ.

వీరభద్రవిజయము, ఆ. 1. [15. సం. 25. తె.]

పిల్లలమఱ్ఱి పినవీరన్న.

ఉ. కాఁక నెదిర్చి సంగరముఖమ్మున హెచ్చిన రాజవంశముల్
గూఁకటివేళ్లతోఁ బెఱికి గోత్రవధంబును జేసి నట్టి యా
వ్రేఁకపుఁగీడుగాక ప్రజసేఁచఁదలంచిన గోరుచుట్టుపై
రోఁకటిపోటుచందముగ రోసి జను ల్ననుఁజూచి తిట్టరే.

జైమినిభారతము. [8. సం. 31 తె.]

కృష్ణదేవరాయలు.

సీ. వాతెఱతోంటికై పడి మాటలాడదు కుటిలవృత్తి వహించెఁ గుంతలంబు
లక్షులు సిరులురా నరచూపుఁగనుఁగొనె, నాడించె బొమగొనియాననంబు
వనుగొమల్నెగయ వక్షము పేక్షఁగి నెకొత్తె బాణిపాదము లెత్తివాఱఁదొడఁగె
సారెకుమధ్యంబు దారిద్ర్యము లెచెప్పె ఆచ్ఛేర్వకటుఁలోఁగఁబొచ్చె మేను
గీ. వట్రిగాంభీర్యమొక్కఁడు పెట్టుకొనియె, నాభినానాఁటకీగతి నాఁటిపొందు
చవుకయైనట్టి యిచ్చట చనదునిలుప, ననుచుజాఱెవకరణి బాల్యంబుజాతె

ఆముక్తమాల్యద, ఆ. 5. [16. సం. 54. తె.]

అల్లసాని పెద్దన్న.

ఉ. ఎంతదపంబుచేసి జనియించినవారొకొ మర్త్యభామినుల్
కాంతుఁడవజ్ఞచేసినను గాయముఁబాయుదు రే నమర్త్యనై
చింతలవంతలంజివికి సిగ్గరితిన్ మృతిలేని నాదుచె
ల్వింతయు శూన్యగేహమున కెత్తినదీపిక యయ్యె నక్కటా.

మనుచరిత్ర. ఆ. 3. [14. సం. 27. తె.]

నంది తిమ్మన్న.

మ. జలజాతాననవాసవాదిసురపూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధుకన్నతండ్రిశిర మచ్చో వామపాదంబునన్
దొలఁగందోచె లతాంగి యట్లయగు నాథుల్నేరముల్సేయఁ జే
రలుకం జెందినయట్టికాంత లుచితవ్యాపారము ల్నేర్తురే.

పారిజాతాపహరణము. [17. సం. 26. తె.]

పింగళి సూరన్న.

మ. తమిఁబూఁదీఁగెల తూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచుందూఁగు నా
కొమరుం బ్రాయపుగబ్బిగుబ్బెతల యంఘ్రుల్చక్కఁగాఁజాఁగి మిం
టిమొగంబై చనుదెంచు శీవిఁగనుఁగొంటే దివ్యమౌనీంద్ర నా
కమృగీనేత్రలమీఁదఁ గయ్యమునకుం గాల్దాఁచులాగొప్పెదుర్.

కళాపూర్ణోదయము, ఆ. 1. [7. సం. 34. తె.]

రామరాజభూషణుఁడు.

శా. రాజీవాక్షులనేఁచుపాతకివి, చంద్రా, రాజవానివు? నీ
రాజత్వంబునఁ జక్రముల్మనియెనో రంజిల్లి సత్సంతతుల్
తేజంబందెనొ? డిందెనో యహిభయోద్రేకంబు, తాఁ జెల్ల రే!
రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే? రాజౌటదోషార్థమే?

వసుచరిత్ర, ఆ. 4. [21. సం. 22. తె.]

చేమకూర వేంకటకవి.

చ. శివుఁడిటురమ్మటంచు దయచేసినవోఁ దలకెక్కి తుగ్రవై
భవమునఁ జూచుచో నడుగు బట్టితి వేమనవచ్చు నీగుణం
బవునవు నందిన న్నిగయు నందకయున్నను గాళ్లఁబట్టికొం
దువు హరిణాంక వేళకొలఁదుల్గద నీ నడక ల్తలంపఁగన్.

విజయవిలాసము, ఆ. 3. [8. సం. 36. తె.]

ముద్దుపళని.

గీ. తనదుమట్టెంత తానెంత తానె యింత, చేయఁజూచిన నేనెంత చేయరాదు
వేలువాఁచిన ఱోలంత విరివియైన, ఱోలువాఁచిన నదియెంత మేలుగనునో.

రాధికాసాంత్వనము. [దీనియందు సంస్కృతపదములు లేవు.

కంకంటి పాపరాజు.

మ. పలుతావుల్వెదచల్లు తెమ్మెరలు పైపై డాయ రేరాజువె
న్నెలగాయన్ మధుపాళిమ్రోయఁ గలకంఠీపాళికూయన్ మరు

ల్లలనల్గానముచేయ నొంటి నిశివేళం దోఁటలో నైందవ్రొ
పల వేదిన్వసియించు పాంథుని స్మరాపస్మారముల్నేరవే.

ఉత్తరరామాయణము, ఆ. 4. [17. సం. 27. తె.]

మండపాక పార్వతీశ్వరకవి.

ఉ. వ్రాయఁడు లెక్క లొక్కటిగ రంగడరంగ మెఱుంగుపూఁతలన్
బూయఁడు భిత్తిభాగముల ముఖ్యవిధానములందు మందతం
బాయఁడు బాంధవాదు లగువారికిఁ జేయఁగలట్టి సత్కృతుల్
చేయఁడు వేఱె మీకిపుడు చెప్పఁగ నేటికి మీరెఱుంగరే.

రాధాకృష్ణసంవాదము. ఆ. 2. [8. సం. 38. తె.]

పై యుదాహరణములవలనఁ జాలమట్టుకు సంస్కృత సమేతరపదములు సంస్కృతసమములకంటె నెక్కుడుగ నున్నవని తెలియఁగలదు. ఆయా పద్యములు కవీశ్వరుల రచనకు ముఖ్యోదాహరణములుగ నెంచవచ్చు నని తలంచెదను. ప్రతిగ్రంథమును దీసికొని లెక్కించినను బై విషయము స్థిరపడునని నానిశ్చయాభిప్రాయము. ఈ లెక్కించుటలోఁ బదములే కాక ప్రత్యయములును లెక్కలోనికి రావలసినదే కాక యాయా ప్రత్యయములును బదములును నెన్నిసార్లుపయోగించిన నన్నిసారులు లెక్కింపవలయును. ఇతరభాషాపదములును నట్లులే లెక్కింపఁబడినప్పుడు దప్పక దేశ్యపదసంఖ్య చాలహెచ్చుగ నుండు ననుటకు సందేహము లేదు. ఇదిగాక రసపుష్టి గలకావ్యములం దెల్ల దేశ్యపదము లెక్కుడుగ నుండును. పదాడంబరము కొఱకును, బాండిత్యప్రకర్షకొఱకును నన్యదేశ్యపదపూర్ణములుగఁ గావ్యముల నొనరించినచో రసమును, అర్థగాంభీర్యమును గొంత చెడకపోదు. నిత్యమును మనజిహ్వాగ్రమున నుండుమాటలు మనకు సుబోధములుగా నుండు ననుట వేఱె చెప్ప

# ఆఱవ పరిచ్ఛేదము.

## సమాస ప్రకరణము.

సంధిప్రకరణమున వర్ణవిధిని గూర్చిన నియమములు వివరింపఁబడినవి. సంస్కృతమున నజ్ఝల్లులలో నెవ్వియైన నవ్యవధానముగ నొకదానికొకటి పరమైనయెడల నేదియో యొకవిధమగుసంధి కలుగుచుండును. ఆ వర్ణములకుఁ గాని, యా వర్ణములు గల పదములకుఁగాని యర్థవిషయమున నెట్టి సంబంధము నుండనక్కఱలేదు. ఉదా. "తిష్ఠతు దధ్యశానత్వం శాకేన." ఇచట 'దధి'యను పదమునకును 'అశాన' అను క్రియకును నర్థసంబంధము లేకున్నను సంధి కలుగు చున్నది. "తిష్ఠతు కుమారీచ్ఛత్రం హర దేవదత్తాత్." ఇచట 'కుమారీ' శబ్దమునకును "ఛత్ర" శబ్దమునకును నర్థసంబంధములేకున్నను సంధియందు 'తుక్కు' కలుగుచున్నది.

కాని, పదము లట్లర్థసంబంధము లేకయే కలియవు. అవి యట్లు కలియు టకు సమర్థములై యుండవలెను; అనఁగా వాని కర్థసంబంధ ముండవలెను. ఎట్లన, "కష్టం శ్రితః" (కష్టము నాశ్రయించినవాఁడు) అనుదానియందు 'కష్ట,' 'శ్రిత' శబ్దముల కర్థసంబంధముచేఁ గలియుటకు సామర్థ్యము గలదు; కాఁబట్టి యవి సమసించి "కష్టశ్రితః" అను ద్వితీయాతత్పురుషసమాస మేర్పడుచున్నది, కాని, "పశ్య దేవదత్త కష్టం, శ్రితో విష్ణుమిత్రో గురు కులమ్" అను వాక్యములందు "కష్టం, శ్రితః" అను శబ్దముల కర్థసంబంధము లేకుండుటచే సమసించుటకు వానికి సామర్థ్యములేదు. కావుననే, "సమర్థంబు లగు పదంబు లేకపదంబగుట సమాసం బనఁబడును" అని వైయాకరణులు నిర్వచింతురు.

సామర్థ్యము (1) వ్యపేక్షాసామర్థ్యము (2) ఏకార్థీభావసామర్థ్యము అని రెండువిధములు. రెండుపదములు సమసింప సమర్థములై యున్నను సమ సింపక, అనఁగా రెండును గలిసి యేకపదముగాక వాక్యమున వేర్వేఱుగ నిలిచియున్నను నాకాంక్షచే వానిసంబంధము స్పష్టపడవచ్చును. 'రాజుయొక్క పురుషుఁడు' అనునప్పుడు 'రాజు' 'పురుషుఁడు' అను రెండుపదములును సమ ర్థములై యున్నను ఏకపదముగ సమసింపలేదు. "ఎవనిపురుషుఁడు" అని ప్రశ్నింపఁగా "రాజుయొక్క పురుషుఁడు" అను ప్రత్యుత్తరమునందు వానికిఁ గల సంబంధము వ్యక్తమగుచున్నది. ఇట్టి సామర్థ్యమునకు వ్యపేక్షాసామర్థ్య మనిపేరు. కాని, యా రెండును సమసించి 'రాజపురుషుఁడు' అని యేకార్థీ భావమును బొందుట యేకార్థీభావ సామర్థ్య మనఁబడును. సాధారణముగ

నేకార్థీభావసామర్థ్యము గల పదముల సమాసములకే సమాససంజ్ఞను వైయాకరణు లంగీకరించియున్నారు.

తెనుఁగున సమాసములు (1) సాంస్కృతికములు (2) ఆచ్ఛికములు (3) మిశ్రములు—అని మూఁడువిధములుగ నుండును. అందు సాంస్కృతిక సమాసములు (i) సిద్ధములు (ii) సాధ్యములు అని రెండువిధములు. సంస్కృతమునం దేర్పడిన సమాసములకే తెనుఁగునఁ దత్తత్ప్రత్యయములు చేరఁగాఁ గలిగినవి సిద్ధసాంస్కృతిక సమాసములు. సంస్కృతపదములు తత్సమములై సమసించినయెడల నట్టి సమాసములు సాధ్యసాంస్కృతిక సమాసములనఁబడును. తద్భవ, దేశ్యపదములలో నేవియైనను గలిసి యేర్పడిన సమాసము లాచ్ఛికములు; అనఁగా నిట్టిసమాసములందలి పదములన్నియు దేశ్యములయికాని, అన్నియుఁ దద్భవము లయికాని, తద్భవదేశ్యపదములు కలిసికాని యుండవచ్చును. మిశ్రసమాసమందు సంస్కృతసమపదములతో నాచ్ఛిక పదములు చేరును.

(1) i. సిద్ధసాంస్కృతిక సమాసములు—విశ్వవిద్యాలయము, ఆంధ్రభాషాచరిత్రము, ఆనందముద్రాశాల, రాధాకృష్ణులు.

ii. సాధ్యసాంస్కృతికములు: నదిజలము, జనకునాజ్ఞ, రాముని భార్య.

(2) ఆచ్ఛికసమాసములు— i. కేవల తద్భవపదములు (అర్వాచీన తద్భవములు) చేరినవి. అంచరవుతు, బంగారుకంటె.

ii. కేవలదేశ్యములు (ప్రాచీనతద్భవములు) చేరినవి—కనువినికి. కాయగూరలు.

iii. తద్భవదేశ్యములు కలిసినవి—చెలువునీరు, సిరిచెలువుఁడు, తెల్లగాడిద.

(3) మిశ్రసమాసములు: మంచిరాజు, నల్లయశ్వము, సిరివిభుఁడు.

(1) i. సిద్ధసాంస్కృతిక సమాసములు.

సిద్ధసాంస్కృతిక సమాసములనుగూర్చి సాధారణముగఁ దెనుఁగు వ్యాకరణములందు చెప్పు నాచారము లేదు. కాని, తెనుఁగు గ్రంథములందు సంస్కృత సమాసజ్ఞానములేనిదే జరుగదు. సంస్కృతవ్యాకరణము నభ్యసించినఁగాని యాజ్ఞాన మలవడదు. సంస్కృత సమాసముల నన్నిటిని దెనుఁగున విభక్త్యాది ప్రత్యయములనుజేర్చి యుపయోగింపవచ్చునను నొక యభిప్రాయము గలదు. ఇదితప్పు. సంస్కృతమునందలి సమాసములనన్నిటి నున్నవున్నట్లుగాని, తదర్థబోధక ప్రత్యయాదులనుజేర్చి కాని, ప్రయోగింప వీలు లేదు. సంస్కృతసమాసములలోఁ గొన్నివిధములు మాత్రము తెనుఁగునఁ

ప్రచారమం దున్నవి. ఆవిధములందయినను దత్తత్సూత్రముల ననుసరించిన కొన్నిసమాసములు మాత్రము తెనుఁగున నుపయోగింపవచ్చును. అట్టివానినే యితరముల నుపయోగింప వీలులేదు; అట్టి సమాసములు తెనుఁగున స్థిరపడ లేదు. సంస్కృతవ్యాకరణమువలన సాధ్యములగునని యింతవఱకుఁ దెనుఁగున స్థిరపడని సమాసములను కల్పించుట సమంజసముకానట్లు తోఁచుచున్నది. ఈ క్రింద సిద్ధసంస్కృత సమాసముల నిష్పత్తివిధానము వివరింపఁబడుచున్నది. ఆయా స్థలములందు తెనుఁగునఁ బ్రయోగింపఁబడని సమాసరూపములును తెలుపఁబడును.

సంస్కృతమున సమాసము లెన్నివిధము లనువిషయమున ననేకు లనేకవిధములుగఁ జెప్పియున్నారు. "తత్పురుష, బహువ్రీహి, ద్వంద్వంబులని సమాసంబులెల్లం ద్రివిధంబులై యుండు" నని చిన్నయసూరి యొక యభిప్రాయమును వెల్లడించెను. ఇవిగాక అవ్యయీభావమను నొకసమాసమును గూర్చి సిద్ధాంతకౌముది వివరించుచున్నది. ప్రాదిసమాసములు, ఉపపద సమాసములు మొదలగు మఱికొన్ని సమాసములను గొందఱు ప్రత్యేకించి యున్నారు. "కేవలసమాసము" లను విభాగమును గూడఁ గొందఱు తెలిపిరి.

## I. కేవలసమాసము.

శబ్దములు ప్రత్యేకముగా సుబంతాదులై యుండియు లోపాదులను బొందక యర్థవశమున వాక్యమునందు గలిసియున్నచో నవి కేవలసమాసము లనఁబడును. ఇట్టివి సమాసము లగునా యనుసందేహ ముదయింపకపోదు. అయినను నిట్టివానినిగూడ సమాసములుగనే కొందఱు పరిగణింతురు. వాగర్థా+ ఇవ = వాగర్థావివ; జీమూతస్య + ఇవ = జీమూతస్యేవ; మొదలయినవి కేవలసమాసములు.

సమాసమందు సుబంతము సమర్థమగుపదముతోఁ గలియును. ఆ సమర్థమగుపదము సుబంతమయినను కావచ్చును; లేదా, తిఙాదులలో నేదియైనఁ గావచ్చును. సుబంతపదమునకు ధాతువనికాని, ప్రాతిపదికమని కాని సంజ్ఞ కలిగినప్పుడు దానికిఁజేరిన సుప్ప్రత్యయము లోపించును.

## II. అవ్యయీభావము.

అవ్యయము సమర్థమగు పదముతోఁగలిసి యేర్పడిన సమాసమునకు 'అవ్యయీభావ'మని పేరు. అవ్యయీభావసమాసములు సాధారణముగ నపుంసకలింగములై యుండును. కావున నవి తెనుఁగునఁ జేరునప్పుడు సంస్కృత నపుంసకలింగ శబ్దములు తెనుఁగునఁ దత్సమము లగునప్పుడు వర్తించువిధులు వీనికిని వర్తించును.

పాణిని సూత్రములందు ప్రథమా విభక్త్యంతముగ చూపఁబడినది సమాసమందు ఉపసర్జనమను సంకేతమును పొందును. ఉపసర్జనత్వమును పొందు పదము సమాసమునఁ బూర్వపదముగాఁ బ్రయోగింపఁబడును. 'శ్రిత, అతీత, గత, అత్యస్త, ప్రాప్త, ఆపన్న, అను పదములతో ద్వితీయచేరి సమాసమగును' అను సూత్రమున 'ద్వితీయ' అనునది ప్రథమాంతముగా నిరూపింపఁ బడినది. కాఁబట్టి, ద్వితీయా విభక్త్యంత పదములు శ్రిత, అతీత, గత, అత్యస్త, ప్రాప్త, ఆపన్న, అనుపదములతోఁ గూడునప్పుడు ఉపసర్జనమగును. 'కష్టమును + శ్రితుఁడు' అను విగ్రహమున 'కష్టమును' అనునది ద్వితీయాంతముగా నున్నది. కావున నది యుపసర్జనము. అది సమాసమునఁ బూర్వపదమగును; అప్పుడు దాని విభక్తిప్రత్యయము లోపింపఁగా నది ప్రాతిపదికరూపమును బొంది 'కష్ట' అగును; రెండు పదములును సమసించి 'కష్టశ్రితుఁడు' అను రూప మేర్పడును.

సమసించు పదములలో నొకదాని విభక్తిప్రత్యయము విగ్రహమునందు మాఱక, రెండవదాని విభక్తి మాఱుచుండినచో, విభక్తిప్రత్యయము మాఱని సుబంతపదమునకును ఉపసర్జనమనియే సంకేతము. కాని, యీ యుపసర్జనత్వము నొందిన పదము సమాసమునఁ బూర్వపదముగా నుండ నక్కఱ లేదు. ఉదా. కౌశాంబినుండి నిష్క్రాంతుఁడు=నిష్కౌశాంబి; కౌశాంబినుండి నిష్క్రాంతుని=నిష్కౌశాంబిని; కౌశాంబినుండి నిష్క్రాంతునితో=నిష్కౌశాంబితో; కౌశాంబినుండి నిష్క్రాంతునికొఱకు=నిష్కౌశాంబికొఱకు; కౌశాంబి నుండి నిష్క్రాంతునియందు = నిష్కౌశాంబియందు. ఈ యుదాహరణమున 'కౌశాంబినుండి' యను సుబంతము మాఱకుండిననే యది యుపసర్జనమగును; లేకున్నఁగాదు రాజుయొక్క కుమారి=రాజకుమారి; రాజుయొక్క కుమారిని= రాజకుమారిని; రాజుయొక్క కుమారివలన = రాజకుమారివలన—ఈ యుదాహరణమునందు కుమారీశబ్దముపై విభక్తి ప్రత్యయము మాఱుచుండుటచే నా పదమున కుపసర్జనత్వము కలుగదు.

సమాసమందలి రెండవపదము 'గో' శబ్దమయికాని, స్త్రీ ప్రత్యయాంతమయికాని యున్నయెడల నాపదముల తుది దీర్ఘాచ్చునకు హ్రస్వము కలుగును: ఉదా. చిత్రమైనగోవు = చిత్రగువు; శబలమైనగోవు = శబలగువు. (ఇట్టి రూపములు తెనుఁగువాఙ్మయమున మృగ్యములు.) నిః + కౌశాంబి = నిష్కౌశాంబి; అతి + ఖట్వా = అతిఖట్వ; తెనుఁగున. (ఉత్వము) + డుజ్ఞు= అతిఖట్వుఁడు. అతి + మాలా = అతిమాల; తెనుఁగున: (ఉత్వము) + డుజ్ఞు= అతిమాలుఁడు. అట్టిపద ముపసర్జనము కాకున్న నీ కార్యము కలుగదు. 'రాజ్ఞః భార్యా' అను విగ్రహమున 'రాజన్' శబ్దమున కుపసర్జనత్వ కలదుగాని భార్యా

శబ్దమునకు లేదు. కావున వానిసమాసము 'రాజభార్యః' అనియై తెనుఁగున రాజభార్యుఁడు అను సమాసము కలుగదు; సంస్కృతమున 'రాజభార్యా' అని సమాసము సిద్ధించి, తెనుఁగునఁ దుది దీర్ఘాచ్చునకు హ్రస్వము కలుగుటచే 'రాజభార్య' యనియగును. అట్లే, స్త్రీ ప్రత్యయములు చేరుటవలన నేర్పడిన స్త్రీ ప్రత్యయాంతములు కాని పదములందు సంస్కృతసమాసమున దీర్ఘాచ్చునకు హ్రస్వముకలుగదు. అతి + లక్ష్మీః, అతి + శ్రీః, అనువానియందు లక్ష్మీః, శ్రీః, అనుపదములు స్త్రీ ప్రత్యయములు చేరుటవలన స్త్రీలింగములయినవికావు; స్వతస్సిద్ధముగనే యవి స్త్రీలింగములు; కాఁబట్టి సంస్కృతమున వాని సమాసములు 'అతిలక్ష్మీః' అతిశ్రీః' అనికావు. తెనుఁగున తత్సమము లగునపుడు అతఁడతిలక్ష్మి; 'అతఁడతిశ్రీ' యనియగును; కాని, యిట్టి రూపములు తెనుఁగునఁ గానరావు.

అదంతమయిన అవ్యయీభావమునకు తుది సుప్ప్రత్యయము లోపింపదు; కాని, పంచమీ ప్రత్యయమయినఁదప్ప నా సుప్పునకు 'అమ్' అని యాదేశమగును. ఉదా. అపదిశమ్, తెనుఁగు. అపదిశము. ఇచట 'దిశయోఃమధ్యే' (రెండు దిశలకు మధ్యమందు) అని విగ్రహము; ఇందు దిశాశబ్దము సమాసమున రెండవపదమగుచు నుపసర్జన సంజ్ఞను బొందుచున్నది. కావున, 'నిష్కౌశాంబిః' యని సంస్కృత సమాసమయినట్లే నిదియును 'అపదిశయోః' అని కావలసెను. కాని, యీ సూత్రము ప్రకారము సప్తమీ ద్వివచన ప్రత్యయమగు 'ఓస్' స్థానమున 'అమ్' చేరి 'అపదిశమ్' అని సమాసమేర్పడినది. అదంతమయిన యవ్యయీభావసమాసములందె యనుటవలన 'అధిహరి' మొదలగువానియందు అమాదేశము కలుగదు. పంచమీవ్యతిరిక్త విభక్తుల కనుటచేత 'ఉపకుంభాదానయ' అనియే యనవలెనుగాని 'ఉపకుంభమానయ' అని సంస్కృతమున నవఁగూడదు.

తృతీయాసప్తమీ విభక్త్యంతములగు పదములకు అమాదేశము బహుళముగా నగును. 'అప + దిశా' అను పదములకు ప్రథమా, ద్వితీయా, చతుర్థీ, పంచమీ, షష్ఠీ, విభక్తులందు 'అపదిశమ్' అనియు, తృతీయయందు 'అపదిశమ్, అపదిశేన' అనియు, సప్తమియందు 'అపదిశమ్, అపదిశే' అనియు సమాసములు సంస్కృతమున సిద్ధించును. తెనుఁగున నీరూపముల కన్నిటికి 'అపదిశముగన్' 'అపదిశమున' 'అపదిశము' అనురూపములు గలుగును. అవ్యయీభావ సమాసమునకు 'సమృద్ధి' యనునర్థము గలుగునప్పుడు, సమాసమునందు నదీవాచకపదములు చేరినప్పుడును, సమాసమందలి యొకపదము సంఖ్యావాచక మయినప్పుడును, అమాదేశము నిత్యము: ఉదా. సుమద్రము.

మద్రులసమృద్ధి ; సుమగధము = మగధులసమృద్ధి: ఇట్లే, ఉన్మత్తగంగము, లోహితగంగము, ఏకవింశతిభారద్వాజను మొదలయినవి.

అవ్యయీభావ సమాసములం దవ్యయములకు సాధారణముగ నీయర్థములలో నొకటి యుండును:

(1) విభక్తి వచనము: ఉదా. అధిహరి. ఇందు 'అధి' అను నుపసర్గము నకు సప్తమ్యర్థము గలదు; కావున సప్తమ్యంత పదములకుఁ గలుగు కార్యము దీనికినిగలిగి, 'అధి' యుపసర్గనమయి సమాసమునఁ బూర్వపదముగనిలిచి, సమాసము నపుంసక లింగమగుచున్నది.

(2) సమీపవచనము: ఉదా. ఉపకృష్ణమ్ = కృష్ణునికి సమీపము. తెనుఁగు: ఉపకృష్ణము. కాని, యన్ని సమీపార్థ కావ్యయములకును సమాస కార్యములు కలుగవు. అభితః, పరితః, సమయా, నికషా, హా, అను నవ్యయ ములు ద్వితీయాకారకము గలవి. అట్లే, అన్యార్థకావ్యయములును, ఆరాత్, ఇతర, ఋతే, అనునవియుఁ బంచమీకారకము గలవి వీనిలో సమయా, నికషా, ఆరాత్, అనునవి సమీపవాదకావ్యయము లయినను సమాసము లందు చేరవు. ఉదా: సమయాగ్రామమ్, నికషాలంకా, ఆరాద్వనాత్ మొదలయినవి.

(3) సమృద్ధివచనము: ఉదా. సుమద్రమ్ (తెనుఁగు: సుమద్రము); సుమగధమ్ (తెనుఁగు: సుమగధము) మొదలయినవి.

(4) వ్యృద్ధివచనము: 'వ్యృద్ధి' యనఁగా వృద్ధిలేమి. ఉదా: దుర్యవ నమ్ (తెనుఁగు: దుర్యవనము).

(5) అభావ వచనము: ఉదా. నిర్మక్షికమ్ (తె. - ము); నిర్మశకమ్ (తె. - ము) మొదలయినవి.

(6) అత్యయవచనము: అత్యయమనఁగా 'పోవుట, నశించుట.' ఉదా: నిర్హిమమ్ (తె. - ము); అతిహిమమ్ (తె. - ము.).

(7) అసంప్రతివచనము: ఉదా. అతినిద్రమ్ (తె.-ము.) = వేళయతిక్ర మించిన నిద్ర.

(8) శబ్దప్రాదుర్భావ వచనము: ఉదా. ఇతిహరి = హరియను శబ్దము. వైష్ణవ గృహమున 'ఇతిహరి' వర్తించుచున్నది = హరి! హరి! యను శబ్దము వినఁబడుచున్నది.

(9) పశ్చాద్వచనము. ఉదా: అనువిష్ణు (తె. - వు) = విష్ణునివెంబడి.

(10) యథార్థవచనము; 'యథా' అను నవ్యయమునకు నాలుగర్థములు గలవు. అవి యీ యుదాహరణములవలన స్పష్టము లగును. ఉదా. (1) అను

రూపమ్ (తె.-ము) = తగినట్లు; (2) ప్రత్యర్థమ్ (తె.-ము) = అర్థము ననుసరించి; (3) యథాశక్తి = శక్తినతిక్రమింపక (4) సహరి = హరినిపోలిన.

(11) ఆనుపూర్వ్యవచనము: ఉదా. అనుజ్యేష్ఠం ప్రవిశంతు భవంతః= తాము అనుజ్యేష్ఠము (గా) ప్రవేశింతురుగాక; అనఁగా మొదట అందఱికంటెఁ బెద్దవాఁడు, తరువాత వంతకంటె చిన్నవాఁడు, ఈ రీతిగా వయసునుబట్టి యని యర్థము.

(12) యౌగపద్యవచనము: ఉదా. సచక్రం దేహి = చక్రముతోఁ గలిపి యిమ్ము; ఇచట 'సహ' అను నవ్యయమునకు 'స' ఆదేశమయినది; కాలార్థమున 'సహ' కు 'స' ఆదేశముకాదు. 'సహపూర్వాహ్ణము' అనవలెనుగాని, 'సపూర్వాహ్ణము' అని యనఁగూడదు.

(13) సాదృశ్య వచనము: ఉదా. ససఖి = మిత్రునివలె. (10) లో యాథార్థ్య వచనమున సాదృశ్యార్థమిమిడియున్నను గుణభూత సాదృశ్యార్థమునను సమాసము గలుగునని చెప్పుటకీ యర్థము పునరుక్తము చేయఁబడినది.

(14) సంపత్తి వచనము: ఉదా. సక్షత్త్రమ్ (తె. - ము); సమృద్ధి యనఁగా ఎక్కువతనము: సంపత్తి యనఁగా స్వభావానుకూలత.

(15) సాకల్యవచనము: ఉదా. సతృణమ్ (అత్తి), తె.-ము (తినును); అనఁగా తృణముకూడ విడువక యని యర్థము. కేవలము. గడ్డిపోచను కూడ తినునని యర్థముకాదు. సమస్తమును, దేనిని విడువకుండ నని యర్థము.

(16) అంతవచనము: ఉదా. సాగ్ని = అగ్నిని గూర్చిన వేదమందలి తుది యధ్యాయముతోఁ గూడనని యర్థము.

'యథా' యను నవ్యయము సాదృశ్యార్థమునఁగాక తక్కిన యర్థములందు సమాసములందుచేరును: ఉదా. యథావృద్ధమ్ బ్రాహ్మణానా మామంత్రయస్వ = వృద్ధబ్రాహ్మణుల నందఱిని పిలువుము. ఇచట సాదృశ్యార్థము లేదు. ''యథాహరి స్తథాహరః'' అనుచోట సాదృశ్యార్థము కలదు కావున సమాసము కలుగదు.

'యావత్' అను నవ్యయము అవధారణార్థమున సమాసమునందు కలియును: ఉదా. యావత్తైలమ్ తావద్వ్యాఖ్యానమ్ = ఎంతవఱకు దీపమునకు చమురుండునో అంతవఱకు వ్యాఖ్యానము; యావదమత్రం బ్రాహ్మణానా మామంత్రయస్వ = కుండలెన్ని యున్నవో అంతమంది బ్రాహ్మణులను పిలువుము; యావచ్ఛ్లోకం ప్రణామాః = శ్లోకములెన్ని యున్నవో అన్నిసార్లు ప్రణామములు. తెనుఁగున: యావత్తైలము; యావదమత్రము; యావచ్ఛ్లో

కము. అవధారణార్థమునఁగాక యితరార్థములందు సమాసము కలుగదు: ఉదా. యావద్దత్తం తావద్భుక్తమ్ (మయా) = 'ఇచ్చినంత కాలమును తింటిని' అనఁగా ఎంతతింటినో తెలియదని యర్థము; కావున సమాసము సిద్ధింప లేదు.

'ప్రతి' యను నవ్యయము మాత్రార్థమున, అనఁగా 'కొంచెము' అను నర్థమున సుబంతముతో సమసించును: ఉదా. శాకప్రతి = కొంచెముకూర; సూపప్రతి = కొంచెముపప్పు. మాత్రార్థము లేనప్పుడు: 'వృక్షం వృక్షం ప్రతి విద్యోతతే విద్యుత్' = మెఱుపు వృక్షము వృక్షముపై ప్రకాశము మెఱయుచున్నది. ఇచట సమాసము కలుగలేదు. ఇట్టి సమాసములకు తెనుఁగున ప్రచారము లేదు.

అక్ష, శలాకా, పదములును, సంఖ్యావాచకపదములును, 'పరి' అను నవ్యయముతో సమసించును. అక్ష, శలాకా, పదములకు జూదమందలి పాచికలని యర్థము: ఉదా. అక్షపరి, శలాకాపరి, ఏకపరి. ఇట్టి సమాసములకును దెనుఁగునఁ బ్రచారము లేదు.

అప, పరి, బహిస్, అను నవ్యయములును, 'అంచు' అనునది అంతమందు గల యవ్యయములును (అనఁగా 'ఉదంచ్,' 'ప్రాంచ్' మున్నగునవి) పంచమీ విభక్త్యంతములతో వైకల్పికముగా సమసించును: ఉదా. అప విష్ణు సంసారః, అపవిష్ణోః సంసారః (సంసారము విష్ణువునకు బయటనున్నది): పరిత్రిగర్తేభ్యః = త్రిగర్తదేశమునకు చుట్టును, బహిర్గ్రామం, బహిర్గ్రామాత్ = గ్రామమునకు బయట, ప్రాగ్గ్రామం, ప్రాగ్గ్రామాత్ = గ్రామమునకుఁ దూర్పున. తెనుఁగునఁ బంచమీరూపములతోడ సమాసములు కలుగవు.

'ఆఙ్' అను నవ్యయము మర్యాద, అంతవఱకు, అభివిధి = హద్దును కలుపుకొని, అను నర్థములందు సుబంతములతో వైకల్పికముగా సమసించును: ఉదా. మర్యాదార్థమున: ఆముక్తిసంసారః, ఆముక్తేః సంసారః = ముక్తి వఱకును సంసారము; అభివిధ్యర్థము: ఆబాలం హరిభక్తిః, ఆబాలేభ్యః హరిభక్తిః = బాలురవఱకును (బాలురను కలిపి) హరిభక్తి.

అభి, ప్రతి, అను నవ్యయములు 'వైపు' అనునర్థమున దేనివైపునకో తెలియఁజేయు సుబంతపదములతో వైకల్పికముగా సమసించును: ఉదా. అభ్యగ్ని శలభాః పతంతి, అగ్నిమభిశలభాః పతంతి = శలభములు అగ్ని వైపు పడుచున్నవి.

'దగ్గఱ' అను నర్థముగల 'అను' అనునవ్యయము దేనికి దగ్గఱయో తెలుపు సుబంతముతో వైకల్పికముగా సమసించును: ఉదా. అనువన మశని ర్గతః = పిడుగు వనమునకు దగ్గఱగా పోయెను.

'పొడుగున' అనునర్థముగల 'అను' అను నవ్యయము దేనికిపొడుగుననో తెలుపు సుబంతిముతో వైకల్పికముగా సమసించును: ఉదా. అనుగంగం వారాణసీ, గంగాయా అను వారాణసీ = వారాణసి గంగపొడుగునను (ఉన్నది.).

'తిష్ఠద్గు' ప్రభృతు లవ్యయీభావ సమాసములు: తిష్ఠద్గు, వహద్గు, ఆయతీగవమ్, ఖలేయవమ్, ఖలేబుసమ్, లూనయవమ్, లూయమానయవమ్, పూతయవమ్, పూయమానయవమ్, సంహృతయవమ్, సంహ్రియమాణయవమ్, సంహృతబుసమ్, సంహ్రియమాణబుసమ్, సమభూమి, సమపదాతి, సుషమమ్, విషమమ్, దుఃషమమ్, నిఃషమమ్, అపసమమ్, ఆయతీసమమ్, పాపసమమ్, పుణ్యసమమ్, ప్రాహ్ణమ్, ప్రరథమ్, ప్రమృగమ్, ప్రదక్షిణమ్. (అపరదక్షిణమ్), సంప్రతి, అసంప్రతి, ఇత్యాదులు—తిష్ఠద్గు ప్రభృతులు,

'పార, మధ్య' అనువానికి 'పారే, మధ్యే' యను నవ్యయరూపము లగునప్పుడు వానికి షష్ఠీ ప్రత్యయాంత పదములతో సమాసము వైకల్పికముగ గలుగును; వైకల్పికమనుటచేత నివి షష్ఠీతత్పురుష సమాసములుగ గూడ నేర్పడవచ్చును: ఉదా. పారేగంగాత్, గంగాపారాత్ (ఆనయ); మధ్యేగంగాత్, గంగామధ్యాత్ (ఆనయ).

సంఖ్యావాచకపదము వంశమను నర్థముగల పదముతో వైకల్పికముగా సమసించును. వంశమనగా గురుశిష్య వంశమనికాని, జన్మముచేత గలిగిన వంశమనికాని యర్థము: ఉదా. ద్విముని వ్యాకరణస్య, త్రిముని వ్యాకరణస్య; ఏకవింశతి భారద్వాజమ్, మొదలయినవి.

సంఖ్యావాచకపదము నదీవాచకశబ్దములతోడను వైకల్పికముగనే సమసించును: ఉదా. సప్తగంగమ్, సప్తగోదావరమ్, ద్వియమునమ్ మొదలయినవి.

నదీవాచక శబ్దములు విభక్త్యంత పదములతో గలిసి, యా పదముల యర్థముకాక యితరార్థము కలిగినప్పుడును నవ్యయీభావ సమాసమేర్పడును: ఉదా. ఉన్మత్తగంగమ్, లోహితగంగమ్, కృష్ణగంగమ్, శనైర్గంగమ్, ఇవియన్నియు దేశములకు సంజ్ఞావాచకములు. ఈ సమాసములకును నందలి పదముల యర్థమునకును సంబంధము లేదు.

ఈ క్రింది ప్రత్యయములు సమాసముల యర్థము నేవిధముగను మార్పక వానియంతమునఁ జేరుచుండును:—

అవ్యయీభావమునందు శరత్ప్రభృతులకంటె 'టచ్' అను ప్రత్యయము వచ్చును; అనఁగా వానికంటె 'అ' త్తువచ్చును; అవ్యయీభావసమాసములు నపుంసకలింగము లగుటచేత 'మ్' అనునదియత్తుపైఁ జేరును—శరద్, విపాశ్, అనస్, మనస్, ఉపానహ్, అనడుహ్, దివ్, హిమవత్, హిరుక్, విట్; సద్, దిశ్, దృశ్, విశ్, చతుర్, త్యద్, తద్, యద్, కియత్, జరా (దీనికి 'జరస్' అని యాదేశమగును), ప్రత్యక్షమ్, పరోక్షమ్, సమక్షమ్, అన్వక్షమ్, పథిన్, సదృశ్—ఇవి శరత్ప్రభృతులు. ఉదా. ఉపశరదమ్, ప్రతివిపాశమ్ మొదలయినవి.

సమాసమున అన్ - అంత శబ్దము చేరునపుడు దానియంతమున టచ్ ప్రత్యయము చేరును. అపుడు దాని యంతమందలి 'అన్' లోపించును. ఉదా. ఉప + రాజన్ = ఉప + రాజన్ + టచ్ = ఉప + రాజ్ + టచ్ = ఉపరాజ; అవ్యయీభావము కావున 'ఉపరాజమ్.' ఇట్లే 'అధ్యాత్మమ్' మొదలయినవి.

నపుంసకలింగమగు అన్నంతశబ్దము సమాసమున పరపదమగునపుడు దానిపై 'టచ్చు' వైకల్పికముగా నగును: ఉదా. ఉపచర్మ, ఉపచర్మమ్.

నదీ, పౌర్ణమాసీ, ఆగ్రహాయణీశబ్దము లంతమందుగల యవ్యయీభావ సమాసముల యంతమందు 'టచ్' ప్రత్యయము వైకల్పికముగా వచ్చును: ఉదా. ఉపనదమ్, ఉపనది; ఉపపౌర్ణమాసం, ఉపపౌర్ణమాసి; ఉపాగ్రహాయణమ్, ఉపాగ్రహాయణి.

ఝయ్యులు (వర్గప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థాక్షరములు) అంతమందుగల పదములు సమాసము నంతమందువచ్చినను వానిపై 'టచ్చు' వైకల్పికముగా వచ్చును: ఉదా. ఉపసమిధమ్, ఉపసమిత్, మొదలయినవి.

'గిరి' యనుపదము సమాసమున పరమందున్నను దానిపై టచ్చు వైకల్పికముగఁ జేరును: ఉదా. ఉపగిరమ్, ఉపగిరి.

పై రీతిగా సంస్కృతమున సిద్ధములయిన యవ్యయీభావసమాసములలోఁ గొన్ని తెనుఁగు గ్రంథములం దారూపములతోడనే యవతరించినవి. అందు 'అమ్' అనునంతముగల సమాసములకుఁ దెనుఁగున ఉత్తుమాత్రము చేరి ప్రాచీనాంధ్రకావ్యయములందు తఱచుగఁ బ్రయోగములు గాన్పించుచున్నవి. తరువాతికాలమున వానిపై 'కన్, కాన్'లు చేరుచు వచ్చినవి.

## III. తత్పురుష సమాసము.

కొన్ని సమాసములలోఁ గొన్నిటియందలి రెండుపదములలోఁ బూర్వ పదము నర్థము ప్రధానముగా నుండును. అట్టిసమాసములకు అవ్యయీభావ సమాసములని పేరు. కొన్నిటియం దుత్తరపదము నర్థమే ప్రధానమై యుండును; అట్టివి తత్పురుష సమాసములు. కొన్నిటియందు సమాసమందలి రెండుపదముల యర్థమునుగాక మఱియొకయర్థము ప్రాధాన్యమును పొందును. అట్టివి బహువ్రీహి సమాసములు. కొన్నిటియందు రెండుపదముల యర్థము లును సమానప్రాధాన్యమును వహించును; అట్టివి ద్వంద్వసమాసములు.

పై వానిలో నుత్తరపదప్రధానములైన తత్పురుష సమాసములు సమానాధికరణము, వ్యధికరణము నని రెండువిధములుగా నుండును. విశేష్య మును విశేషణమును నొకటితో నొకటి కలిసి సమాసముగ నేర్పడుటకు సమానాధికరణమని పేరు. ఇట్లు కలియు విశేషణ, విశేష్యములు విగ్రహ మునం దేకవిభక్తియం దుండును. ఇట్టి తత్పురుషభేదమునకుఁ గర్మధారయ మని పేరు.

వ్యధికరణమనఁగా వేఱువేఱు (విభక్తుల) నాశ్రయించి యుండుట. ఇట్టి సమాసములందలి పదము లేకవిభక్తికములై యుండవు; వీనిలోఁ బూర్వపదము విశేషణమై యుండదు. ఇట్టిసమాసములు ద్వితీయా తత్పురు షము, తృతీయా తత్పురుషము, చతుర్థీ తత్పురుషము, పంచమీ తత్పురు షము, షష్ఠీ తత్పురుషము, సప్తమీ తత్పురుషము, అని యాఱువిధములుగా నుండును. అభావమును దెలుపు నఞ్ (న) పూర్వపదముగాఁ జేరిన సమాస మునకు నఞ్ సమాస మనిపేరు. దీనినిగూడ నఞ్ తత్పురుషమని తత్పురుష భేదముగాఁ బరిగణింతురు.

### (అ) వ్యధికరణతత్పురుషము.

### I. ద్వితీయాతత్పురుషము.

(1) ద్వితీయా విభక్త్యంతమగు పదము శ్రిత, అతీత, పతిత, గత. అత్యస్త, ప్రాప్త, ఆపన్న అనుపదములతో సమసించి ద్వితీయా తత్పురుష సమాసమగును. ఈ పదములకు గమీ, గామీ, బుభుక్షు మొదలగు పదము లను గూడఁ జేర్చికొనవలెను: ఉదా. కష్టశ్రితుఁడు = కష్టము నాశ్రయిం చినవాఁడు; కష్టాతీతుఁడు = కష్టము నతిక్రమించినవాఁడు మొదలయినవి. ఇట్లే గ్రామగామీ = గ్రామమును (తెనుఁగు: గ్రామమునకు) పోఁగు వాఁడు; అన్నబుభుక్షువు = అన్నమును తిన నిచ్ఛగించువాఁడు మొదలయినవి.

(2) ['స్వయం' అనుపదము క్తప్రత్యయాంత పదముతో సమసింపదు; అనఁగా దానిపై నుండు 'అమ్' ప్రత్యయమునకు లోపము కలుగదు. 'స్వయం' అనున దవ్యయముకావున దానికి ద్వితీయా విభక్తిక ప్రసక్తిలేదు: ఉదా. స్వయంకృతము; స్వయంలబ్ధము మొదలయినవి.]

(3) ఖట్వా శబ్దము ద్వితీయారూపము క్తప్రత్యయాంతముతో నిందార్థమున సమసించును: ఉదా. ఖట్వారూఢుఁడు, ఖట్వాప్లుతుఁడు (మంచ మెక్కినవాఁడు, మంచము (పై) నెగురువాఁడు) అనఁగా తెలివితక్కువవాఁడు, తప్పుదారిఁ ద్రొక్కినవాఁడు అని నిందార్థము. నిందార్థము లేనప్పుడు సమాసముకాదు. ఖట్వామారూఢః = మంచముపై పరుండి యున్నవాఁడు.

(4) ['సామి' (= సగము) అనునవ్యయము క్తాంతశబ్దముతో సమసించి తత్పురుష సమాసమగును: ఉదా. సామికృతము = సగము చేయఁబడినది. ఇట్టిసమాసమున ద్వితీయావిభక్తి ప్రసక్తిలేదు.]

(5) కాలవాచకపదములు అత్యంత సంయోగార్థకములు కానప్పుడు ద్వితీయాంతములై క్తాంతములతో వైకల్పికముగా సమసించును: ఉదా. ప్రతిపచ్చంద్రుఁడు మాసప్రమితుఁడు; మాసమును పరిచ్ఛేదింప నారంభించిన వాఁడని యర్థము.

(6) కాలవాచకపదము లత్యంతసంయోగార్థమునఁ గూడ ద్వితీయాంతములయి క్తాంతములు కానిపదములతోఁ గూడ వైకల్పికముగ సమసించును: ఉదా. ముహూర్తసుఖము = ముహూర్తము సుఖము.

## ii. తృతీయా తత్పురుషము.

(1) తృతీయా విభక్త్యంతపదము దానిచే తెలుపఁబడు గుణవాచక పదముతో సమసించి తృతీయా తత్పురుష సమాసమగును: ఉదా. శంకులాఖండము = శంకులచేత చేయఁబడిన ఖండము; ధాన్యార్థము = ధాన్యముచేత సంపాదింపఁబడిన ధనము. తృతీయాంతపదబోధకవస్తువు కరణము కానప్పుడు సమాసము కలుగదు: ఉదా. అక్ష్ణాకాణః = కంటి(చేత) గ్రుడ్డివాఁడు. ఇచ్చట గ్రుడ్డితనమునకు కన్ను కరణముకాదు.

(2) తృతీయాంతపదము పూర్వ, సదృశ, సమ, ఊన, అర్థ, కలహ, నిపుణ, మిశ్ర, శ్లక్ష్ణ, అనుపదములతో సమసించి తృతీయా తత్పురుష సమాసమగును: ఉదా. మాసపూర్వుఁడు = మాసముచేత పూర్వుఁడు; మాతృసదృశుఁడు = తల్లితో పోలిక కలవాఁడు; పితృసముఁడు = తండ్రితో సమానుఁడు; మాషోనము, మాషవికలము (కార్షాపణము) = మినుపగింజ ఎత్తుచేత తక్కువయైన (కార్షాపణ మను నాణెము); వాక్కలహము = మాట

తో కలహము; ఆచారనిపుణుఁడు = ఆచారముచేత నేర్పరియైనవాఁడు; గుడమిశ్రము = బెల్లముతో కలిసినది; ఆచారశ్లక్ష్ణుఁడు = ఆచారముచేత నాజూకయినవాఁడు.

ఈ కార్యము 'అవర' శబ్దముతోఁ గూడఁ గలుగును: మాసావరుఁడు = మాసముచేత వైఁబడినవాఁడు:—మిశ్రశబ్దమునకుఁ బూర్వామం దుపసర్గము చేరియున్నను సమాసము కలుగును: గుడసంమిశ్రము = బెల్లముతో చక్కఁగాఁ గలిసినది.

(3) కర్తృకరణ వాచకపదములు తృతీయయందుండి కృదంతములతో బహుళముగా సమసించి తృతీయా తత్పురుష సమాసము లగును: ఉదా. అహిహతుఁడు = పాముచేత చంపఁబడినవాఁడు (ఇచట 'పాము' కర్త); నఖభిన్నము = నఖములచేత భిన్నము (ఇచట నఖములు కరణము); ఇట్లే హరిత్రాతుఁడు, పరశుచ్ఛిన్నము, మొదలయినవి.

బహుళమనుటచేత 'దాత్రేణ లూనవాన్,' 'పరశునా ఛిన్నవాన్' అనుచోట్ల సమాసము కలుగదు. బహులగ్రహణముచేతనే 'పాదహారకుఁడు,' 'గళచోపకుఁడు,' అనుచోట్ల సమాసము కలుగవీలులేకున్నను కలిగినది. కృదంతముతో సమసించు ననుటచేత "కాష్ఠైః పచతితరామ్" అనుచోట 'పచతితరామ్' అనునది క్రియాపదము కావున సమాసము కలుగదు.

(4) కర్తృకరణ వాచకపదములు తృతీయయందుండి కృత్యప్రత్యయాంతపదములతో అతిస్తుతి, అతినిందార్థములందు సమసించి తృతీయా తత్పురుష సమాసము లగును: ఉదా. వాతచ్ఛేద్యము (తృణము) = గాలిచేఁ గూడ ఛేదింపఁదగినది, అనఁగా అంత మృదువైనదని స్తుతిగాని, అంత అల్పమైనదని నిందార్థముగాని స్ఫురింపవచ్చును. అట్లే, 'కాకపేయ (నది)' = కాకి ఒడ్డునఁగూర్చుండి ముక్కుతో త్రాగఁదగినంత లోఁతు నీళ్లుగల నది యని స్తుత్యర్థముగాని, కాకి ముక్కు మాత్రము మునుఁగునంతటి లోఁతు గల నది యని నిందార్థముగాని స్ఫురించును.

(5) అన్నవాచకముతో వ్యంజన వాచకపదముచేరి తృతీయా తత్పురుష సమాస మగును: ఉదా. దధ్యోదనము = పెరుగుతో నన్నము.

(6) భక్ష్యవాచకపదముతో రుచికలిగించు వస్తువును తెలుపు పదము కలిసి తృతీయా తత్పురుష సమాసమగును: ఉదా. గుడధానములు = బెల్లముతో చేరిన పేలాలు.

### iii. చతుర్థీ తత్పురుషము.

చతుర్థ్యంతపదము తాదర్థ్యబోధకపదముతోను, అర్థ, బలి, హిత, సుఖ, రక్షిత, శబ్దములతోడను సమసించి చతుర్థీ తత్పురుష సమాసమగును: ఉదా. యూపముకొఱకు దారువు = యూపదారువు; రంధనాయ స్థాలీ = వంట కొఱకుస్థాలి యనుచో తాదర్థ్యములేదు కావున సమాసముకాదు; ద్విజుని కొఱకు ఇది (పప్పు) = ద్విజార్థము; భూతములకొఱకు బలి = భూతబలి; గోవులకొఱకు హితము = గోహితము; గోవులకొఱకు సుఖము = గోసుఖము; గోవులకొఱకు రక్షితము = గోరక్షితము.

### iv. పంచమీ తత్పురుషము.

(1) పంచమీ విభక్త్యంతపదము భయశబ్దముతో వైకల్పికముగా సమసించి పంచమీ తత్పురుష సమాసమగును: ఉదా. చోరునివలన భయము = చోరభయము—భీత, భీతి, భీ శబ్దములతోడను పంచమ్యంతపదము సమసించును: ఉదా. చోరభీతుఁడు, చోరభీతి; 'భీ' శబ్దముతోడి సమాసము తెనుఁగునఁ గలుగదు.

(2) పంచమ్యంతపదము అపేత, అపోఢ, ముక్త, పతిత, అపత్రస్త, అనుపదములతో సమసించి 'కొంచెము కొంచెముగా' అను నర్థమున పంచమీ తత్పురుష సమాసమగును: ఉదా. సుఖాపేతుఁడు = సుఖమువలన విడివడిన వాఁడు; కల్పనాపోఢుఁడు = కల్పనవలన తీసికొనిపోఁబడినవాఁడు; చక్రముక్తుఁడు = చక్రమునుండి విడిపింపఁబడినవాఁడు; స్వర్గపతితుఁడు = స్వర్గమునుండి పడినవాఁడు; తరంగాపత్రస్తుఁడు = తరంగములవలన భయపడిన వాఁడు. 'కొంచెము కొంచెముగా' అనుటవలన 'ప్రాసాదమునుండి పడిన వాఁడు' అనుటకు 'ప్రాసాదపతితుఁడు' అను సమాసము కాదు.

(3) పంచమ్యంతములైన 'కొంచెము', 'దగ్గఱ', 'దూరము', అనునర్థములుగల పదములును, 'కృచ్ఛ్ర' అనుపదమును క్తాంతపదములతో సమసించి పంచమీతత్పురుష సమాసము లగును. ఇట్టి సమాసములందు విభక్తిలోపము కలుగదు: ఉదా. స్తోకాన్ముక్తుఁడు, అల్పాన్ముక్తుఁడు, అంతికాదాగతుఁడు, అభ్యాశాదాగతుఁడు, దూరాదాగతుఁడు, విప్రకృష్టాదాగతుఁడు, కృచ్ఛ్రాదాగతుఁడు, కృచ్ఛ్రాల్లబ్ధము మొదలయినవి.

### v. షష్ఠీతత్పురుషము.

(1) షష్ఠ్యంతమగు పదము సమర్థమగు పదముతో సమసించి షష్ఠీ తత్పురుష సమాసమగును: ఉదా. రాజుయొక్క పురుషుఁడు = రాజపురుషుఁడు.

(2) షష్ఠ్యంతపదము 'యాజక' మొదలగు పదములతోఁ గలిసి షష్ఠీతత్పురుష సమాసమగును. యాజక, పూజక, పరిచారక, పరిషేచక, పరివేషక, స్నాపక (స్నాతక), అధ్యాపక, ఉత్సాహ (-ద) క, ఉద్వర్తక, హోతృ, భర్తృ, రథగణక, పత్తిగణక, పోతృ, హర్తృ, వర్తక - ఇవి యాజకాదులు. ఉదా. బ్రాహ్మణుని యాజకుఁడు = బ్రాహ్మణయాజకుఁడు; దేవపూజకుఁడు మొదలయినవి.

షష్ఠ్యంతపద మాపదమునం దంతర్భూతమైన గుణమును దెలుపు పదముతోఁ గలిసి షష్ఠీతత్పురుష సమాసమగును: ఉదా. బ్రాహ్మణవర్ణము, చందనగంధము మొదలయినవి.

అట్లే, యది విశేషణముల 'తర' భావమును దెలుపు పదముతో సమసించియు షష్ఠీతత్పురుష సమాసమగును: ఉదా. అన్నిటికంటె శ్వేతతరము= సర్వశ్వేతము మొదలయినవి.

కృదంత పదముతోడి సంబంధమువలన నొకపదమునకు షష్ఠీ ప్రత్యయము చేరునపుడు, ఆ షష్ఠ్యంతపద మాకృదంతపదముతో సమసించి షష్ఠీతత్పురుష సమాసమగును: ఉదా. ఇధ్మవ్రశ్చనము = ఇధ్మములను (కట్టెలను) వ్రశ్చనము (చీల్చునట్టిది) = గొడ్డలి.

(3) నిర్ధారణార్థముగల షష్ఠ్యంతపదము మఱియొకపదముతో సమసింపదు. 'నరులలో ద్విజుఁడు శ్రేష్ఠుఁడు' అనవలెనుగాని 'ద్విజుఁడు నరశ్రేష్ఠుఁడు' అని సమాసము చేయరాదు.

(4) షష్ఠ్యంతపదము పూరణార్థక పదముతోడను, గుణవాచకముతోడను, సుహిత, సత్, అను నర్థములుగల పదములతోడను, అవ్యయముతోడను, తవ్యప్రత్యయాంత పదముతోడను, సమానాధికరణముతోడను, సమసింపదు. "ఉన్నవారిలో ఆఱవవాఁడు" అనునర్థమున 'సత్‌షష్ఠుఁడు' అనకూడదు. 'కాకినలుపు' అనునర్థమున 'కాకకార్ష్ణ్యము' అనకూడదు. 'ఫలమునకుతృప్తుఁడు' అనునర్థమున 'ఫలతృప్తుఁడు' అనకూడదు. 'ఫలముచేత తృప్తుఁడు' అని తృతీయతోఁ జేరునపుడు 'ఫలతృప్తుఁడు' అనవచ్చును. తృతీయా సమాసమయినప్పుడు సమాస మాద్యుదాత్త స్వరము కలది; షష్ఠి చెప్పినవు డంత్యోదాత్తస్వరము; 'బ్రాహ్మణునికి పనిచేయువాఁడు' అనునర్థమున 'బ్రాహ్మణకుర్వాణుఁడు' అనకూడదు; 'బ్రాహ్మణునికిచేసి' అనునర్థమున 'బ్రాహ్మణకృత్వా' అనకూడదు. 'బ్రాహ్మణుని కర్తవ్యము' అనునర్థమున 'బ్రాహ్మణకర్తవ్యము' అనకూడదు. ('తవ్య' ప్రత్యయాంతమయినప్పుడు సమాసము కలుగదుగాని, 'తవ్యత్' ప్రత్యయాంతమయినచో సమాసము సిద్ధించును: ఉదా. బ్రాహ్మ

కర్తృత్వము, స్వకర్తృత్వము మొదలయినవి. సమానాధికరణము, అనఁగా రెండు పదములును నేకవస్తువును దెలుపునప్పుడు: 'రాజ్ఞః పాటలిపుత్రకస్య' అనుదాని యందు రాజ, పాటలిపుత్రక శబ్దము లేకపురుషుని దెల్పుచున్నవి, కావున 'రాజపాటలిపుత్రకుఁడు' అనుసమాసము సిద్ధింపదు. ఇట్లే, పాణిని సూత్రకారుఁడు, తక్షకసర్పము, అనుసమాసములును సిద్ధింపవు. అయినను 'సూత్రకార ఏవ పాణినిః' అను విగ్రహము చెప్పిన 'సూత్రకారపాణిని' అను సమాసము సుసంగతమగును.

(5) షష్ఠ్యంతపదము పూజార్థమున క్తాంతపదముతో సమసింపదు పూజార్థమనుటవలన మతి, బుద్ధి, అను నర్థములును ద్యోతకములగును. రాజ్ఞాం మతః, బుద్ధః, పూజితః, అను విగ్రహార్థమున 'రాజమతః, రాజబుద్ధః, రాజపూజితః' అను సమాసములు కలుగవు. రాజులచేత పూజింపఁబడువాఁడు అను తృతీయార్థమున 'రాజపూజితుఁడు' అను తృతీయాతత్పురుష సమాసమునకు బాధకము లేదు.

(6) అధికరణవాచకశబ్దముతోఁ గూడ షష్ఠ్యంతపదము సమసింపదు. ఉదా. ఇదమేషాం వాసితం ( - గతమ్ - భుక్తమ్.)

(7) షష్ఠ్యంతపదమునకు ద్వితీయార్థము కలుగునప్పు డది మఱియొక పదముతో సమసింపదు. ఉదా: 'ఆశ్చర్యో గవాం దోహో ఽగోపేన'. ఇచట 'గవాం' అను షష్ఠ్యంతపదమునకు ద్వితీయార్థమున్నది గావున 'గోదోహః' అని సమాసము సిదింపదు.

(8) షష్ఠ్యంతపదము కర్త్రర్థకములగు 'తృచ్', 'అక' అను ప్రత్యయములు చేరి యేర్పడిన పదములతో సమసింపదు: ఉదా. 'అపాంస్రష్టా' ('అప్స్రష్టా' అని కాదు); వజ్రస్యభర్తా ('వజ్రభర్తా' అనికాదు); ఓదనస్య పాచకః ('ఓదనపాచకః' అనికాదు).

(9) కర్త్రర్థము కలిగిన షష్ఠ్యంతపదము 'అక' ప్రత్యయాంతపదముతో సమసింపదు: ఉదా. భవతః శాయికా ('భవచ్ఛాయికా' అనికాదు).

(10) షష్ఠ్యంతపదము 'క్రీడ, జీవిక' అను నర్థములనిచ్చు 'అక' ప్రత్యయాంతపదముతో తప్పక సమసించి షష్ఠీతత్పురుష సమాసమగును: ఉదా. ఉద్దాలక పుష్పభంజిక = ఒకవిధమగు ఆట. ఈ యాటయం దుద్దాలకపుష్పము లను చిదుముదురు; దంతలేఖకుఁడు = పండ్లకు రంగువేసి జీవించువాఁడు; నఖలేఖకుఁడు = గోళ్లకు రంగువేసి జీవించువాఁడు.

(11) పూర్వ, అపర, అధర, ఉత్తర అను పదములు మొత్తమునుండి ప్రత్యేకింపఁబడిన భాగములుగలిగిన యొకవస్తువును దెలుపుపదముతో

సమసించి, షష్ఠీతత్పురుష సమాసములగును: ఉదా. కాయమునకు పూర్వము = పూర్వకాయము; కాయమునకు అపరము = అపరకాయము.

(12) 'అర్ధము' అనుపదము 'సరిగా సగము' అనునర్థముఁ గలిగియున్నప్పుడు నపుంసకలింగ మగును. అట్టి 'అర్ధము' అను పదము సమభాగములుగల వస్తువును దెలుపు పదముతో (ఆ సమభాగములుగల వస్తువు సంపూర్ణవస్తువయినపుడు) సమసించి షష్ఠీతత్పురుష సమాసమగును: ఉదా. పిప్పలితో అర్ధము=అర్ధపిప్పలి.

(13) ద్వితీయ, తృతీయ, చతుర్థ, తుర్య, అను పదములు భాగములు గలిగిన సంపూర్ణవస్తువును దెలుపు పదముతో వైకల్పికముగా సమసించును: ఉదా. భిక్షుయొక్క ద్వితీయము = ద్వితీయభిక్ష.

(14) ప్రాప్త, ఆపన్న, అనుపదములు ద్వితీయాంతపదములతోఁ గూడ వైకల్పికముగ సమసించును: ఉదా. ప్రాప్తజీవికుఁడు, జీవికాప్రాప్తుఁడు; ఆపన్నజీవికుఁడు, జీవికాపన్నుఁడు.

(15) కాలవాచకపదములు తత్పరిమాణవాచకపదములతో గలిసి షష్ఠీతత్పురుష సమాసములగును: ఉదా. జాతోమాసస్య = మాసజాతః, తెనుఁగు: మాసజాతుఁడు; ద్వ్యహో జాతస్య యస్య = ద్వ్యహ్నజాతః, తెనుఁగు; ద్వ్యహ్నజాతుఁడు మొదలయినవి.

vi. సప్తమీతత్పురుషము.

(1) సప్తమ్యంతపదము శౌండాదిపదములతోఁ గలిసి సప్తమీతత్పురుష సమాసమగును: శౌండ, ధూర్త, కితవ, వ్యాడ, ప్రవీణ, సంవీత, అంతర (స్థలవాచకమయినప్పుడు), అధి, పటు (అధిపటు), పండిత, కుశల, చపల, నిపుణ, సంవ్యాడ, భవ్య, సమీర - ఇవి శౌండాదులు. ఉదా. అక్షము. లందు శౌండుఁడు = అక్షశౌండుఁడు మొదలయినవి.

(2) అట్లే, సప్తమ్యంతపదము 'సిద్ధ, శుష్క, పక్వ, బంధ,' శబ్దములతోఁగూడ సమసించి సప్తమీతత్పురుష సమాసమగును: ఉదా. సాంకాశ్యమునందు సిద్ధుఁడు = సాంకాశ్యసిద్ధుఁడు; ఆతపమునందు శుష్కము = ఆతపశుష్కము; స్థాలియందు వండఁబడినది = స్థాలీపక్వము; చక్రమునందు కట్టఁబడినది = చక్రబంధము,

(3) సప్తమ్యంతపదము నిందార్థమున ధ్వాంక్ష శబ్దముతోఁగలిసి సప్తమీతత్పురుష సమాసమగును: తీర్థమునందు ధ్వాంక్షము = (కాకము, వాయసము) తీర్థధ్వాంక్షము = నీటికాకి (నీటకానులకొఱకు నది ఒడ్డున కాచుకొనియుండువాఁడు); లేదా, కాకి, నీటియొడ్డున నిలుకడగా నొకచోట నిలువక

యొగురుచుండును; అట్లే గురుకులమునఁజేరి యచట చిరకాలము నిలువక లేచిపోవువాఁడును తీర్థవాయస మనఁబడును.

(4) సప్తమ్యంతపదము ఋణార్థమున కృత్యప్రత్యయాంత పదములతో సమసించి సప్తమీ తత్పురుష సమాసమగును. ఈ సూత్రమునందలి కృత్య ప్రత్యయము యత్ప్రత్యయమునకు మాత్రము వర్తించును: ఉదా. మాసమున నివ్వవలసిన ఋణము = మాసదేయము, 'సాయాహ్నే గేయం నామ' అనుచో 'ఋణార్థము' లేదు కావున సమాసముకాదు.

(5) సప్తమ్యంతపదము మఱియొక విభక్త్యంతపదముతోఁగలిసి సంజ్ఞావాచకమయి సప్తమీ తత్పురుష సమాసమగును. ఇట్టిచోట సప్తమీ ప్రత్యయమునకు లోపము గలుగదు: ఉదా. అరణ్యే తిలకాః = అడవి నువ్వులు.

(6) రాత్రియొక్కకాని, పగటియొక్కకాని భాగములను దెలుపుపదములు క్తాంతపదములతో సమసించి సప్తమీ తత్పురుష సమాసములగును. ఉదా. పూర్వాహ్ణకృతము, అపరాహ్ణకృతము, అపరాత్రకృతము మొదలైనవి.

(7) 'తత్ర' అనుపదము సప్తమ్యంతము: అది క్తాంతపదముతోఁ గలిసి సప్తమీతత్పురుష సమాసమగును. ఉదా. తత్రభుక్తము.

(8) సప్తమ్యంతపదము నిందార్థమున క్తాంతపదముతో సమసించి సప్తమీ తత్పురుష సమాసమగును : ఉదా. ఈ నీపని అవతప్తే నకులస్థితము వలె నున్నది; ఈ మాట చపలమనస్సుగల వానినిగూర్చి చెప్పఁబడును.

(9) 'పాత్రేసమిత' మొదలగు పదములు నిందార్థమున సప్తమీ తత్పురుష సమాసములగును. పాత్రేసమితులు, పాత్రేబహులులు = తిండి వేళకు సిద్ధమగువారు; ఉదుంబరమశకము, ఉదుంబరకృమి, కూపకచ్ఛపము, అవటకచ్ఛపము, కూపమండూకము, కుంభమండూకము, ఉదపానమండూకము = తానున్నదేలోక మనుకొనువాఁడు; నగరకాకము, నగరవాయసము = పట్టణములలో పనిపాటులులేక తిరుగువాఁడు; మాతరిపురుషుఁడు = అమ్మకూచి; పిండీశూరుఁడు = తిండికిశూరుఁడు; పితరిశూరుఁడు = తండ్రిమీఁద శూరత్వము చూపువాఁడు; గేహేశూరుఁడు = ఇంటిలోమాత్రము శూరుఁడు; గేహేనర్ది, గేహేక్ష్వేడి = ఇంటకేకలు వేయువాఁడు; గేహేవిజితి = ఇంటిలోగెలిచినానని చెప్పుకొనువాఁడు; గేహేవ్యాడుఁడు = ఇంటిలో పామువంటివాఁడు; గేహేమేహి, గేహేదృప్తుఁడు, గేహేధృష్టుఁడు = ఇంట గర్వించువాఁడు; గేహేతృప్తుడు = ఇంటికూచి; ఆఖునికబకము = ఎలుకమీఁదికి కొంగవంటివాఁడు, అనఁగా తనకంటె చిన్నవారిమీఁదికి శూరుఁడు; గోష్ఠేశూరుఁడు = ఆవుల సాలలో శూరుఁడు, గోష్ఠేవిజితి=అవులసాలలో జయించువాఁడు; ఇట్లే, గోష్ఠే

త్స్వేడుఁడు, గోష్ఠీపటుఁడు, గోష్ఠీపండితుడు, గోష్ఠీప్రగల్భుఁడు, కర్ణేటిరటిర, కర్ణేచురచుర = చెవిలో గొనుగువాఁడు; ఇవి పాత్రేసమితాద్యులు.

(10) పూర్వకాలమును దెలుపునట్టి పదములును, ఏక, సర్వ, జరత్, పురాణ, నవ = క్రొత్త, కేవల, అనుపదములును విభక్త్యంతములై, అవే విభక్తులంతమందు గల పదములతో సమసించి సప్తమీతత్పురుష సమాసములగును: ఉదా. స్నాతానులిప్తుఁడు = మొదటస్నానముచేసి తరువాత అనులేపనము చేసికొన్నవాఁడు; కృష్టసమీకృతము = మొదట దున్ని తరువాత చదునుచేయఁబడినది; ఏకనాథుఁడు = ఒక్కనినే యధికారిగాఁ గలవాఁడు; ఏకభిక్ష = దినమునకొక్కసారి యెత్తినభిక్ష; సర్వమనుష్యులు = అందఱు మనుష్యులు; జరద్ధస్తి = ముసలియేనుఁగు; పురాణమీమాంసకులు=ప్రాఁత కాలపు మీమాంసకులు; నవపాఠకులు = క్రొత్తవిద్యార్థులు; కేవలవైయాకరణులు = వ్యాకరణము మాత్రము తెలిసినవారు.

(11) దిగ్వాచక పదములను, సంఖ్యావాచక పదములును, వానితో సంబంధించి యవే విభక్తులయందున్న పదములతో సమసించి, సంజ్ఞావాచకములై తత్పురుషసమాసము లగును: ఉదా. పూర్వేషుకామశమీ=తూర్పున నున్న కామశమి యను పట్టణము; సప్తర్షులు = సప్తర్షులను నక్షత్ర సముదాయము.

(12) తద్ధితార్థముగల విభక్తియందుగాని, సమాసముతో మఱియొక పదము సమసించినప్పుడు గాని, సమాహారార్థమునందుగాని, దిగ్వాచక, సంఖ్యావాచక పదములు, అవే విభక్తు లంతమందుగల పదములతో సమసించి, తత్పురుషసమాసములగును.

(అ) తద్ధితార్థముగల విభక్తి: 'పూర్వస్యాం శాలాయాం భవః' ఇచట 'భవః' అనుదానికి తద్ధితార్థముగలిగి 'పౌర్వశాలః' అనురూపము గలిగినది. ఇది తెనుఁగున మహద్వాచకమగునపుడు 'పౌర్వశాలుఁడు' అనియు, అమహద్వాచకమగునపుడు 'పౌర్వశాలము' అనియు, రూపముల నొంది తత్పురుష సమాసమగును. ఇట్లే 'అపరశాలుఁడు, అపరశాలము.'

(ఆ) సమాసముతో మఱియొకపదము సమసించుటకు: పూర్వశాలాప్రియుఁడు, అపరశాలా ప్రియుఁడు. ఇట్టి ఉత్తరపద సమాసములు నిత్యసమాసములుగావున వీనికి విగ్రహము లేదు.

(ఇ) సమాహారార్థమున దిగ్వాచకములతో సమాసములు కలుగవు; అట్టివి ప్రయోగాసిద్ధములు.

సంఖ్యావాచకములతో తద్ధితార్థమున సమాసముకలిగినందుకు, షాణ్మా తురేఁడు.

'పంచగావో ధనం యస్య' అయిదుగోవులు ధనముగా ఎవనికిఁ గలవో వాఁడు అనుదానిని బహువ్రీహి సమాసము చేయక, పూర్వము 'పంచ+గో' అను పదములకు సమాసము కల్పింపవలెను. ఇట్లుండఁగా,—

(18) తత్పురుష సమాసమున ద్వితీయాంగముగా నిలిచిన గోశబ్దమునకు, తద్ధితప్రత్యయమునకు లోపము కలుగకుండినచో, 'టచ్' ప్రత్యయమగును. అప్పుడు 'పంచ+గో' అనునది 'పంచగవః' అను తత్పురుష సమాసమగును. తరువాత నా సమాసముపై 'ధన' శబ్దముచేరి 'పంచగవధనః' = పంచగవధనుఁడు అను బహువ్రీహిసమాసమగును.

'పంచ + గో' అను పదములను తత్పురుషసమాసము చేయనియెడల 'టచ్' రాదు. అప్పు డా పదములపై 'ధన' శబ్దముచేరి 'పంచగోధనః' = పంచగోధనుఁడు, అనియే సమాసమగును.

(అ) కర్మధారయసమాసము.

ఇంతవఱకును వ్యధికరణ తత్పురుషము వివరింపఁబడినది. తత్పురుషమున సమానాధికరణమను రెండవ భేదమునకుఁ గర్మధారయ మనిపేరు. ఇదియును ఉత్తరపదము నర్థను ప్రధానముగాఁగలదియే. ఇందు విశేషణ విశేష్య పదములు కలిసి సమాసములగును; కొన్నియెడల రెండుపదములును విశేషణములే కావచ్చును. ఈ సమాసమునందలి రెండుపదములును మాత్రము ఒక్కవిభక్తియందే యుండును. ఇందలి విశేషణములకు సంభావన, ఉపమానము, మొ॥లగు నర్థములు గలిగి కర్మధారయమందు కొన్ని భేదములు గలుగును.

i. ద్విగుసమాసము.

కర్మధారయసమాసమందు సంఖ్యావాచకపదము పూర్వపదమైన యెడల దానికి ద్విగువను పేరు గలుగును, ద్విగుసమాసము (1) తద్ధితార్థగువు (2) ద్విపపదద్విగువు (3) సమాహారద్విగువు అని మూఁడువిధములుగా నుండును. ఉదా. (1) తద్ధితార్థద్విగువు: దశకపాలము = పదిపాత్రలయందు చేయఁబడిన బలిపదార్థము; (2) ఉపపదద్విగువు: సమాసముపై మఱియొక పదముచేరుట: పంచనావప్రియుఁడు = అయిదునావలను కలిగియుండ నిష్టము గలవాఁడు. (3) సమాహారద్విగువు: పంచగవము=అయిదు గోవుల సమూహము.

(1) ఇందు సమాహార ద్విగుసమాస మేకవచనమునందును నపుంసక లింగమునందును మాత్రముండును: పంచగవము = అయిదు గోవులసమూ

హము. తద్ధితార్థద్విగువయినచో నేకవచనమునం దుండదు; పంచకపాలములు = అయిదుకపాలములందు సంస్కరింపఁబడినవి: పంచగవములు (పటములు) = అయిదు గోవులతోఁ గొనినవి (వస్త్రములు).

ii. కేవల కర్మధారయ సమాసము.

కుత్సితార్థమును దెలియఁజేయుపదములు కుత్సనార్థకపదములతో సమసించును: ఉదా. వైయాకరణఖసూచి = వ్యాకరణము తెలియక వ్యాకరణ ప్రశ్నము నడిగినప్పుడెల్ల నాకాశమువంకఁ జూచువాఁడు; మీమాంసకదుర్దురూఢుఁడు = బాగుగ మీమాంసాశాస్త్రమును దెలియనివాఁడు; యాజ్ఞికకితవుఁడు=యజ్ఞముచేయ నర్హులు కానివారికొఱకు యజ్ఞములను జేయించువాఁడు.

(2) 'పాప,' 'అణక' అనుపదములు కుత్సితార్థకపదములతో సమసించును. ఈ విధి పైసూత్రమున కపవాదము. 'పాప,' 'అణక' శబ్దములు కుత్సనార్థకములు కావునఁ బైసూత్రముప్రకారము సమాసమున నుత్తరపదములు కావలసియుండఁగా నీసూత్రమువలనఁ బూర్వపదము లగుచున్నవి: ఉదా. పాపనాపితుఁడు = దుష్టుఁడైన మంగలివాఁడు; అణకకులాలుఁడు = నీచుడైన కుమ్మరవాఁడు.

(3) ఉపమానవాచకపదములు సమానధర్మము గలవియై యుపమేయవాచకపదములతో సమసించును: (కృష్ణుఁడు) ఘనశ్యాముఁడు. ఇచట ఘనము (మేఘము)నకును కృష్ణునకును శ్యామత్వము (నలుపుఁదనము) సమానధర్మమగుటచే ఘన, శ్యామపదములకు సమాసము కలిగినది. ఇం దుపమానవాచకమగు 'ఘన'శబ్దము సమాసమునఁ బూర్వపదముగా నున్నది. ఇట్లే, కుముదశ్యేతి, హంసగద్గదము, న్యగ్రోధపరిమండలము మొదలయినవి. ఇట్టి సమాసమునకు విగ్రహము చెప్పునప్పుడు 'ఇవ' = వలె అనుపదము వచ్చును. ఘనశ్యామః = ఘన ఇవ శ్యామః, ఘనమువలె శ్యామవర్ణము గలవాఁడు.

(4) ఉపమేయవాచకము 'వ్యాఘ్ర' మొదలగు నుపమానవాచకపదములతోఁ బైసూత్రమునందువలె సమానధర్మము ద్యోతకము కానప్పుడు సమసించును: ఉదా. పురుషవ్యాఘ్రుఁడు. దీనికి విగ్రహము 'పురుషోఽయం వ్యాఘ్ర ఇవ' = ఈ పురుషుఁడు (బలమున) వ్యాఘ్రము వంటివాఁడు' అని చెప్పవలెను.

వ్యాఘ్ర, సింహ, ఋక్ష, ఋషభ, చందన, వృక, వృష, వరాహ, హస్తిన్, తరు, కుంజర, రురు, పృషతీ, పుండరీక, పలాశ, కితవ—ఇవి వ్యాఘ్రాదులు. ఇది యాకృతిగణము; కావున, ముఖపద్మము, ముఖకమలము, కరకిసలయము, పార్థివచంద్రుఁడు మొదలగు సమాసములును గలవని తెలియవలెను.

(5) విశేషణము విశేష్యముతో సమానవిభక్తియం దుండి బహుళముగా సమసించును: ఉదా. నీలోత్పలము, రక్తోత్పలము. బహుళమనుటచేతఁ గొన్నిచోట్ల నీవిధి నిత్యము: ఉదా. కృష్ణసర్పము; కొన్నిచోట్లఁ గలుగదు: ఉదా. రాముఁడు జామదగ్న్యుఁడు; తక్షకుఁడను సర్పము మొదలయినవి.

(6) పూర్వ, అపర, ప్రథమ, చరమ, జఘన్య, సమాన, మధ్య, మధ్యమ, వీర అనుపదములును తమతో సమానవిభక్తియందున్న పదములతో సమసించును. ఇది నియమసూత్రము. పై పదము లెప్పుడును సమాసమునఁ బూర్వపదములుగనే యుండవలెనని యీ సూత్రము నియమించుచున్నది: ఉదా. పూర్వవైయాకరణుఁడు, అపరాధ్యాపకుఁడు మొదలయినవి.

అర్ధశబ్దముతో సమసించునప్పుడు 'అపర' అను పదమునకు బదులుగా 'పశ్చ' అను పదము వాడఁబడును: పశ్చార్ధము.

(7) 'శ్రేణి' మొదలగు పదములు 'కృత' మొదలగు పదములతో సమానవిభక్త్యంతములై సమసించును.

శ్రేణి, ఏక, పూగ, ముకుంద, రాశి, నిచయ, విషయ, నిధన, పర, ఇంద్ర, దేవ, ముండ, భూత, శ్రమణ, వదాన్య, అధ్యాపక, అభిరూపక, బ్రాహ్మణ, క్షత్త్రియ, (విశిష్ట), పటు, పండిత, కుశల, చపల, నిపుణ, కృపణ— ఇవి శ్రేణ్యాదులు.

కృత, మిత, మత, భూత, ఉక్త, (యుక్త), సమాజ్ఞాత, సమామ్నాత, సమాఖ్యాత, సంభావిత, (సంసేవిత), అవధారిత, అవకల్పిత, నిరాకృత, ఉపకృత, ఉపాకృత, (దృష్ట), కలిత, దలిత, ఉదాహృత, విశ్రుత, ఉదిత మొదలయినవి కృతాదులు. ఇది యాకృతిగణము గావున నిట్టి వింకను గలవని తెలియవలెను.

ఉదా. శ్రేణీకృతము మొదలయినవి.

(8) నఞ్ తోఁ జేరని క్తాంతపదము నఞ్ తోఁ జేరిన క్తాంతపదములతో సమానవిభక్తియందుండి సమసించును: ఉదా. కృతాకృతము, అశితానశితము, క్లిష్టాక్లిశితము.

(9) 'శాకపార్థివ' మొదలగు సమాసములందు ఉత్తరపదలోపము కలుగునని చెప్పవలెను; శాకప్రియుఁడగు పార్థివుఁడు 'శాకపార్థివుఁడు' = తన శకమువారికి ప్రియుఁడయి శకమును గల్పించువాఁడు; దేవపూజకుఁడగు బ్రాహ్మణుఁడు 'దేవబ్రాహ్మణుఁడు', మొదలయినవి.

శాకపార్థివ, కుతపసౌశ్రుత = కుతపకాలమును జూచికొని యాతిథ్యము కొఱకు వచ్చువాఁడు; అజాతౌల్వలి = మేకపాలను త్రాగి బ్రతుకుఋషి—

ఇవి శాకపార్థివాదులు. ఇది యాకృతిగణము, అనఁగా నిట్టి వింకను నుండవచ్చు ననుట: కృతాపకృత, భుక్తవిభుక్త, పీతవిపీత, గతప్రత్యాగత, యాతానుయాత, క్రయాక్రయికా, పుటాపుటికా, ఫలాఫలికా, మానోన్మానికా మొదలయినవియు శాకపార్థివపదమువంటివే.

(10) సత్, మహత్, పరమ, ఉత్కృష్ట, అను పదములు పూజ్యార్థములను దెలుపు పదములతో సమసించును. ఉదా. సద్వైద్యుఁడు, మహాపురుషుఁడు, పరమపురుషుఁడు, ఉత్కృష్టపురుషుఁడు మొదలయినవి. పూజ్యార్థము లేనప్పుడు సమాసము కాదు. గోవు బురదనుండి యుత్కృష్టమయినది (పైకి త్రీయఁబడినది). ఇచట పూజ్యార్థము లేదు.

(11) పూజార్థ్రతను దెలుపుపదము బృందారక, నాగ, కుంజర పదములతో సమసించును: ఉదా. గోబృందారకము మొదలయినవి.

(12) 'కతర, కతమ' అను పదములు జాతినిగూర్చి ప్రశ్నించునప్పుడు సమానవిభక్తికము లగుపదములతో సమసించును. ఉదా. కతరకఠుఁడు=వీరిలో నెవఁడు కఠజాతికిఁ జెందినవాఁడు? కతరకాలాపుఁడు = వీరిలో నెవఁడు కాలాప జాతికి చెందినవాఁడు. జాతియనఁగా గోత్రము, చరణము అని యర్థము. ఇట్టి సమాసములు తెనుఁగునఁ జేరలేదు.

(13) 'కిమ్' అనుపదము నిందార్థమున సమాసమున నితరపదముతోఁ జేరును: ప్రజలను రక్షింపనివాఁడు 'కింరాజు'; ద్వేషించు సఖుఁడు 'కింసఖుఁడు;' చూలుదాల్పనియావు 'కింగోవు' మొదలయినవి.

(14) జాతివాచకపదము పోటా (మీసముగల యాఁడుది), యువతి (యౌవనవతి), స్తోక (కొంచెము), కతిపయ (కొన్ని), గృష్టి (మొదటి యీఁత యావు), ధేను (పాఁడియావు), వశా (గొడ్రాలు), వేహద్ (గర్భచ్యుతి యైన యావు), బష్కయణీ (ఎదిగిన దూడ గలయావు), ప్రవక్తృ (వ్యాఖ్యానము చేయువాఁడు), శ్రోత్రియ (వేదము నభ్యసించిన బ్రాహ్మణుఁడు), అధ్యాపక (అధ్యయనము చేయించు గురువు), ధూర్త (మోసగాఁడు, నేర్పరి) అను పదములతో సమసించును. ఉదాహరణములు (15) లో చూపఁబడును.

(15) 'ఊ'కారాంత స్త్రీలింగపదములుతప్ప తక్కిన స్త్రీప్రత్యయాంత పదములు కర్మధారయసమాసమందు పూర్వపదములుగాఁ జేరియు, జాతీయ, దేశీయ, పదములకుఁ బూర్వమందుచేరియు పుంలింగ రూపములను దాల్చును. ఉదా. మహానవమి, కృష్ణచతుర్దశి, మహాప్రియ, పాచకస్త్రీ, దత్తభార్య, పంచమభార్య, సుకేశభార్య, బ్రాహ్మణభార్య, పాచకజాతీయ, పాచకదేశీయ, ఇభపోట, ఇభయువతి, అగ్నిస్తోకము, ఉదశ్విత్. కతిపయము = మజ్జిగబొట్టు,

గోగృష్టి, గోధేనువు, గోవశ, గోవేహత్తు, గోబష్కయణి, కఠప్రవక్త, కఠశ్రోత్రియుఁడు, కఠాధ్యాపకుఁడు; కఠధూర్తుఁడు (ఇచట ధూర్త శబ్దమునకు నింద్యార్థము లేదు, నేర్పరి యని యర్థము).

(16) జాతివాచక పదములు ప్రశంసావాచక పదములతో సమసించును: ఈ ప్రశంసావాచక పదములు రూఢి పదములుగా నుండవలెను; అనఁగా నితర లింగములందున్న పదములతో వీనిని జేర్చినను వీని లింగము మాఱఁగూడదు. ఉదా. గోప్రకాండము, గోమతల్లిక, గోమచర్చిక, గవోద్ధము, గోతల్లజము. ఇట్టి ప్రశంసావాచక పదములు సాధారణముగ సమాసములందు పరపదములుగానే యుండును.

ప్రశంసార్థముగల ప్రశస్త, శోభన, రమణీయ మొదలగు పదములును, ప్రత్యేక ప్రశస్తిని దెలుపు శుచి, పటు, మొదలగు పదములును మతల్లికాది పదములతోఁ జేరవు. జాతివాచక పదములు సమసించు ననుటచేత 'కుమారీ మతల్లిక' అను సమాసము కలుగదు.

(17) 'యువా' శబ్దము 'ఖలతి, పలిత, వలిన, జరతి' అను పదములతో సమసించును: ఉదా. యువఖలతి (యౌవనములో బట్టతల గలవాఁడు-గలస్త్రీ); యువపలితుఁడు, పలిత (యౌవనములో వెండ్రుకలు నెరసినవాఁడు-నెరసిన స్త్రీ); యువవలినుఁడు, వలిన (యౌవనమున శరీరము ముడుతలు పడినవాఁడు-పడినస్త్రీ); యువజరుఁడు, జరతి (చిన్నతనములో ముసలితనము గలిగినట్లు కనఁబడువాఁడు-కనఁబడుస్త్రీ).

(18) కృత్య ప్రత్యయాంత పదములును, తుల్యార్థక పదములును జాతివాచకములు కాని పదములతో సమసించును: ఉదా. భోజ్యోష్ణము = తినుటకు యోగ్యమయిన వేఁడి గలది; తుల్యశ్వేతము = సమానమగు తెలుపు గలది; అట్లే, సదృశశ్వేతము మొదలయినవి.

(19) వర్ణ (= రంగు) వాచకపదము వర్ణవాచక పదముతో సమసించును: ఉదా. కృష్ణసారంగము. ఇచట కృష్ణ, సారంగ పదములు రెండును. వర్ణవాచకములు. సారంగ మనఁగా చిత్రవర్ణము. కృష్ణసారంగ మనఁగా నల్లని మచ్చలు గలది, లేడి మొదలయినవి.

(20) కర్మధారయ సమాసమున 'కడార' మొదలగు పదములు వైకల్పికముగా పూర్వపదము లగును; ఉదా. కడార జైమిని, జైమిని కడారుఁడు; గడులశాండిల్యుఁడు, శాండిల్య గడులుఁడు మొదలైనవి. కడార, గడుల, ఖంజ, ఖాడ, కాణ, కుంఠ, ఖలతి, గౌర, వృద్ధ, భిక్షుక, పింగ, పింగల, తను, జఠర, బధిర, మఠర, కుబ్జ, బర్బర—ఇవి కడారాదులు. నౌ, కాక, అన్న,

శుక, శృగాల, ప్రకృతి, ప్రాయ, గోత్ర, సమ, విషమ, ద్విద్రోణ, పంచక, సాహస్ర, ప్రతి, పరి అను ఇవి గూడ కడారాదులలోఁ జేరినవి.

(21) 'కుమార' అను పదము 'శ్రమణా' మొదలగు పదములతో సమసించును. శ్రమణా, ప్రవ్రజితా, కులటా, గర్భిణీ, తాపసీ, దాసీ, బంధకీ, అధ్యాపక, అభిరూపక, పండిత, మృదు, కుశల, చపల, నిపుణ—ఈ పదములు శ్రమణాదులు. కుమార శబ్దము వీనిలోని స్త్రీలింగపదములతో సమసించినప్పుడు వైకల్పికముగ స్త్రీలింగరూపముతోడను, పుంలింగ పదములతో సమసించునపుడు పుంలింగరూపముతోడను ప్రయోగింపఁబడవలెను: ఉదా. కుమారీశ్రమణ, కుమారశ్రమణ; కుమారపండితుఁడు మొదలైనవి.

(22) చతుష్పాజ్జంతు వాచకపదము గర్భిణీ పదముతో సమసించును. ఉదా. గోగర్భిణి, అజాగర్భిణి మొదలయినవి. చతుష్పాజ్జంతువాచక పదమనుటచే 'బ్రాహ్మణీ గర్భిణీ' అను సమాసము కలుగదు.

(23) 'మయూరవ్యంసక' మొదలగునవియు కర్మధారయసమాసములగును. మయూరవ్యంసక, ఛాత్రవ్యంసక, కంబోజముండ, యవనముండ, హస్తేగృహ్య (హస్తగృహ్య-వేదములో), పాదే (-ద) గృహ్య, లాంగూలే (-ల)గృహ్య, పునర్దాయ—ఇవి మయూరవ్యంసకాదులు. ఇవి యన్నియు నిపాతములు.

ఉదక్చ అవాక్చ 'ఉచ్చావచమ్' = తె. ఉచ్చావచము; నిశ్చితంచ ప్రచితంచ= 'నిశ్చప్రచమ్', తె. నిశ్చప్రచము; నాస్తి కించన యస్య = 'అకించనః', తె. అకించనుఁడు; నాస్తి కుతో భయం యస్య = 'అకుతోభయః', తె. అకుతోభయుఁడు. అన్యోరాజా = 'రాజాంతరమ్', తె రాజాంతరము; చిత్ ఏవ = చిన్మాత్రమ్, తె. చిన్మాత్రము.

క్రియాసాతత్యమున, అనఁగా ఒకక్రియ యెడతెగక జరుగుచున్నదను నర్థమున నొక క్రియాపదము మఱియొక క్రియాపదముతో సమసించి తత్పురుష సమాసమగును. అశ్నీతపిబతా = 'తినుఁడు, త్రాగుడు' అను మాటలు పుట్టుచున్నవిందు; పచతభృజ్జతా = 'వండుఁడు, వేయించుఁడు' అను మాటలు పుట్టునట్టి విందువంటు; ఖాదత - మోదతా = 'తినుఁడు, సంతోషింపుఁడు' అను మాటలు గలవిందు; ఖాదతవమతా=తినుఁడు, క్రక్కుఁడు అను మాటలు గలవిందు; ఖాదతాచామతా = 'తినుఁడు, ఆచమింపుఁడు' అను మాటలుగల విందు; అహార నివపా; అహార నిష్కిరా; భింధి లవణా = పగుల గొట్టుము, చీల్చుము, అను మాటలు గలది; కృంధి విచక్షణా; పచ లవణా = వండుము, చీల్చుము, అనుమాటలు గలది; పచ ప్రకూటా; - ఇది

యూకృతిగణ మగుటచేత అకుతోభయ, కాందిశీక, అహోపురుషికా, అహమహమికా, యదృచ్ఛా, ఏహిరేయాహిరా, ఉన్మృజావిమృజా, ద్రవ్యాంతరమ్, అవశ్యకార్యమ్, మొదలగు సమాసములును సిద్ధించుచున్నవి.

'ఏహీడ' మొదలగు పదము లన్యపదార్థమును దెలుపుచుఁ దత్పురుష సమాసము లగును: ఏహీడమ్, ఏహిపచమ్, ఏహివాణిజా, అపేహివాణిజా, ప్రేహివాణిజా, ఏహిస్వాగతా, అపేహిస్వాగతా, ఏహిద్వితీయా, అపేహిద్వితీయా, ప్రేహిద్వితీయా, ఏహికటా, అపేహికటా, ప్రేహికటా, ఆహరకరటా, ప్రేహికరటా, ప్రేహికర్దమా, ప్రోహికర్దమా, విధమచూడా, ఉద్ధమచూడా, ఆహరచేలా, ఆహరవనితా, ఆహరవసనా, కృంతవిచక్షణా, ఉద్ధరోత్సృజా, ఉద్ధరావసృజా, ఉద్ధమవిధమా, ఉత్పచనిపచా, ఉత్పతనిపతా, ఉచ్చావచమ్, ఉచ్చనీచమ్, ఆచోపచమ్, ఆచపరాచమ్, నిశ్చప్రచమ్, అకించనః, స్నాత్వాకాలకః, పీత్వాస్థిరకః, భుక్త్వాసుహితః, ప్రోష్యపాపీయాన్, ఉత్పత్యపాకలా, నిపత్యరోహిణీ, నిషణ్ణశ్యామా, అపేహిప్రఘుణి, ఏహివిఘసా, ఇహపంచమీ, ఇహద్వితీయా—ఇవి ఏహీడాదులు.

'జహి' అను క్రియాపదము ఆభీక్ష్ణ్యార్థమున (మఱియు మఱియు నను నర్థమున) దాని కర్మపదముతో సమసించి తత్పురుష సమాసమయి కర్తృపదమును దెలుపును : జహిజోడుఁడు = 'జహిజోడ' అని పలుమా రనువాఁడు, జహిస్తంబుఁడు = 'జహిస్తంబ' అని పలుమా రనువాఁడు.

(24) 'ఈషత్' అను పదము కృదంతముకాని గుణవాచకపదముతో సమసించి తర్పురుషసమానమగును: ఈషత్కడారము = కొంచెము గర్వము; ఈషత్పింగలము = కొంచెము పింగలవర్ణము; ఈషద్వికటము = కొంచెము వికటము; ఈషదున్నతము = కొంచెము ఎత్తు; ఈషత్పీతము = కొంచెము పచ్చన, ఈషద్రక్తము = కొంచెము ఎఱుపు మొదలయినవి.

(25) 'అభావద్యోతకమగు 'నఞ్' అనునది సుబంతముతో సమసించి తత్పురుషసమాసమగును.

అట్లు సమసించునపుడు 'న' లోని నకారము లోపించును: న + బ్రాహ్మణుఁడు = అ + బ్రాహ్మణుఁడు = అబ్రాహ్మణుఁడు.

కాని, ఉత్తరపదము అజాదియైనయెడల 'అ' కారముపై నకారము చేరును: ఉదా. న + అశ్వము = అ + అశ్వము = అ + న్ + అశ్వము = అనశ్వము; న+అంతము = అ+అంతము = అ+న్ + అంతము = అనంతము మొదలయినవి.

నభ్రాజ్, నపాత్, నవేదమ్, నాసత్యా, నముచి, నకుల, నఖ, నపుంసక, నక్షత్ర, నక్ర, నాక, - అను పదములలో 'నఞ్' లోని నకారమునకు లోపము కలుగదు.

ప్రాణివాచకము కాని 'నగ' అను పదమునందు 'నఞ్' లోని నకారమునకు లోపము వైకల్పికముగా నగును: నగము, అగము = చెట్టు, కొండ; వృషలుఁడు చలిచే 'అగు'ఁడగుచున్నాఁడు, అనగా 'కదలలేకున్నాఁడు' అని ప్రాణివాచకమును దెలుపుటచేత నకారమునకు లోపము గలిగినది.

(26) (i) 'కు' అను నవ్యయమును, (ii) 'గతి' సంజ్ఞగల ప్రత్యయములును, (iii) ప్రాదులును నితర పదములతో సమసించును: ఉదా. i. కుపురుషుఁడు.

(ii) ఊరీ ప్రభృతులును, చ్వి, డాచ్ ప్రత్యయాంతశబ్దములును వ్యాకరణమున 'గతి' యనుసంజ్ఞను పొందుచున్నవి.—ఊరీ, ఉరరీ, వేతాలీ, ధూసీ, శకలా, సంశకలా, ధ్వంసకలా, భ్రంశకలా, గులుగుధా, సజూః, ఫల, ఫలీ, విక్లీ, ఆక్లీ, ఆలోష్టీ, కేవాలీ, సేవాలీ, శేవాలీ, వర్షాలీ, మసమసా, మస్మసా, వౌషట్, వషట్, శ్రౌషట్, స్వాహా, స్వధా, పాంపీ, ప్రాదుః, శ్రత్, ఆవిస్ - ఇవి ఊరీప్రభృతులు.—పాంపాలీ, సంకలా, కేవాసీ, వాదాలీ, పాదాలీ, ఆలంబీ, అంగీ, లంఫీ, తాలీ, ఆతాలీ, ధూలీ, ఆశ్మసా, వశిలా, మష్మసా, బంధా మొదలగునవియు నూరీప్రభృతులలో పఠింపఁబడుచున్నవి.

చ్వి - ప్రత్యయాంతపదములకు: శుక్లీకృతము, దూరీకృతము మొదలయినవి.

డాచ్ - ప్రత్యయాంతపదములకు: పటపటాకృతము మొదలయినవి.

'ఇతి' అను పదము పరముగాలేని యనుకరణ శబ్దములును గతి సంజ్ఞకము లగును. ఉదా: ఖాట్కృతము, యత్ ఖాట్కృతము మొదలయినవి.

'సత్' అనుపద మాదరార్థమునందును, 'అసత్' అనుపదము అనాదరార్థమందును గతి సంజ్ఞకములగును. సత్కృతము, అసత్కృతము.

'అలమ్' అను పదము క్రియతోఁ గలిసి భూషణార్థమును బొందునపుడు గతిసంజ్ఞను పొందును: అలంకారము, అలంకరణము.

'అంతర్' అను పదము అపరిగ్రహార్థమునఁ గ్రియతో సమసించునపుడు గతిసంజ్ఞక మగును: అంతర్గ్రహము = అపరిగ్రహము.

'కణే', 'మనస్' అను పదములు క్రియాపదముతోఁ గూడినప్పుడు శ్రద్ధాప్రతీఘాతార్థమున (తృప్తిచే అసహ్యము కలుగుట) గతిసంజ్ఞను పొందును:

ఉదా. కణేహత్యముగ పాలుత్రాగుచున్నాఁడు; మనోహతముగ పాలుత్రాగుచున్నాఁడు.

'పురస్' అనున దవ్యయమయి క్రియతోఁ గూడినప్పుడు గతి సంజ్ఞను బొందును: ఉదా. పురస్కృతము.

'అస్తం' అను పదమవ్యయమగునపుడు క్రియాపదముతో సమసించి గతిసంజ్ఞకమగును: సూర్యోఽ స్తంగతుఁ డయ్యెను.

'ముందు', 'ఎదుట' అను నర్థములుగల 'అచ్ఛ' అను నవ్యయము 'గతి' అను నర్థముగల క్రియలతోను, 'వద్' అను ధాతురూపముతోడను సమసించి గతిసంజ్ఞకమగును: ఉదా. అచ్ఛగతి, అచ్ఛోద్యము.

ఒక క్రియాపదముతోఁ గలిసి మఱియొకని కుపదేశమును చూపించుట అను నర్థము లేనప్పుడు 'అదస్' అను పదమునకు 'గతి' యను సంజ్ఞ కలుగును: ఉదా. అదఃకృతము.

'తిరస్' అను పదము 'కనఁబడకుండుట' అను నర్థమున క్రియతోఁ గలిసి గతిసంజ్ఞను పొందును: ఉదా. తిరోధానము, తిరోభూతము.

'బలహీనులకు సహాయముచేయు' అను నర్థముగల 'ఉపాజే, అన్వాజే' అను పదములు 'కృఞ్'=చేయు అనుధాతువుతోఁజేరి వైకల్పికముగా గతిసంజ్ఞను పొందును: ఉదా. ఉపాజేకృతము, అన్వాజేకృతము.

'సాక్షాత్' మొదలగు పదములు 'కృ'=చేయు ధాతువుతోఁజేరి వైకల్పికముగా గతిసంజ్ఞను బొందును: ఉదా. సాక్షాత్కారము.

ఉరసి, మనసి, అను పదములు కృ = చేయు, అను ధాతువు పరమగునపుడు 'ఉంచు' అను నర్థము కలుగకున్నయెడల గతిసంజ్ఞను వైకల్పికముగాఁ బొందును: ఉదా. ఉరసికృతము, మనసికృతము.

'ఉంచు' అను నర్థమును బొందనప్పుడు 'మధ్యే', 'పదే', 'నివచనే' అను పదములును 'కృ'(= చేయు) ధాతువుతోఁజేరి వైకల్పికముగా గతి సంజ్ఞకము లగును: ఉదా. మధ్యేకృతము, పదేకృతము, నివచనేకృతము

'పెండ్లి' అను నర్థమున 'హస్తే', 'పాణౌ' అను పదములు కృ(=చేయు) ధాతువుతోఁజేరి నిత్యముగా గతిసంజ్ఞను బొందును: ఉదా. హస్తేకృతము, పాణౌకృతము.

'ప్రాధ్వమ్' అను నవ్యయము 'బంధనము' అను నర్థమున కృ(=చేయు) ధాతువుతోఁ గలిసి నిత్యముగా గతిసంజ్ఞను పొందును: ప్రాధ్వంకృతము.

జీవికా, ఉపనిషద్, అను పదములు - కృ (= చేయు) ధాతువుతోఁ జేరి 'పోలిక' అను నర్థమును బొందునపుడు నిత్యముగ గతిసంజ్ఞకము లగును. జీవికాకృతము, ఉపనిషత్కృతము.

## ప్రాదిసమాసములు.

ప్రాదులతోఁ గూడిన సమాసములు గతిసంజ్ఞగలవి కావు.

(1) ప్రాదులు 'పోయిన' మొదలగు నర్థములలో ప్రథమావిభక్త్యంత పదముతో సమసించును: ఉదా. ప్రాచార్యుఁడు, ప్రపితామహుఁడు, ప్రమాతామహుఁడు.

(2) 'అతి' మొదలగునవి 'దాఁటిన, మించిన' అనునర్థములలో ద్వితీయావిభక్త్యంత పదములతో సమసించును: ఉదా. అతిమాలుఁడు, అతిఖట్వుఁడు, అభిముఖము, ఉద్వేలము, ప్రత్యక్షము.

(3) 'అవ' మొదలగునవి 'అఱచిన' మొదలగు నర్థములలో తృతీయావిభక్త్యంత పదములతో సమసించును: ఉదా. అవకోకిలము = కోకిల అఱచు కాలము; పరివీరుధము, సంవర్మము మొదలయినవి.

(4) 'పరి' మొదలగునవి 'అలసిన' మొదలగు నర్థములలో చతుర్థ్యంత పదములతో సమసించును: ఉదా. పర్యధ్యయనుఁడు = అధ్యయనము కొఱకు నలసినవాఁడు; అలంకుమారి = కూమరి జీవనమునకు చాలినంతధనము.

(5) 'నిర్' మొదలగునవి 'దాఁటిన, మించిన,' మొదలగు నర్థములలో పంచమీవిభక్త్యంతపదములతో సమసించును: ఉదా. నిష్కౌశాంబి = కౌశాంబీనగరమును వదలినవాఁడు; నిర్వారణాసి = వారణాసి నగరమును విడిచినవాఁడు; ఉత్కులుఁడు = కులమును విడిచిపెట్టినవాఁడు; నిరంగులమ్ = వ్రేళ్లను విడిచినది.

## ఉపపదసమాసములు.

పాణిని సూత్రములలో సప్తమీవిభక్త్యంతముగ నిరూపింపఁబడిన పదముచేఁ దెలుపఁబడు పదమునకు ఉపపదమను సంజ్ఞగలదు. ఉదాహరణమునకు 'కర్మణ్యణ్' అనునది పాణినిసూత్రము. ఇందు 'కర్మణి' అనుపదము సప్తమ్యంతముగా నున్నది. కావున, కర్మమును దెలుపు ద్వితీయావిభక్త్యంతపదమున కుపపదమను సంజ్ఞ కలుగును. ఇట్లే తక్కినచోట్లను దెలియవలెను.

(1) సుబంతమయిన ఉపపదము సమర్థమగు పదముతో సమసించును. అట్టి సమాసము తిఙంతముగా నుండఁగూడదు: ఉదా. కుంభమును చేయువాఁడు 'కుంభకారుఁడు.'

(2) ఉపపదము 'అమ్' అంతమందుగల యవ్యయములతోడనే సమసించును: ఉదా. స్వాదుంకారముగఁ దినుచున్నాఁడు = అన్నమును తీయగాఁ జేసికొని తినుచున్నాఁడు; లవణంకారముగఁ దినుచున్నాఁడు = అన్నములో ఉప్పుకలుపుకొని తినుచున్నాఁడు.

(3) తృతీయావిభక్త్యంతమగు నుపపదము 'అమ్' అంతమందుగల యవ్యయముతో వైకల్పికముగ సమసించును: ఉదా. మూలకోప దంశముగఁ దినుచున్నాఁడు = అన్నముతో కందమూలమును జేర్చి తినుచున్నాఁడు.

(4) సంఖ్యావాచకముగాని, యవ్యయముగాని పూర్వమందుండి, 'అంగులీ' పదము పదమందువచ్చు తత్పురుష సమాసమునకు 'అచ్' ప్రత్యయము చేరును: ఉదా. ఈ కర్రె త్ర్యంగులము; నిరంగులము, అత్యంగులము మొదలయినవి.

(5) అహన్, సర్వ, అనుపదములుగాని, రాత్రియందలి భాగములను దెలుపు పదములుగాని, సంఖ్యాత, పుణ్యా, అను పదములుగాని, సంఖ్యావాచకముగాని, యవ్యయముగాని పూర్వమందుగల 'రాత్రి' శబ్దమునకు 'అచ్' ప్రత్యయము చేరును: ఉదా. అహోరాత్రము, సర్వరాత్రము, పూర్వరాత్రము, సంఖ్యాతరాత్రము, పుణ్యరాత్రము, ద్విరాత్రము, అతిరాత్రము మొదలయినవి.

(6) రాజన్, అహన్, సఖ, అనుపదములు తత్పురుష సమాసమునఁ బరపదములుగా నున్నయెడల వానిపై 'టచ్' ప్రత్యయము వచ్చును: ఉదా. పరమరాజుఁడు, సప్తాహము, కృష్ణసఖుఁడు మొదలయినవి.

(7) సర్వ, సంఖ్యాత అనుపదములును, పగటియందలి భాగములను దెలుపు పదములును, సంఖ్యావాచకపదములును, అవ్యయములును పూర్వపదములుగానుండి, 'అహన్' అనుపదము పరమందుండి తత్పురుషసమాసమగునపుడు 'అహన్' కు 'అహ్న' అని యాదేశమగును: ఉదా. సర్వాహ్ణము, సంఖ్యాతాహ్నము; పూర్వాహ్ణము, మధ్యాహ్నము, ఏకాహ్నము, ద్వ్యహ్నము, త్ర్యహ్ణము, అత్యహ్నము, నిరహ్నము మొదలయినవి.

అదంతమైన నకారములు ణకారముగా మార్పఁగల యక్షరముగల పదము పూర్వమం దున్నయెడల 'అహ్న' అనుపదమందలి నకారము ణకారముగా మారును: పూర్వాహ్ణము మొదలయినవి. నిరహ్నము, దురహ్నము, అనువానియందు పూర్వపద మదంతముకావున 'ణ' కారము కలుగ లేదు.

(8) కర్మధారయసమాసము సంఖ్యాదినై పరమందున్న 'అహార్' శబ్దముతో సమాహారార్థమును బొందినచో 'అహార్' అనుపదమునకు అహ్నాదేశము కలుగదు: ఉదా. ద్వ్యహము, త్ర్యహము.

(9) పుణ్య, ఏక, పదములకుఁ బరమైన 'అహార్' పదమునకును అహ్నాదేశము గలుగదు : పుణ్యాహము, ఏకాహము.

(10) తనజాతియందు శ్రేష్ఠము అనునర్థమున 'ఉరస్' శబ్దము తత్పురుషసమాసమునఁ బరపదముగా నున్నచో దానిపై 'టచ్' ప్రత్యయము వచ్చును: ఉదా. అశ్వోరసము = అశ్వజాతిలో శ్రేష్ఠమైనది.

(11) జాతినిగాని, సంజ్ఞనుగాని తెలుపుచుఁ దత్పురుషసమాసమునఁ బరపదములుగానుండు అనస్, అశ్మన్, అయస్, సరస్, అనువానిపై 'టచ్' ప్రత్యయము చేరును: ఉదా. ఉపానసము, అమృతాశ్మము, కాలాయసము, మండూకసరసము; ఇవి జాతివాచక సమాసములు. మహానసము, పిండాశ్మము, లోహితాయసము, జలసరసము.—ఇవి సంజ్ఞావాచక సమాసములు.

(12) గ్రామ, కౌట, అనుపదములు పూర్వపదములుగను, తక్షన్ అను పదము పరముగను గల తత్పురుషసమాసమున తక్షన్ శబ్దమునకు టచ్ ప్రత్యయము చేరును : ఉదా. గ్రామతక్షుఁడు, కౌటతక్షుఁడు.

(13) అతి పూర్వమగు శ్వన్ శబ్దముతోఁ జేరిన తత్పురుషసమాసముతుదను టచ్ ప్రత్యయము చేరును : ఉదా. ఈ వరాహము అతిశ్వము = కుక్కకంటె వేగముగా పరుగెత్తునది.

(14) ప్రాణినిగాక యితరవస్తువును దెలుపు పదముతో నుపమానమును దెలుపు శ్వన్ శబ్దము తత్పురుష సమాసమునఁ బరపదమగునపుడు దానిపై 'టచ్' ప్రత్యయము చేరును: ఉదా. ఆకర్షశ్వము = కుక్కను పోలిన విల్లు.

(15) ఉత్తర, మృగ, పూర్వ అను పదములు పూర్వమందుగల సక్థిన్ శబ్దముతోఁ గలిసిన తత్పురుషసమాసము తుదను టచ్ ప్రత్యయము చేరును : ఉదా. ఉత్తర సక్థము, మృగసక్థము, పూర్వసక్థము.

(16) ద్విగుసమాసమున నుత్తరపదముగానున్న 'నౌ' శబ్దమునకు టచ్ ప్రత్యయము చేరును ; తద్ధిత ప్రత్యయము లోపించినచోఁ జేరదు : ఉదా. ద్వినావరూప్యుఁడు = రెండు నావలతో వచ్చినవాఁడు ; పంచనావప్రియుఁడు ; ద్వినావము, త్రినావము మొదలైనవి.

(17) [illegible] బరమైన [illegible] శబ్దమునకు 'టచ్' ప్రత్యయము చేరును ; అర్ధనావము.

(18) ద్విగుసమాసమందును, అర్ధశబ్దమునకుఁ బరమందున్నప్పుడును 'ఖారీ' శబ్దముపైఁగూడ 'టచ్' ప్రత్యయము వైకల్పికముగా వచ్చును: ఉదా. ద్విఖారము, ద్విఖారి; అర్ధఖారము, అర్ధఖారి.

(19) ద్విగుసమాసమున ద్వి, త్రి, శబ్దములు పూర్వపదములుగాఁగల 'అంజలి' శబ్దముమీఁద 'టచ్' ప్రత్యయము వైకల్పికముగా నగును: ఉదా. ద్వ్యంజలము, ద్వ్యంజలి; త్ర్యంజలము, త్ర్యంజలి.

(20) తత్పురుషసమాసమున నుత్తర పదముగానుండు బ్రహ్మన్ శబ్దముకంటె నొక దేశవాసియను నర్థము కలుగునప్పుడు 'టచ్' ప్రత్యయము చేరును: ఉదా. సురాష్ట్రబ్రహ్మ, అవంతిబ్రహ్మ మొదలయినవి.

(21) కు, మహత్, అను పదములు పూర్వమందుగలిగి బ్రహ్మన్ శబ్దము పరమందున్న తత్పురుషసమాసమున బ్రహ్మన్ శబ్దముకంటె టచ్ ప్రత్యయము వైకల్పికముగా చేరును: ఉదా. కుబ్రహ్మ.

(22) కర్మధారయసమాసమునఁ బూర్వపదముగా నుండినను 'జాతీయ' అను పదము దానికి పరమందున్నను మహత్ పదము నంత్య హల్లునకు 'ఆ' అని యాదేశమగును: ఉదా. మహాబ్రహ్మ, మహాదేశీయుఁడు. కర్మధారయసమాసము కానప్పుడు 'మహత్సేవ'.

(23) ద్వి, అష్టన్ అను సంఖ్యావాచకపదములపై మఱియొక సంఖ్యావాచకపదము చేరినయెడల వాని యంత్యవర్ణములకు 'ఆ' ఆదేశమగును: ఉదా. ద్వాదశము, ద్వావింశతి, అష్టాదశము, అష్టాశీతి మొదలైనవి.

(24) 'త్రి' అను పదమునకు మఱియొక సంఖ్యావాచకపదము పరమగునపుడు 'త్రి' కి 'త్రయస్' అను నాదేశము కలుగును: త్రయోదశము, త్రయోవింశతి, త్రయస్త్రింశత్తు—ఈ యాదేశము బహువ్రీహిసమాసమందును, 'అశీతి' అను పదము పరమగునపుడును గలుగదు: ఉదా. త్రిదశులు, త్ర్యశీతి. మఱియు నీ యాదేశము నూఱువఱకుఁగల సంఖ్యలను దెలుపు పదములు పరమగునపుడే కలుగును: ఉదా. త్రిశతము, త్రిసహస్రము మొదలగునవి.

(25) 'ఏక' అను పదముతో నారంభమగు పదమునందు 'నఞ్' అనునది లోపింపక నిలుచును; ఈ 'ఏక' శబ్దముపై 'అదుక్' అను నాగమము వచ్చును: ఏకాన్న వింశతి, ఏకాన్నవింశతి.

'షష్' = 6 అను పదముపై 'దత్, దశ, ధా' అనునవి చేరునపుడు దాని యందు షకారమున కుత్వమాదేశమయి 'షో' అని యగును. దానిపైఁ జేరిన పదము నాది నకారము 'ణ' కారముగనో, ఢకారముగనో మాఱును;

ఉదా. షోడన్ [illegible] షోడుఁడు = ఆఱుదంతములు గలవాఁడు; షోడశము; షోఢా = తెనుఁగు: షోఢము = ఆఱువిధములు.

## సమాసముల లింగము.

(1) ద్వంద్వ తత్పురుషసమాసములు పరపదముయొక్క లింగమును గలిగియుండును: ఇవి కుక్కుటమయూరులు; ఇవి మయూరీ కుక్కుటములు.

(2) 'అశ్వము + వడవా' అను పదములు సమసించునపుడు ఆ సమాస లింగము పూర్వపదము లింగమును గలిగియుండును: ఇవి యశ్వవడవములు ('వడవా' శబ్దమాకారాంత స్త్రీలింగమయినను సమాసమున దానికి పుంలింగము కలిగినది).

(3) సంస్కృతసమాసములు అనంతములగునపుడు పుంలింగములయినను నపుంసకలింగములయినను తెనుఁగున వాని మహదమహత్త్వము ననుసరించియే ప్రత్యయములు చేరుచుండును.

(4) నఞ్ - తత్పురుష సమాసములును, కర్మధారయసమాసములును తప్పఁ దక్కిన తత్పురుషసమాసము లీ క్రింది సందర్భములందు నపుంసక లింగములగును :—

(i) 'కంథా' శబ్దము ఉశీనరదేశములోని పట్టణము అను నర్థమున సంజ్ఞావాచకమై తత్పురుషసమాసమునఁ బరపదముగాఁ జేరి నపుంసకలింగ మగును : ఉదా. సౌశమికంథము. సంజ్ఞావాచకము కానప్పుడు 'వీరణకంథా= తెనుఁగు=వీరణకంథ'; ఉశీనరదేశములోని పట్టణము కానప్పుడు 'దాక్షికంథా= (తెనుఁగు) దాక్షికంథ.'

(ii) 'ఉపజ్ఞా, ఉపక్రమ' అను పదములు 'క్రొత్తగా కనిపెట్టఁబడిన, ఆరంభింపఁబడిన' అను నర్థములందు తత్పురుషసమాసములఁ బరపదములుగాఁ జేరి నపుంసకలింగములగును: ఈ గ్రంథము పాణిన్యుపజ్ఞము; ఈ ద్రోణము (కొలతపాత్ర) నందోపక్రమము (నందుఁడనురాజు తొలుత నేర్పఱిచినది).

(iii) 'ఛాయా' శబ్దము ఎక్కువగానున్న వస్తువులఛాయ అను నర్థమునఁ తత్పురుషసమాసమునఁ బరపదమై నపుంసకలింగమగును: ఇక్షుచ్ఛాయము.

(iv) 'రాజ' అను నర్థముగల పదముగాని, మనుష్యేతరుల పేర్లుగాని, పూర్వమందు గల 'సభా' శబ్దము తత్పురుషసమాసమున నపుంసకలింగ మగును: ఉదా. ఇనసభము, ఈశ్వరసభము, రక్షస్సభము, పిశాచసభము. 'రాజ' అను నర్థముగల ఉత్తరపద[illegible]న్నచో యీ విధి వర్తింపదుగాని

'రాజ' శబ్దమే యున్నచో సమాసము నపుంసకలింగము కాదు: రాజసభా (తె. - భ); చంద్రగుప్తసభా (తె. - భ).

(v) 'సభా' అను పదము 'శాల, ఇల్లు' అను నర్థమునఁగాక, 'సమూహము' అను నర్థమునఁ దత్పురుషసమాసమునఁ బరపదమై నపుంసకలింగమగును: ఉదా. స్త్రీసభము; కాని 'ధర్మసభా (తె. - భ)'; ఇచట 'సభ'కు 'ఇల్లు' అని యర్థము.

(vi) నఞ్ - సమాసములును, కర్మధారయసమాసములును గాని తత్పురుషసమాసములందు 'సేనా, సురా, ఛాయా, శాలా, నిశా' అనునవి పరపదములై వైకల్పికముగ నపుంసకలింగములగును: ఉదా. తెనుఁగు: బ్రాహ్మణసేన, బ్రాహ్మణసేనము; యవసుర, యవసురము; కుడ్యచ్ఛాయ, కుడ్యచ్ఛాయము; శ్వనిశ, శ్వనిశము. - రాజు 'దృఢసేనుఁడు', ఇచట బహువ్రీహిసమాసము; ఇది అసేన, ఇచట నఞ్ - సమాసము; ఇది పరమసేన, ఇచట కర్మధారయసమాసము; కావున వీనికి నపుంసకత్వము కలుగలేదు.

## IV. బహువ్రీహిసమాసము.

(1) రెండుగాని, రెంటికంటె నెక్కువగాని పదములు ప్రథమావిభక్త్యంతములై యుండ నా ప్రత్యేకపదముల యర్థములకు భిన్నమగు క్రొత్త యర్థము గలది బహువ్రీహిసమాసమగును: ఉదా. ప్రాప్తముదకం (గ్రామమ్) = ప్రాప్తోదకో (గ్రామః), తెనుఁగు గ్రామము ప్రాప్తోదకము = ఏ గ్రామము ఉదకముచేత పొందఁదగినదో అది; ఇట్లే, (ఎద్దు) ఊఢరథము = ఏదిరథమునకు కట్టఁబడినదో (అ)ఎద్దు; (రుద్రుఁడు) ఉపహృతపశుఁడు = ఎవనికి పశువుపహారముగా నివ్వఁబడినదో వాఁడు; (స్థాలి) ఉద్ధృతౌదన = దేనియందు అన్న ముంచఁబడినదో అది (స్థాలి); (హరి) పీతాంబరుఁడు=ఎవనికి పీతవర్ణము గల వస్త్రముగలదో యతఁడు = హరి; (గ్రామము) వీరపురుషకము = దేని యందు వీరపురుషులుందురో అది (గ్రామము).

ప్రాదులకంటెఁ జేరిన ధాతుజ పదములతోఁ గూడినపదము బహువ్రీహిసమాసమునఁ జేరినచో నాప్రాదులవైనున్న పదములకు వైకల్పికముగా లోపము కలుగును: ఉదా. (ఈ వృక్షము) ప్రపతితవర్ణము; లేక 'ప్రపర్ణము'.

నఞ్‌తోఁ జేరిన యస్త్యర్థక పదములు బహువ్రీహిసమాసమునఁ జేరునపుడు వానికి వైకల్పికముగ లోపముగలుగును: ఉదా. అవిద్యమానపుత్రుఁడు, లేక అపుత్త్రుఁడు (ఎవనికి పుత్త్రులు లేరో వాఁడు); ఇట్లే, 'అభా

'అస్తిక్షీర' మొదలగునవి బహువ్రీహిసమాసములు. (ఈ బ్రాహ్మణి) అస్తిక్షీర = ఎవరియొద్ద పాలుగలవో యామె. 'అస్తి' యనునది క్రియాపద

మయినను నిట్టి సమాసములందు అవ్యయత్వమును బొందును; దానికి విభక్తి ప్రతిరూపకావ్యయమని పేరు.

(2) బహువ్రీహిసమాసమున స్త్రీప్రత్యయాంత పదమునకు మాఱుగ దానితో సరిపోవు పుంలింగరూప మీక్రింది సందర్భములందు వచ్చును; (i) ఆస్త్రీలింగ రూపమునకు సరిపోవు పుంలింగరూప ముండవలెను. (ii) ఆస్త్రీ లింగరూపము 'ఊఙ్' ప్రత్యయములో సంతము కాకూడదు. (iii) సమాస మున దాని తరువాత వచ్చుపదము కూడ స్త్రీలింగమం దుండవలెను. (iv) ఆ రెండవపదము మొదటిదానితో సమానాధికరణమం దుండవలెను; అనఁగా, ఆ రెండు పదములును ఏకవస్తువును బోధింపవలెను. (v) అట్లుత్తర పదముగా వచ్చినపదము (అ) పూరణార్థక సంఖ్యావాచకముగాని (ఆ) 'ప్రియ' మొదలగు పదములలో నొకటిగాని, కాకూడదు—ప్రియా, మనోజ్ఞా, కల్యాణీ, సుభగా, దుర్భగా, భక్తి, సచివా, స్వా, (స్వసా), కాంతా, క్షాంతా, సమా, చపలా, దుహితా, దామనా (సమా), తనయా, అంబా, - ఇవి ప్రియాదులు.

ఉదా. చిత్రా గావో యస్య సః = చిత్రగుః (తెనుఁగు : చిత్రగువు= ఎవనికి చిత్రవర్ణముగల గోవులు గలవో వాఁడు); దర్శనీయా భార్యా యస్య సః - దర్శనీయభార్యః = తెనుఁగు : దర్శనీయ భార్యుఁడు ఎవనిభార్య దర్శ నీయయో వాఁడు); ఇట్లే, శ్లక్ష్ణచూడుఁడు, దీర్ఘజంఘుఁడు మొదలయినవి.

(స్త్రీ ప్రత్యయాంత పూరణార్థక సంఖ్యావాచక పదముగాని, ప్రమాణీ అను పదముగాని యంతమందుగల బహువ్రీహిసమాసము తుదను 'అప్' ప్రత్యయము జేరును. ఉదా. కల్యాణీ పంచమీ ఆసాం రాత్రీణామ్= కల్యాణి పంచమా (రాత్రయః) = తెనుఁగు: (రాత్రులు) కల్యాణీ పంచమ ములు. ఇచట 'పంచమీ' అను దానిపై 'అప్' ప్రత్యయము వచ్చి 'పంచమ' అని యైనది. ఇట్లే 'కల్యాణీ దశమా రాత్రయః = తెనుఁగు: (రాత్రులు) కల్యాణీ దశమములు; స్త్రీ ప్రమాణీ ఏషామ్ = స్త్రీ ప్రమాణాః (కుటుం బినః) = తెనుఁగు: కుటుంబులు స్త్రీప్రమాణము.

(4) ఉత్తర పదము నదీపదము (దీర్ఘ ఈ కారాంత, ఊ కారాంత పదముగ నుండునట్టిగాని, ఋకారాంత పదముగ నుండునట్టిగాని బహు వ్రీహిసమాసము తుదను కప్ ప్రత్యయము చేరును: ఉదా. బహ్వ్యః కుమార్యః అస్మిన్ దేశే = బహుకుమారీకో దేశః; ఇట్లే, బహుబ్రహ్మ బంధూకము, బహుకర్తృకము మొదలయినవి.

(5) క ప్రత్యయమునకుఁ బూర్వమందుండు అ, ఈ, ఊలకు హ్రస్వము గలుగును: ఉదా. కుమారిక, కిశోరిక, బ్రహ్మబంధుక మొదలయినవి.

(6) బహువ్రీహిసమాసముల యంతమందు వచ్చు కప్ ప్రత్యయమునకుఁ బూర్వమందుండు ఆ, ఈ, ఊ అను నచ్చులకు హ్రస్వము గలుగదు. పై సూత్రమువలన కల్యాణ పంచమికః అను సమాసము సిద్ధింపవలసి యుండఁగా నీ సూత్రమువలన నట్టి రూపము నిషిద్ధమయినది. ఇట్లే, బహుకుమారీకుఁడు, బహులక్ష్మీకుఁడు, బహువృషలీకుఁడు మొదలగు రూపములు సిద్ధించుచున్నవి.

(7) ఊఙ్ - అంతము కానట్టియు, పుం రూపము గలిగినట్టియు స్త్రీలింగమగు పదము 'త్ర, తస్, తర(ప్), తమ(ప్), చర(ట్), జాతీయ(ర్), కల్ప(ప్), (దేశ్య), దేశీయ(ర్), రూప(ప్), పాశ(ప్), (థమ), థాల్, (దా, గ్హిల్, తి(ల్), ధ్య(న్), తాతి(ల్), అను ప్రత్యయములకుఁ బూర్వమందు పుంలింగ రూపమును బొందును: ఉదా. బహ్వీ + త్ర = బహుత్ర; బహ్వీ + తస్ = బహుతః; దర్శనీయతరా, దర్శనీయతమా; పటుచరీ, పటుజాతీయా, దర్శనీయకల్పా, దర్శనీయదేశీయా, దర్శనీయరూపా, దర్శనీయపాశా, బహుధా, వృకతిః = ప్రశస్తావృకీ, అజథ్యా = అజాభ్యో హితాః, మొదలయినవి. పై ప్రత్యయముల ముందే కాక కొన్ని స్త్రీలింగ శబ్దములకు మఱికొన్ని ప్రత్యయములకుఁ బూర్వమున పుంలింగరూపము గలుగును.

i. బహు, అల్ప అను పదముల స్త్రీలింగరూపములు 'శస్' ప్రత్యయమునకుఁ బూర్వము పుంలింగ రూపములను దాల్చును: ఉదా. బహ్వీభ్యో దేహి = బహుశో దేహి, అల్పాభ్యో దేహి = అల్పశో దేహి.

ii. స్త్రీలింగమున నున్న విశేషణము 'త్వ' 'త(ల్)' ప్రత్యయములకుఁ బూర్వము పుంలింగ రూపమును బొందును: శుక్లాయాః భావః = శుక్లత్వమ్ (తె. శుక్లత్వము); ఇట్లే, శుక్లతా (తె. శుక్లత.)

iii. స్త్రీలింగ శబ్దము 'ఢ' అను తద్ధిత ప్రత్యయమునకుఁ బూర్వమందు తప్ప, తక్కిన భ-సంజ్ఞ గల తద్ధిత ప్రత్యయములకుఁ బూర్వమందు పుంలింగమగును: హస్తినీనామ్ సమూహః = హాస్తికమ్ (తె. హాస్తికము); సపత్నీ అను పదమునకు మూఁడర్థములు గలవు. (1) సపత్నుఁడు = శత్రువు, వాని భార్య 'సపత్ని' (2) ఎవతెకు సమానుఁడగు మగఁడు గలఁడో ఆమె, ఈ యర్థమున 'సపత్నీ' శబ్దమునకుఁ బుంలింగరూపము లేదు. (3) ఎవతెకు సమానుఁడగు యజమానుఁడు (మగఁడు కాఁడు), కలఁడో ఆమె. సపత్ని యొక్క అపత్యము అని చెప్పవలసినప్పుడు మొదటి రెండర్థములందును 'సాపత్నుఁడు' అనియు, మూఁడవ యర్థమున సాపత్న్యుఁడనియు రూపములు గలుగును.

(3) 'ఠక్,' 'ఛస్' అను ప్రత్యయములకుఁ బూర్వమందును స్త్రీలింగ శబ్దములు పుంలింగరూపములఁ బొందును: ఉదా. భవత్యాః ఛాత్రాః = భవత్కాః, భవదీయాః = తె. భవత్కులు, భవదీయులు.

(4) 'కుక్కుటీ' మొదలగు శబ్దములు 'అండ' మొదలగు శబ్దములకుఁ బూర్వమందు చేరి పుంలింగరూపములఁ దాల్చును: ఉదా. కుక్కుటి యొక్క అండము 'కుక్కుటాండము; మృగియొక్క పదము 'మృగపదము,' మృగియొక్క క్షీరము 'మృగక్షీరము; కాకియొక్క శావము 'కాకశావము,' మొదలయినవి.

(5) స్త్రీప్రత్యయాంతమగు స్త్రీలింగశబ్దము జాతివాచక మగునపుడు సమాసమునఁ బుంలింగ రూపమును బొందదు: శూద్రాభార్యుఁడు, బ్రాహ్మణీభార్యుఁడు.

(6) అవ్యయములును, ఆసన్న, అదూర, అధిక, అను పదములును, సంఖ్యావాచకపదములును సంఖ్యావాచకార్థమున సంఖ్యావాచకపదములతో సమసించి బహువ్రీహిసమాసములగును: ఉదా. ఉపదశములు = పదికి దగ్గఱగానుండు సంఖ్యలు, అనఁగా 9 లేక 11; ఉపవింశములు = ఇరువదికి దగ్గఱగానుండు సంఖ్యలు, అనఁగా 19 లేక 21—ఇట్టిసమాసమున 'వింశతి' శబ్దములోని 'తి'వర్ణమునకు లోపము గలుగును: ఉదా. ఆసన్నవింశములు; అదూరత్రింశములు, అధికచత్వారింశములు; 'రెండుగాని మూఁడుగాని;' 'ద్విత్రములు;' రెండుపదులు = ద్విదశములు మొదలయినవి.

(7) రెండు దిగ్వాచక పదములు సమసించి యారెండు దిక్కులకును మధ్యనుండు దిక్కును సూచించినచో బహువ్రీహిసమాస మగును: దక్షిణము యొక్కయు పూర్వముయొక్కయు దిక్కుల యంతరాలము 'దక్షిణపూర్వ;' ఇట్లే 'పూర్వోత్తర' మొదలగునవి. రూఢియగు దిగ్వాచకములకే యీ కార్యము కలుగును; యౌగికార్థమునఁగాదు: ఐంద్రీదిక్కునకును కౌబేరీదిక్కునకును మధ్యనుండు అంతరాలము అనునపుడు సమాసము కాదు.

(8) 'ఇది దీనిలో, లేక, దీనిచేతఁ గలిగినది. అను నర్థమున సరూపపదములలో పూర్వపదము తుదియచ్చునకు దీర్ఘము కలిగి బహువ్రీహిసమాసమేర్పడును: కేశాకేశి, దండాదండి, ముష్టీముష్టి మొద. తెనుఁగున 'ముష్టాముష్టి' అనియుఁ నందురు; 'కేశాకేశి' మొదలగు రూపముల సాదృశ్యమున నీరూపము తెనుఁగున నేర్పడినది.

(9) భ సంజ్ఞ గల ప్రాతిపదికము తుది ఉ, ఊ లకు గుణము కలుగును: ఉదా. బాహాబాహవి.

(10) తుల్యయోగమున 'సహ' అను పదము తృతీయా విభక్త్యర్థక పదములతో సమసించి బహువ్రీహిసమాస మగును; ఇట్టి 'సహ'కు వైకల్పిక ముగా 'స' యాదేశమగును. సపుత్త్రుఁడు; సహపుత్త్రుఁడు; కామ్ము వివాహము నకు సకుటుంబులుగ దయచేయవలెను—ఆశీరర్థమున 'సహ' కు 'స' కలు గదు. సహపుత్త్రుఁడగు (సహామాత్త్యుఁడగు) రాజునకు స్వస్తి యగుఁగాక! ఆశీరర్థమున 'గో, వత్స, హల' శబ్దములకుఁ బూర్వమునఁ జేరిన 'సహ'కు సాదేశము వైకల్పికముగ నగును: సహవత్సుఁడవగు (సవత్సుఁడవగు) నీకు; సహహలుఁడవగు (సహలుఁడవగు) నీకు-శుభమగుఁగాక !

(11) బహు, గణ, అను పదములతో నంతముగానట్టియు, సంఖ్యా వాచకమును దెలుపు నట్టియు బహువ్రీహిసమాసము తుదిని 'డచ్', ప్రత్య యము వచ్చును. ఉదా. ఉపదశములు.

['నిస్త్రింశ' మొదలగు సంఖ్యావాచకపదములుగల తత్పురుషసమా సముల తుదనుగూడ 'డచ్' ప్రత్యయము చేరును. చైత్రునికి నిస్త్రింశములు వర్షములు గడచినవి=ముప్పదియేండ్లు దాఁటినవి; ఖడ్గము నిస్త్రింశము=ముప్పది యంగుళములకంటె నెక్కువ నిడివిగలది.]

(12) సక్థి, అక్షి, అనుపదములు బహువ్రీహిసమాసమున పరపద ములుగాఁ జేరి దేహమునందలి యవయవములను సూచించునప్పుడు సమా సము తుదను షచ్ - ప్రత్యయము వచ్చును: దీర్ఘములగు సక్థులు గలవాఁడు దీర్ఘసక్థుఁడు; జలజాక్షి; కాని, దేహావయవముల యర్థములేదు గావున 'శకటము దీర్ఘసక్థి, వేణుయష్టి స్థూలాక్షము' మొదలయినవి.

(13) 'అంగులి' శబ్దము పరముగానుండి 'కట్టెముక్క' అనునర్థముగల బహువ్రీహిసమాసముతుదను షచ్ ప్రత్యయముచేరును: ఈ దారువు పంచాంగులము.

(14) ద్వి, త్రి అనుపదములు పూర్వమందు గలిగి 'మూర్ధన్' అను పద ముత్తరపదముగా నున్న బహువ్రీహిసమాసములందు ష-ప్రత్య యము వచ్చును: ద్విమూర్ధుఁడు, త్రిమూర్ధుఁడు.

(15) అంతర్, బహిస్, అనుపదములు పూర్వమందును లోమన్ శబ్దము పరమందును గల బహువ్రీహిసమాసముతుదను 'అప్' ప్రత్యయము వచ్చును. అంతర్లోమము, బహిర్లోమము (వస్త్రము).

(16) 'నాసికా' శబ్దము పరపదముగా గలిగిన బహువ్రీహిసమాస మున 'నాసిక'కు 'నస్' ఆదేశమయి, సంజ్ఞావాచకమగునపు డాసమాసము

తుదిని 'అచ్' అను ప్రత్యయముచేరును; నాసికాశబ్దమునకుఁ బూర్వమందు 'స్థూల' అనుపదము చేరినచో నీ ప్రత్యయమురాదు. ఇట్టిసమాసమందు పూర్వపదము నంతమున 'ర' వర్ణము లేకుండినచో 'నస్' లోని నకారమునకు ణకారమాదేశమగును: ఉదా. ద్రుణసుఁడు, ఖరణసుఁడు. కాని, 'వరాహము స్థూలనాసికము'—ఖుర, ఖర, అనుపదములపై వచ్చు నాసికా శబ్దమునకు 'నస్' ఆదేశమగునుగాని అచ్ - ప్రత్యయము చేరదు: ఖురణాః (తె. ఖుర ణుఁడు); ఖరణాః (తె. ఖరణుఁడు).

(17) ఉపసర్గపూర్వకమయిన 'నాసికా' శబ్దమునకు 'నస్' ఆదేశమయి సమాసముతుదను అచ్ - ప్రత్యయము చేరును: ఉదా. ఉన్నసుఁడు = ఉన్నతమైన ముక్కు ఎవనికి గలదో వాఁడు.

(18) ఉపసర్గముకంటె పరమైన 'నస్' అనుపదమునందలి నకారమున ణకారము గలుగుటకుఁ గారణమున్నచో నట్టిమార్పు బహుళముగాఁ గలు గును: ప్రణసుఁడు (వికృతమైన నాసిక గలవాఁడు 'విగ్రుఁడు;' లేక 'విఖ్యుఁడు').

(19) సుప్రాత, సుశ్వ, సుదివ, శారికుక్ష, చతురస్ర, ఏణీపద, అజపద, ప్రోష్ఠపద, - అనునవి అచ్ - ప్రత్యయముతోఁ జేరిన బహువ్రీహిసమాస ములు. ఇవి వ్యాకరణసూత్రముల నతిక్రమించినవి.

(20) హలి. సక్థి, అనుశబ్దములకుఁ బూర్వమున 'నఞ్' గాని, 'దుస్, సు,'లుగాని ఉండి, బహువ్రీహిసమాసమున నవి పరపదములుగా నున్నచో నా సమాసము తుదను అచ్-ప్రత్యయము వైకల్పికముగాఁ జేరును: అహ లుఁడు, అహలి; దుర్హలుఁడు, దుర్హలి; సుహలుఁడు, సుహలి; అసక్థుఁడు, అసక్థి; సుసక్థుఁడు, సుసక్థి; దుస్సక్థుఁడు, దుస్సక్థి.

(21) నఞ్, దుస్, సు, ప్రత్యయములు పూర్వమందుగల ప్రజా, మేధా, శబ్దము లంతమందుగల బహువ్రీహిసమాసము 'తుదను 'అసిచ్' ప్రత్యయము చేరును:—అప్రజాః (అప్రజుఁడు),దుష్ప్రజాః (దుష్ప్రజుఁడు), సుప్రజాః (సుప్రజుఁడు); అమేధాః (అమేధుఁడు); దుర్మేధాః (దుర్మేధుఁడు), సుమేధాః (సుమేధుఁడు).

(22) బహువ్రీహిసమాసమున పూర్వపదము సమస్తపదముకాక, ఉత్తరపదము మఱియొక పదముతోఁ గూడని 'ధర్మ' శబ్దమైనయెడల, దానిపై 'అనిచ్' (అన్) ప్రత్యయము చేరును: కల్యాణధర్మన్, ప్రథమైకవచనము: కల్యాణధర్మా, లేకున్నచో 'పరమస్వధర్మః'. తెనుఁగున నీరెండు సందర్భములం దును నొకేవిధమగు రూపము గలుగును: కల్యాణధర్ముఁడు, పరమస్వధర్ముఁడు.

(23) బహువ్రీహిసమాసమున 'సు, హరిత, తృణ, సోమ, అనునవి పూర్వపదములుగాఁ గల జంభ (=ఆహారము, దంతము) శబ్దమునకు 'జంభన్' అను రూపము గలుగును: సుజంభా, హరితజంభా, తృణజంభా, సోమజంభా,' తెనుఁగున సుజంభుఁడు, హరితజంభుఁడు, తృణజంభుఁడు, సోమజంభుఁడు.

(24) కర్మవ్యతిహారార్థమున (ఒకపని పరస్పరముగా జరిగినదని తెలుపునపుడు) బహువ్రీహిసమాసమునంతమున 'ఇ(చ్)' ప్రత్యయము చేరును: కేశాకేశి, ముసలాముసలి.

(25) ద్విదండి మొదలగునవి గుణ సరిగాఁ బహువ్రీహిసమాసములే: ద్విదండి, ద్విముసలి, ఉభాహస్తి, ఉభయాహస్తి మొదలగునవి.

ద్విదండి, ద్విముసలి, ఉభాంజలి, ఉభయాంజలి, ఉభాదంతి, ఉభయాదంతి, ఉభాహస్తి, ఉభయాహస్తి, ఉభాకర్ణి, ఉభయాకర్ణి, ఉభాపాణి, ఉభయాపాణి, ఉభాబాహవి, ఉభయాబాహవి, ఏకపది, ప్రొహపది, ఆఢ్యపది (ద్వాఢ్యచ్యపది), సపది, నిష్కుచ్యకర్ణి, సంహతపుచ్ఛి, అంతేవాసి—ఇవి ద్విదండ్యాదులు.

(26) ప్ర, సం, అను నుపసర్గములకు పరమగు 'జాను' శబ్దమునకు 'జ్ఞు' ఆదేశమగును: ప్రజ్ఞుః = ప్రజ్ఞుఁడు = ప్రకృష్టములైన జానువు గలవాఁడు; సంజ్ఞుః = సంజ్ఞుఁడు = సంగతములైన జానువు లెవనికిఁ గలవో వాఁడు.

'ఊర్ధ్వ' శబ్దముపైనున్న 'జాను' శబ్దమునకు 'జ్ఞు' అను నాదేశము వైకల్పికముగా నగును: ఊర్ధ్వజ్ఞుః = ఊర్ధ్వజ్ఞుఁడు = ఊర్ధ్వములైన జానువు లెవనికిఁ గలవో వాఁడు, ఊర్ధ్వజానుః = ఊర్ధ్వజానుఁడు.

(27) బహువ్రీహిసమాసమునందుఁ గల 'ధనుస్' శబ్దము తుది వర్ణమునకు 'అనఙ్' ఆదేశమగును: శార్ఙ్గధన్వా = శార్ఙ్గధన్వుఁడు.

అట్టిసమాసము సంజ్ఞావాచకమైనప్పు డాదేశము వైకల్పికముగా నగును: శతధన్వా = శతధన్వుఁడు, శతధనుః = శతధనుఁడు (-వు)

(28) బహువ్రీహిసమాసమున నంతమందలి 'జాయా' శబ్దమునకు 'నిఙ్' చేరును: 'యువతి + జాయా = యువతి + జాయ + ని' అనియుండఁగా:

(29) యకారముతప్ప నున్న యేహల్లయినను వరమందుగల వ, యు, లకు లోపము గలుగును: యువతి + జా + ని; - 'యువతి' శబ్దమునకుఁ బుంవద్భావముగలిగి 'యువజానిః' అనురూపము గలుగును. తెనుఁగు: యువజాని, ఇట్లే, 'వృద్ధజాని' మొదలయినవి.

(30) బహువ్రీహిసమాసమున 'ఉత్, పూతి, సు, సురభి,' అనుపదములు పూర్వమందుగల 'గంధ'శబ్దము తుదియచ్చునకు 'ఇ' ఆదేశమగును: ఉద్గంధి, పూతిగంధి, సుగంధి, సురభిగంధి, తక్కిన పదములు పూర్వమందున్నచో 'వాతము తీవ్రగంధము.' 'ఇ' ఆదేశము గంధశబ్దము గుణవాచకమగునపుడే కలుగును; ద్రవ్యావాచకమగుచోఁ గాదు: పుష్పము సుగంధి; వాయువు సుగంధి; కాని, సుగంధద్రవ్యము లెవనికిఁ గలవో వాఁడు 'సుగంధుఁడు (అపణికుఁడు).'

(31) బహువ్రీహిసమాసమున నేశబ్దము పూర్వమందున్నను 'అల్పము' అనునర్థముగల 'గంధ' శబ్దము పరమందున్నచో దాని తుదియచ్చునకు 'ఇ' ఆదేశమగును: ఈ భోజనము సూపగంధి (= కొంచెము పప్పుగలది); ఘృతగంధి ( కొంచెము నేయిగలది ).

(32) ఉపమానవాచక పూర్వపదముగల 'గంధ' శబ్దము తుదియచ్చునకును 'ఇ' ఆదేశము కలుగును: పద్మమువంటి గంధమెవనికిఁ గలదో వాఁడు పద్మగంధి; ఇట్లే, ఉత్పలగంధి, కరీషగంధి మొదలయినవి.

(33) బహువ్రీహిసమాసమున నుత్తరపదముగా నున్న 'పాద' శబ్దమునకుఁ బూర్వమున దానిలో నుపమించిన వస్తువాచకపద మున్నప్పు డా పాద శబ్దము తుది అకారము లోపించును; హస్తి మొదలగు శబ్దములు పూర్వమందున్నచో లోపము గలుగదు: వ్యాఘ్రపాత్ (తె. వ్యాఘ్రపాత్తు); కాని, హస్తిపాదః = హస్తిపాదుఁడు.

హస్తి, కుద్దాల, అశ్వ, కశిక, కురుత, కటోల, కటోలక, గండోల, గండోలక, కండోల, కండోలక, అజ, కపోల, జాల, గండ, మహేలా, దాసీ, గణికా, కుసూల—ఇవి హస్త్యాదులు.

'కుంభపదీ' మొదలగు సమాసములందును 'పాద'శబ్దము తుది అకారము లోపింపఁగా దానిపై స్త్రీ ప్రత్యయము చేరునప్పుడు 'పాత్'నకు 'పద్' ఆదేశము గలిగినది. స్త్రీప్రత్యయము చేరనిచో 'అ'కారలోపము గలుగదు; కుంభపాదః = కుంభపాదుఁడు.

కుంభపదీ, ఏకపదీ, జాలపదీ, శూలపదీ, మునిపదీ, గుణపదీ, శతపదీ, సూత్రపదీ, గోధాపదీ, కలశీపదీ, విపదీ, తృణపదీ, ద్విపదీ, త్రిపదీ, షట్పదీ, దాసీపదీ, శితి(త)పదీ, విష్ణుపదీ, సుపదీ, నిష్పదీ, ఆర్ద్రపదీ, కుణి(-ణా)పదీ, కృష్ణపదీ, శుచిపదీ, ద్రోణ(-ణీ)పదీ, ద్రుపదీ, సూకరపదీ, శకృత్పదీ, అష్టాపదీ, స్థూల(-ణా)పదీ, అపదీ, సూచీపదీ, మాలాపదీ, గోపదీ, ఘృతపదీ

మూపపదీ, పంచపదీ, అర్వనదీ, స్తనపదీ, కలహంసపదీ, విషపదీ—ఇవి కుంభ పద్యాదులు.

బహువ్రీహిసమాసమున సంఖ్యావాచకముగాని, 'సు'గాని పూర్వమందుగల 'పాద'శబ్దము తుదియచ్చునకు లోపము గలుగును: ద్విపాత్, త్రిపాత్, సంపాత్ మొదలయినవి.

(౮౪) బహువ్రీహిసమాసమున సంఖ్యావాచకపదముగాని, 'సు' గాని పూర్వమందుగల 'దంత' శబ్దమునకు వయస్సును దెలుపునప్పుడు 'దత్' అను నాదేశము గలుగును: రెండుదంతములు గల వయస్సుగల బిడ్డ ద్విదన్ (తెనుఁగు: ద్విదనుఁడు? సుదంతుఁడు ?) ఇట్లే, త్రిదన్, చతుర్దన్, షోడన్, సుదన్ మొదలయినవి. స్త్రీవాచ్యమయినపుడు సుదతీ, ఏకదతీ, ద్విదతీ, మొదలయినవి. వయస్సు అను నర్థము లేనప్పుడు కరిద్విదంతము; నటుఁడు సుదంతుఁడు.

ఇతరపదములు పూర్వమందున్నను స్త్రీవాచకము యి సంజ్ఞాపదమయి నప్పుడును 'దంత' శబ్దమునకు 'దత్' ఆదేశమగును: అయోదతీ, ఫాలదతీ— మొదలైనవి. సంజ్ఞావాచకము కానప్పుడు: సమదంతీ, స్నిగ్ధదంతీ మొదలైనవి.

శ్యావ, అరోక, అనుపదములు పూర్వమందుగల దంతశబ్దమునకును వైకల్పికముగ దత్, ఆదేశమగును: శ్యావదన్, శ్యావదంతః; అరోకదన్, అరోకదంతః; అనఁగా పండ్లు ఎడములేనివాఁడు; తెనుఁగు: శ్యావదంతుఁడు, అరోకదంతుఁడు.

'అగ్ర' అనుపద మంతమందుగల పదములును, శుద్ధ, శుభ్ర, వృష, వరాహ, అను పదములును పూర్వమందుగల దంతశబ్దమునకు బహువ్రీహి సమాసమున 'దత్' ఆదేశమగును: ఉదా. కుడ్మలాగ్రదన్, కుడ్మలాగ్ర దంతః; శుద్ధదన్, శుద్ధదంతః; శుభ్రదన్, శుభ్రదంతః; వృషదన్, వృషదంతః; వరాహదన్, వరాహదంతః.

(౮౫) జంతువుల వయస్సునుగాని, యవస్థనుగాని తెలియఁజేయు బహువ్రీహిసమాసమున నుత్తరపదముగా నున్న 'కకుద'శబ్దము తుది అకారమునకు లోపము గలుగును: అజాతకకుత్, పూర్ణకకుత్.-అవస్థను తెలియఁ జేయునపుడు 'శ్వేత కకుదః.'

మూఁడు కకుదములుగల యొక పర్వతవిశేషము 'త్రికకుత్'. ఇది సంజ్ఞావాచకపదము; తె. త్రికకుత్తు.

ఉత్, వి, అను నుపసర్గములు పూర్వమందుగల 'కాకుద' శబ్దము తుది అకారము లోపించును: ఉత్కాకుత్, వికాకుత్; - 'పూర్ణ' శబ్దముతంబో

చరమందున్న 'కాకుద' శబ్దముతుది అకారము వైకల్పికముగ లోపించును: పూర్ణకాకుత్, పూర్ణకాకుదః (తె. పూర్ణకాకుత్తు, పూర్ణకాకుదము).

(36) సుహృద్, దుర్హృద్, శబ్దములు మిత్ర, శత్రు, అర్థములందు వచ్చు బహువ్రీహి సమాసములు. సు(దుర్) + హృదయ, అని యుండఁగా 'హృదయ' లోని 'అయ' లోపించినది.

(37) బహువ్రీహిసమాసములం దుత్తరపదములుగావచ్చు 'ఉరస్' మొదలగు పదములపై 'క(ప్)' ప్రత్యయమువచ్చును: ఉదా. వ్యూఢోర స్కుఁడు; ప్రియసర్పిష్కుఁడు మొదలయినవి.

ఉరస్, సర్పిస్, ఉపానహ్, పుమాన్, అనడ్వాన్, పయస్, నౌః లక్ష్మీః, దధి, మధు, శాలి, అనర్థ— ఇవి ఉరఃప్రభృతులు.

(38) ఉత్తరపదము ఇనంతమయి, స్త్రీవాచకనుగు బహువ్రీహిసమా సము తుదను 'క(ప్)' ప్రత్యయనుచేరును: ఉదా. ఈ నగరి బహుదండిక; ఈ సభ బహువాగ్మిక.

(39) పై సమాసాంతములను గూర్చిన సూత్రములందు చెప్పఁబడని తక్కిన బహువ్రీహిసమాసములన్నిటికంటెను 'క(ప్)' ప్రత్యయము వైక ల్పికముగాఁ జేరును: మహాయశస్కుఁడు, సుహాయశుఁడు మొదలయినవి.

(40) ఆ కారాంత స్త్రీలింగ శబ్దముపై 'క(ప్)' ప్రత్యయము చేరు నప్పుడా యాకారమునకు వైకల్పికముగా హ్రస్వము కలుగదు: బహు మాలాకుఁడు, బహుమాలకుఁడు - కప్ - ప్రత్యయము చేరనప్పుడు 'బహు మాలుఁడు.'

(41) బహువ్రీహిసమాసము సంజ్ఞావాచకమగునపుడు దానిపై - కప్ - ప్రత్యయము చేరదు: 'విశ్వేదేవుఁడు-' 'విశ్వేదేవకుఁడు' అనికాదు.

(42) 'ఈయస్' అనున దంతమందుగలది యుత్తరపదముగానుండు బహువ్రీహిసమాసముకంటె 'క(ప్)' ప్రత్యయమురాదు: ఉదా. బహుశ్రే యాన్, బహుశ్రేయసీ ( తెనుఁగు: బహుశ్రేయాంసుఁడు,బహుశ్రేయసి ).

(43) 'వందిత' అను నర్థముగల భ్రాతృశబ్ద ముత్తరపదముగాఁగల బహువ్రీహిసమాసముకంటె 'క(ప్)' ప్రత్యయమురాదు: సుభ్రాత—శాని, మూర్ఖభ్రాతృకుఁడు, దుష్టభ్రాతృకుఁడు.

(44) 'దేహావయవములు' అనునర్థమున నాడీ, తంత్రీపదములు బహు వ్రీహిసమాసములం దుత్తరపదములుగా నున్నప్పు డా సమాసముకంటె'క(ప్)'

ప్రత్యయముచేరదు: ఈ కాయము బహునాడి; ఈ గ్రీవము బహుతంత్రి-కాని, ఈ స్తంభము బహునాడీకము; ఈ వీణ బహుతంత్రీక.

(45) 'నిష్ప్రవాణి' అను సమాసమున నుత్తరపదముగానున్న 'ప్రవాణీ' శబ్దము నదీసంజ్ఞకమైనను దానిపై 'క(ప్)' ప్రత్యయము రాదు: ఈ బట్ట నిష్ప్రవాణి = మగ్గమునుండి తీసినది.

(46) సప్తమీవిభక్తియందున్న పదమును, విశేషణ పదమును బహువ్రీహిసమాసమునఁ బూర్వపదములుగా నుండవలెను: ఉదా. ఉరసిలోముఁడు.

సర్వనామములును సంఖ్యావాచకములును బూర్వపదములుగ నుండును: సర్వశ్వేతుఁడు.

సర్వనామపదమును సంఖ్యావాచకపదమును గలిసి యేర్పడిన బహువ్రీహిసమాసమున సంఖ్యావాచకపదము పూర్వపదముగా నుండవలెను: ద్వ్యన్యుఁడు.

సమాసమునందలి రెండుపదములును సంఖ్యావాచకపదములైన మొదల తక్కువసంఖ్యను దెలుపునది పూర్వపదముగ నుండవలెను: ద్విత్రములు.

ద్వంద్వసమాసమునఁ గూడ రెండుసంఖ్యావాచకపదములు చేరునప్పుడు తక్కువసంఖ్యను దెలుపునది పూర్వపదముగా నుండవలెను: ద్వాదశము.

బహువ్రీహిసమాసమున 'ప్రియ' అను పదము పూర్వపదముగానైనను ఉత్తరపదముగానైనను నుండవచ్చును: గుడప్రియుఁడు; ప్రియగుడుఁడు.

'గడు' (=వంకర, గూను) మొదలగు పదములపై సప్తమీవిభక్త్యర్థకపదముత్తరపదముగఁ జేరును: గడుకంఠుఁడు, గడుశిరుఁడు. ఒకప్పుడిట్లుకాదు: వహీగడుఁడు (భుజమునందు వంకర గలవాఁడు).

(47) నిష్ఠావాచకపదము బహువ్రీహిసమాసమునఁ బూర్వపదముగా నుండును: కృతకృత్యుఁడు, యుక్తయోగుఁడు, కృతకటుఁడు, భిక్షితభిక్షి—సారంగజగ్ధి, మాసజాతుఁడు, సుఖజాతుఁడు, ఇచట నిష్ఠాపదముత్తరపదముగా నున్నది.

(48) 'ఆహితాగ్ని' మున్నగు సమాసములలో నిష్ఠాపదము వైకల్పికముగాఁ బూర్వపదము కావచ్చును: ఆహితాగ్ని, అగ్న్యాహితుఁడు,

'కొట్టుట' మొదలగు నర్థముగల పదముల తరువాతవచ్చు నిష్ఠాంత పదములును, సప్తమ్యర్థకపదములును సమాసమున నుత్తరపదములుగా నుండును: అభ్యుద్యతుఁడు, దండపాణి—ఒకప్పు డిట్లు కాదు; వివృతాసి.

## V. ద్వంద్వసమాసము.

(1) 'చ' (= మఱియు) అనునర్థమున ననేకములగు సుబంతపదములు వైకల్పికముగా సమసించును. సమసించునపుడు ద్వంద్వసమాసమగును. 'చ' అను నవ్యయమునకు (1) సముచ్చయము (2) అన్వాచయము (3) ఇతరేతరము (4) సమాహారము-అను నాలుగర్థములు గలవు. పరస్పరసంబంధములేని రెండు స్వతంత్రపదములు ఒకదానిప్రక్క నొకటిచేరుట సముచ్చయమనఁబడును: ఈశ్వరుని, గురువును భజింపుము. ఇచట 'ఈశ్వర,' 'గురు' అనుపదములు స్వతంత్రములు; వానికిఁ బరస్పరసంబంధములేదు. వీనికి సమసింప సామర్థ్యములేదు గావున సమాసము సిద్ధింపదు. ఈ యుదాహరణమున రెండుద్రవ్యము లేక క్రియతో నన్వయించుచున్నవి. 'రాజు యొక్క గజమును, అశ్వమును' అనుచోట పరస్పరసంబంధములేని రెండు పదములు మఱియొకవస్తువుతో సంబంధించుచున్నవి. 'వస్త్రము, రక్తమును, శుక్లమును;' ఇచట రెండు స్వతంత్రములగు గుణవాచక విశేషణములు, పరస్పరసంబంధములేనివి, యొకవిశేష్యముతో సంబంధించుచున్నవి. 'రక్తమైన వస్త్రమును కుండలమును,' ఇచట రెండు స్వతంత్రవిశేష్యములు, పరస్పరసంబంధములేనివి ఒకవిశేషణముతో సంబంధించుచున్నవి. ఇవికూడ సముచ్చయార్థమున కుదాహరణములే.

ఒక ప్రధానకార్యము ననుసరించి యుపకార్యము కలుగుచున్నపు డా రెండుకార్యములను దెలుపుపదము లొకదానిప్రక్క నొకటిచేరుట 'అన్వాచయము'. 'భిక్షమునకు పొమ్ము, ఆవును తీసికొని రమ్ము,' అనుచోట భిక్షమునకు పోవుట నిశ్చయము; ఆవును తీసికొని వచ్చుట అది కనఁబడకపోయిన చోఁ గాక పోవచ్చును. భిక్షాటనము ప్రధానకార్యము; ఆవును తీసికొని వచ్చుట యుపకార్యము. కావున నిచటఁగూడ సమాసము సిద్ధింపదు.

'ధవఖదిరములు' అనుచోట 'ధవవృక్షము, ఖదిరవృక్షము' అనునవి యితరేతరసంబంధము గలిగినవి కావున సమాసము సిద్ధించుచున్నది. 'సంజ్ఞాపరిభాషము' అనుచోట సమాహారార్థము (వస్తువులకూడిక) గలిగి సమాసము సిద్ధించుచున్నది.

హోతృ, పోతృ, నేష్టృ, ఉద్గాతృ అనుపదములు సమసించి 'హోతృపోతృ నేష్టృ-ద్గాతారులు' అనికాని, 'హోతాపోతానేష్టోద్గాతారులు' అని

కాని యగును. మొదటి సమాసములో 'హోతృ, పోతృ' పదములపై నుత్తర పదములేదు గావున 'హోతా పోతా' అను రూపములను బొందలేదు. రెండవ సమాసములో 'హోతృ, పోతృ' శబ్దములు రెంటికిని, నేష్టృ, ఉద్గాతృ పదములు రెంటికిని ప్రత్యేకముగా సమాసములు గలిగినపిదప నా రెండు సమాసములును మఱల నొక పెద్దసమాసముగాఁ జేరినవి.

(2) 'రాజదంత' మొదలగు సమాసములందు ఉపసర్జనసంజ్ఞగల పదము ఉత్తరపద మగును. దంతములకురాజు = రాజదంతము - రాజదంత, అగ్రేవణమ్, లిప్తావసితమ్, నగ్నముషితమ్, సిక్తసంమృష్టమ్, మృష్టలుంచితమ్, అవక్లిన్నపక్వమ్, అర్పితోప్తమ్ (అర్పితోప్తమ్), ఉప్తగాఢమ్, ఉలూఖలముసలమ్, తండులకిణ్వమ్, దృషదుపలమ్, ఆరగ్వాయనీ (ఆరగ్వాయనబంధకీ), చిత్రరథబాహ్లీకమ్, అవంత్యశ్మకమ్, శూద్రార్యమ్, స్నాతకరాజానౌ, విష్వక్సేనార్జునౌ, అక్షిభ్రువమ్, దారగవమ్, శబ్దార్థౌ, ధర్మార్థౌ, కామార్థౌ, అర్థశబ్దౌ, అర్థధర్మౌ, అర్థకామౌ, వైకారిమతమ్, గాజవాజమ్, గోజవాజమ్, గోపాలిధాన(-నీ)పూలాసమ్, పూలాసకారండమ్, (పూలాసకకురండమ్), స్థూలాసమ్ (స్థూలపూలాసమ్), ఉశీరబీజమ్ (జిజ్ఞాస్థి), సింజాస్థమ్ (సింజశ్వత్థమ్), చిత్రాస్వాతీ(చిత్రస్వాతీ), భార్యాపతీ, దంపతీ, జంపతీ, జాయాపతీ, పుత్రపతీ, పుత్రపశూ, కేశశ్మశ్రు, (కేశ, శ్మశ్రుకేశౌ), శిరోబీజమ్, శిరోజాను, సర్పిర్మధునీ, మధుసర్పిషీ, ఆద్యన్తౌ, అంతాదీ, గుణవృద్ధీ, వృద్ధిగుణౌ.

ధర్మాదిపదములకు సమాసమున స్థాననియమము లేదుగావునఁ బై పట్టికలో రెండేసి రూపములు చూపఁబడినవి.

(3) ద్వంద్వసమాసమున 'ఘి' అను వ్యాకరణసంజ్ఞగల పదము పూర్వపదముగా నిలచెను. హరియు హరుఁడును 'హరిహరులు' సమాసమున 'ఘి' సంజ్ఞగల పదము లనేకము లున్నప్పుడు వానిలో దేనినైనను బూర్వపదముగ నుపయోగించవచ్చును. హరియు, గురుఁడును, హరుఁడును 'హరిగురుహరులు' లేక 'హరిహరగురులు.'

(4) అజాద్యదంతమైనది ద్వంద్వసమాసమునఁ బూర్వపదమగును; ఈశుఁడును కృష్ణుఁడును 'ఈశకృష్ణులు.' అట్టి పదము లనేకము లున్నప్పుడు వానిలో దేనినైనను బూర్వపదముగా వాడవచ్చును: అశ్వరథేంద్రులు, ఇంద్రాశ్వరథులు. ద్వంద్వసమాసమున అజాదియు నదంతమునైన పదమే పూర్వపదమగును: 'ఇంద్రాగ్నులు' అనుచోట 'ఇంద్ర'పద మజాదియు నదంతమును నైనది; 'అగ్ని' అనునది యజాదియైనను నదంతము కాదు. కావున నిచట 'అగ్ని' పదము పూర్వపదముకాదు. 'ఇంద్ర' అనునదే మొదట నిలిచినది.

(5) ద్వంద్వసమాసమున తక్కువ యచ్చులుగలది పూర్వపదమగును: శివకేశవులు. 'శివ' అనుపదములో రెండచ్చులున్నవి; 'కేశవ' అనుదానిలో మూఁడున్నవి; కావున 'శివ' అనునది పూర్వపదమగుచున్నది.

సమాసమున తక్కువ యచ్చులుగల యనేకపదము లున్నప్పుడు వానిలో దేనినైనను బూర్వపదముగా వాడవచ్చును : శంఖదుందుభివీణలు; వీణాశంఖదుందుభులు.

'ఋతువులయు' నక్షత్రములయు పేళ్లు సమానసంఖ్యగల యచ్చులను గలిగియున్నప్పుడు వానిని ఆనుపూర్వ్యముగ నుపయోగింపవలెను: హేమంతశిశిరవసంతములు; కృత్తికారోహిణులు. సమానసంఖ్యగల యచ్చులు లేనపుడీ నియమము లేదు: గ్రీష్మవసంతములు.

సమానసంఖ్యగల యచ్చు లున్నపదములైనను వానిలో లఘ్వక్షరములు గలపదమును మొదటవాడవలెను: కుశకాశములు.

ఎక్కువ గౌరవమును దెలియఁజేయు పదమును మొదటవాడవలెను: తాపసపర్వతులు, వాసుదేవార్జునులు.

వర్ణముల పేళ్లను యథాక్రమముగ నుపయోగింపవలెను. బ్రాహ్మణక్షత్రియులు, క్షత్రియవైశ్యులు, విట్శూద్రులు.

అన్నపేరిని తమ్మునిపేరికి ముందుగా నుంచవలెను; యుధిష్ఠిరార్జునులు.

(6) ప్రాణులు, తూర్యములు, సేన—వీనియంగములను దెలియఁజేయు పదములు ద్వంద్వసమాసముఁ జేరునప్పు డాసమాస మేకవచనమందే యుండును: పాణిపాదము, శిరోగ్రీవము, మార్దంగికపాణవికము, వీణావాదకపరివాదకము, రథికాశ్వారోహము, [illegible]తము.

ఇట్టి యేకవచనత్వము సమాహారద్వంద్వసమాసములకే వర్తించును; ఇతరేతరద్వంద్వములకు వర్తింపదు. పై యుదాహరణములవంటివి కేవల సమాహారద్వంద్వములు. 'దధిపయాంసులు' మొదలగునవి కేవలము నితరేతర ద్వంద్వములు; వానికేకవచనత్వము కలుగదు వృక్ష, మృగ, తృణాదులను దెలియఁజేయు పదముల ద్వంద్వసమాసము వైకల్పికముగా నేకవచనమందుండును. కావున నవి సమాహారద్వంద్వములుగాని, యితరేతరద్వంద్వములుగాని కావచ్చును.

(7) ప్రాణివాచకములుగాని జాతులను దెలుపు పదముల ద్వంద్వసమాస మేకవచనమందుండును; ఈ జాతులు ద్రవ్యవాచకములై యుండవలెను : ఉదా, ధానాశష్కులి.

జాతులు గుణవాచకములైనను క్రియావాచకములైనను నేకవచనము రాదు : రూపరసములు, గమనాకుంచనములు.

ద్రవ్యవాచక జాతులను దెలుపు పదముల సమాసమైనను సమాహారమగునప్పుడే యేకవచనము కలుగును. సమాహారార్థము లేనప్పుడు గలుగదు : బదరామలకములు.

(8) వేర్వేరు లింగములందున్న పదముల సమాహారద్వంద్వసమాసమూపదములు నదీ, దేశ, నామము లగునప్పు డేకవచనముండును : ఉదా. ఉద్ధ్యైరావతి ('ఉద్ధ్య' అనున దొకనది), గంగాశోణము; కురుకురుక్షేత్రము.

సమాసమునందలి పదములు పట్టణముల పేళ్లయినప్పు డేకవచనము రాదు: జాంబవశాలూకినులు (జాంబవ, శాలూకి, అను పట్టణములు).

ఏకవచన నిషేధము గ్రామ, పట్టణవాచక పదములకేకాని, నగరవాచకపదములకు లేదు : మధురాపాటలిపుత్రము

సమాసమునందు నొకపదము పట్టణ, గ్రామవాచకమును, నొకటి నగరవాచకమును నైనయెడల ఏకవచనము నిషిద్ధమగును : సౌర్యకేతవతిములు (సౌర్యనగరము, కేతవత గ్రామము).

సమాసమందలి పదములు పర్వతనామము లయినను నేకవచనము గలుగదు: కైలాసగంధమాదనములు.

రెండుపదములును నేకలింగములం దున్నయెడల నేకవచనము గలుగదు : గంగాయమునలు (రెండును స్త్రీలింగములు), మద్రకేకయులు (మద్రదేశము, కేకయదేశము).

ఒకపదము దేశవాచకమును ఒకటి నదీవాచకమును నయినను ఏకవచనము గలుగదు : గంగాకురుక్షేత్రములు.

(9) క్షుద్రజంతువులను దెలుపు పదముల సమాహారద్వంద్వసమాసమేకవచనమున నుండును : యూకాలిక్షము (పేలు, ఈగుపేలు).

సహజవైరముగల జంతువులను దెలుపు పదముల ద్వంద్వసమాసము ఏకవచనమం దుండును : అహినకులము, గోవ్యాఘ్రము, కాకోలూకము.

(10) ఎక్కువ జాతులవారితోడి సంపర్కము నిషేధింపబడని శూద్రజాతులను దెలుపు పదముల ద్వంద్వసమాసములు ఏకవచనముందుండును : తక్షాయస్కారము (వడ్రంగి, కమ్మరి); కాని, చండాల మృతపులు (వీరి కెక్కువ జాతులవారితో సంపర్కము లేదు).

(11) గవాశ్వము మొదలగు ద్వంద్వసమాసములును నేకవచనమందుండి సాధువు లగుచున్నవి: గవాశ్వము, గవాదికము, గవైడికము, అజావికము, అజైడకము, కుబ్జవామనము, కుబ్జకైరాతకము, పుత్రపౌత్రము, చండాలము, స్త్రీకుమారము, దాసీమాణవకము, శాటీపిచ్ఛకము, ఉష్ట్రఖరము, ఉష్ట్రశశము; మూత్రశకృత్, మూత్రపురీషము, యకృన్మేదము, మాంసశోణితము, దర్భశరము, దర్భపూతీకము, అర్జునశిరీషము, తృణోలపము, దాసీదాసము, కుటీకుటము, భగవతీభాగవతము—ఇవి గవాశ్వాదులు.

(12) వృక్ష, మృగ, తృణ, ధాన్య, వ్యంజన, పశు, శకుని, అను నర్థములు దెలుపుపేళ్ల ద్వంద్వసమాసములును; అశ్వవడవ, పూర్వాపర, అధరోత్తర, అను సమాసములును, వైకల్పికముగ ఏకవచనాంతములై యుండును: ప్లక్షన్యగ్రోధము(లు); రురుపృషతము(లు); కుశకాశము(లు); వ్రీహియవము(లు), దధిఘృతము(లు); గోమహిషము(లు); శుకబకము(లు); అశ్వవడవము(లు); పూర్వాపరము(లు), అధరోత్తరము(లు).

ఫలములు, సేన, పెద్దచెట్లు, అడవిమృగములు, పక్షులు, క్షుద్రజంతువులు, ధాన్యము, గడ్డి, వీనిపేళ్లు ఎక్కువ సంఖ్యనుగాని, ఎక్కువ మొత్తమునుగాని తెలియఁజేయుచు సమసించి సమాహారార్థమును బొందునపుడా సమాసము ఏకవచనమం దుండును. సమాసమందలి యొకొక్క పదమును బహువచనమున నున్నచో సమాసమేకవచనమున నుండును: బదరములును ఆమలకములును 'బదరామలకము'; ఒకబదరము, ఒక ఆమలకము 'బదరామలకములు.' ఒక రథికుఁడును ఒక అశ్వారోహుఁడును 'రథకాశ్వారోహులు.' ఒక ప్లక్షమును ఒక న్యగ్రోధమును 'ప్లక్షన్యగ్రోధములు,' ఇట్లే, రురుపృషతములు, హంసచక్రవాకములు, యూకాలిక్షలు, వ్రీహియవములు, కుశకాశములు మొదలయిన వానిలోని యొకొక్క పద మొకొక్క వస్తువునే తెలియఁజేయును.

(13) పరస్పర విరుద్ధార్థములుగల పదములు చేరినసమాస మాపదములు అప్రాణివాచక ద్రవ్యపదార్థముల పేళ్లు కానపుడు వైకల్పికముగ నేకవచనమం దుండును: శీతోష్ణము(లు), సుఖదుఃఖము(లు), జీవితమరణము(లు). 'దధిపయస్' మొదలగు ద్వంద్వసమాసము లేకవచనమున నుండవు. దధిపయసులు, సర్పిర్మధునులు, మధుసర్పిషులు, బ్రహ్మప్రజాపతులు, శివవైశ్రవణులు, పరివ్రాట్కౌశికులు, ప్రవర్గ్యోపసదులు, శుక్లకృష్ణములు, ఇధ్మాబర్హిషులు, దీక్షాతపసులు, శ్రద్ధాతపసులు, మేధాతపసులు, అధ్యయనతపసులు, ఉలూఖలముసలములు, ఆద్యావసానములు, శ్రద్ధామేధలు, ఋక్సామములు, వాఙ్మనసలు—ఇవి దధిపయ ఆదులు.

(14) ఒక నియతసంఖ్యగల యధికరణ (అప్రాణివాచకములు, అద్రవ్యవాచకములు) పదముల ద్వంద్వసమాసము ఏకవచనముగ నుండవలయు నను నియమము లేదు: దశదంతోష్ఠములు, పదేసి దంతములు, పదేసి పెదవులు.

ఒక సంఖ్య నించుమించుగాఁ దెలుపఁజేయు పదముల ద్వంద్వసమాసము వైకల్పికముగా నేకవచనమం దుండును: ఉపదశదంతోష్ఠము(లు).

(15) ఋకారాంతపదములు రెండుచేరి ద్వంద్వసమాస మగునపుడు దానిలోని పూర్వపదము ఋకారమునకు ఆ(డజ్) అనున దాదేశమగును: హోతాపోతారులు, నేష్టోద్గాతారులు—కాని, హోతృపోతృనేష్టోద్గాతారులు. దీనిలో హోతృపోతృ పదములపై నుత్తరపదము లేదుగనుక వాని ఋకారమున కాదేశము రాలేదు.

(16) దేవతావాచకపదముల ద్వంద్వసమాసమునఁ బూర్వపదము తుదియచ్చునకు దీర్ఘము కలుగును: మిత్రావరుణులు—'వాయు' అను పదము పూర్వమందున్నను పరమందున్నను దానికి దీర్ఘము కలుగదు: అగ్నివాయువులు, వాయ్వగ్నులు.

(17) 'అగ్ని' అను పదమునకుఁ బరముగా 'సోమ, వరుణ' అను పదములు పరమై ద్వంద్వసమాసమగునపు డగ్నిశబ్దము తుదియచ్చునకు దీర్ఘము కలుగును: అగ్నీషోములు. (అగ్ని శబ్దమునకుఁ బరముగావచ్చు 'స్తుత్, స్తోమ, సోమ అను పదములందలి తొలి సకారమునకు షకారమాదేశమగును); అగ్నివారుణులు.

(18) దేవతావాచకపదముల ద్వంద్వసమాసమున దొలుతనుండు 'దివ్' శబ్దమునకు 'ద్యావా' అను నాదేశము కలుగును: ద్యావాక్షామా, ద్యావాభూమీ.

(19) దేవతావాచకపదముల ద్వంద్వసమాసమునఁ దొలుతనుండు 'దివ్' శబ్దముపై పృథివీశబ్దము చేరినచో దివ్ శబ్దమునకు 'దివస్' అని కాని 'ద్యావా' అని కాని యాదేశము కలుగును: దివస్పృథివీ, ద్యావాపృథివీ.

(20) దేవతాద్వంద్వసమాసమునఁ బూర్వపదమగు 'ఉషస్' శబ్దమునకు 'ఉషాసా' అను నాదేశము కలుగును: ఉషాసాసూర్యము, ఉషాసానక్తా (తె.-క్త).

(21) మాతృ, పితృశబ్దముల ద్వంద్వసమాసము 'మాతాపితరౌ' (తె. మాతాపితరులు) అనియే కాక 'మాతరపితరౌ' (తె. మాతరపితరులు) అని కూడ నగును.

(22) సమాహారద్వంద్వసమాసము నంతమున చవర్గీయ హల్లుగాని, ద, ష, హ అను హల్లులుగాని పరమగుచో దానిపై 'టచ్' ప్రత్యయము చేరును.

## VI. ఏకశేష సమాసము.

ద్వంద్వసమాసమునఁ జేరిన పదములన్నియుఁ గొన్ని వికారములు గలిగినను లోపింపక నిలుచును. కాని, ఏకశేష సమాసమున కలిసినపదములలో నొకటి మాత్రము నిలిచి తక్కినవి లోపించిపోవును. నామవాచకాదుల బహువచనము చెప్పవలసినప్పుడు సరూపములైన పదములు చేరి యందొక్క పదముమాత్రము శేషించును. రామ+రామ+రామ అను సరూపములగు మూఁడు పదములు సమసించి 'రామరామరామ' అను సమాసముకాక, వానిలో నొక్కరామశబ్దము మాత్రము మిగిలి 'రాములు' అను రూప మేర్పడును. ఇట్లు సరూపములగు పదములు మాత్రమేకాక రూపభేదముఁ గలిగియున్నను నేకార్థముఁ గలిగిన పదములు కూడినప్పుడును వానిలో నొక్క పదము మాత్రము శేషించుట గలదు: ఉదా. వక్రదండము+కుటిలదండము= వక్రదండములు, లేక కుటిలదండములు.

(1) ఒక వంశము నారంభించిన వానినుండి కలిగిన పేరు గోత్రము; అట్లారంభించిన వాని కొడుకు కూడ నా గోత్రము వాఁడు. కాని, గోత్రకర్త మనుమఁడు జీవించియుండినచో నతని పేరు 'యువ' మగును. 'గోత్ర' పదమునకు 'వృద్ధ' అనునది నామాంతరము. ఒక వృద్ధపదమును ఒక యువపదమును సమాసముగ చేసినప్పుడు వృద్ధపదముమాత్రము శేషించి, యువపదము లోపించును. ఈ రెండు పదముల రూపములందును వాని ప్రత్యయము లందు మాత్రము భేదముండవలెను. ఉదా. గార్గ్యుఁడు+గార్గ్యాయనుఁడు = గార్గ్యులు. ఇచట 'గార్గ్య' అనునది వృద్ధపదము; గార్గ్యాయనుఁడు అనునది యువపదము; కావున రెండింటిలోను సమాసమున వృద్ధపదము శేషించినది. 'గార్గ్యుఁడు+వాత్స్యాయనుఁడు' అనుచోట గార్గ్య అనునది వృద్ధపదమును, వాత్స్యాయన అనునది యువపదమునైనను రెండు పదములకును సరూపత్వము లేదుగనుక యువపదము లోపింపదు; గార్గ్యవాత్స్యాయనులు అని మాత్రమే సమాసమగును. ఆ రెండు పదములును కేవల వృద్ధ, యువ, అను నర్థములను మాత్రము గలిగియుండవలెను; మఱియొకయర్థము గలిగిన యెడల నేకశేషసమాసము సిద్ధింపదు. 'భాగవిత్తి + భాగవిత్తికుఁడు' ఇచట భాగవిత్తికపదము నిందార్థమున్నది గనుక, యువపదముకాదు; కాఁబట్టి, భాగవిత్తి భాగవిత్తికులు అనియే సమాసమగును.

నపుంసకలింగపదము శేషించును; కావున స్త్రీ నపుంసకలింగపదములలో నపుంసకలింగపదమే శేషించును:

సా చ దేవదత్తశ్చ = తౌ (ఆమెయు దేవదత్తుఁడును వారు. ఇచట తెనుఁగున పుంస్త్రీవాచకములకు బహువచనమున భేదములేదు.) అదియు, దేవదత్తుఁడును; యజ్ఞదత్తయు 'అవి', అదియు దేవదత్తుఁడును 'అవి.' ఇది సంస్కృత సంప్రదాయము: తెనుఁగున అదియును ఆమెయును ననుటకుఁ గాని అదియును వాఁడును అనుటకుఁగాని యేకశేష సమాసములు లేవు.

(9) గ్రామ్యపశువుల సంఘములందు తరుణములు గానివానిని తెలుపు పదములు కలిసినప్పుడు స్త్రీలింగపదము శేషించును: గోవులును వృషభములును 'గోవులు;' ఆఁడుమేకలును మగమేకలును 'అజములు.'

చీలిన డెక్కలుగల గ్రామ్యపశువులను తెలుపుపదములకు మాత్రమే యీ సూత్రము వర్తించును. ఇవి 'అశ్వములు' (మగవి, ఆఁడువి) - ఇచట పుంలింగపదము శేషించినది.

## సర్వసమాసశేషము.

కృద్వృత్తి, తద్ధితవృత్తి, సమాసవృత్తి, ఏకశేషవృత్తి, సనాద్యంత ధాతురూపవృత్తి, అనివృత్తి యైదువిధములు. వృత్తి యనఁగా ఒకపదము స్వార్థమునకు భిన్నమగు నర్థమును గల్పింపఁ గలశక్తి; అర్థభేదమును గొంచెమైనను గల్పింపఁజాలనిది వృత్తికాదు.

ధాతువునుండి మూలనామవాచకపదమును గల్పించుట కృద్వృత్తి; మూలనామవాచక పదమునుండి మఱియొక నామవాచక పదమును గల్పించునది తద్ధితవృత్తి; రెండుగాని యంతకంటె నెక్కువగాని పదములను కూర్చి యేకపదముగాఁ జేయునది సమాసవృత్తి; అనేకపదములు సమసించునప్పు డందలి యొకపదమును మాత్రము శేషింపఁజేయునది యేకశేషవృత్తి; నామవాచకమునుండి క్రియాపదమునుగాని, యొక మూలక్రియాపదమునుండి మఱియొక క్రియాపదమునుగాని గలిగించునది సనాద్యంత ధాతురూపవృత్తి.

ఒకవృత్తి యర్థమును వివరించు కార్యమునకు విగ్రహమని పేరు. విగ్రహవాక్యము మూలపదమునర్థ మేరీతిగ మాఱినదో తెలియఁజేయును. విగ్రహము లౌకికమనియు, అలౌకికమనియు రెండువిధములు. సాధారణ భాషలో నర్థము ననుసరించి వివరింపఁబడినది లౌకికవిగ్రహము; వ్యాకరణ సంకేతములతో వివరింపఁబడినది యలౌకికవిగ్రహము. రాజపురుషః (రాజ

పురుషుఁడు) అను సమాసమునకు 'రాజ్ఞః పురుషః' (రాజుయొక్క పురుషుఁడు) అని యర్థవివరణము చేయుట లౌకికవిగ్రహము. 'రాజన్ + ఙస్ + పురుష+సు' (రాజన్ + అంత్యలోపము + ఉ + యొక్క + పురుష + ఉ + డుఙ్) అని వివరించుట యలౌకిక విగ్రహము.

లౌకికవిగ్రహము చెప్ప వీలులేనిది నిత్యసమాస మనఁబడును; అనఁగా నా సమాసమందలిపదముల సంబంధమును వేర్వేఱుగ వివరించి చెప్ప సాధ్యము కాదు.

సమాసములు అవ్యయీభావము, తత్పురుషము, ద్వంద్వము, బహువ్రీహి, యని నాలుగనియు, నవి వరుసగా పూర్వోత్తరోభయాన్యపదార్థ ప్రధానములనియుఁ జెప్పుట చూచాము. కాని, ఈ నిర్వచనము చాలదు. 'ఉన్మత్తగంగము' మొదలగు నవ్యయీభావసమాసములును, 'అతిమాలా' మొదలగు తత్పురుషసమాసములును, 'ద్విత్రాః' మొదలగు బహువ్రీహి సమాసములును, '[illegible]' మొదలగు ద్వంద్వసమాసములును పై నిర్వచనము ననుసరించి పోవు.

కర్మధారయము తత్పురుషభేదము; ద్విగువు కర్మధారయభేదము. ద్వంద్వబహువ్రీహి సమాసములందు మాత్రము [illegible] ఎక్కువపద ములు చేరును. '[illegible]' మొదలగు [illegible] తత్పురుషసమా[illegible] ఎక్కువ[illegible], [illegible] నందు [illegible] మాత్రము చేరును.

## సమాసాంతప్రకరణము

ఈ ప్రకరణమునందు నానావిధసమాసముల యంతమునందు చేరు ప్రత్యయములు వివరింపబడును:

(1) ఋక్, పూర్, అప్, ధూర్, పథిన్ అను శబ్దములు సమాసముల నుత్తరపదములుగా నున్నప్పుడు వానిపై 'అ' అను ప్రత్యయము వచ్చును: అర్ధర్చము, [illegible], బహ్వృచము — 'ధూర్' అనుపదము 'అక్ష'శబ్దముతోఁ గలిసినప్పుడీ ప్రత్యయము రాదు, అక్షధూః. విష్ణోః + పూర్ = విష్ణుపురమ్; ఇట్లే, [illegible]పురము, నాందీపురము ([illegible]) విమలాపము.

(2) ద్వి, అంతర్, అనుపదములమీఁదను, ఉపసర్గములమీఁదను జేరిన 'అప్' అనుపదముపై 'ఈ' యాను నచ్చు చేరును: ద్వీపము, అంతరీపము, ప్రతీపము, సమీపము, మొదలగునవి.

'అను' అను నుపసర్గమీఁదఁ జేరిన 'అప్' శబ్దము మొదటి 'అ'కారమునకు బదులుగ స్థలార్థమున 'ఊ' అనునచ్చు ఆదేశమగును; అనూపము

(ఒకదేశము). సమాసాంతమునవచ్చు 'పథిన్' శబ్దమునమీఁదను 'అ' అను ప్రత్యయము చేరును: సఖిపథము, రమ్యపథము.

(3) ప్రతి, అను, అవ, అను నుపసర్గపూర్వకములగు 'సామన్, లోమన్' శబ్దములపై 'అచ్' అను ప్రత్యయము వచ్చును: ప్రతిసామము, అనుసామము, అవసామము; ప్రతిలోమము, అనులోమము, అవలోమము.

కృష్ణ, ఉదక్, పాండు, అను పదములును, సంఖ్యావాచకపదములును పూర్వమందుగల భూమిశబ్దముమీఁదను 'అచ్' ప్రత్యయము చేరును: కృష్ణభూమము, ఉదగ్భూమము, పాండుభూమము, ద్విభూమము(ప్రాసాదము).

సంఖ్యావాచకపదములు పూర్వమందుగల గోదావరీ, నదీశబ్దముల మీఁదను 'అచ్' ప్రత్యయము చేరును: సప్తగోదావరము, పంచనదము.

'అచ్' ప్రత్యయము మఱికొన్నిచోట్లను వచ్చును: పద్మనాభుఁడు, ఊర్ణనాభుఁడు, సమరాత్రము, దీర్ఘరాత్రము, అరాత్రము; వీనిలో నాభి, రాత్రి, శబ్దములపై 'అచ్' ప్రత్యయము చేరినది.

(4) 'అక్షి' శబ్దమునకు 'కన్ను' అనునర్థము లేనప్పుడును సమాసమున 'అచ్' ప్రత్యయము చేరును: గవాక్షము = వెలుతురుకొఱకు చేసిన కన్నము.

(5) అచతుర, విచతుర, సుచతుర; స్త్రీపుంసలు, ధేన్వనడుహములు, ఋక్సామములు, వాఙ్మనసములు; అక్షిభ్రువము, దారగవము, ఊర్వష్ఠీవము, పదష్ఠీవము, నక్తందివము, రాత్రిందివము, అహర్దివము, సరజసము, నిఃశ్రేయసము, పురుషాయుషము, ద్వ్యాయుషము, త్ర్యాయుషము, ఋగ్యజుషము, జాతోక్షము, మహోక్షము, వృద్ధోక్షము, ఉపశునము, గోష్ఠశ్వము, అను నిరువదియైదుసమాసములును 'అచ్' ప్రత్యయము చేరుటవలనఁ గలిగినవి.

(6) బ్రహ్మ, హస్తిశబ్దములకుఁ బరముగా వచ్చు 'వర్చస్' శబ్దము తుదను 'అచ్, ప్రత్యయము చేరును: బ్రహ్మవర్చసము, హస్తివర్చసము. పల్య, రాజ శబ్దములమీఁదవచ్చు వర్చశ్శబ్దమునకును 'అచ్' ప్రత్యయము చేరును: పల్యవర్చసము, రాజవర్చసము.

(7) అవ, సమ్, అంధ అనువానిపై వచ్చు 'తమస్' శబ్దమునకును 'అచ్' ప్రత్యయము చేరును: అవతమసము, సంతమసము, అంధతమసము.

(8) సమాసమున 'శ్వః' శబ్దముకంటెఁ బరమైన 'వసీయస్, శ్రేయస్' శబ్దములమీఁదను 'అచ్' ప్రత్యయము చేరును: శ్వోవసీయసము, శ్వఃశ్రేయసము.

(9) అను, అవ, తప్త, అనుపదములపై వచ్చు 'రహస్' శబ్దమునకును 'అచ్' ప్రత్యయము చేరును: అనురహసము, అవరహసము, తప్తరహసము.

(10) 'ప్రతి' అనుదానికి బరముగా సప్తమ్యర్థమున వచ్చు 'ఉరస్' శబ్దముపైఁ గూడ 'అచ్' ప్రత్యయము చేరును: ప్రత్యురసము.

(11) ఓకారాంత గోశబ్దముతోఁ గలిసిన 'అనుగవము' అనుసమాసము 'అచ్' ప్రత్యయాంతమై ఆయామార్థమును బొందుచున్నది.

(12) ద్విః + తావత్ = ఇంతకంటె రెండింతలు; త్రిః + తావత్ = ఇంతకంటె మూఁడింతలు అనునర్థమున 'వేది' శబ్దమునకు విశేషణములై 'ద్విస్తావా, త్రిస్తావా' అనుసమాసము లేర్పడుచున్నవి.

(13) సమాసమున నుపసర్గము పూర్వమందుగల 'అధ్వన్' అను పదము మీఁదను 'అచ్' ప్రత్యయము చేరును: (రథము) ప్రాధ్వము = చాలదూరము పోయినది.

(14) సు, అతి, అను నుపసర్గములు తప్ప పూజార్థముగల పదములు సమాసమునఁ బూర్వపదములుగా నున్నచో నా సమాసములపై సమాసాంత ప్రత్యయములు చేరవు: పరమరాజః (పరమరాజుఁడు), పరమగవః, (పరమగవుఁడు)——వీనిలో సు, అతి, అను నుపసర్గములు లేవు. కాని, సురాజా (సురాజు), అతిరాజా (అతిరాజు); ఇట్లే మహారాజః = మహారాజుఁడు = గొప్పరాజులు గలవాఁడు; మహారాజు = గొప్పరాజు.

(15) 'కిమ్' పూర్వకశబ్దముతోఁ గలిసి నిందార్థమును బొందినసమాసముమీఁదను సమాసాంతప్రత్యయములు చేరవు. కింరాజా, కిం సఖా, కిం గౌః.

(16) రాజన్ మొదలగు పదములకుఁ బూర్వము 'నఞ్' చేరిన సమాసములతుదిని సమాసాంతప్రత్యయములు చేరవు : అరాజా, అసఖా, అధురమ్ (శకటమ్).

(17) నఞ్ పూర్వక పథిన్ శబ్దమువలనఁ గలిగిన తత్పురుషసమాసముపై వైకల్పికముగా సమాసాంతప్రత్యయములు చేరవు: అపథము = చక్కని బాటలులేని దేశము; అపంథ = బాటలు లేకుండుట.

## అలుక్సమాసము.

సమాసమున నుత్తరపదమునకుఁ బూర్వ మీక్రింది సందర్భములందు విభక్తి ప్రత్యయములకు లోపము కలుగదు.

(1) స్తోక మొదలగు పదములమీఁది పంచమికి లోపము లేదు : స్తోకాన్ముక్తుఁడు, అల్పాన్ముక్తుఁడు, అంతికాదాగతుఁడు, అభ్యాశాదాగతుఁడు, దూరాదాగతుఁడు, విప్రకృష్టాదాగతుఁడు, కృచ్ఛ్రాన్ముక్తుఁడు మొదలైనవి. వీనికి 'బ్రాహ్మణాచ్ఛంసి' అను సమాసమును జేర్పవలెను.

(2) ఓజస్, సహస్, అంభస్, తమస్, అను పదములమీఁది తృతీయావిభక్తి లోపింపదు: ఓజసాకృతము, సహసాకృతము, అంభసాకృతము, తమసాకృతము మొదలైనవి. 'అంజస్' శబ్దమునుగూడఁ బైవానికిఁ జేర్పవలెను: అంజసాకృతము—పుంసాగ్రజుఁడు, జనుషాంధుఁడు, అను సమాసములు నిట్టివే.

(3) ఉత్తరపదముచేరి సంజ్ఞావాచకమగునప్పుడు 'మనస్' శబ్దముమీఁది తృతీయావిభక్తిప్రత్యయము లోపింపదు: మనసాగుప్త—సంజ్ఞావాచకము కానప్పుడు: మనోదత్త, మనోగుప్త.

'ఆజ్ఞాయిన్' అను పదమునకుఁ బూర్వమందున్న మనశ్శబ్దముమీఁది తృతీయావిభక్తి ప్రత్యయము లోపింపదు: మనసాజ్ఞాయి.

'ఆత్మన్' శబ్దముమీఁది తృతీయా ప్రత్యయమును లోపింపదు: ఆత్మనా పంచముఁడు = తనతో నయిదుగురు గలవాఁడు. ఇట్లు లోపింపకుండుట పూరణార్థక సంఖ్యావాచకము పరమందున్నప్పుడే యగును: ఆత్మకృతము.

(4) వ్యాకరణమున సంజ్ఞను [illegible] చతుర్థీవిభక్తి ప్రత్యయము లోపింపదు: ఆత్మనేపదము, [illegible]

'పర' అను పదముమీఁదనుండు [illegible] సమాసము నందు చతుర్థీప్రత్యయము లోపింపదు: [illegible]

(5) సమాసము సంజ్ఞావాచకమగునప్పుడు, హలంతశబ్దములమీఁదను, అదంతశబ్దములమీఁదను వచ్చు సప్తమీవిభక్తి ప్రత్యయము లోపింప [illegible] త్వచిసారము.

గవి, యుధి అనువానిపై వచ్చు 'స్థి' [illegible] కారమునకు షకారము వచ్చును: గవిష్ఠిరుఁడు, యుధిష్ఠిరుఁడు, [illegible]

హృద్, దివ్, శబ్దములమీఁది సప్తమీవిభక్తి ప్రత్యయమును లోపింపదు: హృదిస్పృక్కు(-శము), దివిస్పృక్కు(-కము).

(6) తూర్పుదేశపువారియందు ప్రచారమునందున్న పన్నును తెలియఁజేయుచు, హలాదియగు నుత్తరపదమునకు ముందున్న సమాసమునఁ బూర్వపదముమీఁది సప్తమీవిభక్తిప్రత్యయము లోపింపదు: ముకుటేకార్షాపణము; దృషదిమాషము మొదలైనవి.

(7) గురుశబ్దముపరమందుగల మధ్య, అంత, అను పదములమీఁది సప్తమీవిభక్తిప్రత్యయము లోపింపదు: మధ్యేగురుఁడు, అంతేగురుఁడు.

(8) 'కామ' అనునదితప్ప నతికియేపద ముత్తరపదముగానున్నను 'మూర్ధన్,' 'మస్తక' అను పదములుతప్ప తక్కిన దేహావయవములఁ దెలుపు

పదములమీఁది సప్తమీవిభక్తి ప్రత్యయము లోపింపదు: కంఠేకాలుఁడు, ఉరసిలోముఁడు — కాని, మూర్ధశిఖుఁడు, మస్తకశిఖుఁడు; ముఖకాముఁడు.

(9) హలంత, అదంతపదములమీఁది సప్తమీవిభక్తి ప్రత్యయము 'బంధ' అను పదము పరమగునపుడు సమాసమున వైకల్పికముగ లోపించదు: హస్తేబంధము, హస్తబంధము.

(10) తత్పురుష సమాసమున నుత్తరపదము కృదంతమగునపుడు పూర్వపదముమీఁది సప్తమీవిభక్తి ప్రత్యయము వైకల్పికముగ లోపించదు: స్తంబేరమము, కర్ణేజపము.

(11) 'జ' అనునది పరమగునపుడు 'ప్రావృట్, శరత్, కాల, దివ్' అను పదములమీఁది సప్తమీవిభక్తి ప్రత్యయము లోపించదు: ప్రావృషిజము, శరదిజము, కాలేజము, దివిజుఁడు.

వర్ష, క్షర, శర, వర అను పదములపై 'జ' నుండు పూర్వపదములమీఁది సప్తమీవిభక్తి ప్రత్యయము వైకల్పికముగా లోపించదు: వర్షేజము, వర్షజము; క్షరేజము, క్షరజము; శరేజము, శరజము; వరేజము, వరజము

(12) తర(ప్), తమ(ప్), అనునవిగాని, 'కాల' అనునదిగాని, 'తన' అను ప్రత్యయముగాని పరమగుచున్న హలంతమైనట్టిగాని, అదంతమైనట్టికాని కాలవాచకపదములమీఁది సప్తమీవిభక్తి ప్రత్యయము వైకల్పికముగ లోపించదు: పూర్వాహ్ణేతరే(-రః), పూర్వాహ్ణతరే(-రః); పూర్వాహ్ణే (హ్ణ)కాలే; పూర్వాహ్ణే (-హ్ణ) తనే.

(13) శయ, వాస, వాసిన్, అను పదములకుఁ బూర్వమందున్న పదము కాలవాచకముకాక, హలంతముగాని, అదంతముగాని యైనచో దానిమీఁది సప్తమీవిభక్తిప్రత్యయము వైకల్పికముగా లోపించదు: ఖేశయుఁడు, ఖశయుఁడు; గ్రామేవాసము, గ్రామవాసము; గ్రామేవాసి, గ్రామవాసి.

(14) ఇన్ - అంతపదమునకును, 'సిద్ధ' అను పదమునకును, బంధ్ - ధాతువునుండి పుట్టిన పదమునకును బూర్వమందున్న సప్తమీవిభక్తి ప్రత్యయము లోపించును: స్థండిలశాయి, సాంకాశ్యసిద్ధుఁడు, చక్రబంధము.

(15) వ్యావహారిక సంస్కృతభాషలో 'స్థ' కుఁ బూర్వమందున్న సప్తమీవిభక్తిప్రత్యయము లోపించును: సమస్థుఁడు.

(16) సమాసమున నాక్రోశార్థమునఁ బూర్వపదము షష్ఠీప్రత్యయమునకు లోపము గలుగదు: చౌరస్యకులము; - ఆక్రోశార్థము లేనప్పుడు;

బ్రాహ్మణకులము - 'యుక్తి' అను పదము పరమందుగల 'వాక్' శబ్దము మీఁదను, 'దండ' పరకమగు దిశ్ - శబ్దముమీఁదను, 'హర' శబ్దపరకమగు 'పశ్యత్' శబ్దముమీఁదను గూడ షష్ఠీవిభక్తి ప్రత్యయము లోపింపదు: వాచోయుక్తి, దిశోదండము, పశ్యతోహరుఁడు.

ఆముష్యాయణుఁడు, ఆముష్యపుత్త్రిక, ఆముష్యకులిక, దేవానాం ప్రియుఁడు అనువానియందును షష్ఠీప్రత్యయమునకు లోపములేదు.

'దాస' శబ్దము పరముగానున్న 'దివ్' శబ్దముమీఁది షష్ఠీప్రత్యయము లోపింపదు : దివోదాసుఁడు.

(17) నిందార్థమున పుత్త్రశబ్దము పరముగానున్న పదముమీఁది షష్ఠీ ప్రత్యయము వైకల్పికముగా లోపింపదు : దాస్యాఃపుత్త్రుఁడు, దాసీపుత్త్రుఁడు. నిందార్థము లేనప్పుడు : బ్రాహ్మణీపుత్త్రుఁడు.

పుత్త్రశబ్దము పరమగునపుడు ఋదంతమై విద్యాసంబంధమునుగాని, రక్తసంబంధమునుగాని తెలుపు పదముమీఁది షష్ఠీప్రత్యయము లోపింపదు: హోతురంతేవాసి, హోతుఃపుత్త్రుఁడు, పితురంతేవాసి, పితుఃపుత్త్రుఁడు.

(18) స్వసృ, పతిశబ్దములు పరములుగానున్న ఋదంతశబ్దముల షష్ఠీ ప్రత్యయమునకు వైకల్పికముగా లోపముగలుగదు: మాతుఃస్వస, మాతృష్వస ; పితుఃస్వస, పితృష్వస ; దుహితుఃపతి, దుహితృపతి; ననాందుఃపతి, ననాందృపతి.

మాతుర్, పితుర్ శబ్దములకు పరమందున్న స్వసృశబ్దము మొదటి సకారమునకు షకారము వైకల్పికముగా నగును : మాతుఃస్వస, మాతుః ష్వస; పితుః స్వస, పితుఃష్వస.

మాతృ, పితృ శబ్దములకుఁ బరమందున్న స్వసృశబ్దము తొలి సకార మునకు షకారమగును : మాతృష్వస, పితృష్వస - సమాసము కలుగునప్పుడు: మాతుఃస్వసా, పితుఃస్వసా.

## సమాసాశ్రయవిధిప్రకరణము.

(1) తర, తమ, రూప, కల్ప అను ప్రత్యయములకును, చేల (ట్), బ్రువ, గోత్ర, మత, హత అనుపదములకును బూర్వమందు వచ్చు అనేకా క్షరములు కలిగి, సమాస పుంలింగరూపముగల ఙీప్రత్యయాంత స్త్రీలింగ పదము తుది దీర్ఘమునకు హ్రస్వముగలుగును: బ్రాహ్మణితరా, బ్రాహ్మణి తమా, బ్రాహ్మణిరూపా, బ్రాహ్మణికల్పా, బ్రాహ్మణిచేలీ, బ్రాహ్మణిబ్రువా, బ్రాహ్మణిగోత్రా, బ్రాహ్మణిమతా, బ్రాహ్మణిహతా.

(2) నదీసంజ్ఞగల తక్కిన స్త్రీలింగపదముల తుదిదీర్ఘమునకుఁ బై సందర్భములందు హ్రస్వము వైకల్పికముగా నగును. కృదంత నదీవాచకపదముల కీసూత్రము వర్తింపదు.

జీ-ప్రత్యయాంతములు కాని స్త్రీలింగపదములు నదీసంజ్ఞకములు. ఇవికాక ఊకారాంతములై యేకాక్షర పదములకును నీసూత్రము వర్తించును: బ్రహ్మబంధుతరా, బ్రహ్మబంధూతరా; స్త్రితరా, స్త్రీతరా.

కృత్ప్రత్యయముచేరిన పదములుకావున లక్ష్మీ, తంత్రీ పదముల దీర్ఘమునకు హ్రస్వము కలుగదు: లక్ష్మీతరా, తంత్రీతరా.

(3) ఉ, ఋ లు ఇద్వర్ణములుగాఁగల తద్ధిత ప్రత్యయములపైఁ జేరిన స్త్రీ ప్రత్యయమగు 'జీ' (ఈ) అనునది వైకల్పికముగా హ్రస్వమగును. విదుషితరా; హ్రస్వము కలుగనప్పుడు పుంవద్భావము గలిగి 'విద్వత్తరా.'

(4) లేఖ, లాస, అనుపదములకును యత్, అణ్ ప్రత్యయాంత పదములకును బూర్వమందుండు 'హృదయ' శబ్దమునకు 'హృద్' అనునాదేశమగును: హృల్లేఖము. హృల్లాసము, హృద్యము, హార్దము.

శోక, రోగ, అనుపదములుగాని, ష్యఞ్-ప్రత్యయముగాని పరమందు చేరిన హృదయశబ్దమునకు 'హృద్' అనునాదేశమగును. హృచ్ఛోకము, హృదయ - శోకము; హృద్రోగము, హృదయరోగము; సౌహార్ద్యము, సౌహృదయ్యము.

(5) ఆజి, ఆతి, గ, ఉపహతి అనువానికిఁ బూర్వమందు వచ్చు పాద శబ్దమునకు 'పద' అనునాదేశమగును: పదాజి, పదాతి, పదగము. పదోపహతుఁడు.

'దానికి సరిపోయిన' అనువర్థమునందు తప్ప, తక్కిన యర్థములందు వచ్చు యత్ - ప్రత్యయము చేరునప్పుడు 'పాద' శబ్దమునకు 'పద్' అను నాదేశము గలుగును: పాదములను వేధించునవి 'పద్యములు (రాళ్లు); (ఉదకములు) పాదార్థములు.

'హిమ, కాషిన్, హతి' శబ్దముల పూర్వమందున్న పాదశబ్దమునకు 'పద్' అనునదాదేశమగును; పద్ధిమము, పత్కాషి, పద్ధతి.

'శస్' ప్రత్యయముచేరిన పాదశబ్దమునకు ఋగ్వేద మంత్రమర్థమున 'పద్' అనున దాదేశమగును: పాద + శః = పచ్ఛః (గాయత్రీం పచ్ఛః శంసతి).

ఘోష, మిశ్ర, శబ్ద అనుపదములు పరమందున్న పాదశబ్దమునకు 'పద్' అనునదాదేశమగును: పద్ఘోషము, పాదఘోషము; పన్మిశ్రము, పాద మిశ్రము; పచ్ఛబ్దము, పాదశబ్దము.

(6) సమాసము సంజ్ఞావాచక మగునపుడు 'ఉదక' శబ్దమునకు 'ఉద' అనునాదేశము కలుగును: ఉదమేఘుఁడు = ఒకమనుష్యుని సంజ్ఞ.

ఉదకశబ్దము పరమందున్న సమాసముగూడ సంజ్ఞావాచకమగునపుడు 'ఉదక' కు 'ఉద' ఆదేశమగును: క్షీరోదము.

పేషం, వాస, వాహన, ధి, అనునవి పరమందున్న ఉదకశబ్దమునకు 'ఉద' ఆదేశమగును: ఉదపేషముగా నూఱుచున్నాఁడు; ఉదవాసము, ఉదవా హనము, ఉదధి.

నీటిచే నింపఁబడిన వస్తువుపేరు ఒక్కటే పొల్లు ఆదియందుఁగలది పర మగునప్పుడు 'ఉదక' శబ్దమునకు 'ఉద' ఆదేశమగును: ఉదకుంభము, ఉదకకుం భము; ఉదపాత్రము, ఉదకపాత్రము. ఏకహలాది శబ్దము పరమందున్న పుడు: ఉదకస్థాలి.

మంథ, ఓదన, సక్తు, బిందు, వజ్ర, భార, హార, వీవధ, గాహ అను పదములు పరమందున్న 'ఉదక' శబ్దమునకు 'ఉద' అను నాదేశము వైకల్పిక ముగా నగును: ఉద (క) మంథము, ఉదోదనము, ఉదకోదనము, ఉద (క) సక్తు; ఉద (క) బిందువు, ఉద (క) వజ్రము; ఉద (క) భారము, ఉద (క) హారము, ఉద (క) వీవధము, ఉద (క) గాహము.

(7) సమాసమున నుత్తరపదమునకుఁ బూర్వమందుండు ఈ, ఊ, ఋ లకు హ్రస్వము కలుగును; స్త్రీ ప్రత్యయమగు ఙీ (ఈ) అనుదానికి మాత్రము కలుగదు.

గ్రామణి (ణీ) పుత్త్రుఁడు; బ్రహ్మబంధు (-ంధూ) పుత్త్రుఁడు. అవ్య యీభావసమాసములందును, విభక్తులు ఇయఙ్, ఉవఙ్, ఆగమములను బొందు పదములందును ఈ మార్పు గలుగదు : శ్రీమదము, భ్రూభంగము, శుక్లీభావము.

కాని, భ్రూకుంసుఁడు, భ్రుకుంసుఁడు, భ్రూకుటి, భ్రుకుటి, అను రెండేసి రూపములు గలవు.

(8) తద్ధితప్రత్యయము పరమందున్న 'ఏకా' అనుపదము సమా సమునఁ బూర్వపదమైనపుడు దాని తుది దీర్ఘమునకు హ్రస్వము గలుగును : ఏకస్యాః ఆగతమ్ = ఏకరూప్యమ్ (తె.-ము); ఏకస్యాః క్షీరమ్ = ఏకక్షీరమ్ (తె. - ము).

(9) సంజ్ఞావాచకపదములందును, వేదములందును స్త్రీలింగప్రత్యయములగు ఙీ (ఈ), ఆ (ప్), అనువానికి బహులముగా హ్రస్వము వచ్చును: ఆ హ్రస్వము కలుగుటకు: రేవతిపుత్త్రుఁడు. హ్రాస్వము రానందుకు: నాందీకరుఁడు, నాందీఘోషము, నాందీవిశాలము. వేదములో హ్రస్వము కలిగినందుకు: కుమారిదార. వేదములో కలుగనందుకు: ఫాల్గునీ పౌర్ణమాసీ (తె. - సి); జగతీచ్ఛందః (తె. - ము). సంజ్ఞావాచకపదములలో ఆప్ ప్రత్యయము: హ్రస్వము కలుగుటకు; అజక్షీరము, శిలప్రస్థము; కలుగనందుకు: లోమకాగృహము, లోమశాఖండము. వేదములో హ్రస్వము కలుగుటకు: అజక్షీరేణ జుహోతి; కలుగనందుకు: ఊర్ణాసూత్రేణ కవయో వయంతి.

(10) త్వ-ప్రత్యయమునకుఁ బూర్వమందున్న 'ఈ, ఆ' అను స్త్రీ ప్రత్యయములు బహులముగా హ్రస్వములగును: అజ (-జా) త్వము, రోహిణి (-ణీ) త్వము.

(11) చిత, అనుపదము పరముగానున్న 'ఇష్టికా' పదమునందును, 'తూల' అనుపదము పరముగానున్న 'ఇషీకా' పదమునందును, 'భారిన్' అను పదము పరముగానున్న 'మాలా' పదమునందును తుది దీర్ఘమునకు హ్రస్వము గలుగును: ఇష్టకచితము, ఇషీకతూలము, మాలభారిణి (కన్య).

(12) 'కార' అనుపదము పరముగానున్న 'సత్య', 'అగద' అనుపదముపై 'ముమ్' అనునాగమము గలుగును. సత్యంకారము, అగదంకారుఁడు.

'అస్తు'పై 'కార' చేరినను నీయాగమము గలుగును: అస్తుంకారము.

'భవ్య' శబ్దపరకమగు ధేను శబ్దముమీఁదను నీయాగమము కలుగును: ధేనుంభవ్య.

'పృణ' శబ్దపూర్వక 'లోక' శబ్దముమీఁదను నీయాగమము గలుగును: లోకంపృణుఁడు.

'ఇత్య' పదపూర్వక 'అనభ్యాశ' పదముమీఁదను గలుగును: అనభ్యాశమిత్యము.

'ఇంధ' పదపూర్వక 'భ్రాష్ట్ర, అగ్ని' అనుపదములమీఁదను గలుగును: భ్రాష్ట్రమింధుఁడు, అగ్నిమింధుఁడు.

'గిల' శబ్దపూర్వక పదముమీఁదను గలుగును: తిమింగిలము; 'గిల' అనునది పరమైనచోఁ గలుగదు: గిలగిలము.

'గిలగిల' శబ్దపూర్వక పదముమీఁదను 'ముమ్' ఆగమమగును: తిమింగిలగిలము.

'కరణ' శబ్దపూర్వకములగు 'ఉష్ణ, భద్ర,' అనుపదముల మీఁదను గలుగును : ఉష్ణంకరణము, భద్రంకరణము.

కృదంత పదపూర్వక 'రాత్రి' శబ్దముమీఁద నీయాగమము వైకల్పికముగఁ గలుగును : రాత్రి (ం) చరుఁడు, రాత్రిమటుఁడు, రాత్ర్యటుఁడు; కాని, రాత్రింమన్యుఁడు; - రాత్రిమన్యుఁడు అనికాదు.

(13) సమాసము సంజ్ఞావాచక మగునపుడు పూర్వపదమగు 'సహ' కు 'స' ఆదేశ మగును : సపలాశము.

'గ్రంథము తుదివఱకు, ఎక్కువ' అను నర్థముగల సమాసమునఁ బూర్వపదమగు 'సహ' కు 'స' ఆదేశమగును : జ్యోతిషము సకలము నభ్యసించెను (కలాంతమువఱకు); సముహూర్తము జ్యోతిషమును చదివెను (ముహూర్తభాగము తుదివఱకు); వ్యాకరణమును ససంగ్రహము చదివెను ('సంగ్రహము' అనుభాగము తుదివఱకు). 'ఎక్కువ' అనునర్థమున : 'సద్రోణముఖారి' (ద్రోణముకొలత యెక్కువయగు 'ఖారి' యను కొలత); సమాషము కార్షాపణము (మాష మెక్కువయైన కార్షాపణమను నాణెము).

రెండుపదములు సాధారణముగఁగలిసి ప్రయోగింపఁ బడునపుడం దొకటి ప్రత్యక్షముగఁ గనఁబడి, రెండవది మొదటి దానివలనఁ దెలిసికొనఁ దగిన దయినపుడు, మొదటిదాని కుపాఖ్యమనియు, రెండవదానికి అనుపాఖ్యమనియుఁ బేర్లు. మొదటిదానివలన రెండవదానిని దెలిసికొనవలసినప్పుడు మొదటిదానికిఁ బూర్వమందుండు 'సహ' అనుదానికి 'స' ఆదేశమగును.

సాగ్ని .(కపోతము), అనఁగా నెక్కడనో మంటగలదని సూచించు పావురము ; సపిశాచ (వాత్య), అనఁగా పిశాచములుగలవని సూచించుగాలి ; సరాక్షసీక (నిశ), అనఁగా రాక్షసులు సంచరించుచున్నారని తెలుపు రాత్రి.

(14) జ్యోతిస్, జనపద, రాత్రి, నాభి, నామస్, గోత్ర, రూప, స్థాన, వర్ణ, వయస్, వచన, బంధు, అను పదములకుఁ బూర్వమందుండు 'సమాన' అనుపదమునకు 'స' అనున దాదేశమగును : సనామ=సమానమగు పేరుగలది మొదలయినవి.

'సమాన వేదచరణముల నభ్యసించువారు' అను నర్థమున 'సమాన' అను పదముపై 'బ్రహ్మచారిన్' అనుపదము చేరునపుడు 'సమాన' కు 'స' ఆదేశమగును : సబ్రహ్మచారి.

'తీర్థ' శబ్దముపై యత్ - ప్రత్యయము చేరునపుడు దానికిఁ బూర్వమందున్న 'సమాన' అనుపదమునకు 'స' అను నాదేశమగును : సతీర్థ్యుఁడు = ఒక్క గురువునొద్ద తనతో సమానముగాఁ జదువుకొనువాఁడు.

యత్ - ప్రత్యయము పరమందుగల 'ఉదర' శబ్దమునకుఁ బూర్వమం దున్న 'సమాన' అనుపదమునకు 'స' అను నాదేశము వైకల్పికముగా నగును : సోదర్యుఁడు, సమానోదర్యుఁడు.

దృక్, దృశ్, దృక్ష అను పదములకుఁ బూర్వమందున్న 'సమాన' అను పదమునకును 'స' ఆదేశమగును : సదృక్కు, సదృశుఁడు, సదృక్షుఁడు.

(15) దృక్, దృశ్, దృక్ష అను పదములు పరములగునపుడు 'ఇదమ్' పదమునకు 'ఈ' అనునదియు, 'కిమ్' పదమునకు 'కీ' అనియు నాదేశము లగును : ఈదృక్కు, ఈదృశము, ఈదృశుఁడు ; కీదృక్కు, కీదృశము, కీదృశుఁడు. కీదృక్షము, కీదృక్షుఁడు.

(16) సమాసమున నంగులి శబ్దమునకుఁ బరమగు 'సంగ' శబ్దములోని సకారమునకు షకార మాదేశమగును : అంగులిషంగము.

సమాసమున భీరుపదము పూర్వమందున్న స్థానశబ్దమందలి సకారము నకు షకార మాదేశమగును : భీరుష్ఠానము.

జ్యోతిస్, ఆయుస్, అను పదములకు సమాసమునఁ బరముగానున్న 'స్తోమ' శబ్దమునందలి సకారమునకు షకార మాదేశమగును : జ్యోతిష్టో మము, ఆయుష్టోమము.

సుషామము, నిఃషామము, దుఃషామము ; సుషేధము, నిషేధము (నిఃషేధము); దుఃషేధము, సుషంధి, నిఃషంధి (నిషంధి), దుఃషంధి ; సుష్ఠు, దుష్టు (దుష్ఠు), గౌరిషక్థుఁడు (సంజ్ఞావాచకము), ప్రతిష్ణిక, జనాషాహము, నాషేచనము, (నౌషేవనము), దుందుభిషేవణము, (దుందుభిషేచనము, దుందుభిషేవనము), హరిషేణుఁడు, నక్షత్రషే (- సే) నుఁడు, రోహిణీ షేణుఁడు. ఇట్టి పదములయందు సకారస్థానమున షకారము వచ్చినది.

సంజ్ఞావాచకసమాసమున పదము తొలి సకారమువై 'ఏ' యను నచ్చుచేరి దానికిఁ బూర్వమున ఇ, ఉ, ఋ, లు గాని, క, ఖ, గ, ఘ, ఙ లు గాని యున్నచో సకారమునకు షకార మాదేశమగును : హరిషేణుఁడు, పరి షేణుఁడు, వారిషేణుఁడు, జానుషేణి.

పై సందర్భములందు గలుగు సమాసము నక్షత్ర సంజ్ఞావాచకమైనచో సకారమునకు షకారము వైకల్పికముగా నగును : రోహిణీషేణుఁడు, రోహిణీ సేనుఁడు.

(17) ఆశిస్, ఆశా, ఆస్థా, ఆస్థిత, ఉత్సుక, ఊతి, కారక, రాగ అను పదములును, 'ఛ' = ఈయ అను ప్రత్యయ మంతమందుగల పదములును షష్ఠీవిభక్తియందులేని 'అన్య' అనుపదమునకుఁ బరమందున్నపు డాపద

మున్పై 'దుక్' (= ద్) అను నాగమము గలుగును: అన్యదాశీస్సు, అన్యదాశ, అన్యదాస్థ, అన్యదుత్సుకుఁడు, అన్యదూతి, అన్యత్కారకము, అన్యద్రాగము, అన్యదీయము మొదలయినవి. షష్ఠ్యర్థమున అన్యాశ, అన్యాస్థ మొదలయినవి.

అర్థశబ్దము పరమందున్న 'అన్య' అనుపదము షష్ఠ్యర్థమున లేనప్పుడు దుగాగమము వైకల్పికముగా నగును: అన్యదర్థము, అన్యార్థము.

(18) తత్పురుషసమాసమున అజంతపదము పరమందుగల 'కు' అనుదానికి 'కత్' అనునదాదేశమగును: కు + అశ్వము = కదశ్వము; కు + అన్నము = కదన్నము. 'త్రయ' అనుపదము పరమందున్నను 'కు' కు 'కత్' ఆదేశమగును: కత్త్రయము.

'రథ, వద' అనుపదములకుఁ బూర్వమందున్న 'కు' కును 'కత్' ఆదేశమగును'—కద్రథము, కద్వదము.

జాతివాచకమగు 'తృణ' శబ్దము పరమందున్నను 'కు' కు 'కత్' ఆదేశమగును: కత్తృణము.

పథిన్, అక్ష, శబ్దములు పరమందున్నచోఁ, 'కు' కు 'కా' ఆదేశమగును: కాపథము, కాక్షము - రెండవపదము 'అక్ష' అనునదైనచోఁ దత్పురుషసమాసమును, 'అక్షి' యైనచోఁ బహువ్రీహిసమాసము నగును.

'కొంచెము' అను నర్థమున సమాసమునఁ బూర్వపదముగానున్న 'కు'కు 'కా' అనున దాదేశమగును: కామధురము, కాలవణము, కామ్లము, కాజలము.

'పురుష' శబ్దము పరమగునపు డీ యాదేశము వైకల్పికముగా నగును: కాపురుషుఁడు, కుపురుషుఁడు.

'ఉష్ణ' శబ్దము పరమగునపుడు 'కవ' అను నాదేశము కూడఁ గలుగును: కవోష్ణము, కోష్ణము.

'పృషోదర' మొదలగుపదములందు లోపాగమాదేశాదులు పూర్వఋషుల యుపదేశానుసారముగ సాధువులగును:—పృషత్తు ఉదరముగాఁ గలది 'పృషోదరము'; వారివాహకము = వలాహకము; జీవనముయొక్క మూతము 'జీమూతము'; శవముల శయనము 'శ్మశానము'; దేనికి 'ఖము' ఊర్ధ్వమో అది 'ఉలూఖలము'; 'పేశిని తినునది పిశాచము': 'మహిమీఁద ధ్వనించునది మయూరము':—'హంస' శబ్దమున వర్ణాగమము (హన్ ధాతువుపై అచ్ ప్రత్యయముచేరి 'సక్' అను నాగమము వచ్చినది; సింహశబ్దమున వర్ణవ్యత్యయము (హింసించునది సింహము), 'గూఢోత్మా' అనుదానియందు వర్ణాదేశము; 'పృషోదర' శబ్దమునకు వర్ణలోపము కలిగినది.

దిగ్వాచకపదముపైఁ జేరిన 'తీర' శబ్దము 'తారం' అనియగును: దక్షిణతీరము. దక్షిణతారము; ఉత్తరతీరము, ఉత్తరతారము.

'దాశ, నాశ, దభ, ధ్యై' అనునవి 'దుర్' అను నుపసర్గముపైఁ బరమగునపుడు దాని తుదిరేఫము 'ఉ' గా మాఱును; ఆ పదముల తొలి వర్ణములు మూర్ధన్యములుగా మాఱును: దూడాశము, దూణాశము, దూడభము, దూఢయము.

(19) వి, అష్టన్, పంచన్, మణి, భిన్న, ఛిన్న, ఛిద్ర, స్రువ, స్వస్తిక, అనునవి తప్ప మఱి యేపదముమీఁదనైనను 'కర్ణ' శబ్దముచేరి పశువుల స్వామిత్వమునకు గుఱుతును తెలియఁజేయు నప్పు డా పదములతుది యచ్చునకు దీర్ఘమగును: ద్విగుణాకర్ణము మొదలయినవి, పశువుల స్వామిత్వము గుఱుతు కానప్పుడు 'శోభనకర్ణము'; ఇట్లే, వికర్ణము, అష్టకర్ణము, పంచకర్ణము, మునికర్ణము, భిన్నకర్ణము, ఛిన్నకర్ణము, ఛిద్రకర్ణము, స్రువకర్ణము, స్వస్తికకర్ణము.

నహ్, వృత్, వృష్, వ్యధ్, రుచ్, సహ్, తన్ అనుధాతువులపై 'క్వి' ప్రత్యయము చేరినప్పుడు వానికిఁ బూర్వమందున్న యచ్చునకు దీర్ఘము గలుగును: ఉపానహము, పరీణహము, నీవృతము, ఉపావృతము, ప్రావృట్టు, ఉపావృట్టు, మర్మావిత్తు, హృదయావిత్తు, శ్వావిత్తు, నీరుక్కు, అభీరుక్కు, ఋతీషట్టు, తరీతట్టు మొదలయినవి.

'కోటర' మొదలగు పదములపై 'వన' అనుపదము చేరునప్పుడును, 'కింశులక' మొదలగు పదములపై 'గిరి' అనుపదము చేరునప్పుడును సంజ్ఞావాచకము లేర్పడినచో కోటర కింశులకాది పదముల తుదియచ్చునకు దీర్ఘము కలుగును: కోటరావణము మిశ్రకావణము, సిధ్రకావణము, సారకావణము, పురగావణము; వీనిలో 'వన' శబ్దమందలి 'న' 'ణ' ఐయినది. కింశులకాగిరి, సాల్వకాగిరి, నడాగిరి, అంజనాగిరి, భంజనాగిరి, లోహితాగిరి, కుక్కుటాగిరి.

'వల' ప్రత్యయపూర్వమగు పదము తుది యచ్చునకును దీర్ఘము కలుగును: కృషీవలుఁడు.

రెంటికంటె నెక్కువ వర్ణములు గల పదముపై మతుప్ప్రత్యయముచేరి సంజ్ఞావాచక మేర్పడునపుడు దాని తుదియచ్చునకు దీర్ఘము వచ్చును, అమరావతి - అజిర, ఖదిర, పులిన, హంస, కారండవ (హంసకారండవ): చక్రవాక, అనుపదములపై మతుప్ప్రత్యయము చేరునప్పు డీ కార్యము కలుగదు: అజిరవతి, ఖదిరవతి మొదలయినవి.

శర, వంశ, ధూమ, అహి, కపి, మణి, ముని, శుచి, హను, అనుపద ములవై మతుప్-ప్రత్యయముచేరి సంజ్ఞావాచకమగునప్పుడును వాని తుది యచ్చునకు దీర్ఘము కలుగును: శరావతి, వంశావతి మొదలయినవి.

'వీలు' శబ్దమునందు తప్ప 'ఇ, ఉ' లంతమందుగల పదములకు 'వహ' అనుపదము పరమగునపుడు వాని తుదియచ్చునకు దీర్ఘము కలుగును:—

ఋషీవహము, కపీవహము, మునీవహము మొదలయినవి. 'వీలు' పదమునకే కాక మఱికొన్ని పదములందు నీ దీర్ఘము కలుగదు: దారువహము.

'ఘఞ్' అను కృత్ప్రత్యయమందుగల పదమునకుఁ బూర్వమందున్న యుపసర్గము తుదియచ్చునకు దీర్ఘము బహుళముగాఁ గలుగును : సమాసము మనుష్యవాచకమగుచో నీ కార్యము గలుగదు : పరీపాకము, పరిపాకము; ఇచట వైకల్పికము—ప్రసేచము, ప్రసారము; ఇచట కలుగదు. ప్రాసాదము, ప్రాకారము. స్థలవాచకము లగునపుడు వీనియందు నిత్యము. 'వేశ' మొద లగు పదములు పరమందున్నచో దీర్ఘము వైకల్పికము: ప్రతి(తీ)వేశము, ప్రతి(తీ)రోధము మొదలగునవి. మనుష్యవాచకమగునపుడు 'నిషాదుఁడు'-కాని, 'ప్రతీహారుఁడు' అనురూపము సాధువే.

'కాశ' అనుపదము పరమయినపుడు ఇ, ఉ, లతో నంతమగు నుపసర్గము తుదియచ్చునకు దీర్ఘము కలుగును: నీకాశము, నీకాశము.

సంజ్ఞావాచకమగు సమాసమునఁ బూర్వపదమగు 'అష్టన్' లోని తుది వర్ణమునకు దీర్ఘాచ్చు ఆదేశమగును: అష్టాపదము.

కప్ ప్రత్యయముచేరిన 'చితి' శబ్దము తుదియచ్చునకు దీర్ఘము కలు గును: ఏకచితీకుఁడు.

సమాసము సంజ్ఞావాచకమగునపుడు 'నర' శబ్దము పరమందున్న 'విశ్వ' అనుపదము తుదియచ్చునకు దీర్ఘము కలుగును : విశ్వానరుఁడు.

సమాసము ఋషిసంజ్ఞావాచకమగునపుడు మిత్రశబ్దము పరమం దున్న 'విశ్వ' అనుపదము తుదియచ్చునకు దీర్ఘము కలుగును: విశ్వామిత్రుఁడు.

(20) సమాసము సంజ్ఞావాచకము కాకున్నను 'ప్ర, నిర్, అంతర్, శర, ఇక్షు, ప్లక్ష, ఆమ్ర, కార్ష్య, ఖదిర, పీయూక్షా' అనుపదములు పూర్వ మందుగల 'వన' అనుపదములోని 'న' కు 'ణ' ఆదేశమగును: ప్రవణము, నిర్వణము, అంతర్వణము, శరవణము, ఇక్షువణము, ప్లక్షవణము, ఆమ్రవణము, ఖదిరవణము, పీయూక్షావణము.

సమాసము ఓషధి, వనస్పతివాచకమై పూర్వపదమున నకారమును ణకారముగా మార్పఁగల వర్ణమున్నప్పు డుత్తరపదమగు 'వన' అనుపదము

లోని 'న'కారమునకు 'ణ'కారము వైకల్పికముగా నగును: దూర్వావణము, దూర్వావనము; శిరీషవణము, శిరీషవనము. 'ఇరికా' మొదలగు పదముల మీఁది వనశబ్దమున నీ మార్పు గలుగదు: ఇరికావనము, మిరికావనము. పూర్వపదము ద్వ్యక్షర త్ర్యక్షరపదమగునపుడే యీ మార్పు కలుగును. కావున, 'దేవదారువనము' అనుసమాసమున 'న' కు 'ణ' రాలేదు.

పూర్వపదమునందు 'న' ను 'ణ'గా మార్పఁగల వర్ణముండి అది మోయఁబడువస్తువు పేరైనపుడు పరమందువచ్చిన 'వాహన' శబ్దమందలి నకారమునకు ణకారమగును: ఇక్షువాహణము. కాని, ఇంద్రవాహనము అను సమాసమునకు ఇంద్రునికి సంబంధించిన వాహనము అనునర్థము గావున 'న'కారము ణకారముగ మాఱలేదు.

సమాసమునకు దేశము, జనులు, అనునర్థముండి, యందలిపూర్వపదము నందు నకారమును ణకారముగ మార్పఁగల వర్ణముండనేని, పరపదముగా వచ్చిన 'పాన' అనుపదమందలి నకారమునకు ణకారము వచ్చును: ఉశీనరులు-క్షీరపాణులు; ప్రాచ్యులు సురాపాణులు.

సమాసమునకు భావకరణార్థము లున్నప్పుడు పై సందర్భములందు, 'పాన' శబ్దములోని నకారమునకు ణకారము వైకల్పికముగా నగును: క్షీరపాణము-క్షీరపానము = పాలు త్రాగుట; క్షీరపాణము, క్షీరపానము = పాలు త్రాగు పాత్రము.

గిరినదీ, చక్రనితంబా, మొదలగు సమాసములందీ మార్పు వైకల్పికముగ నగును: గిరినది, గిరిణది; చక్రనితంబ, చక్రణితంబ మొదలయినవి.

(21) గోవుయొక్క పాదము 'గోపదము'; గోవులు సంచరించు స్థలము 'గోష్పదము'; గోవులు నంచరింపని స్థలము 'అగోష్పదము'; గోవుపాదమంత భూమి 'గోష్పదము.'

'ఆ + పదము' అనునప్పుడు 'స్థానము, ప్రతిష్ఠ' అను నర్థములందు 'ఆస్పదము' అని సమాసమగును: 'పదమువఱకు' అనునర్థమున 'ఆపదము' అగును.

(22) 'ఆ+చ్చర్యము' అనునపుడు 'వింత' అనునర్థమున 'ఆశ్చర్యము' అగును; ఈ యర్థములేనప్పుడు 'ఆచర్యము' అగును.

(23) 'అవ+కర' అనునది 'అవస్కరము' అయి 'అన్నమలము' అను నర్థమును పొందును. 'ముష్టి' అనునర్థమునను 'అవస్కరము' అని యగును, ఈ యర్థము లేనప్పుడు 'అవకరము' అని యగును.

వి + కిరము = విష్కిరము, లేక వికిరము (ఒకవిధమగు పక్షి); ప్రతి + కశుఁడు = ప్రతిష్కశుఁడు; ప్రతికశము = (కొరడా)తో తోలఁబడునది (గుఱ్ఱము).

ప్ర + కణ్వుఁడు, హరి + చంద్రుఁడు అనునవి ఋషివాచకము లగునపుడు 'ప్రస్కణ్వుఁడు, హరిశ్చంద్రుఁడు' అను రూపములను బొందును. ఋషివాచకములు కానప్పుడు 'ప్రకణ్వుఁడు, హరిచంద్రుఁడు.'

మస్కరమనఁగా వెదురు; మస్కరి యనఁగా భిక్షువు; 'మకర' మనఁగా మొసలి; మకరి = మకరములు గలది (సముద్రము).

కాస్తీరము, అజస్తుందము, అనునవి దేశములు; కాతీరము = చిన్న తీరముగల ప్రదేశము; అజతుందము = అజమునకువలె తుందము గలది.

కారస్కర మనున దొకవృక్షము, వృక్షార్థము లేనపుడు 'కారకరము.' పారస్కర (దేశము), కారస్కర (వృక్షము), రథస్యా (నది), కిష్కు (ప్రమాణము), కిష్కింధా (గుహ), తస్కరుఁడు = చోరుఁడు; బృహస్పతి=ఒక దేవత; ప్రాయశ్చిత్తి, ప్రాయశ్చిత్తము, వనస్పతి—ఇట్టి సమాసములందును 'సుట్' అను నాగమము గలుగుచున్నది:—

## ప్రాకృతభాషలలో సమాస విధానము.

ఇట్లు పాణిని తెలిపిన సమాస విధానమునకును ప్రాకృత గ్రంథముల యందు కనఁబడుదానికిని గొన్ని భేదములు కానవచ్చుచున్నవి. ప్రాకృత భాషలు కొన్ని పాణినీయ సంప్రదాయము నవలంబింపక పోవుట దీనికిఁ గారణమై యుండును. లేదా, తొల్లింటి పాణినీయ సంప్రదాయము రానురాను ప్రాకృత భాషలలో మార్పుచెందియుండవచ్చును. ఇట్టి మార్పుల కుదాహరణము లీ క్రింద చూపఁబడినవి.—

మాహారాష్ట్రి : ధవల కఓఅ వీఅ = సం. కృతధవలోపవీత (గఉడవహో, 1); కాసర విరల కుముఅ = సం. విరల కుముదకాసారాః (గఉడవహో 27); విరహ కరవత్త దూసహ ఫాలిజ్జంతమ్మి = సం దుస్సహ విరహ కరపత్ర స్ఫాల్యమానే (హాలుని సత్తశతి, 153); దరలంబి గొచ్ఛ కఇకచ్ఛు సచ్ఛహం = సం. దరలంబి కపికచ్ఛు గుచ్ఛ సదృశమ్ (హాలుని సత్తశతి 538); ముహల ఘణ పఅ విజ్జంతఅం = సం. ముఖరఘన పీయమాన పయసమ్ (సేతుబంధము II. 24); సంఖోహువ్వత్త ణింత రఅణ మఊహం = సం. సంక్షోభోద్వృత్త రత్న నిర్యన్మయూఖమ్ (సేతుబంధము V. 40); పచ్ఛన్నపలాస = సం. పలాశ ప్రచ్ఛన్న (ఆయారంగసుత్త I. 6; I. 2.); కఅణిజ్ఝర దసదిసం = నిర్ఝరీకృత దశదిశమ్ (సేతుబంధము VIII. 27).

అర్ధమాగధి: లోహాగర ధమ్మమాణ ధమగమేంత ఘోసం = సం. ధ్మాయమాన లోహాకర ధమధమాయమాన ఘోషమ్(ఉవాసగదసాఓ * 108); తడివిమల - సరిస = సం. విమలతటి త్సదృశ (కప్పసుత్త I. 35); ఉడువఈ పడిపుణ్ణఅ సోమవయణే = సం. ప్రతిపూర్ణోడుపతి సౌమ్యవదనః (ఓవవఇయ సుత్త పు. 29. 18.)

సమాసములందలి యిట్టి వ్యత్యాసము లాధునిక ప్రాకృతభాషల యందును గాన్పించుచున్నది. వ్యావహారిక భాషలయందలి యీ సమాసముల వ్యత్యాసము గ్రాంథికభాషలయందును గలిగియుండవచ్చును. తెనుఁగు కవులును సమాసములం దిట్టి వ్యత్యాసములను జేసిరి. కాని సమాసముల విషయమున గ్రాంథికభాషలకును వ్యావహారిక భాషలకును ముఖ్యమగు భేదమొకటి కలదు. తొల్లింటి సంస్కృతకావ్యములందు దీర్ఘసమాసములు లేవు; రెండు మూఁడు పదములకంటె నెక్కువ చేరి యేర్పడిన సంస్కృతసమాసములు భాస కాళిదాసాదుల గ్రంథములందు కాన్పించవు. దీర్ఘసమాసకల్పనమునకు బాణుని కాదంబరి కారణమై యుండును. ఆరభటీవృత్తియందును, గౌడరీతి యందును నిట్టి దీర్ఘసమాసములు కావలసియుండునని లాక్షణికులు తలంప సాగిరి. ఈ యాచార మన్నియెడలను వ్యాపించెను. ప్రాకృత కావ్యములందును దీర్ఘసమాసములు కల్పింపఁబడసాగెను. ఈ సంప్రదాయ మాధునిక ప్రాకృతకావ్యములందును గానవచ్చుచున్నది. కాని, యిది ద్రావిడభాషలయందుఁ ముఖ్యముగా నాంధ్ర కర్నాటక భాషలయందు తొలుతనుండియు సంపూర్ణముగ సంక్రమించినది. ఆంధ్ర కర్నాట భాషలయం దీ సంస్కృతమందలి యర్వాచీన సంప్రదాయము ప్రబలినది. తెనుఁగున నన్నయ భారతము నారంభించుచు——

"హరిహర హిరణ్యగర్భ పద్మావాణీపతుల స్తుతియించి తత్ప్రసాద సమాసాదిత నిత్య ప్రవర్ధమాన మహామహీరాజ్య విభవుండును, నిజభుజవిక్రమ విజితారాతి రాజనివహుండును, నఖిల జగజ్జేగీయమాన నానా గుణరత్న రత్నాకరుండును...అన్యరాజ తేజో జయశాలి శౌర్యుండు, విశుద్ధ యశశ్శరదిందు చంద్రికాలంకృత సర్వలోకుఁడపరాజిత భూరి భుజాకృపాణ ధారాజలక్షాంత శాత్రవ పరాగుఁడు ..ఘనమురితానుబంధ కలికాలజ దోష తుషార సంహారిం. (దప్పఁగఁ జేసి)...రాజ్యసంతత నితాంత విభూతిని...ధర్మ దయార్ద్రనిబద్ధ బుద్ధియై... అఖిల జలధివేలా వలయిత వసుమతీ వనితా విభూషణంబయిన...రాజమహేంద్రపురంబునందు...మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానానంత సామంత విలాసినీ పరివృతుండయి...జననుత కృష్ణ ద్వైపాయనముని వృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థము...(తెనుగున రచియింపుమన)...దుర్గమార్థ జలగౌరవ భారత భారతీ సముద్రముఁ దరియంగ...నేరఁబోలు నే...(అయినను...రచియించెదనని)...హరిహరాజ గజానన కార్త్తికేయ దాక్షాయణీ సరస్వతీ గిరిసుతాదిక దేవతాతతికి (న్నమస్కృతి సేసి)...సంయమ

94

వివేక సౌరభ విభాసిత సద్గుణపుంజ వారిజోత్కర రుచిరంబులై...మహా మనోహర సుచరిత్ర పావన యశఃపరిపూర్ణములైన సత్సభాంతర సరసీవనంబుల...గొనియాడి...భారత సంహితా రచన బంధురుఁ" డయ్యెను.

నన్నయ తాను రచించిన గ్రంథమునంతటిని సంస్కృతపద భూయిష్ఠముగను సంస్కృత సమాస భూయిష్ఠముగను జేసినాఁడు. అతఁడు గ్రంథము నెట్లారంభించెనో దాని రచనమునుండి విరమించునప్పుడు నట్టి బిగితోడనే వదలిపెట్టెను. చూడుఁడు—

"శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారక హారపంక్తులం
జారుతరంబు లయ్యె, వికసన్నవ కైరవ గంధ బంధురో
దార సమీర సౌరభముఁ దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండురుచి పూరములం బరిపూరితంబులై."

నన్నయ విడిచిన భాగము నెత్తికొని యెఱ్ఱాప్రగడయు (అతఁడే యరణ్య పర్వశేషమును బూరించిన వాఁడైనచో) నట్టి బిగితోడనే యారంభించినాఁడు. చూడుఁడు—

స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్త నీరదా
వరణములై దళత్కమలవైభవ జృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతర హంససారస మధువ్రత నిస్వనముల్ చెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్.

అతి గాంభీర్యవిభూతి నేచు లుకాహంకార నిశ్శేషశో
షితపాథోధి పయస్కుఁడైన ముని దోఁచెం బుణ్యతేజోమయా
కృతి నయ్యామ్యదిగంతవీథిఁ బ్రకటక్రీడాకళాగర్వ ఖ
ర్జిత మందూక కళంకితాంబుశుచితాసిద్ధి ప్రదాయుఁడై."

ఈ ధోరణి యెఱ్ఱాప్రెగడ యితర గ్రంథములందును గాన్పించుచున్నది. తిక్కనయు భారతాంధ్రీకరణారంభమున నీ సమాసరచనావేశమునకు లోఁబడెను.

"తత్ప్రసాదాసాదిత కవిత్వ తత్త్వ నిరతిశయానుభవానంద భరితాంతఃకరణుండ నగుచుండి"-అని యెత్తుకొనెనుగాని వెంటనే మేల్కొనెనో యనునట్లు తనకు సహజమగు తెనుఁగుధోరణి నవలంబించెను. నన్నయభారతమునఁ దెనుఁగు రచన యెచ్చటనయినఁ గాన్పించినచో హాయి యనిపించును; అట్లే, సహజమధుర దేశి రచనాబంధురమగు తిక్కన భారతమున నచ్చటచ్చట సంస్కృత రచనచేరి సంతోషపారవశ్యమును జేకూర్చుచుండును. నన్నయ రచనయందు సంస్కృతపు డొంకలతో నిబిడమైనయడవిమధ్యమున తెనుఁగు

లతాగృహమొకటి కాన్పించుచుండును; తిక్కన రచనయందు తెనుఁగు చంద్రికాపూరము లోకొక్క సంస్కృత స్ఫటికశిలపైఁ బ్రతిఫలించి వింత కాంతుల నీనుచుండును.

పోతన భాగవతరచనయందు సంస్కృత వ్యామోహము కాన్పించుచుండునుగాని, దీర్ఘసంస్కృత సమాసము లరుదుగనే యున్నవి. అనుప్రాస రచనావేశసందర్భమున పోతన దీర్ఘసమాసరచనాలోలుఁ డగుచుండును:

"వాలినభక్తి మ్రొక్కెద నవారిత తాండవ కేళికిన్ దయా
ళాలికి శూలికిన్ శిఖరిజాముఖ పద్మమయూఖ మాలికిన్
బాలశశాంక మౌళికిఁ గపాలికి మన్మథగర్వ పర్వతో
న్మూలికి నారదాది మునిముఖ్య మనస్సరసీరుహాళికిన్." భాగ. I. 2.

భక్త్యావేశము గలిగినప్పుడును బోతన దీర్ఘసమాస రచనముచేఁ దన యుత్కంఠను దీర్చికొనును.—

"పరగోవింద కథా సుధారస మహావర్షోక్తి ధారా పరం
పరలంగాక బుధేంద్రచంద్ర యితరోపాయానురక్తిం బ్రవి
స్తర దుర్దాంత దురంత దుస్సహ జనుస్సంభావితానేక దు
స్తర గంభీర కఠోర కల్మష కనద్దావానలం బాఱునే." భాగ. I. 49.

వర్ణనభాగము వచ్చినప్పుడు, ముఖ్యముగా గద్యము నట్టియెడల వ్రాయునపుడు పోతనకు దీర్ఘసమాసములు ప్రియములై యుండును.—

"భుజగేంద్ర పాలితం బయిన భోగవతీ నగరంబు చందంబున స్వసమాన బల యదుభోజ దశార్హ కుకు రాంధక వృష్ణి వీరపాలితంబును, సకలకాల సంపద్యమానాంకుర పల్లవ కోరక కుట్మల కుసుమ ఫల మంజరీపుంజ భార వినమిత లతాపాదపరాజీ విరాజితోద్యాన మహోపవనారామ లాలితంబును, వనాంతరాళ రసాలసాల శాఖాంకురఖాదన తుణ్ణ కషాయ కంఠ కలకంఠ మిథున కోలాహల ఫలరసాస్వాద పరిపూర్ణ శారికా కీరకుల కలకల కహ్లార పుష్ప మకరందపాన పరవశ భృంగ భృంగీ కదంబ ఝుంకార సరోవర కనకకమల మృదుల కాండ ఖండ స్వీకార మత్త వరటాయత్త కలహంసనివహ క్రేంకార సహితంబును..."
భాగ. I. 255.

వేళ్ల గుత్తడములు వ్రాయవలసివచ్చునపుడు పోతన కందపద్యములలో వాని నేకసమాసముగ ముగించును.

"అతులితమాల మహీజ। ప్రతతి తుహిన జాతజలద పరికంకాంగి
కృత తాండవ ఖేలన విల। సిత పింఛవిభాసి బాలశిఖి సేవ్యంబై;
కారండవ జలకుక్కుట। సారస బక చక్రవాక షట్పద హంసాం
భోరుహ కైరవ వనక। హ్లార విరాజిత సరోరుహాకరయుతమై;

కరి పుండరీక వృక కా। సర శశ భల్లూక హరిణ చమరీ హరి సూ
కర ఖడ్గ గవయ వలిముఖ। శరభ ప్రముఖోగ్ర వన్య సత్త్వాశ్రయమై.

భాగ. III. 769—771.

శ్రీనాథుఁడు విద్వత్కవి; సంస్కృత విద్వత్కవి; తెనుఁగు నుడికారమును స్వవశము చేసికొన్నవాఁడు. అతని కవితయం దచ్చటచ్చట, నుచిత స్థలములందు, దీర్ఘసమాసములు ప్రవహించుట వింతగాదు.

"కింతుర్వాణ పురందరాదిక మహాగీర్వాణ కోటీ కిరీ
టాంక స్థాపిత నూత్నరత్న రుచిధారాశ్లేష కిమ్మీరప
త్పంకేజుండు హరుండు జంతువులకుం బ్రాణాంతకాలంబునం
దోంకారాక్షర మంత్రరాజముఁ జెవిన్ యోజించుఁ గాశీస్థలిన్." కాశీ. III. 95.

"అదెమాస్వామి సుధారసోద్భవుఁడు దక్షారామభీమేశుఁ డ
భ్యుదయంబొంది ప్రతిష్ఠ గైకొనెడు నంభోరాశి తీరంబునం
బదమా షట్పదమాలికా కలితసత్పాథోధునీ సంపదా
స్పద నానా సలిల ప్రవాహాలహరీ సంభార గోదావరీ." భీమ. III. 47.

కృష్ణదేవరాయల యాముక్తమాల్యదయందు దీర్ఘసమాసము లనేకము లున్నను వానియందు మార్దవము తక్కువ. సాధారణముగఁ దెనుఁగు కవు లందఱకును దీర్ఘసమాసఘటనమునందు ప్రీతిమెండే కాని, దాని నొక కళగా దిద్ది తీర్చినవాఁడు రామరాజభూషణుఁడు.

"పవమాన మానవ ప్లవమాన కైరవ చ్యవమానరజము మైనంటఁదివురుఁ
గరసారసాగ్ర తామరసాళిసాంద్ర సీధురసార్తిఁ గన్నీరుఁ దుడువఁగోరు
మదనావలగ్నభా సదనాగ్రమ కోమలచ్ఛదనార్చిపైఁ జూపు జరపఁజూచు
సలయాహత లతా కిసలయాగ మలయాగ నిలయానిలున కూర్పు దెలుపఁదలఁచుఁ
గుంజపుట గుంజ దళిపుంజ శింజితంబు, వెగ్గలంబైనఁ జెవియొగ్గి వినఁగడంగుఁ
బంచ శరభూతి పరిభూతి పంచభూతి, ముఁ దదీయస్థలంబులఁ గలపు కరణి.

వసు. III. 118.

రామరాజభూషణునితో నాంధ్రకవిత్వమందు ప్రతిభ కనఁబడుట తగ్గినది. తరువాతి తెనుఁగుకవులందఱును బూర్వకవులరచన ననుకరించినవారే. ఈ సంస్కృత సమాస రచనావేశమును బ్రతిఘటించుటకో యన నచ్చ తెనుఁగుఁ గావ్యములు బయలుదేరినవి. చేమకూర వెంకటకవి యచ్చ తెనుఁగు కావ్యముల యస్వాభావికత్వముపై రోఁతఁగొని చక్కని దేశికవితకు దారి చూపినాఁడు. అతఁడును నతని ననుకరించినవారును తెనుఁగు రచనకుఁ బ్రాధాన్యమునిచ్చి సంస్కృతము నొక నియమముతో మితముగ వాడుకొన మొదలిడిరి.

## మిశ్ర సమాసములు.

కేవల సంస్కృత ప్రాతిపదిక మాచ్ఛిక శబ్దముతో సమసింపదనియు, నట్టి సమాసములు పూర్వకవుల గ్రంథములలోఁ గ్వాచిత్కముగఁ గాన్పించి నను మహాకవులు వాని నుపయోగించి యుండుటచే నట్టివాని ననింద్య గ్రామ్యము లనవలెననియు, నట్టివాని సాదృశ్యమున నితరములను గల్పింపఁ గూడ దనియు, కల్పించినచో నవి గ్రామ్యములగుననియు లాక్షణికులు చెప్పుచుందురు. అనింద్య గ్రామ్యములని లాక్షణికు లుదాహరించిన సమాసములు.

కలికంఠుఁడు, దినవెచ్చము, * రాయభారము, రాయభారి, చౌదంతి, చౌపదము, చౌపుటము, చౌషష్టి, కపిలకన్నులు, కపిలజడలు, జీవగఱ్ఱ, ప్రాణగొడ్డము; నిత్యపడి, ఉత్తరజందెములు, అపదూఱు, అప(-వ)పాడి; అపరాతిరి, అపసమ్మిశ, అపసమ్మకము, అపనెపము, పంచవన్నె(లు) మొదలయినవి.

[కలికంఠా క్షమియింపుము. భార. అర. II; దినవెచ్చమునకునై తనమేనఁగల సొమ్ముఁ గొదుకక యిచ్చింటఁ గుదువవైచు - పాండు. III.; దంతి వంశమ్ము లాతముగఁ ద్రిప్పుచు వాడుఁ జౌపవన్నులకుఁ బిశాచమొకటి - జైమి. V.; శేశృథంగిని జౌకళించి చౌపుటము లాక్కమ్మని పదునైఁదు నతికి యుతికి - అని. IV.; ఖగములగములు చవుషష్టికళలుఁ గళలు - రుక్మాం. V.; లోభనిరతిఁ బెద్దకానపడి పాడి దొలంగినఁ బ్రాణగొడ్డపుంబనులగు- భార. అను. IV. - ; అవనిపతులు పలువు రపపాడి నొక్కరిఁ, దన్నుఁ బొడవికొనినఁ దరల కదిసి, పోటులాడి వాదు పుత్త్రుండు పడుటదాఁ, గీర్తికరముగాని కీడుగాదు-మార్కం. VIII.; సొమ్మొకచోనుండఁగ నపసమ్మిశ యొకచోటనుండు నరులకు నెపుడున్ - హరిశ్చ. V.; అటఁ బోయినంతలో నపనెప మాను - సారం. II; పంచవన్నియతోడఁ బ్రసవనారాచుని నెత్తిచిచ్చుఁబోకంట జట్టినాఁడు - భీమ. I.]

ఇవిగాక గ్రంథములం దిట్టి సమాసము లెన్నియో కాన్పించుచున్నవి; కొన్ని మాత్ర మిూ క్రింద నుదాహరింపఁబడుచున్నవి.

[దినబత్తెము - 'నీకు మొదలన్ దినబత్తెము నే నొడంబడన్. హరిశ్చ. IV. రసదాడి- 'రసదాడి చెలువుతోఁ బ్రతి వెట్టి చెలువైనఁ జానవాతెఱ ప్రతి చక్కరగును—చంద్రభా.; రసదాడి సరి పవరచుట గానక పోల్చి యనువైన తలఁపులు గనక నిల్చి—చంద్రాం. I. వీర - 'మట్టెలు పిల్లాండ్లు మఱి వీరమద్దియ లెలమిని దొడిగెఁ దొయ్యలి యొకర్తు -

---

* 'రాయభారము, రాయభారి' అను రూపములు తప్పనియు 'రాయబారము, రాయబారి' అనుటయే యొప్పనియుఁ గొందఱందురు. కాని, "దినవెచ్చము, 'రాయభారము' ఇత్యాదా ప్రాకృత సమత్వేనాపి రూపం సువచనమ్. 'రాయభారులు' ఇత్య ప్రాథర్వణోక్తమిత్యపి" అని యహోబలుఁ డనియుండుటచేత 'రాయభారము, రాయభారి' అను రూపము లనే యాతఁడు స్వీకరించి వానికి సాధుత్వమును గల్పింప యత్నించెనని గ్రహింపవచ్చును. తిక్కన్నఁ గలికంఠాదులతో వాని నుదాహరించుటకుఁ గారణము కనఁబడదు.

యయాతి. IV; వీరముద్దియలు - 'మట్టియలు వీరముద్దియలు పాయవట్టంబులు - హైవ. VI; చంద్రకావి - 'అల వసంతధరాకాంతుఁ డరుగుదేర రాచిలుకచాలు పచ్చతోరణముగాఁగ, సాంద్రగతిఁగట్టు మేల్కట్టు చంద్రకావి యంశుకంబులు నాఁ బూచెఁ గింశుకంబు-రామా. I; నాగగన్నేరు - 'నాగగన్నేరులు మూనాళ్ళ సొబగు - భల్లా. III; నాగపడగలు; నాగపడగలదండ - 'భాసురంబగు నాగపడగలదండ, యాసలఁజేరె నయ్యతివ నీదండ-భాగ. X; నాగబెత్తము - 'మలగొను చిన్నికెంజడలు మంతుల బొత్తము నాగబెత్తమున్... తెలుపలరంగ నొప్ప నొక సిద్ధుఁడు సింగపు వారువంబుతోఁ - కళా. II; నాగవాసము - 'వనపుకాఁడ బువేల్పు నాగవాసముగూడి మహిమ గోల్పోయెనే మాండకర్ణి - మను. II; నాడెంపుఁగోటల నాగవాసంబులఁ గొమ్మలు గొమ్మలుఁ గొనలునూవ - అచ్చ. బాలకాం.' నాగసరము-'కంచు కొమ్ములు బూరగలు నాగసరము, లంచితపటహ కాహళములు సరుమ-నల. II; నిరాపనింద- 'పినతల్లిని పెనుపఁగనోపిన తల్లివి గాన వచ్చి పిలిచిన నయ్యో, కనికరములేక వానింగని కరము నిరాపనింద గట్టందగునే - పారం. III; పరవాది - 'మితిలేని తేని నామెడఁజేసె విరవాది, యితరలతికల మరగి యేఁగునది పరవాది - మను. III; ఉపతాయి - 'ఉపతాయిలోఁదనకొద పెడు తోరహత్తము మాపి - భార. విరా. II; గరుడపచ్చ - గరుడపచ్చల చాయగల పచ్చగంపని కూరలు శైవలాంకురములయ్యె. శై. VII; మవహత్తి - 'అచటి యొకపాటి దొర మొదహత్తులకును నెత్తుగున్నలు దిక్కుల మత్తకరులు - పాంచా. V. కరదివ్వె (- విము,-వ్వియ)- కరమునఁ బూనిన ఖడ్గప్రకాశ మరుదుగాఁ గరదివ్వెయై త్రోవఁజూప - పారిజా. I; కరవాలు తివిరి కరవాలునేకాని, అవలవ లెపగంగ నత్తెలవపైఁ బడుచో - అచ్చ. సుం. కాం.]

ఇట్లే అతివస, అంతరతామర, అంతెరపల్లటీ, అపసిరి, అవదాయము, అవసడి, గరుడసరులు, పాండవబీడు, బాలసంగడము, గళకత్తెర, మూలదుంప, రసగుండు, లింగకట్టుమాత్ర, లింగకాయ, లింగదొండ, లింగపొట్ల, లింగబలిజులు, లింగరాజు, వజ్రగార, వీరభద్రపళ్లెరము, నాగదాళి, నాగనేరెడు, నాగవెంజెర, నాగమల్లె, నాగముస్తె, నదాముస్తె, పరపత్తెము, దీపకంభము మొదలయినవి నిఘంటువుల కెక్కినవి.

లోకములో శుద్ధ, శుక్ల, బహుళ అను పదములతో వైకృతనామములు గల తిథులపేళ్లు సమసించి వినఁబడుచున్నవి: శుద్ధపాడ్యమి, శుద్ధవిదియ, శుద్ధతదియ, శుద్ధచవితి; ఇట్లే శుక్ల (బహుళ) పాడ్యమి (విదియ, తదియ, చవితి), మొదలగు మిశ్రసమాసములు వినఁబడుచున్నవి. ఈ రీతిగనే సంవత్సరాది పాడ్యమి, గౌరీపున్నమ మొదలగునవి. ఇవిగాక కంతసరులు, శుద్ధతప్పు, శుమ్మడదండుగ, అనేక మా(-సా)ర్లు, అనేకమంది, అల్పసిరి, స్వల్పడబ్బు, దురలవాటు, దుస్సలహా మొదలగు ననేక మిశ్రసమాసములు వ్యవహారమున బహుళప్రచారమున నున్నవి. సంజ్ఞావాచకములలో జగన్నాథరావు, సుబ్బారాయావధాని, అన్నప్పశాస్త్రి, అనంతవరము, శ్రీకాకుళము, సింహాద్రి అప్పన్న, కృష్ణదేవరాయలు మొదలగునవి.

పై వానిలో సంస్కృతపదము సమాసమునఁ బూర్వాంగముగా నున్నది; దానిపై నాచ్ఛికశబ్దము చేరినది. ఆచ్ఛికపద ప్రాతిపదిక రూపము పూర్వపద ముగను సంస్కృతపదము పరమందునుగల సమాసములకు నిషేధమును లాక్షణికులు కల్పించినట్లు కానరాదు: అంచపదము, అంచయాన, అన్నప్ప శాస్త్రి, అప్పలరాజు, అఱజాతి, ఉల్లిపాషాణము, ఎత్తుభారము, ఏలుకోట, ఒఱబీజము, కోఱప్రాణము, చూఱకారుఁడు, చొక్కతరము, తిరుచూర్ణము, తిరుపతి, తిరుమజ్జనము, తిరుమణి(వడము), తిరువారాధనము, తిరుమంత్రము, నడుమంతరము, పట్టవర్ధనము, పుడమీశుఁడు, పెద్దరోగము, పోగబాణము, బారిముద్ర, కటికదరిద్రుఁడు, చిలుకద్వాదశి, బిడాలవణము, మట్టమధ్యాహ్నము, ముక్కోపము, మట్టితైలము, ముంగోపము, ముక్కణము, కెంధూళులు, వసనాభి, వాటపద్యములు, వింజామరము, విన్నపత్రిక, కప్పతాళము, చిక్కతాళము, చిటితాళము, బొమ్మచారి, సజ్జరసము మొదలగునవి సాధువులే. పుణ్యానక్షత్రము, బుక్కరాయసముద్రము, నుచిలీపట్టణము, బరంపురము, కొర్లకోట, హండే అనంతపురము, బేస్తవారము, ముల్లగూరశక్తి, మొదలగు నవియు నిట్టి సమాసములే.

ఆచ్ఛిక పదమునకు సంస్కృతప్రత్యయము చేరిన కొన్నిపదములు సమాసములయి తెనుఁగున నిలుచుచున్నవి: ఉదా. గిరుటామంతుఁడు, గరుటాలమంతుఁడు ('కంబమయ్యారో మేలుకలిగిన నీకొక్క గరుటాలమంతుని గానుకిత్తు-యయా. II; సిరిమంతుఁడు (నీలాను. I.); చెలికారము.

తత్సమ సమాసములు.

ఆధునిక వైయాకరణులు సంస్కృత సిద్ధసమాసములనేకాక సంస్కృతసమ పదముల సమాసములను నొకవిభాగమును జేసి వానికి సాధ్య సాంస్కృతిక సమాసములని పేరిడిరి. ఇట్టి విభాగమును గల్పించుట సమంజసము కానట్లు తోఁచుచున్నది. ఇట్టి సమాసములు సాధారణముగ నాచ్ఛిక సమాసముల తీరుననే యేర్పడుచుండును. వానిలోని పూర్వపదములం దెట్టి మార్పును గలుగదు; అనఁగా వానితుది విభక్తి ప్రత్యయములు లోపింపవు. లోపించినచో నవి శుద్ధసాంస్కృతిక సమాసములే యగును. 'తటాకంబు నుదకము, చెఱువునుదకము, మొగమునంపిము' అను సమాసములలో మొదటి దానిలోఁ దత్సమపదములును, రెండవదానిలో నాచ్ఛిక తత్సమ పదములును, మూఁడవదానిలో రెండును నాచ్ఛికపదములును నున్నను వాని రూపమునం దెట్టి భేదమును లేదు. ఇట్లే లక్ష్మీవల్లభుఁడు, లక్ష్మీమగఁడు, లచ్చిమగఁడు అను వానియందును. ఇట్లే మాలసౌందర్యము, దండసౌందర్యము, దండ

యందము, అను వానియందుఁగూడ సమాసరచనయందుగాని, రూపమునందు గాని యెట్టి భేదమును గాన్పింపదు.

ఇదిగాక తత్సమపదములతోఁ గేవలము చతుర్థీ షష్ఠీ తత్పురుషసమాసములను మాత్రము కల్పింప వీలగునేమోకాని, తక్కిన సంస్కృత సమాసములను గల్పింప వీలులేనట్లు తోఁచుచున్నది. అవ్యయములను ప్రత్యేకముగాఁ దత్సమములుగ నుపయోగింప వీలులేకపోవుటచేత సాధ్యసాంస్కృతికావ్యయీభావ సమాసములను గల్పింప వీలులేదు. తత్పురుషములో 'కృష్ణశ్రితుఁడు' అనునది ద్వితీయాతత్పురుషసమాసమైనను దానినుండి కృష్ణుని శ్రితుఁడు అని సాధ్యసమాసముఁ గల్పింపరాదు. 'కృష్ణుని యాశ్రితుఁడు' అను సమాసము సాధ్యమయినను నది సంస్కృతసంప్రదాయార్థమును బట్టి ద్వితీయాతత్పురుషసమాస మనుకొనవలసినదే కాని రూపమున షష్ఠీతత్పురుషమే. ఇట్లే 'దుఃఖమునతీతుఁడు' అనుట తెనుఁగు సంప్రదాయము కాదు, దుఃఖమున కతీతుఁడనవలెను. గ్రామమునుగమి, అన్నమును బుభుక్షువు, మొదలగునవి తెనుఁగున నస్వాభావికములు. 'శంకుల ఖండము' అను చోట తెనుఁగున 'శంకులచేత ఖండము' అని యర్థము స్ఫురింపక 'శంకులయొక్క ఖండము' అనియే స్ఫురించును. 'యూపముదారువు' అను చోట చతుర్థీ తత్పురుషసమాస మేర్పడుచున్నది; ఇట్టిచోట్ల 'ము' వర్ణమునకు పు వర్ణ మగుచుండును: యూపపుదారువు, దీపపు స్తంభము మొదలగునవి. 'చోరుని భయము' అనుచోట రూపమున షష్ఠీతత్పురుషసమాసమే కానవచ్చుచున్నది గాని, పంచమీతత్పురుషము సిద్ధింపలేదు. 'ఈశ్వరుని యధీనము' అను చోటను షష్ఠీతత్పురుష రూపమే కాని సప్తమీతత్పురుష రూపము లేదు.

సంస్కృత సంఖ్యావాచకపదములలోఁ గొన్నిమాత్రము తత్సమము లగును. ఏకుఁడు బ్రాహ్మణుఁడు మొదలగు సమాసములు తెనుఁగునఁ గలుగవుగదా. బ్రాహ్మణుల ద్వయము, వృక్షముల త్రయము, పుస్తకముల శతము, సైనికుల సహస్రము, భవనముల వింశతి మొదలగునవి సాధ్యములు గావచ్చునుకాని, వీనిలో సంఖ్యావాచకము పూర్వపదముగా లేదు; పుస్తకములు అనునది బహువచన మందున్నదీ; షష్ఠీరూపమును దాల్చియున్నది. అందుచేత నిట్టివానిని సాధ్యద్విగుసమాసములనుట సరికానట్లు తోఁచుచున్నది.

ఇట్లే యితర సమాసముల విషయమునఁ గూడఁ జెప్పవలసియున్నది. 'ఘనశ్యాముఁడు' అనునది 'ఘనుఁడు శ్యాముఁడు' అనికాని, 'పురుషవ్యాఘ్రుఁడు' అనునది 'పురుషుఁడు వ్యాఘ్రుఁడు' అనికాని సాధ్యసమాసమగుటకు వీలులేదు. ఘనమువంటి శ్యామవర్ణము గలవాఁడు,' 'వ్యాఘ్రమువంటి పురుషుఁడు,' అని యారీతిగా సమాసములను గల్పింతుమన్న వానిలో నాచ్ఛా

పదములు చేరి యుండుటచే నవి సాధ్యసమాసములు కాకపోవును. కర్మధారయ సమాసములను క్రియాజన్య విశేషణముల సంబంధము లేనిదే తత్సమ పదములనుండి యేర్పఱుచుట యసంభవము: 'మధురమైన ఫలము' అనవలెను గాని, 'మధురము ఫలము' అను సమాసము తెనుఁగున సిద్ధింపదు. ఇట్లే బహువ్రీహిసమాసములను గూడఁ దత్సమపదములతో నేర్పఱుప వీలులేదు. 'గ్రామము ప్రాప్తోదకము' అనుదానిని తత్సమసమాసము చేయఁదలఁచినచో ద్రావిడప్రాణాయామపద్ధతి నుపయోగించి 'ఎచట నుదకము ప్రాప్తమో అది (గ్రామము)' అని చెప్పికోవలసినదే కాని వేఱు గతిలేదు. వ్యాఖ్యాప్రాయమయిన పదవిన్యాసమును సమాసమని చెప్పుట తగదుగదా. షష్ఠీ - సమాసమునకుఁ దత్సమసమాసములతోఁ బ్రసక్తియే లేదు.

## ఆచ్ఛిక సమాసములు.

ఆచ్ఛిక సమాసములు రెండువిధములు (i) అఖండ వైకృతములు (ii) ఇతరములు. (i) సంస్కృత సిద్ధసమాసము లున్న వున్నట్లుగానే వికృతినొందినవి వైకృతములు. ఇట్టివానిలోఁ బ్రత్యేకపదములు వికృతియందు గోచరింపక పోవచ్చును: ఉదా. శూర్పణఖ = చుప్పనాక, ఇందు 'చుప్ప', 'నాక' అను పదములకుఁ దెనుఁగునఁ బ్రత్యేకస్థితిలేదు. ఇట్లే అంఘ్రిజాత = అంగజాల; అంగారపోలికా = అంగనోల్లె (లు) అంభశ్చరము = అంజాచారము; అపూర్వము = అపురూపము; హరితాళము = అరిదళము; ఏకాంతము = ఎగ్గతము, ఏకతము; అఖండము = ఏకాండము; కాండపటము = గండవడము; చతురశీతి = చౌసీతి; గండనాయకుఁడు = గనాయఁడు, మొదలయినవి.

కొన్నియెడల సిద్ధసమాసము సంపూర్ణరూపము వైకృతమయినప్పుడు సమాసమందలి యొకపదమునకుఁ దెనుఁగున స్వతంత్రప్రయోగ ముండక పోవచ్చును: చెంద్రనాకలు; చేందురవంకలు (-కూనలు). చుబ్బనమాజు, దిక్కు (-క్కా-చ్చు) మొగము, నెట్టిసీల, అంతిపురి (-పురి), అడిమాన, అద్దమరేయి, ఆమవడ, పడిహారి, పరుసవేది; చౌసాల; గండగొడ్డలి, గండకత్తెర, - ఇట్టివానిలోని మొదటిపదములుగాఁ గాన్పించు 'చెంద్ర' చెందుర, చుబ్బన, దిక్కు (-క్కా,-చ్చు), నెట్టి, అంతి, అడి, అద్దమ, ఆమ, పడి, పరుస, గండ, చౌ, మొదలగువానికిఁ దెనుఁగున స్వతంత్రప్రయోగములేదు. మూలమయిన సమాసమున నుత్తరపదములుగా నుండిన పదములు వికృతియందు కేవల ప్రత్యయములుగా మాఱి తెనుఁగున వ్యస్తపదములయినవి. అశ్లేషకపదముగా నిప్పుడు గాన్పించు పదములు తొలుత సమాసములే.

(ii) వైరీతివిగాక ప్రత్యేకముగా వికృతులై ప్రత్యేకార్థములు గలిగిన పదముల సమాసములకును, వైకృతదేశ్య, దేశ్యదేశ్య పదములు చేరి

కలుగు సమాసములకును రూపఘటనమునందు భేదము కాన్పింపదు. ఇట్టి సమాసముల రూపమునుబట్టి వానిని కొన్ని వర్గములుగా నేర్పఱుపవచ్చును.

i. వ్యస్తపదముల కెట్టిమార్పును గలుగనివి.

కొన్ని సమాసములందు వ్యస్తముగానున్న పదముల కెట్టిమార్పును కలుగక యాపదము లొకదాని తరువాత నొకటిచేరి సమాసము లగును. 'Analytical languages' అనఁగా సుప్ - తిజ్ ప్రత్యయరహితభాషలని భాషాశాస్త్రజ్ఞులు తెలుపు భాషలయందెల్ల సమాసఘటన యిట్లే యుండును. చీనాభాషయు, ఇంగ్లీషుభాషయు నిట్టివాని కుదాహరణములు. ఇంగ్లీషున సమాసములు క్రికెట్ మేచ్ (cricket match); మేచ్ - బాక్స్ (match box), రైల్వే - ట్రైన్ (rail-way-train), ఈ రీతిగానుండును. వీనిలోని పూర్వపదముల కెట్టి వికారమును గలుగదు. తెనుఁగున నాచ్ఛిక సమాసములలో సాధారణముగ నిట్లే యుండును. ఉదాహరణములు :—

**రెండును వైకృత పదములు :**— అడవికుక్క, ఒజ్జబంతి, కుమ్మరపురుగు, గడసాదన, తీఁగమల్లె, పట్టెమంచము మొదలయినవి.

**ఒకటి వైకృతము నొకటి దేశ్యమునయిన పదములసమాసములు :**— చలిగరువు, చనుమొన, చంకతాళి, చేఱుబొంద, చెలఁదితెర, చిచ్చుబుడ్డి, గోరుచుట్టు, గోనెసంచి, గుండుతాయి, గుంటప్రొయ్యి, గాలిపటము, గానుగపిండి, గుంటవేఁట, క్రిందుకయ్యము, కోలదివియ, కొండగుఱుతు, కాంచువడియము, కట్టుగుద్దలి, కత్తెరవానము, కత్తిమందు, కడుపుమంట, చెవిపోటు, కంచెకోట మొదలయినవి.

**రెండు పదములును దేశ్యములయిన సమాసములు :**— అంటువేను, ఆకుపచ్చ, ఆటవిడుపు, ఇలునింపడము, గొడుగుబల్ల, చుట్టుగుల్ల, జాలెత్రాడు, పందిమూతి, పనిముట్టు, పెండ్లినడక, పొగగూఁడు, పోగుపోత, బొద్దుకీటు, బొమముడి, మూఁతబల్ల, మొయిమఱపు, వెన్నుపాము మొదలయినవి.

ii. వ్యస్త పదములకు సమాసమందు మార్పుగలుగుట.

(అ) పూర్వపదమునకు.

(1) పూర్వపద మాపవిభక్తిక మగుచో దాని యాపవిభక్తిరూపము నిలుచును: ఉదా. మునికోల, మునియేఁడు, చెలియలికట్ట, చాకాలిపీఁట, పాత్తినాలికాయ, నూలిగరను, నోటిబీగము, అంగిటిముల్లు, కుందేటికొమ్ము, నాఁగటిచిప్ప, నాఁగటిదుంప, పొంగటిపండుగ, కూటినీళ్లు, కూటిముత్యము, ఘాటుప్పు, పాటినేల, పాటిరేవు, పురుటిల్లు, జంటితేన, మంటినూనె, వింటి

కోల, అడ్డవాతియమ్మ, దాతికఱ్ఱి, పాలవాతియమ్మ, చేతిబిడ్డ, తాతియుప్పు, తాతిగుండె, తాతియులి, వాతిబియ్యము, దంపకఱ్ఱి.

(2) కొన్నియెడల పూర్వపదము తుది ముపర్ణము 'ప' వర్ణమగును: అనుపసూది, నాఁపతాయి, పాపజగము, ఇనుపకమ్మి, జనుపనార, దంపకఱ్ఱి మొదలయినవి.

(3) కొన్నియెడల పూర్వపదముతుది 'పు' వర్ణముపై 'అ' కారము చేరును. నిడుపకమ్ములు.

(4) కొన్నియెడల పూర్వపదము తుది ముపర్ణమునకు 'పు' వర్ణ మాదేశమగును: ఉదా. అగండ్రపాకు, అడిదపుమొకము, ఉంగరపువ్రేలు, మైనపుబిడ్డి, రాట్నపాకు, మగ్గపుగుంత.

(5) కొన్నియెడలఁ బూర్వపదము తుది ముపర్ణమున కాదేశముగా వచ్చిన 'పు' వర్ణముపై నుగాగమముగలిగి సంధియందు ద్రుతమునకుఁ గలుగు కార్యములు కలుగును: ఉదా. కారపుఁజడుగు, తొండపుఁద్రాడు, పల్లపుఁబంట, ముత్తెపుఁజిప్ప, తోరణపుఁగమ్మి, చలపుఁబెడుక మొదలయినవి.

(6) ఇట్టి 'పు' వర్ణమున కచ్చుపరమైనయెడలఁ గొన్నియెడల టుగాగమము కలుగును: ఉదా. నెయ్యపుటలుక. కొన్నియెడలఁ గలుగదు: ఉదా. రాట్నపాకు, తములపాకు.

(7) కొన్నియెడలఁ బూర్వపదము ముపర్ణాంతము గాకున్నను దానిపై 'పు' వర్ణ మాగమము గావచ్చును: ఉదా. తామరపాకు.

(8) కొన్నియెడలఁ బూర్వపదముపై టుగాగమము గలుగును: ఉదా. అచ్చుపెద్దు, ఆకుటిల్లు, ఉంకుటుంగరము, తూఁగుటుయ్యెల, దంపుటిల్లు, పడుకటిల్లు మొదలయినవి.

(9) కొన్నియెడల 'టి' వర్ణమాగమముగా వచ్చును: బుజ్జటకొమ్మ, చిన్నటనాఁడు మొదలయినవి.

(10) కొన్నియెడల 'రి' వర్ణమాగమముగా వచ్చును: ఉదా. వీతిరిగుంట, నంగిరిమాట.

(11) ఉదంతస్త్రీ సమపదములపైఁ బరుష సరళములు పరమగునపుడు నుగాగమమగును: ఉక్కుఁదీఁగె, తొట్టుఁబట్టు, దుడ్డుఁగఱ్ఱ, పొత్తుఁగుడుపు మొదలయినవి.

(12) ఈ కార్యము ఉదంత విశేషణముల మీఁదను గలుగును: ఉదా. పెనుంగొమ్మ, పెనుంగొండ మొదలయినవి.

అలుగు(-వు)ఁదెవులు, అలుకుఁజుట్ట, అదురుఁగ్రోవి, అదురుఁద్రిక్క; ఊఁదుఁగ్రోవి.

(13) ఉదంత ధాతువులమీఁదను నీ కార్యము గలుగును : ఉదా. కట్టుఁగొయ్య, కట్టుఁగొమ్మ, కట్టుఁగోక, కట్టుఁగొంగు, కట్టుఁగొఱ్ఱు, పొర్లుఁగట్ట, విచ్చుఁగత్తి, త్రవ్వుఁగోల, మెట్టుఁబ్రాలు, మించుఁగాలు, తండుఁగోల, కక్కుఁదెవ్వలు, ఏఁగుఁబెండ్లి, ఎదురుఁగుత్తుక, వాలుఁబ్రొద్దు, వాలుఁగడుపు, వేఁగుఁజుక్క, తూఁగుఁబలక, ఒత్తుఁగమ్మి, కట్టుఁగంబము, పడుఁగాయ, పడుఁగొమ్మ, పిడుచుఁబాత, తోడుఁగఱ్ఱ, ఎండుఁదెవులు, అనుఁగఱ్ఱ, కడవుఁజేయి, తన్నుఁగోల, చూఁడుఁగొడుపు, పెట్లుఁగ్రోవి మొదలయినవి.

(14) భావార్థక డు వర్ణముమీఁదను నీ కార్యము గలుగును : ఊఱుకుడుంబొడ్డు, ఆనుడుంబిల్ల మొదలయినవి.

(15) కొన్నియెడల ధాతువుపై 'పు' వర్ణము చేరును : ఎండుపుఁదట్ట.

(16) కొన్నియెడల ధాతువు తుదివర్ణము లోపించును : ఉడుఁబోతుపిండె.

(17) ఈ నుగాగమము కొన్నియెడల నిత్యరాచ్చు లాతమందు గల పదములమీఁదఁగూడఁ గలుగును : అకారాంతపదములపై : ఎడఁదెఱపి, ఎలఁదోఁట, ఒరఁగట్టు, ఒరఁగిడుగు, ఒరఁగల్లు, ఒరఁగాలు, ఒరఁబదును, ఒఱఁబెంకు, కడఁగొఱవి, కమ్మఁగాడ్పు, కొయ్యఁగాలు, తెలఁద్రాడు, తిమ్మఁదియ్యము, తొఱఁదేనె, నానఁబ్రాలు, పుట్టఁగూడు, పుట్టఁదేనె, తియ్యఁగూర, పచ్చఁబ్రాలు, పిల్లఁగ్రోలు, పిల్లఁగ్రోవి, పిల్లనఁగ్రోలు, పిల్లనఁగ్రోవి, వాతెనఁబీఁట, ఎత్తనఁగోల, ఎత్తనఁగోలు, ఒడ్డఁగెడవు, కిఁచినఁగాయ, కలపనఁబిండి, కుదుకనఁగోలు, కుప్ప(న)ఁగూర, చిమ్మనఁగ్రోవి, తెలఁబ్రాలు, దీవనఁబ్రాలు, దోరఁగల్లు, పాయఁగొమ్మ, బింజనఁగ్రోవి, బట్టనఁగోల.

ఆకారాంత పదములపై : మ్రాఁగన్ను.

ఇకారాంత పదములపై : ఉరిఁగోల, ఒడిఁద్రాడు, ఒడిఁబ్రాలు, కాఁడిఁగట్టు, తరిఁగోల, తరిఁదీపు, తరిఁద్రాడు.

ఎకారాంత పదములపై : వాసెఁగ్రోలు.

ఏకారాంత పదములపై : క్రేఁగన్ను, క్రేఁగయి, చేఁద్రాడు, లేఁగసవు; లేఁబగలు, లేఁబోక, లేఁబ్రొద్దు.

ఓకారముపై : మోఁకాలు.

(18) ధాతువుల తుమున్నంత రూపములపై బరుష సరళములు పరమగునపుడు సహజముగనే ద్రుతకార్యములు గలుగును : ఒల్లఁబోక, కలఁగలవు, వడియఁబోఁత, దిగఁదుడుపు, తిరుగఁబోఁత.

(19) కొన్నియెడల ధాతువుల తుదివర్ణము లోపించియు నితర వికారములు గలిగియు నేర్పడిన రూపములపై 'ప', 'పన' మొదలగు వర్ణములు చేరును: తిరుపగూడ, కలపనఁబిండి మొదలగునవి.

(20) కొన్నియెడల పూర్వపదము తుది వర్ణమునకు 'పు' వర్ణము గలుగదు: బోగమాట.

(21) కొన్నియెడలఁ బూర్వపదముగాఁ జేరిన ధాతువులపై 'రు', 'డు' వర్ణములు చేరును: వేగురుఁజుక్క; త్రొక్కుడుఁబట్టె, త్రొక్కుడుఁగమ్మి, త్రొక్కుడుఁబలక, చోపుడుఁగోల, చూపుడుఁబూఁట, చెక్కుడుఁబాఱ, ఎక్కుడుఁదీఁగ, దో(గో)కుడుఁబాఱ, తిరుగుడుఁజీల, తిరుగుడుఁద్రాడు.

(22) ధాతుజ విశేషణములతో సమాసములు గలుగును: పుట్టినిల్లు, మెట్టినిల్లు, కలరూపు, ఉన్నరూపు.

(23) ధాతువుల క్త్వార్థక రూపములును సమాసములందు పూర్వపదములుగా నుండును: పంచివేఁత, తేఱిచూపు.

(24) ఒకప్పుడు సంపూర్ణ క్రియారూపములును సమాసములందు పూర్వపదములుగా నుండును: లేదుబంతి.

(25) కొన్ని సమాసములలోఁ బూర్వపదము షష్ఠీబహువచన రూపముఁ గలిగియుండును: ఆట్లతదియ, నాగులచౌతి, పాలగిరువు, పాలగోకుడు, పాలపండ్లు, పాలబుగ్గలు, పాలమన్ను, పాలవిఱుగుడు, పాలసున్నము, పాలగచ్చు, సాలగార; ఆలపోతు, కట్లబల్ల, కట్లగుదియ, గీట్లద్రద్ద, చేఱులకోల, పూలముడుపు, పెట్లకంబము, ప్రొద్దులనెల, నుల్లెలగుది, మేకలమంద, సకినలమంచము మొదలయినవి.

(26) కొన్నియెడలఁ బూర్వపదము తుదివర్ణము లోపించును: వంజెఱఁగు, మొగవీణె, మీసకట్టు, వ్రేపల్లె, ఎనుపోతు, ఎనుపెంటి, పూరేకు, పూనీరు, పూఁదోఁట, చేవ్రాలు, చేపట్టు, వాదోడు, నానుడి, పిరుపీకు, బల్లెకోల, నెత్తపలక, గండపొడి, ఊరోస్కె, వాచూరు, దూముడి, చాపరువు, చిరోక్కల.

(27) కొన్నియెడలఁ బూర్వపదము తుదియచ్చుమాత్రము లోపించును: కండెఱ, పెంద్రోవ, పొందొడవ, పెందెరువు, కన్నీరు ('కన్ను నీరు' అనియుఁ బ్రయోగము గలదు). పుట్నిల్లు, పార్పత్తెము, నిట్రాయి, నిట్రాడు, చట్రాయి.

(28) చన్నీళ్లు, వేణ్ణీళ్లు, పేణ్ణీళ్లు, ఏణ్ణాళ్ళు, ముణ్ణాళ్ళు, విజ్జోడు, ఇన్నూఱు, మున్నూఱు, నన్నూఱు, ఏణ్ణూరు మొదలగువానిలో పరపదాది నకారము పూర్వపదాంత్య హల్లుతో గలిసి దానికి వికారము గలిగించినది.

(29) నిర్+కడి = నిగ్గడి; నిర్+కాక = నిక్కాక; ఈ సమాసములలో 'నిర్' అనునది 'ఎక్కువ' అను నర్థముగల యుపసర్గము.

(30) చిఱు, కుఱు, నడు, నిడు అను శబ్దములపై నచ్చు పరమగు నప్పుడు ద్విరుక్త టకారమగును: నిట్టుపానసము, నిట్టూరుపు, నట్టడవి, కుట్టునురు, చిట్టంటుచేతలు, నట్టుంట్లు, నట్టేఱు, నట్టిల్లు.

ఒకప్పుడు ద్విరుక్త టకారము రాదు: చిఱ్ఱుద్ది. ఒకప్పుడు 'ట్ర' కలుగును: నిట్రుపాసము.

(31) కొన్నియెడలఁ బూర్వపదము తుదియచ్చునకు దీర్ఘము కలుగును: తారాకీఁట, గునామొలనూలు, పెద్దాపురి, మచిలీపట్టణము.

(32) కొన్నియెడలఁ బూర్వపదముపైఁ గొన్నివర్ణము లాగమములుగా వచ్చును: తెల్లనాకు, చిటికెనవ్రేలు, బొట(-ట్ట)నవ్రేలు, బొటకనవ్రేలు, బొటమనవ్రేలు.

(33) కొన్నియెడల నుత్తరపదము నాది హల్లునకు లోపము గలుగును: పెందలాడ.

(34) సమాసమునఁ బూర్వపదముగా నిలిచిన 'పది' శబ్దమునకుఁ గలుగు మార్పు లీ క్రిందిసమాసములవలనఁ దెలిసికొనవచ్చును: పదకొండు, పదనొకొండు, పదునొకండు, పండ్రెండు, పన్నెండు, పదుమూఁడు (పద్మూడు), పదునాలుగు (పధ్నాలుగు), పదునేను (పదిహేను), పదునైఁదు (పదహైదు), పదునాఱు (పదహాఱు), పదునేడు (పదిహేడు), పదునెనిమిది (పద్ధెనిమిది, పఝెనిమిది), పందొమ్మిది (పంతొమ్మిది).

(35) సమాసమున నుత్తరపదముగానున్న 'పది' శబ్దమునకుఁ గలుగు మార్పు లీ క్రిందిసమాసములవలనఁ దెలిసికొనవచ్చును: ఇరువది (ఇర్వై, ఇరవై), ముప్పది, (ముప్ఫై), నలువది, నలుబది (నలభై), ఏఁబది (యాభై), అఱువది (అరువై, అరవై), డెబ్బది (డభ్భై), ఎనుబది (ఎనుభై, ఎనభై), తొంబది (తొంభై.)

(36) ఎనిమిది, తొమ్మిది, అను పదములు సమాసమునఁ బూర్వపదములగునపుడు గలుగు మార్పుల నీ క్రిందివానియందు గమనింపవచ్చును: ఎనమన్నూఱు, తొమ్మన్నూఱు, ఎనమనూఱు, తొమ్మనూఱు, తొంబనూఱు.

(37) ఈ క్రింది సమాసములలో నుత్తర పదములందు వికారము గలిగినది: తొలకరి, వెల్లివిరి, ముక్కంటి, వేఁగంటి, నసఁబోఁడి.

(38) ఈ క్రింది సమాసములలోని పూర్వపదములకు తెనుఁగున వ్యస్త ప్రయోగము లేదు. అడసాల (కన్న. అడికె = వంట), అడిగండ్లు, అలవోక, ఉజ్జవకల్లు, ఎట్టపోగు, ఒమ్మచ్చు, ఒఱగడ్డము, ఒఱగొడ్డెము, ఓరచ్చులు, ఓలగండము, కరగోడ, కారగ్గి, కుంపెరుగు, కుడినీరు; గండ పెండ (-ండా, -ండె) రము, గగ్గోలు, గొబ్బండు, చందురకావి, చరికుండ, చిత్తడి, చెందుప్పు, చొక్కాకు, జాలపల్లిక, జోబిల్లు, జొబ్బిల్లు, డా(దా) కల్లు, తిరుకొలను (-చిన్నము, -నాళ్లి, -నీఱు, -వతి, -మన్ను, -మణి, -మల, -మాళిగ), దుంబోడి, పంచకరపాటులు, పడసాల, పడివాగె, పరగడుపు, పాడట్టు, పొద్దొట్టు, పుదియబొట్టు, పులకండము, పులసరము, పొరిచూపు, పొలయలుక, పొలునోరు, ప్రెబ్బొత్తి, బడగొండ, బొమ్మంచు, మెఱమెచ్చు, మేలుబంతి (మేలు = మీఁది), వఱగొడ్డము, వల్లకాడు, వాలుమగఁడు, విసనకఱ్ఱ, వెరవేఁకి, సంగమదుఁగు, సయ్యోధ్య, సరకట్టు, సవడండవల, సురేకారము, సెలగోల, సేసకొప్పు.

(39) కొన్నియెడల ప్రథమావిభక్తి క వర్ణముమీఁద నుత్తరపదము చేరినను విభక్తి ప్రత్యయము లోపింపదు: సుబ్బారాయఁడుషష్ఠి, కొలముసామి.

(40) వ్యవహారమున నివర్ణాంత పదముపై నజాది పదము చేరునప్పుడు సంధికలుగక ప్రకృతిభావమే నిలుచును; శని ఏకాదశి, దివాళి(-ళీ) అమావాస్య; సింహాద్రి అప్పన్న (సింహాద్రప్పన్న అనియు సంధిరూపము వ్యవహారమునఁ గలదు).

(41) అ, ఈ, ఏ అను నిర్ధారణార్థక విశేషణములకు త్రికమని పేరు. త్రికముమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వము బహుళముగా నగును; ద్విరుక్తమగు హల్లు పరమగునపు డాచ్ఛికంబగు వర్ణమునకు హ్రస్వమగును: అ+కన్య = అక్కన్య; ఈ + కాలము = ఇక్కాలము; ఏ + లోకము = ఎల్లోకము. బహుళమనుటచేత నూష్మరేఫములకు ద్విత్వము కలుగదు: ఆరాముఁడు, ఈశనివారము, ఏషష్ఠి, ఆసుందరి, ఆహరి. ఇట్లే ఋకారాదిపదము చేరునప్పుడును ద్విత్వముకలుగదు: ఆఋషి, ఆఋతువు. ఋకారముతోఁ గూడిన కొన్ని హల్లులకును ద్విత్వము ప్రయోగములందు కానరాదు: అ+బృందము=అబ్బృందము; అ+ ధృతి = అద్ధృతి; అ+ఘృతము = అఘ్ఘృతము-మొదలగు సంధులు కానరావు - కృతహ్రస్వమయిన త్రికముమీఁదిచోటు శబ్దమునందలి యోత్వమునకు హ్రస్వమగును; లేదా, ఓకారమున కత్తు ఆదేశమగును; ఆచోటు, అచ్చోటు, అచ్చొటు; ఈచోటు, ఇచ్చోటు, ఇచ్చొటు, ఇచ్చటు; ఏచోటు,

ఎచ్చోటు, ఎచ్చొటు, ఎచ్చటు. కృతహ్రస్వంబగు త్రికమనుటచే 'అచటు, ఈచటు, ఏచటు' అనురూపములు లేవని తెలియునవి. 'మూఁడు' శబ్దముపై సమానాధికరణమున నుత్తరపదము పరమగునపుడు అందలి డుజ్‌వర్ణమునకు లోపమయి 'మూ' అని నిలుచును. లుప్తశేషమగు 'మూ' మీఁది హల్లునకు ద్విత్వము కలుగును; 'చోటు' శబ్దము పరమగుచో నందలి ఓత్వమునకు అత్వ ద్విత్వములు గలుగును: మూఁడు + చోటులు = మూ + చ్చోటులు = ముచ్చోటులు, ముచ్చొటులు, ముచ్చటులు; మూఁడు+కారు = ముక్కారు; మూఁడు+జగములు = ముజ్జగములు; మూఁడు + లోకములు = ముల్లోకములు; మూఁడు+పాతిక=(లు) ముప్పాతిక (లు), మూఁడు+త్రోవలు=ముత్త్రోవ (లు); మూఁడు+విధము = ముద్విధము (లు): ఇట్లే ముప్పది, మున్నాలు, ముక్కోటి, ముమ్మాఱు, మొదలయినవి. ఈకార్యము కొన్నియెడలఁగాదు; 'ముబ్భువనములు' మొదలగు రూపములు కలుగవు; ఇట్లే ఊష్మరేఫములు పరమందున్నను నీకార్యము కలుగదు. ముఱ్ఱాపములు, మొదలగు రూపములు కలుగవు. 'నాఁడు' శబ్ద ముత్తరపదమగునపుడు 'మూ' కు హ్రస్వము కలుగదు. ద్విత్వము వైకల్పికముగాఁ గలుగును: మూనాళ్లు, మూన్నాళ్లు. 'నెల' శబ్దము పరమగుచో డుజ్జునకు ణకార మాదేశమగును; 'మూ' కు హ్రస్వము కలుగదు: మూణ్ణెలలు; ద్విత్వమున నొకహల్లు లోపింపదు: 'మూనెలలు' అనికాదు. వేయి శబ్దము పరమగుచో డుజ్జునకు లోపము కలుగదు. మూఁడువేలు, (ముెవ్వేయి, ముెవ్వేలు, అనికాదు). 'మూఁడు శబ్దముపై నచ్చు పరమగుచోఁ గూడఁ గొన్నియెడల డుజ్వర్ణము లోపించి, యడాగమము గలిగిన తరువాత దీర్ఘమునకు హ్రస్వముగలిగి యకారమునకు ద్విత్వము కలుగును: ఉదా. ముయ్యేడు (మాఱులు); ముయ్యాఱు, ముయ్యేఱు మొదలయినవి.

సంఖ్యావాచకములగు రెండు, ఏడు, పదములపై నెల, నాఁడు అనునవి చేరునప్పుడు వానితుది డువర్ణమునకు ణకార మాదేశమగును: ద్విత్వ ణకారమునకు ద్విత్వ ణకారముగాని, క్రింది ణకారమునకు మాత్రము నకారముగాని కలుగవచ్చును. రెణ్ణాళ్లు, రెన్నాళ్లు, రెణ్నాళ్లు, రెణ్ణెలలు, రెణ్నెలలు, రెన్నెలలు; రెణ్ణాళ్లు, ఏణ్ణాళ్లు (ఏణ్ణెలలు, ఏణ్నెలలు), ఈ రూపములలో ద్విత్వ ణకారమునకు ద్విత్వ నకారము గలుగదు. 'ఏను' (= ఐదు) పై 'నాఁడు' చేరినచో దానితుది 'ను' వర్ణము లోపించును; ఏనాళ్లు-'ఏను' పదముపై నెల చేరదు; అనఁగా ఏనునెలలు, ఏనెలలు, అను రూపములు గలుగవు; కాని, 'పదునేను నెలలు' అనవచ్చును. 'ఏను' పై 'పది' చేరుచో 'ను' వర్ణమునకు బిందువు కలుగును: ఏంబది, ఏఁబది; (ఏంభది, ఏంభయి) ఏంభై, శాసనములందు కానవచ్చుచున్నవి; వ్యవహారమున యాభై, యేభై); 'పది' అనుపదము పర

మగుచో 'నాలుగు' నకు 'నలు' ఆదేశమగును; 'ప' కు 'వ' ఆదేశమగును: నలువది; 'ఆఱు' నకు 'అఱు' ఆదేశము; 'పది' లోని 'పకు' 'వ' ఆదేశము: 'అఱువది'; 'ఏడు' నకు 'డె' ఆదేశము: డెబ్బది. 'ఎనిమిది' కి 'ఎను' ఆదేశము, 'ప' కు 'బ' ఆదేశము: 'తొమ్మిది' కి 'తొం' ఆదేశము. 'ప' 'బ' ఆదేశము: తొంబది. వ్యవహారమున 'నలు', 'అఱు' 'ఎను' అనువానికి 'నల, అఱ, ఎన' అని యగును; 'పది' ఇరవై, ముప్ఫై, నలభై, యాభై, అరవై, డెబ్భై, ఎనభై, తొంభై, అను సమాసములలో వై, ఫై, భై, లుగా మాఱినది. 'పది' పూర్వపదమగునపుడు 'పద, పదు, పన్' అను రూపములను దాల్చును. ఎనిమిది, తొమ్మిది. అనువానిలో నుత్తర పదమగు 'పది' 'మిది'గా మాఱి నది. 'ఇరు'వై నజంత సంఖ్యావాచకాద్యక్షికపదము చేరునపుడు దాని యికార మునకు దీర్ఘము కలుగును: ఈరాఱు, ఈతేడు.

(41) ప్రకృతియందుగాని, వికృతియందుగాని ప్రథమావిభక్తి ప్రత్య యము కానట్టి ముపర్ణమంతమందు గలిగి పూర్వపదముగా నిలిచిన 'నాము' మొదలగు కొన్నిపదముల తుది ముపర్ణమునకు బిందుపూర్వక పవర్ణమును, 'కనుము' మొదలగు కొన్నిటి తుది ముపర్ణమునకు 'ప' వర్ణమును సమాసమం దాదేశము లగును. విభక్తి ప్రత్యయముకాని 'మ్ము' అంతమందుగల కొన్నిపదములు సమాసమునఁ బూర్వమందు నిలిచినచో వాని తుది 'మ్ము' నకు 'ంప' ఆదేశమగును.

(i) నామ్వాదులు: నాము, పాము, ప్రే (పే)ము, వేము; నాఁప చేను, పాఁపజగము, ప్రే (పే)ఁప సజ్జ, వేఁపగింజ.

ఆము, ఈము, గాము, గీము, గోము, చీము, జాము, తూము, దీము, నోము, బాము, బోము - అనుపదముల తుది ముపర్ణమునకు పవ్వర్ణ మాదేశము కాదు. వీనిలో ఆము = అహము; ఈము = హీనుము; గాము = గ్రహము; గీము = గృహము; గోము = * గ ప్తమ్; చీము = * ఛిత్తమ్; జాము = యామము; తూము = ? ; దీము = దీమము; వై.; నోము = నుతిము; బాము = భవము; బోము = భూతము. ఇట్లు వీని తుది ముపర్ణము మూలమున ప్రథమావిభక్తికి సంబంధించినది గావున దానికి సమాసమున 'పబ్' వర్ణ మాదేశము కాలేదు.

(ii) 'మ్ము' అంతమందుగల పదములు: అమ్ము, ఎమ్ము, దమ్ము; అంప కోల, ఎంపపొగు, దంపసాగు. ఇమ్ము, ఒమ్ము, కుమ్ము, కొమ్ము, తుమ్ము, దిమ్ము, నెమ్ము, మమ్ము, తొమ్ము, వమ్ము - వీని తుది 'మ్ము' నకు 'ంప' ఆదేశము కాదు. ఇమ్ము = హితము; ఒమ్ము = అవహితము; కొమ్ము = ? ;

తుమ్ము = క్షుతము ; దిమ్ము = * ధృతమ్ ; నెమ్ము = నిర్హ్రేమము ; మమ్ము = ? ; ఱొమ్ము = ఉరము ; వమ్ము = వ్యర్థము = వై. వయ్యము.

'కుమ్ము' లోని 'మ్ము' నకు 'ంప' అని యొకప్పు డాదేశము కలుగుచుండె నేమో. చూ. కుంపటి = కుమ్మునకు సంబంధించినది ; అట్లే 'ఱొమ్ము' నందుఁ గూడ. చూ. ఱొంప = ఱొమ్మునకు సంబంధించినది.

(iii) కనుమ మ్వాదులు : అనుము, ఇనుము, ఉడుము, ఎనుము, కనుము, గినుము, జనుము, మినుము, మొరము ; అనుపచేను, ఇనుపకడ్డీ, ఉడుపతోలు, ఎనుపపాలు, కనుపగడ్డి, గినుపపనులు, జనుపనార, మినుపవడ, మొరపనేల (మొరపవాన వెల్లుగురిసె, భార. ద్రో. III).

చిడుము, చిలుము, తుడుము, పిఱుము, వెనము, పొడుము, పొళము, మునుము, మెఱుము, మెఱుము, సగము - వీని ము వర్ణమునకు ప వర్ణమా దేశముకాదు.

* 'గొనమ' అను 'మ' కారాంతపదమునకు 'గొనప' అను రూపాంతరము గలదు. ఇందు 'మ' కారమునకు 'ప' కారము వైరీతిగనే కలిగి యా రూపమే వ్యస్తముగఁ బ్రథమావిభక్తియందు నిలిచియుండవచ్చును. పదముల యాపవిభక్తికరూపములు కొన్ని ప్రథమావిభక్తియందు నిలుచుట కుదాహరణము లున్నవి : చూ. పాలు, పాఁడి.

(42) "ఆకారంబున కామ్రేడితంబునకుం దదర్థకంబునకు అయి, ఆయి అనుశబ్దములు విభాషనగును." 'ఆ+ఆ+కాలము' అనుచో ఆయా కాలము, అయ్యాకాలము, ఆయక్కాలము, అయ్యక్కాలము, ఆయయి కాలము, అయ్యయికాలము, ఆయాయికాలము, అయ్యాయికాలము ; 'అయి' కి 'ఐ' కలిగి 'ఆ యైకాలము, అయ్యైకాలము', అనికూడ నగును.

(43) సంబంధార్థమునఁ దచ్ఛబ్దములగు వాఁడు, అది (అమహద్వాచకము) అనుపదము లన్నిశబ్దములమీఁదను నుత్తర పదముగాఁ జేరి సమాస మగును : "నావాఁడు, నాయది ; ఇంటివాఁడు, ఇంటియది ; రామునివాఁడు, రామునియది." ఇట్టి సమాసములందు 'అది' యనుదాని తొలి అకారమునకు లోపమును గలుగును : నాది, ఇంటిది, రామునిది.

(44) ధాతుజ విశేషణములతో సమర్థములైన యన్ని పదములును జేరి సమాసము లగును : వచ్చినవాఁడు, వచ్చినయది, వచ్చినవీఁడు, వచ్చినయిది, చదివిన యెవఁడు, పడినయేది ; రానియప్పుడు ; చంపినపులి, పగిలినపలుక ; చచ్చిన రావణుఁడు ; వచ్చుచున్నము, పోవుచున్న బండి, మొదలఘునవి,

ఇట్లు సమాసములందు పూర్వపదములుగ నిలిచిన ధాతుజ విశేషణములపై అట్టి అను పదము వైకల్పికముగాఁ జేరుచుండును : వచ్చుచున్నట్టివాఁడు, వచ్చినట్టివాఁడు, వచ్చునట్టివాఁడు.

(45) నా, నీ, తన అను పదముల కుత్తరపదము పరమగునపుడు దుగాగమము వైకల్పికముగా నగును: నాదుమాట, నీదునేరము, తనదు రూపము. ఇట్టి రూపములు కేవలము గ్రంథస్థములు, వ్యవహారమున నిట్టి దుగాగమయుక్తరూపములు వినఁబడవు. 'యుష్మదస్మ దాత్మభ్యో ద్వితివర్ణకః' అను నాంధ్రశబ్ద చింతామణి సూత్రము ననుసరించి యందలి బహువచనప్రయోగము నాధారముగాఁ జేసికొని, కొంద ఱాధునికులు 'మనదు, మాదు, మీదు, తమదు' అనురూపములను బ్రయోగించుచున్నారు. కాని యిట్టి రూపములను వైయాకరణ ఛ్ఛాందస కవియగు నప్పకవి (తమదు నడకలు, తమదు పంచమములు) తప్పఁ బూర్వకవులలో సాధారణముగ నెవ్వరును బ్రయోగించియుండలేదు. వ్యవహారమున నేకవచనము మీఁదను బహువచనము మీఁదను దుగాగమము గలిగినరూపములు రెండును నస్వాభావికములు.

(46) గుణవచనములగు నల్ల మొదలగు వానిపైఁ గర్మధారయమున నిగాగమము బహుళముగా నగునని లాక్షణికు లందురుగాని వానిపైఁ జేరిన భావార్థకమగు 'న' వర్ణముపై మతుబర్థక 'ఇ' వర్ణము చేరినదని చెప్పుట యుక్తమగును: 'నల్ల' విశేషణము; 'నల్లన' భావార్థక తద్ధితరూపము; నల్లన + ఇ = నల్లని = నల్లదనముగల. ఇట్టి సమాసములందు చేరునది 'ఇ' వర్ణమేకాని 'ని' వర్ణము కాదనుటకు 'తెలిదమ్మి, వెలిదామర, చిన్ని కృష్ణుఁడు, పెద్దిభట్టు, మొదలగు సమాసములే నిదర్శనము. తెల + ఇ = తెలి; వెల + ఇ = వెలి; చిన్న + ఇ = చిన్ని; పెద్ద + ఇ = పెద్ది. భావార్థమున న వర్ణముచేరిన గుణవాచకపదములు సాధారణముగ నదంతములై యుండును. నల్ల, తెల్ల, వెల్ల, పచ్చ, ఎఱ్ఱ, చామ, తియ్య (తీయ), కమ్మ, పుల్ల, విన్న, తిన్న, సన్న, అల్ల, పల్ల, చల్ల, వెచ్చ, కోల, చక్క, చిక్క ఇవి నల్లాదులు. భావార్థక న వర్ణముచేరని కొన్ని గుణవాచక పదములమీఁద 'ఇ' వర్ణముమాత్రము చేరును: చిన్ని, తెలి, వెలి, పులి, సంజ్ఞావాచక పదములందుమాత్రము 'పెద్ద' పై 'ఇ' వర్ణముచేరును: పెద్దిభట్టు, పెద్దిరాజు మొదలయినవి. తెల, వెల, పల, చల, పుల, అను ద్విత్వ రహిత రూపములపై ని వర్ణము చేరునుగాని 'తెల్ల, వెల్ల' మొదలగువానిపై చేరదు. 'చిక్క' అనుదానికి 'చిన్న' అను నర్థముగలప్పుడు దానిపై 'ఇ' చేరును: చిక్కి-రెడ్డి. నల్లాదులలోఁ గొన్నిటిపై భావార్థమున జేరిన న వర్ణము మీఁదనే

'ఇ' వర్ణము చేరును; అనఁగా నల్లి, తెల్లి, ఎఱ్ఱి, పచ్చి మొదలగు రూపములు గలుగవు. 'చిన్న' అనుపదమును నవీనముగ నల్లాదులలోఁ జేరుచున్నది: చిన్నని, 'తెల్ల, వెల్ల, పుల్ల, చిన్న' ల తుది ద్విత్వమునం దొకహల్లు లోపించి వానిపై ని వర్ణముచేరును: తెలిదీవి, వెలిగారు, పులినీరు, చినికృష్ణుఁడు. ఇట్టి విశేషము లింకను గలవు. వీనియందెల్ల సమాసమునఁ దొలిపదముపైఁ జేరునది 'ని' వర్ణము కాదనియు, 'ఇ' వర్ణమేయనియు గ్రహింపవలెను.

(47) ఆ, ఈ, ఏ, వెందల, తల అనువానిపై 'కడ' అను పదము చేరునపుడు దాని తొలిహల్లునకు లోపము కలుగును: ఆడ, ఈడ, ఏడ, వెందలాడ, తలాడ. ఇట్లు పరపదాదిహల్లు సమాసములందు లోపించుట మఱికొన్నిచోట్లను కాన్పించుచున్నది.

(48) 'ద్వంద్వంబున ఋకారంబునకు ర వర్ణంబు విభాషనగు' నని చిన్నయసూరి 'ద్వంద్వేగ్రాణికే దీర్ఘాత్పరతోఽపి వికల్పతః' అను కారికను బట్టి నిర్వచించెను. ఈ కార్య మన్ని ఋకారాంత పదములమీఁదను గలుగునా యను సందేహము కలుగకపోదు. 'ఆనఙ్ ఋతోద్వంద్వే' అను పాణిని సూత్రముప్రకారము 'మాతృ + పితృ' అను పదములు 'మాతాపితరా' అను ద్వంద్వసమాసముగ నేర్పడును. ఇట్టి ఆనఙ్ ఆదేశము కలుగుటకు సమాసమందలి రెండు పదములును ఋదంతములుగ నుండవలెను: కావుననే 'పితృ పితామహులు' అని యగునుగాని 'పితా పితామహులు' అని కాదు. ఇట్టిచోట 'పిత్ర పితామహులు' అను రూపము కలుగదు. 'మాతరపితరావుదీచామ్' అను సూత్రమునఁ బాణిని ప్రత్యేకముగ నీ మాతృ, పితృ పదముల సమాసమునకుమాత్రము 'మాతర పిత(రు)లు' అను రూపవిశేషము నుదీచ్యులమతము ననుసరించి తెలిపియున్నాఁడు. ఈ 'మాతరపిత(రు)లు' అను దానిని మాత్రము కొందఱు తెనుఁగుకవులు మనస్సునం దుంచుకొని 'మాత్ర పితలు' అని ప్రయోగించియుందురు. పై యథర్వణకారిక ననుసరించి మాత్రపుత్త్రులు, పిత్రపుత్త్రులు, హోత్రపోతలు మొదలగు సమాసములను గల్పింపరాదు. "క్షత్త్రియవంశ్యులై ధరణిఁగావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ, క్షత్త్రియ వైశ్యశూద్రులనఁగాఁ గల నాలుగుజాతులన్ స్వచారిత్రము తప్పకుండఁగఁ బరీక్షితు కాచినయట్లు రామ మాం, ధాతృరఘుక్షితీశులు ముదంబునఁగాచిరె యే యుగంబులన్' (భార. ఆది. II.) అను పద్యమునందు 'మాంధాతృ' పదమునకు 'మాంధాత్ర' అని పాఠాంతరమును గొందఱు కల్పించుట పొరపాటు. 'త్రృ', 'త్ర', 'తృ' లకుఁ [illegible] బ్రాసము

చెల్లి, సంయుతాసంయుత ప్రాసమగును. ఈ 'మాంధాత్ర' అను భారత పద్యపాఠమును సమర్థించుటకే పై కారిక పుట్టియుండును.

(49) ఆచ్ఛికసమాసములందు సంబంధార్థ షష్ఠీబహువచనమున వచ్చు 'ల' వర్ణమునకు లోపము రాదు: గుణములప్రోక, మాటలప్రోగు, వంటలక్క, తమలపాకులమోద, సకినలమంచము మొదలగువానియందును లవర్ణమునకు లోపము కలుగదు.

ప్రథమావిభక్తిక మువర్ణము తప్పఁ దక్కిన విభక్తులు సమాసమందు లోపించుననియు, డుజ్, వు, ప్రత్యయాంతములు మీఁదిపదముతో సమసింపవనియుఁ గొందఱందురు. 'సుబ్బారాయుఁడు షష్ఠి' అని వ్యవహారమున నుండుట యింతకుముందు సూచింపఁబడినది. 'నట్టువ్రెజ్జ' అను సమాసము 'నట్టువ్రెజ్జనై పొలఁగుదు నగళులందు' అను భారతప్రయోగమునందు (విరా. I.) కాన వచ్చుచున్నది. ఇందు 'నట్టువ' అనునదే సరియగురూపముగాని 'నట్టువు' కాదని యెవరైనఁజెప్పి శబ్దరత్నాకరమును జూపవచ్చును. కాని, శబ్దరత్నాకరమున నీ పదము 'వ' వర్ణాంతమే కాని వు వర్ణాంతము కాదనుటకుఁ దగిన ప్రమాణములేదు. సం. నృత్య = ప్రా. ణట్ట = తె. నట్టు(వు), అని యగును. 'నట్టు' అను పదముకూడ నీ యర్థమందే కలదు. 'ధర్మ' శబ్దము 'ధమ్మువు' అయినట్లే 'నృత్య' శబ్దము వికృతియందు 'నట్టువు' అగునుగాని 'నట్టువ' అని కాదు. 'ప్రభువునాజ్ఞ' మొదలగు సమాసములందలి వు వర్ణ మాగమాత్మక మైనదనుట వైయాకరణకల్పిత సంస్కారముగాని, యా వువర్ణ మెన్నడును లోపింపనులేదు, మఱల రానులేదు. వు వర్ణము లోపించి మఱల నాగమముగా వచ్చినదనువారు 'ధర్మముతెలుఁగు' అను సమాసమునందును లోప పునర్దర్శన కార్యములు గలిగినదని యేల చెప్పరో తెలియదు.

సాధారణముగ తెనుఁగు సమాసములను సంస్కృత సమాసవిధానము ననుసరించి లాక్షణికులు వర్గీకరించుచుందురు. అట్టి వర్గీకరణము కొంతవఱకు మాత్రము పొసఁగును. సంస్కృత సమాసవిధానమునకు లొంగని యనేక తెనుఁగు సమాసములను వేఱువర్గములుగ నేర్పఱుపవలసి యుండును. ఈ భావమునే 'ద్విగుకర్మధారయే తత్పురుషద్వంద్వౌ బహువ్రీహిః, అన్యేచ కేచిదుపమానోత్తర పదలోప రూపకాఖ్యాస్యాః పరిదృశ్యా ఇహ' అను నాంధ్ర శబ్దచింతామణి సూత్రము వివరించుచున్నది. కాని, ద్విగుకర్మధారయములు తత్పురుష భేదములై యుండఁగా వానిని బ్రత్యేకించిచెప్పుట యనావశ్యకమని తోఁచుచున్నది. కాని యహోబలుఁ డాచ్ఛికసమాసముల నేర్పఱించు పట్ల నిట్టి భేదపరిగణనమావశ్యకమని సమర్థించియున్నాఁడు. అవ్యయీభావ సమాసము తెనుఁగున లేదనుభావముతోఁ గావలయు నది చెప్పఁబడలేదు.

ఉపమాన సమాసములు, ఉత్తరపదలోప సమాసములు, రూపక సమాసములు అను మూఁడు 'కేవలాచ్ఛిక సమాసములుగాఁ బైయార్యయందు తెలుపఁబడినవి. ఇంకను గేవలాచ్ఛిక సమాసము లిట్టి వుండుననియు నా యార్య తెలుపుచున్నది.. నన్నయ వివరించిన పై సమాసముల కహోబలుఁడు చేసిన వ్యాఖ్యాన మాచ్ఛికసమాసములకు సంబంధించినంతమట్టు కీ క్రింద వివరింపఁబడుచున్నది.

ముచ్చిచ్చు, మువ్వంక, మువ్వన్నె, ముప్పొద్దు, ముత్రోవ, ముక్కాక, ఇరుగడ, ఇరుమేను ఇత్యాదులు ద్విగుసమాసములు. మిశ్రసమాసముకాని ద్విగుసమాసము ప్రాయికముగా నేకవచనాంతమగును; మిశ్రసమాస మైనచో బహువచనాంతమగును; ఈ యేకవచన బహువచనాంతత్వ మితర సమాసములయందును నొకప్పుడు గలుగును. అమిశ్ర ద్విగుసమాసమునకు 'ముచ్చిచ్చు' మొదలగున వుదాహరణములు. (పాదంబు లిరుచేతఁబట్టి గుంజుండు - కాశీఖండము; ఇరుదెఱఁగున్న దీప్సితమె - ఆముక్తమాల్యద; ఇరుపెవి యెఱుఁగక యుండన్ - ఉత్తర హరివంశము; ఇట్టి ప్రయోగము లనేకములు గలవు.) (ప్రయోగ్రహణముచే 'ముక్కాకలు', 'ఇరుగడలు' మొదలగు బహువచనాంతద్విగుసమాసములును గలవని తెలియవలెను.) 'నల్గడలఁ జెదరఁగా' నని నన్నయప్రయోగము. మిశ్రసమాసముల కుదాహరణములు: ముజ్జగములు, ముల్లోకములు మొదలయినవి. (ప్రయోగ్రహణము మిశ్ర సమాసములకును వర్తించునట్లు తోఁచుచున్నది; ముజ్జగంబేలురాజు, ముల్లోకమున కధిపతి మొదలగునవి.) ఇతర సమాసములందు బహువచనమున కేకవచనము గలుగుట కుదాహరణము: 'తనకూడు సీరకై కాంచనమడిగి' అని తిక్కయజ్వప్రయోగము.

చిగురుటాకు, కఱకుటమ్ము, పండువెన్నెల, నల్లగలువ, తెల్లదమ్మి, తెల్లనితమ్మి, నల్లనివాఁడు, నల్లనియది - ఇట్టివి కర్మధారయాభాసములు. కర్తృత్వము కారకము నాశ్రయించినచోఁ గర్మధారయాభాస మగునని యధర్వణుఁడు. 'తెల్లదమ్మి' మొదలగువానియందు బిందువున్నదని (తెల్లఁదమ్మి, తెల్లందమ్మి) చెప్పు నాధునిక లాక్షణికోక్త మప్రామాణికము. (ఈ విషయ మింతకుఁబూర్వము చర్చింపఁబడినది.) 'అస్త్ర్యస్త్రీత్యుదీరిత' అను ప్రయోగానుసారముగ 'కలఁడు కలం డనెడువాఁడు' అను సమాస రూపకల్పనము చేయఁబడినది. 'పలరాచవారు' అను సమాసమున 'పరాశరమునీంద్రుఁడు' అను సమాసమున 'పరాశరుఁడు అను మునీంద్రుఁడు' అను విగ్రహమునందలి ఇత్యర్థకపదము లోపించినట్లే 'పలరాచ అను వారు' అని విగ్రహము చెప్పవలెను.

వడగఁదాల్పు, తేనెఁదిండి ఇట్టివి ద్వితీయాతత్పురుషసమాసములు. 'పట్టుఁ బుట్టముఁదాల్పు' అనునది యలుగ్ద్వితీయాతత్పురుషసమాసము. ఉలి తునక, నెలతక్కువబిడ్డ, ఇత్యాదులు తృతీయాతత్పురుషసమాసములు. 'ఉలి తునుక' షష్ఠీతత్పురుషసమాసము కూడఁ గావచ్చును. 'దేవరమేలు' మొదలగునవి చతుర్థీతత్పురుషసమాసములు. 'దొంగయలుకు' ఇత్యాదులు పంచమీతత్పురుషసమాసములు. దొరమానిసి, తేఁటిపిల్ల, మల్లెపూవు, జాబిల్లి వెన్నెల, గట్టుపట్టి, రాచకొలము, నేతిముంత, కూటికుండ, ఇత్యాదులు షష్ఠీతత్పురుషసమాసములు. 'మాటనేర్పరి' మొదలగునవి సప్తమీతత్పురుషసమాసములు.

డాలుడమాములు, కుంచెకాళంజులు, కాలుసేయి, ఊరువల్లెలు, తల్లిదండ్రులు, కీడుమేళ్లు, వెన్నెలచీ(సీః)కట్లు, పగలురేలు, కన్నవెంచినవారు, విన్నకన్నవారు, ఇట్టివి ద్వంద్వసమాసములు. కన్నవెంచినవారు, విన్నకన్నవారు మొదలగువానిలోని తుది 'వారు' అను తచ్ఛబ్దము సమాసము తొలిపదముతోడను అన్వయించును. వచ్చిరాములు, చేసిచేయములు, చొచ్చిచొరములు, అను ద్వంద్వసమాసములును సాధువులే. క్త్వార్థకశబ్దముతోడను గొన్ని యెడల ద్వంద్వసమాసములు గలుగవచ్చునని యథర్వణుఁడనెను. (ఇట్లే వచ్చుచుపోవుచుండువారు, వచ్చుపోవువారు. వచ్చుచున్న పోవుచున్నవారు మొదలగునవియు ద్వంద్వసమాసములే యనవలెను.) 'వచ్చీరానిమాటలు' ఇట్టి సమాసము లప్రామాణికములు. "వచ్చియును రానిమాటలు" అనుట సాధువగును. (కాని యిట్టి ప్రయోగములు గ్రంథములం దనేకములున్నవి. వినీ వినమింబురిలోని సైనికుల్ (జై. మి.); వినీ విననిభంగి (నై. ష. VI. 33); నరపతి నమ్మీ నమ్మక (భార. శాంతి. II. 351 1901. ముద్రణము.) ద్వంద్వసమాసములు సాధారణముగ బహువచనాంతములుగ నుండును. కాని, యొకప్పుడవి యేకవచనాంతములుగఁగూడ నుండవచ్చును. అప్పుడవి సమాహారద్వంద్వములగును: కాలుసేయాడు తఱియంద కదలవలయు (కాశీఖండము); కాలునేతి బల్ త్రొక్కుల (ఆముక్తమాల్యద); అరయంగాఁ బిన్నపెద్దయై యతఁడుండుక్ (కాశీఖండము); కూడు సీరకునింటఁగొదలేక యుండునే (హరవిలాసము); సంసారంబు వదల విడిచి కూడుసీరకు నవసియుండునట్టివాఁడు (భారతము: శాంతిపర్వము); ఇట్టి ప్రయోగము లనేకములు గలవు.) - వ్యవహారమున 'కూడూగుడ్డా, కూరాగాయా, కాలూచేయీ, పిన్నాపెద్దా, రాకాపోకా; ముందూవెనుకా, తేపూమాపూ, గొడ్డూగోదా-అని యీ రీతిగా సముచ్చయదీర్ఘము రెండుపదముల మీఁదను చేరుచుండును. గ్రంథములం దుత్తరపదము మీఁదఁగాకున్నను బూర్వపదము మీఁదనయినను సముచ్చయదీర్ఘము గలిగిన

ద్వంద్వసమాసముల కనేక ప్రయోగములు కాన్పించుచున్నవి. 'వెన్నామీఁగడయున్ ఫలంబానగిదన్ (కవిచిం.); రోళ్లా రోఁకండ్లఁబాడ (వరాహ. VII. 22); రాకాపోకకావించె (చంపూ.) అన్నాదమ్ములఁగని (హరి ఉ. IV. 15); తల్లీతామరయునుబోలి (హరి. V. 200); చల్లాయంబలి ద్రావితిన్ (శ్రీనాథ వీథి.) మొదలయినవి.

అలరువిలుతుఁడు, వేయిగంటి, వేఁడివెలుఁగు, చలివెలుఁగు, ముక్కంటి, నలువ, ఇత్యాదులు, బహువ్రీహిసమాసములు. 'కలకంఠుఁడు' అనునది మిశ్రబహువ్రీహిసమాసము. 'కలకంఠ' మొదలగునవియు హితములే యని యథర్వణోక్తి. మొదలగునవి యనుటచేత దినవెచ్చము మొదలగునవి గ్రహింపఁబడుచున్నవి. త్రినేత్రుఁడు, పీతాంబరుఁడు అను సమాసార్థము ననుసరించి 'మూఁడుకన్నులవాఁడు, పీతాంబరమువాఁడు, పట్టుపుట్టముదొర మొదలగునవి ఆభాసబహువ్రీహులగుచున్నవి. స్త్రీత్వమునందివి మూఁడుకన్నులయది, పట్టుపుట్టమునది మొదలగునవియు నాభాసబహువ్రీహులే. ప్రథమాది ప్రయోగము వలన నాభాసబహువ్రీహి యగునని యథర్వణుఁడు; ఇచట ప్రథమాంతమనఁగా తచ్ఛబ్దార్థకపదములును నితరశబ్దములును గ్రహింపఁబడును. 'వేఁడివెలుఁగు' మొదలగు వానియందును షష్ఠ్యర్థ వివక్షచేఁ బ్రథమాంత ప్రయోగము సాధువేయగును. కావున 'వేఁడి వెలుఁగువాఁడు' అనియు ననవచ్చును. 'కన్నులుమూఁడుగలవాఁడు' అనునది యాభాస కర్మధారయసమాసము. 'మెఱుఁగుఁబోఁడి' మొదలయినవి ఉపమానగర్భ బహువ్రీహులు. (బహువ్రీహిని స్త్రీవాచ్యంబగుచో నుపమానంబు మీఁది మేనునకుఁబోఁడి యగునని చిన్నయసూర్యాదులనిరి. ఇట్లనుట వైయాకరణసరణి. కాని, యిందు 'మేను' శబ్దప్రసక్తి యున్నట్లు కాన్పింప 'పోని = పోలిన' అను ధాతుజ విశేషణమువై 'స్త్రీ'వాచక తచ్ఛబ్దార్థక పదమగు 'అది' లోని, 'ది'వర్ణముచేరి 'పోనిది' అను రూపమేర్పడి, 'ని'మీఁది యిత్వము లోపించి 'ద'కారమునకు 'డ'కారము కలిగినది. మెఱుఁగుంబోని యది = మెఱుఁగుంబోనిది = మెఱుఁగుఁబోఁడి, ఇత్యాది రూపములు సిద్ధించుచున్నవి.) 'చౌదంతి' ఇది మిశ్రసమాసము; ప్రాకృతమునుండి వచ్చిన సిద్ధసమాసము. 'చతుః' అనునది ప్రాకృతమున 'చఊ = చౌ' అని యయినది; 'దంతి' అను దానియందు మార్పు కలుగలేదు. 'కర్మధారయసమాసముకంటె మతుప్ప్రత్యయము కలుగదనువిధి నిత్యముకాదు, కావున 'చౌదంతి' మొదలగు రూపములు సాధువులే.

కేలుదమ్మి, మోముదామర, కైచిగురు, మోవిపండు, అడుగుఁజివురు, మైదీఁగ, చెక్కుటద్దము, కన్నుగలువ, కానుమిన్ను - ఇట్టివి ఉపమానసమాస

ములు. (ఇం దుపమానవాచకపద ము త్తరపదముగా నున్నది. ఇట్టివాని నుప మానో త్తరపద కర్మధారయసమాసములనియు, ఉపమితసమాసములనియుఁ గూడ నందురు.) సామాన్యధర్మ ప్రయోగము లేని యెడల నుపమితము వ్యాఘ్రాది శబ్దములతో సమసించు ననుశాస్త్రము ప్రకారము పురుష వ్యాఘ్రుఁడు, రాజచంద్రుఁడు మొదలగు సమాసములు సిద్ధించుచున్నవి. తత్సాదృశ్యముచే 'మానిసిపులి, రాచచందురుఁడు' మొదలగు సమాసములను గల్పింపవచ్చును" అని యహోబలుఁ డనెనుగాని యుద్దిష్టార్థమునకు బాధ కము కలుగునప్పు డట్టి సమాసములను చేయఁగూడదు. మనుష్యుల మీఁదికి పులివంటివాఁడు, మనుష్యుల చంపువాఁడు, అను నర్థమును 'మానిసిపులి' యనుసమాసమువలన ద్యోతకమగుచున్నది గావున శ్రేష్ఠార్థమం దా సమా సము నుపయోగింపఁ గూడదు. రాచచందురుఁడు మొదలగు సమాసములు తెనుఁగు నుడికారమునకు దూరములు. ఇట్లే కరకిసలయము, అధరపల్లవము మొదలగు సమాసముల సాదృశ్యము ననుసరించి కైచిగురు, మోవిచివురు, మొదలయినవియు తెనుఁగు నుడికారమునకు భిన్నములు. పూర్వపదము నర్థ ముం దుత్తరపదము నర్థధర్మము నారోపించి చెప్పినయెడల రూపకసమాస మందురు. కేలుదమ్మి మొదలయిన విట్టివే.

పండుమోవి, తమ్మికేలు, తీఁగకౌను, తామరడుగు మొదలయినవి ఉపమానపూర్వపదకర్మధారయ సమాసములు. సంస్కృతమున వ్యాఘ్ర శూరుఁడు, చంద్రసుందరము, సింహవిక్రముఁడు మొదలగున విట్టివే.

జవ్వాజిసెట్టి, పచ్చళ్లబాపిత, గాజులసెట్టి ఇట్టివి ఉత్తరపదలోపిసమాస ములు. (వీనిని మధ్యమపదలోపి సమాసములనుటయుఁ గలదు). ఇట్టి సమా సముల విగ్రహమునఁ బూర్వపదమును ద్వితీయావిభక్తియందు చెప్పి దాని పై లోపించిన పదమును జేర్చి విగ్రహమును బూర్తిచేయవలెను (జవ్వాజిని అమ్మనెట్టి, పచ్చళ్లను చేయు బాపిత, గాజులను అమ్మనెట్టి మొ.). (తిక్కన భారతము = తిక్కన (రచించిన) భారతము.)

అఱగన్ను, క్రేగన్ను, సామేను, కొనచేయి, వెడతల మొదలగున వేక దేశిసమాసములు. (ఇవి పూర్వకాయము, అర్ధరాత్రము మొదలగు సంస్కృత సమాసములవంటివి.)

తావిమొల్ల, పువ్వునీళ్లు, ఇట్టివి మతుప్సమాసములు (వీనిని గూడ నుత్తరపదలోపిసమాసములని చెప్పుటయే యుక్తము. తావి(గల)మొల్ల, పువ్వు(లుగల) నీళ్లు అని వాని విగ్రహము). 'పువ్వుయొక్క నీరు' అని విగ్ర హము చెప్పుచో షష్ఠీతత్పురుషసమాసమగును.

'పూర్వాపరాధరోత్తర మేకదేశి నైకాధికరణే' 'అర్ధమ్ నపుంసకమ్' అనునిట్టి పాణినీయ సూత్రముల స్వారస్యము ననుసరించి 'క్రేగన్ను, సామేను' మొదలగు సమాసములు యుక్తములయినను తెనుఁగున 'కనుక్రేవ, మేను సగము, వైసగము' మొదలగు నిట్టి యాచ్ఛికసమాసములును తెనుఁగునఁ గలవు. 'రాజహంస' మొదలగు సాంస్కృతిక సమాసముల ననుసరించి 'రాయంచ, రాచిలుక' మొదలగు నాచ్ఛికసమాసములును గలవు.

సమాసములోని రెండుపదములును విశేషణము లయినయెడల దానికి విశేషణోభయపద కర్మధారయమని పేరు. 'పండితుఁడును గవియునైనవాఁడు' అను నర్థమున 'పండితకవి' అను సమాసమేర్పడినట్లే ఎత్తును పల్లమునైనది 'ఎత్తుపల్లము' అను నాచ్ఛికసమాస మేర్పడును.

సంస్కృతమున 'ఇతి' అనునదియు, తెనుఁగున 'అను' అనునదియు పూర్వోత్తర పదములకునడుమ లోపించిన సమాసము సంభావనాపూర్వపద సమాసము : వింధ్యపర్వతము (వింధ్య ఇతి పర్వతః); మఱ్ఱిచెట్టు (మఱ్ఱి అను చెట్టు) మొదలయినవి.

తపోధనము = తపస్సేధనము - ఇట్టివి అవధారణ పూర్వపదసమాసములు. చెప్పుడుమాట, ఉంపుడులంజ మొదలగున విట్టిసమాసముల కుదాహరణములు కావచ్చును.

కేశాకేశి, దండాదండి, మొదలగు నిట్టి వ్యతిహారలక్షణ బహువ్రీహి సమాసములు తెనుఁగునను గలవు : హోరాహోరి, ఎకాయెకి మొదలయినవి.

తెనుఁగున నవ్యయీభావసమాసములకీ క్రింది యుదాహరణముల నీయవచ్చును :—

(1) ఉవ్వెత్తు, కలకాలము, తలక్రిందు, డబ్బాటు, ఉరువడి, బరువడి, వెంబడి—వీనియం దుత్తరపదము అవ్యయ ప్రతిరూపక విశేష్యముగా నున్నది.

(2) ఎల్లుండి, రేపాడి, వీనియం దుత్తరపదము క్త్వార్థకరూపమై విశేష్యార్థమును గలిగించుచున్నది.

(3) ఉండుండి, ఉండియుసిగి, ఇటఁబట్టి, కాఁబట్టి, కనుకని, పడంపడి - వీనియం దుత్తరపదము క్త్వార్థకరూపమై యవ్యయములఁ గల్పించుచున్నవి.

(4) ఇందనుక, ఎడపడదప, క్రచ్చఱ, తెకతేర, - వీనియం దుత్తర పదము తుమున్నర్థకమై యవ్యయములను గల్పించుచున్నది.

(5) ఇంటిల్లిపాది, ఒండొండ, త్రైభ్భాత్రి, మేమెయి - ఇట్టి సమాసములును గలవు.

షష్ఠీతత్పురుషసమాసమందు ప్రాచీనగ్రంథముల నగాగమము వైకల్పికముగాఁ జేరుట కలదు: ఉదా. ఎలజవ్వనంబున విలసనంబు. ఈ కార్యము సప్తమీతత్పురుషమందును గొన్నియెడలఁ గాన్పించుచున్నది: వారణావతంబున వారు; విశ(శా)ఖపట్టణమున కోమటి (శాసనము).

బిరుదపద ముత్తరపదముగా నిలిచినపుడు స్త్రీ పుం సంజ్ఞావాచకా దుదంతపదముల తుది యచ్చునకు దీర్ఘము బహుళముగా నగును: రామాశాస్త్రి, హనుమానాయఁడు, గుండూరావు. 'కొన్నియెడల నిచ్చో న నా హా మా యాగమంబులగు' నని ప్రౌఢవ్యాకరణకారుఁడనెనుగాని, పట్టియెడలి 'అన్న, అప్ప, అమ్మ, అయ్య' అను పదములందలి ద్విత్వ వికల్పమువలనఁ గలిగిన 'అన, అప, అమ, అయ' అను రూపములుగాని యవి యాగమాక్షరములు కావు: తిక్కన సోమయాజి, నన్నపార్యుఁడు, కృష్ణమనాయుఁడు, నన్నయభట్టు. 'వై యాగమంబులు కొన్నియెడల ద్విత్వ యుక్తంబులగు' నను వచనముచేతనే వై యూహ దృఢమగుచున్నది.

ధాతుజ విశేషణములమీఁద తథార్థకావ్యయము చేరి కర్మధారయ సమాసమగును: భానుఁ డోత్తముల్ వేదముల్ సదువునట్లు; కడుం బెద్ద దవ్వు పోయినయట్లు మొదలయినవి.

తథార్థకములకును, నివార్థకములకును దెనుఁగున భేదము కాన్పింపదు. 'అట్లు' నకు 'అట్టి'యు, 'పోలెన్' కు 'పోని', 'పోఁటి' అనునవియు, 'వలెన్' కు వంటియు విశేషణరూపములు. ఇవార్థకపదముల ప్రయోగవైచిత్రి యీ క్రింద చూపఁబడుచున్నది. ఇవి పూర్వపదములతోఁ జేరి కర్మధారయసమాసములగుచున్నవి.

1. అట్లు.

ఉపమేయము ప్రథమాంతమగునపుడు 'అట్లు' పరమైనచో నుపమానములగు నామ తదస్మద్యుష్మదాత్మార్థములకు షష్ఠియగును: నారాయణునట్లు, వానియట్లు, నాయట్లు, నీయట్లు, తినయట్లు మొదలయినవి.

2. అట్టి.

అట్టి, యిట్టి, యెట్టి విశేషణములమీఁది తచ్ఛబ్దవకారమునకు లోపము విభావనగు: అట్టిఁడు, అట్టివాఁడు; ఇట్టిఁడు, ఇట్టివాఁడు; ఎట్టిఁడు, ఎట్టివాఁడు.

3. పోని.

భారతమున 'క్రొమ్మెఱుంగునుంబోని' అనునట్లు సముచ్చయమగు 'ఉన్' పైఁ 'బోని' చేరుచుండును. 'పోని' అనునది ధాతుజవిశేషణము; 'పోలిన' అనుదాని రూపాంతరము. 'క్రొమ్మెఱుఁగుంబోని' అనునట్టి సముచ్చయ

రహితరూపములు తరువాతికాలమున వ్యాప్తినొందినవి. (చూ. వరాహ. VI. 16.) ఇట్లే 'నినుఁబోలు సాధ్వి' (రామాభ్యు. V. 78) వంటి రూపములు 'పోలు' అను క్రియాజన్యవిశేషణములతో రానురాను భాషయందు చేరినవి.

4. పోలె.

'పోలెన్' తోడి యివార్థకరూపములు భారతానంతరమునను నిలిచినవి—ఉదయించు వడువుఁబోలె (కుమా. భా. I. 272); కలభాషిణికిఁ బోలె (క శా. II. 36); మోహిఁబోలె (పాండు. II. 219; భారతభాషప్రకారము 'మోహియుంబోలె' అని యుండవలెను); చూచుటకుంబోలె (పాండు. III. 98); ఏనుబోలె (కాశీ. I. 10); ఎఱుఁగనిదానిఁబోలె (శకు. పరి. III. పు. 54); ననుఁబోలె; నినుంబోలె (శశాం. III.); అట్లపోలె (వరాహ. II. 19).

పై యుదాహరణములనుబట్టి 'పోలె' పరంబగునపుడు దానికిఁ బూర్వమందున్న పదము ప్రథమా, ద్వితీయా, షష్ఠీ విభక్తులం దుండవచ్చుననియు, అస్మద్యుష్మచ్ఛబ్దంబులు మాత్రము దానికి పూర్వపదములై, ప్రథమయందుండవనియుఁ దెలియనగును.

వడునాఱవశతాబ్దమునాఁటికి 'వలె, బలె' అనునవి యివార్థములుగ గ్రంథములందు గానవచ్చుచున్నవి.

5. వలె.

i. ప్రథమపై: పుష్పాదివలె (వరాహ. IV. 168); ఇంద్రుండువలె (వరాహ. III. 58); దోసకాయలువలె (వరాహ. III. 24); గుండువలెన్ (పాండు. V. 240).

ii. ద్వితీయపై: మఁతోటన్వలె (రామాభ్యు. V. 87); ఇంద్రున్వలెన్ (ఉ. రా. I. పు. 22).

iii. షష్ఠిపై: మీవలెన (ఉ. రా. పు. 88); తనవలె (ఉ. రా. V. పు. 91); నీవలె (పాండు. V. 19); వారివలెన్ (ఉ. రా. పు. 165).

iv. క్రియపై: తిప్పకాయవువలె (ప్రభులిం. పు. 66.)

v. అవ్యయముపై: ఇటువలె (రామాభ్యు. VI. 65; వరాహ. V. 92; ఉ. రా. పు. 14; దశావ. పు. 58); మున్నువలె వరాహ. V. 124.)

6. బలె.

i. ప్రథమపై: మీరుబలె (వరాహ. II. 88); నేనుబలె (వరాహ. II. 51); పెద్దవాఁడు బలె (ఉ. హరి. IV. 65).

ii. ద్వితీయపై: సముద్రముంబలె (రామాభ్యు. VII. 188); మీరివారింబలెన్ (వరాహ. II. 18).

iii. షష్ఠిపై: దానికింబలె (కళా. II. 19); కేసరిమీఁదికింబలె (రామాభ్యు. VII. 246); ఇల్లాలిబలె (వరాహ. I. 32).

iv. సముచ్చయముపై: విశేషంబులుంబలె (కళా. III. 9); దక్కినదింబలె (రామాభ్యు. V. 138); కల్పవల్లియుంబలెన్ (రామాభ్యు. VI. 158.) పై యుదాహరణములవలన 'బలె' అనునది పరమగునపుడు నామతచ్ఛబ్దార్థములకు ప్రథమయేకాక ద్వితీయా షష్ఠులుగూడఁ గలుగుననియు, అస్మదర్థప్రభృతులకు ప్రథమకూడఁ గలుగవచ్చుననియుఁ దెలియనగును.

7. బోఁటి.

i. ద్వితీయపై: ననుబోఁటికి (పాండు. IV. 63); మముబోంట్లు (ఉ. హరి. II. 11); మముబోంట్లకున్ (కళా. II. 71); నినుబోఁటి (కాశీ. III. 150); మిమ్ముబోఁటులు (ప్రభులిం. IV. పు. 62); మిముబోఁటులు (వరాహ. XI. 41; కళా. I. 187);

ii. షష్ఠిపై: మా బోఁటులకు (ప్రభులిం. I. పు. 9); మాబోంట్లు (వరాహ. XI. 116; కళా. I. 178); మనబోంట్లు (కాశీ. VI. 76); మీ బోంట్లు (కళా. III. 61.)

8. వంటి.

i. ప్రథమపై: దేవరవంటి (వరాహ. I. 15; పాండు. II. 205); దిగ్గజమువంటివాని (,, I. 32); నేఁడువంటి (వరాహ. II. 147); కార్చిచ్చువంటి (వరాహ. V. 117); ఆకాశమువంటి నడుము (వరాహ. VI. 10); పూఁత పసిండివంటి (మను. III. 33); పొగడపూవంటి (మను. V. 98); సుడివంటి నాభి (ప్రభులిం. I. పు. 8); పుండువంటి చలి (పాండు. II. 29); నూఁబూవువంటి నాసిక (హరవి. III. 23).

ii. షష్ఠిపై: నావంటి (శకుం. పరి. II. పు. 43); ననువంటి (వరాహ. VII. 90); మనవంటి (ఉ. రా. పు. 33); మావంటి (మను. I. 65; వరాహ. I. 114); మమువంటి (నమి. III. 16), నీవంటి (వరాహ X. 2); మీవంటి (వరాహ. III. 101; 108; V. 40; మను. I. 65; ప్రభులిం. I. పు. 8); అతనివంటి (నమి. VI. 25); తనవంటి (వరాహ. IX. 17); పులులవంటి (వరాహ. III. 28); క్రొమ్మెఱుఁగులవంటి (వరాహ. IV. 156); మెఱుఁగులవంటి (వరాహ. VI. 52).

iii. ద్వితీయపై: నినువంటి (నమి. II. 6); నిన్నువంటి (నమి. II. 4; వరాహ. VI. 33); మిమువంటి (ఉ. రా. I. 11); మిమ్మువంటి (ఉ. రా. V. పు. 91).

iv. అవ్యయముపై: అటువంటి (రామాభ్యు. VII. 226); ఇటువంటి (ప్రభులిం. I. పు. 10; ప్రభా. III. 57; కళా. VI. ౭; ఉ. రా. V. పు. 85; విక్ర. VII. 131); ఎటువంటి (ప్రభులిం. II. పు. 88; కళా. III. 83; రామాభ్యు. VII. 102; వరాహ. II. 145; ఉ. రా. I. పు. 16; దశావ. పు. 44).

'వంటి' 'అంటి'గా కూడ వ్యవహారమున మారినదో, 'అట్టి' 'అంటి' అను ననునాసికోచ్చారణము నొందఁగా 'వ'కారమాగమముగా వచ్చినదో తెలియదు. 'అంటి' గ్రంథములలోని కెక్కినది: మునుపంటిపురము = మునుపటివంటిపురము (పాంచా. పరి. IV. పు. 33).

లాగు, తరము, తోయము, పగిది మొదలగునవియుఁ దెనుఁగున నివార్థములుగ వాడఁబడుచున్నవి: మహానాగంబులాగున (వరాహ. III. 52); మీతరమువారు (మను. IV. 108; పాండు. VI. 44); ఆతోయము (కాశీ. VI. 7;) ఈతోయము = ఈమాఱు; (కాశీ. VI. 29); ఈతోయము= ఈగుంపు, (కాశీ. VI. 35)-అను నర్థములు గూడఁ గలవు); పగిది (వరాహ. IV. 162) మొదలయినవి.

ఇవార్థముపైఁ దిరుగ నివార్థకపదము గ్రంథములందు కాన్పించు చున్నది: నిలిపినభంగివోలె (కుమా. భా. II. 55); వచ్చువడువువోలె (కుమా. 64); చాడ్పునఁబోలె (కుమా. 259).

కొందఱు కవులకుఁ గొన్నికొన్ని యివార్థకపదములపై నభిమానము గలదు. నన్నయకు 'విధంబున, పోలె, పోని' మొదలగున విష్టములు. తిక్కనకు 'పరుసున' ఇష్టము.

వ్యవహారమున 'మోస్తరు' అనున దొకటి కలదు. అది కవుల గ్రంథములలోని కెక్కలేదు. ఇఁక ముం దెక్కవచ్చును.

కొన్నియెడల నుపమానము లనేకము లగునపుడు ఇవార్థకశబ్దము తుది దానిపై మాత్రము చేరును: కమలమండంబు నాగలోకంబు దలిరుఁ బొన్పు కల్పాంతమున జముబానసంబు నింటిలోపలఁబోలె (నిర్వ. IV); పీంద్రును వాంద్రునుబలె (ప్రభా. I).

పోలె ప్రభృతులు క్రియాపదములమీఁదను కానంబడుచున్నవి; అట్టి యెడఁ గ్రియాపదముపై సముచ్చయార్థకమగు 'ఉన్' కూడ చేరవచ్చును: శోకతప్తంబయిన తనహృదయంబుఁ దడుపుచున్నదియుంబోలె (భార. అర. II); ధర్ముఁ గూర్మిఁ గొనరుచున్నది పోలె.—ఒకప్పుడ సంపూర్ణక్రియల మీఁదను నవి కాన్పించును: పయుటకొంగది మాన్పఁగఁ బోలెఁ గాళ్లపైఁ బ్రబ్బికొనన్ (కళా. VIII).

తెనుఁగున నాచ్ఛికసమాసములు గలుగునప్పుడు తఱచుగ స్త్రీసమ పదము లొకదానివెంబడి నొకటిచేరుచు నెట్టి వికారములను బొందకుండ నిలుచును. జున్నుగడ్డ, సేతుకట్ట, వాడవదినె, పోగుపోఁత మొదలగునవి. పూర్వపదము లౌపవిభక్తికము లగుచో నౌపవిభక్తిక రూపములతోడనే నిలువవచ్చును: ఇంటికప్పు, జుంటితేనె, కంటిపాప, వాతిబియ్యము;—కన్నీరు, జున్నుగడ్డ, అనురీతిగా నుపవిభక్తులు చేరకయు నుండవచ్చును.

బహువ్రీహిసమాసములం దుత్తరపద మొకప్పు డౌపవిభక్తికముగ నుండవచ్చును: ముక్కంటి, కడలిచూలి, వెఱవింటి మొదలయినవి. ఇట్టివానియం దుత్తరపదముపైఁ జేరిన యివర్ణము మత్వర్థీయ తద్ధిత ప్రత్యయమైనను గావచ్చును. ఉపవిభక్తులు చేరియే కాక యితర లోపాదేశాగమములు గలిగియు నాచ్ఛికసమాసము లేర్పడుననుట కుదాహరణము లింతకుముందీయఁబడినవి. పూర్వపదముగాని, యుత్తరపదముగాని వికారము పొందకయుండు నాచ్ఛికపదములు మూఁటికంటె నెక్కువగఁ జేరి సాధారణముగ సమాసములు కానేరవు. నందెమల్లియసౌరు, మొదలయినవి. గాలిమేపరి పాన్పువాఁడు, కడలిరాచూలియల్లుఁడు - ఇట్టి సమాసములు తెనుఁగునకు సహజములుకావు. కొన్నిపదములయినను వికారమును బొందినచో నాచ్ఛికసమాసము కొంత దీర్ఘము కావచ్చును: వంటయింటికుందేటివదువు మొదలగునవి.

సమాసమనుపదమునకు శబ్దపరముగను నర్థపరముగనుగూడ వ్యాఖ్యానము చేసికొనవచ్చును. వ్యాకరణమునకు శబ్దముతోడనే కాని యర్థముతో సంబంధముండదు. అర్థము న్యాయమునకు సంబంధించినది. కాని, శబ్దార్థముల కవినాభావసంబంధ ముండుటచే నారెంటిని విడదీయ వీలులేదు. కాని, వైయాకరణులును నైయాయికులును వానిని వేఱుచేసి యొండొరులతోఁ బోరాడుట సంప్రదాయమైనది. శాబ్దికులు తాము కల్పించుకొనిన సంకేతములను పడియచ్చులలోని కాయూరూపముల నిరీక్షింపఁ జూతురు. అట్లుచేయుట యర్థవిరుద్ధమును ననహజమునైనను వ్యాకరణశాస్త్రము ప్రకార మారీతిగనే వ్యాఖ్యానింపవలెనని శాసింతురు. నైయాయికు లీ మార్గమున కొప్పుకొనక యర్థమునకే ప్రాధాన్యము నిత్తురు. సమాసములవిషయమున మాత్రము శాబ్దికులు నైయాయికమతమునకు లోఁబడక తీఱినదికాదు. సమాసములందు పృథగ్భూతంబులైన యర్థంబుల కేకార్థీభావము కలుగును. అట్లేకార్థీభావము నొందఁగలపదములే సమర్థములై సమసింపఁ గలవు. కావుననే పృథగ్భూతంబులయిన పదంబు లేకపదంబగుట సమాసంబగునని చెప్పక, సమర్థంబులయి పృథగ్భూతంబులయిన పదము లేకపదంబగుట సమాసం బగునని చెప్పవలసివచ్చినది.

ఇట్లు పృథగర్థముల కేకార్థీభావము కలుగునప్పుడు పదముల ప్రాతిపదిక రూపములే పూర్వపదములుగ నిలువవలయు నను నియమము కలుగదు. కావు ననే లుక్సమాసములే కాక యలుక్సమాసములును శాస్త్రసమ్మతములైనవి. తెనుఁగున సాధారణముగ నన్నియుఁ 'ప్రథమా విభక్త్యంతపదము పూర్వ మందుగల సమాసములే యుండునని చెప్పవచ్చును. డుజ్, ము, వు, లు, మాత్రమే ప్రథమావిభక్త్యంతము లనుకొనుట పొరపాటయినట్లు తోఁచు చున్నది. 'రాముఁడు' వనము, తరువు మొదలగునవెట్లు ప్రథమావిభక్తి యందున్నవో, మాట, చీఁకటి, మ్రాను, సందె, గూఁడు, పాము, పురువు, మొదలగునవియుఁ బ్రథమావిభక్తియందే యున్నవి. అవి స్త్రీసమములనుట శాస్త్రార్థముగాని వాస్తవికము కాదు; అవి ప్రాతిపదికములును బ్రథమారూప ములునుగూడ నగును. తెనుఁగు పదములకుఁ బ్రాతిపదికమనియుఁ బ్రథమా రూపమనియు భేదములేదు. పూర్వపదముల కొకవేళ సమాసమందు వికారము కలిగినచో నవి యలుక్సమాసములుగనే నిలుచుచున్నవి. కావున నర్థమును బట్టి యొక విభక్త్యర్థమున మఱియొక విభక్తిరూపము నుపయోగించినను తెనుఁగున విభక్తి రూపమున కెన్నడును లుక్కు కలుగదు. అందువలనఁ దెనుఁగున సమాసములన్నియు నలుక్సమాసములే కాని లుక్సమాసములు లేవని చెప్పవచ్చును. కొన్నియెడల సమాసమందలి పూర్వపదము ప్రాతిపదిక రూపముఁ దాల్చినను నది సంస్కృతసిద్ధసమాసమునకు వికృతియని చెప్పవచ్చును గాని, ప్రత్యేకార్థికపదముల కూడికవలన నయినదని చెప్పఁగూడ దనవ వచ్చును.

తెనుఁగున నర్థప్రాధాన్యమును వహించిన సమాస విధానమువలన దీర్ఘసమాసములకు తావేర్పడినది. కొన్ని యుదాహరణములు మాత్రము చాలును :

"ఘనదురితానుబంధ కలికాలజ దోషతుషార సుహాతిం
దనయుదయప్రభావమున దవ్వఁగఁజోపి, జగజ్జనానురం
జనమగు రాజ్య సంతత వసంత నితాంత విభూతి నెంతయుం
దనరుఁజళుక్యమన్మథుఁడు"—ఇదియంతయు నొక్క సమాసము.
"హిమకరుఁదొట్టి పూరుభరతేశకురుప్రభు పాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణ శోభితులైన పాండవ్యా
త్తములచరిత్ర"—ఇదియంతయు నొకసమాసము.
"ఇనుమును రాగియుఁ దగరంబును వెండియుఁబసిఁడియుం బ్రభూతములై పే
ర్చిన సిరిఁజేయఁనొప్పెడు, ఖనులు"—ఇదియంతయు నొక్కటే సమాసము.

"అంబకై పూనివచ్చి బలాధికుండు జామదగ్న్యుండు సాధింపఁ జాల కున్న వాని (భీష్ము)"-ఇట్టి సమాసములకు 'సమాసక'ము లని లాక్షణికులు పేరిడిరి.

"నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు" అని చెప్పి నిక్కల, కవ్వడి; పువ్విలుకాఁడు, అనుమూఁ డుదాహరణములను మాత్ర మిచ్చెను. వీనికి వ్యాకరణ శాస్త్రప్రకారము విగ్రహమును గల్పించుటకు సాధ్యముకాక కావలయు నాతఁడు వానినట్లే గ్రహింపవలెనని చెప్పివిడిచెను. ప్రౌఢవ్యాకరణకారుఁడును వీనికి విగ్రహమును గల్పింప యత్నింపలేదు; కాని, తన శబ్దరత్నాకరమున 'కవ + వడి = కవ్వడి' యనియు, 'నిక్కము + కలి = నిక్కలయనియు పదములు వేఱుచేయఁబడినవి. కొందఱు పెత్తనము, వేఁగు రుఁజుక్క, చిత్తరుబొమ్మ, ఎగాదిగ, ఎగుదల, బళాబళి, హాళాహాళి, పోటాపోటి, ఎడవంక. వలవంత, అవతల, ఇవతల, బెబ్బులి మొదలగు సమాసములను పై వానికిఁ జేర్చియున్నారు. వీనిలోఁ గొన్నిటికి శాస్త్రమును గల్పింపవచ్చును. కాని కొన్నిటి వ్యుత్పత్తులు మఱుఁగుపడి యుండుటచే వాని విగ్రహవాక్యము లను వివరింప వీలుపడకున్నది. ఇట్టి సమాసములు తెనుఁగున ననేకములు గలవు. ఇవి యన్నియు వైకృత సమాసములయి యుండవచ్చును; అనఁగా సంస్కృత సిద్ధ సమాసములకు వికృతులు కావచ్చును.

పూర్వపదము నర్థము మఱుఁగుపడినవి.

ఉజ్జవ (ఉజ్ఝిత?) కల్లు, ఒమ్మచ్చు, ఒఱగడ్డము (ఒఱఁగు + అడ్డము? ఒఱ + గడ్డము?), ఒఱగొడ్డెము (ఒఱఁగు + ఒడ్డెము?, ఒఱ + గొడ్డెము?), ఓరచ్చులు (ఓరు + అచ్చు?), ఓల (?) గందము, కర (?) గోడ, కారగ్గి (కాడు + అగ్గి), 'కారు' 'కాడు' నకు రూపాంతరము కావచ్చును), కుం ? పెరుగు, గ (?) గ్గోలు, గో (?) బ్బందు, చరి (?) కుండ ('చలి' కి 'చరి' రూపాంతరమా? చలిదియన్న ముంచు కుండయేమో), చి (?) త్తడి (చిత్త్ర= చిత్ర + తడి?), దుం (?) బోడి (దుమ్ము + పోడి?), పంచకర (?) పాటులు, పడ (?) సాల (శ. ర. పడము + సాల, పడము = అందలము క్రింద పఱచెడు రత్నకంబళము; ఈ యర్థమునకును 'పడసాల' లోని 'పడ' కును సంబంధమ లేదు. 'పడ' 'పథ' శబ్దభవమేమో; ఇంటియందు నలుగురును నడచెడు తావు నకు పడసాలయందురు); పడి (?) వాగె (పడి = ప్రతి?), పర (?) గడువు; పుదియ (?) బొట్టు; పొరి (?) చూపు (పొరి = పొలి?) పొల (?) యలుక ('పొల్ల + అలుక' అని శ. ర.), పొలు (?) నోరు (పొల్లు + నోరు, అని శ. ర.); మెఱమెచ్చు ('మెచ్చు + మెచ్చు' అని శ. ర; కన్నడము: మెఱచు=మెచ్చు = మెచ్చు, మెఱ (చు) + మెచ్చు = మెఱమెచ్చు); మేలుబంతి (మేలు + బంతి;

కన్నడము, అఱవము, మళయాళము: మేల్ = మీఁదిభాగము; ఈ యర్థమున 'మేలు' కుఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు); వల్ల (?) కాడు 'వల్లడి=ఆపద+కాడు' అని శ. ర. కాని 'వల్ల' పదము 'ఒలికి' ఒలుకుల (మిట్ట) అను పదములతో సంబంధించి యుండును. ఒలికి యనఁగా సొదపేర్చెడిచోటు); వాలు (?) మగఁడు (వాలు = ఖడ్గము అను నర్థము సరికాదేమో); వెరవేఁకి ('వెర' 'విరహ' శబ్దభవము; దీనికి వ్యస్తప్రయోగము లేదు); సంగ (?) మడుఁగు (సంగడ + మడుగు; 'డ' లోపము; కన్న. సంగడ = సమీపము; తె. సంగడము); సర (?) కట్టు (సరము=స్వరము ('ము' లోపము)+కట్టు); సవ (?) దంగవల (సవ=జాడ, అనునర్థము సరిపోదు); సురే (?) కారము; సెల (?) కోల—కట్టె, (సెల = ముల్లు; కొనను ముల్లుగలకోల, కట్టె); సేస (?) ఁబ్రాలు—కొప్పు (సేస=సం. శీర్ష); పీ (?) తోలు=పైనుండు సన్నని చర్మము; కంబర (?) త్రాడు (కంబర = కొబ్బెర; చూ. హిం. కోప్రా); గునా (?) మొలనూలు (చూ. కన్నడము: గున్నాంపట్టె = బంగారుపూత పూసినపట్టె; అఱవము: కురునాత్తగడు = ముచ్చెబంగారు మూసిన పళ్లెము); అల్లి (?) తెమ్మెర (అఱవము: అలరి = పరిమళముగల + తెమ్ = తేమగల ఎరల్ = గాలి, సౌరభమును శైత్యమునుగల గాలి); అల్లో (?) నేరేడు (ప్రా. అల్లా = తల్లి, అల్లో నేరేడు = తల్లినేరేడు, లేక పెద్దనేరేడు, అని యర్థము చెప్పవచ్చునా? లేఁ, ఆహ్లాదక = ప్రా. అల్హాఅఓ = తె. అల్లో(-ల్లో); లేక, ఆర్ద్రిక=ప్రా. అల్లఓ = తె. అల్లో = రసముగల, అని చెప్పవచ్చునా?); ఆణి (?) పోటు = జీవస్థానము నందు పొడిచినపోటు; ఇల్లి (?) ముక్కు = పగిలి నెత్తురుకాఱెడి ముక్కు లోపలిభాగము; ఈ (?) రెండ (ఇవురు = ఈరు + ఎండ = చిగురువంటి, లేఁ లేఁత యెండ?); ఉల్లకుట్టు (ఉల్లము = హృదయము + కుట్టు); ఎల (?) గోలు (ఎల(రు) + కోలు = ఉత్సాహముగొనుట?); ఏఁడి (?) కోల (ఏరు = నాఁగలి; షష్ఠీవిభక్తిక రూపము ఏరి, ఏటి, ఏఁడి); ఏట (?) వాలు (కన్న. ఏఱు = క్రి. మీఁదికిపోవు; వి. మీఁదికిపోవునేల; షష్ఠీరూపము: ఏఱ్ఱి = * ఏట్రి = * ఏట్ట = తె. ఏట); ఏఱు (?) పిడుక (కన్న. ఏరు, ఎరుబు = పేఁడ, చూ. తె. ఏరుఁగు, ఎరువు); ఐ (?) నిల్లు (హిం. మరాఠీ. ఐన; కన్న. అయిను = మొదటి, ముఖ్యమైన + ఇల్లు = నట్టిల్లు, అంతర్గృహము); ఐ (?) మూల (అతిమూల ?), ఓర (?) వలి = 'వన్నెకోక' అను శ. ర. అర్థము తప్పు; 'అంచుకోక' అనవలెను; (ఓర = అంచు): ఔ (?) కాఁపు (అవుకు + కాఁపు ? = ఒకరికి లోఁబడి యుండవలసిన కాఁపురము ?); ఔ (?) దల = నడితల, తల; కాట్ర (?) గడ= కంపకోట; (కాష్ఠ = * కాట్ర; దీని నుండియే 'కఱ్ఱ, కట్టె' అను పదములు గలిగినవి); కిట్టకోల = ఇటికించుటకుఁగా నొకరట్టు కొనలఁజేర్చికట్టి చిన్నకోల

లతో నేర్పఱుపఁబడిన సాధనము, అని శ. ర. కన్నడము : కిట్టి = చెవులను, ముక్కును, చేతులను రెండు కట్టెల నడుమనుంచి అదుమునట్టి హింస; అట్టి హింస కుపయోగించు కట్టెలు); గండ (?) దల (అఖండ = * అగండ=గండ; ఇట్లే 'గండదీపము' మొదలయినవి; 'గండ' అనఁగా 'పెద్ద' యని యర్థము కాదు), గడి (?) త్రాడు = రెండురెండు పశువులను ఒక్కొక్కకాలుచేర్చి లంకెవేసెడు పలుపు (కన్న. కడి = గట్టి, బలమైన, పెద్ద; ఇట్లే, 'గడిపోతు'); గొంతెమ (?) కోరిక = శ. ర. సాధ్యముకాని కోరిక; 'గొంతెమ' స్త్రీవాచక పదమా ? 'గొంతెమ్మ' అను దేవత పురుటింటి నాశ్రయించియుండుననియు నది 'గొంతెమ పురుగు' రూపమునవచ్చి పురుటింటిలోని దీపము నార్పివేయు ననియు నొక నమ్మకము గలదు. 'కొత్తెమ్మ, కొత్తమ్మ' అని యిద్దఱు దేవతలు; వీరు పురుటింటి నాశ్రయించి యుందురు. పురుటి పదునొకండవదినమున వీరికి 'పులగము' నైవేద్యము పెట్టుదురు. ఈ 'కొత్తెమ్మ' యే 'గొంతెమ్మ' యా ? అయిన నీ 'గొంతెమ్మ' కోరు సాధ్యముకాని కోరిక యేమి ? 'గొంతెమ్మ' పాండురాజు భార్యయా ? ఆమె కోరిన సాధ్యముకాని కోరిక యేమి ? ఆలోచింపఁగా 'గొంతెమ' స్త్రీవాచకపదము కానట్లు తోఁచుచున్నది. తమిళములో 'కొత్తు' అనఁగా 'అకస్మికముగా మీఁదపడి ఒడిసిపట్టు, అని యర్థము; ఇది తెనుఁగున 'కొంతు, గొంతు' గా మాఱి 'ఎమ, ఎమ్మ' అను కృదంత ప్రత్యయములను గొనినట్లు తోఁచుచున్నది. గొంతెమకోరిక = అకస్మాత్తుగా మీఁదపడి ఒడిసిపట్టవలెనను కోరిక; గొంతెమపురుగు = అకస్మాత్తుగా దీపమును ఱెక్కలతో నార్పివేయు పురుగు; గొంతెమగోరు = ప్రసారణి అనునొక చెట్టు; ఇది తనమీఁద వ్రాలు కీటకాదులచుట్టును ఆకులను అకస్మాత్తుగా ముడిచి వానిని భక్షించును; అడ (?) సాల (కన్న. అడికె = వంట; అడు = వండు); అల (?) ద్రోక (కన్న. అలవు=అలపు; శ్రమము పోవుట); అలవాటు (అలవు= పరిశ్రమము + పాటు); అవద (?) గాకి ('అవద' కు వ్యుత్పత్తి తెలియదు; 'అవదళ' = దిక్కుమాలినతనము, అనుపదముతో సంబంధమున్నదా ?); ఆన (?) పాలు = ఆఱఁగాచినపాలు ('ఆఱు' అను క్రియతో 'ఆన' కు సంబంధమున్నదా ?); ఈరువాలు = అసివాలు ('అసివాలు' వలె నిదియు నన్యదేశ్య పదము కావచ్చును; ఎట్ట (?) పోగు = దండు, సైన్యము, అని శ. ర. "హరునకు పెట్టఁజుట్టిన యనూలయవాటికఁజేరి యచ్చటన్, మరుఁడు తదీయశాసనమునన్ విరహిప్రకరంబునొంప దుష్కరగతి నెట్టపో గెసఁగఁ గైకొని వచ్చినరీతి వచ్చెఁగ్రొవ్విరి రవ దువ్వచాల్గొని చివిక్ మలయానిలపాతపోతముల్." చంద్ర. - కన్నడము : ఎట్టి = మూర్ఖుఁడు, తుంటరి, మొండివాఁడు; పై పద్యమున 'తుంటరులగుంపు' అను నర్థమే సరిపోవును; ఒర (?) గట్టు (ఒర = [illegible]

ఒకప్రక్కకు కుచ్చెళ్లన్నియు మూటకట్టి ముడిచినకట్టు); ఓని (?) కట్టు = కొండల నడిమి గొందిదారి (సం. అవనికృష్ట=ప్రా. ఓనికట్ట = తె. ఓనికట్టు); కరి (?) వెద = నేలదున్ని విత్తుటకు వాన నెదురుచూచుట (కరి = 'కారు'నకు సంబంధించిన వెద = బీజము; కారున విత్తనములు చల్లుటకు సిద్ధపడుట; తోఱు (?) ద్రొక్కు (శ. ర. త్రొక్కు + త్రొక్కు; మళ. కన్న. తుళి, తొళి; తుళు. తొర్ = త్రొక్కు; మళ. కన్న. ళ = ఱ); పావ (?) కోళ్లు (పాద = ప్రా. పాఅ, తె. పావ); పోటనబంతి = పుట్టబంతి (పుట్ట = పోట; పోటంబంతి, పోటనబంతి); బొమ్మంచు = ఎఱుపు, ఎఱుపువన్నె వస్త్రము, ఎఱ్ఱనిది, 'బొమ్మ + అంచు' అని శ. ర. లో పదచ్ఛేదము; కాని, 'పొం = బంగారు, బంగారువన్నె' అనియే యర్థము చెప్పికొనవలెను; హేర(రా)వళి = ఇందు 'హేర(రా)' శబ్దమున కర్థము తెలియదు; 'వలి' యనఁగా వస్త్రము. 'పొడవన్నెకోక' యని శ. ర.

### ఉత్తరపదము స్వరూపము మఱుఁగుపడినవి.

ఈరువెన ? (వెన = దువ్వెన, అని శ. ర. లో లేదు; గంజాము విశాఖపట్టణము జిల్లాలలో శూద్రవ్యవహారమున 'పయిన' అనియు, ఉత్తమజాతివారి వ్యవహారమున 'పన్నె' అనియు వ్యవహారము గలదు); క్రొత్తముట్టు ?=శ. ర. వడుక నారంభించినప్పుడు ఏకుననుండి పురిలేక చాఁగఁదీసి కదురున కంటిం చెడునూలు; "కళ్యాలఁ బదిలంబుగాని గుఱ్ఱంబులఁ గ్రొత్తముట్టున కియ్యకొలుపు వెరవు. - భార. విరా. V.—శ. ర. లోని యర్థముగల 'ముట్టు' శబ్దము వడకుటయందు వాడుకలో నున్నదేమో తెలియదు. ఇచట 'ముట్టు' అనఁగా 'కొఱముట్టు, పరికరము' అని యర్థము చెప్పవలెనేమో. "వాహనములు వానివాని ముట్టులనొక్క వలనుగానొసర్చి"—భార. మా. I; "గుఱ్ఱములు కళ్లెములకు లొంగకపోయినయెడల వానిని లొంగఁదీయుటకుఁ గ్రొత్త సాధనముల నుపయోగించు నేర్పు" అని పై విరాటపర్వములోని పద్యమున కర్థము చెప్పవలెనేమో; ఆనవాలు (?) = గుఱుతు, ఆజ్ఞాపత్ర ?; ఏఁడుడి ?= ఆబ్దికము ('ఏఁడుఁడి' అని బిందుపూర్వక 'డి' వర్ణ ముండవచ్చును; 'ఉఁడి' 'ఉండి' కి సంక్షేపరూపము కావచ్చును; ఒకయేఁడుండి చేయు నాబ్దికము; చూ. ఎల్లుండి; కత్తెరగాయము (?)-సం. ఘాతము = తె. గాయము, కత్తెర ఆకారముగా గోడలో త్రవ్వఁబడిన గవాక్షము; నటవాలు = అశ్వగతి విశేషము, రేచితము = సం. నాట్యపాత ? - నిగ్గడి = మిక్కిలి కఠినము (నిఱు + కడి; 'కడి' కఠినశబ్దభవము.

## రెండుపదముల స్వరూపమును మఱుఁగుపడినవి.

ఎద్దడి (?) = దారిద్ర్యము, శూన్యము; చిలువాయనము = చిల్లర, క్షుద్రము; చిలు = చిఱు ? నరగజము = నరగ = నగారా ('అల్గోజా' వలె 'నర్గోజా' కూడ నొక వాద్యవిశేషము; ఇది హిందూస్థానీపదము; 'నర్గోజా' తెనుఁగున 'నరగజము' అయినది; వానికి నర, గజ, పదములతో సంబంధము లేదు; పాణివడము = అమ్మలపొది; పానవట్టము = పానము+వట్టము, అని శ. ర. లోని వ్యుత్పత్తి దుర్గ్రాహ్యము; 'ప్రాణప్రతిష్ఠ(ము)' అగునా ? = ప్రా. పాణవయట్టమ్ = తె. పానవట్టము; పారుపత్తెము = సం. పరభృత్యము; వడునుడి = రాజులకిచ్చుదండువు, విడిముడి = ధనము; సయ్యొద్ద=సహితార్థ ?- సింగోట (ఇందు పూర్వపదము 'శృంగ' శబ్దభవము; రెండవదాని వ్యుత్పత్తి తెలియదు); సీవిరి = సం. చామరీ ?

ఈ రీతిగా తెనుఁగున నర్థము విడవలసిన యనేక సమాసములు గలవు. వాని వ్యుత్పత్తులను దెలుపుటకుఁ జాల పరిశోధనము కావలెను. ఈ క్రింద నాలుగయిదు పదములకు మాత్రము వ్యుత్పత్తి విచారముచేసి యీ ప్రకరణమును ముగింపవలసి యున్నది.

### 1. కవ్వడి.

చిన్నయసూరి 'కవ్వడి' అను పదమును సమాసముగా గ్రహించి, దానిని నిక్కలాదులలోఁ జేర్చి, యథాప్రయోగముగ గ్రాహ్యమన్నాఁడు. ప్రౌఢవ్యాకరణకారుఁ డీప్రశంస నెత్తుకొనకపోయినను తన శబ్దరత్నాకరమున నా పదమును 'కవ + వడి'గా విడఁదీసి రెండుచేతుల వడిగలవాఁడని యర్థము చెప్పినాఁడు. ఆధునిక లాక్షణికులందఱును నాపదము నట్లే విడఁదీసినారు. ఇట్లు వా రాపదమును విడఁదీయుట కర్జునునికి సంస్కృతమున 'సవ్యసాచి' యను నామముండుటయే కారణముగఁ గనఁబడుచున్నది. 'సవ్యసాచి' యను పదమునకు 'ఎడమచేతివాఁడిగలవాఁడు' అని యర్థమగును గాని 'రెండుచేతుల వాఁడిగలవాఁడు' అను నర్థము పొసంగదు. ఎడమచేతి వాఁడి గలిగినను కుడిచేతికిఁగూడ వాఁడి లేకుండకపోదు; కాని రెండుచేతులకును సమానమగు వాఁడి యుండుట యసంభవము. అర్జునుఁడును "ఖండనమున నిరుగేలను గాండీవము దివియ నేర్పు గలిగిన నం దుద్దండమగు సవ్యకరము ప్రచండతఁ బరగుదును సవ్యసాచి యనంగన్" అని చెప్పికొన్నట్లు విరాటపర్వము IV. 145 పద్యమున నున్నది. ఎడమచేతివాఁడివానిరంతయో కొంతయో కుడిచేతితోఁగూడఁ బనిచేయఁగలరు. అందుచేతనే యర్జునుఁడు కవదొనలను ధరించి యుద్ధముచేసినట్లు వర్ణింపఁబడినాఁడు.

"కవదొన తేల పూనునొకొ కవ్వడి నావల దుగ్రసంగరో
త్సవమున సవ్యపాణి నపసవ్యకరంబున మార్చి మార్చి గాం
డివముధరింపఁగా శరపటిష్ఠతయుం బొరిఁజేయిమార్చి చూ
పు వెరవుతోన వీఁడ్వడక పొందొడఁగూడెడు నప్డు సూచినన్"—
విరా. V. 45.

"ఉభౌ మే దక్షిణౌ పాణీ గాండీవస్య వికర్షణే, తేన దేవమనుష్యేషు సవ్యసాచీతి మాం విదుః" అని సంస్కృత భారతమందున్నది. ఈ యర్థమును తిక్కన యొప్పుకొనక సవ్యసాచి పదమున కెడమచేతివాఁడి గలవాఁడనియే నిర్ధారించినాఁడు. "కవదొన" లను పై పద్యమువలన కవదొనలను బూనియర్జునుఁడు రెండు చేతులను బాణములను వదలుటవలనఁ గవ్వడి యనఁబడుచున్నాఁడను నభిప్రాయము వ్యక్తముకాదు. తిక్కన 'కవ్వడి' యను పదమును 'సవ్యసాచి' పదమునకుఁ బర్యాయపదముగా నుపయోగింపలేదనుటకొక్క యుదాహరణము చాలును. అర్జునుఁడు యతి రూపమున సుభద్రకడ నున్నప్పుడామె :

"అలినీలకుంతలుం డనియును, హరినీలసమవర్ణుఁడనియు, నాజానులంబి
తాయతస్థిరబాహుఁ డనియు, నారక్తాంత నలినదళాకార నయనుఁడనియు,
నుత్తుంగఘన విశాలోరస్కుఁడనియును, "గవ్వడి"యనియును గరము వేడ్క
విన్వచ్చు నెప్పుడు వినియెదునది దన వినినట్లయతిఁజూచి, వీఁడు విజయుఁ
డొక్కొయనుచు సంశయోపేతచిత్తయై యుండి, యుండనోపకొక్క నాఁడు
భోజనావసానమునసున్న యమ్మునిఁ గిందువదన ప్రీతి నిట్టులనియె"
ఆది. VIII. 185.

సుభద్ర పై సందర్భమునం దర్జునుని యాకారమును వర్ణించుచున్నది. కవవడితన మాకారము కాఁజాలదు గదా. రెండు చేతులందును గుణకిణాంకములను జూచి కాని, భుజములపై నున్న యమ్ముల పొదుల గుర్తును చూచి కాని, సుభద్ర యాతని కవపడితనము నూహించెనందుమేని నామె కాతఁడు కపటయతి యగుట మొదటనే తెలిసియుండును; అట్లు జరుగలేదు. కావున నామె యాతని యాకారమున కొక లక్షణమయిన కవ్వడితనమును చూచినదని చెప్పవలెను. ఇచ్చట చిన్న విశేషమున్నది. సంస్కృత భారతమున నర్జునుఁడు కపటయతివేషము వేసికొన్నట్టుగాని, సుభద్ర యాతనికి సేవచేసినట్టు కాని చెప్పఁబడియుండలేదు. అర్జునుని ద్వారకయందున్నవా రందఱును నర్జునుఁడనియే భావించిరి. కృష్ణుఁడు పంపిన రథముపై సుభద్ర పోయి రైవతాద్రిని పూజించి ద్వారకకు తిరిగి వచ్చుదారిలో నర్జునుఁ డామె నెత్తికొనిపోయినట్లు సంస్కృత భారతము చెప్పుచున్నది. అర్జునుని కపటయతివేష కథకు మూలము మృగ్యము.

అర్జునుని పేళ్లలో అర్జునుఁడు, ఫాల్గునుఁడు, జిష్ణువు, కిరీటి, శ్వేతవాహనుఁడు, బీభత్సుఁడు, విజయుఁడు, కృష్ణుఁడు, సవ్యసాచి, ధనంజయుఁడు అను పేళ్లు విరాటపర్వమున నర్జునుఁ డుత్తరునకు తెలిపినవి. వీనినిగాక పార్థుఁడు, శక్రనందనుఁడు, గాండీవి, మధ్యమపాండవుఁడు, కపిధ్వజుఁడు, రాధాభేది, సుభద్రేశుఁడు, గుడాకేశుఁడు, బృహన్నల అను నర్జున నామములను జటాధరుఁడు తెలిపియున్నాఁడు. 'నర' అను పదముగూడ భారతమున నర్జునునికి వాడఁబడినది. తెనుఁగు భారతమున క్రీడి, వివ్వచ్చు, కవ్వడి అను పేళ్లు కానవచ్చుచున్నవి. ఇందు 'క్రీడి' 'క్రీడిన్' భవమైన తత్సమపదము కాదు; కిరీటి = ప్రా. కిరీడి = తె. క్రీడి, అను నాచ్ఛికపదము; 'వివ్వచ్చు' బీభత్సు శబ్దభవము; 'కవ్వడి' కృష్ణ శబ్దభవము; ఈ మూఁడును తద్భవములు, అట్లే 'కవ్వడి' యను పదముకూడ తద్భవము కాకూడదా ?

'కవ + వడి' = కవ్వడి, అని చెప్పి యది బహువ్రీహిసమాస మన్నచో ఇంద్రాత్మజ, ఇంద్రజ, ఇంద్రతనూజ, శక్రనందన,' పురందరసూతి అను రీతి నెన్ని సమాసములనైనఁ జేయ వీలగునట్లు 'కవవడి' పదమునకు 'ఇరువడి, జంటవడి, జతవడి, జంటవేగరి', మొదలగు పర్యాయపదములను గల్పింప వచ్చును. కాని, భారతకవు లట్టి సమాసములను గల్పింపలేదు; అర్జునునకు కవ్వడియను పేరు రూఢిమైనట్లే భావించి ప్రయోగించిరి. ఇదిగాక యాంధ్ర భారతమున 'కవ్వడి' అను పదము ప్రయోగింపఁబడినపుడెల్ల 'కవవడితనము' నే సూచించుటకు ప్రయోగింపఁబడలేదు 'కడఁగి ప్రపదానుజుఁడు నెవ్వడిఁ గవ్వడినేసె నూఱువాఁడిశరములం, గినుకలిగి వాని నన్నియు నడుమన తుని యంగ నేసె నరుఁడస్త్రములన్' (ఆది. VI. 85) అను పద్యమునందు కవవడి తనమే ప్రధానమైనచో, 'కవ్వడి, నర' శబ్దములు తాఱుమాఱైనవి. 'కవవడి తనమే' యిచటఁ ప్రధానమైనచో 'ప్రపదాత్మజుఁడు నెవ్వడి నరు నేసె నూఱు వాఁడి శరములన్ ... వానిని ... తునియంగ నేసె కవ్వడి యస్త్రములన్' అనిన యెడల నాచితి పోషింపఁబడియుండును. ఒకవేళ నర్జును పరాక్రమ ముద్దేశింపఁబడినప్పుడు 'కవ్వడి' అను పదము పడినను నట్టియెడల పార్థ, నర మొదలగు పదములును నుపయోగింపఁబడియుండుటచే 'కవ్వడి' పదము 'కవవడితనము'ను సూచించుటకే వాడఁబడినదని చెప్ప వీలులేదు. ఇదిగాక తెనుఁగు భారతమునఁ గవ్వడిపద ముపయోగింపఁబడినచోట్ల సంస్కృత మూలమున 'కవవడితనము'ను సూచించు పదములు వాడఁబడియుండలేదు.

ఆంధ్ర భారతమున అర్జునుని పేళ్లలో అర్జున (487), పార్థ (209), పృథాతనయ (1), పృథాపుత్ర (1), నర (131), ఇంద్రుని కొడుకు నను నర్జునున (115), క్రీడి (93), కవ్వడి (80), సవ్యసాచి (77), కిరీటి (60), గాండీవి

(58); గాండీవధర (2), వివ్వచ్చు (57), ధనంజయ (56), విజయ (50), ఫల్గున (27), భీభత్సు (26), జిష్ణు (14), కపిధ్వజ (8), కపికేతన (1), శ్వేతవాహన (2), కృష్ణ (2), కర్తి (2), ఇంద్రావరజసఖ (1), అనున వన్నియన్ని సార్లు వచ్చినవి. వీనిలో సవ్యసాచి, గాండీవి, గాండీవధర, వివ్వచ్చు, భీభత్సు, జిష్ణు, కపిధ్వజ, కపికేతన, శ్వేతవాహన అను పదములు సందర్భోచితముగ సార్థకములగుచున్నవి. కావున 'కవ్వడి' అనునది తద్భవమే కాని తెనుఁగున నయిన బహువ్రీహిసమానము కాదనియే తోఁచుచున్నది.

'కవ్వడి' పదము తద్భవమైనచో నది 'కపర్దిన్' శబ్దభవము కావలెను. ఈ పదమునకు 'కవడి, కవడ్డి, కవ్వడి' అనునవి ప్రాకృత రూపములు; ప్రాకృతమున వానికి 'జటాధారి, గవ్వ' అని యర్థము. 'కపర్దిన్' పదము సంస్కృతమున శివునకు రూఢివాచకముగను, జటాధారులకు సామాన్యవాచకముగను నున్నది. కపర్దమనఁగా కిరీటమనియు నర్థముగలదు; 'కపర్ది' యనఁ గిరీటి కావచ్చును. ఇందుకు సంస్కృతమున ప్రయోగము మృగ్యము; కాని, ఋగ్వేదమున 'కపర్దిన్', శబ్దము 'కిరీటి' పదమునకుఁ బర్యాయముగ వాడఁబడియున్నది. "అయం సోమః కపర్దినే ఘృతం న్య పనతే మధు, అభక్షత్ కన్యాను నః" (ఋగ్వేదము VII. 67. 11.) దీనిలోని 'కపర్దినే' అను పదమునకు భాష్యమున 'కల్యాణ ముకుటవతే' అని యర్థము చెప్పఁబడినది. ఈ సంప్రదాయార్థము ననుసరించి 'కిరీటి' పదమునకుఁ బర్యాయపదముగా 'కపర్ది' శబ్దభవమగు 'కవ్వడి' పదము తెనుఁగు భారతమున నుపయోగింపఁ బడియుండును. కాని, 'కిరీటి' పదమునకుఁ గ్రిడియను తద్భవముండనే యున్నది కావున 'కవ్వడి' పదము 'కపర్ది' భవముగనే అనఁగా 'కపర్దము' లేక 'జటాజూటము' కలవాఁడను నర్థముననే యుపయోగింపఁబడినదని యెంచుట యుక్తమని తోఁచుచున్నది.

అయినను భారతమునఁ గాని మఱి యెచ్చటఁగాని యర్జునునకు కపర్ది యను నామము కానరాదు. అంతమాత్రమున 'కవ్వడి' పదమునకు 'కపర్ది' భవత్వమును త్రోసివేయుటకు వీలులేదు. 'కవ్వడి' యనునది లక్షణార్థమునఁ దొలుత నుపయోగింపఁబడి తరువాత రూఢ్యర్థమునఁ దెలుఁగుకవుల వాడుకయందు నెలకొన్నదని చెప్పవలెను. అర్జునుఁడును కపర్దము కలవాఁడే యనుట కాతని 'గుడాకేశ' నామము తెలుపుచున్నది. గుడాకేశుఁ డనినను కపర్ది యనినను నర్థమొక్కటే. కపర్దాకారముగల కేశపాశమును జుట్టుకొనువారి కెల్లరకు కపర్ది, గుడాకేశనామములు చెల్లును. గుడాకేశపదము అర్జునునకుఁ గృష్ణునికి శివునకుఁగూడఁ జెల్లుచున్నది. వారి కేశరచనలక్షణము ననుసరించి వారి కాపేరు కలిగినది. కిరీటధారులు కపర్దాకారముగఁ శిరోజములను జుట్టుకొన్నచే యా కిరీటములు స్థిరముగ నిలుచును. అర్జునుఁడు కిరీటి కావున

నాతఁడు తన శిరోజములను కపర్దాకారముగఁ జుట్టికొనియుండుట యసంభవము కాదు. అర్జునుఁడు తెగబారెడు వెంట్రుకలవాఁడు కావున వానిని కపర్దాకారమునఁ జుట్టుకొనుట సహజమే. కావున, 'కవ్వడి' పదము 'కపర్ది' శబ్దభవమని చెప్పుటయే యుక్తమని తోఁచుచున్నది. ప్రాకృతమున 'కవ్వాడ' అను మఱియొక పదము గలదు. దీనికి 'ఎడమచేయి' అని యర్థము; 'కవ్వాడి' అనఁగా ప్రాకృతమున 'ఎడమచేతివాఁడు' అను నర్థము కలుగును. అర్జునుని సవ్యసాచిత్వము వలననే యర్జునునికి తెనుఁగున 'కవ్వడి' యను పేరు గలిగినదని సాధింపనెంచువారీ ప్రాకృతపదము నాధారముగఁ దీసికొనవచ్చును; 'కవ+వడి' అని తెనుఁగున బహువ్రీహిసమాసమును కల్పించుకొన నక్కఱలేదు.

2. వడముడి.

కేశరచనను బట్టియే యర్జునునకుఁ గవ్వడి యను పేరు కలిగినదని చెప్పుటకు భీమునికి 'వడముడి' యను పేరుండుట యుపబలముగా నున్నది. 'వడముడి' యనఁగా కుడిప్రక్క శిరోజముల ముడిగలవాఁడని యర్థము. 'వడ' 'వల' కు రూపాంతరము. 'వల' యనఁగా కుడిప్రక్క. చూ. వలకేలు = కుడిచేయి; వలపల = కుడిప్రక్క; మొదలయినవి.

3. ఐదువ.

'ఐదువ' అనుపదమునకు శబ్దరత్నాకరమున కర్థమిట్లు వివరింపఁ బడి యున్నది. "ఐదువ. ద్వ. వి. (ఐదు + వన్నెలు గలది.) సౌమంగల్యము గలస్త్రీ (వన్నెయనఁగా ఇక్కడ సుమంగలియొక్క అలంకారము. ఐదేవనఁగా.—మంగళసూత్రము, పసుపు, కుంకుమము, గాజులు, చెవ్వాకు.) అయిదువ యొక్క రూపాంతరము." అని. ఈ వ్యుత్పత్తి సరియైనట్లు తోఁపదు. 'వ' అనునది 'వన్నె'కు సంక్షేపరూపముగ మఱియెచ్చటను సమాసములందును గానరాదు. పైని వివరించిన యైదును సుమంగలి కలంకారములని యేధర్మశాస్త్రమును వివరించి యుండలేదు. జనులవాడుకలో నవి సుమంగలి కలంకారములుగఁ బరిగణింపఁ బడుచున్నను నట్లు పరిగణింపఁబడు కాలివ్రేళ్ల మట్టెలు మొదలగు మఱికొన్నియుఁ గలవు.

అఱవములో 'ఐ' అనఁగా 'అందమయిన' అనియు, 'ఐదు' అనఁగా అందముగలది యనియు నర్థము లున్నవి. 'ఐదువ'న కీవ్యుత్పత్తిని జెప్పినచో దాని కందకత్తె యనునర్థము వచ్చునుగాని తెనుఁగునఁగల యర్థము కలుగదు.

ప్రాకృతమున 'అఇదుఅ', 'అఇదుఅ', 'అయిదువ' అను పదములు గలవు. అవి 'అవిధవా' శబ్దభవములు. తెనుఁగుననున్న 'ఐదువ' కూడ 'అవిధవా' శబ్దభవ మగునేమోయనియు, ప్రాకృతపదమే తెనుఁగున నట్లే యుపయోగింపఁబడుచున్నదనియు ననుకొనుట యుక్తమని తోఁచు

చున్నది. ఈ వ్యుత్పత్తి యీనాఁటివారిచెవులకుఁ గటువుగా నుండవచ్చును గాని, 'కూఁతురు' మొదలగుపదముల వ్యుత్పత్తులనువలె దీనినిగూడ సహించుకొనవలసియుండును. 'విధవ' యనఁగా మగఁడు లేనిది. పెండ్లికాని కన్యయు, మగఁడు గతించిన స్త్రీయును విధవలే యగుదురు. కన్యక విధవయే కావున నామెకు సౌమంగల్యవిధాన మొనర్చుట * 'అవిధవాకరణ' మని సంస్కృత గ్రంథములఁ గానవచ్చుచున్నది. భాసకృత "స్వప్నవాసవదత్తము" తృతీయాంకమున 'అవిధవా కరణం' అని యొకచోటను, 'అవిధవాభిః' అని యొకచోటను బ్రయోగించియున్నాఁడు. కాళిదాసు "మేఘసందేశము"న 'అవిధవే' అని వాడినాఁడు. "నాగానందనాటకము"నను 'అవిధవా' శబ్దము కనఁబడుచున్నది. ఈ 'అవిధవా' శబ్దము వేదకాలమునుండియు వచ్చుచున్నదిగాని క్రొత్తగఁ గల్పించినదికాదు. ఋగ్వేదఖిలభాగమున నీ పదమున్నట్లు నిఘంటువులు చెప్పుచున్నవి. తైత్తిరీయబ్రాహ్మణము (3. 7. 5) లో 'ఇంద్రాణీ వా విధవా భూయాసం, అదితి రివ సుపుత్రా (భూయాసమ్)' అని యున్నది. ఇట్లే అదేగ్రంథమున (3. 5. 13) 'ఇంద్రాణీ వావిధవా అదితిరివసుపుత్రా' అని యున్నది. దీనికి భాష్యవివరణమున 'ఇంద్రస్య పత్నీంద్రాణీ, సా కదాచిదపి విధవా న భవతి; తద్వ దహ మపి యావజ్జీవ మవిధవా భూయాసమ్' అని యున్నది. కావున, 'అవిధవాకరణము' అను ప్రయోగమునుబట్టి కన్యకకు విధవాత్వమును, పతిగతించిన స్త్రీకి 'అహమవిధవా భూయాసమ్' అను ప్రయోగమునుబట్టి విధవాత్వమును సిద్ధించుచున్నవి. కాని, వ్యవహారమున విధవాత్వము భర్తృవియోగము నొందిన స్త్రీకే చెల్లుచు వచ్చినది. 'అవిధవా' శబ్దము మాత్రము ప్రాకృతద్వారమున తెనుఁగున 'అయిదువ' అను పదమున నిలిచియున్నదని చెప్పవచ్చును.

ఆంధ్రభాషా పరిశోధనమున నిప్పటి యవస్థయం దనేకపదముల వ్యుత్పత్తిని నిర్ణయించుట కష్టసాధ్యము. పదములపోకడ లనేకరీతులుగ నుండును. వానినన్నిటిని సప్రమాణముగ నిరూపించుటకుఁ జాల పరిశోధనము కావలసియుండును. శబ్దరత్నాకరకారుఁడు తెలిపిన కొన్నిపదముల వ్యుత్పత్తులు విద్వాంసుల విమర్శకొఱకై క్రింద నీయఁబడినవి.

అడియాలము = అడి + ఆలము = గుఱుతు, చిహ్నము (ఆలశబ్దమున కిక్కడ స్థానమర్థము); అడువ = అడుగు + పట్టినది; అరమర = అర + మఱలుట; అఱవము = అఱ + వాయి; అత్తాఁడు = అత్త + ఆఁడు; అల్లుఁడు = అల్లు + వాఁడు; ఔలగరి = ఔలగడుగు + అరి; ఔలగడుగు = ఔలకము +

* ఈ ప్రయోగమును నెల్లూరువాస్తవ్యులు మ-రా-రా. ఒంగోలు వెంకటరంగయ్య, బి. ఏ, బి. ఎల్. గారు నాకుఁ దెలిపియున్నారు. వారికిఁ గృతజ్ఞుఁడను.

కడుగు; జేలతారు = జలకము + తారు, జేలపోఁత = జేలకము + పోఁత; జేలపోసనము = జేలకము + పోసనము; నిక్కాక = నింబు + కాక; నిముకళా = నిమురు + కళ్లము; ముంగమురము = ముందు + కయి + మురము; ముంగయిమురము = ముందు + కయిమురము; మువ్వా = మూఁడు + వా; తెలివ = తెలి + వా; మోఁచేయి = మోఁద + చేయి; వదులుడి = వదులు + లూటి; వాకిలి = వా + ఇల్లు; వెన్న = నెల్ల + నేయి మొదలయినవి.

## ద్విరుక్తప్రకరణము.

తెనుఁగున సంధినిగూర్చి వ్రాయునప్పు డామ్రేడితసంధినిగూర్చి కూడ విచారించియుంటిమి. మొదట నుచ్చరించిన పదమునే వ్యవధానము లేకుండ నుచ్చరించునప్పు డారెండవసారి యుచ్చరింపఁబడిన పదమున కామ్రేడితమని పేరు. ఈ యామ్రేడిత మనేకార్థములందు కలుగుచుండును. ఇంగ్లీషుభాష యందీ యామ్రేడితమున కంతగా వ్యాప్తిలేదు. సంస్కృతమునఁ గొన్ని సందర్భములం దామ్రేడితము గలుగుచుండును. భారతీయాధునికభాషలయందు మాత్ర మిది యెక్కువగఁ బ్రయోగింపఁబడుచున్నది. అందును వ్యవహారమున నిది యపరిహార్యముగా నున్నది.

ద్విరుక్తి నాలుగు విధములుగా నుండును: (1) పూర్వోక్తమైన మాటయే ప్రత్యయాదులతోఁగూడ మరల పలుకఁబడుట: ఉదా. గణగణ, తినితిని, అనఁగా అనఁగా, మొద. (2) పూర్వోక్తమయిన మాట ప్రత్యయాదులయందలి మార్పులతో మరల పలుకఁబడుట: ఉదా. మాటిమాటికి, వాఁడిట్లన్నాఁడు, అంటే నేనిట్లు చెప్పినాను, చెప్పి అంతటితో ఊరుకోలేదు మొద. (3) మొదట పలికిన మాటయే కాకున్నను, తెనుఁగుననైనను నితర భాషలయందయినను నదే యర్థముగల మాటను పలుకుట: ఉదా. కుండా మండా; బోర్డుబల్ల; గేటువాకిలి; పేరూ, ప్రతిష్ఠా మొద. (4) ప్రత్యయాదులలో మార్పు కలిగియు, కలుగకుండకయు, కేవల స్వరభేదము గలిగి యదే మాట మరల పలుకఁబడుట: ఉదా. నూనూగుమీసాలు, చిట్టి చిట్టి పలుకులు, వేడి వేడి యిడ్డెనలు మొద.

ద్విరుక్తియందు గలుగు నర్థభేదములను వర్గీకరింప సాధ్యముకాదు. సిద్ధాంతకౌముదియందు వివరింపఁబడిన యర్థములందే కాక, తెనుఁగున నింకను ననేకార్థములందు ద్విరుక్తికి ప్రయోజనము గలదు. ఈ క్రిందఁ గొన్ని ప్రయోగములనుమాత్ర మిచ్చుచున్నాను. వాని యర్థభేదములను పాఠకులు సులభముగ గ్రహింపఁగలరు. వానిలోఁ గొన్ని యర్థములు సంస్కృత వ్యాకరణములందు వివరింపఁబడినవే.

(1) వండుతున్నాడు, వండుతున్నాడు, ఎంతటికిన్ని అన్నం ఉడుకదు.

(2) తిని, తిని బలిసినాడు; ఆడి, ఆడి అలసిపోయినాడు.

(3) చదువుతూ, చదువుతూ ఉన్నాడు.

(4) ఉండుండి ఒక చినుకు పడుతున్నది.

(5) చెట్టు చెట్టుకూ నీళ్లు పోసినాడు. ఇంటిరింటికిన్ని పోయినాడు.

(6) అనగా, అనగా, ఒకరాజు. ఆ రాజుకు ఏడుగురు కొడుకులు; ఏడుగ్గురు కొడుకులున్ను ఏట్లో పడినారు. పడి, ఏడుచేపలు తెచ్చినారు. తెచ్చి ఏటి ఒడ్డున ఎండ వేసినారు.

(7) అందులో ఒకచేప ఎండిందికాదు. "చేపా, చేపా ఎందు కెండినావు కావేఁ?" - "గడ్డి దుబ్బు చాటు." - "గడ్డిదుబ్బా, గడ్డిదుబ్బా, ఎందుకు చాటేఁ?" - "గుర్రం మేసింది కాదు." - "గుర్రం, గుర్రం, ఎందుకు మేసినావు కావేఁ?" - "పోలిగాడు కాసినాడు కాడు." - "పోలిగా, పోలిగా, ఎందుకు కాసినావు కావురాఁ?" - "పోలి అంబలి పెట్టలేదు." - "పోలీ, పోలీ, ఎందుకు అంబలి పెట్టలేదేఁ?" - "చీమ కుట్టింది." - "చీమా, చీమా, ఎందుకు కుట్టినావేఁ?" - నీ పెళ్లినాడు పప్పూ, కూడూ, పెట్టినావా, పెట్టినావా, పెట్టినావాఁ?"

(8) ఆ దేశములో ఊరూరూ ఎంతో అందముగా ఉన్నది. ఇంటింటా ఒక పొయ్యి, మాయింట మరొక్కపొయ్యి.

(9) ఆ ఊరికి మీదు మీదుగా (దగ్గర దగ్గరగా, కింద కిందుగా) పోయినాడు.

(10) సారంగధరా, సారంగధరా, ఇట్లు తప్పించుకొంటావాఁ?

(11) దేవా, దేవా, నీవే నాకు దిక్కు.

(12) మూర్ఖా, మూర్ఖా, నాచేత చిక్కినావు; ఇంకెక్కడకు పోతావుఁ?

(13) శూరుడా, శూరుడా, ఏదీ నీ శౌర్య మెక్కడకు పోయినదిఁ?

(14) దొంగా, దొంగా, చూడు నిన్నేమిచేస్తానో!

(15) ఒకొక్కమాటా వెయ్యి వరహాలు చేస్తుంది, ఒకొక్కమాటు కలలు నిజమవుతవి; ఒకొక్కరే జారిపోయినారు; ఒక్కరొక్కరు చల్లగా జారిపోయినారు; ఒకానొకప్పుడు; ఒకానొక ఊరిలో, ఒకొక్కప్పుడు; ఒకొక్కకొమ్మకు కోటి రాక్షసులున్నారు; వారిలో ఒకరికొకరికి పడదు; ఒకరికొకరికి అట్లా వికారం పుట్టుతుంది; ఒకొక్కరికి ఒక రూపాయి ఇయ్యి, ఒకరికొకరు సాయపడవలెను; ఆ సేనలో ఒకరొకరూ మహారథులే; ఒక్కటే ఒక్కటి.

(16) ఉన్నదున్నట్టుగా చెప్పు. (17) ఉన్నవా దున్నట్టుగా లేచినాడు. (18) కమలాక్షు నర్చించు కరములు కరములు. (19) "దొంగ! దొంగ!" - "ఏడి, ఏడీ!" - "అదుగో! అదుగో!" - "పోయె! పోయె!" (20) రామ రామా! ఎంతపని జరిగినది? (21) చిట్టి చిట్టి పలుకులు; సంగిరిసంగిరి మాటలు; నూనూగు మీసాలు. (22) నల్ల నల్లనివాడు; తెల్ల తెల్లనిచీర. (23) తెల తెల వారుతున్నది; అతని మొగము వెలవెల పోయినది. (23) ఎఱ్ఱని ఎఱుపు; తెల్లని తెలుపు; నల్లని నలుపు; పచ్చని పసుపు. (24) వేడివేడి ఇడ్డెనలు, కారం కారం పచ్చడి, పుల్ల పుల్లని మజ్జిగ, తియ్య తియ్యని మామిడిపండ్లు. (25) చల్ల చల్లగా; మెల్ల మెల్లగా. (26) చటచట, గటగట, సరసర, (27) మహా మహా వాళ్లకే లేదు, నీకొచ్చింది (28) పెద్ద పెద్ద వాళ్లందరున్ను అనేమాటే యిది. (29) పెద్ద పేద్ద మాటలాడుతున్నాడు. (30) ఇంతింతై వటుఁడింతయై (31) అంతంత పనులు నావల్ల కావు; ఎంతెంత? ఇంతింత; (32) ఈ తెచ్చిన సామాను లెంతెంత అయినవి.? (33) వీళ్లకెన్నెన్ని ఇవ్వమన్నావు? (34) కొన్నికొన్ని సమయాలలో ఇట్లే జరుగుతుంది. (35) వీరివీరి కిన్నిన్ని (ఇంతింత) అని నిర్ణయించు. (36) పల్లెపల్లెకున్ను పోయి ప్రచారము చేసినాడు. (37) ఇంటి యింటెడు పనీ నేనే చేసుకోవాలి; ముంత ముంతెడు నీళ్లున్ను తాగేసి నాడు. (38) గంపలు గంపలు ధాన్యం మోసుకొచ్చినారు; ఇంటింటికీ తిరిగి నారు; వీసెలకు వీసెలు బంగారం కొన్నాడు; ఒంటి ఒంటెడు నగలున్ను దొంగలు దోచుకొన్నారు; ముద్దముద్దకూ బిసమిల్లా. (39) పాము! పాము! పాము! - ఏది! ఏది! ఏది! - కఱ్ఱ! కఱ్ఱ! కఱ్ఱ! - కొట్టు! కొట్టు! కొట్టు! - పోయె! పోయె! పోయె! పోయె! పోయె!! (40) వాడు వచ్చి నాడు; వస్తే నువ్వుచెప్పినమాట చెప్పినాను; చెప్తే విన్నాడుకాడు; వినక పోతే, కోప్పడ్డాను; కోప్పడినా లక్ష్యపెట్టినాడు కాడు. (41) వసులు వసులుగా; బుల బులాగ్గా—ఈ రీతిగా నెన్నో యర్థభేదములను చూపవచ్చును.

పైని వివరించిన రీతులఁగాక యామ్రేడితము మఱికొన్ని విధములను గలుగుచుండును.

(1) అత్యంతార్థమున: (అ) ఎఱ్ఱ ఎఱుపు, తెల్ల తెలుపు, నల్ల నలుపు; ఈ యుదాహరణములలో రెండవపదము మొదటిదానికంటె కొంచెము భిన్నముగా నున్నను, నా రెండింటికిని గల సంబంధము స్పష్టముగానే కనఁబడు చున్నది.

(ఆ) కట్టకడ, ఎట్టఎదురు, చిమ్మచీకటి, తుట్టతుద, నట్టనడుము, పట్ట పగలు, పిట్టపిడుగు, మిట్టమధ్యాహ్నము, మిట్టమిఱ్ఱు, మిట్టమీను, ముమ్మొనట్టు, మొట్టమొదట, విచ్చలవిడి. ఈ యుదాహరణములలో మొదటిపదము తెన్ను

గునఁగాక మఱియొక ద్రావిడభాషలో రెండవపదమునకు రూపాంతరముగా నున్నది.

(ఇ) కారుప్పు (దీనిలో 'కారు' క్షారశబ్దభవము; 'ఉప్పు' దేశ్యము); చేదువిషం ('చేదు' దేశ్యము; 'విషము' సంస్కృతము); పుల్లఓడ్లు (పుల్ల, ఓడ్లు అను పదములు మాండలికములు);-ఈ యుదాహరణములలో పదములు వేర్వేఱయినను రెండింటికి నర్థమొక్కటే.

పైనిచూపిన (అ), (ఆ), (ఇ) లలోని యుదాహరణములందు మొదటి పదము మొదటియచ్చుపై నూఁతయున్నది; అనఁగా నా యక్షరము నూఁది పలుకవలెను. ఆ యూఁత ననుసరించియే యత్యంతార్థము కలుగుచున్నది.

(ఈ) నిట్రుపాసము, నుగ్గునూచము—వీనిలోఁ గూడ 'నిట్రు', 'ఉపాసము' అను పదములకును, నుగ్గు, నూచము, అను పదములకును నర్థమొక్కటే. వీనిలోని నిట్రు, నూచము, అను పదములకు నేఁడు భాషయందు స్వతంత్రప్రయోగము లేదు. వీని కత్యంతార్థమున్నను, నాయర్థ మంతస్పష్టముగ లేదు.

(ఉ) తుందుడుకు, దాదాపు-వీనిలో 'తుం', 'దా' అనునవి '* తుందు, దాపు' అను వానిలోని తొలితునుకలు; అవి ప్రత్యేకపదములు కావు.

(ఊ) ఉట్టూతలు, ఇల్లిగ్గులు, ఇట్టింకులు - వీనిలోని 'ఉట్టు, ఇల్లు, ఇట్టు' అనునవి తెనుఁగున నష్టపదములు. సజీవములైన 'ఊత, ఇగ్గు, ఇంకు' అను పదములతోఁ గలిసి యత్యంతార్థమును దెలుపుచున్నవి. (ఈ)-లోని సమాసము లేకవచనమున నుండఁగా నివి నిత్యముగ బహువచనమున నుండును.

(ఋ) తుందునుకలు, తెందెప్పలు - వీనిలోని 'తుం', 'తెం' అనునవి తునుక, తెప్ప, అను నర్థముగల పూర్ణపదముల తునుకలు. ఆ పదములిప్పుడు భాషనుండి లోపించినవి. ఇవి (ఉ)-లోని సమస్తపదములవంటివే కాని యవి యేకవచనమందుండఁగా నివి బహువచనమం దున్నవి.

(౯) పెనుగొండకొండ (పెద్దకొండ యుండుటవలన నదియుండు ఊరికి పెనుఁగొండయనుపేరు రూఢిగానైనది. ఆ 'పెనుగొండ' యను నూరఁగలకొండ 'పెనుగొండకొండ' యైనది.)—సీతాఫలపండు, రామాఫలపండు, కమలాఫలపండు (ఆ ఫలములపేళ్లు 'సీతాఫలము, రామాఫలము, కమలాఫలము, అని. ఆపేరుగలపండ్లు అను నర్థమున పైపేళ్లు గంజాము మండలప్రాంతమున వాడుకయందున్నది.)—కాయలచెఱువు - చెఱువు (కాయలుత్రవ్వించిన చెఱు

వునుబట్టి దానియొద్దనున్న యూరికి 'రాయలచెఱువు' అను పేరు రూఢిమైనది. ఆ యూరినిబట్టి యా చెఱువును 'రాయలచెఱువు చెఱువు' అను పేరు వచ్చినది. శ్రీశైలపర్వతము (శ్రీశైలము అను పర్వతము అని యర్థము)—సింహాచలం కొండయు నిట్టిదే.

(3) నిర్ధారనార్థము: బోర్డుబల్ల (ఇందు 'బోర్డు' ఇంగ్లీషుపదము; బల్ల తెనుఁగుపదము. అనేకవిధములగు బల్లలలో 'బోర్డు' అనుబల్ల ప్రత్యేకముగ నిర్దేశింపఁబడినది.—గేటువాకిలి ('గేటు' ఇంగ్లీషుపదము; వాకిలి తెనుఁగు పదము. వాకిలియనఁగా తలుపని రాయలసీమయందు వ్యవహారము. చూ. కన్నడము: బాగిలు = తలుపు. వాకిలి పదమునకు తలుపు అను నర్థమున గ్రంథములందును బ్రయోగములు గలవు. వాకిళ్లు (తలుపులు) అనేక విధములైన వుండఁగా నందు 'గేటు'నకుండు తలుపు అని చెప్పుటకీ సమాసము నుపయోగింతురు.)—'స్లేటు పలక' ('స్లేటు' ఇంగ్లీషుపదము; పలక తెనుఁగు. పలక లనేకవిధములైన వుండఁగా నందు వ్రాఁతకుపయోగించు ఇంగ్లీషు 'స్లేటు' అను పలక యనునర్థమున నీ సమాసము వాడఁబడుచున్నది.—ఇట్లే 'పెన్సలుపుల్ల, ట్రంకుపెట్టె' మొదలగు వానిని దెలిసికొనవలెను.

(4) అగ్గినిప్పు, నడుమంతరము, వెధవముండ - ఇట్టి సమాసములలో రెండుపదములకు నించుమించుగా నర్థమొక్కటే యైనను, పై యుదాహరణములందువలె వానిని గలుపుటవలన నర్థవిశేషము కలుగలేదు.

(5) అటమట, అదవద, అఱ (-ర) మర, అలబలము, అల్లిబిల్లి, ఉదురుమిడుకు, ఒడుదొడుకు, కట్టుపకాసి (-సు), గాసటబీసట, తటమట, తబ్బిబ్బు, దండడి, బటాబూరము, ముంగ (-ంగా, - గఁటు, - గై) మురము (-రారి); వేళాకోళం—ఈ సమాసములలోని రెండుపదములకును నేఁడు వ్యస్తముగ వ్యవహారములేదు; ఎప్పుడయిన నుండెనేమో తెలియదు. 'అఱమఱ' లోని 'అఱ' కు మాత్రము పూర్వగ్రంథములందు వ్యస్తముగఁ బ్రయోగము గలదు.

(6) అట్టాఁక, అట్టాఁకలి - వీనిలో 'అట్టు' నకు 'ఆఁక', 'ఆఁకలి' యను నర్థము లితరద్రావిడభాషలయందు గలదు. అత్యంతార్థమున నివి యీ సమాసములలోఁ దొలిపదములుగఁ జేరినవి.

(7) నిర్ధారణార్థము: (అ) (3)-లో నింగ్లీషు పదములతో తెనుఁగు పదములు చేరిన సమాసములు చూపఁబడినవి. ఇతరభాషాపదములుఁ జేరిన సమాసముల కుదాహరణములు: అలిదిప్ప (హిందూస్థానీ: అలి = చిప్ప); ఆలెప్రొయ్యి (కన్నడము: ఆలె = ప్రొయ్యి); కందదుంప (సం. కందఃదుంప

ఘ; 'కందమూల' మని సంస్కృతమందే సమాసముగలదు. గంజాంజిల్లాలో 'కందమూలందుంప' అని దుంపగలదు. 'కందదుంప' కు 'కంద' అనియు వ్యవహారము గలదు. 'కందమూలము' నకే 'కందమూలందుంప' యని గంజాం వ్యవహారము)—కప్పతాళము ('కప్ప' యన్నను 'తాళ' మన్నను నొక్కటే 'కప్ప' యాకారముననుండుటచేఁ గావలయు 'కప్ప' యనుపేరు వచ్చినది 'తాళము' ఏభాషలోనిదో తెలియదు. తాళమునకు 'కప్ప' యనునర్థమే కాక దానిని తెఱచునట్టి చెవి యనునర్థమును గలదు. 'కప్పతాళము' లో తాళమునకు 'కప్ప' యనియే యర్థము.) - తాళంచెవి (హిందూస్థానీ: చాబీ=తాళం చెవి; తాళమన్నను, చెవియన్నను నొక్కటే యర్థము.) - కొల్లా (రు) బండి ('కొల్లారు' హిందూస్థానీ పదము. దాని యాకారముగల బండియని యర్థము.) గాజేపరుజే ('గాజే' 'పరుజే' అను రెండుపదములును నన్యదేశ్యములే. రెండును 'కత్తిపిడి' యను నేకార్థముగలవి).

(ఆ) కొఱవిచీమ, దుడ్డుకఱ్ఱ, గడ్డిపోచ - వీనిలోని రెండుపదములకును నర్థమొక్కటే. రెండును తెనుఁగుపదములే. సమాసమున నిర్ధారణమును దెలుపుచున్నవి. ఒకవిధమైన పెద్దచీమ, లావైన (దప్పమైన) కఱ్ఱ, గడ్డికి సంబంధించినపోచ అను నర్థములందివి వాడఁబడుచున్నవి.

(8) కఱకఱ = బాధ; కొఱకొఱ = కోపము - మొదలగు ద్విరుక్త పదములు ధ్వన్యనుకరణములై భావార్థబోధకము లగుచుండును.

(ఆ) కింకిరి = కోపము (కిం = కిను, చూ. కినుక) కింగిరి = అల్పము (చూ. కన్న, కిఱు=చిన్న.)-ఇట్టి ద్విరుక్త పదములం దేదో యొకదానికి వికారము కలుగును. (ఇ) కయ్యాలక్రచ్చ మొదలగు వానిలో రెండుపదములకును నర్థమొక్కటే; మొదటిది బహువచన మందుండును. కయ్యమన్నను క్రచ్చ యన్నను నర్థమొక్కటే.

(9) అడఁగిమడఁగిఉండు, ఉఱ్ఱుట్లూఁగు, ఉఱ్ఱూఁతలూఁగు, ఊలమాలగుడుచు, అల్లాడు, అల్లల్లాడు, అల్లార్చు, ఒడ (వ) గూడు, కదలాడు, నిఱ్ఱినీలుగు, బిఱ్ఱబిగియు, మాటుమణఁగు, ముచ్చముడుఁగు, పాఱజూచు—మొదలగు ధాతువులలో ద్విరుక్తికలదు. ఇందలి మొదటి పదము రెండవదానికి రూపాంతరమో, సమానార్థకమో, యయి యుండును. 'కదలాడు' అనుదానిలో 'కదలు, ఆడు' వేర్వేఱు ధాతువులు. 'పాఱజూచు' అనుదానిలో 'పార్' అనునది తమిళపదము, 'చూచు' అనియర్థము.

'వ్రాచ్చి వందఱలాడు' అను ధాతువులో 'వ్రాచ్చు' 'వందఱ' లు సమానార్థకములు. ఇచట రెండవపదము బహువచనరూపమున నున్నది.

(10) అందిపొందిన (వాఁడు), కనీవినని (మాట), కానిపోని (పని), పెట్టిపొయ్యలేని (వాఁడు), లేనిపోని (మాటలు),—ఈ ధాతుజ విశేషణము లలో రెండు పదములకును నర్థము వేఱయినను నవి యెల్లపుడును కలిసియే ప్రయోగింపఁబడును.

(11) అచ్చికబుచ్చిక, అరులుమరులు, అవురునవురు, అవురుసవురు, అనురుసురు, ఉస్సురసురు - ఇందలి రెండుపదములు రూపమున భేదించినను నేకార్థకములు.

(12) అంక (-ంకా) పొంకములు, అగవుతగవులు, అంతలపొంతలవాఁడు, అరవరలు, ఆపసోపాలు (పడు), ఈఱతాఱలు, చెట్టాపట్టా (-ట్టీ) లు, మిఱు మిట్లు, రొక్కాపక్కములు, నసివాళ్లు, విచ్చవిచ్చలు, వేనవేలు, సగ్గిసముగ్గి సలు—ఇవి నిత్యద్వంద్వసమాసములు; నిత్య బహువచనాంతములు. అందలి రెండుపదములును నేకార్థకములు.

కుప్పలుతిప్పలు మొదలగు సమాసములందు రెండుపదములును బహు వచనాంతములుగానే యుండును. 'కుప్ప తిప్పలు' అనుటయుఁ గలదు.

(13) ఈక్రిందివి యవ్యయములు:—

(అ) పదింబది, పోరి (ఁ) బోరి - వీనిలో మొదటిపదముపై సను స్వారను చేరుచున్నది.

(ఆ) పరి (-ఱి) పరి (-ఱి), పాట పాట - వీనిలో మొదటిపదమే యామ్రేడిత మగుచున్నది.

(ఇ) కళవెళ, చిటపట, మొదలగువానిలో రెండవపదము మొదటి దానికంటె భిన్నమగుచున్నది. ఇట్టి వనేకములు ధ్వన్యనుకరణశబ్దములను శీర్షికక్రింద చూపఁబడినవి.

(ఈ) చుబ్బనచూఱు మొదలగు సమాసములందు నేకార్థకములగు భిన్నపదము లున్నవి.

(ఉ) అంజలిగుంజలి, ఉక్కిరిబిక్కిరి, కక్కిరిబిక్కిరి, కొక్కిరిబిక్కిరి, చిన్నారిపొన్నారి, చీకిలిమాకిలి, తక్కిడిబిక్కిడి, వంకరటింకర - ఇందేకార్థకము లగు భిన్నపదములు చేరినవి. ఈ రెండును నష్టధాతువుల క్త్వార్థక రూపములై యుండును.

(ఊ) ఎడపాదడపా, చెడాస (-మ) డా - ఇట్టివానియందు ధాతు వుల తుమున్నర్థకరూపములు చేరినవి. ఇగ్గమ్రొగ్గ (నడచెను) అనుదాని

యుందును తుమున్నర్థక రూపములే కలవు. కాని దీర్ఘము కలుగలేదు. 'తెక తేర' కూడ నిట్టి తుమున్నర్థకరూపములు గలదే.

(ఋ) చేతావాతా (కానివాఁడు), ముడ్డీనోటా (వాగుతాఁడు) - ఇట్టి వానియందు విశేష్యపదముల విభక్త్యంత రూపములు కానవచ్చుచున్నవి.

(ౠ) ఆదరాబాదరా - మొదలగునవి యన్యదేశ్యములు.

(ఎ) అకటావికటం, అతలాకుతలం, తాటాతూటం మొదలగు వాని యందు మొదటి పదమునకుమాత్రము దీర్ఘము కలిగినది.

(ఏ) జాదురజాదురంబు, అనుదానిలో దీర్ఘము కలుగలేదు.

(ఐ) ఇంచుమించు, కల్లబొల్లి, కొకిబికి, గుడిగుడి, కంచుమించు - వీని లోని పదములకు వికారము కలుగలేదు.

(ఒ) 'అడ్డ (-డ్డా) దిడ్డి' లో మొదటి పదము తుదియచ్చునకు దీర్ఘము వైకల్పికముగా కలుగును.

(ఓ) అయిటయిటికి, చీటికిమాటికి, మాటిమాటికి మొదలగునవి విశేష్యపదముల విభక్త్యంతరూపములు. చూ. (ఋ.) వీనిలో మొదటిపదము మీఁది విభక్తిప్రత్యయము వైకల్పికముగా లోపించును.

(ఔ) రమారమి, సగటుసుమారు, సరాసరి - మున్నగునవి యన్యదేశ్యములు.

(14) అయ్యేదీలేదు, పొయ్యేదీలేదు; ఉయ్యాలా, జంపాలా; ఊరా? పేరా? - పెట్టనా? పొయ్యనా? - పెట్టాలా? పొయ్యాలా? - లోపల లొటారము, బయట బటారము; విచ్చలవిడి, రామారాజ్యం; - ఇట్టివానిలో నాయా పదములు కలిసియే ప్రయోగింపఁబడును.

(15) పులిమీఁదపుట్ర, ఎనుకలమీద బొమికలు—మొదలగు నానుడులనుగూడ నీ సందర్భమున స్మరింపవచ్చును.

(16) ఈ క్రింది ద్వంద్వసమాసములందు రెండవపదములు కేవల మూఁతగా నుపయోగింపఁబడినవి. ఇట్టి వనేకములు గలవు. కొన్నిమాత్ర ముదాహరింపఁబడుచున్నవి:—

అగ్గిబుగ్గి, అంటూసొంటూ, అడాపొడా, అడుగూమడుగూ, అడ్డం దిడ్డం, అడ్డదిడ్డం, అడ్డాదిడ్డి, అందంచందం, అద్దాబద్దా, అనలూకొనలూ; అన్నెంపున్నెం, అప్పూసప్పూ, అరమరా అభ్యంతరం; అటాగొటా (అటి గొటి), అల్లంబెల్లం, ఆకూఅలమూ, ఆటాపాటా, ఆరూపోరూ, ఆలగోడు

బాలగోడు, ఆశాపాశా, ఆస్తీపాస్తీ, ఇంటావంటా, ఇంతో అంతో, ఇల్లూ వాకిలీ, ఉచ్చంనీచం, ఉత్తరంపత్తరం, ఉప్పూకారం, ఊరూవాడా, ఊరూ పేరూ (లేనివాడు), ఊళ్లూపూళ్లూ (ఏకమయినవి), ఎక్కువా తక్కువా, ఎగుడూ దిగుడూ, ఎచ్చూ తగ్గూ, ఏళ్లూపూళ్లూ (పట్టును), ఒచ్చెం పోచ్చెం, కంచంముంతా, కత్తులూకటార్లూ, కన్నూకాలూ, కబురూ కాకరకాయ, కబురూగట్రా; కర్రాకంపా (గట్రా), కసవూగట్రా, కాయాకసురూ, కారాకూరం, కారాలూ మిరియాలూ, కాలూచేయీ, కుండాచట్టీ, కుండా మండా, కూరాకాయా, కూరానారా, కూలీనాలీ, కొంపాగుడిశా, కోలూ కదపా (అన్యదే.), గట్టూపుట్టా, గడ్డీగట్రా, గడ్డీగాదరా, గుట్టూమట్టూ, గుండాపిండీ, గుడ్డాగుడుసూ, గుడ్డూగూసూ, గొడ్డూగోదా, చ(స)డీచప్పుడూ, చదువూసంధ్యా, చిందఱవందఱ, చిదుగూచిట్రా, చిన్నాపెద్దా, చిలుకూ ములుకూ, చిల్లరాచిట్రా, చిల్లరాచిదిపీ (చిదిపీచిల్లరా), చిల్లరామల్లరా, చీమలూగామలూ (కలగొనిచీమల గామలవలెను, జెలఁగుచుముందఱ శిశువు లాడంగ. హరిశ్చ. II.); చీరాచిట్రా, చుట్టంపక్కం, చెట్టూచేనూ, చెట్టూచేమా, చెత్తాచెదారం, చెరుపూమరుపూ, చేనూచెట్కా, జంకూ గొంకూ, జీతంనాతం, డబ్బూదసకం, డొక్కూడోలూ, తల్లీపిల్లా, తాఱు మాఱు, తిట్టాదిన్నే, తిండీతీర్థం, తోక్కాతోలూ, తోలూతోపారం, నగానట్రా, నీళ్లూనిప్పులూ, నుయ్యీగొయ్యీ, నోరూవాయీ, పనీపాటూ, పసుపూ కుంకం, పాడీపంటా, పాపంపుణ్యం, పిన్నాపెద్దా, పియ్యీపేడా, పిల్లా జెల్లా, పిల్లాపేకా, పిల్లామేకా, పిసరూపిప్పీ, పురుగూపుట్రా, పెట్టేపేడా, పెద్దాపిన్నా, పెళ్లీపెడాకులూ, పే(బీ)దాసాదా, పేరూప్రతిష్ఠా, పోలూ పొందూ, బుగ్గీబూడిదా, భూమిబుట్రా, మడీమట్రా, మందూమాకూ, మన్నూమశానం, మన్నూమిన్నూ; మాలామాదిగా, మాటా మంతీ, మాయా మర్మం, మిట్టాపల్లం, ముక్కాముట్రా, ముడ్డీమొగం (తెలియనివాడు), ముద్దూ ముచ్చటా, మూటాముల్లే, మూతముప్పిడి, మేడామిద్దే, రండీమొండీ, రవ్వా రట్టూ (రట్టూ రవ్వా), రాకాపోకా, రాయీరాపాషాణం, రాయీరప్పా (ప్రాకృతము : రప్ప=వల్మీకము; గుజరాతీ=రాఫడో); లంచంపంచం, లొడ్డూ లొసుకూ, వెట్టీమొట్టీ, వేరూవెల్లంకీ— మొదలయినవి.

పై జంటలయం దేకార్థీభావము కలిగియుండుటచే వానిని ద్వంద్వ సమాసము లనియే యనవలెను. వానిలోఁ గొన్నిటియందు సముచ్చయార్థక దీర్ఘములును తుది ము వర్ణకములును, బహువచన లు వర్ణమును లోపించి కేవల ద్వంద్వసమాసములు కావచ్చును. అప్పుడు కొంచె మర్థభేదము కలుగును.

(1) సముచ్చయదీర్ఘము లోపించుట.

అంటుసొంటులు, అడుగుమడుగులు, అప్పుసప్పులు, అరమరలు, అఱగొఱలు, ఆకలములు, ఊరువాడలు, ఎగుడుదిగుడులు, కుండమండలు, కూరనారలు, కూలినాలులు, గడ్డిగాదరలు, గుట్టుమట్టులు, గుడ్డగుడుసులు, గొడ్డుగోడలు, చదువుసంధ్యలు, చిలుకుమలుకులు, చిల్లరమల్లరలు, చెత్తచెదారములు, చెఱుపుమఱుపులు, జంకుగొంకులు, డబ్బుదసకములు, డొక్కడోలులు, పిల్లజెల్లలు, పే(బీ)దసాదలు, బుగ్గిబూడిదలు, భూమిబుట్రలు, మడిమట్రలు, మందుమాకులు, మన్నుమశాణములు, మన్నుమిన్నులు, మాలమాదిగలు, మాటమంతులు, మిన్నుమన్నులు, ముద్దుముచ్చటలు, మూటముల్లెలు, మూతముప్పిడులు, మేడమిద్దెలు, రండిమొండులు, రవ్వరట్టులు, రాయిరప్పలు, లొడ్డులొసుకులు, వెట్టిమొట్టులు, వేరువెల్లంకులు.

పై వానిలో సముచ్చయదీర్ఘము రెండవపదములమీఁదను లోపించి రెండవపదము తుదిని బహువచనప్రత్యయము చేరుట కానవచ్చును. మొదటి పదము హ్రస్వమగునపుడు దానిపైఁ బరుషములు పరమగుచో దాని కొకప్పుడు గసడదవాదేశము కలుగును; ఒకప్పుడు నేఁటి వ్యవహారమునఁ గలుగదు. పూర్వకాలమునఁ గలుగుచుండెడిదేమో.

(అ) గసడదవాదేశము కలుగుటకు.

కాయగసురులు, కాలుసేతులు, కూరగాయలు, చడిసప్పుడులు, చిదుగుసిట్రలు, చెట్టుసేనులు, చెట్టుసేమలు, చెత్తసెదారములు, చేనుసెట్రలు, తిట్టదిన్నెలు, పసుపుగుంకములు.

(ఆ) గసడదవాదేశము నేఁడు కలుగనందుకు.

అడపొడలు, ఆటపాటలు, ఆరుపోరులు, ఆశపాశలు, ఆస్తిపాస్తులు, ఊరుపేరులు, ఎక్కువతక్కువలు, ఎచ్చుతగ్గులు, కట్టుకంపలు, కాయకసురులు, కాలుకదపాలు గట్టుపుట్టలు, గుండపిండులు, తల్లిపిల్లలు, తిండితీర్థములు, తోలుతోపారములు, పాడిపంటలు, పిన్నపెద్దలు, పిల్లపేకలు. పిసరుపిప్పులు, పురుగుపుట్రలు, పెట్టపేడలు, పెద్దపిన్నలు, పేరుప్రతిష్ఠలు, పోలుపొందులు, రాళపోకలు.

(2) మొదట పదము తుది ము వర్ణము లోపించుట.

అడ్డదిడ్డములు, ఉచ్చనీచములు, జీతనాతములు.

మువర్ణము లోపింపఁగా గలిగిన పదముపైఁ బరుషములు నిలిచినచో వానికి గసడదవాదేశము నేఁడు గలుగదు; పూర్వకాలమునఁ గలుగుచుండెడిదేమో.

అందచందములు, అన్నెపున్నెములు, ఉత్తరపత్తరములు, ఒచ్చెపొచ్చెములు, చుట్టపక్కములు, లంచపంచములు.

(3) బహువచన లు వర్ణము లోపించుట: నీరునిప్పులు.

బహువచన లు వర్ణము లోపింపఁగా మిగిలిన రూపముపైఁ బరుషములు చేరినయెడల నేఁడు గ స డ ద వాదేశము కానరాదు; పూర్వకాలమునఁ గలుగుచుండెడిదేమో. ఉదా. కత్తికటారులు.

కొన్నిజంటలను సాధారణ ద్వంద్వసమాసములుగఁ గూర్ప వీలులేదు; అప్పు డాజంటలలోని పదముల తుది దీర్ఘములకు హ్రస్వముగాని, ము, లు వర్ణములకు లోపముగాని కలుగదు. ఉదా. అద్దాబద్దా, అనలూకొనలూ 'అనలుకొనలు' అని సమాసము కావచ్చును; కాని, 'అనకొనలు' అని కాదు; ఊళ్లూప్రాళ్లూ; పల్లూపూల్లూ; కన్నూకాలూ, కబురూకాకరకాయా, కారాలూ మిరియాలూ, చీమలూగామలూ, తొక్కాతోలూ.

ఒకప్పుడు పూర్వపదము తుది దీర్ఘము నిలిచి రెండవపదము తుది దీర్ఘమునకు మాఱుగ బహువచన లు వర్ణము నిలుచును: అడ్డాదిడ్డాలు, రొక్కాపక్కములు, కకావికలు, అప్పాచెల్లెండ్రు మొదలయినవి.

ఒకప్పు డిట్టిసమాసములందలి యుత్తరపదము తొలిపరుషములకు గ స డ ద వ లాదేశము లగును: అన్నాదమ్ములు, అక్కాసెల్లెండ్రు.

మఱిల మిశ్రసమాసము.

ఇంతకుఁబూర్వము (చూ. పుట. 749) మిశ్రసమాసములనుగూర్చి ముచ్చటించియుంటిమి. అచట సంస్కృతాచ్ఛికపదముల కలయిక మాత్రము వివరింపఁబడినది. ఇట్టి సమాసములేకాక (i) కేవలాన్యదేశీయ సమాసములు (ii) అన్యదేశ్యపదములును సంస్కృత పదములును గలిసిన సమాసములు (iii) అన్యదేశ్యములును దేశ్యములును గలిసిన సమాసములుకూడ తెనుఁగునఁ బ్రచారమున నున్నవి. ఇట్టివానిని గ్రంథములందు ప్రయత్నముతోఁ బరిహరింప వీలుండునేమోకాని, వ్యవహారమున నవి యపరిహార్యములుగ నున్నవి. ఇచట నాయాతెగల సమాసములకుఁ గొలఁదిగ నుదాహరణముల నిచ్చినఁ జాలును.

i. కేవలాన్యదేశ్యపదముల సమాసములు.

(అ) కేవలాంగ్లపదములు.

రైల్వేస్టేషను, పోస్టాఫీసు, కాలేజీహాలు, మోటారుకారు, బాడీనిక్కరు, గ్రామోఫోనుప్లేటు, హైకోర్టు మొదలయినవి.

(ఆ) కేవల హిందూస్థానీపదములు.

హుజూరు సిరాస్తాదారు, హైదరాబాదు, కలందాను మొదలయినవి.

(ii) వేర్వేరు అన్యదేశ్యములు చేరినవి.

(అ) ఆంగ్ల హిందూస్థానీపదములు చేరినవి.

హెడ్‌మునిషీ, హెడ్‌గుమస్తా, డిప్టీతహసీల్‌దారు, ఫుల్‌ఆరమ్‌కమీజు, హాఫ్-ఆరమ్‌చొక్కా, కలక్టరుకచేరీ, గవర్నరుదర్జా, పోలీసుజవాను, వుయిలు నామా, మొదలయినవి.

(ఆ) హిందూస్థానీ, ఆంగ్ల పదములు చేరినవి.

హుజూరుమేజిస్ట్రేటు, బేడ్రెస్సు, సఫేదుపౌడరు, మొదలయినవి.

iii. అన్యదేశ్యములును సంస్కృతపదములును గలిసినవి.

(అ) ఆంగ్ల సంస్కృతపదములు కలిసినవి.

యూనివెర్సిటీపరీక్ష, కాలేజీభవనము, హెడ్‌పండితుఁడు, గ్రామో ఫోను సంగీతము, ఎలెక్ట్రిక్‌దీపము, మొదలయినవి.

(ఆ) సంస్కృతాంగ్ల పదములు కలిసినవి.

ప్రథమఫ్రొటర్లలిస్టు, దక్షిణ మహారాట్రా రైల్వే, ఉత్తరఅమెరికా, దక్షిణఆఫ్రికా, అమృతాంజనండిపో, ఆంధ్రపత్రికా ఆఫీసు, ఆనందా ప్రెస్సు, వెంకటేశ్వర్ అండు కో, మొదలయినవి.

(ఇ) హిందూస్థానీ, సంస్కృతపదములు చేరినవి.

హిందూస్థానీభాష, బేమర్యాద, జరూరుకార్యము, మున్సబుద్యోగము, ఘరానామనుష్యుఁడు, జనానాస్త్రీలు, నానా వజీర సేనా మానభేదనుఁడు, మొదలయినవి.

(ఈ) సంస్కృత, హిందూస్థానీపదములు చేరినవి.

కేవల హిందూస్థానీపదములు, అతిజరూరు, పండితదర్జా, మంత్రి హోదా, మొదలయినవి.

iv. అన్యదేశ్యములును ఆచ్ఛికపదములును గలిసినవి.

(అ) ఆంగ్లాచ్ఛికపదములు చేరినవి.

హార్మోనియంపెట్టె, రేడియోపాట, కలెక్టరు దొరవారు, లోయర్-సెకెండరీ తరగతి, హోటేలుతిండి, గాడ్డుబండి, పాప్లినుగుడ్డ, మొదలయినవి.

(అ) ఆచ్ఛికాంగ్ల పదములు చేరినవి.

అప్పారావు మేస్టరుగారు, తెనుఁగుడాక్టరు, పశువులాసుపత్రి, మొదలయినవి.

(ఇ) హిందూస్థానీపదములును ఆచ్ఛికపదములును జేరినవి.

జరూరుపని, ఖజానాగది, సామానుబండి, కలముపోటు, కాఫలా మనిషి, మేజాబల్ల, సందుగపెట్టె, మొదలయినవి.

(ఈ) ఆచ్ఛికపదములును హిందూస్థానీపదములును చేరినవి.

బంగారుమొలాము, అంగడిసామాను, మొదలయినవి.

మిశ్రసమాసములలో మఱియొకరీతివిగూడఁ గలవు. ఇవి యాచ్ఛిక సంస్కృతపదములు కలియుటచే నేర్పడిన కఱకంఠాది సమాసములవంటి వయినను నిట్టివానిని సంస్కృతకవులును దెనుఁగుఁ గవులును గూడ విశేషముగ వాడియుండుటచే వీనిని బ్రత్యేకముగఁ బేర్కొనవలసియున్నది. సంస్కృతపదములు (1) ఆచ్ఛిక బిరుద పదములందును (2) ఆచ్ఛికసంజ్ఞావాచకపదములందును సమసించును. అహోబలుఁ డిట్టివాని నుదాహరించియున్నాఁడు.

(1) బిరుదనామములతోడి మిశ్రసమాసములు.

స్వామిద్రోహరగండలాంఛనుఁడు, పేమణీహనుమంత బిరుదాంకుఁడు, చౌహత్తమల్లుఁడు, హిందూరాయ సురత్రాణుఁడు ('సురత్రాణ' పదము 'సుల్తాను'నకు సంస్కృతీకరణము), మూరురాయరగండ బిరుదాంకుఁడు.

(2) సంజ్ఞావాచకపదములతోడి మిశ్రసమాసము.

మాగంటిపట్టణ మహేశుఁడు, మానూరిపట్టణపరము, అమ్మభూపతి, జమ్మిలవంశసంభవుఁడు, గుత్తిమువంశసంభవుఁడు, కొల్లాపురశక్తి, కనువరాజ వంశజలధి కౌస్తుభాంచితోదయుఁడు మొదలయినవి.

ప్రత్యేకపదము లనేకములు కలిసి క్ష్మప్తరూపములను దాల్చు సమాసము లేర్పడుచున్నవి. సమాస మేర్పడునప్పుడు కేవల పదములే కాక, వాని యర్థములును సమసించి యేకార్థమును గలిగించుచుండును. సమాసమునందు చేరనంతకాలమును పదములు తమ ప్రత్యేకార్థములను గలిగి యుండును; కాని, యవి సమాసములఁ జేరినంతనే తమ ప్రత్యేకార్థములను మఱుఁగుపఱుచుకొని యస్వతంత్రములై సంపూర్ణసమాసార్థమున లీనములయిపోవును. సమాసమున ననేకపదము లున్నను దానివలన మనస్సున నేదో యొక్క భావము మాత్రము వ్యక్తమగును.

సమాసమునకును దాని విగ్రహమునకును గల భేదమును పతంజలి యిట్లు వివరించి యున్నాఁడు-'విగ్రహవాక్యమున సుబలోపము, వ్యవధానము,

యథేష్టముగ నొకపదము మఱియొకపదముతో సంబంధము గలిగియుండుట, ప్రత్యేకపదములకుఁ బ్రత్యేకస్వరము, సంఖ్యావిశేషము (అనఁగా ప్రత్యేక పదములు తమతమ వచనములం దుండుట, వ్యక్తాభిధానము (అనఁగా ప్రత్యేకపదములు స్వతంత్రముగఁ బ్రత్యేకార్థములను గలిగియుండుట, ఉపసర్జనవిశేషణము, 'చ' యోగము, అనునవి యుండును. సమాసమున నివి యుండవు.' సమాసము లనేకవిధము లున్నను అవి యేకపదములుగ పరిగణింపఁబడును. సమాసమునఁ జేరిన పదములన్నియు నొండొంటితో నతి సన్నిహితసంబంధము గలిగియుండుటచే నా సమాస మవిభాజ్యగుణమును బొందును. కావుననే కృత్తద్ధితములతోఁబాటు సమాసములను గూడ పాణిని ప్రాతిపదికములుగఁ బరిగణించి యున్నాఁడు.

ఒకపదము సమాసమునందు చేరిన పిమ్మట నా సమాసమునకు బహిర్గతమయిన మఱియొకపదముతో సాధారణముగ నన్వయింపదు. "ఋద్ధస్య రాజమాతంగాః" అను ప్రయోగ మసాధువు. కాని, వ్యవహారమున నీ నియమమునకుఁ దప్పిన కొన్ని ప్రయోగములను లాక్షణికులు గమనించి యున్నారు. "దేవదత్తస్య గురుకులమ్," "చైత్రస్య దాసభార్యా" యను ప్రయోగములు గమకిత్వశక్తిచే సాధువులని వారి యభిప్రాయము.

ఈ యభిప్రాయము ననుసరించియే కావలయు తెనుఁగుకవులు "తన ధర్మ విభవ సంతతి సంస్తుతదానమాన పరిపూర్ణులు" అను నిట్టి సమాసములలో 'తన' మొదలగు నాచ్ఛికపదములను సంస్కృతసమాసమధ్యగతము లగు పదములతో నన్వయము గలుగఁజేసి ప్రయోగించియున్నారు. ఇట్లు చేయఁగూడ దని యహోబలుని తలఁపు. పై సమాసమునందు 'సంస్తుతదానమాన పరిపూర్ణులు' అనుటకు 'సంస్తుతప్రీతిదానపరిపూర్ణుల' అని యతఁడు సవరించినాఁడు. ఈ సవరణవలన నాతని యుద్దేశ మెట్లు సిద్ధించెనో తెలియదు. అయినను 'ఆ నారాయణ గజదేవు మాహాత్మ్యముల ...' ను సమాసము నన్వయింపఁ గావున నాతఁడు గ్రహించి చెప్పుచున్నాఁడు. ఇందు 'ఆ' అనునది 'నారాయణ', 'గజదేవు', 'మాహాత్మ్య', '...' పదములలో దేనితోనైనను, అన్నిటితోనైనను నన్వయము గలిగియుండవచ్చును గదా. ఇట్టి యన్వయమునకు మన తెనుఁగువాఙ్మయమునం దెన్నిటినైన నుదాహరణముల నీయవచ్చును.



ఆంధ్ర విశ్వకళాపరిషద్ గ్రంథమాల
( 18-వ ప్రచురణము )

శ్రీః

# ఆంధ్రభాషాచరిత్రము

కర్త:
చిలుకూరి నారాయణరావు, ఎమ్. ఏ., ఎల్. టి., పి హెచ్. డీ.
సంస్కృతాంధ్ర కర్ణాటక భాషాధ్యాపకుఁడు,
రాయలసీమ కళాశాల, అనంతపురము.

2-వ భాగము.




వాల్తేరు.
1937
మద్రాసు:
ఆనంద ముద్రణాలయమునందు
ముద్రితము.

 [రూ. 6-0-0

స్ఫోటముగఁ గాని వ్యక్తిస్ఫోటముగఁ గాని యుండవచ్చును. ఆ స్ఫోట ముపాధి భేదమువలన నేకభాషయందు వివిధవాక్యములుగను, ననేకభాషలయం దనేక విధములగు వాక్యములుగను వ్యక్తమగుచుండును. ఆయాజాతులయొక్కయు, వ్యక్తులయొక్కయు వాగింద్రియ నిర్మాణాది కారణములవలన వివిధభాషల యందును, ఏకభాషయందును నేకస్ఫోటమున కేకకాలమందు ననేకకాలము లందును వివిధవాక్యము లుత్పన్నములగుచున్నవి.

ఖండపక్షమువారి ప్రకారము వాక్యము (i) క్రియాపదము (ii) పద క్రమము (iii) పదసంఘాతము (iv) ఆద్యపదము (v) సాకాంక్షగల సుప్తి జంతపదములు అనువానిలో నొకటి యగుచున్నది. వీనిలో పదక్రమము ముఖ్యమయినది. క్రమమనుటతోడనే పౌర్వాపర్యము స్ఫురించుచున్నది. వాక్యమునందలి ప్రతిపదమును కర్తృత్వ, కర్మత్వాద్యర్థములలో నొకదానిని తెలియఁ జేయుచుండును. ఈ యర్థము లొకదాని తరువాత నొకటిగ నొక క్రమము ననుసరించి యితరార్థ విశేషములతో వాక్యమున వ్యక్తమగు చుండును. చైత్రుఁడు పుస్తకమును చదువుచున్నాఁడు - అను వాక్యమునకు 'చైత్రుఁడు కర్తగను, పుస్తకము కర్మగను గల చదువుట అనుక్రియ' అని యర్థము చెప్పవలెను. ఇందు ప్రత్యేకపదముల యర్థముల కూడికవలన గలి గిన యర్థమునకు కర్మత్వము మొదలగునవి విశేషార్థమును గలిగించుచుండును. ఈ విశేషార్థ మొక క్రమము ననుసరించి వ్యక్తమగుచుండును. ఈ క్రమమే వాక్యమునఁ బ్రధానాంశము; అదిలేక వాక్యత్వము సిద్ధింపదు.

ఖండపక్షమువారి వాక్యనిర్వచనములను భాట్టమతమును ప్రాభాకర మతమును ననుసరించి రెండువిధములుగ నేర్పఱుపవచ్చును. కుమారిలభట్టు వాదమునకు 'అభిహితాన్వయవాద' మనిపేరు. ఈ వాదము ప్రకారము వాక్య ము 'పదసంఘాతము' కాని, 'పదక్రమము' కాని యగుచున్నది. ప్రభాక రుని వాదమునకు 'అన్వితాభిధాన వాద' మనిపేరు. దీని ప్రకారము వాక్యము, ఆఖ్యాతమో, ఆద్యపదమో, సాకాంక్షమగు సర్వపదసముదాయమో యగును. ఈ రెండువాదములును వాక్యము నర్థమునకు సంబంధించినవి.

పై విచారమువలన వాక్యమనఁగానేమి, వాక్యము నర్థమనఁగానేమి యను విషయమున ననేకాభిప్రాయములు బయలుదేరుటచే నీ విషయము చాల వివాదగ్రస్తమయినది. స్ఫోటవాదము ప్రకారము ప్రతిభయే వాక్యము నర్థమగుచున్నది. క్రియయే వాక్యమని యాఖ్యాతవాది యనుచున్నాఁడు. అభిహితాన్వయవాది 'సంసర్గము' వాక్యము నర్థమని తలంచుచున్నాఁడు; అనఁగా వాక్యమునందలి పదముల యర్థముకంటె భిన్నమగు తాత్పర్యార్థము వాక్యమువలన ద్యోతకమగుచున్నదని యాతని యభిప్రాయము. దీని

విలక్షణ బోధయని యాతఁ డనుచున్నాఁడు. కాని, అన్వితాభిదానవాది వాక్య మందలి పదముల యర్థమే వాక్యము నర్థమని చెప్పును. అభిహితాన్వయ వాది ప్రతిపాదించిన విలక్షణబోధ వాక్యములోని పదములయర్థముల సము దాయమే కాని వానికి భిన్నము కాదని యాతని. యభిప్రాయము.

పై వాదములలో నేది సరియైన దను విషయమును నిర్ణయించుట కష్టసాధ్యము. పదములు ప్రధానము లనువారును, వాక్యమంతయును బ్రధా నమనువారును గూడఁ దమవాదములకు మంచి యుపపత్తులను జూపక పోలేదు. కాని, యీ రెండుమతములందునుగూడ నభిప్రాయప్రకటనము నకు వాక్యమే మూలమను విషయమును వైయాకరణులందఱు నంగీకరించి యున్నారు. అట్టి సంపూర్ణవాక్యమునందలి యంశములను విడఁదీసి వాని కాయా రూపములెట్లు కలిగినవని నిర్ణయించుటకు వైయాకరణులు పూనిరి. వాక్యమునందలి యాయా భాగముల వ్యాకరించుట, అనఁగా విడఁదీయుటకే వ్యాకరణమని పేరు.

## పదజాతములు.

వాక్యమునం దంశములుగాఁ జేరు పదములు (i) నామములు (ii) ఆఖ్యాతములు (iii) ఉపసర్గములు (iv) నిపాతములు, అని నాలుగు విధము లుగా నుండునని యాస్కుఁడు తెలిపియున్నాఁడు. ఐంద్రవ్యాకరణమున 'పద' మనున దొక్కటే యనియు, పదములు వర్గములుగా విభజింప వీలులేదనియుఁ దెలుపఁబడినట్లు దుర్గుఁడు నిరుక్త వ్యాఖ్యయందు వ్రాసియున్నాఁడు. 'సుప్తి ఙంతం పదమ్' అను పాణిని సూత్రము ననుసరించి కొందఱు పదములను సుబం తములు, తిఙంతములు, నను రెండు వర్గములుగ విభజించియున్నారు. కొందఱు యాస్కుఁడు వివరించిన నాలుగు వర్గములకును 'గతి', 'కర్మప్రవచనీయము' లను జేర్చి దరజాతము లాఱని తెలిపియున్నారు.

పై వానిలో నామము, ఆఖ్యాతము, అనున వర్థవంతములుగావున ముఖ్యములయినట్లు వైయాకరణులు చెప్పుచున్నారు. ఉపసర్గములకును నిపా తములకును స్వతంత్రార్థములేదు. అవి నామాఖ్యాతములతోఁ జేరి వానికర్థ విశేషములను గల్పించుచున్నవి. కొంద ఱుపసర్గ నిపాతములును నర్థవంత ములే యనుచున్నారు.

యాస్కుని పదవిభాగమున సర్వనామములును, విశేషణములును అవ్య యములును గానరావు. సర్వనామములును నొకరీతి నామములే యను నభి ప్రాయముతో నాతఁడు వానిని ప్రత్యేకవర్గముగ వివరించియుండకపోవ చ్చును. లేదా, అవి వస్తూపలక్షణమును దెలియఁజేయుచు విశేషణము లగు చున్నవను భావమునన్నైనను వానిని విడిచియుండవచ్చును. విశేషణములు

నామములు తెలుపు వస్తువుల గుణములను దెలుపుటచే నవి నామములకంటె భిన్నములు కాఁజాలవు. అట్లే అవ్యయములును క్రియలతో నన్వయించుచు వానిలక్షణమునే కలిగియుండుటచే నాఖ్యాతములకంటె వేఱుకావు. లేదా, అవ్యయములకు నపుంసకలింగము, ద్వితీయావిభక్తి, ఏకవచనము అనునవి విధింపఁబడి యుండుటచే వానిని నామములుగఁ బరిగణించినను తప్పులేదు. కావున యాస్కుని విభాగమే సరియైనదైనట్లు తోఁచుచున్నది.

## ప్రకృతి ప్రత్యయ విభాగము.

వైయాకరణులు పదములను పదజాతములుగ విభజించి యూరకొనలేదు. పదములనుండి వానియందుండు ప్రకృతి, ప్రత్యయములనుగూడ విడఁదీసిరి. ఇట్లు విడఁదీయుటకు సంస్కారమని పేరు. ఇట్లు శబ్దముల సంస్కారమును దెలుపుటకే శబ్దానుశాసన మనిపేరు. శబ్దము ననుసరించి శాసించుటయే శబ్దానుశాసనము. శబ్దములు లోకమునందు సహజములుగ నుండునవి. అవి వైయాకరణుఁడు కల్పించునట్టివి కావు. శబ్దముల నెవ్వఁడును సృష్టిచేయలేదు. "కుమ్మరివాని యింటికిపోయి, 'కుమ్మరీ, నాకుకుండలుచేయు' మన్నట్లు వైయాకరణునియొద్దకుపోయి, 'ఓయీ, నాకు శబ్దములను చేయుము' అని యెవ్వరు ననరు." శబ్దమెల్లప్పుడును నఖండముగనే యుండును. దానియందలి ప్రకృతి ప్రత్యయములను విడదీయుట వైయాకరణ కల్పనము. ప్రకృతి ప్రత్యయములం దొకదానిని విడిచి యొకటి ప్రత్యేకముగ నుండఁజాలదు. కాని, యనేక శబ్దములను గూర్చి మీమాంస చేయఁదలపెట్టిన వైయాకరణుఁడు వానియందలి యన్వయవ్యతిరేకములను గుర్తించి వానిని ప్రకృతులుగను ప్రత్యయములుగను విడఁదీయును. రాముఁడు, భీముఁడు మనుష్యుఁడు మొదలగు వానిలో నాతనికి 'డుజ్' అనున దంతమందు సామాన్యముగఁ గాన్పించుచుండుటచే నది ప్రత్యయమనియు, నొకదానికొకటి పోలని రాము, భీము, మనుష్య అను నవి ప్రాతిపదికములనియు నాతఁడేర్పాటు చేయును. అట్లే, చేయుచున్నాఁడు, చేసెను, చేయును అనువానిలో 'చేయు' అనునది సామాన్యముగ నుండుటచే నది ప్రకృతి, లేక ధాతువనియు, డుజ్, ఎను, ను, అనునవి ప్రత్యయములనియు 'చున్న' మొదలగునవి వాయా యర్థములం దాగమములుగా వచ్చినవనియుఁ దెలుపును.

ప్రకృతులును ప్రత్యయములునుగూడ స్వతంత్రార్థబోధకములే యనువారును లేకపోలేదు. కొన్ని ప్రత్యయములను బ్రకృతితో కలిపి కాక ప్రత్యేకముగఁ గూడఁ బ్రయోగింపవచ్చు ననుమాట నిజమే. ఇందువలనఁ బ్రత్యయములును నొకప్పుడు సంపూర్ణపదములుగ నుండెడివని తెలిసికొనవచ్చును. కాని, లోకమున నిది ప్రకృతి, యిది ప్రత్యయము అను జ్ఞానము

కలిగి శబ్దములను ప్రయోగింపరు. పదములను ప్రకృతి ప్రత్యయములుగ విడఁదీయుట వైయాకరణుఁడు చేయుపనియే కాని వేఱుకాదు.

పదజాతములలో నామపదములు నాఖ్యాతములును ముఖ్యములు. అందు నామపదములకు విశేషణములును సర్వనామములును ఆఖ్యాతముల కవ్యయములు నుపలక్షణములు. కావున తొలుత నామపదములనుగూర్చియు, పిమ్మట విశేషణములనుగూర్చియు, పిదప సర్వనామములనుగూర్చియు తదుపరి ఆఖ్యాతములనుగూర్చియు, తరువాత నవ్యయములనుగూర్చియు నిఁక ముచ్చటింపఁబడును.

నామపదములు లింగ, వచన, విభక్తులను గలిగియుండును. మొదట సంస్కృత నామపదముల లింగమునుగూర్చి విచారింతము.

లింగము.

సంస్కృతమున లింగము శబ్దగతము. ఆయా శబ్దముల యంశములను బట్టి యవి పుం, స్త్రీ, నపుంసకలింగములలో నెవ్వియో నిశ్చితము లగుచుండును. ఆ శబ్దములు తెలుపు జంతువులయు, వస్తువులయు జాతినిబట్టి సంస్కృతమున లింగము నిర్ణీతముకాదు. ఉదాహరణమునకు—మిత్రమ్ = స్నేహితుఁడు, ఇది పుంలింగ శబ్దముకాదు; నపుంసకలింగ శబ్దము. దారాః = భార్య, ఇది స్త్రీలింగముకాదు, పుంలింగము. వృక్షః = చెట్టు. ఇది నపుంసకలింగము కాదు, పుంలింగము. ఇట్లే, వృక్షః, శాఖా, ఫలమ్, అను శబ్దములు మూఁడును జడవాచకములైనను, శాఖాఫలములు వృక్షమునకు సంబంధించిన భాగములైనను, వానిలో వృక్షశబ్దము పుంలింగము, శాఖాశబ్దము స్త్రీలింగము, ఫలశబ్దము నపుంసకలింగము. అదేరీతిగా, దారాః, భార్యా, కలత్రమ్, అను మూఁడును పెండ్లామను నర్థము కలవి, కాని వేర్వేఱు లింగములకుఁ జెందినవి. వానిలో 'దారాః' పుంలింగము, 'భార్యా' స్త్రీలింగము, 'కలత్రమ్' నపుంసకలింగము.

స్థూలదృష్టికి సంస్కృతమున లింగవివేక మీరీతిగనున్నను, సూక్ష్మముగ నాలోచించినచో శబ్దముల యంతములనుబట్టియే లింగమును నిర్ణయించుట సాధ్యము కానట్లు తెలియకపోదు. అకారాంతశబ్దములు పుం నపుంసక లింగములలో నేవయినఁ గావచ్చును; కొన్నియెడల నేకశబ్దమే పుంలింగము గాని నపుంసకలింగముగాని కావచ్చును. ఇ, ఉ, ఋ, లంతమందుగల శబ్దములు కొన్ని పుంలింగములు, కొన్ని స్త్రీలింగములు, కొన్ని నపుంసకలింగములు. ఈయచ్చులలో నేదయిన నంతమందుగల ఏకశబ్దమే పుంనపుంసకలింగములలో నొకటయికాని, పుంస్త్రీలింగములలో నొకటయికాని యుండవచ్చును.

ఇట్లే, హలంతశబ్దములందును నేకహల్లంతమందుగల శబ్దములు నియతముగ నేదో యొకలింగము నాశ్రయించియుండుననియుఁ జెప్ప వీలులేదు. ఇట్లు సంస్కృతమున ననియతస్థితిక మగుటచేతను, లోకము నాశ్రయించి యుండుట చేతను, లింగమశిష్యమని చెప్పుదురు. అయినను నీ లింగనిర్ణయ విషయమునఁ గొన్ని సాధారణ నియమములను వైయాకరణు లేర్పఱిచి యున్నారు. అవి యీక్రింద వివరింపఁబడినవి.

## స్త్రీలింగము.

1. ఋ-కారాంత శబ్దములలో 'మాతృ, దుహితృ, స్వసృ, యాతృ, ననాందృ' శబ్దములు మాత్రమే స్త్రీలింగములు.

2. '-అని' ప్రత్యయాంత ధాతువులును, '-ఊ' ప్రత్యయాంత ధాతువులును స్త్రీలింగములు: ఉదా. అవనిః, చమూః. కాని—

అశని, భరణి, అరణి, శబ్దములు పుంలింగములుగూడ నగును.

3. '-మి', '-ని', అను ప్రత్యయము లంతమందుగల శబ్దములు స్త్రీలింగములు: ఉదా. భూమిః, గ్లానిః. కాని—

(అ) వహ్ని, వృష్ణి, అగ్ని శబ్దములు పుంలింగములు.

(ఆ) శ్రోణి, యోని, ఊర్మి శబ్దములు పుంలింగములు కూడను.

4. 'క్తిన్' అంతములన్నియు స్త్రీలింగములు. ఉదా. కృతి, ధృతి, మతి మొదలయినవి. కాని—

పతి, నృపతి, స్థపతి, భూపతి, ఇట్లు 'పతి' శబ్దముతోఁ గూడినవి పుంలింగములు.

5. ఈ కారాంత శబ్దములన్నియు స్త్రీలింగములు. ఉదా. లక్ష్మీః, మొదలయినవి.

6. 'ఊఙ్', 'ఆప్' అను ప్రత్యయము లంతమందుగల శబ్దములు స్త్రీలింగములు: ఉదా. కురూః, విద్యా మొదలయినవి.

7. ఈ, ఊ, లంతమందుగల యేకాక్షర శబ్దములు స్త్రీలింగములు: ఉదా. శ్రీః, భూః, మొదలయినవి.

8. వింశతిః, త్రింశత్, చత్వారింశత్, పంచాశత్, షష్టిః, సప్తతిః, అశీతిః, నవతిః అను సంఖ్యావాచకములు స్త్రీలింగములు.

9. 'దుందుభి' శబ్దము జూదములోని పాచిక యను నర్థమునందును 'నాభి' శబ్దము 'ఒక క్షత్రియుఁడు' అనునర్థము లేనప్పుడును స్త్రీలింగములు ఇతరార్థములం దవి పుంలింగములు.

10. తల్-అంత శబ్దములు స్త్రీలింగములు. ఉదా. శుక్లతా, బ్రాహ్మణతా, గ్రామతా, దేవతా మొదలయినవి.

11. భూమి, విద్యుత్, సరిత్, లతా, వనితా అను శబ్దములును, అదే యర్థముగల యితర శబ్దములును స్త్రీలింగములు. కావున, 'భూః, సౌదామనీ, నిమ్నగా, వల్లీ, యోషిత్' మొదలగునవి స్త్రీలింగములు. కాని, 'యాదస్' శబ్దము సరిద్వాచకమైనను నపుంసకలింగమే.

12. భాః, స్రుక్, స్రక్, దిక్, ఉష్ణిక్, ఉపానట్, శబ్దములు స్త్రీలింగములు.

13. స్థూణ, ఊర్ణ శబ్దములు స్త్రీలింగములు, నపుంసకలింగములు కూడ నగును. అనఁగా వాని రూపములు స్థూణా, స్థూణమ్; ఊర్ణా, ఊర్ణమ్ అని రెండు విధములుగ నుండును. కాని, స్థూణశబ్దమునకు గృహశబ్దమును, ఊర్ణ శబ్దమునకు శశశబ్దమును బూర్వమందుచేరి సమసించినచో నవి నపుంసకరూపములనే పొందును. గృహస్థూణమ్, శశోర్ణమ్.

14. ప్రావృట్, విప్రుట్, రుట్, తృట్, విట్, త్విట్ అను శబ్దములు స్త్రీలింగములు.

15. దర్వి, విది, వేది, స్వని, శాని, అశ్రి, వేశి, కృషి, ఓషధి, కటి, అంగులి శబ్దములు స్త్రీలింగములు. వీనికి జీప్ కూడచేరి 'దర్వీ' మొదలగు రూపములును నేర్పడును.

16. తిథి, నాడి, రుచి, విచి, నాలి, ధూలి, కికి, కేలి, ఛవి, రాత్రి మొదలగు శబ్దములు స్త్రీలింగములు.

17. శష్కులి, రాజి, కుటి, అశని, వర్తి, భ్రుకుటి, త్రుటి, వలి, పంక్తి శబ్దములు స్త్రీలింగములు.

18. ప్రతిపద్, ఆపద్, విపద్, సంపద్, శరద్, సంసద్, పరిషద్, ఉషస్, సంవిత్, క్షుత్, పుత్, ముత్, సమిధ్ శబ్దములు స్త్రీలింగములు.

19. ఆశీః, ధూః, పూః, గోః, ద్వాః శబ్దములు స్త్రీలింగములు.

20. అప్, సుమనస్ (పుష్పమను నర్థమందు), సమా, సికతా, వర్షా శబ్దములు స్త్రీలింగములు. వీనిని బహువచనమునందే సాధారణముగ వాడవలెను. సుమనశ్శబ్దము దేవతావాచియైనచో పుంలింగము.

21. స్రక్, త్వక్, జ్యోక్, వాక్, యవాగూ, నౌః, స్ఫిక్, శబ్దములు స్త్రీలింగములు.

22. త్రుటి, సీమన్, సరంబధ్యా శబ్దములు స్త్రీలింగములు.

23. చుల్లి, వేణి, ఖారి, శబ్దములు స్త్రీలింగములు.

24. తారా, ధారా, జ్యోత్స్నా మొదలగునవి స్త్రీలింగములు గూడ నగును.

25. శలాకా శబ్దము నిత్యముగా స్త్రీలింగమగును.

**పుంలింగము.**

1. ఘఞ్, అప్, ఘాచ్ ప్రత్యయము లంతమందుగల శబ్దములు: పాకః, త్యాగః, కరః, గరః, విస్తరః, గోచరః, చయః, జయః మొద. కాని, భయ, లింగ, భగ శబ్దములు నపుంసకలింగములు.

2. నఙ్ ప్రత్యయ మంతమందుగల శబ్దములు: యజ్ఞః, యత్నః, మొద. కాని, యాచ్ఞా శబ్దము స్త్రీలింగము.

3. కి-ప్రత్యయాంతమగు 'ఘు' ప్రత్యయముగల శబ్దములు: ఆధిః, నిధిః, ఉదధిః మొద. కాని, 'ఇషుధి' శబ్దము స్త్రీలింగము కూడనగును.

4. దేవ, అసుర, ఆత్మన్, స్వర్గ, గిరి, సముద్ర, నఖ, కేశ, దంత, స్తన, భుజ, కంఠ, ఖడ్గ, శర, పంక శబ్దములును వాని యర్థములు గల యితర శబ్దములును పుంలింగములు: సురాః, దైత్యాః, క్షేత్రజ్ఞః, నాకః, పర్వతః, అబ్ధిః, కరరుహాః, శిరోరుహాః, దశనః, కుచః, దోః, గలః, కరవాలః, మార్గణః, కర్దమః మొద. కాని—

(అ) స్వర్గవాచులగు 'త్రివిష్టప, త్రిభువన' శబ్దములు నపుంసకములు.

(ఆ) స్వర్గవాచి 'ద్యౌ' శబ్దము స్త్రీలింగము.

(ఇ) శరవాచి 'ఇషు' శబ్దమును, భుజవాచి 'బాహు' శబ్దమును స్త్రీలింగములు కూడనగును.

(ఈ) శరవాచకములగు 'బాణ, కాండ' శబ్దములు నపుంసకలింగములు గూడ నగును.

5. న-కారాంత శబ్దములు పుంలింగములు: రాజన్, తక్షన్, మొద. చర్మ, వర్మ, మొదలగు నకారాంత శబ్దములు నపుంసకములని ముందు వివరింపం బడునుగాన అట్టివి పుంలింగములు కావు.

6. క్రతు, పురుష, కపోల, గుల్ఫ, మేఘ శబ్దములును నా యర్థములు గల యితర శబ్దములును పుంలింగములు. ఉదా. అధ్వరః, నరః, గండ, ప్రపదః, నీరదః మొద. కాని, మేఘవాచియగు అభ్ర శబ్దము నపుంసః లింగము.

7. ఉకారాంత శబ్దములు: ప్రభుః, ఇక్షుః, మొద. కాని—

(అ) ధేను, రజ్జు, కుహూ, సరయూ, తను, రేణు, ప్రియంగు శబ్దములు స్త్రీలింగములు. రజ్జుశబ్దము సమాసగతమైనప్పుడు పుంలింగము గూడ నగును. ఉదా. తృతీయైకవచనము: కర్కటరజ్జ్వా, కర్కటరజ్జునా మొదలయినవి.

(ఆ) శ్మశ్రు, జాను, వసు (ధనమను నర్థమందు), స్వాదు, అశ్రు, జతు, త్రపు, తాలు, దారు, కసేరు, వస్తు, మస్తు శబ్దములు నపుంసకములు

(ఇ) మద్గు, మధు, సీధు, శీధు, సాను, కమండలు శబ్దములు నపుంసకములు గూడ నగును.

8. కకార ముపధగాఁగల శబ్దములు పుంలింగములు. ఉదా. స్తబకః, కల్కః మొద. కాని—

(అ) చిబుక, శాలూక, ప్రాతిపదిక, అంశుక, ఉల్ముక శబ్దములు నపుంసకములు.

(ఆ) కంటక, అనీక, సరక, మోదక; చషక, మస్తక, పుస్తక, తడాక, నిష్క, శుష్క, వర్చస్క, పినాక, భాండక, పిండక, కటక, శండక, పిటక, తాలక, ఫలక, పులాక శబ్దములు నపుంసకములు గూడ నగును.

9. టకార ముపధగాఁ గల శబ్దములు పుంలింగములు. ఉదా. ఘటః, పటః మొద. కాని-

(అ) కిరీట, ముకుట, లలాట, వట, వీట, శృంగాట, కరాట, లోష్ట శబ్దములు నపుంసకములు.

(ఆ) కుట, కూట, కపట, కవాట, కర్పట, నట, నికట, కీట, కట శబ్దములు నపుంసకములు గూడ నగును.

10. ణకార ముపధగాఁగల శబ్దములు పుంలింగములు. ఉదా. గుణః, గణః, పాషాణః మొద. కాని—

(అ) ఋణ, లవణ, పర్ణ, తోరణ, ఉష్ణ శబ్దములు నపుంసకములు.

(ఆ) కార్షాపణ, స్వర్ణ, సువర్ణ, వ్రణ, చరణ, వృషణ, విషాణ, చూర్ణ, తృణ శబ్దములు నపుంసకములు గూడ నగును.

11. థకార ముపధగాఁగల శబ్దములు పుంలింగములు. ఉదా. రథః మొద. కాని—

(అ) కాష్ఠ; పృష్ఠ, సిక్థ, ఉక్థ శబ్దములు నపుంసకములు. దిగర్థకమగు కాష్ఠాశబ్దము స్త్రీలింగము.

(ఆ) తీర్థ, ప్రోథ, యూథ, గాథ శబ్దములు నపుంసకములు గూడ నగును.

12. నకార ముపధగాఁగల శబ్దములు పుంలింగములు. ఉదా. ఇనః, ఫేనః మొద. కాని—

(అ) జఘన, అజిన, తుహిన, కానన, వన, వృజిన, విపిన, వేతన, శాసన, సోపాన, మిథున, శ్మశాన, రత్న, నిమ్న, చిహ్న శబ్దములు నపుంసక లింగములు.

(ఆ) యాన, మాన, అభిధాన, నలిన, పులిన, ఉద్యాన, శయన, ఆసన, స్థాన, చందన, ఆలాన, సమాన, భవన, వసన, సంభావన, విమాన శబ్దములు నపుంసకములు గూడ నగును.

13. పకార ముపధగాఁగల శబ్దములు పుంలింగములు. ఉదా. యూపః, దీపః, సర్పః, మొదలయినవి. కాని—

(అ) పాప, రూప, ఉడప, తల్ప, శిల్ప, పుష్ప, శష్ప, సమీప, అంతరీప, శబ్దములు నపుంసకములు.

(ఆ) శూర్ప, కుతప, కుణప, ద్వీప, విటప శబ్దములు నపుంసకములు గూడ నగును.

14. భకార ముపధగాఁగల శబ్దములు పుంలింగములు. ఉదా. స్తమ్భః, కుమ్భః మొదలయినవి. కాని—

(అ) తలభ శబ్దము నపుంసకము. (ఆ) జృంభ శబ్దము నపుంసకము కూడ నగును.

15. మకార ముపధగాఁగల శబ్దములు పుంలింగములు. ఉదా. సోమః, భీమః మొదలయినవి. కాని—

(అ) రుక్మ, సిధ్మ, యుధ్మ, ఇధ్మ, గుల్మ, అధ్యాత్మ, కుంకుమ, శబ్దములు నపుంసకములు.

(ఆ) సంగ్రామ, దాడిమ, కుసుమ, ఆశ్రమ, క్షేమ, క్షౌమ, హోమ, ఉద్దామ శబ్దములు నపుంసకలింగములు కూడను.

16. యకార ముపధగాఁగల శబ్దములు పుంలింగములు. ఉదా. సమయః, హయః మొద. కాని—

(అ) కిసలయ, హృదయ, ఇంద్రియ, ఉత్తరీయ శబ్దములు నపుంసకములు.

(ఆ) గోమయ, కషాయ, మలయ, అన్వయ, అవ్యయ శబ్దములు నపుంసకములు కూడను.

17. రేఫ ముపధగాఁగల శబ్దములు పుంలింగములు. ఉదా. క్షురః, అంకురః మొద. కాని—

(అ) ద్వార, అగ్ర, స్ఫార, తక్ర, వప్ర, క్షిప్ర, క్షుద్ర, నార, తీర, దూర, కృచ్ఛ్ర, రంధ్ర, అశ్ర, శ్వభ్ర, భీర, గభీర, క్రూర, విచిత్ర, కేయూర, కేదార, ఉదర, అజస్ర, శరీర, కందర, మందార, పంజర, అజర, జఠర, అజిర, వైర, చామర, పుష్కర, గహ్వర, కుహార, కుటీర, కులీర, చత్వర, కాశ్మీర, నీర, అంబర, శిశిర, తంత్ర, యంత్ర, క్షత్ర, క్షేత్ర, మిత్ర, కలత్ర, చిత్ర, మూత్ర, సూత్ర, వక్త్ర, నేత్ర, గోత్ర, అంగులిత్ర, భలత్ర, శస్త్ర, శాస్త్ర, వస్త్ర, పత్ర, పాత్ర, ఛత్ర శబ్దములు నపుంసకములు.

(ఆ) చక్ర, వజ్ర, అంధకార, సార, ఆవార, పార, క్షీర, తోమర, శృంగార, భృంగార, మందార, ఉశీర, తిమిర, శిశిర శబ్దములు నపుంసకములుకూడ నగును.

* మందార, శిశిర శబ్దములు (అ), (ఆ) ల రెండింటను పఠితమగుట విచార్యము.

18. షకార ముపధగాఁగల శబ్దములు పుంలింగములు. ఉదా. వృషః, వృక్షః, మొద. కాని—

(అ) శిరీష, జోష, అంబరీష, పీయూష, పురీష, కిల్బిష, కల్మష, శబ్దములు నపుంసకములు.

(ఆ) యూష, కరీష, మిష, విష, వర్ష, శబ్దములు నపుంసకములుకూడ నగును.

19. సకార ముపధగాఁగల శబ్దములు పుంలింగములు. ఉదా. వత్సః, వాయసః, మహానసః, మొద. కాని—

(అ) పనస, బిస, బుస, సాహస శబ్దములు నపుంసకములు.

(ఆ) చమస, అంస, రస, నిర్యాస, ఉపవాస, కార్పాస, వాస, మాస, కాస, కాంస, మాంస శబ్దములు నపుంసకములుగూడ నగును. ప్రాణివాచకము కానప్పుడు 'కంస' శబ్దమును పుం నపుంసకోభయలింగమగును.

**20.** రశ్మి, దివస శబ్దములును నాయర్థములు గల యితరములును పుంలింగములు. కావున, మయూఖ (రశ్మి), ఘస్ర (దివస) మొదలగు శబ్దము

12. ఇస్, ఉస్, లంతమందుగల శబ్దములు: హవిస్, ధనుస్ మొదలయినవి. కాని—

'అర్చిస్' శబ్దము స్త్రీలింగముకూడ నగును. 'ఛదిస్' శబ్దము స్త్రీలింగము మాత్రము.

13. ముఖ, నయన, లోహ, వన, మాంస, రుధిర, కార్ముక, వివర, జల, హాల, ధన, అన్న శబ్దములును, నాయర్థములుగల యితర శబ్దములును నపుంసకములు. ఉదా. ఆననమ్, లోచనమ్, కాలమ్, గహనమ్, ఆమిషమ్, రక్తమ్, శరాసనమ్, బిలమ్, వారి, లాంగలమ్, ద్రవిణమ్, అశనమ్ మొదలయినవి. కాని—

(అ) సీర (హాల), అర్థ (ధన), ఓదన (అన్న) శబ్దములు పుంలింగములు మాత్ర మగును.

(ఆ) వక్త్ర (ముఖ); నేత్ర (నయన), అరణ్య (వన), గాండీవ (కార్ముక) శబ్దములు పుంలింగములు గూడ నగును.

(ఇ) అటవీ (వన) శబ్దము స్త్రీలింగము మాత్ర మగును.

14. లకార ముపధగాఁగల శబ్దములు నపుంసకలింగములు. ఉదా. కులమ్, కూలమ్, స్థలమ్ మొదలయినవి. కాని—

(అ) తూల, ఉపల, తాల, కుసూల, తరల, కంబల, దేవల, వృషల శబ్దములు పుం లింగములు.

(ఆ) శీల, మూల, మంగల, సాల, కమల, తల, ముసల, కుండల, పలల, మృణాల, వాల, నిగల, పలాల, బిడాల, ఖిల, శూల శబ్దములు పుంలింగములుకూడ నగును.

15. సంఖ్యలలో సహస్ర శబ్దము నపుంసకలింగము. ఒకప్పుడిది పుంలింగముకూడను. శత, అయుత, ప్రయుత శబ్దములు పుం, నపుంస కోభయలింగములు; లక్షా, కోటి శబ్దములు స్త్రీలింగములు; శంకు శబ్దము పుం లింగము.

16. మన్ ప్రత్యయాంతములయి, కర్తృవాచులుకాని, రెండచ్చులుగల శబ్దములు నపుంసకలింగములు. ఉదా. చర్మ, వర్మ, నామ, రోమ మొదలయినవి. కాని—

(అ) బ్రహ్మన్ శబ్దము పుం లింగము కూడ నగును.

17. 'అస్' అంతమందుగలిగి, రెండచ్చులుగల శబ్దములు నపుంసకములు: ఉదా. యశస్, మనస్, తపస్ మొదలయినవి.

'అప్సరస్' శబ్దము స్త్రీలింగము. ఇది సాధారణముగ బహువచనము నందే యుండును.

18. త్రాంతములు నపుంసకలింగములు. ఉదా. పత్రమ్, ఛత్రమ్ మొదలయినవి. కాని—

(అ) యాత్రా, మాత్రా, భస్త్రా, దంష్ట్రా, వరత్రా, శబ్దములు స్త్రీలింగములు మాత్ర మగును.

(ఆ) భృత్ర, అమిత్ర, ఛాత్ర, పుత్ర, మంత్ర, వృత్ర, మేఢ్ర, ఉష్ట్ర, శబ్దములు పుం లింగములు.

(ఇ) పత్ర, పాత్ర, పవిత్ర, సూత్ర, ఛత్ర శబ్దములు పుం లింగ ములు గూడ నగును.

19. బల, కుసుమ, శుల్వ, పత్తన, రణ శబ్దములును, ఆయర్థములుగల యితరములును నపుంసకలింగములు. కావున, వీర్య (బల) మొదలగునవియు నపుంసకములు.

(అ) పద్మ, కమల, ఉత్పల శబ్దములు పుం లింగములు గూడ నగును.

(ఆ) ఆహవ, సంగ్రామ శబ్దములు పుం లింగములు మాత్రమగును.

(ఇ) ఆజి శబ్దము స్త్రీలింగము మాత్రమగును.

20. ఫలజాతిని తెలుపు శబ్దములు నపుంసకలింగములు. ఉదా. ఆమలకమ్, ఆమ్రమ్ మొదలయినవి. వృక్షజాతిని తెలుపు శబ్దములు కొన్నియెడల స్త్రీలింగములు మాత్రమగును. ఉదా. హరీతకీ మొదలయినవి.

21. వియత్, జగత్, సకృత్, శకన్, పృషత్, శకృత్, యకృత్, ఉదశ్విత్ శబ్దములు నపుంసకములు.

22. నవనీత, అవత, అనానృత, అమృత, నిమిత్త, విత్త, చిత్త, పిత్త, వ్రత, రజత, వృత్త, పలిత శబ్దములును, శ్రాద్ధ, కులిశ, దైవ, పీఠ, కుండ, అంక, అంగ, దధి, సక్థి, అక్షి, ఆస్య, ఆస్పద, ఆకాశ, కణ్వ, బీజ శబ్దము లును నపుంసకలింగములు. * 'దైవ' శబ్దము పుం లింగముకూడ నగును.

23. ధాన్య, ఆజ్య, సస్య, రూప్య, పణ్య, వర్ణ్య, ధృష్య, హవ్య, కవ్య, కావ్య, సత్య, అపత్య, మూల్య, శిక్య, కుడ్య, మద్య, హర్మ్య, తూర్య, సైన్య శబ్దములు నపుంసకలింగములు.

24. ద్వంద్వ, బర్హ్మ, దుఃఖ, బడిశ, పిచ్ఛ, బింబ, కుటుంబ, కవచ, వర, శర, వృందారక శబ్దములు నపుంసకములు.

25. ఇంద్రియమను నర్థమున 'అక్ష' శబ్దము నపుంసకలింగము.

## స్త్రీ, పుముభయ లింగము.

1. (అ) గో, మణి, యష్టి, ముష్టి, పాటలి, వస్తి; శాల్మలి, త్రుటి, మసి, మరీచి.

(ఆ) మృత్యు, సీధు, కర్కంధు, కిష్కు, కండు, రేణు శబ్దములు స్త్రీ పుముభయలింగములు.

2. ఉకారాంతమగు గుణవాచకశబ్దములు మూఁడు లింగములందును నుండును. ఉదా. పటు, పటుః, పట్వీ మొదలయినవి.

3. తద్ధిత రూపములందు అపత్యార్థకములు పుం స్త్రీ లింగముల రెండింట నుండును. ఉదా. ఔపగవః, ఔపగవీ మొదలయినవి.

## పుం నపుంసకోభయలింగము.

1. (అ) ఘృత, భూత, ముస్త, క్ష్వేలిత, ఐరావత, పుస్తక, బుస్త, లోహిత.

(ఆ) శృంగ, అర్ఘ, నిదాఘ, ఉద్యమ, శల్య, దృఢ.

(ఇ) వజ్ర, కుంజ, కుథ, కూర్చ, ప్రస్థ, దర్ప, అర్భ, అర్ధ, బుచ, దర్భ, పుచ్ఛ.

(ఈ) కబంధ, ఔషధ, ఆయుధ, అంత.

(ఉ) దండ, మండ, ఖండ, శత, సైంధవ, పార్శ్వ, ఆకాశ, కుశ, కాశ, అంకుశ, కులిశ.

(ఊ) గృహ, మేహ, దేహ, పట్ట, పటహ, అష్టాపద, అంబుద, కకుద, అను శబ్దములు పుం నపుంసకోభయలింగములు.

ఇంతవఱకును వివరించినది శబ్దగతలింగము. ఇట్టిదిగాక స్త్రీలింగము నేర్పఱించుటకు స్త్రీ ప్రత్యయములను జేర్చుటయు సంస్కృతమున నెక్కువ ప్రచారమం దున్నది. అట్టి ప్రత్యయములు చేరునప్పుడు కొన్ని యాగమాక్షరములు చేరుటయుఁ గలదు. ఈ క్రింద నా యా ప్రత్యయములును, ఆగమాక్షరములును నుదాహరణములతో వివరింపఁబడియున్నవి. ఆయా ప్రత్యయములను జేర్చికొన సమర్థములగు శబ్దములను గూర్చియే యీ వివరణము చేయఁబడినదిగాని, తత్సాదృశ్యముగల సకలశబ్దములకును నాయా ప్రత్యయములు చేరు ననుకొనరాదు.

### 1. టాప్ :

i. అజాదిశబ్దముల తుది యత్తుకంటె టాప్ ప్రత్యయము వచ్చును. ఉదా. అజా, ఏడకా, అశ్వా, చటకా, మూషికా.

ii. సమ్, భస్త్ర, అజిన, శణ, పిండ, శబ్దములు పూర్వమందుగల ఫల శబ్దముకంటె టాప్ వచ్చును: సంఫలా, భస్త్రఫలా, అజినఫలా, శణఫలా, పిండఫలా.

iii. సదచ్, కాండ, ప్రాంత, శత, ఏక శబ్దపూర్వకమగు పుష్పశబ్దము కంటె టాప్ వచ్చును: సత్పుష్పా, ప్రాక్పుష్పా, ప్రత్యక్పుష్పా, కాండపుష్పా, ప్రాంతపుష్పా, శతపుష్పా, ఏకపుష్పా.

iv. జాతివాచకమును, మహచ్ఛబ్దపూర్వకము కానట్టియు శూద్ర శబ్దముకంటె టాప్ వచ్చును: శూద్రా;- కాని, పుంయోగమున 'శూద్రీ' యగును. మహచ్ఛబ్దపూర్వకమైన 'మహాశూద్రీ' అగును.

v. నఞ్ పూర్వకమగు మూలశబ్దముకంటె టాప్ వచ్చును: అమూలా.

2. ఙీప్ :

i. ఉగిదంతమగు ప్రాతిపదికముకంటె స్త్రీలింగమున ఙీప్ వచ్చును: ఉదా. భవతీ, పచంతీ, దీవ్యంతీ మొదలయినవి. వీనియందు నుమాగమము విశేషము. ఉఖాస్రత్, పర్ణధ్వత్, అనువానికి ఙీప్ రాదు. 'అంచితి'కి వచ్చును: ప్రాచీ, ప్రతీచీ.

ii. వన్నంత శబ్దములకు ఙీప్ వచ్చును. రేఫమంతాగమముగాఁ గూడఁ జేరును: వన్నంతమనుటచే ఙ్వనిప్, క్వనిప్, వనిప్,లు గూడ గ్రహింపఁబడును. ఉదా. అతిసుత్వరీ, అతిధీవరీ, శర్వరీ. కాని, హాశంతధాతువునకు విధింపఁబడిన వన్నంత శబ్దములమీఁదను, వన్నంత శబ్దము లంతమందుగల శబ్దముల మీఁదను ఙీప్ప్రత్యయమును, రాగమమును రావు. అవావా బ్రాహ్మణీ; రాజయుధ్వా. బహువ్రీహిసమాసమున ఙీప్పును రాగమమును వైకల్పికముగ వచ్చును; ఉదా. బహుధీవరీ, బహుధీవా.

iii. 'పాద్' శబ్దము సమాసమందుచేరి యీ సమాసమునంతమం దున్నప్పుడు ఙీప్పు వైకల్పికముగా వచ్చును: ద్విపదీ, ద్విపాత్ - కాని యీ సమాసము ఋక్కును దెలుపునప్పుడు 'పాత్' శబ్దముకంటె టాప్‌వచ్చును. ఙీప్ రాదు: ద్విపదా ఋక్, ఏకపదా. పఞ్చ, చతుశ్శబ్దములపై టాప్‌రాదు: పఞ్చ, చతస్రః.

iv. మన్నంతశబ్దములకంటె ఙీప్‌రాదు: సీమా, సీమానౌ. బహువ్రీహి సమాసాంతమగు అన్ అంతశబ్దములకంటెనుగూడ ఙీప్‌రాదు: బహుయజ్వా, బహుయజ్వానౌ. ఇట్టి మన్నంత, అన్నంతశబ్దములకంటె డాప్ప్రత్యయము వైకల్పికముగ వచ్చును: ఉదా. సీమా, సీమే, సీమానౌ; దామా, దామే,

నగును: కౌరవ్యాయణీ, మాండూకాయణీ. ఆసురశబ్దముపైఁ గూడ నిట్లే యగును: ఆసురాయణీ.

vi. ప్రథమవయోవాచులగు నదంత శబ్దములపై స్త్రీలింగమున 'జీప్' వచ్చును. ఉదా. కుమారః, కుమారీ. చరమవయోవాచులుగాని అదంతశబ్దములపై 'జీప్' వచ్చునని చెప్పవచ్చును. ఉదా. వధూటీ, చిరంటీ.- కన్యాశబ్దముపై జీప్‌రాదు.

vii. అదంతమగు ద్విగుసమాసముపై జీప్ వచ్చును. ఉదా. త్రిలోకీ. పరిమాణవాచకములు కానట్టి శబ్దములును బిస్త, ఆచిత, కంబల్య శబ్దములును ద్విగుసమాసమున నుత్తరశబ్దములుగా లేనప్పుడు తద్ధితలోపము కలిగినచో జీప్‌రాదు. ఉదా. పంచాశ్వా, ద్విబిస్తా, ద్వ్యాచితా, ద్వికంబల్యా. పరిమాణవాచకమైనచో 'ద్వ్యాఢకీ'; సమాహారవాచి యైనచో 'పంచాశ్వీ' మొదలయినవి.

ద్విగుసమాసము 'కాండ' శబ్దాంతమై క్షేత్రపరిమాణమును నిర్దేశించినప్పుడు జీప్ రాదు. ఉదా. ద్వికాండా, క్షేత్రభక్తిః. క్షేత్ర పరిమాణమును దెలుపునప్పుడు 'ద్వికాండీ రజ్జుః.'

ద్విగుసమాసమున పురుషశబ్దము పరిమాణవాచకమై యుత్తరపదముగా నిలిచి తద్ధితలోపము కలిగినచో జీప్ వైకల్పికముగా నగును. ఉదా. ద్విపురుషీ, ద్విపురుషా (పరిఖా).

ఊధస్ శబ్దము బహువ్రీహిసమాసమున నుత్తరపదముగా నున్నప్పుడు 'అనజ్' అనునది ఆదేశముగా వచ్చును. బహువ్రీహిసమాసమున ఊధశ్శబ్దముపై స్త్రీత్వమున 'డాప్', 'జీప్'లు రావు, 'జీష్' వచ్చును. ఉదా. కుండోధ్నీ. స్త్రీత్వమున ననుటచే 'కుండోధో ధైనుకమ్'. ఇచట 'అనజ్' ఆదేశముకూడ రాదు.—కాని, సంఖ్యావాచకముగాని, అవ్యయముగాని 'ఊధస్' శబ్దమునకు బహువ్రీహిసమాసమునఁ బూర్వపదముగా వచ్చినచో 'జీప్' వచ్చును, 'జీష్' రాదు. ఉదా. ద్వ్యూధ్నీ, అత్యూధ్నీ; ఇయ్యది బహువ్రీహియందుమాత్రము వచ్చును. 'ఊధో అతిక్రాంతా' అని విగ్రహము చేయునప్పుడు 'అత్యూధాః' అగును.

(viii) సంఖ్యాదియై 'దామ', 'హాయన' శబ్దాంతమగు 'దామ' 'హాయన' శబ్దములతో నంతమగు బహువ్రీహిసమాసమున 'జీప్' వచ్చును. ఉదా. ద్విదామ్నీ, ద్విహాయనీ (బాలా.).—త్రి, చతుర్ అను సంఖ్యావాచకములు సమాసాదినిగల హాయన శబ్దమందలి నకారమునకు ణత్వము కూడ నగును. వయోవాచక సమాసగత 'హాయన' శబ్దమునకు మాత్రము

'ఙీప్' 'ణ'త్వములు ప్రాప్తించును. ఉదా. త్రిహాయనీ, చతుర్హాయణీ. వయోవాచకము కానప్పుడు, త్రిహాయనా, చతుర్హాయనా (శాలా).

ix. అన్నంతమై ఉపధా లోపముగల బహువ్రీహిసమాసము సంజ్ఞావాచకమయినప్పుడును వేదమునందును జీప్ వచ్చును. ఉదా. సురాజ్ఞి (ఒక నగరము పేరు); వేదమునందు-'శతమూర్ధ్నీ'. ఇట్లే సంజ్ఞావాచకములందును, వేదమునందును 'కేవల, మామక, భాగధేయ, పాప, అపర, సమాన, ఆర్యకృత, సుమంగల, భేషజ' శబ్దములు బహువ్రీహిసమాసమున సంఖ్యావాచక పూర్వపదములైనప్పుడును, వేదమునందును జీప్పును పొందును: కేవలీ, మామకీ, భాగధేయీ, పాపీ, అపరీ, సమానీ, ఆర్యకృతీ, సుమంగలీ, భేషజీ. ఇతర స్థలములయందు 'కేవలా' మొదలగు రూపములు. లోకమందు సంజ్ఞావాచకము కానప్పుడు 'మామికా' (బుద్ధిః) అగును. మాతులపత్ని 'మామీ', 'మామకీ'.

x. అంతర్వత్, పతివత్ శబ్దములకు 'నుక్కు'ను 'జీప్పు'ను వచ్చును: అంతర్వత్నీ, పతివత్నీ, జీవద్భర్తృకయైన గర్భిణి అంతర్వత్ని. ఇతరత్ర మతుప్పు నిపతింపఁబడును: పతిమతీ, పృథివీ.

xi. యజ్ఞసంబంధము గలిగినప్పుడు పతి శబ్దమునకు స్త్రీత్వమున నకారాదేశము వచ్చును: పత్నీ 'వసిష్ఠుని పత్ని' యనఁగా వసిష్ఠకృత క్రతుఫల భోక్త్రి యని యర్థము.

'స' అనునది పూర్వమందు గల 'పతి' శబ్దమునకు స్త్రీత్వమున నకారాదేశము వైకల్పికముగ వచ్చును. గృహపతిః, గృహపత్నీ, అను రెండు రూపములును స్త్రీలింగములే. ఇట్లే, దృఢపతిః, దృఢపత్నీ; వృషలపతిః, వృషలపత్నీ. వృషలపత్నీ శబ్దమునందు నుక్కు వచ్చుట యజ్ఞసంబంధముచేతఁగాదు; 'పత్నివంటిది' అని ఔపచారికము. స - పూర్వమనుటచేత 'గవాంపతిః' అనునది స్త్రీవాచకమగును. సపత్న్యాది శబ్దములందు నుక్కు నిత్యముగా వచ్చును: సపత్నీ, ఏకపత్నీ, వీరపత్నీ మొదలయినవి

xii. 'పూతక్రతు' శబ్దముపై 'ఐ' అనునదాదేశముగా వచ్చును: పూతక్రతాయీ. ఇట్లే 'వృషాకపి, అగ్ని, కుసిత, కుసిద ('కుసీద'కాదు) శబ్దములపై ఉదాత్తమగు 'ఐ' ఆదేశమగును: వృషాకపాయీ, ఆగ్నాయీ, కుసితాయీ, కుసిదాయీ.

'మను' శబ్దముపై 'ఔ' అనునదియు వైకల్పికముగ వచ్చును: మనావీ, మానాయీ, మనుః.

xiii. రంగును దెలియఁజేయు శబ్దములం దుపధగానుండు అనుదాత్తాంతమగు 'త'కారమునకు 'న'కార మాదేశముగా వచ్చి, జీప్పు కలుగును. ఏతా

( = చిత్రవర్ణముగలది), ఏనీ, రోహితా (ఎఱ్ఱనిరంగుగలది), రోహిణీ. 'శ్వేతా' అనునది అనుదాత్తాంతము కాదు. కావున 'శ్వేనా' అనురూపము లేదు. 'పిశఙ్గ' శబ్దముపైఁగూడ జీప్ వైకల్పికముగ వచ్చును. పిశఙ్గీ, పిశఙ్గా. వేదమున 'క్నా'ంత శబ్దములమీఁదను జీప్ వచ్చును. అసిక్నీ, పలిక్నీ. 'అవదాత' శబ్దమునకు 'శుద్ధమైన వర్ణము' అని యర్థము; 'తెలుపు' కాదు. కావున అవదాతీ, అవదానీ, అను రూపములు రావు.

3. జీష్.

i. తోపధభిన్నములై, అనుదాత్తాంతములు కాని వర్ణవాచక శబ్దములపై జీష్ వచ్చును; జీప్ రాదు. కల్మాషీ, సారంగీ. అనుదాత్తాంతములు కావు గావున 'కృష్ణా', 'కపిలా' అను రూపములుమాత్రముండును.

ii. షిదంతములకంటెను, గౌరాది శబ్దములకంటెను 'జీష్' వచ్చును. ఉదా. నర్తకీ, గౌరీ. - "గౌర, మత్స్య, మనుష్య, శృంగ, పింగల, హయ, గవయ, ముకయ, ఋష్య, పుట, తూణ, దుణ, ద్రోణ, హరిణ, కాకణ, పటర, ఉణక, ఆమలక, కువల, బింబ, బదర, కర్కర, తర్కార, శర్కార, పుష్కర, శిఖండ, సదల, శుష్కాండ, సనంద, సుషమ, సుషవ, అలింద, గుడుల, పాండశ, ఆఢక, ఆనంద, అశ్వత్థ, సుపాట, ఆపచ్చిక, శష్కుల, సూర్భ, శూర్ప, సూత్ర, యూష, యూథ, సూప, పూప, మేథ, వల్లక, ఘాతక, సల్లక, మాలక, మాలతి, సాల్వక, వేతస, బృస, అతస, ఉభయ, భృంగ, దహ, మఠ, ఛేద, పేశ, మేద, శ్వన్, తక్షన్, అనుడుహ్ (అనడ్వాహ్), ఏషణ (కరణార్థమున), దేహ, దేహల, కాకాదన, గవాదన, తేజన, రజన, లవణ, ఔద్గాహమని, గౌతమ, పారక, అయఃస్థూణ, భౌరిక, భౌలికి, భౌలింగి, యాన, మేఘ, ఆలంబి, ఆలజి, ఆలబ్ధి, ఆలక్షి, కేవాల, ఆపక, ఆరట, నట, టోట, నోట, మూలాట, శాతన, పోతర, పాతన, పాటన, ఆస్తరణ, అధికరణ, అధికార, ఆగ్రహాయణ, ప్రత్యవరోహిన్, సేచన, సుమంగల (సంజ్ఞాయందు), అండర, సుందర, మంగల, మంథర, మండల, పట, పిండ, పిటక, షండ, ఊర్ద, గుర్ద, శమ, సూద, ఆర్ద, హ్రాద, పాండ, భాండ, లోహాండ, కదర, కల, కందర, తరుణ, తలున, కల్మాష, బృహత్, మహత్, సోమ, సౌధర్మ, రోహిణీ, రేవతీ (నక్షత్రము), వికల, నిష్కల, పుష్కల, కటాచ్ఛ్రోణి వచనే; పిప్పల్యాదేశ్చ (పిప్పల్యాదులు :-పిప్పలీ, హరీతకీ, కోశాతకీ, శమీ, వరీ, శరీ, పృథివీ, క్రోష్ట్రీ, మాతామహీ, పితామహీ)—ఇది గౌరాదిగణము.

iii. సూర్య, తిష్య, అగస్త్య, మత్స్య, శబ్దములం దుపధగానున్న యకారమునకు లోపముగలిగి, దానిపై జీష్ చేరును: సూరీ, తైషీ, ఆగస్తీ, మత్సీ.

iv. జానపద, కుండ, గోళ, స్థల, భాజ, నాగ, కాల, నీల, కుశ, కాముక, కబర శబ్దములకు వరుసగా వృత్తి, అమత్ర, అవపనా, అకృత్రిమా, శ్రాణా, స్థూలా, వర్ణ, అనాచ్ఛాదన, అయోవికార, మైదునేచ్ఛా, కేశవేశ అనునర్థములందు జీష్ వచ్చును

1. జానపదీ = ఒకవృత్తి; జానపదీ (ఆద్యుదాత్తమగుటచే జీప్) = జానపదస్త్రీ.

2. కుండీ = కుండ; కుండా = తండ్రి బ్రతికి యుండఁగా జారునికి పుట్టిన కూఁతురు.

3. గోణీ = గోనె, చింకిగుడ్డ; గోణా = ఒక సంజ్ఞావాచక శబ్దము.

4. స్థలీ = దున్నని నేల; స్థలా = దున్నిన నేల.

5. భాజీ = ఉడికించిన అన్నము మొదలయినవి; భాజా=ఉడికించనిది.

6. నాగీ = స్థూలమైనయేనుఁగు; సర్పపరమైనచో దీర్ఘమైనది; నాగా = సాధారణమైన యేనుఁగు లేక పాము.

7. కాలీ = నలుపురంగు; కాలా = ఒక సంజ్ఞావాచకశబ్దము.

8. నీలీ = నీలవర్ణము, నీలా = నీలిరంగుగలబట్ట; ('నీలినీ' అని కూడ రూపము గలదు. నీలీ శబ్దము నీలి పైరునకును జెల్లును. ప్రాణివిషయమునను నీలీశబ్దము నుపయోగింపవచ్చును; నీలీగౌః.-సంజ్ఞావాచకమైనప్పుడు 'నీలీ', 'నీలా' అని రెండు రూపములు నుండును.

9. కుశీ = నాఁగలి యినుపమొన; కుశా = త్రాడు, దర్భ.

10. కాముకీ = మైథునేచ్ఛగలస్త్రీ; కాముకా = ధనమును గోరుస్త్రీ.

11. కబరీ = కొప్పు; కబరా = చిత్రమైనది (విశేషణము).

ప్రాచ్యులమతమున 'శోణ' శబ్దముకంటె 'జీష్' వచ్చును: శోణీ. శోణా.

v. ఉదంతములగు గుణవాచకశబ్దములకంటె 'జీష్' వైకల్పికముగ వచ్చును: మృద్వీ, మృదుః.

(ఉదంతమనుటచేత 'శుచి' శబ్దముపై రాదు. గుణవచనమనుటచే 'ఆఖు' (ఎలుక) శబ్దముపై రాదు. 'ఖరు' ( = పతిని స్వయముగా వరించు కన్య) శబ్దము మీఁదను, ఉపధావర్ణము సంయుక్తాక్షరముగాఁగల శబ్దముల మీఁదను 'జీష్' రాదు: పాండుః ).

vi. 'బహు' మొదలగు శబ్దములకంటెఁ గూడ 'జీష్' వైకల్పికముగ వచ్చును: బహ్వీ, బహుః.

('క్తిన్' కాని కృత్ప్రత్యయమగు 'ఇ'కారముపైఁ గూడ నిట్లే యగును: రాత్రిః, రాత్రీ; రాజిః, రాజీ. 'క్తిన్' అర్థములేని యెట్టి పదాంత ఇకారము మీఁదనైనను జీఘ్ వచ్చునని కొంద అందురు: శకటిః, శకటీ.-'పద్ధతి' శబ్దము 'క్తి' స్నంతమైనను దానికంటె జీష్ వైకల్పికముగ వచ్చును: పద్ధతిః, పద్ధతీ.)

vi. 'ఈమె ఇతనిభార్య' అని ప్రత్యేకముగాఁ జెప్పినప్పుడు పుంవాచక శబ్దముపై జీష్ వచ్చును: గోపస్య స్త్రీ గోపీ. (కాని, 'పాలికా' శబ్ద ముత్తర పదముగాఁ గల సమాసములందు జీష్ రాదు: గోపాలికా, అశ్వపాలికా. సూర్యునిస్త్రీ దేవతావాచియైనచో 'ఆప్' వచ్చి 'సూర్యా' అగును. మనుష్య స్త్రీయైనచో 'సూరీ' = కుంతి.

vii. ఇంద్ర, వరుణ, భవ, శర్వ, రుద్ర, మృడ, హిమ, అరణ్య, యవ, యవన, మాతుల, ఆచార్య శబ్దములపై 'ఆనుక్' ఆగమమును దాని కంటె 'జీష్'ను వచ్చును: ఇంద్రాణీ, వరుణానీ, భవానీ, శర్వాణీ, రుద్రాణీ, మృడానీ, హిమానీ (ఎక్కువ మంచు), అరణ్యానీ (దట్టమైన యడవి), యవానీ (పుచ్చిన యవధాన్యము), యవనానీ (యవనుల లిపి విశేషము), మాతులానీ (మాతులీ అను రూపమును గలదు), ఆచార్యానీ, ఆచార్యాణీ ('ఆచార్య' శబ్ద ముపై 'అణ్' వచ్చినది. ఆచార్యాని యనఁగా ఆచార్యుని భార్య. 'ఆచార్యా' అనురూపమును గలదు; 'స్వయం వ్యాఖ్యాత్రి' అని దీనియర్థము).

ఉపాధ్యాయ శబ్దముమీఁదఁ గూడ 'ఆనుక్', 'జీష్'లు వైకల్పికముగ వచ్చును: ఉపాధ్యాయానీ = ఉపాధ్యాయుని భార్య; ఉపాధ్యాయా = స్వయ ముగా అధ్యయనము చేయించుస్త్రీ.

అర్య, క్షత్త్రియ శబ్దములపైఁ గూడ స్వార్థమున ఆనుక్, జీష్, లు వైకల్పికముగ వచ్చును: అర్యాణీ, అర్యా = స్వామిని; లేక వైశ్యస్త్రీ. పుంయోగమున 'అర్యీ, క్షత్త్రియీ' అను రూపములు కలుగును. బ్రాహ్మణ శబ్దముపై కర్మణ్యర్థమున 'అణ్' వచ్చి 'బ్రహ్మను తీసికొని వచ్చినది. లేక జీవింపఁజేయునది' అను నర్థమున 'బ్రాహ్మణీ' అను రూపము కలుగును.

viii. దేనిచే అమ్మఁబడినదో ఆ వస్తువును దెలుపు శబ్దము సమాస మున పూర్వమందు గల 'క్రీత' శబ్దముకంటె జీష్ వచ్చును: వస్త్రక్రీతీ.— ఒకప్పుడు రాదు: ధనక్రీతా.

ix. కరణవాచకశబ్దముపై సమాసమునఁ జేరిన క్తాంతశబ్దముకంటె అల్పార్థమున జీష్ వచ్చును: అభ్రలిప్తీ ద్యౌః = మేఘములు కొంచెముగా వ్యాపించిన యాకాశము.

x. క్తాంతమై, అంతోదాత్తమై, అదంతమగు బహువ్రీహిసమాసమున జీష్ వచ్చును. ఈ విధి జాతివాచకశబ్దము పూర్వపదమైనప్పుడే వర్తించును. కావున, 'బహు, నఞ్, సు, కాల, సుఖ' మొదలగునవి పూర్వపదములైనచో జీష్ రాదు. ఉదా. ఊరుభిన్నీ; కాని,— బహుకృతా. 'జాతి' అనునది పూర్వ పదమైనచో జీష్‌రాదు. దంతజాతా—అగ్నిసాక్షికముగ పాణిగ్రహణము చేసినస్త్రీ 'పాణిగృహీతి'; ఇతర విధముల పాణిగ్రహణము గలిగినది పాణి గృహీత = జారిణి.

xi. క్తాంతమై, అంతోదాత్తమై; అదంతమగు బహువ్రీహిసమాస మున పూర్వపదము దేహమందలి యొకయంగమును దెలుపు శబ్దముకానిచో జీష్ వైకల్పముగ వచ్చును: ఉదా. సురాపీతీ, సురాపీతా. కాని,—ఊరు భిన్నీ ('ఊరుభిన్నా' అని కాదు).

xii. సమాసమున నుత్తరపదము దేహములోని యొకయంగమును దెలుపునదై, అముఖ్యమైనదై దాని యుపధావర్ణము సంయుక్తాక్షరము కాన ప్పుడు జీష్ వైకల్పికముగా వచ్చును. ఉదా. అతికేశీ, అతికేశా; చంద్రముఖీ, చంద్రముఖా, సుస్తనీ, సుస్తనా (ప్రతిమా);—కాని, సంయోగోపధము కావున 'సుగుల్ఫా' ('సుగుల్ఫీ' అని కాదు).

xiii. సమాసమున 'బహు, సు, నఞ్, కాల, సుఖ' మొదలగునవి పూర్వమందులేని నాసిక, ఉదర, ఓష్ఠ, జంఘా, దంత, కర్ణ, శృంగ శబ్దము లపై జీష్ వైకల్పికముగ వచ్చును. ఉదా. తుంగనాసికీ, తుంగనాసికా;— కాని, సునాసికా, అనాసికా (సునాసికీ, అనాసికీ, అనఁగూడదు). అంగ, గాత్ర, కంఠ శబ్దముల మీఁదఁగూడ (బహు, సు, మొదలయినవి పూర్వమందు న్నను) జీష్ వైకల్పికముగ వచ్చును. ఉదా. స్వంగీ, స్వంగా;—'పుచ్ఛ' శబ్ద ముకంటెఁగూడ నిట్లే యగును. ఉదా. సుపుచ్ఛీ, సుపుచ్ఛా;—పుచ్ఛశబ్దము కబర, మణి, విష, శర, శబ్దములపై సమాసమందు చేరినచో నిత్యముగా జీష్‌వచ్చును: కబరపుచ్ఛీ = నెమలి. ఉపమానవాచకములై పక్ష, పుచ్ఛ, శబ్దములు సమాసమునఁ జేరిన యెడల జీష్ నిత్యముగా వచ్చును: ఉలూక పక్షీశాలా; ఉలూకపుచ్ఛీసేనా.

xiv. దేహములోని యొక యంగమును దెలియఁజేయుచు, క్రోడాది గణమునఁ జేరిన శబ్దముగాని, రెంటికంటె నెక్కువ యచ్చులుగల శబ్దముగాని సమాసమున నుత్తరపదమైనప్పుడు 'జీష్' రాదు. క్రోడయనఁగా గుఱ్ఱపు ఱొమ్ము. (క్రోడ, నఖ, ఖుర, ఉఖా, వాల, శఫ, గుద; భగ గల, ఘోణ, నాల, భుజ, కర మొదలగునవి క్రోడాది గణమునఁ జేరినవి). ఉదా. కల్యాణక్రోడా, సుజఘనా.

xv. సహ, నఞ్, విద్యమాన, శబ్దములు పూర్వపదములుగా నుండి దేహావయవబోధక పదము ఉత్తరపదములుగానున్న సమాసములపై జీష్ రాదు : సుకేశా, అకేశా, విద్యమాన నాసికా.

xvi. సఖి, ముఖశబ్దములు సమాసోత్తరపదములై సంజ్ఞావాచకము లయినయెడల జీష్‌రాదు. ఉదా. శూర్పణఖా, గౌరముఖా. సంజ్ఞావాచకము కానప్పుడు 'తామ్రముఖీ కన్యా'.

xvi. దిగర్థక శబ్దము పూర్వపదమును, దేహావయవమును దెలుపునది యుత్తరపదమునుగాఁగల సమాసమున 'జీప్' కు మాఱుగ 'జీష్' వచ్చును. ఉదా. ప్రాఙ్ముఖీ.

xvii. సఖి శబ్దముపై లౌకికభాషలో జీష్‌వచ్చును : సఖీ.

xviii. యకార ముపధగాలేని, స్త్రీవిషయముకాని జాతివాచక పదముకంటె జీష్‌వచ్చును : ఉదా. తటీ, వృషలీ, మొద. గోత్ర, చరణ, శబ్దముల మీఁదను ఈ జాతి కార్యమగును : ఉదా. ఔపగవీ, కఠీ, బహ్వృచీ, మొద. కాని, యకార ముపధగాఁగల 'హయ, గవయ, ముకయ, మనుష్య, మత్స్య,' శబ్దములపై జీష్‌వచ్చును : హయీ, గవయీ, ముకయీ, మనుషీ (మనుష్యపదములో య-లోపము), మత్సీ.

xix. పాక, కర్ణ, పర్ణ, పుష్ప, ఫల, మూల, వాల, అనునవి సమాసమున నుత్తరపదములైనప్పుడు వానికంటె జీష్‌వచ్చును : ఓదనపాకీ, శంకుకర్ణీ, శాలపర్ణీ, శంఖపుష్పీ, దాసీఫలీ, దర్భమూలీ, గోవాలీ, మొదలయినవి. ఈ పదములన్నియు ఓషధివిశేషవాచకములుగ రూఢములు.

xx. మనుష్యజాతిని తెలుపు ఇకారాంత పదములపై జీష్‌వచ్చును : దాక్షీ. ఈ కార్యము యోపధ శబ్దములపైఁ గూడ వచ్చును : ఉదమేయః, ఔదమేయీ. మనుష్యజాతి యనుటచే 'తిత్తిరి' శబ్దముపై జీష్‌వచ్చి తిత్తిరీ, అని కాదు.

## 4. ఊఙ్.

i. ఉకారాంతములై, యకార ముపధగాలేని మనుష్యజాతి వాచకపదములపై 'ఊఙ్' వచ్చును. ఉదా. కురూః. అధ్వర్యుశబ్దము యోపధముగావున ఊఙ్ రాదు.—అప్రాణిజాతివాచకములును, రజ్జ్వాది పదభిన్నములునగు పదములపైఁ గూడ నిట్లే యగును. ఉదా. అలాబూః, కర్కంధూః. వీనికి పుంలింగములోఁ గూడ నివే రూపములైనను స్వరమున భేదమున్నది.

ii. సంజ్ఞావాచకములై 'బాహు' అను పద మంతమందుగల సమాసములపై ఊఙ్ వచ్చును. ఉదా. భద్రబాహూః. — సంజ్ఞావాచకము కానప్పుడు—వృత్తబాహుః.

iii. 'పఙ్గు' శబ్దముమీఁదను 'ఊఙ్' వచ్చును: పఙ్గూః. ఇట్లే శ్వశుర శబ్దము మీఁదను వచ్చును: శ్వశ్రూః.

iv. ఉపమానవాచకము పూర్వపదమై, ఊరుశబ్ద ముత్తరపదమగు సమాసమునకును ఊఙ్ వచ్చును: కరభోరూః.

v. పూర్వపద ముపమానవాచకము కాకున్నను, అది 'సంహిత, శఫ, లక్షణ, వామ' పదములలో నొకటియై యుత్తరపద మూరుశబ్దమైనను ఊఙ్ వచ్చును; సంహితోరూః, శఫోరూః, లక్షణోరూః, వామోరూః.

vi. కద్రు, కమండలు శబ్దములు సంజ్ఞావాచకములైనచో వానికంటె 'ఊఙ్' వచ్చును: కద్రూః, కమండలూః.—సంజ్ఞావాచకములు కానప్పుడు 'కద్రుః, కమండలుః.'

### 5. ఙీన్.

శార్ఙ్గరవాది శబ్దములం దకారాంతములగు జాతివాచక పదములపై ఙీన్ వచ్చును. ఉదా: శార్ఙ్గరవీ, బైదీ. (శార్ఙ్గరవ, కాపటవ, గౌగ్గులవ, బ్రాహ్మణ, గౌతమ, కామండలేయ, బ్రాహ్మణకృతేయ, ఆతిథేయ, ఆనిధేయ, ఆశోకేయ, వాత్స్యాయన, మౌంజాయన, కైకసేయ, కావ్య, శైబ్య, ఏహి, పర్యేహి, అశ్మరథ్య, ఔదపాన, అరాల, చండాల, వతండ, భోగవద్, గౌరిమత్, పుత్ర—ఇవి శార్ఙ్గరవాదులు.) నృ, నర, శబ్దములపై వృద్ధివచ్చును: నారీ.

### 6. ఆప్.

యఙంతములపై ఆప్. వచ్చును: అంబష్ఠ్యా, కారీషగంధ్యా. షకారముమీఁదను అఙంతములమీఁదను ఆప్ వచ్చును. ఉదా. పౌతిమాష్యా. 'ఆవట్య' శబ్దముమీఁదఁగూడ ఆప్ వచ్చును: ఆవట్యా.

### 7. తి.

యువన్ శబ్దముపై 'తి' అను తద్ధితప్రత్యయము వచ్చును: యువతిః. అనుపసర్జనమందే 'యువతి' అను రూపము వచ్చును. సమాసమున 'బహుయువా.' 'యువతీ' శబ్దము యౌతిధాతువు శత్రంతముపై ఙీప్ చేరుటవలనఁ గలిగినది.

పైని వివరించినదానినిబట్టి సంస్కృతమున లింగము శబ్దగతముగ సాధారణముగఁ గాన్పించుచున్నను, కవులవాడుకయం దనేకశబ్దముల లింగము

కార్యారగుచు వచ్చెనని తెలిసికొనవచ్చును. ఒకప్పు డొకయర్థముగల యనేక శబ్దము లేకలింగమును గలిగియుండుటయుఁ గాననగును. ఒకటేశబ్దము పుం నపుంసకలింగములందుగాని, పుం స్త్రీ లింగములందుగాని, మూఁడు లింగములందుగాని వాడఁబడుచుండెను. ఇట్లు లింగవ్యవస్థ తొలుత నిర్ధారితమై యుండినను, రాను రాను నియమహీనమగుచు వచ్చెను. పైని వివరించిన శబ్దముల లింగముల విషయమై నిఘంటుకారులు వేర్వేఱుగఁ దెలిపియుండుటయు నిట్టి యవ్యవస్థకు లక్షణ మనకతీరదు. కాని, యింకను జాతినిబట్టి లింగ మేర్పడుట సంస్కృతమునఁ గలుగలేదు. కొన్నియెడల నట్టి జాతిలింగము గోచరించుచున్నను, నట్టి నియమము మాత్రము సంస్కృతభాష నుపయోగించినవారి మనస్సుల నావేశింపలేదు. ఇట్లు సంస్కృతమున నవ్యవస్థనందిన లింగము విషయమునఁ బ్రాకృతమున నింకను నెక్కువ యవ్యవస్థ యేర్పడెను.

## ప్రాకృతమున లింగము.

సంస్కృతమందలి హలంత శబ్దములన్నియుఁ బ్రాకృతమున నజంతములయి యజంతములవలెనే లింగ, వచన, విభక్తుల నందఁజొచ్చినవి. లింగవిషయమున వ్యత్యయము గలిగినది; వచనమున ద్వివచనము లోపించినది; విభక్తిప్రత్యయములు చాలవఱకు సమసిపోయినవి. ఇట్లు స్వరూపమునఁ జాలవఱకు మాఱియుండిన ప్రాకృతభాషలయందు సంస్కృతమునందే యవ్యవస్థత నందిన లింగజ్ఞానము మఱింత వ్యత్యయమగుట వింతగాదు. "లిఙ్గంచ" అని సంస్కృతమునందువలెనే ప్రాకృతములందును మూఁడు లింగములను నెఱుఁగవలెనను సూత్రముప్రక్కనే ప్రాకృతలక్షణకారుఁడు "క్వచిద్వ్యత్యయః" అనుదానిని పొందుపఱచినాఁడు. దీని కుదాహరణములుగ నాతఁడు సంస్కృతమున స్త్రీలింగమగు విద్యుచ్ఛబ్దము ప్రాకృతమున 'విజ్జుణో' అను పుం లింగ రూపమగుననియు, పుం లింగమగు దేవశబ్దము నపుంసక లింగమగుననియుఁ జెప్పి, "దేవాణి రక్ఖంతు" అను నుదాహరణము నిచ్చియున్నాఁడు - ప్రాకృతమునందలి యీ లింగవ్యత్యయమునుగూర్చి హేమచంద్రుఁడు తన ప్రాకృతవ్యాకరణమునఁ గొంచె మెక్కువగ వివరించియున్నాఁడు.

| సంస్కృతము | ప్రాకృతము |
|---|---|
| (1) ప్రావృట్ (స్త్రీ) | పాఉసో (పుం.) |
| శరత్ (స్త్రీ) | సరఓ (పుం.) |

(2) దామన్, శిరస్, నభస్ శబ్దములుతప్ప తక్కిన నకారాంత, సకారాంత శబ్దములన్నియుఁ బ్రాకృతముల పుం లింగములగును. ఉదా.

| సంస్కృతము. | ప్రాకృతము. |
|---|---|
| యశస్ (నపుం.) | జసో (పుం.) |
| పయస్ (నపుం.) | పఓ (పుం.) |
| తమస్ (నపుం.) | తమో (పుం.) |
| ఉరస్ (నపుం.) | ఉరో (పుం.) |
| జన్మ (నపుం.) | జమ్మో (పుం.) |
| నర్మ (నపుం.) | నమ్మో (పుం.) |
| మర్మ (నపుం.) | మమ్మో (పుం.) |

కాని, దామ (దామం), శిరస్ (సిరం); నభస్ (నభం) అగును.

(3) అక్షి శబ్దమును ఆ యర్థమును బోధించు శబ్దములును, వచన, మొదలగు శబ్దములును వైకల్పికముగా ప్రాకృతమున స్త్రీలింగములగును. ఉదా. ఏసా అచ్ఛీ (స్త్రీలింగము, ఏకవచనము); అచ్ఛీఇం (నపుంసకలింగము, బహువచనము); చక్ఖూ (స్త్రీలింగము, ఏకవచనము); చక్ఖూఇం (నపుం. బహు.); నయణా (స్త్రీ. ఏక.); నయణాఇం (నపుం. బహు.); లోఅణా (స్త్రీ. ఏక.); లోఅణాఇం (నపుం. బహు.); వయణా = వచన (స్త్రీ. ఏక.); వయణాఇం (నపుం. బహు.); ఇత్థీ, విజ్జుణా, విజ్జూఏ; కులో, కులం; ఛందో, ఛందం; మాహప్పో, మాహప్పం = మాహాత్మ్యమ్; దుఃఖా, దుఃఖాఇం; భాయణా, భాయణాఇం మొదలయినవి.

(4) గుణ, మొదలగు శబ్దములు వైకల్పికముగా క్లీబములగును. ఉదా. గుణాఇం = గుణాని, గుణా = గుణాః; దేవాణి = దేవాని; దేవా = దేవాః; బిందూఇం = బిందూని; బిందుణో = బిందవః, ఖగ్గం = ఖడ్గమ్. (ప్రథమావి.), ఖగ్గో = ఖడ్గః; మండలగ్గం = మండలాగ్రమ్ (ప్ర. వి.), మండలగ్గో = మండలాగ్రః, కరరుహం (ప్ర. వి.) కరరుహమ్; కరరుహా = కరరుహాః); రుక్ఖాఇం = వృక్షాణి; రుక్ఖా = వృక్షాః.

(5) ఇమనిజంతములును, అంజల్యాదిశబ్దములును ప్రాకృతమున వైకల్పికముగ స్త్రీలింగములగును. ఉదా. ఏసా గరిమా, ఏస గరిమా; ఏసా మహిమా, ఏస మహిమా; ఏసా నిల్లజ్జిమా, ఏస నిల్లజ్జిమా; ఏసా దుత్తిమా, ఏస ధుత్తిమా; ఏసా అంజలీ, ఏస అంజలీ; పిట్ఠీ, పిట్ఠం; అచ్ఛీ, అచ్ఛిం; పణ్హా, పణ్హో; చోరిఆ, చోరిఅం; కుచ్ఛీ, కుచ్ఛిం; బలీ, బలిం; నిహీ, నిహిం; విహీ, విహిం; రస్సీ, రస్సిం; గంఠీ, గంఠిం మొదలైనవి.

ప్రాకృతమునఁ గలిగిన లింగవ్యత్యయమును గూర్చిన యీ క్రింది యుదాహరణములు పిషెల్ పండితుఁడు రచించిన ప్రాకృత వ్యాకరణమునుండి గ్రహింపఁబడినవి.

ఆఊ తేఊ వాఊ = ఆపస్తేజోవాయుః.
తుంగోచ్చిఅ హోఇ మనో = తుంగమేవ భవతి మనః.
ఏస సరో = ఏతత్సరః.
ఖుడిఓ మహేందస్స జసో = * క్షుదితో మహేంద్రస్య యశః.
అణ్ణో అణ్ణస్స మణో = అన్య దన్యస్య మనః.
మారుఅ-లద్ధ-త్థామో మహిరఓ = మారుత-లబ్ధ-స్థామ మహీ-రజః.
తమాల-కసణో తమో = తమాల - కృష్ణం తమః.
తారిసో అ ఉరో = తాదృశం చ ఉరః.
తవ్వో కఓ = తపః కృతమ్.
సుమణం = సుమనస్.
మనమ్ = మనస్.
తఓ ఠాణాణి = త్రీణి స్థానాని.
దంతాఇం = దంతాన్ మొదలయినవి.

ఆధునికార్యభాషలయందు లింగము.

ఇట్లు ప్రాచీన ప్రాకృతభాషలయం దస్తవ్యస్తమయిన శాబ్దికలింగము నేఁటి యనేకార్యభాషలందు మఱింత వ్యత్యయమునొంది యొకదిక్కును తెన్నునులేక యున్నది. కొన్నిటియం దసహజమగు నీ లింగము విడనాడఁబడి, జాతినిబట్టి లింగ మేర్పడఁజొచ్చినది. అట్టిభాషలలో నీ విధానము చాలవఱకు ద్రావిడభాషామార్గము ననుసరించుచున్నది. నేఁటి కొన్ని యార్యభాషల నున్న యీ లింగప్రక్రియ యీక్రింద పొందుపఱుపఁబడినది.

1. **బంగాళిభాష:** ఇందు మనుష్యవాచక శబ్దములకు మాత్రము ప్రథమా బహువచనమున '-రా', '-ఏరా' అను ప్రత్యయములు చేరును. తిర్యగ్జడవాచక శబ్దముల బహువచనము ప్రత్యేక బహువచన బోధక శబ్దములను జేర్చుటవలనఁ గలుగును. ఇందు విశేష్యముల లింగము ననుసరించి విశేషణముల లింగము మాఱదు.

2. **అస్సామీభాష:** విశేష్యములలింగము ననుసరించి యిందు విశేషణముల లింగము మాఱదు.

3. **తూర్పు హిందీభాషాభేదములు :—**

i. అవధీభాష: ఈ భాషలో క్రియారూపములందు పుంలింగ స్త్రీలింగముల భేదము కానవచ్చుచున్నది. ఈ భేదము ప్రథమపురుషమందేకాక యుత్తమ మధ్యమపురుషములందును గలదు.

ii. బఘేలిభాష: ఇందు విశేష్యములలింగము ననుసరించి విశేషణముల లింగము మాఱదు.

iii. ఛటిస్‌గఢీభాష: ఇందు ఆకారాంతములగు తద్భవవిశేషణముల స్త్రీలింగమునందు 'ఆ'కు బదులుగ 'ఈ' కారము చేగును. కాని, యీ నియమము సార్వత్రికము కాదు. తక్కిన విశేషణముల లింగము విశేష్యములనుబట్టి మాఱదు.

4. ఖాస్-కురాభాష: ఇందు లింగము జాతి ననుసరించి యుండును. స్త్రీవాచకము లన్నియు స్త్రీలింగములు. తక్కినవన్నియు పుంలింగములు. ఇట్టి మార్పునకు టిబెటో-బర్మనుభాషల ప్రోద్బలము కారణమని గ్రియర్సన్ పండితుఁ డభిప్రాయపడుచున్నాఁడు. ఇందు వర్తమాన క్రియలయందును నఞర్థక క్రియలయందును ప్రథమ, మధ్యమ పురుషములందు పుంస్త్రీ లింగ భేదము కానవచ్చుచున్నది. ఉత్తమపురుషమునం దీభేదము లేదు. భూతకాలమునను ఈభేదము గలదుగాని యది ప్రథమపురుషక్రియలయందే కాన్పించుచున్నది.

5. మధ్యపహాఁడీ, లేక, కుమాఁనీ భాష: ఇందు ప్రథమపురుషమున పుంస్త్రీ లింగముల వేర్వేఱు రూపములును బహువచనమున రెంటికి నొక్కటే రూపమును గాన్పించుచున్నది. భూత, అద్యతనభూత, అనద్యతనభూతకాలిక క్రియలయందు పుంస్త్రీ భేదముల ననుసరించి క్రియారూపములును మాఱును.

6. ఖస్‌పర్జియాభాష: ఇందలి క్రియారూపములలో మధ్యమపురుషైకవచనమున భూతకాలమున పుంస్త్రీ భేదమును జూపించు ప్రత్యేక రూపములున్నవి; ప్రథమపురుషమున నీ భేదమేకవచనమందే కాక బహువచనమునందును గలదు.

7. గర్హ్వాలీభాష: తద్భవ విశేషణములు తప్ప తక్కిన విశేషణములు విశేష్యముల లింగమును బొందవు. అవి మాఱక యట్లే నిలుచును. భవిష్యత్కాలిక క్రియారూపములం దన్నిపురుషములందును నీ భాషలో పుంస్త్రీ భేదము ననుసరించి ప్రత్యేకరూపము లున్నవి.

8. పడమటి పహాఁడీ భాషలు:

i. బఘాఁటీభాష: ఇందు క్రియారూపములలో భవిష్యత్కాలమందు ప్రథమపురుషమున పుంస్త్రీ లింగములకుఁ బ్రత్యేకరూపములున్నవి.

ii. కిఉన్థాలీభాష, : iii. ముల్వీభాష: ఈ రెంటియందును బఘాఁటీ (i) యందువలెనే యున్నది.

iv. మండ్రెఆలీ: ఇందు వర్తమానకాలమున మూఁడు పురుషములందును పుంస్త్రీలింగములకుఁ బ్రత్యేకరూపము లున్నవి.

v. గాదీభాష: ఇందు వర్తమాన భవిష్యత్కాలములయందు మూఁడు పురుషములందును బుంస్త్రీ లింగములందు ప్రత్యేకరూపము లున్నవి.

vi. భద్రవాహీ, భలేసీ భాషలు: వీనిలో భవిష్యత్కాలిక క్రియలయందు పుంస్త్రీలింగములఁ బ్రత్యేకరూపము లున్నవి.

vii. పాడరీభాష } ఈ రెంటియందును భద్రవాహీ భలేసీ భాషలయందువలెనే యున్నది.
viii. గుజురిభాష }

9. పష్టోభాష: ఇందనద్యతన భూతకాలికక్రియల మూఁడు పురుషములందును బుంస్త్రీభేదము ననుసరించి ప్రత్యేకరూపములు గలవు.

10. ఓర్మూరీభాష: ఈ భాషయందు ప్రాణివాచకశబ్దములకు జాతిలింగము వాడుకలో నున్నది. ఇందు సాధారణముగ మహద్రూపములకు సరిపోవు మహతీరూపములు ప్రత్యేకశబ్దములచేఁ దెలుపఁబడును. ఈ భాషలో కొన్ని విశేషణములు విశేష్యముల లింగము ననుసరించి మాఱుచుండును గాని యట్టి విశేషణములు క్వాచిత్కముగ మాత్రమున్నవి; అనేక విశేషణశబ్దము లట్లు మార్పునొందవు. ఇందలి క్రియారూపములు భూత, అసమాప్త భూత, అనద్యతనభూత, అసమాప్త భవిష్యత్, అనద్యతన భవిష్యత్కాలములందు పుంస్త్రీ భేదముల ననుసరించి ప్రత్యేకరూపముల నందుచుండును.

11. బెలోచీభాష: ఈ భాషలో శాబ్దికలింగము లేదు. విశేష్యముల లింగము ననుసరించి విశేషణశబ్దముల లింగము మాఱదు.

12. బుందేలీభాష: ఇందు భవిష్యత్కాలిక క్రియలలో పుంస్త్రీభేదముచే ప్రత్యేకరూపములు గలవు.

13. బనఫారీభాష: ఇందు భూతకాలిక చేదర్థమునందును, భూతార్థక్రియాజన్యవిశేషణములకును పుంస్త్రీభేదముచేతఁ బ్రత్యేకరూపములు గలవు.

14. పంజాబీభాష: పుంస్త్రీభేదముచేఁ బ్రత్యేకరూపము లీభాషయందు వర్తమాన, భూతకాలక్రియలయందు గలవు.

15. మాల్వాటీభాష: అసమాప్త భూతకాల క్రియలయందును, భవిష్యత్కాలిక క్రియలలో నొకతెగయందును మూఁడు పురుషములలోను పుంస్త్రీభేదముచేఁ బ్రత్యేకరూపములు గలవు.

16. సింధీభాష: ఇందు శాబ్దికలింగ మంతరించిపోవుచున్నది; చాల మట్టుకు జాతిలింగ మనుసరింపఁబడుచున్నది. ఆ, ఈ, ఊ, అంతమందు గల విశేష్యములు పురుషనామము లైనప్పుడు పుంలింగములును, స్త్రీనామము లైనప్పుడు స్త్రీలింగములును నగుచున్నవి. జడవాచకములును, గుణవాచక పదములును స్త్రీలింగము లగుచున్నవి. ఉదాహరణములు: రాజా = రాజు (పుం.); హాచా=హత్య (స్త్రీ); సాణీ=స్నేహితుఁడు (పుం.); గోలీ=బానిసస్త్రీ (స్త్రీ.); రహాకూ = ఒకస్థలమున నివాసము గలవాఁడు (పుం.); ఆబిరూ=గౌరవము (స్త్రీ.) క్రియారూపములలో భూత భవిష్యత్కాలములందును, నిర్ధారిత వర్తమానకాలమునందును, అసమాప్త భూతకాలమునందును, వర్తమానాపరిసమాప్త చేదర్థకరూపములందును పుంస్త్రీభేదములచేఁ బ్రత్యేకరూపము లున్నవి.

పిశాచభాషలు.

17. బాష్గలీ: ఇందు జడవాచకశబ్దము లనేకములు స్త్రీలింగములుగ నున్నవి. ప్రాణివాచకములలో జాతిలింగముమాత్ర మనుసరింపఁబడుచున్నది. సాధారణముగ విశేష్య, విశేషణముల లింగభేదమును దెలుపకుండుటయే యీ భాషయందలి ముఖ్యలక్షణముగ నున్నది. కొన్ని విశేషణములు విశేష్యముల లింగము ననుసరించి మార్పు నొందవు.

18. వైఅలాభాష: ఇందు జాతిలింగమున్నది. మహన్మహతీరూపముల భేద మీక్రిందివిధముగఁ దెలుపఁబడుచున్నది.

i. శబ్దములయంతమందుగల యచ్చుల మార్పుచేతను. ఉదా. దబల = బాలుఁడు; దబలి = బాలిక మొదలయినవి.

ii. వేఱేఱుపదముల నుపయోగించియు. ఉదా. మనష్ = మనుష్యుఁడు, మేషి = ఆఁడుది; త్ర = ఎద్దు; గా = ఆవు మొదలయినవి.

iii. మహన్మహతీ భేదమును దెలుపుటకుఁ బ్రత్యేకపదముల నాయాపదములకుఁ బూర్వమందు చేర్చుటవలనను. ఉదా. చూ=మగకుక్క; నరేస్తా - చూ, లేక, ఇస్త్రేకీ - చూ = ఆఁడుకుక్క మొదలయినవి.

ఈ భాషలో విశేష్యముల లింగవిభక్తుల ననుసరించి, విశేషణముల లింగవిభక్తిరూపములు మాఱవు. కొన్ని సందర్భములం దీభాషలోని క్రియలలో లింగభేదమును గాన్పించుచున్నదిగాని యట్టిభేద మరుదనియే చెప్పవచ్చును.

19. కలాషాభాష: ఇందు శాబ్దికలింగము లేదు. ప్రాణివాచకశబ్దముల కొకరీతిగను, అప్రాణివాచకముల కొకరీతిగను విభక్తిప్రత్యయములఁ జేర్చు విధాన మిందు గలదు. ఈభాషలో విశేషణములకు లింగము లేదు. వానిపై విభక్తిప్రత్యయములును జేరవు.

20. గవర్బటీభాష: ఇందు ప్రథమేతరవిభక్తులలో విశేషణములకు మార్పు గలుగదు.

21. పషాయిభాష: ఇందు విశేషణములకు లింగభేదము లేదు. క్రియారూపములలో భూతకాలమున పుంస్త్రీభేదములచేఁ బ్రత్యేకరూపము లున్నవి.

22. షినాభాష: ఇందు విశేషణములు విశేష్యముల లింగవచనముల ననుసరించి మాఱుచుండునుగాని, వాని విభక్తిరూపముల నందవు. ఇందు వర్తమాన, భూత, అపరిసమాప్తభూత, అనద్యతనభూతకాలిక క్రియారూపములందు పుంస్త్రీభేదముచేఁ బ్రత్యేకరూపములు గలవు.

23. ద్రాస్ దేశమందలి భోక్పాభాష: దీనిలో విశేషణములు విశేష్యముల లింగము ననుసరించి మాఱుట చాల నరుదు. అన్నికాలముల క్రియారూపములందును పుంస్త్రీభేదముచేఁ బ్రత్యేకరూపములు గలవు.

24. డహానుదేశపు భోక్పాభాష: ఇందు విశేష్యములందు శాబ్దికలింగము స్పష్టముగా లేదు. వర్తమాన, భూతకాలికక్రియలందు పుంస్త్రీభేదముచేఁ బ్రత్యేకరూపము లున్నవి.

25. కాశ్మీరీభాష: ఇందు ప్రాణివాచకశబ్దములకు జాతిలింగము మాత్రము గలదు. జడవాచకశబ్దముల లింగ మాయాశబ్దముల యంతమందు గల మాత్రాచ్చుల మార్పులవలనఁ దెలియఁజేయఁబడును. (ఈ భాషయందు మాత్రాచ్చులయందలి మార్పులవలన ననేక వ్యాకరణకార్యములు కలుగుచుండును.వాని నన్నిటిని వివరించుట యనావశ్యకము. కాని, శబ్దమందలి యొక యచ్చు మాఱుటవలనఁగాని, శబ్దమునకు మఱియొకయచ్చును జేర్చుటవలనఁగాని, శబ్దగతాచ్చులు మాఱునట్టి సంప్రదాయము తెనుఁగునను గొంతవఱకుఁ గాన్పించుచున్నదని మఱియొకచోటఁ జెప్పఁబడి యున్నది.) విశేషణములను విశేష్యములుగ వాడినఁదప్ప, కేవలవిశేషణములై విశేష్యములకుఁ బూర్వము చేరునప్పుడు వానియం దెట్టిమార్పును గలుగదు. ఈ భాషలో భూత, వర్తమానక్రియారూపములును, అనద్యతనభూతకాలిక క్రియాజన్యవిశేషణములును, పుంస్త్రీభేదము ననుసరించి ప్రత్యేకరూపముల నందుచుండును.

26. తోర్వాలీభాష: ఇందు విశేష్యముల లింగవచన విభక్తుల ననుసరించి వాని విశేషణములందు మార్పులు గలుగవు.

27. బురుషస్కీ, లేక, ఖజునాభాష: ఇందు జాతిలింగమే కలదు; మహన్మహతీరూపములు ప్రత్యేకముగఁ గలవు. తిర్యగ్జడవాచకపదములు మహన్మహతీ రూపములనుండి వేఱుపడి యుండును.

28. మగహీభాష: ఇందు విశేషణములు విశేష్యముల ననుసరించి మాఱవు.

29. భోజ్‌పురీభాష: ప్రామాణిక భోజ్‌పురీభాషలో విశేష్యముల ననుసరించి వాని విశేషణములు మాఱవు. భూత, వర్తమానకాలిక క్రియారూపములందు పుంస్త్రీభేదముచేఁ బ్రత్యేకరూపము లుండును.

30. ఒఱియాభాష: ఇందు జాతిలింగమున్నది. మహదమహద్ విధాన మున్నది.

31. మరాఠీభాష: ఇందు అప్రాణివాచకశబ్దముల యేకబహువచన రూపములును, ప్రాణివాచకశబ్దముల బహువచనరూపములును నపుంసకములు. ప్రాణివాచక బహువచనరూపములు మహన్మహతీ సామాన్యరూపములుగ నుండును; లేదా, అట్టిభేద మనిర్ధారితముగ విడిచిపెట్టఁబడును. కొంకణదేశపు మరాఠీభాషయందు రజస్వలలుకాని కన్యకలవిషయమున నపుంసక లింగైకవచనమును వాడుదురు. గౌరవార్థమున స్త్రీలకు నపుంసక లింగబహువచనము నుపయోగింతురు. ఆ-కారాంతవిశేషణములు తప్పఁ దక్కిన విశేషణములు విశేష్యముల ననుసరించి మార్పునొందవు.

32. హాళబీభాష: ఇందును విశేషణములు విశేష్యముల లింగవచనముల ననుసరించి మార్పులఁ జెందవు.

## ద్రావిడభాషలలో లింగము.

కాల్డువెల్లుపండితుఁడు ద్రావిడభాషలలోని లింగము ఇండో-యూరోపియను భాషలయందలి లింగమును బోలక, చాలవఱకు సిథియను భాషలలోని లింగమును బోలియున్నదనియు, ఇండో-యూరోపియను భాషలను మాట్లాడు జాతులవారు అధికభావనాసంపత్సంకలితులు గావున మనుష్యపురుష, స్త్రీ వాచకశబ్దములకుపుంస్త్రీలింగప్రత్యయములను సహజముగఁ జేర్చుటయేకాక, తిర్యగ్జడవాచకశబ్దములు దెలుపు నాయావస్తువులకును గుణవాచకశబ్దములకును గూడ పుంస్త్రీభేదమును గల్పించి, వానికి ప్రాణప్రతిష్ఠచేసి, తమ కవితా దృష్టిని వెల్లడించిరనియు, సిథియనుభాషలను మాట్లాడువా రట్లుచేయక తిర్యగ్జడవాచకములను నపుంసకలింగములుగఁ దలంచిరి సరేకదా, బుద్ధియుతులగు మానవ పురుషస్త్రీలనుగూడ నప్రాణివస్తువుల జతఁజేర్చి వానికిని నపుంసక లింగత్వము నంటఁగట్టి, ప్రాణ్యప్రాణ్యర్థవాచకముల నన్నిటి నొక్కవర్గము

లోనికి దింపి తమభావనాబలహీనతను బ్రకటించిరనియు, ద్రావిడభాషలను మాట్లాడువారు సిథియనుభాషలను మాట్లాడువారివలెనే పుంస్త్రీవాచకశబ్దములకుఁ బ్రత్యేకప్రత్యయములను జేర్పక వానిని తిర్యగ్జడవాచకములతో సమానముగఁ బరిగణించుటచే ద్రావిడభాష లీ విషయమున సిథియను భాషా సంప్రదాయము ననుసరించుచున్నవిగాని ఇండో-యూరోపియను భాషా సంప్రదాయము ననుసరింపలేదనియు వ్రాసియున్నాఁడు.

కాల్డువెల్లుపండితుఁడు వెల్లడించిన యీ యభిప్రాయ మాతని భావనాబలమును గవితాశక్తిని వెల్లడించుచున్నదిగాని వాస్తవముగ నాలోచించినచో ఇండో-యూరోపియను భాషలను మాట్లాడువారి భావనాబలమును, సిథియను ద్రావిడభాషలను మాట్లాడువారి భావనాబలహీనతను నెంతమాత్రమును వెల్లడింపఁజాలవు. స్త్రీయైన పెండ్లామును భార్యవలె స్త్రీలింగమం దుంచక, ఒకప్పుడు మగవానినిచేసి 'దార' అనియు, ఒకప్పు డామెకు నపుంసకత్వము నారోపించి 'కళత్ర' మనియుఁ జెప్పుట యేఁటిభావన ? పాషాణమును పుంలింగముచేసి, శిలను స్త్రీలింగము చేయ నేల ? ఆహవ, సంగ్రామములు పురుషోచితములు కావుననా యవి పుంలింగము లగుట ? అయిన రణము నపుంసకులు చేయునదియు, ఆజి స్త్రీలు చేయునదియు గావున వానికి నపుంసక, స్త్రీలింగములు వరుసగ నాపాదింపఁబడినవని చెప్పనగునా ? సంగ్రామ రణాజులయందు గావలసిన వీర్య, బలములు నపుంసకము లనుట యేఁటిభావన? వ్యాకరణగ్రంథమున కశ్లీలతాదోషము లేదుగావున చెప్పవలసివచ్చినది—స్త్రీత్వ చిహ్నమగు ననయనవాచక పదమునకు పుంలింగత్వమును గల్పించి, పుంస్త్వ చిహ్నద్యోతకమగు పదమునకు నపుంసకత్వమును గల్పించుట యెంతటి తెలివి ?

సిథియను, ద్రావిడభాషలను మాట్లాడువా రన్నిశబ్దములను ఏకరూపత చాపుమట్టమునకుఁ (dead level of uniformity) దెచ్చుటయేకాక టిని. నిర్జీవపదార్థవాచకములుగఁ జేసిరని కాల్డువెల్లుగా రనిరి. ఏషయమునఁ గూడ నీ విధముగనే చెప్పవచ్చును. సంస్కృత , నపుంసకలింగప్రత్యయములు విశేష్యములలోఁ గొంత భాషలయం దాభేదము వానికి సంబంధించిన క్రియా నే యున్నదిగదా ! రూపమెట్లున్నను క్రియగదా యేమిచేసినది ? శబ్దములకు రూపభేదమును గల్పించి పుంసకములఁ జేసివైచినదిగదా ! స భవతి, సా ఁడులింగములందును క్రియలకేకరూపముగలిగి

యన్నియుఁ జావు మట్టమునకు వచ్చినవేకదా ! అందువలన ద్రావిడులే బుద్ధిశాలురు, భావనా బలసంపన్నులును, ఇండో - యూరోపియను జాతులవారు కారు నని చెప్పనగునా ?

కావున భావనాశక్తివాదము సరియైనదికాదు. పుం, నపుంసక భేదములను శబ్దములవిషయమునఁ గల్పించినది వైయాకరణులుగాని, తత్తద్భాషలను మాట్లాడు జనులుకారు. ఇండో - యూరోపియను భాషలయందు విశేష్యములు వానివాని యంతాక్షరములనుబట్టి వేర్వేఱువర్గములుగఁ జాల వఱకు నేర్పడియుండెను. ఆయా యంతములుగల శబ్దములకు వచనవిభక్తులు చెప్పవలసినప్పు డాయావర్గముల శబ్దములన్నియు నేకరీతిగ మార్పుల నొందుచు వచ్చెను. వీనివిషయమై, పుంస్త్వ, స్త్రీత్వ, నపుంసకత్వములను యథార్థముగ నూహించుట సమంజసముకాదు. సంస్కృతమునను జాతిలింగము లేదనుట పొరబాటు. టాప్, జీప్, జీష్, డాప్ మొదలగు ప్రత్యయములు తత్తదాగమ వర్ణములతోఁ బురుషవాచక శబ్దములఁ గూడి స్త్రీవాచకములును స్త్రీలింగ ములు నగుచున్నవి గదా! పురుషవాచకములు కాని పుంలింగశబ్దములకుఁ గూడ నాప్రత్యయములు చేరుట యవి తత్సదృశాంతము లగుటయే కారణము. ఇక ద్రావిడభాషలయందువలె పురుషవాచకములకుఁ దగిన స్త్రీవాచకములు ప్రత్యేక శబ్దములచే నిరూపింపఁ బడుటయు సంస్కృతమునఁ గల సంప్రదాయమే : ఉదా. పురుషః, స్త్రీ; పితృ, మాతృ, భ్రాతృ, స్వసృ; వరః, వధూః; జామాతృ, స్నుషా; భావుకః; వధూనీ మొదలయినవి. ఆడు, మగ అనునర్థములుగల శబ్దములఁ జేర్చి లింగమును నిరూపించుటయు సంస్కృత సంప్రదాయావిరుద్ధమే. ఉదా. పురుషసంతానమ్, స్త్రీసంతానమ్, పురుషశిశుః, స్త్రీశిశుః మొదలయినవి. ఒక్కటే శబ్దము స్త్రీపురుష సామాన్యవాచకముగ నుండుట కుదాహరణములు : జనః, బంధుః, కవిః మొదలయినవి. ఒకప్పుడు స్త్రీపురుషసామాన్యవాచకముగ నుండిన గోశబ్దము రానురాను స్త్రీవాచకముగ నిలిచిపోయినది.

## మహదమహద్వాచకములు.

తెనుఁగునను దక్కిన ద్రావిడభాషలయందును సంస్కృతాది భాషలయందువలెఁగాక పుం స్త్రీ నపుంసక లింగములను దెలుపు ప్రత్యేక ప్రత్యయములు లేవనియు, నందుచేత ద్రావిడ భాషలలోని పదములన్నియు సాధారణముగ నపుంసకలింగ రూపములతోనే యుండుననియుఁ గాల్డువెల్లు చెప్పుచు నిది కారణముగా ద్రావిడ సంస్కృత భాషలకు పరస్పరసంబంధము లేదని చెప్పియున్నాఁడు. సంస్కృతమునందే వ్యాకరణలింగ మనియతముగా నుండెననియు, ప్రాకృతాది భాషలలో లింగబోధకప్రత్యయములు సాధారణముగ

వికారమునుబొంది, లింగజ్ఞాన మంతరించుటచే నీవిషయమున ననేకవ్యత్యాసములు గలిగినవనియు, ఇంకను వ్యాకరణలింగమును బాటింప యత్నించుచున్న యాధునికార్యభాషలలోఁ గూడ శబ్దములకు నియతలింగము కానరాక చాలవ్యత్యాసములు కలిగినవనియు, నాధుని కార్యభాషలయందువలెనే ద్రావిడభాషలయందును తొల్లింటి వ్యాకరణలింగము లోపించి, స్త్రీ, పుం, నపుంసక జాతులను దెలుపుట యావశ్యకమగు పట్టులఁ బ్రత్యేకపదములను, పదవికారములగు ప్రత్యయములను జేర్చి యాజ్ఞానమును జనులు పొందుచుండిరనియు నింతకుముందు తెలిపియున్నాము. అట్టి జ్ఞానమును గలిగించు పదములలోను, ప్రత్యయములలోను గొన్నిపదములకుఁ దరువాతను, కొన్నివానికిఁ బూర్వమందును జేరుచు వచ్చినవి. స్త్రీజాతిని పుంజాతినిఁ బ్రత్యేకించుటకిట్టి ప్రత్యయములు సాధారణముగఁ జేరుచుండును. ఆరెండింటిని బ్రత్యేకించినచోఁ దిర్యగ్జడ వాచకములకుఁ బ్రత్యేకసంజ్ఞ యక్కఱలేదు. అయినను దిర్యగ్వాచకములందును స్త్రీ, పుం భేదమును దెలుపవలసినపుడు ప్రత్యేక పదప్రత్యయములతో నాభేదమును గల్పించుట యనావశ్యక మయ్యెను. అట్టి పదప్రత్యయములు చేరనప్పుడు మహదమహద్వాచకములు ప్రత్యేకపదములుగా నుండును. ఈ విధాన మొక్కద్రావిడభాషలయందే కాక యార్యభాషలయందును గానవచ్చుచున్నది.

### (1) పదములను పూర్వమందు చేర్చుట.

సంస్కృతము: అపత్యము—పుమపత్యము, స్త్ర్యపత్యము; పురుషశిశువు, స్త్రీశిశువు మొదలయినవి.

ఇంగ్లీషు: Child (చైల్డ్)—He-child (హీ - చైల్డ్), She-child (షీ - చైల్డ్) మొదలయినవి. Ass—He-ass, She-ass మొదలయినవి.

తెనుఁగు: బిడ్డ—మగబిడ్డ, ఆఁడుబిడ్డ మొదలయినవి. గాడిద—మగగాడిద, ఆఁడుగాడిద మొదలయినవి.

తెనుఁగున మహద్వాచకములను దెలుపుటకు 'పోతు' అనియు, మహతీతిర్యగ్వాచకములను దెలుపుటకు 'పెంటి' యనియుఁ బదములకుఁ బూర్వమందు చేర్చుటయుఁ గలదు.

### (2) మహన్మహతీవాచకములు వేర్వేఱుగా నుండుట.

సంస్కృతము: భ్రాత, స్వస; పిత, మాత; వరుఁడు, వధువు; జామాత, స్నుష మొదలయినవి.

ఇంగ్లీషు: Brother (బ్రదర్), Sister (సిస్టర్); Father (ఫాదర్), Mother (మదర్) మొదలయినవి.

తెనుఁగు : తండ్రి, తల్లి; అన్న, అక్క; తమ్ముఁడు, చెల్లెలు; మామ, అత్త మొదలయినవి.

(3) పదములను ప్రత్యయములను పరమందు చేర్చుట.

పదములకుఁ బరమందుచేరి మహ న్మహత్యర్థములను దెలియఁజేయు ప్రత్యయములును బదములును నీ క్రింద వర్గీకరింపఁబడినవి:—

I. మహద్వాచకములు.

పురుషులను తెలియఁజేయు పేళ్లు మహద్వాచకములు. సాధారణముగ దెనుఁగున నిట్టి పేళ్లకు-డుఙ్ ప్రత్యయమునుగాని యితర ప్రత్యయములను గాని జేర్చుట కానరాదు. అట్టి పదములు సందర్భమును బట్టి మహదర్థమును గాని, మహత్యర్థమునుగాని కలిగి యుండును. కాని, కొన్నిటికి మహదర్థము మాత్రము కాన్పించు చున్నది. ఉదా:—

(అ) మహద్వాచకములు : ప్రత్యయములు లేనివి.

ఊబ = పేడి, నపుంసకుఁడు; ప్రేపుడు = అధికుఁడు; దొర, నంబి; పైద= పిల్లవాఁడు; కన్వడి; ప్రె(పె)గ(-గ్గ,-వ)డ; మాసటె = శూరుఁడు; నలువ; పడాలు, పడవాలు, రాజు, రారాజు (లింగ-, పోతుల మొద.); అరుసు, గేస్తు, బచ్చు, వెజ్జు, పేడి, గామిడి, దళవాయి; రుసి, జోసి, మంతిరి, బొమ్మ చారి, బోయ (రేవు-, సదరు మొద.); చదువులయ్య, దాసరయ్య, నల్లనయ్య, బాపనయ్య, ఎంబన్న, దేవర, వెనకయ్య, కన్నయ్య, కంబమయ్య, జియ్య, హనుమ, బమ్మ, తురక, మిత్త, ఒజ్జ, రాచ, జోగి, నియ్యోగి మొదలయినవి.

మనుష్యుల రక్తసంబంధమునుదెలుపు కొన్ని మహద్వాచకపదములు ప్రత్యయరహితములుగఁ గానవచ్చుచున్నవి. ఉదా. అన్న, అబ్బ, అయ్య (-య), కొడుకు, తండ్రి, తంబు, తాత, నాయన, నాన్న, పితర, పెండ్లికొడుకు, పెనిమిటి, బావ, మామ మొదలయినవి.

(ఆ) మహద్వాచకములు : ప్రత్యయములు గలవి.

1.—అఁడు: అడియఁడు, అనుమఁడు, అరుహుఁడు, ఉలుపఁడు, కొడు కఁడు, చెడుగఁడు, దుడుకఁడు, పొడవడు, వడుగడు.

2.—ఆఁడు: ఆఁడు ప్రత్యయ మెప్పుడును బహువచన లకారము మీఁదనే చేరుచుండును. ఇది '-వాఁడు'లోని తొలివకారము లోపించుట వలన నేర్పడినది.—

కలుతలాఁడు, కలుదులాఁడు, కొడిమెలాఁడు, చిన్నెలాఁడు, టెక్కు లాఁడు, తక్కులాఁడు, నేరుపులాఁడు, పోకలాఁడు, బిరుదులాఁడు, బూమె లాఁడు, బొంకులాఁడు, (మటు) మాయలాఁడు, రజ్జులాఁడు, వగలాఁడు, వన్నె లాఁడు, వాఁదులాఁడు.

కొన్ని యెడల నీ ప్రత్యయ మమహద్వాచక పదములయందును గాన్పించును : బొక్కలాఁడు = సర్పము.

3.—ఇఁడి : కట్టిఁడి.

4.—ఇయఁడు : బొట్టియఁడు.

5.—ఇయుఁడు : కొండియుఁడు.

6.—ఈకుఁడు : తా(దా)లీకుఁడు.

7.—ఈఁడు : అటమటీఁడు, ఆగడీఁడు, ఉక్కడీఁడు, ఉక్కీఁడు, ఉద్దీఁడు, ఊడిగీఁడు, ఎకిమీ(?)ఁడు, ఎక్కటీఁడు, ఒంటరీఁడు, ఒడ్డీఁడు, కత్తళీఁడు, కన్నడీఁడు, కమతీఁడు, కమ్మటీఁడు, కమ్మతీఁడు, కమ్మరీఁడు, కల్లరీఁడు, కాసీఁడు, కుంటెనీఁడు, కొండీఁడు, కోడిగీఁడు, గారడీఁడు, డింగరీఁడు, తిండీఁడు, తెరువాటీఁడు, తోఁటీఁడు, తిమ్మరీఁడు, దాఁపరీఁడు, దావరీఁడు, దిండీఁడు, దిమ్మరీఁడు, దుండగీఁడు, -నీఁడు, పాండీఁడు, ప్రల్లదీఁడు, బవినీఁడు; బానసీఁడు, బూటకీఁడు, బొందలీఁడు, బోయీఁడు, మచ్చరీఁడు, మందడీఁడు, మన్నీఁడు, మొక్కడీఁడు, రక్కసీఁడు, వాసీఁడు, వెగ్గలీఁడు, వెట్టీఁడు, సంగడీఁడు, సాలీఁడు, సావలీఁడు, సుంకరీఁడు, సుంకీఁడు, హెగ్గడీఁడు.

పై యుదాహరణములలో 'ఈఁడు' ప్రత్యయము స్వార్థమునందు వచ్చినది. శీలార్థమునను నది బహువచన లకారముపై వచ్చును : వాట్లీఁడు.

అమహద్వాచకములయందును - ఈఁడు ప్రత్యయము కాన్పించుచున్నది. ఏకలీఁడు = అడవిపంది; ఒడ్డీఁడు = ఉడ్డీనగతిగల పావురాయి; సాలీఁడు.

8. ఉఁడు: అంకుఁడు, అక్కజుఁడు, అతగుఁడు, అవఘళుఁడు, ఆకెకుఁడు, ఇచ్చకుఁడు, ఇతవుఁడు, ఉక్కలుఁడు, ఉక్కివుఁడు, ఉత్తుఁడు, ఎల్లిదుఁడు, ఒడయుఁడు, కమనుఁడు, కావరు(-లు)ఁడు, కందుఁడు, కఱకంతుఁడు, కుచ్చితుఁడు, కొమరుఁడు, కొమారుఁడు, గరుటా(ల)మంతుఁడు, గాఁఱుఁడు, గాయకుఁడు, గాళకుఁడు, చదురుఁడు, చాదస్తుఁడు, చెలువుఁడు, జముఁడు, తమ్ముఁడు, తిరుఁడు, దట్టుఁడు, దుగినుఁడు, దుస్ససేనుఁడు, నాయకుఁడు, నెయ్యుఁడు, పాలసుఁడు, పాఱుఁడు, పితరుఁడు, పుడమీశుఁడు, ప్రల్లదుఁడు, బండగుఁడు, బందుగు(వు)ఁడు, బత్తుఁడు, బలియుఁడు, బలువుఁడు, బల్లిదుఁడు, బాపనుఁడు, బూటకుఁడు, బెట్టిదుఁడు, బెడిదుఁడు, బొప్పుఁడు, మల్లకుఁడు, రక్కసుఁడు, వియ్యంకుఁడు, విరటుఁడు, వివ్వచ్చుఁడు, వెన్నుఁడు, సడ్డకుఁడు, సిరిమంతుఁడు, సుక్కురుఁడు; సెల్లుఁడు, సొబగుఁడు.

9. ఎఁడు: ఎడ్డెఁడు, బొట్టెఁడు.

10. ఁడు : అట్టిఁడు, ఇట్టిఁడు, ఎట్టిఁడు; (తోడి) యల్లుఁడు, కున్నఁడు, క్రిం చుఁడు, గుండఁడు, గుమ్మఁడు, గేస్తుఁడు, గొల్లఁడు, జగిలెఁడు, జన్నఁడు, జాణఁడు, జోస్యుఁడు, నట్టుగు(-వు)ఁడు, పాపఁడు, మావతుఁడు, (ఇలు-, నెయ్యపు-, పసిఁడి-, పాప-, పుడమి-, పైఁడి-) ఱేఁడు, విఠానుఁడు, ప్రేఁడు.

11. కాఁడు:—ఈ ప్రత్యయము (1) చేయువాఁడు (2) కలవాఁడు (3) శీలముగలవాడు, (4) వృత్తిగలవాఁడు, అనునర్థములందును (5) స్వార్థ (6) నీచార్థములందును చేరి మహదర్థబోధకమగును. కాఁడు ప్రత్యయము చేరునప్పు డొకచో పూర్వపదము తుది మువర్ణములోపించును.

అంకకాఁడు, అంటు-, అంప-, అక్కఱ-, అక్కసు-, అడవ-, అట మట-, అన్నె-, అబ్బ-, అర-, అలరువిలు-, ఆగడ-, ఆణి-, ఆయ-, ఆయతి-, ఆస్తి-, ఆబూతి-, ఈటె-, ఈగి (-వి)-, ఈసు-, ఉద్ది-, ఎడ-, ఎత్తు (-తు) బరి-, ఎమ్మె-, ఎలమి-, ఏవ-, ఒంటరి-, ఒడిసెల-, ఒత్తు-, ఒరుదల-, కక్క ఱితి-, కటారి-, కమత-, కవణ-, కావలి-, కినుక-, కీలు-, కుంటెన-, కైలా ట-, కొంచె-, కొండె-, కొటి (-ట్టి)-, కొలువు-, కొల్ల-, కోటి-, కోడె-, కోప-, కోలు-, గగ్గుల-, గద్దఱి-, గమి-, గుత్త-, గుమి-, గుఱి-, గుల్ల-, గెలుపు-, గొంగడి-, గొంటు-, గొనబు-, చాగ-, చికిలి-, చిటి-, చిల్లర-, చెలి-, చెలిమి-, చేత-, చేరువ-, చేవడి-, చొరవ-, జగిలె-, జజ్జర-, జట్టి-, జంత్ర-, జల్లి-, జాడ-, జాల-, జుమ్మ-, జూద-, టాటోటు-, ఠవళి-, డాలు-, తక్కిడి-, తరి-, తరువు-, తాపి-, తాలిమి-, తిండి-, తిత్తి-, తుటారి-, తూలి-, తెక్కలి-, తెరవేఁట-, తెరువాటు-, తేర-, తేరు-, త్రిమ్మట-, దం దన-, దబ్బఱ-, దాడి-, దొడ్డ-, దోఁపు-, దోఁపుడు-, నచ్చు-, నంటు-, నట్టువ-, ననుపు-, నాణె-, నిమిత-, నీటు-, నెఱ-, నేఁత-, నేరుపు-, నేస్త-, నోడి-, పచ్చె-, పంత-, పందె-, పారపత్తె-, పీలి-, పువ్విలు-, పేరిమి-, పొత్తు-, పొందు-, పోటు-, బంది-, బందె-, బయ-, బరి-, బలిమి-, బూమె-, బేర-, మన్నె-, మర-, మాట-, మాయ-, మాలిమి-, ముడి-, మొన-, రంత-, రాయిడి-, ఱంప-, ఱిత్త-, లంజె-, వగ-, వడి-, వన్నె-, వల-, వలపు-, వల్లడి-, విట-, విలు-, విలువ-, వీర-, వెచ్చ-, వేఁట-, వేగిర- వేడుక-; వైపు-, వ్రాఁత-, వ్రాయస-, సంగడి-, సంగాత-, సం దడి-, సిబ్బితి-, సుతి-, సూడు-, సేద్య-, సొగసు-, హెగ్గడి-, హొంత-, హాను-.

ఒకప్పుడు - కాఁడు ప్రత్యయము తిర్యగ్జడవాచకములందును గాన వచ్చును. ఒట్టికాఁడు = చిలుక, గోరువంక; ఒంటికాఁడు = పంది, ఒంటరి కాఁడు = పంది.

12. - గాఁడు: ఇది 'కాఁడు' నకు రూపాంతరము.

అత-, ఆత-, ఇత-, ఈత-, ఎత,- ఏత-, అంద-, అమాంత-, ఆత్ర-, ఆలె-, కన్న-, కొల-, గాలి-, చొటి-, జీత-, డోసు-, తిరిప-, తోయ-, పాళె-, పిల్ల-, పెత్తన-, పోటి-, పోఱి-, బిచ్చ- బుచ్చి-, బూచి-, మొన-, లుల్లి-, వేస-, సన్న,-సూన-.

ఒకప్పుడు - గాఁడు ప్రత్యయము తిర్యగ్జడ వాచకములయందును గాన వచ్చుచున్నది.

పక్షులు.

అంబటిజోరిగాఁడు, ఆసకప్పెరగాఁడు, కాటిగాఁడు, గిజిగాఁడు, గిజ్జిగాఁడు = పచ్చపిట్ట; గుండుములుపుగాఁడు; పోలిగాఁడు; నల్లబ్బిగాఁడు; తోఁచిగాఁడు = ఒకడేగ; తోనిగాఁడు = ఒకడేగ.

జంతువులు.

గాలిగాఁడు = గాడిద; బావురుగాఁడు = బావురుబిల్లి, ఇబ్బందిగాఁడు = బెబ్బులికిని చిఱుతపులికిని పుట్టినపులి; పూచిగాఁడు = ఒకకుక్కపేరు; అనుమంతిగాఁడు = ఒక కుక్కపేరు.

చెట్లు.

పొగ్లుగాఁడు = క్రోష్టపుచ్ఛిక.

13. గారు: ఇది ' - కాఁడు, - గాఁడు' లకు బహువచనరూపము. దీనిని గౌరవార్థమందు వాడుదురు: అయ్యగారు. మహత్వార్థమునను దీనిని వాడవచ్చును. అమ్మగారు, రాణిగారు.

14. తుఁడు: పగ(-వ)తుఁడు, మార్తుఁడు, పచ్చ-, అలరు-, పూ (విలుతుఁడు).

15. వాఁడు : (i) ధాతుజ విశేషణములపై : అందిపొందిన-, ఉన్న-, ఏలిన,- కల-, కానని-, చేగల-, అల్లు-, చాలు-, నడుచు-, చను.

(ii) విశేషణములపై : గట్టి-, చిన్న-, పిచ్చి, వెలి-, ఎడ-, కడ.

(iii) విశేష్యములపై: లెస్స-, లేకి-, వింత-, తుది-, పగ-, పని-, పల్లాయనంబు-, వెఱ్ఱి.

(iv) విశేష్యముల షష్ఠీవిభక్త్యేకవచనరూపములపై: తోడి-, పాలి-, పొట్టకూటి-, వింటి-, వెనుకటి-.

(v) షష్ఠీ బహువచనరూపములపై: అంతలపొంతల-, అప్పుల-, పసుల-, పాముల-, బుడుబుడుక్కల-, పూసల-.

(vi) కర్మధారయమున మువర్ణమున కాదేశముగా వచ్చిన పు-వర్ణముపై: పట్టపు-, సన్నపు-.

(vii) శీలార్థమున: అల్లు-, చిప్పె.

(viii) వాసస్థానార్థమున: నీరుకాయ-, వెలివాడ-.

(ix) మతుబర్థమున: దిస(-స్స) మొల-.

(x) స్వార్థమున: చోఱ-, తమ్ము-, నట్టు-, మగ.

(xi) వృత్త్యర్థమున: కొమ్ము-, జీనిగిరి-, డుబుడుక్క-, తోఁట-, దబ్బ-, పంచాణంబు-, పఱిగ-, పసుల-, పాముల-, పాలేరు-, పూసల-, పూటకూటి-, పొట్టకూటి-, బుక్కా-, బుడుబుడుక్కల-, వంట-, వాతగాని-, వింటి-, వేగు-, సాలె-.

(xii) జాతివాచకములందు: ఈడిగ-, కమసాల-, కుట్రపు-, కుడిమి-, గవుండ్ల-, రాచ.

(xiii) దేహావయవములనుబట్టి: కొంగకాళ్ల-, గద్దముక్క-, గాడిద కాళ్ల-, గూని-, గేడెకాళ్ల-, తొంటిచేతి-, తొట్టి-, దొడ్డికాళ్ల-, నడ్డిముక్క-, నత్తి-, పంగటికాళ్ల-, పుటకాలి-, పొట్ట-, బట్టతల-, బుడ్డ-, బుజ్జిముక్క-, బూరకాలి-, బొజ్జ.

(xiv) ఆలంకారికముగ: పెద్దవిన్నపమువాఁడు = చెవిటివాఁడు.

16. - వారు: (i) 'అయ్య' పైఁ జేరి యిది యుపాధ్యాయుఁడు అను నర్థము నిచ్చును. దీనిని మహతీవాచకపదములపైఁ గూడ వాడవచ్చును: రాణివారు. 'అమ్మ' పైఁ జేరి యిది స్త్రీదేవతావాచక మగును.

(ii) జాతివాచకములయందు: కొండ-, కోలల-, పండా-, బ్రద్దల.

17. వాండ్రు: గాజుల-, పనస-, పిచ్చుగుంటి.

18. ఆతఁడు: ఇంటి యాతఁడు.

## మహతీ వాచకములు.

### అకారాంతములు.

**దేశ్యములు:** కుంక, జోటిక, పారిక, నంగ, ఎలనాగ, గొంజ, ముండ, బిడ, బిడ్డ (ఈ పదము రాయలసీమలో ఆఁడుదానికే వ్యవహారమున నున్నది; ఉత్తరసర్కారులలో మహన్మహతీవాచకము), ఆడుబిడ్డ, చోఱబుడుత, అత్త, చాన, లతకూన, చెడిప, పాప (ఈ పదము రాయలసీమలో ఆఁడుదానికే చెల్లును); ఇంటిపాప, జొత్తుపాప, పిన్నపాప, కొమ, కోమ, కొమ్మ, (పడపుఁ

గొమ్మ), (కొమ్మ) మాచకమ్మ, నవల, అడవ, అతివ, ఐదువ, చెలువ, తెఱవ, మగువ.

వైకృతములు: అక (అక్క), పాఱుటక్క, బాపనక్క, కైక, ఱాఁగ, దుగ్గ, వంజ, జెష్ట, గాణ, ఉవిద, ముగుద, అప, అప్ప, అమ, అమ్మ (అంకమ్మ, ఎఱ్ఱపోతమ్మ, ఎల్లమ్మ, గంగమ్మ, గంగనమ్మ, గంటలమ్మ, పూటకూళ్లమ్మ, పెద్దమ్మ పెద్దింటమ్మ), ముత్యాలమ్మ, సోమిదమ్మ, కన్నియ, చేడియ, లయ్య, అచ్చర చదుర, అవ, అవ్వ, ముత్తవ్వ, రక్కెస.

ఇకారాంతములు.

దేశ్యములు: కలికి, చిలుకలకొలికి, నంగనాచి, కలువకంటి, క్రాలు గంటి, తెలిగంటి, తొగకంటి, మచ్చెకంటి, వాలుగంటి, వాలుగకంటి, గొంటి, పెంటి, బోటి, అలరు,- ఇంచు-, ఇగురు-, చిగురు-, తలిరు-, తియ్య-, తీఁగ-, సన-, పువు-, పువ్వారు-, పూ-, పూవు-, మించు-, విరి-(బోఁడి), దుండి, క్రొత్తడి, తెంపి, ముండమోపి, మోపి, జఱభి, గట్టివాయి, ఒయా(-య్యా)రి, ఓయారి, తుటారి, పోరి, బిత్తరి, మిటారి; ఉగ్మలి, తొయ్యలి, పైదలి, ఉచ్చ మల్లి, తలి, తల్లి, బిడ్డతల్లి, మాఱుఁదల్లి, సవతితల్లి.

వైకృతములు: సకి, సింగి, దుగ్గి, లచ్చి, జాజి, జోటి, సీమాటి, చండి, జోగిణి, రాణి, ఇంతి, గొంతి, ఆరంజోతి, సవతి, దాది, ద్రోవది, చిత్తిని, జక్కిని, జవ్వని, నాగిని, సుకిని, సాని (ఎఱుక-, ఏలిక-, ఒజ్జ-, దొర-, నాగప-, నాప-, మంతర-, వియ్యపు-, వేలుపు-, సోమి-); (మరిడి) మహాలక్ష్మి, లక్కిమి, అమ్మి, అమ్మాయి, తాయి, దేవేరి, మానికదారి, సింగారి, కోమలి, దాదిలి, బసవి.

ఉకారాంతములు.

దేశ్యములు: అంకు, తోఁబుట్టఁగు, తోడఁబుట్టుగు, ఆఁడుపడుచు, తోడఁబుట్టు, ఆడుతోడు, గొడ్డు, పుట్టుగొడ్డు, తొత్తు, పెండ్ల(-ండ్లాము), కూఁతురు, ఆఁడుకూఁతురు, పెండ్లికూఁతురు, నాంచారు, మైలారు, పోలేఱు, ఆలు, గట్టువాలు, మందప్రోయాలు, కోడలు, తోడికోడలు, మనుమరాలు, ఆఁడుఁబుట్టువు, తోఁబుట్టువు, తోడఁబుట్టువు, మేపుట్టువు.

వైకృతములు: పొత్తువు.

ఎకారాంతములు.

వైకృతములు: కొమిరె, కన్నె.

ఓకారాంతములు.

దేశ్యము: ముత్తో.

- త ప్రత్యయాంతములు.

దేశ్యములు: అఱివత, ఎఱుకత, కుమ్మరత, కోఱవత, చాకిత, నెలఁత, ౩త, పాఱుత, బాపత, బోయత, మిండత, ముట్టుత, మెలఁత, వానెత. )(వే)ఁత, జంత.

వైకృతములు: గొల్లత, వడ్లత.

- ఇత ప్రత్యయాంతములు.

వైకృతములు: కోమ(-మా)రిత (-ర్త), గరిత, ముదిత.

- ఇంత ప్రత్యయాంతములు.

దేశ్యములు: చూలింత.

- ఎత ప్రత్యయాంతములు.

దేశ్యములు: బంకెత, బోయెత, మాలెత, అంకెత, లంజెత.
వైకృతములు: గుబ్బెత, చెంచెత, జాణెత, వానెత.

- ఎంత ప్రత్యయాంతములు.

దేశ్యములు: బాలెంత.

- తి ప్రత్యయాంతములు.

దేశ్యములు: గోతి, నాతి, పడతి (గడన-), పొలతి, ముదఁతి, వలఁతి.— ౯, తి-ప్రత్యయాంత మహతీవాచకములపై -'ఉక' ప్రత్యయము స్వార్థము ము చేరుటయును గలదు: పొలతుక, నెలఁతుక, పడతుక, నాతుక, వెలఁదుక.

- ది ప్రత్యయాంతములు.

ఆఁటది, ఆఁడ(-ఁదు)ది, పడుచుది, బోగముది, వెలఁది (ఆట-).— ౦శేషణాదులపైఁ గూడ -ది ప్రత్యయముచేరి మహత్యర్థమును సూచిం ము; ఇది మహతీతరామహదర్థమునందును వచ్చును: చిన్నది, పెద్దది, ప్పది, చెడ్డది మొదలయినవి.

- అలు ప్రత్యయాంతములు.

కోడలు, చెలి(-ల్లి)యలు, చెల్లెలు, మఱఁదలు.

- ఆఁడి ప్రత్యయాంతములు.

ఈ ప్రత్యయ మెప్పుడును బహువచన లకారముమీఁదనే చేరు ౦డును: ఎమ్మెలాఁడి, ఒప్పులాఁడి, ఒఱపులాఁడి, కులుకులాఁడి, గచ్చులాఁడి, బ్బలాఁడి, చిన్నెలాఁడి, చివ్వలాఁడి, టెక్కులాఁడి, తక్కులాఁడి, తనుకులాఁడి, ళలాఁడి, బాగులాఁడి, బూమెలాఁడి, బొంకులాఁడి, మాయలాఁడి, ముద్దు

- అరి.

ఆలరి, ఈబరి, ఈవరి, ఉక్కరి, ఏతరి, ఒంటరి, ఒఱపరి, ఒసపరి, ఒళవరి, ఓరుపరి, కలమరి, కాపరి, ఆలకాపరి, కాలరి, కుడుపరి, కూరుపరి, గడుసరి, గుడుసరి, గొంటరి, చదువరి, చనవరి, చలమరి, చుఱుకరి, చూపరి, చెఱుపరి, చెలిమరి, చొప్పరి, డి(ది)మ్మరి, తగవరి, తఱుగరి, తిరిపరి, తీరుపరి, తుంటరి, తెంపరి, తెరువరి, త్రిప్పరి, త్రిమ్మరి, త్రోపరి, త్రోవరి, దళవరి, దావరి, దోంపరి, నగవరి, నిజమరి, నుడువరి, నెప్పరి, నెయ్యరి, నెఱసరి, నెలవరి, నెళవరి, నేగుపరి, నోవరి, పనుపరి, పఱిగరి, పులసరి, (తేరు) పూన్పరి, పెనపరి, పెనుపరి, పొలపరి, పొలమరి, పోటరి, ప్రేలరి, ప్రోపరి, లగ్గరి, బాగరి, బేలరి, బొంకరి, మనుపరి, మెణకరి, మేంతరి, లావరి, వంటరి, వతారి, వఱపరి, విడుపరి, వితమరి, వెడ్డరి, వెరవరి, వేగరి, వేంటరి, వేసరి, సామరి, సిగ్గరి; సూనరి, సూసరి, సోమరి.

- ఆరి.

కిలారి, కీలారి, పిసినారి, పిల్లారి, పెచ్చారి, బిటారి.

- అఱి.

కన్నఱి, గద్దఱి, గుజాఱి, దబ్బఱి.

వైకృతములు.

పిఱికి; ఓడంగి; కోణంగి; చాగి; బైరాగి; కొనటి; పొట్టి, సెట్టి; కన్నడి; కిగ్గాడి; గారడి; హెగ్గడి; విన్నాణి; సంగాతి; వాంపి; పుడిపి; సామి, (కొమర-); తారి, దోసకారి, దునె(-నే)దారి ?; నిరాబారి, పగదారి, పడగదారి, పడి(ణి) హారి, బాటసారి, మాకరి, రాయబారి, సీకారి; కుఱ్ఱి; వెక(-క్క)లి; వెంగలి; తపసి; తుసాసి, పిసాసి; మట్టసి; మానిసి; కాలు -, చాలు -, నీరు -, పాటు -, పులు -, పోటు -, బెండు (మానిసి); రక్కసి (రాకాసి), బొమ్మరాకాసి, వినువాసి, సన్నాసి, (దొరకు -; దొరకోలు -), సావాసి, సుకవాసి, సోమాసి.

- అరి.

ఇతవరి; కంచరి; కఱుకరి; కీలరి; జూదరి; టక్కరి; తక్కరి; తలవరి ?; తలారి ?; తూంటరి; తూండరి; దిచ్చరి; దిమ్మరి; పూజ(జా-)రి; రూపరి; సుంకరి; హితవరి; బండారి.

బండారి.

-రి

ఉపమరి; చౌదరి; లేకరి; సాకిరి; గుట్టుసాకిరి.

(ఊ) ఉదంతములు.

దేశ్యములు.

చీఁకు; టంకు, మంకు; అనుఁగు, వెడఁగు, తుజుగు, పినుగు, పిలుగు, పెరుగు, వడుగు, పుట్టువడుగు, వేగు; పడుచు, పెళుచు; మ్రుచ్చు; బౌజు; గొంటు, పిచ్చు(క)కుంటు; కనుకుట్టు, చట్టు, తుట్టు, తోఁబుట్టు, సంచికట్టు; తొండు; చేదోడు, చోడు, సూడు; సైదోడు; పలువిత్తు, వెంగలివిత్తు, వెంబరవిత్తు; ఎఱగందు, కనుఁగందు; హాసదు; కాఁపు (ఇంటి-; తోఁట-; పంట-; పడి -; పసి - ; పారి - ; పాలి - , పూఁట - ; పెద్ద - ); కుదుపు; చల్లజంపు; (తరి - ; విలు - ) దాలుపు, కుదుపు, (ఇలు - ; నేల - ) వేలుపు; దోము; (తోడి .. ; తొలి - ) చూలు; బాడుగోలు; మెడ(మడి)వాలు; కందువు, కాలిపుట్టువు, పెరువు, వడువు; కట్టుపకాను; అచ్చాళు, సురి(రె-)యాళు.

ము - వర్ణాంతములు.

అరగడము; చుట్టము; నాలిబూతము; పాలిచుట్టము; వియ్యాము; వీయము; వెట్టము.

వైకృతములు.

గొఱకు; నిసుఁగు; జోగు; జొగ్గు; కి(క్రి)ంచు; చెంచు; అలుచు; గుజ్జు; మఱుగుజ్జు; బంటు (కాలి - ; పోటు - ); చోటు; వరవుడు; దుడ్డు; బట్టగుత్తు; బిరుదాయత్తు; చందు; విందు; కలువవిందు; జోదు; (సాదన - ; నడ - ); దొద్దు; ప్రొద్దు; వెక్కుఁరు; బాసవాలు; నిసువు; పబువు; వరవు; సిసువు.

ము - వర్ణాంతములు.

సబను.

(ఋ) ఎదంతములు.

దేశ్యములు : దుడ్డె; దెబె.
వైకృతములు : ఎడ్డె, చిట్లుకట్టె; తోఁటమాలె.

- వారు.

అమ్మవారు (= దేవత), అయ్యవారు (= ఉపాధ్యాయుఁడు); రాణివారు, ప్రభువువారు, ఏలినవారు.

## శీలార్థక ప్రత్యయములు.

ఈక్రింది ప్రత్యయములును బదములునుజేరి శీలమును దెలియఁజేయుచు మహన్మహత్యర్థముల రెంటియందును వర్తించును:-

1. అంగి: ఆడంగి.

2. కట్టె: పెడసర-.

3. కాకి: పలు-, పల్-.

4. కారి: గడె-, చలప, మాట-, వల-, హొంత-.

5. కుప్ప: నచ్చు-.

6. కొయ్య: గుండ-.

7. కొఱవి: చేట్ల-, త్రోపనం-.

8. కోరి, కోరు: మిండల-. (ఇది హిందూస్థానీ ప్రత్యయము.)

9. క్రచ్చు: కయ్యాల-.

10. గంప: కలపన-.

11. గుంటె: నొప్పి-.

12. గొంటె: తెగు (-వు)లు-, తెవ్వ-.

13. గొట్టు: ఈబరి-, ఉలిపి-, చాడీ-; తిరిప-, తిట్టి-, దేవురు-, దొంబులి-, నచ్చు-, పిసిని-, వలిపిరి-, వాఁపిరి.

14. గొండి: ఇచ్చు-, చిల్లి-, చేరు-, జగడ-, తగులు-, దూల-, లంచ-.

15. చేట : చెఱపనఁ-.

16. తిండి: దూఁ (?) బఱ(?)-.

17. దారి: మాయ-. (ఇది హిందూస్థానీ ప్రత్యయము.)

18. నంగి: మాటి-.

19. పోతు: అగచాట్ల-, అప్పుల-, ఉడుకుఁ-, ఉడుఁ, కచ్చె-, కు(కు)ళ్లు-, గొడ్డుఁ-, చనరుఁ-, చండి-, తిండి-, తిరుగఁ-, తోడుఁ-, త్రాగుఁ-, త్రుళ్లుఁ-, దూల-, నిక్కుఁ-, నిదు (ద్దు)ర-, నేరఁ-, పాఱుఁ-, పొగరుఁ-, బందెల-, బం-, బెదరుఁ-, బోరెం-, మాయ-, ఱంకుఁ-, వదరుఁ.

20. బండి: నవ్వుల-.

21. బలి: దండు-.

22. బాగులు: వెట్టి-.

23. మాఱి: అగచాట్ల-, కట్ల-, కడిగండ్ల-, కొట్ల-, జగడాల-, జిత్తుల-, తలకొట్ల-, తొత్తుల-, పాట్ల-, పెట్ట-, పెట్ల-, బికిరాల-, మంట-, మందుల-, లంపుల-, సుళ్ల-.

24. మిడుకు: ఉదురు-.

25. ము(మ్రు)చ్చు: గరిడి-, నాలి-, బంక-, లొట్టి-, (తిర్యక్కు-: కొండ-.)

26. రట్టు: వాత-.

27. వాలు: చిలుము-.

మతుబాద్యర్థములఁ జేరు ప్రత్యయములను పదములను నాయావర్గముల క్రిందఁ జూచికొనవలెను.

కులవాచక పదములు.

(1) కులవాచకపదములు సాధారణముగ నదంతములై యుండును: అఱువ, ఆదివెలమ, ఆసర, ఈండ్ర, ఈడిగ, ఉప్పర, ఎఱుకల, ఎఱ్ఱగొల్ల, ఏతుల, కంచర, కమ్మర, కరణకమ్మ, కరిణ, కాటిపాప, కుమ్మర, కురుప (-బ, మ, -వ), కైకోల, కొణిద, కొఱువ, కోయ, గొడగర, గొల్ల, గౌర, చాకల, జేండ్ర, తట్ర, తంబళ, తమ్మళ, తొగట, తోఁచ, దేండ్ర, దొమ్మర, పద్మవెలమ, పలుపట్టడ, పట్ర, పిళ్ల, పూనిగొల్ల, బడగ, బలిజ, బాపన, బెస్త, బోయ, మంగల, మాదిగ, మాల, ముత (-త్త) రాచ, మేదర, లింగబలిజ, వెలమ, సదరుబోయ, మొదలయినవి.

(2) కొన్ని 'ఇ, ఎ' లంతమందు గలవై యున్నవి. ఇవి 'ఇక' ప్రత్యయాంతములయి ప్రాకృతమున నా ప్రత్యయము ఏగ 'ఇయ' గ మాఱఁగా దానికి వికారములై తెనుఁగునఁ జేరియుండవలెను.

ఆసాది, ఏకరి, ఏనాది, ఒడ్డె, కాసె, చచ్చుడి, చా(సా)తాని, పరికి, బేరి, రట్టడి (రడి, రడ్డి, రెడి, రెడ్డి), వైజాతి, సాలె.–ఇట్టివికొన్ని మాత్రమే తెనుఁగునఁ గలవు.

(3) 'తెలగా' అనుపద మాకారాంతము.

(4) కొన్ని ఉదంత కులవాచక పదములును గలవు: ఎఱుకు, కొమ్ము, గౌడు, జక్కులు, లొంపు, సాఁతు మొదలయినవి.

(5) అన్నికులవాచక పదములమీఁదను బహువచన - లువర్ణము గాని, వారు, వాండ్రు, వాళ్లు పదములుగాని చేరవచ్చును.

వచనమున్నప్పుడు, మూఁడింటికి, నాల్గిటికి, ఐఁదిటికి, నీ రీతిగాఁ బ్రత్యేకముగ ననంతములగు ప్రత్యేకవచనము లేల యుండఁగూడదో తెలియదు. ఇట్టి యభిప్రాయము ననుసరించియే కావలయు ననంతవచనముల నేర్పఱుచుట సాధ్యము కాకపోవుటను, రెండింటికిఁ బ్రత్యేకముగ వచనము నేర్పఱుచుట యస్వాభావికమగుటచేతను, ఏక, బహువచనములను రెండుమాత్రమే జనవ్యవహారమున నిలిచినవి. ఒకదానిని తెలుపు పద మేకవచనమునం దున్నదనియు నొకటికంటె నెక్కువవానిని దెలుపు పదము బహువచనమునందున్నదనియు మాత్రము జనులు గ్రహింపసాగిరి. ఆధునిక ప్రపంచభాషలలో నేక బహువచనములే కాని ద్వివచనము కానరాదు.

## ద్వివచనము.

సంస్కృతమునను, ప్రాచీన ఇండో-యూరోపియను భాషలందును ఇద్దఱు, రెండు, అను సంఖ్యను దెలుపుటకుఁ బ్రత్యేక విభక్త్యంత రూపములుండెడివనియు, నట్టిరూపములు ద్రావిడభాషలయందు లేవు గావున ద్రావిడ భాష లిండో-యూరోపియను భాషావర్గమునకుఁ జేరినవి గావనియుఁ జెప్పువాదము సరికాదు. భాషల చరిత్రమందు నుడికారము మాఱిపోవుచుఁ గొన్ని వ్యాకరణరూపములు లోపించి, వాని స్థానమున నితర రూపములు నిలుచుచుండుట సహజమే. ఇండో-యూరోపియను వర్గమునకుఁ జేరిన యనేకభాషల ప్రాచీనావస్థయందే ద్వివచనము లోపించి, దాని స్థానమున బహువచనమే ప్రచారములోనికి వచ్చినది. ఉదాహరణమునకు నేటి యింగ్లీషుభాషలో ద్వివచనరూపములు లేవు. ఈ యింగ్లీషు భాషకుఁ బ్రాచీనావస్థను దెలుపు 'ఆంగ్లో-సాక్సను' భాషయందును లేవు. దానికిఁ బ్రాచీన రూపమగు గాథికు భాషయందును లేవు. అందుచేత నింగ్లీషు ఇండో-యూరోపియను భాషా వర్గమునకుఁ జేరినది గాదని చెప్పఁగూడదు. ఇట్లే యితరములగు నైరోపీయ భాషలయందును జరిగినది. ఆయా ఐరోపీయ భాషలయందు ద్వివచనము లోపించుటకుఁ గారణము ద్వివచనము లేని యితరభాషాకుటుంబముల సంపర్కమనవచ్చునా? అయినచో నా భాషాకుటుంబము లేవి?

నేటి హిందూస్థానార్యభాషలయందును ద్వివచనము లేదు. వాని ప్రాచీనావస్థయందును నది యున్నట్లు కానరాదు. అది యా భాషలయందు లోపించుటకు ద్రావిడభాషల, లేదా అనార్యభాషల, సంపర్కమే కారణమని కొందఱందురు. ఇట్టి వాదము యూరోపియనుభాషల విషయమున బయలుదేర లేదు. యూరోపియను భాషలందు ద్వివచనలోపము సహజమును, భారతీయార్యభాషల విషయమున నితరభాషాసంపర్కమూలమును నని చెప్పనగునా?

సంస్కృతభాషయందే కొన్నియెడల ద్వివచనమునకు బదులుగ బహువచనమును వాడు నాచారము వచ్చినది. "అస్మదోర్ద్వయోశ్చ" అను సూత్రము ప్రకారము అస్మచ్ఛబ్ద ఏకవచన ద్వివచనములకు మాఱుగ బహువచనము నుపయోగింపవచ్చును. 'అహం బ్రవీమి', 'ఆవాం బ్రూవః', అనువానికి మాఱుగ 'వయం బ్రూమః' అనవచ్చును. ఏకవచనమునకు మాఱుగ బహువచనము గలుగుట యన్ని భాషలయందును గొన్ని సందర్భములందు గౌరవాద్యర్థములఁ గలుగుచుండును. ఇచట మనకుఁ గావలసినది ద్వివచనమునకు బహువచనము గలుగుటయే. అయినను 'అస్మ'చ్ఛబ్దము విశేషణముతోఁ గూడియున్నచో సంస్కృతమున నేక ద్వివచనములకు మాఱుగ బహువచనము నుపయోగింపరాదు. "పటు రహం బ్రవీమి" "పటూ ఆవాం బ్రూవః" అనుచోట్ల "పటవో వయం బ్రూమః" అనఁగూడదు.

ఇట్లే నక్షత్రవాచకములగు 'ఫల్గునీ, ప్రోష్ఠపదా' అను పదములు రెండేసి నక్షత్రముల గుంపులకు పేళ్లు. కావున నా పదములు ద్వివచనమునం దుండవలసియున్నను వానిని బహువచనమునందును వాడవచ్చును. 'ఉదితే పూర్వే ఫల్గున్యౌ; ఉదితాః పూర్వాః ఫల్గున్యః; పూర్వే ప్రోష్ఠపదే, పూర్వాః ప్రోష్ఠపదాః' అను రెండేసి రూపములును సంస్కృతమున సాధువులే.

సంస్కృతమునను నితరములగు ఇండోయూరోపియనుభాషలయందును ద్వివచనము నిలిచినది. కాని, ప్రాకృతముననే ద్వివచనము లోపించి దాని స్థానమున బహువచనము మాత్రము నిలిచినది. ఉదాహరణములు:—మహారాష్ట్రి: బలకేశవాణం = బలకేశవయోః (గౌడవహో 26); హత్థా థరథరంతి (హాలుని సప్తశతి, 165); కణ్ణేసు = కర్ణయోః (రావణవహో 5, 65); అచ్ఛీహిం = అక్షిణీ (గౌడవహో 44);—అర్ధమాగధి: జణగా = జనకౌ (ఆయారంగసుత్త 1, 6, 1, 6); పహాణాఓ = ఉపానహౌ (ఠాణంగసుత్త 359); భుమగాఓ, అచ్ఛీణి, కణ్ణా, ఉట్ఠా, అగ్గహత్థా, హత్థేసు, థణయా, జాణూఇం, జంఘాఓ, పాయా, పాయేసు = భ్రువౌ, అక్షిణీ, కర్ణౌ, ఓష్ఠౌ, అగ్రహస్తౌ, హస్తయోః, స్తనకౌ, జానునీ, జంఘే, పాదౌ, పాదయోః (ఉవాస గదసాఓ * 94);—జైనమహారాష్ట్రి: హత్థా, పాయా = హస్తౌ, పాదౌ; తణ్హాచుహాఓ=తృష్ణాక్షుధౌ (ద్వారావతి, 500, 7); దోవి పుత్తా జమగా = ద్వావపి పుత్రౌ యమలకౌ, చిత్తసంభూఏహిం = చిత్రసంభూతాభ్యామ్;— శౌరసేని: మాహవ-మఅరందా ఆఅచ్ఛంతి = మాధవ-మకరందా వాగచ్ఛతః (మాలతీమాధవము, 293, 4); రామరావణాణం = రామ-రావణయోః (బాలరామాయణము, 260, 21); సీదా-రామేహిం = సీతారామా

భ్యామ్ (ప్రసన్నరాఘవము 64, 5); సిరీ - సరస్సదీణం = శ్రీ-సరస్వత్యోః (విద్ధసాలభంజిక 108, 5);—మాగధి: లామ-కణ్హాణం = రామ-కృష్ణయోః (కంసవధము 48, 20); అమ్హే హి లుహిలం పివమ్హ = ఆవా మపి రుధిరం పిబావ (వేణీ-సంహారము 35, 21); కలేమ్హ = కరవావ (చండకౌశికము 68, 15, 71, 10); దాక్షిణాత్య: చందణక - వీరఏహిం = చందనక - వీరకాభ్యామ్ (మృచ్ఛకటికము 105, 8); సుంభ - నిసుంభే = శుంభ - నిశుంభౌ (మృచ్ఛకటికము 105, 22);—అపభ్రంశము: రావణ-రామహో, పట్టణ - గామహో = రామరావణయోః, పట్టణ - గ్రామయోః (హేమచంద్రుఁడు, 4, 407 );— మొద.

ఆధునికార్యభాషలయందును వానితోఁ బాటు ద్రావిడభాషలయందును నీ ప్రాకృతసంప్రదాయము ననుసరించియే ద్వివచనము లోపించి యేక బహువచనములు మాత్రము మిగిలియున్నవి.

ద్రావిడభాషలలో పదములన్నియుఁ బ్రత్యయవిహీనములనియు సందుచేత మహాదమహాద్వివక్షు యర్థగతమేకాని ప్రత్యేకప్రత్యయములచేఁ గలుగదనియు, నట్టిప్రత్యయము లెవ్వియైననున్నచో నవియన్నియుఁ దత్సమపదముల సామ్యమున నర్వాచీనకాలమునఁ జేరినవే యనియుఁ గావున రూపమున ద్రావిడపదములన్నియు నమహత్తులేయనియుఁ గాల్డువెల్లభిప్రాయపడ్డినాఁడు. ఈ యభియప్రాయము సరియైనదే కాని యీ విషయమున సంస్కృతమునకును ద్రావిడభాషలకునుగల భేదము ననుసరించి యీ రెండింటికి నెట్టిసంబంధమును లేదనుటమాత్రము సరిగలేదు. సంస్కృతము ననంతరచరిత్రమును గమనించి యపభ్రంశభాషలచరిత్రమును నపభ్రంశభాషాజన్యములగు నాధునికార్యభాషాపదముల స్వరూపమును గుర్తించినచోఁ గాల్డువెల్లు నభిప్రాయమున సారములేనట్లు తెలియకపోదు. అపభ్రంశప్రాకృతములోను నేఁటి సింధీ మొదలగు భాషలలోను ప్రథమైకవచనమున నన్నిపదములును నుకారాంతములై యుండి రూపమున ద్రావిడభాషలయందువలెనే నమహత్తులవలెఁ గాన్పించును. అర్థమునుబట్టియే యవి మహాద్వాచకములో యమహాద్వాచకములో తెలిసికొనవలెను.

ద్రావిడభాషలయం దమహాద్వాచక పదములన్నియు నేకవచనమునందే యుండుననియు వానికిఁ బూర్వమందు సంఖ్యావాచకపదము చేరినను నాపదమునకు బహువచనప్రత్యయము సాధారణముగఁ జేరదనియు, నొకవేళ చేరినను దానితో సంబంధించిన క్రియాపదముమాత్ర మెన్నఁడును బహువచనమున నుండదనియుఁ గాల్డువెల్లు చెప్పియున్నాఁడు. ఈ సందర్భమున బహువచన తత్త్వమును గొంచెము విచారించుట యావశ్యకము కాకపోదు.

## ఏకత్వమా? బహుత్వమా?

వ్యాకరణమునఁ బ్రత్యయములను జేర్చు విషయమున బహువచనము నందున్న పదములు దెలుపు వస్తువులకును మనస్సునకును గల సంబంధము నాలోచించినచో నేకత్వమే కాని బహుత్వము గోచరింపదేమో యని తోఁచు చున్నది. ఏకత్వవిషయమునను నొక యవ్యక్తమును సాముదాయికమును నగు నొకబింబము మన మనస్సునఁ బ్రతిఫలించుచుండును. 'గోవు' అనుపదము నుచ్చరించునపుడు మనస్సు నెదుటఁ గానఁబడు బింబమెట్టిది? అది యెఱ్ఱని యావా? తెల్లనిదా? నల్లనిదా? మచ్చలుగలదా? పెద్దకొమ్ములదా? చిన్న కొమ్ములదా? ముసలిదా? లేఁతవయసుదా? పాలిచ్చునదా? వట్టిపోయినదా? అది వీనిలోఁ నెట్టిదియుఁ గాదు; వీని లక్షణములన్నియు నం దిమిడియుండును. మన మింతకుఁ బూర్వము చూచియుండిన యావుల లక్షణములన్నియు దాని యం దుండును. మైసూరి యావులనుగాని, యింగ్లీషు ఆవులనుగాని మన మింతకుముందు చూచియుండనిచో వాని ప్రత్యేకలక్షణములు దానియందు గాన్పింపవు. కావున 'గోవు' అను పదము నుచ్చరించునపుడు మన మనసు నెదుట గోచరించు నావు ప్రత్యేకవ్యక్తి కాదు. అది సాముదాయికలక్షణము గల యవ్యక్తమైనయావు. ఆ యావురూప మందఱకును నొక్కతీరుగఁ గాన్పిం పదు. వారివారి గోవుల యనుభవము ననుసరించి యా యవ్యక్తరూపము గూడ భేదించుచుండును. కావున 'గోవు' అను నేకవచనమందున్న పదమునం దనేకత్వముగూడఁ గాన్పించుచున్నది. అట్లే 'గోవు' శబ్దమునకు బహువచన లు - వర్ణముఁజేర్చి 'గోవులు' అని యుచ్చరించినను మనస్సునందలి ప్రతి బింబము సాముదాయికమే కాని, యందు చిన్నయావులు, పెద్దయావులు, ఎఱ్ఱయావులు, నల్లయావులు మొదలయిన ప్రత్యేకమయిన యావులస్వరూప ములు వేర్వేఱుగఁ గాన్పింపవు. కావున బహుత్వమునం దేకత్వమే కాన్పించు చున్నవి. కావున నేకత్వ బహుత్వములను భేదము కాల్పనికమే కాని వాస్త కము కాదని తేలుచున్నది. మానసికముగ నెట్లున్నను, లోకవ్యవహారమున త్రము ఏకము, అనేకము అను భేదముండుటచేతను నా భేదమును దెలు టకు బహువచనమునఁ బ్రత్యేకవర్ణము సాధారణముగఁ గనఁబడుచుండుట తను బహువచనమును గూర్చి వ్యాకరణములందు విచారము చేయవలసి న్నది. కావున ద్రావిడభాషలయందును నార్యభాషలయందును గల హువచనప్రత్యయములను గూర్చి విచారింతము.

## ద్రావిడభాషలలో బహువచనము.

కాల్డువెల్లు ద్రావిడభాషలలోని బహువచనమును గూర్చి విమర్శించి విషయమున సిథియనుభాషావర్గముతో ద్రావిడభాషల కెక్కువ పోలిక

(1) (i) ద్రావిడభాషలు: తమిళము: గళ్, గ, ఆంగ్; కోరవ: గ, గళు, ంగ: కైకాడి: గా, ఆంగ్; బుర్గండి: ఆంగ్; కన్నడము: గళు, కళు, గోళ్, గోడ్; బిజాపురీ: గోళ్; గోలరీ: గోడ్; సేఓనీ: గోట్; కురుమ్‌వారీ: గాండ్లు; బడగ: కళు; గోండీ: క,జ్గ్, స్క్; కూఇ: గా, ంగా, స్కా; తెలుఁగు: కులు; బ్రాహుఇ: ఆక్, ఇక్; మళయాళము: గళ్, క్కళ్, అవర్గళ్, ఆర్గళ్; కురుఖు: గుఠీ; పర్జీ: కుల్; కోలమి: కోల్; భిలీ: కుళ్; నాయికీ: కోర్.

(ii) ఆర్యభాషలు: రాజ్‌బంగ్‌సీ; గులా*, ఘుర్;-హైజోంగు: గిలా; సిల్హెటులోని యాగ్నేయ ప్రదేశమందలి భాష: గున్; ఉన్; ప్రామాణికమైన అస్సామీ: బిలాక్; పడుమటి అస్సామీ: గిలాక్; ఘటాన్గలి-ఠర్: గులా; బష్‌గలీ: కిలె; వై-అలా: కెలె; వీసీ-వెరి: కిల్, కిలి; గవర్-బతి: గిల, గిలె; జెబాకీ: గన్.

(3) (i) ద్రావిడభాషలు: తమిళము: అర్, ఆర్, ఓర్, అవర్; కోరవ: అర్, అరు, మార్, మారు;-కన్నడము: అర్, ఆర్, ఇర్, ఈర్; గోండీ: రు; కూఇ: రు; తెలుఁగు: రు, ఋ; మళయాళము: అర్, ఆర్, మార్, అన్మార్, అవర్; సంబల్‌పురపుకురుఖు: ఆర్, ఈర్, ఓర్; మాల్తో: ర్; పర్జీ: ఏర్; కోలమి: ఉర్, ర్; నాయికీ: కోర్.

(ii) ఆర్యభాషలు: బంగాళీ: ఏరా; రాజ్‌బంగ్‌సీ: రా*, ఘుర్: తూర్పు-సిల్హెటు తూర్పుభాగము: రా; గిల్గితీ: రె, అరె; గురేజీ: ఆర్; కనౌజీ: హ్వార్, హ్వారు; మాల్వీ: హరోర్; ఖాస్ - కురా: హరు, హెరు; రాజస్థానీ: హరోర్, హరోరో, హరోనో; ఛట్టీస్‌గటీ = హర్.

V. సంపుటము, భాగము I.

బంగాళీభాష (పుట 34).

మనుష్యులపేళ్లకు మాత్రము ప్రథమా బహువచనమున '-ఏరా' అను ప్రత్యయము చేరును: సంతాన్, సంతానే = బాలుఁడు; బహు. సంతానేరా;-ఇతరజీవులపేళ్లకు బహుత్వబోధకమగు నొకపదము చేరును: కుక్కుర్ - సకల్ = కుక్కలు. జడవాచకములకును బహువచన మిట్లే కలుగును: గాచ్ఛ్-సకల్ = చెట్లు.

మాన్‌భూమ్‌లోని 'ఖటియా - ఠార్' భాష (పుట. 91.)

ఏకవచనరూపమే బహువచనమున వాడఁబడును; కావలసినచో బంగాళీ భాషయందలి బహువచన ప్రత్యయముల నుపయోగింతురు.

రాజ్ బంగ్సీ భాష (పుట 164)

రా, లేక, గులా అనునవి సామాన్య బహువచన ప్రత్యయములు: బాలక్ - రా, బాలక్ - గులా = బాలకులు; 'గిలా' ను కూడ బహువచన ప్రత్యయముగ వాడవచ్చును. ఈ పదము లొకప్పుడు ప్రాతిపదికమునకుఁగాక షష్ఠ్యేకవచన రూపమునకుఁ జేర్పఁబడును: ఉదా. సాతేర్ - గులా = సహవాసులు; 'గులా' కు మాఱుగ 'ఘర్' అనియు వాడవచ్చును: చాకరేర్ - ఘర్ = చాకర్లు, సేవకులు; బంధుర్ - ఘర్ = బందుగులు; సఖర్ - ఘర్ = స్నేహితులు. కొన్ని ప్రదేశములందు - 'లా' అను బహువచన ప్రత్యయమును జేరును: హి-లా; ఇ-లా=ఇవి; ఐ-లా=అవి; జేయ్ - లా = ఏవి; చాక్రియా - లా = చాకరులు, సేవకులు; కస్బీ-లా = లంజలు.

మిమెన్‌సింగులోని హైజోంగుభాషలో (పుట 214) సాధారణముగ బహువచనమున 'గిలా' అనునది చేరును.

తూర్పు సిల్హెటులోని తూర్పుభాగమున (పుట 225) మానవులను దెలుపు పదములకు బహుత్వమున - 'రా' చేరును: మానుష్, మానుషే; బహు. మానుష్-రా. ఒకప్పుడు బహువచనమున - ఆఇన్ అనునదియుఁ జేరును: ఘరాఇన్ = ఇండ్లు; గాసాఇన్ = చెట్లు.

సిల్హెట్‌లోని యాగ్నేయ భాగమందలి భాష (పుట 293) కొన్ని బహువచనములు 'హాల' ప్రత్యయము చేరి కలుగును: చాయర్ - హాల - రే = చాకరులకు. కొన్ని నామవాచకములకు బహువచనమున - గున్, లేక, ఉన్ ప్రత్యయముచేరును; కుడర్-గున్ = కుక్కలు, ఘోటా - ఉన్ = గుఱ్ఱములు. సాధారణముగ - 'రా' అను నదియే బహువచన ప్రత్యయము.

అస్సామీ భాష.

ప్రామాణికమైన అస్సామీ (పుట 402)

ప్రథమైకవచన రూపములకు '-బిలాక్,' '-బోర్,' లేక '-హఁత్' అను ప్రత్యయముఁ జేర్చుటవలనఁ బ్రథమా బహువచనరూప మేర్పడును. ఇట్లు చేరినపిదప 'మానుహ్ = మనుష్యుఁడు' అను పదమునకుఁ జేరినట్లే విభక్తి ప్రత్యయములు చేరును.

పడుమటి అస్సామీ (పుట 414)

- హేఁత్, అనునవి బహువచన ప్రత్యయములు. 'సాకార్-
కరులకు, అనురూపమున రాజబంగ్సీ బహువచన ప్రత్యయ
కనఁబడుచున్నది.

### మయాంగ్ (పుట 421)

సకలశబ్ద పర్యాయములగు - 'హాబీ,' - 'లోకెయ్' అనుపదములను జేర్చుటవలన బహువచనము కలుగును. ప్రకరణమునుబట్టి వచనము స్పష్టము కానప్పుడే బహువచన ప్రత్యయము చేరును. 'జెలా' కు 'జెలెయ్' బహువచనమయినట్లే, 'లోక్' అనుదానికి 'లోకెయ్' అనునదియు బహువచన రూపమైనట్లు తోఁచుచున్నది.

### సంపుటము V-భాగము II.

### బిహారీ భాష.

### మైథిలీ (పుట 26)

సముదాయ వాచకములగు - సభ్, - సబహీ, - లోక అనుపదములఁ జేర్చుట వలన బహువచన మేర్పడును. నేనా = బాలుఁడు; బహు. నేనా - సభ్; నేనా-సబహి; నేనా - లోకని = బాలురు.

### మగహీ (పుట 38)

పదముతుది దీర్ఘాచ్చు హ్రస్వమయి, దానిపై 'న్' చేరుటవలన బహువచన మేర్పడును. ఘూరా = గుఱ్ఱము; బహు. ఘూరన్; ఘర్ = ఇల్లు; బహు. ఘరన్. - సబ్,-లోగ్, అను సముదాయవాచకపదములను జేర్చుట వలనఁ గూడ బహువచన మేర్పడును: ఘోరా-సబ్ = గుఱ్ఱములు; రాజా - లోగ్ = రాజులు.

### భోజ్‌పురీ (పుట 50)

పదము తుది దీర్ఘాచ్చును హ్రస్వముచేసి - ని, - న్హి, - న్, లను చేర్చుటవలన బహువచనమేర్పడును: ఘోటా = గుఱ్ఱము; బహు. ఘోటని, ఘోటన్హి, ఘోటన్; ఘర్ = ఇల్లు; బహు. ఘరని, ఘరన్హి, ఘరన్. సబ్, లోగ్, మొదలగు సముదాయవాచకపదములఁ జేర్చియు బహువచనమును జెప్పవచ్చును: ఘోటా - సబ్; రాజా - లోగ్.

### కుట్మాలి-ఠర్ (పుట 147)

బహువచనరూపమునకును నేకవచనరూపమునకును భేదము లేదు. కాని, మానవవాచకపదములకు బహువచనమున - 'గులా' చేరును: మునిస్-గులా-కే = సేవకులకు; బాబు-గులా-క్ = బాబులకు.

### పడుమటి భోజ్‌పురీ (పుట 249)

ఏక బహువచనరూపములకు భేదములేదు.—అన్ అను బహువచన ప్రత్యయ మరుదుగ వాడుకయందున్నది.

నాగ్పురియా (పుట 280)

'మన్' అను బహువచనప్రత్యయ మీ భాషలోనికి ఛటీస్గఢీ భాష నుండి వచ్చినది. ఇదియైనను ప్రాణివాచకపదములకే చేరుచుండును.

ఒటియా.

ప్రామాణికభాష (పుట 380)

(1) మహన్మహతీవాచకములు, స్థలములు:—మానే; ఉదా. పురుషమానే; వ్యవహారమున 'పురుషే'. - 'మానే' కు మాఱుగ - 'దల, - లోక' మొదలగు సముదాయవాచకపదములను వాడవచ్చును. ఇవి చేరునప్పుడు ఏకవచనమునందువలెనే బహువచనమునందు విభక్తిప్రత్యయములు చేరును.

(2) తిర్యగ్జడవాచకములు:— -సబు, - సకల, మొదలగు సముదాయవాచకములఁ జేర్చుటవలన బహువచన మేర్పడును.—మానప్రత్యయము చేరినచో నది -'మాన' అని నిలుచును గాని - మానే యని కాదు.

సంపుటము VI.

తూర్పు హిందీ.

ప్రామాణికభాష.

(1) వే, వనె, వన్; (2) నె, అన్; (3) ఇన్.

బఘేలీ.

ఏ̆, ఐ̆.

ఛ త్తీస్ఘఢీ.

మన్ (తఱుచుగ దీనిని చేర్చకుండుటయుఁ గలదు), సబ్, సభో, సబ్బో, జేమా, జేమ్మా, అనువానిని పదములకుఁ బూర్వమునఁ జేర్చియు బహువచనము చెప్పవచ్చును. వీనిని జేర్చునప్పుడు - మన్ ప్రత్యయమును చేర్చినఁ జేర్పవచ్చును.

సంపుటము VII.

మరాఠీ.

ప్రామాణికభాష.

(1) 'ఆ'కారాంత పుంలింగపదములకు బహువచనము 'ఆ'కు మాఱుగ 'ఏ' చేర్చుటవలనఁ గలుగును: ఘోడా, ఘోడే. తక్కిన పుంలింగశబ్దములకు బహువచన మేకవచనరూపమే.

(2) (i) చాల స్త్రీలింగశబ్దములకు 'ఆ' చేర్చుటవలన బహువచన మేర్పడును:—జీభ్ = నాలుక; జీభా = నాలుకలు.

(ii) ఊ కారాంతములగు కొన్ని స్త్రీలింగశబ్దములకు బహువచనమున మార్పు గలుగదు: దారూ = సారాయి, సారాయులు.

(3) 'ఏ' అంతమందుగల నపుంసకలింగశబ్దములకు బహువచనమున తుది 'ఏ' కారము 'ఈ' గా మాఱును: తాళేఁ = చెఱువు; తాళీఁ = చెఱువులు. తక్కిన నపుంసకలింగపదముల కన్నిటికి బహువచనమున 'ఏ' వచ్చును: ఘర్ = ఇల్లు; ఘరేఁ = ఇండ్లు; మోతీఁ = ముత్యము; మోత్యేఁ = ముత్యములు.

(4) ఇ దుదంతశబ్దములకు బహువచనమున మార్పు గలుగదు: కవి = కవి, కవులు; ధేను = ఆవు, ఆవులు.

కొంకణీ.

ఈ భాషయందు నామవాచకముల బహువచనము ప్రామాణిక మరాఠీభాషయందువలెనే కలుగును; కాని స్త్రీలింగ బహువచన ప్రత్యయములు 'ఓ, ఈ, ఒ' లును, బలహీన ప్రాతిపదికముల నపుంసకలింగ బహువచన ప్రత్యయము ఆఁ యును నగును. రాణ్యో=రాణులు, ఫుర్నాఁ=పండ్లు. ఇతర బహువచన ప్రత్యయములు.

| ప్రథమ ఏక. | ప్రథమ బహు. |
| --- | --- |
| పుం. ఉ: పుతు = కొడుకు | అ: పుత = కొడుకులు. |
| స్త్రీ. అ: ధువ = కూఁతురు | ఒ: ధువొ = కూఁతులు. |
| ఇ: పొరి = కూఁతురు | ఈ: పోరీ = కూఁతులు. |
| నపుం. అ: చిత్తల = జింక | అఁ: చిత్తలఁ = జింకలు. |

హలబీ.

ఛత్తిస్‌ఘుటీలో వలె నిందు బహువచనము - మన్ చేర్చుటవలనఁ గలుగును: బాబా - మన్ = తండ్రులు; సాధారణముగ బహువచన ప్రత్యయము చేరదు; లేదా, సముదాయవాచకపద మొకటి చేరుచుండును: హున్= వాఁడు; హున్ - మన్ = వారు; నౌకర్-సభో-కే = నౌకరులకు; ఖుబే - ఘోడా, లేక జుగే - ఘోడా = గుఱ్ఱములు.

## సంపుటము VIII-భాగము I.

### సింధీ.

ఏకవచనరూపమే బహువచనముగ నుండును. ఒకప్పుడు దానికి ఉఁ
చేరును; ఒకప్పుడు ఏకవచనము తుదిని 'అ' అను నస్పష్టాచ్చు చేరి బహు
త్వము తెలుపఁబడును.

### లహండా.

ఌని ప్రామాణికభాషలో నాలు విధములుగ బహువచన మేర్పడు
చున్నది. ఈ యుదాహరణముల వలన నీ విషయము బోధపడును.

(1) ఘోటా - ఘోటే; (2) కుక్కుర్ - కుక్కుర్; (3) ఘర్ - ఘర్;
(4) గల్ల్ = మాట - గల్లాఁ; (5) అఖ్ - అఖీఁ; (6) హాఇన్ - హాఇఆఁ.

## సంపుటము VIII-భాగము II.

### దర్దికు లేక పిశాచభాషలు.

### బష్గలీ.

ఈ క్రింది యుదాహరణమువలన నిందలి బహువచన విధానము బోధ
డఁగలదు :

| ఏక. | బహు. |
|---|---|
| i. తోత్త్ = తండ్రి | తోత్త్; తోత్త్ - కిలె = తండ్రులు. |
| ii. మఙ్చ్ = మనుష్యుఁడు | మఙ్చ్ఆన్ = మనుష్యులు. |
| iii. అఝొ = ఎద్దు | అఁఝొ = ఎడ్లు. |
| iv. గఓ - ఆవు | గోఁ (ఆవులు) |
| v. కుటి = కుక్క | కుఁటి = కుక్కలు |
| vi. రక్యాస్ = జింక | రక్యాసోఁ = జింకలు. |

### వై-అలా.

ప్రకరణమునుబట్టి స్పష్టపడనప్పుడు తప్ప సాధారణముగ బహువచన
ఎన నేకవచనరూపమే యుండును. బహువచనమును ప్రత్యేకముగఁ దెలుప
ఎసినప్పుడు సముదాయవాచకపద మొకటి చేరును:— మనష్=మనుష్యుఁడు;
నష్ - కెలె = మనుష్యులు; త్రఁ = ఎద్దు; ఎచ్చు-త్రఁ = ఎడ్లు; తత-తతె-
లె; గుట్ - గుటె.

సంపుటము IX - భాగము II.

బ్రజ్; బుందేలీ, మేవాటీ, మాల్వీ, జయపురీ, మత్వాటీ, భాష యందు బలహీన పుంలింగశబ్దములకు బహువచన ప్రత్యయము చేరదు. మాల్వీభాషలో - 'హాఁర్' అను ప్రత్యయము చేరును.

సంపుటము IX-భాగము II.

పహాటీ, గుజురీ భాషలు.

ఖాస్ - కురా

- హరు ప్రత్యయముఁ జేర్చుటవలన బహువచన మేర్పడును. ఒక ప్పుడు - హెరు కూడఁ జేరును: ఉదా. చాకర్ - హరు; కేటా - హరు మొదలయినవి. ఈ ప్రత్యయము తిర్యగ్జడ వాచకములకుఁ జేరదు. చూ. మాల్వీ - రాజస్థానీ: - హాఁర్,-హాఁరాఁ,-హాఁనాఁ; కనౌజీ: హ్వార్; హ్వాం; ఛటీస్‌గటీ: - హర్.

సంపుటము X.

ఐరేనియన్ భాషలు.

పష్తోభాషలోఁ గొన్ని శబ్దముల బహువచన మేకవచన రూపముగనే యుండును. ఓర్ముటీ భాషలోఁ గొన్నిశబ్దములకు - అన్నీ, - గన్నీ ప్రత్యయ ములుచేరి బహువచన మేర్పడును: హాతీ = ఏనుఁగ; హత్యన్నీ = ఏనుఁగలు; మాహీ=చేఁప; మాహీ-గన్నీ = చేఁపలు. జేబాకీ, సంగ్లీచీ, లేక ఇష్కాష్మీ భాషలో నొకప్పుడు - గన్ చేరి బహువచన మేర్పడును.

ద్రావిడభాషలలో బహువచన ప్రత్యయములు.

ఇఁక ద్రావిడభాషలలో బహువచన విధానమును వివరింతము.

(1)కొన్ని ద్రావిడభాషలలో తిర్యగ్జడ వాచకములకే బహువచన రూపములందు భేదములేదు.

(2)ఆ యా భాషల యందు చేరు బహువచన ప్రత్యయములు:

(i) తమిళము: అ, అర్, గళ్; వ్యవహారముగ: గ, ఆళ్, ఆ ఆంగ్; మ్.

కొరవ : అర్, అరు, మార్, మారు, గ, గళు, ంగ.

కైకాడి : గా, ఆంగ్.

బుర్గండి : ఆంగ్.

(ii) కన్నడము : గళు; వ్యవహారము: గోళ్, గోడ్; ల్, లా; ఆర్, ఇర్, ఈర్; మ్.

బిజాపురీ : గోళ్.

గోలరీ : గోడ్.

సేటనీ : గోట్.

కురుమ్వారీ : గాండ్లు.

బడగ : కళు.

(iii) గోండీ : క, ఙ్గ్, స్క, రు.

(iv) కూఇ : రు, వి, గా, ంగా, స్కా.

(v) తెలుఁగు : లు, రు, కులు; ము, ఉ.

(vi) బ్రాహుఇ : ఆక్, ఇక్.

(vii) మళయాళము: గళ్, క్కళ్; అర్, మార్, అన్మార్, అవ ఆర్గళ్; అ.

(viii) కురుఖు ; ఆర్, గుఠ్.

(సంబల్పురమున) : ఆర్, ఈర్, ఓర్.

(ix) మాల్తో : ర్.

పర్జి : ఏర్, ల్, కుల్.

కొలమి : ఉల్, కోల్, ఉర్, ర్.

బసీమునందలి భిలీభాష : ళ్, కుళ్.

నాయికీ : కోర్, ల్.

పై ప్రత్యయములకును నేటి యార్యభాషలలోని ప్రత్యయములకును బహువచనమునఁ గల పోలిక లీక్రింద వర్గీకరింపఁబడినవి.

(4) (i) ద్రావిడభాషలు: తమిళము: ఆళ్, కన్నడము: వ్యవహారము-లా, తెలుఁగు: లు: పర్జి: ల్, కొలమి: ఉల్; భిలీ: ళ్; నాయికీ: ల్.

(ii) అర్యభాషలు: సిస్లైటు ఆగ్నేయభాగము: హాల; పషాయి: లాన్; ; ల; ఏలా; లా, కోహిస్థానీ: ఆల్.

(5) (i) ద్రావిడభాషలు: తమిళము, మళయాళము, తుళు, కన్న తెలుఁగు: మ్, ము (సర్వనామములందు) కొరవ: మార్, మారు; ళము: మార్, అన్మార్.

(ii) ఆర్యభాషలు: ఒటెయా: మానే, మాన; ప్రామాణిక ప్రాచ్య బీ: వె, వనె, వన్; హాలబీ: మన్; సింధీ: ఊఁ; నాగపురియా: మన్; చట్టిస్ మన్.

(6) (i) ద్రావిడభాషలు: తమిళ మళయాళములు: అ.

(ii) ఆర్యభాషలు: పడుమటి భోజ్‌పురీ: అన్; ప్రామాణిక మరాఠీ. ఆ; కొంకణీ: ఓ, ఒ; లహండా: ఆ; వసీ-వెరి: ఒ; ఖోవారు: అ, ఆన్, ఎన్.

పై వివరణము వలన ద్రావిడార్యభాషలకు బహువచనమునఁ గల సన్నిహిత సంబంధము స్పష్టపడఁ గలదు. ద్రావిడభాషలనుండి యార్యభాషలు భారతవర్షమం దంతటను నీ ప్రత్యయముల నెరవు తెచ్చికొన్నవని కొందఱనవచ్చును. అయినను గావచ్చును; ఆర్యభాషలింకను ద్రావిడభాషల కెట్లు సంబంధించియున్నవో చూచి యీ యెరవువాదమును గూర్చి యాలోచింతము.

ద్రావిడభాషలలోని బహువచన ప్రత్యయముల యుత్పత్తి.

ప్రాచీన ఇండో-ఆర్యభాషలలోని ద్వివచనము మధ్యఇండో - ఆర్య యుగమునాఁటి కంతరించినది. ప్రాకృతములలో ద్వివచనములేదు. తరువాతి కాలమున నేకబహువచనముల భేదముగూడఁ గొన్ని యార్యభాషలలో లోపించినది; కొన్నిటిలో మిగిలినది. ప్రాచీన బహువచన ప్రత్యయము లందలి తుదియచ్చులు లోపించుటచే నేకబహువచన రూపములకు గొన్ని భాషలయందు భేదములేకుండఁ బోయినది. ఇట్లు బహువచన ప్రత్యయములోపించుట తృతీయయందును షష్ఠియందును దప్ప తక్కిన యన్నివిభక్తులందును గలిగినది. వికారమునొందిన తృతీయా బహువచన ప్రత్యయమును, షష్ఠీ బహువచన ప్రత్యయమును సామాన్య బహువచన ప్రత్యయముగ నాయా భాషలయందు సంక్రమించినది. 'భిస్' ప్రత్యయ ప్రాకృత రూపమగు అహి, ఏహి, హి, అనునవి బంగాళీ, ఒటియా, బిహారీ, మున్నగు భాషలయందు అఇ, లుగామాఱి, ప్రథమా బహువచన ప్రత్యయముగాఁ గూడఁ గాన్పించుచున్నది. ఉదా. బం. లోకే; సబే మొదలయినవి.

'ఆనామ్' అను షష్ఠీబహువచనప్రత్యయము ఇతర విభక్తుల బహువచన ప్రత్యయముగాఁ జేరుట బంగాళీ మున్నగు భాషలలో స్పష్టముగఁ గానఁనగును. ఈ 'ఆనామ్' అను ప్రత్యయము 'ఆన్, అన్, ఆణ్, అణ్, ఆళ్' లుగా మాఱి దేశవాచకముగా భారతవర్షమున ననేక ప్రాంతములను దెలుపుచున్నది. 'భోటాన్' = భోటానామ్ (దేశః); కోల్హాన్ = కోల్హా (కోలుజాతి) నామ్ (దేశః); మళయాళమ్ = మలయా (పర్వత దేశ) నాం (దేశః); కొంకణము = కొంగా (కొంగుదేశమువారు) నాం (దేశః); తెలింగా (తెలుఁగువారి) ణామ్ (దేశః) మొదలయినవి. మళయాళ శబ్దవ్యుత్పత్తిని జెప్పుచు కాల్డువెల్లు - ఆళ ప్రత్యయము 'ఆళ్ = ఏలు' అను ధాతువునుండి పుట్టినదని చెప్పుట సరికానట్లు తోఁచుచున్నది.

'అహి = అఇ = ఏ' యను తృతీయా బహువచనప్రత్యయమును, ...నామ్ = ఆన్, ఆణ్, ఆళ్, అన్, అళ్' అను షష్ఠీబహువచనప్రత్యయ ...ను సర్వవిభక్తి సామాన్యప్రత్యయముగ నేర్పడని సందర్భములందన్ని ...ధునికార్యభాషలయందును సముదాయవాచక శబ్దములను జేర్చి బహు ...చనములను జెప్పికొనుట పరిపాటి యైనది. ఇట్టి సంప్రదాయము ప్రాకృత ...నందే పొడచూపినది. బహువచన ప్రత్యయములుగ నార్యభాషలందు గల ...ముదాయవాచకములలో 'జన = జన్; గణ = గణ్; గళ్; మన, మాన = ...నుష్య; అనేక=అనేఅ, అనే, నే; సకల=సకల్, సఏల; లోక = లోఅ;సర్వ = ...భ, సబ, సబ్; సమస్త, సమ్హ; కుల=కుల్, గుల, గుల్' అనునవి ముఖ్యము ...నవి. వీనికిని నాయా ద్రావిడభాషా బహువచనప్రత్యయములకును గల ...ంబంధము సులభముగ బోధపడఁ గలదు. గణ = గణ్ = గళ్; మన = మ్, ..., ము; లోక = లోఅ = లు; కుల = గుల, కుల్, గుల్, మున్నగు వ్యుత్ప ...లు స్పష్టముగనే యున్నవి. కాని, ద్రావిడభాషల కార్యభాషా సంబంధము ...ల్లని కాల్డువెల్లు, సునీత్ కుమార్ ఛాటర్జీ ప్రభృతు లీ సంబంధము నేర్పఱు ...ట భ్రమజనితమని యందురు; ఎందుకో తెలియదు; తాము ను ద్రావిడ ...షా బహువచనప్రత్యయములకుఁ దగిన వ్యుత్పత్తిని చెప్పఁజాలరు.

స్వామినాథ అయ్యరుగారు 'కళ్' ప్రత్యయమును 'క+ళ్' గా విభ ...ంచి 'క'-వర్ణము స్వార్థిక క-ప్రత్యయముగ నిర్వచించిరి. అయినను గావ ...ను. అప్పుడు 'లు, ళ్' ప్రత్యయముల వ్యుత్పత్తిని జెప్పవలెను. ఈ 'ల్' ...అనునవి ఇండో - జెర్మానిక్ ప్రథమా విభక్తిక 'న్త' (చూ. భరన్త మొద ...యినవి) నుండి కలిగినదని అయ్యరుగా రనిరి. మహతీ ప్రత్యయమగు 'ల్, ...' లు గూడ 'న్త' భవములనియే వారు నిర్వచించిరి. ఇట్లనుటకంటె నితర ...ర్యభాషా బహువచనరూపములందలి 'ల' కారమునకువలె దీనికిని 'లోక' ...బ్దమునుండి వ్యుత్పత్తిని గల్పించుట సమంజసము.

మహన్మహతీప్రత్యయమగు 'ర్, రు, ఱు' అనువానికి సరిపోవు రేఫ ...క్త బహువచనప్రత్యయము లనేకములగు నిండో-ఆర్యభాషలయందున్న ...ంతకుముందే తెలుపఁబడినది. ఈ బహువచనరేఫము నుత్పత్తినిగూర్చి ...చారింపవలసియున్నది. బంగాళీభాషలో సర్వసాధారణమగు ప్రథమా ...వచనప్రత్యయములు, '- రా,' '- ఏరా,' అనునవి. ఇవి ద్రావిడభాషల ...దువలె మనుష్యులపేళ్లకు మాత్రము చేరును: ఇట్లే, రాజ్ - బంగ్సీ, ...ప్ప-సిక్హైట్ భాషయందును గానవచ్చుచున్నది. దర్దికు (పిశాచ) భాష ...గు 'షీనా' లో - 'రె', - 'ఆరె' అనునవి బహువచనప్రత్యయములు, ...రేజీభాషలో - 'ఆర్', కనౌజీ భాషలో - హ్వార్, హ్వారు, అను ప్రత్యయ

ములు బహువచనబోధకము లగుచున్నవి. బ్రజ్, బుందేలీ, మేవాటీ, మాల్వీ, జయపురీ, మార్వాటీ, భాషలలో - 'హూర్' అను బహువచన ప్రత్యయము గలదు. ఖాస్ - కురా భాషయందు 'హీరు', 'హేరు' అనునవి గలవు. ఈ భాషలన్నియు నార్యభాషలే. ద్రావిడభాషా ప్రత్యయమగు '-రు' వర్ణ మిన్నిభాషలయందును జొరఁబడినదని చెప్పుటకంటె, నాయా యార్యభాషలయందువలె నిందును నున్నదనియు, ద్రావిడభాషలును నీ విషయమునఁగూడ నార్యభాషాలక్షణమును గలిగియున్నవనియు, నా భాషలలో నా ప్రత్యయమెట్లు కలిగెనో ద్రావిడభాషలయందును నట్లే కలిగినదనియుఁ జెప్పుట యుక్తముగదా.

బంగాలీభాషలోని యీ -రా,-ఏరా, అను బహువచనప్రత్యయములఁ గూర్చి ఛాటర్జీగా రిట్లు చెప్పుచున్నారు. ఈ ప్రత్యయములు షష్ఠీ బహువచనములు. తొలుత వీని తరువాత సముదాయవాచకములగు 'సబ్', 'సకల్' మొదలగు పదములుచేరి, ప్రథమా రూపము లేర్పడుచుండెను. రానురా నా సముదాయవాచకశబ్దముల యావశ్యకత తగ్గిపోయి - రా, - ఏరా, ప్రత్యయము లంతమందుగల రూపములు ప్రథమా బహువచనరూపములుగ నిలిచినవి. రేఫమంతమందుగల సర్వనామ బహువచనరూపములు నిట్లే కలిగినవి. తొలుత 'అమ్హారా - (అమారా-, అమరా) సాబొ = మేము (కన్న. ఆమ్); తోమ్హారా - (తోమారా-, తోమరా-) సాబొ = తమరు = మీరు; అను మొదలగు రూపములుండి 'ఆమరా, తోమరా' మొదలగు షష్ఠీ బహువచన రూపములే ప్రథమా బహువచనరూపములుగ భాషయందు నిలిచినవి. ఇట్లే ఏ-రా, ఏరా సబ్ = వీరు, వీరందఱు; తా-రా = వారు, తారు, అను రూపములును గలిగినవి. ద్రావిడభాషలయందలి బహువచన - రువర్ణమును నిట్లే కలిగియుండవచ్చును.

## తెనుఁగున బహువచనము.

### తత్సమపదముల బహువచనము.

తత్సమాచ్ఛికపదము లన్నిటిమీఁదను దెనుఁగున - లువర్ణము బహువచనమున సాధారణముగఁ జేరుచుండును. తత్సమశబ్దములలో నది మహద్వాచకమగు డుజ్ ప్రత్యయస్థానమున వచ్చును. డుమంతములు కాని శబ్దములపై నది యాగమముగానే చేరును. ము, వు, వర్ణకము లంతమందుగల శబ్దములకు - ము, వు వర్ణకేతరవిభక్తులు పరంబగునపుడు ప్రథమైకవచనేతర విభక్తులందు డుజ్వర్ణకము లోపించినట్లే యీ ము, వు వర్ణకములును లోపించుననియు, కాని యవి మఱల నాగమరూపమునఁ జేరుచుండుననియు

౦, వు, వర్ణకములకు వర్తించు వ్యాకరణవిధు లాగమ ము-, -వు, వర్ణక
ములకును వర్తించుననియు వైయాకరణులు చెప్పుచున్నారు. ఇట్లు చెప్పుట
స్త్రార్థముగాని వాస్తవికముకాదు. ము, వు, వర్ణకములు నిజముగ లోపింపను
లేదు; మఱల నవి యాగమాక్షరములుగఁ జేరను లేదు. తత్సమ ము - వర్ణ
ంతశబ్దముల మువర్ణక మెన్నడును లోపింపదు; కాని, తత్సమ వు-వర్ణకము
థమైకవచనేతర విభక్తులందు బహుళముగ లోపించుట గలదు; ఉదా:
ములు, రథములు, వనములు; రాహువులు, రాహులు; సానువులు,
నులు; తరువులు, తరులు; కృకవాకువులు, కృకవాకులు;- మధువులు, వధు
వులు, క్రతువులు మొదలయినవి. (మధులు, వధులు, క్రతులు మొదలగు
హువచనరూపములు గానరావు.) బహువచన లు, ల-వర్ణకములును, ప్రత్య
ాగమరూపమగు నకారమును పరమగునపుడు ప్రథమైకవచనమందు
ర్ణకముగాను, వైయాకరణుల ప్రకార మాగమముగాను వచ్చిన 'ము' వర్ణ
నకు లోపమును దత్పూర్వస్వరమునకు దీర్ఘమును గలుగుచుండును. లోక
వహారమున నీ కార్యము నిత్యము; గ్రంథములందలి యీ కార్యమును
ర్చి చిన్నయసూరి వైకల్పికత్వమును దెలుపుచు 'ఒకానొకచో' నట్లగునని
సూత్రమునందు చేర్చి తత్సూత్రవివరణమున 'ఒకానొకచోట' ననుటచేత
కార్యంబునకుం బ్రయోగవైరళ్యంబు సూచింపఁబడియె' నని వ్రాసెను.
వివరణము నాధారముగాఁ జేసికొని యనేకులు నేఁడిట్టిరూపము లసాధువు
నుకొని వానిని వ్రాతలయందు నిషేధించుచున్నారు. ఆంధ్రశబ్దచింతా
ణిలో "వికృతౌ క్వచి చ్చ లోపో మో దీర్ఘ శ్చాత ఆదిమస్య భవేత్" అను
త్రమున ములోప తత్పూర్వస్వరదీర్ఘకార్యములు వికృతిశబ్దములయందు
గునని చెప్పఁబడినది. దీని నాధారముగఁ జేసికొని "'సంస్కృతపదంబు
తులఁ దత్సమము సేయునపుడు ముత్వమయిన దీర్ఘమయినఁ జెల్లు' నిత్యా
ధునికానాం లక్షణ మతీవ దూషణగ్రస్త మితి స్పష్టమేవ" అని యహో
ఁడు చెప్పినాఁడు. కాని, వెంటనే 'మానుగ ధృతరాష్ట్రుఁడు ప్రాణానం
గంగ' అను తిక్కన ప్రయోగము స్మరణకు రాఁగా, 'ప్రాణానన్' అను
పమునకు సాధుత్వముఁ గల్పింపనెంచి 'ఉతామత్ర (పాఠాంతరము:
బుద్ధౌ) భవే ద్వా వు రస్త్రియాం ల్వాదివర్ణకే, ప్రాయశో వైకృతపదే
దీర్ఘశ్చ మోర్మతః" అను నథర్వణకారికయందు ప్రాయికముగా
ృతపదములందు మువర్ణలోపమును బూర్వస్వరమునకు దీర్ఘమును గలుగు
ప్రాయోగ్రహణముచేఁ దిక్కనప్రయోగము సాధు వగుచున్నదని
నుమన్నాఁడు. ఈ సమాధానము తత్సమశబ్దములవిషయమున నెట్లు
గునో తెలియదు. 'ప్రాయికముగా వైకృతపదములం దీకార్యము కలుగు'

ననుటచే వైకృతపదములం దీకార్య మొకప్పుడు కలుగునని యే యర్థమగును గాని తత్సమపదములందు కలుగునని బోధపడదు. కావున నాంధ్రశబ్దచింతామణ్యాధర్వణకారికల మతమున ములోప, తత్పూర్వస్వరదీర్ఘములు వికృతి పదములకే చెల్లుననుట నిశ్చయమగుచున్నది. నన్నయ భారతభాగవతమున తత్సమ పదములందుగాని, వైకృతపదములందుగాని యిట్టి మార్పుకలుగుట కుదాహరణములు కానరావు; కాని, నాఁటిశాసనములలోఁ నిట్టిరూపములు కాన్పించుచునే యున్నవి. తత్సమములందు: దీపానకు (ద. ఇం. శా. IV. 939; 1000; V. 1005); వైకృతములందు: మిరియాలు (ద. ఇం. శా. V. 65, 66); గుండానకు (ద. ఇం. శా. V. 1114); కుంచాలు (ద. ఇం. శా. IV. 1064; V. 68.) అహోబలు ననుసరించి కావలయుఁ జిన్నయసూరి తన సూత్రమును దత్సమపరిచ్ఛేదమునఁ జేర్చి 'ప్రాయశః' అనుపదమును 'ఒకానొకచో' నని యాంధ్రీకరించినాఁడు. కాని, యాతఁ డనుకొని నట్లీకార్యమునకు వైరళ్యము లేదు. లోకమున '-ములు' అంతమందుగల బహువచన రూపములు లేనేలేవని చెప్పవచ్చును. గ్రంథములందును ములోప తత్పూర్వస్వరదీర్ఘములు గల బహువచనరూపము లనేకములు ప్రయోగింపఁ బడి యున్నవి. కాని యీ రూపము లసాధువులను నభిప్రాయమాధునికలాక్షణికుల కందఱకును విడువకున్నది. కూచిమంచి తిమ్మకవివంటి యుదారలాక్షణికుఁడుఁ గూడ నిట్టిరూపములు గ్రామ్యములనియే తలంచినాఁడు. అతఁడు తన సర్వలక్షణ సారసంగ్రహమున (విభక్తిప్రకరణము, 14), 'వనము, కాలము, ప్రాణము, ధనము, డెంద, మన ముకారాంతములకు నా లెనయు నొక్కతతిని మూలోప్యయి దీర్ఘముల్ దాపలి దెసవర్ణములకు విభక్తులువచ్చు నభవ' యని వ్రాసినను, గ్రామ్యత్వమును నిర్ణయించుపట్టున, 'తగిలివర్ణంబు లెక్కువ తక్కువలుగ నియమమెడలించి పల్కునవియె తలంప గ్రామ్యమగు చుండెఁ బరులఁ దెగడెడుచోట్లఁ జెప్పఁదగునవి కలధౌతశిఖరిసదన'; ప్రాకటముగఁ గృతులనాకడ నీకడయనుచుఁ బలుకుచోట నాడ నీడ యనిన వర్ణలోపమగు ఫలములకు 'ఫలాలనంగ హెచ్చు నీలకంఠ' అని వ్రాయుటచే ఫలాలను రూపము గ్రామ్యమనియే యాతఁడు తలంచినాఁడు. ఇట్లే యిప్పటి పండితులును దలంచుచున్నారు. ఇట్టి ప్రయోగములకు గ్రంథములనుండి కొన్ని యుదాహరణములు:

తల్లీ! యిన్నిదినాలకేనియు సుధాధారారసస్యందియై యుల్లంబున్ సుఖియింపఁజేయు పలు కట్లోవింటి (భీమ. II. 120); రసాలాలు (చంద్రరే. I. 12); కొన్నిదినాల బుణాను బంధముల్ (రాధామా. III. పు. 44); తోరణాలమేల్కట్లు (రాధామా. III. పు. 59); దినాలలో (రాధామా. III. పు. 69); దైవాలఁ బ్రార్థించి (తొండమాన్. ఆం. సా. పరి. ప. 1913, పు. 315); మొదలయినవి.

డు మంతశబ్దముల ప్రథమైకవచన డుజ్వర్ణమునకు బహువచనమున
పముగలిగి దానిస్థానమున బహువచనమున లువర్ణము చేరును. ఉదా:
రుషుఁడు, పురుషులు; బ్రాహ్మఁడు, బ్రాహ్మలు (ద. ఇం. శా. VI. 1096);
త్రేయ గోత్రుఁడు, ఆత్రేయ గోత్రులు; - 'గోత్రులు' అని కూడఁ
లదు. (ఆత్రేయ గోత్రుల్లైన - ద. ఇం. శా. VI. 982.) ఇట్లే, వ్యవహార
మున 'రాముళ్లు, భీముళ్లు' మొదలయిన బహువచనరూపములు కానవచ్చు
న్నవి. కాని, 'అదంతమయి దీర్ఘపూర్వలోపధంబయిన మహద్వాచక
త్సమ పదములందు విభక్తి లకారమునకు బహువచనమున రేఫమగును': [1]
దా. బాలుఁడు, బాలురు; నృపాలుఁడు, నృపాలురు మొదలయినవి.
యాళు, కరుణాళు[2], కృపాళు మొదలగు మతుబర్థక - ఆళు ప్రత్యయాంత
బ్దములు ఉదంతము లయినను వానికి బహువచనమున రేఫమే వచ్చును.
చోళుఁడు' అనునది తత్సమపదమైనచో దానికి బహువచనమున 'చోళురు'
ను బహువచనరూపము కలుగునేమో తెలియదు; 'చోళులు' అనురూపము
ప్రసిద్ధముగా నున్నది. 'ద్విత్వయుక్తలాంతంబు మీఁది 'లుల' లకును 'రుర
దేశంబగు' నని ప్రౌఢ వ్యాకరణకారుఁడు తెలిపి 'అరరే!...వీరారి మ,
్లురకున్ మట్టియగున్' అను రామాభ్యుదయమున ప్రథమాశ్వాసస్థపద్యము
దాహరించెను; ఇట్లే, పోతన "చెల్లా చెదరైరి పాటి చిక్కిన మల్లుర్"
భాగ. X. I. 1371) అని ప్రయోగించెను. కాని, యిచట 'మల్లుల్' అని
ను సరిపోవును. తిక్కనమాత్రము 'మల్లులు' అనియే ప్రయోగించియు

1. 'లుజసో లశసోఽలాంతాత్, లాంతాత్తు రురా తయోః క్రమేణ స్తః' అను
ాంధ్రశబ్దచింతామణి సూత్రమున దీర్ఘపూర్వలోపధశబ్దములకు మాత్రముగాక యన్ని లాంత
బ్దములకును బహువచనమున రేఫమగునని తెలుపఁబడినది; కావున నీ సూత్రమున కతివ్యాప్తి
పము పట్టినదని యైనను చెప్పవలెను; లేదా, యా సూత్రకారుని మతమున జటిలుఁడు, కుటి
ఁడు మొదలగు పదములకును జటిలురు, కుటిలురు మొదలగు బహువచనరూపములు కలుగునని
ని చెప్పవలెను. ఇదిగాక, 'లాంతాత్' అనుటవలన అద్వ్యక్త లకారమునకే యీ కార్యము
గునుగాని, ఇ దుత్సహిత లకారమునకుఁ గలుగదనియు గ్రహింపవచ్చును. లాంతాత్తను
డు లకారముపై నెట్టియచ్చున్నను బహువచనమున రేఫము వచ్చునన్నచో 'దయాళురు'
దలగు రూపములకు గతికలుగును. కాని, వానితోఁ బాటు 'పుష్కలురు' మొదలగు
పములును సాధువు లగును.

2. ఆలుచ్ ప్రత్యయము దయాశబ్దముమీఁదనే చేరునుగాని, కరుణా, కృపా మొద
వానిపైఁ గలుదనియు, కరుణాల, కృపాల, అను నిట్టిరూపములు 'బాల' శబ్దమువంటి
యు నవి అకారాంతములనియు, కావున వానికి కరుణాలురు, కృపాలురు, అనురూపములు
కాక్షేపము లేదనియు సుప్తార్థప్రకాశికా కారుల మతము.

న్నాఁడు. 'వలసిన ... వెనంగుజెట్టి మ, ల్లులవిఱుతున్ (విరా. I. 223, ప్రాసస్థానము); జెట్టిమల్లులతోనిప్పు డట్టువ్రాలె; నీదు నేడ్కకుఁ బెనఁగెద నేర్చినట్లు (విరా. II. 13); చిక్కనిమల్లులు (విరా. II. 20); వలలుఁ డనంగ ... జెట్టిమ, ల్లుల విఱుచున్ (విరా. V. 323 ప్రాసస్థానము.) 'సావిదల్లుఁడు' అనుపదమునకు 'సావిదల్లులు' అనియే బహువచనరూపము ప్రయోగములఁ గాన్పించుచున్నది. 'భిల్లుఁడు' అనుదానికి 'భిల్లురు' అను రూపముండునేమో తెలియదు. 'భిల్లులు' అను రూపము ప్రసిద్ధము. 'మల్లురు' మొదలగు రేఫాంత బహువచనము లర్వాచీనకాలమున 'అల్లురు' మొదలగు వానిపోలిక నేర్పడియుండును. 'దీనురకు' అని ద. ఇం. శా. VI. 628 లో నున్నది.

"స్వర్గివాచి దేవ, సురశబ్దంబు లేకత్వ బహుత్వంబులం బ్రయోగింపంబడు." 'దేవుఁడు' అను పదమునకు 'దేవులు' అను బహువచనరూపము లేదు. 'భూదేవుఁడు' అనునది స్వర్గివాచికాదు కావున దానికి 'భూదేవులు' అను బహువచనరూపము కలుగును. వ్యవహారమునమాత్రము 'దేవుళ్లు' అను రూప మెక్కువప్రచారమం దున్నది. 'దేవ' శబ్దమునకు 'దేవఁడు' అను ప్రథమైకవచనరూపము పదునోకండవశతాబ్దమునుండియు శాసనములందు కానవచ్చుచున్నది. దానికి 'దేవరు' అను బహువచనరూపమును గాన్పించుచున్నది. కాని, యట్టివేయగు 'లింగఁడు' మొదలగువానికి 'లింగరు' మొదలగు బహువచనరూపములు లేవు. స్వర్గివాచి సురశబ్దముమాత్ర మెప్పుడును బహువచనమందే వాడఁబడును: సకలసురలు.—'భూసుర' శబ్దము స్వర్గివాచి కాదు గావున దానికి బహువచనరూపము 'భూసురులు' అనియే యుండును. 'అసుర' శబ్దమునకు మహత్తునందు ప్రథమైకవచనమున అసుర, అసురుఁడు, అను రెండురూపములు నుండును; బహువచనమున 'అసురులు' అను రూప మొక్కటిమాత్రము గలదు; సమాసమున 'అసురుఁడు' అనియే యేకవచన రూపము: బకాసురుఁడు. ఇట్లే, యోధ, యోధుఁడు అనునవి యేకవచన రూపములు; యోధులు అని మాత్రము బహువచనరూపము.

సంస్కృత ఇదంత శబ్దములు తత్సమము లగునపుడు వానిపైఁ బ్రథమైకవచన డుఙ్ ప్రత్యయముచేరదు. ఈ యిదంతశబ్దములపై బహువచన లు-వర్ణము పరమగునపు డాయిత్వమున కుత్వము వచ్చును: హరి, హరులు; మతి, మతులు; వారి, వారులు.

సంస్కృత ఉదూదోదంత శబ్దములు తత్సమము లగునపుడు వానిపై ప్రథమైకవచనమున వువర్ణము వచ్చును. బహువచనమున నీ వువర్ణముపై లువర్ణము చేరును. ఉదంత పుంలింగశబ్దములపైఁ జేరు వువర్ణము బహుళముగ లోపించును: బాహుప్పలించి; బాహువులు, బాహులు (భార. విరా. I.

34. ప్రో. III. 91.) శత్రువులు, శత్రులు (భార. VI. ఆర. 72. శాంతి. . 405); జంతువులు, జంతులు (భార. ఆర. V. 57); సానువులు, సానులు; ంధువులు, బంధులు (భార. విరా. II. 70)—బాహు అనునది ప్రథమైక చనరూపమయినట్లు శత్రు, జంతు, సాను, అనునవికావు.

'సంస్కృతసమంబులం దికారాంతములైన శబ్దముల యుపధా 'చ, లు బహువచనంబు పరంబగునపుడు దంత్యములగును: వీచి, వీచులు; రోచి, ోచులు; వాజి, వాజులు; రాజి, రాజులు మొదలయినవి. ఇట్టి శబ్దములందు ాలవ్యమగు నుపధా 'శ' వర్ణముగూడ బహువచనమున దంత్యమగు 'స' ర్ణముగ బహుళముగ మాఱును: రాశి, రాసులు; - కాని, మాంసాశి శులు); సుకేశి (-శులు), పేశి, పేశులు;-'కాశి' (పట్టణము) కి బహువచస ుమిరో నిర్ణయింపఁ బ్రమాణములేదు. బహువచనమున 'సమితి' శబ్దము ందలి యుపోత్త మేత్వమునకుఁ నేఁటి వ్యవహారమున నుత్వము కలుగు ున్నది: సముతులు.

'కంచుకి' శబ్దమునకు బహువచన లు-వర్ణము పరమగునపు డుచ్చార ుమున 'కంచుకులు' అని చవర్ణము దంత్యముగ వ్యవహారమున వినఁబడు ున్నది.

'దృష్టి' శబ్దమునకు బహువచన రూపమయిన 'దృష్టులు' 'దృష్ట్లు' అను ూపము తోడను భారతమునఁ బ్రయోగింపఁబడి యున్నది. (విరా. II. 74; ట్టీ నన్నయ.)

## వైకృతశబ్దముల బహువచనము.

లు-వర్ణముగాక తెనుఁగున -రు, -ఱు వర్ణములును నొకచో బహు చన బోధకములుగఁ జేరుచుండును. ఇవిగాక యొకప్పుడు వ, మ, వర్ణములును హువచనమునఁ గానవచ్చుచున్నవి. కొన్ని శబ్దములపై -కులు, -గులు, ునవి చేరుచుండును. ఇవి యితర ద్రావిడ భాషలలోని, 'కళు, గళు' అను ంని వికారము లనవచ్చును. ఆయా యంతములు గల యేకవచన రూప ులపై నేయే బహువచన ప్రత్యయములు చేరునో యీ క్రింద వివరింపఁ ుచున్నది.

### 1. ఆచ్ఛికములగు మహద్వాచక డుజ్వర్ణాంత శబ్దములు.

i.—"ఆఁడు ప్రత్యయాంతములు:—వీని బహువచన లకారమునకు ఘమును, దానికిముందు పూర్ణబిందు పూర్వక డ-కారమును నగును. శబ్ద 'స్త్రీ' ప్రకారము వీని బహువచనములు - ఱు చేరుటవలనఁ గలుగుననియు; యేకవచన రూపములు ప్రాచీన ద్రావిడ భాషావస్థనుండియు వచ్చిన -అన్

అంత గూపములనియుఁ దెలిసికొనవచ్చును. ద్రావిడమున న్+ఉ = న్డు, ణ్డు, గమాఱుచుండును. గండన్+ఉ = గండన్డు = గణ్డణ్డు; శాసనములందు 'వేహాన్డు, మగన్డు,' మొదలగు రూపములు కానవచ్చుచున్నవి. కాని, '-ంద్రు' అంతమందుగల బహువచనరూపములను భారతకవులు వాడినట్లు కానరాదు. పదునాల్గవ శతాబ్దమునుండియు నవి గ్రంథములలోని కెక్కి యుండును.

మగఁడు, బహు. మగలు; అనియే భారతప్రయోగములు. దండి మగలు (భార. ద్రో. iii. 218); పోటుమగలు (భార. విరా. v. 89; ద్రో. iii. 170); మగలరాజు (భార. ద్రో. II. 239); మగలు (భాగ. VIII. 59).

ఈ క్రింది పదములు వ్యవహారభ్రష్టములై యుండుటచేతను, పూర్వ గ్రంథములందు వీని బహువచనరూపము లెవ్వియో నిర్ణయించుటకుఁ దగిన ప్రమాణములు లేకుండుట చేతను, వాని బహువచన రూపములు -లు, -రు, -ండ్రు, -ళ్లులలో దేనితోనంతమయ్యెడివో తెలిసికొన వీలులేకున్నది. అడి యఁడు, బహు. ఆడియలు అయియుండ వచ్చును; అనుమఁడు, బహు. అను మలు కావచ్చును, అరుహాఁడు, బహు. అరుహాలు; ఉలుపఁడు (-లు ? ళ్లు?); ఒడయఁడు (-లు); 'ఒడయరు' అను రూపము కన్నడమునుండి వచ్చియుండును; కొడుకఁడు (బహువచనము ? లు ? రు ? ండ్రు ? ళ్లు ?); గండఁడు, బహు. గండలు; 'గండర గండఁడు' అను దానిలో బహువచన రు-వర్ణము కాన్పించు చున్నది. గండండ్రు, గండండ్లు, గండళ్లు అను రూపములు కలవో లేవో తెలియదు. గుండఁడు, బహు. గుండలు కావచ్చును; చెదుగఁడు, బహు. ? ; దుడుకఁడు, బహు. ? ; పొడవఁడు, బహు. పొడవళ్లు ? ; మిండఁడు, బహు. 'మిండలు' అని బహువచన రూపము వ్యవహారమున నున్నది; మిండండ్రు అను రూపమున్నదో లేదో తెలియదు; గుమ్మఁడు, బహు. గుమ్మలు (గుమ్మండ్రు, గుమ్మళ్లు, గుమ్మరు, అను రూపములుండ వేమో.) నాయఁడు, బహు. నాయలు, నాయళ్లు; అను రూపములు వ్యవహారమున నున్నవి, నాయండ్లు; నాయండ్రు, అని యనవచ్చునో రాదో తెలియదు, పొడవఁడు, బహు. 'పొడవలు' కావచ్చును. పొడవండ్రు, పొడవళ్లు, అను రూపములు న్నవో లేవో తెలియదు. వడుగఁడు, బహు. వడుగలు ? -ండ్రు ? -ండ్లు ? ఇదేరీతిగ కోటఁడు, జుమ్మఁడు, దమ్మఁడు, దుడుకఁడు, బాణఁడు, నడ గఁడు, నరసింగఁడు, నాగఁడు, నిడుపఁడు, నీలఁడు, పులియఁడు, బొల్లఁడు, పొదఁడు, పాపఁడు, బుడుతఁడు, బాఁపఁడు, మనుమఁడు, బొమ్మఁడు, తిమ్మఁడు, పోఱఁడు, పోలఁడు, ప్రోడఁడు, బండఁడు, బయ్యఁడు, బసవఁడు, బిడ్డఁడు, రాయఁడు, మన్నియఁడు, అప్పఁడు, నరియఁడు, ముదుకఁడు, బోయఁడు, బురు

ండు, బూరఁడు, బొల్లఁడు, బోడఁడు, మాలఁడు, రంగఁడు, కుఱ్ఱఁడు, మాలఁడు, వెలమఁడు, గొల్లఁడు, రేవఁడు, లింగఁడు, వడుగఁడు, సింగఁడు, సిరంగఁడు మొదలయిన వాని బహువచన రూపములు లు-వర్ణాంతము లై యుండును. అతఁడు, ఇతఁడు, ఎతఁడు అను సర్వనామములకు బహువచన రూపములు లేనేలేవు; వానికి 'వాఁడు'నకు బహువచనమగు 'వారు, వాండ్రు, వాండ్లు, వాళ్లు, వాళ్లు' అను రూపములే బహువచన రూపము లగుచున్నవి. మిండం డ్రు, గండండ్రు అని చిన్నయసూరి యిచ్చిన యుదాహరణముల కైనను సరియైన ప్రయోగములు చిక్కలేదు. వ్యవహారమున నారూపములు లేనే లేవు; మిండలు, గండలు అనియే లోకమున వినఁబడుచున్నది.

ii. ఆఁడు ప్రత్యయాంతములు:—ఆఁడు ప్రత్యయము మతుబర్థమున షష్ఠీబహువచన ల-వర్ణముపై చేరుచుండును. అది 'వాఁడు' అను సర్వనామ మునఁ దొలి వకారము లోపించుటచే నేర్పడినది. ఆఁడు ప్రత్యయాంత శబ్ద ములకు బహువచన మెట్లుకలుగునో తెలియదు. తగిన ప్రయోగములు లేవు. మహతీప్రత్యయమగు - ఆఁడి చేరిన పదములకువలె దీనికిని బహువచనము కలుగునా యని సందేహము కలుగుచున్నది; లేదా, లు వర్ణమునకు రేఫా దేశమును దానికిఁ బూర్వము బిందుపూర్వక డకారమును గలుగునా? కఱత లాఁడు, బహు. కఱతలాఁడులు (-లాళ్లు? లాండ్రు?); ఇట్లే - కఱదు లాఁడు, కొడిమెలాఁడు, చిన్నెలాఁడు, టెక్కులాఁడు, తక్కులాఁడు, నేసపు లాఁడు, పోకలాఁడు, బిరుదులాఁడు, బూమెలాఁడు, బొంకులాఁడు, బొక్క లాఁడు, రజ్జులాఁడు, వగలాఁడు, వన్నెలాఁడు, వాదులాఁడు మొదలయిన పదముల విషయమునను బహువచన రూపములను నిర్ణయించుట కాధార ములు లేవు.

iii - ఇఁడు ప్రత్యయాంతములు:—అట్టిఁడు (భార. సభా. I. 276; ఆది. IV. 167); ఇట్టిఁడు (భార. ఆది. V. 234); అను పదములకు అట్టిరు (భార. ఆది. IV. 17; సభా. I. 234); ఇట్టిరు (భార. ఆది. IV. 187; ఆది. VII. 73; అర. IV. 157) అను బహువచన రూపములు కానవచ్చుచున్నవి. కాని, ఎట్టిఁడు (భార. ఆది. IV. 251; రామా. సుం. ఎట్టిఁడు నా నిజేశుఁడు) అను రూపమునకు బహువచన రూపము కానరాలేదు. అట్టిరు, ఇట్టిరు అను రూపముల పోలికను 'ఎట్టిరు' అనుదాని నూహించుకొనవలె నేమో. ఈ బహు వచన రూపము లిట్లుండఁగా నేఁటి గ్రంథకర్తలు అట్టిఁడులు, అట్టిండ్రు, ఇట్టిఁడులు, ఇట్టిండ్రు, ఎట్టిఁడులు, ఎట్టిండ్రు అను బహువచన రూపములను ప్రయోగించుచున్నారు. పూర్వ గ్రాంథికసంప్రదాయము తెలియకుండు

టయు, విపరీత పాండిత్యమును జూపనభిలాషయునే దీనికిఁ గారణము.— 'వెట్టిఁడు' అను పదమునకు బహువచనరూపమేమో తెలియదు.

iv. - ఇయఁడు ప్రత్యయాంతములు:—'బొట్టియఁడు' అను దానికి 'బొట్టియలు' అని బహువచన రూపము కలుగు నేమోకాని, 'కన్నడియఁడు' అను దానికెట్లు కలుగునో తెలిసికొనుట కష్టము. ఇట్లే, తక్కిన - ఇయఁడు ప్రత్యయాంత శబ్దముల విషయమునను సందేహము కలుగు చున్నది.

v. - ఇయుఁడు ప్రత్యయాంతములు:—'ఒడయుఁడు' అను పదమునకు 'ఒడయులు' అను బహువచన రూపము కలుగునేమోఁ తెలియదు. -'ఇయుఁడు' అంతమందు గల యితరపదముల విషయమునను నింతే.

vi. - ఈఁడు ప్రత్యయాంతములు:—ఈఁడు ప్రత్యయాంత శబ్దములకు బహువచనమున డుజ్ స్థానమున లు-వర్ణము వచ్చును: మందడీఁడు, బహు. మందడీలు (భార. విరా. I 95); మన్నీఁడు, బహు. మన్నీలు (భార. శాం. I. 9); ఉక్కీఁడు, బహు. ఉక్కీలు (నిర్వ. III.); ఎక్కటీఁడు, బహు. ఎక్కటీలు (చంద్రభా.); ఏకలీఁడు, బహు. ఏకలీలు (హరి. నల. II); కమతీఁడు, బహు. కమతీలు (సారం. I.); ఇట్లే అటమటీఁడు, ఉక్కడీఁడు, ఉద్దీఁడు, ఊడిగీఁడు, ఏకిమీఁడు, ఒంటరీఁడు, ఒడ్డీఁడు, కత్తలీఁడు, కన్నడీఁడు, కమ్మటీఁడు, కమ్మతీఁడు, కమ్మరీఁడు, కల్లరీఁడు, కాసీఁడు, కుంటెనీఁడు, కొండీఁడు, కోడిగీఁడు, తిండీఁడు, గారడీఁడు, డింగరీఁడు, తెరువాటీఁడు, తోటీఁడు, త్రిమ్మరీఁడు, దాఁపరీఁడు, దావరీఁడు, దిండీఁడు, దిమ్మరీఁడు, దుండగీఁడు, పాండీఁడు, ప్రల్లదీఁడు, బవినీఁడు, బానసీఁడు, బూటకీఁడు, బొందడీఁడు, బోయీఁడు, మచ్చరీఁడు, మావటీఁడు, మాస్టీఁడు, మొక్కడీఁడు, రక్కసీఁడు, వాట్లీఁడు, వానీఁడు, వెగ్గలీఁడు, వెట్టీఁడు, సంగడీఁడు, సాలీఁడు, సావలీఁడు, సుంకరీఁడు, సుంకీఁడు, హెగ్గడీఁడు— మొదలగు వానికిని డుజ్వర్ణస్థానమున లువర్ణము చేరుటవలననే బహువచనరూపము లేర్పడునని యనుకొనవలెను. -'ండ్రు, -ండ్లు,'తో బహువచన రూపములు కలుగునేమో తెలియదు; ప్రయోగములు కానరాలేదు.

vii. - ఉఁడు ప్రత్యయాంతములు:—తత్సమ శబ్దములందువలె ఉత్వ డుజ్జులు చేరిన యాచ్ఛికశబ్దముల బహువచనమున డుజ్స్థానమున లు-గాని, రు-గాని రావచ్చును:

ఒడయుఁడు, బహు. ఒడయులు (భార. శాంతి. II. 2); ఎల్లిదుఁడు, బహు. ఎల్లిదులు (నిర్వ. VIII.); బెట్టిదుఁడు, బహు. బెట్టిదులు (భార. విరా. IV. 54): లావంతుఁడు, బహు: లావంతులు (భార. విరా. II. 161);

కాని, బలియురు (భార. భీష్మ. III. 6); నెయ్యురు (భార. ఆర. VI. 62; ఆర. VII. 297; శాంతి. III. 512; అను. II. 271.)-'మల్లుఁడు' అనుదానికి 'మల్లులు' అనియే బహువచన రూపము; 'మల్లురు' అనురూపము 'అల్లురు' అనుదాని పోలిక నాధునికకవు లుపయోగించిరి. అతగుఁడు, అవఘళుఁడు, ఉక్కలుఁడు, ఉక్కివుఁడు, కమనుఁడు, కావరుఁడు, కూళుఁడు, దట్టుఁడు, దాళకుఁడు, చెలువుఁడు, తమ్ముఁడు (కన్నడము. తమ్మ); తాళీకుఁడు, దాళీకుఁడు, పాలుఁడు, ప్రల్లదుఁడు, బత్తుఁడు, బూటకుఁడు, వితాకుఁడు, వియ్యంకుఁడు మొదలగు శబ్దములకును బహువచనమున డుజ్ స్థానమున లు-వర్ణమేవచ్చును.

viii. - డుజ్ ప్రత్యయాంతములు:—'అల్లుఁడు' అను పదమునకు 'అల్లువాఁడు' అని యర్థము చెప్పుదురుకాని, అది కన్నడములోని 'అళియ' శబ్దముతో సంబంధించినది. 'అలియఁడు' అను రూపము తెనుఁగున నెన్నడైన నుండెనేమో కాని, యిది 'అల్లుఁడు' అను రూపములోనే తెనుఁగు గ్రంథములందు కాన్పించుచున్నది. 'అల్లువాఁడు' అను రూపము తప్పు వ్యుత్పత్తివలన నేర్పడిన కృతకరూపము; అది లోకములో నెక్కడను వినఁబడదు. 'అల్లుఁడు' అనుదానికి బహువచన రూపము తొలుత 'అల్లురు' అనియే యుండెను. (భార. ఆది. VIII. 53; ఉద్యో. IV. 122.) 'అల్లుండ్రు' అనురూపము గ్రంథముల నున్నదేమో తెలియదు. కాని యారూపము మాండలికముగ నుండియుండవలెను. వ్యవహారమున 'అల్లుళ్లు' అను దానికిఁ బూర్వరూపములు 'అల్లుండ్లు, అల్లుండ్రు' అని యుండవలెను. 'అల్లులు' అని మాత్రము బహువచనరూపము గలుగదు. 'అల్లులలో మల్లు గొప్పవాఁడు' అను సామెత మాత్రముగలదు.

పగతుఁడు, మార్తుఁడు, (అలరు) విలుతుఁడు, అను శబ్దములలో 'తు' అను నాగమాక్షరము పగ, మాఱు, విలు అనుపదములపైఁ జేరినది. ఈ '-తు' వర్ణము తమిళమున షష్ఠీవిభక్తి ప్రత్యయము చేరకపూర్వము కొన్ని పదములపై నుపవిభక్తిగ నుపయోగించు '-త్తు' వర్ణముతో సంబంధించినది. పగతుఁడు, మార్తుఁడు అను శబ్దములకు పగతురు (భార. ఆర. VI. 27); మార్తురు (ద్రోణ. III. 242; III. 304; సౌప్తి. I. 53); అనునవి బహువచన రూపములు. (అలరు-) విలుతుఁడు అనుదానికి బహువచనమేమో తెలియదు. - 'విలుతులు' అగునేమో.

viii. కాఁడు ప్రత్యయాంతములు:—"కా ప్రత్యయంబు మీఁది బహువచన లకారంబునకు లఘ్వలఘు రేఫంబులును, లఘు రేఫంబునకు ముందు బిందుపూర్వక డకారంబునగు. విలుకాండ్రు, విలుకాఱు; వేఁటకాండ్రు, వేఁటకాఱు; వేడుకకాండ్రు, వేడుకకాఱు.-"చిన్నయసూరి. ఈ సూత్రమునఁ జెప్పఁబడిన వానిలో ఱు-వర్ణకాంత బహువచనరూపములు ప్రాచీనములు.

నన్నయ భారతమున 'సంగడికాఁడు, * దాపికాఁడు, నేర్పుకాఁడు, పరికాఁడు' అను నేకవచన రూపములున్నవి కాని,-కాఁడు ప్రత్యయాంత శబ్దముల బహువచనరూపములు ప్రయోగింపఁబడి యుండలేదు. అతనికాలమున నవియెట్లుండెనో తెలియదు. తిక్కన 'తెక్కలికాఁఱు (భార. స్త్రీ. I. 44); వేఁటకాఁఱు (స్త్రీ. I. 102) అని ప్రయోగించెను. నిబన్ధకాఁఱు (ద. ఇం. శా. V. 220); మనవితికాఁఱు (ద. ఇం. శా. V. 176.) తిక్కన '-కాఁఱు' పై మరల బహువచన లు-వర్ణమును గూడ వాడినాఁడు. "వేడుక, కాఁఱులు జాలరులు సూచి" (శాంతి. III.)

'-కాండ్రు' తోడి బహువచన రూపములు పదునాల్గవ శతాబ్దము నుండియుఁ గానవచ్చుచున్నవి. చెలికాండ్రు (భాగ. VII. 122); సంగడికాండ్రు (భాగ. VII. 211); తరిగాండ్రు (భాగ. VIII. 206); వేడుకకాండ్రు (ఉ. రా. IV.); కటారికాండ్రు (కళా. VIII.); గమికాండ్రు (అచ్చ. రా. అర.) - ఒత్తుకాంఱు (ద. ఇం. శా. VI. 955); వాస్యకాం(కాం) ఱు (ద. ఇం. శా. VI. 1116) అని నున్నవి. ఱు వర్ణము శాసనములందు కనఁబడుచున్నది. '-కాండ్రు' పై మరల బహువచన రువర్ణము చేరుటయుఁ గలదు. గమికాండ్రురు (అచ్చ. రా. అర.)

పురుషసంజ్ఞావాచక శబ్దములకు 'గాఁడు' చేరి నీచార్థము నిచ్చును; దాని బహువచనన రూపమగు 'గారు' గౌరవార్థమున నేకవచనబోధకమగును. గౌరవార్థమున బహువచనమున 'గారులు' అగును; 'గాఁడు' నకు గాండ్రు, బహువచనమయి నీచ, గౌరవార్థములందుకాక సామాన్యార్థమునఁ బ్రయోగింపఁబడును; దాని వికారమగు 'గాళ్లు' నీచార్థమున బహువచన బోధకమగును. 'అయ్యంగారు' మొదలగు రెండేసి బహువచన ప్రత్యయములు చేరియు నేకవచన బోధకములే యగును. అట్లే 'పంతులుగారు, శాస్త్రులుగారు, మొదలగు వానియందును రెండేసి బహువచనసంజ్ఞలు చేరియు నేకవచనమునే తెలుపుచున్నవి. 'పంతులవారు' అను రెండు బహువచన ప్రత్యయములు చేరిన యేకవచనబోధకపదమునకు 'పంతుళ్లవారు' అనునది బహువచన రూపము; ఇందు మూఁడు బహువచనప్రత్యయములు చేరినవి. శాసనములందును వ్యవహారమునందును - గారు అనునది ప్రథమమీఁదఁ జేరుటయే కాక దానికిఁ బూర్వమందు అనుస్వారము కూడఁ జేరుచుండును: వేమారెడ్డింగారు (ద. ఇం. శా. V. 2); చిట్టమరునుంగారు (ద. ఇం. శా. IV. 702); ఓబుళరాజుంగారు (ద. ఇం. శా. IV. 279); తిరుపణి పిళ్లంగారికి (ద. ఇం. శా. IV. 282); ఖొజా అల్లింగారు (ద. ఇం. శా. IV. 711); సూరనంగారు (ద. ఇం. శా. V. 36); ఛిన్నా దేవమ్మంగారు (ద. ఇం. శా. VI. 695)

తిరుమలమ్మంగారు (ద. ఇం. శా. IV. 702):—ఒకప్పుడు - గారు ద్వితీయా రూపములపై వచ్చును: యల్లా భక్తునింగారికి (ద. ఇం. శా. IV. 702); ఇట్లే, రామా రాయనింగారు. బహువచనరూపముపై ననుస్వారము చేరఁగా దానిపై 'గారు' చేరుటయుఁ గలదు; శ్రీ రంగరాజులుంగారు (ద. ఇం. శా. IV. 279), రామా పండితులుంగారు (ద. ఇం. శా. IV. 696); ఒకప్పుడనేక గౌరవ వాచకపదములు చేరునప్పుడు 'గారు' తుది పదముపైఁ జేరును; సోమాపండితులు లింగాం పండితులు మంలా పండితులుంగారు (ద. ఇం. శా. IV. 699).

ix. - వాఁడు ప్రత్యయాంతములు:—'-వాఁడు' అను సర్వనామ మంతమందు చేరిన శబ్దముల బహువచనరూపములందు 'వాఁడు' కు గల బహువచన రూపములు 'వాఁడు'నకు మాఱుగఁ జేరును. అట్టివానిలో 'వారు' అంతమందు గలవి ప్రాచీనములు; 'వాండ్రు' అంతమందు గలవి యర్వాచీనములు; నన్నయ భారతమున -'వాండ్రు'తో రూపములు లేవు. తిక్కన గ్రంథములందు కనఁబడుచున్నవి. అంత నట్టువారు (భార. సౌ. II. 3); కొంచెపువారు (భార. ఉ. I. 14); బాసలవారు (భార. విరా. III. 166); మగవారు (భార. ఉ. I. 247); వేగులవారు (భార. ద్రో. II. 304); అర్వాచీనకాలమున నిట్టియెడల '-వాండ్లు' అనియుఁ జేరుచుండెను. '-వాండ్రు' పై మరల బహువచన '-రు-'వర్ణము చేరుటయుఁ గలదు: 'వెలివాండ్రురపల్లియ (భార. శాంతి. III. 284).

ఇతరములగు - డుజ్ ప్రత్యయాంతములు:—"తే ప్రభృతుల బహువచనమునకు ముందు డుజ్జగు" నని చిన్నయసూరి చెప్పెనుగాని యా ప్రభృతులెవ్వియో తెలుపలేదు. 'బోఁడు, వ్రేఁడు' పదములుమాత్ర మట్టివి కాన వచ్చుచున్నవి. వానికి బోలు, వ్రేలు, అను బహువచనరూపములే కాని బోండ్లు, వ్రేండ్లు, అనునవి కానరావు.

2. ఆచ్ఛికములగు ము-వర్ణాంతశబ్దములు:—

i. సాధారణముగ ప్రథమైకవచన ము వర్ణముపై గ్రంథములందు లు-వర్ణమే బహువచనమునఁ జేరుచుండును: కొంచెములు (భార. అర. IV. 192, 292); పగ్గములు (భార. అర. V. 92); బాహిరములు (భార. విరా. I. 137); గొనయములు (విరా. I. 172); వంటకములు (భార. I. 219); పావడములు (భార. విరా. III. 74); మతకములు (భార. విరా. II. 295); లంచముల్ (భార. విరా. II. 334); దెంచనమ్ములు (భార. విరా. III. 167); కావరములు (భార. ఉ. III. 28); మీసంబుల్ (భార. VI. 94) మొదలయినవి.

ii. "లులనలు పరంబులగు నపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాషనగు: వజ్రములు, వజ్రాలు మొదలయినవి." - చిన్నయసూరి. దీనిపై విమర్శను మీఁదఁ జూడ నగును. తొలుతనుండియు నీమార్పు తెలుఁగునఁ గానవచ్చుచునే యున్నది. చిన్నయసూరి యన్నట్లు దీనికిఁ బ్రయోగ వైరల్యము లేదు. నన్నయ భారత భాగమున నిందు కుదాహరణములు లేకున్నను నాఁటి శాసనములందు గాన వచ్చుచునే యున్నవి. ఉదా. 11-వ శతాబ్దమున మిరియాలు (ద. ఇం. శా. V. 65, 66); గుండానకు (ద. ఇం. శా. V. 1114); కుంచాలు (ద. ఇం. శా. IV. 1064; V. 68); తరువాతి కాలమున: కళ్యాలు (భార. విరా. I. 95; కర్ణ. I. 140); చుట్టాలు (భార. అను. IV. 382; భాగ. I. 233; II. 53; పాండు. III. 18); నిజాలు (భాగ. VI. 200); బోనాలు (భార. ఉ. III. 229); గుర్రాలు (ఉ. నై. 70); వియ్యాలు (ఉ. హరి. III. 82); వేసాలు (దశా. 313); గుఱాలు (పాండు. II. 38; రామాభ్యు. VII. 274); మీసాలు (మను. II; పాండు. III. 66) అలుపాలు (భార. ఉద్యో. III. 117); చందాన (భార. ఆశ్ర. I. 103); సారసానకు (భార. భీ. I. 142); ఆఁకొన్నతనాన (భీమ. II. 120); ముత్యాలు (శృం. నై. VIII. 161); బేరానకు (శుక. పు. 47); - మొదలయినవి. చోద్యాలు (వరాహ. I. 3); పంతాలు (కళా. I. 147); ముత్యాలు (పాండు. II. 175); బేహారాలు (వరాహ. IX. 125); గంగాళాలు (వరాహ. IV) మొద.

iii. ఒకప్పుడు ఢిట్టిచోట్ల 'ఆ' కు 'ఏ' కూడవచ్చును: ముత్తేలు (యయా. పు. 7); కల్లేలు (రంగరా. III. 204); కడేలు (యయా. పు. 16); బల్లేలు (రంగారా. III. 200); బిడేన (యయా. పు. 17).

iv. ఒకప్పుడు మువర్ణము లోపింపఁగాఁ గలిగిన అకారదీర్ఘమునకు హ్రస్వమును గలుగుచుండును. చుట్టలు (భార. శల్య. II. 134; విరా. I. 49); మీసలు (భార. అర. VI. 315; భాగ. VI. 92; 318); కుంచము, కుంచములు; కుంచాలు, కుంచలు (ద. ఇం. శాసనములు) మొదలయినవి.

v. ఆ-త్వము పూర్వమందుగల ము-కారాంతపదములు మువర్ణకాంత ములవలెఁ గాన్పించును. వానికి బహువచన లు-వర్ణము పరమగునపుడు ము వర్ణము లోపించును: జాజాము, జాజాలు; ఏతాము, ఏతాలు; పెండ్లాము (భాగ. III. 982), పెండ్లాలు.

vi. 'మొదవు' శబ్దమునకు 'మొదవులు, మోదాలు, మోదలు' అను మూఁడు బహువచన రూపములును శాసనములందు గాన్పించుచున్నవి.

౩. మహతీవాచక ప్రత్యయములు:—

i. - ఆఁడి ప్రత్యయాంతములు:—'ఆఁడి' అనునది మహద్వాచక మగు - ఆఁడు ప్రత్యయమువలె షష్ఠీ బహువచన రూపములమీఁదనే చేరుచుండును: కులుకులాఁడి, వన్నెలాఁడి మొదలయినవి. వీనికి ఇదంతశబ్దములకు వలెనే బహువచనరూపములు గలుగును: కులుకులాఁడులు, వన్నెలాఁడులు మొదలయినవి. కులుకులాళ్లు మొదలగురూపములు కలుగనేమో.

ii. -త,- తి-, తుక-, ద-, ది-, దుక మొదలగు మహత్యర్థబోధక ప్రత్యయములపై లువర్ణము చేరును; ఇత్వమున కుత్వము కలుగును: నెలఁతలు, పొలఁతులు, నెలతుకలు, ఉవిదలు, వెలఁదులు, వెలదుకలు మొదలయినవి; గోతి, గోతులు.

iii. లి-వర్ణాంత మహతీవాచకపదములపై బహువచన లువర్ణముచేరి తత్పూర్వమందున్న యిత్తునకు ఉత్తు కలుగును: చెలి, చెలులు; తొయ్యలి, తొయ్యలులు; ఉగ్మలి, ఉగ్మలులు; పైదలి, పైదలులు మొదలయినవి. తొయ్యళ్లు, ఉగ్మళ్లు, పైదళ్లు, అను రూపములు కలుగవు. - 'ఆలి' కి 'ఆలు' కువలె 'ఆండ్రు' అగును. 'ఆలులు' అని బహువచనరూపము కలుగునేమో తెలియదు. 'చూలి'కి బహువచనరూపము 'చూలు'కు వలె 'చూళ్లు' అగునేమో; 'చూండ్రు' అనికాదు.

iv. లు-వర్ణాంత మహతీవాచకపదముల బహువచనమున వాని తుది లు-వర్ణము లోపించి, బహువచన లువర్ణమునకు రువర్ణ మాదేశమయి దాని పూర్వమందు బిందుపూర్వక డకారము నిలుచును: ఆలు, ఆండ్రు; చెలియలు, చెలియండ్రు; చెల్లెలు, చెల్లెండ్రు; మఱఁదలు, మఱఁదండ్రు మొదలయినవి. ఈలువుటాండ్రు (భార. ఆర. VII. 61); 'ఈలుపుటాలు' అను ప్రయోగము కనఁబడలేదు. కోడండ్రు (భాగ. I. 267); ముద్దరాండ్రు, వింతరాండ్రు (భాగ. VI. 255); అక్కసెలియండ్రు (భాగ. VIII. 183); అక్కాచెల్లెండ్రు (భాగ. VIII. 473); ఆండ్రు (భార. విరా. II. 231).

-'ఆండ్రు' పై మరల బహువచన రు - వర్ణము చేరునా? ఆండ్రురు (భార. అశ్వ. IV. 69; స్వర్గా. I. 65; విరా. II. 140.) ఇది 'ఆండురు' అను శిథిలరూపము కావచ్చును.

'ఏరాలు' అనుపదమునకు బహువచనమేమో తెలియదు. 'ఏరళ్లు' అని లోకమున వినఁబడుచున్నది. ఇది ప్రాచీనరూపమగు 'ఏరండ్రు' అను దాని వికృతికావలెను. అపుడు ప్రాచీనకాలమున 'ఏరాలు'కు హ్రస్వరూపమగు 'ఏరలు'కు 'ఏరండ్రు' అను బహువచన రూపముండెడిదని యూహింపవలెను. ఇట్లే 'గొడ్రాలు'కు బహువచనరూపము లోకమున 'గొడ్రాళ్లు'

అని వినఁబడుచున్నది. పూర్వకాలమున 'గొడ్రాండ్రు' అను రూపముండెడి దేమో; ప్రయోగములు కానరావు.

'గట్టువాలు' అనుపదమునకు బహువచనమేమో తెలియదు; 'గట్టి వాళ్లు' అగునేమో! 'గట్టువాండ్రు' అని కాదేమో! 'గట్టివా' శబ్దమువలె నిది 'గట్టువా' అనుశబ్దమయి దానిమీఁద బహువచన లు-వర్ణము చేరుట వలన నీ రూపము కలుగలేదు. కావున నిది 'గట్టువ + ఆలు' అయి యుండ వలెను. 'గట్టివ'కు "గట్టివచేతలుంబనులుఁ గల్లదనంబులు" అని ప్రయో గమున్నది (పంచా. I.); అట్లే "గట్టివాజాడ లెట్టుగాఁ బట్టువడిరొ" (నీలా. III.) గట్టివా యొక్కతె (ఉ. రా. III.) 'గట్టివా' అనునది 'గట్టివ' కు మొదటి రూపమని శబ్దరత్నాకరకారుఁడు దానికి 'ధూర్తుఁడు, ధూర్తురాలు' అను రెం డర్థములను జెప్పెను. ఇట్లు చెప్పుట సరికానట్లు తోఁచుచున్నది. 'గట్టివ' మహ ద్వాచకమును, దానికి 'గట్టివా' మహతీరూపము నయినట్లు కానవచ్చు చున్నది. 'గట్టువాలు' పదము 'గట్టువ + ఆలు' అను పదములసమాసమే కావచ్చును కాని, 'గట్టువ' కు ప్రయోగము కానరాదు.

౮. "కూఁతుశబ్దము ప్రథమైక వచనంబునకు రువర్ణంబగు. కూఁతు రు—కూఁతులు.—కూఁతురులు, కూఁతుళ్లు, కూఁతిరి సీత్యాది రూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది."— చిన్నయసూరి బాలవ్యాకరణము. ఆచ్ఛి. 8.

పైసూత్రమువలన 'కూఁతురు' శబ్దమునకు 'కూఁతులు' అనునదియే బహువచన రూపమనియు, కూఁతురులు, కూఁతుళ్లు అనురూపములు వ్యవ హారమునం దున్నను వానిని గ్రంథములం దుపయోగింప ననర్హములనియుఁ దేలుచున్నది. 'కూఁతుండ్రు' అనుబహువచనరూపము నుదాహరింపక పోయి నను నది గ్రామ్యమే యయినట్లు చిన్నయసూరి యభిప్రాయము కానోపును.

చిన్నయసూరి 'కూఁతు' శబ్దమును ప్రాతిపదికముగఁ దలంచి దానిపైఁ బ్రథమైకవచన ప్రత్యయముగ రు- వర్ణమువచ్చుననితలంచి యుండవచ్చును. 'కూఁతు' అనునది యే పూర్వగ్రంథమందును బ్రథమైకవచన రూపముగాఁ బ్రయోగింపఁబడి యుండకున్నను నేఁటి కొందఱు కవులును బండితులును దానినే బ్రథమైకవచనమునఁ బ్రయోగించుచున్నారు. ఇది తప్పు. 'కూఁతురు' అను నది మహతీవాచకపదము. అందు 'రు' అనునది మహతీబోధకమగు ప్రథమైక వచన ప్రత్యయమనిచెప్పుట పొరబాటు. 'కూఁతురు' అను పదమునకు 'కూఁ తుఱు' అనియు రూపాంతరము కలదు. 'కూఁతురు (-ఱు)' అనుప్రథమైక వచన రూపమందలి తుది 'రు', 'ఱు' అనునవి కొన్నియెడలఁ బ్రథమైకవచనేతర విభక్తులందు లోపించునని సూత్రించుట సమంజసముగ నుండియుండును

'కూఁతురు' లోని తుది రు-వర్ణము ప్రథమైకవచనప్రత్యయ మందురేని 'చెల్లెలు, మఱఁదలు' మొదలగువానియందలి తుది లు-వర్ణమును బ్రథమైకవచన ప్రత్యయమే యని చెప్పవలయును. కాని, యట్లు చెప్పముగదా. చెల్లెలు, మఱఁదలు అను వానిలోని 'లు' అనునది మహత్త్వార్థబోధకవర్ణమనియు, -ఆలు పదమునందలి తునుకయనియు నందుము. 'కూఁతురు' శబ్దములోని రు-వర్ణమట్టి మహత్త్వార్థబోధకవర్ణముగానైనఁ గానరాదు. శబ్దస్వరూపమే యది యని తోఁపకపోదు. కావున 'కూఁతురులు, కూఁతుళ్లు, కూఁతుండ్రు' మొదలగు బహువచనరూపములు సాధువులే యగుచున్నవి. వీనిని పూర్వవైయాకరణు లనఁగాఁ గేతనయు విన్నకోట పెద్దన్నయు నుదాహరింపకున్నను నహోబలుఁ డుదాహరించియే యున్నాఁడు. పూర్వకవులు 'కూఁతురులు' అనురూపమును బ్రయోగింపకున్నను 'కూఁతుండ్రు' అనురూపమును వాఁడియున్నారు. 'కూఁతుళ్లు' అనురూపము నర్వాచీనకవులెల్లరును వాఁడినారు. నేఁటిగ్రంథకర్తలందఱుఁ దమగ్రంథములందు 'కూఁతుండ్రు, కూఁతుళ్లు, కూఁతురులు' అనురూపములను వాడుచునేయున్నారు. చిన్నయసూరియే 'కూఁతుండ్రు' అని ప్రయోగించెను. కాని, చిన్నయసూరి వ్యాకరణమే నేఁటికొందఱికి పరమప్రమాణ మగుటచే వారు 'కూఁతు' అనుదానిని ప్రథమైక వచనమున వాడుచున్నారు. 'ద్రౌపది ద్రుపదునికూఁతు,' 'నేనా మెకూఁతును,' 'నీవు వాని కూఁతవు' అను నిట్టి కృత్రిమరూపములు నేఁడు వాడఁబడుచున్నవి. 'కూఁతుళ్లు, కూఁతుండ్రు' మొదలగు ప్రాచీనకవుల ప్రయోగములను నేటి పరిష్కర్తలు దిద్దివేయ సాహసించుచున్నారు. వా రెంతదిద్దినను ముద్రితగ్రంథములం దింకను నీ రూపములు నిలిచియేయున్నవి. అట్టిప్రయోగము లెక్రిందఁ జూపబడినవి:—

"నిబిడతమము వితానము నీడగాఁగఁ, బెండ్లికూతుండ్రి చందాన వెడలివచ్చు, జారిణుల వానకాలాన జారతతిని, నొక్కటిగఁ గూర్చు నెవఁడింక నోఘుషాంక." - పార్వతి III. పు. 26.

"రాచకూఁతుండ్రు సుతుల సంగ్రామనిరత హృదయులగువారిఁ గాంచఁ గోరుదురకాదె." - శుక. పు. 114.

"అస్తిప్రాప్తి నామధేయులయిన కంసభార్య లిద్దఱు దనకూఁతుండ్రు గావున." —హ. ఉ. I. 4.

"పెండ్లికాని కూఁతుండ్రున్న పక్షమందు." — హిందూధర్మశాస్త్రసంగ్రహము; చిన్నయసూరి, పు. 47., పేరా, 194.

"ఘనవిలాసవతులు గౌసల్య కైక సుమిత్రయనెడి పేళ్లఁ బేర్మి మీఱి, హరిశనునకు మువ్వురుఁగూఁ గూఁతుళ్లు వారల పరిణయంబు నంచుఁ దెలిసె నధిప."—నిర్వ. వి. రా. పు. 58. రాచకూఁతుండ్రు. భార. శాం. II. 166.

vi. 'బోఁ(ౕ) టి' శబ్దము సబిందుకమా ? నిర్బిందుకమా? భాగవతమున VIII-వ స్కంధమున—

"తేఁటియొకటి యొరు ప్రియకును, మాటికిమాటికిని నాగమదజల గంధం బేటికినని తనుఁబొందెడు, బోటికినందిచ్చు నిండుబోటుఁ దనమునన్." అని 'బోటి' నిర్బిందుకముగ శబ్దరత్నాకరమున నుదాహరింపఁబడినది. ముద్రిత భాగవతగ్రంథమునందును నట్లేయున్నది. కాని, 'ఏఁటికి' అనునప్పుడు బిందువుండవలెనని మనకుఁ దెలియును. ఏమిటికిలోని 'మ' కారములోపించు టచే నది సబిందుకమే. 'మాటికి' లోఁగూడ నరసున్న నోరుగంటి కవులుప యోగించినారు. కావున, 'బోఁటి' సబిందుక మయినట్లే కాన్పించుచున్నది. దీనికి బహువచనము 'బోంట్లు, బోఁటులు' అనికావలెను.

'పోఁడి' అంతమందుగల 'పువుబోఁడి, అలరుబోఁడి' మొదలగు వానికిఁ 'బోఁడులు, బోండ్లు' అని బహువచనమునవచ్చును. పువ్వుబోండ్లు (భాగ. VI. 255).

'ఆఁడుది' అను పదమునకు 'ఆఁడువి' అని బహువచనరూపము కలుగదు; 'ఆఁడువారు' అని చెప్పికొనవలెను.

మహన్మహతీసామాన్యవాచకపదములు.

మహన్మహతీ సామాన్య వాచకపదములన్నియు ఆయా యంతములు గల మహతీతరామహద్వాచక పదములవలెనే బహువచనరూపములను బొందును. ముదుసలి, వెంగలి, వెకలి అనుపదములకు వరుసగా ముదుసళ్లు, ముదుసళులు, ముదుసలులు; వెంగలులు, వెకలులు, అనునవి బహువచనరూపములు. ముదుసండ్రు; వెంగండ్రు, వెంగళ్లు, వెకండ్రు, వెకళ్లు, అనురూపములు గలుగవు. ముదుసళ్లు (భార. ఆర. V. 121); వెంగలులు ( భార. ద్రో. II. 192).

పగఱు, చూపఱు, అనువాని కేకవచనరూపములు లేవు: పగవాఁడు చూచువాఁడు అనునవి వానియేకవచనమును దెలుపును. పగఁడు, చూపఁడు, అను నేకవచనరూపములు లేవు. పగఱు (భార. ద్రో. II. 144; భీష్మ. I 154; ఉద్యో. I. 287; అశ్వ. I. 124; ఆర. VI. 194.); చూపఱు (భార విరా. V. 37, 124; భీష్మ. IV. 289; ద్రోణ. II. 127; శల్య. I. 221,87. మొదలయినవి. 'చూపఱు' పై మరల 'లు' - వర్ణమునుచేర్చి యర్వాచీ గ్రంథకర్తలు ప్రయోగించియున్నారు గాని, యీ రూపములు కృత్రిమములు కావచ్చును. చూపఱులు (ఉ. రా. I. పు. 11); చూపఱులకు (కవి II. 104); మొదలయినవి. లోకమున నీ రూపము నేఁడు లేదు. 'చూపఱు'

చూపఱ' అను రూపాంతరము నున్నది; ఇది 'అంపఱ' వంటిది; 'అంపఱ' కును బూర్వరూపము 'అంపఱు' అని యుండవలెను. భార. విరా. I. 82 లోని 'చూపఱు లెంతయు వెక్కసంపడక' అను నచ్చుపాఠము తప్పకావలయును. దానికి 'చూపఱ యెంతయు' అను పాఠాంతరము గలదు. ఉ-వర్ణాంత బహువచనరూపములు ప్రాచీనములు; అ - వర్ణాంతరూపములు తరువాతి కాలమున నేర్పడినవి. అందఱు, ఇందఱు, ఎందఱు, అనురూపములు నిట్టివే. 'పగఱవారు' అని నిర్వ. IV. 5 లో నున్నది.

'కాల్వురు' అను బహువచన రూపమున కేకవచన రూపమేమో తెలియదు. 'కాల్వుఁడు' అనునది లేదు. 'కాలివాఁడు' అనునదియు లేదు.

'కవలు' అనున దేకవచనరూపము; అది బహువచన రూప మను భ్రమచే నందుండి తరువాతి కాలమున తెనుఁగువారు 'కవ' యను నేకవచన రూపము నేర్పాటుచేసికొనిరి. కన్నడము: కవల్; తమిళము: కవడు, కవర్, మళయాళము: కవర; తుళు: కబర్.

'పడవాలు' సాధారణముగ మహద్వాచకముగ నుండి బహువచనమున 'పడవాళ్లు' అను రూపమును బొందుచున్నది. (భార. భీష్మ. I. 82; శల్య. I. 98); రామా. యుద్ధ. న 'పడాళులు' అని ప్రయోగింపఁబడియున్నది. స్త్రీ సైన్యాధిపత్యమును వహించినయెడల నామెను గూడ 'పడవాలు' అని పిలువవచ్చునో కూడదో తెలియదు.

వాదోడు, చేదోడు, సైదోడు, సూడు శబ్దములకు బహువచన మెట్లు కలుగునో నిర్ణయించుట కష్టము: వాదోడులు, చేదోడులు, సైదోడులు, ...ాడులు అని మాత్రముండునేమో. వాదోళ్లు, చేదోళ్లు మొదలగు ద్విత్వ ...-కార రూపము లుండవు. వాదోడు, చేదోడు, సైదోడు, అను పదములు ...త్యేకవచనము లైనను గావచ్చును

"కొన్ని డుమంతంబుల బహువచన లకారంబునకు రేఫంబును దానికి ముందు పూర్ణబిందుపూర్వక డకారంబునగు." "ఆల్వాదుల బహువచన ...కారంబునకు, రేఫంబును ముందటి ఉవర్ణంబునకు బిందుపూర్వక డకారం ...బునగు" అని చిన్నయసూరి నిత్యవిధులను గల్పించినాఁడు. ఇందువలన ...డండ్లు, కోడళ్లు, అల్లుండ్లు, అల్లుళ్లు, కొమాళ్లు మొదలగు రూపములకు లక్షణము లేకపోయినది. ఇట్టి రూపములు వ్యవహారమున నున్నవి. కావ్యములను గలవు.

సీ. అపజయంబెఱుఁగని-యచటిరాచకొమాళ్లు రణమున వెనుకయా... ...ఘనగుదు (రు) (రాధా. II

## 2. ఆకారాంత పదములు.

1. ఆకారాంతపదము లన్నిటి మీఁదను బహువచనమున లు వర్ణము చేరును: నవలా, నవలాలు; నేజా, నేజాలు. నతనాభిన్నవలా నొకానొక మరున్నారీ శిరోరత్నమున్ (మను. II.); II. కల్వమొగ్గనేజానటు చిమ్మి (భాను. III.) నవలా, నేజా, శబ్దముల తుదిదీర్ఘమునకు హ్రస్వమును నొకప్పుడు కలుగును. అన్నవల ముద్దుమోమును, దిన్నని నెన్నడుము నగవు దేటెడు కన్నుల్ (విక్ర. V.); అనుఁగుఁ జుట్టంబైన యలవసంతునిరాక విరవాజి బలు నేజ విఱుఁగఁబూచి (చంద్రా. III). III. 'నేజా' శబ్దము క్లీబసమమై ము-వర్ణకమునుగూడఁ బొందును: నేజము గొని యిప్పోటున నేజము నిన్ జేర్తు ననుచు (శశాం. V).

## 3. ఇదంతశబ్దములు.

i. తత్సమేకారాంతశబ్దములకువలె బహువచన లువర్ణముచేరునప్పు డాచ్ఛికేకారంతశబ్దముల తుది ఇత్తున కుత్తు కలుగును: కాకి, కాకులు; కంకి, కంకులు; దుక్కి, దుక్కులు; జిగి, జిగులు; ముంగి, ముంగులు; బుగ్గి, బుగ్గులు; గోఁచి, గోఁచులు; సంచి, సంచులు; కచ్చి, కచ్చులు; కాజి, కాజులు; గంజి, గంజులు; గజ్జి, గజ్జులు, కుంపటి, కుంపటులు; వెంటి, వెంటులు; చట్టి, చట్టులు; గడి, గడులు; గండి, గండులు; గడ్డి, గడ్డులు; జక్కిణి, జక్కిణులు; కోఁతి, కోఁతులు; దొంతి, దొంతులు; కత్తి, కత్తులు; గది, గదులు; గొంది, గొందులు; కొద్ది, కొద్దులు; పని, పనులు; ఉన్ని, ఉన్నులు; తలుపి, తలుపులు; కలయంపి, కలయంపులు; పుప్పి, పుప్పులు; ఊబి, ఊబులు; నంబి, నంబులు; గొబ్బి, గొబ్బులు; ఓరిమి, ఓరుములు; కమ్మి, కమ్ములు; అల్లరి, అల్లరులు; తఱి, తఱులు; మఱ్ఱి, మఱ్ఱులు; కరువలి, కరువలులు; నల్లి, నల్లులు; పెదవి, పెదవులు; జువ్వి, జువ్వులు; బేసి, బేసులు; తొస్సి, తొస్సులు; రహి, రహులు?; ఎగతాళి, ఎగతాళులు; మిళ్లి, మిళ్లులు.

ii. "వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు. ఇచ్చట వికృతిశబ్దంబుచే సంస్కృత సమేతరంబు గ్రహింపవలయు: కలికి, కలుకులు; ములికి, ములుకులు; చెలిమి, చెలుములు; బలిమి, బలుములు. ఉపోత్తమేత్వంబున కనుటంజేసి జిగి, నిసి, ఇత్యాదులం దుత్వంబులేదు. జిగులు, నిసులు.

"ర, ల, డోపధ నవార్థాదుల యుపోత్తమేత్వంబున కుత్వంబు గలుగదు. పందిరి, పందిరులు; పిడికిలి, పిడికిళులు; రాపిడి, రాపిడులు; తొమ్మిది, తొమ్మిదులు." చిన్నయసూరి.

ఇచట నుపోత్తమ మనఁగా మూఁడక్షరములును నంతకెక్కువయుఁ గల పదములందు తుది వర్ణమునకుఁ బూర్వవర్ణము; అనఁగా ఉపధకుఁ బూర్వవర్ణము.

చిన్నయసూరి చెప్పిన సూత్రమునందలి బాహుళకత్వముచేత నింకను గొన్నిచోట్లఁ బై కార్యములు కలుగవనియుఁ గొన్నిశబ్దములలో నుపోత్తమేత్వమునకేకాక యుపోపోత్తమేత్వమునకును నుత్వము గలుగుననియుఁ దెలియనగును.

i. ఉపోత్తమేత్వమున కుత్వము కలుగనందుకు: సిబ్బితి, సిబ్బితులు; జక్కిని, జక్కినులు.

ii. ర, ల, దోపధ నవార్థాదులలో నుత్వము కలుగుటకు: ఉరిడి, ఉరుడులు; మరిడి, మరుడులు; గరిడి, గరుడులు; అలికిడి, అలుకుడులు; కురిడి, కురుడులు; నరిడి, నరుడులు; ఉదిరి, ఉదురులు; తండిరి, తండురులు; తొమ్మిదికి వ్యవహారమున తొమ్ముదులు అనియే బహువచనరూపము; తొమ్మిదులు అని శ్రీనాథుఁడు 'మి'నియతిస్థానమున వాఁడివాఁడు (కాశీ. III. 181.) ఇది కవ్యాత్తి కావచ్చును. 'తొమ్ముదులు' అని శకుంతలాపరిణయము రెండవయాశ్వాసమున (పుట 45) వాడఁబడినది.

'రాపిడి'కి 'రాపుడులు' అనియు బహువచనరూపము గలదు; పత్తిరి, తిత్తిరి, పదములకు వ్యవహారమున పత్తురులు, తిత్తురులు, అను బహువచనరూపములు వినఁబడుచున్నవి.

iii. ఉపోపోత్తమేత్వమునకును నుత్వము కలుగుటకు: అలికిడి, అలుకుడులు; ఎనిమిది, ఎనుముదులు.

iv. తత్సమశబ్దములందును నుపోత్తమేత్వమున కుత్వమొకప్పుడు కలుగవచ్చును: సమితి, సముతులు.

v. ఒకరితి, ఎవరితి, అనుపదములపై లువర్ణముచేరి ఒకరితులు, ఎవరితులు, అను రూపములు కలుగవు.

టి వర్ణాంతశబ్దములు బహువచనమున - టులు అంతములుగా నగును; - టు మీఁదిఉత్వము వైకల్పికముగా లోపించును: కోమటి, కోమటులు, కోమట్లు; చక్కటి, చక్కటులు; చక్కట్లు; వెంటి, వెంటులు, వెంట్లు. తత్సమమగు 'కోటి, దృష్టి, శబ్దములమీఁదను నిట్లేయగును: కోటులు, కోట్లు; దృష్టులు, దృష్ట్లు. ఖండబిందుపూర్వక టి వర్ణాంతశబ్దములకు బహువచనము కలుగు -'టులు' లోని 'టు' మీఁది యుత్వము లోపించునపుడు ఖండ

బిందువునకుఁ బూర్ణబిందువు వచ్చును: తేఁటి, తేఁటులు (భార. అను. I. 181); తేంట్లు; (భాగ. VIII. 104); బోఁటి, బోఁటులు, బోంట్లు; - 'ట్టి' అంతమందుగల పదముల బహువచనరూపములలోని 'ట్టులు' అను దానిలోని 'ట్టు' లోని యుత్వమేకాక యొక టవ వర్ణముగూడ వైకల్పికముగ లోపించును: ఉట్టి, ఉట్టులు, ఉట్లు; జెట్టి, జెట్టులు, జెట్లు; పుట్టి, పుట్టులు, పుట్లు; సెట్టి, సెట్టులు, సెట్లు;-కొన్నియెడల నీమార్పు కలుగకపోవచ్చును: చిట్టి, చిట్టులు; మట్టి, మట్టులు; ముట్టి, ముట్టులు మొదలయినవి.

-'టి' వర్ణాంత శబ్దములపై బహువచన లువర్ణము చేరునప్పుడు 'టు' వర్ణముమీఁది యుత్వము వైకల్పికముగ లోపించును: తిట్టువాటు, తిట్టువాట్లు (భార. ఉద్యో. III. 37.) తఱటు, తఱటులు, తఱట్లు (భాగ. V. ii. 140.) 'ఒఱటు' నకు 'ఒఱట్లు' అనుబహువచనరూపము కలుగుననియే తోఁచుచున్నది. ఒఱటులు (భార.అను. V. 93.)

-'టు' అంతమందుగల శబ్దములకు బహువచన లకారము చేరునప్పుడుత్వమేకాక యొకటకారమును లోపించును: కట్టుఁబట్టు, కట్టుఁబట్టులు, కట్టుఁబట్లు (భార. భీష్మ. I. 82.); చుట్టు, చుట్టులు, చుట్లు (చుట్లనుండి-భార. ద్రో. II. 78); పరిచుట్లు (భాగ. VIII. 209); మేలుకట్టు, మేలుకట్టులు, మేలుకట్లు (భార. ఉద్యో. I. 93); వీడుఁబట్టు, వీడుఁబట్టులు, వీడుఁబట్లు (భార. అశ్వ. I. 136.)

ఖండబిందు పూర్వక టు వర్ణాంత పదములకు బహువచన లకారము చేరునపుడు టు వర్ణముమీఁది యుత్వము లోపించునపుడు వైకల్పికముగ ఖండబిందువు పూర్ణబిందువగును: తూఁటు, తూఁటులు, తూంట్లు (భాగ. III. 1003.)

-ది వర్ణాంతశబ్దములకు బహువచన లకారము చేరునపు డిత్వమున కుత్వముకలిగి, డకారమునకు ళకారముగూడ నాదేశమగును; డువర్ణముమీఁది యుత్వము లోపించును: లేడి, లేడులు (భార. విరా. III. 37.); లేళ్లు (భార. శల్య. I. 232; ద్రోణ. IV. 142; భీష్మ. II. 157); గుడి, గుడులు, గుడ్లు గుళ్లు (భార. ఆశ్ర. I. 7); అంగడి, అంగడులు, అంగళ్లు (భార. శాంతి. II 383;); అలజడి, అలజడులు, ఆలజళ్లు (భార. శాంతి. II. 337, అశ్వ. IV 155); అట్టళ్లు (భాగ. VII. 96; X. ii. 838-దీనికేకవచనము 'అట్టడి' యో 'అట్టలి' యో నిర్ణయింపఁ బ్రయోగము గానరాలేదు); నడవళ్లు (భాగ. II 387): పొడి, పొడులు, పొళ్లు (భీమ. III. 357.); మడి,మళ్లు (కళా. IV, 97 మెరవడి (ణి), మెరవళ్లు(ఉ.రా. పు. 78);నాడి, నాళులు (కళా. V. 162);ప

కుబడి, పలుకుబళ్లు (వరహా. I. 9.); పచ్చడి, పచ్చడులు, పచ్చళ్లు; నూ(ను) జెపిడి, నూ(ను) జెపిడులు, నూ(ను) జెపిళ్లు; కురిమిడి, కురిమిడులు, కురిమిళ్లు; సొలిమిడి, సొలిమిడులు, సొలిమిళ్లు, రాపిడి, రాపి (పు?) డులు, రాపి (పు) ళ్లు; గరిమిడి, గరిమిడులు, గరిమిళ్లు మొదలయినవి.

పంగిడి, చప్పిడి, పిసిడి, శబ్దములకు పంగిళ్లు, చప్పిళ్లు, పిసిళ్లు, అను రూపములు కలుగునో కలుగవో తెలియదు. తడి, నుడి, మిడి, పడి, వడి, విడి మొదలగు వానికి - 'ళ్లు' తోడిబహువచన రూపములు గలవు.

కావళులు (భార. మా I. 29);; వేళులు (భార. ద్రో. II. 25); మొదలగు 'ళులు' అంతమందుగల బహువనన రూపములును నున్నవి.

వ్యవహారమున - 'ళ్లు' అంతమందుగల బహువచనరూపములే విన వచ్చుచున్నవి; -'డులు' రూపములు వినబడుట యరుదు.-'ళులు' రూపములు కవులు పద్యగణములకొఱకు గల్పించినవిగఁ దోఁచుచున్నవి.

ఖండబిందుపూర్వక ఁడివర్ణ మంతమందుగల శబ్దములకు బహువచన లు-ప్రత్యయము చేరునప్పుడు 'డి''డు' గ మాఱుటయేకాక, ఖండబిందువును వైకల్పికముగఁ బూర్ణ బిందువగును:పసిఁడి, పసిఁడిలు,పసిండ్లు;కాఁడి,కాఁడులు, కాండ్లు (భార. విరా. V. 53); ('కాళ్లు' అని వ్యవహారమునఁ గలదు.)-కొన్ని యెడల -ఁడులు' '-ండ్లు' గమాఱునో మాఱదో తెలియదు: గాఁడి(గాండ్లు?) చూఁడి, చూండ్లు); తాఁడి (తాండ్లు?); పాఁడి (పాండ్లు?) వాఁడి (వాండ్లు?), వేఁడి (వేండ్లు?); పూఁబోఁడి మొదలగు మహతీ వాచకపదములకు పూఁబోఁ ...లు,పూఁబోండ్లు,పూఁబోళ్లు, అను బహువచనరూపములు గలుగును. కవికర్ణ ...సాయనము IV. 37 లో పువ్వుఁబోంట్లు అను రూపము కానవచ్చుచున్నది.

'-ండి'అంతమందుగల శబ్దములు బహువచనములు'ండులు'అంతమందు ...వై 'డు' మీఁది యుత్వము లోపింపఁగా-'ండ్లు' అంతమందు కలవ గిండి, గిండులు, గిండ్లు; తిండి, తిండులు, తిండ్లు; బండి, బండులు,బండ్లు. చోట్ల నట్లగునో కాదోనిర్ణయింప వీలులేదు: కొండి (కొండ్లు?); తొండి ...ండ్లు?), దండి (దండ్లు?);దుండి(దుండ్లు?);దొండి(దొండ్లు?);బగ్గుండి(బగ్గుం వెండి (వెండ్లు).

'-ండ్లు' రూపములలో 'డ' కు 'ళ' ఆదేశమయి'-ంళ్లు' అను రూప పొందియుండుట శాసనములందు కానవచ్చుచున్నది. స్థిరవర్ణమునకుఁ ...మందాద్యక్షిక పదములలో ననుస్వార ముండదను కారణమునఁ జిన్నయ ...లుండవని తలంచెను; కాని, శాసనములం దట్టి రూప

ములు గలవు. రానురాను-'ంళ్లు' లోని యనుస్వారోచ్చారణము లోపింపఁగా -'ళ్లు' తోడి బహువచనరూపములు ప్రచారములోనికి వచ్చినవి: బళ్లు, తిళ్లు, మొదలగునవి. కొన్నిచోట్ల నిట్టిశబ్దములకు - 'ళ్లు' తోడిబహువచన రూపములు గలుగవు.

'-డ్డి' అంతమందుగల శబ్దములకు బహువచనమున '-డ్డులు' అనుదంతమందు రాఁగా నందు 'డ్డు' లోని యుత్వమును నొక డకారమునున లోపించుటయుఁ కలదు. ఇట్టి 'డ్లు' అను బహువచన రూపమునకు 'ళ్లు' ఆదేశముకాదు: గ్రుడ్డి, గ్రుడ్లులు, గ్రుడ్లు; బుడ్డి, బుడ్డులు, బుడ్లు; దిడ్డి, దిడ్డులు; దిడ్లు;—అడ్డి (అడ్లు), నడ్డి (నడ్లు); గడ్డి (గడ్లు); మడ్డి (మడ్లు) అను బహువచన రూపములు వ్యవహారమున నున్నవి.

'-డు' అంతమందుగల పదములపై బహువచనమున లువర్ణము చేరఁగా 'డు' మీఁది యుత్వము లోపించుటయు, డకారమునకు ళకార మాదేశముగా వచ్చుటయుఁ గలుగును. కీడు, కీడులు, (భార. ఆశ్ర. V. 432), కీళులు, కీళ్లు. (భార. ఆశ్ర. I. 90; శాంతి. III. 71); వఱడు, వఱడులు, వఱళులు (భార. కర్ణ II. 116; శల్య. II. 240), వఱళ్లు; మెదడు, మెదడులు, మెదళులు (భార. శల్య. I. 130), మెదళ్లు; అఱువుడు, అఱువుడులు, అఱువుళులు, అఱువుళ్లు (భార. విరా. V. 36; ద్రో. II. 39; III. 203; భీష్మ. III. 306; 233); వీడు, వీడులు (భార. అను. I. 51), వీళులు (భార. ఉద్యో. III. 303); వీళ్లు (భార. ఉద్యో. IV. 269, 382); చప్పుడు, చప్పుడులు, చప్పుళులు, చప్పుళ్లు (భార. భీష్మ. I. 267; III. 247; భాగ. VIII. 55); - ఇట్లే, పేడు, పేడులు, పేళులు, పేళ్లు; నేరేడు (మొద.), నేరేడులు, నేరేళులు, నేరేళ్లు (మొద.); నంజుడు, నంజుడులు, నంజుళులు, నంజుళ్లు; - తోడు (=సాహాయ్యము, సాహాయ్యకుఁడు) అనుపదమునకు తోళులు, తోళ్లు, అను బహువచన రూపములు లేవేమో. ఇట్లే, గడు, గాడు, గోడు, చౌడు, చోడు, జాడు, తౌడు, తెరలుడు, బోడు, రాడు, పదములకును - ళ్లుతోడి బహువచన రూపములు లేవు. 'కోడి' శబ్దమునకు 'కోడులు' అనురూపము గ్రంథములందు కానరాలేదు. గ్రంథములందును వ్యవహారమునందును 'కోళ్లు' అనురూపమే యున్నది.

ఖండ బిందుపూర్వక డువర్ణాంత శబ్దములపై బహువచన లువర్ణము చేరునప్పుడు ఖండబిందువున కొకప్పుడు పూర్ణబిందువు వచ్చును. అప్పుడు 'డ' కారమునకు ళకార మాదేశమయి '-ంళ్లు' కాఁగా ననుస్వారము లోపిం 'ళ్లు' అను బహువచనరూపము కలుగును. ఈ 'ళ్లు' 'ళులు' గాఁగూడ విడి

వును; ఏఁడు, ఏఁడులు, ఏండ్లు (భార. శాంతి. V. 46), ఏళ్లు, చెన్నబ. పు. 29); ఏళులు; తూఁడు, తూఁడులు, తూండ్లు (భార. అను. III. 220), తూళ్లు, తూళులు; గూఁడు, గూఁడులు, గూండ్లు, గూళ్లు, గూళులు; - 'నాఁడు' కు 'నాఁడులు', 'నాళ్లు,' 'నాళులు' అనియేకాని 'నాండ్లు' అను బహువచన రూపము లేదు. నాళ్లు (భార. అర. V. 223; భీష్మ. I. 64; ద్రోణ. I. 59; 130; కర్ణ. I. 53; శాంతి. III. 66; అను. II. 83).

• పూర్ణబిందుపూర్వక డువర్ణాంతపదములపై బహువచన లువర్ణము చేరునపుడు తెలుచుగ 'డు' మీఁది యుత్వము లోపించును. ఈ - 'ండ్లు' 'ంళ్లు' గను 'ళ్లు' గనుమాఱుటగలదు. గుండు, గుండులు, గుండ్లు (భార. ద్రోణ. III.67; సౌ. I. 197, భాగ. III. 988); పండు, పండులు (భార. అను. I. 50); పండ్లు (భాగ. V. ii. 21), పళ్లు; ఇట్లే, పుండు, పుండులు, పుండ్లు. పుళ్లు; దిండు, దిండులు, దిండ్లు, దిళ్లు; గొబ్బండు, గొబ్బండులు, గొబ్బండ్లు, గొబ్బళ్లు; మొదలయినవి. లొండు, రొండు, బొండు, బెండు, చెండు, చుండు, లకు, 'ండ్లు' తోడి బహువచనరూపములు గలుగవు.

'డ్డు' అంతమందుగల శబ్దములకు బహువచన లువర్ణము పరమగు నపుడు 'డ్డు' లోని తుదియుత్వమును నొక డకారమును లోపించుటయుఁ గలదు. ఇట్లేర్పడిన 'డ్లు' 'ళ్లు, ళులు' గా మాఱదు. గ్రుడ్డు, గ్రుడ్డులు, గ్రుడ్లు (భాగ. III. 702); ఇట్లే, అడ్డు, ఒడ్డు, గొడ్డు, జిడ్డు, త్రొడ్డు, దుడ్డు, బడ్డు, బొడ్డు, ఱొడ్డు, లొడ్డు, వెడ్డు, సొడ్డు, లకును దెలిసికొనవలెను.

'ణి' అంతమందుగల 'పింగాణి' శబ్దమునకు 'పింగాండ్లు' అను బహువ న రూపము వరాహపురాణము నాల్గవ అశ్వాసమున వాడఁబడినది.

'ది, - ఁది, - ంది, - ద్ది' అను నంతమందుగల శబ్దముల బహువచన కారమునకు ముందు వాని తుదియిత్వమున కుత్వము కలుగును.-దు,- ఁదు, ందు, - ద్దు, లపై బహువచనమున లువర్ణము చేరును. ఇట్లేర్పడిన బహు చన రూపములందలి దులు, ఁదులు, ద్దులు, లందు '-డులు, - ఁడులు,- ులు' లందు గలుగు లోపాదికార్యములు కలుగవు. - 'ఎద్దు' శబ్దమునకు వచనమున 'ఎడ్లు' అనియు రూపము కలుగును. 'ఎడ్లు' లోని డకారము ళకారముగూడ నరుదుగ నాదేశమగునని తెలుపుటకు శబ్దరత్నాకరమున ండ్లు కట్టింపు పై బరువు లెక్కింపు మీఁ దెళ్లను బూన్చు కావళ్లనునుపు" రి. పూ. VI.) అను నుదాహరణ మీఁబడినది. కాని, లోకమున 'ఎడ్లు' రూపమేకాని, 'ఎళ్లు' అనునది లేకుండుటచేతను, కావళ్లకు 'కావడ్లు' రూపమును నుండుటచేతను, 'ఎడ్లను బూన్చి కావడ్ల నునుపు' అనుసా మే సరియైనదనియును 'ఎళ్లు' అనురూపము లేదనియుఁ జెప్పవచ్చును. 'ఎడ్లు'

బ్దము ఆవు, ఎద్దు, ఎనుము, లకు సామాన్య వాచకముగ తొలుత నుపయో ంపఁబడి యుండవచ్చును. శాసనములలో 'ఇనుపమెడ్లు' అని కానవచ్చు చున్నది. ఈ పదము 'ఎనుము' లకు పర్యాయ వాచకమయినట్లు కనఁబడు చున్నది. (చూ. తమిళము: ఎఱుదు. కన్నడము, ఎత్తు = ఎద్దు; కన్నడము; )ఱుమె = ఎనుము.) ఎడ్లు - భార. ఆర. IV. 349;

'కోన' శబ్దమునకు బహువచన లువర్ణము పరమగునపు డొకచో వాని తుది యత్వమునకు దీర్ఘము కలుగును: కోనాలగొంది (పాండు V. 296.) ఇది 'కోణములగొంది' కి రూపాంతరమైనను గావచ్చును.

'ను' వర్ణాంత శబ్దములను వాని బహువచన రూపములనుబట్టి మూఁడు వర్గములుగా విభజింపవచ్చును: (i) ను వర్ణము లోపించునవి (ii) ను వర్ణము లోపించి లుప్తశేషముపై 'ఁకులు' గాని 'ఁగులు' గాని చేరునవి (iii) ను వర్ణము లోపింపక లువర్ణము చేరునవి, అని.

(i) నువర్ణము లోపించునవి: చేను, చేలు; పేను, పేలు; మీను, మీలు (భార. అను. II. 262); - వ్యవహారమున చేనులు, పేనులు, అనురూపములును గలవు. 'మీను' నేఁడు వ్యవహారమున లేదు. దానికి 'మీనులు' అను బహువచనరూపము కవిక. III. 48; IV. 41; చెన్నబ. పు. 123. లో కానవచ్చుచున్నది.

(ii) (అ) ను వర్ణములోపించి బహు వచనమున 'ఁకులు' చేరునవి: కలను, కలఁకులు: కెలను, కెలఁకులు (భార. ద్రో. V. 132; శల్య. I. 53; అను. I. 181; భాగ. VIII. 213); కొలను, కొలఁకులు (భార. ఆర. IV. 332; అను. I. 181), గవను, గవఁకులు (భాగ. IV. 767); మ్రాను, మ్రాఁకులు (భార. ఆర. VII. 99; భీష్మ. I. 251; అను. II. 9); ఇట్లే, కొఱను, కొఱఁకులు, నెఱను, నెఱఁకులు; వరను, వరఁకులు; వలను (దిక్కు-అనునర్థమున), వలఁకులు (ఉపాయమను నర్థముద నీ రూపము కలుగదు); పై పదములలో కొలను, గవను, మ్రాను, అనుపదములు మాత్రము నేఁటి వ్యవహారమున నున్నవి; వ్యవహారమున వానికి కొలనులు, గవనులు, మ్రానులు, అను బహువచన రూపములను గలవు. 'ముసలి మానుల్' అని వసుచరిత్ర కారుఁడు (ఆశ్వాసము I.) శ్లేషించినాఁడు.

(ఆ) బహువచనమున నువర్ణము లోపించి-'ఁగులు' చేరునవి: రేను, రేఁగులు; గోను, గోఁగులు. - ఉత్తరేను, సంబరేను, శబ్దములకు బహువచనమున నీకార్యము గలుగదు.

(iii) బహువచనమున ను వర్ణము నిలిచి లు వర్ణము చేరునవి:

(అ) కొలను శబ్దము వంటివి: అదను, చదును, జడను, జతను, పదును, పసను, సాబను.

(ఆ) మీను, మ్రాను, గోను శబ్దములవంటివి: కాను, గూను, జాను, జీను, మేను, వీను.

కన్ను శబ్దమునకు బహువచనము 'కన్నులు.' ప్రాచీనకవు లిట్లేవాడిరి. కావి, కండ్లు, కళ్లు, అను రూపములు వ్యవహారమందును నర్వాచీన కావ్యము లందును గలవు. వీనికెవ్వరును లక్షణముఁ గల్పింప కుండుట యా రూపముల దోషముకాదు.

చ. మొగంబునఁ బొట్టుదిద్ది యంజనము గండ్లఁ దీర్చి (కవిజనచ. చ. IV. 178).

ఆ. వె. నేఁడు, గలిగెఁ జూడఁ గళ్లకఱవుదీఱ (నిర్వ. విరా. పు. 35)

సీ. కడగండ్ల బడువారిఁగడగండ్ల నీక్షించి (నిర్వ. వి. రా. పు. 147)

క. కళ్లంగి వేసినట్లా, త్రుళ్లడమున మోహుఁబట్టి (ప్రబో. పు. 41)

చ. వింతచేష్టలం గడువడిఁ దానొకొక్కయెడఁ గండ్లెఱజేయుచు (రాజశే. III. 26)

ఆ. వె. ముండ్లకట్టె నొకని - కండ్లువెటికి (సానం. పు. 26.)

గీ. కొండతటి, కండ్లు వెటికి నిమ్మ - పండ్లుగుచ్చి (సానం. III. 57)

ఇట్లే, 'చన్ను' శబ్దమునకు 'చన్నులు' బహువచనరూపము; అర్వాచీన కవులు 'చండ్లు' అనివాడిరి. వ్యవహారమున 'చళ్లు' అని వినఁబడుచున్నది. 'న్ను' అంతమందుగల తక్కిన శబ్దముల కన్నిటికిని బహువచనమున 'లు' వర్ణము మాత్రము చేరును. నువర్ణమునకెట్టి వికారమును గలుగదు.

వైభక్తికమువర్ణముకాని ముపర్ణముతో నంతమగు కొన్ని శబ్దము లకు బహువచన లువర్ణము చేరునపు డా మువర్ణము వైకల్పికముగ లోపిం చును: ఉదా. జాము, జాములు, జాలు (కాశీ. V. 333; మను; వేంక. పంచ. IV. 164); పెండ్లాము, పెండ్లాములు, పెండ్లాలు ('పెండ్లము' పైలు వర్ణము నకు బూర్వమందు 'ము' లోపము కలుగదు); జాజాము, జాజాములు, జాజాలు; గుడ్డాము, గుడ్డాలు; జుంజాము, జుంజాలు; దోణాము, దోణాలు; గోతాము, గోతాలు మొదలయినవి. ఈ మువర్ణము దీర్ఘముల మీఁద నున్నప్పుడే కొన్నియెడల బహువచనమున లోపించుచుండును. ఆము, ఈము, గాము, గీము, గోము, చీము, తీము, తూము, దీము, నాము, నోము,

౦, పేము, బాము, బోము, మోము, వాము, వేము, సాము లకు బహు లు వర్ణమునకుముందు లోపము గలుగదు. ఇట్లే, అనుము, ఆలము, ము, ఇలుము, ఇల్లము, ఇనుము, పెనము మొదలగు వానియందును ౦వచనమున ము వర్ణము లోపింపదు.

(i) కొన్ని - యి వర్ణాంతశబ్దములపై బహువచన లు వర్ణము చేరు డు యకారమునకు తకార మాదేశమగును: చేయి, చేతులు; దాయి, తులు; నూయి, నూతులు; పీయి, పీతులు; నేయి, నేతులు.

(ii) కొన్ని - యి వర్ణాంతశబ్దముల తుది యి వర్ణము బహువచన న లోపించును: వ్రాయి, వ్రాలు; రేయి, రేలు; ఱాయి, ఱాలు; ్రయి, ప్రాలు; 'ఱాయి' కి 'ఱాళ్లు' అనియు బహువచనరూపము వ్యవ రమున గలదు.

(iii) కొన్ని - యి వర్ణాంతశబ్దముల బహువచనరూపములను నిర్ణయిం ట కష్టము: కూయి, మెయి, కుయి, దోయి, బాయి, రోయి, ప్రోయి, యి, నుయి, గోయి.

(iv) 'వాయి' కి బహువచనము 'వాతులు'; కాని, ఉప్పలవాయి, వాయి, అరవాయి, దళవాయి మొదలగు పదములకు బహువచనము నిర్ణ ౦పనాధారములు లేవు. అమ్మాయి, అబ్బాయి, శబ్దములకు అమ్మాయులు, బ్బాయులు, అని వ్యవహారమున బహువచన రూపములు వినబడుచున్నవి.

(v) 'పాయి' కి 'పాలు' అనియు, 'కయి' కి 'కేలు' అనియు బహువచన ాపము లగునేమో. 'పాలు' బాగున్నవి, రుచిగానున్నవి, అని బహువచనము ౦దే యుపయోగింతుము. పయశ్శబ్ద భవమగు 'పాయి' యిపుడు పిల్లల విష యమున నే యుపయోగింపఁబడుచున్నది. "కొడుకుఁ, బాయని యక్కుఁనఁబట్టి ాలిండ్ల, నొత్తి" (హరిశ్చ. భా. II.).

'కేలు' ఏకవచనమునందును బహువచనమునందును గూడ గ్రంథము ౦ దుపయోగింపఁబడినట్లు తోఁచుచున్నది; కాని, యిదమిత్థమని నిర్ణయింప ులు లేకున్నది. "వడి నొడు గఱచి వలకేల్ నిడుచన గనయమునఁ బెనఁచి (భార. ఆది. VII. 175.) ఇందు నన్నయ 'కేలు' శబ్దము నేకవచనమున నుప యోగించినాఁడు. "అని కేలు మొగిచి మ్రొక్కిన" (ఆది. V. 20); "కొందఱు మొగిన కేలు మొగిచి మ్రొక్కిరి" (ఆర. II. 102) లో దానిని బహువచనమున వాడినాఁడు. ఆర. V. 277లో, 'ఇరుకేలఁ' అనియున్నది; ఇచట నిది బహువచ నమో యేకవచనమో తెలియదు. ఇరు, ఇను, మూ, నలు, అనువానిపై జేరిన పదము లేకవచనమునందే సాధారణముగఁ గాన్పించుచున్నవి. ఇరుచే

యునెత్తి (భార. మా. I. 151); ఇరుదెఱుంగు (ఉద్యో. IV. 168; V. అను. 146, 181; అశ్వ. II. III; మా. I. 54, 58); ఇరుపీనుఁగు (భీష్మ. II. 209; ఇరుప్రొద్దు (శాంతి. IV. 368; అను. V. 8; అశ్వ. II. 168); ఇరుమేను (భీష్మ. I. 251); ఇరుమూఁడు (భీష్మ. I. 273); ఇరుపఱియ (కర్ణ. I. 94; సౌ. I. 192); ఇరువాఁగు (నిర్వ. V. 73; విరా. III. 170; భీష్మ. II. 42; 290, 395; III. 208, 315; ద్రోణ. I. 271; V. 278; కర్ణ. I. 69); ఇనుమడి (విరా. II. 45; అను. IV. 419); ఇనుమాటు (భాగ. II. 227); ఇనుమాఱు (కర్ణ. III. 317); ముత్తునియ (భీష్మ. II. 53, 79; ద్రోణ. IV. 27); నలుగడ (ద్రోణ. III. 62; కర్ణ. I. 5; శాంతి. V. 440; అను. I. 287); నలుమడి (ద్రోణ. II. 213); కాని, ఇరుకెలంకుల (ద్రోణ. V. 142, ఇది వచనమున నున్నది; 'కెలనన్' అనినను తప్పు లేదు); ఇరుతెఱఁగుల సైనికులకు (ద్రోణ. I. 135, దీనిని 'ఇరుతెఱఁగుఁ సైనికులకు' అని సవరింప వీలున్నది); ఇరువంకలన్ (ఉద్యో. III. 253, ఇది వచనమున నున్నది; 'ఇరువంకన్' అని యుండెనేమో); నలుదిక్కులన్ (ద్రోణ. II. 79; దిక్కునన్' అని యుండవచ్చును); నల్దిక్కుల మన్నీలు (శల్య. I. 9; 'దిక్కున' అని యుండ వచ్చును);—ఇట్లున్నను విరాటపర్వము III. 198లో 'ఇరువాఁగులు' అని 'లు'వర్ణము ప్రాసస్థానమం దున్నది. ఇందువలన ఇరు, మూ, నలు,లపైఁ జేరు పద మేకవచనమం దయినను బహువచనమం దయినను నుండవచ్చు నని తేలుచున్నది. కావున 'ఇరుకేలన్' అనుచోట 'కేలు' ఏకవచనరూపమో, బహువచనరూపమో నిర్ణయించుట కష్టము. 'కేలు' ఏకవచనరూప మైనచో దానికి 'కేళ్లు' అనుబహువచనరూప ముండవలెను. కాని, యది గ్రంథములందు కానరాదు. 'కయి'కి 'కేలు' బహువచనరూపము కానిచో దానికి బహువచనరూప మేమై యుండును? కయి, కేలు, అను రెండును నేఁడు వ్యవహారభ్రష్టములు గావున నీ విషయమై యేమి చెప్పుటకును వీలులే కున్నది.

రి- వర్ణాంతపదములపై బహువచన లువర్ణము పరమగునపుడు సాధారణముగ 'రి' మీఁది యిత్వమున కుత్వము వచ్చును. ఈ యుకారము లోపించుచుండును.

అరి, అరులు; అల్లరి (-రులు); ఉదిరి (-రులు); ఉరి (-రులు) ఊపిరి (-రులు); ఎడారి (-రులు); తిరి (-రులు); విరి (-రులు); సరి (-రులు) మొదలయినవి. వీని యన్నిటియందును-'-రులు', '-ర్లు'గ, మాఱును. ఈ 'ర్లు' 'ళ్లు'గ మాఱదు.

'వరి' శబ్దమునకు 'వడ్లు' అనునది బహువచనరూపము.

'సీవిరి' శబ్దమున కర్థ మేమో తెలియదు. "తెల్లసీవిరులును వెల్లనిగొడు ..., యల్లవాఁడె పాండవాగ్రజుండు" (భార. కర్ణ. I. 190) దీనికి "తెల్ల ... సిడము, తెల్లనిగొడుగునై" అని పాఠాంతరము గలదు "కడలుకొనఁ ... పట్టెడు గొడుగు లెవ్వి, యెసక మెసగంగ సీవిరు లేలపట్టరు" (శల్య. II. ...) ఇందు ముద్రితపాఠమున 'సీవురులు' అని యున్నది. దీనికి సంస్కృత ...తమున "శ్వేతే త దమలం ఛత్రం వ్యజనం శ్వ చ పార్థివ" అని యున్నది. ...ని బట్టి శ. ర-కారుఁడు 'సీవిరి' కి 'ఆలవట్టము' అని యర్థము వ్రాసెను. ...శ్యోగపర్వము IV. 123లో "ఉచితగతిఁ జేరి వంది, ప్రచయము గీర్తింప ...క్క రథమం దొనరన్, ఖచియించిన వజ్రంబుల, రుచులను బోలుపారు ...రులు బెరయంగన్" అని యున్నది. ఇందు 'బెరయంగన్' అనఁగా నర్థమేమి? ...వ్యాపింపన్' అని యర్థము చెప్పవచ్చునా? అయిన 'సీవిరులు=ఆలవట్టములు' ...వ్యాపించుట యేమి? ఇచట 'సీవిరులు' అనుటకు 'నాసిగులు' అను పాఠాంతర ...యున్నది. కాని, 'నాసిరి(?)' శబ్దరత్నాకరమున లేదు. 'నాసిరి' కర్థ మేమి? ...విరి' యేకవచనరూప మగునా? లేక నిత్యబహువచనమా? లేదా, 'సీవిరులు' ...రులు, అరులు, మొదలగువానివలె నేకవచనరూపమా? 'సీవిరి' 'సీవురు' ...అనువానిలో నేది సరియైనరూపము? 'సీవిరి' యేకవచనమైనచో బహువచన ...మున దాని యుపోత్త మేత్వమున కుత్వము కలిగినదా?

రు-వర్ణాంతశబ్దములపై బహువచన లువర్ణము చేరునప్పుడు 'రు' మీఁది యుత్వము లోపించును. చాలపదములలో నీ 'ర్లు' 'ళ్లు'గా మాఱును. ఈ 'ళ్లు' ళులు'గా గ్రంథములలో శిథిలమైకూడఁ గాన్పించుచున్నది. వ్యవహారమున ...ళులు' రూపము లుండవు. -ఎదురు, ఎదురులు, ఎదుర్లు, ఎదుళ్లు(భార. ఉద్యో. III. 228); నీరు, (నీరులు?), (నీర్లు?), నీళ్లు (భార. ఆది. IV. 128; V. 18; VI. 173, 179, 219; అర. I. అర. 6; XI. 87); కన్నీళ్లు (భార. ఆది. VII. 268; VI. 259); నీళులు (భార. ఆది. IV. 86; V. 259; ఉద్యో. II. 125; భీష్మ. III. 156; ద్రోణ. III. 160, 161; శాంతి. IV. 413); కన్నీళులు ద్రోణ. IV. 333; ఆశ్ర. I. 164); ఎసరు, ఎసరులు (భార. ఉద్యో. IV. 116): ఎసర్లు (?), ఎసళ్లు; కుదురు, కుదురులు, కుదుర్లు, కుదుళ్లు (భాగ. VIII. 55); పేరు, పేరులు, పేర్లు, పేళ్లు, పేళులు, (భార. శాంతి. V. 626, VI. 436; అశ్వ. II. 156); ఊరు, ఊరులు, ఊర్లు, ఊళ్లు, ఊళులు (భార. ఆది. V. 267; విరా. III. 119; ఉద్యో. II. 219; శాంతి. II. 386; ఆశ్ర. I. 7, 102); తుమురు, తుమురులు (తుత్తుమురులు, భార. భీష్మ. I. 267); తుముర్లు, తుముళ్లు (భార. ద్రోణ. I. 341; నోరు, నోరులు, నోర్లు, నోళ్లు (భార. ద్రో. II. 87); వేరు, వేరులు, వేర్లు, వేళ్లు (భార. ఆది. II. 140; సౌ. I. 16);

గోరు, గోరులు, గోర్లు, గోళ్లు (భార. విరా. I. 148; సౌ. I. 153); చిగురు, చిగురులు (భార. విరా. II. 67); చిగుర్లు, చిగుళ్లు, చిగుళులు (భార. విరా. V. 402); నగరు, నగరులు, నగర్లు, నగళ్లు (భార. ఉద్యో. III. 153); నగళులు (భార. విరా. I. 130); ఏరు, ఏరులు, ఏర్లు, ఏళ్లు; కరుదు, కరుదులు (-ర్లు, -ళ్లు); చీఁపురు (-లు, రులు, -ర్లు -ళ్లు); నల్లేరు (లు, - రులు, - ర్లు, - ళ్లు); నుదురు (-లు,-రులు,-ర్లు,-ళ్లు,-); వెదురు (-లు-రులు, ర్లు,-ళ్లు.) అంబరు, అవురు, అకరు, అగురు, అనరు, అంబరు, అలరు, అవురు, ఉల్లారు, ఎలరు, ఓరు, కనరు, కసురు, కారు, కిసరు, కోరు, కౌరు, గండారు, గగు (గ్గ) రు, గదురు, గన్నె (న్నే) రు, గరు, గలిజె (జే)రు, గుబు (ము) రు, గురు, గొవరు, గౌరు, చమురు, చౌరు, జిగురు, డొగరు, తలిరు, తేరు, తైరు, తొగరు, తొట్రు, నెత్తురు, నెత్తురులు (విరా. I. 148); నౌరు, పీరు, సైరు, మేరు, మోరు, సారు, సోరు, సౌరు, అను పదముల బహువచనరూపములు - 'ళ్లు' తో, అంతము కావు.

ఉ-వర్ణాంతశబ్దములలో 'ఏఱు' అను దానికిమాత్రము 'ఏఱులు' (భార. శాంతి. III. 280); సెలయేఱులు (భార. భీష్మ. II. 240; భాగ. VI. 221), ఏఱ్లు, ఏళ్లు, అను బహువచనరూపములు గలుగును. తక్కినవానికి లువర్ణము చేరును; 'ఉలు' - 'ళ్లు'గ మాఱదు.

ల-వర్ణాంత శబ్దములలో 'నెల' కు బహువచనరూప మగు 'నెలలు' మాత్రము 'నెల్లు' అని యగును. ఉదాహరణము లదంతశబ్దముల బహువచన రూపములలో నీయఁబడినవి.

లి-వర్ణాంతపదముల బహువచనమున లు వర్ణము చేరి పదాంత మం దలి యిత్వమున కుత్వము కలుగును; ఒకప్పుడు పదము నుపోత్త మేత్వమున కును నుత్వము కలుగును. ఇట్లేర్పడిన - 'లులు' 'ళ్లు' గ మాఱుటయు, '-ళ్లు' '-ళులు' గా విడుటయుఁగూడఁ గలుగుచుండును: 'వేనలి' కి బహువచనరూప మగు 'వేనలులు' (భార. స్త్రీ. I. 98) అనుదానియందు తప్ప సాధారణముగ '-లులు' తోడి బహువచనరూపము లరుదనియే చెప్పవచ్చును. '-ళులు' తోడిరూపములు కేవల గ్రాంథికములు; పద్యగణాది సౌకర్యముకొఱకు వానిని కవులుకల్పించి యుందురు.

ల-వర్ణాంత శబ్దములలో 'నెల' కు 'నెలలు, నెల్లు' అను రెండు బహు వచనరూపము కాన్పించు చున్నవి. ఇట్లే, 'కుచ్చె'లకు కుచ్చెలలు, కుచ్చెల్లు' అను బహువచనరూపము లున్నవి. వ్యవహారమున 'ఒడిసెల, ఒడిసెల్లు; కల, కల్లు; గె(గొ) ల, గె(గొ)ల్లు; గోల, గోల్లు; తల, తల్లు; తోల, తోల్లు; దూల, దూల్లు; నేల, నేల్లు, మూల, మూల్లు; వల, వల్లు; వెన్నెల, వెన్నెల్లు; వెల,

ు; చీల, చీల్లు' అను బహువచనరూపములు వినఁబడుచున్నవి గాని వానికి ంథములందు ప్రయోగములు కానరావు. 'తొట్టెల, తొట్టిల, లను ట్టెళ్లు, తొట్టిళ్లు' అని వ్యవహారమున బహువచనము కలదు; గ్రంథముల ను నుండునేమో. "అద్దాళ్లలో నున్నప్పుడే బిడ్డలు" అను నానుడిలో ద్దాళ్లు' అనునది నిత్యబహువచనముగా నున్నది; దీని కేకవచనరూపము ద్దాల' అని యుండునా? లేక 'అద్దములు = అద్దాలుఅని చెప్పి, అద్దాలు ప బహువచనరూపముపై మరల బహువచన లు-వర్ణము చేరిన దని చెప్ప' ెనా?

లి-వర్ణాంత శబ్దములలోఁ గొన్నిటిపై బహువచన లు వర్ణము చేరు ప్పుడు 'లి' 'లు' గా మాత్రము మాఱును: వేనలి, వేనలులు (భార. స్త్రీ. 98); ఇలి, ఇలులు; (ఉగ్మలి, ఉగ్మలులు); ఉలి, ఉలులు; ఓకలి, ఓకలులు; డలి, కడలులు; కరువలి, కరువలులు, కలి, కలులు; కూలి, కూలులు; కొలి, లులు (తొలులుఁ గొలులు-ఉ. హరి. V.); గాలి, గాలులు; గిలి, గిలులు; లి, చీలులు; చెలి, చెలులు; చూలి, చూలులు (-ళ్లు?); జాబిలి, జాబిలులు ళ్లు?)జాలి, జాలులు; జోలి; జోలులు, తాలి, తాలులు; (తొయ్యలి, తొయ్య లు - కళా. III. 255); తొలి, తొలులు (తొలులుఁ గొలులు- ఉ. హరి. .); దాలి, దాలులు; నాలి, నాలులు (కూలినాలులు); నులి, నులులు; లి, పులులు; పొలి, పొలులు; బలి, బలులు; మెలి, మెలులు; లాలి, ాలులు; వలి, వలులు; గుబ్బలి, గుబ్బలులు; జిలిబిలి, జిలిబిలులు; మొద యినవి. వ్యవహారమున బహువచన లువర్ణమునకుఁ బూర్వమం దున్న ఋత్వమునకు లోపము వినఁబడుచున్నది. కూల్లు, నాల్లు, పుల్లు, మొద.

కొన్ని లి-వర్ణాంత శబ్దములపై బహువచన లువర్ణము చేరునప్పుడు లి ర్ణమునకు బిందుపూర్వక డకార మాదేశ మయి -ండ్లు తోడి బహువచన రూపము లేర్పడును. ఈ -ండ్లు, -ంళ్లుగ మాఱి శాసనములందు కాన్పించు చున్నది. గ్రంథములందును వ్యవహారమునందును నదియే 'ళ్లు' గ నిరను స్వారమై కానవచ్చుచున్నది. ఇట్టివానిలోఁ గొన్నిటికి -ండ్లు తోడి రూపము లకు గ్రంథములందును వ్యవహారమునందును బ్రయోగములు గానరా కున్నవి. కాఁగిండ్లు (మను. II. 54) అను ప్రయోగ మున్నది గాని యది '-ండ్లు తోడి రూపమును స్థిరపఱుపఁ జాలదు. కొన్నిటికి -లులుతోడి రూపములు కానరావు. గ్రంథములందు -లులు, -ళులు తోడి బహువచనరూపములు గాన్పించినను నవి కృత్రిమములును, గణాదులకొఱ కేర్పడినవియును నని తోఁచుచున్నది. ఉదా. ఎరగలి, ఎరగళ్లు (భార. కర్ణ. II. 227); చెక్కిలి, చెక్కిళ్లు; వాకిలి, వాకిళ్లు (భార. ఆర. VII. 107; శాంతి. II. 388); వేవిలి

(ఏకవచనరూప మున్నదా?), వేవిళ్లు; కప్పలి, కప్పళ్లు; తొంగిలి, తొంగిళ్లు (-డ్లు); ఎక్కిలి, ఎక్కిళ్లు; ఓకిలి, ఓకిళ్లు; అంకిలి, అంకిళ్లు; అంగిలి, అంగిళ్లు; ఆఁకలి, ఆఁకళ్లు; (అత్త్రాఁకలి - దీనికి బహువచనము లేదు); దోసి (-యి) లి, దోసి, (-యి) ళ్లు; పొంగిలి, పొంగిళ్లు; పింపిలి, పింపిళ్లు; ఎంగిలి, ఎంగిళ్లు; ముంగిలి, ముంగిళ్లు; కమికిలి, కమికిళ్లు; పుడిసిలి, పుడిసిళ్లు; పిడికిలి, పిడికిళ్లు; పుక్కిలి, పుక్కిళ్లు; లొడితిలి, లొడితిళ్లు; గుప్పిలి, గుప్పిళ్లు; గుక్కిలి, గుక్కిళ్లు; నాఁగలి, నాఁగళ్లు; నెమిలి, నెమిళ్లు; సందిలి, సందిళ్లు; పట్టెలి, పట్టెళ్లు; ('పట్టెళ్లు' అని వ్యవహారరూపము); పొంగలి, పొంగళ్లు; పొక్కిలి, పొక్కిళ్లు; పొక్కలి, పొక్కళ్లు; పొదిగిలి, పొదిగిళ్లు; బచ్చలి, బచ్చళ్లు; మించిలి, మించిళ్లు; బాణలి, బాణళ్లు; ముదుసలి, ముదుసళ్లు; (మను. IV. 36) ;—పై లి-వర్ణాంత శబ్దములకు - డ్లు తోడి బహువచనరూపములు కానరావు. 'మంగలి' కి 'మంగడ్లు' (ద. ఇం. శా. VI. 250) అను బహువచనరూపము కానవచ్చు చున్నది. ఇట్లే, 'చాకలి', 'చాకడ్లు'. 'కంసాలి' అను వానికి 'కంసాడ్లు' అని బహువచనరూపములు కలుగునా? 'మొగలి' కిని 'మొగడ్లు' అను బహువచన రూపము కలదు. (ద. ఇం. శా. VI. 628. మొగడ్ల చెఱువు.) 'చిమ్మిలి' కి బహువచనరూపము 'చిమ్మిళ్లు' అగునా ? 'పిప్పలి' తత్సమపద మయినను దానికి 'పిప్పళ్లు' అను బహువచనరూపము గలదు.

ఎంగిళులు (భార. కర్ణ. II. 54); వాకిళులు (భార. శాంతి. IV. 97)- ఇట్టి రూపములు పద్యగణములు సరిపోవుటకుఁ గవులు చేసిన శిథిలరూపములు.

పూర్వకాలపు శాసనములలో 'ఎంగిడ్లు' మొదలగు '-డ్లు' తోడి బహువచనరూపములు కాన్పించుచున్నవి. లి-వర్ణాంత శబ్దములు తొలుత డి-వర్ణాంతములుగ నుండెడి వేమో. లేదా, '-ళ్లు' లోని తొలి 'ళ' కారము డకారముగ మాఱి యైన నుండవచ్చును.

తిరుగలి, గొడ్డలి, కొడవలి, గుద్దలి, కౌఁగిలి (కౌఁగిండ్లు, మను. II. 54); కౌఁగిళ్లు; వీనికి -oడ్లు, -ళ్లు ల తోడి రెండేసి బహువచనరూపములు గలవు.

ఆలి, ఆవిలి, ఇక్కిలి, ఇరివిలి, ఒంపిలి, ఒడిపిలి, ముచ్చిలి, చలి, జంగిలి, చెంగలి, కుఱఁగలి, ముంగలి, వెనుకలి, పింగలి, చిందలి, ఒంజిలి, ఒందలి, అరగలి, కొడి(-ణి)దిలి, గబ్బిలి, జమిలి, గుమి(-బి)లి, ఆర్నిలి, ఎక్కలి, జిగిలి, దూఁకలి, నలి, అత్త్రాఁకలి, గేలి, జుట్టెలి, బడిలి, నర్నిలి, తనకలి, నెంజిలి, పక్కిలి, పికిలి, పిక్కిలి, మాఁగిలి, వింజిలి, అను పదములకు బహువచన రూపము లున్నట్లు కానరాదు.

కులు; నాగవల్లి, నాగవలి, నాగవలులు; జాబిల్లి, జాబిలి, జాబిలులు; వ్వ, కువ, కువలు; నువ్వు, నువు, నువులు, దినన్సు, దినసు, దినసులు మొద యినవి.

2. అక్కడ మొదలగు సమస్త పదములకు బహువచన ప్రత్యయము రదు: అక్కడ, ఇక్కడ, ఎక్కడ; అచ్చట, ఇచ్చట, ఎచ్చట; అప్పుడు, ప్పుడు, ఎప్పుడు; ఆవల, ఈవల, ఏవల; ఆనాఁడు, ఈనాఁడు, ఏనాఁడు; మొదలయినవి. అక్కడ, ఇక్కడ, ఎక్కడ అను పదములందు 'కడ' కు ప్రాధాన్యము వివక్షించునపుడు సప్తమీ విభక్తియందు బహువచనమున వర్ణము చేరును: అక్కడలన్, ఇక్కడలన్, ఎక్కడలన్.

3. సస్యవాచక శబ్దము లెల్లప్పుడు నేకవచనమునందే ప్రయోగింపఁ డును: కంది, పెసర, మినుము, వరి, ఆరుగ, చోడి, సెనగ, మొదలయినవి.

4. కొన్ని తీఁగల పేళ్లును నేకవచనమునందే ప్రయోగింపఁబడును: ర, కాకర, గుమ్మడి, బచ్చలి, దొండ మొదలయినవి.

5. కొన్ని సంభార వాచకపదములు నిత్యైక వచనములు: నూనె, ముదము, ఉప్పు, చింతపండు, ఇంగువ, పసుపు మొదలయినవి. ఇట్లే, "అగరు సరి కదంబ మంబరు పునుంగు జవ్వాది హారిణమదము, బుక్కయత్తరు గోవ ంబూరబోలు చట్టకలపంబు పన్నీటఁ జాఁదిపూసి (హంస. V).

6. లోహవాచకశబ్దములును నిత్యైకవచనములు: వెండి, రాగి త్తడి, బంగారము, కంచు మొదలయినవి.

7. సరి, సాటి, ఈడు, ఎన మొదలగు సమానార్థక పదములకు బహువచ [illegible] గలుగవు. 'కన్నులు వెన్నెల్, సురుచిర పదములు రదములు, నిరు [illegible] (రా. కిష్కిం.) 'సతు లీభార్గవికి భాగ్య సంపద [illegible]' (భార. ఆది. III.); [illegible] (భార. సభా. I.); దీనికి సనకావు నుఁ డీ తలంపనేధర్మంబుల్ (భార. అను. II.); 'సభ లెల్ల ... నవి దీనికిసరిగా వత్యంత విభవ సౌందర్యముల్' (భార. సభా. I.); 'ఆ పురూరవుఁడా దన్సులాజయంతుఁ డాపులస్త్యనిమనుమఁ డీయధిపుతోడ సాటి యగుదురె' (నైష. VI.) 'ప్రధానులు దక్కినవారు సాటియే మామిడి వీర భద్రునకు' (నైష. I.) - 'సరులులేని దృక్షంజన శాబకములు' (నైష. III,) మొదలగుచోట్లఁ బై శబ్దములలో సాటి, ఈడు, లకు బహువచనములు గ్రంథములందును [illegible] చున్నవి.

8. గుణ, రస, వాచకములైన దేశ్య విశేషణ శబ్దములు నిత్యైక వచనములుగ నుండును: ఈ కాగితములు తెలుపు; ఆ బట్టలు ఎఱుపు; మామిడి పండ్లు తీపు; చింతకాయలు పులుపు; కాకరకాయలు చేదు మొద.

9. కొన్ని యితర శబ్దములకును బహువచనము ప్రయోగమును గ్రంథములందును వ్యవహారమునందునుగూడ లేదు: అని = యుద్ధము; చక్కిలిగిలి, పోరచి, రోయి, అర (అ) మర (అ), మున్నీరు, ఇసుమ ('ఇసుములం గుడువదె' అని భార. II. 234 లో ప్రయోగమున్నదిగాని యది 'ఇసుమంగుడువదె' అనియే యుండవలెను).

10. కొన్ని రోగములపే రేకవచనమునం దుండును: అయిరు, ఉంగిడి, ఉక్కస, దగ్గు, జలుబు, ఉబ్బస, ఒరొంప మొదలగునవి. 'ఏల పల్కవు చెప్పవే యన్న నీకు, నరిమియో కోసయో యంగిటిముల్లో' (భల్లా. III.)

11. 'పొల్ల' పొల్లు, అనువాని నేకవచనమునందే యుపయోగింపవలసినను (చలము రోషము పొల్లయున్నె - భాగ. అర. IV. 357) 'పొల్లలు' అను బహువచనరూపమును గాన్పించుచున్నది. (పొల్లలు - భాగ. అర. IV, 294.)

12. 'తాయి'కి బహువచనరూపము లేదు; అట్లే ఒకరిత, ఒకరిత, మొదలయిన యేకార్థక మహతీవాచకపదములకును, 'ఎవరిత' మొదలగు వానికిని బహువచనరూపములు లేవు.

### బహువచనములైనను నిత్యైకవచన తుల్యములైనపదములు.

అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, రెండు మొదలుగాఁగల యమహద్వాచక సంఖ్యావాచకపదములు రూపమున నేకవచనములుగ నున్నను బహువచనములే. రెండు మొదలగు సమహద్బోధక సంఖ్యావాచకపదములకు బహువచన లువర్ణము చేరుటయుఁ గలదు: రెండురెళ్లు, మూఁడుమూళ్లు, నాలుగు పదులు మొదలయినవి. సంఖ్యావాచకపదములు సమూహార్థకములగు నపుడును, అట్టి సమూహముల బహుత్వమును దెలుపవలసినపుడును నుపయోగింపఁబడును: రెండుపదులు ఇరువది మొద.

సమాసమునందు సంఖ్యావాచకపదము పూర్వపదముగా నున్నప్పుడు సమస్తపదము తఱచుగ నేకవచనాంతమగును: ఇరువాగు, ఇరుగేలు, ఇద్దుము, ఇక్కట్టు, ఇరాలు, ఈరాలు, ఇబ్బంది, ఇబ్బడి, ఇమ్మడి, ఇడుగడ, ఇడుమ, ఇనుమడి, ఇనుమాఱు, ఇనుమిక్కిలి, ఇన్నాఱు, ఇరుఁదలపాము, ఇరుఁదల పులుగు, ఇరువాయికట్టు, ఇరువది, ఇరుస, ఇల్లము; ఈరేడు; ముక్కాక, ముక్కాలు, ముచ్చిరుకి, ముక్కన్ను, ముక్క-(క్కా-)లిపీట, ముక్కాని, ముక్కారు, ముక్కొట్టిక, ముక్కోణము, ముక్కోల, ముచ్చిచ్చు, ముచ్చెలక,

ాములు; నాగవల్లి, నాగవలి, నాగవలులు; జాబిల్లి, జాబిలి, జాబిలులు;
వ్వ, కువ, కువలు; నువ్వు, నువు, నువులు, దినన్సు, దినసు, దినసులు మొద
యినవి.

2. అక్కడ మొదలగు సమస్త పదములకు బహువచన ప్రత్యయము
చేరదు: అక్కడ, ఇక్కడ, ఎక్కడ: అచ్చట, ఇచ్చట, ఎచ్చట; అప్పుడు,
ఇప్పుడు, ఎప్పుడు; ఆవల, ఈవల, ఏవల; ఆనాఁడు, ఈనాఁడు, ఏనాఁడు;
మొదలయినవి. అక్కడ, ఇక్కడ, ఎక్కడ అను పదములందు 'కడ' కు
ప్రాధాన్యము వివక్షించునపుడు సప్తమీ విభక్తియందు బహువచనమున
లువర్ణము చేరును: అక్కడలన్, ఇక్కడలన్, ఎక్కడలన్.

3. సస్యవాచక శబ్దము లెల్లప్పుడు నేకవచనమునందే ప్రయోగింపఁ
బడును: కంది, పెసర, మినుము, వరి, ఆరుగ, చోడి, సెనగ, మొదలయినవి.

4. కొన్ని తీఁగల పేళ్లును నేకవచనమునందే ప్రయోగింపఁబడును:
బీర, కాకర, గుమ్మడి, బచ్చలి, దొండ మొదలయినవి.

5. కొన్ని సంభార వాచకపదములు నిత్యైక వచనములు: నూనె,
ఆముదము, ఉప్పు, చింతపండు, ఇంగువ, పసుపు మొదలయినవి. ఇట్లే, "అగరు
కేసరి కదంబ మంబరు పునుంగు జవ్వాది హరిణమదము, బుక్కయత్తరు గోవ
గంబూరబోలు చట్టకలపంబు పన్నీటఁ జాఁదిపూసి (హంస. V).

6. లోహవాచకశబ్దములును నిత్యైకవచనములు: వెండి, రాగి
ఇత్తడి, బంగారము, కంచు మొదలయినవి.

7. సరి, సాటి, ఈడు, ఎన మొదలగు సమానార్థక పదములకు బహువచ
నరూపములు గలుగవు. 'కన్నులు వెన్నుల్, సురుచిర పదములు రదములు, నిరు
వురకుంజూడ నొక్కయీడైయునికిన్' (రా.కిష్కిం.) 'సతు లీభార్గవికి భాగ్య
సంపద నెనయే' (భార. ఆది. III.); నీకెనయె మానవనాథులు (భార. సభా.
I.); దీనికినెనకావు నుఁడీ తలంపనేధర్మంబుల్ (భార. అను. II.); 'సభలెల్లో ...
నవి దీనికిసరిగా వత్యంత విభవ సౌందర్యములన్' (భార. సభా. I.); 'ఆ
పురూరవుఁడా దస్రులాజయంతుఁ డాపులస్త్యనిమనుమఁ డీయధిపుతోడ సాటి
యగుదురె' (నైష. VI.) 'ప్రధానులు దక్కినవారు సాటియే మామిడి వీర
భద్రునకు' (నైష. I.) - 'సరులులేని దృక్కంజన శాబకములు' (నైష. III,)
మొదలగుచోట్లఁ బై శబ్దములలో సాటి, ఈడు, లకు బహువచనములు
గ్రంథములందును గొన్ని మండలముల వ్యవహారమునందును కానఁబడు
చున్నవి.

8. గుణ, రస, వాచకములైన దేశ్య విశేషణ శబ్దములు నిత్యైక వచ ములుగ నుండును: ఈ కాగితములు తెలుపు; ఆ బట్టలు ఎఱుపు; మామిడి పండ్లు తీపు; చింతకాయలు పులుపు; కాకరకాయలు చేదు మొద.

9. కొన్ని యితర శబ్దములకును బహువచనము ప్రయోగమును గ్రంథములందును వ్యవహారమునందునుగూడ లేదు: అని = యుద్ధము; చక్కలిగిలి, పోరచి, రోయి, అర (అ) మర (అ), ముక్కెరు, ఇడుమ ('ఇడుమలం గుడవదె' అని భార. II. 234 లో ప్రయోగమున్నదిగాని యది 'ఇడుమంగుడువదె' అనియే యుండవలెను).

10. కొన్ని రోగములపే ర్లేకవచనమునం దుండును: అయిర, ఉంగిడి, ఉక్కిస, దగ్గు, జలుబు, ఉబ్బస, ఆొంప మొదలయినవి. 'ఏల పల్కవు చెప్పవే యన్న నీకు, నరిమియో కోవయో యంగిటిముల్లో' (భల్లా. III.)

11. 'పొల్ల' పొల్లు, అనువాని నేకవచనమునందే యుపయోగింపవలసి నను (చలము రోషము పొల్లయున్నై - భాం. ఆం. IV. 357) 'పొల్లలు' అను బహువచనరూపమును గాన్పించుచున్నది. (పొల్లలు - భార. ఆం. IV, 294.)

12. 'తాయి' కి బహువచనరూపము లేదు; అట్లే ఒకరితి, ఒకరిత, మొద లయిన యేకార్థక మహతీవాచకపదములకును, 'ఎవరిత' మొదలగు వానికిని బహువచనరూపములు లేవు.

**బహువచనములైనను నిత్యైకవచన తుల్యములైనపదములు.**

అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, రెండు మొదలుగాఁగల యమహద్వాచక సంఖ్యావాచకపదములు రూపమున నేకవచనములుగ నున్నను బహు వచనములే. రెండు మొదలగు నమహద్బోధక సంఖ్యావాచకపదములకు బహు వచన లువర్ణము చేరుటయుఁ గలదు: రెండురెళ్లు, మూఁడుమూళ్లు, నాలుగు పదులు మొదలయినవి. సంఖ్యా వాచకపదములు సమూహార్థకములగు నపు డేకవచనమందును, అట్టి సమూహముల బహుత్వమును దెలుపవలసినపుడు బహువచనమందును నుపయోగింపఁబడును: రెండుపదులు ఇరువది మొద.

సమాసమునందు సంఖ్యావాచకపదము పూర్వపదముగా నున్నప్పు డాసమస్తపదము తఱుచుగ నేకవచనాంతమగును: ఇరువాగు, ఇరుగేలు, ఇద్దుము, ఇక్కట్టు, ఇరాలు, ఈరాలు, ఇబ్బంది, ఇబ్బడి, ఇమ్మడి, ఇదుగడ, ఇడుమ, ఇనుమడి, ఇనుమాఱు, ఇనుమిక్కిలి, ఇన్నూఱు, ఇరుదలపాము, ఇరుదల పులుగు, ఇరువాయికట్టు, ఇరువది, ఇరుస, ఇల్లసు; ఈరేడు; ముక్కాక, ముక్కాలు, ముచ్చివుకి, ముక్కన్ను, ముక్క(క్కా)లిపీట, ముక్కాని, ముక్కారు, ముక్కోటిక, ముక్కోణము, ముక్కోల, ముచ్చిచ్చు, ముచ్చెలక,

మచ్చట్లు, ముచ్చే (చ్చి) మూఁడు, ముచ్చవలము, ముత్తుము, మున్నూఱు, ముప్పది, ముప్పాతిక, ముప్పావు, ముప్పావులా, ముప్పిరి, ముప్పూఁట, ముప్పొంగు, ముప్పొద్దు, ముబ్బడి, ముమ్మడి, ముమ్మూఁడు, ముయ్యంచు, ముయ్యంచుతుంగ, ముయ్యడ, ముయ్యేలగుట్ట, ముయ్యాకుఁబొన్న, ముయ్యాఱు, ముయ్యేడు, ముయ్యేఱు, మువ్వంచాకు, మువ్వంచ, మువ్వంటు, మువ్వన్నె (మెకమువిల్లు), మువ్వీసము; నన్నూఱు, నలుగడ, నలుమూల, నలుకుము, (నల్తుము), నలువది, నలుసాల; ఏఁబది, ఏఁదుము, ఏనూఱు; అఱువది, ఆర్దుము, ఆఱ్నూఱు, ఆఱుస; ఏడ్దుము, ఏణ్నూఱు, డెబ్బది; ఎనమందుము, ఎనమనూ (-న్నూ) ఱు, ఎనుఁబది; తొంబది, తొమ్మనూ (న్నూ)ఱు, తొంబ (-మ్మ) నూఱు, తొమ్మందుము.

రెండు, మూఁడు, నాలుగు, ఐఁదు, ఆఱు, ఏడు, ఎనిమిది, తొమ్మిది అనుసంఖ్యావాచకపదముల తఱువాత వచ్చు విశేషణము బహువచనమునందే యుండును; వానికి ఇర్, ఇరు, ఇను; ము, మూ; నలు, నాలు; ఏను; అఱు, ఆర్; ఏడ్ (-ళ్); ఎన, ఎను; తొం; అనునవి సమాసములఁ బూర్వపదములుగ నిలిచినచో వానిపైఁ జేరుపదములు సాధారణముగ నేకవచసరూపముతోడనే యుండును. సాధారణముగ ననుటచే నొకప్పుడు ఇరుఁదలలు, ముచ్చెమటలు, నలుగడలు, ఏనాళ్లు, మొదలగు బహువచన రూపములును గలుగునని గ్రహింపవలెను.

**ఏకవచనములయినను బహువచనరూపములవలెఁ గానవచ్చు పదములు.**

ఈక్రిందిపదములు బహువచనములను భ్రమను గల్పించుచున్నవి. కాని యవి తొలుత బహువచనములుకావు; వానినుండి తెనుఁగున మరల నేకవచన రూపములు కలుగలేదు!

అగచాట్లు (కన్న. ఏక. అగచాటలు); అంగలు (-ఆర్చు, కన్న. ఏక. అంగల్); ఆనాలు = ఆనవాలు = ఇవురఁ గాచినపాలు; ఇనుళ్లు (కన్న. ఏక. ఈచల్); తొప్పలు, దోరలు (కన్న. ఏక. తొప్పల్ = ఒత్తుగా రాలిన చిన్న యాకుల సమూహము) పొట్ల (పొడల కాయ); (కన్న. ఏక. పడవల, పడల; మరాఠీ, ఏక. పడవళ); అబిసీలు (ఇది గాడ్పుబాబాలనెక్కి క్రొవ్విరి తావి యబిసీల్ దువాళించునట్టి బయలు, చంద్ర.) హిం. ఏక. అబ్సీల్; అరులు (కన్న. ఏక. అరుళ్); ఇరులు (కన్న. ఏక. ఇరుళ్) ఇర్లవారము (భార. శల్య. II. 86); కురులు (కన్న. ఏక. కురుళ్); భాగ. VIII. 279; VI. 101; మరులు (కన్న. ఏక. మరుళ్); అఱవఱలు భార. ద్రో. III. 158; భాగ. VIII. 217; (కన్న. ఏక. అఱవఱల్); సూరెలు (భార. ద్రో. II. 295,

III. 179; స్త్రీ. I. 119; II. 19; ఉద్యో. III. 183); కాని, 'సూరెగిల్లు' అను నామధాతువున 'సూరె' అను నేకవచనరూపము కాన్పించుచున్నది; క్రేళ్లు (ఉఱుకు) దాఁటు భార. విరా. II. 38; నరలు, 'కలయ నరలువచ్చి తల తెల్లనై నంతఁజేసి యెట్లు నీకుఁ జేరు నెఱుక (భార. ఆర. IV. 201);'నరలుగల కామునైనను దరుణులు రోయుదురు' (భార. ఆది.)—-నర అనఁగా 'వెంట్రుకలయందు కనఁబడు తెలుపు' అనుఅర్థము శబ్ద రత్నాకరముననున్నది. దీనికి భారతమున 'నరలు' అనియే ప్రయోగమున్నది. 'నరలు' బహువచనమను భ్రమచేఁ దరువాతి వారు దానినుండి 'నర' యను మఱియొక యేకవచన రూపమును గన్పించికొనిరి. అవ్విభు తలనొక నరయున్నఁ జూపి తరలాక్షి యనున్ (మార్క. VII); 'అలుగులఁబడు' అను భార. విరా. III. 50 లోని ముద్రితపాఠము 'అలుగుల' లోని ల-కారము బహువచనబోధకమను భ్రమచేతఁ గలిగినది; 'అలగులము + పడు' అను పదముల కలయిక వలన నా శబ్దపల్లవము కలిగినది; 'అలువులు' = కంటికొన అనుదానిలోని లు-వర్ణము బహువచన బోధకము కాదేమో (భార. విరా. V. 240); కేకిసలు (భార. మహా. I. 41; శేష. I; హంస IV; బహు. II.); తుంపెసలు (భాగ. XII. 688)-ఈపదము లేకవచనములే; కన్నడమున-'సల్' అంత శబ్దము లేకవచనములు;- 'క్రేళ్లు' ఇది 'కెరలు' నను రూపాంతరము కానోపును. 'కెంపు దళుకొత్తు వాలుతోఁ గ్రేళ్లువాఱు నావృకోదరుపై' (భార. భీష్మ. II.); 'కేలిమై నొక్కట లీలఁగ్రేళ్లుఱికెడు వాలుగ సోగల మేలుడించి (భార. విరా. II.); 'హయము క్రేళ్లుఱుకునో యని రెండు కడలందు వాగెపట్టిరి మత్స్యవత్సపతులు (కళా. II.); 'క్రేళ్లుఱికెం దొలఁగం బగతుని, యఱకడనుండి భువిమీఁద కబ్బలియుంచున్' (హరి. పూ. VII.); 'రోహిణాద్రియ పెక్కురూపులై యున్నట్లు క్రీడాచలంబుల క్రేళ్లుగలిగి' (శా. యు. కాం.); 'మీలు క్రేళ్లుదాఁటుచు మాటికిని సముల్లోల కల్లోలములఁదేలు క్రమముఁగన్గొంచు; (విష్ణు. పూ. II.); 'అడ్డంపు నిడుపు టాఁబడ్డలగతి మన్నుఁబిల్లు డొంకలనుండి క్రేళ్లుదాఁట' (మను. II.);'అల జలంబులు ధాత్రి నవఘళింపకమున్న క్రేళ్లుబ్బు వారి యకీర్తిపంకము' (కాశీ. V.);—గుంజులాడు—-తమి. కుంజల్ = ఈడిగిలఁబడుట; 'గుదగుదలాడు' మొదలగు కొన్ని శబ్దములలో 'దల్, సల్, చల్, పల్' మొదలగు వర్ణము లంతమందుగల పదములు 'అల్' అను కృత్తద్ధిత ప్రత్యయము చేరుటవలన నేర్పడిన యేకవచన రూపములు, కాని, యవి బహువచన రూపములనియే తెనుఁగువారు తలంపఁ జొచ్చిరి. వానిలోఁ గొన్నిటి తుదివర్ణమగు లువర్ణము బహువచన ప్రత్యయమను భ్రమచే వారు మరల లువర్ణ రహితములగు నేకవచనరూపముల నేర్పాటు చేసి

నిరి; కొన్నిటి కట్లుచేయలేదు. గుసగుసలు, గెగ్గలు, గొప్పలు, గోరుపులాడు, ర్పిళ్లాడు (దీనికి 'గోర్పిలి' అను నేకవచనరూపము కానరాదు), చిటచిట ాడు, చిదురలు, చిదురుపలు, చిఱుతలు కవియు, చుంగులు, చుమ్మలు చుట్టు, మికలు (దీనికి 'చెమిక' అను నేకవచన రూపములేదు), తలముళ్లు = వేఁట ాని, లేక దొంగయొక్క సాధనము; కన్నడమున 'ముల్లు' కు 'ముళ్లు, ముల్, నునది యేకవచనరూపము; తుంపెసలాడు, తుప్పలుదూలు; నంబెరుమాళ్లు, ిరుమాళ్లు, అనువానిలో 'ఆళ్' అనునది యేకవచనమును దెలియఁజేయును; గోవాళ్లు' శబ్దమునిట్టిదే. 'నీకుఁదగిన గోవాళ్లు మహిఁన్ నెమకి నగరాదె' ను. (IV.) కన్నడమున గోప శబ్దభవము 'గోవ' అనియున్నది. 'గోవాళ్' నఁగా 'గొల్లవాఁడు' అని యర్థము; 'గొల్ల' శబ్దమాలంకారికముగ 'వెట్టి' ానికిఁ దెనుఁగున నుపయోగింపఁబడును; కావున పై ప్రయోగమున 'గోవా ళ్' అనఁగా 'వెట్టివానిని' అని యర్థము చెప్పికొనవచ్చునేమో. కాని, శబ్ద త్నాకరమున నాపదమునకు 'యౌవనము గలవాఁడు' అని యర్థమున్నది; అది హువచన మయినట్లు తెలుపఁబడినది. 'గోవ + వారలు' అని దానికి విగ్ర హము చెప్పఁబడినది. 'గోవకు' 'యౌవనము, మనోజ్ఞము' అని యర్థము వ్రాయఁబడినది. 'గోవ' కుఁ ప్రత్యేకముగఁ బ్రయోగములేదు. 'గోము' కు 'గోవు' అని రూపాంతరముండునా? ఉన్నయెడల 'గోవాళ్లు' అను పద మునకు 'విలాస పురుషుఁడు' అని యర్థము చెప్పికొనవచ్చును. ఎట్లయినను గోవాళ్లు' అనుపదము బహుచనరూపము కాదు. - 'నవ్వటాలు' (భార. ఉద్యో. II. 61.) అనునది 'నవ్వులాట' కు రూపాంతరము; 'నవ్వటా' అను నేక వచనరూపములేదు. - నామరులు; ఇది యేకవచనరూపము కానోపును: 'బలి తపుఁ బ్రహ్మాండమను పాళిఘటిం చటమీఁదఁ బడ్డ జీ, వులనెడు సారెలుంచి రహిపుట్టఁగ సమ్మిహిరేందునామముల్ గలిగిన నామరుల్ గొని యలౌకిక చిత్ర దురోదరంబుగా, నలరమతోడ నాడు కమలాక్షుఁడు మైకొనెఁ గంటె జూదమున్ (చను. I.); - నెరవులు = చుట్టుఁబట్లు (భార. విరా. I.) 243, 245; (III. 26), ఈ యర్థమున నిది యేకవచనమే యగునని తోఁచు చున్నది; వ్యాపనము, మార్గము పూర్తి, మొదలగు నర్థములందు 'నెరవు' అను నేకవచన రూపమున్నది; పడలు = బ. రాసులు, అం శబ్ద రత్నా కరము. 'ఏచిన పొదలఁబడల్పడ' (భార. అర. II.) అని ప్రయోగము; కన్న డమున 'పడల్' అనఁగా పడుట, పాటు, అని యర్థము. ఈ యర్థమందే యీ ప్రయోగమున 'పడలు' పదము వాడఁబడినది. అది యేకవచనమే కాని బహువచనము కాదు;—పొనలు = బ. సందేహము, అని శబ్ద రత్నాకరము; 'బసవా యనఁగ విన్నఁ బొనలొండేల, పసి బాలలకునైనఁ బ్రబలదే భక్తి'

(**భల్లా. II. భాగ.**); 'పానలు' ఏకవచనమే కాని బహువచనముకాదు; 'పాన' అను నేకవచన రూపములేదు. పింపిసలు; నసివాళ్లు; 'వసివాడ్ (-ళ్)' అను నేకవచన రూపముపై నుత్వము చేరునపుడు 'ళ' కు ద్విత్వము కలిగి నది; విచ్చవిచ్చలు; వీచోఁపులు; వెట్టిబాగులు; సకినల మంచము; ఇందలి 'సకినలు' అనుదానికి 'సకిన' అను నేకవచన రూపములేదు; సగ్గిస ముగ్గిసలు; సిళ్లు : 'దే. వి. బ. (ఏనుఁగును పొడిచెడు) బరిగోల,' 'మ. హిమవత్పావవ నాంత కేలిరతిమై నేపార కోపారుణ, క్రమ నేత్రాంచలమై ప్రభూత మద రేఖంబైన గంధద్విపేం, ద్రముడాయఁజని సిళ్లుసూపుట సుమీ ధర్మాత్మ సత్యోగ్ర విక్రము గాంగేయవరిష్ఠు నీవు దొడరంగాఁజూచు టూహింపఁ గన్ - భార. ఆర. VI. మొదటి రూపము, 'సిడులు' అని శబ్దరత్నాకరము, 'సిడి' కి బహుచనరూపము 'సిళ్లు' అని శబ్దరత్నాకరకారుని యభిప్రాయము. కాని యిట్టి సందర్భమున నేకవచనమగు 'సిడి' కి ప్రయోగములేదు. 'సిడి' యనఁగా 'ఏతపుమ్రాను: 'ఏతపుసిడి దావంగినఁ బాతాళపు నీరువచ్చు.'- సిడులజాతరను నాటెడు స్తంభముమీఁది యడ్డమ్రాను 'అంభోధరముమీఁద నసియాడు నైరావతియుఁబోలె సిడిమ్రేలెఁ దెఱవ యోర్తు' పాండు III. ఇది గంపసిడి, గాలపుసిడి అని ద్వివిధము, అని శ. ర. ఈ యర్థములు ఏనుఁగు నకు సిళ్లుచూపుట యనునప్పుడు కుదురవు. కన్నడమున, 'సిడి' విశేష్య మగు నపుడు సూక్ష్మత్వము, ఇనుపకొక్కెము, చెదరుట, ఇనుప ముంబోను, తృప్తిచే మొగము మొత్తుట; భయము, కలవరము (చూ. తెనుఁగు: చిడి ముడిపాటు), . ఏనుఁగుమదము, అను నర్థములు గలవు. కన్నడమున 'సిడి' కి 'సిడిల్' అనునది పూర్వరూపము; ఏకవచనము. అనేకములగు లకారాంత పదములందువలెఁ గన్నడమున నిందలి తుది లకారము లోపించి క్రొత్త యేకవచనరూప మేర్పడినది. తెనుఁగున నేనుఁగు విషయమునఁజూపునది 'సిళ్లు' గాని 'సిడి' కాదు. 'సిళ్లు' కు 'మదము' అనికాని 'అంకుశము' అనికాని యర్థము చెప్పవలెను. ఈ పద మేకవచనమే కాని బహువచన మయినట్లు తోఁచదు. (చూ. భార. ద్రో. II. 114; విరా. V. 81; ఆర. IV. 175; మొద.)— కుప్పన (-లు)ఁ గూఁగలు, (భార. ఆర. V. 7); సూఁకెలు; సీవిరి అని శ. ర. లో నేకవచనము; ఇట్టి రూపమున్నట్లు తోఁచదు. 'సీవిరులు' అని యే ప్రయోగములు; 'సీవురులు' అనియు ముద్రిత పాఠముగలదు.- **చిదురుపలు :** ఇది యేకవచనరూపము (భార. భీష్మ. II. 66, 361); దీని నుండి 'చిదురుప' అను నేకవచనరూప మర్వాచీన కాలమునఁ గల్పించి నట్లున్నది'-చిట్టలు = ఆశ్చర్యము, 'నీదుమహత్త్వ మెంతయుఁ జిట్టలుగాదె' (భార. ఆర. V. 223); ద్రోణ. V. 25;—చిట్టలు గట్టుమంట (భార. ద్రో. III.

52) ఇందును ఏకవచనము. నిక్కలువడు (భాగ. VII. 209); సెరలు: ఎత్తి సెరలు (భార. ద్రోణ. III. 178).

కేలు: ఇది యేకవచనమో బహువచనమో నిర్ణయించుట కష్టము. 'కై' ఇది తొలుత బహువచన రూపమయి యేకవచనమునఁగూడ ప్రయోగింపబడి యుండును. వెడకేలుకట్టి (భార. అర. VI. 251; విరా. III. 12); ఒక కేలన్ (భార. అశ్వ. I. 153); వలకేలు (భార. అను. IV. 113); కరినాథు కేల్ నిడుదకొమ్ములతో బెరయంగఁ ద్రుంప; ఈ ప్రయోగములలో 'కేలు' ఏకవచనముగఁ గాన్పించుచున్నది. ఇరుగేలఁబట్టి (భార. స్త్రీ. I. 130); కేలు మొగిచి (భార. శాంతి. I. 385); అను. I. 250); కేలుమొగిడ్చి (భార. అను. I. 163; III. 281; అశ్వ. I. 218); ఈ ప్రయోగములలో 'కేలు' బహువచనము; పలుపంచలు: (ఇంద్రుని యిల్లాలు పలుపంచలును జాలిఁబడియె నేఁడు - భాగ. VIII. 474); దవ్వులు, ఇమ్ములు: వాని దవ్వులన పరిత్యజించి (భార. V. 43); దొడదవ్వులంజూచి (భార. భీష్మ. II. 183). ఉ. హరి. II. 16; III, 87; కాశీ. IV. 260 ఇమ్ములనుండి (భార. అర. V. 120.) ఇట్టి చోట్ల నీ రెండు పదములును నేకవచనమునందే ప్రయోగింపఁబడినవి.— కుమ్మెలు: శ. ర. లో 'కుమ్మె' అని చూపఁబడినది; కాని యిట్టి యేకవచన రూపమునకుఁ బ్రయోగములులేవు; - మక్కెలు = ఎముకలు; దీనికి 'మక్కె' అను నేకవచనరూపము కానరాదు; 'మక్కెలు' అను నేకవచనరూపమే బహువచనమున వాడఁబడి యుండవచ్చును. సొమ్ములువ్రాపు (భాగ. II. 188); కడుపు 'చుమ్మలు' చుట్టు; 'చెట్టలు' పట్టు (భార. సౌ. 197) మొదలగు వానిలో 'సొమ్ములు, చుమ్మలు, చెట్టలు' అనునవి తొలుత నేకవచన రూపములే; ఓరంత ప్రొద్దులన్ (మను. V. 7).

లు - వర్ణాంతైకవచనరూపములందు తుది లువర్ణము బహువచన ప్రత్యయమను భ్రమచే నేర్పడిన క్రొత్త యేకవచనరూపములును దెనుఁగున గలవు. వీనిలోఁ గొన్ని లు-వర్ణాంతములగు ప్రాఁత యేకవచనరూపములును వాడుకయం దున్నవి.

i. ఇతర ద్రావిడభాషలయం దేకవచనమున లువర్ణాంతములై తెనుఁగున నా వర్ణములోపించిన పదములు: ఆట (కన్న. ఆటల్, ఆటలె, ఆల్లె); ఈతచెట్టు (కన్న. ఈచల్; తమి. ఈఞ్జల్); ఉండ (కన్న. ఉన్దల్), కుప్ప (తమి. కుప్పల్); గుడిస (-సె) (కన్న. గుడ (-డి) సల్); మళ. కడిఞ్ఞల్ తుళు. గుడిచ (-స)ల్; గురుగు = ఒక పువ్వు (కన్న. గురుగులు); జమ్ము = ఒకగడ్డి (కన్న. జబ్బులు = జల + పులు?); తిక్క (కన్న. తిక్కలు); తెమ్మెరలు

తెమ్మెర (కన్న. తెమ్మెరల్); తొక్క (కన్న. తొగలు); పుచ్చి (కన్న. పుటిచిల్); పక్కు (కన్న. పక్కళె, హక్కళె); తొగ(-వ), కన్న. తొగల్; (తమి. వలజల్); కొన (కన్న. కొనల్); అన (కన్న. అనల్); ఎంగెస (కన్న. ఎంగెసల్); ఎగిసె (కన్న. ఎగిసల్); కొ(గొ?)దలు (కన్న. కొదలు); చూ. అదగొదలు; సిబ్బి (కన్న. చిబ్బల(-లు), చిబ్బులు); ముట్టు=మైల (కన్న. ముట్టల్, ముట్టిల్, ముట్టి); మఱుస (కన్న. మఱుసల్).

ii. ఇతర ద్రావిడభాషలయందువలె లు-వర్ణాంతశబ్దము తెనుఁగున నిలిచి యేకవచన బోధకమైనను దానినుండి లువర్ణము లోపించిన మఱియొక యేకవచన మేర్పడును:—

అంచెలు (అంచెలంచెలన్ - మను. IV. 62), అంచె (తమి. మళ. అంచల్, అంజల్); ఉరులు, ఉరి (కన్న. ఉరుల్); కవలు, కవ (కన్న. కవల్; తుళు. కబర్; తమి. కవర్); 'కవలు' కు 'కవళ్లు' అని బహువచనరూపమున్నది. 'ఎడనెడను గవళ్లఁ దడబడకుండఁగ గుఱుతులు మదిఁ బాదు కొలిపి నిలిపి' (కళా. IV); (అద)గొదలు, గొద, కొద (కన్న. కొదలు); చెదలు, చెద (కన్న. గెదలు; మళ. చిదలు, చిదలె, చిదళ్; తమి. చిదళై, చిల్, చెల్లు); తెట్టెలు, తెట్టె (కన్న. తెట్టెల్); తెప్పలు, తెప్ప (కన్న. తెప్పల్); తొట్టెల, తొట్టె, తొట్టి (కన్న. తొట్టిల్); ఒడిసెల, ఒడిసె, (కన్న. ఒడిసెల్); నొగలు, నొగ (కన్న. నొగల్); 'నొగలు' భారతమున నేకవచనముననే ప్రయోగింపఁబడి యుండును. 'నొగ' అనియు నందు రూపము కాన్పించుచున్నది. 'పగ్గంబులు నొగలముడిచి' (భార. విరా. IV. 73); నొగలు (ద్రోణ. III. 25); ఉద్యో. III. 48; IV. 125; ద్రోణ. IV. 154; సౌ. II. 53); నొగ (విరా. III. 169; ద్రో. III. 124; 104' అను పాఠము తప్పు. 'పొదరు' (విరా. భార. II. 112 III. 82); పొద (కన్న. పొదల్); 'పొద' కు తెనుఁగున 'పొదలు' అను బహువచనరూపమును నున్నది (భార. ఉద్యో. III. 183); నిచ్చలు, నిచ్చ (రెండును నేకవచనరూపములే).

iii. అన్యదేశ్యములగు లు-వర్ణాంతైకవచనరూపముల విషయమునను గొన్నియెడల నిట్టి భ్రమకలిగినది. ఇంగ్లీషు: కనిస్టేబిలు, కనిస్టేబు; హిందూస్థానీ: ముటాలు, ముటా.

iv. కన్నడమున 'అంతలు, ఇంతలు, ఎంతలు, అత్తలు, ఇత్తలు, ఎత్తలు' అనుపదము లేకవచనములు; తెనుఁగున 'అంతలు, ఇంతలు, ఎంతలు' అనునవి బహువచనములను భ్రమను గలిగించుటచే నందుండి 'అంత, ఇంత, ఎంత' అను నేకవచనరూపము లేర్పడినవి. ప్రాచీనాంధ్రవాఙ్మయమున 'అంతలు, ఇంతలు, ఎంతలు' అనునవి యేకవచనమునందే ప్రయోగింపఁబడి

); వానికి సంబంధించిన విశేష్యములు బహువచనమునం దున్నను నవి ఏకవచనరూపములే. అంతలుసేసి (భార. ఉద్యో. III. 101); అంతలంతలు ై (ఉద్యో. III. 201); అంతలంతలు (ఉద్యో. IV. 73); చచ్చునంతలు ై (అను. IV. 274); అంతలంతలు మాటలు (స్త్రీ. I. 12); సుయోధనుం తలుసేసె (ఉద్యో. III. 47); ఇంతలు పాపము లాచరించునే (ఉద్యో. I. 83); ఇంతలేసిదొరలు (ఉద్యో. III. 95, -'ఇంతలు' మహద్వాచకపద ంలకును విశేషణముగ నున్నది); ఇంతింతలు సెక్కులై (ద్రోణ. II. 99); ంతింతలు (భాగ. II. 25).

కన్నడమందలి 'అత్తలు; ఇత్తలు, ఎత్తలు' అను రూపములు తెనుం న 'అట్లు, ఇట్లు, ఎట్లు' అనురూపములతోం గాన్పించుచున్నవి. అవి బహు చనరూపములను భ్రమచేం గావలయుం దెనుంగువారు వానినుండి 'అట్టు, ట్టు, ఎట్టు' అనురూపములను గల్పించి కొనిరి. నేంటి వ్యవహారమునం గూడ రెండువిధములగు రూపములును గాన్పించుచున్నవి. 'అట్లు, ఇట్లు, ఎట్లు' నున నవ్యయములు గావున వానివిషయమున బహువచనజ్ఞానము కలుగదు.

vi. మల్లె, జాజి, మొదలగు నేకవచనరూపము లాయా వృక్షజాతు ను దెలుపును; మల్లెలు, జాజులు, మొదలగు బహువచనరూపములు పుష్ప ములను సూచించును.

vii. 'నీరు-' దీనికి బహువచనము 'నీళ్లు' అగునుగాని యర్థమున ేదము గానరాదు: నీరు తేంటగా నున్నది, నీళ్లు తేంటగా నున్నవి. 'మున్నీరు' బ్దమునకు 'మున్నీళ్లు' అను బహువచనరూపము గలుగదు. 'పాలు' తొలుత పాయి' (సం. పయస్) కి బహువచనరూపమే యైనను వాడుకయం దేక చనముగా వాడంబడుచున్నది; దీనికి బహువచనరూపము లేదు. 'పాలు ుచిగా నున్నది' అని కొన్ని మండలములందు వ్యవహారమున్నది కాని సాధా ణముగ దానితో బహువచనక్రియయే చేరుచుండును.

viii. ద్రవ్యవాచకపదములు సమూహార్థకములై యేకవచనమున వాడంబడును; ఆద్రవ్యములకు సంబంధించిన విడివిడివస్తువులను దెలుపునపుడు బహువచనమునం బ్రయోగింపంబడును: ఈయిల్లు కట్టుటకు లక్షయిటిక పట్టి నది; పునాదులకోసము పదివేలరాయి తెప్పించినాను; నాలుగిటికలు ఇక్కడ పెట్టు; పదిరాళ్లు తీసికొనిరా.

## నిత్యబహువచనములు.

1. అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు, పెక్కురు, పెక్కండ్రు, పలుగు(-వు)రు(-ండ్రు), ఇరువురు, ఇద్దఱు, నలువు(-గు)రు, ఏవు(-గు)రు, ఐదు

గురు. ఆఱువు(-గు)రు, ఏడ్వురు, ఏడుగురు, ఎనమండ్రు, ఎనమండుగురు, తొమ్మండ్రు, తొమ్మండుగురు, పదువు(-గు)రు, పదురు, పదుండ్రు, పదునొక్కండ్రు, పదునొక్కరు, పన్నిరువురు, పన్నిద్దఱు, పండ్రెండుగురు, పదుమువ్వు(-గ్గు)రు, పదునలువు(-గు)రు, పదునేవు(-గు)రు, పదునాఱ్వురు, పదునాఱుగురు, పదునేడ్వురు, పదునెనమండ్రు, పదునెనమండుగురు, పందొమ్మండ్రు, పందొమ్మండుగురు, ఇరువండ్రు, ఇరువదియొక్కరు(-ండ్రు),... ముప్పండ్రు ...; నలువండ్రు ...; ఏబండ్రు ...; అఱువండ్రు; డెబ్బండ్రు ...; ఎనుబండ్రు ...; తొంబండ్రు ...; నూర్వు(-గ్గు)రు ...; వేవురు; ఈ సంఖ్యావాచక మహన్మహతీ బోధకపదము లెప్పుడును బహువచనరూపముల తోడనే యుండును; వాని కేకవచనరూపము లుండుటకు వీలులేదు. 'చూపఱు' పై లు-వర్ణము నుత్తరాంధ్రకవులు చేర్చిరి: చూపఱులు (ఉ. రా. I. పు. II); చూపఱులకు (కవిక. II. 104).

2. ధాన్యవాచకశబ్దములు సాధారణముగ బహువచనరూపముల తోడనే యుండును; వాని యేకవచనరూపములు తత్తత్సస్యవాచకములై యేకవచనమునందే యుండును:—

అక్కుళ్లు, అలసందెలు, ఆముదాలు, ఆరెనడ్లు, ఆవాలు, ఆళ్లు, ఉద్దులు, ఉలవలు, ఎండువులు, ఒదివిరి ప్రాలు, కందులు, కస్తురిపట్టెయలు, కాకిజెక్కలు, కుఱెనువ్వులు, కొఱ్ఱినువ్వులు, గంటెలు, గరుడసరులు, గుత్తిమల్లెలు, గోధుమలు, చిఱువడ్లు, చెంద్రవంకలు, జొన్నలు, చేమపూరాజనములు, చోళ్లు, జవలు, తవిందెలు, తిరువరంగములు, ధనియాలు, నూగులు, నువ్వులు, పాలకన్నులు, పునాసలు, నెమిలివడ్లు, పిచ్చిపెసలు, పెసలు, పేరాముదాలు, పొంగుప్రాలు, మినుములు, మెంతులు, రాగులు, రెడ్డిపాలవంకలు, జెక్కపాయలు, సన్నమండెంగలు, సెనంగలు, మొదలయినవి.

3. కొన్ని విత్తనములపేళ్లును బహువచన రూపముతోడనే వాడుకయందున్నవి: గసగసాలు, మోదుగ మాడలు, కనుపాలవిత్తులు, కాపీగింజలు, మొదలయినవి.

4. కొన్ని యాటలపేళ్లు బహువచన రూపముతో నుండును:—

అచ్చనగ (-గు) ండ్లు (గాయలు). అచ్చనలు, అప్పళాలు, ఆలంకలు, ఈనెగాజులు, ఈలకూంతలు, ఉప్పనంబట్టెలు, ఏలపాటలు, ఓమనంగాయలు (-గుంటలు), కనుమూసి గంతలు, కుందికాళ్లు, కుప్పిగంతులు, కుప్పీలు, గీరన గింజలు, గుంటచాళ్లు, గుజగుజతేకులు, గూవనాలు, ఓగుళ్లు, గుడిగుడిగుంచాలు, గొబ్బిళ్లు, గోడిపట్టెలు, గోర్పిళ్లు, చిక్కనా బిల్లలు, గ్రచ్చకాయలు,

మ్మనబిల్లలు, చిఱుతనబిల్లలు, చీఁకటిమొటికిళ్లు, జాబిళ్లు, డాఁ (దా) గన డాఁగలి, డాఁగుడు (రు)) మూఁతలు (ముచ్చులు), డికీలు, తూరనఁ ోలలు (-తుంకములు), బొట్టనగోలలు, బొమ్మరాలు, వామనములు, వెన్నెలకుప్పలు, సరిబేసులు, సొగటాలు. కొన్నియాటలపే ర్లేకవచనమునందే యుండును: గట్టినబోది, చిట్టిపట్టె, దూఱుదుంకెన, తన్నుబిల్ల, గుంజనఁగాలు, ందెనగుడి (-గిడి); తూనరతుక్కము మొద.

5. కొన్ని భక్ష్యములపేళ్లు బహువచనరూపములతోడనే కాన్పించుచున్నవి; అంగరొల్లెలు, అడుకులు, అమృతకలశములు, ఇడికుడకలు, ఉక్కెలు, గుగ్గిళ్లు, చక్కెరబుడగలు, జిల్లేడుకాయలు, జీడలు, నాగులు, పడికుడుకలు, పాలకాయలు, పిండిపోకలు, పుడు (-ణు) కులు, పోళీలు, బూరియలు, లడ్డువములు, సుకియలు, మొదలయినవి.

6. కొన్ని యాభరణముల నామములును బహువచనములందే కాన్పించుచున్నవి.

అంటుపోగులు, అడ్డిగలు, ఒంట్లు, కనుపులగుండ్లు, కమ్మపంజులు, కుట్టుపోగులు, కుండపోగులు, గిఱుగాజులు, గుమ్మతీలు, గోడుగుమెట్టెలు, చిటుకెన బొద్దులు, చెంపసరులు, చెంపకల్లీలు, చెవులపూవులు, చేకట్లు, చౌకట్టు (-టు) లు, జంపులు, జుమికీలు, జొత్తులు, (భార. విరా. I. 228); పంజులకమ్మలు, పాఁజేబులు, పాటీలు, పోఁచీలు, బావిలీగొలుసులు, బిందీలు, పీరమద్దియలు (-మధ్యములు, ముద్దియలు, ముద్రికలు) మొదలయినవి. ఇట్టి కొన్ని పదము లేకవచనమందే యుండుట గలదు, బన్నసరము, బుగడ, బిరికీ మొదలయినవి.

7. కొన్ని మనుష్యజాతులపేళ్లు: అఱవలు, కరణకమ్మలు, కరిణలు, కాఁపులు, జక్కులు, పంపరెడ్లు, పద్మనాయకులు (-వెలమలు); పిచ్చుగుంటువాండ్రు, బడగులు, కోమట్లు, భట్రాజులు మొదలయినవి.

8. కొన్ని వృత్తుల నవలంబించిన వారిపేళ్లు; కోలలవారు, గాజులవాండ్రు మొదలయినవి.

9. ఇతరములు: అడ్డాలు ('ఆడ్డాలలో నున్నప్పుడే బిడ్డలు, గడ్డాలు వచ్చిన తరువాత బిడ్డలా?'); అంకిళ్లు, అంక (-ంకా) పొంకము (-ంకా) లు; అంట్లు, అంతికలు, అక్షింతలు, అంపసెలలు, (భార. ఉద్యో. IV. 192); అపరాలు, అదరులు, అమడలు, అమ్మనలు; అర (ఱ) వర (ఱ) లు, అగచాట్లు, అగవాళ్లు, అడిగండ్లు, అడుకులు (భార. ద్రోణ. IV. 89); అడ్డవాట్లు, అడ్డసాళ్లు, (భార. ద్రో. I. 262); అరిగాళ్లు, అరిమెనకుండలు, అఱవఱలు (భార. భీష్మ. II. 136, అఱువుళ్లు, అలకలు, అల్లుఁడుకొమాళ్లు, ఆగడపలు; ఆడంగులు, ఆసాసలు, ఇట్టింకులు, ఇట్టీయలు, ఇల్లిగ్గులు; ఇసిటింతలు, ఉద్దాలు,

ఎండమావులు, (భాగ. V. 168; VI. 556) ఎత్తుగడ్డలు, ఏటికోళ్లు, ఒంట్లు, ఒడిఁబ్రాలు, ఒదిగిళ్లు, ఓలచెంగనాలు; కక (-కా) వికలు, కటకటాలు, కటుమరలు, కడగండ్లు, కడికండలు, కనుపాట్లలు, కఱదలు, కఱకుట్లు (కుమా. భా. I. IV. 60); కనఅలు, కాఱులు, కుప్పీలు, కేకిసలు, కైచాఁపులు, గండ్రికలు, గగ్గులు, గప్పాలు, గస్తీలు, గిడిగిళ్లు, గిరిగిటలు, గుంజుళ్లు; గుండ్రలు, గుత్తిపండ్లు, గుదిగుంజలు, గుదియకఱ్ఱలు, గుఱుములు, గోవాళ్లు, చింకలు, చిచ్చుబుడ్లు, చిట్టంటుచేతలు, చిట్టంటులు, చిట్టుములు, చిదురుపలు, చీవాట్లు, చుంగులు, చెంగనాలు, చేరుడులు (ళ్లు), చందమామ గుక్కిళ్లు, చందురవంకలు (-కూనలు); జంపాలు, జంకెలు (భార. భీష్మ. II. 113); జతిగెలు, జోతలు, జోబిల్లు, డింగిళ్లు, తప్పుదెబ్బలు, తలమునుకలు (భార. భీష్మ. III. 119); తళ్లు, తావకాళ్లు (-కోళ్లు), తుందునుకలు, తుంపిళ్లు, తుంపెసలు, తొంగిళ్లు, తోలుచదువులు, దండెపుఁబీటలు, దిక్కుమొగములు దీవనఁబ్రాలు, దొడ్డికాళ్లు, ధనళములు, నక్కిళ్లు, నల్లిండ్లు, నామటలు, నీరుకాళ్లు, నుచ్చిళ్లు, నులివాళ్లు, నెత్తఱులు, పంచకరపాటులు, పంబుదాళ్లు, పచ్చఁబ్రాలు, పడలు, పల్లఅపులు, పానలు, పాఱుటాకులు, పాలపండ్లు, పాలబుగ్గలు, పాలిండ్లు (వరాహ. IV. 153), పాలెలు, పావటీలు, పానలు, పాగా (-వా) లు, పింపిసలు, పింపిళ్లు, పితరులు, పితాళ్లు, పిసికిళ్లు, పుడి (-ణి) కిళ్లు, పులకలు, పూజెకుండలు, పూజెగులు, పూఁటకూళ్లు, (ఏడులు) పూఁడులు (మను. I. 73), పెండెకట్లు, పెండ్లికుండలు, పెద్దలు, పెనుమినుకులు, పేణ్ణీళ్లు, పేలలు, ప్రేలాలు (ఉ. హరి. IV. 216); పొంగునీళ్లు, పోకిళ్లు, పోలానిగంటలు, ప్రాఁజదువులు (మినుకులు), ప్రాలు, బయ్యాంకలు, బాగములు, బిట్టుబిళ్లు (ఇది యవ్యయముగా నుపయోగింపఁబడుచున్నది; ఏక. బిట్టుబిడి?); బొరుగు (-వు) లు, బోరుతలుపులు, మంగలికోళ్లు, మంచినీళ్లు, మగచెయ్యిలు, మదనచేతులు, మిడిగ్రుడ్లు, మిడుఁగుఱులు; మిడుఁగుఱు; అని యేకవచనరూపమును గలదు. దిశల మిడుఁగుఱు చెదరె (భాగ. III. 604); ముకు (-క్కు) గ్రోళ్లు, ముక్కుళ్లు, ముట్టునీళ్లు, మెఱికలు, లాఁకలు, లూడుపులు, వంగుళ్లు, వాటపద్యములు, వానకాళ్లు, విళంగీలు, వైరవులు, సడింపులు, సెనగపేడలు (హర. II. 9); సేసలు, సోరణగండ్లు (భార. ఉద్యో. II. 112), కుచ్చెళ్లు (దీని కేకవచనముగ 'కుచ్చె' అను రూపము శబ్దరత్నాకరమున నీఁబడినదిగాని, దానికి ప్రయోగము లేదు; వ్యవహారమునను గ్రంథములందును నీపదము బహువచనాంతముగానే యున్నది. 'కుచ్చెళ్లు' అను బహువచనరూపము గలుగుటకు 'కుచ్చెలు' అను నేకవచనరూప ముండవలెను; కాని యట్టి రూపము

లేదు. 'కుచ్చె'కు బహువచనరూప మగు 'కుచ్చెలు' కు ప్రోగులు అని యర్థము.

పై వానిలోఁ గొన్నిటికి వృత్తియం దేకవచనరూపము గలుగును: అదరుటగ్గి, ఎండువుఁ దట్ట మొ.వ.

10. (i) కొన్ని అ - వర్ణాంత శబ్దములు బహువచనరూపములై యుండవచ్చును. అవి యేకవచనరూపము లను భ్రమచే వానిపై మరల లువర్ణము చేరుచువచ్చినది: చిందఱు, (చీఁదఱు), దబ్బఱు, పాఁతఱు, (చెవులు సిందఱు గొన - భాగ. VII. 210); (చిందఱు) వందఱు (భార. భీష్మ. I. 26). వీనికి వరుసగా చిందు, దబ్బు, పాఁతు, వందు, అనునవి యేకవచనరూపములు గావచ్చును. కాని. 'శ్రుతిపుటములు చీఁదఱలు వ్రూన' (భోజ. VI.); చిందఱు వందఱులై (భాగ. III. 116; VI. 337).

'మిడుఁగుఱు' తొలుత నేకవచనరూపమే (కన్న. మిణుగుహుళు = మినుకు పురుగు).

'చిచ్చు' నకు 'చిచ్చఱు', 'చిచ్చుఱు' అను రెండును బహువచనరూపములే. చిచ్చఱుకన్ను (భార. భీష్మ. III. 299); చిచ్చఱుకోల (భాగ. I. 282); చి, చ్చఱుపిడుగు (భార. విరా. V. 143, యతిస్థానము); చి, చ్చుఱుపిడుగు (భార. విరా. IV. 83, యతిస్థానము); ఇట్లే, 'అమ్ము' బహు. అంపఱు; తమ్మి, బహు. తంపఱు మొద.

(ii) 'చింపిఱి': ఇది 'చిమ్ము' నుండి కలిగిన బహువచనరూపమై యుండును; జుంజుఱు: దీని నేకవచనము 'జుజ్జు' అయియుండును; తుంపర: ఇది 'తుమ్ము' నకు బహువచనమా? తుమ్మునప్పుడు కలుగు నోటినుండియు ముక్కునుండియు వెడలు నీటిబొట్ల సమూహమని తొలుత నర్థమై. పిదపనట్లు చిమ్ము నీటిబొట్లకన్నిటికిని నదివర్తించెనా?—'తుంపర'కు 'తుంపరలు' అనియు బహువచన రూపమున్నది. (భాగ. VIII. 209); తుమురు (భార. ద్రోణ. IV. 177) అని బహువచనమునఁ బ్రయోగమున్నది; దీనికి 'తుముళ్లు' అనియు భారతమున బహువచనరూపము కాన్పించుచున్నది.

తొలుత బహువచనములై తరువాత నేకవచనమున నుపయోగింపఁ బడిన పదములును గొన్ని కలవు: 'పంతులు': దీని కేకవచన మనఁదగు 'పంతు' తెనుఁగున లేదు; మరాఠి యందున్నది. 'మోరేపంత్' మొదలయినవి. దీనికి పాలి, ప్రాకృతములందు 'భంతే' అని రూపము. ఇది 'భవంతః' అను బహువచన రూపమునకు వికృతి. దీనినిబట్టి 'పంతు' అనునదియే బహువచన రూపమనియు, ఆ గౌరవము చాలక తెనుఁగున 'పంతులు' అని యేకవచనార్థమునసే మఱియొక బహువచన లు-వర్ణమును జేర్చిరనియు, దీనికి బహు

వచనముగ 'పంతుళ్లు' అని యేర్పడినదనియు, ఇంకను గౌరవముకొఱకు 'పంతుళ్లవారు, పంతులవారు, అని తెనుఁగువారు పిలిపించుకొన నెంతు రనియుఁ దెలిసికొనవచ్చును.

**తిరునాళ్ల**: 'తిరునాళ్లు' అనఁగా నుత్సవదినములు; ఉత్సవదినములకు సంబంధించిన పండుగ 'తిరునాళ్ల'; తొలుత నిది బహువచనమైనను నేకవచ నమునగూడఁ బ్రయోగింపఁబడుచున్నది.

. పిళ్లు = గడ్డి వెంటి; దీనికి 'పిరి', లేక 'పిడి' అను నేకవచనరూప మున్నను నీ బహువచనరూపమే యేకవచనమునను నుపయోగింపఁబడు చున్నది.

తొలుత నేకవచన రూపములకు బహువచనరూపములు గలుగఁగా, నా బహువచన రూపములనుండి మరలఁ గలిగిన యేకవచన రూపములు కొన్ని గలవు. అట్టివానిలోఁ గొన్ని తెనుఁగునకు మొదటి యవస్థలోనే కలిగి నవి. అట్టివానిలో -క, -ఁక, -ంక, -క్క; -కు, -ఁకు, -ంకు, -క్కు; -గ, -ఁగ, -ంగ, -గ్గ; -గు, -ఁగు, -ంగు, -గ్గు; అను వర్ణములతో నంతమగు ననేక పదములు చేరినవనియు, నవి '-కలు, -కులు, -గలు, -గులు' అను ద్రావిడ బహువచన ప్రత్యయము లేకవచన రూపములపైఁ జేరఁగా నం దొక్క -లువర్ణమే బహువచన రూపము లనుకొని యేకవచనరూపములందలి క, కు, గ, గు, లను వదలుటవలన నీ క్రొత్తరూపము లేర్పడినవనియు శబ్ద శాస్త్రజ్ఞులందురు. కాని, యీ క్రొత్త యేకవచనము లందలి క, కు, క్క, క్కు; గ, గు, గ్గ, గ్గు, లు స్వార్థమునఁ జేరిన కవర్ణమును దద్వికారములును నని యైనఁ జెప్పవచ్చును. కొన్ని ను- వర్ణాంతైకవచన రూపములకు రూపాం తరములుగ నేర్పడిన కు, గు వర్ణాంతపదములను గూర్చిమాత్ర మవి 'కులు, గులు' అను బహువచన ప్రత్యయములలోని లు-వర్ణమును వేఱుచేయఁగా మిగిలినవని మాత్రము చెప్పవచ్చును. కొలను, కొలఁకులు, కొలఁకు; కలను, కలఁకులు, కలఁకు; వలను, వలఁకులు, వలఁకు; గవను, గవఁకులు, గవఁకు; గోను, గోఁగులు, గోఁగు; రేను, రేఁగులు, రేఁగు; మొదలయినవి. ఇందు కు, గు, లంతమందుగల యేకవచన రూపము లర్వాచీనములు.

### ఔపవిభక్తిక పదముల బహువచనము.

ఔపవిభక్తిక పదములు సాధారణముగ -టు, -ఁడు, -డు, -ండు, -ను, -న్ను, -యి, -రు, -ఱు, -ఱ్ఱు, -లి, -లు, -ల్లు, అను వర్ణములతో నంతమగు చుండును. వాని బహువచన రూపములను గూర్చి యీప్రకరణ మున నింతకుముందు వివరింపఁబడినది; కాని, వానిని గూర్చి యొక్క విష

కము మాత్రము వివరింపవలసి యున్నది. ఇవర్ణమే యుపవిభక్తి యనియు గానికిఁ బూర్వమందున్న ట్, త్, అను వర్ణము లుపవిభక్తులు చేరునప్పుడు ంతకుఁ బూర్వమే యా యా శబ్దములందుండిన హల్లులకుఁ గలుగు వికారము నియు విభక్తి ప్రకరణమునఁ దెలుపఁబడును. ఔపవిభక్తిక ములగు యి ర్ణాంత శబ్దముల బహువచన లువర్ణమునకుఁ బూర్వమందు ప్రథమేతర భక్త్యేకవచనమున నున్న '-త్' అనునది నిలుచుచుండును: చేయి, చేతులు; చేతిని, చేతులను; మొద. కాని, రు, ఱు, లి, లు, ల్లు, లకు వచ్చు ట్, త్' లు బహువచనమున నిలువవు. గోరు, గోరులు, గోళ్లు, (గోటులు, గోట్లు, అని కాదు); గోటిని, గోళ్లను ('గోటులను' అని కాదు); గోటిచే, గోళ్లచే ('గోట్లచే' అని కాదు); ఏఱు, ఏఱులు, ఏళులు, (ఏటులు అని కాదు); ఏటిని, ఏళ్లను (ఏట్లను అని కాదు); రోఁకలి, రోఁకళ్లు (రోఁకట్లు అని కాదు); రోఁకలితో, రోఁకళ్లతో (రోఁకట్లతో అని కాదు); మొదలు, మొదలులు, మొదళ్లు (మొదట్లు అని కాదు), మొదటికి, మొదళ్లకు (మొదట్లకు అని కాదు); విల్లు, విండ్లు (వింట్లు అని కాదు); వింటిచే, విండ్లచే (వింట్లచే అని కాదు). ఇట్టియెడల ప్రథమైకవచనేతర విభక్తులందు టకారమునకు డకార మాదేశమగు (Voicing) నని చెప్పుకొనవలెనని తోఁచుచున్నది. అప్పుడు గోట్లు = గోడ్లు = గోళ్లు; ఏట్లు = ఏడ్లు = ఏళ్లు, మొదట్లు = మొదడ్లు = మొదళ్లు, రోఁకట్లు = రోఁకడ్లు = రోఁకళ్లు; వింట్లు = విండ్లు = వింళ్లు = విళ్లు, అనురీతి మార్పులు కలిగినవని చెప్పికొనవలెను. -ఱు 'అంతమందు గల శబ్దముల బహువచనమును గూర్చి మాత్రము సందేహము కలుగుచున్నది. అఱ్ఱులు, అఱుతులు; గొఱ్ఱులచేన్, గొఱుతులచేన్; పఱ్ఱులకు, పఱుతులకు, మొదలగు రూపాంతరము లుండునేమో విచారింపవలసియుండును.

సమాసములందును, శబ్దపల్లవములందును, కొన్ని కృత్తద్ధిత ప్రత్యయములు చేరునప్పుడు కానవచ్చు నేకబహువచన నియమములను గూర్చి తత్తద్విషయములను జర్చించునప్పుడు వివరింపఁబడినది కావున నిచట నా విషయమై తెలుపుట పునరుక్తమగును. సర్వనామ శబ్దములయు క్రియాపదములయు బహువచన విధానమును గూర్చి యా యా ప్రకరణములందు వివరింపఁబడును.

### అన్యదేశ్యశబ్దముల బహువచనరూపములు.

### హిందూస్థానీ పదములు.

1. హ్రస్వాచ్చు లంతమందు గల హిందూస్థానీపదముల బహువచన మాచ్ఛికపదములకువలెఁ గల్గును. ఉదా:—

అదంతములు: రూపాయ, రూపాయలు ('రూపాయి' కి 'రూపాయులు' అను బహువచనరూపము లేదు); సరిపెణ, సరిపెణలు; టపాకాయ, టపాకాయలు మొదలగునవి.

ఇదంతములు: తనాబి, తనాబులు; పిల్లాఁడి(-ణి), పిల్లాఁడు(ణు)లు, పిల్లాండ్లు; బికారి, బికారులు; పంపిణి, పంపిణులు; చావడి, చావళ్లు; చీటి, చీట్లు; సురతాణి, సురతాణులు; సన్కాని, సన్కానులు; సారాయి, సారాయులు; కళాయి, కళాయులు; సుకారి, సుకారులు; మాగాణి, మాగాణులు; ఇట్లే, కానులు, ఏగానులు.

ఉదంతములు: తట్టు(లు), జీను(లు), తబుకు(లు), చాకు(లు), నత్తు(లు), సేర్లు, డబ్బులు, బదుళ్లు, నకళ్లు, రుమాళ్లు మామూళ్లు, హాసీళ్లు, నజరులు (ర్లు) మొదలయినవి.

2. ఆకారాంతములగు హిందూస్థానీ శబ్దముల తుది దీర్ఘమునకు హ్రస్వము కలుగదు: పహారాలు, తర్జుమాలు, మసోయిదాలు, హోదాలు, మజాకాలు, మేజాలు, ఫర్మానాలు, ఖాజాలు, తాలూకాలు, జిల్లాలు, దావాలు, ఆవర్జాలు, ఔక్యాలు, నమూనాలు, ఖాయిదాలు, ముచ్చెలకాలు, జెండాలు, బిచానాలు, తగాదాలు, తామామర్వాలు, బాజాలు మొదలయినవి. వీని కేకవచనమునందును తుది దీర్ఘమునకు హ్రస్వము కలుగును.

3. (i) అనేకములయిన ఈకారాంత హిందూస్థానీ శబ్దములకు బహువచనమున లువర్ణము చేరునపుడు సాధారణముగ దీర్ఘమునకు హ్రస్వము కలుగదు; కావున ఇత్వమున కుత్వమురాదు: ఉదా. గరిడీలు (కెంపుటోడు బిళ్లల గరిడీలు - వసు. IV; సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర.-మను II.); పాళీలు (భాగ. XI); బోయీలు, జట్టీలు, పట్టీలు, ('రొట్టె'కి, బహు; రొట్టులు అనికాదు; 'రొట్టె'కు రొట్టెలు అగును); దట్టీలు, లట్టీలు, వెట్టీలు, గుమ్మితీలు, దమ్మిడీలు మొదలయినవి. వీని కేకవచనమున దీర్ఘమునకు హ్రస్వము వైకల్పికముగ నగును.

(ii) 'దీర్ఘపూర్వక' 'యి' వర్ణము అంతమందుగల హిందూస్థానీ పదముల తుది యిత్తునకు బహువచనమున దొల్లింటి దీర్ఘము మరల గాన్పించును: ఇలాయీలు, బోయీలు, కసాయీలు మొదలయినవి.

కొన్ని యెడల దీర్ఘము మరల గాన్పించక లు వర్ణమునకు బూర్వమందు 'యి' 'యు'గ మాఱుటయుఁ గలదు: (తగ సూర్యప్రభ లాయిలాయులును జంద్రజ్యోత్స్నలున్.- హంస. III.); ఇట్లే, కబాయులు, ముద్దాయులు, మిటాయులు, తురాయులు, బడాయులు, బజాయులు, డమాయులు'

6. కుంచ్చు. ఏక. (VI. 1000), కుంచలు = కుంచములు (VI. 986.)

7. పుడ్లులు = పుట్లు (VI. 135), ఏక. పుట్టి;—పుష్పవాటికగట్లు, గొన్నగట్లు (VI. 1004.) జోస్యునల్లయభట్లు (IV. 1078),—పెగ్గడ్లు V. 1185), రెండువాడ్లకున్ను = రెండువాడలకున్ను (IV. 970), వాడ్లు = వాడలు (IV. 748);—గుడ్లు = గుడులు (IV. 749); (VI. 123, 124); పచ్చళ్లు (IV. 981); మామిళ్లు = ళ్లు (IV. 784), ఏనాళ్లు = అయిదు దినములు (VI. 1128), నంజుడ్లు (IV. 1015, 1021), (కుంచడు) వైళు (?); రెండు పె (ం) అడ్లు = పెరడులు (VI. 1066);—మనోహరలడ్లు (VI. 923);—మత్తుఁ. ఏక, (IV. 766), మత్తుఁలు, మత్తుఁరు (VI. 591)మఱు తురులు (VI. 649), మత్తుఁ అు (VI. 624);—మఱుతుళ్లు ఎడ్లు (IV. 1015) వెల్లెడ్లు (VI. 143, 636), వీడ్లు (IV. 1015); కొట్టాడ్ల పత్తిఁ (V. 139), ఆడ్ల పట్లు (VI. 112), ఆడ్లు (VI. 585), ఊడ్లు (VI. 236, 585), ఊళ్లు (VI. 1040); నీడ్లు (VI. 1011, V. 213 ), పేళ్లు (VI. 938);—తగడ్లు = తగఁలు = పొఁటేళ్లు (VI. 218), మూఁడ్లు = మూఁఁలు (V. 216, 117, 218), మూఁళ్లు= మూఁఁలు (VI. 979):—గుడికట్టు కుచ్చెళ్లు (IV. 709), ఏక. కుచ్చెల; పడి కట్టు కుచ్చళ్లు (IV. 709);—ఎంగిడ్లు (IV. 1015); పెండ్లిండ్లకు (IV. 803), మంగడ్ల కొమ్మన (VI. 250), మొగడ్ల (=ళ్ల) చెఱువు (VI. 628,) ఏక. మొగలి;—కాహడ్లు = కాహళలు (IV. 675), నొంచెడ్లపురము (VI. 748).

బహువచనమున నర్థవిశేషములు.

కొన్ని పదములపై బహువచన లు - వర్ణము చేరునపు డర్థవిశేషము లును వేఱర్థములును కలుగుచుండును :—

i. అంకిలి = కలఁత, అడ్డగింత, ఆపద; అంకిళ్లు = దవుడక్రింది కీళ్లు;—అంటు = స్పర్శము, కూడిక, అశౌచము, ముట్టు; అంట్లు = వండికడుగని పాత్రములు, అంటుపేలు;—అంతిక సం. = అక్క, ఒక యోషధి, ప్రొయ్యి, సమీపము; అంతికలు, దే. = చాఁపవలె నల్లిన కసవుతడకలు; అనరు = సంకటము; అనరులు = జీవస్థానము, మర్మము; అపరము = ఇతరము, క్రిందిది, మీఁదిది, మృతినొందిన తరువాతి సంస్కారము; అపరాలు = పయర ధాన్యము; ఆడంగి = ఆడుదాని స్వభావముగల పురుషుఁడు; ఆడంగులు = ఆడువారు; ఉప్పుడు = ఉప్పుట, ఆవిరిపోక యుడికించుట; ఉప్పుళ్లు = ఉప్పుడు బియ్యము; ఊసు = పనిలేనికాలము, వృత్తాంతము; ఊసులు = కాలక్షేపము కొఱకు మాట్లాడు మాటలు; ఎదురుకోలు; = ఎదురుకొనుట; ఎదురుకోళ్లు = వివాహమునందు పెండ్లికొమార్తెవారు పెండ్లికొడుకువారి కెదురుగాఁబోయి

యాహ్వానించు నొక యాచారము; నాఁడు = దినము; (ఏ) నాళ్లు = అయిదు దినములు, వివాహానంతరము వియ్యంకు లొకరికొకరికి పంపెడుసారె; ఒత్తు = అదుముడు, తలచుఁదనము, మెత్త, ఆక్రమణము; ఒత్తులు = బిడ్డలచేతి యాభరణము; ఒండు = ఒకటి; ఒండ్లు = ఇతరములు, ఇతరులు; గుంజిలి = గోపనము; గుంజిళ్లు = కూర్చుండి లేచుచుండుటలు; చింక = చిన్నకాలువ; చింకలు = రెల్లలలోనుండు జొన్నలు; తంతియ = తీఁగ; తంతియలు = మెట్లు (' అనిమిషకోటి దైత్యవధ మాత్మను మర్వకయుండఁ దెల్పఁగా, వెను కొని కోట తంతియల వెంబడిగా దిగివచ్చి నందనం, దనుగను నన్నచోఁ బిదప దాని సమున్నతిఁ జెప్పనేఁటికిన్.—భద్రా. I.); తచ్చన = కపటము; తచ్చనలు = పరిహాస వచనములు; ఉల్లసము = ఉత్సాహము; ఉల్లసములు = ఉల్లసపు మాటలు; ప్రల్లదము = పారుష్యము; ప్రల్లదములు = పరుషపు మాటలు; బెట్టిదము, బేడిదము = ఉద్ధతి, కౌర్యము; బెట్టిదములు, బెడిదములు = పరుషవచనములు; అనరు = సంకటము; అనరులు = జీవస్థానము, మర్మము; కవ = జంట; కవలు = కవలబిడ్డలు; కొమరు = ప్రాయము; కొమరులు = కుమాళ్లు, దూలపు గుజ్జులు; గొప్పు = త్రవ్వుట; గొప్పులు = త్రవ్విన మంటిదిబ్బలు; చాఁప = ఏ చాఁపయైనను సరే; చాఁపలు = (ఒకప్పుడు) చిక్కు చాఁపలు; ప్రొద్దు = సూర్యుఁడు, కాలము; ప్రొద్దులు = ప్రసవసమయము; రవ = సన్నని నూక, వజ్రపు తునుక; రవలు = చిన్న తుపాకి గుండ్లు, వజ్రపు తునుకలు; సడింపు=బియ్యము దంచుట; సడింపులు = దంచినబియ్యము; మైల = మాలిన్యము, మలినవస్త్రము; మైలలు = మలిన వస్త్రములు; వేవిలి = పొలము; వేవిళ్లు = ఒక గర్భిణీ లక్షణము; జాబిలి = చంద్రుఁడు; జాబిళ్లు = ఒక పిల్లలయాట; కాఱు = పరుషము, పారుష్యము; కాఱులు = పరుషవచనములు (భార. కర్ణ. II. 93); సొమ్ము = ధనము; సొమ్ములు = ధనములు, ఆభరణములు, పశువులు, (ఆవులు) (ఆర. IV. 294, 347; భాగ. I. 13); నార = చెట్టునార; నారలు = నారబట్టలు; (నారలుగట్టి కూరలశనంబుగ - భార. ఆర. V. 349).

ii. క్రొత్త, ప్రాఁత, పెద్ద, చిన్న, పిన్న, మొదలగునవి విశేషణము లయినను మహన్మహతీబోధక విశేష్యములుగఁగూడ నేకవచనమున నుపయోగింపఁబడును; బహువచనమున క్రొత్తలు, ప్రాఁతలు, పెద్దలు, చిన్నలు, పిన్నలు అను రూపములు గలిగి క్రొత్తవారు, ప్రాఁతకాలమునుండియు నున్న వారు, పెద్దవారు, చిన్నవారు, పిన్నవారు, అను నర్థములను బొందును, (మేము) కౌరవుల ప్రాఁతలము (భార. విరా. I. 285).

iii. పచ్చ, కెంపు, నీలము అనునవి యేకవచనమున రంగులకును జాతి తాలకును వర్తించును; బహువచనమున (పచ్చలు, కెంపులు, నీలములు) జాతితాలను మాత్రము తెలుపును.

iv. అఱవ, ఒడ్డె, కాఁపు, కమ్మ, అంగజాల, కంసాల, కుమ్మర మొద లగున వేకవచనమున జాతి, వృత్తి మాత్రపరములు; వాని బహువచన రూపములు తత్తజ్జాతులకుఁ జెందిన మనుష్యులను దెలుపును. ఏకవచనమున మనుష్యపరముగ వాడునప్పుడు వానిపై 'వాఁడు' అను తచ్ఛబ్దము చేర్చును.

v. రాగి, వరి, కంది, మినుము, మొదలగు నేకవచనరూపములు సస్య వాచకములు; వాని బహువచన రూపములగు రాగులు, వడ్లు, కందులు, మిను ములు, మొదలగునవి ధాన్యవాచకములు.

### బహువచనమును గూర్చిన కొన్ని విశేషములు ప్రశ్నలు.

భాషకు ప్రాణము లనఁదగినవానిలో బహువచన మొకటి. బహు వచనరూపముల కేకవచన రూపములుగాని, యేకవచనరూపములకు బహు వచనరూపములుగాని చెప్పలేనియెడల నా భాష పరిచితమయినది కాదని నిస్సంశయముగఁ జెప్పవచ్చును. జీవద్భాషలో బహువచనమును వాడుకను బట్టి సందేహము లేకుండ నిర్ణయించుకోనవచ్చును; ఒక బహువచన రూప మున కేకవచన రూపముగాని, యేకవచన రూపమునకు బహువచన రూపము గాని వాడుకలో లేనప్పుడు తెనుఁగువారి నేటి వాడుకలో నట్టి రూపములు లేవు అని తెనుఁగువారు చెప్పికోఁ గలరు. సామ్యమునుబట్టి యాయా రూప ములను గల్పించి వాడినయెడల నీతఁడు తెనుఁగువాఁడు కాడు, అని వెంటనే చెప్పవచ్చును. జీవల్లోకమునుండి భ్రష్టమయిన ప్రాచీన భాషావిషయమున నాయారూపములు నేటికిని నిలిచియుండినఁదప్ప యిదమిత్థమని నిర్ణయింప వీలులేకుండును. ప్రాచీన భాష వాడుకనుండి తొలఁగి యుండుటచే దానిని గూర్చి పరిశోధనములుచేసి శాస్త్రదృష్టితో నున్న రూపములను వర్గీకరించి, 'ప్రాచీన భాషావిషయమున మాకు తెలిసినదింతే' యని పరిశోధకులు తెలుపఁగలరు. వారయినను నిది యిట్లే యుండవలెను అని శాసింపలేరు. ప్రాచీనపదముల బహువచన నిర్ణయ సందర్భమున నెన్నియో సందేహము లున్నవని యింతవఱకు వ్రాసినదానిబట్టి స్పష్టమయి యుండును. ఆయా సందర్భములందు చేర్చుటకు వీలుపడని కొన్ని విషయముల నిచ్చటఁజేర్చి యీ వచనమును గూర్చిన ప్రకరణమును ముగింపవలసి యున్నది.

**బాలుఁడు :** దీనికి బహువచనము 'బాలులు' అనవచ్చునా ? అనఁగూడ నిచో 'బాలులార' అను సంబోధనరూప మెట్లు గలిగినది ? అది తప్పా ? 'బాలురార !' అనవలెనా ? 'బాలుంద్రు' అను రూపము కలుగునా ?

**సొబగుఁడు :** దీనికి బహువచనరూప మేమి ? సొబగులు ? సొబగురు ? సొబగుంద్రు ? సొబగులు ?

**పగతుఁడు :** దీనికి 'పగతులు, పగతులు' అను బహువచనరూపములు గలుగునా ?

**మూర్తుఁడు :** 'ధూర్తులు' అనునట్లు 'మూర్తులు' అనవచ్చునా ?

**బాఁపనుఁడు :** బహువచనము ? బాఁపనులు ? బాఁపనురు ? బాఁపనుంద్రు ?

తమ్ముఁడు : 'అల్లుంద్రు' వలె 'తమ్ముంద్రు' అనవచ్చునా ? అనఁగూడనిచో వ్యవహారమున 'తమ్ముళ్లు' అనురూప మెట్లు కలిగినది ?

కొమరుఁడు : 'కొమార్లు, కొమాళ్లు' అనునట్లు 'కొమర్లు, కొమళ్లు' అని యనవచ్చునా ? 'కొమారుఁడు' కు కొమాళ్లగునట్లు, 'వజీరుఁడు' కు 'వజీళ్లు' అగునా ?

ఒక (కొ)రుఁడు : దీనికి 'ఒక (-కొ) ర్లు' అను బహువచనరూపములు గలవా ?

సంద్రుఁడు: 'చంద్రులు' అనునట్లు చంద్రార్థమున 'సంద్రులు' అనవచ్చునా ?

ఉక్కివుఁడు : బహువచనము ? 'ఉక్కివులు' అనుటకుఁ బ్రమాణ మేమి ?

రక్కసుఁడు : దీనికి 'రక్కసుంద్రు' అను బహువచనరూప మున్నదా?

చెలువుఁడు : దీనికి బహువచన రూపమేమి ? చెలువులు? చెలువుంద్రు?

ఒకొ (క్కొ)రుఁడు : దీనికి బహువచనము 'ఒకొ (క్కొ) రులు' అని కాన్పించుచున్నది. ఒకొరుంద్రు, ఒకొరుళ్లు, అని యనవచ్చునా ?

ఒకఁడు : అమహద్వాచక మగునపుడు దీనికి బహువచనరూప మేమి ? ఒకలు ? ఒకరు ? ఒకంద్రు ?

**పదునొకఁడు :** దీనికి 'పదునొకండులు' అని బహువచనరూప మున్నది. 'ఒకఁడులు' అని వ్యస్తముగఁ బ్రయోగింపవచ్చునా ? అమహత్తున 'పదునొకలు, పదునొకరు, పదునొకంద్రు' అనవచ్చునా ?

రెంటికంటె నెక్కువ వర్ణములుగలిగి '-ఆయి' అంతమందుగల శబ్ద లబహువచన రూపములను నిర్ణయించుట కష్టము: అబ్బాయి (-యిలు ? యులు ?), అమ్మాయి (-యిలు ? యులు ?), పాపాయి (-యిలు ? యులు ?), తాయి (-యిలు ? యులు ?), కంకణాయి, గబ్బిడా (-లా-ళా) యి; వ్వాయి, తరువాయి, తువ్వాయి, దిగువాయి, బొమ్మడాయి, వెన్నడాయి, వాయి, తిమ్మాయి, రామాయి, ఇలాయి (దీనికి 'ఇలాయులు' అని యొకకవి హువచన రూపమును ప్రయోగించెను. 'తగసూర్య ప్రభ లా యిలాయు ను జంద్రజ్యోతులున్ - హంస. III.); కబాయి, కసాయి, చీకువాయి, జిబ యి, జీనువాయి, ముద్దాయి, మిఠాయి, తురాయి, డమాయి, జజాయి, జాయి, సవాయి, పావురాయి.

'వడగండ్లు': దీనికి 'వడగలి, వడగల్లు' అనున వేకవచనరూపములు వచ్చునుగాని వానికిఁ బ్రయోగములు గానరావు. 'నెయ్యురు': దీనికి నెయ్యుఁడు' ఏకవచనరూపమై యుండవలెను; కాని, ప్రయోగము ? పగఱు, ల్వురు, చూపఱు, చెయ్వఱు, అనువాని కేకవచనరూపములు కానరావు.

'పొదుగిళ్ళు' (వరాహ. VI. 5): దీని కేకవచనరూపము 'పొదుగిలి' కా, 'పొదిగిలి' యా ? ప్రయోగములు? 'పొత్తిళ్లు, తొంగిళ్లు,' వీని కేక చనమున 'పొత్తిలి, తొంగిలి' అనవచ్చునేమో కాని ప్రయోగము మృగ్య లు; 'పొత్తిటన్' అను నొపవిభక్తిక రూపమున్నది. 'పొత్తుల శిశువు': నికి 'పొత్తు' అను నేకవచనరూప మున్నట్లు గానరాదు. 'పోచిళ్లు పొతురు' ప్రభులిం. I. పు. 23): దీని కేకవచనమున 'పోచిలి' యగునా ? ప్రయో ము ? అర్థ మస్పష్టము.

'సారి: పర్యాయము = ఒకసారి, రెండుసారులు (-ర్లు); కాని 'సారె సారెకున్'; 'సారి సారికిన్' అని యందురా ? 'సారె' = పర్యాయము అను ర్థమున 'సారెలు' అను బహువచనరూపము లేదు. బూరియ = బూరె, హు. బూరెలు; బూరెల మూఁకుడు = బూర్ల మూఁకుడు అనవలెనా ? బూర్లెమూఁకుడు' అనవలెనా ? అట్లే, 'గార్లతట్టయా' ? 'గార్లెతట్టయా' ?

'ఒక్కచోన్' అనవచ్చును; 'రెండు చోలన్' అనఁగూడదు. 'ఇమ్మె ున్ - బహువచనము:' 'రహిన్' అని సప్తమ్యేకవచనమునందే యవ్య యార్థమునఁ బ్రయోగము; దీనికి 'రహులు, రహులన్' మొదలగు బహువచన రూపములును గలవా? ఇట్లే సరవిన్, కరణిన్, ఒగిన్, మొగిన్ మొదలయినవి.

'వ్రేఁతలు' అనుటకు శకుంతలాపరిణయము, I. పు. 20 లో వ్రేయులు' అను రూపము కానవచ్చుచున్నది; దాని కేకవచనరూపములు 'వ్రేయి, వ్రేయు' అనునవి కావలెను కాని, యా రూపములు తెనుఁగున లేవు.

హలవసానములు పరములగునపు డసంయుక్తములును, ప్రథమా బహువచన ప్రత్యయములును నగు లు, రు, వర్ణముల యుత్వము వైకల్పికముగ లోపించును: 'వారి దప్రతతుల్ సాల్వాడి నల్గడం జెదరఁగాఁ బాఱెన్ మనోవేగుఁడై, పతగేంద్రుండమృతాంతికంబునకుఁ దత్పాలుర్ భయంబందఁగన్.' భార. ఆది. II. పలువుర్, కవుల్, మొద: —పగలు, కాళ్లు, వేటకాండ్రు, బండ్లు మొదలగువానియం దుత్వమునకు లోపములేదు. 'పుత్రుర్లేని' అని వరాహపురాణము IX. 86 లో ప్రయోగమున్నది. వ్యవహారమున నున్న 'మీకూ మాకూ మాటల్లేవ్ గుప్‌చప్!', 'దొంగలు మా మూటల్లాక్కొన్నారు', 'బల్లల్లేని పిల్లలున్నూ, పుస్తకాల్లేనివాళ్లున్నూ ఇంటికి పొండి'—అను నిట్టి ప్రయోగములు సురక్షితము లగుచున్నవి. ఇట్టి యుల్లోపము వ్యవహారమునఁగాని, కావ్యములందుగాని యన్ని చోట్లను గలుగదు. 'దొంగల్ మా మూటల్ లాక్కొని పారిపాయినార్' అని వ్యవహారమునఁగాని, 'పాండవులు వచ్చినవార్' అని కావ్యములందుగాని (?) యుండదు.

బహుత్వంబున ద్వితీయాది విభక్తులందు ప్రథమా బహువచన ప్రత్యయము తుది యుత్వమున కత్వమగును. వనములు, వనములను; బాలురు, బాలురతోన్; పగలు, పగలవలన; వేడుకకాండ్రు, వేడుకకాండ్ర కంటెన్; కాళ్లు, కాళ్లయందు; గూండ్లు,గూండ్లన్ మొదలయినవి.

'స్త్రీసమంబులగు విశేషణంబులయు, మువర్ణకాంత విశేషణంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగా నగు.' బాల. కారక. 20. ఉదా. మాటలు పెక్కుల -పెక్కులేల; కులిశధారల్ గుంఠితంబయ్యె; ఇష్టమగు (ఇష్టములగు) పదార్థములు.

పూజ్యతయం దేకవచనమున కొకప్పుడు బహువచనము వచ్చును: శంకరాచార్యులు. ఒకప్పుడు పూజయందు రెండు బహువచన ప్రత్యయములు చేరును: మధ్వాచార్యులవారు; -వారలు; మొద. ఒకప్పుడు మూఁడు బహువచన ప్రత్యయములు చేరును: మీరలు (ఇందు మ్, ర్, ల్, అను మూఁడును బహువచన బోధకములే.)

బహువచన ప్రత్యయముపై మరల బహువచన ప్రత్యయములు చేరుట తెనుఁగునఁ గాన్పించుచుండుట గలదు. ఈ విషయమును గుర్తించియే "అపి సంయుక్త సమాస్తో భూయోఽంతే లుః ప్రదృశ్యతే నామ్నామ్" అని యాంధ్రశబ్దచింతామణి కారుఁడు సూత్రించినాఁడు. మరల -లువర్ణము చేరుననుటచే దాని కాదేశముగావచ్చు రువర్ణమును గూడ గ్రహింపవలసి యుండును. కావున, నీళ్లులు, ఊళ్లులు, తాళ్లులు, కాళ్లులు, ఆంధ్రురు, పెక్కం

న్రురు మొదలగు రూపములును నున్నవని చింతామణికారుని యభిప్రాయము. కాని, యిట్టి రూపములు ప్రాచీన శాసనములం దెచ్చటను గానరాకున్నవి. ముద్రిత గ్రంథములలో విండ్లులన్ (భార. అర. VI. 233); అడ్డసాళ్లులు భార. అర. V. 29); ఏండ్లులు (భార. శాంతి. VI. 224); కీళ్లులు (భార. శాంతి. 154, 232); ఎన్నాళ్లులు (భార. ఆశ్ర. II. 15) మొదలగు ప్రయోగములు కానవచ్చుచున్నవి. కాని, విండులన్, అడ్డసాళులు, ఏండులు, కీళులు, ఎన్నాళులు, మొదలగు రూపములే సరియైన వైనట్లు తోఁచుచున్నది. అడ్డసాళులు (విరా. I. 72) మొదలగు రూపములే యెక్కువగ గ్రంథములందు కాన్పించుచున్నవి. దీర్ఘముపై సంయుక్త బహువచనము కలుగునపు డాసంయుక్తాక్షరమును శిథిలముచేసి రెండు హల్లుల నడుమను గణములకొఱకు నుత్తును గవులు చేర్చుచుందురు. హ్రస్వ స్వరముమీఁదను వారట్లే చేయుదురు గాని యట్టిచోట్ల సంయుక్త బహువచనముపై మరల బహువచన లు, ళు, వర్ణములను జేర్చుట కుదాహరణములు గానరావు. ముదుసళులు (భార. ఆది. VIII. 38); మొదళులు (భార. ఆది. V. 170); ఎరవళులు (భార. భీష్మ. I. 83); మొగిళులు (భార. భీష్మ. I. 9); ఒడళులు (భార. ఉద్యో. III. 224) పఱమొయిళులు (భార. విరా. IV. 86); మొదలగు రూపములు కాన్పించుచున్నవిగాని, ముదుసళ్లులు, మొదళ్లులు, ఎరవళ్లులు, మొగిళ్లులు, మొయిళ్లులు, ఒడళ్లులు, అనునిట్టి రూపములు ముద్రిత గ్రంథములందును గానరాకున్నవి. ఇట్లే, ఆంధ్రురు, వెక్కంధ్రురు మొదలగు ముద్రిత పాఠములకు ఆందురు, వెక్కండురు మొదలగునవియే సరియగు రూపములగునట్లు తోఁచుచున్నది. ఆ రూపము లయినను గవికల్పితములే కాని, వ్యవహారమున నెన్నడైన నున్నట్లు గానరావు.



'విభక్తి' యనఁగా విభజింపఁబడినది. సుప్ తిఙంతము పదము. నామములపై సుప్పులును ధాతువులపై తిఙ్ఙులును చేరి పదము లగుచుండును. సుప్తిఙాద్యులకుఁ బ్రత్యయము లని పేరు. సుప్పులును తిఙ్ఙులును పదములతో నెల్లప్పుడును గలిసియే యుండును. వానికిఁ బ్రత్యేక ప్రయోగము లేదు. సుప్పులును తిఙ్ఙులును చేరిన మూలరూపమునకుఁ బ్రాతిపదికము, లేక, ప్రకృతి యని పేరు. ఈ ప్రకృతి రూపము ప్రత్యయముతోఁ గూడక ప్రత్యేకముగఁ బ్రయోగింపఁబడదు. కాని, వైయాకరణులు శబ్దస్వరూపమును నిర్ణయించుటకుఁ బదములను బ్రకృతులుగను బ్రత్యయములుగను విడఁదీయుదురు. వీనిలోఁ బ్రాతిపదికమున ధాత్వర్థము కొంతవఱకు గోచరించు చుండునుగాని ప్రత్యేకింపఁబడిన ప్రత్యయమునకు ప్రత్యేకార్థముండదని కొందఱందురు. కాని, కొందఱు దానికిని బ్రత్యేకార్థము కలదనియు, 'అర్థం ప్రత్యాయయతీతి ప్రత్యయః' అను వ్యుత్పత్తిని బట్టియే దాని కర్థము గలదని తెలియుచున్నదనియు నందురు. ప్రత్యయము లొకప్పుడు పదములుగనే యుండి, రాను రాను వికారములను బొంది ప్రత్యేకార్థవత్త్వమును గోల్పోయియుఁ బ్రాతిపదికములతో నిత్యసంయోగముఁ బొంది, వానికిని వాక్యమందలి యితర పదములకును గల సంబంధమును స్పష్టము చేయుట కుపయోగించుచున్నవనియు తెలుపు వాదమున కీ యభిప్రాయము తోడ్పడుచున్నది.

అన్వయ వ్యతిరేకములను గుర్తించి వైయాకరణులు ప్రత్యయములను బ్రాతిపదికములనుండి విడఁదీయుదురు. సంస్కృతమునఁ బ్రథమైకవచనమున 'రామః' అను పదమునందు 'రామ' అనియు 'స్' అనియు రెండు భాగములు కాన్పించుచున్నవి. అట్లే, హరిః, గురుః మొదలగువానిలోఁ గూడ 'హరి, గురు' అను భాగములును 'స్' అను భాగమును గాన్పించుచున్నవి. వీనిలో 'రామ, హరి, గురు' అను భాగములు మాఱుచుండఁగా 'స్' అనుభాగ మన్నిటికిని సమానముగా నిలిచియున్నది. ఈ భాగమునకుఁ బ్రత్యేకముగ నర్థము లేదు. అది తత్పూర్వ భాగములకుఁ జేరి యాయా వ్యక్తులొక్కొక్కరే యున్నారని బోధించుచున్నది. 'రామౌ' అనునప్పుడు 'రామ' అనుభాగము నిలిచి, 'స్' అనునది పోయి దానిస్థానమున 'ఔ' అని చేరినది. ఇట్లే, కృష్ణౌ, వృక్షౌ మొదలగువానియందును 'ఔ' అనునది సమానముగాఁ గాన్పించుచు నా యా వ్యక్తులు రెండేసి యున్నవని తెలుపుచున్నది.

తత్పూర్వ భాగములతోఁ గలియకయున్నప్పుడు 'ఔ' కుఁ బ్రత్యేకార్థము లేదు. కావున 'ఔ' అనునదియుఁ బ్రత్యయమే యగుచున్నది. అది ద్వివచనబోధక ప్రత్యయమని వైయాకరుణుఁడనును. ఈ రీతిగా నేఁడు (ఎనిమిది) విభక్తులందును ఏక, ద్వి, బహువచనములందు వేర్వేఱు ప్రత్యయములు నిలిచి వేర్వేఱు సంబంధములను దెలుపుచుండఁగా నా ప్రత్యయములు చేరినట్టి భాగము లర్థవంతములై తాము ప్రాతిపదికసంజ్ఞను బొందుచున్నవి. ప్రాతిపదిక ప్రత్యయ సంయోజనమువలన నేర్పడు భాషలయందెల్ల పదముల నిట్లే విడఁదీయుట వైయాకరణసంప్రదాయమై యున్నది.

సంస్కృతమున 'స్ (ఉ) ఔ జ(స్); అమ్ ఔ(ట్) (ఛ్)అస్; (ట్) ఆ భ్యామ్ భిస్; (ఙ్) ఏ భ్యామ్ భ్యస్; (ఙ్)అస్(ఇ) భ్యామ్ భ్యస్; (ఙ్) అస్ ఓస్ ఆమ్; (ఙ్)ఇ ఓస్ సు(ప్)' అను ప్రత్యయముల పట్టికలో మొదటి 'సు' అనునదియు తుది 'ప్' అను ఇద్వర్ణమును గలిసి 'సుప్' అను ప్రత్యాహార మేర్పడుచున్నది. ఇది యా పట్టికయందలి ప్రత్యయముల నన్నిటిని సంక్షేపముగ బోధించును. ఈ సంస్కృత ప్రత్యాహారమునే తెనుఁగు వైయాకరణులు తెనుఁగు విభక్తులకును బ్రత్యాహారముగ వాడుచున్నారు. తెనుఁగున 'సుప్' ప్రత్యాహార మసమంజసమైనను ననేక విషయములందు వలె తెనుఁగునను సంస్కృతపరిభాష వాడుకలోనికి వచ్చినది. సుప్ప్రత్యయము లన్నియు నామముల మీఁదనే చేరును గనుక, వీనిని నామవిభక్తు లనుటయుఁ గలదు.

'తి (ప్), తస్, (ఝ) ఇ; సి (ప్), థస్, థ; మి (ప్), వస్, మస్; త్, ఆతామ్, (ఝ) అ; థాస్, ఆథామ్, ధ్వమ్; ఇ (ట్), వహి, మహి (ఙ్)' అను ప్రత్యయములు ధాతువులపైఁ జేరి సంపూర్ణక్రియాపదముల నేర్పఱుచును. వీనిలో మొదటి 'తి' యును, తుది 'ఙ్' అను నిద్వర్ణమును గలిసి 'తిఙ్' అను ప్రత్యాహారమనఁబడును. తిఙ్లనఁగాఁ గ్రియాపదముల నేర్పఱుచుటకు ధాతువులపైఁ జేరు ప్రత్యయములు. తెనుఁగువైయాకరణులు తెనుఁగు క్రియలయందు చేరు ప్రత్యయములకు సంస్కృత సంప్రదాయము ననుసరించి 'తిఙ్లు' లనుటయుఁ గలదు. చిన్నయసూర్యాదులు వీనికి 'డుఙ్, రు; వు, రు; ను, ముఙ్' అను ప్రత్యయములను బట్టి తెనుఁగున 'డుఙ్' ప్రత్యాహారమును గల్పించిరి. ఈప్రకరణమున దెనుఁగునందలి సుబ్విధానమును గూర్చి మాత్రము తెలుపఁబడును.

సంస్కృతమునందలి సుబ్విధానమునకును ద్రావిడభాషలలోని సుబ్విధానమునకును జాలభేదము గలదు. (1) సంస్కృతమున నొక్కొక్క విభక్తియందును నేక, ద్వి, బహువచనములను మూఁడువచనములు గలవు; ద్రావిడభాష

లలో నేక, బహువచనము లను రెండే కలవు. (2) సంస్కృతమున నొక్కొక్క వచనమున ప్రత్యేక విభక్తులందు ప్రత్యేక విభక్తి ప్రత్యయము లున్నవి; ద్రావిడభాషలలో నొక్కొక్క విభక్తియందు నేకవచనమునను బహువచనమునను గూడ నొక్కటే విభక్తిప్రత్యయము చేరును; ఈ విభక్తిప్రత్యయములు బహువచనమున బహువచనబోధకమగు ప్రత్యేకప్రత్యయముపైఁ జేరును. (3) సంస్కృతమున విభక్తిప్రత్యయము వచనమును గూడఁ దెలుపును; ద్రావిడభాషలలో నది వచనమును దెలుపదు; వచనమును దెలుపుటకు ప్రత్యేక ప్రత్యయము చేరును; ఈ బహువచన ప్రత్యయ మన్నివిభక్తులయందును నొక్కటియే యైయుండును. (4) సంస్కృతమున నాయా పదముల యంతముల ననుసరించి ప్రథమేతర విభక్తులయందు ప్రాతిపదికరూపము భేదించుచుండును; ఉదా. షష్ఠీఏకవచనము: రామస్య, హరేః, మరుతః, అస్య మొద. ద్రావిడభాషలలో ప్రాతిపదిక రూపమునందిట్టి మార్పులు కలుగవు; ఏమయిన మార్పులు కానవచ్చినను నవి సంస్కృతము నందలి మార్పులవంటివి కావు.

పై కారణములను బట్టి కాల్డువెల్లు సంస్కృతమునకును ద్రావిడభాషలకును సంబంధములేదను తనయూహ కొకయాధారమును గల్పించుకొన్నాఁడు. కేవల సంస్కృతముతోఁ బోల్చునప్పుడు ద్రావిడభాషలకు సంస్కృతముతో సంబంధము లేనట్లే కాన్పించును. కాని, సంస్కృతము ననంతరచరిత్రము నాలోచించినచో సంస్కృతద్రావిడముల పరస్పర సంబంధము గోచరింపఁ గలదు. ఈ విషయమును నిర్ణయించుటకు సంస్కృతమునను ప్రాచీనప్రాకృత భాషలలోను, ఆధునిక ప్రాకృతభాషలలోను నీ సుబ్విధాన మెట్లున్నదో కొంచెము వివరింపవలసియున్నది.

## సంస్కృతమున సుప్ప్రత్యయములు.

1. సంస్కృతమున నీ క్రింది సుబంత ప్రత్యయములు పేర్కొనఁ బడినవి :

| | ఏ. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్రథమా విభక్తి | స్ (ఉ) | ఔ | (జ్) అస్ |
| ద్వితీయా విభక్తి | అమ్ | ఔ (ట్) | (శ) అస్ |
| తృతీయా విభక్తి | (ట్) ఆ | భ్యామ్ | భిస |
| చతుర్థీ విభక్తి | (ఙ్) ఏ | భ్యామ్ | భ్యస |
| పంచమీ విభక్తి | (ఙ్) అస్ (ఇ) | భ్యామ్ | భ్యస |
| షష్ఠీ విభక్తి | (ఙ్) అస్ | ఓస్ | ఆమ్ |
| సప్తమీ విభక్తి | (ఙ్) ఇ | ఓస | సు (ప్) |

2. పై ప్రత్యయము లన్ని ప్రాతిపదికముల మీఁదను నొక్క రీతిగాఁ జేరవు; వానికిఁ బూర్వమందు కొన్నియెడలఁ గొన్ని యాగమవర్ణములు చేరుచుండును. కొన్నియెడల నాయావిభక్తి ప్రత్యయములకు మాఱుగ వేఱు ప్రత్యయములు చేరుచుండును. కొన్ని శబ్దములపై విభక్తి ప్రత్యయములు లోపించును. ఇట్టి విషయముల నన్నిటి నిచట వివరింప వీలులేదు; కాని దిఙ్మాత్రముగాఁ గొన్ని మాత్రము చూపఁబడుచున్నవి. ప్రాకృతాది భాషలయందు ద్వివచనము లేకపోవుటచే నీ క్రింద ద్వివచనరూపములఁగూర్చి విచారింపలేదు.

ప్రథమైక వచనము: ఆకారాంత ఈకారాంత శబ్దములమీఁదను, కొన్ని నపుంసకలింగ పదములమీఁదను, హలంతశబ్దముల మీఁదను, కొన్ని సర్వనామ శబ్దములమీఁదను ప్రథమైక వచన ప్రత్యయమగు 'స్' చేరదు: ఉదా. మాలా, నదీ, వారి, మధు, సరిత్, శిరస్, అహమ్, త్వమ్ మొద. అకారాంత నపుంసకలింగ శబ్దములపై సుస్థానమున 'అమ్' చేరును: ఉదా. ఫలమ్:— సు - లోపము కలుగునపు డా శబ్దములందలి యచ్చులు లం దొకచో మార్పులు కలుగుచుండును: ఉదా. హనుమాన్, సఖా, అనడ్వాన్ మొద. కొన్ని నపుంసకలింగ హలంతశబ్దములపైఁ బ్రత్యయము చేరకుండుటయే కాక యా శబ్దముల తుదిహల్లుకూడ లోపించును: ఉదా. నామ మొదలయినవి.

ప్రథమా బహువచనము: అజంత నపుంసకలింగ శబ్దముల ప్రథమా బహువచనమున అస్ - స్థానమున -'ని' చేరును; 'ని' చేరునపుడు తత్పూర్వస్వరమునకు దీర్ఘము కలుగును: ఉదా. ఫలాని, వారీణి, మధూని. హలంత నపుంసకలింగ శబ్దములకు ప్రథమా బహువచనమున తుది హల్లుపై ఇ-వర్ణమును, హల్లునకుఁ బూర్వమందు 'న్' ను చేరుచుండును: మహాంతి, శిరాంసి, జగంతి మొద. కొన్ని సర్వనామముల బహువచనము ప్రత్యేక రూపములను దాల్చియుండును: వయమ్, యూయమ్, తే, సర్వే మొద. 'అస్' చేరునపుడు తత్పూర్వ స్వరములకుఁ గొన్నియెడల గుణము వచ్చును: హరి + అస్ = హరే + అస్ = హరయ్ + అస్ = హరయః; ఇష్లే, వాయవః మొద.— కొన్ని 'అన్' అంత నపుంసకలింగ శబ్దముల తుది నకారము లోపింపఁగా మిగిలిన రూపముల తుదియచ్చు ననుసరించి బహువచనరూపము లేర్పడును: నామాని.

ద్వితీయైకవచనము: ద్వితీయైకవచన ప్రత్యయమగు 'అమ్' లోని తొలి అకారము కొన్నియెడల లోపించును: రామమ్, ఫలమ్, హరిమ్, మాలామ్, నదీమ్, వాయుమ్, వధూమ్ మొద. కొన్నియెడల ననఁగా నపుంసక లింగ శబ్ద

ములపై నెట్టి ప్రత్యయమును జేరదు: వారి, మధు, మహత్ మొదలయినవి. కొన్ని హలంత శబ్దములపై విభక్తి ప్రత్యయము చేరకుండుటయేకాక యా శబ్దముల తుది హల్లుకూడ లోపించును: ఉదా. నామ.

ద్వితీయా బహువచనము: ద్వితీయా బహువచనమున అకారాంత పుంలింగశబ్దములపై 'అన్' చేరును: రామాన్; దీర్ఘాజంతబ్దములపై 'స్' మాత్రము చేరును: మాలాః, నదీః మొద. నపుంసకలింగశబ్దముల ద్వితీయా బహువచన రూపములు ప్రథమా బహువచన రూపములవలెనే యుండును: ఫలాని, వారీణి, మధూని, జగంతి, శిరాంసి మొద.

తృతీయైకవచనము: అకారాంత పుంనపుంసకలింగపదములపై 'ఆ' స్థానమున 'ఇన'వచ్చును. రామేణ, ఫలేన; ఇ, ఉ లంతమందుగల శబ్దములపైఁ గొన్నియెడల 'నా' చేరును: హరిణా, వారిణా, వాయునా, మధునా మొద. కొన్నియెడల 'నా' వైకల్పికముగఁ జేరును: మతినా, మత్యా మొద. ఆకారాంతశబ్దముల తుది యచ్చునకు హ్రస్వము కలిగి యా హ్రస్వాచ్చుపై 'య్' ఆగమముగా వచ్చును: మాలయా మొద.

తృతీయా బహువచనము: అకారాంత శబ్దములపైఁ దృతీయా బహువచనమున 'ఐస్' వచ్చును: రామైః, ఫలైః మొద.

చతుర్థ్యేకవచనము: అకారాంత శబ్దములపైఁ జతుర్థ్యేక వచనమునఁ 'ఏ'స్థానమున'అయ' వచ్చును: రామాయ, ఫలాయ; అకారాంత శబ్దములపై 'య్' ఆగమముగా వచ్చి, వైభక్తిక 'ఏ' కారమునకు 'ఐ' ఆదేశమగును: మాలాయై; కొన్నియెడల నాగమాక్షరము లేకయే 'ఐ' అనునది విభక్తి ప్రత్యయముగాఁ జేరును: నద్యై మొద. సర్వనామ పదములందు 'స్య', 'స్మ' అను నాగమాక్షరములపై 'ఐ' చేరును: సర్వస్మై, సర్వస్యై, మొద.

చతుర్థీ బహువచనము: అకారాంత శబ్దములపై 'భ్యస్' చేరునపుడు వాని తుది అకారము ఏకారముగ మాఱును: రామేభ్యః, ఫలేభ్యః మొద.

పంచమ్యేకవచనము: అకారాంత పుం నపుంసకలింగ శబ్దములకు పంచమ్యేకవచన స్థానమున '-అత్' అనునది చేరుచుండును: రామాత్; ఫలాత్; సర్వనామ పదములకు '-అత్, అస్'లు చేరుటకుఁ బూర్వము వరుసగా 'స్మ' 'స్య' లాగమములగునా? సర్వస్మాత్, సర్వస్యాః.

ఋ-కారాంత శబ్దములతుది ఋ-కారమునకు 'ఉ' కార మాదేశమై, పంచమ్యేకవచనమున 'స్' మాత్రము చేరును: పితుః మొద.

పంచమీ బహువచనము: చతుర్థీ బహువచనమునందువలెనే పంచమీ బహువచనమునందును రూపములు గలుగును.

షష్ఠ్యేకవచనము: షష్ఠ్యేకవచనమున అకారాంత పుంనపుంసకలింగ పదములపై 'అస్' స్థానమున 'స్య' చేరును: రామస్య, ఫలస్య. స్త్రీలింగ సర్వనామ శబ్దములపై 'అస్' చేరుటకుఁ బూర్వము 'స్య' ఆగమముగాఁ జేరును: సర్వస్యాః, తస్యాః.

షష్ఠీబహువచనము: అజంత శబ్దములపై 'అమ్' ప్రత్యయమునకుఁ బూర్వము 'న్' ఆగమముగా వచ్చును; అప్పుడు కొన్నియెడల పూర్వాచ్చునకు దీర్ఘము కలుగును: రామాణామ్, ఫలానామ్, హరీణామ్, మాలానామ్, నదీనామ్, గురూణామ్, వధూనామ్ మొదలయినవి. గో శబ్దమునకు 'గవామ్' అను రూపము కలుగును. సర్వనామపదములపై పుం నపుంసకలింగముల 'ఇష్', స్త్రీలింగమున 'అస్' అనున వాగమములుగాఁ జేరును: సర్వేషామ్, తేషామ్; సర్వాసామ్, తాసామ్.

సప్తమ్యేకవచనము: సప్తమ్యేకవచనమున ఇదుదంత శబ్దములపై 'ఇ' స్థానమున 'ఔ' చేరును. అట్లు చేరునపు డాప్రాతిపదికముల తుది యచ్చు లోపించును: హరౌ, గురౌ, సర్వనామములపై పుం నపుంసకలింగముల 'స్మిన్', స్త్రీలింగమున 'స్యామ్'లు చేరును: సర్వస్మిన్, తస్మిన్; సర్వస్యామ్, తస్యామ్.

సప్తమీబహువచనము: అకారాంత పుంనపుంసకశబ్దములపై 'సు' చేరునపు డాశబ్దముల తుది అకార మేకారముగా మాఱును. రామేషు, ఫలేషు.

సంబోధన ప్రథమైకవచనమున విభక్తిప్రత్యయము చాల యెడల లోపించును: రామ, ఫల, జగత్ మొదలయినవి. ఇదుదంత పుంలింగ శబ్దముల తుది యచ్చులకు గుణమువచ్చును: హరే, గురో. ఈ దూదంతశబ్దముల తుది దీర్ఘమునకు హ్రస్వము కలుగును: నది, వధు. ఋకారాంతశబ్దముల తుది యచ్చుస్థానమున 'అస్' చేరును: భర్తః. సంబోధనప్రథమా బహువచన రూపము ప్రథమా బహువచనరూపమువలెనే యుండును.

పైని వివరించినదానిని బట్టి సంస్కృతమునను విభక్తిరూపము లన్నియెడల నొక్కతీరునఁ గలుగలేదనియు, నేకార్థముననే యనేకవిధములగు ప్రత్యయములు చేరుచున్నవనియుఁ దెలియనగును. కాని, సంస్కృతమునకును నాధునికార్యభాషలకును గల యొక ముఖ్య భేదమును మాత్రము గుర్తింపవలసియున్నది. సంస్కృతమున నాయా ప్రత్యయములు విభక్తినేకాక వచనమును గూడఁ దెలుపుచుండఁగా నాధునికార్యభాషలయందు ద్రావిడభాషలందువలెనే విభక్తి వచనములు వేర్వేఱు ప్రత్యయములచే తెలుపఁబడుచున్నవి. ఇట్టి గొప్ప మార్పుకలుగుట కనేక కారణములున్నవి. అందు ముఖ్య

మయినది ధ్వనులయందు కలుగు సహజమగు మార్పు. ఇంతకుముందు తెలిపినట్లనేకములగు మార్పులుగలిగి శబ్దముల తొల్లింటి స్వరూపము పోల్చుకొన వీలులేనంతగమాఱినది. ఈ మార్పు ప్రత్యయములకుఁగూడ సోఁకినది. ప్రత్యయములుశబ్దముల తుదనుండుటచే వానిపై నూఁత(accent)చెడి యాయాప్రాకృత భాషలందు కొన్నియెడల నవి మాఱుటయుఁ గొన్నియెడల లోపించుటయుఁ గలిగినది. ఇట్టి మార్పులవలన వేర్వేరు విభక్తిరూపము లేక రూపమును బొందుట సంభవించినది. ఆ మార్పుల నన్నిటి నిట వివరించు టనావశ్యకము. ఈ క్రింద ప్రాకృతసుబంతములం దెట్టి తబ్బిబ్బులు గలిగినవో తెలుపుట కాయా ప్రత్యయములు వివిధవిభక్త్యర్థముల నెట్లు పొందినవో తెలుపఁబడుచున్నది.

ప్రా:—అ.

ప్ర. ఏ. (సం. పుం. అ), గఅ=గజః; పావయ=పావకః; సుపురిస=సుపురుషః; మాగ. కామ=గ్రామః; మాగ. చండాల=చండాలః; మాగ. ణల=నలః; మాగ. పంచయ్యనా = పంచజనః.

(సం. స్త్రీ. ఆ), సేవిద = సేవితా; కృతా+ఇతి = కడత్తి.

(సం. స్త్రీ. ఔ), ణావ = నౌః.

(సం. నపుం. అస్). మాగ. శిల = శిరస్.

ప్ర. బ. (సం. పుం. అ), అప. పుత్త = పుత్రః

ద్వి. బ. (సం. పుం. అ). అప. పుత్త = పుత్రాన్.

తృ. ఏ. (సం. పుం. ఋ), పిఅర = పిత్రా.

సం. ప్ర. ఏ. (సం పుం. అ), మాగ. అర్ధమా. మాగ. పుత్త = పుత్ర;

(సం. పుం. ఋ). మహా. (పిఅ, పిఅర.)

ప్రా:—అఊ.

ప్ర. బ. (సం. పుం. ఇ), మహా. అర్ధమా. జైమహా. అగ్గఊ=అగ్నయః

ప్ర. ఏ. (సం. పుం. అ), ఫణిహారా = ప్రతీహారః; వీసా = విషం; కందా = కందః; చందా = చంద్రః; కంతా = కాంతః; సీఅలా = శీతలః; దడ్ఢ = దగ్ధః.

(సం. స్త్రీ. ఆ), మహా. మాలా= మాలా; ప్రా. శౌ. పట్టికా=పట్టికా.

(సం. పుం. ఋ), మహా. అర్ధమా. జైమహా. భత్తా=భర్తా; మహా. పిఅ=పితా; శౌర. మాగ. పిదా=పితా.

(సం. స్త్రీ. ఔ), అర్ధమా. నావా = నౌః; శౌర. ణావా=నౌః.

ప్ర. బ. (సం. పుం. అ), పడిహారా=ప్రతీహారాః; వీసా=విషాః; కందా = కందాః; చందా=చంద్రాః; కంతా=కాంతాః; సీఅలా=శీతలాః; దడ్ఢా=దగ్ధాః; ప్రా. శా. విజశా. పతీభాగా = ప్రతిభాగాః; అద్ధికా = అర్థికాః; కోలికా = కోలికాః; గామేయికా = గ్రామేయికాః; ఆయుత్తా = ఆయుక్తాః; మహా. అర్ధమా. అప. పుత్తా = పుత్రాః.

(సం. నపుం. అ), జై మహా. అర్ధమా. ఫలా=ఫలాని.

(సం. స్త్రీ. ఆ), మహా. అర్ధమా. జై మహా. మాగ. మాలా=మాలాః; ప్రా. శా. బాధా=బాధాః; ప్రా. శా. పిలా=పీడాః.

(సం. పుం. ఋ,), అర్ధమా. భత్తా=భర్తారః

(సం. స్త్రీ. ఓ.), అర్ధమా. గవా=గావః.

ద్వి. ఏ. (సం. స్త్రీ. ఆ), ప్రా. శా. బాధా=బాధామ్; ప్రా. శా. పిలా=పీడామ్

ద్వి. బ. (సం. పుం. అ), మహా. అర్ధమా. అప. పుత్తా=పుత్రాన్.

(సం. నపుం. అ), జై మహా. అర్ధమా. ఫలా=ఫలాని.

(సం. స్త్రీ. ఆ), మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ. మాలా = మాలాః.

పం. ఏ. (సం. పుం. అ), మహా. అర్ధమా, జై మహా. జై శౌర. పుత్తా=పుత్రాత్; భయా = భయాత్; ప్రా. శా. విజశా. కాంచీపురా = కాంచీపురాత్.

సం. ప్ర. ఏ. (సం. పుం. అ), మహా. అర్ధమా. పుత్రా=పుత్ర.

(సం. స్త్రీ. ఆ.), మహా. మాలా=మాలే.

(సం. పుం. ఋ.) మహా. భత్తా=భర్తః; మహా. పిఅ=పితః;

సం. ప్ర. బ. (సం. పుం. అ.) మహా. అర్ధమా. పుత్తా=పుత్రాః

(సం. నపుం. అ.) అర్ధమా. జై మహా. ఫలా = ఫలాని.

(సం. స్త్రీ. ఆ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ. మాలా = మాలాః.

ప్రా—ఆయ.

చ. ఏ. (సం. పుం. అ.) అర్ధమా. పుత్తాయ (పద్యములలో) = పుత్రాయ.
(సం. నపుం. అ.) ప్రా. శా. విజశా. వాససత సహస్సాయ = వర్షశత సహస్రాయ.

ప్రా—ఆయే.

చ. ఏ. (సం. పుం. అ.) ప్రా. శా. విజశా. అజాతాయే = అజాతాయ.

ప్రా—ఆఅ.

తృ. ఏ. (సం. స్త్రీ. ఆ.) మహా. **మాలాఅ** = మాలయా.

చ. ఏ. (సం. పుం. ఆ.) మాగ. పుత్తాఅ (పద్యములలో) = పుత్రాయ;
**మహా.** పుత్తాఅ = పుత్రాయ.

పం. ఏ. (సం. స్త్రీ. ఆ.) **మహా.** అర్ధమా. జైమహా. [మాలాఅ] =
**మాలాయాః.**

ష. ఏ. (సం. స్త్రీ. ఆ.) మహా. **మాలాఅ** = మాలాయాః.

స. ఏ. (సం. స్త్రీ. ఆ.) మహా. **మాలాఅ** = మాలాయామ్.

ప్రా—ఆఉ.

ప్ర. బ. (సం. స్త్రీ. ఆ.) మహా. అర్ధ**మా.** జైమహా. మాలాఉ = **మాలాః.**

ద్వి. బ. (సం. స్త్రీ. ఆ.) మహా. అర్ధమా. జైమహా. **మాలాఉ** = మాలాః.

పం. ఏ. (సం. పుం. ఆ.) **మహా.** అర్ధ**మా.** జైమహా. పుత్తాఉ = పుత్రాత్.

(సం. స్త్రీ. ఆ.) మహా. అర్ధ**మా.** జైమహా. **మాలాయాః** = **మాలాఉః.**

పం. బ. (సం. పుం. ఆ.) మహా. [పుత్తాఉ] = పుత్రేభ్యః.

(సం. స్త్రీ. ఆ.) మహా. అర్ధమా. [మాలాఉ] = మాలాభ్యః.

సం. ప్ర. బ. (సం. స్త్రీ. ఆ.) **మహా.** అర్ధమా. జైమహా. **మాలాఉ** = మాలాః.

ప్రా—ఆఎ.

**తృ. ఏ.** (సం. స్త్రీ. ఆ.) మహా. అప. మాలాఎ = **మాలయా.**

ప్రా—ఆఏ.

తృ. ఏ. (సం. స్త్రీ. ఆ.) మహా. **మాలాఏ**=**మాలయా.**

(సం. స్త్రీ. ఔ.) అర్ధ**మా.** నావాఏ=నావా.

చ. ఏ. (సం. పుం. అ.) అర్ధమా. జైమహా. పుత్తాఏ=పుత్రాయ; అర్ధమా. సాగపాగాయే=శాకపాకాభ్యామ్ (ద్వివచనమున కేకవచనము; పుంలింగ రూపమునకు స్త్రీలింగరూపము. శాకపాకాయ=శాకపాకాయై.)

(సం. నపుం. ఆ.) దేవత్తాఏ = దేవతాయ; రుక్ఖత్తాఏ = వృక్షత్వాయ; గోణత్తాఏ=గోత్వాయ; హంసత్తాఏ=హంసత్వాయ మొద.

(సం. స్త్రీ. ఆ.) మహా. **మాలాఏ**=**మాలాయై.**

పం. **ఏ.** (సం. స్త్రీ. ఆ.) శౌర. మాగ. మాలాఏ = మాలాయాః.

**ష. ఏ.** (సం. స్త్రీ. ఆ.) **మహా.** మాలాఏ = మాలాయాః.

స. ఏ. (సం. స్త్రీ. ఆ.) **మహా. మాలాఏ** = **మాలాయామ్.**

ప్రా—ఆఓ.

ప్ర. బ. (సం. పుం. అ.) అర్ధమా. పుత్తాఓ = పుత్రాః.

(సం. స్త్రీ. ఆ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ. మాలాఓ = మాలాః.

(సం. స్త్రీ. ఓ.) మహా. గాఓ = గావః.

ద్వి. బ. (సం. స్త్రీ. అ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ. మాలాఓ = మాలాః.

(సం. స్త్రీ. ఔ.) అర్ధమా. నావాఓ = నావః.

పం. ఏ. (సం. పుం. అ.) మహా. అర్ధమా. జై మహా. పుత్తాఓ = పుత్రాత్.

(సం. స్త్రీ. ఆ.) మహా. అర్ధమా. జై మహా. మాలాఓ = మాలాయాః = మాలాతః.

పం. బ. (సం. పుం. అ.) మహా. [పుత్తాఓ] = పుత్రేభ్యః.

(సం. స్త్రీ. ఆ.) మహా. అర్ధమా. మాలాఓ = మాలాభ్యః.

సం. ప్ర. బ. (సం. స్త్రీ. ఆ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ. మాలాఓ = మాలాః.

ప్రా—ఇ.

ప్ర. ఏ. (సం. స్త్రీ. ఇ.) పాణజాఇ = ప్రాణజాతిః.

(సం. నపుం. ఇ.) మహా. శౌర. మాగ. దహి = దధి.

(సం. పుం. అ.) మాగ. సక్కి = శక్యః.

(సం. నపుం. అస్.) మాగ. శిలి = శిరస్.

ప్ర. బ. (సం. స్త్రీ. ఇ.) పాణజాఇ = ప్రాణజాతయః.

(సం. నపుం. అ.) మహా. అర్ధమా. జై మహా. ఫలాఇ = ఫలాని.

(సం. నపుం. ఇ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ. దహీంఇ = దధీని.

ద్వి. ఏ. (సం. నపుం. ఇ.), మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ. దహిం = దధి.

ద్వి. బహు. (సం. నపుం. అ.) మహా. అర్ధమా. జై మహా. ఫలాఇ = ఫలాని.

తృ. ఏ. (సం. స్త్రీ. ఆ.) మహా. మాలాఇ = మాలయా.

పం. ఏ. (సం. స్త్రీ. ఆ.) మహా. అర్ధమా. జై మహా. మాలాఇ = మాలాయాః.

ష. ఏ. (సం. స్త్రీ. ఆ.) మహా. మాలాఇ = మాలాయాః.

స. ఏ. (సం. స్త్రీ. ఆ.) మహా. మాలాఇ = మాలాయామ్.

(సం. పుం. ఇ.) మహా. అగ్గి = అగ్నే.

(సం. నపుం. ఇ.) మహా. దహి = దధి.

(సం. పుం. అ.) అప. పుత్తి = పుత్రే.

సం. ప్ర. బ. (సం. నపుం. అ.) అర్ధమా. జైమహా. ఫలాఇ = ఫలాని.

ప్రా—ఇఁ.

ప్ర. బహు. (సం. నపుం. అ.) మహా. అప. ఫలాఇఁ = ఫలాని.

ద్వి. బహు. (సం. నపుం. అ.) మహా. అప. ఫలాఇఁ = ఫలాని.

(సం. నపుం. ఇ.) మహా. అర్ధమా. జైమహా. శౌర. మాగ. దహీఇఁ = దధీని.

సం. ప్ర. బహు. (సం. నపుం. అ.) మహా. అప. ఫలాఇఁ = ఫలాని.

(సం. నపుం. ఇ.) మహా. అర్ధమా. జైమహా. శౌర. మాగ. దహీఇఁ = దధీని.

ప్రా—ఇం.

ప్ర. బహు. (సం. నపుం. అ.) మహా. అర్ధమా. జైమహా. శౌర. మాగ. ఫలాఇం = ఫలాని.

(సం. నపుం. ఇ.) మహా. అర్ధమా. జైమహా. శౌర. మాగ. దహీఇం = దధీని.

(సం. స్త్రీ. ఉ.) మహా. అర్ధమా. జైమహా. మధూఇం = మధూని.

(సం. స్త్రీ. ఓ.) మహా. గోణాఇం = గావః.

ద్వి. బహు. (సం. నపుం. అ.) మహా. అర్ధమా. జైమహా. శౌర. మాగ. అప. ఫలాఇం = ఫలాని.

(సం. నపుం. ఇ.) మహా. అర్ధమా. జైమహా. శౌర. మాగ. దహీఇం = దధీని.

సం. ప్ర. బహు. (సం నపుం. అ.) మహా. అర్ధమా. జైమహా. శౌర. మాగ. అప. ఫలాఇం = ఫలాని.

(సం. నపుం. ఇ.) మహా. అర్ధమా. జైమహా. శౌర. మాగ. దహీఇం = దధీని.

సం. బ. (సం. పుం. ఉ.) మహా. అర్ధమా. [వాఊఓ] = వాయుభ్యః.
ష. ఏ. (సం. పుం. ఉ.) మహా. అర్ధమా. జై మహా. [వాఊఓ] = వాయోః.

ప్రా. - ఎ.

స. ఏ. (సం. పుం. అ.) అప. పుత్తె = పుత్రే.

ప్రా. - ఏ.

ప్ర. ఏ. (సం. పుం. అ.) మాగ. సక్కే = శక్యః; మాగ. అర్ధమా. పుత్తే= పుత్రః

(సం. పు. ఋ) అర్ధమా. భత్తారే = భర్తా.

(సం. నపుం. అస్) మాగ. శిలే=శిరస్.

(సం. స్త్రీ. ఓ.) అర్ధమా గవే = గౌః.

ద్వి. బ. (సం. పుం. అ.) మహా. అర్ధమా. అప. పుత్తే=పుత్రాన్; ప్రాశా. విజశా. వల్లవే=పల్లవాన్; గోవల్లవే=గోపల్లవాన్; అమచ్చే = అమాత్యాన్; ఆరకాధికతే=ఆరక్షాధికృతాన్; గుమికే=గుల్మికాన్; తూథికే = [తూథి]కాన్; భోజకే = భోజకాన్; దేసాధికతాదీకే=దేశాధి

(సం. పుం. ఋ.) మహా. [పిఅరే]=పితౄన్; శౌర. పిదరే=పితౄన్.
తృ. ఏ. (సం. పుం. అ.) అప. పుత్తే=పుత్రేణ.
స. ఏ. (సం. పుం. అ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ. పైశాచి జై శౌర. అప. ప్రాశా. పుత్తే=పుత్రే; విసయే=విషయే; చిల్లరేకకొడుంబకే = చిల్లరేకకుటుంబకే.

(సం. పుం. ఋ.) జై మహా. శౌర. భత్తారే=భర్తరి.

సం. ప్ర. ఏ. (సం. పుం. అ.) మాగ. పుత్తే = పుత్ర.

(సం. స్త్రీ. ఆ.) మహా. మాలే=మాలే.

ప్రా—ఏం.

తృ. ఏ. (సం. పుం. అ.) అప. పుత్తేం=పుత్రేణ.

ప్రా—ఓ.

ప్ర. ఏ. (సం. పుం. అ.) మహా. అర్ధమా. పుత్తో=పుత్రః; ప్రాశా. విజశా. మహారాజాధిరాజో=మహారాజాధిరాజః; భారద్దాయో=భారద్వాజః; పతిభాగో=ప్రతిభాగః.

(సం. పుం. ఋ.); మహా. అర్ధమా. జై మహా. భత్తారో=భర్తా; మహా. [పిఅరో] = పితా.

(సం. స్త్రీ. ఓ.), అర్ధమా. మాగ. గోణో=గౌః; గో=గౌః.

ప్ర. బ. (సం. పుం. ఋ.). మహా. [పిఅరో] = పితరః; అర్ధమా. జైమహా. పియరో = పితరః; శౌర. పిదరో=పితరః.

సం. ప్ర. ఏ. (సం. పుం. అ.) అర్ధమా. పుత్తో=పుత్ర.

(సం. పుం. ఋ.) మహా. పిఅరో = పితః.

సం. ప్ర. బ. (సం. పుం. ఋ); అర్ధమా. భత్తారో = భర్తారః.

ప్రా—ణ.

తృ. ఏ. (సం. పుం. అ.) మహా. అర్ధమా. జైమహా. శౌర. జైశౌర. మాగ. అప. పైశాచి. పుత్తేణ=పుత్రేణ; అప. పుత్తిణ, = పుత్రేణ (ప్రాశా. విజశా.మదేన లిఖితేన.)

(సం. పుం. ఇ) అప. అగ్గిణ=అగ్నినా.

(సం. పుం. ఉ.) అప. వాఉణ=వాయునా.

(సం. పుం. ఋ.) మహా. [పిఅరేణ]=పిత్రా.

ష. బ. (సం. పుం. అ.) మహా. అర్ధమా. పుత్తాణ=పుత్రాణామ్; ప్రాశా. విజశా. పల్లవాణ=పల్లవానామ్; మణుసాణ=మనుష్యాణామ్; తత్థవాణ = తత్ స్తవానామ్; భాతుకాణ = భ్రాతృకానామ్;

(సం. స్త్రీ. ఆ.) మహా. మాలాణ=మాలానామ్.

(సం. పుం. ఇ.) మహా. అగ్గీణ=అగ్నీనామ్.

(సం. పుం. ఉ.) మహా. అర్ధమా. జైమహా. వాఊనా=వాయూణామ్.

ప్రా—ణం.

తృ. ఏ. (సం. పుం. అ.) మహా. అర్ధమా. జైమహా. పుత్తేణం=పుత్రేణ.

ష. బ. (సం. పుం. అ.) మహా. అర్ధమా. శౌర. మాగ. అప. పుత్తాణం = పుత్రాణామ్; ప్రాశా. విజశా. పల్లవాణం=పల్లవానామ్; బమ్హణాణం= బ్రాహ్మణానామ్; పముఖాణం=ప్రముఖానామ్.

(సం. స్త్రీ. ఆ.) శౌర. మాగ. మాలాణం=మాలానామ్.

(సం. పుం. ఇ.) మహా. అర్ధమా. జైమహా. శౌర. మాగ. అగ్గీణం = అగ్నీనామ్.

(సం. పుం. ఉ.) మహా. అర్ధమా. జైమహా. శౌర. మాగ. వాఊణం = వాయూనామ్.

(సం. పుం. ఋ.), అర్ధమా. పిఈణం, పిఊణం, = పితౄణామ్.

ప్రా—ణా.

తృ. ఏ. (సం. పుం. ఇ.) మహా. అప. అగ్గిణా=అగ్నినా.

(సం. పుం. ఉ) మహా. అప. వాఉణా=వాయునా.

(సం. పుం. ఋ.) మహా. పిఉణా=పిత్రా; శౌర. మాగ. పిదుణా=పిత్రా

ష. బ. (సం. పుం. అ.) మహా. అర్ధమా. పుత్తాణా=పుత్రాణామ్.

(సం. స్త్రీ. ఆ.) మహా. అర్ధమా మాలాణా = మాలానామ్.

(సం. పుం. ఇ.) మహా. అర్ధమా. జై_మహా. అగ్గీణా=అగ్నీనామ్.

(సం. పుం. ఉ.) మహా. అర్ధమా. జై_మహా. వాఊణా=వాయూనామ్

ప్రా—ణి.

ప్ర. బ. (సం. నపుం. అ.) అర్ధమా. జై_మహా. జై_శౌర. ఫలాణి = ఫలాని.

(సం. నపుం. ఇ.) మహా. అర్ధమా. జై_మహా. శౌర. మాగ. దహీణి = దధీని.

(సం. నపుం. ఉ) మహా. అర్ధమా. జై_మహా. శౌర. మాగ. మహూణి = మధూని.

ద్వి. బ. (సం. నపుం. అ) మహా. అర్ధమా. జై_మహా. శౌర. మాగ. ఫలాణి = ఫలాని.

సం. ప్ర. బ. (సం. నపుం. అ.) అర్ధమా. జై_మహా. జై_శౌర. ఫలాణి = ఫలాని.

(సం. నపుం. ఇ.) మహా. అర్ధమా. జై_మహా. శౌర. మాగ. దహీణి = దధీని.

ప్రా—ణో.

ప్ర. బ. (సం. పుం. ఇ.) మహా. అర్ధమా. జై_మహా. శౌర. అగ్గిణో = అగ్నయః.

(సం. పుం. ఉ.) మహా. అర్ధమా. జై_మహా. వాఉణో = వాయవః.

(సం. పుం. ఋ.) మహా. [పిఉణో] = పితరః.

ద్వి. బ. (సం. పుం. ఇ.) మహా. అర్ధమా. జై_మహా. అగ్గిణో = అగ్నీన్.

(సం. పుం. ఋ.) మహా. [పిఉణో] = పితౄన్.

పం. ఏ. (సం. పుం. ఇ.) మహా. అర్ధమా. జై_మహా. అగ్గిణో = అగ్నేః.

(సం. పుం. ఉ.) మహా. అర్ధమా. జైమహా. [వాఉణో] = వాయోః.
ష. ఏ. (సం. పుం. ఉ.) మహా. అర్ధమా, జైమహా. శౌర. మాగ. వాఉణో = వాయోః.

(సం. పుం. ఋ.) మహా. అర్ధమా. భత్తుణో = భర్తుః, మహా. అర్ధమా. జై మహా. పిఉణో = పితుః; శౌర. మాగ. పిదుణో = పితుః.
సం. ప్ర. బ. (సం. పుం. ఇ.) మహా. అర్ధమా. జైమహా. అగ్గిణో అగ్నయః.

ప్రా—తు.

పం. ఏ. (సం. పుం. అ.) పైశాచి. ప్రాశా. పుత్తాతు = పుత్రాత్.

ప్రా—తో.

పం. ఏ. (సం. పుం. అ.) పైశాచి. ప్రాశా. పుత్తాతో = పుత్రాత్.

ప్రా—త్తో.

పం. ఏ. (సం. పుం. ఆ.) మహా. (పుత్తత్తో) = పుత్రాత్.
(సం. స్త్రీ. ఆ.) మహా. అర్ధమా. జైమహా. [మాలత్తో] = మాలాయాః (= మాలాతః ?)
(సం. పుం. ఇ.) మహా. అర్ధమా జైమహా. [అగ్గిత్తో]=అగ్నేః.
(సం. పుం. ఉ.) మహా. అర్ధమా. జైమహా. [వాఉత్తో] =వాయోః [= వాయుతః ?]
పం. బ. (సం. పుం. అ.) మహా. [పుత్తత్తో] = పుత్రేభ్యః.
(సం. పుం. ఇ.), మహా. అర్ధమా. జైమహా. [అగ్గిత్తో] = అగ్నిభ్యః (= అగ్నితః ?)
(సం. పుం. ఉ), మహా. అర్ధమా. [వాఉత్తో] = వాయుభ్యః (= వాయుతః ?)

ప్రా.— దు.

పం. ఏ. (సం. పుం. అ.) జైశౌర. పుత్తాదు = పుత్రాత్.

ప్రా.— దో

పం. ఏ. (సం. పుం. అ.). శౌర. జైశౌర. మాగ. పుత్తాదో.
(సం. స్త్రీ. ఆ.) శౌర. మాగ. మాలాదో = మాలాయాః (= మాలాతః)

(సం. పుం. ఇ.) జై శౌర. శౌర. (మాగ.), అగ్గిదో = అగ్నేః (= అగ్నితః?)

ప్రా.—ం = మ్

ప్ర. ఏ. (సం. పుం. అ.), మహా. ఫలం = ఫలమ్.
(సం. పుం. ఇ.). మహా. [అగ్నిం] = అగ్నిః.
(సం. నపుం. ఇ.), మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ. దహిం = దధి.
(సం. పుం. ఉ.). మహా. వాఉం = వాయుః.

ద్వి. ఏ. (సం. పుం. అ.) మహా. పుత్తం = పుత్రమ్; ప్రాశా. విజశా. పరిహారం = పరిహారం; వాటక (ం) = వాటమ్; పువ్వదత్తం = పూర్వదత్తమ్; నివతణం = నివర్తనమ్; వారణం = వారణం.
(సం. నపుం. అ), ప్రాశా. విజశా. ఉపరిలిఖితం = ఉపరిలిఖితం. ఆణతమ్ = ఆనతమ్, ఆజ్ఞప్తం; మహా. ఫలం = ఫలమ్.
(సం. స్త్రీ. ఆ.) మహా. మాలం = మాలామ్.
(సం. పుం. ఇ.), మహా. అగ్గిం = అగ్నిమ్.
(సం. నపుం. ఇ.), మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ. దహిం = దధి
(సం. పుం. ఉ.). మహా. వాఉం = వాయుమ్.
(సం. నపుం. ఉ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ. మహుం = మధు.
(సం. పుం. ఋ.) మహా. భత్తారం. మాగ. భత్తాలం = భర్తారమ్.
(సం. స్త్రీ. ఔ.) మహా. అర్ధమా. ణావం = నావమ్; అర్ధమా. నావం = నావమ్.

తృ. ఏ. (సం. పుం. ఇ.) అప. అగ్గిం = అగ్నినా.
(సం. పుం. ఉ.) అప. వాఉం = వాయునా.

ష. బ. (సం. స్త్రీ. ఓ.) మహా. గవం = గవామ్.

సం. ప్ర. ఏ. (సం. పుం. ఋ.) మహా. పిఅరం = పితః.

ప్రా.—ంమి.

స. ఏ. (సం. పుం. అ.) అర్ధమా. పుత్తంమి = పుత్రే.
(సం. పుం. ఇ.) అర్ధమా. జై మహా. అగ్గింమి = అగ్నౌ.
(సం. పుం. ఉ.) అర్ధమా. జై మహా. వాఉంమి = వాయౌ.

ప్రా.—మ్మి.

స. ఏ. (సం. పుం. అ.), మహా. జైశౌర. అర్ధమా. పుత్తమ్మి = పుత్రే.
(సం. పుం. ఇ), మహా. అగ్గిమ్మి = అగ్నౌ.
(సం. పుం. ఉ.), మహా. అర్ధమా. జైమహా. వాఉమ్మి = వాయౌ.

ప్రా.—ంసి.

స. ఏ. (సం. పుం. అ.), అర్ధమా. పుత్తంసి = పుత్రే.
• (సం. స్త్రీ. ఆ.), అర్ధమా. గిరిగుహాంసి = గిరిగుహాయామ్.
(సం. పుం. ఇ.), అర్ధమా. జైమహా. అగ్గింసి = అగ్నౌ.
(సం. పుం. ఉ.), అర్ధమా. వాఉంసి = వాయౌ.

ప్రా.—శ్శి.

ష. ఏ. (సం. పుం. ఉ.), మాగ. వాఉశ్శి = వాయోః.

ప్రా.—స.

ష. ఏ. (సం. పుం. అ.), ప్రాశా. విజశా. [కులగోత్తస] = కులగోత్రస్య.
(సం. పుం. ఇ.), ప్రాశా. విజశా. భట్టిస = భట్టేః.

ప్రా.—సుంతో.

పం. బ. (సం. పుం. అ.), మహా. [పుత్తాసుంతో, పుత్తేసుంతో] = పుత్రేభ్యః.
(సం. స్త్రీ. ఆ.), మహా. అర్ధమా. [మాలాసుంతో] = మాలాభ్యః.
(సం. పుం. ఇ.), మహా. అర్ధమా. జైమహా. [అగ్గీసుంతో] = అగ్నిభ్యః.
(సం. పుం. ఉ.), మహా. అర్ధమా. [వాఊసుంతో] = వాయుభ్యః.

ప్రా.—స్స.

ష. ఏ. (సం. పుం. అ.), మహా. పుత్తస్స; ప్రాశా. విజశా. కులగోత్తస్స = కులగోత్రస్య; సాసణస్స = శాసనస్య; [దేవకులస్స] = దేవకులస్య.
(సం. పుం. ఉ.), మహా. అర్ధమా. జైమహా. వాఉస్స = వాయోః.
(సం. పుం. ఋ.), అర్ధమా. పిఉస్స = పితుః; జైమహా. పియరస్స = పితుః; అర్ధమా. భత్తారస్స = భర్తుః.

ప్రా.—స్సు.

ష. ఏ. (సం. పుం. ఆ.), అప. పుత్తస్సు = పుత్రస్య.

ప్రా.—హ.

ష. ఏ. (సం. పుం. అ.), అప. పుత్తహ; మాగ. పుత్తాహ = పుత్రస్య.
(సం. పుం. ఋ.), అప. పిఅరహ = పితుః.

ప్రా.—హా.

ష. బ. (సం. పుం. అ.), అప. పుత్తహా; అప. (మాగ.) పుత్తాహా = పుత్రాణామ్.

(సం. పుం. ఇ.), అప. అగ్గిహా = అగ్నీనామ్.

(సం. పుం. ఉ.), అప. వాఉహా = వాయూనామ్.

ప్రా.—హి.

తృ. బ. (సం. పుం. అ.), అప. పుత్తహి; మహా. అర్ధమా. జైమహా. జైశౌర. అప. పుత్తేహి = పుత్రైః. విజశా. ఏవమాదికేహి = ఏవమాదికైః. పరివారేహి = పరివారైః.

(సం. స్త్రీ. ఆ.), మహా. అర్ధమా. జైమహా. మాలాహి, = మాలాభిః

(సం. పుం. ఇ.), మహా. అర్ధమా. జైమహా. అప. అగ్గిహి = అగ్నిభిః

(సం. పుం. ఉ.). మహా. అర్ధమా. జైమహా. వాఊహి = వాయుభిః.

(సం. పుం. ఋ.), అర్ధమా. భత్తారేహి = భర్తృభిః.

పం. ఏ. (సం. పుం. అ.), మహా. పుత్తాహి = పుత్రాత్.

(సం. పుం. ఇ.). మహా. అర్ధమా. జైమహా. అగ్గీహి = అగ్నేః.

పం. బ. (సం. పుం. అ.), మహా. [పుత్తాహి] = పుత్రేభ్యః; [పుత్తేహి] = పుత్రేభ్యః.

ప్రా. - హిం.

ద్వి. బ. (సం. పుం. ఇ.), మహా. అగ్గీహిం = అగ్నీన్.

తృ. బ. (సం. పుం. అ.), అప. పుత్తహిం; మహా. అర్ధమా. జైమహా. జైశౌర. శౌర. మాగ. అప. పుత్తేహిం = పుత్రైః.

(సం. స్త్రీ. ఆ.), మహా. అర్ధమా. జైమహా. శౌర. మాగ. మాలాహిం = మాలాభిః.

(సం. పుం. ఇ.), అర్ధమా. జైమహా. శౌర. మాగ. అగ్గీహిం=అగ్నిభిః.

(సం. పుం. ఉ.), మహా. అర్ధమా. జైమహా. శౌర. మాగ. వాఊహిం = వాయుభిః.

(సం. పుం. ఋ.), అర్ధమా. పిఈహిం, పిఊహిం, [పిఅరేహిం] = పితృభిః.

(సం. స్త్రీ. ఓ.), మహా. గోహిం = గోభిః.

పం. బ. (సం. పుం. అ.), మహా. అర్ధమా. జైమహా. పుత్తేహిం=పుత్రేభ్యః.

స. బ. (సం. పుం. అ.), మాగ. పుత్తేహిం = పుత్రేషు.

ప్రా. - హింతో.

పం. ఏ. (సం. పుం. అ.), మహా. పుత్తాహింతో = పుత్రాత్.

(సం. స్త్రీ. ఆ)., మహా. అర్ధమా. జైమహా. మాలాహింతో = మాలాయాః.

(సం. పుం. ఇ.), మహా. అర్ధమా. జైమహా. అగ్గీహింతో = అగ్నేః,

(సం. పుం. ఉ.), మహా. అర్ధమా. జైమహా. [వాఊహింతో] = వాయోః.

పం. బ. (సం. పుం. అ.), మహా. [పుత్తాహింతో], అర్ధమా. పుత్తేహింతో = పుత్రేభ్యః.

(సం. స్త్రీ. ఆ.), మహా. అర్ధమా. మాలాహింతో = మాలాభ్యః.

(సం. పుం. ఇ.), మహా. అర్ధమా. జైమహా. అగ్గీహింతో= అగ్నిభ్యః

(సం. పుం. ఉ.), మహా. అర్ధమా. వా ఊహింతో = వాయుభ్యః.

ప్రా. - హీ.

తృ. బ. (సం. పుం. అ.), అప. పుత్తహీ; మహా. అర్ధమా. జైమహా. జైశౌర. అప. పుత్తేహీ = పుత్రైః.

(సం. స్త్రీ. ఆ.), మహా. అర్ధమా. జైమహా. మాలాహీ = మాలాభిః.

(సం. పుం. ఇ.), అప. అగ్గిహీ = అగ్నిభిః.

స. బ. (సం. పుం. అ.), అప. పుత్తహీ, [పుత్తిహీ, పుత్తేహీ.]

ప్రా. - హు.

పం. ఏ. (సం. పుం. అ.), అప. పుత్తాహు = పుత్రాత్.

పం. బ. (సం. స్త్రీ. ఆ), అప. మాలాహు = మాలాభ్యః.

ష. బ. (సం స్త్రీ. ఆ.), అప. [మాలహు] = మాలానామ్.

ప్రా. - హుం.

పం. బ. (సం. పుం. అ.), అప. పుత్తహుం = పుత్రేభ్యః.

(సం. పుం. ఇ.), అప. అగ్గీహుం = అగ్నిభ్యః.

(సం. పుం. ఉ.), అప. వాఉహుం = వాయుభ్యః.

ష. బ. (సం. పుం. ఇ.), అప. అగ్గిహుం = అగ్నీనామ్.

(సం. పుం. ఉ.), అప. వాఉహుం = వాయూనామ్.

ప్రా. - హే.

పం. ఏ. (సం. పుం. అ.), అప. పుత్తాహే = పుత్రాత్.

(సం. స్త్రీ. ఆ.), అప. మాలహే, మాలాహే = మాలాయాః.

(సం. పుం. ఇ.), అప. అగ్గిహే = అగ్నేః.

(సం. పుం. ఉ.), అప. వాఉహే = వాయోః.

ష. ఏ. (సం. పుం. ఉ.), అప. [వాఉహే] = వాయోః.

ప్రా—హాం.

ష. ఏ. (సం. పుం. అ.), అప. పుత్తహాం = పుత్రస్య.

సం. ప్ర. బ. (సం. పుం. అ.), అప. పుత్తహాం = పుత్రాః.

ప్రా—హాఀ.

ష. ఏ. (సం. పుం. అ.), అప. పుత్తహాఀ = పుత్రస్య.

సం. ప్ర. బ. (సం. పుం. అ.), అప. పుత్తహాఀ, పుత్తాహాఀ = పుత్రాః.

(సం. పుం. ఇ.), అప. అగ్గిహాఀ = అగ్నయః.

(సం. పుం. ఉ.), అప. వాఉహాఀ = వాయవః.

పైని వివరించిన ప్రత్యయములీక్రింద నాయావిభక్తులుగ వర్గీకరింపం బడుచున్నవి:—

ప్ర. ఏ.

1. అ. (పుం. అ.) మహా. మాగ. ...
   (స్త్రీ. ఆ. ఔ.) మహా.
   (నపుం. అన్.) మాగ.
2. ఆ. (పుం. అ.) మహా. ... ... ...
   (స్త్రీ. ఆ. మహా. చూపై శా.
   (పుం. ఋ.) మహా. అర్ధమా.
   జైమహా. శౌర. మాగ.
   (స్త్రీ. ఔ.) అర్ధమా. శౌర.

ప్ర. బ.

1. అ. (పుం. అ.) అప.
2. అఊ (పుం. ఇ.) మహా. అర్ధమా జైమహా.
3. ఆ. (పుం. అ.) మహా. అర్ధమా. అప.
   (నపుం. అ.) జైమహా. అర్ధమా.
   (స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.
   జైమహా. మాగ. చూపై శా.
   (పుం. ఋ.) అర్ధమా.
   (స్త్రీ. ఓ.) అర్ధమా.
4. ఆఉ. (స్త్రీ. ఆ.) మహా.
5. ఆఓ. (పుం. అ.) అర్ధమా.
   (స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.

ప్ర. ఏ.

3. ఇ. (పుం. అ.) మాగ. ... ... ..
(స్త్రీ. ఇ.) మహా.
(నపుం. ఇ.) మహా. శౌర. మాగ
(నపుం. అస్.) మాగ.

4. ఈ. (పుం. ఇ.) మహా. ... ..
(నపుం. ఇ.) మహా. అర్ధమా
జై మహా.
(స్త్రీ. ఓ) మహా. అర్ధమా.
జై మహా.

5. ఉ. (పుం. అ. (అప.
(నపుం. అ.) అప.
(నపుం. ఉ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.

ప్ర. బ.

జై మహా. శౌర. మాగ.
(స్త్రీ. ఓ.) మహా.

6. ఇ. (స్త్రీ. ఇ.) మహా.
(నపుం. ఇ.) మహా. అర్ధమా
జై మహా. శౌర. మాగ.
(నపుం. అ.) మహా. అర్ధమా.
జై మహా.

7. ఇ. (నపుం. అ.) మహా. అప.

8. ఇం. (నపుం. అ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.
(నపుం. ఇ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.
(స్త్రీ. ఉ.) మహా. అర్ధమా.
జై మహా.
(స్త్రీ. ఓ.) మహా.

9. ఈ. (నపుం. అ.) మహా. అర్ధమా.
జై మహా.
(పుం. ఇ.) మహా. అర్ధమా
జై మహా.
(నపుం. ఇ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.
(నపుం. ఉ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.
(పుం. ఋ.) అర్ధమా.

10. ఈఓ. (పుం. ఇ.)మహా. అర్ధమా.
జై మహా. శౌర.

11. ఉ. (నపుం. అ.) అప.

12. ఊ. (పుం. ఉ.) మహా, అర్ధమా.
జై మహా.
(నపుం. ఉ.) మహా. అర్ధమా.
జైమహా.

ప్ర. ఏ.

6. ఊ. (పుం. ఉ.) అప.

7. ఏ (పుం. అ.) మాగ. అర్ధమా.
(పుం. ఋ.) అర్ధమా.
(నపుం. అన్.) మాగ.
(స్త్రీ. ఓ.) అర్ధమా

8. ఓ (పుం. అ.) మహా. అర్ధమా.
ప్రా శా. విజశా. ...
(పుం. ఋ.) మహా. అర్ధమా.
జై మహా.
(స్త్రీ. ఓ.) అర్ధమా. మాగ.

9. ం = మ్ (నపుం. అ.) మహా.
(పుం. ఇ.) మహా.
(నపుం. ఇ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.
(పుం. ఉ.) మహా.

ప్ర. బ.

13. ఊఓ. (పుం. ఉ. ) మహా.
అర్ధమా. జై మహా.

14. ఓ (పుం. ఋ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర.

15. ణి (నపుం. అ.) అర్ధమా. జై
మహా. జై శౌర.
(నపుం. ఇ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.
(నపుం. ఉ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.

16. ణో (పుం. ఇ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర.
(పుం. ఉ.) మహా. అర్ధమా.
జై మహా.
(పుం. ఋ.) మహా.

ద్వి. ఏ.

1. ఆ (స్త్రీ. ఆ.) చూపైశా.

ద్వి. బ.

1. అ. (పుం. అ.) అప.

2. ఆ. (పుం. అ.) మహా. అర్ధమా. అప
(స్త్రీ. ఆ.) మహా. అర్ధమా జై
మహా. శౌర. మాగ.

ద్వి. ఏ.

2. ఇ (నపుం. ఇ.) మహా. అర్ధమా.
జైమహా. శౌర. మాగ.

3. ఈ (నపుం. ఇ.) మహా. జైమహా.

4. ఉ (పుం. అ.) అప.
(నపుం. అ.) అప.
(నపుం. ఉ.) మహా. అర్ధమా
జై మహా. శౌర. మాగ.

5. ం=మ్ (పుం. అ.) మహా. ప్రాశా.
విజశా.
(నపుం. అ) ప్రాశా. విజశా.
(స్త్రీ. అ.) మహా.
(పుం. ఇ.) మహా.
(నపుం. ఇ.) మహా. అర్ధమా.

ద్వి. బ.

3. ఆఉ. (స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.
జై మహా.

4. ఆఓ (స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.
(స్త్రీ. ఓ.) అర్ధమా.

5. ఇ. (నపుం. అ.) మహా. అర్ధమా.
జై మహా.

6. ఇఁ. (నపుం. అ.) మహా. అప.
(నపుం. ఇ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.

7. ఇం (నపుం. ఆ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ. అప.
(నపుం. ఇ.) మహా. అర్ధమా.
జై మహా శౌర మాగ.

8. ఈ (నపుం. అ.) మహా. అర్ధమా.
జై మహా.
(నపుం. ఇ.) మహా. అర్ధమా.
జై మహా.
(నపుం. ఇ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.
(నపుం. ఉ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.

9. ఊ. (నపుం. ఉ.) మహా. అర్ధమా
జై మహా.

10. ఊఓ (పుం.ఉ.) మహా. అర్ధమా.
జై మహా.

11. ఏ. (పుం. అ.) మహా. అర్ధమా.
అప.
(పుం. ఋ.) మహా. శౌర.

జై మహా. శౌర. మాగ.
(పుం. ఉ.) మహా.
(నపుం. ఉ.) మహా. అర్ధమా
జై మహా, శౌర. మాగ.
(పుం. ఋ.) మహా. మాగ.
(స్త్రీ. ఔ.) మహా. అర్ధమా.

12. ణి (నపుం. అ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.
13. ణో (పుం. ఇ.) మహా. అర్ధమా.
జై మహా.
(పుం. ఋ.) మహా.
14. హిం (పుం. ఇ.) మహా.

తృ. ఏ.

అ (పుం. ఋ.) మహా
2. ఆ (స్త్రీ. ఆ.) మహా
3. ఆఎ (స్త్రీ. ఆ.) అప.
4. ఆఏ (స్త్రీ. ఆ.) మహా
(స్త్రీ. ఔ.) అర్ధమా.
5. ఇ (స్త్రీ. ఆ.) మహా.
6. ఏ (పుం. అ.) అప.
7. ఏం (పుం. అ.) అప.
8. ంమ్ (పుం. ఇ.) అప.
(పుం. ఉ.) అప.
9. ణ (పుం. అ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. జై శౌర.
మాగ. అప. జై శౌ.

తృ. బ.

1. హి (పుం. అ.) మహా. అర్ధమా.
జై మహా. జై శౌర. అప.
(స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.
జై మహా.
(పుం. ఇ.) మహా. అర్ధమా.
జై మహా. అప.
(పుం. ఉ.) మహా. జై మహా.
(పుం. ఋ.) అర్ధమా.
2. హిం (పుం. అ.) మహా. అర్ధమా.
జెమహా. జై శౌర. శౌర. మాగ.
అప.
(పుం. ఇ.) అర్ధమా. జైమహా.
శౌర. మాగ.
(పుం. ఉ.) మహా. అర్ధమా.
జై మహా, శౌర. మాగ.
3. హీ (పుం. అ.) మహా. అర్ధమా.
జై మహా. జై శౌర. అప.
(స్త్రీ. ఆ.) మహా, అర్ధమా.
జై మహా.
(పుం. ఇ.) అప.

(పుం. ఇ.) అప.
(పుం. ఉ) అప.
(పుం. ఋ.) మహా.
10. ణం (పుం. అ.) మహా. అర్ధమా.
జైమహా.
11. ణా (పుం ఇ.) మహా. అప.
(పుం. ఉ.) మహా. అప.
(పుం. ఋ.) మహా. శౌర. మాగ

చ. ఏ.

1. ఆఅ (పుం. అ.) మహా. మాగ.
2. ఆఏ (పుం. అ.) అర్ధమా. జైమహా
(నపుం. అ.) మాగ.
(స్త్రీ. ఆ.) మహా.
3. ఆయ (పుం. అ.) అర్ధమా.
4. ఆయే (నపుం. అ.) చూపైశా.
(పుం. అ.) మహా. మాగ.

చ. బ.

చతుర్థీ బహువచనమున షష్ఠీ బహువచనమునందలి ప్రత్యయములే యన్ని ప్రాకృతములందును గాన్పించుచున్నవి. చతుర్థ్యేకవచన ప్రత్యయములలో 'ఆఅ' 'ఆఏ' లు షష్ఠ్యేకవచనమందును గాన్పించుచున్నవి.

పం. ఏ.

1. ఆ (పుం. అ.) మహా. అర్ధమా.
జైమహా. జైశౌర. చూపైశా.
2. ఆఅ (స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.
జై మహా.
3. ఆఉ (పుం. అ.) మహా. అర్ధమా.
జైమహా.
4. ఆఏ (స్త్రీ. ఆ.) శౌర. మాగ.
5. ఆఓ (పుం. అ.) మహా. అర్ధమా.
జై మహా.
(స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.
జైమహా.
6. ఇ (స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.
జైమహా.
7. ఈఉ (పుం. ఇ.) మహా. జైమహా
8. ఈఓ (పుం ఇ.) మహా. అర్ధమా.
జై మహా.

పం. బ.

1. ఆఅ (పుం. అ.) మహా.
(స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.
ఆఓ (పుం. అ.) మహా.
(స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.
3. ఈఓ (పుం. ఇ.) మహా. అర్ధమా
జై మహా.

| | |
|---|---|
| 9, ఊఉ (పుం. ఉ.) మహా. అర్ధమా.<br>జై మహా. | 4. ఊఓ (పుం. ఉ.) మహా. అర్ధమా. |
| 10. ణో (పుం. ఇ.) మహా. అర్ధమా.<br>జై మహా,<br>(పుం. ఉ.) మహా. అర్ధమా<br>జై మహా. | |
| 11. తు (పుం. ఇ.) పై శా. చూ పై శా. | |
| 12. తో (పుం. అ.) పై శా. చూ<br>పై శా. | |
| 13, త్తో (పుం. అ.) మహా ... ... ...<br>(స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.<br>జై మహా.<br>(పుం. ఇ.) మహా. అర్ధమా. జై<br>మహా.<br>(పుం. ఉ.) మహా. అర్ధమా.<br>జై మహా. | 5. త్తో (పుం. అ.) మహా.<br>(పుం. ఇ.) మహా. అర్ద్దమా. జై<br>మహా.<br>(పుం. ఉ.) మహా. అర్ద్దమా. |
| 14. దు (పుం. అ.) జై శౌర. | |
| 15. దో (పుం. అ. శౌర. జై శౌర.<br>మాగ.<br>(స్త్రీ. ఆ.) శౌర. మాగ.<br>(పుం. ఇ.) శౌర. జై శౌర.<br>(మాగ.) | 6. సుంతో (పుం. అ.) మహా.<br>(స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.<br>(పుం. ఇ.) మహా. అర్ధమా. జై<br>మహా.<br>(పుం. ఉ.) మహా. అర్ధమా. |
| 16. హి (పుం. అ.) మహా. ... ...<br>(పుం. ఇ.) మహా. అర్ధమా. జై<br>మహా. | 7. హి (పుం. అ.) మహా.<br>8. హిం (పుం. అ.) మహా. అర్ధమా.<br>జై మహా. |
| 17. హింతో (పుం. అ.) మహా.<br>(స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.<br>జై మహా.<br>(పుం. ఇ.) మహా. అర్ధమా. జై మహా.<br>(పుం. ఉ.) మహా. అర్ధమా. జైమహా. | 9. హింతో (పుం.అ.) మహా అర్ధమా.<br>(స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.<br>(పుం. ఇ.) మహా. అర్ద్దమా. జై<br>మహా.<br>(పుం. ఉ.) మహా. అర్ధమా. |

18. హు (పుం. అ.) అప.

19. హే (పుం. అ. ఇ. ఉ; స్త్రీ. ఆ) అప.

ష. ఏ.

1. ఆఅ (స్త్రీ. ఆ.) మహా.
2. ఆఏ (స్త్రీ. ఆ.) మహా.
3. ఇ (స్త్రీ. ఆ.) మహా.
4. ఊఓ (పుం. ఉ.) మహా. అర్ధమా. జై మహా.

5. ణో (పుం. ఉ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ.
(పుం. ఋ. మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ.

10. హు (స్త్రీ. ఆ.) అప.
11. హూ (పుం. అ.) అప.
(పుం. ఇ.) అప.
(పుం. ఉ.) అప.

ష. బ.

1. ంమ్ (స్త్రీ. ఓ.) మహా.
2. ణ. (పుం. అ.) మహా. అర్ధమా. ప్రాశా. విజశా.
(స్త్రీ. ఆ.) మహా.
(పుం. ఇ.) మహా.
(పుం. ఉ.) మహా. అర్ధమా. జై మహా.
3. ణం (పుం. అ.) మహా. అర్ధమా. శౌర. మాగ. ప్రాశా. విజశా.
(స్త్రీ. ఆ.) శౌర. మాగ.
(పుం ఇ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ.
(పుం. ఉ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ.
(పుం. ఋ.) అర్ధమా.
4. ణా (పుం. అ.) మహా. అర్ధమా.
(స్త్రీ. ఆ.) మహా. అర్ధమా.
(పుం. ఇ.) మహా. అర్ధమా. జై మహా.
(పుం. ఉ.) మహా. అర్ధమా. జై మహా.

| ష. ఏ. | ష. బ. |
|---|---|
| 6. శ్శ (పుం. ఉ.) మాగ. | |
| 7. స. (పుం. అ.) చూపై శా. | |
| (పుం. ఇ.) చూపై శా. | |
| 8. స్స. (పుం. అ.) మహా. చూపై శా. | |
| (పుం. ఉ.) మహా. అర్ధమా. జై మహా. | |
| (పుం. ఋ.) అర్ధమా. జై మహా. | |
| 9. స్సు (పుం. అ.) అప. | |
| 10. హ (పుం. అ. మాగ. | 5. హా (పుం. అ.) అప. (మాగ.) |
| (పుం. ఋ.) అప. | (పుం. ఇ.) అప. |
| | (పుం. ఉ.) అప. |
| | 6. హు (స్త్రీ. ఆ.) అప. |
| | 7. హుం (అం. ఇ. ఉ.) అప. |
| 11. హే (పుం. ఉ.) అప. | |
| 12. హాం (పుం. అ.) అప. | |
| 13. హాఁ (పుం. అ.) అప. | |

| స. ఏ. | స. బ. |
|---|---|
| 1. ఆఅ (స్త్రీ. ఆ.) మహా. | |
| 2. ఆఏ (స్త్రీ. ఆ.) మహా. | |
| (పుం. అ.) అప. | |
| 3. ఇ (స్త్రీ. ఆ.) మహా. | |
| (పుం. ఇ.) మహా. | |
| (నపుం. ఇ.) మహా. | |
| 4. ఎ. (పుం. అ.) అప. | |
| 5. ఏ. (పుం. అ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ. పై శా. చూపై శా. జై శౌర. అప. | |
| 6. ంమి (పుం. అ.) అర్ధమా | |
| (పుం. ఇ.) అర్ధమా. జై మహా. | |
| (పుం. ఉ.) అర్ధమా. జై మహా. | |
| 7. మ్మి (పుం. అ.) మహా. అర్ధమా. జై శౌర. | |

ప. ఏ.

(పుం. ఇ.) మహా.

(పుం. ఉ.) మహా. అర్ధమా. జై మహా.

8. ంసి (పుం. అ.) అర్ధమా.

(స్త్రీ. ఆ.) అర్ధమా.

(పుం. ఇ.) అర్ధమా. జై మహా.

(పుం. ఉ.) అర్ధమా.

ప. బ.

1. హిం (పుం. అ.) మాగ.

2. హీం (పుం. అ.) అప.

నం. ప్ర. ఏ.

1. అ (పుం. అ.) మాగ. అర్ధమా.

2. ఆ (పుం. అ.) మహా. అర్ధమా.

(స్త్రీ. ఆ.) మహా.

(పుం. ఋ.) మహా.

3. ఆఅ (స్త్రీ. ఆ.) మహా.

4. ఈ (పుం. ఈ.) మహా.

నం. ప్ర. బ.

1. ఆ. (పుం. అ.) మహా. అర్ధమా

(నపుం. అ.) అర్ధమా. జై మహా

(స్త్రీ. ఆ.) మహా అర్ధమా. జై మహా. శౌర. మాగ.

2. ఆఉ. (స్త్రీ. ఆ.) మహా. అర్ధమా. జై మహా.

3. ఆఓ (స్త్రీ. ఆ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ.

4. ఇం. (నపుం.అ.) అర్ధమా. జై మహా.

5. ఇ (నపుం. అ.) మహా.

(నపుం. ఇ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ.

6. ఇం. (నపుం. అ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ. అప.

(నపుం. ఇ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ.

7. ఈ. (నపుం.అ.) అర్ధమా. జై మహా

(పుం. ఇ.) మహా. అర్ధమా. జై మహా.

(నపుం. ఇ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ.

(నపుం. ఉ.) మహా. అర్ధమా. జై మహా. శౌర. మాగ.

సం. ప్ర. ఏ.

5. ఉ (నపుం. ఉ.) మహా. అర్ధమా.
జై మహా.
6. ఏ. (పుం. అ.) మాగ.
(స్త్రీ. ఆ.) మహా.
7. ఓ (పుం. అ.) అర్ధమా.
(పుం. ఋ.) మహా.
8. ం=మ్ (పుం. ఋ) మహా.

సం. ప్ర. బ.

8. ఊ (నపుం. ఉ.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.

7. ఓ. (పుం. ఋ.) అర్ధమా.

8. ణి (నపుం. అ.) అర్ధమా. జై మహా
జై శౌర.
(నపుం. ఇం.) మహా. అర్ధమా.
జై మహా. శౌర. మాగ.
9. ణో (పుం. ఇ.) మహా. అర్ధమా.
జై మహా.
10. హాం (పుం. అ.) అప.
11. హో (పుం. అ. ఇ. ఉ.) అప.

## సంస్కృత హలంతశబ్దములు.

(1) సంస్కృత త - కారాంతశబ్దముల తుది తకారము ప్రాకృతమున లోపించును. మిగిలినరూపము నంతమందుగల యచ్చుల ననుసరించి వానికి విభక్తి రూపములు గలుగుచుండును: ఉదా. మహా. ఇందఇణా = ఇంద్రజితా; ఇందఇణో = ఇంద్రజితః; ఇందఇస్స = ఇంద్రజితః; ఇందఇమ్మి = ఇంద్రజితి.

(2) ఒకప్పుడు తుది తకారము లోపింపఁగా మిగిలిన రూపము తుది యచ్చునకు దీర్ఘము గలుగును. ఉదా. తడీ = తడిత్; తళీ = తడితమ్; మరూ = మరుత్; విజ్జూ = విద్యుత్; జగత్ = మహా. ప్ర. ఏ. జఅం; అర్ధమా. జగే; అప. జగు;- ద్వి. ఏ. అర్ధమా. జగిం = జగతమ్; ఏక. షష్ఠీ. అప. జఅస్స = జగతః; స. ఏ. మహా. జఅమ్మి = జగతి, జఏ = జగతి; అర్ధమా. జగఈ, జగంసి = జగతి; జై. శౌర. స. ఏ. జగది; అప. జగి = జగతి.—— స్త్రీలింగ శబ్దములందు. ప్ర. ఏ. వచనమున తకారముపై ఆ-కారముచేరి, తా = ఆ, యా, లుగా మాఱును; ప్ర. ఏ. మహా. సరిఆ; జై. మహా. సరియా; అప. సరిఅ ('ఆ'కు హ్రస్వము) = సరిత్; మహా. షష్ఠీ బ. సరిఆహా; అప. తృ. బ. సరిహిం = సరిద్భిః;- విజ్జూఏ, విజ్జుణా, విజ్జుణో = విద్యుతః (ప్ర. బ.)

(3) (i) -అత్ - మత్ - వత్, అంతమందుగల సంస్కృతశబ్దముల ప్రథమైక వచనరూపముల తుది నకార మనుస్వారమగును; నకారమునకుఁ బూర్వమందున్న ఆకారమునకు హ్రస్వము గలుగును - ఉదా. జాణం = జానన్; విజ్జం = విద్వాన్; చక్ఖుమం = చక్షుష్మాన్; దిట్ఠిమం = దృష్టిమాన్; ఆయవం నాణవం ధమ్మవం బంభవం = ఆత్మవాన్, జ్ఞానవాన్, ధర్మవాన్, బ్రహ్మవాన్; పుట్ఠవం = స్పృష్టవాన్; థామవం = స్థామవాన్; కువ్వం = కుర్వన్; మహం = మహత్; అరహం = అర్హన్; భఅవం = భగవాన్;—— కొన్నియెడల నిట్టుమార్పు వైకల్పికముగఁ గలుగును: శౌర. షష్ఠీ. ఏక. రుమణ్ణదో = రుమణ్వతః; కాని, ప్ర. ఏ. రుమణ్ణో = రుమణ్వాన్.

(ii) కొన్నియెడల అత్, మత్, వత్, అనున వంతమందుగల సంస్కృతశబ్దములకుఁ బ్రాకృతమునఁ బ్రథమైకవచనమున- అంత,- మంత, - వంత,- అను నంతములుగల రూపములు ప్రాతిపదికము లగును. ఉదా. పి అంతో = పిబన్; చలంతో = చలన్; గుణవంతో = గుణవాన్; అర్ధమా. మూలమంతే = మూలవాన్; కందమంతే = కందవాన్; వణ్ణమంతే = వర్ణవాన్ గంధమంతే = గంధవాన్;- తృ. ఏ. పిఅంతేణ = పిబతా; జంపంతేణ = జల్పతా ష. ఏ. భగవంతస్స = భగవతః; జాణంతస్స = జానతః; భగవంతస్స = భగవతః; హణుమంతస్స = హనుమతః మొద.

(iii) కొన్నియెడల అత్, మత్, వత్ అంతమందుగల సంస్కృతశబ్దముల తుది తకారము లోపించి తత్పూర్వ స్వరము దీర్ఘమగును: అర్హాన్ = అరహా, అరిహా: హనుమాన్ = మహా. హనుమా మొదలయినవి.

(4) తక్కిన సంస్కృత హలంత శబ్దములకును ప్రాకృతమున సాధారణముగ తుదిహల్లు లోపింపఁగా మిగిలిన యజంతరూపములు ప్రాతిపదికములయి యాయా యజంతపదముల యట్లే విభక్తి రూపములను పొందుచుండును. కొన్నియెడలఁ బ్రథమేతర విభక్తులం దజంతశబ్దములకు హలంత రూపములును హలంతశబ్దముల కజంతరూపములును గలుగుట కాన్పించును. ఉదా.

రాఆ, రాఓ = రాజా (ప్ర. ఏ.), రాఆణం, రాఇణం, రాఅం, రాయం =రాజానమ్; రణ్ణా, రాఏణ = రాజ్ఞా, రణ్ణో, రాఆదో, రాఆదు=రాజ్ఞః (ప్ర. ఏ.); రణ్ణో, రాయస్స = రాజ్ఞః (ష. ఏ.); రాఇమ్మి, రాఅమ్మి, రాఏ = రాజ్ఞి, రాజని (స. ఏ.); రాఆణో, రాఆ = రాజానః (ప్ర. బ.); రాఆణో, రాఆ = రాజ్ఞః (ద్వి. బ.); రాఈహిం, రాఏహిం = రాజభిః; రాఈహిం, రాఈహింతో, రాఈసుంతో, రాఆసుంతో = రాజభ్యః (పం. బ.); రాఈణం, రాఇణం, రాఆణం, రాయాణం = రాజ్ఞామ్ (ష. బ.); రాఈసుం, రాఏసుం = రాజసు; ఆయా, ఆదా, అప్పా = ఆత్మా (ప్ర. ఏ.); పెమ్మం = ప్రేమన్; పెమ్మస్స = ప్రేమ్ణః; నామం = నామ (ప్ర. ఏ.); కామిస్స = కామినః (ష. ఏ.); మొదలయినవి.

పై వివరణమునుబట్టి ప్రాకృతభాషలయందే విభక్తి ప్రత్యయముల విషయమున నెట్టి యవ్యవస్థ యేర్పడినదో తెలియఁగలదు. కొన్ని ప్రాకృతములలో నేకవచన బహువచన రూపములందు భేదము పోయినది, కొన్నిటిలో ననేకవిభక్తుల కేకరూపము కలిగినది. ఇందువలన నేరూప మేవిభక్త్యర్థమున వాడఁబడినదో తెలిసికొనుట కష్టమైనది. ఈ పరిస్థితులు గ్రాంథిక ప్రాకృతములందే యిట్లుండఁగా వ్యావహారిక ప్రాకృతముల మాట వేఱ చెప్పనక్కఱలేదు. విభక్తి వచనము లొక్కటే ప్రత్యయముచే తెలుపఁబడు నవస్థ యంతరింపగా, కేవల విభక్తిని దెలుపు సాధనము లోపింపగాఁ దత్తత్ప్రాకృత భాషలను మాట్లాడుజనులు బహువచనమును దెలుపుటకుఁ బ్రత్యేకపదములను, విభక్తిని దెలుపుటకు వేఱుపదములను వాడుకొనఁ జొచ్చిరి. బహువచనమును గూర్చిన పదము లింతకుముందు వివరింపఁబడినవి. ఈ పదములును వికారములనుబొంది ప్రత్యయములుగ మాఱినవి. విభక్త్యర్థమును బోధించు క్రొత్తపదములును నానాఁటికిని బ్రత్యయములయినవి. ఇవి యేకవచనమున నొకప్పుడు ప్రథమావిభక్త్యేకవచన రూపముమీఁదను నొకప్పుడు

ప్రథమేతర విభక్తి ప్రాతిపదికముమీఁదను జేరుచుండెను; బహువచనమున బహువచన బోధక పదముమీఁదనో తద్వికారమగు ప్రత్యయము మీఁదనో చేరుచుండెను. ఆధునికార్యభాష లనఁబడు హిందీ, బంగాళీ, మరాఠీ మొదలగు భాషలలో నీ విధానము నెలకొనినది. ఇదేవిధానము ద్రావిడభాషలయందును గాన్పించుచున్నది. ఇందువలన నీ పద్ధతి నాధునికార్యభాషలు ద్రావిడ భాషలనుండి యెరవు తెచ్చుకొనినవని యాధునిక పాశ్చాత్య పండితులు లభిప్రాయపడసాగిరి. ఈ యెరవువాదము సమంజసముగ నున్నట్లు తోఁపదు. ద్రావిడభాషల పూర్వచారిత్రకావస్థనుగూర్చి మనకుఁ దెలియదు; అట్లే యాధునికార్య భాష లనఁబడు వాని పూర్వచారిత్రకావస్థయు మనకుఁ దెలియదు. ఈ రెండువర్గముల భాషలకును వాఙ్మయావస్థ కలిగిననాఁటికిఁ గొంచెము పూర్వ మాయాభాషల మాట్లాడు వారి ప్రదేశములందు కనఁబడు శాసనాదులవలనఁ దత్తత్ప్రదేశములందు ప్రాకృతభాష లుండినట్లు మనకుఁ దెలియుచున్నది. కావున నాయా ప్రాకృతభాషలే వివిధ వికారములను బ్రత్యేకముగఁ బొంది ప్రత్యేక భాషలుగఁ బరిణమించినవని యనుకొనుటయే యుక్తియుక్తమగును గాని, చారిత్రకాధారములేక ద్రావిడులను నొక జాతివా రార్యులు భరతవర్షమునఁ బ్రవేశించుటకుఁ బూర్వ మీదేశమం దెల్లెడల వ్యాపించి యుండిరనియు, వారిభాష యార్యభాషలకంటెఁ బటుత్వము గలదై, యార్యుల నాగరికతకంటె నెక్కువ నాగరికతను దెలుపునదియై, సమస్త విధముల సాంస్కృతిక భాషల నిర్మాణమునే మార్పగలుగుసంతటిశక్తి గలదియై యుండెననుటయుఁ బొసఁగదు. ద్రావిడభాషలును బ్రాకృతభాషలే; ప్రాకృతభాషలందు గాన్పించు పరిణామమే ద్రావిడభాషల యందును గాన్పించుచున్నది. విభక్త్యర్థములఁ దెలుపు విషయమున నార్యభాష లనఁబడు వానికిని ద్రావిడభాషలకును దగ్గఱి పోలికలు కాన్పించుచున్నవి. ఆ పోలికలను వివరించుటకుఁబూర్వ మాధునికార్య భాషలందలి విభక్తి ప్రత్యయములను, విభక్త్యర్థములఁ దెలియఁజేయు పదములను వర్గీకరించి యీ క్రింద చూపుచున్నాను.

## ప్రథమావిభక్తి

ప్రథమయం దార్యభాషలలో సాధారణముగఁ బ్రత్యయములు లేవు. కొన్ని భాషలందుమాత్రము కరణ కారకము గలిగిన తృతీయావిభక్తి ప్రత్యయముతోఁ గూడిన రూపము ప్రథమైకవచనమునఁనిలిచినది. బంగాళీ భాషలో ప్రాణివాచక పదములపై నవి సకర్మకక్రియలతోఁ గూడియున్నప్పుడీ ప్రత్యయము చేరుచుండును. ఉదా. బంగాళీ: సంతాన్; ప్ర. ఏ. సంతానే; పితా, ప్ర. ఏ. పితాయ్ మొద. ఇట్టి సందర్భములందే తూర్పుహిందీ

భాషయందును 'నే' అను ప్రత్యయము చేరును. ఈ ప్రత్యయము సంస్కృత మందలి 'నా' (మునినా, హరిణా మొద.), 'ఇన' (రామేణ, ధనేన మొద.) అను ప్రత్యయముల వికారమని యాభాషల వ్యాకరణములను వ్రాసినవారు తలంచుచున్నారు. ఈ యభిప్రాయమునే నేఁటి పాశ్చాత్య విద్వాంసులును భాషాపరిశోధకులును వెల్లడించి యున్నారు. ఈ 'నే' ప్రత్యయము ప్రాచ్య హిందీయందుకంటె ప్రతీచ్య హిందీభాషయం దెక్కువ ప్రచారమునం దున్నది. మరాఠీ భాషయం దిది యేకవచనమున 'నే' గను బహువచనమున 'నీ' గను గాన్పించుచున్నది. కెల్లాగ్ పండితుఁడు తన తూర్పుహిందీవ్యాకరణమున నీ ప్రత్యయమునకు సంస్కృతమునఁ గానవచ్చు తృతీయ యందలి 'నా' మూలమదు కాదనియు, నది 'లగ్' ధాతు కృదంత రూపమగు 'లగ్య' అను దాని యపభ్రంశరూపమనియుఁ దలంచుచున్నాఁడు.

హైజోంగు భాషలోఁ బ్రథమైక వచనమునఁ బ్రాణివాచక పదములపై -'రా' అనునది చేరును: పలా-రా = పుత్త్రుఁడు మొద. ఒకప్పుడు ప్రథమైక వచనమునఁ బ్రాణివాచక పదములపై '-ఆ' చేరును: హా పాలా కుబాలే= ఆ పిల్లవాఁడు కొట్టెను; మొద. అస్సామీ భాషలోఁ బ్రథమైక వచనమునఁ సకర్మక క్రియలతోఁ గూడియున్నప్పుడు పదములతుదివర్ణము కొన్ని వికారములను బొందును: ఉదా. మానుహ్ = మనుష్యుఁడు, ప్ర. ఏ. మానుహే; పుత్ర = పుత్రుఁడు, ప్ర. ఏ. పుత్రయ్; గా = శరీరము, ప్ర. ఏ. గాఇ; సరాఇ = పక్షి, ప్ర. ఏ. సరాయే; సకు = నేత్రము, ప్ర. ఏ. సకు-వే; నాఓ = నావ, ప్ర. ఏ. నా-వే; మొద.

ఇట్లున్నను నప్రాణివాచక పదము లన్నిటిమీఁదను, ప్రాణివాచక పదముల కొన్నిటిమీఁదను బ్రథమైకవచనమున నెట్టి ప్రత్యయముగాని, ప్రత్యయ సదృశమగు పదముగాని చేరకుండుటయే కానఁబడుచున్నది. ఉదా. బంగాలీ: ప్ర. ఏ. గాఛ్ = చెట్టు; కుక్కుర్ = కుక్క; ఒఱియా: పురుష = పురుషుఁడు; ఘర = ఇల్లు; మొద.

## ద్వితీయా విభక్తి

ఉత్తరార్యభాషలలో సాధారణముగాఁ బ్రథమైకవచనరూపమే ద్వితీయైక వచనమునను గానవచ్చును. కాని, కొన్నియెడల చతుర్థీ, షష్ఠీ ప్రత్యయములు చేరియు నీ భాషలయందు ద్వితీయావిభక్త్యర్థమును గలిగించుచుండును. కొన్నిభాషలలో నీ క్రింది చతుర్థీ షష్ఠీ ప్రత్యయములు ద్వితీయా విభక్త్యర్థమునఁ గానవచ్చుచున్నవి:

బంగాళీ:— కే; హైజోంగు:- కే,- గే,- రా అస్సామీ: - అక్, -ఆకే;- క్,- కే; హిందూస్థానీ:- కో; దక్షిణీ: కో, కూ, కే, తై, క-తై, కనే; వ్రజభాష: కు, కూ, కౌ, కఇ, కే; కనౌజీ:కో, కా; బుందేలీ: కో, ఖో; బనాఫరీ: ఖా, కా, కా, కౌ, కై.

## తృతీయా విభక్తి.

తృతీయా విభక్తియందీ క్రింది ప్రత్యయములును విభక్తి ప్రతిరూపకావ్యయములును గాన వచ్చుచున్నవి :—

బంగాళీ:— తే (ఇది చాల సరుదు);- కర్తృక్; దియా, మొద.- హైజోంగు:- దే,- దిఆ,-ది.

అస్సామీ:— ఏరే; య్;- ఏ;- రే;- వే;- వేరే; ఉదా: మానుహ్ = మనుష్యుఁడు, తృ. ఏ. మానుహే, మానుహేరే; పుత్ర = పుత్త్రుఁడు, తృ. ఏ. పుత్ర-య్, పుత్ర- ఏరే; గా = శరీరము, గా-యే, గా-రే; సరాయ్ = పక్షి; తృ. ఏ. సరాయే, సరాఇ-రే, సరాయ్-ఏరే; సకు = నేత్రము, తృ. ఏ. సకు-వే, సకు-రే, సకు-వేరే; నావ్ = నావ, తృ. ఏ. నావే, నావేరే మొ.

మైథిలీ లేక ప్రాచీన బిహారీభాష:— ఇందు 'ఏ' అనున దొక్కటే సరియైన తృతీయా విభక్తి ప్రత్యయము. దీనిపై తృతీయావిభక్త్యర్థమున వేఱుగ షష్ఠీ విభక్తి ప్రత్యయములగు 'ఏ; హి; హి' అను వానిని జేర్చుటయుఁ గలదు.

పశ్చిమ హిందీభాషా భేదమగు బనాఫరీభాష :— ఇందు-'తై' అనునది తృతీయా విభక్త్యర్థమునఁ జేరును.

పంజాబీ భాషలో 'తే, తో, థో, దో' = చేత, తో, వలన, 'నుండి' అను ప్రత్యయములు తృతీయా విభక్తి ప్రత్యయములుగఁ బరిగణింపఁ బడుచున్నవి.

మరాఠీభాషా భేదమగు కొంకణిలో 'కడె' అనునది 'తో' అను తృతీయా విభక్త్యర్థమునఁ బ్రాతిపదికములపైఁ జేరుచుండును : ఉదా. బాపాయ్-కడె తండ్రితో, తండ్రికడ.

పిశాచ భాషలలో పషాయి భాషయందు 'దే' అను ప్రత్యయమును వర్షిక్వార్ భాషయందు 'ఇంద' అను ప్రత్యయమును ద్వితీయా విభక్త్యర్థమున వచ్చును.

## చతుర్థీ విభక్తి

ప్రాకృత భాషలలోనే చతుర్థీ, షష్ఠీ విభక్తులకు భేద మంతరించినది రెండింటియందును నాయాభాషలం దొక్కటే విభక్తి ప్రత్యయము చేర సాగినది. దీనికి 'కొఱకు', 'యొక్క' అను రెండర్థములును గుదురుకొనినవి. వాస్తవమైన షష్ఠీవిభక్తి ప్రత్యయముయొక్క వికారరూపములు నేఁడు మరాఠీ మొదలగు కొన్ని యార్యభాషలయందు మాత్రము నిలిచినవి. తక్కిన వానిలో నది కేవలము లోపించుటచే ప్రత్యేకావ్యయములు చేరి యావిభక్త్యర్థముల బోధింప సాగినవి. ఆధుని కార్యభాషలలో చతుర్థీప్రత్యయము లనుపేర నీ క్రిందివి ప్రచారములో నున్నవి.

**బంగాళీ** :— కే (ప్రాణివాచక పదములమీఁద మాత్రము);- రే.

హైజోంగు:— గే (ద్వితీయా విభక్తియందు వలెనే):- తా ఇ;- ఠిట్; ఉదా. మాస్టర్-ఠిట్ కలే = మాస్టరుతోటి అనెను.

**అస్సామీ** :— లాఇ;- లాఇకే.

**మైథిలీ లేక ప్రామాణిక బిహారీ** భాష:— కేఁ;- బనాఫరీభాష: ఖాఁ, కాఁ, కా, కౌఁ; కై, = కాజే.

పిశాచ భాషలు:

**బాష్గలీ**: తఁ, తాఁ, తాఁర్, తా, కే, కా (ఇవి హలంత పదములపై సాధారణముగ వచ్చును; గెఁ, గఁ, ఇవి సాధారణముగ నజంతపదములపై వచ్చును; 'దొగ -దుగాఁ,-త్క అనునవి కూడ చతుర్థ్యర్థమున వచ్చుచుండుట గలదు.

**వై-అలా**:— క, -కె; -కేతి, -కనె; **గవర్-బతీ**:-అఁ, -అకెఁ; **పషాఇ**:- ఆంతే; **గార్వీ**:- కహ్, -కేర్; **తోర్వాలీ**:-కె, -కీ; **మైయా**:-గై; **వర్షి క్వార్**: -ఘు;-బాక.

**బ్రజ్-భాష**:— కౌఁ; **బుందేలీ**:- ఖోఁ; **మాల్వీ**:- కేఁ; **జైపురీ**:- కైఁ, కుఁ, కూఁ, వఇఁ, కేఁ;

**సింధీ**:— ఖే, -కనే; **హిందూస్థానీ**:-కోఁ;-కేలియే; **దక్షనీ**:-కూ, -కూఁ. కోఁ, -కేతై; -కతై, -కనే: **బుందేలీ** :-కోఁ, -ఖోఁ; **డంగీ**:-కై; **డాంగ్**-కై.

## పంచమీ విభక్తి.

కొన్ని యాధునికార్య భాషలలో, బంచమీ విభక్తి ప్రత్యయములుగా నీ క్రిందివి వాడఁబడుచున్నవి.

బంగాళీ:—థాకియా, -థాకే; - హైజోంగు:- థాక్కెఆ; - తన్; ఉదా. చేలఆ-థాక్కెఆ=నూతనుండి; బాప్-తన్=తండ్రినుండి; మొద. ఒకప్పుడు-తన్-ప్రత్యయము షష్ఠీప్రత్యయముపైఁ జేరుచుండును. ఉదా. బాప్ -లా -తన్=తండ్రినుండి.

పిశాచభాషలు:

బాష్గలీ:— స్తే,-స్త,-స్తై; ఇవిగాక-'త్, - తా, -తా,-తార్' అనునవి గూడఁ బంచమ్యర్థముననే వాడఁబడుచున్నవి. వీనికి 'వలన, లో, యొక్క, మీఁద, కారణమున, తో,-కు, కొఱకు' మొదలగు ననేకార్థములు గలవు. ఇవియచ్చునకుఁ బరమైనప్పుడు 'ద, దా' మొదలగు రూపములను బొందును.

షై-అల:— కే, -కనె; ఉదా. జూ-కేలిఆ-కనె = కూఁతుళ్లనుండి-వలన; మొద.

గవర్-బతి :- న; ఉదా. మాల-న = ఆస్తినుండి.

సషఈ:(i)— ఉద్దై;-ఊదె,-ఓద్దై, -ఓద = దగ్గఱ, దగ్గఱనుండి (ii)-తే = నుండి. బాంగరూ (కర్నల్-పాటియాలా ప్రాంతములందలిభాష)-'కాని-తీ.'

## షష్ఠీ విభక్తి.

'యొక్క' విభక్తినిమాత్రమే యాధునికార్యభాషలయందు షష్ఠీవిభక్తిగ నెంచుచున్నారు. 'యొక్క' అనునర్థమున వచ్చు ప్రత్యయములను ద్వితీయాచతుర్థీవిభక్త్యర్థము లందును వాడుట గలదు.

బంగాళీ: ప్రాణివాచకపదములపై - 'ఏర్, - ఆర్' అనున వేకవచనమునఁ జేరుచుండును; బహువచనమున - దేర్, - దిగేర్, అనునవి చేరును. ఉదా. సంతానేర్ = సంతానముయొక్క; పితార్ = తండ్రియొక్క; సంతానేదేర్ (-దిగేర్) = సంతానములయొక్క; పితాదేర్ = తండ్రులయొక్క. అప్రాణివాచకపదములపై '-ఏర్' వచ్చును. ఉదా. గాఛేర్ = చెట్టుయొక్క.

హైజోంగు:—లా;-లాక్; ఉదా. రాజా-లాక్ = రాజుయొక్క; రాణి-లా = రాణియొక్క.

అస్సామీ:-ర్, -అర్,- అరె; ఉదా. మానుహర్, మానుహరె = మనుష్యునియొక్క; పుత్రర్, పుత్రరె = కొడుకుయొక్క; గార్, గారె = శరీరముయొక్క; సరాఇర్, సరాఇరె =పక్షియొక్క; సకుర్, సకురె=కంటియొక్క; నావర్, నావరె = నావయొక్క.

మైథిలీ,లేక ప్రామాణిక బిహారీ:—క్, -అక్, -కె, -కర్,-కేర్.

హిందూస్థానీ:—కా,- కే,-కీ; దక్షిణీ:-కా, (-కే-,కీ);
వ్రజభాష:-కా,-కే,-కీ;

కనౌజి:—కో,-కే,-కీ, బుందేలీ:-కో,- కే,-కీ,-ఖో, కర్నల్ - పాటియాలా ప్రాంతమందలి బాంగరూభాష:- కా,-కే,-కై; డాంగీ:-కో,-కే; డాంగ్ భాంగీ:-కా,-కె ; బనాఫరీ:-కొ,-కా,-కే,-కై,-కీ, పంజాబీ;-దా; ఉదా: ఘర్దా = ఇంటియొక్క; ఘోడేదా-మూహ్ = గుఱ్ఱపుమొ...

మరాఠీ భాషావికారమగు కాథోడీ భాష:- నా; ఉడా. బాహాస్ - నా = తండ్రియొక్క; మా-నా=నాయొక్క; తూ-నా = నీయొక్క;- కొంకణీ; -కా, కా; ఉదా. మా-కా = నాకు; తాఀ-కా = వారికి; తాఀ-కా = వానికి ఆప్-నా-క్=తనను మొద.

వ్రజభాష:—కా,- కే,- కీ; బుందేలీ:- కో,-కే,-కీ; రాజస్థానీ భాషా వికారము లగు (I) మేవారీ:- కో,-కా,-కీ; (II) మాల్వీ;-రో,-రా,-రీ; కో, -కా,-కీ;

(III) జైపురీ:—కో,-కా,-కీ; (IV) మార్వాడీ:-రో,-రా,-రీ;

గుజరాతీ:—నో,-నా,-నీ.

పిశాచభాషలు:

బాష్గలీ:—స్త్,-స్; ఇది సంస్కృతమందలి '-స్య' కు వికారము. ఇది సాధారణముగ లోపింపఁగా, మిగిలిన ప్రథమేతరవిభక్తి ప్రాతిపదికరూపమే షష్ఠ్యర్థమున వాడఁబడును: ఉదా ప్ర. ఏ. తొత్ = తండ్రి; ష. ఏ. తొతి, తొతిబ, తొత్ = తండ్రియొక్క.

వై - అల :—బ;—గవర్ బతీ :—అన; ఉదా. మనుష్-అ-న = మనుష్యుని; బాబ్-అ-న = తండ్రియొక్క; సార్-అ-న = పందులయొక్క; ఖుదాయ్-అ-న = దేవుని; పుత్రేస్-అ-న = పుత్రుని;— లహండా భాషయుత్తర మాండలిక వికారములందును ఈ- అనప్రత్యయము షష్ఠ్యర్థమున వాడుకయం దున్నది. ఒకప్పుడిందలి న- వర్ణము ముఖ్యముగా స్త్రీవాచక పదములపై -నివర్ణముగా మాఱుచుండుటయుఁ గలదు.

షినా :—ఎయ్; ఉదా. పుచెయ్ = పుత్త్రునియొక్క; ఈ 'ఎయ్' ని 'ఐ' గాఁ గూడ వ్రాయుదురు. కర్నల్ బిడల్ఫ్‌గారు దీనిని 'ఏ'గ వ్రాసిరి. ఈ ప్రత్యయమువై నితర విభక్తి ప్రత్యయములు చేరునపుడు దానిని 'ఏ'గనో 'ఎయ్'గనో వ్రాయుదురు.

కాశ్మీరీ, కష్ఠవారీ భాషలు :—ఉకు: దీని నప్రాణివాచకములును పుంలింగములు నగు పదముల యేకవచనమందు వాడుదురు.

## సప్తమి విభక్తి

సాధారణముగా నుత్తరహిందూస్థానభాషలలో సప్తమీవిభక్తి యందు ప్రాతిపదికములపై -'ఏ' చేరుచుండును. బంగాళీ: ప్రాణివాచక పదములపై: సంతాన = సంతానము, స. ఏ. సంతానే = సంతానమునందు; అప్రాణివాచకపదములపై సప్తమ్యర్థమున 'ఏ' ఒక్కటేకాక -'ఏతే,' '-తే'లుకూడఁ జేరుచుండును : ఉదా. గాఛ్,=చెట్టు; స.ఏ.గాఛ్- తే, గాఛేతే= చెట్టునందు.

హైజోంగు భాషలో బంగాళీ భాషయందువలెనే యాయా ప్రత్యయములు చేరుచుండును. కాని, -'మి, -ని, -మిని' అను ప్రత్యయములును జేరుట గలదు. ఉదా. ఘర్ = ఇల్లు, స. ఏ. ఘర్మి, ఘర్మిని = ఇంటిలో; దేష-ని = దేశములో.

అస్సామీ భాషలో సప్తమ్యర్థమున -'త్, -తే, -అత్, -అతే'లు ప్రాతిపదికమువైఁ జేరును: ఉదా. మానుహ్ = మనుష్యుఁడు, స. ఏ, మానుహత్, మానుహతే; పుత్ర=కొడుకు, స. ఏ. పుత్రత్, పుత్రతే; గా= శరీరము. స. ఏ. గాత్, గాతే; సరాఇ = పక్షి, స. ఏ. సరాఇత్, సరాఇతే; సకు=కన్ను, స. ఏ. సకుత్, సకుతే; నావ్ = నావ, స. ఏ. నావత్, నావతే.

మైథిలీ, లేక ప్రామాణిక బిహారీ భాషలో '-మేఁ, -మఁ'లు చేరును.

మరాఠీ భాషా వికారమగు కొంకణీ భాషలో '-లో' అను ప్రత్యయమును గానవచ్చుచున్నది. ఉదా. చేకరాంత్ - లో=చేకర్లలో.

పిశాచ భాషయగు షినా భాషలో '-రో' అనునది సప్తమ్యర్థమునఁ జేరుచుండును: ఉదా. మనుజే- రో = మనుష్యులలో; పూచే- రో = పుత్త్రునిలో; పూచోరో = పుత్త్రులలో. ఈ షినాభాషలో 'క్రింద' అను నర్థముగల -కిరిహ్' అను ప్రత్యయమును సప్తమ్యర్థముగలదిగాఁ బరిగణింపఁబడు చున్నది.

అస్సామీ:-ర్, -అర్,- అరె; ఉదా. మానుహర్, మానుహరె = మనుష్యునియొక్క; పుత్రర్, పుత్రరె = కొడుకుయొక్క; గార్, గారె = శరీరముయొక్క; సరాఇర్, సరాఇరె = పక్షియొక్క; సకుర్, సకురె=కంటియొక్క; నావర్, నావరె = నావయొక్క.

మైథిలీ, లేక ప్రామాణిక బిహారీ:—క్, -అక్, -కె, -కర్, -కేర్.

హిందూస్థానీ:—కా,- కే,-కీ; దక్షిణీ:-కా, (-కే-,కీ);

బ్రజభాష:-కా,-కే,-కీ;

కనౌజీ:—కో,-కే,-కీ, బుందేలీ:-కో,- కే,-కీ,-ఖో, కర్నల్ - పాటియాలా ప్రాంతమందలి బాంగరూభాష:- కా,-కే,-కై; దాంగీ:-కో,-కే; బంగ్ భాంగీ:-కా,-కె ; బనాఫరీ:-కో,-కా,-కే,-కై,-కీ, పంజాబీ;-దా; ఉదా: ఘర్దా = ఇంటియొక్క; ఘూ ఉదా-మూంహ్ = గుఱ్ఱపుముఖము.

మరాఠీ భాషావికారము గు హల్బీ భాష:- నా; ఉదా. బాహాస్ - నా = తండ్రియొక్క; మూ-నా=నాయొక్క; తూ-నా = నీయొక్క;- కొంకణీ; కా, కా; ఉదా. మా-కా = నాకు; తాం-కా = వారికి; లాం-కా = వానికి స్వ-నా-క్=తనకు మొద.

వ్రజభాష:—కా,- కే,- కీ; బుందేలీ:- కో,-కే,-కీ; రాజస్థానీ భాషా కారము లగు (I) మేవారీ:- కో,-కా,-కీ; (II) మాల్వీ;-కో,-రా,-రీ; కో, కా,-కీ;

(III) జైపురీ:—కో,-కా,-కీ; (IV) మార్వాడీ:-రో,-రా,-రీ;

గుజరాతీ:—నో,-నా,-నీ.

పిశాచభాషలు:

బాష్గలీ:—స్త్,-స్; ఇది సంస్కృతమందలి '-స్య' కు వికారము. ఇది సాధారణముగ లోపింపఁగా, మిగిలిన ప్రథమేతరవిభక్తి ప్రాతిపదికరూపమే షష్ఠ్యర్థమున వాడఁబడును: ఉదా ప్ర. ఏ. తొత్ = తండ్రి; మ. ఏ. తొతి, తొతిప, తొత్ = తండ్రియొక్క.

వై - అల :—బ;—గవర్ బతీ :—అస; ఉదా. మనుష్-అ-న = మనుష్యుని; బాబ్-అ-న = తండ్రియొక్క; సార్-అ-న = పందులయొక్క; ఖుదాయ్-అ-న = దేవుని; పుత్రేస్-అ-న = పుత్త్రుని;— లహాండా భాష యుత్తర మాండలిక వికారములందును ఈ- అన ప్రత్యయము షష్ఠ్యర్థమున వాడుకయందు దున్నది. ఒకప్పుడు డిందలి న- వర్ణము ముఖ్యముగా స్త్రీ వాచక పదములపై -నివర్ణముగా మాఱుచుండుటయుఁ గలదు.

విభక్తి

షినా :—ఎయ్; ఉదా. పుచెయ్ = పుత్త్రునియొక్క; 'ఎయ్' ని 'ఐ' గాఁ గూడ వ్రాయుదురు. కర్నల్ బిడల్ఫ్‌గారు దీనిని '
వ్రాసిరి. ఈ ప్రత్యయముపై నితర విభక్తి ప్రత్యయములు చేరునప
దానిని 'ఏ'గనో 'ఎయ్'గనో వ్రాయుదురు.

కాశ్మీరీ, కష్తవారీ భాషలు :—ఉకు: దీని నప్రాణివాచకముల
పుంలింగములు నగు పదముల యేకవచనమందు వాడుదురు.

సప్తమీ విభక్తి.

సాధారణముగా నుత్తరహిందూస్థానభాషలలో సప్తమీవిభ
యందు ప్రాతిపదికములపై -'ఏ' చేరుచుండును. బంగాళీ: ప్రాణివా
పదములపై: సంతాన్ = సంతానము, స. ఏ. సంతానే = సంతానమున
అప్రాణివాచకపదములపై సప్తమ్యర్థమున 'ఏ' ఒక్కటేకాక -'ఏ
'-తే'లుకూడఁ జేరుచుండును: ఉదా. గాఛ్,=చెట్టు; స.ఏ.గాఛ్- తే, గాఛే
చెట్టునందు.

హైజోంగు భాషలో బంగాళీ భాషయందువలెనే యాయా ప్రత్య
ములు చేరుచుండును. కాని, -'మి, -ని, -మిని' అను ప్రత్యయము
జేరుట గలదు. ఉదా. ఘర్ = ఇల్లు, స. ఏ. ఘర్మి, ఘర్మిని = ఇంటిలో; దే
ని = దేశములో.

అస్సామీ భాషలో సప్తమ్యర్థమున -'త్, -తే, -అత్, -అతే
ప్రాతిపదికముపైఁ జేరును: ఉదా. మానుహ్ = మనుష్యుఁడు, స.
మానుహత్, మానుహతే; పుత్ర=కొడుకు, స. ఏ. పుత్రత్, పుత్రతే;
శరీరము. స. ఏ. గాత్, గాతే; సరాఇ = పక్షి, స. ఏ. సరాఇత్, సరా
సకు=కన్ను, స. ఏ. సకుత్, సకుతే; నావ్ = నావ, స. ఏ. నావత్, నా

మైథిలీ, లేక ప్రామాణిక బిహారీ భాషలో '-మేఁ, -మఁ'లు చేరు

మరాఠీ భాషా వికారమగు కొంకణీ భాషలో '-లో' అను ప్రత
మును గానవచ్చుచున్నది. ఉదా. చౌకరాంత్ - లో=చౌకర్లలో.

పిశాచ భాషయగు షినా భాషలో '-రో' అనునది సప్తమ్యర్థవ
జేరుచుండును: ఉదా. మనుజే- రో = మనుష్యులలో; పూచే- రో = పు
నిలో; పూచోరో = పుత్త్రులలో. ఈ షినాభాషలో 'క్రింద' అను నర్థమ
'-కిరిహ్' అను ప్రత్యయమును సప్తమ్యర్థముగలదిగాఁ బరిగణింప
చున్నది.

## సంబోధన ప్రథమా విభక్తి.

పిశాచ భాషయగు బాష్గలియందు ప్రాతిపదికమునకు '-ఆ', '-ఓ'లు చేర్చుటవలన సంబోధనార్థము కలుగుచున్నది. ప్రథమా రూపమునకుఁ బూర్వమున 'ఎహ్' అను దానిని జేర్చుటవలనను నీ భాషయందు సంబోధన మేర్పడును. ఇట్లే, మఱికొన్ని యుత్తరార్య భాషలయందును గానవచ్చుచున్నది. మరాఠీ భాషలో ప్రథమావిభక్తి రూపమునకుఁ బూర్వమందు 'హో-, రే-, అరే, -రి' అను దానిని జేర్చుటవలన సంబోధన మేర్పడుచున్నది.

## ద్రావిడ భాషలయందు సుబ్విధానము.

ఇండో- యూరోపియను భాషలలోని విభక్తి ప్రత్యయములు తొలుత ప్రత్యేకపదములుగా నుండి, ప్రాతిపదికరూపములతోఁ గలిసి తత్తత్సంబంధములను దెలుపుచుండెనే యనియు, కాని, రానురా నవి యనేక వికారములకు లోనయి ప్రత్యేకార్థరహితములగు ప్రత్యయములుగాఁ బరిణమించినవనియు భాషా శాస్త్రజ్ఞుల యభిప్రాయము, సంస్కృతమువంటి యిండో- ఆర్య భాషలలోని ప్రత్యయములుగూడ నాయా ప్రాకృత భాషలయందనేక వికారములను బొంది యేరీతిగఁ దమ ప్రత్యయత్వమును గోల్పోయినవో ప్రాకృతభాషలయందలి విభక్తులను గూర్చి వివరించినప్పుడు తెలుపబడినది. ఇట్లే విభక్తి ప్రత్యయములు లోపింపఁగా నాయా సంబంధములను దెలుపుటకు మరల నాయా ప్రాకృతభాషల మాటలాడు జనులు ప్రత్యేకపదముల నుపయోగించుకొనఁ జొచ్చిరి. ఆ పదములును వికారమును నొందఁ జొచ్చెను. అందు కొన్ని యెక్కువగ వికారమునొంది మరల ప్రత్యయము లగుచుండఁగా, మఱికొన్ని యంతమార్పు నొందక తమ పదస్వరూపమును సంపూర్ణముగఁ గోల్పోక యుండెను. ఉత్తరార్యభాషలయందీ యవస్థయే వ్యక్తమగుచున్నది. ఈ విషయమున నుత్తరార్య భాషలకును ద్రావిడ భాషలకును సంపూర్ణములగు పోలికలు కాన్పించుచున్నవి. ఇండో-యూరోపియను భాషలలో నేక బహువచనములందు వేర్వేఱు బహువచన ప్రత్యయము లుండినను బ్రాకృతభాషలందావిధానమంతయు నెట్లంతరించినదో, బహువచనముల దెలుపుటకుఁ బ్రత్యేక పదములును బ్రత్యయములు నెట్లు చేరినవో, పూర్వావస్థయందేక ప్రత్యయమువలననే తెలుపఁబడుచుండెడి వచన విభక్తులు రానురాను వేర్వేఱుగఁ బ్రత్యేకప్రత్యయముల మూలమున నెట్లు వ్యక్తము కాఁజొచ్చినవో యింతకుఁబూర్వము వివరింపఁబడియున్నది. ఇట్లు వచనమునుండి విడఁబడిన విభక్తివిధానము విభక్తిప్రత్యయములన్నియు మాసిపోవుటవలన [illegible] భాషలయందు విభక్తి [illegible]

నవి. ఉత్తరార్యభాషలయందువలెనే ద్రావిడభాషలయందును నేక బహువచ ములను భేదములేక రెంటియందును నొక్కటే యవ్యయము వాడుకలో వచ్చినది. కాల్డువెల్లీవిషయమున ద్రావిడభాషలు సిథియను భాషలను బో యున్నవని చెప్పెనుగాని, యతఁడనుకొనిన సిథియను భాషాకుటుంబ మను లేదని యిటీవలి విద్వాంసులు నిర్ణయించియుండుటచే నాతఁడు తెలిపినపో లను గూర్చి విమర్శింపనక్కఱలేదు.

సంస్కృతమున నానా యంతములుగల పదములను బట్టివిభ ప్రత్యయములును నవిచేరుటచే విభాగమును భేదముగ నుండును. ఉదా. రామః రామౌ, రామాః; ఫలమ్, ఫలే, ఫలాని; హరిః, హరీ, హరయః; వా వారిణీ, వారీణి; ధాతా, ధాతారౌ, ధాతారః; మరుత్, మరుతౌ, మరు గుణవాన్, గుణవంతౌ, గుణవంతః; సః, తౌ, తే—ఈరీతిగా ననేకము భేదములు గలవు. కాని, ద్రావిడభాషలయందట్టి భేదములులేక యొక్క విధమే యనుసరింపఁబడుచున్నది. ప్రథమావిభక్తియందు కొన్ని చిన్నభేద లున్నను నవి విభక్తి విభాగమునకు సంబంధించినవి కావు. ప్రథమేతరవిభ ప్రాతిపదికము సాధారణముగఁ బ్రథమావిభక్తి రూపమే యైయుండును రూపమునకుఁ గొంచెము వికారము గలిగినను నదియేర్పడినపిదపఁ దకి విభక్తి ప్రత్యయము లన్నియు నన్నిపదములమీఁదను నొక్కటేతీరునఁ చుండును.

ద్రావిడభాషలలోని విభక్తులను వైయాకరణులు సంస్కృతవ్యాక మర్యాద ననుసరించి యెనిమిదిగా నేర్పఱచియున్నారు. కాని, యీవిభక్తులి యని ద్రావిడభాషల విషయమున నిర్ణయింప వీలులేదు. ఒక్కొక్కయర్థమ దెలుపుట కొక్కప్రత్యయమో, అవ్యయమో చేరుచుండును. ప్రత్యేకార్థ లుగల ప్రత్యేక ప్రత్యయములనుబట్టి ప్రత్యేకవిభక్తుల నేర్పఱు యుక్తము.

ఇఁక తెనుఁగునందలి విభక్తులనుగూర్చి విచారించుచు, నావిభక్తిప్ర యములకును నితరద్రావిడభాషలయందలి వానికినిగల సంబంధమును దె ద్రావిడవిభక్తిప్రత్యయములకును బ్రాకృతభాషలయందలియు నాధునిక భాషలయు విభక్తిప్రత్యయములకును గల సంబంధమును విచారింపఁ యున్నది.

## ప్రథమా విభక్తి.

ద్రావిడభాషలలోఁ బ్రథమావిభక్తిప్రత్యయములు లేవనియు, ఉన కాన్పించునవి [illegible] వాస్తవముగాఁ బ్రత్యయములు కావనియు, ఆయాపల్లెలే ప్రత్యయములుగా [illegible] ప్రథమావిభక్తియందుపయోగింపఁబడునని

...వెల్లు చెప్పియున్నాఁడు. ఇందు చాలవఱకు సత్యము లేకపోలేదు. సంస్కృ...నందలి విభక్తివిధానము ప్రాకృతములందు వికారముఁ బొందుటయు, ...నిలిచిన యాయా విభక్తిరూపములందు చాల మార్పులుగలిగి తొల్లింటి ...క్తి స్వరూపమంతయు మఱుగుపడఁగా నాధునికార్య భాషలయందు ...త్త పదముల చేరికచే వాక్యమందలి పదముల సంబంధము తెలుపఁబడు ...డుటయుఁ గూర్చి యింతకుముందు వివరింపఁబడినది. ప్రథమావిభక్తి ...ందు మాత్ర మనేకపదములకు ప్రాకృతముద్వారా వికారమును బొందిన ...పములు నిలిచినవి. కొన్ని భాషలయందు మాత్రము ప్రథమావిభక్త్యర్థ ...ను దెలుపుటకు తృతీయాకారకము ప్రచారములోనికి వచ్చుటచేత తృతీయా ...న క్త్యంతపదమే ప్రథమావిభక్త్యంత పదమను భ్రమను గలిగించి ...ప్రథమావిభక్తి రూపముగా నిలిచిన ట్లుత్తరార్యభాషా తత్త్వజ్ఞులు తెలుపు ...న్నారు. ఉదాహరణమునకు సంస్కృతమున "రామః అగచ్ఛత్" అను ...ను "రామేణగతమ్" అను నుడికారము కుదురుకొన్నది. ఇట్లే, 'రామా ...తః' అను నుడికారమును గలదు. ఈ రెండు నుడికారముల మూలమునను ...హిందీభాషలో ప్రథమావిభక్తియందు "రామ్ - నే," "రామ్" అను ...రెండు రూపము లేర్పడినవి. ఇందు మొదటిదానిలోని 'నే' అనునది ప్రథమా ...విభక్తి ప్రత్యయముగా [illegible]. దానికి హిందీభాషలో తృతీయా విభ...క్త్యర్థ మంతరించిపోయినది. [illegible] నా భాషయందు [illegible] ప్రత్యయము ...నిప్పుడు వాడరు. ఈ [illegible] మూలమున [illegible] రూపములు ...మరాఠీ మొదలగు భాషలయందును గలవు. [illegible] 'నే' అనునది తృతీయా విభక్త్యర్థమున నే వాడఁబడుచున్నవి. [illegible] భాషలయందీ ప్రత్యయము లేదు.

ద్రావిడభాషలయందలి ప్రథమా మహత్ప్రత్యయమగు 'అన్' అను...నది హిందీ మొదలగు భాషలయందువలెనే కరణకారకము మూలమున ...నేర్పడియుండునా యను సందేహము కలుగకపోదు. కాని, యీ యూహ...రెండాక్షేపణ లున్నవి. I. హిందీభాషలో 'నే' ప్రత్యయము మహద్వాచక పదములమీఁదనే కాక యన్ని పదములమీఁదను వచ్చుచుండును. ఉదా:

**పుంలింగము.**

(1) అకారాంతము: బాలక్ - నే; (2) ఆకారాంతము: లడ్కే - నే ...రాజా - నే; బాప్ - దాదా - నే; బాప్-దాదే-నే (3) ఇకారాంతము [illegible] సాధు ...ముని-నే; (4) ఈకారాంతము: [illegible]

నే; (6)

(8)ఓకారాంతము: రాసో- నే; (9) ఔకారాంతము: జౌ-నే; (10) స
స్వార ఓకారాంతము: కోదోఁ - నే.

## స్త్రీలింగము.

(1) అకారాంతము: బహిన్ - నే; (2) ఆకారాంతము: శాలా -
(3) యా వర్ణాంతము: బుఢియా - నే; (4) ఇకారాంతము: శక్తి -
(5) ఈకారాంతము: దేవీ - నే; (6) ఉకారాంతము: ధేను - నే; (7) ఊ
రాంతము: బహూ - నే; (8) ఔకారాంతము: గౌ - నే; (9) సానుస్వా
ఓకారాంతము: సరసోఁ - నే.

II. హిందీభాషలో 'నే' ప్రత్యయము ప్రథమైకవచనమునందే
బహువచనమునందును వచ్చును: ఉదా. ఏక. బాలక్ - నే; బ
బాలకోఁ - నే; ఏక. లడకే - నే; బహు. లడకోఁ - నే; ఏక. రాజా -
బహు. రాజాఓఁ - నే మొద.

పయి యాక్షేపణలకు సమాధానములు లేకపోలేదు. హిందీ మొద
భాషలయందు శబ్దగత లింగజ్ఞానము కేవల మంతరించిపోలేదు; కాని,
ప్రత్యయము ప్రథమావిభక్తి ప్రత్యయమను జ్ఞానము స్థిరపడినది. ఏక బ
వచనములం దనేక పదములకు ప్రాచీన తమిళభాషయందు వలెనే రూ
మొక్కటియే యగుటచేత రెండు వచనములందును ప్రథమా ప్రత్య
ముగా స్థిరపడిన - నే ప్రత్యయము చేరుచున్నది. ద్రావిడభాషలయ
కొన్నియెడల మహన్మహతీ వాచక పదములకు బహువచన ప్రత్యయ
చేరుచుండుటవలన '(అ)న్' ప్రత్యయ మేకవచనమునందును '(అ)ర్' ప్ర
యము బహువచనమునందును నిలిచినవి. ఈ 'అన్' ప్రత్యయము కేవ
మహద్వాచకములమీఁదనే ద్రావిడభాషలయందు వచ్చుననియు, మహ
రామహద్వాచక పదములపై 'అమ్' ప్రత్యయము వచ్చుననుటయుఁ బొ
టయినట్లు కాన్పించుచున్నది. కన్నడమున చెట్టు అనుటకు 'మరం'
వ్రాఁతలో కాన్పించుటచేత దానిని 'మరమ్' అని మకారాంతముగఁ జ
చున్నారు. కాని, దానిని 'మరన్' అనియే చదువవలయునని తోఁచుచు
అది న - కారాంతము కావుననే తెనుఁగున 'మ్రాను' అను ను - వర్ణ
శబ్ద మేర్పడినది. కన్నడముననే 'మరం + ఇర్దుదు' = మరనిర్దుదు అని య
గాని 'మరమిర్దుదు' అని కాదు. కావున వ్రాఁతయందలి నున్న నకా
మున వచ్చినది కాని, మకారస్థానమున వచ్చినదికాదు. ఇట్లే, కులం = కొ
నున్న నకారస్థానమున వచ్చినదే. 'ఫలమ్' అన

వముగా తమిళమున 'పలన్' అను పదమున్నట్లు కాల్డువెల్లే వ్రాసి
న్నాఁడు. కాఁబట్టి 'అన్' అనునది కేవలము మహత్ప్రత్యయమని చెప్పుట
కాదు. కాని, 'ఆన్' = మగవాఁడు, అను జ్ఞానము ద్రావిడుల కుండుటచేఁ
లయుఁ దక్షిణ యార్యభాషలయందువలెనే యేర్పడిన 'అన్' ప్రత్య
ము కొన్ని ద్రావిడభాషలయందు ప్రథమైకవచనమున మహత్ప్రత్యయ
గా నిలిచినది. ఈ అన్ ప్రత్యయము సర్వనామమగు 'అవన్' నుండి
ర్పడినదని కొంద ఱందురు; అప్పుడును నందలి 'అన్' ప్రత్యయ మెట్లేర్పడి
తో నిర్ణయించుకొనవలయును గదా.

'అన్' ప్రత్యయమునకుఁ దోడు కొన్ని ద్రావిడభాషలయందు మహతీ
ధకముగ 'అళ్' ప్రత్యయము గలదు. ఇది 'ఆలు' అను పదమునుండి వెలి
వదని కొందఱమతము; సంస్కృతమందలి 'తా, తి' అను మహతీ
స్త్రీలింగప్రత్యయముల వికారమని యార్యభాషా సంప్రదాయజ్ఞులమతము.
క మహతీతరామహత్ప్రత్యయములు 'అమ్', 'ము' అనునవి ప్రథమైక
వచన ప్రత్యయములుగా మిగిలినవి. ఇవి సంస్కృత ప్రాకృతభాషల వలను
మండియు మహతీతరామహద్వాచక ప్రత్యయములుగ నున్నవే కాని
క్రొత్తవికావు. ఈ 'అమ్' ప్రత్యయమునకును 'అమ' అను ద్రావిడ సర్వ
నామమునకును సంబంధమును గల్పించుటకుఁ గాల్డువెల్లు చాలఁ బ్రయాస
పడియున్నాఁడు. కాని, యీ వ్యుత్పత్తి క్లిష్టము ... యనావశ్యకము
నగుచున్నది. తెనుఁగు కన్నడములందు 'ము' అనువానినిబట్టి మహతీతరామ
ద్వాచక ప్రత్యయముగ నెంచుటగలదు. ఇది 'ము' లోని అనునాసిక్యము
లోపించుటవలనఁ గొన్నియెడలను, ప్రాకృత భాషలందు సంస్కృత ప్రథ
మైకవచన ప్రత్యయము వికారమునొంది 'ఉ'గా మాఱఁగా దానిపై నుచ్చా
రణముకొఱకుఁ జేరిన 'వ' కారము మూలమునఁ గొన్నియెడలను ఏర్పడి
యున్నదని చెప్పవచ్చును.

పైని చెప్పిన ప్రత్యయము గాక ప్రథమావిభక్తి ప్రత్యయములని
దెలుపునవిగాఁ గనఁబడు మఱి రెండు విషయములను గాల్డువెల్లు తెలిపి, యవి
ప్రథమాప్రత్యయములు గావని నిర్ధారణ చేసియున్నాఁడు.

(1) కన్నడమున 'నాను, నీను, తాను' అను సర్వనామ
ములలోని తుది 'ను' వర్ణము లోపించియు 'నా, నీ, తా' అను
వానినే ప్రథమైకవచనమున వాడుట గలదు కావున, వానిలోని
'ను' వర్ణము ప్రథమావిభక్తి ప్రత్యయమని భ్రమపడవచ్చునని
యుఁ, గాని యీ 'ను' వర్ణము ప్రథమేతర విభక్త్యేకవచనములం
దెల్లఁ గానవచ్చుచుండుటచే (ననగె, నినగె మొద.) దానిని ప్రథమావిభక్తి

ప్రత్యయముగ నెంచఁగూడదనియు నాతని యభిప్రాయము. సంస్కృ
సంప్రదాయము ప్రకారము ప్రథమావిభక్తి ప్రత్యయము ప్రథమేత
విభక్తులందు నిలువ దనుట సత్యమే కాని ప్రాకృతాది భాషలకాలమునుం
యు, ననఁగా సంస్కృత విభక్తి జ్ఞానమంతరించిన కాలమునుండియు ఆ రూ
ముతుదినున్న వర్ణము విభక్తి ప్రత్యయమయినను గాకున్నను ప్రథమై
వచన రూపముమీఁదనే ప్రథమేతరైకవచనరూపములందు వచ్చు ప్రత్య
యములుగాని, ప్రత్యయ ప్రతిరూప కావ్యయములుగాని చేరుచుండు
పరిపాటియైనది. మళయాళమునందు 'రామనుక్కు', కన్నడమున 'రామని
తెనుఁగున 'రామునికి' అను రూపములందు 'న' కార మాగమముగా, అర్థర
తముగాఁ జేరినదని పలువు రభిప్రాయపడుచున్నారు. కాని, యీ యూ
సరియైనట్లు తోఁచదు. ప్రథమావిభక్త్యేకవచనమునందలి 'న' కార
తక్కిన విభక్తులందును గానవచ్చుచున్నదనుటయే యుక్తమని తోఁ
చున్నది. తెనుఁగు వ్యవహారమున 'రాముడికి, రాముడితో' మొదలగు రూ
ము లున్నవిగదా. ఇట్లే తెనుఁగున ఫలమునకు, కన్నడమున 'ఫలంగె' మొ
లగువాని యందును ప్రత్యయమువలెఁ గానవచ్చు 'ము' వర్ణము లోపింప
ఇందలి 'ము' వర్ణమాగమ మువర్ణమని తెనుఁగు వైయాకరణులు సమా
నము చెప్పికొనిరి. ఆగమమని చెప్పినంత మాత్రమున 'ము' వర్ణముయొ
ప్రథమైక వచనత్వముపోదు. ప్రయోజనములేక, యర్థరహితముగ నెట్టి
గమ వర్ణములును జేరవు. 'వు' వర్ణము విషయమునఁగూడ నిట్లే యని తె
కొనవచ్చును.

(2) కొన్ని ద్రావిడ భాషలయం దుత్తమ, మధ్యమార్థక
నామములకుఁ బ్రథమావిభక్తియందు దీర్ఘస్వరమును, ప్రథమేతర విభ
లందు హ్రస్వస్వరమును గాన్పించుటచే దీర్ఘస్వరమునే ప్రథమైకవ
ప్రత్యయముగఁ గొందఱు తలంపవచ్చుననియుఁ గాని, యట్లనుకొనుట పొ
టనియు, కొన్ని ద్రావిడ భాషలలో నట్లున్నను తెనుఁగు మొదలగువాని
'నాకు, నాతో, మాకు, మాతో' మొదలగు రూపములలో దీర్ఘస్వరమే
యుండుటచేత దీర్ఘత్వము ప్రథమాత్వ బోధకము గాదనియు, నిదిగాక
యెడల బ్రథమైకవచనమందలి దీర్ఘము ప్రథమేతర విభక్తులందు ప్ర
మైనదో, ప్రథమేతర విభక్తులందలి హ్రస్వస్వర మూఁదిపలుకుటకొ
బ్రథమయందు దీర్ఘమైనదో చెప్ప వీలులేదనియుఁ గాల్డువెల్లు వ్రాసి
న్నాఁడు. ఇదియంతయుఁ గాల్డువెల్లు కల్పించుకొన్న కల్పనగాని వేఱుగ
దీర్ఘము ప్రథమావిభక్తిత్వ బోధక మని యేవైయాకరణుఁడును నన

మగుటచేతను నాఁడట్లు చెప్పియుండును. వీనిలో 'ని, ను'లను గూర్చియు, లవర్ణమును గూర్చియు నింతకుముందు దెలుపఁబడినది. 'కూర్చి' యనునది 'కూర్చు' ధాతువునకు క్త్వార్థకరూప మని సాధారణముగఁ జెప్పుచుందురు; అది క్త్వార్థకరూపమగుట వాస్తవమేకాని, * 'కృత్య'=కృత్వా అను సంస్కృత రూపమునకు వికారమనుట తగునేమో. ఇట్టిసందర్భములందు సంస్కృతమున '(అధి) కృత్య' అని యుపయోగించుట గలదుగదా. ఉపసర్గతో కూడకున్నను వేదమునందు 'కృత్య''గృహ్య' మొదలగు రూపములను క్త్వార్థకములుగా నుపయోగించుట గలదు. 'కృత్య' కుఁ బ్రాకృతమున 'కిచ్చి' 'కుచ్చి' * 'కురిచి' మొదలగు రూపములగును. నన్నయభారతమున 'కుఱిచి' అను రూపము మాత్రము గాన్పించుచున్నది గాని, 'కూర్చి' అను రూపముగాని, 'గుఱించి' అనురూపముగాని లేదు. 'కుఱిచి' కి 'కుఱిచ్చి' అనునది రూపాంతరమయి, యందుండి 'కుఱించి' యనియు నాదిపరుషమునకు సరళాదేశము గలుగుటచేఁ 'గుఱించి'యనియు నేర్పడియుండును. 'కుఱిచ్చి' లోని రెండవ వర్ణముమీఁద యూఁత మొదటి వర్ణముమీఁదికి వచ్చునప్పుడు 'చ్చి' యొక్క ద్విత్వముపోయి తొలిస్వరమునకు దీర్ఘము గలిగినది. 'కూర్చి' కి కన్నడమున 'కుఱితు' అనునది సరిపోవును.

## తృతీయా విభక్తి.

ద్రావిడభాషలలోని తృతీయావిభక్తి ప్రత్యయములను—

(1) తమిళ మళయాళములు:— ఆల్; తెనుఁగు:- అన్ (మొ. చేతన్, రోఁకటన్ మొద.)

(2) తమిళ మళయాళములు:- ఒడు, -ఓడు; - ఉడన్; కొరవ:-ఓడు; కన్నడము:-ఒడనె,-ఒడం; - దె, ది(ం),-రిం; తెనుఁగు:తో,తోడ;కురుఖు,మాల్తో: త్రీ, త్రూ; మాల్తో:-త్; కూఇ:-పై; బ్రాహూఇ:-అట్; తుళు:-డ,-ట.

(3) కన్నడము:-ఇం-ఇంద,-ఇందె,-ఇందం.

(4) తెలుఁగు: చే, చేత, చేసి, పై, మొదలగునవి.

అను మూఁడు వర్గములుగా విభజింపవచ్చును. ఇవి యన్నియు సహార్థబోధకమగు 'తోడ' వర్ణకమునర్థకముగలవి. వీనిలో మొదటివర్గములో నివి సంస్కృత పంచమీవిభక్తిక 'అత్' ప్రత్యయమునకు సంబంధించినవి. పంచమీవిభక్తిని తృతీయకు మాఱుగ వాడుట ప్రాచీనప్రాకృతముల కాలమునుండియు వచ్చినది. 'అత్' అనునది ప్రాకృతమున 'అల్' గా మాఱును. మలయాళమునందును నిట్లే 'అల్' అనునది 'అత్'కు వికారమగుచున్నది. తెలుఁగునందలి-అన్ ప్రత్యయము దీని వికారమే. కాని, కాల్డువెల్లు 'ఆల్' ప్రత్యయము 'కాల్'=కాలు, అను పదమునుండికాని, 'కాలువ' అను పదమునుండి

కాని, కలిగియుండవచ్చునని చెప్పియున్నాఁడు. ఏదోయొక వ్యుత్పత్తిని చెప్పవలెనను నుద్దేశముతప్ప నీయభిప్రాయములో సారమేమియు నున్నట్లుతోఁచదు.

రెండవ వర్గపు ప్రత్యయములతో బంగాలీ:- తే; హైజోంగు: - దే, - దిఅ, - ది; అస్సామీ: - రే, - ఏరే; బనాఫరీ:- త్తై; పంజాబీ:- తే, - తోఁ థోఁ, - దోఁ; పషాయి: దే; - అను తృతీయావిభక్తి ప్రత్యయములను బోల్పవచ్చును.- 'తో' అను తెనుఁగు ప్రత్యయము సంస్కృతములోని 'తస్' అను ప్రత్యయమునుండి కలిగినదేమో విచారింపవచ్చును.- 'తస్' అనునది ప్రాకృతమున -'తో', - 'దో' లుగా మాఱును. కాని ప్రాకృతమున 'తు, తో, త్తో, దు, దో' (పుత్తాతు, పుత్తాతో, పుత్తత్తో, పుత్తాదు, పుత్తాదో) అను ప్రత్యయములు పంచమ్యర్థమున వాడఁబడుచున్నవి. పంచమ్యర్థక ప్రత్యయములు తృతీయార్థమున వాడఁబడుట. ప్రాకృతసంప్రదాయావిరుద్ధము. కాల్డువెల్లు 'తోడన్' అను ప్రత్యయము తమిళమందలి 'తొడు=తాకు; తొడర్ = అనుసరించు; తోటిమెయ్ = అనుఁగుఁదనము; తొలుది = సమూహము; తొలు = ఆవులనాల' మొదలగు పదములతో సంబంధము గలిగి యున్నట్లూహించుచున్నాఁడు.

మూఁడవ వర్గములోని -ఇం, - ఇంద, - ఇందె, - ఇందం-అను కన్నడ ప్రత్యయములతో హైజోంగు:- దే, - ది; బిహారీ: ఎఁ, ఏఁ, హి, హిఁ; వర్షిక్వా:- ఇంద, అను ప్రత్యయములను బోల్పవచ్చును. ప్రాకృతప్రత్యయమగు -'హిం' ను గూడ నీ సందర్భమున స్మరింపవచ్చును.

'తో, చేత, తోడ, చే, చ తృతీయాయాః' అని యాంధ్ర శబ్దచింతామణి సూత్రము. కాని, చిన్నయసూరి 'చేత, తోడ' లను మాత్రము తృతీయావిభక్తిప్రత్యయముగఁ జేర్చి, వాని ప్రథమాక్షరములు వైకల్పికముగ శేషించునని వేఱొక సూత్రమును గల్పించినాఁడు.

## చతుర్థీవిభక్తి.

ద్రావిడభాషలలోని చతుర్థీవిభక్తి ప్రత్యయములను—

(1) తమిళము:- కు, ఉక్కు; కొరవ: - కె, - క, - క్; కైకాడి:- అక్,- క, - కు; బుర్గండి:- క్; మళయాళము:- క్కు; కన్నడము:- గె, - ంగె, - ఇగె, - ఇంగె, - కె, - ఇకె, - కం, - గం; కురుఖు - ఖే, - కే; మల్తో:- ఖే, - కే, - కో, - క్; కూయి:- కి; నాయకీ:- కున్; తెనుఁగు:- కిన్, - కున్; - కై, - కొఱకున్; కోలామీ:- న్గ్; తుళు:- కు, - గు, - క, - గ.

యాలోచించుకొనుమన్నారు. ఆ విషయమై తమకే సందేహము గలదని తెలిపినారు.

రెండవవర్గములోని ప్రత్యయములలో మళయాళములోని 'న్ను' అనునది 'క్కు' వెనుక ననుస్వారము చేరఁగా 'ంగు' అయి 'ఙ్ఙు', 'న్ను' లుగా మాఱినదని కాల్డువెల్లు నభిప్రాయము. తక్కిన భాషలలోని 'ఇన్, ఉన్' లను గూర్చి యాతఁడు విచారింపలేదు; అవియును మలయాళప్రత్యయము వలెనే యేర్పడినవని యాతఁడుచెప్పియుండునేమో. మలయాళప్రత్యయమగు 'ఙ్ఙు' కాల్డువెల్లు చెప్పినట్లే యేర్పడి యుండును. కాని, యీ వర్గములోని తక్కినప్రత్యయములు ప్రాకృతమందలి '-మ్' అను షష్ఠీప్రత్యయముతో సంబంధించినవేమో విచారింపఁ దగును.

మూఁడవ వర్గములోని 'ఏ' అను ప్రత్యయమునకును ప్రాకృతభాషలలోని 'ఆయ, ఆఏ, ఆయే' అను చతుర్థీప్రత్యయములపైను బోలిక కాన్పించుచున్నది.

ఇఁక నాలుగవ వర్గములోని ప్రత్యయములకు సంస్కృతమందలి 'అవసర' శబ్దము మూలము. అది ప్రాకృతమున 'ఓసర' అని యగును. తమిళమున నది 'ఓసర' అనియే వాడఁబడుచున్నది. కాని, తెనుఁగున నది షష్ఠీ ప్రత్యయమగు 'కు' వర్ణకముతోఁ గలిసి 'కోసర' అను రూపమును దాల్చినది. తెనుఁగువారి వాడుకయందది 'కోసరము' అనియే వినఁబడియెడు చున్నది. 'కోసరము', 'కొఱ్ఱము', * 'కోస్నము', 'కోసము' అనియు మాఱినది. కన్నడమున 'ఓసర' శబ్దము 'కె' ప్రత్యయముతోఁ గలిసినను, నా 'కె' వర్ణకము ప్రత్యేకమయినదనియే కన్నడులు తలచుచున్నారు. కాని, వెనుకటి 'కె' వర్ణకము ప్రోద్బలముచేత 'ఓసర' లోని సకారముపైఁ గకారముచేరి 'ఓస్కర' అను క్రొత్తరూప మేర్పడినది. కన్నడ దేశప్రాంతమందలి తెనుఁగువారు 'కోసరము, కోసము' అనుటకు 'కోస్కరము' అని యనుటయుఁ గలదు.

## పంచమీ విభక్తి.

ద్రావిడభాషలలోని పంచమీవిభక్తిప్రత్యయముల నీ క్రింది వర్గములుగా నేర్పఱుపవచ్చును:—

(1) తమిళము: ఇన్ఱు, ఇరున్దు, నిన్ఱు; కొరవ లేక యెరుకుల: ఇండె, ఉండ్, ఇండ్రె, ఇందె; కురుఖు: తీ, ౘ్తీ;

(2) బుర్గండి: కే, కుస్;

(3) గోండి: ఆల్; బ్రాహూఇ: అన్; తెలుఁగు: అన్, న్.

(4) గోండి: సే.

(5) కురుఖు: గుస్తీ; మాల్తో: స్తే; కన్నడము: అకిన్త; తెలుఁగు:కంటె; కన్నడము: అత్తణిం, దెసెయింద.

(6) కూయి: అగ్గడ

(7) తెలుఁగు: వలన, పట్టి, ఉండి.

పైవానిలో మొదటివర్గములోని ప్రత్యయములు ప్రాకృతమందలి 'హిం, హింతో' అను ప్రత్యయములతో సంబంధించియున్నవి. రెండవ వర్గమందలి 'కే, కున్' ల నాధునికార్యభాషలలోని ద్వితీయా చతుర్థీ షష్ఠీ ప్రత్యయము లగు 'కే, కు' లతోఁ బోల్పవచ్చును; ఒక విభక్తి మఱియొక విభక్త్యర్థ మున వచ్చుట సాధారణముగఁ గాన్పించుచున్నది. 'దానికిది యెక్కువ, దీని కది తక్కువ' అను వాక్యములందు షష్ఠీప్రత్యయమగు 'కు' వర్ణకము పంచమ్యర్థమునవచ్చినది. మూఁడవ వర్గములోని 'ఆల్, అన్,న్' లు సంస్కృతమందలి 'అత్' ప్రత్యయమునకు వికారరూపములు. 'అత్' అనునది ప్రాకృతమున'అల్'గా మాఱును. 'ఆల్'తృతీయావిభక్తిప్రత్యయముగఁగూడ వాడఁబడుచున్నది. నాల్గవవర్గములోని 'సే' ప్రత్యయ మాధునికార్యభాషలలో నిదే యర్థమునఁ గలదు. అయిదవ వర్గమందలి ప్రత్యయములు సంకీర్ణములు. వానిని 'గు+సే+తీ; సే+తే; అకె+ఇంత: కు+అంటె = ఇంత' అని విడదీయ వచ్చును. ఆఱవ వర్గమందలి 'అగ్గడ' అనునది ప్రత్యేకపదమయి విభక్త్యర్థ మును దెలుప వాడఁబడుచున్నది. ఏడవ వర్గమందలి 'వలన' అనునది 'వలను' = 'దిక్కు' అను పదమునకుఁ బంచమీరూపము; 'పట్టి, ఉండి' అనునవి క్త్వార్థకములు. ఇవి ప్రత్యయములు కావు; విభక్తిప్రతిరూప కావ్యయములు.

ద్రావిడభాషలలో గమనార్థక పంచమీ విభక్తి ప్రత్యయములు లేవనియు పంచమ్యర్థమును దెలియఁజేయు ప్రత్యేకపదములుమాత్ర మున్న వనియు, నా పదములను సప్తమీ విభక్తి ప్రత్యయముపైఁ జేర్చెద రనియు కాల్డువెల్లు తెలిపియున్నాఁడు. ఆ సప్తమీ విభక్తి ప్రత్యయము తమిళము నందును దానితో సంబంధించిన ద్రావిడ భాషలయందును 'ఇల్, ఇన్' లగను ప్రాచీన కన్నడమునందు 'ఇమ్' గను కానవచ్చుచున్నదని యాతని యభిప్రాయము. ప్రాచీనకన్నడమున తృతీయా పంచమీ సప్తమీ విభక్తి ప్రత్యయముకూడ 'ఇన్' కాని 'ఇమ్' కాదు. నకారస్థానమునఁ జేరిన వ్రాఁత లోని నున్నను నేఁటివారు మకారముగ నుచ్చరించుట వాస్తవమే కాని పూర్వకాలమున దానిపై నచ్చు చేరునపు డది నకారమే యగుచుండుటచేత

నా ప్రత్యయము 'ఇన్' అనియే నిశ్చయింపవలసినది. ఈ 'ఇన్' ప్రత్యయము ద్రావిడపదమగు 'ఇల్' అను గృహవాచక పదమునకు వికారమని కాల్డువెల్లు చెప్పియున్నాఁడు. కాని, యీయూహ సరియైనట్లు తోఁపదు. ప్రాచీన ద్రావిడభాషలలో 'ఇన్' కనపడుచున్నది గాని 'ఇల్' కానరాలేదు; కావున 'ఇల్' అను నది 'ఇన్' నుండి యేర్పడిన యర్వాచీనరూపమై యుండును. సంస్కృత సర్వనామముల సప్తమీవిభక్తి రూపములందున్న 'ఇన్' ప్రత్యయముతో (చూ. తస్మిన్, సర్వస్మిన్, అముష్మిన్ మొద.) కాల్డువెల్లు సంబంధమును సూచించెను గాని, దానిని ప్రాకృతములందలి 'హిం' తోఁ బోల్చుటయే యుక్తమయినట్లు తోఁచుచున్నది. ఈ 'ఇన్' ప్రత్యయమును ప్రత్యేకముగాఁ బంచమ్యర్థమున వాడవచ్చును. చూ. తమిళము: మలెయిన్ విఴుమ్ అరువి = కొండనుండి పడు జలపాతము. కాని, సాధారణముగ 'ఇన్' పై నవ్యయములను జేర్చి పంచమ్యర్థమును దెలుపుట వాడుకయైనది. తమిళమున 'ఇరున్దు, నిన్ఱు' మొదలగువానిని, తెనుఁగున 'ఉండి' మొదలగువానిని చేర్చుచున్నారు. తెనుఁగున నికారాంత పదములపై 'ఇన్' ప్రత్యయమును (చూ. హరినుండి), ఉకారాంతశబ్దములపై 'న్' ప్రత్యయమును (చూ. శంభునుండి), అకారాంత శబ్దములపై 'న్ - అన్' ప్రత్యయములను జేర్చుచున్నారు (చూ. వనమునునుండి.) 'న్ - అన్' అనునవి యుకారాంత మహద్వాచక పదముల మీఁదను జేరును (చూ. చెట్టుననుండి,) ఈ 'న్ - అన్' ప్రత్యయములకును 'ఇన్' ప్రత్యయమునకును సంబంధము గలదని కాల్డువెల్లంగీకరించి యున్నాఁడు. కన్నడములోని 'అత్తణిం' అనునది హళగన్నడ రూపమని కాల్డువెల్లును కర్ణాటకవైయాకరణులును దెలిపియున్నారుగాని ప్రాచీనకన్నడమున దాని వాడుక చాల విరళము; 'ఇం, ఇంద' అనువాని వాడుకయే విస్తారముగ నున్నది. ఈ 'అత్తణిం' అనునది 'అస్థానాత్' అను సంస్కృత రూపములకు ప్రాకృత వికారమగు 'అత్థాణాహిం' అనురూపము ద్వారా వచ్చియుండును. 'దెసెయింద' అనునదియు హళగన్నడమున నంతగ వాడుకయందు లేదు; అది 'దిసాహింతో' అను ప్రాకృతరూపమునుండి యేర్పడియుండును. తుళు భాషలోని 'ద్దు, డ్డ్' అనునవియు తుద భాషలోని 'ఎద్ట్, ఎన్ద్' అనునవియు కన్నడమందలి 'ఇంద'తో సంబంధించినవని కాల్డువెల్లు తలంచెను గాని, యవి తమిళమందలి క్త్వార్థక రూపమగు 'ఇరున్దు'తో సంబంధించినవని యైనను జెప్ప వచ్చును. తమిళమందలి 'ఇరున్దు'కు కన్నడములోని 'ఇష్ప, ఇద్దు'లు సరిపోవును

## షష్ఠీ విభక్తి.

ద్రావిడభాషలలోని షష్ఠీవిభక్తి ప్రత్యయముల నీక్రింది వర్గములుగ నేర్పఱుపవచ్చును:—

(1) తమిళము:—ఉడ్-ఎయ్-అ; మలయాళము:- ఱ్-ఎ; ఉడ్-ఎ, గోండి: ఓర్; బుర్గండి: ఏ, న్-ఏ; కురుఖు: గహ్-ఇ, ఘ్-ఇ, ఘ్-ఏ, గ్-ఏ, క్-ఏ, ఏ, హ్-ఇ, ఇ; మాల్తో: క్-ఇ; కూయి: న్-ఇ: కోలామీ: న్-ఎ; న్-ఎంత్; నాయకీ: న్-ఏ; తెలుఁగు: ఏకవచనమున 'ఇ.'

(2) కన్నడము: అ; గోండి: ఆ; తెలుఁగు: బహువచనమున: అ; బ్రాహూఇ: న్-ఆ; బహువచనమున: ఆ; ప్రాచీనతమిళము: అ.

పై వానిలో మొదటివర్గమునందలి ప్రత్యయములతో మహారాష్ట్రీ ప్రాకృతమునందలి-అఏ,-ఇ, అను షష్ఠీవిభక్తి ప్రత్యయములను, రెండవవర్గమువానిలోని ప్రత్యయములతో మహారాష్ట్రీయందలి 'ఆఅ' అను ప్రత్యయమును, మాగధ్యపభ్రంశభాషలలోని 'ఆ అ, హ' అను ప్రత్యయములను పోల్పవచ్చును.

ద్రావిడభాషలలోని షష్ఠీవిభక్తి ప్రత్యయముల వ్యుత్పత్తినిగూర్చి కాల్డువెల్లు దీర్ఘమగు చర్చఁ గావించియున్నాఁడు. అతఁడు వాని నేడు శీర్షికల క్రింద నేర్పఱిచియున్నాఁడు.

(1) సర్వనామములలో దీర్ఘస్వరము హ్రస్వమగుటవలన నేర్పడిన షష్ఠీవిభక్తి: తమిళ, మలయాళ, కన్నడభాషలలో సర్వనామముల ప్రథమైకవచన రూపమునందలి దీర్ఘాచ్చు శేషషష్ఠియందు హ్రస్వమగును: ఉదా. తమి. మళ- ప్ర. ఏ, నాన్, నీన్, నామ్, నీమ్, తాన్, తామ్-ష. ఏ. నన్, నిన్, నమ్, నిమ్ తన్, తమ్; కన్న. ష. ఏ. నన్న, నమ్మ, నిన్న, నిమ్మ, తన్న, తమ్మ. శేషషష్ఠీరూప మొకవిధమగు విశేషణత్వమును దెలుపుననియు, విశేష్యము విశేషణత్వమును పొందునప్పుడు దీర్ఘస్వరము హ్రస్వమగుట సహజమనియు, ఈ విధానము సంఖ్యావాచక పదములందు కానవచ్చుచున్నదనియు (చూ. తమి. ఆఱు, అఱుబదు; ఏఱు, ఎఱుబదు, మొద.) నాతఁడు తెలిపియున్నాఁడు.|ఇందు కొంత సత్యము లేకపోలేదు. కాని, యీరీతిగ షష్ఠియందును, విశేష్యములు విశేషణము లగునప్పుడును దీర్ఘస్వరము హ్రస్వమగుట సార్వత్రికముకాదు. చూ. ఏమ్=౮; ఏంబదు=౮౦('ఎంబదు' అనికాదు.); కన్నడము: మూఱు, మూవత్తు, ముప్పత్తు; తెనుఁగున సర్వనామములలో షష్ఠియందు దీర్ఘస్వరము హ్రస్వముకాదు: చూ. నేను, మేము, నీవు, మీరు; షష్ఠీరూపములు: నా, మా, నీ, మీ. 'తన, తమ' లలో మాత్రము

షష్ఠియందు హ్రస్వత్వము కాన్పించుచున్నది. కాని, దీర్ఘస్వరము హ్రస్వమగుటవలన షష్ఠీరూప మేర్పడుచున్నదా యను విషయమునఁ గాల్డువెల్లు గూడ సందేహించి, హ్రస్వస్వరముగల రూపములే పూర్వ రూపములును, దీర్ఘస్వరముగలవి యందుండి యేర్పడినవియుఁ గానవచ్చునని వ్రాసి యున్నాఁడు.

(2) తమిళమునందును తెనుఁగునందును నమహద్వాచకపదముల షష్ఠీరూపములను గలిగించు -అత్తు, -అత్త్రు, -టి, -తి, మొదలగు ప్రత్యయములు:-

ఇవియన్నియు ద్రావిడ సర్వనామమగు 'అదు' యొక్క వికారములని కాల్డువెల్లు నభిప్రాయము. 'అదు' ను విశేషణముగ - అనఁగా షష్ఠ్యర్థమున వాడునప్పుడు దకారమునకు బరుషత్వమును ద్విత్వమును కలుగుట ద్రావిడ భాషా సంప్రదాయానుసారముగా నున్నది. ఇట్లు పరుషత్వ ద్విత్వములు గలుగుట తమిళమునందును సార్వత్రికముగాదు. ఉదా. కుళత్తు మీన్ = కొలనిమీను; మరత్తు - క్ - కొప్పు = మ్రానికొమ్మ; వాళెయ్ - అదు - పళమ్ = అరటిపండు. ఈ 'దు' యొక్క యిట్టి ప్రయోగము తెనుఁగునను 'నాదుమనవి, తనదు గృహము' మొదలగు చోట్ల సర్వనామములపైఁ గాన్పించుచున్నది. ఇందు 'దు' మాత్రమే షష్ఠీ బోధకము; అది 'అదు' యొక్క లుప్త శేషమగునేమో తెలియదు. నాయదుమనవి,తనయదు గృహము అని తెనుఁగునవాడుక లేదు. 'నాయది మనవి, తనయది గృహము' అనియు ననవచ్చును గాని, యిందు 'అద' షష్ఠీ విభక్త్యర్థమునఁ బ్రయోగింపబడలేదు. 'నాది మనవి, తనదిగృహము' అని తెనుఁగువారనరు. తమిళమునందును 'అదు'కుఁ బ్రత్యేకముగా 'అత్తు, అత్త్రు' అను షష్ఠీరూపములు గానరావు. కావున 'అత్తు, అత్త్రు' లు 'అదు'కు వికారరూపములాయనువిషయమున సందేహము తీరకున్నది. కన్నడమునందలి 'ద' (చూ. మరద, గృహద) కును 'అత్తు, అత్త్రు, తి, టి' లకును సంబంధముగలదు, తమిళమున నొకప్పుడు 'అదు' అనునది షష్ఠీ - సప్తమీ ప్రత్యయమగు - ఇన్ పైఁ జేరుచుండును: ఉదా. మర్ -అత్త్ -ఇన్ -అదు కొప్పు; వాళె -య్ -ఇన్ -అదు పళమ్.

(3) అమహద్వాచక సర్వనామమగు 'అదు', దాని దీర్ఘరూపమగు 'ఆదు' అనునవియు షష్ఠీ విభక్తి బోధకములుగ ప్రయోగింపఁబడుచుండును. ఇవి సాధారణముగ ప్రథమేతర విభక్తిప్రాతిపదిక రూపములపైఁ జేరుచుండును. ఇవిచేరిన రూపములనే వాక్యమునఁ గర్తగాఁగూడ నుపయోగింపవచ్చును. తమిళము: ఎనదు- కెయ్ = నాదుచేయి; ఎనదు పోయిట్రు = నాది (నా ధనము) పోయినది.

'అదు', 'ఆదు'లు పైఁ జూపిన 'అత్తు, అత్త్రు, టి, తి' మొదలగు వానివంటివే. ఇవి యన్నియు నేకవచనమునందే చేరును. అదు, ఆదు లు నిర్దేశార్థక సర్వనామము లని కాల్డువెల్లు నభిప్రాయము. అట్లయినచో వాని బహువచన రూపముల నట్లుపయోగింపకుండుటకుఁ గారణము కానరాదు. 'ఎనదు - కెయ్' అన్నట్లు 'ఎనవు - కెయ్‌గళ్' అనఁగూడదు. తెనుఁగునను 'నాదు - చేయి' అనునట్లు 'నావు - చేతులు' అనగూడదు. 'నాదు - చేతులు' అని యనవచ్చునేమో తెలియదు. నాది - చేయి, నావి - చేతులు అని తెనుఁగున వాడుక లేదు. 'దు, అదు, ఆదు' లు చేరిన షష్ఠీరూపములవాడుక మాత్ర మన్ని ద్రావిడభాషలయందును బ్రాచీన వాఙ్మయమునందు మాత్రము కానవచ్చుచున్నది; నేటి వ్యావహారిక భాషలయం దట్టివాడుక లేదు.

(4) షష్ఠ్యర్థమునఁ జేరు 'ఇన్' అను నదియు దాని రూపాంతరములగు 'ని' మొదలగునవియుఁ దొలుత సప్తమీ విభక్తి ప్రత్యయములని కాల్డువెల్లు నభిప్రాయము. తమిళమున 'ఇన్' అనునది షష్ఠ్యర్థమున సర్వసాధారణముగ వాడుకయందున్నది. ఆ భాషలో 'అత్తు' అనునది యమహద్వాచకైకవచనమందును, 'అత్త్రు' అనునది యమహద్వాచక బహువచనమందును వాడఁబడుచుండును. కాని 'ఇన్' అనునది మహదమహద్వివక్షగాని, యేక బహువచన వివక్షగాని లేక యన్నియెడలను వాడఁబడును. మలయాళభాషయందును నిట్టి వాడుకయే కలదు. కన్నడమున మాత్రము 'ఇన్' అనునది యాగమవర్ణముగఁ జేరుచుండును. 'ఇన' అను కన్నడమందలి షష్ఠీ ప్రత్యయమందు తుది 'అ' వర్ణముమాత్రము షష్ఠ్యర్థబోధకము; 'ఇన్' అనునది యాగమముగఁ జేరినది. తెనుఁగున 'ని' వర్ణమును, దాని రూపాంతరమగు 'న' వర్ణమును షష్ఠియందు వచ్చుచుండునని కాల్డువెల్లు తెలుపుచు నవి తమిళమునందలి 'ఇన్' వర్ణకమునకు రూపాంతరములని చెప్పినాఁడు. ఇందును'న్' వర్ణమాగమాక్షర మనియే యేల చెప్పఁగూడదో తెలియరాదు. 'న' 'ని' లలోని అకార ఇకారములు మాత్రము షష్ఠీబోధకములగుట యొప్పును. కన్నడమున 'ఇన' వర్ణకమువలెనే తెనుఁగున 'న, ని' లేక వచనమునందు మాత్రము చేరుచుండును. కూయి భాషలోఁ దెనుఁగునందువలెనే 'ని' వర్ణమే షష్ఠీవిభక్తి బోధకముగా నున్నది. గోందు భాషలోని, న, నా, ద, ఆ, లును, బ్రాహూయి భాషలోని 'నా'యును, తమిళమందలి 'ఇన్' వర్ణకముతో సంబంధించినవే. ఈ 'ఇన్' వర్ణకమును తమిళ వైయాకరణులు షష్ఠీ ప్రత్యయముగా నేర్పఱుపలేదు. కాని, విశేష్యములపై - 'ఉడైయ' అను ప్రత్యయము - 'ఇన్' ప్రత్యయము ముందుగాఁ జేరిన రూపముమీఁదనే

లేవనియు నిండో - యూరోపియను భాషలందు మాత్ర మున్నవనియుఁ గాల్డువెల్లు తెలిపియున్నాఁడు. ప్రాకృతములందలి షష్ఠీ ప్రత్యయమగు 'ఆ అ' అనునదియు 'య,అ' లుగా పరిణమించిన 'స స్స'లును, 'అ' గా మాఱిన 'హ'యు, 'న'గా మాఱిన 'ణ, ణా,' లును ద్రావిడభాషలందు షష్ఠీ ప్రత్యయములుగాఁ గానవచ్చుచున్న 'అ, య, న' లకు మూలములై యుండవచ్చును. ఉత్తర హిందూస్థాన భాషలలోని కొన్ని ప్రత్యయముల తుది - 'ఆ' కార మీ షష్ఠిని బోధించునని నా యభిప్రాయము. చూ. హైజోంగు: ల్ - ఆ; పంజాబీ: ద్ - ఆ; కాథోడి: న్ - ఆ; మాల్వీ: ర్- ఆ: మార్వాడీ: ర్ - ఆ; గుజరాతీ: న్ - ఆ; వై - అల: బ్ - అ; గవర్-బతీ: అన్ - అ; వీని యన్నిటిలోను 'ఆ' 'అ'లు మాత్రము షష్ఠీబోధకములును, 'ల్, ద్, న్, ర్, బ్, అన్' అనున వాగమాక్షరములును నై యుండును.

(6) మలయాళమున షష్ఠ్యేకవచన ప్రత్యయములగు 'రె' 'దె' లు: ఇవి 'అదు' అను సర్వనామము వికారములని కాల్డువెల్లు నభిప్రాయము. తెనుఁగువిభక్తి ప్రత్యయములతో వీనికి సంబంధ మంతగా లేకుండుటచే దానిని గూర్చి యిచటఁ జర్చింపలేదు.

పై ప్రత్యయములు కాక తెనుఁగున 'యొక్క,' తమిళమున 'ఉడైయ' అను సహాయక ప్రత్యయములు గలవు. 'ఉడైయ' అనఁగా 'ధనమయిన' అని యర్థము. తెనుఁగునందలి 'యొక్క' కు వ్యుత్పత్తిని సరిగఁ జెప్పుట కష్టము. తెనుఁగు వ్యవహారమున దీనిని షష్ఠీ ప్రత్యయముగ నెవ్వరును వాడరు. 'ఆయొక్క, ఈ యొక్క' అని కొందఱు ఛాందసులందురు గాని యట్టి వ్యవహారము విరళము. తెనుఁగున గ్రంథములందు గాని శాసనములందుగాని 'యొక్క' గానరాదు. దీని యర్థమేమో యిదమిత్థమని చెప్పలేము. 'నా' యన్నను 'నాయొక్క' యన్నను నర్థమొక్కటే కావున 'యొక్క' కూడ సంబంధార్థమున నూఁతపదముగాఁ జేరుచున్న దనవచ్చును. ఇది తొలుత యకారాదియై యుండియుండదు. 'ఉండి' పదమునాదిని నకారము చేరి 'నుండి' యని యేర్పడినట్లే 'ఒక్క' అను తొల్లింటిరూపము నాదిని యకారముచేరి 'యొక్క' అని యేర్పడియుండును. కాని, యది యజాదియను జ్ఞానము తెనుఁగువారియందు లోపించియుండును. తొలుత నిది 'ఒక్క'గా నుండినచో దానికిని తమిళ - మళయాళము లందలి 'ఒక్క' అను పదమునకును సంబంధ ముండియుండును. తమిళ - మలయాళములలో ఈ 'ఒక్క'ను షష్ఠీ ప్రత్యయముగ వాడుటగలదు. ఆ భాషలయందు 'ఒక్క' అనునది 'ఒక్క్' = ఒప్పు, తగు, అను నర్థముగల ధాతువునుండి యేర్పడిన

క్రియాజన్య భూతార్థక విశేషణము. మలయాళమున 'ఒక్క' యనఁగా ఒప్పిన, తగిన, యని యర్థము; దీనినుండి తెనుఁగున 'యొక్క' కు 'సంబంధించిన' యను నర్థభేదము గలిగియుండును. తమిళమున 'ఒక్క' కు 'కలిసి,' 'అధికముగా', 'సమానముగా' అను నర్థములు గలవు. ఇందుబట్టి యీ 'ఒక్క' అనునది సంఖ్యార్థబోధకమగు 'ఒక్క'తో సంబంధించినదా యను సందేహమును గలుగక పోదు. యొక్క వ్యుత్పత్తిని గూర్చి యిప్పటి కింతకంటె నెక్కువగ వివరింప వీలులేదు.

## సప్తమీ విభక్తి

ద్రావిడభాషలలోని సప్తమీ విభక్తి ప్రత్యయముల నీ క్రింది వర్గములుగా నేర్పఱుప వచ్చును:

(1) తమిళము: ఇల్; కొండ, కోక, యెరుకల: ఉల్లి, ఒల్లి; కైకాడి: అలి, ఉళి; బుర్గండి: అళి, ఉళి; మలయాళము: ఇల్; కన్నడము: అల్లి; ప్రాచీనము: ఒళ్, ఓళ్, ఒళం; తెలుఁగు: లో, లోపల; నాయకీ: లోపుల్.

(2) మలయాళము: ఏ; గోండి: ఏ; బ్రాహూయి: ఆఏ.

(3) బుర్గండి: కో.

(4) కురుఖు: నూ; మల్తో: నో; తెలుఁగు: న.

(5) కోలామి: క్; బ్రాహూయి: టీ; తుళు: దు, ద్, టు, ట్.

(6) తెలుఁగు: అందు.

పై వానిలో (1), (4), (6) వర్గములోనివి స్థలవాచకములు; అందు నూ, నో, న, లు 'లో'కు వికారములుగా నుండును. రెండవ వర్గములోని 'ఏ', 'ఆఏ' లు సంస్కృతము ద్వారా ద్రావిడ భాషలయందు చేరియుండును. కో, కే, లుత్తరార్యభాషల ద్వారా చేరియుండును. ఐదవ వర్గములోని ప్రత్యయములు 'ఉళ్' అనునది 'ఉడ్' గా మారుటచే నేర్పడినవని గండర్టుగా రభిప్రాయపడియున్నారు. తెనుఁగున 'న' వర్ణము సప్తమీ విభక్తి ప్రత్యయముగా నాంధ్రవైయాకరణులు తెలిపియున్నారు గాని యిది సరియైనట్లు తోఁపదు. ఔపవిభక్తిక పదములపైఁ జేరు 'అన్' ప్రత్యయమే (చూ. చేతన్, ఇంటన్ మొద.), 'వనములన్' మొదలగు వాని యందును గాన్పించుచున్నది, కావున న వర్ణకము గాక 'అన్' అనునదియే సప్తమీ విభక్తి ప్రత్యయ మనుట యొప్పును. అందుచేత సిథియాను భాషలయందును 'న' వర్ణకము సప్తమీ విభక్తి బోధకముగ నున్నదని చూపుటవలనఁ బ్రయోజనము లేదు.

ప్రాకృతభాషలలోని 'అ, ఎ, ఇ, ఎ, ఏ' లను పై రెండవ వర్గమం దలి ప్రత్యయములతోను, మి, ంమి, మ్మి, లను మొదటివర్గపు ప్రత్యయ ములతోను పోల్పవచ్చును. ఉత్తర హిందూస్థాన భాషలలో బంగాలీ; 'ఏ' ను పయి రెండవ వర్గమందలి ప్రత్యయములతోను, హైజోంగు: మి, ని, మిని; మైథిలి: మే, లను మొదటి వర్గమందలి ప్రత్యయములతోను, అస్సామీ: త్, తే, అత్, అతే, లను అయిదవ వర్గమందలి ప్రత్యయములతోను, కొం కణి:-లో; షినా:-రో,లను తెనుఁగులోని 'లో' ప్రత్యయముతోను సరిపోల్ప వచ్చును. లో, లోపల, ప్రత్యయములను తెనుఁగు వైయాకరణులు షష్ఠీ ప్రత్యయములలో జేర్చియున్నారుగాని వాస్తవముగనవి యధికరణమునవచ్చు 'అందు' ప్రత్యయమువంటి వగుటచే నవి సప్తమీ విభక్తి ప్రత్యయములే యని చెప్పవలెను.

## సంబోధనప్రథమా విభక్తి

సంస్కృతమున అకారాంత పుంనపుంసక శబ్దములయు, ఇకారాంత నపుంసకలింగ శబ్దములయు, అనేక హలంత శబ్దములయుఁ బ్రాతిపదికరూప ములే సంబోధన ప్రథమైక వచనమున నిలుచుచుండును. ఉదా. రామ; ఫల, వారి;మరుత్, సంపద్, విరాట్ మొ. సంబోధన బహువచనమున నన్ని శబ్ద ములకును బ్రథమా బహువచన రూపములే యుండును. సంబోధన ప్రథ మైకవచనమున నితరశబ్దములందు కొన్ని విశేషములు కాన్పించుచున్నవి: హరే; మతి, మతే; మాలే; వాయో; నది; కర్తః; విద్వన్; నామ మొద. ఈ సంబోధన రూపములకుఁ బూర్వ మేకబహువచన వివక్షలేక 'హే, రే, రేరే' మొదలగు నవ్యయములు నిలుచుటయుఁ గలదు.

ప్రాకృతభాషలలోను నుత్తరార్యభాషలలోను సంబోధనమునఁ గలుగు రూపము లింతకుముందు వివరింపఁబడి యున్నవి. ఇట్టి రూపములన్ని యు ద్రావిడ భాషలయందును నదేరీతిగఁ గలుగుచున్నవి. తమిళ మలయాళము లందు మాత్ర మొక విశేష మున్నది. సంబోధనమునఁ దుది యచ్చును దీర్ఘ ముచేయు వాడుక ననుసరించియే తమిళమునఁ బదములతుది 'ఎయ్' కారము 'ఆయ్' గా మాఱును. ఉదా. తంగెయ్=చెల్లెలు; తంగాయ్!=చెల్లెలా! తెనుఁగు నను నీ సంప్రదాయము క్వాచిత్కముగ నున్నది. ఉదా. పాపాయ్! అమ్మాయ్ మొదలయినవి. ఇట్టిరూపములు పాప, అమ్మ, మొదలగు పదములు 'ఎయ్' కారాంతములుగ నుండిన యవస్థనుండియుఁ దెలుఁగున నిలిచినవనియైనఁ జెప్ప వలెను; లేదా పాపా! అమ్మా!అబ్బా! లను సంబోధనరూపములతుది అత్వముపై 'య' కార మాగమముగా వచ్చినదని యైన చెప్పవచ్చును. లేదా, పాపాయి,

అమ్మాయి, అబ్బాయి, అనురూపముల తుది యిత్వము లోపించి సంబోధన రూపము లేర్పడినవని యైనఁ జెప్పవచ్చును. వ్యవహారమున 'పాపాయ్!' అని పిలుచుటయు, 'పాపాయి' అను ప్రథమైకవచన రూపము తుదియచ్చు దీర్ఘముకాఁగా 'పాపాయీ!' అని పిలుచుటయుఁ గూడఁగలదు. ఈ 'ఆయ్' అనునది మధ్యమ పురుషైక వచన సర్వనామమని కాల్డువెల్లు చెప్పినదిసరికాదేమో. తమిళమున పద్యభాషలో 'ఈర్' అను మధ్యమపురుష బహువచన సర్వనామమును సంబోధనమున 'ఎల్ల' శబ్దముతోఁ జేర్చి 'ఎల్లిర్! (=*మీరందరా!) అని యుండుటచే నాతఁ డిట్లు చెప్పియుండును. తమిళమున బహువచనమున 'గళ్' ప్రత్యయమందలి యచ్చును బొడిగించుటవలనను సంబోధన మేర్పడును. ఉదా. పావిగళ్ = పాపులు; పావిగాళ్! = పాపులారా! ఇట్టి ప్రయోగము తక్కిన ద్రావిడ భాషలయందు లేదు.

## మిశ్రవిభక్తి ప్రత్యయములు.

విభక్తి ప్రత్యయములను ప్రథమేతరవిభక్తి ప్రాతిపదికముగ నేర్పడిన షష్ఠీవిభక్తి రూపములపైఁ జేర్చు సంప్రదాయము సంస్కృతమున 'పుత్త్రస్య కృతే' మొదలగువానిని బోలిన రూపములనుబట్టి ప్రాకృతమున విస్తరించి, యుత్తర హిందూస్థానీ భాషలయందును ద్రావిడభాషలయందును సంపూర్ణముగ నెలకొన్నది. ద్రావిడభాషలయందు షష్ఠీవిభక్తిరూపములమీఁదనే కాక యితర విభక్తిప్రత్యయములమీఁదను మరల విభక్తిప్రత్యయములు చేరుటగలదు. ఉదా. తమిళము: వీట్టుక్కుళ్ = ఇంటిలో; ఇడత్తిల్ = ఎడమునందు; మలయాళము; ఇవిట్టుళ్ళ్ = లోపల; కన్నడము: మనెయుల్లింద = ఇంటిలోనుండి; తెనుఁగు: గ్రంథములయందు: వనమునను, హిమగిరి వలననుండి; జ్ఞానమునుబట్టి; వనమునందులో, ఊరియందును మొదలగునవి. తెనుఁగువ్యవహారమున నిట్టిరూపములు లోపించినవి; కాని, గ్రామ్య సంప్రదాయము మఱికొన్ని ప్రత్యయములను వ్యాపించినది. ఉదా. కత్తితో కంటె గొడ్డలితో బాగా తెగుతుంది. అందులో కంటె ఇందులో ఎక్కువనీళ్లున్నవి, మొదలయినవి.

సిథియనుభాషలలో విశేష్యములపై సర్వనామములను సమసింపఁజేసి యట్టి సమాసములను విశేష్యములుగ వాడుటగలదు. హంగేరియను భాష నుండి యిట్టి యుదాహరణములను కాల్డువెల్లిచ్చియున్నాఁడు: ఉర్ = ప్రభువు.

| ఏక. | బహు. |
|---|---|
| ఉరమ్ = నా ప్రభువు | ఉరైమ్ = నా ప్రభువులు. |
| ఉరద్ = నీ ,, | ఉరైద్ = నీ ,, |
| ఉర = వాని ,, | ఉరై = వాని ,, |

| ఏక. | బహు. |
|---|---|
| ఉరున్క్ = మా ప్రభువు | ఉరైన్క్ = మా ప్రభువులు |
| ఉరతోన్క్ = మీ ,, | ఉరైతోన్క్ = మీ ,, |
| ఉరోన్క్ = వారి ,, | ఉరైన్క్ = వారి ,, |

ఇట్లేర్పడిన సమాసములు విశేష్యములవలెనే విభక్తి ప్రత్యయములను బొందును.

ఉరమ్నక్ (ఉర్-అమ్-నక్) = నా ప్రభువునకు

ఉరున్క్‌నక్ (ఉర్-ఉన్-క్-నక్) = మా ప్రభువునకు

ఉరైమ్నక్ (ఉర్-ఐమ్-నక్) = నా ప్రభువులకు

ఉరైన్క్‌నక్ (ఉర్-ఐన్-క్-నక్) = మా ప్రభువులకు

ఇట్టి సంప్రదాయము ద్రావిడభాషలకు విరుద్ధమనియు నీ విషయమున ద్రావిడభాషలకును సిథియనుభాషలకును నెట్టి సంబంధమును లేకుండుట వింతగా నున్నదనియు కాల్డువెల్లు తెలిపియున్నాఁడు.

## తెనుఁగున విభక్తులు

### ప్రథమావిభక్తి

1. డు, ము; వు, లు, అనునవి ప్రథమావిభక్తి ప్రత్యయములని సాధారణముగా చెప్పఁబడుచున్నవి. వీనిచరిత్రమును గూర్చి వేఱొకచో ముచ్చటింపఁబడినది. వీనిలో 'డు' అనునది బిందుపూర్వకముగనే యుండును. ఇది మహద్వాచక ప్రత్యయము. ఇది సాధారణముగ సంస్కృతాకారాంత పుంలింగ మహద్వాచక శబ్దములపైఁ జేరుచుండును. 'యోధ, వృద్ధ, మూర్ఖ' మొదలగువాట్ల నిది చేరకుండుటయుఁ గలదు. ఇది చేరినప్పుడు తత్పూర్వ మందలి యత్వముత్వముగ మారును. తెనుఁగుభాష ప్రాచీనావస్థయందు డుబ్పూర్వకమగు నత్వమున కుత్వము సాధారణముగ వచ్చుచుండుట లేదు. ఇకారాంత పుంలింగమహద్వాచక సంస్కృతశబ్దములపై నిదిచేరదు. అకారాంత నపుంసకలింగ మహద్వాచకశబ్దములపై నిది వైకల్పికముగఁ జేరును (మిత్రుఁడు. మిత్రము, మొద.); ఉకారాంత పుంలింగమహద్వాచక శబ్దములపైఁ గూడ నది వైకల్పికముగనే చేరును (ప్రభువు, ప్రభుఁడు మొద.) ఋకారాంత మహద్వాచక శబ్దములకొన్నిటిపై నది చేరనేచేరదు (కర్త, దాత మొద.); కొన్నిటిపై వైకల్పికముగఁ జేరును (విధాతృఁడు, విధాత మొద.) హలంతశబ్దములపై నిదిచేరు విధానము వేఱొకచోఁ జూపఁబడినది. ఆచ్ఛికశబ్దముల కొన్నిటిమీఁదమాత్రము డువర్ణకము చేరుచున్నది.

మువర్ణము విభక్తిప్రత్యయము కాదేమోయని తోఁచుచున్నది. అంతకుఁబూర్వము శబ్దగతమైయున్న మకారముపై నుత్వముచేరుటవలన నిది యేర్పడియుండును. దీనిపై బహువచన లువర్ణముచేరునపుడు 'ము' వర్ణము లోపించి తత్పూర్వమం దున్న అత్వమునకు దీర్ఘము కలుగుచుండును.

వువర్ణముకూడ విభక్తిప్రత్యయము కాదు. ఉత్వముపై 'వ'కారమును దానిపై తెనుఁగుసంప్రదాయము ప్రకార ముత్వమును నాగమములుగాఁ జేరుటవలన నీ 'వు'వర్ణమేర్పడినది. ఈ వర్ణముకూడ లోపించుటయుఁ దత్పూర్వ ఉకారము దీర్ఘమగుటయు నచ్చటచ్చట వ్యవహారమున మాత్రము కానవచ్చుచున్నది.

లు-వర్ణము ప్రథమాబహువచనమున వచ్చు ప్రత్యయము. ఇందలి 'ఉ'కారము మాత్రము ప్రథమావిభక్తి ద్యోతకము; లకారము తక్కిన విభక్తుల యందును నిలుచుచున్నది.

ప్రథమావిభక్తిని గూర్చిన తక్కిన విషయములు మఱియొకచోట వివరింపఁ బడినవి.

“ప్రాతిపదికార్థలింగపరిమాణవచనమాత్రే ప్రథమా,” “సంబోధనే చ” అని పాణిని సూత్రించియున్నాఁడు. అనఁగా కేవల ప్రాతిపదికార్థముఁ గలిగియున్నప్పుడును (ఉచ్చైః, నీచైః), నియతలింగమును గలిగి యున్నప్పుడును (కృష్ణః, జ్ఞానమ్, సీతా) ప్రాతిపదికార్థమని చెప్పఁబడును. ఈ ప్రాతిపదికార్థముగాక లింగముకూడ భేదించుచున్నప్పుడును ప్రథమవచ్చును (తటః, తటీ, తటమ్); పరిమాణవాచక పదముకూడ ప్రథమావిభక్తియం దుండును. (ద్రోణో వ్రీహిః); వచనమును దెలుపు పదములును ప్రథమావిభక్తి యం దుండును (ఏకః, ద్వౌ, బహవః,); సంబోధనమును దెలుపు పదమును ప్రథమావిభక్తియం దుండును. (హే రామ !.) సంబోధ్యవాచకపదము ప్రథమయం దుండునా యను విషయమున నభిప్రాయ భేదమున్నది. కొందఱది యవ్యయ మందురు; కొందఱు విశేషణ మందురు. పాణిని సూత్రముప్రకారము 'ఉచ్చైః, నీచైః' మొదలగు నవ్యయములకును ప్రథమావిభక్తిత్వము కలుగుచున్నది. అట్లే తెనుఁగున 'అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు, అట్లు, ఇట్లు, ఎట్లు' మొదలగు నవ్యయములును ప్రథమావిభక్తియం దున్నవని తెలుపవలెను. తెనుఁగున లింగవివక్షకుఁ బ్రాధాన్యములేక, మహ దమహదర్థములకే యుండుటచే నిచట మహ దమహత్తులనే లింగ పర్యాయములుగాఁ దీసికొనవలసి యున్నది. పరిమాణవాచకపదము కొలువఁబడు దానిని దెలుపు పదము తరువాత వచ్చునప్పుడేను ప్రథమావిభక్తిత్వమును బొందుచున్నది; తత్పూర్వమందు చేరినచో మానార్థమున 'ఎడు' వర్ణకము చేరును. 'ఎడు'

వర్ణసహిత మానార్థకపదము ప్రథమయందున్నదని చెప్ప వీలున్నదేమో తెలియదు. 'ఎడు' వర్ణ మేకవచనపదముపైఁ జేరి విశేష్యమునకుఁ బూర్వమందును బరమందును జేరును. సోలెడు పెసలు; పెసలు సోలెడు. 'పెసలు సోల' అని యనుటయుఁ గలదు. బహువచనమందున్న మానార్థకపదములపై 'ఎడు' వర్ణకము చేరదు. ఉదా. పెసలు రెండు సోలలు. ఇట్టియెడ మానార్థకపదము విశేష్యమునకుఁ బూర్వమందు చేరినచో షష్ఠీరూపమును బొందును: రెండు సోలల పెసలు.

పాణిని సూత్రమునే యించుమించుగ ననుసరించి చిన్నయసూరి "ప్రాతిపదిక సంబోధనోక్తార్థంబులం బ్రథమయగు" నని వ్రాసియున్నాఁడు. నియతోపస్థితికము ప్రాతిపదికమని యూతఁడు నిర్వచించెను; అనఁగా 'రామ' అను ప్రాతిపదికము నుచ్చరించునప్పుడు గలుగు నర్థస్ఫూర్తియే నియతముగా 'రాముఁడు' అని యుచ్చరించు నప్పుడును గలుగుచున్నది. కావున 'రాముఁడు' అను పదము 'రామ' అను ప్రాతిపదికమునర్థము నందే నిలిచి ప్రథమా విభక్త్యంతమును బొందుచున్నది. సంస్కృతమునందువలెఁ గాక తెనుఁగున సంబోధనమున నకారాంత పుంలింగ మహద్వాచకపదములపై డుజ్వర్ణకము చేరుచున్నది కావున నదియుఁ బ్రథమా విభక్తియందే యున్న దనవచ్చును గాని యిచట సంబోధకమునకై చేరు 'అ, ఆర' మొదలగు ప్రత్యయములకును బ్రథమాత్వమును జెప్పవచ్చునేమో తెలియదు. క్రియచే చెప్పఁబడు వానిని (దానిని) దెలుపు పదమును బ్రథమావిభక్తియందే యుండును. దీనికే ఉక్తార్థమని పేరు. 'రాముఁడు రావణుని చంపెను' అనునప్పుడు 'చంపెను' అను క్రియపై 'ఎవఁడు చంపెను?' అను ప్రశ్నమురాఁగా 'రాముఁడు' అనునది ప్రథమావిభక్తియందున్నదని యందుము.

## ప్రథమేతర విభక్తి ప్రాతిపదికము.

### i. తత్సమ పదములు.

తక్కిన ద్రావిడభాషలయందువలెఁ దెనుఁగునను పదముల షష్ఠీ విభక్తి రూపము ప్రథమేతరవిభక్తి ప్రత్యయములు చేరుటకుఁ బ్రాతిపదికమగుచున్నది. సాధారణముగా దత్సమములం దకారాంత, ఇకారాంతములై ప్రథమా విభక్త్యేకవచనమునఁ దెనుఁగున నిలిచిన పదములే షష్ఠ్యేకవచనమునను నిలుచుచుండును. సీతతోడ, హరికంటె, దాతకు మొద. తెనుఁగున డువుంతము లయిన పదములకుఁ బ్రథమైకవచనమున వచ్చు డుజ్వర్ణము ప్రథమేతర విభక్తులందు లోపించి, దాని స్థానమున షష్ఠ్యేకవచనమున న వర్ణము

పడుమటి తెనుఁగు జిల్లాలలో నిట్టి రూపములు లేవు; అందు 'రామునితో, రామునికి' అనియే యందురు. కావున నీ పలుకుబడులు మాండలికములు; రెండిటియందును బ్రథమైకవచన ప్రత్యయమునకు లోపములేదు. ఈ మహ ద్వాచకపదముల ప్రథమేతర విభక్తులందలి 'న' కారము కొన్నాళ్ల కరరహి తము కాఁగా నది యమహద్వాచకపదములందును జేరుచుండెను కాఁబోలు. కాని, ము, వు వర్ణాంతములగు పదముల షష్ఠ్యేక వచనమున నీ 'న' వర్ణము మనకుఁ దెలిసిన తెనుఁగులో తొలి యవస్థనుండియుఁ గానవచ్చుచునే యున్నది. 'ఉరమునయందు, వనమునకంటె' మొదలగువానియందలి 'న' కారము కవి కల్పితమయినఁ గావలెను, లేదా, 'విశఖవట్టనమునవారు, తామరచెఱునయందు' మొదలగు శాసనస్థ ప్రయోగముల ననుసరించి 'న' వర్ణము షష్ఠ్యేకవచనమునఁ బ్రాచీనకాలమున వ్యవహారమున నున్నదని యైనను జెప్పవలెను.

తెనుఁగున 'ఇ' కారము విశేష్యములనుండి విశేషణముల నేర్పఱుచు వర్ణముగా నున్నది. ఈ యికారమే యించుమించుగ విశేషణముల యర్థమును గలిగిన షష్ఠీ విభక్తియం దుపవిభక్తిగ నెలకొనియున్నది. దీనినిగూర్చి యీ క్రింద సవిస్తరముగఁ జెప్పఁబడును. ఈ యి వర్ణము ప్రోద్బలముచేఁ గావలయు కన్నడముతోఁబాటు 'రామన' మొదలగు షష్ఠ్యేకవచన రూప ముల నొకప్పుడు గలిగియుండిన తెనుఁగున 'నాథని, రామని,' మొదలగు రూపములును వచ్చినవి.

### ii ఆచ్ఛికములు.

ఆచ్ఛికపదము లన్నియు ప్రథమేతరవిభక్త్యేకవచనమునఁ బొందు ప్రాతిపాదిక రూపముల ననుసరించి రెండువర్గములుగా నేర్పడుచున్నవి. అందు మొదటివర్గములోనివాని ప్రథమైక వచనరూపమునకుఁ బ్రథమేతర విభక్తులం దెట్టి మార్పును గలుగదు. ఇట్టివానిని గూర్చి ఇచట విచారింపనక్కఱలేదు.

### ఔపవిభక్తికములు.

ఔప విభక్తికము లనఁగా నామవిభక్తి ప్రత్యయములు ప్రథమేతర విభక్తులందు పదములకుఁ జేరకపూర్వ మాపదముల ప్రాతిపదికమగు షష్ఠ్యేక వచనరూపము కలుగుటకుఁ జేర్పఁబడు 'ఇ, టి, ంటి, తి' అను వర్ణములు కలిగిన పదములు. అఱవమునందు విశేష్యములు విశేషణములుగ వాడఁ బడునప్పుడు పదముల తుది సరళవర్ణములు పరుషత్వమును ద్విత్వమునుబొందు చుండుట గలదు. విశేష్యములు విశేషణములుగ వాడఁబడునప్పుడు విశేష్య ముల తుదనుండు గ, డ, ద, బ లు వరుసగ క్క, ట్ట, త్త, ప్ప లగును. ఈ నం

ప్రదాయము తెనుఁగునను గొంతవఱకుఁ గలదు. ఇదిగాక తెనుఁగున మఱి కొన్ని వర్ణము లంతమందుగల శబ్దములకును షష్ఠ్యేకవచనమునఁ గ్రొత్తవర్ణములు చేరుటయో, పదముల తుదివర్ణములకుఁ గ్రొత్తవర్ణము లాదేశము లగుటయో కలుగును. ఇట్లు విశేష్యములను విశేషణములుగ నగఁగా షష్ఠ్యేక వచన రూపములుగ మార్చునట్టి వర్ణముల నుపవిభక్తు లని వైయాకరణులు సంజ్ఞనేర్పాటు చేసినారు. ఈ యుపవిభక్తులే యే పదములపైఁ జేరునో వాని కౌపవిభక్తికము లనిపేరు. తక్కినవి యనౌపవిభక్తికములు.

ఇ, టి, తి వర్ణము లౌపవిభక్తికము లని చిన్నయసూరి వచించెను. కొందఱు -ంటిని గూడ వీనికిఁ జేర్తురు "ఔపవిభక్తికవర్ణాస్తిటత్యాదయో భవంతీహ, కల్యాదేర్నామ్నాం స్యుష్షష్ఠీ హి విభక్తౌ సమాసే చ" అని యాంధ్రశబ్దచింతామణికారుఁడు '-ంటి' ని యౌపవిభక్తికములలోఁ జేర్చియున్నాఁడు. "టిటత్య" మలని యీ సూత్రమున నిఁకటచేత 'న' వర్ణమును గూడ నహోబలపతి యౌపవిభక్తికముగా నెంచియున్నాఁడు. 'న' వర్ణము షష్ఠీ సమాసమందు 'ము' వర్ణస్థానమున నిలుచునట్టిది. దానికి షష్ఠ్యర్థమున్నను నది యౌపవిభక్తిక మనిపించుకొనదు. ఔపవిభక్తికమనఁగా విభక్తిప్రత్యయములను జేర్చుటకుఁ బూర్వము పదములపైఁ జేరు వర్ణ మని యర్థము. 'ఇంటన్' అనునట్లు 'నాన (నాము)' మొదలగురూపములు సిద్ధింపవు. 'న' వర్ణ మౌపవిభక్తికము కాదేని 'ము' స్థానమున వచ్చు 'పు' వర్ణముగూడ నట్టిదే కావలసియుండును.

-ఇ, -టి, -ంటి, -తి, వర్ణము లౌపవిభక్తికము లని వ్యాకరణముల దున్నను, ఇందలి 'ఇ' వర్ణ మొక్కటి మాత్రమే వాస్తవముగ నౌపవిభక్తికమని చెప్పవలసియుండును; -ట్, -ంట్, -త్, అనువానికి విభక్త్యర్థముతో సంబంధములేదు. ఆ యా పదములపై నిర్వచనము చేయవలసిన వ్యాకరణశాస్త్రము ననుసరించి -ట్, -ంట్-త్, అను వ్యవధానములు కలుగుచుండును. ఉదా: ఇ= *ఏఱు+ఇ* = ఏట్రు+ఇ = *ఏట్టు+ ఇ= *ఏట్టి=ఏటి; పంటు + ఇ = పంట్ + ఇ= పంటి; వాయి + ఇ = వాయ్ + త్ (ఈ 'త' కారము తెనుఁగు పూర్వావస్థయందు శబ్దగతమై యుండినదే; చూ. తమి. వాయిల్ = ద్వారము) + ఇ = * వాయ్తి = * వాత్తి = వాతి; - ఈ రీతిని నానారూపములకు నిష్పత్తిని శబ్దశాస్త్రము ప్రకారము చెప్పుకొనవలెను. - ఇ వర్ణమును జేర్చుటచేఁ గొన్ని విశేష్యములు విశేషణము లగుచున్నవి. షష్ఠీరూపముగూడ నొకవిధ మగు విశేషణ మగుటచే నిచటను నా యువర్ణమే చేయుచున్నదని యూహింప వచ్చును.

ఈ సందర్భమున నహోబలుఁడు పడిన మఱియొక పొరపాటునుగూర్చి తెలుప వలసియున్నది. "కేషాం చి దుదంతానాం నేతి విభక్త్యా వునో లుక్ స్యాత్" అను చింతామణి సూత్రమునకు వ్యాఖ్యానము వ్రాయుచు నతఁడు "కేషాం చి దుకారాంతానాం నేతి సప్తమీవిభక్తి పరత ఉనో లుక్ స్యాత్. ఉకారాంతా న్నవర్ణక విధాన మిత్యత్ర ఇదమేవ సూత్రం జ్ఞాపకమ్. చోటున, చోట; ఊరున, ఊర; నడుమున, నడుమ; మీఁదున, మీఁద; పేరున, పేర నిత్యాది. బహుళపద మనువర్త్య క్వచిత్ పేరున, చోటున, ఇత్యాదిరూప స్యాపి సాధుత్వ మవగంతవ్యమ్. కేషాంచి దిత్యుక్తేః 'ఆ వైపున' ఇత్యాదౌ న. "ఉదంతా స్త్వాంతాః స్థానార్థవాచకా యుక్తబోధకాః, కాపరేతు భవే దత్వం ల్వంతో లాంతః ప్రకారయుక్" ఇత్యథర్వణః. ఇటురమ్ము, అటువున్ము, ఎటు వ్రోయెదు; ఇటను, అటను, ఎటను; అటులువల్కె, అట్లువల్కె; అటుకై, ఇత్యాది" అని వివరించియున్నాఁడు. ఈ వివరణము భ్రమజనితము. 'కేషాంచిదుదంతానామ్' అని సూత్రమునఁ దెలుపఁబడిన పదము లౌప విభక్తికములని యాతఁడు పొరపడినాఁడు. అథర్వణునివివరణము సరిగానున్నది; కొన్నియుదంత శబ్దము లనఁగా స్థానార్థముఁ గలిగిన 'అటు, ఇటు, ఎటు,అను నవని యాతని యభిప్రాయము. అవి ఔపవిభక్తికములుకావు; అయినను నవి సప్తమీ విభక్తియందు అటున, ఇటున,ఎటున, అనురూపములను బొందక 'అటన్, ఇటన్, ఎటన్' అనురూపములఁ దాల్చుననియు, ప్రకారార్థమున అటు,ఇటు, ఎటు,లపై 'లు' వర్ణముచేరి,'అటులు,ఇటులు,ఎటులు' అనురూపము లను బొందుననియు నాతని యభిప్రాయము. ఇది సమంజసమేకాని ఈ వివర ణమునందును చిన్నభేదమును గుర్తింపవలసి యున్నది. 'అటు, ఇటు, ఎటు'లు దిగర్థకములు; 'అటువ్రోయె' ననఁగా నా దిక్కున కని యర్థము. 'అటన్, ఇటన్, ఎటన్' అనునవి స్థానార్థకములు; 'అటనుండె' ననఁగా నాస్థానమున నని యర్థము. ఇట్టి యర్థభేదమున్నను శబ్ద మొక్కటియేకావున నాతని సూత్ర వివరణమున లోపము లేదు. కాని, యహోబలుని వ్యాఖ్యానము కేవల మసందర్భముగ నున్నది ఇట్టి వ్యాఖ్యానముల ననుసరించియే యిప్పటి పండి తులు ఊరునను, చోటునను, ముందునను, అందునను, మొదలగు నస్వాభావిక రూపములను గ్రంథములం దుపయోగించుచున్నారు.

ఆంధ్రశబ్ద చింతామణియందు సమాసములను గుఱించి తెలుపు ప్రక రణమున "కార్యా ఔపవిభక్తిక వ దంతవిధయశ్చ" అను సూత్రమునకు సమాసాంతములం దౌపవిభక్తికములకు వలెఁ గార్యము లగును అను నర్థము ననుసరించి ముక్కంటి, తమ్మిచూలి, మొదలగువాని తుది - ంటి, 'ఇ' మొద లగునవి యౌపవిభక్తికములని కొందఱు భ్రమించుచుందురు. అవి యౌపవిభ

క్తికముల 'వంటివి' గాని యౌపవిభక్తికములుగావు; అందలి తుది యివర్ణము మత్వర్థీయ తద్ధితప్రత్యయము.

ఔపవిభక్తిక శబ్దముల వివరణము.

1. (i) -ఁటు వర్ణాంతములలో 'తూఁటు' శబ్ద మౌపవిభక్తికము: తూఁటి.

(ii) -ంటు అంతమందుగల శబ్దములలో 'కుంటు, గంటు' లౌపవిభక్తికములు: కుంటికి, గంటికి.

(iii) -టు వర్ణాంత శబ్దములలో 'చోటు' అనున దౌపవిభక్తికము: చోటికి, చోటన్; 'అచ్చ (చ) టు, ఇచ్చ (చ) టు, ఎచ్చ (చ) టు' లు కూడ నౌపవిభక్తికపదములే: అచ్చటన్, ఇచ్చటికి మొద. ఇచ్చటన్ (భార. ఆది. IV. 26.); అచట నచట (భార. శాం. II. 91); అచటన్ (భార. అను. IV. 438); అచటి (భార. ఉ. IV. 6); అచటికి (భార. విరా. II. 91; V. 817; శల్య. II. 29); ఇచ్చ టచ్చట (భార. విరా. I. 148); ఇచ్చటనొప్ప టన కెచ్చటనైన (భార. విరా. I. 254); ఇచటన్ (భార. విరా. II. 30; అర. V. 148); ఇచ్చటన్ (భార. ద్రో. I. 40; శాంతి. VI. 219); ఇచ్చటి (భార. శాంతి. I. 160); ఇచ్చటికి (భార. అన. VII. 23, శాంతి. III. 502); ఎచ్చ టన్ (భార. విరా. II. 40; శల్య. II. 54.)— పాటు = విధము- 'ఏపాట నైనన్ (భార. విరా. I. 79); అప్పాటన్ (భార. అను. V. 107; విరా. I. 74; పారిజా. II.; పాటు = అనుభవము, పడుట, అను నర్థములం దౌపవిభక్తికము కాదు. పాటున కింతులోర్తురె (పారిజా. II.)

(iv) 'పిమ్మటన్' (భార. అర. vii. 335) అనునది సప్తమ్యేకవచన రూపమున నున్న యవ్యయము. దీనికి ప్రథమైకవచనమున 'పిమ్మటు' అని కాని 'పిమ్మట్' అని కాని ప్రథమైకవచనరూప ముండవలెను. 'పిన్నాడు' అని అరవమున నున్నది.

2. (i) -డకారాంత శబ్దములలో అక్కడ, ఇక్కడ, ఎక్కడ, లు ప్రాచీనకాలమున నౌపవిభక్తికములు గాకున్నను దరువాతి కాలమున వైకల్పికముగ నౌపవిభక్తికము లగుచున్నవి. అక్కడకు, అక్కడికి మొద లయినవి. ఎక్కడిదానవు (భార. విరా. I. 90); ఎక్కడిమాట (భార. విరా. I. 281); భయము నాకు నెక్కడిది (భార. ఉ. IV. 216); మొద. 'తక్కెడ, కేగ(-వ)డ,' శబ్దములౌపవిభక్తికములు: కేగ (-వ) టినేల, తక్కెటన్. పామరజన వ్యవహారమున ననంతపురముజిల్లాలో 'అడ, ఉడ, ఏడ' లౌపవిభక్తికములుగ వాడఁబడుచున్నవి; అటికి, ఉటికి, ఏటికి.—'అటకడన్ (భార.

V. I. 106, భార. ఉ. III. 310. అనునది 'అఱికటన్' అయియుండవలెనేమో. దీనికి 'అఱికల్, అఱికల' అనునవి ప్రథమైక వచనరూపములై యుండును.

(ii) -'ండి' అంతమందుగల పదములలో కొండి, గొండి, అనున ఔప విభక్తికములు: కొంటన్, గొంటన్; '-ండి' అంతమందుగల పదములు తొలుత '-ండు' అంతములైనవైయుండును. -'ఎల్లుండి' విశేష్యమైనపిదప నౌప విభక్తికపదమై 'ఎల్లుంటికి, ఎల్లుంటన్' అను రూపములు గలిగినవి.

(iii) -'డి' అంతమందుగల శబ్దములలో 'అంగడి, కావడి, గొంగడి, లేడి, అనున ఔపవిభక్తికములు: అంగటి, కావటి, గొంగటి, లేటి, కోడమ లేటిన్ (భా. ద్రో. iv. 121,) 'సింగంబు లేడికోల్లు వృట్టు' (భార. కర్ణ. I. 307;) అనుపాఠముతప్పు; 'లేటికి' అయియుండవలెను. 'లేడి' యిప్పుడనౌప విభక్తికముగనుపయోగింపఁబడుచున్నది. 'నీరాటిరేవున' (కళా. II. 141) ఇందు 'నీరాడు'అను క్రియాజన్యవిశేషణ మౌపవిభక్తిక విశేష్యముగా నుప యోగింపఁబడినది.

(iv) -'ండు' అంతమందుగల శబ్దములలో 'ఏండు, గూండు, తూండు, నాండు, నేండు' లౌపవిభక్తికములు: ఏంటి, (ఏంటన్, భా. అను. III 304); (శాసనములు) ఏంట, ఏణ్ట మొద. తూంటికూర, నాంటిమాట, నేంటివిద్య, నేంటి యెల్లింటిలోపల (భాగ. X. i. 1593); నేంటి యెల్లింటిలోనన్ (భార. V. 301); నేంటికిఁబోయి (భార. భీ. II. 252) గూంటన్, (భా. శాంతి. V. 224) గూంటిలోన్ (భాగ. VII. 63); గూంటన్ (భార. శాం. V. 224); 'ఎండు' నన్ణకమౌప విభక్తికము: పుష్పెంటిపట్టు (S. I. I. VI. 98); అడ్యంటి లెక్క (S. I. I. V. 1180), అడ్డంటి లెక్కను (S. I. I. V. 1157); నగ మింటిలోను (S. I. I. V.); ఇంటిబంటి (హ. హరి. V. 26); కుత్తుకబంటి, కాలిబంటి, మొలబంటి, మొదలగు వానిలోని 'బంటి' * 'పాంటి'కి రూపాంతరమై యుండును; 'పాంటి' * 'పాండు' నకౌపవిభక్తికరూప మగును. లేదా, అది 'పట్టు' అనున దాని విభక్తికముకాఁగా 'పట్టి' అను రూపమేర్పడి యందుండి *'పంటి' 'బంటి' అను రూపమేర్పడి యుండును.

(v) -'ండు' అంతమందుగల శబ్దములలో 'పండు, పుండు, రొండు, చుండు (శిరోరోగము) తుండు, (?) అనున ఔపవిభక్తికములు: 'నిమ్మ' పంటికి, పనసపంటి చందంబున (భార. స్త్రీ. I. 47) పుంటి, రొంటి -(నొప్పి), చుంటితల, గుడ్డతుంటన్ (?).

(vi)-'డు' అంతమందుగల శబ్దములలో 'అంకుడు' (అంకుటివిత్తులు), ఓడు, ఓటి, కాడు-కాటి; (భా. అను. III. 210; హరి. పూ. VIII. 101) కుంకుడు - కుంకుటికాయ; కూడు - కూటికి; కొఱడు - కొఱటి;(మంచము)

అర (-న)ంటి, 'అరందు'కు ఔపవిభక్తికరూపము కావచ్చును. (భార. స్త్రీ. I. 32); అనంటికాయ (S. I. I. VI. 932).

3. (అ) 'త్త' అంతమందుగల 'మెత్త' పదముపై 'టి' వర్ణముకూడ చేరుచు మెత్తటి (మన్ను) అను రూపము నొందుచున్నదిగాని యీ 'టి' వర్ణమౌపవిభక్తికము కాదు: దీనిపై విభక్తి ప్రత్యయములు చేరవు. (ఆ) అంత, ఇంత, ఎంత, ల నౌపవిభక్తికములుగ నన్నయ వాడలేదు, కాని తరువాతి కాలమున నవి యౌపవిభక్తికములుగఁ బ్రయోగింపఁబడినవి. వీనికిఁ బూర్వరూపములు 'అంతలు, ఇంతలు, ఎంతలు' కావుననే లకారము టకారము కాఁగా నందుపై 'ఇ' చేరి 'టి' వర్ణమేర్పడినది: ఈయంతటన్ (హరి. పూ. VIII. 133); అంతంతటన్ (భార. అర. VII. 16); ఒకయింతటి లోన (భార. విరా. I. 21); ఇంతటి పనులకుఁ జాలితిమి (భార.భీ. III. 437); ఎంతటిపని (భార. అర. VI. 943; ఉ. IV. 386) ఎంతటిపెద్ద (భార. విరా. I. 31); -అంత, ఇంత, ఎంత, యనియుఁ బ్రయోగములు గలవు. అంత వారెందు నెవ్వరులేరు (భార. ఉ. IV. 258); ఇంత వెఱ్ఱివాడనుగలను (భార. ఉ. IV. 377.)

4. (అ) 'అడటన్' (భార. శాంతి. I. 141.); ఇది 'అడ'కు సప్తమీ రూపమైయుండును. 'తుద' ఔపవిభక్తికము: తుది.

(ఆ) ఒద్ద, వద్ద లపైఁగొంద ఱివర్ణమును జేర్తురు. ఒద్దకు, ఒద్దికి; వద్దకు, వద్దికి - ఇవర్ణముతోడి రూపము లసాధువు లనితోఁచుచున్నది. 'తమతమ యొద్దిబలంబులు' (భా. విరా. V. 65) అను పాఠము తప్పుకావచ్చును. ఇట్లే 'అతనియొద్ది జోదులు(భా. శాంతి. I. 141.) పుణ్యాశ్రమంబున యొద్దియేట విడిసి (భా. ఉద్యో. III. 146.)

5. (i) 'దు' వర్ణాంతములలోఁ చేఁదు - చేఁతి (పోట్ల); మీఁదు - మీఁదికి, మీఁదటికి, ఔపవిభక్తిక శబ్దములు. పిఱుఁదు (-ందు) పదమునకు పిఱిఁద(కి), పిఱుందన్ అను విభక్తిరూపము లున్నవి. 'పిఱిందివలన' (భార. ద్రో. III. 47.)

(ii) -'ందు' అంతమందు గలవానిలోఁ 'క్రిందు, ముందు' లౌపవిభక్తికములు: క్రింది, క్రిందటి; ముందటి (కి):-అందు, ఇందు, ఎందు, లపై 'ల' వర్ణముచేరి షష్ఠీరూప మేర్పడును.:-ఉలతోడి రూపములు నేఁడులేవు. ఇందుల మానులు (S. I. I. IV. 994); ఇందుల స్థానపతులు (S. I. I. IV. 722) ఇందులపహిండిఘంట (S. I. I. IV. 1019) ; అందలి, యిందలి విలుకాండ్రు (భా. ఉద్యో. IV. 229). పాఠము తప్పు. అలి (=కన్న. అలి,

(ఇదియూపవిభక్తికమే; కాని; (శకుం. పరి. III. పు. 60 భార.అను. IV. 326; మేలునకు), ఱోలు-ఱోలన్ (భార. విరా. V. 35; హరి. పు.V. 243); పగలు (నన్నయ: పట్టపగల, సభా. II. 299; తిక్కన: పట్టపగలింటి సూర్యుని పగిది; (ఉ. హరి. I.152) పగటి భానుఁడు; (భార. సౌ. I. 146) పగలింటియాహవము; 'పగటి' అర్వాచీన రూపము: (దశా. పు. 127) పగలిట; పట్టపగలింటి సూర్యుని పగిది (భార. కర్ణ. III. 18); మొదలు-పూర్వపు ఔప. మొదలి, మొదలింటి; ఆర్వా. రూపము మొదలిటి (ఉ. రా. I. పు. 11.) మొదలింట నుండియున్ (భార. విరా. II. 169); చెలియలికట్ట (భార. ద్రోణ. I. 202). వెలికి (భాగ. III. 702); జుట్టసత్త్రేలనుం జూపవచ్చునే (భార. ద్రోణ. II. 304); చెలియలికి (భార. ద్రోణ. II. 140); చెలియలికట్ట (భార. భీష్మ. II. 217; III. 247 ద్రోణ. I. 202); సవతాలిప్రజలు వుందనేర్తురే(భార. భీష్మ. I. 168,) చదలికి (భార.అర. VII. 21; మోడ్పుఁగేలితోన్ (భార.అను. IV. 443)-ఈపాఠమునరిదైనచో 'కేలు' ఏకవచనమగును.

ఇట్లే, (దశావ. పు. 127) రాత్రిట; (పు. 143) పక్కట; (కాశీ I. 5) పాలియు, ఋషులపాలిటివే యింతిపేసిపనులు; మొలనూలిమణులు (భార. శాంతి. II. 133; ద్రోణ. VI. 231); పొత్తినూలి పువ్వు (భార. అను. V. 230).

అంత, ఇంత, ఎంత, లు నన్నయభాషలో నౌపవిభక్తికములు కావు. వీనిపై నర్వాచీనకాలమున'ట' వర్ణ మాగమముగా వచ్చెను. (ప్రభా. IV. 116) అంతటను; (V. 192,) అంతట (కళా III. 160) అంతటివాఁడు; (హరి. పూ.VIII. పు. 183.) అని యంతటియందున్; (VIII. పు. 181)ఇంతటి తోడ;(ఉ. హరి. I. 123) అంతటలో; (నిర్వ. II. 99) అంతటికి; (సర్ప. మా. I. 39. ఇంతటికన్న; (వరాహ.X. 92) ఎంతటి పని, (ప్రభా. II.55) ఎంతటి,- అంతన్,మొదలగురూపములనుగూడ నర్వాచీనకవులు వాడిరి. (ఉ. హరి. I. 10) అంతనుండి; (ప్రభా. IV. 117) అంతన్ = అంతటన్; (కళా. I. 142) అంత కంతకు=క్రమముగా; (విక్రమా. IV. 17) నీరజాననుం డెంతకు నేరఁడు; (విజ. I.) అంతనుం డిన్నాల సన్నగిల్లె.

అర్వాచీనకాలమున-టివర్ణ ముపవిభక్తిగాఁ జేరిన కొన్ని శబ్దములు, (ఉ. హరి. IV. 28) తెల్లంటి చీర (చూ. నల్లటి, ఎఱ్ఱంటి, పచ్చటి; పచ్చటి (ని) ఆకుఁ 'పచ్చాకు' వేఱు.) తెల్లటిగాన్=తెలియునట్లు (భాస్క. యు. 383) తొల్లి-పూర్వకాలపు ఔప. రూపము 'తొంటి' (భార. విరా.I. 96); తొల్లిటి (భాగ. I. 241; ప్రభా. III. 120); తొల్లింటివెద్దలు' మొద. అర్వాచీన

చక్కటి=ప్రక్క, దగ్గరతావున, ఇది ప్రథమైకవచన రూపము కాదు; ఈ చక్కటి నిలుతమె (భార. విరా. I. 156); ఇచట సప్తమీవిభక్తిరూపముగనె కాన్పించుచున్నది. అయిన దాని ప్రథమైకవచనరూప మికారాంతమైయుండవలెను. 'చక్కటి' అను షష్ఠీరూపము కూడఁగలదు. ఇది తొలుత 'ల' కారంత పదమై 'చక్కల్' అనియుండవలెను. పూ. వెనుక (ల్)+ఇ=వెనుకటి.

దర్భగంటిని (భార. శల్య. II. 160)- 'దర్భగంటను' అనియుండవలె నేమో. అయిన దీని ప్రథమైకవచన రూపము 'కంటు' అగును; ఇది 'కన్ను' అనుపదమునకు రూపాంతర మగును.

వాపటను (భార. విరా. I. 228)-'వాపటి' అనునది ప్రథమైకవచనరూపమగునా? దీని ప్రథమైకవచన రూపము తొలుత 'వాపల్' అయియుండును; దీనికి 'వాపటను' అనునది సప్తమ్యేకవచనరూపము. కాని, 'వాపటి' అనుషష్ఠీరూపము నకుఁ ప్రయోగము కానరాదు.

పట్టు—'బంటి' (యు. పట్టికబంటి, మొద.) అనునది 'పట్టు' అను దాని సప్తమీవిభక్తిరూపమై యుండవలెను. పట్టు+ఇ=పట్టి= * బంటి=(సరళాదేశము) బంటి. ఇంతబంటి (కు. పారి. V. 26) మొద.

పోలె రూ. పోల్+ఇ=పోలి; పోణ్+ఇ= * పోణ్ణి-* బోణ్ణి=(సరళాదేశము) బోణ్టి=బోంటి; 'వంటి' 'బోణ్టికి' రూపాంతరమా? లేక 'వలె'కు మూలమయిన * వల్=వళ్=వణ్+ఇ=* వణ్ణి=వంటి అని రూపనిష్పత్తిఁగల్పింపవలె నేమో: పిట్టవంటి (పాండు. III. 2;) అటువంటి (పాండు. IV. 145; V. 238) ఎటువంటి (పాండు. IV. 160); మావంటి (పాండు. V. 43); కల్పకంబువంటి (పాండు V. 197); తాయువంటి, జాతివంటి, (పాండు. V. 212); 'వంటి' అర్వాచీన గ్రంథములలోనున్నది; 'బోంటి,' 'పట్టి' (భార. ఆది. V. 115) అనునవి ప్రాచీన గ్రంథముల నున్నవి.

చట్టన —ఇది యవ్యయము; 'చట్టు' కు సప్తమ్యేకవచన రూపమై యుండును. 'చట్టన'=చటక్కున, అని ప్రాచీన గ్రంథములం దున్నది. నేఁడు 'చట్టున' అని వ్యవహారము. 'చట్టని' అని ద్వితీయావిభక్తికముగ (భార. ఆర. IV. 317) లో ప్రయోగమున్నది. మానార్థక ప్రత్యయము'-ఎడు'లోని'డ' కారమునకుఁ బరుషత్వమును ఇకారమునుగాని; ఈ పన్నముపై ఇటి, ఇంటి, అనునవి కాని చేరుచుండును: అడ్డెటికి, అడ్డెంటికి, అడ్డెడటికి, అడ్డెడంటికి; ఇట్లే తవ్వ, సోల, మాన, మణుగు, వీస, రూపాయి, అణా, పావలా, దమ్మిడీ మొదలయిన యనేకశబ్దములపై నేఁడు ద్వితీయావిభక్తి కార్యములు గాన్పించు చున్నవి; పూర్వ కాలపు శాసనములందును నిట్టి వాని కుదాహరణములు గలవు.

పాఠములను బరిష్కర్తలు దిద్దినప్పుడు కష్టమధికమగును. ఒక్క యుదాహరణమునుమాత్ర మిచ్చి యాపవిభక్తిక పదములఁ గూర్చిన చర్చను ముగింపవలసియున్నది. 'ప్రోలు' అను పద మాపవిభక్తికమా, కాదా?

నన్నయభారతము, అరణ్యపర్వము, IV. 80 లోని :—

క. కనకమయమైన యీ ప్రో, లునఁ దమనుతు లాహవంబులో నమరులచేత నవధ్యులుగాఁ దగ న, వ్వనజజుచేఁ బడసి రసురవనితలు గరుణన్''

అను పద్య ముదాహరించి 'ప్రోలు' అనాపవిభక్తిక మని తిమ్మకవి తన సర్వలక్షణసారసంగ్రహములో చెప్పియున్నాఁడు. ఈ మాటనుబట్టి గుప్తార్థప్రకాశికారుఁడును 'ప్రోలు' అనాపవిభక్తికముగఁ గూడఁ బ్రయోగింపఁబడె నని వ్రాసెను. పై పద్యమున 'ప్రోలున' అనుటకు 'ప్రోలును' అను పాఠము వ్రాఁతప్రతులయం దున్నది. ప్రకరణమునుబట్టి 'ప్రోలును' అను పాఠమే సరియైనది. 'అసురవనితలు (1) ఈ ప్రోలిని (2) తమ నుతు లాహవంబులో నమరులచేత నవధ్యులుగాను' రెండువరములను బడసిరని యీ పద్యము నభిప్రాయము. సంస్కృత మూలమునందును నిట్లే యున్నది. కావున 'ప్రోలును' అను పాఠము ఒప్పు; ఇందు 'ను' వర్ణము సముచ్చయార్థకము. నన్నయకాలమునుండి నేఁటివఱకును 'ప్రోలు' ఔపవిభక్తికముగానేయున్నది. నేఁడు 'ప్రోలు' స్థలవాచక సంజ్ఞాపదములలో మాత్రము కొన్ని వికారములనుగూడఁ బొందియున్నది. నిడుఁబ్రోలు, అమ్మనఁబ్రోలు, రాయప్రోలు; 'ప్రోలు' 'పోలు, వ్రోలు, మోలు' లుగఁ గూడ మాఱినది: అంపోలు (విశాఖపట్టణంజిల్లా శ్రీకాకుళము నొద్ద); నిడుమోలు (కనకసుందరం), 'నిడుమోలి' వారు; రాయప్రోలు సుబ్బారావు (ప్రోలి అనవలెను.); నిడుదవ్రోలు (నిడుదవ్రోలి); 'పోలు' 'ఓలు' గఁ గూడ మాఱినది. 'ఒంగోలు' వెంకటరంగయ్య; 'ఒంగోలి' అని యనవలెను; అట్లే తెనుఁగు వారందురు. ఈ 'ప్రోలు, దోలు, మోలు, వ్రోలు, ఓలు, డ్-ఓలు' లు నల్లమలలకుఁ బడుమటనున్నట్లు కానరావు; తూర్పు తీరముననే యివి తెఱచు: అనంతపురము జిల్లాలో లేవు. 'ప్రోలు' పదము హళగన్నడమున 'పొఱల్' గాను (వాసస్థానము, పెద్దనగరము, పట్టణము); అరవమున : పొఱలి=భూమి, విస్తీర్ణము, గొప్పతనము అను రూపములతో నున్నది. శాసనములలో నిది యాపవిభక్తికముగానే యున్నది. 'ప్రోలి' (**S. I. I. IV. 945**); 'చేంబ్రోలనుండి' (బెజవాడ యుద్ధమల్లుని శాసనము) మొదలయినవి. నన్నయభారతమున 'ప్రోలికిన్' (ఆది. I. 116; ఆది. VI. **264, 294**) అని ప్రయోగింపబడినది. కావున, తిమ్మకవి తప్పుపాఠమును జూచి భ్రమపడినాఁడని యనవలెను. ఇదిగాక యర్వాచీన కవుల ప్రయోగములు పదముల యాపవిభక్తికత్వానాపవిభక్తికత్వములను సరిగ నిర్ణయింపఁ

గలవు. పదునాఱవు శతాబ్దము దాటినపిదపఁ గొంతవఱకుఁ గ్రుతకభాష యేర్పడినది. ప్రాస, యతి, గణాదులకొఱకుఁ గవులు స్వాతంత్ర్యమును వహించి యిచ్చవచ్చినట్లు ప్రయోగించినారు. "వీడు చదివించె నయ్యేడ, వీడని ముక బలారి బుధులతోనే, వీడు మణులనఁగఁ దగులన, వీడునగల మానిములు వివిధాంబరముల్"-వసుచరిత్రము. ఇందు 'డు' ప్రాసము నిమిత్తము 'డు' అనో పవిభక్తికనుగఁ బ్రయోగింపబడినది. "విన్నున నేఁగు తామరల యందు కిలాతపు నీడ లెవ్వఁడుక" - యయాతి చరిత్రము; ఇందు 'విన్నున' ను ప్రయోగమును ప్రాసముకొఱకే.

## ద్వితీయా విభక్తి.

పదము కర్మమును దెలిపినపుడు దానికి ద్వితీయావిభక్తి కలుగును. ధాతువునకు, కర్తను వ్యా[illegible] నను రెండర్థములు గలవు. వ్యాపార యిన కాశ్రయము [illegible] (కర్త, [illegible]) [illegible]. [illegible] పదము ప్రథమావిభక్తియం దుండును. ప్రథమావిభక్తికి ప్రకృతియని [illegible] లను. ఇంగ్లీషునఁ బ్రథమావిభక్తికి 'సూటి' విభక్తియని (Straight case) పేరు. ప్రథమా విభక్త్యర్థము ప్రక్[illegible] వాలుటచే, [illegible] నర్థము [illegible] ర్థములను బొందుటచే ప్రథమేతర విభక్తులకు నవియు, వానికి 'వాలు' విభక్తు (Oblique Cases) లని పేరిడియు[illegible]. ద్వితీయా విభక్తి వికృతి విభక్తియను పేరును గలదు. [illegible] మాత్రముగాఁ గలద కర్మము. కర్మవాచక పదము ద్వితీయా విభక్తి నుం[illegible], ద్వితీయా విభక్తి ప్రత్యయములను [illegible]ను.

"కూర్చి, ల, ను, నవోధనే ద్వితీయకు" అని యాంధ్రశబ్ద చింతామణి 'కూర్చి, ల, ను, ని' అను వానిని ద్వితీయా విభక్తి ప్రత్యయముల[illegible] వివరించు చున్నది.

కూర్చి: ఇది ప్రత్యయముగ [illegible] మొట్టమొదటి[illegible] భారతమున నన్నయ 'కుఱిచి' అని వాడినాడు. ఇది 'కుఱి (-ఱు) చు' ధాతువునకుఁ గ్త్వార్థక రూపము. 'కుఱి (-ఱు) చు' ధాతువును [illegible] యేర్పడిన యితర వ్యాకరణ రూపములును దెనుఁగున మొదటి నుండియు నున్నట్లగపడదు. 'కుఱి (-ఱు)చు' నామధాతువై యుండును. '[illegible]', 'కుఱిచ్చు' అనునవి తమిళ రూపములు. తెనుఁగున 'కుఱి' పరశాదిద్విరై 'గుఱి' - (లక్ష్యము) యనురూపము నొందినది. దీనినుండి 'గుఱించు' అను నామధాతువును, నందుండి 'గుఱించి' అను క్త్వార్థక రూపమును నేర్పడినవి. 'గుఱించి' అనఁగా 'ఉద్దేశించి, లక్ష్యముంచి' అని యర్థము. 'కూర్చి, గుఱించి' యనునవి తెనుఁగున వర్యాయ ప్రత్యయ రూపములు. ఆ రెంటిలో 'గుఱించి' ప్రా[illegible]

రూపమును 'కూర్చి' తరువాతి కాలమున నేర్పడిన రూపమునుగఁ గాన్పించు చున్నవి. 'కుఱుచు' అనునది 'కూర్చు'గ మాఱినతరువాత నందుండి 'కూర్చి' యను క్త్వార్థక రూప మేర్పడినది. నన్నయ కాలమునఁ 'గూర్చు' ధాతువు లేకపోలేదు; కాని యందుండి యేర్పడిన 'కూర్చి' అను క్త్వార్థకరూప ముద్దే శార్థమున ద్వితీయార్థ బోధకముగ నేర్పడియుండలేదు. 'కూర్చి' యనున దాంధ్రశబ్దచింతామణి విధించిన రూపమైనచో నన్నయ చింతామణిని రచింపలేదని చెప్పనచ్చును. కాని సూత్రమందలి 'కూర్చి' యపపాఠమును, 'కుఱిచి, ల, ను, నయోభవేద్ద్వితీయాతు' అను పాఠము సాధువు ననుకొన్నచోఁ జింతామణిని నన్నయ కర్తృతా విషయమున బాధయుండదు. 'కుఱిచి' యను పాఠమువలన గణభంగము గలుగదు. కాని, చింతామణి వ్రాతప్రతులలో నొక్కదానియందును 'కుఱిచి' యను పాఠము కానరాదు.

బాలవ్యాకరణమున 'కూర్చి' యనునది ద్వితీయా విభక్తి ప్రత్యయ ముగాఁ దెలుపఁబడ లేదు. 'ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱిచియు నను ప్రయుక్తంబగు' నని ప్రౌఢ వ్యాకరణకారుఁడు తెలిపినాఁడు. 'కుఱిచి' యనుటయే యాతని యభిప్రాయమై యుండనోపును. 'కుఱిచియు' నని సముచ్చయార్థకముగఁ జెప్పుటచే 'గుఱించి, కూర్చి' యనునవియుఁ గలుగు నని యాతని యాశయము కావలయును గాని 'సముచ్చయ గ్రహణము కూర్చి జ్ఞాపనార్థ' మని మాత్ర మాతఁడే చెప్పి యూరకొన్నాఁడు.

కుఱిచి, గుఱించి, కూర్చి యనునవి ద్వితీయా ప్రత్యయమగు నువర్ణము మీఁదనే చేర్పఁబడుచుండును; ఇందువలన విభక్తి ప్రత్యయముపై మఱల విభక్తి ప్రత్యయము చేరుచున్నదని చెప్పవలసి యుండును. ఇట్లు చెప్పుట కంటె నవి ప్రత్యేకావ్యయము లని చెప్పుటయే యుక్తముగ నుండును.

ఉదాహరణములు:—

నన్నుఁగుఱిచి (హరి. పూ. I. 101); మముఁగుఱిచి (హరి. పూ. II. 91); నిన్నుఁగుఱిచి (హరి. పూ. I. 131); నన్నుగుఱిచి (హరి. ఉ. V. 26); కుఱిచి (భాస్క. యు. 1081); ఈ యార్యజనంబులు నిన్నుఁ గుఱించి వచ్చిన వారు (భార. ఆర. IV, 364); ఆతనిం గుఱించి (భార. శల్య. II. 73); కృప గుఱించి = లక్ష్యముతోఁ గృపఁజూపి (దాశ. శత. 40).

'కుఱిచి' యనునది వ్యవహితము గూడనగును: 'అజ్ఞానునుఁడు దన్ను నర్థితోఁ గుఱిచి యజించుట గోరి సృజించె సురల' (హరి. పూ. I.) కూర్చి, గుఱించి, అనువానిని గూడ వ్యవహితముగ ప్రయోగింప వచ్చును.

చిన్నయసూరి 'ను' వర్ణమునుమాత్రము ద్వితీయా విభక్తి ప్రత్య యముగఁ జెప్పినాఁడు 'డుమంతంబునకు ద్వితీయా ద్యేకవచనంబు పరంబగు

నీన్, కన్నునునేనిన్, కన్నునునేన్; అను నిట్టి రూపములు సిద్ధింపవు. ఉదంతములగు తమ్ముఁడు, అల్లుఁడు, మొదలగువానికి నిగాగమము వైకల్పికము. కావున, తమ్మునునున్, తమ్మునినిన్, అల్లునున్, 'అల్లునినిన్' మొదలగు రూపములేర్పడుచున్నవి. ప్రయోగములందు 'తమ్మున్, తమ్మునిన్' అల్లున్, అల్లునిన్' అను రూపములే కాన్పించుచున్నవి గాని పై రూపములు కానరాకున్నవి. ఉదృదంతములగు తత్సమ శబ్దముల కదంతములకు వలె నిగాగమము వైకల్పిక మనియే చిన్నయసూరియభిప్రాయము. ఇందువలన శంభును (న్), శంభునిని (న్); విధాతృను (న్), విధాతృనిని(న్) అను నిట్టి రూపము లేర్పడుచున్నవి. కాని, శంభునున్, విధాతృనున్, మొదలగు రూపములు ప్రయోగములందు మృగ్యములు; 'శంభున్, విధాతృన్' మొదలగు రూపములకు వ్యాకరణములందు గతి కానరాదు.

డుమంతములు కానట్టి తత్సమాచ్ఛిక పదములలో నికారాంతములపై నివర్ణకమును, తక్కిన వానిపై నువర్ణకమును ద్వితీయైకవచనమునఁ జేరును. ఉదా. హరిని, కోతిని, స్త్రీని, తేజీని:—కాని, దాతను, మాటను; నవలాను; వాక్కును, గట్టును; వన్నెను; మొద.

ఔపవిభక్తిక శబ్దముల ద్వితీయా ద్యేకవచనముల ప్రాతి పదికము లిదంతములుగ నుండును గావున ద్వితీయావైభక్తిక నువర్ణకము నివర్ణకముగ మాఱును. కావున, ఊరినిన్, నేతినిన్, ఏటినిన్, ఇంటినిన్, అను నిట్టిరూపము లేర్పడును. కాని, ప్రయోగములందు కానవచ్చు 'ఊరిన్, నేతిన్, ఏటిన్, ఇంటిన్' మొదలగు రూపములు వ్యాకరణముల ప్రకారము సాధ్యములు కావు.

ఇఁక నాంధ్రశబ్దచింతామణి చెప్పిన లవర్ణము మిగిలినది. ఇది ద్వితీయా విభక్తి ప్రత్యయమా యను విషయము విచారింపవలసియున్నది. ద్వితీయావిభక్తి ప్రత్యయపరిగణనసూత్రమున కేకాక 'శసోలః' అనుసూత్రమునకు 'ల' అను విభక్తిప్రత్యయ మెప్పుడువచ్చునో ప్రత్యేకముగఁ జింతామణియందు చెప్పఁబడినది. ఇదిగాక యీ లవర్ణము తృతీయాది విభక్తి బహువచనములం దాగమవర్ణముగ వచ్చునని చెప్పఁబడినది. ప్రథమేతరబహువచనములందు బహువచనసూచకముగవచ్చు ల వర్ణము ద్వితీయయందు ప్రత్యయముగను తృతీయాదులయం దాగమవర్ణముగను వచ్చునని చెప్పుటయందలి యభిప్రాయము తృతీయాదులయందు లవర్ణము వైభక్తిక మన్నచో దానిపై మఱల విభక్తిప్రత్యయములు చేరునని చెప్పుట శాస్త్రసంప్రదాయముకాదని చెప్పుటయే కాని, ద్వితీయాబహువచనమున ల వర్ణమును విభక్తిప్రత్యయముగఁ జెప్పుటవలన ద్వితీయైకబహువచనములందు క్రమముగా 'దాతనున్, దాత

న్; హరినిన్, హరులన్; శంభునిన్, శంభులన్' అను నిట్టి రూపములే సిద్ధిం
చుచున్నవిగాని, ప్రయోగరూఢములైన 'దాతన్, దాతలను(న్); హరిన్,
రులను (న్); శంభున్, శంభులను (న్), మొదలగురూపములు చింతామణి
కారము సాధ్యములుకావు. ఇట్టిరూపములను సాధించుటకు 'వాక్యాంతగత
నానాంచ,' 'కవిభల్లటైః క్రియాణాం నామ్నాంచోల్లోప ఇష్యతేహి' మొద
సూత్రములను బలవంతముగ నీవిషయమున ననుసంధించుట సమంజసము
దు. ఆ సూత్రములు వేఱువ్యాకరణరూపములను సాధించుటకేర్పడినవి.
క్రియనుపపత్తి నూహించియే కావలయుఁ జిన్నయసూరి తృతీయాది బహు
వచనములందు వచ్చు లవర్ణమునేకాక ద్వితీయాబహువచనమున వచ్చు దానిని
ండ నాగమ లవర్ణముగ నెంచియున్నాఁడు. కావున నాతని ప్రకారము ద్వితీ
యయందు వచ్చు ల వర్ణము బహువచనబోధకమగు నాగమ లవర్ణముగాని
భక్తిప్రత్యయమగు ల వర్ణముకాదు. కావున, నాతని యభిప్రాయమున
గాములను (న్)' వంటి రూపములు సాధ్యములగుచున్నవి.

## తృతీయావిభక్తి.

"తో, చేత, తోడ, చే చ తృతీయాయాః" అని యాంధ్రశబ్దచింతా
మణి. "చేత, తోడ తృతీయ" అని చిన్నయసూరి చెప్పి "చేత, తోడ, ల
ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు" నను మఱియొక సూత్రముచే
చే, తో లను సాధించియున్నాఁడు. 'చేత' యనునది 'చేయి' పదమునకును
తోడ' అనునది 'తోడు (=సహాయము)' పదమునకును తృతీయా-పంచమీ-
సప్తమ్యేకవచనమున వచ్చు రూపమని యందురు. 'చేయి' కి 'చే' పూర్వ
రూపమనియు దానికి సప్తమ్యేకవచనరూపము 'చేత' అనియు, నా రూపమే
తృతీయా పంచములందును వచ్చుననియుఁ గూడఁ జెప్పుదురు. 'తో' అనునది
సంస్కృత 'తస్' ప్రత్యయమునకుఁ బ్రాకృతరూపమై యున్నది. అర్థము
నందును రూపమునందును తెనుఁగునందలి 'తో' ప్రత్యయ మీ ప్రాకృత
ప్రత్యయమును బోలియున్నది.

'చే' ప్రత్యయమును హిందీమొదలగు భాషలలోని తృతీయా పంచమీ
విభక్తిక 'సే' ప్రత్యయముతోఁ బోల్పవచ్చును. తెనుఁగు 'చే' ప్రత్యయ
మునకును హిందీ 'సే' ప్రత్యయమునకును నర్థమునందును వాడుకయందును
భేదము లేదు. హిందీ 'సే' ప్రత్యయము ప్రాకృతమందలి పంచమీ ప్రత్య
యమగు 'సుంతో' నుండి కలిగినదని హార్నెల్ పండితుఁడును గోవింద
నారాయణ మిశ్రపండితుఁడును దలంచుచున్నారు. కెల్లాగ్ పండితుఁ డది
'సమ' అను సంస్కృతశబ్దమునకు వికార మనుచున్నాఁడుకాని 'సే' కు 'సమ'
కును సర్థము లేదు కావున నీ వ్యుత్పత్తి సమంజసముగ లేదు. హిందీ 'సే'

ప్రత్యయమునకు వ్యుత్పత్తినా కిట్లు తోఁచుచున్నది. ఉత్తరార్యభాషలయందు ద్రావిడభాషలయందువలె షష్ఠ్యేకవచనరూపము ప్రథమేతర విభక్తులందు ప్రాతిపదికమగుచున్నది. సంస్కృత షష్ఠ్యేకవచనప్రత్యయమగు 'స్య' అను దాని వికారమగు 'స్స' అనునది ప్రాకృతభాషలయం దకారాంత పదముల మీఁదనేకాక యన్ని శబ్దములమీఁదను చేరుచున్నది: హరిస్స, (* హరిస్య); విణ్హుస్స(=* విష్ణుస్య); హణుమంతస్య (=* హనుమంతస్య; రాజస్స(=*రాజస్య); జసస్స (* యశస్య); మొద. సంస్కృత తృతీయావిభక్తి ప్రత్యయమగు 'ఇన' అనునది ప్రాకృతమున 'ఇ, ఇం' మొదలగు వికారములను బొందినది. తృతీయా బహువచనప్రత్యయమగు 'భిస్' కూడఁ బ్రాకృతమున 'హిం, ఇం' లుగ మాఱినది. ఈ రీతిగ 'స+ఇం'=సేం, సేఁ, సే, లుగ మాఱియది నేఁటియార్య భాషలందు తృతీయైక బహువచన ప్రత్యయముగఁ గానవచ్చుచున్నది. హళె గన్నడమున 'ఇం' అనునదియే తృతీయాప్రత్యయము. తెనుఁగున 'చేన్' ప్రత్యయమును నీరీతిగనే కలిగియుండవచ్చును.

'చేత' లోని 'త' వర్ణము ప్రాకృత 'సుంతో, హింతో' అను వాని లోని 'తో' కు వికారమునై యుండును. 'త' అనునది మాగధీ ప్రాకృతవికారములగు బంగాలీ, అస్సామీ, మొదలగుభాషలలో సప్తమీ ప్రత్యయముగఁ గాన్పించుచున్నది. ఈ సప్తమీప్రత్యయమే తృతీయా పంచములందును నెలకొన్నది. ఈ 'త' ప్రత్యయము 'అంతః' అను నవ్యయమునకు వికారమని సునీతికుమారఛాటర్జి యభిప్రాయపడుచున్నాఁడు. 'చేత'లోని తవర్ణ మీ రీతిగనైనను గలిగియుండవచ్చును. 'తోడ' లోని 'డ' వర్ణమునకును 'త=ట=డ' అనురీతిని వ్యుత్పత్తిని గల్పింపవచ్చును.

పై ప్రత్యయములేకాక తెనుఁగున 'చేసి, మెయి, మై' అనునవియుఁ దృతీయార్థమున వచ్చును. వీనిలో 'చేసి' అనునది 'చేయు' ధాతువునకు క్త్వార్థక రూపము. "కొన్నియెడలఁ జేత విభక్త్యర్థకవర్ణకంబులకును వలన వర్ణకంబునకును దఱచుగఁజేసి యనుప్రయుక్తంబగు" నని ప్రౌఢవ్యాకరణము. ఇది సాధారణముగ మహతీతరామహద్వాచకపదములపై ద్రుతము చేరఁగా నాద్రుతముపైఁ జేరుచుండును: వచ్చుటంజేసి, రామింజేసి; భారత భారతీ శుభగభస్తిచయంబులఁజేసి, మొద. ఇట్టి రూపములందలి ద్రుతము ద్వితీయావిభక్తిక నుస్థానమునఁగాక, తృతీయార్థమునవచ్చు 'అన్' అను దానితో సంబంధించియుండును. ఈ 'అన్' అనునది సాధారణముగ ఔప విభక్తికశబ్దముల తృతీయా, పంచమీ, సప్తమీ విభక్తులయందు జడవాచక పదముల మీఁదనే చేరును. కొన్ని యిదంత జడవాచక తత్సమాచ్ఛిక శబ్ద

టుక (భా. అర. IV. 201; అయినంతమాత్రముచేత' ననియర్థము. ఇచట చేసి' అనునది 'అంతన్' అనునవ్యయమువై (చేరినది.); నాతప్పునుఁగాఁచేసి ఁసవవు. వు. 22; ఇచట 'కాన్' అను నన్నంత క్రియవ్యవధానము గా ప్పినది.)

ధాతుజవిశేషణములవైఁ 'దానన్' అను తచ్ఛబ్ద తృతీయారూపము పుటవలనను తృతీయార్థము గలుగుచుండును: పొనరించినదానన్ (నిర్వ. II. 5=పొనరించుటచేత): 'దానన్' అనుదానివై మల 'చేసి' చేరుచుండును: దానంజేసి, పొనరించినదానం జేసి; మొ.

## తోడ, తో.

1. 'కరణసహార్థ తుల్యార్థయోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు.' కరణము: కోలతోడఁగూలనేసె; సహార్థము: రాజు సేనలతోడ వచ్చె; తుల్యా ము: చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు.'' బాలవ్యాకరణము.

2. 'వచ్యర్థాముఖ్యకర్మంబునకుం దోడవర్ణకము ప్రాయికముగా నగు. బాలవ్యాకరణము.—'అను' మొదలగుకొన్ని ధాతువులు ద్వికర్మకములుగ నుండును. ఆ రెండుకర్మములయందు నొకటి ద్వితీయనుండే యుండును. అది ముఖ్యకర్మము; రెండవదానివై ద్వితీయాప్రత్యయము లేకాక తృతీయాషష్ఠీ భక్తిప్రత్యయములనుగూడఁ జయ్యాకరణులు చెప్పుచున్నారు. అట్టివాని నముఖ్య కర్మము లనిపేరు. ద్వికర్మకధాతువులలో 'వచ్' అను సంస్కృతధాతువునకును తదర్థకములను నితర ధాతువులకును (అను, చెప్పు, పలుకు, మొ.) సంబంధి చిన యముఖ్యకర్మములవై తోడవర్ణకమునుగూడఁ జేరును. ఉదా. మైత్రుండు చైత్రునితోడనిట్లనియె; 'మైత్రుండు చైత్రు నిట్లనియె' ననియు ననవచ్చును. కొంత ప్రొద్దు జరపు కుంతీసుతాగ్రజుండు యమునితోఁ బలికె నిట్లని వినయ సంపదలు వ్రులయ (హరిశ్చ. I.)

3. 'ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకం బగు. నియమపూర్వక విద్యాస్వీకారం బుపయోగం బనం బడు. రామకృష్ణులు సాందీపనితోడ వేదం బులం జదివిరి.'' బాలవ్యాకరణము.

4. ఒకానొకచోఁ దోడకుఁ బ్రత్యేక ప్రయోగంబును జూపట్టెడి: ఉదా. స్తంభగత రత్నపుత్త్రిక తనదు కోటియుని విలోకించి తోడ మాటాడి పనికి నలుగడల సూచి (రామాభ్యు. IV.) ప్రౌఢవ్యాకరణము. తోడాని (భా. విరా. III. 126, 152); తోన = వెంటనే (భా. శా. I. 288; అను. VII. 134); తోరాన్ (భా. అను III. 70); తోరాఁగన్ (భా. అను. V.

450); తో నరుగు దేరంగా(భార. విరా. I. 59); తోనరుగన్ (భార.ఉ.IV. 80). తో నడువన్, తో నేతేరన్ (భార. భీ. I. 112); తోనెక్కి (భార. శల్య. I; 307), మొద.

తోడ, తో, లకుం గొన్ని ప్రయోగములు.

బిమ్మటితోడన్ (భాస్క. సుం. 29); బిమ్మటితోడన్ (భాస్క. సుం. 85); పదిలముతోడన్ (భాస్క. యు. 1322); ఇంతటితోడన్ (హరి. పూ. VIII. 82); గదతోడం గద చుట్టిరాన్ (భార. శల్య. II. 259); కళ్యాలతోడ (భార. క. I. 140); పుఖుంఖోటతోడ (భార. విరా. III. 205); పేరితోడన్ (భార. విరా. I. 100; నన్నయ: పేరన్); ఇంతతోం గయ్యముడిగి శాంతుండవు గమ్ము (భార. క. I. 34; నన్నయ: ఇంతకు, ఇంతటన్; తోన్ = అవధితో); ఎక్కుడుగ వలయు నను తలంపుతోమనుట(భార. శాం. II. 262); = తలంపున; సంగడములతో (భార. భీ. I. 93); అంతతోన=అంతటన్ (భార. ద్రో. I. 111); పరిపాటితోన్=పరిపాటిన్ (భార. ఆర. VI. 4); క్రొత్తరంగలతోన్ (హరి. ఉ. VII. 86); ఈరసతోన్ (భాస్క. యు. 1971); ఎడమడుగగు మదితో (హరి. పూ. I. 85); గజ్జతడవు లెలమితోంగట్టి = ఎలమిన్ (హరి. పూ. V. 254); చిగురులతో (భార. విరా. II. 67); తన యిచ్చతోంబడియె= ఇచ్చన్ (భార. ఉ. III. 358); తత్తజ్జాతితోం బండ్లగున్ (సర్వేశ్వరశత. 87= అనుసరించి); పిగువ్వానతో (S. I. I. 672; కు వర్ణకము చేరునప్పటి వలె నగాగమము); క్రమంబుతోడ = క్రమముగా (నిర్వ. V. 44); మరువము మొలసంగిందోడనె పరిమళ ముదయించు (విక్ర. I. 191; వ్యవధానము), మొద.

తోడుతన్.

'తోడన్' అనుటకు 'తోడుతన్' అనియు పదునాల్గవ శతాబ్దము నుండియు కావ్యములందు రూపాంతరము గాన్పించుచున్నది. ఇది 'తోడ్తోన్= తోడు+తోన్' అనుదానికి రూపాంతరమై యుండును. 'తోడ్తోన్' = వెంటనే అనునది కేవలావ్యయముగ నుపయోగపడుచుండఁగా 'తోడుతన్' అనునది 'తోడన్' వలె విభక్తి ప్రత్యయముగా నుపయోగపడుచున్నది. కాని, 'తోడన్' కు కలుగు కార్యములు 'తోడుతన్' కు కలుగవు. తోడ్తోన్ (భార. విరా. II. 321; ద్రో. I. 255; కర్ణ. II. 295; ఉ. హరి. II. 14; మొద.) ఇట్లే, 'తోడుతోడన్' అను నవ్యయమునుగలదు. 'చుక్కలు తోడుతోడం దల చూపందొడంగె (భార. విరా. II. 319); తోడుతోడం బెరుగన్ = వెంట వెంటనే(భార. విరా. II. 349); మొద. 'తోడ్తోన్' అనునది నేటి వ్యవహారమున 'తోడ్తో' అని వినంబడుచున్నది.—'తోడుతన్' కుదాహరణములు:

మానావమానములకు నోర్చి యడఁకువతోఁడుతనునికి యరిది (భార. విరా. I.); పగతురచేతిలోఁ బడక ప్రాణముతోఁడుత నున్నవాఁడవే (భాగ. X. పూ.); వేడ్కతోఁడుతన్ (భాగ. V. i. 138; XI. 53); చిత్తంబుతోఁడుతన్ (భాగ. VI. 298); సూక్తులతోఁడుతన్ (భాగ. VIII. 271); సమ్మానముతోఁడుత మ్రొక్కుచు (భాస్క. బాల. 13); * దశాస్యుతోఁడుతన్నిలిచి పెనంగఁగాఁ బలుగ నీకు వశంబె (భాస్క. అర. II. 138); నోళ్లతోఁడుత (భాస్క. యు. 517); ఇట్లే, పాండు. II. 235; కృష్ణరా. II. 113; సారం. I. పు. 6; మొద.

వ్యవహారమున నేఁడు 'తో' మాత్రముపయోగింపఁ బడుచున్నది. 'తోఁడ' కు మారుగ 'తోటి' అని వినఁబడుచున్నది. ఉదా. వానితోటి మాట్లాడకు, మొద.

## మెయి, మయి, మై, మే.

"జడపదంబులమీఁది 'తోడ' కు 'మెయి, మై'లు వికల్పంబుగనగు. ఉదా. అందఱుఁగూడి మోసలకు సద్దిమెయిం జనుదెంచి (నిర్వ. II.); ముక్తికున్ముఖతవహింపఁగావలయు మోహముఁ బాయఁగఁద్రోచి భక్తిమైన్ (లక్ష్మ. IV.); అవారణమెయిన్ (భార. ద్రో. IV. 99); ఏపాటిమెయిన్ (భార. ఉ. I. 289; శాం. I. 7); సముచితమెయిన్ (హరి. పూ. IX. 6); కూర్మి మైనిత్తుఁ గండలు కోసిమైన (భార. ఆ. III. 283); నిర్భీతిమైన్ (భార. విరా. V. 395); ఓలిమైన్ (భార. V. ii. 124); ప్రీతిమైన్ (భాస్క. యు. 2156); ఎఱుకమెయిన్ (హరి. పూ. V. 242); ఉద్రేకాతిమైన్ (భాస్క. యు. 2107); ఓర్మిమైన్ (నాచి. II.); మొద. మై, మెయి, అను పదములకు విధమని యర్థము. ఆ యర్థమున నవి ప్రత్యేకముగను బ్రయోగింపఁ బడినవి. ఉదా. ఉచితంపుమెయిన్ (భార. కర్ణ. II. 226); ఇమ్మెయిని మెయికొనవు (హరి. పూ. I. 131); తగుమైన్ (భార. శాం. I. 98); ఇమ్మైన్ (భార. [illegible] VI. 21); ఈమైన్ (భాస్క. కిష్కి. 122); కయ్యంబుమైఁ జెప్పుచున్ (భార. [illegible] I. 109); నీతలంపుమే గెలువన్ (భార. ద్రో. V. 124);—ఒకప్పుడు మై, మెయి, లు చేరి యవ్యయము లేర్పడును: ఉదా. మెయిమైఁ బోవచ్చున్ (భాస్క. యు. 1795); ఒంటిమైఁ జిక్కఁగనయ్యె (భాస్క. కిష్కి. 855); వేగమైన్ (భార. అర. VI. 72);—ఒకప్పుడు 'మెయి, మై'లు 'తోడ' అను నర్థమునఁగాక యితరార్థములందును నుపయోగింపఁబడును: ఉదా. ఏపనిమెయి వర్తిల్లుదు = పనియందు (భార. విరా. I. 108); రాత్రిమైన్ = రాత్రియందు (భాస్క. కిష్కి. 117); బాసమైన్ = బాసప్రకారము (భార. విరా. III. 109);- మెయి, మై, లపై 'కొను' ధాతు వనుప్రయుక్తమై 'పూను' అను నర్థము నిచ్చును. ఉదా. ప్రియమైనకార్యంబు మెయికొనంగఁ గమటకంటెను

(భార. భీ. III. 301); ఇమ్మెయికి మెయికొనవు (హరి. పూ. I. 131); ప్రతిన పూరగింపమేకొని (భార. ద్రో. II. 359); మేకొని (భార.ఉ. IV. 242; ద్రో. II. 359; III. 21), మొద. కాని, మేకొనఁజాలదు = ఓర్వఁజాలదు (భార.విరా. I. 103); 'మై' కి 'తెంచు' అనుబంధముగాఁజేరి 'సమ్మతించు' అను నర్థము నిచ్చును. ఉదా. మైతెంచి (కుమా. భా. II. 327); మొద. 'కార్యంబుమైవాఁడు' కార్యమునందు వ్యాపృతుఁడైనవాఁడు (భాస్క. యు. 486). జడపదంబులమీఁది 'తోడ' కు మెయి, మై, లగునని ప్రౌఢవ్యాకరణకారుఁడు చెప్పినను నవి తోడ నను నర్థమున గుణవాచకపదములమీఁదనే చేరును గాని వస్తువాచకపదములపైఁ జేరవు. ఖడ్గము మెయింజంపె, లేఖినిమెయిన్ వ్రాసె, మొదలగు ప్రయోగములు గానరావు. 'తోడ' నను నర్థమున నన్నయ మెయి, మై, లను వాడలేదు. ఇవి యెన్నడైన వ్యవహారమున నున్నవేమో తెలియదు. నేఁటి వ్యవహారమున లేవు. కావ్యములం దవి 'న్, అన్' అను తృతీయావిభక్తిప్రత్యయములకు మాఱుగఁ జేరుచుండును: కూర్మిమైన్=కూర్మిన్ ఓర్మిమైన్ = ఓర్మిన్; అనారణమెయిన్ = అవారణన్; పరిపాటిమెయిన్ = పరిపాటిన్; సముత్సుకతమెయిన్ = సముత్సుకతన్; మొద.

సప్తమియందువలెఁ దృతీయయందును 'అన్, న్' లు ప్రత్యయములుగఁ జేరును. ఉదాహరణములు మున్ముందు చూపఁబడును. పై ప్రత్యయములు గాక, తృతీయార్థమున బడిన్, వెంటన్, మొదలగు నవ్యయములును జేరుచుండును :

ఉదా:—చనియెం గేకయను తానుచారికలబడిన్ = తో (భార. విరా. I. 306); మొద. ఇట్లే, కూడన్ = తో (కళా. II. 17); ఈరసమెత్తి= ఈరసముతో (భార. ఉ. IV. 306); మేదినీతనయుఁడు లక్ష్మణుండుసయితంబుగ (భాస్క. అయో. 61); నిన్నుఁగనుఁగొనఁబడసి నాదు చూడ్కి చరితార్థమయ్యె (భార. ఉ. I. 273); మొద.

శిరసావహించి (భాగ. IV. 688); ఇట్లే, మనసా, క్రమేణ, మొదలగు సంస్కృత తృతీయాంతరూపములును దెనుఁగు కావ్యములందును వ్యవహారమునందును ప్రయుక్తము లగుచున్నవి.

## చతుర్థీవిభక్తి.

'సంప్రదానంబునకుం జతుర్థియగు. త్యాగోద్దేశంబు సంప్రదానంబు నాఁబడు. జనకుండు రామునికొఱకు(కై) గన్యనిచ్చెను. కొన్నియెడల నుద్దేశ్యమాత్రంబునకగు: పురుషార్థంబుకొఱకు యత్నింపవలయు. బాలవ్యాకరణము. 'కై, కొఱకున్' అనునవి తెనుఁగునఁ జతుర్థ్యర్థమునఁ బ్రాథమేతరవిభక్తి ప్రాతిపదికముపైఁ జేరును. ఇవి సంప్రదానార్థమందే కాక యుద్దేశార్థము

నను వచ్చును. ఉద్దేశార్థమున వీనికిని 'కుఱిచి, కూర్చి, గుఱించి' అనువానికిని భేదములేదు. 'కై' అనునది 'కు+అయి' అనువాని చేరికవలనఁ గలిగినదని యందురు. ఈ పక్షమున 'అయి' అనుదానికి "సహాయపడి, పక్షమును బూని" యనునర్థము వచ్చును. ఈయర్థమున "అయి"అనునది ప్రత్యేకపదమగును; 'కు' అనునదియే ప్రత్యయమగును. బాగుగనాలోచించినచో 'కు, కి' అనునవి వాస్తవముగఁ జతుర్థీవిభక్తి ప్రత్యయములు. వానికి సంబంధించిన తమిళమందలి 'కు', కన్నడమందలి 'కె, క్కె, గె, ఎగె, ఇగె' మొదలగునవి చతుర్థీవిభక్తి ప్రత్యయములుగనే తమిళ కర్నాటక వైయాకరణులు తెలిపియున్నారు. 'కై' అనునది 'కు+ఇ' అనువాని సంధివలన నేర్పడిన దనుటకంటె, సంస్కృతమందలి 'కృతే' అను నవ్యయమునకుఁ బ్రాకృతరూపమగు 'కఏ'అనుదాని సంక్షేపరూపమని చెప్పుట యొప్పును.

'కొఱకుఁ' అను ప్రత్యయమును నన్నయ వాడలేదు; పదునొకండవ శతాబ్దపు శాసనములందుఁగాని పన్నెండవపు శాసనములందుఁగాని యది కానరాదు. కాని, యాంధ్రశబ్దచింతామణి దానిని పేర్కొనుచున్నది. 'కై' అనునది మాత్రము నన్నయ భారతభాగమున మూఁడుసార్లు వచ్చినది. అందొకసారి యతిస్థానమున వచ్చినది; అచట నదే ప్రధానముగా నున్నది; తక్కిన రెండు చోట్లనుబట్టి దాని ప్రాధాన్యమును నిర్ణయింప వీలులేదు. 'కు' తో చేరకయే 'అయి' అనునది ప్రత్యేకముగఁ బ్రత్యేకార్థములందు నన్నయభారతమున నుండుటచే 'కై' అనుదానిని నన్నయ 'కు+అయి' అనియే భావించినట్లు నిర్ణయింపవచ్చును. కావున 'కై' అనునది కూడ నన్నయకాలమునఁ జతుర్థ్యర్థకప్రత్యయముగ లేదనియే తలఁపవచ్చును. కాని, యాంధ్రశబ్దచింతామణియందది చతుర్థీవిభక్తి ప్రత్యయముగనే పేర్కొనఁబడియున్నది. 'కొఱకు' అనుదానిని 'కొఱ (=ప్రయోజనము)+కు' అని విడఁదీయుదురు. 'ఎఱ పొఱలు కఱుచు చేతులు, నొఱవశరీరంబు గలిగి యొరులకుఁ జూడఁ గొఱగా కుండియు మన్మథు, నొఱపులఁబడియెడు నిలిచెడు యువతీప్రియుఁడై (భార. ఆర. II. 134) అను పద్యమున 'కొఱ' యనుపదము నన్నయభారతభాగమున నొక్కసారి మాత్రము వచ్చినది. ఈ 'కొఱకు' 'ప్రయోజనము' అను నర్థమును జెప్పవచ్చునేమో. ఇట్లే 'కొఱగామి, కొఱమాలిన పనులు' మొదలగువానియందును నీయర్థము తోఁచుచున్నది. కాని, 'కొఱ' కు ప్రయోజనము నర్థ మెట్లుకలిగినదో తెలియరాకున్నది. 'కొఱ' కు 'కొఱఁత' అనునది సుప్రసిద్ధార్థము; ఇతర ద్రావిడభాషలలో తమిళము: కుఱై; మలయాళము: కుఱె; కన్నడము: కొఱె, తుళు: కొఱె, అను పదములకు 'కొఱఁత' యనియే కాని 'అక్కఱ' యను నర్థము లేదు. కొఱఁగునకు 'అఱ

గొఱ, కొఱప్రాణము' మొదలగు వానియందు దానికి కొఱతయనియే యర్థమున్నది. "మిఱిమిఱి చీకటిలో నందఱురాజులు సమగముడిగి తగనెల్లిట్టికిన్ గొఱ గల కల నగు నడువుఁడు నెఱవగు గోవర్ధనాద్రి నేలకుననుచున్" (ఉ. హరి. IV) లోఁ గూడ 'కొఱ'కు 'కొఱత' యనియే యర్థము. 'కొఱముట్టు' అనుదానియందు 'కొఱ' యనఁగా 'పని' యనునర్థము కలుగుచున్నది. కొఱమాలిన పనులు, కొఱగాని కొడుకు, మొదలగు వానియందును 'కొఱ' యనునది 'పని' యనునర్థమందే వచ్చుచున్నది. 'కొఱమించు పగడంపు గుండ్రకంబంబులు' (అచ్చ. రా. అర. కాం.) అను ప్రయోగమున 'కొఱ' యనఁగా 'పనితన' మనునర్థము కలుగుచున్నది. ఈ 'పని' యను నర్థము నుండియే 'ప్రయోజన' మను నర్థవిశేషము కలిగియుండును; గాని, యీయర్థమున నీపదముతో సంబంధించిన యితర ద్రావిడభాషాపదములు కానరాకున్నవి. కావున ప్రయోజనము, పని, యనునర్థములుగల 'కొఱ' యను తెనుఁగుపదము ద్రావిడేతరభాషలనుండి తెనుఁగునఁ జేరియుండును. అది ప్రాకృతపదమైనచో 'కృష, కర్ష' మొదలగు 'కృష్' ధాతుజన్యములగు సంస్కృతశబ్దములకు వికారమగు ప్రాకృతపదమునుండి పుట్టియుండునని చెప్పవచ్చును.

పూర్వకాలపు తెనుఁగున 'పొంటెన్' అను నొక యవ్యయము 'కొఱకు' అను నర్థమున వాడుకయందుండెను. అది నేఁటి వ్యవహారమున నెందును గానరాదు. దాని వ్యుత్పత్తిని గూర్చి 1388-వ పుటలో విచారింపఁ బడినది. ఉదా. విప్రుల మంత్రులఁగా నొనరించితే కార్యసంప్రయోగముపొంటెన్, (భార. సభా. I.), మొద.

కై అను ప్రత్యయము పదము శేషషష్ఠీ రూపముపైఁ జేరును: రామునికై, నాకై, హరికై, మొద. డుమంతమగు శబ్దముపై 'కై' చేరునప్పుడు 'కు' వర్ణము చేరునప్పటి తీరుననే నగాగమము వచ్చును: రామునకై, శంభునకై, విధాతృనకై, మొద. అర్వాచీన కృతులందు నగాగమము లేకుండఁ గూడఁ బ్రయోగములు కాన్పించుచున్నవి: ప్రాచేతసుకై (భాస్క. బాల. 3.)

'కొఱకు' 'పొంటె' అనునవి శేషషష్ఠీరూపముల మీఁదనే కాక, 'తద్ధర్మార్థక ధాతుజ విశేషణముల మీఁదను జేరుచుండును: చేయుకొఱకు, చేయుపొంటె, మొద.

## కొన్ని ప్రయోగములు.

**కొఱకు:**—i. ప్రథమా రూపములపై: పార్థులతోడివిగ్రహము కొఱక (భార. అర. V. 358); నిబ్బదుకు కొఱకు (భాస్క. కిష్కి. 532); కలఁచుట

ాఱకు (భాస్క. సుంద. 199); బ్రాహ్మణకోఱకు (భాస్క. యుద్ధ. 126); సందర్శ ంబు కొఱకు (కళా. IV. 140); సిరికొఱకు (పాండు. II. 40).

ii. శేష షష్ఠీ రూపమునై: బభ్రుకొఱకునై (హరి. ఉ. VI. 260); * నాకొఱకు' అనుటకు 'నాదుకొఱకు' అని భాస్క. కిష్కి. 329లో ప్రయోగము లేదు.

iii. తద్ధర్మార్థక ధాతుజ విశేషణములపై: చేయుకొఱకు (భాగ. I. 33, IV. 531; కళా. II. 7); జరుగనీకుండుకొఱకు (భాగ. IV. 31); కొఱకు' పై మరల 'అయి' చేరును: సిద్ధించుకొఱకునై (వరాహ. VII. 36); కుర్దించుకొఱకునై (శకుం. పరి. II. పు. 22; విష్ణుపు. II. 116), చూపు ాఱకు (కళా. III. 161), మొద.

* గుగ్గిలంబు వెట్టికొఱకై (S. I. I. V. 529); ఆసీవాదంబు సేసికొఱకై (S. I. I. V. 1153)—వీనిలో వెట్టి = పెట్టే; చేసి = చేసే, అని యుండవలెనేమో.

iv. అవ్యయమునపై: ఏమికొఱకై (భాగ. VIII. 440); మొద.

కై, కయి:—i. నాకైకసింగాని (నిర్వ. III. 43); నీకై పొంలితిమి =నీవంకకు, (భార. ఉ. IV. 26); మాకై (భార. అశ్వ. IV. 268); ధర్మరతుణము నకై (భార. మా. I. 86); అతినికై వేదంబులు విధించె నఖిలక్రియలకై (హరి. ఉ. IV. 51); ఉదరపోషణకై (భార. విరా. II. 218); అంబకై పూనివచ్చి (భార. భీ. I. 54). నీకయి (భార. అశ్వ. III. 59); గంధమాదనంబునకయిచను మన్న (భార. అర. V. 414); నీకయికదా (భార. ద్రో. IV. 268); అమ రులకయి సమరంబుసేసి (హరి. ఉ. II. 139); దానింగనుటకయి (భార. భీ. I. 209); దానికైకాదే (భాస్క. యు. 75); తనకై యొరులకయి (హరి. పూ. I. 129).

ii. నగాగమము లేకుండ: ప్రాచేతసుకై (భాస్క. బాల. 2); బ్రహ్మ వత్తుకై (భాస్క. బాల. 322): వాయుపుత్రుకై (భాస్క. సుం. 492)

iii. కున్+ఐ=కునై: నీకునై (భా. అను. IV. 125); చేయుటకునై (భార. అర. VI. 82); * కు+అయి; కున్+అయి: అనునవిచేరి చతుర్థ్యర్థమును బోధించునట్లే 'కున్+కాన్' అనువాని కూడికవలనఁ గూడఁ జతుర్థ్యర్థము ద్యోతకమగును: ఉదా. నాకుఁగాన్ (నిర్వ. VI. 18; VII. 68); మువర్వుల కుఁగా (ఉ. రా. I. పు. 28); తమ్మునికిఁగాఁగభీష్ముఁడు గన్నియలఁగొని పోయె (భార. ఉ. IV. 280); మాకుంగా దీనిని విడువవలయు (భార. అర. V. 183); దైన్యమువకుంగా నొచ్చియున్ (భార. ఉ. IV. 261); క్రావ్యుటకుఁ న

(భార. అను. I. 227); ఒకపనికిఁగా (విష్ణుపు. VI. 142); దశబందానకుంగా (S. I. I. IV. 923, శక. 1300.), మొద.

పొంటె:—దీని వ్యుత్పత్తి యేమో నిర్ణయింప వీలులేదు. అఱవము లోని 'పొరుట్టు' అనుదానికిని దీనికిని సంబంధ మున్నదందురు. స్పృశ్ ధాతు జన్యమగు * 'స్పృష్టి' అనుదాని చతుర్థ్యేకవచనము 'స్పృష్ట్యై' అను దానికి ప్రాకృతమున 'పుట్ఠీఏ) అనియగును; అది తెనుఁగున 'పోంటె' అని యగుటకవకాశమున్నది. కొంచె మించుమించుగ 'స్పృశ్ ధాత్వర్థమందే 'పొంటె' నుపయోగింపఁబడుచుండుటచే నీ వ్యుత్పత్తి సరియైనదేమో విచా రార్హముగ నున్నది.

i. ప్రథమారూపముపై: విప్రులమంత్రులఁగా నొనరించితె కార్య సంప్రయోగముపొంటెన్ (భార. సభా. I.)

ii. తద్ధర్మార్థక ధాతుజవిశేషణములపై: హితమొనర్చు పొంటెన్ (హరి. పూ. VI. 64); జడిపట్టుపొంటె (హరి. పూ. VII. 160); ఋణంబు నీగుపొంటె (హరి. ఉ. I. 94); చేయుపొంటె (హరి. పూ. II. 106); మొద.

కోసము, కోసరము:—'కోసము' అను పదముగూడ చతుర్థీ విభక్త్య ర్థకావ్యయముగ గ్రంథములందును వ్యవహారమునందునున్నది. ఇది కన్నడ మందలి 'ఒస్కర' శబ్దముతో సంబంధించినది. కన్నడదేశ ప్రాంతములవా రగు నాంధ్రుల వ్యవహారమున నిది 'కోస్కరము' అని వినఁబడుచున్నది. 'అదక్కె + ఒస్కర' = అదక్కోస్కర, అను సంధిరూపము నాప్రాంతపు తెనుఁగువారు విడఁదీయునప్పుడు 'కోస్కర' అని వేఱుచేయుటవలన నీ రూప మేర్పడినది. 'కోస్కరము' అనునది 'కోసరము, కోసము' లుగా మాఱి యుండును. ఉదా:

ఉ. ఎవ్వరికోస మీవగలకేమి యిఁకం బదమంచు (అనిరుద్ధ చరిత్రము I. 111).

ఉ. స్థిరభక్తిని గొల్వఁడే పరా, ధీనులుగాక మీరు వసుదేవకుమా రకు ముక్తికోసమై (అప్పకవీయము IV. 314).

ఉ. భూనుతకోసమే గనక - బొంకితి నేనియు (ఉత్తర రామా యణము పుట 313).

సీ. ఎలమితోఁ గపిరాజు చెలిమి పాటించుట, నీ కోసమేకదా - నీర జాక్షి. (ఉత్తర రామాయణము పుట 317).

సీ. వలరాజుకోసమై యలవసంతుఁడు గుంపు నేసిన చిలుకతేజీ లనంగ. (ఉత్తర రామాయణము I. 21.)

సీ. చెలువారమేఁ గ్రొత్తసందుల వస్త్రమని యెంచుకొన నిదె
య్యంటకోస మనును (నిరంకుశోపాఖ్యానము. II. 45).

ఉ. మా, కోసము తల్లిదండ్రులిది - గోయదిగోయని చూచుటాయె.
(తిరుపతి వేంకటకవులు: నానారాజ సందర్శనము.)

తోఁగికంటకోసమై (రాధికా సాంత్వనము III. 118); ఆడిన కోసము (వైజయంతీ విలాసము III. 96); బంటుకోసమై (వైజయంతీ విలాసము V. 5.) వాని కోసమై (హంసవింశతి III. 36); రాళ్లకోసమై (కాళహస్తీశ్వర శతకము 23).

ముక్తికోసము (నరసింహశతకము 7); కూటికోసముకై (నరసింహ శతకము 52).

ఇతర విధములఁ గూడఁ జతుర్థ్యర్థమును దెలుపుట గలదు: ఏఁగుదేలయు ఏ పనిఁబూని (భా. విరా. II. 40); దేహహత్యా మిమ్మహిం జననము నొందినాఁడను (భా. ఆర. IV. 186); ఏమిటికి వచ్చితి (భా. ద్రో. I. 262); ఏమి గారణంబు వచ్చితో (భాస్క. కిష్కి. 14); ఇట్లే, నిమిత్తము, మొదలయినవి.

పంచమీ విభక్తి.

'పట్టి, వలన, కంటె ఇతి పఞ్చమీ' అని యాంధ్రశబ్దచింతామణి సూత్రము చెప్పినానే బాలవ్యాకరణాదులందుఁ గూడ 'పట్టి, వలన, కంటె' అనునవి పంచమీవిభక్తి ప్రత్యయములుగాఁ జెప్పఁబడినవి. 'స్పృష్ట్వా' అను సంస్కృతక్త్వాప్రత్యయాంతమునకుఁ బ్రాకృతరూపము 'పట్టి' అనుదానినుండి యీ 'పట్టి' వర్ణకము గలిగినదనియుఁ జెప్పవచ్చును. వీనిలో 'పట్టి' అనునది 'పట్టు' అను ధాతువునకుఁ గ్త్వార్థకరూపము; 'గ్రహించి' అని దాని యర్థము. ఇది నామముల ద్వితీయావిభక్తి రూపములమీఁదఁ జేరుచుండును: జ్ఞానమును బట్టి; ఆటంబట్టి; ఒకప్పు డిది హేత్వర్థమున నవ్యయక్రియలమీఁదను జేరును: నీవు కలగఁబట్టి, రాఁబట్టి, కాఁబట్టి, మొ॥.

'ఎట్టుసమకూరు నీకిక నీప్రభావ మీవు గలుగఁగఁబట్టికా కిందువదన' (కాశీ. III. 44); సేవింపఁబట్టి (కాశీ. VII. 18); పావనాత్మునందిలఁ బ్రభవింపఁబట్టి; (ప్రభులిం. పు. 111), మొద.

'పట్టి' ని హేత్వర్థమున నేకాక యితరార్థములందును వాడవచ్చును; ఉదా. పెద్దగాలంబునంబట్టి (కాశీ. V. 275; VII. 140); నాఁటంబట్టియు (విక్ర. V. 215); తడవులంబట్టి (ప్రభా. III. 97; కళా. III. 116); మొ॥ పట్టి వర్ణకము పై యర్థములందు నేఁటివ్యవహారమునను గలదు.

పనినెరవేరింది; వాడు ఇవ్వబట్టి యీ అప్పుతీరింది; అప్పటిబట్టీ యిక్కడనే ఉన్నాను; మొద. హేత్వర్థమున నొక్క 'పట్టి'నేకాక యన్ని ధాతువులక్త్వార్థక రూపములను వాడవచ్చును. ఉదా. వానితో చెప్పి లాభములేదు; కొట్టి ప్రయోజనము లేదు; చదివి ప్రయోజనమేమి? మొద. ధర్మనందనుఁడు కల్గం బట్టి (భార. అర. VI. 61); సత్యగుణనిష్ఠంబట్టి (హరి. పూ. I. 34).

2. "అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరామాంతర్ధి వారణంబు లెద్దాననగు దానికి వలన వర్ణకంబగు. రాజ్యంబువలన భ్రష్టుండయ్యె; చోరునివలన భయపడియె; పాపంబువలన నేవగించె; అధ్యయనమువలన డస్సె; పాడివలనం బరాకుపడియె; మైత్రునివలన ధనంబుఁగొనియె; మనువువలనం బ్రజలు వుట్టిరి; చోరునివలనంగాచె; భోగంబులవలన విరమించె; తల్లివలన డాగె; శోకంబువలన వారించె;-బాలవ్యాకరణము.

మోహంబువలనఁ జై మునసరులోభంబు (భార.అర. IV. 288); ప్రీతుఁ డనైతి నీవలన (భార.అర. VI. 125); ఇట్టిట్టని సాలవకు రాజువలన నటు గైకేయిన్ (భాస్క. అయో. 86); సకలభయంబులవలనం బాసిన (హరి. పూ. I. 92); సత్రాజిత్తు జనార్దనునివలన శంకించి (హరి. పూ. III. 176); వారికంటె నీకేమిటివలనఁ దక్కువ (హరి. పూ. IV. 81); నీవలన సంతసిల్లితి (హరి. ఉ. X. 274);-ఎల్లవలనఁ గలుగు భువనవాసులఁ బిలిచి (హరి. పూ. I. 134-ఇందు 'వలను' ప్రత్యేకపదముగానున్నది)

వలనన్' అనునది దిగర్థకమగు 'వలను' పదమునకు సప్తమ్యేకవచన రూపము; ఆ రూపమే పంచమ్యర్థమునను వాడఁబడుచున్నది. ఇది 'వల్న,' 'వల్ల' అనియు వికారము నొందినది. 'వల్న, వల్ల' లర్వాచీన కావ్యములలోని కెక్కినవి. నేటి వ్యవహారమున 'వల్ల' యే కాని 'వలన, వల్న'లు లేవు.

'ప్రీ, నా మానిం బచరించి తుంబురుని వ-ల్నం గన్న గాంధర్వవిద్యా మాహాత్మ్యము (చంద్ర భా. V. 206); తప్పునా, వల్లను గల్గెనంచు జన వల్లభుదేవి నొసంగనైతి (నిర్వ. వి. రా. VI. 218); అల్లేమ చను హాళాహాళి, వల్లనెకాదు (బహులా. II. 56); ఈ కళానిధివల్లనేకదా ..., ఈ వసుఖని వల్లనేకదా ..., ఈ మహావిభువల్లనేకదా ..., ఈ సత్ప్రభునివల్లనేకదా ... (బిల్హ. II. 55); తేజినందితి మల్లధీరువల్ల (మధు.); చలిమలవల్లనుల్లసిలు చల్ల దనంబును నూనకుండినన్ (మను. II. 10); విశ్వమంత నీ, వల్లను సంభవించు (శివర. పు. 18); ఎవ్వనివల్లఁబుట్టు జగమెల్లను సంతతముం బ్రవర్ధనం బెవ్వని వల్ల లీనమగు నెవ్వనివల్నఁ దిరోహితంబునౌ (శివర. పు. 22); తన్నుఁగనుట వల్ల నీవల్ల ధారుణీవల్లభాజ్ఞ,మీఱి (సారం. III. 95); మొద.

'వలన' కు మాఱుగ 'కు' వర్ణకమును నొకప్పుడు గావ్యములందు వాడుటగలదు. ఉదా. రాజ్యంబునకు భ్రష్టుండయ్యె; చోరునకువెఱచె; మనువునకుం బ్రజలుపుట్టిరి; మొద. గ్రహణ, త్రాణ, విరా, మాంతర్యర్థములం ం కార్యము గలుగదు: మైత్రునికి ధనంబుఁగొనియె; చోరునకుఁగాచె; భోగంములకు విరమించె, తల్లికిడాగె, అను నిట్టి ప్రయోగములుండవు. వ్యవహారమున నేఁడు 'వలన' కు రూపాంతరమగు 'వల్ల' ను భయ, పరాజయ, గ్రహణ, ంవ నార్థములందే వాడుచున్నారు. దొంగలవల్ల భయము; చదువువల్ల ంలసట; వారివల్ల పుచ్చుకొన్నాను; గింజలవల్ల మొలకలుపుట్టుతవి; మొద. నేఁడు 'రాజ్యమువల్ల భ్రష్టుడైనాడు; పాపమువల్ల అసహ్యించుకొన్నాడు; ధర్మమువల్ల పరాకుపడినాడు; చోరులవల్ల కాపాడినాడు; తల్లివల్లదాగినాడు, అను నిట్టి వాడుకయున్నను వాని యర్థమునందు చాల మార్పుగలిగినది. ందు 'వల్ల' కు 'కారణముచేత' అను నర్థము కలిగినది. 'నేఁడు రాజ్యమువల్ల భ్రష్టుడైనాఁడు' మొదలగువానిలో భ్రష్టతకు రాజ్యమును, ఏవఁగాపమును, పరాకునకుధర్మమును, రక్షణమునకుఁ [illegible]లును, దాగుటకుఁ దల్లియుఁ గారణములను నర్థము గలుగును. 'వలన' కీ యర్థమున నర్వాచీన కావ్యముందు ప్రయోగములు గలవు. అందువలన (పాండు. II. 225); మొద. ఆపని నావల్లకాదు' మొదలగు వాడుకలును వ్యవహారమునను నర్వాచీన కావ్యములందును నున్నవి.

'ఉండి' యను క్త్వార్థకరూపము పంచమీ విభక్తి ప్రతిరూప కావ్యయముగా నుపయోగింపఁబడినది. అది ద్రుతముతోఁ గలిసి 'నుండి' నెహాలాదిగనే విభక్తిప్రత్యయముగఁ బరిగణింపఁబడుచున్నది. వ్యవహారమున 'నుండి'యేకాక ద్రుతముతోఁగూడిన 'ఉంచి' యను క్త్వార్థకరూపమును బంచమీవిభక్త్యంతముగ నిలిచినది. 'ఉండి' 'నుండి' యైనట్లే 'ఉంచి' 'నుంచి' యైనది. ఈ 'నుంచి' ప్రత్యయమును గవులును వాడియున్నారు.

గీ. కాంచి యమ్మంత్రి యెచ్చోట-నుంచివచ్చె. (కృష్ణరాయవిజయము IV. 28.) శా. ...న, న్నుంచే; నాఁటనుంచి (దశావ. పు. 64, 298); అప్పటినుంచి (దశావ. పు. 206); మణిగవాక్షులనుంచి వేమాఱుఁగాంచి (ఉషాక V. 70); మొద.

'ఉండి' పదము కావ్యములం దొకప్పుడు వలన వర్ణకమున కనుప్రయు క్తమగును. ఉదా. హిమగిరివలననుండి గంగ[illegible]; నాకంబువలన నుండి నారదుండువచ్చె. మొద. (దుపులవలననుండి వచ్చెనందగోపుఁడు హరి. పూ. V. 1[illegible]) 'ఉండి' [illegible] వాడి

బడుచుండెను. అఱికటనుండి (హరి. పూ. VII. 105); పిన్ననాఁటనుండే నియు (భాగ. VII. II.); పసిపాపనాఁటనుండియు (హరి. ఉ. VIII. 263); అనేకజన్మములనుండే నన్ను (ఒం. రఘు. శత. 13); వ్యవహారమునను 'వల్లనుండి, వల్లనుంచి' అని వాడుటకలదుగాని యవి హేత్వర్థమున మాత్రము వాడఁబడుచున్నవి.

'ఉండి' పదమును 'వలనన్' అను 'వలను' శబ్దము సప్తమ్యేకవచన రూపము మీఁదనేకాక యితరపదముల సప్తమీ రూపములమీఁదను, ద్వితీయా రూపములమీఁదను గూడ వాడవచ్చును: ఉదా. సప్తమీ రూపములపై: వనముననుండి వచ్చె, వనమందుండివచ్చె, వనమునందుండివచ్చె, వనములనుండివచ్చె, వనములందుండివచ్చె, వనములయందుండివచ్చె; ఊరనుండివచ్చె, ఊరియందుండివచ్చె, ఊళ్లనుండివచ్చె, ఊళ్లయందుండివచ్చె; గగనమందుండివచ్చి (భాగ. XII. 900); 'ఎందు' పైఁగూడ 'ఉండి' చేరును: ఎందుండిరాక (భార. శాం. V. 7); ద్వితీయారూపములపై : వనమునుండి వచ్చె, ఊరినుండివచ్చె. నేఁటివ్యవహారమున ద్వితీయారూపములమీఁదనే 'ఉండి' చేరుచుండును. 'నన్నుండి యీ వెతలందవలసె (రాధికా. III. 70); నిన్నుండి (రాధికా. III. 22); తన్నుండి (రాధికా. III. 21); అను నిట్టి ప్రయోగము లర్వాచీనములు. 'ఉండి' పదమును వ్యవధానముతోఁగూడ వాడవచ్చును: ఉదా. ఎన్నాళ్లనోయుండి = ఎన్నాళ్లనుండియో (పాండు. III. 33.)—'ఉంచి, ఉండు'లు షష్ఠీరూపముల మీఁదను నర్వాచీనకృతులందును నేఁటి వ్యవహారమునను గాన్పించుచున్నవి. అప్పటినుంచి (దశావ. పు. 206); నానుంచి, మీనుంచి, మొద.

పూర్వకృతులందు పంచమియందు 'కోలెన్' అను పదమును వాడుచుండిరి. ఇది ప్రథమా, సప్తమీ విభక్త్యంతరూపములమీఁదను, భూతార్థక ధాతుజ విశేషణముల మీఁదను వాడఁబడును: ఉదా. పాపగోలెన్ = చిన్నతనమునుండియు (శకుం. పరి. II. పు. 25); అన్నిదినంబులం గోలెన్ (శకుం. పరి. I. పు. 19); పుట్టినకోలెను (భార. ఆర. V. 10; హరి. ఉ. VI. 207; VIII. 204; హరి. పూ. II. 207 నను చేరినకోలెను (హరి. పూ. IX. 55): గోగ్రహణంబునఁగోలె (భార. ఉ. III. 92); విన్నకోలె (భాస్క. యు. 156); కనినప్పటఁగోలెను (భాస్క. అర. I. 149); (నిర్వ, IX. 53).

'కంటె' వర్ణకమును 'కు+అంటె' అని విడఁదీయుదురు. దీనికిఁ గన్నడమున సరిపోవు ప్రత్యయము 'అకి (క్కి)ంత' అనునది. ఇది 'అకె+ఇంత' అనువాని సంధివలన నేర్పడినది. 'అకె' లోని తొలి 'అ'కారము షష్ఠీబోధక ప్రత్యయము; దానిపైఁ జతుర్థ్యర్థక 'కె' ప్రత్యయముచేరినది. ఇట్లేర్పడి

iii. ఒకప్పుడు 'కంటె' చేరునప్పుడు ప్రథమా రూపమువై 'స' వర్ణముచేరును: ఇంద్రలోకమునకంటె మీఁద (భార. అర. VI. 132).

'కంటె'ననురూపము పదముల పైరూపములమీఁదనే కాక క్రియావిశేషణముల మీఁదను మొదటినుండియుఁ జేరుచున్నది.—

కాంచుకంటె (భార. అర. V. 349); రవియుదయించుకంటెమును (నిర్వ. VII. 139); ప్రకటించుకంటె (నిర్వ. VIII. 20); చనుదెంచుకంటె (భాస్క. యు. 1290); చెడుకంటెన్ (హరి. పూ. V. 219); ఒనర్చుకంటెన్ (హరి. పూ. VIII. 67). మనుపకుండినకంటెఁ గల్మషముగలదె (విక్ర. III. 93); అందినకంటె సంతసమునందె లతాంగి (విక్ర. V. 27); ఏలినకంటెను (విక్ర. VII. 22); కోసినకంటె (శకుం. పరి. II. పు. 39); మేల్కనుకంటె (వరాహ. VIII. 7), మీర లిద్దఱువచ్చినకంటెన్ వరమింక నొందుగలదె (వరాహ. VIII. 39) మొద.

'కంటె' వర్ణక మవ్యయములమీఁదను జేరును: మునుకంటె (కవిక. II. 99); చెప్పినంతకంటెను (భార. ఉ. III. 68); అంతకంటెను బలవంతులు (భార. ఉ. II. 199); ఇంతకంటెను (భార. అర. IV. 379); హరి. పూ. VI. 72; IV. 164; [విభక్తిప్రతిరూప కావ్యయములు విభక్త్యంతరూపములవైఁ జేరుచుండుట సాధారణముగఁ గాన్పించుచున్నది. చేయుటంజేసి, వనమునయందు, నాఁటంగోలె, హిమగిరివలననుండి మొద. ఇట్లే 'కంటె' వర్ణకమును నితర విభక్తి ప్రత్యయములవై వ్యవహారమున నుపయోగింపఁబడుచున్నది. నేఁటి గ్రంథకర్త లనేకు లిట్టి ప్రయోగములను దమ గ్రంథములందు చేయుచున్నారు: ఉదా. ద్వితీయావిభక్తిమీఁద; ధనమునుకంటె ధర్మమును ప్రేమించుట మేలు; తృతీయావిభక్తి: ఈ పనిని వానిచేతకంటె వీనిచేతచేయించిన బాగుగఁజేయును; నోటితోకంటె చేతితోలేదని చెప్పుట మంచిది; ఉద్యోగము కోసముకంటె వ్యాపారముకోసము ప్రయత్నించుట లాభకరము; పుస్తకములనుంచికంటె లోకమునుంచి యెక్కువజ్ఞానమును సంపాదింపవచ్చును; తండ్రివల్లకంటె తల్లివల్ల మనమెక్కువ యుపకారమును బొందుదుము; ఆమందుబట్టికంటె దీనిఁబట్టి యెక్కువ నయమైనది; ధనమునింటికికంటె పొలములకు పెట్టుటమంచిది; చెంబులోకంటె బిందెలో నెక్కువ నీళ్లు పట్టును. ఇట్టివ్యవహారమపరిహార్యము. ఈ నుడికారమును బూర్వాంధ్రములోనికి మార్చుట చాలఁగష్టము; మార్చిన నసహజమగును. ఇట్లే యితర విభక్తి ప్రత్యయములను వ్యవహారమునఁ గుదురుకొన్నవి: దానిలోనుంచి, మొదలయినవి.]

'కంటె' వర్ణకమునకుమాఱుగ 'కన్న' వర్ణకమును గ్రంథములందును వ్యవహారమునందును జేరినది: ప్రాణములు నిలుపుకన్న ధర్మంబుగలదె (పాండు. V. 160); నా, కన్న దురాత్ముండున్ ... నీ, కన్న మహాత్ముండున్ (దాశ. శ. 59. ప్రస).

రాకమున్ను, పోకమున్ను-మొదలగువానిలో వ్యతిరేకక్త్వార్థక రూపములు పంచమ్యర్థమును గలిగియున్నవి. పంచమ్యర్థమున 'వెంట, చేసి, కతన, కతనఁజేసి, మొదలగు పదములును బ్రయోగింపఁబడును : పాదంబువెంట జూనపోయి (భాస్క. ఉ. I. 22); పనివెంటను (భార. విరా. I. 65); కార్యంబులచేతఁజేసి (భార. శాం. IV. 283); ననుం గొనియాటఁజేసి భార. ద్రో. I. 73); భూవణజాలంబు కతన (భార. భీ. I. 83); మీఁదయ పెంపుకతనఁజేసి (భార. స్వర్గా. I. 84).

## షష్ఠీవిభక్తి.

"లోపల, కి, కు, యొక్కాన్య" అని యాంధ్రశబ్ద చింతామణి సూత్రము. చిన్నయసూరి 'కు, యొక్క, లోపల' లనుమాత్రము షష్ఠీప్రత్యయములుగఁ బేర్కొన్నాఁడు. 'కి' వర్ణకమును 'కు' నుండి మఱియొక సూత్రముచే నాతఁడు సాధించినాఁడు. అట్లే 'లో' యనువర్ణకమును 'చే, లో' లతో సాధించుకొన్నాఁడు. ఈ ప్రత్యయములలో 'లో, లోపల' లు వాస్తవముగ 'అందు' అనునర్థమును గలిగి సప్తమీవిభక్తి ప్రత్యయములుగఁ బరిగణింపఁబడవలెను. 'కి, కు' లు తక్కిన ద్రావిడభాషలలోని 'కు, క, గె, ంగె' అను వానితో సంబంధించినవై చతుర్థ్యర్థమును గలిగి యుండుటచే వానిని చతుర్థీవిభక్తి ప్రత్యయములుగనే పరిగణింపవలెను. కావున, స్వస్వామి సంబంధసూచకమగు శేషషష్ఠి యొక్కటిమాత్రమే షష్ఠీవిభక్తిగ మిగులుచున్నది. 'యొక్క' అనునది శేషషష్ఠీ ప్రత్యయము; కాని, దానిని సాధారణముగ నెవ్వరును వ్యవహారమున వాడుటలేదు. కావ్యములందు దాని నెవ్వరును వాడియుండలేదు.

ద్రావిడభాషలయందు శేషషష్ఠ్యర్థమును 'అ' అను ప్రత్యయము తెలియఁజేయుచుండును. ఉదా. కన్నడము: ప్ర. ఏ. రామను; ష. ఏ. రామన; ప్ర. ఏ. హరి, ష. ఏ. హరియ; ఒకప్పుడీ 'అ' వర్ణము చేరుటకుఁ బూర్వము కొన్ని యాగమాక్షరములు ప్రకృతిపైఁ జేరుచుండును. ఉదా. కన్న. మాతిన =మాటయొక్క; మరద = చెట్టుయొక్క; అదఱ = దానియొక్క; తమి. రామనుడైయ = రామునియొక్క; మొద. తెనుఁగునను 'అ' వర్ణకమే శేషషష్ఠియందు ప్రకృతులపైఁ జేరుచుండును. కాని, కొన్ని

యెడల నేకవచనమున నది సాధారణముగ లోపించును; ఒకప్పుడది 'ఇ' వర్ణకముగ మాఱును: రాముని, శంభుని, మొదలగు వానికి కన్నడరూపములు 'రామన' 'శంభువిన' అనునవి. 'ఊరి, ఇంటి, ఱాతి, ఱోటి' మొదలగు వానియందు 'ఇ' వర్ణకమే సంబంధార్థమును దెలుపుచున్నది. తెనుఁగున 'అ, ఇ' లంతమందు గలశబ్దములపై నెట్టిప్రత్యయమును జేరకయే సంబంధార్థ మేర్పడును. సీతమాట, హరినేర్పు, మాటతీరు, కోఁతిచేష్ట, మొద. ఉకారాంత పదములపైఁ గూడ నెట్టి ప్రత్యయమునుజేరదు. ఉదా. వనముతోఁవ, చెట్టుకొమ్మ, మొద. కాని, వానిపై నజంతపదము చేరునపు డా రెంటిమధ్యను నగాగమము గలుగును; రాజునాజ్ఞ, మోమునందము, మొద. ఒకప్పు డర్వాచీన కృతులలో నీ నగాగమమురాని ప్రయోగములును గానవచ్చుచున్నవి: ఉదా. ఏమందము మందయాన ముఖమందము మీఱు నవారవిందమున్ (విజవి.)—ఏకవచనమున నిట్లున్నను పదముల బహువచనమున 'అ' వర్ణకమే షష్ఠియందు తెనుఁగున సంబంధార్థమును దెలియఁజేయుచున్నది. ఉదా. రాముల, మాటల, చెట్టుల, హరుల, వనముల, మొద.

కు (కి)

1. తుల్యార్థము తెలుపవలసినపుడు 'తోడ' వర్ణకమునకు మాఱుగ 'కు' వర్ణకమును వాడవచ్చును: మైత్రుండు చైత్రునితోడఁ దుల్యుండు; మైత్రుండు చైత్రునికిఁ దుల్యుండు.

2. వచ్యర్థా ముఖ్యకర్మమునకు ద్వితీయా ప్రత్యయమును, తోడ వర్ణకమునే కాక 'కు' వర్ణకమును జేర్పవచ్చును: వాఁడు నన్నిట్లనియె, నాతోడ నిట్లనియె, నా కిట్లనియె.

3. చతుర్థీ ప్రత్యయములగు కై, కొఱకు లకు మాఱుగఁ దఱచుగఁ గువర్ణకమే యుపయోగింపఁ బడును; జనకుఁడు రామునకుఁ గన్యనిచ్చెను; పురుషార్థంబునకు యత్నింపవలయును.

4. కొన్నియెడలఁ గంటె వర్ణకము స్థానమునఁ గువర్ణకము వచ్చును: రామున కన్యుండు ధానుష్కుఁడు లేఁడు.

5. ఈ క్రింది ధాతువులతో సంబంధించిన విశేష్యాదులపై సాధారణముగఁ బూర్వ కావ్యములందును గొన్నియెడల నేఁడును గువర్ణకము చేరుచుండును:—

(1) అగపడు: ఇంచువిల్తుని యలరమ్ముల బారికి నగపడ్డ భామలు (నిర్వ. I. 82); మనబారి కగపడు (భార. విరా. V. 16); అనిలతనయు బారి కగపడు (భార. భీ. III. 80); బంధుల కగపడ్డ (భార. విరా. II. 70).

| | | | | | |
|---|---|---|---|---|---|
| తుళు { దూర / అంతిక | ఆమ్ - ఎ<br>ఇమ్ - బ్ - ఎ<br>...<br>...<br>...<br>...<br>...<br>... | ఆళ్<br>మోాళ్ *ఉమ్.అళ్<br>ఇమ్బళ్ - ఇమ్బాళ్<br>...<br>...<br>ఇమ్తె - ఓళు<br>...<br>... | ఆర్ (పూజ)<br>మాాకళు*ఉమ-కుళు<br>...<br>..<br>...<br>...<br>మ్ - ఏర్<br>(* ఇమ్ - అర్)<br>ఇమ్బ్ - ఏర్ (పూజ) | అవ్ - ఉ<br>ఇద్ద్ - ఉ<br>...<br>ఉద్ద్ - ఉ<br>...<br>...<br>...<br>... | ఎయ్ - ంలు.<br><br>...<br>...<br>ఇవ్ - ఇ.<br>...<br>...<br>... |
| | మ. ఏ. | మహతి. ఏ. | ఉభయ. బ. | అమ. ఏ. | అమ. బ. |
| చెన్నరాజధాని లోని గోంది { దూర / అంతిక | ఓణ్డ్ - ఉ<br>వీణ్డ్ - ఉ | అద్ద్ - ఉ<br>ఇద్ద్ - ఉ | ఓర్ - ఉ<br>వీర్ - ఉ | అద్ద్ - ఉ<br>ఇద్ద్ - ఉ | అవ్ - ఉ.<br>ఇవ్ - ఉ. |
| గోంది { దూర / అంతిక | ఓర్<br>ఏర్ | అద్<br>ఇద్ | ఓర్ - క్<br>ఏర్ - క్ | అద్<br>ఇద్ | అవ్; అఉఁ.<br>ఇవ్; ఇఉఁ. |
| కూఈ { దూర / అంతిక | ఎ అఞ్జు ఓ అఞ్జు<br>ఇ అఞ్జు | ఏరి<br>ఇరి | ఏఅర్ - ఉ<br>ఇఅర్ - ఉ | ఏర్ - ఇ<br>ఇర్ - ఇ | ఏవ్ - ఇ.<br>ఇవ్ - ఇ. |
| తెలుఁగు { దూర / అంతిక | వాఁడు<br>(*అవఁడు)<br>వీఁడు<br>(*ఇవఁడు) | అది<br><br>ఇది | వారు =<br>(*అవర్ - ఉ)<br>వీరు<br>(* ఇవర్ - ఉ) | అద్ - ఇ<br><br>ఇద్ - ఇ | అవ్ - ఇ.<br><br>ఇవ్ - ఇ. |

పైఁ జూపిన రూపములలో ననేకముల యంతమున ఉకార మున్నది. అది ధాతుగతము కాదు; ఉచ్చారణ సౌకర్యమునకుఁ జేరినది.

ఇవిగాక (1) అ, ఇ, ఉ, అను నిర్దేశార్థక చిహ్నములు: ఉదా. తమిళము: అక్కుదిరెయ్ (ఆ గుఱ్ఱము); ఇమ్మనెన్ (ఈ యిల్లు); ఉవ్వణి, మొద. (2) ఆ, ఈ, ఊ, ఏ, ఓ, అను నిర్దేశార్థక విశేషణములు: ఉదా. తెలుఁగు: ఆ గుఱ్ఱము; తుళు: ఈ వన; కుఱుఖ్: ఊ ములుక్; కూఈ: ఏ దేశ; ఓ కోగఙ్ఞ=ఆ పిల్లవాఁడు, మొద. అనువానిఁ గూర్చికూడ నీ సందర్భమున విచారింపవలెను.

దూరార్థమును దెలియఁజేయు నీ సర్వనామములందలి అన్, అవ అను నవే మళయాళము, కూఈ, గోండి, చిన్నరాజధాని గోండి భాషలందు కొన్ని రూపములలో 'ఓ' గాను, తుళు భాషలో 'ఆ' గాను మాఱియున్నది. తుళు భాషయందలి ఈ 'అ' కారము ప్రథమేతర విభక్తులలోను, బహువచన మందును 'ఎయ్' గా మాఱుచున్నది. ఉదా. ఎయ్కు = వానికి; ఎఱ్కులు = వారు. కొన్ని తెలుఁగు రూపములలో (వాఁడు, వీఁడు, వారు, వీరు) అ, ఇ లు పదముల లోని తమ ప్రథమస్థానమును పోఁగొట్టుకొన్నవి. ఇట్లే తుళులోని (మోళ్, మేర్, మోకుళు) పదాది అ, ఇ, ఉకారములును తమ ప్రథమస్థానమును పోఁగొట్టుకొన్నవి. తెలుఁగులోను, మఱ్ఱాను గోండిలోను ప్రథమావిభక్తి యందు (అది, అవి, ఇది, ఇవి, మొద.) పదాది అకార ఇకారములు నిలిచినను, ప్రథమేతర విభక్తులందా యచ్చులు తమ స్థానమును గోల్పోయినవి (దాని, దీని, వాని, వీని, మొద.). తుళు భాషలో సర్వనామములందు గాన్పించు మకారము ధాతువునకుఁ జెందినది కాదని కాల్డువెల్లు తెలంచినట్లుచ్చారణ సౌకర్యమునకు వచ్చిన వకారమునకు మాఱురూపము గాదు.

అ, ఇ, ఉ, అను మూఁడు నిర్దేశార్థక చిహ్నములలో 'అ' దూరపు వస్తువును, 'ఇ' దగ్గఱి వస్తువును దెలుపును. 'ఉ' అనునది రెండిటికి మధ్యనున్న వస్తువును దెలుపునని కిట్టెల్ మున్నగువా రూహించిరి. కాని, యాయా భాషల వ్యాకరణములను వ్రాసిన ప్రాచీనులు దాని కట్టి యర్థమును నిరూపించి యుండలేదు. ప్రాచీన తమిళమునందుగాని హళెగన్నడమునందుగాని ప్రయోగములందు దానికట్టి యర్థములేదు. అది దూరపువస్తువునే తెలుపుచుండెను. తమిళమున 'ఉకుబర్' అనఁగా 'దూరపు ప్రక్క'; 'ఉఙ్గు' అనఁగా 'ఎత్తైన', 'మీఁది' అని యర్థము; 'ఉప్పక్కమ్' అనఁగా 'వెనుక ప్రక్క', 'దూరముగా నున్నప్రక్క' అని యర్థము; 'ఉప్పాల్' అనఁగా 'దూరపుదిక్కు' అని యర్థము. తెనుఁగున 'ఉల్ల' అనునది దూరపు వస్తువును నిరూపించుట యందే ప్రాచీన వాఙ్మయమున క్వాచిత్కముగ వాడఁబడినది. నేఁడు తుళు

భాషయందు తప్ప మఱి దేనియందును ఈ 'ఉ' కారము నిర్దేశార్థమున
వాడుకయందు లేదు. అందైనను 'ఇందు', 'ఉందు' అనునవి 'ఇది' అన
నర్థముననే వాడఁబడుచున్నది. 'ఇందు', 'ఉందు' లు తుళు భాషయం దేకా
మున వాడుటను బట్టి 'ఉ' అనునది మధ్య ప్రదేశ సూచకము కాదనియే
తెలియుచున్నది. దూరార్థ బోధకమయిన 'అవ' అనునది ఇండో-ఐరేనియన
భాషలలోనిదనియు, అదియే పెర్షియనుభాషలో 'ఊ' గాను, ఉత్త
హిందూస్థాన భాషలలో ఓ, ఊలుగాను మాఱినదనియు, ద్రావిడ భాష
లోని హ్రస్వ 'ఉ'కారమునకును నట్లే యుత్పత్తిని చెప్పుకొనవలె ననియ
తోఁచుచున్నది.

తమిళ వ్యాకరణమైన 'నన్నూలు' 13-వ శతాబ్దారంభమున పుట్టినది
అందు "అ, ఇ, ఉ, ఎ"ల తర్వాత 'య, వ'లు వచ్చినయెడల 'వ' కా
మాగమముగా వచ్చుననియు, నితర హల్లులు పరమైనయెడల నా హల్లుల
ద్విత్వము కలుగుననియుఁ జెప్పఁబడియున్నది. ఉదా:

అ + అణి = అవ్వణి; ఆ + వళై = అవ్వళై; ఆ + యానై = అయ్యా
ఆ + కుదిరై = అక్కుదిరై; ఆ + మనై = అమ్మనై, మొద.

ఈ సూత్రము ననుసరించి అవన్, ఇవన్, ఉవన్, ఎవన్, అను స
నామములను అ + వ్ + అన్; ఇ + వ్ + అన్; ఉ + వ్ + అన్; ఎ + వ్
అన్, అని విభజించుట యాచారమైనది. కాల్డ్వెలు ఈ విభాగమునే యన
రించినాఁడు. కాని, నన్నూలునందే మఱియొకచోట అవ్, ఇవ్, ఉవ్, ఎ
లు ప్రాతిపదికములుగ చెప్పఁబడినవి. దీని ననుసరించి ఆ + యానై
అవ్యానై; ఇ + యానై = ఇవ్యానై; ఉ + యానై = ఉవ్యానై, అగు
ఇట్లే అ, ఇ, ఉ, లను పరుషాక్షరములు పరమైన యెడల 'ం' ఆద్యము
మముగా వచ్చునని చెప్పఁబడియున్నది. దీనినిబట్టి అ + కుదిరై = అంకుది
అగును. ఇట్లే అందు = అవ్ + తు; ఇందు = ఇవ్ + తు; ఉందు = ఉవ్ +
యగును. కాఁబట్టి ఆద్యముతోఁ గూడిన రూపములే ప్రాచీనము లని
అంకమ్, అంకేనమ్, ఎంకు అను ప్రాచీనరూపములు అక్కమ్, అక్కే
ఎక్కు,లుగా మాఱినట్లే "అంకుదిరై" మొదలగు రూపములనుండి "అక
దిరై" మొదలగు రూపములు పుట్టినవనియు, వ-కార మాగమాక్షర
కాదనియు, అది ధాతుగతమే యనియు, అవ్, ఇవ్, ఉవ్, ఎవ్,లే ని
వాచకములు గాని, అ, ఇ, ఉ, ఎ, లు కావనియు, అ, ఇ, ఉ, ఎ, లా సంపు
రూపములందలి ప్రథమాక్షరములు మాత్ర మనియు, కావున అవన్, ఇవ
ఉవన్, ఎవన్, లను అవ్ + అన్, ఇవ్ + అన్, ఉవ్ + అన్, ఎవ్ + అ
అని విభజింపవలెననియు తేలుచున్నది. ఇట్లే, 'అదు, ఇదు, ఉదు, ఎదు'ల

అద్, ఇద్, ఉద్, ఎద్,లు ధాతుగతములు, కావున వానిని అద్ + ఉ, ఇద్ + ఉ, ఉద్ + ఉ, ఎద్ + ఉ, అని విభజింపవలెను గాని అ + ద్ + ఉ, ఇ + ద్ + ఉ, ఉ + ద్ + ఉ, ఎ + ద్ + ఉ లు x కాల్డువెల్లుచేసినట్లు విభజింపఁగూడదు.

### సంస్కృతమున నిర్దేశార్థక సర్వనామములు.

సంస్కృతమున 'తద్, త్యద్' లు ప్రథమపురుషసర్వనామములుగను, నిర్దేశార్థక సర్వనామములుగను గూడ వాడఁబడును. ఇవిగాక అదస్, ఇదమ్, ఏతద్, అను అ, ఇ, ఏ, లు ఆదియందుగల నిర్దేశార్థక సర్వనామములును సంస్కృతమునఁ గలవు. 'అయమ్ (పుంలింగము)' ఇయమ్ (స్త్రీలింగము), ఇదమ్ (నపుంసకలింగము) అనునవి యుభయార్థమును గలిగినవి. వీని ప్రథమేతర విభక్తులందు అన,-ఇమ అనునవి ప్రాతిపదికములుగఁ గొన్నియెడలఁ గాన్పించుచుండును (అనేన, అనయా, అనయోః; ఇమా, ఇమే, ఇమా, ఇమాని.) 'అసౌ (పుం. స్త్రీ), అదస్' లు దూరార్థకములు. వీని ప్రథమేతర విభక్తులందు 'అమ్' ప్రాతిపదికముగాఁగల 'అము, అమూ, అమీ,' అను రూపములు కానవచ్చును. 'అవ' అనునది గూడ నతిప్రాచీనకాలమున దూరార్థక సర్వనామముగ ఋగ్వేదమున రెండు, మూఁడు స్థానములయందు ద్వివచనమున గానవచ్చినది. 'అవ'కు రూపాంతరముగ 'అమ' అనునది అథర్వవేదమున 'అమోహమస్మి' అను ప్రయోగమున నొకచోట కానవచ్చినది.

### ఐరేనియనుభాషలో
### నిర్దేశార్థక సర్వనామములు.

ఐరేనియను భాషలో (i) పుం. ఏతే; స్త్రీ. ఏతా; నపుం. ఏతత్; (ii) పుం. ఇమ; అ; స్త్రీ. ఇమా. అ; నపుం. ఇమత్. ఇద్. (iii) పుం. అవ; స్త్రీ. అవా; నపుం. అవత్. అవత్. వీనిలో i-వ వర్గములోనివి సంస్కృతములోని 'ఏతద్' వలెనే యున్నవి. ii-వ వర్గము ప్రథమేతరవిభక్తులలో "అద్, ఇద్, అ, ఇ, ఇమ" అను ప్రాతిపదికములు కానవచ్చుచున్నవి. ఇవిగాక ప్రథమా, ద్వితీయా విభక్త్యేకవచనములలో నపుంసకలింగమున "అద్, ఇద్, ఈద్"లును, నపుంసకలింగ ప్రథమా బహువచనమున 'ఈ, ఇమా' పుంలింగమున 'ఇమే,' స్త్రీలింగమున 'ఇమాఏ' అను రూపములును గాన్పించుచున్నవి. iii-వ వర్గము ప్రథమేతరవిభక్తి రూపములన్నియు 'అవ' అను ప్రాతిపదికమునుండియే కలుగుచున్నవి. ప్రథమా బహువచనమున వీనికి 'అవే' అనురూపము కలుగును. 'అమ్' అను ప్రాతిపదికమునుండి యేర్పడిన యరూపములు తప్ప, తక్కిన యన్నిరూపములును కొన్ని వికారములతో ఐరేని

యను భాషయందును గాన్పించుచున్నవి. ఈ రూపము లన్నిటిలోను 'అ, ఇ అవ్, అన్, ఇద్' అనునవి సంస్కృత, ఐరేనియను భాషలయందుండుటయే కాక, ఇండో-జెర్మానికుయుగమునుండియు నున్నట్లు బ్రుగ్మన్ వ్రాసి ఇండో-జెర్మానిక్ భాషల చరిత్రమువలనఁ దెలిసికొనవచ్చును. లాటిన భాషలోని 'ఇద్', ఇంగ్లీషులోని 'ఇట్' అనునవికూడ ద్రావిడభాషలలోని 'ఇద్' తో సంబంధించిన వనుట స్పష్టము.

ఆధునిక పెర్షియనుభాష.

ప్రథమ పురుషైకవచనమున ఆధునిక పెర్షియను భాషలో 'అవ్' అనునది నిర్దేశార్థక సర్వనామము. దీనిని 'ఊ' గా ఉచ్చరింతురు. దీని ప్రాచీనరూపము 'ఊవ' = వాఁడు, ఆమె, అది. ఇది అవెస్తాభాషలోని 'అవ'కు వికారము. ఆధునిక పెర్షియను 'ఊ; (ఓ)' = పజేందుభాష 'ఓ' = ప్రాచీన పెర్షియను 'అవ.' ఆధునిక పెర్షియను 'ఈ' = పజేందుభాష 'ఓయ్' = ప్రాచీన పెర్షియను 'అవ+హ్యా.' 'వై' అనునది 'అవ' 'ఓయ్' ల సమ్మేళనమువలనఁ గలిగియుండవచ్చును. దీనికి బహువచనరూపము : "ఈ-షాన్. = వారు.

ప్రాచీన పెర్షియనులో 'ఇమ్' అను మఱియొక నిర్దేశార్థక సర్వనామ మున్నది. ఇది సంస్కృతములోని 'ఇమ' తో సంబంధించినది. 'రోజ్=వినుట; షబ్ = రాత్రి; సాల్ = సంవత్సరము; కొన్నియెడల 'బార్ = కాలము' అను శబ్దములకు పూర్వమందు వచ్చు 'ఈన్' అను పదమునకు బదులుగ 'ఇమ్' వచ్చుచుండును.

ఇవిగాక 'ఈ' (ప్రాచీనరూపము 'ఏ') అనునొక నిర్దేశార్థక విశేషణ ముగూడ నాధునికపెర్షియనునం దున్నది. దీనిని విశేష్యములకుఁ బూర్వ మందు ఏకవచనమందును, బహువచనమందునుగూడఁ జేర్పవచ్చును. ఇది ప్రాచీనపెర్షియనులోని 'అవిత' అనుదానినుండి కలిగినది.

అధునిక ఇండో-ఆర్యభాషలలో నిర్దేశార్థక సర్వనామములు.

| | దూర | అంతిక |
|---|---|---|
| | ప్ర. ఏ. | ప్ర. ఏ. |
| హిందీ | ఉ, ఓ, వహ్ | ఇ, ఇహ్, ఏ, ఏహ్, యహ్ |
| పంజాబీ | ఉహ్ | ఇహ్, ఏహ్. |
| సింధీ | ఊ, వహా, హూ | ఈ, హీ, హే. |
| గుజరాతీ | ఆ | ఏ |
| బంగాలీ | ఓ | ఏ |

అవెస్తాభాషలోని 'అవ' అను రూపము భారతీయార్యభాషలలో లేకుండినను, దాని వికారములైన 'ఓ, ఊ, ఉ'లు హిందూదేశార్యభాషలయందెల్లఁ గలవు. ఇవి యీ భాషలయందెల్ల దూరార్థనిర్దేశక సర్వనామములుగా నున్నవి.

వైదికభాషలలోని అ, ఇ, ఏ, లను నిర్దేశార్థకములలో 'అ' అనునదొక్కటే స్వతంత్రప్రయోగము గలదైనను, అమూఁటికిని భారతీయార్యభాషలందు స్వతంత్రప్రయోగము గలదు.

### ద్రావిడభాషలయందును నార్యభాషలయందును నిర్దేశార్థక సర్వనామములకుఁ గల సంబంధము.

ఈ క్రింది పట్టికవలన ద్రావిడభాషలందును నార్యభాషలందును నిర్దేశార్థక సర్వనామములకుఁ గల సంబంధము స్పష్టపడఁగలదు.



| | ఐరేనియను అవెస్తాభాష. | | ఇండో- ఆర్యభాషలు వైదికభాష | | ద్రావిడభాషలు. | |
|---|---|---|---|---|---|---|
| | దూర | అంతిక | దూర | అంతిక | దూర | అంతిక |
| 1. | అద్ | ఇద్ | అద్-అస్ | ఇద్-అమ్ | అద్ | ఇద్ (గోంది) |
| | | | | | అద్-ఇ | ఇద్-ఇ (తెలుఁగు |
| | | | | | అద్-ఉ | ఇద్-ఉ (తమిఌ మళ. కన్నడ.) |
| 2. | అవ్ | ఇమ్ | అవ్ / అమ్ | ఇమ్ | అవ్ | ఇవ్, తమి. గోంది. |
| | | | | | అవ్-ఐ | ఇవ్-ఐ (తమి.) |
| | | | | | అన్ద్-అ | ఇన్ట్-అ (తమి.) |
| | | | | | అవ్-ఆ | ఇవ్-అ (మళ. |
| | | | | | అవ్-ఉ | ఇవ్-ఉ (కన్న |
| | | | | | అవ్-ఉ | ఇన్ద్-ఉ, ఉన్ద్-. ఇమ్బ్-ఎ, ఇమ్బ్-ఎర ఇమ్బ్-అళ్, ఇమ్బ్-ఆళ్ ఇమ్బ్-ఓళు, మేర్. (తుళు |
| | | | | | అవ్-ఇ / అన్ద్-ఉ | ఇవ్-ఇ / ఇన్ద్-ఉ } తెలుఁగు |
| 3. | అన్ | | అన్ | | అన్ | (క్రియాప్రత్యయమ తమి.) |
| 4. | అ | ఇ | అ | ఇ | అ ఉ ఇ | (తమి, తుళు, కన్నడ |
| 5. | ఓ (ఏ. పహ్లావీ భాష) | | ఆ, ఊ, ఓ. | ఈ | (1) సమాసములలో (ఆధునిక గోంది; కూఇ, మద్రాసుగోంది; మళ) | |
| | ఊ | ఈ (ఆధునిక పెర్షియను) | ఊ | ఈ (ఆధునికార్యభాషలు) | | |

| ఐరేనియను అవెస్తాభాష. | ఇండో-ఆర్యభాషలు వైదికభాష | ద్రావిడభాషలు. |
|---|---|---|
| | | (2) స్వాతంత్రనిర్దేశార్థక విశేషణములు. |
| | | అ, ఇ (కన్న. తుళు, మల. కురుఖ్, తెలుఁగు.) |
| | | ఈ, ఏ, ఓ (కూఇ) |
| | | ఉ (బ్రాహుఇ) |
| | | ఏ ఓ (బ్రాహూఇ.) |

పై దానినిబట్టి ద్రావిడభాషలలో నిర్దేశార్థక సర్వనామములు అవెస్తా, వైదిక, సంస్కృత, అనువిశాలభాషలలోని నిర్దేశార్థక సర్వనామములతో సంబంధము గలవని సూక్ష్మదృష్టికి గోచరింపఁగలదు. క్రింది మూఁడు విధములైన నిర్దేశార్థకపదములు తెలుపుచున్నవి.

(i) అద్, ఇద్; అవ్, ఇవ్:

అవెస్తాభాషలో అత్, ఇత్, లును, సంస్కృతమున 'అద్-అమ్,' 'ఇద్-అమ్, లును నపుంసకలింగైకవచన రూపములు. ద్రావిడభాషలలో అద్, ఇద్; అద్-ఉ, ఇద్-ఉ; అద్-ఇ, ఇద్-ఇ - అనునవి కూడ నపుంసకలింగైకవచనరూపములే.

నపుంసకలింగ బహువచనమున అవెస్తాభాషలో 'అవే, ఇమా, అవ, ఈ, లును, సంస్కృతమున 'అమూని, ఇమాని, ఇమా' లును, ప్రాచీన పెర్షియనుభాషలో 'అవై, ఇమై' లును వచ్చును. నపుంసకలింగబహు[illegible] వనే ద్రావిడభాషలలో 'అవ్, ఇవ్' అను ప్రాతిపదికములను [illegible] అవ్-ఐ, ఇవ్-ఐ; అవ్-అ, ఇవ్-అ; అవ్-ఉ, ఇవ్-ఉ — అనునవి గలవు.

నపుంసకలింగైకవచనమున 'ద' కారము [illegible] వికారముగాదు; అది ధాతుగతమే. కావుననే తెనుఁగున నద పదాదిని కూడను 'ద'కారముగనే నిలిచినది: అది, దాని; ఇది, దీని, మొద. ఇట్లే నపుంసకలింగ బహువచనమున 'వ'కారము ధాతుగతమేకాని కాల్డువెల్లు చెప్పినట్లు ఆగమ వర్ణముకాదు.

అవెస్తాభాషలో అవ్, ఇమ్,లకు పుంస్త్రీ నపుంసకలింగ ప్రత్యయములను చేర్చుటవలన నాయా సర్వనామము లేర్పడును: పుం. అవ; స్త్రీ. అవా; నపుం. అవద్, అఒమ్, పుం. ఇమ; స్త్రీ. ఇమా, నపుం. ఇమద్. ఇండో-ఆర్య-

గ్రాంథికభాషలలో వైదికకాలమున 'ఇమ్' అనుదాని పోలికను 'అమ్' అను నొక ప్రాతిపదికము చేరినది. 'అవ్' అనునది లోపించినది. లేదా, 'అవ్' లోని 'వ'కారము 'మ'కారముగా మారినదనియైనను జెప్పవచ్చును. ఇట్లే. తమిళము మొదలగు ద్రావిడభాషలలో అవ్, ఇవ్,లు సర్వనామముల ప్రాతిపదికములైనవి. ఉదా: అవ్-అన్; ఇవ్-అన్; అవ్-అళ్, ఇవ్-అళ్; అ౦ందు, ఇ౦ందు, మొద.

ఇండో-ఆర్యభాషలకును ద్రావిడభాషలకును నీరీతిగా నిర్దేశక సర్వనామముల విషయమున సంపూర్ణ సంబంధ మేర్పడినది. 'మ'కారమునకు మాఱుగ 'వ'కారము కనఁబడుట యొకభేద మనవచ్చునుగాని, ఆ 'మ'కారము తుళు భాషయందు కానవచ్చుచునేయున్నది.

(ii) అ, ఇ, ఉ, ఎ, ఆ, ఈ, ఊ, ఏ, ఓ:

అవెస్తా భాషలోని 'అవ' 'ఓ'గాను, 'ఇవ' 'ఈ'గాను ప్రాచీన పెర్షియను భాషయందే మాఱినవి. ఆధునికార్యభాషలందును నివి కాన్పించుచున్నవి. గోండీలో 'ఓర్', మద్రాసుగోండీలో 'ఓణ్డు';కూఈలో'ఓఅఞ్జు'అనునవి 'వాఁడు' అను నర్థమునఁ గానవచ్చుచున్నవి. ఈ 'ఓ,యే' 'ఒ,ఊ, ఉ'లుగ మాఱినది. అ, ఆ, ఇ, ఈలు సర్వసాధారణముగ నన్నిద్రావిడభాషలయందును గాన్పించుచునే యున్నవి. 'ఏ' అనునది అవెస్తాలో 'ఎయ్త'గను ప్రాకృతమున 'ఏ' గను, కొన్ని యాధునికార్యభాషలలో 'ఏ'= గా కాన్పించుచున్నది.

(iii) అన్:—గ్రాంథికమగు తమిలభాషలో క్రియాప్రత్యయములందు 'అనన్, అనళ్, అన్ఱు, అనర్, అన' అనునవి 'ఇరున్దవన్, ఇరున్దవళ్ మొదలగు రూపములందువలెనే ఏర్పడుచున్నవి. అవన్, అవళ్ లకు, 'అవ్ ప్రాతిపదికమైనట్లే, వీనికి 'అన్' అనునది ప్రాతిపదికము.

(iv) త:—తెలుఁగు: అతఁడు, ఆతఁడు, అతను, ఆతను; ఇతఁడు ఈతఁడు, ఇతను, ఈతెను; కన్నడము: ఆతమ్, ఈతమ్, ఊతమ్; తుద: అతవ్ ఇతమ్—ఈ రూపములలోని 'త' వర్ణము సంస్కృత ప్రాతిపదికము 'ఏత అవెస్తా ప్రాతిపదికము 'ఎయ్త' అనువానిలోని 'త' వర్ణము ననుసరించి యున్నది.

ద్రావిడభాషలలో ప్రశ్నార్థకసర్వనామము.

ముఖ్యములయిన ద్రావిడభాషలలోని ప్రశ్నార్థకసర్వనామము లీక్రింది పట్టికలో చూపఁబడినవి.

ద్రావిడ భాషలనుండి యిండో - ఆర్యభాష లెరవు తెచ్చుకొన్నవని స్టెన్‌కోనో ప్రభృతులు తెలుపు ప్రత్యయములను గూర్చి విచారించినచో నా ప్రత్యయము లిండో - ఆర్యభాషలయందు మొదటనుండియు నున్నవే కాని, ద్రావిడభాషలనుండి యెరవు తెచ్చుకొన్నవి కావని స్పష్టము కాఁగలదు. ఈ క్రింద ప్రథమైకవచన మహత్ప్రత్యయములు చూపఁబడినవి:—

| ద్రావిడ భాషలు. | ద్రావిడ ప్రత్యయరూపములు | ఆర్య రూపములు | ఆర్యభాషలు. | ద్రావిడప్రథమేతర విభక్తి ప్రాతిపదికములు |
|---|---|---|---|---|
| తమిళము, మళయాళము | అవన్ | భరన్ | వేదము | అవన్ |
| కన్నడము | అవను | | | |
| హళెగన్నడము, బడగ | అవమ్ | భరమ్ | అర్ధమాగధి | అవమ్ |
| తెలుఁగు | వాఁడు, వాణ్డు | భరన్తో | పాలి | వాని |
| మద్రాసుగోండీ, గోండీ | ఓణ్డు, ఓర్ | భరన్తు | అపభ్రంశము | ఓ[illegible], ఓ[illegible] |
| కూఇ | ఏఞ్జు, ఓఞ్జు | బరఁస్, [illegible] | అవెస్తా | ఏ అన |
| తుళు | ఆయె | [illegible] | అవెస్తా | |

పై రూపములను బట్టి [illegible] హళెకన్నడమందలి 'అవమ్' అనునది మాగధీ, అర్ధమాగధీ ప్రాకృతములలోని 'భరమ్' ను బోలియున్నదనియు, జైన, బౌద్ధమతముల ప్రాబల్యముచే నట్టిరూపము వెలసెననియు, తమిళమందలి 'అవన్' అనునది వైదికరూపమగు 'భరన్త్స'లోని 'త్స' లోపింపఁగా మిగిలిన 'భరన్' అను రూపమును బోలియున్నదనియు, బ్రాహ్మణమత ప్రాబల్య మీ ప్రత్యయవిషయమునఁ గానవచ్చుచున్నదనియు తెలియనగును. అట్లే, తెలుఁగు, మద్రాసుగోండీ భాషలలోని మహత్ప్రత్యయము పాలి, అపభ్రంశ భాషలయందలి 'అన్తో,' 'అన్తు'ల నుండి యేర్పడినది. కూఇ-భాషలోని 'ఞ్జు' రూపము 'ణ్డు' నకు తాలవ్యరూపమనియైనను, శేడా, అవెస్తా భాషలోని 'బరస్' వంటి రూపముగలిగిన యొక నష్టప్రాకృతమునుండి

వచ్చినదనియైనను జెప్పవలెను. '-అన్స్' రూపము సంస్కృతములో: 'విద్వాంస్' మొదలగువానియందు గానవచ్చుచునే యున్నది.

తుళుభాషలోని ప్రథమైకవచన ప్రత్యయమగు 'ఆయె' అనునదియ నొక నష్టప్రాకృతమునుండి వచ్చినదనియైనను, లేదా, ఇందలి తుది 'ఎ' కారమ మాగధిభాషనుండి కలిగిన దనియైనను చెప్పవలెను. మాగధీ ప్రాకృతము ప్రథమైకవచన ప్రత్యయముగ 'ఏ' వచ్చును. ఈ క్రింది శ్వేతాంబరజైను వాక్యమును జూడుఁడు.

శే భగవం మహావీరే మహామాహనే
సం. స భగవాన్ మహావీరో మహాబ్రాహ్మణః
తెనుఁగు: ఆ భగవంతుఁడు మహావీరుఁడు మహాబ్రాహ్మణుఁడు

ప్రథమైకవచనమున 'ఏ' ప్రత్యయము తుళుభాషయందును, కన్న మునకు మాండలికభాషయగు కోతభాషయందును విస్తారముగఁ గాన్పిం చున్నది. ఈ 'ఏ' ప్రత్యయమును, హళగన్నడ, బడగభాషలలో ప్రథమై వచన మహత్ప్రత్యయములందలి 'మ్' అనునదియు మాగధీ ప్రాకృతవ నుండి కలిగిన వనుటకు సందేహము లేదు.

గోండీభాషలో ప్రథమైకవచనమున 'ఓఱ్' కానవచ్చుచున్నది. ఇంద రేఫము బహువచనబోధకమనియు, నారూపమే యేకవచనమున వాడు లోనికి వచ్చెననియు స్టెన్‌కోనో పండితుని యభిప్రాయము. ఇది సరియైన తోఁచదు. ఈ రేఫము ప్రథమైకవచనమున మాత్రము కానవచ్చుచున్న తక్కిన విభక్తుల యేకవచనములందు 'ఓన్' అనునది ప్రాతిపదికమ చున్నది. ఇట్లే, నిర్దేశార్థక సర్వనామమగు 'ఏర్,' ప్రశ్నార్థక సర్వనా మగు 'బోర్' అను గోందీరూపములందు ప్రథమైకవచనమున రేఫము ప్రథమేతర విభక్తులందు వానికి 'ఏన్,' 'బోన్' అనునవి ప్రాతిపదికము ల చున్నవి. ఇట్లే, గోందీ 'తమ్ముర్' = తమ్ముఁడు అనుదానికి ప్రథమే విభక్త్యేకవచనమున 'తమ్మున్' అను రూపము గలుగుచున్నది. దీనిని వై రూపములందలి రేఫము బహువచన బోధకము కాదని చెప్పవచ్చు అది తెనుఁగునందలి 'ఁడ్'='ఱ్'='ర్' అని నిర్వచింపవచ్చును.

తెలుఁగు: 'ణ్డు' ప్రత్యయము ఇండో - ఆర్యభాషలోని 'న్తు' యొక వికారము.

పైని వివరించిన మహత్ప్రత్యయములలో తెనుఁగునఁగల 'ణ్డు', 'ఁ ప్రత్యయములు సంస్కృతమునందలి 'న్త' ప్రత్యయముతో సరిపోవుచున్న తమిటికన్నడములలోని దంత్య త, ద, లు తెనుఁగున మూర్ధన్య ట, డ, లు గానవచ్చును. చూడుఁడు—

లనియు రెండువిధములుగ నుండును. బలవద్రూపములు 'న' కార సహితము లుగను (బలవాన్, బలవన్తౌ, బలవన్తః; బలవన్తమ్, బలవన్తౌ); బలహీనరూప ములు 'న' కార రహితములుగను (బలవత్, బలవతీ, బలవంతి) నుండును అందు పుంలింగరూపములు ప్రథమావిభక్తి మూఁడు వచనములందును ద్వితీయావిభక్త్యేక, ద్వివచనములందును బలవంతముగ నుండును; తక్కిన విభక్తులు బలహీనములు. నపుంసక లింగమున 'న' కారము ప్రథమ, సంబో ధన ప్రథమ, ద్వితీయల బహువచన రూపములందు మాత్రము బలవద్రూ పములు కాననగును. ఇతర విభక్తులయందును, వచనములందును నవి బలహీ నము లగును. దీని స్త్రీలింగ ప్రథమైకవచన రూపములు నపుంసకలింగ ప్రథ మైకవచన రూపములకు 'ఈ' చేర్చుటవలన నేర్పడును. అప్పు డవి ఈ-కా రాంత స్త్రీ లింగ శబ్దములవలె విభక్తి ప్రత్యయములను పొందును.

సంస్కృతమున పుంలింగ ప్రథమైకవచనమున న-కారాంతములయి రూపములు—ద్యుతిమాన్, బలవాన్; విద్వాన్; బలీయాన్; భరన్; వృధన్ భరిష్యన్— అను రీతిగనుండును. ద్రావిడభాషలయందలి ప్రథమైకవచ న-కార మీ ఇండో-ఆర్య రూపముల పోలికను దాల్చినవని చెప్పవచ్చును.

ఈ యూహ కొక యాక్షేపణము రావచ్చును. "సంస్కృతములో లింగము వస్తువుల జాతినిబట్టి కాక, శబ్దముల యంతముఁబట్టి యుండున సింహ, వృక్ష, మనుష్య, దారాః, అనున వన్నియు సంస్కృతమున పుంలిం ములే. కాని, యవి ద్రావిడభాషలలో కొన్ని మహద్వాచకములును గొన్ని యమహద్వాచకములు నగును. 'న్' అనునది ద్రావిడభాషలలో నిండో-ఆర భాషలయందు న-కారము చేరు సందర్భములం దెల్ల చేరదు. కావున, సంస్కృ తములోని 'అన్' ప్రత్యయమునకును ద్రావిడభాషలలోని దానికిని నె సంబంధమును లేదు" అని యెవరైన ననవచ్చును. కాని, దీనికి సమాధానమ లేకపోలేదు. తమిళమున నిప్పుడు అన్నంతశబ్దములు మహద్వాచకములుగ గాన్పించుచున్నవి గాని, మొదటినుండియు నవి యట్లు లేవనుటకు నిదర్శనము గలవు. తొల్కాప్పియము (శొల్లదిగారమ్: పిఱప్పు 49)లో తొమ్మిది యమహ చ్ఛబ్దములందు మాత్రము తుది న-కారము మకారముగ మాఱదని చెప్ప బడియున్నది. నన్నూలు (121 సూత్రము) నందు తమిళభాషలో యమహద్వాచకముల తుది మకారమునకు బదులుగ న-కారము జేర్పవచ్చు కొన్ని శబ్దములు గలవని చెప్పఁబడినది. ఈ రెంటిని జే సమాలోచించినచో, దమిళమునఁ బ్రాచీనకాలమున న-కారాంతామహ చ్ఛబ్దము లనేకము లుండెడివనియు, నవి యిప్పుడు మ-కారాంతములుగ మా

| ...ధిక తమిళము | కన్నడము | తెలుఁగు. |
|---|---|---|
| | | కొండ |
| | ఒందు | ఒండు |
| | | ఎండ |
| | | నాఁడు = దినము |
| ు | ఎందెను | అంటిని |
| ్ | తిందెను | తింటిని |
| ్ర | హుత్తు | పుట్ట |
| ్ర | నుత్తు | నేట్టు |

ఈ క్రిందివానిలో తెనుఁగునఁగల-'ండ' సంస్కృతమందలి 'న్త' కు పోవుచున్నది:

i. మధ్యమపురుష క్రియలలోని అండు, - ఉండు: రండు, వినుండు. చూ. సం. ఆగచ్ఛ - అన్తు, శృణ్వ - అంతు.

ii. మానార్థక '-ఎడు' ప్రత్యయము:— ఉదా. మూరెడు, మానెడు -చూ. వైదిక ప్రత్యయము '-యత్': ఇ-యత్, కి-యత్, మొద.

iii. -వంటి = పోలిన = మావంటి, అటువంటి. -చూ. వైదికరూపములు: 'మావంత్' = నావంటి; 'త్వావంత్' = నీవంటి, మొద.

iv. అండ = సమీపము; సం. అంత; అంతిక; అంతేవాసి, మొద.

v. పెరడు; సం. పర్యంత; ప్రా. పేరంత.

## ద్రావిడభాషలలో మహత్ప్రత్యయము.

ద్రావిడభాషలలో మహత్ప్రత్యయము ప్రథమైకవచనమున నొక్కొక్క వానిలో నొక్కొక్కరీతిగ నున్నట్లు కాన్పించుచున్నను, ప్రథమేతర విభక్తులందు 'న'కార మన్నిభాషలయందును దప్పక కనఁబడుచున్నది. చూ. తమిళము: అవనై; హళగన్నడము: అవనమ్; తెలుఁగు: వాని; గోండీ: ఒక్; కుఇ: ఒఅన్. వీని యన్నిటికిని సరిపోవు నిండో-ఆర్య చిహ్నములు గలవు. ఈ యార్యరూపములందు 'న్త' అను సంయుక్తహల్లు కనఁబడుచున్నది. ఇది ఇండో - జెర్మానికభాషావస్థలోనిది; కాలక్రమమున దానికి వివిధరూపభేదములు గలిగినవి. ఈ 'న్త' గల రూపములు ఇండో- ఆర్యభాషలలో (1) వర్తమాన, తద్ధర్మ, భవిష్యదర్థకములగు 'అన్త' 'స్యన్త' అనున వంటిమందు గల క్రియాజన్య విశేషణములందును (2) భూతార్థమున 'వన్త' అంతమందుగల క్రియాజన్య విశేషణములు (3) మతుప్ప్రత్యయాంత శబ్దములు—వీనిలో ... ... బలవదూపము లనియు, బలహీన రూపము

నియు రెండువిధములుగ నుండును. బలవద్రూపములు 'న' కార సహితము లుగను (బలవాన్, బలవన్తౌ, బలవన్తః; బలవన్తమ్, బలవన్తౌ); బలహీనరూపములు 'న' కార రహితములుగను (బలవత్, బలవతీ, బలవంతి) నుండును. అందు పుంలింగరూపములు ప్రథమావిభక్తి మూఁడు వచనములందును, ద్వితీయావిభక్త్యేక, ద్వివచనములందును బలవంతముగ నుండును; తక్కిన విభక్తులు బలహీనములు. నపుంసక లింగమున 'న' కారను ప్రథమ, సంబోధన ప్రథమ, ద్వితీయల బహువచన రూపములందు మాత్రము బలవద్రూపములు కానగును. ఇతర విభక్తులయందును, వచనములందును నవి బలహీనము లగును. దీని స్త్రీలింగ ప్రథమైకవచన రూపములు నపుంసకలింగ ప్రథమైకవచన రూపములకు 'ఈ' చేర్చుటవలన నేర్పడును. అప్పు డవి ఈ-కారాంత స్త్రీ లింగ శబ్దములవలె విభక్తి ప్రత్యయములను పొందును.

సంస్కృతమున పుంలింగ ప్రథమైకవచనమున న-కారాంతములయిన రూపములు—ద్యుతిమాన్, బలవాన్; విద్వాన్; బలీయాన్; భరన్; వృధన్; భరిష్యన్— అను రీతిగనుండును. ద్రావిడభాషలయందలి ప్రథమైకవచన న-కార మీ ఇండో-ఆర్య రూపముల పోలికను దాల్చినవని చెప్పవచ్చును.

ఈ యూహ కొక యాక్షేపణము రావచ్చును. "సంస్కృతములోని లింగము వస్తువుల జాతినిబట్టి కాక, శబ్దముల యంతముఁబట్టి యుండును; సింహ, వృక్ష, మనుష్య, దారా, అనున వన్నియు సంస్కృతమున పుంలింగములే. కాని, యవి ద్రావిడభాషలలో కొన్ని మహద్వాచకములును గొన్ని యమహద్వాచకములు నగును. 'న' అనునది ద్రావిడభాషలలో నిండో-ఆర్య భాషలయందు న-కారము చేసు సందర్భములం దెల్ల చేరదు. కావున, సంస్కృతములోని 'అన్' ప్రత్యయమునకును ద్రావిడభాషలలోని దానికిని నెట్టి సంబంధమును లేదు" అని యెవరైన ననవచ్చును. కాని, దీనికి సమాధానము లేకపోలేదు. తమిళమున నిప్పుడు అన్నాంతశబ్దములు మహద్వాచకములుగఁ గాన్పించుచున్నవి గాని, మొదటినుండియు నవి యట్లు లేవనుటకు నిదర్శనములు గలవు. తొల్కాప్పియము (కొల్లదిగాంమ్: పుటప్ప 49)లో తొమ్మిది యమహ చ్ఛబ్దములందు మాత్రము తుది న-కారము మకారముగ మాఱదని చెప్పఁ బడియున్నది. నన్నూలు (121 సూత్రము) నందు తమిళభాషలోని యమహద్వాచకముల తుది మకారమునకు బదులుగ న-కారమును జేర్పవచ్చు కొన్ని శబ్దములు గలవని చెప్పఁబడినది. ఈ రెంటిని జేర్చి సమాలోచించినచోఁ దమిళమునఁ బ్రాచీనకాలమున న-కారాంతామహచ్ఛబ్దము లనేకము లుండెడివనియు, నవి యిప్పుడు మ-కారాంతములుగ మాఱె

నూహింపవచ్చును. ప్రాచీన తమిళగ్రంథములందు న-కారాంతము ండి నేడు మ-కారాంతములుగ నున్న కొన్ని యమహచ్ఛబ్దములు—పులమ్, పులన్; వళమ్, వళన్; తిఱమ్, తిఱన్; మరమ్, మరన్, అఱన్; నిలమ్, నిలన్; ఇడమ్, ఇడన్; మొద.

మహతీవాచకపదములుకూడ నొకప్పుడు 'అన్'-అంతములుగ నుండె ఉదా. (1) పదుమన్ - దేవి = పద్మాదేవి (2) పెణ్ మగన్ = మగళ్ (3) న్ = అక్కా, అక్కాళ్; (4) అమ్మన్ = అమ్మ, అమ్మాళ్. గంజాము, పట్టణము జిల్లాలలో 'అమ్మన్న, కామన్న' మొదలగునవి యీనాడువారి గా వినఁబడుచున్నవి. ఇందలి 'అన్న' అనుదానికి సోదరుఁడను నర్థము. 'అన్' అంతముపై అకారముచేరుటవలన నిట్టిరూపము లేర్పడును.

కావున, తొలుత నన్నిశబ్దములును మహదమహద్వివక్షలేక న-కారాంతములుగ నుండెననియు, రానురాను సంస్కృతనపుంసకలింగశబ్దముల ననుసరించి మహత్యేతరామహద్వాచకపదములు మకారాంతములుగను, మహద్వాచకపదములు అన్ అంతములుగను విడిపోయెననియు చెప్పవలసియున్నది.

## ద్రావిడములోని యుపవిభక్తియగు త-కారము.

తమిళమున మహద్వాచకముల ప్రథమైకవచన ప్రాతిపదికమును ప్రథమేతర విభక్త్యేకవచన ప్రాతిపదికమును నొక్కటే; కాని, అమహద్వాచకములందు ప్రథమైకవచనమునఁగల 'మ-'కారమునకు బదులుగ ప్రథమేతర విభక్త్యేకవచన ప్రాతిపదికమున 'త-'కారము చేరును. ఉదా:—

| | | ప్ర. ఏ. | ప్రథమేతరైక. | ద్వి. ఏక |
|---|---|---|---|---|
| మహత్. | | మగన్ | మగన్ | మగనై |
| అమహత్ | ప్రాచీనము | అఱన్ | అఱన్ | అఱనై |
| | నవీనము | అఱమ్ | అఱత్ | అఱత్తై |
| | ప్రాచీనము | ఇడన్ | ఇడన్ | ఇడనై |
| | నవీనము | ఇడమ్ | ఇడత్ | ఇడత్తై |

ఇందలి తకారము సంస్కృతమందలి నపుంసకలింగైకవచనరూపము 'భవత్,' 'భరత్' మొదలగువాని ననుసరించుచున్నది.

## ద్రావిడభాషలందు మహచ్చిహ్నమగు 'ళ'-కారము

తమిళ, మళయాళ, కన్నడములలో స్త్రీవాచక ప్రత్యయముగ 'అళ్' మనది కాన్పించుచున్నది. క్రియారూపములందును నీప్రత్యయమే భావ

లయందున్నది. కాని, తెనుఁగునఁ గ్రియలలో నది లోపించినది. తెనుఁగున నేకవచనమున క్రియలలో 'అది,' 'ది' అనునవియు బహువచనమున మహత్తులకువలె 'వారు,' 'రు' అనునవియుఁ జేరుచుండును. తెనుఁగునఁ గొన్ని విశేష్యములందు మాత్రము 'అలు,' 'ఆలు,' 'లు' అనునవి స్త్రీవాచక ప్రత్యయములుగ నున్నవి. ఆలు, కోడలు, చెలియలు, చెల్లెలు, మఱఁదలు, మొదలగునవిట్టివి కొలఁదిగ నున్నవి. 'ఆలు' శబ్దవికారమగు 'ఆఁడు' అనునది స్త్రీవాచక విశేషణముగఁ గూడ నున్నది. కుఇ భాషలో 'కు ఆలి' అనఁగా కుఇ - స్త్రీ; కురుఖు భాషలో 'ఆలీ' అనఁగా స్త్రీ.

తెనుఁగున ఆలు, కోడలు, చెలియలు, చెల్లెలు, మఱఁదలు అనుపదములకు వరుసగా ఆండ్రు, కోడండ్రు, చెలియండ్రు, చెల్లెండ్రు, మఱఁదండ్రు, అనునవి బహువచనరూపములు. వీనిలో 'ండ్రు' అనున దెట్లు కలిగినది. 'రు' అనునది బహువచనప్రత్యయ మగుట స్పష్టము. ఇఁక 'ండ్' అనుదాని వ్యుత్పత్తియేమి? ఇది షష్ఠీవిభక్తి కాదు. కావున, దీనికిని మహద్వాచకప్రత్యయమగు 'ండు' నకును సంబంధ ముండవలెననియు, ఇదియును సంస్కృతమందలి 'న్త' నుండియే పుట్టియుండవలెననియు, ద్రావిడభాషలయం దొకానొకప్పుడు మహన్మహతీరూపములకు భేదము లేకుండెననియు, రానురా నిట్టి భేదము కలుగఁగా, మహన్మహతీరూపములు వేఱయ్యెననియు స్వామినాథయ్యరుగారు చెప్పినారు. ఇది నిజమైనను గావచ్చును. లేదా, 'ఱు' అను బహువచనప్రత్యయము 'ఆల్, అల్, ల్' లపైఁ జేరఁగా 'ల-'కారము 'న' కారముగా మాఱి 'న్ఱ' అను సంయుక్తాక్షరమేర్పడి ద్రావిడభాషా సంప్రదాయానుసారముగ 'ండ్రు' అను నుచ్చారణము కలిగిన దనియైనను జెప్పవచ్చును. అప్పుడు 'ల్' అనునది సంస్కృతమందలి స్త్రీశబ్దభవమగు 'ఇత్థి,' 'తి' లకు వికారములగు 'లి' 'ల్' ల నుండియే ఏర్పడి స్త్రీవాచకమయి యుండును.

ద్రావిడస్త్రీవాచకప్రత్యయము లగు 'ది,' 'త్తి,' మొదలయినవి.

కాల్డువెల్లు ఈ ప్రత్యయములు 'అది' అను నిర్దేశార్థక సర్వనామము నుండి కలిగిన వని చెప్పినాడు. కాని, యిది స్త్రీశబ్దభవమగు ప్రాకృతమందలి 'ఇత్థి' నుండి కలిగిన దనుట స్పష్టము. పాలిభాషయందు, చతురిత్థిఓ=నలుగురుస్త్రీలు; మనుస్సిత్థీ = మనుష్యస్త్రీ; నాటకిత్థిఓ=నటకురాండ్రు; తరుణిత్థీ = తరుణస్త్రీ—మున్నగు రూపము లెన్నియో కలవు. సంస్కృతమునందలి కృతవతీ, బుద్ధిమతీ, బలవతీ, మున్నగు రూపముల ననుసరించియైనను ద్రావిడభాషలోని 'తి, త్తి,' అనునవి కలిగియుండవచ్చునుగాని యిది యసంభవము.

మిట్టి 'తీ' వర్ణకాంత సంస్కృతశబ్దములనుండియైనను, ప్రాకృతము ఇత్థి' యందలి 'త' కారమునకు సరళాదేశము కలిగియైనను నేర్పడి వచ్చును. చూ. సం - భవతీ; ప్రా. భోది.

## యుష్మదస్మదాత్మార్థక సర్వనామములు.

యుష్మదస్మదాత్మార్థక సర్వనామములకు మహదమహద్వివక్షలేదు. ...కి బహువచనరూపములు మాత్రము గలవు. ఈ క్రింది పట్టికలు కాల్డు వ్యాకరణమునుండి యుద్ధృతము లయినను, అందు నవీన పరిశోధనముల దేలిన కొన్ని మార్పులు చేయఁబడినవి. ఈ పట్టికలలో ఉత్తమపురుష ...చనమున అస్మదర్థకరూపము మీఁదిపంక్తిలోను, యుష్మదస్మదర్థక ...ము క్రిందిపంక్తిలోను చూపఁబడినవి. ఒకభాషలో నొకదానికి రెండు ...ములు చూపఁబడినప్పుడు మీఁదిపంక్తిలోనిది కేవల గ్రాంథికమయి, ...రభ్రష్టమయినదో, అగుచున్నదో అని తెలియవలెను.

ఈ పట్టికలలోని యీ క్రింది విషయములను గూర్చి పరిశోధకపండితు ...ు నేకాభిప్రాయులై యున్నారు:—

(1) క్రియాపదములలోని సర్వనామబోధక ప్రత్యయము లతిప్రాచీన ...). నేటి సర్వనామరూపములు ప్రాచీనరూపములనుండి చాల మార్పు ...యున్నవి.

(2) ఉత్తమపురుష సర్వనామములకు 'అన్, ఏన్, యాన్,' అను ...ను, మధ్యమపురుషసర్వనామమునకు 'ఉన్, ఉ, నీ' అనునవి యు ...చీనరూపములు. 'అన్, ఏన్, యాన్, ఉన్, తాన్' అనువానిలోని తుది ...రము ప్రత్యయము. ఈ న-కారము తొలుత నిర్దిష్టార్థక సర్వనామము ...న-కారమే యని స్టెన్‌కోనోపండితుఁడు తెలుపుచున్నాఁడు.

(3) సాధారణముగా ...సర్వనామములందు మ-కారము బహువచన ...ప్రత్యయము. మధ్యమపురుష, ఆత్మార్థకసర్వనామములందు ఈ మ-కారమునకు ...బుగ రేఫము బహువచనబోధకముగ వచ్చును.

(4) యుష్మదస్మదర్థకసాధారణ బహువచనరూప మాదిద్రావిడమందు ...యు కోలుభాషలసంపర్కమువలన నది ద్రావిడభాషలయందు చేరిన ...ు స్టెన్‌కోనోపండితుని యభిప్రాయము.

ఈ పట్టికలం దీ క్రింది విషయములను గూడ గమనింపవచ్చును:—

(1) యుష్మదస్మదర్థకసామాన్య బహువచనములు గల ద్రావిడభాష
ిడు గలవు. వీనిలో నైదు 'న'-కారముతో నారంభ మగుచున్నవి. ఈ
యిదిటిలో మళయాళము, తుళు, కురుఖు, మాల్తో, అను నాలుగు భాషల
యందును ఈ సామాన్యరూపములు మాత్రమే న-కారాదిగ నున్నవి. ఈ
హువచనరూపములు తరువాతికాలమున నాయా భాషలయందు చేరియుండ
చ్చును. వీనిలో న-కారమే యుత్తమపురుషములోని యితర రూపములకును
్యాపించియుండుటయు నసంభవముకాదు.

(2) వ్యావహారిక తమిళభాషలో 'ఎనక్కు', 'ఉనక్కు', అనురూప
ములు 'నేక్కు', 'నోక్కు' అనురూపములం బొందినవి. ఈ నకార మాదిగంగల
ాపములు తుళు, తెలుంగు వర్గముల భాషలలో గ్రాంథికముగ వ్యవహా
మునందును రూఢములైనవి. 'అన్, ఏన్, ఆమ్, ఏమ, ఈమ్' అను రూప
ములే వైకృతిగ 'నా, నే, నీ, మా, మే, మీ' లుగ మాఱియుండవచ్చును.
నిపై మరల నాయా విభక్తిప్రత్యయములు చేరినవి.

(8) ఈ సర్వనామములందలి యాదిమ న-కార మంతకు పూర్వము
ండిన య-కారమునుండి కలిగియుండవచ్చును. చూ. సం. యుమ, తమి. నమన్
ం. యుగ, తమి. నుగమ్. మొద. యకారము మళయాళమునందువలె తొలు
'ఇ' కారముగను, ఆ ఇ-కారము న-కారముగను మాఱియుండవచ్చును.

(4) ద్రావిడభాషలయందలి నిర్దేశార్థక సర్వనామములకును, ఆత్మార్థక
ర్వనామమునకును ఇండో - ఆర్యా భాషలయందును, ఐరేనియను భాషయం
ను నెన్నియో సంబంధములు కానవచ్చుచున్నవి. అట్లే, యుష్మదస్మదర్థకసర్వ
ామములు ద్రావిడభాషల యతిప్రాచీనావస్థయందు 'యా, 'యీ,' లుగా
ండెనని యూహించుట కవకాశమున్నది.

(5) తమిళమునందలి 'నుమ్, ఉమ్, ఉంగళ్' అనువానిలో ఉ-కారమ
ాధారణము. ఈ రూపములు సంస్కృతమందలి 'యుష్మ' అను రూపమునుండి
లిగియుండవచ్చును. అట్లే, గౌడభాషలలోని 'అమి, హామి' మొదలగు రూప
ములం బోలిన ద్రావిడరూపములగు 'ఆము, అమ్మా, అమ్' మొదలగునవి
ప్రాకృతమందలి 'అమ్హె, అమ్హి, అమ్హే' మొదలగు రూపములద్వారా, సంస్కృత
మందలి అస్మచ్ఛబ్దముతో సంబంధము గలిగియున్నవి.

| భాష | ఏకవచనము | | | బహువచనము | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రథమా విభక్తి | ప్రథమేతరవిభక్తి ప్రాతిపదికము | క్రియాపదముల సర్వనామప్రత్యయ | ప్రథమా విభక్తి | ప్రథమేతరవిభక్తి ప్రాతిపదికము | క్రియాపదముల సర్వనామప్రత్యయ |
| తమిళము | యాన్ నాన్ | ఎన్, నే (వ్యవహార) చూ. నేక్కు=ఎనక్కు | ఎన్, ఏన్, అన్ | i. యామ్, నామ్గళ్ ii. నామ్, నామ్బళ్ (వ్యవహార) | i. ఎమ్, ఎమ్గళ్ ii. నమ్, నమ్బళ్ (వ్యవహార) | i. ఎమ్, ఏమ్, ఓమ్ ii. అమ్, ఆమ్ |
| మళయాళము | ఞాన్ | ఎన్, ఇన్ | ... ... ... ... ... | i. నఞ్ఙళ్, ఎఞ్ఙళ్ ii. నామ్, నోమ్, నమ్మళ్, నుమ్మళ్ | i. నఞ్ఙళ్, ఎఞ్ఙళ్ ii. నమ్. | ... ... |
| కన్నడము | ఆన్, యాన్ నాను, నా | ఎన్, నన్ | ఏన్, ఎన్, ఏను, ఏనె, ఎ | ఆమ్, ఆవు, నావు | ఎమ్, నమ్ | ఎవు, ఏవు, ఎవె |
| తెలుఁగు | ఏను, ఏ, నేను, నే, నాను | నా, నన్ | 'ను, ని' * | i. ఏము, నేము ii. మేము, మాము (వ్యవహారము) | i. మా, మమ్ | (ము, మి) * |

* మళయాళమునఁ గ్రియాపదములందు సర్వనామ చిహ్నములు లేవు. తెనుఁగునఁ గ్రియాపదముల సర్వనామ చిహ్నము లా భాషయందలి సర్వనామముల తుది యక్షరములై యున్నవి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | | | | iii. మోనము | iii. మోన, మోనల | |
| తుళు | యాన్ | యెన్, ఎన | ఎ | i. ఎంకుళు, ఎంకుళు | i. యెంకుళె | అ |
| | | | | ii. నను | ii. నమ్, నమ | |
| గోండీ | అన్నా, నన్నా | నా | ఆ, న | అమ్మాట్, మమ్మాట్ | మా | ఆమ్, అమ్, ఓ, |
| కుఇ | ఆను | నా, న | ఇ, ఇజ్, ఎ | i. ఆము | i. మా | ఆము |
| | | | | ii. ఆజు | ii. అమ్మా | |
| కురుఖ్ | ఏన్ | ఎ, ఎంగ్ | ... | i. ఏమ్ | i. ఎన్ | ... |
| | | | | ii. నామ్ | ii. నన్ | |
| మల్తో | ఏన్ | ఎంగ్ | ... | i. ఏమ్ | i. ఎన్ | |
| | | | | ii. నామ్ | ii. నన్ | |

యుష్మదర్థక సర్వనామములు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| తమిళము | నీ, నీయ్ | నిన్, నున్, ఉన్ (వ్యవహార), ఓన్, నో (చూ నోక్కు=ఒన క్కు=ఉనక్కు) | ఈ, ఇ, ఐ, ఆయ్, ఓయ్ | నీమ్, నీవిర్, నీయిర్, నీర్ | నుమ్, ఉమ్, ఉంగళ్ | ఇర్, ఇనిర్, ఇర్ ఈర్ |
| మళయాళము | యీ, నీ | నిన్ | ... | నిజ్జళ్, నీజ్జళ్ | నిమ్, నిజ్జళ్ | ... |

| భాష | ప్రథమా విభక్తి | ప్రథమేతర విభక్తి ప్రాతి | క్రియాపదముల ప్రత్యయము | ప్రథమా విభక్తి | ప్రథమేతర విభక్తి ప్రాతి | క్రియాపదముల ప్రత్యయములు |
|---|---|---|---|---|---|---|
| తెలుగు | ఈవు, నీవు, నీ | నీ, నిన్ | (వు, వి) | ఈరు, మీరు | మీ, మిమ్ | (రు, రి) |
| కన్నడము | నీన్, నీ, నీను | నిన్ | ఈ, ఇ, ఈయె, | నీమ్, నీవు | నిమ్ | ఇర్, ఇరి, ఈరి |
| తుళు | ఈ | నిన, ని | ఇన్, ఎ | నీకుళు, ఈర్ | నికుళె, ఈరె | అరి |
| | | | అ | (గౌరవ.) | | అర్ |
| గోండి | ఇమ్మా | ని | ని, ఇ | ఇమ్మాట్ | మీ | ఈట్ |
| కుఇ | ఈను | నీ, నిన్ | ఇ | ఈరు | మీ, మిన్ | ఏరు, ఆరు |
| కురుఖ్ | నీన్ | నిజ్, నింగ్ | ... | నీమ్ | నిమ్ | ... |
| మల్తో | నీన్ | నింగ్ | ... | నీమ్ | నిమ్ | ... |
| | | | ఆత్మార్థక సర్వనామము | | | |
| అన్నిద్రావిడ భాషలయందును | తాన్ | తన్, తన | ... | తాన్ (తాంగళ్) | తమ్, తమ, (తంగళ్) | ... |

యుష్మదర్థమున గౌరవమును దెలుపుటకు—తమి. తాంగళ్; మళ. తాన్, తజ్జళ్; కన్న. తావు; తెలుగు. తాము తమరు.

బహువచనచిహ్నమగు 'మ'-కారమునకు మూలము.

యుష్మదస్మదాత్మార్థక సర్వనామముల బహువచనరూపములందు 'మ్, ళ్, ర్, ట్' అనునవి బహువచనచిహ్నములుగఁ గాన్పించుచున్నవి. వీని ని మ-కారము నుత్పత్తినిగూర్చి చర్చించుచు కాల్డువెల్లు అది ద్రావిడ షలయందలి సముచ్చయచిహ్నమగు 'ఉమ్' నుండి పుట్టినదని నిర్ధారించెను. ని సంభవమే కాని, యీ 'ఉమ్' అను సముచ్చయ మెట్లు కలిగినది?

ఈ క్రింది ద్వంద్వములను గమనింపదగును—

| తమిళము | తెనుఁగు | సంస్కృతము |
|---|---|---|
| తాయుమ్-తగప్పనుమ్ | తల్లియుఁదండ్రియుఁ | మాతరపితరా |
| | | మాతాపితరా |
| విణ్ణుమ్-మణ్ణుమ్ | విన్నుఁమన్నుఁ | ద్యావాక్షామా |
| అల్లుమ్-బగలుమ్ | రేయుఁబగలుఁ | నక్తోషాసా |
| ఞాయిఱుమ్-తింగళుమ్ | సూర్యుఁడుఁజంద్రుఁడుఁ | సూర్యాచంద్రమసౌ |

పై వానిలో సముచ్చయచిహ్నము జంటలలోని రెండవయవములకును రుచున్నది. ప్రథమేతర విభక్తులందును సముచ్చయచిహ్నము రెండవ యవములకును జేరవలెను.

| | | |
|---|---|---|
| ఎనైయుమ్ | ఎన్-మగనైయుమ్ | అళైత్తాన్ |
| నన్నును | నాకొడుకును | పిలిచెను |
| ఇదు ఉనక్కుమ్ | ఉన్-తంబిక్కుమ్ | పోదు |
| ఇది నీకును | నీ-తమ్మునకును | సమానము. |

ఇది ద్రావిడభాషలలోని మాటతీరు. సముచ్చయచిహ్నను రెండు గార్లు రాకుండఁగూడ పైవానిని చెప్పవచ్చును. 'నాన్, ఎన్-మగన్—ఇరువ యుమ్ అళైత్తాన్,' 'నేను, నాకొడుకు, ఇద్దరిని పిలిచెను'—అని యన చ్చునుగాని, ఇది తమిళ, తెనుఁగుభాషల నుడికారము కాదు.

ద్వంద్వసమాసములలో రెండవయవములకును సముచ్చయచిహ్నమును ర్చుట ఐరేనియనుభాషలో ప్రాచీన అవెస్తా భాషలో నున్నది. "అవెస్తా వ్యాకరణము"న జాక్సన్ పండితుఁడు అవెస్తాభాషయందు ద్వంద్వసమాసము ందలి రెండవయవములును ప్రత్యేకముగ ద్వివచనరూపమున నుండునని చెప్పుచున్నాఁడు. ఉదా. పసు-వీర = పశువులు, మనుష్యులు; పసుబ్య-వీరబ్యా= శువుల చేతను, మనుష్యుల చేతను (§ 879).

ఋగ్వేదమునందును ద్వంద్వసమాసములలోని రెండవయవములును ద్వివచనమున నుండుటయే సర్వసాధారణముగఁ గాన్పించుచున్నది. రెండవ

ములు మాత్రము ద్వివచనమునం దున్నరూపములు ఋగ్వేదమున మాత్రము గలవు.

సంస్కృతభాషయందు 'ఔ' అనునది ప్రథమా - ద్వితీయా ద్వివచన నము, కాని, ప్రాచీనవేదభాషయం దది 'ఆ' గాని 'ఔ' గాని మై స. 'ఆ' తోడి రూపములే తఱచని చెప్పవచ్చును. తరువాతికాలమున సాధారణ ద్వివచన చిహ్నముగ నేర్పడిన తరువాత కూడ 'ఆ' అను గాసము మొదటి యవయవమునకుఁ జేరుచుండెను: ఉదా. మిత్రావరు గార్యాచంద్రమసౌ, మొద.

ద్వివచన చిహ్నమగు 'ఔ' = 'అ-ఉ' లోని 'ఉ' వర్ణము ఇండో-జెర్మా భావస్థయందలి దనియు,అది స్వతంత్ర ప్రత్యయమనియు,దాని యర్థము అయియుండుననియు సుప్రసిద్ధ ఇండో-జెర్మానిక్ పండితుఁడగు బ్రుగ్ చెప్పుచున్నాఁడు. (చూ. బ్రుగ్‌మన్: ఇండో-జెర్మానిక్ భాషాచరిత్రము I. § 284, 289.) 'మిత్రా-వరుణౌ' అనునది 'మిత్రా-వరుణో' అను ండియే కలిగియుండవచ్చును. 'మిత్రశ్చ, వరుణశ్చ' అనునప్పటి 'చ' సముచ్చయ చిహ్నమువంటిదే 'ఔ' కూడనై యుండవచ్చును. నేటి -ఆర్యభాషలలో ఈ 'ఔ' కు సరిపోవు సముచ్చయ చిహ్నములు గలవు:

: అఉ; ఒటియా: ఆఉ, ఓ; బంగాలీ: ఓ; సింధీ: ఔఁ. ఈ రూపములు ృతమందలి అపి, అపి చ, అనువానినుండి ప్రాకృతము 'అబి' ద్వారా ముండునని హోయర్నెల్ పండితుని యభిప్రాయము. ఈ 'ఉ' అను ం అనునాసికత్వమును బొంది ఉఁ, ఉమ్‌లుగా మాఱి యుండవచ్చు ు, ఆ 'ఉమ్' ద్రావిడభాషలయందు సముచ్చయ చిహ్నమైన దనియు, ముచ్చయ చిహ్నమునుండియే బహువచన ప్రత్యయమగు 'మ-' కార పుట్టియుండుననియు స్వామినాథ అయ్యరుగా రభిప్రాయపడినారు.

యుష్మదస్మ దుభయార్థక సర్వనామము.

తెనుఁగులోని 'మేము' 'మనము' అను రూపములకు సరిపోవు రూపము గా ద్రావిడభాషలలోనున్న వీక్రింద చూపఁబడినవి.

| మేము" ప్రథమేతర వి. ప్ర. | మనము" ప్రథమేతర వి. ప్ర. |
|---|---|
| ెఁగు: ఏము, నేము, మేము, మా | మనము, మన, మనల. |
| ళము: యామ్, నాఙ్గళ్ ఎమ్, ఎఙ్గళ్. | నామ్, నాంబళ్, నమ్, నంబళ్. |
| యాళము: ఇఙ్గళ్, ఎఙ్గళ్, ఎఙ్గళ్, ఎఙ్గళ్. | నామ్, నోమ్, నమ్మళ్, నుమ్మళ్ } నమ్. |

| | | | | |
|---|---|---|---|---|
| ళుః | యెంకుళు, ఎంకుళు | యెంకుళె | నమ | నమ్,నమ. |
| ఇః | ఆము | మా | ఆజు | అమ్హా |
| రుఖుః | ఏమ్ | ఎమ్ | నామ్ | నమ్ |
| ల్తోః | ఏమ్ | ఎమ్ | నామ్ | నమ్ |

క్రింది ద్రావిడభాషలలో యుష్మదస్మదుభయార్థక సర్వనామములు లేవు.

"మేము"

| | | | | |
|---|---|---|---|---|
| న్నడము: | ఆమ్, ఆవు, నావు | ఎమ్, నమ్ | ... | ... |
| ందీ: | అమ్హాట్,మమ్హాట్ | మా. | ... | ... |

పై పట్టికలనుబట్టి తేలువిషయములు: (1) గళ్,కళ్,కుళ్, అంతమందు ల రూపము లుభయార్థకములుకావు (2) తెనుఁగున 'నేము', కన్నడమున 'నావు' అనునవి తప్ప న-కారాది రూపము లన్నియు నుభయార్థకములు. ) కుఇ భాషలోని 'అజు' అనునదియు, తెనుఁగున 'మన, మనల', అనున యుఁ దప్పఁ దక్కిన యుభయార్థక రూపము లన్నియు 'న'-కారముతో రంభ మగుచున్నవి. వీనిలో తెనుఁగునందలి 'మన' అను రూపము 'నమ'-న్మ, అను కన్నడరూపములోని యక్షరములు స్థానములను మార్చుకొనుట లన నేర్పడిన దనుకొన్నచో, నదియుఁ దొలుత న-కారాదియే యని చెప్పవల యును. ఈ విషయముల నన్నిటి నాలోచించినచో 'నమ్, నామ్' అను రూప ములే యుభయార్థక సర్వనామములుగ నున్నవని చెప్పవచ్చును. కాని, యీ యుభయార్థక సర్వనామములు తొలుతనుండియు ద్రావిడభాషలయందుండి వి కావనియుఁ దరువాతికాలమున నేర్పడినవనియు స్టెన్‌కోనో పండితుఁడు చెప్పుచున్నాఁడు. ఇది సత్యము కావచ్చును. కొన్ని ద్రావిడభాషలలో నీ రూప ములు లేకుండుటకుఁ గారణ మదియే యై యుండవచ్చును.

మఱియొక విశేషము. ద్రావిడభాషలలో యుష్మదస్మ దర్థకసర్వనామ ములందు య-కారాది రూపము లతిప్రాచీనములు. మళయాళమునందలి ఇ-కారాది రూపములు వానినుండియే పుట్టినవి. ఆ, ఏ, ఈ, లను నచ్చులతో నారంభించు రూపములు తొలుత య-కారాదులై యుండి పిమ్మట అ-కారాదు లయ్యె ననుటకంటెఁ దొలుత అ-కారాదులై యుండి తరువాత య-కారాదు లయ్యె ననుట యుక్తము. నకారాదు లర్వాచీనములు. ఏను, ఏము, ఈవు, ఈరు, ఈరలు, అనునవి నేను, మేము, నీవు, మీరు, మీరలు అను రూపముల ంటె ప్రాచీనములు. ఇట్లే తక్కిన ద్రావిడభాషలయందును.

అయిన న-కారాదులగు నుభయార్థముగల యుష్మదస్మదర్థక సర్వ నామము లెట్లాయా భాషలయందు చేరినవి? సంస్కృతమునం దస్మచ్ఛబ్దము నకు ప్రథమా ద్వివచనమున 'ఆవాము, నౌ' అను రెండు రూపము లున్నవి.

డిటిలో 'నౌ' అనునది యుష్మదస్మదుభయార్థకముగ వేదమునందు
ణముగఁ గాన్పించుచున్నది. చూడుఁడు—
i సహ నౌ యశః సహ నౌ బ్రహ్మవర్చసమ్ (తై. ఆర. 5. 3).
కలసి మనమిద్దఱమును యశస్సు, కలసి మనమిద్దఱమును బ్రహ్మవర్చ
పొందుదుము గాక !).
ii. సహ నావ్ అవతు సహ నౌ భునక్తు
కలసి మనలనిద్దఱను (ఈశ్వరుఁడు) రక్షించును గాక, కలసి మనలనిద్ద
ఈశ్వరుఁడు) (వరముల) ననుభవింపఁ జేయును గాక !
తేజస్వి నావ్ - అధీతమ్- అస్తు
తేజస్వి మనయిద్దఱకు చదివినది అగుఁగాక !
iii. సం నౌ మనాసి ఆకరమ్ (ఏకాగ్నికాండ. 1. 3.)
మన యిద్దఱి మనస్సులను కలిపెదను.
iv. సం ఉ దేష్ట్రీ దిదేష్టు నౌ (ఏకాగ్నికాండ. 1. 11.)
ఉపదేష్ట్రి మనయిద్దఱకు నుపదేశించును గాక !
v. సమ్- అఞ్జన్తు విశ్వేదేవా హృదయాని నౌ (ఏకాగ్నికాండ).
విశ్వేదేవతలు మన యిద్దఱి హృదయములను పరస్పరస్నేహయుక్తము
జేయుదురు గాక !

vi. తాని భద్రాణి బీజాని వృషభా జనయన్తు నౌ (ఏకాగ్నికాండ. 1.14.)
వీర్యవంతులగు దేవతలు మనయిద్దఱి బీజములును ఫలవంతములగు
చేయుదురు గాక !

vii. అహమ్ నావ్ - ఉభయోస్ - సువ్ రోక్ష్యామి (తైత్తిరీయ
త 1. 7. 9. 1.) నేను మనయిద్దఱకు స్వర్గము లేవఁ జేసెదను.

ఇట్టి యుదాహరణముల నింక ననేకముల నీయవచ్చును. ఋగ్వేదమున
అను ద్వివచన మాఱునాళ్లు కనబడుచున్నది. అది యన్నిచోట్ల నుభ
బోధకముగనే యున్నది.

'నౌ' అనున దుభయార్థకముగ వేదకాలపు వ్యవహారభాషయందు
ద్ధముగ నుండి యుండవలెను. ఔత్వము దీర్ఘము గావున 'నౌ'
'గా నుండి; 'నావ్' గా మారియుండును. ద్రావిడభాషలయం దది పరం
న్యాయమున సంక్రమించి 'నామ్'గా పరిణమించిన దని చెప్పవచ్చును.
వేదసంహితలయం దస్మదర్థకసర్వనామ ప్రథమా ద్వివచనమున
మ్' అనురూపము లేదు, 'వామ్' అని మాత్రమున్నది. శతపథ తైత్తిరీయ
హ్మణములందు 'ఆవామ్' అనురూపము కానవచ్చుచున్నది. ద్వితీయా

ద్వివచనమున 'ఆవామ్' అనురూపము సంహితలయందే కాక బ్రాహ్మణము లందును లేదు. 'నౌ' అనునదిమాత్రము గలదు. చతుర్థీ, షష్ఠీ ద్వివచనము లందు సంహితలలో ఈ 'నౌ' అనురూపమే యున్నదిగాని, 'ఆవాభ్యామ్,' 'ఆవయోః' అనురూపములు లేవు. ఐతరేయబ్రాహ్మణమున 'ఆవాభ్యామ్' అనురూపమును, శతపథబ్రాహ్మణమున 'ఆవయోః' అను రూపమును దొలుత గానవచ్చుచున్నవి.

వేదములందు యుష్మదర్థక ద్వితీయా, చతుర్థీ, షష్ఠీ, ద్వివచనములందు అస్మదర్థక ప్రథమా ద్వివచనరూపమగు 'వామ్' అనునదియే యున్నది. ఇట్లు యుష్మదస్మదర్థక సర్వనామములు ద్వివచనమున నేకరూపముం దాల్చి యుండుటచే నది యుభయార్థబోధకముగ వైదిక వ్యవహారభాషలయందును, అందుండి పరిణామమునొందిన ప్రాకృతములందును నేర్పడియుండును.

## ఆత్మార్థక సర్వనామము.

అన్నిద్రావిడ భాషలయందును 'తాన్' ఏకవచనమునందును 'తామ్' బహువచనమునందును నాత్మార్థక సర్వనామములుగా నున్నవి. ఈ సర్వనామము నుపయోగము వివిధముగను విచిత్రముగ నుండును. తమిళమునం దలి యీ ప్రయోగములను గమనింప నగును.

(అ) i. వల్లి తన్ మగనుడన్ వన్దాళ్ = వల్లి తన కొడుకుతో వచ్చెను.

ii. అవన్ తన్ మగనుడన్ వన్దాన్ = అతఁడు తనకొడుకుతో వచ్చెను.

iii. నీ ఉన్ మగనుడన్ వన్దాయ్ = నీవు నీకొడుకుతో వచ్చితివి.

iv. నాన్ ఎన్ మగనుడన్ వన్దేన్ = నేను నాకొడుకుతో వచ్చితిని.

(iii), (iv), లలో 'ఉన్,' 'ఎన్'లకు మాఱుగ 'తన్' అని వాడరాదు.

(ఆ) i. నాళైక్కు తాఙ్గళ్ వరుగిఱదాగచ్-చొన్నార్ = తాము (వారు) రేపు వత్తుమన్నారు.

ii. నాళైక్కు నీ వరుగిఱదాగచ్-చొన్నాయ్ = నీవు రేపు వత్తు నన్నావు.

iii. నాళైక్కు నాన్ వరుగిఱదాగచ్-చొన్నేన్ = నేను రేపు వత్తు నంటిని. (ii), (iii) లలో 'నీ,' 'నాన్' లకు మాఱుగ 'తాన్' అనివాడఁగూడదు. (i) లో నాత్మార్థమభిహితము కాలేదు.

iv. నాళైక్కు తానే వరుగిఱదాగచ్-చొన్నాన్ = రేపు తానే వత్తు నన్నాఁడు.

v. నాళైక్కు నీయే వరుగిఱాయా? = రేపు నీవే వత్తువా?

vi. నాళైక్కు నానే వరుగిఱేన్ = రేపు నేనే వత్తును.

జేయును. ప్రథమా విభక్తియందుగాక యితరస్థలములలో 'తను' అను పదమమూలనున నాత్మార్థము తెలుపఁబడును. ఉదాహరణములు—

i. స్వయం గాతుం తన్వ ఇచ్ఛమానమ్ (ఋగ్వేదము IV. 18. 10.)

ii. యజస్వ తన్వమ్. (ఋ. X. 7. 6.)

iii. మా హాస్మహి ప్రజయా మా తనూభిః (ఋ. IX. 128. 5.)

iv. అగ్నే యజస్వ తన్వం తవ స్వామ్ (ఋ. VI. 11. 2.)

ఋగ్వేదమున 'ఆత్మన్' శబ్దము స్వయమర్థమున క్వాచిత్కముగ వాడఁబడినది.

ఉదా: 'బలం దధాన ఆత్మని' (ఋ. IX. 113); 'యక్ష్మం సర్వస్మాద్ ఆత్మనః ... వివృహామి' (X. 163.) 'ఆత్మానమ్' అను ద్వితీయారూపము స్వయమర్థమున ఋగ్వేదమునఁ బ్రయోగింపఁబడకున్నను దరువాతి సంహితలం దున్నది.

'ఆత్మన్' శబ్దమునకు మాఱుగ 'త్మన్' అను రూపము ఋగ్వేదమునఁ గానవచ్చుచున్నది.

'త్మానమ్, త్మనా, త్మనే, త్మని, త్మన్' అను విభక్తిరూపములు వాడఁబడినవి.

ఋగ్వేదమున నిట్లు స్వయమర్థమునఁ దలచూపుచుండిన 'ఆత్మన్' శబ్ద ము తరువాతిభాషావస్థలో సాధారణముగ వాడుకలోనికి వచ్చినది. సంస్కృ తమున నిది మూఁడు పురుషములందును వాడఁబడుచుండెను: 'తను' అను రూప మంతరించెను. 'త్మన్' అను రూపమును బ్రచారమున నుండెను. ఉదా. ఆత్మభగినీ, ఆత్మహత్యా, ఆత్మసుతః, ఆత్మగృహమ్; * త్మ - సుతా, * త్మ- పితా, * త్మ - భర్తా, మొ॥.

పాలిభాషలో 'ఆత్మన్,' 'త్మన్' శబ్దముల వికృతులగు 'అత్త, అతు మ, తుమ' అనునవి స్వయమర్థమున నున్నవి. సమాసముననివి 'అత్త, అతు మ, తుమ' అని యున్నవి. అశోకుని శాసనములలో 'అత్తపాషండ' = తన మతము అనురూపమున్నది. నేఁటి గౌడభాష లన్నిటిలోను 'ఆత్మన్' శబ్దభవ మగు 'ఆప్' అను రూపము స్వయమర్థములోను మధ్యమపురుష సర్వనామ మునకు మాఱుగ గౌరవార్థమందును వాడుకలో నున్నది.

కాల్డువెల్లుపండితుఁడును ఆత్మార్థక సర్వనామము విషయమునఁ ద్రావిడ భాషలకును ఇండో-యూరోపియను భాషలకును గల సంబంధము నొప్పుకొ నుచు నీక్రింది సదృశరూపముల నిచ్చియున్నాఁడు:-డోరికు, 'హేవోస్;' ఇయో లియక్, 'కేవోస్', గ్రీకు, 'ఎ-కెయ్యోస్,' ప్రాచీన పర్షియను, 'తక్స = తనస్'

'తనము' అను ప్రత్యయమునకును సంస్కృతములోని 'తత్త్వమ్' నకును గల సంబంధమును గూడ నాతఁడు నిరూపించెను. కాని, 'తనము' వేదభాషలోని 'త్వనమ్' నుండి ప్రాకృతరూపమగు 'త్తణమ్' ద్వారా ద్రావిడభాషలలోఁ జేరినదని మఱియొకచోట నిరూపించియున్నాము.

కాల్డువెల్లుచెప్పిన 'తంబిరాన్, తమప్పన్, తమక్కన్' మొదలగు వానిలో నాదియందున్న 'తమ్, తన్, త, మొదలగునవి గౌరవార్థకములు గావ నియు, నవి 'ఆత్మన్' శబ్దభవములనియుఁ జెప్పవలెను. ఇవి 'ఆత్మన్' శబ్దరూపాంతరమగు 'త్మన్' కు పాలిభాషారూపమగు 'తుమ' ద్వారా కలిగినవి. 'తంబి, తంగై' అను తమిళరూపములందు గౌరవార్థము పొసగదు.

## సంస్కృత సర్వనామములు : తెనుఁగునఁ జేరినవి.

సంస్కృతమున 'సర్వ' శబ్ద మాదియందు గల గణమునఁ జేరిన పదములకు సర్వనామములని పేరు. తెనుఁగున సంస్కృత సర్వనామములు కొన్ని మాత్రమే ప్రచారములోనికి వచ్చినవి. వానికైనను గొన్ని తత్సమ రూపములు మాత్రమే కొన్ని యర్థములందు కలిగినవి.

సర్వ—దీనినుండి యమహద్వాచకమగు 'సర్వము' మాత్రము కలిగినది; దీనికి సంస్కృతమున 'సర్వే' అను బహువచన రూపమున్నట్లు 'సర్వములు' అను రూపము తెనుఁగున లేదు. సర్వ అను స్త్రీలింగ మహతీవాచక రూపముగాని, 'సర్వుఁడు' అను మహద్వాచక రూపముగాని కలుగలేదు. 'సర్వులు' అను మహన్మహతీ సామాన్యబహువచన రూపము వ్యవహారమున నున్నది.

విశ్వ—దీనినుండి 'విశ్వము' అను రూపము కలిగినదికాని, యది 'ప్రపంచము, లోకము,' మొదలగు నర్థములందే వాడఁబడుచున్నది. దానికి 'సమస్తము' అను నర్థమున వ్యస్తప్రయోగము లేదు. 'విశ్వ' అను స్త్రీలింగ మహతీరూపము లేదు. 'విశ్వుఁడు' అను మహద్రూపముగలదు గాని, అది 'ఒక గణదేవత' అను నర్థమున సంజ్ఞావాచకపదముగ మాత్రమున్నది.

ఉభయ—దీనినుండి 'ఉభయము' అను రూపము గలిగినది. 'ఉభయములు' అను బహువచనరూపముగాని, 'ఉభయ' అను మహతీరూపముగాని

లేవు. 'ఉభయులు' అను మహన్మహతీ సామాన్య బహువచనరూపము వ్యవహారమునఁ గలదు. గ్రంథములందును నున్నదేమో నాకు కనఁబడలేదు.

అన్య—అన్యము, అన్యములు, అను రెండురూపములును గలవు; 'అన్య' అను స్త్రీలింగరూపమునకు 'పరకీయ, ఇతరుని భార్య' అను నర్థము మాత్రము గలదు. (శ. ర. లో లేదు.) 'అన్యుఁడు, అన్యులు' అను రెండు రూపములును గలవు. (శ. ర. లో లేవు.)

అన్యతర—అన్యతరము; అన్యతరుఁడు (శ. ర. లో లేదు) అను రూపములు గ్రంథములందు గలవు. 'అన్యతర' అను రూపమున్నదేమో తెలియదు.

ఇతర—ఇతరము (శ. ర. లో లేదు), ఇతరుఁడు, అను రూపములు గలవు; 'ఇతరులు' అనునది మహన్మహతీ సాధారణము. ఇతర, ఇతరలు, అను రూపములు నాకుఁ గానరాలేదు.

సమ—సమము, సముఁడు (రెండును శ. ర. లో లేవు); 'సమ' అను రూపము 'సంవత్సర'మను నర్థమున మాత్రము తెనుఁగున వ్యస్తముగ గ్రంథములందు ప్రయుక్తమయినది.

పూర్వ—పూర్వము, పూర్వుఁడు, అను తత్సమరూపములు గలవు. 'పూర్వ' అను స్త్రీసమ రూపము లేదు. శ. ర. లో పూర్వ = తూర్పు, తొలిదిక్కు అను నర్థ మీఁబడినది. వ్యస్తముగా నా పరిమునకుఁ బ్రయోగము గానరాలేదు. 'అది దీనికంటె పూర్వము; వాఁడు నాకంటె పూర్వుఁడు; ఆమె నాకంటె పూర్వ (?), పూర్వురాలు (?).'

పర—పరము, పరుఁడు, అను రూపములు గలవు; 'పర' అను స్త్రీసమ రూపమునకు వ్యస్తప్రయోగము లేదు. కాని, అతనికి తన, పర, అనే భేదము లేదు' అను వ్యవహారము గలదు. ఇందు 'తన, పర' అనునవి విశేష్యములా, విశేషణములా ?

దక్షిణ, ఉత్తర—ఇవి దిగర్థకములుగ 'దక్షిణము, ఉత్తరము' అను రూపముల నున్నవి. వీనికి 'కుడి, మీఁదు' అను నర్థములందు వ్యస్తప్రయోగము లేదు.

అపర—'అపరము' అను రూపము వ్యవహారమున నున్నది గాని, దానికి 'పితృసంస్కారా ద్యంత్యసంస్కారము, అను నర్థము గలిగినది.

అవర—'అవరము, అవర, అవరుఁడు' అనువానికి గ్రంథములందు మాత్రము ప్రయోగములు గలవు.

స్వమ్—దీనికి 'స్వము=తాను' అను నర్థము శ. ర. లో నున్నదిగాని, వ్యస్తముగ ప్రయోగములు కానరావు. 'స్వమ్ము'నకుఁ దద్భవరూపమగు 'సొమ్ము' అనురూపము 'ధనము' అను నర్థమున నున్నది.

అంతర—'అంతరము' అను తత్సమరూపము మాత్రము గలదు.

ఏక—'ఏకము' అను తత్సమ రూపము గలదు; 'ఏక' అను స్త్రీలింగ స్త్రీ సమరూపముగాని, 'ఏకుఁడు' అను మహద్రూపము గాని, తెనుఁగునఁ గానరాలేదు. 'అనేక' శబ్ద మమహద్వాచక మగునప్పుడు 'అనేకము' అను రూపము నొందును. దీనికి 'అనేకములు' అను బహువచనరూపమును గలదు. 'అనేకులు' మహన్మహతీరూపము. గుణవాచకపదము నేకవచనముతోఁ గూడ 'అనేకము' అని వాడవచ్చును; ఈతని పౌరుష మనేకము (భార. ఆర. VI. 210); అనేకభంగులన్ (భార. అశ్వ. III. 206); అనేకభంగిన్ (భార. విరా. III. 164).

ద్వి—దీనినుండి పుట్టిన ద్వయము, ద్వికము, అను రూపములు మాత్రము తెనుఁగున నున్నవి.

సంస్కృత సర్వనామములగు ఉభ, డతర, డతమ, త్వత్, త్వ, నేమ, సిమ, అధర, స్వమ్, త్యద్, తద్, యద్, ఏతద్, ఇదమ్, అదస్, యుష్మద్, అస్మద్, భవత్, కిమ్, అనునవి తెనుఁగునఁ దత్సమరూపములను బొందలేదు. వీనిలో డతర, డతమ, నేమ, సిమ, అనువానికి సంస్కృతమందే ప్రచారము విరళము. సంస్కృతమునుండి తెనుఁగునఁ దత్సమములయిన సర్వనామ పదము లన్నియుఁ దక్కిన శబ్దములవలెనే యాయా విభక్తి ప్రత్యయములను బొందును. సంస్కృత సంఖ్యావాచక పదములలో ఏక, ద్వి, అనునవి మాత్రము సర్వాదులలోఁ జేర్పఁబడినవి. తక్కిన సంఖ్యావాచక పదము లేల చేరలేదో తెలియదు. 'ద్వి' నుండి పుట్టిన 'ద్వయము, ద్వికము'లు తెనుఁగునఁ జేరినట్లే, 'త్రి' నుండి పుట్టిన 'త్రయము, త్రికము, లు గూడ చేరినది. చతుర్, పంచ, షష్, సప్త, అష్ట, నవ, దశ, లనుండి 'క'వర్ణకముతోఁ గూడిన తత్సమరూపములు గలవుగాని చతుష్కము, పంచకము, షట్కము, సప్తకము, అష్టకము, నవకము, దశకము, అనువానికి సమాసములందే ప్రయోగము గలదు; వానికి సంఖ్యార్థమున వ్యస్త ప్రయోగము లేదు. ఇట్లే, యే సంస్కృత సంఖ్యావాచక

పదముమీఁద నైనను కవర్గకమును జేర్చి తత్సమముల నేర్పఱుపవచ్చును. అట్టివాని కన్నిటికిని గ్రంథములందు ప్రయోగములు దొరకవు. ఇట్లున్నను నాయా సంఖ్యావాచక పదముల పూరణార్థక రూపములను మాత్రము తెనుఁగునఁ దత్సమములఁ జేసికొనవచ్చును: ప్రథమము, ప్రథమ, ప్రథముఁడు, ద్వితీయము, ద్వితీయ, ద్వితీయుఁడు; మొద. వింశతి, చతుర్వింశతి, షష్టి, సప్తతి, అసీతి, నవతి, శతము, శతకము, సహస్రము, లక్ష, కోటి, అను నవి దెనుఁగునఁ దత్సమములయి వ్యస్తప్రయోగము గలవగుచున్నవి. త్రింశత్తు, పంచాశత్తు, అను రూపములు తెనుఁగునఁ బ్రయోగములందు గానరావు. సమాసములందు పూర్వావయవములుగనో యుత్తరావయవములుగనో యన్ని సంస్కృత సంఖ్యావాచక పదములను వాడుకొనవచ్చును.

## ప్రాకృత సర్వనామములు.

అస్మచ్ఛబ్దమునుండి పుట్టిన 'అహం, అస్మై, మహ' మొదలయిన విభక్తిప్రత్యయములు గల రూపములనుండి 'ఏను, నేను, ఏము, మేము, మన, మనము, మా,' మొదలయిన తెనుఁగు సర్వనామరూపములు పుట్టియుండును. కాని, యిట్టి సర్వనామముల చరిత్రమును ప్రాకృతావస్థనుండి నింకను బూర్వకాలమునకు, అనఁగా ఇండో-ఐరేనియను భాషల కాలమునకు దీసికొని పోవలయుననియుఁ జాలవఱకు వానితో సంబంధించిన రూపములతోఁ బ్రాచీన ఇండో - యూరోపియను భాషల నన్వేషింపవలె ననియు నింతకుముందు సూచింపఁబడినది.

ఇట్లే సంఖ్యావాచకము లగు సర్వనామముల చరిత్రముతోఁబాటుఁగూడ నిండో - ఐరేనియను భాషల చరిత్రము నన్వేషింపవలసియున్నది. కాని, ప్రాకృతభాషలనుండి యర్వాచీనకాలమునఁ దెనుఁగున జేరిన కొన్ని సంఖ్యావాచకపదములు గలవు. వీనిలోఁ గొన్ని నేఁటి వ్యవహారమునఁగూడ నున్నవి; కొన్నిగ్రంథములందు మాత్రము నిలిచినవి; వానిలోఁ గొన్ని సమస్తపదములం దవయవములై తద్భవావస్థయందు గుఱుతింప వీలులేకయున్నవి.

(1) ఒకటి: ఎక్కటి: కనలు బింకపుఁ గింకఁగెలుగు వేఁడిమి యెల్ల నొక్కటిహై యొడలత్తైననఁగ (లక్ష్మీశ. II.) =ఒకటిగాఁ గలిసి; ''భీముఁడానొక్కటిఁ దాఁకె దిక్కరి సహింపక సింహముఁ దాఁకునట్టులు'' (భార. అర. IV.)=ఒక్కఁడే, అసహాయుఁడై, ''ఎక్కటికయ్యము. ఎక్కటిపోరు, మొద. — ఎక్కటీఁడు = అసహాయుఁడు, ''ఇగురుకై జీరపు టెక్కటీలకు గుజ్జుపఱుపు మావిడి కట్టుబడిగఁ

జేసి (చంద్ర.):— ఎగ్గతము = ఏకాంతము, ఏకాంతస్థలము, "ఎగ్గతం బునఁ దాను గారగ్గిఁ గాలెనటె. (భార. ఆశ్వ. II.); అయ్యువ్వ యతఁ డెగ్గ తంపుఁజోట నరయది క్కెవ్వరును లేనియట్టి తెగుట నొందఁగలవాఁడుగాఁ బల్క (భార. మౌ. I.);- ఏకతము = ఒంటరి, ఏకాంతము;—ఇవి యన్నియు కేవల గ్రాంథికములు.

ఏకలీఁడు = 'ఒంటరి'అను అడవిపంది; ఈ పదము గ్రంథములందును వ్యవహారమునందునుగలదు; ఎక్కము: అంకెల స్థానము నెంచునప్పుడు'ఎక్కం, దహాం' అని యనుట గలదు. 'ఎక్కము' లనఁగా గుణకారమును దెలుపు నంకె ల వరుసలు; వీని కనంతపురమున 'ఒంట్లు' అనియు నందురు. ఏకాండము=ఏక ఖండము, అతుకులులేనిది, "మలిచి యేకాండముగనొక్కమానికమున,వేడ్క నెద్దాని నిర్మించె విశ్వకర్మ, యట్టి దేవేంద్రదత్త మహార్ఘ్యనూత్న వీటికాపేటి మామ భూవిభున కొసగె (నైష. VI.); ఏకాండపుఁ దెరచీరలు (కవిక. III.); ఏకోను = సమష్టి, అంతయును గలిసినది; ఇది కేవల వ్యావహారికరూపము. దీనిని 'ఏక+ఊను' అని విభజింపవలెను; 'ఊను' అనునది 'ఊన' శబ్దభవము; 'ఊన' అనఁగా 'ఒకటి'; ఇంగ్లీషు 'one' (వన్); 'unit' (యూనిట్), 'unite' (యునైట్), 'union' (యూనియన్), మొదలగువానితో సంబంధిం చినది. 'ఏకోను' అనఁగా 'అంతయును ఒక్కటిగా' అని యర్థము.

వంచే, వంచేము, వంచి, అను మూఁడు పదములును ద్యూతమునందు ఒకటికిఁ బర్యాయవాచకములుగ గ్రంథములందు గాన్పించుచున్నవి. ఇవి 'ఊన' శబ్దభవములై యుండును. ఉకారమునకు సంప్రసారణము గలిగినది; 'చ' వర్ణము సమూహార్థకమగు ప్రత్యయము; చూ. రెంచ = రెంటి సమూహము. సోగటాలాటయందు రెండు పాచిక లుండును. ఒక్కొకపాచికకు నాలుగుప్ర క్కలు, ఒకొక్క పాచిక ప్రక్కలపై వరుసగ ఆఱు, నాలుగు, మూఁడు, ఒకటి, x చుక్కలుండును. రెండు పాచికలను తాళించి వేసినయెడల 6 + 6 = 12; 6 + 4 = 10; 6 + 3 = 9; 4 + 4 = 8; 6 + 1 = 7;4 + 3 = 7; 3 + 3 = 6; 4 + 1 = 5; 3 + 1 = 4; 1 + 1 = 2; అను తొమ్మిది విధములైన పందె ములు పడును. ఒకటి, మూఁడు, పదకొండు, పడవు. 'ఒకటి' అను నర్థముగల ప్రాకృత రూపమగు 'వంచ'ను తీ, చౌ, మొదలగువానితోఁ గలిపిన వాని కొకటి చేర్చవలెనని యర్థమగును; తీ= 3 + వంచ = 1 = 4; చౌ=4 + వంచ= 1 = 5; మొద. ఈ పందెముల వివర మీ క్రింది పద్యమున నున్నట్లు, శ. ర. కారుఁ డుదాహరించి యున్నాఁడు. అత్రీవం, చిత్రిగ, దుగ, సత్తా, దచ్చాక, వంచ, చౌవం-, చీరై, దిత్రిగ యద్దుగ, బద్రలు, చిత్తం

బునఁ దలఁచినట్లు చేతికిఁ దెచ్చున్" (ఉ. హరి. III.); ఇందు, తీవంచ = 3 + 1 = 4; ఇత్తిగ = 3 + 3 = 6; దుగ = 1 + 1 = 2; సత్తా = 6 + 1; 4 + 3; దచ్చౌక = 4 + 4 = 8; చౌవంచ = 4 + 1 = 5; ఇంతవఱకును సరిపోయినది గాని, వంచ = 1; తిగ = 3; అను పందెములు పడుటకు వీలులేదు; 'అద్దుగ' యనఁగా నేమో యర్థము తెలియదు. అ + దుగ అని పదచ్ఛేదము చేసిన యెడల 'దుగ' కుఁ బునరుక్తి గలుగును. పై పద్యము సరియైన పాఠము కాదేమో. 'అద్దుగ' కు మాఱుగ 'ఇత్తిగ' అనియు 'వంచ చౌవంచ'యనుటకు 'వంచ తీవంచ' యనియు నుండవలయునేమో. అట్లయినచో తీవంచ = 3 + 1; ఇత్తిగ = 3 + 3; దుగ = 1 + 1; సత్తా = 6 + 1; 4 + 3; దచ్చౌక = 4 + 4; వంచ తీవంచ = 1 + 4; ఈరైఁదు = 6 + 4; తిగయిత్తిగ = 3 + 6 = 9; బద్ర = 6 + 6 = 12; అను లెక్క సరిపోవును.

'పగడ, పగడము' అను పదములు సోగటాలాటయందు సారెపై నుండు నొంటి చుక్కకుఁ బేరు. ఇది దేశ్యపదమని శ. ర. కారుఁడు వ్రాసి నాఁడు కాని, యవి 'ప్రవాళ' శబ్ద భవములై యుండును. మణులతో చేయఁ బడినపాచికలపై నెఱ్ఱని చుక్కలుగఁ గాన్పించుటకు రాజులు ప్రవాళములను పొదిగించుట యాచారముగ నుండెను. పగడ, పగడములు, తొలుత సంఖ్యా వాచక పదములు గాకున్నను సోగటాలాటయందలి పరిభాషనుబట్టి వానికి 'ఒకటి' యను నర్థము గలిగినది.

(2) రెండు: 'దుగ, దువ' అనునవి 'ద్వికా' శబ్ద భవములు. ఇందలి 'దు'వర్ణమే దుప్పటి, దుగులము, దుగ్గాని, అను పదములందును గాన్పించు చున్నది. జత, జంట, జంటె, జంటే, జట్టి, జోత, జోత (తా)ము, అను పద ములకు 'యుక్త' అనునది మూలము. జమిలె, జమిలి, అమడలు, అను పద ములకు 'యమళ' శబ్దము మూలము. 'దోయి'కి 'ద్వయీ' ప్రకృతి; దొందము, దొందు'లకు, ద్వంద్వ శబ్దము ప్రకృతి. 'ద్వి' శబ్దము 'బే' గా మాఱి బేడ = బే అణా = 2 అణాలు; బెత్త, బెత్తిలి, బేఁటు, అనునవి 'ద్విధా' శబ్ద భవము లైయుండును. బేడిగ (= భాగధేయము, పన్ను) పదమునకు రెండవ భాగము, సంగోరు, అని యర్థము గావున నిందలి 'బే'కిఁ గూడ 'ద్వి' యనునది మూలమై రెండను నర్థమును గలిగించుచున్నది. బొంకిత = ద్విః కృత = దుగ; దుబాసి = ద్విభాషి; దుళ్ళాలువ, దుప్పటి, మొదలగు పదములందును 'దు = ద్వా, ద్వి' కవఁబడుచున్నది.

(3) మూఁడు: తిగ, తివ, తీ,లు 'త్రిక' శబ్దభవములు; తికమక, తిక్కటమక్కట మొదలగు పదములలో 'త్రి' మఱుఁగుపడి యున్నది. తికమక = త్రికర్ణక = ప్రా. తికణ్ణక- 'ఉవిదపిండు తోడ, నవ విమానము తోడఁ, దనదు విద్యతోడఁ ధరణి ద్రెళ్లి, తిరిగి లేవలేక తికమక గుడువంగ (భాగ. VI.); ఒక మొగము గాక దివిజులు తికమక గొని వైరులెల్ల దీకొని తమ్మునన్, బకపక నగ వకవకలై లుకలుకఁ బరువెత్తిరోడి లోఁగొను భీతిన్ (భాగవ. VI.)

(4) నాలుగు: ఇద్దుగ = ఇరు × దుగ = రెండు రెళ్లు; తీవంచ = తీ+వంచ మూఁడున్నొకటి; తిగ+వంచ = మూఁడున్నొకటి;-సం. చతుర్ = ప్రా. చఉ= తెనుఁగు: చవు, చౌ; దీనినుండి 'చౌకట్టులు చౌకము, చౌకళించు (-ంత), చౌకాశిగుడియ (కాలిపీఁట, - గంటి, - డోలు,-పదము,- పుటము,- సాల), మొదలగు సమస్తపదములు గలిగినవి. 'చౌదరి' = సం. చతుర్థహారిక=ప్రా. చౌత్థహారిఅ=* చౌత్థహారిఅ=*చౌద్ధారిఅ=తెనుఁగు: చౌధరి, చౌదరి;పన్నులలో నాల్గవభాగమును గొని యేలికపరముగా నొక ప్రదేశమునఁ బ్రభుత్వమును సాగించువాఁడు; చావడి = ప్రా. చతుష్పథి; చౌషష్టి = సం. చతుష్షష్టి = 64; చౌసీతి = సం. చతురశీతి = 84; మొద. చవలము, చివుక, ముచ్చివుక, ముచ్చౌక, అను నాణెముల పేళ్లలో చతుశ్శబ్దభవమగు 'చౌ' అనునది నిలిచి యున్నది. చివుక = నాల్గవభాగము, రూపాయలోఁగాని, అన్నిటి కంటె పెద్ద నాణెములోఁగాని నాల్గవభాగము; మూఁడుచివుకలు 'ముచ్చివుక, ముచ్చౌక' యగును. చచ్చౌకము = సం. చతుశ్చతుష్కమ్ = ప్రా. చఉచ్చఉక్కమ్;— అష్టా చెమ్మా = అట్టచెమ్మ, అను గవ్వలాటలో 'చెమ్మ' అనఁగా నాలుగు; ఇదియు చతుశ్శబ్దముతో సంబంధించినదే.—'పుంజి' అనఁగా నాలుగని గంజాము, విశాఖపట్టణము జిల్లాలలో నర్థమున్నది: నాలుగు పుంజీల వంకాయలు, పిడకలు, రూపాయలు, మొద. పుంజీ = సం. పుంజికా = ప్రా. పుంజిఆ; 'రాశి, ప్రోగు' అని యర్థము. రెండురెండుగా నెంచినవి జతలు; నాలుగు నాలుగుగా నెంచినవి పుంజీలు; అయి దయిదుగా నెంచినవి చేతులు; పది పదిగా నెంచినవి పదులు; ఇరువదియైదిరువదియైదుగా నెంచినవి పాతికలు; ఎనుబది యెనుబదిగా నెంచినవి పణములు; నూఱు నూఱుగా నెంచినవి నూర్లు, వందలు. 'పుంజి' సమూహావాచకము; 'నాలుగు' కు రూఢిగ నిలిచినది.—ఉడ్డ =సం. ఊర్ధ్వ = ప్రా. ఉడ్ఢ; ఇదియు రాశివాచకమే; పుంజీవంటిది; నాలుగను నర్థమును బొందినది; ఉడ్డకేలునేలుపు = చతుర్భుజుఁడు, విష్ణువు; ఉడ్డమోముదేలుపు = చతుర్ముఖుఁడు, బ్రహ్మ; ఉడ్డపల్లంచి = నాలుగు గవ్వల

తో నాడెడు నొక బాలికాక్రీడ; 'ఉడ్డ' కు 'ఉడ్డా', అని రూపాంతరము. ఈ పదము లిప్పు డెక్కడనైన వ్యవహారమున నున్నవేమో తెలియదు.

(5) అయిదు: చౌవంచ, చవ్వంచ, చౌవంచి = చౌ+వంచ = వంచి =నాలుగున్నొకటి,ఐదు; అంజి=గవ్వలతోనాడు నొక బాలికాక్రీడ;తమిళము, మలయాళము: అంజు, సం. పంచన్.

(6) ఆఱు: ఇత్తిగ = ఇర్+తిగ = రెండుమూళ్లు; తిగ = సం. త్రిక;- ద్వితి = ద్వి+త్రి = రెండుమూళ్లు = ఇత్తిగ.

(7) ఏడు: సత్తా, సత,=సం. సప్తన్; 'చక్కు'-ఇది 'సప్తక' శబ్దభవము కావచ్చును. ద్యూతమునందు 'ఏడు' కు 'పగడ' అనికూడ వ్యవహారముగలదు.

(8) ఎనిమిది: దచ్చౌక = సం. ద్వా X చతుష్క; దచ్చి = సం. ద్వా + చతుష్కికా; -అట్ట (చెమ్మ) = అష్ట-; అట్ఠము = సం. అష్టకము = వేదభాగము.

(9) తొమ్మిది: ముత్తిగ = మూ(డు) + తిగ = మూడు మూళ్లు.

(10) పది: దహం, దాహం = సం. దశత్; సంఖ్యాస్థానముల నెంచునప్పుడు 'ఎక్కం, దహం, (దాహం), అని యందురు; -బంతి = సం. పంక్తి.

(12) పన్రెండు : బర్ర, బార, బారా: ఈ మూడును 'ద్వాదశ' శబ్దభవములు; బారసి, బారాసి' అనునవి.'ద్వాదశీ' శబ్దభవములు;-నత్తిగ=నల్ + తిగ= నాలుగు మూళ్లు; పదింబేడు = పది + బేడు; బేడు=సం. ద్వితయ; చూ. బేడ = బేఅణా; ముచ్చౌకము = మూ(డు) + చౌకము = మూడు నాలుగులు.

(13) పదుమూడు: తేరసి = సం. త్రయోదశికా = ప్రా. తేరసి ఆ.

(32) ముప్పదిరెండు: బత్తీసు = సం. ద్వాత్రింశత్ (పండితా. పు. 410).

(37) ముప్పదియేడు: సత్తీసు=సం. సప్తత్రింశత్ (పండితా. పు.142).

(56) ఏఁబదియాఱు: ఛప్పన్న = సం. షట్పంచాశత్; ఛప్పన్నదేశ ములు.

(64) అఱువదినాలుగు: చౌషష్టి = సం. చతుష్షష్టి.

(72) డెబ్బదిరెండు: బాహత్తర, (-రి) = సం. ద్విసప్తతి.

(84) ఎనుబదినాలుగు: చౌసీతి = సం. చతురశీతి.

ప్రాకృతమునుండి వచ్చిన యాయా సంఖ్యావాచకపదములకుఁ గొన్ని ప్రయోగములు.

'వనితమెచ్చవు వంచివైచిన ననుచు, ననఘుఁ డచ్చవువంచి యను దాయ మాడు; నాకు నాతీ వంచనయె గెలుపంచు, నాకాంతుఁ దీవంచ యను దాయ మాడు; ఒడలుసత్తా శివయోగులకంచుఁ దడయకయాడు సత్తా యని పడిన; వలవ దచ్చౌకమాటలు నీకు ననుచు నలఘుఁడు దచ్చౌకమను దాయమాడు (పండితా. పురా. పు. 125); అత్తీవంచ తిగదుగయు, సత్తాదచ్చౌకవంచ చౌవంచిరైఁ దిత్తిగ యిద్దుగ బద్రలు చిత్తంబునఁ దలఁచినట్లు చేతికిఁ దెచ్చున్ (ఉ. హరి. III. 121-ఈ పాఠముకూడ తప్పే; చూ. వైని. (1) వంచ-జత భారా పది దచ్చి యిత్తిగముగా చౌవంచ తీవంచ బొంకిత (-ద్వికృత = దుగ) సత్తిక (సత్తిగ?) యంచు నాజాను భయాంగీకారమేపారఁగన్ (నిరం. III. 120); ఉన్నవాఁడీతఁడే తిగకన్నులేని శంభుఁ డవుచును శంభుఁ డీ సనుయ మునను (చంద్రాలో. 15); వామాక్షి యొకతె తీవంచ వేయుమటన్న నది శిల్పి రాకె యెట్లగు నటంచు (చమత్కా. I. 43); పొడవైన మువ్వంచఁ బోలుచునట్లుగ నేనుఁగులకు గుజ్జములకుఁ గొట్టములును (భార. ఉద్యో. I. 93); కంకణంబులు మ్రోయఁగా దుగ బెత్రి చౌవం చంచుఁ బందెముల్ వైచువారు (చమత్కా. I. 136); దచ్చౌక చౌవంచి యిత్తిగ బారా దుగ యంచుఁ జిల్కలోన లుద్దీపింపఁ దా దవ్వులన్ (కళా.III. 131);వడి దచ్చి యేనుఁ గుల్ కడభూమిఁజేరుట మాఘాక కటు నిల్వనోడికాదె (సారం. I. 37); మంపు దులకించు ముత్తిగ మానికముల మొలకనిద్దా కడాని సొమ్ములమెఱుంగులు (రసిక. III. 47); హారారాహారొడిం బోరిరి బారాసి దినంబు లవనిప్రజలు దలంకన్ (ఆము. III. 14); చేడియకోపము పాడిదప్పె నా బారామాటకు (చమత్కా. I. 89); మొద.

ప్రాకృత సంఖ్యావాచకరూపములు కొన్ని నాణెములు, కొలతలు, మొదలగువానిఁదెలియఁజేయుపదములందు కానవచ్చుచున్నవి; పావ (వు) లా= సం. పాదికా = రూపాయలో నాల్గవుభాగము; చివుక, చవలము, ముచ్చివు (-చ్చౌ)క (-సం. చతుష్కక); బేడ = బే (ద్వి) అణా; అణా = ప్రా.

అద్ధా = సం. అర్ధ = సగము (ఎందులోని?); దుగ్గాని, దుగులము (దు = ద్వా ద్వి); పాతిక = సం. పాదిక = నాలుగవుభాగము (సాధారణముగా నూటిలో; ఇతర సంఖ్యలయందును గావచ్చును; పాతికభాగము = నాలుగవభాగము); వీసె = సం. వింశతికా = ప్రా. వీసాఇయా = ఇరువదియవ భాగము (ఎందులోని; ఒకానొకప్పుడు 20 వీసెల బరువేమో. కంట్లమా ?) వీసము = సం. వింశతికమ్ = ప్రా. వీసఇయం = దేనిలోనైనను ఇరువదియవ భాగము; మాసము మాతి మతిరియొక యర్థమున రూఢియైనది; ఇప్పుడు పదునాఱవు భాగము; పదలము = పది పలములు; ఏబదలసు, ఏబలము, ఏబులము = 5 పలములు; అడ్డ = సం. అర్ధ = ప్రా. అద్ధ, అడ్ఢ=కుంచములో సగముభాగము (రాజమహేంద్రవర వ్యవహారము; గంజాము విశాఖపట్టణములలో కుంచమునకు నాలుగడ్డలు); సోల = సం. షోడశ = ప్రా. సోళ అ = హిం. సోళా = పదునాఱు, పదునాఱవ భాగము (ఎందులో ? కుంచములో అయిఉండును; అప్పుడు కుంచమునకు నాలుగడ్డలు, అడ్డకు నాలుగు సోలలు నగును.)

ప్రాకృతమున 'ఆ' అను నిర్దేశార్థక విశేషణము లేదు. కాని 'ఏతత్, ఇదమ్' అనువాని వికారమగు = ఈఅ = ఈ, అనునదియు, 'ఊ' = ఆ (ప్రాచీన ద్రావిడము: ఊ) అనునదియు, 'ఏఅ' = సం. ఏతద్ = ద్రావిడము: 'ఏ' అను నదియుఁ గలవు. 'ఆ' 'ఊ' లేకార్థకములు; వానిలో 'ఊ' ప్రాచీనము.

ఆధునిక ద్రావిడేత రార్యభాషలలో ద్రావిడ సర్వనామములను బోలు రూపము లీ క్రిందివి కాన్పించుచున్నవి:

ఏను

కిఉంథాలీ, సిమ్లాసిరాజీ: అఁ; హాండూరీ: హాఉఁ; శొరాఛొలి: అఉఁ; మండఆలీ: హాఁఓ హాఉఁ.

పిశాచ భాషలు: దర్ద్: అ, యు, మ; ఖోవార్: అవ, కలాషా: అ;షినా: మ; వైగల్: యే; గవర్-బతీ; అ — వీనితో ద్రావిడభాషలలోని 'ఆమ్, ఆన్, ఏవ, యేను, (మా, మాము, మేము), మొదలగు రూపములను బోల్పవచ్చును. 'మేము' లోని తొలి మకారము తొలుత నేకవచనమునకే సంబంధించినదై యుండవచ్చును.— తెనుఁగు: నా, మా; కోహిస్థానీ: మా; ఖోవార్: మ; పషాయీ; మే-నా.

ఏము

ఉంథాలీ: హామే; సిమ్లాసిరాజీ: అఁఇ, ఏఁ,ఐమూఁ, ఎఉఁ; శొరాఛొలి: హామే, ఆమే; మండఆలీ-పహాడీ: హామేహ.

పిశాచ భాషలు: బాష్గలీ: ఇమా; కోహిస్థానీ: మా; వై-అల: యెమ, యుమ; గవర్‌బతీ: అమా; పషాయీ: హామా; - వీనితో తెనుఁగు నందలి ఏ (యే, మే) ము, నా, మా, లను బోల్పవచ్చును;—బాష్గలీ: ఇమా; కలాషా: హాేమ; కోహిస్థానీ: మో, మున్; వై అల: యుమ; గవర్‌బతి: అమోని; వీనితో ద్రావిడభాషలలోని 'నా, మా; ఉన్' మొదలగు వానిని బోల్పవచ్చును.

నీవు.

పిశాచభాషలు: కాఫిర్ (వెరోన్): ఈయూ; చూ. తెనుఁగు. ఈవు:- కాఫిర్ (వెరోన్): ఈ, ఈ ఊరీ; చూ. తెనుఁగు: నీ;

మీరు.

పిశాచ భాషలు: కాఫిర్ (వెరోన్): మిఊ; చూ. తెనుఁగు: మీరు; కాఫిర్ (కలాషా): మీ-మి; వై అల: విమ-బ; చూ. తెనుఁగు: మీ.

వాఁడు.

పిశాచభాషలు: షినా: అనో, ఓ; కోహిస్థానీ: ఓ; చూ. ద్రావిడము: ఆన్, అవన్, మొద:— షినా: అనై; చూ. ద్రావిడము: అవన, వాని, మొద.— పషాయీ భాషలో ప్రథమపురుష సర్వనామమునకు మూలమగు 'ఉ' మీఁదనే తక్కినవిభక్తి ప్రత్యయములు చేరును. 'ఉ' అనునది ప్రథమ పురుషమున ద్రావిడభాషలయందును గలదు.

పిశాచీభాషలలోను వాని సంపర్కముగల కొన్ని యితరభాషలలోను మాత్రము ద్రావిడభాషలలోని యుత్తమ, మధ్యమపురుష సర్వనామములకు పోలికలు కాన్పించుటను గమనింపఁదగును.

తెనుఁగున సర్వనామములు.

తెనుఁగున 'అన్ని ప్రభృతులు సర్వనామములని చిన్నయసూరి చెప్పి వానిని 'అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, పెక్కు, పలు, ఆ, ఈ, ఏ, నీ, నా, మన, తా, సంఖ్యా వాచకములు' గ వివరించినాఁడు. ఇందు 'అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, పెక్కు పలు' లు గూడ నొక విధముగ సంఖ్యావాచకములే, 'పలు' సర్వనామమయినప్పుడు 'పెల్లు, ఎల్ల,లు గూడఁ గావలసియుండును.

ఈ క్రింద నాయా సర్వనామముల వివిధ విభక్తిరూపములు వివరింపఁ బడుచున్నవి. అందసాధారణరూపము లున్నయెడలఁ బ్రయోగములు సాధ్య మయినంతవఱకుఁ జూపఁబడును:

అహమద్వాచకములు.

1. సర్వతావదర్థకము: అన్ని: ఔపవిభక్తికము, నిత్యైకవచన రూప మును నిత్య బహువచనార్థమునుగలది: ప్ర. ఏ. అన్ని: దుఃఖావళులవన్ని తొలఁగిపోవు; ద్వి. బ. అన్నిటిని (రామతా. శత. 41); తృ. బ. అన్నిటన్, అన్నిటిచేత (చే, తోడ, తో); చ. బ. అన్నిటికై (కొఱకు); పం. బ. అన్ని టన్+అన్నిటివలన (ఁబట్టి, కంటె) ష. బ. అన్నిటి (కి, లో, లోపల); దానము లన్నిటికిని భూదానం బెక్కుడు (భార. అను. II. 350); స. బ. అన్నిటన్ (అన్నిటియందు) ప్రయోగములు: అన్నింటిన్ (భా. భీ. I. 266; ద్రో. IV. 113); అన్నిటిన్ (భార. భీ. II. 211); అన్నింటిపనులు=అన్ని యుపకరణముల పనులు (నిర్వ. I. 63); లోకములకన్నిటికిన్ (భార. అను. V. 317); అన్నిటి యందు (ప్రభా. IV. 155).

విశేషణముగ: అన్నాళ్లు (భార. ద్రో. I. 130) మనను వచ్చినన్నిదిన ములు (భార. విరా. I. 206) కొన్నిదినములకు (నిర్వ. VII. 68); పాండు రంగ మహాత్మ్యమున (IV.) 'కొ' అని యున్నది. 'వాని కెన్' తలలు (శ.ర.)

2. ఇయ దర్థకము: ఇన్ని: ఔపవిభక్తికము; నిత్యైకవచనరూపమును నిత్య బహువచనార్థమును గలది: ప్ర. బ. ఇన్ని; ద్వి. బ. ఇన్నిటిని ; తృ. బ. ఇన్నిటన్, ఇన్నిటిచేత (చే, తోడ, తో); చ. బ. ఇన్నిటికై (కొఱకు); పం. బ. ఇన్నిటన్ = ఇన్నిటివలనఁ (బట్టి, కంటె); ష. బ. ఇన్నిటి(-కి,లో,లోపల); స. బ. ఇన్నిటన్, ఇన్నిటియందు, విశేషణముగ: ఇన్నాళ్లు (భార. కర్ణ. I.53; శాం. III. 66; భీ. I. 64; హరి. పూ. III. 187); ఇన్నేల = ఇన్ని+ఏల (భాగ. X. II. 780).

3. కియ ద్వావ దర్థకము: ఎన్ని: ఔపవిభక్తికము; నిత్యైకవచనరూప మును నిత్య బహువచనార్థమును గలది. ప్ర. బ. ఎన్ని; ఎన్నాళులు (భార. ఆశ్ర. II. 15); ద్వి. బ. ఎన్నిటినిన్; తృ. బ. ఎన్నిటన్, ఎన్నిటిచేత (చే, తోడ, తో); చ. బ. ఎన్నిటికై (కొఱకు); పం. బ. ఎన్నిటన్, ఎన్నిటివలన (ఁబట్టి, కంటె); ష. బ. ఎన్నిటి (కి, లో, లోపల); స. బ. ఎన్నిటన్, ఎన్నిటి యందు.-'వానికెన్ తలలు గలవు' అని శ. ర. కారుఁడు వ్రాసెను. కాని యది గ్రంథస్థప్రయోగమగునో కాదో తెలియదు - ఎన్నియెన్ని = ఎన్నో, చాలా (ప్రభా. III. 12).

4. కతిపయార్థకము: కొన్ని: ఔపవిభక్తికము, నిత్యైకవచన రూప మును నిత్యబహువచనార్థమును గలది. ప్ర. బ. కొన్ని; ద్వి. బ. కొన్నిటిన్ (యయా II); కొన్నిటినిన్; కొన్నిన్ (కొన్నినడిగితి-భాగ. II. 261); తృ. బ. కొన్నిటన్, కొన్నిటిచేత (చే, తోడ, తో); చ. బ. కొన్నిటికై (కొఱకు);

బ. కొన్నిటన్; కొన్నిటివలన (౦బట్టి, కంటె); ష. బ. కొన్నిటి (-కి -లో, -లోపల); స. బ. కొన్నిటన్, కొన్నిటియందు.

ప్రయోగములు: కొన్నిటి (భార. భీ. II. 211). 'అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని' అనువానికి 'అని, ఇని, ఎని, కొని' అనునవి రూపాంతరములని కొంద ఱందురు. కాని యట్టిరూపములు కృతకములు; 'పురాణంబు, లనియును నొక విద్య' అని భార. శాం. III. 119 లోని ప్రయోగమును శ. ర. కారు౦డిచ్చె ను గాని 'పురాణంబులన్నియు నొకవిద్య ' యన్నను సరిపోవును.

•5. బహ్వర్థకములు: i. పెక్కు: ఔపవిభక్తికము, నిత్యైకవచనరూప మును నిత్య బహువచనార్థమును గలది. దీనికి బహువచనమున లు వర్ణము గూడ౦ జేరును; కాని, యట్లుచేరిన రూపములపై విభక్తిప్రత్యయములు చేరవు; ప్ర. బ. పెక్కు, పెక్కులు; ద్వి. బ. పెక్కిటినిన్; తృ.బ. పెక్కిటన్, పెక్కిటిచేత (చే, తోడ, తో); చ. బ. పెక్కిటికై (కొఱకు); పం. బ. పెక్కిటన్, పెక్కిటివలన (౦బట్టి, కంటె); ష. బ. పెక్కిటి (కి, లో, లోపల);స. బ. పెక్కిటన్, పెక్కిటియందు; - పెక్కులను, పెక్కులతో, మొదలగు రూప ములులేవు.

ప్రయోగములు: మాటలు పెక్కాడితివి (భార. విరా. V. 89);రూప ములు పెక్కు (భార. సౌ. I. 104); నారాచంబులు పెక్కులు (భార. క. I. 165); పెక్కులెడలు (భార. భీ. III. 177); పెక్కులు వల్కఁగాదు (భార. అర. VI. 156) పెక్కుఁగాలము (విష్ణు పు. III. 14); పెక్కు భంగి విలపించె (భాస్క. యు. 1386).

ii. పలు: దీనికి విశేషణముగ మాత్రము వాడుక గలదు; అప్పు డది విశేష్యమునకుఁ బూర్వమందే ప్రయోగింపఁబడును: పలుపోకలఁబోవుచు (భార. విరా. II. 150); పలుగడలన్ (భార. శల్య. II. 29); పలుపువ్వులు (భార. విరా. I. 320).

iii. పెల్లు: దీనికి బహువచనరూపములేదు. దీనిని విశేషణముగ విశే ష్యమునకుఁ బూర్వము ప్రయోగింపరు. పేదవారికిఁ బ్రజపెల్లువ్రేఁడము; దుర్ద శలపెల్లు (భార. విరా. I. 51); పెల్లుగ భోగింపక (భార. విరా. I. 140); గడ్డికవణములును పెల్లుగా నొడిఁగూర్చి (భార. ఉ. I. 93); జననాథులపైఁ బెల్లేసిన (భార. భీ. III. 18); అస్త్రవృష్టి పెల్లుగురిసె (భార. ద్రో. I. 165); తాఁకుపెల్లు (భార. ద్రో. III. 152); పెల్లేసినన్ = శరములపెల్లు (ఇట్లే తిక్కన సాధారణముగా 'పెల్లు' నుపయోగించును (భార. ద్రో. V. 129, 150); పెల్లుపుట్టుదురు ప్రజలు (భార. శాం. I. 216);-'పెల్లు' నవ్యయముగఁ గూడ నుపయోగింపవచ్చును: రెండుసైన్యములు నాహవకేళికి నుత్సహించి

వెల్లొప్ప (భార. భీ. I. 146) - 'వెల్లు'కు మహన్మహతీవాచకరూపములు లేవు. మహన్మహతీబహువచనరూపముగ 'వెల్లు' నే యుపయోగింపవచ్చును: మనుష్యులవెల్లు, స్త్రీలవెల్లు, ప్రజలువెల్లు, మొదలయినవి.

iv. ఎల్ల: ఇది ద్రుతాంతమగు నవ్యయమని కొందఱందురుగాని యట్లుకాదని తోఁచుచున్నది. 'ఎల్లన్' అనునప్పుడు 'న్' అనునది సముచ్చయ చిహ్నముగాని కేవలద్రుతముకాదు. 'ఎల్లయుఁ గలయంగని (నిర్వ. IV. 23)' అనుప్రయోగమువలన నీ విషయము బోధపడఁగలదు. తక్కిన సర్వనామములవలె దీనినిగూడ విశేష్యములకుఁ బూర్వమందు వాడవచ్చును; దీని నేకబహువచనములందున్న విశేష్యములరెంటికిని బూర్వమున నుపయోగింపవచ్చును: దీనిపై వచ్చు పరుషములకు గ స డ ద వా దేశముఁ జేయకుండఁ దిక్కన ప్రయోగించినాఁడు. ఇది యట్టియెడల విశేషణమగును గావున గ స డ ద వా దేశము రాకుండుటయే సరి. ఎల్లపనియు (నిర్వ. IX. 45,-'ల్ల' యతి స్థానము, 'ప' ప్రాసస్థానము); ఎల్లకృత్యము (నిర్వ. IX. 48); ఎల్లచోటు నరసి (భార. అను. III. 101); ఎల్లభంగిఁ (భార. విరా. III. 120: అశ్వ. III. 181; శాంతి. V. 279); ఎల్లవెంటకును గొఱంతలేక (భార. ఉ. II. 77); ఎల్లవెంటలన్ (భార. అర. V. 307); ఎల్లకలుషము (కళా. I. 129);- 'ఎల్లన్ శిష్యులఁ గొంచు వత్తునో' అని శ్రీనాథుఁడు 'ఎల్ల' విశేష్యమునకుఁ బూర్వమందున్నపుడును ద్రుతాంతముగఁ బ్రయోగించినాఁడు; కన్నడమున నిట్లే 'ఎల్లవరు, ఎల్లాయువరు' అని ప్రయోగింపవచ్చును.

విశేష్యమునకుఁ బరమందు 'ఎల్ల' ను బ్రయోగించినప్పుడు ద్రుతి చిహ్నమగు 'న్, ఉన్' లను జేర్చియే యుపయోగించిరి: రాజ్యమెల్లను దారై = రాజ్యమందంతటను (ఇచట 'ఎల్లను' అనునది సప్తమీరూపమువలెఁ గాన్పించుచున్నది); చోటికినెల్లను (శకుం. పరి. II. పు. 31); నీపలుకెల్ల (కళా. III. 96); నవ్వె సభయెల్లన్ (కళా. III. 183); భవచ్ఛలంబు పయినెల్లను (భార. క. III. 144); రక్కసులకెల్లఁ జాటువినఁగ (భార. ఉ. III. 101); ఆపదలకెల్లను నోర్చెద (భార. విరా. II. 228).

'సకల' శబ్దముతోఁ గూడియున్న విశేష్యముపై మరల 'ఎల్లను' కవు లుపయోగించిరి. సకలజీవులకెల్ల (భాగవ. V. I. 19).—

వ్యవహారమునందును శాసనములందును 'ఎల్ల' కు ద్రుతాంతమగు 'అల్లా' అనునది కాన్పించుచున్నది: వేంచేశేటప్పు డల్లాను (S. I. I. IV. 280).

'ఎల్ల' పై విభక్తిప్రత్యయములు చేరవలసివచ్చినప్పుడు దానికిఁ దచ్ఛబ్దార్థక సర్వనామముల విభక్తిరూపము లనుప్రయుక్తము లగును. ఎల్లదానను

జెడిలిమి = అన్నిటికిని (హరి. పూ. V. 221); ఎల్లదానను బాగ డ్తవడి=అన్నిటి యందును (భార. భీ. I. 27); ఎల్లది (భార. అను. I. 68); ఎల్లవియున్ (భార. అర. V. 298); తీర్థములెల్లవియు (భార. అను. IV. 241); ఎల్లవాఁడుం దన వారిఁదోడ్కొని=ప్రతియొక్కఁడున్ను (భార. విరా. III. 126); ఎల్లవాఁడున్= ప్రతివాడున్ను (భార. సౌ. I. 45); వెరవిట్టి తెఱఁగని వెంగలితనమని యెల్లవాఁడును దనయెఱిఁగినట్టి తెఱఁగున నిజకార్యదృష్టిఁ గనుంగొనును; ఎల్లవారి కధికులు = అందఱకంటె (భార. అను. V. 317);—'ఎల్లయందు' అనిఎల్ల' పై అందు' అను సప్తమీవిభక్తి ప్రత్యయమును జేరును.

'ఎల్ల'ను మహన్మహతీ సామన్య వాచకపదముగ వాడవచ్చును: కృపుఁడు రాజసుతుఁ దన తేరిపై నిడి తోలఁగఁ దెచ్చె నెల్లఁజూడ (భార. భీ. II. 322); ఎల్లఁజూడ నిడము విల్లు నశ్వంబుల సూతుఁ దునిమి నన్ను నాతఁ డలవు నెఱయ గెలిచె (భార. కర్ణ. III. 110); మున్ను పలికినాఁడ ... ఉద్యోగవేళయందు నెల్ల వినుచునుండ = అందఱును (భార. శల్య. I. 96): వీఁడెల్లబోఁటిబాలుఁడు గాఁడు (హరి. పూ. V. 149); ఇట్లే, ఎల్లవినఁగ = ఎల్లరువినఁగ ; మొద.— అన్నిటికంటె నధికమను 'తమ' అను నర్థమున నెల్లను వాడుదురు. మొదవు లలోనెల్లఁ గపిలమొదవు వరిష్ఠంబు (భార. అను. III. 19).

మహన్మహతీ సామాన్యరూపములు.

బహువచనము.

1. సర్వతాన దర్థకము: అందఱు, అందఱన్, అందఱచే (చేత, తోడ, తో), అందఱకై (కొఱకు), అందఱవలన (ఁబట్టి, కంటె), అందఱ (కు, లో; లోపల), అందఱయందు; అర్వాచీన రూపములు: అందఱిన్, అందఱిచే, అందఱికొఱకు, అందఱివలన, అందఱికి, అందఱియందు, మొద. అందఱుంగల యంగనుంగొని (కాశీ. VI. 233).

అందొఱు: భీమునకునం, దొఱుఁ గీడ్వడఁ దొడఁగి రుద్ధతులు రాజ సుతుల్. (భార. ఆది. V. 164); 'అందొఱు' అను రూపము యతి నిమిత్తము కవికల్పించినదై యుండును. ఇందొఱు, ఎందొఱు, కొందొఱు, అను రూపము లకుఁ బ్రయోగములు కానరావు.

2. ఇయదర్థకము : ఇందఱు, ఇందఱన్; ఇందఱకు; మొద. ఇందఱిన్, ఇందఱికి, మొదలగున వర్వాచీన రూపములు. మాయింవఱరాక (భార. నిర్వ. II. 5).

3. కియద్యావ దర్థకము : ఎందఱు, ఎందఱన్, ఎందఱకు; మొద. ఎంద ఱిన్, ఎందఱికి, మొదలగున వర్వాచీనములు. ఎందఱో = ఎందఱనో (హరి పూ. IX. 88).

**4.** కతిపయార్థకము: కొందఱు (యయా. II.); కొందఱన్, కొంద ఱకు, మొద. కొందఱిన్, కొందఱికి, మొదలగున వర్వాచీనరూపములు. 'కొంద ఱికి, కొందఱిన్ (భాగ. I. 233; పరిష్కర్తలు దీనిని సవరింపలేదు; I. 20 లో సవరించినారు).

**5.** బహ్వర్థకములు: వెక్కండ్రు, వెక్కండ్రన్, వెక్కండ్రకు, మొద. వెక్కండ్రు (భార. విరా. III. 164; భీ. III. 47; ద్రో. II. 41; ద్రో. III. 225; శాం. VI. 200; అను. V. 107) వెక్కండ్రతోడ (భార. కర్ణ. III. 171); వెక్కండ్రయందు (మను. VI. 69).

'వెక్కండ్రురు' అను రూపము ముద్రిత ప్రతులయం దున్నది. తొలుత నది 'వెక్కండురు' అనియే యుండియుండును: (భార. ద్రో. II. 206; కర్ణ. I. 37; ఆది. VIII. 25).

'వెక్కురు' అనురూపము నవీనము: నీలాసుం. II.

ii. 'పలువురు, పల్వురు' ప్రాచీనరూపములు; 'పలుగురు' అర్వాచీన రూపము; పలువుండ్రు; పలుగుండ్రు, అనురూపములు శ. ర. లో నున్నవి గాని ప్రయోగములు గానరావు. 'పలుమంది' అని ఉ. రా పు. 34 లో నున్నది.

iii. 'ఎల్ల' అనుదానిని మహన్మహత్యర్థకముగ వాడవచ్చును. మే మెల్ల, మీరెల్ల, వారెల్ల, మొద. 'ఎల్లరు' అనురూపమును గలదు. 'ఎల్ల వారు' అనునది 'ఎల్లవాఁడు' కు బహువచన రూపముకాని రెంటికి నర్థభేదము గలదు. 'ఎల్లవాఁడు' = అందఱిలో ప్రతియొక్కఁడు; ఎల్లవారు = అందఱు.

అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, అనువానివలెనే అంత, ఇంత, ఎంత, కొంత; అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు మొదలగువానినిగూడ సర్వనామములుగఁ బరిగణింప వలసియుండును. దానిపై విభక్తిప్రత్యయములు చేరునుగదా. కాని, వాని యర్థముగల సంస్కృతపదములను సంస్కృత వైయాకరణు లవ్యయములుగఁ బరిగణించి యుండుటచేత, దెనుఁగు వైయాకరణులను వాని నవ్యయములుగఁ బరిగణించిరి. వీనినిగూర్చి యవ్యయ ప్రకరణమున ముచ్చటింపఁబడును.

ప్రథమపురుష సర్వనామములు.

అ, ఈ, అను నిర్దేశార్థక విశేషణములును 'ఏ' అను కిమర్థక విశేష ణమును ద్రావిడ భాషలయందు ప్రథమపురుష సర్వనామములకు మూల ములని వైయాకరణులు చెప్పుదురు. కాని, యింతకుముందు తెలిపినరీతిగ· అద్ ఇద్, ఎద్, అవ్, ఇవ్, ఎవ్, అనునవే వానికిమూలము లని యనుకొన వలెను. వానినుండి యాయాసర్వనామము లెట్లేర్పడినదియు నింతకు ముందు తెలుపఁబడియున్నది. ఈ క్రింద వాని వివిధరూపములును, విశేష రూపములకు ... ప్రయోగములును జూపఁబడుచున్నవి.

మహద్వాచకములు - ప్రథమైకవచనము.

1. తదర్థకము: (అ) వాఁడు. ఇది క్రియాపదములందు 'ఆఁడు' గా మాఱినది. చెప్పినాఁడు, చేసినాఁడు; మొద. పామరజన వ్యవహారమున 'ఆఁడు' అనియే 'వాఁడు' కు మాఱుగ వినఁబడుచున్నవి. ఇట్లే, రజ్జులాఁడు (భార. ఆర. VI. 63); ముద్దులాఁడు (భార. ద్రో. II. 289) మొదలగు వాని యందును 'ఆఁడు' ఉన్నది. వీని సామ్యమును బట్టి మంగలాడు, చాకలాడు, మొదలగునవియు సాధువు లగుచున్నవి.

(ఆ) ఆతఁడు, అతఁడు: ఇది నేఁడు కొంచెము గౌరవము తెలుపునప్పుడు వాడఁబడుచున్నది. 'వాఁడు' నీచత్వ మిత్రత్వములందు వాడఁబడుచున్నది. పూర్వకాలములం దిట్టి భేదము గాన్పింపదు. 'ఆతఁడు' ను 'ఆ+తాన్+వాఁడు' అనువాని కూడికకు సంక్షేపరూపమని చెప్పవచ్చును. 'ఆతఁడు' లోని తొలి 'ఆ' త్వమునకు హ్రస్వముకలిగి 'అతఁడు' ఏర్పడినవి. అతఁడు ... అతిరథులకెల్లఁ దల (భార. ఉ. IV. 268); కట్టుము పట్టుమతనిన్ (భార. ద్రో. I. 62); అచ్చోటి కతనిం జాలించి (భా. ద్రో. IV. 46); ఆతనిదాల్పు నాభిదలితాబ్జమునం దుదియించె (S. I. I. VI. 626); అతనికి నెట్టియెడల దురిత మేల పొందు (భార. ఆర. VI. 332); నీవతనికిఁ గాన్పుము (భార. ఉ. I. 270); ఆతనికిఁ బడవలసెనకట (భార. భీ. I. 59); అతనికి మెచ్చి (హరి. పూ. IV. 19).

(ఇ) 'ఆతగాఁడు' అనియు రూపము గలదు. దీనితొలి యాత్వము హ్రస్వమయి 'అతగాఁడు' అగును. ఇంచుమించుగ 'ఆయన' అను నర్థమందే యీ రూపములను వాడుదురు.

(ఈ) ఆయన = ఆ+అన (భాగ. X. ii. 1005); ఆ, యన యఱుత (హరి. ఉ. I. 68- 'య' యతిస్థానము, 'న' ప్రాసస్థానము); ఆ, యన (యతి ప్రాసస్థానములు)—(భా. ఆర. IV. 334; ఉ. III. 48; భీ. II. 261; శల్య. II. II. 357; హరి. పూ. V. 75); ఆయనన్ (భార. ఆర. V. 10); ఆయనకు (హరి. పూ. VII. 191).

ii. మహన్మహతీవాచకము:—ప్రథమా బహువచనము: (అ) వారు: నేఁటి వ్యవహారమున 'వారు' కేవల గౌరవార్థమందే వాడఁబడుచున్నది. దీని నేకవచనమునను గౌరవార్థమున వాడవచ్చును. పూర్వకావ్యములం దిట్టి భేదములేదు. నేఁడు కేవల బహువచనమున 'వాండ్లు, వాళ్లు' అనునవి వాడఁబడుచున్నవి. పామరజన వ్యవహారమున 'ఆళ్లు' అనియుఁ గలదు. జాతివాచకపదముపైఁ జేరునప్పు డది పామరజన వ్యవహారమున 'ఓళ్లు' కూడ నగును నాగరకవ్యవహారము: కోమటివాండ్లు, (-వాళ్లు); కోమటాళ్లు; పామరజనవ్య:

వ్యవహారమున: కోమటోళ్లు. సామరజనులు 'వారు' కు 'ఆరు' అనియు నందురు. క్రియాపదములందు 'వారు' గ్రంథములందును 'ఆరు' అయినది: చెప్పినారు, చేసినారు, మొద.

(ఆ) వారలు: ఇది కేవలము గ్రాంథికరూపము. మగవారలు (భాగ. I. 160); వారలెవ్వరో వినుటకు (భార. అశ్వ. II. 221); ఏను వారలఁ దీర్తున్ (భార. ద్రో. V. 121); చెప్పెద మనవారల వారివారి మానములు (భార. ఉ. IV. 219); వారలందఱు...తనతన తెఱఁగు మెఱయ (భార. భీ. I. 100);

(ఇ) వాండ్రు: ఇదియుఁ గేవల గ్రాంథికరూపమే. కవిత్రయమువారు దీనిని వాడలేదు; ఇది మాండలికరూపమై యుండును. (భాగ. X. i. 1526); వాండు + రు = వాండ్రు; 'వాండ్రు' పై మరల బహువచన 'రు' వర్ణము చేరునందురు; వెలివాండ్రుర పల్లియ (భార. శాం. III. 284); 'వాండుర' యగునేమో. వాఁడు, వారు, లితర పదములకుఁ బరములయి సాధారణముగ మధ్యమపదలోపి సమాసము లగును: విపులభద్రమూర్తివాఁడు = కలవాఁడు (భాగ. I. 16); ఎగుభుజంబులవాఁడు (విజయ.) = ఎగుభుజములు కలవాఁడు, నుతువాఁడు = నుతుఁడుగాఁ గలవాఁడు (భా. ఉ. III. 25); వంటవాఁడు = వంటచేయువాఁడు.

(ఈ) వాండ్లు: ఇది నేఁటి రాయలసీమయందును, మైసూరులోని బెంగుళూరు, కోలారు జిల్లాలయందును సర్వసాధారణముగ నున్నది; గ్రంథములలోనికిఁగూడ నెక్కినది: 'వాండ్లున్ వీండ్లు ననున్ బడంతి యనుచున్ వాక్రువ్వఁగా వించుఁ దా విండ్లంబుల్ శిశుపాలుఁ డందుకొని' (రాధామా. III. పు. 49); అర్థివాండ్లు (నరసిం. శత. పు. 4) మొద.

'వాండ్లు' అను బహువచనరూపమునకుఁ బూర్వవ్యాకరణములం దను శాసన మున్నది. 'నిత్య జ శ్శసో ర్లులౌ తస్మాత్' (ఆంధ్రకౌముది. సూ. 285); 'వాండ్లుర్ బహువచనేఽపి వా స్త్రియాం చ' ఆడవాండ్లు, విధవ వాండ్లు; 'పుం వాచకపదానా మపి బహువచనే వాండ్లుర్ నిత్యం స్యాత్; మగవాండ్లు (ఆంధ్రకౌ. సూ. 286). ఇట్లే కాండ్లు (మత్తుగాండ్లు), మొద లగువానికిని నర్వాచీనగ్రంథములందు ప్రయోగములు గలవు.

వాండు + లు = వాండ్లు; లేదా, వాండు + రు = వాండ్రు (ర=ల)= వాండ్లు. అర్వాచీనభాషలో డుమంతములగు నాచ్ఛిక మహద్వాచకపదముల తుది డుజ్ఞునకు బహువచన రు, లు, వర్ణములు పరములగునపు డొకచో లోపము రాకుండెను. ఉదా. గండండ్రు, మిండండ్రు, విలుకాండ్రు, వేఁట కాండ్రు, వేషకాండ్రు, జేండ్లు, మొద. ఇందు డువర్ణకమునకుఁ బూర్వ

మందలి యర్ధానుస్వారమునకు బహువచనమునఁ బూర్ణానుస్వారము కలుగు చుండెను. వాండ్లు, కాండ్లు, కూడ నిట్టి బహువచనరూపములే.

(ఉ) వాళ్లు: ఇది 'వాఁడు' అనుపదము నిరనుస్వారమయినతరువాత వాడు + లు = వాడ్లు; డ = ళ; వాళ్లు, అనురీతి నేర్పడియుండును. లేదా, వాండ్లు (డ = ళ) = వాండ్లు (అనుస్వారలోపము) = వాళ్లు, అని యైనను గావచ్చును—లేదా, వారలు = వార్లు = వాళ్లు; లోకములో 'వాళ్లు' అను రూపము సర్వత్ర వినఁబడుచున్నది. పూర్వకాలపు గద్యవాఙ్మయమం దీరూప మున్నది. నేఁటి పద్యగద్యరచయితలలో వ్యవహారమున 'వారు,' 'వాళ్లు' అను వానికి స్పష్టమగు నర్థభేదముకలదు; కావున, రెండును నపరిత్యాజ్యములు: మంగలవాళ్లు, చాకలవాళ్లు, బండ్లవాళ్లు, అనవలెనుగాని, హేళనచేయునప్పుడు తప్ప 'మంగలవారు, చాకలవారు, బండ్లవారు' అని యనరు—'గొల్లవారు' (భాగ. VIII. 206) అని పోతన గౌరవార్థమందే వాడినాఁడు. గ్రాంథిక వాదులుకూడ దానిని వాడియున్నారు. లంబాడీవాళ్లు (విజ్ఞానసర్వస్వము. కే. వి. లక్ష్మణరావు); మీవాళ్లు, ఆడవాళ్లు (వీరేశలింగము: సత్యవతీచరిత్ర; వాళ్లతల్లి (చిలకమర్తి లక్ష్మీనరసింహము: సుధాశరచ్చంద్రము); మొద.

పైవాని కితరవిభక్తులందు రూపములు.

(1) పిన్నవాఁడు = పిన్నవయస్సు గలవాఁడు (భార. ద్రో. II. 11; అశ్వ. III. 190); పిన్నవారు (భార. అను. IV. 135); గూనివాఁడు = గూని యైన వీఁపు గలవాఁడు (భార. అను. V. 104); పనులవాఁడు = పనులను కాఁచువాఁడు (భార. శాం. V. 279); కలవాఁడు = ధనముగలవాఁడు (భార. శాం. V. 278); తోఁటవాఁడు = తోఁటను పెంచువాఁడు (భార. శాం. II. 300); కానివాఁడు = అడ్డగింప శక్యముకానివాఁడు; (భార. ద్రో. III. 168); చాలువాఁడు = పనిచేయఁజాలువాఁడు (భార. ఉ. IV. 143); వంటలమేర వాఁడు = వంటలుమేరగా (పనిగాఁ) గలవాఁడు (భార. విరా. I. 226); నడి సన్నవాఁడు = లోకమున పేరెక్కినవాఁడు (భార. విరా. III. 152); సార్వ భౌమపదవికిఁ దగియెడు భంగివాఁడు (భార. విరా. I. 186); పౌరుషము వాఁడు = పౌరుషము కలవాఁడు (రామాభ్యు. I. 63); అల్లువానికి = ప్రియుఁ డయినవానికి (రామాభ్యు. IV. 14); ఏలినవానిన్ = తన్ను, ప్రజలను, భూమిని, ఏలినవానిని (భార. విరా. III. 184); అర్జునునకు సరివింటివానిన్ = అర్జునునివింటికీడగు విల్లుగలవానిని (భార. ఉ. II. 166); మెత్తనిమేనివానిన్ = మేనుగలవానిని (భార. ద్రో. II. 3); మాలవానిన్ = మాలకులమునకు జెందినవానిని. (భార. అను. IV. 46); పాఱువానికి = పాఱు (బ్రాహ్మణ

కులమునకుఁ జెందినవానికి (నీచార్థమున—భార. అర. IV. 340); ఏచందంబు వాఁడు = ఏచందముగలవాఁడు = నన్నయ; ఏచందంబునవాఁడు (భాగ. II. 77); సానివారు = సానికులమువారు (S. I. I. IV. 702; 'వారు' అనుట వలన నా కాలమున సానికులము నీచముగఁ జూడఁ బడలేదని తెలిసికొన వచ్చును); కూంతువారు = (పెండ్లి) కూఁతురి ప్రక్కవారు (S. I. I. IV.- కోమటిపెండ్లిని కూంతువారు రూక అచ్చువారు; ఆ కాలమున పెండ్లిసుంకము లను దీసికొనుచుండెడివారు); అంతవట్టువారిని = అంత సంఖ్యగల జనులను (భార. పౌ. II. 8); ఇంతవారగుటకు=ఇంతటి బలము గలవారగుటకు (భార. భీ. II. 258); పయివారు = శత్రువులు (భార. భీ. I. 141); ఇంత వెఱ్ఱివారును గలరే = వెఱ్ఱిపట్టినవారు (భార. ఉ. IV. 377); ఎరవగువారు = వింతవారు (భార. విరా. I. 188); తోలువారు (రథమును దోలువారు) (భార. భీ. III. 235); కానివారు=అసమర్థులు, చేతకానివారు (భా. ద్రో. V. 105); నా. అయినవారి కాకులలోను, కానివారికి కంచాలలోను (అయినవారు=బంధువు లయినవారు; కానివారు బంధువులు కానివారు); ఎఱుఁగిపడ్డవారు = లోకము నకు బాగుగఁ దెలిసినవారు (భార. స్త్రీ. II. 167). లోకమువారు = లోకము లోని ప్రజలు (భార. ఉ. III. 102); కొలువువారు = కొలువునందున్నవారు (భా. ఉ. III. 255); మగవారు = మగతనముగలవారు; శూరులు (భార. ఉ. I. 247); వేగులవారు=వేగువృత్తిగలవారు (భార. ద్రో. II. 304); ధర్మజుఁ డెమ్మెయి వాఁడొకో (భార. ద్రో. IV. 130).

వాౕ దోడై వచ్చిరి; (భార. మహాప్ర. I. 50; గణముకోస ముత్వ లోపము); అట్టి, ఇట్టి, ఎట్టి, అనువానిపై వాఁడు, వారు,లు చేరునపుడు పూర్వకావ్యములందు వాని 'వా' లోపించును: అట్టిఁడు, ఇట్టిఁడు, ఎట్టిఁడు; అట్టిరు, ఇట్టిరు (భార. అర. IV. 157); ఎట్టిరు.

ఇదమర్థకము.

i. మహద్వాచకము: ప్రథమైకవచనము: (అ) వీఁడు (గ్రంథములు, వ్యవహారము); పామరజన వ్యవహారమున 'ఈఁడు' అనియుఁ గలదు. ఇది మిత్రత్వ నీచత్వములందు నేఁ డుపయోగింపఁ బడుచున్నది. పూర్వ గ్రంథ ములం దిట్టి యర్థనియమము లేదు.

(ఆ) ఇతఁడు, ఈతఁడు: ఇది నేఁడు కొంచెము గౌరవమును దెలుపు నప్పుడు వాడుదురు. పూర్వగ్రంథములందు వాఁడు, ఇ (ఈ) తఁడు ల కర్థభేద ము లేదు. ఈతఁడు = 'ఈ + తాన్ + వాఁడు' అనువాని కూడికకు సంక్షేప రూపము. ఇతఁడు 'ఈతఁడు' లోని తొలి యీత్వమునకు హ్రస్వము కలు గుటవలన నేర్పడినది. ఇతనిఁ గావవలయు నేమి (భార. భీ. I. 77); ఈతఁడే

టిపతి (భార. శాం. I. 361); గొంతికిఁ బ్రాణము ప్రాణ మితఁడు (భార. విరా. V. 328); ఇతనిపై నలుగవలదు (భాస్క. యు. 1739).

(ఇ) ఇ (ఈ) తగాఁడు: దీని నించుమించుగ 'ఈయన' అను నర్థమందే వాడుదురు.

(ఈ) **ఈయన** = ఈ + అన; ఈ, యన (హరి. ఉ. X. 237; 'య'యతి స్థానమున; 'న' ప్రాసస్థానమున; (భార. భీ. II. 252; కర్ణ. I. 315); ఇయ్యన లక్ష్మి (భార. ఆశ్ర. I. 159).

ii. మహన్మహతీసామాన్య వాచకము:—ప్రథమ [illegible] **వీరు** (గ్రాంథికము; వ్యావహారికము); **వీరలు** (కేవల గ్రాంథికము); **వీండ్రు** (కేవల గ్రాంథికము); **వీండ్లు** (గ్రాంథికము, వ్యావహారికము) (రాధామా. III. పు. 49; **వీళ్లు** (వ్యావహారికము); **ఈళ్లు** (పామరజన వ్యవహారమున); వ్యవహారమున 'వీరు గౌరవార్థకము; 'వీళ్లు' నీచత్వమిత్రత్వ బోధకము. వీండ్లు = వీంళ్లు = వీళ్లు; లేదా, వీఁడు + లు = వీడ్లు = వీళ్లు; లేదా, వీరలు = వీర్లు = వీళ్లు.

## యత్కిమర్థకము.

i. మహద్వాచకము:—ప్రథమైకవచనము: ఎవఁడు,ఎవ్వఁడు,ఏవాఁడు. ఎవ్వాఁడు (విధితో నెవ్వాఁడు నేర్చుంగటా - భాస్క. అయో. 113); వేఁడు, ఏఁడు; ఇవి యన్నియు గ్రాంథికములు; వీనిలో ఎవఁడు, ఎవ్వఁడు, వేఁడు, ఏఁడులు వ్యవహారమునందును గలవు; తక్కిన ఏవాఁడు, ఎవ్వాఁడు, లు కేవల గ్రాంథికములు.

వేఁడు: వీరిలో ముఖ్యులెవ్వారు వేఁడు రాముఁ డతని యనుజమ్ముఁడెట్టి వాఁడు (రామాభ్యు. VII); ఓడితిమె యేము రణమునఁ గ్రీడికిఁ గ్రీడించిరాక గెలుపే, యతఁడున్ వేఁడీ డాగెనొకో, మాతోడి బవరమిట్లు దాను దొలఁగం జనునే (భా. ద్రో. I.)

'ఏఁడు' ప్రథమైకవచనమునఁ బ్రయుక్తమై యున్నదేమో విచార్యము. 'ఏఁడీ' అను ప్రయోగము మాత్ర మున్నది: ఏఁడీ నా బలుమానికంబుల కొటారు ? (అచ్చ. రా. అర.); వాఁడేఁదు ? 'అను రీతిప్రయోగము గ్రంథములం దున్నట్లు కాన్పింపదు.

ii. **మహన్మహతీ** వాచకము:—ప్రథమా బహువచనము: ఎవరు, ఎవ్వరు, ఏవారు, ఎవ్వారు, ఎవ్వారలు, వేరు, ఏరు; ఇవియన్నియు గ్రాంథికములు. వీనిలో ఎవరు, ఎవ్వరు, మాత్రము వ్యవహారమునఁ గలవు. ఎవ్వారు నెక్కాలము నిట్లు సేసిర (భార. విరా. V. 247). ఎవ్వారున్ ధర్మజు పాటిగారు. (భార. విరా. I. 51); అంతవారెందు నెవ్వరులేరు. (భార. ఉ. IV. 258);

ఎవ్వరికాచరితంబు (నిర్వ. I. 32); ఎవ్వరిదెసకున్ (భార. భీ. I. 197); నను ముట్ట నెవ్వరికి వచ్చు (భార. విరా. II. 104); ఈ మేర యెవ్వరు అతిక్రమించి నాను (S. I. I. IV. 276). పామరజన వ్యవహారమున మాత్రము 'యారు' అను రూపము గలదు; కన్నడమున 'యారు' గ్రాంథికము; అగ్రజాతులవారి వ్యవహారముననుగలదు. చిన్నయసూరి 'ఎవ్వండ్రు, ఎవ్వాండ్రు, అను రూపములను గూడ నిచ్చినాఁడు. ఇవి గ్రంథములందు గానరావు; వ్యవహారమున లేవు.

వేరు: వేరీ ... వీరుల్ (హరవి. III. 145); ఈ క్షోణి న్నినుఁబోలు సత్కవులు వేరీ నేటికాలంబునన్ (కాశీ. I).

ఎవ్వరు: (శాసనములు) ఎవ్వరు చెల్ల నీకుంన్నను (S. I. I. VI. 149); ఈమేర యెవ్వరు అతిక్రమించినాను (S. I. I. IV. 276); ఎవ్వరు తప్పినాను (S. I. I. IV. 710); ఎవ్వరడ్డపడ్డాను (S. I. I. IV. 935); కాకుండా నెవ్వరు (S. I. I. V. 192); దీని నెవ్వరేని విలంబ్బము సేసినవారు గోబ్రాహ్మణవధ సేసినవారు (S. I. I. V. 162): ఎవ్వరికైనఁ జేరఁ జొర నెన్నదురాని (హరి. పూ. VII. 89).

వ్యవహారమునందు యవ్వరు అను రూపమును గలదు. ఇది శాసనములందును నున్నది. యవ్వరు తప్పించుకొన్నాను (S. I. I. IV. 803); యవ్వరు తప్పినాను (S. I. I. IV. 981).

పామరజన వ్యవహారమున 'ఓరు' అనునది 'ఎవరు' కుఁ బర్యాయపదముగ నున్నది. దీనిని పోతన వాడినాఁడు: ఓరేడ్వురుఁడు = ఒకఁడును, ఎవ్వరును (భాగవ. VI. 523).

'ఎవరు' అనునది యేకవచన బోధకముగ గౌరవార్థకము గాకున్నను బ్రయోగింపఁబడును.

ఈమె యెవరు? వాఁడెవరు? నే నెవరు? నీ వెవరు?- 'నీ వెవ్వ రేమిపనికై యేవలనికిఁ బోవుచునికి యిది నావుడు (భార. విరా. I. 297); నీ వెవ్వరు= ఎవ్వ తెవు (భార. విరా. I. 287); నీవెవ్వరవు (భార. ఉ. I. 171).

'ఎవ్వఁడు' యదర్థక మనుటకు: కలలోనవచ్చి యెవ్వండు నిన్నుఁ గలసెనతండు నీకుం బతియయ్యెడం బొమ్ము (హరి. ఉ. VII. 77)—'ఎవఁడు' పై సముచ్చయార్థకమగు 'ఉన్' చేరి 'ఒక్కఁడున్ను' అను నర్థము నిచ్చును; విల్లెత్త లేఁడెవ్వఁడున్ (భార. భీ. III. 401).

ఈ క్రింద పైవానికి ద్వితీయాది విభక్తులందు గలుగు రూపములును వం దసాధారణ రూపములకుఁ బ్రయోగములకు బొందుపఱుపఁబడినవి. విభక్తి

ప్రత్యయములలో తృతీయయందు చే, తోడ; సప్తమియందు 'అందు' అను నవి కేవల గ్రాంథికములు; తక్కినవి వ్యవహారమునందును వచ్చును.

ద్వితీయావిభక్తి.

వాఁడు: ఏక. వానిని (వాడిని, వాణ్ణి - వ్య.); బహు. వారిని, వారలను (గ్ర.); వాండ్రను (గ్ర.); వాండ్లను, వాళ్లను (వ్య.), ఆళ్లని (పామరజనవ్య.) అ (ఆ) తనిని (అతడిని, అతణ్ణి - వ్య.); అతగానిని, (ణ్ణి); ఆయనను.

వీఁడు: ఏక. వీనిని (వీడిని, వీణ్ణి - వ్య.); బహు. వీరిని; వీరలను (గ్ర.); వీండ్రను (గ్ర.); వీండ్లను (గ్ర. వ్య.); వీళ్లను,-ని (వ్య.); ఈళ్లని (పామరజన వ్య.); ఇ (ఈ) తనిని, ఇ (ఈ) తడిని, ఇ (ఈ) తణ్ణి-వ్య.); ఇతగానిని(ణ్ణి); ఈయనను.

ఎవఁడు: ఏక. ఎవనిని (ఎవడిని, ఎవణ్ణి, వ్య.); ఎవ్వనిని (ఎవ్వడిని, ఎవ్వణ్ణి,వ్య.); ఏవానిని (గ్ర.); ఎవ్వానిని (గ్ర.); వేనిని (గ్ర.); ఏనిని (గ్ర.); బహు. ఎవరిని, ఎవ్వరిని; ఏవారిని (గ్ర.); ఏవారలను (గ్ర.); ఎవ్వారిని (గ్ర.); ఎవ్వారలను (గ్ర.); వేరిని (గ్ర.); ఏరిని (గ్ర.); ఓరిని (పామరజన వ్య.);-ఎ (ఏ) తనిని (ఎతణ్ణి - వ్య.); ఏయనను.

తృతీయా విభక్తి.

వాఁడు: ఏక. వాని (అతని, అతగాని, ఆయన); చేత, మొద. (వాడిచేత-వ్య.); బహు. వారిచేత, మొద; వారలచేత, (గ్ర.); వాండ్రచేత (గ్ర.) వాండ్లచేత; వాళ్లచేత, మొద.

వీఁడు: ఏక. వీనిచేత, మొద. బహు. వీరిచేత, మొద.

ఎవఁడు: ఏక. ఎవనిచేత, మొద. బహు. ఎవరిచేత మొద. ఇట్లే తక్కిన విభక్తులందును నాయా రూపములను దెలిసికొనవలెను.

అమహద్వాచకము - ప్రథమావిభక్తి.

i. తదర్థకము: ఏక. అది, అద్ది, ఆయది, అయ్యది; బహు. అవ్వి, అవి, ఆయవి, అయ్యవి.- వీనిలో అది, అవి, మాత్రము వ్యావహారికములు గూడ నగును; తక్కినవి కేవల గ్రాంథికములు.

ii. ఇదమదర్థకము: ఏక. ఇది, ఇద్ది, ఈయది, ఇయ్యది; బహు. ఇవి ఇవ్వి, ఈయవి, ఇయ్యవి. - వీనిలో ఇది, ఇవి, మాత్రము వ్యవహారమున గూడ నున్నవి; తక్కినవి కేవలగ్రాంథికములు.

iii. యత్కిమర్థకము: ఏక. ఎది, ఏది, ఎద్ది, ఏయది, ఎయ్యది; ఇట్టి మహిమకుఁ గతమెయ్యది (భార. అర. IV. 189);- బహు. ఎవి, ఏవి, ఎవ్వి

ఏయవి, ఎయ్యవి;- వీనిలో 'ఏది, ఏవి' మాత్రము వ్యవహారమునందును గలవు; తక్కినవి కేవల గ్రాంథికములు.

ద్వితీయాది విభక్తులు.

తదర్థకము: ఏక. దాని, ఆదాని, అద్దాని (గ్రా.);- బహు. వాని (గ్రా.); ఆవాని (?), అవ్వాని (?); వాటి (గ్రా. వ్య.)- 'వాఁటి' అని సబిందుకముగా వ్రాఁత ప్రతులలోఁ గాన్పించుచున్నది; 'వాని' పై 'టి' వర్ణముచేరి 'వానిటి= వాన్టి = వాఁటి' అని యేర్పడినందున 'వాఁటి' సబిందుకమని నిర్ణయింప వచ్చును. కాని, తమిళమున ప్ర. అవెన్. ద్వి. అవత్తై, (ఉచ్చారణము: అవట్రై) నుండి నిర్బిందుకమగు 'వాటి' కూడ నేర్పడియుండును. అనంతపురమున 'అవిటి= వాటి' అనురూపము సర్వసాధారణముగ నున్నది. 'వాఁటి' అనుటకు ప్రయోగములు: 'నల, గగ, భ, జ, స, గణంబు లేనునెకాని, కందంబునకు నొండు గణము సొరదు, వీఁటిలోపల నొక మూఁటిచే వడిలేని హీనపాదము ముందు గానఁబడును' (అప్పక. IV. 270); 'క్షితి మహారాష్ట్రభాషచేఁ జెప్పఁబడెడు భీకరోక్తులు బిరుదులై వెక్కుడనకు, వాఁటి బిరుదావళి యొనర్పవలయునం త్రు బుధులు సంబుద్ధి పదములు పొసఁగఁ గూర్చి (అప్పక. IV. 359) ; వాటి (ప్రభు లిం. పు. 156); వాటిచే (చెన్న. బ. పు. 29, 153); వాటికి (దశావ. పు. 21); వాటిన్ (దశావ. పు. 267); గ్రంథముద్రణమునందు పరిష్కర్తలు 'వాటి, వీటి, వేటి, అనువానిని 'వాని, వీని, వేని' అని దిద్దివేయుటచేతను, అట్లు దిద్ద సాధ్యము కానప్పుడా పదములకు మాఱుగ వేఱుపదములనే చేర్చిరి కావునను నేఁడా రూపములు ముద్రితప్రతులం దెక్కువగఁ గానరావు; కాని, వ్రాఁత ప్రతులలో నవి చాల నెక్కువగనే కాన్పించును. మహద్వాచక వచనములగు 'వాని, వీని, వేని' అనువానికిని, మహతీతరామహద్వాచక బహువచనములగు 'వాని, వీని, వేని' అనువానికిని భేదము గల్పించుటకు 'వాటి, వీటి, వేటి' అనునవి భాషయం దత్యంతావశ్యకములు.

తక్కిన ప్రథమేతర విభక్తులందు పై షష్ఠీ రూపములపై నాయావిభక్తి ప్రత్యయములు చేరును.

ii. ఇదమర్థకము: ష. ఏక. దీని, ఈదాని (గ్రా.); ఇద్దాని (గ్రా.) ;- బహు. వీని (గ్రా.);ఈవాని (?); ఇవ్వాని (?); వీఁటి, వీటి (గ్రా. వ్య.)- వీఁటి సాటినిమేటి యోఁఖోఁటి బోఁటి (ఉషా. క. III. 52).

iii. యత్కిమర్థకము: ష. ఏక. దేని; ఏదాని (గ్రా.); ఎద్దాని (గ్రా.); బహు. వేని (గ్రా.); ఏవాని (గ్రా.); ఎవ్వాని (గ్రా.);- వేటి (వ్య. గ్రా?).

తృతీయా, పంచమీ సప్తములయందు గ్రంథములలో ఏక. దానన్, దీనన్, దేనన్; ఆదానన్ (?), అద్దానన్;- ఈదానన్ (?), ఇద్దానన్; ఏదానన్ (?), ఎద్దానన్; బహు. వానన్, వీనన్, వేనన్; ఆవానన్ (?), అవ్వానన్; ఈవానన్ (?), ఇవ్వానన్ (?); ఏవానన్, ఎవ్వానన్-అను రూపములు గాన్పించు చున్నవి. వానన్ (భార. శాం. I. 71. V. 232; అను. II. 395; IV. 135; V. 217); వీనరెంటనున్ (భార. ఆర. VI. 123); వీనను (భార. శాం. II. 234); మొద. దాన విచిత్రాతనురాగ ప్రౌఢివచ్చి తనుఁ బైకొనఁగన్ (రాఘ. పాం; II.); ఆతపంబు దూఱదు దీనన్ (భార. ఆర. II.); కాననము గిరులు నదులును నానాతీర్థములు భూజనంబులకెల్లన్ భూనుత సాధారణములు వానను ధర్మములు సేయవచ్చునిజెచ్చున్ (భార. అను. II. ); కలవు ... ఘనమాయ లధిప నాకు, వానఁ దగులకపోరాదు వనజభవునకైన (లక్ష్మీ. IV.); ధ్యానం బింద్రియ వృత్తులుమానించు టహింస గురుసమర్చనవిధి నిత్యానుష్ఠానము దపమును, వీనఁ బరసేవ్యమెద్ది (భార. అను. IV.); త్రిగుణంబులును బ్రవర్తించు వీన జనితంబులగుఁ బ్రీతిసంతాపమోహాదులు (భార. అను. V.); దీనసంశయంబువలదు (భార. అను. V. 156); దీన నీవు గన్నది గలదే (భార. ఉ. IV. 237); వీనన్ (భార. ఆర. VI. 123; అను III. 263; IV. 277); ఎల్లదానను జెడితిమి (హరి. పూ. V. 221).

'అది, ఇది, ఏది' అనువానియర్థమున 'అందు, ఇందు, ఎందు' లు ప్రథమేతర విభక్తులందు గ్రంథములలోను వ్యవహారములోను గాన్పించుచున్నవి: అందుమీఁద = దానిమీఁద (కళా. V. 167); అందుననొచ్చి (ఉ. రా. పు. 40); అందులో (హరి. పూ. VIII. పు. 105. 189); అందులో = వారిలో (హరి. పూ. II. పు. 162). అందుకు (రామరా. పు. 163); అందుకుఁదోడు (భోజరా. VI. 148); ఇందులోనన్ = వీరిలో (భాస్క. అయో. 56); ఇందులోను = వీటిలో (S. I. I. IV. 282); ఇందులకు నెయి (S. I. I. IV. 1180); ఇందుకు = దీనికి (S. I. I. IV. 280.) ఇట్లే, అందుచేత, అందుతో, అందుకొఱకు, అందువలన, అందులోపల మొద.

తమిళ మలయాళ కన్నడములందలి 'అదు' కు 'అంను' ఈ యర్థమున రూపాంతరము గావచ్చును.

"సర్వశబ్దంబులు సంబంధంబునందుఁ దచ్ఛబ్దంబుతోడ సమసించు" (బాలవ్యాకరణము). ఉదా. నావాఁడు, నాయది, నాయవి; ఇంటివాఁడు. ఇంటియది, ఇంటియవి; రామునివాఁడు, రామునియది, రామునియవి; మొద. అద్ది, అవ్వి, అనున వీ సందర్భమునఁ జేరవు. "అది, యవి" శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగనగు: నా + అది (అవి) = నాయది

చేరి వస్తునిర్దేశమును జేయును: వాఁడె సురాసురులెల్ల కడ్డమై వచ్చిననైన రాక్షస వివాహమునం గొనిపోవు నిన్ను (భాగ. X.); వీఁడె (భార. విరా. I. 11; స్వర్గా I. 62); వీఁడె వచ్చుచున్నవాఁడు పార్థుఁడు (భార. విరా. V. 181); అదె యిదె (భార. ఆశ్వ. II. 31); ఇదెపోయెద (భార. ఉ. III. 69); ఇదొ (రాధికా. II. 110); ఇదో (పండితా. పు. 403); వీఁడుగో (శకుం. పరి. II. పు. 33); అదె (భార.ఉ. III. 296); ఇట్లే, వారె; వీరె; (వీరె వచ్చిరి-భార. శల్య. II. 44); అవె,ఇవె; వాఁడుగో, వారుగో, వీరుగో; అదిగో, ఇదిగో, అవిగో; ఇవిగో; మొద.-ఇట్టి సందర్భములందు 'వాఁడొ, వారొ, వీఁడొ, వీరొ, ఆమెగో, ఈమెగో,మొదలగు రూపములు కలుగవు. వాఁడుగో, వీఁడుగో, వారుగో, వీరగో. లు నేఁడును నెల్లూరు ప్రాంతమున వ్యవహారమున నున్నవి. కొన్ని ప్రదేశములలో నివి అదుగో, ఇదుగో, అరుగో, ఇరుగో, అను రూపములను పొందును. 'ఇదిగో, ఇవిగో' లకు వ్యవహారమున 'ఇదుగో, ఇవుగో' లనియు రూపములు గలవు.

ఏఁడు, ఏరు, లపై 'ఇ, ఈ,' లు చేరి ప్రశ్నార్థకము లగును. ప్రశ్న యందు ఏది, ఏవి, అనువాని తుది యిత్తునకు దీర్ఘమును గలుగును.

ఆతఁడేఁడీ (భార. ద్రో. I. 374); లక్ష్మణుఁడేఁడనుచున్ (భాస్క. యు. 1587); ఏఁడె నా బలుమానికంబుల కొటారు (అచ్చ. రా. అ.); వారేరీ సిరి మూటగట్టికొని పోవంజాలిరే (భాగ. VIII.); ఏది యేదీ యిదిసాలఁ గ్రొత్త (కళా. I.); ఏదీ (భాగ. VI. 310);- 'ఏఁడీ' కి 'వేఁడి' యనియు రూపము గలదు: 'పోఁడిగ నెందునుంగలఁడు పొమ్మను దానుని జిహ్వనుండియో వేఁడిర మా విభుండనెడి వేటిశిదైత్యుని దృష్టి నుండియో' (భోజరా. I.); పార్థుఁడువేఁడీ (భార. ద్రో. III. 46); అయ్యవేఁడ (భార. ఆశ్వ. II. 31); వేరీ ... వీరుల్ (యతి - హరవి. III. 145); వేరె ? (భార. విరా, V. 322.)

ద్రావిడభాషల ప్రాచీనావస్థయందు 'అదు, ఇదు, ఉదు; అవు, ఇవు, ఉవు' అను రూపములుండెను; వీనిలో 'ఉదు, ఉవు' లన్ని ద్రావిడభాష లయందును వ్యస్తముగఁ బ్రయోగింపఁబడలేదు. తెనుఁగున 'నాదు, మాదు, నీదు, మీదు, తనదు, తమదు; చేయదు' మొదలగు నిట్టి రూపములందు 'అదు' అనునదియు, 'చేయవు' మొదలగువానియందు 'అవు' అనునదియు నున్నవి. అదు, అవులు కన్నడమున నేఁడును గలవు. ఉదు, ఉవు,లు కన్నడమున నేఁడు కొన్ని క్రియాపదములందు మాత్రమున్నవి. తెనుఁగున 'అల్ల, ఇల్ల, ఉల్ల' లు గూడఁగలవు; 'అల్ల' ప్రసిద్ధిని దెలుపునని శ. ర. కారుఁడనెనుగాని 'అల్ల'యు, 'ఉల్ల'యు దూరమునందుండు వస్తువును నిర్దేశించు విశేషణములు; 'ఆ' అను నర్థముగలవి: ''ఉదు, ఉవు' లు దూరమునుగాక దగ్గఱయుగాక మధ్యమం

దుండు వస్తువని కాల్డువెల్లర్థము చెప్పెను. కాని, 'అదు' వలె 'ఉదు' కూడ దూరవస్తువును దెలియఁజేయునదే. కాల్డువెల్లు ననుసరించి నేఁటికొందఱు తెనుఁగులోని 'ఉల్ల' కు 'దూరముననుగాక దగ్గఱను గాక మధ్యమున నున్న' యని యర్థము చెప్పుదురు. కాని, యట్లుచెప్పుట సరికాదు. 'ఉల్ల' దూరపు వస్తువునే నిర్దేశించునట్టి విశేషణము. శ. ర. కారుఁడు 'ఇల్ల, ఉల్ల' లను తన నిఘంటువునఁ జేర్పలేదు; 'అల్లను' నన్నయ వాడినాఁడు (ఆది. IV. 20; VI. 211, 264; అర. I. 115; III. 86.); 'ఇల్ల' ఉల్ల లను వాడలేదు. ఎఱ్ఱాప్రగ్గడ 'ఉల్ల' ను వాడినాఁడు: ఉల్లకాంచనరథము (అర. VI. 153, 185), ఉల్లపద్మాకరముపొంత (అర. VI. 154); ఉల్లమహాగజంబు (అర. VI. 188); ఉల్ల (అర. VI. 152, 209; 218); నన్నయ 'ఇల్ల' యర్థమున 'ఈ' యనివాడియే సాధించినాఁడు; ఈ యున్న పౌష్యుపోలికి (ఆది. IV.)— నేఁటివ్యవహారమున 'ఉల్ల' లేదు. అల్ల, అల్లా (అల్ల+ఆ), అల్లక్కడ (అల్ల+అక్కడ); ఇల్లీ(ఇల్ల+ఈ) 'ఇల్లిక్కడ (ఇల్ల+ఇక్కడ), అని వ్యవహారమున నెల్లయెడలను నున్నది. అల్లక్కడ, ఇల్లిక్కడ, ఎల్లెక్కడ, అనునవి 'అల్లి+అక్కడ; ఇల్లి+ఇక్కడ; ఎల్లి+ఎక్కడ' అనియైనను విభజించి, 'అల్లి, ఇల్లి, ఎల్లి' అనునవి ఒకప్పుడు కన్నడమునందువలె తెనుఁగునను నుండెననియుఁ జెప్పికొనవచ్చును.

ఆ, ఈ, ఏ, లు.

ఆ, ఈ, లు నిర్దేశార్థక విశేషణములు; 'ఏ' యత్రిమర్థక విశేషణము. ఈ మూఁడిట్పై నితరపదములు చేరునపుడు గలుగుమార్పులు సంధిప్రకరణమునఁ దెలుపఁబడినవి. అ (ఇ; ఎ) చ్చ (చ, చ్చో, చో) ట (టు); అ (ఇ, ఎ) వ్వ (వ, వు) ల; అ (ఇ, ఎ) చ్చో (చో) టు; మొదలగువాని మొదట ఆ, ఈ, ఏ, లు చేరియున్నవి; వాని నా సమస్త పదమునుండి వేఱుచేయవీలు లేదు.

ఆలోన్, ఈలోన్, అనునవి కాలార్థమునను దిగర్థమునను వాడఁబడినవి. కాలార్థమున: ఆలోన్ (భార. ద్రో. I 190, 197; III. 259; భీ. III. 286; విరా. III. 169); ఈలోన (హరిపు. VIII. 97; భార. ద్రో. III.184); దిగర్థమున: ఆలోన్ (భార. అర. VII 397; భాస్క. సు. 24);- ఆచాలుట కోర్వవలయు (భార. విరా. III. 110 = దానికి, దానిని చేయుటకు); ఎఱుఁగనియట్టు లుండుటిది యే పురుషార్థము (భార. ద్రో. I. 228 = ఎట్టి); ఇదియే నాఁటి చందము (భార. అర. IV. 850 = ఎన్నడయినఁ గలదా); ఈ మా దేశంబననేల (మను. I. 71— ఈదేశము, ఆ దేశము, అననేల).

మహతీవాచకములు.

మహతీవాచక సర్వనామ పదముల యేకవచనమునఁ దొలుత మహతీతరామహద్వాచక సర్వనామములగు 'అది, ఇది, ఏది' అనునవియే వాడఁ

బడుచుండెను. నన్నయ వీనినే వాడియున్నాడు. ఇవి నేఁటివ్యవహారమునందును మహతీవాచకములుగనే యున్నవి గాని వానిని మిత్రత్వ నీచత్వములను దెలుపు నప్పుడే వాడుదురు. నన్నయ వీని నిట్టి యర్థభేదమున నుపయోగింపలేదు. ద్రౌపది, కుంతి, గాంధారి, అందఱకును నీ సర్వనామముల నాతఁ డుపయోగించినాఁడు. అతని ననుసరించి కావ్యకర్తలందఱును వానినట్లే ప్రయోగించుచు వచ్చిరి. కాని, నన్నయకుఁ దరువాతికవులు మహత్యర్థమున వ్యవహారమందలి యితరపదములఁ గూడ వాడుచువచ్చిరి. ఏకవచనమునం దిట్లు స్త్రీలను గూర్చి 'అది, ఇది, ఏది' అనివాడుచుండినను బహువచనమున మాత్రము మహద్వాచకములతోఁబాటు 'వారు, వాండ్రు, వాండ్లు; వీరు, వీండ్రు; వీండ్లు; ఎవరు, ఎవ్వరు' అనుపదములే కలవు. మహతీవాచకపదములు గ్రంథములందును వ్యవహారమునందును మహద్వాచక పదము బహువచనములనే కలిగియున్నవి. ఏకవచనమునఁ బ్రథమేతరవిభక్తులందును మహతీతరామహద్వాచక పదములకు వలె వీనికిని రూపము లుండును; కాని, తృతీయా, పంచమీ, సప్తమ్యేక వచనములందు వీనికి 'దానన్, దీనన్, దేనన్' అనురూపములు లేవు.

ఆ, ఈ, ఏ, లపై అమ్మ, అప్ప, అక్క, అనుపదములు చేరి స్త్రీలను నిర్దేశించును: ఆ యమ్మ, ఆ యప్ప, ఆ యక్క-ఇందు 'ఆ యమ్మ' 'ఈ యమ్మ' 'ఏ యమ్మ' అను నిండురూపములు నేఁ డనంతపురము జిల్లాయందు వాడుకయందున్నవి. పామరస్త్రీలనయినను 'ఆ యమ్మ, ఈ యమ్మ, ఏయమ్మ' అనియే చెప్పవలెను. 'అది, ఇది, ఏది' అని నిర్దేశించినయెడల వారు తప్పుపట్టుకొందురు. 'అప్ప' అనునది స్త్రీ వాచకముగ రాయలసీమయందు వాడఁబడదు; అది యచట కన్నడమునందువలె 'తండ్రి' యను నర్థముగలది; 'అప్ప=అక్క' అను వ్యవహారము తూర్పుజిల్లాలది. తూర్పుజిల్లాలయం దయినను 'రామప్ప, సోమప్ప' అను నపుడు 'అప్ప' పురుషునే బోధించును. 'అప్ప'ను 'అక్క' అనునర్థమున తిక్కన వాడినాఁడు (భార. విరా. II. 36, 39, 59; అను.I. 207; IV. 188; ఆశ్వ. II. 22;) అప్పాచెల్లెండ్రు (నిర్వ. III. 92); బెంగుళూరు ప్రాంతములలో 'అక్క' యని స్త్రీజన సామాన్యవాచకములుగ నుపయోగింపఁ బడును. అక్కడ స్త్రీలను 'అక్కా' యని పిలుతురు; రామక్క, భీమక్క, మొదలగు వానియం దది స్త్రీమాత్రపరము. 'అక్క' కు సహోదర్యర్థమున నన్నయకాలమునుండియు బ్రయోగములు గలవు. అక్కసెలియండ్రు (భాగ. VIII. 183); అక్కాచెల్లెండ్రు (భాగ. VIII. 478); స్త్రీమాత్రపరముగ: సానెక్క (S. I. I. IV. 987.) అమ్మ, తుది ద్విత్వహల్లులలో నొకటిలోపింపఁగా మిగిలిన 'అమ' యనునది ఆ, ఈ, ఏ, లపైఁజేరి 'ఆయమ, ఈయమ, ఏయమ' అనిమ్మై 'ఆమె, ఈమె, ఏమె,' లుగా మార్పునొందినది: ఆయమ (భార. శాం. I

7; అర. V. 304); ఇయ్యమ (భార. అశ్వ. I. 148) 'ఆపె, ఈపె, ఏపె, ఆకె, ఈకె, ఏకె,' అను సర్వనామరూపములు 'ఆ, ఈ, ఏ'లపై 'అప్ప = అప; అక్క = అక' అనునవి చేరి యేర్పడినవని కొందఱమతము. ఈ మతము సరియైనదో కాదో నిర్ణయింపలేము. ఆకె, ఈకె, ఏకెలు కన్నడమున గలవు; దక్షిణ మహారాష్ట్రమందలి కన్నడమున నివి గౌరవార్థముననే వాడఁబడుచున్నవి; 'అవళు, ఇవళు, యావళు' అనునవి గౌరవముచూపవలసిన వారియెడల నచట వాడరు. మైసూరు ప్రాంతమందలి కన్నడమున నిట్టి యర్థభేదములేదు. నాకంటె, నకట యుత్తమ యాకె యగుట చెప్పవలయునా? (ప్రభా. V.); తక్కినవానికిఁ బ్రయోగములు మృగ్యములు; ఈ రూపములన్నియు నర్వాచీనములు; శ్రీనాథుని కాలము వఱకునుగల గ్రంథములలో నివి కానరాలేదు.

'ఆబిడ, ఈబిడ, ఏబిడ; ఆవిడ, ఈవిడ, ఏవిడ' అనునవియు మహతీ వాచక సర్వనామములుగ వ్యవహారమునఁ గలవు. వీనిలో మొదటిమూఁడును రాయలసీమలోని కొన్ని ప్రాంతములలో మాత్రము వినఁబడును; తక్కిన మూఁడును తూర్పు తీరపు తెనుఁగు జిల్లాలయందెల్ల వాడుకలోనున్నవి.

యత్కిమర్థక మహతీవాచక సర్వనామము 'ఎవతె' అను దానికి వైయాకరణులు వివిధరూపాంతరములను జెప్పియున్నారు. ఆ రూపములు: 'ఎవ-' ఎవ్వ-, ఎవర్-, ఎవ్వర్- ఎవరి-, ఎవ్వరి,- అనువానిపై స్త్రీ శబ్దమునుండి పుట్టిన ప్రాకృతమందలి 'ఇత్థీ' అనుదాని వికారములగు '-త, -తి, -తె,-తుక' అనువానిని చేర్చుటవలన నేర్పడుచున్నవి: ఎవత, ఎవ్వత, ఎవర్త, ఎవ్వర్త, ఎవరిత, ఎవ్వరిత; ఎవతి, ఎవ్వతి, ఎవర్తి, ఎవ్వర్తి, ఎవరితి, ఎవ్వరితి; ఎవతె, ఎవ్వతె, ఎవర్తె, ఎవ్వర్తె, ఎవరితె, ఎవ్వరితె; ఎవతుక, ఎవ్వతుక, ఎవర్తుక, ఎవ్వర్తుక; - 'ఎవరి-, ఎవ్వరి' అనువానిపై 'తుక' చేరదు.

ఇవియన్నియు వేర్వేఱు మండలములందలి రూపములుగాని, యేకమండలమందలి వివిధ సంఘములవారి వాడుకయందున్న రూపములు గాని యై యుండును. '-తుక' తోడి పదములు వ్యవహారమున నాకు వినఁబడలేదు. తక్కినవన్నియు నేఁడు సజీవములై యున్నవి. నన్నయ వీనిలో నొక్కదానిని గూడ వాడలేదు. తిక్కన 'ఎవ్వత' అనుదానిని రెండుసార్లుమాత్రము భారతమున వాడినాఁడు: 'ఎవ్వతె నేని ధాత సృజియించెడఁగ మగవానిఁగాఁగ నా కొవ్వమిఁజేసి యట్టి నిను నుగ్మలి నేయుగ నొల్ల (భార. భీ. III. 321); ఏ నెవ్వతనైతినేమి (భార. అను. III. 222); శ్రీనాథుఁడీ రూపములను వాడినట్లగపడదు; ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ యొంటిఁజరించె దోటలే కివ్వనభూమి' నని పెద్దన్న (మను. II) ప్రయోగించెను. తక్కిన రూపములకుఁ జాలనర్వాచీన కావ్యములనే వెదుకవలసియుండును.

వృత్తియందు పదములపై 'అది' చేరి మహతీబోధకమును నగును: ఆఁటదిఫ్రూలె(భార. ద్రో. III. 201);అంటరానిదానిక్ (భార.శల్య. II.288); ఈ పిన్నది నాకూఁతురు (భార. ఆర. VII. 319); బూచిదానిక్ (మాతృ.శత. 40.) మొద.

## ఏమి.

'ఏమి'ని సాధారణముగ నవ్యయముగఁ బరిగణింతురు. కాని, 'ఏది'వలె నదియు సర్వనామమే. 'ఏది, ఏమి' రెండును బ్రశ్నార్థకములు; రెండును బూర్వోక్త వస్తువును సూచించును: రెంటిమీఁదను విభక్తి ప్రత్యయములు చేరును. కాని, 'ఏమి'కి బహువచనరూపములేదు. 'ఏది' కున్నవి. ఉదా. ఏమి (భార. ఆది. I. 117; III. 211. VI. 240; VIII. 116); ఏమినీఁగ రాదయ్యె డికో (భార. భీ. I. 48); ఏమిటనైనన్ (భార. అశ్వ. II. 185); అద్దేవునియత్తమిం చు టేమిటి (భార. ఆర. VII. 423); ఎప్పుడెయ్యెడ నేమిట నెట్టులరయవలసె నమ్మెయి నాయము (భార. విరా. II. 214); ఏమిట = ఎందువలన (భార. ద్రో. IV. 134); ఏమిటికితల (కళా. V. 61); ఇవి యేఁటిమాటలు (భార. ఆర. IV. 350; ఉ. IV. 37); ఏమిటివాఁడు (భా. భీ. I. 48); ఏమిటికి నలంగు (భా. ద్రో. II, 257); ఏమిటికి (భార. ద్రో. IV. 88; V. 105); ఏఁటికి (భార. ఆర. V. 335; కర్ణ. II. 72); కలుగనేఁటికిఁ గల్లులకడుపుఁజేటు (భాగ. I. 14); ఏమిటియుఁడు (భాగ. IV, 720);— ఏమి గావ్యమునకు (భాస్క. యు. 1813); నుదానిలో 'ఏమి' 'ఏ' యను నర్థముగలిగి విశేషణ మగుచున్నది.— పైకి నపదముల మీఁదవలె 'అది' యనునది 'ఏమిటి, ఏఁటి' అనువానిపైఁ జేరి సమాసను గావచ్చును: ఏఁటిది (భార. విరా. III. 225;)

## అస్మదర్థక సర్వనామము.

ప్రథమైకవచనము: (i) ఏను (భారతకవులు 'ఏను' అనియే వాడిరి. 'నేను' ను వాడలేదు)- ఏనేలనడతు ధర్మేతరంబు (భార. ఆర. VII. 338) మాఁరుమైనను నేనేమి సేయుదాన (భార. విరా. II. 62); అనికిఁ జాలనేను (భార. విరా. IV. 59); ఏనుగట్టువాలుదానను (భార. విరా. I. 298); ఏను విడపటనడిగియెద (భార. శల్య. II. 333); ఏనులోనుగా (భార. శాం. VI. 18) ఏనట యొక్కెడ నొక్కరుఁ గానఁగ బోదునట (భార. శాం. VI. 581); ఈ విధమేను నచ్చి (హరి. పూ. IV. 181); ఏను నతఁడు నయినన్ (హరి. పూ. IV. 122); ఇప్పుడేను రాఁకుండ నొకండు వచ్చి మఱియొందునె (మను. II.48) హల్లుపరమయినపుడు 'ఏను' లోని తుది 'ను' వర్ణము వైకల్పికముగ లోపించును. ఏ మున్ను వెఱతునటరా (భాస్క. బా. 199).

(ii) నేను (ఇది యర్వాచీనరూపము); నేనై చేయఁగవలసిన (ఉ. రా. పు. 33); నేను (పాండు. IV. 158); ఇవుడు వ్యవహారమున 'ఏను' లేదు. పామరజనులు 'నాను' అనియు నందురు. 'నాను' అనున దితర ద్రావిడభాషల యందు సర్వసామాన్యము.

ప్రథమా బహువచనము: (i) ఏము: కావ్యములం దీ రూపమే చాల తఱచుగఁ గాన్పించుచున్నది. నిక్కమున కేమును దస్సితిమి (భార. విరా. I. 154); ఏమయి = మేమున్వాయముగా (ప్రభా. III. 71)

(ii) మేము: మేము కౌరవుల పాంతలము (భార. విరా. I. 285); మేము గోటివచ్చెదము (వరాహ. X. 69); పామరజనులు 'మాము' అనియు నందురు. నేఁటి వ్యవహారమున 'ఏము' లేదు.

(iii) నేము: (S. I. I. IV. 280; 802; భా. అర. V. 199, 200;)- ఇతరద్రావిడభాషలయందు 'నామ్, నావు' మొద.

(iv) అస్మద్యుష్మ దర్థకము : మనము: మనముఁగాలు నోముటెఱిఁగి, (భార. ద్రో. V. 102); ఇప్పుడు మనమంత గాలుద్రవ్వవలవదు (భాగ. విరా. V. 10).

ద్వితీయైకవచనము: (i) నన్ను ( ): నన్నుఁగూర్చి (పాండు. IV. 191); నన్ను సైఁచునె (హరి. పూ. V. 224.).

(ii) నను ( ): నను మిగిలి జగతిఁ గల్పించిన నాఁడెవఁడు (వరాహ. V. 224);

(iii) నన్: నన్ బట్టిచెన్ (భార. విరా. II. 176); సహించునె నన్ మరుఁడు (భార. విరా. II, 296); నన్ = నన్ను (పాండు. II. 207);- నేఁటి వ్యవహారమున 'నన్ను' మాత్రమున్నది.

ద్వితీయా బహువచనము: (i) మమ్ము ( ): మమ్ముఁ గనియుకుము (భాగ. అను. I. 76).

(ii) మము ( ); మమునాపదలకుఁ బాపితి (హరి. ఉ. IX. 255). మముఁజింతం బాపరాదొక దే( భా. ఉ. III. 72); మము న్నవ్యాకులచిత్తులన్ (భాగ. VI. 28); మముఁబోంట్లు (భార. భీ. I. 12); మముఁ బోఁటులు (భార. ఉ. II. 97; IV. 248);- 'మమ్ములన్' అనికవులు వాడినట్లు గానరాదు. -'మమ్ము' అనిమాత్రము నేఁటి వ్యవహారముననున్నది- 'మమ్ములను' అనునది. 'మమ్మల్ని' అనినేఁడు వినఁబడుచున్నది.

(iii) అస్మద్యుష్మ దర్థకము: మనలన్; ఇది నేఁటి వ్యవహారమునను గలదు.

తృతీయైక వచనము: నాచేత (చే, తోడ, తో); నాచేత నిన్ను వినిన యపుడ వుత్తైంచె (భార. ఉ. IV. 280); బహు. మాచేత (చే, తోడ, తో); మనచేత (చే, తోడ, తో):—మనలచేత (చే, తోడ, తో) అనురూపములను గవులు వాడినట్లు కాన్పింపదు. ఆ రూపములు వ్యవహారమున లేవు. 'మనలచేతను' అని బాలవ్యాకరణ కారుఁ డుదాహరించుట ప్రమాదజనితము.

చతుర్థ్యేకవచనము: నాకై, నాకొఱకు; బహు. మాకై, మాకొఱకు; మనకై, మనకొఱకు;- మనలకై, మనలకొఱకు, అని కవులు వాడిన ట్లగపడదు. అవి వ్యవహారమున లేవు.

పంచమ్యేకవచనము: నా వలన (కంటె); బహు. మావలన (కంటె); మనవలన (కంటె)—మనల వలన (కంటె) అను రూపములు కావ్యములందు గానరాలేదు. వ్యవహారమున లేవు.

షష్ఠ్యేకవచనము (i) నా; బహు. మా, మన; 'మనల కొలఁదులు' అని రామాభ్యు. VI. 72 లో నున్నది. పూర్వకవులు దీనిని వాడ లేదు; వ్యవహారమున నిది లేదు.

(ii) నాదు: నాదుకొఱకు (భాస్క. కి. 329); నాదుమీఁదనా (కళా. V. 39); బహు. మాదగు (విష్ణుపు. V. 86); మనదగు; - 'మనలదగు' అని కనఁబడ లేదు; పై రూపములెవ్వియు లోకమున వినఁబడవు.

(iii) నాకు (లో, లోపల); బహు. మాకు (లో, లోపల); మనకు (లో, లోపల); - 'మనలకు (లో, లోపల)' అని కావ్యములఁ గనఁబడ లేదు. లోకమునను వినఁబడవు.

సప్తమ్యేకవచనము: నాయందు; బహు. మాయందు, మనయందు; - 'మనలయందు' అని కావ్యములందుగాని వ్యవహారమునఁగాని లేదు.

యుష్మదర్థక సర్వనామము.

ప్రథమైకవచనము: ఈవు, నీవు; బహు. ఈరు; మీరు; ఈరలు, మీరలు; - ఇందు 'ఈవు, ఈరు, ఈరలు' ప్రాచీనములు; నేఁటివ్యవహారమున లేవు; 'మీరలు' కూడ నేఁటి వ్యవహారమున లేదు: నీవెక్కడ బుద్ధి తెరువు లెక్కడ (భార. ఆర. VII. 297); శత్రులోకమునకు నీవు వధ్యుఁడవుగావు (భార. ఆర. VII. 286); - ఈరు (భార. ద్రో. V. 38; విరా. V. 123); - 'మీరు' 'మీర్' కూడ నగును: (భార ఆర. V. 383); - మీరలు (భార. శాం. II. 2; ఉ. IV. 140); మొద. ద్వితీయైకవచనము: నిన్ను, నిను, నిన్; బహు: మిమ్ము, మిమ్ములన్; - నేఁడు 'నిను, నిన్, మిము', అనునవి వ్యవహారమున లేవు—నిను: ఏ పుణ్యురాలొకో యిప్పుడు నినుఁ బుత్త్రుగాఁ గాంచుటకు

**మేలికలనుగాంచు** (భార. అర. VII. 344); నినునగరే (భార. భీ. III. 250); నిన్: పాపంబు నిన్ద్రెక్కొనున్ (భార. అర. VI. 192); మిముఁబోటులకున్ (భార. అర. VI. 366); **మిముఁజూడఁబడయఁగంటి** (భాస్క. అర. I. 106); మిముఁబోఁటి (భాగ. I. 449); **మిముఁబోంట్లు** (భార. శాం. III. 294; శల్య. I. 42); **మిమ్ములన్** (భార. ఉ. I. 26) - వ్యవహారమున 'మిమ్మల్ని' అని నేఁడు వినఁబడుచున్నది. తృతీయైకవచనము: నీచేత (చే, తోడ, తో); బహు. **మీచేత** (చే, తోడ, తో); - మీ (రు) లచేత, మిమ్ములచేత, మొదలగురూపములు కావ్యములందును వ్యవహారమునందును గానరావు. చతుర్థ్యేకవచనము: నీకై (కొఱకు); బహు. **మీకై** (కొఱకు); - మీ (రు) రలకై, మిమ్ములకై, లేవు—పంచమ్యేకవచనము: నీవలన (కంటె); బహు. మీవలన (కంటె); మీ (రు) రలవలన (కంటె) లేవు. షష్ఠ్యేకవచనము: నీ, నీదు; నీకు (లో, లోపల) బహు. మీ, మీదు; **మీకు** (లో, లోపల); - **మీలోపల** నొకగోవు (భార. అను. III. 83); మీలో నధిమన్యుఁడు లేఁడేమో (భార. ద్రో. II. 233); మీలోమీ రెవ్వుపడుచుగునే (భార. ద్రో. V. 371); నీదైన (భార. అర. V. 346); నీదు మహత్త్వ మెంతయుం జిట్టులుగానె (భార. అర. V. 223); నీదు నైపుణములకెల్లఁ గలకట్టు (హరి. ఉ. VII. 161); నీదుపైన్ (భాగ. X. i. 1482); నీదగు రాజ్యలక్ష్మి (భాస్క. అయో.); మాదగు (విష్ణుపు. V. 86); మీదైన కానన (రామా. అర. V. 185); - (రు) **మీరల** (కు, లో, లోపల) అనురూపములుగాని, మిమ్ముల (కు, లో, లోపల) అనురూపములుగాని లేవు. సప్తమ్యేకవచనము: నీయందు; బహు. మీయందు; - మీరలందు, మిమ్ములందు, అనురూపములు లేవు

ఆత్మార్థక సర్వనామము.

ప్రథమైకవచనము: **తాను, తా , తా**; బహు. **తాము, తారు,** తమరు. ఇందు 'తారు' కావ్యములందు మాత్రమున్నది; నేఁడు వ్యవహారమునలేదు; నన్నయ 'తారు'ను వాడినాఁడు; 'తాము'ను వాడలేదు. 'తమరు'కు పదునాలవశతాబ్దమునకుఁ బూర్వమందు ప్రయోగములు కాన్పించవనితోఁచుచున్నది. 'తాము'ను నేఁడాత్మార్థమందే కాక యుష్మదర్థమందును వాడుదురు; 'తమరు' కేవలము యుష్మదర్థమందే వాడఁబడుచున్నది.

ద్వి. ఏ. తన్ను, తను, తన్; ద్వి. బ. తమ్ము, తము ('తమ్ములన్' లేదు); తృ. ఏ, తనచేత (చే, తోడ, తో); తృ. బ. తమచేత (చే, తోడ. తో); చ. ఏ. తనకై (కొఱకు). చ. బ. తమకై (కొఱకు); పం. ఏ. తనవలన (కంటె), పం. బ. తమవలన (కంటె); ష. ఏ. తన (కు, లో, లోపల). ష. బ. తమ (కు, లో, లోపల); స. ఏ. తనయందు, స. బ. తమయందు.

అత్యంతదయాంతరంగుఁడు గృతాహితభంగుఁడు దానుఁ దమ్ముఁడున్ (భార. ఆర. VII. 154), కర్మశమము తాన కలుగున్ (భార. భీ. I. 202); ఏమీ పౌండ్రుఁడు దానుఁ జుట్టములునై యేతెంచెనే (హరి. ఉ. VI. 203); అతనికిం దాం బుట్టిరి (S. I. I. VI. 628; ఇందు 'తాము = తాం'); నోముల్ వేయును నోఁచి తా అంకాడఁగఁ దొడంగినట్లు (ఒం. రఘు. శత. 6); తారు (అర. V. 58, 307, 373, 409; అను. V. 247; సౌ. I. 27); తార = తారే (విరా. II. 35; భీ. I. 204); తన్నుమఱచి (మను. VI. 34); తన్నుఁ గాన రాక పగిది వీచినన్ (నిర్వ. VIII. 24); తనుఁగొల్వఁగన్ (భార. ఆర. VII. 37); తనుమెఱసి (భార. విరా. I. 140), తనున్ = తన్ను (భార. ఆర. VII. 37; ద్రో. I. 22; 24; శాం. VI. 394); తనుఁ జుట్టిరా (ఉ. హరి. II. 84); తనునగరె (నిర్వ. V. 90); తననున్ (హరి. ప్రా. IV. 83; ఇది యపూర్వ రూపము; గణముకొఱకై యుండును); తన్ = తన్ను (కాశీ. II. 80); తన విల్లునిల్పి (భార. భీ. III. 401); తప్పుతనదెస లేదు (భార. ఉ. IV. 5); తన యిచ్చినదివియ (S. I. I. IV. 1008); తమ తల్లిందండ్రికి (S. I. I. IV. 751); తమతల్లితండ్రికి (S. I. I. IV. 919: గౌరవార్థమున నేకవచనమునకు బహువచనము); తమకట్టించిన శనివారమండపము (S. I. I. V. 138- గౌర వార్థమున ఏక. వ. కు బహువ.) తమతల్లి దండ్రిం గారికిన్ని (S. I. I. IV. 789- గౌరవార్థమున ఏకవ. నకు బహువ.)-తనదులోనన్ (పాండు. IV. 78, గణముకొఱకు కర్తృకార్తి); తనకెదిరి (భార. భీ. I. 48); భీష్మునకుఁదనయందు గలిగె భంగంబు శిఖండిచేత (భార. భీ. I.); హంసి తానయై ధరణికిడిగ్గి (ప్రభా. III. 8).

'తారు' నుండియేర్పడిన ప్రథమేతర విభక్తి రూపములు లేవు. 'తమరు' నుండి 'తమరిని, తమరిచేత, తమరితో, తమరికొఱకు, తమరివల్ల (కంటె), తమ రికి (లో, లోపల), అనురూపములు వ్యవహారమునందుగలవు. కావ్యములందు లేనట్లే తోచుచున్నది.

'తాను' పదమును దాని యితరవిభక్తి రూపములును నాత్మార్థమున ప్రథమపురుష సర్వనామము లగుటయేకాక యితరార్థములందును నుపయో గింపఁబడినవి.

దానవి తనకున్ (= నాకు) మగడవగుమనిన (భాస్క. అర. I. 145) తన్‌గొల్వ నేఁటిమొదన్ (భాస్క. కి. 515 = అతనిని); ముల్లోకముల కేఁ ముత్తవన్నాకుఁ దల్లివిగాన నాతల్లి ! నీయట్టి తల్లివి గలుగంగఁదనకు (=నాకు రోగంబు నెల్లెడ బొందంగ నెట్లుండవచ్చు (బసవపు. పు. 70); పెనిమిటితన్ను

(= నన్ను) జంపినఁ జంపనిమ్ము అనుచుఁ దూపొడువ కే నరిగితినపుడు (బసవపు. పు. 66); ద్విజులము దార (= మనము) యంత్యజులముగాక ద్విజులమే యని చాఁగి వెండియు మ్రొక్కి (పండితా. పు. 159); కుసుమాస్త్రహతికిఁదా (= నేను) గుఱియైతి (పండితా. పు. 333); దొడ్డవ్రోతనకు (= నాకు) నీతోడి కూటంబు (పండితాపు. 389); తన కిందు పోయిన ననవేల (= నాకు; పండితా. పు. 482); తా రామభద్రుండన్ (=నేను) (భాగ. I. 17); తా (=అతఁడు) వచ్చె సుదర్శనాయుధుఁడు (భాగ. X. ); ఏమఱకుండని తాను ప్రబోధించె (= అతఁడు) (భార. ఆది. VI); నీవు సెప్ప నొకకంబుగఁ బూనిన యీ ప్రబోధముం దనకిపు డంకితంబు ప్రమదంబుగఁ జేయుము (=నాకు) (రుక్మాం. I.); మొద.

"కర్తృబహుత్వంబునఁ దనతనకుఁ దమతెమయునగు" (ప్రౌఢ. పు. 37); తమతమపుత్త్రుఁడుగాఁ జిత్తములం జేకొని దయను బృథగ్భావములేక ముదంబునఁ బెంచిరి (భా. అర. III.) తనుతమయొద్దిబలంబులు (భార. విరా. V. 65); - కాని, అందఱు తనతనమది నున్న తెఱఁగుఁ దథ్యముచెపుఁడా (భార. విరా. I. 65); తీర్చికొనుఁడు తనతన వాహనములు (భార. విరా. IV. 89); మొద.

తనుదాన్, తనుదాన (నె), తనంతనె అనువాని కితరు సహాయములేక యని యర్థము: తనుదా (భార. విరా. I. 103); తనుదానదాచికోలు (భార. ఉ. I. 348); తనుదాన కౌఁగిలించెను (సిం. నార. శత. 30); తనంతనె (భాగ. IV. 699); తనుదాన తోఱఁగిన పచ్చకప్పురపురజము (మను. II); ఇట్లే, వానికి వాఁడె, వీనికి వీఁడె, నాకు నేనే; మొద.

'తమకతమకతనియు' (భార. అర. VII. 76; ద్రో. II. 71; భీ. II. 342) = 'ఎవనిమట్టుకువాఁడు తనియు' అని యర్థమగునేమొ.

'మత్వంత త దేత ద్యుష్మ దస్మ దాత్మ శబ్ద పూర్వకం బంతట శబ్దంబు పృథగర్థకంబగు: వానియంతట వాఁడున్నాఁడు. మొద.' (ప్రౌఢ. పు. 48).

## సంఖ్యావాచకములు.

ఇంతకుఁ బూర్వము ఏకవచనము బహువచనము అను వానిని గూర్చి ముచ్చటించి యుంటిమి; కాని, ఏక, బహువచన పరిజ్ఞానమున మాత్రమే వ్యవహారము సాగదు. ఒకటి కంటె నెక్కువయగు వస్తువు లెన్నియో సరిగ నిర్ణయింపవలసి యుండును. అప్పుడు సంఖ్యలను ప్రత్యేకముగఁ దెలియఁ జేయు శబ్దములు కావలసి యుండును. కాని, అనంతమయిన సంఖ్యాసముదాయ మంతటిలోను నొక్కొక్కదాని కొక్కొక్క పదము నేర్పఱుచు కొనుటకు సాధ్య ముకాదు. కావుననే యాయా భాషావర్గము లందలి భాషలను మాట్లాడువారు

సంఖ్యల పేళ్ల విషయమున నొక మితి నేర్పఱుచుకొని అంతకు పై సంఖ్యలను జెప్పవలసి నప్పు డన్ని మితులును బైఁగా మిగిలిన విడివస్తువుల సంఖ్యను దెలుపుకొనఁ జొచ్చిరి. ఒక్క భాషలోనే యనేక విధములగు సంఖ్యామితి వాచక పదము లుండవచ్చును. తెనుఁగున నన్నిటి కంటె తక్కువ వర్గము 'జత'; ఇందు రెండేసి వస్తువు లొక మితిగ నేర్పడును; దేహావయవములలో కన్నులు, చెవులు, ముక్కుఁ జెరమలు, చేతులు, కాళ్లు, అన్నియు జతలుగా నున్నవి. తల్లి, తండ్రి; ఆలు, మగఁడు; పుంజు, కోడి; ఉపాధ్యాయుఁడు, శిష్యుఁడు; అని యీ రీతిగ రెండు రెండ్లుగ జతలు కనఁబడుచున్నారు. కావున జతలుగ లెక్కించుట స్వాభావికమే. రెండు రెండుగఁ గానవచ్చు వస్తువుల సంఖ్యకు వేర్వేఱు పేళ్లును నుండవచ్చును; అందొకపే రొకవిధమగు వస్తువులకును నితరము లితరములగు వస్తువులకును మాత్ర ముపయోగింపఁబడును; కొన్నివస్తువుల విషయమున రెండు, మూఁడు పదములను గూడ నుపయోగింప వచ్చును; ఉదాహరణమునకుఁ దెనుఁగున 'కవ, జంట, జత, దోయి' మొదలగు పదముల నుపయోగింపవలసి వచ్చినప్పుడు 'అడుఁగుదోయి' అందురుగాని అడుఁగుఁగవ, అడుగు జంట (జత), అని యనరు. 'క (చ) ను దోయి', క (చ) నుఁగవ' అందురుగాని 'క (చ) ను జత, క (చ) ను జత' అని యనరు; 'చెప్పుల జత' అందురుగాని చెప్పుల కవ (జంట, దోయి) అని యనరు. 'తమ్మిఁదోయి' (భార. అశ్వ IV. 143) అను ప్రయోగము గలదు. ఇట్లే యింకను నీ విషయమున నెంతయో వైచిత్రి గలదు. వస్తువుల నెంచునప్పుడు రెండు (మూఁడు, నాలుగు, మొద.) జతలుమ బై నొకటియు నేర్పడును; కాని, యీ సంఖ్యా పద్ధతివలన ఒకటి, రెండు, మూఁడు, మొదలగు సంఖ్యావాచక పదముల ప్రయోజనము లేకుండఁబోదు. వస్తువులను మూఁడు మూఁడులుగా నెంచు సంప్రదాయము తెనుఁగున లేదు; నాలుగులుగా నెంచుట గంజాము జిల్లా యందున్నది; నాలుగు వస్తువుల సమూహమున కచట 'పుంజీ' యందురు. వస్తువుల నెంచునప్పుడు రెండు పుంజీల ఒకటి, మూఁడు పుంజీల మూఁడు, పది పుంజీల రెండు, అని యీ రీతిగఁ జెప్పుదురు. కాని, యిందువలనను సాధారణ సంఖ్యల యావశ్యకత తొలఁగిపోదు. 'పుంజీ' అను పదము గంజాము జిల్లాకు దగ్గఱగ నివసించు సవరల భాషలో 'ఉంజీ' అని కాన్పించుచున్నది. తెనుఁగు వా రా పదమును సవరలనుండి గ్రహించిరో సవరలే తెనుఁగువారి నుండి గ్రహించిరో చెప్పలేము. పండ్లు, కాయలు, పిడుకలు, మొదలయిన కొన్ని విధములైన వస్తువులను మాత్రమే పుంజీలుగ లెక్కింతురు. పుంజీల లెక్క మఱి కొన్ని తెలుగు జిల్లాల యందును నుండిన నుండవచ్చును; కాని, యిది సర్వ సామాన్యము కాదు. ఐఁదైఁదులుగఁ గూడఁ దెనుఁగున లెక్కించుట

పదములనుజేర్చి ఇరువది, ముప్పది, మొదలగు నర్థమిచ్చు సంప్రదాయమున సంస్కృత ద్రావిడభాషలకు సామ్యముగలదు. సంస్కృతమునఁ దొలుత 'తొమ్మిది' ని దెలుపుపదము ప్రత్యేకముగ లేకుండి యుండవలెను; కావుననే 'క్రొత్త' అను నర్థముగల 'నవ' అను పదము సంస్కృతాంకములందు చేరినది. పందొమ్మిది, ఇరువది తొమ్మిది, మొదలగు వానిని దెలుపుటకును సంస్కృతమున పదములు లేకుండెను; వానిని దెలుపుటకు వానిపై యంకెలగు 'వింశతి, త్రింశత్, చత్వారింశత్' మొదలగు పదములకుఁ బూర్వమందు 'ఊన' అను అనుపదమును సంస్కృతమున మాట్లాడువారు చేర్చుకొనుచుండిరి. 'ఊన' అను పదమునకు 'ఒకటి' అని మొదటి యర్థము. ఇదియే లాటిను: ఊనున్; గ్రీకు: ఓయ్‌నోస్; ఇంగ్లీషు: వన్, యూనిట్, యూనియన్, మొదలగు పదములందు గానవచ్చుచున్నది. అదిచేరునప్పుడు మధ్యమపదలోపి సమాసమేర్పడి ఊనవింశతిః అనఁగా 'ఒకటి (తక్కువ) ఇరువది, ఊనత్రింశత్ = ఒకటి (తక్కువ) ముప్పది' అనునర్థములు గలిగినవి; దీనిని బట్టి సంస్కృతమున 'ఊన' పదమునకు 'తక్కువ' అనునర్థము గలిగినది; పాదోన = పాతిక తక్కువ; మొద. ద్రావిడభాషలయందును దొలుత 'తొమ్మిది' కిఁ బ్రత్యేకముగ మాటలేకుండనుండవలెను. కాని, సంస్కృతమునుండి ద్రావిడులు 'నవ' అనుపదమును గ్రహింపక 'ఊనవింశ'తీత్యాది సంప్రదాయము ననుసరించి 'పది'కిఁ బూర్వమందు దామును 'ఊన' పదమును జేర్చికొని యుందురు. ద్రావిడభాషల యందును 'ఊన' పదము 'ఒం, ఒణ్-డు, ఒణ్-ఋ; ఒన్-దు' మొదలగు పదములయందు గాన్పించుచునే యున్నది. 'పది'కిఁ బూర్వమం దిట్లు 'ఊన' పదమును జేర్చుకొన్నను ద్రావిడులు పందొమ్మిది, ఇరువదితొమ్మిది, మొదలగు చోట్ల 'ఊన'ను జేర్చుట మానుకొనిరి; 'ఏక'నుండి 'అష్ట'వఱకును క్రిందిపదికి జేర్చి, 'తొమ్మిది'కిఁ బ్రత్యేకముగ నేర్పడిన పదమునుగూడ నట్లే చేర్చుట వారికి స్వాభావికముగనే కాన్పించెను. 'నవ'ను క్రింది 'దశత్తు'కుఁ జేర్చుట సంస్కృతమునను లేకపోలేదు: చూ. 'నవనవతిః' మొద. కొన్ని 'దశత్తు'లకుఁ బూర్వమందు 'నవ' చేరకుండుట సంస్కృత భాషా సంప్రదాయమున నిలిచినది. కాని, సంస్కృతమునకు సంబంధించిన యన్ని యాధునిక భాషలందును 'నవ'తో సంబంధించిన పదము క్రిందిదశత్తుకు చేరుచున్నది.

సంస్కృత సంప్రదాయమునకును ద్రావిడ సంప్రదాయమునకు పదులకుఁ బైయంకెల పరిగణనమున భేదముగలదు. సంస్కృతమున నాయా దశత్తులకుఁ బైనున్న విడి యంకెలను దెలుపు పదముల నా దశత్తులను దెలుపు పదములకుఁ బూర్వమందు చేర్తురు; ద్రావిడ భాషలలో వానికిఁ బరమందు చేర్తురు. ఏకాదశ, ద్వావింశతిః, త్రయస్త్రింశత్, చతుశ్చత్వారింశత్ = ఒక

టింబది, రెండునిరువది, మూఁడుమ్ముప్పది, నాలుగున్నలువది మొదలయినవి. ద్రావిడము : పదునొకండు, ఇరువది(యు)రెండు, ముప్పది(యు)మూఁడు, నలువది(యు)నాలుగు; మొద. సంస్కృతమునం దిట్లున్నను దానికి సంబంధించిన కొన్ని ప్రాచీనాధుని కార్యభాషలయందును ద్రావిడభాషల యందువలెనే యెక్కువగనున్న యంకెలను దశత్తులకుఁ బరమంనుచేర్చు సంప్రదాయము లేకపోలేదు. ఇంగ్లీషున పదకొండు నుండి పందొమ్మిది వఱకును సంస్కృత సంప్రదాయమున్నది. ఇరువదికిఁ బై సంఖ్యలయందు ద్రావిడమునందలి సంప్రదాయము వంటిదే యున్నది. థర్టీన్ (Thirteen) = మూఁడుంబది;' ఫోర్టీన్ (Fourteen) = నాలుగుంబది; నైన్-టీన్ (Nineteen) = తొమ్మిదింబది; మొద. కాని, ట్వెంటి-వన్ (Twenty-one) = ఇరువదియొకటి; థర్టీ-టూ (Thirty-two) = ముప్పదియురెండు; మొద. జర్మను మొదలగు భాష లిప్పటికిని నీ విషయమున సంస్కృత సంప్రదాయమునే యనుసరించుచున్నవి. ప్రాచీన ప్రాకృతములలో సంస్కృత సంప్రదాయమే యున్నను నేఁటి పైశాచీభాషలలో ననేకములందెక్కువయగు నంకెలను క్రింది పదులకుఁ జేర్చుటయే సంప్రదాయముగ నున్నది. ఇండియాలోని నేఁటి కొన్ని యార్యభాషలు సంస్కృత సంప్రదాయమును, కొన్ని పైశాచీ సంప్రదాయము ననుసరించుచున్నవి. పైశాచి ననుసరించిన వానిలో ద్రావిడభాషలు చేరినవి.

ద్రావిడభాషలకు ప్రాకృతభాషలయందు గాని నేఁటి ద్రావిడేతరార్య భాషలందుగాని సంఖ్యావాచకపదముల విషయమున నెక్కువపోలికలు కనఁబడవు. యూరోపియనుభాషలందును ఇరేనియను భాషల యందుఁగూడ వీని కెక్కువ సామ్యము గాన్పించుచున్నది. సంఖ్యావాచకపదములు ద్రావిడభాషల యందు ప్రత్యేకముగఁ బుట్టినవో, లేక నేఁటి ప్రచారమునుండి తొలఁగిన యే పైశాచ్యాది భాషలనుండి యైన వానియందు చేరినవో నిర్ణయించుట కష్టము. ఇరేనియనుభాషలయందలి స్వరపరిణామ సంప్రదాయమును బట్టియు, నేఁటి కొన్ని పైశాచీ భాషలయందలి కొన్నిరూపములను బట్టియు నాలోచించి పరిశోధన చేసినయెడల ద్రావిడ సంఖ్యావాచకపదముల స్వరూప నిర్ణయమున కొక సూత్రము చిక్కునేమో వెదుకవలసియున్నది. అట్టి ప్రయత్నము చేయుటకు ద్రావిడభాషలయందలి ఒకటినుండి పదివఱకుఁ గల సంఖ్యలఁ దెలుపు పదముల నొకచోటఁ జేర్చి యితరభాషలయందు వానిని బోలినపదము లున్నచో వానిని జూపి, లేనియెడల వ్యుత్పత్తి నూహింపవలసియున్నది.

[త. = తమిళ్; కొర్. = కొర్వి (బెల్గాము); కై. = కైకాడి (షోలాపూరు); మ. = మలయాళము; క. = కన్నడము (బెల్గాము); కు. = కురుఖు

(పలమన్); మల్ = మల్తో; కూ = కూఇ (ఖోండ్ మలలు); గో = గోండి (మండ్ల); తె = తెలుఁగు; బ్రా = బ్రాహూఇ (కలత్.)]

ఒకటి

త. ఒన్రు, ఒరు, ఓర్; కోర్ : ఒణ్డ్; కై : వణ్డ; మ. ఒరు : క. ఒన్దు; తు. ఒన్ణ; మల్, ఒర్త్, ఓణ్డ్-ఒన్డ్; కూ. రో(ణ్డి), ఏక; గో. ఉణ్డీ; తె. ఒకణ్డు, ఒణ్డు; బ్రా. అసిట్. వీనిలో ననేకరూపములకు 'ఒన్' అనునది మూలము; కొన్నిటిలో ననునాసికత్వము నేఁడు పోయినది; కాని, తొలుత నన్నిభాషలయందును నుండియుండవలెను. 'రోణ్డి' యనునప్పుడు తొలి ఒకారమునకు స్థానవ్యత్యయము కలిగినది; బ్రాహూఇ లోని 'అసిత్' కు ద్రావిడ మూలము లేదు.

ద్రావిడేతరార్యభాషలలో 'ఊన' శబ్దము మూలముగాఁ గల పదములు చాల భాషలలో నేకార్థవాచకములుగ నున్నవి.

తెనుఁగునందలి 'ఒక(టి, ఁడు, రుఁడు)' అనునది సంస్కృతమందలి 'ఏక' శబ్దమునుండి కలిగినదని యాంధ్రపండితుల యభిప్రాయము. ఈ వ్యుత్పత్తి యసంభవము కాదని కాల్డువెల్లు ఒప్పుకొనుచున్నాఁడు. కాని, యారెండు పదములకుఁ గల సంబంధము చాల దూరమనియు, నేకార్థవాచకములగు బంగాళీ: ఒక్, పెర్షియను 'యక్' అనువానికిని ఏకశబ్దమునకును గల దగ్గఱ సంబంధమును 'ఒక, ఏక'లకుఁ జెప్ప వీలులేదనియు నాతని యభిప్రాయము. అయినను నాతఁడు 'ఒక' యనునది 'కలుపు, చేర్చు, అను నర్థముగల 'ఒ' అను ద్రావిడధాతువుతో సంబంధించినదని చెప్పుట యుక్తమని చెప్పియున్నాఁడు. కాని, 'ఒ' యను ధాతువునుండి 'ఒక్క' అను పద మెట్లు కలుగునో సరిగ నిర్వచింపలేదు. ఇట్లు ద్రావిడ ప్రాణాయామముగ వ్యుత్పత్తి నేర్పఱుపఁ బాటుపడుటకంటె, బంగాళీ, పెర్షియను భాషలయందువలె తెనుఁగలోని 'ఒక' కూడ నతి ప్రాచీనకాలముననే యేకశబ్దమునుండి యేర్పడినదని చెప్పుటయే బాగుండును.

రెండు

త. ఈరణ్డు, ఇరు, ఇర్; కోర్. రణ్డ్; కై. రణ్డ; మ. రణ్డు; క. ఎరడ తు. ఎణ్డ్; మల్. ఈవ్రు, ఏణ్డిస్; కూ. రిణ్డి, దుఇ; గో. రణ్డ్; తె. రెణ్డు (వ్యవహారమున : రొణ్డు), బ్రా. ఈరట్.

ఈ రూపములను బోలిన ద్రావిడేతరార్యభాషారూపములు గరావు. కాని తెనుఁగునందలి వ్యవహారమున 'రొండు' అను రూపమునుబట్టి

వీలులేక 'రెండు' 'ఇరండు' గ మాఱియుండునేమో. ఈ వ్యుత్పత్తిని గూర్చి తజ్జ్ఞులు నిష్పక్షపాతముగ నాలోచింతురు గాక.

మూఁడు.

త. మూన్ఱు, మూ, ము; కొర్. మూడ్; కై. మూణ్డ్; మ. మూన్ను; క. మూఱు; కు. మూణ్డ్; మల్. తీన్; కూ. మూన్జి, తిని; గో. మూణ్డ్; తె. మూఁడు; బ్రా. ముసిట్.

పై వానిలో మల్తోలోని 'తీన్', కూయిలోని 'తిని' అనునవి హిందీ మొదలగు భాషలనుండి యాభాషలలోఁ గ్రొత్తగఁ జేరియుండును. తక్కిన రూపముల కన్నిటికి 'మూన్' అనునది మూలమగును. ద్రావిడేతరభాషలలో దేనియందును దీనిని బోలిన త్ర్యర్థవాచకపదము కానఁగాలేదు.

నాలుగు.

త. నాన్గు, నాలు, నాల్; కొర్. నాల్; కై. నాల్; మ. నాలు; క. నాల్కు; కు. నాఖ్; మల్. చార్; కూ. నాల్గి, సారి; గో. నాలూంగ్; తె. నాలుగు; బ్రా. చార్.

వీనిలో మల్తోలోని 'చార్', కూయిలోని 'సారి', బ్రాహుఇ లోని 'చార్' అనునవి హిందీ మొదలగు భాషలనుండి క్రొత్తగా నాభాషలయందు చేరియుండును. తక్కిన రూపముల కన్నిటికిని 'నాల్' అనునది మూలరూపము. దీనిని బోలిన రూపము ద్రావిడేతరభాషలయందు కానరాలేదు; కాని, యుత్తర హిందూస్థాన భాషలలోఁ గొన్నిమెడల 'చతుర్ శ్వః' = నాలుగు దినముల పిమ్మట అనుటకు 'నర్సొ' అని యున్నట్లు లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియాయందు తెలుపఁబడినది. ఇందలి 'నర్' యొక్క వ్యుత్పత్తిని దెలిసికొనినచో ద్రావిడమందలి 'నాల్' కుఁ గూడ వ్యుత్పత్తి తేలును. కాని, యట్లు కనుగొనుట కాధారము లెవ్వియుఁ జిక్కలేదు.

అయిదు.

త. ఎయ్న్దు, ఎయ్న్; కొర్. అఞ్జ్; కై. అఞ్జ్; మ. అఞ్జు; క. ఏను, ఐదు; కు. పంఛే; మల్. పఛ్; కూ. సిఞ్గి, పాను; గో. సైయూంగ్; తె. అయిదు; ఏఁదు; ఏను; బ్రా. పఞ్చ్.

వీనిలో మల్తో: పఛ్; కూయి: పాను; బ్రాహూఇ: పఞ్చ్, అనునవి 'పంచన్' శబ్దభవములై హిందూస్థాన భాషలలోని రూపములను బోలియున్నవి. అవి తరువాతికాలమున నా భాషలలోనికిఁ జేరియుండును. కూయిలోని

'సిఙ్గ్,' గోండీలోని 'సైయూంగ్' అనువానిలోఁ దొలుత 'స' కారము చేరి నది; ఏల చేరినదో తెలియదు. పయి రూపముల కన్నిటికిని 'పంచన్' అను సంస్కృతరూపమే మూలమైయుండును. తొలి పకారము హకారముగను, హకారము అకారముగను, చకారము జకారముగను, తద్ద్వారా దకారము గను మాఱి యీ యీ రూపము లేర్పడియుండును. పదిహేను, పదహైదు (అనంతపురము) అను వ్యావహారిక రూపములలో నింకను హకారము మిగిలి యున్నది.

ఆఱు

త. ఆఱు, అఱు; కొరగ. ఆఱ; కై. ఆఱ; మ. ఆఱు; క. ఆఱు; కు. ఛస్ సాయే; మల్. చో; కూ. సజ్గి; స; గో. సారూఙ్గ్; తె. ఆఱు; బ్రా. షష్.

పై వానిలో మల్తోలోని 'ఛో', కూయిలోని 'సజ్గి, స,' బ్రాహూఇలో 'షష్' అనునవి సంస్కృతములో 'షష్' కు సంబంధించినవి. ఛో, ఛః, మొదలగు రూపములు ఉత్తర హిందూస్థానభాషలయందెల్ల నున్నవి; వానినుండి యీ భాషలలోని కవి తరువాతి కాలమునఁ జేరియుండును. తెక్కున రూపముల కును 'షస్' అనునదియే మూలమై యుండును. ఇరేనియను భాషలో పదాది సకారము హకారముగ మాఱును : సప్త = హప్త; సింధు = హిందు; సోమ = హోమ; మొదలయినవి. ద్వాదశ = హిం. బారా; త్రయోదశ = హిం. తేరా, మొదలగు వానిలో శ = స = ర, అనుకీతి మార్పు కాన్పించుచున్నది. ప్రాకృతమున శుృ = హుణ; శృత = హణిఅ; అనువానియందలి శవర్ణము నకు హకార మాదేశమయినది. తెనుఁగునను నిట్టి మార్పులు లేక పోలేదు: సోయగము, చూ. హొయలు; సార్థ. చూ. హత్తు: మొ. పై యుదాహరణ ముల సామ్యమున సంస్కృతమందలి 'షస్' ప్రాచీన ప్రాకృతములందే హర్, హార్, లుగ మాఱి యైరేనియను భాషలకు సంబంధించిన పైశాచీభాషల ద్వారా ద్రావిడభాషలందు మొదటినుండియు నెలకొని యున్నవని చెప్ప వచ్చును. 'ఆఱు' తొలుత హకారాదియై యుండెననుటకు వ్యవహారమునఁగల 'పదహారు' లోని హకారము సూచించుచున్న దనవచ్చును.

ఏడు.

త. ఏఴు, ఎఴు; కొరగ. అగ; కై. అగ; మ. యేఴు; క. ఏఴు, ఏళు; కు. సత్తే; మల్. సాత్; కూ. ఒద్గి. సాతు; గో. యేరూఙ్గ్; తె. ఏడు; బ్రా. హఫ్త్.

పై వానిలో మల్తో 'సాత్; కూయి: సాతు; బ్రాహూఇ: హఫ్త్ అనునవి సంస్కృత 'సప్త' అనుదానినుండి కలిగినవి; వానిలో 'సాత్, సాతు

అనునవి ఉత్తరహిందూస్థాన భాషలయం దెల్ల నున్నవి. 'హఫ్త్' అనుదానిలో స = హ, అను మార్పు ఐరేనియనుభాషా సంప్రదాయము ననుసరించినది. తక్కిన రూపములుగూడ 'సప్త' నుండి కలిగినవే. అవి ఐరేనియను భాషలకు సంబంధించిన పిశాచభాషలయందు సప్త = హాత్థ = హేత్థ = * హేడ్, అను రీతిని కలిగియుండును. ఆది హాకారము తెనుఁగు వ్యవహారమున 'పదిహేడు' లోఁ గాన్పించుచున్నది. 'ఏడు'కుఁ దక్కిన ద్రావిడభాషా రూపములన్నియు నీ విధముగనే కలిగియుండును; వానిలో డ = ఱ = ళ, అను మార్పు కూడఁ గలిగినది.

## ఎనిమిది.

త. ఎట్టు, ఎణ్; కొ. అట్; కై. అట్; మ. యెట్టు; క. ఎణ్టు; కు. ఆఖ్; మల్. అట్; కూ. ఆటు; గో. అఖ్; తె. ఎనిమిది; బ్రా. హష్త్.

పై వానిలో కొర్వి, కైకాడి, కురుఖు, మల్తో, కూయి, గోండీ, బ్రాహూఇ భాషలలోని రూపములు సంస్కృతమందలి 'అష్ట'కు సంబంధించిన వనుటకు సందేహము లేదు. ఆ రూపములే యార్యభాష లని పిలువఁబడు భారతవర్షీయ భాషలయం దెల్లఁ గాన వచ్చుచున్నవి. తమిళము, మళయాళము, కన్నడము, తెనుఁగుభాషలలో 'అష్ట=ప్రా. అట్ఠ' అయి దాని తొలి అకారమెకారముగ మాఱినది. ద్రావిడభాషలయం దీ మార్పు సర్వసాధారణము: యమ =తమి. యెమన్; కన్న. ఆనె = తె. ఏనుఁగు. తెనుఁగున: క(=కె)రడు, గ(గె)డ. గ(గె)డ్డ; న(నె)మ్మి; మ(మె)యి; ర(రె)ట్టి; ర(రె)క్కను; మొద.

తెనుఁగులోని 'ఎనిమిది' అను రూపము మాత్రము కొంతవింతఁగఁ గాన్పించుచున్నది. ఇందలి 'ఎని' అనునది తక్కిన ద్రావిడభాషలయందలి యుష్టళ ద్ధాత్కరూపమే. 'మిది' అనునది దాని వెంటనే వచ్చు నంకెయగు 'తొమ్మిది' యను పదము పోల్చ్యలముచే 'ఎన్' పైఁ జేరియుండును. కాని, 'ఎన్' అనునది 'ఇరు(ను)' శబ్దవికారమనియు, తొమ్మిది యనఁగా 'పది'కి తొల్లింటియంకె యను నర్థము చెప్పికొనవలసినట్లే 'ఎనిమిది'కిఁ గూడ పదిలో రెండుతక్కువయగు నంకెయని యర్థము చెప్పికొనవలెననియుఁ గాల్డువెల్లు తెలిపియున్నాఁడు. కాని, యన్ని ద్రావిడభాషలలోను 'ఎనిమిది' లోని మొదటిభాగమగు 'ఎన్' అను నంగము కనఁబడుచుండఁగా నొక్క యీ యంకెవిషయమునమాత్రము దాకి 'రెండు' అను నర్థము నేల చెప్పికొనవలెనో తెలియదు. కాల్డువెల్లువాదము నంగీకరించినయెడలఁ దెనుఁగునఁ దొలుత నెనిమిదికిఁ గూడఁ బ్రత్యేకమగు సంఖ్యావాచక పదము లేకుండెనని చెప్పవలసివచ్చును అట్లు చెప్పుటకంటె 'ఎనిమిది' లోని 'మిది' 'తొమ్మిది' లోని 'మిది' సంపర్క

మువలనఁ గలిగినదనియు, 'ఎని' అను భాగమునకు మాత్రము 'అష్టన్' అను నర్థము గలదనియుఁ జెప్పుట యుక్తము.

తొమ్మిది

త. ఒమ్బదు, కొర్. ఒమ్బిది; కై; వమ్‌ది : మ. ఒన్పదు ; క. ఒమ్బత్తు; కు. నై; మల్. నో; కూ. న ; గో. నా, ఉన్మక్; తె. తొమ్మిది; బ్రా. నోస్.

కురుఖు, మల్తో, కూయి, గోండీ, బ్రాహూఇ, భాషలలోని పదములు సంస్కృత 'నవ' శబ్దమునకు సంబంధించినవి. తక్కినవన్నియు సమస్తపదములు. వానిలో మొదటి యంగము 'ఒన్' 'ఉన్' అనునదియు, రెండవది 'పది, పదు, మిది' అనునదియునై యున్నవి. 'మిది' అనునది వికారముగఁ గాన్పించును. తెనుఁగున 'ఒన్'కు మాఱుగ 'తొన్' అనునదియు, కైకాడిలో 'వన్' అనునదియు నున్నవి. ఒత్వమునకు వత్వము సాధారణముగఁ గలుగుచుండును గాని, తెనుఁగులోని 'తొన్' అనుదానినిగూర్చి విచారింపవలసి యున్నది. తక్కిన ద్రావిడభాషలలోని 'ఒన్' పూర్వరూపమయి, తెనుఁగున దాని మొదల 'త'కారం మాగమముగనైన వచ్చియుండవలెను; లేదా 'తొన్' అనునది 'తొల్' (=పూర్వము) అనుదాని వికారరూపమైన కావలెను. 'ఒన్' పూర్వరూప మనుకొన్నయెడల నది 'సం. ఊన(=ఒకటి)' అను పదమునుండి కలిగియుండును. 'తొన్' పూర్వరూపమయిన యెడల, దాని తొలి తకారము లోపించియుండవలెను. పదమధ్యగత తకారము 'అ'కారమై తుదకు లోపించుట గలదు గాని, పదాది తకారమట్లులోపింపదు. కావున, ఒన్, తొన్, లు వేర్వేఱు పదములై యుండును. తెనుఁగున 'తోడ' ప్రత్యయమునకును తక్కిన ద్రావిడభాషాలయందు 'ఒడు, ఒడం' మొదలగు ప్రత్యయములును నిట్టి సంబంధము గలవే. కొర్వభాషలోని 'పిది' తెనుఁగునందలి 'మిది' అనునవి. రెండును 'పది' శబ్దమునకు మాఱురూపములు. కాని, వానియందలి యత్వమిత్వముగ నెట్లు మాఱినదో నిర్ణయించుట మాత్రము కష్టము.

పది

త. పత్తు ; కొర్. పత్ ; కై. పత్త్; మ. పత్తు ; క. హత్తు ; కు. దస్సే ; మల్, దస్; కూ. దశు; గో. దస్; పద్; తె. పది; బ్రా. దహ్.

కురుఖు, మల్తో, కూయి, గోంది, బ్రాహూఇ భాషలలోని పదములు సంస్కృత 'దశ' శబ్ద భవములు. తెనుఁగున 'పది' సంస్కృత 'పంక్తి' శబ్ద భవమని యాంధ్ర వైయాకరణుల యభిప్రాయము. 'పంక్తి' తెనుఁగున 'పంతి, బంతి' యను రూపములను బొందినది. అనునాసికముమీఁది తకారము దకారమగుట ప్రాకృతభాషలతోఁ బాటు ద్రావిడభాషలయందును గలదు. 'పది' యందు నేఁ డనునాసికధ్వని వినఁబడకున్నను 'పన్నిద్దఱు,

పన్ద్రెండు, పందొమ్మిది, పందుము' మొదలగువానియందు 'న' కార మింకను వినిపించుచునే యున్నది గావునఁ దొలుత నది 'పది' యందుండవలెనని యూహింపవచ్చును. ఇంతకంటె మంచి వ్యుత్పత్తి లభించువఱకును 'పది' 'పఙ్క్తి' శబ్ద భవమనియు, 'పది' యను పదము తక్కిన ద్రావిడభాషలయందు వివిధరూపములను దాల్చినదనియు ననుకొనవచ్చును.

ఇరువది, ముప్పది, నలువది, ఏఁబది, అఱువది, డెబ్బది, ఎనుబది, తొంబది అను పదములును వానికి సరిపోవు నితర ద్రావిడభాషా పదములును రెండుపదులు, మూఁడుపదులు, మొదలగు నర్థములు గలవి. ఒక పదికిని మఱి యొక పదికిని మధ్యనుండు సంఖ్యలను దెలుపుటకు వాని క్రింది పది కాయా సంఖ్యలను జేర్చి చెప్పవలెను: పదుమూఁడు, ఇరువదినాలుగు, మొద. తొమ్మిది పదులు 'తొంబది' యగుచున్నది. ఇది యితర ద్రావిడభాషల యందును 'తొం' తోడనే యారంభించుచున్నది; కావున, 'తొమ్మిది' లోని 'తొమ్' అను నదియే పూర్వరూపనియు నదియే 'తొంభత్తు, తొంబది' మొదలగు రూపములలోఁ గానవచ్చుచున్నదనియుఁ జెప్పుట కవకాశమున్నది. 'తొంబది' అనునది 'తొల్ + పది' = (నూటికి) ముందటి పది, అను రీతినైనను నేర్పడి యుండును. 'తొమ్మిది' అను పదమునకు 'పది' కి పూర్వపు (అంకె) అనియు, 'తొంబది' కి '(నూటికిఁ) బూర్వపు (పది)' యనియు నర్థము చెప్పఁకొన వచ్చును.

నూఱు

త-నూఱు; కొన్. నూర్; కై. నూన్; మ. నూఱు; కు. ఒణ్డ్ సై; మల్. పఞ్కోటి; కూ. పాఁను కడి; గో. సైక్రా; నూన్; తె. నూఱు; వంద; బ్రా. షద్.

కురుఖులోని ఒణ్డ్సై = ఒక శతము; 'సై' అనునది 'శత' శబ్దభవము; ఇట్లే, గోండీలోని 'సై,' బ్రాహూఇలోని 'షద్'లు కూడ 'శత' శబ్దభవములే. మల్తోలోని పఞ్కోటి, కూయిలోని పాఁనుకడి, అనువానికి 'అయిదు ఇరు వదులు' అని యర్థము; ఆ భాషలలో నిరువదులతో లెక్కించుట యాచా రము; తక్కిన భాషలలోని 'నూఱు'కు వ్యుత్పత్తిని కనుఁగొనుట కష్టము. దానినిబోలురూపము లా యర్థముగలవి మఱియేభాషలలోను నున్నట్లు గాన్పిం పదు.- 'నూఱు' అనఁగా 'పొడి' అని యర్థమును గల్పించి పొడిలోనుండు రేణువులెన్నో యుండును గనుక ద్రావిడులకు శతసంఖ్య మిక్కిలి యధిక మగుటచేత నా సంఖ్యకు 'నూఱు' అను పేరిడిరని కాల్డువెల్లు తెలిపియున్నాఁడు.

మఱియొక వ్యుత్పత్తి తోచనప్పుడే దానియొక్క సమాధానము చెప్పఁబోవలెను గదా. కాని, కాల్డువెల్లు తెనుఁగులోని 'వంద'కు వ్యుత్పత్తి నాలోచింపలేదు. 'వంద'ను తెనుఁగు భారతకవులు వాడలేదు. తరువాతి కవులలో నెవ్వరైన వాడిరేమో తెలియదు; వాడినట్లు కనఁబడదు. ఇది మఱి యేద్రావిడభాషయందును గాన్పింపదు. ఇది సమూహార్థమున 'బృంద' శబ్దభవముగఁ బ్రాకృతమున నున్నది. ఈ యర్థమున నది 'పఉమచరి అ. I. 1,' 'జావపాదిక సూత్ర,' అను జైన గ్రంథములందు ప్రయోగింపఁబడినది; ప్రాకృతప్రకాశికయం దుదాహరింపఁబడినది. 'వంద' యను సమూహార్థక ప్రాకృతపదమే తెనుఁగున నూ అను నర్థమున నెలకొనియుండును.

వేయి.

త. మ. ఆయిరమ్; క. సావిర; తె. వే, వేయి.

సావిర, ఆయిర, శబ్దములు సంస్కృత 'సహస్ర' శబ్దభవము లని కాల్డువెల్లొప్పుకొని యున్నాఁడు గాని, తెనుఁగులోని 'వేయి' కేవలద్రావిడపదమనియు నది వేఁడియగు, చుఱుకగు, అనునర్థములుగల 'వే' యనుద్రావిడధాతువునుండి కలిగినదని చెప్పియున్నాఁడు. ఇట్టి వ్యుత్పత్తిని చెప్పుటయందాతని యభిప్రాయ మేమో తెలియదు. వేడిగానున్నది 'వేయి' యెట్లగునది యగమ్యగోచరముగా నున్నది. ఇట్టి నిరాధారమగు వ్యుత్పత్తిని చెప్పుటకంటె నదియు సావిర, ఆయిర, శబ్దములవలె 'సహస్ర' శబ్దభవమే యనుట యొక్కటముగ నుండియుండును. సహస్ర = సాహస్స. సావిర = * సాహిర = సాహసగడము = సావిర; తమి. ఆయిర = ప్రా. * ఆవిర = తెనుఁగు: వేయి; అనురీతి నాయా వ్యుత్పత్తులను జెప్పికొనవచ్చును.

సంస్కృతములోని 'లక్ష' శబ్దము తెనుఁగున సామాన్యజనవ్యవహారమున 'లచ్చ,' 'నచ్చ'లుగ మాఱినది; ఇందు 'లచ్చ' యచ్చ తెనుఁగు కావ్యముల కెక్కినది. కాని, 'కోటి' శబ్దము మాత్రము నేఁటికను వ్యవహారమునఁ గూడఁ దెనుగున నట్టి మార్పును బొందలేదు.

తెనుఁగున సంఖ్యావాచకపదములు

1. ఒకటి.

(అ) విశేషణము: (i) ఒక, ఒక్క.

ఒక, ఒక్క, లు విశేషణములు. వీని యుపయోగము చాలఁ ...ముగ నుండును.

i. కేవల సంఖ్యావాచక విశేషణములు: ఒక్కనూటిని (ద్రా. తి. I. 96); అనిన నగుచు నొక్క కేల నతనిఁ గౌఁగిటఁ జేర్చి (భార. అశ్వ. I. 18

ii. ఒకపరి (భార. ద్రో. III. 255; భాగ. VIII. 74); ఒకమరి (భార. విరా. V. 55; ఉ. IV, 196; శాం. III. 151; అను. I. 38; అను. II; అను. III. 289); ఒకమాటు (భార. ఉ. III. 20; భాగ. VII 62); ఒక్కమాటు (భాగ, VII. 415); ఇందు సంఖ్యార్థమున్నను సంఖ్యయే ప్రధానము గాదు.

iii. ఒక్క దనుజాధముఁడు ... నన్నుఁ జెఱఁగొనిపోయెడు (భార. అర. V. 177); ఒక్కొక నుతి = ఒకానొకప్పుడు (భార. విరా. I. 71; ద్రో. III. 228; హరి. పూ. VIII. 152); ఒక్కొకచో = ఒకానొకచోట (భార. విరా. I. 53); ఒక్కొక్కమాటు (భార. అర. V. 409); ఒకమాత్ర (నిర్వ. V. 29); ఒకనాఁడు = ఒకానొకనాఁడు (చంద్రభా. III. 14); అనఁగా అనఁగాఒకరాజు.

iv. 'ఒకనూఱు, ఒకకొన్ని, ఒకకొందఱు' మొదలగువానియందు 'ఒక' ఊఁతపదము.

v. ఒక, ఒక్క, లేకార్థవాచకము లయినను వానిని బహువచనమునం దున్న పదములతోఁ జేర్పవచ్చును. పడతులాత్మ నొండొక్క పడతులం గలసిన (భార. అర. V. 300); మన మొకయేవుర మీ యంగనయున్ (భార. విరా. I. 159); ఒకమూఁడు ముహూర్తములు (ఉ. హరి. V. 190); అవియు నొక్క బ్రతుకులే (కళా. III. 30), ఒకముప్పది గోటులు మూఁడుగోటులున్ (పాండు. I. 159); ఒకకొన్ని (పాండు. I. 181; IV. 184); ఒక్క యిద్దఱు తలోదరుల [illegible] (పాండు. V. 201); ఒకకొందఱన్ (సమీ. III. 40; V. 107. 111); ఒక మున్నూఱు గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షుచాపంబు (భోగ. IX. 262); ఇట్లే, ఇరువదియొక్క రూపాయలు; మొద.

vi. ఒకండొక = కొండొక, అనునది 'కొంత' నను నర్థమున వాడఁబడును; కొండొకవడి విచారవ న్మానసుఁడై (భార. అశ్వ. I. 153); కొండొక సేవునకు (భార. భీ. I. 50).

vii. 'ఒకానొక' అనునది యనిశ్చితమగు విశేషణమును దెలుపును: ఒకానొక యర్చన (పాండు. IV. 191); ఒకానొకనాఁడు (భాగ. IV. 742); 'ఒకానొక' అని భారతకవులు వాడినట్లు కాన్పింపదు; నన్నయ వాడలేదు.

viii. 'ఒక, ఒక్క' లపై 'ఇంచుక, అంత, ఇంత. కొంత,'లు చేరి 'కొంచెము' అను నర్థము నిచ్చును.

ఒక్కించుక సేపు (భార. విరా. II. 47); ఒక్కించుకంత సేపునకు (కళా. IV. 148); అంబురాసులు నేడున్ ... ఒక్కంతసేయన్ (భాస్క. యు. 1992); ఒకయింత (పాండు. I. 154); ఒకయింతటిలోన = కొంచెములో (భార. విరా.

I. 21); దువ్వటొకింత జారఁగా (రాధికా. II. 107); అందుల కొక్కయింత దరహాసము (సమీ. VI. 203); ఒక్కింతసేపునకెల్ల (కళా. III. 92); ఒక్కింతసేపునకు (భార. అశ్వ. II. 89), ఒక్కంతలు=కొంచెము ముఖ్యములు (భార. అను. II. 411); ఒక్కావంత (భార. విరా. II. 161.) ఇంకొక కొంతసేపునకు (ఆము. V. 59).

ix. 'ఒక, ఒక్క' యనునవి చేరునప్పుడు వాని విశేష్యములమీఁది సముచ్చయ చిహ్నము 'ఒక, ఒక్క' ల సంఖ్యార్థము నూఁదిచెప్పును: ఒక యమ్మున నమ్మృగము సెందద చేరదయమ్భుతంబుగన్ (భార. ఆర. VII.380); ఒక్కడుగు నేఁగెడుదానికి నోర్వ నెమ్మెయిన్ (భార. విరా. I. 148); ఒకత్రు ప్పుడు రాలను (భార. విరా. V. 239).

x. 'కలసియాకస్మికముగా' నను నర్థమున నీక్రిందివానియందు 'ఒక్క' నేకాని 'ఒక' ను వాడఁగూడదు; ఒక్కవెట్ట (భార. భీ. III. 13; వాసిష్ఠ రా. IV. 86); ఒక్కవడితోన్ (భాస్క. అయో. 209); ఒక్కమొగమ్మైకడం గినన్ (భార. ఉ. IV. 229); ఒక్కమ్మైన్ (భార. ద్రో. II. 105; భాస్క. యు. 1831). ఒక్కయుమ్మడిన్ (భార. భీ. II. 131; ద్రో. III. 24. హరి. పూ. VI. 87); ఒక్కుమ్మడిన్ (భాగ. VIII. 55. భార. భీ. I. 214).

xi. ఒక్కసరిన్ = ఒకటేరీతిగా (భాస్క. అయో. 298); ఒక్క వెంబడి = ఎట్లెట్లో, ఏదోయొక విధమున (ప్రభా. I. 117); వారెల్లను నొకతల యమ్మారుతియొకతల (భార. ఉ. II. 184); ఇదియెల్ల నొకతల ... చెనకుట యొకతల (భార. ఆర. VI. 61); ఇదియెల్లనునొకతల ... అది యొకతల (భార. ఉ. III. 193); ఒక్కతరవాయిదొరకొని = ఒకరితరువాతనొకరు (హరి. పూ. VII. 81); అదియొక ( = ఇంచుమించు) యక్షౌహిణికిం గలిగియొప్పె (భార. ఉ. I. 221. 233); ఒకచీరికింగైకొనక (భాగ. IV. 326); ఒకచోన్ (నైష. VII. 148, 149); ఒకపుడు (కళా. V. 188); ఒకకాలమును నట్టివి సూడము = ఏకాలమందును (భార. ద్రో. III. 117); మనసొక లాగైనన్ = అదియొక రీతి (కళా. I. 150); ఒకమైన్ = ఒకరీతిగా (భాస్క. యు. 566); ఒక వెంటన్ = ఒకరీతిగా (హరి. ఉ. III 73); ఒకదినుసు పద్యముల్ = అది యొకరీతి (ప్రస. రా. శత. 4); ఒకమొగిన్ = కలసి (భార. ఉ. IV. 817); (పువ్వులు) ముడి కొక్కభంగిగా నెత్తులువట్టియుత్తు = ఒకవిశేషముగ నున్నట్లు (భార. విరా. I. 107); అయ్యిరువురఁజూచుచు మేనులు గరుపాఱఁగఁద్రుచ్చి యొక్క కౌఁగిటఁ జేర్చెన్ = ఒకటే (భార. ద్రో. V. 16).

**xii. 'ఒక్క' కు 'ఒకొ్క' అని 'ఒ, కొ్కనిమేషంబున ... ... కూడన్ (భార. ఉ. IV. 424) అను ప్రయోగమున నున్నది; యతికొఱకై యుండును.**

xiii. 'ఏసి' ప్రత్యయము 'ఒక, ఒక్క' లపైఁ జేరదు గావున దాని యర్థమును దెలుపుటకు 'చెఱు, చెఱి' అను పదములు వానికిఁ బూర్వమందు చేరును: చెఱొకపోటు (భార. విరా. III. 163).

xiv. 'ఒక' కు 'ఓ' అనియు రూపాంతరము గలదు: ఓరాత్రింగను తెప్పవేయక (కాశీ. V. 189).

xv. 'ఒక, ఒక్క'లు సర్వనామములకుఁ బూర్వమందును జేరును: ఒక(-క్క) నన్నే పిలిచినారు; ఒకకొందఱు; ఒకకొన్ని; మొద.

xvi 'ఒక' కు 'వొక', 'వొగ' అనురూపములు వ్యవహారమునఁ జాల కాలము నుండియు నున్నవి: వొగనివేశనం (S. I. I., I. 874).

xvii. ఈక్రింది ప్రయోగములందు 'ఒక, ఒక్క' లు వివిధార్థములందు వాడఁబడినవి:— నూతులు నూఱిటికంటె సూనృతవ్రత యొకబావి మేలు (భార. ఆది. III. 93); నరుఁడొకరథికుని యనుమతిఁ జొరఁ దలఁచునె (భాం. ద్రో. IV. 147); అతఁడొకచందమైన నేమిగతిఁబోదు=మఱియొకరీతి (భార. భీ. II. 365); ఒకలాగునఁ గానిపించుచున్నదానవు (కళా. VII. 218); వారకులాచారవాసనాబాహ్యంబు లొకపూట కొకపూట కుడిగిపోవ (కాశీ. IV. 23); ఒక్కబియ్యము, ఒక్కనీరు, ఒక్కనిప్పు, మొదలగువానియందు 'ఒక, ఒక్క' లు కేవలార్థకములు.

(అ) విశేషణము: (ii) ఒండు.

i. 'ఒకొండు' అనుపదమునందుమాత్రము 'ఒండు' కు 'ఒకటి' యను నర్థము గలదు. కాని, యిందది విశేషణముకాక సర్వనామమే యగుచున్నది. 'వేఱొండు, మఱొండు, ఇంకొండు' మొదలగు ప్రయోగములందు 'ఒండు' కు 'ఒక' అనునర్థ మున్నది. ఇట్లే మనమున కొండురెండు మఱు మంత్రముల నురిపోవఁ జెప్పినస (ఆము. IV. 265); సంద్రములు నేఁడొండై నవేళన్ (దశావ. I. 227); 'చను మింకొండుదలంపు మానుమని యాశ్వాసించి' (భార. అర. 49) అనుప్రయోగమున 'ఇంకఁ జనుము. ఒండు దలంపు మానుము' అనియర్థము చేసికొనవలయు నని తోచుచున్నవి. ఒండొంటిన్, ఒండొంటన్, ఒండొండ, మొదలగువానియందు మొదటి యవయవము మాత్రము 'ఒకటి'యను నర్థమును గలిగియున్నది. 'ఒండొకరుండు (భార. విరా. IV.76)= ఒకానొక పేరులేనివాఁడు అని యర్థము. ఒండొండపొంగి కలయఁబాఱు బయోధులు = ఒకటికంటె వేఱొకట యెక్కువగా (భార. అర. IV. 223,224; 308; ఉ. IV. 819. భీ. I. 294; కుమా. భా. II. 248, 683, 783; భాస్క. అర. II. 110; మను. III. 28); మొద. కాని, ఒండొండ = ఒక్కరొక్కరే అని భాగ. III.3 లో ప్రయోగమున్నది.

సాధారణముగా విశేషణ మగునపుడు 'ఒండు' కు 'వేఱు, వేఱొక' యనియేయర్థము: త్రిణయన నుతుఁడొండు సోటు మెచ్చక (యుద్ధ. బెజ. శాస.); ఒండుగుఱ్ఱంబులం బూన్చుము (భా. ఆర. II. 166); ఒండొకనిఁ = వేఱొకని (భార. విరా. IV. 28); ఒండుపనులకు సెలవు లేకునికిఁ జేసి (భార. విరా. I. 240); ఒండువిల్లు = (లు-ండ్లు) వేఱు (భార. భీ. I. 254; ద్రో. III. 83; V. 135); ఒండువెంట బ్రదికియుండఁ జేరదు (భార. ఆర. VII. 61); ఒండొక విలు (భార. ద్రో. III. 242); ఒండొకచాపము (భార. ద్రో. IV. 31); మొద.

'ఒంటి' అనునది 'ఒండు' నుండిపుట్టిన విశేషణము; దీనికి 'ఒక' అనియే యర్థము. ఒంటికంటిగాము, ఒంటిరొమ్ము నేలుపు, ఒంటిపాటు, ఒంటిపోగు, ఒంటియడుగుఁ గత్తెర. మొద. ఒంటికాలు (భాగ. I. 401):- 'ఒంటి' కి శబ్దమై యవ్యయముగఁ బ్రయోగింపఁబడును. దీనిపైఁ బరుషములు సరళము లాదేశములగును. ఆశ్రమంబునఁ గృష్ణ నునిచి వచ్చినార మొంటిమిఁ గట (భా. ఆ. VI. 194); ఒంటి దిరుగుదాని కవ్వదు (భా. విరా I. 103, ప్రాస); ఒంటిననుటయొడ (భార. విరా. V. 234. ప్రాస); ఒంటివచ్చునే (భా. విరా. IV. 76); ఒంటి గుంపులు పడిపోవ (భార. ద్రో. I. 274); ఒంటిపొమ్మంటిఁ (భాస్క. అర. II. 65); మొద. అర్వాచీనకాలమున గొందఱు 'ఒంటి' ని ద్రుతప్రకృతికముగ నుపయోగించిరి: 'ఒంటిన్' (ఉ. రా. I. పు. 13- శార్దూలవి. ప్రథమపాదమున కాదిని);— 'ఒంటి' పై మరల 'మై, మెయి' లను జేర్చి యాదేశ్యార్థమున వాడుటయుఁ గలదు. ఒంటిమెయిన్ (భార. విరా. II. 265. కర్ణ. II. 85. అను. I. 223); ఒంటిమైన్ (భార. భీ. II. 84; ఉ. IV. 278; భాస్క. కి. 355) మొద.— 'ఒంటిపడి' (భాస్క. అయో. 245) లో 'ఒంటి' విశేష్యముగ వాడఁబడినది.

ఒంటరి, ఒంటరికాఁడు, ఒంటరిపాటు, ఒంటరీఁడు, ఒంటిరుపు, ఒంటికాఁడు, అనుపదములు 'ఒక' అను నర్థముగల 'ఒండు' నుండి కలిగినవి, కాని, ఒంటరము ( = శత్రుత్వము. విరోధము) అనుపదము 'వేఱు' అనునర్థముగల 'ఒండు' నుండి కలిగినది. 'ఒంటమిలేనివి యొంటరమింటరములు పలుకు టుచితమే' (భార. ఉ. IV. 237).

'ఒండెన్' అనునది ద్రుతాంతమగు నవ్యయము. దీనికి 'కాని; వికల్పమున' నని యర్థము. ఒండు + ఏన్ = ఒండేన్ = ఒండెన్, అని దీనికి వ్యుత్పత్తిని చెప్పుదురు; ఇట్టి యర్థమునఁ దొలుత శ్రీనాథుఁడు 'ఒండేనిన్' అని వాడినాఁడు: అను వంగంబున నొండె, నొండెను విహారాపేక్ష, నొండేని ధర్మనిరాసంబున, నొండెఁ దీవ్రభయ సంత్రాసార్థ, మొండేని యన్య నియోగంబున నెవ్వఁడే మునుఁగు గంగాంభఃప్రవాహంబునన్ జనుఁ డారిందును బుంద

రీక నయనా శాసించుఁ బాపౌఘముల్ (కాశీ. VII)—'ఒండెన్' అనునది వికల్పముగఁ జెప్పఁబడిన యన్ని పదముల మీఁదను సాధారణముగఁ జేరును: సమకట్టి సైన్యంబు సైన్యంబుతో నొండెఁ దొడరి మీ ముప్పురతోడ నొండె, నిద్దఱితో నొండె నెక్కటి యొక్కనితో నొండెఁ బొడిచెద దోర్బలమున(భార. సభా. 197); నేర్పొండెను మల్లుల పూనిక యొండె (హరి. పూ. IV. 68). సిద్ధులొండె విద్యాధరు లొండెం గావలయు (హరి. పూ. IV. 22).- 'ఒండె'ను ప్రత్యేకముగఁ గూడఁ బ్రయోగింప వచ్చును: అష్టమీ వాసరంబున యందు నొండె, నొండెనేని చతుర్దశి, నిండుభక్తిఁ బూజఁ గావించి (భీమ. VI. 72). ఇట్టి ప్రయోగమును భారతకవులు చేయలేదు.

'ఒండె'ను వికల్పముగఁ జెప్పఁబడు నన్ని పదములతోడను గాక యొక్క దానిమీఁద మాత్రము వాడుట నన్నయ తిక్కన గ్రథములందు గానరాదు. ఎఱ్ఱాప్రెగడ "భూరి తపోధనుల్ మనంబునఁ గలుషించి రేనియుఁ దపోమహిమన్ మిము నిద్దహింతు రొండె నతులి తాస్త్రశక్తిని వడిం దును మాడుదు రాజినందఱున్" (భార. ఆర. V. 363) అని ప్రయోగించినట్లు ముద్రిత ప్రతియందున్నది. 'తునుమాడుదు రొండె నాజిలోన్' అని పాఠాం తరము గలదు. ఇట్లే తిక్కన 'జిష్ణునోర్తు నొండెఁ గృష్ణునోర్తు' (భా. కర్ణ. II. 45)లో 'ఒండె' నొక్క పదముతోడనే వాడినట్లు ముద్రిత పాఠము గలదు. దీనికిని 'జిష్ణునోర్తు నొండెఁ గృష్ణునొండె' అను పాఠాంతరము గలదు. కాని. తరువాతి కవులలోఁ గొందఱు 'ఒండె' నొక్క పదముమీఁద మాత్రము కూడ వాడఁజొచ్చినారు: పటుమార్గణ సంపద సొంపు మూపెదం, దుని సెద నొండె నప్పభునిఁ దూపుల (భాస్క. అర. 227). పోరు మొండె...విష్ణు పదంబు నొందుము (భాస్క. యు. 1620). చంపుదు నొండె...నిహతి నొందువాఁడ (భాస్క. యు. 1889). కూల్చెదనొండెఁ జచ్చెదన్ (భాస్క. యు. 1920). మొద.

'ఒందు'కు బహువచనము 'ఒండ్లు': తెరువు లొండ్లు దలఁపంగలవే (భార. శాం. VI. 163. హరి. ఉ. VII. 81).

(అ) విశేషణము: (iii) ఒరు.

'ఒరు, ఓర్' అనునవి తక్కిన ద్రావిడ భాషలయందు 'ఒక' యను నర్థమున నున్నవి. తెనుఁగున 'ఒర్తి, ఒర్తు' మొదలగు రూపములందును 'ఓర్,' అనున దొకయను నర్థము గలదియే. ఇపుడు 'ఒరు, ఓర్' అనునవి విశేషణములుగఁ దెనుఁగున లేవు. ఒకొ (-కొ)రుఁడు, ఒకొ (-కొ)రు (-రి)త (-తె), అను వానియందు 'ఒరుఁడు' అను దానికి మహా ద్వాచక

దానిచేత (భాస్క. యు. 302; భార. అశ్వ. I. 123; అను. II. 364. ఉ. IV. 242). మొద. 'ఒంటికి'= మఱియొకదానికి (భార. విరా. III. 110) మొద.

'ఎక్కటిపోరు, ఎక్కటికయ్యము, ఎక్కటివీరుఁడు' మొదలగువానిలో, 'ఎక్కటి' విశేషణముగ వాడఁబడినది; దానినవ్యయముగఁగూడ వాడవచ్చును. ఎక్కటెక్కటిపోరెదరు (భార. ద్రో. IV. 266); ఎక్కటెక్కటి పెనఁగినన్ (భార. ద్రో. I. 178), ఎక్కటెక్కటి దలపడు (భార. ఉ. IV. 41). మొద.

అనంతపుర ప్రాంతమున 'ఒట్టు'అనురూపము 'మొత్తము' అనునర్థమున వాడఁబడుచున్నది. ఇది 'ఒండు' కు రూపాంతరము.

(ఆ) మహతీతరామహద్వాచకములు: (ii) బహువచనము.

'ఒకఁడు' కు బహువచనమేమో తెలియదు. 'ఒకఁడులు, ఒకండ్లు,' అను రూపములకుఁ బ్రయోగములు కానరావు. 'ఒకన్లు' అనురూపమున్నదిగాని యది మహన్మహతీవాచకము. 'ఒండు' అనుదానికి 'వేఱొకటి' యనునర్థమునఁ 'ఒండులు, ఒన్లు' అనురూపములున్నవి. ఈ రూపములే మహన్మహతీవాచక బహువచనరూపములుగను బ్రయోగింపఁబడినవి. 'ఒకటి' ప్రథమైకవచన రూపమయిన తరువాత దానికి 'ఒకట్లు' అనుబహువచనరూపమును గలిగినది: నాలుగొకట్ల నాలుగు, మొద. అనంతపుర ప్రాంతీయుల ఒకట్లకు ఒట్లు అనియు నందురు.

(ఇ) మహద్వాచకములు: (i) ఏకవచనము.

'ఒక (క్క,కొ,క్కొ) రుఁడు' అనునవి తొల్లింటి మహద్వాచకరూపము. నన్నయ యీరూపములనే వాడినాఁడు. 'ఒక (క్క)రుఁడు' అనురూపముకంటె 'ఒకొ (క్కొ)రుఁడు' అను రూపమే ప్రాచీనమగును. 'ఒక(క్క)+ ఒరుఁడు' అని దానిపదచ్ఛేదము. కాని యది సమస్తపదమను జ్ఞానము నన్నయ కాలమునాఁటికే యంతరించినది. అందుచే 'ఒక(క్క)రుఁడు' అనురూపము కలిగినది. ఒక్కొరుఁడు (భార. ఆర. V. 19. 24- 'క్కొ' యతిస్థానము); ఒక్కరుఁడు (భార. విరా. II. 141), వారొక్కొక్కరుండు గెలువగానియట్టి జెట్టిజోదులు (భార. ద్రో. II. 304); తక్కినరూపముల కొఱకుఁ 'బదునొకండవు శతాబ్దమునాఁటి తెనుఁగుభాష' యనుప్రకరణమును జూడవలెను.

ఒకఁడు: (భా. ఆర. V. 127. VII. 49. విరా. II. 140. ఉ. I. 188 భీ. I. 181. ద్రో. III. 32. V. 97. హరి. పూ. I. 75. భాస్క. యు. 1458).

ఒక్కండు: (భార. అర. VII. 413; విరా. I. 135; III. 164. IV. 212; ద్రో. II. 189, 279, 353 ఒకడొక్కండ = ఒకనితరువాత నొకండు (భార. విరా. IV. 212).

ఇవిగాక ఒకొ(క్కొ)ండు అను రూపములును గలవు.

ప్రథమేతర విభక్తులు: ద్వితీయ. ఒకనిన్ (భార. విరా. I. 77); ఒకని నొకనిన్=ఒకనితరువాతనొకనిని (భార. భీ. III. 200); ఒక్కనిన్ (భార.శాం. III. 78;కర్ణ. I.37); ఒకొక్కనిన్ (భార. ద్రో. IV. 42);తృతీయ: ఒక(క్క) నిచే; చతుర్థి: ఒక(క్క)నికై; పంచమి: ఒక(క్క)నివలన; షష్ఠి: ఒకనొకని= ఒకని+ఒకని (భాగ.VIII.417); వేఱొకనిసొమ్ములు (విజ్ఞా. ప్ర.26); ఒక్కని (భార. ద్రో. IV. 80), ఒకనికిన్ (భార. అర.II. 21); ఒక్కనికి (భా. విరా. II. 192; ద్రో. II. 336); సప్తమి: ఒక(క్క)నియందు.

ఒకానొకండు = ఎవఁడో యొక పురుషుఁడు (హరి. పూ. III. 19);

పై రూపములుగాక ఒక(క్క,కొ,క్కొ) రువుఁడు అను రూపములు నున్నట్లు శబ్దరత్నాకరాది నిఘంటువులందును బాలవ్యాకరణాది వ్యాకరణము లందును గానవచ్చునుగాని యాయా రూపములకుఁ దగిన ప్రయోగములు కానరావు. 'ఒరుఁడు' అనుదానికి వ్యుత్పత్తి ననుసరించి 'ఒకఁడు' అనునర్థ ముండవలెను గాని దానికి మొదటినుండియు 'అన్యుఁడు' అనునర్థమే కుదురు కొన్నది. 'ఒండొరువులన్' అనురూపమును జూచికావలయు శబ్దరత్నాకర కారుఁడు 'ఒగువుఁడు (=ఒకరుఁడు)' అనుపదమును నిఘంటువున, జేర్చినాఁడు; కాని, 'ఒరువుఁడు' అనుదానికి వ్యస్తముగఁ బ్రయోగములేదు.

'జగనొబ్బగండఁడు' (హరి. పూ. I. 11) అను ప్రయోగముతప్పు; అది 'జగదొబ్బగండఁడు' 'అనియుండవలెను. కన్నడమున 'జగద' అనురూప ముండునుగాని 'జగన' అనియుండదు. అందలి 'ఒబ్బ' అనురూపము కన్నడ మున నేకార్థకమగు మహద్వాచకపదము.

ఒరుఁడు=*ఒర్డు=ఒడ్డు, బహువచనము: ఒడ్డులు, ఒడ్లు. 'ఒడ్డు' అను నేక వచనరూపము కానరాదు. ఒడ్డులు, ఒడ్లు=ఇతరులు అనునర్థమున నున్నది: చుల్కనివృత్తి దుర్గనుం డొక్కనిఁ జొచ్చి క్రిందువడ నొడ్లకుఁ గీడొనరింపఁగల్గి నన్ (మను. III. 50); ఒడ్డులకుందగదట్లు సేయఁగన్ (భార. విరా. I. 123); ఒడ్లను బంపును గల్లు దేర (భా. విరా. II. 93).

(ఇ) మహతీవాచక పదములు: ఏకవచనము.

ఒక, ఒకొ,ఒక్క, ఒక్కొ, ఒకర్, ఒకొర్, ఒక్కర్, ఒక్కొర్, ఓర్,- అనువానిపై త, తి, తు, తుక, తె, ఇత, ఇతి, ఇతె, అను ప్రత్యయములు

చేరుటవలన 'ఒక' శబ్దము మహతీవాచకము లేర్పడును. వీనిలో 'ఇతి,' 'ఇతె' 'తు' అనునవి ఒకర్, ఒకొర్, ఒక్కర్, ఒక్కొర్, అనుప్రాతిపదికముల మీఁద మాత్రము చేరును. 'త,' 'తి,' మొదలగు ప్రత్యయములు 'స్త్రీ' శబ్ద ప్రాకృతరూపమగు 'ఇత్థి' కి వికారరూపములు.

ఒక: ఒకత, ఒకతి, ఒకతుక, ఒకతె

ఒకొ: ఒకొత, ఒకొతి, ఒకొతుక, ఒకొతె

ఒక్క: ఒక్కత, ఒక్కతి, ఒక్కతుక, ఒక్కొతె,

ఒకర్: ఒకర్త, ఒకర్తి, ఒకర్తు, ఒకర్తుక, ఒకర్తె, ఒకరిత, ఒకరితి,

ఒక్కర్: ఒకరితె, ఒక్కర్త, ఒక్కర్తి, ఒక్కర్తు, ఒక్కర్తుక, ఒక్కర్తె, ఒక్కరిత, ఒక్కరిత, ఒక్కరితె

ఒకొర్: ఒకొర్త, ఒకొర్తి; ఒకొర్తు, ఒకొర్తుక, ఒకొర్తె, ఒకొరిత, ఒకొరితి, ఒకొరితె.

ఓర్: ఓర్త, ఓర్తి, ఓర్తు, ఓర్తుక, ఓర్తె.

'తుక' ప్రత్యయములోని 'క' వ్యవహారమునం దెన్నఁడైన నుండెనో, కవికల్పితమో తెలియదు. కావ్యములందయినను 'తుక' తోడి రూపములు మృగ్యములు. తక్కిన వన్నియు మాండలిక రూపములు. నేఁటికి నవి యాయా మండలములందును వివిధవర్ణములవారియందును నచ్చటచ్చట వ్యవహారమున వినఁబడుచున్నవి.

నన్నయ ఒక్కత, ఒక్కతి, ఒక్కతె, ఒక్కర్తు, అను రూపములును మాత్రము వాడినాఁడు. తిక్కన 'ఒకత (భార. విరా. II. 256); ఒకత (భార. అను. III. 244); ఒక్కతి (భార. సౌ. I. 193); ఓర్తు (భార. అను. III. 219; V. 105); 'తమతలంపులగతి నొక్కొర్తునకుం దెలియ విలాపములుసేయు తెఱఁగు' (నిర్వ. V. 101) అనుపాఠము తప్పు. 'ఒక్కొర్తులకుఁ' అని యుండ వలెను. అనురూపములను మాత్ర ముపయోగించెను. పోతన 'ఒక్కర్తు' (భాగ. I. 262) అనురూపమును వాడెను. 'ఓర్త, ఓర్తి, ఓర్తు' అను రూప ములు భాస్క. యు. 2220 లోఁ గాన్పించుచున్నవి. 'ఒకతె' (చమత్కా. I. 43); ఒకర్తె, ఓర్తు (కాశీ. V.316); తక్కిన యేకార్థక మహతీవాచకపదము లకుఁ బ్రయోగములు మృగ్యములు.

(ఇ) మహన్మహతీ వాచకపదములు: (iii) బహువచనము.

ఏకార్థక మహన్మహతీవాచకపదములకు సామాన్యముగ 'ఒకళులు, ఒకళ్లు, ఒకడ్లు' అనురూపములు కావ్యములందు గాన్పించుచున్నవి. 'ఒక(క్క, కొ, క్కొ) రు (వు) లు' అనురూపములు మృగ్యములు. ఒక(క్క, కొ, క్కొ)

(రి) త (తి, తె, తుక) లకు లు-వర్ణముచేరిన బహువచనరూపములు కానరావు. వ్యవహారమునందును నిట్లేయున్నది: ఒకళు లొకళుల హయముల నుర్విఁగూల్చి (భార. కర్ణ. I. 92); ఒకళులన్ (భార. ఉ. II. 215); ఒకళ్లు (భార. విరా. V. 55; భాస్క. అర. 80); ఒకళ్లు పసరము నడఁచిన నొకళులు వెయ్యానడువ వలయునే (భార. ఉ. III. 91); ఒకళ్లను (భార. మహా. I. 21); ఒకళ్లొకళ్ల మాటలంబోయెడివారుగారు (భార. ఉ. I. 282); ఒకళ్లొకళ్లంబెట్టిపోక (భార. ఉ. IV. 228); ఒకళ్లొకళ్ల వెలిమావులు (భార. భీ. II. 42); ఒకళ్లొకళ్ల కంఠంబులు లక్ష్యంబులుగా (భార. ద్రో. III. 268); ఒకళ్లొకళ్ల మార్గణంబులు (భార. ద్రో. IV. 262); ఒకళ్లొకళ్లం జుట్టికొని (భార. కర్ణ. I. 77); ఒకళ్లొకళ్లకుఁ బ్రాపగుచు (భార. శల్య. I. 101); ఒకళ్లొకళ్లు (రామాభ్యు. VII. 167); ఒక్కొకడ్లు (S. I. I. IV. 667).—

*. వారియం దొకరిలోని చిదురపాలును బోలందు (భార. ఉ. II. 160); ఒక్కరిన్ (భార. ఉ. I. 109); అను ముద్రితపాఠములు తప్పులు. ఒకరులోని, ఒక్కరున్, అని యుండవలెను.

పోతనకాలమునాఁటికి 'ఒకరు' అనునది మహన్మహతీ బహువచనరూపముగ నేర్పడినది. పదియొకరు (భాగ. IV. 749); ఒకరుపోయినదెసకు నింకొకరు వ్రేక;— మొద.

ఒరుఁడు = (ఇతరుఁడు) అనుదానికి 'ఒరులు' అనునది బహువచనరూపము. తక్కొరులు (భాగ. VI. 179); ఒరువుఁడు అను నేకవచనరూపమునకుఁ బ్రయోగములు గానరావు. కాని, దాని బహువచనరూపమగు 'ఒరువులు' అను పదమును తిక్కన వాడినాఁడు (భార. అను. V. 89).

'ఒండు' అను పదమున కేకవచనమున మహదర్థము లేదు. అమహదర్థమున దానికి బహువచన రూపమగు 'ఒండులు, ఒండ్లు' అనువానికిఁ బ్రయోగములు మృగ్యములు. 'ఒండ్లు, ఒండులు,' అనువానికి 'ఇతరులు' అను నర్థము మాత్ర మున్నది. ఒండ్లు (భార. సౌ. II. 72); ఒండ్లవిసామ్ములు (భార. ఆర. IV. 347); ఒండులన్ (భార. విరా. I. 103); 'ఒండులు, ఒండ్లు' అనువానికి ఒడ్డులు, ఒడ్లు' అనియు రూపాంతరములు గలవు. ఒడ్డులు (భార. విరా. I. 128); ఒడ్లు (భార. ఉ. IV. 385; అను. III. 297).

ఒండొకరుండు (భార. భీ. II. 47) అనఁగా మఱియొకఁడని యర్థము.

ఒండొరు లొట్టువడక (భాస్క. అర. II. 136); పువ్వుల నొండొరుల్ రువ్వుకొనుచు (రాజగో. శత. 45); అను ప్రయోగము లున్నవిగాని భారత కవులు 'ఒండొరులు' అని వాడలేదు. ఇందలి 'ఒరులు' అనునది భారతమునఁ

ప్రథమేతర విభక్తియందే కానవచ్చుచున్నది. ఒండొరులన్ (భార. ద్రో. IV. 216); ఒండొరులకు మార్కొలయుచు (భార. ద్రో. IV. 191);—'ఒండొరువుల' విషయమునఁ గూడ నిట్లే తెలియవలెను. ఒండొరువులమెచ్చక (భార. ఆర. IV. 300); ఒండొరువుల నొల్లరైరి (భార. ఆర. IV. 306); ఒండొరువులఁ గానరైరి (భార. విరా. III. 190); ఒండొరువులఁ దలపడుటనూఁచి (భార. విరా. V. 83); ఒండొరువులన్ (భాస్క. సుం. 159); ఒండొరువులతో (భార. ద్రో. I. 135); ఒండొరువులకై (భార. అను. III. 141); ఒండొరువులకంటె (భార. భీ. I. 138).

రెండు.

(అ) విశేషణము: (i) ఇరు.

'ఇరు' కేవల విశేషణము; దీనికి సర్వనామ పదముగ నుపయోగము లేదు. దీని తరువాత వచ్చు విశేష్యము తొల్లిటి కావ్యములందు సాధారణముగ నేకవచనమునందు వాడఁబడుచుండెను. దీనిపై విశేష్యముల బహువచనము చేరుటయుఁ గలదుగాని, యట్టి ప్రయోగములు క్వాచిత్కముగ నున్నవి. దీనిపై వచ్చు పరుషములకుఁ గ్రమముగ గ, స, డ, ద, వ,లాదేశము లగును. ఒక, ఒక్క, లపైఁ బరుషములకు గసడదవాదేశమురాదు; కాని, తక్కిన సంఖ్యార్థక విశేషణములమీఁద నీ యాదేశము వచ్చును.

(1) ఇరుగేలన్ (భార. ఆర. V. 277; స్త్రీ. I. 130, హరి. ఉ. VII. 255); ఇరు సేతన్ (భార. అను. IV. 102); ఇరుచేయు నెత్తి (భార. మౌ. I. 151); ఇరు దెఱంగు (భార. ఉ. IV. 168; మౌ. I. 54, 58; అశ్వ. II. 111. అను. V. 146; 181; హరి. ఉ. IX); ఇరు వక్కయలన్ (దాశ. శత. 45); ఇరువతియగాఁగ (భార. కర్ణ. I. 49; సౌ. I. 194); ఇరువీసునఁగు (భార. భీ. II. 209); ఇరు వ్రెద్దు (భార. శాం. IV. 368; అను. V. 8; అశ్వ. II. 168); ఇరుమెయి = రెండు దేహములు (భార. విరా. III. 161); ఇరుమేను = రెండు దేహములు(భార. విరా. V. 402; భీ. I. 251); ఇరు సంధ్దియలయందు (S. I. I. V. 192); ఇరుసంధ్య దీపము (S. I. I. V. 171); ఇరువాగు (భార. విరా. III. 170; భీ. II. 42, 290, 395; III. 208, 315; ద్రో. I. 271; V. 278; కర్ణ. I. 69; నిర్వ. V. 73; హరి. పూ. IV. 141; హరి. ఉ. X. 150); ఇట్లే, 'ఇరువాయికట్టు', మొద.

(2) సంఖ్యావాచక పదములతో: ఇరుమూఁడు దూపులు (భార. భీ. I. 278); ఇన్నూఱు పద్యములు (ప్రస. రా. శత. 4); ఇన్నూటపదిట (ఉ. హరి. IV. 276); ఇన్నూఱు (భార. శాం. III. 375); ఇన్నూఱుసేసి హాయంబు లిచ్చి

(భార. ఉ. III. 217); ఇరాఱు దెఱంగులు (రుక్మిణీ. I. 49); ఇరాఱు మేనులన్ (రుక్మిణీ. I); ఇరువది, ఇరువై. మొద.

(3) ఇరుసెవి యెఱుఁగకుండ (కాశీ. II. ఉ. హరి. V. 197) అను ప్రయోగమున 'ఇరు'కు 'రెండవ చెవి' యని యర్థము. —'ఇరు మూఁడునెలల శిశువై' (హరి. ఉ. IV. 251); అనఁగా రెండునెలల, లేక మూఁడునెలల శిశువై అని యర్థము. (ఇరుమడి = రెండుసార్లు S. I. I. VI. 628).

(4) ఇరువంకలన్ (భార. ఉ. III. 253); ఇరుదెఱఁగుల సైనికులకు —నేడ్తెఱ (భార. ద్రో. I. 135); ఇరుగెలంకులన్ (భార. ద్రో. V. 142) అను ప్రయోగములందు 'ఇరు'పై విశేష్యముల బహువచనరూపములు గాన వచ్చుచున్నవి. కాని, యవి ఇరువంకన్, ఇరుదెఱఁగున సైన్యములకు, ఇరు గెలనన్, అని యుండవలెనని తోఁచుచున్నది. అయినను 'ఇరువాఁగులు' అని బహువచన లు వర్ణము ప్రాసస్థానమున భార. విరా. III. 198 లో నున్నది. ఇట్లే, భార. అర. VI. 229 లో 'ఇరు గొమ్ములతోన్, అని యున్నది. దీనికి 'నిడు గొమ్ములతో' నని పాఠాంతర మున్నది. భార. శల్య. I. 53 లో 'ఇరు గెలఁకులందు' అనుదానికిఁ బాఠాంతరము లేదు.

(5) ఇరుఁదల పాము, ఇరుఁదల పులుఁగు, ఇరుఁవుట్టువు,అను పదములలో శ. ర. కారుఁ 'డిరు'పై నరనున్నను జేర్చుట తగదు. 'ఇరుస' అనఁగా రెండు కుంచములు. ఇందు 'ఉస' యను రూపమేమో తెలియదు. ఇఱుకు, ఇఱుకటము, ఇఱుకుపాటు, మొదలగు పదములు 'ఇరు' నుండియే కలిగినవేమో. వీనికి రెండిటి మధ్యఁ బడుటచేఁ గలిగిన నిర్బంధము అని యర్థము. 'ఇరు' అను దానికి 'ఇఱు' రూపాంతరమేమో. ఇక్కట్టు, ఇక్కము, ఇక్కుపాటు, అను పదములలో 'ఇరు' మఱుఁగువడియున్నది, 'ఇరువు(గు)' అనఁగా రెండవది. 'ఇరుగిల్లు' అనఁగా 'రెండవ యిల్లు'.

(6) 'ఇడుగడ, ఇడుమ' అనుపదములలో 'ఇరు' లోని రేఫమునకు డకార మాదేశముగ వచ్చినది. 'ఇడియు' అను ధాతువు 'ఇడు=రెండు 'అను పదమునుండి కలిగియుండవచ్చును.

(7) 'ఇరు'పై సంఖ్యావాచకపదము చేరునప్పుడు 'ఇరు' కు 'ఈరు' వైకల్పికముగ నాదేశ మగును. ఈరేడుజగంబులు (భార. అర. IV. 271) ఈరేడుజగంబులు (ఉ. హరి. V. 505); ఈరేద్వురు (భాగ. II. 31); ఇరాఱుమేనులన్ (రుక్మి. I. I. ఇట్లే, ఈరాఱు, ఈరేను, ఈరైఁదు);-ఇరురెండు, ఇరునాలుగు, ఈరెనిమిది, ఇరుదొమ్మిది, అనువానికిఁ బ్రయోగములు కానరాలేదు.

### (అ) విశేషణము: (ii) ఇను.

ఇరు, ఇను, అనువానిలో 'ఇను' ప్రాచీనరూపమైనట్లు తోఁచును. ఆఱు, ఏడు, లందు తప్పఁ ద్రావిడభాషలందలి యొకటినుండి పదివఱకుఁగల సంఖ్యలలో నకారము గాన్పించుచున్నది: ఒన్ (డు); ఇను, రెన్(డు); మూన్ (డు); తమి. నాన్ (గు); ఏను, కన్న. ఎన్టు, తెనుఁగు: ఎని(మిది); తొన్పది, తొ౯(మిది) తమి. పన్ని (ఇరండు); తెనుఁగు: పఁ-డ్రెండు, పన్దొమ్మిది, పఁదుము; మొద. ఇంట్రిము ఇంటరము, ఇండె, ఇండెవాయు, మొదలగు పదములలో 'ఇన్' అనునది చేరియున్నదని చెప్పవచ్చును. తెనుఁగున 'ఇను, ఇరు' ల యుపయోగమునఁ జాల భేదమున్నది. 'ఇరు' వాడవలసిన చోట 'ఇను' నుగాని, 'ఇను' వాడుచోట 'ఇరు' నుగాని వాడుటకు వీలులేదు. ఇనువాగు, ఇనుదెఱఁగు, ఇనుగడ, మొదలగు రూపములు లేవు. అట్లే, ఇరుమడించు, ఇరుమాఱు, మొదలగు రూపములును లేవు.

ఇనుమడి (భార. విరా. II. 45; భీ. I. 27; కర్ణ. I. 92; అను IV. 419; హరి. ఉ. X. 302; వరాహ. X. III.); ఇనుమాఱు (భార. కర్ణ. III. 317); ఇనుమాటు (భాగ. II. 227); దృక్శరము లినుమిక్కిలై (సత్యా. కృ. సం. II. పు. 29); ఇనుమూఁడు = 6 (భాస్క. యు. 1269); -ఇనుమడి = ఇన్నడి = ఇమ్మడి = ఇబ్బడి; -'ఇను పాదములు' అని S. I. I. VI. 628 లో నున్నది. ఈ ప్రయోగము వింతయైనదే.

### (అ) విశేషణము: (iii) రెండు.

'ఇరు', 'ఇను'లవలెఁ గాక 'రెండు'ను విశేషణముగను సర్వనామ పదముగను గూడ నుపయోగింప వచ్చును. 'ఇరు'వైఁ జేరు విశేష్య మేకవచనము నందు సాధారణముగ నుండును. కాని, 'రెండు' వైఁజేరు విశేష్య మెల్లపుడును బహువచనమునందే యుండును.

రెండంతలు (భార. భీ. I. 27). ఎఱ్ఱేశ్వర భట్టోపాధ్యలకు పెట్టిన రెండు మాడలు (S. I. I. V. 156); రెండుఁవీళ్లు (భార. ఉ. IV); రెండు దెఱంగులు (భార. ద్రో. V. 286. అను. V. 198. హరి. ఉ. II. 67); ఒకటి రెండు పూటలు మాయింట నిలిచి (కళా. III. 42); రెండు దొమ్మిదులు (కాశీ. III. 181); రెండు వాఙ్లకున్ను (S. I. I. IV. 970); పంద్రెండు వేలేండ్లు (భార. శాం. V. 46); డెబ్బది రెండువేలు (భార. శాం. V. 61); పదిరెండు వర్షముల్ (అధ్యా. రా. బాల. V. 5); పదియు రెండేఁడుల ప్రాయంబు దానసై (శుకా. IV. 98); పంద్రెం డేఁడులు (ఉ. హరి. II. 167).

(ఆ) సర్వనామము: (i) మహతీత రామహద్వాచకము:

(1) వాని విల్ వెండియు రెండు సేసి (భార. భీ. II. 55); పండ్రెండు పటు మార్గణంబులు (భార. ద్రో. I. 205). రెండు, పండ్రెండు (భార.ద్రో. II. 30); (ప్రతి వింధ్యుఁడు) రెండై పడఁగన్ (భార. సౌ. I. 181); ఒకటి రెండ గుచు నట్లుండి పదైదయి (తొండమాన్. పు. 313).

(2) 'రెండు'కుఁ బ్రథమేతర విభక్తిరూపములు: ద్వి. రెంటిన్ (భార. ఆర. IV. 349; V. 42); తృ. రెంటన్ (భార. ఆర. VI. 123; విరా. V. 150; III. 19); ఒంట, రెంటఁ జిక్కినవారిన్ బోషింప (భాస్క. యు. 161); పం డ్రెంటన్ (భాస్క. యు. 1266); రెంట రెంటన్ (భార. ద్రో. I. 241); రెంటి చేత (ఉ. హరి. II. 12); చ. రెంటికై; పం. రెంటన్, రెంటివలన; ష. రెం టికి, రెంటిలోనన్ (భాగ. IV. 240); స. రెంటియందు.

(3) రెండు+నెలలు = రెన్నెలలు, రెన్నెల్లు; లేదా, ఇరు+నెలలు = ఇరు నెలలు, ఇర్నెలలు, రెన్నెలలు, రెన్నెలలు.— రెన్నెల్లదాఁక (భాస్క. నుం. 202); రెన్నెల్లలోన (భాస్క. నుం. 204); రెన్నెల్లమీఁద (భాస్క. నుం. 281); రెన్నెలలు (భాగ. VIII. 497): రెన్నెల్లను (జైమి. VIII. 100); మొద.

(4) 'రెండు' కు 'రోండు' అనియు వ్యవహారమునందును శాసనము లందును రూపము గలదు: రోండు (S. I. I. V. 847); రోండుగ్రామాలు (S. I. I. V. 874); రోండ్డో (S. I. I. IV. 711).

(5) 'రెండు' అనఁగా 'భేదము' అనునర్థమునఁ బ్రయోగములుగలవు: పతియెడ రెండు లేక కులభామలు దారతఁ డెట్టిదైన సన్మతిఁజరియించు టొప్పు (భాస్క. అర.); జూదమునందు 'రెండు' కు 'రెంచ' యను రూపము గలదు. 'రెండు'నుండి 'రెంట'యనుభావార్థకపద మేర్పడినది. 'రెంటఁద్రాగుడుమొకము; అనఁగా తొండముతోను, నోటితోను రెంటను నీరుత్రాగు ఏనుఁగు; రెంట త్రాగుడు తిండి' అట్టి ఏనుఁగు ఆహారముగాఁగల సింహాము; 'రెంటెము' జంట నేత వస్త్రము; రెంబ, రెమ్మ, రెబ్బ=రెండుగా విడిన చిన్న వృక్షశాఖ; 'రెట్టి' = రెండింతలు (భార. విరా. I. 209);—రె (ఱె) క్క, రెక్కొను, రెచ్చు, రేఁగు, రే (ఱే) పు, అను పదములకును 'ఇను' తో సంబంధ ముండియుండును.

(6) 'రెండు' అనునది సముదాయవాచకమై యేకవచనరూపమున నున్నది. కాని, దానితోఁ జేరుక్రియ బహువచనమునందే యుండవలెను. 'రెండు' కు బహువచనరూపములు 'రెండ్లు, రెళ్లు' అనునవి: రెండు రెండ్లు, (-ళ్లు) నాలుగు.

(అ) విశేషణము: (ii) మూఁడు.

మూండుగాలాలాను (S. I. I. V. 155); మూఁడువేలు, మూఁడు కోట్లు (భార. శల్య. I. 113); ఒకమూఁడు ముహూర్తములు (ఉ. హరి. V. 190); పదుమూఁడు దినంబులమాత్రకుఁ (భార. విరా. III. 62); మూఁడు మూఁడు మెఱుఁగువాఁడితూపులు (భార. ద్రో. VI. 294. 297); ఇరుమూఁడు దూపులు (భార. భీ. I. 273); మూఁడుమార్గణములు (భార. శల్య. I. 194).

(ఆ) సర్వనామపదము : మహతీతరామహద్వాచకము.

మూఁడు (భార. ద్రో. II. 30); పదుమూఁడు (భార. కర్ణ. III. 33); మూఁటఁ (భార. భీ. III. 245; ద్రో. III. 95, 224, 226, 227); డెబ్బది మూఁటను (భార. శల్య. I. 194); మొద.

బహువచనము: మూళ్లు (మూఁడు మూళ్లు తొమ్మిది) 'మూండ్లు' అను రూపము వినఁబడదు.

(ఆ) సర్వనామపదము: మహన్మహతీవాచకము.

ముప్వురు (భార. అను. V. 287; విజ్ఞా. వ్య. III.); పదుముప్వురు (భాగ. IV. 28); ముప్వురను (భార. ద్రో. IV. 142); పదుముప్వురగండండు (S. I. I. VI. 628); ముప్వురమీఁద (జైమి. IV. 138); ముప్వుర కపెంకల కొలఁదులు (భార. విరా. III. 152); ముప్వురకుం జాలి (భార. ద్రో. IV. 168); మొద. 'మూవురు' అనియుఁ గలదు (ఉ. హరి. IV. 10); 'ముప్రుు' అని యున్నదేమో తెలియదు.

'ముగ్గురు' అర్వాచీనరూపము (ఉ. రా. పు. 78); 'ముగుుు' గూడఁ గలదు (భాగ. V. 20); ముగురు ... పొగరు ... మిగిలిన (ప్రాస. జైమి. II. 43; ఇందు 'ముప్రురు, పొవరు, మివిలిన' అని యుండనచ్చును).

నాలుగు.

(అ) విశేషణము; (i) నలు, నల్; నాలు.

దీనిమీఁదఁజేరు విశేష్యము సాధారణముగ నేకవచనము నందుండును: నలుగడ (భార. ద్రో. III. 62: కర్ణ. I. 5: III. 9; శాం. V. 440; అను. I. 287); నలుగాలివానఁ (భార. శాం. I. 71); నలుగారివానిఁ (భార. అశ్వ. IV. 181); నన్నాలు (భార. శాం. V. 50: కాశీ. V. 192); నలువది, నల్వది: నలుమడి (భార. ద్రో. II. 218); నలులతుకవులతో (భాస్క. యు. 19); మొద. కాని, 'నలు' పైఁ జేరిన విశేష్యము బహువచనమునను ప్రయోగింపఁబడినది: నలుదెసలం గాకులక్రియఁ జెదరి (భార. అర. VII. 107); నలుదిక్కులన్

(భార. ద్రో. II. 79); నలుదిక్కుల మన్నీలు (భార. శల్య. I. 9);-వీనియందు 'నలుదెసల, నలు దిక్కులన' అనియుండవలెనేమో.—'నాళ్లు, నెలలు, 'నాలుగులు' అను పదములు చేరునపుడు 'నలు' 'నాల్' గా మాఱును: నాల్నాళ్లు, నాల్నెలలు, నాల్నాలుగులు పదహారు; మొద.

(అ) విశేషణము: (ii) నాలుగు, నాల్గు.

నాలుగుదెఱంగులసేనలు (భార. ఉ. IV. 226); ఇరువైనాలుగుమూళ్ల మేర (కాశీ. I. 55); ఇరువదినాలుగువేలు మున్నూటయిరువండ్రు (భార.స్త్రీ. II. 167); ఎనిమిదిలక్షలు నలువదినాలుగువేలు (భార. శాం. V. 46);లక్షయు నలువదినాలుగువేలు (భార. శాం. V. 51); పదునాలుగుజగములు (హరి.పూ. V. 5); నాలుగు వర్ణములందును (శిక్షా. వ్యవ. 131); నాలుగు పదువులు (పద్మ. IV. 172); నాలుగు మొగములు (కవిజన. I. 9); పద్నాల్గేండ్లు(మొల్ల రా. అయో. 29).

(ఆ) సర్వనామపదము; మహతీతరామహద్వాచకము.

పదునాలుగు (భార. ద్రో. III. 95), పద్నాలుగు (S. I. I. V. 834); పదునాల్గు (భార. కర్ణ. III. 149; శల్య. II. 118); నాల్గు (ఉ. హరి. IV. 53; భార. ద్రో. IV. 6); నాలిగింటిమీఁదను (భార. శాం. II.177); నాలుగింటను (భార. అను. భీ. II. 49; IV. 301); నాలుగిట (భార. విరా. V. 103.); మొద.

'నాలుగు' కు 'నాలువు' అనియు రూపముగలదు: నాలువు మాడలకు (S. I. I. VI. 982);—నాలుగేను = నాలుగుగాని అయిదుగాని (హరి. పూ. V. 223); ఇట్లే, ఒకటి రెండు మాటలు; రెండుమూఁడు దినములు; మూఁడు నాలుగు పూటలు; నాలుగైదు; పది పండ్రెండు; పది పదునేను; నూఱు నూటయేఁబది; మొద.

'నాలుగు' కు బహువచనము 'నాలుగులు': అయి నాలుగులు ఇరవై.

(అ) సర్వనామ పదము: మహన్మహతీ వాచకము.

(పదు) నలువురు (భాగ. భీ. II. 236);—'నలుగురు' అర్వాచీన రూపము: ఇరువై నలుగురు (S. I. I. V. 874);—'నలువదిగురు' అని దశావతార చరిత్ర, 163-వ పుటలో గానఁబడుచున్నది.

అయిదు.

(అ) విశేషణము (i) ఏను.

(1) ఇరువదేనమ్ముల్ (భార. భీ. II. 34); నాలుగే నలుకులు దొంతి దించి (హరి. పూ. V. 223); ఇరువదేను వాఁడి తూపుల (భార. శల్య. I. 94); ముప్పదేనమ్ముల్ (భార. ద్రో. V. 185); ఏనింద్రియములు (భార

ఆర. V. 94); పదియేను దినంబులకున్ (నైష. VIII. 200); పదియు నేను నిశిత బాణంబులు (భార. ద్రో. IV. 297).

(2) 'ఏను' పైఁ బరుషములు పరమగునపుడు సరళాదేశము వచ్చునా, గసడదవాదేశము వచ్చునా, ఎట్టి యాదేశమును రాదా ?—ఈ విషయమును నిర్ణయించుటకుఁ దగిన ప్రయోగములు గానరావు. ఏనుకో (గో?) నులు (భీమే. II. 88); పదియేన్ క (గ?) ళలు (నైష. VIII. 200); పదేను (బ? వ?) పర్వములు (భీమ. I. 9); ఇవి ముద్రిత ప్రతులందలి పాఠములు. 'ఏను' పైఁ 'బది' చేరునప్పుడు 'ను' వర్ణమునకు ద్రుతత్వము గలిగి 'ఏఁబది' అని సరళాదేశమును 'ను' వర్ణమునకు బిందువును గలుగును. ఏఁబది (భార. ద్రో. IV. 36); ఏఁబంద్రు (భాస్క. బాల. 203); దీని సామ్యమును బట్టి యన్ని యెడలను 'ఏను' పైఁ బరుషములకు సరళాదేశమును జెప్పఁగూడదేమో. 'ఏను' పై 'పది' చేరునప్పుడు వ్యవహారమునను శాసనములందును 'ప' కు 'భ' ఆదేశము కానవచ్చుచున్నది. ఏఁభయి (S. I. I. V. 1154-5; 150; IV. 1063); ఏంభై (S. I. I. VI. 974, 1065); యేంభై (S. I. I. VI. 188); ఏంభదేను (S. I. I. VI. 644); 'ఏఁభయి' 'ఎఁభయి' యను రూపమునను శాసనములఁ గాన్పించుచున్నది. (S. I. I. VI. 950); యెఁభయిగండమాడలు (S. I. I. V. 1154-5); 'ఏను' పై 'తూము' చేరునపుడు సరళాదేశమును 'తూ' దీర్ఘమునకు హ్రస్వమును గలిగి 'ఏఁదుము, ఏదుము' అగుచున్నది: పదేందుము (S. I. I. IV. 974; V. 159); వ్యవహారమున; పదునేదుము.

(3) 'ఏను' పై 'నాళ్లు, నూఱు' లు పరమగుచో 'ఏను' లోని నువర్ణము వైకల్పికముగ లోపించును: ఏనాళ్లు (S. I. I. VI. 1128; భార. ఉ. IV. 416); ఏనూఱు (భార. భీ. III. 55; ద్రో. III. 38; అను. I. 167, 175); విజ్ఞా. ప్రా. 127.

(అ) విశేషణము: (ii) అయిదు, ఐదు.

తెనుఁగున 'ఏను' అను రూపమును బట్టియు, ఐన్దు, అంజు, మొదలగు నితర ద్రావిడభాషల యందలి రూపమును బట్టియు, 'ఐఁదు' సబిందుకమని నిర్ణయింపవలసి యున్నది. నన్నయ 'అయిదు, ఐఁదు' లను వాడలేదు. తిక్కన చేసిన యీ క్రింది ప్రయోగములవలన 'ఐదు' లో బిందువున్నదో లేదో నిర్ణయింప వీలులేదు : ఐదు శరంబులు (భార. ద్రో. III. 228; వచనము, ఏను; ఐఁదు అని యుండవచ్చును); నూఱు పదింటను నైదిట (భార. విరా. V. 77; కందము ప్రథమపాదము; 'ఐఁదిట, ఏనిట' అని యుండవచ్చును); ఒకని కొకని నైదు మహాస్త్ర, గ, భాను, రాస్త్రములనేసి (భార. భీ. III. 200. గీత

పాదము; (ఏనేను, ఇఁద్దైఁదు) అని యుండవచ్చును; ఇదు నెన్మిదియును నాఱు శల్యుఁడు (భార. ద్రో. II. 30; సీసపాదము, 'ఇఁదు' అని యుండ వచ్చును); హిడిం, బానుతు నైదైదు బాణములను (భార. ద్రో. III. 267); సీసపాదము; 'ఏనేను, ఇఁద్దైఁదు' అని యుండవచ్చును; ఆతఁ డట్టి నూఱు - లైదడరించె (భార. ద్రో. IV. 299; సీసపాదము; 'ఇఁదు' అని యుండవచ్చును; అమ్మ, లైదింట నేసి మ-హారజతధ్వజం, బిలఁగూల్చి (భార. ద్రో. V. 135; సీసపాదము; 'ఇఁదింట' అని యుండవచ్చును); అ, ల్లా డఁగఁ బోరుచో శరము-లాఱుయిదుల్ (భార. కర్ణ. I. 111; ఉత్పలమాలా పాదము; 'అయిఁదుల్, అని యుండవచ్చును); అయిదింటన్ (భార. శాం. IV. 87; వచనము, 'అయిఁదింటన్' అని యుండవచ్చును); వీనినైదింట నచలా వధానవృత్తి (భార. శాం. V. 115; గీతపాదము; 'ఏనింట, ఇఁదింట అని యుండవచ్చును); ఈ యాఱును మంచి తెరువు, లైయుండు; నహింసయున్న-న్యైదిటికిఁబవి, త్రాయతనము (భార. అను. IV. 279; కందము; 'ఇఁదిటికి' అని యుండవచ్చును); అది యాదిగాఁగ ముప్పదియునైదు (భార. మౌ. I. 3; సీసపాదము; 'ముప్పదియునైఁదు' అని యుండవచ్చును).

కాని, 'ఏదు యోజనముల నతఁడొక్క పురము, భూదేవిచరణ నూపు రము నిర్మించి' అని రంగనాథ రామాయణము, అయోధ్యాకాండమున నున్నది. ఈ గ్రంథము కాలమునకు నఏందు నిర్బిందు పాఠిసమును గవులు వాడి యుండుటచేత నీప్రయోగము 'ఏదు' నఏందుకత్వ నిర్బిందుకత్వ నిర్ణయ విషయమునఁ బ్రమాణము కానేరదు.

(అ) సర్వనామపదము: మహతీతర రామహద్వాచకము : i. ఏను. పదేను (S. I. I. VI. 1059; భార. విరా. V. 32; కవిక. I. 74); ఇరువదేను (భార. భీ. II. 37; శల్య. I. 194; విజ్ఞా. ప్రా. 127); పదియేను (భార. ద్రో. III. 95); పదియు నేను (భార. ద్రో. IV. 294); ఇరువదేను (S I. I. VI. 995); ముప్పదేను (S. I. I. VI. 123); ఇరువయేను (S. I. I. IV. 1187); ఏనింటన్ (భార. శల్య I. 194; ద్రో. III 224); ఇరువదేనింటన్ (భార. ద్రో. II. 68; III. 227); పదియేనింటన్ (భార. ద్రో. II. 68); ఏనింటిలోనన్ (భార. భీ. I. 18); మొద.

(ii) అయిఁదు, ఇఁదు.

**నూఱులైఁదు** (భార. ద్రో. IV. 299); ఇఁదు (భార. ద్రో. II. 30, 37); ఇఁద్దైఁదు (భార. భీ. III. 200); ముప్పదియునైఁదు (భార. మౌ. I. 3); ఇఁదిటికి (భార. అను. IV. 279); ఇఁదింటన్ (భార. ద్రో. V. 135; శాం. V.

15); అయిుదింటన్ (భార. శాం. IV. 87); ఐదిటన్ (భార. విరా. V. 77); మొద.

**'ఏను'** కు 'ఏనులు' అను బహువచనరూపము లేదు. 'ఐుదు'కు బహువచనము 'ఐుదులు.' 'అ,ల్లాడఁగఁ బోరుచో శరము లాఱయిుదుల్' (భార. కర్ణ. I. 111).

(ఇ) సర్వనామపదము : మహన్మహతీ వాచకము.

(1) ఏవురు (S. I. I. IV. 661); మనమొక యేవుర మీయంగయున్ భార. విరా. I. 59); ఏవురు ... తురం, గావలి (ప్రాస. భార. భీ. II. 404); కేకయులేవురు వేవురివెట్టు (భార. ద్రో. I. 96); ఇరువదియేవురు (భార. ద్రో. III. 277); పదేవురు దొరలు (వరాహ. V. 21); ఆ విప్రులేద్వురైనను నేవురు మువ్వురునునైన (విజ్ఞా. వ్యవ. 111).

(2) 'ఏవురు'కు 'ఏగురు' అనియు రూపాంతరము గలదు. 'గురువచన స్థితి మనకే, గురకును నిదిపత్నిగాఁద - గుంగావున (భార. ఆది. VII. 213); 'గు' యతిస్థానము; ఈ పాఠము చింత్యము; 'ఏ, వురకును నిదిపత్నిగాఁద - వుంగావున' అని నన్నయ ప్రయోగించియుండును. 'గు' తోడి సంఖ్యావాచక మహన్మహతీ రూపములను నన్నయ మఱి యెచ్చటను వాడలేదు. 'ఏగురకు' (S. I. I. VI. 1112).

(3) 'ఏగురు' అనుటకు 'ఐగురు' అని శాసనములందు గలదు: ఐగురకు) S. I. I. VI. 1117); తక్కిన ద్రావిడ భాషలలో 'ఐవర్.'

ఆఱు

i. మహతీత రామహద్వాచక సర్వనామపదము : ఆఱు

ఐుదు నెన్మిదియును నాఱు శల్యుఁడు (భార. ద్రో. II. 30); ఆఱింటిన్ (భార. శాం. V. 181); ఆఱిటన్ (భార. విరా. V. 108); నూటయాఱింటన్ (భార. ద్రో. III. 228); ఆఱింటన్ (భార. ద్రో. IV. 6; శాం. III. 422).

ii. మహతీతరామహద్వాచక విశేషణము : ఆఱు.

ఇరాఱు దెఱంగులు (రుక్మిణీ. I. 49); ఇరాఱు మేనులన్ (రుక్మిణీ. I.); పెయ్యాఱమ్ముల కమ్మవింటిదొరకున్ (పాంచా. II. 39); ఆఱయిుదుల్ (భార. కర్ణ. I. III.); ఆఱమ్ములు (భార. అర. I. ట. 270); ఆఱునాళ్లకున (భార. అర. V. 228); ఎడ్ల నాఱునూఱును (భార. కర్ణ. II. 91), ఆఱువేలు (భార. శల్య. I. 118); పదియాఱు పీఠములు (విజ్ఞా. ప్రా. 26); ముప్పదియాఱువేలు (భార. శాం. V. 61); పదాఱు (S. I. I. VI. 1028; భార. ద్రో. V. 135; శల్య. I. 291; శాం. V. 608); పదాతేండ్లు (భార. ఆశ్వ. II. 90); పదాఱు

వన్నె (దశావ. పు. 157); పదాఱువేలు (భార. భీ. I. 22; భాగ. V. II. 598); పదాఱువ్రక్కలు (రుక్మిణీ. I. 49);

'ఆఱు' కు బహువచనము 'అర్లు'; వేయునూటపదార్లు (వై జ. I. 92.)

'ఆఱు' వై 'పది' సమాస మగునపుడు 'ఆఱు' తొలి 'ఆ'కారమునకు హ్రస్వమును 'పది, తొలి 'ప' కారమునకు 'వ' ఆదేశమును గలుగును: అఱువది. 'అఱువది' 'అఱువై' గూడ నగును: అఱువది (భార. భీ. II. 37; ద్రో. III. 224; IV. 116); మున్నూట యఱువదింటఁ (భార. శాం. V. 46); అఱువదింటికిని (విజ్ఞా. వ్యవ. 116); అఱువది యఱువది యమ్ములన్ (భార. ద్రో. IV. 298); అఱువదినాలుగు (భార. భీ. III. 51); చిత్తజాతకళ లర్వదినాలుగు (కళా. I. 110); అఱువది బాణములను (భార. భీ. II. 34); అఱువై యోజనముల్ వెడల్పును శతాయామంబునుం గల్గి (వరాహ. I. 137); అఱువై తొమ్మిది (S. I. I. VI. 991).

iii. మహన్మహతీవాచక సర్వనామపదము : ఆర్వురు.

అర్వ్వురు బోల పసమున (S. I. I. IV. 1008); ఆర్వురు (భార. భీ. III. 98); ఆద్యులై పేరుగలుగు పదార్వురు (భార. అశ్వ. IV. 179); మొద.—ఆఱుగురు, ఆఱుమంది, అర్వాచీనరూపములు.

ఏడు

మహతీతరామహద్వాచకము : (అ) సర్వనామపదము: ఏడు.

పదియేడు (భార. ద్రో. II. 30); ఏడు (భార. ద్రో. III). 95; IV. 6); ఈరేడు (భార. అర. IV. 271); ఏడింటన్ (భార. విరా. V. 66; ద్రో. I. 169, 205 II. 68; ఉ. హరి. IV. 276); ఏడింటనేడింటన్ (భార. భీ. III. 245).

(ఆ) విశేషణము.

ఈరేడు జగంబులు (భార. అర. IV. 271); ఏడు సముద్రంబుల జలము (భార. అర. IV. 271); పదియేడులక్షలు (భార. శాం. V. 46); ఏడెనిమిది నాళ్లు (భార. శాం. VI. 580); ఏడిరువులు (భార. శాం. III. 59, 190); ముయ్యేడుమారుల్ (భాగ. III. 155); ఏడు దినంబులలో నీరేడు జగంబులును వ్రాసియిత్తుఁ బటము (ఉ. హరి. V. 505); ఏడుదినంబు లన్నమున కెడ్డము పుట్టిన యంతమాత్రలో (భీమ. II. 116).

(ఇ) సమాసములలో :

i. 'ఏడు' వై 'తూము' చేరునపుడు 'ఏ' కు హ్రస్వమును 'డు' లోని యుత్వమునకు లోపమును, 'తూ' లోని ఊత్వమునకు హ్రస్వమును, తకారమునకు దకారాదేశమును గలుగును : ఏడ్దుము.—'ఏడ్దుము'కు 'ఎద్దుము' అని యు శాసనములందు గలదు : S. I. I. VI. 1094.

ii. 'ఏడు' పై 'నూఱు' చేరునపుడు 'డు'లో యుత్తునకు లోపమును డ'కారమునకు పర్యాయమున 'ణ' కార 'శ' కారములును వైకల్పికముగం గలుగును: ఏడునూఱు రథంబులన్ (భార. విరా. III. 214); ఏణ్నూరు కాశీ. V. 286); ఏణ్ణూఱుముఖుల నేఁగె జలధి (కాశీ. V. 286).

iii. 'ఏడు' పై 'పది' చేరునపుడు ఏత్వమునకు హ్రస్వము కలిగి యది డు'పైఁ జేరి 'డె' యని యేర్పడును. అప్పుడు 'పది'లోని తొలి 'ప' కారమునకు బ' కారాదేశమును 'బ' కు ద్విత్వమును గలుగును: డెబ్బది (భార. భీ. I. 34; ద్రో. I. 165; II. 53; III. 65, 77, 85, 267; IV. 213; V. 52; కర్ణ. I. 127; శల్య. I. 194; శాం. V. 51; స్త్రీ. II. 167; హంస. I. 52).

'డెబ్బది' కి 'డెబ్బఇ, డెబ్బయి, డెబ్బై, డెబ్బది' అనియు శాసనములందు రూపాంతరములు గాన్పించుచున్నవి: డెబ్బఇ నాలిగింటికి (S. I. I. IV. 981); డెబ్బైయేను (S. I. I. VI. 218); డెబ్బడేను (S. I. I. VI. 1143).

మహన్మహతీవాచకము.

ఏడ్వురు (భార. ద్రో. IV. 6; విజ్ఞా. వ్యవ.); ఈరేడ్వురు (భాగ. II. 31).—'ఏండ్లుగురు' అని (S. I. I. V. 85 లోఁ గలదు.—'ఏడుగురు, ఏడు మంది' అనునవి వ్యవహారమునఁ గలవు.

ఎనిమిది.

మహతీతరామహద్వాచకము: (అ) సర్వనామపదము: ఎనిమిది, ఎన్మిది.

ఎనిమిది (భార. ద్రో. IV. 6, 189); ఎనిమిదింటన్ (భార. విరా. II. 66; భీ. I. 177; ద్రో. II. 227; అను. II. 262); ఎనిమిదిట[illegible] (భార. విరా. V. 103); ఎన్మిది (భార. ద్రో. II. 30); ఎన్మిదిటికిన్ (కళా. I. 110).

(ఆ) విశేషణము.

(i) ఎనుబది యెనిమిదివేవురు (భార. సభా. II. 121); ఎన్మిదిదిక్కులన్ (భార. అర. IV. 37); ఎనిమిదివేలు (భార. అర. V. 306; శాం. V. 46); ఎనిమిదిదునియలు (భార. ద్రో. IV. 189); ఏడెనిమిదినాళ్లు (భార. శాం. VI. 580); నూటిరువై యెనిమిది భేదములను (నరస భూ. II. 50); పద్నెనిమిది మాఁబులు (చిత్ర భార. VI. 67).

(ii) 'ఎనిమిది' పై 'పది' చేరునపుడు 'మిది' లోపించి 'ని' వర్ణము నిత్తున కుత్తు ఆదేశమగును; 'పది' పకారమునకు బకారమాదేశమగును: ఎనుబది (విజ్ఞా. ప్రా. 127); ఎనుబదిటికి (విజ్ఞా. వ్యవ. 116):—శాసనములందు 'ఎనుంభది' అనియుఁ గాన్పించుచున్నది. వ్యవహారమున 'ఎనభై' అను రూపము మాత్రము కలదు. కొందఱు 'ఎనుభై' అనియు నందురు.

(iii) 'ఎనిమిది' పై 'నూఱు' చేరునపుడు 'ఎనిమిది' కి 'ఎనుమ' ఆదేశ మగును; ఎనుమనూటతొంమ్మిది పైఁ డిట్టికల (జైమి. భార. VIII. 176);— శాసనములందు 'ఎనుంబనూఱు, అనియుఁ గాన్పించుచున్నది (S. I. I. IV. 1087); వ్యవహారముననను గ్రంథములందును 'ఎనమనూ (న్నూ)ఱు' అను రూపము గలదు: ఎనమనూఱు (శివధ. VII. 15).

(ఇ) మహన్మహతీవాచకము : ఎనమండ్రు.

ఎనమండ్రు (కాశీ. VI. 247; ఉ. రా. పు. 109; కళా. I. 125; జై. భార. I. 97); పదునెనమండ్రు (ఆము. I. 35); ఎనమండ్రన్ (భార. మా. I. 188);—ఎనమండ్రురు (భార. ద్రో. III. 216); అని ముద్రితప్రతియం దున్నదిగాని, యది 'ఎనమండురు' అయియుండును;—'ఎనమంబు' అని S. I. I. VI. 1052 లో నున్నది. వ్యవహారమున 'ఎనమండుగురు, ఎనిమిదిమంది' అను రూపములున్నవి.

తొంమ్మిది.

మహతీతరామహద్వాచకము : (అ) సర్వనామపదము : తొంమ్మిది.

(భార. భీ. II. 37; ద్రో. II. 30; III. 224, 227; IV. 189); తొంబది తొంమ్మిది (నిర్వ. VIII. 84); తునియలు దొంమ్మిదియఁట (ఆము. I. 35).

(ఆ) విశేషణము.

తొంమ్మిది నునిశితాస్త్రమ్ములన్ (భార. భీ. II. 34); తొంమ్మిదిశరముల్ (భార. ద్రో. IV. 189); ఎనమనూట తొంమ్మిది పైఁడిట్టికల (జై. VIII. 176).

(ఇ) సమాసములందు :

(1) 'తొంమ్మిది' పై 'పది' చేరి 'తొంబది' యగును; లేదా, తొల్ (=న్) + పది = నూటికి పూర్వపు పది యనియుఁ జెప్పవచ్చును. 'తొంబది' 'తొంబై' కూడ నగును.

తొంబది (భార. భీ. III. 44); తొంబదివేలు పద్మములు (హరి. పూ. III. 7); తొంబదియేడు (రంగ. రా. కిష్కి.);- తొంబై (S. I. I. VI. 961).

(2) 'తొంమ్మిది' పై 'నూఱు' చేరినప్పుడు 'తొంమ్మిది' 'తొంమ్మ,' 'తొంబ'లుగ మాఱును. తొంమ్మనూటి మీఁదఁ దొంబది తొంమ్మిది (నిర్వ. VIII. 84) 'తొంమ్మన్నూఱు' అనియు నగును.

'తొంమ్మిది' కి బహువచనరూపము 'తొంమ్మిదులు' అని యొక ప్రయోగము గలదు. తొం,మ్మిదులు (కాశీ. III. 181—యతిస్థానము); లోకములో 'తొంమ్ముదులు' అనియే వినఁబడుచున్నది.

మహన్మహతీవాచకము :

(1) తొమ్మండ్రు : తొమ్మండ్రు గొడుకులఁ దొలి వేలుపులఁ జేయ (ఉ. హరి. II. 144); తొమ్మండ్రు (కాశీ. IV. 178; VI. 247).

(2) తొమ్మండుగురు : దశావ. పు. 20, 91.

పది.

మహతీతరామహద్వాచకము: సర్వనామపదము.

పది (భార. ద్రో. IV. 6); పదియింటిని (భార. అశ్వ. II. 153); పది యును నూఱును వేయును ... ఒకటిం బదియింటి నూటినిచ్చిన (భార. అను. III. 30); పదిటన్ (నిర్వ. V. 86; విరా. V. 103: భీ. II. 187; ఉ. హరి. IV. 276); పదింటన్ (భార. విరా. V. 66, 77); పదియింటన్ (భార. భీ. II. 226); పదియింటఁ బదియింట (ఉ. హరి. III. 74); మొద.

ii. విశేషణము.

పదినాళ్లు (భార. ద్రో. I. 59); పదినాళులు (భా. భీ. III. 363); పది రువ్వంబులు (హరి. ఉ. X. 298); పదివేలు (భార. విరా. శాం. VI. 320; శల్య. I. 400; ఆర. V. 306); పదివేలు నేనునూఱు (భార. శల్య. I. 113); పదివేల్ వర్షాలు (చంద్రభా. III. 14); పదివేలును బదినూఱులు (హరి. పూ. IV. 69).

iii. మహన్మహతీ వాచకము.

(1) నన్నయ 'పదుండ్రు' అని మాత్రము వ్రాసినాఁడు. తిక్కన 'పదుండ్రు' (భార. భీ. III. 357; ద్రో. V. 127; కర్ణ. III. 180; అను. I. 119; III. 210); అను రూపమునే కాక 'పదురు' (భార. ఉ. III. 140); అనియు, 'పదువురు' (భార. కర్ణ. I. 264); అనియుఁ గూడ వాడెను. 'పదు గురు' అనునది 'పదువురుకు' అర్వాచీనరూపము. 'పదుగుండ్రు' అని శ. ర. లో నున్నదిగాని, కావ్యములందు గనఁబడలేదు. 'పదిమంది' అనునది యర్వా చీన రూపము (శుకచ. పు. 19)—కొన్ని ప్రయోగములు: పదుండ్రు (భాస్క. యు. 1458; భాగ. IV. 944); పదురు (వాసిష్ఠ. II. 162); పదు గురు (భాగ. VI. 60); మొద.

'పది' కిని 'ఇరువదికిని మధ్యగల సంఖ్యావాచకములు-'పది' పైనొకటి నుండి తొమ్మిదివఱకుఁ గల సంఖ్యలను దెలుపు పదములఁ జేర్చుటవలన నేర్ప డును. అట్లు చేరునపుడు 'పది' కిఁ గొన్ని వికారములు గలుగును. (i) సాధా రణముగ 'పది' కిఁ దక్కిన ద్రావిడభాషలయందువలె తుది యిత్వమున

కుత్వము గలుగును; అట్లాదేశమగునపుడు దానిపై సముచ్చయ చిహ్నమగు 'ఉన్' చేరును.

11. పదు + ఉన్ + ఒకండు = పదునొకండు (భార. శల్య. V. 113); పదునొకండవది (వరాహ. I. 84); నన్నయభారత భాగమున వ్రాతప్రతు లందెల్ల 'పదనకొండు' అను రూపము కాన్పించుచున్నది. ఇందు 'పది' యిత్వమున కత్వమును 'ఒకొండు' తొలి యొత్వమున కత్వమును గలిగినది. నేటి వ్యవహారమందలి 'పదకొండు' అను రూపమున కిది మూలమై యుండును. 'పది' అను రూపము ప్రథమావయవముగ నిలుచునపుడు 'పది+ఉన్+ఒకండు = 'పదియునొకండు' అని యగును. 'పదియొకండు' అను రూపము కావ్యములందు గాన్పింపదు. ఇట్లే 'పదియొకటి' మొదలగు రూపములును గాన్పింపవు. 'పదునొకండు' అను రూపము 'పద్నొకండు' అనియు నగును (వరాహ. IX. 54, 84); 'పదియు నొకండు' అనునట్లే 'పదియురెండు, పదియుమూఁడు, పదియునాలుగు, పదియునైఁదు (పదియునేను అని యుండదేమో), పదియునాఱు, పదియునేడు, పదియునెనిమిది, పదియుఁదొమ్మిది, అను రూపములును గావ్యములందు గాన్పించును.

12. 'పది' పై 'రెండు' చేరునపుడు 'పది+ఉన్+రెండు' = పదియు(న్) రెండు అని యగును. 'పదియురెండేఁడుల ప్రాయంబుదానవై' (రుక్మాం. IV. 98); 'పదిరెండు' అనియుఁ గవులు ప్రయోగించిరి (అధ్యా. రా. బాల. పు. 5); 'పదురెండు' అను రూపములేదు. కాని, సాధారణముగఁ గావ్యములందును వ్యవహారమునందును 'పది'కి 'పన్' ఆదేశముకాఁగా, నకారముపై రేఫము చేరి ద్రావిడ సంప్రదాయానుసారముగ 'ండ్ర' అను నుచ్చారణము కలిగి 'పండ్రెండు' అను రూప మేర్పడుచున్నది, పండ్రెండు (భార. ద్రో. II. 30; శాం. V. 46; ఉ. హరి. II. 167); పండ్రెంటన్ (భార. విరా. V. 66; భీ. III. 246; ద్రో. III. 226; భాస్క. యు. 1266).

'పదిట రెంటన్' అని ఉ. హరి. III. 74 లో ప్రయోగమున్నది.

13. పది+మూఁడు = పదు+మూఁడు = పదుమూఁడు (భార. విరా. III. 62; కర్ణ. III. 38); వ్యవహారమున ననంతపురమున 'పదుమూఁడు' అని కలదు. తూర్పు జిల్లాలలో 'పదమూఁడు' ఈ రెండు రూపములకును దేశమందెల్ల 'పద్మూడు' అను రూపాంతరము వ్యవహారమునఁ గలదు. 'పధ్నాలుగు, పద్ధెనిమిది' అనునట్లే అనంతపురమున 'పధ్మూడు' అనియు నందురు.

14. పది+నాలుగు = పదు+ఉన్+నాలుగు = పదున్ నాలుగు (ద్రుత లోపము); = పదునాలుగు (భార. ద్రో. III. 95; హరి. పూ. V. 5);— పదునాల్గు (భార. కర్ణ. III. 149); పద్నాలుగు (S. I. I. V. 834); తన

యుంబట్టము గట్టి రాఘవునిఁ బ-ద్నాల్గేండ్లు (మొల్ల. రా. అయో. 29); వ్యవహారమున 'పధ్నాలుగు;—'పదినాలువు' అని S. I. I. VI. 1178 లో నున్నది.

'పదునాలుగు'కు కవులు 'ఈరేడు' అనియు నందురు (భార. అర. IV. 271; ఉ. హరి. V. 505).

15. పది+ఉన్+ఏను = పదియునేను (భార. ద్రో. IV. 294, 297); 'ఉన్' చేర్పక 'పదియేను' అనియు కవులువాడిరి (భార. ద్రో. III. 95); పదియేను దినంబులకుం బదియేన్గళ లెక్క (నైష. VIII. 200); పదియేనింటన్ (భార. ద్రో. II. 68; విరా. V. 66);—పది+ఏను = పదేను (భార. విరా. V. 82; భీమ. I. 9; కవిక. I. 74; S. I. I. VI. 1060); పదు + ఉన్ + ఏను = 'పదునేను' అనియు నగును కాని, యది తొల్లిటికవుల గ్రంథములందు కానరాలేదు;—పదియేను+తూము = పదియేందుము; పదేను + తూము = పదేందుము (S. I. I. IV. 974; V. 159).

వ్యవహారమున తూర్పు జిల్లాలలో 'పదిహేను'; అనంతపుర ప్రాంతమున 'పదహైదు.' పది+ఐదు = పదు+ఉన్+ఐదు ='పదునైదు' అను రూపము తొల్లిటి కవుల గ్రంథములందు కానరాలేదు. 'పదేను' అనునట్లు 'పదైదు' అని యనవచ్చునేమో తెలియదు.

16. పది+ఆఱు = పదియాఱు; పదు + ఆఱు = పదాఱు, అను రెండు రూపములను నన్నయ వాడెను. తిక్కన 'పదాఱు' అనియే వాడెను (భార. భీ. I. 22; ద్రో. V. 185; శల్య. I. 291; శాం. V. 603; ఆశ్ర. II. 90); ఇట్లే భాగ. V. ii. 598; రుక్మిణీ. I. 49; దశావ. పు. 158; S. I. I. VI. 1028; మొద. 'పదాఱు' కు 'పదార్లు' అను బహువచనరూపము గలదు: (దీనారముల్) వేయునూట పదార్లు (వైజ. I. 90);—'పదియాఱు' అను రూపము నర్వాచీన కవులును వాడిరి: పదియాఱు వణములు (విజ్ఞా. ప్రా. 26);—వ్యవహారమున 'పదహారు' అని కలదు. 'పదునాఱు' అను రూపమును పూర్వకవులు వాడలేదు; అర్వాచీన కవులు వాడిరేమో తెలియదు.

17. పది+ఏడు = పదియేడు; నన్నయ యీ రూపమునే వాడినాఁడు; తిక్కనయు నట్లే (భార. ద్రో. II. 30; శాం. V. 46); వ్యవహారమున 'పదిహేడు' అని మాత్రమున్నది. 'పదేను' వలె 'పదేడు' అను రూపమున్నదేమో తెలియదు. 'పదునేడు' అను రూపము పూర్వకావ్యములందు లేదు; అర్వాచీన గ్రంథములందున్నదేమో మృగ్యము.

18. పది+ఎనిమిది = పదు+ఉన్+ఎనిమిది = పదునెనిమిది; ఈ రూపమునే నన్నయ వాడినాఁడు; కాని. నన్నయ కాలపు శాసనములందు 'పదియెన్మిది, పది

ఎన్మిది' అను రూపములు గానవచ్చుచున్నవి. తిక్కన 'పదునెనిమిది' యనియే వాడెను (భార. ద్రో. IV. 6); అర్వాచీన కావ్యములందు 'పద్నెనిమిది' యనియుఁ గలదు: 'బంధురభటు జరాసంధుఁ బద్నెనిమిది మాఱులు రణభూమిఁ బాఱఁ దోలె' (చిత్ర. భార. VI. 67);—వ్యవహారమున తూర్పు జిల్లాలలో 'పద్ధెనిమిది' అనియు, అనంతపుర ప్రాంతమున 'పఝ్ఝెనిమిది' అనియుఁ గలదు.

19. పది+తొమ్మిది = పన్+తొమ్మిది = పందొమ్మిది. నేఁటి వ్యవహారమున నిట్లే యున్నది. అనంతపుర ప్రాంతమున సరళాదేశము చేయక 'పంతొమ్మిది' అని యందురు. 'పందొమ్మిది' కి భారతమునఁ బ్రయోగములు చిక్కలేదు.

ఈ క్రింద నిరువదినుండి నూఱువఱకును గల సంఖ్యావాచకపదములకుఁ గల కావ్యప్రయోగములు పొందుపఱుపఁ బడినవి. ఇందు ప్రయోగములు చూపఁబడని సంఖ్యావాచకపదములకుఁ బూర్వకాలమున రూపము లెట్లుండెనో యూహించుకొనవలసినదే కాని, మఱియొకమార్గము లేదు. ఆయా పదములను వాడుటకుఁ గవులకు సందర్భపడలేదనిమాత్రము చెప్పవలయును.

20. ఇరువది (భార. ద్రో. II. 68; ద్రో. III. 228); ఇరువదింటిన్ (భార. కర్ణ. III. 149); ఇరువయివుట్లు (S. I. I. IV. 661); ఇరువఇ (S. I. I. VI. 1080); ఇరువై (S. I. I. IV. 797; V. 1059; కాశీ); ఇరువై పంబ శరంబులేసె (వరాహ. IX. 106); వ్యవహారమున 'ఇరవై'. 21. ఇరువదియొక్కమాఱు (భార. ద్రో. II. 212; రంగ. రా. కిష్కి. పు. 234); ఇరువదొక్కమాటు (హరి. పూ. IV. పు. 83); ఇరువైయొక్కణ్డు (S. I. I. IV. 1378); ముయ్యేడు (భాగ. II. 155);—22. ఇరువది (-వై) రెండు; 23. ఇరువది మూఁడు (భార. సభా. II. 316)(-వై);—24. ఇరువదినాలుగు (వేలు) (భార. స్త్రీ. II. 167); ఇరువైనాలుగు మూళ్లమేర (కాశీ. I. 55);—25. ఇరువదియేనింటికి (S. I. I. V. 21); ఇరువదేను (భార. భీ. II. 34,37; కల్యా I. 194); నూటయిరువదేను (విజ్ఞా. ప్రా. 127); ఇరువదేనింటన్ (భార. ద్రో II. 68; III. 227);-ఇరువడేను (S. I. I. VI. 995, 1181, 1188); ఇరుఁదేను (S. I. I. IV. 1187). 26. ఇరువది (-వై) యాఱు; ఇర్వయాఱు (S. I. I. V. 1188). 27. ఇరువది (-వై) యేడు. 28. ఇరువదియెనిమిఁ (భార. శాం. V. 46); ఆయతగతి నిల నూటిరువైయెనిమిది భేదములను (వరః భూ. II. 50); ఇరువడెన్మిది (S. I. I. V. 71). 29. ఇరువది (-వై తొమ్మిది; ఇరువైతొమ్మిదవు ద్వాపరంబున (కాశీ. III. 51).

30. కావ్యములందు సాధారణముగ 'ముప్పది', ముప్పదింటన్ (భా ద్రో. I. 284); (నాలుగులతులు) ముప్పదిరెండు (వేలు) (భార. శాం. I

46); వ్యవహారమున 'ముప్పై'. 31. ముప్పదియొకండు (ముప్పదియొకటి, ముప్పైయొకటి). 32. ముప్పదిరెండు (ముప్పైరెండు);—ముప్పదిరెంటను (భార. ద్రో. III. 224). 33. ముప్పదిమూఁడు (వ్యవ - ముప్పైమూఁడు); ముప్పదియును మూఁడుగోట్లు (ఆము. IV. 12). 34. ముప్పది (-ప్పై) (నాలుగు). 35. ముప్పదియేను, ముప్పదియైదు;—వ్యవ. ముప్పై అయిదు, ముప్పదేను (S. I. I. IV. 1098; IV. 123); ముప్పదియు నైదు (భార. మహా. I. 3); ముప్పదేను (భార. ద్రో. V. 135). 36. ముప్పదియాఱు (వేలు) (భార. శాం. V. 51); వ్యవ. ముప్పైయారు. 37. ముప్పది (ప్పై) యేడు; ముప్పదేడు (S. I. I. V. 76). 38. ముప్పది (-ప్పై) యెనిమిది. 39. ముప్పదితొమ్మిది (S. I. I. V. 76); వ్యవ. ముప్పైతొమ్మిది. నూంటముప్పయి (S. I. I. IV). 32. ముఫయిరెండు (S. I. I. V.); ముప్పై (S. I. I. VI. 218; VI. 1067).

40. నలువదింటికిని (విజ్ఞా. వ్యవ. 116); నల్వది (శివధర్మో. VII. 5); నలుభయి (S. I. I. VI. 1184); వ్యవహారము. నలభై;—నల్వాయిరెండు (S. I. I. V. 1118); మొద.

50. ఏఁబది (భార. భీ. II. 37; ద్రో. IV. 36); ఏంభయి (S. I. I. V. 150; VI. 1068; V. 1154-5); ఏంబై (S. I. I. VI. 974; VI. 1065); యేంబై (S. I. I. VI. 139); ఎంభయి (S. I. I. VI. 950);—55. ఏంభదేను (S. I. I. VI. 644); ఏంబైటికి (S. I. I. VI. 1179); మొద.

60. అఱువది (భార. భీ. II. 34, 37; ద్రో. III. 224; IV. 36, 116); అఱువది యఱువది యమ్ములన్ (భార. ద్రో. IV. 298); అఱువదింట (భార. విరా. V. 66; శల్య. I. 194; శాం. V. 46); అఱువదింటికిని (విజ్ఞా. వ్యవ. 116); 64. చిత్రజాతకళ లర్వదినాలుగు (కళా. I. 110); అఱువదినాలుగు భార. భీ. II. 51; శాం. V. 46); అఱువదినాలుగింటన్ (భార. ద్రో. V. 52); అఱువది నాల్గింటఁ (భార. భీ. II. 34); అఱువై యోజనముల్ వెడల్పును శతాయామంబునుం గల్గి (వరాహ. V. 137); అఱువై తొమ్మిది (S. I. I. VI. 991); మొద.

70. డెబ్బది (భార. ద్రో. I. 165); డెబ్బదింటన్ (భార. ద్రో. III. 77. V. 52); డెబ్బదింటి (S. I. I. VI. 1189); డెబ్బదిరెండు పాళెములు (హంసవిం. I. 52); డెబ్బదిమూఁడు (భార. ద్రో. II. 58; కర్ణ. I. 127); డెబ్బదిమూఁటన్ (భార. ద్రో. III. 65,267; శల్య. I. 194); డెబ్బయినాలిగింటికి (S. I. I. IV. 981); డెబ్బదేను (భార. ద్రో. III. 35 IV. 218); డెబ్బైయేను (S. I. I. VI. 218); డెబ్బదేను (S. I. I. VI. 1148).

డెబ్బదియూఱు (గోట్లు) (భార. స్త్రీ. II. 167). డెబ్బదియేడు (భార. ద్రో. I. 165); డెబ్బదేడు (భార. భీ. II. 84); వ్యవహారము: డ (డె)బ్బై.

80. ఎనుబది (విజ్ఞా. ప్రా. 127); ఎనుబదిటికి (విజ్ఞా. వ్యవ. 116); ఎనుబది యెనిమిది వేవురు (భార. సభా. II. 121);- వ్యవహారము: ఎనభై.

90. తొంబది (భార. భీ. III. 44); (పండ్రెండు లక్షలుఁ) దొంబది యూఱు (వేలు) (భార. శాం. V. 46); తొంబదియేడు (రంగ. రా. కిష్కిం.); (త్రొమ్మనూటి మీఁదఁ దొంబది తొమ్మిది (నిర్వ. VIII. 84); తొంబదివేలు (హరి. పూ. III. 7); —తొంబై (S. I. I. VI. 961);—వ్యవహారమున 'తొంభై.'

100. నూఱు (భార. ద్రో. III. 228; శాం. V. 50); పదియును నూఱును వేయును (భార. అను. III. 30); నూఱుగతులన్ (భార. కర్ణ. II. 63); నూఱుమాడలకు (విజ్ఞా. వ్యవ. 116); నూటికిన్ (భార. అను. III. 30; ద్వాత్రింశ. I. 96); నూటయొక్కండు త్రోవలు (కాశీ. VII. 164); నూట యేను (భార. ద్రో. IV. 213); నూటయూటింటన్ (భార. ద్రో. III. 223); (వేయు) నూటపదార్లు (వైజ. I. 92); నూంటముప్పయి (S. I. I. IV. 276).

ఇన్నూఱు (భార. శాం. III. 375; V. 50); ఇన్నూఱుచేసి హయంబుల నిచ్చి (భార. ఉ. III. 317); ఇన్నూఱు పద్యములు (ప్రస. రా. శత. 4); ఇన్నూట పదిట (ఉ. హరి. IV. 276);— మున్నూఱు (భార. శాం. III. 375; V. 50; విజ్ఞా. ప్రా. 127); ఒకమున్నూఱు గదల్చి తెచ్చిన లలాటో గ్రాత్తుచాపంబు (భోగ. IX. 262); వేయు మున్నూఱు (భార. కర్ణ. III. 182); మున్నూఱు శిష్యులును (భీమ. II. 126); మున్నూటి నామమడఁచె (భార. విరా. III. 214);— నన్నూఱు విండ్లమానము (కాశీ. V. 192); నన్నూఱు (భార. శాం. X. 50);— ఏనూఱు (భార. భీ. III. 55; అను. I. 167; విజ్ఞా. ప్రా. 127); వేయునేనూఱు (భార. ద్రో. III. 38); ఏనూఱేం డ్లకుఁ బుట్టు నా యనుజుఁడు (భార. అను. I. 175); నూఱులైదు (భార. ద్రో. IV. 299);—వేయిన్నూఱునూఱు (కాశీ. V. 244); ఎడ్లనాఱునూఱును (భూ. కర్ణ. II. 91); ఏడునూఱు రథంబులన్ (భార. విరా. III. 214); ఏళ్నూఱు (కాశీ. V. 286); ఏణ్నూఱు ముఖముల నేఁగె జలధి (కాశీ. V. 286);— ఎనమనూఱు (శివధ. VII. 15); ఎనమనూట తొమ్మిది వైఁడిట్టి కలు (జైమి. భార. VIII. 176); ఎనుంభనూఱు (S. I. I. IV. 1087) తొమ్మనూటి మీఁదఁ దొంబది తొమ్మిది (నిర్వ. VIII. 84); పదినూఱులు (హరి. పూ. IV. 69); పదినూఱు శిరముల పాఁపఱేని (నర. భూ. II. 92.)

ఇరు (ఇన్), మూ (మున్), నల్ (నన్), ఏను (-న్), ఏడ్ (ణ్, ళ్), ఎనమ (న్), తొమ్మ (న్) అను పదములపై 'నూఱు' చేరి యేకవచనమున నిలుచును; ఇన్నూఱు, మున్నూఱు, నన్నూఱు, ఏనూఱు, ఏళ్నూ (-ణ్నూ)ఱు ; ఎనమనూ (-న్నూ) ఱు, తొమ్మనూ (-న్నూ) ఱు;—కాని, రెండు, మూఁడు, నాలుగు, ఐఁదు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది, అను పదములతోఁ జేరి బహువచనమున నుండును: రెండునూర్లు, మూఁడునూర్లు, నాలుగునూర్లు, ఐఁదునూర్లు, ఏడునూర్లు, ఎనిమిదినూర్లు, తొమ్మిదినూర్లు;—నూర్లు రెండు (మూఁడు, నాలుగు, ఐఁదు, ఆఱు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది) అనియు ననవచ్చును. 'ఆఱు' పై 'నూఱు' చేరి, యేకవచనమం దయినను బహువచనమం దయినను నుండవచ్చును.

'నూఱు' పై నితర సంఖ్యావాచక పదములు చేరునప్పుడు 'నూఱు' మీఁద సముచ్చయార్థకచిహ్నమగు 'ఉన్' చేరును: నూఱు నొక్కటి, నూఱును రెండు, నూఱుం దొంబది, మొద. కాని, వ్యవహారమునను గావ్యములను గూడ నిట్టియెడల 'నూఱు' 'నూట' గ మాఱును. ఇందు 'నూట' యను రూపము ద్రుతాంతమగు -తృతీయా -పంచమీ -సప్తమీ రూపము కాదు. అది కళ: నూటయొక్కఁడు (-టి), నూటరెండు; నూటపది, నూట యిరువది, నూట తొంబది, మొద. వ్యవహారమున 'నూట' 'నూటా' యనియు నగును: నూటా ఒకటి, నూటాపది, నూటా తొంభై; మొద. 'నూర్లు' పై 'అ' చేర్చియుఁ బై సంఖ్యలను వ్యవహారమునఁ దెలుపుట గలదు: ఏడు నూర్ల ముప్పైఅయిదు; మొద. 1000. వేయి (భార. అను. I. 175); వేయి గన్నుల వాఁడు (భాగ. VIII. 43); రావణ కుంభకర్ణ ద్విపేంద్రములకు సింగంపు వేయి మా రంగశాయి (పాంచా. I. 28); వేయర్కులు (భాగ. VIII. 160); 'వేయి'కి 'వే' అనునది మూలము: వే వత్సరములు (భార. అను. III. 78); వే (భార. అను. II. 43); మొగములు వేగల శేషుండు (కవిజన. I. 9); ఆవులు వేయును (భార. కర్ణ. II. 91).

'వే' పూర్వ పదముగాఁ గలిగిన సంఖ్యావాచక పదములందు 'వే'పై సముచ్చయార్థకమగు 'ఉన్' చేరును: వేయు నిన్నూఱు (భార. శాం. III. 375); వేయు మున్నూఱు (భార. కర్ణ. III. 182); వేయు నేనూఱు (భార. ద్రో. III. 88); వేయినూట పదార్లు (వైజ. I. 92); -ఒకప్పుడు 'వే' పై సముచ్చయార్థక 'ఉ'వర్ణ మనావశ్యకముగఁ జేరుచుండును: వేయు మాడలు (భార. అను. II. 268); -'వేయున్' అనుటను 'వేయిన్' అనియుఁ గావ్యములం దున్నది. వేయిన్నూఱు నూఱు (కాశీ. V. 244); -వ్యవహారమున 'వేయిన్ని' 'వెయ్యిన్ని' అని యగును; వీని ఉచ్చారణమునఁ దుది యిత్తునకు దీర్ఘమును

గలుగును: వెయిన్ని (-న్నీ) ముప్పైఁ; -ఒకప్పుడు 'వెయ్యా-' అగును: వెయ్యా ముప్పైఁనాలుగు; మొద. వేయిలక్షలమణుల్ (భాస్క. బాల. 540).

'వెయ్యాలు' అనునది 'అనేక' అను నర్థమున నుపయోగింపఁబడును: వెయ్యాలమ్మలు కమ్మవింటిదొరకున్ (పాంచా. II. 39); అతనికి వెయ్యాలు విధాల బోధ చేస్తిని; మొద.

'వేయి' సంఖ్యావాచకపదమున నుత్తరపద 'మగునపుడు రెండు, మూఁడు, నాలుగు, అయిదు, ఆఱు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, మొదలగు రూపముల మీఁదనే చేరునుగాని ఇరు (ఇను), మూ (మున్), నల్ (-న్), ఏను (-న్), ఏళ్ (-ణ్), ఎనమ (న్), తొమ్మ(న్), లపైఁ జేరదు. 'నూఱు' వలె నాయాసంఖ్యావాచక పదములపైఁ జేరి యది బహువచనమునందే యుండును. మూఁడువేలు, ఆఱువేలు (భార. శల్య. I. 113); ఎనిమిదివేలు (భార. ఆర. V. 306); పదివేలు (భార. ఆర. V. 306; శల్య. I. 113, 400; శాం. VI. 320); పదివేల్వొరాలు (చంద్రభా. III. 14) పదివేలును బదినూఱులు=11,000 (హరి.పూ. IV. 69); పదునొకండు వేలు (భార. శల్య. I. 113); పదాఱువేలు (భార.భీ. I. 22; భాగ. X. ii. 598); పండ్రెండు వేలేండ్లు (భార. శాం. V.46); ఇరువదివేలు (భార. స్త్రీ. II. 167); పరిచారకులు నూఱువేలు(భార. ఆర.V. 306); - వేయువే లరదములు=పదిలక్షలు (భార. శాం. I. 233); వేయివేలు= అనేకము (హరి. పూ. పు. 169); వేనవేలు (భార. ఆర. IIV. 344); వేనవేల విధులఁ బ్రీతులఁ జేత (భార. ఆర. I. 376) -'వేవేల, వేవే' విధములు=అనేకవిధములు.)

'వేలు' అను బహువచనరూపముపై సంఖ్యావాచకపదము చేరునప్పుడు 'ఉన్' అను సముచ్చయచిహ్నము 'వేలు' కంతాగమముగ వచ్చును: నాలుగువేలుం దొమ్మనూఱు మొద. అట్టి యెడలను, 'వేలు'పై నితర పదములు చేరునప్పుడును 'అ' వర్ణము చేరుటయుఁ గలదు. మూఁడువేల నన్నూఱు; పదాఱువేల యోజనములు (భార. భీ. I. 22); వేనవేల విధులు (భార. శాం. II. 376); వేనవేల భంగులన్ (భార. ఆర.. VII. 344); వేయువేల విధములు (భాగ. X. ii. 945).

లక్ష, కోటి, అను పదములు దత్సమములు: లక్షలు (భాస్క. యు. 1458); నలులక్ష కపులతో (భాస్క. యు. 19); వ్యవహారమున 'నాలుగు లక్షల'; 'నలులక్ష' అను రీతిని 'ఇరులక్ష, ముల్లక్ష, ఎనమలక్ష' మొదలగు రూపములు లేవు. -వెలుంగుల లక్ష (భాగ. VIII. 217); వేయిలక్షల మణుల్ (భాస్క. బాల. 540).

'కోటి'కి బహువచనము 'కోట్లు' (భాస్క. యు. 1468); డెబ్బదియారు గోట్లు (భార. స్త్రీ. II. 167); మొద.

'అసంఖ్యము' అని తెలుపుటకు 'నూర్లకు నూర్లు, వేలకువేలు, వేనవేలు, వేయివేలు, వేవేలు, లక్షోపలక్షలు, కోట్లానం గోట్లు, (భాస్క. యు. 264; రాధికా. III 128). మొదలగు పదము లుపయోగింపఁ బడును. త్రవ్వి తండములు, కుప్పలు, తిప్పలు రాములిదాశి అను సంఖ్యావాచకములు కాని పదములును నసంఖ్యమను నర్థమున వాడఁబడును.

'రెండింతలు' అనుటకు 'ఇనుమడి' (హరి. ఉ. X.302; భార. విరా. II. 45; కర్ణ. I. 92; అను. IV. 419) అనియు 'ఇను మడింతలు' (వరాహ. X. 111) అనియు, 'ఇను మిక్కిలి' (శ్రవ్యా. కృ. సం. II. పు. 29) అనియుఁ బ్రయోగములు గలవు. ఇట్లే 'ముమ్మడి, ముమ్మడింతలు (?), ముమ్మిక్కిలి; నలుమడి, నలుమడింతలు (?), నలుమిక్కిలి (?), మొద.

ఒకటి రెండు సార్లు, రెండు మూఁడు సార్లు మొదలగు వానియందు సంఖ్యావాచక పదములకు 'ఇంచుమించుగ' అను నర్థముండును.

వీప్సార్థమున ఒకఁడొకఁడు (ఒకొకొకటి), రెండు రెండు, మూఁడు మూఁడు, మొదలగు రీతి నాగా సంఖ్యావాచకపదములు ద్విరుక్తములగును. ఒకని నొకని నైదైదు మహాస్త్రభాను రాస్త్రములఁ జేసె (భార. భీ. III. 200); అఱువదియఱువది యమ్ములు (భార. ద్రో. IV. 298); ప్రదరంబులు పదియింటం బదియింటఁ బదిట రెట్టించి నేసెను (ఉ. హరి. III. 74); పంత్రెంటఁ బంత్రెంట, మూఁట మూఁట, ఏడింట నేడింట (భార. V. III. 245); రెంట రెంటను (భార. ద్రో. I. 241); పంత్రెండు పంత్రెండు పటు మార్గణమ్ములు (భార. ద్రో. I. 205); మూఁడు మూఁడు మొనలుగు వాఁడి తూపులు (భార. ద్రో. IV. 294); ఐదైదు (భార. ద్రో. IV. 27); మూఁడు మూఁడు (భార. ద్రో. IV. 297); ఇరువదియిరువది (భార. ద్రో. IV. 298), పదిపది తూపులన్ (భార. ద్రో. II. 68); తొమ్మిది తొమ్మిది వాలికయమ్ములన్ (భార. ద్రో. III. 207); (ఆటవాలు IV. ద్రో. IV. 211), మొద.-మహన్మహతీవాచక సంఖ్యాపదములను నిట్లే ద్విరుక్తిగ వాడవచ్చును: ఇద్దఱిద్దఱన్ (హరి. పూ. I. 79.) -ఇట్టి యెడల నన్వయ కాలమున సంఖ్యా వాచక పదము ద్విరుక్తము కాకయు దానిపై 'చేసి' అను క్త్వార్థక రూపము చేరుచుండెడిది: మూఁడునేసి, పదినేసి, మొద. నాలువునేసి పుట్లు (S. I. I. IV. 668). రాను రా నిట్టి సందర్భము లందు 'చేసి' 'ఏసి'గా మాఱినది: తొమ్మిదేసి (భార. భీ. II. 85); రెండ్డేసి అడ్డలు (S. I. I. V. 1157); మూడేసి (భార. V. II. 19; ద్రో. II. 80; శాం. V. 41); ఎన్మిదేసి (కళా. I. 110);

పదేసి (భార. ద్రో. III. 82); వేయేసిపాటి (భార. ద్రో. II. 202; శా. I. 234); వేయేసి (భార. శాం. I. 234); మొద. ద్విరుక్తమగు పదము మీఁదను 'ఏసి' చేరుటగలదు: నూఱు నూఱేసి (భార. ద్రో. II. 202); మొద.-ఇట్లే, మహన్మహతీబోధక సంఖ్యావాచకపదము మీఁదను 'ఏసి' చేరవచ్చును: నూర్వురేసి (భార. IV. 807); మొద.

పూరణార్థమున సమహద్బోధక సంఖ్యావాచక పదములపై 'అవు' అనుధాతువు తొలుతఁ జేరుచుండెను. 'అవు' కు రూపాంతరమగు 'అగు' ధాతువును దరువాతి కవులీ సందర్భమున వాడుచుండిరి. 'అవు' వ్యవహారమున 'ఓ' గా మాఱి గ్రంథములందు చేరినది. వైయాకరణులు 'అవ' అనునది పూరణార్థమునఁ జేరు నందురు. 'అవ' తోడిరూపములుముద్రిత ప్రతులయందు గానవచ్చుచున్నవి, కాని, 'అవ' లోని 'వ' యతి స్థానమున నెచ్చటను గానరాదు. వ్యవహారమున 'అవ' తోడిరూపములులేవు. కావున, 'అవ' రూపములు కృతకము లయినట్లు తోచుచున్నది.

రెండవునడవు (S. I. I. VI. 1118); రెండవునన్ను (భార. విరా. V. 386); రెండవుకాండను (మను. IV. 46); రెండవుమాఱు (భాగ. I. 63); రెండవుకైలాసము (కాశీ. III. 200); ఆయంబునందు నాలవుభాగమొండె మూఁడవుభాగముండె నం దర్ధమొండె (భార. సభా. I. 46); మూఁడవునీయండము (కాశీ. VI. 23); మూఁడవుకంట (కవిసం. I. 44); నాలవుదినంబు పతిమృతికాలంబు (భార. ఆర. IV. 199); నాలవుపాలు (S. I. I. IV. 1029); నాలవువెంటన్ (భాస్క. యు. 773); ఆఱవు(పాలిసమానము) (భార. అను. V. 34); ఎనిమిదవుసారి వినినన్ (హరి. ఉ. X. 304); పదునొకండవది (వరాహ. I. 84); పదునొకండవు చక్రపాణి, పండ్రెండవుశూలి, పదుమ్నాఁడవు సూర్యుఁడనఁగ (భోజరా. V. 244); కి.ట్టక పద్నాల్గవునేట (చంద్రభా. III. 14); పదాఱవుపాలు (భార. ఆర. VI. 63); పదునెనిమిదియాఱవుదినము (కాశీ. VI. 68); ముప్పదియాఱవునేఁడు (భార. శా. I. 22); మొద.

రెండోమేళం (S. I. I. IV. 702); రెండ్డో, రొండ్డో, మూండో, నాలుగో (S. I. I. IV. 711); రెండో, మూండో (S. I. I. IV. 810); నాలుగోభాగం (S. I. I. IV. 710); నాల్గోభాగము (S. I. I. IV. 699); క. చెలువకు రెండో, కలయికయందును (కామకళానిధి II.); క. రాఁడోయని తలపోయఁగ, మూఁడోజామయ్యె (నిరం. II. 102); సీ. అంటంగఁ గడలెల్ల నాఱురేఖలుగీసి క్రిందిపందొమ్మిదో ఛందమునను (అప్పక. IV. చక్రబం

ధము); గీ. తప్ప కిరువదియెనిమిదో ద్వాపరాంత, మందు (వేం. శ్వ. మా. 102); మొద.

'ఇరుసెవి యెఱుఁగకుండ = రెండోచెవి' (కాశీ. ఉ. హరి. V. 167) అను ప్రయోగమున 'రెండవు' అనుటకు 'ఇరు' అనివాడఁబడినది.

పదికిపైఁబడిన సంఖ్యావాచకపదముల మహన్మహతీ రూపములు.

II. పదియొకరు (భాగ. IV. 749); పదునొక్కరు, పదునొక్కండ్రు, పదకొండుగురు, పదకొండుమంది;- 12. (ఇను లొక్క పెట్ట పన్నిద్దఱు వృడమ (వాసిష్ఠరా. IV. 86); పన్నిద్దఱు ప్రమోదభాజులైరి (కాశీ. VI. 84); పన్నిద్దఱు (భార. ఆర. VI. 155, 233; భీ. III. 378; III. 120; భాగ. IV. 6); పన్నిరువురు (భార. భీ. III. 134; అను. II. 255; నిర్వ. I. 28); పండ్రెండు గురు, పండ్రె (-న్నె)ండుమంది;-13; పదుముప్వురు గండండను ధార నిలిపె (S. I. I. VI. 628); పదుముప్వురు (భాగ. IV. 28; నిర్వ. I. 28);-14; పదునలువురు (భార. భీ. II. 236); పదునలుగురు, పధ్నాలుగుమంది;-ఈరేడ్వురు (భాగ. II. 31);-15; పదేవురుదొరలు (వరాహ. V. 21); పదియేవు(-గు)రు; పదునేవు(గు)రు, పదిహేనుగురు, పదహైదుగురు, పదిహేనుమంది, పదహైదుమంది; 16. పదార్వురు (భార. అశ్వ. IV. 179); పదునార్వురు, పదహారుగురు, పదహారుమంది;-17. పదునేర్వురు, పదియేడ్వురు, పదేడ్వురు, పదయే(హే)డుమంది;- 18. పదునెనమండ్రుఁట మోచువారలు (ఆము. V. 35), పదునెనమండుగురు, పదియెనమండ్రు (-ండుగురు); పద్దె (-జ్ఝె)నిమిదిమంది;- 19. పందొమ్మండ్రు; పందొమ్మండుగురు. పందొమ్మిదిమంది;-20. ఇరువండ్రు; ఇరువదినాలుగువేలు మున్నూటయిరువండ్రు (భార. స్త్రీ. II. 167); ఇరువదిగురు (?), ఇరవైమంది; 12. ఇరువ (-ర్వది)యొక్కరు (-ండ్రు?); ఇరవైయొక్కమంది-- 22. ఇరువది యిద్దఱు (-యిరువురు?); ఇరవైయిద్దఱు;- 23. ఇరువదిముప్వ(-గ్గు)రు; ఇరవై ముగ్గురు;- 24. ఇరువదినలువురు; ఇరువైనలుగురు (S. I. I. V. 874); ఇరవైనలుగురు;- ఇరవైనాలుగుమంది 25. ఇరువది యేవురు (భార. ద్రో. III. 277); ఇరవైయైదుగురు, ఇరవైయైదుమంది;- 30. ముప్పండ్రుదాసులన్ (భార. సభా. II. 121);- 32.ముప్పదిద్దఱు (ఉ. రా. పు. 109);- 40. నలువండ్రు; నలువదిగురు (దశావ. పు. 168);- 50. ఏఁబండ్రు (భాస్క. బాల. 208);- 60. అఱువండ్రు; 70. డెబ్బండ్రు 80. ఎనుబండ్రు; 90. తొంబండ్రు (భాగ. V. I. 64);- 100. నూర్వురు (భార. కర్ణ. III. 149; భాస్క. యు. 1458); సానిమున్నూఱ్వురు (S. I. I. V. 160); పాటలగంధులు పదినూఱువురును (నవనాథోపాఖ్యా. IV, 112); 1000 వేవురు (భాస్క. యు. 1458;

భార. ద్రో. I. 96); పదివేవురందొ౯డు (భార. అర.V. 127); ఇరువదివేవురు (భార. ద్రో. II. 209); తెలికివేగురు (S. I. I. VI. 774); మొద.

మహన్మహత్యర్థక సంఖ్యావాచకపదములలో i. ఇరువురు, మువ్వురు, నలువురు, మొదలగు 'వు'తోడిరూపములు ప్రాచీనములు; ఇరుగురు, ముగ్గురు, నలుగురు, మొదలగు 'గు'తోడి రూపము లర్వాచీనములు; ii. ఎనమండ్రు, తొమ్మండ్రు, ప్రాచీనములు; ఎనమండుగురు, తొమ్మండుగురు, అర్వాచీనములు; iii. ఇరువండ్రు, ముప్పండ్రు, మొదలగు 'ండ్రు' తోడిరూపములు ప్రాచీనములు; ఇరువదిగురు, మొదలగున వర్వాచీనములు. iv. పదికిఁబైఁబడిన సమస్తపదములగు సంఖ్యావాచకపదముల మహన్మహతీ రూపములలోఁ దుదినున్న దానికి మాత్రము మహన్మహతీ రూపము కలుగును; తత్పూర్వ సంఖ్యావాచక పదములన్నియు మహతీతరా మహద్వాచక రూపములతోడనే యుండును: ఉదా. పదుమువ్వురు, పదియేవురు, ఇరువదినల్వురు, ముప్పదియిద్దఱు, తొంబదితొమ్మండ్రు; మున్నూర్వురు; నూటయిరువది యేవురు; ఎనమన్నూట ముప్పదియార్వురు; పదివేలుం దొమ్మన్నూట తొంబదితొమ్మండ్రు; మొద. v. 'మంది' అను జనసమూహవాచకపద ముత్తరపదమైనప్పుడు తత్పూర్వ సంఖ్యావాచకపదము మహతీత రామహద్వాచక రూపముననే యుండును: ఎనిమిదిమంది; నూఱుమంది, వేయిమంది; మొద.- vi. ఒకప్పుడు సంఖ్యావాచకపదము మహన్మహత్యర్థక విశేష్యములకు విశేషణమగునప్పుడు మహతీత రామహద్వాచక రూపముననేయుండును: అతిపుణ్యులెనిమిదివేలు, యతులుపదివేలు, పరిచారకులు నూఱువేలు (భార. అర. V. 306); వేయఱ్కులు (భాగ. VIII. 160); మున్నూఱుశిష్యులు (భీమ. II. 126); లక్షలు (రాక్షసులు) (భాస్క. యు. 1458); మేముగోటివచ్చెదము, అసురు లఱువదివేలు (భార.అర. IV); అబ్జనాభులు నూఱునైఁదుపదులు (కాశీ. VI). మూఁడర్బుదములు ... విజయధౌరేయులు వీరభటులు (జైమి. భా. V.)

"సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబులయం దెయ్యది ముందు ప్రయోగింపంబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగానగు: అన్నిగుఱ్ఱములకు, అన్నింటికి గుఱ్ఱములకు, గుఱ్ఱములన్నిటికి; గుఱ్ఱములకన్నింటికి; సాహిణులు మువ్వురు; రెండుగుఱ్ఱములకు, రెండిటికిగుఱ్ఱములకు, గుఱ్ఱములు రెండింటికి, గుఱ్ఱములకు రెండింటికి, సాహిణులు నలువురు; లక్షగుఱ్ఱములకు, లక్షకు గుఱ్ఱములకు, గుఱ్ఱములు లక్షకు, గుఱ్ఱములకు లక్షకు, రవుతులు లక్ష." చిన్నయసూరి. "సంఖ్యాప్రయుక్తవిశేషణము i.ఏకాంతంబయి యమహద్విశేష్యకమయ్యు, ii. తదంశాంతంబయి మహదమహ ద్విశేష్యకమయ్యు,

(అ) సమస్తంబు (ఆ) వ్యస్తంబు నగుచో విశేష్యంబు క్రమంబుగ నుత్తర పదంబునేకవచనాంతంబును, పూర్వపదంబు బహువచనాంతంబు నగు. -తదంశము=ఆయొకటియొక్క భాగము, అనఁగాఁ బాతికలోనగునది;—ఉ. డెబ్బది యొక్కరథము; రథములు డెబ్బదియొక్కటి; రెండున్నరమానిసి; మానునులు రెండున్నర; రెండున్నరరూపాయ, రూపాయలు రెండున్నర; మొద." (ప్రౌఢ వ్యాకరణము.)

"అయ్యాది యేకాంతంబు మహద్విశేష్యకంబు సమస్తంబుకాదు. వ్యస్తంబగుచో బహువచనాంతంబ యగు. పదునొక్కండ్రు రుద్రులు." (ప్రౌఢవ్యాకరణము).

ప్రౌఢవ్యాకరణకారుఁ డిట్లు సూత్రించినను 'డెబ్బదియొక్కరథములు' వంటి ప్రయోగములును గలవు. వాని సామ్యమునను వ్యవహారము ననుసరించి యు 'రెండున్నర రూపాయలు' అనియు ననవచ్చును.

# ఎనిమిదవ ప్రకరణము

## విశేషణములు

విశేషముల యర్థవ్యాప్తి కవధిని గల్పించునట్టియు, వ్యక్తివాచకపదవ్యముల గుణాదులను వర్ణించునట్టియు, జాతివాచకపదములు తెలుపు వస్తువుల ధర్మమును నిరూపించునట్టియు పదములు విశేషణము లనఁబడును. పెద్దకొండ, నల్లగుఱ్ఱము, జాలిగుండె, బరువుఱాయి, మొదటిమంత్రి, నాయిల్లు, మొదలయిన వానిలో పెద్ద, నల్ల, జాలి, బరువు, మొదటి, నా, అనుపదములు వానితోఁజేరిన కొండ, గుఱ్ఱము, గుండె, ఱాయి, మంత్రి, ఇల్లు, అను జాతివాచకపదములచేఁ దెలుపఁబడు వ్యక్తులెన్నో యుండఁగా వానిలోనికొన్నిటిని మాత్రము దెలుపుచు విశేషణత్వమును బొందుచున్నవి. రావణవైరి రాముఁడు మమ్ము రక్షించును', 'పతివ్రతసీత భర్తతో నడవులకుఁబోయెను' అను నప్పుడు 'రావణవైరి, పతివ్రత' అనుపదములు 'రాముఁడు, సీత' అను వ్యక్తుల గుణాదికము వర్ణించుచు విశేషణము లగుచున్నవి. మూఁగపశువులు, నల్లకాకి, చల్లనిమంచు, మొదలగువానియందు మూఁగ, నల్ల, చల్లని, అను పదములు తత్తజ్జాతుల ప్రధాన లక్షణములను దెలుపుచు విశేషణము లగుచున్నవి.

విశేష్యముల యర్థవ్యాప్తి నేవిధముగనైన సంకుచితముచేయు నేపదమయినను విశేషణమే యగును. కావున, పదములకు సంబంధషష్ఠియందుగలుగు రూపములును (రామునిబాణము, తాతమాట, ఏటినీరు, మా మనవి) 'నిర్దేశార్థక సర్వనామ విశేషణములును (ఆ, ఈ, ఏ), సంఖ్యావాచకవిశేషణములును (రెండుపుస్తకములు, రెండున్నర రూపాయలు, అర్ధసంవత్సరము, మొదటి యేఁడు) విశేషణములే యగును. ఇట్లే చేయుచున్నపని, చెప్పినమాట, వ్రాయునాతఁడు, మొదలగు ధాతుజరూపములును విశేషణము లగును. కాని, వీనిని గూర్చి విభక్తి, సర్వనామ, సంఖ్యావాచక, క్రియాప్రకరణములందు తెలుపఁబడియుండుటచేత నిచట గుణవాచకవిశేషణములనుగూర్చి మాత్రము తెలుపఁబడును. గుణవాచకవిశేషణములు కాల, స్థాన, ఆకార, వర్ణ, దశా, గుణాది భేదములచే వివిధములుగా నుండును; ఉదా. కాలము; క్రొత్త, ప్రాఁత, మొద; స్థానము: ఎత్తు, లోఁతు, దాపలి, వలపలి, మొద; ఆకారము: గుండ్రని, చౌకపు, వంకర, మొద.; వర్ణము: తెల్ల, నల్ల, ఎఱ్ఱ, మొద; దశ: పేద, గొప్ప, మోటు, మొద.; గుణము: మంచి, చెడ్డ, మొద.

విశేషణములను (i) విశేష్యములకుఁ బూర్వమందు గాని (ii) క్రియాస్థానమున వానికిఁ బరమందుగాని చేర్పనచ్చును. విశేష్యములకుఁ బూర్వ

కెంపు (భార. ద్రో. V. 384; కర్ణ. II. 255; శల్య. I. 164); దొడ్డ (భార. ద్రో. I. 358); దొడ్డ నారసము (భార. భీ. III. 19, 126; ద్రో. III. 63); దొడ్డమహిమ (భాగ. I. 240), నడగొండ (భాగ. VI. 361); నడదీవ (హర వి. III. 69); నిగన్నిగ ప్రభలు (రాజగో. శత. 18); నున్నకొంగు (భాస్క. అర. II. 87); నెఱిగిన్క (భార. ఉ. I. 247); నెఱసంగడము (భార. భీ. III. 349); నెఱసందురుఁడు (భార. అను. I. 50); నెత్తమ్మి (భార. విరా. II. 236); నెత్తావి (భార. విరా. II. 238); పఱిమొయిల్ (భార. విరా. I. 294); పఱిమొయిళులు (భార. విరా. IV. 86); పలుచ (భార. భీ. III. 162); పల్ల పాండ్రుకల్ (భాస్క. యు. 2029); పిన్నకొడుకు (భాగ. VI. 62); పిన్న తమ్ముండు (భార. ద్రో. IV. 284); పిన్ననవ్వు (భార. ఉ. III. 52); పిన్న తమ్ములు (భార. శాం. II. 130); పిన్ననగవు (భార. ద్రో. II. 249); పిన్న నాఁడు (భార. కర్ణ. III. 75); పిన్నవాఁడని (భార. ద్రో. II. 147).

అఱినిండపడికేలు గట్టి (భార. ఆది. VI. 251; విరా. III. 12); పెడ చెవులను బెట్టి (భార. కర్ణ. III. 93); పెడబొబ్బిల్లు (హరి. ఉ. V. 37); ఇది యొక్క పెద్దగిట్టమున (భార. విరా. IV. 245), పెద్దబ్రదుకు (భార. భీ. I. 193); పెద్దగాలము (భార. ద్రో. III. 188); పెద్దతల్లి (భార. ఆశ్ర. II. 54); పెఱయాలి (భార. ఆశ్వ. II. 29); పెఱవనిత (భార. అను. V. 287); పెఱముత్తము (భార. ద్రో. III. 277); పెఱరథికులు (భార. ద్రో. II. 309); పేదమనసు (భార. శాం. I. 91, 117); పేదమాట (భార. ఆశ్వ. I. 88); పొల్లయొడలు (భార. ఆ. IIV. 291); బోదనవకెంపుఁ దీవలు (భార. VII. 267); మక్కువ యిల్లాలు (భాగ. VI. 186); మిట్టగ్రుడ్డులు (భాస్క. యు. 2029), అంప మూఁడమంచు (భార. విరా. V. 169); మెత్త (భాగ. VI. 373); రాచకొమాళ్లు (రాధామా. III 38); లేటమొగము (భార. విరా. IV. 248); లేతవచ్చిక (భాగ. VIII. 39); వలకేలు (భార. అను. IV. 113); వలచెవి (భార. అను. IV. 116), వలుఁదగమపులు (భాగ. VIII. 45); వాలిక తూపులు (భార. విరా. II. 88); వాలిక దొడ్డనారసము (భార. ద్రో. I. 358); వాలిక నారసము (భార. ద్రో. IV. 120); వెడగూఁదు (భార. విరా. II. 192); బెబ్బాడుఁదయమున్న (భార. కర్ణ. II. 228); వెల్లేనుఁగు (భార. భీ. మొద.

## ii. ఇకారాంతములు.

[illegible] (భార. అను. I. 50); అలరి బ్రాహ్మణుఁడు (భాగ. [illegible] (భార. అను. I. 297); కట్టిఁడి బ్రహ్మ (భాగ. VI. [illegible] VI. 48); కఠిందివని (భార. ద్రో. IV. 308).

(భార. ఉ. I. 290); తమ్ముఁ గుత్తులు (భార. ద్రో. IV. 135; శల్య. I. 28); తీవు (భార. విరా. IV. 55); తరితీపు తలఁపులు (భాగ. VI. 519); తొలుపుట్టు (భార. అను. V. 89); తొలుబాము (భార. అను. V. 86); తొలుప్రాఁకు (భార. శాం. IV. 293); తొలుచూలు (భార. స్త్రీ. II. 180); తొలుతాఁకు (భార. కర్ణ. IV. 278); తొలుసుద్ద గొందుము రయంబున నాతనిన్ (భార. ఉ. IV. 208); తొలుమేనికి (పాండు. IV. భాస్క. యు. 390); నడుగలను (భార. భీ. II. 116; ద్రో. III. 168); నడువాన గాలంబు (భార. ద్రో. I. 281); నిండుగొలువు (భాగ. VI. 490); నిండుపున్న(పు?)ము (భాగ. VI. 260); నునుమ్రోఁత (భార. అను. I. 181); నునుఁదీవ (భార. అను. I. 50); నునుగావు (భార. విరా. II. 308); నునుఁగాంతి (భార. విరా. I. 294); నునుసెలగోల (భార. విరా. I. 276); పులుఁగడుగంగఁబడ్డ నునుముత్యము (పాండు. III. 9); నునుగెంపు (భాగ. I. 285); నునుఁబోఁద నెయ్యంబు (భాగ. VIII. 267), నవ్వేఁగుఁజన్నుఁగవ (భార. విరా. I. 291); పరనువారు (కాశీ. IV. 64): పాడిల్లు (భార. ద్రో. II. 387); పేరాఁకలి (భాగ. IV. 910; శాం. III. 288); పేఁడెలు (భార. స్త్రీ. II. 45; మా. I. 100); పేరడవి (భార. ద్రో. II. 62; V. 321; శల్య. II. 6); పేరుక్కు (భార. కర్ణ. I. 87; ద్రో. IV. 57; V. 74); పేరురము (భార. కర్ణ. I. 9; అశ్వ. IV. 12); పేరెలుఁగు (భార. ద్రో. IV. 175); పెరల్లి రిపుప్రతానము (భార. శల్య. I. 342); పేరెలమి (భార. అను. I. 158); పెనుమిఱ్ఱు (భార. విరా. II. 321); పెనుఁగుదుటన్ (భార. విరా. V. 401); పెనుఁజాములు (భార. ఉ. VI. 366); పెనుగ్రద్దలు (భార. ద్రో. I. 182); పెనుఁజోటు (భార. ద్రో. IV. 110); పెనురొంపి (భార. శల్య I. 153); పెనుత్రేఁగు (భార. అను. I. 287); పెనుమంచు (భార. సౌ. II. 27); పెనుమంది (భాస్క. యు. 81); పెనునెత్తురులు (భాగ. VI. 373); పొనుఁగు ప్రజ (భార. ఆర. VI. 239); పోటుమగలు (భార. విరా. V. 89; ద్రో. III. 170); బడుగు (భార. అను. II. 402); బలుగాయలు గాచె (భార. విరా. II. 221); బలుడేగలు (భార. ద్రో. IV. 181); బలుతీర్పు (భార. ఉ. IV. 148); బలుదాటున (భార. విరా. I. 275); బలునారసంబు (భార. ద్రో. II. 94); బలుపుండులు (భార. అను. V. 103); బలువిలు (భార. ద్రో. IV. 29, 189); బలువిడిన్ (భార. ద్రో. IV, 54); బీతొండ (భార. ఉ. IV. 116); ముఱుమాటలు (భార. స్త్రీ. II. 76; శాం. I. 107); మాఱుమనిసి (భార. శల్య. II. 11); ముఱుఁబ్రోవు (భార. విరా. IV. 253); మెఱుఁగు వాలారుఁదూపు (భార. సౌ. I. 195); మేలుచేయు (భార. కర్ణ. II. 107); వాలంపగోలువలు (భార. భీ. III. 284); వాలంపగ

పొత్తు (లోను+ఇ; భార. ఉ. III. 260); మానంబులోని యంద (భార. అను. VI. 151); వెలిచవులు (భార. శాం. IV. 304); వెలి (వెలు+ఇ) మావు (భార. ఉ. IV. 125); వెలిమెచ్చు (భార. కర్ణ. III. 271); వెలివెలి వస్తువులు (భార. శాం. I. 85); వెలివృత్తము (భార. ఉ. II. 260); మొద.

ix. ము వర్ణాంత పదముల తుది మువర్ణమునకుఁ
బుంపులు కలిగిన రూపములు.

కొంచెపువారు (భార. ఉ. I. 14); కొంచెపునగవు (భార. శాం. II. 11); అవగాఢపుఁబొత్తు (భార. విరా. III. 32); చొక్కపు రక్కసి కులము (భాగ. VII. 254); చొక్కపుఁ గొమునకు (హరి. పూ. V. 280); తిరిసెంపుఁ బువ్వులు (భాస్క. యు. 1666); దెప్పరపుఁ జోటు (భార. భీ. I. 190); నవకంపుఁ దీవలు (భాగ. VIII. 267); నిద్దంపుఁ గెంజాయ మేను (భాస్క. యు. 796); పరుసంపు నడవడి (భార. ఉ. IV. 350); పొచ్చెపుమాటలు (హరి. పూ. II. 216); బలితంపు (భార. విరా. III. 55); బింకపు వానరులు (భాస్క. యు. 832); అడిబీరపుఁ దులువ (భార. ద్రో. IV. 184); బెట్టిదంపు విలు (భార. ద్రో. IV. 36); బెడిదంపు మాటలు (భార. భీ. I. 133); మువ్వంపుఁ దనులత (భార. విరా. II. 37); మాయపుఁ జోటి (భార. ద్రో. IV. 324); వెక్కసపు మద్యపానపు ... (భాగ. VI. 136); నెమ్మిపుఁ గ్రయ్య (భార. సౌ. II. 17);-'గారాము' నకు 'గారాబు' విశేషణ మగును: గారాబుపట్టి (భార. ద్రో. II. 289); గారాబు కొమునకు (హరి. పూ. V. 211); ఒకప్పుడు మువర్ణమునకు వుంపులు గలుగవు: అవ్విధంబు గెలువ దలంచెంబు (భార. విరా. II. 67); కావరమైన కీచకుఁడు (భార. విరా. II. 228); ప్రాయంబునాఁడు (భార. అను. V. 91); విన్నాణంబు తగులు (భార. ద్రో. IV. 262).

x. ఉదంతపదములకుఁ గలుగు వికారములు గల రూపములు.

కట్టలుక (భాగ. VII. 59); కట్టాయితంబు (భార. ద్రో. III. 166); కట్టెదురు (భార. ద్రో. III. 179); కట్టెఱ్ఱ (భార. ఆశ్ర. II. 42); నిట్టూరుపులు (భాగ. VI. 470); నిట్టూర్పు (భాగ. IV. 77); మొద.

xi. హలంతపదములపై ఇత్తుచేరి యేర్పడిన రూపములు.

తుఱుఁగలి (-ల్+ఇ) పెఱుఁగులు (భార. విరా. I. 294); క్రొవ్వాఁడి (-వాల్ = * -వాన్ = * వాణ్ +ఇ) దొడ్డనారసంబు (భార. భీ. III. 126); పిన్నటి (* = పిన్నల్ = * పిన్నట్+ఇ) నవ్వు (భార. ద్రో. IV. 72); చెన్నటి (= * చెన్నల్ = * చెన్నట్+ఇ) పల్కులు (భార. కర్ణ. I. 125); వాఁడి (భాగ. VI. 324); మేటిమగలు (= మేల్ = * మేట్+ఇ, భార. విరా. III.

168); మేటిపుణ్యము (సర్వ. మా. I. 89); మేటి విలుకానిన్ (భార. ద్రో. III. 78); నీ బోఁటి (పోల్ = * పోన్ = పోఁణ్ట్+ఇ) యీ కునక శ్రేణి (భాగ. II. 656); నను బోఁటి బాలస్వభావునకు (భార. విరా. I. 19); రాధేయు బోఁటి తులువలు (భార. ఉ. I. 86); అటువంటి (ప్రాకృతము. వల్ = *వన్ = *వణ్ట్ + ఇ; ౨౦. రఘు. శత. 5); నావంటి విమూఢ మానసులు (భాగ. IV. 801); ఇటువంటి (భాగ. VII. 383); నీవంటి (భార. శాం. II. 328).

xii. అందు, ఇందు, ఎందు, లపై 'ఉల' చేరినరూపములు.

అంద్దుల తామ్రశాసనాలు (S. I. I. IV. 279); ఇందుల సంకీర్తన శావ (S. I. I. IV. 280); ఇంద్దులస్థానపతులు (S. I. I. IV. 722); ఇందుల మానులు (S. I. I. 994); ఇందుల పహిండిగంట (S. I. I. IV. 1019); అందుల యిందుల విలుకాండ్రు (భార. ఉ. IV. 229); అందుల పరాకు (పాండు. IV. 49); మొద.

xiii. ఆ, ఏ, లపై నిత్తు చేరుట.

ఆయ్యాయి (హరి. పూ. V. 209);—ఇట్లే, ఆయాయి, ఆయ్యో, ఆయై; ఏయ్యేయి, ఏయ్యే; మొద.

xiv. ధాతువుపై నిత్తు చేరుట.

తని (* తను+ఇ) పండ్లు (భార. అను. I. 181); మిక్కిలినోము (భార. ద్రో. V. 382); మిక్కిలి తీర్థములు (భాగ. I. 301); లెక్కకు మిక్కిలి చుక్కలు (భాగ. VIII. 209); చిన్నారి పొన్నారి చెమట (వరాహ. VI. 52); వట్టి (వట్టు+ఇ) యుడివి (భార. ద్రో. V. 60); మొద.

viv. పరిమాణార్థకమగు 'ఎడు' వర్ణకము చేరిన రూపములు.

తూమెడువడ్లు (భార. అర. VI. 116); కుంచెడు (భార. అను. V. 211); మొద.

'పేరు' పై 'ఏ' చేరి 'పేరే' అని యగును (ఉ. హరి. I. 165);—ఈ 'ఏ' కారము క్రియాజన్య విశేషణములందు గాన్పించు 'ఏ' కారమే (చెప్పే, చేసే, మొద.) యై యుండును.

'ఏమ్' అను ప్రశ్నార్థకావ్యయముపై నిత్తుచేరి 'ఏమి' యను సర్వనామమును విశేషణమును గలుగును: ఏమి వాహనంబు నెక్కెను (భార. మా. I. 31); ఏమి సేట్లకుం జెదుటకు నొగ్గె (భార. ద్రో. III. 199); మొద.

ఆ త్రెంగుల రేఖ (భార. విరా. V. 67); విశఖపట్టనమున కోమటి (S. I. I. IV.) మొదలగు వానియందు 'వ' వర్ణముచేరి యాయా పదములకు

విశేషణత్వమును గల్పించుచున్నది. ఇట్టివానియందలి 'న' వర్ణము సత్వము విశేషణమును గల్పించునదని చెప్పవలెను. ఈ యత్వము సంబంధార్థక షష్ఠియందు తెనుఁగున బహువచనమునందును (రాముల, మొద.) కన్నడమున నేక బహువచనము లందును గానవచ్చుచున్నది. పైఁ జూపిన ప్రయోగములలో విశేషణములందు గానవచ్చు నిత్వమును సంబంధార్థక షష్ఠియందు తెనుఁగున నేకవచనమునఁ జేరునదే (రాముని, ఊరి, నీటి, మొద.) ఈ యకారేకారములే ధాతుజ విశేషణములందును గానవచ్చుచున్నవి: తెనుఁగు: చేయుచున్న, వేసిన; కన్నడము: మాడిద, మాడిల్పట్ట; తెనుఁగు: చేయని; కన్నడము: మాడద; మొద.

### తెనుఁగున విశేషణముల తర, తమ భావము.

సంస్కృతమున ఒకదానికంటె మఱియొకటి యెక్కువ, అన్నిటి కంటె నొకటి యెక్కువ, అను భావములు విశేషణపదములపై (i) తర; ఈయస్; (ii) తమ; ఇష, అను ప్రత్యయములను జేర్చుటవలనఁ గలుగును. ఈ ప్రత్యయములను తెనుఁగు విశేషణములపైఁ జేర్చుట లేదుగాని, వీనిలోని - తర ప్రత్యయము సంస్కృతము ప్రాబల్యమువలనఁ గొన్ని యాధునిక విశేషణములపైఁ గానవచ్చుచున్నది: చొక్కటమైన వేఁగుఁజుక్క పొడిచె (చంద్ర. భా.); బాలముద్దుం దెలిమావు లంగజాని తూపులఁ బోల మెత్తంబులు (విజ. I.); మొద. 'తరము' అను ప్రత్యయము తెనుఁగునఁ బ్రత్యేకపదముగఁ గూడ వ్యవహరింపఁబడుచున్నది: నీయందు వారియందుం, జేయంగల మానముల విశేషంబులఁ జిత్తాయత్తంబుగఁ జెప్పుము, నీ యెఱుఁగనియవియు లేవు నిక్కువుఁ దరముల్ (భార. ఉద్యో. IV. 218) = ఎక్కువ తక్కువలు; నరపుంగవులు గాని, నరపుంగవులుగాని తారతమ్య విచారణ ధర్మభృతులఁ (వసు. I.) = ఎక్కువ తక్కువలు విచారింపఁగా; అత్తఱి వేంకటాంద్రు యమునాంబు తరంగ పరంపరాకృతిఁ, ముత్తమైన సూనసముత్కరము గని (వసు. IV.) = పెద్దవి, అంతకంటెఁ బెద్దవి, అన్నిటికంటెఁ బెద్దవియగు మూఁడు తెనుఁగుల పందులను;—వీరు మధ్యనభుజశక్తిం దరము గారు (శ. హరి. IV.) = ఎక్కువవారు; తరము సొదాపుసీదాపు ధామమునకుఁ గరము పోలుపొందు దీని యంగముల కాంతి (నైష. III.); దీనికిఁ బూర్వమందున్న 'సాటి, సాటి' అను పదములను బట్టి శ. ర. కారుఁడు 'తరము' నకు 'సమానము' అని యర్థము చెప్పెను. కాని, యిందును 'ఎక్కువ' యనియే యర్థము చెప్పఁగాన వచ్చును. [illegible] వ్యవహారమున 'ఇది మనితరముగా ఉన్నది' = ఎక్కువ [illegible] [illegible] లగు [illegible] యున్నది. 'తరము' [illegible]

నలినదళేక్షణ రామా!' (రామదాసు కీర్తన); ఇట్లు చేయుట నీ యబ్బతరము కాదు; పెట్టెలు చేయుట కీకట్టె తరముకాదు. 'తరము' నకు తద్భవరూపము 'తలము': తలమే బ్రహ్మకునైన నిన్నగమహాత్త్వం బెన్న (మను. II).

ప్రాకృతమున - తర ప్రత్యయమునందలి 'త' వర్ణము పదమధ్యమునఁ బడి 'అ', 'య' లుగా మాఱును: ఉదా. తీక్ష్ణతర = మహా. తిక్ఖ అర; దృఢతర = జై. మహా. దఢయ ; భూయస్ (తర) = భుజ్జయరో (ఆయారంగ సుత్త 2, 8, 1, 18); మొద. కొన్ని యాదృచ్ఛిక విశేషణములందలి '-అరము, -అలము, -ఆరము, - ఆలము' అను ప్రత్యయములు సంస్కృత '-తర' ప్రత్యయమునుండి పుట్టియుండవచ్చును గాని, వాని '-త'రార్థము తెనుఁగున విస్మృతమై యున్నది: ఉదా. ఇంటరము = ఎక్కువ యిఱుకు; ఎచ్చరము=మిక్కిలి హెచ్చు; ఎత్తరము = మిక్కిలి యెత్తు; తీంట్ర (-ండ్ర) ము = తీక్ష్ణతరము; వేండ్రము = మిక్కిల వేఁడి; పెడసరము = మిక్కిలి పెడుసు;—ఉమ్మల (-ర) ము = ఉష్ణతరము; నిట్టలము = మిక్కిలి నిడుపు; ఓయారము = ఓజస్తరము; మిటారము = మిష్టతరము; మొదలయినవి.

'-తమ' ప్రత్యయము జాడ తెనుఁగునఁ గానరాకున్నది.

సంస్కృతమందలి '-ఈయస్,' '-ఇష్ఠ' ప్రత్యయము లంతమందుగల పదములనుండి పుట్టిన శబ్దములలో నేటి వ్యవహారమున 'కనీసము' అను పదము 'కనిష్ఠము' అను నర్థమున వాడఁబడుచున్నది. దీనిని కవులు వాడలేదు. ఇట్లే 'కనిష్ఠ' శబ్దము తెనుఁగు బ్రాహ్మణ స్త్రీల నోట 'కనికిష్ఠము' గా వినఁబడుచున్నది. 'జ్యేష్ఠుఁడు, కనిష్ఠుఁడు,' అను రూపములు 'అందఱికంటెఁ బెద్ద కొడుకు; అందఱికంటెఁ జిన్నకొడుకు' అను నర్థమున నున్నవి కాని, నలుగు రన్నదమ్ము లున్నపుడు మూఁడవ వానికంటె రెండవవాఁడు జ్యేష్ఠుఁడు, రెండవ వానికంటె మూఁడవవాఁడు కనిష్ఠుఁడు నని వ్యవహారమునఁ జెప్పకొందురు. పెద్దకూఁతురిని 'జ్యేష్ఠ' యనుట లేదు. 'జ్యేష్ఠ' 'జెష్ట, దెష్ట' లుగ వ్యవహారమున మాఱినది; 'దరిద్రురాలు' అని యర్థము; మగవారిని గూడ 'జెష్టవెధవ, దెష్ట వెధవ' అని తిట్టుట గలదు. 'వాఁడు బలిష్ఠుఁడు, అది బలిష్ఠము' అని వ్యవహారమునఁ గలదుగాని దానికి '-తమ' అను నర్థము లేదు. 'బలముగలవాఁడు, బలముగలది' అనియే యర్థము. 'పాపిష్ఠ' అను పదమున కిత్తుచేర్చి 'పాపిష్ఠి' అను పదమును 'పాపాత్మ' అను నర్థమున వాడుచున్నారు. 'గరిష్ఠ సామాన్య భాజకము. కనిష్ఠ సామాన్య భాజ్యము' అను పదములు నేటి బడులలో G. C. M., L. C. M., అను వానికి వాడుచున్నారు గాని, వాని యర్థము

గించునట్లు కాన్పింపదు. - ఈయస్, - ఇష్ఠ

ప్రత్యయములు చేరిన సంస్కృతపదములు మ తెవ్వియుఁ దెనుఁగునఁ బ్రచారములోనికి వచ్చినట్లు కాన్పింపదు.

-తర భావమును దెలుపుటకుఁ దెనుఁగున 'తక్కువ' యను నర్థము గల విశేషణమునై 'కంటె' అను పంచమీ ప్రత్యయమును జేర్చుట వాడుక: రామునికంటె లక్ష్మణుఁడు చిన్నవాఁడు; లక్ష్మణునికంటె రాముఁడు పెద్దవాఁడు:— ఈ సందర్భమున 'కంటె' కు మాఱుగ 'కు' ప్రత్యయమును జేర వచ్చును: రామునికి లక్ష్మణుఁడు చిన్న; లక్ష్మణునికి రాముఁడు పెద్ద;— తక్కువ, అంతకుఁ దక్కువ, అంతకంటెఁ దక్కువ;— తక్కువ, ఎక్కువ, పదములను జేర్చియు - 'తర' భావమును దెలుపవచ్చును: వీఁడు వానికంటె తక్కువ (ఎక్కువ) వయస్సు గలవాఁడు.

-'తమ' భావమును దెలుపుటకు 'లో, అందు' అను ప్రత్యయములు జాతివాచకపదము బహువచన రూపమునైఁ జేరును: జంతువులలో (-లందు) నేనుఁగు పెద్దది; జనులలో (-లందు) పండితుఁడు పూజ్యుఁడు; ఆవులలోఁ గత్తి యావు మేలు; మొద. 'అన్నిటి (అందఱి)కంటె' అను దానిని జాతివాచకపదము బహువచనరూపమునకుఁ జేర్చియుఁ '-తమ' భావమును దెలుపవచ్చును: జంతువు లన్నిటికంటె నేనుఁగు పెద్దది; జను లందఱికంటెఁ బండితుఁడు పూజ్యుఁడు; ఆవు లన్నిటికంటెఁ గత్తియావు మేలు; మొద. '-తమ' భావమును చాలాచాలా పెద్దది; ఎంతో పెద్దది; అంతకంటె పెద్దది మఱిలేదు; పెద్దది - అను రీతులుగా వ్యవహారమునఁ దెలుపుచుండుటయుఁ గలదు.

-తర, -తమ భావము లిట్లు సంస్కృతసంప్రదాయమునకు భిన్నముగఁ దెలుపుట ప్రాకృతభాషలయందే పొడసూపినది: శౌరసేని: తత్తో వి పిఅ త్తి = తతో ఽపి ప్రియ ఇతి (శాకుంతలము, 9, 10); పఢమదంసణాదో వి సవిసేసం పిఅదంసణో = ప్రథమ దర్శనాదపి సవిశేషం ప్రియదర్శనః (విక్రమోర్వశీ. 24, 1);- వీనిలో 'ప్రియతరఇతి,' 'ప్రియతరదర్శనః' అని సంస్కృత సంప్రదాయము ననుసరించి యుండవలెను. కావున -తర, -తమ భావప్రకటనము విషయమునఁ దెనుఁగున సంస్కృత సంప్రదాయము లేదన్న మాత్రముచేత తెనుఁగునకును సంస్కృతమునకును సంబంధము లేదని చెప్పఁ గూడదు; ఆ రెంటికిని ప్రాకృతములద్వారా సంబంధము కలదు.

# తొమ్మిదవు ప్రకరణము

## క్రియా ప్రకరణము.

ప్రాకృత భాషలయందు సంస్కృతమందలి రూపము లన్నియు నెట్లు మాఱినవో, ననేకార్థములం దుపయోగింపఁబడుచుండిన రూపము లెట్లేక రూపమును బొందుటచే మరల నా యా యర్థములను దెలుపుట కాధునికార్య భాషలయందు క్రొత్తప్రాతిపదికము లేర్పడి, సహాయక క్రియల మూలమున నా యా యర్థముల నెట్లు తెలుపుకొనవలసి వచ్చినదో యింతకుముందు సూచింపఁబడెను. ద్రావిడభాషలయందును నట్లే సంభవించినది. సంస్కృతమందలి ధాతువుల యాత్మనేపద పరస్మైపదభేదమును దశవిధవికరణ భేదములును, కర్మణ్యర్థమును దెలుపు విధానమును, చాలమట్టుకు 'ల' కారములును ప్రాకృతభాషల యవస్థనుండి నేటిద్రావిడభాషలతోఁ గూడిన యార్యభాషల యవస్థవఱకును నెన్నో లోపములు గలిగినవి. వాని నన్నిటి నిట వివరించి వ్రాయుటకుఁ దావులేదు. క్రియల నిర్మాణ విషయమున నాధునికార్యభాషలని చెప్పఁబడువానికిని ద్రావిడభాషలకును నెంతో సామ్యము గలదు. ద్రావిడభాషలు సంస్కృతభాషతో సంబంధించినవి కావని వాదించువా రిట్టి సామ్యమును గుర్తింపరు; గుర్తించినను నాచాయల నార్యభాషలు ద్రావిడభాషలనుండి యెరవు దెచ్చుకొన్న వందురు; లేదా, యా పోలికలు యాదృచ్ఛికములందురు; ద్రావిడభాషలయం దార్యభాషలతోఁ బోలికలుగల రూపములు వేఱువిధముగఁ గలిగినవని చెప్ప యత్నింతురు. వారీ రెండు వర్గములకును గల భేదములనుగూర్చియే యెక్కువగ నూఁది చెప్పుదురు. సరళదృష్టికి వాద మార్గము సమంజసముగ నున్నట్లు కానరాదు. ద్రావిడభాషలకును నార్య భాషలకును గొన్ని భేదము లున్నవనుమాట సత్యము; కాని, యా భేదము లొక యార్యభాషకును మఱియొక యార్యభాషకును గల భేదమువంటివే కాని, వేఱు గాదు. అట్టిభేదములకు హేతువులను నిరూపింపవచ్చును. ఈ విషయమున నిచట నింతకంటె నిరూపింపఁ బనిలేదు.

తెలుఁగునందలి యాచ్ఛిక ధాతువుల స్వరూపమునుగూర్చి ద్వితీయ ప్రకరణమున వివరింపఁబడియున్నది. తత్సమధాతువుల స్వరూపమునుగూర్చి పదునొకండవు ప్రకరణమునకు మూఁడవు ననుబంధముగఁ జేర్చిన 'యాంధ్రశబ్ద చింతామణి వ్యాసము' అను నధ్యాయమునఁ దెలుపఁబడినది.

## సకర్మకాకర్మక ధాతువులు

ద్రావిడభాషలయందు సకర్మకాకర్మక ధాతువులకు రూపమునందు భేదము కానరాదు; ధాతువుల సకర్మకత్వాకర్మకత్వములను వాని యర్థమును బట్టియే తెలిసికొనవలెను. తమిళమునందు సరళాక్షరములతో నంతమగు ధాతువులు సాధారణముగ నకర్మకములై యుండును; వానితుది సరళములకుఁ బరుషత్వమును ద్విత్వమును గల్పించి, వానిని సకర్మకములుగఁ జేయవచ్చును; ఆ సరళాక్షరములకుఁ బూర్వము ననునాసికమున్నయెడల నదియు లోపించును. ఈ విధానము తెనుఁగునఁ గొంతవఱకుమాత్ర మున్నది.

## ప్రేరణార్థక ధాతువులు

ప్రేరణార్థకధాతువులును నొకరీతి సకర్మకధాతువులే. ఇవి యేర్పడు విధానమునుగూర్చి చిన్నయసూరి చెప్పినదానికంటె నెక్కువవ్రాయ వీలు లేదు; కావున, నాతఁ డీ విషయమున రచించిన బాలవ్యాకరణ సూత్రముల నిచటఁబొందుపఱిచి యాయా రూపములఁగూర్చి వలసినయెడల లఘువ్యాఖ్యను మాత్ర మిచట వ్రాయుచున్నాను:

(1) క్రియా. 70. స్వార్థంబునకుం బ్రేరణంబునం ఇంచుక్కగు; 87. ప్రేరేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారంబునకగు: పంచు, పంపించు; వండు, వండించు; ఆవులించు, ఆవులింపించు; మొద.

(2) క్రియా. 71. రంజాదుల యించుక్ప్రకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారంబగు (రంజిల్లు) మొద. 'ఇల్లు' అంతమందుగల ధాతువులు యాత్మనేపదార్థకములై యకర్మకములై యుండును. వీనిపై 'ఇంచు'క్కు చేరదు. 72. ఇంచుక్కు పరంబగునపుడు రంజాదుల యించుక్కునకు లోపంబగు: రంజించు రంజింపించు, మొదలగు రూపములు కలుగవని యీ సూత్రము భావము. రంజాదులకు స్వార్థమున 'ఇల్లు' ను ప్రేరణార్థమున 'ఇంచు' ను చేరునని యీ సూత్రముల పిండితార్థము.

(3) క్రియా. 73. చుగాగమంబు బాహుళకంబున కసంయుక్త న, ల, డ, రాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగానగు: (చుగాగమము రానప్పుడు ఇంచుగాగమము వచ్చును.) పూను, పూనుచు, పూనించు; తేలు, తేలుచు, తేలించు; మగుడు, మగుడుచు, మగుడించు; కుదురు, కుదురుచు, కుదిరించు; విను, వినుచు, వినిపించు. బాహుళకంబుచేఁ గొన్నింటికిఁ జుగాగమంబు లేదు: అను, అనిపించు; తిను, తినిపించు, కను, కనుపించు, కానిపించు. (వీనిలో 'ఇంచుక్కు' తోడిరూపము లర్వాచీనము లయినట్లు కాన్పించును; అనిపించు, తినిపించు, కనిపించు, మొదలగు రూపములకు దొలుత 'అనుచు,

కనుచు' మొదలగురూపము లుండియుండవలెను; అట్టిరూపములు భాషనుండి లోపించినవి. కన్నడమున 'అనిను, తినిను, కాణిను' మొదలగు రూపములు ప్రేరణమునఁ గలవు.)

(4) క్రియా. 74. అట్లు పుగాగమంబు మాన్వాదులకగు. ('అట్లు' అనఁగా బహుళముగా నని యర్థము) మాను, మానుపు, మానుచు; మను, మనుపు, మనుచు; ('మానిపించు' అనియు రూపము గలదు; 'మనిపించు' అని యాధునికులు వాడుచున్నారు.)

(5) క్రియా. 75. చుక్పువర్ణంబులు పరంబగునపు డిత్వంబున కుత్వం బగు: బిగియు, బిగుచు; వడియు, వడుచు; మెలియు, మెలుచు; బిగియు, బిగుపు; తెలియు, తెలుపు; కలియు, కలుపు; ('వడియు' మొదలగునవి యువర్ణాంత ధాతువు లనుటకంటె ఇకారాంత ధాతువు లనుట యొప్పును. ఇతర ద్రావిడభాషలయందిట్టి యికారాంతధాతువులు గలవు; అందలి యకార మాగమాత్రకము. 'విడి+చు' అని యుండఁగా 'చు'వర్ణకము నుత్వము మూలమునఁ దత్పూర్వమందున్న యిత్వమున కుత్వము కలిగినది. చువర్ణాంత ధాతువులే లోలుతెఁ ప్రేరణార్థకములై యుండెడివి. అవి సకర్మకార్థమున స్థిరపడఁగా 'ఇంచు'క్పుత్తోడి ప్రేరణార్థక రూపములు మఱల నేర్పడినవి. వడియు, వడుచు, వడియించు; బిగియు, బిగుచు, బిగియించు, వ్యవహారము: బిగిపించు; బిగింపించు, మొద.

(6) క్రియా. 76. అట్లు చుక్పుగాగమంబు లడంగ్వాది మాయ్వాదుల కగు, వగుచో వాని కపవ్రాలు లోపించు: అడఁగు, అడఁచు, అడఁగించు; మాయు, మాపు, మాయించు; అడఁగు, కరఁగు, కలఁగు, నలఁగు, ఇత్యాదు లడంగ్వాదులు; మాయు, ఉడుగు, కడఁచు, కుడుఁచు, బిగియు, ఇత్యాదులు మాయ్వాదులు;- 'అగు' ప్రభృతు లుభయగణంబులు.- బాహుళకంబునం జేసి కొన్నింటి కించుక్, చుక్, పుగాగమంబులు మూఁడును గొన్నింటికందు యథాసంభవంబుగా రెండును, గొన్నింటికొక్కటియు, నగు నని యెఱుంగునది: అఁగు, అఁచు, అఁపు, అఁగించు; రేఁగు, రేఁచు, రేఁపు, రేఁగించు; పాయు, పాచు, పాపు; విఱుగు, విఱుచు; చూచు, చూపు; నేరుచు, నేరుపు; మీయు, మీపు; పేచు, పేపు; కలియు, కలుపు; తడియు, తడుపు; తెలియు, తెలుపు; ఇత్యాదు లెఱుంగునది.

(పై వానిలో పుగాగమము గలుగుటకు పూర్వమం దాధాతువులు చువర్ణాంతములై యుండవలెను. ఇప్పు డట్టి చువర్ణాంత రూపములు గల ధాతువులు కొన్ని లోపించినవి. ఉదా. 'మాయు' ధాతువునకు 'మాచు' అను రూపము లోపించినను 'మాపు' అను ప్రేరణ రూపము కలుగుట

కవకాశ ముండదని గ్రహింపవలెను. 'త్రాఁగు' ధాతువునకు 'త్రాఁగించు' అనునది ప్రేరణరూపము; కొన్ని ప్రాంతములందు 'తా(త్రా)వు' అను రూపమును గలదు. 'తాపించు' అను రూపము ప్రేరణమున వినఁబడుచున్నది. 'త్రాఁగు' నకు 'త్రాఁచు' అను రూపాంతరముండి యుండవలెను. లేకున్న 'తావు, తాపించు' అను రూపములు కలుగవు.)

(7) క్రియా. 77. ఇంచుక్, చుక్, పుగాగమంబులు పరంబు లగునవు డాగమాదేశలోపంబులు పెక్కు దెఱంగులం గానంబడియెడి.

అగు, కావించు; వచ్చు, రావించు, రప్పించు; (అగు, తుమున్నర్థక రూపము 'కా' + ఇంచు (వగాగమము) = కావించు; వచ్చు = *వర్, తుము న్నర్థక రూపము 'రా' + ఇంచు (వగాగమము) = రావించు; 'రప్పించు' అను రూపము కలుగుటకు '*రచ్చు' అను స్వార్థరూప ముండియుండవలెను. నొచ్చు, నొంచు, నొప్పించు:—'నొంచు' అను రూపము 'నొచ్చు' నకుఁ దుమున్నర్థక రూపమగు 'నోక్' పై 'ంచు' చేరుట వలన నేర్పడి యుం డును.—ఉందు, ఉనుచు, ఉంచు:-*ఉను ధాతువుపై చువర్ణముచేరి 'ఉనుచు, ఉంచు' లేర్పడిన వని చెప్పవచ్చును: ఎూ. ఉన్నె, మొద.—డిగు, డించు, డిగించు;—పెరుగు, పెనుచు, పెంచు (వ్యవ-పెరిగించు); రేఫమునకు నకారా దేశము;—తునుగు, త్రుంచు; నకారమునకు రేఫాదేశము, అద్యచ్చునకు లోపము; మునుగు, మునుచు, ముంచు; మొగుడు, మొగుడుచు, మొగుడ్చు, మొగుచు, మోడుచు, మొగిడించు; చొచ్చు, చొనుపు, చొప్పించు; *ధాతువు 'చొరు', రేఫమునకు నకారాదేశము; ... చినుఁగు, చించు, చింపు;—'చింపు' అను రూపము 'చించు' అను రూపము స్వార్థము నొంద౯ఁగా మరలఁ బ్రేరణ ప్రత్యయము చేరిన రూపము: త్రెగు, త్రెంచు, త్రెంపు, 'త్రెంచు' స్వార్థ కము కాఁగా మరల 'త్రెంపు' అను ప్రేరణరూపము కలిగినది. తిరుగు, త్రిప్పు; *తిరుచు, అను రూపముండినఁ గాని 'తిరుపు, త్రిప్పు' అను రూప ములు గలుగవు; చచ్చు, చంపు; 'చను' ధాతువుపై 'చు'వర్ణముచేరి యను నాసికలోపమును చకారమునకు ద్విత్వమును గలుగఁగా 'చచ్చు' అను రూప మేర్పడినది. 'చంపు' సకర్మక క్రియ యగును గాని, ప్రేరణ క్రియ కాఁజా లదు, కావుననే ప్రేరణమున 'చంపించు' అను రూప మేర్పడినది. నిలుచు, నిలు వు, నిలువరించు; '*నిలువడు' అను రూపముండినఁ గాని 'నిలువరించు' అనురూప మేర్పడదు; ఇట్లే 'పలవరించు' నకు స్వార్థమున 'పలవడు' అని యుండవలెను. కొను, కొలువు; 'కొనుట' ద్రావిడరూపము 'కొళ్'; 'కొలువు'లోని లకా రము పూర్వద్రావిడ ధాతువునుండి కలిగినది; పోవు, పుచ్చు ద్రావిడధాతువు [illegible] ప్రేరణ రూపము. 'పోగిడు'; ఇది [illegible]గున

"*పుగుచు' అయి, 'పుచ్చు'గ మాఱి యుండును; పనుచు, పంచు, పనుపు, పంపు, అను రూపములకు మూల ధాతువు *పను అను నందుండియుండవలెను. అనుచు, అంచు, అనుపు, అంపు, అనునవి '*అను' అను ధాతువునుండి కలిగి యుండును; *పను, *అను, ధాతువులకు 'ప్ర (ఆ)జ్ఞా' అనునది సంస్కృత మూలమై యుండును. వీనికి 'పోవు' ధాతువుతో సంబంధములేదు; ... అను ప్రయుక్తమగు పోవునకుం బుచ్చుమాత్రంబగు: మోసపోవు, మోసపుచ్చు, మొద.

(8) క్రియా. 78. అన్వాదుల కించుక్కు పరంబగునపుడు పుగాగమంబగు; మానునకు విభాషనగు: అను, అనిపించు; కను, కనిపించు; తిను, తినిపించు; విను, వినిపించు; (వీనికి 'అనుచు, కనుచు, తినుచు, వినుచు' అను రూపములు తొలుత ప్రేరణార్థకములై, పిమ్మట స్వార్థమునందు నిలువఁగా, వానికిఁ బై ప్రేరణరూపములు కలిగిన పిమ్మట 'ను' వర్ణాంత స్వార్థరూపములు ధాతువునుండి లోపించియుండును.)

(9) క్రియా. 79. అర్థాదుల కించుక్కు పరంబగునపుడు గుగాగమంబగు; అప్పాదులకు విభాషనగు: అర్థము, అర్థించు;- అర్థము, ఒర, చిత్తము, పంతము, పల్ల, లోఁగ, మట్టము, మేలిము. ఇత్యాదు లర్థాదులు;-అప్ప, అప్పగించు, అప్పించు; ('అప్ప' అనుటకంటె 'అప్పన' అని చెప్పుట మేలు; తుది న వర్ణమునకు లోపము.) అప్ప (న?), ఒప్ప (న?) పల్లము, కోపము, ఇవి యప్పాదులు.

(10) క్రియా. 80. అడు, ఓడు, కూడు, ల డకారంబునకుఁ జుక్కుపరంబగునపుడు రేఫంబగు: అడు, అరుచు, అడించు; ఓడు, ఓరుచు, ఓడించు; కూడు, కూరుచు, కూడించు;- వీనియందలి రేఫము పూర్వ మా ధాతువునందుండినదే; అఱు, *ఓఱు, కూఱు అనునవి అడు, ఓడు, కూడులకుఁ బూర్వ రూపములు.

(11) క్రియా. 81. చెడునకుం జుక్కుగాగమంబులును డా కలఘు రేఫంబు నగు: చెఱుచు, చెఱుపు.

(12) క్రియా. 82. పడునకుం జుక్కును డా కలఘురేఫంబు నగు: పఱుచు;— 'పాఱు' నకు 'పఱచు' అను నకార మధ్యమరూపము కలుగును.

(13) క్రియా. 83. శబ్దపల్లవంబగు 'పడు' న కించుక్కు విభాషనగు, నగుచో డాకు లఘురేఫంబగు: వెలువడు, వెలువరించు, వెలువఱుచు; చొప్పడు చొప్పరించు, చొప్పఱుచు; (నామములపై 'ఇంచు'క్కుచేరి కొన్ని నామ ధాతువు లేర్పడును: తత్సమములు: కరుణించు, అనుమానించు, మొద.

హుంకారించు, కేకరించు, ప్రక్కలించు, మొదలగువానిలో 'కృ' ధాతువునుండి కలిగిన 'కరించు, కలించు' అనునవి యుపధాతువులుగ నేర్పడినవి:—'ఆలకించు, ఆలించు' అను రూపములకు * 'ఆలు' అను రూప ముండి యుండవలెను. 'కించు' అనునది 'కరించు' నకు సంక్షేపరూపము; ఆలకించు, ఆలించు, లకర్మకములు; ప్రేరణరూపములు గావు.

(14) ప్రేరణంబునం దించుక్కు మీఁద నించుక్కు లేదు.— ఇట్లనుటం జేసి ప్రేరణార్థం బయిన యితరాగమంబు మీఁదం బ్రేరణార్థంచుగాగమం బగునని యెఱుంగునది: నొచ్చు, నొంచు, నొంపించు; చచ్చు, చావు, చంపించు. (ఇందు 'నొచ్చు, చచ్చు' లకర్మకము లనియు, నొంచు, చంపులు వాని సకర్మక రూపము లనియు, నొంపించు (నొప్పించు), చంపించు, లు ప్రేరణ రూపము లనియుఁ జెప్పవలెను.)

(15) నామముమీఁదంగాని ధాతువుమీఁదంగాని యించుక్కు చేరునప్పుడు తత్పూర్వాచ్చులు సాధారణముగఁ నిత్తులుగ మాఱును=కరుణ+ఇంచు= కరుణించు; ఇట్లే, కానుపించు, మొద.—అర్వాచీనాంధ్రమునందలి కలిగించు, మొదలగు రూపములకుఁ బూర్వాంధ్రమున 'కలుగించు' మొదలగు రూపము లుండెడివి.

## కర్మణ్యర్థము.

సంస్కృతమున ధాతువునై కర్మణ్యర్థ బోధకమగు 'య'వర్ణమును, దానిపై నాత్మనేపద ప్రత్యయములును చేరుటవలనఁ గర్మణ్యర్థము తెలుపఁబడును. ప్రాకృతమునం దీ కర్మణ్యర్థక క్రియలు తక్కిన క్రియల వలెనే మార్పు నొందుటచేతను, ఆత్మనేపద ప్రత్యయములు చేరు విధానము లోపించుటచేతను కర్తరి, కర్మణి ప్రయోగములందు భేద మంతరించెను. కావున, కర్మణ్యర్థమును దెలుపుటకు వేఱు ధాతువులు చేరవలసి వచ్చెను. ఈ విధాన మాధునికార్యభాషలయందు వ్యాపించినది. ఇట్టి విధానమే ద్రావిడ భాషలయందును నున్నది.

తెలుఁగున సాధారణముగ ధాతువుల తుమున్నర్థకాన్నంత రూపములపై 'పడు' ధాతువు చేరుటవలన కర్మణ్యర్థము తెలుపఁబడును: సత్యంబ పల్కంబడున్ (భార. అర. IV. 191); వాని రెంటి జయించినవాఁడు గాని యెందుఁ బరమ ధార్మికుఁడని యెన్నఁబడఁడు: (భార. అర. V. 42); ఇట్టికర్మణి ప్రయోగము కావ్యములందు గ్వాచిత్కముగ మాత్రమున్నది. పడు ధాతు వెల్లయెడలను కర్మణ్యర్థమును బోధించుట కుపయోగపడదు: తడిగిలంబడున్ (నిర్వ. VI. 56); మరలంబడునే (భార. శ. I. 317), మొదలగు వానియందు కర్మణ్యర్థములేదు.

దెబ్బలుతిను, దెబ్బలుపడు, ముగిసిపోవు, చల్లనగు, మొదలగు పలుకుబడులవలనను కర్మణిప్రయోగమువలన కలుగు నర్థము సిద్ధించును. అది నాచేత పగిలినది, అను రీతిగఁగూడ నిట్టి యర్థమును దెలుపవచ్చును. సర్వ సాధారణముగ ధాతుజ విశేషణముల మూలముననే కర్మణ్యర్థము తెనుఁగునఁ దెలుపఁబడుచున్నది: నేను చేయుచున్న పని = నాచే చేయఁబడుచున్న పని: నేను చెప్పినమాట = నాచేఁ జెప్పఁబడిన మాట; అతఁడు చేయు కార్యము=అతనిచే చేయఁబడు కార్యము; మొద.

## ఆత్మార్థకము.

ఒక కార్యమాత్మార్థము కలుగుచున్నదని తెలుపుటకు ధాతువులపై కొను ధాతు వనుప్రయుక్తమగును: చెప్పుకొను, కాచుకొను, మొద. ధాతువుల క్త్వార్థక రూపముల మీఁదను కొను ధాతువును జేర్పవచ్చును: చెప్పికొను, కాచికొను, మొద.

యుకారాంత ధాతువులు క్త్వార్థక రూపముల మీఁదనే యాత్మార్థమును దెలుపు 'కొను' ధాతువు చేకొను: చేసికొను, తీసికొను;—వ్యవహారమున 'యు' వర్ణమునకు 'సు' అనునది యాదేశమగును: చేసుకొను, తీసుకొను, మొద.

ఇంతవఱకును నాయా యర్థములందు ధాతువుల రూపము లెట్లేర్పడునో తెలుపఁబడినది. ఇఁక నాయా ధాతువుల యసమాపక క్రియారూపములును, సమాపక క్రియారూపములును గలుగు విధానమునుగూర్చి ముచ్చటింపఁబడును.

## అసంపూర్ణ క్రియారూపములు.

### I. ధాతుజ విశేషణములు.

(1) ధాతువుపై 'చున్న' అనుదానిని జేర్చుటవలన వర్తమానార్థక విశేషణము లేర్పడును: చేయుచున్న, కొట్టుచున్న, మొద. 'చున్న' అనుదానిలో శత్రర్థమును దెలుపు 'చు' వర్ణమే వర్తమానార్థమును దెలుపుచున్నది. 'ఉన్న' యనునది కేవల మనుబంధము. అది '*, ఉను+ఇ+న *=ఉనిన=ఉన్న' అను రీతి నేర్పడుటచే లిడర్థబోధక మగునుగాని లడర్థబోధకము కాదు: ఇల్లడయున్న (భాస్క. యు. 218); ఉంచియున్న (భార. ద్రో. V. 229); కొలువున్న (భార. అర. VII. 59); ఉన్నట్లు (భార. శాం. IV. 34); ఉన్నయందము (భార. అను. I. 178); ఉన్నద (భార. అర. VI. 336; VII, 20; విరా. II. 174; I. 51, 58; ద్రో. III. 151); మొఱకుచేసున్న తియ్యవండు మొనాఁడికొనిన నేర్పరియుంబోలె (భార. ద్రో. V. 248); నిల్చున్నవేళ

(భాగ. IV. 272); కొన్నిమొసల నిట్టి లిడర్థకరూపములను వర్తమాన, తద్ధర్మార్థములందును వాడఁటగలదు: ఉయున్నజనుల్ (భార. ద్రో. IV. 180); నూరేలనున్న వీరలోకము (భార. ద్రో. III. 179); పురవరముఁ జుట్టియున్న శరధిపోలె (నిర్వ. I. 50): కోకనూలున్న భంగి (భాగ. VI. 169); మొద.

-'చున్న' చేరునప్పుడు ధాతువున కెట్టి వికారమును గలుగదు. వ్యవహారమున 'తున్న, తూఉ (-వు)న్న' అనునవి చేరి వర్తమానార్థక విశేషణముల గును: చెప్పుతున్న, చెప్పుతూఉ (-వు)న్న; మొద. ఇవి చేరునప్పుడు 'చు, యు'వర్ణాంతధాతువుల చు,యుక్కులకు సకారమాదేశమగును: కొలుస్తున్న, తెస్తున్న, వస్తున్న; చేస్తున్న, తీస్తున్న. మొద. కొలుస్తూఉ (-వు)న్న, మొదలగు రూపములును గలవు. 'పోవు' ధాతువుపై 'తున్న' చేరునప్పుడు, దాని తుదివర్ణము నిత్యముగ లోపించును: పోతున్న, పోతూఉ (-వు)న్న.

(2) i. ధాతువుపై '-ఇన' చేర్పుటవలన భూతార్థక ధాతుజ విశేషణము లేర్పడును: అడిగినమాత్రన (భా. అను. II. 372); పిసుగిడిచిన క్రియన్ (భార. అర. VI. 303); గుజ్జులమరిన బంతి (భా. అను. II. 379); మొద.

ii. అగు, పోవు, ధాతువులపై 'ఇన' చేరునప్పుడు వాని తుదివర్ణము లులోపించును: అయిన, పోయిన; తెల్లనైనగి (భా. అ. IV. 201); ఇట్టులమైన తేజము (భా. అర. V. 225); మీఁదైనవాని (భా. అ. V. 155); అగ్గమైనలతి (భార. విరా. I. 54), పెనుమట్టమైన తోఁట (వరాహ. XII. 82;) మొద. ఆ నవాలుసు పోయినపాకలు (భార. ఉ. I 178); ఓడి పోయిన (భార. భీ. II. 71); పతిపోయినకాంత (భా. అను. I. 74); వట్టిపోయిన కానలు (భాస్క. యు. 760); దంశపోయినవారి (హరి. పూ. III. 182); మొద.

iii. యువర్ణాంత ధాతువులపై 'ఇన' చేరునప్పుడా యువర్ణమునకు సకారమాదేశమగును: ఎనసిన (భాగ. IV. 713); ఎలసిన (భార. అర. V. 81); ఏసిన (భార. విరా. III. 169); ఒలసిన (భా. అశ్వ. I. 64) కమిసిన (హరి. పూ. VI. 88; భీమ. II. 29); చేసిన (భా. ఉ. I 331; S. I. I. IV. 815; భార. విరా. II. 289); నాసిన (భాస్క. సు. 303); పూసిన (భార. ద్రో. III. 108); భ్రమసిన (రామకా. శత. 46); సుడిసిన (భాస్క. 1430); వలసిన (భార. అను. I. 105); వేసిన (చిత్రభా. శత. 69);

iv. 'య్యు' అంతమందుగల ధాతువులందలి ద్విత్వ యకారమునకు ద్విత్వ సకార మాదేశమగును. కొస్సిన పదములే (భాగ. VIII. 364); ఇట్లు. వఱసిన, డస్సిన, మొద.

v. లఘుపూర్వకములగు న, డ వర్ణము లందుగల ధాతువులపై 'ఇన' చేరునపుడు -'నిన,' -'డిన' లున్న, డ్డ, లుగ మాఱును: అన్న (భార. ఉ. II. 174); కన్న (భార. అర. V. 364); కొన్న (భార. శాం. I. 333); విన్న (భాగ. I. 19); చన్న (భార. విరా. III. 167); తిన్న (హరి. పూ. V. 196); ఇడ్డ (పాండు. II. 172); పడ్డ (భార. విరా. I. 183); ఇడ్డే, చెడ్డ, విడ్డ.-'తోడు' ధాతువునకు 'తోడిన' అని యగునుగాని యది 'తోడ్డ' యని మాఱదు.

vi. 'పుట్నిల్లు' (భాగ. VIII. 634) అను సమస్తపదమునందు 'పుట్టిన' 'పుట్న' అని మాఱినది.

vii. భూతార్థక ధాతుజ విశేషణములపై 'కంటె' వర్ణకము చేర వచ్చును: చేసినకంటెన్, చెప్పినకంటెన్, మొద.

(8). (అ) i. ధాతురూపమే తద్ధర్మార్థక ధాతుజ విశేషణముకూడ నగును. దానిపై నచ్చు పరమగునపుడు నగాగమము గలుగును: ఎరవగువారు (భార. విరా. I. 188); అంతెపుసంతికు (భార. విరా. III. 67); నెఱను నోనాడునవియు (భార. విరా. III. 162); నిప్పులురలు చూపులు (భార. ద్రో. I. 156); క్రొన్నెలయు పూఁగొమ్మలు (భాగ. VIII. 89); ఏర్చుబవరము (భార. ఉ. IV. 227); ఇఱుకొత్తు చిత్తంబులు (భార. విరా. II. 238); కాయ పండు తిను వన్యమృగంబులు (భాస్క. కి. 309); ఇంతికు నేర్చు నీకు (భార. విరా. I. 21); మంచువేసవి (భాగ. IV. 648); మ్రొగ్గు నేనుఁగులు (భార. అశ్వ. I. 8).

ii. కర్మధారయ సమాసమునఁ దద్ధర్మార్థక ధాతుజవిశేషణములపైఁ బరుషములు పరమగునపుడు నుమాగమ మగును: వాలాయుం జూపులు (భాగ. VIII. 400); చెడుందెరువు (భార. ఉ. III. 344), మొద.

iii. తద్ధర్మార్థక ధాతుజవిశేషణములపై 'కొఱకు, పొంటె, కంటెఁ అను ప్రత్యయములు చేరుటయుఁ గలదు: జరుగనీకుండుకొఱకు (భాగ. IV. 31); చేయుకొఱకు (భాగ. I. 238; IV. 581); పేరడఁగించు పొంటెన్ (హరి. ఉ. I. 40); హితమొనర్చు పొంటెన్ (హరి. పూ. VI. 64); జడివట్టు పొంటెన్ (హరి. పూ. VII. 160); ఋణమునీగుపొంటెన్ (హరి. ఉ. I. 94); తోవాడుకంటెన్; ఒనర్చుకంటెన్ (హరి. పూ. VIII. 67); కాంచుకంటెన్ (భార.అర. V. 349); చనుదెంచుకంటెన్ (భాస్క. యు. 1290); చెడు కంటెన్ (హరి. పూ. V. 219); మొద.

(ఆ) ధాతువుపై 'ఎడు, ఎడి' వర్ణకములు చేరియుఁ దద్ధర్మార్థక ధాతుజ విశేషణము లేర్పడును; ఉరిపడు రెడునది పంక్తికంఠనగరు (భాస్క. యు. 468);

నాకడుపు చల్లనయ్యెడు నాకారముతో (హరి. ఉ. X. 216); పులుఁగుఁద్రాటఁ బట్టి యలయించి యాడెడు బాలునట్లపోలె (భార. ద్రో. III. 278); గోఁతియ నత్తెడు పులి (భార. శాం. VI. 229); ఒప్పెడుమేను (భార. విరా. I. 92); ఒఱగెడివి (భాగ. షి. II. 213); కావఁగఁజాలెడివారికి (భాస్క. యు. 258).

(3) ధాతువుపై 'వ', 'వటి' అనునవి చేరియుఁ దద్ధర్మార్థక ధాతుజవిశేషణములుగ వ్యవహారమునందును, నర్వాచీన కావ్యములందును, ప్రాచీనశాసనములందును గానవచ్చుచున్నవి: అడిగే యూనక్తి (ఒం. రఘు. శత. 54); అడిగే విద్యకు (ఒం. రఘు. శత. 18); భవచ్చరణం బనే మరుత్తరువున (దాశ. శత. 50); శ్రీరామా యనే మాట (ఒం. రఘు. శత. 47); కొలిచే దిక్కు వగలేకనే (దేవకీనం. శత. 42); చేసేగరిమ (ఒం. రఘు. శత. 11); తను చేసేవెల్ల (ఒం. రఘు. శత. 77); కీర్తనచేసే మతిలేదు (ఒం. రఘు. శత. 34); నాపాలి పాపాలిఁ బాఱఁదోలే నారసింహా (ఒం. రఘు. శత. 29); లోక దూరుఁడని పల్కే దెల్లు (ఒం. రఘు. శత. 35); ఇలుంబుట్టిన నేమిచ్చు (ఒం. రఘు. శత. 78); మందటోయుఁ డిడి వచ్చే పొత్తు (ఒం. రఘు. శత. 66); నండే నేర్పులఁ జొక్కునీతుల పిచుల్ వత్తిల్లనే (దేవకీనం. శత. 18); కొసివేసే తటిన్ (ఒం. రఘు. శత. 48); విహరించేతఱికి (దేవకీనం. శత. 39).

ఆరగించే అట్లు (S. I. I. IV. 282); ఆరగిచ్చే అమృతపడి (S. I. I. IV. 282); చేసుకుండే (S. I. I. V. 874); నడచే (S. I. I. VI. 695); వేంచేశివుండే (S. I. I. V. 874); చెల్లే (S. I. I. VI. 695); చెల్లివచ్చే (S. I. I. IV. 279); నడపుక వచ్చేయట్లు; ఆగివం కేసేప్పట్టు; వేంచేశేటప్పు డల్లాను (S. I. I. IV. 280); చెల్లివచ్చేమడి (S. I. I. V. 874); అనే (టి) (S. I. I. VI. 79); అనే టటుష్టువంటి, ఉద్భవించి నఘువంటి; కలఘువంటి (S. I. I. VI. 79); వుండేటటుగాను (S. I. I. IV. 280); చెల్లేటి, అనేటి (S. I. I. IV. 802); చెల్లేటి (S. I. I. IV. 803); వేంచేశేటందుకు, విన్నపం చేశే, పంచుకొనే టట్టు (S. I. I. V. 874); నడపుక వచ్చేటందుకు (S. I. I. IV. 280), మొద.

పట్టిటి - వట్టేటి (S. I. I. VI. 752); గుగ్గిలము పట్టె కొఱకై (S. I. I. V. 529) వాయించిటి (S. I. I. VI. 1053); పెట్టిటి (S. I. I. V. 1025);—ఇవి ప్రాయస కాని తప్పులై యుండును.

(4) ధాతువు తుమున్నర్థక రూపమగు అన్నంత క్రియపై 'కల' అను దానిని చేర్చుట వలన నొకప్పుడు భవిష్యదర్థక ధాతుజ విశేషణ మేర్పడును: చేయుంగల (భార. ఉ. IV.2 18); మొద. నేఁడు బాబుల వక్కణయులో 'అనే వనునా దినముల వేసి చేయుంగల విన్నపములు' అని వచ్చును 'కల' భవిష్య

దర్థమున వాడఁబడుచున్నది. 'కల' అను రూపమెట్లు సిద్ధించినదో చెప్పుట కష్టము; అది "*" 'కలు' ధాతువువై సంబంధార్థమునఁ జేరు 'అ' కారము చేరుటవలన నేర్పడి యుండునేమో. 'కల' అనుదానికి వివిధార్థములు గలవు.

(i.) కలిగిన: పేరుగల యట్టిమగఁడు (భార. విరా. V. 13); ఉత్తమాంగము గలందులకు ఫలంబు (నర్స. మా. III. 88); పెంపుగల యుల్లము (భార. విరా. I. 92); పెంపునఁగల మానికంబు (హరి. పూ. VII. 41); మీటుగల రాజ రథికులు (భార. ఉ. IV. 407); మొద. (ii.) ఉన్న: కలట్లు (భార. శాం. IV. 28); ఆయువు గలంతకాలము (భార. ఉ. IV. 895); దండిమగల కలనిజంబు (భార. ఉ. IV. 258); మొద. (iii) వ్యాపించిన: మిన్ను గలయంతయు (భార. ద్రో. III. 152); మొద. (IV) పడసిన, పొందిన: పేరుగల యూళులు (భార. శాం. II. 356); పేర్కొల సంయమీంద్రతతి (హరి. పూ. I. 114); (v.) ధనముగల: కలవాఁడు = ధనముగలవాఁడు (భార. శాం. V. 278); మొద. ఇట్టి సందర్భమునుబట్టి యర్థమును గ్రహింపవలెను.

(6) వ్యతిరేకార్థక ధాతుజ విశేషణములనుగూర్చి వ్యతిరేకార్థ మను షక్రింద ముచ్చటింపఁ బడినవి.

## II. క్త్వార్థకములు.

సంస్కృతమునఁ ధాతువులపై 'త్వా' అను ప్రత్యయమును చేర్చుట వలన భూతకాలి కాసమాపక క్రియారూపము లేర్పడును. ఈ ప్రత్యయము ధాతువు నంతమునఁగల హల్లుతోఁ గలిసినప్పుడు వివిధములగు మార్పులు గలుగుచుండును: ఉదా. ను - నుత్వా; గమ్ - గత్వా; వస్ - వసిత్వా; బన్ధ్- బద్ధ్వా; దృశ్ - దృష్ట్వా; మొదలగునవి. కొన్ని ధాతువులందలి చకార జకారములతోఁ గలిసి 'త్వా' 'క్త్వా' గా మారును: ముక్త్వా, త్యక్త్వా, భుక్త్వా, మొద. ఇట్టి రూపములను బట్టియే తెనుఁగున భూతకాలి కాసమాపక క్రియలకు క్త్వార్థకము లని వైయాకరణులు పేరిడిరి. ధాతువునకుఁ బూర్వము విసర్గము చేరునపుడు 'త్వా' స్థానమున 'య' చేరును: విభజ్య, సంత్యజ్య, అనుభూయ, మొద. వేదమునందు 'త్వీ, త్వానమ్' మొదలగు ప్రత్యయములును నీ యర్థమందే చేరును.

ప్రాకృతములం దీ ప్రత్యయములు వివిధ వికారములను బొందినవి. 'త్వా' = త్తా; త్వానమ్ = త్తాణం, తుఆణం, తుఆణ, తూణ, దూణ, ఊణ; త్వీ = త్తి, ప్పి; య = ఇఅ, ఇ; త్య = చ్చ;-వీనిలో ద్రావిడ భాషలను సంబంధించిన క్త్వార్థక ప్రత్యయములు 'దు, ఇ' అను రెండు గలవు. వీనిలో'దు' అనునది 'త్తా' నుండికాని, 'దూణ' నుండికాని కలిగియుండవచ్చును. తెనుఁగు లోని 'కావున, కాన' యనుదానియందుమూలము 'ఊణ' అను ప్రాకృత

ప్రత్యయమింకను వినవచ్చుచున్నది. ఈ రూపములు సం. కృత్వా = ప్రా. కాఊణ, అను రూపమునుండి కలిగినవి. 'దు' అను ప్రత్యయము తెనుఁగునందు తప్పఁ దక్కిన ద్రావిడభాషలయం దున్నది. అది యుత్తరార్యభాషల యందును గలదు. 'ఇ' ప్రత్యయము ప్రాకృతమునందేకాక (పరిహరి = పరిహరించి; పసరి = ప్రసరించి, చలి = చలించి; కోపిరి = కోపించి; మారి = చంపి; సంచారి = సంచరించి; విచారి = విచారించి; కరి = చేసి; ముత్తి = విడిచి; మొద.) యనేకములగు నుత్తరార్య భాషలయందును ద్రావిడభాష లన్నిటి యందును గూడఁగలదు. తెనుఁగున క్త్వార్థమందు 'దు' 'చ్చ' వర్ణములు లేవు; అవి కొన్ని ధాతువులయందు లీనముకాఁగా, నట్టి క్రొత్తరూపములే మఱల ధాతువులుగ నిలిచినట్లుకాన్పించును. ఆ క్రొత్తరూపములపైఁ గ్త్వార్థమునఁ దెనుఁగున 'ఇ' వర్ణముచేరి క్త్వార్థమును దెలుపుచున్నది. చు, చ్చు, ంచు; జు, జ్జు; ంజు; టు, ట్టు, ంటు, డు, డ్డు, ండు; తు, త్తు, ంతు, దు, ద్దు, ందు లతో నంతమగు తెనుఁగు ధాతువులలోఁ గొన్ని యిట్లె యేర్పడియుండును: పోల్+దు = తమి. పోన్దు, పొన్దు; తెలుఁగు: పోలు, పొందు;—ఇట్లే యితరరూపములకు నూహించుకొనవచ్చును.

i. తెనుఁగున క్త్వార్థమున 'ఇ' యను ప్రత్యయముచేరును: చిక్కఁడించి (భార. ద్రో. II. 38), అడిగి (హరి. పూ. VIII. 143); అలంకరించి (హరి. పూ. IV. 26); అంది (భార. ఉ. III. 144); అధిక్షేపించి (హరి. పూ. V. 229), మొద.

ii. తెనుఁగున 'యు' కారాంతధాతువులకు సంస్కృత మూలములందు సకార ముండెను. వానిపై 'ఇ, ఎ' వర్ణములుచేరినపు డా 'స'కారము మఱలఁ దలచూపుట సంభవించెను: అరిసి (భార. విరా. I. 306); క్రిక్కిఱిసి (భాగ. VI. 174); ఎగసి (భాస్క. యుం. 383); ఎలసి (భార. విరా. I. 25); ఏసి (భార. భీ. I. 278); ఒడిసి (భార. అర. VI. 247), ఒలసి (భార. అను. V. 353); కవిసి (హరి. పూ. IX. 72); కాసి (కవిక. IV. 12); కురిసి (భార. ఉ. IV. 335); క్రుస్సి (హరి. పూ. VI. 28); క్రొస్సి (భార. అర. IV. 368) గీసి (కవిక. III. 21); చెవసి (భార. అర. V. 367); చేసి (భార. విరా. II. 27); త్రోసి (భాగ. IV. 134); తెలిసి (భార. విరా. III. 169); తవిసి (భార. భీ. II. 342); నవసి (భార. అర. VI. 111); పొవిసి (భార. అర. VI 111); నెగసి (భాస్క. యుం. 554); నోసి (భార. అర. V. 368); పడిసి(భార. ఉ. III. 254); పాసి (ఉ. హరి. II. 97); పేసి (భార. శకుం. పరి. III. శ్లో. 48); పోసి (భార. కర్ణ. III. 287); బలిసి (భార. భీ. III. 274); [illegible] (భార. [illegible] I. [illegible]); [illegible] ([illegible] I. 70); [illegible] ([illegible] I. [illegible]); [illegible]

(భాస్క. యు. 78); రోసి (భార. అర. IV. 382); విడిసి (భార. ఉ. III. 146); విరిసి (భార. విరా. II. 359;) మొద.

iii. అవు, పోవు, ధాతువులు రెండును సంస్కృత 'భూ' ధాతువునుండి యే కలిగియుండును. అపభ్రంశము: అఉ; మహారాష్ట్రి: భో; పైశాచీద్రావిడము: పో; అఉ+ఇ = అఇ = అయి; పో+ఇ = *పోఇ, పోయి.

iv. కొన్ని ధాతువులు క్త్వార్థక రూపములలో మాత్రము నిలిచి కేవలావ్యయము లయినవి: ఒత్తిలి = ఎక్కువగా (భాగ. VI. 166); ఓహరిసాహరి = అపహృత్య సంహృత్య (భార. విరా. III. 164); కనుకని (భాస్క. బాల. 144); మఱి (భాగ. I. 6క); మిక్కిలి గడుకొన్న (భాస్క. యు. 1682); మొద. ఓర్చిన మఱి కాక (భార. అర. VI. 72); అనుదానిలో 'మఱి' అను క్త్వార్థకరూపము విశేష్యత్వమును బొందినట్లు గానవచ్చును.

v. 'మిక్కిలి' అనునది 'మిక్కిలు' అను ధాతువునకు క్త్వార్థకరూపము. దానిని విశేషణముగను మిక్కిలి యన్ను. [ఇక్షే, పూలిచెఱుకు కిగ్గిలి పుట్టెండు నేల(S. I. I. V.1058); చిన్నారి పొన్నారి సురభూజమూ (రామతా.శత.54); చిన్నారిపొన్నారి చిఱుత కూకటినాఁడు (కాశీ. I. 14); మొద.;] విశేష్యము గను (మిక్కిలియై - భాగ. విరా. V. 84); అవ్యయముగను (మిక్కిలి యే కాంతిపుఁ బని (కళా. IV. 150); వాడఁబడును. 'మిక్కిలి' ద్రుతాంతము గను వాడఁబడినది (భాగ. V. ii. 142).

vi. 'తొడుగు' ధాతువుపై క్త్వార్థక 'ఇ'వర్ణము చేరునపుడు దానితుది 'గు' వర్ణము వైకల్పికముగ లోపించును; లేదా, 'తొడు' అనునదియే ధాతువనుకొనవచ్చును. తొడి (భార. విరా. III. 188; IV. 34; V. 317). మొద.

vii. 'వెలువడి' అనుటకు 'వెలుడి' అని రూపాంతరము గలదు (శాంతి. VI. 282); వెలుడెన్, వెలుడున్, వెలుడక, వెలుడుచున్, మొదలగు రూపములు లేవు.

viii. కొన్ని ధాతువుల క్త్వార్థకరూపములకు సందర్భమును బట్టి యర్థవిశేషములు గలుగుచుండును:—

అను: పెండ్లికని పిల్వఁబంచినన్ (భాగ. భార. ఉ. I. 42); తనకనిపెట్టిన కీడము (భార. ఉ. III. 250); ఏమనికర్ణునిఁ గావఁబనిచె (భార. ద్రో. IV. 207); తన కని యేమియు ననుపక (భార. ద్రో. II. 205); తోడుపడుట కని (భార. నిర్వ. VI. 124); కావుకావురని (హరి. పూ. V.); మియావు మియావనచు (భాగ. III. 848); హాహాహాయని చలివేళ (భాగ. IV. 648).

ప్రత్యయమింకను వినవచ్చుచున్నది. ఈ రూపములు సం. కృత్వా = ప్రా. కాఊణ, అను రూపమునుండి కలిగినవి. 'దు' అను ప్రత్యయము తెనుఁగు నందు తప్పఁ దక్షిణ ద్రావిడభాషలయం దున్నది. అది యుత్తరార్యభాషల యందును గలదు. 'ఇ' ప్రత్యయము ప్రాకృతమునందేకాక (పరిహరి = పరిహరించి; పసరి = ప్రసరించి, చలి = చలించి; కోపిరి = కోపించి; మారి = చంపి; సంచారి = సంచరించి; విచారి = విచారించి; కరి = చేసి; ముత్తి = విడిచి; మొద.) యనేకములగు నుత్తరార్య భాషలయందును ద్రావిడభాష లన్నిటి యందును గూడఁగలదు. తెనుఁగున క్త్వార్థమందు 'దు' 'చ్చ' వర్ణములు లేవు; అవి కొన్ని ధాతువులయందు లీనముకాఁగా, నట్టి క్రొత్తరూపములే మఱల ధాతువులుగ నిలిచినట్లుకాన్పించును. ఆ క్రొత్తరూపములపైఁ గ్త్వార్థమునఁ దెనుఁగున 'ఇ' వర్ణముచేరి క్త్వార్థమును దెలుపుచున్నది. చు, చ్చు, ంచు; జు, జ్జు; ంజు; టు, ట్టు, ంటు, డు, డ్డు, ండు; తు, త్తు, ంతు, దు, ద్దు, ందు లతో నంతమగు తెనుఁగు ధాతువులలోఁ గొన్ని యిట్లే యేర్పడియుండును: పోల్+దు = తమి. పోన్దు, పొన్దు; తెలుఁగు: పోలు, పొందు;—ఇట్లే యితరరూపము లకు నూహించుకొనవచ్చును.

i. తెనుఁగున క్త్వార్థమున 'ఇ' యను ప్రత్యయము చేరును: చిక్కఁడించి (భార. ద్రో. II. 38); అడిగి (హరి. పూ. VIII. 143); అనుకరించి (హరి. పూ. IV. 26); అంచి (భార. ఉ. III. 144); అధిష్ఠించి (హరి. పూ. V. 229); మొద.

ii. తెనుఁగున 'యు' కారాంతధాతువులకు సంస్కృతి మూలము లందు సకార ముండెను. వానిపై 'ఇ, ఎ' వర్ణములు చేరునపు డా 'స'కారము మఱలఁ దలచూపుట సంభవించెను: అరసి (భార. విరా. I. 306); క్రక్కెసి (భార. VI. 174); ఎగసి (భాస్క. సుం. 358); ఎలసి (భార. విరా. I. 26); ఏసి (భార. భీ. I. 278); ఒడిసి (భార. అర. VI. 247); ఒలసి (భార. అను. V. 353); కవిసి (హరి. పూ. IX. 72); కాసి (కవిక. IV. 12); కురిసి (భార. ఉ. IV. 335); క్రుస్సి (హరి. పూ. VI. 28); క్రొస్సి (భార. అర. IV. 368) గీసి (కవిక. III. 21); చెనసి (భార. అర. V. 367); చేసి (భార. విరా. II. 27); త్రోసి (భార. IV. 184); తెలిసి (భార. విరా. III. 169); తవిసి (భార. భీ. II. 342); నవసి (భార. అర. VI. 111); పొవిసి (భార. అర. VI 111); నొగసి (భాస్క. సుం. 554); నోసి (భార. అర. V. 36); పలిసి (భార. ఉ. III. 254); పాసి (ఉ. హరి. II. 97); మేసి (భార. శకుం. ... III. ... 48); పోసి (భార. కర్ణ. III. 267); బలిసి (భార. భీ. III. 276); ... (భార.

(భాస్క. యు. 78); రోసి (భార. అర. IV. 382); విడిసి (భార. ఉ. III. 146); విరిసి (భార. విరా. II. 359;) మొద.

iii. అవు, పోవు, ధాతువులు రెండును సంస్కృత 'భూ' ధాతువునుండియే కలిగియుండును. అపభ్రంశము: అఉ; మహారాష్ట్రి: భో; పైశాచీద్రావిడము: పో; అఉ+ఇ = అఇ = అయి; పో+ఇ = *పోఇ, పోయి.

iv. కొన్ని ధాతువులు క్త్వార్థక రూపములతో మాత్రము నిలిచి కేవలావ్యయము లయినవి: ఒత్తిలి = ఎక్కువగా (భాగ. VI. 166); ఓహరిసాహరి = అపహృత్య సంహృత్య (భార. విరా. III. 164); కనుకని (భాస్క. బాల. 144); మఱి (భాగ. I. 68); మిక్కిలి గడు తెస్స (భాస్క. యు. 1682); మొద. ఓర్చిన మఱి కాక (భార. అర. VI. 72); అనుదానిలో 'మఱి' అను క్త్వార్థకరూపము విశేష్యత్వమును బొందినట్లు గానవచ్చును.

v. 'మిక్కిలి' అనునది 'మిక్కులు' అను ధాతువునకు క్త్వార్థకరూపము. దానిని విశేషణముగను మిక్కిలి కన్ను. [ఇట్లే, పూలిచెఱువు కిగ్గిలి పుట్టెండు నేల(S. I. I. V.1058); చిన్నారి పొన్నారి సురభూజమా (రామతా.శత.64); చిన్నారిపొన్నారి చిఱుత కూకటినాఁడు(కాశీ. I. 14); మొద.;] విశేష్యముగను (మిక్కిలినై - భాగ. విరా. V. 84); అవ్యయముగను (మిక్కిలి యే కాంతిపుఁ బని (కళా. IV. 150); వాడఁబడును. 'మిక్కిలి' ద్రుతాంతముగను వాడఁబడినది (భాగ. V. i. 142).

vi. 'తోడుగు' ధాతువుపై క్త్వార్థక 'ఇ'వర్ణము చేరునపుడు దానితుది 'గు' వర్ణము వైకల్పికముగ లోపించును; లేదా, 'తోడు' అనునదియే ధాతువనుకొనవచ్చును. తోడి (భార. విరా. III. 188; IV. 34; V. 317). మొద.

vii. 'వెలువడి' అనుటకు 'వెలుడి' అని రూపాంతరము గలదు (శాంతి. VI. 282); వెలుడన్, వెలుదున్, వెలుడక, వెలుదుచున్, మొదలగు రూపములు లేవు.

viii. కొన్ని ధాతువుల క్త్వార్థకరూపములకు సందర్భమును బట్టి యర్థవిశేషములు గలుగుచుండును:—

అను: వెండ్లి కని పిల్వఁబంచినన్ (భార. భార. ఉ. I. 42); తనకనివెట్టిన పీఠము (భార. ఉ. III. 250); ఏమనికర్ణునిఁ గావఁబనిచె (భార. ద్రో. IV. 207); తన కని యేమియు మనువక (భార. ద్రో. II. 205); తోడువడుట కని (భార. విర్వ. VI. 124); కావుకావురని (హరి. పూ. V.); [illegible]

[illegible] (భాగ. III. 348);

(భార. అర. VI. 8); నీ దృష్టికి నెక్కన్ = ఎక్కునట్లు (భార. విరా. 279); చూపఱకెంతయు వెక్కసపడన్ = వెక్కసపడునట్లు (భార. విరా. 82); ఇ.

(2) ధాతువు సూచించుకార్యము జరుగుచుండఁగా : పొంచియుండన్ (భార. ద్రో. I. 294); కోల్తలసేయన్ (భార. ద్రో. I. 42); మేనులు దూలాడన్ (భార. విరా. V. 184); మొగంబులఁ గోపంబుముడివడన్ (భాస్క. మం. 212, 482); కిన్నరాంగనయూడిగెములుసేయన్ (ప్రభా. IV. 89); మొద.

ఇట్టి యర్థమున శత్రర్థకరూపములపై 'ఉండన్' అనునది చేరుటయుఁ గలదు: కోర్కులు సిత్తుముత్తాడుచుండన్ (భార. విరా. II. 85); కరుణయు ఖేదంబును బిరిగొనుచుండన్ (భార. విరా. I. 150); మన మురియాడుచుండన్ (భార. విరా. II. 102); సల్లాపంబులు సెల్లుచుండన్ (భార. ఉ. IV. 102); పెంపుమీాఱంగ ధాత్రిఁ బాలింపుచుండన్ (మను. I. 84); మొద.

(3) భావార్థమున: ఈ యాదేశం బన నేల (మను. I. 71); సిద్ధులొండె విద్యాధరులొండెఁ గావలయు (హరి. పూ. IX. 22); కర్మమూమాఱు గజ మెక్క కంతదూరన్ = దూరుట (సిం. నార. శత. 66); వారిఁగాన్పనుగడింది = కాంచుట (భార. విరా. III. 99); ఇయ్యెడ కేఁగుదేవలయు ఁబవనిఁ బూని (భార. విరా. II. 40); ఏలచెల్ల నేర్చు (భార. ఉ. II. 25); తలఁచగు కందంబుఁ జూడఁదగునా హరికిన్ (భాగ. VIII. 257); తగు నీకేమనిపల్కనన్ (నిర్వ. VII. 91); దీని సైరింపఁదగు (హరి. పూ. VII. 201); నా ప్రతికూల దుర్లలితవాక్యంబుల్ సహింపందగున్ (భార. అర. VII. 202); ఇదుమ గుదువ వలసె (భార. విరా. II. 225); అతనికిఁ బడవలసె (భార. భీ. I. 59); చావలసె (మా. I. 109); ఏండ్లగవన బుద్ధిదిగనన (సింహా. నార. శత. 14)—ఇందు ఎగవనన్, దిగనన్, అనురూపములు భావార్థక విశేష్యత్వమును బొందుచున్నవి.

(4) 'తుమున్' న్నర్థమున: తిరుగుచుండఁగఁ గారణమేమి (సర్వ. మా. II. 50); నిముఁబోగడ నెంతవారము (భాగ. VIII. 229); దాని పొనుసనన్ (భార. అశ్వ. II. 14); తప్పిపోవరాదు (భార. శాం. III. 204); చాలము (S. I. I. VI. 1098); ఎవ్వరికైనఁ జేరఁబోర నెన్నడురాని (హరి. పూ. VII. 89); మొద.

(5) క్త్వార్థమున: ఓటూరన్ = ఓటూరి (భార. భీ. II. 407); క్రుందారన్ = క్రుందారి (భార. సా. I. 201); మీాపదంబులానన్ (భాగ. VII. 176); కలగొనన్ = కలగొని (భార. సా. II. 6); అప్పలుకు ద్రో[illegible] = [illegible] (భార. [illegible]. II. 270); మొద.

(6) వ్యతిరేక క్త్వార్థక రూపముతో సూతపదముగ: చాకుండన్ = చావక (భార. విరా. III. 118); తొలఁగుపోకుండన్ = పోక (భార. విరా. I. 279); నిరూపింపంగ రాకుండ=రాక (భార. విరా. III. 178). పోవకుండ=పోక (భార. శాం. II. 335; సౌ. II. 126); కొండలమునఁ బొందకుండ=పొందక (భార. ద్రో. II. 247); మొద.

(7) ఆమ్రేడితమై నైరంతర్యార్థమున: చూడంజూడన్ (హర వి. VI. 25); చెప్పఁజెప్పన్ (కుమా. భా. I. 554); చనఁజనన్ (భార. అర. VII. 21), మొద.

(8) శత్రర్థమున: తొడిఁబడన్ = తొట్రుపడుచు (భాస్క. అయో. 89)

(9) పంచమ్యర్థమున: చాకుండమున్న (భార. విరా. III. 118); మొద.

(10) భూతార్థక 'ఇనన్' ప్రత్యయమునకు మాఱుగ: ఎట్టనన్ = ఎట్లనినన్ (హరి. పూ. VIII. పు. 193); మానునే గొల్లపాల్ త్రావ మందబుద్ధి (సిం. నార. శత. 34).

(11) కొన్ని యన్నంతక్రియలు కేవలావ్యయములుగ నుపయోగింపఁబడును; వానితుది నకారమునకు లోపమును దత్పూర్వ 'అ' కారమునకు దీర్ఘమును గలిగి కేవలావ్యయము లేర్పడినవి: ఎగదిగన్ (రామాభ్యు. VII. 69); ఎగాదిగ; ఒక్క నిమేషంబున... కూడన్ (భార. ఉ. IV. 424); కూడా (S. I. I. V. 874); వెలుచన (భార. అర. V. 425; VI. 308); చాలఁబెట్టిదంబు (భార. భీ. I. 61); చాలా నినునమ్మినాను (కృ. శత. 94); చాలా (S. I. I. IV. 711); అందాఁక (భార. అర. VI. 82; కల్య. II. 100; భాగ. VII. 54; X. i. 86; పరాహ. II. 169); ఇందాఁక (భార. కల్య. II. 66; హరి. పూ. IX. పు. 209; భాగ. X. ii. 33; కళా. III. 272; V. 40. 77); ఎందాఁక (భాగ. VII. 54; XII. 36); జన్మించు పందాఁక (కళా. V. 218); తుట్టందుదదాఁక (భాస్క. యు. 265); నదిదాఁకన్ (శుకం. పరి. II. పు. 24); రెండువేలయోజనంబులదాఁక (భాగ. V. ii. 19; షష్ఠీబహువచన రూపముతో 'దాఁక' అని నకారాదియగు నవ్యయము); సంవత్సరముదాఁక (కళా. II. 34); రజతాచలముదాఁక (పాండు. I. 172);— కృష్ణదనుకా నొచ్చింది (రామరా. పు. 302); కొండదాంకాను (S. I. I. IV. 276); తూరపగది (భార. విరా. I. 182; ఉ. II. 80; శాం. I. 42; II. 445. °తూఱు); మొద.

(12) తుమున్నర్థకరూపముల తొలియక్షరము సూది [illegible] గలుగును. చిక్కన్ జిడుఁజొక్కు (భార. అర. VI. [illegible]); [illegible]గదించింది (భార. అర. VII. 262); చిక్కఁ[illegible] (భార. విరా. II. 283); [illegible] (భార. కర. III. 210); [illegible]

(13) చక్కనగము (భార. ఉ. I. 251; III. 361); జిట్టాడిరిగి (భాస్క. యు. 1194); మొదలగువానిలోఁ దుది 'అనన్' అను సహాయక క్రియ తుది నకారము లోపించినది.

(14) బెగ్గిలన్ (భార. విరా. V. 57); కన్నారన్ (భార. విరా. V. 89); బలియన్ (హరి. పూ. VI. 22); మొదలంటన్ (పాండు. V. 238); కలగొనన్ (భార. మా. I. 21); మునుముట్టన్ (భాస్క. అయో. 91); మొదలుముట్టన్ (భాగ. VI. 58); మొదలగు నన్నంతరూపములును కేవలావ్యయములుగఁ బ్రయోగింపఁబడినవి.

(15) ధాతువుపై 'అన్' ప్రత్యయము చేరునపుడు సాధారణముగ నెట్టి వికారములును గలుగవు. కాని—

i. కొన్ని చువర్ణాంతధాతువుల చకారమునకు పకారమాదేశమగును: ఒనర్పన్ (భార. ఉ. II. 112); కాల్పన్ (భార. ద్రో. II. 164); ఒప్పరింపన్ (భార. భీ. II. 280); తుఱంగలింపన్ (భార. భీ. II. 48); మొద.

అర్వాచీనకావ్యములం దీ యాదేశము రాకుండఁగను బ్రయోగములు గలవు: తుదిం, జనుఁ జండాల కులంబులోన నుదయించంగోరి (ఒం. రఘు. శత. 42).

ii. కొన్ని చువర్ణాంతధాతువుల చకారమునకు వకారమాదేశమగును: తిగువన్ (భాస్క. అయో. 315); దీనికి 'తివ్వన్' అనియు రూపాంతరము గలదు. (భాస్క. అయో. 316, 318; వరాహ. IV. 3); 'తివన్' అనియుఁ గలదు (భాగ. X. i. 408), నడువన్ (భార. భీ. I. 112); నిల్వన్ (భార. ద్రో. II. 295; స్వర్గా. I. 65); మొలవన్ (విక్ర. I. 191); వెలువన్ (భార. విరా. I. 101); తోవన్ (వరాహ. II. 4); కావనుతోవను (శకుం. పరి. II. పు. 31); మోవఁదరంబుగాని (పాండు. III. 51); తలకడవన్ (భాగ. I. 370); విడ్వన్ (భార. మహా. I. 56); మిడువన్ (హరి. పూ. V. 221); తఱువన్ (హరి. పూ. V. 205); గెలువన్ (భార. ద్రో. V. 124); మోవన్ (వరాహ. V. 78), మొద.

iii. 'చ్చు' అంతమందుగల ధాతువులపై 'అన్' ప్రత్యయము చేరునపుడు రూపములు వివిధములుగఁ గలుగుచుండును: చచ్చు—చావన్; చాన్; చావేఁడి (భార. ఉ. I. 321); తెచ్చు-తేరన్, తేన్; 'తెచ్చు' సహాయక క్రియయగునపుడు దానికి గలుగు రూపాంతరమగు 'తెంచు' నకును తేరన్, [illegible] తుముష్మ [illegible] క్రొవ్వుతేరన్ (భార. విరా. I. 101); తేరతే (భాస్క. కాల. 460); తేరన్ - తేఁగా (పాండు. I. 14); తేఁడేని (పాండు. I. 190); అరుగు దేరఁగా (భార. విరా. I. 60); [illegible]

రన్ (భార. భీ. I. 112); కవియుదేరన్ (భార. భీ. III. 418); ఒత్తుదేరన్ (కుమా. భా. II. 342); చెప్పవుత్తేరన్ (శకుం. పరి. II. వు. 41); చొత్తేరన్ (భాస్క. అయో. 227); 'లెక తేర' అనునది యవ్యయము (వేం. పంచ. వు. 102); ఈ ధనము నాకు తేరగా రాలేదు = ఊరక (వ్యవహారము); చనుదేన్ (నిర్వ. IV. 8); నడతేనటుముఁడను (భాస్క. కిష్కి. 701); పాలుతేఁ గని (భాస్క. బాల. 257); -నొచ్చు. నొవ్వన్; నొవ్వనేయున్ (భార. భీ. III. 40); నోనాటన్ (భార. ఉ. IV. 317); నోనాడు (భార. విరా. III. 162); నోన్ (నిర్వ. IX. 12; కర్ణ. II. 245); వ్రచ్చు - వ్రవ్వన్; వ్రవ్వఁగఁదిట్టు (భార. ఉ. II. 10); వచ్చు—రాన్; తోరాన్ (భార. అను. III. 70; V. 450); తనుఁజుట్టిరాన్ (భార. భీ. I. 112; శాం. II. 389; ఉ. హరి. II. 84; పాండు. I. 37; V. 67; ఇది వ్యవహారమున 'చుట్టూరా' అనియైనది); కొలిచిరాన్ (భార. నిర్వ. III. 88); వెంటరాన్ (వరాహ. II. 48); కొల్చి రాన్ (కళా. II. 8); ఇల్లే, ఇచ్చు - ఇవ్వన్, ఈన్; గిచ్చు, గివ్వన్; క్రుచ్చు-క్రువ్వన్, క్రుచ్చన్; క్రొచ్చు - క్రొవ్వన్; చొచ్చు - చొరన్; త్రచ్చు- త్రవ్వన్; నచ్చు-నచ్చన్; మెచ్చు-మెచ్చన్; విచ్చు-వివ్వన్, విచ్చన్;

iv. కొన్ని గు- వర్ణాంతధాతువులు తొలుత వు వర్ణాంతములై యుండెను. వానిపై 'అన్' చేరునపుడు - 'వన్' తో నిరూపములు గలుగును; ఇట్టి రూపములు కొన్నిమాత్రము మిగిలినవి.

అగు- కాన్; కాన్ అనునది— (అ) విశేష్యముల ప్రథమారూపములమీఁదను: ఉత్తరలోనుగాఁగల పయోజముఖుల్ (భార. విరా. II.265); ఒకళ్లొకళ్ల కంఠంబులు లక్ష్యంబులుగాన్ (భార. ద్రో. III.263); ధర్మ్మార్థ్యగా (S. I. I. IV. 751); మొద.— (ఆ) షష్ఠీ రూపముల మీఁదను: నీకుఁగా వని సేయుట (భార. భీ. I. 157); తెల్లటిగాని (భాస్క. యు. 388); త్రాళ్లుటకుం గాన్ (భార. అను. I. 227); దైన్యమునకుం గా నొచ్చియు (భార. ఉ. IV. 261); నాకుఁగాన్ (నిర్వ. VII. 68); మువర్వ్వలకుఁ గాన్ (ఉ. రా. I. వు. 28); మొద. (ఇ) ధాతువుల తుమున్నంత రూపములమీఁదను: చొత్తేరఁగాన్ (భాస్క. అర. I. 8); వీతేరఁగాన్ (భాస్క. అర. I. 65); వెళ్లేఁ సేయఁగాన్ (భార. విరా. II. 309); మొద. చేస్తున్నుండఁగాను (S. I. I. IV. 802); మొద.—చేరును.

'కాన్' అనునది 'కన్' అనియు నగును. ఇదియు 'కాన్' [illegible] యుపయోగింపఁబడును: (అ) తోడుగన్ (భార. విరా. II. 28); [illegible] (భార. అర. V. 206); [illegible] (భార. అను. IV. 36); మొద. [illegible]

(భార. శాం. II. 89; దునఁగన్ (భార. అర. V. 57); పొద్మఁగన్ (భార. అర. IV. 410); మొద. కాని, 'కాఁగన్' అనునట్లు 'పోఁగన్, తేఁగన్' అను రూపములు కాన్పింపవు.

చెప్పంగానే, చేయంగానే, మొదలగు పూర్ణానుస్వారముతోడి పలుకు బడులు కొన్నిచోటుల వినిపించుచున్నవి; కొన్ని ప్రాంతములందు వినఁబడవు. ఇట్లే, తెల్లఁగన్ (భార. అర. VII. 320); చిక్కఁగన్ (భాస్క. అర. I. 117) లలో తెల్లన, చిక్కన, అనువానిపై 'కాన్' రూపాంతరమగు 'కన్' చేరునపుడు 'న' కారముమీఁది యచ్చు లోపించినది. ఇట్లే, కొన్ని ప్రాంతము లందు వ్యవహారమున 'చల్లంగా, మెల్లంగా, నల్లంగా' మొదలయిన పలుకు బడులు వ్యవహారమున వినబడుచున్నవి.- చాలన్ = చాలా = కానా = 'సేన' అను నవ్యయముపై 'కన్' చేరి 'సేనగ' అయినది (సర్వ. మా. II. 80); 'కాలేదు' అనుటకు'అవలేదు' అనియు వ్యవహారమునఁగలదు. క్రాగు-క్రావ్వన్ (శకుం. పరి. II. పు. 24); క్రాఁగు-క్రావన్, క్రాఁగన్; నగు- నవ్వన్(నగన్?)

v. 'అను' ధాతువు తుమున్నంతరూపము 'అనన్': దిగ్గనంగ (నిర్వ. III. 80); మొద. ధ్వన్యను కరణశబ్దములపై 'అనన్' చేరునపుడు దానితుది ద్రుతము లోపింపఁగా మిగిలిన రూపము కళయగు నవ్యయమగును; క్రన్నన (భార. అర. V. 434); గ్రద్దన (భార. భీ. III. 43; భాగ. VII. 288); గ్రమ్మన (భార. అర. VI. 125; ఉ. III. 114; ద్రో. V. 118); ఘల్లన (కాశీ. VII. 160); చట్టన (భార. అర. V. 228); జడ్డన (భాగ. I. 260); ఝల్లన (కాశీ. III. 14); దిగ్గన (కాశీ. IV. 54; V. 158); మెత్తన (భార. అను. V, 342); మెల్లన (నిర్వ. V. 12); మొద. ఇట్టి రూపము లర్వాచీన కృతులం దుకారమధ్యములు నయ్యెను: భగ్గన, బగ (కాశీ. VII. 75); బగ్గన (కాశీ. VII. 87); గుండె బగ్గునఁ బగులన్ (వరాహ. II. 50); భోరన (ఉ. రా. పు. 75); భోరున (యతి: ఉ. రా. పు. 54);— ధ్వన్యను కరణ పదములపై 'అను' ధాతువు చేరునపుడు 'ర, మ్' లాగమములు ప్రధాన ధాతువుపైఁ జేరును: దిగ్గురనన్, భగ్గుమని, మొద.); - ఒకప్పుడు 'అనన్' లోని ద్రుతమేకాక నకారము మీఁది యకారమును లోపించును: చిక్కఁ దునియు (భాగ. III. 638); దొప్పఁదోఁచు (పారి. ఉ. II. 50); పెచ్చఁ గంద (భాగ. IV. 77); మిలమిల మెదలక (భార. ద్రో. I. 386);- చరాల్న (రంగారా. I. 62); ఇట్లే, ధడాల్న, టటేల్న, మొదలగు వానియందు లవర్ణము సత్వము లోపించినది.

vi. అను -అనక (దశావ. పు. 180); నాన్ (ఉ. III. 105); పోన్ (భార. శాం. III. 337).

vii. నిన్నేమనన్ (భాస్క. అయో. 210); అతని మహిమ నేమని చెప్పన్ (భాగ. V. i. 65); ఏమిసెప్ప (భాగ. VI. 281; హరి. ఉ. 192)— ఇట్టి ప్రయోగములందు తుమున్నంత రూపములపై 'కలదు' మొదలగు క్రియల నధ్యాహారము చేసికొనవలయును.

viii. వలరాయా, నీ తలరాయా; నీయమ్మ కడు కాల; నీ తలపడా, మొదలగువానియందు తుమున్నర్థక 'అక్' ప్రత్యయము 'న'కారము లోపించి యత్వమునకు దీర్ఘముకలిగి కాపాగ్రమును గలిగించు చున్నది. కావ్యములందు 'నీ తల రాయ' మొదలగు హ్రస్వాకారము తోడి రూపములు గానవచ్చుచున్నవిగాని, యవి పద్యగణముల కొఱకు కవులు చేసినవి. ఒకప్పుడిట్టి రూపము లవ్యయములైనవి: నేఁజెల్ల != అయ్యో (హరి. పూ. V. 155),

ix. 'కాకుండా నెవ్వరు' (S. I. I. V. 192); చెప్పకుండా పోయి నాఁడు మొదలగు వ్యావహారిక రూపములందు ద్రుతలోపమును బూర్వస్వర దీర్ఘమును గలిగినది. కేవల తుమున్నర్థమున నిట్టి మార్పు 'ఉండు' ధాతువు మీఁదనే కలుగునట్లు తోఁచుచున్నది.

x. తుమున్నర్థక రూపములపై 'పట్టి' పర్ణకము చేరి నామ విభక్త్యర్థమును బోధించును: కల్గంబట్టి, చేయంబట్టి, మొద.

IV. ఇనన్నంతానమాపకక్రియలు.

(1) ధాతువుపై 'ఇనన్' ప్రత్యయముచేరి 'అపి' అనువర్థము నిచ్చును' కొంతయినన్ = కతిచిదపి (భార. ద్రో. III. 269); ఏపాటనైనన్ = కథంచిదపి (భార. విరా. I. 79); కొంచెమయినను=కించిదపి (ఢి. I. 127); ఆ స్థానములలో నొక్కరుఁడైనన్ = కశ్చిదపి (భార. విరా. II. 141); మొద.

(2) ఒకప్పుడు 'ఇనన్' అంతముగుగల యసమాపక క్రియకు 'యది' అను నర్థము గలుగును: ఏను నరుఁడు నయినన్ (హరి. పూ. IV. 122); కాహారములయినన్ (భార. విరా. I. 187), మొద.

(3) ఒకప్పుడు 'వా, అథవా,' అను నర్థములు గలుగును: ఆ విప్రులేడ్వురైనను నేవురు మువ్వురునైన (విజ్ఞా. వ్యవ. III.), మొద.

(4) ఒకప్పు డానంతర్యార్థము గలుగును: తునియతూఁటాడినన్ (హరి. ఉ. X. 109); రెండయి పాయయిచ్చినన్ (భార. విరా. III. 166), మొద.

(5) ఇను, చెను, వను, విను, అను, * ఉను, కను, కొను, [illegible] [illegible], మను, [illegible], ధాతువులపై 'ఇన' ప్రత్యయము చేరునప్పుడు - 'ఇన' - '[illegible]' అనునవి [illegible] 'క్క', '[illegible]'లుగ [illegible] క్రియవర్తన (హరి. [illegible] V.

228); తలపడ్డన్ (భార. అర. VI. 281); విడఁబడ్డన్ (నైష. I. 76); అగపడ్డన్ (భార. విరా. II. 70); తిరుగఁబడ్డన్ (భార. అర. V. 279).

(6) 'ఇనన్' లోని ద్రుతమునకు లోపమును దత్పూర్వాచ్చునకు దీర్ఘమును వ్యవహారమునఁ గలుగును. అపుడు దానికి 'యది, యద్యపి' అను నర్థములు మాత్రము గలుగును. వ్యవహారమునను గొన్ని యర్వాచీన కావ్యములందును నిట్టి రూపములు గలవు. శాసనములలో నిట్టి దీర్ఘము కలిగిన రూపములు ద్రుతాంతములుగను గానవచ్చుచున్నవి:

ఈ మేర యెవ్వారు అతిక్రమించినాను (S. I. I. IV. 276); ఎవ్వారు గనక అపహరించ్చినాను (S. I. I. IV. 659); ఏమినర కమ్మినాను (S. I. I. V. 212); ఎంతనైవేద్యము ఆరగించ్చినాను (S. I. I. IV. 710); ఎవ్వారు విఘ్నము సేసినాను (S. I. I. V. 136); ఎవ్వారు గనక తప్పినాను (S. I. I. IV. 280); యీ ధర్మ్మానకు ... తప్పినా (S. I. I. IV. 280); ఇందుకుం గనక యెవ్వారు తప్పినాను (S. I. I. IV. 710); యవ్వారు తప్పినాను (S. I. I. IV. 981); యువ్వారు తప్పించ్చుకొన్నాను (S. I. I. IV. 808); ఎవ్వారడ్డపడ్డాను (S. I. I. IV. 985), మొద.

(7) 'ఇనన్' అంతమందు గల రూపములకు వ్యతిరేకార్థమున నా ధాతువుల వ్యతిరేకార్థకరూపములపై 'ఉన్నన్,' 'తక్కినన్,' 'పోయినన్' మొదలగు సహాయక క్రియల 'ఇనన్' అంతరూపములు చేరును: వశము కాకున్నన్ (భార. విరా. II. 292); మార్కొనక తక్కినన్ (భార. భీ. III. 393); ఇంతలు సేయకున్నన్ (భార. ద్రో. IV. 293); కొనిపోక తక్కినన్ (భార. శల్య. II. 169); ఎద్దుక తక్కినన్ (భార. విరా. III. 140); చూడఁబడయ కున్నన్ (భార. ద్రో. II. 249); చాకున్నన్ (భార. భీ. III. 484); చూపునకుం జొరవ యీకున్నన్ (భార. ద్రో. V. 86); అదలుప కున్నన్ (భోజరా. V. 299); ఓ యనుట లేకున్నన్ (భార. అను. I. 76); ఎవ్వారు చెల్లనీకుంన్నను (S. I. I. V. 149).

(8) యద్యర్థమున: అడిగితే (దేవకీనం. శత. 42); ఐతే (దేవకీనం. శత. 85); కొట్టితే (S. I. I. V. 1312); మొదలగు రూపములందు 'ఇనన్' కు మాఱుగ 'ఇతే' తో వ్యవహారమునను నర్వాచీన గ్రంథము లందును గాన్పించుచున్నది.

## V. శత్రర్థకములు.

(1) ధాతువులపై -'చున్' అను ప్రత్యయమును చేర్చుటవలన శత్రర్థకావస్థావక క్రియ లేర్పడును: ఉల్లఁబొరుచున్ (భార. విరా. II. 112); క్రుంగి (భార. విరా. II. 79); ఊనుచున్ (శాంతి. IV. 292); మొద.

(2) పోవు ధాతువు నన్నియసమాపక క్రియారూపములందును 'వు' వర్ణము లోపించినను శత్రర్థక చువర్ణము చేరునపుడుమాత్రము లోపింపదు: పోవుచున్.

(3) లఘుపూర్వక'ను' అంతమందుగల ధాతువులపై శత్రర్థక చువర్ణము చేరునపుడు ధాతువు తుది యుత్వము వైకల్పికముగ లోపించును; అట్లేర్పడిన 'న్చు' ను 'ంచు' గ వ్రాయుటయుఁ గలదు; 'న్చు' అని వ్రాసినను, 'ంచు' అని వ్రాసినను దాని యుచ్చారణము 'న్చు' అనునదియే. ఊంఊమ్మటంచు (భాగ. VIII. 30); కడిఁగడి నంమకొంచు (వృషా. శత. 95); విఁచునుండఁగాన్ (భార. ఉ. III. 368); బనికొంచు (భార. ఉ. II. 147); విఁచున్ (భార.ఉ. II. 63); అంచుండునను (భార. ఉ. I. 336); విచుచుండెన్ (భార. శల్య. II. 370); కొంచున్ (భార. ఆర. IV. 221); ఇట్లు కొంచున్, తించున్, మంచున్—'చనుచున్' అనునది 'చంచున్' అని కాదు.

(4) ధాతువుపైఁ దచ్ఛబ్దార్థక సర్వనామముచేరియుఁ బూర్వకావ్యములందు శత్రర్థము కాన్పించుచున్నది: చూ. పదునొకండవు శతాబ్దపు ఆంధ్ర భాషా లక్షణము.

(5) 'పోవుచున్' అనునది వర్తమానకాలమును బోధింపకున్నను, దానిపై 'ఉండి' అను క్త్వార్థకరూపము చేరి భూతార్థమును దెలియఁజేయును: పోవుచుండి, కొట్టుచుండి, మొద.

(6) వ్యవహారమున నాంధ్రమునఁ దొలుతనుండియు శత్రర్థమున 'తు, తూ', 'తా' లు కానవచ్చుచున్నవి.

ఇవి కన్నడమునఁ బూర్వకావ్యములందును గానవచ్చుచున్నవి. తెనుఁగున సంపూర్ణక్రియలయందు వర్తమానార్థమున 'తు' వచ్చును: కొట్టుతున్నాఁడు, చెప్పుతున్నాఁడు; మొద. శత్రర్థకాసమాపక క్రియలయందు 'తూ' అని దీర్ఘముగనే యుండును; కొట్టుతూ, చెప్పుతూ; మొద. పామర జన వ్యవహారమున 'తా' వచ్చును: చేస్తావున్నాడు, కొడతా వున్నాడు, మొద. శాసనములందు 'తు' ప్రత్యయసహితముగను గాన్పించుచున్నది: చేస్తున్న వుండేటట్టుగాను (S. I. I. IV. 280); చేస్తున్న (S. I. I. IV. 801); చేస్తున్నుండగాను (S. I. I. IV. 802); మొద. యుకారాంత ధాతువులపై 'తు' చేరునప్పుడు 'యు' కారమునకు 'స' కార మాదేశమగును.

## VI. యద్యర్థకములు.

(1) 'ఏనిన్' అనునది సంపూర్ణ క్రియారూపములపైఁ [illegible] యద్యర్థ;

ఇది యేమిఁటికంటేని (మను. III. 104); ఎట్లంటేని (భార. శాం. VI. 178); చనితేనిన్ (భార. భీ. II. 161).

భూతార్థకోత్తమ మధ్యమ పురుషైకవచనమునఁ జేరు -తిని, -తివి, అనువాని తుది 'ని, వి' అనువానికి లోపము కలుగఁగా, రెండును 'తి' అను నేకరూపమును బొందినవి. వానిపై 'ఏనిన్' చేరి '-తేనిన్'; '-తేఁ,' -'తే' అను రూపమును దాల్చినవి. ఇట్లుత్తమ మధ్యమ పురుషముల మాత్రము చేరవలసిన -'తే' అను వర్ణకము తక్కిన పురుషములందును క్త్వార్థకరూపములపైఁ జేరుచు వచ్చెను. వ్యవహారమున నన్ని పురుషములందును వచనములందును నిట్టి రూపములే నిలిచినవి: నేను (మేము, నీవు, మీరు, వాఁడు, ఆమె, అది, వారు, అవి), వస్తే, మొద.

(2) 'ఇనన్' అంతాసమాపకక్రియిలకును నొకప్పుడు యద్యర్థము కలుగును: వాఁడు వచ్చిన నే నిచ్చెదను, నీవు చెప్పిన వాఁడు వినును, మొద.

VII. ఆనంతర్యార్థకములు.

(1) అన్నంతాసమాపకక్రియల కొకప్పు డానంతర్యార్థము కలుగును: సూర్యుఁ డస్తమింపఁ జుక్కలు కానఁబడును, మొద.

(2) ఇనన్నంతాసమాపకక్రియలకును నిట్లే యానంతర్యార్థము కలుగును: యదునందనుఁ దర్మిలిమ్రొక్క, మ్రొక్కినన్ ... లతాంగి, లతాంతాయుధు కన్నతండ్రి శిరమున్ వామపాదంబునం దొలఁగందోచె (పారిజా. II).

(3) క్త్వార్థకరూపములకును నొకప్పు డానంతర్యార్థము కలుగును: ఈ పనిచేసి యింటికిఁ బొమ్ము.

(4) ధాతువుపై -'డున్' అను ప్రత్యయమును జేర్చుటవలనను నానంతర్యార్థము కలుగును: అనుఁడున్, పోవుడున్, చెప్పుడున్, మొద.

సంపూర్ణ క్రియలు.

I. వర్తమానకాలము.

వర్తమానార్థక ధాతుజవిశేషణములపై నాయా సర్వనామ రూపములను, వాని పరిణామరూపములను జేర్చుటవలన వర్తమానార్థక క్రియ లేర్పడును:

ఉత్తమ పురుషము.

ఏకవచనము: -చున్నవాఁడను, -చున్నాఁడను, -చున్నాను (వ్యవహారము: —తున్నా(ను).

బహువచనము: -చున్నవారము, -చున్నారము, -చున్నాము (వ్యవ

వచ్చుచున్నవాఁడను (నన్నయ); చెప్పుచున్నాఁడ (భార. శాం. IV. 442); (వ్యవహారము: చెప్పుతున్నా(ను), చేస్తున్నా(ను), పోతున్నా(ను), తెస్తున్నా(ను), తలస్తున్నా(ను), మొద.)

ఎమల్లి సూచుచున్నవారము (భార. ఉ. III. 228); చూచుచున్నారము, చూచుచున్నాము (వ్యవహారము: చెప్పుతున్నాము, చేస్తున్నాము. పోతున్నాము, తెస్తున్నాము, తలస్తున్నాము, మొద.)

మధ్యమ పురుషము.

ఏకవచనము: -చున్నవాఁడవు, -చున్నాఁడవు, చున్నావు (వ్యవహారము: తున్నావు).

బహువచనము: -చున్నవారరు, -చున్నవారలరు; -చున్నారరు, -చున్నారలరు; -చున్నారు? (వ్యవహారము: -తున్నారు).

చిటిలి పడుచున్నవాఁడవు (భాస్క. యు. 129); చెప్పుచున్నాఁడవు చెప్పుచున్నావు. (వ్యవహారము: చెప్పుతున్నావు, చేస్తున్నావు, పోతున్నావు తెస్తున్నావు, తలస్తున్నావు, మొద.)

పోవుచున్నవారరు, పోవుచున్నవారలరు, పోవుచున్నారరు, పోవుచున్నారలరు, పోవుచున్నారు? (వ్యవహారము: చెప్పుతున్నారు, చేస్తున్నారు, పోతున్నారు, తెస్తున్నారు, తలస్తున్నారు, మొద).

ప్రథమ పురుషము.

మహద్వాచకము: ఏకవచనము: -చున్నవాఁడు, -చున్నాఁడు (వ్యవహారము: -తున్నాడు.)— తిరుగుచున్నవాఁడు (భాస్క. యు. 349); విజయం చేయుచున్నవాఁడు (భార. విరా. I. 11); నిగ్రహించుచున్నాఁడు (భార. ఉ. III. 389); ఏయుచున్నాఁడు (భాస్క. బాల. 641); ఏతెంచుచున్నాఁడు (భార. అర. V. 388); భోగించుచున్నాఁడు (భాస్క. కి. 188), మొద.

మహన్మహతీవాచకము: బహువచనము: -చున్నవారు, -చున్నారు (వ్యవహారము: తున్నారు); ఒదర్చుచున్నవారు (నన్నయ), ఒదర్చుచున్నారు (భార. కర్ణ. I. 278); వచ్చుచున్నారు (భార. అశ్వ. IV. 147), విలపించుచున్నారు (భాస్క. కి. 388); గ్రుద్దుచున్నారు (భాస్క. యు. 204), మొద. (వ్యవహారము: చెప్పుతున్నారు, చేస్తున్నారు, పోతున్నారు, తెస్తున్నారు, తలస్తున్నారు, మొద).

అమహద్వాచకము: ఏకవచనము: -చున్నయది, -చున్నది

(భార. అర. VII. 242); ఏర్పడుచున్నది (భార. విరా. I. 308); పొందుచున్నది (భార. విరా. I. 295); చేర్పుచున్నది (భార. స్త్రీ. II. 74); మొద. (వ్యవహారము: చెప్పుతున్న (-న్నా)ది), చేస్తున్న (-న్నా)ది, పోతున్న (-న్నా)ది, తెస్తున్న (-న్నా)ది, తలస్తున్న (-న్నా)ది, మొద.

మహతీతరామహద్వాచకము: బహువచనము: -చున్నయవి, -చున్నవి (వ్యవహారము: -తున్నవి, -తున్నావి (పామరజన వ్యవహారము), -తున్నాయి (అగ్ర వర్ణములవారి వ్యవహారము); వెలుగుచున్నయవి (నన్నయ); వెలుగుచున్నవి (భార. శాం. IV. 40); శోభిల్లుచున్నవి (భార. అర. V. 846); మొద. -(వ్యవహారము: చెప్పుతున్న(-న్నా) వి (-యి), చేస్తున్న(న్నా)వి. (యి), పోతున్న(-న్నా)వి (-యి), తెస్తున్న (-న్నా)వి (-యి), తలస్తున్న (-న్నా)వి (-యి), మొద.

పై రూపములలో 'చున్' అనునదియే వర్తమానార్థ బోధకమని పోవుచునున్నారు (భార. విరా. III. 187); చేయుచు నున్నాఁడు (హరి. పూ. I. 19) మొదలగు ప్రయోగములవలనఁ దెలిసికొనవచ్చును. 'ఉన్నాఁడు' అనునది నిర్మాణమువలన భూతార్థక మయినను నది యొకరీతి తద్ధర్మార్థక క్రియగ భాషయందు నిలిచినది.

* 'కలు' ధాతువుపై సంబంధార్థమున విశేష్యముల మీఁదఁ జేరు 'అ' వర్ణము చేరి యేర్పడిన 'కల' అనునదియు 'ఉన్న' వలెనే యొకరీతి తద్ధర్మార్థమును దెలియఁజేయును. ఒకప్పుడు దానికి 'ఉన్న' యను నర్థమే యుండును.

ఉత్తమ: ఏక. కలను (భార. శాం. VI. 241); నేరుపు గలను = కలదానను (హరి. పూ. V. 247), మొద.

బహు. ఉన్నతిఁ బొందం గలవారమై యునికి గృష్ణా నేఁడు గా వచ్చెనే (భార. ఉ. III. 80); కలము = కలవారము (భార. శాం. VI. 615).

మధ్యమ: ఏక. కరుణగలవు = కలవాఁడవు (భార. శాం. III. 300); నామీఁదం గృపగలవు (హరి. పూ. VII. 89).

బహు. కలరు = కలవారలరు.

ప్రథమ: ఏక. మహత్తు: కలఁడు = కలవాఁడు (భార. అను. IV. 250); కలఁడు= ఉండెడివాఁడు (భార. శాం. II. 68); కురుపతి ప్రాణంబులం గలఁడే= ప్రాణములతో నున్నాఁడా (భార. శల్య. II. 16); లావును దాల్మియుఁ గలఁడు (భార. ఉ. IV. 260); బలము మీఁకయుఁ గలఁడు (భార. ఉ. IV. 262); అతఁడు రోషము గలఁడు (భార. ఉ. IV. 281); అతఁడు మదము గలఁడు (భార. ఉ. IV. 224); మున్నాఁడు తోడు గలఁడు (భార. ఉ. IV. 178); కర్ణుఁడిందు గలఁడు (భార. ఉ. II. 212); అహింసకుఁ గూర్మి గడుం గలం డతండు

(భార. ఉ. II. 7); మగఁటిమి గలఁడు (భార. ఉ. I. 315); దశాననుఁడు నీ చెప్పిన యంతకుం గలఁడు (భాస్క. యు. 2268); పని నీఁగఁ గలండు (భాస్క. యు. 1062).

కార్యమునకు ఖడ్గమునకుఁ గలవాఁడై (భార. ఉ. I. 281); శాంతన వుండు సర్వకురునతతికిం గలవాఁడు గాఁడె (భార. ఉ. II. 164);—చేయ గలాఁడు (అశ్వ. I. 120), మొద.

బహు. మహన్నహతులు: తెంపు నలవుఁ గలరు (భార. ఉ. IV. 264); సంతోష మారఁ గలరు (భార.అను. V. 425); కలరు=ఉన్నారు (భార. శాం. I. 159; అను. V. 287); మీరెటుకే గలరు (భార. శాం. V. 828); ఇంత వెట్టివారును గలరు (భార. ఉ. IV. 377); పాడియు సత్యముం గలరు (భార. ద్రో. II. 260); వారు గోత్తల గలరు (భార. ఉ. IV. 257); ప్రకట బలురు గలరు (భార. ఉ. IV. 227).

ఏక. అమహత్తు: కలయది; కలదు (భార. అర. V. 38; విరా. I. 81, 88; IV. 231) మొద.

బహు. మహతీతరామహత్తు: కలయవి (భార. అర. IV. 312); కలవు (భార. ద్రో. III. 228; భార. శల్య. II. 342), మొద.

*'కలదు'కు 'కల్దు' (భాగ. X. i. 1338; ఓం. రఘు. శత. 39) అనియు, 'కద్దు' అనియు రూపాంతరములు గలవు (చూ. ఉత్తరాంధ్రము).

కలను, కలము, కలవు, కలఁడు, కలరు, అనువాని లకారముమీఁది యత్తునకు దీర్ఘమును గలుగును: పొందఁగలానట (భాస్క. అయో. 230); కలారు (భార. అను. III. 70; ద్రో. II. 11), మొద.

ధాతువుల తుమున్నర్థకాన్నంత క్రియలపై 'కల'అనునది చేరి భవిష్య దర్థమును దెలుపును:

అనంగలవాఁడ (భార. విరా. I. 73); ఎవ్వరికాలానాన్న తప్పంగల వారము కాము (S. I. I. IV. 710); పోవంగలవారము (భార. అర. VI. 30); ఉన్నతిఁ బొందంగలవారమై యుని (భార. ఉ. III. 80); అవహరింపం గలవాఁడు (భార. అర. VI. 46); అనం గలవాఁడు (భార. విరా. I. 73); నటింపం గలవాండు (S. I. I. V. 1088); చాతంగ్గలాండు (S. I. I. VI. 1186); వడపంగలవారు (S. I. I. IV. 282); చేయఁగలరు (భార. అర. IV. 288, 293); విడువఁగలరు, కాఁగలరు (భార. అర. IV. 289); పాలింపంగలవారు

వర్తమానార్థమునఁ బ్రథమపురుష మహద్వాచకైకవచన క్రియ లందును, మహతీతరామహద్వాచక బహువచనక్రియలందును ధాతువుపై 'ఎదుర్' అను ప్రత్యయము కానవచ్చుచున్నది:

ఒక్క దనుజాధముండు మొఱయో! కడంగి నన్నుఁ జెఱగొనిపోయెదు (భార. అర. V. 177); ఖండనంబు సేయువాఁడుగాఁ దలంచి చనియెదుర్ (భార. భీ. I. 155); పెనఁగెదుర్ = పెనఁగుచున్నాఁడు (హరి. పూ. V. 246); చెప్పక చూప కీతని విశేషముఁ దెల్పెదుర్ (భార. విరా. I. 92); కొడుకిటు వోకకున్ మనము గుందెదుర్ (భార. విరా. II. 213); చెవులు సీములు గట్టెదుర్ (భార. ఉ. II. 10), మొద.

'దు' వర్ణకము చేరునపుడు ధాతువు తుది ద్విత్వాక్షరములలో నొకటి లోపించుటయుఁ గలదు. ఈ లోపము సార్వత్రికము కాదు: ఎసుదుర్ సజ్జనుల్ (హరి. ఉ. VII. 108); చెవుదురు (అను. II. 227);—'ఎమి తిని చెపితివి కపితము' అను చాటుధారలో 'చెపితివి' అను నిట్టి రూపముల కాక్షేపము గర్భితమై యున్నది. వ్యవహారమున నిట్టి ద్విత్వలోపము గలిగిన కొన్ని రూపములు గలవు.

## II. భూతకాలము.

### ఉత్తమ పురుషము.

i. ధాతువుల క్త్వార్థక రూపములపై ఏకవచనమున 'తిని', బహువచనమున 'తిమి' చేర్చుటవలన:

ఏకవచనము: కొన్ని నడిగితి (భాగ. II. 261); కుశలం బడిగితిని (భాస్క. సుం. 330); నీవలనఁ బ్రీతుఁడనైతి (భార. అర. VI. 125); కోడలైతి (భార. ఉ. III. 108); ఏ నెవ్వతనైతి నేమి (భార. భీ. III. 324; భార. అను. III. 222); ఏను వేఱైతి (భార. కర్ణ. III. 61); ఇల్లాలైతిఁగా (హరవి. III. 126); తగిలి ప్రియముసేయఁ దగితిఁగాని (భార. అర. V. 309); తపస్సిద్ధుఁడైతి (భాస్క. బాల. 330); శరము కుత్తుకనైతి (భాస్క. సుం. 438); నిందకుఁడైతిన్ (భాస్క. యు. 967); నిన్నుఁ దడవ సిచటి కరుగుదెంచితి (భార. అర. VII. 29); ఒకటి యాడఁగ వచ్చి మఱొక్కటాడితిన్ (మిత్రవిం. IV. పు. 56); కన్నుల మాత్రయుండితి, ఓపాటించితిర్ (భార. విరా. V. 337); యమ కింకరాళిఁ గట్టితి బొమ్మ (దాశ. శత. 102); నీకు నేఁ గలసితిర్ (భాస్క. అర. I. 188); జననిఁగూర్చితి శోకములోఁతువాటమున్ (హరి. ఉ. VII. 104); చిక్కితిర్ చనితిని (భాగ. VII. 473); చిక్కితిఁగదా (భార. అర. VI. 61); కాలు దొడరితిర్ (భార. అను. II. 210); ఒక మూర్ఖ (భాస్క. అయో. 14); [illegible] (భార. విరా. II. 226); అక్కడఁ బుచ్చితిర్ (భార. ద్రో.

IV. 129); మూఁడించితిని (హరి పూ. II. 180); ఇట్టి కష్టమునకు వచ్చితిని (భార. అర. VI. 20); అప్పరిపాటి నిన్ను మున్ను వినిపించితి (భార. అను. IV. 186); నీవలన నంతసిల్లితి (హరి. ఉ. X. 274).

బహువచనము; ఇంతటి పనులకుఁ జాలితిమి (భార. శాం. III. 437); నిక్కమున కేమును డస్సితిమి (భా. విరా. I. 154), నంతసంబునఁ బొందితిమి (భాస్క. కి. 750); నీకై పోలితిమి (భా. ఉ. IV. 26); ఎల్లదానను జెడితిమి (హరి. పూ. V. 221); ఒల్లఁబోయితిమి (హరి. పూ. V. 221); తతిమి నడిచితిమి (భార. విరా. I. 151); కొనియాడితిమి (భార. విరా. I. 179); మొగదప్పితిమి (భార. సౌ. II. 27); వింటిమి (నిర్వ. VII. 95; -ఇది కర్తృర్థరూపమై యుండును), మొ.వి.

ను వర్ణాంత ధాతువులపై 'తిని', 'తిమి' చేరునపుడు వాని క్త్వార్థకరూపము 'ని' లోని యిత్తునకు లోపమును, తికారమునకు టకారాదేశమును గలుగును; ఒంటి పొమ్మంటిఁ (భాస్క. అర. II. 65); ఋణము నీకుఁ గొంటి నక్షితో (భార. కర్ణ. III. 195); మిముఁ జూడఁ బడయుఁ గంటి (భాస్క. అర. I. 106); ఔఁగా దనకయ్యకొంటి (భార. ద్రో. I. 78); దొరకొంటిఁ (భాగ. I. 7); పని వింటిఁ (వరాహ. XI. 466); నీ విక్కడ యుండుట వింటి (భార. కర్ణ. III. 46); ఇట్లే, ఉను - ఉంటిని; తిను - తింటిని; మను - మంటిని, అంటిమి, కంటిమి, మొద.—చను ధాతువుపై టకారాదేశము గలుగదు: చనితిని, చనితిమి.

చు, చ్చు, లంతమందు గల ధాతువులపై 'తిని', 'తిమి', చేరునపుడు వ్యవహారమునందును గొన్ని యర్వాచీన కావ్యములందును ప్రాచీనకావ్యము లందును చు, చ్చు లకు సకారాదేశము కలుగుచున్నది. యుకారాంత ధాతువుల క్త్వార్థక రూపమందలి 'సి' లోని యిత్తునకు లోపము కలుగును; ఇస్తిమి (S. I. I. IV. 799, 800, 802; VI. 588, 959, 980, 1054); ఇప్పిస్తిమి (S. I. I. IV. 698); చేస్తిమి (S. I. I. IV. 280, 686; VI. 126); చేయిస్తిమి (S. I. I. IV. 709); రాస్తిమి (S. I. I. IV. 711); విడిస్తిమి (S. I. I. IV. 808); వేయిస్తిమి (S. I. I. IV. 815); సమర్పింస్తిమి (S. I. I. IV. 847, 874, 981, 997); సమర్పిఁస్తిమి (S. I. I. VI. 1212); సహాస్తిఇస్తిమి (S. I. I. VI. 1010); దానము లెన్ని తలంచి యిస్తినో, యాగము లెన్ని చేస్తినో (చట్టాభి. పు. 41); తనువిస్తిని మనసిస్తిని ధనమిస్తి నటంచు (ప్రభు. పు. 54); తోచినది మనవి చేస్తిమి (చట్టాభి. పు. 75); మాస్తిమి, కోస్తిమి (శ్రీనా. చాటు).

ii. ధాతువుల భూతార్థక ధాతుజ విశేషణ రూపములపై 'టాయను',

చేర్పడును; నన్నయ యిట్టి రూపములనే వాడినాఁడు. చూ. పంద్రెండవు ప్రకరణము. తరువాతికాలమున నిట్టి రూపములను గవులు వాడుచుండినను, వానిలో తచ్ఛబ్ద వకారమునకు లోపమును దత్పూర్వాచ్చునకు దీర్ఘమును గలిగిన రూపములు కావ్యముల కెక్కినవి. ఉదా.

ఏకవచనము: ఇచ్చినాఁడ (భార.అశ్వ. IV. 190; మహా. I. 11); ఉన్నాఁడఁ (భార. అను. II. 17; అశ్వ. I. 55; స్త్రీ. II. 127); ఊఁటాడి యున్నాఁడను (ఒం.రఘు.శత.17); ఎఱిఁగినాఁడ (భార.అశ్వ.II. 53); కల్పించినాఁడఁ (భార. ద్రో. II. 170); చంపినాఁడను (భార. ద్రో. V. 422); చని నాఁడను (భార. కర్ణ. III. 138); చెందినాఁడ (భార. శాం. IV. 52); చేసినాఁడను (భార. శాం. V. 228); తప్పినాఁడ (భాస్క. యు. 188); తెలిసినాఁడను (భాగ. V. ii. 112); పలికినాఁడఁ (భార. శల్య. I. 96); వచ్చినాఁడ (భార. ఉ. II. 3; శాం. I. 365; V. 281).

బహువచనము: దీక్షితులై నారము (భాస్క.బాల. 401); ఉన్నారము (భార. ఉ. I. 276; II.6; భాగ. I. 250); కన్నారము (భాగ. I. 250; VIII. 391); పలికికొన్నారము (భార. శల్య. II. 213); చనుదెంచినారము (భార. ఆర. V. 201); చేసినారము (భాస్క. I. 102); మన్నారము (భాగ. I. 250) వచ్చినారము (భార. VI. 283, 349); విన్నారము (భాగ. I. 251; VIII. 391), మొద.

నాఁడను, -నారము, ల లోని డ, ర, లు లోపించిన రూపములు నేఁడు వ్యవహారమున నున్నవి; వానిని కవులును వాడినారు: ఒనరించినాను (కాశీ. మా. III. 218); తెలంచినాను (సానం. పు. 37); వెళ్లినాను (సానం. పు. 84); నేర్చినాను (మొల్లరా. I. 12); చూపించినాను (షట్చ. III. 127); పలికినాను (సమీ. విజ. III. 104); వచ్చినాను (ఉ.రా.పు. 120); పట్టఁదగిన కొమ్మఁ బట్టినాను (రామతా. శత. 73):— ఒనరించినాము (ఘటి. మా. II. 158); చదువుకొన్నాము (కువల. II. 79); నడచినాము (రంగారా. II. 171).

మధ్యమపురుషము.

I. ధాతువుల క్త్వార్థకరూపములపై 'తివి', 'తిరి', అనువానికిని చేర్చుట వలన భూతకాలిక మధ్యమపురుష క్రియల యేక బహువచనములు వరుసగ నేర్పడును; 'తివి' లోని తుది 'వి' వర్ణము లోపించుటయుఁ గలదు:—

ఏకవచనము: అలసితివి (భాగ. V. I. 142); తెగటాఱితివి (మను. III. 40); చేసైతిగదే (భార.ఉ. III. 159); నవ్వులకాడితో (భార. అను. I. 186); గోవుల నెట్టు లాఁగితివి (భార. విరా. V. 288); చెప్పితివి (భాస్క. అయో.

209); పూనితివా? (భార. విరా. II. 117); పెనవెట్టితివి (భార. ఆర. V. 335) ముట్టితివి (భాగ. I. 91); మెట్టితివి (భాగ. I. 91); ఏమిటివాఁడవై యిచ్చితి పుడమి (భార. శల్య. II. 74); లక్కయింటఁ జిచ్చొట్టితి (భార.శల్య. II. 134); కుడిచితి, కట్టితి, పెట్టితి (భార. ద్రో. V. 277); చనితేనిఁక (భార. భీ. II. 161); నీ వెక్కఁడ చనుదెంచితి (భార. ఆర. VII. 413); చూచితే (భార. ఆర. VI. 61; VII. 3); గాసిచేసితి (భార. ఉ. IV. 376); తోడుపడఁగాదని నిల్చితో (భార. భీ. III. 77); పనుపడితి (భార. ఆర. V. 152); ఒల్లవైతివి (భార. ఆర. V. 18); మెకమెక పడితి (భార. శాంతి. III. 392); మము నాపదలకుఁ బాపితి (హరి.ఉ.IV. 255); ఇమ్ముల న్వెడలితి (భార. ఆర.V. 120).

బహువచనము: ఏమిటికి వచ్చితిరి (వరాహ. II. 96); విజయం చేసితిరి (భార.ఉ. II. 106); చెప్పరైతిరే (భార.భీ.II. 119); మీరీ తక్కువ కోర్చితిరి (భార. ద్రో. II. 266); పోకులఁ బోయితిరి (భార. శాం. VI. 301); మొద.

తెగితిరే శినివీరుఁడ (భార. కర్ణ. III. 188)—ఇందు బహువచనరూప మచ్చు తప్పేమో. మిడిసిపడితివి (హరి. పూ. V. 247); అనునది 'మిడిసిపడు చున్నావు' అను వర్తమానార్థమున వాడఁబడినది. ద్వివర్ణక లఘుపూర్వక ను వర్ణాంత ధాతువులపై 'తివి, తిరి' చేరునపుడు 'ను' ఉత్వమునకు లోపమును తకారమునకు టకారాదేశమును గలుగును: అంటివి (వరాహ. VII. 51); తెచ్చికొంటివి (భార. భీ. I. 67); ఎట్లంటివి (భార. శాం. VI. 178); కంటే కదా (భాస్క. యు. 79); ఇది యేమి సేయంగ నెత్తికొంటి (భార. ఆశ్ర. I. 157); వింటె (భార. ఆర. VI. 331); (భాగ. IV. వింటే 59); ఇట్లే తింటివి, మంటివి; అంటిరి,కొంటిరి, కంటిరి, మొద.— 'చను' ధాతువున కిట్టి రూపములు గలుగవు: చనితివి, చనితిరి.

చు, చ్చు, వర్ణము లంతమందుగల ధాతువులపై 'తివి, తిరి' చేరునప్పుడు 'చ' కారమునకు సకారమాదేశమగును. యువర్ణాంత ధాతువుల క్త్వార్థక రూపముల తుది 'సి' లోని యిత్వమునకు లోపము కలుగును: ఇస్తివి (కృ. శత. 6, 19, 24, 25, 37); ఏ శకునాన వస్తివో (ప్రభు. పు. 14); మొద.

(2) భూతార్థక ధాతుజ విశేషణములపై 'వాఁడవు' అని ఏకవచనమునను, 'వారు, వారలు, వారలరు' అనువానిని బహువచనమునను జేర్చుటవలనను భూతకాలిక మధ్యమపురుష క్రియ లేర్పడును. నన్నయ యిట్టి రూపములనే వాడెను. కాని, తరువాతి కవు లా రూపములందలి తచ్ఛబ్ద 'వ' కారము లోపించి తత్పూర్వాచ్చు దీర్ఘము కాఁగా నేర్పడిన 'నాఁడవు, నారు, నారలు, నారరు, నారలరు' అనునవంతమందుగల రూపములను వాడఁజొచ్చిరి.

ఏకవచనము: ఇచ్చినాఁడవు (భార. ఉ. IV. 306; ద్రో. III. 107) సరకుగాఁ గొనకున్నాఁడవు (భార. శాం. IV. 425); ఉన్నాఁడవు (భాగ. I. 43); కన్నాఁడవు (భాగ. I. 43) కఱపినాఁడవు (భాగ. VII. 172); జనియించినాఁడవు (భార. అర. VI. 169); జన్మించినాఁడవు (భార. ఉ. IV. 59); మన్నాఁడవు(భాగ.I. 43); వచ్చినాఁడవు (భాస్క. యు. 1106); పేదవడ్డాఁడవు (భార. శాం. IV. 412); విన్నాఁడవు (భాగ. I. 43); మొద.

బహువచనము: (మీరు) ఉన్నారలు (భార. ద్రో. II. 268); ఉన్నారరు (భార. ద్రో. V. 111); జననము నొందినారరు (భార. అర. IV. 186); మొద.

-నాఁడవు, -నారరు, అనున వర్వాచీన కాలమున 'నావు, నారు' గఁ గూడ మాఱి గ్రంథముల కెక్కినవి: కలిమిచ్చినావు (అప్పక. IV. 411); చెందినావు (ఉ. రా. పు. 317); చేసినావు (నిరం. IV. 44); పోయినావె (పట్టాభిరా.) I. 15); పాసినావు (పట్టాభిరా. I. V. 174);- ఏఁగుదెంచినారు (వరాహ. I. 133); విచ్చేసినారు (కాళి. మా. III. 218); చూచినారు, మెట్టినారు (మను. I. 68); చనుదెంచినారు (హరి. పూ. V. పు. 101); వెరిగినారు (హరి. పూ. IV. పు. 205); మొద.

ప్రథమపురుషము.

(1) మహదమహదర్థముల రెంటను భూతకాలిక ప్రథమపురుషైకవచనమున ధాతువుపై 'ఎను' అను వర్ణకము చేరును. ఇందు 'ఎ' అనునది మాత్రమే భూతకాలార్థమును సూచించునది. 'ను' వర్ణకము కేవల ద్రుతము, పురుషబోధకము కాదు. యువర్ణాంత ధాతువులపై 'ఎను' చేరునపుడు యకారమునకు సకార మాదేశమగును:

అడిచెన్ (భార. అను. I. 89); అనియెన్ (నిర్వ. V. 43); అయ్యెన్ (భార. అర. VI. 268); ఏసెన్ (భాస్క. కి. 228); మొద.

మహాతీత రామహద్వాచకముల ప్రథమపురుష బహువచన క్రియలకును భూతకాలార్థమున నిట్టి రూపములే కలుగును: నెవ్వాలువగలనీనె (భార. విరా. II. 106); కులశైలంబులు గ్రక్కదంగదలె (భార. అర. V. 208); మధుపకులము లబ్జవనముల కురులంజొచ్చె (భార. విరా. II. 237); శోణితములు మడువులై తొట్టెన్ (భార. అర. V. 421); మొద.

i. 'అగు' ధాతువునకు భూతార్థమునఁ బైసందర్భములందు 'అయ్యెన్' అను రూపము కలుగును; దీనికి 'ఆయెన్' అనియు రూపాంతరము గలదు.

ii. 'పోవు' ధాతువు తుది 'వు' వర్ణము లోపించును: పోయెన్ (భార. విరా. III. 7; V. 32); మొద.

iii. 'ఉండెన్' అనుటకు 'ఉండనిమ్ము' అనియు నొకప్పు డర్థము గలుగును; అది యట్లుండెన్ (భార. విరా. III. 110; ద్రో. III. 114; శాం. IV. 409; హరి. పూ. I. 131); మొద.

iv. 'చెల్లంబో' అను సంతాపార్థకావ్యయమున 'చెల్లెన్' అనుటకు 'చెల్లన్' అను రూపము గలిగినది. 'అయ్యో నీ సుతు గ్రద్ద యెత్తుకొని పోయన్' (కేయూర. II.) అను ప్రయోగమున 'పోయెన్' అనుటకు 'పోయన్' అని యతిస్థానమున నున్నది. ఇది వ్యవహారానుసారముగ నున్నది.

v. రెండు లఘువర్ణములు గల ధాతువులపై 'ఎను' చేరునపుడు తొలుత వాని క్త్వార్థక రూపములమీఁదనే 'ఎను' చేరుచుండెడిది. కాని, రానురాను తక్కిన ధాతువులకువలెనే యిట్టి ధాతురూపములమీఁదను 'ఎను' చేరసాగెను:

డిగియెన్, అనియెన్, కనియెన్, కొనియెన్, చనియెన్, తినియెన్, మనియెన్, వినియెన్, ఇడియెన్, పడియెన్, మొదలగునవి నన్నయ భారతమందలి రూపములు. డగ్గతెన్ (భాగ. I. 243); చనెన్ (భార.అను. V. 287); కైకొనెన్ (భాగ. I. 247); ఇట్లే, డిగెన్, అనెన్, కనెన్, తినెన్, మనెన్, వినెన్, ఇడెన్, పడెన్, మొదలయినవి నన్నయకాలమునకుఁ దరువాతఁ గానవచ్చుచున్న రూపములు.

బహువచనమున భూతకాలిక ప్రథమపురుష మహన్మహతీవాచక క్రియలు ధాతువుల క్త్వార్థక రూపములపై 'రి' అనునది చేరుటవలన నేర్పడును:

అనురాగించుచుండిరి (భార. భీ. I. 170); కావరైరి (భార. విరా. III. 190); మ్రుగ్గులిడిరి (భార. విరా. V. 382); మొద.

(2) మహదర్థమున భూతార్థక ప్రథమ పురుషైకవచనమున 'వాఁడు' అను సర్వనామమును, బహువచనమున 'వారు' అను సర్వనామమును భూతార్థక ధాతుజ విశేషణములపైఁ జేరియు క్రియారూపము లేర్పడును. ఈ రూపములు విధేయ విశేషణములనియు నందురు:

ఏకవచనము: ఈలగఁ జుచుకొని యున్నవాఁడు (భార. ద్రో. II. 104); కోలుమసంగినవాఁడు (భార. భీ. II. 138); బీఱువాఱినవాఁడు (భార. ఉ. IV. 234); అడవింగలసినవాఁడు (భార. సౌ. II. 36); మొద.

బహువచనము: జెట్టాన జెట్లున్నవారు (భార. ఉ. IV. 425); మొద.

ఇట్టి క్రియారూపములందు 'వాఁడు, వారు' ల వకారమునకు లోపమును దత్పూర్వాచ్చునకు దీర్ఘమును గలిగిన రూపములు నన్నయకుఁ దరువాతికాలమునఁ గానవచ్చుచున్నవి:

ఏకవచనము: అన్నాఁడు (భాగ. X. 318); అప్పగించినాఁడు (భార. స్వర్గా. I. 16); ఐనాఁడు(భాగ. IV. 120); అరిగినాఁడు (భార. మా. I. 69); అర్థించినాఁడు (భాగ. VII. 77); ఉన్నాఁడు (భార. ఉ. IV. 312);చదివినాఁడు, చేసినాఁడు, జరపినాఁడు, తరపినాఁడు, నెరపినాఁడు, పడసినాఁడు, పుట్టినాఁడు, మఱపినాఁడు (భాగ. VI. 89); చెప్పినాఁడు (భార. మా. I. 124); చేసినాఁడు (భార. శాం. III. 519); తలఁచినాఁడు (భార. ఆర. V. 385); అడుగఁ బుత్తెంచినాఁడు (హరవి. IV. 63); పెంచినాఁడు (భార. శల్య. II. 347); పెరిగినాఁడు (భార. ఉ. III. 234); వచ్చినాఁడు (భాస్క. కి. 204); వరియించినాఁడు (భార. అశ్వ. I. 40); వసించినాఁడు (భార. స్వర్గా. I. 63); 'పెట్టినాఁడు' అనుటకు S. I. I. V. 196 లో 'పె [ట్టా] ం [డు] అను రూపముగలదు. పెట్టాడు, కొట్టాడు, మొదలయిన రూపములు వ్యవహారమునఁ గలవు; వీనిలోని పదమధ్య 'ఆ'కారము తాలవ్యోచ్చారణము గలది. నైజాము రాజ్యమున 'కొట్ట్యాడు' 'పెట్ట్యాడు' మొదలగు నుచ్చారణము గలదు. కొన్ని ప్రాంతములలో కొట్టిండు, పోయిండు, మొదలగు పలుకుబడి గలదు. ద్రావిడమున 'ఇ' పై 'అ' చేరునపుడు యడాగమము గాని, నగాగమము గాని కలుగవచ్చును: కట్టి + అ = కట్టియ; కట్టిన;- వీనిలో మొదటిదానినుండి 'కొట్ట్యాడు, కొట్టాడు (తాలవ్యోచ్చ)' అను రూపములును, రెండవదానినుండి 'కొట్టినాడు, కొట్టిండు' అను రూపములును గలిగినవి.

బహువచనము: ఉన్నారు (భార. ఉ. III. 204); కన్నారా, మన్నారా, విన్నారా (భాగ. I. 304); గటి కెక్కినారు (భాస్క. యు. 43); పలికినారు (భార. అను. V. 93); కలిగినారు (భార. అను. V. 97); పేర్చినారు (భార. అను. V. 98), చంపినారు (భార. అను. V. 103); పొందినారు (భార. అను. V. 104); కావించినారు (భార. అను. V. 105); చనినారు (భాగ. VI. 167); చనుదెంచినారు (భార. ఉ. III. 252); పైఁబడ్డారు (భాగ. I. 313); తోఁపవఁబడ్డారు (భాస్క. అయో. 80); చెప్పినారు (భార. అశ్వ. I. 45).

అమహదర్థక ప్రథమపురుష భూతకాలికైకవచనమున భూతార్థక ధాతుజ విశేషణముపై 'అది' అను సర్వనామము చేరును: పదుమూఁడు వత్సరంబులేని వేచినయది (భార. శల్య. II. 305); మొద. తనికినయది (భార. స్వర్గా. I. 3).

'అది' లోని తొలి అకారము లోపించి 'ది' మాత్రము చేరియు నిట్టి రూపములు గలుగును: ఉన్నది (భార. శల్య. I. 383); ఐనది (భార. విరా. III. 225); అతిశయిల్లినది (భార. ఆర. V. 370); నేర్పలవడ్డది (భార. విరా. I. 197); వినినది (భార. మా. I. 130).

మహాతీత రామహద్వాచకము లగునప్పుడు వైక్రియారూపముల తుది రూప'ది'వర్ణకమునకు 'వి' వర్ణకమగును: ఉన్నవి (భార. శల్య. II. 77); విన్నవి (భార. శల్య. I. 16); వచ్చినవి (భార. ఆర. VI. 164); తిన్నవి (భార. స్త్రీ. II. 121); ఎండినవి (భార. అను. V. 28); మొద.

అగ్ని చల్లన యయ్యేనేనిన్ (భార. ఆర. VI. 215) = అగునేని (తద్ధర్మార్థమున భూతకాలక్రియ); కల్గినయేని (భార. భీ. I. 127) = కల్గెనయేని (సంపూర్ణ భూతకాలక్రియా స్థానమున భూతకాలార్థక ధాతుజ విశేషణము); ఇట్లే, నాకు బొంకు గల్గినయేనిన్ (నిర్వ. V. 66).

IV. తద్ధర్మకాలము.

ఉత్తమ పురుషము.

i. ధాతువుపై నేకవచనమున 'దును', బహువచనమున 'దుము' చేరుట వలన: అగుదున్ (భార. ఉ. IV. 400); ఆఁగుదున్ (భార. ద్రో. III. 32); ప్రాయ్యెదుదుఁ (భార. విరా. I. 78); ఉండుదున్ (నిర్వ. V. 8); కడఁగుదునో (భార. భీ. I. 179); చంపుదున్ (భాస్క. యు. 1889); మొద.

ii. 'పోవు' ధాతువుపై 'పోవుదును, పోదును' అను రెండు రూపములు నగును: పోదును (భార. విరా. IV. 68; భీ. II. 365); మొద.

iii. ద్విలఘువర్ణక నువర్ణాంత ధాతువులపై 'దును' 'దుము' లు చేరునప్పుడు 'ను' వర్ణము నుత్తు లోపించును: ఎత్తునఁగొందుఁ గౌరవులనెల్లను (భార. విరా. IV. 9); ఇట్లే అందును, ఉందును, కందును, తిందును, మందును, విందును;—'చను' ధాతువుపై నీ కార్యము కలుగదు; 'చను' ధాతువుపై 'దును' 'దుము' లు చేరునో చేరవో తెలియదు. ఇట్టి రూపములందు 'దు' వర్ణమునకు 'డు' వర్ణమును గలుగును: ఆకొండున్ (భార. విరా. I. 135); మార్కొండుఁ (భార. ఉ. I. 237); విండున్ (భార. నిర్వ. IV. 4, 7); 'ండు' తోడి రూపములు ప్రాసముకొఱకు పుట్టినవేమో. అందును, కందును, ఉందును (ఉత్తమ), తిందును, మందును, కొందును (ప్రధానక్రియగా), అను వానికిఁ గాని, వాని 'ండు'తోడి బహువచన రూపములకుఁగాని ప్రయోగములు కానరావు.

ప్రాఁకుదుమా (భాస్క. యు. 279); పడయుదుము (భార. విరా. I. 49); పోదుమె (భార. విరా. IV. 198); అందుమే (భార. అను. II. 314); మొద.

ii. ధాతువుపై నేకవచనమున 'ఎదను' బహువచనమున 'ఎదము' చేరుటవలన: అచ్చెదన్ (హరి. పూ. V. 232); వేఁటాడెద (భార. ఉ. IV. 407); ఆర్చెదన్ (భార. కర్ణ. III. 49); మొద. చాలెదము (భార. ఉ. IV. 248); చూచెదము (హరి. పూ. I. 105); జుత్తెదము (దాశ. శత. 30); తలంచెదము (భార. అర. VII. 262); ముట్టెదము (భార. అర. IV. 240); వేఁడెదము (భార. ఉ. III. 22).

(అ) 'అగు' ధాతువుపై 'ఎదను', 'ఎదము' లు చేరి 'అయ్యెదను, అయ్యెదము' అను రూపములు లేర్పడును. నీ మృత్యువై యుద్భవమయ్యెద (నిర్వ. V. 19).

(ఆ) యువర్ణాంత ధాతువులపై 'ఎదను, ఎదము' లు చేరునప్పుడు యకారమునకు సకార మాదేశమగును: చేసెదన్ (భార. విరా. I. 328); మొద.

(ఇ) 'పోవు' ధాతువుపై నావర్ణకములు చేరునప్పుడు 'వు' వర్ణములోపించి యెదాగమము గలుగును: పోయెదన్ (భాస్క. కి. 515); మొద.

(ఈ) ద్విలఘువర్ణక నువర్ణాంత ధాతువులపై 'ఎదను' 'ఎదము' లు చేరునపుడు ధాతువుపై 'ఇ' త్తు చేరును. ఈ యిత్తు క్త్వార్థక సంబంధి కాదు: కొనియెదను(కళా. III. 47); డిగియెద (భార. శల్య. II. 333); తినియెద (భార. భీ. II. 8); పనివినియెదన్ (భాస్క. యు. 159); మొద. ఇట్టి ధాతువులమీఁదనే 'ఎదను, ఎదము'లు చేరిన రూపములు పూర్వకావ్యములందు కానరాలేదు. అనఁగా, అనెదము, కొనెదను, వినెదము, మొదలగు రూపములు లేవేమో.

(ఉ) 'తునిసెదను' (భాస్క. అర. I. 227) తునియఁజేసెదను; కన్నడము: 'తునిసు' అను ప్రేరణధాతువుపై 'ఎదను' చేరినది.

(ఊ) 'ఎదను' అనునది 'ఏను' గను, 'ఎదము' అనునది 'ఏము' గను వ్యవహారమున మాఱినది: నమ్మేనెట్లు నీ పుట్టువు (ఒం. రఘు శత. 44); వారి పాదాలు మాశిరస్సున ధరించేము (S. I. I. VI. 248); మ్రొక్కేము నీ కాళ్లకున్ (పార్వ. పు. 67); చచ్చేమని పల్కినారు (రంగారా. II. 245); మొద.

iii. చు, ంచు, చ్చు, లంతమందుగల ధాతువులపై 'దు' వర్ణకము చేరునప్పుడు పూర్వకావ్యములందు 'చుదు' 'తు' గను, 'ంచుదు' 'ంతు' గను, 'చ్చుదు' 'త్తు' గను మాఱుచుండెను:

చక్కడతున్ (భాగ. VII. 272); తాకులాడింతునె, కావింతునె, వ్రాయిఁతునె, మ్రింగిపుత్తునె (భాస్క. యు. 1339); ఇత్తున్ (భార. విరా.

I. 107); ఎఱిఁగింతు (భాస్క. అర. II. 93); ఓర్తున్ (భార. కర్ణ. I. 45); కూర్తున్ (భార. విరా. I. 101); చూతుఁ (భార. అను. II. 203); తీర్తున్ (భార. ద్రో. V. 121); తొలఁగింతున్ (భార. భీ. I. 224); నమస్కరింతు (భాగ. VIII. 155); పగుల్తున్ (భార. కర్ణ. I. 250); వత్తును (భార. అశ్వ. I. 148); పనుతును (భార. ద్రో. IV. 131); విఱుతున్ (భార. విరా. I. 223); మొద.—ఏతెంతుమో (భార. శల్య. II. 44); పెటికి పేటాడి వైపింతుము (భాస్క. యు. 207).

(అ) 'ఏర్తున్, నేర్తున్' అనువానికి 'ఏతున్ (భార. విరా. II. 281), నేతున్ (భార. విరా. I. 196)' అను రూపములు కానవచ్చుచున్నవిగాని, యవి ప్రాసములోఁ జేర్పడిన కృతకరూపములై యుండును.

(ఆ) అర్వాచీన కావ్యములందు చు, ంచు, చ్చు అను ధాత్వంతవర్ణములపై 'దు' వర్ణకము చేరి 'చుదు' కు 'తు' కలుగని రూపములును గానవచ్చుచున్నవి. అట్టియెడ తత్సమ ధాతువుల తుది 'ంచు' నకు 'ంపు' వైకల్పికముగ నాదేశమగును: ఆకర్ణించుదురు, ఆకర్ణింపుదురు (భాగ. X. i); మొద.

(ఇ) యువర్ణాంత ధాతువులపై 'దు' వర్ణకము చేరునప్పు డర్వాచీన కావ్యములందు 'యుదు' అనుదానికి 'తు' ఆదేశమగుట కాన్పించుచున్నది. వ్యవహారమునను నిట్టి రూపములు గలవు: చూ. ఉత్తరాంధ్రము: చేతును, చేతుము; కోతును కోతుము; మొద.

iv. ధాతువుపై నేకవచనమున 'వాఁడను', బహువచనమున 'వారము' చేరుటవలనను తద్ధర్థక కోత్తమపురుషక్రియ లేర్పడును.

చంపుదు నొండె...నిహతినొందువాఁడ (భాస్క. యు. 1889); చనువాఁడను (భార. నిర్వ. V. 42; అర. VI. 151); చేయువాఁడ (భార. హరి. ఉ. III. 75); పేర్కొనువాఁడను (భార. విరా. I. 8); వచ్చువాఁడ (భార. విరా. I. 285); మొద.

## మధ్యమపురుషము.

i. ధాతువుపై నేకవచనమున 'దువు', బహువచనమున 'దురు' చేరుటవలనఁ దద్ధర్థక మధ్యమపురుషక్రియ లేర్పడును. 'దువు' లోని 'వు' వర్ణము లోపించుటయుఁ గలదు:

రథంబు గడుప నీవగుదు (భార. ఉ. I. 111); శాంతుంగావింప నోపుదేని (భార. ఉ. III. 385); శౌర్యమునన్ నెగడుదు (భాస్క. కి. 144); నీవు తున్నువోదు (భార. శాం. IV. 899); ఏ పనిమెయి వర్తిల్లుదు (భార. విరా. I. 108); తెలివి మాన్పుదువు (ఆంధ్ర నా. శత. 51).

ii. చు, -ంచు, చ్చు, అంతమందుగల ధాతువులపై:

జీవింతువు (భాగ. IV. 596), కబళమన నోరుదెఱుతువు (సిం. నార. శత. 38); కన్నారఁ జూతుగాని (భార. భీ. III. 279); చూతు (భార. ఉ. III. 206); పరిగ్రహింతుగా (ప్రభా. V. 18); పోయివత్తు గాక = పోయి రమ్ము (భార. ఉ. I. 364); ఎంతు (ఒం. రఘు. శత. 20); సనుతె (భార. అశ్వ. IV. 27);—మీరలాపనికి నేర్తురే (భార. ఆశ్ర. I. 148).

iii. ధాతువులపై 'ఎదవు, ఎదరు' లకు చేరి:

ఎక్కుడు మాటలాడెదవు (భార. ఉ. I. 253); ఏఁగెదవు (భార. విరా. I. 312); కొల్చెదవు (ఒం. రఘు. శత. 20); చూచెదవు (భార. విరా. III. 60); చెప్పెదవు (భార. ఉ. IV 206); దునిమెదవు (భార. శల్య II. 215); పలికెదవు (భార. కర్ణ. II. 9); మఱపెదవు (భాస్క. సుం. 194); విచ్చేసెదవు (వరాహా. II. 5); విఱ్ఱవీఁగెదవు (భాస్క. యు. 2082); ఆడించెదవు (ఆంధ్రనా. శత. 51).

-'ఎదవు' నకు 'ఎదు' అనియు రూపము గలదు: కర్ణ, కయ్యపు బలు పాడెదు (భార. కర్ణ. II. 25); కొండయెక్కెదు బ్రతిమాలుకొన్న కొలఁది (సిం. నార. శత. 2); ఏతెంచెదుగాక (భార. భీ. I. 160); కనుకట్టు గట్టెదు గారడీఁడును బోలె (ఆంధ్రనా. శత. 51); చూచెదుగాక (భార. ద్రో. IV. 9); ఒదిగిచూచెద కలిఁబోయ నుట్లదిక్కు (సిం. నార. శత. 39); ధిక్కరించెదు (భార. అర. VI. 174); ఉరిసినపుండుల నుప్పువెట్టెదు (భార. ద్రో. V. 35); నీ వెక్కడఁబోయెదు (భాస్క. కి. 362), నోరఱువంగఁ బ్రేలెదు (భార. అర. IV. 195).

మీరేల కారించెదరు (భార. అర. VI. 39); మీరిదియేటి కాగడంబుసేసెదరు (భార. అను. V. 312); మొద.

'-ఎదవు, -ఎదరు' లు '-ఏవు, -ఏరు' లుగ వ్యవహారమున మాఱి గ్రంథములకు నెక్కినవి. ఆఱడిఁ బెట్టేవు (ఒం. రఘు. శత. 8); నెరపేవు (రంగారా. II. 169); చూచేవు (రాధామా. I. పు. 3); అడిగేవు (రాధామా. I. పు. 5); మఱచేవు (రాధామా. III. పు. 55); కృశియించేవు (పట్టు. III. 140); మొద.

## ప్రథమ పురుషము.

i. (1) **మహదమహద్వాచక తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనమందును, మహతీతరామహద్వాచక తద్ధర్మార్థక ప్రథమపురుష బహువచనమునను, ధాతువుపై ద్రుతము మాత్రము చేరును:**

ఏమనునో యెటుసూచు నొక్కొ, ఏతలఁపు వచ్చునో (భార. విరా. I. 129); అలందురుగన్ (భార. విరా. II. 293); ఇంతలు పాపము లాచరించునే (భార. ఉ. III. 83); సవతి కొడుకయేలు నవనియెల్ల (భార. అర. VI. 295); పలికిననేమి యన్నియును బల్కనగున్ (భార. ఉ. IV. 418);— ధర్మువుల్ గల్గునే (భార. అర. IV. 382); ఆశ్రమంబులు ...కలియుగంబున గత్తెరఁ గలిసిపోవు.

పయిసందర్భములందు ధాతువుపై ఎడున్, ఎడిన్, నన్నకములు చేరియుఁ గ్రియారూపము లేర్పడును:

ఇక్కడ మునికి మనకింక నెంత లెస్సయయ్యెడున్ (హరి. పూ. V. 251). అఱచెడున్ (భార. స్త్రీ. II. 69); కెలసం బెవ్వరికెక్కెడున్ (భార. సౌ. 24). ఎద్ది దెఱఁగయ్యెడినో (భార. విరా. I. 59); ఏమినీఁగ రాదయ్యెడినో (భార. ద్రో. II. 250); నాకల నిక్కల యయ్యెడు శోకింపకు మమ్మ (భార. అర. VI. 401); మొద.

(2) ధాతువుపై తచ్ఛబ్దార్థకమగు 'వాఁడు' పదము చేరి మహద్వాచక తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనరూపమును, 'వారు' చేరి బహువచన రూపమును నేర్పడును:

అశ్వత్థామ గాండీవితోఁ బురుడింపంవగువాఁడు (భార. ఉ. IV. 228); కొల్చువాఁడు (భార. విరా. I. 85);— ధాతువుపై 'ఎడు, ఎడి' చేరిన రూపముల మీఁదను 'వాఁడు' 'వారు'లు చేరవచ్చును. రిత్తలు రజ్జెడువాఁడే (భార. ఉ. IV. 204); సాత్యకి యలఁతులఁ బోయెడువాఁడే (భార. ఉ. I. 268).

(3) ధాతువుపై 'దురు' చేరుటవలన మహన్మహతీవాచక తద్ధర్మార్థక ప్రథమపురుష బహువచనక్రియ లేర్పడును: ఉండుదురు (భార. ద్రో. III. 29); ప్రాఁకుదురు, దాఁటుదురు, చిమ్ముదురు, పెనఁగుదురు (భాస్క. యు. 25); ఎక్కుదురు (భాస్క. యు. 26); ఏలుదురు (భార. విరా. I. 298); మొద.

ii. నువర్ణాంతములగు ద్విలఘు ధాతువులపై 'దురు' చేరునపుడు నువర్ణము నుత్వమును, ఒకప్పుడు 'దు' వర్ణము నుత్వము కూడను లోపించును; 'దు' వర్ణము దకారమునకు డకారమాదేశముగఁ గూడ రావచ్చును.

పట్టుకొందురు (సిం. నార. శత. 55); పొడగందురు (భాగ. I. 58); అందురు (భార. అను. IV. 136); కొనకొండ్రు (భార. శాం. VI. 242); తిండ్రు (భార. విరా. IV. 217; నిర్వ. V. 106); విందురు (భార. నిర్వ. IV. 7); మొద.

iii. చు, ంచు, చ్చు, లంతమందుగల ధాతువులపై 'దురు' చేరునప్పుడు చుదు, ంచుదు, చ్చుదు, లకు క్రమముగ -తు, -ంతు, -త్తు లగును: ఇచ్ఛయింతురు (భాగ. X. ii. 50); ఇత్తురు (భాగ. VIII. 527); భయ మొనర్తురు (భార. అర. IV. 293); తాఁకోర్తురు (భార. ఉ. IV. 257); మొ.

ఈ కార్య మర్వాచీనకాలమునఁ గలుగక చువర్ణమునకు 'వు' వర్ణమాదేశము కాఁగా దానిపై 'దురు' చేరుచు వచ్చెను: కదలువుదురు (భాగ. X. i. 289); ఆకర్ణింపుదురు (భాగ. VIII. 21); చరియింపుదురు (భాగ. III. 887); నిర్ణయింపుదురు (భాగ. V. ii. 84); మొద.—'చుదురు' తోడి రూపములును నర్వాచీనకావ్యములందు గలవు. చూ. ఉత్తరాంధ్రము.

iv. యువర్ణాంత ధాతువులపై 'దురు' చేరునపు డేర్పడిన 'యుదురు' అనుదానికి 'తురు' అనియు నర్వాచీనకావ్యములందు కానవచ్చుచున్నది. చేతురు, కోతురు, మొద. చూ. ఉత్తరాంధ్రము.

v. ధాతువుపై 'ఎదరు' చేరియు మహన్మహత్యర్థక తద్ధర్మ ప్రథమపురుష బహువచనరూపము లేర్పడును: ఎవరెట్లయ్యెదరో (భార. భీ. I. 128); ఎఱుఁగఁజాలరయ్యెదరు (భార. II. 23); ఫలములానెదరు (భార. అర. VII. 9); పట్టిపాలార్చెదరు (భార. భీ. II. 280); కలఁచెదరు (భార. ద్రో. IV. 163); మీఁరేమిగాచెదరు (భార. ద్రో. III. 172); కారించెదరు (భార. అర. VI. 39); చరించెదరు (భార. అర. IV. 291); నశించెదరు (భాగ. III. 645); పరిగ్రహించెదరు (భార. అర. IV. 298); పొడిచెదరే (భార. ఉ. IV. 244); పోరెదరు. (భార. ద్రో. IV. 266); వగచెదరు (భార. హరి. ఉ. VIII. 12); వచ్చెదరు (భాస్క. కి. 496).

'—ఎదరు' కు '—ఏరు' అనియు వ్యవహారమునను నర్వాచీన కావ్యములందును ప్రాచీన శాసనములందును రూపాంతరము గలదు: నవ్వేరెవరైన విన్న (దశావ. పు. 218); మొద.

(4) ధాతువుపై 'వాఁడు, వారు' లు చేరి వరుసగ నేక బహువచనములందు తద్ధర్మార్థక ప్రథమపురుషక్రియ లేర్పడును. ప్రందువారు (భార. విరా. II. 146); తప్పింపం జాలువారు (భార. ద్రో. II. 305).

IV. భవిష్యత్కాలము.

సాధారణముగఁ దద్ధర్మబోధక క్రియారూపములే భవిష్యదర్థమునందును వచ్చును. తుమున్నర్థక అన్నంత రూపములపై 'కల' అనుబంధముగాఁ జేరిన రూపములు కొన్ని ప్రాచీనకాలమున భవిష్యదర్థక క్రియారూప

ములుగా నుండెడివి. కాని, యిట్టి రూపములు నేఁడు జాబుల వక్కాణముల లోను దస్తావేజులలోను మాత్రము కానవచ్చుచున్నవి. సాధారణముగ వ్యవహారమున సంపూర్ణక్రియలయందు 'కల' కు 'శక్తిగల' అనియే యర్థము గలదు.

'ఎద' గాగమముగల రూపములును 'దు' గాగమ రూపములును భవిష్యదర్థమును దెలుపునవియే. 'ఎద' గాగమముగల రూపములు నేఁడు వ్యవహారమున లేవు; 'ఎద' కు 'ఏ' అను పరిణామము గలిగినది. వ్యవహారమున నీ రూపములన్నియుఁ గలవు; కాని, వానికి సూక్ష్మములగు నర్థభేదములు గలిగినవి. ఈ క్రింది యుదాహరణములవలన నీ భేదములను గ్రహింపవచ్చును: నీవు చెప్పి ఉంటే పోదును, ఇప్పుడు చెప్పినావు గనుక పోతాను; ఈ మాట మరెవ్వరితో నయినా చెప్పేవు సుమీ, చెప్పితే కష్టము వస్తుంది; నేను వేళకే వస్తును, కాని, రైలు ఆలస్యమయింది; మొద. వస్తాను, వెళ్లుతాను, మొదలగువానిలోని 'తా' అనుదానివలనను కేవల భవిష్యదర్థము వ్యవహారమునఁ గలుగుచున్నది.

చేయనుండెను, చేయనున్నాఁడు, చేయనుండును, అనువానిలో ఉండెను, ఉన్నాఁడు, ఉండును అనునవి వేర్వేఱు కాలములను దెలుపుచున్నను 'చేయన్' అను నన్నంత క్రియారూపమువలనఁ దత్తత్కాలములందు భవిష్యదర్థము స్ఫురించుచున్నది. ఇట్లే, చేసియుండెను, చేసియున్నాఁడు, చేసియుండును, అనువానిలోఁగూడ ఉండెను, ఉన్నాఁడు, ఉండును, అనునవి వేర్వేఱు కాలములను దెలిపినను 'చేసి' అను క్త్వార్థకరూపమువలన భూతార్థమే ద్యోతకమగును. ఇట్టి సూక్ష్మార్థభేదములను వ్యావహారికభాషలోఁ గనిపెట్టఁగలిగినట్లు గ్రాంథికభాషలోఁ దెలిసికొనుట శ్రమైకసాధ్యము - చూ. ఉత్తరాంధ్రము.

### V. తెనుఁగునఁ బ్రార్థనార్థక క్రియారూపములు.

ధాతువుపై ము-వర్ణమును జేర్చుటవలనఁ బ్రార్థనార్థక క్రియల యేకవచన మేర్పడును. కావ్యములందు హలవసానములు పరములగునపు డీ మువర్ణము లోపించుటయుఁ గలదు. వ్యవహారమున నీ మువర్ణ మచ్చుపరమగునపుడే కాన్పించును; హలవసానములు పరములగునపుడు మువర్ణము కనఁబడదు. కొన్ని ప్రయోగములు:

i. అచ్చుపరమగునపుడును, నవసానము పరమగు నపుడును మువర్ణము లోపించనందుకు: దానవి తనకున్ మగఁడ వగుమనినన్ (భాస్క. అర. I. 145); రాజ్యలక్ష్మిఁ దగు చందమునం గొనియాడు మున్నతిన్ (భార. విరా. III. 95); ఎయిదు మెయిదుము (భార. విరా. III. 203); కట్టుము పట్టు మతనిన్

(భార. ద్రో. I. 62); కూరుకు మోపాపఁడ! (భాగ. X. i. 237); చెప్పు మటన్నన్ (వరాహ. II. 5); పోరు మెుండె... విష్ణుపదంబు నొందుము (భాస్క. యు. 1620); వెట్టివాఁడ యోడముంచకు మనురీతి (సిం. నార. శత. 44); వామాక్షి యెుక తె తీసంచవేయుమటన్న (చమత్కా. I. 43.); ఏమని యెదనుము (భార. కర్ణ. III. 206); ఎట్టు లరయవలసె నమ్మెయి నారయుము (భార. విరా. II. 214); మాబన్న మీఁగుము (భాగ. VI. 341); ఏయకుండుము (భార. కర్ణ. III. 351); ఊఁదుము (భార. శాం. VI. 167); సత్పదముఁ జెందుట కెక్కుము (భార. శాం. VI. 227); ఎద్దుము (భార. ద్రో. II. 247); మునులకంటె మీఁదై యొప్పుము (హరి. పూ. I. 59); ఈ బయలు నీ తలనె కట్టికొనుము (భార. శల్య. II. 72); కనికొనుము (భార. అశ్వ. II. 37); నీవు చాలుము (నిర్వ. VI. 84); పొడసూపుము (భార. ఉ. IV. 385); పాండు రాజునకు జనించితేని తెగి చూపుము (భార. ద్రో. III. 195); డగ్గఱుము (భార. ద్రో. V. 128); వ్యథలు తల్గుము (భార. ఆర. VI. 364); ఋణంబు నీఁగుము (హరి. ఉ. X. 238); చిత్తవృత్తిఁ జిక్కఁబట్టుము (భార. విరా. IV. 69); నాకుఁ బల్కుము (భాగ. V. i. 28); వాకిలిఁ బుచ్చుము (భార. ద్రో. II. 270); నీ తనూజుని ... కౌశికున కిచ్చి పుచ్చుము (భాస్క. బాల. 206); నీ పసులఁగావఁ బెట్టుము భూపాలక నన్ను (భార. విరా. I. 278); నీ కాంతలు నీవుఁ గామిత సుఖంబులఁ బొందుము (భాస్క. కి. 159); విష్ణుపదంబు నొందుము (భాస్క. యు. 1620); సత్రాణుండ్వై మనుము (భాస్క. సుం. 195); ఇంకొండు తలంపు మానుము (భార. ఆర. VI. 49); ఓరి వినుము (భార. ఆర. VI. 82); మహారాజా వినుము (భార. ఉ. III. 276); చెవియును మదియుఁ గూడఁ జేర్చి వినుము (భార. శాం. II. 205); వెలలుము (హరి. ఉ. IV. 17); ఈప్సితం బైనది వేఁడుము (భార. ఆర. VI. 255).

ii. అర్వాచీన కావ్యములందు మువర్ణమున కచ్చుపరమగునపుడును మువర్ణమునకు లోపము కలుగుట కాన్పించును: ఆడిదె నీదు పందెము (కళా. VI.); భవచ్చిత్తేప్సితం బెట్టి చెప్పునినన్ (మాస్క. II.), మొద.

iii. హల్లు పరమగునపుడు మువర్ణము లోపింపనందుకు: అనిచి పుచ్చుము నన్నున్ (భార. అను. II. 24); నీ వర్జునునిపాలి కరుగుము నాకున్ (భార. ద్రో. III. 296).

iv. హలవసానములు పరము లగునపుడు మువర్ణము లోపించుటకు: అఱుము (ము) (భార. ఉ. III. 97); నాపలు కూఁదు (భార. శాం. I. 221); ఎఱుఁగఁ జెప్పు (నిర్వ. VII. 4); అనిచిపుచ్చు (భార. ఆర. II. 172); పెఱుకు

(భాస్క. అయో. 190); మర్మ మెఱిఁగినవారితో నూను వాదు (సిం. నార. శత. 43), మొద.

v. ఆమ్రేడితము పరమగునపుడ డజ్ఝల్లులలో నేది పరమయినను మువర్ణము తఱచుగ లోపించును: ఆగాగుము, ఆగుమాగుము; ఆడాడుము, ఆడుమాడుము; చెప్పు చెప్పుము; చెప్పుము చెప్పుము; మొద. తఱచుగ ననుటచే లఘ్వాదులగు ద్వివర్ణకాజాది ధాతువుల కామ్రేడితము పరమగునపుడు మువర్ణము లోపింపదు: అగగుము, అననుము, ఇడిడుము, మొదలగు రూపములు కలుగవు:—కమ్ము, కొమ్ము, తెమ్ము, పొమ్ము, రమ్ము, ల కామ్రేడితము పరమగునపుడు మ్మునకు లోపము వైకల్పికముగ నగును. అగుచోఁ బూర్వాచ్చునకు దీర్ఘము గలుగును: కాకమ్ము; కోకొమ్ము (భార. భీ. III. 318); తే తెమ్ము; పో పొమ్ము (భార. ఉ. IV. 282); రా రమ్ము; మొద. కమ్ము కమ్ము, కొమ్ము కొమ్ము, మొదలగు రూపములును గలవు. 'ఇమ్ము' న కామ్రేడితము పరమగునపుడు 'ఈయిమ్ము' అని యగునేమో తెలియదు: 'చాచావుము, మామానుము' అనవచ్చును; 'కాకావుము' అనవచ్చునేమో తెలియదు. ఆఆనుము. ఈఈనుము, మొదలగు రూపములు కలుగవు. 'మానుము మానుము' అనుటకు 'మామా' అని పోతన ప్రయోగించినాఁడు: మామా నాపయిఁ గోపము మామా (భాగ. IX. 548); వ్యవహారమున 'మా' = మానుము అను రూపము లేదు; సంస్కృతమందలి 'మా' = వలదు అను నవ్యయమును పోతన మనసునం దుంచుకొని 'మామా' అని ప్రయోగించి యుండును; లేదా, అనుప్రాసము కొఱకైనను నట్లు చేసియుండవచ్చును. 'మ్ము' తోఁ బ్రార్థనార్థమును బొందు క్రియల కామ్రేడితమున రెంటను 'మ్ము' లోపించును: పోపో పిఱికి (భార. ద్రో. I. 174); ఇల్లే, లేలే, తేతే, కోకో, రారా, మొద.

vi. 'కొను' ధాతువుపై మువర్ణము చేరునపుడు నువర్ణము నుత్వమునకు లోపమును నకారమునకు మకారాదేశమును గలుగును: డప్పియార్చి కొమ్ము (భార. కర్ణ. III. 179); నీ సిగ్గు నిలుపుకొమ్ము (సిం. నార. శత. 44); మొద. 'కొన్ము' అని నిలుచునేమో తెలియదు. 'కనుము' 'కన్ము' అగును (భార. అర. V. 97); అగు ధాతువు ప్రార్థనార్థక క్రియయగు 'కమ్ము' నకును దీనికిని భేదముఁ జూపుట కీమార్పు 'కన్ము' తో నిలిచియుండును. అను, చను, తిను, దును, ధాతువులపై నిట్టి కార్యములు కలుగనట్లే తోఁచుచున్నది.—(కొనుము, 'కో' కూడనగును; చెప్పుకో, అనుకో, మొద. ఊరకుండు అను, శబ్దపల్లవ ధాతువున కర్వాచీనకాలమున 'ఊరకొను' అను రూపము గలుగగాఁ బ్రార్థనార్థమున 'ఊరకో' అను రూపము గలిగినది: ఊరకో

నాయన్న యూరకో తండ్రి (నా. సో. బసవ. పు. 84); నేఁటి వ్యవహారమున నిట్లే వినఁబడుచున్నది. 'ఊరుకో' అనియుఁ గలదు.

vii. చువర్ణాంత ధాతువులపైఁ బ్రార్థనార్థక ము వర్ణకము పరమగు నపుడు కొన్ని యెడల గొన్ని విశేషకార్యములు గలుగుచున్నవి.

(అ) ఇంచుక్కు చేరిన తత్సమక్రియలపై మువర్ణము చేరునపుడు చకారమునకు పకార మాదేశమగును. వివేకింపుము (భార. శాం. I. 61); స్వామికోపం బుపసంహరింపుము (భార. శాం. V. 441); మొద.

ఉత్తరాంధ్రమునఁ దత్సమ ప్రార్థనార్థక క్రియలయందును చకారమునకు పకారాదేశము వైకల్పికముగఁ గాన్పించుచున్నది: కరుణించుము, కరుణింపుము. ప్రయోగములకు పండ్రెండవ ప్రకరణమును జూడవలెను.

(ఆ) ఇంచుక్కంతమందుగల యాచ్ఛికధాతువులందలి చకారమునకును దొలుత ప్రార్థనార్థమున పకార మాదేశ మగుచుండెను: ఆమతింపు (ము) (భార. ఆర. VI. 70); పిలిపింపుకోమలిన్ (భార. విరా. II. 76); మానిపింపు (పాండు. I. 209); బండ్లమెట్టింపు (హరి. పూ. IV. 22); వినిపింపుము (భార. అశ్వ. II. 88; భాగ. III. 745); సైరింపుము (భాగ. V. 146); మొద.— పకారాదేశము రాని రూపములకు చూ. పండ్రెండవ ప్రకరణము.

(ఇ) (1) ఁచు, చు, ంచు, అంతెమందు గల ధాతువులపై ప్రార్థనార్థక మువర్ణము చేరునపుడు సాధారణముగ చకారమునకు పకార మాదేశమగును: మనుజుగా నిన్నుఁగను తప్పు మాకు సైఁపుము (హరి. పూ. VII. 237); వలసినపనిఁ బంపుము మమ్ము (భాస్క. బాల. 416); ఇట్లే, ఏఁచు (ఏఁపుము); చాఁచు (చాఁపుము), మెలఁచు (మెలఁపుము), వేఁచు (వేఁపుము), అడఁచు (అడఁపుము), ఆఁచు (ఆఁపుము), డా (దా) ఁచు (డాఁదా) ఁపుము), తాఁచు (తాఁపుము), మడఁచు (మడఁపుము), మలఁచు (మలఁపుము), తోఁచు (తోఁపుము), తొలఁచు (తొలఁపుము), అంచు (అంపుము), ఉంచు (ఉంపుము), అడరుచు (అడరుపుము), ఏచు (ఏపుము), కాలుచు (కాలుపుము), కుదుచు (కుదుపుము), అలవఱుచు (-పుము), ఉలుచు (-పుము), ఏమఱుచు (-పుము); ఇట్లే, ఎలరుచు, ఉనుచు, అదరు (-లు) చు, కదలుచు, కెరలుచు, చిముడుచు, చీలుచు, డు (దు) లుచు, మొద.— వీనిలోఁ గొన్నిటికిఁ బ్రాచీనకావ్యములందే పకారాదేశము వైకల్పికముగఁ గాన్పించుచున్నది. అర్వాచీనకావ్యములం దా యాదేశము వైకల్పికమే.

(2) అఱచు, ఆర్చు, ఏడుచు, ఓర్చుచు, కడచు, కఱచు, కాచు, కొలుచు, తఱచు, తెఱచు, పిడుచు, పొడుచు, ప్రోచు, తొలుచు, నిలుచు, వెఱచు, విడుచు, మొదలగు ధాతువులపైఁ బ్రార్థనార్థక మువర్ణము పరమగునపుడు

చకారమునకు వకార మాదేశమగును : కాముతూపులఁ దొడింబడకుండఁగఁ గావుము (భార. విరా. II. 121); విడ్వుము (భార. అర. VI. 346); మొద.

(3) ఏమఱచు, ఒలుచు, కొలుచు, గెలుచు, నిలుచు, పిలుచు, మఱచు, విడుచు, వెఱచు, మొదలగు ధాతువులపైఁ బ్రార్థనార్థక ప్రత్యయములు చేరునప్పుడు, వాని తుది చువర్ణమునకు లోపము గలుగును; గెలుము (భార. అర. VII. 114; విరా. IV. 43); నిలుము (భార. అర. V. 430; ఉ. IV; ద్రో. I. 376; శాం. VI. 325); నిలునిలుము (భార. ద్రో. I. 163; III); నిలునిలు (భార. ద్రో. II. 59); నిలుఁడు (భార. ద్రో. I; అచ్చరా. యు.); మఱుము (భాస్క. యు. 383), పోవిడుము (భార. విరా. II.); మొద.— మఱచు, ఏమఱచు, వెఱచు ధాతువుల మధ్య శకటరేఫ నుండుటచేతను; దాని మీఁది చువర్ణము తొలఁగఁగా 'ము' వర్ణము కాక తమిళమునందువలె 'ఉమ్' అను ప్రార్థనార్థక ప్రత్యయము చేరినది. 'తివుచు' ధాతువు ప్రార్థనార్థకైక వచనము : తివుము, తివ్వుము; బహు. తివుఁడు, తివ్వుఁడు, వెఱపుము (కాశీ.)

(4) 'లేచు' ధాతువు ప్రార్థనార్థమున చువర్ణము లోపించి 'లే' అని నిలుచును; తుది పనికివచ్చెలే నీకు తురకగుద్దు (సిం. శత. 30); 'లే' పై మువర్ణము వైకల్పికముగఁ జేరును; చేరుచో 'లే' లోని యచ్చునకు హ్రస్వమును మువర్ణము మకారమునకు ద్విత్వమును గలుగును : దండిమై లెమ్మ (భార. భీ. I. 192); లేలెమ్మ (భార. శల్య. II. 79);— అనంతపురమున 'లే' అనుటకు 'లెయ్' అందురు. శూద్ర వ్యవహారమున 'లెగు, నెగు' అని వినఁబడును.

(5) క్రాఁచు, నాఁచు, లాఁచు, వాఁచు, లోఁచు, కుంచు, ధాతువులపై బ్రార్థనార్థక దుజ్ఞులు చేరునపు డెట్టి రూపములు కలుగునో తెలియదు.

(6) 'నోఁచు' ధాతువుపై మధ్యమ ముడుజ్ఞులు చేరునపుడు 'నోచు' కు 'నోము' ఆదేశమగును ; నోముము, నోముఁడు.

(7) 'చూచు' ధాతువుపై మధ్యమ మువర్ణము చేరునపుడు 'చు' కు 'డు' ఆదేశమై 'చూడుము' అని యగును; ఒకప్పుడు 'చూచు' తుది చువర్ణమునకు లోపమును, మొదటి దీర్ఘమునకు హ్రస్వమును. మధ్యమ మువర్ణము మకారమునకు ద్విత్వమును గలుగును : చుమ్మన్న (భార. అర. VII. 264, 458); చుమ్మయ్య (భార. శాం. IV. 246); మొద. నన్నయ 'చుమ్మ' అనుటకు 'చూవె, చువ్వె' అని యగును; 'చుమ్ము' అని యతఁ డొకసారి వాడెను గాని యా పాఠము సరియై యుండదు.

(8) 'వలచు' 'ఒల్లు' ఆదేశముగాఁగా 'ఒల్లుము, ఒల్లుఁడు' అను రూపము మును గలుగునేమో.

(ఈ) 'చ్చు' అంతమందుగల ధాతువులు :—

(1) అచ్చు, ఉచ్చు, ఎచ్చు, కచ్చు, క్రొచ్చు, నచ్చు, పుచ్చు, మెచ్చు ధాతువులపై మధ్యమ ముడుజ్జులు చేరునపుడు వాని తుది 'చ్చు' నకు మార్పు కలుగదు: వాకిలిఁ బుచ్చుము (భార. ద్రో. II. 270); నీతనూజుని గాశికున కిచ్చి పుచ్చుము (భాస్క. బాల. 206); అనిచి పుచ్చుము నన్నునన్ (భార. అను. II. 24; భాస్క. అర. II. 172); మొద.

(2) గిచ్చు, క్రుచ్చు, ప్రుచ్చు, లకుఁ బ్రార్థనార్థక ముడుజ్జులు పరము లగునపుడు తొలుత 'చ్చు' కు 'వ్వు' ఆదేశమగుచుండెను. అట్టి యాదేశము లేకుండఁ గూడ నర్వాచీన ప్రయోగము లున్నవి: గివ్వుము, గిచ్చుము; క్రువ్వుము, క్రుచ్చుము; ప్రువ్వుము, ప్రుచ్చుము.

(3) 'త్రచ్చు' నకుఁ బ్రార్థనార్థమున 'త్రచ్చుము (-ఁడు)' అనియే రూపము లుండెను. రానురాను 'త్రవ్వుము (ఁడు)' అను రూపములును గలిగినవి.

(4) 'నొచ్చు' 'చ్చు' నకుఁ బ్రార్థనార్థమున 'వ్వు' ఆదేశము నిత్యము; నొవ్వుము.

(5) 'ఇచ్చు' ధాతువుపై 'ము' వర్ణము చేరునపుడు 'చ్చు' లోపించి, 'ము' లోని మకారమునకు ద్విత్వము కలుగును: కీర్తియటుండ నిమ్ము (భార. అర. VII. 299); చాపము నా కందిమ్ము (భార. విరా. IV. 112); ఇంకది యట్టులుండనిమ్ము (భార. భీ. III. 395); ఆనతియిమ్ము (భాస్క. అయో. 269; వరాహ. VIII. 97); నాకు భండన మిమ్ము (భాస్క. కి. 159); అప్పను లటు లుండనిమ్ము (భాస్క. యు. 127); మొద.

తుమున్నర్థక రూపములపై 'ఇమ్ము' సహాయక క్రియగాఁ జేరునపుడు 'ఇమ్ము' లోని 'మ్ము' లోపించి 'ఇ' కి దీర్ఘము కలుగుట దిక్కనకుఁ దరువాతి గ్రంథములందు కానవచ్చుచున్నది: ఓర్పుమై నుప్పిండి యుపవాస ముండనీ మగనాలి సరిపోల్పఁ దగదు విధవ (కాశీ. IV.);— 'ఇవ్వుము' అను రూపము మును గలదు గాని, యది యర్వాచీన కృతులందు మాత్రము కానవచ్చుచున్నది. వ్యవహారమున కృష్ణా, గుంటూరు మండలములందు 'ఇవ్వు' అను రూపము నేడును వినఁబడుచున్నది. వాని కుత్తరమున నున్న జిల్లాలందును మఱికొన్ని ప్రాంతములందును 'ఇయ్యి' అని వినఁబడుచున్నది. ఇది 'ఈ' యను రూపమునుండి కలిగిన రూపము. 'చెప్పనీ, కొట్టనీ' మొదలయిన 'ఈ'

తోడి రూపము లన్ని ప్రాంతములందును వాడుకయం దున్నవి. మాతగానీ ... భార్యగానీ (భాగ. IV. 778); జననిగానీ దయితగానీ (భాగ. IV. 781); తలంపనీ (భాస్క. కి 515); పగేకానీ (సర్వే. శత. 1324); 'ఈ' యని వ్యస్త ప్రయోగము లేదు. 'ఉండనిమ్ము' అనుటకు భూతార్థక క్రియారూపమగు 'ఉండె' ను పూర్వకవులు వాడిరి: అట్లుండెన్ (భార. విరా. I. 193); అది యట్లుండెన్ (భార. విరా. III. 110, 114; హరి. పూ. I. 131); అది యట్టులుండె (భార. శాం. IV. 409).

'ఇచ్చు' ధాతువునకు 'ఇమ్ము, ఈ' లను ప్రార్థనార్థక రూపములు గలిగినట్లే, 'తెచ్చు' నకు 'తెమ్ము, తే' అను రూపములు కలిగినవి. 'ఇమ్ము, తెమ్ము' లు వ్యవహారమున వానిపై నచ్చు చేరునపుడు వినంబడును. 'ఈ' సహాయక క్రియగమాత్ర ముపయోగింపం బడును; 'తే' ను స్వతంత్ర క్రియగం గూడ ప్రయోగింపవచ్చును.

'తెచ్చు' అనునది సహాయకక్రియ యగునపుడు 'తెంచు' గ మాఱును: పఱతెంచు, అగుదెంచు, మొద. 'తెంచు' పై ప్రార్థనార్థక మువర్ణము చేరునప్పుడు 'తెమ్ము' 'తే' అనియే యగును. ఉదా: తనూభవుం బుత్తెమ్ము (భాస్క. బాల 179): పఱతెంచుము, పఱతే అను రూపములు గలుగవు. నేటి కవులు కొంద ఱీయ గ్రాంథిక రూపములు గ్రాంథికము లనుభ్రమచే వాడుచున్నారు.

(6) 'చొచ్చు' ధాతువుపై మధ్యమ ము డుజ్జులు పరమగునపుడు 'చ్చు' కు 'రు' ఆదేశమగును: ఇతనిం జొరు మనగు గదా (భార. ద్రో. II. 234); తటికిం జొరుము (భార. ఉ. IV. 191); మొద. నేటి కవులు 'చొచ్చుము' అని వాడుట గ్రాంథిక వ్యవహారము తెలియకయే. 'చొరుము, చొరుండు' అను రూపములు నేడు వ్యవహారమున లేవు.

(7) 'అగు' ధాతువునకు మధ్యమ మువర్ణముచేరి 'అగుము'అని యగును. ఈ రూపమున నూంత తొలియచ్చుపై నున్నది. కాని, ఆయూంత రెండవయచ్చుపైకిం జేరంగా మొదటి యకారము లోపించుటయు, ద్రావిడ సంప్రదాయానుసారముగం బదాదిని సరళమునకుం బరుషాదేశము కలుగుటయు, అది హ్రస్వాక్షరముపైం జేరిన 'ము' వర్ణమందలి మకారమునకు ద్విత్వము కలుగుటయు సంభవించి 'కమ్ము' అను రూప మేర్పడినది. చక్కం గమ్ము (భార. అర. VI. 378); శాంతుండవు కమ్ము (భార. కర్ణ. I. 34); నన్నయ 'అగుము' అని ప్రయోగించెను; 'కమ్ము' అని వాడలేదు. 'కమ్ము' నకామ్రేడితము పరమగునపుడు కావ్యములందు మొదటి 'కమ్ము' నకు 'కా' యాదేశమయి 'కాకమ్ము' అని యగును. 'కా' అని వ్యస్తముగం గొంద ఱర్వాచీన కవు లుప

యోగించిరి. 'కాకా యని యఱచు' అని శ్లేషకొఱ కట్లు వా రుపయోగించి యుందురు. వ్యవహారమున 'అగుము, కమ్ము'లు లేవు; 'కా' అనియే యున్నది: దీర్ఘాయుష్మంతుడవు కా! మొద. 'అవుము, అవుఁడు' లకు 'ఔము, ఔఁడు' లగునని చిన్నయసూరి చెప్పెనుగాని వానికిఁ బ్రయోగములు మృగ్యములు.

'వచ్చు' ధాతు వగు ధాతువు చరిత్రమును గొంతవఱ కనుసరించుచున్నది. 'వచ్చు' నకు తమిళమున 'వర్' అనునది మూలము. ఈ రూపమున నూఁత మొదటి 'వ' పైనున్నది. ఈయూఁత రెండవ వర్ణము పై కి మాఱఁగా 'వ' లోపించి హ్రస్వమగు 'ర' మీఁది 'ము' వర్ణము మకారమునకు ద్విత్వము కలిగి 'రమ్ము' అను రూప మేర్పడినది. 'రమ్ము' అనునది కేవల గ్రాంథిక రూపము: వఱం, హరోఁకు, రమ్ము (భాగ. VIII. 243); దీనిలోని 'మ్ము'కు లోపమును దాని పూర్వాచ్చునకు దీర్ఘమును గలిగి యేర్పడిన 'రా' అను రూపము తొలుతనుండియు నామ్రేడితము పరమగునపుడు వాడఁబడుచున్నది. నేఁటి వ్యవహారమున 'రా' ను వ్యస్తముగను నుపయోగింపవచ్చును.

(8) 'చచ్చు' ధాతువునకు మధ్యమ మువర్ణము పరమగునపుడు 'చావు' ఆదేశమగును: చావుము; దీనికి 'చా' అనియు నర్వాచీన గ్రంథములందు రూపము గలదు. 'చా' అనునది ప్రార్థనార్థక బహువచనమునను పాల్కురికి సోమన వాడినాఁడు: చా కుక్కలార !—వ్యవహారమున నేకవచనమున 'చావు !' అని మాత్ర మున్నది; 'చచ్చు' క్త్వార్థక రూపముపై 'పో !' అను దానిని చేర్చి 'చచ్చిపో !' అనియు నందురు.

(9) 'విచ్చు' ధాతువుపై మధ్యమ మువర్ణము చేరునపుడు 'చ' కారమునకు 'ప' కారము వైకల్పికముగ నాదేశమగును: విచ్చుము, విప్పుము;— లేదా, 'విచ్చు' నకు 'విప్పు' రూపాంతరమనియైనఁ జెప్పవచ్చును.

(10) 'రెచ్చు,' 'వెచ్చు' లకుఁ బ్రార్థనార్థక రూపములేమో తెలియదు.

(ఉ) 'పోవు' ధాతువుపై మధ్యమ మువర్ణము చేరి 'పోవుము' అని యగును. ఇందలి ధాతుగత వువర్ణ లోపమును నాది దీర్ఘమునకు హ్రస్వమును, మువర్ణము మకారమునకు ద్విత్వమును గలిగి 'పొమ్ము' అనియు నగును: కొంచుఁ బొమ్ము (భార. ఆర. IV. 221); కంటిఁబొమ్ము (భార. ఆర. V. 30); నీకుం జూడంబోలిన గతిం బొమ్ము (భార. ఉ. IV. 360); ఏమని పలికితేని నీకుం జనియెఁ బొమ్ము (భార. ద్రో. V. 109); పోకాలి పొమ్ము (వరాహ. V. 15);-'పోవు' తుది 'వు' లోపింపఁగా మిగిలిన 'పో' అను రూపమే ప్రార్థనార్థమున నుండవచ్చును. వ్యవహారమున నీరూపమే యున్నది. 'పో' అనుటకు 'కదా' అనియు నర్థము గలదు: మూర్కొందు రింతేపో (భార. ఉ. I. 321);

ఇట్లే, చెల్లెఁబో (ౘబొమ్మ), మొద. తప్పు మనయందే పో విచారించినన్ (భాస్క. యు. 74); వారలు లేరటె పో (భార. విరా. III. 111); మార్కొందు రింతేపో (భార. ఉ. I. 321); తగునను బో (భార. ఉ. III. 168); అతఁడ పో కురుసేనకు మేటి (భార. ద్రో. II. 65); 'పో' చేరి, కొన్ని యాశ్చర్యార్థకావ్యయము లేర్పడును: చెల్లంబో (భార. స్త్రీ. II. 104; ఇది 'చెల్లెంబో' కు రూపాంతరమై యుండును); నల్ల వ్రో (భార. విరా. V. 136 = మంచిదిపో); నల్ల వె (భార. విరా. III. 99).

(ఊ) చెప్పుము అను రూపమునందలి 'ప్పు' లోని యొకపకారమునకు లోపము వైకల్పికముగ నగును: మొదలగ్కాని చెపుము (కళా. III. 276)- ఒప్పు, కప్పు, తప్పు, మప్పు, కొప్పు, లపై 'ము' వర్ణము చేరునపుడా ద్విత్వ లోపము కలుగదు. 'విప్పుము' అనునది 'విపుము' అని యగునేమో తెలియదు.

(ఋ) 'ఇందము' (భార. విరా. V. 301); అనఁగా 'నే నిచ్చెదను. నీవు తీసికొనుము' అని యర్థము. ఈ రూపమునకు ధాతువేమో తెలియదు. వ్యవహారమున నేటికిని 'ఇంద' అని యున్నది. 'ఇదు' అను ద్రావిడ సర్వనామమునకు 'ఇందు' అను రూపాంతరము గలిగి దానిపై ప్రార్థనార్థమున వచ్చు అకారము చేరి 'ఇంద' అని యేర్పడియుండును. తక్కిన మువర్ణాంత ప్రార్థనార్థకక్రియల పోలిక నీ రూపముమీఁదను ము-వర్ణము చేరియుండును.

(ౠ) నేఁటి వ్యవహారమున 'పంతులుగారు చెప్పమన్నారు, వినమన్నారు, తినమని చెప్పినారు; మొదలగు రీతిగ వ్యతిరేకార్థకోత్తమపురుష బహువచన క్రియలను ప్రార్థనార్థమున వాడుచున్నారు. ఇట్టి పలుకుబడి 'చెప్పవే, వినవే, తినరే' మొదలగు రూపముల సాదృశ్యమునఁ గలిగియుండును. వ్యవహారమున నీ రూపము లపరిహార్యములు.

(ౡ) 'ఏమి చెప్పుమా, వాడింకా రాలేదు' అనునపుడు వక్త తన్నే, లేదా తన్నుఁగూడ, సంబోధించుకొనును.

(ఎ) దీర్ఘపూర్వ యువర్ణాంత ధాతువులపై గ్రంథములందు ప్రార్థనార్థమున నేకవచనమున 'ము' చేరును; కాని, వ్యవహారమున నేకవచనమున ధాతువుమీఁదనే ఇత్తు చేరును. చేరుచో పూర్వాచ్చునకు హ్రస్వమును యకారమునకు ద్విత్వమును గలుగును: 'యి' మీఁది యిత్తు లోపించుటయుఁ గలదు: ఏయు (ఎయ్, ఎయ్యి; వానికొక్క టెయ్యి); చేయు (చెయ్, చెయ్యి); తోయు (తొయ్, తొయ్యి); పోయు (పొయ్, పొయ్యి); మోయు (మొయ్, మొయ్యి).

'ఇచ్చు' ధాతువునకు వ్యవహారమున 'ఇయ్, ఇయ్యి' అని ప్రార్థనార్థక రూపములు గలవు.

వ్యతిరేక ప్రార్థనము.

(1) వ్యతిరేక ప్రార్థనార్థమున నేకవచనమున 'అకు (ము)' అని ధాతువుపైఁ జేరును: ఓడకుము(హరి. ఉ. III. 100); కినియకుము (భార. అను. I. 76); దురపిల్లకుము (భార. శల్య. II. 3 5); తెగంబాఱకు (భార. ఉ. III. 25); విప్పకుము (భాగ. VII. 159). ఇట్టిట్టని సొలవకు (భాస్క. అయో. 88). మొద.

(2) కమ్ము, తెమ్ము, పొమ్ము, రమ్ము లకు వరుసగ వ్యతిరేకార్థమున కాకుము, తేకుము, పోకుము, రాకుము, అని యగును. 'పోకుము' అనుటకు 'పోవకుము' అనియు రూపము గలదు. కాకుము (భార. శాం. VI. 227, 229). తేకుము (భార. భీ. III. 169). పోకుము. (భార. ద్రో. IV. 66. భాగ. III. 243). మొద.

(3) వెఱచు ధాతువునకు వ్యతిరేక ప్రార్థనమున 'వెఱవకుము' అనియే కాక 'వెఱకుము' అనియు నగును: (భాస్క. అర. II. 149).

(4) 'మఱచు' ధాతువునకు 'మఱవకుము' అని యగును. అందలి 'వ' లోపించి తత్పూర్వాచ్చు దీర్ఘమై 'మఱాకుము' (భార. ఉ. IV. 70; భాస్క. యు. 1767) అనురూపమును గలుగును. దీని సామ్యమున 'పంచాకుమయ్య, తోపించాకుమయ్య' మొదలగు గ్రామ్యములని కేతన వెక్కిరించిన రూపములును నొకవిధముగ సాధువు లగుచున్నవి.

(5) వ్యవహారమున 'చెప్పక!' 'చేయక!' మొదలగు రూపములు వ్యతిరేక ప్రార్థనార్థకైకవచనమున వినఁబడుచున్నవి.

ఉభయప్రార్థనార్థకము.

(1) సాధారణముగ ధాతువుపై 'దము' అనుదానిని జేర్చుటవలన నుభయప్రార్థనార్థకక్రియ లేర్పడును: ఆడుదము, పాడుదము, వీడుదము, కూడుదము (భాగ. VII. 248). తాఁకుదము (భార. శల్య. II. 44). మొద. వ్యవహారమున 'ఆడుదాము, పాడుదాము' అని 'ద' మీఁది యుత్తునకు దీర్ఘము కలుగును: చూ. ఉత్తరాంధ్రము.

(2) (i) చు వర్ణాంతధాతువుల కుభయప్రార్థనమునఁ బ్రాచీనకావ్యములందు చువర్ణలోపము కాఁగా, లుప్తశేషముపై 'తము' అనునది చేరుచుండెను: కడతము (భార. అర. VII. 44). చూతము (భార. విరా. II. 89). నిలుతము (భార. విరా. I. 156); నడతము (భార. అశ్వ. I. 152); పనుతము (భార. ద్రో. V. 198); మొద.

(ii) -ంచు, -ఇంచు, లంతమందుగల ధాతువులకు నుభయప్రార్థన మున చువర్ణముమాత్రము లోపించును. అనుస్వారము నిలుచును. దానిపై 'తము' చేరును: ఈసడింతము, ఉంకింతము, అలవరింతము, ఉంతము, దంతము, త్రుంతము, త్రెంతము, ముంతము, వంతము, నింతము, నొంతము, మొద.

కొన్ని -'ంచు' అంతమందుగల ధాతువులపై నీకార్యము కలుగునో కలుగదో తెలియదు: అంచు, ఇంచు, ఎంచు, కుంచు, కొంచు, నంచు, అను వానిపై 'దము' చేరును.

(iii) 'చ్చు' అంతమందుగల ధాతువుల నుభయప్రార్థనమున 'చ్చు' లోపించి, 'త్తము' అనునది చేరును: విత్తము, వ్రత్తము, ఇత్తము, చొత్తము (భాగ. VII. 249). చొత్తముగాక (భార. విరా. V. 7).—ఇట్లే, ఉచ్చు, క్రొచ్చు, చచ్చు, తెచ్చు, వచ్చు, విచ్చు, అను ధాతువులకును గలుగును.—ఎచ్చు, హెచ్చు, త్రచ్చు, ల కీకార్యము గలుగదు. వానిపై 'దము' చేరును. *. (i), (ii), లలోని యన్నిధాతువులమీఁదను నర్వాచీనకాలమున 'దము' చేరిన యుభయప్రార్థనార్థకరూపములు కాన్పించుచున్నవి.

(3) ను వర్ణాంతధాతువులగు అను, * ఉను, కను, కొను, తిను, విను, లపై నుభయప్రార్థనమున 'దము' చేరునపుడు 'ను' లోని యచ్చు లోపించును : అందము, ఉందము, కందము, కొందము, తిందము, విందము, అందము (భార. అను. V. 347); మొద.—చను, మను, లపై నీకార్యము గలుగదు.

(4) యు-వర్ణాంత ధాతువులపైఁ దొలుత 'దము' చేరుచుండెను. కాని, యర్వాచీనకావ్యములందు యు-వర్ణము లోపింపఁగా లుప్తశేషముపై 'తము' చేరుచుండుటయుఁ గాన్పించుచున్నది.

(5) ఉభయప్రార్థనార్థమున 'పోవు' ధాతువు వువర్ణము వైకల్పికముగ లోపింపఁగా లుప్తశేషముపై 'దము' చేరును. నన్నయ పోవుదము, పోదము, అను రెండు రూపములను వాడినాఁడు. తిక్కన 'పోవుదము' అను రూపమును వాడినట్లు కానరాదు. పోదము (భార. విరా. III. 123; IV. 69, 247; V. 220. ఉ. III. 309; ద్రో. I. 248; అశ్వ. I. 152; మౌ. I. 126).

పదము, పొదము, పద, పొద, అను రూపములును గాన్పించుచున్నవి. వీనికిని పోవుదము, పోదము లకును నర్థభేదము గలదు. ఇవి యేకవచనరూపములు; కేవల మధ్యమపురుష యోగమున వచ్చునవి. పోవుదము, పోదము లు బహువచనరూపములు. నీవును, నేనును గలిసి పోవుదమని యర్థము గలవి. పదము, పొదము, పద, పొదలకు, నీవు ముందఱపో, నేను (మేము) నీ (మీ) వెంట వచ్చెదను (ము), అని యర్థము. పదమా ... గోదావరీ. (భీమ.

III). మల్లుదీసి కొట్టుడఁచిన చందమామయెం బదమా యెలదోఁటఁ జరింప కింటికిన్. (మను. III.) పొదము (భార. విరా. IV. 30). పొదమా పరికింత మలరు పొదమాటునకున్ (అచ్చ. రా. అర.), పొదమీ స్యందనముఁగొనుచుఁ బుర మునకధిపా (భాగ. X. II; పదము, పొదము, ల తుది మువర్ణమేకవచనమును దెలుపుటచేతనే 'వినుము, విను' అనునట్లు పద, పొద, రూపములును గలిగినవి. వీనిలో 'పొద' ప్రాచీనరూపము. పొదపొదము (భార. కర్ణ. II. 313) నేఁడు వ్యవహారమున నున్నదో లేదో తెలియదు. 'పద' నేఁడు సర్వత్ర వ్యవహారమున నున్నది. మువర్ణముతోఁడి రూపములు వ్యవహారమున లేవు. మువర్ణ మేకవచన బోధకము గావున, దానికి డుజ్వర్ణముతోఁడి బహువచన రూపములును గలిగినవి: పదండు (భాస్క. కిష్కి. 641); పొదండు (పా. సో. బసవ.); ఒండొరుమీఁటి పొదఁడు పొదఁడు (అచ్చ. రా. యు.)

ఉభయ ప్రార్థనార్థకమైన బహువచన 'ము' వర్ణకముగల రూపముల కును మఱల డుజ్వర్ణకముతోఁడి రూపాంతరములు ప్రాచీనకవుల గ్రంథము లందు, ముఖ్యముగ శివకవుల గ్రంథములందు కాన్పించుచున్నవి: వెదకుదండు (భాస్క. కి. 641); చెప్పుదండు (పా. సో. బస. పు. 149); చెఱుపుదండు (పా. సో. బస. పు. 174); పోదండు (పా. సో. బస. పు. 179); చూతండు (పా. సో. బస. పు. 215); ఇట్లే, పాల్కురికి సోమన తన పండితారాధ్యచరిత్రమున 'పడుదండు, ఉండుదండు, తీర్తండు' మొదలగు రూపములును బ్రయోగించెను. 'పదండు' అనుటకు 'పొదరు' అనియు నాతఁడు ప్రయోగించెను. 'ప్రాత వడ్డమాటలఁ దమ నేర్పుసూపుట' కర్వాచీనకవులును నిట్టి ప్రయోగములను జేసిరి.

(6) పడము, పొదము లు నేటి వ్యవహారమున లేవు; 'ఇందము' వ్యవ హారమున 'ఇంద' అయినది; తక్కిన యుభయప్రార్థనార్థక రూపముల త, ద, వర్ణకముల యత్తునకు వ్యవహారమున దీర్ఘము కలుగును; స్తంభంబులోఁజూప రా చూతాము (ఒం. రఘు. శత. 104); ఇట్లే, చేదాము, పోదాము; వ్యవ హారమున 'తెత్తాము, తెద్దాము; చేద్దాము, మొదలగు రూపవిశేషములును గలవు.

ప్రార్థనార్థకము: బహువచనము.

(1) ప్రార్థనార్థమున నేకవచనమునఁ బైని వివరించిన రూపముల తుది ము, మ్మ, వర్ణకముల స్థానమున డుజ్లును జేర్చుటవలన ప్రార్థనార్థక బహు వచన రూపము లేర్పడును: ఉదా.

ఎట్టులైన నగుఁ డండ్రార్కఁ (భార. శల్య. II. 100); ఆఁగుఁడు (భార. ద్రో. V. 145); మాకుం గుడుమిం డిదె మీరు వ్రక్కఁగొనుఁడు (భార. ఉ.

I. 312); **తాల్మినెడలకుండుఁడు** (భార. **మా.** I. 137); సంతనకట్టుఁడు (భార. ఆర. VI. 200); **మీారమ్మికొనుఁడు సేయువెలలకు** (భార. అను. II. 265); కైకొనుఁడు (భార. భీ. III. 237); **తీర్చికొనుఁడు** తన తన వాహనములు (భార. విరా. V. 89); **మనసువచ్చినన్ని** దినములు నలుపుఁ డిచ్చోట (భార. విరా. I. 207); నాకుఁ జెప్పుఁడు (వరాహ. IV. 132). చెప్పుఁడటన్నఁ (సమీా. IV. 4). తఱుముఁడు (భార. భీ. II. 150). **సుయోధను** చెఱ తలుఁగుండు (భార. ఆర. V. 409). పొదువుఁడు (భార. భీ. II. 372). విడ్వుఁడు (భార. ఆర. VI. 416). **వీని వధించి** రండు (భాగ. VII. 187);- పదఁడు (నిర్వ. VI. 92). పోదం డు (భాగ. V. i. 983).- వేసరకుఁడు (హరి. పూ. V. 232); మొద.

(2) ప్రార్థనార్థక డుజ్వర్ణకము ము-వర్ణకమువలె సాధారణముగ లోపింపదు. ఆమ్రేడితము పరమగునపుడు మొదటి క్రియయందలి డుజ్జు వైకల్పికముగ లోపించును: **విడు విడుఁడు** (భాగ. VIII. 200). పద పదఁడు (నిర్వ. VII); మొద.

(3) 'తలఁగు' ధాతువు ప్రార్థనార్థక బహువచన రూపమగు 'తలఁడు అనియు నుండును: తలఁడు తలఁడు (భాగ. V. i. 1371); దీని కేకవచనమున **'తలము'** అని **యుండునేమొా** తెలియదు. 'తల! తల!' అని యొకకవి యేకవచనమునఁ బ్రయోగించెను.

(4) వ్యవహారమున ప్రార్థనార్థక బహువచనమున ధాతువుపై 'అండి' అనునది చేరును: చెప్పండి, చేయండి ర (రా)ండి, పొ (పో) ండి, మొద. వ్యతిరేక ప్రార్థనమున వ్యతిరేక ప్రార్థనార్థకైకవచనమున వచ్చు 'ము' వర్ణక స్థానమున 'అండి' ని చేర్చుటవలన వ్యవహారమున వ్యతిరేక ప్రార్థనార్థక క్రియ లేర్పడును: **మఱవకండి**, వదలకండి (రామతా. శత. 4).

సంప్రార్థనము: అత్యంత ప్రార్థనము.

(1) సంప్రార్థనమునఁ జేరు ము, డుజ్జులపై నీ క్రింది వర్ణములు చేరుట వలన సంప్రార్థన రూపము లేర్పడును:

i. అ: చెపుమ (భార. ఆర. V. 115. VI. 293. విరా. I. 67. భీ. III. 214); చెప్పుమ (భార. ఆర. VI. 4); రమ్మ (భార. ఆర. V. 29); చెపుఁడ (భార. ద్రో. II. 254); మొద.

ii. ఆ: **ఆరయుమా** (భార. ఉ. III. 267); ఊహింపుమా (భార. ఆర. V. 57); **ఎన్నుమా** (భార. ఉ. III. 264); చూడుమా (భాస్క. **యు.** 198); చెపుమా (భార. ఆర. V. 325; భార. విరా. I. 205; విరా. II. 233); **చెప్పుమా** (భార. ఆర. VI. 406. **విరా.** I. 44); **తలఁపుమా** (భార.

శాం. VI. 581). నిలుపుమా (భార. సౌ. II. 92); నిశ్చయింపుమా (భార. ఆర. VII. 44. ఉ. III. 284); పొమ్మా (భార. విరా. V. 91); రమ్మా (భార. విరా. II. 89. ద్రో. V. 370); ఎఱింగియుండుఁడా (భాస్క. యు. 2361); ఊహింపుఁడా (భార. విరా. I. 231; భాగ. I. 291); చూడుఁడా (భాగ. VI. 112; హరి. పూ. IV. 33); చెపుఁడా (భార. విరా. I. 65; ఉ. IV. 271; భార. ద్రో. II. 237); చెప్పుఁడా (భార. ఉ. I. 154; భార. ద్రో. II. 260; భాస్క. యు. 2411); చేయుఁడా (భార. ఉ. IV. 90); విచారింపుఁడా (హరి. పూ. VIII. 63); మొద.

iii. ఇ: కొల్లగొనుఁడి, నమ్మికొనుఁడి, నయమునుండి (రామతా. శత. 4); మొద.

iv. ఈ: అనుమీ (భార. ఆశ్ర. I. 123); ఉల్లంబుచ్చిపో నాడుమీ (భార ఉ. III. 97); ఎక్కింపుమీ (హరి. పూ. VI. 22); కనుఁగొనుమీ (భార. విరా. V. 182); కనుమీ (భార. ఆర. IV. 280); కాన్పుమీ (భార. ఉ. I. 365); కొనుమీ (భార. ఆర. V. 311); చాకుమీ (భాస్క. యు. 1752); చెపుమీ (భార. విరా. II. 72);- 'చుమ్మీ' కు 'చుము' అనురూపము వ్యస్తముగఁ గలుగదు; 'ఈ' చేరునపుడు 'మ్మి' ద్విత్వము వైకల్పికముగ లోపించును: చుమీ (భార. ఆర. V. 90; VI. 175. VII. 292; భార. విరా. I. 110, II. 287; భాస్క. యు. 2294;) చుమ్మీ (భార. ఆర. VI. 65; VII. 31; భార. విరా. I. 250; ఉ. II. 197); కలఁకఁ దక్కుమీ (భార. ఉ. III. 203); నిలుమీ (భార. ఉ. III. 24); పొందకుమీ (భార. ఆర. V.434); మోసపోకుమీ (భార, ఆర. VII. 286); రక్షింపుమీ (భాస్క. కి. 321); విన్నవింపుమీ (భార. ఆశ్ర. I. 121);—అలుగకుఁడీ (భార. విరా. V. 123), ఇండీ (భార. ద్రో. II. 346); కనుఁడీ (భార. ఆర. IV. 355); 'చుండు' కు 'చుఁడు' అని వ్యస్తప్రయోగములేదు; 'ఈ' చేరునప్పుడు 'చుఁడు' అనియగును: చుఁడీ (భార. విరా. I. 176); చుండీ (భార. భీ. I. 79; భార. ద్రో. I. 378; భార. శాం. VI. 330); చూడుఁడీ (భార. ఉ. I. 121); తెండీ (భార, విరా. IV. 47); దీవింపుఁడీ (భాగ. VII. 101); నోవకుఁడీ (భార. ఉ. I. 208); నందడిఁ బడకుఁడీ (భాగ. VII. 101); వినుఁడీ (భార. ఆర. IV. 355; భార. ద్రో. II. 277).

v. ఎ: (అ) 'ఎ' సాధారణముగ మధ్యమపురుష వ్యతిరేకార్థకైకవచన క్రియారూపముపైఁ జేరును; కరుణింపవె (భార. ఆర. VI. 282); తీర్పవె (భార. ఆర. VI. 29); వినవె (భార. ఆర IV. 274. 302); కావరె (భార. ఆర. VI. 343); మొద.

(ఆ) 'చూడుము, చుమ్ము' అనుటకు 'చూ' అనియు రూపము గలదు. (భార. ఆర. VII. 292; విరా. II. 312; ఉ. II. 76; భార. కర్ణ. III. 102; భార. భీ. III. 324); ఈ రూపముపై 'ఎ' చేరునప్పుడు 'వ' కార మాగమ ముగ వచ్చును; దానిపై 'ఎ' చేరును; చూవె; దీనికి 'చువ్వె' అనియు రూపము గలుగును (భార. ఆర. V. 5); మొద. 'చూవె' కు బహువచనరూపము 'చూరె' (భార. అశ్వ. II. 137, 148).

vi. ఏ: (అ) వ్యతిరేకార్థక మధ్యమపురు షైకవచనరూపములపై: ఈవే (భార. ఆర. VI. 280); ఉఱుకింపవే (భార. విరా. I. 183); ఒనరింపవే (భార. ఆర. VII. 113); ఒసగవే (భార. శాం. III. 139); కావవే (భార. V. ఆర. 402; భాగ. VIII. 90); కైకొనవే (భార. ఆర. V. 150) చెప్పవే (భార. ఆర. IV. 262; భార. భీ. I. 214); చేయవే (భార. విరా. I. 21, 203); ఇచ్చిపుచ్చవే (భాస్క. యు. 302; భార. అశ్వ. III. 3); పోవే (భార. ఉ. IV. 24); మెలుపవే (చెన్నమల్లు శత. 7); రావే (భాగ. VIII. 90; భాస్క. ఆర. II. 260), వినవే (భార. ఆర. V. 91; VI. 171); కృపసేయరే (భార. శాం. II. 70); తివరే (భాగ. I. 476); *తివు; వరింపరే (భార. అను. II. 16); విడిపింపరే (భార. ఆర. V. 17).

(ఆ) ఏక. చూడుము = చూ+వ్+ఏ = చూవే. బహు. చూరే (భార. అశ్వ. II. 132); 'చూవే' కు రూపాంతరను 'చువ్వే' (భార. శాం. IV. 68).

(ఇ) 'అగు' ధాతువు వ్యతిరేకార్థక ప్రథమపురు షైకవచనరూపము 'కాదు'+ ఆ (ఏ) = 'కాదా (-దే); ఇవి ప్రశ్నార్థకరూపములు. వీనికి రూపాంతరము 'కదా (-దే); వీని తుదిదీర్ఘము హ్రస్వమయి 'కద' (దే) అనియగును: తండ్రీ నాకు ననుగ్రహింపఁగదె వైద్యంబు (మను. V.) ఈ రూపమున నున్న ప్రశ్నములు 'అవును' అను ప్రత్యుత్తరము నపేక్షించును. 'కదే' అనురూపము మన్నంతక్రియలపైఁ జేరి ప్రార్థనార్థకమగును. దయసేయఁగదే (భాగ. X.) ప్రార్థనార్థమున 'కదే' కు 'కదవే' యనియు రూపాంతరముగలదు. పురంబుఁ జేరనింకెవ్విధిఁగాంతుఁ దెల్పఁగదవే (మను. II).

(ఈ) వ్యతిరేక ప్రార్థనార్థమునవచ్చు 'అకుము' పై 'ఏ' చేరునపుడు ము వర్ణము మకారమునకు వకారాదేశమగును. అడ్డపడకువే (భార. శాం. III. 297); విడెముసేయవే, నను విడనాడకువే (క్షేత్రయపద).

vii. ఆ: వ్యతిరేక మధ్యమ పురుష క్రియపై: చెఱకుఁబాపరా (భార. ఉ. II. 204).

viii. ఓ: వ్యతిరేక మధ్యమపురుష క్రియపై: ఓ యమునానది రావో, తేవో, తోయములు (హరి. ఉ. II.

ix. (అ) మధ్యమపురుషైకవచన వ్యతిరేక క్రియారూపముపై 'అన్న, అమ్మ, అయ్య' మొదలగు పదములుచేరి యత్యంత ప్రార్థనమును దెలుపును; అన్న, అమ్మ, అయ్య, ల తుది ద్విత్వమునకు **లోపమును గలు గును:**

ల్లవనా (భాస్క. అర.); చెల్లింపవనా (భార. మా. I. 123); **పోవనా** (భార. అను. I. 218); రావనా (భాస్క. యు. 2277; భార. మహా. I. 51); **పోవన్న** (భార. ఉ. III. 348); ఎఱిఁగింప **వమ్మ** (భాస్క. యు. 115); **చేయవమ్మ** (భార. అశ్వ. V. 67); మానకువమ్మ (భాగ. I. 7); **పట్టరమ్మ** (హరి. పూ. V. 202); -ఆర్పరయ్య (భార. అర. V. 121); ఆశ్రయింప వయ్య (భార. ఉ. II. 321); కావవయ్య (భార. **ద్రో**. III. 110); తలఁగ వయ్య (భార. అశ్వ, III. 170); పఱుపకుమయ్య (భార. అర. V. 134); పలుకవయ్య (భాగ. II. 41); పుట్టవయ్య (భార. భీ. II. 267); **పోవుమయ్య** (వృషా. శత. 89); బ్రదుకవయ్య (భార. ఉ. III. 341); **మనవయ్య** (భార. అర. VI. 64); రావయ్య (భార. భీ. III. 268); ఈ వలదయ్య (భార. అను. II. 270); వినవయ్య (భార. విరా. II. 73); భాగ. IV. 741); **అనువరయ్య** (భార. ఆశ్ర. I. 94); కావరయ్య (భాస్క. అర. 115); చనరయ్య (భార. అర. VI. 201); చేయరయ్య (భార. అను. I. 193); విడిపింపరయ్య (భాస్క. అర. 115); మొద. ప్రాచీనకావ్యములం దిట్లు వ్యతిరేకార్థక రూపములే ప్రార్థనార్థమునఁ గానవచ్చుచున్నవి. అర్వాచీనకావ్యములందు ప్రార్థనార్థక ముదుఙ్ములమీఁద నాయా పదములు చేరియు రూపములు గాన్పించుచున్నవి.

(ఆ) వినఁగదయ్య (భార. అర. VI. 64); నీవకదయ్య (భార. అర. VI. 290); ఒంటిమైఁ జిక్కఁగదయ్య (భాస్క. కి. 355).

(ఇ) సాధారణ ప్రార్థనార్థక క్రియలపై: కావింపుమనా (భాస్క. అర. I. 115); పోవుమయ్య (వృషా. శత. 89.)

x. ర, రా: (అ) వ్యతిరేకక్రియలపై: వినరా (భాగ. III. 656; సుమతి శతకమకుటము); వినరవేమ (వేమనశతకమకుటము); మొద.

(ఆ) 'ర'పై 'అన్న' మొదలగునవి చేరును: వలదురన్న (భార. ద్రో. V. 73); మొద.

(ఇ) తప్పనుమ్మర (భార. ద్రో. V. 324); చుమ్మర (భార. శాం. I. 39). మధ్యమపురుష తద్ధర్మార్థక క్రియలపై 'కాక, కాని' అను వానిని జేర్చియు సంప్రార్థనార్థమును దెలుపుటగలదు: అవధరింతురు గాక (భాస్క. యు. 175); పోదురుగాక (భార. ద్రో. II. 298); వత్తురుగాక (భాస్క. యు. 287); సత్కారంబుఁ గైకొనిపోవుదురుగాని (భార. అర. VI. 159).

## VI. వ్యతిరేకార్థము.

'-అ' అనునది తెనుఁగున వ్యతిరేకార్థబోధకముగ నున్నది. దీనికిని సంస్కృతమందలి 'న' స్థానమున నఞ్-సమాసములందు పూర్వావయవముగఁ జేరు 'అ'కారమునకును నర్థసామ్య మున్నను నా రెండిటికిని సంబంధములేదని కాల్డువెల్లభిప్రాయ పడినాఁడు. సంస్కృతమున క్రియల నఞర్థముఁ దెలుపుటకు 'న' అను నవ్యయమును బ్రత్యేకముగఁ గ్రియలతోఁ జేర్చి చెప్పుదురు. ఈ 'న' వర్ణము వ్యస్తముగ నిలిచియుండును; దానిని గ్రియకు దగ్గఱగ నుంచ వలె నను నియమము లేదు. తెనుఁగున వ్యతిరేకార్థ బోధకమగు 'అ' వర్ణము క్రియారూపములందు ధాతువులమీఁదఁ జేరఁగా దానిపై సర్వనామబోధక ప్రత్యయములు చేరి, యఱ్ఱేర్పడిన క్రియారూప మఖండముగ నిలుచును. సంస్కృతమునందలి వ్యతిరేకార్థబోధక రూపములకును ద్రావిడభాషలయందలి రూపములకును నిట్టి భేద మున్నను సంస్కృతముతో సంబంధించిన కొన్ని యాధునికార్య భాషలయందు ద్రావిడభాషలయందువలెనే నఞర్థకచిహ్నము లగు 'అ', 'న' అనునవి క్రియారూపములందుచేరి, వానినుండి వేఱుచేయరాక యున్నవి. సింధీభాషయందును, నేపాలదేశభాషయగు ఖాస్-కురాభాష యందును నిట్లున్నదని లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియాలో తెలుపఁబడినది. ఈ రెండు భాషలును పైశాచీభాషా లక్షణములను గలిగియున్నవి. ప్రాకృత లాక్షణికు లీ భాషలు మాట్లాడఁబడు ప్రదేశములు పిశాచజనాక్రాంతములని తెలిపియున్నారు.

ఈ క్రింద తెనుఁగునందలి వివిధములగు వ్యతిరేకార్థక రూపములు వివరింపఁ బడుచున్నవి:—

### (1) వ్యతిరేక భావార్థకము.

i. వ్యతిరేక క్త్వార్థకరూపములపై భావార్థక క్రియాజన్యవిశేష్యములఁ జేర్చుట:—చేయకుండుట, చెప్పకుండుట, మొద.

ii. ధాతువుపై వ్యతిరేకార్థక 'అ' వర్ణమును, దానిపై 'ఇమనిచ్' ప్రత్యయముతో సంబంధించిన భావార్థబోధక 'మి' వర్ణమును జేర్చుట: ఏమిని జేయనీమి (భార. ఉ. II. 18); వినమిభావించి (భార. విరా. II. 44); వినీవినమిన్ (జైమి. భా. IV. 116); మొద.

### (2) వ్యతిరేకక్త్వార్థకము.

i. ధాతువుపై వ్యతిరేకార్థబోధకవర్ణమును దానిపై "క" వర్ణమును జేర్చుటవలన వ్యతిరేక క్త్వార్థకరూపము లేర్పడును:—అదరక (నిర్వ. VI. 6). అనక (భార. విరా. I. 254); మొద.

ii. 'చు', 'ఇంచు' వర్ణము లంతమందుగల కొన్ని ధాతువులపై 'వ్యతిరేకార్థక 'అ'వర్ణము చేరునపుడు చకారమునకు పకార మాదేశమగును. అనుమానింపక (భార. ఉ. IV. 247); ఉనుపక (భార. ద్రో. II. 105); ఓహటింపక (భార. ద్రో. III. 45); కారింపక (భార. ఉ. I. 314); డింపక (భార. విరా. I. 95, 104); తోడరుపక (భార. విరా. I. 127); సైంపక (భార. విరా. V. 105); సైరింపక (భార. ద్రో. IV. 279); మొద.

iii. కొన్ని చువర్ణాంతధాతువులపై వ్యతిరేకార్థ కావర్ణము చేరునపుడు చకారమునకు వకార మాదేశమగును. ఓర్వక (భాగ. VI. 276); వెఱచఱవక (భార. ద్రో. I. 266);— చొలవక (భార. సౌ. II. 69), ఇది 'చొలయు' ధాతువునకుఁగాక 'చొలచు' అను నష్టధాతువునకు వ్యతిరేకక్త్వార్థక రూపము. నేర్చు, నేర్వక; మొద.

iv. 'చ్చు' అంతమందుగల ధాతువుల వ్యతిరేక క్త్వార్థకరూపములు వివిధములుగ నుండును:

(1) ఇచ్చు—ఇవ్వక, ఈయక, ఈక. (భా. విరా. I. 132; ఉ. IV. 378; ద్రో. V. 275; అశ్వ. I. 173; భాస్క. యు. 270, 2245); మొద. నేటివ్యవహారమున 'ఈక' పామరజన వ్యవహారమునఁగలదు. 'ఇవ్వక' అనునది యుత్తమజనవ్యవహారమునఁ గలదు.

'ఇయ్యక' అనియు వ్యవహారమునఁ గలదు; ఇది గ్రంథములందు కానరాలేదు.

(2) గ్రు (క్రు?)చ్చు- గ్రువ్వక (ప్రాచీనము), గ్రు (గు)చ్చక (ఆధునికము); (3) క్రొచ్చు- వ్యతిరేక క్త్వార్థక రూపము? (4) చచ్చు- చావక (భార. శాం. I. 213); చాక (భాస్క. అర. II. 138); (5) చొచ్చు-చొరక; చొచ్చు ధాతువునుండి పుట్టిన కొన్ని రూపములు నేటి వ్యవహారమున నున్నను 'చొరక' అనునది నిత్యవ్యవహారమునుండి లోపించినది. 'నీరు చొరక లోతు తెలియదు, మొదలగు సామెతల మూలమున మాత్ర మది యింకను వ్యవహారమునఁ గొలఁదిగ నిలిచియున్నది. (6) త్రచ్చు - త్రవ్వక; ఈ రూపము 'త్రవ్వు' నుండి పుట్టినదని యైనను జెప్పవచ్చును. (7) తెచ్చు-తేక (చనుదేక తక్కినట - భార. భీ. I. 157); (8) నచ్చు - నచ్చక (9) నొచ్చు- నొవ్వక, నోవక, నోక (10) ప్రుచ్చు—ప్రువ్వక (ప్రాచీనము); పుచ్చు=ప్రుచ్చు—పుచ్చక (ఆధునికము); పుచ్చు = పంపు—పుచ్చక; (11) మెచ్చు—మెచ్చక (12) వచ్చు—రాక (నిర్వ. VIII. 24; భాగ. VII. 72); మొద. 'వర్' ద్రావిడ ధాతువు. * 'వరాక' పూర్వద్రావిడ వ్య. క్త్వా.

## VI. వ్యతిరేకార్థము.

'-అ' అనునది తెనుఁగున వ్యతిరేకార్థబోధకముగ నున్నది. దీనికిని సంస్కృతమందలి 'న' స్థానమున నఞ్-సమాసములందు పూర్వావయవముగఁ జేరు 'అ'కారమునకును నర్థసామ్య మున్నను నా రెండిటికిని సంబంధము లేదని కాల్డువెల్లభిప్రాయ పడినాఁడు. సంస్కృతమున క్రియల నఞర్థముఁ దెలుపుటకు 'న' అను నవ్యయమును ప్రత్యేకముగఁ గ్రియలతోఁ జేర్చి చెప్పుదురు. ఈ 'న' వర్ణము వ్యస్తముగ నిలిచియుండును; దానిని గ్రియకు దగ్గఱగ నుంచవలె నను నియమము లేదు. తెనుఁగున వ్యతిరేకార్థ బోధకమగు 'అ' వర్ణము క్రియారూపములందు ధాతువులమీఁదఁ జేరఁగా దానిపై సర్వనామబోధక ప్రత్యయములు చేరి, యట్లేర్పడిన క్రియారూప మఖండముగ నిలుచును. సంస్కృతమునందలి వ్యతిరేకార్థబోధక రూపములకును ద్రావిడభాషలయందలి రూపములకును నిట్టి భేద మున్నను సంస్కృతముతో సంబంధించిన కొన్ని యాధునికార్య భాషలయందు ద్రావిడభాషలయందువలెనే నఞర్థకచిహ్నములగు 'అ', 'న' అనునవి క్రియారూపములందుచేరి, వానినుండి వేఱుచేయరాక యున్నవి. సింధీభాషయందును, నేపాలదేశభాషయగు ఖాస్-కురాభాషయందును నిట్లున్నదని లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియాలో తెలుపఁబడినది. ఈ రెండు భాషలును పైశాచీభాషా లక్షణములను గలిగియున్నవి. ప్రాకృత లాక్షణికు లీ భాషలు మాట్లాడఁబడు ప్రదేశములు పిశాచ జనాక్రాంతములని తెలిపియున్నారు.

ఈ క్రింద తెనుఁగునందలి వివిధములగు వ్యతిరేకార్థక రూపములు వివరింపఁ బడుచున్నవి:—

### (1) వ్యతిరేక భావార్థకము.

i. వ్యతిరేక క్త్వార్థకరూపములపై భావార్థక క్రియాజన్యవిశేష్యములఁ జేర్చుట:—చేయకుండుట, చెప్పకుండుట, మొద.

ii. ధాతువుపై వ్యతిరేకార్థక 'అ' వర్ణమును, దానిపై 'ఇమనిచ్' ప్రత్యయముతో సంబంధించిన భావార్థబోధక 'మి' వర్ణమును జేర్చుట: ఏమిని జేయనీమి (భార. ఉ. II. 18); వినమిభావించి (భార. విరా. II. 44); వినీవినమిన్ (జైమి. భా. IV. 116); మొద.

### (2) వ్యతిరేక క్త్వార్థకము.

i. ధాతువుపై వ్యతిరేకార్థబోధకవర్ణమును దానిపై "క" వర్ణమును జేర్చుటవలన వ్యతిరేక క్త్వార్థకరూపము లేర్పడును:—అదరక (నిర్వ. VI. 6). అనక (భార. విరా. I. 254); మొద.

ii. 'చు', 'ఇంచు' వర్ణము లంతమందుగల కొన్ని ధాతువులపై 'వ్యతిరేకార్థక 'అ'వర్ణము చేరునపుడు చకారమునకు పకార మాదేశమగును. అనుమానింపక (భార. ఉ. IV. 247); ఉనుపక (భార. ద్రో. II. 105); ఓహటింపక (భార. ద్రో. III. 45); కారింపక (భార. ఉ. I. 314); డింపక (భార. విరా. I. 95, 104); తోడరుపక (భార. విరా. I. 127); సైఁపక (భార. విరా. V. 105); సైరింపక (భార. ద్రో. IV. 279); మొద.

iii. కొన్ని చువర్ణాంతధాతువులపై వ్యతిరేకార్థ కావర్ణము చేరునపుడు చకారమునకు వకార మాదేశమగును. ఓర్వక (భాగ. VI. 276); వెలిచలివక (భార. ద్రో. I. 266);— చాలవక (భార. సౌ. II. 69), ఇది 'చాలయు' ధాతువునకుఁగాక 'చాలచు' అను నష్టధాతువునకు వ్యతిరేకక్త్వార్థక రూపము. నేర్చు, నేర్వక; మొద.

iv. 'చ్చు' అంతమందుగల ధాతువుల వ్యతిరేక క్త్వార్థకరూపములు వివిధములుగ నుండును:

(I) ఇచ్చు—ఇవ్వక, ఈయక, ఈక. (భా. విరా. I. 132; ఉ. IV. 378; ద్రో. V. 275; అశ్వ. I. 173; భాస్క. యు. 270, 2245); మొద. నేటివ్యవహారమున 'ఈక' పామరజన వ్యవహారమునఁగలదు. 'ఇవ్వక' అనునది యుత్తమజనవ్యవహారమునఁ గలదు.

'ఇయ్యక' అనియు వ్యవహారమునఁ గలదు; ఇది గ్రంథములందు కానరాలేదు.

(2) గ్రు (క్రు?)చ్చు- గ్రువ్వక (ప్రాచీనము), గ్రు (గు)చ్చక (ఆధునికము); (3) క్రొచ్చు- వ్యతిరేక క్త్వార్థక రూపము? (4) చచ్చు- చావక (భార. శాం. I. 213); చాక (భాస్క. అర. II. 138); (5) చొచ్చు- చొరక; చొచ్చు ధాతువునుండి పుట్టిన కొన్ని రూపములు నేటి వ్యవహారమున నున్నను 'చొరక' అనునది నిత్యవ్యవహారమునుండి లోపించినది. 'నీరు చొరక లోతు తెలియదు, మొదలగు సామెతల మూలమున మాత్ర మది యింకను వ్యవహారమునఁ గొలఁదిగ నిలిచియున్నది. (6) త్రచ్చు - త్రవ్వక; ఈ రూపము 'త్రవ్వు' నుండి పుట్టినదని యైనను జెప్పవచ్చును. (7) తెచ్చు- తేక (చనుదేక తక్కినర్ - భార. భీ. I. 157); (8) నచ్చు - నచ్చక (9) నొచ్చు- నొవ్వక, నోవక, నోక (10) ప్రుచ్చు—ప్రువ్వక (ప్రాచీనము); పుచ్చు=ప్రుచ్చు—పుచ్చక (ఆధునికము); పుచ్చు = పంపు—పుచ్చక; (11) మెచ్చు—మెచ్చక (12) వచ్చు—రాక (నిర్వ. VIII. 24; భాగ. VII. 72); మొద. 'వర్' ద్రావిడ ధాతువు. * 'వరాక' పూర్వద్రావిడ వ్య. క్త్వా.

రూపము; ఊఁత మొదటి యచ్చుమీఁదనుండి రెండవ యచ్చుమీఁదికి మార్పు; ఆద్యక్షర లోపము. (13) వ్రచ్చు—వ్రచ్చక, (14) విచ్చు-విచ్చక, (విచ్చకి?).

v. కొన్ని ధాతువుల వ్య. క్త్వా. రూపములు:—

(1) అగు—కాక (భార. అర. VI. 72; VII. 9; విరా. I. 197); మొద. 'అగు'కు ద్రావిడ వ్య. క్త్వా. రూపము *అగాక; ఊఁత మొదటి యచ్చుమీఁదనుండి రెండవ యచ్చుమీఁదికి మార్పు; ఆద్యక్షర లోపము—'కాక'కు వివిధార్థములు: ఓర్చిన మఱికాక = ఓర్చుకున్న యెడల (భార. అర. VI. 72); కాక = వికల్పమున (భార. అర. VII. 9); కాక = కాని (భార. విరా. I. 215); ఉరవడికిం గాక = తాళలేక, నిలువలేక (భార. ద్రో. I. 387); అదియునుం గాక (మఱి యొకటి కూడ, భార. ద్రో. IV. 38); కడవం గాక = కడవఁజాలక (భార. కర్ణ. II. 68); మందుగాక = మందువుగాని (భార. శల్య. II. 52); కాక = కానీ (నిర్వ. VI. 85);—ఇట్లు సందర్భమును బట్టి 'కాక' కర్థములు మాఱుచుండును.

(2) *ఇల్, *ఇలు—నష్టధాతువు; ద్రావిడ వ్య. క్త్వా. రూపము. *ఇలాక * ఊఁత మొదటి యచ్చుమీఁదనుండి రెండవ యచ్చు మీఁదికి మార్పు; ఆద్యచ్చునకు వ్యత్యయము. అ + ఇ = ఏ; లేక (భార. అర. IV. 337; VI. 95; విరా. II. 128);—'లేక' వికల్పార్థకమును నగును: వాఁడు పోనైనను పోవును, లేక యుండనైననుండును; మొద. ఇట్టి యర్థ విశేషములను వ్యవహారము వలనఁ దెలిసికొనవలెను. '-*ఇల్, *ఇలు' అను ధాతువు వ్యతిరేకార్థము గలదని యందురు; కాని, యట్లనుట పొరబాటు; దానికి 'ఉండు, కలుగు' అనియే యర్థము. తక్కిన ధాతువుల మీఁదవలె దీనిమీఁదను వ్యతిరేకార్థమున 'అ' వర్ణము చేరును. కన్నడమున 'ఇల్ల'=లేదు. లేఁడు, లేవు, లేరు, లేను, లేము—అను రూపమునందును తుది'అ'కారమే వ్యతిరేకార్థమును దెలుపునది. 'ఇల్లు' = గృహము అను పదము 'ఇల్' = ఉండు అను ధాతువు నుండియే కలిగినది. దానికి 'ఉనికి (పట్టు)' అని యర్థము.

(3) కొను—కొనక (భాస్క. యు. 1794); కోక (భాస్క. యు. 7767); 'న' వర్ణ లోపము పూర్వాచ్చునకు దీర్ఘము.

(4) అను—అనక. ఊఁత మొదటి యచ్చుమీఁద నుండి రెండవ యచ్చుమీఁదికి మార్పు. మొదటి యచ్చునకు వర్ణ వ్యత్యయము. అ + అ = ఆ; నాక (భార. విరా. I. 135. II. 210); మొద.

(5) కను—కనక. ప్రథమాచ్చునకు దీర్ఘము, 'కానక' (భార. అర. VII. 397. హరి. పూ. I. 15); మొద.

(6) దున్ను, రూ. దును—దునక (భార. శాం. II. 290). కాని, ఎన్ను—ఎనక. తన్ను— తనక, అను రూపములు లేవు.

(7) పోవు—పోవక (భార. విరా. II. 228.), పోక (భార. విరా. IV. 64. ఉ. III. 60, 107. IV. 223.) నేర్చు—నేర్వక, నేరక; మొద;

(8) కడచు—కడవక; 'వ' లోపము, పూర్వాచ్చునకు దీర్ఘము 'కడాక' (భాస్క. యు. 52, 136.); 'కడక' అని పామరజనవ్యవహారము మొద. ఇట్లే, గెలక, పిలక, నిలక, మొద.

ఇట్లే, 'మఱాక' మొద. మఱాక, *వెఱాక, *ఏమఱాక, మొదలగు రూపముల దీర్ఘము హ్రస్వమగును: వెఱక (సమీ. III. 118); మొద.

(9) వారక, ఊరక, మిన్నక మొదలగు నవ్యయములు *వారు, *ఊరు, *మిన్ను మొదలగు నష్టధాతువులనుండి పుట్టి యుండవలెను.

(10) ఒకప్పుడు వ్య. క్త్వా. రూపములను విశేష్యవిభక్తులకు మాఱుగను (నేగకనుందరవేగుటకు ముందర, భాగ. x. i. 955), విశేషణములుగను (కానరాక పగిది, నిర్వ. VIII. 24); రాజ్యము పాలులేక తీఱుః=లేకుండు (ఉ. III. 102), వాడవచ్చును.

(11) వ్యతిరేక క్త్వార్థకరూపము లొకప్పుడు ద్రుతాంతములు కూడ నగును. ఆధారములేకను (భార. ఆది. IV. ఊఱడకన్ దిగిచి, ఏమఱకన్ సర్వ కాలము (భద్రా. రామ శత. 8);—వ్యవహారమున ఊరకే, ఊరకనే; లేకే, లేకనే, మొద.

(3) వ్యతిరేకార్థక ధాతుజ విశేషణములు.

(1) ధాతువునై వ్యతిరేకార్థక చిహ్నమగు 'అ'వర్ణమును, దానిపై విశేషణత్వబోధక 'ఇ'వర్ణమును జేర్చుటవలన తెనుఁగున వ్యతిరేకార్థక ధాతుజ విశేషణము లేర్పడును. ఇవర్ణముచేరునపుడు వ్యతిరేకార్థ కావర్ణముపై 'న్' ఆగమముగా వచ్చును. ఆ పోవని (భాగ. X. II. 485); ఎఱుఁగని (భార. ఆశ్వ. I. 143); పెట్టనికోట, కట్టనియిల్లు (మానసబో. శత. 14.) మొద.

(2) కొన్ని 'చు' వర్ణాంతధాతువులపై వ్యతిరేకార్థ కావర్ణము చేరునపుడు చకారమునకు వైకల్పికముగ పకారాదేశమగును. అడఁచ(ప)ని, తాఁచ(ప)ని, దాఁచ(ప)ని, మలఁచ(ప)ని, తోఁచ(ప)ని, ఈసడించ(ంప)ని, చిగుర్చ (ర్ప)ని, మొద.

(3) కొన్ని చువర్ణాంత ధాతువులకు వ్యతిరేకార్థ కావర్ణము చేరునపుడు చకారమునకు బహుళముగ వకారమగును. పూవనికావని తరువులు (భాస్క. 8. 726, ఆధునికరూపము 'పూయని కాయని'). వార్వని (కాశీ. V. 214);

(ఆధు; వార్చని), వేల్వని (ఆధు; వేల్చని); తోఁవని (ప్రాచీ); తోఁయని (ఆధు); అఱవని, కఱవని, కడవని, తోఁవవి, తిగువని, తివ్వని; ఏమఱచు, వెఱచు, మొదలగుధాతువుల చువర్ణము లోపించును. ఏమఱని, వెఱని (సమీ. II. 183); నేర్చు—నేరని (విక్ర. II. 179), గెలని.

(4) 'చ్చు' అంతమందు గల ధాతువుల వ్యతిరేకార్థక ధాతుజ విశేషణములు: అచ్చని,

ఇచ్చు—ఈయని, ఈని (ప్రాచీ.) ఇవ్వని (అర్వా.); ఇయ్యని (ఆధు); కుఱుచ్చు—కుఱువ్వని (ప్రాచీ), కుఱుచ్చని (అర్వా).

క్రొచ్చు—క్రొవ్వని (ప్రా). క్రొచ్చని (అర్వా.), చచ్చు— చావని (భాగ. VII. 214); చాని (ప్రాచీ.); చొచ్చు— చొరని (ప్రాచీ.) నేఁడిది వ్యవహారమున లేదు (భార. ఉ. II. 283); తెచ్చు—తేరని (ప్రాచీ. భార. విరా. I. 245), తేని; త్రచ్చు— త్రవ్వని; లేక, త్రవ్వు-త్రవ్వని; నచ్చు-నచ్చని; నొచ్చు-నోవ్వని, నోని; ప్రుచ్చు-ప్రువ్వని; పుచ్చు=ప్రుచ్చు-పుచ్చని; పుచ్చు=పంపు—పుచ్చని; మెచ్చు— మెచ్చని;వచ్చు(*వర్; ద్రావిడము:వరాని; ఊఁత మొదటి యచ్చుమీఁదనుండి రెండవయచ్చుమీఁదికి మార్పు, ఆద్యక్షర లోపము. రాని;—'రాని'కి సందర్భమునుబట్టి యర్థవిశేషములు గలుగుచుండును. చనరాని తటము = పోవుటకుఁగష్టమైన (భార.ఉ. II. 277); ప్రవేశింపరాని బంధురవ్యూహంబు=వీలులేని (భార.ద్రో.II. 296); వారొక్కొక్కరుండు గెలువరాని యట్టి జెట్టిజోదులు= సాధ్యముకాని (భార. ద్రో. II. 304.) చేయక పోవరానిది=తప్పనిది (భార. శాం. I. 154); ఎన్నరాని బన్నంబులు= శక్యముకాని (దశకు. VII. 111); గాలికిం దూరరాని యీరంబు=ఎడములేని (నైష. VII. 141); విడువరాని= విడువమననుపుట్టని (భాగ. I. 79); భటులకు రారాని లంక=చేరసాధ్యముగాని (భాస్క. యు. 201); పోరానిచుట్టము= విడువరాని, మిక్కిలి ప్రియమైన, దగ్గఱచుట్టము (హరి. పూ. VI. 124; ఉ. IV. 112); ఇట్లే యితర ప్రయోగములను బట్టియు వ్యవహారమును బట్టియుఁ దెలియవలెను.— వ్రచ్చు—వ్రచ్చని (వ్రవ్వని ?); మొద.

(5) * ఒవ్వు-ఒవ్వనివారలు (భార. అర. VI. 16; భీ. II. 11); కను= *కాను—కానని (భార. విరా. II. 118); * వారు-వారని (భార. శాం. VI. 242); అగు—ద్రావిడము= అగాని; ఊఁత మొదటి యచ్చుమీఁదనుండి రెండవ యచ్చుమీఁదికి మార్పు, ఆద్యక్షరలోపము; పదాదిని సరళమునకుఁ బరుషాదేశము.—కాని— (i) దీనికి సందర్భమునుబట్టి యర్థభేదములు గలుగుచుండును. ఇట్టి చెడ్డపనులు నాకుఁ గానిపేరివి=నాపేరికిఁ దగనివి (భార. అర.V. 302); పదిలంబుకాని గుఱ్ఱంబులు = లొంగని (భార. విరా. IV. 96); కాని

తెరువు=తగని (భార. విరా. II. 73); కాని తెఱంగు=ధర్మముకాని (భార. ఉ. II. 158); వినఁజవికాని పలుకులు=కూర్పని (భార. ఉ. III. 325. భీ. II. 282); చవికానియిందులకు (మను. III. 94); కానివాఁడు= అడ్డగింప శక్యముకాని వాఁడు (భార. ద్రో. III. 168); నేఁడు 'కానివాఁడు'= సమర్థుఁడు, దుష్టుఁడు; కానివారు= అసమర్థులు (భార. ద్రో. V. 105); కాని చనవు=కూడని, తగని (భార. కర్ణ. II. 271); పడఁగాని యిడుమ=అనుభవింప సాధ్యముకాని (భార. శల్య. II. 366); పడరానియిడుమ యనియు ననవచ్చును; కాని కాలము=చెడ్డ, సరిగ జీవింప వీలులేని కాలము (భార. శాం. I. 185); వినఁగాని మాటలు=విని సహింపరాని (భాస్క. సుం. 222); కాని తలఁపు= ధర్మముకాని (భాస్క. యు. 1737); పలుకఁగానిపలుకులు=కూడని (హరి. పూ. VIII. 152); కానుకు గవ్వకైనఁ గొఱగాని=పనికిరాని, విలువచేయని (రామరాఘవ శత. 48); ii. 'కాని' అను రూపము 'తప్ప' అను నర్థమున నవ్యయమగును. పసులఁగాచి కాని బ్రదుక (భార. విరా. I. 285), పొద్దు గ్రుంకినమఱికాని పోవఁడొక్కొ క్రీడి; బలమునెల్లను దెగటార్చఁబఱపికాని తక్కఁడు (భార. విరా. V. 63); నిల్చినం గాని (భార. ఉ. II. 137); ఇట్లే (భార. ఉ. I. 169. శల్య. II. 281; శాంతి. II. 348. V. 626. VI. 29. అను. I. 113. III. 292). మొద.— (iii) 'కాని' వికల్పార్థకమగును. చెప్పఁగాని (భార. అశ్వ. III. 130); (iv)'కాని' అవధారణార్థమున; వారలచేటగుఁగాని (భార. ఉ. III. 273);- (vi). 'కాని' పూర్వకథితార్థమునకు వ్యతిరేకార్థమును దెలుపును. చూడఁ జిన్నవాఁడు గాని యలంతులం బోయెడువాఁడుగాఁడు (భా. ద్రో. II. 104); ధీరుఁడై పరగిరకాని (భార. ద్రో. II. 152); (vii) క్త్వార్థకముపైఁజేరి 'కాని' వ్యతిరేకక్త్వార్థబోధకమగును. ఆచరించికాని కుడువను (భార. శాం. I. 326);—ఇట్లే యాయాయర్థములను బ్రయోగములను బట్టియు వ్యవహారమును బట్టియుఁ దెలిసికొనవలెను.—

పోవు—పోవని, పోని (భార. భీ. II. 56. శల్య. II. 386. భాగ. III. 681.) మొద.

* ఇల్, * ఇలు—*ఇలని=లేని. మగఁడులేని మగువమాడ్కి (భార భీ. I. 62); పొనుగులేని శిఖ (భార. శాం. V. 95); ఒచ్చెములేని మచ్చిక (వృషా. శత. 105). లేఁగలేనిలేఁగటికుఱ్ఱి (భాగ. I. 395).

వ్యతిరేకార్థకక్రియలు.

I. వ్యతిరేకార్థక క్రియలకుఁ గాలభేదములేదు. అవి తద్ధర్మకాల సూచకము లనియే చెప్పవలెను. ఇవి ధాతువుపై వ్యతిరేకార్థక 'అ' వర్ణమును దానిపైఁ దత్తత్పురుషవచనబోధక ప్రత్యయములును జేరుటవలన నేర్పడును:

(1) ఉత్తమ పురుషము : ఏకవచనము : ఇడను (భార. విరా. II. 154); ఊడ్పను (భార. ద్రో. II. 130); ఎఱుఁగను (భార. శాం. IV. 396); ఏలను (భార. విరా. I. 67); ఓపను (భార. శల్య. II. 74); ఓర్వను (భార. విరా. I. 148); కొనను (భార. భీ. III. 170); గెల్వను (భార. విరా. V. 284); చంపను (భార. ఉ. IV. 270); చాలను (భార. విరా. IV. 59); చేయను (భార. ఉ. III. 305); తేను (భాస్క. యు. 126); నేరను (భార. అర. IV. 364); పడను (భార. శల్య. II. 13); పుచ్చను (భార. ద్రో. II. 255); పోను (భార. అర. V. 13); పోవను (హరి. పూ. III. 44); మొద.

బహువచనము : చూడము (భార. ద్రో. III. 117); పడయము (భార. ఉ. III. 117); ఓపము (భార. భీ. II. 282); కానము (భార. అర. VII. 18); పడము (భార. అర. VI. 29).

(2) మధ్యమ పురుషము : ఏకవచనము : ఏమిర పనులని యార్వవు (భార. కర్ణ. III. 221); ఎఱుఁగవు (భార. శాం. IV. 397); చేయవు (భార. అర. VII. 421); వినవు (భార. అర. VII. 296); (మెయి) కానవు (హరి. పూ. I. 131;) లేవు (భాగ. VII. 152); తలఁపవు (భార. విరా. II. 49); పడవు (భార. విరా. I. 278); చొరవు (భార. ఉ. II. 280); (చను) దేవు (భార. విరా. I. 186); తెప్పిఱవు (భార. ద్రో. III. 160); ఏదవు (నిర్వ. I. 43); వాడవు, ఎండవు (భాస్క. అర. II. 418).

వ్యతిరేకార్థక మధ్యమపురుష క్రియారూపములు మహన్మహతీవాచక ప్రథమపురుష బహువచన రూపములవలెనే యుండును.

(3) ప్రథమపురుషము : మహద్వాచకము : ఏకవచనము : ఈఁడు' కాఁడు, రాఁడు, లేఁడు (భాగ. I. 283); ఓడఁడు (భార. విరా. V. 338); కందఁడు (భాగ. VIII. 245); వినఁడు, కానఁడు (భార. ఉ. II. 14); కాయఁడు (భాస్క. సుం. 217); కావఁడు (భార. అను. III. 338); కొనఁడు (భార. ద్రో. III. 298); క్రుంకఁడు (భార. విరా. II. 312); చాలఁడు (భార. విరా. I. 152); చిక్కఁడు (భాగ. I. 101); చేయఁడు (భార. ఉ. IV. 242); డాయఁడు = డయ్యఁడు (భాగ. VII. 153); తప్పఁడు (భాస్క. కి. 485); తివియఁడు (భార. ఉ. IV. 226); తేఁడు (భార. విరా. II. 330); పన్నింపఁడు (భాగ. VIII. 96); పఱుపఁడు (హరి. పూ. V. 177); పొందఁడు (భార. శాం. VI. 320); పోవఁడు (భార. విరా. V. 63); పోఁడు (భార. విరా. II. 54); పోలఁడు (భార. ఉ. II. 160); శపింపఁడు (భార. అర. V. 19); మొద,

మహన్మహతీ వాచకము : బహువచనము : చాలరు (భార. ఉ. III. 335); పట్టరు (భార. విరా. I. 186); మొద.

అమహద్వాచకము : ఏకవచనము : ఆడదు, కూడదు, పాడదు, వీడదు (రామప్రభో శత. 89); ఒలయదు (భార. కర్ణ. III. 89); ఒసగదు (సిం. నార. శత. 74); ఓర్వదు (భార. విరా. I. 103); కలుగదు (భార. ఆర. VI. 82); కానదు (భార. ద్రో. IV. 50); కుడువదు (భార. విరా. II. 234); కొల్వదు (భార. విరా. I. 197); చొరదు (భార. విరా. I. 160); తడవదు (భాగ. I. 25); తేదు (భార. శాం. VI. 182); పోవదు (భార. ఆర. IV. 266); పోదు (భార. ఉ. III. 123); రాదు, లేదు (భార. ఉ. III. 378); ప్రువ్వదు (భాగ. VII. 12); మొలవదు (భార. విరా. III. 95).

మహతీతరామహద్వాచకము : బహువచనము :ఆడవు, కూడవు, వీడవు, మొద.కాదు, రాదు, లేదు, అనువానికి సందర్భమునుబట్టి యర్థవిశేషములు కలుగుచుండును: వెక్కలు పల్కఁగాదు నీకు = నీవు పల్కఁగూడదు (భార. ఆర. VI. 156); సాధుల దూఱంగఁ గాదు = కూడదు (భార. విరా. II. 148); కాదు కూడ దనఁగల్గెనె = తగవుకాదు (భార. విరా. II. 257; V. 276); ఈడుగాదు = యుక్తముకాదు, తగదు .(భార. ఉ. I. 154); జూదవుసిరి యాసపడం గాదు = కూడదు (భార. ఉ. I. 316); కాదు వధింప నెట్టి శత్రునిన్ = వధింపరాదు (భార. భీ. I. 148); కాలముగాదు దానికిన్ = కాలమురాలేదు (భార. భీ. I. 159); చే నిరతముగాదు గాండివము= ఉండదు (భార. భీ. I. 181); త్రెక్కొనఁగాదు = తెగఁజూడరాదు (భార. భీ. III. 306); కాదేనిన్ = కాకుండినన్ (భార. ద్రో. I. 35); వారల నమ్మంగఁగాదు చేత గుండెకాయ నిడిన = వీలులేదు (భార. శల్య. II. 379); కుడువక పోవఁ గాదు = శక్యము కాదు (భార. అశ్వ. I. 186); సంబంధముకాదు = పొందు పడదు (భాస్క. అయో. 14); ఇచ్చోటనేకాదు = మఱియొకచోటఁ గూడను (భార. విరా. I. 218); మొద. 'కాదు' అనుటకు 'అవదు' అను రూపముత్తర సర్కారులలో వాడుకయందున్నది.

రాదు = శక్యముకాదు (భార. అను. III. 198); రెంటిబారికిం దప్పి పోవరాదు = శక్యముకాదు (భార. శాం. III. 204); ఎదురు చనరాదయ్యె = వీలులేకుండెను (భార. భీ. II. 57); పోనొల్ల ననంగరాదు అచటికూరకపోవను రాదు = కూడదు (భార. విరా. II. 91); చెంతం జేరరాదీ శమీవృక్షంబు = శక్యముకాదు (భార. విరా. I. 164); ముద్దముట్టలేదు = అన్నము సహింపదు (మాతృ. శత. 66); ఎవ్వరికిం గడవంగరాదు = సాధ్యముకాదు (నిర్వ.

IX. 74); మును శిశువు నేడిపింపక ముద్దురాదు = కలుగదు (సింహ. నార. శత. 31); మొద.

పూసద్రాడు దుయ్యానులేదు = అభావము (హరి. పూ. V. 221); నీకుఁబోలేదు = పోవఁగాలము రాలేదు (భార. అను. V. 287); నీతోఁ బదరం బనిలేదు నాకు = కాదు (భార. శాం. IV. 409); నీవు సంపవలయునని లేదు = చంపువాఁడవు కావు (భార. భీ. I. 215); తప్పఁ గ్రుంకలేదు = కాలములేదు (భార. ఉ. IV. 191), నీ విటవచ్చు సెలవులేదు = ఇవ్వఁబడలేదు (భార. ఆర. VII. 235); కన్నది లేదు = చూడలేదు (నిర్వ. VI. 127).

II. వ్యతిరేక క్రియారూపములెట్టి కాలమును సూచింపవు; ప్రత్యేకముగఁ గాలమును పురుషమును సూచింపవలసినపుడు వ్యతిరేక క్రియారూపములపై 'అగు' ధాతువు క్రియారూపములఁ జేర్చుట గలదు: చేయనైతిని. చేయమైతిమి; చేయవైతివి, చేయరైతిరి; చేయఁడయ్యెన్, చేయరైరి; చేయదయ్యెన్, చేయవయ్యెన్; వృష్టిలేదయ్యెన్, వృష్టిలేదవున్; ఎదురు చనరాదయ్యె (భార. భీ. II.517); కాని, చూడఁగాననైతి (భార. ఆర. VI. 361); ఎఱుఁగంగఁ జాలనయ్యెద (భార. విరా. IV. 363); ఏర్పఱుప నేరనయ్యెద (భార. విరా. V. 206); కానసయ్యెద (భార. నిర్వ. VI. 130); ఎఱుఁగలేనైతిన్ (భాగ. I. 123); నమ్మనయ్యెదన్ (భాస్క. యు. 2547); కానఁబడయమైతిమేని (భార. ఉ. III. 117); చెప్పరైతిరే (భార. భీ. II. 119); ఎఱుఁగఁ జాలరయ్యెదరు (భార. స్త్రీ. II. 23); కాని, లేఁడ (ర) గుచున్నవాఁడు (-రు), మొదలగు రీతి రూపములు కానరాకున్నవి.

(అ) సంపూర్ణక్రియారూపములపై 'అగు' ధాతువు వ్యతిరేకార్థక రూపములు జేరియు వ్యతిరేకార్థము కలుగును: ఎవ్వరికాలానాన్ను తప్పంగల వారము కాము (S. I. I. IV. 710); మొద.

(ఇ) వ్యతిరేకక్త్వార్థక రూపములపై ఉండు, పోవు, మొదలగు ధాతువుల క్రియారూపములఁ జేర్చుటవలనను కాలమును బురుషమును సూచించుట గలదు: చేయకున్నాను, చేయనైతిని, చేయకుందును; చేయకపోతిని, చేయక పోదును; మొద.

పొరయకయున్నేనిన్ (భార. శాం. V. 154); మనసుకందకయున్నే (భార. ద్రో. IV. 206); దినము తెగుదలరాత్రియేతేరకున్నె (భార. ఆర. V. 340); చూడకున్నాఁడను (భార. స్త్రీ, II. 127); ఆయువు మాల్పకుందున్ (భార. అను. IV. 96); మనసువెట్టక యున్నది (భార. అను. V. 230): చూపకున్నది (భార. విరా. I. 176); కోల్కొనకున్నది బుద్ధి (భార. ఉ. IV. 90); మొద.

III. (అ) భావార్థక తద్ధర్మార్థక క్రియలపై ప్రశ్నార్థక చిహ్నములగు 'ఎ, ఏ, అ, ఆ' లు చేరి వ్యతిరేకార్థక ప్రత్యుత్తరము నపేక్షించును: ఇది పలుకగునే (భార. విరా. I. 299); ఎరవు సతమగునే (భార. ఆర. IV. 347); నరునందు భీష్మునియందుఁదక్కఁ గలుగునే యెందు నీయస్త్రబలము (భార. ద్రో. III. 134); ఇనుఁడలచేత మాటువడు నెన్నఁడుఁగల్గునె (భార. ఆర. VII. 347); మెట్టునకుఁ జన్నె తరములువెట్టి చూడ (హరి. పూ. VIII. 70); నడుకందగునే (భార. భీ. II. 237); ఇట్టట్టనవచ్చునే (భార. ఉ. I. 297); వార్చునె మృత్యువు జనుల పసులు (భార. శాం. VI. 234); నన్నుసైఁచునె (హరి. పూ. V. 224); సహించునె నన్ మరుఁడు (భార. విరా. II. 296); మీరులేక వేగునె మాకున్ (హరి. పూ. V. 232).

(ఆ) వ్యతిరేకార్థక క్రియలపై ప్రశ్నార్థకచిహ్నములును, అయ్యా, అమ్మ, అన్న, మొదలగు పదములును చేరియు భావార్థమును దెలియఁజేయును: ఇత్తలోదరిం జెందఁగఁ గాన్పగాదె ఫలసిద్ధి (భార. విరా. II. 26); వారు వచ్చినచోటఁ బూరియున్ మొలవదె యింతకు (భార. విరా. III. 95); జనకాత్మజ రావణుచే గృహీతయై పోవదె = పోయెను (భార. ఆర. VI. 266); పైఁబ్రయిడనే = ఇడుదును (భార. విరా. II. 154), మే మధిక దుఃఖవహ్ని పాల్పడమయ్యా = పాల్పడుదుము (భార. ఆర. VI. 29); అడిగిన యప్పుడ చెచ్చెరఁ గడిపిన పోనవ్వ (భార. ఆర. V. 13); పారణ యొనర్పఁదగదే (భార. ఆర. VII. 205); చాలదా (భాగ. IV. 94); ఇంతిం గాముం డిట తేఁడె యింతకు (భార. విరా. II. 330); ఇడుమలఁ గుడువదె (భార. విరా. II. 234); నిన్నెఱుఁగనా (భార. శాం. IV. 396); నారె (భార. ద్రో. IV. 130); ఆఁగువాఁడనె (భార. ద్రో. III. 113); పోవఁగవలదే (భార. ద్రో. III. 285); వేఁటరారె (వరాహ. II. 51); ఎఱుంగమె వెట్టరె (భార. ఉ. III. 102); నిను నగరే (భార. భీ. III. 250).

'కాదా' అనుటకు 'కదా', 'కద' యనియు, 'కాదే' అనుటకు 'కాదె, కదె' యనియు, 'కద' పై 'ఎ, ఏ' మొదలగునవిచేరి వగాగమము గలిగి 'కదవె, కదవే' అనియు రూపములు గలుగును; ఈ ప్రశ్నార్థక రూపములు 'అవును' అను ప్రత్యుత్తరము నపేక్షించును:

మానిమాటలు గదా సభలఁజెల్లు (భార. ఆర. IV. 201); మోదము నొందునే కదా (భాగ. III. 62); కన్నులులేని మాకన్నులుఁ గాళులు నీవ కదన్న (భార. ఆర. VII. 262); కలిమికి భోగములకదా ఫలము (భార. విరా. I. 140); మొద—'కదా' అనుటకు 'కా' అనియు రూపాంతరము గలదు: చావుమేలకా (భాస్క. యు. 2259); మీరిట మున్నుగన్గొనని భూముల్లేవుగా

(విజ. వి. III.); కనిపించుకోవుగా, జాలిరాదామెగా, అలుక రాదామెగా (సిం. నార. శత. 34); మొద.

మ్రగ్గఁడు గదా = మ్రగ్గలేదు గదా (భార. ద్రో. II. 235); కురుసేనగదా = అందువా (భార. ఉ. II. 197); భూమితనూజఁగానము = కానలేమైతిమి (భార. ఆర. VII. 18); నేను గెల్వను = గెల్వలేదు (భార. విరా. V. 284); ముద్దటవమ్మా = ముద్దుకాదు.

క్రియారూపముల మీఁదనే కాక విశేష్యములమీఁదను ప్రశ్నార్థక చిహ్నములు చేరి వ్యతిరేకార్థమును బోధించును: తగవా (భార.అను. II. 200); ఇంత గఱవా (భార. విరా. IV. 20); నీ వాఁడెడునంత తక్కువనె (భార. శాం. III. 391); ఇతఁడు గేవల నరుఁడే (భార. విరా.I. 215); ఇట్టిదే (భార. ఆర. IV. 157).

(ఇ) వ్యతిరేకార్థక క్రియలతో 'ఏమి, ఎట్లు, ఏల, ఎక్కడ, ఎవ్వఁడు, ఏ', మొదలగు ప్రశ్నార్థకపదములుచేరి భావార్థమును బోధించును: ఈ పాతకం బేమిసేయుదు (భార. ఆర. VI. 307); వారలయేపు నోపఁగానమెట్లు (భార.భీ. II. 282); నవ్వరెట్లు (భార. విరా. IV. 62); జయింపరెట్లు (భార. విరా. I. 52); శపింపఁడెట్లు (భార. ఆర. V. 19); మాట వుట్టదెట్లు (భార. ఉ. I. 79); శాప మీనెట్లు నీకు (భార. అను. II. 212).

ఏమి, ఎట్లు, ఏల, ఎక్కడ, ఎవ్వఁడు, మొదలగునవి భావార్థక క్రియలతోడను, విశేష్యములతోడను జేరియు వ్యతిరేకార్థమును దెలుపును: ఈ తిప్పబోర్లఁబడిన నేమితినియెదవు (సిం. నార. శత. 29); మాకేమిటఁ గడమ (భార. ఆర. V. 115); చొరఁగానెట్లువచ్చు (భార. ద్రో. IV. 146); విధితో నెవ్వాఁడునేర్చు (భాస్క. అయో. 113); ఇంతకంటె వలయు వరంబెయ్యది (భార. ఆర. IV. 379); ఎఱుఁగనియట్టు లుండుటిదియే పురుషార్థము (భార. ద్రో. I. 223); అవియు నొక్క బ్రతుకులే (కళా. III. 30); చొత్తేర యుక్తంబకో (శివర. IV. 75); శంకింపం బట్టాకొ (భార. ఉ. III. 103); పరశురాముఁ గానఁబడయుట యెక్కడఁ గలుగు (భార. ఉ. IV. 290); నీ వెక్కడ బుద్ధి తెరువులెక్కడ (భార. ఆర. VII. 297); మొద.

(ఈ) రెండు వ్యతిరేకార్థక పదములుచేరి యత్యంత భావార్థబోధకము లగును: చూపకతక్కరు (భార. శాం. II. 360); కఱపక తక్కరు (భార. విరా. I. 116); మొద.

(ఉ) వ్యతిరేకార్థక క్రియారూపములవై ఎ, ఏ, అ, ఆ, అయ్యా, అమ్మ, అన్న మొదలగునవి చేరి సంప్రార్థనమును దెలియఁజేయును: చూ. ప్రార్థనార్థకక్రియలు.

(ఊ) 'వలచు' ధాతువు వ్యతిరేకార్థకరూపము లేర్పడునపుడు దానికి 'ఒల్లు' సర్వాదేశమగును: ఒల్లమి, ఒల్లని, ఒల్లక; ఒల్లను (భార. భీ. I. 181; భాగ. II. 9); ఒల్లము; ఒల్లవు (భార. ఉ. III. 334); ఒల్లరు, ఒల్లఁడు; పాండవులు గౌరవులతోఁడి పగకు నొల్లరు (భార. ఉ. I. 233); ఒల్లదు, ఒల్లవు.

## VII. నిషేధార్థక క్రియలు.

i. 'వలచు' ధాతువు వ్యతిరేకార్థక రూపమగు 'వలవదు' అనురూపము తుమున్నర్థకాన్నంత క్రియలపైఁ జేరి నిషేధమును దెలుపును; 'వలవదు' కు వలాదు, వలదు, వల్దు, వద్దు, అనియు పరిణామ రూపములు గలవు: —

మసలవలవదు (భార. విరా. V. 80); ఎప్డు సెప్పవలదు (భార. ఆర. V. 318); చేయవలదు (భార. ఆర. VII. 4); చన్నుగుడుపన్ వల్దమ్మ (భాగ. X. i. 223); చూ. ఉత్తరాంధ్రము.

ii. వ్యతిరేక ప్రార్థనమందును బై రూపములు వచ్చును: వగవవలదు = వగవకుము (భార. ఆర. VII. 202); ఇతనిపై నలుగవలదు (భాస్క. యు. 1739); మనమునందు నితనిఁ గినియవలదు (భాస్క. యు. 2429), మొద.

iii. 'తగదు, ధర్మముకాదు' అను నర్థమునను పైరూపములు వాడఁబడును.

ఇప్పుడు మనమంత గాలు ద్రవ్వవలవదు (భార. విరా. V. 10); వగపు వలదు చిత్తంబులో నీకు (భార. ఆర. V. 323); ఇంతటి కెలనంబుఁ దీర్ప నేనియు వలదే (భార. ఆర. VI. 30); సైఁపవలదె (భార. ఆర. VI. 245); వగవవలదు (భార. ఆర VII. 202); ఈఁగవలదా (భార. ఉ. III. 201); వలదింత రజ్జులు (భార. కర్ణ. II. 23); అనఁగా వలదు (భార. శాం. V. 278); దీన సంశయము వలదు (భార. అను. V. 156); భుజింపఁగా వలదటోయి (శకుం. పరి. I. పు. 4); మొద.

iv. 'కాదు, కూడదు, చనదు' అనునవి తుమున్నర్థకాన్నంత క్రియలపైఁ జేరియు నిషేధార్థమును దెలుపును: చేయంగాదు, చేయఁగూడదు, చేయఁజనదు; మొద.

v. వ్యతిరేక క్త్వార్థక రూపముపై 'ఉండునది' అని చేరి నిషేధార్థమును బోధించును: చేయకుండునది, చెప్పకుండునది; మొద.

## VIII. విధ్యర్థక క్రియలు.

i. ధాతువుల తుమున్నర్థకాన్నంత రూపములపై 'వలయున్' అనునది చేరి విధ్యర్థమును దెలుపును; 'వలయున్' అనుటకు 'వలెన్' అర్వాచీనరూపము: ఓర్వవలయున్ (భార. విరా. III. 110); అఱుమవలయున్ (భార. విరా. V.

338); పోరనవలయున్ (భార. భీ. III. 216); ఇతనికి నోసరించి **పోవవలయు** (భార. **ద్రో**. IV. 12); పొత్తు**మనంగవలయు** (భార. శాం. III. 527); మానస మూన్పంగ **వలయు** మహనీయధృతిన్ (భార. శాం. IV. 289); పోవ **వలయు**న్ (నిర్వ. III. 42); మొద.

ii. ఒకప్పుడు '**వలయు**' ప్రార్థనార్థక **మగును**: మాకుంగా వీనిని విడువ **వలయు** = విడువుఁడు (భార. ఆర. V. 433); నా బాల్యంబుఁ గరుణ సైఁప **వలయు** (భార. ఆర. VII. 334); ఆ చాలుట కోర్వవలయు = ఓర్వుఁడు (భార. విరా. III. 110); మొద.

iii. ఒకప్పుడు '**వలయు**' కేవల తద్ధర్మార్థబోధక **మగును**: కోరెంగా **వలయు** (నిర్వ. IV. 8); నాకుఁ గల తెఱుంగు సెప్పవలయున్ = **నేను** కల **తెఱుం**గు చెప్పవలసి **యున్న**ది (నిర్వ. VII. 98); కర్ణము లెల్లం దార పెడఁ బాయ**వలయు** (భార. భీ. I. 204); మొద.

iv. తద్ధర్మార్థక విశేషణముపైఁ దచ్ఛబ్దార్థక సర్వనా**మ**రూపములుచేరి విధ్యర్థబోధకము **లగును**: మీరు చాలియుండునది (భార. ఆర. VI. 71); **మొద**—'*' **ఉను** + న్ + అది = '*' ఉనునది = ఉన్నది = ఉండునది (భార. **శాం**. III. 239); **చేను**వాడు = **చేయు**వాఁడు = వాఁడు చేయవలెను (S. I. I. V. 1152); అనుభవించి బ్రతుకువారు (S. I. I. IV. 698);—**ధాతు**వుపై 'ఎడిది, ఏది' అనునవి చేరియు విధ్యర్థబోధకము **లగును**: చేయించ్చి (—ంచ్చె?) డిది; పుణ్యమునం బొంద్ది (—ంద్దె?) డిది (S. I. I. V. 193); **సుఖాన** అను**భ**వించి (—ంచే?) ది (S. I. I. V. 166); **చే**రేద్ది (—ది?) (S. I. I. VI. 950); **నూం**క్కేది (S. I. I. VI. 1202); చేశి (—సే?) ది (S. I. I. IV. 659); మొద. చూ. ఉత్తరాంధ్రము.

# ఆంధ్రభాషా చరిత్రము.

## పదునొకండవ ప్రకరణము.

### నన్నయకుఁ బూర్వకాలపు భాష.

నన్నయకుఁ బూర్వ మేడవశతాబ్దమువఱకు నాంధ్రభాషాస్వరూప మెట్లుండెనో తెలిసికొనుట కాధారములు గానరావు. ద్రావిడ భాషలకే కాక భారతీయభాషల కన్నిటికి నది యజ్ఞాతయుగ మనియే చెప్పవచ్చును. ఆ కాలమున వ్యావహారిక ప్రాకృతభాషలుమాత్రము ప్రచారమున నుండె నని మాత్రము చెప్పుట కవకాశ మున్నది.

ఏడవశతాబ్దము నుండియు శాసనములలోఁ గొన్ని గ్రామముల పేళ్లు కానవచ్చు చున్నవి. తక్కిన శాసనభాష యంతయు సంస్కృతముగనే యుండెను. కాని, రాను రాను తెనుఁగుభాగ మెక్కువగాఁ గల శాసనములును వెలువడఁ జొచ్చినవి. వానియందలి భాష నన్నయకాలపు భాషకుఁ గొంత విలక్షణముగ నుండును. ఆయా శాసనముల కాలమున వ్యవహారమందలి భాష యట్లే యుండి యుండవచ్చును. అట్టి శాసనములు నేఁటివఱకు బయల్పడిన వీ క్రింద కొంత వివరణముతోఁ బొందుపఱుపఁబడినవి.

### జయసింహవల్లభుని శాసనము.

(క్రీ. శ. 633.)

జయసింహవల్లభుఁడు కుబ్జవిష్ణువర్ధనుని పుత్త్రుఁడు. తెలుఁగున నున్న శాసనములలో నెల్ల నిదియే ప్రాచీనతమ మైనదని యెన్నఁబడుచున్నది.

౧. స్వస్తి శ్రీమత్ సకలలోకాశ్రయ జయసింఘ
౨. వల్లభ మహారాజులాకున్ ప్రవర్ధమానవిజయరా
3. జ్య సంవత్సరంబుళ్ ఎణుంబొది అన్నేణ్టి అమ్మఙపూణ్ణ
౪. మ నాణ్డుం ప్లూవిండిరాజులముట్లు కలివిముడిరాజుల్
౫. ప్లూవిండి సముద్రకై నాకుబణి సేసిన కల్చివీ
౬. టిరుల్లి మద్దికదు మూటికి విత్పత్తి ఉత్తరంబున పులో
౭. ంబున చెఱువు పడుమాఱికోటన్ ఎణుంబొదిపు(వు?)ట్టుళ ఆ
౮. ల్లిపట్టు సేను[*] తూప్పుఁన కోటి తా (టు)తోంటళాయు పడువా
౯. రంబు ఇచ్చిరి పాఱపడువారంబు ప్లూవి (౦) డీళ్వరంబున కళా

౧౦. కణ్డుగు మిచ్చి కుడుచువారు యిల్లికాను ఏవెలుగు

౧౧. రు విత్పత్తి గాణంబు [న్దొ] ల్గొట్టు [నం] గాణంబు చువ్వ టూరు గాణంబు.

... ... ... వ్రచ్చినవారు బారణాసి వేవ్ర

... ... .. లీడిన స (ము) ద్రంబును లా

... ... ... డి సెనవదికి

... ... ... రమఞ్చ

దీని తాత్పర్యమును వ్రాయుచు నొకరు "ఇది జయసింహవల్లభుఁడు తనకు 'బణిసేసిన' ఏ యుద్ధముననో సహాయము చేసిన మ్లావిండి రాజులకు 'విత్పత్తి' గ్రామము నిచ్చినట్లుగాఁ దెలుపుచున్నది" అని వ్రాసినారు. ఈ యర్థము సరియైనట్లు తోఁపదు. ఈ శాసనములోని తెనుఁగుమాటల యర్థమును ముందు నిర్ణయించి, తరువాత తాత్పర్యమును తెలిసికొనవచ్చును.

3. ఎణుంబొది = 80; అన్నేణ్టి = అగు నేఁటి, అమ్మఁపూణ్ణ మనాణ్డు= అంబా పూర్ణిమ = గౌరీపూర్ణిమనాఁడు;

౪. మ్లావిండిరాజుల ముట్కు = మ్లావిండి గ్రామపురాజుయొక్క ప్రధానోద్యోగి; కలిముడిరాజుల్ = కలిముడిరాజు అను పేరు గలవారు.

౫. మ్లావిండి = మ్లావిండి గ్రామమునుయొక్క; సముద్రరక్షై = సముద్ధరణమునకు, బాగుచేయుటకు; నాకు బణిసేసిన = నాకొఱకు పనిచేసిన.

౫-౬. కల్చివీటు, రుఙ్లి, మద్దికదు, మూటికి = కల్చివీడు, రుఙ్లి, మద్దికదు అను మూడు గ్రామములకు, అనఁగా ఆ మూఁడు గ్రామములవారికిని; విత్పత్తి ఉత్తరంబున పులొ ౭. ంబున చెఱువు పడుమాటి కోటన్ = విత్పత్తి అను గ్రామమున కుత్తరముగా నున్న భూమిలోని చెఱువు పడమటిప్రక్కను; ఎణుంబొదిపు(వు?)ట్లు ఆల. ఙ్లిపట్టుసేను=80 పుట్లు ఆళ్లిపట్టుగల చేను;తూర్పుణనకోటి = (ఆ చెఱువుకు) తూర్పుప్రక్క; తా (టి) తోంటళాయు పడువా ౯. రంబు ఇచ్చిరి = తాటితోఁటల కల్లు గీచుకొను హక్కును ఇచ్చిరి; పాఱ పడువారంబు = తాటిఆకులమీఁది హక్కును; మ్లావి [౦డీ] శ్వరంబున = మ్లావిండీశ్వర గ్రామమున, లేక మ్లావిండీశ్వరుని యాలయమున; ౧౦. కళా కణ్డుగు మిచ్చి = కళాకణ్డుగ మను పన్ను చెల్లించి; కుడుచువారు = అనుభవింపవలెను. (తక్కినభాగము ఎక్కువగా చెడిపోవుటచేత నర్థము స్పష్టముగా లేదు. విత్పత్తిగాణము, తొల్గొట్టుగాణము, చువ్వటూరుగాణము, అను మూడు వాడల పేర్లున్నవి. 'వ్రచ్చినవార్లు బారణాసి వేవ్ర' అనుభాగము శాప వాక్యములోనిది.)

పై దానినిబట్టి యీ శాసనము జయసింహవల్లభునిది కా దనియు, అతని రాజ్యకాలమున వ్రాయఁబడిన దనియు, దానము చేసినవాఁడు మ్లావిండిరాజు యొక్క ఉద్యోగి యైన కలిముడిరాజు అనియు, దానము చేయఁబడినది విత్పత్తి కుత్తరమున నుండు చెఱువుప్రక్కనున్న భూమియుఁ దాటితోఁటయు ననియుఁ దెలిసికొనవచ్చును.

**మంగి దొగరాజుకాలపు లక్ష్మీపుర శాసనము.**

(సుమారు క్రీ. శ. 675.)

౧. స్వస్తిశ్రీ మగిదొగరజుల ముద్దు
౨. విత్రజుల ప్రతమరా
౩. జ్యంబున కడువం [డ్లు]
౪. ల ఇచ్చిన రెన్డువటి
౫. మిరియమ్ము బోళ
౬. జకు తెంగరి పె
౭. డశిన రెణ్డువట్టి
౮. పదేన్డుంబు ఆడ్లుప
౯. ట్టు ద్రుగ్గాదేవి నేలయు
౧౦. ఉఱువుటురి బోళ
౧౧. రెన్డుట్టియు తూఱ్పు
౧౨. ఈ రెన్డుట్టి ఒచువరు
౧౩. కళరేని బారనాసి
౧౪. వేగివిళాలు వేడ్లు
౧౫. ము వేశెఱువుళు
౧౬. వేవురు పతూను
౧౭. చమ్పిన చన్నంగు

... ... ... ... ... ...

అర్థము.

**మగి దొగరజుల** = మంగి దొగరాజుల = రెండవ మంగిరాజు, లేక **మంగి యువరాజు**యొక్క; **ముద్దు** = రాజోద్యోగి, మండలేశ్వరుఁడు (చూ. **ముట్టు** - జయసింహ వల్లభునిశాసనము; అహదనకర శాసనము - 'ముద్దు') **అయిన**; **విత్రజుల** = విత్ర జను పేరు గలవాని; ప్రతమ రాజ్యంబున = **రాజ్యము** ప్రథమ సంవత్సరమున; కడవండ్లుల ఇచ్చిన = కడవండ్లు అను **వూరున ఇచ్చిన**; **రెన్డువటి** మిరియమ్ముబోళ = రెండుపుట్లు విత్తనములు **మిరియమ్ముబోళ** అను పేరు గల పొలమును; జకుతెంగరి = **జకుతెంగరి**

అను పేరు గలవాఁడు; పెడశిన = పడసిన; రెణ్డువట్టి పదేన్దుంబు ఆడ్లుపట్టు = రెండుపుట్లు పదునేదుము ఆళ్లు విత్తుటకు తగిన; ద్రుగ్గాదేవి నేలయు = ద్రుగ్గాదేవి నేల అను సంజ్ఞగల పొలమును; (దీనికి) తూఙ్బు = తూర్పునం గల; ఉఱువుటురిబోళ = ఉఱువుటురిబోళ అను పేరు గల; రెన్డుట్టియు = రెండు పుట్లు విత్తనములు చల్లుటకు యోగ్య మైన పొలమును. ఈ రెన్డుట్టి = ఈ రెండుపుట్లు నేలను; ఱచువరు = చెఱచువారు; కళరేని = ఉన్నయెడల; బార నాసి = కాశియందు; వే గవిళలు = వేయి కపిలగోవులను; వేడ్లము = వేయి యెడ్లను; వే శెఱువ్వుళు = వేయి చెఱువులను; వేవురు పఱాను = వేయిమంది బ్రాహ్మణులను; చమ్పిన చన్నం గు(డుచువారు) = చంపినత్రోవను (అనుభ వింపఁ గలరు.)

పై శాసనముల పిదప ముఖ్యమైనది విష్ణువర్ధనుని 'అహదనకర' శాస నము. ఈ విష్ణువర్ధనుఁడు చాళుక్య విష్ణువర్ధనులలో మూఁడవవాఁ డని (714-751) కొందఱును, నైఁదవ విష్ణువర్ధనుఁ డని (847) కొందఱును దలంచు చున్నారు. ఇందేది నిజమైనను నాశాసనము భాషావిషయమునఁ జాల ముఖ్య మయిన దని చెప్పక తీరదు. కాని, యీ శాసనభాష చాల దురవగాహముగా నున్నది. ఇందలి కొన్నియక్షరముల స్వరూపములనుగూర్చి భేదాభిప్రాయ ములు గలవు. దాని యర్థనిర్ణయమునకుఁ గొందఱు ప్రయత్నించిరిగాని సఫలమనోరథులు గా లేదు. ఈ శాసనమును జదివినవారిలోఁ గడపటివారు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు. వారు చదివిన పాఠ మీక్రింద నుదా హరింపఁబడినది.

17. స్వస్త ప్రిథివి వల్లవపట్టనబున ఊరి

18. వారు కరిగళ్లె వడవరికి ఊరిస్వాముళ్ ఇచ్చినస్తితి రెణ్డువాడల పట్టనావురకు

19. అరియు డగు తెతెయు సిద్ధాయంబు దణ్డు దసపరాధబును సర్వ్వ బాదప

20. రియూరువు ఊరు దాయసెసి ఇచ్చి దినికి వక్రంబు ళెదు వచ్చిన వారు గళరెని ఊరిస్తితి

21. దప్పినవారు దినికి వక్రంబు వచ్చిన గచ్చురు రెణ్డువడల ఎలెవు వరు లెముల ల

22. సినదియు చన్ను విరిపయి నాడువరు గళ్లిన ఎళెముళ చెసిన సెయుదు సను

23. మహానబియుళ్ నరాళోక మహాసత్థవుళ్ విరాపవ మహానబియుళ్ గజ్జబం [సె]

24. ల్లి నడుపుళ్ శమస్త భువనశ్రియ కనడిరజు బద్రపెరెయ ఊరిసనిన ప్రసివర

25. వర్మ్యోడి మాహానభిళ్ వర్మ్యోతి మహాభిళ్ పనికొళు చెనెరక పళ్చిన ప్రసి

26. వర్మ్యోతి మహానభియుళ్ సకల కొన్తుకళ్ సర్వలోకశ్రయ మహా సత్థవళ్

27. పెద్దఁళ్ నెరవద్య మహాసత్థఁవళ్ పసిణ్డిముధ్లు వెటన్దల చరు వయ్యఁ విష్ణువర్ధఁన మ

28. హాసత్థవళ్ పనుశ్చెవుల కొన్తుకళ్ అచ్చకుఙ్జవనియు కొన్తుకళ్ గజంబు సెధ్లల

29. నడుపుళ్ ప్రిధిమి మహాసత్థఁవళ్ వెటన్దళ్ పొనికన్తిఅమ కొళ నడుపు విణ్ణువర్ధఁన

30. మహాసత్థవల కొన్తుకలు నిరవద్యప్రిధివి కనడిరజుళ్ గునవన మహా నవియుళ్

31. ముద్దకళ్చికొళ్ రమిస్వరా ప్రిధివి మహాసత్థఁవళ అపయజనువ కాల కొణ్డుకళ్ కొరిన్ధికొళ్

32. కరిగల ప్రిధివి మహాసత్థవల కొన్తుకళ్ నన్దిమహానవిల నడుపు శీమహా

33. సత్థవళ సకలోకశ్రయ్య ప్రిధివి మహాసత్థఁవల టివకరయ్య పళ్చ

34. కొళ్ శీజప్తి పెన్దటట్ల గన్త్రాన్తు.

శ్రీ శర్మగారు తాము చదివిన పాఠమునకుఁ దగిన కారణముల నిచ్చి యున్నారు. ఇవి సమంజసములుగ నుండుటచేత వారి పాఠమునే స్వీకరించి యీ శాసనము నర్థమును నాకుఁ దోఁచినట్లు తెలుపుటకుఁ బ్రయత్నించుచు నా యీ పదములకు లఘుటీక వ్రాయుచున్నాను.

పంక్తి. 17. స్వస్త = స్వస్తి; ప్రిధివి పలవపట్టనబున = పృధివీ పల్లవ పట్టనంబున; 'పృధివీ' శబ్దము 'శ్రీ' కారమువలెఁ బూర్వశాసనములలో ననేకస్థలములఁ గానవచ్చుచున్నది; పల్లవపట్టనము శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులుగారు గుంటూరుజిల్లా రేపల్లెతాలూకాలోని 'పల్లపట్ల' గ్రామ మగు నని యభిప్రాయపడినారు. 'పట్టనబున' ఇచట 'బు' వెనుక నున్నను లేఖకుఁడు వదలి యుండవచ్చును; లేదా, దాని నాఁకాలమున ననునాసి కోచ్చారణముతోఁ జదువుచుండి రని యైన ననవచ్చును. సంస్కృతమందలి

'మ' కారమును తెనుఁగువారు బుగను, కన్నడులు 'వు' గను మార్చి

కొనిరి. కావుననే తెనుఁగున 'పట్టనంబు' మొదలగు రూపములును, కన్నడమున 'పట్టనవు' మొదలగు రూపములును గలిగినవి. తెనుఁగునఁ గూడ 'ము' వర్ణము 'వు' గ మాఱుట గలదు; చూ. పంక్తి 20, పరియారువు. ఈ పంక్తిలో 'పట్టనబు', పంక్తి 23, 'గజ్జబు' పంక్తి 19, దనపరాధబును, అనుపదముల యందలి 'బు' పై చుక్కలేదు; కాని, 19. పంక్తి 'సిద్ధాయంబు' పంక్తి 21, 'వక్రంబు' పంక్తి 28, 'గజంబు' అను వానిలో 'బు' పైఁ జుక్కయున్నది. 'పట్టనబు', 'గజ్జబు' లలోఁ జుక్క లేకుండుట లేఖక ప్రమాదము కావచ్చును. ఈ చుక్కయక్షరము తలపైఁ గుడివైపున నుండుటచే నా వర్ణము ననునాసికోచ్చారణముతోఁ జదువవలె నను నూహ కవకాశ మిచ్చుచున్నది.—'పట్టనబున ఊరివారు' = పట్టణమునందలి జనులు, ఇచ్చట 'సప్తమీ విభక్తి' యుండుట యాకాలపు భాషాసంప్రదాయము; నన్నయకాలమునను నిట్లే యున్నది. చూ. విశఖవట్టనమున కోమటి; ఇట్టి స్థలములందు విభక్తిరూపము విశేషణరూపమున నుండుటచే సరళాదేశము రాదు.

పంక్తి 18. కరిగళ్ల వడవరికి = కరిగళ్లవాడవారికి. ఈ శాసనమునందును మఱికొన్ని శాసనములందును నక్కడక్కడ దీర్ఘచిహ్నములను వదలుట గలదు. కావున హ్రస్వదీర్ఘరూపములలో నేది సరియైనదో తెలిసికొనుట కవకాశము లేదు. 'పల్లవర్, విణ్ణవర్, విల్లవర్' మొదలగు రూపములలో నఱవమున నున్న 'అవర్' అను పదము తెనుఁగున 'వారు'గా కాన్పించుచున్నది. తెనుఁగునను 'వారు' ప్రత్యయముగా వాడఁబడినప్పుడు 'వా' హ్రస్వమగుటయే కాక 'వు' గ కూడ మాఱును. చూ. ఆర్వురు, పలువురు, మొద. ఇచట 'వాడవరికి' అని చదివినను ద్రావిడసంప్రదాయమునకు భంగము రాదు. 'వడవరికి' అను పదమునకు 'ఒడయ' శబ్దముతో సంబంధముఁ గల్పించి శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులుగారు 'దేవునికి' అని యర్థము చెప్పినారు. ఇది సరికాదు. ఆ కాలమునకు పదముల తొలి 'ఒ'త్వములు 'వ' కారములుగ మాఱలేదు. ఈ శాసనవిషయము దేవుని కొక గ్రామమును సమర్పించుట కాదనియు, రెండు గ్రామములవారు భూముల పంపకము విషయమునఁ జేసికొన్న యొడంబడిక యనియు నాయభిప్రాయము.—ఊరి స్వాముళ్ = ఊరిపెద్దలు; 'ళ్' అనునది బహువచనప్రత్యయమో, లేక లేఖకుఁడు లకారమునకు ళకారమును జెక్కెనో తెలియరాదు. ద్రావిడ భాషలలో 'గళ్' ప్రత్యయమున 'ళ' కారమే యున్నది. ఆ కాలమున బహువచనప్రత్యయముగ 'ళ' కార ముండె నన్నను వింతగాదు.—'ఇచ్చిన స్తితి' = చేసిన తీర్పుస్థితి='Settled rule,' 'Sure or fixed decision,' 'Ordinance,' 'Decree,' 'Axiom,' 'Maxim,' (కిట్టెలు నిఘంటువు); రెణ్డు వాడల పట్టనా

పురకు = రెండు వాడల ప్రజలకు; అఱవము. పట్టనపర్; కన్న. పట్టనదవర్; శ్రీ ప్రభాకరశాస్త్రులుగారు 'పట్టనాపురకు,' అనుదానిని 'పట్టునవూరకు' అని మార్చి, 'వూర' అనునది 'ఊరు' అనుదానికి రూపాంతర మని చెప్పినారు. 'పట్టన'ను 'పట్టున'గా నేల మార్పవలెనో తెలియదు. 'వూర' అనుదానిలో 'వూ' తో పద మారంభించుటకుఁ దగిన యాకాలపు ఆధారములు లేవు. 'వూర' అని యా పద మకారాంతముగా నుండుటకు 'తలవర, ఊర, చెరువ' మొదలగు రూపముల నుదాహరించినారు. ఇట్టి వానిలోని తుది అకార మేవార్థకము కాని ప్రథమైకవచన బోధకము కాదు.)

పంక్తి 19. తెఱ = తఱుగు ; రాజునకు చెల్లింపవలసిన పన్నును తీసికొని పోవుటకై మధ్యవర్తి కిచ్చునట్టి ధనము. ఈ పద మిప్పుడును కన్నడము నందు నాణెమురూపముగా చెల్లించు నొక పన్నుకు పేరుగా నున్నది;— అరి = ధాన్యరూపమునఁ జెల్లించు పన్ను; ఈ పదము 'అరిగాఁపులు' అను శబ్దములో నున్నది;—డగు = తగ్గు = తఱుగు, గ్రామమువారు చెల్లింపవలసిన మొత్తము పన్నులో లోటు వచ్చినప్పుడు దానిని పూర్తి చేయుటకై విధింపఁబడిన పన్ను;—సిద్ధాయంబు (దీనిని 'సిద్ధాయబు' అని చదువవలెనేమో) = పంటలు పోయినను జెల్లింపవలసిన పన్ను;—దణ్డు = రాజసైన్యము గ్రామసమీపమునఁ గాని గ్రామములోఁ గాని విడిసినప్పుడు గ్రామమువారు చెల్లింపవలసిన పన్ను;—'దసపరాధబును', ఇచ్చట 'బు' పై చుక్కను లేఖకుఁడు వదలినాఁడు) = ఇది 'దశాపరాథము' అగునేమో. శ్రీ ప్రభాకర శాస్త్రిగారు 'దేశాపరాధ' మన్నారు. 'దేశాపరాధ' మనఁగా గ్రామము మొత్తముపై దండనగా విధింపఁబడిన పన్ను అని వారి యభిప్రాయము; ఇది 'దశాపరాధ' మైనచో దశాపరాధము లేవ్వో తెలియదు. ఇది నేటి 'దశబంధ'ముతో సంబంధించిన దేమో;—సవ్వఁ బాద పరియారువు = సర్వ బాధాపరిహారము = ప్రాకృతము: సవ్వ బాధా పరియారో;—

పంక్తి 20. ఊరు దాయసేసి: ఇచట 'దాయసేసి' అను దానిని 'దయసేసి,' అని దిద్దఁగూడదు. 'దాయ' = పంపకము;—ఇచ్చి = ఇచ్చిరి; ఇచట 'రి' వర్ణమును లేఖకుఁడు చెక్క మఱచె నని యైన ననవచ్చును; లేదా 'ఇచ్చి' యనునదియే సంపూర్ణక్రియ యని యైనను జెప్పవచ్చును. ఈ క్త్వార్థక రూపమే లింగ, వచన, పురుష వివక్ష లేక నేఁడును మళయాళమున భూతకాలక్రియగా వాడుకలో నున్నది. తెనుఁగుపిల్లల బాలభాషితములో నిట్లే వాడుక యున్నది;—దినికి = దీనికి;—'వక్రంబు' దీనిని 'వక్రబు' అని చదువవలె నేమో.) = అడ్డు, ఎదురు;—ళెదు = లేదు ('ల' కు 'ళ' ఈ

శాసనమునఁ దఱచుగ నున్నది.)—వచ్చినవారు = వక్రంబు లేక, అడ్డు వచ్చినవారు;—గళరెని = గలరేని = ఉన్నయెడల,—ఊరిస్తితి = ఊరి కట్టడి.

పంక్తి 21. దప్పినవరు = తప్పినవారు. 'ద' ఆదేశముగా వచ్చినది. 'అవరు' అని యుండినను దప్పులేదేమో.—దినికి వక్రంబు వచ్చిన = దీని కడ్డు వచ్చినయెడల;—గచ్చురు = నశింతురు (శ్రీ ప్రభాకర శాస్త్రులుగారు 'గచ్చురు = ఊరి రక్షకులు' అని యూహించి, యర్థము కుదురక 'గచ్చురకు' అని దిద్దుకొను మనిరి. ఇది సరి కాదు. తెనుఁగున 'క్రయ్యు, క్రాయు = నశించు' అను ధాతువు గలదు. పూర్వకాలమున నీ ధాతువు 'క్రచ్చు, కచ్చు' అని యుండవచ్చును. పూర్వము 'చు' కారాంతము లయిన ధాతువులు తరువాతి కాలమున 'యు' కారాంతము లయినవి; చూ. మెఱచు; మెఱయు.)—రెణ్డు వడల = రెండు వాడల;—ఎలెవువరు (శ్రీ ప్రభాకర శాస్త్రులుగారు దీనిని 'ఎలెమువరు' అని చదివి, దానిని 'ఏలే + మువరు' = ఏలునట్టి ముగ్గురు అధికారులు అని యర్థము చెప్పినారు. 'ఏలే' అను రూపము తెలుఁగునఁ బదునాల్గవ శతాబ్దమువఱకు నవతరించ లేదు. 'మువర'గు నా ముగ్గు రధికారులు నెవ్వరో తెలియరాదు. కావున నాయర్థము సరికాదు.) ఎలెవు = ఏలెము. దీనికి రూపాంతరములు 'ఏలేము, ఏలిదము, ఎల్లిదము.' ఎలెవువరు = ఎల్లిదము చేసినవారు, అతిక్రమించినవారు;—లెములలసినదియు = లేములు + అలసినదియు + లేములచే నలయుట, అనఁగా దుఃఖము ననుభవించుట;—

పంక్తి 22. చన్ను = చనును = కలుగును. 'చన్ను' అను క్రియలో ద్విత్వము విచార్యము. చన్, విన్, కొన్, ఉన్ మొదలగు ధాతువులపై ప్రశ్నార్థక మగు 'ఎ' వర్ణము చేరునప్పుడు నకారమునకు ద్విత్వము కలుగుట పూర్వాంధ్రభాషా సంప్రదాయము: చన్నె, విన్నె, కొన్నె, ఉన్నె— మొద. కాని 'ఉ' త్వము చేరునప్పుడును ద్విత్వము కలుగునా?—(శ్రీ ప్రభాకర శాస్త్రిగారు తా మూహించిన యర్థముకొఱకు 'లేముల'లోని 'లే'ను విడిచి పెట్టవలసిన దని వ్రాసి, ముల = ఒక అధికారి అని చెప్పవలె నన్నారు. ఇది సరి కాదు.) విరిపయి నాడువరు = వీరిపయి నాడువారు = ఈ గ్రామములవారి నాక్షేపించువారు; లేదా, విరి = పూవు, పూవుపై నాడునట్టివారు, మృదువగు నీకట్టడి నుల్లంఘించువారు, అని యైన నర్థము చెప్పవచ్చును. శాసనాంతమునందు సాధారణముగ నిట్టి మాటలే యుండును. చూ. "పాలనీయోభవద్భిః, భావినః పార్థివేంద్రాన్, భూయో భూయో యాచతే రామచంద్రః";—గల్గిన = కలిగిన = ఉండిన;—ఎళెముళచెసిన = ఎల్లిదములు చేసిన;—సేయుడు = చేయుట;—చను = ఒప్పును.

(ఇచ్చటనుండి యర్థము క్లిష్టముగా నున్నది. పై వివరించినరీతిగా నర్థమును జెప్ప సాహసింప వీలు లేదు. అయినను ప్రయత్నించుట తప్పుగాదు.)

పంక్తి 23. మహానబియుళ్ (చూ; ఇదే పంక్తి. మహనబియుళ్ పంక్తి 25. మాహానభిళ్, మహబిళ్; పంక్తి 26. మఘానభియుళ్; పంక్తి 30. మహనవియుళ్; పంక్తి 32. మహానవిల, ఇది షష్ఠీరూపము;—ఇవి యన్నియు నేకపదమునకు రూపాంతరములు. మహానభిజ్ఞుల్ ?, అభియుక్తుల్ ?, మహానాభుల్ ? = గొప్పవారు, అధికారులు, తెలిసినవారు, మొదలగు నర్థములలో నొకటి పొందవలెను;—నరాళోక = నరలోక; —మహా సత్థవుళ్ (చూ. పంక్తి 26. మహా సత్థనళ్; పంక్తి 27. మహా సత్థఁవళ్;—పంక్తి 28. మహాసత్థవళ్ ; పంక్తి 29. మహాసత్థఁవళ్ ; పంక్తి 30. మహాసత్థవల (షష్ఠీ రూపము); పంక్తి 31. మహాసత్థఁవళ (షష్ఠీరూపము); పంక్తి 33. మహా సత్థవళ (షష్ఠీరూపము); మహాసత్థవల (షష్ఠీరూపము); ఇవి యన్నియు నేక పదమునకు రూపాంతరములు. వీనికి మూలము 'మహా సత్త్వుల్' అని కాని, 'మహా సార్థవాహుల్' అని కాని యుండవచ్చును. రెండవదే మూల మని నా యభిప్రాయము. 'మహా సత్త్వుల్' అయినయెడల 'మహా సత్థువుల్' అని యుండవలెను. పై రూపములలోఁ గొన్నిటిలో 'త్థఁ' అను వర్ణము కలదు; ఒక్క దానిలోను 'త్థు' అను వర్ణము లేదు. ఇది గాక 'సెట్టి; సెఘ్లల = కోమట్ల అను పదము లున్నవి.—విరాపవ ఇది యొక పురుషసంజ్ఞావాచకము కావచ్చును;—సెట్టి కడువుళ్ (చూ. పంక్తి 28. సెఘ్లల నడువుళ్) సెట్ల పెద్ద, కోమట్లపై నధికారి;—గఙ్జబు ('బు' అనియుండు నేమో. లేఖకుఁడు చుక్కను విడిచి యుండును.) = గంజాము, పల్లిపట్లకు సమీపమున నున్నది; గఙ్జబు (సె)ట్టి నడువుళ్ = గంజాము సెట్ల కులపెద్ద;—

పంక్తి 24. శమస్త భువనశ్రియ కనడిరజు=సమస్త భువనాశ్రయ కన్నడరాజు;—బద్రపెరెయ = బద్రప + ఎరెయ = బద్రపరాజు;—ఊరి పనిన = ఊరికి పన్నిన = ఊరికి పంచిన= పంపఁబడఁగా; 'పనిన' కు రూపాంతరము 'పఞ్చిన' చూ. పంక్తి 25;—వ్రసినర = కష్టపడినవారి;—

పంక్తి 25. వయ్యేడి = వయ్యేటి; 'వయ్యేఱు' కు ఔపవిభక్తిక రూపము; 'వయ్యేఱు' నేటి 'పల్లిపట్ల' కు సమీపముననున్న 'పుయ్యేరు' కావచ్చును;—పనికొళు = పనులు,—'కొళు' బహువచనప్రత్యయము. చూ. అఱవము, కన్నడము, మళయాళము,—'కొళు';—చెనెరక = చేయ నేరక = చేయ లేక; పఞ్చిన = పంపఁగా; వ్రసి = కష్టపడి ?—

పంక్తి 26. సకల కొన్తుకళ్ = సమస్తమును జయించినవారు, ('ద్రా(కొళ్' ధాతువు, తెనుఁగు, కొను.) కొన్తుకళ్ = కొడుకులు, అని చెప్ప

వచ్చునుగాని యర్థము కుదురదు;—సవ్వలోకశ్రయ = సర్వలోకాశ్రయ, చాళుక్యరాజుల బిరుదము;

పంక్తి 27. పెర్ద్గళ్ = పెద్దలు (పేర్, పెర్ = పెద్ద);—నెరవద్య = నిరవద్య = అనింద్య మయిన; చూ. పంక్తి 30. నిరవద్య; పసిణ్డిముద్ధ్లు = ధనాగారాధ్యక్షులు;—నెటన్దల చరువయ్యర్ = ఇది యొకపురుష సంజ్ఞా వాచకము కావచ్చును; అయ్యర్ = ఆర్య;—

పంక్తి 28. పసుఱేవుల కొన్ఱుకళ్ = పశువుల మేతబీళ్లను పట్టుకొన్న వారు; అచ్చకుఱ్ఱువనియు కొన్ఱుకళ్ = అచ్చకుఱ్ఱు అను స్థలమును పట్టుకొన్న వారు;—గజంబు సెట్ణల నడుపుళ్ =గంజాము నందలి సెట్ల కులపెద్ద; సెట్ణల= రెండు బహువచనప్రత్యయములు చేరి యున్నవి.

పంక్తి 29. ప్రిథిమి = పృథివి, చూ. తెనుఁగు, పుడమి;—వెటన్దళ్, పానికన్ఱిఱము, ఈ రెంటను గ్రామనామములు కావచ్చును;—కొళ = గళ, బహువచనప్రత్యయము, షష్ఠీవిభక్తి;

పంక్తి 30. కొన్ఱుకలు, దీనికి కొడుకు లని యర్థము చెప్పవలెను;—గునవన = గుణావన, ఒకపేరు;—

పంక్తి 31. ముద్దకఞ్చికొళ్ = ముద్దకఞ్చి యను పేరు గలవారు; రమిస్వరా = రామేశ్వర;—అపయజనువకాల కొన్ఱుకళ్= అపయజనువకాల అను స్థలమును పట్టుకొన్నవారు; కొరన్దికొళ్ = కొరన్ధి యను స్థలమును పట్టు కొన్నవారు;

పంక్తి 32. కరిగల ప్రిథివి మహసత్థవల కొన్ఱుకళ్ = కరి గల గ్రామ మహాసార్థవాహులను చేకొన్నవారు;—సన్ది, ఇది యొక పురుషుని నామము;—నడుపు = అధికృతుఁడు;—

పంక్తి 33. సకలొకశ్రయ్య = సకల లోకాశ్రయ;—టివకరయ్య పఞ్చికొళ్ = ఇదియొక పురుషనామము కావచ్చును;—

పంక్తి 34. శ్రీజప్టి పెన్దటట్ర గన్డాన్ఱు = శ్రీయష్టి పెన్రట్టర గండండు = వేత్రధరు లగు గొప్ప రాష్ట్రకూటుల నాయకుఁడు.

శాసనమందలి 23 నుండి తుదివఱకుఁ గల పంక్తులలో పల్లవపట్టణంబున ఊరివారికిని కరిగళ్లవాడవారికిని జరిగిన భూముల విభాగమును గూర్చిన కట్టడికి సాక్షులుగా నుండినవారి పేళ్లు వారివారి బిరుదాదులతోఁ దెలుపఁబడి యున్న దని నా యభిప్రాయము.

## II. యుద్ధమల్లుని బెజవాడ శాసనము.

అహదనకర శాసనము తరువాత నాంధ్రభాషా చరిత్రవిషయమునఁ బ్రాచీన మని ప్రసిద్ధిఁ గన్నది యుద్ధమల్లుని బెజవాడ శాసనము. ఇది నన్నయకుఁ బూర్వమందలిదా యను విషయమున వాదోపవాదములు బహుకాలము నడచినవి. తుద కది నన్నయకు పూర్వపుదే యని. స్థిరపడినది. నన్నయకుఁ బూర్వమున నుండిన అక్కఱలను తెనుఁగుపద్యములరూపమున నీ శాసన మున్నది. దానినీ క్రింద పొందుపఱుచు చున్నాను.

మొదటి ప్రక్క.

1. స్వస్తి నృపాఙ్కుశాత్యన్త వత్స
2. లసత్యత్రినేత్ర విస్తర శ్రీయుద్ధ
3. మల్లుణ్డనవద్య విఖ్యాతకీర్తిః
4. ప్రస్తుత రాజాశ్రయుణ్డు ద్రిభు
5. వనాభరనుణ్డు సకల వస్తుస
6. మేతుణ్డు రాజసల్కి భూల్లభు
7. ణ్డర్తిన్ పరగగ బెజవాడం గొమ
8. రస్వామికి భక్తుణ్డై గుడియు ని
9. రుపమమతి నృపధాముణ్డెత్తిచ్చె
10. నెగిదీచ్చ్రేః మఠంబు గొరగల్గాకొరు
11. లిన్దు విడిసి బృన్దంబు గొనియు
12. ణ్డువారు (?) రి గాక యబ్బార
13. నాసి వ్రచ్చిన వాపంబు గొ
14. ణ్డ్రు వెలయంగ నియ్యోట్టు టిస్సి
15. మలినుకై విడిసినం బ్రో
16. ల గల తానపతులును రా
17. జు పట్టంబు గట్టిన పతి

రెండవ ప్రక్క.

18. యు నలియుం బయ్యోవరల
19. వెల్వతించిన నశ్వమేధంబు
20. ఫలంబు పేక్షించి నాలింగ బ
21. టిసిన పాపంబు దమకు జ
22. (న) నుత చేబ్రోలనుండి బెజ

23. వాడ జాత్ఱకు వచ్చి త్ఱిణ
24. యను నుతు ణ్డ్డొంబు సోటు మె
25. చ్చక తివిటె యిన్నిలవ యనఘు
26. ణ్డు సేకొని యిన్దు ప్రత్యక్ష
27. బయన్న నిచ్చ గని మల్ల ణ్డై
28. త్తించె గుడియు మఠంబు
29. నుం గార్త్తి కేయునకు దీనిం జేంబ్ఱో
30. లు యేలెడు రతిరబేలు
31. రొండుసోటు గోరగ
32. ను బెట్టి వేరుగను జ
33. యి స్తితి సేకొణి కాచు
34. ర దీని న్దారు నిల్పినవాడు
35. తి దప్పి యటిపుట వా
36. బు గా

మూఁడవ ప్రక్క.

37. రమునతో బెజవాడ కెల్ల
38. బెడంగును రక్షయుం గాను
39. న్దమతాత మల్లపరాజు వే
40. రడు దానుం గట్టించెం గ్రమ
41. బున దానిక కలశబద్ధ
42. ట్లు గాగ మొగమాడు వమ
43. రంగ శ్రీయుద్ధ మల్లు ణ్డైత్తి
44. ంచె నమిత తేజుణ్డు తన
45. ధర్మ్మ వ్రుడంబడి కాచు నృపు
46. లకున్ద

ఇందలి భాషావిశేషములు.

1. తెనుఁగున 'ఱ' కార ముండుట: ఱస్సి, ఱటిసి, ఱటిపుట. అహదనకర శాసనమందును (వయ్యెఱి) నీ యక్షరము గలదు.

2. రా ఒత్తుకు బదులుగఁ గొన్నిచోట్ల శకటరేఫ ముండుట: కొణ్డు, త్ఱి చేబ్ఱోలు.

3. నున్నకు బదులుగ ననునాసికాక్షరములను వ్రాయుట: భక్తుణ్డై, బృన్దంబు, ఉణ్డి.

4. శకటరేఫములు సక్రమముగ వాడుట: తివిఁటి.

5. సరళాదేశము యథాక్రమముగ నుండుట: బెజవాడం గొమర స్వామికి.

6. గసడదవాదేశము: ఒఱ్ఱుసోటు, ఇన్దు వ్రత్యక్షమై.

లఘు వ్యాఖ్య.

నెగిదీర్చె-ఇది 'ఒగి, మొగి' మొదలగువానివంటి యవ్యయము. జయంతి రామయ్య పంతులుగారు 'నెగయందీర్చె' నని యర్థము చెప్పినారు; పరగంగ-శాసనమున 'పరగు'లో అరసున్న లేదు, రామయ్యపంతులుగా రుండవలె నని యభిప్రాయపడినారు;-'పరగు' లో సరసున్న యున్నదనుటకుఁ దగిన ప్రయోగములు కానరావు;-కొమరస్వామి, ఇందు 'స్వా' ను తేల్చి పలుకవలెను, 'ర' గురువు కాదు; చూ. గొరగల్గాక;-రామయ్యపంతులుగారు 'స్వామి'లోని 'వా' ఒత్తును తీసివేసినారు, కొమరస్వామి అనునది దుష్టసమాస మని కాఁబోలు.—బృందంబుగొను=సంఘముగాఁ జేరి యుండు;-[స]రి గాక, అని యక్షరలోపమును బూరింపవలె నేమో;-బారనాసి, దీనిని 'వారణాసి' యని రామయ్య పంతులుగా రేల దిద్దిరో?-వ్రచ్చిన = వధించిన;-ఒట్టుబిస్సి = శాపమును బోఁద్రోసి, గణింపక;- మలినురు, దీర్ఘపూర్వోపధ మగు మహద్వాచకములకు మాత్రమే 'రు' వర్ణము బహువచనమున రాదు;- విడిసిన = గొరగలు విడిసినన్; మలినురై పైవారల వెల్వరించినన్, అని యన్వయము;-పయ్వారల=పైవారల, ఐ=అయ్; 'పాపంబు'-ఈ పదమునకు 'అశ్వమేధంబు ఫల ముపేక్షించిన, లింగమటెసిన' అను రెండు విశేషణములతోడను నన్వయము;-తివిఁటి, దీనిలో శకటరేఫ ముండఁగూడ దని రామయ్యపంతులుగారి యభిప్రాయము;ఉండవలె ననియే తోఁచుచున్నది; నిలవ,—'నెలవ' అని రామయ్యపంతులుగారు; 'ని' శాసనమున స్పష్టముగాఁ గనఁబడుచున్నది; కన్నడమున 'నిలవు'; - వ్రత్యక్షము, 'వకారము తప్పు' అని రామయ్య పంతులుగారు. ఇట్లనుట పొరబాటు. అందు, ఇందు, ఎందు, అట, ఇట, ఎట, అట్లు, ఇట్లు, ఎట్లు, అంత, ఇంత, ఎంత, మొదలగు నవ్యయములపై గసడద వాదేశము వచ్చును.-పంక్తి 29 లో 'దీనిం జేంబ్రో' నుండి రెండవప్రక్క తుదివఱకు నస్పష్ట మని రామయ్య పంతులుగా రర్థము విడదీయ మానినారు. ఇంతవఱకు నిది యేపద్యమో, యేమని యర్థము చెప్పవలెనో యెవ్వరును నాలోచింపలేదు. ఈ పాదములు కర్ణాటక ద్విపద పాదము లేమో యని నాకుఁ దోఁచుచున్నది. వాని నిట్లు వ్రాయుచున్నాను.

దీనిఁ జేఁబ్రోలు యేఁ-లెడు రతిరబేలు

[వే]రొణ్డు సోటి గో-రగఁ జ[ను]బెట్ట

వేరుగను, జ[ని]యిస్తితి - సేరొని కాచు

[వా]ర దీనిం దారు - నిల్పినవారు
[మ]తి దప్పి యటిపుట - వాపంబుగాఁగ.

పై పాదములలో 'లెదురతిర', 'జనియిస్థితి' అనునవి 'నలల'ములు, కర్ణాటక విష్ణుగణములు; 'జనియిస్థితి'లో 'స్థి'ని తేల్చి పలుకవలెను; 'యి' గురువు కాదు, చూ. కొమరస్వామి, గొరగల్గాక; 'వేరుగను'-ఇది భలఘువు, కర్ణాటక విష్ణుగణము; తెనుఁగున నింద్రగణములు తెనుఁగు ద్విపద కెట్లు చెల్లునో, కర్ణాటక విష్ణుగణములు కర్ణాటక ద్విపద కిట్లు చెల్లును. కర్ణాటక ద్విపదయందు తెనుఁగుయతి లేదు.

వేరదు, (' ఈ శబ్దము సందేహాస్పదముగా నున్నది ' జ. రా.) ఇచ్చట వకార మాదేశవకారము. 'పేరదు' అనునది శబ్దము. ప్రకృమపై 'ప' కు వాదేశము. పేరదు=వెరదు=చుట్టుగోడ, ప్రహారీగోడ. చూ. కోరదు.

III. గుణగ విజయాదిత్యుని శాసనము.

(నెల్లూరు శాసనసంపుటము II-పుట 544.)

మొదటి ప్రక్క.

1. శ్రీ నిరవద్యుణ్డు
2. సిత్త... సముణ్డు శివ
3. పదవరా ... సేవితుణ్డు
4. ఖలుణ్డు నృతరిపుబ
5. లు డ్డానూవరావరావరణ్డు
6. యోధ్య సిఘనసనుణ్డు
7. గణిత దానమాన్యుణ్డు గజ

రెండవ ప్రక్క.

8. లయుణ్డు ... హాసణ్డు
9. న పణ్డురంగు వ్వి ... చ్ఛణియుఁగాని
10. కొల లేని కొట్టం బల్వాడిచి
11. గొణకె సల్లాతని పక్షపాతి
12. సలలిత ... ... ... పదగ
13. ... ... ... ... ... న

మూఁడవ ప్రక్క.

**14. తాకాన్ను విభవ గౌరవెన్ద్ర.**

ఇది సీసపద్యఖండ మని కీ. శే. కె. వి. లక్ష్మణ రావుగారు తెలిపి యిట్లు సవరించి వ్రాసిరి. (చూ. శ్రీ ఆంధ్రపరిశోధక మహామండలి పంచమ వార్షికోత్సవసంచిక.)

సీ. శ్రీ నిరవద్యుణ్డు - సిత్త[జాత]సముణ్డు
శివపదవ[ర]రాజ్య - సేవితుణ్డ-
ఖిలుడు [న]నృతరిపు - బలుఁడు నాహవరావ-
రణ్డయోధ్యసిఘాస - నుణ్డగణిత
దానమాన్యుణ్డు [దయాని] లయుణ్డు[ను]
[భణ్డన] సణ్డన - పణ్డురుంగు
... ... ... ... ... ... ..కొలడి లేని
కొట్టము ల్వోడిచి - గొణక నల్ల
గీ. తని పక్షపాతి ... ... ... ... ...

... ... ... ... ... ....విభవ - గౌరవేంద్ర

పై పద్యము సీసపద్యఖండ మనుటకు సందేహము లేదు; కాని, శ్రీ లక్ష్మణరావుగారు చేసిన సవరణలను గూర్చి విచారింపవలసి యున్నది. 7-వ పంక్తిలో 'గజ' అని యుండఁగా దానిని 'దయాని' అనియు, 8-వ పంక్తిలో 'హ' అని యుండఁగా 'భండన' అనియు సవరించినారు. ఇట్లు సవరింపక తెలియదని విడిచిన బాగుండెడిది. తక్కిన సవరణ లాక్షేపణీయములు కావు. పంక్తి 5. 'ఆహవరావరణ్డు' పంక్తి 8. '[భండన] సండన' అనిన నర్థ మేమో తెలియదు. పంక్తి 9. "వ్వి ... చ్ఛణియు గాన్థి", పంక్తి 12. 'పదగ', పంక్తి 13. 'న', పంక్తి 14. 'తాకాన్న' అనునవే శబ్దములలోని ముక్కలో తెలియదు.

ఈ పద్యము సీసపద్య మగుటయు నిందు గొణకెనల్ల, పండురంగ శబ్దములు కనఁబడుటయు నే విశేషము. 'ణ్డ' 'న్ద్ర' మొదలగు చోట్ల వర్ణక్రమమును, "శ్రీ నిరవద్యుణ్డు - సిత్త", "కొట్టంబు ల్వొడిచి" అనువానియందలి 'స, వ' ల యాదేశమును, 'సింహాసన' శబ్దమునకుఁ బ్రాకృతరూప మగు 'సిఘాసన' అను పదమును నిందుగ గమనింపఁ దగిన విషయములు.

## పండురంగుని శాసనము.

(నెల్లూరు శాసన సంపుటములు II. పుట 896.)

పై శాసనమున నీ పండురంగుని ప్రస్తావనగలదు.

శాసనము

1\. ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... భూపాలకుణ్డు
2\. పట్టంబు గట్టిన ప్రథమంబు నెణ్డు బలావ్వఁబొంబొ
3\. ప్పగ బై లెచి శెన పట్టంబు గట్టి ఇ ప్రభు

4. బణ్డరగ బణ్డన సమ ... ౦ పదువళో బోయ
5. కొట్టంబు ల్పణ్డెణ్డు ... వేంగినాణ్టి గొండల్దము
6. త్రిభువనాంకుశ [బాణ] నిల్వ కట్టెపు దుగ్గఁంబు క(డు)
7. బయల్సేసి కణ్డు కబ్బజవహ మిఞ్చి వచ్చి
8. పాణ్డురంగు పరమమహేశ్వరణ్డు ఆదిత్యభటారని
9. కి ఇచ్చిన ఎనుబది పుట్లె ఆట్లు పట్టు నేల ద
10. మ్మపురంబున దమ్ముపులు [విని] రక్షిఞ్చ వారికి అశ్వ
11. మెదంబున పలంబు అగు.

ఇందు తరువోజ పద్య మున్నది. శాసనమునఁ జిన్నసవరణములు చేసి శ్రీ లక్ష్మణరావుగా రిట్లు పద్యమును వ్రాసి యున్నారు.

పట్టంబు గట్టిన - ప్రథమంబు నేఁడు
బలరవం బొప్పంగఁ - బై లేచి సేన
పట్టంబు గట్టించి - ప్రభుఁ బండరంగు
భండన సమయుక్తుఁ - బనుపంగఁ బోయి
కొట్టముల్ పండ్రెండు - (గొని) వేఁగినాఁటి
కొండలం ద్రిభువనాం-కుశ (బాణ) నిల్పి
కట్టెపుదుర్గంబు - కడు బయు ల్సేసి
కందు కబ్బజవహ ... ... మించి వచ్చె.

పై దానిలో తరువోజలక్షణము కనఁబడు చున్నది గాని, భాషా విషయమునను, ఆదేశాదుల విషయమునను ననేక సందేహములు మిగిలియే యున్నవి. శాసనాంతమున నున్న గద్యలో 1. 'భటారనికి' అను పదమునకుఁ బ్రథమైకవచనరూపము 'భటారఁడు.' ఆ కాలమున నన్ని యకారాంత పుల్లింగము లైన మహద్వాచకములకు నజ్జునకుఁ బూర్వము ఉత్తు చేరు చుండుట లేదు; 2. 'అశ్వమేధంబున ఫలంబు' ఇట్టి షష్ఠీసమాసములు తఱచుగ నుండెను, అను వ్యాకరణ విషయములు తెలియవచ్చుచున్నవి.

### గుణగ విజయాదిత్యుని ధర్మవరపు శాసనము.

విజయాదిత్య పాదపద్మ భ్రమరాయమాన శ్రీను క్కడియరాజు గుణ గణాభరణణ్డు దనకెని ఈస్వరున(కుం) గార్త్తికేయుణ్డుంబోలె చౌషష్టికల విసారదు (ణ్డ) య్న (అ) య్య పయ్యాయు సకలశాస్త్రార్థపారగులయ్న వె (ద)పణ్డరంగులు అల్లుమ పగ్గెడలుం గర(వ)మ్మన పణ్డరంగును ఈ ధమ్మఁని [వ్వఁహ] నోద్యోగమ్మన(కు) బృహస్పతిసమాను లయ్న పెగ్గెడకొ (డెయ) గారి కొడుకు (బె) జెయరాజు సమ (ర్థుఁ) ణ్డని ఆత్మానమ్మ తంబునం

బంచిన ప్రసా (దం) బని సమస్త రా (జ్యభ) ర నిరూపిత మహా మన్త్రాధిపతి (మహే) శ్వర పక్షపాతి దేవబ్రాహ్మణ గురుభక్తిపరుణ్డు నక్తిత్రయ సంప న్నుణ్డును యబెజయరాజు బెజెయేశ్వరంబు గలస నివ్వ (హ) నంబు సేసి దిస గుడ్లుం బ్రాకారంబు మటంబును నేమియించి ... బున్వా ... వ్రచ్చినవారు దంబు సల్పినవారు ... ది (౧) జగద్యంబులవలస (శా) స్వతంబు ... యను ఇ భూమింలోన ....

ఈ క్రింద నింతకుఁ బూర్వము ప్రకటితములు కాని నన్నయకుఁ బూర్వకాలపు కొన్ని శాసనములు వ్రాయఁబడుచున్నవి.—

(1) కడపజిల్లానుండి వచ్చిన శాసనప్రతి. దీని తాయి మద్రాసు మ్యూజియములో I గా నున్నది.—

1. స్వస్తి శ్రీ చోటిమ
2. [హా] రాజాధిరాజ రాజప
3. ర మేశ్వర విక్రమాది
4. త్య శక్తి ౹ మర వి
5. క్రమాది[త్యు] ల కొడు[కు]
6. [ళ్] కాశ్యప[గో] త్రు
7. [స్తు] శత్యదితుస్తు శిధి
8. [వెయు] రేనాణ్డు ఏబు [వె]
9. [ల] ఏళుచ్చిస్త్రి కొ [మ]
10. [టి] పాటి రేవ శ
11. [మ్మ =] కాశ్యపగో
12. త్రినికి ఇచ్చిన
13. ... చిటుంబూరి ఉత్త
14. ... శ తుపు = న దిశ
15. ... [డు] జుగ్గి పొలగ [రు]
16. సు ద [క్షి] ణ [దిశ]
17. ... పాటి [మ]
18. ఏను మటుత్తు గా
19. ను తాగిరి [॥] దేస
20. సల్పినవానికి
21. వేగు [ళ్] ళువు వేసె
22. ఋవుళు వేవాన్తు
28. ఋ్ళ నిల్పినం పుణ్యాం

24. బు [।] దీనికి వక్రంబు
25. వచ్చువన్దు పుత్రవ
26. ద్య స్త్రీ వద్య [గోవ]
27. ద్య పఞ్చమ [హా]
28. [పా] తకఞ్చేసి [న]
29. వాని లోక [ం] [బు]
30. [ను] న్తు వాన్తు

(2) గుత్తితాలూకా, దిమ్మగుడి గ్రామమున కీశాన్యముగ నున్న యొక పొలములోని యొక ఱాతిమీఁదిది. (ఎపిగ్రాఫి డిపార్టుమెంటువారి 1920 సం. రపు 864 సంఖ్య గల శాసనము.)

1. స్వస్తి శ్రీ విక్రమాదిత్య సత్యా
2. శ్రయ పృథివీవల్లభ మ
3. హారాజాధిరాజ పరమే
4. శ్వర భటారళకున్ విజయరా
5. జ్య సంవత్సరంబుల్ ఇరుభది ఎ
6. ణ్డు అగునెటి కజుళుకోణిన్
7. బణ్డొ న్నీలమ ... ... ...
8. [రా]జుల న్విణ ...సికుళతురి
9. ఇర [శ]మ్మాన్నారికిన్ మర[డి]...
10. ... ణ్టెముత్తళూరిన్ రూఖివ...
11. రుభది మఱుతుధునేల [ఆ]రి...
12. (మున్) ఇచ్చిరి దేని అచ్చువాన్తు పాతకు...

పై శాసనమందలి రాజు పశ్చిమచాళుక్యుఁ డగు విక్రమాదిత్య సత్యాశ్రయ పృథివీవల్లభుఁడు; అతని 27-వ సం॥ ర రాజ్యకాలమున నీ శాసనము చెక్కింపఁబడినది. డాక్టరు ఫ్లీటుగారి ప్రకార మీరాజు క్రీ. శ॥ 655-680 సం. రముల మధ్యమున రాజ్య మేలె ననియు, క్రీ. శ. 686 సం. రమువఱకు రాజ్య మేలి యుండు ననియుఁ దెలియ చున్నది. ఈతఁడే ప్రథమ విక్రమాదిత్యుఁడు.

(3) గుత్తితాలూకా, కొండుపల్లి గ్రామమున కీశాన్యమున నున్న యొక పొలములోని ఱాతిపై నున్నది. ఎపిగ్రాఫీ డిపార్టుమెంటువారు 1920 సం. రమున సంపాదించిన శాసనములలో 359 సంఖ్య గలది.

1. స్వస్తి శ్రీ విజయాదిత్య సత్యాశ్రయ శ్రీ ప్రిథువీవల్లభ మహా రాజాధిరా

2. జ పరమేశ్వర భటారళకు విజయరాజ్య సంవత్సరంబు ళిరుబది (మూ)ఖు ప్రవ

3. ర్త్తిఁల్ల బలికలు తిలక నరసింహ బాణాధిరాజ ప్రియతర సుత విక్రమా

4. దిత్య బలిఇంద్ర బాణరాజుల్ఱ తురమర విషయంబు యేళేవారి మామాఱరుం

5. వెమ్బొడిచి శాత్రవు... ...పుళూ
6. రిమిాన్దు మిఙ్చది... ...సి(ం)హవమావులగి చెఱువు యేళు
7. వారా... న్త్రవట్టం బేళు బాదిశమ్మాఱరికి
8. పులగి చెఱువున చీకట్ళుపుల(ం) బన రాచమానం బన
9. లఙ్చలుక్కాళవుూబోఱళు అన న్తశోభళు తూవలకాము
10. ల్ళు ... ...యుళూ ఆడ్ళు గుడి ... ...
11. బు యేవ(ది) మఱుతుథ్లు ఇచ్చిరి స్వదత్తా(ం) పర (దత్తాంవా)
12. యో హరేత వసున్ధరాం షష్టి... ...

పై శాసనమున నుదాహరింపఁబడిన రాజు శ్రీ విజయాదిత్య సత్యాశ్రయ శ్రీ పృథివీవల్లభుఁడు. ఇతఁడు వినయాదిత్యుని పుత్త్రుఁడు. ప్రథమ విక్రమాదిత్యుని పౌత్త్రుఁడు. ఫ్లీటుదొరగారి ప్రకార మీతఁడు క్రీ. శ. 696-733 సంవత్సరములందు రాజ్య మేలెను. ఇతఁడు పశ్చిమ చాళుక్యవంశమువాఁడు.

### (4) అమ్మరాజ విజయాదిత్యుని శాసనము. (క్రీ. శ. 945-970.)

#### స రి హ ద్దు లు.

పూర్వతః—అమునిగరులుః గొల్ల తెంకి శ్చ
దక్షిణతః—కోటికట్టు
పశ్చిమతః—మడికాట్టు
ఉత్తరతః—చెఱుకుమడి మేరుపుమడ్ల శ్చ
పూర్వతః—గోరగమడ్లు
దక్షిణతః—మడికాదుః
పశ్చిమతః—గరుగుః
ఉత్తరతః—కాట్టనిక్షేత్రం

శ్రీ

# పదనకొండవ శతాబ్దమునాఁటి తెనుఁగుభాష.

## I. వర్ణములు.

1. పదనకొండవ శతాబ్దమున తెలుఁగుభాషయందు కనఁబడుచున్న వర్ణములు:—

అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, ం.
క, ఖ, గ, ఘ, ఙ; చ, ఛ, జ, ఝ, ఞ; ట, ఠ, డ, ఢ, ణ; త, థ,
ద, ధ, న; ప, ఫ, బ, భ, మ; య, ర, ఱ, ఴ, ల, ళ, వ; శ, ష,
స, హ; క్ష.

2. గుణింతములో ఈ క్రింది సంజ్ఞలు కానవచ్చుచున్నవి:—

✓, ా, ి, ీ, ు, ూ, ృ, ౄ, ె, ే, ై, ొ, ో, ౌ,

్క, ్ఖ, ్గ, ్ఘ, ్ఙ, ్చ, ్ఛ, ్జ, ్ఝ, ్ఞ, ్ట, ్ఠ, ్డ, ్ఢ, ్ణ, ్త, ్థ,
్ద, ్ధ, ్న, ్ప, ్ఫ, ్బ, ్భ, ్మ, ్య, ్ర, ్ఱ, ్ల, ్వ, ్శ, ్ష, ్స, ్హ, ్ళ, ఱ.

3. ౠ, ఌ, ౡ, ం, ఙ, ఞ, ణ, ళ—ఈ అక్షరములు శబ్దముల మొదట లేవు.

4. గుణింతములో ౄ, ౣ, అనుసంజ్ఞలు లేవు.

5. న్, ర్, ల్, ళ్, అనునవి తప్ప పొల్లులితరములు లేవు:—పాలుర్ (ఆది 11-89), అసురుల్ (ఆది 11-96.)

6. సంస్కృత శబ్దములందు అనుస్వారమునకు బదులుగ సనునాసికాక్షరములే సాధారణముగ కానవచ్చును. తెనుఁగుపదములయందును నీ నియమము కానవచ్చుచున్నది.

ఉదా:—డక్కలపూణ్డి, జరిపిఞ్చువారు, మణ్డలికుణ్డు, నన్దగిరి, సమ్పన్నుణ్డు.

7. నకార మకార ద్విత్వములకు పూర్వమందు బిందువు కానవచ్చుచున్నది.

ఉదా:—ఉంన్న, ముంన్ను, పొంమ్ము, ఇంమ్ము.

8. రేఫముతో సంయుక్తమయిన యక్షరములను తొలుత వ్రాసి వాని తరువాత వెలుపల గిలుకరించెడివారు.

అప్పుడు క, గ, చ, జ, ణ, త, ద, న, ప, బ, మ, య, ల, వ లకు ద్విత్వమును, ఘ, ఛ, థ, ధ, భ, ల పైని వాని సాధుఅక్షరములను వ్రాయు చుండెడివారు. థకారమువైని తవర్ణమును చేర్చెడివారు.

9. 'ఱ' అను అక్షరము వ్రాఁతలో నున్నను దానికి అరవ కన్నడము లందున్న ఉచ్చారణ ముండెనో, యది 'డ' కారముగా ఉచ్చరింపఁబడు చుండెనో నిర్ణయించుట కష్టము. అంతకుఁ బూర్వకాలమున నాయక్షరమున కాయుచ్చారణ ముండి తీరవలెను. వేర్వేఱు ఉచ్చారణము లుండఁబట్టియే వేర్వేఱు వర్ణములు వ్రాఁతలయందు చేరియున్నవి.

ఈ క్రింది పదములలో ఆయా పదములయందు 'ఱ'కారము 11-వశతాబ్దపు శాసనములలోను అంతకు పూర్వపు శాసనములలోను కనవచ్చుచున్నది.

ఆఱ్వనికి (S. I. I. V. 66) విన్నగరాఱువారికి (S. I. I. V. 81) చోఱణ్డి (S. I. I. V. 1039) నఱపంగలవాణ్డు (S. I. I. V. 1083) పఱమ నాయకుఱాలు (S. I. I. V. 1281) మేఱయ (S. I. I. V. 1106) విఱ్పర యణ్డైన (S. I. I. V. 1023) జీవితమాఱ (S. I. I. IV. 1015) నఱపఙ్గల వారు (S. I. I. IV. 1015) ఱస్సి, అఱెపుట (యుద్ధమల్లుని బెజవాడ శాసనము) ఱచ్చువాన్డు (Ep. coll. 364 of 1920) తాఱుగుమ్మిసీమ (E. I. V. p. 31) పఱుమటికట్ట, ఱుల్లసీమ (E. I. VI. p. 34) కఱపత్తె, తాంకఱ పొలము (E. I. VI. p. 347) చోఱమహారాజు, ఏఱువేల (E. I.I.X. p. 345) కొఱచుంకొన్డు (E. I. IX. p. 98)

ఇట్లే మఱికొన్ని పదములలోఁగూడ నీ 'ఱ' కారము కనఁబడుచున్నట్లు 'దక్షిణ హిందూదేశ శాసనావళి' (South Indan Inscriptions) VI సంపుటము 333 పుట అడుగున 'In this and a few other cases 'డ' is written without the talakattu" ఈ శాసనమునందును ఇంక మఱికొన్ని స్థలములందును 'డ' కు తలకట్టు లేకుండ వ్రాయఁబడినది" అని సంపాదకులు వ్రాసియున్నారు. ఈ విషయమై ఆ శాసనములను చదివినవా రంత శ్రద్ధ తీసి కొని యుండ లేదనుట స్పష్టము.

## II. వర్ణముల ఉచ్చారణము.

1. (i) 'అ' 'ఆ' ఇ, ఈ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ అను నచ్చులకు అచ్చులు పరమయినప్పుడు యశ్రుతి వినఁబడుచుండెను. అందుచేతనే సంధియందు యడాగమము వచ్చుచుండెను.

(ii) మధ్యమ పురుషక్రియల తుది ఇకారము తరువాత యశ్రుతి లేకుండెను. కావుననే దానిపై యడాగమము రాకుండెను. ప్రథమోత్తమ పురుషక్రియల తుది ఇకారము కొన్నియెడల యశ్రుతితోను కొన్నియెడల లేకుండఁగను ఉచ్చరింపఁబడుచుండెను.

2. (i) పదముతుది ఉత్వము తేలికగా ఉచ్చరింపఁబడు చుండెను. అందుచేత అది సంధియందు లోపించి దానిస్థానమున దానికి పరమందుండిన అచ్చు చేరుచుండెడిది.

(ii) షష్ఠీసమాసమందు ఉ, ఋ, ఔల తరువాత 'ఁ' అను అనునాసికోచ్చారణము వినఁబడుచుండెను.

3. క, ఖ, గ, ఘ, ఙ; చ, ఛ, జ, ఝ, ఞ; ట, ఠ, డ, ఢ, ణ; త, థ, ద, ధ, న; ప, ఫ, బ, భ, మ; య, ర, ఱ, ల, ళ, వ; శ, ష, స, హ— అను వర్ణములకు నేఁడును నాఁడును ఒక్కటే ఉచ్చారణము లుండును.

4. డ, ఱ, టి, ళ—అను వర్ణముల ఉచ్చారణము ఒక్కటే కాకున్నను కొంచె మెక్కువ తక్కువగ దగ్గఱగా నుండెను. కావుననే ఆకాలపు వ్రాంతలలో డ, ఱ, (అచ్చువాన్డు అని వ్రాయుటకు 'అచ్చువాన్ఱు'); డ, టి, ('చోటి' అని వ్రాయుటకు 'చోడ'); టి, ళ ('చోటి' అనుటకు 'చోళ') అను వర్ణముల యందు తబ్బిబ్బులు కాన్పించుచున్నవి.

5. రేఫమునకును శకటరేఫమునకును ఉచ్చారణమునందు స్పష్టమగు భేద ముండెను. కావుననే శకటరేఫను లసందిగ్ధముగ వ్రాయుచుండిరి.

6. శకటరేఫము ద్విత్వమును పొందినప్పుడు ద్రావిడ సంప్రదాయాను సారముగ 'ట్ఱ' అని ఉచ్చరింపఁ బడుచుండెను. 'ఱ' అను పరుషధ్వనికి 'ఱ్ఱ' అనునది పరుషధ్వని యని చెప్పవచ్చును.

ఉదా:—ముయ్యలికుఱ్ఱు (నందంపూడిశాసనము) అట్టి ఉచ్చారణ ముండుటచేతనే 'పఱ్ఱు, పట్టు' 'మిఱ్ఱు, మిట్ట' 'కుఱ్ఱు, కుట్ట (గుట్ట)' మొదలగు రూపాంతరము లేర్పడినవి. ఇట్లే ద్రావిడ సంప్రదాయము ప్రకారము శకట రేఫాంతము లగు విశేషణములు విశేష్యములతోఁ జేరునప్పుడు ద్విత్వముఁ బొంది 'ట్ఱ' అను నుచ్చారణమును, రానురాను ద్విరుక్త టకారోచ్చారణ మును పొందినవి.

ఉదా:—కుఱు + ఉసురు = కుఱ్ఱు (ట్ఱ) కుట్టు + ఉసురు = కుట్టు సురు; చిఱు, చిఱ్ఱు, చిట్ఱు లేక చిట్టు+ఎలుక=చిట్టెలుక— మొద.

ప్రథమేతరవిభక్తులందు 'ఱ' పై నిత్వము చేరినప్పుడు టివర్ణముగా మాఱుటయు నిందుచేతనే. ఏఱు, ఏటి మొద.

7. ద్రావిడ సంప్రదాయము ప్రకారముగనే 'స' కారము శకటరేఫముతో సంయుక్త మయినపుడు 'ద్ర' అను నుచ్చారణమును, తరువాత 'ణ్ర' అను నుచ్చారణమును పొందెను. 'టచ్చువాన్రు' అని నన్నయకు పూర్వపు శాసనములలో వ్రాయఁబడినదే తరువాత వాణ్రు, వాండ్రులుగా మాఱినది. వాండ్రు అనునది మాండలికపదము. నన్నయలో 'వారు' అనియే యున్నది.

8. 'జ్ఞ' అను సంయుక్తాక్షరము నన్నయభారతములో 'జ్ఞ' అనియే యథాసంజ్ఞికముగ ఉచ్చరింపఁబడుచుండెను. నేఁటి 'గ్ఞ,' 'గ్న' అను నుచ్చారణమును నన్నయ అనుసరింపలేదు. అందుచేతనే అతఁడెప్పుడును 'జ్ఞ' కును చ, ఛ, జ, ఝ, శ, ష, స లకును మైత్రిని కల్పించినాఁడు. అట్టి యతిస్థానములు నన్నయభారతములోనివి ఈ క్రింద ఎత్తి చూపఁబడినవి.

ఆది. I. 157. జ్ఞానము సర్వభూతహిత-సంహిత బుద్ధియు

ఆది. II. 222. అమ్మనుజేంద్రుఁడైన నలు-యజ్ఞము ధర్మజు
రాజసూయ య

జ్ఞమ్ముఁ బ్రయోగఁజేసిన ప్ర-జాపతియజ్ఞము, బాశపాణియ
జ్ఞమ్మునుఁ గృష్ణుయజ్ఞము, ని-శాకరుయజ్ఞము, నీమనోజ్ఞయ
జ్ఞమ్మును నొక్కరూప విల-సన్మహిమం గురువంశవర్ధనా.

ఆది. VIII. 35. కావించు నజ్ఞులు భూనాథుల కాప్తులుఁ సఖులునై-శోషింతు రత్యంతముఁ.

సభా. II. 100. ధృతరాష్ట్రు నను,జ్ఞానముఁ బడయుడును మనకు - సమకూరు ...

అర. III. 128. జామదగ్న్యుండు నిర్మల - జ్ఞానదృష్టి ...

9. 'క్ష' అను సంయుక్తాక్షరమునందు 'క' కారోచ్చారణమునకే ప్రాధాన్యముండెను. కాని షకారమునకు లేదు. కావుననే నన్నయ యెల్ల యెడలను 'క్ష' కారమునకును క, ఖ, గ, ఘ లకును మాత్రమే మైత్రిని కల్పించినాఁడు. ఇట్టి మైత్రి కలిగినతావులు ఈ క్రింద చూపఁబడినవి.

ఆది. I. 107. క్షేత్రమునం బ్రకామగతి - ఖేలననొప్పి ...

ఆది. II. 168. క్షమాదమసమన్వితుం గనియెఁ - గాననాంతంబునన్.

,, 118. అవిచలితరక్షా,క్షముఁడై రక్షించికొని సు-ఖస్థితినుండెన్

,, 173. క్షత్త్రియ పంశ్యులై ధరణిఁ- గావగఁబుట్టిన ...

క్షత్త్రియ వైశ్య శూద్రులనఁ - గాఁ దగు ...

,, త, క్షకకోటుల్ పని సేయఁగా ఘనతరై-క స్తంభ ...త,

క్షకభీతిన్ రచియింపఁ బంచి దృఢర-క్షన్ ...

ఆది. II. 224. సా, క్షోద్విష్ణుండవు నీవు భూపతులలోఁ - గౌరవ్యవంశో
త్తమా.

ఆది. III. 92. క్షితిభృత్కుం బగుదాని భూరిభుజశక్తిం జేసి ...
సభా. I. 103. క్షేమంబున నడపుచున్న - కృష్ణునియోగంబు ...
సభా. II. 25. క్షత్త్రియుండవు పూజ్యుండవు వి-క్రమసమృద్ధి ...
,, 155. క్షేమవృద్ధి యనువాని న-కృత్త్రిమసాహసా ...
ఆర. II. 247. క్షత్త్రియధర్మములె సుగతి - కారణములు ...
,, 253 విక్రమ, క్షణదాచరవరరిపు మీాక్షణను వి-ఖ్యాతంబుగా ...
,, 262. క్షత్త్రియధర్మైన పదంబుఁ - గ్రాంగినలయు.
,, III. 136. క్షత్త్రియుఁ డున్నవిల్లియు న-ఘుకుయకొంబుచుఁడుఁ.

ఈ క్రింది రెండు పాదములలో పైవానికి విరుద్ధముగ అచ్చుప్రతు
లలో కాన్పించు చున్నది. కాని, అచ్చువాని ములు ప్రమాదజనితములు.
వ్రాంతప్రతులలో సరియైన పాఠము లున్నవి.

ఆర. I. 217. కుమయతాల్చియుండి -జనవల్లబొప్ప ... అచ్చుపాఠము.
క్షమయతాల్చియు నుండ-గా నెల్లఁ ద్రొప్పు ... వ్రాంతప్రతులు.

ఆర. III. 136. క్షత్త్రచరిత్రుడై పరగు-గర్వముతోఁ ... అచ్చుపాఠము.
క్షత్త్రచరిత్రుఁడై పరగు - గర్వమునఁ (గర్వమునఁ) ... వ్రాంతప్రతులు.

10. క, ఖ, గ, ఘ లకును 'హ' కారమునకును కంఠ్యోచ్చారణమువలన
మైత్త్రి కలుగవలసి యున్నను, లాక్షణికు లట్టి మైత్త్రిని నిరూపించి యుండ లేదు.
కాని కంఠ్యోచ్చారణము గల జిహ్వామూలీయముతోఁ గూడిన కంఠ్యవర్ణ మగు
'ఖ' కారమునకును 'హ' కారమునకును నన్నయ మైత్త్రిని కుదిర్చినాఁడు.

ఆర. IV. 128. దుః, ఖంబునైన నిమోహమును బొంద ... కావున
'ఃఖ' అనునది నేటివలె నాఁడును 'హ్ఖ' అనియే ఉచ్చరింపఁబడుచుండవలెను.

11. శిథిలాక్షరములు:— రేఫయుక్తములగు కొన్ని సంయుక్తాక్షరము
లకుఁ బూర్వమం దుండునక్షరములు గురువులు గాకుండును.

క॥ తలరఁగ రేణుక ప్రభవ, ప్రలిహా ప్రసదాశ్వ కుంత పదసఖులను
క్రతుల—

విద్రిచి (ఆది. VII. 223); అభ్యుదర్ (ఆది. V. 224, ఆర. I. 162);
ఆర. III. 312; స, క్షత్త్రియుండుగా శత్రుప్రకాశ జయోన్నతమైన యష్ట
మిఁ (ఆది. V. 94); సం, త్రిత వ్రతులను విప్రసగులు సేసిరి (ఆది. V.
96); అవనిజములలః నమ్ముని ప్రవరు పృథూత్సంగితములయ్యై వడిఁబడియెఁ
(సభా. I. 142).

### అక్షరస్వరూపము

1. నన్నయకు పూర్వకాలమందున్న లిపి నిలువుగను చతురస్రముగను ఉండెడిది. అది 11-వ శతాబ్దము నాఁటికి గుండ్రకత్తుగా మాఱుచు వచ్చినది. 12-వ శతాబ్దమునాఁటి కదియు మఱింత పరిణామముఁ బొందినది. 11-వ శతాబ్దమున నన్నయరచించిన నందంపూడిశాసనపు రెండు రేకుల ప్రతిబింబము లిపిప్రకరణమునఁ జూపఁబడినది.

2. నన్నయ తన భారతమును తాటియాకులపై నెట్లు వ్రాసియుండునో 11-వ శతాబ్ద శాసనములందలి లిపిననుసరించి, నన్నయ భారతములోని మొదటి యయిదుపద్యములును ఇట్లు వ్రాయఁబడి యుండవలయునని యూహించి ఈ ప్రక్కపటమునఁ జూపియున్నాను.

## III. సంధిప్రకరణము

### ఉత్వసంధి

1. ఉత్తున కచ్చుపరంబగునపుడు సంధియగును. ఉకారము అచ్చుల యందెల్ల మిక్కిలి చులుకనైనది. గనుక, అది తనపై వచ్చు నచ్చునకు తా విచ్చుచుండును.

ఆది. I. 3. చంద్రికారాజిత సర్వలోకుఁడు + అపరాజిత = చంద్రికా రాజితసర్వలోకుఁడపరాజిత.

ఆది. I. 7. అగ్రహారంబులు + ఇచ్చుచు = అగ్రహారంబులిచ్చుచు.

ఆది. I. 8. భూషణంబు + ఐన = భూషణంబైన.

ఆది. I. 27. మునినికాయము + ఎల్లన్ = మునినికాయమెల్లన్.

ఆది. I. 30. దత్తావధానులరు + అయి = దత్తావధానులరయి.

ఆది. I. 47. మేలు + అనఁగాన్ = మేలనఁగాన్.

ఆది. I. 76. త్రావుదురు + అట్టి = త్రావుదురట్టి.

2. నా, నీ, తన శబ్దముల ద్వితీయావిభక్తియందలి ఉకారమునకును, షష్ఠీ, సప్తమీ విభక్తులలోని ఉకారమునకును సంధి వైకల్పికము.

నన్ను, నిన్ను, మమ్ము, మిమ్ము, తన్ను, తమ్ము, అనువానియందు ద్విత్వ లోపము కలిగిన యెడల సంధి కాదు.

ద్వితీయ:—ఆది. III. 143, నన్ను + ఉద్ధరించి = నన్నుద్ధరించి.

ఆది. V. 206, నన్నున్ + ఎఱుంగుదే = నన్నెఱుంగుదే.

ఆది. VII. 217, మమ్ము + ఎవ్వరు = మమ్మెవ్వరు.

ఆది. VII. 231, మమ్ము + ఎఱుఁగేడున్ = మమ్మెఱుంగేడున్.

ఆది. I. 132, నిన్ను + ఎట్లు = నిన్నెట్లు.

ఆది. I. 153, నిన్నున్ + ఇప్పుడ = నిన్ను నిప్పుడ.

ఆది. II. 144, మిమ్ము + ఇట్లు = మమ్మిట్లు.

ఆది. VII. 57, మిమ్మున్ + ఎఱుంగియు = మిమ్ము నెఱుంగియు.

ఆది. II. 156, తన్నున్ + అన్యులు = తన్ను నన్యులు.

ఆది. I. 42, తన్ను + ఎన్ననన్ = తన్నెన్ననన్.

షష్ఠి:—ఆది. I. 73, కథకునకు + ఇట్లు = కథకునకిట్లు.

ఆది. I. 101, నీకున్ + అల్పకాలంబునన్ = నీకు నల్పకాలంబునన్.

సప్తమి:—ఆది. I. 140, అగ్నిహోత్రములందున్ + ఔపాసన = అగ్నిహోత్రములందు నౌపాసన.

ఆది. I. 143, శుచులయందు + ఎల్లన్ = శుచులయం దెల్లన్.

శత్రర్థక చువర్ణము.

ఆది. I. 7, చేయుచున్ + ఇట్లు = చేయుచిట్లు.

ఆది. I. 71, వినుచున్ + ఉండు = వినుచునుండు.

ఆది. I. 136, ఆడుచున్ + ఉన్నవానిన్ = ఆడుచు నున్నవానిన్.

3. కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమం బగును.

ఆర. II. 90, కఱకుటెఱుకు = కఱకు + ఎఱుకు.

ఆర. I. 294, ఏపుటడవి = ఏపు + అడవి.

ఉబ్బు + పల్లి = ఉబ్బుటుంబల్లి. S. I. I)

వీనిలోని 'టు' అనునది యాగమవర్ణముగాక 'డు' వర్ణవికారము. కఱకుండు + ఎఱుక; ఏపుడు + అడవి; ఉబ్బుడు + పల్లి.

4. కర్మధారయంబునందు పేర్యాది శబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమము రాదు. పేరు + ఉరము = పేరురము ('పేరుటురము' కాదు.)

5. ఉదంత తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరంబగునపుడు నుగాగమం బగును. ఇచట సంధియం దాగమముగాఁ జేరు 'న్' అనునది తొలుత ద్రావిడమున విశేషణముతోఁ జేరియుండినదే.

ఆర. I. 127, పదియుగు + అడుగు = పదియుగునడుగు.

ఆది. VI. 157, నమ్ము + అట్లుగాన్ = నమ్మునట్లుగాన్.

ఆది. II. 12, త్రచ్చు + ఎడన్ = త్రచ్చునెడన్.

సభా. II. 60, నిండు + అంతకున్ = నిండునంతకున్.

విడ్చు + అట్టు = విడ్చునట్టు (S. I. I. IV, 1132)

నడచు + అట్టుగా = నడచునట్టుగా (S. I. I. IV, 1186, 1168)

6. షష్ఠీసమాసమం దుకార ఋకారముల కచ్చు పరంబగునపుడు నుగాగమంబగును.

ఆర. II. 127, పదియగునడుగు + అప్పుడు=పదియగునడుగు నప్పుడు.

S. I. I.. IV. 1323, మంత్రబోనము + అప్పటికి = మంత్రబోనము నప్పటికి.

S. I. I. 77, బోయు + అల్లుణ్డు = బోయునల్లుణ్డు.

7. (అ) ధాతువుల ఉపోత్తమ ఇత్వ, ఉత్వములకు లోపము వికల్పముగా నగును. ఆ ధాతువుల అన్ని క్రియారూపములయందును ఆ లోపము వికల్పముగా కాన్పించును. నన్నయభారతమునుండి ఉదాహరణములు.

అలుగు:—అలిగెన్, అల్గెన్, అలిగి, అల్గి, అలుగుదురు, అలిగించెదు, అల్గితిని, అలిగితిన్, అలిగించి, అలుగక, అలిగిన, అలిగెడునో, అల్గునో, అలుగుదురయ్యా, అలుగఁ, అల్గఁ, అలుగంగఁ, అలిగినన్.

కలుగు:—కలుగువాఁడు, కలిగెఁ, కల్గెఁ, కలుగును, కలిగింపు(ము), కలుగుము, కలిగి, కల్గి, కలుగు, కలిగిన, కలుగవలయుఁ, కలుగునె, కల్గునే, కలుగునయ్యా, కలిగినఁ, కలిగినను, కలుగఁ, కలుగఁగన్, కలుగంగన్, కల్గినన్, కల్గన్, కల్గఁగన్, కలిగెనేని, కలిగి రేనిన్.

కుడుచు:—S. I. I. IV. 1248, కుడ్వంగల.

చెడుచు:—S. I. I. IV. 675, చెడ్చిరేనిఁ.

తనుపు:—తనిపె, తనుపుఁ, తనుపుము, తన్పుదుఁ, తనుపుచుఁ, తన్పుచుఁ, తనిపినఁ.

తెలుపు:—తెల్పెఁ, తెలుపును, తెల్పుఁ, తెలుపుచుఁ, తెలుపంగఁ, తొడుగు, తొడ్గు. (ఆది. I. 114).

నిలుచు:—నిలిచెఁ, నిల్చిరి, నిలిచిరి, నిలిచినవి, నిలుచుఁ, నిలిచి, నిల్చి, నిలుచు, నిలిచిన, నిలుచుచుఁ ,నిలువఁ, నిల్వఁ, నిలిచినఁ, నిల్చినఁ, నిలుచుటయు, నిలువుము, నిల్వుము.

నిలుపు:—నిలిపెఁ, నిల్పెఁ, నిలిపిరి, నిల్పుఁ, నిలుపుము, నిలుపుదుపు, నిల్పితిఁ, నిలిపి, నిల్పి, నిలిపికొని, నిల్పరె, నిలుపఁగాఁ, నిల్పఁగఁ, నిల్పునది, నిలుపుటయు, నిలుపుటయ, నిలుపుటఁ జేసి.

పలుకు:—పలికెఁ, పల్కెఁ, పలుకకుండెఁ, పలుకకుండిరి, పలుకరయిరి, పలుకరైరి, పలికిరి, పల్కిరి, పలుకుఁ, పలుకునో, పలుకుదు, పల్కు, పలికెదు, పలుకవు, పలుకుదు (వు), పల్కుదే, పల్కెదు, పలికితిఁ, పల్కితిఁ, పలికితిమి, పలుకుదుఁ, పలికెడువారము, పలుకక, పలుకఁబడియు;

పల్కి, పలికిన, పలుకు, పలికెడు, పలుకుచున్న, పల్కిన, పల్కెడు, పలుకునో, పల్కుదే, పలుకగా, పలుకువడంగా, పలుకంగా, పలుకంగా, పలుకంగాా, పలుకునాడు, పల్కగా, పల్కంగా, పల్కంగాా, పలుకుచున్నచోా, పల్కను.

పనుచు:—పంచెా, పంచెను, పంచెనో, పంచిరి, పన్పుడు, పనుపుండు, పనుపుడు, పనుపును, పంపుము, పంచితిా, పంచెదా, పంచి, పంచియుా, పంచినా, పంచితయ్యా, పంచితిరో, పంపంగా, పంపంగా.

పెనుచు:—పెనిచెా, పెనిచెను, పెంచిరి, పెంచితి(వి), పెన్పు(ము), పెనిచితిని, పెంచి; పెంచుచుా, పెంచా, పెనుచుటంజేసి.

చలుపు:—చలుపుచున్నయవి, చలుపుచుండెా, చలిపిరి, చలుపుా, చలుపుదయ్యా, చలుపును, చలిపితిమి, చలుపుదుా, చలుపుదము, చలుపక, చలిపి, చలిపిన, చలిపెడు, చల్పుచుా, చలుపవలయుా, చలుపా, చల్పా, చలుపుటయును, చల్పంగా.

పిలుచు:—పిల్చెా, పిలిచి, పిల్చి, పిలువంబడి, పిలువంగంబడి, పిలువంగంబడక, పిలుచుచుా, పిల్చుచుా, పిల్వా, పిలువా.

విడుచు:—విడ్చెా, విడిచిరి, విడుచుా, విడుచునో, విడుతురు, విడువంజాలరు, విడుండు, విడుపుము, విడుపుము, విడువు, విడిచితిా, విడువంబడితిని, విడిచితిని, విడిచెదా, విడువా, విడా (I do not), విడువంబడియెదను, విడుతుము, విడిచి, విడిచియుా, విడిచిపుచ్చి, విడువక, విడుపని, విడువంబడి, విడిచిన, విడుచు, విడువంగంబడిన, విడువవలయు, విడుతునే, విడిచినా, విడువా, విడువంగా, విడువనినాడు, విడువంబడినా, విడుచుట, S.I.I. IV. 1325, విడ్చిన, S.I.I. IV. 1132, విడ్చునట్టుగా, S.I.I. IV. 1255, విడ్చి.

(ఆ) ఈ క్రింది ధాతువులు తొలుత ఉపోత్తమాత్వము గలవి కావు. నన్నయ భారతములో ఉపోత్తమాత్వముగ నివి కానరావు. అదల్చు, అమర్చు, ఆర్చు, ఈడ్చు, ఊర్చు, ఎదుర్చు, ఏడ్చు, ఏర్చు, ఒసర్చు, ఓర్చు, కదల్చు, కాల్చు, కూర్చు, చేర్చు, తలిర్చు, తాల్చు, తీర్చు, నీల్గు; నేర్చు, పేర్చు, వార్చు, విడుచ్చు, వేల్చు. ఈ ధాతువులనుండి తరువాతి కాలమున 'అదలుచు, అమరుచు' మొదలయిన రూపము లేర్పడినవి.

(ఇ) ఉకారాంత ధాతువులకు ణిజర్థక 'చు' వర్ణము చేర్పంగా నేర్పడిన ధాతువుల ఉపోత్తమాత్వమునకు వికల్పముగా లోపముకలుగును.

విను, ణిజర్థకము, విన్చు, వినిచెా, విన్చెా.

(ఈ) కీఙ్+పఱుచు=కీల్పఱుచు; తోఙ్+తెచ్చు=తోత్తెచ్చు; చేఙ్+పడు=చేల్పడు; వీఙ్+పడు=వీల్వడు-మొదలగునవి రాను రాను కీడ్పఱుచు, తోడ్తెచ్చు, చేడ్పడు, వీడ్వడు నను రూపములను బొంది, అట్టివానిలో కొన్ని రాను రాను కీడుపఱుచు, తోడితెచ్చు, అని శిథిలత్వమును పొందినవి. ఇట్లే వెల్+పడు=వెల్వడు; కోల్+పడు=కోల్పడు; ఏఱ్+పడు=ఏర్పడు; చీఱ్+పులి=చీర్పులి (S. I. I. IV. 675) అనువానిలోఁ గొన్నియు తరువాతికాలమున శిథిలత్వమును పొందినవి. ఇట్లే తనర్చు, ఒనర్చు, తలిర్చు, మొదలగునవి.

(ఉ) కొన్ని ధాతువులలో ఉపోత్తమ అకారము ఉకారముగా మాఱి ఆ ఉత్వము లోపించినది.

తెఱచు:—ఆది. VII. 273, 274, తెర్చి.

తొలుచు:—సభా. II, 176, తొల్చి, తొలిచి.

నడచు, S I. I. V. 1437, నడ్వఁ.

(ఊ) ఈ ఉపోత్తమ ఉకారలోపము ధాతువులందేకాక యితర పదముల యందును కలిగినది.

అవుడు [అప్డు] (ఆది. IV. 168); అఱుతఁ, [అర్తఁ] (S. I. I. IV. 989); [అలుకఁ] అల్కఁ, (ఆది II. 22); [అట్టులు] అట్లు (ఆది. I. 66, మొ).; [ఇట్టులు] ఇట్లు (ఆది. I 7, 67, మొ.); ఇందులఁ (ఆది II. 194), ఇండ్లు (అర. II. 150); [ఎట్టులు] ఎట్లు (ఆది I. 96. 136, మొ); [ఏండులు] ఏండ్లు, (ఆది. II. 4); [కొడుకు] కొడ్కు (S. I. I. IV. 688, 1113, 1317, S.II . V. 1048); [కొలువు] కొల్వు (S. I. I. V. 66); [గుడులు] గుడ్లు, (S. I. I. IV 749); [చనుప] చన్ప, (అర. II. 110); [చులుకఁ] చుల్కఁ, (సభా. I. 201); చెలువు, చెల్వు, (S. I. I. IV. 945); (పందులు) పంద్లు, (అర. I. 94); [పలుకు] పల్కు, (ఆది. I. 100 మొ.); [పొలుపు] పొల్పు, (అర. IV. 141), (కోటులు) కోట్లు, (ఆది I. 16, సభా I. 244, అర. II 245, 263, 267, 281, అర. IV. 55); (దృష్టులు) దృష్ట్లు ఆది. III. 159, ఆది. VIII. 106).

(ఋ) తూర్పు, తనర్పు, నేర్పు, తాల్మి, పేర్మి - మొదలయినవి తొల్లింటి రూపములు నన్నయ భారతములోనివి యిట్లే కానవచ్చును. ఇవి తరువాతి కాలమున శిథిలతఁబొంది తూరుపు, తనరుపు, నేరుపు, తాలిమి పేరిమి అను రూపములఁ బొందినవి.

(ఋ) ప్రథమపురుష బహువచన క్రియలయందలి 'తురు' 'త్రు' గామాఱును.

అనుభవింతురు,-అనుభవింత్రు.

(౯) ఉపోత్తమముగానుండు ఉత్వమునకే కాక యితరాచ్చులకును అందందు లోపము కనిపించుచున్నది.

ఉనికి, ఉన్కి (ఆది. IV. 171; ఆది. VI. 267; ఆది. VIII. 36).

(ౠ) శత్రర్థక చు- వర్ణము పరమగునపుడు నుకారాంత ధాతువుల నుకారము మీఁది ఉత్వమునకు లోపము బహుళముగా నగును.

(అనుచుఁ) అన్చుఁ; (కొనుచుఁ) కొన్చుఁ; (తినుచును) తిన్చును; (వినుచుఁ) విన్చుఁ. ఈ నకారమునకు బదులుగా పూర్ణబిందువును వచ్చును; అంచుఁ, కొంచుఁ, తించుఁ, వించుఁ. బహుళగ్రహణమువలన 'చనుచుఁ' అనుదానికి రాలేదు.

(9) (అ) పడు, చేయు అనుధాతువులు పరములైనప్పుడు ప్రథమావిభక్తి మువర్ణముమీఁది ఉత్వమునకు లోపము వచ్చును. మిగిలిన మకారమునకు పూర్ణబిందువు బహుళముగా నగును.

భయము + పడి = భయంపడి; భయము + పడక = భయంపడక, ఇట్లే భయంపడియెడు, భయంపడఁ. భయపడకుండఁ, భయంపడుదుగు. విజయంచేయుమ; విజయంచేయుండు. (S. I. I., IV. 1102); విజయంచ్చేసి, శ్రమంపడి. కొన్నియెడల పూర్ణబిందువునకు లోపమును కలుగును. (ఆర. III. 30; ఆది. VII. 156; ఆర. I. 2; ఆర. IV. 9); ఉత్తరము + మించి = ఉత్తరమించి (ఆర. IV. 3; విజయాదిత్యుని శాసనములు); దక్షిణమించి; సంతసపట్టి (ఆది. II. 21); ఇల్లడయిడి (ఆది. V. 248; సభా. I. 162); ఇట్లే సంతసపడక, తెల్లడపడఁగఁ మొదలగునవి.

విజయాదిత్యుని ర్యాలి శాసనము I.-నారనపరంగపుల చీననుండి ఉత్తరమించిపోయిన కోరుమిల్లి పొలగరున సీమా. కోరుమిల్లి పొలములో నుత్తరమించిపోయిన అడ్డపుంద్రోవ దక్షిణముతలయ సీమా

విజయాదిత్యునిర్యాలిశాసనము II-ముయ్యాలికుట్రుననుండి దక్షిణమించి పాఱిన చోడిపల్లియ సీమా. వ్రంతయు దక్షిణమించివచ్చి పొలగరునుఁ.

(ఆ) ప్రథమావిభక్తియందున్న వుకారాంతశబ్దముల 'వు' కారమునకు పడ్వాదులు పరము లయినప్పుడును వాని 'వు' కారమునకు లోపము గలుగును,

పశువరిచి (అర. III. 215) అచ్చెరువడి (అర. II. 97).

(10) తను, అను, మను, చను, ఇలు, మీను, మొదలయిన శబ్దముల తుది ఉకారమున కొకప్పుడు లోపము కలుగును.

తన్వినుచున్నవారల (ఆది. III. 9); తఱంబంచినయాశుణంబ చేయుచు (ఆది. III. 109), జనములుతఱఁ బొగడఁగ (ఆది. IV. 29); విలసత్కూలఘన వల్లి య న్నిష్టసఖఱ (ఆది. III. 140); పలుకులఱ కడువాడి బాణతతుల (ఆది. III. 206); అపత్యశోకమ న్వననిధిలోన (ఆది. IV. 37); శృంగియ న్వాడు (ఆది. II. 180). ఘృతాచియఱ సదమలాంగి (ఆది. V. 195); దుర్వానుఁడఱ సిద్ధమునియు వచ్చె (ఆది. V. 17); వారణావతమఱ పురంబున (ఆది. VI. 138);సంవరణుఁ డన్వాఁడు (ఆది. VII. 86); రిపులఱ కడిఁది విషా హులు (ఆది. VII. 192); గిరివ్రజమఱ పురంబు (సభా. I. 172); అఱ చాపరత్నము (ఆది. VIII. 253); తనువు మీన్వొలవల్చు (ఆది. III. 39); తమ్మున్ను త్తముల్ పొగడఁగ మఱ మహామతులు (ఆది. II. 149); మ్రఱ మ్రానిపాటు (ఆది. VII. 176); విప్రసతికి నూఱువేఁడఁజఱ వరములు (సభా. II. 263); లక్కయిల్ గావించి (ఆది. III. 14); వంటయిల్ కుం దెలుసొచ్చె (ఆది. VI. 186).

## అత్వసంధి

(I) అత్తునకు సంధి బహుళము.

(అ) మేన + అత్త = మేనయత్త (మేనత్త కాదు.) ఆది. V. 17. మేనయత్త; సభా. II. 55, మేనయత్త; ఆది. VII. 215, మేనయత్త కొడుకున్.

(ఆ) విప్రుల + అందు = విప్రులయందు (ఆది. I. 100); ఉర్వీశుల + ఒద్ద = ఉర్వీశులొద్ద (ఆది. VII. 221); రాజుల + ఒద్ద = రాజులొద్ద (ఆది. VIII. 65, ఆది. VI. 120); అరిగిన + ఎడక = అరిగినెడక (ఆది. VI. 142); చొచ్చిన + అచ్చోన = చొచ్చినచ్చోన (S. I. I. IV. 737); అయిన + ఎడలు = అయినెడలు (అర. III. 312); ఐన + ఎడ = ఐనెడ (అర. IV. 114); ఐన + ఎడల = ఐనయెడల (అర. II. 74); అంత + అవమానము = అంతవమానము (సభా. II. 203); ఎంత + ఎఱుక = ఎంతయెఱుక (అర. I. 32); ముందట + ఉన్న = ముందటున్న (ఆది. VI. 153); తమ + అయ్యకు = తమయ్యకు (S. I. I. IV. 1325); తమ + అమ్మ = తమయమ్మ (S. I. I. IV. 1228; S. I. I. V. 75); తమమ్మ (S. I. I. V. 1148);

(ఇ) కల + అయ్యెనిమిది = కలయయ్యెనిమిది (ఆది. I. 47).

(8) స్త్రీవాచక తత్సమ సంబోధ నావధారణ చిహ్నాంతములకు సంధిలేదు.

స్త్రీవాచకము:—చెలువ + ఇట్టులు = చెలువయిట్టులు (ఆర. II. 165); తత్సమ:—భద్ర + అను = భద్రయను (ఆది. V. 84).

సంబోధనాంతము:—భూజనవంద్య + ఏను = భూజనవంద్యయేను (ఆది. I. 121).

అవధారణము:—చోటిక + అరుగుదము = చోటికయరుగుదము (ఆర. I. 5).

(9) వృత్తియందు శబ్దముమీఁది అది, అవి, శబ్దముల అకారమునకు లోపము బహుళముగా నగును.

(అ) నా, మా, నీ, మీ, తన, అను షష్ఠీవిభక్తిరూపములపై 'అది' అవి, చేరినప్పుడు యడాగమమే వచ్చునుగాని అది, అవి, అనువానిలోని అకారమునకు లోపమురాదు. నాయది, మాయది, నీయది, మీయది, తనయది, తమయది, నాయవి, మాయవి, నీయవి, మీయవి, తనయవి, తమయవి.

పై సర్వనామముల షష్ఠీవిభక్తియందు 'అదు,' అను ఆగమము వచ్చును. అప్పుడు దాని ఆదిమ అకారమునకు లోపము కలుగును: నాదు, నాదగు, నాదయిన; నీదు, నీదగు, నీదయిన; మీదగు, మీదయిన, తనదు, తనదగు, తనదైన.

(ఆ) వాని, వారి, వీరి, దాని, అనువానిపై, 'అది,' చేరినప్పుడు దాని తొలి అకారమునకు లోపముకలుగును: వానిదైన, వారిదయిన, వీరిది, దానిదైన; అట్టి, ఇట్టి, ఎట్టి అనువానిమీఁదను నామముల షష్ఠియందలి అకారము మీఁదను అది, అవి అనువాని తొలి అకారము వైకల్పికముగా లోపించును:- అట్టిది, ఇట్టిది (ఆది. II. 217), ఎట్టిది (ఆది. I. 26) మీవంశమున నరదేవోత్తములదైవ (సభా. I. 25)

(ఇ) తోడ అనువిభక్తిప్రత్యయముపై ఇ అనువర్ణకము చేరఁగానయిన 'తోడి' మీఁద 'అది' చేరినప్పుడు, దాని తొలి అకారమునకు లోపముకలుగును:— మాతోడిదేమి (ఆర. II. 211); దానితోడిదేమి (ఆది. III. 147).

(ఈ) వర్తమానక్రియలయందు ఉన్నానుబంధముపై వచ్చు 'అది 'అవి' శబ్దముల తొలి అకారమునకు లోపము రాదు. అచట యడాగమము వచ్చును:— ఉన్నయది, ఉన్నయవి, ఎఱుఁగనియది, ఏడ్చుచున్నయది, అగుచున్నయవి, ఏర్పుచున్నయది, ఒప్పుచున్నయది, కలయది, కలయవి మొద.

ఉన్నది అను రూపము ఉండునది అను విధ్యర్థమందు ప్రయోగింపఁబడి నది. ఉండకున్నది (ఆది. III. 205) ఉన్నది (ఆది. VI. 267).

(౨) 'పెద్ద' మొదలగు అకారాంత విశేషణములపై 'అది' 'అవి', పరమైనప్పుడు వాని తొలి అకారమునకు లోపము రాదు:— ఉదా:- పెద్దయది (ఆది. IV. 210).

(౯) భూతార్థక క్రియాజన్య విశేణములపై అది, అవి పరమైనప్పుడు వాని తొలి అకారమునకు లోపము వైకల్పిముగా నగును. ఉదా:—లోపము రానందుకు-అయినయవి, ఎఱుంగనియది, తగిలినయది, పోయినయది.

లోపము వచ్చినందుకు:— అయినది, అయినవి, చూచినది, తగిలినది.

(10) సమాసమందు తోడ, వలన ల అత్వమున కిత్వ మగును.

రాజులతోడి యుద్ధంబు (ఆది. I. 60); నీతోడి సఖ్యంబు (ఆది. VII. 50) ఇంద్రనందనుతోడి యిష్ట వినోదంబులు (ఆది. VII. 223); పిడుగుల తోడి వృష్టి (సభా. II. 70) గాడ్పుతోడి వాన (అర. III. 298), దణ్డుతోడి దివియ (SI.I. IV, 1209, 1210) తక్షకువలని భయంబు (ఆది. II. 176); తమవలని నెయ్యంబు (ఆది. VI. 147) పితృగణంబువలని ఋణంబు (ఆది. VI. 248); జనులవలని తాడనంబులు (ఆది.VII. 101); మావలని మోహంబు (ఆది. VIII. 310); పగఱవలనివారలు (సభా. I. 40); సుతులవలని నెయ్యంబు (అర. I. 81) నావలని భయంబు (అర. II. 18) శత్రు నివహంబువలని భయంబు (అర. II. 127) కపోతంబువలని యాగ్రహంబు (అర. III. 233).

**ఇత్వసంధి.**

I. (అ) క్త్వార్థంబయిన ఇత్తునకు సంధిలేదు.

ఆది. I. 31 అని+అధ్యాత్మవిధులు=యనియధ్యాత్మవిదులు.

S. I. I. V. 62 ప్రసాదించి+ఇచ్చిరి=ప్రసాదించి యిచ్చిరి.

సంధిలేనిచోట స్వరంబుకంటెఁ బరంబయిన స్వరంబునకు యడాగ మంబగు.

(ఆ) 'అయి' అను క్త్వార్థక రూపముమీఁద సముచ్చయ 'ఉ' కారము వచ్చినప్పుడు, ఇత్వ లోపమును యకారమునకు ద్విత్వమును వైకల్పికముగ వచ్చును:—ఉదా:—ఆది VII. 35, అయ్యు; ఆది. VIII. 25, ఎన్నడయ్యు; ఆది. VIII. 261, చక్రధరుండయ్యు జలరుహనాభుండు గాండీవ ధరుఁడయ్యు; బాండవుండు.

2. ఏమ్యాదులయందు 'కి' షష్ఠి లేదు. ఏమ్యాదుల 'ఇత్తు' నకు సంధి లేదు.

అది:— స్త్రీనపుంసక బోధకముగా 310 సార్లు వచ్చినది. అందు 131 సార్లు మాత్రమే దానితరువాత అచ్చు వచ్చినది. 128 చోట్ల యడాగమము వచ్చినది. ఆది. II. 39 'అదెట్లనిన' అర. III. 132 ఉన్నదని, అని రెండుచోట్ల వచనములయందు అచ్చుప్రతులలో సంధి కనఁబడుచున్నను వ్రాఁత ప్రతులలో సంధిలేకుండఁగనే 'అది యెట్లనిన' 'ఉన్నది యని' అని కనఁబడుచున్నది. ఆది. IV. 259 'అదేల' అని ఆటవెలఁది పద్యములో అచ్చు ప్రతిలో కనఁబడుచున్నను కొన్ని వ్రాఁతప్రతులలో 'శప్తుఁడౌట యేల-సంభవించె' అనుపాఠము కాన్పించుచున్నది.

అవి:— ఇది 44 సార్లు వచ్చినది. అందు 13 సార్లు దానితరువాత అచ్చు వచ్చినది. అన్నిచోట్లను యడాగమమే వచ్చినది.

అయ్యది:— ఇది 2 సార్లు వచ్చినది. ఒకమాఱు దాని కచ్చు పరముగా నున్నది. సంధిలేదు.

ఇది:—మొత్తము 263 సార్లు. అచ్చుపరముగా 73 సార్లు. సంధిలేదు.

ఇయ్యది:— 1 సారి. అచ్చుపరమైనది. సంధిలేదు.

ఇవి:— మొత్తము 22 సార్లు. అచ్చుపరముగా 10 సార్లు. సంధిలేదు.

ఇద్ది, ఇవ్వి, ఇయ్యవి, ఎయ్యవి, ఎయవి, వీనికి ప్రయోగములు లేవు.

ఏది:— 2 సార్లు. దీనితరువాత అచ్చురాలేదు.

ఎద్ది:— 37 సార్లు. అచ్చుపరముగా 24 సార్లు. సంధిలేదు.

ఎయ్యది:— 10 సార్లు. అచ్చుపరముగా 2 సార్లు. సంధిలేదు.

ఏయది:— 2 సార్లును అచ్చుపరముగానున్నను సంధిలేదు.

ఎవ్వి:— మొత్తము 2 సార్లును అచ్చుపరముగానున్నను సంధిలేదు.

ఏమి:— మొత్తము 145 సార్లు, అచ్చుపరముగా 28 సార్లు. వీనిలో

ఆది. V. 29, 'ఏమనారు'అని అచ్చుపాఠము.ఏమినారు అనునది వ్రాఁత ప్రతులపాఠము.

అర. I. 238, 'ఏమని తలఁచునొకొ బుద్ధి నిష్ఠులుఁ దాన్ముఁ' అచ్చు పాఠము.

'ఏమిదలఁచునొక్కొ బుద్ధి నిష్ఠులు దాన్ముఁ' వ్రాఁతపాఠము.

ఆర. III. 305, 'ఏమని' ఇది వచనములోనిది. కొన్ని వ్రాఁతప్రతు లలో 'ఏమియని' అనియే ఉన్నది.

మఱి:— 133 సార్లు. అచ్చుపరముగా 38 సార్లు. సంధిలేదు.

3. ప్రథమోత్తమపురుష క్రియలయం దిత్తునకు సంధి వైకల్పికను. మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధినిత్యము.

ఉత్తమపురుషము:—

ఆది. VIII. 91, ఐతిమి + ఇందఱమున్ = ఐతిమి యిందఱమున్. ఆది. VI. 239, ఉండితిమి + ఒరులెఱుంగకుండ = ఉండితిమి యొరు లెఱుంగకుండ.

ఆర. II. 67. అపహరించితిమి + అని = అపహరించితిమని.

ప్రథమపురుషము:—

ఆది. VI. 264, క్రమమువడసి యొక్క సమయంబుసేసిరి. యొనర దాని తెఱఁగు వినుము తల్లి.

ఆర. II. 102, అందు గొంద అధిక హాస్యంబు సేసిరి. యడవి నేమిసేసె దనిరి కొంద,ఱు—

ఆర. II. 54, నిలిచిరంత.

[illegible]పురుష

ఆది. II. 198, (నీవు) తాల్చితి + అభిషిక్తుఁడవై = తాల్చితభిషిక్తుఁ డవై.

ఆది. II. 199 (నీవు) మంచితి + అనేక యాగములన్ = మంచితనేక యాగములన్.

ఆది. IV. 230 [నీవు] వచ్చితి + ఇందులకు = వచ్చితిందులకు.

4. 'ఏని' శబ్దమున కచ్చుపరమగునపుడు ఇత్వమునకు లోపము వికల్ప ముగా నగును: లోపము కలిగినందు కుదాహరణములు:—

ఆది. V. 149 తరువ్రూజ ... ... ...నీవు దిరముగా నిష్టంబు దీర్చితే నిందు ధృతిఁ బతియిష్టంబుఁ దీర్పనకాన.

సభా. I. 57. వ. ఎందే నిట్టిసభం జూచి యెఱుంగుదురే ?

సభా. II. 114. ఉ ... ... అత్యధికులైన సపత్నులపేర్మిఁ జూచియేఁ జూవె సహింపనోపక కృశుండ వివర్ణుండనైతి నెంతయున్.

సభా. II. 215 వ. నీ వేకవస్త్రవైతేనేమి విగతవస్త్రవైతేనేమి

సభా. II. 244. సీ. గీ. ధన్యులార యేను దాసినే దాసినే నెఱుఁగ జెప్పి పనుపుఁడు ...

అర. II. 263, వ. ఎందేనుండి యాత్రాపరులై కురుక్షేత్రంబునకుం బోదు రట్టి నైమిశకుంజం బాడి.

అర. II. 267, వ. కుమారు సేనాపతింగా నెందే నభిషేకించి రట్టి తైజసంబను తీర్థంబును.

అర. III. తే. గీ. నీవు దీని నొక్కరుఁడవు నిర్వహింప, నోపవే నొక్కరుండ న-య్యును గడంగి నడపనోపుదు, ... ...

లోపము కలుగనందుకు—

ఆది. II. 154, నాకు నీ వెన్నండేని నవమానంబుఁదలంచితి నాఁ నిన్నుం బాసి పోవుదు.

సభా. I. 4. ఎద్దియేని నొక్క యపూర్వంబయినదాని నిర్మింప ... ..

ఆది. III. 181, ఎందేని నుండియొక్క మహాముని ... .. వచ్చి.

ఆది. VII. 18. ఎయ్యేని నొక్కవేల్పు నారాధించి.

'ఏని' శబ్దము ద్రుతాంతమా కాదా?

ఆది. III. 181, ఎందేనినుండి.

ఆది. IV. 127, ఎయ్యేనియు నొక్క స్త్రీ యందు.

5. కొన్ని ఇకారాంతములగు తెనుఁగు శబ్దములమీఁద నచ్చు మగు నప్పుడు సంధి వైకల్పికముగా నగును.

ఓటమి + ఉను = (ఆది. I. 159)

ఓటమి + ఎడఁద = ఓడమెడఁద (అర. III. 63).

ఋకారసంధి

1. ఋకారము శబ్దమునకు పరమై యున్నప్పుడు సంధి కలుగదు. ఋషుల ఋణంబుల; వేల్పులుచున్న ఋషులన్ (ఆది. II. 137).

ద్రుతము

1. ద్రుతముమీఁది పరుషములకు సరళము లగును. అట్టిచోట ద్ర మునకు స్వత్వమైనను, బిందువైనను కలుగును; లేదా సంశ్లేషమైనను కలుగ

శరణన్నన్ + కాచుచు = శరణన్నఁ గాచుచు (ఆది. I. 7).

దవ్వుగన్ + చోపి = దవ్వుగఁ జోపి (ఆది. I. 5).

విభూతిన్ + తనరఁజేయుచు = విభూతిఁ దనరఁజేయుచు (ఆది. I. 7.)
ప్రీతిన్ + పెంచుచు = ప్రీతిఁ బెంచుచు (ఆది. I. 7.)
సంపదలును + కావించు = సంపదలును గావించు (ఆది. I. 33.)
వినన్ + పొలుచు = వినంబొలుచు (ఆది. I. 45.)

2. కెమ్, చెమ్, కన్, మొదలగు నకార మకార పొల్లు లంతమందు గల శబ్దములపై పరుషములు వచ్చినప్పుడు ద్రుతముమీఁదవలె సరళాదేశము వచ్చును (కెమ్, చెమ్, అనునవి శోణార్థకములు); కెందమ్మిరేకులవలనన్ (ఆది. IV. 76.)

3. ద్రుత ప్రకృతికములకంటె సరళస్థిరవర్ణములు పరములైనపుడు వాని ద్రుతమునకు వైకల్పికముగా లోపముగాని, స్వత్వముగాని, దానిమీఁది ఉత్వమునకు లోపముగాని కలుగును:—

లోపము:—తత్త్వవిత్త్వమునన్ + దానగుణాభిరతిన్ = తత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ (ఆది. I. 6.)

స్వత్వము:—ఎన్నను + సర్వవేద = ఎన్నను సర్వవేద (ఆది. I. 19.)

ద్రుతముమీఁది ఉత్వలోపము:—దానగుణాభిరతిన్ + సమస్త=దానగుణాభిరతిన్ సమస్త (ఆది. I. 6.)

4. అచ్చు పరమైనప్పుడు ద్రుతమునకు లోపము కలుగదు. కొన్నిచోట్ల సంశ్లేషము కలుగును. ఈ సంశ్లేషము కొన్ని 'ను'కారాంతధాతువులపైఁ గూడ కలుగును.

ఆది. VII. 141, ఎన్నడున్ + ఏని = ఎన్నడున్నేని; S. I. I. IV. 672, సంఘమున్ + అరుదుగ = సంఘమున్నరుదుగ; ఆర. I. 321; కేతనంబులున్ + అతుల = కేతనంబులున్నతుల.

ఆర. I. 321. ధైర్యశక్తికిన్ + అరుదుగ = ధైర్యశక్తికి న్నరుదుగ.

(ఈ పాఠమును ముద్రాపకులు 'ధైర్యశక్తి కప్డరుదుగ' అని దిద్దినారు. తాళపత్రప్రతులయందెచ్చటను ఈ పాఠము కాన్పించదు. పూర్వలాక్షణికులు కొందఱు 'శక్తికిన్నరుదుగ' అను పాఠము నుదాహరించి యున్నారు.)

అను + అసుర = అన్నసుర (ఆది. II. 3); అను + ఇష్టసఖ = అన్నిష్టసఖ (ఆది. III. 140.)

అను + ఏటితరంగలన్ = అన్నేటితరంగలన్ (ఆది. VIII. 79.)

ఈ యుదాహరణములలో అను ధాతువులలోని 'ను'కారమున కుత్వలోపమును నకారమునకు ద్విత్వమును కలిగినది.

6. సమాసములందు ద్రుతమునకు లోపము కలుగును.

వింటన్ + నేర్పు = విల్లునేర్పు (ఆది. V. 206.)

7. ద్రుతముమీఁద 'మ'కారము పరమగునపుడు ద్రుతమునకు వైకల్పికముగా మకారమగును.

ఆది. V. 142. కమ్మని లతాంతములకు మ్మొనసి

అర. III. 143, చేసెమ్మహానదులున్

8. కొన్నియెడల ఉత్తమపురుష క్రియలమీఁది ద్రుతమునకు లోపము వచ్చును.

అర. IV. 121 దుఃఖితుఁడన్ + ఐతిన్ = దుఃఖితుఁడైతిన్.

9. ద్రుతాంతములుకాని కొన్ని క్రియాపదములమీఁదను ఒక్కొకచో ద్రుతము కానవచ్చుచున్నది.

ఆది. VII. 2246, అయ్యేదము + అని = అయ్యేదమునని.

10. కొన్నియెడల ద్రుతముమీఁద నకారము కనఁబడును. అదియునుంగాక (ఆది. I. 13.)

ఉద్యానవనంబునుంబోలె; నాటకప్రయోగంబునుంబోలె(ఆది.II.27.)

11. ఇఁకాదులకుతప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు.

ఇంక + ఏల = ఇంకేల (ఆది. II. 21.)

12. వాక్యావసానమునందు ద్రుతము వైకల్పికముగా లోపించును.

గ స డ ద వా దే శ ము

ఈ క్రింది సందర్భములందు క, చ, ట, త, ప, లకు వరుసగా గ, స, డ, ద, వలు ఆదేశము లగును.

(i) నేను, తాను, శబ్దములుతప్ప తక్కిన ప్రథమావిభక్తియందున్న తెనుఁగు మీఁది తెనుఁగు శబ్దములకేకాక తెనుఁగుమీఁద సంస్కృతము వచ్చినను, సంస్కృతముమీఁద తెనుఁగువచ్చినను, సంస్కృతముమీఁద సంస్కృతము వచ్చినను గూడ ఈ గ, స, డ, ద, వ, ఆదేశము వచ్చును.

(అ) తెనుఁగుమీఁద తెనుఁగు:

ఉప్పు + పొలము = ఉప్పువొలము (S. I. I. IV. 1175)

ఎడ + పొలము = ఎడవొలము (S. I. I. IV. 662)

వెణ్ణి + కట్టిన = వెణ్ణిగట్టిన (S. I. I. IV. 1802)

తమ్ముణ్ణు + పోలణ్ణు = తమ్ముణ్ణు వోలణ్ణు (S. I. I. IV. 1061).

డాకరేమి + పాల్కొలను=డాకరేమివాల్కొలను (S. I. I. IV. 749);
అసము + పెరుగన్ = అసముపెరుగన్ (S. I. I. IV. 1007);
కడువలు + పెట్టు = కడువలువెట్టు (S. I. I. IV. 1248);
వెరసినవారు + పూంటంగాన్ = వెరసినవారు వూంటంగాన్ (S. I. I. IV. 1302)
మాడలు + పెట్టె = మాడలువెట్టె (S. I. I. V. 1105);
తూములు + పదిన్ని = తూములువదిన్ని (S. I. I. V. 1052)
(ఆ) తెనుఁగుమీఁద సంస్కృతము:
మండండు విృయంబునన్ (S. I. I. IV. 672);
తమ్ముండు+ప్రతాపమున=తమ్ముండు వ్రతాపమున (కోణిదెనశాసనము)
ఆరియ + పట్టనమున = ఆరియవట్టనమున (S. I. I. IV. 1364)
వెన్నమ + ప్రకాశముగాన్ = వెన్నమవ్రకాశముగాన్ (S. I. I. IV. 666);
అందు + ప్రసిద్ధిగన్ = (S I. I. IV. 672);
రట్టడికము వ్రతిగ్రహించి (S. I. I. IV. 1186);
(ఇ) సంస్కృతమీఁద తెనుఁగు:
అమృతాంశుండు వయఃపయోధి (S. I. I. IV. 677)
శ్రీలోలుండు + పడాలుకాటనికి = శ్రీలోలుండు వడాలుకాటనికి (S. I. I. IV. 666);
కాంత్త + తాన్ = కాంత్తచా [నరుదగుచుండ] (S. I. I. IV.)
జగజ్జిగీషుండు + పేమ్మిఁని = జగజ్జిగీషుండు వేమ్మిఁని (S. I. I. IV. 675)
మహీపాలుణ్డు + పుట్టేఁ = మహీపాలుణ్డు వుట్టేఁ (S. I. I. IV. 677)
వీరవ్రతుండు + పడిహారి = వీరవ్రతుండు వడిహారి (S. I. I IV. 915)
మందగమన + తొల్లి = మందగమనదొల్లి (S. I. I. IV. 1007)
గురువు + తల్లియ = గురువుదల్లియ (ఆది. VII. 252)
(ఈ) సంస్కృతముమీఁద సంస్కృతము:
చంద్రుణ్డు గులనిస్తారకుణ్డు (S. I. I. IV. 677); విస్తరణపట్టము (S. I. I. IV. 675);
ముల్లోకవిభుండు + చక్రి = ముల్లోక విభుండు సక్రి.

అమ్రితాంశుండు + పయఃపయోధి = అమ్రితాంశుండు వయఃపయోధి (S. I. I. IV. 677)

పవిత్ర చరిత్రుండు + పాత్రుండు = పవిత్రచరిత్రుండు వాత్రుండు (S. I. I. IV. 1169.)

ధారుణి + పాలింతె = ధారుణివాలింతె (సభా. I. 15)

వదాన్యత + ప్రస్ఫురించె = వదాన్యతవ్రస్ఫురించె (S. I. I. IV. 675)

(ii) అందు, ఇందు, ఎందు, అట, ఇట, ఎట, అటు, ఇటు, ఎటు, అట్లు, ఇట్లు, ఎట్లు, అంత, ఇంత, ఎంత, అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు, ఎన్నడు, ఏమి, పెద్ద, ఒప్పు, తెల్ల, నల్ల, నెఱి, కల, మొదలయిన శబ్దముల మీఁదను గ, స, డ, ద, వా దేశము వచ్చును.

ఆర. VII. 221 అంత + కూడు = అంతగూడు.

ఆర. I. 389. దుర్బుద్ధియని యేమిసెప్ప వలయు.

ఆది. VII. 4. ఏమిగారణంబున నయోనిజయయ్యె.

ఆది. VI. 45. పెద్దగాలంబు.

S. I. I. IV. 672. 929. 930. కలయంత్త + కాలమును=కలయంత్త గాలమును.

ఆది. IV. 167. ఆది. VII. 209, సభా. II. 150. ఒప్పుగొనుము.

ఆది. VII. 73. నెఱిగురులు.

ఆది. VII. 254. కలదెఱంగు.

(iii) ద్వంద్వసమాసమందు:

తల్లి + తండ్రి = తల్లిదండ్రులు (ఆది. VI. 45, 233, ఆది. II. 49; S. I. I. IV, 674, 676, 688, 991, మొ.)

(iv) సంఖ్యావాచకములమీఁద:

ఆది. IV. 227, అరుగు మొందుగడకు. ఏనువ్రుట్లు (S. I. I. IV. 1323 S. I. I. V. 1342) రెణ్డుగట్టిన (S. I. I. IV. 1190); పదియేనువ్రుట్లు (S. I. I. IV. 1314); పదివ్రుట్లు S. I. I. IV. 1255); నాలుగువ్రొంకలు (S. I. I. IV. 939); మూణ్డువ్రుట్లు (S. I. I. IV. 1133) S. I. I. V. 1176 ఇరువ్రుట్టి S. I. I. IV. 103 1347; ఎనిమిదివ్రుట్లు (S. I. I. V. 1014)

(v) కొన్ని క్రియాపదములమీఁద:

వరియింత్తురు + కోరి = వరియింత్తురుగోరి (S. I. I. IV. 649)

సమకట్టరు + కా = సముకట్టరుగా (అర. I. 97)

ఎక్కడఁబోయిరి + చెప్పుము = ఎక్కడఁబోయిరి సెప్పుము. (అర. III. 245)

(vi) కొన్ని ధాతువులపై ఉపధాతువులు చేరునప్పుడు ఉపధాతువుల ఆది యందుండు పరుషములకు బహుళముగా గసడదవ లగును:

అరుగుదెంచు, ఏఁగుదెంచు, ఒప్పుగొను మొద. పఱతెంచు, నడ తెంచు, వీతెంచు, తోతెంచు మొదలగువానియందు గసడదవాదేశము రాదు.

ఆది. IV. 167 ఒప్పుగొనుము వీని నుర్వీశయని సుతునిచ్చి గంగసనిన.
ఆది. VII. 209 ఈ భిక్షు నొప్పుగొనుము.
సభా. I. 150 వీనినొప్పుగొనుము.

గసడదవాదేశము రానిచోట్లు.

(i) ఏవార్థక 'అ' కారముపైని (ii) ప్రశ్నార్థకములపైని, (iii) ఆశ్చర్యార్థకములపైని (iv) శేషషష్ఠీరూపములపైని (v) క్త్వార్థములపైని (vi) క్రియాజన్య విశేషములపైని (vii) తోడ్కొని, కొల్పడి, మొదలగు కొన్ని ధాతువులలోను గసడదవాదేశము కలుగదు.

ఆమ్రేడితము.

I. అచ్చున కామ్రేడితంబు పరమగునపుడు సంధియగును 'ఏమి' ఏమ్యాదులలో చేరుటచేతను, 'ఏఁగి' మొదలగునవి క్త్వార్థకము లగుటచేతను ఇట్టిచోట్ల సంధిలేదు.

ఉదా: అహ + అహ = అహహ (ఆది. VI. 89); ఎట్టు + ఎట్టు = ఎట్టెట్టు (అర. I. 116)

2. ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబగు. ఇంచుక, నాఁడు, ఇత్యాదులయందు అంతిమాక్షరలోపము లేదు.

ఇంచుక + ఇంచుక = ఇంచుకించుక.

మ్రానికిన్ + మ్రానికిన్ = మ్రానిమ్రానికిన్ (అర. II. 94)
మఱునాఁడు + నాఁటికిన్ = మఱునాఁడు నాఁటికిన్ (ఆది. VIII. 183)
నాఁటికిన్ + నాఁటికిన్ = నాఁటినాఁటికిన్ (ఆది. VIII. 183)
ఏఁటఁ + ఏఁటఁ = ఏఁటేఁటఁ (ఆది. III. 24; సభా. I. 152)

(3) ఆమ్రేడితంబు పరమగునపుడు మధ్యమ ముదుజ్జులకు లోపము విభాషనగును.

ఏయకుము + ఏయకుము = ఏయకేయకుము, ఏయకుమేయకుము.
పోవకుము + పోవకుము = పోవకుపోవకుము (ఆర. IV. 19.)

ద్విరుక్త 'ట' కారము.

(1) తెనుఁగునందుగాని తత్సంబంధములగు ఇతర ద్రావిడపదములందు గాని, అంతమందు శకటరేఫమో, శకటరేఫ ద్విత్వమో ఉన్నప్పుడు, అది మఱియొక విశేష్యమునకు విశేషణముగా నిలిచి సమసించినయెడల, ద్రావిడ భాషా సంప్రదాయము ప్రకారము 'ట్ర' గను, 'ట్ట' గను మాఱును. ఇట్లే క, ట, త, ప, అనువర్ణము లంతమందుగల శబ్దములు విశేషణములయి సమసించినప్పుడు ద్విత్వమును పొందుట ద్రావిడభాషా సంప్రదాయము. గ, డ, ద, బ, లు అంతమందుగల ద్రావిడపదములు విశేషణములుగ సమసించి నిలిచినప్పుడు పరుషములయి ద్విత్వమును పొందును. ఈ సంప్రదాయము ననుసరించియే ఈ క్రింది సంధిరూపము లేర్పడినవి:—

సభా. II. 97, కట్టెదురన్ = కడు + ఎదురన్.
ఆర. II. 132, నిట్టూర్పులు = నిడు + ఊర్పులు.

ఎట్టయెదుర = ఏఱ్ (తమిళము, కన్నడము, మళయాళము = లేచు, ఎదురుగానిలుచు) ఏఱ్ఱ, ఏట్ర, ఏట్ట, ఎట్ట + ఎదుర.
సభా. II. 299, పట్టపగల = (ఏ)

(2) సమసింపనప్పుడు ద్విరుక్త 'ట' కారము రాదు:
సభా, I. 122, కడునధికుతోడఁ దొడరినఁ బొడిచిన నొడిచినను ...
ఆర. II. 108, కడునెండ యెక్కునంతకు నుడుగక యచ్చనుప నడచి ...
ఆది. I. 84, కడున్ + అకరుణాన్వితులు = కడు నకరుణాన్వితులు.

(3) కర్మధారయమునందు పేర్వాదిశబ్దముల కచ్చుపరమగునపుడు 'టు' గాగమము వైకల్పికముగా నగును:

పేరు + ఉరము = పేరురము.

ఉప్పు + పల్లి = ఉప్పుటుంబల్లి (S. I. I. IV. 672).

ఇతరసంధులు.

(1) పేబాదిశబ్దముల కాలుశబ్దము పరమయినప్పుడు కర్మధారయము నందు రుగాగమమగును. ఈ 'రు' గాగమము ద్రావిడభాషలలోని బహువచన ప్రత్యయమయిన రేఫముకాని, శబ్దము నేకవచనమందుండిన రేఫముగాని అయియుండును:

'పేద' దీనికి కన్నడమునందును ప్రాచీనాంధ్రము నందును 'పేదరు' అనునది బహువచనరూపము. దీనికి షష్ఠియందు 'పేదర' అని యగును. పేదర + ఆలు = పేదరాలు. ఇట్లే ముద్దరాలు = ముగ్ధ + రు = (బహువచన ప్రత్యయము (ముద్ద + రు = ముద్దరు, షష్ఠియందు ముద్దర + ఆలు = ముద్ద రాలు; గొఱ్ఱాలు (S. I. I. V. 1059)

(2) క్రొత్త శబ్దము నాద్యక్షర శేషముమీఁది హల్లునకు ద్విత్వంబగు: క్రొత్త + ముడులు = క్రొమ్ముడులు.

(3) సమాసమందు కొన్ని శబ్దముల తొలియచ్చుమీఁది వర్ణములకెల్ల లోపము బహుళముగానగును. లుప్తశేషముమీఁది వర్ణమునకు ద్విత్వమగును. అది దీర్ఘమైనచో హ్రస్వమును కలుగును:

మూఁడు + మడుఁగు = ముమ్మడుఁగు (ఆది. I. 80)
నెఱ + వగ = నెవ్వగ (ఆది. VIII. 59)
నెఱ + వడి = నెవ్వడి (ఆది. VI. 81)
రెండు + నెలలు = రెన్నెలలు (ఆర. III. 56)
రెండు + నాళ్లు = రెన్నాళ్లు (ఆది. I. 68)
మూఁడు + నూఱు = మున్నూఱు (ఆది. I, 71)
మూఁడు + అలి + కుట్టు = ముయ్యలికుట్టు (S. I. I. IV. 1217)
నాలుగు + నూఱు = నన్నూఱు (సభా. II. 113)
తొమ్మిది + పది = తొంబది (ఆర. II. 174)
ఇరు + నూఱు = ఇన్నూఱు (ఆది. I. 71)
ఎనిమిది + నూట = ఎనమన్నూట (ఆది. I. 44)
తొమ్మిది + నూట = తొమ్మన్నూట (ఆది. I. 42)

(ఇర్ + నెలలు=(ఇర్ నెలలు) రెన్నెలలు; ఇర్+నాళ్లు=రెన్నాళ్లు; నెఱ్ + వగ = నెఱ్వగ (నెవ్వగ); నెఱ్ + వడి = నెఱ్వడి (నెవ్వడి), నల్ + నూఱు = నల్నూఱు (నన్నూఱు) (Assimilation); మూ + మడుగు = ముమ్మడుగు, మూ + ఏడు = ముయ్యేడు అని శబ్దశాస్త్రప్రకారము చెప్పవలసియుండును.

ఎనిమిది, తొమ్మిది అనువానికి ఎనమ, (తొంబ) తొమ్మ అనునవి ప్రాతిపదికములు. వీనిలో ఆద్యక్షరేతరములకు లోపమురాదు. ఎనమ తొంబ అను నవి ప్రాతిపదికములు కావుననే ఎనమండ్రు, తొంబండ్రు, తొంబది, అను రూపములు సిద్ధించినవి.

(4) కర్మధారయమందు మువర్ణమునకు పుంపులువచ్చును:
ఆది. IV. 221, బలితంపురక్కసు.

ఆది. VII. 260 విరుద్ధంపువరము.

ఆర. I. 49, వీనిపుట్టిన పాపంపువేళ.

ఆర. III. 300, పరుసంపురాలవై.

పై యుదాహరణములలో 'బలితంపురక్కను' అనుటకు 'బలియుఁడౌ రక్కను' అనియును, 'పాపంపువేళ' అనుటకు 'పాపంబువేళ' అనియును గౌతమీ గ్రంథాలయస్థ తాళపత్రప్రతులలో పాఠములు కాన్పించుచున్నవి. తక్కిన రెంటికిని 'విరుద్ధంబువరము' 'పరుసంబురాలవై' అని పుంపులురాని పాఠములు కాన్పించినచో కర్మధారయమునందే కాక ఏ సమాసమందును మువర్ణమునకు పుంపులురావని చెప్పవలసి వచ్చును.

(5) షష్ఠీసమాసమందు మువర్ణమునకు పుంపులు రావు:

ఆర. I. 34 తపంబు గౌరవంబు.

ఆర. II. 68 పుట్టంబు చెఱంగు.

ఆర. II. 209, తపము బలమునన్.

ఆర. III. 273, ఆశ్రమంబుదెసకు.

(6) తృతీయా సప్తమీ సమాసములందును మువర్ణమునకు పుంపులు రావు:

ఆర. III. 107, అంబురుహంబుసమంబు.

ఆర. I. 362, అమరలోకంబు వేశ్యలము.

(7) పరిమితిని తెలుపు ఎడు, ఎణ్డు, ఎందు అను ప్రత్యయములు పరమైనప్పుడు అన్ని యచ్చులకును సంధియగును:

మాన + ఎడు = మానెడు (S. I. I. IV. 667, S. I. I. V. 15, 16, 17, 18, 21, 22, 23.)

మాన + ఎణ్డు = మానెణ్డు (S. I. I. IV. 1008, 1051, 1128, S. I. I. V. 13, 63;)

మాన + ఎందు = మానెందు (S. I. IV. 945.)

అడ్డ + ఎందు = అడ్డెందు (S. I. I. I. IV. 667, 974.)

అడ్డ + ఎణ్డు = అడ్డెణ్డు (S. I. I. V. 19, 23.)

కుంచ్చ + ఎణ్డు = కుంచ్చెణ్డు (S. I. I. IV. 1323.)

సోల + ఎణ్డు = సోలెణ్డు (S. I. I. V. 66.)

'పతియుణ్డు' (S. I. I. IV. 1328) అనుచోట 'ఇయుణ్డు' అనునది పరిమితిని దెలుపుచున్నది.

(8) ఇంతకుముందు తెలిపిన స్థలములయందుతప్ప 'ఉ' కారవ్యతిరిక్తములైన అచ్చుల కచ్చుపరమగునపుడు సంధిరాదు:

ఇ. అలవి + ఎ = అలవియె (ఆది. IV. 106, ఆది. VII. 222, సభా. I. 61) అట్టి + అందు = అట్టియందు (సభా. II. 42)

ఈ. కుడువంబెట్టకుమీ + అని=కుడువంబెట్టకుమీయని (ఆది.V. 231.)

ఎ. కలరె + ఒరులు = కలరెయొరులు (ఆర. II. 3.)

ఏ. క్రాఁగిరే + అనుచున్ = క్రాఁగిరేయనుచున్ (ఆది. VI. 166)

ఐ. ఏకవస్త్రమై + ఓడన్ = ఏకవస్త్రమైయోడన్ (ఆది. III. 36.)

ఒ. కోపాగ్నియొక్కొ + అనుచును = కోపాగ్నియొక్కొ యనుచును (ఆది. I. 112.)

ఓ. కనకాద్రియొకో + ఇది = కనకాద్రియొకోయిది (ఆర. III. 343)

(9) ఆ, ఈ, ఏ, లపై ఇతరవర్ణము పరమైనప్పుడు వానికి హ్రస్వమును, హల్లునకు ద్విత్వమును, అచ్చు పరమైనయెడల ఆగమ యకారమునకు ద్విత్వమును వైకల్పికముగా వచ్చును.

ఆ + అయి = అయ్యయి (ఆది. VII. 226); అయ్యయి క్షత్త్రియకులంబులు (సభా. II. 2)

ఆ + కడన్ = అక్కడన్ (ఆది. V. 133)

ఆ + చోన = అచ్చోన (S. I. I. IV. 738)

ఈ + మహాభారతంబు = ఇమ్మహాభారతంబు (ఆది. I. 27)

(10) కర్మధారయసమాసమునందు 'తమ్ముఁడు' మొదలగు శబ్దములలోని విభక్తిప్రత్యయము వికల్పముగా లోపించును:

S. I. I. V. 1341, సితుంగాలమునకు.

S. I. I. IV. 1061, నాగదేవయ్య తమ్ముంబ్రోలయ.

,, ,, నాగార్జునుతమ్ముంబ్రోల్లడు.

,, 704, ఎఱ్ఱంజెఱువు.

,, 939; నానాదేసిం పెక్కండ్రు

,, 1255, ఉఱ్ఱుటుంబల్లి; ఆర. I. 300, చెంచుఁదలలు; ఆది. V. 26, పుట్టుఁగసచంబు; ఆది. IV. 23[illegible]ముఁజీకు.

(11) అందు, ఇందు, ఎందు,లకు 'ఉల' అను ఆగమము వచ్చును. ఆ 'ఉల' ఆగమముమీఁదనే షష్ఠీయందు కువర్ణము చేరును.

అందుల (ఆది. IV. 63, ఆది. VI. 235, 305 ఆది. VIII. 147)

అందులకు (ఆది. IV. 75, ఆది. VIII. 163)
ఉల అనునది 'లో'యొక్క పూర్వరూపము.

'అందులో' అనురూపము S. I. I. IV. 1102 లో కాన్పించుచున్నది.

ఇందుల (ఆది. VI. 128, 264, 282, S. I. I. IV. 991 - 996; 1017, S. I. I. V. 12, 15 - 19, 21 - 23, 1095, 1280, 1215, 1305, 1328, 1334 మొ.)

ఇందులకు (ఆర. III. 227)

ఇందులకు (ఆది. II. 76, ఆది. III. 212, IV. 27, 230, ఆది. VI. 128, 186, ఆది. VII. 24, ఆది. VIII. 37, మొ.)

'ఇందుల' అనునది 'ఇక్కడి' అను ప్రదేశార్థకము. దానికి 'ఇహలోకమందలి' అనునర్థమును వచ్చినది. (ఆది. VI. 345)

ఎందుల (ఆది. VII. 2); ఎందులవాఁడవు (ఆది IV. 131. 146, 171, ఆది. VI. 191, ఆది. VII. 268); ఎందులవాఁడు (ఆర. I. 372); ఎందులకు (ఆది. V. 69, 217. ఆది. IV. 230)

అందులకు, ఇందులకు, ఎందులకు—అనువానికి ప్రదేశార్థమేకాని, అందుకొఱకు, ఇందుకొఱకు, ఎందుకొఱకు' అనునర్థముగాని, 'కారణమున' అను నర్థముగాని లేదు.

(12) మధ్యమపురుష మువర్ణమునకు హలవసానంబులు పరంబులగునపుడు వైకల్పికముగా లోపముకలుగును. ఇట్లే భూతభవిష్యదర్థములందు వచ్చు ఉత్తమ మధ్యమ పురుషైక వచనములందలి 'ని, వి, ను, వు' అను ప్రత్యయములకును హలవసానములే కాక, అచ్చులు పరములైనప్పుడును వైకల్పికముగా లోపముకలుగును.

భారతమునుండి ఉదాహరణములు:

మధ్యమపురుష మువర్ణము.

ఉండు, ఎఱుఁగు, ఒసఁగు, [illegible]డవు, కలిగింపు, కలుపు, కావింపు, కొను, చూపు, చెడకు, చెప్పకుండు, ఎన్ను, వెలుగింపు, పడయు.

మధ్యమపురుష 'వు' వర్ణము.

అగుదు, ఓపుదు, నిలుపుదు, నేర్తు, వలతు ...

### మధ్యమపురుష 'వి' వర్ణము.

అయితి, అంటి, అడిగితి, ఇచ్చితి, ఎఱుఁగించితి, ఒడిచితి, ఒడ్డితి, ఒన రించితి, ఓటువడితి, ఓర్చితి, కంటి, కడఁగితి, కఱచితి, కఱపితి; క్రొవ్వితి, చంపితి, చలిపితి, చూపితి, చెఱిచితి, చేకొంటి, చేసితి, తప్పితి, తాల్చితి, నించితి, పట్టువడితి, పట్టితి, పడితి, పలికితి, పుచ్చితి, పుట్టితి, పెంచితి, పెట్టితి, పోయితి, పోలితి, మంచితి, మఱచితి, మసలితి, వగచితి, వచ్చితి, వారించితి, వింటి, వెఱచితి ...

### ఉత్తమపురుష 'ను' వర్ణము.

అగుదు, అడిగెద, ఎఱుఁగుదు, చేయుదు, కాంతు, చేయుచుండుదు, చేసెద, చేసికొందు, నేర్తు, పంచెద ...

### ఉత్తమపురుష 'ని' వర్ణము.

అయితి, ఇచ్చితి, కఱపితి, చేసితి, పడితి, పలికితి ...

(13) వ్యతిరేక మధ్య మువర్ణమునకు లోప మెల్లయెడలను వైకల్పిక ముగా నగును.

ఏయకేయకుము, ఓడకు, చెడకు, పోవకుపోవకుము, పెట్టకుము.

వ్యతిరేక మధ్యమపురుషమునందు పై ఉదాహరణము లలోని 'ఏయ కుము, పోవకుము, పెట్టకుము' అనునవిమాత్రము 'కుము' తోఁ గాన్పించు చున్నవి. సాధారణముగా నన్నయ భారతమున వ్యతిరేకమధ్యమక్రియలు వ్యతిరేక క్త్వార్థకములపై 'ఉండుము' అనుక్రియను చేర్చుటవలననుపర్పడుచుండును.

ఏయకుండుము, ఓడకుండుము, చెప్పకుండుము, చేయకుండుము, పాయ కుండుము, పోవకుండుము; ముట్టకుండుము, వగవకుండుము, వెఱవకుండుము, ఇట్టిచోట్ల 'ము' వర్ణలోపము కలుగదు.

భూతార్థక క్రియాజన్య విశేషణముల 'ఇన' ప్రత్యయమందలి ఇకార మునకు లోపమును 'న' కారమునకు బదులు వెనుకవర్ణమునకు ద్విత్వ అకార ములును గలుగును.

ఆది. VI. చెడిన-చెడ్డ.

'చెడిన' మొదలగువానికి 'చెడ్డ' మొదలయినవి రూపాంతరము లనుట కంటె నా రూపములు రెండును వేర్వేఱు ప్రక్రియల ననుసరించి యేర్పడిన వనుట సమంజసము. చెడు, చెడిన; * చెట్టు; * చెట్ట, చెడ్డ, పడు, పడిన; * పట్టు, *పట్ట, పడ్డ, విడు, విడిన; *విట్టు, *విట్ట, విడ్డ; తగు, తగిన; తక్కు, తక్క, తగ్గ; అను, అనిన * అన్ను, అన్న; * ఉన్ను, ఉన్న; ఉండు, ఉండిన; కొను, కొనిన; * కొణ్ణు; * కొణ్ణ, కొన్న మొదలయినవి.

కొన్ని చోట్ల గకారమునకు వకారమగును.

(ఆది. II. 152,) ఏవలు, పవళుల్, (ఆది. IV. 213, 252,) తవిన, (ఆ
II. 230,) తవిలి, (ఆది. VII. 58,) ఉడివింపఁగనే.

"క్వచి ద్గకారో వః" అను నాంధ్రశబ్దచింతామణి సూత్రమున
'కొన్నియెడల గకారము వకారమగును' అను నర్థమునుబట్టి వకారమున
గకారమగుట సర్వసాధారణమనియు, గకారము క్వాచిత్కముగ వకారమ
టయుఁ గలదనియుఁ దెలిసికొనవచ్చును. వకారముతోడి రూపములు సా
రణముగఁ బ్రాచీనములు; గకారముతోడి వర్వాచీనములు. ఇరువురు,
వ్వురు, నలువురు, ఏవురు, అర్వురు, ఏడ్వురు; ఏవలు, ఏవడము మొదలగు
తొల్లింటిరూపములు; వీనిలోని 'వ' కారమునకుఁ గకారము తెసువాని క
మునఁ గలిగినది.

# VI. విభక్తిప్రకరణము.

## తత్సమవిభాగము.

### ప్రథమా విభక్తి

#### ఏకవచనము.

#### ప్రాతిపదికము.

#### అకారాంత పుంలింగములు.

1. సంస్కృతములోని అకారాంతపుంలింగ మహద్వాచకములకు ఉత్వముకలుగును:

ఆద్యః—ఆద్యు; విభవః—విభవు; నివహః—నివహు; రత్నాకరః—రత్నాకరు; నరేంద్రః—నరేంద్రు; దధీచః— దధీచు; మొ.

2. నన్నయకుఁ బూర్వకాలమున తక్కిన ద్రావిడభాషలయిందువలెనే తెనుఁగునందును ఈ ఉత్వము లేకుండఁగనే ప్రాతిపదిక మేర్పడియుండును. నన్నయకాలమున అత్వముతోను ఉత్వముతోనుకూడ ప్రాతిపదికములు కాన్పించుచున్నవి.

గరుడ—గరుడఁడు; దేవ—దేవణ్డు (S. I. I. IV. 762, 744, 771, 1258, S. I. I. V. 1015, దేవనిచేతన్ (S. I. I. IV. 1043); దేవని (S. I. I. IV. 1107; S. I. I; V. 1069)

సోమ—సోమని (S. I. I. IV. 1138); సోమణ్డు (S. I. I. IV. 749, 1169).

ఆయ్యణ - ఆయ్యణ్డు (S. I. I. IV. 1169); మాధవ-మాధవణ్డు (S. I. I. IV. 1169).

ఉపాధ్యాయల (S. I. I. IV. 1077, 1186); నాథ- నాథని S. I. I. V. 1056).

'బ్రాహ్మ' శబ్దముపై ఉత్వముకలుగదు; బ్రాహ్మలు, బ్రాహ్మలకు (S. I. I. IV. 1248).

(3) కొన్ని అకారాంత పుల్లింగ శబ్దముల అకారము మిగిలి దానిపై **డుతి** విభక్తిప్రత్యయము చేరదు.

దూత (అర. II. 34). అసురశబ్దమునకు రెండు రూపములును గలవు: ఉసుర (ఆది. I. 132); అసురులు (ఆది. II. 96).

(4) కొన్నిటిమీఁద ఉత్వమువచ్చి దానిపై విభక్తిప్రత్యయము చేరదు. (నన్నయభట్టు ఆది. I. 25).

(5) కొన్నిటిమీఁద ఉత్వమువచ్చి ప్రత్యయము చేరకుండుటయు, కొన్నియెడల చేరుటయుఁ గలదు.

మూర్ఖు (మూర్ఖవు. సభా. II. 204), వృద్ధు (అర. III. 248, సభా. II. అర. I. 208, 388), యూపు (ఆది. IV. 179, 222, ఆది. V. 236); రూపము (సమాసమందు) ఆది. VII. 235, 126); రూపంబున (సమాసమందు) (ఆది. VII. 270.)

సంస్కృత దీర్ఘాంత శబ్దములు.

(1) (అ) ఏకాక్షర దీర్ఘాంత శబ్దములకు హ్రస్వమురాదు:

శ్రీ (ఆది. VII. 72), శ్రీకి (ఆది. VII. 278), పాండవశ్రీ (సభా. II. 145), పాండవేయులశ్రీ (సభా. II. 185), రాజ్యశ్రీ (ఆది. I. 238).

(ఆ) అన్యదేశ్యములగు దీర్ఘాంత శబ్దముల తుది దీర్ఘమునకు హ్రస్వము రాదు:

గాడీలు (ఆది. VIII. 221), కాని 'గాడిదలు' 'గాడ్దలు' అని పాఠాంతరములు కాన్పించుచున్నవి.

(2) ఆకారాంత ఈకారాంత శబ్దముల తుది దీర్ఘమునకు హ్రస్వము వచ్చును.

ప్రజ (ఆది. I. 72); భాష (ఆది. I. 17); బాధ (ఆది. I. 105): క్షమ (అర. I. 217); గీత (ఆది. I. 32); గోష్ఠి (ఆది. I. 8); నది (ఆది. I. 132).

(3) ఊకారాంత శబ్దములు హ్రస్వములయి 'వు' వర్ణమును పొందును చమువు (ఆది. I. 80).

ఇకారాంత శబ్దములు.

(1) ఇకారాంత శబ్దముల తుదిఇకార మట్లేయుండి ప్రథమైక వచన ప్రత్యయములను పొందదు:

సంహతి, విభూతి, బుద్ధి (ఆది. I. 5); అభిరతి (ఆది. I. 6) మొద.

(2) కొన్ని ఇకారాంతశబ్దములు ఇయాంతములుగా కూడ కాన్పించును:

తరుణియలు (ఆది. VIII. 175); 'ఇయ' అంతమందుగల శబ్దములు సంస్కృతమందలి 'ఇక' అంతమందు గలవాని వికారములు: లంజియ=ఉంపుడు కత్తె (S. I. I. V. 1083, 1090).

ఈ ఇయాంత శబ్దములు 'ఎ' వర్ణాంతములుకూడ నయినవి:
గద్దె (ఆర. II. 345).
ఇట్లే కొన్ని అచ్ఛికశబ్దములు ఇయాంతములుగా నున్నవి:
లొట్టియల్ (సభా. I. 265) గద్దియల్ (ఆర. II. 344).
(3) 'భక్తి' శబ్దము 'భక్తు' అని కూడ కాన్పించుచున్నది:
భక్తుతోన్, భక్తునన్ (S. I. I. VI. 672).

ఉకారాంతములు.

(1) ఉకారాంత శబ్దముల తుది ఉత్వమట్లేయుండును. దానిపై ప్రథమైకవచన ప్రత్యయమును చేరును.

అనురూపప్రాంశున్ (ఆది. III. 3); ప్రభువు (ఆది. I. 2); క్రతువు. హేతువు; జరత్కారువు (ఆది. II. 127); రజ్జువు (ఆది. V. 215); ఋతువు (ఆది. I. 118).

(2) బహువచనమునఁ గొన్నియెడల నీ 'వు' వర్ణము లోపించును: గురులు, విష్ణులు మొ.

(3) కొన్నియెడల ఉకారాంత శబ్దములపై వు వర్ణము వికల్పముగా చేరును:

రాహు (సభా. II. 299); రాహువు (ఆది. III. 64).
(4) వసు, మను, శబ్దములు వుమంతములుకావు:
వసువు (ఆది. III. 66); మనువునకు (ఆది. III. 60).

(5) పాంసు, పూరు, ప్రాంశు, శంతను, శ్వేతకేతు, స్థాణు, శబ్దములకు మహత్తుసందు వువర్ణముగాదు:

స్థాణునకు (ఆది. III. 68); పూరుఁడు (ఆది. III. 199); పూరున్ (ఆది. III. 194, 195); శంతనుండు (ఆది. IV. 160); శ్వేతకేతుండు (ఆది. V. 89, 90); పాంసులన్ (ఆర. II. 24), ఒక్క కులపాంసనుచేసిన; అనురూపప్రాంశున్ (ఆది. III. 2).

(6) స్త్రీవాచకమగు జరత్కారు శబ్దమునకు ప్రథమయందు వువర్ణము చేరినను ప్రథమేతర విభక్తులందు మహత్తుసందువలె రూపములు వచ్చును:

జరత్కారువు (ఆది. II. 127); జరత్కారున్ నుదేయానుజన్.

(3) కొన్నియెడల అమహద్వాచకముల అకారమున కుత్వము వైకల్పికముగా వచ్చును:

శరణన్నన్ (ఆది. I. 7); శరణము (ఆర. I. 5); శరణంబు (ఆది. II. 44.)

(4) కొన్ని అకారాంత పుంలింగములు అమహద్వాచకము లైనప్పుడు వాని అత్వమున కుత్వమును దానిపై 'వు' వర్ణకమును వైకల్పికముగా వచ్చును:

ఉదా: నృపధర్మువుల్ (ఆది. V. 58); సర్వధరువులు (ఆది. IV. 218); అధర్మువు (ఆది. II. 33); అధర్మము (ఆది. III. 218); ధర్మము (ఆది. IV. 218); భణ్డారువు (S. I. I. 1114); క్షత్రియ ధర్మము (సభా. I. 194); ఖణ్డువు (S. I. I. IV. 1224).

(5) మహద్వాచక మిత్ర, పాత్ర, శబ్దముల అత్వమున కుత్వమువచ్చి డుఙ్డు చేరును. అమహద్వాచకములందువలె వీని అత్వముమీఁదనే 'ము' వర్ణముచేరుట నన్నయభారతములోఁ గానరాదు :

పాత్రుఁ (ఆది. I. 9); మిత్రులన్ (ఆది. II. 195); పాత్రునకు (ఆది. III. 23, 203); మిత్రున్ (ఆది. I. 22).

(6) అపత్యశబ్దముపై ము వర్ణమూత్రము చేరును: అపత్యంబు (ఆది. II. 142).

(7) కానన శబ్దముమీఁది తుదినకారము లోపించును: కానంగడచి (ఆది. III. 28).

(8) హంసశబ్దముపై విభక్తిప్రత్యయము చేరదు:

హంసల్, హంసల(ఆర. II. 12); హంసపిండు (ఆర. II. 16); కలహసం (ఆర. II. 18. 26.) కలహంసఁ (ఆర. II. 17.) హంస (ఆర. II. 17, 22);

(9) 'ఉరగ'శబ్దము బహువచనమున ఉరగములు, ఉరగులు అని రెండు రూపములును వచ్చును; ఏకవచనమున 'ఉరగము' అనియే ఉండును.

ఉరగంబులు (ఆది. II. 181); ఉరగములకు (ఆది. II. 35); ఉరగులు (ఆది. II. 43, 45. 51, 62).

ప్రథమేతర విభక్తుల ప్రతిపాదికము.

(1) ప్రథమావిభక్తియందు 'ఉ' కారము ప్రాతిపదికముగావచ్చు శబ్దముల షష్ఠియందు 'ని' వర్ణము వైకల్పికముగ వచ్చును. భీముని, భీము, మొద. ఈ రూపములే ప్రథమేతరవిభక్తి ప్రత్యయములు పరమగునపుడు ప్రాతిపదికములగును. ఉత్వవిశిష్టమయిన ప్రాతిపదికమునకు 'కు' వర్ణము

పరమైనప్పుడు 'న' గాగమమునువచ్చును. ఈ 'న' కారముమీఁది 'అ' కారము మాత్రమే షష్ఠినిబోధించునది. నకారము అంతకు పూర్వ మా శబ్దమున నున్నదే: భీమునికి, భీమునకు.

వాస్తవముగా 'భీముని' అనుదాని పూర్వరూపము 'భీమని' అనునది. ఇందలి ఇత్వము (ఊరు, ఊరి, యందువలెనే) ఉపవిభక్తి. 'భీమన' అనునది కన్నడములో షష్ఠిరూపము. దీని మీఁదనే 'కు' వర్ణము చేరును. భీమణ్డు, సోమణ్డు మొదలగు పూర్వరూపములు భీముణ్ణు, సోముణ్డు అని ప్రాతిపదికమునందు తరువాతి కాలమున ఉత్వవిశిష్టము లెట్లయ్యెనో అట్లే భీమన, సోమన మొదలయిన రూపములును భీమున,సోమున, అని మాఱినవి. ఈరూపములమీఁదనే 'కు' వర్ణముచేరినది. దీనిపై ఉపవిభక్తియైన ఇత్వము చేరినప్పుడు 'కు' వర్ణము 'కి'గా మాఱినది. అంతేకాని 'కి' వర్ణముచేరుట వలన 'న' కారమున కిత్వము రాలేదు.

బహువచనమునందుఁగూడ 'ల' మీఁది 'అ' కారము మాత్రము షష్ఠిని బోధించునది.

(2) ఆకారాంతశబ్దములు తత్సమములయి వానికి హ్రస్వము కలిగినప్పుడు ఆ ప్రాతిపదికములే షష్ఠీరూపములగును. వీనిమీఁదనే ప్రథమేతర విభక్తి ప్రత్యయములు చేరును.

(3) ఇకారాంత ఈకారాంత శబ్దముల ప్రథమైకవచనమందలి ప్రాతిపదికమే షష్ఠియందును నిలుచును. వీనిపై ప్రథమేతరవిభక్తి ప్రత్యయములు చేరును. హరికి, నదికి మొద.

(4) ఉకారాంతశబ్దముల ప్రథమయందలి ప్రాతిపదికములమీఁదగాని, ప్రథమైకవచన ప్రత్యయమగు 'వు' వర్ణముమీఁదవచ్చు నగాగమము మీఁదగాని, ప్రథమేతరవిభక్తి ప్రత్యయములుచేరును: ప్రభునకు, ప్రభువునకు.

(5) ఋకారాంతశబ్దముల ఋత్వముపోయి ప్రథమయం దత్వము కలుగునప్పుడు ఆ రూపములమీఁదను, ప్రథమయందలి ప్రాతిపదికము 'ఋ' కారాంతముగనే నిలచినప్పుడు దానిపైవచ్చు 'న' గాగమము మీఁదను, ప్రథమేతర విభక్తులు చేరును: విధాతకు, విధాతృనకు.

6. గోశబ్దము ప్రథమా రూపముమీఁదనే ప్రథమేతర విభక్తులు చేరును.

## సంస్కృత హలంతశబ్దములు.

(1) చకారాంత వాక్ శబ్దమునకు ప్రథమైక వచనరూపమగు 'వాక్' అనుదాని 'క్' ద్విత్వమును, ఉత్వమును పొందును. ద్విత్వమునకు లోపమును కలుగును:

(ఆది. III. 129; ఆది. VI. 129); వాకునకు; (ఆది. VIII. 41) వాకులు.

(2) జకారాంతములగు 'ఋత్విక్,' 'భుక్' శబ్దములు 'ఋత్విజ్,' 'భుజ్ అని జకారాంతములుగానేయుండి వానిపై ఉత్వముచేరుటవలన ప్రాతిపదిక మేర్పడును.

(సభా. II. 11) ఋత్విజుండు; (ఆది. II. 266,)ఋత్విజులను; (అర. II. 391) భిక్షాభుజులు (ఋత్విక్కు, భుక్కు అను రూపములు నన్నయభారతము లో లేవు.)

(3) (అ) తకారాంత 'జగత్' శబ్దముయొక్క 'త' కారము లోపించును:

(సభా. I. 50,) జగము; (ఆది. II. 44. 85, 109, 115, 117, 119) త్రిజగంబులు: (జగత్తు అను రూపము నన్నయభారతములో లేదు.)

(ఆ) మహద్వాచక తకారాంతములపై ఉత్వమువచ్చి ప్రాతిపదిక మేర్పడును:

పరీక్షితుండు (అది. II. 167 ఆది. IV. 112)

(4) (అ) దకారాంత 'ముత్' శబ్దములోని ప్రథమైక వచనాంతమగు తకారమునకు బదులు ద్ కారమును, నపుంసకలింగమగుటచేత దానిపై అకారమును వచ్చును:

(ఆది. I. 7, 23, ఆది. V. 104.) ముదంబు.

(ఆ) దకారంత 'సంపద్' శబ్దముపై అకారము మాత్రముచేరును:

(ఆది. I. 6) సంపదన్; (ఆది. I. 33) (ఆది. VI. 120) సంపదలు.

(5) (అ) 'అన్' అంతములగు నపుంసక వాచకములగు "జన్మన్, పర్వన్, కర్మన్, దామన్, ప్రేమన్, వర్త్మన్" అను శబ్దముల తుది 'న్' లోపించి శేషించిన దానిపై 'ము' వర్ణము చేరును:

(ఆది. I. 34, ఆది. V) జన్మంబు; (ఆది. 1. 47) పర్వము; (ఆది. V. 100) కర్మము; (ఆది. III. 119) కర్మములు; (ఆది. III. 155) పుష్ప దామములయు; (అది. IV. 53) ప్రేమంబు ('ప్రేమ' అని నన్నయలో కాన రాదు); (ఆది. VIII. 262) వర్త్మంబు.

(ఆ) 'అన్' అంత పురుషవాచకములగు మహాత్మన్, సుధన్వన్, మఘవన్, శబ్దముల తుది నకారమునకు లోపమును, శేషించిన తుది అకారమునకు ఉత్వమును వచ్చును:

(ఆర. II. 289) మహాత్ముఁడు, (ఆది. I. 95) మహాత్మునకు,(సభా. II. 249) సుధన్వుండు, (ఆర. I. 344) మఘవునాజ్ఞ.

(ఇ) కొన్ని 'అన్' అంత పురుషవాచకముల తుది'న్' మాత్రము లోపించి అట్లు లోపించిన అకారాంతరూపమే ప్రథమైక వచనరూపముగా నిలుచును:

(ఆది. I. 52, ఆది. III. 78) అశ్వత్థామ, (ఆది. I. 141, ఆది. III. 69) బ్రహ్మకు, (ఆర. IV. 94) బ్రహ్మ, (ఆది. III. 66) విశ్వకర్మ (ఆది. III. 79) కృతవర్మ, చిత్రవర్మ, చంద్రవర్మ.

(ఈ) 'శ్వన్' శబ్దముయొక్క సప్తమ్యేకవచన రూపము తెనుఁగున ప్రథమైకవచనరూప మగును. (ఆది. I. 83) శుని.

(ఉ) రాజన్ శబ్దము ప్రథమైక వచనమున 'రాజు' అగును:

(6) (అ) 'ఇన్' అంతములగు శబ్దముల 'న్' లోపించి మిగిలిన ఇకారాంతరూపము ప్రథమైకవచన రూపమగును:

(ఆది. I. 3) జయశాలి, (ఆది. I. 137) సాధు, (ఆది. I. 143 శుచి, (ఆది. I. 148) తపస్వి; (ఆది. II. 21) మంతులు, (ఆది. II. 33 కామచారులు, (ఆది. II. 81) అనిలవేగి, (ఆది. II. 104) దైత్యభేది; (ఆది III. 79) శిఖండి; (ఆది. IV. 264) పక్షులు; (ఆది. IV. 124) దీర్ఘదర్శి (ఆర. I. 46) గాండీవి.

(ఆ) 'అశ్విన్' శబ్దముయొక్క ద్వివచన రూపమగు 'అశ్వినౌ' అనది 'అశ్వినులు' అనియే యగును.

(ఆది. III. 83) అశ్వినులు.

(ఇ) 'సఖిన్' శబ్దము అకారాంతపుంలింగ శబ్దములవలె అత్వ ఉత్వములను పొందును:

(ఆది. I. 118, ఆర. IV. 138) సఖుఁడు.

(7) వకారాంత 'దివ్' శబ్దమునకు దివి, దివ, అను రెండును ప్రాతిపదికము లగును.

(ఆది. VIII. 273) దివిఁ, (ఆది. VII. 235) దివంబుననుండి, (ఆర. IV. దివంబునకు, 'దివమ్=పగలు' అనునది 'దివంబు' అనియే అగును, (ఆది. VI. 156) దివంబులు,

8. (అ) శకారాంత 'దిక్' శబ్దము తుది'క్' కారమునకు ద్విత్వమును, ఉత్వమును అగును.

(ఆది. I. 7, ఆర. IV. 37) దిక్కులన్; (ఆది. II. 13) దిక్కుల్; (ఆర. III. 373) దిక్కునకు.

(ఆ) 'దిశ' అనుశబ్దము స్త్రీలింగ 'దిశా' శబ్దమునకు తత్సమము.

(ఆది. VII. 244) దిశలు, (ఆర. IV. 14) దిశలును.

(9) (అ) సకారాంత పురుషవాచక శబ్దముల తుది సకారముపై ఉత్వముచేరి ప్రాతిపదిక మేర్పడును.

(ఆది. I. 21) ప్రచేతసు పుత్రు; (ఆది. I. 27) ఉగ్రశ్రవసుఁడు, (ఆది. VIII. 198) పృథుశ్రవసుఁడు, (ఆది. I. 87) సోమశ్రవసుఁ, (ఆది. III. 65) ఆంగిరసుఁడు.

(ఆ) 'దుర్వాసస్, పురూరవస్, శబ్దముల తుది సకారమునకు లోపమును, మిగిలినదాని తుది అకారమునకు ఉత్వమును కలుగును:

(ఆది. V. 17) దుర్వాసుఁడు, (ఆర. II. 285) పురూరవుఁడు.

(ఇ) సకారాంత నపుంసక వాచకముల తుది సకారమునకు లోపము కాఁగా మిగిలిన రూపములు ప్రాతిపదికము లగును. ఆ ప్రాతిపదికముల తుదిని అకారముండిన ము వర్ణమును, ఉకారముండిన వు వర్ణమును ప్రథమైన వచనమునఁ జేరును.

(ఆది. V. 256) శిరంబు, (ఆర. I. 285) నభము, (ఆది. II. 190, ఆర. I. 390) యశంబు, (ఆది. I. 100) మనంబు; (ఆది. II. 17) మనంబునకు. (ఆది. I. 149; ఆది. II. 139) తపము. (ఆది. II. 16) ఉచ్చైశ్శ్రవము. (ఆది. II. 21) వపము. (ఆది. III. 164) తేజము (ఆది. III. 181) తేజంబు. (ఆది. VIII. 77) తమము. (ఆది. VII. 176; ఆర. III. 205) ధనువు; (ఆది. III. 71) ఆయువు; (ఆది. III. 63) అనాయువు.

సమాసమందు 'రేతస్' శబ్దమునకు మహద్వాచక మగునప్పుడు రేతసుఁడు, రేతుఁడు, అని రెండురూపములు నగును. ఊర్ధ్వరేతసులైనన్ (ఆది. III. 59); ఊర్ధ్వరేతుఁడైన కణ్వమహాముని (ఆది. IV. 31).

(ఈ) 'అప్సరస్' శబ్దమునకు ప్రథమైక వచనమున 'అప్సరస' అని యగును.

(ఆది. III. 64) అప్సరసలు.

(ఉ) ఇకార పూర్వకమగు 'స్' అంతమందుగల శబ్దముల 'స్' కారము లోపింపఁగా మిగిలిన ఇకారాంత శబ్దములే ప్రథమైక పచనరూపము **లగును:**

(ఆది. II. 230) అర్చులు; (ఆది. III. 66) జ్యోతి.

(ఊ) 'ఉచ్చైస్' శబ్దములోని 'స్' లోపించి, దాని పూర్వమందున్న ఐత్వమునకు అత్వమువచ్చి ప్రాతిపదిక మేర్పడును:

(సభా. II. 198,) అత్యుచ్చము.

(10) ఇనునిజంతముల తుది 'న్' కారము లోపింపఁగా మిగిలిన రూపమే ప్రథమైక వచనరూపముగా నుండును:

(ఆది. I. 6, 49, ఆది. II. 86) మహిమన్;

(ఆది. III. 136) మహిమలు; (ఆది. I. 8) మహిమతో.

(11) (అ) మతుబంత ప్రత్యయములగు మత్, వత్, అనువాని 'త్' నకు పూర్వమందు అనునాసికముచేరి మంత్, వంత్, అని అగును. వీనిపై పురుషవాచకముల ప్రాతిపదికములకు ఉత్వమును, నపుంసక వాచకముల ప్రాతిపదికములకు అత్వమును వచ్చును:

(ఆది. II. 3) వీర్యవంతులన్; (ఆది. III. 79) వేగవంతుఁడు; (ఆది. III. 88) వివస్వంతుఁడు, వైవస్వంతుఁడు; (ఆది. VIII. 102) పుణ్యవంతుల, (ఆది. VIII. 125) భాగ్యవంతులు.

(ఆది. II. 125) హిమవంతంబులు.

(ఆది. III. 78) కేతుమంతుఁడు; (ఆది. III. 78, అర. IV. 20, 21). మణిమంతుఁడు;

(ఆది. IV. 68) బుద్ధిమంతులు; (ఆది. V. 226) మతిమంతుఁడు, (ఆది. VIII. 114) ధృతమంతులు; (అర. III. 319) హనుమంతున్; (అర. III. 320) హనుమంతుఁడు.

(ఆ) 'హనుమత్' శబ్దములోని 'త్' అను దానికి లోపముగలిగి మిగిలిన 'హనుమ' అను రూపముకూడ ప్రథమైకవచనరూప **మగును.**

**(అర. III. 314) హనుమ.**

## V. ఔపవిభక్తికములు.

1. పదునకొండవ శతాబ్దమున కానవచ్చు శబ్దములలో ఈ క్రిందివి ఔపవిభక్తికములుగా నున్నవి.

-ఇ.

ఆలు (సభా. II. 246,) ఆలిన్; (ఆది. VIII. 317.) ఆలికిన్.

ఊరు (S. I. I. IV. 939, 1015, 1016, 1098, 1255, S. I. I. V. 1029, 1277, 1342, ఊరి).

ఎక్కుడ (ఆది. II. 30, ఆది. III. 182; ఆది. IV. 33; ఆది. V. 223; ఆది. VII. 225; ఎక్కుడి.)

కటిక (ఆది. VI. 78, కటికినేలన్).

తెలిక (S. I. I. V. 1316, తెలికివేవురు).

కొలను (ఆది. VI. 219; ఆర. III. 366; S. I. I. IV. 762, 1158; కొలని).

కోడలు (ఆది. IV. 250, 256, ఆది. VI. 228; ఆది. VIII. 54; సభా. II. 292; ఆర. III. 262; కోడలిన్; ఆది. VIII. 4; సభా. II. 264; కోడలి).

క్రింద (ద. ఇం. శా. V. 1113, 1274; క్రింది; ఆది. II. 58; క్రిందికి) క్రిందటికి అను రూపమర్వాచీనము.

చల్లన (ఆది. IV. 22. చల్లని).

ఎఱ్ఱన (అర. III. 106. ఎఱ్ఱని).

తెల్లన (ఆది. II. 33. తెల్లని).

నల్లన (ఆది. II. 196. నల్లని).

మెత్తన (ఆది. VII. 98. మెత్తని).

చెలియలు (ఆది. III. 15. ఆది. V. 17, 209, చెలియలిన్).

చోటు (ఆది. IV. 125; ఆది. VI. 122; ఆది. VII. 279; ఆర. II. 139, S. I. I. IV. 1133; చోటికిన్).

తుద (ఆది. VI. 156; తుదిదాఁక).

తోడు (ఆది. I. 60; ఆది. VII. 60; ఆది. VIII. 223; సభా. II. 70; ఆర. III. 298; S. I. I. IV. 1209, 1210; తోడి).

నీరు (S. I. I. IV. 685, 687; నీరినేల; ఆది. V. 170, 260, 262; నీరిలోఁ; ఆది. V. 211. నీరిలోనఁ; అర. III. 182; నీరిలోనుండి; ఆది. V. 177; నీరిలోననుండి).

(ఆది. III. 200;) నీటిలోఁ, (ఆది. IV. 149); నీటిలోనఁ, అని ముద్రితపాఠములు కనఁబడుచున్నను, 'నీర' అనియే చాల ప్రయోగము లుండుటచేతను, చాల వ్రాఁతప్రతులలో 'నీరి' అని ఉండుటచేతను ఆనాఁటి శాసనములలో 'నీటి' అని ఉండక 'నీరి' అనియే ఉండుటచేతను, 'నీరి' అనునదియే ఆ కాలమున నుండెడిదనియు, 'నీటి' అనునది తరువాతి రూపమనియు అనుకోనవచ్చును.

పోరు (ఆది. VII. 200; ఆది. VIII. 205; సభా. I. 65; పోరిలోఁ; సభా. I. 244; పోరిలోనఁ).

ప్రోలు (ఆది. I. 116; ఆది. VI. 264, 292; ప్రోలికిఁ); కాని (చూ. అర, IV. 80) ప్రోలును.

మఱుఁదలు (ఆది. VIII. 208; మఱుఁదలిఁ).

మీఁదు (S. I. I. IV. 808, 1014, 1133, 1267; మీఁది; ఆది. II. 9; ఆది. III. 13, ఆది. VI. 86; సభా. II. 208 మీఁదిది); 'మీఁదటి' అను రూప మర్వాచీనము.

మ్రాను (సభా. II. 144; అర. III. 135; మ్రానిఁ; ఆది. V. 254; మ్రానిని; సభా. II. 144; మ్రాని; అర. II. 94; మ్రాని మ్రానికిఁ; ఆది. VII. 276; మ్రన్మ్రానిపాటఁ).

మొదలు (ఆది. III. 119; సభా II. 144; మొదలి).

వలను (ఆది. III. 139; అర. III. 106; వలనికి).

వెలు (అర. I. 153; అర. II. 65; వెలిఁ).

పాలు = భాగము (S. I. I. IV. 97 పాలి).

-టి.

అప్పుడు (అర. III. 263; S. I. I. IV. 1323 అప్పటికి).

ఎప్పుడు (ఆది. IV. 253; ఆది. V. 107; ఆది. VI. 228, 292, ఆది. VIII. 64; అర. I. 71; అర. III. 345 ఎప్పటి).

జేపు (S. I. I. IV. 1176; A. 1323; S. I. I. V. 66 జేపటి).

అప్పుడు, ఎప్పుడు, అనువాని ఔపవిభక్తిక రూపములందు 'ప్పు' మీఁది ఉత్వమున కత్వము వచ్చును.

ఆఁకలి (ఆది. V. 183; ఆది. VI. 291; ఆఁకటి)

ఏఁడు (S. I. I. IV. 1300; ఏణ్టి)

ఏఱు (ఆది. IV. 44 ఏటి)

కుఱుంగలి (అర. III. 311, 373; ఆది, VII. 156; కుఱుంగటన్)

కూడు (ఆది. VII. 256 కూటిలోనన్)

తక్కు (ఆది. V. 79 తక్కటి)

నాఁడు రోజు, దేశము (ఆది. I. 52; ఆది. VI. 266; అర. I. 10; S. I. I. IV. 1015; నాఁటి)

నేఁడు (ఆది. V. 158; ఆది. VII. 24; నేఁటికిన్; S. I. I. IV. 1011-14; S. I. I. V. 63; నేఁటి)

పాడు = పరిమితి (ఆది. IV. 101; ఆది. VII. 43 పాటి)

పాడు = గ్రామము (S. I. I. V. 21-19, 21-23; సానియం బాటి)

నిన్న (ఆది. VIII. 118. నిన్నటఁగోలె)

మానెండు (S. I. I. V. 66; మానెంటికి)

మొదలు (సభా. II. 202; మొదలిటి)

పిడికిలి (ఆది. VI. 292; అర. III. 396; పిడికిటన్)

లేడి (ఆది. VI. 58; లేటికడుపునన్)

తొల్లి (ఆది. II. 14; తొల్లిటికంటెన్)

-ంటి.

ఇల్లు (ఆది. VIII. 115; ఇంటివలన; ఆది. III. 39, 110; ఇంటికిన్; ఆది. VI. 159, 277; ఇంటి; ఆది. VII. 254; ఇంటిలోనికి)

తలుసలి (సభా. II. 228; తలుసంటి)

తొల్లి (ఆది. III. 114; ఆది. V. 125; తొల్లింటి; ఆది. I. 150, తొల్లింటికంటెన్; ఆది. II. 118, ఆది. III. 87; ఆది. VI. 127; ఆది. VII. 266; అర. IV. 8 తొంటి); -'తొల్లి' అనునదియే 'తొల్'కు ఔపవిభక్తిక రూపమైయుండవచ్చును. ఈ 'తొల్' పై 'టి' చేరఁగా లకారము నకారముగా మాఱినది యనియైనఁ జెప్పవచ్చును.

11. పదునకొండవశతాబ్దమున కొన్నిశబ్దములు అనౌపవిభక్తికములుగానే యుండి తరువాతికాలమున ఔపవిభక్తికము లయినవి.

ఎదురు (ఆది. V. 215, ఆది. VII. 111, ఆది. VIII. 215, సభా. I. 178, సభా. II. 63, అర. IV. 96), ఎదురన్ (ఆది. I. 93, 101, ఆది. IV. 123, ఆది. VI. 63, ఆది. VII. 162, 198, అర. I. 107, అర. II. 56, అర. IV. 111); ఎదురను (అర. II. 169) (ఎదుటి అను రూపము 11-వ శతాబ్దమున లేదు).

పొద్దునకు (ఆది. III. 118, అర. I. 167, 192) పొద్దుటికి అను రూపము లేదు.

బయలన్ (ఆది. III, 41, ఆది. IV. 42) బయటన్, బయటి, అను రూపములు లేవు.

మన్ననన్ (ఆది. V. 236), మంటన్, మంటి, అను రూపములులేవు. (అర. I. 24), సీరన్; (సభా. II. 67), మొదలన్.

12. 'ముందటు' అను దానిలోని 'దటు' అనునది 'దల్, తల్' అను దాని రూపాంతరము. ఎట్లయినను దానిపై ఔపవిభక్తిక ఇకారము చేరి అకారమునకు ద్విత్వముకలిగి డ్టి, ట్రి, ట్టి, టియగి మారును. భారతమున ముందఱన్, ముందటన్ అను రెండురూపములును గలవు.

ముందఱన్ (ఆది. I. 132; ఆది. II. 18, 117, 143, 230; ఆది. III. 45; ఆది. VI. 69, 121, 153, 159, 187, 194, 247, 293; ఆది. VII. 36; 239, 270; ఆది. VIII. 211, 238, 287; సభా. I. 54; సభా. II. 284, అర. I. 181, 394; అర. II. 58; అర. III. 128, 241, 289, 305 మొద.).

ముందటన్ (ఆది. IV. 14, 20, 40, 163, 238; ఆది. V. 145; ఆది. VI. 183, 219, 292; ఆది. VII. 271; ఆది. VIII. 10; సభా. II. 97, 194; అర. I. 199, 300, 307, 340; అర. II. 66, 95; అర. III. 101, 217, 310, 313; అర. IV. 7, 52, 78, 115 మొద.).

ముందటి (S. I. I. V. 65)

13. 'పాడి'—ఇది 'పాల్గు' యొక్క ఔపవిభక్తికరూపము. 'ర, ల'లు డకారముగా మాఱుటయు కలదు. (ఎంగిలి) ఎంగిడి, ఎంగిడ్లు (మొసలి) మొసడి, మొసడుల్ (ఆది. VIII. 148); (సీరు) సిడు (సిడ్లు S. I. I. IV. 1015); (ఊరు) ఊడు (కోట ఊడ్లలోని Ep. coll 360 of 1915); (ఒరులు) ఒడ్లు (ఆది. VI. 277).

పై రీతిగనే 'పాలు' అనుశబ్దమునకు 'పాఁడు' అనునది రూపాంతరమై ఉండవచ్చును. కోఁదు భాషలో 'పాడు, పాజు' అనురూపములు గలవు. దీనిపై ఉపవిభక్తిలయిన ఇత్వము చేరఁగా 'పాఁడి' అని ఏర్పడినది. ఈ ఔపవిభక్తిక రూపమే ప్రథమైక వచనముగను కుదురుకొన్నది.

14. 'ఏమి' అనుదానికి 'ఏమ్' అనునది హళగన్నడమున పూర్వ రూపము. దానిపై 'టి' చేరఁగా 'ఏంటి' అయినది. అందుచేత 'ఏఁటి' అను నది పూర్వరూపము, ఏమిటి, అనునది తరువాతిరూపము. ఈ రెండును నన్నయగ్రంథమున నున్నవి.

ఏఁటికి (ఆది. III. 5, ఆది. VIII. 298; సభా. II. 92, 133. 180; ఆర. I. 290, 294)

ఏమిటికి (ఆది. V. III. 34; సభా. II. 67, ఆర. I. 137)

ఇట్లే 'తొంటి' పూర్వరూపము; తొల్లిటికంటెఁ (ఆది. II. 14)

15. బోఁటి—ఇదియు ఔపవిభక్తికరూపమే. 'పోల్' అను దానిపై 'టి' వర్ణము చేరునప్పుడు 'ల్' ఁ గామాఱి పోఁ + టి = పోంటి అని ఏర్పడినది. ఇచట 'బో' అనునది ఆదేశము గావచ్చిన సరళము. తప్పు కత్తి రింపువలన అది మిగిలినది. చూ. (చెలయు) సెలయు; (చుమ్మ) సుమ్ము; (చాఁగు) సాఁగు; (చీరాడు) జీరాడు; (చెన) జెన; (చెముడు) జెముడు; (చొల్లు) జొల్లు మొదలయినవికూడ ఈ తప్పు కత్తిరింపువలనఁ గలిగినవే.

16. 'మగంటిమి' లోని 'ంటి' కూడ ఉపవిభక్తియే. ఇది 'మగఁ' శబ్దముపై 'టి' చేరుటవలన కలిగినది. 'మి' అనునది విశేష్యములకువచ్చు నొక ప్రత్యయము. 'మగఁటిమి' అనఁగా మగవానితనము అని అర్థము. (ఆది. VI. 306)

17. సంఖ్యావాచకములన్నియు ఔపవిభక్తికములు.

కంటి, ఒకటి [ఒకండు], రెంటి [రెండు], మూఁటి [మూండు], నాల్గిటి [నాల్గు], ఐఁదిటి [ఐఁదు], ఏనిటి [ఏను], ఆఱిటి [ఆఱు], ఏడిటి [ఏడు], ఎనిమిదింటి [ఎనిమిది], తొమ్మిదింటి [తొమ్మిది], పదింటి [పది], నూఱిటి [నూఱు], వేయింటి [వేయి].

## VI. విభక్తిప్రత్యయములు

### ప్రథమావిభక్తి

1. ప్రథమా విభక్తియందు తత్సమ పదములమీఁద సాధారణముగా డు, ము, వు, లు, రు, ఱ, కులు, అను వర్ణములు వచ్చును. వీనిలో డు, ము, వు, లు ఎచ్చ ఎచ్చటరావలెనో ఇంతకుపూర్వము చూపఁబడినవి.

తెనుఁగు సంప్రదాయముప్రకారము దాని తుదిని ఉత్వము చేరినది. ఈ ముపర్ణమునకు ంబు, మ్ము, అనునవి పూర్వరూపములుగ కాన్పించుచున్నవి. కన్నడమునందు ఈ ముపర్ణమునకు బదులుగ 'వు' వర్ణము వచ్చుటయు, కొన్నియెడల ఏదియు చేరకుండుటయు గలదు. ధర్మ, ధర్మవు; 'ధర్మవ్వు' అను రూపములు 11-వ శతాబ్దమునఁ గలదు. (S. I. I. IV. 1158); ఇట్టి రూపములు పుంలింగమందువలెనే ఉకార మధ్యములుగా మాఱినవి: ధర్మువు (S. I. I. IV. 943, 989, 991, 992, 1098, 1133, 1145, 1228); బంధువు (S. I. I. I.V. 1080, 1098); భండారువు (S. I. I. IV. 1114).

సమ్మువు - ఇది 'నర్మ' శబ్దభవము. ధర్మ శబ్దము ధర్మువు ఎట్లయినదో నర్మ శబ్దము 'నర్మువు' అయి, రేఫమకార సంయోజనము (assimilation) వలన 'నమ్మువు' అయినది (S. I. I. V. 1037).

'మూర్ఖ' శబ్దముపై డుజ్జు చేరకయే దాని ప్రాతిపదిక రూపమగు 'మూర్ఖు' అనునది ప్రథమైకవచనమున వచ్చును.

మూర్ఖవుశిశుపాల! (ఆది. VIII. 192); మూర్ఖులకు.

'శరణ' 'రూప' శబ్దముల ప్రథమైకవచనమున 'శరణు, రూపు' అనియు వచ్చును. ఒక్కరూప (ఆది. II. 179; 222) (ఆది. IV. 29; కలరూ పెఱుంగక).

(ఆది. II. 181); శరణంబునాకగుము.

(ఆది. I.) శరణన్నఁ గాచుచు.

రాహు శబ్దమునకు ప్రథమైక వచనమున, 'రాహు' అని కూడ నిలుచును.

సంబోధనమ్, స్ఫురణమ్, ఖేలనమ్ - మొదలగు శబ్దములకు ప్రథమైకనమున సంబోధన, స్ఫురణ, ఖేలన అనియువచ్చును. (ఆది. I. 127); సంబో జేసి; విక్రమ స్ఫురణఁ.

4. వు వర్ణము సాధారణముగా ఉకారాంతములపై ప్రథమైకవచన న చేరును. ఇది మహద్వాచకములపై చేయుటయు కలదు.

ఋతు - ఋతువు; ప్రభు - ప్రభుండు, ప్రభువు.

5. లు, రు, ను, ఱు, లు ప్రథమా బహువచన ...

2. వీనిలో 'డు' వర్ణము బిందుపూర్వకముగా నుండును. ఇది ప్ర థమైకవచన ప్రత్యయము 'అన్' అనునది ద్రావిడ భాషలలో ప్రథమై వచన ప్రత్యయము. 'రామ' శబ్దమును తీసికొందము. ఇది తమిళముల 'రామన్', కన్నడములో 'రామను' అని ప్రథమైకవచనమున నుండున 'అన్' అనఁగా మగవాఁడు అని అర్థము. వీనిలోని నకారము ణకారము తమిళములోనే మాఱినది. తెనుఁగులో ణకారము స్థిరపడి 'రామణ్ అయినది. ఈ ణకారమునకు ద్విత్వమువచ్చి 'రామణ్ణ్' అయి క్రింది ణకా స్థానమున 'డ' కారమువచ్చి 'రామణ్డ్' అయినది. తెనుఁగు సంప్రదాయవ ప్రకారము ఈ శబ్దము తుదిని ఉత్వమువచ్చి 'రాముణ్డు' అను రూప మేర్ప నది. నన్నయకు పూర్వమం దిట్టి అకారమధ్యమములయిన రూపము తొలుత ఉండియుండును. కాని, రానురాను అవి ఉకార మధ్యమములుగ మాఱినవి. పదునొందవ శతాబ్దమున 'రామణ్డు, రాముణ్డు' అనునిట్టి రెండ రూపములును కాన్పించుచున్నవి. ఈ బిందుపూర్వక డు వర్ణము కొన్ని మహద్వాచకములగు తెనుఁగు శబ్దములయందును కాన్పించుచున్నవి.

అల్లుఁడు (ఆది. III. 168; ఆది. II. 137; S. I. I. IV. 667; S. I. I. V. 22, 77, 220); తమ్ముఁడు (ఆది. II. 66, ఆది. VIII. 106; S. I. I. IV. 667, 1061, 1170, 1186, 1190, 1210; S. I. I. V. 1015 1019); నెయ్యుఁడు (ఆది. VIII. 317); పాలుఁడు (ఆది. V. 2, 7, 223) బోయుణ్డు (S. I. I. IV. 1008, 1014, 1161); బోణ్డు (S. I. I. IV. 1008); బంటండు (S. I. I. IV. 1323); బలియుఁడు (ఆది. VI. 211 215; సభా. I. 119; అర. III. 90; అర. IV. 25); మనుమండు (ఆది. VII. 149; అర. III. 67; S. I. I. IV. 1035); మామండు (S. I. I. IV. 1039); ఱెండు (S. I. I. IV. 1150)

అట్టి, ఇట్టి, ఎట్టి, కొణ్డ ('కొనిన' యొక్క పూర్వరూపము. కన్నడ ములో 'కొణ్డ' అనునది 'కొను' ధాతువుయొక్క భూతార్థ క్రియావిశేష ణము) అను వానిపైఁగూడ ప్రథమైకవచనమున బిందుపూర్వక 'డు' వర్ణము వచ్చును.

అట్టిండు (ఆది. II. 216; ఆది. IV. 167; సభా. 286); ఇట్టిండు (ఆది. V. 224)

ఎట్టిండు (ఆది. IV. 251); కొణ్డణ్డు (S. I. I. IV. 1334)

3. ము వర్ణము అమహద్వాచకములపై వచ్చు ప్రథమైక వచన ప్రత్యయము. 'అమ్' అనునది సంస్కృతమందలి అకారాంత నపుంసకలింగ ప్రథమైకవచనమున వచ్చు ప్రత్యయము. అదియే తెనుఁగున నిలువఁగా

తెనుఁగు సంప్రదాయముప్రకారము దాని తుదిని ఉత్వము చేరినది. ఈ మువర్ణమునకు ంబు, మ్ము, అనునవి పూర్వరూపములుగ కాన్పించుచున్నవి. కన్నడమునందు ఈ మువర్ణమునకు బదులుగ 'వు' వర్ణము వచ్చుటయు, కొన్నియెడల ఏదియు చేరకుండుటయు గలదు. ధర్మ, ధర్మవు; 'ధర్మవు' అను రూపములు 11-వ శతాబ్దమునఁ గలదు. (S. I. I. IV. 1158); ఇట్టి రూపములు పుంలింగమందువలెనే ఉకార మధ్యమములుగా మాఱినవి: ధరుమ్మవు (S. I. I. IV. 943, 989, 991, 992, 1098, 1133, 1145, 1228); బంధువు (S. I. I. I.V. 1080, 1098); భండారువు (S. I. I. IV. 1114).

నమ్ముమ్మవు - ఇది 'నర్మ' శబ్దభవము. ధర్మ శబ్దము ధరుమ్మవు ఎట్లయినదో నర్మ శబ్దము 'నరుమ్మవు' అయి, రేఫమకార సంయోజనము (assimilation) వలన 'నమ్ముమ్మవు' అయినది (S. I. I. V. 1037).

'మూర్ఖ' శబ్దముపై డుజ్జు చేరకయే దాని ప్రాతిపదిక రూపమగు 'మూర్ఖ' అనునది ప్రథమైకవచనమున వచ్చును.

మూర్ఖవుశిశుపాల! (ఆది. VIII. 192); మూర్ఖులకు.

'శరణ' 'రూప' శబ్దముల ప్రథమైకవచనమున 'శరణు, రూపు' అనియు వచ్చును. ఒక్కరూప (ఆది. II. 179; 222) (ఆది. IV. 29; కలరూ పెఱుఁగక).

(ఆది. II. 181); శరణంబునాకగుము.

(ఆది. I.) శరణన్నఁ గాచుచు.

రాహు శబ్దమునకు ప్రథమైక వచనమున, 'రాహు' అని కూడ నిలుచును.

సంబోధనమ్, స్ఫురణమ్, ఖేలనమ్ - మొదలగు శబ్దములకు ప్రథమైక వచనమున సంబోధన, స్ఫురణ, ఖేలన అనియువచ్చును. (ఆది. I. 127); సంబోధనఁజేసి; విక్రమ స్ఫురణ.

4. వు వర్ణము సాధారణముగా ఉకారాంతములపై ప్రథమైకవచనమున చేరును. ఇది మహద్వాచకములపై చేరుటయు కలదు.

ఋతు - ఋతువు; ప్రభు - ప్రభుండు, ప్రభువు.

5. లు, రు, అు, ఱు, లు ప్రథమా బహువచన ప్రత్యయములు. వీనిలో సాధారణముగా లువర్ణమే బహువచనమునఁ గాన్పించును.

6. అదంత మయినట్టియు, దీర్ఘపూర్వకమయిన లకారము ఉపధగాఁ గలట్టియు మహద్వాచకముమీఁది విభక్తి 'లు' వర్ణమునకు 'రు' వర్ణము వచ్చును.

బాలురు (ఆర. II. 249) నృపాలురు, మొద, కాని, 'మల్లురు' (సభా. I. 241).

'దేవఁడు' అనునది లోపధముకాకున్నను కన్నడమునందువలె దీనికి 'దేవరు' అని బహువచనరూపము కలిగినది. (S. I. I. V. 50, 63; S. I. I. IV. 749).

రాయరు (S. I. I. IV. 1325); హెుడయరు (S. I. I. IV. 50)

దీర్ఘముపై వచ్చు లోపధముకాని శబ్దములయినను కొన్నిటిలో బహువచనమున రు వర్ణము వచ్చును.

అల్లుఁడు - అల్లురు (ఆది. VIII. 53); అట్టిఁడు - అట్టిరు (ఆది. IV. 17; సభా. I. 234) ఇట్టిరు (ఆది. IV. 187; ఆది. VII. 73); వెయ్యురు (సభా. I. 16; ఆర. I. 237).

(అ) ఇరువురు, ముప్పురు, నలువురు, ఏవురు, అల్వురు, ఏష్వురు అను వానియందుఁగూడ 'రు' వర్ణము బహువచన ప్రత్యయముగా నున్నది. ఎవ్వరు, వారు, తారు, మీరు, చేయరు, చేయుదురు మొదలయిన వాని యందును 'రు' వర్ణము బహుత్వమందు వచ్చినది.

మాత్తురు (సభా. II. 296). దీని కేకవచనము 'మాత్తుఁడు' అగు నేమో 'మత్తురు' దీని యేకవచనము 'మత్తుఁ'.

'కాల్వురు' అనునది 'కాలవరు' నుండి వచ్చిన సంక్షేప రూపము దీనికి తెనుఁగున ఏకవచనము లేదు.

7. అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు, మూవఱు, అనువానియందలి 'ఱు' వర్ణము బహువచన ప్రత్యయము. వీనికి ఏకవచన రూపములు కానరావు - 'చెయ్వఱు' దీని కేకవచనము 'చెయ్వ'. (ఆది. VIII. 21)

కూఁతుఱు - అనుదానిలో తుది 'ఱు' వర్ణము ఏకవచన బోధకము ప్రథమైకవచనమునఁదప్ప తక్కిన విభక్తులయందీ 'ఱు' వర్ణము లోపించును.

కూంతుఱు (ఆది. IV. 256; ఆర. II. 137; S. I. I. IV. 1010 1015, 1053, 1062, 1076, 1120, 1161, 1253, 1357; S. I. I. V. 62 72, 1933, 1091, 1105).

కూఁతుర్ (అది. III. 168; ఆది. IV. 46, 232; S. I. I. IV. 1067); కూఁతును (ఆది. III. 32, 33); కూఁతునకు (ఆది. III. 186; ఆది. IV. 63); కూఁతులు (ఆది. III. 60); కూఁతులర్ (ఆది. III. 50; ఆది. VII. 86; సభా. I. 134).

కూంతుఌ శబ్దము నిర్బిందుకముగఁగూడ కనఁబడుచున్నది. కూంతుఌ (S. I. I. V. 1039, 1125); కూంత్తుఌ (S. I. I. V. 1026); కూంతు (S. I. I. V. 1022).

కూంతు (S. I. I. V. 1022); ప్రథమైకవచన రూపముగాకూడ నున్నది.

'అంపఱకు' (ఆది. IV. 201); 'పగఱ్' (ఆది. V. 60; సభా. I. 40; సభా. II. 144); యొక్క ప్రథమాబహువచన రూపములు 'అంపఌ' 'పగఌ' అని యుండునేమో.

8. 'ము' వర్ణముకూడ కొన్నియెడల బహువచన ప్రత్యయముగా కానవచ్చుచున్నది. మేము, మనము, తాము, తమ, చేయుచున్నవారము, వీనిలోని మకారము బహుత్వమును తెలుపును. మనము, మన, మీరు, మీ, అనువానిలోని, మొదటి మకారము బహువచనబోధకము.

9. 'వు' వర్ణమును బహువచన ప్రత్యయమగును. 'నీవు' లోని వు వర్ణ మట్టిది. కన్నడములో 'నీవు' అనఁగా 'మీరు' అని యర్థము. తెనుఁగున 'నీవు' ఏకవచనమందు స్థిరపడినది. దీనికి బహువచనము 'మీరు.' 'నీవు, మీరు' లకు 'ఈవు, ఈరు' లు పూర్వరూపములు. 'అవి చేయవు' మొదలగు నిషేధార్థక క్రియలయందలి 'వు' వర్ణమును బహువచనమందు వచ్చినదే.

## -ండ్రు.

10. —ండ్రు అను బహువచన ప్రత్యయము 'ఱ్' అను మహత్ప్రత్యయముపై 'ఌ' అను బహువచనము చేరుటవలన ఏర్పడినది. 'న్ఱు' అనునది ద్రావిడములో 'న్ద్రు' అని ఉచ్చరింపఁబడును. దీనిలోని దకారమునకు డకార మాదేశముగా వచ్చినప్పుడు 'న' కారము 'ణ' కారముగా మాఱుట వలన 'ణ్డ్రు' అను ప్రత్యయరూప మేర్పడినది. (అవర్) వార్+ఌ = వాన్ఱు, ఉచ్చారణము (వాన్ద్రు) వాణ్డ్రు (ఇప్పటి వ్రాఁతలో) వాండు; నన్నయకాలమున 'వాణ్డ్రు' అను ప్రథమపురుష సర్వనామరూపము కానరాదు. 'వారు' అనునది మాండలిక రూపము; అది ద్రావిడములోని 'అవర్' నుండి ఏర్పడినది. కాని, కోడండ్రు, పెక్కండ్రు అను రూపములనుబట్టి 'ండ్రు' అనునది

కూడ బహువచన ప్రత్యయముగా నున్నదని చెప్పవచ్చును. పూర్వశాసనములందు—

'అచ్చువాన్రు' (Ep. coll. No. 363; of 1920); గోత్రున్రు (E. I. XI. p. 345); శత్యదితున్రు (Ibid) వేవాన్రు (Ibid) వాన్రు (Ibid); మూన్రు (Ibid); మగన్రు (Ibid); అని 'న్రు' అనియే వ్రాయఁబడియున్నది. నన్నయ గ్రంథమునుండి ఉదాహరణములు:- కోడండ్రు (ఆది. V. 165; సభా. II. 159); పెక్కండ్రు (ఆది. I. 46; ఆది. II. 25; ఆది. IV. 225; ఆది. VI. 275; ఆది. VI. 242; ఆది. VIII. 25; అర. II. 145); మఱఁదండ్రు (ఆది. IV. 216)—

కోడలు, మఱఁదలు లోని తుది 'లు' వర్ణము 'ఆలు' శబ్దమునకు బదులుగా నున్నది. ఆలు శబ్దమునకు ద్రావిడభాషలయందు 'ఆళ్' అనురూపము గలదు. ఈ ణకారమువె 'ఱు' అను బహువచన ప్రత్యయముచేరఁగా 'ణ్డ్రు' అని అయినది. ఇట్లే 'పెక్కు' శబ్దముపై మహత్ప్రత్యయమైన 'అణ్' చేరి, దానిపై 'ఱు' వర్ణము చేరుటవలన 'పెక్కండ్రు' అని అయినది.

11. ఒకప్పుడు 'ళు' వర్ణముకూడ బహువచన ప్రత్యయముగా కానవచ్చుచున్నది.

సంవత్సరంబుళ్ (Ep. coll. No. 364 of 1920); రాజుళ్ (Nell. Ins. II. P. 1152); భటారళు (Ep. coll. Nos. 359, 364, of 1920). స్వాముళ్ (Burgess: Tam. & Skt. Ins. No. 22).

12. ర, ల డ, లతోఁగూడిన బహువచన ప్రత్యయ 'లు' వర్ణము ఆ వర్ణములతో సంయోజనము (assimilation) పొంది 'ళు' గా మాఱినది. ఈ 'ళ్ళు' 'ళులు' గకూడ నిలిచిపోవును.

ఒకళ్ళొకళ్ళకం దొకరునికిచ్చిన (అర. II. 314); ఒక్కొక్కళ్ళతురీయార్థము (ఆది. IV. 129); ఒకళ్ళొకళ్లిన పంచా (ఆది. V. 248); అంగడి + లు = అంగడులు, (ఆది. VIII. 73); అంగడ్లు, అంగళ్లు, అంగళులు (ఆది. VI. 148); నాఁడు + లు = నాఁడులు, నాడ్లు, నాళ్ళు (ఆది. I. 68; సభా II. 115); [నీరు] నీడు + లు (= నీడులు) నీడ్లు, (S. I. I. IV. 1015) నీళ్ళు (ఆది. IV. 86, 128; ఆది. V. 18, ఆది. VI. 173, 178, 179, 219 అర. I. 6; అర. III. 87); నీళులు (ఆది. V. 259); కన్నీరు (ఆది. III 139) + లు = కన్నీడు + లు = (కన్నీడులు, కన్నీడ్లు), కన్నీళ్ళు, (ఆది. VI 259; ఆది. VII. 268); కాళ్ళు (ఆది. V. 18, 224; ఆది. VI. 289); పః

ళుల్ (ఆది. II. 152); పాళ్ళు (ఆది. VII. 221); ముదుసళుల్ (ఆది. VIII. 381); మొదళులన్ (ఆది. V. 170); వరవృళ్ళన్ (సభా. II. 200); వఱళులు (సభా. II. 251); వ్రేళ్లు (మూలము, అంగుళి అను రెండర్థములందును దీనికి ద్రావిడరూపము 'విరల్.' మూలము అను అర్థమందు 'వేరు' అనియును, అంగుళి అనునర్థమందు 'వ్రేలు' అనియును దీనికి తెనుఁగున రూపము లేర్పడినవి. కాని, ఈ రెండు శబ్దముల బహువచనములును 'విరల్ + లు' = విరళ్ళు, వ్రేళ్ళు, అని అయినది. ఆది. II. 140; ముదుసళుల్ (ఆది. VIII. 38); 'ఏఱు' (= నది) శబ్దములోని ఱు-వర్ణము బహువచనమున 'లు' వర్ణముతో సంశ్లేషముఁ బొంది 'ఏళ్ళు' గా మాఱుదు: (సభా. I. 170;) ఏఱులన్.

13. టుకార, డుకారములపై బహువచన 'లు' వర్ణముండఁగా ఒకప్పుడు 'టు, డు' ల మీఁది ఉత్వము లోపించును.

ఏండు + లు = ఏండులు, ఏండ్లు, (ఆది. II. 4; సభా. II. 278; ఆర. III. 248; S. I. I. IV. 731); ఒరుఁడు + లు (= ఒడ్డు + లు = ఒడ్డులు), ఒడ్లు (ఆది. VI. 27); తోఁట్టుపట్లు (ఆర. III. 118); కాహడ్లు (S. I. I. IV. 675); పండులు = ఫలములు (ఆర. I. 94); పండ్లు (ఆది. V. 170; ఆది. VI. 26); కోమటులు (ఆది. VIII. 73); కోమట్లు (S. I. I. IV. 1014); గుడ్లు, గుడులు (S. I. I. IV. 749); పెగ్గడ్లు (S. I. I. IV. 992); గ్రుడ్లు (ఆర. I. 107); మిడిగ్రుడ్లు (ఆర. I. 300) పుట్లు (S. I. I. IV. 1015, 1029, 1133, 1314, 1323; S. I. I. V. 50, 1005, 1052); పొడ్లలోనన్ (S. I. I. IV. 1082).

14. కన్ను, చన్ను, శబ్దములపై లు వర్ణముచేరఁగా కన్నులు (ఆది. II. 30; ఆది. III. 27; ఆది. IV. 252; ఆది. VIII. 105); చన్నులు (ఆది. II. 167; ఆది. III. 27; ఆది. V. 32; ఆది. VII. 98) అనినైనది. తరువాతి కాలమున 'కల్, ముల్' మొదలగు లకారాంత శబ్దముల బహువచన సాదృశ్యము (analogy) వలన వీనికి కండ్లు, చండ్లు, అను రూపములును వచ్చినవి.

15. ఇల్, కల్, పల్, ముల్, నిల్ శబ్దములపై బహువచన లువర్ణము చేరునప్పుడు వాని లకారమునకు నత్వమును, తరువాత ద్విత్వ ణత్వమును దాని లోని క్రింది ణకారమునకు డత్వమును వచ్చి—

ఇండ్లు (ఆది. IV. 64; ఆది. VII. 28, 132; ఆర. 11. 150) విశ్లేషమువలన 'ఇండులు' (ఆది. VI. 194); కండ్లు (ఆది. VI. 160, 178); (పండ్లు) విశ్లేషమువలన 'పండులు' (ఆది. VI. 200); ముండ్లు (ఆది. VI.

160. ఆర. II. 85), విండ్లు (ఆర. I. 300); తడవిండ్లు (ఆర. I. 300) అన రూపము లేర్పడినవి.

16. ద్రావిడములో కళ్, గళ్ అను బహువచన ప్రత్యయములు తెనుఁగులో కులు, గులు అను రూపములనుకూడ పొందును.

కెలను (ఆది. III. 154; ఆది. VI. 6; ఆది. VII. 194) కెలంకుల (ఆర. III. 297); కొలను (ఆది. III. 133; ఆది. V. 67; ఆది. VI. 173 219, 224, 228; సభా. I. 12, 233; ఆర. III. 174, 186, 227, 313, 366) కొలంకులు (ఆర. III. 270); వలను (ఆది. II. 13, ఆది. III. 139; ఆది IV. 93; ఆది. VI. 131, 292; ఆది. VIII. 156, 22; ఆర. I. 344; ఆర II. 26, 37, 160, 189, 193; ఆర. III. 106, 374: ఆర. IV. 22); వలకులు (ఆర. III. 113 ఆర. IV. 135); మ్రాను (ఆది. V. 254; సభా. II 144; ఆర. II. 94; ఆర. III. 135; S. I. I. IV. 920); మ్రాంకృల (S. I. I. IV. 1016, 1050, 1099, 1114, 1115); మ్రాఁకులు (ఆది. IV 20; ఆది. V. 170; సభా. II. 41; ఆర. III. 312).

పై శబ్దముల బహువచన రూపములనుండి జనులవాడుకలో తప్పు కత్తిరింపువలన కెలఁకు, కొలఁకు, వలఁకు, మ్రాఁకు, అను క్రొత్త ఏకవచన రూపములు తరువాతి కాలమున నేర్పడినవి. కాని కెలఁకు, వలఁకు, మ్రాఁకు అనువాని కేకవచనమున గ్రంథములలో ప్రయోగములు కానరావు. కొన్ని ఉకారాంత శబ్దములందువలె కొలఁకు అనునది కొలఁకువు అని కూడ మారినట్లు బమ్మెరపోతరాజ కృతభాగవతములోని 'కొలఁకువు కలంకంబొందగా జొచ్చి (స్కంధ. VIII. III)' అను ప్రయోగమువలన తెలిసికొనవచ్చును 'వలంకు' కూడ అట్లే 'వలఁకువు' గా మారినట్లు శబ్దరత్నాకరమునందుదాహరింపఁబడినది గాని ప్రయోగము ఈయఁబడలేదు.

(17) ఏనుఁగ (ఆది. II. 65); ఏనుంగు (S. I. I. IV. 1190) తెఱుంగు (ఆది. I. 10; ఆది. II. 57, 110; ఆది. III. 5; ఆది. VI. 283) తెఱుఁగు (ఆది. V. 234; ఆది. VI. 264; ఆర. III. 281); మడుంగు = దీర్ఘిక, (ఆది. I. 79); మడుంగు = పరిమాణము (ఆది. VII. 107; సభా. I 84; సభా. II. 137); రేకు (ఆది. IV. 76); లాన్నకు (ఆది. VIII. 299) వెడఁగు (ఆది. VI. 230; ఆది. VII. 43; సభా. II. 9; ఆర. II. 164 అను శబ్దములలోని 'కు, గు' వర్ణములు జనులు తమ వాడుకలో 'కులు గులు' తోఁగూడిన బహువచన రూపములను తప్పుగ కత్తిరించి, యేకవచన రూపములను, క్రొత్తగా కల్పించుటవలన నేర్పడినది.

'నెఱఁకులు' (ఆర. I. 314; ఆది. VI. 201); అనునది 'నెఱను' అనుదాని బహువచనరూపమై యుండవలెను. కాని, 'నెఱను' అనుదానికి 11-వ శతాబ్దమున ప్రయోగములు కానరావు.

'మెఱుఁగులు' (ఆర. III. 179) అనునది 'మెఱుము' అను ఏకవచనమునకు 'కులు' చేర్చుటవలన ఏర్పడిన బహువచనరూపము (చూ. ఉఱుముచు, మెఱుముచు ఆది. VIII. 270).

'మఱువు' (ఆది. II. 96; ఆది. VI. 187, 201; ఆది. VIII. 289; ఆర. III. 227) అనునది 'మఱుఁగు' అను దానిలోని కత్తిరింపు రూపము లోని గకారమునకు వకారము వచ్చుటవలన ఏర్పడినరూపము.

'కొడుకు' అనునదికూడ పైరీతి కత్తిరింపురూపమే. 'కొడ' అను శబ్దముపై 'కులు' చేరి 'లు' ప్రత్యేకింపఁ బడుటవలన ఏర్పడిన ఏకవచన రూపము. ఈ 'కొడ' శబ్దమే వివిధరూపములతో, కోడె, కోడెగాఁడు, కోడలు మొదలగు శబ్దములందు కాన్పించుచున్నది. అతగులు (ఆది. VI. 68) అను బహువచన రూపముయొక్క ఏకవచనము 11-వ శతాబ్దమునందు కానరాదు. దీని ఏకవచనరూపము 'అతను' అయియుండి, తప్పక త్తిరింపువలన 'అతగు' అయియుండును. తరువాతి కాలమున దీనిపై బిందుపూర్వక'డు' వర్ణముకూడ చేరినది. 'అతివీరుతోఁ గలహము వెట్టుకొన్న యతగునిరీతి' (ప్రభు. V.) ఇట్లే 'ఆరెకులు' (ఆది. VI. 260); దీని ఏకవచన రూపమేమో తెలియదు 'ఆరెకుఁడు' అని శబ్దరత్నాకరములో నున్నదిగాని దాని కేకవచనమున ప్రయోగములు కానరావు. 'ఆరె' అనునదియే ఏకవచనరూపమై యుండును. దానిపై 'కులు' అను బహువచన ప్రత్యయముచేరఁగా 'ఆరెకులు' అను రూప మేర్పడినది. 'ఆరె' అనునది మహారాష్ట్ర దేశమునకును, 'ఆరెము' అనునది మహారాష్ట్రభాషకును పేళ్లు. చూ 'అరబి, పారసి, గుజరాతి, యారె, మచ్చ తెనుఁగు, కన్నోజ, మొదలుగాఁ దెలిసివ్రాయ దారిగన్నట్టివాఁడు' (యయాతి. X.) మహారాష్ట్రులు పూర్వకాలమున తలారులుగా నుండుటచేత 'ఆరెకులు' అను శబ్దమునకు తలారులను అర్థము కుదురుకొని యుండును.

(18) (అ) 'గళ్' అనుదాని రూపాంతరమగు 'గారు' అను బహువచన ప్రత్యయము గౌరవార్థమం దేకవచనమున బ్రయోగింపఁబడును.

మేడయంగారి కొడుక్క (S. I. I. IV. 1193); జన్నమగారికి (S. I. I. IV. 1228; జియ్యంగారు (S. I. I. IV. 704).

'గారు' అనునది బహువచన ప్రత్యయ మయినందుకు 11-వ శతాబ్దము నాఁటిది కాకపోయినను శక 1468 సం॥ రము నాఁటి (S.I.I. IV. 699)

ఈ క్రింది ప్రయోగములవలన తెలియనగును. "సోమాపండితులు లింగ్గాపండితులు, మంలాపండితులుగారు" ఇప్పుడు మనము 'గారు' ఏకవచనమనుకొని, బహువచనమున దానిపై మఱల 'లు'వర్ణమును చేర్చి 'గార్లు' అనియందుము. 'గారు' అనుదానికి 'గాండు'నకు పూర్వరూపమయిన 'కాండు'ఏకవచనమునందు వచ్చును. నేర్పుకాండు (ఆది. VI. 32); సంగడికాండు (ఆది. V. 207); లోని 'కాండు' అనునదియే యీ 'కాండు.' దీనికి కన్నడములో 'కాఱ'అని ఏకవచనమందును. 'కాఱులు'అని బహువచనమందును రూపములు. 'కాఱు' అనునది బహువచన ప్రత్యయముగా (S. I. I. V. 220) నిబంధకాఱును అను పదమునం దున్నది.

(19) డుజంతశబ్దముల బహువచనమునందు లు, రు వర్ణములు డుజ్జు నకు ఆదేశముగావచ్చును. ఇతరశబ్దములయం దవి ఆగమములుగా చేరును. ఱేండుశబ్దముపై లువర్ణ మాగమముగానే వచ్చియుండును.

(20) ఇకారాంతశబ్దములకు బహువచన ప్రత్యయము పరమగునప్పుడు వాని ఇత్వమునకు ఉత్వమువచ్చును.

దాది - దాదులు (సభా. I. 145, 150); ముడి - ముడులు (ఆది VIII. 175); గుడి - గుడులు, గుళ్లు (S. I. I. IV. 749); మొనసి, మొనదులు (ఆది. VIII. 148); జీంది - జీందులు, జీంళ్లు, (S. I. I. IV. 672)

(21) ఔపవిభక్తికశబ్దములయి అసలు ధాతువులోనే యున్న 'య'కారము గలిగిన 'చేయి, నూయి, నేయి, వాయి మొదలగుశబ్దముల బహువచనము వాని ఔపవిభక్తిక రూపములమీందనే వచ్చును.

చేయి - ఔప, చేతి + లు = చేతులు (సభా I. 147, సభా II. 57 అర. I. 300; అర. II. 134, 158, అర. III. 329); నూయి - ఔప నూతి + లు = నూతులు (ఆది. IV. 92); నేతులు, వాతులు అనుటక 11 - వ శతాబ్దమున ప్రయోగములు కానరావు.

(22) ఔపవిభక్తికములయిన, ధాతువులో లేని 'య' కారముగల శ ముల బహువచనమునందు ఉపవిభక్తులు చేరకుండుటయేకాక వాని తు 'యి' అను నకారముకూడ లోపించును. ఇట్టి శబ్దములు నిజముగ దీర్ఘాం ము లనియును, వానిపై యశ్రుతి వినంబడుచున్నదనియును గ్రహింపవలెన

ప్రా (యి)— ప్రాలు (S. I. I. V. 65, 66); ఱా (యి) (ఆ VII. 119);—ఱాలు (ఆది. V. 118. ఆది. VI. 160. 281, సభా. I. 1 అర. I. 317; అర. III. 300; S. I. I. V. 1052, 1148 గొడిగఱాలు (ఆ III. 299); రే (యి) (ఆది. I. 68, ఆది. II. 88; ఆది. VI. 286; ఆది. V

39; ఆది VIII. 18; ఆర. I. 188; ఆర II. 26);—రేలు (ఆది.II. 152); వే(యి) (ఆది. I. 54, 62, 81; ఆది. IV. 94, 102; ఆది. VIII. 2; సభా. II. 113; ఆర. I. 342; ఆర. III. 132); వేలు (ఆది. I. 34, 30. 38, 40, 42, 44, 46, 48, 50, 52, 54, 56, 58, 60, 81; ఆది. II. 11; ఆది. IV. 157: ఆది. V 39; సభా. I. 13, 267; సభా. II. 113, 111: ఆర. I. 2, 217; ఆర. II. 170, 344' 345, 281, 245; ఆర. III. 331, 174, ఆర. IV. 56, 85).

'మే' శబ్దమునకు బహువచనము 'మేలు' అనికాదు. మేనుశబ్దబహువచనమే, దీనికిని వచ్చును.

'ఆవు'శబ్దమునకు 'ఆ'అనునది పూర్వరూపము. దానిపై బహువచన 'లు'ప్రత్యయముచేరి ఆలు (ఆది VI. 168) అని అగును.

(23) కొన్నిబహువచనరూపములపై మఱియు బహువచన ప్రత్యయము చేరుటఁ గలదు.

ఊళ్ళులు (ఆది. VI. 267); నీళ్ళులలోఁ (ఆది. IV. 86); కండ్లులు = కాళ్లు(ఆది. VI. 178); బండ్లులు (ఆర II. 175); కోడండ్రుగు (సభా. II. 257); పెక్కండ్రురు (ఆది. VIII. 25); వారలు; వీరలు. మీారలు; ఈరలు; పండితులవారు, పండితులుంగారు (S. I. I. IV. 699).

ఇట్టిచోట్ల 'నీళులు, ఊళులు' మొదలగు రూపములే యుండవలె ననియు బహువచనరూపముపై మరల బహువచనప్రత్యయము చేరుననుట తప్పనియుఁ గొంద ఱందురు; అయినను గావచ్చును.

(24) సంస్కృతమున ఏకవచనముగానున్న 'త్రివిష్టప' శబ్దము నన్నయ గ్రంథములో బహువచనమునఁ బ్రయోగింపఁబడినది (ఆది. II. 111); త్రివిష్టపంబులఁ.

25. (అ) ఇకారాంతములైన తాలవ్య చ జ లుపధలుగాఁగల శబ్దముల బహువచనమునం దా తాలవ్యములు దంత్యములుగా మాఱును.

(ఆ) ఇట్లే శవర్ణ ముపధగాఁగలిగిన ఇకారాంతశబ్దముల బహువచనమునందు శవర్ణము సవర్ణముగా మాఱును. (ఆది. V. 66. ధాన్యరాసులు).

(26) ము విభక్తికశబ్దములపై ప్రథమైకవచనేతరవిభక్తులు కొన్ని చేరునప్పుడు ఆ మువర్ణమునకు లోపమును దాని పూర్వ హ్రస్వమునకు దీర్ఘమును ఒకప్పుడు కలుగును.

మిరియాలు: (S. I. I. V. 65, 66); గుండానకు (S. I. I. V. 1114); దీపానకు: (S. I. I. IV. 939, 1000; S. I. I. V. 1055); కుంచాలు (S.I.I. IV. 1014, S. I. I. V. 66).

27. డు జంతశబ్దములకు బహువచన ప్రత్యయము చేరక పూర్వము డుజ్జునకు లోపము కలుగును: రాములు, విష్ణులు, బోఁడు + లు = బోలు.

28. బంధువు, బాహువు, రజ్జువు మొదలగు వు విభక్త్యంత శబ్దముల పై లు వర్ణము చేరునప్పుడు వాని 'వు' వర్ణమునకు లోపము కలుగును: (ఆర. I. 11) బంధులు; (ఆర. II. 78;) రజ్జులు, బాహులు.

29. (ఆర. II. 80), నలుగడ బరికించి; (ఆర. II. 6), కరంబిడుమఁ బడఁడె.—ఇచట బహువచనము వాడవలసినచోట ఏకవచనము వాడఁబడినది. (ఆర. II. 3); మాయ ట్లిడుమలఁబడిన నృపులుగలరె. ఇట్లే (ఆర. I. 211, ఆర. II. 70); అను చోట్ల 'ఇడుమునుంబడిన' అను పాఠము సరియైనది.

## ప్రథమేతర విభక్తుల ప్రాతిపదికము.

1. ప్రథమేతర విభక్తి ప్రత్యయములను చేర్చక పూర్వము సంబంధార్థక షష్ఠియందువచ్చు శబ్దముల రూపములు తత్సమములందు ప్రాతిపదికములుగా నిలుచును. వానిపైని విభక్తి ప్రత్యయములు చేరును.

2. అచ్ఛబ్ద శబ్దముల ప్రథమైకవచన రూపములే ఇతర విభక్తుల ఏకవచనమందు ప్రాతిపదికములుగను బహువచనమునందు బహువచన ప్రత్యయముపై 'సంబంధము' ను తెలియఁజేయు 'ఁ' కారముచేర్పఁగా ఏర్పడిన రూపములు ప్రాతిపదికములుగను అగును.

## ద్వితీయా విభక్తి.

1. 'న్' అనునది ద్వితీయా విభక్తి ప్రత్యయము. ఇది ఒకప్పుడు లోపించుటయు, కొన్నిమెడల దీనిపై 'ఇ, ఉ' లు చేరుటయు కలుగుచుండును.

### ఉదాహరణములు.

(ఆది. I. 7) ప్రజన్; ధరణీసురులన్; కప్పంబులన్; విప్రకులమున్ (ఆది. I. 9) కులబ్రాహ్మణున్ (ఆర. I. 140) ఏపునను; (ఆర. I. 14! తనయుని ;నన్ను, మొదలగునవి.

ద్వితీయా విభక్తి ప్రత్యయమగు 'న్' పైవచ్చు 'ఇ, ఉ' లపై ద్రుతముకూడ కాన్పించును.

2. ద్వితీయకు బదులుగా కొన్నియెడల ప్రథమయు వచ్చును.

(ఆది. I. 7) చారుతర మహాగ్రహారంబు లిచ్చుచు; (ఆది. I. 12! అగ్నులు విహరింపుము; (ఆది. VII. 36) విల్లుగొని.

ప్రథమకు మాఱుగ ద్వితీయ వచ్చుటయుఁ గలదు: విజితేంద్రియుడనఁగ నిమ్మునిఁ బాయక విందు (ఆది. IV. 30).

3. సంస్కృతమునందు ద్వితీయా విభక్తియందు 'కూర్చి, గుఱించి' అను అర్థములును వచ్చును. అందుచేత తెనుఁగు వైయాకరణులు ఆ రెంటిని తెనుఁగున ద్వితీయావిభక్తి ప్రత్యయములలో చేర్చికొన్నారు. నన్నయ గ్రంథమునందు 'గుఱిచి' అని సాధారణముగా కాన్పించుచున్నది గాని 'కూర్చి' అనునది లేదు. 'గుఱిచి' అనునది 'లక్ష్యముంచి' అను నర్థమం దుపయోగింపఁబడును. 'గుఱించి' అనునదికూడ ముద్రిత ప్రతులలో క్వాచిత్కముగా కనఁబడుచున్నను కొన్ని వ్రాతప్రతులలో ఆ స్థలములందు 'గుఱిచి' అని కనఁబడుచుండుటచేత 'గుఱిచి' అని వాడుటయే నన్నయ మతమని తోఁచుచున్నది. 'గుఱి' అనుదానికి 'కుఱి' అనునది ద్రావిడ రూపము. కన్నడములో ప్రేరణమందు 'ఇసు' అను ప్రత్యయము చేరును. దీనిలోని 'సు' అనునది తెనుఁగులో 'చు' గా మాఱినది. కొంతకాలమున కది 'ఇంచు' గ గూడ మాఱినది. అందుచేత ప్రేరణమందు చు, ంచు లతో రెండు రూపము లున్నప్పుడు, 'చు' రూపములు ప్రాచీనము లనియు, 'ఇంచు' రూపములు తరువాతివనియు నిశ్చయింపవచ్చును.

(ఆది. II. 165) అంబుజసంభవు గుఱిచి భక్తితోడ ఘోరతపము సేయుచున్న ... (ఆది. VII. 23) పాండవులను గుఱిచి ... (ఆది. VII. 67) తపతి ... అత్తపను గుఱిచి భక్తిఁదపము సేసె (ఆర. I. 42) సూర్యుగుఱిచి జపము సేయుచున్నన్ ...

ఈ క్రిందిచోట్ల ముద్రిత ప్రతులలో 'గుఱించి' కనఁబడుచున్నను కొన్ని వ్రాత ప్రతులలో 'గుఱిచి' అనియే ఉన్నది.

(ఆది. VII. 3) పాండవుల గుఱించి బహువిధంబులగు నిమిత్తములు ... (పాండవులను గుఱిచి) ...

(ఆర. III. 81) ఈశ్వరు గుఱించి తపంబు సేసిన } (గుఱిచి)
(ఆర. IV. 52) ఈశ్వరు గుఱించి }

### తృతీయావిభక్తి

1. మహన్మహతీ తరములయిన శబ్దములకు తృతీయయందు 'న్' అను ప్రత్యయము వచ్చును:

(ఆది. I. 5) ప్రభావమునన్, విభూతిన్; (ఆది. I. 6) పోషణంబునన్; మహిమన్, అభిరతిన్; (ఆది. I. 7) ప్రీతిన్, బలిమిన్; (ఆది. I. 8) గోష్ఠిన్, (ఆది. I. 23) వేడుకన్; (ఆది. I. 34) వృత్తాంతంబులన్; (ఆది. I. 52) బాణంబునన్; (ఆది. I. 56) వచనంబులన్; (ఆది. I. 65) శాఖలన్; వితతిన్; (ఆది.

I. 76) అంజలిన్; (ఆది. I. 104) ఫణాలిన్; (ఆది. I. 139) అగుటన్; (ఆది
II. 220) ధర్మచరితన్ మొద.

2. చేతన్, చేన్, తోడన్, తోన్-అను పదములుకూడ తృతీయార్థమ
లందు వచ్చును:

(ఆది. I. 30) బ్రహ్మచేత ననుజ్ఞాతుండై; (ఆది. I. 50) సహదేవు
చేత నపుత్త్రికుండైన; (ఆది. I. 38) వారిచేత జవ్వనంబు వడయుటయు. (S
I. I. IV. 1190, 1186; S. I. I. V. 65) అడ్డారిచేతన్, (S. I. I. V. 65
సెట్టిచేతంగొన్న; (S. I. I. IV. 737) పరమాత్మునిచేన్; (ఆది. I. 9, 33
కరుణతోడన్; (ఆది. I. 27) భక్తితోడన్; (ఆది. I. 92) గుణములతోడ
(ఆది. I. 10) భక్తితోన్; (ఆది. II. 191) రత్నావళితోన చల్లుదు; (ఆది
II. 99) దానితోన దగ్ధుండై మఱి దానితోన లబ్ధజీవుండై; (ఆది. III. 85
ప్రీతితోన్; (ఆది. IV. 1104) చతుస్సీమములతోఁగూడ; (ఆది. IV. 1108
పంచమితోన్; (S. I. I. IV. 672) 'విగువ్వ్యనతోన్' అనుచోట సప్తమి
మీఁద తోన్ చేర్పఁబడినది.

(3) (అ) చేతన్, చేన్—అనునవి పంచమ్యర్థమునందును వచ్చును:

(S. I. I. IV. 1186, 1190) అడ్డారిచేతం బెట్టి పుత్తెంచిన = ద్వారా
(S. I. I. V. 65) సెట్టిచేతంగొన్న = నుండి, వలన; (ఆది. II. 92) తక్షకు
చేత ననంతంబైన యర్థంబుగొని; (ఆది. I. 113) తక్షకుచేతఁ గుండలంబులు
గొని; (ఆర. I. 44) అహర్పతిచేత వరంబు వేర్మితోఁబడసి.

(ఆ) ,చేత, చేన్' —అనునవి కరణార్థమందునువచ్చును.
(ఆర. IV. 18) చెఱిచెన్ ఘనుఁదగ్గదచేత భీముఁడున్.

4. సముచ్చయార్థమందు అనేక శబ్దములతోడను చేరవలసిన 'తోడన్,
తోన్' అనునవి ఒక్క తుదిశబ్దము మీఁదనే కానవచ్చును:

(ఆర. III. 319) బాలకులయు నధిక శ్రీదర్పితులయు లుబ్ధులయు లఘుజనం
బులయుందోడ; (ఆర. II. 101) అగ్నిహోత్రంబులయు నపారఫలపుష్ప నదీ
రమ్య తపోవనంబులయుఁదోడ నదృశ్యులైనఁ జూచి; (ఆర. III. 43) రోమశ
ధౌమ్యులయుఁ దమ్ములయుఁ దోడ; (ఆది. IV. 215) అఖిల బాంధవులయు
బ్రాహ్మణులయుఁదోడ; (ఆర. III. 95) బాహుదండంబులయు ... దంష్ట్రలయు
... దశనంబులయు ... నయనంబులయు ... వక్త్రంబును ... శరీరంబునుం దోడ

**5. అధ్యయనము విషయమయినపుడు గురువులనుబోధించు శబ్దమునకు
'తోడన్, తోన్' అనునవి చేరును:**

(ఆది. II. 159) చ్యవనసుతుండై ప్రమతితోఁ జదివె నెల్ల శాస్త్రములు; (ఆది. IV. 167) వేదంబులు వసిష్ఠుతోఁజదివె; (ఆది. V. 194) వేదంబుల్ సదివించె భూసురులతో; (ఆది. VII. 5) ధనుర్వేద మగ్నివేశులతోడ నర్థిఁగఱచి; (ఆది. VIII. 227) ధౌమ్యుతో వేదము సదివెఁ; (అర. III. 242) ఇద్దఱు ... నుద్దాలకుతోఁ జదివి.

6. (అ) చేసి అను క్త్వార్థకరూపముకూడ తృతీయార్థమందు తృతీయా విభక్తిప్రత్యయముమీఁద మఱలఁ జేరును :

(ఆది. 1. 30) నుహత్త్వంబునం జేసి; (ఆది. 1. 20) అనుగ్రహంబునం జేసి; (ఆది. 1. 22) గభస్తిచయంబులఁ జేసి; (అర. III. 343) పుచ్ఛమునఁ జేసి.

ఇట్లే—(ఆది. I. 79) దానన చేసి; (ఆది. I. 123) ధూమకేతనహతిఁ జేసి; (ఆది. I. 124) సంబోధనఁ జేసి చేసె; (ఆది. I. 140) తేజరిల్లమిఁ జేసి; (ఆది. I. 145) అగుటం జేసి; (ఆది. II. 68) శాపంబులం జేసి; (ఆది. II. 46) నీ కులిశాభిరక్షణ స్ఫురణన జేసి; (ఆది. III. 26) తన పాదంబునం జేసి తలఁగం ద్రొచిన; (ఆది. III. 27) ముదితయందు తనదు హృదయంబు నిలుపుటఁ జేసి రాగమడర; (ఆది. IV. 64) తన మహాసత్త్వంబునం జేసి తమియించుచున్న; (ఆది. IV. 215) కామరాగాధికాసక్తిఁ జేసి శోషించి; (అర. II. 156) నలుఁ డిప్పుడసమర్థుఁడగుటం జేసి; (అర. I. 22) విజ్ఞానంబునం జేసి యుపశమనంబునం బొందుము; (అర. I. 26) అనలంబునం జేసి దగ్ధంబగు; (అర. I. 99) దీవనలీగిఁ జేసి; (అర. III. 339) ద్వాపరంబున రెండు పాదములఁ జేసి నడచు ...

(ఆ) పై ఉదాహరణములలో 'చేసి' అను క్త్వార్థకరూపము చేత, తోడ, వలన-అను అర్థములలో ప్రయోగింపఁబడినది.

(7) మెయిన్, మైన్—అనునవికూడ తృతీయార్థమందు శబ్దములతోఁ జేరును:

(ఆది. I. 16) ధీయుక్తి మెయిన్; (ఆది. II. 92; ఆది. IV. 12) కడిమి మెయిన్; (ఆది. II. 175) అలుక మెయిన్; (ఆది. III. 44) లీల మెయిన్; (ఆది. III. 71) భక్తిమెయిన్; (ఆది. III. 111) నిష్ఠమెయిన్; (ఆది. III. 141) శక్తిమెయిన్; (ఆది. IV. 207) ధృతిమెయిన్; (ఆది. IV. 86) ప్రీతిమెయిన్; (సభా. I. 161) బలిమిమెయిన్; (ఆది. IV. 178) అలుకమెయి మున్న పలికితిన్; (ఆది. I. 69) పేఁకమైన్; (ఆది. IV. 35) శక్తిమైన్; (ఆది. IV. 62; సభా. I. 180) బలిమిమైన్; (ఆది. VI. 118) రాజనీతిమైన్; (అర. III. 321) సుఖనిద్రమైన్; (అర. IV. 68) అలుకమైనేసిన; సభా. II. 2) దివ్యశక్తిమైఁ దాల్చిన.

## చతుర్థీవిభక్తి.

(1) ద్రావిడభాషలయందు చతుర్థిలో కె, క్కె, గె, కు, క్కు అను నవి విభక్తి ప్రత్యయములుగా వచ్చును. కాని, తెనుఁగువైయాకరణులు 'కు' ప్రత్యయమును షష్ఠియందు చేర్చిరి. చతుర్థియందు కై, కొఱకు- అను నవి వచ్చునని తెలిపిరి. 'కొఱకు' అనునది 11-వ శతాబ్దమందలి తెనుఁగులో కానరాదు. 'కయి = కై' అనునది అప్పుడప్పుడే ప్రత్యేక ప్రత్యయముగ ఏర్పడుచుండెను. 'కై' అనునది కొందఱనుకొనునట్లు 'చేయి' అను నర్థము గల పదముకాదు. 'కు + అయి' అని దాని పదచ్ఛేదమని కొందఱందురు 'అయి' అనగా కూడి, సహాయపడి అని అర్థమును చెప్పుదురు. ఈ క్రింది ఉదాహరణములందు 'అయి' అనునది ఏల్లువాడఁబడినది:

(ఆర. V. 394) విజయుండు నేనునయి ... ధృతరాష్ట్రజాధముల నెల్లం జంపి; (S. I. I. V. 1074) నాయకుణ్ణును నాయకురాలును నై పెట్టిన = కూడి, కలసి; (ఆర. II. 216) సుధాంశుండును గమలహితుండును నేనునయి = కలసి. 'కై, కయి' ఇవి 11-వ శతాబ్దమున క్రొత్తగా విభక్తులగుచుండుట కుదాహరణము:—(సభా. II. 174) అనఘ మామామ శకుని నాకై కడంగి = సహాయపడి; (సభా. II. 38) చైద్యునికై పూని సన్నద్ధులైయున్న యీ రాజులిందఱు ... (సభా. II. 175) అన్యులకయి యన్యులు వాదంబాడుట యెంతయు విషమంబు ...

(2) (అ) చతుర్థ్యర్థమందు 'పొంటెఁ' అను నొక ప్రత్యయము కాన వచ్చుచున్నది. దీని వ్యుత్పత్తి యేమో సరిగ తెలియరాకున్నది. కన్నడము లోను, తమిళములోను, 'పూణ్' అను నొక ధాతువున్నది. దీనికి 'ఆరంభించు' అని అర్థము. తెనుఁగులో ఈ ధాతువు 'పూను' అని కనఁబడు చున్నది. ఈ ధాతువే తమిళ మళయాళములలో 'పుణను' అనియు కన్నడములో 'పొణర్' అనియు, మళయాళములో 'పూణు' 'పుణ' అనియుఁగూడ కానవచ్చుచున్నది. రూపభేదమువలన 'కలియు' అని దీని కర్థభేదముకూడఁ గలిగినది. 'పొణర్, పోణ్' అనునవి ప్రాచీనకాలమున తెనుఁగునందును ఉండి యుండును. దీని మధ్యమ పురుషైకవచన భూతకాలరూపము 'పొంటి' అని యగును. దీనికి 'ఏఁ' అని చేర్చినయెడల 'పొండెఁ' అని యగును. 'పూని తేఁ, పూనదేఁ' అని యర్థము. దీనికి రూపాంతరము 'పొంటెఁ' అని యగును. ఇది తొలుత మధ్యమ పురుషరూపమే అయినను, రానురాను అన్ని పురుషములయందును వాడఁబడుచు కేవలవిభక్తి ప్రత్యయముగా పరిణమించినది:

(ఆది. II. 181) అఖిలలోక హితంబుపొంటె (ఆది. V. 157) కురుకుల వృద్ధి పొంటె నేముద్భవిల్లితిమి; (ఆది. V. 157) వంశవివృద్ధి పొంటెన్; (ఆది. VII. 244) తదీయ ధర్మసందేహ నివృత్తిపొంటెఁ జనుదెంచె; (ఆది. VIII. 13) ఆత్మోదయ వృద్ధిపొంటెను దదున్నతి గోరుదురు; (ఆది. VIII. 96) సుర హితంబుపొంటె సుందోపసుందుల కడకువచ్చె; (సభా. I. 26) విప్రుల మంత్రులుగా నొనరించితె కార్యసంప్రయోగము పొంటెన్.

(ఆ) 'పొంటెన్' అనునది క్రియాజన్య విశేషములపైఁగూడఁ గాన వచ్చుచున్నది:

(ఆది. IV. 189) వివాహంబు సేయుపొంటెన్; (ఆది. VII. 274) హితముసేయుపొంటెన్; (ఆది. VIII. 164) అఘములు వాయుపొంటెన్; (ఆర. II. 120) అన్వేషించుపొంటెన్; (ఆర. I. 150) వధియించుపొంటెన్.

(ఇ) చతుర్థ్యర్థమున 'తదర్థము' అను పదమును నన్నయ ప్రయోగించినాఁడు:

(ఆది. II. 207) నీతదర్థముకాఁగ దేవ వినిర్మితంబిది. (సభా. I. 258) నీతదర్థంబులై నిఖిల వేదంబులు వర్తిల్లు.

పంచమీ విభక్తి.

(1) సాధారణముగా 'న్' అనునదే తృతీయా సప్తము లందువలె పంచమ్యర్థమునఁగూడ వచ్చును; (ఆది. I. 48) విప్రశాప నిమిత్తంబునన్.

(2) (అ) 'వలనన్' అను సహాయక విభక్తి ప్రత్యయముకూడ పంచమ్యర్థమున వచ్చును. 'వలనన్' అనునది దిగర్థకమగు 'వలను' శబ్దముయొక్క పంచమీ విభక్తిరూపము :

(ఆది. I. 27) అక్కథకువలవన్; (ఆది. I. 28) నావలన నెక్కథ వినవలతురు; (ఆది. I. 34) అగ్నిభయంబువలన మయభుజంగ మోక్షణంబును; (ఆది. I. 36) నారదువలన లోకపాల కథా శ్రవణంబును; (ఆది. I. 38) యమువలన వరంబులు వడసి; (ఆది. I. 58) గాంగేయువలన నెఱుంగుటయు; (ఆది. I. 64) వనచర భయంబువలన రక్షింపనోపమి; (ఆది. I. 66) వైశంపాయన మహామునివలన విని వచ్చితి; (ఆది. I. 98) వానివలన సురక్షితముగఁ జేసిచనుము; (ఆది. I. 120) నీవలనఁ బరమ సంప్రీతి హృదయుండ నయితి; (ఆది. I. 150) ప్రమద్వరను పంచత్వంబువలనం బాపె; (ఆది. II. 53) దాస్యంబువలన విముక్తుల మగువారము; (ఆది. II. 849) తన చారువలన నంతయు నెఱింగి; (ఆది. II. 176) తక్షకువలని భయంబు; (ఆది. III. 12) భూసుర వరులవలన ... విద్యలు గఱచుచు; (ఆది. III. 15) అపాయంబులవలనం బాయుచు; (ఆది. III. 17) యమువలన సభాప్రాప్తుండై; (ఆది. III. 58) కశ్యపు

వలనఁ జరాచరభూత రాశి యుద్భవిల్లె; (ఆది. III. 118) అనురులవలన నై
యపకారంబు; (ఆది. III. 127) శుక్రువలన సంజీవనిఁబడసి; (ఆది. IV. 7
కెందమ్మిరేకులవలనం దొరంగు జలకణంబులువ్రాలె; (ఆది. VII. 127)
పంబువలనం బాపి; (ఆది. VIII. 8) దేవతాదులవలన భయంబు; (సభా
II. 261) సాయంగిపలయు దాస్యమువలనన్, (సభా. II. 312) రాష్ట్రం
వలనంబాపి; (ఆర. I. 26) మృత్యువువలన భయంబు; అనలంబువల
భయంబు; (ఆర. I. 39) ఆపదలవలనన్ ప్రజల సముద్ధరించిరి; (ఆర.
41) నీనిందొల్లి యింద్రువలన నారదుండు వడసె, నారదువలన వసువసురా
వడసె, నాతనివలన నేను బడసితిని; (ఆర. I. 133) సత్త్వంబువలన యజ్ఞం బు
రించుటంజేసి; (ఆర. I. 191) సౌంభకంబువలనఁ బడు తెంచు; (ఆర. I. 34
వారిదమార్గంబువలన మహానీల వైజయంతీవిభవంబు నెలయు; (ఆర. I
66) ఎవరి వలనను సత్కారంబుఁగానక; (ఆర. II. 88) అజగర ముఖంబువల
వెలువడిన యా దమయంతి; అమ్మనుజునవలన నంతివృత్తాంతంబు నెఱుం
(ఆర. II. 177) ఋతువర్ణువలన నక్షహృదయంబువడసి; (ఆర. II. 212) పర్ణా
వలన నిన్నెఱుంగినదాన; (ఆర. II. 271) దురితంబులవలనం దొలంగుదుర
(ఆర. II. 314) ఋషులవలనం బుణ్యకథలు వినుచున్న యవసరంబున; (ఆ
III. 103) వానివదనంబువలన వెలువడు ... భాషితంబులు; (ఆర. IV. 12
శక్రాసనంబువలనంబాసి (ఆర. IV. 133) ఆతనివలన నధ్యాత్మ రహస్యం
లెఱుంగి.

(ఆ) వలన ప్రత్యయముపై మఱల 'చేసి' అనుపదియు చేరును:

(ఆర. II. 312) క్రోధంబువలనంజేసి.

3. (అ) తారతమ్య ప్రమాణమునందు పంచమియందు 'కంటెన్'
అనునది వచ్చును. 'కంటెన్' అనునది కు + అంటెన్ అనువాని కూడి
వలన నేర్పడినది. 'కు' అనునది చతుర్థ్యర్థకమగు షష్ఠీ ప్రత్యయము. 'అంటెన్'
అనునది కన్నడమందలి, అకిన్త, 'అకిన్తా', 'అక్కన్త', 'అక్కన్తా', అను ప
మీవిభక్తి ప్రత్యయముయొక్క వికారము. కన్నడమందు 'అకింత' అనున
'కె' యను చతుర్థీవిభక్తి ప్రత్యయముపై 'ఇంత' అనుపదమును చేర్చు
వలన నేర్పడినది. 'కె' అనుదానికి తెనుఁగున 'కు' అను రూపము కలిగిన
ఇన్త అనునది 'ఇన్ను' అనుదానికి రూపాంతరము. దీనికి తెనుఁగున ఇంకను అ
రూపము 'శతమఖుకంటెను శతగుణ వీర్యుఁడు' అనఁగా 'శతమఖున కింక
శతగుణవీర్యుఁడు' అని యర్థము.

(ఆది. II. 83) శతమఖుకంటెను శతగుణవీర్యుండై; (ఆది. II. 172) అం
కంటె మిక్కిలి పాతకం బొండెద్ది; (ఆది. II. 189) వాని యిచ్చు ధనంబుకం

నాయందధికధనంబుఁ గొనిపొమ్ము; (ఆది. II. 223) యాజకోత్తముల కంటెం బ్రసిద్ధులు; (ఆది. V. 128) కార్తవీర్యకంటెను వీరుఁడు; (ఆది. VI. 253) పురుషుకంటె మున్ను పరలోక మేఁగిన సతియ నోఁచినదియు సతులలోన; (ఆది. VI. 259) మీకు నాయందయ్యెడు దౌహిత్ర లాభంబునకంటె మీరిద్దరు జీవించిన ననేక పుత్రపౌత్ర లాభంబగు; (అర. II. 280) యాగశతంబులకంటెఁ బ్రయాగనివాసము విశేషము.

(ఆ) 'కంటెన్' అనునది క్రియాజన్యవిశేషణములపైఁ గూడ వచ్చును.

(ఆది. VIII. 307) ఎలుకచేఁ జచ్చుటకంటె నీ జ్వలనశిఖులఁ గ్రాఁగి పుణ్యలోకంబులఁ గాంతుమేము.

(ఇ) 'కంటెన్' అనుదానిలోని 'కు' ప్రత్యయమే ముఖ్యమైనదని యీ క్రింది యుదాహరణములవలన తెలిసికొనవచ్చును:

(S. I. I. IV. 672) గాన్ధారికి సీతకుఁ శచికిఁదానధికంబు; (ఆది. III. 194) నలువురకుం గొండొకవానిని; (అర. I. 81) ఎల్ల నెయ్యమునకుఁ దల్లిదండ్రులయందు సుతులవలని నెయ్య మతిశయంబు; (అర. IV. 180) విత్తరక్షకుఁ గడుమేలు వృత్తరక్ష; (అర. II. 237) నీవ యెల్లవారికి నత్యున్నతుఁడవు; అర. II. 243) తీర్థగమనఫలంబు యజ్ఞంబులకు విశేషంబు; (అర. II. 52) (ఆది. ... గోసహస్రదానంబులకు నశ్వమేధ సహస్రంబునకు విశేషంబు.

**4. 'వలన'** అనుదానికి బదులుగా నన్నయభారతములో కృతమున, మూలమున మొదలగు సంస్కృతశబ్దములును కానవచ్చుచున్నవి:

(అర. I. 51) నీకృతమునఁ గౌరవాన్వయ మకిల్బిషకీర్తిఁ బ్రకాశితంబగుఁ.

**5.** ఉండి అనుక్త్వార్థకముకూడ పంచమ్యర్థపోషకమై, సప్తమీ విభక్తి ప్రత్యయముపై వచ్చును:

(ఆది. II. 221) తాల్చినయంతనుండి; (ఆది VII. 2) పురంబుననుండి; (ఆది. VII. 40) శృంగంబున నుండి భూమికి వచ్చి; (అర. II. 187) అయోధ్యనుండి సరి నిందులకాతని సారథినై వచ్చితి; (అర. II. 215) వాయుభట్టారకుఁడు ... ఆకాశంబున నుండి యిట్లనియె; (అర. II. 286) రోమశుండు దేవలోకంబుననుండి నీకడకువచ్చు; (అర. III. 83) హరుశిరంబందుండి ... ధరణితలంబున కరుగుదెంచు; (అర. III. 102) అడవినుండి ... ఫలంబులు గొని వచ్చి; (అర. III. 122) నీరిలోనుండి వెలువడి; (అర. IV. 40) నాకలోకంబుననుండి వచ్చె; (అర. II. 290) ఎందుండి వచ్చితిరి; (అర. III.) దేవి! యిద్దేవపథంబునందుండి వసుమతి కొందంగఁ జనుదేరవలయు.

6. (అ) కోలెక్ అను పదము పంచమ్యర్థమున కాలవాచి పదములపై వచ్చును:

(ఆది. II. 119, 20, 151, 134; ఆది. V. 90; ఆర. III. 127, 132 ఆర. IV. 119, మొద.); నాఁటంగోలెక్; (ఆది. VI. 128) మొదలింటంగోలెక్ (ఆది. VI. 192) అప్పటంగోలెక్; (ఆది. VIII. 118) నిన్నటఁగోలెక్; (ఆది VIII. 227) ఆదిఁగోలెను; (ఆది. VIII. 149) నూఱేండ్లంగోలె.

కోలెక్ అనునది కొల్, కోల్ అను ద్రావిడధాతువునుండి పుట్టినది ఈ ధాతువులకు పొడవు = length, విస్తారము = extension, అని యర్థము దీనినుండియే కొలచు = to measure, అను తెనుఁగుధాతువు పుట్టినది. దీని కొల అనునది తెనుఁగున ఇప్పటి విశేష్యరూపము. కన్నడమున దీనికి కొలె అని రూపము. కొలె, కోలె, అను రూపములు ప్రాచీనావస్థలో ననఁగా తెనుఁగు కన్నడము లేకభాషగా నుండినప్పుడు తెనుఁగునందును ఉండి, రానురాన విభక్తిప్రత్యయములుగా మాఱినవి. అకిత్తనుండి కంలెక్ అను రూపము పుట్టి విభక్తిప్రత్యయమైనప్పు డెట్లు ద్రుతప్రకృతిక మయ్యెనో, యట్లే కొలె, కోలె యనునవికూడ ద్రుతప్రకృతికము లైనవి. నాఁటంగోలెక్ అనఁగా నాఁటినుండి విస్తరించి నేఁటివఱకును అని యర్థము.

(ఆ) కోలెక్ అనునది అధ్వవాచిశబ్దములపైఁగూడ కానవచ్చుచున్నది

(ఆది. II. 40) దాని శరీరసౌగంధ్యంబు యోజనంబునంగోలె జనలకు నేర్పడునట్లుగాఁ బ్రసాదించిన ...

## షష్ఠీవిభక్తి.

(1) సంబంధార్థమున షష్ఠియందు 'అ' వర్ణమువచ్చును. కొన్ని సమాసములకు ఇవర్ణమును వచ్చును'. ఇవర్ణము పరమైనప్పుడు తత్సమశబ్దములందు ఏకవచనమున 'న' గాగమము వచ్చును: ఉదా. (S. I. I. V. 1054) నాయకుని: బహువచనమునం దీ నగాగమమురాదు. అవర్ణము పరమైనప్పుడు కూడ ఏకవచనమున ఈ నగాగమము విభక్తిక శబ్దములపై కొన్నియెడల వచ్చును

(S. I. I. IV. 1167) మలయమున బంటరాజు; (S. I. I. IV. 109 మఠమునతపస్సులు; (S. I. I. V. 9) నబ్బపురమున భావసరయణదేవర; (S. I. V. 82) నెరుత్యమునపాలమున; (S. I. I. V. 1089) బీఱట్టానవారు; (S. I. V. 1116) తొంటకలివ్రెరమునవారు; (S. I. I. IV. 1114) అనన్తారామము తూర్పునన తోణ్టా; (ఆది. I. 7) పరమండలంబులధరణీపతులక్; (ఆర. III 149) తపమునపేర్మిక్; (ఆది. IV. 58) తేజంబునవాఁడు; (S. I. I. V. 1 13, 15, 16, 17, 18, 19, 22, 23) చతుర్వేదిమంగ్గలమున శ్రీపురుషో

మమున వీరచోడవిన్నగ రాజ్ఞ్వారికి; (ఆది. II. 139) లోకమున తెరువు; (ఆది. II. 171) కుంభమున తోయములు; (ఆది. III. 27) అలసభావంబున పోలుపును; ఎలజవ్వనంబున విలసనమును; (ఆది. III. 195) యదువంశంబునవారు; తుర్వసు వంశంబునవారు; అను వంశంబునవారు; (ఆది. VI. 58) ఇట్టి దివ్యతేజమునవాఁ డధమాన్వయమునఁ బుట్టునె; (ఆది. VII. 132) అతని వంశమునవారు, (ఆది. VIII. 143) కులంబునవారు; వంశంబునవారు; (ఆది. II. 142) వ్రేలెడ మధమలోకమున తెరువు సనక; (ఆది. VI. 71) కాంపిల్యానగరమున జనులెల్లక; (ఆది. VI. 148) వారణావతమునవారు.

ఈ అవర్ణ ఇవర్ణములును నగాగమమును కొన్ని ఆచ్ఛికశబ్దముల మీఁదకూడ వచ్చును:

(S. I. I. V. 1108) తామరచెఱునవారు; (S. I. I. V. 17, 22) మగధరాయని పెట్టిన.

(2) సంబంధార్థమున సమాసములందు కొన్ని శబ్దములపై ఎట్టి ప్రత్యయమును సాధారణముగా చేరదు:

(ఆది. III. 109) నేర్పుపేర్మి, (ఆది. II. 37) ఉచ్చైశ్శ్రవంబు వాలంబు; (ఆది. V. 65) మృగంబు పలుకులకలిగి; (ఆది. V. 23) మంత్రంబుశక్తి; (ఆది. VIII. 201) పురము వీథులు; (ఆది. IV. 260) అన్నగరంబురాజు; (ఆది. III. 27) లలితాననేందు మండలము రుచి.

(3) ఔపవిభక్తికములపై ఉపవిభక్తులగు ఇ, టి, ంటి, తి వర్ణములు చేరిన రూపములే సంబంధార్థక షష్ఠియందు వచ్చును:

(S. I. I. V. 1346) తాంగొలనివారు; (S. I. I. V. 1277) ఈయూరివారు; (S. I. I. V. 1321) నాయకుతాలిపెట్టిన.

(4) డుమంతశబ్దముల సంబంధార్థకషష్ఠియందు డుజ్వరహితమయిన ఉకారాంత ప్రాతిపదిక రూపముకూడ వచ్చును:

(S. I. I. IV. 737) తపనురశ్మి; (S. I. I. V. 1138) పల్లినాయకు రేవినాయకు బెరసినకాంపులు; (S. I. I. V. 19) బోయువసమున; (S. I. I. V. 78) గుణ్డియబోయు కొన్నయెడ్లు; (ఆది. V. 234) ఏకలవ్యు సమీపంబున; (ఆది. II. 77) వినుతానుతుమీఁద; (ఆది. V. 88) శ్వేతకేతుతల్లి.

(5) సంబంధార్థక శబ్దము లనేకము లొకచే శబ్దముతో సంబంధించి యుండినయెడల నవి యన్నియు సంబంధ బోధకరూపములను పొంది యుండును.

త్రిభువనాంకుశమునవేమాన (ద్రాక్షారామ శాసనములు); (S. I. I. IV. 667) నాయకుల యిచ్చిన; (S. I. I. IV. 685, 927) తన కట్టించిన;

(S. I. I. IV. 687) తమ కట్టించిన; (S. I. I. IV. 929) ఆదిత్యచంద్రుల కలయంత్తగాలమ్ము; (S. I. I. IV. 1050) బుద్ధరాజులపెట్టిన; (S. I. I. IV. 1102) తమ పెట్టించిన సత్రమునకు; (S. I. I. IV. 1114) అనన్తారామమున తూర్పూన పోంక్క మ్రాంకులు; (S. I. I. IV. 1248) సింగ్గల భడారలపెట్టిన; (S. I. I. IV. 1339; C. S. I. I. V. 17, 22) మగధరాయనిపెట్టిన; (S. I. I. V.) చోడవలనాంటి ప్రోలునాంటి శుత్తమల్లి చతుర్వేది మంగ్గలమున శ్రీ పురుషోత్తమమున వీరచోడవిన్నగడాళ్వారికి; (S. I. I. V. 63) కొసణియబోఇని ఎఱ్ఱమబోఇని కామియబోఇని సూగియబోఇని బెరసిన నల్వురవససమున; (S. I. I. V. 78) గుణ్డియబోయకొన్న మెడ్లు; (S. I. I. V. 78, 79) ఆదిత్యచంద్రుల కలయన్తగాలము; (S. I. I. V. 1033) వీరిద్దఱపెట్టిన; (S. I. I. V. 1051) వీరికొన్నమాడలు; (S. I. I. V. 1138) పల్లినాయకు రేవినాయకు బెరసిన కాంపులు; (S. I. I. V. 1054) నాయకునిపెట్టిన, (S. I. I. V. 1321) నాయకుఱాలిపెట్టిన; (ఆది. I. 117) నీయానతిచ్చినట్లు; (ఆది. I. 118) వారి యనునయించు సితకృష్ణతంతురాజితయంత్రము; (ఆది. I. 125) ఒక్క కులపాంసను చేసినదానికి; (ఆది. II. 4) వారి కోరినయట్టులు; (ఆది. II. 113) నాకలతెఱంగు సెప్పెద; (ఆది. II 122) దాని యున్నస్థానంబు; (ఆది. II. 130) జనమేజయుని చేయు సర్పయాగమునకు; (ఆది. II. 144) నాపడియెడు నీ యవస్థ; (ఆది. II. 159) నామేల్కానునంతకు; (ఆది. II. 160) నీకు నాచేసిన సమయంబు; (ఆది. II. 172) తనచేసిన శాపస్థితి; (ఆది. II. 176) నీ యిచ్చిన శాపంబు; (ఆది. II. 181) తనచేసిన వ్యతిక్రమంబునకు; (ఆది. II. 176) పరీక్షితుం గాచినయట్లు; (ఆది. II. 192;) వాని యిచ్చుధనంబుకంటె; (ఆది. II. 224) వారి కోరిన కోర్కి; (ఆది. III. 141) తమ విహరించుచున్న యవ్వనంబునకు; (ఆది. IV. 39) నానేర్చు విధంబున, (ఆది. IV. 60) దాని కోరినవరంబు; (ఆది. IV. 73) నీయిచ్చినవరము; (ఆది. V. 105) అనిలజుపుట్టిన దివసము; (ఆది. VI. 34) అర్జునుచూపిన యస్త్రవిద్యలు; (ఆది. VI. 141) దుర్యోధను కఱపిన రూపున (ఆది. VI. 230) అమ్మునివరు కఱపినమార్గము; (ఆది. VI. 277) తమ విడిసిన బ్రాహ్మణునకైన యాపద; (ఆది. VII. 37) గంధర్వుని త్రిమ్మరియెడు ప్రొద్దులు; (ఆది. VII. 145) హింసచేసిన వారల యేఁగు గతికి; (సభా. II. 65) వసుదేవుచేయు నశ్వమేధము; ఆర. I. 5) పాండుసుతుల యరిగినచోటు; (ఆర. II. 344) అగస్త్య చెప్పినంతధనము; (ఆర. III. 31) నామఱలి వచ్చునంతకు.

ఇట్లే నన్నయ రచించిన నందంపూడి శాసనములో—

పూర్వతః ఇయ్యూరియుం బిల్లెమ పెద్దపూణ్డియుం బొలగరుసున పల్ల మున కొణ్డియగుంటసీమా, ఆగ్నేయతః ఇయ్యూరియుం బిల్లెమ పెద్దపూణ్డియు నెరపులయుం బొలగరుసున ముయ్యలికుట్ర సీమా, దక్షిణతః ఇయ్యూరియు నెరపులయుం బొలగరుసున తాడ్లచేవ సీమా, నైరిత్యతః ఇయ్యూరియు నెలపు లయు ముందరమునయుం బొలగరుసున ముయ్యలికుట్ర సీమా, పశ్చిమతః ఇయ్యూరియు ముందరమునయు మఱకుఱితియుం బొలగరుసున ముయ్యలి కుట్ర సీమా, వాయవ్యతః ఇయ్యూరియు మడకుఱితియుం బిల్లెమ పెద్దపూ ణ్డియుం బొలగరుసున ముయ్యలికుట్రున గొల్లచేవ సీమా, ఉత్తరతః ఇయ్యూ రియుం బిల్లెమ పెద్దపూణ్డియుం బొలగరుసున (యే)ఱువగడ్డయ సీమా, ఐశా న్యతః ఇయ్యూరియు (౦) బిల్లెమ పెద్దపూణ్డియుం బొలగరుసున మత్తితోడితాటి యొద్ద చింతయ సీమా.

రాజరాజ కోరుమిల్లిశాసనములో—

దక్షిణతః వానపల్లియు సంపుతటియయు మామణ్డాదియు సీమేవసీమా,

6. షష్ఠియందు 'కు' ప్రత్యయము చేరునని తెనుఁగు వైయాకరణులు చెప్పిరిగాని, వాస్తవముగా నది చతుర్థీవిభక్తి ప్రత్యయము. అరవములో నిది 'కు,' 'క్కు' అనియు, కన్నడములో 'కె' 'గె' అనియు ఉండును. ఆ భాష లలో నవి చతుర్థియందే వచ్చును. తెనుఁగునందును అవి సాధారణముగా చతుర్థ్యర్థమునందే వచ్చుచుండును. ఈ 'కు'వర్ణమునకు పూర్వమందు 'ఇ' కా రము వచ్చినయెడల 'కి' గా మాఱును:

(ఆది. 1. 7) అగ్రజన్ములకు, (విప్రులకు; (ఆది. I. 21) పద్యవిద్యకు; (ఆది. I. 33) ఆయురర్థులకు; (ఆది. 1. 38) దిక్కునకు; (ఆది. 1. 40; నగ రంబునకు; (ఆది. 1. 21) దేవతాతతికి; (ఆది. 1. 24) పాకశాసనికి; వీనికి, దానికి, వానికి మొద.

7. 'కు' ప్రత్యయము చతుర్థ్యర్థమున వచ్చుట కుదాహరణములు:

(ఆది. II. 125) బ్రహ్మకుం దపము సేసి; (S. I. I. V. 62) ఆచంద్రా ర్కతారమునకుఁగా; (ఆది. I. 42) శ్రీకృష్ణునింగని సహాయత్వంబునకుం బ్రార్థించిన.

8. 'కు' ప్రత్యయము పంచమ్యర్థమందు 'కంటెన్' అనుదానికి బదు లుగ వచ్చును:

(ఆది. III. 194) నలువురకుంగొండొకదానిని; (ఆర. !. 81) ఎల్ల నెయ్యములకుఁ దల్లిదండ్రులయందు సుతులవలని నెయ్య మతిశయంబు; (ఆర. II. 237) నీవ యెల్లవారికి నత్యున్నతుఁడవు; (ఆర. II. 243) తీర్థగమనఫలంబు యజ్ఞంబులకు విశేషంబు; (ఆర. IV. 130) విత్తరక్షకుఁగడు మేలు వృత్తరక్ష; (S. I. I. IV. 672) గాన్ధారికి సీతకున్నచికిం దానధికంబు.

పూర్వతః ఇయ్యూరియుం బిల్లెమ పెద్దపూణ్డియుం బొలగరుసు... ప...
మున కొణ్డియగుంటసీమా, ఆగ్నేయతః ఇయ్యూరియుం బిల్లెమ పెద్దపూణ్డి...
నరపులయుం బొలగరుసున ముయ్యలికుట్ర సీమా, దక్షిణతః ఇయ్యూరియు
నరపులయుం బొలగరుసున తాడ్లచేవ సీమా, నైరిత్యతః ఇయ్యూరియు నెలపు
లయు ముందరమునయుం బొలగరుసున ముయ్యలికుట్ర సీమా, పశ్చిమతః
ఇయ్యూరియు ముందరమునయు మఱకుటితియుం బొలగరుసున ముయ్యలి
కుట్ర సీమా, వాయవ్యతః ఇయ్యూరియు మడకుటితియుం బిల్లెమపెద్దపూ
ణ్డియుం బొలగరుసున ముయ్యలికుట్టున గొల్లచేవ సీమా, ఉత్తరతః ఇయ్యూ
రియుం బిల్లెమ పెద్దపూణ్డియుం బొలగరుసున (య్యే)ఉువగడ్డయ సీమా, ఐశా
న్యతః ఇయ్యూరియు (౦) బిల్లెమ పెద్దపూణ్డియుం బొలగరుసున మట్టితోడితాటి
యొద్ద చింతయ సీమా.

రాజరాజ కోరుమిల్లిశాసనములో—

దక్షిణతః వానపల్లియు సంపుతటియయు మామణ్డాదియు సీమేవసీమా

6. షష్ఠియందు 'కు' ప్రత్యయము చేరునని తెనుఁగు వైయాకరణులు చెప్పిరిగాని, వాస్తవముగా నది చతుర్థీవిభక్తి ప్రత్యయము. అరవములో నది 'కు,' 'క్కు' అనియు, కన్నడములో 'కె' 'గె' అనియు ఉండును. ఆ భాషలలో నవి చతుర్థియందే వచ్చును. తెనుఁగునందును అవి సాధారణముగా చతుర్థ్యర్థమునందే వచ్చుచుండును. ఈ 'కు'వర్ణమునకు పూర్వమందు 'ఇ' కారము వచ్చినయెడల 'కి' గా మాఱును:

(ఆది. 1. 7) అగ్రజన్ములకు, (విప్రులకు; (ఆది. I. 21) పద్యవిద్యకు (ఆది. I. 33) ఆయురర్థులకు; (ఆది. 1. 38) దిక్కునకు; (ఆది. 1. 40; నగరంబునకు; (ఆది. 1. 21) దేవతాతతికి; (ఆది. 1. 24) పాకశాసనికి; వీనికి దానికి, వానికి మొద.

7. 'కు' ప్రత్యయము చతుర్థ్యర్థమున వచ్చుట కుదాహరణములు:

(ఆది. II. 125) బ్రహ్మకుం దపము సేసి; (S. I. I. V. 62) ఆచంద్ర...మునకుఁగా; (ఆది. I. 42) శ్రీకృష్ణునింగని సహాయత్వంబునకుం బ్రార్థించిన

8. 'కు' ప్రత్యయము పంచమ్యర్థమందు 'కంటె' అనుదానికి బదులుగ వచ్చును:

(ఆది. III. 194) నలువురకుంగొండొకదానిని; (ఆర. I. 81) ఎల్ల...ఖ్యములకుఁ దల్లిదండ్రులయందు సుతులవలని నెయ్యమతిశయంబు; (ఆర. II. 237) నీవ యెల్లవారికి నత్యున్నతుఁడవు; (ఆర. II. 243) తీర్థగమనఫలంబు ...ణంబులకు విశేషంబు; (ఆర. IV. 130) విత్తరక్షకుఁగడు మేలు వృత్తరక్ష (S. I. I. IV. 672) గాన్ధారికి సీతకున్నచికిం దానధికంబు.

9. ‘కు’ ప్రత్యయము చేరునప్పుడు సందర్భానుసారముగ అర్థభేదము కలుగుచుండును:

(ఆది. II. 60) కుత్తుకకుడిగక; (ఆది. II. 156) నామేల్కనునంతకుఁ; (సభా. II. 60) నిండునంతకుఁ=వఱకు; (ఆది. VI.69) చనుదెంచునంతకుమందఱ; (అర. III. 270) కొలంకులకుఁజొచ్చిన; (S. I. I. IV. 675) నుతికెక్కెఁ; (S. I. I. IV. 1073) ఆరామంబులకెల్ల నాయకము; (ఆది. II. 127) సర్పకులప్రణయంబునకు వెఱచి; (S. I, I. IV. 1123) ఆచంద్రార్కకుఁ మునకిచ్చె.

10. అనుగ్రహించు, సహించు, సైఁచు, అలుగు, భీతిలు, వెఱచు, వివాహమగు, వరియించు, కరుణించు, శరణమగు, శోకించు, పాయు, మాఱ్కొను, ఎదురు, సంతసిల్లు, సంతోషించు, ప్రీతులగు, కూర్చు, చనుదెంచు, మెచ్చు, చేయు—మొదలగు ధాతువులును తదర్థకములగు ధాతువులును ప్రయుక్తములయినప్పుడు ‘కు’ ప్రత్యయముతో షష్ఠీకారక ముపయోగింపఁబడును:

(ఆది. I.) పౌష్యునకు ననుగ్రహించి; (ఆది. V. 31) ఈ యపరాధంబు నాకు సహింపవలయు; (ఆది. III. 211) యయాతి గర్వంబునకు సహింపక యింద్రుండలిగి; (సభా. II. 59) మఱందికి ... అపరాధ శతంబుసైఁపుము; (ఆది. III. 98) యయాతికినలిగి; (ఆది. III. 39,) దీని కొడంబడనినాఁడునా కలిగియిమ్మని శాపంబిచ్చునోయని వెఱచి; ఆది. III. 187, శుక్రుండు యయాతికి నలిగి; (ఆది. II. 7) వినుతకునలిగి; (ఆది. I. 156) అతం డులికిపడి నాకలిగి శాపంబిచ్చె; (ఆది. I. 153) పాముల కేలయల్గితివి; (ఆది. I. 151) అపకారము సేసిన పాములకలిగి; (ఆది. IV. 123) కమలయోనికిఁ గరమల్గి; (అర. II. 179) నాకు నలుగవలదు; (ఆది. IV. 229) ప్రద్వేషిణి ... దీర్ఘతమునకు నలిగి; (ఆది. IV. 225) వానికి నలిగి బృహస్పతి; (ఆది. IV. 191) ఆక్షేపించుచున్న వానికలిగి చిత్రాంగదుండు ... వచ్చినఁ; (ఆది. V. 55) మృగంబుల పలుకుల కలిగి; (ఆది. II. 229) నాస్త్రీకున కందఱు భీతులైరి; (ఆది. II. 150) నాకు సనాభియైనదాని వివాహంబు గావలయు; (అర. III. 59) మీకు వెఱవనేల; (ఆది. II. 127) సర్పకుల ప్రళయంబునకు వెఱచి; (ఆది. I. 130) ఇది నాకుఁదొల్లి వరియింపఁబడిన భార్య; (ఆది. III. 6) జనమేజయునకుం గరుణించి కృష్ణద్వైపాయనుండు; (ఆది. VI. 138) మహా తపోనిధి మీకుం గరుణించు నితనిం బ్రార్థింపుఁడు; (అర. I. 86) ఇంద్రుండు దానికిం గరుణించి; (అర. IV. 222) నాకుం గరుణించి మునివరుండు; (అర. II. 180) నాకుం గరుణింపుము; (ఆది. II. 46) శరణంబు నాకగుము; (ఆది. III.119) అక్కఁచు

నకే శోకింప కెట్లుఁగడుదుర్; (ఆది. VIII. 169) పాపములుఁబాసె భృశంబుగ నాకు నచ్యుతా; (ఆది. VIII. 46) వానికి మార్కొనంగర్; (అర. III. 353) మాకు ... మార్కొనునంత వీరులు లేరు; (అర. IV. 88) హరి కిభంబులు మార్కొనునయ్యె; నీకు మార్కొనంగ నోపరు; (అర. II. 329) అమ్ముదితకు సంతసిల్లి; (అర. IV. 52) నాకు సంతోసిల్లి; (అర. II. 164) ఎట్లయేని కూర్తు రింతులు మాకని; (అర. II. 165) సాధ్వినాకుఁగూర్చు సంతతిగలయది; (అర. III. 377) గురుభుజుండ నాకుఁగూర్తేని, (అర. III. 260) దీనికి నెవ్వరుం జను దేర నోడుదురు, (ఆది. II. 226) నాస్త్రీకునకందఱుఁ బ్రీతులయి; (అర. IV. 133, ధర్మనందనున కతిప్రీతుండై, ఎఱుకు విలువిద్యకలిమికి హీనుఁడయ్యె; (ఆది. III. 26) ఉపరిచరునకు మెచ్చి; (అర. I. 55) ఇతని నియోగంబు మనకు జేయుకునికిఁ మానుషంబె.

11. తరువాతికాలమున షష్ఠీకారకము వచ్చినచోట నన్నయగ్రంథములో ఇతర కారకము కనఁబడుచున్నది:

(అది. II. 36) ఇద్ధారుణికి హితంబుగ దుష్టోరగ సంహారమిప్పు డోడం బడ వలసెన్; (ఆది. IV. 22) చల్లనిగాడ్పానపడి = గాడ్పునకు; (ఆది. IV. 26) వేటవచ్చి = వేటకు; (ఆది. VIII. 251) కార్యంబు గడంగకున్న వార ము = కార్యంబునకు; (అర. II. 223) వానిన కడంగుము; (అర. II. 16) దమయంతి యంతికంబున వచ్చి విహరించుచుండె.

12. తరువాతి కాలమున ప్రథమలో నుపయోగింపఁబడు శబ్దములు కొన్ని నన్నయగ్రంథములో షష్ఠియందు ప్రయోగింపఁబడినవి:

(ఆది. II. 169) పరీక్షిజ్జనపాలు చనుట.

13. అట, ఇట ఎట, అను నవ్యయములపై తరువాతి కాలమున 'కు' ప్రత్యయము చేరుచోట్ల నన్నయగ్రంథములో నట్లు చేరియుండ లేదు:

(ఆది. II. 210) ఇటయేలవచ్చితి; (అర. II. 184) రాజులిట యెవ్వరు వచ్చినవారు లేరు; (అర. II. 77) ఎటయేనియుం బోయెద; (అర. II. 107) ఇచ్చనుప యెటవ్రాయెదు; (అర. III. 72) తానపోయెనో నీ వెటయేని పుచ్చితో.

అక్కడ, ఇక్కడ, ఎక్కడ, అను నవ్యయములమీఁదఁ గూడ నీవిధి కొన్నిచోట్ల నన్నయగ్రంథములో కానఁబడుచున్నది:

(ఆది. II. 167) మృగం బమ్మౌనితోన వచ్చె నదియొక్కడం బాఱె; (అర. II. 128) ఎక్కడం గదలనేరకున్నవాఁడ; (అర. III. 245) ఎక్కడఁ బోయిరి.

(ఆది. VI. 157); కొలనన్ (ఆది. VI. 224, సభా. I. 233, అర. III. 227); చేతన్ (ఆది. VI. 260); చదలన్ (ఆది. VII. 285; ఆది. VIII. 10; అర. I. 161; 180; అర. II. 67); చోటన్ (ఆది. III. 37; ఆది. IV. 224; ఆది; V. 192; ఆది. VI. 211; ఆది. VIII. 46); మొద.

(3) సప్తమియందు 'అందు' అను నవ్యయమును వచ్చును :—

(అ) నాదిండ్లఅందు (S. I. I. IV. 672); విశ్వంభరయందు (S. I. I. IV. 1169); చరితలందు (సభా. I. 56); లతలందు, ద్రుమములందు, వనములందు (ఆది. V. 143); గ్రామమునన్దు (S. I. I. V. 1342); సన్నిధానమునందు (S. I. I. V. 62); శిఖరమునందు (S. I. I. V. 1081); తరుషండములయందు (ఆది. V. 143); శాకలమునయందు (సభా. I. 265); లోకంబునయందు (ఆది. VII. 41); ముదితయందు (ఆది. III. 28); అనిమిషపతియందు గురుంబోలె (S. I. I. IV. 675); సంక్రాంతియందు (S. I. I. IV. 667 935); సర్పయాగమునందు (ఆది. II. 127); (ఆది. V. 90); పురాణములందు.

(ఆ) ఈ క్రింది ఉదాహరణములలో 'అందు' అనునది వివిధార్థములందు ప్రయోగింపఁబడినది.

(అర. I. 317) అవివేకియందు ప్రయుక్తంబులయిన సుభాషితంబులుంబోలె వీనియందు నిష్ఫలంబు లగుచున్నయవి; (అర. III. 390) అతిథివై వచ్చి నీవు మాయందుగుడిచి; (ఆది. V. 34) తాల్మియందు బృథివింబోని దాని; (అర. III. 71) రాజ్యభారం బంశుమంతునందు సమర్పించి; (అర. III. 72); దిలీపునందు రాజ్యభారముపూన్చి; (ఆది. II. 192); వాని యిచ్చు ధనంబుకంటె నాయం దధికధనంబు గొనిపొమ్ము.

(ఇ) సాధారణముగా 'అందు' అనునది 11-వ శతాబ్దమున ప్రత్యేకముగ నవ్యయముగానేయుండి, అప్పుడప్పుడే విభక్తిప్రత్యయముగ ఏర్పడుచుండెను. 'అట్టియందు' (సభా. II. 42; అర. I. 372) అనుచోట 'అందు' అనునది స్థలార్థమందే యుపయోగింపఁబడినది:—ఇట్లే 'ఎల్లయందు నధిక సాత్త్వికుఁ డాస్తీకుఁడనఁగ జనులు (ఆది. II. 164) ఆది. II. 159); ముందఱున్నయంద యుండి (ఆది. VI. 153).

(4) కలుగు, పోవు, పొందు, మొదలగు ధాతువులు ప్రయుక్తములయినప్పుడు సప్తమీకారక ముపయోగింపఁ బడును :

(S. I. I. IV. 672) అనురాగచిత్తమునంగల్గి; (S. I. I. V. 1315) పాతకానంబోదురు; (ఆది. VII. 72) అంగమునఁబొందిన విభూషణశ్రీ;

(ఆది. VII. 74) అనిమిషత్వంబునం బొందిన తన నయనంబులు; (ఆది. III. 221) దేవత్వంబునంబొంది విశుద్ధజ్ఞానులయి ముక్తులగుదురు; (ఆది. IV. 190) అతి మనోరాగంబునం బొంద శాంతనవుండు; (ఆది. II. 212) జ్ఞానంబునం జేసి యుపశమనంబునం బొందుము; (పద్మంబు) నీరం బొందనియట్లు.

5. 'అందు' శబ్దముపై 'ఉల' అనునది చేరి షష్ఠీరూప మేర్పడును. దానిపై తిరిగి 'న్' చేర్చుటవలన సప్తమీరూప మేర్పడుచున్నది. ఇట్లే 'ఇందు' 'ఎందు' అను శబ్దములకుఁగూడఁ గలుగును:

ఇందులన్ (అర. III. 227).

6. (అ) 'న్' చేరునప్పుడు 'ద్వారా' అను నర్థమును వచ్చును:

(ఆది. I. 102) భూవివరమునన్.

(ఆ) 'న్' చేరునప్పుడు 'తరువాత' అను అర్థమును వచ్చును:

(ఆది. II. 161) కౌరవాన్వయ పరిక్షయమున నుదయించి ప్రథఁబరీక్షితుఁడునాఁ బరగువాఁడు.

(ఇ) "ద్రౌపదియందు సమయక్రియ" (ఆది. i. 34);-అనగా ద్రౌపదికి చేసిన ప్రతిజ్ఞ అని యర్థము.

(ఈ) 'అందు' అనుదానికి 'విషయమున' అను నర్థమును వచ్చును:

(ఆది. V. 34) తాల్మియందు పృథివిఁబోనిదాని.

## సంబోధన ప్రథమ.

1. డుజంతములయిన శబ్దముల 'డు' వర్ణముమీఁది ఉత్వమునకు బదులు ఏకవచనమున సంబోధనయందు అత్వముగాని ఆత్వముగాని కలుగును:

(ఆది. VII. 60) సత్యభాషణుండ; (సభా. II. 312) ఇందుకులుఁడ!

2. ప్రథమైకవచన ప్రాతిపదికములు అకారాంతము లయినయెడల, అవి సంబోధనమందు అకారాంత ప్రాతిపదికరూపములనే పొందియుండును. ఈ అత్వమునకు దీర్ఘమును కలుగును:

(ఆది. I. 125) ధీయుత! (ఆది. II. 33) దానవసూదన! (ఆది. II. 111) దేవగణేశ! (ఆది. II. 150) మునిశ్రేష్ఠ! (ఆది. III. 128) మహా దేవకులావతంస! రవితేజ! (ఆది. I. 116) తపోమహిమా! (ఆది. II. 33) పాకశాసనా; (ఆది. II. 58) భయరహితా! (ఆది. II. 220) పారిక్షితా! (సభా. I. 126) కౌరవేశ్వరా!

3. ప్రథమైకవచనమున ఇకారాంత రూపములఁ బొందియున్న శబ్దముల ఇకార, ఉకారము లట్లే సంబోధనమందును నుండును. ఈ ఇతోత్వములకు దీర్ఘమును కలుగును:

(ఆది. I. 152) హరిహరి! (ఆది. II. 104) దైత్యభేదీ! (ఆది. III. 130) తరుణీ !

4. సంస్కృతమున ఉకారాంతములయిన శబ్దములపై డుఙ్బురాకుండ, దానిపూర్వమందలి ఉత్వము సంబోధనమం దట్లే నిలుచుటయు, కొన్నియెడల ఆ ఉత్వమునకు దీర్ఘము వచ్చుటయుఁ గలుగును:

(ఆది. II. 150) జరత్కారూ ! మునిశ్రేష్ఠ!

5. బహువచన సంబోధనమునందు బహువచనరూపమే నిలుచును:

(ఆది. IV. 185) వినుఁడు ప్రసిద్ధులైన పృథివీపతులందఱు; (ఆది. IV. 3:4) రక్కసులు! మనుజులఁ దినకుండుఁడు.

6. సంబోధమున బహువచనమున 'ఆర' అను ఆగమము కూడ వచ్చును:

). VII. 207) వేల్పులార ! భూసురేశులార! (సభా. II. 244) ధన్యులార! యేను దాసినే దాసినే నెఱుఁగఁజెప్పి పనుపుఁ డెల్లదానిన్.

7. 11-వ శతాబ్దపుఁ దెనుఁగు భాషలో సంబోధనమునందు 'ఓ' 'ఓయి' 'ఓరి' 'ఓసి' అనునవి కానరాలేదు.

# VII. సర్వనామ ప్రకరణము.

## ప్రథమభాగము

[ఈ క్రిందిపదముల తరువాత నీయఁబడిన సంఖ్యలు ఆయా పదములు నన్నయ రచించిన భారతభాగమున నెన్నిసార్లు వచ్చినవో తెలుపును. దక్షిణ హిందూదేశశాసనములనుండి తీసికొన్న ఉదాహరణములకు S. I. I. అను గుఱుతు ఉంచఁబడినది.]

### ఉత్తమపురుషము.

### ఏను.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్రథమ: | ఏను (329) | ఏము (47) (ఏము S. I. I. IV. 1186) మేము (6) |
| ద్వితీయ: | నన్ (2) ననున్ (3) నన్ను (65) నన్నున్ (89) | మమ్ము (12) మమ్మున్ (12) |
| తృతీయ: | నాచేత (3) నాచేతన్ (3) నాచేతను (1) నాతో (5) నాతోన్ (8) నాతోడన్ (5) | మాచేత (1) మాచేతన్ (1) మాతో (1) మాతోన్ (2) మాతోడ (1) |
| చతుర్థి: | నాకై (1) | |
| పంచమి: | నావలన (1) నావలనన్ (1) నాకంటె (1) నాకంటెన్ (3) | మాకంటెను (1) |
| షష్ఠి: | నా (230) నా (S. I. I. IV. 1133) నాకు (178) నాకున్ (127) నాదు (3) నాదగు (2) నాదయిన (1) | మా (58) మా (S. I. I. IV. 1123) మాకు (46) మాకున్ (80) |
| సప్తమి: | నాయందు (11) | మాయందు (7) మాలోనన్ (1) మాలోనందు (1) |

నీవు + నేను = మనము; నేను + నీవు కాక నాప్రక్కవారు = మేము

ప్ర. మనము (7); ద్వి. మనలన్ (4); తృ. మనచేత (1); మనతోన్ (1); మన (12); మనతోడి (1); ష. మనకు (16); మనకున్ (110); స. మనయందు (2).

## మధ్యమపురుషము.

### ఈవు, నీవు.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. | ఈవు (119) నీవు (202) | ఈరు (3) ఈరల్ (1) మీరు (57) మీరలు (15) |
| ద్వి. | నిన్ (1) నినున్ (3) నిన్ను (48) నిన్నున్ (50) | మిమ్ము (15) మిమున్ (7) మిమ్మును (2) |
| తృ. | నీచేన్ (1) నీచేత (7) నీచేతన్ (11) నీతోన్ (5) నీతోడ (1) నీతోడన్ (4) | మీచేన్ (1) మీచేత (2) మీతోన్ (1) మీతోడ (3) |
| పం. | నీకంటెన్ (2) నీవలన (1) నీవలనన్ (4) | మీకంటెన్ (1) |
| ష. | నీ (346) నీకు (156) నీకున్ (85) నీకును (10) నీదు (8) నీదగు (2) నీదయిన (2) నీదైన (1) | మీ (84) మీకు (47) మీకున్ (22) మీకునున్ (1) మీదగు (2) మీదైన (2) |
| స. | నీయందు (16) | మీయందు (4) మీలోనన్ (2) |

## ప్రథమపురుషము.

పుంలింగము: వాఁడు, అతఁడు, అతండు, ఆతఁడు, ఆతండు.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. | వాఁడు (253) వాండు (S. I. I. IV. 989) అతఁడు (25) అతండు (23) ఆతండు (39). | వారు (195) వారలు (56) వాణ్డ్రు (S. I. I. IV. 1015) అతఁడు (11) |
| ద్వి. | వానిన్ (112) వానిని (6) అతనిన్ (17) అతనిని (1) ఆతనిన్ (32) | వారిన్ (85) వారిని (7) వారలన్ (154) వారలను (1) |
| తృ. | వానిచేన్ (1) వానిచేత (1) వానిచేతన్ (8) అతనిచే (1) అతనిచేత (3) ఆతనిచేతన్ (1) వానితో (1) వానితోడ (1) వానితోడన్ (2) అతనితో (2) అతనితోడన్ (3) అతనితోడ (1) ఆతనితో (1) ఆతనితోన్ (1) | వారిచేత (1) వారిచేతన్ (2) వారలచే (1) వారలచేన్ (1) వారలచేతన్ (2) వారలతో (4) వారలతోన్ (2) వారితోడ (3) వారితోడన్ (1) వారితో (3) వారితోన్ (2) వారలతోడన్ (1) |

| | ఏక | బహు |
|---|---|---|
| పం. | వానికంటె (1) వానివలన (2) అతనివలన (2) ఆతనివలన (1) ఆతనివలనన్ (2) | వారికంటెన్ (2) వారలకంటె (1) వానివలన (1) వారివలనన్ (1) వారలవలన (5) |
| ష. | వాని (100) (S. I. I. IV. 1039) అతని (30) ఆతని (34) ఆతని (S. I. I. IV. 1039, 737) | వారి (42) వారి (S. I. I. IV. 1133) వారల (31) |
| | వానికి (79) వానికిన్ (45) వానికిని (1) అతనికి (23) ఆతనికి (S. I. I. IV. 943, 945), అతనికిన్ (5) అతనికి (23) ఆతనికిన్ (7) (S. I. I. IV. 1073) ఆతనికిని (S. I. I. IV. 1039). | వారికి (55) వారికిన్ (38) వారికిని వారలకు (44) వారలకున్ (6) |
| స. | వానియందు (2) అతనియందు (2) | వారియందు (2) వారలందు (1) వారిలో (1) వారిలోపల (1) వారలలో (2) వారలలోన్ (1) వారలలోనన్ (1) వారియందు (S. I. I. IV. 1029) |

వీఁడు, ఇతఁడు, ఇతండు, ఈతఁడు, ఈతండు.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. | వీఁడు (27) ఇతఁడు (8) ఇతండు (7) ఈతఁడు (16) ఈతండు (7) | వీరు (15) వీరలు (15) (S. I. I. IV. 974) |
| ద్వి. | వీనిన్ (21) ఇతనిన్ (14) ఈతనిన్ (5) | వీరిన్ (11) వీరలన్ (10) |
| తృ. | వీనిచేతను (2) ఇతనిచేతన్ (1) ఇతనితోడన్ (1) | వీరిచేతన్ (1) |
| పం. | వీనికంటె (1) | వీరికంటెన్ (1) వీరలవలనన్ |
| ష. | వీని (7) వీని (S. I. I. IV. 1199) ఇతని (5) (S. I. I. V. 1014) ఈతని (6) వీనికి (2) వీనికిన్ (1) ఇతనికి (1) ఈతనికి (1) | వీరి (1) వీరి (S. I. I. IV. 1186 1098) వీరల (7) వీరికి (5) వీరికిన్ (2) వీరిక (S. I. I. V. 66) వీరలకు (S. I. I. V. 1107) |

| | ఏక | బహు |
|---|---|---|
| | ఈతనికిన్ (1) | |
| స. | ... ... ... | వీరిలోన్ |

*వీర = వీరే (S. I. I. IV. 1132, 1120, 1224).

అది

### మహతీవాచకము.

ఏకవచనము.

ప్ర. అది (72); ద్వి. దానిని (2); దానిఁ (90); తృ. దానితోన్ (1); పం. దానివలన (1); ష. దాని (50); దానికి (53); దానికిఁ (13); స. దానియందు (5).

దీనికి బహువచనము పుంలింగమునకువలెనే. క్రియలయందు 'దానను' 'దానవు' 'అది' అనియగును.

ఇది

ప్ర. ఇది (25); ద్వి. దీనిఁ (16) దీనిని (1); ష. దీని (7) దీనికి (4) దీనికిఁ (1) స. దీనియందు (1).

దీని బహువచన రూపములు పుంలింగమునందువలెనే.

### మహతీతరామహద్వాచకము.

అది, ఇది.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. | అది (196), అయ్యది (2) ఇది (263) ఇయ్యది (1) | అవి (34) ఇవి (20) |
| ద్వి. | దానిఁ (217) (S. I. I. IV. 1186) దానిని (2) దీనిఁ (103) దీనిని (2) | వానిన్ (33) వీనిన్ (12) (S. I. I. IV. 993, 945, 992; S. I. I. V. 63); |
| తృ. | దానిచేతన్ (1) దానితోన్ (2) దీనితోన్ (1) | |
| పం. | దానన్ (13) దానంజేసి (5) దానఁజేసి (2) దాననచేసి (2) దీనంజేసి (1) దీననచేసి (2) దీన (1) దీనన్ (15) దీనివలన (1) దీనికంటెన్ (1) | వానివలన (1) |

| | ఏక | బహు |
|---|---|---|
| ష. | దాని (29) దానికి (26) దానికిన్ (7) దీని (19) దీనికి (S. I. I. IV. 989, 1156;) దీనికిన్ (9) దీనికిన్ (S. I. I. IV. 1011; S. I. I. V. 1016). | వాని (4) వానికి (3) వీనికి (2) |
| స. | దానిలోన్ (3) దానిలోపలన్ (1) దీనిలోన్ (1) దీనియందు (1) దీనన్ (1) * దీనిక = దీనికే (S. I. I. IV. 1080). | |

తాను.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. | తాన్ (4) తాను (146) | తారు (13) |
| ద్వి. | తన్ (1) తనున్ (2) తన్ను (3) తన్నున్ (7) | తమ్ము (8) తమ్మున్ (5) |
| తృ. | | తమతోడన్ (1) |
| పం. | తనవలన (2) | |
| ష. | తన (304) (S. I. I. IV. 345, 974, 737); తనకు (50) S. I. I. IV. 974); తనకున్ (23) తనకును (1) (S. I. I. V. 1125); తనకుఁ (S. I. I. IV. 1007); | తమ (37) (S. I. I. IV. 687, 1158, 1314, 1228, 1325). (S. I. I. V. 1037); తమకు (1) (S. I. I. IV. 992); తమకుఁ (1) తమలో (7) తమలోన్ (11) తమలోనన్ (4) |
| స. | తనయందు | |

ఎవ్వాఁడు.

మహదర్థకము.

ప్రశ్న, సంబంధార్థములు.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. | ఎవ్వాఁడు (18) ఎవ్వాండు (6) | ఎవ్వరు (44) ఎవ్వారలు (1) |
| ద్వి. | ఎవ్వనిన్ (1) | ఎవ్వరిన్ (6) |
| తృ. | ఎవ్వనితోడన్ (1) | ఎవ్వరిచేతన్ (2) ఎవ్వరిచేన్ (1) ఎవ్వరితోడన్ (2) |

పం. ... ... ... ఎవ్వారివలనన్ (2) ఎవ్వారివలనను (2) ఎవ్వారికంటె (1) ఎవ్వారికంటెన్ (2)

ష. ఎవ్వని (7) ఎవ్వనియేని (1) ఎవ్వారి (6) ఎవ్వారికిన్ (8) ఎవ్వారికి (5) ఎయ్యేని (1) ఎవ్వారికిని (7)

ఏది.

మహత్మ్యమహాదర్థకము.

ప్రశ్న, సంబంధార్థకము.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. | ఏది (2) ఏయది (4) ఎద్ది (37) ఎయ్యది (11) ఎయ్యేది (1) | ఎవ్వి (3) |
| ద్వి. | ... ... ... | ఏవానిన్ (1) |
| పం. | ఎద్దానివలన (1) | |

ద్వితీయభాగము.

(1) ఉత్తమ పురుషైకవచనమందు 'ఏను' అనునదియే కాన్పించు చున్నది. 'నేను' అని కొన్నిముద్రిత ప్రతులయం దున్నను, వ్రాతప్రతు లలో 'ఏను' అనియే యున్నది.

అచ్చుపాఠము.

(ఆది. VII. 102) విశ్వామిత్రుఁడు నేను క్షత్త్రియుండ ...

వ్రాతప్రతులు.

విశ్వామిత్రుం డేనుక్షత్త్రియుండ.

అచ్చుపాఠము.

(ఆది. I. 55) హరిపరాక్రమ నేను గిందముఁడన్మునిన్

వ్రాతప్రతులు.

హరిపరాక్రమ యేను గిందముఁ డన్మునిన్

అచ్చుపాఠము.

(సభా. II. 122) లక్ష్మియెల్లను నీకు - న్నేనపహరించియిత్తు ...

[ఇందు అన్నేటితరఁగలన్ (ఆది. VIII. 79); అన్నిష్టసఖి (ఆది. III. 140); అన్నసుర (ఆది. II. 3); ఎన్నఢున్నేని (ఆది. VII. 141); మొదల

లగు వానియందువలె ద్రుతముపై అచ్చుపరమగునపుడు 'న' కారమునకు ద్విత్వము వచ్చినది. నీకున్ + ఏన్ = నీకున్నేన్ ?

అచ్చుపాఠము.

(సభా. II. 240) మీ వివాదమెఱిఁగి తీర్పు గుణశ్రేష్ఠుఁ డితఁడొ నేనొ.

వ్రాఁతప్రతులు.

... ...ఇతఁడొ యేనొ.

అచ్చుపాఠము.

(అర. I. 365) వ. దేవతలకు నెట్లునడచిన నెగ్గులేదు నేను గర్మభూమిని జనియించి.

వ్రాఁతప్రతులు

... ... నెగ్గులే దేను గర్మభూమిని జనియించి.

2. ఉత్తమపురుష బహువచనరూపముగ 'నేము' అనునది (ఆది. VII. 140) వ. 'నీ రోషంబు విడువుము నేమసమర్థులమై' అని ముద్రితప్రతులయం దున్నను, వ్రాఁతప్రతులలో 'విడువు మే మసమర్థులమై' అనియే ఉన్నది.

(3) (సభా. II. 174) 'అనఘ మా మామ శకుని నా-కై కడంగి' అను చోట 'కై' అనునది చతుర్థీవిభక్తి ప్రత్యయమైనట్లు తోఁచును. కాని, దానిని 'కు+అయి' అని పదచ్ఛేదము చేయవలయును. 'అయి' అనఁగా 'సహాయపడి' అని అర్థము చెప్పుదురు. ఇట్లే,

(సభా. II. 38) చైద్యునకై పూని, అనుచోట. 'చైద్యునకు+అయి' అని పదచ్ఛేదమనియు, 'చైద్యునకు తోడ్పడి' అని అర్థమనియుఁ జెప్పుదురు.

(అర. II. 216) 'సుధాంశుఁడుం గమలహితుండు నేనువయి' అను చోట 'ఏనున్+అయి' అని పదచ్ఛేదముచేసి 'ఒండొరులకు తోడ్పడి, కలసి' అని అర్థము చెప్పుదురు.

(4) (అ) నా, మా, నీ, మీ, తన-అను షష్ఠీవిభక్తి రూపములపై 'దు' వర్ణకము చేరుచుండును. కొన్నియెడల ఈ 'దు'వర్ణకముపై మఱల 'అగు, అయిన, ఐన' అను క్రియా విశేషణములును చేరుటకలదు.

నాదు, నాదగు, నాదయిన; నీదు, నీదగు, నీదయిన; మీదయిన; తనదు, తనదగు, తనదైన—అను రూపములు నన్నయ భారతభాగమున కాన్పించుచున్నవి.

(ఆ) వాని, వారి; వీరి; దాని—అనువానిపై కొన్నియెడల 'ది'వర్ణకమును కొన్నియెడల 'ది'వర్ణకముపై మఱల 'అగు, అయిన, ఐన' అను క్రియావిశేషణములును షష్ఠియందు కాన్పించును.

వానిదయిన; వారిదయిన; వీరిది; దానిదైన; ... ..

(5) (అ) 'అదె! ఇదె!'-అనునవి 'అటుచూడుము, ఇటుచూడుము' అను నర్థములందు వాడఁబడియున్నవి.

(ఆ) 'అదిమొదలు' అనుచోట 'అది' అనఁగా ఆ సమయమని యర్థము.

(ఇ) 'అందుచేత' అనుటకు నన్నయ 'అదిగావున' 'అది గారణంబుగా' అని వాడియున్నాఁడు.

(ఈ) 'ఇదియవసరంబయ్యె' అనుచోట 'ఇది' అనగా 'ఈ కాలము' అని యర్థము.

(ఉ) క్రియలయందు 'చేయుచున్నయది' యని వర్తమానార్థమునందును, 'చేయునది' అని విధ్యర్థమునందును, 'తిరుగునదిముందఱ' అనునట్టిచోట్ల 'తిరుగుచుండఁగా' అను నర్థమునందును, 'అది' అనుపదము వాడఁబడియున్నది.

(ఊ) 'ఆదిపర్వం బది వినఁగానొప్పు భారతాద్యంబగుచున్'. (ఆది. I. 35) ఇట్టిచోట్ల 'అది' అనునది ఊఁతపదముగా ఉపయోగింపఁడినది.

(ఆది. V. 6) హస్తిపురంబది రాజధానిగాన్.

(6) (అ) 'వాఁడు' అనుసర్వనామము 'అది' వలెనే క్రియారూపములందు-

(i) వర్తమానార్థకముగను: చేయుచున్నవాఁడు.

(ii) విధ్యర్థకముగను: చేయువాఁడు=చేయువలెను.

(iii) 'ఆపని చేయుచుండఁగా' అను నర్థమందును: (అరుగువాఁడు ముందఱ=పోవుచుండఁగా).

వాడఁబడియున్నది.

(ఆ) 'వీరు' అనుసర్వనామము ఏకవచనమునకు బదులుగ పూజార్థమం దుపయోగింపఁబడును:

(ఆది. VII. 237) "వీరు కుంతీ మహాదేవులు"

(ఇ) 'వీరు' అనునది నింబార్థమందును నుపయోగింపఁబడినది:

(ఆది. VI. 89) వీ రెవ్వరయ్య ద్రుపదమహారాజులె?

(ఈ) (అర. II. 202) అది (దమయంతి) నిజజననికిట్లనియె-నైషధుండు వాఁడిట వచ్చువాఁడో?—ఇచట పూజయో, నిందయో తెలియరాకున్నది.

(7) (అ) తనకుఁదాన (ఆది. II. 7; ఆది. IV. 77, 265; సభా. II. 115); 'తమకుఁదామ' అనునవి తనంతటతానే, తమంతటతామే అనునర్థములందు వచ్చును.

(ఆ) తమతమ, తమతమకు-అనునవి తమయంతట్లోకొక్కని (కి) అను నర్థమందు వచ్చును.

(ఇ) ప్రథమావిభక్తియందున్న విశేష్యము ప్రయుక్తమయినను 'తాను' అనునది తిరిగి ప్రయోగింపఁబడును:

(ఆది. I. 27) అమ్మునుల కడకువచ్చి తానుగ్రశ్రవసుం డనుసూతుండు ... ప్రణమిల్లియున్న ...

(8) ఎవ్వఁడు, ఎవ్వరు, ఎద్ది- అను సర్వనామములు అనేకార్థములందు సందర్భానుసారముగా ప్రయోగింపఁబడి యుండును.

(అ) ఎవ్వఁడు, ఎవ్వండు- ప్రశ్నయందు.

(అర. I. 372) వ. ఇమ్మనుజుం డెందులవాఁ డెవ్వఁడనిన ... (సభా. II. 5) అనిన నట్టివాఁడెవ్వఁడు నాకెఱుంగింపుమనిన ... (ఆది. V. 228;) నాదైనయిష్ట, మొగినతీర్పంగ నిందెవ్వఁ డోపుననిన ...

(ఆ) ఎవ్వఁడు, ఎవ్వండు=ఎవఁడయితే, సంబంధార్థక సర్వనామము.

(ఆది. II. 58) గాలము, క్రియ నెవ్వఁడు కంఠబిలము - క్రిందికిఁజన కగ్నియపోలె నేర్చుచుండును, భయరహితా వానినెఱుఁగుబ్రాహ్మణకులుఁగాన్; (ఆది. III. 94) తనజవ్వనంబు నా-కొనరంగ నెవ్వఁ డీనోపు నాతండ; (ఆది. VII. 165) ఎవ్వఁ, డేనుశరముల నేయు నశ్రమమున నతఁడ నాతనయకు వరుఁడగు; (ఆది. VII. 171) ఇందు లక్ష్య మెవ్వఁడేసె నాతని వరియింపు; (ఆది. VIII. 140) ఎవ్వఁడు వ్రుడిచి యొడిచె - నతనిన వలతుర్క.

(ఇ) 'ఏని'శబ్దముతోఁగూడి ఎవ్వఁడు, ఎవ్వండు, ఎవ్వరు, మొదలగునవి విశేషార్థమును బొందును:

(ఆది. VII. 94) ఏవ్వఁడేనిఁ గృతాంతకుఁ గడవంగ నోల్లఁడ ... యట్టి వసిష్ఠముని; (ఆది. VII. 10) ఎవ్వరేని ఫలార్థులగుదు రందుల కేఁగుము; (S. I. I. IV. 930, 929, 662) ఎవరేని (S. I. I. IV. 1133);

(ఈ) 'ఒక్కొ' అనుపదముతోఁ గలిసి ఆశ్చర్యమును దెలుపును:

(ఆది. VIII. 161) అట్టి మహాబాహుఁ డత్యంతబలుఁ డెవ్వఁడగు నొక్కొ.

(ఉ) 'ఓ' అను పదముతోఁగలసి సందేహమును దెలుపును:

(ఆది. V. 248) అల్లేసినవాఁ డెవ్వఁడో యని రోయుచు; (ఆర. II. 185) బాహుకుండనువాఁ డెవ్వండో వానియందు నా హృదయంబు ముదితం బగుచున్నయది.

(ఊ) ఎవ్వరు = ఎవరైనను (S. I. I. IV. 929, 665).

(ఆది. VII. 219) దానిఁ బిహితంబుగ నెవ్వరుఁ జేయనేర్తురే; (ఆర. II. 85) ఎవ్వరువలికిన నప్పుడ యుగ్రానలాకారుండై.

(ఋ) ఎవ్వరు = అందరు.

(ఆర. VI. 47) ఈతఁడు ... అజయ్యవీరుఁ డని నెవ్వరికిన్; (ఆది. VIII. 47) మాద్రేయు లజేయు లెవ్వరికి; (ఆది. VIII. 148) ఇది సారంగనసాధ్య మెవ్వరికి; (సభా. I. 171) ఎవ్వరికి దురాసదంబులగు వజ్రమయోన్నత వప్ర చారు గోపురములదాని; (ఆది. VII. 8) తపోమహిమ నెవ్వరికంటెఁ బెద్దయైన వాని నుపయాజు నుపాసించి; (ఆర. II. 338) ధనవంతుఁ డతఁడ యెవ్వరి కంటెన్.

(ౠ) 'ఎవ్వరూను' (S. I. I. IV. 974) - ఇది 'ఎవరును' అను దానికి బదులుగా వాడఁబడినది.

(ఌ) వారు అనుటకు 'అవరు' అనియు, శకటరేఫముతో 'వాఱు' అనియు శాసనములందు కనఁబడుచున్నది:

(S. I. I. V. 1347) నడపినవరికి; (S. I. I. V. 1348) నడపిన వాఱికి.

ఓటువడియెఁ, ఓర్చెఁ,-ను, కట్టికొనియెఁ, కడఁగెఁ,-ంగెన్, కడిగెఁ, కందెఁ, కదిసెఁ, కదలెఁ, కనియెఁ,-ను, కనంబడియెఁ, కప్పెఁ, కప్పికొనియెఁ, కమరెఁ, కలఁగెఁ,-ంగెఁ, కలఁచెను, కలిగెఁ, కల్గెఁ, కవిసెఁ, కఱచెఁ, కఱపించెఁ, కఱపెఁ, కాంచెఁ, కాఁచెఁ, కానంబడియెన్, కాల్చెన్, కావించెఁ, -ను, కావించికొనియెఁ, కీడ్పఱచెను, కుడిచెఁ, కుందెఁ, కురియించెన్, కురిసెన్, కూడఁబట్టెన్; కూడెన్, కూలెన్, కొనియెన్,-ను, కొనిపోయెన్, కొనియాడెన్, కోఱెన్, కోఱికొనియెన్, కోల్పడియెన్, కౌఁగిలించికొనియెన్, క్రమ్మఱియెన్, క్రమ్మఱిచెన్,-ంచెన్, క్రాఁగెన్, క్రాచెన్, క్రాలెన్, క్రుంకెన్, చదివెన్, చదివించెన్, చనియెన్,-ను, చనుదెంచెన్, చంపెన్, -ను, చాటెన్, చూచెన్, చూపెన్, చెప్పెన్,-ను, చెలఁగెన్,-ను,-ంగెఁ, చెఱుపఁబడియెన్, చెఱిచెన్, చేకొనియెన్, చేసెన్, చేరెన్, చేయించెన్, చేసికొనియెన్, చొచ్చెన్, చొనిపెన్, జడిసెన్, తడిపెన్, తడసెఁ, తనిపెన్, తప్పెన్, తఱిగెన్, తలఁచెఁ తలంచెన్, తలకొనుదెంచెన్, తాఁకెన్, తాకుదెంచెన్, తాఁచెన్, తాల్చెన్, తిగిచెన్, తిరిగెన్, తివిరెన్, తూలెన్, తెంచెన్, తెచ్చెన్, తెల్పెన్, తేఱెన్, తొడఁగెన్,-ంగెఁ, తొఱఁగెన్, తొలంగెన్, త్రావెన్, త్రెళ్లెన్, త్రెస్సెన్, త్రోపించెన్, దొరకొనియెన్, నగియెన్, నించెన్, నిండెన్, నిలిపెన్, నిల్పెన్, నెగసెన్, నెగయుదెంచెన్, నెగడెఁ, నేర్చెన్, పంచెన్,-ను, పట్టికొనియెన్, పట్టువడియెన్, పట్టెన్, పడియెన్, పడయఁగవలసెన్, పడసెన్, పనిచెన్, పర్వెన్, పలికెన్, పల్కెన్, పఱగెన్ పఱచెఁ,-ను, పఱపెన్, పఱతెంచెన్, పాచెన్, పాపెన్, పాసెన్, పాఱెన్, పిల్చెన్, పుచ్చెన్, పుట్టెన్, పుట్టించెఁ, పుత్తెంచెన్, పూనెన్, పెట్టెన్, పెట్టికొనియెన్, పెట్టించెన్, పెండ్లియయ్యెన్, పెనఁగెన్, పెనిచెన్,-ను, పెరిగెన్, పొంగెన్, పొడసూపెన్, పొడిచెన్, పొడమెఁ, పోయెన్, పోలెన్,-ను, పోల్చెన్, పోవుదెంచెన్, బయల్పడియెన్, మఱచెన్, మసలెన్, మాసెన్, మించెన్, మిన్నకుండెన్, మెచ్చెన్, మొనసెన్, మోపెట్టెన్, మ్రొక్కెన్, మ్రోయించెన్, మ్రోసెన్, రావించెఁ, వందఱలాడెన్, వందెన్, వచ్చెన్, వడఁకెన్, వదలెఁ, వలసెఁ, వారించెఁ, వెన్చెఁ, విడచెఁ, విడిచిపుచ్చెఁ, విడిపించెఁ, విడిచెఁ, విడ్చెఁ, వినఁగబడియెన్, వినంబడియెఁ, వినియెఁ, వినిచెన్, విన్చెఁ, విరియించెఁ, వీఁచెఁ, వీడ్వడియెఁ, వీతెంచెఁ, వెలువడెఁ, వెల్వడియెఁ, వెలుఁగెఁ,-ంగెఁ, వెలసెఁ, వేఁడెఁ, వేల్చెఁ, వేల్వఁగాఁబడియెఁ, వైచెఁ, సమకట్టెఁ, సమకూఱెఁ.

లఘువులయిన రెండక్షరములతోఁగూడిన 'డిగు, తగు, తెగు, నగు, ఇడు, చెడు, పడు, అను, కను, కాను, చను, మను, విను' అను ధాతువులపై

భూతార్థక ప్రథమపురుషైకవచనక్రియా ప్రత్యయము చేరునప్పుడు దాని క్త్వార్థకరూపములపైఁ జేరునుగాని, ధాతువులపైఁ జేరదు. అనఁగా ఆ రూపములు డిగియెన్, తగియెన్, నగియెన్, ఇడియెన్, చెడియెన్, అనియెన్, కనియెన్, కొనియెన్, చనియెన్, మనియెన్, వినియెన్-అనియే యుండునుగాని, 'డిగెన్, తగెన్, తెగెన్'-మొదలగు రూపములను పొందవు. 'కనెన్' అని ముద్రిత భారతములో నొకచోట ప్రయోగముకాన్పించుచున్నది గాని అది సరియైన పాఠముకాదు.

## మహన్మహతీ—బహువచనము.

అభినందించిరి, అభిషేకించిరి, అర్పించిరి, ఆదరించిరి, ఆరాధించిరి, ఆశ్వాసించిరి, ఉదయించిరి, ఉద్భవించిరి, ఉపేక్షించిరి, కల్పించిరి, కీర్తించిరి, దీవించిరి, సమస్కరించిరి, నిర్జించిరి, నిర్మించిరి, నిర్వర్తించిరి, పరిగ్రహించిరి, పూజించిరి, ప్రవేశించిరి, ప్రశంసించిరి, వధియించిరి, వధియింపించిరి, వరియించిరి, వర్ణించిరి, విశ్రమించిరి, వేష్టించిరి.

అయిరి, అందిరి, అనిచిరి. అనిరి, అరిగిరి, అరుగుదెంచిరి, అడిచిరి, ఆడిరి, ఆర్చిరి, ఇచ్చిరి, ఉండిరి, ఉడిగిరి, ఊఱార్చిరి, ఎక్కిరి, ఎత్తికొనిరి, ఎదుఱువచ్చిరి, ఎఱుంగిరి, ఏఁగుదెంచిరి, ఏఁగిరి, ఏడ్చిరి, ఏతెంచిరి, ఏసిరి, ఐరి, ఒడ్డిరి, ఒనరించిరి, ఒప్పిరి, ఓడిరి, కదలిరి, కనిరి, కప్పిరి, కలంగిరి, కఱపిరి, కాంచిరి, కాలిరి, కొనిరి, కోరిరి, కోల్పడిరి, క్రాఁగిరి, క్రొచ్చిరి, క్రొవ్విరి, చనిరి, చనుదెంచిరి, చలిపిరి, చిలికిరి, చూచిరి, చూపిరి, చెందిరి, చెప్పిరి, చేసిరి, చొచ్చిరి, తనరిరి, తాఁకిరి, తెంచిరి, తొడఁగిరి, తొరఁగిరి, త్రోఁచిరి, నగిరి, నడచిరి, నిల్చిరి, నిలిపిరి, పంచిరి, పడసిరి, పడిరి, పఱిగిరి, పలికిరి, పల్కిరి, పల్కరించిరి, పఱచిరి, పాఱిరి, పుట్టిరి, పుత్తెంచిరి పూనిరి, పెంచిరి, పెనఁగిరి, పొగడిరి, పొడిచిరి, పోయిరి, పోరిరి, పోరాడిరి, బ్రదికిరి, మగుడిరి, మసలిరి, మిన్నకుండిరి, మెఱసిరి, మొనసిరి, మ్రొక్కిరి, రోసిరి, వందిరి, వగచిరి, వచ్చిరి, వాంచిరి, విడిచిరి, వెలువడిరి.

* ఈ క్రిందివి భూతకాలక్రియారూపము లయినను భూతకాలమందే ఆ కార్యము జరుగుచుండు ననుటను తెలుపును.

## ఏకవచనము.

రచియించుచుండెన్, విచారించుచుండెన్, విహరించుచుండెన్, అగుచుండెన్, అనుచుండెన్, అడుగుచుండెన్, ఎసగుచుండెన్, ఒనరించుచుండెన్, ఒప్పుచుండెన్, కుడుచుచుండెన్, చలుపుచుండెన్, చూచుచుండెన్, చేయు

తిమి, నేర్చితిమి, పలికితిమి, పాడితిమి, పుట్టితిమి, పెనిచితిమి, వచ్చితిమి, వింటిమి, విడిచితిమి.

(ii) క్త్వార్థక రూపములపై ఈ క్రిందివానిని చేర్చుటవలనను ఉత్తమ పురుష భూతకాల క్రియారూపము లేర్పడును.

| | ఏక | బహు | |
|---|---|---|---|
| మహద్వాచకము | వాఁడను | వారము | మహదమహ |
| అమహద్వాచకము | దానను | వారము | ద్వాచకము. |

ఉదాహరణములు.

మహత్తు—ఏకవచనము.

పుట్టినవాఁడఁ, మురిసినవాఁడఁ, వచ్చినవాఁడఁ.

మూఁడు లింగములయందు బహువచనము.

వధియింపఁబడినవారము, వచ్చినవారము.

అమహత్తు—ఏకవచనము.

ఎఱుంగినదానను.

(iii) భవిష్యత్తద్ధర్మకాలములు.

భవిష్యత్తద్ధర్మకాలములకు వేర్వేఱుగా నియతములైన ప్రత్యయము లున్నట్లగపడదు. చేసెదను, చేసెదము, చేయుదును, చేయుదుము, చేయం గలను, చేయంగలము. చేసెదవు, చేసెదరు, చేయుదువు, చేయుదురు, చేయం గలవు, చేయును, చేయుదురు, చేసెదరు, చేయుంగలరు, మొదలయిన వివిధ రూపములలో నొక్కొకటి ప్రత్యేకముగా భవిష్యత్కాలమునకుఁగాని, ప్రత్యేకముగా తద్ధర్మకాలమునకుఁగాని చెందినవి కావు. అవి ఈ రెండిం టిలో నేకాలమునైనను బోధించును.

ప్రథమపురుషము.

(1) ధాతువుపై ఈక్రిందివానిని చేర్చుటవలన భవిష్యత్తద్ధర్మరూ పము లేర్పడును.

| | ఏక | బహు | |
|---|---|---|---|
| మహత్తు | ను | దురు | మహన్మహతీ |
| అమహత్తు | ను | దురు | |
| | ను | న్ను | |

## ఉదాహరణములు.

మహదమహత్తులయందు—ఏకవచనము.

మహతీతరామహత్—బహువచనము.

అనుకరించుచుండుఁ, అనుగమించుఁ, అనుభవించుఁ, ఉదయించుఁ, ఉద్భవిల్లుఁ, ఉద్ధరించుఁ, ఉపశమిల్లుఁ, కరుణించుఁ, గుణియించుఁ, జన్మించుఁ, జయించుఁ, దహించుఁ, దూషించుఁ, నిగ్రహించుఁ, నిందించుఁ, పరిగ్రహించుఁ, పూజించుఁ, ప్రతీక్షించుచుండుఁ, ప్రవర్తించుఁ,-ల్లుఁ, భక్షించుఁ, భరియించుఁ, భరియింపఁబడుఁ, రక్షించుఁ,-ను, వధియించుఁ, వరియించుఁ, -ను, వర్తిల్లుఁ, వర్ధిల్లుఁ, వసియించుఁ, విలసిల్లుఁ, విలాపించుఁ.

అగుఁ, -ను, అగుచుండుఁ, అవుఁ, -ను, అనుచుఁ, అనఁబడుఁ, అమరుఁ, -ను; అరుగుదెంచుఁ, అడుగుఁ, ఆరయుచుండుఁ, ఆర్చుఁ, ఇంకుఁ, ఇచ్చుఁ, ఈడ్చుఁ, ఉండుఁ, -ను, ఉడుగుఁ, -ను, ఉడుచుఁ, ఉనుచుఁ, ఎఱుఁగుఁ,-ంగుఁ, ఏఁగుఁ, ఏతెంచుఁ, ఏయుఁ, ఏర్చుఁ, ఏర్పడుఁ, ఒడంబడుఁ, ఒడుచుఁ, ఒడఁగూడుఁ, ఒందించుఁ, ఒసరించుఁ, ఒనరించుచుండుఁ, ఒనరుఁ, ఒనర్చుఁ, ఒప్పుఁ, ఒప్పుచుండుఁ, ఓడుఁ, ఓపుఁ, -ను, ఓర్చుఁ, ఔఁ, కడఁగుఁ, కదలుఁ, కదల్చుఁ, కలుగుఁ, కఱచుఁ, కాంచుఁ, కాఁచుఁ, కాఁచుచుండుఁ, కానంబడుఁ, -ంగఁబడుఁ, కాల్చున్, కావించుఁ, -ను, కూర్చుఁ, కొనుఁ, కొలువుండుఁ, కొలుచుఁ, కోరుఁ, క్రాఁచుఁ, చనుఁ, చంపుఁ, చలుపుఁ, చాలుఁ, చూచుఁ, చూపుఁ; చెడుఁ, చెఱుచుఁ, -ను, చేకొనంగఁబడుఁ, చేకొనుఁ, చేయుఁ, చేసును, చేయును, చేయుచుండుఁ; చొచ్చుఁ, తక్కుఁ, -ను, తగుఁ, -ను, తగులుఁ, తనరుఁ, తనుపుఁ, తప్పుఁ, తఱికొల్పుఁ, తాల్చుఁ, తిరుగుఁ, తివురుఁ, తెగును, తెలుపుఁ, తెల్పుఁ, తేనేర్చుఁ, త్రావుఁ, త్రావుచుండుఁ, దొరకొనుఁ, -ను, నడచుఁ, నాఁబడుఁ; నించుఁ, నిండుఁ, నిలుచుఁ, నిల్పుఁ, నెగడుఁ, నేర్చుఁ, నేర్పుఁ, పట్టువడుఁ, పడుఁ, పడయుఁ, పదరుఁ, పరగుఁ, పర్వుఁ, పలుకుఁ, పల్కుఁ, పఱచుఁ, పాచుఁ, పాపుఁ, -ను, పాయుఁ, పుట్టుఁ, -ను, పుట్టించుఁ, పుత్తెంచుచుండుఁ, పెట్టుఁ, పెరుఁగుఁ, పెరుఁగుచుండుఁ, పొందుఁ, పోలుఁ, పోవుఁ, బ్రదుకుఁ, మానొక్కనుఁ, మఱచుఁ, మాయుఁ, మెచ్చఁబడుఁ, మెచ్చుఁ, మోపియుఁ, వగచుఁ, వచ్చుఁ, వల్చుఁ, వలయుఁ, వారించుఁ, విడుచుఁ, వినఁబడుఁ, -ంబడుఁ, విరియుఁ, వెలువరించుఁ, వెలుంగించుచుండుఁ, వెలుఁగుఁ, -ను; వెలయుఁ, వెలయించుఁ, వెలిచుఁ, ప్రచ్చుఁ, సమకట్టుఁ, సమకూఱుఁ, సుడియుఁ, సైఁచుఁ.

మహాన్మహాతులు
బహువచనము

'దురు' ప్రత్యయము చేరునప్పుడు చుకారాంత ధాతువుల తుది చు వర్ణమునకు లోపమును, 'దురు'లోని దకారమునకు తకారమును వచ్చును. 'చ్చు' అంతమందుగల ధాతువులకు 'దురు' చేరునప్పుడు 'చ్చు' లోపించి 'దురు' లోని 'దు'కు బదులుగా 'త్తు' నిలుచును. అనుస్వారముపై వచ్చు తురు, దురు, లు త్రు, ద్రు, లుగా మాఱుటయుఁగలదు. నకారాంత ధాతువులమీఁద నది 'ంద్రు' 'ండ్రు' లుగ కూడ మాఱును.

ఉదాహరణములు.

అనుచరింతురు, అనుభవింతురు, ంత్రు, అపేక్షింతురు, ఆదరింతురు, ఉత్సహింతురు, ఉదయింతురు, ఉద్ధరింతురు, ఉపజీవింతురు, ఉపయోగింతురు, కీర్తింతురు, క్రీడింతురు, జయింతురు, జీవింతురు, నిర్జింతురు, నివేదింతురు, పరిచరింతురు, పరిహరింతురు, ప్రవర్తిల్లుదురు, ప్రసాదింతురు, ప్రాపింతురు, భక్షింతురు, భయంపడుదురు, భేదిల్లుదురు, రక్షింతురు, వధియింతురు, వర్ణింతురు, వర్తిల్లుదురు, వర్తింతురు, వసియింతురు, విచారింతురు, విమోహింతురు, విహరింతురు.

అందుదురు, అందురు, అంద్రు, అల్గుదురు, అడంగుదురు, ఇత్తురు, ఈఁగుదురు, ఉండుదురు, ఏఁగుదురు, ఒడంబడుదురు, ఒందుదురు, ఒనరింతురు, ఓడుదురు, ఓపుదురు, కాంతురు, కూర్తురు, కొందురు, కొలుతురు, కోరుచుండుదురు, కోరుదురు, క్రమ్మఁగుచుండుదురు, చత్తురు, చదివిగొంద్రు, చనుదెంతురు, చలుపుచుండుదురు, చూతురు, చూపుదురు, చెప్పుదురు, చెఱుతురు, చేయుదురు, చేయుచుండుదురు, తగుదురు, తొలంగుదురు, త్రావుదురు, త్రోతురు, నడతురు, నమ్ముదురు, నేర్తురు, పడుదురు, పడయుదురు, పలుకుదురు, పాతురు, పాయుదురు, పుట్టుదురు, పెట్టుదురు, పొందుదురు, పోదురు ('దురు' చేరునప్పుడు 'పోవు' ధాతువులోని 'వు'అనుదానికి లోపము కలుగును.), పోలుదురు, మండ్రు, మంతురు, మన్నింతురు, మెత్తురు, రోయుదురు, రోయుచుండుదురు, వత్తురు, వలతురు, విడిపింతురు, విడుతురు, వెఱతురు, సైఁతురు.

(ii) ప్రథమపురుష మహాన్మహతీ బహువచనమునందు 'దురు' కు బదులుగ ఎదరు అనుదానిని చేర్చుటవలనను భవిష్యత్తద్ధర్మరూపము లేర్పడును:—కడఁగెదరు, పలికెదరు, పోయెదరు, వచ్చెదరు.

(iii) మహదమహత్తుల ఏకవచనమందును మహతీతరామహద్ బహువచనమందును, 'ఎడును', 'ఎడిని' వర్ణకములు చేరి భవిష్యత్తద్ధర్మార్థక క్రియారూపము లేర్పడును.

అయ్యెడున్, అరిగెడున్, ఎఱుఁగెడున్, ఒప్పెడుర్, కానంబడియెడుర్, కొనియెడున్, పడియెడున్, పుట్టెడున్, పోయెడుర్; ఆడెడిన్, చూపెడిన్, చేసెడిన్, పోయెడిన్, మఱుఁగెడిన్.

(-డిన్ రూపములు సందేహాస్పదములు-డిన్ రూపములకును, డున్ రూపములకును గొంచమర్థభేదము గలదేమో.)

iv. తద్ధర్మార్థక క్రియావిశేషణములపై ప్రథమపురుష సర్వనామములు చేరియు భవిష్యత్తద్ధర్మరూపము లేర్పడును.

రక్షించువాఁడు, ఉండువాఁడు, చేకొనువాఁడు, చేయువాఁడు, తగువాఁడు, పుట్టెడువాఁడు, వచ్చువాఁడు, వేఁడువాఁడు; ఉండువారు, చేయువారు, తగువారు, వర్తిల్లువారు, వచ్చువారు; ఉండెడునది; ఉండునవి, చేయునవి.

భవిష్యత్తద్ధర్మకాలములు.

మధ్యమపురుషము.

(i) మధ్యమపురుష ఏకవచనమందు మూఁడు లింగములందును ధాతువులపై 'దు'వర్ణకమును చేర్చుటవలన భవిష్యత్తద్ధర్మార్థకక్రియ లేర్పడును. బహువచనమున ప్రథమ పురుషమునందువలెనే 'దురు'ను చేరును. 'దు' పై 'వు' చేరుటయుఁ గలదు. 'దు' రూపములు ప్రాచీనములై యుండును. తక్కిన నియమములు ప్రథమపురుషమునందువలెనే యుండును.

కీర్తింతువు, జయింతు, నిందింతువు, రక్షింతు, వధియింతు.

అగుదు, అగుదువు, ఓపుదువు, ఓపుదు, కాంతు, తలంతువు, నిలుపుదు, నేర్తు, పడయుదువు, పరికింతు, పలుకుదు, పల్కుదు, ప్రోతు, వలఁతు, సలుపుదు.

(ii) ధాతువులపై 'ఎదు' వర్ణకమును చేర్చుటవలనను భవిష్యత్తద్ధర్మార్థక మధ్యమపురుష ఏకవచన రూపము లేర్పడును. 'ఎదు'పై 'అవు' కూడఁజేరుచుండును. 'ఎదు' రూపములు ప్రాచీనములు. వీని బహువచన రూపములు ప్రథమపురుషమునందువలెనే 'ఎదరు' చేర్చుటవలన కలుగును.

ప్రసాదించెదు, ఉండెదు, ఏఁగెదు, ఏచ్చెదవు, ఒనరించెదు, కుడిచెదు, చేసెదు, పలికెదు, పొగడెదు, పోయెదు, పోయెదవు, రోసెదు, వైచెదు.

-దు, ఎద, ప్రత్యయములు వర్తమాన, భూత, తాచ్ఛీల్య, సాతత్యార్థములందు వచ్చుచుండును: "ఏను జరయను రాక్షసి నిప్పురమున చదుకమును బాయకుండుదు సంతతంబు; నీకు నిష్టంబు సేయంగ నెమ్మితోడఁ గోరుచుండుదు నది సమకూరె నేఁడు (సభా. I. 150).

## భవిష్యత్తద్ధర్మకాలములు.

### ఉత్తమపురుషము.

తద్ధర్మార్థక విశేషణములపై 'దును' చేరుటవలన ఏకవచన రూపమును, 'దుము' చేరుటవలన బహువచనరూపమును కలిగి భవిష్యత్తద్ధర్మకాలమును బోధించును. 'దును'లోని 'ను' లోపించుటయుఁ గలదు.

ఏకవచనము.

ఆరాధింతున్, ఆస్వాదింతున్, జయింతున్, నయింతున్, నిగ్రహింతున్, పరిగ్రహింతున్, భక్షణసేయుదున్, భయమందుచుండుదున్, భరియింతున్, రక్షింతున్, వధియింతున్, వధింతున్, వరియింపఁబడుదున్, వర్తిల్లుదున్, విచారింతున్, విస్తరింతున్, విహరించుచుండుదున్, హరింతున్, అగుదున్, -ను, ఇత్తున్, ఉండుదున్, ఉడిగింతున్, ఒడంబడుదున్, ఒడుతున్, ఒనర్తున్, ఓడుదున్, కలుపుదున్, కాంతున్,-ను, కావింతున్,-ను, కొందున్,-ను క్రమ్మఱింతున్, చనుదెంతున్, చలుపుదున్, చూచుచుండుదున్, చూడవత్తున్, చూడనోపుదున్, చూతున్, చూపుదున్, చెప్పుదున్, చెఱుతును, చేయుదున్,-ను, చేయుచుండుదున్, చేసికొందున్, తన్పుదున్,తప్పుదున్, తలఁతున్ -ంతున్, తాల్తును, తునుముదున్, తెత్తున్, తొలఁగుదును, త్రిమ్మరుదున్ త్రోతున్; నెగడుదున్, నేర్తున్, పడుదున్, పడయుదున్, -ను, పడయనేర్తున్ పలుకుదున్, పఱతున్, పాతున్, పాపికొందున్, పాయుదున్, పుత్తున్, పోదున్ -ను, పోవుదున్, ప్రోతున్, మెఱయుదున్, మ్రొక్కుదున్, రానేర్తున్, వచ్చితును, వత్తున్, వలతున్, విందున్, విడుతున్, వినవలతున్, వినుపింతున్ వెఱతున్.

బహువచనము.

జయింతుము, దూషింతుము, నిపాతింతును, నిగ్రహింతుము, నిర్జింతుము, నిర్వహింతుము.

అగుదుము, అరుగుదెంతుము, ఓడుదుము, కాంతుము, చలుపుదుము చూపుదుము, చేకొందుము, నేర్తుము, పరిమాఱుతుము, విందుము, విడతుము, వెఱతుము, వెఱపింతుము.

(ఆర. II. 255) "ఏమేము మున్ను పూజింపుదుము రుద్రు నిందఁ వేడ్క" అను పాఠము నన్నయకాలపుభాష కాదు. 'పుదుము, పుదురు పుదును' మొదలగు రూపములు నందిమల్లయ్య ఘంటసింగయ్యల వరాహ పురాణమునాఁటివఱకును భాషలోనికి చేరినట్లగపడదు. పై పద్యపాదమునకు వ్రాఁత ప్రతులలో—

"ఏమేము మున్ను పూజింతుము రుద్రుని-నిందనివేడ్క"
"ఏమేము మున్ను పూజింతుము రుద్రు-నిందనుచువేడ్క"

అను పాఠములు కాన్పించుచున్నవి, ఈ రెండింటిలో నేదియో యొకటి నన్నయవ్రాసిన పాఠమైయుండును.

(ii) ధాతువుపై ఏకవచనమున 'ఎదను,' బహువచనమున 'ఎదము' అనువానిని చేర్చుటవలనఁగూడ భవిష్యత్తద్ధర్మార్థక ఉత్తమపురుష క్రియా రూపము లేర్పడును.

ఏకవచనము.

జన్మించెదన్, దుఃఖించెదను, ధరియించెదన్, నిర్మించెదన్, పరిగ్రహించెదన్, పరిభ్రమించెదన్, భక్షించెదన్, రచియించెదను, వరియించెదన్, వివరించెదన్.

అయ్యెదన్, అరిగెదన్, అడిగెదన్, ఆడెదను, ఇచ్చెదన్, ఇడియెదన్, ఉండెదన్, ఉడిగించెదన్, ఉడిపెదన్, ఎఱుఁగించెదన్, -ఁగించెదన్, ఏఁగించెదన్, ఒనరించెదన్, ఒనర్చెదన్, ఓర్చెదన్, కడఁగెదన్, కప్పెదన్, కావించెదన్, క్రక్కించెదన్, చనియెదన్, చెప్పెదన్, చేయించెదన్, చేసెదన్, తీర్చెదన్, తెచ్చెదన్, తొడఁగెదన్, పంచెదన్, పడియెదను, పుత్తెంచెదన్, పుట్టెదన్, పొడిచెదన్, వగచెదన్, వచ్చెదన్, విడిచెదన్, వేఁడెదన్.

బహువచనము.

జీవించెదము, వసియించెదము.

అయ్యెదము, ఉండెదము, కొనిపోయెదము, చూచెదము, చేసెదము, తెచ్చెదము, పుట్టెదము, పెట్టెదము, పోయెదము, వచ్చెదము, వ్రేలెదము.

(iii) తద్ధర్మార్థక విశేషణములపై ఈ క్రిందివానిని చేర్చుటవలనను భవిష్యత్తద్ధర్మార్థక ఉత్తమపురుషరూపము లేర్పడును.

| | ఏక. | బహు. | |
|---|---|---|---|
| మహత్తు | వాఁడను | వారము | మహదమహత్తులు |
| అమహత్తు | దానను | వారము | |
| | దానను | వారము | |

పుంలింగము—ఏకవచనము.

చేయువాఁడన్, వచ్చువాఁడన్, ఈఁగలవాఁడన్.

మహదమహత్తులు—బహువచనము.

అగువారము, ఉడుగువారము, చేకొనువారము, చేయువారము, త్రచ్చువారము, పలికెడువారము, కావంగలవారము, చేయంగలవారము.

అమహత్తులు—ఏకవచనము.

చేయుదానఁ, -ను.

నామక్రియలు.

విశేష్యములపై కొన్ని ప్రత్యయములు చేరి క్రియలుగా నేర్పడుచుం డును. ఇవి సాధారణముగా మూఁడు కాలములకును జెందియుండును. వీనిఁ తద్ధర్మక్రియలనియుఁ జెప్పవచ్చును. ప్రథమపురుషమునందు క్రియలుగా నుప యోగపడునప్పుడు విశేష్యముల కెట్టిమార్పును కలుగదు. అప్పుడు వానిఁ విశేషణములనియు ననవచ్చును, కాని, ఉత్తమ మధ్యమ పురుషములందు నామముల అంత్యాక్షరమునుబట్టి ఈ క్రింది ప్రత్యయములను జేర్చినయెడల నామక్రియ లేర్పడును.

| | ఉత్తమపురుషము. | | మధ్యమపురుషము. | |
|---|---|---|---|---|
| | ఏక | బహు | ఏక | బహు |
| అకారాంతములు | ను | అము | వు | అరు |
| ఇకారాంతములు | ని | అము | వి | అరు |
| ఉకారాంతములు | అను | అము | అవు | అరు |

ఉదాహరణములు.

అకారాంతములు.

ఉత్తమపురుష ఏకవచనము.

ఆరాధ్యను, ఇతరను, కృశన్, చరణను, చిత్తను, తనూజన్, -ను, దూతఁ, -ను, దేవదూతఁ, ధర్మేతరఁ, పూర్వదత్తఁ, భర్తను, (ఏక) వస్త్రను, విశ్వకర్మను, విహీనను.

మధ్యమపురుష ఏకవచనము.

అన్వితవు, అభివంద్యవు, అభ్యర్చితవు, అవినీతవు, అసురవు, తనూజవు, దేవతవు, ప్రసూతవు, బాలవు, పుణ్యదేవతవు, పెద్దవు, బేలవు, భర్తవు, భామవు, భార్యవు, మనోహీనవు, లోచనవు, వస్త్రవు, వివశవు.

ఇకారాంతములు.

ఉత్తమపురుష ఏకవచనము

అశుచిని, కామచారిణిని, కార్యార్థిని, కీర్తిని, -చారిణిని, దాసిని, ధర్మ పత్నిని, పతిఁ, పత్నిఁ, పుత్త్రార్థిని, పుత్త్రిని, -మతిని,

మధ్యమపురుష ఏకవచనము.

అభిశంకివి, అర్థివి, -అశివి, అశుచివి, అహివి, కార్యార్థినివి, గతివి, ఘాతినివి, తపస్వివి, దాసివి, దేవివి, దుర్మతివి, దేవర్షివి, ధర్మబుద్ధివి, -నిధివి, పక్షివి, పతివి, పత్నివి, -బుద్ధివి, బ్రహ్మచారివి, భక్షివి, భావినివి, -మతివి, -మూర్తివి, రాజర్షివి, రాక్షసివి, -శీలివి, శుచివి.

ఉకారాంతములు.

ఉత్తమపురుష ఏకవచనము.

అంధుఁడన్, -ను, అధికుండన్, అనుజుండన్, -అశుండన్, ఆహూతుండను, ఇంద్రుఁడన్, -ండన్, -ఁడను, ఇష్టుండన్, కుశలుఁడన్, -కృత్యుఁడన్, కృతార్థుండన్, -ను, గృహుండన్, కృష్ణుఁడన్, -గతుండను, తనయుండన్, నియుక్తుండను, తక్షకుఁడన్, -తేజుఁడన్, దర్శనుండను, దక్షుండన్, దానుండన్, దుఃఖితుండను, - దేహుండన్, ద్రోణుండన్, ధన్యుఁడన్, నందనుఁడన్, -ను, నియుక్తుండను, నిరతుండన్, నిశ్చింతుఁడను, నిష్ఠురుండను, పరాజితుండన్, పరుండన, పుత్రుండన్, పూరుఁడను, పూర్వజుండన్, -ప్రయత్నుండన్, ప్రసిద్ధుండన్, -బలుఁడన్, -ండన్, బలాఢ్యుఁడన్, భక్తుండన్, -ఁడను, భక్షితుండన్, భరద్వాజుండన్, భీతుఁడన్, భీముండన్, భీష్ముండన్, ముఖ్యుండన్, మూర్ఛితుండన్, -యుతుఁడను, -ండను, యుధిష్ఠిరుండన్, -రథుండన్, రాజను, రాజసుతుఁడను, రురుండన్, -లలాటుండను, -విదుండన్, విప్రుఁడన్, విమనస్కుండను, విముక్తుఁడన్, -ండ, -వివరుఁడన్, విస్మితుండన్, -ను, విహీనుండను, వీరుండన్, వేదవిదుండన్, వైదర్భుండన్, శిష్యుండన్.

అనుంగన్, కూఁతురన్, కొడుకన్, చెలియలన్, పాపను, వెడఁగన్.

మధ్యమపురుష ఏకవచనము.

-అదుఁడవు, అంధుఁడవు, అనుగతుండవు, అనుజుండవు, అనుమతుండవు, అభిషిక్తుఁడవు, -ండవు, అర్హుఁడవు, -ండవు, అవలంబనుండవు, అవహితుండవు, అవినీతుఁడవు, - అశనుండవు, ఉరగమవు, కారణమవు, కుశలుఁడవు, -కృత్యుఁడవు, కృశుఁడవు, కోపిదుఁడవు, క్రూరుఁడవు, -ండవు, క్రోధుండవు, గతుండవు, గుణుండవు, తేజుఁడవు, -దయుండవు, దయాళుండవు, దక్షుండవు, దివ్యుండవు, దివ్యపురుషుండవు, దేవముఖుండవు, ధరుండవు, ధర్మవిదుండవు, ధర్మశీలుండవు, ధర్మజుండవు, ధ్యేయుండవు, ధ్వజమవు, నరుఁడవు, నిత్యుండవు, నిధానంబవు, నిపుణుఁడవు, నియతుఁడవు, నిరతుండవు, నిర్దయుండవు, నిర్మత్సరుండవు, నిరతుండవు, నిష్ఠితుండవు, పరమేశ్వరుండవు, పరిగ్రహుండవు, పరుఁడవు, -ండవు, పాత్రుండవు, పుత్త్రుండవు, పురాణపురుషుండవు, పురుషుండవు,

పూజ్యుఁడవు, -ండవు, ప్రగల్భుఁడవు, ప్రణయుండవు, ప్రతికూలుండవు, ప్రతిజ్ఞుండవు, ప్రభుండవు, ప్రవృత్తుండవు, ప్రసన్నుఁడవు, -ండవు, ప్రసిద్ధుండవు, ప్రియుఁడవు, -ండవు, బలుఁడవు, -ండవు, బలాఢ్యుఁడవు, బలవంతుఁడవు, బాలుఁడవు, బుద్ధిమంతుఁడవు, భక్తుఁడవు, భక్షకుండవు, భీతుండవు, భూతుఁడవు, భూషణుఁడవు,- బ్రహ్మచర్యస్థుండవు, బ్రాహ్మణుండవు, భోజనుండవు, మనస్కుండవు, మనుష్యుండవు, మనుష్యాదుఁడవు, మయుండవు, మహాత్ముఁడవు, మహాధ్వజమవు, మహానుభావుఁడవు, మహాపురుషుండవు, ముఖుండవు, మూర్ఖవు, యజ్ఞపురుషుండవు, యుతుడవు, రక్షకుండవు, రక్షాపరుఁడవు, రాక్షసుండవు,రోషుఁడవు, వర్జితుండవు, వామనుండవు, వాహనంబవు, వాహుండవు, -విదుఁడవు,- ండవు, విధేయుఁడవు, వినీతుఁడవు, విప్రుఁడవు, విభక్తుఁడవు, విముక్తుఁడవు, వివర్ధనుండవు,-విషయుండవు, విష్ణుండవు, వీర్యుండవు, 'వృద్ధుఁడవు, శాంతుఁడవు, శీలుఁడవు, -ండవు.

ఒక్కరుండవు, కూఁతువవు, పాలుండవు, వేల్పవు, నెయ్యుండవు, నేర్పుకాఁడవు.

అకారాంత, ఇకారాంత, ఉకారాంతములు.

ఉత్తమపురుష బహువచనము.

అసమర్థులము, ఆదిమునులము, కృతార్థులము, గతులము, త్రాణులము, త్రాతలము, ధారులము, ధన్యులము, ధారుణీసురులము, పత్నులము, -పాతులము, పితరులము, పితామహులము, పుత్త్రులము, పురుషులము, బలులము, మంత్రులము, యుతులము, లుబ్ధులము, విముక్తులము, విశేషితులము, వేశ్యలము, శక్తియుతులము.

మధ్యమపురుష బహువచనము.

అర్థులరు, అవధానులరు, అస్త్రవిదులరు, ఆరాధ్యులరు, తాపత్యులరు, -ధరులరు, ధర్మమూర్తులరు, ధర్మవిదులరు, నిత్యులరు, పూజ్యులరు, ప్రశస్తులరు, ప్రియులరు, బాహులరు, బుద్ధులరు, మహాసత్త్వులరు, -మార్గులరు, -యుతులరు, రమ్యులరు, రహితులరు, రక్షితులరు, వర్గులరు, వినీతులరు, విప్రులరు, విముక్తులరు, వీర్యవంతులరు, వృత్తులరు.

ప్రార్థనార్థకము.

(అ) ప్రార్థనార్థక క్రియలు మధ్యమపురుషమునందే యుండును. ఏకవచనమున 'ము' వర్ణకమును, బహువచనమున 'ఁడు' 'ండు' లను ధాతువు మీఁద చేర్చుటవలన ప్రార్థనార్థక క్రియారూపము లేర్పడును. ఏకవచనమున

మువర్ణకమునకు లోపమును గలుగును. ప్రత్యయములు చేరునప్పుడు చుకారాంత ధాతువుల చకారమునకు పకారము వచ్చును.

ఏకవచనము.

అనుగ్రహింపుము, అనుభవింపుము, అపనయింపుము, అపహారింపుము, ఆచరింపుము, ఆచరింపు, ఆరాధింపుము, ఉద్యోగింపుము, ఉపయోగింపుము, ఉపసంహారింపుము, ఉపక్రమింపుము, ఉపదేశింపుము, కరుణింపుము, చిత్తగింపుము, జన్మింపుము, జయింపుము, దయయొనర్పుము, దయసేయుము, దయసేయు, నియోగింపుము, నిర్మింపు, -ము, నిర్వహింపు, పరిగ్రహింపు, -ము, పాలింపుము, ప్రకాశింపుము, పూజింపుము, ప్రార్థింపుము, ప్రబోధింపుము, ప్రసాదింపు, -ము, భక్షింపు, భజియింపుము, భరియింపుము, రచియింపు, -ము, రక్షింపుము, రక్షించికొనుము, వధియింపుము, వరియింపు, -ము, విస్తరింపు, విహారింపుము.

అగుము, అవుము, అందుము, అనుము, అమర్పుము, అరుగుము, అడుగుము, ఆడుము, ఆనతిమ్ము ('చ్చు' అంతమందుగల ధాతువుల 'చ్చు' నకు ప్రార్థనార్థమున ఏకవచనమున 'మ్ము' బహుళముగా ఆదేశమగును), ఆర్పుము, ఇమ్ము, ఇప్పించికొమ్ము (కొనుము, కొన్ను, కొమ్ము), ఉండుము, ఉండనిమ్ము, ఉండు, ఉండఁజేయుము, ఉడివింపుము, ఉడుగుము, ఎక్కుము, ఎఱుఁగింపుము, -ంగింపుము, ఎఱుంగు; ఎఱుఁగు, -ము, ఏఁగుము, ఏయుము, ఏలుము, ఒడఁబడుము, -ంబడుము, ఒడిచికొమ్ము, ఒనరింపుము, ఒనర్పు, -ము, ఒప్పగొనుము, ఒసగుము, కమ్ము (*అగు), కడఁగుము, -ంగుము, కడిగికొనుము, కనుము, కలుగింపు, కలుగుము, కఱపు, కావింపు, -ము, కావుము (చుకారాంత ధాతువులపై ప్రార్థనార్థక ప్రత్యయములు చేరునప్పుడు వాని తుది చకారమునకు వకారమగును), కొను, -ము, కోరికొనుము, కౌఁగిలింపుము, క్రమ్మఱుము, క్రమ్మఱింపుము, చనుదెమ్ము, చనుము, చలుపుము, చఱుపుము (*చఱు), చుమ్ము, చువ్వె, చూవె, చూ (ధాతువు 'చూ' అయి ఉండవలెను. దానిపై 'ము' చేరఁగా 'చూము' అయి, ఆద్యక్షరము హ్రస్వముకాఁగా, మువర్ణమునకు ద్విత్వము కలిగినది. అట్లే 'ఎ' అను ప్రశ్నార్థక ప్రత్యయము ప్రార్థనార్థకముగ నిలచి, చూ+ఎ అని కాఁగా, వకారాగమము కలిగి 'చూవె' అను రూపమును, ఆద్యక్షరమునకు హ్రస్వమును, అందుచేత వకారమునకు ద్విత్వమును కలిగి 'చువ్వె' అను రూపమును ఏర్పడినవి. 'చూ' అను ధాతురూపమే ప్రార్థనార్థకముగను ఉపయోగపడినది), చూచుచుండుము, చూడు, -ము, చూపు, -ము, చెడకు, చెప్పికొనుము, చెపుము, చెప్పు, -ము, చేకొనుము, చేయుము, చేయింపుము, చేసికొమ్ము, తనుపుము, తసరుము, తలఁపుము,

-ంపుము,తలుంగుము, తీర్పు, తొడఁగుము, తొలంగుము, నమ్ముము, నిలువుము నిలుము (*నిలు), నిల్వుము, నిలుపుము, పడయు, -ము, పనుపు -ము, పంపు -ము, పరగుము, పఱపుము, పాయుము, పుచ్చుము (బహుళ మనుటచే ఇచట 'చ్చు' నకు 'మ్ము' గాలేదు), పుట్టుము, పూన్పుము, పెట్టు, -ము, పెన్పు మనుము, మఱవుము, మార్పుము, రమ్ము (*వర్), రావింపుము, లెమ్ము (*ఎళ్ = లే + ము), వగవుము, వారింపుము, విడిపించికొమ్ము, విడువుము విను, -ము, విన్మ, వెల్వడుము, వెలుగింపు, వేఁడుము, సమకట్టుము, సైఁపుము.

బహువచనము.

ఉత్సహింపుఁడు, ఉపయోగింపుఁడు,-ండు, ఉపదేశింపుఁడు, కరుణింపుఁడు, పురస్కరింపుఁడు, ప్రార్థింపుఁడు, -ండు, ప్రసాదింపుండు, రక్షింపుఁడు, వర్ధియింపుఁడు, వర్తిల్లుచుండుఁడు, విచారింపుఁడు, విజయంచేయుండు.

అగుఁడు, అనుఁడు, అరుగుఁడు, -ండు, ఆనతిండు, (*ఈ), ఇండు, ఉండుఁడు, -ండు, ఉడుగుఁడు, -ండు, ఎక్కుండు, ఎఱుఁగింపుఁడు, -ఁగింపుఁడు, కడఁగుండు, కాంచియుండుఁడు, కావింపుఁడు, -ండు, కావుండు, కొనుఁడు, కొరికొండు (నుకారాంత ధాతువులపై డుజ్ప్రత్యయము చేరునప్పుడు ధాతువు తుది ఉత్వమునకు లోపమును, నత్వమునకు ణత్వమును, బహుళముగా అగును), క్రమ్మఱుఁడు, చనుఁడు, చూచుచుండుఁడు, చూడుఁడు, -ండు, చెపుఁడు, చెప్పుఁడు, చేకొనుఁడు, చేకొండు, చేయుఁడు, -ండు, తలఁపుండు, పనుపుఁడు, -ండు, పన్పుడు, పుచ్చుడు, -ండు, పుట్టుఁడు, -ండు, పొగడుండు, పొండు (పో ధాతువుపై 'ండు' చేరఁగా 'పోండు' అయి ఆదిస్వరమునకు హ్రస్వము కలిగినది), పోయుండు, రండు (*వర్), విడిపింపుఁడు, వినుఁడు, -ండు, వేఁడుడు.

(అ) అత్యంత ప్రార్థనమునందు 'ము, ఁడు, ంపు' లపై 'అ' కారము చేరును.

రక్షింపుమ, విజయంచేయుమ, అగుమ, ఇమ్మ, ఉండుమ, ఏఁగుమ, క్రమ్మఱుచుండుమ, చెపుమ, చెప్పుమ, చేయుమ, నిలువుండ, పాపుమ, విడువుమ, వేఁడుమ, చెపుఁడ.

ఎఱుంగింపుమా, చెపుమా, చెప్పుమా, నిశ్చయింపుమా—అని ఆత్వముతోఁగూడ రూపములు కలవు.

(ఇ) 'అన్నసాధకుం బిలిచి ... ... పార్థునకు ... కుడువం బెట్టకుమీ యని' —ఇచ్చట 'సంప్రార్థనార్థకాదీత్' అను ఆంధ్రశబ్ద చింతామణి సూత్రమున కేకే యుదాహరణము ముద్రిత ప్రతులయందు కానవచ్చుచున్నది. కాని, పెక్కు వ్రాఁతప్రతులయందు 'పెట్టకుమని' అనియే యున్నది. సంప్రార్థన, మున 'ఈత్' 11-వ శతాబ్దపు తెనుఁగులో వచ్చునో రాదో విచార్యము.

(ఈ) క్రియల మధ్యమపురుష వ్యతిరేక తద్ధర్మరూపములమీఁద అయ్యా, అమ్మా, ఏ, అనువానిని జేర్చుటవలనను ప్రార్థనార్థక రూపము లేర్పడును. ఉదా. చెప్పనయ్యా, వినవయ్యా, వినవమ్మా, ఒనర్పవే.

(ఉ) ప్రార్థనార్థక ప్రత్యయములగు 'ముఁడుఁజు'లపై 'అయ్యా' మొదలగునవికూడఁ జేరును. ఉదా. చెప్పుమయ్యా, చెప్పుఁడయ్యా.

(ఊ) 'ఉండేదా' అనునది 'ఉండనిమ్ము' అను నర్థములో నన్నయ వాడినాఁడు. (అర. II. 210) అదియట్లుండె.

ఉభయప్రార్థనార్థకములు.

ధాతువులపై 'దము' వర్ణకము చేరుటవలన ఉభయప్రార్థనార్థక క్రియ లేర్పడును. 'చు, ంచు', అంతమందుగల ధాతువులపై 'దము' చేరునప్పుడు 'చు'వర్ణమునకు లోపమును, 'దము'లోని దకారమునకు తకారాదేశమును అగును. 'చ్చు' అంతమందుగల ధాతువులపై 'దము' చేరునప్పుడు, 'చ్చు'కు లోపమును, 'దము'లోని దకారమునకు ద్విత్వ తకారమును అగును.

ఉదాహరణములు.

ఉపయోగింతము, పూజింతము, అడుగుదము, అరుగుదము, ఆడుదము, ఉండుదము, ఉడిగింతము, ఏఁగుదమ, ఒనరింతము, -మ, కావింతము, చూతము, -మ, చేయుదము, చేయింతము, తెత్తము, పుట్టింతము, పుత్తము, పోదము, పోవుదము.

ఆశీశ్శాపాద్యర్థకములు.

ఆశీశ్శాపార్థములందు ధాతువుపై 'ఎడుఁగా', 'ఎడమ', 'కాక', 'తమ', 'కావుతమ' అనునవి చేరును.

ఎడుఁగా.

ఇచ్చుచుండెడుఁగా, ఉండెడుఁగా, కాచుచుండెడుఁగా.

ఎడమ.

అరిగెడమ, ఉండెడమ, ఒందెడమ, కాకుండెడమ (ఆది. III. 181); చనియెడమ, లేకుండెడమ.

తమ.

కావుతమ.

కాక.

పాయుఁగాక, పనిసేయుంగాక (ఆది. III. 131).

విధినిషేధార్థకములు.

(అ) (i) తద్ధర్మవిశేషణములపై 'అది, వాఁడు, వారు', అను సర్వనామములను జేర్చుటవలనను;

(ii) తుమున్నంత రూపములపై వలయుఁ, అనుదానిని చేర్చుటవలనను విధ్యర్థకక్రియ లేర్పడును.

(ఆ) (i) తుమున్నంత రూపములపై 'వలవదు, రాదు, కాదు, చనదు' అనువానిని;

(ii) వ్యతిరేకక్త్వార్థములపై 'ఉండుదురు' అనుదానిని చేర్చుటవలన నిషేధార్థకక్రియ లేర్పడును.

ఉదాహరణములు.

విధ్యర్థకములు.

అది—అనుష్ఠించునది, ఉద్ధరించునది, కల్పించునది, దూషించునది పరిహరించునది, ప్రయోగించునది, రక్షించునది, వర్తిల్లునది, వసియించునది శాసించునది, అగునది, అందునది, అరుగునది, ఇచ్చునది, ఉండునది, ఎఱుంగనది, ఎఱుంగించునది, చెఱుచునది, చేకొనకుండునది, చేయునది, తలంచునది నమ్మునది, నిల్పునది, నెగడునది, పల్కునది, పుచ్చునది, పుత్తెంచునది ప్రవర్తిల్లునది, మఱచునది, వచ్చునది.

వాఁడు—చేయువాఁడు, అనుభవింపంగలవాణ్డు (S. I. I. V. 1014).

వారు—చేయువారు.

వలయుఁ—అరయవలయుఁ, ఉండవలయుఁ, ఎఱుంగవలయుఁ, -ంగవలయుఁ, -ంగింపవలయుఁ, ఒడంబడవలయుఁ, కలుగవలయుఁ, కావలయుఁ, క్రాఁగవలయుఁ, చలుపవలయుఁ, చెప్పవలయుఁ, చేయవలయుఁ, పాపవలయుఁ, పాయంగవలయుఁ, సాయవలయుఁ, పోవలయుఁ, పోవవలయుఁ, రావింపవలయుఁ, విడువవలయుఁ, తలఁపవలయుఁ, తొల్పవలయుఁ, తీర్పవలయుఁ, తేరవలయుఁ, పడయంగవలయుఁ, పలుకవలయుఁ, అనుగ్రహింపవలయుఁ, అనుభవింపఁగవలయుఁ, అపహరింపవలయుఁ, ఉదయింపవలయుఁ, ఉపదేశింపవలయుఁ, నిర్వహింపవలయుఁ, పరిహరింపవలయును, ప్రతిపాదింపంగవలయుఁ, ప్రసాదింపవలయుఁ, రక్షింపవలయుఁ, వర్జింపవలయుఁ, విచారింపవలయుఁ, శోధింపవలయుఁ.

నిషేధార్థకములు.

వలవదు—అరుగవలవదు, ఉండవలవదు, ఒడంబడవలవదు, తలంపవలవదు, నవయంగవలవదు, నెగడవలవదు, మసలవలవదు, రావలవదు, వగవ

వలవదు, వారింపవలవదు, చేయవలవదు, చొరవలవదు, అవమానింపవలవదు, గర్వింపవలవదు, లజ్జింపవలవదు, శోకింపవలవదు.

రాదు—అవమానింపరాదు, తీర్పరాదు.

కాదు—అవమానింపంగాదు, చేయఁగాదు, తప్పఁగాదు.

చనదు—తప్పంజనదు.

ఉండుదురు—అనకుండుదురు.

'ఉన్నది' అను క్రియ విధ్యర్థమం దుపయోగింపఁబడినది. అది 'ఉను' ధాతువుపై 'అది' చేరుటవలన నయిన 'ఉనునది' యొక్క సంక్షేపరూపము. (ఆది. III. 205) దుర్జనయోధవరులకడ నుండకున్నది=ఉండకుండునది; (ఆది. VI. 267) భూపాలకురక్షమున్నవడసి ... యూళ్ళులనున్నది ... కాని నాఁడు వనంబుల నున్కి కష్టమే.

సందేహార్థకములు.

(అ) ఒ, ఓ, లు సందేహార్థమును దెలుపును.

అగునో, అయ్యెడునో, అయ్యెనో, -నో, అరుగునో, అలిగెడునో, అల్లునో, ఇచ్చునో, ఉన్నవారో, ఉండుదురో, ఉపక్రమించునో, ఏఁగుదానవో, ఐరో, ఒండెనో, ఓటువడియెనో, కాంచెనో, కాంతునో, కావించితినో, చేతురో, చంపితిరో, చేయునో, చేసిరో, తలంచిరో; దుఃఖించిరో, పంచిరో, పంచెనో, పడయుదునో, పడయునో, పడియెనో, పదరునో, పలుకునో, మందురో, మఱచెనో, పోయెనో, పొయిరో, మసలెనో, మసలిరో, వచ్చునో, వచ్చువాఁడో, వారింపరో, విడుచునో, సమకూఱునో.

(ఆ) క్రియలమీఁద నేకాక నామములమీఁదను సర్వనామములమీఁదను ఒ, ఓ, లు సందేహార్థమున వచ్చును.

ఇదియో, ఎట్టిదో, ఎయ్యదియొ, ఎవ్వరో, వాఁడో, దినమొ, దివ్యులరో, దేవతవొ, -వో, -యో, నలుఁడో, నిక్కువంబో, భానుఁడో, భామినివొ, మేఘమొ, రథమో (ఆది. VII. 183), సురేశ్వరుఁడో, హరుఁడో, భానుఁడో, గుహుఁడో (ఆది. VII. 220) ఎవ్వఁడో యేవంశంబునవాఁడో, వానిచరితం బెట్టిదో (ఆది. VII. 235.) మీరు క్షత్త్రియులరో, బ్రాహ్మణులరో, మంత్రసిద్ధులరో, దివ్యులరో (సభా. I. 201) క్షోభమో, శక్తియో.

(ఇ) ఒకో, ఒక్కొ-లు చేరియు సందేహార్థమునిచ్చును. తలచునొకో, తలంతురొక్కొ, వచ్చునొకో, ఎఱుఁగునొకో, ఏమఱునొకో.

ఆశ్చర్యార్థకములు.

(అ) ఒ, ఒకో, ఒక్కొ, అనునవి క్రియలతోఁగూడి ఆశ్చర్యమును దెలుపును.—

'ఏల' అనునదికూడ 'ఏమ్' నుండి పుట్టినదే. ఏమ్-ఏఁ-ఏల్-ఏల-అని దాని పరిణామమయి యుండును. 'ఎలో, ఎలె' అను కర్ణాటక సంబోధనార్థక పదములు 'ఏల'తో సంబంధించినవే.

(ఆర. I. 389) దుర్బుద్ధియని యేమి సెప్పవలయు—అనుదానికి 'చెప్ప వలయునా ?'-అని యర్థము.

వ్యతిరేక క్రియలు.

అకారము వ్యతిరేకత్వ బోధకమై క్రియలయందు చేరును. వ్యతిరేక క్రియలు సాధారణముగా తద్ధర్మ కాల బోధకములై యుండును. ధాతువుపై ఈ క్రింది ప్రత్యయములు చేరుటచేత ఆయా పురుషములందు వ్యతిరేకక్రియ లేర్పడును.

(అ) ప్రథమపురుషము.

| | ఏక. | బహు. | |
|---|---|---|---|
| మహత్తు | అఁడు | అరు | మహన్మహతి |
| అమహత్తు | అదు | అరు | |
| | అదు | అవు | మహతీతరామహత్తు |

మధ్యమపురుషము.

| | |
|---|---|
| అవు | అరు |

ఉత్తమపురుషము.

| | |
|---|---|
| అను | అము |

ఈ ప్రత్యయములు చేరునప్పుడు 'ంచు' అంతమందుగల ధాతువుల తుది 'చు'లోని చకారమునకు పకారమగును. చుకారాంతధాతువుల అంత్య చువర్ణమందలి చకారమునకు వకారమగును.

ఉదాహరణములు.

ప్రథమపురుషము—ఏకవచనము.

మహత్తు.

అతిక్రమింపఁడు, పరిగ్రహింపఁడు, ఎఱుఁగఁడు, -ండు, -ంగఁడు, -ంగండు, ఒల్లండు, ఓపండు, కాఁడు (*ఆగు+అ+ఁడు=*అగండు, కాఁడు), కానఁడు, చూడఁడు, చేకొనఁడు, చేయఁడు, తగఁడు, పరికింపండు, నేరఁడు, -ండు, పడఁడె, పొరయండు, పోలఁడు, మెచ్చఁడు, వినఁడు, -ండు.

బహువచనము.

మహన్మహాతులు.

ఉపేక్షింపరు, విమోహింపరు, ఆలింపర, ఎఱుంగరు, ఓపర,-రు, ఒల్లరు, కారు (*అగు),-ర, కానరు, చేయరు, తగరు, చాలరు, నారు, నేరరు, పడయ నేరరు, పోలరు.

అమహత్తులు.

ఏకవచనము.

జీవింపనేరదు, వరియింపదు, ఎఱుఁగరాదు (* వర్), ఒప్పదు, ఒల్లదు, ఓపదు, కాకుండనేరదు, కాదు (* అగు), చేయదు, తప్పదు, తీఱదు, నేరదు, పడదు, పడదె, పలుకదు, పాయనేరదు, పొరయదె, పోలదు, మూయదు, వినంబడదు, వినవొల్లదు, సమకూఱదు.

మహాతీతరామహత్తు.

బహువచనము.

ఎఱుఁగవు, ఓపవ, కావు, కావ (* అగు), తక్కవు, తగవు, చూడఁబడవు, చేయవు, నడవవు, నాటవు, పోలవు.

మధ్యమపురుషము.

ఏకవచనమందు ప్రథమపురుష నపుంసకలింగైక వచనమునందువలె 'అవు' అనునది ధాతువుమీఁద చేరును. బహువచనమందు ప్రథమపురుషములోవలెనే 'అరు' చేరును.

ఉత్తమపురుషము.

ఏకవచనము.

అపేక్షింపన్, ఎఱుంగను,-ంగన్, ఓపన్, కాను (* అగు), చేయను.

బహువచనము.

విశ్వసింపము, ఉండనోపము, ఎఱుఁగము,-ంగము, ఒడంబడము, ఒల్లము, ఓపము, కాము (* అగు).

(ఆ) వ్యతిరేక తద్ధర్మార్థక క్రియావిశేషణములపై ఈ క్రిందివానిని చేర్చుటవలనను వ్యతిరేకక్రియ లేర్పడును.

| | ఏక. | బహు. | |
|---|---|---|---|
| ప్రథమపురుషము: మహత్ | వాఁడు | వారు | మహన్మహాతీ |
| అమహత్ | అది | వారు | మహన్మహాతీ |
| అమహత్ | అది | అవి | మహాతీతరామహత్తు |

| | | | | |
|---|---|---|---|---|
| మధ్యమపురుషము: | మ. | వాఁడవు | వారలరు | మ. అమ. |
| | అమ. | దానవు | వారలరు | |
| | | దానవు | వారలరు | |
| ఉత్తమపురుషము: | మ. | వాఁడను | వారము | మ. అమ. |
| | అమ. | దానను | వారము | |
| | | దానను | వారము | |

ఉదాహరణములు.

ప్రథమపురుషము.

ఒల్లకున్నవాఁడు, ఎఱుఁగనియదియు,-ంగనియది, నిద్రవోవనియది, లేనియది.

మధ్యమపురుషము.

తప్పనివాఁడవు.

ఉత్తమపురుషము.

ఓపనివాఁడను, కడఁగకున్నవారము.

(ఇ) తద్ధర్మార్థక సంపూర్ణ వ్యతిరేక క్రియారూపములపై 'అగు' ధాతువు నుండి యేర్పడిన క్రియారూపములు చేరియు వ్యతిరేకక్రియ లేర్పడును.

వర్తమానకాలము.

ప్రథమపురుషము—ఏకవచనము.

ఒప్పదయ్యెడున్.

ఉత్తమపురుషము—ఏకవచనము.

నమ్మనేరనయ్యెదను.

భూతకాలము.

ప్రథమపురుషము.

ఏకవచనము.

ఏవగింపదయ్యెన్, కడవదయ్యెన్, కాకున్నదయ్యె, కానఁడయ్యెన్, పడదయ్యెన్, పుట్టదయ్యెనే, మెచ్చఁడయ్యెన్, వినండయ్యెన్.

బహువచనము.

చేయరైరి, పలుకరయిరి,-రైరి, వారింపరైరి.

ఉత్తమపురుషము—ఏకవచనము.

ఎఱుఁగనయితిన్, చేయనయితిన్.

భవిష్యత్తద్ధర్మకాలములు.

ప్రథమపురుషము.

(వృష్టి) లేదవు (ఆది. IV. 248).

(ఈ) వ్యతిరేక క్త్వార్థకములపై 'ఉండు' ధాతువు క్రియారూపములు చేరియు వ్యతిరేకక్రియ లేర్పడును.

వర్తమానకాలము.

కాకున్నయది.

భూతకాలము.

పలుకకుండెన్, మిన్నకుండెఁ, పలుకకుండిరి, మిన్నకుండిరి.

భవిష్యత్తద్ధర్మకాలములు.

కాకుండనేరదు.

వ్యతిరేక ప్రార్థనార్థకములు.

ఏయకేయకుము, ఓడకు, చెడకు, పోవకు, పోవకుము, పెట్టకుము, విచారింపకుము, శోకింపకము.

ఏవార్థకము.

'ఆకుమ్' అనునది ద్రావిడమున వ్యతిరేక ప్రార్థనార్థక ప్రత్యయము. కొన్ని ప్రాంతములలో 'పంచాకుము,' 'తోపించాకుము' అను రూపముల ప్రచారము కేతన కిష్టములేక యట్టి వానిని నిషేధించినాఁడు.

(1) అకారము ఏవార్థకచిహ్నము:—పర్వంబ, అట్టేడ, అట్టిర—మొద. ఒకప్పుడు 'ఉన్' కూడ నేవార్థక మగును: తొల్లియు వింటిని = మునుపే.

(2) ఉకారేతరాంత శబ్దములపై ఏవార్థకాకారము చేరునప్పుడు సంధి కలుగదు, యడాగమము వచ్చును:—అఱియ.

(3) ఉకారాంతశబ్దముల మీఁదను, ద్రుతాంతముల మీఁదను. ఏవార్థకాకారము చేరునప్పుడు సంధియగును:—తోడన, మొదలన, పర్వంబ-మొద.

(4) సముచ్చయార్థక 'ఉన్' ప్రత్యయముపైఁగూడ ఏవార్థకాకారము చేరును:—ఒక్కఁడున.

(5) క్రియారూపముల మీఁదను ఏవార్థకాకారము చేరును:—చేసియ, చేయకయ.

(6) సంపూర్ణ క్రియలపై ఏవార్థకాకారముచేరి 'తప్పక, బొత్తిగ
అను నర్థముల నిచ్చును:—

అగునకాదె, చేయునకాదె, మెచ్చఁడ, వినఁడ, ఆలింపర, ఓపర, ఓప
కార, కాన మొద—(ఆది. II. 128) తలంపఁడ యొక్కనాఁడు ... భ
భయప్రవిఘాత కృత్యముల్; (ఆది. IV. 95) సత్యంబుతో సరియుఁగా
(ఆది. V. 176) తనువుపై తోలును నోపవ భేదింపంగ; (ఆది. V. 90) పు
ణములందు సెప్ప విందుమ యపత్యమమేలని; (ఆది. VI. 257) ఏను మీాదా
గాన, యొరులధనమ.

సముచ్చయార్థకము.

(1) 'ఉన్' అనునది సముచ్చయ చిహ్నము:—తన కిష్టుఁడున్ స
ధ్యాయుఁడున్.

(2) 'ఉన్' అనునది ఆనంతర్యార్థమునుగూడ బోధించును:— చే
టయున్, చెప్పుటయున్ - మొద.

(3) ప్రస్తుతము మనము వాడనిచోట సముచ్చయార్థకమైన 'ఉ
కాన్పించును. కన్నడమునఁగూడ ఇట్టి సంప్రదాయము కనఁబడుచున్నది.

(ఆది. III. 95) విషయోపభోగాభిలక్షణ మింకను బెరుగుచున్నదిం
గాన నందనులార! (ఆది. II. 109) మీాతోడఁ జెలిమిసేయుంగ నాకభీష్ట
యదియు; (ఆది. III. 156) అనిలుఁడను దూతవోయి తోడ్కొని
దెచ్చె, (ఆది. IV. 53, 54) ఎడయుఁజేయఁగానేల, (ఆది. IV.
దయయులేక.

(ఆది. IV. 65) సతులకేడుగడయు పతులచూవె; (ఆది. IV.
తనయులనిట్లేల దయయులేక గంగలో వైచెదు; చెలువ దన్నుబాసి
ననియుఁ బలుకక; (ఆది. IV. 226) పతియుభరియించుఁగావున భర్తయ
(ఆది. IV. 65) ఎడయుఁజేయ; (ఆది. VIII. 251) ఎడయుఁజేసి; (ఆ
30) వృథయపుచ్చఁజనునె; (ఆర. I. 261) కార్యమెడయుఁ జేయనగునె;
II. 76) నిద్రతగిలినదియు; (ఆర. II. 262) నాకును సద్గతిగలుగవల
(ఆర. IV. 127) ఇట్లనియుఁజెప్పె.

(4) సముచ్చయము 'మిక్కిలి' అనునర్థము నిచ్చును.

(ఆది. IV. 160) ప్రభాసుండు పెద్దయు నపరాధంబుసేసె;
'తద్దయు'.

(5) 'అయి' అను క్త్వార్థకముపై 'ఉణ్' చేరి 'అయ్యుణ్' అని యగును. ఈ రూపమున కిప్పుడు 'అయినప్పటికీ' అను నర్థము వచ్చినది. నన్నయ గ్రంథములో ఆ యర్థము లేదు.

(ఆది. VII. 35) వానికి శివుఁడు ప్రత్యక్షమయ్యు వేడుము నరమన్న.

(6) భావార్థక 'ట'కారముపై 'ఉణ్' చేరి ఒకప్పుడు అనంతర్యార్థక మగును.

(ఆది. II. 154) ఆగుటయుణ్ = కాఁగా; (ఆది. I. 133) చెప్పుటయుణ్ = చెప్పఁగా.

(7) 'న్ని' అనునదికూడ సముచ్చయముగ వాడఁబడినది:—(S. I. I. V. 1052) తూములువదిన్ని.



## XIV· క్రియలనుగూర్చిన కొన్ని విశేషములు.



(1) పూను, విడుచు, ఒడుచు, మెఱయు, ఉడుచు, కుఱియు, వినుచు ఇఱికికొను, ఎదురు—మొదలగు ధాతువులు కర్మణ్యర్థమును గలిగియుండెను ఆ యర్థములో తరువాతి కాలమున పూన్చు, విడిపించు, ఓడించు, మెఱయించు, ఉడుపు, కుఱియించు, వినుపించు, ఇఱికించికొను, ఎదుర్చు (ఎదిరించు), మున్నగు రూపములు కలిగినవి.

ఉదాహరణములు.

(ఆది. IV. 10) వడిగలవాహంబులు పూనినరథంబెక్కి; (అర. II 164) హయంబులు పూనిన రథంబెక్కి; (ఆది. II. 69) ఖగేంద్రుండిఱికికొని గగనవీథింబఱచె; (ఆది. II. 185) సంజీవితుఁజేసి నా విద్యాబలంబు మెఱయుదు; (ఆది. VI. 11) తమవిద్యలుమెఱసి రెల్లజనులుమెచ్చి పొగడ; (ఆది VI. 12) భీమదుర్యోధనులు తమ ... గదాకౌశలంబులు మెఱయునెడ; (ఆది VI. 15) భోరనమ్రోయుచున్న వాదిత్ర శబ్దంబులుడిచి, (ఆది. VI. 27 కర్ణుండు నిజవిద్యాకౌశలంబు మెఱయ సమకట్టె; (ఆది. VI. 96) అన్నలక వినయము మెఱయుచుండిరి; (ఆది. VI. 174) ఉరుకరనికరంబు లుడిచికొని ... హరిదశ్వుండు విశ్రమించె; (ఆది. VI. 160) సత్త్వంబు మెఱసి; (ఆది. VI 189) దేవఋషిగణంబులు ... అతనిపయింబుష్పవృష్టిఁగురిసి; (ఆది. VI 282) బ్రాహ్మణుల బాధయుడుచుచుఁ; (ఆది. VII. 44) కలిమిమెఱసి; (ఆది VII. 122) అప్పాశములవిడిచి; (ఆది. VIII. 110) మీలోనం దెవ్వఁడు వ్రేడిం యొడిచె నతనినవలతుఁ; (సభా. II. 231) దుశ్శాసనుండు నెట్టన ద్రౌపది గట్టిన పుట్టంబువిడ్చె; (అర. I. 42) విషయంబులం దింద్రియంబుల నమే వ్రతానుభావమున నుడిచి; (అర. I. 287) మహామధురధ్వని వించెవానికిఁ (ఆది. IV. 91; ఆది. IV. 103) దివ్యవాణి వినిచెధరాధినాథునకు; (అర. I 79) రణప్రారంభమయిన నెదిరెడి వారు పరాక్రాంతులై; (అర. II. 241 బాహుబలంబు మెఱసి; (అర. II. 156) బెదరకెదిరె.

(2) నన్నయకాలమున యుకారాంతములయిన కొన్ని ధాతువులు తరువాతి కాలమున వాడుకలో చుకారాంతము లయినవి.

కుఱియు, మరియు, మెఱయు.

(3) నన్నయకాలమున చుకారాంతములయిన కొన్నిధాతువులు తరవాతికాలమున యుకారాంతము లయినవి.

మిన్నమిడుఁగుకులై రెండు మెఱచుచున్న మెఱుఁగులు, గృధ్ల మెఱవర్ (అర. II. 107); తృష్ణఁబాతురు (అర. II. 25); తోఁపించియు (అర. II. 110); మెఱచుచున్నను (అర. III. 177).

(4) నన్నయ గ్రంథములో కొన్ని ధాతువులకర్మ ణ్యర్థమునందు, ఇంచు, లు రెండును వచ్చును.

క్రమ్మఱుచు, క్రమ్మఱించు.

(5) నన్నయ గ్రంథములో కర్మణ్యర్థమునందు 'పడు' ధాతువు తఱచుగా ప్రయోగింపఁబడియున్నది. తరువాతి కాలమున నిట్టి ప్రయోగను లంతగఁ గానరావు.

(ఆది. I. 71. ఆది. III. 120, ఆది. VII. 50) పడయఁబడిన, (ఆది. III. 220) ఆగఁబడిన; (ఆది. IV. 155) ప్రభవింపఁగాఁబడిన; (ఆది. VI. 35) పిలువంగఁబడక; (ఆది. VI. 215) వీవంగఁబడి; (ఆది. VI. 272) చేయం బడుటంజేసి; (ఆది. VII. 7) విడువఁబడి; (ఆది. VII. 50) శాసింపంబడక; (ఆది. VII. 104) పీడింపఁబడి; (సభా. II. 24) పరిభవింపఁబడి; (అర. I. 9) నివర్తింపఁబడి; (అర. I. 136) ఒలువంగఁబడి; (అర. III. 90) విడువఁబడి నన్; (అర. III. 256) పడయఁగాఁబడిన; (అర. IV. 71) నిర్మింపంగఁబడిన, వినిర్మింపంగఁబడని.

(6) 'ఆదిగా' 'మొదలుగా' అను నర్థములో 'తొట్టు'అను నొక నష్ట ధాతువుయొక్క క్త్వార్థకరూపమైన 'తొట్టి' అనునది వాడుకయం దుండెను.

(ఆది. I. 14) హిమకరుఁదొట్టి పూరుభరతేశ కురుప్రభుపాండు భూప తుల్; (ఆది. III. 95) యదువుఁదొట్టి సుతులు మదిమికినోపక తలలు వాంచి యున్న; (ఆది. III. 154) శర్మిష్ఠఁదొట్టి సఖులెల్ల; (ఆది. III. 161) ఈ లతాంగిఁదొట్టి యీ కన్యకలందఱు; (ఆది. IV. 37) నిన్నుదొట్టి యీ యని మిషులెల్ల; (ఆది. VI. 40) దుర్యోధనుఁదొట్టి ధృతరాష్ట్రు తనయులందరు; (ఆది. VI. 149) గాంధారిందొట్టి దేవీజనులు; (సభా. I. 284) భీష్ముఁదొట్టి సద్బంధుజనుల్; (అర. I. 337) అమరనాథుఁదొట్టి యమరులెల్ల; (అర. II. 292) ఈశుఁదొట్టి సురలెల్ల; (అర. III. 3) అమరపతిఁదొట్టి వేల్పుల నారా ధించుచున్న.

(7) ఏయు, పూయు, కట్టు, తొడు, తొడుగు, కుడుచు, చఱచు-అను ధాతువులయందే వాని కర్మము లంతర్భూతములై యుండెను. ఇప్పుడు వీని కర్మములను ప్రత్యేకముగా తెలుపవలెను.

(ఆది. V. 234) ఏకతంబ యేయుచున్న యేకలవ్యు సమీపంబు; (ఆది. VI. 85) ఒండొరులమార్కొని యేయునప్పుడు; (ఆది. VIII. 17) పూసికట్టి తొడి, (సభా. II. 120) కుడువను గట్టను నోడువఁ బూయ; (ఆది. 15) ఉడుగక యొండొరుంజఱచి (బాహువులుచఱచి).

(8) 'అఁట,' 'అంట'—అని నేఁడు వాడుచుండుచోట్ల నన్నయఁ 'అటె,' 'అట్టె,' అని కానవచ్చుచున్నది.

(ఆది. II. 182) పరీక్షితుఁడు తక్షకదష్టుండగు నేఁడు వ స్తమనఁ సంబ టె.

(ఆది. II. 185) తక్షకుఁడను పన్నఁగుఁడు పరీక్షితుఁ గఱచున టె నేఁడ

(ఆది. VII. 160) ధనంబును బ్రాహ్మణులకు వా రిత్తురట్టె; (ఆది. IV 157) దీనిపాలుద్రావి మానవుల్ జీవింతురటె; (ఆది. V. 9) ఆ కన్యక వరమ వడసెనటె హరుచేతన్; (ఆది. V. 246) ఆతఁడు మీకుం బ్రియశిష్యుఁడ యమిథ్యావచనా; (ఆది. VI. 306) బకాసురు నేఁ డని జంపెనట్టె; (ఆది. VIII 264) తిలోత్తమకంటె రూపవతియట్టె గుణాన్వితయట్టె; (సభా. II. 269 అపత్యంబుఁ గర్మంబు విద్యయు నను నివి తేజంబులట్టె; (అర. I. 16) అన్న లనైన విడువఁజాలరట్టె; (అర. II. 52) నళినదళనేత్ర పరియింపదట్టె; (అర III. 172) దనుజులనోర్చెనట్టె.

(9) ఆశ్చర్యార్థమును దెలుపునప్పుడు కొన్నియెడల భూతకాలమునకు బదులు తద్ధర్మ ముపయోగింపఁబడుచుండును.

(ఆది. IV. 205) ఇట్లు క్రమ్మఱంచునె యితఁడంచును చూపఱ ... పొ గడుచుండిరి=క్రమ్మఱించెనే? (సభా. II. 208) ఇట్లు సేయునొక్కొ యిందు కులుఁడు=చేసెనే. (అర. I. 55) ఇది పనిగాఁగవచ్చునొక్కొ!=ఇంతపనిమైనదే?

(10) 'కాక, కాకేమి' అను రూపములు 'కదా' అను నర్థమున వాడఁ బడినవి.

(ఆది. III. 116) ఆతఁడు సుగతికిఁజనుఁగాక యేలశోకింపంగ; (ఆది. I. 97) అశుచిభావంబునంగాకేమి యప్పరమపతివ్రత మదీయదృష్టిగోచర గాకున్నదయ్యె; (ఆది. VI. 276) అక్కట దుఃఖాతిశయంబున మతిభ్రమణం బయ్యెంగాకేమి; (అర. II. 68) ఈ యక్షప్రకోపంబునంగాకేమి నాకిట్టిదయ్యె; (అర. III. 322) సేవ సేయవుగాకేమి.

(11) ప్రణమిల్లు, పల్కు, కఱపు, తొడఁగు, కడంగు, తలఁగు, ప్రకా శించు, విహరించు-అనుక్రియలు నన్నయ గ్రంథములో సకర్మకములు. తరు వాతి కాలమున నవి అకర్మకములైనవి.

(ఆది. I. 76) పరాశరసుతుం బ్రణమిల్లి; (ఆది. I. 152) మహాహి భయంపడి పల్కు భార్గవుక; (ఆది. IV. 171) నృపతిఁగన్నియ యిట్లనిపల్కె; (ఆది. V. 245) విలువిద్య నొరులు నీ కగ్గలముగ లేకుండ నిన్నుఁగఱపుదు; ఆది. II. 158) ఈ తపంబేఁ దొడఁగెద; (ఆది. I. 158) ఇది యేమిదొడం గితి; (ఆర. II. 223) దానిన కడంగుము; (ఆర. III. 19) సీవకావె తలఁగితి దానిక; (ఆర. III. 68) దానిం దలఁగుము; (సభా. I. 92) సామ్రాజ్యంబుం బ్రకాశింపుము; (ఆది. I. 129) అగ్నిహోత్రమునకు నగ్నులు విహరింపుము.

(12) పూన్చు, పంచు, విను, కొను, చెప్పు, ఒడఁబడు, చేయు, ఉనుచు, మున్నగు ధాతువులు నన్నయగ్రంథములో ద్వికర్మకములుగ కనఁబడుచున్నవి.

(ఆర. III. 189) విదితముగ నిన్నుఁజేయించెదఁ గ్రతువు; (ఆది. II. 47) కద్రువ గర్వంబున నుఱక గరుడని వినుతనుం బనులు గొనుచున్నంత; (ఆది. IV. 108) తన రాజ్యభారం బంతయు భరతుంబూన్చి; (ఆది. IV. 240) చనుఁబనిఁబంపంగనిన్ను జననుతనాకుక; (ఆది. IV. 36) ఇప్పని నన్ను బంపఁ గక; (ఆది. VI. 68) భవత్సఖుఁడనంగ వినరొకొ వానిక; (ఆర. II. 46) హంస చేత నలు విని; (ఆర. III. 228) నిన్ను సత్యనిత్య నిర్మలుఁగా విందు; (ఆది. II. 133) దుష్టోరగ సంహార మిప్పుడొడఁబడ వలసెక; (ఆది. V. 124) ఈతండ నిఖిలావనీశులనోర్చి రాజసూయము ధర్మరాజునునుచు; (ఆది. VI. 125) నన్నును భరతకులశ్రేష్ఠుఁ డునిచె బహుయజ్ఞములక; (ఆర. I. 378) అగ్రజు రాజసూయాధ్వర మునిచిన; (ఆర. III. 189) నిన్నుగ్రతువుఁ జేయించెద.

(13) (అ) సహించు, కరుణించు, సైఁచు, కూర్చు, వెఱచు, డిగు, అలుగు, ఎదురు-మొదలగు ధాతువులు షష్ఠీకారకమున నున్నవి. (చూ. పుట 103)

(ఆ) 'పొందు' మొదలగుధాతువు లనుప్రయుక్తము లయినపుడు ఇప్పటి ద్వితీయకు మాఱుగ సప్తమి ప్రయోగింపఁబడును. (చూ. పుట 109)

(14) 'చను' ధాతువు విశేష్యములతోఁ గూడి క్రియగా వాడఁబడినది.

(ఆది. II. 36) పాములు పంచత్వము సనియెడమని ... శాపంబిచ్చె.

(15) భవిష్యత్తదర్థములందు భూతకాలక్రియలు నన్నయగ్రంథ ములో కానవచ్చును.

(ఆది. VI. 223) తండ్రికిం బ్రియం బనఘుఁడు సేయుచుండి (=చేయు వాఁడై) బ్రహ్మచర్యముఁబాల్చె; (ఆది. IV. 152) పుట్టుచుండి(=పుట్టువాఁడై); (ఆది. V. 70) పురుషుండు పుట్టుచుండి (=పుట్టువాఁడై); (ఆది. VII. 171) ఇందులక్ష్యమెవ్వఁడేసె (=ఏయునో) నాతనివరియింపు నెమ్మితోడ; (ఆది. VIII. 110) మీలోనం దెవ్వఁడు వ్రేడిచి యొడిచె (ఒడించునో) నతనిన వలతుక.

(16) ఎవ్వఁడు, ఎవ్వరు, ఏది, ఏవి మొదలగు సర్వనామములతోఁగలి క్రియలు సంబంధార్థద్యోతకమగు 'ఓ' అను నర్థమిచ్చును.

ఎవ్వఁడడుగు నతండు = అడుగునో; చెడుఁ = చెడునో; ఒడిచె ఒడిచెనో, మొద.

(17) -ట్టు,-ంటు,-డ్డు,-ండు,-త్తు,-తు,-దు,-ందు—ఇవి అంత మంద గల ధాతువులు సాధారణముగా పూర్వమందుండిన ద్రావిడ ధాతువు క్త్వార్థకరూపములై తెనుఁగున ప్రత్యేక ధాతువులుగా నేర్పడినవి. వీని తత్త్వ మిట్టిదని తెలుపుటకు ఆ ధాతువుల రూపాంతరములే ప్రమాణము. దు, త అనునవి ద్రావిడభాషలలో క్త్వార్థక చిహ్నములై యుండుట నీ ధాతువు స్వరూపము తెలుపుచున్నది.

కట్టు (కలి, కడి); కిట్టు (చూ. కెడ (యు), పూర్వరూపము 'కిడు (కన్నడము, కిడు); కుట్టు (కన్నడములో కుడు = కొట్టు); చుట్టు, సు (చు డి (యు); తిట్టు (తెగడు, హ. క. తెగట్); తొట్టు [తొడ (ఁగు)], పట్టు (క పడు); పుట్టు (పొడము); పెట్టు (ఇడు, క్త్వా. ఇట్టు, ఎట్టు, పెట్టు (holophrasis); ముట్టు (క. ముడ, ముడి); మెట్టు (క. త. మిది; మళ. మెది, మెడి; క్త్వా. మెట్టు).

అంటు (క. అట్టు *అడ, *అడు); ఒడ్డు (ఉఱు, క్త్వా. ఉట్టు, ఒట్టు, ఒడ్డు); ఉండు (క. ఉళ్, తె. ఉను); నిండు, తె. నిను (చు); మండు [మఱ (ఁగు)]; వండు (?ఉణ్. క్త్వా. ఉణ్డు (ఒణ్డు) వండు); పాతు (?పాయ్); ఎత్తు (క. ఏఱ్, ఏళ్); ఒత్తు (?ఉఱు, తె. ఒదగు, ఒదవు); ఊఁదు (తె. ఊను); ఏదు (క. ఏయ్, తె. ఏయు); అందు (?అఱ); ఒందు (తె. ఒనరు); కందు (?కఱ్, కనల్); కుందు (కుఱు); చెందు (తె. చెనయు); పొందు (తె. పొనరు); మ్రందు (* మ్రఱ, చూ. మ్రన్నాన్నిపాటు); వందు (తె. వనరు).

(18) నన్నయవాడిన ఈ క్రింది ధాతువుల యర్థమునకును నేఁడు వాని కున్న యర్థమునకును భేదమున్నది.

అగు (ఆర. IV. 108) శక్తి యెట్టులయ్యె = కలిగెను; (ఆర. I. 53) ఇట్టులన నీకగునే = కూడునా; (ఆర. I. 394) విజయుండు నేనునయి = కలసి; (ఆర. II. 216) కమలహితుండు నేనునయి కాంచితిమి = కలసి; (ఆర. II. 14) అపాయంబు సేయుంగావగచి = అని; (ఆర. I. 285) పూనఁగాని = సాధ్యము కాని; (ఆది. I. 96) అద్దేవి ... అశుచులకుఁ గానఁగాదు = శక్యము కాదు.

(ఆర. IV. 83) ఓర్వఁగాదు = ఓర్వరాదు.
(ఆది. III. 118) చూచికాని కుడువనొల్ల.
(ఆర. I. 60) విరక్తియకాని ప్రీతిపుట్టింపదు.

ఇచట 'కాని' అనునది ఇప్పటి యర్థమందే యున్నది. (ఇది నన్నయ మతమా?)

అమయు (ఆర. II. 196) వంటలమయునంతకు ('అమయు' ఇప్పుడు వాడుకలో లేదు. దానికి బదులు 'అమరు' ఉన్నది).

అలుగు (ఆది. I. 130) నన్నయ గ్రంథమున దీనికి 'కోపించు' అని అర్థము.

ఇచ్చు (ఆర. II. 176) ఉపదేశమిచ్చెఁ (ఉపదేశముచేసెను. 'ఇచ్చు' ధాతువే 'ఇంచు' ప్రత్యయమైనది. ఉపదేశించెఁ).

అలుకు (ఆది. IV. 178) అలుకమెయి మున్న పలికితి నలుకని నా పలుకు తీక్ష్ణమై యింతకు; (ఆది. I. 95) మద్వచనంబున వాని నిప్పించికొమ్ము= పుచ్చుకొనుము, తీసికొనుము; (ఆది. II. 81) ఈఁగంబూని = ఇవ్వఁదలఁచి. (ఇచట 'ఈఁగు' అనగా ఓడు అని అర్థముకాదు. 'కఁ' అనునది 'అగు' ధాతువు తుమున్నంత రూపము).

ఈడు (ఆది. I. 69) ఈడంబోవక (ఈ ధాతు విప్పుడు లేదు).

ఉరువు (ఆర. II. 42, 207; ఆర. III. 162); ఉరివి (ఈ ధాతు విప్పుడు లేదు).

ఎత్తు (ఆది. III. 12) దుర్యోధనుండు దుష్కార్యమెత్తి = పూని.

ఎత్తించు (S. I. I. IV. 927) గుడియెత్తించి = కట్టించి.

ఒడుచు (ఆర. III. 260) గర్వంబు నొడిచియున్నవాఁడ యుత్తముండు. (ఉడుచు రూపాంతరము 'ఒడుచు' ఇప్పుడు లేదు. ఒడచు = ఓడించు అని కూడ నన్నయవాడినాఁడు (ఎవ్వఁడు వ్రేడిచియొడిచె నతనిన వలతుఁ). ఈ యర్థమునఁగూడ ఒడుచు ధాతు విప్పుడు లోపించినది.

ఓడు (ఆర. II. 208) ఓడకుండుము = భయపడకుము.

ఓపు = చాలు (ఆది. I. 99, 190) అనపత్యుండఁగానోపఁ; (ఆది. I. 137) ఈ నోపనివాఁడను; (ఆర. II. 126) చానోపఁ; (ఆర. III. 132) ఈ నోపుదేసి; (ఆర. I. 7) ఉండనోపము; (ఆర. I. 26) పడయనోపండు; (ఆర. I. 37) విడువనోపము; (ఆర. I. 62) నిర్వహింపనోపక, మొద.

కట్టు (S. I. I. IV. 1190) నవరత్నములుఁ మాణిక్యములుగట్టిన = పొదిగిన.

కలుగు (ఆర. III. 313) కలుగవలయు = ఉండవలయును.

కాను (ఆర. II. 183) స్వయంవరంబను శబ్దంబు మొదలుగా వినం గానక = తనకు వినఁబడకుండ నుండఁగా.

కొను (ఆర. I. 162) అనలాస్త్రమట్లు వక్షముఁగొనినఁ (నాఁటఁగా, కొట్టఁగా).

చలుపు (అర. I. 266) పదుమూఁడు మాసములు సలిపితిమి; (అర. III. 167) సమయాబ్దంబులు సలిపి = కడపి.

చాలు (ఆది. I. 51) వినంగఁజాలి = తగి.

చెల్లు (S. I. I. V. 1316) అఖండదీపము సెల్లుటకు = నడచుచుండుటకు.

చేయు (అర. III. 203) మాంధాతృండను నామంబుఁ జేసిరి = ఉంచిరి, పెట్టిరి; (అర. I. 286) ద్రౌపది తన హృదయం బెట్టకేనియు నొక్కింతఁ జేసికొనియుండె.

తక్కొను (ఆది. IV. 78) సరుఁడు దక్కొననేర్చునె తన్ను ముచ్చిలన్ = ?

తగులు పుత్త్రవరులఁ దగిలి కాంచునట్టితల్లి = మిక్కిలి జాగ్రత్తతో

తఱుఁగు (అర. II. 157) దాని (దమయంతి) వస్త్రార్ధంబుదఱిగి = చించి, కోసి.

తెచ్చు: దీనికి 'తెంచు' రూపాంతరము. ఇది ఉపక్రియఁగా వాడఁబడును. తెచ్చు, తెంచు, లకు అకారాది ప్రత్యయములు పరమగునపుడు 'తేరు' అనునది ఆదేశముగా వచ్చును. 'తే' అను నాదేశము నన్నయగ్రంథములో లేదు. (ఆది. V. 141) ఏర్పడుదెంచినన్; (ఆది. I. 93) తేరంబూని, తొడరు; (అర. III. 298) అతివిషమశిలా సంకటపథంబున నడవనేరక ద్రౌపది తొడరిపడి మూర్ఛితయైనన్ = ?

త్రచ్చు: దీని ణిజర్థమందు 'త్రాపించు' అని వచ్చినది. (S. I. I. V. 1114) త్రాపించిన.

నిల్పు (S. I. I. IV. 672) విగుర్వునతో గుడినిల్పె భక్తునన్ = ప్రతిష్ఠించెను.

పెట్టు (అర. II. 223) దమయంతి నంద పెట్టి = ఉంచి, ఇప్పుడు జడపదార్థములనే పెట్టెదము.

(S. I. I. IV. 992) పెట్టిన = సమర్పించిన.

పొడుచు (ఆది. VIII. 104) ఒండొరులతోఁ బొడిచి = డీకొని.

పోలు (ఆది. I. 71) పడయఁబోలున్; (ఆది. I. 129) శాపభయము తీర్చికొనఁగఁబోలున్ = వచ్చును.

(ఆది. IV. 173) పుట్టినప్పుడ కన్యకఁబోలునట్టి వరునకిచ్చుట యిది లోకవర్తనంబు.

మలుఁగు (ఆర. II. 172) మలుంగి=వెనుకకు మరలి.

మిగులు (ఆర. I. 8) గుణములు మీఁ యనురాగమునఁజేసి మిగులి వెలుఁగెన్ = ఎక్కువగా.

మొగుచు 'మొగుడ్చు'కు రూపాంతరము. (ఆర. I. 292) మొగిచి.

ముచ్చిలు (ఆది. IV. 78) నరుఁడు దక్కొనఁనేర్చునె తన్ను ముచ్చిలన్= దాచికొనుటకు. ఇప్పుడు 'దొంగిలించు' అని అర్థము.

వట్టు (ఆర. IV. 67) వట్టఁగన్=వట్టిపోవునట్లు, నీరు శుష్కించినట్లు; ఇప్పు డీధాతువు 'పోవు' అను ఉపక్రియతో కలసియే వాడఁబడుచున్నది. (ఆర. III. 202) నీరువట్టి=దాహమువేసి, 'నీరువట్టు' అనునది దాహ మనునర్థమున విశేష్యముగా నన్నయకు తరువాతికాలమున వాడుకయున్నదిగాని, క్రియగా వాడుక లేదు.

వలచు (ఆది. II. 111) నీవగలకు నీ యమృతం బీవలవదు; (ఆది. IV. 182) ఈవలవదు; (ఆది. VI. 32) నీన కడునేర్పు కాఁడవు కావలవదు; (ఆర. III. 380) మీఁ రిందు మసలవలవదు.

'వలవదు' అనునది తరువాతకాలమున 'వలాదు, వలదు, వల్దు, వద్దు, ఒద్దు'లుగా క్రమముగ మాఱినది.

విగుర్వించు. 'గుర్వ్' అను సంస్కృత ధాతువునకు 'ప్రయత్నించు, ఎత్తు' అను నర్థములున్నవి. 'గుర్వీ ఉద్యమనే' అని ధాతుపాఠమున నుండుటచేత దీనినుండి విగూర్వించు, విగూర్వణము అని రూపము లేర్పడును. విగుర్వు, విగుర్వించు అనునవి తద్భవరూపములు. (ఆది. VII. 273) ఈ పర్వతవివరము దెర్చి విగుర్వింపుము చూతము; (S. I. I. IV. 672) విగుర్వునతో గుడినిల్పె భక్తునన్.

వించు. (ఆర. II. 217) వించెన్ సురదుందుభినాదంబులు=వినిపించెను.

వెన్వాడు (ఆది. II. 9) వెన్వాడియున్నన్=వెనుకతీయుగా.

వేఁచు (ఆర. I. 269) ప్రస్తవంబున నాజి వేఁచి; (ఆది. II. 46) నభశ్చరముఖ్యులెల్ల నీ కరుణయ వేఁచిమంద్రు.

సమయు (ఆర. I. 119) ఆసన్నమహీరుహంబులు సమసిన నయ్యిద్దఱు శిలాయుద్ధంబునకుఁ దొడంగి. (ఇచట 'సమసిన' అనఁగా 'చచ్చిన' అని అర్థము కాదు, 'అయిపోఁగా' అని యర్థము.)

(20) ఇప్పు డుపక్రియలుగా వాడఁబడునవి కొన్ని నన్నయకాలమ ప్రధానక్రియలుగా నున్నవి.

(అర. I. 30) సాధురక్షవలయుఁజేయ; (అర. 308 చనునె) ముద వలుక; (అర. II. 297) పోలునె పడయఁగ; (అర. II. 47) రావింపఁగా ? వలసె; (అర. IV. 75) ఉండంగ నేల వలసె.

(21) 'కలు'ధాతువునుండి 'కలఁడు, కలరు, కలదు, కలవు,' మున్న క్రియారూపము లేర్పడినవి.

(అర. I. 101, అర. III. 391) నీవు బుద్ధిగలవేని; (అర. III. 33 దయయుఁగలవేని; (అర. III. 377) ఎఱుకగలవు; (ఆది. I. 114) ఇది వ? లదు మనసుకంటె గాడ్పుకంటె.



## XV. అవ్యయములు.

---

(1) ము వర్ణాంత తత్సమశబ్దములపై తగువాతికాలమున 'కన్, కాన్' అనునవిచేరి అవ్యయత్వమును బోధించుచోట్ల నన్నయభారతములో వాని సప్తమ్యేకవచనరూపములే తఱచుగ అవ్యయములుగ నుపయోగింపఁబడినవి.

(ఆది. VI. 186) నిర్భయమునన్; (ఆది. VIII. 2) అగ్నిసాక్షికంబునన్; (ఆది. VIII. 200) ఆకరమునన్; (ఆది. VIII. 239) అనాకులంబునన్; (ఆది. VIII. 317) నిర్విఘ్నంబునన్; (సభా. I. 243) ప్రియపూర్వకంబునన్; (సభా. II. 39) రూక్షమ్మునన్; (అర. III. 313) ఆసన్నంబునన్; (అర. IV. 117) అసామర్థ్యమునన్; (S. I. I. IV. 1008)

తత్సమేతరము లందును ఇట్లే కాననగును.

(ఆది. II. 52) సంతసంబునన్; (సభా. II. 130) ఉక్కివమునన్; (అర. I. 55) ఉక్కివంబునన్; (అర. IV. 23) కతమునన్. నిమిత్తమునన్.

(2) ఏకాంత, ప్రత్యేక, మొదలగు శబ్దములపై అవధారణార్థక 'అ' వర్ణముచేరి అవ్యయములగును.

(అర. III. 220) ఏకాంతమ, (ఆది. VII. 259) ప్రత్యేకంబ, 'ఏకాంతంబ' అనుదాని తద్భవరూపమగు 'ఏకతమ' అనునదియు అవ్యయమగును. (ఆది. II. 26, ఆది. III. 111, ఆది. VII. 254, అర. I. 76) ఏకతమ. ఆది. V. 148 ఏ నేకత మెట్టులుండదు.

(3) 'సుఖము' అనునది అట్లే అవ్యయరూపమగును.

(ఆది. VI. 267) సుఖమేగి, (ఆది. IV. 157) అమరభావమున సుఖంబు జీవింతురట.

(4) క్రియా, మాత్రా శబ్దముల సప్తమ్యేకవచనరూపము లవ్యయములుగా వాడఁబడినవి.

(ఆది. II. 9) ఏక్రియన్, (అర. III. 204) ధ్యానమాత్రన, (అర. IV. 96) మాత్రన్=క్షణమున.

'మాత్రా'శబ్దముపై షష్ఠీ 'కు' వర్ణముచేరియు అవ్యయ మగును,

(ఆది. V. 222) వీనిమాత్రకు.

(5) 'ప్రతి'అను ఉపసర్గము ద్రుతప్రకృతికమై తెనుఁగున నవ్యయమగును.

(ఆది. IV. 28) ప్రతిన్.

(6) కొన్ని సంస్కృతావ్యయములు తెనుఁగున విశేష్యములుఁ బ్రయోగింపఁబడి యున్నవి.

చెడు నిహాముంబరంబు.

(7) కొన్ని సంస్కృతావ్యయములు తెనుఁగునను అవ్యయములుగ వాడబడినవి.

చిరముగ బ్రహ్మకుం దపము; అవశ్యము, అనిశము, స్వస్తియొనర్చ నవసరము, నాయథాశక్తి.

(8) ఉపమానవాచకమగు 'కరణి' అనునదియు తెనుఁగున నవ్యయమగును.

(అర. II. 115) లచ్చికరణిన్-ఇట్లు, రీతిన్, విధమునన్, మొద.

(9) (అ) ఉపమాన వాచకమగు 'పోలెన్' అనునదియు అవ్యయమగును. ఇది సాధారణముగా ప్రథమ మీఁది సముచ్చయ చిహ్నముపై గానవచ్చును. కేవల ప్రథమా రూపములపై నన్నయ దీనిని వాడియుండలేదు.

(ఆది. IV. 204) సమవర్తియుంబోలె నతిశౌర్యాకారుండయి; (ఆది I. 358) క్రొమ్మెఱుంగుఁ దీగయుఁబోలె.

అవధారణ సంజ్ఞపైఁగూడ నిదివచ్చును.

(ఆది. II. 144) నీవు మా చుట్టమవపోలె నెమ్మితోడ.

'అట్లు' అను దానిపై మఱల 'పోలె' కానిపించుచున్నది.

(ఆది. III. 126) అట్లపోలె.

(ఆ) ఉపమానవాచకమగు 'మాడ్కి' కూడ నవ్యయమగును. (ఆది VI. 78) మాడ్కిన్; (S. I. I. IV. 737) మాడ్కిన.

(ఇ) సరిన్—అనునదికూడ నవ్యయమే.—(అర. II. 187.)

(10) సాధారణముగా శబ్దములపై 'కన్, కాన్' అనునవి చేరుటవలన నవ్యయము లేర్పడుచుండును.

(ఆది. V. 242, 243; సభా. II. 197; S. I. I. IV. 1108) అగ్గల ముగన్; (ఆది. VIII. 303) కడవనేరఁగ లావే; (ఆది. III. 14; ఆది. VI. 160, 203, 264) అక్కజముగన్; (ఆది. V. 238) అక్కజంబుగాన్; (ఆది. III. 203) అచ్చుగన్; (సభా. II. 128) అడలుగన్; (ఆది. II. 10) అరుదుగన్; (సభా. I. 34) ఆరఁగన్; (ఆది. II. 81) ఆరంగన్; (ఆది. IV. 3) ఇమ్ముగన్; (ఆది. II. 4) ఇమ్ముగాన్; (ఆది. I. 76) ఇంబుగన్; (ఆర. III. 235) కడిందిగన్; (ఆది. V. 60) క్రంచఱంగన్; (ఆది. VI. 18) చల్లగాన్; (ఆర. II. 17) చెలువముగన్; (ఆది. VI. 214) డగ్గఱఁగన్; (ఆది. VIII. 67) తిరమ్ముగన్; (సభా. I. 84) తిరంబుగాన్; (S. I. I. V. 66) తిరుగా; (ఆది. V. 253) తెల్లముగన్; (ఆది. VI. 219) తెల్లంబుగాన్; (ఆది. I. 5.) దవ్వుగన్; (ఆది. III. 128) పన్నుగన్; (ఆది. III. 139) పన్నుగాన్; (ఆది. VII. 3) పొలుపుగన్; (ఆది. II. 15) పొల్పుగన్; (ఆది. III. 111) పోఁడిగన్; (సభా. II. 174) పోఁడిగాన్; (ఆది. VI. 267) పోలంగన్; (ఆర. III. 268) బెడఁగుగన్; (సభా. I. 16) మంచిగన్; (ఆది. III. 107) మానుగన్; (ఆది. III. 65) మానుగాన్; (ఆది. IV. 95) మిక్కిలిగాన్; (ఆది. IV. 52) మేలుగన్; (ఆది. VI. 267) మేలుగాన్ - ఇట్లే మొదలుగన్, మొదలుగాన్, మొదలుగాఁగన్, రూఢిగన్, లోఁపుగాన్.

అట్టు, ఇట్టు, ఎట్టు, అట్లు, ఇట్లు, ఎట్లు, అనువానిపై మఱల 'కన్, కాన్'లు చేరును.

(S. I. I. IV. 1114, 1168) అట్టుగాన్; (ఆది. I. 110 అట్టులుగన్.

(11) నామముల సప్తమీ రూపములు కొన్నియెడల నవ్యయార్థములను పొందియుండును.

(ఆది. II. 85) అల్లన్; (ఆది. VI. 64) ఇల్వరుసన్; (ఆది. VI. 265) ఇలువరుసన్; (ఆది. I. 93, 101) ఎదురన్; (ఆది. IV. 56) ఇచ్చుచోన్; (ఆది. VIII. 118) జంటన్; (ఆది. IV. 201; ఆది. VI. 154; ఆర. I. 356) నెఱిన్; (ఆది. I. 62; ఆది. VI. 66; ఆది, VII. 269; ఆది. VIII. 119) పిఱుందన్; (ఆది. VIII. 65) రమణన్; (ఆది. I. 69) రూఢిన్; (ఆది. VIII. 222) వేర్వేఱన్; (ఆర. II. 187; ఆర. III. 334) సరిన్; (ఆది. VII. 156; ఆర. III. 311, 373) కుఱంగటన్; (ఆర. I. 153; ఆర. II. 65) వెలిన్; (ఆది. III. 220) క్రిందన్; (ఆది. II. 127) మీఁదన్; (ఆది. I. 52; ఆది. II. 45, 152) పయిన్; (ఆర. II. 218) పైన్-ఇట్లే అక్కడన్, ఇక్కడన్ మొద.

(4) కారికావళి చింతామణికి వివరణ గ్రంథమయ్యును సధర్వాణుని కాలము మనకు నిశ్చయముగాఁ దెలియదు. లిపినిగూర్చి తెలుపు కారికలవలన నాతని కాలమును నిర్ణయింప నెంచుట సాహసము. కావున నాంధ్రశబ్ద చింతామణికాలముఁగూర్చి చెప్పవలసినప్పు డది కారికావళికంటెఁ బూర్వపు దనియు, కారికావళి బాలసరస్వతి వ్యాఖ్యకంటెఁ బూర్వపుదనియు మాత్రము చెప్పవలెను.

(5) వీరేశలింగము పంతులుగారు నన్నయభారత ప్రయోగములకు విరుద్ధములని యుదాహరించిన సూత్రము లట్టి విరోధము గలవి కావు. ఆ సూత్రముల కుదాహరణములు నన్నయరచిత భారతభాగమునఁ గాన్పించుచున్నవి. కాని, నన్నయభారతమునందలి యనేక ప్రయోగములకుఁ జింతామణియందుగలిలేదనియు, సూత్రములవలన నిష్పన్నములగు ననేకరూపములు నన్నయభారతమునఁగాని యాతని కాలపు శాసనములందుగాని కానరావని యు గ్రహింపవలసియుండును.

(6) కొండ అనునట్లు చింతామణి తత్సమరూపసాధన ప్రక్రియయే ప్రధానముగఁగల గ్రంథముకాదు. కేవలముఁ దత్సమరూపములనే సాధించునట్లు కానవచ్చుసూత్రములు చింతామణియందు కొలఁదిగమాత్ర మున్నవి.

(7) ఆంధ్రశబ్దచింతామణి నన్నయకృతము కాదన్న నాతనికీర్తి గౌరవములకు హాని కలుగునంతటి ముఖ్యగ్రంథముకాదు. అది సమగ్రగ్రంథము కాదు. దానియందలి పరిభాషయందును, సూత్రరచనయందును, భాషయందును ననేకములగు లోపములున్నవి.

(8) చింతామణివలన తత్సమాచ్ఛికాంధ్రభాషయందు సందేహము లేకుండ నొక్క రూపముకూడ నేర్పడఁజాలదు. ఆంధ్రవ్యాకరణమును సంస్కృతమున రచియించుటవలనఁ గలుగు నవసర మిది.

(9) నన్నయకుఁ బూర్వము తెనుగు కవిత్వము లేకపోలేదు. పెద్ద తెనుఁగు గ్రంథమింతవఱకును నన్నయకుఁ బూర్వపుది మనకు లభింపకున్నను, లభ్యములగు పద్యముల భాష కావ్యోపయోగియగు భాషయేకాని వేఱు కాదు. నన్నయభారత భాషకును నానాఁటి శాసనస్థమగు వ్యావహారికభాషకును నెక్కువ భేదము కానరాదు.

(10) ఆంధ్రశబ్దచింతామణికిఁ బూర్వము వ్యాకరణము లుండెడివనుట కంవలి 'అన్యవ్యాకరణ, కేచిత్, విదుః, ఇష్యతే,' మొదలగు పదములు చెప్పుచున్నవి.

పై దానినిబట్టి నన్నయ తెనుఁగునఁ బంధుకవికాఁడు; అతఁడాంధ్ర

చేసిన ప్రయోగములను సాధించుటకు సూత్రములను రచింపక, తాను చేయని ప్రయోగములకు రచించుట యస్వాభావికము. అతనికి శబ్దశాసన బిరుదము వేఱుకారణమునఁ గలిగియుండును. ఆంధ్రశబ్దచింతామణి ప్రథమాంధ్ర వ్యాకరణమును గాదు, అను విషయములు స్పష్టపడుచున్నవి.

## ఆంధ్ర శబ్ద చింతామణి

### టీక.

### సంజ్ఞాపరిచ్ఛేదము.

1. విశ్వశ్రేయః కావ్యమ్.

కావ్యము విశ్వమునకు శ్రేయస్సును గలిగించుట ప్రయోజనముగాఁ గలది; తత్కర్తకును పఠితకును శ్రోతకును నానందమును గలిగించి తన్మూలముగ శ్రేయమును గలిగించునని యభిప్రాయము.

2. త దదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ.

అది (కావ్యము) దోషములు లేనట్టియు, నలంకారములతోఁ గూడినట్టియు శబ్దము, అర్థము ననువానితోఁ గూడియుండును.

3. సా వాగ్గ్రాహ్యా రసవృత్తిః.

ఏది రసమే వృత్తిగాఁ గలదియగునో యది వాక్కనఁబడును. (కావ్యభాషకు రసమే ప్రధానము; ఆనందము ప్రధానోద్దేశముగాఁగల వ్యావహారిక భాషకును రసము ప్రధానమే.)

4. సాధ్యో హి రసో యథాతథం కవిభిః

రసము కవులచేత వారివారి నేర్పునుబట్టి సాధింపఁ దగినది గదా.

5. స్వస్థాన వేషభాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధధియః.

లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చాన్య దసహాయః.

రసమునందు లోభము నందిన బుద్ధిగలవారు తమ దేశమును, తమ వేషమును, తమభాషను బ్రేమించినవారై, ఇతర కావ్యములనువిడిచి, (సంస్కృతకావ్యములనేకాక) వైకృతకావ్యములను గూడ (అనఁగా ఆంధ్రకావ్యములవంటి ప్రాకృతకావ్యములను) గౌరవింతురు.

6. సిద్ధి ర్లోకా ద్దృశ్యా.

(శబ్ద) సిద్ధి లోకమువలనఁ దెలియఁదగినది. (అనఁగా లోకవ్యవహారము

16. ప్రకృతేస్తు తే దశోనాన్యః.

ప్రాకృతమునకన్ననో యవి (ఆ వర్ణములు) పదితక్కువ యగుచున్నవి; (అనఁగా నలువది)

17. షట్త్రింశ దత్ర తే.

అవి యిందు (ఆంధ్రభాషయందు) ముప్పదియాఱు. (దీనికి 'సప్తత్రింశదిహ' = ఇచ్చట (నవి) ముప్పదియేడు, అను పాఠాంతరము గలదు.)

18. అన్యే చానుప్రవిశన్తి శబ్దయోగవశాత్.

ఇతరములును (ఈ ముప్పదియాఱు-లేక ముప్పదియేడు-కాక తక్కిన, సంస్కృతప్రాకృతములందలి వర్ణములును) నాయా (తత్సమ) శబ్దములతోఁ గూడి (యాంధ్రమున)ఁ బ్రవేశించుచున్నవి.

19. ద్వివిధా దుదితే దోతోఽచౌ వక్రతమౌ చ తావ ప్యనుస్వారౌ.

రెండు విధములగు (హ్రస్వము, దీర్ఘము నగు) అ, ఉ, ఇ, ఎ, ఒ, లును వక్రతమము (ఐ, ఔ)లును (పూర్ణము, అర్ధము నను) రెండనుస్వారములును అచ్చులు.

20. క గ చ జ యుగ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హా ళ ం తు హల్వర్గః.

క, గ, దంత్యములగు చ,జలు, తాలవ్యములగు చ, జలు; ట,డ,ణ; త, ద,న;ప,బ, మ య,ర,ల,వ; స,హ,ళ, అను వర్ణసమూహము హల్వర్గము. (దీనికి 'కగ,చజయుగ, టడణ, తదన, పబమ, య,ర యుగ, ల, వ, స, హాళ్చ హలః' అను పాఠాంతరము గలదు. ఇందు రేఫమును శకటరేఫమును బ్రత్యేకముగఁ బరిగణితము లయినవి; శవర్ణము బ్రత్యేకముగఁ బఠింపఁబడలేదు.)

21. సిద్ధ స్సాధ్య శ్చానుస్వారః పూర్ణార్ధ భేదతో ద్వివిధః.

సిద్ధమును సాధ్యమును నగు ననుస్వారము పూర్ణము, అర్ధము, నను భేదములచే రెండు విధములు; (అనఁగా సిద్ధపూర్ణము, సాధ్యపూర్ణము; సిద్ధార్ధము సాధ్యార్ధము, అని నాలుగు విధము లగును.)

22. హ్రస్వా త్పూర్ణోఽపి భవేత్.

హ్రస్వవర్ణముకంటెఁ బరమందున్న యర్ధానుస్వారము పూర్ణానుస్వారము కూడ నగును. కడంక, కడంక్క; అరంటి, అరంట్టి; మొద.

23. దీర్ఘా చ్చేత్ ఖణ్డ ఏవ స జ్ఞేయః.

అది (అర్ధానుస్వారము) దీర్ఘముకంటెఁ బరమైయున్నయెడల ఖండాను

మొదలగువానిలోని యనుస్వారము ఖండానుస్వారముగానే యుండునుగాని పూర్ణానుస్వారము కానేరదు. (* దీర్ఘముమీఁది యనుస్వారము పూర్ణానుస్వారమే యగునేమో యని తోఁచుచున్నది.)

24. అద్ యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః.

భూతకాలికార్థమును దెలిపునట్టియు (కనియెన్, వినియెన్, పోయెన్), పదాది నున్నట్టియు (యెవఁడు, యేమి, యెప్పుడు, యెక్కడ, యెంత, యితఁడు, యిప్పుడు, యిక్కడ, యింత, యిల్లు,) యకారముతప్ప తక్కిన యకారము లత్వవిశిష్టములుగానే యుండును.

* ఈ సూత్రము చాల వివాదగ్రస్తమయినది. (1)ఇందలి 'క్రియాసు' అనునది భూతార్థద్యోతినం, ఆద్యగం, అను రెంటికిని నన్వయించునా ? అట్లయినచో 'ఆద్యగం' అనునది 'యేఁగెను, యిచ్చెను' మొదలగు క్రియారూపములను దెలుపును. 'క్రియాసు' అనునది 'భూతార్థద్యోతినం' అనుదానితో నూత్ర మన్వయించినయెడల కొన్ని దేశ్యపదముల యాదిని అద్వ్యతిరిక్తములగు నచ్చులతోఁగూడిన యకార ముండునని ధ్వనించుచున్నది. అప్పుడు, 'యానాది, యాడ = ఎక్కడ, యిప్పుడు, యిల్లు, యెప్పుడు, యేమి' యను రూపము లుండునను నర్థము తేలుచున్నది. ఒత్వముతోఁగూడిన 'యొక్క' అను విభక్తి ప్రత్యయమును నీవర్గములోఁ జేరును. 'నన్నయకాలమున' నిట్లద్వ్యతిరిక్తములగు నచ్చులలోఁగూడిన యకారమాదియందుగలపదములుండెననుటకుఁ బ్రమాణము క్వాచిత్కముగఁ గానవచ్చుచున్నది. దక్షిణ ఇండియా శాసనములసంపుటము IV. లో 1009 సంఖ్యగల శాసనమున 'లోపుగా యిల్లు నట్టు' అని యొక్క ప్రయోగము కాన్పించుచున్నది. ఇట్టివానిని నిషేధించుటకే యీసూత్రము పుట్టియుండును. కాని, 'లోపుగా యిల్లునట్టు' అనుదానిని బట్టి 'ఇల్లు' యకారాది యని నిర్ణయింప వీలులేదు. 'గా' అనునది కళగా నుచ్చరింపఁబడుటచేత యడాగమము వచ్చియుండవచ్చును.

(2) 'ఆద్యగం' అనుదానికి పదాదినుండు 'ఎ' త్వముతోఁగూడిన యకారము మాత్రమని యందఱు వ్యాఖ్యాతలును వ్రాసిరి. కాని, యది అ, ఇ, ఈ, ఎ, ఏ, ఒ, ల కన్నిటికిని జెల్లును: యాడ, యిల్లు, యీడు, యెప్పుడు, యేమి, యొక్క.

(3) ఈ సూత్రము దేశ్యశబ్దములకు మాత్రము వర్తించునని యెట్టి సూచనయు లేదు. కావున, చింతామణిని నన్నయయే రచియుంచియుండిన పక్షమున నాతని కాలమునను ...

త్రాద్వ్యాత్కార్యం జ్ఞేయం' అను రాజ్ఞోవు సూత్రమువలన 'వాఁడెముఁడు, అదె మున, ఇతఁడెతి' మొదలగు సంధులును చింతామణి కిష్టను లగును.

(5) ఈ సూత్రము 'పోయెదన్, పోయెదువు, పోయెదిన్' మొదలయిన తద్ధర్మార్థకక్రియలలోని 'యె' వర్ణమునకు గతిని కల్పించుచున్నది. కావున, 'అద్యః క్రియాసు భూతాద్యర్థసముద్యోతినం వినా సర్వః' అను పాఠాంతర మే సరియైనదని చెప్పవలసియుండును. ఇందువలన నన్నయకాలమున వికృతి పదముల మొదల నచ్చులకు యకారముతోఁడి యుచ్చారణముండెడిదను నప్రా మాణిక సిద్ధాంతమునకుఁ దాపులేకుండుటయే కాక, తద్ధర్మార్థక క్రియలయం దలి యెత్వమునకును గతి కలుగును. కన్నడమున 'యారు' అను రూపమున్నది గావునఁ దెనుఁగున నన్నయకాలమునను 'యెవరు' అను రూపమున్నదని వాదించుటయు సరికాదు. కన్నడమున 'యారు' నవీనరూపము; అట్లే తెనుఁ గునను 'యెవరు' అర్వాచీనరూపము. నన్నయకాలమున నట్టి రూపము లుండె ననుటకుఁ బ్రమాణము దొరకువఱకును నిర్వివాదమైన యెట్టి సిద్ధాంతమును జేయ వీలులేదు. చింతామణికర్త నన్నయయే యని స్థాపించుచుట కాతని కాలమున పదాదిని యెకారముండుననుటకు చింతామణిసూత్రమునే యుదా హరించుట తగదు.

25. యశ్రుతి మార్యా లఘుయం ప్రవదన్తి ప్రాణతసపరం పాణినమ్.

అచ్చుకంటె నచ్చుపరమగునపుడు గలుగు యశ్రుతి నార్యులు లఘు యకారమని (నొక్కి) చెప్పుచున్నారు. (ఈ సూత్రమున 'ప్రవదన్తి' 'ప్ర' యను నుపసర్గము గణమురోజుకు చేర్పఁబడినది.)

26. లఘువో ఽ లఘుశ్చేతి ద్వైధ్యాన్తస్థాః వివదన్తి శాస్త్రారః.

శాస్త్రమును వ్రాసినవా రంతస్థములను (య, ర, ల, వ, లను) లఘు వులనియు నలఘువులనియు రెండు విధములుగాఁ దలిసికొనుచున్నారు.

27. అన్యేఽన్య వ్యాకరణస్పష్టాః.

ఇందు (రేఫముగాక) యితరము లితర వ్యాకరణములందు స్పష్టము చేయఁబడియున్నవి. ('వ్యోర్లఘుప్రయత్నతర శ్శాకటాయనస్య' అను పాణినీయ సూత్రమువలన య, వ, లకు లఘ్వలఘుభేదముచే ద్వైవిధ్యము స్పష్టము, అను సహోబలుని వాక్యము సరికాదు. ఇందువలన శాకటా యనుని మతమున య, వ, లకు లఘుప్రయత్నతరత్వ మున్నదనియే తెలియుచున్నది గాని, య, వ లకుఁ గొన్నియెడల గురూచ్చారణమును గొన్నియెడల లఘూచ్చారణమును నుండునని స్పష్టముగా లేదు. 'లస్యద్వైవ

నసంగతమే. లకారమునకుఁ బ్రాకృతమున శకారము గలుగునని యా సూత్రము బోధించుచున్నది. కాని, యది లకారపు గురులఘూచ్చారణములను బోధింపలేదు. కావున, 'అన్యవ్యాకరణ' శబ్దము సంస్కృత ప్రాకృత వ్యాకరణములకుఁ గాక యాంధ్రవ్యాకరణములకు మాత్రము వర్తించునని యనుకొనవలెను.

28. రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః.

రకార మన్ననో యిచట (ఆంధ్రమున) రెండు విధములుగ గ్రహింపఁబడుచున్నది. రకారము సాధు రేఫమనియు శకటరేఫమనియు రెండు విధములనుట కంటె ర, ఱ లను ప్రత్యేకాక్షరములుగఁ బరిగణించుటయే సరి. రెండిటికిని ధ్వనిపుట్టు స్థానము వేఱు, ప్రయత్నము వేఱు; ఆ ధ్వనులకు సంకేతములగు వర్ణముల స్వరూపమును వేఱు.

29. నాన్యేషాం వైధర్మ్యం లఘ్వ లఘూనామ్.

లఘ్వలఘు భేదములుగల (రేఫముగాని) యితరములకు వైధర్మ్యము లేదు. (అనఁగా పద్యములలో యతి ప్రాసస్థానములందు ఆయా ధ్వనుల లఘ్వలఘూచ్చారణములకు మైత్రి గలదు.)

30. రయోస్తు నిత్యం స్యాత్.

రేఫ శకట రేఫముల కెల్లప్పుడును (వైధర్మ్యము) గలదు. ప్రాసస్థానమందును యతిస్థానమందును వానికి మైత్రి లేదు.)—ఈ నిషేధ సూత్రము రేఫ శకటరేఫలకు యతి ప్రాసస్థానములందు కవులు మైత్రిని గల్పించిన యనంతరము పుట్టి యుండవలెను. పదుమూఁడవ శతాబ్దము వఱకును దెనుఁగు కవులు రేఫ శకటరేఫ సాంకర్యమును జేయలేదు. శాసనములందును జనులకు శకటరేఫ జ్ఞానము పదునాల్గవ శతాబ్దమువఱకును నుండెడిదని స్పష్టపడుచున్నది.

31. అద్దన్త్యా స్తాలవ్యా శ్చ ర్వక్రస్యాత్ర స్మిథః సవర్ణాశ్చ.

(సంస్కృత చు-ప్రత్యాహారము చ, ఛ, జ, ఝ, ఞ లకు సంజ్ఞ; తెనుఁగున చ, జ, లకు మాత్ర మది నిలుచును.) దంత్యములైన చ, జలు హ్రస్వ-అకారముతోఁ గూడి యుండును; తాలవ్యములగు చజలు ఎ ఏ ఒ ఓకారములతోఁ గూడియుండును. ఇవి పరస్పరము సవర్ణములు; అనఁగా వీనికి యతి ప్రాసస్థానములందు మైత్రిగలదు. -అత్ అని తపరకరణముఁ జేయుటచేతను, వక్రమని ప్రత్యేకముగ ఎ, ఏ,ఒ,ఓ లను మాత్రము చెప్పుటచేతను బైరీతిగ నర్థము చేయవలసి వచ్చెను. కాని, అ,ఆ, ఉ,ఊ,ఒ,ఓ, ఐ,ఔ లతోఁ గూడిన తెనుఁగు చ, జ, లు దంత్యములనియు, ఇ, ఈ, ఎ, ఏలం గూడినవి తాలవ్యము లనియుఁ జెప్పవలెను. ఒ, ఓ, లతోఁగూడిన చ జలును ...

32. వికృతి పదాదౌ ప్రథమాస్య తృతీయానునాసికౌ న స్తః.

తెనుఁగు పదముల మొదల యకారమును, ణకారమును నుండవు.

33. క్వచిదపి న స్త ఉమాతౌ దన్త్యోష్ఠ భవస్య వికృతి శబ్దాదౌ.

ఒకప్పుడు తెనుఁగు పదముల మొదల వకారముపై ఉ, ఊ లుండవు.) పై రెండు సూత్రములును ప్రక్షిప్తములని కొందఱి యభిప్రాయము. కాని, 'అద్యః క్రియాను' అను సూత్రము చింతామణిలోని దైనయెడల నిదియు నవలిదే యని చెప్పుట కాక్షేపణ ముండఁగూడదు. వీనితోఁబాటు 'శ, ష' లాది యందుగల తెనుఁగు పదములు నుండవనియుఁ జెప్పవలసి యుండును.

34. ప్రాతిపదికం హి నామ.

ప్రాతిపదికమే నామము గదా. 'హి' అనునది పాద పూరణార్థము. ప్రాతిపదికమునకు 'నామ' మను సంజ్ఞను చింతామణికర్త యేర్పాటు చేసినాఁడు.

35. ప్రత్యయ ఇహ వర్ణకః.

ఇచ్చట (ఈ యాంధ్రశబ్దచింతామణిలో ప్రత్యయమునకు వర్ణకమను సంజ్ఞ) చేయఁబడినది.

36. క్రియా ధాతుః.

ధాతువునకు 'క్రియ' అను సంజ్ఞగలదు. (ఈ సంజ్ఞ గూడ చింతామణి కర్త యేర్పఱిచినదే.)

37. ప్రాణా స్సమానతో౽చః.

పై 18-వ సూత్రమున (ద్వివిధాదుపి దేవోఽశ్వో, మొద.) వివరింపఁబడిన వర్ణములనుగూడ ప్రాణ శబ్దమునలన గ్రహింపవలెను. సంస్కృతమున నచ్ - ప్రత్యాహారమునకు నీ సూత్రమందలి ప్రాణముల పరిగణనమునకును సరిపోకయున్నను, సంస్కృత ప్రత్యాహారమగు 'అచ్' సంజ్ఞనే తెనుఁగునందలి ప్రాణములకును వ్యవహరించుకొనవలసినదని చింతామణికారుఁడు తెలుపుచున్నాఁడు.

38. బిన్దు రనుస్వారః.

ఈ యాంధ్రశబ్దచింతామణియందు అనుస్వారమునకు బిందువను సంజ్ఞ యేర్పఱుపఁబడినది. బిందువు వర్ణస్వరూపమును అనుస్వారము ధ్వని స్వరూపమును దెలుపునదైనను బిందువు, అనుస్వారము, అను పదములు పర్యాయపదములుగా నీగ్రంథమున వాడఁబడునని యీ సూత్రమున సంకే

39. ఏ జథో వక్రాః.

(పిమ్మట) ఏజ్ ప్రత్యాహారస్థ స్వరములు వక్రములను సంజ్ఞగలవి (అని చింతామణికారుఁడు సంకేతించుచున్నాఁడు. మాహేశ్వర సూత్రముల ప్రకార మేర్పడిన ఏజ్-ప్రత్యాహారము తెనుఁగునకు వర్తింపదు. సంస్కృతమున ఏ, ఓ, లు మాత్రము ఏజ్ ప్రత్యాహారమునఁ జేరును. తెనుఁగున వానికి హ్రస్వములగు ఎ, ఒ, లు గూడఁ జేరును. ఈ సూత్రమున 'ఏజ్' అనఁగా ఎ, ఏ, ఒ, ఓ, లని గ్రహింపవలెనని చింతామణికర్త యాశయము. ఏజ్ ప్రత్యాహారము ధ్వనికి సంబంధించినదియు, వక్రత్వ మక్షరస్వరూపమునకు సంబంధించినదియు నగుచుండఁగా, 'నీరెంటిని బర్యాయపదములుగ నీగ్రంథమున నుపయోగించితి'నని తత్కర్త తెలుపుచున్నాఁడు. ఇదిగాక వాస్తవముగ నక్షరములన్నియు కొలఁదిగనో గొప్పగనో వక్రములే యైనను ఎ, ఏ, ఒ, ఓ, లకు మాత్రము వక్రసంజ్ఞ యీ సూత్రమున సంకేతింపఁబడినది. ఇందలి 'అథో' అనుపదము పాదపూరణార్థము; మంగళార్థమని కొంద అనుకొందురు గాక !

40. వక్రతమ ఐచ్.

ఐచ్ ప్రత్యాహారస్థ స్వరములగు ఐ, ఔ, లకు అక్షరస్వరూప బోధకమగు వక్రతమసంజ్ఞ (యిందు సంకేతము చేయఁబడినది.)

41. హల స్స్యు స్స్వమాసతః ప్రాణినః.

ప్రాణము (అచ్చు)లతోఁ గూడినవి ప్రాణులు (అనగా, క, గా, ణి, నో, మొదలయినవి); లేదా ప్రాణములను బొంది వ్యవహరింపఁబడునట్టివి ప్రాణులు (అనఁగా క్, గ్, ణ్, మొదలయినవి.) రెండవయర్థమే చింతామణ్యభిప్రాయము. ఈ ప్రాణులకు హల్లు లను సంకేతము (చింతామణియందు చేయఁబడినది.) సంస్కృతమునందలి హల్-ప్రత్యాహారము తెనుఁగునందలి పై 19-వ సూత్రమున వివరింపఁబడిన ధ్వనులకు సరిపడకున్నను హల్-సంజ్ఞను వానికిఁగూడ చింతామణికర్త విధించుచున్నాఁడు.

42. ద్రుతాఖ్యో నః.

న వర్ణము ద్రుతమను పేరుగలది. నకారపుహల్లు (-న్) ద్రుతమని యీ సూత్రమున కర్థము చెప్ప వీలులేదు. అట్లు చెప్పదలఁచినచోఁ జింతామణికర్త 'ద్రుతాఖ్యోన్' అనియుండును. చూ. నః కా; భూతార్థానాం తు నః క్రియాణాం న్యాత్ (నః=న.) కాని, యాతని యుద్దేశము ద్రుతము నకారపుఁ బొల్లనియే. (చూ. దారాత్కోట ఉదపి రః, రః=ర్;

43. అయిగవుగా దేశౌ స్తః క్రమేణ సర్వత్ర వక్రతమయో ర్వా.

ఐ, ఔ, ల కెల్లయెడలను వైకల్పికముగ 'అవు', 'అవు' అనునవాదేశములగును. ఈసూత్ర మధికారముగఁ గాన్పించుచున్నది.

44. కచటతపాః పరుషాఖ్యాః.

క, చ, ట, త, ప, అను నైదింటికిని బరుషములని యీ సూత్రము వలన సంకేతము చేయఁబడినది.

45. గజడదబా స్తు సరళాః.

గ, జ, డ, ద, బ, అనున వన్నియో సరళములను సంజ్ఞను బొందును.

46. స్థిరా ఇతరే.

ఇతర హల్లులకు స్థిరములని సంజ్ఞ (యియ్యఁబడినది.) *పరుష, సరళ, స్థిర, సంజ్ఞలు సంస్కృతవ్యాకరణ సిద్ధములుగావు. ఆంధ్రశబ్దచింతామణి సూత్ర నిర్మాణముకొఱ కీసంజ్ఞలు విధింపఁబడినవి.

47. తిఙ్మధ్య, శేషషష్ఠీ, నుస్, కర్మప్రవచనీయజవిభక్తీః
కిఞ్చిత్,ప్రశంస, నాద్భుత, సన్తాప, యదా, తదా, కి, మేవాంశ్చ,
క్త్వా,కిల,తూష్ణీ, మాద్యా నభిదఘటికలా, ద్రుతో పయేషాంస్యాత్.

ద్రుతము వేనికి లేదో యట్టివి కళలని చెప్పదురు. (అవి యేవియనఁగా) (1) తిఙ్మధ్యములు (అనఁగా తిఙ్తులలో, అనఁగా క్రియాప్రత్యయములలో, మధ్యమపురుష ప్రత్యయములును, ర, మా౦తక్రియలును; చూ. క్రియా పరిచ్ఛేదము - సూత్రము 25):—

ఉదాహరణములు: చేయుచున్నాము, చేయుదుము, చేసితిమి; మొదలగు నుత్తమపురుష బహువచనక్రియలు; చేయుచున్నారు, చేయుదురు, చేసిరి మొదలగు ప్రథమపురుష బహువచనక్రియలు; చేయుచున్నావు, చేయుదువు, చేసితివి, మొదలగు మధ్యమపురుషైకవచనక్రియలు; చేయుచున్నారు, చేయుదురు, చేసెదరు, చేసితిరి మొదలగు మధ్యమపురుష బహువచనక్రియలు; (2) శేషషష్ఠీ='యొక్క' అను షష్ఠీవిభక్తిప్రత్యయము; (3) నుస్=ప్రథమావిభక్తి ప్రత్యయములు ('నుస్' అనునది సంస్కృత వ్యాకరణ మందలి ప్రత్యాహారము; ఇది 'సు, ఔ, జస్' అను ప్రథమా వైభక్తికైక, ద్వి, బహువచన ప్రత్యయములకు సంజ్ఞ. ప్రాకృతమున ద్వివచనముగాని, సంస్కృత ప్రత్యయములుగాని లేకున్నను ప్రాకృతవ్యాకరణములలో 'నుస్' మొదలగు ప్రత్యాహారములనే యుపయోగించియున్నారు. ఆ సంప్రదాయము ననుసరించి చింతామణికర్తగూడ 'నుస్' మొదలగు ప్రత్యాహారములను

ఏ (నే)ను, తాను పదములుతప్ప ప్రథమా విభక్తియందున్న పదము లన్నియు నని చింతామణికర్త యభిప్రాయము. కొందఱు వ్యాఖ్యాతలు 'డు, ము, వు, లు' అను ప్రత్యయములను మాత్ర మీ సందర్భమున నుదాహరించుట పొరబాటు. (4) కర్మప్రవచనీయజ విభక్తిః=(చింతామణిలోని వక్ష్యమాణసూత్రము చొప్పున) 'కూర్చి'యను విభక్తిప్రత్యయము; (5) కిఞ్చిత్ = 'కొంచెము' అను నర్థమును దెలుపు ఇంచుక; మొద. (6) ప్రశంసన = పొగడ్తను దెలుపు 'ఔర' మొదలయినవి; (7) అద్భుత = ఆశ్చర్యమును దెలుపు 'ఆహా, ఓహో, బళీ, మొదలయినవి; (8) సన్తాప = విచారమును దెలుపు 'అయ్యో, అక్కటా,' మొదలయినవి; (9) యదా = ఎప్పుడు, ఎన్నడు, మొదలయినవి; (10)తదా=అప్పుడు, మొదలయినవి; (11) కిమ్=ఏమి, ఏల, మొదలయినవి; (12) ఏవ = అ, ఏ, మొదలగునవి (ఉదా. అదియ, అదియే); (13) క్త్వా = క్త్వార్థకములగు 'చేసి, కొట్టి,' మొదలగునవియు, వ్యతిరేకక్త్వార్థకములగు 'చేయక, కొట్టక,' మొదలగునవియు ('క్త్వా' అను పద సంస్కృత సంజ్ఞకాదు; చింతామణియందు క్రొత్తగా కల్పింపఁబడినది. 'భుక్త్వా, కృత్వా' మొదలగువానియందలి 'క్త్వా'అనుదానినిబట్టి యిది యేర్పడియుండును.); (14) కిల = కదా, మొదలయినవి; (15) తూష్ణీమ్ = మిన్నక, ఊరక, మొదలయినవి; ఇవిగాక 'ఆద్యాః' అను పదముచేనింకను కళా సంజ్ఞనందదగిన వున్నవని తెలియవలెను (ఉదా. చేయుచున్న, చేసిన, చేయు, ను ధాతుజ విశేషణములు).

48. అన్యే ద్రుతప్రకృతయో యే న్యస్తా స్తేనుజీవితద్రుతా నిత్యమ్.

ఏవి నిత్యముగా ద్రుతముతోఁగూడి ప్రవర్తించుచుండునో యట్టి యితరములు ద్రుతప్రకృతు లనఁబడును.

49. తజ్జా సమా చ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి.

ఈ (యాంధ్రభాష) వానినుండి (సంస్కృతప్రాకృతములనుండి) పుట్టినది. లేక తద్భవమనియు; వానితో (సంస్కృతప్రాకృతములతో) సమమైనది, లేక తత్సమమనియు; (ఆంధ్ర) దేశమునకు సంబంధించినది. లేక దేశ్యమనియు, గ్రామ్యమనియు. నాలుగువిధములుగా నున్నది. ఈ తద్భవ, తత్సమ, దేశ్య, గ్రామ్యభేదములు శబ్దములకు వర్తించును; వాక్యనిర్మాణము విషయము ననువర్తించునో లేదో యను విషయముకూడ చింతామణ్యాభిప్రేతమగునో కాదో చెప్పలేము. వ్యాఖ్యాతలందఱును నీభేదములను శబ్దములకే యని తలంచిరి. వస్తాడు. ఇస్తిని, పంచాకుముద్య్య, చాడీచెప్పుతారు, మొద

టచే వాక్యనిర్మాణవిషయమునను నీభేదములు వర్తించుననియే యనుకొన వలసియున్నది.

50. ప్రకృతిద్వయజా తజ్జా.

ఆంధ్రమునకుఁ బ్రకృతులని చెప్పఁబడిన సంస్కృతప్రాకృతముల రెంటనుండియు (వర్ణలోప, వర్ణాగమ, వర్ణాదేశ, వర్ణవ్యత్యయములచే) జనించినది తద్భవము.

51. తుల్యా తు సమా.

ప్రకృతిద్వయముతో ననఁగా సంస్కృతప్రాకృతములతో సమమయినది. అనఁగా సంస్కృతప్రాకృత పదములకుఁ దెనుఁగువిభక్తులు మాత్రము చేరి యేర్పడినది తత్సమము.

52. ప్రవాహినీ దేశ్యా.

(ఆంధ్ర) దేశవ్యవహారమునఁ బ్రవాహరూపమున నానావిధపరిణామములకు లోనయ్యుఁ దన కేవలతను, స్వాతంత్ర్యమును గోల్పోక, యానాఁటి స్వరూపమే యీనాఁటిది గూడనను నిత్యత్వభ్రమను గల్పించునట్టిది దేశ్యము.

53. విరళాన్ పేచోషాదిక శబ్దాన్ ప్రవ్యాహరన్తు శబ్దజ్ఞా,
ఇహ తు ప్రవ్యాహార్యం సఙ్కేతిత సుప్రసిద్ధమేవ పదమ్.

శబ్దజ్ఞు లనఁగా లాక్షణికులు విరళప్రయోగముగల 'పేచ,' 'ఊష' మొదలగు రూపములను తమ యిచ్ఛచొప్పునఁ బ్రయోగించుకొందురుగాక. ఈ (యాంధ్ర) భాషయందుమాత్రము వ్యవహార సంకేతితార్థముగలిగి, సుప్రసిద్ధమయిన పదమును మాత్రమే ప్రయోగింపవలెను. (తద్భవ, తత్సమ, దేశ్యములను బై సూత్రములలో నిర్వచించి, యీయార్యాగీతియందు చింతామణికర్త భాషలో నాల్గవభేదమగు గ్రామ్యమును విస్తరించి చెప్పుచున్నాఁడు. వ్యవహారవిదూరమై, యల్పప్రయోగరక్షితమై, లోకమున సుప్రసిద్ధముగానిదై, లోకముచే సంకేతింపఁబడినదికాని, యనఁగా దేశమున నెల్లవారికి నర్థముకాని, శబ్దమే గ్రామ్యమనియీసూత్రమునభిప్రాయము. 'ప్రవ్యాహార్యమ్' అను పదముచేతనే వ్యవహారమున కిందు ప్రాధాన్యమీఁబడినదని గ్రహింపవలెను. 'ప్ర' అను నుపసర్గము సుప్రసిద్ధవ్యవహారమును సూచించుచున్నది.

54. న పదా న్యవ్యయ సు ప్తిఙ్ క్త్వా తుమునామ్.

(ప్రాతర్, సాయమ్, మొదలగు) సంస్కృతావ్యయములయు; హరిణా, భాషాయాం, మొదలగు సంస్కృత సుబంతరూపములయు, భవతి, భవతః, భవన్తి, అభవత్, మొదలగు సంస్కృతతిఙంత రూపములయు; భుక్త్వా, ప్రస

మొదలగు సంస్కృత తుమున్నంత రూపములయు ప్రయోగ మీయాంధ్ర భాషయందు లేదు.

55. అనుకృతేఽస్తి వాక్యం తు.

అనుకరణమునందుమాత్రము సంస్కృతవాక్యము కలదు. ఉదా. "భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకన్ధరా శ్శ్రేయసే" యని... స్తుతియించి".

56. ఇన్ద్రాద్యా అపి చ గణాః.

ఇంద్రగణములు మొదలయినవి (అనఁగా చంద్రగణములుగూడ) తెనుఁగుపద్యములందు గణము లగుచున్నవి.

57. వళిరాద్యమ్.

పద్యపాదమందలి మొదటి (యక్షరము) నకు వళియని పేరు. 'వళి' యనునది సంస్కృతపదము కాదు.

58. అనన్తరాక్షరం ప్రాసః.

పద్యపాదమున వళితరువాతి యక్షరము, అనఁగా రెండవ యక్షరము, ప్రాసవర్ణము.

(59. శుభవర్ణా శ్శుభశబ్దా యే చ శుభగణా స్త ఏవ కావ్యాదౌ గ్రాహ్యాః.)

కావ్యారంభమున మంగళకరములగు వర్ణములను, శబ్దములను, గణములను మాత్రము వాడవలెను. ఈ సూత్రము ప్రక్షిప్తమై యుండును.

(60. పు, రాష్ట్ర, వన, గిరి, రుద్ర, ష్వ, క, చ, ట, హ, మాతృకా నిన్ద్యాః.)

పాదమునందలి మూఁడు, అయిదు, ఆఱు, ఏడు, పదునొకండు, అగు స్థానములలో అ, క, చ, ట, హ, అను నక్షరములు నింద్యములు (అనఁగా వాని నుపయోగింపఁ గూడదు.)—ఈ సూత్రమును ప్రక్షిప్తమే కానచ్చును.

(61. ఆద్యోవళి, ర్ద్వితీయో వర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు)

పద్యమందలి ప్రతిపాదమునందును మొదటి వర్ణము వళి; రెండవ వర్ణము ప్రాసము. ఈ సూత్రమును ప్రక్షిప్తమే కానచ్చును. 55, 56-వ సూత్రములలో నీ విషయము చెప్పఁబడియే యున్నది. 'అత్ర పాదపాదేషు' అను పదములిం దధికముగా నున్నవి. ...

62. స్వస్వ చరణేషు పూర్వః ప్రాస స్సర్వేషు త్వేక ఏవ స్యాత్.

తమతమ చరణములందు పూర్వ మ్ముంచబడిన ప్రాసాక్షరమే యా పద్యము నన్ని పాదములందును నుండును. ఈ సూత్రము ప్రక్షిప్త మన వీలు లేదు. సంస్కృతచ్ఛందశ్శాస్త్రమున లేని తెనుఁగునకుఁ గల విశేష నియమ మిందు తెలుపఁబడినది.

(63. వృత్తం జాతి శ్చేతి ద్వివిధం పద్యమ్.)

పద్యము వృత్తము, జాతియునని రెండు విధములు.

64. గణైర్నిసర్గాఖ్యై స్సంబద్ధం వృత్తమ్ స్యాత్.

నిసర్గగణములతోఁ గూర్పఁబడినది వృత్తము. నిసర్గగణము లనఁగా మ, న, భ, జ, స, య, ర, త, అనునవి. వీనితరువాత పాదాంతమున గగ, గల, లగ, లల, ములును గొన్నిపద్యములందు చేరుచుండును

65. ఉపగణమాత్రాభి రన్వితా జాతిః.

ఇంద్రాద్యుపగణములతోఁగూడిన పద్యమునకు జాతి యని పేరు.

66. శాస్త్రార ఏక మాత్రాం లఘూం, ద్విమాత్రం గురుం, రితి వదన్తి.

శాస్త్రకారులు లఘువున కొక్కమాత్రయు, గురువునకు రెండుమాత్రలు నుండునని చెప్పుదురు.

67. గౌలౌ గగ లల సంజ్ఞౌ.

రెండు గురువులకు గగమనియు, రెండు లఘువులకు లల మనియు సంజ్ఞలు.

68. గ్లో హగణః.

గలమునకు హగణమని పేరు.

69. లఘుగురూ లగో వగణః.

లఘువునై గురువుచేరి లగమగును; దానికి వగణమని పేరు.

70. దీర్ఘ స్సంయుక్తాద్యాః పూర్ణానుస్వారపూర్వవర్ణశ్చ ఏతే గురవః.

దీర్ఘాక్షరమును, సంయుక్తాక్షరముకంటెఁ బూర్వవర్ణమును, పూర్ణానుస్వారముకంటెఁ బూర్వవర్ణమును, ఇవి గురువులు.

71. శేషా స్సర్వే లఘ్వక్షరా ఇతి జ్ఞేయాః.

తక్కినవన్నియు లఘ్వక్షరములని తెలిసికొనవలెను.

72. గత్రితయం లత్రితయం మనసంజ్ఞౌ.

మూఁడు గురువులుగలది మగణము; మూఁడు లఘువులు గలది నగ

73. ఆద్యమధ్యమాన్త్యవర్ణాః గురవశ్చే ద్భజసగణాః.

ఆదియందును మధ్యమందును, అంతమందును గురువులుండి (తక్కిన రెండు వర్ణములును లఘువులైనయెడల వానికి వరుసగా భ, జ, స, గణము లని పేరు.

74. లఘవోఽయది య, ర, త, సంజ్ఞికాః క్రమతః.

ఆది, మధ్యమ, అంతములందు లఘువుండి, తక్కిన రెండక్షరములును గురువులైనయెడల వానికిఁ గ్రమముగా య, ర, త, గణములని పేరగును.

* 54-వ సూత్రమునుండి యింతవఱకును గల సూత్రములు ఛందస్సునకు సంబంధించినవి. వీనిలో 57-వ సూత్రమునుండి 72-వ సూత్రమువఱకును గలవి యప్పకవీయమున నున్నవి. ఇవి యన్నియుఁ బ్రక్షిప్తములని యహోబలుఁడు సూచించియున్నాఁడు. కాని, యీ పరిచ్ఛేదమున మొదటి నాలుగు సూత్రములందును నలంకారభాగమును బై సూత్రములందు ఛందోభాగమును జింతామణికర్త వివరించి, తక్కిన భాగమంతయు వ్యాకరణమునకు వినియోగించియుండును.

ఈ క్రింది లిపిస్వరూపబోధకములగు నార్యాగీతుల నప్పకవి యాంధ్రశబ్దచిన్తామణి లోనివిగా నుదాహరించియున్నాఁడు.

బాలేన్దు, పరిధి, శృంగ, గావర్త, కుశగ్రంథి, దాత్ర, పరశు సమాః.
ఆద్యా; ఇభకర తుల్యా వృత్తద్వర్ణా, స్స్యాలసన్నిభా వన్త్యాః;
దర, శార్ఙ్గ, పిప్పలన, లాంకుశ, పన్నగ సన్నిభాః క్రమాత్ సమసాః;
స్తన్యవిశేషాధిక్యే స్త ఏవ వర్గద్వితీయ వర్ణాద్యాః;
వర, తరు, హాస్తి మస్తక, శుక్తి, తులాసన, వితర్ది, సీరసమాః.
అన్తస్థా శ్చోష్మాణో; దన్త్యచజౌ గురురతౌ చ బిన్దుయుతౌ.

దీని వివరణము: 'అ' అర్ధ చంద్రాకారము గలది; 'ఇ' నున్న యాకారమున నుండును; 'ఉ' కొమ్ము నాకారమున నుండును (ఏజంతువు కొమ్మో తెలియదు. ఆవు కొమ్మా?); 'ఋ' (నీటి) సుడి యాకారమున నుండును; 'ౠ' దర్భముడి యాకారము గలది; 'ఎ' కొడవలి రూపముగలది; 'ఒ' గండ్రగొడ్డలి యాకృతి నుండును; పయి 'అ, ఇ, ఉ, ఋ, ౠ, ఎ, ఒ, ల దీర్ఘములు ఏనుఁగు తొండమునలె నుండును; ఐ, ఔలు శూలములను బోలి యుండును.

'క' శంఖమునలెను, 'చ' విష్ణువు ధనుస్సువలెను (విష్ణుధనుస్సు నాకారము సాధారణ ధనురాకారము...

ఠ, థ, ఫ,' లు వరుసగా 'క, చ, ట, త, ప' ల యక్షరముల క్రింద స్తంభా
కారముగ గీఁతల నుంచుటవలన నేర్పడును; 'య' చిలుకవలెను, 'ర' ఓడవ
లెను, 'ల' ఏనుఁగు తలకాయవలెను, 'వ' ముత్యపుఁ జిప్పవలెను; 'శ'
త్రాసు నడ్డకట్టువలెను, 'ష' అరుగువలెను, 'హ' నాఁగటివలెను నుండును.
దంత్య చజలును, గురు రలలును బిందువు (బొట్టు) తోఁ గూడియుండును.

పైని వర్ణింపఁబడిన యక్షరముల యాకారమును బట్టి యాంధ్రశబ్ద
చింతామణి కాలమును నిర్ణయింపనెంచుట హాస్యాస్పదము. (i) ఆ యార్యా
గీతులలో 'గ, జ, డ, ద, బ, ణ, న, మ' ల యాకారము వర్ణింపఁ బడలేదు;
కావున నా లిపుల స్వరూపవర్ణన మసంపూర్ణము. (ii) అచ్చుల దీర్ఘముల
యిభకరతుల్యత్వ మొక్క 'అ' కారమునకుఁ జెల్లునేమో కాని తక్కినవానికి
వర్తింపదు. (iii) ఖ, ఛ, ఠ, థ, ఫ, ల క్రింద ఒత్తుండుననియు నది స్తంభా
కారమున నుండుననుటయు పదునొకండవ శతాబ్దపు లిపికే కాదు, పందొమ్మిదవ
శతాబ్దారంభమున నున్న లిపికిని వర్తింపదు. నేఁటి లిపిలోఁగూడ ఖ, ఠ, లకు
వర్తింపదు. (iv) దంత్య చజలు (క్రిందనో, మీఁదనో, ముందుగనో, వెను
కనో) బిందువు (బొట్టు) తోఁ గూడియుండు ననుట కెట్టి యాధారమును గాన
రాదు. (v) పై గీతులలోని యక్షరస్వరూపము పదునొకండవ శతాబ్దము
నాఁటిదని నిర్ణయింప నెంచినవారు నన్నయభట్టు స్వయముగ దగ్గఱనుండి
చెక్కించిన నందంపూడి శాసనమును జూడవలసియుండును. పసిబాలు రాకాశ
మునఁ బోవు మేఘములనుజూచి యిది గుఱ్ఱమువలె నున్నది, యిది యేనుఁగు
వలె నున్నది యని యూహించి యాటలాడుకొన్నట్లు చేసినను నందంపూడి
శాసనలిపికిని బై గీతులయందు వర్ణితమయిన లిపికిని పోలిక తగులదు. కావున
నీ యార్యాగీతులు ప్రక్షిప్తము లనవలెను; లేదా, చింతామణి నన్నయ
కృతము కాదనియైన ననవలెను.

ఇది సంజ్ఞా పరిచ్ఛేదము.



శ్రీః

# ఆన్ధ్రశబ్దచిన్తామణిః

## సన్ధిపరిచ్ఛేదః.



### 1. సన్ధిర్నాచో చ్యతనుగః.

హ్రస్వ - ఉకారమునకుఁ గాక తక్కిన యచ్చుల కచ్చుపరమగు
నప్పుడు సంధికాదు. ఇందువలన ఉత్తున కచ్చుపరమగు నపుడు సంధి నిత్య
ముగా నగునని యీ సూత్రము దెలుపుచున్నదని యందురు; కాని యా
యర్థము పొసగదు. 'ధైర్యము లేని వానికి జయము కలుగదు' అన్నప్పుడు
ధైర్యముగల వాని కెల్లప్పుడును జయము కలుగునని చెప్ప వీలులేదు గదా.

### 2. వాఽఽతః.

అత్తుకంటె నచ్చు పరమైనచో సంధివైకల్పిక (బహుళ) ముగ నగును.
స్త్రీవాచక, తత్సమ, సంబోధన, అవధారణార్థకశబ్దముల తుది యత్తువై సంధి
కలుగదు గావున, నత్తునకు సంధి బహుళమని 'చెప్పుటయే యుక్తము. 'వా'
అనుదానికి మఱికొన్ని సూత్రములందును బహుళమనియే యర్థము కలుగు
చున్నది.

### 3. అనాదిషు విభక్తిషూతో వా.

ప్రథమేతర విభక్తుల తుది యుత్తున కచ్చుపరమగునపుడు సంధి వైక
ల్పికముగ నగును. ద్వితీయావిభక్తియందు 'ను', చతుర్థియందు 'కొఱకు', షష్ఠి
యందు 'కు', సప్తమియందు 'అందు, ఇందు', అనునవి యుదంతములు. వీనిలో
కొఱకు, కు, అందు, ఇందు, లపై నచ్చు వచ్చునపుడు వైకల్పికసంధిని గూర్చి
వివాదములేదు. కాని, ద్వితీయావిభక్తి ప్రత్యయమగు నువర్ణము విషయ
మునఁ గొంత వివాదమేర్పడినది. 'రామ' శబ్దము 'మహతోఽత ఉ ద్విభక్తౌ'
అను సూత్రము ప్రకారము 'రాము' అనిమైనది; దానిపై ద్వితీయయందు
'ను' చేరఁగా 'నిరమోమహతామ్' అను సూత్రము ప్రకారము 'ను' స్థాన
మున 'ని' చేరినది. ఈ నివర్ణము 'టిఙ్నధ్యశేవ షష్ఠీ' త్యాది సూత్రముల
వలన ద్రుతాంతముకాఁగా 'రామునిన్' అనురూపమేర్పడినది. దీనిపై నచ్చు చేరి
'రామునిన్ + అడిగెను' అనునప్పుడు 'అనాదిషు' మొదలగు సూత్రమువలన
సంధికానప్పుడు 'రామునినడిగెను'

'లుక్చస్యాత్' అను సూత్రము ప్రకారను 'రామునిన్' లోని 'ని' వర్ణము లోపించినచో దానితోఁబాటు దానిమీఁది ద్రుతముగూడ లోపించునుగదా. అప్పుడు 'రాము+అడిగెను' అని యున్నప్పుడు 'రాముడిగెను' అను సంధియైన రూపమును, సంధికలుగనప్పుడు 'రాము యడిగెను' అను సంధికాని రూపమును గలుగవలెను. ఈ రెండును ననిష్టరూపము లయినను సూత్రమునుబట్టి యనివార్యము లగుచున్నవి. 'రాము+అడిగెను' అనునప్పుడు 'రాము' అను పదమున ద్వితీయార్థప్రతీతియున్నది కావున నచట ద్రుతముఁ గలిగి 'రామునడిగెను' అను రూపము సిద్ధించునని యెవరైనఁ జెప్పవచ్చును. అప్పుడది సంధికలుగనందు కుదాహరణమగును, కాని సంధియగు పక్షమున 'రాముడిగెను' అను రూపము సూత్రము ప్రకారము కలుగుచునేయున్నది. ఈ యనిష్టరూపములను వారించుటకొక మార్గమున్నది. 'రాము+నున్' అనియుండఁగా 'నిరమోమహతాం' 'లుక్చస్యాత్' అను సూత్రములను వెంటనే ప్రవర్తింపక, పరమందున్న యచ్చుతోఁగలిగిన వైకల్పిక సంధి మూలమున 'రామును నడిగెను, రామునడిగెను' అనురూపములను గల్పించుకొని మొదటి రూపమునందు 'నిరమో మహతాం' అను సూత్రమును ప్రవర్తింపఁజేసి 'రాముని నడిగెను' అను రూపమునకు నిష్పత్తిని గల్పింపవచ్చును. ఈ మార్గము నవలంబించునపుడు 'లుక్చస్యాత్' అను సూత్రమునకుఁ బ్రసక్తియుండదు. కావుననే 'ను' వర్ణములోపింపఁగా మూల ద్రుతమెట్లు కలిగిన దను శంకయుఁ గలుగదు. రాముడిగెను, రాముయడిగెను నను రూపములును నిందుమూలమున నివారింపఁబడును.

'అనాదిషు' మొదలగు సూత్రమునకు వ్యాఖ్యాతలందఱును 'నన్నేలు, నన్నునేలు, మమ్మేలు, మమ్మునేలు' అను నుదాహరణముల నిచ్చియున్నారు. నా, నీ; మా, మీ; అను శబ్దములకు 'న్న పరః హ్రస్వశ్చ దేరమి శసిచ' అను సూత్రమువలన ద్వితీయైక బహువచనములందు ద్వితీయావిభక్తి ప్రత్యయమునకుఁ బూర్వమున 'నన్ను, నిన్ను; మమ్ము, మిమ్ము' అను రూపము లేర్పడుచున్నవి. వీనిపై ద్వితీయా 'ను' వర్ణము ద్రుతముతోఁ జేరి 'నన్నునున్, నిన్నునున్, మమ్మునున్, మిమ్మునున్' అని నిలువఁగా, వానిపై నచ్చుచేరి 'నన్నునేలె, నన్నునునేలె; నిన్నునేలె, నిన్నునునేలె; మమ్మునేలె, మమ్మునునేలె; మిమ్మునేలె, మిమ్మునునేలె' అను రూపములు 'అనాదిష్వి' త్యాది సూత్రమువలన సిద్ధించుచున్నవి. అయిన 'నన్నేలె, నిన్నేలె, మమ్మేలె, మిమ్మేలె', అను రూపములకు గతియేమని యడిగిన నదియాంధ్రశబ్దచింతామణియందు లేదనియే చెప్పవలెను. మమ్మేలె, మిమ్మేలె, అను రూపములకు 'నపదాన్యవ్యయను పిబ్క్త్వా తుమునామ్' అను సూత్రము ప్రకారము గతి కల్పింపనెంచుటయు

గింపఁ గూడదని యా సూత్రము చెప్పుచున్నది గాని, యది మమ్ము, మిమ్ము, తమ్ము'లపై లవర్ణకమును నిషేధించుట కేర్పడినదిగాదు. నన్ను, మమ్ము, నిన్ను మిమ్ము, లలోని ద్విత్వయుత న్ను, మ్ములలోని యొకహల్లు 'అన్యతర లుక్చ యుక్తస్య' అను సూత్రమువలన లోపింపఁగా 'నను, మము, నిను, మిము' అను రూపము లేర్పడుచున్నవి. వీనికి ద్వితీయావిభక్తిప్రత్యయము చేరఁగా 'ననునున్, మమునున్, నినునున్, మిమునున్' అను ననిష్టరూపము లేర్పడుచున్నవి. ఈ రూపములపై నచ్చు చేరునపుడు 'అనాదిషు' మొదలగుసూత్రముచే ననును నేలె, మమును నేలె, నినును నేలె, మిమును నేలె, మొదలగు ననిష్ట సంధులును నేర్పడుచున్నవి. చింతామణి చొప్పున నివి యన్నియు ననివార్యములు.

4. నిత్య మనుత్తమపురుషక్రియా స్వితః.

ఉత్తమపురుషవ్యతిరిక్త క్రియలం దిత్తునకు సంధి నిత్యము; అనఁగా మధ్యమపురుష క్రియలందును (చేసితివి, చేసితిరి, మొద.), ప్రథమపురుషక్రియలందును (చేసిరి, మొద.) గల తుదియిత్తున కచ్చు పరమగునపుడు సంధి నిత్యముగ నగును. ఇందువలన నుత్తమపురుషక్రియల యిత్తునకు సంధికాదో, వైకల్పికమో తెలియలేదు; కాని, వ్యాఖ్యాత లిదంతములగు నుత్తమపురుష క్రియలను కిమాదిగణములో చేర్చి వానికిఁ బ్రాయస్సంధిని విధించుచున్నారు. అప్పవి ఉత్తమపురుష బహువచన క్రియలు తిఙ్మధ్యములలోఁ బఠింపఁబడుటచేత నట్టివానికిఁ బ్రాణసంధి నిత్యమును, నేకవచనమున నుత్తమ పురుషేదంత క్రియల యిత్తునకు సంధి వైకల్పికమునని చెప్పియున్నాఁడు. కాని, నన్నయ భారత ప్రయోగము లుత్తమపురుష బహువచనమందలి యిత్తునకుఁ బ్రాయస్సంధినే సూచించుచున్నవి. ఇదంతములగు నుత్తమపురుషైకవచనక్రియల తుది యిత్తునకు సంధి ప్రాయస్త్వమునుగూర్చి సందేహము లేకున్నను తత్ప్రరూపసాధనప్రక్రియనుగూర్చి యించుక యభిప్రాయభేదము గలదు. "ఉత్వేయులౌ వనకారా స్యాతాం మధ్యోత్తమైకవచనానామ్," "భూతాదిమతాం వరేషామిత్" అను సూత్రములవలన 'గొలుచు' ధాతువు భూత కాలికోత్తమ పురుషైక వచనక్రియ 'గొలిచితిని' అని యేర్పడుచున్నది. 'తిఙ్మధ్యే' తి సూత్రముచే నిది ద్రుతప్రకృతికము గావున దానికి 'గొలిచితినిన్' అనురూప మేర్పడుచున్నది. దీనిపై నచ్చు చేసినప్పుడు 'గొలిచితినంబను, గొలిచితినినంబను' అను రెండు రూపములు 'నిత్యమనుత్త' మేత్యాది ప్రస్తుతసూత్రమువలన నేర్పడుచున్నవి. కాని, 'గొలిచితంబను' అనురూప మేర్పడదు. నన్నయభారతమున 'గొలిచితంబను' వంటి సంధిలోఁడి రూపములు

హారణము కానవచ్చుచున్నది. ఇట్లుండ 'కొలిచి తద్విజను' అను రీతిగలవి ప్రాయస్సంధిపక్షోదాహరణములనియు, 'కొలిచితి నద్విజన్' అను రీతిగలవి యటుదుగ నుండఁదగిన సంధ్యభావపక్షమునందలి యుదాహరణములనియు సహాబలుఁ డుదాహరించుట కేవల మసంగతమై యున్నదని బ్ర. శ్రీ. వఝ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రులవారు తమ "చిన్తామణివిషయపరిశోధన" మను గ్రంథమున వ్రాసియున్నారు.

శ్రీ శాస్త్రులవారు తమ గ్రంథమున మఱియొక సందర్భమున వ్రాసిన రీతిగా 'అంటినిన్' అనునది సముచ్చయార్థబోధక మనుకొనినఁ దమవాదమునకు బాధ కలుగకపోదు. ప్రకరణమునుబట్టి యచట సముచ్చయార్థమునే చెప్పవలసినట్లు తోఁచుచున్నది.

"ఏను నీయింతియునుగాని యెఱుంగ రన్య, లర్థిఁ గణ్వమహాముని యాశ్రమంబునందు గాంధర్వవిధి వివాహమునఁ గరము, నెమ్మిఁ జేసితి దీనిఁ బాణిగ్రహణము, అన్య లెఱుఁగమిఁ జేసి లోకాపవాద, భీతి నెఱిఁగియు నిత్తన్విఁ బ్రీతిదప్పి యెఱుఁగ నంటినిన్." (ఆది. IV. 107, 108.)

"అప్పుడు పాణిగ్రహణము చేస్తిని. ఇప్పు డెఱుఁగనంటిని కూడా నున్ను; రెండున్ను నిజమే," నన్నయ భారతమున 'కొలిచితిని నంబను' వంటి రూపములు మఱి లేవు.

ఇఁకఁ 'గొలిచి తద్విజన్' వంటి సంధిరూపములు నన్నయ భారతమునఁ గానరావనుట వాస్తవమే. నన్నయ 'కొలిచితి' మొదలగు రూపములపై నచ్చును జేర్చుటకు సందర్భపడలేదు. కాని, 'కొలిచితిన్' వంటి రూపముల పై హల్లువచ్చుసందర్భములు గొన్ని కలుగుటచే 'న్' అనునది ద్రుతము గావున శ్రీ శాస్త్రులవారి మతమున నీ నకారహల్లును ద్రుతమునఁ గూడను) సరళ స్థిరవర్ణములు పరములుకాఁగా నా ద్రుతము లోపించిన యుదాహరణములు నన్నయభారతమున లేకపోలేదు. 'పెక్కు సూచితి జగత్పరిపూజ్యము లైన; నిల్పితిఁ బ్రకాశముగా' (ఆది. I. 10); వచ్చితి నీకును (ఆది. III. 108); ఇట్లే, పల్కితి, పుచ్చితి, పుట్టించితి, మసలితి, రోసితి, వచ్చితి, మొదలగు రూపములు గాన్పించుచున్నవి. ఈ రూపము లున్నవని శాస్త్రుల వారు గ్రహింపక పోలేదు. కాని, వాని ప్రక్రియను వేఱువిధముగ సాధించి యున్నారు. 'కొలిచితినిన్' అను రూపమందలి తుది ద్రుతనకారము 'వాక్యాంత గతపదానాంచ' అను సూత్రముచే లోపింపఁజేసిరి. 'కొలిచితి నిన్' అనునది సమాపకక్రియ గావున దానిని వాక్యముగానే వారు పరిగణించి యుందురు. సరే; మిగిలిన 'కొలిచితిని' లోని 'ని' వర్ణము మీఁది

క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతేహ్యేషు' అను సూత్రము చొప్పున నువర్ణమందలి యుత్తు లోపించును గావునను, ఉత్తునుండి జనించిన ఇత్తు కూడ లోపించునని వారి యభిప్రాయము. ఒక వర్ణమునకు విధింపఁబడిన కార్యము లన్నియుఁ దజ్జన్య వర్ణములకుఁగూడ వర్తించునా యను ప్రశ్న మిచట జనింపకపోదు. ఇదిగాక 'కవిభల్లకై' రిత్యాది సూత్రము పదాంత మందలి వర్ణములకు వర్తించునాయని మఱియొక ప్రశ్నయుఁ గలుగుచున్నది. 'పలుకు, పల్కు; అనుచు, అన్చు' మొదలగువాని కింతవఱకును లాక్షణికు లీసూత్రమును వర్తింపఁ జేయుచున్నారు. అది యట్లుండనిండు. వారి ప్రక్రియప్రకార మిప్పుడు 'కొలిచితిన్' అనురూప మేర్పడినది. ఇందలి తుది నకారము మరల 'వాక్యాంత పదగతానాంచ' అనుసూత్రము ప్రకారము లోపించునని వారు చెప్పుచున్నారు. 'వాక్యాంత పదగతానాంచ' అనుసూత్రము ద్రుతవిషయకము. 'కొలిచితిన్' అని వారి ప్రక్రియ చొప్పున నేర్పడిన రూపమందలి తుది నకారమునకు ద్రుతసంజ్ఞ చెల్లునా? వారి మతమున 'తి' వర్ణము త్తమపురుషైక వచన ప్రత్యయము కాదు; కావున దానిమీఁది నకారము ద్రుతమునుగాదు. కావున నది లోపించుటకుఁ బ్రసక్తియు లేదు. కాని, 'కొలిచితి' వంటి రూపములు భారతమునఁ గాన్పించుచున్నవి. ఇన్ని యనుపపత్తులతోఁగూడిన యీ చుట్టుమార్గమును బట్టుట కంటె శాస్త్రులవా రహోబలాదులు త్రొక్కినమార్గము ననుసరించుటయే సమంజసమని తోఁచుచున్నది.

ప్రథమపురుషక్రియలందలి యిత్తునకుఁ గలుగు సంధివిషయమునఁ గూడ వివాదము గలదు. పై సూత్రము ప్రకార మాయిత్తునకు సంధి నిత్యము కాఁదగియుండఁగా నన్నయభారతమున: 'అందు గొందఱధిక హాస్యంబు సేసిరి, యడవి నేమిరోసెదనిరి కొందఱు' (ఆర. II. 102) అని యొక చోటను, 'క్రమమువడసి రొక్క సమయంబుసేసిరి యొనర దాని తెఱఁగు వినుము తల్లి' (ఆది. VI. 267) అని మఱియొకచోటను బ్రయోగములు సంధ్యభావముతోఁ గాన్పించుచున్నవి. కావునఁ జింతామణి నన్నయకృతము కాఁజాలదనియు, నన్నయకృతమే యగుచోఁ దన ప్రయోగములకు సూత్రమున గతిఁ గల్పించియుండుననియుఁ జెప్పుదురు. పై యుదాహరణములలో నా క్రియలు వాక్యాంతమునను బాదాంతమునను నుండుటచే నచట సంధి కలుగకున్నను దోషములేదని కొందఱు చెప్పుదురు. కాని, చింతామణియందు పాదాంతమునఁగాని వాక్యాంతమునఁగాని సంధి లేమిదోషము కాదని సూత్రింపఁబడియుండలేదు. అట్టిచోట్ల సంధి లేమి దోషము కాదనుట నన్నయ ప్రయో

యెట్లు చెప్పనగును? నన్నయయుఁ బాదాంతమున సంధిలేమిని బాటింపలేదు. "సర్వ తీర్థాభిగమనంబు సర్వవేద సమధిగమము సత్యంబుతో సరియుఁగావు, ఎఱుఁగుమెల్ల ధర్మంబుల కెందుఁ బెద్దయండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు" (ఆది. IV. 96) అను పద్యములో 'సరియుఁ గావు' అను పాఠము తప్పు. 'సరియుఁగావ' అని యేవార్థకాకారముతోడనే యనేక తాళపత్ర ప్రతులందు కాన్పించుచున్నది.

5. పరిమితౌ సమస్తానామ్.

పరిమాణార్థక ప్రత్యయము (పదములు కూడనా?) పరమగుచుండఁగా నన్ని యచ్చులకును సంధియగును. 'ఎడు, ఎండు, ఇయండు' అనునవి పరిమితిని దెలుపు ప్రత్యయములు. ఇవి పరమగునపుడు నిత్యసంధియగును. ఉదా. అఱ్ఱెడు, మూనెండు, పఱియుండు, మొదలగునవి పదునొకండవుశతాబ్దపు శాసనములందు కాన్పించుచున్నవి. లి వర్ణాంత శబ్దములపై ఎడు వర్ణకము పరమగునపు డాశబ్దముల తుదివర్ణము లోపించును: దోసెడు, పిడికెడు. గుప్పెడు, మొద. రివర్ణాంత శబ్దములపై ఎడు వర్ణకము పరమగు నపుడును 'రి' వర్ణము లోపించున ట్లుదాహరణముగ 'విస్తరి+ఎడు'=విస్తెడు అనుదాని నొక యాధునిక వైయాకరణుఁడు వ్రాసియుండుట యవిచార మూలకము. 'ఎడు' వర్ణకముగాక 'అంత' మొదలగు పదములును పరిమాణవాచకములే; కాని, యవి పరమగునపుడు సంధి వైకల్పికము 'కంచంత కాఁపురము' (కంచి. +అంత) మొదలగు సంధిరూపము లిందువలన సురక్షితము లగుచున్నవి.

6. నః స్యా త్తద్ధర్మోతః (పాఠా. న స్యాత్తద్ధర్మోతః).

తద్ధర్మోకారముకంటె నచ్చుపరమగునపుడు నకార మాగమముగా వచ్చును. (పాఠాంతరము ప్రకారము తద్ధర్మోకారమున కచ్చు పరమగునపుడు సంధి కలుగదు.)

తద్ధర్మోకారమనఁగా (i) తద్ధర్మార్థక సమాపక క్రియల తుది ఉకారము: చేయుదు (న్), చేయుదుము, చేయుదువు, చేయుదురు, మొద. (ii) తద్ధర్మార్థక ధాతుజ విశేషణముల తుది యుకారము: చేయు, చేసెడు, మొద. రెండును గ్రహింపఁబడుచున్నవి. వీనిలో మొదటి వర్గపువాని కచ్చుపరమగు నపుడు 'సన్ధిర్నాచోఽచ్యనుతః' మొదలగు సూత్రముల ప్రకారము సంధి సిద్ధించుచున్నది. కావున రెండవ వర్గములోని యుదంతధాతుజ విశేషణములు మాత్రమే యీ సూత్రమున నుద్దిష్టము లనుకొనవలెను. ఇఁక ధాతుజ విశేషణములు కళలా, ద్రుతప్రకృతికములా యను ప్రశ్నకు వచ్చు సమాధానమునుబట్టి 'న స్యాత్', 'నః స్యాత్' అను పాఠములలో నేది సరియైనదో నిర్ణ

మందలి 'ఆద్యాన్' అను వర్గములో వానిని జేర్పఁగూడదు; కళలైనచోఁ జేర్పవలెను. 'చేయుచున్న, చేసిన' అను మొదలగు వర్తమాన భూతార్థక ధాతుజ విశేషణములు కళలగుట సుప్రసిద్ధము; కావున, తద్ధర్మార్థక ధాతుజవిశేషణములును గళలే యనుట యసంగతము కానేరదు. అందుచేత నప్పకవి చెప్పిన చొప్పున 'నఃస్యాత్' అను పాఠమే సరియైనదని చెప్పవలసియుండును. (చూ. పుటలు 372, 373.)

7. చో ర్వాస్యా ద్వర్తమాన విహితవ్య.

'చు ఇతి క్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలే స్యాత్' అని క్రియాపరిచ్ఛేదమున విధింపఁబడిన చువర్ణమునందలి యుత్తున కచ్చుపరమగునపుడు సంధివైకల్పికముగా నగును. చేయుచిట్లు (చేయుచుఁ+ఇట్లు) (ఆది. I. 7); వినుచునుండు (వినుచుఁ+ఉండు) (ఆది. I. 71.)

* 8. తద్వ త్తదాదిజన్య.

తదాదులనుండి పుట్టినదానికిని (అనఁగా తదాదులకుఁ బర్యాయపదములగు వైకృత పదములకును) అచ్చుపరమగునపు డట్లే యగును.

పూర్వ సూత్రముల క్రమమునుబట్టి యీ సూత్రమును నుత్తును గూర్చిన సంధినే తెలుపుచున్నదని యనుకొనవలెను. అట్లనుకొన్నచో 'వాఁడు, వీఁడు, ఎవఁడు, వారు, వీరు, ఎవరు, అతఁడు, ఇతఁడు, ఎతఁడు,' మొదలగు మహద్వాచక పదములను గ్రహింపవలసియుండును. అప్పుడు వానిపై నచ్చు పరమగునపు డుత్తునకు సంధివైకల్పికముగ నగునని వైసూత్రమున కర్థము చేయవలసి యుండును. కాని, యట్లుచేయుట ప్రయోగములకు విరుద్ధమగును. కావున వ్యాఖ్యాత లుత్తరసూత్రమగు 'ప్రాయస్తు స్యాత్కిమాదిక స్యేతః' అనుదానినుండి 'ఇతః' అనుపదము నపకర్షముచేసి యీ సూత్రమున వర్తింపఁజేసి,తదాదులనఁగా 'అది, ఇది, ఏది, అవి, ఇవి, ఏవి' యనువానిని గ్రహించియున్నారు. కాని, ఉత్తరసూత్రమందలి 'ఇతః' అనుదాని నపకర్షముచేయునప్పుడు దానిలోని 'ప్రాయస్తు' అనుదానిని గూడ నపకర్షము చేయవలసి యుండును గాని, పూర్వసూత్రమందలి 'వా' అనుదాని ననుసంధింపఁగూడదు. 'ప్రాయః' అనుదానికిని 'వా' అనుదానికిని నర్థమున నించుక భేదముకలదు.

ఈ సూత్రము నన్నయ ప్రయోగములకు విరుద్ధముగ లేకున్నను నన్నయ 'అది, ఇది, ఏది, అవి, ఇవి, ఏవి' అనువానిపై నచ్చు వచ్చునపుడు సంధిచేయకుండుటచేత నన్నయకు సంధిరహితరూపములే యిష్టములనియు, చింతామణి నన్నయవిరచితము గాదనియుఁ జెప్పుట కాస్పదముగలుగు

* 9. ప్రాయస్తు స్యాత్కిమాదికస్యేతః.

కిమ్=ఏమి, మొదలగువాని యిత్తునకన్నో యచ్చు పరమగునపుడు సంధి తఱచుగ నగును. ఈ సూత్రమున 'ఆదికస్య' అను పదమును బట్టి చిన్నయసూర్యాదులు ' మఱి, కిషష్ఠి' యనువానిని కిమాది గణమునఁ జేర్చిరి. కిమ ర్థకము లైన యిదంతములగు వైకృతశబ్దము లితరములు లేవు. 'ప్రాయస్తు స్యాత్' అనఁగా 'ఏమి' లోని యిత్తున కచ్చు పరమగునపుడు సంధియగుటయుఁ గలదను నర్థము స్ఫురించుచున్నది. 'సంధిర్నాచోఽచ్యనుతః' అనుసూత్రము ప్రకార మిత్తునకు సంధి కాఁగూడకున్నను 'ఏమి,మఱి' శబ్దములలోని యిత్తునకు మాత్రము సంధియొకప్పుడు కలుగవచ్చునని యీ సూత్రమునభిప్రాయము. కాని, నన్నయభారతప్రయోగములందు సంధికలుగుట కుదాహరణములు కాన రాకున్నవి, (చూ. పుట 1472.) 'కి' షష్ఠికి మఱియొక సూత్రముక్రింద గతి సిద్ధింపకుండుటచేత లాక్షణికులు దానిని కిమాది గణములోఁ జేర్చినారు. కాని, దాని నట్లుచేర్చుట సమంజసము కాదు. 'అనాదిషు విభక్తిష్విదుతో ర్వా' అని సూత్రమును సవరించుకొనవలసియుండును; ఆ యార్యాగీతి గణములను సవ రించుట సంస్కృతకవులపని.

10. అపి శబ్దార్థ స్యేతః.

అపి శబ్దార్థముగల యిదంత వైకృకపదమగు 'ఏని' లోని తుది యిత్తున కచ్చు పరమగునపుడు సంధి వైకల్పికముగ (ప్రాయికముగ?) నగును. ఇందు 9-వ సూత్రమునుండి ప్రాయశ్శబ్దమును దెచ్చుకొనవలెనో, 7-వ సూత్రమునుండి 'వా' అను దానిని తెచ్చుకొనవలెనో తెలియదు.

నన్నయభారతమున 'ఏనియున్, ఏనిన్ , ఏని, ఏన్, ఏ' అను వివిధరూప ములు కాన్పించుచున్నవి. పైసూత్రము ప్రకార మిదంతమగు 'ఏని' శబ్దమే యపిశబ్దార్థకమవి స్పష్టపడుచున్నది. కాని, యిది కళయో ద్రుతప్రకృతికమో తేలదు. 'త్రిష్వర్ధ్యే'తి సూత్రమునందలి 'ఆద్యాన్'లో దీనిని చేర్చవలెనా? చేర్చిన 'ఏనియున్' అను రూపము సిద్ధించును; చేర్చకున్న 'ఏనిన్' అను రూప ము సిద్ధించును. 'ఏని' అనునది 'ఏఁడు' అను సర్వనామమునకు ద్వితీయైక వచన రూపమనుకొని 'సిరమోమహతాం' అను సూత్రమును బట్టించుటకు 'నాకు నీ వెన్నండేని నవమానంబున్ దలంచితిఁ' (ఆది. II. 154.); ఎద్దియేని నొక్క యపూర్వంబయిన దాని (సభా. I. 4.); ఎందేనినుండి (ఆది. III. 181.); ఎయ్యేనియు నొక్క స్త్రీయందు (ఆది. IV. 127.); - ఇత్యాది నన్నయ ప్రయోగము లాటంకము లగుచున్నవి. ఇఁక 'ఏని' లోని 'ని' వర్ణము ద్రుత ము కాదుగదా; 'కవిభల్లకో' అను సూత్రమును వర్తింపఁ జేయుదమన్నను

ద్ధార్థస్యేతః" అను సూత్రము ననుసంధించుకొనవలెను; కాని, సంధియందే యీ సూత్రమువలన నిత్యమునకు లోపము గలుగఁగలదు గాని, వాక్యావసానమునను నట్టి లోపను కలుగుట సాధింపఁ బడనేరదు. సంధియందే కాక స్వతంత్రముగను నేనిశబ్దములోని 'ఇ'కారము లోపించును. ఈ 'ఇ'కారము లోపింపఁగా మిగిలిన 'ఏన్'లో నకారపుఁబొల్లు ద్రుతముగాకున్నను ద్రుతమునకుఁ గలుగు కార్యములు కలుగుచుండును. ఉదా. సపత్నులపేర్మిఁజూచియేఁజూవె సహింపనోపక కృశుండ వివర్ణుఁడనైతి (సభా. II. 114)

11. చౌ రే రుపధాత్త నశ్చ లుగ్వా స్యాత్.

'చి' వర్ణము పరమగుచుండఁగా నుపధావర్ణమగు రివర్ణమునుమీఁది యిత్తు వైకల్పికముగా లోపించును: అమరిచి, అమర్చి. సాధారణముగానుపధయనఁ దుదివర్ణ మచ్చయినను హల్లయినను దానికిఁ బూర్వమందున్న యచ్చుగాని హల్లుగాని యైనను నిచట తుదివర్ణమునకు ముందున్న యచ్చుతోడి హల్లని వ్యాఖ్యానము చేసికొనవలెను. 'అమరిచి' అనునప్పుడు సాధారణముగ 'చ్'అనునది యుపధావర్ణము గావలసి యుండును. అమరుచు, అమర్చు, అను రూపములు 'కవిభల్లస్థైః' అను సూత్రమువలన సిద్ధించుచున్నవి. కాని, అమరిచెన్, అనునది 'అమర్చెన్' గామాఱుటకు చింతామణియందు గతిలేదు. 'చౌ' అనునది 'చె' మొదలగువానికిని నుపలక్షణమని యహోబలుఁడు సర్దినాఁడు. సూత్రమందలి 'చ'కారమునకుఁ బ్రయోజనముగానరాదు.

12. శత్రర్థేతూత శ్చే నోః.

'ధాతువునందలి' నువర్ణమునకు శత్రర్థకచువర్ణము పరమగుచుండఁగా నుపధాస్థానమున నుండు నా నువర్ణములోని యుత్తునకు లోపము వైకల్పికముగా (బహుళముగా ?) నగును. (ఉపధానిర్వచనమును గూర్చి పై సూత్రము నొద్దఁజూడవలెను.) అనుచున్, అన్చున్; కనుచున్, కన్చున్, మొద.

18. తస్య స్యాచ్చ పూర్ణబిన్దురపి.

దానికి పూర్ణబిందువుకూడ నగును:—దానికనఁగా దేనికి ? 'ను'వర్ణమునకా ? నువర్ణములోని యుత్తునకా ? పై సూత్రమును బట్టి 'ను'వర్ణము లోపించు యుత్తునకనియే చెప్పవలయును. కాని, 'ను' వర్ణమునకని సూత్రకారుని యభిప్రాయమైన ట్లనుకొనవలెను. అనుచున్, అంచున్; కనుచున్, కంచున్; వినుచున్, వించున్; మొద.—11-వ సూత్రములోని 'వా'అనువానికి 'బహుళ'మనియే యర్థము చేయవలెను. 12, 18 వ సూత్ర...

లేవు; అట్లే దీర్ఘపూర్వమగు 'ను'వర్ణమున కీకార్యములు గలుగవు: ఆనుచున్, ఈనుచున్, ఊనుచున్, పూనుచున్, మానుచున్, మొదలగువానియందు లోపములేదు, కావున పూర్ణబిందువును లేదు.

14. శబ్దాత్తచ్ఛబ్దాతః.

శబ్దమునకంటెఁ బరమయిన 'అది' అను తచ్ఛబ్దార్థక పదమందలి తొలి యత్తునకు లోపము వైకల్పికముగ నగును. ఈ సూత్రమున ననువర్తించుచున్న 'వా' కు బహుళమని కాక వైకల్పికమనియే యర్థము చెప్పవలెను. నాది, నాయది; రామునిది, రామునియది మొద.

15. ప్రోశ్చ తదాద్యర్థవాచకే మాతః.

తదాద్యర్థక వైకృతపదములగు అపుడు, ఇపుడు, ఎపుడు అనువానిలోని 'పు' వర్ణమునందలి యుత్తునకును లోపము వైకల్పికముగ నగును: అపుడు, అప్డు; ఇపుడు, ఇప్డు; ఎపుడు, ఎప్డు ('అప్డు') అని భారతము ఆది. VI. 168 లో నొక్కసారిమాత్రము వచ్చినది. ఇప్డు, ఎప్డు, లను నన్నయ ప్రయోగించలేదు.)

16. ప్రథమా వైభక్తిక మోర్బిందుశ్చ మహాన్ పతిక్రియార్థేషు.

ప్రథమావిభక్తికి సంబంధించిన మువర్ణముమీఁది యుత్వమునకును 'పడు' మొదలగు క్రియలు పరములగునపుడు లోపము వైకల్పికముగ నగును. అట్టియెడ శేషించిన మకారస్థానమున పూర్ణబిందువుగూడ వచ్చును అని సూత్రార్థము; కాని, మువర్ణమున కంతటికిని లోపము గలుగునని సూత్రకారుని యభిప్రాయము. అట్లు కాకున్న 'భయమ్పడు' అను రూపము సిద్ధించును; భయపడు అను రూపము సిద్ధింపదు. అహోబలుఁ డీ సందర్భమున 'పదంపడి' యని యుదాహరించుట ప్రమాదము; 'పదముపడి' అను రూపము లేదు. ఇందు 'పదము' అనునది శబ్దము కానట్లు తోఁచుచున్నది. 'పదపడి' శబ్దవ్యుత్పత్తి విచార్యము. ఉదా. భయమువడు, భయపడు, భయంపడు; మొద.

ఈ సూత్రమునందలి కార్యము కర్తృవాచి మువర్ణమునకుఁ గలుగదు: 'గజమువడియె' అని యగునుగాని 'గజంపడియె, గజపడియె' నను రూపములు గలుగవు.

మువర్ణము ప్రథమా వైభక్తికము గావున దానిపై వచ్చు పరుషములకు గసడదవ లగును. 'భయమువడు'; కాని, మువర్ణలోపమును, పూర్ణబిందువులును వచ్చునప్పుడును గసడదవాదేశము వచ్చునాయని యహోబలుఁడు శంకించుకొని 'స్థానివదాదేశోऽనల్విధౌ' అను పాణినీయసూత్రమును ... ప్రామాదికము. 'భయపడి,

20. షష్ఠ్యా ఉతో౽చి నుమ్ సే చ.

షష్ఠీ సమాసమున నుత్తునకచ్చు పరమగునపుడు నుమాగమ మగును. ఉదా. రాజునాజ్ఞ, పాము నెమ్మిలు, మొద.

21. ఆద్య స్యా మ్రేడితే౽న్త్యలోపశ్చ.

ఆమ్రేడితము పరమగుచుండఁగా మొదటిపదము తుది వర్ణమునకు లోపముకూడఁ గలుగును. ఇంచుకించుక, ఇంచించుక; నాఁడునాఁడు, నానాఁడు; పోర పోర, పోపోర; ఇంటి కింటికి, ఇంటింటికి. ఒకప్పుడు మొదటి శబ్దము తుది యచ్చుమాత్రము లోపించును: ఆహాహా, ఓహోహో, ఔరౌరా, మొద.

22. అహమాదీనాం ద్విత్వమ్.

'అహమ్' మొదలగు శబ్దములకు (అనుకరణమున) వాని తుదిహల్లులకు ద్విత్వము వైకల్పికముగా నగును. (నన్నయ యిట్టి సంధికార్యముల కుదాహరణములగు ప్రయోగములఁ జేయ లేదు. పదునొకండవ శతాబ్దమున నీ సూత్రమున కుదాహరణములు గానరావు. ఉదా. దాసో౽హమ్మనె, దాసో౽హమనె; మకారేతర హల్లుల కనుకరణమున ద్విత్వము నిత్యము: కింతత్తనియె; ఇదం జగత్తనియె; మొద. అహమాదులలోఁ జేరు నితర పదములుగ త్వమ్, స్వమ్,ల నుదాహరింపవచ్చును. కస్త్వమ్మనె, కస్త్వమనె; మదీయఁ స్వమ్మ (-మ)నె; మొద. ద్వితీయైకవచనమున వచ్చు 'అమ్', 'మ్'లతోఁ గూడిన రూపములను గూడ నహమాదిగణములోఁ జేర్పవచ్చును. ఏత త్కలమ్మ (-మ)నె; వందే భగవన్తమ్మ (-మ)నె; మొద.)

23. లోపో నమ ఆదికే విసర్గస్య.

'నమః' మొదలగు శబ్దములలోని తుదివిసర్గమున కనుకరణమున లోపము (నిత్యముగ) కలుగును: (దీనికిని నన్నయభారతమునఁ గాని పదునొకండవ శతాబ్దమువఱకునుగల శాసనములందుగాని ప్రయోగముల కానరావు. రామాయ నమ యనియె;—విసర్గమున కోత్వముగూడ నగునని యథర్వణుని కారిక గలదు: రామాయ నమో యనియె. 'నమ' ఆదు లెవ్వియో నిర్ణయింప వీలు లేదు. 'భూయస్, జ్యాయస్, కనీయస్' మొదలగు వానినీగణమునఁ జేర్పవచ్చును. నమ ఆదికములుగాని శబ్దముల విసర్గమున కనుకరణమున కేమి యగునో, యితరములగు నచ్చులుగాని హల్లులుగాని యంతమందగల సంస్కృత పదములపై ననుకరణము గలుగునపు డేమియగునో చింత

24. * బోరద్భుత శబ్దార్థే.

అద్భుతార్థముగల వైకృత పదమగు 'అబ్బురము' అనుదానిలోని 'బు' వర్ణమునకు లోపము వైకల్పికముగా నగును: అబ్బురము, అబ్రము. (ఈ రీతిగఁ బ్రత్యేక పదములందు గలుగు కార్యములను జింతామణి మఱి యెచ్చటను వివరింపలేదుగావున నీ సూత్రము ప్రక్షిప్తమై యుండును.)

25. * పోశ్చ తదాద్యర్థవాచకే మాతః.

పై సూత్రమును నీ సూత్రమును గలిసి యొక యార్యాగీత్యర్థముగ నొక పాఠము గలదు; కాని, యీ సూత్రమే 'శబ్దాత్తచ్ఛబ్దాతః' అను దానితో గలిసి యార్యాగీత్యర్థముగఁ గొన్ని ప్రతులలో నున్నది. ఈ సూత్రము పునరుక్తమగుటకుఁ గారణము లేకుండుటచేతను, 'బోరద్భుత శబ్దార్థే' అను సూత్రము ప్రక్షిప్తమగుటచేతను నీ రెండును గలిసిన పాఠము త్యాజింపఁ దగినది.

26. * లోపో వా స్యాత్తేషా మితశ్చ తద్వత్త్రివిక్రమమతేన.

త్రివిక్రమమతముచొప్పున వాని యిత్తునకును లోపము వైకల్పికము గానగును. (ఇందు తేషాం='వాని' యనునది 'కవిభల్లటైః' అనుహాలంత పరిచ్ఛేదములోని సూత్రమునఁ జెప్పఁబడిన 'క్రియాణాం', 'నామ్నాం' అను వానితో నన్వయించును. అప్పకవి యీ సూత్రము నిచ్చట చెప్పుట తగదు. ఈ సూత్రము ప్రక్షిప్తమనుటకు హేతువు కానరాదు. ఉదా. నేరిచి, నేర్చి; నేరిచెన్, నేర్చెన్; వేలిచి, వేల్చి; వేలిచెన్, వేల్చెన్; మొద.

27. * పరుషా ద్రుతప్రకృతికా త్సరళాః స్యుః.

ద్రుతప్రకృతికములకంటెఁ బరములయిన పరుషములు నిత్యముగా సరళములగును. (సూత్రమునందు 'ద్రుతాత్' అనినఁ జాలును.) ఉదా. రాముఁన్ + కొలిచెద = రామున్ గొలిచెద; దానిన్ + చేయుదును = దానిన్ జేయుదును; చేసెన్ + టక్కు = చేసెన్ డక్కు; చేసెన్ + తప్పు = చేసెన్ దప్పు, కొలిచెన్ + ప్రభువున్ = కొలిచెన్ బ్రభువున్; మొద.

28. * తద్ద్రుతంచ బిందుః స్యాత్.

దాని (ఆ ద్రుతప్రకృతిక శబ్దపు) ద్రుతము బిందువు కూడనగును. 'బిందురనుస్వారః' అను సూత్రము చొప్పున ద్రుతమున కనుస్వారోచ్చారణముగూడఁ గలుగునని యర్థము; అనఁగా నా ద్రుతమునకు దాని తరువాత వచ్చు హల్లు వర్గమునకు సంబంధించిన యానునాసికోచ్చారణము కలుగును

దును; చేసెన్ డక్కు, చేసెణ్ డక్కు; చేసెన్ దప్పు, చేసెన్దప్పు (తవర్గీయానునాసికము నకారమే కనుక నిచట మాఱలేదు); కొలిచెన్ బ్రభువున్, కొలిచెమ్ బ్రభువున్; మొ. బిందువున నున్నయని యర్థమును జెప్పవచ్చును గాని నున్న వ్రాతకు సంబంధించినది; ఈ సూత్రముచ్చారణమును విధించుచున్నది గావున బిందువునకు నున్నయని యర్థము చెప్పుట తగదేమో.

29. * అవికారగతే తస్మిన్నపి సరళా ఏవ సన్తి తే పరతః.

దానికి (ద్రుతమునకు బిందువను సంజ్ఞగల యనుస్వారోచ్చారణమునకు) వికారము గలుగకున్నను అవి (పరుషములు) సరళములుగానే యుండును (అనఁగా ద్రుతముపై పరుషములకు సరళాదేశము నిత్యము. ఈ సందర్భమున ద్రుతమునకు స్వత్వాభావ మండుననియుఁ బూర్ణార్థబిందువులు గలుగుననియు, సంశ్లేషము గలుగుననియు వ్యాఖ్యాతలు చెప్పు నర్థము లసంగతములు. చింతామణియందు ద్రుతమునకు స్వత్వాభావమును గూర్చిన ప్రశంసయే లేదు. 'తస్యాంతంచ బిందుః స్యాత్' అనునప్పుడు చింతామణి పరిభాషప్రకారము (పూర్ణ, అర్ధ) అనుస్వారోచ్చారణమునే గ్రహింపవలెను గాని 'నిండుసున్న, అరసున్న' లను గ్రహింపఁ గూడదు. 'అరసున్న'కు గుఱుతుఁ (నాఁడేకాక యీనాఁటివఱకు నెవ్వరును లేరు.) 'న' అను నకారపు పొల్లు నిలుచునపుడు గలుగు సంధిరూపము సంశ్లేష రూపము గనుకచేత సంశ్లేషమునుగూర్చి ప్రత్యేకముగఁ దెలుపుటయు ననావశ్యకము.

30. * గసడదవాస్స్యుః ప్రథమామాత్రాల్లక్ష్యదృష్ట్యైవైతే.

ఇవి (పరుషములు) తాను, ఏ (నే)ను పదములలోఁ దక్కఁ దక్కిన ప్రథమావిభక్తిక ప్రత్యయములపై (అనఁగా డు, ము, వు, లు, లపై) వరుసగా గ, స, డ, ద, వ లగును, (ఇచట 'మాత్రా' అను పదమునకు 'గుఱుతు' అని యర్థము చేయఁబడినది. కాని, 'మాత్రా' శబ్దమునకు కార్త్స్న్యార్థమును వ్యాఖ్యాతలు చెప్పిరి. పదము ప్రథమా విభక్తి రూపమున నున్నంతమాత్రముచేత దానిపై వచ్చు పరుషములకు గసడదవ లాదేశమగునని యీ పక్షమున నర్థము చెప్పవలెను. ఈ యర్థమే ప్రయోగముల కనుకూలముగ నుండి 'అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు', అంత, ఇంత, ఎంత, అట్లు, ఇట్లు, ఎట్లు, అట, ఇట, ఎట, ఏమి, మొదలగు నవ్యయముల మీఁదను, ద్రుతాంతములు కాని సమాపకక్రియారూపముల మీఁదను, ద్వంద్వ సమాసములయందును గసడదవాదేశము కలుగుటను దావేర్పడుచున్నది.

ఈ సూత్రము తాను (నేను) పదములపై గసడదవాదేశము కలుగ

కలుగుటనుగాని, కలుగకుండుటనుగాని నిర్ణయింపఁగల ప్రయోగములు నన్నయ గ్రంథమునఁగాని యాతనికాలపు శాసనములందు గాని కానరాలేదు. తిక్కన మాత్రము 'ఏను' పదముపై 'ప' కు 'వ' ఆదేశముగా నిలిపినాఁడు. ఏను పదముతోఁబాటు తాను పదమును ద్రుతాంతము గానన్లే తలంపవలసియుండును. ఏను, తాను పదములు ద్రుతాంతము లగుట యర్వాచీనకాలమునఁ గలిగినది. కావున చింతామణి నన్నయకృతము కాదేమో యని సందేహించుటకు మఱియొక కారణ మేర్పడుచున్నది.

31. * న వికృతిశబ్దాత్పరత స్సాంస్కృతికానాం భవన్తి గసడదవాః.

(ప్రథమా మాత్రములగు) వికృతిశబ్దములకంటెఁ బరమయిన సాంస్కృతిక శబ్దముల (తొలి వర్ణములకు) గసడదవ లాదేశములు గావు.

నన్నయకాలమున వికృతిశబ్దములకంటెఁ బరమయిన పదములకు గసడదవాదేశము కలుగుటకుఁ బ్రయోగములు కానవచ్చుచున్నవి. కావున, చింతామణి నన్నయకృతము కాదనుట కిది మఱియొక హేతువగుచున్నది.

32. * లుగ్వా ద్రుతప్రకృతికాత్పరత స్స్వరే స్థిరే చ నస్య స్యాత్.

ద్రుత ప్రకృతికముకంటె (నాదేశ వర్ణములుగాని) సరళములును స్థిర వర్ణములును బరమగునపుడు (వానికుండు నకారమునకు (అనఁగా ద్రుతమునకు) లోపము వైకల్పికముగ నగును. వచ్చెన్ + గరుడుఁడు = వచ్చెన్ గరుడుఁడు, వచ్చె గరుడుఁడు; వచ్చెన్ + ధర్మరాజు = వచ్చెన్ ధర్మరాజు; వచ్చె ధర్మరాజు. మొద.

33. * అలుకి చ సంశ్లేషః స్యాత్.

ద్రుత లోపము కలుగనపుడు సంశ్లేషముకూడ నగును. (ఈ సూత్రము నభిప్రాయము స్పష్టముగా లేదు. 'లుగ్వా' అను సూత్రము ప్రకారము లోపము కలుగనప్పుడు ద్రుతమగు నకారపుఁ బొల్లుపై సరళమో స్థిరమో నిలుచునప్పుడు సంశ్లేషమే యగుచున్నది. 'వచ్చెన్ ధాత్రీపతి' అనుటకును 'వచ్చెన్ధాత్రీపతి' అనుటకును వ్రాఁతలోఁదప్ప నుచ్చారణములో నెట్టి భేదమును లేదు. అట్టియెడ నీ సూత్రము ప్రయోజనము గానరాదు.)

34. * బిన్దుం ప్రవదన్తి తం క్వచిత్ కేచిత్.

కొందఱొకప్పుడు దానిని (ద్రుతమును) బిందువని నొక్కి చెప్పె నన్నయ. 'బిన్దు రనుస్వారః' అను సూత్రముచొప్పున సరళాదులకు ముందు నిలుచు ద్రుతమున కనుస్వారోచ్చారణమనఁగా వత్తి వర్గీయానునాసికోచ్చారణము గలుగునని కొందఱి యభిప్రాయము. [illegible]

మారుతము; వినె ణ్ణంకారధ్వని, మ్రోగె ణ్ణమరుకము, మ్రోగెణ్ణక్క; పోయె న్దర్పము, ఆడె న్ధర్మజుఁడు, పాతె న్నది; కలఁచె మ్మణి, కలఁగించె మ్బంగారము, తాండవించె మ్భవుఁడు; చంపెఁ యముఁడు, చచ్చెఁ రాక్షసుఁడు, పుట్టెఁ లవుడు, వేసెఁ వర్ణము, రక్షించెఁ శంకరుఁడు, సంహరించెఁ షణ్ముఖుఁడు, ధరించెన్ హరుండు; మొద.—బిందువనఁగా నున్నయని యర్థము చేయఁగూడదు. అట్లు చేయుట చింతామణి పరిభాషకు విరుద్ధము.

35. * సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య.

యకారమున కన్నియెడలను నచ్చునకువలెఁ గార్య (మగునని) తెలిసికొనఁదగినది. ఇచట 'యస్య' అనుటవలన నన్నివిధములగు యకారములకును గాక 'అద్ యః క్రియాను భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః' అను సూత్రమునఁ దెలుపఁబడిన వైకృతపదముల తొలుతనుండు యకారమునకని వ్యాఖ్యానము చేసికొనవలెను. సాధారణముగా 'సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః' అని ద్రుతప్రకృతికములకంటె వచ్చు యకారమునకే యచ్కార్యము గలుగునని వ్యాఖ్యాతలు వ్రాయుచుందురు. అచ్కార్యము ద్రుతప్రకృతికములకంటెనే కాక యన్నియెడలను గలుగును గావున 'ద్రుత ప్రకృతికేభ్యః' అను పదము నీసూత్రమునఁ జేర్పఁగూడదు. అతఁడు + యెవఁడు = అతఁడు + ఎవఁడు = అతఁడెవఁడు; పుస్తకమున్ + యిచ్చెను = పుస్తకమున్ + ఇచ్చెను = పుస్తకము నిచ్చెను; చెప్పినన్ + యేమి= చెప్పినన్ + ఏమి= చెప్పిననేమి; మొద.

36. * ద్రుతప్రకృతికేభ్యో లుక్సంశ్లేషౌ నాచి.

ద్రుత ప్రకృతికముల కంటె నచ్చు పరమగునపుడు (ద్రుతమునకు) లోపమును సంశ్లేషమును గలుగవు. (ద్రుతమునకుఁ బరుషములు పరమగునపుడు సరళాదేశమును ద్రుతమునకు బిందు సంశ్లేషములును, తక్కిన హల్లులు పరమగునపుడు లోపబిందు సంశ్లేషములును గలుగునని యింతకుముందు తెలుపఁబడినది. ఇంక ద్రుతమున కచ్చు పరమగునపు డేమి కార్యము గలుగునను ప్రశ్న పుట్టఁగా దానికి లోపమును సంశ్లేషమును గలుగవని యీ సూత్రము తెలుపుచున్నది. బిందువుగూడఁ గలుగదని చెప్పవలసియుండెను, కాని, యీ సూత్రముదానిని తెలుపలేదు. ద్రుతమున కచ్చు పరమగునపుడు సంశ్లేషముగలుగదనిన సర్థమేమో విశదము కాలేదు. 'సర్వమున్నతని' మొదలగు వానియందువలె ద్రుతమున కనఁగా నకారపుఁ బొల్లులకు ద్విత్వము గలుగదని సూత్రకారుని యభిప్రాయమై యుండును. కాని, 'పాడె న్గధర్వుఁడు' మొదలగు వానియందలి సంశ్లేషమునకును 'సర్వమున్నతని' మొదలగు వానియందలి

బొల్లుక్రింద పొల్లుచేరినది; రెండవదానియందు ద్రుతమునకు ద్విత్వము గలిగినది. ఇట్టి ద్విత్వమునే సంశ్లేష మందురేని, యీ ద్విత్వము నన్నయ భారతమునఁ గానవచ్చుచున్నది (ధైర్యశక్తి కిన్నరుడుగ, మొద.); కాఁబట్టి చింతామణి నన్నయరచితము కాదనుటకు మఱియొక హేతు వేర్పడుచున్నది.

37. * ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు.

సమాసములందు ద్రుతముల కెల్ల యెడల లోపము గలుగును.

'షష్ఠీ భవే ద్వితీయాతుల్యా తత్పురుష సంస్థితా నామ్నామ్' అను సూత్రముచేత రాముని గుణములు, రాము గుణములు, రాముల గుణములు, అజురాణి, కవినేర్పు, మొదలగువానియందు రాముని, రాము, రాముల, అజు, కవి, అనునవి సంబంధార్థక షష్ఠియందున్నవి. వాని రూపములు ద్వితీయా విభక్తి రూపములతో సమానముగా నున్నవి. ద్వితీయా విభక్తిక రూపములు ద్రుతాంతములు గావున, నివియు ద్రుతాంతములు గావలసివచ్చును. వాని ద్రుతాంతత్వమును దొలఁగించుటకు 'ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు' అను ప్రస్తుత సూత్రము కల్పితమయినదని వ్యాఖ్యాతలా సూత్రము నర్థమును వివరించినారు. 'విజ్ఞధ్యేతి' సూత్రముచేత నింతకుముందే నిషిద్ధమయిన ద్రుతమున్నదని 'షష్ఠీ భవే' త్తను సూత్రముచేత నేల కల్పింపవలెనో దానిని మఱియొక సూత్రముచేత నేల మఱల నిషేధింపవలెనో తెలియదు. వైయాకరణుల మార్గములట్టివి; లేదా వ్యాఖ్యాతల మార్గమట్టిది. 'సమాసేషు' అనునప్పుడు కేవల షష్ఠీ సమాసములనే గ్రహింపఁ గూడదు. నెలన్ తాల్పు + నెలతాల్పు (ద్వితీయా తత్పురుషము); నెలన్ = నెలచేత తక్కువవాఁడు (ఇచటఁ దృతీయకు ద్వితీయారూపమువచ్చి ద్రుతాంతముగా నున్నది) = నెలతక్కువవాఁడు; దేవరమేలు (ఇది చతుర్థీతత్పురుషార్థమును గలిగియున్నను 'దేవర' పదము షష్ఠీరూపము గలిగి ద్వితీయాతుల్యత్వముతో ద్రుతమును బొంది ప్రస్తుత సూత్రముచే ద్రుతలోపము కలుగఁగా నేర్పడిన సమాసము); ఇట్లే దొంగభయము (పంచమీ తత్పురుషము); రాముని బాణము (షష్ఠీరూపము, ద్వితీయా తుల్యత్వము, ద్రుతము, ద్రుతలోపము) మాటన్ (సప్తమికి ద్వితీయ, ద్రుతము, సమాసమున ద్రుతలోపము.) ఇవి వ్యధికరణ సమాసములు. సమానాధికరణమున సరసపు + (నుమ్వోతః) న్ (ద్రుతము) + వచనము, అని యుండఁగా ప్రస్తుత సూత్రము వలన ద్రుతలోపము గలిగి 'సరసపువచనము' అయినది. 'చేయు+ అతఁడు' -ఇచట 'చేయు' కళయైనయెడల'నుమ్వోతః' అను సూత్రము చొప్పున 'చేయునతఁడు' అను రూపమేర్పడఁగా 'ద్రుతస్య సర్వత్ర లుక్' అను

ము చెప్పున మఱల నకారము వచ్చుచున్నది. ద్రుతాంతమైన యెడల 'ద్రుతస్యసర్వత్ర లుక్సమాసేషు' అను ప్రస్తుత సూత్రము చెప్పున ద్రుతము లోపించి తిరుగ 'చేయు + అతండు' అని నిలువంగా 'నః స్యాత్' అను సూత్రము చెప్పున మఱల ద్రుతము చేరుచున్నది; ఏ పక్షమందయినను 'నఃస్యాత్' అను పాఠమే సరియగును. ఇట్లే, యితర సమాసములందును నెఱుంగవలెను. 'సర్వత్ర' అని సూత్రమునందున్నను ద్రుతలోపము సమాసములందు సర్వత్ర నిత్యముగాం గలుగదు. ఉదా. తలంబ్రాలు, ఊరంబంది, చిగురుంగేలు, మొదలయినవి.

38. * నుమ్వోతః.

(సమాసములందు) ఉత్తునకు (ఎల్లయెడల) 'నుమ్ము' కూడ వచ్చును. ఈ కార్య ముత్తునకుం బరుష సరళములు పరములగునపుడు గలుగునని కొందఱందురుగాని యెట్టి హల్లుగాని యచ్చుగాని పరమైనను గలుగును. ('నుమ్' అను దానియందు మకార మిద్వర్ణము. 'మిదచోఽన్త్యాత్పరః' అను పరిభాషను బట్టి పూర్వపదము తుది యచ్చుపై వచ్చి దాని కవయవముగా నకారము చేరునని తెలియవలెను. ఈ నుమాగమము త్తుపై పదము పరమగునపుడే కాక 'తనము' అను ప్రత్యయము చేరునప్పుడును గలుగును. ఆమ్రేడిత సమాసమున స్త్రీసమముకంటె నుమాగమము గలుగునని యొకమతము. మువర్ణకమునకు వికారములగు 'వు, పు' లపైంగూడ నుమ్ము వచ్చును. ఉదా. గండుంగోయిల, తళుకుంజెక్కులు, ముదువుంజెక్కులు, సొగసుంబలుకులు, కలుకుంబలుకులు, తళుకుంగజ్జెలు, అలుకుంజొన్నలు, కొలువుంజాలు, సొగసుంబర్హము; తెనుంగుం వ్యాకరణము; సొగసుందనము, సొగసుపుంబలుకు, గరువపున్నవ్వు; మొద. - అదంత శబ్దములమీందను నీకార్యము గలుగును. తెల్లందనము, ఎఱ్ఱంజెఱువు, మొద. అందు, పట్టి, కూర్చి, విభక్తులు పరమగునపుడును నుత్తుపై నుమాగమమగునని యథర్వణుడు చెప్పెను. నన్నయకాలమున 'అందు' వర్ణకము పరమగునపుడు నుమాగమముగాక నవర్ణాగమమే తెలుచుగం గాన్పించుచున్నది. వనమునయందు మొద. పట్టి, కూర్చి, అను విభక్తి ప్రత్యయములు నన్నయకాలమునం గానరాలేదు. ఒకవేళ నుండినను వానికిం బూర్వమందు వచ్చునది యాగమమగు 'నుమ్ము' కాదు. ద్వితీయావిభక్తిపై వచ్చు ద్రుతమే యచట నిలుచుచున్నది.

39. * పరుషాణాం గసడదవాః స్యుః పదాద్ద్వన్ద్వే.

ద్వంద్వసమాసమందు పదముకంటెం బరమయిన పరుషములకు వరుసగా గసడదవలు (నిత్యముగ) నాదేశములగును: కూరగాయలు, అక్క

ప్రథమా మాత్రాత్' అను సూత్రముచేతనే ద్వంద్వసమాసమునఁగూడ గసడదవాదేశము సిద్ధించుచుండఁగా నీ సూత్రమువలన సమాసములలో ద్వంద్వసమాసములందే యీకార్యము గలుగునుగాని యితరసమాసములందు గలుగదని నిషేధించుట కీసూత్ర మావశ్యకమైనది.

40. * సామానాధికరణ్యే మూ దన్తానాం టుగాగమోఽచి స్యాత్.

కర్మధారయసమాసములం దుదంత శబ్దముల కచ్చు పరమగునపుడు 'టు' గా గమమగును. కఱకు + అమ్ము = కఱకుటమ్ము; సరసపు + అలుక = సరసపుటలుక. అచ్చు పరమగునపుడు టుగాగము నన్నయ భారతమునఁ గానరాలేదుగాని, శాసనములలో 'ఉబ్బుటుంబల్లె' మొదలగుచోట్ల హల్లు పరమగునపుడు గానవచ్చుచున్నది.

41. * దారార్థేరేత ఉదపి రః.

'దారాః' అను నర్థముగల తెనుఁగుశబ్దమగు 'ఆలు' అనుపదము పరమగునపుడు (సమాసమందు) పూర్వపదము తుదియత్తున కుత్తుగూడఁ గలుగఁగా, దానిపై రేఫాగమమును వచ్చును. 'అపి' ని ఉత్తుతోఁ గలిపి చదివిన యెడల సాధారణముగ నత్తున కుత్తు కలుగదనియు, అయినను గొన్నియెడల నది కలుగుననియు నర్థము చెప్పవలెను. అట్టియెడ దేశ్యశబ్దములందు తుదియత్తున కుత్తు సాధారణముగఁ గలుగదనియు, సంస్కృతశబ్దములపై తఱచుగఁ గలుగుననియు చింతామణి హృదయమును గ్రహింపవలెను: పేదరాలు, బాలింతరాలు; గుణవంతురాలు; మొద. 'అపి' శబ్దమును 'రః' తోఁ గలిపి చదివినయెడల నుత్తు తప్పక వచ్చుననియు, రేఫాగమముగూడఁ గలుగుననియుఁ జెప్పవలెను. అప్పు డీసూత్రము తత్సమశబ్దములకు మాత్రము వర్తించును. 'అతః' అనుదానితోఁ గలిపి 'అపి' శబ్దమును బఠించినయెడల నదవ్యతిరిక్తాచ్చులకుఁగూడ నుదాదేశముఁ గలుగునని యర్థము చెప్పవలెను: పాపజాతురాలు మొద. ఉదంతశబ్దములపై నుదాదేశమునకుఁ బ్రసక్తి లేదు: సాగనురాలు, గొడ్డురాలు. సూత్రమున 'దారార్థే' అనుటవలన 'ఆలు' శబ్దమునకు సమాసములందు 'భార్య' అనునర్థమును గ్రహింపవలెనని ధ్వనించుచున్నదిగాని దానిని 'స్త్రీమాత్రపరము' గ గ్రహింపవలెను. 'ప్రతోఖ్యేనః' అనునపుడు 'నః=ణ్' అని యెట్లు గ్రహింపవలెనో యట్లే యీ సూత్రమునఁగూడ 'రః=ర్' అని గ్రహింపవలెను.

42. * మోస్తు విభక్త్యేకవచనే పుంవూ.

ప్రకరణమును బట్టి కర్మధారయ సమాసమున విభక్త్యేకవచనము

(చూ. సూత్రము 17) అనుపాఠము చింతామణి నన్నయకృతమయిన చో ప్రక్షిప్తము. ప్రస్తుతసూత్రమునకుఁ గూడ నన్నయభారతమునఁ దగిన యుదాహారణములు గానరావు. వీనిపుట్టిన పాపంబు వేళ (-ంపుగి) మొద.

43. * ప్రథమలుగపి ద్వినుల్లోః.

న్ను, ల్లు అను పదముల తుది ద్విత్వను, లు, వర్ణములలో మొదటి ను, లు, లకు లోపమును (సమాసమునందు) వైకల్పికముగఁ గలుగును. ఈ సూత్రమున 'ద్వినుల్లోః' అనుటవలన 'న్ను, ల్లు' లు 'నును', 'లులు' ల సంయోగమువలనఁ గలుగుచున్నవని ధ్వనించుచున్నది గాని, వాస్తవముగ నవియట్లు గలుగలేదు. 'కన్‌ను, ముల్‌లు' అను నుచ్చారణ క్రమము గల పదములను వ్రాతయందు 'కన్ను, ముల్లు' లుగ వ్రాయుట వ్రాతయందలి దోషము గాని వేఱుగాదు. 'కన్ను, ముల్లు' అను వ్రాత కనున్ (న్‌గి), ములుల్ (-లగి) అను నుచ్చారణక్రమము దెలుపుచున్నది. ఈ పదములందు రెండు ను-వర్ణములుగాని, రెండు లు వర్ణములుగాని లేవు; ఉన్నవనుకొనుట భ్రమ. 'కన్‌ను,' ముల్‌లు' అనువానిలోని మొదటి నకార లకారములకు సమాసములందు లోపముగూడఁ గలుగునని చెప్పబోయి సూత్రకారుఁ డిట్లు చెప్పియుండును. ప్రకరణములబట్టి కర్మధారయసమాసములందుకెలుగు నీకార్యమునకు కన్నుదోయి, కనుదోయి; ముల్లుకంప, ములుకంప; కల్లుకుండ, కలుకుండ; మొదలగున వుదాహారణము లగును. 'అపి' శబ్దముచేతనే 'తల్లిదండ్రులు, తలిదండ్రులు' మొదలగు ద్వంద్వసమాసములందును, ఇల్లుసేరెన్, ఇలుసేరెన్, మొదలగు వ్యస్త ప్రయోగములందును గూడ నీ కార్యము కలుగునని సమరించుకొనవలెను. 'విలుకాఁడు' మొదలగు వానియందు లోపము నిత్యము. 'న్ను, ల్లు' లంతమందుగల యన్నిపదములందును నీలోపము గలుగదు. అన్ను, చెన్ను, తన్ను (=తాఁపు), తెన్ను అనునవి 'అను, చెను, తను, తెను' లు గావు చెల్లు, వెల్లు, లు 'చెలు, వెలు' లుగ మాఱవు. ద్విత్వాక్షరములలో నిట్లొక హల్లు లోపించుట యుత్వవిశిష్టములగు న, ల, ల మీఁదనే కాక యితరహల్లుల మీఁదఁ గూడ నగును. నిప్పట్టి, నిప్పటి; తాయెత్తు, తాయెతు; రావుత్తు, రావుతు; దుమ్ము, దుము; కొట్టు, కొటు; నువ్వు, నువు; పువ్వు, పువు; మొదలయినవి. ఉత్వవిశిష్టములగు ద్విత్వహల్లులందే కాక యితరాచ్చులతోఁగూడి యున్నవానియందును నీ లోపము కాన్పించును; చిన్న, చిన; నల్ల, నల; బిడ్డ, బిడ; పెద్ద, పెద; మువ్వ, మువ; చిట్టి, చిటి: పొట్టి, పొటి; రెడ్డి, రెడి; దోదుమ్మి, దోదుమి, నుయ్యి, నుయి; నెయ్యి, నెయి; శెట్టి, శెటి; తల్లి, తలి; నెట్టి

44. * ఇచ్చ విభక్త్యన్తిమస్య.

విభక్తి ప్రత్యయముల యంత్యాచ్చునకు మాఱుగ సమాసమునం దిత్తు కూడఁ జేరును. ఈ కార్యము 'చేత, తోడ, వలన' లకు మాత్రము గలుగును. ఉదా. నీ చేతిపోటు, వానితోడి చెలిమి, దొంగవలని భయము. సూత్రము నందలి చకార మీ కార్యములకు బాహుళకత్వమును దెలుపును. చేత, తోడ వలన, ల వంటివే యగు 'చే, తో, కొఱకు, కంటె, లో' అనువానికీ కార్యము గలుగదు. 'లోపల' నైఁ గలుగును; లోపలి.

45. * జే రలి చ.

సప్తమ్యేకవచన ప్రత్యయము లని చెప్పఁబడిన 'అందు, ఇందు' లకు 'అలి' గాగమము సమాసమునందు గలుగును. 'జేః' అనుటవలన నవర్ణకమును గూడ గ్రహింపవలసి యున్నను నా ప్రత్యయముపై నలిగాగమము గలుగదు. అలిగాగమముతోడి రూపములు నన్నయభారతమునఁ గాని యాతని నాఁటి శాసనములందుగాని కానరావు. ఆ కాలమున 'ఉల' గాగమమే కానవచ్చుచున్నది. అందులవారు, ఇందులవారు, మొద. అలిగాగమము తోడి రూపము లర్వాచీనములు; ఉల గాగమముతోడి రూపములు సర్వసాధారణముగ నుండఁగా నలిగాగమముతోడి రూపములును గలవని సూత్రము నందలి 'చ' కారమువలన గ్రహింపవలసి యుండును. నన్నయయే చింతామణి కర్తయైనచో నలిగాగమముతోడి ప్రయోగములను జేయకుండుట విచిత్రమే.

46. ఔపవిభక్తికసంజ్ఞా వర్ణాఃషింట్యాదయో భవన్తీహ.

ఇచట (అనఁగా నాంధ్రభాషయందు) టి, ంటి, మొదలగు నౌప విభక్తిక సంజ్ఞలుగల వర్ణములున్నవి. ఆదిశబ్దముచే 'ఇ, తి' వర్ణములను గ్రహింపవలెను. కొన్ని వైకృతపదములపై ఇ, టి, ంటి, తి, అను వర్ణములను జేర్చిన పిదపఁ బ్రథమేతర విభక్తుల యేకవచనమున విభక్తి ప్రత్యయములను జేర్పవలెను. కావున నీ 'ఇ, టి, ంటి, తి' వర్ణముల కుపవిభక్తులను పేరు గలిగినది. ఏ పదములపై నుపవిభక్తి ప్రత్యయములు చేరునో యా పదము లౌపవిభక్తికములని చెప్పవలెను. కాని, యీసూత్రము 'ఇ, టి, ంటి, తి' వర్ణములకే ఔపవిభక్తికములను సంజ్ఞ నిచ్చుచున్నది. ఉదా. కొలను, కొలని; నీరు, నీటి; ఇల్లు, ఇంటి; వాయి, వాతి; మొద.

47. *రుల్వాదేర్నామ్నాం న్యన్తేహి విభక్తౌ సమాసే చ.

అవి (ఔపవిభక్తికవర్ణములు) ము, లు, మొదలగున వంతమందుగల శబ్దముల తుది వర్ణములకు విభక్తి ప్రత్యయము

48. * వాత్మాస్మదో ర్ద్రుతస్య స్యాల్లుక్.

ఉదా. ఊరు, ఊరికి; కాలు, కాలికి; ఊరివారు, కాలినడక; ఏటినీరు, ఇంటిగోడ, వాతిబియ్యము, మొద.

ఆత్మన్, అస్మద్, అను సంస్కృత పదముల (కు సరియగు వైకృతపదముల) ద్రుతమునకు లోపము వైకల్పికముగ నగును.—ఆత్మన్, అస్మద్ అను పదములకు సరియగు వైకృత సర్వనామముల రూపములు హలంతపరిచ్ఛేదమున తెలుపఁ బడినవి. తెనుఁగు వ్యాకరణమును సంస్కృతమున వివరించుటవలన నెన్నియో సందేహములకుఁ దావేర్పడుచున్నది. (1)సంస్కృతమునందలి 'ఆత్మన్' శబ్దమునకు చింతామణి ప్రకారము తెనుఁగునరూపము 'తాను' అగును, 'తానున్' అను రూపమేర్పడి ద్రుతము లోపింపఁగా 'తాను' అని మఱల నిలుచును. (2) అస్మచ్ఛబ్దమునకుఁ దెనుఁగున సరిపోవు రూపములు 'మా' మన, అనునవి రెండు గలవు. ఇవి ద్రుతప్రకృతికము లనుట యసందర్భము; సూత్రకారుఁ డీ రూపములనుగాక 'నా' అను రూపమునే యుద్దేశించి యుండును. కాని, 'నా' అనునదియు తెనుఁగున ద్రుతప్రకృతికము కాదు. అయిన నాతఁ డుద్దేశించినది 'నా' అనుదాని ప్రథమైకవచనరూపమైయుండును. అది యేది? 'ప్రథమాయా ఏ దస్మదః', దేశ్యా దస్మచ్ఛబ్దా త్సుజసో న్నుమ్వా న్తౌ, అను సూత్రముల ప్రకారము 'ఏను' అను నేకవచనరూపమును, ఏము అను బహువచనరూపమును బ్రథమావిభక్తియం దేర్పడును. వీనిలో 'ఏను' ను మాత్రము మనము స్వీకరింపవలయునని చింతామణియాశయమై యుండును. ఇది ద్రుతప్రకృతికము గావున 'ఏనున్' అనుదాని తుది ద్రుతము లోపింపఁగా సంధియందు 'ఏను' అనిమాత్రము నిలుచును.

ఇట్లుండఁగా సంధియం దచ్చు పరమగునపుడు 'ఏనున్ + ఇప్పుడు=ఏనునిప్పుడు; ఏను+ఇప్పుడు = ఏనిప్పుడు; తా(?) నున్+ ఇప్పుడు=తా(?)ను నిప్పుడు; తా(?)ను+ఇప్పుడు=తానిప్పుడు' అను రూపములును (2) హల్లులలోఁ (i) పరుషములు పరమగునపుడు 'ఏనున్+పలికితి = ఏనుమ్బలికితి, ఏనున్బలికితి; ఏను+పలికితి = ఏనువలికితి; తా(?)నున్+పలికె= తా (?)నుమ్బలికె, తా(?)నున్బలికె; తాను+పలికె=తానువలికె; అను సంధిరూపములును; (ii) స్థిరవర్ణములు పరమగునపుడు, ఏనున్+భరించితి = ఏనుమ్భరించితి, ఏనుమ్భరించితి; ఏను+భరించితి=ఏనుభరించితి; తా(?)నున్+భరించె= తా(?) నుమ్భరించె, తా(?)నున్భరించె; తా(?)ను+భరించె=తాను భరించె అనునిట్టి రూపములును గలుగును. 'ఏను విదప డిగియెద' అనుచోట్ల గలుగు గసడదవాదేశము నీవిధముగనైన సాధింపవచ్చును. చింతామణివలన సాధింపఁదగిన రూపము లివియైయుండఁగా

రూపములను సాధింప నెంచుట చింత్యము. చింతామణి యట్టి రూపముల నిష్పత్తిని దెలుపలేదు. 'కవిభల్లస్త్రైః క్రియాణామ్' అను మొదలగు సూత్రముచేత 'తా(ఁ)ను, నేను,' పదములతుది యుత్వములోపించినను మిగిలిన నకారపుఁ బొల్లు ద్రుతమనుటకుఁ జింతామణియం దాధారములేదు. తాన్, నేన్, అను రూపములలోని నకారపుఁ బొల్లు లోపించుటకును జింతామణియందు గతి కాన్పింపదు.

49. * వాక్యాన్తగతపదానాంచ.

వాక్యాంతమున నిలిచిన ద్రుతప్రకృతిక పదముల ద్రుతమునకును లోపము వైకల్పికముగ నగును. ఉదా. వాఁడువచ్చెన్, వాఁడువచ్చె.

50. * నలడాదే ర న్త రుతశ్చ.

(పద) మధ్యమందుండు న, ల, డ, మొదలగు వర్ణములమీఁది యుత్వమునకును లోపము (వైకల్పికముగా) నగును. ఉదా. పునుక, పున్క; చిలుక, చిల్క;కడుపు, కడ్పు: -ఇతర హల్లులమీఁది పదమధ్యోకార లోపమునకు: పెటులు, పెట్లు; నెత్తురు, నెత్రు; విదురుచు, విద్రుచు; చప్పుడు, చప్డు; కప్పురము, కప్రము; అబ్బురము, అబ్రము; పముజు, పంజు; చెయువు, చెయ్వు; కూరుకు, కూర్కు; మాఱుపు, మార్పు; తెవులు, తెవ్లు; సాళువము, సాళ్వము; మొదలగునవి.

కొన్నియెడల నీ కార్యము గలుగదు. తగులు, మిగులు; మొద.

51. * అన్యేషాం ప్రయోగమహితానామ్.

(కవులచే గ్రంథములందును, జనులచే వ్యవహారమునందును) ప్రసిద్ధముగఁ బ్రయుక్తములగు పదముల యుత్తునకేకాక పదమధ్యగతములగు నితరాచ్చులకును లోపము (వైకల్పికముగా) నగును:-- ఉదా. అత్తునకు లోపము. ఉంగరము, ఉంగ్రము; పట్టనము, పట్నము; ఇంటరము, ఇంట్రము; బొందలము, బొంద్లము; కొలఁది, కొల్ది; పాత్తరము, పాత్రము; మొద. ఇత్తునకు లోపము: పొగడిత, పొగ్డ; విడియము, విడ్యము; ముత్తియము, ముత్యము; పెండిలి, పెండ్లి; పెనిమిటి, పెన్మిటి; మొద.

ఇది సంధి పరిచ్ఛేదము.

---

శ్రీః

# ఆన్ధ్రశబ్దచింతామణౌ.

## అజన్తపరిచ్ఛేదః.

---

1. డు, ము, వు, లవః ప్రథమా స్యాత్.

డు, ము, వు, లు అనునవి ప్రథమావిభక్తి యగును. (ప్రథమావిభక్తిని దెలియఁజేయు ప్రత్యయముల నుట)—'డు, ము, వు, లవః' అనునది సమాహారద్వంద్వసమాసముగాఁ దీసికొనవలెను. సమాహారద్వంద్వమయి నయెడల సమాసము నపుంసలింగైకవచనమున నుండవలెను. ఇతరేతరయోగద్వంద్వమైనచో 'ప్రథమాః స్యుః' అని యుండవలెను. ఈ సూత్రము సంస్కృతసంప్రదాయమునకుఁ దప్పినది.

2. * కూర్చి ల, ను, నయో భవేద్ద్వితీయా తు.

ద్వితీయ యన్ననో కూర్చి, ల, ను, ని అను విభక్తి ప్రత్యయములను గలది యగును. ఈ సూత్రముగూడ సంస్కృత సంప్రదాయమునకుఁ దప్పినది. 'కూర్చి, ల, ను, ని భవేత్' అనికాని, 'ద్వితీయాస్తు' అనికాని సూత్రమును సవరింపవలసియుండును. దీనిలో 'కూర్చి' అనునది నన్నయభారతమున లేదు; ఆ గ్రంథరచనమున కనంతరము చాలకాలమువఱకు నాంధ్రకావ్యములందు గాన్పింపదు. ఇందు 'తు' అనునది నిరర్థకము; పాదపూరణము కొఱకుఁ జేరినది.

3. తో, చేత, తోడ, చే, చ తృతీయాయాః

తో, చేత, తోడ, చే, అనునవి కూడ తృతీయా (విభక్తి) కగును. ఇందు 'చ' కు ప్రయోజనము కానరాదు. తో, చేత, తోడ, తో, లు గాక యింకను సుప్రసిద్ధములగు తృతీయావిభక్తి ప్రత్యయము లున్నయెడల నీ 'చ' సార్థకమగును; మెయిన్, మైన్; చేసి; కొని; మొదలగునవి తృతీయార్థమున నున్నను నవి సుప్రసిద్ధములు గావు.

4. కొఱకు, కై, చతుర్థ్యాః స్తః.

కొఱకు, కై, (అనునవి) చతుర్థికగును (చతుర్థీ విభక్తి ప్రత్యయము లనుట.) వీనిలో 'కొఱకు'ను నన్నయ వాడలేదు. ఆతనికాలపు శాసనము

వానిని 'కు+అయి' అని భేదముచేయవచ్చును. ఆ స్థలములం దచ్చునకే ప్రాధాన్య మీఁ బడినది; - కాబట్టి 'కై' కూడ చతుర్థీవిభక్తి' ప్రత్యయముగ నన్నయ యంగీకరించియుండఁడు.

5. * పట్టి, వలన,కంటే, ఇతి పఞ్చమీ.

పట్టి, వలన, కంటె, అనునవి పఞ్చమి (యందు వచ్చు ప్రత్యయములు)

ఇందు 'పట్టి' అనునది నన్నయ రచించిన భారతమందుగాని, యాతని కాలపు శాసనములందుగాని కానరాదు. (చింతామణి నన్నయకృతమా?); కంటే అని దీర్ఘముగఁ జెప్పుట యార్యాగీతిగణములు చెడకుండుటకు. సంస్కృతములో ఛందోబద్ధముగా తెనుఁగువ్యాకరణమును రచించినప్పు డిట్టి పొరపాట్లు క్షంతవ్యములు. సూత్రమునందు 'పఞ్చమ్యాః' అని యుండవలెను.

6. * అథ లోపల, కి, కు, యొ, క్కాన్యా.

పిమ్మట లోపల, కి, కు, యొక్క, అనునవి యన్య (షష్ఠీ) విభక్తిప్రత్యయము (లగును).

'అథ' అనుపదము పాదపూరణార్థము. 'అథాతో బ్రహ్మ (ధర్మ) జిజ్ఞాసా' లోని 'అథ' వంటిది కాదిది. మంగళార్థమని కొంద అనుకొందురుగాక. 'లోపల' ను జెప్పి 'లో' ను విడుచుట యెందుకో తెలియదు. 'తోడ, తో; చేత, చే'లను సూత్రకారుఁడు చెప్పియున్నాఁడుగదా.— 'యొక్క'ను షష్ఠీవిభక్తిప్రత్యయములలో నేలచేర్పవలెనో కూడఁ జింత్యము; అది కావ్యములలోఁ గానరాదు; వ్యవహారమున లేదు. వ్యాఖ్యానములందు మాత్రము తెనుఁగు తెలియని సంస్కృతపండితులు కొందఱు వాని నుపయోగించుట కలదు.—సూత్రమున 'షష్ఠీ' అనుటకు 'అన్యా' అనుట గణసౌకర్యార్థము. ఈ 'అన్య' పదమునే 'విషయనిమిత్తాదిషు తథైవాన్యా' అనుసూత్రమున 'సప్తమీ విభక్తి' పముగా నుపయోగింపఁబడినది.— 'యొక్కాన్యా' అని సంధిచేయుట విచార్యము. 'యొక్కా అన్యాయాః' అనవలసియుండెను. ఏమిచేయును? వ్యాకరణమును సంస్కృతములోనే వ్రాయవలెను; ఆర్యాగీతులలోనే వ్రాయవలెను. సంస్కృతాంధ్రపండితులు వీని నార్షప్రయోగములందు రేమో.

7. అంద్విందు నాస్తు సప్తమీ.

అందు, ఇందు, న, లన్నవి సప్తమీ(విభక్తి ప్రత్యయములు).

'ఇందు' ప్రత్యయ మెట్లగునో తెలియదు. 'రామునందు' అనునట్లు 'రామునిందు' అని నన్నయ

వలెను. నన్నయకాలమున 'అలి' గాగమము లేదని యింతకుముందు చెప్పఁబడినది.-'తు' నిరర్థకము; '(ద్వితీయా) తు' వంటిదే.—సప్తమ్యాః'అనవలెను.

* 8. ఓ యీ త్యామన్త్రణం చ వికృతౌ స్యాత్.

'ఓయి' అని పిలుచుటగూడ వికృతియందు (తత్సమేతరములవై) అగును.

'ఓయి' అను నామన్త్రణ సంజ్ఞను నన్నయ వాఁడలేదు. దీనిని విభక్తి ప్రత్యయములలోఁ జేర్చి యేలచెప్పవలెనో తెలియదు. రామోయి! రాముఁడోయి ! అని నన్నయకాలమున పిలుచుచుండిరందురా ? 'చ' కారమును బట్టి 'ఓయి' తోఁబాటు మఱికొన్ని ప్రసిద్ధములగు (చింతామణి చెప్పినట్టి) ఆమన్త్రణ సంజ్ఞలుండెడి వందురా? అయిన నవి యేవి? వానినేల చింతామణి వివరింపలేదు.

9. స్త్రీ పశు జడా న్వినా న్యే మహదాఖ్యాః.

స్త్రీ వాచకములు, పశువాచకములు, జడవాచకములు నగు పదములు దప్ప తక్కినవి మహత్తు లను పేరుగలవి.

ఈ సూత్రమందు 'పశు' అను పదము 'తిర్యక్కు'ల కన్నిటికి నుపలక్షణ మనవలెను. లేకున్నఁ బక్షులను సరీసృపములను, మత్స్య, భేకాది జంతుజాలమును, కీటకములను దెలుపు పదములనుగూడ మహద్వాచక పదము లనవలసి యుండును. గుణవాచకపదములను గూడ స్త్రీ పశు జడవాచకపదములతో సూత్రమునఁ బరిగణనము చేయవలసియుండును. సూత్రమున మనుష్యులలోఁ బురుషులను దెలియఁజేయు పదములు మహద్వాచకములనియు, మహద్వాచకములుగానిపదము లమహద్వాచకములనియు జెప్పిన బాగుండెడిది. మానవ పురుషత్వారోపణము చేయఁబడిన ప్రాణులను జడపదార్థములను దెలియఁజేయు పదములును మహద్వాచకములే యనవలయును; ఉదా. గరుడుఁడు, హనుమంతుఁడు, జాంబవంతుఁడు; సూర్యుఁడు, చంద్రుఁడు, సముద్రుఁడు, మేఘుఁడు; పులియఁడు, బూచిగాఁడు; జన్నుఁడు, నీలుఁడు, దేవుఁడు,రాక్షసుఁడు, మొదలయినవి. మహదమహత్సంజ్ఞలు సంస్కృత వ్యాకరణసిద్ధములు కావు గనుక ప్రత్యేకముగ వాని నేర్పఱుపవలసివచ్చినవి.

10. తద్విశేషణాశ్చాపి.

వాని (మహద్వాచకపదముల) విశేషణములుగూడను ( మహద్వాచకములే). ఉదా: రాముఁడు సుగుణాభిరాముఁడు; సీత జనకపుత్త్రి; తాత మంచి

11. మహతోఽత ఉద్ విభక్తౌ.

విభక్తిప్రత్యయము పరమగుచుండఁగాఁ (తత్సమమగు) అకారాంత (పుంలింగ) మహద్వాచక శబ్దము తుది అత్తున కుత్తు ఆదేశమగును: రామ-రాము. ఈకార్యము తత్సమపదములమీఁదనే కలుగును.

12. మహతస్సో ర్డు జనితో భవే త్పుంసి.

పుంలింగమునందుండు మహద్వాచకమగు నిదంతముకాని (తత్సమ) పదము ప్రథమైకవచనమున డుజ్బు అగును. (జిత్తు నాన్ధ్రశబ్దచింతామణి నిర్వచింపలేదు. జిత్తు బిందుపూర్వకమగు నను నాంధ్రవ్యాకరణ పరిభాష చింతామణికిఁ బూర్వమందుండియు నుండును.) ఉదా: రాముఁడు, శంభుఁడు. మొద

13. ఆమన్త్రణ సుజనో స్తసి క్రమేణ చా దార దాగమా వ స్తే.

సంబోధన ప్రథమైకవచనమునందు హ్రస్వ అకారమును, దీర్ఘాకారమును, ప్రథమా బహువచనమున 'అర' అను హ్రస్వఅకారమందుగల ప్రత్యయమును సంతాగమములుగ వచ్చును. 'క్రమేణచాత్' అనుదానిని 'క్రమేణ చ+అత్' అని కాని, క్రమేణ చ+ఆత్, అనికాని విడఁదీయవచ్చును. తపరకరణము చేయుటవలన హ్రస్వాకారమో, దీర్ఘాకారమో, సూత్రకారోద్దిష్టమై యుండును; కాని, యీరీతిగా గోడమీఁది పిల్లివాటముగ సూత్రరచన చేయుట సూత్రలక్షణమగు నసందిగ్ధతకుఁ దోడ్పడదు. గాని, 'అరత్' అని 'అర' వైఁ దపరకరణము చేయుటవలన 'అరా' అను నాగమమును నిషేధించినట్లే యగుచున్నది. సూత్రమువలన 'రాముఁడ, 'రాములార, శంభుఁడ, శంభులార', అను రూపములు సిద్ధించుచున్నవి, రాముఁడా, శంభుఁడా, అనువానిఁబోలిన రూపములును సిద్ధించుచున్నవని యనుకొనవచ్చును. 'రాములారా' అను నిట్టి రూపములు సిద్ధింపవు. ఈ యాగమము అమహద్వాచక పదములమీఁదఁగూడఁగలుగును: వనమ (-మా?). వనములార; తరువ (-వా), తరువులార; మొదలయినవి. వైకృతపదముల మీఁదఁగూడ నీ యాగమములే వచ్చును: మేఁక (-కా), మేఁకలార; చెట్ట (-ట్టా), చెట్టులార; మొద. 'అనితః' అను పదము పూర్వసూత్రమునుండి యనువర్తించుచున్నది. అనిదంతములవై ననుటవలన నిదంతములగు 'కన్నె, ఒంటె, బోదె' మొదలగువాని నేకవచనమున నెట్లు పిలువవలెనో తెలియరాదు; వానికి బహువచనమున లున్నములవై అరదాగమము వచ్చును. కన్నెలార, ఒంటెలార, బోదెలార, మొదలయినవి. తేలు, తేల, తేలా (?); తేళ్లు, తేళ్లార (?); ఎద్దు, ఎద్ద (-ద్దా?), ఎడ్లార (?).—ఇట్టిచోట్ల నెట్లు పిలువవలెనో

(-యా)' అను మొదలగు సంబోధన ప్రథమైకవచన రూపము లేర్పడును; అనువర్తించినయెడల హరి, (-రీ); హరులార, మొదలగు రూపములకుఁ జింతామణియందు దిక్కులేకుండను.

**14. లుజసో లశసోఽలాన్తాత్.**

లకారాంతముకాని పదము ప్రథమాబహువచనమున లువర్ణకమును, ద్వితీయా బహువచనమున లవర్ణకమును (వచ్చును)—ఈ సూత్రము తత్సమ వైకృతపదములకు రెంటికిని వర్తించును. రాములు, రాములన్; హరులు, హరులన్; శంభులు, శంభులన్, దాతలు, దాతలన్; గుణవంతులు, గుణవంతులన్; స్త్రీలు, స్త్రీలన్; మాటలు, మాటలన్; పాములు, పాములన్; గేదెలు, గేదెలన్; మొద. 'లు జసః' అనుటవలన జస్స్థానమున 'లు' వర్ణకము వచ్చునని యర్థము; అందుచే 'లు' అనునది ప్రథమా బహువచనమున వచ్చు ప్రత్యయమని తెలియుచున్నది. 'డుముువులవః ప్రథమాస్యాత్' అను సూత్రమున లువర్ణము ప్రథమావిభక్తి వర్ణకముగ నింతకుముందే తెలుపఁబడినది. ఈ సూత్రమున నది ప్రథమాబహువచనమునందు వచ్చునని ప్రత్యేకింపఁబడినది. అందువలన 'డు, ము, వు', ప్రథమైకవచనమున వచ్చునని తేలుచున్నది. ఇఁక 'ల శసః' అనునప్పుడు 'శస్సు' స్థానమున 'ల' వర్ణము వచ్చునని వ్యాఖ్యానము చేయవలెను. అప్పుడు ద్వితీయా బహువచనమున రామశబ్దమునకు 'రాముల' అని నిలుచును. ఇది ద్రుతప్రకృతికము గావున 'రాములన్' అని యగును. 'కూర్చి, ల, ను, ని', లు ద్వితీయావిభక్తి వర్ణకములుగఁ జింతామణి చెప్పుటచేతను, వానిలో 'ల' వర్ణమును ద్వితీయా బహువచనమునకుఁ బ్రత్యేకించుటచేతను, మిగిలిన 'కూర్చి, ను, ని', లేకవచనమునందు మాత్రము వచ్చునని చెప్పవలసి వచ్చును. నకారపుఁబొల్లే ద్రుతముగావునను, ప్రత్యయముపై మఱలఁ 'బ్రత్యయముచేరుట కూడదనుట వైయాకరణ సంప్రదాయ మగుటచేతను 'రాములను' అనుదానిఁబోలు రూపములు చింతామణి ప్రకారము సిద్ధింపవు. 'అలాన్తాత్' అనుటవలన బెజవాడ యుద్ధమల్లుని శాసనములోని 'మలినురు' అను రూపమునకు గతి కలుగదు. ఈ సూత్రము వైకృతపదములకును వర్తించుచున్నయెడల 'బలియురు' మొదలగు రూపములకు గతిలేదు.

**15. లాన్తాత్తు రురా తయోః క్రమేణ న్తః.**

లాంత పదమున కన్ననో యా రెంటికిని (లు, ల వర్ణకములకు) రు, ర, లు వరుసగ నగును. బాలుఁడు, బాలురు, బాలురన్; 'లాంత' మనుటవలన నతివ్యాప్తి కలుగుచున్నది: అనలురు, అనిలురు, మొదలగు బహువచనరూపములు

పూర్వమగు నదంత మహద్వాచక తత్సమ లకారమని కొందఱందురు. కాని, సూత్రమువలన నీ విషయము స్పష్టముకాదు. అట్లనుకొన్నచో మల్లురు, మల్లురన్, దయాళుఁడు, దయాళురన్, మొదలగురూపము లీ సూత్రమువలన సిద్ధింపవు.

16. ని రమో మహతామ్.

మహద్వాచక పదములకు ద్వితీయైకవచనమున ని వర్ణకము వచ్చును: రాముని (న్), శంభునిన్, రంగనిన్, మాలనిన్, అల్లునిన్ మొదలయినవి. ని వర్ణము డుమంత శబ్దములమీఁదనే వచ్చును; కావున తాతను (న్) అన్నను (న్), మామను (న్), మొదలగువానియందు రాదు.

17. లుక్చ స్యాత్.

(ఆ నివర్ణమునకు) లోపముకూడ నగును. 'చ' కారము బాహుళకత్వమును దెలుపును: రామున్, శంభున్, బలియున్, మొద. వైకృతాదంత డుమంతములం దున్నను కున్నను కలుగనప్పుడు నివర్ణమునకు లోపము కలుగదు. ఉదంత వైకృత డుమంతములపై నివర్ణలోపము వైకల్పికము: అల్లునిన్, అల్లున్; తమ్మునిన్, తమ్మున్ మొద.

18. కర్మప్రవచనీయకే కూర్చిః,

కర్మప్రవచనీయార్థమున 'కూర్చి' (యనునది వచ్చును.)

సంస్కృతమున 'అను, ఉప, ప్రతి, పరి, అభి, అధి, సు, అతి, అపి' అనునవి యుపసర్గగతిసంజ్ఞికములయినను ద్వితీయా విభక్త్యంత రూపములపైఁ జేరి కర్మమును స్పష్టముగఁ బ్రకటించుచుఁ గర్మప్రవచనీయసంజ్ఞను బొందుచున్నవి. అవి కర్మప్రవచనీయములుగ నుపయోగింపఁబడినప్పు డవ్యయములై క్రియలయర్థముతో నన్వయించుచుండును. ఉదా. నదీ మన్వవసితా సేనా=సేన నది వెంబడివిడిసియున్నది; అనుహరిం సురాః=సురలు హరికంటె హీనులు; ఉప హరిం సురాః = సురలు హరికంటె హీనులు: వృక్షం ప్రతి(-పరి,-అను)విద్యోతతేవిద్యుత్ = మెఱుపు చెట్టువంక (-(ప్రక్క,- వైపు) మెఱయుచున్నది; భక్తో విష్ణుంప్రతి (-పరి-అను) = విష్ణునియెడ (- వంక,- యందు) భక్తుఁడు; హరిం ప్రతిలక్ష్మీః = లక్ష్మి హరిపాలు; వృక్షంవృక్షంప్రతి (-పరి అను) సిఞ్చతి=చెట్టు చెట్టును తడుపుచున్నాఁడు. హరిమభి వర్తతే = హరివంకఁ దిరుగుచున్నాఁడు. భక్తో హరిమభి = హరియెడ (-వంక) భక్తుఁడు; దేవం దేవమభి సిఞ్చతి = దేవతను దేవతను అభిషేకించుచున్నాఁడు; సుసిక్తం భవతా = తాము బాగుగా నభిషేకించినారు; అతిదేవాన్ కృష్ణః = కృష్ణుఁడు దేవత...

పై వివరణమునుబట్టి కర్మప్రవచనీయకము లనునవి సాధారణముగఁ గర్మమును దెలుపు పదముల ద్వితీయా విభక్త్యంతరూపములపైఁ జేరుచుండు ననియు, తాము మాత్రము విభక్తి ప్రత్యయములు కావనియుఁ దెలిసికొన వచ్చును. కాని చింతామణి 'కూర్చి' ని ద్వితీయా విభక్తి ప్రత్యయముగాఁ దెలుపుచున్నది. అట్లు చెప్పుట వైయాకరణ సంప్రదాయ విరుద్ధము. 'కూర్చి' యెప్పుడును ద్వితీయా విభక్త్యంతపదములమీఁదనే వచ్చుచుండుటచే దానికిఁ గర్మప్రవచనీయ సంజ్ఞ తగియున్నది, కాని యది ద్వితీయా విభక్తి 'ప్రత్యయము' కానేరదు. 'కూర్చి' అను నొక్కదానినే కర్మప్రవచనీయార్థమునఁ జెప్పి, తత్తుల్యములగు 'వంక, ఎడ, అందు, వెంబడి, ప్రక్క, వైపు, పట్టి, చేసి' మొదలగు వానినిగూడఁ గర్మప్రవచనీయ సంజ్ఞికములుగ నుదాహరింప కుండుట చింత్యము.

19. మహతో నిత్తా విభక్తౌ టాదౌ వచనద్వయే క్రమేణ స్తః

మహద్వాచక పదములకంటెఁ బరముగ తృతీయ మొదలుకొని యుండు విభక్తి ప్రత్యయములు చేరునపుడు (వాని ప్రాతిపదికములపైఁ దొలుత) నేకవచనమున 'ని' అనునదియు, బహువచనమున 'ల' అనునదియు (నాగమాక్షరములుగ) వచ్చును. తృతీయాదివిభక్తులందు ప్రత్యయములు చేరుటకుముందు ప్రథమేతర విభక్తి ప్రాతిపదికముపై నేకవచనమున 'ని' అనునదియు, బహువచనమున 'ల' అనునదియు నాగమములుగఁ జేరునని యర్థము. ద్వితీయైకవచన బహువచనములందు క్రమముగా 'ని, ల' అనునవి ప్రత్యయము లగుచుండఁగా నవి తృతీయాదులందాగమవర్ణము లగుచున్నవని యభిప్రాయము: రామునిచేత, రాములచేత; మొద. ఏకవచనమున 'ని' గాగమము వైకల్పికమని సూత్రమువలనఁ దెలియదు గాన 'రాముచేత' మొదలగు రూపములును గలవు. ఈ సూత్రమునందలి 'మహతః' అను పదము డుమంతములగు తత్సమ వైకృత మహద్వాచక పదములకే చెల్లును.

20. టాది విభక్తౌ నిర్నే త్యేకే.

తృతీయాద్యేక వచనములందు నిగాగమము లేదని కొంద(అందురు). రామునిచేత, రామునికొఱకు, రామునికంటె, రామునికి, రామునియందు, అను నిగాగమముతోడి రూపము లుండవనియు 'రాముచేత' మొదలగు రూపములే యుండుననియు నొక మతముగలదని యభిప్రాయము. కొంద అనుట వలన చింతామణికిఁ బూర్వమందాంధ్రవ్యాకరణములు గలవని స్పష్టమగుచున్నది.

21. నామ స్త్రాణే డు ఊత్యన్యే.

సంబోధన [illegible]

రాముఁడ' అను దానినిబోలు రూప ముండదని కొందఱ యభిప్రాయమని సూత్రము చెప్పుచున్నది.

20, 21 సూత్రములందలి కార్యములు చింతామణి కర్త కిష్టములో కావో స్పష్టముకాలేదు.

22. టా స శ్చేతః.

తృతీయావిభక్త్యేక బహువచనముల రెంటను చేత వర్ణకమగును— 'టాస్' అను ప్రత్యాహారము ప్రాకృత వ్యాకరణముననుసరించియున్నది.'తో, చేత, తోడ, చే, చ తృతీయాయా' అనిచెప్పి మఱల 'చేత'ను గూర్చి సూత్రించుట ప్రథమా ద్వితీయా విభక్తి ప్రత్యయములుగా నిరూపింపఁబడినవానిలోఁ గొన్ని యేకవచనమందును గొన్ని బహువచనమునందును జేరుచుండఁగా, తృతీయైక బహువచనముల రెంటను చేత వర్ణకమే చేరునని చెప్పుటకు. తృతీయావిభక్తి సంస్కృతమునం దేయే యర్థములందు వచ్చునో యా యర్థములలో (సహార్థమునందు తప్పఁ) దక్కినయర్థములందు చేత వర్ణకము వచ్చునని సూత్రకారుని యభిప్రాయము. ఆ యర్థములందెల్ల తెనుఁగున చేతవర్ణకము వచ్చునాయనువిషయము విచార్యము. 'చే'వర్ణకమునుగూర్చి చింతామణిప్రత్యేకముగఁ దెలుపకున్నను నదియు 'చేత'యను నర్థమునందే వచ్చునని తత్కర్త యాశయమై యుండును.

23. జేసః కై కొఱకు.

చతుర్థీ విభక్తి యందు కై, కొఱకు' అనునవి (ప్రత్యయములుగ) వచ్చును. కై, కొఱకు, లను నన్నయవాడలేదనియు, నాతనికాలపు శాసనములందయినను, నవి కానరావనియు నింతకుముందు తెలుపఁబడినది.

24. ఙసి స ఉచ్యతే వలనః.

పంచమికేక బహువచనముల రెంటను వలన వర్ణకము చెప్పబడుచున్నది.

25. నః కౌ.

'కు' వర్ణకము పరమగుచుండఁగాఁ బ్రథమేతర విభక్త్యేకవచనప్రాతిపదికముపై నగాగమ మగును. ఇంతకుముందు తృతీయాది విభక్త్యేకవచనమున 'ని' గాగమ మగునని చెప్పఁబడినది. ఈ సూత్రముప్రకారము 'కు' వర్ణము పరమగునప్పుడు 'ని' గాగమము రాదనియు, నగాగమ వచ్చుననియుఁ దెలియుచున్నది. రాముసకు, శంభునకు, గురునకు, తమ్మునకు, అలునకు మొద.

షష్ఠియందు 'కు' వర్ణకము పరమగునపుడే నగాగమము కలుగును: కి, యొక్క, లో, లోపల అనునవి చేరునపుడు 'ని' గాగమమే కలుగును. రామునికి, రాముని (యొక్క), రామునిలో, రాముని లోపల.

26. జమఝి కు రనితాన్.

ఇదంతములు కాని పదముల షష్ఠ్యేకబహువచనముల రెంటను కు వర్ణకము వచ్చును. ఇందువలనఁ బై సూత్ర వ్యాఖ్యవలన నేర్పడిన 'రామునికి, శంభునికి', మొదలగురూపములు కలుగవని తెలియుచున్నది. ఈ సూత్రము తత్సమవైకృత పదము లన్నిటిని జెల్లును: రామునకు, శంభునకు, దాతకు, తాతకు మొద.

27. అందు జీపః.

సప్తమ్యేక బహువచనముల రెంటను 'అందు' వర్ణకముచేరును. 'మహతో నితా' అను సూత్రముచేత నిగాగమము : రామునియందు, శంభుని యందు, మగనియందు. 'టాది విభక్తౌ నిర్నేత్యేకే,' 'నుమ్వోతః' అను సూత్రములవలన 'రామునందు, శంభునందు మొద. తక్కినచోట్ల నాగమను లేకుండ దాతయందు, తాతయందు, మాటయందు, చెట్టునందు మొద.

28. సవిధర్తినా మిందు.

దగ్గఱగా నున్న (వస్తువులను దెలుపు పదముల) కిందువర్ణకమగును— 'ఇందు' అనునది ప్రత్యయము కాదని యింతకుముందు చెప్పఁబడినది.

29. తోడ సహార్థే టాసః.

తృతీయైక బహువచనముల రెంటను సహార్థమున 'తోడ' వర్ణకము వచ్చును.—తృతీయా విభక్తికి సంస్కృతమునఁగల యనేకార్థములలోసహార్థక మొకటి; ఆ యర్థమున 'తోడ' వర్ణకము వచ్చునని యర్థము. తక్కినయర్థము లందు 'చేత' వర్ణకమగునని సూత్రకారుని యభిప్రాయము.— సహార్థమున 'చేత' వర్ణకముచేరుటయుఁ గలదు. కర్తిచేత నఱకెను. కర్తితోడనఱకెను.— సూత్రకారుఁడు 'తో' వర్ణకమును తృతీయా విభక్తిప్రత్యయముగఁ జెప్పియు దాని యుపయోగమును బ్రత్యేకముగ వివరింపకుండుట యది 'తోడ' యర్థమందే వచ్చునను నభిప్రాయముతో నైయుండును.

30. పట్టీతి తు పఞ్చమీ గుణే హేతౌ.

'పట్టి' యనునదన్ననో పంచమియందు గుణము, హేతువు, అనునర్థము లందు వచ్చును. జాడ్యముంబట్టి (గుణము) మంచమెక్కెను; జ్ఞానముంబట్టి

రాదని యింతకుముందు దెలుపఁబడినది. 'పఞ్చమీ' అనుటకు 'పఞ్చమ్యాః' అని కాని 'ఙసిఁ నః' అనికాని యనవలసియుండెను.

31. కంటే ఽ న్యారాదాదేః.

'అన్య, ఆరాత్' మొదలగు నర్థములందు 'కంటె' వర్ణకము పంచమ్యర్థమున నేక బహువచనములందు వచ్చును. 'కంటే' అని దీర్ఘము చెప్పుట గణములుసరిపోవుటకు; తెనుఁగు వ్యాకరణమును సంస్కృతమునందును ఛందోబద్ధముగ వ్రాయుటవలన నవసరమిది. "అన్యారా దితరర్తే దిక్ఛబ్దాం చూత్తరపదాజాహియుక్తమ్" అని పాణిని సూత్రము.

కృష్ణునికంటె నన్యుఁడు (భిన్నుడు, ఇతరుఁడు); వనముకంటెదగ్గఱ (దూరమున); 'ఋతే' అనునర్థమునఁ దెనుఁగునఁ బంచమిరాదు: కష్ణుఁడుతప్ప); గ్రామముకంటెఁబూర్వము: ఫాల్గునము చైత్రముకంటెఁ బూర్వము (కాని) కాయముయొక్క పూర్వము); గ్రామముకంటె వెనుక; గ్రామముకంటె బయట, మొద.

32. లోపల నిర్ధారణోద్భవా షష్ఠీ.

'లోపల' వర్ణకము నిర్ధారణార్థమునఁ బుట్టిన షష్ఠీ(ప్రత్యయము).

సూత్రమున 'ఉద్భవా' యనుట గణముకోసము; నిర్ధారణోద్భవాయాః షష్ఠ్యాః' అనియుండవలెను. 'అందు' వర్ణకమును గూడ నిర్ధారణార్థమున నుపయోగింపవచ్చును; అయినను జింతామణి దానిని సప్తమీప్రత్యయముగఁ దెలుపుచున్నది. 'అందు' అను నర్థమున 'లోపల'వర్ణకము నుపయోగింపవచ్చును; అయినను నది షష్ఠీప్రత్యయముగఁ జెప్పఁబడినది. నిర్ధారణార్థము లేకున్నను నన్నయ 'లో,లోపల'లను వాడియున్నాఁడు. అవి ప్రత్యయములు కావనియు 'అంతర్' అను నవ్యయము నర్థముగల దేశ్యపదములనియు నహోబలుని తలంపు.

33. యొక్క చ శేషే షష్ఠీ.

సంబంధార్థమున 'యొక్క' అనుప్రత్యయము షష్ఠియందువచ్చును. 'యొక్క'కు కావ్యములందుగాని, వ్యవహారమునందుగాని ప్రయోగము లేదని యింతకుముందు చెప్పఁబడినది.

34. విషయనిమిత్తాదిజా తథైవాన్యా.

అట్లే ఇతరమైన 'న' అను సప్తమీ ప్రత్యయము విషయనిమిత్తాద్యర్థములందు వచ్చును.—ఈ సూత్రమున కహోబలుఁడు "విషయనిమిత్తాద్యర

నము వ్రాసినాఁడు. తక్కినవ్యాఖ్యాత లందఱు నతఁడు చెప్పినరీతినే చెప్పియున్నారు. కాని, 'అన్యా' అనుపదము సప్తమీ ప్రత్యయమగు 'న'వర్ణకమును మాత్రము దెలియఁజేయునని తలంపవచ్చును. ఈ పరిచ్ఛేదమున సూత్రకారుఁ డవలంబించిన సూత్రరచనా విధానక్రమమునుబట్టిచూడ మొదల తత్తద్విభక్తులందువచ్చు ప్రత్యయములను సాముదాయకముగఁజెప్పి, పిదప నాయాప్రత్యయములలో నేవి యేయేయర్థముల నుపయోగపడునో వివరించి యున్నాఁడని బోధపఱచికొనవచ్చును. ఇంతవఱకును నన్నివిభక్తులందలి యన్ని ప్రత్యయములను గూర్చియు సూత్రకారుఁడు తెలిపియున్నాఁడు; ఇఁక మిగిలిన యన్యప్రత్యయము 'న'అనునది. ఇదిగాక యింతవఱకును మహద్వాచ కానిదంతపదములపైఁజేరు ప్రత్యయములను గూర్చియే తెలుపఁబడినది. దీనితరువాతి సూత్రమునుండియుఁ బ్రకరణము మాఱుచున్నది. కావున మహద్వాచక పదములపై 'న' వర్ణక మెప్పుడుచేరు ననునదియే ప్రస్తుత సూత్రవిషయమనుటకుసందేహములేదు. అది మహద్వాచకపదములపై నెట్లు చేరునో చెప్పనెంచి యవి 'విషయమునన్, నిమిత్తమునన్, కారణమునన్, కృతమునన్,మూలమునన్' మొదలగు నవర్ణకయుత సప్తమ్యంత పదములతోఁ గలసియుండునని యీసూత్రమున సూత్రకారుఁడు వివరించియున్నాఁడు; నీకృతమునఁ (శాసితరి త్వయి) గౌరవాన్వయ మక్లిష్టమకీర్తిఁ బ్రకాశితంబగున్ (అర. I. 51); మొద.

35 స్యాదమహతాం విభక్తౌ సోశ్చ ము.

అమహద్వాచ కాదంత (తత్సమ)పదములకు విభక్తి పరమగుచుండఁగాఁ బ్రథమైక వచనమున మువర్ణకముకూడ వచ్చును: ఫలము, వనము, మొద. (ఇందు 'చ'కారము ఛందస్సు కొఱకు.)

36. తదుపరి ముబూ ప్రాచామ్.

ప్రాచీనుల మతమున (నా మువర్ణకముపై మఱల) ము, బు, అనునది (చేరును)— ఇందువలన 'ఫలముము, ఫలముబు; వనముము, వనముబు' అనురూపములేర్పడును. ఇట్లుండఁగా 'కవిభల్లపై' రిత్యాదిసూత్రముచేత మొదటిమువర్ణముమీఁది యుత్వము లోపించి 'వనమ్ము, వనమ్బు; ఫలమ్ము, ఫలమ్బు; అనురూపములు కలుగుచున్నవి.

37. సోర్లుగితః.

ఇత్తుకంటెఁబరమైన ప్రథమైకవచన ప్రత్యయమునకుఁ లోపము(కలు

38. ఉ ద్బహుత్వే.

బహువచనమున నిదంతశబ్దముల యిత్తున కుత్తువచ్చును ; హరి+లు =హరు+లు=హరులు మొద.

39. సంబుద్ధౌ నాత్.

సంబోధనమున (18-వ సూత్రమునఁజెప్పఁబడిన) అ (ఆ ?)త్తు చేరదు: హరి ! మొద.

40. ఇతాం జసః కి శ్చ.

ఇదంతశబ్దముల షష్ఠ్యేకవచనమున 'కి'వర్ణకముగూడ వచ్చును. హరికి. (ఇందు 'చ' కారము ఛందస్సుకొఱకు.)

41. టాదా వితో న నిః స్యాత్.

తృతీయా ద్యేకవచనములందు (19-వ సూత్రమునఁజెప్పఁబడిన) నిగాగమము కలుగదు. 'రామునికి' అనునట్లు 'హరినికి' అని కాదనుట.

42. ఈదన్తా ఇద్వ దేవ కృతహ్రస్వాః.

ఈకారాన్తశబ్దముల తుదియీత్వము హ్రస్వముచేయఁబడఁగా వానిపై నిదంతశబ్దములకువలె విభక్తిప్రత్యయములు చేరును. నదీ, నది, నదిని, నదిచేత, నదులచేత మొద.

43. వికృతౌ క్వచి చ్చ లోపో మోః.

మువర్ణాంత తత్సమేతరపదముల తుది మువర్ణమున కొకయెడ లోపము కూడఁ గలుగును: గుఱ్ఱము, 'గుఱ్ఱ' అని నిలువఁగా—

44. దీర్ఘ శ్చాత ఆదిమస్య భవేత్.

మొదటిదగు అత్తునకు దీర్ఘముకూడ కలుగును. ('ఆదిమస్య' అనఁగా 'ము వర్ణాత్పూర్వస్య' అని యర్థముచెప్పికొనవలెను.) గుఱ్ఱ=గుఱ్ఱా;-పూర్వసూత్రమున 'క్వచిత్' అనుటవలన అన్నిబహువచనములందును షష్ఠీసప్తముల యేకవచనములందును నని గ్రహింపవలెను: గుఱ్ఱాలన్, గుఱ్ఱాలచేతన్, గుఱ్ఱాలకొఱకున్, గుఱ్ఱాలవలనన్, గుఱ్ఱానకున్, గుఱ్ఱాలకున్, గుఱ్ఱానన్, గుఱ్ఱాలయందును మొద.

45. నర్వ తోర్దోతో ర్వ ర్ఘవతి మువత్.

ఉదంత, ఓదంత శబ్దములకు ము వచ్చునట్లే (అనఁగా నమహత్తులపైఁ బ్రథమైకవచనమున) వువర్ణమెల్లయెడల (అనఁగా మహదమహత్తులరెంటను)

46. డుజ్ మహత్పదానాం వా.

(ఉదంత తత్సమ పదములపై) డుజ్జు వైకల్పికముగ (వచ్చును.) శంభుఁడు, శంభువు; గురుఁడు, గురువు మొద. ఓదంత తత్సమ మహద్వాచక పదములు లేవు.

47. డు జతౌ తు న ప్లుత స్స్యాత్సంబుద్ధా విత్యూతాం విదుః కేచిత్.

ఉదంతశబ్దములకు సంబోధన ప్రథమైకవచనమునఁ జెప్పఁబడిన డుజ్, అత్, అను ప్రత్యయములు చేరవనియు, (వానితుది యుత్వమునకు) ప్లుతము వచ్చుననియుఁ గొందఱు తెలిసికొందురు. అనఁగా, శంభుఁడా, తరువా, అను నిట్టి రూపము లుండవనియు, శంభూ 3, తరూ 3, మొదలగు రూపములు కలుగుననియుఁ గొందఱు చెప్పుదురని యభిప్రాయము. ఈ మతము చింతామణికర్త కిష్టమో యిష్టముకాదో విశదము కాలేదు.

48. దీర్ఘాణాం హ్రస్వః స్యాత్.

(సంస్కృతదీర్ఘాజంతశబ్దములు తత్సమము లగునపుడు వాని తుది) దీర్ఘమునకు హ్రస్వమగును: మాలా, మాల; నదీ, నది; యవాగూః, యవాగువు, మొద.

49. న చ దేశ్యపదే.

దేశ్యపదము తుది దీర్ఘమునకు మాత్రము హ్రస్వము కలుగదు. (సూత్రమున 'చ' కు బదులు 'తు' ఉండవలెను. నన్నయకాలమున దీర్ఘాంతములగు దేశ్యపదముల కుదాహరణములు కానరాలేదు.

50. న చైకవర్ణేఽపి.

సంస్కృతమందలి దీర్ఘాంతములయి యేకవర్ణము గలిగిన పదముల తుది దీర్ఘమునకును హ్రస్వము కలుగదు: స్త్రీ, శ్రీ, మొద.

51. డా బవిధాత్రాదే ఋః.

'విధాతృ' మొదలగుశబ్దములఁదప్పఁ దక్కిన ఋదంత శబ్దముల తుది ఋత్తునకు 'డాప్' (ఆ) వచ్చును: దాతృ, దాతా; పితృ, పితా; మాతృ, మాతా; స్వసృ, స్వసా; రక్షితృ, రక్షితా. మొద. దీర్ఘమునకు హ్రస్వము కలిగి 'దాత, పిత, మాత, స్వస, రక్షిత' మొదలగు రూపము లేర్పడును.

52. తస్య చ వా.

దానికి (విధాత్రాది గణమునకు) డాప్పు (ఆ) వైకల్పికముగ (వచ్చును.) విధాతృఁడు, విధాత; మొద. ('తస్య' అనునది 'అవిధాత్రాదేః' అనుదానిలో నన్వయించుచున్నను ప్రకరణమును బట్టి 'విధాత్రాదేః' అని క్లిష్టాన్వయమును జేసికొనవలెను.)

53. తావుభౌ రమేశ సమౌ.

ఆ రెండును (వరుసగా) రమా, ఈశ, అను శబ్దములను బోలియుండును. ('తావుభౌ' అనునప్పుడు అవిధాత్రాదులు, విధాత్రాదులు నని స్పష్టమగు నర్థము వచ్చుచున్నను 'డా బంతరూపములు, అడా బంతరూపములునుని క్లిష్టార్థమును జేసికొనవలెను.) సంస్కృతమున ఋదంతములై తత్సమములగునప్పుడు డా బంతములయిన రూపములు రమా శబ్దమువంటివియు, అడా బంతములు ఈశ శబ్దమువంటివనియుఁ దెలియవలెను. దాత; విధాత, విధాతృఁడు, ఈ కార్యములు దీర్ఘాణాం హ్రస్వః స్యాత్, మహత స్సోర్డు జనితో భవేత్పుంసి' అను సూత్రములచేతనే సిద్ధించుచుండుటచేతఁ బ్రస్తుతసూత్రమనావశ్యక మగుచున్నది.

54. క్వచిదమహతోఽపి డుజ్ స్యాత్.

ఒకయెడ నమహత్తులకంటెఁ గూడ డుజ్ఞు వచ్చును; పులియఁడు, బూచిగాఁడు, నీలఁడు, జన్నఁడు. (ఇవి జంతువుల పేళ్లు.) ఇట్టిపేళ్లు నన్నయ కాలమున నున్నందు కుదాహరణములు కానరాలేదు.

55. ఏకాదే రమహతాం చ డావున్న.

ఏకాదిగణమునందలి పదములకును నమహద్వాచక పదములకును డువర్ణకము పరమగుచుండఁగా, దాని ప్రాతిపదికమందలి తుది యుత్తునకుత్తురాదు. ఒకఁడు, అతఁడు, ఇతఁడు, గండఁడు, మనుమఁడు, మగఁడు, మొదలయిన వేకాదులు; కత్తెరఁడు, కైరఁడు, జన్నఁడు, నీలఁడు మొదలగున వమహద్వాచకములు. 'ఒకఁడు'ను నన్నయ మహద్వాచకముగ వాడలేదు.

56. స్త్రీత్వ బహుత్వే నురాదే రసమాసే.

నురాది గణమందలి పదములు సమాస గతములు కానప్పుడు, స్త్రీత్వమును బొంది (అనఁగా స్త్రీసమములై) బహుత్వమునం దుండును. (చింతామణికర్త నేరక యార్యాగీతులలో సూత్రరచన నారంభించినాఁడు. 'నుర' శబ్దమునకుమాత్ర మసమాసమందు స్త్రీత్వ బహుత్వములు కలుగునని చెప్పుటయాతని యభిప్రాయము. గణము కుదురక 'నుర' శబ్దమును 'నాది' శబ్దముతోఁ గలిపి సమాసము చేసినాఁడు. కాని 'ఆది' శబ్దమువలన గ్రహింపఁదగిన నుర శబ్దమును బోలు పదములు లేవు—'స్త్రీత్వ బహుత్వే' అని సూత్రమునం దుండవలెను; కాని యిట్లున్నచో గణభంగము కలుగును. 'స్త్రీత్వ బహుత్వే సమాసే' అని గణముల కొఱకు వ్రాసిన పదమే యున్నదను

ములను సాధించుకొనవలెను. యోధ, శుంఠ, మొదలగువాని నీ సూత్రమున కుదాహరణములుగఁ గొంద ఱిచ్చియున్నారు. అట్లుచేయుట తగదు.

57. లు గ్భవే త్కుశాదే ర్మోః.

కుశ, మొదలగు పదను లమహత్తులుగనుక వానికిఁ బ్రథమైక వచనము-వర్ణము రావలెను. కాని, వాని కీసూత్రమువలన మువర్ణము లోపించుచున్నది: కుశలు, దర్భలు; కుశాదులను నురాదులఁజేర్చిన నీ సూత్ర మనావశ్యక మగును; కాని, సూత్రకర్త యట్లు చేయక కుశాదులకుఁ బ్రత్యేక సూత్రమును గల్పించి యున్నాఁడు; అందుచేత 'స్త్రీత్వ బహుత్వే' అను సమాస మీా సూత్రములోని కనువర్తింపదు. కావున నేకవచనమున 'కుశ, దర్భ' అను నేకవచన రూపములును సిద్ధించుచున్నవి. ఇది వికల్పమును విధించు సూత్రముకాదు. కావున కుశము, దర్భము, అను రూపము లుండఁ గూడదు. కాని, శబ్దరత్నాకరమున 'కుశము' అను రూపము చేరినది. 'కుశ' అను పదము 1. స్త్రీలింగము, ఆకారాంతము = త్రాడు; దీనికి 'కుశ' యను తత్సమరూపము మువర్ణ లోపముచేఁ గలుగలేదు; దీర్ఘమునకు హ్రస్వము కలిగినది. 2. నపుంసకలింగము, అకారాంతము=నీళ్లు; ఈ యర్థమున మువర్ణమును బహువచన లువర్ణమును జేరి 'కుశములు' అను రూపమేర్పడవలెను. 3. పుంలింగము, అదంతము, అమహద్వాచకము = కుశద్వీపము, త్రాడు, దర్భ; దీనికి 'కుశము' అను తత్సమ రూపము గలుగును. ప్రస్తుత సూత్రము 'దర్భ' యను నర్థముగల కుశ శబ్దమునకు మాత్రము వర్తించునని సూత్రకారుని యభిప్రాయమై యుండును. దానికి కుశ, కుశము, కుశలు, కుశములు, అను రూపము లేక బహువచనములందు కలుగుచున్నవి. కాని, యీా సూత్రము, కుశము, కుశములు, అను రూపములను నిషేధించుచున్నది. అహోబలుఁడు కుశాది గణమున హంస, కుశ, దర్భ, దూత, చరిత, చరిత్ర, భ్రమ, అభిలాష, విజృంభణ, అక్షత, పులక, అలక, తరంగ, వేగ, కుండ, పనస, స్ఫురణ, ఘోష మొదలగువానిని జేర్చినాఁడు. వీనిలోఁ 'దర్భ' శబ్దమునకు నిత్యముగ ములోపము గలుగును: దర్భ, దర్భలు. (దర్భము, దర్భములు అను రూపములులేవు.) దూత శబ్దము నీ గణములో నేల చేర్చవలెనో తెలియదు; ఇది జనశబ్దమువంటిది కావున, కుశాది గణములో జేరునని యహోబలుఁడు చెప్పుటయందలి యభిప్రాయ మేమో తెలియదు. 'జన' అని ప్రథమైకవచన రూపముగాని, 'జనలు' అను ప్రథమాబహువచన రూపముగాని, 'దూతము' అను రూపముగాని యుండునని యాతని యభిప్రాయమా? సూత్రమున 'మోర్లుక్' అని యున్నదిగాని, 'సోర్లుక్' అని లేదు. అతఁడు

అనురూపము లుండవు, 'కుండము' అను నర్థమున 'కుండ' అను తత్సమపద ముండదు. వైకృతపదమగు 'కుండ' కైనను 'కుండము' అను నర్థములేదు. ఈ సూత్రమువలన కుశాదుల మువర్ణ లోపము నిత్యమని తెలియుచుండఁగా నహోబలుఁడు 'సోర్లుక్' అనక 'మోర్లుక్' అనుట యీ విధి యనిత్యమని వింత వ్యాఖ్యానమును జేసియున్నాఁడు. అట్టి యభిప్రాయము గలవాఁడగుట చేతనే యాతఁడు కుశాది గణమున నిత్య వికల్ప ము-లోపము గల వివిధ పదములను గుశాది గణమునఁ జేర్చియున్నాఁడు.

58. షష్ఠీ విశేషణానాం ప్రథమా స్యాత్.

షష్ఠీ విభక్తి ప్రత్యయముతోఁ గూడిన పదములకు విశేషణములయిన పదములు ప్రథమావిభక్తి యందుండును: ఉదా. అనేక పురాణ పుణ్య కథా కథన దక్షుండు వ్యాసశిష్యుండైన రోమహర్షణునకుఁ బుత్త్రుండ (ఆది. I. 28); నన్నయ యీ రీతిగా 'అయిన', 'అగు' మొదలగు ధాతుజ విశేషములతో వ్యవహితములయినప్పుడు షష్ఠీవిశేషణములకుఁ బ్రథమా విభక్తిని వాడియున్నాఁడు. 'అనఘ చరితుఁడు రఘునందనునకుఁ బ్రణతి' అనునిట్టి ప్రయోగముల నాతఁడు చేయలేదు. ప్రథమయగుట షష్ఠీ విశేషణములకే కాక యితరవిభక్తులయందున్న పదముల విశేషణములకును గలుగును: సుగుణాభి రాముఁడు రామునితో (-వలన, -కంటె, -యందు.) మొద.

59. వ్యవహితాశ్చ సర్వే స్యుః.

ప్రథమ యందున్న యన్ని విశేషణములకును వాని విశేష్యముల కును మధ్యమున మఱికొన్ని పదములును రావచ్చును ఉదా. రాముఁ గొలిచెద సుగుణాభిరామునిఁ; ఈ సూత్రము ప్రయోజనము తెలియదు; సంస్కృత మునను విశేష్య తద్విశేషణములు వ్యవహితములుగ నుండవచ్చును గదా.

60. వికృతౌ చ స్త్రీలింగాః స్త్రీలింగక సర్వనామధేయాః స్యుః.

ఆంధ్రభాషయందును తత్సమ 'స్త్రీవాచక' స్త్రీలింగ శబ్దముల విశేషణములును స్త్రీలింగమునందే యుండును; సీత భక్తవత్సల; ద్రౌపది మహా పతివ్రత; మొద. క్రింది సూత్రమున నమహతీవాచక పదములను పేర్కొనుటచే నీ సూత్రము మహతీవాచకపదములకే వర్తించును. తత్సమ స్త్రీవాచక పదములకే కాక, తత్సమేతర స్త్రీవాచక పదముల తత్సమ విశేషణములును స్త్రీలింగమునందే యుండును. 'పాలమున్నీటి కూఁతురు పద్మహస్త.

61. ఉభయవిధ మమహతీనామ్.

మహతీవాచకములు కావి, ...

వచ్చును: పద్మలత మనోహర (-ము); (వైకృత పదములు మహతీతరా మహద్వాచకము లగునపుడు మాత్రము వాని తత్సమ విశేషణములు నపుంసక లింగమందే యుండును.)—'అమహతీనామ్' అనుటవలన మహద్వాచకములును, మహతీతరామహద్వాచకములును నని గ్రహింపవలసి యున్నను సూత్రకారుని యాశయమున మహద్వాచక పదముల కీసూత్రముతోఁ బ్రసక్తిలేదు. మహతీత రామహద్వాచకములను మాత్ర మీ సూత్రము వలన గ్రహింపవలెను.

62. నియత స్త్రీ ప్రత్యయస్తు సర్వాసామ్.

కాని, అన్ని స్త్రీలింగ శబ్దములకును వాని వానికి నియతములైన స్త్రీ ప్రత్యయములే చేరును. అనఁగా నాయా శబ్దములకు సంస్కృత వ్యాకరణమున స్త్రీలింగ శబ్దములకు విహితములగు టాప్, ఙీప్, ఙీష్, మొదలయిన ప్రత్యయములు చేరును. అవి దీర్ఘములయినచోఁ దత్సమము లగునపుడు హ్రస్వములగును: సీత సర్వాభీష్ట ప్రదాత్రి; రామకృప సంతాపహారిణి; మొద.

63. ఇతరత్ర చ ద్వితీయా.

అజంత సంస్కృతనపుంసకలింగ శబ్దములై మహన్మహతీవాచకములగు పదములకును అజంత పుంలింగములై మహతీతరామహద్వాచకములైన పదములకును, వాని సంస్కృత ద్వితీయైకవచన (తుల్య)రూపములు ప్రథమైకవచనమున నిలుచును: మిత్రము, కలత్రము, వృక్షము. "స్యా దమహతాం విభక్తౌ సోశ్చ ము"అను సూత్రమువలన'మిత్రము' మొదలగు మహద్వాచక పదములు సిద్ధింపవు. 'దార' శబ్ద మమహద్వాచకమగుటచేత, నాసూత్రము వలన 'దారము' అను ననిష్టరూపము సిద్ధించును. 'ఇతరత్ర చ' అనుటవలన నింతవఱకు ననుక్తములగు పదములకు ప్రథమైకవచన రూపసిద్ధి యీసూత్రము వలనఁ గలుగుచున్నది. సూత్రమందలి 'చ' కారమువలన 'దార' శబ్దమునకు 'ము'వర్ణము కలుగదని యూహింపవలెను.

(సూత్రమందలి 'ఇతరత్ర' అనుదానికి 'ద్వితీయేతర విభక్తియందు' అని యర్థముచేసి, ద్వితీయేతర విభక్త్యర్థమున ద్వితీయా విభక్తి వచ్చునని యహోబలుఁడు వ్యాఖ్యానించి, 'హేతిని నఱకెన్,' 'హేతిచేత నఱకెన్'; 'అయోధ్య నున్నవాఁడు, అయోధ్యయందున్నవాఁడు' అను నుదాహరణముల నిచ్చియున్నాఁడు. ఈ కార్యమేకాక తక్కినయిట్టి యితరకార్యములును,ననఁగా నొకవిభక్తి యర్థమున మఱియొకవిభక్తివచ్చుట 'అన్యస్యాశ్చ క్వచి ద్భవేచ్ఛాన్యా'

సూత్రమున నొక్క ద్వితీయకుఁ బ్రత్యేకముగ విధిని గల్పించు టనావశ్యక ముగఁ దోఁచుచున్నది.)

64. తస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్.

జడవాచకపదములకుఁ గలిగిన యా ద్వితీయారూపమునకే ప్రథమా విభక్తిత్వముగూడ గలుగును: రాజు రథమెక్కెను (రథము నెక్కెను); వృక్షమునాటెను (వృక్షమును నాటెను; మొదలయినవి.)ఇట్టి కార్యము మువర్ణాంతములగు మహన్మహతీవాచకపదములకుఁ గలుగదు: మిత్రమునడిగెను (ఈ యర్థమున 'మిత్ర మడిగెను' అని యనఁగూడదు.); కలత్రము నడిగెను. (ఈయర్థమున 'కలత్రమడిగెను' అని యనఁగూడదు.) కావుననే జడపదములకు మాత్ర మీకార్యము కలుగునని సూత్రకారుఁడు వచించెను.

65. ఓ ఉ వావౌ రైనావోః.

రై, నౌ, అను పదములకుఁ బ్రథమైకవచనమున వాని తుది యచ్చులకు వరుసగా ఓ, అవ, అనున వాదేశములుగ వచ్చును: రో, నావ.

66. స్త్రీవ గ్లౌః.

'గ్లౌః' అనుశబ్దము తత్సమముగునపుడు స్త్రీలింగశబ్దములకువలెనే కార్యమగును. 'అనుతాం స్త్రియాం' అను వక్ష్యమాణ సూత్రముచే 'గ్లౌ' శబ్దముపైఁ బ్రథమైకవచనమున విభక్తిప్రత్యయములోపించి 'గ్లౌ'అనిమాత్రము నిలుచును.

67. భూదివో స్తు కౌ య త్తత్.

భూ, దివ్, అను శబ్దములకు సంస్కృతమునఁగల సప్తమ్యేకవచన రూపమే తెనుఁగునఁ బ్రథమైకవచనరూప మగును: భువి, దివి.—'భువి, దివి' అను రూపములను నన్నయ ప్రథమైకవచనమున వాడినట్లు గానరాదు: భువిన్, దివిన్, అని సప్తమ్యర్థమునందు మాత్ర మవి ప్రయోగింపఁబడునేమో. 'హృద్, సరస్' శబ్దములును భూ, దివ్, శబ్దములవంటివే: హృది. సరసి; ఇవి సప్తమ్యంతరూపములు; వీనిని దొల్లింటికవులు సప్తమియందే ప్రయోగించియున్నను రానురానవి ప్రథమయందును వాడఁబడఁజొచ్చినవి.

* ఇంతవఱకును సూత్రరచనను తత్సమపదరూపనిష్పత్తి ప్రధానముగా సాగించి యికఁ దత్సమేతరరూపములఁగూర్చి చింతామణికర్త శివరించుచున్నాఁడు.

68. వాఽయిరవు ర్వ్యక్రతమా.

'వాఽయ్యావూ వక్రితమా' అని సూత్రముండవలెనేమో. సూత్రము నకు సంస్కృతశబ్దమునందలి ఐ, ఔ, లు గలపదములు తద్భవము లగునప్పుడు వాని ఐ, ఔ, లు 'అయి, అవు' అని వరుసగ నవుననికూడ నర్థము చెప్ప వచ్చును. అయిన=ఐన; మయిల=మైల; సయిదోడు=సైదోడు; కయిత=కైత; అవును=ఔను; తవుడు=తౌడు; సవురు = సౌరు;—కైకేయి = కయికేయి, కయిక; వ్యవహారమునఁ దత్సమైకారౌకారములను అయి, అవు లుగ నుచ్చ రించుట సర్వసాధారణము: సయింధవుడు, చయిత్రము, తయిలము; సవు ఖ్యము, కవుటిల్యము, గవురవము, దవుర్బల్యము, పవురుషము, మవునము; మొద.

69. ఉర్ద్వంద్వే రః.

ఋకారాంతశబ్దముల తుది ఋకారమునకు ద్వంద్వసమాసమందు తెనుఁగున రేఫ మాదేశమగును. ఈసూత్రము ''క్షత్రియవంశ్యులై భువిని గానఁగఁ బుట్టిన ...మాంధాత్ర రఘుక్షితీశులు'' అను నన్నయరచిత పద్యమం దలి'మాంధాత్ర' అను రూపమును సాధించుటకుఁబుట్టినది. కాని,'మాంధాత్రి రఘుక్షితీశులు' అనుపాఠము తప్పయియుండును. 'మాంధాతృరఘుక్షితీశులు' అనుపాఠమే చాల వ్రాఁతప్రతులయందు కాన్పించుచున్నది, 'మంధాతృ' అనుపాఠము సంయుతాసంయుత ప్రాసమున కుదాహరణమగును. అట్టిప్రాసము ద్రావిడచ్ఛందస్సంప్రదాయమునకు విరుద్ధముకాదు. ఈసూత్రము సరియైన దైనయెడల 'మాత్రపితలు, మాత్రపిత్రులు, మాతాపిత్రలు, పిత్రపుత్త్రులు, భ్రాతృస్వస్రలు, మొదలగు నన్ని భాషాసంప్రదాయ విరుద్ధ రూపము లేర్పడును.

70. క్వచి ద్గకారో వః.

ఒక్కయెడ గకారము వకారమగును. వకారము గకారమగునని కూడ నీసూత్రమున కర్థముచేయావచ్చును. వైశాఖ, వేసఁగి,వేసవి (ఇది గకా రమువకారమగుట కుదాహరణము); ప్రవాళము, పవడము, పగడము (ఇది వకారముగకారమగుట కుదాహరణము.) తెనుఁగున 'ఇరువురు, ముయ్వురు, నలు వురు,ఏవురు, ఆర్వురు, ఏడ్వురు, అను'వ' కారముతోడి రూపములు ప్రాచీన ములు; ఇరుగురు, ముగ్గురు, నలుగురు, ఏఁగురు (ఐఁదుగురు), ఆఱుగురు, ఏడు గురు, అను గకారముతోడి వర్వాచీనములు.

71. స్వన్తా న్నామ్నః కుజ్ నో ర్బహువచనే.

నువర్ణాంత వైకృత శబ్దములకు బహువచన (లువర్ణ)ము పరమగు నపుడా 'ను'వర్ణమునకు బిందుపూర్వక కువర్ణమాదేశమగును: కొలను, కొలఁ

72. కుత్రచిన్నులోపశ్చ.

(ఆ నువర్ణాంతశబ్దములలోఁ గొన్నిటికి బహువచన లువర్ణము పరమగునపుడా) నువర్ణమునకు లోపము [illegible] పేలు; చేను, చేలు; మొద.

[illegible] పేఁకులు, చేఁకులు' అను [illegible] నేర్పడుచున్నవి కాని, సూత్రకారుఁ డట్టి రూపము లుండునని యభిప్రాయపడి యుండఁడు.

73. సలలోర్బిందుయుతో డుర్వా లులయోః.

లు వర్ణముతోఁగూడిన లకారమునకు (అనఁగా పదములమీఁదనుండు -ల్లు అను సంయుక్తాక్షరమునకు (బహువచన సంజ్ఞలగు) లుల లు పరమగుచుండఁగా 'ల్లు' కు బిందువుతోఁ గూడిన డువర్ణము వచ్చును. ఇల్లు + లు = ఇండు + లు = ఇండులు, మొదలయినవి. 'కుత్రచిత్' అనునది పూర్వసూత్రమునుండి యనువర్తించుచున్నది గనుక 'రెల్లు' = గడ్డి; కల్లు = మద్యము; పల్లు = పల్లము మొదలగు పదముల కీకార్యము కలుగదు. ఇది వైకల్పికత్వమును దెలుపు సూత్ర మనుకొని కొందఱు ఇల్లులు, విల్లులు మొదలగు రూపములు నున్న వందురు, అట్టి రూపములు వ్యవహారమున లేవు. 'గోకులమిల్లులు' మొదలగు కవి ప్రయోగములు కృతకములు. సూత్రమునందు 'బిందు' వను దానికిఁ బూర్ణబిందువని యర్థము చెప్పవలెను.

74. ఉల్లు గపి తయోర్గ పరతః.

(ఆ బహువచన లు ల వర్ణములు) పరమగుచుండఁగా (ఆదేశముగా వచ్చిన డు వర్ణము మీఁది యుత్తునకు లోపముగూడఁ గలుగును: వింటులు, వింట్లు; ఇండులు, ఇండ్లు; మొద.

75. నిత్యం దారార్థశ్చ స్యాల్లో ర్లులయో రురా చ తత్రస్తః.

దారార్థకమగు ఆలు శబ్దము యొక్కయు నట్టి యితర శబ్దములయుఁ దుదినుండు లు వర్ణమునకును (పై రెండు సూత్రములందు చెప్పఁబడిన కార్యము, అనఁగా బిందుయుత డు వర్ణము బహువచన లు ల వర్ణములు పరమగునపుడు కలుగుటయు, నాడు వర్ణముమీఁది యుత్తునకు లోపము గూడఁ గలుగుటయు) నిత్యముగ సంభవించును. ఇది గాక (యీ శబ్దముల విషయమున) బహువచన లు, ల వర్ణకములకు రు, ర, అనునవియు క్రమముగ నాదేశము లగును. ఆలు, ఆండ్రు, ఆండ్రఁ; కోడలు, కోడండ్రు, కోడండ్రన్ మొద. సూత్రమందు 'నిత్యం' అనుటవలన [illegible]

రూపములు నుండుననియు నర్థము చెప్పుటకవకాశ మున్నది. ఈ రెండు విధములగు రూపములును నన్నయ ప్రయోగములకు వ్యతిరేకములు.

76. రో లః.

రేఫమునకు లకారమగును. 71-వ సూత్రములోని 'బహువచనే' అను పదమిం దనువర్తించుచున్నది. రేఫ మనఁగా పదము తుదినుండు రేఫ మనియే యర్థము చేసికొనవలెను; ఇదిగాక రేఫ శకటరేఫముల రెంటిని గ్రహింపవలెను. ఏఱు + లు = ఏలు + లు = ఏలులు; గోరు+లు = గోలు+లు = గోలులు; మొద. ఈ సూత్రమునకు 'లకారము రేఫమగును' అని కూడ నర్థము చేయవచ్చునుగాని యట్లు చేయుట సూత్రకారుని యుద్దేశమై యుండదు.

77. డలటా ముదితాం తస్య చ వా లుక్.

ఉదంత, ఇదంత డ, ల, ట, లాంతమందుగల పదముల తుది ఉత్తు, ఇత్తులకును, వానియొక్క (అనఁగా పై సూత్రమున కాదేశముగా వచ్చిన లకారము మీఁది ఉత్తునకును వైకల్పికముగా లోపము గలుగును, త్రాడు+లు = త్రాడ్ + లు = త్రాళ్లు, త్రాడులు; తెడి + లు = తెడ్ + లు = తెళ్లు, తెడులు; చాలు + లు = చాల్ + లు = చాల్లు, చాలులు; అంబలి + లు = అంబల్ + లు = అంబల్లు, అంబలులు; పాటు + లు = పాట్ + లు = పాట్లు, పాటులు; మేటి + లు=మేట్ + లు = మేట్లు, మేటులు; గోరు+లు = గోలు+లు = గోల్ + లు = గోల్లు, గోలులు, గోరులు, గోర్లు; ఏఱు+లు = ఏలు+లు= ఏల్ +లు=ఏల్లు, ఏలులు, ఏఱులు, ఏఱ్లు.

'డలటేభ్య ఉదితాం' అనినచో 'ఉదిత్తు' లకు వైకల్పికలోపము; 'డలటా ముదితాం' అనినచో 'ఉదిత్తు'లను గలిగిన డలటలకు గాని, డలటలతోఁ గూడిన యుదిత్తులకుఁగాని వైకల్పికలోపము; డలటలకు లోపమును సూత్రకారుఁ డుద్దేశించియుండఁడు. ఇట్లే 'తస్య' అను పదమువలన వైకల్పిక లోపము రేఫమునకో, దాని కాదేశమున వచ్చిన లకారమునకో, వానిపై వచ్చు అ, ఇ, ఉ, లను నచ్చులకో స్పష్టము కాలేదు; రేఫము మీఁది యుత్వమునకని వ్యాఖ్యాత లెట్లో సరిపెట్టుకొనుచున్నారు.

చింతామణియందు బహువచనమున డ, ల, ల కాదేశముగా నలఘు లకారము వచ్చునని చెప్పఁబడియుండలేదు. 'గోలః' అను సూత్రమువలనఁ గలిగిన లకార మలఘులకార మనికూడ నందులేదు. కాఁబట్టి త్రాళ్లు, తళ్లు, చాళ్లు, అంబళ్లు, ఏళ్లు, గోళ్లు, మొదలగు నలఘు లకారముతోఁ గూడిన బహువచన రూపములు చింతామణివలన

త్రాడ్లులు; తడ్లు, తడ్లులు; చాల్లు, చాల్లులు; అంబల్లు, అంబల్లులు; పాట్లు, పాట్లులు; మేట్లు, మేట్లులు; గోల్లు, గోల్లులు; గోడ్లు, గోడ్లులు; ఏల్లు, ఏల్లులు; ఏళ్లు, ఏళ్లులు; విల్లు (-ళ్లు), విల్లు(-ళ్లు?) లు; కొడవల్లు (-ళ్లు?) లు, కొడవడ్లు (లు), మొద.

81. కేషాంచి దుదన్తానాం నేతి విభక్తా వునో లుక్ స్యాత్.

కొన్ని యుదంతశబ్దములకు 'న' అను సప్తమీవిభక్తి ప్రత్యయము పరమగునపుడు శబ్దము తుదియుత్వమునకును ప్రత్యయమందలి తొలి నకారపుం బొల్లునకును లోపము కలుగును; చోటు+నన్ అనియుండఁగా ఉత్వనకారములులోపించి 'చోట్+అన్' అని నిలిచి, 'చోటన్' అనురూప మేర్పడును. ఇట్లే, మీఁదన్, క్రిందన్, ఊరన్, మొద. 'కొన్ని' యనుటవలన నీకార్య మాపవిభక్తిక శబ్దములమీఁదనే కలుగును; కొంగునన్, వీపునన్, మొదలగుచోట్లఁ గలుగదు.

ప్రక్క, దారి, మొదలగు నదంత ఇదంత శబ్దములమీఁద 'న' వర్ణకము చేరునప్పుడును అన్, ఇన్, అనువానికిని లోపము గలుగును. వింటన్, కంటన్, వాఁకిటన్, మొదలగుచోట్లఁ గొన్ని విశేషకార్యములు గలుగును. ఇట్టివానిని చింతామణి వివరింపలేదు.

82. ఔపవిభక్తికనామ్నా మత్వం స్యాత్సప్తమి తృతీయార్థే.

ఔపవిభక్తిక శబ్దములకు సప్తమీ తృతీయార్థములందు అత్వము వచ్చును. ('సప్తమీ తృతీయార్థయోః' అని సూత్రమున నుండవలెనేమో.) అత్వమువచ్చుననిన దేనిపై వచ్చునో, యను విషయముగాని, దేనికాదేశముగ వచ్చునో యను విషయముగాని విశదము కాలేదు. 'చేయి+అ' అని అత్వమాగమముగా వచ్చుననియో, లేదా, ఇత్ స్థానమున నత్వము వచ్చుననియో లేదా 'చేతి' లోని యిత్ స్థానమున వచ్చుననియో, చింతామణి యభిప్రాయ మేమియు స్పష్టముగా లేదు. ప్రథమేతర విభక్తి ప్రాతిపదికము తుదియచ్చు స్థానమున సప్తమీ తృతీయార్థములందు ఏకవచనమున అత్తు చేరుననియు, ఆకార్యము వైకల్పికమనియు, తృతీయా సప్తమీ విభక్తిప్రత్యయములు ద్రుత ప్రకృతికములుగావున నీయత్తును ద్రుతప్రకృతిక మే యనియు నెట్లయిన నీ సూత్రమున కర్థము చెప్పికొనవలెను.

83. అనుతాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీసమస్య చ నులోపః.

స్త్రీలింగమందు తత్సమానుదంతశబ్దములకును, సమస్తమైన (దేశ్య) స్త్రీ సమశబ్దములకును, ప్రథమైకవచన ప్రత్యయములగు 'డు, ము, వు' లు

వెలఁది, కోఁతి, బంటు, ఆలు, పోతు, మొద. సులోపముగలుగు 'దార' మొదలగు పదము లింకను ననేక విధములైన వున్నవి. వానిని చింతామణి వివరింపలేదు. సులోపము గలుగుటయే స్త్రీ సమత్వమునకు లక్షణ [illegible] సమములకు సులోపము క[illegible]

84. ఏదన్తతా చ [illegible] మియాన్తానామ్.

'ఇయ' అనున దంతమందుగల పదములకు ఆ 'ఇయ' కు మాఱుగ 'ఏ' అనునది గూడ వైకల్పికముగ వచ్చును: కన్నియ, కన్నె; వన్నియ, వన్నె; గోనియ, గోనె; మొద. 'ఇయము' అంతమందుగల పదముల 'ఇయము' నకు మాఱుగ 'ఎము' వచ్చుననియు చెప్పికొనవచ్చును; కడియము, కడెము; ముత్తియము, ముత్తెము; మొద:— సూత్రమునందు 'ఏదన్తతాచ' అనియుండవలెను; కాని, యట్లున్నచో గణభంగము కలుగును. గణభంగము కలుగునని తప్పు టుపదేశముఁ జేయుట తగదుగదా.

85. వికృతౌ సర్వే శబ్దాః క్లీబసమాః స్త్రీసమా శ్చ; నాఽన్యే స్యుః.

తత్సమేతరాంధ్రపదము లన్నియు నపుంసకలింగ సమములును స్త్రీసమములునై యుండును; ఇతరములు లేవు. నపుంసకలింగసమము లనఁగా 'ము, వు' వర్ణకములు ప్రథమైకవచనమునఁ జేరు శబ్దములు; వేసము, అరదము, పుట్టువు. మొద. స్త్రీసమము లనఁగాఁ ప్రథమైక వచనప్రత్యయములు చేరనివి: మాట, కోట, సొగను, మఱంది మొద. ఇతరములు లేవనఁగా పుం సమములు లేవని తేలుచున్నది. కాని, నగఁడు, మనుమఁడు, అల్లుఁడు, మొదలగునవి కానవచ్చుచున్నవి. వ్యాఖ్యాతలు వీని నేకాదిగణములోఁ జేర్చుకొనవలెననుచున్నారు. అట్లు చేర్చినంత మాత్రమున వాని పుం సమత్వము పోదుగదా.

86. క్లీబసమా అమహద్వత్.

నపుంసక సమశబ్దములు మహద్వాచకములవలె నుండును. చింతామణియందీ మహద్వాచక పదములకు విధించిన విధులే క్లీబసమములకును వర్తించునని యర్థము.

87. స్త్రీవ త్తుః స్త్రీసమాః

వైకృతిములగు స్త్రీ సమములు తత్సమములగు స్త్రీ లింగశబ్దములవలె నుండును. అనగాఁ జింతామణియందు స్త్రీలింగశబ్దములకు విధింపఁబడిన విధులు స్త్రీ సమములకును వర్తించు నని యర్థము.

88. సమా స్తు సమాః.

తత్సమములు వాని ప్రకృతులకుఁ గల లింగములనే కలిగియుండును.

శ్రీః

# ఆంధ్రశబ్దచింతామణౌ

---

## హలన్త పరిచ్ఛేదః

1\. ప్రథమైకవచనతుల్యం సర్వత్ర హలన్త మగుణవత్ప్రభృతి.

గుణవర్ణములో చేరని హలంతపదము తత్సమమగునపుడెల్లయెడలను ప్రథమావిభక్తియందుఁ దాని(సంస్కృత) ప్రథమైకవచన రూపమును బోలి యుండును; వాక్, మరుత్, రాట్ మొదలయినవి.

2\. గుణవర్ణో ద్వితీయైకవచనతుల్యో భవే ద్వికృతౌ.

ఆంధ్రమున గుణవర్ణమందలి పదములు తత్సమము లగునపుడు ప్రథమైకవచనమున సంస్కృతమందలి యా పదముల ద్వితీయైకవచనరూపములను బోలియుండును: గుణవంతమ్, మతిమంతమ్, విద్వాంసమ్, మొదలయినవి.

3\. ద్విత్వోత్వే సర్వహలాం హ్రస్వాత్.

హ్రస్వాచ్చుకంటెఁ బరమందున్న సమస్తహల్లులకును ద్విత్వమును ఉత్వమును (వచ్చును.) ఉదా. మరుత్తు, ద్విట్టు మొదలయినవి.

4\. ద్విత్వంతు దీర్ఘతో బహుళమ్.

దీర్ఘాచ్చుకంటెఁ బరమందుండు హల్లులకు ద్విత్వము బహుళముగా నగును; (ఉత్వము తప్పక వచ్చును) ఉదా: వాక్కు, వాకు:— కాని, రాటు, విరాటు, అను నిట్టి రూపములు గలుగవు.

5\. అగుణవతాం సర్వాహలాం సోర్లోపః.

గుణవర్ణములోఁ జేరని సర్వహలంతశబ్దములమీఁదను బ్రథమైక వచన ప్రత్యయము లోపించును: ఉదా. రాట్, రాట్టు; 'రాటుఁడు' అని కాదు.

6\. గుణవతాం డుమూ ప్రాగ్వత్.

గుణవర్ణములోఁ జేరిన పదములకు అజంతశబ్దములకువలె 'డు, ము,'

· ఆత్మన ఇమనంతానాం డా వా.

ఆత్మన్ శబ్దమునకును ఇమనిజంత శబ్దములకును 'డా' [illegible] వికల్పముగా నగును. 'డా' [illegible] యము 'ఆ' అనునది. డిత్తు [illegible], గరిమన్, లఘిమన్ మొదలగు వానిలోని తుది 'అన్' లోపించి, దానిస్థానమున 'ఆ' చేరును. కావున, ఆత్మా, గరిమా, లఘిమా' మొదలగురూపము లేర్పడును. 'ఋగ్రాణాం ప్రాస్వశ్చ స్యాత్' అనుసూత్రమువలన 'ఆత్మ, గరిమ, లఘిమ' అను తత్సమ ప్రథమైక వచన రూపములు కలుగును. సూత్రము ఇంక 'డా' చేరుటవైకల్పికమని చెప్పుటచేత 'ఆత్మన్, గరిమన్, లఘిమన్' అను రూపము లట్లే మిగులును; ఆ రూపము లకుఁ దత్సమత్వమునఁ బ్రథమైకవచనరూపము లేమగునో చింతామణి తెలుపలేదు: 'ద్వితోఽ్వత్వే' అను సూత్రమువలన 'ఆత్మన్ను, గరిమన్ను, లఘిమన్ను' మొదలగు ననిష్టరూపము లేర్పడుచున్నవి. అట్టిరూపము లేర్పడుట చింతామణికర్త యాశయముకాదు. 'ఆత్మ, గరిమ, లఘిమ' మొదలగు రూపములతోఁబాటు 'ఆత్మము, ఆత్ముఁడు, గరిమము, లఘిమము' మొదలగు రూపములును గలుగునని తెలుపుటయే యాతనియుద్దేశము. ఆ రూపకల్పనమునకు 'డా వా' యని చెప్పుటవలనఁ బ్రయోజనములేదు. 'ఆత్మము' మొదలగు రూపములు గలుగుటకు ముందు 'డా' నిత్యముగవచ్చి తీరవలెను. అట్లు వచ్చిన రూపము వైకల్పికముగ స్త్రీ సమమగునని వేఱ చెప్పవలసియుండును.

8. డు స్స్యాత్సదా రాజ్ఞః.

రాజన్ శబ్దమునకు పై 'డు' అను ప్రత్యయము నిత్యముగా వచ్చును. 'డు' అనుదానిలో 'డ' కార మిత్సంజ్ఞ గలది గావునఁ జేరునట్టి ప్రత్యయము 'ఉ' అనునది. అది చేరునప్పుడు 'రాజన్' శబ్దములోని తుది 'అన్' లోపించి తత్సమ ప్రథమైక వచనమున 'రాజు' అను రూప మేర్పడును.

9. సాన్తా దసయోః ప్రభృతేః స్లోపః.

ప్రయోగణమునకుఁ జెందని సంస్కృతి సకారాంత పదములు తత్సమములగు నప్పుడు వానితుది సకారము వైకల్పికముగ లోపించును. అట్లు లోపించినరూపము ప్రాతిపదికము కాఁగా దానిపై డు, ము, వు, ప్రత్యయములు చేరును. మనము, యశము, తేజము, మొదలగునవి. ఇది వైకల్పికత్వమును విధించు సూత్రముగఁ గాన్పించుచున్నది. కావున 'ద్వితోఽ్వత్వే' అను సూత్రమువలన 'మనస్సు, యశస్సు, తేజస్సు' అను రూపములును గలు

మనను; మొద. పయః ప్రభృతుల తుది సకారమునకు లోపము గలుగదు. పయస్సు, వయస్సు, విహాయస్సు, మొద.

10. అన్యేషాం చ వా లు గంతస్య.

సకారాంత వ్యతిరిక్త హలంతపదముల తుది హల్లునకును లోపము వైకల్పికముగ నగును: జగత్తు, జగము.

11. ప్రాకృతభవ సంస్కృతభవ సంస్కృతవత్ ప్రాకృతభవ వికృతి భవాః.

ప్రాకృతభవములై యాంధ్రభాషయందు వెలసినశబ్దములు సంస్కృత సమములు సంస్కృతభవములు, దేశ్యములునగు ప్రాకృత భాషాశబ్దములను బోలియుండును.—ఇంతవఱకును సంస్కృతసమ ప్రాకృతసమాంధ్ర శబ్దముల రూపనిష్పత్తిని దెలిపి చింతామణికర్త యీ సూత్రమున నాంధ్రమందలి ప్రాకృతభవశబ్దములను గూర్చి తెలిపియున్నాఁడు.

12. వ్యతిరిక్తా భూయాంసః.

1. ప్రాకృతభాషాశబ్దములకు (వర్ణలోప, వర్ణాగమ, వర్ణాదేశ, వర్ణవ్యత్యయాదులచే) భిన్నములగు ప్రాకృతభవములును (నాంధ్రభాషయందు) అనేకములుగలవు. —లేదా. 2. (ఇంతకుముం దాంధ్రమందలి సంస్కృతసమ, ప్రాకృతసమ, ప్రాకృతభవములను గూర్చి తెలుపఁబడి యుండుటచేత) నింకను మిగిలిన (సంస్కృతభవ) శబ్దము లనేకములును (నాంధ్రభాషయందు గలవు).

13. వ్యతిరిక్తా సంప్రదాయతో వేద్యాః.

అట్టి వ్యతిరిక్తములైన ప్రాకృతభవశబ్దములుగాని, సంస్కృతభవ శబ్దములుగాని (వ్యవహార)సంప్రదాయమువలనఁ దెలిసికొనఁ దగినవి. (ఇట్లు చెప్పి సూత్రకారుఁడు సంస్కృత ప్రాకృతముల కత్యంతభిన్నము లగు కొన్నిశబ్దములనుగూర్చి కొంత వివరింపఁబూని తెనుఁగునందలి 'సర్వనామము' లను గూర్చి తెలుపఁబోవుచున్నాఁడు.)

14. దేశ్యా దస్మ ద్యుష్మచ్ఛబ్దా త్సుజసో ర్నుమూ వురూ చ స్తః.

దేశ్యములయిన అస్మత్, యుష్మత్, అను (నర్థములుగల) శబ్దముల కంటె ప్రథమైక బహువచనములందు (క్రమముగా) ను, ము; వు,రు, అను నవి వచ్చును.— సంస్కృతమున 'అస్మత్' అనిన 'మావలన' ననియుఁ యుష్మద్, అనిన 'మీవలన' ననియుఁ బంచమ్యర్థములు గలుగును. అది ప్రాతిపదికములుగా నిలుచునేని 'నా','నీ,మా, మీ' అనునర్థములను బొందును. వానిప్రథ

అను నర్థములను గ్రహింపవలెను. ఈ మూఁడర్థములలోను బంచమ్యర్థకరూపములు సూత్రకారుఁ డుద్దేశించినవై యుండవు. ఇఁక దేశ్యాస్మద్ యుష్మచ్ఛబ్దములు 'నా, నీ' యనునవి [illegible] కావలెను. సూత్రకారుఁడ [illegible]
రూపములగు 'ఏ(నే)ను, ఈ [illegible] కావున సూత్రమందలి దేశ్యాస్మద్యుష్మచ్ఛబ్దములకు 'నా, నీ' అనియే అర్థము చెప్పవలెను. 'నా, నీ' అను పదములు ప్రాతిపదికము లని ముందుగ తెలిసియుండినఁ గాని యీ సూత్రమునకును ముందుసూత్రములకును నర్థమును వివరించుట కష్టము. 'నా, నీ' పదము లస్మద్యుష్మ దర్థకములని యెచ్చటను జింతామణియందు చెప్పఁబడి యుండలేదు. ప్రస్తుతసూత్రమువలన నాను, నాము; నీవు, నీరు; అను ప్రథమైక బహువచన రూపములు క్రమముగా దేశ్యాస్మద్యుష్మచ్ఛబ్దముల కేర్పడు చున్నవి.

15. న్ను మ్మూ న్మహ్రస్వశ్చైతే దమి శసి చ.

ద్వితీయైకవచనమున 'న్ను' అనునదియు, ద్వితీయా బహువచనమున 'మ్ము' అనునదియు 'నా, నీ' లపైఁ జేరును; అవి చేరునప్పుడు 'నా, నీ' లకు హ్రస్వము గలుగును; ఇందువలన 'నన్ను, నమ్ము; నిన్ను, నిమ్ము' అనురూపము లేర్పడుచున్నవి. (సూత్రమునాదిని 'న్ను' అని యెట్లుచ్చరింపవలెనో తెలియకున్నది. నాక్యాదని భిన్నవర్ణ సంయోగముగల సంయుక్తాక్షరముల నుచ్చరింపవచ్చునుగాని, ద్విత్వాక్షరముల నుచ్చరింప వీలులేదుగదా.)

16. అన్యతర లుక్చ యుక్తస్య.

ఈ 'న్ను, మ్ము' లను సంయుక్తాక్షరములలో నొక (హల్లు) లోపించుటయుఁ గలదు. (లుక్ అనునది హల్లునకే వర్తించునుగాని యచ్చునకుఁ గాదని యనుకోనవలెను.) ఇందువలన 'నను, నము; నిను, నిము'; అను రూపము లేర్పడుచున్నవి.

17. కే ర్న జమః.

షష్ఠ్యేక బహువచనములందు వీనిపై 'కి' వర్ణకము చేరును ('కు' వర్ణకము చేరునని యభిప్రాయము. 'జమః కు రనితామ్' అను సూత్రమువలన నకారాంతములపై 'కు' చేరదనుటచే 'కి' చేరునని తెలియుచున్నది. కావున 'నీ' అనుదానిపై 'కి' చేరి 'నీకి' అను రూపమేర్పడవనియు, 'నీకు' అనియే యేర్పడు ననియు నీ సూత్రము నభిప్రాయ మగుచుయుండును. 'అనితామ్' అనుటవలన హ్రస్వ ఇకారమునే గ్రహింపవలసి యుండుటచేతను, 'ఈ' కారమని త్తే కావు

18. ప్రథమాయా మే దస్మదః.

'అస్మద్' అను సంస్కృత శబ్దముస్థానమునఁ దెనుఁగునఁ బ్రథమైక బహువచనములందు దీర్ఘమయిన ఏకారము నిలుచును: ఇందువలన 'ఏను ఏము' అను ప్రథమారూపము లేర్పడుచున్నవి. లేదా. 'నా' అనుదానిలోని 'ఆ' కారమున కేత్వము కలిగిన దనుకొన్నయెడల నేను, నేము, అను రూపము లేర్పడును.

19. ఏతయో ర్బహుత్వే మః.

ఈ సూత్రమునకు రెండు విధములుగ నర్థము చెప్పవచ్చును. (1) ఆ రెండింటిలో (అనఁగా ప్రథమైకబహువచన రూపములలో) బహువచనరూప మునవచ్చిన 'ఏత్' అనుదానికి మకారము చేరును. (అది పూర్వమందు చేరునా పరమందుచేరునా యను విషయ మీ సూత్రమువలనఁ దెలియదు; పూర్వ మందేయని యనుకొందము.) ఇందువలన 'మేము' అను రూప మేర్పడుచున్నది. (2) ఆ రెండింటికిని (అనఁగా అస్మద్, యుష్మద్, అను శబ్దములకు) బహుత్వ మున (నన్నివిభక్తులందును) 'మ' కారము వచ్చును. మకార మాగమమాత్ర మనుకొన్నయెడల 'ఏము' శబ్దమునుండి 'మేము' అను రూపము కలుగును. ఆదేశముగావచ్చిన దనుకొన్నయెడల 'నేము' అను దానిలోని నకారము నకు మకార మాదేశమైనదని చెప్పవలెను. కాని, మీరు అను రూపనిష్పత్తి కది 'న' కారమున కాదేశముగ వచ్చినదని యనుకొనవలెను. ఇట్లే తక్కిన విభక్తులయందును నాయారూపముల నూహించుకొనవలెను.

అస్మచ్ఛబ్దము.

| ఏక. | బహు. |
|---|---|
| ప్ర. ఏను, నేను | ఏము, నేము, మేము. |
| ద్వి. నన్ను | మమ్ము |
| తృ. నా చేత (మొద.) | మా చేత (మొద.) |
| చ. నా కొఱకు (కై) | మా కొఱకు (కై) |
| పం. నా వలన (మొద.) | మా వలన (మొద.) |
| ష. నా (కు మొద.) | మా (కు మొద.) |

యుష్మచ్ఛబ్దము.

| | ఏక. | బహు. |
|---|---|---|
| ప్ర. | నీవు | |
| ద్వి. | నిన్ను | |
| తృ. | నీ చేత (మొద.) | మీ చేత (మొద.) |
| చ. | నీ కొఱకు (కై) | మీ కొఱకు (కై) |
| పం. | నీ వలన (మొద.) | మీ వలన (మొద.) |
| ష. | నీ (కు మొద.) | మీ (కు మొద.) |
| స. | నీ యందు | మీ యందు |

చింతామణిప్రకార మేర్పడిన పై రూపములలో ‘నేను’ అనుదానిని నన్నయ నాదరింపలేదు. ఆతని కాలమున కింకను ‘ఏను’ అనురూపమే కాని, ‘నేను’ అను రూపము కలుగలేదని తోఁచుచున్నది. ‘ఈవు, ఈరు, ఈరలు, మీరలు’ అను రూపములు నన్నయ భారతమునఁ గానవచ్చుచున్నది. వానికిఁ జింతామణియందు గతి కానరాదు.

20. హ్రస్వే టాదౌ సమహాన్ వ్యయవ ద్వచనద్వయేఽస్యయో రాత్మా.

ఆత్మార్థక దేశ్యసర్వనామము ‘తా’ అనుదానికి తృతీయాదివిభక్తులందు హ్రస్వము కలుగఁగా నా హ్రస్వ ‘త’ వర్ణముపై నేకవచనమున ‘న’ వర్ణమును, బహువచనమున ‘మ’ వర్ణమును చేరి, ‘తన, తమ’ అను రూపము లేర్పడును. ఆ పైని విభక్తిప్రత్యయము లారూపములపై జేరును. తక్కిన విభక్తులందు, అనఁగా ప్రథమా ద్వితీయా విభక్తులందు దాని రూపము లస్మద్యుష్మచ్ఛబ్దములవలె గలుగును: తాను, తాము; తన్ను, తమ్ము. ఈవిధి ఈయుక్తగముల విషయమునకే సంగ్రహించును; అస్మచ్ఛబ్దమునకు విధించిన దుగాగమమునకు గలుగు మార్పులు ‘తా’ శబ్దమునకు రావు. ‘తమను’ అను రూపము చింతామణివలన సిద్ధింపదు.

21. ఘాయి ఉభయార్థవాచి యుష్మస్చ్ఛవతి నిత్యం బహువచః.

మనల నస్మద్యుష్మదర్థముల రెంటని దెలుపు నొకానొకటి (సర్వనామము) ఉన్నది. అది నిత్యబహువచనము: మన.

22. తస్య జసో ము శసో లసి.

దానికి ప్రథమాబహువచనమున ‘ము’ వర్ణమును, ద్వితీయా బహు వచనమున

23. ప్రాగ్వత్సర్వం భిసాదికేఽన్యత్ర.

దాని తృతీయావిభక్తులందలి బహువచనము అస్మద్యుష్మచ్ఛబ్ద
ములకువలె నుండును. మనచేత, మనకొఱకు, మనవలన, మనకు, మనయందు.

24. కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యేషు.
ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తాదయోఽపి కథ్యన్తే.

క్రియలలోను నామపదములలోను గల ఉత్తునకు లోపము కవిభల్ల
టులచేతఁ గోరఁబడుచున్నది. వికృతి (యగు నాంధ్రభాషలో) ప్రథమైకవచన
మాత్రమందు నకారము మొదలగున వంతమందుగల పదములును జెప్ప
బడుచున్నవి.

'కవి భల్లటులు' అనువారు ప్రాచీన వ్యాకరణాచార్యులని యహో
బలుఁడు చెప్పుచున్నాఁడు. ఇందువలన నాంధ్రశబ్దచింతామణికిఁ బూర్వమున
నాంధ్రవ్యాకరణము లున్నవని తెలియుచున్నది; కాని, యీ కవిభల్లట
లెవరో యేకాలపువారో యెట్టి వ్యాకరణములను రచించిరో యించుకయు
దెలియదు. ఈ 'భల్లట' అను పురుష సంజ్ఞావాచకపదము 'మమ్మట, లొల్లట
మొదలగు కాశ్మీర సంస్కృతకవుల పేళ్లను బోలియున్నది. తెనుఁగువారి కి
పేళ్లింతవఱకును గానరాలేదు. 'భల్లట' శబ్దము శ్రేష్ఠవాచక మగునా
అగు నేని 'కవిశ్రేష్ఠులచేఁ గోరఁబడుచున్నది' అను వాక్యమువలనఁ జింతా
మణికిఁ బూర్వ మాంధ్రకవి 'శ్రేష్ఠు' లుండెడివారని తేలుచున్నది.

'క్రియలలోను నామపదములలోను ఉత్తునకు లోపము' అనఁగా న
లోప మాయాపదముల ఆదియందున్న యుత్తునకో మధ్యమందున్న ఉత్తునకో
యంతమందున్న ఉత్తునకో స్పష్టము కాలేదు. ఆదియందున్న యుత్తున కం
నచో 'పురువు, ప్రువ్వు; కురుచు (కన్న.) క్రుస్సు, గ్రుస్సు' మొదలగున వుదా
హారణములగును; మధ్యమమందున్న యుత్తునకన్నచో అపుడు, అప్డు, నేరుచు
నేర్చు, మొదలగున వుదాహరణము లగును. ఇట్టివానిలోఁ గొన్ని 'శత్రు
తూత శ్చైనోః' 'పోశ్చ తదాద్యర్థవాచకే షూలః' 'ప్రథమా న్వైభ
క మోః' అని సంధిపరిచ్ఛేదమునఁ జెప్పఁబడియున్నవి. ఇట్టి చోట్లనే యు
పము చింతామణికర్త క్లిష్టమైనను 'గవిభల్లటులు' ఇతరస్థలముల యందు
కాలోపమున క్లిష్టపడుచున్నారని యర్థము తేలుచున్నది. ఉల్లోపము పదమ
యంతోత్తున కన్నచో 'చేయుచున్నాను, చేయుచున్నాము; చేయుదును
చేయుదుము; చేయఁగలను, చేయగలము; చేయఁబడుదును, చేయఁబడుదుము
చేయను, చేయము; చేయుచున్నావు, చేయుచున్నారు; చేయుదువు, చే

చేయరు; చేయుచున్నాఁడు, చేయుచున్నారు; చేయును, చేయుదురు; చేయఁగలఁడు, చేయఁగలరు; చేయఁబడును, చేయఁబడుదురు; చేయఁడు, చేయరు —అను నిట్టి క్రియాపదముల తుది యుత్తు లోపించినచో చేయుదున్, చేయఁగలన్, చేయన్; చే

లేర్పడును. అహోబలాడు

ము నుత్తునకు లోపము నుదాహరించు 'చూడఁద్గనులు, వత్తుర్ఘనులు, ఎల్లు సహింతుర్' అను నుదాహరణముల నిచ్చియున్నారు. ఇట్టివి కొన్ని కవిప్రయుక్తములు. వ్యవహారమున నీ లోపము మఱికొన్ని క్రియలయందును గలుగుచున్నది. 'చేస్తు(యుచు) న్నాఁ (-మ్, వ్, -ం) మొదలయిన పలుకుబడులు లోకమున నిత్యమును వినఁబడుచున్నవి. ఇట్టి వ్యావహారిక రూపములకు గతి కల్పించుటకును నీ సూత్రము పుట్టియుండునేమో. 'వస్తు (చ్చుచు) న్నాడ్' వంటి పలుకుబడి తెనుఁగుదేశమున నేమూలనైన వ్యవహారమున నుండకపోదు; ఉండకున్న కవిభల్లటు లిట్లు సూత్రింతురా? కవి భల్లటుల కాలమున నిట్టిరూపములు కావ్యములందును నుండెనేమో! ఇట్టి దేశ్యభాషా ప్రవాహాని కొన్నాళ్లు కాలగర్భమున నంతర్వాహిని యై నిలిచి, యిపుడు మరల పైకుబుకుచున్నదేమో!

క్రియలయం దట్లో నామములందును తుది యుత్తునకుఁ గొన్నియెడల లోపము గలుగును; అట్టివి ప్రథమైకవచనమందు మాత్రము కానవచ్చుచున్నవని 'ఉల్లోప ఇష్యతే క్వాపి ప్రథమైకవచన మాత్రే' అని యన్వయించినచో న్యాయము కాఁగలదు. ప్రథమైకవచన మనుదానికి 'క్రియలయందు ప్రథమపురుషైకవచన' మనియు 'నామములందు ప్రథమావిభక్త్యేకవచన' మనియు నర్థము చెప్పినయెడల 'చేయుచున్నాఁడ్, చేసెన్, చేయన్, చేయఁగలఁడ్, చేయఁడ్' మొదలగు క్రియారూపములును, 'వాఁడ్, రాముఁడ్, శంభుఁడ్, చెల్లెల్, పోక్, పేర్, ఆవ్, గోన్' మొదలగు నామపద రూపములును సిద్ధించును. కాని, 'ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాంతాదయోఽపి కథ్యంతే' అని యన్వయము చేసిన యెడల ఆ నకారములుకాని యితరము లెవ్వియో స్పష్టము కాలేదు. కావున వానిని ప్రయోగములనుబట్టి తెలిసికొనవలెను. ను, లు, రు వర్ణములు నాంతాది గణమునఁ జేరునేమో; మేను, మేన్; తేలు, తేల్; పలుకులు, పలుకుల్; పేరు, పేర్; పలువురు, పలువుర్; మొద. 'నాంతాదయః' అనునప్పు డాదిశబ్దముచే 'కన్ను, చన్ను, విన్ను, విల్లు, కల్లు, పల్లు' మొదలగు ద్విత్వాక్షరము లంతమందుగల శబ్దములనుగూడ గ్రహింపవలెను: కన్దోయి, చన్గవ, విల్కాఁడు, కల్పెంట, పల్దోముడు, ...

25. ఇద మద సేతద్; య; త్తచ్ఛబ్దా శ్శబ్దా స్తరాస్వయే బహుళమ్.
హ్రస్వం ప్రపద్య దీర్ఘా ద్విత్వముపర్యక్షరస్య జనయన్తి.

ఇదమ్, అదస్, ఏతద్ అనువాని యర్థముగల 'ఈ' అనునదియు, యచ్ఛబ్దార్థముగల ఏ అనునదియు, తచ్ఛబ్దార్థముగల 'ఆ' అనునదియు, దీర్ఘములు; ఇవి యితర శబ్దముతో నన్వయించి కలిసియున్నప్పుడు బహుళముగా హ్రస్వమును బొందుచు మీఁది యక్షరమునకు (హల్లునకు) ద్విత్వమును గలిగించును. ఆ కాలము, అక్కాలము; ఈ చెఱువు, ఇచ్చెఱువు; ఏ పట్టణము, ఎప్పట్టణము; మొదలయినవి. బహుళమనుటవలన (i) వానిపై నచ్చుపరమగునపుడాగమముగా వచ్చిన యకారమునకు ద్విత్వము గలుగును: అయ్యాది, ఇయ్యూర్లు, ఎయ్యాశ్వము; మొ. (ii) శ, ష, స, హ, ర, ఱ, ఋ, లు పరమగునపుడీ కార్యము గలుగదు. ఆ శివ్రుడు, ఈ షణ్ముఖుడు, ఏ సేన, ఆ హరి, ఆ రాముడు, ఈ ఱంపము, ఏ ఋషి; మొ. (iii) ఖ, ఛ, ఠ, థ, ఘ, ఫ; లు పరమగునపుడు కొన్నియెడల నీ కార్యము గలుగదు; ఆఖని, ఈ ఛత్రము ఏ ఠవర; ఆ ఘోటకము, ఈ ఫణి మొ. (iv) అగ్గుఱ్ఱము, ఇగ్గోడ, మొదలగు రూపములు మృగ్యములు. (v) సంయుక్తాక్షరము పరమగునపుడీ కార్యము కొన్నియెడల గలుగదు: ఆ క్షణము, ఈ జ్ఞానము, ఏ ప్రభువు; కాని, కొన్నియెడలఁ గలుగునేమో: అప్ప్రోలు, ఇప్స్మశానము, ఎగ్గ్రహణము మొ.

26. డిన్నాం త్స్వంబంధార్థే సప్తాత్.

అన్ని నామపదములపై సంబంధార్థమున 'ది' వర్ణకము వచ్చును. నాది, కోతిది, కోటది, రాజది, గేదెది మొ. కాని, ఇట్టి రూపములును విశేషణములగును: ఈ పుస్తకము నాది, ఈ పని కోతిది, ఆ గోడ కోటది, ఈ కిరీటము రాజది, ఆ త్రాడు గేదెది మొ. నా పుస్తకము, కోతిది పని, మొదలగురీతిని వాడఁగూడదు. ఈ 'ది' వర్ణకము బహువచనమున 'వి' వర్ణకమగును: ఈ పుస్తకములు నావి, ఆవాలు గేదెవి మొద.

27. యుష్మదస్మదాత్మభ్యో ద్వితవర్ణకః

నీ, నా, తన, మీ, మా, మన, తమ, అను పదములపై 'దు' అను వర్ణకము చేరును. నీదు, నాదు, తనదు, మీదు, మాదు, మనదు, తమదు— వీనిలో 'మాదు, మనదు, తమదు', అను రూపములను నన్నయ వాడలేదు.

దు వర్ణకముతోడి రూపములను విశేష్యములకు ముందే వాడవలెను: నీదుబడి, నాదుగది మొద. బడినీదు, మొదలగురీతిని వాడఁగూడదు. ఈ దు

28. అ, ఇ, ఉ, స్త్రీ విషయాః.

(డు, ము, వు, అను ప్రథమైకవచన ప్రత్యయములకు [illegible] కారముకాక సహజముగఁ బదముల యంతమున [illegible] ఉకారమును, అకారము [illegible] బోధించును. మాట, పే[illegible]; [illegible], [illegible] మొద. 'స్త్రీ విషయాః' అనఁగా స్త్రీ సమ విషయాః అనియే యర్థము చెప్పవలెనుగాని, స్త్రీ వాచక విషయాః అని చెప్పఁగూడదు. ('ఎ' కూడ స్త్రీవిషయమే: గిన్నె, కుప్పె, మొద.)

29. త్వార్థే తనశ్చ వికృతౌ స్యాత్.

'బహుత్వము, గురుత్వము' మొదలగు పదములందలి 'త్వ' అను ప్రత్యయము నర్థమున నాచ్ఛికభాషలో 'తన' అను ప్రత్యయము కూడ వచ్చును. పెద్దతనము, చిన్నతనము, వెఱ్ఱితనము, మొద. 'చ' అనుదాని వలన నింకను నిట్టి యర్థముగల ప్రత్యయములు తెనుఁగున గలవని యర్థము. 'తన' వర్ణకముకూడ వచ్చును. [illegible] ప్రసిద్ధము కాదని కాని, చింతామణికిఁ బూర్వపు వ్యాకరణములందు దా ప్రత్యయమును దెలుపక విడిచినారని కాని, యనుకొనవలెను.

30. నామ్నః కవర్ణః స్యాత్ త్వార్థే.

త్వార్థమునందు నామమునకు [illegible] కవర్ణకము వచ్చును: [illegible], [illegible] మొద.

31. స్యాదుత్వ మంతే తస్య [illegible].

ఆ త్వార్థక వర్ణకము [illegible] (నామము [illegible] యచ్చునకు) ఉత్వముకూడ రావచ్చును. [illegible], నెలతుక; వెలఁది, వెలఁదుక; మొద.

32. చురితి క్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలే స్యాత్.

అన్ని ధాతువులకును వర్తమానకాలమున 'చు' అనునది చేరును: చేయుచు, పోషించుచు మొద.

33. ప్రతిషేధవాచినాం నిః.

ప్రతిషేధవాచక ధాతువులపై నివర్ణకము వచ్చును. ప్రతిషేధ మనఁగా వ్యతిరేకమని యర్థము చేసికొనవలెను: చేయుని, అని నిలువఁగా ధాతువు తుది యుత్వమున కత్వము వచ్చుటకు 'ఉతోఽచ్చ సర్వేషు' అను సూత్రము ననుసంధించుకొనవలెనని చింతామణి యాశయమై యుండును.

34. భూతార్థానాం తు నః క్రియాణాం స్యాత్.

ధాతువులు భూతార్థమును దెలియఁజేయునప్పు డన్ననో వానిపై 'న' అనునది చేరును. 'క్త్వా భూతయోః క్రియాంత స్యేత్' అను సూత్రమువలన 'జయించు' అను ధాతువుపై ఇత్తుచేరఁగా 'జయించి' అయి, దానిమీఁద 'న' చేరునపుడు 'జయించిన' అను రూప మేర్పడుచున్నది. ఇట్లే తక్కిన ధాతువుల కును నెలుంగునది.

35. కర్మాదేః కర్తృత్వం ప్రథమాద నవర్ణకశ్చ తద్వత్ స్యాత్.

న వర్ణము చేరిన భూతార్థక ధాతుజ విశేషణములతోఁ జేరిన కర్మాది వాచక పదములు కర్తృత్వమును బొంది, ప్రథమావిభక్తిని పొందును; అప్పుడు పూర్వమునవలెనే (34-వ సూత్రమునఁ జెప్పఁబడినట్లే) భూతార్థ వాచకములపై న వర్ణము చేరిన ధాతుజవిశేషణము కర్తృవాచక ప్రథమా విభక్తికరూపముతో నిలుచును: నీవు నుతించిన రాజు = నీచే నుతింపఁబడిన రాజు (ఇచట రాజు కర్మపదమైనను ప్రథమావిభక్తియం దున్నది); నీవు ప్రహరించిన ఖడ్గము (ఇచట ఖడ్గము కరణము); నీవు గోవునిచ్చిన బ్రాహ్మ ణుఁడు (బ్రాహ్మణ శబ్దము సంప్రదానమున నున్నది): నీవు పూలుగోసిన చెట్టు (చెట్టు శబ్ద మపాదానమున నున్నది); నీవు భుజించిన చోటు (చోటు శబ్ద మధికరణమున నున్నది); సూత్రమున భూతార్థముఁ జేసిన న వర్ణకము మాత్రము చెప్పఁబడినదిగాని, కర్మాదులకు గర్తృత్వమును ప్రథమావిభ క్తియుఁ దక్కిన ధాతుజవిశేషణములతోఁ గూడ నప్పుడును గలుగును; నీవు చేయనిపని; చేయుచున్నపని; చేయుపని మొ॥.

36. షష్ఠీభవే ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా నామ్నాన్.

తత్పురుష సమాసమందు ప్రాతిపదికములకుఁ బూర్వమందు నిలిచిన షష్ఠీవిభక్తికరూపము ద్వితీయావిభక్తిరూపముతో సమానముగానుండును. అనఁగా ద్వితీయావిభక్తి విషయమై చెప్పఁబడిన 'లశసోఽలాన్తాత్', 'లాం తాత్తు రోఽస్తి' 'నిరమో మహతామ్', 'లుక్చస్యాత్', మొదలగుసూత్రము లీ షష్ఠీరూపమునకును వర్తించునని యర్థము. షష్ఠీతత్పురుషసమాసము నందలి షష్ఠీరూపము సంబంధార్థ బోధకమగు 'యొక్క' అను శేషషష్ఠ్యర్థ మును గలిగియుండును. ద్వితీయాతుల్యరూప మీషష్ఠికి వచ్చుటచే నది ద్రుతాంతము కావలసియున్నను 'ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు' అను సూత్ర ము చొప్పున ద్రుతము లోపించినదని చెప్పవలెను: ఉదా. రామునిగుణములు,

37. ఇదుపోత్త మోత్తనూనాం బహువచన ఉపోత్తమేత ఉద్భవతి.

తుది వర్ణమును దానికిఁ బూర్వ వర్ణమును హ్రస్వ - ఇకారముగాఁ గల పదములకు బహువచన [illegible]
మీఁది యిత్తునకు ఉత్తు [illegible]
సూత్రముచేత 'కలుకులు, [illegible], [illegible]లుకులు; బుడిపి, బుడుపులు, మొద.)

38. అస్మద్యుష్మ ద్వాచ్యా దేకత్వ ఇతో నిపి.

నేను, నీవు, అని చెప్పవలయు ఇదంతరూపములపై నేకవచనమునఁ గ్రమముగా 'ని', 'వి', అనునవి వచ్చును: నేను హరిని; నీవు [illegible]లివి, మొద. ఇట్లే, నేను రక్షించితిని, నీవు రక్షించితివి, మొద.

39. పరేషాం తు ధర్మోత్తను మధ్యమవత్.

ఇతరములకన్ననో తదర్థాత్మక ఉత్తమ మధ్యమపురుష క్రియలకువలె నగును.— ఈ సూత్రమున కర్థము స్పష్టముగా లేదు. 'పరేషాం' అనుదానికి (i) అస్మద్యుష్మ ద్వాచ్యములు కాని (అనఁగా తదర్థ వాచ్యములగు) ఇదంత శబ్దములకు (ii) అస్మ ద్యుష్మ ద్వాచ్యములై ఇదంతములు కాని వానికి (iii) అస్మ ద్యుష్మ ద్వాచ్యములునుగాక యిదంతములునుగాక యుండువానికి, అని మూఁడువిధముల నర్థము చెప్పవచ్చును. పైసూత్రములో 'ఏకత్వే' అని యుండుటచేతను, దీనితరువాతి సూత్రమగు 'బహుషు న మధ్యమవత్' అను దానిలో బహువచనమునఁగలుగు కార్యము ప్రత్యేకముగ నుపదిష్టమగుట చేతను, నీ సూత్రమువలనఁ గలుగు కార్యము లేకవచనమునకే వర్తించునని యనుకొనవలెను. అప్పుడు (i) మొదటి పక్షమున 'వాఁడు కవి, వాఁడు చేయును' మొదలగు రూపములేర్పడును. 'ప్రథమైకవచనలోప స్తద్ధాతీతయోః క్రియాణాం స్యాత్' అను సూత్రమిచట వర్తించును. (ii) రెండవపక్షమున నేను సీతను, నేను రాముఁడను; నీవు సీతవు, నీవు రాముఁడవు' మొదలగు రూపము లేర్పడును. ఈ పక్షమందు 'ఉశోఽచ్చ నవ్యేషు' అను సూత్రమునుగూడ వర్తింపఁజేయవలెను; 'నేనుచేయుదును, నీవుచేయుదువు' అను రూపములును నేర్పడునుగాని యిచట నుత్తున కత్వమురాదు; (iii) మూఁడవపక్షమున 'వాఁడు రాముఁడు, ఆమె సీత,' మొదలగు రూపములేర్పడును. 'ప్రథమైకవచన లోపః' అను సూత్ర మిచట వర్తించును.

(iv) 'పరేషాం' అను పదమును 'ఏకత్వే' అను పదముతో నెట్లో యన్వయింపఁ జేసినయెడల 'ఏకవచనేతరములైన' అనఁగా 'బహువచనముం దున్న' అను నర్థము వచ్చును. అప్పుడు (అ) 'అస్మద్యుష్మ ద్వాచ్య

హువచనమున నను రెండర్థములు గలుగును. వీనిలో మొదటిపక్షమున వారు రాములు, సీతలు; వారు చేయుదురు మొదలగున వుదాహరణము గును; రెండవపక్షమున మేము రాములము, మేము సీతలము; మీారు రాములరు, మీారు సీతలరు; మొదలగు రూపము లేర్పడును; మేము చేయుదుము, మీారు చేయుదురు, మొదలగు రూపములు నేర్పడునుగాని నికి 'ఉతోఽచ్చ సర్వేషు' అను సూత్రము వర్తింపదు.

ఇట్లర్థవివరణముఁ జేయవలసియున్నను నీ సూత్ర మేకవచనములకే ర్తించుననియు, చేయుదును, చేయుదువు, చేయును, చేయుదుము, చేయు రు, మొదలగు రూపముల నిష్పత్తి క్రియాపరిచ్ఛేదమందలి సూత్రము చేఁ గలుగుచున్నది గావున నట్టివానికి వర్తింపదనియు, నామపదములపైఁ యా ప్రత్యయములు చేరువిధానమునే నది బోధించుచున్నదనియు నను నవలెను.

40. బహుషు న మధ్యమవత్.

బహువచనమున (తద్ధర్మ) మధ్యమపురుష రూపములు గలుగవు.— చట బహువచనమున ననఁగా అది దుదంతముల మూఁడు పురుషముల హువచనమునందును నని యర్థము. బహువచనమందలి యాయారూప ులు పై సూత్రముచే సిద్ధించుచున్నవి; కాని, యీా సూత్రమున నా రూప ులలో మధ్యమపురుష బహువచనము మధ్యమపురుష బహువచన ప్రత్య యముచే నేర్పడదని చెప్పఁబడినది. అయిన నది యెట్లేర్పడునో చింతామణి తెలుపలేదు. ప్రథమపురుష బహువచనమున వచ్చు 'రు' వర్ణమే మధ్యమ రుషముననను వచ్చుచున్నదనియు, మధ్యమపురుష బహువచనమునకుఁ ప్రత్యేక ప్రత్యయము బహువచనమున లేదనియుఁ జింతామణి యాశయమై యుండవచ్చును.

41. సర్వ విభక్తి స్సంస్కృత తుల్యా.

తెనుఁగునందలి యాయా విభక్తుల యర్థములు, సంస్కృతము నందలి భక్తుల యర్థమునే గలిగి యుండును.

42. అన్యస్యాశ్క్వచి ద్భవే చ్చాన్యా.

ఒకయెడ నొక విభక్తికి మఱియొక విభక్తియువచ్చును: రథమెక్కెను. ద్వితీయార్థమునఁ బ్రథమ); రామునకు నమస్కారము (చతుర్థ్యర్థమున షష్ఠి.); తేఁడు నీ కధికుఁడు (పంచమ్యర్థమున షష్ఠి); భక్తుల పాదములు నా శిరమునఁ ల్తును (తృతీయార్థమున సప్తమి); ఖడ్గమున నఱకెను. (తృతీయార్థమున

**43.** ఏకత్వం భేదకగత బహువచనానాం చ దృశ్యతే వికృతౌ.

వికృతియైన యాం [illegible] ములతోఁ జేరిన విశేష [illegible] దన్ననో విశేష్యమునకుఁ గల లింగ, వచన, విభక్తులు తద్విశేషణములకును వచ్చును: ఇంపయినమాటలు, ఇష్టమయిన పనులు, మొద.

**44.** ద్విగుకర్మధారయే, తత్పురుష ద్వన్ద్వే, (చ నా) బహువ్రీహిః. అన్యే చ కేచి దుపమానోత్తరపదలోప రూపకా ఖ్యాద్యాః పరిదృశ్యా ఇహ.

ద్విగువు, కర్మధారయము, తత్పురుషము, ద్వంద్వము, బహువ్రీహి, (అను సంస్కృతవ్యాకరణప్రోక్త సమాసములును), ఉపమాన సమాసము, ఉత్తరపదలోప సమాసము, రూపకసమాసము, మొదలగు పేళ్లుగల కొన్ని యితర సమాసములును నిందు (ఆంధ్రభాషయందు) బాగుగా చూడఁదగినవి. తెనుఁగునందలి దేశ్యపదముల సమాసము లీ సూత్రమునఁ దెలుపఁబడినవి. ఉదాహరణములు:

I. ద్విగువు: i. ఏకవద్భావి: (అ)సంస్కృత సమాస లక్షణములుగలవి. ఇరుసంజె, ముప్పొద్దు, నలుకాలు మొదలయినవి.

ii. అనేకవద్భావి: ఇద్దఱుతెల్లుల ముద్దుబిడ్డఁడు, ఏడుగుఱ్ఱాల రౌతు, మొద.

II. కర్మధారయము: సమానాధికరణము:

i. విశేషణపూర్వపదకర్మధారయము: ఎఱ్ఱఁగలువ; నల్లమబ్బు; మంచినీళ్లు, మొద.

ii. విశేష్యపూర్వపద కర్మధారయములు: వేల్పుఁ బెద్ద, మొద.

iii. విశేషణోభయపద కర్మధారయము: నులివెచ్చ, లేయెఱుపు, మొద.

iv. ఉపమానోత్తర పద కర్మధారయము: చూపుగుఱ్ఱము, మోఁతగాడిద, తిండిపులి, మొద.

v. ఉపమాన పూర్వపద కర్మధారయము: చిగురుఁగేలు, జుంటిమోవి, మొద.

vi. సంభావనాపూర్వపద కర్మధారయము: మామిడిచెట్టు,

vii. అవధారణ పూర్వపద కర్మధారయము: పలుకుఁ జక్కెర, లిమి జవరాలు, మొద.

III. తత్పురుషము: వ్యధికరణము—

i. ప్రథమా తత్పురుషము: ముంజేయి, మొనగాలు, కడ న్ను, మొద.

ii. ద్వితీయా తత్పురుషము: పట్టుఁ బుట్టముఁ దాల్పు, గాడ్పు మేఁపరి, మొద.

iii. తృతీయా తత్పురుషము; నెలతక్కువవాఁడు, మొద.

iv. చతుర్థీ తత్పురుషము: దేవరమేలు, మాఁతకూలి, మొద.

v. పంచమీతత్పురుషము: దొంగభయము, గాలిదెబ్బ, మొద.

vi. షష్ఠీ తత్పురుషము: అలకాఁపరి, ముత్యాలదండ, మొద.

vii. సప్తమీ తత్పురుషము: మాటనేర్పరి, మొద.

IV. ద్వంద్వ సమాసము:

i. ద్విపదేతరేతరయోగద్వంద్వము: తల్లిదండ్రులు, కూరగా యలు, మొద.

ii. బహుపదేతరేతరయోగద్వంద్వము: నక్క కాకి జింకలు, మొద. (ఇట్టి సమాసములు తెనుఁగున మృగ్యములు.)

iii. ద్విపద సమాహార ద్వంద్వము: ఎఱుపు తెలుపు వన్నె; తీయ పుల్లని పండు, మొద.

iv. బహుపద సమాహార ద్వంద్వము: కమ్మని వెచ్చని తెలి యోగిరము, మొద.

V. బహువ్రీహి సమాసము:

i. ద్విపద బహువ్రీహి: చలివెలుఁగు, ముక్కంటి, మొద.

ii. బహుపద బహువ్రీహి : నీలిమబ్బుచాయ నెమ్మేనివాఁడు, మొద.

iii. సంఖ్యోభయపద బహువ్రీహి: రెండు మూఁడు గదుల రెయిలుబండి, మొద.

iv. సంఖ్యోత్తరపద బహువ్రీహి: ఇంచుమించు నూఱు, మొద.

v. సహపూర్వపద బహువ్రీహి: తోఁబుట్టువు, తోడికోడలు,

vi. దిగంతరాళ లక్షణ బహువ్రీహి: ఆ యిల్లి చటికిఁ దూర్పు దక్షిణములుగా నున్నది.

vii. వ్యతిహ... గ్రహించి, గొంతుక గొం...

(ఆ) సంస్కృతమునఁ గానరాని తెనుఁగు సమాసములు.

I. ఉపమాన సమాసము: కేలుదమ్మి, చెక్కుటద్దము, మొద. ఇట్టి సంస్కృతసమాసములును గలవు: హస్తపద్మము, పురుషవ్యాఘ్రుఁడు, మొద. దీనిని సంస్కృతేతర సమాసములలో నేల చేర్చవలెనో తెలియదు.

II. ఉత్తరపదలోప సమాసము: గాజులసెట్టి = గాజులమ్ము సెట్టి; వంటలక్క = వంటలుచేయు అక్క (స్త్రీ), మొద. దీనిని మధ్యమపదలోపి సమాసమనియు నందురు.

III. రూపక సమాసము: కౌనుమిన్ను, కనుదమ్మి, మొద.

45. కార్యా ఔపవిభక్తికవ దంతవిధయశ్చ.

తెనుఁగు సమాసములం దౌపవిభక్తిక శబ్దములకువలె (ఇ, టి, ంటి, తి, అను వర్ణములను గూడఁ జేర్పవలసియుండును: ముక్కంటి, వాఁడివాతి, మొద.

46. లోపశ్చ విభక్త్యాదేశ్శబ్దేషు స్యాత్సమాసకాఙ్గేషు.

సమాసకములోని శబ్దములందలి విభక్త్యాదులకు లోపమును గలుగును. సమాసకనిర్వచనము క్రిందిసూత్రమునఁ జేయఁబడినది: ఉదా. వేల్పుదొర, రాచకొమరుఁడు, జవ్వాదిసెట్టి మొదలగునవి.

47. కేవల వికృతి పదైర్యత్సమాసకం తం బ్రువన్తి వాక్యజ్ఞాః.

కేవలము తెనుఁగు పదములు మాత్రము చేరిన సమాస మేది గలదో దానిని వైయాకరణులు సమాసక మని చెప్పుచున్నారు: పాలమున్నీటికూఁతురు. పడగఁదాల్పు మొద.

48. సంస్కృత వైకృతశబ్దైర్మిశ్రసమాస స్స ఏవ విజ్ఞేయః.

సంస్కృతపదములును వైకృతపదములును సమసించినది మిశ్రసమాసమని తెలియవలెను. వేఁగివిషయము, చలుక్యవంశము, పరగండభైరవుఁడు, కఱకంఠుఁడు, దీపకంభము, నిత్యపడి, భ్రమకోల, అవసరమాళ, మొద.

49. సంస్కృతపదేన పరిమిత మాన్ధ్రపదం కర్మధారయో భవతి.

పరిమితమయిన యాంధ్రపదము సంస్కృత పదముతో సమసించి కర

బాలసరస్వత్యహోబలాదులును, 'శబ్దపరిమితి' యని యథర్వణుడును వ్యాఖ్యానము వ్రాసియున్నారు. అథర్వణుడును నక్షరపరిమితినే యూహించి నట్లు బాలసరస్వత్యహోబలు లభిప్రాయపడి యథర్వణుడు రచించిన కారికగా 'ఆంధ్రషడ్వర్ణ పర్యంతం సంస్కృతేన సమస్యతే (పదంస్యాత్కర్మధారయే) అనుదాని నుదాహరించి 'వాడి మయూఖములు, వేడి పయోధారలు' మొద లగువాని నుదాహరించియున్నారు. బ్రహ్మశ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రులవారీవిషయమును విమర్శించుచు:

మలయాళమందలి మణిప్రవాళ శైలియందుగానవచ్చు శుద్ధసంస్కృత శుద్ధదేశ్యపదముల సమాసములు తమకాలమందుండుట జూచి యాంధ్ర పండితులు వానిని గర్హించిరి; కాని, వాడి మయూఖములు మొదలగు నన్నయ ప్రయోగములకు గతియేమను చర్చించికొని 'సంస్కృతపదేన పరిమిత మాంధ్ర పదం కర్మధారయో భవతి' అని చింతామణిసూత్ర మట్టి ప్రయోగములకు రక్షక మగుచున్నదని సమర్థించియు నా యక్షర పరిమితి యెంతవఱకు దగునని యాశంకించుకొని 'షడ్వర్ణపర్యాంత' మని యొక మితిని గల్పించి తదనుగుణ ముగా 'ఆంధ్రః షడ్వర్ణపర్యంత 'మిత్యాది కారిక నేర్పఱచికొనిరి. కాల క్రమమున నాకారిక యథర్వణకారికావళిలోని దనుకొని దాని నందులోనికిం జొప్పించిరి. ఇట్టి ప్రక్షిప్త కారికనుజూచి భ్రమ ప్రమాదములను లోనై బాలసరస్వత్యహోబలాదులు దాని నథర్వణుడు రచించినట్లే యుదాహరించిరి. ఆ కారిక యథర్వణుడు రచించినదికాదు. చింతామణి సూత్రమునందలి 'పరిమిత' పదమునకు వాస్తవమైన యర్థము నథర్వణుడు—

"ద్వ్యక్షరాది చతుర్వర్ణ పర్యంత జననామను
లోపస్స్యాద్ డ్వాది వర్ణానాం శబ్దే రాయాదికే పరే;
క్వచి దిత్వం క్వచి లిన్మత్వం క్వచి త్వత్వం"

అని యీరీతిగా వివరించియున్నాడు ఇదియే సరియైనయర్థము. శుద్ధ సంస్కృత శబ్దముతో నాంధ్రశబ్దములకు యథేచ్ఛముగా సమాసముచేయ వలనుపడదు. బిరుదాదివాచక పరిమితాంధ్ర పదములతోనే శుద్ధసంస్కృత పదము కర్మధారయ సమాసముగా (కృష్ణరాయుడు) సమసించును' అని వివ రించియున్నారు. ఈ విషయమై కొన్ని సందేహములు కలుగుచున్నవి:—

i. మణిప్రవాళశైలి నాంధ్రకావ్యముల నెవ్వరైన రచించిరా? యను నది మొదటిది. కవులు శతకములలోం గోరి రచించిన ఒకటి రెండు పద్య

ii. 'ఆంధ్రః షడ్వర్ణ పర్యంత'మను కారిక యథర్వణుని గ్రంథములో నుండుట చింతామణి యాశయమునకు విరుద్ధ మగుటకుం గారణమేమి? అది ప్రక్షిప్తము కానియెడలం [illegible] బాధ కలిగినచో 'వాఁడివ [illegible] ప్ర పదములం దెన్నివర్ణములైన నుండవచ్చునా? 'పరిమిత' శబ్దముచేఁ జింతామణి కర్త యా యక్షరముల సంఖ్యను నియమింపకపోయినను నవి పరిమితముగా నుండవలెనని సూచించె నని చెప్పిన నేమిదోషము కలుగును?

iii. బాలసరస్వత్యహోబలులో మతియెవ్వరో 'ఆంధ్రః షడ్వర్ణే' త్యాదికారిక నథర్వణుని కంటఁగట్టిరనుట సమంజసమా? ఆంధ్రవైయాకరణ సంప్రదాయమున నున్న విషయముచే వారును గ్రహించిరని యేల చెప్పఁ గూడదు?

iv. 'సంస్కృతపదేన పరిమితమాంధ్రపదం' అనిన నాంధ్రపదము సమాసమునఁ బూర్వపదముగ నుండవలెనా? పరపదముగ నుండవలెనా? పూర్వపదమన్నయెడల 'దీపకంభము, అనియంకభీమకోల, చాళుక్యభీమకోల, అవసరమాటి (నాణెము), నిత్యపక్షి, 'కృష్ణరాయ' మొదలగు సమాసములు దుష్టములగును; పరపదమేయని యన్నయెడల 'వేఁగీ విషయాధీశ చాళుక్య కులతిలక, పరగండభైరవ, నన్నయభట్ట, కలకంఠ, మొదలగునవి దుష్టము లగును. ఈ రెండువిధములైన సమాసములును నాంధ్రమునను౦డుటచేతనే చింతామణికర్తయే కాక యాంధ్రవైయాకరణులందఱు వాని సంగీకరించిరని చెప్పఁగూడదా? ఇట్టి సమాసములను బిరుదాది వాచకములకే యన్వయించుట ప్రయోగములకు విరుద్ధముకాదా?

v. 'ద్వ్యక్షరాది చతుర్వర్ణ పర్యంత జననామను' అను కారికయందు మాత్ర మక్షర పరిమితి వచింపఁబడలేదా? 'జననామను' అని కంఠోక్తిగాఁ గారిక చెప్పుచుండఁగా 'బిరుదాది వాచకపదము' అని 'ఆది' శబ్దము నేల చేర్పవలెను? 'ఆది' శబ్దముచేఁ దక్కిన వ్యవహారసిద్ధ శుద్ధసంస్కృతవైకృత పదముల సమాసముల నేల గ్రహింపఁగూడదు?

vi. చింతామణి సూత్రము కర్మధారయసమాసమును గూర్చి మాత్రము చెప్పుచున్నది. 'కృష్ణరాయఁడు' అనునది సంభావనా పూర్వపద కర్మధారయ సమాస మనవచ్చునా? 'రాయ' శబ్దము రాజులు కాని వారి కుండఁగూడదా? 'సీతారామస్వామి' అను నప్పుడు 'సీతారామః ఇతి

కొన్నను చింతామణిసూత్ర మొక్క సంభావనాపూర్వపద కర్మధారయ సమాసములకే వర్తించు నని యేల చెప్పవలెను?

బాగుగ నాలోచించి చూడఁగాఁ చింతామణిలోని పై సూత్రము 'వాఁడిమయూఖములు' మొదలగు కర్మధారయ సమాసములకే వర్తించు నని చెప్పవలయునని తోఁచుచున్నది. కృష్ణరాయఁడు, అంచయాన, కలికంఠుఁడు, ఇత్యాది సమాసములు 48-వ సూత్రమునఁ జెప్పఁబడిన మిశ్ర సమాసముల కుదాహరణము లగును.

50. స్వస్వ విభక్తి వికారై ర్బహవశ్చ యథాతథం సమస్యన్తే.

తమతమ విభక్తివికారములతో ననేకశబ్దములు వ్యవహారానుసారముగ సమాసములగును— రాజునాజ్ఞ, రామునియానతి, ఊరివారు, ఊరఁబంది, నీతోడిచెలిమి, నావలని నేరము, మొదలయినవి.

ఇది హలంత పరిచ్ఛేదము.

శ్రీః

# ఆ న్ధ్ర [illegible]

## ప్ర [illegible] యము.

——:0:——

### క్రియా పరిచ్ఛేదము.

**1.** ఉపకృతి పరిణతి సంవృతి భేదా త్త్రివిధాః క్రియాః.

ధాతువులు ఉపకృతి యనియు, పరిణతి యనియు, సంవృతి యనియు భేదములచే మూఁడువిధములుగ నుండును.

2. పుషణ్వాది రుపకృతిః.

పుష, ను, మొదలగునవి యుపకృతి (ధాతువులు).

3. అథ భూ జ్యాదిః పరిణతిః.

పిమ్మట భూ, జి, మొదలగునవి పరిణతి (ధాతువులు).

4. అన్యా తు రక్షి వ స్యాదిః.

ఇతరమైన (మూఁడవ) దన్ననో (అనగా సంవృతి) రక్షి, వసి, మొదలగు ధాతువులను గలది.

5. స్యా దుపకృతిగి కృదన్తా.

ఉపకృతి ధాతువు కృత్ప్రత్యయ మంతమందు గలదిగా నుండును: పుష్+(ఘఙ్) = పోష్ ; ను+(క్తిన్) = నుతి ; మొదలగు కృదంత రూపములు తెనుఁగు క్రియలకును బ్రాతిపదికము లగును.

6. సా పరిణతి రయవ రన్వితైవ భవేత్.

ఆ పరిణతి ధాతువు 'అయ్, అవ్, అర్' అనువానితోఁ గూడియే (తెనుఁగునఁ) బ్రాతిపదికముగ నుండును. జి = జయ్ ; భూ = భవ్ ; హృ = హర్ ; మొద.

7. సంవృతి రహతాకారా.

సంవృతి ధాతువు తెనుఁగునఁ బ్రాతిపదికమగునప్పు డట్టిమార్పును.

8. జ్ఞేయం త్రివిధాను చ క్రియా స్వేవమ్.

(పై) మూఁడు విధములగు ధాతువులయందు నిట్లే తెలిసికొనవలెను.

9. తద్ధర్మ వర్తమానాతీతాగామ్యర్థకాః క్రియా జ్ఞేయాః.

క్రియలు, i. తద్ధర్మార్థకములు, ii. వర్తమానార్థకములు, iii. భూతార్థకములు. iv. భవిష్యదర్థకములు నని (నాలుగు విధములయిన వానిఁగా) తెలిసికొనవలెను.

10. తత్ర ద్వితీయ తుర్యా యాస్తౌ స్త స్సానుబన్ధకా వేవ.

అందు రెండవదియు (వర్తమానార్థక క్రియయు), నాలుగవది (భవిష్యదర్థక క్రియయు) అనుబంధములు గలిగియే యుండును.

11. వసతి రనుబన్ధక స్స్యా ద్యత్ర లడర్థో వివక్షిత స్తత్ర.

ఎచట లడర్థము (వర్తమానార్థము) చెప్పవలసియున్నదో యచట, వసతి ధాత్వర్థకమగు 'ఉన్న' అనునది యనుబంధముగఁ జేరును. ('వసతి' ధాతువునకుఁ దెనుఁగు 'ఉండు' అనునది కాని, 'ఉన్న' అనునది కాదు; అయినను 'ఉన్న' అని చెప్పుకొనకపోయినచో ముందు సూత్రముల కర్థము నడవదు కావున నా యర్థమే గ్రహింపఁబడినది. పుష్=పోష్+ఉండు (ఉన్న) అనియుండఁగా.

12. అస్తి రనుబన్ధక స్స్యా ద్యత్ర లృడర్థో వివక్షిత స్తత్ర.

ఎచట లృడర్థము (భవిష్యదర్థము) చెప్పవలసియుండునో యచట అస్తి ధాత్వర్థముగల 'కల' అను అనుబంధము చేరును. ('అస్తి' అన్నను 'ఉండు' ధాతువునే చెప్పికొనవచ్చును; కాని, వ్యాఖ్యాతలు 'కలుగు' ధాతువును చెప్పుకొమ్మందురు. అట్లే చేయుదమన్నను 'కల' అనున దనుబంధమను నర్థ మెట్లువచ్చునో తెలియదు. అయినను 'కల' అను ననుబంధముచె యొప్పుకొనకున్న ముందు గ్రంథము నడువదు.) పుష్=పోష్+కలుగు (కల) అని యుండఁగా.

13. భవతి క్రియాపదానాం త్రివిధానా మించుగాగమః.

(ఉపకృతి, పరిణతి, సంవృతి అను) మూఁడు భేదములుగల మూఁ విధములగు ధాతువులమీఁదను 'ఇంచు (ణిచ్)' అను నాగమము స్వా మునఁ జేరును. పోష్+ఇంచు+ఉండు (ఉన్న); పోష్+ఇంచు+కలుగు (క జయ్+ఇంచు+ఉండు (ఉన్న); కలుగు (కల); భవ్+ఇంచు+ఉండు+కలు

14. ణేశ్చ.

ణిజర్థమునందును [ఇంచు(క్) అనునది] దాగమముగా వచ్చును. పోషిం
చు+ఇంచు, అనియుండ...

15. అనుబన్ధే ప్రార్థనాయాం ణిచి వ్యతిరేకార్థే చ చో పస్స్యాత్.

అనుబన్ధవర్ణములు పరమగునపుడును (అనఁగాఁ బూర్వోక్తములయిన 'ఉన్న, కల' అనునవి పరమైనప్పుడును, ప్రార్థనార్థమందును, ణిచ్చుపరమగు నపుడును, వ్యతిరేకార్థములందును గూడ చకారమునకు పకార మాదేశ మగును: అనుబన్ధములకు: పోషింపు+ఉండు (ఉన్న); కలుగు (కల); ప్రార్థనార్థమున: పోషింపు; ణిజర్థమున: పోషింపు+ఇంచు+ఉండు (ఉన్న); కలుగు (కల); వ్యతిరేకార్థమున: పోషింపు, అని యుండఁగా. (చోః పస్స్యాత్ అనునప్పుడు ఉత్వవిశిష్టమైన) చకారమునకు 'ప' కారము (చోః, ప) ఆదేశ మగునదియు నర్థము చెప్పవచ్చును. అప్పుడు కొన్ని యనిష్టరూపము లేర్ప డును. ముందుగా లక్ష్యము తెలిసియున్నచో సూత్రములోని 'చోః' అనుదానికి చువర్ణమందలి హల్మాత్రమునకని యర్థము చెప్ప వీలులేదు.

16. వ్యతిరేకార్థే భావిని చాత్ స్యాత్.

వ్యతిరేకార్థమునను భవిష్యదర్థమునందును హ్రస్వ అకారము చేరును: వ్యతిరేకార్థమున: పోషింపు+అ=పోషింప; భవిష్యదర్థమున: పోషింపు+అ+కల=పోషింపఁకల, మొద. ('భావిని చ+అత్' అనియుఁ బద చ్ఛేదముఁ జేయవచ్చును. అప్పుడు 'పోషింపఁడు, ము, వు, రు, ముజ్, రు' అను ననిష్టరూపములును సిద్ధించును.)

17. క్త్వా భూతయోః క్రియాన్తే స్యాత్.

క్త్వార్థమునందును భూతార్థమునందును ధాతువుతుది (యుత్తునకు) హ్రస్వ ఇకారము చేరును- క్త్వార్థమున: పోషించు+ఇ=పోషించి, పోషిం పించి; భూతార్థమున: పోషించి-, పోషింపించి-.

18. ప్రథమైకవచనలోపస్తద్ధర్మాతీతయోః క్రియాణాం స్యాత్.

భూతతద్ధర్మార్థములందు క్రియలకు ప్రథమపురుషైకవచనప్రత్యయము లోపించును.

19. వ్యతిరేకార్థే ఌటి లటి ముజ్ స్యాత్.

వ్యతిరేకారమునను ఌట్టు (భవిష్యదర్థము) నందును లట్టు (వ...

త్యతిరేకార్థమునకు పోషింపఁడు; భవిష్యదర్థమున: పోషింప+కలుగుఁడు(కలఁడు); ర్తమానార్థమున ('చరితి క్రియాపదానాం' అను సూత్రమువలన 'చు' చేరఁగా) పోషించుచుండుఁడు, పోషించుచున్నఁడు.

20. స్త్ర్యర్థే పున ర్దుదీ భవతః.

మహత్త్యర్థక క్రియాపదమునకన్ననో వ్యతిరేకార్థమునను, భవిష్యదర్థ ందును, వర్తమానార్థమునను ప్రథమ పురుషైకవచనమున దు, ది, అనునవి చేరును: (వీనిలో 'దు' ఎప్పుడు చేరునో 'ది' యెప్పుడుచేరునో స్పష్టముగా లేదు. కాని, వ్యతిరేకార్థ, భవిష్యదర్థములందు 'దు' వర్ణకమును, వర్తమా ార్థమున 'ది' వర్ణకమును నగునని యెట్లయిన సరిపెట్టుకొనవలసియున్నది)- త్యతిరేకార్థమున 'పోషింపదు' భవిష్యదర్థమున: పోషింప కలుగుదు (కలదు); ర్తమానార్థమున: పోషించుచుండుది; పోషించుచున్నది.

21. అన్యస్మా చ్చాధాతో ర్ధాతుత్వ వివక్షయైవ భవ తీంచుక్.

ధాతువుకాని యితరముమీఁద ధాతుత్వవివక్షచేత ఇంచు (క్) అనున ాగమముగా వచ్చును: పల్లవ+ఇంచు, కరుణ+ఇంచు, మొద. ఇట్టిచోట్ల నత్తు కు సంధి నిత్యమని చెప్పికొనవలెను: పల్లవించు, కరుణించు, మొద.

22. తిర్యగ్జడేషు కర్తృషు బహువచనం చైకవచన మేవ స్యా ద్భూతే ద్ధర్మే చ.

తిర్యగ్వాచకపదములును జడవాచకపదములును వాక్యమున కర్తృ దము లగుచుండఁగా వానితో నన్వయించు క్రియాపదముల భూత తద్ధర్మార్థక ప్రథమపురుష బహువచనరూపము ప్రథమపురుషైకవచన రూపమేయగును: వు (లు) పోషించు (ంచె) ను; చెట్టు (లు) పోషించు (ంచె) ను, మొద.

23. అన్యత్ర వు వీ.

భూతతద్ధర్మార్థములు గాక యితరములగు వ్యతిరేక భవిష్య ద్వర్త మానార్థములందు తిర్యగ్జడవాచక పదములు కర్తలగునపుడు బహువచనమున త్యతిరేకభవిష్యదర్థములందు వు వర్ణకమును వర్తమానార్థమున వి వర్ణక మును జేరును. వ్యతిరేకార్థమున: ఆవులు( చెట్లు) పోషింపవు; భవిష్యదర్థమున: ఆవులు (చెట్లు) పోషింపకలుగు (కల) వు; వర్తమానార్థమున: ఆవులు చెట్లు) పోషించు చుండువి (చున్నవి).

24. స్త్రీవ దేకవచనం తు.

తిర్యగ్జడవాచకపదములు కర్తలగునపు డేకవచనమున స్త్రీ వాచకపద

(చెట్టు) పోషింపదు; భవిష్యదర్థమున: ఆవు(చెట్టు) పోషింప కలుగు (కల)దు; వర్తమానార్థమున; ఆవు ( [illegible]

25. ఉత్వాయుతే [illegible] ప్తమైకవచనానామ్.

(అన్నిక్రియలకు నన్ని యర్థములందును) మధ్యమపురుషైకవచనమున 'వు' వర్ణకమును, ఉత్తమపురుషైకవచనమున 'ను' వర్ణకమును వచ్చును.

26. సర్వేషాం బహువచనే రు ఇతి స్యాత్.

అన్ని ధాతువులకును అన్ని యర్థములందును బహువచనమున 'రు' వర్ణకము వచ్చును.

27. ఉత్తమస్య తు భవే న్ము.

ఉత్తమపురుష బహువచనమునకన్నతో ము వర్ణకము చేరును; అనఁగా రు వర్ణకము ప్రథమ మధ్యమ పురుషములందు మాత్రము వచ్చునని యర్థము.

28. ఏకత్వేఽథ బహుత్వే ముడుజౌ సంప్రార్థనార్థకేషు స్తః

పిమ్మట సంప్రార్థనాద్యర్థములం దేక బహువచనములఁ గ్రమముగా ము, డుజ్ అనునవి చేరును. పోషింపుము, పోషింపుఁడు.

29. దౌ చోర్లుక్ తదర్థే.

తదర్థమందు 'దు' అనునది పరమగుచుండఁగా దాని పూర్వమందుండు 'చు' వర్ణమునకు లోపము కలుగును. ఈ దుగాగమము క్రింది 31-వ సూత్రమున విధింపఁబడినది. ముందు దుగామమును విధించి పిదప నీ లోపమును జెప్పిన బాగుండెడిది.

30. ప్రథమైక స్యైవ ద్భవే చ్చ భూతార్థే.

ప్రథమ పురుషైక వచనమున భూతార్థమందు 'ఎ' (ఏ ?) అనునది వచ్చును కూడ. 'క్త్వాభూతయోః క్రియాన్తస్యేత్' అని యింతకుముందు 'ఇ' త్తును విధించియున్నాఁడు. ప్రస్తుత సూత్రమువలనఁ దక్కిన భూతార్థములందు అనఁగా క్త్వార్థమందును, ప్రథమా బహువచన, మధ్యమోత్తమైక బహువచనములందు ఇత్తువచ్చును; కాని, ప్రథమైకవచనమున ఎ (ఏ ?) త్తు వచ్చునని తెలియుచున్నది. పోషించె (న్).

31. దు, తి, వర్ణకౌ క్రమాత్ స్తః.

దు, తి, అను వర్ణకములు క్రమముగా నగును.— ఏ యర్థములందు ? [illegible]

32. నాద్యస్యాదేగ.

(మొదటిదాని తద్ధర్మార్థముయొక్క) మొదటిదానికి (ప్రథమైకవచనమునకు దు, తి, అను నాగమము) లేదు. పోషించును. బహువచనమున రుగాగమ మున్నదనియే యర్థము : పోషించుదురు.

33. ద్వయోశ్చ భూతార్థే.

భూతార్థమున (ప్రథమ పురుషైక బహువచనముల) రెంటికిని లేదు. పోషించె (న్), పోషించి (రు).

34. బిన్దుపరస్య తకారో దోఽగ స్యాత్.

బిందువుకంటెఁ బరమందున్న యాగము దుక్కునకు తకారమగును. 'పోషించు+దు' అని యుండఁగా 'పా చోర్లు క్తద్ధర్మే' అను సూత్రమువలన 'పోషిం+దు' అని నిలువఁగా నీ సూత్రము వలన 'దు' వర్ణమునకు తకారమువచ్చి 'పోషిం+త్' అని యగును. దువర్ణములోని హల్మాత్రమునకే తకారాదేశమని యనఁబలుఁడనెనుగాని, ముందుగా లక్ష్యము తెలిసియున్నదప్పట్లర్థము చెప్పుట కవకాశములేదు.

35. భూతా దుతాం చేపా మిత్.

భూతార్థముకంటెఁ బరమందున్న (ప్రత్యయముల) యుత్తునకిత్తగును. కనఁగా భూతార్థమున 'ను, ము, వు, రు' అను ప్రత్యయములు 'ని, మి, వి, రి' అగును.

36. లఘ్వేకాక్షరపూర్వ క్రియా న్తిను ప్యయో భవే దిద్వా.

లఘువగు నేకాక్షరము పూర్వమందు గల, అయంతము గాని ధాతువు తుది వర్ణమునకు ఇత్తు వైకల్పికముగా నగును; 'ఘట్' అనునది ధాతువు; దానిలో తుది వర్ణమునకుఁ బూర్వవర్ణ మొక్కటే యున్నది; అది లఘువు; 'ఘట్' ధాతువు 'అయ్' అంతముకాదు; కాఁబట్టి ఘట్+ఇంచు = ఘటించు అనియు, ఘటి+ఇంచు = ఘటియించు అనియు రెండు రూపము లేర్పడున్నవి. 'రంజ్' ధాతువు తుది వర్ణమున కేకాక్షరమే పూర్వమందున్నను అది లఘువుకాదు. కావున, దానిపై నిత్తు చేరదు : రంజించు ; 'కరుణ' అను నామధాతువునకును 'విహార్' అను నుపసర్గముతోఁ గూడిన ధాతువునకును తుదివర్ణమునకుఁ బూర్వాక్షరము లఘువయినను నది యేకాక్షరము కాదు కావున నిత్తురాదు: కరుణించు, విహరించు. 'జయ్' అను ధాతువునకు బూర్వమందున్నది లఘువు నేకాక్షరము నైనను నది అయంతము గావున దానిపై

యోగింపఁబడినది; కావున, నొకప్పుడు ప్రాదియోగమున లఘ్వాకేకాతుర పూర్వ
ముకాని యంత్య వర్ణముగల ధాతువుపై [illegible]
తుదివర్ణ పూర్వమున [illegible]
ఉత్తరి+ఇంచె = ఉత్తర [illegible] రెండు రూపములును గలుగుచున్నవి.

37. తిఙ్మధ్యనామకాస్సన్తి మధ్యమపురుషాశ్చ యే రమాంతాశ్చ.

మధ్యమపురుష ప్రత్యయములును (వు, రు, వి, రి, ము, డుఙ్ రాంత, మాంత క్రియలును (ఉత్తమ బహువచన ము, మి, వర్ణకములు, ప్రథమాబహువచన రు, రి, ప్రత్యయములు), తిఙ్మధ్యమములను పేరు గల వగును. తిఙ్మధ్యమములు కళలని సంజ్ఞాప్రకరణమునఁ జెప్పఁబడినది.

38. చో రాత్మనే పదార్థే గృహ్ణాతా వాగమస్య వేత్యం స్యాత్.

క్రియాఫలము కర్తకు చెందునప్పుడు తెనుఁగునఁ జేరు 'కొను' ధాతువు పరమగుచుండఁగా ఆగమముగా వచ్చిన యించు (కు) నందలి తుది చు వర్ణముపై వైకల్పికముగ హ్రస్వ ఇకారము చేరును: పోషించుకొను, పోషించికొను, మొద.

39. రఞ్జతి ఘుట్యాదీనాం చిన్నోశ్చ స్యాచ్ లా వృషా భవతః.

రఞ్జతి, ఘుటి (రంజ్, ఘుట్) మొదలగు ధాతువులపై జేరు నించుగాగ మమునందలి 'ంచ్' అనుదానికి 'ల్ల' అనున దాదేశముగ వచ్చును: రంజించ్ +ఉ=రంజల్ల్+ఉ=రంజల్లు, ఘుటించ్+ఉ=ఘుటల్ల్+ఉ=ఘుటిల్లు, మొద.

40. [illegible] భవే చ్చ లోపః ణ్యర్థే యో వర్తతే వరే త స్మిన్.

ణిచ్చుపరమగునప్పు డన్నో 'ంచ్' కు 'ల్ల' రాదు: పోషింపించు ('పోషింపిల్లు' అని కాదు); ణ్యర్థమునందువచ్చు ఇంచుగాగమము పరమగు చుండఁగా స్వార్థమున మొదట రంజతి ఘుట్యాదిధాతువులపైఁ జేరిన యించు కునకు లోపము గలుగును: రంజ్(+ఇంచు+స్వార్థము) +ఇంచు (ణ్యర్థము), ఇట్లుండఁగా స్వార్థేంచుకు లోపించి 'రంజించు' అనియే ణ్యర్థమున నిలుచును.

41. పునరాగమః క్రియాణామ్.

ధాతువులకుఁ బైని వివరించిన యాగమములే కాక యింకను ననేకవిధ ములైన యాగమములు (ఇంతకుముందు చెప్పినయర్థములందును చెప్పనియర్థ ములందును వచ్చును.) ఇది 'కాఁపుదల' సూత్రము; ఇది యనుక్త, దురుక్త, అత్యుక్త, పునరుక్త, అన్యథోక్త విషయముల నన్నిటిని సంగ్రహించుట [illegible]

'ఉండు' అన

| పురుషము. | స్వార్థము. ఏక | బహు |
|---|---|---|
| ఉత్తమ | రక్షించుచుండును (న్) | రక్షించుచుండుము |
| | రక్షింపుచుండును (న్) | రక్షింపుచుండుము |
| | రక్షించుపుండును (న్) | రక్షించుపుండుము |
| | రక్షింపుపుండును (న్) | రక్షింపుపుండుము |
| మధ్యమ | రక్షించుచుండువు | రక్షించుచుండురు |
| | రక్షింపుచుండువు | రక్షింపుచుండురు |
| | రక్షించుపుండువు | రక్షించుపుండురు |
| | రక్షింపుపుండువు | రక్షింపుపుండురు |
| ప్రథమ: మహత్ | రక్షించుచుండుఁడు | రక్షించుచుండురు |
| | రక్షింపుచుండుఁడు | రక్షింపుచుండురు |
| | రక్షించుపుండుఁడు | రక్షించుపుండురు |
| | రక్షింపుపుండుఁడు | రక్షింపుపుండురు |
| మహతీ | రక్షించుచుండుది | రక్షించుచుండురు |
| | రక్షింపుచుండుది | రక్షింపుచుండురు |
| | రక్షించుపుండుది | రక్షించుపుండురు |
| | రక్షింపుపుండుది | రక్షింపుపుండురు |
| తిర్యగ్జడ | రక్షించుచుండుది | రక్షించుచుండువి |
| | రక్షింపుచుండుది | రక్షింపుచుండువి |
| | రక్షించుపుండుది | రక్షించుపుండువి |
| | రక్షింపుపుండుది | రక్షింపుపుండువి |

షష్ఠియందు 'కు' వర్ణకము పరమగునపుడే నగాగమము కలుగును: కి, యొక్క, లో, లోపల అనునవి చేరునపుడు 'ని' గాగమమే కలుగును. రామునికి, రాముని (యొక్క), రామునిలో, రాముని లోపల.

26. జమగ కు రనితామ్.

ఇదంతములుకాని పదముల షష్ఠ్యేకబహువచనముల రెంటను కు వర్ణకము వచ్చును. ఇందువలనఁ బై సూత్ర వ్యాఖ్యవలన నేర్పడిన 'రామునికి, శంభునికి', మొదలగురూపములు కలుగవని తెలియుచున్నది. ఈ సూత్రము తత్సమవైకృత పదము లన్నిటిని జెల్లును: రామునకు, శంభునకు, దాతకు, తాతకు మొద.

27. అందు జీపః.

సప్తమ్యేక బహువచనముల రెంటను 'అందు' వర్ణకముచేరును. 'మహతో నితా' అను సూత్రముచేత నిగాగమము : రామునియందు, శంభునియందు, మగనియందు. 'టాది విభక్తా నిర్నైత్యేకే,' 'నుమ్యోతః' అను సూత్రములవలన 'రామునందు, శంభునందు మొద. తక్కినచోట్ల నాగమను లేకుండ దాతయందు, తాతయందు, మాటయందు, చెట్టునందు మొద.

28. సవిధ ర్తినా మిందు.

దగ్గఱగా నున్న (వస్తువులను దెలుపు పదముల) కిందువర్ణకమగును— 'ఇందు' అనునది ప్రత్యయము కాదని యింతకుముందు చెప్పఁబడినది.

29. తోడ సహార్థే టాసః.

తృతీయైక బహువచనముల రెంటను సహార్థమున 'తోడ' వర్ణకము వచ్చును.—తృతీయా విభక్తికి సంస్కృతమునఁగల యనేకార్థములలోసహార్థక మొకటి; ఆ యర్థమున 'తోడ' వర్ణకము వచ్చునని యర్థము. తక్కినయర్థములందు 'చేత' వర్ణకమగునని సూత్రకారుని యభిప్రాయము.— సహార్థమున 'చేత' వర్ణకముచేరుటయుఁ గలదు. కర్తిచేత నటికెను. కర్తితోడనటికెను.— సూత్రకారుఁడు 'తో' వర్ణకమును తృతీయా విభక్తిప్రత్యయముగఁ జెప్పియు దాని యుపయోగమును ప్రత్యేకముగ వివరింపకుండుట యది 'తోడ' యర్థమందే వచ్చునను నభిప్రాయముతో నై యుండును.

30. పట్టీతి తు పఞ్చమీ గుణే హేతౌ.

'పట్టి' యనునదన్నో పంచమియందు గుణము, హేతువు, అనునర్థములందు వచ్చును. జాడ్యముంబట్టి (గుణము) మరచమెక్కెను; జ్ఞానముంబట్టి (హేతువు)మోక్షముకలుగును; మొద. 'పట్టి'వర్ణకము నన్నయకాలమునఁ గాన

రాదని యింతకుముందు దెలుపఁబడినది. 'పఞ్చమీ' అనుటకు 'పఞ్చమ్యాః' అని కాని 'ఙసి నః' అనికాని యనవలసియుండెను.

81. కంటే ఒ న్యారాదాదేః.

'అన్య, ఆరాత్' మొదలగు నర్థములందు 'కంటె' వర్ణకము పంచమ్యర్థమున నేక బహువచనములందు వచ్చును. 'కంటే' అని దీర్ఘము చెప్పుట గణములుసరిపోవుటకు; తెనుఁగు వ్యాకరణమును సంస్కృతమునందును ఛందోబద్ధముగ వ్రాయుటవలన ననర్థమిది. "అన్యారా దితర ర్తే దిక్ఛబ్దాం చూత్తర పదాజాహియుక్తమ్" అని పాణిని సూత్రము:

కృష్ణునికంటె నన్యుఁడు (భిన్నుఁడు, ఇతరుఁడు); వనముకంటెదగ్గఱ (దూరమున); 'ఋతే' అనునర్థమునఁ దెనుఁగునఁ బంచమిరాదు: కష్ణుఁడుతప్ప); గ్రామముకంటెఁబూర్వము: ఫాల్గునము చైత్రముకంటెఁ బూర్వము (కాని) కాయముయొక్క పూర్వము); గ్రామముకంటె వెనుక; గ్రామముకంటె బయట, మొద.

32. లోపల నిర్ధారణోద్భవా షష్ఠీ.

'లోపల' వర్ణకము నిర్ధారణార్థమునఁ బుట్టిన షష్ఠీ(ప్రత్యయము).

సూత్రమున 'ఉద్భవా' యనుట గణముకోసము; నిర్ధారణోద్భవాయాః షష్ఠ్యాః' అనియుండవలెను. 'అందు' వర్ణకమును గూడ నిర్ధారణార్థమున నుపయోగింపవచ్చును; అయినను జింతామణి దానిని సప్తమీప్రత్యయముగఁ దెలుపుచున్నది. 'అందు' అను నర్థమున 'లోపల'వర్ణకము నుపయోగింపవచ్చును; అయినను నది షష్ఠీప్రత్యయముగఁ జెప్పఁబడినది. నిర్ధారణార్థము లేకున్నను నన్నయ 'లో,లోపల'లను వాడియున్నాఁడు. అవి ప్రత్యయములు కావనియు 'అంతర్' అను నవ్యయము నర్థముగల దేశ్యపదములనియు నహోబలుని తలంపు.

33. యొక్క చ శేషే షష్ఠీ.

సంబంధార్థమున 'యొక్క' అనుప్రత్యయము షష్ఠియందువచ్చును. 'యొక్క'కు కావ్యములందుగాని, వ్యవహారమునందుగాని ప్రయోగము లేదని యింతకుముందు చెప్పఁబడినది.

34. విషయనిమిత్తాదిజా తథైవాన్యా.

అట్లే ఇతరమైన 'న' అను సప్తమీ ప్రత్యయమును విషయనిమిత్తాద్యర్థములందు వచ్చును.—ఈ సూత్రమున కహోబలుఁడు "విషయనిమిత్తాద్యర్థజా అన్యా విభక్తిః సప్తమీత్యర్థః, తథైవ తేన ప్రకారేణ ప్రథమాంతత్వలక్షణేన తిష్ఠతీత్యర్థః, ఆదిశబ్దేన సత్యర్థప్రధాన సప్తమీ గ్రాహ్య" అనివ్యాఖ్యా

నము వ్రాసినాఁడు. తక్కినవ్యాఖ్యాతలందఱు నతఁడు చెప్పినరీతినే చెప్పియున్నారు. కాని, 'అన్వ్యా' అనుపదము సప్తమీ ప్రత్యయమగు 'న'వర్ణకమును మాత్రము దెలియఁజేయునని తలంపవచ్చును. ఈ పరిచ్ఛేదమున సూత్రకారుఁ డవలంబించిన సూత్రరచనా విధానక్రమమునుబట్టిచూడ మొదల తత్తద్విభక్తులందువచ్చు ప్రత్యయములను సాముదాయకముగఁజెప్పి, పిదప నాయాప్రత్యయములలో నేవి యేయేయర్థముల నుపయోగపడునో వివరించి యున్నాఁడని బోధపఱచికొనవచ్చును. ఇంతవఱకును నన్నివిభక్తులందలి యన్ని ప్రత్యయములను గూర్చియు సూత్రకారుఁడు తెలిపియున్నాఁడు; ఇఁకమిగిలిన యన్యప్రత్యయము 'న'అనునది. ఇదిగాక యింతవఱకును మహద్వాచ కానిదంతపదములపైఁజేరు ప్రత్యయములను గూర్చియే తెలుపఁబడినది. దీనితరువాతి సూత్రమునుండియుఁ బ్రకరణము మాఱుచున్నది. కావున మహద్వాచక పదములపై 'న' వర్ణక మెప్పుడుచేరు ననునదియే ప్రస్తుత సూత్రవిషయమనుటకుసందేహము లేదు. అది మహద్వాచకపదములపై నెట్లు చేరునో చెప్పనెంచి యవి 'విషయమునన్, నిమిత్తమునన్, కారణమునన్, కృతమునన్,మూలమునన్' మొదలగు నవర్ణకయుత సప్తమ్యంత పదములతోఁ గలసియుండునని యీసూత్రమున సూత్రకారుఁడు వివరించియున్నాఁడు; నీకృతమునఁ (శాసితరి త్వయి) గౌరవాన్వయ మకిల్బిషకీర్తిఁ బ్రకాశితంబగున్ (అర. I. 51); మొద.

35 స్యా దమహతాం విభక్తౌ సోఽప్యుః.

అమహద్వాచ కాదంత (తత్సమ)పదములకు విభక్తి పరమగుచుండఁగాఁ బ్రథమైక వచనమున మువర్ణకముకూడ వచ్చును: ఫలము, వనము, మొద. (ఇందు 'చ'కారము ఛందస్సు కొఱకు.)

36. తదుపరి ముబూ ప్రాంచామ్.

ప్రాచీనుల మతమున (నా మువర్ణకముపై ముఱల) ము, బు, అనునది (చేరును)— ఇందువలన 'ఫలముము, ఫలముబు; వనముము, వనముబు' అనురూపములేర్పడును. ఇట్లుండఁగా 'కవిభల్లబై' రిత్యాదిసూత్రముచేత మొదటిమువర్ణముమీఁది యుత్వము లోపించి 'వనమ్ము, వనమ్బు; ఫలమ్ము, ఫలమ్బు; అనురూపములు కలుగుచున్నవి.

37. సోర్లుగితః.

ఇత్తుకంటెఁబరమైన ప్రథమైకవచన ప్రత్యయమునకుఁ లోపము(కలుగును.) హరి+డుజ్ = హరి; మొద.

38. ఉద్బహుత్వే.

బహువచనమున నిదంతశబ్దముల యిత్తున కుత్తువచ్చును ; హరి+లు =హరు+లు=హరులు మొద.

39. సంబుద్ధౌ నాత్.

సంబోధనమున (18-వ సూత్రమునఁజెప్పఁబడిన) అ (ఆ?)త్తు చేరదు : హరి ! మొద.

40. ఇతాం జసః కి శ్చ.

ఇదంతశబ్దముల షష్ఠ్యేకవచనమున 'కి'వర్ణకముగూడ వచ్చును. హరికి. (ఇందు'చ' కారము ఛందస్పూర్తికొఱకు.)

41. టాదా వితో న నిః స్యాత్.

తృతీయా ద్యేకవచనములందు (19-వ సూత్రమునఁజెప్పఁబడిన) నిగాగమము కలుగదు. 'రామునికి' అనునట్లు 'హరినికి' అని కాదనుట.

42. ఈదన్తా ఇద్వ దేవ కృతహ్రస్వాః.

ఈదన్తశబ్దముల తుదియీత్వము హ్రస్వముచేయఁబడఁగా వానిపై నిదంతశబ్దములకువలె విభక్తిప్రత్యయములు చేరును. నదీ, నది, నదిని, నది చేత, నదులచేత మొద.

43. వికృతౌ క్వచి చ్చ లోపో మోః.

ముువర్ణాంత తత్సమేతరపదముల తుది ముువర్ణమున కొకయెడ లోపము కూడఁ గలుగును: గుఱ్ఱము, 'గుఱ్ఱ' అని నిలువఁగా—

44. దీర్ఘ శ్చాత ఆదిమస్య భవేత్.

మొదటిదగు అత్తునకు దీర్ఘముకూడ కలుగును. ('ఆదిమస్య' అనఁగా 'ము వర్ణాత్పూర్వస్య' అని యర్థముచెప్పికొనవలెను.) గుఱ్ఱ=గుఱ్ఱా;-పూర్వ సూత్రమున 'క్వచిత్' అనుటవలన అన్నిబహువచనములందును షష్ఠీసప్తముల యేకవచనములందును నని గ్రహింపవలెను: గుఱ్ఱాలన్, గుఱ్ఱాలచేతన్, గుఱ్ఱాలకొఱకున్, గుఱ్ఱాలవలనన్, గుఱ్ఱానకున్, గుఱ్ఱాలకున్, గుఱ్ఱానన్, గుఱ్ఱాలయందును మొద.

45. నర్వ త్రోదోతో ర్వ ర్ఛవతి మువత్.

ఉదంత, ఓదంత శబ్దములకు ము వచ్చునట్లే (అనఁగా నమహత్తులపైఁ బ్రథమైకవచనమున) వువర్ణమెల్లయెడల (అనఁగా మహదమహత్తులరెంటను) వు వర్ణమువచ్చును. శంభువు; తరువు; గోవు మొద.

46. డుజ్ మహత్వదానాం వా.

(ఉదంత తత్సమ పదములపై) డుజ్జు వైకల్పికముగ (వచ్చును.) శంభుఁడు, శంభువు; గురుఁడు, గురువు మొద. ఓదంత తత్సమ మహద్వాచక పదములు లేవు.

47. డు జతౌ తు న ప్లుత స్స్య త్సంబుద్ధా వి త్యూతాం విదుః కేచిత్.

ఉదంతశబ్దములకు సంబోధన ప్రథమైకవచనమునఁ జెప్పఁబడిన డుజ్, అత్, అను ప్రత్యయములు చేరవనియు, (వానితుది యుత్వమునకు) ప్లుతము వచ్చుననియుఁ గొందఱు తెలిసికొందురు. అనఁగా, శంభుఁడా, తరువా, అను నిట్టి రూపము లుండవనియు, శంభూ 3, తరూ 3, మొదలగు రూపములు కలుగుననియుఁ గొందఱు చెప్పుదు రని యభిప్రాయము. ఈ మతము చింతామణికర్త కిష్టమో యిష్టముకాదో విశదము కాలేదు.

48. దీర్ఘాణాం హ్రస్వః స్యాత్.

(సంస్కృతదీర్ఘాంతశబ్దములు తత్సమము లగునపుడు వాని తుది) దీర్ఘమునకు హ్రస్వమగును: మాలా, మాల; నదీ, నది; యవాగూః, యవాగువు, మొద.

49. న చ దేశ్యపదే.

దేశ్యపదము తుది దీర్ఘమునకు మాత్రము హ్రస్వము కలుగదు. (సూత్రమున 'చ' కు బదులు 'తు' ఉండవలెను. నన్నయకాలమున దీర్ఘాంతములగు దేశ్యపదముల కుదాహరణములు కానరాలేదు.

50. న చైకవర్ణేఽపి.

సంస్కృతమందలి దీర్ఘాంతములయి యేకవర్ణము గలిగిన పదముల తుది దీర్ఘమునకును హ్రస్వము కలుగదు: స్త్రీ, శ్రీ, మొద.

51. డా బవిధాత్రాదే రుః.

'విధాతృ' మొదలగుశబ్దములఁదప్పఁ దక్కిన ఋదంత శబ్దముల తుది ఋత్తునకు 'డాప్' (ఆ) వచ్చును: దాతృ, దాతా; పితృ, పితా; మాతృ, మాతా; స్వసృ, స్వసా; రక్షితృ, రక్షితా. మొద. దీర్ఘమునకు హ్రస్వము కలిగి 'దాత, పిత, మాత, స్వస, రక్షిత' మొదలగు రూపము లేర్పడును.

52. తస్య చ వా.

దానికి (విధాత్రాది గణమునకు) డాప్పు (ఆ) వైకల్పికముగ (వచ్చును.) విధాతృఁడు, విధాత; మొద. ('తస్య' అనునది 'అవిధాత్రాదేః' అనుదానితో నన్వయించుచున్నను బ్రకరణమును బట్టి 'విధాత్రాదేః' అని క్లిష్టాన్వయమును జేసికొనవలెను.)

53. తావుభౌ రమేశ సమౌ.

ఆ రెండును (వరుసగా) రమా, ఈశ, అను శబ్దములను బోలియుం డును. ('తావుభౌ' అనునప్పుడు అవిధాత్రాదులు, విధాత్రాదులు నని స్పష్ట మగు నర్థము వచ్చుచున్నను 'డాబంతరూపములు, అడాబంతరూపములునని క్లిష్టార్థమును జేసికొనవలెను.) సంస్కృతమున ఋదంతములై తత్సమము లగునప్పుడు డా బంతములయిన రూపములు రమా శబ్దమువంటివియు, అడా బంతములు ఈశ శబ్దమువంటివనియుఁ దెలియవలెను. దాత; విధాత, విధాతృ ఁడు, ఈ కార్యములు దీర్ఘాణాం హ్రస్వః స్యాత్, మహత స్సోర్డు జనితో భవే త్వంసి' అను సూత్రములచేతనే సిద్ధించుచుండుటచేతఁ బ్రస్తుతసూత్ర మనావశ్యక మగుచున్నది.

54. క్వచి దమహతో௨పి డుజ్ స్యాత్.

ఒకయెడ నమహత్తులకంటెఁ గూడ డుజ్జు వచ్చును; పులియఁడు, బూచిగాఁడు, నీలఁడు, జన్నఁడు. (ఇవి జంతువులపేళ్లు.) ఇట్టిపేళ్లు నన్నయకాల మున నున్నందు కుదాహరణములు కానరాలేదు.

55. ఏకాదే రమహతాం చ డా వున్న.

ఏకాదిగణమునందలి పదములకును నమహద్వాచక పదములకును డువర్ణకము పరమగుచుండఁగా, దాని ప్రాతిపదికమందలి తుది యుత్తున కుత్తురాదు. ఒకఁడు, అతఁడు, ఇతఁడు, గండఁడు, మనుమఁడు, మగఁడు, మొదలయిన వేకాదులు; కత్తళఁడు, కైరఁడు, జన్నఁడు, నీలఁడు మొదలగున వమహద్వాచకములు. 'ఒకఁడు'ను నన్నయ మహద్వాచకముగ వాడలేదు.

56. స్త్రీత్వ బహుత్వే సురాదే రసమాసే.

సురాది గణమందలి పదములు సమాస గతములు కానప్పుడు, స్త్రీత్వ మును బొంది (అనఁగా స్త్రీసమములై) బహుత్వమం దుండును. (చింతామణి కర్త నేరక యార్యాగీతులలో సూత్రరచన నారంభించినాఁడు. 'సుర' శబ్దము నకుమాత్ర మసమాసమందు స్త్రీత్వ బహుత్వములు కలుగునని చెప్పుట యాతని యభిప్రాయము. గణము కుదురక 'సుర' శబ్దమును 'నాది' శబ్దము తోఁ గలిపి సమాసము చేసినాఁడు. కాని' ఆది' శబ్దమువలన గ్రహింపఁ దగిన సుర శబ్దమును బోలు పదములు లేవు—'స్త్రీత్వ బహుత్వే' అని సూత్రమునం దుండవలెను; కాని యిట్లున్నచో గణభంగము కలుగును. 'స్త్రీత్వ బహుత్వ సమాసే' అని గణముల కొఱకు వ్రాసిన నర్థమే యుండదు. వ్యాఖ్యాత లెట్లో పాట్లుపడి 'సురలు', భూసురుఁడు, భూసురులు అను రూప

ములను సాధించుకొనవలెను. యోధ, శుంఠ, మొదలగువాని నీ సూత్రమున కుదాహరణములుగఁ గొంద ఱిచ్చియున్నారు. అట్లుచేయుట తగదు.

57. లు గ్భవే త్కుశాదే ర్మోః.

కుశ, మొదలగు పదము లమహత్తులుగనుక వానికిఁ బ్రథమైక వచన ము-వర్ణము రావలెను. కాని, వాని కీసూత్రమువలన మువర్ణము లోపించుచున్నది: కుశలు, దర్భలు; కుశాదులను సురాదులఁజేర్చిన నీ సూత్ర మనావశ్యక మగును; కాని, సూత్రకర్త యట్లు చేయక కుశాదులకుఁ బ్రత్యేక సూత్రమును గల్పించి యున్నాఁడు; అందుచేత 'స్త్రీత్వ బహుత్వే' అను సమాస మీా సూత్రములోని కనువర్తింపదు. కావున నేకవచనమున 'కుశ, దర్భ' అను నేకవచన రూపములును సిద్ధించుచున్నవి. ఇది వికల్పమును విధించు సూత్రముకాదు. కావున కుశము, దర్భము, అను రూపము లుండఁగూడదు. కాని, శబ్దరత్నాకరమున 'కుశము' అను రూపము చేరినది. 'కుశ' అను పదము 1. స్త్రీ లింగము, ఆకారాంతము = త్రాఁడు; దీనికి 'కుశ' యను తత్సమరూపము మువర్ణ లోపముచేఁ గలుగలేదు; దీర్ఘమునకు హ్రస్వము కలిగినది. 2. నపుంసకలింగము, అకారాంతము=నీళ్లు; ఈ యర్థమున మువర్ణమును బహువచన లువర్ణమును జేరి 'కుశములు' అను రూపమేర్పడవలెను. 3. పుంలింగము, అదంతము, అమహద్వాచకము = కుశద్వీపము, త్రాఁడు, దర్భ; దీనికి 'కుశము' అను తత్సమ రూపము గలుగును. ప్రస్తుత సూత్రము 'దర్భ' యను నర్థముగల కుశ శబ్దమునకు మాత్రము వర్తించునని సూత్రకారుని యభిప్రాయమై యుండును. దానికి కుశ, కుశము, కుశలు, కుశములు, అను రూపము లేక బహువచనములందు కలుగుచున్నవి. కాని, యీా సూత్రము, కుశము, కుశములు, అను రూపములను నిషేధించుచున్నది. అహోబలుఁడు కుశాది గణమున హంస, కుశ, దర్భ, దూత, చరిత, చరిత్ర, భ్రమ, అభిలాష, విజృంభణ, అక్షత, పులక, అలక, తరంగ, వేగ, కుండ, పనస, స్ఫురణ, ఘోష మొదలగువానిని జేర్చినాఁడు. వీనిలోఁ 'దర్భ' శబ్దమునకు నిత్యముగ ములోపము గలుగును: దర్భ, దర్భలు. (దర్భము, దర్భములు అను రూపములులేవు.) దూత శబ్దము నీ గణములో నేల చేర్చవలెనో తెలియదు; ఇది జనశబ్దమువంటిది కావున, కుశాది గణములో జేరునని యహోబలుఁడు చెప్పుటయందలి యభిప్రాయ మేమో తెలియదు. 'జన' అని ప్రథమైకవచన రూపముగాని, 'జనలు' అను ప్రథమాబహువచన రూపముగాని, 'దూతము' అను రూపముగాని యుండునని యాతని యభిప్రాయమా? సూత్రమున 'మోర్లుక్' అని యున్నదిగాని, 'సోర్లుక్' అని లేదు. అతఁడు 'వేగ, కుండ'లను గూడ నీ గణమునఁ జేర్చుట ప్రమాదమే. 'వేగ, వేగలు,'

అనురూపము లుండవు, 'కుండము' అను నర్థమున 'కుండ' అను తత్సమపద ముండదు. వైకృతపదమగు 'కుండ' కైనను 'కుండము' అను నర్థములేదు. ఈ సూత్రమువలన కుశాదుల మువర్ణ లోపము నిత్యమని తెలియుచుండఁగా నహోబలుఁడు 'సోర్లుక్' అనక 'మోర్లుక్' అనుట యీ విధి యనిత్యమని వింత వ్యాఖ్యానమును జేసియున్నాఁడు. అట్టి యభిప్రాయము గలవాఁడగుట చేతనే యాతఁడు కుశాది గణమున నిత్య వికల్ప ము-లోపము గల వివిధ పదములను గుశాది గణమునఁ జేర్చియున్నాఁడు.

58. షష్ఠీ విశేషణానాం ప్రథమా స్యాత్.

షష్ఠీ విభక్తి ప్రత్యయముతోఁ గూడిన పదములకు విశేషణములయిన పదములు ప్రథమావిభక్తి యందుండును: ఉదా. అనేక పురాణ పుణ్య కథా కథన దక్షుండు వ్యాసశిష్యుండైన రోమహర్షణునకుఁ బుత్త్రుండ (ఆది. I. 28); నన్నయ యీ రీతిగా 'అయిన', 'అగు' మొదలగు ధాతుజ విశేష ములతో వ్యవహితములయినప్పుడే షష్ఠీవిశేషణములకుఁ బ్రథమా విభక్తిని వాడియున్నాఁడు. 'అనఘ చరితుఁడు రఘునందనునకుఁ బ్రణతి' అనునిట్టి ప్రయోగముల నాతఁడు చేయలేదు. ప్రథమయగుట షష్ఠీ విశేషణములకే కాక యితరవిభక్తులయందున్న పదముల విశేషణములకును గలుగును: సుగుణాభి రాముఁడు రామునితో (-వలన, -కంటె, -యందు.) మొద.

59. వ్యవహితాశ్చ సర్వే స్యుః.

ప్రథమ యందున్న యన్ని విశేషణములకును వాని విశేష్యముల కును మధ్యమున మఱికొన్ని పదములును రావచ్చును ఉదా. రాముఁ గొలిచెద సుగుణాభిరామున్; ఈ సూత్రము ప్రయోజనము తెలియదు; సంస్కృత మునను విశేష్య తద్విశేషణములు వ్యవహితములుగ నుండవచ్చును గదా.

60. వికృతౌ చ స్త్రీలింగాః స్త్రీలింగక సర్వనామధేయాః స్యుః.

ఆంధ్ర భాషయందును తత్సమ 'స్త్రీవాచక' స్త్రీలింగ శబ్దముల విశే షణములును స్త్రీలింగమునందే యుండును; సీత భక్తవత్సల; ద్రౌపది మహా పతివ్రత; మొద. క్రింది సూత్రమున నమహతీవాచక పదములను పేర్కొ నుటచే నీ సూత్రము మహతీవాచకపదములకే వర్తించును. తత్సమ స్త్రీ వాచక పదములకే కాక, తత్సమేతర స్త్రీవాచక పదముల తత్సమ విశేషణ ములును స్త్రీలింగమునందే యుండును. 'పాలమున్నీటి కూఁతురు పద్మహస్త.

61. ఉభయవిధ మమహతీనామ్.

మహతీవాచకములు కాని, తత్సమామహద్వాచకపదముల తత్సమ విశేషణములు స్త్రీ లింగములుగఁ గాని, నపుంసకలింగములుగ గాని, యుండ

వచ్చును: పద్మలత మనోహర (-ము); (వైకృత పదములు మహతీతరా మహద్వాచకము లగునపుడు మాత్రము వాని తత్సమ విశేషణములు నపుంసక లింగమందే యుండును.)—'అమహతీనామ్' అనుటవలన మహద్వాచకములును, మహతీతరామహద్వాచకములును నని గ్రహింపవలసి యున్నను సూత్రకారుని యాశయమున మహద్వాచక పదముల కీసూత్రముతోఁ బ్రసక్తిలేదు. మహతీత రామహద్వాచకములను మాత్ర మీ సూత్రము వలన గ్రహింపవలెను.

62. నియత స్త్రీ ప్రత్యయస్తు సర్వాసామ్.

కాని, అన్ని స్త్రీలింగ శబ్దములకును వాని వానికి నియతములైన స్త్రీ ప్రత్యయములే చేరును. అనఁగా నాయా శబ్దములకు సంస్కృత వ్యాకరణమున స్త్రీలింగ శబ్దములకు విహితములగు టాప్, జీప్, జీష్, మొదలయిన ప్రత్యయములు చేరును. అవి దీర్ఘములయినచోఁ దత్సమము లగునపుడు హ్రస్వములగును: సీత సర్వాభీష్ట ప్రదాత్రి; రామకృప సంతాపహారిణి; మొద.

63. ఇతరత్ర చ ద్వితీయా.

అజంత సంస్కృతనపుంసకలింగ శబ్దములై మహన్మహతీవాచకములగు పదములకును అజంత పుంలింగములై మహతీతరామహద్వాచకములైన పదములకును, వాని సంస్కృత ద్వితీయైకవచన (తుల్య)రూపములు ప్రథమైకవచనమున నిలుచును: మిత్రము, కలత్రము, వృక్షము. "స్యా దమహతాం విభక్తౌ సోఽశ్చ ము"అను సూత్రమువలన'మిత్రము'మొదలగు మహద్వాచక పదములు సిద్ధింపవు. 'దార' శబ్ద మమహద్వాచకమగుటచేత, నాసూత్రము వలన 'దారము' అను ననిష్టరూపము సిద్ధించును. 'ఇతరత్ర చ' అనుటవలన నింతవఱకు ననుక్తములగు పదములకు ప్రథమైకవచన రూపసిద్ధి యీసూత్రము వలనఁ గలుగుచున్నది. సూత్రమందలి 'చ' కారమువలన 'దార' శబ్దమునకు 'ము'వర్ణము కలుగదని యూహింపవలెను.

(సూత్రమందలి 'ఇతరత్ర' అనుదానికి 'ద్వితీయేతర విభక్తియందు' అని యర్థముచేసి, ద్వితీయేతర విభక్త్యర్థమున ద్వితీయా విభక్తి వచ్చునని యహోబలుఁడు వ్యాఖ్యానించి, 'హేతిని నఱకెన్,' 'హేతిచేత నఱకెన్'; 'అయోధ్య నున్నవాఁడు, అయోధ్యయందున్నవాఁడు' అను నుదాహరణముల నిచ్చియున్నాఁడు. ఈ కార్యమేకాక తక్కినయిట్టి యితరకార్యములును,ననఁగా నొకవిభక్త్యర్థమున మఱియొకవిభక్తివచ్చుట 'అన్యస్యాఃక్వచి ద్భవేద్వాన్యా' అను హలంతపరిచ్ఛేదమందలి సూత్రముచే సిద్ధించుచున్నది. కావున, నీ

సూత్రమున నొక్క ద్వితీయకుఁ బ్రత్యేకముగ విధిని గల్పించు టనావశ్యక ముగఁ దోఁచుచున్నది.)

64. తస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్.

జడవాచకపదములకుఁ గలిగిన యీ ద్వితీయారూపమునకే ప్రథమా విభక్తిత్వముగూడ గలుగును: రాజు రథమెక్కెను (రథము నెక్కెను); వృక్షమునాటెను (వృక్షమును నాటెను; మొదలయినవి.) ఇట్టి కార్యము మువర్ణాంతములగు మహన్మహతీవాచకపదములకుఁ గలుగదు: మిత్రమునడిగెను (ఈ యర్థమున 'మిత్ర మడిగెను' అని యనఁగూడదు.); కలత్రము నడిగెను. (ఈయర్థమున 'కలత్రమడిగెను' అని యనఁగూడదు.) కావుననే జడపదములకు మాత్ర మీకార్యము కలుగునని సూత్రకారుఁడు వచించెను.

65. స్తో ఉ వావౌ రైనావోః.

రై, నౌ, అను పదములకుఁ బ్రథమైకవచనమున వాని తుది యచ్చులకు వరుసగా ఓ, అవ, అనున వాదేశములుగ వచ్చును: రో, నావ.

66. స్త్రీవ ద్గ్లాః.

'గ్లాః' అనుశబ్దము తత్సమమగునపుడు స్త్రీలింగశబ్దములకువలెనే కార్యమగును. 'అనుతాం స్త్రియాం' అను వక్ష్యమాణ సూత్రముచే 'గ్లా' శబ్దముపైఁ బ్రథమైకవచనమున విభక్తిప్రత్యయములోపించి 'గ్లా'అనిమాత్రము నిలుచును.

67. భూదివో స్తు జౌ య త్తత్.

భూ, దివ్, అను శబ్దములకు సంస్కృతమునఁగల సప్తమ్యేకవచనరూపమే తెనుఁగునఁ బ్రథమైకవచనరూప మగును: భువి, దివి.—'భువి, దివి' అను రూపములను నన్నయ ప్రథమైకవచనమున వాడినట్లు గానరాదు: భువిన్, దివిన్, అని సప్తమ్యర్థమునందు మాత్ర మవి ప్రయోగింపఁబడునేమో. 'హృద్, సరస్' శబ్దములును భూ, దివ్, శబ్దములవంటివే: హృది. సరసి; ఇవి సప్తమ్యంతరూపములు; వీనిని దొల్లింటికవులు సప్తమియందే ప్రయోగించియున్నను రానురానవి ప్రథమయందును వాడఁబడఁజొచ్చినవి.

* ఇంతవఱకును సూత్రరచనను తత్సమపదరూపనిష్పత్తి ప్రధానముగా సాగించి యిఁకఁ దత్సమేతరరూపములఁగూర్చి చింతామణికర్త వివరించుచున్నాఁడు.

68. వాఽయిరవు ర్వక్రతమా.

అయి, అవు, అనునవి వైకల్పికముగ వక్రతమము (ఐ,ఔ)లగును.

'వాఽయ్యావూ వకౌ్రతమాఽ' అని సూత్రముండవలెనేమో. సూత్రమునకు సంస్కృతశబ్దమునందలి ఐ, ఔ, లు గలపదములు తద్భవము లగునప్పుడు వాని ఐ, ఔ, లు 'అయి, అవు' అని వరుసగ నవుననికూడ నర్థము చెప్పవచ్చును. అయిన=ఐన; మయిల=మైల; సయిదోడు=సైదోడు; కయిత=కైత; అవును=ఔను; తవుడు=తౌడు; సవురు = సౌరు;—కైకేయి = కయికేయి, కయిక; వ్యవహారమునఁ దత్సమైకారౌకారములను అయి, అవు లుగ నుచ్చరించుట సర్వసాధారణము: సయింధవుడు, చయిత్రము, తయిలము; సవుఖ్యము, కవుటిల్యము, గవురవము, దవుర్బల్యము, పవురుషము, మవునము; మొద.

69. ఉర్ద్వన్ద్వే రః.

ఋకారాంతశబ్దముల తుది ఋకారమునకు ద్వంద్వసమాసమందు తెనుఁగున రేఫ మాదేశమగును. ఈసూత్రము "క్షత్త్రియవంశ్యులై భువిని గావఁగఁ బుట్టిన ... మాంధాత్ర రఘుక్షితీశులు" అను నన్నయరచిత పద్యమందలి 'మాంధాత్ర' అను రూపమును సాధించుటకుఁబుట్టినది. కాని, 'మాంధాత్ర రఘుక్షితీశులు' అనుపాఠము తప్పయియుండును. 'మాంధాతృరఘుక్షితీశులు' అనుపాఠమే చాల వ్రాఁతప్రతులయందు కాన్పించుచున్నది, 'మంధాతృ' అనుపాఠము సంయుతాసంయుత ప్రాసమున కుదాహరణమగును. అట్టిప్రాసము ద్రావిడచ్ఛందస్సంప్రదాయమునకు విరుద్ధముకాదు. ఈసూత్రము సరియైనదైనయెడల 'మాత్రపితలు, మాత్రపిత్రలు, మాతాపిత్రలు, పిత్రపుత్త్రలు, భ్రాత్రస్వస్రలు, మొదలగు నెన్నో భాషాసంప్రదాయ విరుద్ధ రూపము లేర్పడును.

70. క్వచి ద్గకారో వః.

ఒక్కయెడ గకారము వకారమగును. వకారము గకారమగునని కూడ నీసూత్రమున కర్థముచేయవచ్చును. వైశాఖ, వేసఁగి, వేసవి (ఇది గకారమువకారమగుట కుదాహరణము); ప్రవాళము, పవడము, పగడము (ఇది వకారముగకారమగుట కుదాహరణము.) తెనుఁగున 'ఇరువురు, ముగ్వురు, నలువురు, ఏవురు, ఆర్వురు, ఏడ్వురు, అను'వ' కారముతోడి రూపములు ప్రాచీనములు; ఇరుగురు, ముగ్గురు, నలుగురు, ఏఁగురు (ఐఁదుగురు), ఆఱుగురు, ఏడుగురు, అను గకారముతోడి వర్వాచీనములు.

71. న్వన్తా న్నామ్నః కుజ్ నో ర్బహువచనే.

నువర్ణాంత వైకృత శబ్దములకు బహువచన (లువర్ణ)ము పరమగునపు డా 'ను'వర్ణమునకు బిందుపూర్వక కువర్ణమాదేశమగును: కొలను, కొలఁకులు; వలను, వలఁకులు; మొద.

72. కుత్ర చి న్నులోప శ్చ.

(ఆ నువర్ణాంతశబ్దములలోఁ గొన్నిటికి బహువచన లువర్ణము పరమగునపుడా) నువర్ణమునకు లోపము కూడఁగలుగును ; మీను, మీలు ; పేను, పేలు; చేను, చేలు; మొద. సూత్రమునందలి 'చ' కారమువలన 'మీఁకులు, పేఁకులు, చేఁకులు' అను ననిష్టరూపములును నేర్పడుచున్నవి కాని, సూత్రకారుఁ డట్టి రూపము లుండునని యభిప్రాయపడి యుండఁడు.

73. సలలో ర్బిందుయుతో డు ర్వా లులయోః.

లు వర్ణముతోఁగూడిన లకారమునకు (అనఁగా పదములమీఁదనుండు -ల్లు అను సంయుక్తాక్షరమునకు (బహువచన సంజ్ఞలగు) లుల లు పరమగుచుండఁగా 'ల్లు' కు బిందువుతోఁ గూడిన డువర్ణము వచ్చును. ఇల్లు + లు = ఇండు + లు = ఇండులు, మొదలయినవి. 'కుత్రచిత్' అనునది పూర్వసూత్రమునుండి యనువర్తించుచున్నది గనుక 'రెల్లు' = గడ్డి; కల్లు = మద్యము; పల్లు = పల్లము మొదలగు పదముల కీకార్యము కలుగదు. ఇది వైకల్పికత్వమును దెలుపు సూత్ర మనుకొని కొందఱు ఇల్లులు, విల్లులు మొదలగు రూపములు నున్న వందురు, అట్టి రూపములు వ్యవహారమున లేవు. 'గోకులమిల్లులు' మొదలగు కవి ప్రయోగములు కృతకములు. సూత్రమునందు 'బిందు' వను దానికిఁ బూర్ణబిందువని యర్థము చెప్పవలెను.

74. ఉల్లు గపి తయోర్ల పరతః.

(ఆ బహువచన లు ల వర్ణములు) పరమగుచుండఁగా (ఆదేశముగా వచ్చిన డు వర్ణము మీఁది యుత్తునకు లోపముగూడఁ గలుగును: విండులు, విండ్లు; ఇండులు, ఇండ్లు; మొద.

75. నిత్యం దారాదేశ్చ స్యాల్లో ర్లులయో రురా చ తత్రస్తః.

దారార్థకమగు ఆలు శబ్దము యొక్కయు నట్టి యితర శబ్దములయుఁ దుదినుండు లు వర్ణమునకును (పై రెండు సూత్రములందు చెప్పఁబడిన కార్యము, అనఁగా బిందుయుత డు వర్ణము బహువచన లు ల వర్ణములు పరమగునపుడు కలుగుటయు, నాడు వర్ణముమీఁది యుత్తునకు లోపము గూడఁ గలుగుటయు) నిత్యముగ సంభవించును. ఇది గాక (యీ శబ్దముల విషయమున) బహువచన లు, ల వర్ణకములకు రు, ర, అనునవియు క్రమముగ నాదేశము లగును. ఆలు, ఆండ్రు, ఆండ్రన్; కోడలు, కోడండ్రు, కోడండ్రన్ మొద. సూత్రమందు 'నిత్యం' అనుటవలన 'ఆండురు, కోడండురు' మొదలగు రూపము లుండవనియు, 'చ' అనుటవలన 'ఆండ్లు, ఆండ్లన్' అను

రూపములు నుండుననియు నర్థము చెప్పుట కవకాశ మున్నది. ఈ రెండు విధములగు రూపములును నన్నయ ప్రయోగములకు వ్యతిరేకములు.

76. రో లః.

రేఫమునకు లకారమగును. 71-వ సూత్రములోని 'బహువచనే' అను పదమిం దనువర్తించుచున్నది. రేఫ మనఁగా పదము తుదినుండు రేఫ మనియే యర్థము చేసికొనవలెను; ఇదిగాక రేఫ శకటరేఫముల రెంటిని గ్రహింపవలెను. ఏఱు + లు = ఏలు + లు = ఏలులు; గోరు+లు = గోలు+లు = గోలులు; మొద. ఈ సూత్రమునకు 'లకారము రేఫమగును' అని కూడ నర్థము చేయవచ్చునుగాని యట్లు చేయుట సూత్రకారుని యుద్దేశమై యుండదు.

77. డలటా ముదితాం తస్య చ వా లుక్.

ఉదంత, ఇదంత డ, ల, ట, లంతమందుగల పదముల తుది ఉత్తు, ఇత్తులకును, వానియొక్క (అనఁగా పై సూత్రమున కాదేశముగా వచ్చిన లకారము మీఁది ఉత్తునకును వైకల్పికముగా లోపము గలుగును, త్రాడు+లు = త్రాడ్ + లు = త్రాడ్లు, త్రాడులు; తడి + లు = తడ్ + లు = తడ్లు, తడులు; చాలు + లు = చాల్ + లు = చాల్లు, చాలులు; అంబలి + లు = అంబల్ + లు = అంబల్లు, అంబలులు; పాటు + లు = పాట్ + లు = పాట్లు, పాటులు; మేటి + లు=మేట్ + లు = మేట్లు, మేటులు; గోరు+లు = గోలు+లు = గోల్+లు = గోల్లు, గోలులు, గోరులు, గోర్లు; ఏఱు+లు = ఏలు+లు= ఏల్+లు=ఏల్లు, ఏలులు, ఏఱులు, ఏఱ్లు.

'డలటేభ్య ఉదితాం' అనినచో 'ఉదిత్తు' లకు వైకల్పికలోపము; 'డలటా ముదితాం' అనినచో 'ఉదిత్తులను గలిగిన డలటలకు గాని, డలటలతోఁ గూడిన యు దిత్తులకుఁగాని వైకల్పికలోపము; డలటలకు లోపమును సూత్రకారుఁ డుద్దేశించియుండఁడు. ఇట్లే 'తస్య' అను పదమువలన వైకల్పిక లోపము రేఫమునకో, దాని కాదేశమున వచ్చిన లకారమునకో, వానిపై వచ్చు అ, ఇ, ఉ, లను నచ్చులకో స్పష్టము కాలేదు; రేఫము మీఁది యుత్వమునకని వ్యాఖ్యాత లెట్లో సరిపెట్టుకొనుచున్నారు.

చింతామణియందు బహువచనమున డ, ల, ల కాదేశముగా నలఘు లకారము వచ్చునని చెప్పఁబడియుండలేదు. 'రోలః' అను సూత్రమువలనఁ గలిగిన లకార మలఘులకార మనికూడ నందులేదు. కాఁబట్టి త్రాళ్లు, తళ్లు, చాళ్లు, అంబళ్లు, ఏళ్లు, గోళ్లు, మొదలగు నలఘు లకారముతోఁ గూడిన బహువచన రూపములు చింతామణివలన సిద్ధింపవు. రలడల కభేదము తెనుఁగున

నన్నియెడలను వర్తింపదు; ఎట్టి చోట్ల నభేదమో చింతామణి యెచ్చటను చెప్పలేదు. 'లోళః' అను ప్రాకృత వ్యాకరణ సూత్రము తెనుఁగున నెంత వఱకు వర్తించునో చింతామణి వివరింపలేదు. 'రోలః' అను సూత్ర మన్ని పదాంత 'రు' వర్ణములకును వర్తింపదు. చూ. అకరు, అగరు, అవురు, తగరు, అలరు, మొదలగు మూఁడు వర్ణములు గల పదములు; ఆరు, కారు, కోరు, కారు, గారు, ఆఱు, చూఱు, చేరు, తీరు, తేరు, దూరు, పోరు, సేరు, మొదలగు దీర్ఘపూర్వ రువర్ణాంతపదములు.

78. సలో లోశ్చ.

లకారముతోఁగూడిన లు వర్ణమునకును (బహువచన లు, ల వర్ణకములు పరమగునపుడు లోపముగూడ వైకల్పికముగ నగును.) విల్లు+లు = విల్+లు = విల్లు (లకారమున కలఘుత్వము నూహించినయెడల 'విళ్లు'; ఇట్లే మళ్లు, కళ్లు, ఇళ్లు, చెళ్లు, పళ్లు; మద్యార్థక కల్లు శబ్దమునందును, నిమ్నార్థక పల్లు శబ్దము మీఁదను నీ కార్యము కలుగదు. 'విళ్లు' వంటి రూపములు నన్నయకాల మున లేవు; కాని, చింతామణి దానిని సాధించుచున్నది. వ్యాఖ్యాత లీసూత్ర మునకు 'పందిళ్వేసి, అంబళ్లాచి' అను నుదాహరణముల నిచ్చుట పొరబాటు. ప్రకరణమును బట్టి బహువచనమునఁ గొన్ని పదములందు గలుగు మార్పు లను గూర్చి యీ సూత్రమునకుఁ బూర్వపరములం దున్న సూత్రములు తెలుపుచున్నవి; కావున నీ సూత్రమును నట్టి కార్యమునే వివరించుచున్న దన వలెను.

"రోలో డలటా ముదితాం, తస్య చ వా లుక్ సలో లోశ్చ" అను నది యార్యాగీతి యర్థభాగమునకుఁ గొఱవడియున్నది.

79. ఔపవిభక్తిక లీనా మిల్లు గృహుళం తథైవ డుశ్చ స్యాత్.

ఔపవిభక్తిక లివర్ణాంత శబ్దముల తుది యిత్తునకు బహువచన లు, ల వర్ణములు పరమగునపుడు బహుళముగా లోపము కలుగును; అట్లే డు వర్ణ మును గలుగును: కొడవలి+లు = కొడవల్+లు = కొడవల్లు (-ళ్లు?); కొడవడు+లు = కొడవడులు, కొడవడ్లు; కొడవలులు; ఇట్లే, గొడ్లల్లు (-ళ్లు?), గొడ్డడులు, గొడ్డడ్లు, గొడ్డలులు, మొద. 'డు' వర్ణమన బిందుపూర్వక డు వర్ణకమని వ్యాఖ్యాతలు వ్రాయుటకు చింతామణి యందాధారము లేదు.

80. అపి సంయుక్తసమాప్తౌ భూయోఽంఽతే లుగ్ ప్రదృశ్యతే నామ్నామ్.

బహువచన లు వర్ణము పూర్వవర్ణముతో సంయుక్తమయి బహువచన రూపము నమాప్తమయినను నా సంయుక్తవర్ణముపై మరల లు వర్ణము కనఁబడుచున్నది. ఉదా. విండ్లు, విండ్లులు; ఆంధ్రు, ఆంధ్రులు (-రు?); త్రాడ్లు,

త్రాడ్లులు; తడ్లు, తడ్లులు; చాల్లు, చాల్లులు; అంబల్లు, అంబల్లులు; పాట్లు, పాట్లులు; మేట్లు; మేట్లులు; గోల్లు, గోల్లులు; గోర్లు, గోర్లులు; ఏల్లు, ఏల్లులు; ఏఱ్లు, ఏఱ్లులు; విల్లు (-ళ్లు), విల్లు(-ళ్లు?) లు; కొడవల్లు (-ళ్లు?) లు, కొడవడ్లు (లు), మొద.

81. కేషాంచి దుదన్తానాం నేతి విభక్తౌ వునో లుక్ స్యాత్.

కొన్ని యుదంతశబ్దములకు 'న' అను సప్తమీవిభక్తి ప్రత్యయము పరమగునపుడు శబ్దము తుదియుత్వమునకును ప్రత్యయమందలి తొలి నకారపుం బొల్లునకును లోపము కలుగును; చోటు+నన్ అనియుండఁగా ఉత్వనకారములులోపించి 'చోట్+అన్' అని నిలిచి, 'చోటన్' అనురూప మేర్పడును. ఇట్లే, మీఁదన్, క్రిందన్, ఊరన్, మొద. 'కొన్ని' యనుటవలన నీకార్య మాపవిభక్తిక శబ్దములమీఁదనే కలుగును; కొంగునన్, వీపునన్, మొదలగుచోట్లం గలుగదు.

ప్రక్క, దారి, మొదలగు నదంత ఇదంత శబ్దములమీఁద 'న' వర్ణకము చేరునప్పుడును అన్, ఇన్, అనువానికిని లోపము గలుగును. వింటన్, కంటన్, వాఁకిటన్, మొదలగుచోట్లఁ గొన్ని విశేషకార్యములు గలుగును. ఇట్టివానిని చింతామణి వివరింపలేదు.

82. ఔపవిభక్తికనామ్నా మత్వం స్యా త్సప్తమీ తృతీయార్థే.

ఔపవిభక్తిక శబ్దములకు సప్తమీ తృతీయార్థములందు అత్వము వచ్చును. ('సప్తమీ తృతీయార్థయోః' అని సూత్రమున నుండవలెనేమో.) అత్వమువచ్చుననిన దేనిపై వచ్చునో, యను విషయముగాని, దేనికాదేశముగ వచ్చునో యను విషయముగాని విశదము కాలేదు. 'చేయి+అ' అని అత్వమాగమముగా వచ్చుననియో, లేదా, ఇత్ స్థానమున నత్వము వచ్చుననియో లేదా 'చేతి' లోని యిత్ స్థానమున వచ్చుననియో, చింతామణి యభిప్రాయమేమియు స్పష్టముగా లేదు. ప్రథమేతర విభక్తి ప్రాతిపదికము తుదియచ్చు స్థానమున సప్తమీ తృతీయార్థములందు ఏకవచనమున అత్తు చేరుననియు, ఆకార్యము వైకల్పికమనియు, తృతీయా సప్తమీ విభక్తిప్రత్యయములు ద్రుతప్రకృతికములుగావున నీ యత్తును ద్రుతప్రకృతికమే యనియు నెట్లయిన నీ సూత్రమున కర్థము చెప్పికొనవలెను.

83. అనుతాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీసమస్య చ సులోపః.

స్త్రీలింగమందు తత్సమానుదంతశబ్దములకును, సమస్తమైన (దేశ్య) స్త్రీ సమశబ్దములకును, ప్రథమైకవచనప్రత్యయములగు 'డు, ము, వు' లు లోపించును (అనఁగా చేరవు.) ఉదా. సీత, గౌరి; తాత, అవ్వ; మాట; మఱఁది

వెలఁది, కోఁతి, బంటు, ఆలు, పోతు, మొద. సులోపముగలుగు 'దార' మొద లగు పదము లింకనుననేక విధములైన వున్నవి. వానిని చింతామణి వివరింప లేదు. సులోపము గలుగుటయే స్త్రీ సమత్వమునకు లక్షణ మగునపుడు, స్త్రీ సమములకు సులోపము కలుగును అనిచెప్పుట నిర్వచనపద్ధతి కాదు.

84. ఏదన్తతా చ నామ్నా మన్యతరస్యా మియాన్తానామ్.

'ఇయ' అనున దంతమందుగల పదములకు ఆ 'ఇయ' కు మాఱుగ 'ఏ' అనునది గూడ వైకల్పికముగ వచ్చును: కన్నియ, కన్నె; వన్నియ, వన్నె; గోనియ, గోనె; మొద. 'ఇయము' అంతమందుగల పదముల 'ఇయము' నకు మాఱుగ 'ఎము' వచ్చుననియు చెప్పికొనవచ్చును; కడియము, కడెము; ముత్తియము, ముత్తెము; మొద:— సూత్రమునందు 'ఎదన్తతాచ' అనియుండ వలెను; కాని, యట్లున్నచో గణభంగము కలుగును. గణభంగము కలుగునని తప్పు టుపదేశముఁ జేయుట తగదుగదా.

85. వికృతౌ సర్వే శబ్దాః క్లీబసమాః స్త్రీసమా శ్చ; నాఽన్యే స్యుః.

తత్సమేతరాంధ్రపదము లన్నియు నపుంసకలింగ సమములును స్త్రీ సమములునై యుండును; ఇతరములు లేవు. నపుంసకలింగసమము లనఁగా 'ము, వు' వర్ణకములు ప్రథమైకవచనమునఁ జేరు శబ్దములు; వేసము; అరదము, పుట్టువు. మొద. స్త్రీసమము లనఁగాఁ బ్రథమైక వచనప్రత్యయములు చేర నివి: మాట, కోట, సొగసు, మఱఁది మొద. ఇతరములు లేవనఁగా పుం సమ ములు లేవని తేలుచున్నది. కాని, మగఁడు, మనుమఁడు, అల్లుఁడు, మొదలగు నవి కానవచ్చుచున్నవి. వ్యాఖ్యాతలు వీని నేకాదిగణములోఁ జేర్చుకొనవలె నను చున్నారు. అట్లు చేర్చినంత మాత్రమున వాని పుం సమత్వము పోదుగదా.

86. క్లీబసమా అమహద్వత్.

నపుంసక సమశబ్దములు మహద్వాచకములవలె నుండును. చింతామణి యందీ మహద్వాచక పదములకు విధించిన విధులే క్లీబసమములకును వర్తించు నని యర్థము.

87. స్త్రీవ్య త్సుః స్త్రీసమాః

వైకృతములగు స్త్రీ సమములు తత్సమములగు స్త్రీ లింగశబ్దముల వలె నుండును. అనగాఁ జింతామణియందు స్త్రీలింగశబ్దములకు విధింపఁబడిన విధులు స్త్రీ సమములకును వర్తించు నని యర్థము.

88. సమా స్తు సమాః.

తత్సమములు వాని ప్రకృతులకుఁ గల లింగములనే కలిగియుండును.

ఇది యజంత పరిచ్ఛేదము.

శ్రీః

# ఆంధ్రశబ్దచింతామణౌ

## హలన్త పరిచ్ఛేదః

1. ప్రథమైకవచనతుల్యం సర్వత్ర హలన్త మగుణవత్ప్రభృతి.

గుణవర్ణములోఁ జేరని హలంతపదము తత్సమమగునపు డెల్లయెడలను ప్రథమావిభక్తియందుఁ దాని(సంస్కృత) ప్రథమైకవచన రూపమును బోలి యుండును; వాక్, మరుత్, రాట్ మొదలయినవి.

2. గుణవర్ణో ద్వితీయైకవచనతుల్యో భవే ద్వికృతౌ.

ఆంధ్రమున గుణవర్ణమందలి పదములు తత్సమము లగునపుడు ప్రథమైకవచనమున సంస్కృతమందలి యా పదముల ద్వితీయైకవచనరూపములను బోలియుండును: గుణవంతమ్, మతిమంతమ్, విద్వాంసమ్, మొదలయినవి.

3. ద్విత్వోత్వే సర్వహలాం హ్రస్వాత్.

హ్రస్వాచ్చుకంటెఁ బరమందున్న సమస్తహల్లులకును ద్విత్వమును ఉత్వమును (వచ్చును.) ఉదా. మరుత్తు, ద్విట్టు మొదలయినవి.

4. ద్విత్వంతు దీర్ఘతో బహుళమ్.

దీర్ఘాచ్చుకంటెఁ బరమందుండు హల్లులకు ద్విత్వము బహుళముగా నగును; (ఉత్వముతప్పక వచ్చును) ఉదా: వాక్కు, వాకు:— కాని, రాటు, విరాటు, అను నిట్టి రూపములు గలుగవు.

5. అగుణవతాం సర్వాహలాం సోర్లోపః.

గుణవర్ణములోఁ జేరని సర్వహలంతశబ్దములమీఁదను బ్రథమైక వచన ప్రత్యయము లోపించును: ఉదా. రాట్, రాట్టు; 'రాటుఁడు' అని కాదు.

6. గుణవతాం డుమూ ప్రాగ్వత్.

గుణవర్ణములోఁ జేరిన పదములకు అజంతశబ్దములకువలె 'డు, ము,' అను వర్ణకములు గలుగును: హనుమంతుఁడు, బలవంతము; మొదలయినవి.

. ఆత్మన ఇమనంతానాం డా వా.

ఆత్మన్ శబ్దమునకును ఇమనిజంత శబ్దములకును 'డా' ప్రత్యయము వికల్పముగా నగును. 'డా' అనుదానిలో 'డ' కార మిత్తుగావున ప్రత్యయము 'ఆ' అనునది. డిత్తనుటవలన 'ఆత్మన్, గరిమన్, లఘిమన్' మొదలగు వానిలోని తుది 'అన్' లోపించి, దానిస్థానమున 'ఆ' చేరును. కావున, ఆత్మా, గరిమా, లఘిమా' మొదలగురూపము లేర్పడును.'దీర్ఘాణాం హ్రస్వః స్యాత్' అనుసూత్రమువలన 'ఆత్మ, గరిమ, లఘిమ' అను తత్సమ ప్రథమైక వచన రూపములు కలుగును. సూత్రము ఇంక 'డా' చేరుటవైకల్పికమని చెప్పుటచేత 'ఆత్మన్, గరిమన్, లఘిమన్' అను రూపము లట్లే మిగులును; ఆ రూపము లకుం దత్సమత్వమునం బ్రథమైకవచనరూపము లేమగునో చింతామణి తెలుపలేదు: 'ద్విత్వో్వాత్వే' అను సూత్రమువలన 'ఆత్మన్ను, గరిమన్ను, లఘిమన్ను' మొదలగు ననిష్టరూపము లేర్పడుచున్నవి. అట్టిరూపము లేర్పడుట చింతామణికర్త యాశయముకాదు. 'ఆత్మ, గరిమ, లఘిమ' మొదలగు రూపములతోంబాటు 'ఆత్మము, ఆత్ముఁడు, గరిమము, లఘిమము' మొదలగు రూపములును గలుగునని తెలుపుటయే యాతనియుద్దేశము. ఆ రూపకల్పనమునకు 'డా వా' యని చెప్పుటవలనం బ్రయోజనములేదు. 'ఆత్మము' మొదలగు రూపములు గలుగుటకు ముందు 'డా' నిత్యముగవచ్చి తీరవలెను. అట్లు వచ్చిన రూపము వైకల్పికముగ స్త్రీ సమమగునని వేఱే చెప్పవలసియుండును.

8. డు స్స్యా త్సదా రాజ్ఞః.

రాజన్ శబ్దమునకు పై 'డు' అను ప్రత్యయము నిత్యముగా వచ్చును. 'డు' అనుదానిలో 'డ' కార మిత్సంజ్ఞ గలది గావునం జేరునట్టి ప్రత్యయము 'ఉ' అనునది. అది చేరునప్పుడు 'రాజన్' శబ్దములోని తుది 'అన్' లోపించి తత్సమ ప్రథమైక వచనమున 'రాజు' అను రూప మేర్పడును.

9. సాన్తా దపయశః ప్రభృతేః స్లోపః.

పయోగణమునకుం జెందని సంస్కృత సకారాంత పదములు దత్సమములగు నప్పుడు వానితుది సకారము వైకల్పికముగ లోపించును. అట్లు లోపించినరూపము ప్రాతిపదికము కాంగా దానిపై డు, ము, వు, ప్రత్యయములు చేరును. మనము, యశము, తేజము, మొదలగునవి. ఇది వైకల్పికత్వమును విధించు సూత్రముగం గాన్పించుచున్నది. కావున 'ద్విత్వో్వాత్వే, అను సూత్రమువలన 'మనస్సు, యశస్సు, తేజస్సు' అను రూపములును గలుగును. వీనిలోం గొన్నిటితుది ద్విత్వాక్షరములలో నొకటి లోపించును: 'శిరసు,

మనను; మొద. పయః ప్రభృతుల తుది సకారమునకు లోపము గలుగదు. పయస్సు, వయస్సు, విహాయస్సు, మొద.

10. అన్యేషాం చ వా లు గంతస్య.

సకారాంత వ్యతిరిక్త హలంతపదముల తుది హల్లునకును లోపము వైకల్పికముగ నగును: జగత్తు, జగము.

·11. ప్రాకృతభవ సంస్కృతభవ సంస్కృతవత్ ప్రాకృతభవ వికృతి భవాః.

ప్రాకృతభవముల్తై యాంధ్రభాషయందు వెలసినశబ్దములు సంస్కృత సమములు సంస్కృతభవములు, దేశ్యములునగు ప్రాకృత భాషాశబ్దములను బోలియుండును.—ఇంతవఱకును సంస్కృతసమ ప్రాకృతసమాంధ్ర శబ్దముల రూపనిష్పత్తిని దెలిపి చింతామణికర్త యీ సూత్రమున నాంధ్రమందలి ప్రాకృతభవశబ్దములను గూర్చి తెలిపియున్నాఁడు.

12. వ్యతిరిక్తా భూయాంసః.

1. ప్రాకృతభాషాశబ్దములకు (వర్ణలోప, వర్ణాగమ, వర్ణాదేశ, వర్ణవ్యత్యయాదులచే) భిన్నములగు ప్రాకృతభవములును (నాంధ్రభాషయందు) అనేకములుగలవు. —లేదా. 2. (ఇంతకుముం దాంధ్రమందలి సంస్కృతసమ, ప్రాకృతసమ, ప్రాకృతభవములను గూర్చి తెలుపఁబడి యుండుటచేత) నింకను మిగిలిన (సంస్కృతభవ) శబ్దము లనేకములును (నాంధ్రభాషయందు గలవు).

13. వ్యతిరిక్తా సంప్రదాయతో వేద్యాః.

అట్టి వ్యతిరిక్తముల్తైన ప్రాకృతభవశబ్దములుగాని, సంస్కృతభవ శబ్దములుగాని (వ్యవహార)సంప్రదాయమువలనఁ దెలిసికొనఁ దగినవి. (ఇట్లు చెప్పి సూత్రకారుఁడు సంస్కృత ప్రాకృతముల కత్యంతభిన్నము లగు కొన్నిశబ్దములనుగూర్చి కొంత వివరింపఁబూని తెనుఁగునందలి 'సర్వనామము' లను గూర్చి తెలుపఁబోవుచున్నాఁడు.)

14. దేశ్యా దస్మ ద్యుష్మచ్ఛబ్దా త్సుజసో ర్నుమూ వురూ చ స్తః.

దేశ్యములయిన అస్మత్, యుష్మత్, అను (నర్థములుగల) శబ్దముల కంటె ప్రథమైక బహువచనములందు (క్రమముగా) ను, ము; వు,రు, అను నవి వచ్చును.— సంస్కృతమున 'అస్మత్' అనిన 'మావలన' ననియుఁ యుష్మద్, అనిన 'మీవలన' ననియుఁ బంచమ్యర్థములు గలుగును. అది ప్రాతిపదికములుగా నిలుచునేని 'నా','నీ,మా, మీ' అనునర్థములను బొందును. వాని ప్రథమైకవచనరూపము లీ సూత్రమున నుద్దిష్టములయినయెడల 'అహమ్' 'త్వమ్'

అను నర్థములను గ్రహింపవలెను. ఈ మూఁడర్థములలోను బంచమ్యర్థకరూపములు సూత్రకారుఁ డుద్దేశించినవై యుండవు. ఇఁక దేశ్యాస్మద్ యుష్మచ్ఛబ్దములు 'నా, నీ' యనునవి కాని, ఏ(నే)ను, ఈ(నీ)వు, అనునవి కాని కావలెను. సూత్రకారుఁడు సాధింపవలసిన రూపములు ప్రథమైక వచన రూపములగు 'ఏ(నే)ను, ఈ (నీ) వు' అనునవి కావున సూత్రమందలి దేశ్యాస్మద్యుష్మచ్ఛబ్దములకు 'నా, నీ' అనియే అర్థము చెప్పవలెను. 'నా, నీ' అను పదములు ప్రాతిపదికము లని ముందుగ తెలిసియుండినఁ గాని యీ సూత్రమునకును ముందుసూత్రములకును నర్థమును వివరించుట కష్టము. 'నా, నీ' పదము లస్మద్యుష్మ దర్థకములని యెచ్చటను జింతామణియందు చెప్పఁబడి యుండలేదు. ప్రస్తుతసూత్రమువలన నాను, నాము; నీవు, నీరు; అను ప్రథమైక బహువచన రూపములు క్రమముగా దేశ్యా ద్యుష్మచ్ఛబ్దముల కేర్పడు చున్నవి.

15. న్ను మ్మూౢ హ్రస్వశ్చాదే రమి శసి చ.

ద్వితీయైకవచనమున 'న్ను' అనునదియు, ద్వితీయా బహువచనమున 'మ్ము' అనునదియు 'నా, నీ' లపైఁ జేరును; అట్లు చేరునప్పుడు 'నా, నీ' లకు హ్రస్వము గలుగును; ఇందువలన 'నన్ను, నమ్ము; నిన్ను, నిమ్ము' అనురూపము లేర్పడుచున్నవి. (సూత్రమునాదిని 'న్ను' అని యెట్లుచ్చరింపవలెనో తెలియకున్నది. వాక్యాదిని భిన్నవర్ణ సంయోగముగల సంయుక్తాక్షరముల నుచ్చరింపవచ్చునుగాని, ద్విత్వాక్షరముల నుచ్చరింప వీలులేదుగదా.)

16. అన్యతర లుక్చ యుక్తస్య.

ఈ 'న్ను, మ్ము' లను సంయుక్తాక్షరములలో నొక (హల్లు) లోపించుటయుఁ గలదు. (లుక్ అనునది హల్లునకే వర్తించునుగాని యచ్చునకుఁ గాదని యనుకొనవలెను.) ఇందువలన 'నను, నము; నిను, నిము'; అను రూపము లేర్పడుచున్నవి.

17. కి ర్ఙ జమః.

షష్ఠ్యేక బహువచనములందు వీనిపై 'కి' వర్ణకము చేరదు ('కు' వర్ణకము చేరునని యభిప్రాయము. 'జమః కు రనితామ్' అను సూత్రమువలన నిదంతములపై 'కు' చేరదనుటచే 'కి' చేరునని తెలియుచున్నది. కావున 'నీ' అనుదానిపై 'కి' చేరి 'నీకి' అను రూపమేర్పడదనియు, 'నీకు' అనియే యేర్పడు ననియు నీసూత్రము నభిప్రాయ మయియుండును. 'అనితామ్' అనుటవలన హ్రస్వ ఇకారమునే గ్రహింపవలసి యుండుటచేతను, 'ఈ' కారమనిత్తే కావునను బ్రస్తుతసూత్ర మనావశ్యకమనియే చెప్పవలెను.

18. ప్రథమాయా మే దస్మదః.

'అస్మద్' అను సంస్కృత శబ్దముస్థానమునఁ దెనుఁగునఁ బ్రథమైక బహువచనములందు దీర్ఘమయిన ఏకారము నిలుచును: ఇందువలన 'ఏను, ఏము' అను ప్రథమారూపము లేర్పడుచున్నవి. లేదా. 'నా' అనుదానిలోని 'ఆ' కారమున కేత్వము కలిగిన దనుకొన్నయెడల నేను, నేము, అను రూపము లేర్పడును.

19. ఏతయో ర్బహుత్వే మః.

ఈ సూత్రమునకు రెండు విధములుగ నర్థము చెప్పవచ్చును. (1) ఆ రెండింటిలో (అనఁగా ప్రథమైకబహువచన రూపములలో) బహువచనరూపమునవచ్చిన 'ఏత్' అనుదానికి మకారము చేరును. (అది పూర్వమందు చేరునా, పరమందుచేరునా యను విషయ మీ సూత్రమువలనఁ దెలియదు; పూర్వమందేయని యనుకొందము.) ఇందువలన 'మేము' అను రూప మేర్పడుచున్నది. (2) ఆ రెండింటికిని (అనఁగా అస్మద్, యుష్మద్, అను శబ్దములకు) బహుత్వమున (నన్నివిభక్తులందును) 'మ' కారము వచ్చును. మకార మాగమాక్షర మనుకొన్నయెడల 'ఏము' శబ్దమునుండి 'మేము' అను రూపము కలుగును. ఆదేశముగావచ్చిన దనుకొన్నయెడల 'నేము' అను దానిలోని నకారమునకు మకార మాదేశమైనదని చెప్పవలెను. కాని, మీరు అను రూపనిష్పత్తికది 'న' కారమున కాదేశముగ వచ్చినదని యనుకొనవలెను. ఇట్లే తక్కిన విభక్తులయందును నాయారూపముల నూహించుకొనవలెను.

అస్మచ్ఛబ్దము.

| | ఏక. | బహు. |
|---|---|---|
| ప్ర. | ఏను, నేను | ఏము, నేము, మేము. |
| ద్వి. | నన్ను | మమ్ము |
| తృ. | నా చేత (మొద.) | మా చేత (మొద.) |
| చ. | నా కొఱకు (కై) | మా కొఱకు (కై) |
| పం. | నా వలన (మొద.) | మా వలన (మొద.) |
| ష. | నా (కు మొద.) | మా (కు మొద.) |
| స. | నా యందు | మా యందు |

యుష్మచ్ఛబ్దము.

| | ఏక. | బహు. |
|---|---|---|
| ప్ర. | నీవు | మీరు |
| ద్వి. | నిన్ను | మిమ్ము |
| తృ. | నీ చేత (మొద.) | మీ చేత (మొద.) |
| చ. | నీ కొఱకు (కై) | మీ కొఱకు (కై) |
| పం. | నీ వలన (మొద.) | మీ వలన (మొద.) |
| ష. | నీ (కు మొద.) | మీ (కు మొద.) |
| స. | నీ యందు | మీ యందు |

చింతామణిప్రకార మేర్పడిన పై రూపములలో 'నేను' అనుదానిని నన్నయ వాడలేదు. ఆతని కాలమున కింకను 'ఏను' అనురూపమే కాని, 'నేను' అను రూపము కలుగలేదని తోఁచుచున్నవి. 'ఈవు, ఈరు, ఈరలు, మీరలు' అను రూపములు నన్నయ భారతమునఁ గానవచ్చుచున్నది. వానికిఁ జింతామణియందు గతి కానరాదు.

20. హ్రస్వే టాదౌ నమవాన్ ద్వయవ ద్వచనద్వయేఽన్యయో రాత్మా.

ఆత్మార్థక దేశ్యసర్వనామమగు 'తా' అనుదానికి తృతీయాదివిభక్తులందు హ్రస్వము కలుగఁగా నా హ్రస్వ 'త' వర్ణముపై నేకవచనమున 'న' వర్ణమును, బహువచనమున 'మ' వర్ణమును చేరి, 'తన, తమ' అను రూపము లేర్పడును. ఆ యా విభక్తి ప్రత్యయము లా రూపములపై జేరును. తక్కిన విభక్తులందు, అనఁగా ప్రథమా ద్వితీయా విభక్తులందు దాని రూపము లస్మద్యుష్మచ్ఛబ్దములకువలె గలుఁగును: తాను, తాము; తన్ను, తమ్ము, ఈవిధి తుదియక్షరముల విషయముననే ప్రవర్తించును; అస్మచ్ఛబ్దమునకు విధించిన యాద్యక్షరమునకు గలుగు మార్పులు 'తా' శబ్దమునకు రావు. 'తమరు' అను రూపము చింతామణివలన సిద్ధింపదు.

21. భూయ ఉభయార్థవాచీ యఃకశ్చి ద్భవతి నిత్య బహువచనః.

మరల నస్మద్యుష్మదర్థముల రెంటిని దెలుపు నొకానొకటి (సర్వనామము) ఉన్నది. అది నిత్యబహువచనము: మన.

22. తస్య జసో ము శసో లసి.

దానికి ప్రథమాబహువచనమున 'ము' వర్ణమును, ద్వితీయా బహువచనమున 'ల' వర్ణమును గలుగును: మనము, మనల (న్).

23. ప్రాగ్వత్సర్వం భిసాదికేఽన్యత్ర.

దాని తృతీయావిభక్తులందలి బహువచనము అస్మద్యుష్మచ్ఛబ్ద ములకువలె నుండును. మనచేత, మనకొఱకు, మనవలన, మనకు, మనయందు.

24. కవిభల్లటైరిహ క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యాహుః.
ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తాదయోఽపి కథ్యన్తే.

క్రియలలోను నామపదములలోను గల ఉత్తునకు లోపము కవిభల్ల టులచేతఁ గోరఁబడుచున్నది. వికృతి (యగు నాంధ్రభాషలో) ప్రథమైకవచన మాత్రమందు నకారము మొదలగున వంతమందుగల పదములును జెప్పఁ బడుచున్నవి.

'కవి భల్లటులు' అనువారు ప్రాచీన వ్యాకరణాచార్యులని యహో బలుఁడు చెప్పుచున్నాఁడు. ఇందువలన నాంధ్రశబ్ద చింతామణికిఁ బూర్వమున నాంధ్రవ్యాకరణము లున్నవని తెలియుచున్నది; కాని, యీ కవిభల్లటు లెవరో యేకాలపువారో యెట్టి వ్యాకరణములను రచించిరో యించుకయుఁ దెలియదు. ఈ 'భల్లట' అను పురుష సంజ్ఞావాచక పదము 'మమ్మట, లొల్లట' మొదలగు కాశ్మీర సంస్కృతకవుల పేళ్లను బోలియున్నది. తెనుఁగువారి కిట్టి పేళ్లింతవఱకును గానరాలేదు. 'భల్లట' శబ్దము శ్రేష్ఠవాచక మగునా? అగు నేని 'కవిశ్రేష్ఠులచేఁ గోరఁబడుచున్నది' అను వాక్యమువలనఁ జింతా మణికిఁ బూర్వ మాంధ్రకవి 'శ్రేష్ఠు' లుండెడివారని తేలుచున్నది.

'క్రియలలోను నామపదములలోను ఉత్తునకు లోపము' అనఁగా నా లోప మాయాపదముల ఆదియందున్న యుత్తునకో మధ్యమందున్న ఉత్తునకో, యంతమందున్న ఉత్తునకో స్పష్టము కాలేదు. ఆదియందున్న యుత్తున కయి నచో 'పురువు, ప్రువ్వు; కురుడు (కన్న.) క్రుడ్డు, గ్రుడ్డు' మొదలగున వుదా హరణములగును; మధ్యమమందున్న యుత్తునకన్నచో అపుడు, అప్డు, నేరుచు, నేర్చు, మొదలగున వుదాహరణము లగును. ఇట్టివానిలోఁ గొన్ని 'శత్రర్థే తూత శ్చో నోః' 'పోశ్చ తదాద్యర్థవాచకే షూతః' 'ప్రథమా వైభక్తి క మోః' అని సంధిపరిచ్ఛేదమునఁ జెప్పఁబడియున్నవి. ఇట్టి చోట్లనే యుల్లో పము చింతామణికర్త కిష్టమైనను 'కవిభల్లటులు' ఇతరస్థలముల యందును నాలోపమున కిష్టపడుచున్నారని యర్థము తేలుచున్నది. ఉల్లోపము పదముల యంత్యోత్తున కన్నచో 'చేయుచున్నాను, చేయుచున్నాము; చేయుదును, చేయుదుము; చేయఁగలను, చేయగలము; చేయఁబడుదును, చేయఁబడుదుము; చేయను, చేయము; చేయుచున్నావు, చేయుచున్నారు; చేయుదువు, చేయు దురు; చేయఁగలవు, చేయఁగలరు; చేయఁబడుదువు, చేయఁబడుదురు; చేయవు,

చేయరు; చేయుచున్నాఁడు, చేయుచున్నారు; చేయును, చేయుదురు; చేయఁగలఁడు, చేయఁగలరు; చేయఁబడును, చేయఁబడుదురు; చేయఁడు, చేయరు —అను నిట్టి క్రియాపదముల తుది యుత్తు లోపించినచో చేయుదున్, చేయఁగలన్, చేయన్; చేయున్, చేయఁబడున్' మొదలగు కావ్యస్థ రూపము లేర్పడును. అహోబలాదులు 'రు' వర్ణకాంత క్రియాపదముల తుది రు వర్ణము నుత్తునకు లోపము నూహించి 'చూడర్జనులు, వత్తుర్ఘనులు, ఎట్లు సహింతుర్' అను నుదాహరణముల నిచ్చియున్నారు. ఇట్టివి కొన్ని కవిప్రయుక్తములు. వ్యవహారమున నీ లోపము మఱికొన్ని క్రియలయందును గలుగుచున్నది. 'చేస్తు(యుచు) న్నాన్ (-మ్, వ్, -ర్) మొదలయిన పలుకుబడులు లోకమున నిత్యమును వినఁబడుచున్నవి. ఇట్టి వ్యావహారిక రూపములకు గతి కల్పించుటకును నీ సూత్రము పుట్టియుండునేమో. 'వస్తు (చ్చుచు) న్నాడ్' వంటి పలుకుబడి తెనుఁగుదేశమున నేమూలనైన వ్యవహారమున నుండకపోదు; ఉండకున్న కవిభల్లటు లిట్లు సూత్రింతురా? కవి భల్లటుల కాలమున నిట్టిరూపములు కావ్యములందును నుండెడివేమో! ఇట్టి దేశ్యభాషాప్రవాహిని కొన్నాళ్లు కాలగర్భమున నంతర్వాహిని యై నిలిచి, యిపుడు మరల పైకుబుకుచున్నదేమో!

క్రియలయం దెట్లో నామములందును తుది యుత్తునకుఁ గొన్నియెడల లోపము గలుగును; అట్టివి ప్రథమైకవచనమందు మాత్రము కానవచ్చుచున్నవని 'ఉల్లోప ఇష్యతే హ్యేషు ప్రథమైకవచన మాత్రే' అని యన్వయించినచో నర్థము కాఁగలదు. ప్రథమైకవచన మనుదానికి 'క్రియలయందు ప్రథమపురుషైకవచన' మనియు 'నామములందు ప్రథమావిభక్త్యేకవచన' మనియు నర్థము చెప్పినయెడల 'చేయుచున్నాఁడ్, చేసెన్, చేయన్, చేయఁగలఁడ్, చేయఁడ్' మొదలగు క్రియారూపములును, 'వాఁడ్, రాముఁడ్, శంభుఁడ్, చెల్లెల్, చోట్, పేర్, ఆవ్, గోవ్' మొదలగు నామపద రూపములును సిద్ధించును. కాని, 'ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాంతాదయోఽపి కథ్యన్తే' అని యన్వయము చేసిన యెడల ఆ నకారములుకాని యితరము లెవ్వియో స్పష్టము కాలేదు. కావున వానిని ప్రయోగములనుబట్టి తెలిసికొనవలెను. ను, లు, రు వర్ణములు నాంతాది గణమునఁ జేరునేమో; మేను, మేన్; తేలు, తేల్; పలుకులు, పలుకుల్; పేరు, పేర్; పలువురు, పలువుర్; మొద. 'నాంతాదయః' అనునప్పుడాదిశబ్దముచే 'కన్ను, చన్ను, విన్ను, విల్లు, కల్లు, పల్లు' మొదలగు ద్విత్వాక్షరము లంతమందుగల శబ్దములనుగూడ గ్రహింపవలెను: కన్దోయి, చన్గవ, విల్కాఁడు, కల్పెంట, పల్దోముపుల్ల; మొద.

25. ఇదమ దసేతద్; యత్తచ్ఛబ్దా శ్శబ్దాన్తరాన్వయే బహుళమ్.
హ్రస్వం ప్రపద్య దీర్ఘా ద్విత్వ ముపర్యక్షరస్య జనయన్తి.

ఇదమ్, అదస్, ఏతద్ అనువాని యర్థముగల 'ఈ' అనునదియు, యచ్ఛబ్దార్థముగల ఏ అనునదియు, తచ్ఛబ్దార్థముగల 'ఆ' అనునదియు, దీర్ఘములు; ఇవి యితర శబ్దముతో నన్వయించి కలిసియున్నప్పుడు బహుళముగా హ్రస్వమును బొందుచు మీఁది యక్షరమునకు (హల్లునకు) ద్విత్వమును గలిగించును. ఆ కాలము, అక్కాలము; ఈ చెఱువు, ఇచ్చెఱువు; ఏ పట్టణము, ఎప్పట్టణము; మొదలయినవి. బహుళమనుటవలన (i) వానిపై నచ్చుపరమగునపు డాగమముగా వచ్చిన యకారమునకు ద్విత్వము గలుగును: అయ్యది, ఇయ్యూర్యరు, ఎయ్యశ్వము; మొద. (ii) శ, ష, స, హ, ర, ఱ, ఋ, లు పరమగునపు డీకార్యము గలుగదు. ఆ శివుఁడు, ఈ షణ్ముఖుఁడు, ఏ సేవ, ఆ హరి, ఆ రాముఁడు, ఈ ఱంపము, ఏ ఋషి; మొద. (iii) ఖ, ఛ, ఠ, ఫ, ఘ, ఢ; లు పరమగునపుడు కొన్నియెడల నీకార్యము గలుగదు; ఆఖని, ఈ ఛత్త్రము ఏ ఠవర; ఆ ఘోటకము, ఈ ఢంక మొద. (iv) అగ్గుఱ్ఱము, ఇగ్గోడ, మొదలగు రూపములు మృగ్యములు. (v) సంయుక్తాక్షరము పరమగునపు డీకార్యము కొన్నియెడల గలుగదు: ఆ క్షణము, ఈ జ్ఞానము, ఏత్సరువు; కాని, కొన్నియెడలఁ గలుగునేమోః అప్ప్రిలు, అమ్మ్లేచ్ఛులు, అగ్గ్రహణము మొద.

26. దిసాస్య్వత్సంబంధార్థే సర్వస్మాత్.

అన్ని నామపదములమీఁదను సంబంధార్థమున 'ది' వర్ణకము వచ్చును. నాది, కోఁతిది, కోటది, రాజుది, గేఁదెది మొద. కాని, ఇట్టి రూపములును విశేషణములగును: ఈ పుస్తకము నాది, ఈ పని కోఁతిది, ఆ గోడ కోటది, ఈ కిరీటము రాజుది, ఆ త్రాఁడు గేఁదెది మొద. నా పుస్తకము, కోఁతిది పని, మొదలగురీతిని వాడఁగూడదు. ఈ 'ది' వర్ణకము బహువచనమున 'వి' వర్ణకమగును: ఈ పుస్తకములు నావి, ఆపాలు గేఁదెవి మొద.

27. యుష్మదస్మదాత్మభ్యో ద్వితివర్ణకః

నీ, నా, తన, మీ, మా, మన, తమ, అను పదములపై 'దు' అను వర్ణకము చేరును. నీదు, నాదు, తనదు, మీదు, మాదు, మనదు, తమదు—వీనిలో 'మాదు, మనదు, తమదు', అను రూపములను నన్నయ వాడలేదు.

దు వర్ణకముతోడి రూపములను విశేష్యములకు ముందే వాడవలెను: నీదుబడి, నాదుగది మొద. బడినీదు, మొదలగురీతిని వాడఁగూడదు. ఈ దు వర్ణకమునకు బహువచనమున 'వు' వర్ణకము రాదు.

28. అ, ఇ, ఉ, స్త్రీవిషయాః.

(డు, ము, వు, అను ప్రథమైకవచన ప్రత్యయముల తుద నుండు నుకారముకాక సహజముగఁ బదముల యంతమందుండు నాచ్ఛిక పదముల తుది) ఉకారమును, అకారమును, ఇకారమును నాయాపదముల స్త్రీ సమత్వమును బోధించును. మాట, పేట; సేగి, రాగి, మావి; సొగసు, కన్ను మొద. స్త్రీ విషయాః' అనఁగా స్త్రీ సమ విషయాః అనియే యరము చెప్పవలెనుగాని, స్త్రీ వాచక విషయాః అని చెప్పఁగూడదు. ( 'ఎ' కూడ స్త్రీవిషయమే: గిన్నె, కుప్పె, మొద.)

29. త్వార్థే తనశ్చ వికృతౌ స్యాత్.

'బహుత్వము, గురుత్వము' మొదలగు పదములందలి 'త్వ' అను ప్రత్యయము నర్థమున నాచ్ఛికభాషలో 'తన' అను ప్రత్యయము కూడ వచ్చును. పెద్దతనము, చిన్నతనము, వెడఁగుఁదనము, మొద. 'చ' అనుదాని వలన నింకను నిట్టి యర్థముగల ప్రత్యయములు తెనుఁగునఁ గలవని యర్థము. 'తన' వర్ణకముకూడ వచ్చును. అనుటవలన నది తక్కినవానివలె ప్రసిద్ధము కాదనికాని, చింతామణికిఁ బూర్వపు వ్యాకరణములందా ప్రత్యయమును దెలుపక విడిచినారని కాని, యనుకొనవలెను.

30. నామ్నః కవర్ణక స్స్యా త్స్వార్థే.

స్వార్థమునందు నామముకంటె కవర్ణకము వచ్చును: గొంతు, గొంతుక మొద.

31. స్యా దుత్వ మపి పరే తస్మిన్.

ఆస్వార్థక కవర్ణకము పరమగుచుండఁగా (నామము తుది యచ్చునకు) ఉత్వముకూడ రావచ్చును. నెలఁత, నెలతుఁక; వెలఁది, వెలఁదుక; మొద.

32. చురితి క్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలే స్యాత్.

అన్ని ధాతువులకును వర్తమానకాలమున 'చు' అనునది చేరును: చేయుచు, పోషించుచు మొద.

33. ప్రతిషేధవాచినాం నిః.

ప్రతిషేధవాచక ధాతువులపై నివర్ణకము వచ్చును. ప్రతిషేధ మనఁగా వ్యతిరేకమని యర్థము చేసికొనవలెను: చేయు+ని, అని నిలువఁగా ధాతువు తుది యుత్వమున కత్వము వచ్చుటకు 'ఉతోఽచ్చ సర్వేషు' అను సూత్రము ననుసంధించుకొనవలెనని చింతామణి యాశయమై యుండును. అందువలన 'చేయని, జయింపని' మొదలగు రూపములు గలుగుచున్నవి.

34. భూతార్థానాం తు నః క్రియాణాం స్యాత్.

ధాతువులు భూతార్థమును దెలియఁజేయునప్పు డన్ననో వానిపై 'న' అనునది చేరును. 'క్త్వా భూతయోః క్రియాంత స్యేత్' అను సూత్రమువలన 'జయించు' అను ధాతువుపై ఇత్తుచేరఁగా 'జయించి' అయి, దానిమీఁద 'న' చేరునపుడు 'జయించిన' అను రూప మేర్పడుచున్నది. ఇట్లే తక్కిన ధాతువుల కును నెలుంగునది.

35. కర్మాదేః కర్తృత్వం ప్రథమాచ న వర్ణకశ్చ తద్వత్ స్యాత్.

న వర్ణము చేరిన భూతార్థకధాతుజ విశేషణములతోఁ జేరిన కర్మాది వాచక పదములు కర్తృత్వమును బొంది, ప్రథమావిభక్తిని పొందును; అప్పుడు పూర్వమువలెనే (34-వ సూత్రమునఁ జెప్పఁబడినట్లే) భూతార్థ వాచకములపై న వర్ణము చేరిన ధాతుజ విశేషణమా కర్తృవాచక ప్రథమా విభక్తికరూపముతో నిలుచును: నీవు నుతించిన రాజు = నీచే నుతింపఁబడిన రాజు (ఇచట రాజు కర్మపదమైనను ప్రథమావిభక్త్యంతమై యున్నది); నీవు ప్రహరించిన ఖడ్గము (ఇచట ఖడ్గము కరణము); నీవు గోవునిచ్చిన బ్రాహ్మణుఁడు (బ్రాహ్మణ శబ్దము సంప్రదానమున నున్నది); నీవు పూలుగోసిన చెట్టు (చెట్టు శబ్ద మపాదానమున నున్నది); నీవు భుజించిన చోటు (చోటు శబ్ద మధికరణమున నున్నది); సూత్రమున భూతార్థమునఁ జేరు న వర్ణకము మాత్రము చెప్పఁబడినదిగాని, కర్మాదులకు గర్తృత్వమును బ్రథమావిభక్తియుఁ దక్కిన ధాతుజవిశేషణములతోఁ గూడి నప్పుడును గలుగును; నీవు చేయనిపని; చేయుచున్నపని; చేయుపని మొద.

36. షష్ఠీభవే ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా నామ్నామ్.

తత్పురుష సమాసమందు ప్రాతిపదికములకుఁ బూర్వమందు నిలిచిన షష్ఠీవిభక్తికరూపము ద్వితీయావిభక్తిరూపముతో సమానముగానుండును. అనఁగా ద్వితీయావిభక్తి విషయమై చెప్పఁబడిన 'లశసోఽలాన్తాత్', 'లాం తాత్తు రోఽస్తి' 'నిరమో మహతామ్', 'లుక్చస్యాత్', మొదలగుసూత్రము లీ షష్ఠీరూపమునకును వర్తించునని యర్థము. షష్ఠీతత్పురుషసమాసము నందలి షష్ఠీరూపము సంబంధార్థ బోధకమగు 'యొక్క' అను శేషషష్ఠ్యర్థ మును గలిగియుండును. ద్వితీయాతుల్యరూప మీషష్ఠికి వచ్చుటచే నది ద్రుతాంతము కావలసియున్నను 'ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు' అను సూత్రము చొప్పున ద్రుతము లోపించినదని చెప్పవలెను: ఉదా. రామునిగుణములు, రాము గుణములు, రాముల గుణములు, కవినేర్పు మొద.

37. ఇదుపోత్తమోత్తమానాం బహువచన ఉపోత్తమేత ఉద్భవతి.

తుది వర్ణమును దానికిఁ బూర్వవర్ణమును హ్రస్వ - ఇకారముగాఁ గల పదములకు బహువచన లువర్ణము పరమగు నపుడుపోత్తమవర్ణము మీఁది యిత్తునకు ఉత్తువచ్చును. ఉదా. కలికి, కలుకులు (ఉద్భహుత్వే అను సూత్రముచేత 'కలుకులు, ములికి, ములుకులు; బుడిపి, బుడుపులు, మొద.)

38. అస్మద్యుష్మ ద్వాచ్యా దేకత్వ ఇతో నివీ.

నేను, నీవు, అని చెప్పవలయు ఇదంతరూపములపై నేకవచనమునఁ గ్రమముగా 'ని', 'వి', అనునవి వచ్చును: నేను హరిని; నీవు శూలివి, మొద. ఇట్లే, నేను రక్షించితిని, నీవు రక్షించితివి, మొద.

39. పరేషాం తు ధర్మోత్తమ మధ్యమవత్.

ఇతరములకన్ననో తద్ధర్మారక ఉత్తమ మధ్యమపురుష క్రియలకువలె నగును.—— ఈ సూత్రమున కర్థము స్పష్టముగా లేదు. 'పరేషాం' అనుదానికి (i) అస్మద్యుష్మ ద్వాచ్యములు కాని (అనఁగా తదర్థ వాచ్యములగు) ఇదంత శబ్దములకు (ii) అస్మ ద్యుష్మ ద్వాచ్యములై ఇదంతములు కాని వానికి (iii) అస్మ ద్యుష్మ ద్వాచ్యములునుగాక యిదంతములునుగాక యుండువానికి, అని మూఁడువిధముల నర్థము చెప్పవచ్చును. పై సూత్రములో 'ఏకత్వే' అని యుండుటచేతను, దీనితరువాతి సూత్రమగు 'బహుషు న మధ్యమవత్' అను దానిలో బహువచనమునఁగలుగు కార్యము ప్రత్యేకముగ నుపదిష్టమగుట చేతను, నీ సూత్రమువలనఁ గలుగు కార్యము లేకవచనమునకే వర్తించునని యనుకొనవలెను. అప్పుడు (i) మొదటి పక్షమున 'వాఁడు కవి, వాఁడు చేయును' మొదలగు రూపములేర్పడును. 'ప్రథమైకవచనలోప స్తద్ధర్మాతీతయోః క్రియాణాం స్యాత్' అను సూత్రమిచట వర్తించును. (ii) రెండవపక్షమున నేను సీతను, నేను రాముఁడను; నీవు సీతవు, నీవు రాముఁడవు' మొదలగు రూపము లేర్పడును. ఈ పక్షమందు 'ఉతోఽచ్చ సర్వేషు' అను సూత్రమునుగూడ వర్తింపఁజేయవలెను; 'నేనుచేయుదును, నీవుచేయుదువు' అను రూపములును నేర్పడునుగాని యిచట నుత్తున కత్వమురాదు; (iii) మూఁడవపక్షమున 'వాఁడు రాముఁడు, ఆమె సీత,' మొదలగు రూపములేర్పడును. 'ప్రథమైకవచన లోపః' అను సూత్ర మిచట వర్తించును.

(iv) 'పరేషాం' అను పదమును 'ఏకత్వే' అను పదముతో నెట్లో యన్వయింపఁ జేసినయెడల 'ఏకవచనేతరములైన' అనఁగా 'బహువచనమందున్న' అను నర్థము వచ్చును. అప్పుడు (అ) 'అస్మద్యుష్మ ద్వాచ్యములు కాని వానికి బహువచనమున' (ఆ) అస్మద్యుష్మ ద్వాచ్యములకు

బహువచనమున నను రెండర్థములు గలుగును. వీనిలో మొదటిపక్షమున వారు రాములు, సీతలు; వారు చేయుదురు మొదలగున వుదాహరణము లగును; రెండవపక్షమున మేము రాములము, మేము సీతలము; మీరు రాములరు, మీరు సీతలరు; మొదలగు రూపము లేర్పడును; మేము చేయుదుము, మీరు చేయుదురు, మొదలగు రూపములు నేర్పడునుగాని వీనికి 'ఉతో౽చ్చ సర్వేషు' అను సూత్రము వర్తింపదు.

ఇట్లర్థవివరణముఁ జేయవలసియున్నను నీ సూత్ర మేకవచనములకే వర్తించుననియు, చేయుదును, చేయుదువు, చేయును, చేయుదుము, చేయుదురు, మొదలగు రూపముల నిష్పత్తి క్రియాపరిచ్ఛేదమందలి సూత్రములచేఁ గలుగుచున్నది గావున నట్టివానికి వర్తింపదనియు, నామపదములపైఁ గ్రియాప్రత్యయములు చేరువిధానమునే నది బోధించుచున్నదనియు నను కొనవలెను.

40. బహుషు న మధ్యమవత్.

బహువచనమున (తద్ధర్మ) మధ్యమపురుష రూపములు గలుగవు.—ఇచట బహువచనమున ననఁగా అది దుదంతముల మూఁడు పురుషముల బహువచనమునందును నని యర్థము. బహువచనమందలి యాయారూపములు పై సూత్రముచే సిద్ధించుచున్నవి; కాని, యీ సూత్రమున నా రూపములలో మధ్యమపురుష బహువచనము మధ్యమపురుష బహువచన ప్రత్యయముచే నేర్పడదని చెప్పఁబడినది. అయిన నది యెట్లేర్పడునో చింతామణి తెలుపలేదు. ప్రథమపురుష బహువచనమున వచ్చు 'రు' వర్ణమే మధ్యమ పురుషమునను వచ్చుచున్నదనియు, మధ్యమపురుష బహువచనమునకుఁ బ్రత్యేక ప్రత్యయము బహువచనమున లేదనియుఁ జింతామణి యాశయమై యుండవచ్చును.

41. సర్వ విభక్తి స్సంస్కృత తుల్యా.

తెనుఁగునందలి యాయా విభక్తుల యర్థములు, సంస్కృతము నందలి విభక్తుల యర్థమునే గలిగి యుండును.

42. అన్యస్యాః క్వచి ద్భవే చ్చాన్యా.

ఒకయెడ నొక విభక్తికి మఱియొక విభక్తియువచ్చును: రథమెక్కెను. (ద్వితీయార్థమునఁ బ్రథమ); రామునకు నమస్కారము (చతుర్థ్యర్థమున షష్ఠి); అతఁడు నీ కధికుఁడు (పంచమ్యర్థమున షష్ఠి); భక్తుల పాదములు నా శిరమునఁ దాల్తును (తృతీయార్థమున సప్తమి); ఖడ్గమున నఱికెను. (తృతీయార్థమున సప్తమి); పురమేఁగెను (ద్వితీయా చతుర్థ్యర్థముల ప్రథమ) మొదలయినవి,

**43. ఏకత్వం భేదకగత బహువచనానాం చ దృశ్యతే వికృతౌ.**

వికృతియైన యాంధ్రభాషయందు బహువచనమునందున్న విశేష్య ములతోఁ జేరిన విశేషణములకు ఏకవచనమును వచ్చును. సంస్కృతమునం దన్ననో విశేష్యమునకుఁ గల లింగ, వచన, విభక్తులు తద్విశేషణములకును వచ్చును: ఇంపయినమాటలు, ఇష్టమయిన పనులు, మొద.

**44. ద్విగుకర్మధారయే, తత్పురుష ద్వన్ద్వే, (చ సా) బహువ్రీహిః.
అన్యే చ కేచి దుపమానోత్తరపదలోప రూపకా ఖ్యాద్యాః
పరిదృశ్యా ఇహ.**

ద్విగువు, కర్మధారయము, తత్పురుషము, ద్వంద్వము, బహువ్రీహి, (అను సంస్కృతవ్యాకరణప్రోక్త సమాసములును), ఉపమాన సమాసము, ఉత్తరపదలోప సమాసము, రూపకసమాసము, మొదలగు పేళ్లుగల కొన్ని యితర సమాసములును నిందు (ఆంధ్రభాషయందు) బాగుగా చూడఁదగి నవి. తెనుఁగునందలి దేశ్యపదముల సమాసము లీసూత్రమునఁ దెలుపఁ బడినవి. ఉదాహరణములు:

I. ద్విగువు: i. ఏకవద్భావి : (అ)సంస్కృత సమాస లక్షణములుగలవి. ఇరుసంజె, ముప్పేద్దు, ముక్కాలు మొదలయినవి.

ii. అనేకవద్భావి : ఇద్దఱుతల్లుల ముద్దుబిడ్డఁడు, ఏడుగుఱ్ఱాల రౌతు, మొద.

II. కర్మధారయము : సమానాధికరణము:

i. విశేషణపూర్వపదకర్మధారయము: ఎఱ్ఱఁగలువ; నల్లమబ్బు; మంచినీళ్లు, మొద.

ii. విశేష్యపూర్వపద కర్మధారయములు: వేల్పుఁ బెద్ద, మొద.

iii. విశేషణోభయపద కర్మధారయము: నులివెచ్చ, లే యెఱుపు, మొద.

iv. ఉపమానోత్తర పద కర్మధారయము: చూపుగుఱ్ఱము, మోఁతగాడిద, తిండిపులి, మొద.

v. ఉపమాన పూర్వపద కర్మధారయము: చిగురుఁగేలు, జుంటి మోవి, మొద.

vi. సంభావనాపూర్వపద కర్మధారయము : మామిడిచెట్టు, మల్లెపువ్వు, మొద.

vii. అవధారణ పూర్వపద కర్మధారయము: పలుకుఁ జక్కెర, కలిమి జవరాలు, మొద.

III. తత్పురుషము: వ్యధికరణము—

i. ప్రథమా తత్పురుషము: ముంజేయి, మొనగాలు, కడకన్ను, మొద.

ii. ద్వితీయా తత్పురుషము: పట్టుఁ బుట్టముఁ దాల్పు, గాడ్పు మేఁపరి, మొద.

iii. తృతీయా తత్పురుషము; నెలతక్కువవాఁడు, మొద.

iv. చతుర్థీ తత్పురుషము: దేవరమేలు, మోఁతకూలి, మొద.

v. పంచమీతత్పురుషము: దొంగభయము, గాలిదెబ్బ, మొద.

vi. షష్ఠీ తత్పురుషము: ఆలకాఁపరి, ముత్యాలదండ, మొద.

vii. సప్తమీ తత్పురుషము: మాటనేర్పరి, మొద.

IV. ద్వంద్వ సమాసము:

i. ద్విపదేతరేతరయోగద్వంద్వము: తల్లిదండ్రులు, కూరగాయలు, మొద.

ii. బహుపదేతరేతరయోగద్వంద్వము: నక్క కాకి జింకలు, మొద. (ఇట్టి సమాసములు తెనుఁగున మృగ్యములు.)

iii. ద్విపద సమాహార ద్వంద్వము: ఎఱుపు తెలుపు వన్నె; తీయ పుల్లని పండు, మొద.

iv. బహుపద సమాహార ద్వంద్వము: కమ్మని వెచ్చని తెలి యోగిరము, మొద.

V. బహువ్రీహి సమాసము:

i. ద్విపద బహువ్రీహి: చలివెలుఁగు, ముక్కంటి, మొద.

ii. బహుపద బహువ్రీహి : నీలిమబ్బుచాయ నెమ్మేనివాఁడు, మొద.

iii. సంఖ్యోభయపద బహువ్రీహి: రెండు మూఁడు గదుల రెయిలుబండి, మొద.

iv. సంఖ్యోత్తరపద బహువ్రీహి: ఇంచుమించు నూఱు, మొద.

v. సహపూర్వపద బహువ్రీహి: తోఁబుట్టువు, తోడికోడలు, మొద.

vi. దిగంతరాళ లక్షణ బహువ్రీహి: ఆయిల్లిచటికిఁ దూర్పు దక్షిణములుగా నున్నది.

vii. వ్యతిహార లక్షణ బహువ్రీహి: చేయిచేయిపట్టి, జుట్టుజుట్టు గ్రహించి, గొంతుక గొంతుక నొక్కుకొని పోట్లాడిరి.

(ఆ) సంస్కృతమునఁ గానరాని తెనుఁగు సమాసములు.

I. ఉపమాన సమాసము: కేలుదమ్మి, చెక్కుటద్దము, మొద. ఇట్టి సంస్కృతసమాసములును గలవు: హస్తపద్మము, పురుషవ్యాఘ్రుఁడు, మొద. దీనిని సంస్కృతేతర సమాసములలో నేల చేర్చవలెనో తెలియదు.

II. ఉత్తరపదలోప సమాసము: గాజులసెట్టి = గాజులమ్ము సెట్టి; వంటలక్క = వంటలుచేయు అక్క (స్త్రీ), మొద. దీనిని మధ్యమపదలోపి సమాసమనియు నందురు.

III. రూపక సమాసము: కానుమిన్ను, కనుదమ్మి, మొద.

45. కార్యా ఔపవిభక్తికవ దంతవిధయశ్చ.

తెనుఁగు సమాసములం దౌపవిభక్తిక శబ్దములకువలె (ఇ, టి, ంటి, తి, అను వర్ణములను గూడఁ జేర్పవలసియుండును: ముక్కంటి, వాఁడివాతి, మొద.

46. లోపశ్చ విభక్త్యాదే శ్శబ్దేషు స్యాత్సమాసకాఙ్గేషు.

సమాసకములోని శబ్దములందలి విభక్త్యాదులకు లోపమును గలుగును. సమాసకనిర్వచనము క్రిందిసూత్రమునఁ జేయఁబడినది: ఉదా. వేల్పుదొర, రాచేకొమరుఁడు, జవ్వాదిసెట్టి మొదలగునవి.

47. కేవల వికృతి పదై ర్యత్సమాసకం తం బ్రువన్తి వాక్యజ్ఞాః.

కేవలము తెనుఁగు పదములు మాత్రము చేరిన సమాస మేది గలదో దానిని వైయాకరణులు సమాసక మని చెప్పుచున్నారు: పాలమున్నీటి కూఁతురు. పడగఁదాల్పు మొద.

48. సంస్కృత వైకృతశబ్దై ర్మిశ్రసమాస స్స ఏవ విజ్ఞేయః.

సంస్కృతపదములును వైకృతపదములును సమసించినది మిశ్రసమాసమని తెలియవలెను. వేఁగీవిషయము, చలుక్యవంశము, పరగండ భైరవుఁడు, కటకరంతుఁడు, దీపకంభము, నిత్యపడి, భీమకోల, అవసరమాళ, మొద.

49. సంస్కృతపదేన పరిమిత మాన్ధ్రపదం కర్మధారయో భవతి.

పరిమితమయిన యాంధ్రపదము సంస్కృత పదముతో సమసించి కర్మధారయసమాస మగును. ఇచట 'పరిమిత' శబ్దమున కక్షరపరిమితియని

బాలసరస్వ త్యహోబలాదులును, 'శబ్దపరిమితి' యని యథర్వణుఁడును వ్యాఖ్యానము వ్రాసియున్నారు. అథర్వణుఁడును నక్షరపరిమితినే యూహించి నట్లు బాలసరస్వత్యహోబలు లభిప్రాయపడి యథర్వణుఁడు రచించిన కారికగా 'ఆంధ్రషడ్వర్ణ పర్యంతం సంస్కృతేన సమస్యతే (పదంస్యాత్కర్మధారయే) అనుదాని నుదాహరించి 'వాఁడి మయూఖములు, వేడి పయోధారలు' మొద లగువాని నుదాహరించియున్నారు. బ్రహ్మశ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రులవా రీవిషయమును విమర్శించుచు:

మలయాళమందలి మణిప్రవాళ శైలియందుగానవచ్చు శుద్ధసంస్కృత శుద్ధదేశ్యపదముల సమాసములు తమకాలమం దుండుటఁ జూచి యాంధ్ర పండితులు వానిని గర్హించిరి; కాని, వాఁడి మయూఖములు మొదలగు నన్నయ ప్రయోగములకు గతియేమని చర్చించికొని 'సంస్కృతపదేన పరిమిత మాంధ్ర పదం కర్మధారయో భవతి' అని చింతామణిసూత్ర మట్టి ప్రయోగములకు రక్షక మగుచున్నదని సమర్థించియు నా యక్షర పరిమితి యెంతవఱకుఁ దగునని యాశంకించుకొని 'షడ్వర్ణపర్యంత' మని యొక మితిని గల్పించి తదనుగుణ ముగా 'ఆంధ్రః షడ్వర్ణపర్యంత 'మిత్యాది కారిక నేర్పఱచికొనిరి. కాల క్రమమున నా కారిక యథర్వణకారికావళిలోని దనుకొని దాని నందులోనికిఁ జొప్పించిరి. ఇట్టి ప్రక్షిప్త కారికనుజూచి భ్రమ ప్రమాదములకు లోనై బాలసరస్వత్యహోబలాదులు దాని నథర్వణుఁడు రచించినట్లే యుదాహరించిరి. ఆ కారిక యథర్వణుఁడు రచించినదికాదు. చింతామణి సూత్రమునందలి 'పరిమిత' పదమునకు వాస్తవమైన యర్థము నథర్వణుడు—

"ద్వ్యక్షరాది చతుర్వర్ణ పర్యంత జననామను
లోపస్స్యాద్ డ్వాది వర్ణానాం శబ్దే రాయాదికే పరే;
క్వచి దిత్వం క్వచి తన్మత్వం క్వచి త్పత్వం"

అని యీరీతిగా వివరించియున్నాఁడు ఇదియే సరియైనయర్థము. శుద్ధ సంస్కృత శబ్దముతో నాంధ్రశబ్దములకు యథేచ్ఛముగా సమాసముచేయ వలనుపడదు. బిరుదాదివాచక పరిమితాంధ్ర పదములతోనే శుద్ధసంస్కృత పదము కర్మధారయ సమాసముగా (కృష్ణరాయఁడు) సమసించును' అని వివ రించియున్నారు. ఈ విషయమై కొన్ని సందేహములు కలుగుచున్నవి:—

i. మణిప్రవాళశైలి నాంధ్రకావ్యముల నెవ్వరైన రచించిరా? యను నది మొదటిది. కవులు శతకములలోఁ గోరి రచించిన ఒకటి రెండు పద్య ములను జూపిననఁ జాలదు.

ii. 'ఆంధ్రః షడ్వర్ణ పర్యంత'మను కారిక యథర్వణుని గ్రంథములో నుండుట చింతామణి యాశయమునకు విరుద్ధ మగుటకుఁ గారణమేమి? అది ప్రక్షిప్తము కానియెడలఁ జింతామణి సూత్రమున కెట్టిబాధ కలుగుచున్నది? బాధ కలిగినచో 'వాఁడిమయూఖములు' మొదలగు సమాసములందలి యాంధ్ర పదములం దెన్నివర్ణములైన నుండవచ్చునా? 'పరిమిత' శబ్దముచేఁ జింతామణి కర్త యా యక్షరముల సంఖ్యను నియమింపకపోయినను నవి పరిమితముగా నుండవలెనని సూచించె నని చెప్పిన నేమిదోషము కలుగును?

iii. బాలసరస్వత్యహోబలులో మఱియెవ్వరో 'ఆంధ్రఃషడ్వర్ణే' త్యాదికారిక నథర్వణుని కంటఁగట్టి రనుట సమంజసమా? ఆంధ్రవైయాకరణ సంప్రదాయమున నున్న విషయమునే వారును గ్రహించిరని యేల చెప్పఁ గూడదు?

iv. 'సంస్కృతపదేన పరిమితమాంధ్రపదం' అనిన నాంధ్రపదము సమాసమునఁ బూర్వపదముగ నుండవలెనా? పరపదముగ నుండవలెనా? పూర్వపదమన్నయెడల 'దీపకంభము, అనియంకభీమకోల, చాళుక్యభీమకోల, అవసరమాఱి (నాణెము), నిత్యపడి, 'కృష్ణరాయ' మొదలగు సమాసములు దుష్టములగును; పరపదమేయని యన్నయెడల 'వేఁగీ విషయాధీశ చాళుక్య కులతిలక, పరగండభైరవ, నన్నయభట్ట, కఱకంఠ, మొదలగునవి దుష్టము లగును. ఈ రెండువిధములైన సమాసములును నాంధ్రముననుండుటచేత నే చింతామణికర్తయే కాక యాంధ్రవైయాకరుణులందఱు వాని నంగీకరించిరని చెప్పఁగూడదా? అట్టి సమాసములను బిరుదాది వాచకములకే యన్వ యించుట ప్రయోగములకు విరుద్ధము కాదా?

v. 'ద్వ్యక్షరాది చతుర్వర్ణ పర్యంత జననామను' అను కారికయందు మాత్ర మక్షర పరిమితి వచింపఁబడలేదా? జననామను' అని కంఠోక్తిగాఁ గారిక చెప్పుచుండఁగా 'బిరుడాది వాచకపదము' అని 'ఆది' శబ్దము నేల చేర్ప వలెను? 'ఆది' శబ్దముచేఁదక్కిన వ్యవహారసిద్ధ శుద్ధసంస్కృతవైకృత పదముల సమాసముల నేల గ్రహింపఁగూడదు?

vi. చింతామణి సూత్రము కర్మధారయసమాసమును గూర్చి మాత్రము చెప్పుచున్నది. 'కృష్ణరాయఁడు' అనునది సంభావనా పూర్వ పద కర్మధారయ సమాస మనవచ్చునా? 'రాయ' శబ్దము రాజులు కాని వారి కుండఁగూడదా? 'సీతారామస్వామి' అను నప్పుడు 'సీతారామః ఇతి స్వామీ' అని సంజ్ఞావాచకపదమునకు విగ్రహము చెప్పనగునా? అట్లను

కొన్నను చింతామణిసూత్ర మొక్క సంభావనాపూర్వపద కర్మధారయ సమాసములకే వర్తించు నని యేల చెప్పవలెను?

బాగుగ నాలోచించి చూడఁగాఁ చింతామణిలోని పై సూత్రము 'వాఁడిమయూఖములు' మొదలగు కర్మధారయ సమాసములకే వర్తించు నని చెప్పవలయునని తోఁచుచున్నది. కృష్ణరాయఁడు, అంచయాన, కలి కంఠుఁడు, ఇత్యాది సమాసములు 48-వ సూత్రమునఁ జెప్పఁబడిన మిశ్ర సమాసముల కుదాహరణము లగును.

50. స్వస్వ విభక్తి వికారై ర్బహవశ్చ యథాతథం సమస్యన్తే.

తమతమ విభక్తివికారములతో ననేకశబ్దములు వ్యవహారాను సారముగ సమాసములగును— రాజునాజ్ఞ, రామునియానతి, ఊరివారు, ఊరఁబంది, నీతోడిచెలిమి, నావలని నేరము, మొదలయినవి.

ఇది హలంత పరిచ్ఛేదము.

శ్రీః

# ఆన్ధ్రశబ్దచిన్తామణి

## హృదయము.

——:o:——

### క్రియా పరిచ్ఛేదము.

1. ఉపకృతి పరిణతి సంవృతి భేదా త్త్రివిధాః క్రియాః.

ధాతువులు ఉపకృతి యనియు, పరిణతి యనియు, సంవృతి యనియు భేదములచే మూఁడువిధములుగ నుండును.

2. పుషణ్వాది రుపకృతిః.

పుష, ను, మొదలగునవి యుపకృతి (ధాతువులు).

3. అథ భూ జ్యాదిః పరిణతిః.

పిమ్మట భూ, జి, మొదలగునవి పరిణతి (ధాతువులు).

4. అన్యా తు రఞ్జి వ స్యాదిః.

ఇతరమైన (మూఁడవ) దన్ననో ( అనగా సంవృతి) రఞ్జి, వసి, మొద లగు ధాతువులను గలది.

5. స్యా దుపకృతిగి కృదన్తా.

ఉపకృతి ధాతువు కృత్ప్రత్యయ మంతమందు గలదిగా నుండును: పుష్+(ఘఞ్) = పోష్ ; ను+(క్తిన్) = నుతి ; మొదలగు కృదంత రూప ములు తెనుఁగు క్రియలకును ప్రాతిపదికము లగును.

6. సా పరిణతి రయువ రన్వితైవ భవేత్.

ఆ పరిణతి ధాతువు 'అయ్, అవ్, అర్' అనువానితోఁ గూడియే (తెనుఁగునఁ) ప్రాతిపదికముగ నుండును. జి = జయ్ ; భూ = భవ్ ; హృ = హర్ ; మొద.

7. సంవృతి రహతాకారా.

సంవృతి ధాతువు తెనుఁగునఁ ప్రాతిపదికమగునప్పు డెట్టిమార్పును. గలుగదు. రంజ్, వస్, మొద.

8. జ్ఞేయం త్రివిధాను చ క్రియా స్వేవమ్.

(వై) మూఁడు విధములగు ధాతువులయందు నిట్లే తెలిసికొనవలెను.

9. తద్ధర్మ వర్తమా నాతీ తాగామ్యర్థకాశ్చ క్రియా జ్ఞేయాః.

క్రియలు, i. తద్ధర్మార్థకములు, ii. వర్తమానార్థకములు, iii. భూతార్థకములు. iv. భవిష్యదర్థకములు నని (నాలుగు విధములయిన వానిఁగా) తెలిసికొనవలెను.

10. తత్ర ద్వితీయ తుర్యా యా తౌ స్తస్సానుబన్ధకా వేవ.

అందు రెండవదియు (వర్తమానార్థక క్రియయు), నాలుగవది (భవిష్యదర్థక క్రియయు) అనుబంధములు గలిగియే యుండును.

11. వసతి రనుబన్ధక స్స్యాద్యత్ర లడర్థో వివక్షిత స్తత్ర.

ఎచట లడర్థము (వర్తమానార్థము) చెప్పవలసియున్నదో యచట, వసతి ధాత్వర్థకమగు 'ఉన్న' అనునది యనుబంధముగఁ జేరును. ('వసతి' ధాతువునకుఁ దెనుఁగు 'ఉండు' అనునది కాని, 'ఉన్న' అనునది కాదు; అయినను 'ఉన్న' అని చెప్పుకొనకపోయినచో ముందు సూత్రముల కర్థము నడవదు కావున నా యర్థమే గ్రహింపఁబడినది. పుష్=పోష్+ఉండు (ఉన్న) అనియుండఁగా.

12. అస్తి రనుబన్ధక స్స్యాద్యత్ర ల్ృడర్థో వివక్షిత స్తత్ర.

ఎచట ల్ృడర్థము (భవిష్యదర్థము) చెప్పవలసియుండునో యచట అస్తి ధాత్వర్థముగల 'కల' అను అనుబంధము చేరును. ('అస్తి' అన్నను 'ఉండు' ధాతువునే చెప్పికొనవచ్చును; కాని, వ్యాఖ్యాతలు 'కలుగు' ధాతువును చెప్పుకొన్నుందురు. అట్లే చేయుదమన్నను 'కల' అనున దనుబంధమను నర్థ మెట్లువచ్చునో తెలియదు. అయినను 'కల' అను ననుబంధముచే యొప్పుకొనకున్న ముందు గ్రంథము నడువదు.) పుష్=పోష్+కలుగు (కల) అని యుండఁగా.

13. భవతి క్రియాపదానాం త్రివిధానా మించుగాగమః.

(ఉపకృతి, పరిణతి, సంవృతి అను) మూఁడు భేదములుగల మూఁడు విధములగు ధాతువులమీఁదను 'ఇంచు (క్)' అను నాగమము స్వార్థమునఁ జేరును. పోష్+ఇంచు+ఉండు (ఉన్న); పోష్+ఇంచు+కలుగు (కల) జయ్+ఇంచు+ఉండు (ఉన్న); కలుగు (కల); భవ్+ఇంచు+ఉండు+కలుగు (ఉన్న);(కల); హార్+ఇంచు+ఉండు+కలుగు,(కల); రంజ్+ఇంచు+ఉండు(ఉన్న) కలుగు (కల); వస్+ఇంచు+ఉండు (ఉన్న); కలుగు (కల) అని యుండఁగా.

14. ణేశ్చ.

ణి జర్థమునందును [ఇంచు(క్) అనున] దాగమముగా వచ్చును. పోషిం చు+ఇంచు, అనియుండగా.

15. అనుబన్ధ ప్రార్థనయోః క్త్వా వ్యతిరేకాదిశే చ చోఃప స్స్యాత్.

అనుబన్ధవర్ణములు పరమగునపుడును (అనఁగాఁ బూర్వోక్తములయిన 'ఉన్న, కల' అనునవి పరమైనప్పుడును, ప్రార్థనార్థమందును, ణిచ్చుపరమగు నపుడును, వ్యతిరేకాద్యర్థములందును గూడ చకారమునకు పకార మాదేశ మగును: అనుబన్ధములకు: పోషింపు+ఉండు (ఉన్న); కలుగు (కల); ప్రార్థనార్థమున: పోషింపు; ణిజర్థమున: పోషింపు+ఇంచు+ఉండు (ఉన్న); కలుగు (కల); వ్యతిరేకార్థమున: పోషింపు, అని యుండఁగా. (చోః పస్స్యాత్ అనునప్పుడు ఉత్వవిశిష్టమైన) చకారమునకు 'ప' కారము (ప్ః, ప) ఆదేశ మగుననియు నర్థము చెప్పఁకొనవచ్చును. అప్పుడు కొన్ని యనిష్టరూపము లేర్ప డును. ముందుగా లక్ష్యము తెలిసియున్నఁదప్ప సూత్రములోని ' చోః' అనుదానికి చువర్ణమందలి హల్మాత్రమునకని యర్థము చెప్ప వీలులేదు.

16. వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాత్.

వ్యతిరేకాద్యర్థమునను భవిష్యదర్థమునందును హ్రస్వ అకారము చేరును: వ్యతిరేకార్థమున: పోషింపు+అ=పోషింప; భవిష్యదర్థమున: పోషింపు+అ+కల=పోషింప+కల, మొద. ('భావిని చ+ఆత్' అనియుఁ బద చ్ఛేదముఁ జేయవచ్చును. అప్పుడు 'పోషింపా+డు, ను, వు, రు, డుజ్, రు' అను ననిష్టరూపములును సిద్ధించును.)

17. క్త్వా భూతయోః క్రియా స్త స్యేత్.

క్త్వార్థమునందును భూతార్థమునందును ధాతువుతుది (యుత్తునకు) హ్రస్వ ఇకారము చేరును- క్త్వార్థమున: పోషించు+ఇ=పోషించి, పోషిం పించి; భూతార్థమున: పోషించి-, పోషింపించి-.

18. ప్రథమైకవచనలోప స్తద్ధర్మాతీతయోః క్రియాణాం స్యాత్.

భూతతద్ధర్మార్థములందు క్రియలకు ప్రథమపురుషైకవచనప్రత్యయము లోపించును.

19. వ్యతిరేకార్థే ల్బటి లటి డుజ్స్యాత్.

వ్యతిరేకార్థమునను ల్బట్టు (భవిష్యదర్థము) నందును, లట్టు (వర్తమా నార్థము) నందును (ప్రథమైకవచనమున) బిందుపూర్వక డు వర్ణము వచ్చును:

వ్యతిరేకార్థమునకు పోషింపఁడు; భవిష్యదర్థమునః పోషింప+కలుగుఁడు(కలఁడు); వర్తమానార్థమున ('చరితి క్రియాపదానాం' అను సూత్రమువలన 'చు' చేరఁగా) పోషించుచుండుఁడు, పోషించుచున్నఁడు.

20. స్త్ర్యర్థే పున ర్దదీ భవతః.

మహత్యర్థక క్రియాపదమునకన్నను వ్యతిరేకార్థమునను, భవిష్యదర్థమందును, వర్తమానార్థమునను ప్రథమ పురుషైకవచనమున దు, ది, అనునవి చేరును: (వీనిలో 'దు' ఎప్పుడు చేరునో 'ది' యెప్పుడుచేరునో స్పష్టముగా లేదు. కాని, వ్యతిరేకార్థ, భవిష్యదర్థములందు 'దు' వర్ణకమును, వర్తమానార్థమున 'ది' వర్ణకమును నగునని యెట్లయిన సరిపెట్టుకొనవలసియున్నది)- వ్యతిరేకార్థమున 'పోషింపదు' భవిష్యదర్థమునః పోషింప కలుగుదు (కలదు); వర్తమానార్థమునః పోషించుచుండుది; పోషించుచున్నది.

21. అన్యస్మా చ్చాధాతో ర్ధాతుత్వ వివక్షాయామేవ భవ తీంచుక్.

ధాతువుకాని యితరముమీఁద ధాతుత్వవివక్షచేత ఇంచు (క్) అనునదాగమముగా వచ్చును: పల్లవ+ఇంచు, కరుణ+ఇంచు, మొద. ఇట్టిచోట్ల నత్తునకు సంధి నిత్యమని చెప్పికొనవలెను: పల్లవించు, కరుణించు, మొద.

22. తిర్యగ్జడేషు కర్తృషు బహువచనం చైకవచన మేవ స్యా ద్భూతే తద్ధర్మే చ.

తిర్యగ్వాచకపదములును జడవాచకపదములును వాక్యమున కర్తృపదము లగుచుండఁగా వానితో నన్వయించు క్రియాపదముల భూత తద్ధర్మార్థక ప్రథమపురుష బహువచనరూపము ప్రథమపురుషైకవచన రూపమేయగును: ఆవు (లు) పోషించు (ంచె) ను; చెట్టు (లు) పోషించు (ంచె) ను, మొద.

23. అన్యత్ర వు వీ.

భూతతద్ధర్మార్థములు గాక యితరములగు వ్యతిరేక భవిష్య ద్వర్తమానార్థములందు తిర్యగ్జడవాచక పదములు కర్తలగునపుడు బహువచనమున వ్యతిరేకభవిష్యదర్థములందు వు వర్ణకమును వర్తమానార్థమున వి వర్ణకమును జేరును. వ్యతిరేకార్థమునః ఆవులు( చెట్లు) పోషింపవు; భవిష్యదర్థమునః ఆవులు (చెట్లు) పోషింపకలుగు (కల) వు; వర్తమానార్థమునః ఆవులు (చెట్లు) పోషించు చుండువి (చున్నవి).

24. స్త్రీవ దేకవచనం తు.

తిర్యగ్జడవాచకపదములు కర్తలగునపు డేకవచనమున స్త్రీ వాచకపదములు కర్త లగునప్పుడు వచ్చు ప్రత్యయములే వచ్చును. వ్యతిరేకార్థమునః ఆవు

(చెట్టు) పోషింపదు; భవిష్యదర్థమున: ఆవు(చెట్టు) పోషింప కలుగు (కల)దు; వర్తమానార్థమున; ఆవు (చెట్టు) పోషించు వుండు (వున్న) ది.

25. ఉత్వయుతౌ వ న కారౌ స్యాతాం మధ్యోత్త మైకవచనానామ్.

(అన్ని క్రియలకు నన్ని యర్థములందును) మధ్యమపురుషైకవచనమున 'వు' వర్ణకమును, ఉత్తమపురుషైకవచనమున 'ను' వర్ణకమును వచ్చును.

26. సర్వేషాం బహువచనే రు ఇతి స్యాత్.

అన్ని ధాతువులకును అన్ని యర్థములందును బహువచనమున 'రు' వర్ణకము వచ్చును.

27. ఉత్తమస్య తు భవే న్మః.

ఉత్తమపురుష బహువచనమునకన్నచో ము వర్ణకము చేరును; అనఁగా రు వర్ణకము ప్రథమ మధ్యమ పురుషములందు మాత్రము వచ్చునని యర్థము.

28. ఏకత్వేఽథ బహుత్వే ముడుజౌ సంప్రార్థనార్థకేషు స్తః

పిమ్మట సంప్రార్థనాద్యర్థములం దేక బహువచనములఁ గ్రమముగా ము, డుజ్ అనునవి చేరును. పోషింపుము, పోషింపుఁడు.

29. దౌ చో ర్లుక్ తద్ధర్మే.

తద్ధర్మమందు 'దు' అనునది పరమగుచుండఁగా దాని పూర్వమందుండు 'చు' వర్ణమునకు లోపము కలుగును. ఈ దుగాగమము క్రింది 31-వ సూత్రమున విధింపఁబడినది. ముందు దుగామమును విధించి పిదప నీ లోపమును జెప్పిన బాగుండెడిది.

30. ప్రథమైక స్యై ద్భవే చ్చ భూతార్థే.

ప్రథమ పురుషైక వచనమున భూతార్థమందు 'ఎ' (ఏ ?) అనునది వచ్చును కూడ. 'క్త్వాభూతయోః క్రియాన్త స్యేత్' అని యింతకుముందు 'ఇ' త్తును విధించియున్నాఁడు. ప్రస్తుత సూత్రమువలనఁ దక్కిన భూతార్థములందు అనఁగా క్త్వార్థమందును, ప్రథమా బహువచన, మధ్యమోత్తమైక బహువచనములందు ఇత్తువచ్చును; కాని, ప్రథమైకవచనమున ఎ (ఏ ?) త్తు వచ్చునని తెలియుచున్నది. పోషించె (న్).

31. దు, తి, వర్ణకౌ క్రమాత్ స్తః.

దు, తి, అను వర్ణకములు క్రమముగా నగును.— ఏ యర్థములందు ? తద్ధర్మభూతార్థములందని పూర్వసూత్రముల రెంటనుండియు గ్రహింపవలెను. పోషించుదు (ను-ము,-వు,-రు) ; పోషించితి (ను, ము, వు, రు).

32. నాద్యస్యాదేశః.

(మొదటిదాని తద్ధర్మార్థముయొక్క) మొదటిదానికి (ప్రథమైకవచనమునకు దు, తి, అను నాగమము) లేదు. పోషించును. బహువచనమున దుగాగమ మున్నదనియే యర్థము : పోషించుదురు.

33. ద్వయోశ్చ భూతార్థే.

భూతార్థమున (ప్రథమ పురుషైక బహువచనముల) రెంటికిని లేదు. పోషించె (న్), పోషించి (రు).

34. బిన్దుపరస్య తకారో దోః స్యాత్.

బిందువుకంటెఁ బరమందున్న యాగమ దుక్కునకు తకారమగును. 'పోషించు+దు' అని యుండఁగా 'జా చోర్లుక్తద్ధర్మే' అను సూత్రమువలన 'పోషిం+దు' అని నిలువఁగా నీ సూత్రము వలన 'దు' వర్ణమునకు తకారమువచ్చి 'పోషిం+త్' అని యగును. దువర్ణములోని హల్మాత్రమునకే తకారాదేశమని యహోబలుఁడనెనుగాని, ముందుగా లక్ష్యము తెలిసియున్నఁదప్ప ఓట్లర్థము చెప్పుట కవకాశములేదు.

35. భూతా దుతాం పరేషా మిత్.

భూతార్థముకంటెఁ బరమందున్న (ప్రత్యయముల) యుత్తునకిత్తగును. అనఁగా భూతార్థమున 'ను, ము, వు, రు' అను ప్రత్యయములు 'ని, మి, వి, రి' అగును.

36. లఘ్వేకాక్షరపూర్వ క్రియా న్తిమ స్యానయో భవేదిద్వా.

లఘువగు నేకాక్షరము పూర్వమందు గల, అయంతము గాని ధాతువు తుదివర్ణమునకు ఇత్తు వైకల్పికముగా నగును; 'ఘట్' అనునది ధాతువు; దీనిలో తుదివర్ణమునకుఁ బూర్వవర్ణ మొక్కటే యున్నది; అది లఘువు; 'ఘట్' ధాతువు 'అయ్' అంతముకాదు; కాఁబట్టి ఘట్+ఇంచు = ఘటించు అనియు, ఘటి+ఇంచు = ఘటియించు అనియు రెండు రూపము లేర్పడుచున్నవి. 'రంజ్' ధాతువు తుదివర్ణమున కేకాక్షరమే పూర్వమందున్నను నది లఘువుకాదు. కావున, దానిపై నిత్తు చేరదు : రంజించు ; 'కరుణ' అను నామధాతువునకును 'విహర్' అను నుపసర్గముతోఁ గూడిన ధాతువునకును తుదివర్ణమునకుఁ బూర్వాక్షరము లఘువయినను నది యేకాక్షరము కాదు గావున నిత్తురాదు: కరుణించు, విహరించు. 'జయ్' అను ధాతువునకు బూర్వమందున్నది లఘువు నేకాక్షరము నైనను నది అయంతము గావున దానిపై నిత్తురాదు: జయించు. సూత్రమున 'వా' అనునది బాహుళకార్థమున నువ

యోగింపఁబడినది; కావున, నొకప్పుడు ప్రాదియోగమున లఘ్వక్షరకాక్షర పూర్వ ముకాని యంత్య వర్ణముగల ధాతువుపై నిత్తు చేరుటయుఁ గలదు. ఉత్తర్, దీని తుదివర్ణ పూర్వమున నేకాక్షరము లేకున్నను 'ఉత్తర్+ఇంచె = ఉత్తరించె; ఉత్తరి+ఇంచె = ఉత్తరియించె' అను రెండు రూపములును గలుగుచున్నవి.

37. తిఙ్మధ్యనామకాస్సు ర్మధ్యమపురుషాశ్చ యే రమాంతాశ్చ.

మధ్యమపురుష ప్రత్యయములును (వు, రు, వి, రి, ము, డుజ్ గాంత, మాంత క్రియలును (ఉత్తమ బహువచనము, మి, వర్ణకములు, ప్రథమాబహువచన రు, రి, ప్రత్యయములు), తిఙ్మధ్యమములను పేరు గల వగును. తిఙ్మధ్యమములు కళలని సంజ్ఞాప్రకరణమునఁ జెప్పఁబడినది.

38. చో రాత్మనే పదార్థే గృహ్ణాతా వాగమస్య వేత్వం స్యాత్.

క్రియాఫలము కర్తకు చెందునప్పుడు తెనుఁగునఁ జేరు 'కొను' ధాతువు పరమగుచుండఁగా ఆగమముగా వచ్చిన యించు (క్కు) నందలి తుది చు వర్ణముపై వైకల్పికముగ హ్రస్వ ఇకారము చేరును: పోషించికొను, పోషించుకొను, మొద.

39. రఞ్జతి ఘట్యాదీనాం బిన్దోశ్చ స్యాపి లా వుభౌ భవతః.

రఞ్జతి, ఘటి (రంజ్, ఘట్) మొదలగు ధాతువులపై జేరు నించుగాగ మమునందలి 'ంచ్' అనుదానికి 'ల్ల్' అనున దాదేశముగ వచ్చును: రంజించ్ +ఉ=రంజిల్ల్+ఉ=రంజిల్లు, ఘటించ్+ఉ=ఘటిల్ల్+ఉ=ఘటిల్లు, మొద.

40. సతు ణౌ భవేచ్చ లోపో ణ్యర్థేయో వర్తతే పరే తస్మిన్.

ణిచ్చుపరమగునప్పు డన్నచో 'ంచ్' కు 'ల్ల్' రాదు: పోషింపించు ('పోషింపిల్లు' అని కాదు); ణ్యర్థమునందువచ్చు ఇంచుగాగమము పరమగు చుండఁగా స్వార్థమున మొదట రంజతి ఘట్యాదిధాతువులపైఁ జేరిన యించు క్కునకు లోపము గలుగును: రంజ్(+ఇంచు+స్వార్థము) +ఇంచు (ణ్యర్థము), ఇంట్లుండఁగా స్వార్థేంచుక్కు లోపించి 'రంజించు' అనియే ణ్యర్థమున నిలుచును.

41. పునరాగమః క్రియాణామ్.

ధాతువులకుఁ బైని వివరించిన యాగమములే కాక యింకను ననేకవిధ ములైన యాగమములు (ఇంతకుముందు చెప్పినయర్థములందును చెప్పనియర్థ ములందును వచ్చును.) ఇది 'కాఁపుదల' సూత్రము; ఇది యనుక్త, దురుక్త, అత్యుక్త, పునరుక్త, అన్యథోక్త విషయముల నన్నిటిని సంరక్షించుట కేర్పడి నది. ఇంతవఱకును జింతామణియందు గ్రియలను గూర్చి చెప్పఁబడినదానిని బట్టి యీ క్రింది రీతి సమాపకక్రియారూపము లేర్పడుచున్నవి.

# సంస్కృత ధాతువు:---రక్ష్.

## వర్తమానము.



| పురుషము. | 'ఉండు' అనుబంధము | | | | 'ఉన్న' అనుబంధము. | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | స్వార్థము. | | ణిజర్థము. | | స్వార్థము. | | ణిజర్థము. | |
| | ఏక | బహు | ఏక | బహు | ఏక | బహు | ఏక | బహు |
| ఉత్తమ | రక్షించుచుండును (న్) | రక్షించుచుండుము | రక్షింపించుచుండును (న్) | రక్షింపించుచుండుము | రక్షించుచున్నను (న్) | రక్షించుచున్నము | రక్షింపించుచున్నను (న్) | రక్షింపించుచున్నము |
| | రక్షింపుచుండును (న్) | రక్షింపుచుండుము | ... | ... | రక్షింపుచున్నను (న్) | రక్షింపుచున్నము | ... | ... |
| | రక్షించుపుండును (న్) | రక్షించుపుండుము | రక్షింపించుపుండును (న్) | రక్షింపించుపుండుము | రక్షించుపున్నను (న్) | రక్షించుపున్నము | రక్షింపించుపున్నను (న్) | రక్షింపించుపున్నము |
| | రక్షింపుపుండును (న్) | రక్షింపుపుండుము | రక్షింపింపుపుండును (న్) | రక్షింపింపుపుండుము | రక్షింపుపున్నను (న్) | రక్షింపుపున్నము | రక్షింపింపుపున్నను (న్) | రక్షింపింపుపున్నము |
| మధ్యమ | రక్షించుచుండువు | రక్షించుచుండురు | రక్షింపించుచుండువు | రక్షింపించుచుండుడు | రక్షించుచున్నవు | రక్షించుచున్నరు | రక్షింపించుచున్నవు | రక్షింపించుచున్నరు |
| | రక్షింపుచుండువు | రక్షింపుచుండురు | ... | ... | రక్షింపుచున్నవు | రక్షింపుచున్నరు | ... | ... |
| | రక్షించుపుండువు | రక్షించుపుండురు | రక్షింపించుపుండువు | రక్షింపించుపుండురు | రక్షించుపున్నవు | రక్షించుపున్నరు | రక్షింపించుపున్నవు | రక్షింపించుపున్నరు |
| | రక్షింపుపుండువు | రక్షింపుపుండురు | రక్షింపింపుపుండువు | రక్షింపింపుపుండుడు | రక్షింపుపున్నవు | రక్షింపుపున్నరు | రక్షింపింపుపున్నవు | రక్షింపింపుపున్నరు |
| ప్రథమ: మహత్ | రక్షించుచుండుఁడు | రక్షించుచుండురు | రక్షింపించుచుండుఁడు | రక్షింపించుచుండురు | రక్షించుచున్నఁడు | రక్షించుచున్నరు | రక్షింపించుచున్నఁడు | రక్షింపించుచున్నరు |
| | రక్షింపుచుండుఁడు | రక్షింపుచుండురు | ... | ... | రక్షింపుచున్నఁడు | రక్షింపుచున్నరు | ... | ... |
| | రక్షించుపుండుఁడు | రక్షించుపుండురు | రక్షింపించుపుండుఁడు | రక్షింపించుపుండురు | రక్షించుపున్నఁడు | రక్షించుపున్నరు | రక్షింపించుపున్నఁడు | రక్షింపించుపున్నరు |
| | రక్షింపుపుండుఁడు | రక్షింపుపుండురు | రక్షింపింపుపుండుఁడు | రక్షింపింపుపుండురు | రక్షింపుపున్నఁడు | రక్షింపుపున్నరు | రక్షింపింపుపున్నఁడు | రక్షింపింపుపున్నరు |
| మహతీ | రక్షించుచుండుది | రక్షించుచుండురు | రక్షింపించుచుండుది | రక్షింపించుచుండురు | రక్షించుచున్నది | రక్షించుచున్నరు | రక్షింపించుచున్నది | రక్షింపించుచున్నరు |
| | రక్షింపుచుండుది | రక్షింపుచుండురు | ... | ... | రక్షింపుచున్నది | రక్షింపుచున్నరు | ... | ... |
| | రక్షించుపుండుది | రక్షించుపుండురు | రక్షింపించుపుండుది | రక్షింపించుపుండురు | రక్షించుపున్నది | రక్షించుపున్నరు | రక్షింపించుపున్నది | రక్షింపించుపున్నరు |
| | రక్షింపుపుండుది | రక్షింపుపుండురు | రక్షింపింపుపుండుది | రక్షింపింపుపుండురు | రక్షింపుపున్నది | రక్షింపుపున్నరు | రక్షింపింపుపున్నది | రక్షింపింపుపున్నరు |
| తిర్యగ్జడ | రక్షించుచుండుది | రక్షించుచుండువి | రక్షింపించునుండుది | రక్షింపించుచుండువి | రక్షించుచున్నది | రక్షించుచున్నవి | రక్షింపించుచున్నది | రక్షింపించుచున్నవి |
| | రక్షింపుచుండుది | రక్షింపుచుండువి | ... | ... | రక్షింపుచున్నది | రక్షింపుచున్నవి | ... | ... |
| | రక్షించుపుండుది | రక్షించుపుండువి | రక్షింపించుపుండుది | రక్షింపించుపుండువి | రక్షించుపున్నది | రక్షించుపున్నవి | రక్షింపించుపున్నది | రక్షింపించుపున్నవి |
| | రక్షింపుపుండుది | రక్షింపుపుండువి | రక్షింపింపుపుండుది | రక్షింపింపుపుండువి | రక్షింపుపున్నది | రక్షింపుపున్నవి | రక్షింపింపుపున్నది | రక్షింపింపుపున్నవి |

| పురుషము. | స్వార్థము. | | ణిజర్థము. | |
|---|---|---|---|---|
| | తద్ధర్మము. | | | |
| | ఏక | బహు | ఏక | బహు |
| ఉత్తమ | పోషింతు (న్) | పోషింతుము | పోషింపింతు (న్) | పోషింపింతుము |
| మధ్యమ | పోషింతువు | పోషింతురు | పోషింపింతువు | పోషింపింతురు |
| ప్రథమ మహత్ | పోషించు (న్) | పోషింతురు | పోషింపించు (న్) | పోషింపింతురు |
| మహతీ | పోషించు (న్) | పోషింతురు | పోషింపించు (న్) | పోషింపింతురు |
| తిర్యగ్జడ | పోషించు (న్) | పోషించు (న్) | పోషింపించు (న్) | పోషింపించు (న్) |
| | భూతము. | | | |
| ఉత్తమ | పోషించితిని (న్) | పోషించితిమి | పోషింపించితిని (న్) | పోషింపించితిమి |
| మధ్యమ | పోషించితివి | పోషించితిరి | పోషింపించితివి | పోషింపించితిరి |
| ప్రథమ మహత్ | పోషించె (న్) | పోషించిరి | పోషింపించె (న్) | పోషింపించిరి |
| మహతీ | పోషించె (న్) | పోషించిరి | పోషింపించె (న్) | పోషింపించిరి |
| తిర్యగ్జడ | పోషించె (న్) | పోషించె (న్) | పోషింపించె (న్) | పోషింపించెన్ |
| | వ్యతిరేకము. | | | |
| ఉత్తమ | పోషింపను | పోషింపము | పోషింపించను<br>పోషింపింపను | పోషింపించము<br>పోషింపింపము |

| పురుషము. | స్వార్థము. | | ణిజర్థము. | |
|---|---|---|---|---|
| | | తద్ధర్మము. | | |
| | ఏక | బహు | ఏక | బహు |
| మధ్యమ | పోషింపవు | పోషింపరు | పోషింపించవు<br>పోషింపింపవు | పోషిఢపించరు<br>పోషింపింపరు |
| ప్రథమ మహత్ | పోషింపఁడు | పోషింపరు | పోషింపించఁడు<br>పోషింపింపఁడు | పోషింపించరు<br>పోషింపింపరు |
| మహతీ | పోషింపదు | పోషింపరు | పోషింపించదు<br>పోషింపింపదు | పోషింపించరు<br>పోషింపింపరు |
| తిర్యగ్జడ | పోషింపదు | పోషింపవు | పోషింపించదు<br>పోషింపింపదు | పోషింపించవు<br>పోషింపింపవు |
| | | సంప్రార్థనము. | | |
| మధ్యమ | పోషింపుము | పోషింపుఁడు | పోషింపించుము<br>పోషింపింపుము | పోషింపించుఁడు<br>పోషింపింపుఁడు |

i. పై రూపములలో 'ఉన్న' అనుబంధముపై 'ను, ము, వు, రు, డుజ్' లు చేరునప్పుడు దాని తుది యత్తునకు దీర్ఘము కలుగునని చింతామణియందు లేదు కావునఁ గొన్ని యనిష్టరూపము లేర్పడుచున్నవి.

ii. భవిష్యదర్థక రూపములందు 'అత్' వచ్చునని యున్నదికాని, ఆ యత్తుపై నుమాగమము వచ్చునని చెప్పఁబడి యుండలేదు; కావునఁ గొన్ని యనిష్టరూపము లేర్పడుచున్నవి.

iii. 'చోః పస్స్యా(స్యా)త్' అనునప్పుడు 'చు' వర్ణమున కంతటికిని అత్వవిశిష్టమగు పత్వమో, పొల్లుపకారమో కలుగును గావున, గొన్ని యనిష్ట రూపము లేర్పడుచున్నవి. వానిని పై పట్టికలలో వివరింపలేదు.

iv. పత్వముగలుగు చు వర్ణము ధాతువుపై స్వార్థమునఁజేరు చు వర్ణమో, 'చు రితి క్రియాపదానాం' అను సూత్రమువలననే వర్తమానకాలమున ధాతువులపైఁ జేరిన చు వర్ణమో, లేక రెండునో తెలియదు. స్వార్థంచుప్ప వర్ణ మనుకొనినఁ గొన్నియనిష్టరూపములును, వర్తమానార్థమున వచ్చున దను కొన్నఁ గొన్నియు, రెండును ననుకొన్న మఱికొన్నియుఁ గలుగుచున్నవి.

v. 'వసతి' యనిన 'ఉండు' అనియు, 'అస్తి' అనిన 'కలుగు' అనియు నర్థము చెప్పవలెనో, యట్టి యర్థము గల యితర తత్సమాచ్ఛిక ధాతువులను గ్రహింపవలెనో తెలియదు. 'ఉన్న' కల, అను అనుబంధములనే యేల చేర్ప వలెనో తెలియదు.

vi. పట్టికలందు వివరించిన యనేక రూపములకు నన్నయభారతమునఁ బ్రయోగములు కానరావు.

vii. నన్నయ వాడిన యనేక తత్సమక్రియారూపములకైనను చింతా మణియందు గతి కానరాదు.

viii. శత్రర్థక, తుమున్నర్థక, వ్యతిరేక క్త్వార్థకా ద్యసమాపక క్రియా రూపనిష్పత్తి చింతామణివలనఁ దెలియదు.

ix. ధాతుజవిశేషణములలో భూతార్థ, ప్రతిషేధార్థములు గలవానిని గూర్చియే చింతామణివలనఁ దెలియును; తక్కినవానినిగూర్చి తెలియదు.

x. ఆశీశ్శాప విధ్యర్థములందు గలుగు క్రియారూపములనుగూర్చి చింతామణివలనఁ దెలియదు.

xi. ఎదు, ఎద, ఎడు, ఎడి, మొదలగు ప్రత్యయములతోడి రూపముల కునుఁ జింతామణియందు గతి లేదు.

దేశ్యక్రియల కాయా యర్థములందు గలుగు రూపములనుగూర్చి ప్రసక్తియే లేదు. కావున 8-వ సూత్రమున చెప్పఁబడిన యాత్మనేపదార్థక

'కొను' ధాతువుపై నెట్టి రూపములు గలుగునో చింతామణినిబట్టి తెలిసికొన వీలులేదు.

ఇట్టివాని కన్నిటికిని 'పునరాగమః క్రియాణామ్' అను సూత్రమే శరణ్యమగుచున్నది. దానిమూలమున కావ్యములందును వ్యవహారమునందును గల యాయా యనుక్త రూపములను సాధించుకొనవచ్చును. ఈ సూత్రమునందలి 'ఆగమ' శబ్దము వైయాకరణ సంప్రదాయము ననుసరించి యాదేశ, లోప, వర్ణవ్యత్యయములకును నుపలక్షణమనియుఁ జెప్పికొనవచ్చును.

42. పర్యాప్తో మన్మతే తు సఙ్కేతః.

నా మతమున నాంధ్రశబ్దములఁగూర్చి చేయవలసిన వ్యాకరణ సంకేతము ముగిసినది.

* 43. సంప్రార్థనార్థకా దీత్.

సంప్రార్థనమున క్రియలపై వచ్చు ముడుజ్ఞులపై దీర్ఘమగు ఈకారము వచ్చును: పోషింపుమీ, పోషింపుఁడీ; మొద. ఇట్టి రూపములు నన్నయభారతమున లేవు.

* 44. ఏ దాతౌ ప్రశ్నలక్షణౌ భవతః.

దీర్ఘములగు ఏకారమును, ఆకారమును ప్రశ్నమునకు గుఱుతు లగుచున్నవి. ఏత్, ఆత్, అనునవి చేరిన ప్రశ్నరూపములు నన్నయకాలమునఁ గానరావు. ఈ 'ఏ, ఆ' లు క్రియల యే రూపములపైఁ జేరునో చింతామణి వలనఁ దెలియరాదు.

* 45. ఏదోతౌ వ్యతిరేకాదపి సంప్రార్థనపరౌ క్రియాణాం స్తః.

క్రియల వ్యతిరేకార్థకరూపములమీఁదఁ గూడ ఏ, ఓ, లు చేరి సంప్రార్థనమును దెలియఁజేయును: పోషింపవే, పోషింపవో, పోషింపరే, పోషింపరో మొద. ఇట్టి రూపములును నన్నయకాలమునఁ గానరావు. 'వ్యతిరేకాదపి' అనుటవలన నింక నేయే రూపములపై నవి చేరునో స్పష్టము కాలేదు.

46. భావే టవర్ణకోఽన్తే సర్వేషాం చ క్రియాపదానాం స్యాత్.

అన్ని ధాతువులమీఁదను భావార్థమున టవర్ణము చేరును: పోషించుట, మొదలయినవి.

47. కర్త్ర్యనుబన్ధకః స్యాత్ప్రతిధాతుః కర్తృవచ్చ తద్విధయః.

కర్త్రర్థమున 'పడు' ధాతు వనుబంధముగఁ జేరును. దానిపైఁ గర్త్రర్థమందువలె కార్యములగును, 'పడు' ధాతువు దేశ్యము కావునను, దేశ్యధాతువు

నుండి కలుగు సమాపకాసమాపక క్రియారూపములఁ గూర్చి చింతామణి తెలుపలేదు కావునను, కర్మణ్యర్థమునఁ గలుగు రూపములను జింతామణి నుండి తెలిసికొన వీలులేదు.

48. అత్వాది తత్సమానామివ దేశ్యానాం క్రియాపదానాం స్యాత్.

తత్సమ క్రియాపదములకువలె దేశ్యక్రియాపదములకును 'వ్యతిరేక' భావ్యర్థములందు గలుగు అత్వము మొదలగు కార్యములు కలుగును. 'అత్వాది' అని చెప్పుటవలన నెట్టికార్యములు కలుగునో తెలిసికొన వీలులేదు. దేశ్యక్రియాపదముల రూపప్రక్రియను దెలిసికొనుటకీసూత్ర మొక్కటియే యున్నది. అది యిదమిత్థమని యించుకయుఁ దెలుపదు. తత్సమక్రియాపద ములవలె దేశ్యధాతువులనుండి క్రియాపదముల నేర్పఱిచినయెడల నెన్నియో యనిష్టరూపము లేర్పడఁ గలవు.

49. వర్ణాగమో విశేషః పురుషే ష్వర్థేషు చాఽపి వచనేషు.

(దేశ్యక్రియాపదములందు) పురుషములందును, అర్థములందును, వచనములందును తత్సమ క్రియాపదములందు వర్ణాగమము విశేషముగఁ గలుగును. ఈ సూత్రమును బట్టి, దేశ్యక్రియల గ్రాంథిక వ్యావహారికరూపముల నన్నిటిని సాధింపవచ్చును. ఇందలి వర్ణాగమ మనునది వర్ణాదేశ, వర్ణలోప, వర్ణవ్యత్యయములకును నుపలక్షణ మనుకొనవలెను. అట్లనుకొనకున్నయెడల ననేక గ్రాంథిక క్రియాపదముల రూపనిష్పత్తియు కలుగదు.

క్రియాపరిచ్ఛేదమందలి సూత్రములేకాక తక్కిన పరిచ్ఛేదములందలి సూత్రములును దత్సమపదముల రూపములను మాత్రము సాధించుననియు, దేశ్యపదములరూపములను గ్వాచిత్కముగమాత్రము సాధించుచున్నవనియుఁ గంఠోక్తిగ నేదేని సూత్రము దేశ్యరూపముల సాధనప్రక్రియకే యని చెప్పకుండినయెడల నది తత్సమపదములకు వర్తించునని మాత్రము చెప్పవలయు ననియుఁ గొంద ఱందురు. చింతామణిసూత్రములను బరిశీలించి, వానిని (i) తత్సమదేశ్యములకు రెంటికిని వర్తించునవి (ii) కేవల తత్సమరూప సాధనఁజేయునవి (iii) కేవలదేశ్యములకు వర్తించునవి యని మూఁడు వర్గములుగ నేర్పఱుపవచ్చును.

(i) తత్సమదేశ్యములకు రెంటికిని వర్తించునవి.

సంజ్ఞాపరిచ్ఛేదము: 1-4; 6-16, 18, 49-52; 56-74=39 సూత్రములు.

సంధిపరిచ్ఛేదము: 1-51 = 51 సూత్రములు.

అజంతపరిచ్ఛేదము: 1-14; 16-19; 22-41; 45-47; 58-61; 63, 46, 68, 70 = 52 సూత్రములు.

హలంతపరిచ్ఛేదము: 32-43; 50 = 13 సూత్రములు.

క్రియాపరిచ్ఛేదము: 9-35, 37-49 = 40 సూత్రములు.

మొత్తము: 195 సూత్రములు.

(ii) కేవల తత్సమములకు సంబంధించినవి.

అజంత పరిచ్ఛేదము: 15, 20, 21, 42, 48, 50, 53, 56, 57, 62, 65- 67, 69, = 41 సూత్రములు.

హలంతపరిచ్ఛేదము: 1-10 = 10 సూత్రములు.

క్రియాపరిచ్ఛేదము: 1-8; 36 = 9 సూత్రములు.

మొత్తము: 33 సూత్రములు.

(iii) కేవల దేశ్యములకు వర్తించునవి.

సంజ్ఞాపరిచ్ఛేదము: 5, 17, 19- 48; 53- 55; = 35 సూత్రములు.

అజంతపరిచ్ఛేదము: 43, 44, 49, 54, 55, 71- 88=23 సూత్రములు.

హలంతపరిచ్ఛేదము: 11-31; 44, 49, = 23 సూత్రములు.

మొత్తము: 81 సూత్రములు.

ఇట్లు 309 సూత్రములలో ముప్పదిమూఁడు మాత్రము తత్సమరూప సాధన కుమాత్ర మనుకూలముగ నున్నవి. అందును గొన్నిటిని దేశ్యరూప సాధనకనుగుణముగఁ గూడ నన్వయింపవచ్చును. అందుచే నాంధ్రశబ్దచింతామణి తత్సమప్రక్రియను బోధించుట కేర్పడిన దనుట తగదు.

# ఉత్తరాంధ్రము

## పండ్రెండవ ప్రకరణము.

నన్నయకాలపు భాషకు లక్షణము నేర్పఱిచిన రీతిగాఁ బ్రతిశతాబ్దమునందలి భాషకును నేర్పఱిచినఁగాని యాంధ్రభాషాచరిత్రమును సంపూర్ణముగ వివరించుటకు వీలులేకుండును. అట్టి పనిఁ జేయుట యొకరిద్దఱకు సాధ్యమగు పనికాదు. పూర్వకాలపు భాషయంతయును నేఁడు లేదు; గ్రంథరూపమునఁ గంటఁబడిన భాషకు మాత్ర మెట్లయిన లక్షణము నేర్పఱుచుకొనవచ్చును. కాని, యట్లు మిగిలిన భాషయైనను నాఁటనుండి నేఁటివఱకు నిలిచిన శాసనాదికముల మూలమున మనకుఁ గానవచ్చునది మాత్రమే సంపూర్ణప్రమాణ మగును. తాళపత్రాదులపై మనకుఁ జేరిన పూర్వభాషవిషయముననంత నిబ్బరముగ లక్షణము నేర్పఱుచుట కష్టము. తాళపత్ర గ్రంథములా యా కాలములనాఁటివి నేఁటివఱకు నొక్కటేరూపమున మనకు లభింపకున్నవి. వ్రాయసకాండ్ర భ్రమ ప్రమాదములచేత నేమి, తరువాతి పండితులును గవులును వానియందు చేసిన మార్పులవలననేమి, యాయా గ్రంథములు యథాకవిగ్రథితములుగ మనకు లభింపకున్నవి. అట్టియెడ నాయా కాలములందలి శాసనముల మూలమునను తాళపత్రగ్రంథపరిశోధనమువలనను నొక్కొక్క గ్రంథమునందలి భాషను నిర్ణయించుకొనవలసియుండును. అట్టిపని యింతవఱకును జరిగియుండలేదు. కావున సాధ్యమయినంతవఱకు ముద్రిత గ్రంథముల మూలమునను, నందలి పుటలయడుగున తత్తత్పరిష్కర్త లను గ్రహించిన పాఠాంతరముల మూలమునను నెట్లో పాఠములను సరిపెట్టుకొనవలసియున్నది. ఇట్లు చేయుటవలన నొకరీతిగ మాత్రము భాషాచరిత్రము నేర్పఱుచుకొనఁగలము.

నన్నయకాలపు ఆంధ్రభాషాలక్షణము నేర్పఱుప నేను బ్రయత్నించినట్లే యితరకవుల గ్రంథములకును నితరులు లక్షణము నేర్పఱుపఁ బ్రయత్నింపవలసియున్నది. అట్టి ప్రత్యేకలక్షణగ్రంథములు బయలువెడలువఱకును భాషాచరిత్ర నిర్మాణవిషయమున మనకు సంతృప్తి గలుగఁజాలదు. నన్నయకాలమునకుఁ దరువాతికాలపు ప్రయోగము లాయా సందర్భములందీ గ్రంథమునఁ బొందుపఱుపఁబడియున్నవి. ప్రస్తుత పరిశోధనముల స్థితిలోనంతకంటె నెక్కువగఁ జేయుట సాధ్యముకాదు.

ఆయా ప్రకరణములం దిప్పటివఱకు సేకరింపఁబడిన ప్రయోగములు సాధ్యమగునంతవఱకుఁ జేర్పఁబడినవి. వానియందు చేరక మిగిలిన ప్రయోగములలోఁ గొన్నిటి నుత్తరాంధ్ర మనుపేర నీ ప్రకరణమునఁ బొందుపఱుపఁ బ్రయత్నించుచున్నాను.

లాక్షణికులు దమ కపశబ్దములుగాఁ దోఁచినవానిని గ్రామ్యములుగ నిషేధించియున్నారు. ఇట్టి నిషేధమునకుఁ గారణము తమకుఁ బూర్వుల కావ్యములం దాయా రూపములు లేకుండుటయుఁ దనకాలమున నవి తల చూపుచుండుటయు నని యనుకొనవచ్చును. పూర్వలాక్షణికు లిట్టి దృష్టితో నాయాశబ్దరూపములను నిషేధించినను దరువాతికవులు వానిని ప్రయోగింపక మానరైరి. వ్యవహారము లక్షణముకంటె వారికి బలవత్తరమయ్యెను. అర్వాచీనలాక్షణికులకుఁ బూర్వలక్షణమే ప్రమాణమయ్యెను. గాని, కవుల ప్రయోగములు కాలేదు. కావున నానాఁటికిని లక్షణముకంటె నిషేధమే యెక్కువ యగుచువచ్చెను. ప్రయోగములను వ్యవహారమును విడిచి లక్షణమును గూర్పనెంచుట నేలవిడిచి సాముచేయుట వంటిదయ్యెను. కావుననే, యొక లాక్షణికుఁడు విధించినదాని నింకొకఁ డాక్షేపించుటయు నొకఁడు నిషేధించిన దాని నింకొకఁడు గ్రహించుటయు సంభవించెను.

ఆంధ్రవ్యాకరణ సంప్రదాయ మనేకవిధములుగ నున్నది. ఒకటి యాంధ్రశబ్ద చింతామణియే సంపూర్ణ వ్యాకరణమని తలంచి, దానియందలి లక్షణము నతిక్రమించిన ప్రయోగములను నిషేధించునది. మఱియొకటి యథర్వణుని సంప్రదాయము. ఆంధ్రశబ్ద చింతామణి యసంపూర్ణ లక్షణ గ్రంథమని తలంచి దానిని నవరించి వివరించునట్టిది. అహోబలుఁ డాంధ్రశబ్ద చింతామ ణ్యథర్వణకారికావళులతోఁ దెనుఁగు లక్షణమున కవధిఁ గల్పించి నాఁడు. కాని, తరువాతివారగు కూచిమంచి తిమ్మకవియు, నడిదము సూర కవియు నాయవధి నతిక్రమించి కవులకు మార్గదర్శకులైరి. తరువాతఁ జిన్నయసూరి యహోబలుని సంప్రదాయమును నిలబెట్టుటకు బాలవ్యాకరణ మును రచించెను. బహుజనపల్లి సీతారామాచార్యులవా రథర్వణసంప్రదా యమును సాగించుచు బాలవ్యాకరణమునకుఁ గారికా రూపమునఁ బ్రౌఢ వ్యాకరణమును రచించిరి. ఈ లాక్షణికుల సంప్రదాయమునకుఁ జేరని యాంధ్రభాషాభూషణాది వ్యాకరణములును గొన్ని పొడచూపినవి. ఈ లక్షణగ్రంథముల చరిత్ర మెట్లున్నను, వీనిలో నొకటిగాని, యన్నియుఁగాని యాంధ్రభాషకు సంపూర్ణలక్షణమును జేకూర్చునట్టివి కావు. ఆయా లక్షణ కర్తల దృష్టికి సాధువులని తోఁచిన ప్రయోగములకు మాత్రము లక్షణము

పుట్టినది. తక్కినవానిలోఁ గొన్నిటికి నిషేధము కలిగినది; మిగిలిన యనంత భాష లక్షణాగతికమైనది.

ఆంధ్రశబ్ద చింతామణి కావ్యభాషకు నియమమును గల్పించుటకై యేర్పడినది. కావుననే "విశ్వశ్రేయః కావ్యమ్; తదదోషా పరిష్కృతా చ వాగర్థౌ; సా వా గ్యా రసవృత్తిః; సాధ్వ్యోహి రసో యథా త(య)థం కవిభిః" అను నార్యాగీతితో నాలక్షణగ్రంథ మారంభ మగుచున్నది. పిదప "స్వస్థాన వేషభాషాభిమతా స్సన్తో రసప్రలుబ్ధధియః లోకే బహుమన్యన్తే వైకృత కావ్యాని చాన్య దపహాయ" అవి రసప్రలుబ్ధ ధీమంతులు వైకృత కావ్యములను బహుమానింతురని తెలుపఁబడినది.

వ్యాకరణము ప్రయోజనము రసముకాదు. రసదృష్టితో పాణిన్యాదులు సంస్కృతమునకును నితరు లితర భాషలకును వ్యాకరణమును వ్రాసియుండలేదు. భాషా స్వరూపము నేర్పరించుటయే లక్షణ గ్రంథముల ప్రయోజనము. వ్యాకరణ మొక శాస్త్రము; అది భాషా తత్త్వమును నిరూపించునట్టిది. అది చేయు నియమములు రాజాజ్ఞలవంటివి కావు; అవి సంస్కారమే ప్రయోజనముగాఁ గలవి. "వర్ణలోప, వర్ణాగమ, వర్ణవ్యత్యయ, ప్రకృతి భావలక్షణ స్సంస్కారః" అని కాత్యాయనుని ప్రాతిశాఖ్యము. ఇక్కడ నీ శబ్ద రూపమున నీ వర్ణమునకు లోపము గలిగినది; ఇక్కడ నీ వర్ణ మాగమముగా వచ్చినది; ఇక్కడ వర్ణ వ్యత్యయము గలిగినది; ఇక్కడ నిది ప్రకృతి భావమున నిలచినది, అని తెలియఁజేయుటయే సంస్కారము.

ఇట్లుండఁగా నున్నరూపమును మార్చియు, నిషేధించియుఁ జేసిన నియమము గ్రాహ్యము కాఁజాలదు. అట్టి నియమమును జేసినను లోకము దాని ననుసరింపదు. పంచాంగములు మాఱిన గ్రహగతులు మాఱవు; వృక్ష శాస్త్రము సరిగ లేకున్నఁ జెట్లు తమ సహజ స్వరూపమును విడనాడవు. అయిన భాషకు నియమ మక్కఱలేదా యని యనేకు లడుగుచుందురు. నియమము లేని భాషయే లేదని దానికిఁ బ్రత్యుత్తరము; పదప్రత్యయ విభాగము, విభక్తి, వచన, లింగ, పురుషములు మున్నగు వ్యాకరణవిషయములు సంపూర్ణముగ లేని భాషయే యుండఁజాలదు. అయిన భాషా విషయమునఁ బ్రమాణ మక్కఱలేదా యని యడుగవచ్చును. ప్రమాణమనునది యొక కల్పిత భావము; ప్రమాణమైన మనుష్యుఁడు, ప్రమాణమైన గుఱ్ఱము, ప్రమాణమైన చెట్టు నను వ్యక్తులెట్లు దుర్లభములో, ప్రమాణ భాషా విషయమునఁగూడ నంతే. ఏదో యొక ప్రామాణిక కృతకభాషను గల్పించి కొన్నను, నది యా రూపమునఁ జిరకాల ముండఁజాలదు. ప్రపంచమునకును భాషకును బరిణామము సహజము. పరిణామప్రవాహ రూపమున లోకము

నకు నిత్యత్వము గలదు. నన్నయనాఁ డుండిన మనుష్యులవంటి మనుష్యులు, నాచారములవంటి యాచారములు, వ్యవహారములవంటి వ్యవహారములు, నేఁడెట్లు లేవో, నాఁటి భాషయు నేఁడులేదు. అది పరిణామమును బొంది నది. కొందఱు పాడయిన దనవచ్చును; బాల్యమునుండి యౌవనమును బ్రాపించుట పాడగుట యైనయెడల నేఁటిభాష పాడైనదే యగును. అయిన నేమి చేయవలెను ? మన వ్యవహారమును మానుకోఁ గలమా? తిరుగ బాల భాషితము నభ్యసింప వలెనా?

"సిద్ధిర్లోకాద్ద్రష్టవ్యా" అను సూత్రములోని 'లోక' శబ్దమునకు 'శిష్ట లోక'మని కొందఱును, 'కవిలోక' మని కొందఱును, 'ప్రాచీనకవి' లోక మని కొందఱును, "ప్రాచీనతముఁ"డగు నన్నయ యొక్కఁడే యా లోకమనికొంద ఱును నర్థమును చెప్పి, లక్షణమును జాల సంకుచితము చేసిరి. నన్నయ విడి చిన యరణ్యపర్వ భాగమును బూరించిన యెఱ్ఱన్నకే నన్నయభాషా తత్త్వము సరిగ పట్టుపడనప్పు డాతని కింకను దూరమున నున్న మన కది వేద్యమగుట కష్టమని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. శ్రమ చేయఁగాచేయఁగా నేమూలనుండియో కొంతభాగమును మాత్రము కనుగొనుటకు వీలగునే కాని, యాకాలపు భాషకు సంపూర్ణ లక్షణము నేర్పఱుచుటకు శక్యముకాదు. అట్టి లక్షణమును సంపూర్ణముగ నేర్పఱుచుటకు సాధన సామగ్రి చాలదు. భారత కథలో రెండున్నర పర్వముల కథకు సరిపోయిన భాషను మాత్రము నన్నయ యుపయోగించినాఁడు; అదిగాక చాలవఱకు సంస్కృత పదములతోఁ గాల క్షేపము చేసినాఁడు; ఆ నాఁటి తక్కిన భాషకు స్వరూప మెట్లుండెనో తెలిసి కొనుటకు శాసనములు కొంత తోడ్పడుచున్నవి; కాని, వాని మూలమునను నెక్కువ ప్రయోజనము గలుగదు.

ప్రాచీన కావ్యములను జదువుకొని యందలి మార్గమునే యవలంబింప వలెననుట యనుసరింప సాధ్యముకాని యుపదేశము. జీవితకాలమంతయు భాష యందు కృషిచేసిన పండితులకే ప్రాచీనాంధ్రభాషాలక్షణము దురవగాహ ముగానుండ, సామాన్యజనుల కది యందని మ్రానిపండే యగును. ఏనాఁటి వ్యవహార మానాఁటిది; ఏనాఁటిభాష యానాఁటిది. శబ్దములను విచారము లేకుండ నిషేధించుటవలన లాభములేదు.

ప్రాచీన లాక్షణికులు చేసిన నిషేధములు తమ లక్షణగ్రంథము లందే నిలిచినవి. "ఉత్తరాంధ్ర కవులూరక యుండ"లేదు. తమకుఁ దోచి నట్లు దామును గ్రంథములను రచించిరి; తమ వ్యవహారమునందున్న రూప ములను విడనాడక ప్రయోగించుకొనిరి. వారును రసప్రలుబ్ధ ధీశాలులే. వారి గ్రంథములును నాఁడును నేఁడును దెనుఁగువారి కాదరణ పాత్రములైనవి.

ఆంధ్రశబ్ద చింతామణికారుఁడు "విరళాన్ పేచోపాదికశబ్దాన్ ప్రవ్యాహరన్తు శబ్దజ్ఞాః, ఇహ తు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధ మేవ పదమ్" అని ఘంటాఘోషముగా చెప్పినను లాక్షణికులు వ్యవహారమున సంకేతిత సుప్రసిద్ధములైన పదములను నిషేధించి, యెన్నఁడో కవులు వాడినట్టియు నేఁడు వ్యవహారభ్రష్టములైనట్టియు పదములనే యతిప్రీతితోఁ జూచుచు, ప్రాచీనశబ్ద స్వరూపము తమకు గోచరింపని పట్టుల, వ్యావహారికరూపము దుష్టమను తలంపుతోఁ గృతకరూపములతో రసపుష్టిఁ గలిగింపనెంచుట భాషకు కీడుగలిగించుట గాని వేఱుగాదు.

ఈ క్రింద నాయా లాక్షణికులు నిషేధించిన రూపములును, నా రూపములనుత్తరాంధ్రకవు లెట్లు తమగ్రంథములందు వాడినదియుఁ జూపఁబడును.

కేతన నిషేధించిన రూపములు.

పంచకుము, తోపించకుము; వాటిని; మమ్మాన్ = మమ్మును; గొంటూరమ్మ; ఏదాలు; మోసేటివారు; ఆసనేనువారు; వాఁడి; బాడిగ; ఈఁడు, ఇనుతి; పంపేరు, తెంపేరు; పాడేరు, చూసేరు; ఇందాము, కందాము; ఇస్తి; అటుకు; దవ్వు; వెగడు; అషువలె, ఇషువలె; ఆడ, ఈడ, ఏడ; అచ్చు; ఇచ్చు; నోయన్, కాయన్, వేయకుండు; ఆఁడు, బామ్మఁడు; గద్ద, గుద్ద.

అప్పకవి.

చెవులు, కనులు, బుగ్గలు, పండ్లు, చండ్లు, బొడ్డు, ముడ్డి, కాళ్లు, చెంచు, ఉయ్యాల, పయ్యెద, తాయతు; తన్ను, నిన్ను, నన్ను, లు ద్రుతప్రకృతికములు కావు. కనెన్, వినెన్; రేఫ శకటరేఫములకు యతిప్రాసల విషయమున విరోధము.

అహోబలుఁడు.

అంట, కొంట, మొద.

చిన్నయసూరి.

1. వస్తాఁడు, తెస్తాఁడు; వచ్చేని, తెచ్చేని; వచ్చేవాఁడు, తెచ్చేవాఁడు; వచ్చేటివాఁడు, తెచ్చేటివాఁడు.

2. స్త్రీవాచక తత్సమ సంబోధనాంతంబులకు సంధిలేదు; సంస్కృతీయంబునకు సంధియగునని యధర్వణాచార్యులు చెప్పిరిగాని, దానికిం బూర్వ కాలంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు.

3. క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు.

4. కూఁతురులు, కూఁతుళ్లు, కూఁతురి నిత్యాది రూపంబులు గ్రామ్యంబు లని యెఱుంగునది.

5. ఆకర్ణించుదురు, దంచుదురు, ఆకర్ణించన్, దంచన్, ఆకర్ణించక, దంచక, ఇత్యాది రూపములు ప్రామాదికములు.

6. చేతురు, కోతు రిత్యాదు లసాధువులని యెఱుంగునది.

పై నాయా వ్యాకరణకర్తలు నిషేధించిన రూపములకు గ్రంథముల నుండి పెక్కు లుదాహరణముల నీయవచ్చును. వానినన్నిటిని గవులు యథేచ్ఛముగఁ బ్రయోగించికొనిరి. అట్టియెడ వానికిని బ్రమాణత్వమును గల్పించుటకు సూత్రములను జేయుట వైయాకరణుల ధర్మము.

లాక్షణికులు నిషేధించిన యాయా విషయములందే కాక యింక ననేక విషయములందు పూర్వాంధ్రమునకును నుత్తరాంధ్రమునకును భేదములు గలవు. ఆభేదములను చూపుటమాత్రమే మీ యాంధ్రభాషా చరిత్రము పని. ఆంధ్రభాషాలక్షణమును విశాలముచేయుట కాయా ప్రయోగము లుపకరింపఁగలవు. వీనిలోఁ గొన్నిటిని గుప్తార్థప్రకాశికాకారులగు కీ. శే. బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులుగారు చూపియేయున్నారు. కాని, వారు వాని నంగీకరింపక యవి లక్షణ నురక్షితంబులు కావని పరిహరించిరి. ఆయా ప్రయోగము లపరిహార్యములనియు, వానినిజేకొని విశాల మగు వ్యాకరణము నాంధ్రభాషకుఁ గల్పింపవలయుననియు భాషాభివృద్ధిని జ్ఞానవ్యాపనమును గోరువారికి వేఱ చెప్ప నక్కఱలేదు.

## సంస్కృతము.

తెనుఁగున సంస్కృతము వాడుక యనేక విధములుగ నూఱినది. సంస్కృతపదముల యుచ్చారణము తెనుఁగువారి నోటఁబడి యెన్నియో రీతులఁ బరివర్తనము నొందినది. అందుమూలమునఁ దత్సమములును నర్ధతత్సమములును, తద్భవములును గలిగినవి. తత్సమములలో నతిప్రాచీనములు కొన్ని; నర్వాచీన తత్సమములు కొన్ని; తద్భవములలోఁ బ్రాచీనతద్భవములు కొన్ని, యర్వాచీనతద్భవములు కొన్ని. మిక్కిలియు వికారమునొందిన తద్భవము లనేకములు దేశ్యములుగఁ బరిగణింపఁబడుచున్నవి. కేవల తత్సమములుగా నేఁడు వ్యవహారము నున్న పదములును నాంధ్రభాషాసంప్రదాయము ననుసరించి యుచ్చారణమున మార్పుఁజెందినవి.

వ్యవహారమునఁబడిన సంస్కృతపదములు మార్పు నొందుట సహజమే; కాని, గ్రంథకర్తలును గవులును నట్టి మార్పులను గణింపక యాపదములను బ్రయోగించుటయే వింత. సంస్కృతభాష నెఱుఁగుటలు గమనించుట కష్టమైన పనియే; దానికి సంస్కృత వ్యాకరణమును సంపూర్ణముగ నభ్యసింపవలెను; సంస్కృత వాఙ్మయముతో బాగుగఁ బరిచయము గలుగవలెను. ఇంత కృషి చేసినను నిత్యమును నా భాషతో సంబంధము లేకపోవుటచే నెన్నియో

సందేహములు గలుగుచునే యుండును. సాధారణజనులమాట యటుండ సంస్కృతము నభ్యసించి కవులయినవారి గ్రంథములందే సంస్కృతభాషాను సారులుగాని యనేక ప్రయోగములు దొరలియున్నవి. ఆపండితకవులును వ్యవహారధోరణికి లోఁబడక తప్పినదికాదు. సంస్కృతవాఙ్మయమునందలి గావ్యమార్గము ననుసరించుటచేతఁ గాదంబర్యాదులందువలె దీర్ఘసమాసములును, సంస్కృతలక్షణమే ప్రధానదృష్టిగా నుంచుకొనుటచేతఁ దెనుఁగువాడుకకు విలక్షణమైన ప్రయోగములు, మున్నగువానిని గూర్చి యిట విచారింపఁ బనిలేదు. సంస్కృతవ్యాకరణమునకు విరుద్ధములైన కొన్ని ప్రయోగములను మాత్ర మిచట నుదాహరించుట యుక్తము.

## 1. లింగవ్యత్యయము.

### నపుంసకలింగమునకు స్త్రీలింగము.

అనివారణ (నిర్వ. IV. 49); అర్పణ (పాండు. IV. 160; చెన్నమల్లు శత. 16); ఆరాధన (విక్ర. II. 145).

ఉద్యాపన (కళా. IV. 31); గ్రహతారకాకులము (నిర్వ. V. 56) చిహ్న (పద్మపు. V. 65); త్రాణ (మను. V. 71; విక్ర. VI. 126); నర్తన (రామరా. I. 308); నిష్కర్ష (ఉ. రా. V. పు. 91); పరిపాలన (నిర్వ. VIII. 19); పునశ్చరణ (పద్మపు. V. 14); పూజన (సమీ. II. 55).

పోషణ (రామరా. I. 297); ప్రశ్న (ఉ. రా. I. పు. 15; పద్మపు. V. 49); మధ్య (పాండు. III. 185; కవిక. III. 26); యోచన (యోజన?) ఉ. రా. పు. 55, రక్షణ (విక్ర. II. 39); సంపాదన (హరి. పూ. VIII. పు. 194); సమర్పణ (ప్రభులిం. పు. 53); సృజన (సమీ. I. 179); సంబోధన, స్ఫురణ, ఖేలన (నన్నయ ప్రయోగములు).

### స్త్రీలింగమునకు నపుంసకలింగము.

మాయము (విక్ర. II. 137; ఉ. రా. పు. 156).

### పుంలింగమునకు స్త్రీలింగము.

ఊహాపోహాలు (ఉ. రా. పు. 36); ఊహ (పాండు. IV. 11; విష్ణుపు. II. 170); విమర్శ (చెన్నబ. పు. 91); మొద.

### స్త్రీలింగమునకుఁ బుంలింగము.

స్వర్గార్థి = స్వర్గార్థిని (కుమా. భా. I. 846).

### పుంలింగమునకు నపుంసకలింగము.

సహాయముగా (నిర్వ. V. 52).

2. ఉపసర్గముల వాడుక.

ప్రత్యష్టమీతిథిన్ (కాశీ. II. 69; IV. 184); ప్రతిచతుర్థిని (కాశీ. V. 170); ప్రతి మందిరంబునన్ (హరవి. IV. 51); ప్రతి గృహంబునన్. (హరవి. IV. 54).

3. అవ్యయములకు విభక్తి ప్రత్యయములు చేరుట.

మనుష్యమాత్రమునకు (వరాహ. III. 36); కలహంసగమనల మధ్యంబునందు (శకుం. పరి. I. పు. 11); ప్రాయము (అర్థభేదము: వయస్సు) (కవిక.III. 16); ఇన్నియు ననశ్యంబులు (కవిక.II. 15); అయిదు వారములు=సార్లు (కాశీ. V. 195).

4. అవ్యయములు విశేష్యములుగా వాడఁబడుట.

ఒక్కమాత్ర జయాపజయంబులు (నిర్వ. V. 29); వారత్రయము (మను. IV. 92); ప్రదక్షిణంబులు దిరుగు (వరాహ. IV. 5); సమ్ముఖమై (నిర్వ. V. 29).

5. సంస్కృతావ్యయములను విడిగా వాడుట.

అథవా నన్నుఁ బుట్టింప నూహగల్గిన (వరాహ. II. 156); కించిత్తును (మను. IV. 115); తూచా (తు, చ) తప్పకుండక్ (విక్ర. I. 110); ఏ వినా కలుగునే యితరుఁడ వని (శంక. విజ. పు. 8); దీనన వినా (సమీ. III. 95); వృథా శపింతురే (మను. IV); ఏమన్నన్ వృథా యిత్తటిన్ (కళా. IV. 19); దానిమూలమున సదా నిల్చు మహాదేవుండు (వరాహ. X. 143). చూ. 11-వ శతా. తెనుఁగుభాష: అవ్యయములు.

* 'ముచ్చమూఁడు మాఱులు' అనునది 'మృత్స్న మూఁడుమాఱులు' (వరాహ. VIII. 9) అని సంస్కృతీకరింపఁబడినది.

6. సమాసములు.

ఆబాలవృద్ధులై (హరి. పూ. VII. పు. 168); దుస్సాధ్యము (ఉ. రా. పు. 126); తత్పరులు (ప్రత్యేకముగా ప్రయోగము) నిర్వ. IX. 64; ఎంత దాసోహపరుఁడు (చెన్నబ. పు. 50); పథశ్రమము (కుమా. భా. I. 126); పథశ్రాంత (దశకు. VIII. 15); పథశ్రమాపనోదనార్థము (దశకు. XI. 27, 78); పుస్తకవీణాపాణికి = వీణాపుస్తకపాణికి (హరవి. పీఠి. 4); అస్త్రప్రాప్తుఁడు (మను. V. 32); త్రైలోక్య రాజ్యలక్ష్మి (సర్పమా. పు. 5); మోక్షమంటపంబునకు జయకారంబుసేసి (భీమ. II. 50); వాగ్వివాదము (హరవి. III. 59); నరస్వామి (వరాహ. V. 6); నవనవ సౌరభములు (మను. IV. 118); ఆబాలవృద్ధ నరనారీకము (హరి. పూ. IX. పు. 204); ఆ సమస్తాంగనలు

(హరి. పూ. VIII. పు. 182); 'సమస్తమనుష్యులు' అనవచ్చునా? —కనక ఘటీనిర్వాంత సుగంధిజలంబులు (మను. V. 72); దైవచేష్టితము లెవ్వరికిం గడవంగరాదు (నిర్వ. IX. 74); దోర్విలాసతన్ (నిర్వ. V. 52); గౌరవ శాంతమూర్తి (నిర్వ. III. 4); ఉచితపరుఁడు (నిర్వ. IV. 77); పుణ్యాధిగామ్యుఁడు (నిర్వ. VI. 1).

7. తత్సమములు.

మూర్ఖు, వృద్ధు, మొద. నన్నయవాడినవి; సామంతు (నిర్వ. I. 43); సఖుఁడు (వరాహ. I. 99; III. 113; IV. 7; శకుం. పరి. II. పు. 45; 43; పాండు. IV. 130; హరవి. పీఠి. 12; ప్రభులిం. పు. 53); భ్రూణహుఁడు (పాండు. IV. 131); శిరసుపై (వరాహ. X. 146); దీని సామ్యమున "వయసువానిఁజెందు వరవిద్యలన్నియు" "పయసులో వేసిన పంచదార"— ఇట్టి ప్రయోగములు సాధువు లగునా?—సరసిలో (వరాహ. I. 100)—దీని సామ్యమున 'శిరసిమీఁద' ననవచ్చునా?

8. సంస్కృతక్రియలు తత్సమము లగుట.

అవధారు (ఉ. రా. I. పు. 19)=అవధర.

9. అపూర్వశబ్దప్రయోగములు.

తెనుఁగున గొన్ని సంస్కృతపదములు సకృత్తుగాఁ జేరినవి. పండ్రెండు సములు (వరాహ. V. 52; XII. 9).

10. పాణిని వ్యాకరణమునకు లొంగని శబ్దరూపములు.

కమలనేత్రి; బాలకి (కుమా. భా. II. 103).

(11) తప్పుగా 'ఇమనిచ్' ప్రత్యయము చేరుట.

ప్రౌఢిమ (కాశీ. I; కళా. III. 109).

12. అర్థభేదములతో సంస్కృతపదములను వాడుట.

శోధించి = వెదకి (కాశీ. IV. 104); తాత్పర్యము = శ్రద్ధ (విక్ర. II. 143); మాయము = కనఁబడకుండుట (విక్ర. II. 137; ఉ. రా. పు. 156); అబద్ధములు = అసత్యములు (ఉ. రా. పు. 112); భేషజము=మోసము (హరవి. III. 90); వివరంబు = వివరణము (ఉ. రా. పు. 47; శకుం. పరి. II. పు. 31); వివరించి (మను. VI. 67; కళా. III. 138); స్థలవిశేషము = వింత (శకుం. పరి. II. 24); ఆయత్తము = సిద్ధమగుట (వరాహ. VI. 39).

13. అర్ధతత్సమములు.

మనకేయోనమ్మ యోమానముల్ (వైజ. పు. 62); పరామరిసింపు (సమీ. I. 178).

14. తెనుఁగు సంప్రదాయము కాదని లాక్షణికులు విడనాడిన క్రియా రూపములు.

ఉపచరించు, సకర్మక క్రియ (కాశీ. IV. 61); గమనించు (వరాహ. II. 8; శకుం. పరి. II. పు. 24, 46); దృష్టించు (హరి. పూ. VIII. పు. 184); నివర్తించు (హర. వి. III. 36); పరామరిసింపు (సమీ. I. 178); పరిచరియించు (విక్ర. I. 192); పరిణయించు (పాంచా. పరి. III. పు. 26); పుష్టించు (శకుం. పరి. II. పు. 39); ప్రయాణించు (జైమి. VIII. 85); ప్రతివసియించు (కాశీ. II. 18); సంభజించు (కాశీ. III. 174); విశేషించు (కళా. II. 173); శీలించు (ప్రభులిం. I. పు. 5); సప్రాణించు (హరి. పూ. VII. 173).

15. మిశ్ర సమాసములు.

i. తెనుఁగుపదములు మొదటఁగలవి.

అరినాఁటి వేశ్యాభుజంగుఁడు (నిర్వ. I. 35); చలపకారము (మను. V. 58); చలపక్కారి (మను. V. 58); వేఁటకరుల్ (మను. IV. 50); కటికభావము (ఉ. రా. పు. 116); కవలపుత్త్రులు (పద్మపు. IX. 21); పట్టెవర్ధనము (పద్మపు. VII. 167); తలిదండ్ర్యాదులవంటివారలు (రంగారా. II. 96); పొలిమేరసీమ (కాశీ. III. 118); నడిసన్నరాజులన్ (ఉ. హరి. IV. 151); అన్నయమంత్రి, లక్ష్మమాంబ, గంగమాంబ, రంగయామాత్యుఁడు, అంబమాంబిక, అనంతమాంబిక, తిమ్మమాంబ, కొండమాంబ, నాగమాంబిక (పాండు. I); నరసమాంబ (ఉ. రా. I. పు. 3); బుక్కమాంబ (మను. I. 27); నాగమాంబిక (మను. I. 31); పోతమాంబ (శకుం. పరి. I. పు. 6); అన్నమాంబ (కాశీ. I. 24).

ii. సంస్కృతపద మాదియందు గలవి.

అల్పదనము (పాండు. III. 62); తనుగాలి (నిర్వ. IV. 78); నిత్యపెండ్లికొడుకు (రాధామా. III. పు. 43); భూరివాన (నిర్వ. I. 65); పరివారసన్నాహబిరుదు (నిర్వ. I. 35); తరుపండులు (నిర్వ. VII. 101); సమచౌకపు నెత్తము (వరాహ. X. 112); మదహత్తి (ఉ. రా. పు. 79); జ్యేష్ఠకాపురము (పద్మపు. VI. 114); త్రిభువనపెండేరున్ (నిర్వ. II. 102); సోమప (కాశీ. VII. 59); స్వామివారు (దశావ. పు. 49);—ఇట్లే వ్యవహారమున 'అతి, ప్రతి, బహు, అనేక' అనువానితోఁ దెనుఁగు పదములు సమసించుచుండును.

iii. సంస్కృత సమాసముల పోలిక నేర్పడిన సమాసములు.

హేమాహేమీలు, ఘటాఘటీలు (వరాహ. X. 8).

**లాక్షణికులును నేటి కొందఱు పండితులును నిషేధించిన కొన్ని పదములు.**

1. ఆడ— ఆడాడ (యయా. పు. 7); ఆడకాడకున్ (వరాహ. III 23; XII. 43).

2. ఈడ—ఈడకు (రాధామా. III. పు. 45, 46, 49); మొద.

3. ఏడ—ఏడకు (రాధామా. III. పు. 49, 57, 41); ఏడవి (రాధామా. I. పు. 17); ఏడ(కువల. II. 42); ఏనేడ నిందొ్రదులేడ (భార. ఆది. VIII).

4. ఆతల } = ఆతల (ప్రభా. I. 81); ఆతలకీతలకు వెడలి నమ్మిలు
5. ఈతల } (రామాభ్యు.VIII. 114); తనమానసం బీతలాతలై నన్ (వరాహ. XI. 55).

6. ఎత్తుకొనివచ్చు—ఆ ముద్దియకు బుద్ధిచెప్పి యెత్తుకొనివచ్చెదము (ప్రభా. V. 18).

7. కండ్లు, కన్నులు—తలలో పేనులు కండ్లలోని పుసి (శుకచ. పు. 14); కన్నులు (కాశీ. V. 167); కలికి కా్రల్గన్నులతెలుపు (ఆది. III. 29); చన్నులుఁ గన్నులు (విరా. I. 245); వెడఁదకన్నులవాని వెయినామముల వాని (పాండు. I. 213; IV. 121. నిర్వ. VI. 80).

8. కానుక—(ప్రభా. I. 64; మను. V. 42).

9. కాళ్లు—కడకాళ్లు పట్టి వానిని (ఆది. VI); రోయుటీఁగ కాళ్లం బెనఁగ్ర (ఆది. V.);కుంతి ... గంగనీళ్లఁ గాళ్లుమొగంబుఁ గడిగికొని (ఆది.V.18); భీమసేనుండు ... కాళ్లుగడిగికొని యాచమనంబునేసి (ఆది. VI. 289); అర్జునునికాళ్ల యొప్పిదము (విరా. I. 228); (మల్లుని) కాళ్లును జేతులు వే్రల (విరా. II. 17); నిరతముగాదు గాండివము నిల్వఁగ నోపవు గాళ్లు (భీష్మ. I. 181); కృపవుట్టె నన్నకాళ్లంబడియెన్ (నిర్వ. రా. VI. 14); కాళ్లులు (నిర్వ. IX. 39); కాళ్లగజ్జెలు (వరాహ. IV. 128); కాళ్లు (మను. III. 137); నెఱి కురులు ... నిబ్బరంపు గుబ్బచన్నులు ... తొడలవెక్కువ ... కాళ్లు (పాండు. I. 126); మోకాళ్లు (కాశీ. V. 110); కాళ్లన్ (నిర్వ. VI. 14); కచ్ఛపంబులఁ బోలి మీఁగాళ్లు దనరు (ప్రభా. II. 86); కృష్ణుఁడొడిసి కాళ్లుపట్టి వెన్-దో్రహి చావుమనుచు ఖరునిఁదో్రచెఁ గాళ్లుమీఁదుగాన్ (ఈ రూపమును నిషేధించిన యప్పకవియే యప్పకవీయమున (IV. 277); కలికి నెఱివేణి చెలు

వంబు గాళ్లఁబెనఁగ (విజయ.); మీఁగాళ్లు (సారంగ.); కాళ్లవేళ్లు (దశావ. పు. 73.)

10. ఉంగుటము—(నిర్వ. I. 26).

11. గల్లము—(మను. V. 69); గల్లతోఁణులు (పాండు. I. 64, 194).

12. కొప్పు—విభుఁడు రాధికకొప్పు విచ్చిన తోడనే వల్లభు సిగవిచ్చె వనజగంధి (గోపీనాథకవి: శ్రీ కృష్ణ జన్మఖండము.) విప్పఁగప్పగు గొప్పకొప్పున విరినల్ల గలువలదండలు చెలువుమీఱె (తారాశ).

13. చన్నులు—హారపరీతమై మిషమున, భూరమణుఁడు గమిచె నింతి పొంకపుఁ జన్నుల్ (నైష.); చన్నుల క్రొవ్విదంబు; ఇట్టి చన్నుల పెంపు (సింగన); చంద్రికలు వ్రాలెఁ జన్నుల ముత్యాల సరము లమర (ఉ. హరి.); చన్నులు (పాండు. III. 94); అన్నుల చన్నులు (భాగవ.); ఎటులోర్వ నున్నదో యీ కన్నెచన్నులు గోపసింహాని గోటి కుమ్ములకును (రాధికా.)

14. చెంగు—(వరాహ. XI. 109); 'చేంగు' (వరాహ.)

15. చెవులు—చెవులకు నుత్సవం బొందుచుండ (ఆర. I. 357); చెవులకు నింపెసఁగ (శాంతి. III. 385); నా చెవుల కింపారన్ (శాంతి. VI. 135); చెవులార వింటి (ఆశ్ర. II. 130; V. II; VI. 73; IX. 90); కావ్యంబు సరసులైన కవుల చెవులకు నెక్కినఁగాని నమ్మఁడెందుఁ బరిణతి గలుగు కవీశ్వరుండు (నిర్వ. I. 9); పవడంపుఁ జొత్తుల చెవుల రూ పడఁగంగ (విరా. I. 228); వీఁగుఁ జ, న్నులపయిఁ గేలమర్చుచుఁ దనూలత లించుక కొంకఁ గుంతలం, బులు మెలపొందఁగాఁ జెవుల పొందునఁ జేర్చుచుఁ గూడి వేడుకన్ (నిర్వ. VIII. 47); చెవులు (శకుం. పరి. III. పు. 53; పాండు. III. 94; IV. 121; దశావ. పు. 46, 112, 297; నిర్వ. III. 152, 154; IV. 98; VI. 41; I. 9, 72, 79; IV. 22; VI. 73; విక్ర. IV. 35;) (స్త్రీ వర్ణనము); ఉ. రా. పు. 142; పద్మపు. III. 145;) (పురుష వర్ణనము) చెవులను గడియలు వడ (పాండు. III. 103); చెవియొసఁగు (పాండు. I. 151); చెవులకున్ (శకుం. పరి. II. పు. 38, 31, 18; మను. IV. 34; వరాహ. IV. 7; II. 101; I. 102; ప్రభా. V. 39; III. 96); కవులకుఁ జెవుల పండువులు సేయ (ఈ రూపమును నిషేధించిన యప్పకవియే యప్పకవీయమున IV. 384).

16. తావు; (వరాహ. III. 12; మను. V. 15; ఉ. రా. V. పు. 90; పాండు. III. 105; ప్రభులిం. పు. 64).

17. తగుల్పడు—వీరలగుట్టు నీ పోగునకుఁ దగుల్పడినదియే (ప్రభా. V. 75).

18. తల్లకెడవు— (వరాహ.)

19. ద్రొబ్బు—ద్రొబ్బినఁ జూచి (భోజరా. III. 38; కళా. V. 17); (గౌరవార్థమున).

20. పండులు, పండ్లు = దంతములు వినుము జరానుబంధమున వెంట్రుక తండముఁ బండ్లు వీనులుం గనుఁగవయుం జరం బొరయు (అనుశా. I. 147); పండ్లు వేర్వాసి కదలు చూపకయమున్న (కాశీ. IV. III. 84); భాగ్యనిధి ముప్పదియు రెండుపండ్లవాఁడు (కాశీ IV. 31;) భక్తి వృద్ధుఁడుగాఁగఁ బాటించెనే వేల్పు ప్రహ్లాదుఁగడుఁ బాలపండ్లనాఁడు (పాండు II. 137); గొగ్గిపండులు (వరాహ. II. 45 (ప్రాసయతి); II. 182; V. 117, 124; VII. 40; కాశీ. IV. 37; VII. 31, 84, 92).

21. పిల్ల మెఱుములు: వరాహ.

22. బొడ్డు: ఒక్కొక చన్నును, జెవియును, జెక్కును, జను, బొడ్డు, మూఁపు (సభా. I. 143); బొడ్డు క్రింది యంగములు విప్రుఁ జోఁకిన నచటు గడుగవలయు (విజ్ఞా. III. 100); బొడ్డుబంటిగా (వరాహ. X. 53); నాసి కాపుటములు, నయనముల్, శ్రోత్రముల్, బొడ్డును, వక్షంబు, భుజము లందు (వరాహ. X. 52); అనంతరంబు బొడ్డు నిరువుకొంచుం (కాశీ. V. 224); ప్రియుఁడగు బొడ్డుఁదమ్మి తొలిబిడ్డఁడు (భాగ. II. 240); జగన్నాథు బొడ్డుఁ దమ్మిని బ్రహ్మపుట్టె మొదట (భాగ. IX. 376); బొడ్డుఁ దామర పువ్వునఁ బొడమినట్టి ముద్దుఁబాపఁడు (చిత్రభా. IV. 120); అన్నెలఁత బొడ్డు పొన్నవిరి (ప్రభా. II. 83; కాశీ. V. 167); ముజ్జగంబుల చూలు బొడ్డు వాఁడు (రామాభ్యు. II. పు. 45); అన్నెలఁత బొడ్డుఁ బొన్నవిరి (నా. పంచ. II. పు. 84).

23. బొక్క: (భోజరా. VI. 284);

24. ముడ్డి: (మల్లయుద్ధమున) గడ్డముక్రింద ముడ్డియాని (గణపవరపు వేంకటకవి); కళాపూర్ణోదయము.

25. లవణిపెట్టు: వరాహ.

26. విడిచిపాటు: వరాహ.

27. వెంట్రుకలు: వినుము జరానుబంధమున వెంట్రుక తండము. (భార. అను. I. 147.) కొనవెంట్రుకలు (వేం. పంచ. పు. 98.)

28. వెళ్లు—(వరాహ. IV. 32).

29. సభికులు—(ఉ. రా. పు. 152, 163, 90; చెన్నబ. 138, 155).

పై శబ్దములను నితరముల నిట్టివానిని లాక్షణికులును గొందఱు నేఁటి పండితులును నిష్ఠానుసారముగ నిషేధించిరి; నిషేధించుచునున్నారు. ఇట్లు చేయుటకుఁ గారణ మవి మాండలికపదము లగుటయు, నుత్తమ వర్ణముల వారి వ్యవహారమున నుండకుండుటయు, తమ మండల వ్యవహారమున నశ్లీలము లగుటయునై యుండనోపును. ఇట్టివానిని గ్రంథములందు వాడవచ్చునా, కూడదా, యను ప్రశ్నము నడుగకముందు వీనిని గవులు గ్రంథములందు వాడ లేదా? వాడిన నేలవాడిరి? యను ప్రశ్నములకు సమాధానము చెప్పవలసి యుండును. కవు లిట్టి పదముల నెన్నిటినో వాడిరి. వారికి వ్యవహారము దురతిక్రమణీయ మయ్యెను. తమ మండలమున తమ భాషయందున్న పదములపై వారికి గౌరవము పోలేదు. పదములు తమ మండలమునందుమాత్రము ప్రచారముసం దున్నవైనను. వారి కావిచార మే లేకుండెను. తమ గ్రంథములను రసవంతములుగఁ జేయుటయే వారి తలంపు. రసోత్పాదనమునకుఁ బామరజన భాషణమును గూడ వారు చేకొనక విడువలేదు; లేదా, మనకిప్పుడు పామర జన భాషితమని తోచు పదము లానాఁ డుత్తమ వర్ణములవారిలోఁ బ్రచార మునందుండి యుండవలెను. అశ్లీల పదములను రసికుఁడైన కవి యెన్నడును గోరి ప్రయోగింపఁడు. కొన్ని మండలములలో నశ్లీలములుగాఁ దోఁచు పద ములు, మఱికొన్ని మండలములలో సద్వ్యవహారమం దుండును. తన వ్యవ హారమున నున్న పదములను విడిచి కవి ముందడుగు వేయలేఁడు; వేయ నెంచినఁ గవిత కుంటువడిపోవును.

ఈ క్రింద కవులు వాడినపై రీతి పదములు కొన్ని యుదాహరింపఁబడినవి.

అంటలుగట్టు (కేశములు) (వరాహ. XII. 14); అంటిపండ్లు (పాండు. I. 118); అద్దు (మను. III. 16); అవల = అవుల (పాండు. IV. 273). ఆడంగులు (వరాహ. XI. 103); ఆఁడది (ఉ. రా. పు. 75; యయా. పు. 31); ఇచ్చలన్ = విచ్చలన్ (విక్ర. V. 214); ఇడుమ (ఏకవచనము) (నిర్వ. V. 9); ఉయ్యాల (కళా. VI. 188); ఉయ్యెల (కళా. VI. 190); ఊపిరి (ఉషా క. I. 85); ఊసరవెల్లి (ఉ. రా. పు. 121); ఊసుపోక (నిర్వ. IX. 26); ఎనక (చెన్న బ. పు. 69); ఏఁకట (వరాహ. XII. 68); ఏవల (పద్మపు. X. 80); చ. ఐ, శ్వరియము (రంగరాట్. పు. 39); ఒడ్డు. చూ. ఒడ్డూపొడు గూ గల మనుష్యుఁడు (వరాహ. X. 114); కడమ (కళా. IV. 145); కని పించు = చూపించు (ప్రభా. I. 116); బ్రదుకుఁగన్నారులేరు (ఉ. హరి. IV. 60); కలవరింతలు (కళా. V. 54); కానుక (ఉ. హరి. I. 83); కాళాస్త్రి =కాళహాస్తి (పాండు. I. 75); కింక (ప్రాస.) (నిర్వ. III. 91); కుక్కదేపి (వరాహ. V. 67); కుదించి = కుద్దించి (వరాహ. XII. 7); కులుకు (నిర్వ.

III. 153); కూఁకలు వేయు (శకుం. పరి. III. 52); కూఁకలువెట్టు (పాండు. II. 208); కొంచెముగు నాభరణంబులు (నిర్వ. VI. 58); కోరికి (భారతము); కోరిక (మార్కం. పాండు. I. 63; II. 89; కళా. I. 187); కోరికె (తపతీసం.); గండి (కుమా. భా. I. IV. 60); గుప్పు = త్రోయు (నిర్వ. III. 16); గొడగులు = గొడుగులు (కుమా. భా. II. 111); గొడుగులు (కుమా. భా. II. 595, 607); గోసడఁచు = గోస+అడఁచు (నిర్వ. II. 93); ఘుల్లన (కాశీ. VII. 160); ఘూల్లుమను (రాధామా. III. పు. 59); చక్కనిది = తిన్ననైనది (వరాహ. VIII. 5); చక్కిలిగింత (కళా. III. 46); చదికిలఁబడు (పాండు. III. 92); చనగలు గోధుమల్-శకలులు (ప్రభులిం. పు. 179); చనువు (కవిక. II. 18); చల్దిచిక్కము (పాండు. IV. 64); చాఁదుచేసిన నల్ల-చారుగాఁచి (హరవి. II. 121); క్రిందిచాయ = దిక్కు (కళా. I. 155); చావు పుట్టువులను ఝూడించలేరు (ప్రభులిం. పు. 87); చిముడు (ప్రభా. I. 133); చిలుకపోటులచేతఁ జిరిగిన సహకారఫలములు (పాండు. I. 118); చెంచు (యతి) (కాశీ. I. 91; V. 71; ఉ. రా. పు. 127; శకుం. పరి. II. పు. 24; వరాహ. II. 109, 111, 26);- మొలదట్టిచెఱఁగుఁజెక్కుచు (మను. IV. 57); చేరులు = చారులు, చోరులు? (పాండు. II. 24); చైవదలించుకొను (సత్య. కృ. సం. II. పు. 47); చొక్కటము (పాండు. V. 20); చోళ్లెము (ఉ. హరి. I. 58); చోఁపుడుఁగోలలు (మను. IV. 55); జమిలి (వరాహ. X. 174); జాలి = దుఃఖము (ఉ. హరి. II. 12); ఝుళిపించి (కాశీ. IV. 51); ఝుంకించి (కాశీ. III. 231; IV. 68); డొంకఁగోలను (నిర్వ. III. 72); నీటిడొంకలు (పాండు.V.157); తమ్మంట్లు=తమ్మోళ్లు, తమ్మోట్లు (వరహ. XI. 8); తిప్పలు = కష్టములు (వరహ. III. 65); తిమురు, తెంపు, పొగరు, పోతరము (శకుం. పరి. II. పు. 21): తీఁగెలు (మను. V. 58); తొడిమ (భారతములో లేదు) పాండు. IV. 3;- కుక్కలుదోలి కఱచునో = వెంటఁబెట్టి (భోజరా. IV. 138); చేటలఁద్రవ్వి = ఎత్తి (వరాహ. II. 145); దారబందములు (ఉ. హరి. I. 53); దివిటీ (కుమా. భా. I. V. 71); దేవర (వరాహ. I. 15); దొంతరపూవులు (పాండు. IV. 74); పూర్వాంధ్రము: దొరకొను. ఉత్తరాంధ్రము: దొరకు, దొరుకు: దొరకమికి (ప్రభా. II. 111); దొరకున్ (భీమ. II. 19); దొరకకునికి (పాండు. IV. 157); దొరకు (పాండు. II. 89, 198, కళా. II. 62); దొరకదు (వరాహ. VII. 99); దొరకెన్ (ప్రభా. IV. 43); దొరికె (ఉ. రా. I. పు. 2); దొరికిన (ఉ. రా. పు. 71); దొరుకు (శంక. విజ.); 'దొరకు'నకు ణిజర్థమున: దొరకించు (కాశీ.IV. 255); పీనికి దీనిని దొరికించెనే దైవము (కళా. III. 86); దొరికించుకొనుము (ప్రభా. III. 123);

అన్నములు దొరకింప (వరాహ. VII. 99); నడుము (పాండు. V. 174); నడుమంత్రాంబునన్ (ఉ. రా. I. పు. 21); నలుకుడువడి (ఉ. రా. V. పు. 93); మేడపై నిలుపు (మను. V. 63); భ్రాంతిఁబోనూఁకి (ప్రభులిం. పు. 137); నమలి (విష్ణుపు. IV. 347); పంచదారపానకంబులు (కాశీ. IV. 66); పంట్రకోలలు (మను. IV. 56); పండ్లపేనము (పాండు. I. 118); పసుపు వసంతంబు (కళా. II. 10); పసుపు (పాండు. IV. 16); పాటి = ప్రమాణము. చూ. వాఁడు నీపాటివాఁడా? ఎట్టిపాటి, ఏపాటి, ఈపాటికి, ఆపాటికి (హరవి. II. 128); పాఁతు = లోఁతు (వరాహ. X. III); పాసెము (భీమ. II. 67); పీఁకె (హరవి. III. 41); పుడుకు = చిదుము (వరాహ. XII. 8); పెండ్లికొడుకులు = అల్లుళ్లు (కాశీ. VII. 69; భీమ. II. 7); పెదపెద = పెద్దపెద్ద; వ్యవహారము: పెదపెద్ద (వరాహ. II. 69; X. 154; పాండు. III. 53); పెయ్యావులు (రాధికా. I. పు. 3); పెళుసు (వేం. పంచ. పు. 106); (పడచు) పైద= పడ్డ,దూడ (భోజరా. IV. 138); పొటిపొటితలఁపులు (పాండు. V. 50) చూ. చిటిపొటిమాటలు; పోసరము (వేం. పంచ. పు. 70); ప్రంగలు (మను. IV. 21); ప్రొద్దువంకఁగనుంగొనుచు (శకుం. పరి. II. పు. 42); తొడలబంటి= తొడబంటి (ఉ. రా. పు. 106); బయిళ్లు (వరాహ. VIII. 75); బరవసము= దైన్యము (నిర్వ. IV. 44; III. 94); బనుమము (మను. IV. 19); ఎనిమిది బార్వల కనకము (పద్మపు. X. 52); బెజ్జము (కాశీ. V. 105); బెరుకు (ప్రభా. V. 109); బైలుపడు (సత్య. కృ. సం. I. పు. 18); బ్రతుకు (విష్ణుపు VII. 373; హరి. పూ. VII. పు. 170; దశావ. పు. 47); బ్రామయు (హరవి. II. 44); మండెంగలు (భీమ. II. 67); మడమ (మను. IV. 115); మడిమ (కళా. IV. 151); మడిమంచ = బలహీనత (మను. VI. 26); మడిమట్ర(పాండు. III. 24); మంది = కిరీటము (శకుం. పరి. I. పు. 18); మంది= జనము, బంధువులు (ఉ. రా. పు. 107); (ఇరువదొక్క) మాటు (హరి. పూ. IV. పు. 63); మానిసిమట్ర (శకుం. పరి II. పు. 22); మాద్రి= మాదిరి (పాండు. I. 3); మావిఁడిమోక (ప్రాస.)-(హరవి. పీఠి. 1);మిక్కుటము (ఉ. రా. I. పు. 26; నిర్వ. VI. 98); మిడిదల (కళా. VI. 42); ముద్దెడు (చెన్నబ. పు. 104); మొగంబు మురియించుచు (హరి. పూ. VIII. పు. 192); మువ్వంటల దినములు (హరి. పూ. VIII. పు. 186); బరణి మూకుడు వుచ్చినగతిన్ (వరాహ. XII. 10); మొల్పు (వరాహ. X 39); మొలక (పాండు. III. 191; IV. 38); మొల్క (పాండు. III. 104; IV 23; V. 128; కళా. IV. 75); మొక్క (పాండు. III. 179;వరాహ. IV. 147); మొగమాటలు (కళా. III. 178); వ్రక్కతునుకలుగా మొత్తు (నిర్వ.

XII. 11); మోక=మొక్క (వరాహ. IV. 168; నిర్వ. VIII.32, 35); మోన (కాశీ. VI. 6). చూ. మోనుఎత్తు. కన్న. మోన;— రాయభారము (హరవి. III. 91); రూపసి (ఉ. హరి. V. 155); రూపు =రూపము (కళా. I. IV. 14); రెంటెము (వరాహ. XI. 7); లెస్సలా? (కాశీ. II. 71); లెస్సగాక (కాశీ. VII. 182); వంకో = వలన (వరాహ. IV. 103); వగ్గుతపసి (మను. IV. 85); వట్టి మొగమూటలు (కళా. III. 178); వరుస = క్రమము (వరాహ. VII. 25); వరుస = రీతి (వరాహ. IX. 21); వలము= లావు (వరాహ. X. 111); కడువలమైనట్టియొడలు (నా. పంచ. II. 77; వల్పు= వలపు (మను. VI. 31); ఒకవార = ప్రక్క (దశావ. పు. 35); విచారించు= ఆలోచించు (ప్రభా. I. 74); వినుపించు = తెలియఁజేయు (కళా. V. 183); వియ్యము = వియ్యంకుఁడు (వరాహ. V. 55); విసికి విసిమాలి (భీమ. II. 101); వెతకు (ప్రాస)-(శంకరవి. 6); (వాన) వెలుపు (హరవి. II. 23); వెల్పు (హరవి. II. 24, 25); వానవెలిచెన్ (హరవి. II. 25); వెళ్లన్ (వరాహ. I. 6); వేగిరము (వరాహ. IV. 203); వేపారి (మను. V. 58)—ఇట్లే, బేహారి, బేహారము; 'వెవారము' అని యేందు కనఁగూడదో? వేయు = వైచు (వరాహ. II. 37); వైపు = ఉపాయము. విధము (ప్రభా. II. 26); సంచకరము = సంస్కారము (ఉ. హరి. 163). రూ. సంచకరవు; సత్తరువు (కళా. IV. 198); సళ్లు = సడలు (కువల. II. 58); (నిర్వIX. 46);. సిలుగులు = చిక్కులు (ఉ. హరి. II. 64); సుబ్బు = పైకి తెలియు (ప్రభా. I. 134; III. 44; IV. 17); సెంకించు (నిర్వ. VI. 11);—సెపియుంచు (సర్వ. మా. I. 76); 'జెపించు' అనకూడదా?—సెలవు పెట్టు = ఆజ్ఞాపించు (వరాహ. III. 44); సేకరించుకొను = తెప్పిరిల్లు (మను. IV. 115); సయితము (వరాహ. IV. 97); సైతము (వరాహ. I. 32; II. 101; VI. 57; VII. 90; VIII. 28; కాశీ. VI. 224); మొదలైనవి.

పై రూపములన్నియు మాండలికపదములు; అయినను నాయామండలము కవులు వానిని వాడియేయున్నారు. ఇతరమండలములలో నాయాపదములకు వేఱు రూపములుగాని, వేఱర్థములుగాని కలవు.

పదములు నానాఁటికి మాఱుచువచ్చినవి. ఏకాలపుమాట లా కాలమున నాదరణపాత్రములైనవి. అట్టి పదము మాఱినరూపములు రూపాంతరములుగ లక్షణగ్రంథముల లోనికిని, నిఘంటువులలోనికి నెక్కినవి. లక్షణగ్రంథములయు నిఘంటువులయు ప్రభావమెక్కువ యయి, వ్యవహార పరిత్యాగము కలిగిన నాఁటనుండియు నిట్టి రూపము లన్నియు గ్రంథములలోని కెక్కసాగినవి. కాని, లక్షణకారులును నిఘంటుకారులును నిట్లు మాఱిన

రూపముల నన్నిటిని దమ గ్రంథములందు చేర్పరైరి. లక్షణమేర్పడకయు, నిఘంటువులలోని కెక్కకయు వ్యవహారమున నిలిచినపదములు ప్రయోగార్హములు కావనియు, గ్రామ్యము లనియుఁ బండితులు నిషేధింపఁజొచ్చిరి. ఇది గాక పదము లెంత ప్రాచీనములు నెంతవ్యవహార దూరములైన నంత ప్రయోగార్హములను నభిప్రాయము ప్రబలెను.

రూపమునందుగాని యర్థమునందుగాని మార్పునొందిన కొన్నిపదముల కుదాహరణము లీ క్రిందఁ బొందుపఱుపఁబడినవి:—ఇనుపారు=ఇంపారు (నిర్వ. II. 90); చూ. నినుపారు=నింపారు, మొద. కాని, మునుపు=ముంపు; ఇనుప = ఇంప, మొదలగు రూపాంతరములు గలుగలేదు;-ఉఱుతలు = ఉదుతలు (వరాహ. XII. 42); ఊడ్పు = విడుచు (పాండు. II. 236); ఎమ్ము= ఎముక (మను. IV. 60); అమ్ము = అంబు (మను. IV. 60); ఒడసెల = ఒడిసె (వేం. పంచ. పు. 57); కన్పట్టు = కనఁబడు (ప్రభా. II. 42); కమ్మని కంపు (కాశీ. II. 44); పొగపుఁగంపులు (కాశీ. VII. 185); అద్దొంతర పూవులంగలుగు తోరపుఁగంపులు (పాండు. IV. 74); పొగడపూవంటి కంపుల మదాంబువులు (మను. V. 98); కానిక = కానుక (ఉ. హరి. I. 53; కాశీ. VII. 151); (పురుషుఁడు) కోకకట్టు (కళా. III. 267); క్రుక్కు = కూర్కు = కునుకు (ప్రభా. IV. 59; V. 72); గగ్గోడు = గగ్గోలు (హరవి. VI. 47); చెండారము = చెండేరము (కాశీ. III. 240); చివ్రు; చివురు = చిగురు (సమీ. I. 134); చెప్పు = చర్మము (ప్రభులిం. పు. 86); దాఁగురుమూఁతలు = దాఁగుడుమూఁతలు (విక్ర. V. 32; పాండు. III. 177); తట్టువ = తట్టు (లక్ష్మీ-నారాయణీయములో 'తట్టువా, తట్టువము' అను రూపము లీయఁబడినవి)—మను. IV. 118;-తివియు = తీయు (పాండు. III. 22; కళా. II. 128); తెట్టువ = తెట్టు (నిర్వ. I. 59); తెడ్డెండుహారము = గరిఁటెడు (భీమ. II. 97); తొల్పన్ = విశే. తొల, తొలి; 'తొలువన్,' అనవలెనా ? 'తొలువన్' అనవలెనా ? (హరి. పూ. VIII. పు. 187); దాఁగురింతలు (హరి. పూ. VIII. పు. 183); దాఁగురుముచ్చులు = దాఁగనముచ్చులు (వరాహ. XII. 43); దిట్టకిరాతుఁడు (మను. IV. 57, V. 89); దొరలు = దొర్లు (మను. V. 40); నడ = నడక (పాండు. I. 41); పడిగ = పడగ (కళా. IV. 195); పలికించు = పలుకరించు (కళా. IV. 94); పుడుక= పుడక (వరాహ. VIII. 5); ముక్కునఁబంటి = ముక్కుబంటి (వేం. పంచ. పు. 21); 'జనకునిబడి' - ఇప్పుడు 'బడి' 'వెంబడి'లో మాత్రమున్నది (మను. V. 43); నాబడిన్ రమ్ము (ఉ. రా. పు. 38); బిందెలు = చిన్న మంటికడవలు; ఇత్తడి, మొ. బిందె; మంటికడవ, అని నేటివ్యవహారము; (శకుం. పరి. II.

పు. 29); బ్రదుకు = బ్రతుకు (ప్రభా. IV. 33); మావిపండు = మావిఁడి (సర్వ. మా. II. 87); 'మావిఁడి' అను పదము పదునొకండవ శతాబ్దము నుండియు నున్నది; 'మావి' అను రూపము కవికల్పితమా ?—మెండుకొను= నిండుకొను (మను. IV. 27); మొగడ = * మొగ్డ = మొగ్గ (వరాహ. XII. 43); మోసల = మొగసాల (నిర్వ. IX. 69) 'మొగసాల' యేపూర్వ రూపము; ఇది 'మోసాల, మోసల'గా మాఱినది. వలదు కుక్కలన్విడు వంగన్ = అక్కఱలేదు (మను. IV. 20); ఒకసరియై వర్తించు = రీతిగా (వరాహ. IX. 20); అతఁడు మొదలయిన సురలు (వరాహ. X. 75); ఇట్టి చోట్ల 'మొదలు' పదమొక్క వ్యక్తిపేరుచెప్పిన తరువాతనే పూర్వకాలమున నుండెడిదేమో. నేఁడు 'రాముఁడు, కృష్ణుఁడు, గోవిందుఁడు, మొదలయిన వారు, అని వాడుచున్నాము.—అలవి = వీలు (మను. IV. 44); పొడవు = రూపము (పద్మపు. VII. 75); తోఁచు = కనఁబడు (కుమా. భా. II. 107. 118, 232); తెలివి = వెలుఁగు (కాశీ. IV. 121); చే = చేయి (నిర్వ. II. 11) దీనికి నేఁడు వ్యస్తముగా వ్యవహారము లేదు.

ఈ క్రిందిపదములవంటి వెన్నో భాషనుండి లోపించినవి :

అలబలము (మను. IV. 53); ఆమెత (హరి. పూ. పు. 188); ఇట్టాడరాని = సమీపింపశక్యముగాని; తమి. ఈడ్, ఈడు = మార్కొను (పాండు. I. 11); ఉడుపకుక్కలు (మను. IV. 51); ఉల్ల (కాశీ. VII. 244); ఉల్లెడ (మను. V. 71; ఆము. VI. 182); శ. ర. ఉల్లడ; అక్కటికము (మను I. 4); అక్కటిక (పద్మపు. IX. 131); ఒడగొడ్డెము (హరవి. II. 132), ఒఱగొడ్డెము (శ. ర. కారుఁడు దీనికి 'వఱగొడ్డెము' సరియైనరూపమని చెప్పినాఁడు. ఈ రెండురూపములును నేఁడులేవు.) (హరవి. II. 132); ఒలుకులబూది (వరాహ. IX. 88); కట్టుపకాసి (హరి. పూ. VIII. పు. 184); కఱదులు (శ. ర. కఱద) (ప్రభా. III. 47, 52); కలువడగలు (కుమా. భా. II. 42); కలివడగలు (కుమా. భా. II. 43)-శ. ర. 'కలువడము'; కాలాజికుంచెలు (ప్రభులిం. I. పు. 14); కావడించు (పాండు. III. 89); కావున = కనుక (వాఙ్మయమునఁ జాలతఱచు); కిన్పు (కవిక. IV. 42); కెల్లు = కలకలధ్వని (హరవి. III. 81); కొఱకు = కొఱను (కళా. III. 98); కోండ్రవేలు (కాశీ. IV. 299); క్రేఁకటించు (హరి. పూ. VII. పు. 174); గిరువులు = శత్రువులు మఱల తిరుగఁబడకుండ పూఁటగానుంచినవారు (వరాహ. II. 118); గిరవులు (విక్ర. IV. 60); గొడ్డిగములు (వరాహ. X. 15)-శ. ర. గొడ్డగములు, దీనికి 'గొడ్డగము' ఏకవచనమగునా ?—గాసెన (మను. IV. 38); చీటకము (కాశీ. V. 88); తోకొను (పాండు. II. 180) 'వానితోపాటు'. అది నేటి

వ్యవహారమున నున్నది.—పయ్యాద (కవిక. V. 85); పొగడలు = పడగలు (వరాహ. VI. 71); మేంఠ (కాశీ. VII. 97); (వేల్పుం) బూప (శకుం. పరి. II. పు. 41); (తనయుండు) పెడము పెట్టినవేళ (వరాహ. VIII. 53); (ఎడ్మ) బరి = ప్రక్క (పాండు. II. 103); బారాది (పాండు. IV. 232); మే=మేయి, మెయి, మేను (కళా. III. 81); ఈ పదములెవ్వియు నేఁటివాడుకలో లేవు.—మ్రొక్కించు (హరి. పూ. IV. పు. 83); వయ్యము = వంధ్యము (హరవి. III. 16); మొదలయినవి.

సముచ్చయచిహ్నమగు -'ఉన్' లోపించి పూర్వాచ్చు దీర్ఘమగుట వ్యవహారమందుగలదు. అట్టి దీర్ఘములతోఁగూడిన ప్రయోగములు కావ్యము లందును జేరినవి.

శా. వెన్నామీఁగడయున్ ఫలంబొసగెదన్ - వేగంబ రారమ్మ మా యన్నా (కవిచిం.)

క. రోళ్లారోఁకండ్ల బాడరోయక మఱియున్ (వరాహ. VII. 22.)

క. అన్నాదమ్ములఁగని (హరి. ఉ. IV. 15).

క. రో, ళ్లారోఁకండ్లంబాడిన, కూరుము లిపు డింత దాఁచుకొన్న నడఁగునే (ప్రభా. V. 25).

క. చేతావాతాగొట్టె, ఘాతుకులు (సంపంగి. శత).

క. తల్లీ, తామరయును బోలియుండి తగవువిడుతురే. (హరి. V. 200.)

చ. వినీవినమిం బురిలోనిసైనికుల్ (జైమిని.)

ఉ. వినీవినని భంగి (నైష. VI. 33.)

ఉ. అయినా (ఉ. హరి. V. 198); ఏమీయెఱుఁగఁడు (ఉ. హరి, V. 195);

క. నందీ కన్నుల నశ్రులు, చిందీ, తాపంబుమేనఁ, జెందీ, హృదయం బందీ, కుందీ, యొందీ, యిందీవరనయన వెదకి యిందన లేదా (పార్వ.)

క. నమ్మమి మృత్యువు; పెద్దయు, నమ్మట యపమృత్యువగుట నరపతి నమ్మీ, నమ్మక (శాంతి. II. 351. 1901 ముద్రణము)

శా. చల్లాయంబలి ద్రావితిన్ రుచులు దోసంబంచుఁ బోనాడితిన్ (శ్రీనా. వీధి.)

శా. కూడీకూడని చిన్నకూఁకటిలతో - గోపాలక శ్రేణితో.

ఒకప్పుడు సముచ్చయచిహ్నమగు 'ఉన్' లోని 'ఉ'మాత్రములోపించును: ఉదా: ఏమిన్ (నిర్వ. VIII. 15); ఇట్టిదింగలదె (నిర్వ. VI. 22; V. 22); అంతర్యామివి స్నీవ (మను. II. 75).

ఒకప్పుడు సముచ్చయముపై మరల సముచ్చయముచేరును: దళగ్రి వుండునుం బోవునే (నిర్వ. IV. 89); ఇంకనుంగొన్నినాళ్లు (కళా. III. 70).

ఒకప్పుడు సముచ్చయము తుమర్థక క్రియారూపముల మీఁదను జేరును: ఒసగను ... కావింపనుంబనిచి (హరి. పూ. VII. పు. 168)

పదములతుది ద్రుతములోపించి, పూర్వాచ్చుదీర్ఘమయి, విశేషార్థముల నిచ్చుట వ్యవహారమునఁగలదు. అట్టి ప్రయోగములను కవులుచేసినారు.

శా. బాలా ! ... చాలానేఁగలుగంగ నింతపనికి న్నంతాపముం బొందఁగా, నేలా ... చింతించుటల్, మేలా . (అని. II. 88).

క. జాలారి ..., కాలారి ..., మేలారసి ..., చాలారసికత్వ మబ్బె సర్వేశునకున్ (గౌరీ.)

చౌపదము: సతతభక్తియుత - సన్మునిజాలా,
కృతనుతులను రా- గిలుపృథుశీలా,
కృతయుగమునను స్వ - కృతమయిలీలా
క్షితివృషగిరియనఁ - జెలఁగును జాలా. (ప్రబం.)

క. నీలా ..., హేలా ..., చాలావేఁడిన హరిమీఁ, రేలా ... (మృత్యుం.)

సీ. నేనిద్రబోవుదాఁ - కానిద్రఁబోవదు (వైజ. II. 126.)

ఉ. ఇం, కాగలకార్యమేమి (పట్టాభి.)

ఉ. ఇం, కామటికొన్ని గూర్పవలె (ప్రబో.)

శా. ఇం, కా రావ్రాయి వరంబువేఁడుము (రామస్త.)

క. కూడా నుండుదమోయని (రాధా.)

ఉ. ఐ, నా కల దొక్కవిన్నపము-నాకుసురాధిప ! (దశా.)

శా. ఔలెండా యిటువంటి ఛాందసము లెన్నైనా గలావు (దశా.100.)

క. కావలెనా పనిలే దయి, నా వినుము. (పార్వ.)

ఉ. ఎంతవారినై, నా మదిలెక్కవెట్టక (సానం.)

శా. నాయుద్యోగమింకేరికై, నా శీఘ్రంబుగనిచ్చిపంపుము (సానం.)

ఉ. ఎట్టులై, నా నినుఁజేరవచ్చెద (మిత్రవిం. IV. పు. 56; దశావ. 54, 78, 100, 310); ఐనా; (66. దశావ. చూచినా;) 137. ఇంకా

సముచ్చయార్థక 'ఉన్' ప్రత్యయము చేరునప్పుడు యడాగమము చేరవలసినచోట్ల వ్యవహారమున నాగమ యకారము లోపించుటగలదు. అట్లు

లోపించునప్పుడు ద్రుతమునకు ద్విత్వమును, దానిపై నిత్వోత్వములును గలుగును. ఒకప్పుడాద్రుతము లోపించి పూర్వాచ్చునకు దీర్ఘముకలుగును:మఱిన్ని, మఱి. కావ్యములందు నకారద్విత్వ రూపములు లేవుగాని 'న్, ని'లు నిలుచుట గలదు. ద్రుతలోపమును బూర్వాచ్చునకు దీర్ఘమును గలిగిన రూపములును గావ్యములందు గలవు.

క. అనుజులకు నడ్డపడి యే,మిని జేయఁగ నీవుఁజూచి మెచ్చితి (ఉద్యో. II. 18)

క. తనకై కాదే మదినెల్లను గోరుటవినుము దాఁబ్రళయ మొందెన యేమిని (శల్య, I. 58.)

క. అట్లే,మిని బలుకకుండి (అశ్వ. II. 21).

శా. తల్లిందండ్రియు నన్నుఁగానని మనస్తాపంబునంబొక్కఁగా (మను. III. 98.)

మ. స్తవముల్ సేయు శ్రుతుల్ సమస్త జగదంతర్యామి విన్నీవ (మను II. 75).

ఉ. తండ్రివితల్లియుం బతివి-దైవమవున్ సఖివిన్ గురుండవున్ (భాగ. I. 252.)

తరళము. క్రోధవశాఖ్యయున్ సురసాఖ్యయుఁ సురభిన్ మునిన్ మొదలుగా (భాగ. VI. 256.)

ఏమీకొంక (భోజరా. VII. 75)

శా. వాలింగీలియు వాయుపుత్త్రుసరియే (నిర్వ. VII. 99.)

శా. ఏమింజేయకయున్నఁ గ్రొవ్వి యిట కేతెంచితే (నిర్వ.)

మ. చం, డికయంతర్హితయైన మాయయుమఱిందిన్ నిద్ర మేల్కాంచు. (జైమిని. VIII. 116.)

ఉ. అదిన్, జెప్పెదనంచు (కళా. IV. 50.)

మ. మఱిం, దెనుఁగుంగబ్బము లెన్నియేని (ప్రభా. I. 6.)

ఉ. మిక్కిలిం, గంటికినించువాని (పాండు. III. 61.)

మ. ఎచ్చోటికో, చని వెండిం జనుదెంచి (పాండు. V. 21.)

మిక్కిలిన్ (పాండు. V. 26.); ఉన్నట్టిదిన్ లేదు (పార్వ. 45); దక్కిన దింబలె (రామాభ్యు. V. 138); మఱిన్ (సమీ. I. 88; III. 158).

ఇట్లే కొన్నిసమస్తపదములలో మొదటిపదము తుదియచ్చు దీర్ఘమును, హ్రస్వమును గూడనగును. అట్టిస్థలములందు దీర్ఘము ద్రుతలోపమువలనఁ గలిగిన దనచ్చును.

చ. కడకొను కక్షదీధితు లె-గాదిగఁ గన్గొను (ఆము. II. 50)

క. మల్లామడియగు మదనుఁడు (ఉ. హరి. V. 166).

శా. రొ-క్కా-రొక్కము లిట్టి (కాశి. III. 58.)

చ. ఒకానొక నిద్దురఁ గన్నుమోడ్చి (కాశీ. III. 99.)

చ. కకాపికలౌమది నమ్మ చెల్లఁగా, యనుచు ...య - దాయదలై (కువల. II. 31.)

క. చెల్లాచెదరై యక్షులు, పెల్లగిలంబఱచిరి (నిర్వ. IV. 75).

క. అడ్డాదిడ్డాలు వలుకు - నంతటిలోనన్ (బసవ. పిడు.)

మ. రా- కాపోక గావించె (చంపూరా. V. 39.)

ఎగాదిగ (కువల. IV. 177. పారాశ. II. 77; దశా. 319; రాధా; II. 39; రాధికా. I. 127; శశాం. II. 77; సమీ. II. 154).

దిక్కా-మొగములు (పారి. V. 37); వళావళి (బహు. II. 56). ఏత్వాతత్త్వాలు (బసవ. VII. 275); బటాబయలు (సారం. 112).

సేనా, తలా, అను నవ్యయములును నిట్లే యేర్పడియుండవచ్చును.

క. పూజల్, సేనాగా నొనరించిన, నాసీలగళుండు మెచ్చునా. (ప్రభు.)

క. ఏలాసేనామాటలు, బాలా (బసవ. పిడు).

గీ. అదితలాయొక ముద్దెడు నారగించి (పరమ. IV. 236.)

ఉ. అందఱకుం దలాయొకటి - స్వార్థము గల్గుట దోఁపఁబల్కె (ప్రభా. V. 88.)

పదమధ్యాచ్చు లోపించి సమీపహల్లులగు ల, డ లకును, సంయోగము గలుగు నపు డా రెండింటికిని 'ళ్ల' ఆదేశమగును. ఒకప్పు డా సంయుక్తాక్షరమునకుఁ బూర్వమునను౦డు ననుస్వారము లోపించును. ఇట్టి రూపములు గ్రామ్యము లని కొంద ఱందురుగాని వానికిఁ గావ్యములందు ప్రయోగములు గలవు.

గీ. జరిగెనూడెను జారెను నుఱికి వెళ్లె (ఆంధ్ర. మానస.)

గీ. భావజుఁడు వెళ్లిపోయిన పాడు మేడపగిది (కళా. III. 83)

ఉ. ఒ, ళ్లారకమున్న వచ్చి యొకయంగన సూచె నరేంద్రచంద్రునిన్ (కవిక. I. 6).

సీ. సళ్లించు కళ్లెముల్ - ఘుళ్లనంగ (కృష్ణరా. వి. I. 53)

ఉ. వాకిలి వెళ్లి కల్లమాటాడదు (భాగ. VI. 27)

సీ. మళ్లువారును నిల్చి- త్రెళ్లువారు (భాగ. VI. 81)

గీ. త్రుళ్లి రాతును బడవైచి - మళ్లివచ్చు (రాధికా. II. 121)

సీ. ఒళ్లేల విఱిచెదే - యుజ్జ్వలాంగి (రా. వి. III. 115)

క. వెళ్లింపఁ గాఁగఁ దగ, దుల్లంబున హితుఁడటంచు(రుక్మాం. III. 17)

మ. వె,ళ్లిన రీతిం బడుఁబ్రేలి మౌక్తికమణుల్ (వరాహ. IV. 35)

ఆ. వె. ఇల్లు, వెళ్లలేదటంచు - మెల్లన ముదుగులు, పాఱవిడుచు చుండు (వైజ. III. 93)

-'ట' అనునదియే భావార్థక ప్రత్యయము గాని, '-అడము' కాదనియు నది గ్రామ్యమనియుఁ గొందఱ యభిప్రాయము. 'అటము' 'అడము' అనునవి వ్యవహారమందే కాక కవులచేఁగూడ విశేషముగఁ బ్రయోగింపఁ బడి యున్నవి. ఉదాహరణములు:

సీ. కడవన్నె బొమ్మ చెక్కడపు చొక్కపుఁ గోళ్లు బగడంపునికరంపుఁ బట్టియలును (ఉత్తరరామాయణము. పుట. 222)

సీ. తొలివేల్పురా ప్రతిమల చక్కడపుగండ, వెండెంబు డాకాల-దండిజూప (ఉత్తరరామాయణము. పుట. 43.)

సీ. నెలరాల మంచివన్నెలుమీఱఁ గట్టిన కట్టడమరుగునఁ గ్రాలుచుండ (ఉత్తరరామాయణము. పుట. 23.)

గీ. దాని చక్కఁదనంబును దాని మెఱుఁగు, దానికట్టడపుంబని (ఉత్తర రామాయణము. పుట. 24)

సీ. త్రవ్వటంబులతతిఁ - ద్రవ్వటంబులువెట్టి, తగునట్టు కట్టు గుద్దలి గడించి (కళాపూర్ణోదయము. IV. 78).

గీ. మొదలఁ గాశీపురమునకు - ముట్టడముగ, సకల గృహములఁ దన మూర్తి సంగ్రహించె (కాశీఖండము. V. 301.)

ఆ. వె. మనసురాదునాకు - మానినీమణులార, ప్రేలడములు గట్టిపెట్టి రండు (చంద్రాంగద చరిత్రము. II. 104).

ఆ. వె. అటఁగుళిందుసేమ - మరయుచుఁ దండ్రి, వ్రా, యడముఁజూచి భక్తి నంది యందు (జైమినీభారతము VIII. 82).

క. వెల్లువ ముట్టినపగిదిం, దల్లడమునఁ గూడఁ బారి (నిర్వచనోత్తర రామాయణము. IV. 94).

క. తఱచగుఁ బెనునందడిలో, నిఱుకటమునఁ బడ్డ నృపతి. (నైషధము IV. 124).

సీ. పిలుపిచ్చువిద్యలు - వీకవన్నియలును తెలుచదనంబులుఁ - బ్రేలడ ములు కేరడంబులు సాళి-గింపులు కిల్బిషా, క్రీడనంబులు నడ -కించుటలును (పాండురంగ మహాత్మ్యము. III. 43).

సీ. గీ. తెచ్చుకోల్గొంకులును మోర-త్రిప్పడమ్ము, లలరఁగేళిక కరుదెంచె నల్ల రంభ (పార్వతీపరిణయము. V. పుట. 98).

చ. ... కెంపుపొళ్ల చె, క్కడమున (పార్వతీపరిణయము. V. 104.)

గీ. ఎత్తినప్పుడు విడియుచో - నిఱుకటంపుఁ దెరువునందు (భారతము: సౌప్తికపర్వము. I. 25).

ఉ. ఇమ్మెయిన్, జావడమైనఁజూచి యిది చందము గాదని యంటిఁగాక (భారతము, ఉద్యోగపర్వము. III. 61).

చ. సతకడముల్ పురాణములు - సామెతలుం బరిహాసకంబు లింగిత ములు జారచారిణుల - కేళిచరిత్రముల న్వచింపుచున్. (హంసవింశతి.II.43.)

'ఉన్న, కల, న, వర్ణకంబులమీఁది తచ్ఛబ్ద వకారంబునకు లోపంబు విభాషనగు' అని చిన్నయసూరి. ఈ లక్షణము చాలదు. దీనివలన ఉత్తమపురు షము: 'వండినాను, వండినాము; మధ్యమపురుషము: వండినావు, వండినారు; నీవురాజు; మొదలగురూపములు సిద్ధింపవు. కాని, యిట్టిరూపములు వ్యవహా రమునందును గ్రంథములందును గలవు. ఇట్లే 'కలుగు' ధాతువునుండి పై సూత్రమువలన గ్రంథములందు కానఁబడు 'కలాను, కలాము; కలావు, కలా రలు, కలారు; కలాఁడు, కలారు' ననురూపములు సిద్ధింపవు.

క. బలువేమి చేతవేసరు, చెలికిం జిపిటంబులీయఁ జేకొని కృపతోఁ గలిమిచ్చినావు (అప్ప. IV. 411).

చ. అనితరవామలూరు జవనాంతర వాసముఁ జెందినావు (ఉ. రా. పు. 317.)

శా. భీ, తిత్యాగం బొనరించినాననుడు నత్కీరుం డుమాజానికిన్ (కాళ. మా. III. 218.)

శా. అయ్యా యెక్కడనుండి యిక్కడకు లీలార్థంబు విచ్చేసినారు (కాళ. మా.)

ఆ. వె. చంచలింపకిట్టిసాహసకృత్యంబు, చేసినావుగాన(నిరంకు.IV.44.)

గీ. కోరి గోదావరీ మహాతీరమందుఁ బొలఁతుకలఁగూడి క్రీడకుఁ బోయినావె. (పట్టాభి. I. 15).

పంచచా. నరాధినాథ నన్నుఁబాసి - నావటంచు (పట్టాభి. V. 174).

గీ. నీవ తల్లి విదండ్రివి నీవగురువు (భాస్కర. రామా. బాలకాం.629).

శా. ఏయే దేశములన్వసించితిరి మీ- రేయే గిరుల్ సూచి నా
రేయే తీర్థములందు గ్రుంకిడితి రే - యేద్వీపముల్ మెట్టినా
రేయే పుణ్యవనాళిఁ ద్రిమ్మరితి రే - యే తోయధుల్ డాసినా
రాయాచోటులఁ గల్గువింతలు మహా - త్మా నాకెఱుంగింపవే.
(మనుచ. I. 68.)

ఉ. ఇటుసంగతులై చనుదెంచినారు మీ, రెల్లను (హరి. పూ. V. పుట 101).

గీ. అడవిలో గొల్లమందలయందు పెరిగినారు ... చీరలడుగునంతటి వారె మీరు (హరి. పూ. IX. పుట 205).

మ. దైత్యారికాఁఖోలు నీ,యనఁగాఁకున్నఁగలావె యన్యులకు నీ యంచ త్ప్రభాపూర్ణతుల్ (ఉ. రా. పుట. 182).

మత్త. వారు నాథులు గాఁగలారని - వారికానతియిచ్చె (ప్రభా. IV. 15).

గీ. సకలమహిమలు నీదుపట్టికిని జేకుఱుం; గలా వంగలార్వఁ గురంగ నయన (సమీ. II. 171).

గీ. పావనిగలాఁడు (సమీ. IV. 40).

ఉండినాఁడ నగుటన్ (సమీ. VII. 35); కట్టినాఁడను (పాండు. IV. 106); లింగతనుఁడైన నన్ను (వరాహ. X. 69); నీలకంఠు డనఁదనకు. (వరాహ. X. 92); అర్థించినాను (దశావ. పు. 208; అహ. సం. పు. 10); అలసినాను (,, 315); చేసినాను (,, 213); పండినాను (,, 209); దాచిన దానను (కాశీ. IV. 105); పలికినాను (సమీ. III. 104); మఱచినాఁడ (ప్రభా. I. 73); మెచ్చినాఁడను (కవిక. II. 78); వచ్చినాను (ఉ. రా. పు. 60); దూపట్టినాను (శకుం. పరి. I. పు. 18); కొన్నాఁడను (వరాహ. VI. 20); పుట్టించినాఁడ (వరాహ. VI. 75); వెచ్చినాఁడను (వరాహ. II. 155); తెచ్చినాఁడను (వరాహ. II. 119; కాశీ. VIII. 244); పచ్చినాఁడను (కళా. III. 141); కావించినాను (ఉ. రా. పు. 145).

ఉన్నారము (కాశీ. V. 9; VI. 294; కళా. I. 181); మెచ్చినారము (కళా. కాశీ. V. 300; VI. 221; వరాహ. XII. 39); వందుచున్నారము (కాశీ. VIII. 136); కడపినారము(కాశీ.VIII. 148); నడచినాము (రంగారా. II. 171); వచ్చినారము (శకుం. పరి. II. పు. 22); చెప్పినారము (వరాహ. XII. 44); విన్నారము (కాశీ. I. 15).

తలంచినావు (దశావ. పు. 87); చొచ్చినావు (దశావ పు. 295); పట్టినావు (పు. 296; సమీ. VI. 225); ప్రతిష్ఠించినాఁడవు (కాశీ. IV. 182); వీక్షింపుచున్నాఁడవు (కాశీ. VII. 73); కూడియున్నాఁడవు (కాశీ. VII. 73); తెచ్చినాఁడవు (కాశీ. VIII. 244); చేసినావు (సమీ. V. 176); వచ్చినావు (రంగారా. II. 171; ప్రభులిం. I. పు. 38; II. పు. 46; ఉ. రా. పు. 124, 37,23); నీవు కలవాఁడు (కాశీ. III. 47); ఎవ్వఁడురోరి (ఉ.హరి. III. 43); దుర్లభుఁడగు నీవు (పాండు. IV. 110); నీ వాదిభూతుఁడగుట (పాండు. II. 55); రాజవా నీవు యమధర్మరాజుగాని (రాధికా. II. 91); పెద్దవాఁ డవుదువు (రాధామా. I. పు. 12); ధురంధరుండై వెలుంగువాఁడవు (హరి. పూ. VII. పు.175); మడియించినావు (ప్రభులిం. పు. 102); కూర్చుకొన్నావు (ప్రభులిం. పు. 102); చెప్పినాఁడవు (కాశీ. I. 13); కైకొన్నావు (సమీ. VI. 44); తలఁచినావు (చెన్నబ. పు. 127). కమరినాఁడవు (ఉ. హరి. IV. 286); దాచినావు (ఉ. రా. పు. 104); మెచ్చినావు (ఉ. రా. పు. 140); పూనినావు (,, 141); వంచినావు (ఉషాక. III. 56); తెచ్చినాఁడవు (విష్ణుపు. VI. 79); మించినావు (ఉ. రా. పు. 53); హసించినావు (ఉ. రా. పు. 42); ఐనావు (ఉ.రా.పు. 42); రచియించినాఁడవు (శకుం. పరి. I పు. 4); ఆరాధించినాఁడవు (వరాహ. IX. 115); మెప్పించినాఁడవు, తెప్పించినాఁడవు, కల్పించినాఁడవు (వరాహ. XI. 54).

భూతమునం దుత్తమపురుషైకవచనమున 'తిని', మధ్యమ పురుషైకవచనమున 'తివి' అనునవి ధాతువు క్త్వార్థకరూపముపైఁ జేరును. వాని 'ని, వి' లు వైకల్పికముగ లోపించును. అప్పు డుత్తమ మధ్యమ పురుషైకవచనములం దొక్కటేరూపము నిలుచును. దానిపై 'ఏని' పదము చేరినచో 'తేని' అని యగును; ఇందలి తుది 'ని' వర్ణమొకప్పుడు లోపించును. అప్పుడు క్త్వార్థకరూపముపై 'తే' మాత్రము నిలుచును. వ్యవహారమునం దీ 'తే' రూప ముత్తమ మధ్యమ పురుషైకవచనములనుండి ప్రథమైకవచనరూపమునకును మూఁడుపురుషముల బహువచనరూపములకును వ్యాపించినది. చుకారాంత, యుకారాంత ధాతువులపై 'తే'చేరునప్పుడు చ,య,లుల సకారముగా వ్యవహారమున మాఱుచుండును. 'తే' ద్రుతప్రకృతికముగను, కళగనుగూడ వాడఁబడుచున్నది.

అంగజాస్త్రవృత్తము : ఆర్తవగిరివక్షైతే, నంగజాస్త్రవృత్తమందగించున్. (అప్ప.)

క: అడిగితినఁట లేకుంటే, యోడితినఁట (ఉ. నై.)

క. తెమ్మని నే నగరపైచి- తే నీతఁడు (వేం. పంచ. I. 70).

శా. నిను నిల్లాలంచు నే నమ్మియుం,టే నీవిట్లు దురాశఁ జెందఁదగునే. (దశావ. పుట. 195.)

శా ...కన్నుఁగొనలం బ్రార్థించినం గూడదం,టే నెమ్మోములవంచి యున్నురనుచున్ (దశావ. 309).

క. పాలువిఱిగితే పెరుగగునే (వైజ. II. 101).

శా. ఈశాల యై, తే రామామణి యేది కానము (దశావ. 295).

శా ...దుర్యోధనుం, డై తేనేమి పృథా తనూభవవివాహంబు (పాంచా. 43.)

క ... వేళపాళలు, దెలియంగలవాఁడు దొరకి- తేవాసి (పార్వ. 26.)

క. నీతోడఁ జర్చసేయఁగఁ బో తే నామననుకొకటి పొడమినఁబొడమున్. (రాధామా. 8); ఉందురంటే ... దక్కదఁటంటె ... పోవునఁటంటె ... ఏలుమఁటంటె (రాధామా. 8); సీ. అల్లి తేనే ... మీఁటి తేనే ... పాడి తేనే .. ఆడి తేనే (రాధికా. పు. 14); ఇహమున్నహి పరమున్నహి యైతే; మిగిలినందులకై తే (రాధామా. I. పు. 13).

శా. నేనొల్లనం,టే లాలింపరె తల్లిదండ్రులు (శ్రీకాళ. శత. 52).

శా. ప్రతికర్మంబించుకే చేయఁగాఁ బో తే దోషముగాన (శ్రీకాళ. శత. 69).

క. మామిళ్లకాజ్ఞయై తే, కామిని గ్రుక్కిళ్లకాజ్ఞకలదే యెందున్ (రాధామా. III. పు. 52).

"ముజ్జు పరంబగునపుడు కోశబ్దంబు కొనునకు బహుళంబుగా నగు" నని చిన్నయసూరి. "బహుళం బనుటచే దీనికి నొకానొకచో నతిచారంబని యెఱుంగునది" అని యాతఁడే చెప్పెను. అతిచార మనుటచేత నాతనికా రూపము లనిష్టములని స్ఫురించుచున్నది. గుప్తార్థప్రకాశికాకారుఁడు ముజ్జు పరంబగునపుడేకాక 'మిజీ, నుజీ' ప్రత్యయాది సమావేశమునందును నీయాదేశంబు కానంబడియెడి నని పై బాహుళకార్థమును వివరించి "అన్నునెవ్వతె కందుకో నలవిగాదుగా" (రాజశే. II). "అన్నద్వచ, శ్శ్రీదాంపత్యము నాక నాకయనుకో సిగ్గయ్యెడున్ (రాజశే. III). అను ప్రయోగముల నిచ్చినాఁడు. ఈ క్రింద మఱికొన్ని ప్రయోగములు చూపఁబడుచున్నవి.

చ. ...విధాత పాటలిమ మధ్యమసంధ్యకుఁ జేయలేని యా, కొఱఁతయుఁ దీర్చుకోఁ దొగరుకొల్పిన కైవడి (ఆము. II. 18.)

క. ఆకలియును నాఁకలియును, బైకో పైకొక్క వానిపై వైచిన (ఉ. నైష. 30.)

గీ. ఏను ప్రార్థింపఁ గైకోక యిట్టివానిఁ గాని వరియింప నంటివి (కళా. VI. 49.)

సీ. సేవ సేయించుకోఁ జిత్తగింపఁడు సుమీ నాచేత శ్రీ విశ్వనాయకుండు (కాశీఖం. 122).

శా. పట్టుకో నుద్యోగించి (కాశీ. V. 149); చేయించుకోన్ (కాశీ. 160); ఊఁకో (కాశీ. VII. 173).

గీ. ధైర్య నిర్జితమందరాహార్య భార్య, తనయ యేలయ్య కైకోవు ధర్మబుద్ధి (కాశీఖం. VII 82).

శా. కుంతీ ద్రౌపదులం బ్రభావతి గనుం- గో నేఁగెడున్ (జైమిని) II. 104)

మ. ఇటఁ గైకోవయ్య విస్తారమా, కడనిల్వంగద వయ్య (దశావ. 22.)

క. నాతోడం, బోరాడలేవు పోరా, కోరాయభయంబు, నిల్వుకోరా తనువున్. (దశావ. 92.)

మ. నిమేష వ్యాఖ్యఁ గైకొని దృక్సరసీజంబులు (నైష. V. 182.)

గీ. జవ్వనంబిచ్చి ముదిమిఁ గోఁజాల మనుచు (విష్ణు. VI. 177.)

శా. అర్కేందూపల రత్న నిర్మిత మహాహర్మ్యాగ్ర భాగంబులం దార్కోఁ దారక మండలంబుఁ గని ... (భీమ. III. 93.)

చ. కై, తగవున రత్నకుండల కదంబక ముందనువేఁడి పుచ్చుకోఁ దెగువ మనోభవుండు తియతియ్యని సింగిణి వింటి కొప్పునం దగిలిచె దక్షవాటి వనితాచికురంబులఁ బోలు సింజినిన్ (భీమ. V. 95.)

గీ. ...అష్ట దిశలుఁ, దాన కైకొని కైకోఁ డతండు సురల (హరవి.)

శా. ...దక్షనగరీ రామా సముత్తుంగ వ, క్షోజ ద్వంద్వ శిఖాంకుర స్ఫురణఁ గైకోన్ విఘ్నరా జర్మిలిన్ (హరవి.)

శా. కాముం జీరికిఁ గోక ... (హరవి.)

'ముజ్జు పరమగునపుడు కో శబ్దము కొనునకు బహుళముగా నగు; ముజ్జు పరంబగు నపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును మువర్ణకంబునకు మామిడియు నగు' నను బాల వ్యాకరణ సూత్రములచే 'చెప్పకో = చెప్పకొనుము' మొదలగు రూపములు సిద్ధింపవు. 'కో' పదాదేశము బహుళమనుట చేత నిట్టి రూపములు గలిగినవని చెప్ప వీలులేదు. ఇట్టి వానిలో 'ము'వర్ణక నిషేధమునకు లక్షణములేదు.

ఇదిగో, అదిగో, వాఁడుగో, వీఁడుగో, ఇవిగో, అవిగో, వారుగో, వీరుగో, మున్నగు ప్రయోగములును గ్రంథములందును వ్యవహారమునందును గాన్పించుచున్నవి. ఇట్టివానియందు 'కో' పదము కేవలావ్యయమైనది; 'కొను' ధాత్వర్థము మఱుఁగుపడినది. వీనిలో 'కొను', 'కో' అయిన పిదప ముఱ్ఱు నిత్యముగ లోపించును. 'వీఁడుగో' కుమాఱుగ 'ఇడుగో' అను రూపము వ్యవహారమున నెల్లయెడల వ్యాపించినది. వాఁడుగో, వీఁడుగో, వారుగో, వీరుగో, అను రూపములు కేవల మాండలికములుగ నచ్చటచ్చట వ్యవహారమున వినఁబడుచున్నవి.

యకారాంత ధాతువులపై క్త్వార్థకే కారము చేరునప్పుడే కాక యితర సన్నివేశము లందును యకారమునకు సకార మాదేశముగ నిలుచును.

క. ఒక గిండిలో గళముఁ దొట్టంగా, నా సవమును గడువడిగాఁ, బోసుకొని యచటికిఁదాఁ బ్రమదమున వచ్చెన్ (కవిజన. చ. IV. 53.)

ఉ. సరసత్వము మీఱఁ జేరె నే, సుందరు డింపుతోడఁ గల- నుంబల నూదన భోగభాగ్యుఁడై (ద్రౌపదీ పరిణయము.)

ఉ. శ్రీసతి చన్నుఁ గ్రేవలను జెక్కుల నొక్కటఁ బత్రభంగముల్ వ్రాసుటకున్ విరించి నిట- లంబున నొక్కట భాగ్య వర్ణముల్ వ్రాసుటకున్ జతుర్భుజ విలాసముఁ బూనిన వేల్పు సత్కృపోల్లాస మెలర్పఁ బోసుచు శుభలక్షణుఁ గొప్పుల వల్లభూవరున్. (రాజరా. పు. 500.)

సీ. ఎన్ని జన్మములెత్తి యేమేమి పుణ్యముల్ సేసుటనో (వీరనారాయణ. 17.)

క. రోసంబున వీ రిరువురు, భాసుర కమలాసనాఖ్యబాణంబులు తా మేసుట కుపక్రమింపఁగ, వ్యాస మహామౌని సింహుఁ డడ్డం బగుచున్. (శశి. పుట. 81.)

ఉభయ ప్రార్థనంబున ధాతువుపై 'దాము' 'తాము' లు వ్యవహారమునందును గ్రంథములందును జేరుట గలదు:

మ. ...ఓరీ నీకుఁ దోఁబుట్టువే, విన మేకై వడిఁ జావఁగల్గెఁ జెవుమా విందాము నిక్కంబుగాన్. (చెన్నబ. III. 119).

సీ. ...ముసరుఁ దేంట్లనుదోలి మధుపానములు సేయఁ గదలుదాము, పులిన దేశములందు పిలిచి బంతులుదీఱి యానందమయులమై యాడుదాము, కాళికాస్తంభసంకాశ దేశములందుఁ బువ్వ శయ్యలమీఁదఁ బొందుదాము, సరిజనము లందికోతాము ... తృప్తిఁ బొందుదాము. (పట్టాభి. III. 78).

మ. కోటలో,పల నిల్తామటు గానిచో (రంగారా. II. 181).

గీ. హరిని గని రాధ 'యలయాట- లాడుదాము' (రాధికా. I. 57.)

సీ. గౌతమీ స్నానానఁ గడతేఱు దామంటె, మొనసి చన్నీళ్లలో మునుఁగలేను (నృ. శత. 8).

సీ. ఎగిరిపోయ్యేటందుకే యుపాయంబైనఁ జేయఁబోదా మంటె చేతఁగాదు. (నృ. శత. 41).

పగలు తీర్తమంచు (రామాభ్యు. I. 16).

చేసినది, పోయినది, మొదలగురూపములందలి నవర్ణము మీఁది యత్తునకు వ్యవహారమున లోపము గలుగును. 'ఉన్నది' అను క్రియారూపమందును 'న్న'యందలి ద్విత్వమును నత్తునులోపించును. ఇట్టిరూపములు కవిప్రయోగములందు గాన్పించుచున్నవి.

ఉ. కాననంబులో, ఘోటకమెక్కటుంది (పట్టాభి. IV. పుట III).

గీ. ప్రొద్దుపోయింది నుండని - బుజ్జగించి (భీమ.)

క. కొలిచింది రామచంద్రుని, దలఁచింది పరస్వరూప ధ్యానము సేయన్ వలచింది ముక్తిలలనను, నిలిచింది పురాకృతంబు నిజమని తెలుపన్. (రామస్తవరాజము.)

క. పలికింది వేదతుల్యము, చిలికిందికృపా రసంబు (రామస్తవరాజము.)

మ. కరినేలిందిహుళక్కి, ద్రౌపదికిఁ గోకల్ మెచ్చి యిచ్చింది దబ్బర కాకాసురునింగటాక్షమునఁ జేపట్టిం దబద్ధంబహో (దేవకీనందన శత. 100).

ఆ. పురుషుఁడెన్నిగతులఁ బుట్టింది మొదలుగ (వేమనశత. I. 118).

శా. రోసిందేఁటిది రోఁతలేఁటివి మనోరోగస్థుఁడై దేహి తాఁ
బూసిందేఁటిది పూఁతలేఁటివి మదాపూతంబు లీదేహముల్
మూసిందేఁటిది మూఁతలేఁటివి సదామూఢత్వమే కాని తాఁ
జేసిందేఁటిది చేఁతలేఁటివి వృథా శ్రీకాళహస్తీశ్వరా.

(శ్రీకాళ. శత. 71).

వ్యతిరేకక్త్వార్థకము లోకప్పుడు కావ్యములందు ద్రుతాంతములుగఁ గానఁబడుచున్నవి. వ్యవహారమునందును నిట్లే యున్నది.

క. ఆధారములే, కను సంతానచ్ఛేదంబున వ్రేలెదము (భార. ఆది. II. 139.)

క. కాఱడవిఁబఱచు మృగముల నూఱడకం దిగిచి (ఆది. IV. 18).

సీ. సురఁటిలేకనె వచ్చితి రదేమి పల్కన్న సురఁటిఁ దెచ్చెదనని జరిగ నొకతె (ఉ. నై. V. 28).

క. కాలు కదలింపలేకన్, వాలెము నడుగున నొడలనువైచి (కవిజనచ. చ.)

క. ఆచకనె యానతియ్యఁగఁ దోఁచదసాధ్యంబు కవనధోరణిపట్లన్. (ప్రబం. పుట. 5.)

క. తడఁబడకంబోయి సావధానము గాఁగన్ (శివ. 41).

గీ. అంగజవ్యాధులను మాన్పకం గరంబు (సారం. II. 177).

క. ఏవలాడ వినలే,కను దేశభ్రమణవృత్తిఁ గై కొనిమతియున్. (హంస. III. 147).

(దశావ. పు.45.) ఉండకన్; (దశావ. పు115.) చేయకన్; (దశావ. పు 289) విడువకను; (,, 297.) ఓర్వకన (,, 303.) లేకనే.

ఇట్లే ద్రుతము కొన్ని కళలగు నవ్యయములపైఁ జేరి వానికర్థభేదములను గల్పించుచుండును. ఇట్టిద్రుతములు వ్యవహారమున లోపించి తమకుఁబూర్వమందుండు నచ్చునకు దీర్ఘము గల్పించుచుండును.

క. క్రమ్మఱి, తిరుగన్, మఱిన్, మఱల... పునఃపదంబున.. కివియాఖ్యలగు. (ఆంధ్ర. మానవ. II. 61.)

ఉ. అంటినఁ గందు కెందళుకు లంగములం గలవాని మిక్కిలిన్, గంటికి నించువాని (పాండు. II. 61).

మ. విను మున్ శౌరికినోడి సంగమ మరు-ద్విద్వేషియొచ్చోటికో చని వెండిం జనుదెంచి (పాండు. V. 21).

కొన్నియెడల నీ ద్రుతము కళలగు సంపూర్ణక్రియా రూపములపై చేరి సముచ్చయ చిహ్నముగ నిలుచును.

క. కాదుంగూడ దటన్నను, వాదునకు న్వాదుమునన్ను (పరమ.V.66).

చ. జనక నిమేషముందడయ-సంగతిగాదును మాకు (ప్రభా. II. 50).

ఉ. వేళబమంచుఁ జేయ నొక-వీసముఁగల్గదు హింసతప్పదున్ (ప్రభా. III. 145).

ఏవార్థకమగు 'ఏ' పైఁగూడ వ్యవహారమున ద్రుతముచేరును; ఇట్టి ప్రయోగములును గావ్యములం దున్నవి:

క. వినుపించిన నింతేనా, యని యందఱునవ్వ (శుక. III. 121).

"అనుబంధప్రార్థనయో ర్ణా వ్యతిరేకాదికే చ చోః పః స్యాత్" అనుబంధప్రార్థనములందును ణిచ్చునందును, వ్యతిరేకాదిరూపములందును చువర్ణమునకును పవర్ణము వచ్చును అని ఆంధ్రశబ్దచింతామణి. "ఆగమాన్యచకా

రంబుల కద్విరు క్తంబులకు ముత్తుపరంబగునపుడు పవలగు." "ఆగమచకా రంబునకు నెఱనున్నమీఁది దానికిఁ దుక్కుపరంబగునపుడు పకారంబు విభాషనగు" అని బాలవ్యాకరణము. పై సూత్రములవలన 'ఆకర్ణించుదురు, దంచుదురు, ఆకర్ణించుము, ఆకర్ణించుఁడు, ఆకర్ణించక్, ఆకర్ణించక, మొదలగు ప్రయోగములకు ప్రమాణము సిద్ధింపదు. కాని యట్టి రూపములు వ్యవహారమునను కావ్యములందును నున్నవి. ఉదాహరణములు:

సీ. ఇనసూనుఁడోట ధాత్రి నధార్మికులఁ దన్న నేర్చినట్లం ఘ్రుల్ విదుర్చుఁ దోడఁగె. (ఇందు. ప. II. 16).

ఉ. అంచితలీల భోజవసుధాధిపు డప్పుడ బాహ్యసీమ నిర్మించఁగఁబంచె (ఇందు. ప. V. 69).

చ. నీవు వరింతువో వరిం, చవో యని యెన్నుచుం గుడిభుజం బదరన్ (ఇందు. ప. V. 165).

మ. ప్రబంధంబూని నిర్మించు టే, సరసత్వంబని ప్రాజ్ఞులార! నిరసించంబోకుఁడీ (ఉ. రా. I).

మ. కన్నయ్యా కాపట్య మెం,చఁడె? విన్నయ్యలు విశ్వసింపుదురె? యేసంబంధమున్లేని యీ నడి నావంటి లతాంగికిన్ విధి ఘటించం జెల్లునే? యక్కటా (ఉ రా. I).

మ. జనకుం జేరి కుమారి యేమియు గణిం-చ న్నేరకున్నంతటన్ (ఉ. రా. I).

సీ. శక్తిగర్భీకరిం - చకయుండెనా యరుంధతి నొక్కగతి నీడనంగ వచ్చు (ఉ. రా. I).

శా. సారంగంబువలెన్ని జాగతిఁ దలం-చన్ (ఉ. రా. I).

శా. వి, శ్వాసంబు ల్గనిపించ నేమియొనరిం-చన్నమ్ముఁబుట్టించినా, వో (ఉ. రా. I).

క. వ్యా, పించఁగాచిన తరువులు, గాంచనతరువుల తెఱంగుఁ గైకొనె నచటన్. (ఉ. రా. I).

శా. శాపోక్తుల్ పచరింపకున్న నెదిరిం-చ న్రాదె (ఉ. రా. I).

శా. సారంగ ప్రమదా మహోన్నతిరహిం - చన్ (ఉ. రా. I).

గీ. ఏమి తప్పు లాచరించితినో యన్నియును క్షమి-యించుఁ డనుచు (ఉ. రా. I).

ఉ. మిమ్ము బో, ధించఁగ నేర్తురే యొరులు దేవరయానతి యిచ్చినట్లు కా, వించనొకింత నేర్తు (ఉ. రా. I).

సీ. చంచరీకము ఝుంక - రించ వెఱచు (కకుత్స్థ. I. 151).

గీ. పెంచియొకచోట ననువై న - టించఁజాలు మించి యొకచోట విభువైఁ జ - రించఁజాలు (కకుత్స్థ. II. 32).

చ. భీరులకెల్ల భీతిఁదీ, ర్చుము వెసఁబొమ్ము నమ్ము మను-చుంగదలెన్ (కళా. IV. 13).

క. ఊఁ, హించ నొక నాల్గుగడియలు, సంచారమువలయు (కళా. III. 60).

క. ఎవ్వారిని బో, రించని లక్షణమొకటి ద - రింపఁగ వశమే (కళా. II. 5).

గీ. ఆనల్వవ్రాఁత ననుభ, వించకయె భువిలోనఁ దప్పించుకొనుట కేరికైనను శక్యంబె (కవిజనచ. II. 27).

గీ. రఘునాథ ధరణివిభుఁడు, దరణినిభుఁడు ప్రతాపసంతతులవలన నంచు బుధలోకమెల్ల వ - ర్ణించమించు (కువల. I. 54).

ఆ-వె. కొంచెమనక చిత్త - గించవలయు (కృష్ణరా. II. 138).

గీ. మంచి దేవస్థలంబు వీ - క్షించ నెంచి (కృష్ణరా. IV. 134).

లయగ్రాహి. మించమణి ఘంటలు ర-హించఁ గటిచక్రములు (చంద్రభా. II. 108).

ఉ. గద్దించఁగ నేమి గారణము - తెల్పఁగదోయి (చంద్రభా. III. 28)

శా. స్వామీ తావక భుక్తశేషము భుజిం-చంగల్గి (చెన్నబ.).

క. మంచిది, మీరీసతిఁ బో, షించుండని యొప్పగించి (దశా. IV).

క. ఓ, పంచశరాకృతి ! మది లో, భించక యిటురమ్ము (నిర్వ. వి. రా.).

ఉ. నిర్జరవల్లభుఁ డంత నెమ్మదిం, దోఁచక (నిర్వ. వి. రా.).

ఉ. నిజేశుకోర్కి గా, వించఁగ నిశ్చయించి (నిర్వ. వి. రా.).

ఉ. నుతిం, చంగల దేవతాపదవి - సాది (నిరంకు. II. 67).

సీ. పొంచుండి కోఁతి ని - ద్రుంచఁడేని (నీలా. I. 43).

సీ. ముసిఁడిమ్రానను బండ్లు పసమీఱఁ గల్గించి, యిఁచున కేల పుట్టించఁడయ్యె (నీలా. I. III).

గీ. కుడిభుజంబునఁ జక్రము - య్యెడమవలన శంఖమునుగాఁగ గురుఁడు గూ - ర్చంగవలయు (పద్మ. ఉ. ఖ. V. 34).

ఆ-వె. ఖలమైన కోటఁ గ, ట్టించవలయునని త - లంచినాఁడ (పరమ. V. 9).

సీ. తల్లిదండ్రులఁజాల, పఱచవై సంతోష - పఱచవైతి (పాండు. III. 36).

క. తోఁచినవగ రచియించెదఁ, దోఁచనిచోఁ జిలువకట్టు - దొరతోడై వా యాఁచకనె యానతియ్యఁగఁ, తోఁచ దసాధ్యంబు కవన - ధోరణిపట్లన్. (ప్రబం.)

సీ. హెచ్చి చేపట్లకు వచ్చు నాతని విలో, కించి ప్రార్థనము గా - వించ వలయు (ప్రబో.).

ఉ. కాంచన దీప్తిచేఁ బసిఁడి - గట్టు తెలుంగు నగళ్లకోట సూ, చిం చఁగ (ప్రభా. V. 198).

మ. శారీరభా, జనయంత్రంబు ఘటించి దానిఁ దిరిగిం - చన్ యుక్తి చింతించి (బసవ.).

శా. గ్రామ్య బ్రహ్మచారుల్ దువా, ళించన్ (బహు.).

గీ. నంచుకొంచు నోకించుక - దించఁబోక (బహు.).

సీ. అధిపుపై సుమనోమ - య్యాంబక వ్రాతంబు, నించ నల్లుని బ్రతి - ష్ఠించ దేని (బహు. I. 46).

సీ. చంచలాకార ని - ర్జించఁదగున (భాను.).

ఆ. వె. నిశ్చ, యించలేక మోము - వంచినడచు (భాను. V. 244).

క. పంచగ్రహ మిహిరుని వ, ర్తించని లగ్నమున (రా. వి.).

శా. కుంతలశ్రేణి న, ర్తించన్ (రాజశే. II. 129).

సీ: మించివారాశి లం - ఘించఁగలఁడె (రాజశే. III. 24).

మ. శరణ న్వారలయాపదల్ పరిహరిం - చ న్గామఁ దుండంగ (రామస్త.).

సీ. గోటిచేతను వీణె మీటితేనే సరా, కొంచక ఊ ల్గఱ-గించవలదె (రాధికా. III. 110).

గీ. చల్లకై వచ్చి ముంతఁదాఁ - చంగనేల (రాధికా. II. 126).

మత్త. వ, ర్తించరాఁడని యింతినన్నుఁ బ్రతిజ్ఞచేసిన నట్లు కావించఁ బొల్పడినాఁడ (రుక్మాం.).

క. కొంచెపు విలుగొని న న్నేది, రించంగాలేవు (రుక్మాం.).

గీ. క్రించు వెడవింటి జోదు జ - యించరాదు (వరా. IV. 18).

శా. స్థానాస్థాపిత రత్నరాజముహ - రించం దేరు డిగ్గ న్వడిన్ (వరా.).

గీ. ఇంచుకయులేదు సుమ్ముభా - వించ; సీ. ని, ద్రించమేల్కాని విలో - కించ; గీ. నుతులు, గాంచునే దేవుఁడతనిఁ బూజించు మునుపు.

సీ. కోపించకు మంచూర - డించిమునులు (వరా.).

శా. శాఖాఫల, జ్వాల నావాఙ్ముఖమై తపంబు సవరిం-చన్నాఁగె (వసు. III. 165).

ఉ. మంచు మునుంగు పూని లవ - మాత్రము పద్మిని మోముదమ్మి దీ, పించమి (వసు. IV. 82).

గీ. కంచుకంబేల యింకఁ జా - లించరాదు (వసు. IV. 84).

శా. వినయాహ్లాదంబు లెంతే విజృం, భించన్ - భక్తి న్నిమ్న స్నేఁడు ద, ర్శించన్ (విజయ. II. 65).

శా. శుభోదర్కంబు గావించ దీ, వించన్ (విజయ. II. 76).

ఉ. సై, రించునె ... గా, వించఁడె ..., దంచఁడె (విజయ. III. 59).

గీ. చూచి చెప్పితినని మీకుఁ - దోఁచవలదు (వేం. శ్వ.).

ఉ. సందుచూచి లం, కించఁగనోపు నీ పసిఁడిగిన్నియ (వైజ. IV. 109).

గీ. చూచినాఁడను నీ వింక దాఁచవలదు (శశాం. IV. 18).

మ. చపలాక్షీమణి నిన్వివాహ మొనరిం - చం గార్య మూహింపు చున్ (శుక.).

గీ. మించి తగినట్టి బుద్ధి చె - ప్పించవచ్చు (శుక.).

సీ. శంకరహర, శబ్దంబు లుచ్చరిం - చంగవచ్చు (శుక.).

గీ. ఎంచిచూచిన మది విశ్వ-సించరాదు (పట్ట. IV. 116).

క. ఒక యింతియుఁ దానఁ జలిం, చక యున్నం గినిసి శంభు - సాధనుఁడు (సమీ. I. 171).

శా. సామర్థ్యం బొకయింత నీకుఁ గనుపిం - చం జేసితిన్ (సమీ. III. 115).

మ. జవముం దేజము మించ నీ కిటుఘటిం - చం జెల్లెఁగాక (సమీ. III. 180).

మ. జవసంచార మలంతి యానము గణిం - చన్ శక్యమే మారుతిన్ (సమీ. III. 190).

సీ. రవిపున, స్సంచార మొనయఁ గాం - క్షించఁడేని (సమీ. III. 194).

స్రగ్ధర. క, ల్పించన్ దన్గోరువారిన్ (సమీ. IV. 265).

మ. చనుదేరం దృణలీలఁ బాదహతిఁ ద్రుం - చం దైత్యుఁ డత్యుద్ధతిన్ (సమీ. V. 30).

మ. శరవర్షంబునఁ బెక్కుతూఁపులు జనిం - చ న్మించి వీరత్వమున్ (సమీ. V. 68).

మ. సకల వ్యాప్తి రహించురూపు గనిపిం - చన్ విస్మయస్వాంతుఁడై (సమీ. V. 97).

గీ. జఠరగోళంబునను వసిం-చకయమున్న (సమీ. VI. 26).

ఆ-వె. అనుచు మమ్ముఁ గనుచు - ననుచు మనంబున, మనుచు మునుచు వేఁడు - కొనుచునున్న (సమీ. III. 33).

లయగ్రాహి. అంచల రు - చించ కల యించుల కలంచి గమకించున్ (సానం. III).

క. తాలిమి, డించక ... తాఁ జలి,యించక; మ. దో, సము ను మ్మొందు నిరాపనిందలు గడిం - చన్ (సారం. III. 12); - సీ. అపకార మొప్పు త - లం చఁడయో యెంత మంచివాఁడు (సారం. III. 83); నన్ను నీ, డేర్చఁదలంచి (సారం. III. 185).

సహాయక క్రియయగు ఇచ్చు ధాతువు మధ్యమ పురుషమునందు వచ్చు 'మ్ము' లోపించి లుప్తమైన యిత్తునకు దీర్ఘమగును: కానీ, పోనీ, రానీ, మొద.

శా. నీతిం దానఁదలంచి చేయఁబనిగా - నీ కాకపోనీ (ఆము. IV. 214).

మ. .. పాదములొత్త రమ్మనుట గానీ ... ఏఁగు దెమ్మనుట గానీ ... కన్నులు విచ్చి చూచుటయొకానీ (కళా. IV. 112).

ఉ. కావున రూపయౌవన వికస్వర గర్వ భయంబుచేతఁ గానీ, విభుఁ డిచ్చు మన్ననల - నెయ్యపుటాలనటంచు నమ్మికానీ, వినయాదు లేమఱక (కళా. VII. 94).

శా. నీ చెల్వం బిది నిక్క మట్లయినఁగానీ (కాళ. మా. II. 13).

మ. నిరవద్యస్థి భక్తితోడ ననుఁగానీ, శంభుఁగానీ, రమేశ్వరుఁగానీ గుఱి యించి (కాశీ.).

సీ. ...ఉపవాసముండనీ, ... దేవతార్చనము సేయంగనీ ... పుణ్య తీర్థంబు లాడనీ ... (కాశీ.).

క. ఎంత జడుఁడైనఁగానీ (నైష. VI. 23).

మ. నియతిం బాతికయెత్తుకాంచనముగా - నీ వెండిగానీ (పాండు. II. 87).

క. ఉత్తముఁడు సత్కర్మం, బులుగానీ దుష్కర్మంబులుగానీ హరికి నిచ్చి పొరయఁడు వానిన్ (వరాహ. II. 13).

క. తానంత యొగసి పడినం, గానీ (రా. వి. III. 101).

'కొని' యనుక్త్వార్థకరూపము ధాతువు పల్లవించుట కుపయోగపడు నప్పుడు పదునాఱవ శతాబ్దమునుండియుఁ గావ్యములందు 'క' గ మాఱుచు వచ్చెను. వ్యవహారమునందును నిట్లే కలదు. 'కొని' 'క'గమాఱునప్పుడు ధాతు వుతుది ఉకారము మాఱదు. ఒకప్పుడు 'క' కు మాఱుగ 'కు' కూడఁ గాన వచ్చును :

అందుక (జైమిని. V. 116; శశాంక. V. 31); ఆక్రమించుక (ప్రబం. వేం. వి. 64); ఆదుక (రుక్మి. I.); ఇడుక (రుక్మి. ప. I. 82); ఈడ్చుక (రాజ శే. II); ఉంచుక (రాధా. I. పుట. 10); ఊఁదుక (విజయ. I. 184); ఎక్కుక (అప్ప. IV. 316); ఎత్తుక (జైమిని. V. 62; భా. రా. I. 30; ,, II. 102); కట్టుక (దశా. 346; బసవ. పిడు. 78; బిల్హ; నృసిం. శత; సుమ. శత; జైమిని. IV; సుభ. III.); కఱచుక (హంస. I. 193); కొట్టుక (రాధికా.) ; గదుముక పట్చ. IV); చించుక (కాళ. మా); చీకిలించుక (కాశీ. III. 195); చుట్టుక (బసవ. పిడు. పుట. 118; జైమిని. VII; పట్చ. IV); చూఁచుక (నిరంకు. II. 58); చెప్పుక (రుక్మి. V); చేరుక (రుక్మి. IV); చేసుక (దశా. 93); తట్టుక (పార్వ. 16); తప్పించుక (సుమ. శత.); తార్చుక (రుక్మి. II); తీసుక (భాస్క. శత.); తెచ్చుక (ఉ. రా. I. 107; నిరంకు. II. 122); నాటుక (భాగ. V. ii. 145); పంచుక (కాళ. మా. I. 75); పట్టుక (ఆము. VI. 85; బిల్హ; భాగ; శకుంత. పుట. 80; నృసిం. శత. రుక్మి. III; అచ్చ. యు. కాం; రాజశే. III. ఆము. VI; ఆంధ్రభా. స్వర్గ. I); పుచ్చుక (దశా. 45. పుట); పెట్టుక (అప్ప. V. 91; ఉ. రా. I. 165; పట్టాభి. పుట. 45; రాధికా; వైజ. II, 10; శశి. పుట. 43; రుక్మి. V; పట్చ. I; హంస. V); పెఱుకుక (వరా. II. 174); పొంచుక (సానం. పు. 46); పొదుచుక (హంస. IV); మోకారించుక (కాళ. మా. IV. 73); మోచుక (ఆము. VI. 84); వంచుక (గంధ. 26); వేసుక (ఉ. రా. I. పుట. 10); వ్రచ్చుక (పంచ. సుహృ.); సంధించుక (పద్మ. ఉ. ఖ. III. 72).

ఈడ్చుకు (మార్క. 358); జేఱుక (సమీ. II. 44).

"చువర్ణంబుతోడి దుగ్ధకారంబు తకారంబగు, నిలుతురు, పిలుతురు, అడతురు, కడతురు, చింతురు, పెంతురు, పచింతురు, వచింతురు;—చేతురు, కోతురిత్యాదులసాధువులని యెఱుంగునది. "—బాలవ్యాకరణము. క్రియా పరి. సూ. 108.

ఈ లక్షణమునుబట్టి (1) నిలుచుదురు, చించుదురు, వచించుదురు మొదలయిన 'చుదురు' రూపములు, అనఁగా దేశ్యక్రియలలోని స్వార్థ మందున్న చువర్ణమూ, ప్రేరణార్థమందున్న చువర్ణము, తత్సమ క్రియలయందలి 'ఇంచు' లోని చువర్ణములమీఁద 'దురు' రాఁగా కలిగిన రూపములును; (2) చేయు, కోయు, మొదలగు యుకారాంత క్రియల తద్ధర్మార్థక రూపము లందు 'చేయుదురు, కోయుదురు' మున్నగు వానిలోని 'యుదు' కు మాఱుగ వచ్చిన 'తు' తోఁ గూడిన 'చేతును, చేతుము, చేతువు, చేతురు' మొదలగు రూపములును నసాధువు లగుచున్నవి.

(i) వీనిలో మొదటి తెగకుఁ జేరిన రూపములకు విన్నకోట పెద్దన్న లక్షణముచేసి సాధుత్వమును గల్పించియున్నాఁడు.

క. తుద బహువచనమునకు నిం, పుదురును నింతురునునయ్యెఁ బుడమి యెడల నిం, చుదురును గలుగుఁ బ్రయోగాస్పదములు దేశీయసరణిఁ జనుఁ దెలియంగన్."

నన్నయ తిక్కనాది ప్రాచీనకవు లీ 'చుదురు' రూపములను వాడ లేదు. అరణ్యపర్వము II. 255 లో మాత్రము "ఏమేమ మున్ను బూజిం పుదుము రుద్రు - నిందని వేడ్క" నని యున్నదిగాని, వ్రాఁతప్రతులలో "ఏమేము మున్ను బూజింతుము రుద్రుని - నిందనివేడ్క" నని, యున్నది. నంది మల్లయ్య, ఘంట సింగయ్యలు రచించిన వరాహపురాణ రచనమునాఁటికి 'చుదురు, పుదురు' రూపములు గ్రంథములలోనికి వచ్చినవి.

గీ. రూపమునునైన తనువు లా - ర్యులు వచింపు, దురు వరుస మూఁడటంచు నం - దుల (వరాహ. VII. 110).

గీ. వేదమార్గ రహస్యైక వేత్తలైన, భూనిలింపోత్తములు యజిం - పుదురు బ్రహ్మ (వరాహ. X. 76).

సీ. అచట జాంబూనదం - బను పైఁడిఁ జేసిన, తొడవులు ధరియింపు - దురు దివిజులు (వరాహ. X. 119).

'-ంచు' అంతమందుగల ధాతువులవై ప్రథమా తద్ధర్మక బహువచన క్రియాప్రత్యయముగ 'దురు' చేర్చునప్పుడు 'చు' కు పత్వము రాదని కొందఱి యభిప్రాయము. కాని, గ్రంథములందు ప్రయోగము లున్నవి.

ఆశ్రయింపుదును (విష్ణుపు. I. 204); అనుభవింపుదురు (శకుం. పరి. III. పు. 59); ఒనరింపుదును (విష్ణుపు. II. 136); వసియింపుదున్ (పాండు. II. 224); చలియింపుదునే (వరాహ. III. 36); ఇతని చెయ్యివల్ మున్ను వీక్షింపుదున్ (కళా. III. 89); పూజింపుదుము (వరాహ. V. 54); సన్నుతింపుదున్ (ఉ. రా. పు. 124).

వసియింపుదువు (విష్ణుపు. II. 317); ఆచరింపుదువు (ఉ. రా. పు. 135); సృజియింపుదువు (వరాహ. II. 33); సమయింపుదువు (వరాహ. II. 33)

ఘటియింపుదురు (ఉ. రా. పు. 132); బడలింపుదురు (ఉ. రా. పు. 140); కావింపుదురు (వరాహ. V. 54); జన్మింపుదురు (విష్ణుపు. II. 317); ఆపాదింపుదురు (విష్ణుపు. VI. 186); వినుతింపుదురు (ఉ. రా. పు. 118); నుతియింపుదురు (పాండు. V. 279); సుఖింపుదురు (పా. II. 146); వసింపు, దురు వరుస మూఁడ - టంచు నం - దుల నధర్మ (వరాహ. VII. 110).

ఒనర్పుదురు (పాండు. V. 292).

(ii) చేతురు, కోతురు.

ఉత్తరాంధ్ర కవులందఱును 'చేతురు, కోతురు' వంటి రూపములను వాడియున్నారు. గణపవరపు వేంకటకవి తన "సర్వలక్షణశిరోమణి" లో నీ రూపములకు లక్షణమును జెప్పియున్నాఁడు:

క. చూతము, చూతమ్మనఁగాఁ, ద్రోతును ద్రోయుదును నాఁగ దోరువు దోరియనన్, నేతును నేరుతుననఁగన్, జేతును, జేయుదును నాఁగఁజెలుం వొందుహరీ."

కొన్ని ప్రయోగములు.

గీ. సారె పద్యంపుఁ బలుకపైఁ జమురుపూతు, నెప్పుడును బెద్దపలక పోక్కత్తఁజేతు. (హంస. III. 142).

ఉ. కొండలు పిండిసేతుమొ మొగుల్తెరు వ్రెక్కట మ్రింగివైతుమో (అచ్చ. రా. పు. 72).

మ. అన్యు లెవ్వరు గన్నం దను నిందసేతురను భావం బెంతయుం బూనఁడో (అహ. సంక్ర. పు. 52).

చ. కటకట ! మోసపోతిఁగదె ... ఏమిసేతునే (చెన్నబ. III. 86).

సీ. కుసుమము ల్గోతుమా - ముసరుఁదేంట్లను దోలి, మధుపానములు సేయఁ గదలుదాను ... సరిజనములంది కోతామ ... (పట్టా. రా. పు. 78).

చ. ఏ, మని తలపోతు నట్టి శుభగాకృతి నే మఱవంగ నేర్తునే (భోజ. I. 65).

గీ. కడమనడతలు దెలుతముగాక యనుచు (శుక. పు. 105).

గీ. ఖలుల జిహ్వలు గోతురు - కాలభటులు (శేషధ. III. 42).

క. పరిఘంబులచేఁ, దోలూడఁ దీతు రొక్కని (సానం. పు. 26).

సీ. వేమరుఁ జట్రాత వేతు రొకని ... కొనరి యంగంబులఁ గోతు రొకని (సానం. పు. 26).

శా. ఏమిసేతు మనుచు న్నిర్విణ్ణతం జెంద (ఉ. రా. పు. 85).

క. అవివేకులు గాంక్షసేతు రపయశమునకున్ (ఉ. రా. పు. 228).

ఆ. నుతులు సేతునెపుడు నతులిత సంస్కృత పటు కవిత్వగరిమ పట్టు వడఁగ (కృష్ణరా. I. 10).

గీ. చేరి చుంబించి మోహింపఁ జేతురనిన (నైష. V. 68).

ఉ. దయ్యమ యేమిసేతునని తల్లడమందుచు (భోజ. III. 218.)

ఇంకను నూర్లకొలఁది ప్రయోగములు గలవు.

దోఁతురు (కళా. I. 123); రా, చూతువు (ఉ. హరి. I. 45).

'-ంచు' అంతమందుగల ధాతువులయందలి 'చు' వర్ణమున కాదేశముగ 'పు' వర్ణము చేరి కలిగిన కృదూపములును గ్రామ్యము లని కొందఱు పండితుల యభిప్రాయము. ఇది సరికాదు. గ్రంథములందు ప్రయోగము లున్నవి.

క. అనుదినము వేయుఁ దిరుముడి
కిని మృష్టాన్నముల నారగింపు లిడక యా
యన భుజియింపఁడు మున్నుగ ... ... (పరమయోగి విలాసము IV. 143).

చుకారాంత యుకారాంత ధాతువులపై 'త' వర్ణము చేరి వ్యవహారమం దనేక క్రియారూపము లున్నవి. వానిని లాక్షణికులు గ్రామ్యములుగ బరిగణించినను గవులు దమ గ్రంథములందు వాడక విడువలేదు.

శా. దస్త్రాలున్ మసిబుఱ్ఱలున్ గలములున్ దారొక్కన్న చింతంబళుల్
పుస్తుల్ గారెడు దుస్తులున్ జెమట కంపుంగొట్టు నీర్కావులున్
అస్తవ్యస్తపుఁ గన్నడంబులు భయంబై తోఁచు గడ్డంబులున్
వస్తూచూస్తిమి రోస్తిమిన్ బలుకులన్ వ్యాపారులం గూర్రులన్.
(శ్రీనాథుని చాటుధార).

ఉ. భావ మహానుభావ కడు - భాగ్యముసేసితి విల్లువెల్లి నీ
వేవగ వశ్యవిద్య ఘటి - యించితొ, యేశకునాన వస్తివో
భూవలయంబు లోపలను - బోఁడిమిఁ జెందిన మోహనాంగియే
లా వలపించి మోహము చె - లంగఁగఁ జేసితి చూచినంతటన్.
(ప్రభులింగలీల, పుట. 13.)

క. తను విస్తిని మన సిస్తిని, ధన మిస్తినటంచు నాడఁదగునా యింకా
తను ధనము లేడగలిగెను, పనుపడ నీకిదియు భక్తిపాటియె బసవా.
(ప్రభులింగలీల, పుట. 54.)

మ. అలయింతప్పుడె యిల్లుదూరి, సతులన్ హాస్యంబుగానవ్వి, వా
రలవెన్నల్దిని, జారచోరతతి ధూ - ర్తస్వామివై, నేడు నా
చెలులే పిల్వఁగ నెమ్మి రావలసి వ - స్తే నేరికిం జుల్కనో
చలమేలయ్య మహాత్మ నీదుదయ కృ - ష్ణా! యాపదుద్ధారకా.
(రామస్తవరాజము, 20.)

చ. తపములనెన్ని చేసితినొ - దానము లెన్ని తలంచి యిస్తినో
జపములనెన్ని సల్పితినొ - సద్వ్రత యాగములెన్ని చేస్తినో.
(పట్టాభిరామాయణము, పుట. 41.)

క. తోఁచినది మనవిచే స్తిమి, చూచి కటాక్షింపవలయు సుందరమూర్తీ.

(పట్టాభి రామాయణము, పుట. 75.)

క. వస్తాఁడు నీలభూపతి, తెస్తాఁడు ధనంబు నీక - తి ప్రమదముగా
నిస్తాఁడు విరహవేదనఁ, బస్తాఁడా నమ్మి మదిని - సంశయమేలా.

(చంద్రలేఖా విలాపము, పుట. 78.)

ఎదను, ఎదము,-ఎదవు, -ఎదరు, అంతమందుగల క్రియారూపములు వ్యవహారమునందు -ఏను, -ఏము, -ఏవు, -ఏరు, లుగా మాఱినవి. ప్రథమ పురుషైక వచనమునందు '-ఎదఁడు' రూపమును గల్పించికొని వ్యవహారమున దానిని 'ఏడు'గఁ గూడ మార్చుదురు. ఇట్టి రూపములు సూత్రార్థ సంఘటన మునకు భాష కత్యావశ్యకములు. వానిని గ్రాంథికములుచేసి వాడినచో నుద్దిష్టార్థము సరిగ స్ఫురింపదు. ఈ సూత్రార్థభేదమును విడనాడలేక కవులా వ్యావహారిక రూపములను దమ గ్రంథములందు వాడి యున్నారు.

i. తప్పక యాపని జరుగును.

శా. ఔనౌనే వెలయాలనా యిటులనీ - వాడన్, బళా, చాలు, పో
పో నవ్వే రెవరైన విన్న ...(దశావతార చరిత్రము 218).

ii. ఇట్లు చేయవచ్చును.

చ. నవ్వులు పచరించినట్లు చన-వుల్ నెరపే వది మంచిమాటగా,దు ... (రంగరాట్ఛందస్సు. II. 169.)

ఉ. రా, గిల్ల మయూరపింఛ మడి-గే వని పెన్నెరు లంటనిచ్చు ... (రాధామాధవ సంవాదము. I. పుట. 5.)

iii. అట్లు చేయవచ్చును. కాని చేయకూడదు.

చ. చెలి కలనైన నన్ను మఱ-చేవు సుమీ యెవరెన్ని చెప్పినన్. (రాధామాధవసంవాదము. III. పుట. 55.)

iv. వర్తమానార్థ బోధకము.

ఉ. ఏమి చూ, దేవని నవ్వుచుం బయట-చేఁ దడియొత్తి ... (రాధామాధవసంవాదము I. పుట. 3.)

v. తద్ధర్మార్థబోధకము.

మ. మ, మ్మును గన్నమ్మ యిదేటిబుద్ధి వలదే-మ్రొక్కేము నీకాళ్లకున్. (పార్వతీపరిణయము.)

మ. మముం జంపఁజూ,చినఁ జచ్చేమని పల్కినారు (రంగరాట్ఛందస్సు II. 245.)

శా. శ్రీకుంభిన్యధికారమిచ్చి కృశియిం-చే వెంతరాజత్వము (షట్చక్ర వర్తి చరిత్రము, III. 140).

vi. విధ్యర్థమున.

కృష్ణుని దోడితెచ్చి యతనిం గూర్చేది (మిత్రవిం. I. పు. 41.)

ఎన్నేవు (దశావ. పు. 6); నవ్వేరు ( ,, పు. 205); ఒసంగే ( ,, పు. 158); చచ్చేము (రంగారా. II. 245); అలిగేవేమయ్యా (రాధామా. II. పు. 24); వేడుకవచ్చే నన్నాఁడా (రాధామా. II. 36); నన్నుమఱచేవునుమీా (రాధామా, III. పు. 55); ఎంచేరు (తొండమాన్. పు. 315); చెణికేవు (ఉషా. క. I. 84).

ఉకారాంత తద్ధర్మార్థకవిశేషణములపై 'అది' చేరి క్రియారూపములును క్రియాజన్యవిశేష్యములును నేర్పడును. అప్పుడు నగాగమము వచ్చి, చేయునది, చెప్పునది, మొదలగు రూపము లేర్పడును. ఈ రూపములందలి 'ఉనది' అనునది 'ఏది' గా వ్యవహారమునందు గానవచ్చుచున్నది. 'ఏది' రూపమునకు బదులుగ 'ఉనది' రూపమును వాడినచో నర్థస్ఫూర్తి సంపూర్ణము కానేరదు. దీని నాలోచించియే యర్వాచీనకవు లారూపమును యథేచ్ఛముగఁ దమ గ్రంథములందు వాడియున్నారు.

i. క్రియారూపములు.

క. శ్రీరామకృష్ణులకుఁ బని; ధారుణి నెవరైనఁ దమ్ముఁ దలఁచినవారిన్ జేరేదే దయచేతను (రామస్తవరాజము; 18).

ii. క్రియాజన్య విశేష్యములు.

శా. ఈ రీతిం గొనియాడు నారదునిఁ దా-నీక్షించి సత్ప్రేమ నింకా రావోయి వరంబు వేఁడుమను నా - కాకుత్స్థుతో మాని నిన్ జేరేదిమ్మని కోర నిచ్చె దయతో - శ్రీరామచంద్రుండు (రామస్తవరాజము, పుట. 12.)

క. దిటచెడక దిగులుగొని నట, సాటవ్రోవక వెనుక ముందు చూడక బొంకే దెటులని చింతింపక యా, ఘటకుచ తడఁబడక యుత్తరఁగన్గొని పలికెన్. (హంసవింశతి, V. 186.)

మ. కొలిచేదిం బగలేక నేనడిగితే - కోపించుటే లేక ... (దేవకీనందన శతకము, 42.)

ప్రశ్నార్థకమందు వ్యవహారమున 'ఈనా' అనునదిచేరి సూక్ష్మమగు నర్థభేదమను గలిగించును. వచ్చునా, వచ్చీనా, యనురూపముల కర్థమునందు చాలభేదము గలదు. ఒక పనికొఱకు నిరీక్షించుచు, నది కలుగునో లేదో యను

సందేహముతోఁ గూడిన హృదయావేగమును 'ఈనా' రూపము తెలుపును. ఇట్టి రూపములను గవులు వాడియున్నారు.

క. ఇచ్చోటికి మనకృష్ణుఁడు
వచ్చీనా, ప్రియునిగూడి - వరలెడిభాగ్యం
బిచ్చీనా, యిఁకదైవము
తెచ్చీనా బోటియొకతె - తెఱవలలోనన్.

(కృష్ణలీలావిలాసము. పుట. 26.)

ఒకప్పుడు 'ఆ పనికాదు' అను నిశ్చయార్థమును నిట్టి రూపములకుఁ గలుగును:—

క. నాకేమి దేహసుఖము, పు
రాకృతమేకాక నేఁడు - రాబోయ్యీనా ?

(నిరంకుశోపాఖ్యానము. II. 59.)

పలుకనయ్యీనని; అడ్డమయ్యీనని; కండెలయ్యీనని (రాధికా. III. 33.)

ధాతువుపై 'ఏ', 'ఏటి' అను ప్రత్యయములుచేరియు వ్యవహారమునఁ దద్ధర్మార్థక విశేషణము లేర్పడును. ఇట్టిరూపములు మధ్యయుగము నాఁటి నుండియు కావ్యముల కెక్కినవి.

శా. శృంగారంబును దోఁచుదానిని రచిం-చే మార్గమెల్లందగన్

(ధనుర్విద్యావిలాసము, 161.)

శా. శ్రీమత్పర్వతరాజకన్యను వరిం-చేవేళ (పార్వతీపరిణయము. I. 1).

శా. పా, టెంతుర్పెద్దలు దద్దనమ్మి నుయిదాఁ-టేవానికిం జింతయా
కంతైనం గడమేనియుం గడముగా- దాయంచునూహించుచున్.

(పాండురంగమాహాత్మ్యము IV. 275.)

మ. ... గుడిమ్రిం-గేవానికిం దల్పుల
ప్పడముల్గావు ... (ప్రబోధచంద్రోదయము, 67.)

చ. అటువలె దృశ్య విస్మరణ - నందకశాస్త్ర మనేటి నూతిలో.

(వరాహపురాణము.)

శా. ముందున, న్నేలే రీతిగనేలు నామది కిదే-యిష్టంబు ప్రాణేశ్వరా

(వేంకటేశ్వర మాహాత్మ్యము, పుట. 159.)

శా. పరమార్థమైన సెలవిం-తా లేకపడ్డప్పు డి, చ్చే నీచుం డది పోవ దుఃఖపడఁ దానిట్లయ్యేనే యేఁటికిన్ (సానందోపాఖ్యానము, పుట. 80.)

శా. ఈ నేలపైఁ, బాఱేచీమలు (రంగారా. III. 243.)

గీ. ఆతనివధూటి శుకఘోటి - నలరుమేటి
యొడయఁ డేలేటి సీమాటి - యొఱపుగోటి
కొన నెగయమీఁటి యిదియేఁటి - కులుకనేటి
పోటి కెదిరేటి శుభవాటి - నీటుమెఱయ.

(హంసవింశతి, II. 185).

శా. వండే నేర్పులఁ జెక్కురీతులరుచుల్ - వత్తింపవే శాకముల్.

(దేవకీనందనశతకము, 10).

నమ్మేటట్టి (సురాభాం. పు. 42); కొలిచేటి (సురాభాం. పు. 50); ఉండే (రామరా. 341, 343), ఉండేవారలు (చెన్నబ. పు. 140); తెగించి తిరిగే పుణ్యాత్మునిన్ (రాధామా. II. 31); నేను మెలిగే పాపాన (రాధామా. పు. 45); అడిగేవారు ... మాటాడేటివారో ... తుడిచేవారో (రాధామా. పు. 46); దయచేసేవారు (రాధామా. II. పు. 45).

"తిదుటలు పరంబులగునపు డన్వాదుల నుస్థానంబున నున్నయు. నుండు దులోపంబును విభాషనగు." ఉదా. అందురు, అనుదురు; అనుట, అంట; ఉందురు, ఉండుదురు; ఉంట, ఉండుట; అను, కను, కొను, తిను, మను, విను, ఇవి యన్వాదులు.—చిన్నయసూరి.

అనుదురు, కనుదురు, కొనుదురు, తినుదరు, వినుదురు—అను రూపములు గ్రంథములందు కాన్పింపవు. మనుదురు, మందురు, అను రెండు రూపములును గలవు. ఇట్లే అనితివి, కనితివి, కొనితివి, తినితివి, వినితివి, -ఈ రూపములును గ్రాంథికములు కానట్లు తోచుచున్నది. మనితివి, మంటివి, ఈరెండు రూపములును గ్రాంథికములే—అంట, కంట, కొంట, మొదలగు రూపముల గ్రాహ్యములని యథర్వణుననుసరించిన యహోబలుని మతము. నన్నయ తప్పఁ దక్కిన కవులెల్ల నీ రూపములను దమ గ్రంథములందు వాడిరి.

సీ. స్వప్నభాషితముగా జరుగుచుండును మేలుకొంట యనఁగ మేలు కంట యనఁగ (ఆం. భా. I. 147).

సీ. గీ. తొంట, చెక్కు, తడప -యంట త్యాగాఖ్యయా (ఆం. భా. II. 37).

సీ. ఆఁకలియన, గొదయనఁగ నా కొంట నాఁ, గను (ఆం. భా. II. 260).

గీ. నిపుణుఁ డయ్యె నటంటకుఁ ద్రిపురవైరి (ఆం. నా. శే. పు. 96. ప. 32).

క. పేళ్లి, చను వీక్షించె నటంటకు (ఆం. నా. సం. II. 40.)

ఉ. ఇందు కొక్కమా, టంటయకాదు (ఆము. II. 32.)

గీ. గచ్చులనుకొంట యోమచ్చె - కంటులార (ఇందు. పరి. పు. 33.)

ఉ. ద్వాదశి పుణ్య కాలమునఁదైలమునం దలయంటి కొంట (కవి రామనో. పు. 80.)

చ. ఓడల బండ్లు బండ్లనో, డలుఁ జనుదెంచునంట యకటా వినరే (కేయూర. III. పు. 102.)

క. రెండు గన్నులు పోలియుం, గొంట యుడుగుటకు నొకక, న్నుంటకు సంతసము నొందు టుచితము నీకున్ (కేయూర. III. 133.)

మ. కృపఁ జేకొంటయుఁ గన్పడ న్నిలుపుము (చెన్న. పు.)

ఉ. జనకప్రభు కూఁతురి నేలుకొంట యా, రామున కొప్పె. (నిర్వ. ఉ. రా. పు. 23.)

సీ. పనిగొంట నీకుఁ బ్రాభవముగాదె (నైష. III. 126.)

గీ. చెలిమిసేయుట పగగొంట - తెలియనరిది (నైష. III. 159.)

గీ. పలుకకుంట తిరస్కార -కలనముద్ర (నైష. III. పు. 67.)

ఉ. ముత్తచ్చు లిట్లునూ, ల్కొంట (ప్రభా. V. 167.)

చ. మానిని కోపము వేఁడికొంటయుం, దనదు ప్రతిజ్ఞయుం దెలిపె (హరి. II. 74.)

శా. పతింజేకొంట యుక్తంబు (హరి. V. 61.)

చ. వలతురు నాథులంట (భార. ఆర. V. 200.)

ఉ. చత్తునంట దా, మెచ్చగునయ్య (భార. ఆర. VI. 53.)

క. ఇ, ట్లంటంగట్టందగునే, యంటకునగి (అనుశా. I. 26.)

చ. ఆతనిసామ్ము వుచ్చికొం, టయును. (అనుశా. V. 8.)

చ. పరిశాంతి యొనర్చికొంటయున్ (అనుశా. V. 31.)

చ. ఇ, మ్ముదిత వధింతునంట గడు - మోసముగా దొకొ (భార. ఆర. VII. 142.)

ఉ. పాండునృపాలు పాలు గై, కొంటయ చాలు (ఉద్యో. III. 59.)

ఉ. సుజనవత్సల నీవిటులంట (ఉద్యో. III. 74.)

క. పోలికలనిది, గంట నిధానంబుఁ గంటకాదే. (భీష్మ. I. 62.)

చ. మగుడం బురికొంట (కర్ణ. I. 137.)

క. కృష్ణ గాండీవుల ని, ట్లంట యుడిగి (కర్ణ. II. 85.)

పిలుకుమార్చెదనంట యుదాత్తమైనధైర్యమహిమగాదె

(శల్య. II. 39.)

చ. సకలోర్వియుఁ గైకొనుమంట (శల్య. II. 115.)

సీ. ఒండొక్కఁ డొడలు, కైకొంట (స్త్రీ. I. 34.)

ఉ. దుఃఖముల్, శత్రులచెయ్దినంటయును - సన్నతి దా ధనమూల మంటయున్ (శాంతి. I. 207.)

చ. ఇటులంట యుక్తము (శాంతి. I. 346.)

క. కచ్ఛపంబు - గారుం బట్టం, గంట ... (అను. I. 220.)

చ. కనుగొంటకుఁ గన్నువలంతి గాదు (అశ్వ. II. 31.)

తరల. విపక్షి కుండెలు తింట లో,పలనెఱింగి (భాగ. IX. 158.)

క. చెలువుని గనుగొంట యిందుచే భాగ్యంబో (రాజశే. II.)

ఉ. భానుకులప్రసూతులు కృపాపరులంట, యవధ్య హింసకున్
బూనని పుణ్యులంట, గుణభూషణులంట, యథాపరాథ దం
డానుపమానశౌర్య విదులంట, మునిప్రియులంట, నేఁ డయో
కానక కన్న మానుతుఁ బొకారిచి యిన్నియు మిథ్యసేసితే
(రామాభ్యు. II. 52.)

గీ. స్వప్నముననైనఁ గనుగొంట -సందియంబు (రుక్మా. II. 80.)

క. మీలను, గ్రక్కునఁ బట్టుకొని తింట (రుక్మా. III. 27.)

సీ. మొగముముందఱ నంట - మొదలె లేదు (విజయ. I. 85.)

గీ. కీర్తి కాయంబుఁ గైకొంట -కార్తియేల (హరవి. II. 35.)

గీ. నవ్వుఁ బాటు. గాదెయిట్లంట (హరివ. ఉ. భా. III. 47.)

శా. ఆశక్తిపై, కొంటన్ మేనుమలంచి పట్టుకొని (ఉ. హరి. V. 257.)

అనుట, అంట యగుటకుఁ గేతన లక్షణము వ్రాసినను దక్కినవారు దానిని చేకొనకుంట వింతగా నున్నది.

"క. తినుటకుఁ దింట యగును,
మఱి కొనుటకుఁ గొంటయగుఁ గనుటకును గంట యగున్,
వినుటకు వింట యగును దా,
ననుటకు నంట యగు వలసినప్పుడు కృతులన్".

తెనుఁగు మఱుఁగులు.

వ్యాకరణము భాషాశరీరమును భేదించి తత్తదవయవ నిర్మాణమును మాత్రము నిరూపింపఁ గలదు. కాని, యా శరీరములోని జీవస్వరూపమును నిర్ణయించుటకు దానికి సాధ్యముకాదు. భాషాజీవమంతయుఁ బలుకుబడిలో నిండియుండును. ఆ పలుకుబళ్ల నన్నిటిని విడఁదీసి బయటఁబెట్టుట కష్టసాధ్యము.

కాలము, దేశము ననుసరించి పలుకుబడియు మాఱుచుండుటచే నా యా మఱుఁగులను బహిరంగపఱుచుట యసాధ్యమగు పని. ఆ మఱుఁగులస్వరూప మిట్లుండునని దిక్ప్రదర్శనముగా చూపవచ్చును.

(1) సహాయ క్రియలు.

ఒకొక్కక్రియ యొకొక్కరీతి శబ్దములతో మాత్రము చేరుచుండును. దానిని మఱియొకరీతి పదములతోవాడుట భాషామర్యాద నతిక్రమించుట యగును: ఉదాహరణములు.

నాలుక మొదలంటంబట్టు (హరి. పూ. VIII. పు. 193); పరాజయ మందు (నిర్వ. VII. 71); భయమందు (నిర్వ. VII. 71); ఓలగంబైన దేవేం ద్రుండు (శకుం. పరి. I. పు. 15); వివాహమగు (నిర్వ. I. 23. II. 35. 53. 83; పాండు. I. 66; శకుం. పరి. I. పు. 8; వరాహ. VI. 30); పెండ్లియగు (భోజరా. III. 120); చెప్పియంపు (ప్రభా. I. 79); కాలాగు=ఆగు (శకుం పరి. I. 18); అభిషేకమాడు (పాండు. I. 2); అలుగులపాలాడిరి = అలుగుల పాలుచేసిరి; పనుపాడు (పాండు. II. 193); పెండ్లియాడు (నిర్వ. I. 23; పాం డు. II. 152);మున్నాడు (శకుం. పరి. III. పు. 59); మేనతికంబులాడు =పరి హసించు (మను. IV. 93); రేపాడు (కాశీ. VII. 250; ఉ. రా. I. పు. 5); మీఁదుజోడాడు (శకుం. పరి. I. పు. 1); పెంచ్చును గుందునాడు (శకుం. పరి. I. పు. 10); వేశియాటార్చు (హరవి. II. 108); ఉబ్బనిచ్చు = పొక్కనిచ్చు, పైకిరానిచ్చు (కళా. I. 190); పోనిచ్చు = తోలు (కళా. I. 155); ప్రయ్యె డు (కాశీ. V. 163); విషంబిడు (నిర్వ. IX. 3); జీవకళయుట్టిపడు (ప్రభా.I. 137); కెలనముండు (రామాభ్యు. II. పు. 37); కాపుండు, కాఁపురముండు (కాశీ. V. 14); మంతనంబుండు (కాశీ. V. 295); కొలువుండు (పాండు. IV. 134; II. 195); కోపురంబుండు (మను. III 54); తపముండు (శకుం. పరి. II. పు. 27; 38); పాలెముండు (భీమ. III. 86); పేరోలగంబుండు (ఉ. హరి. IV. 141); సుఖనుండు (పాండు. I. 133); కోరికలీరికలెత్తు (రామరా. పు. 14. విక్ర. I. 120); చేవయెక్కు (ఉ. హరి. III. 4); లావెక్కించు = పురి కొలుపు (ఉ. హరి. III. 32); ఎదురేఁగు, చూ ఊరేఁగు (నిర్వ. II. 8); తపం బొనరించు (కాశీ. V. 332); నిష్ఠీవనంబొనర్చు (కాశీ. III. 154);ప్రేమ యొనర్చు (కాశీ. V. 332); ప్రాణాయామంబొనరించు (కాశీ. V. 209);రణం బొనర్చు (కాశీ. V. 191); సత్కారంబొనర్చు (శకుం. పరి. II. పు. 33); అవ సరము కలుగు (ప్రభా. I. 110); ఎడగలుగన్ (కళా. II. 68); అచ్చికాచు (కాశీ. V. 125); అలమటగుడుచు (ఉ. హరి. V. 93); ఓలమానకుడుచు; దిసంతులుకొట్టు (వరాహ. X. 41; మను; కళా); కైకొను (వరాహ. XII.25=

లక్ష్యవెట్టు); గువ్వకరిగొను (వరాహ. X. 41; శకుం. పరి.); చక్కిలిగింతలు గొనె మనంబు (శకుం. పరి. II. 40); మొదలుకొని వినిపించెద (ఉ. హరి. IV. 5; కళా. IV. 20); సందుకొను (కళా. IV 4); ఆగ్రహంబుచిప్పిలు (వరాహ. IV. 71); అంతర్ధానంబుసేయు (కాశీ. VI.138); ఏకాంతంబుసేయు (కాశీ.V.319); ఆసచేయు (ఉ.హరి. I.53.III.53.); పలుచసేయు (పాండు. II. 16; 29); పెండ్లి చేయు (కాశీ. VI. 171); వాంతిచేయు (వరాహ.XI. 128); వివాహముచేయు (వరాహ. 119); శరణార్థిసేయు (ప్రభులిం. పు. 84); సరి దాఁకు (కళా. .159); వలసలు దీయు (ఉ. రా. V. పు. 92); సేదదీర్చు(విక్ర I. 158); చిత్తముఁ గూడదెచ్చుకొను (నిర్వ. IX. 12); మూర్ఛదెలియు (ఉ. హరి. III. 53); తెప్పలఁదేలు (విక్ర. V. 96; 192); తొప్పగఁదోఁగు (విక్ర VI. 140); డిగ్గఁద్రావు (నిర్వ. VI. 6; హరవి, VI. 9); చదికిలంద్రె ళ్లు (ఉ. హరి.III. 52); పండుగ నిండించు = పూర్తిచేయు;- 'పెండ్లినిండినది' అనవచ్చునా? (హరి. పూ. VII. పు. 169); చెప్పిపంపు=పిలువ బంపు (కాశీ. VI. 139); కంఠబిలంబుపట్టు (కాశీ. VII. 108); కనుపట్టు=కనఁబడు (మను. III. 75); కీర్తిపట్టునే (ఉ. హరి.III.4); చేపట్టు (పాండు.II.17); దర్పముల్ వల్కాంబట్టదు(కుమా. భాగ. II. 506); బాడుదలవట్టు (వరహ. III.33); మాట పట్టిపుచ్చుకొను (ప్రభా. IV. 30); వ్రతములువట్టు (వరాహ. II. 176); పట్టువఱుచు = లొంగఁదీయు (నిర్వ. VII. 57); శంఖముపట్టు, చూ. ఉమ్మ తిత్తిపట్టు, శృతిపట్టు (నిర్వ. VI. 144); దరువులుపాడు (వరాహ. IV. 45); ఉబుసుపుచ్చు (కళా. III. 5); కప్పిపుచ్చు (ప్రభా. IV. 37); విద్యలలోనన పుట్టిపెరిగినట్టి గట్టియోగ్యుఁడు (వరాహ. IX. 43); కానుకకప్పముపెట్టు (శకుం. పరి. I. పు. 19); తెప్పపెట్టు=వేయు (వరాహ. IX. 115); లగ్నము పెట్టు (వరాహ. III. 27); వెచ్చపెట్టు=అమ్ము, ఇచ్చు (వరాహ. V. 12); సళ్లఁబెట్టు (మను. IV. 78); ఆనఁబొడుచు (కళా. III. 194); మూర్ఛవొవు (నిర్వ. III. 30); కన్నుఁబ్రాముఁ (ఉ. హరి. II. 6).

'పడు'ధాతువు కర్మణ్యర్థమందేకాక యింక ననేకార్థములందును వచ్చును.

అడ్డపడు (నిర్వ. VI. 118; III. 7, 6; I. 37; VI. 77); అగపడు (నిర్వ. I. 38); అలవడు (నిర్వ. I. 8); అల్లటుపడు (మను. IV. 102); అవియంగాఁబడు (దశకు. VI. 51); ఒదుంగువడు (నిర్వ. III. 20); ఒల్లొ వడ్డనరసింహునికంటె (కుమా. I. 432); పొగడ్తలాసపడక (నిర్వ. I. 38); లంకయాసపడుట (నిర్వ. III. 94); కట్టఁబడు (పాండు. III. 75); కట్టువడు (మను. IV. 27); పులుగడుగంగఁబడ్డ నునుముత్యము (పాండు. III. 9); కదియంబడు (దశకు. XII. 65); తారుగలఁగంబడిరి (దశకు. X. 60); మీఁద

ల్ గలఁగఁబడ నేల (దశకు. VI 61); కాటువడు (నిర్వ. III. 76); కాడువడు (నిర్వ. I. 76; కానఁబడు (నైష. III. 96; మను. VI. 94); కాల్పువడు (కుమా. భా. I. 432); కొట్టువడు (మను. IV. 86); గోరగిల్లఁబడు (మను. IV 35); చాఁగఁబడు (నిర్వ. II. 76; VII. 108); చాఁపకట్టువడు (నిర్వ. III. 92); చిక్కువడు (నిర్వ. III. 87); చేడ్పడు (నిర్వ. III. 76); చొప్పడు (నిర్వ. V. 16); చొరంబడు (నిర్వ. III, 24, 34); డిగ్గఁబడు (కుమా. భా. I. 367), డిందంబడు (కుమా. III. భా. II. 697); తన్నువడు (నైష. VII. 170); తఱియఁబడు (మను. IV. 27); తలఁపఁబడుదు దానితోడన (కుమా. భా. I. 733); తలపడు (నిర్వ. I. 6; III. 7;V. 29); తిట్టులఁబడు (మను. IV. 86); తిరుగుడునడు (నిర్వ. VI. 129; I. 59); తూఱఁబడు (నిర్వ. III. 76); తెగఁబడు (దశకు. V. 97); తేఁటపడు (నిర్వ. I. 8); తొట్రువడు (నిర్వ. II. 24); తోపువడు (నైష. VII. 170); దాఁటువడు (మను. IV, 27); నాటువడు (కుమా. భా. I. 432); నిలఁబడు (మను. IV. 59); (నేత్రములు) నిలువులువడు (నిర్వ. VI. 144, 139); నిల్వఁబడు (దశమ. VII. 141); పట్టువడు (నిర్వ. VII. 2); మను. IV. 84); పనివడు (ప్రా. పనుపడు ఉ. హరి. III. 5); పరిభవంబువడు (నిర్వ. V. 20); పఱియవడు (మను. IV. 115); బునఁగఁబడు (మను. IV. 79); మొగులు పేరఁబడిన విధమునన్ (కుమా. భా. I. 88); పొదియఁబడు (కుమా. భా. II, 266); పొదువఁబడు (దశకు. XI. 55; మను. V. 71); ప్రాఁతవడ్డమాటలు (నిర్వ. I. 6), బెగడువడు (నిర్వ. III. 87); బోరగిలఁబడు (నిర్వ. I, 40); మఱుంగువడు (మను. IV. 27); మర్గఁబడు (కుమా. భా. II. 912); మాటవడు (నిర్వ. VI. 83); ముచ్చటపడు (కళా. II. 88; III. 99); మునుఁగువడు (నిర్వ. III. 24); ముట్టఁబడు (నిర్వ. III. 76); మ్రొక్కఁబడు (కుమా. భా. II. 936); మ్రొగ్గఁబడు (కుమా. భా. II. 718); వడియంబడెనోడలు (మను. III. 118); వినంబడు (మను. IV. 115); వీరులనఁ గొంద ఱిమ్మహి వినఁగఁబడిరి (నిర్వ. VII. 127); ఆడుమొఱ వినఁబడియెన్ (మను. IV. 66); వేరఁబడు (కుమా.భా. II. 437); వ్రేలఁబడు (మను. V. 50); సిగ్గువడు (నిర్వ. V. 123).

పడ్డపాటు (నిర్వ. VII. 64); మడివ్రావు (కాశీ. VII. 76), కలసి మెలసి=కలసిమెలసి (నిర్వ. VI. 89); మిడుకుమాలు (ఉ. హరి. III. 52); చిట్టమిడుచు (కాశీ. IV. 283); ఆజ్ఞకుమిగులు (పద్మపు. V. 29); ముచ్చ మునుఁగు (పద్మపు. IV. 74); కూడిమాడు (శకుం. పరి. II. పు. 28; వరాహ. IV. 163); ప్రూరిమేయు (వరాహ. IV. 97); పొయిరాఁజు (పాండు. I. 101; మను. I); వేఁటవచ్చు (వరాహ. II. 51); విందువచ్చు (హరవి. I. 19),

మందలవిడు (నిర్వ. VII. 68); దండువదలు (పద్మపు. VII. 199); అంతరంగం బులకువచ్చు (పాండు. I. 98); చేవిడు (కళా. I. 119); చంకల్వేయు (వరాహ. XI. 92); పాఱవైచు (నిర్వ. XI. 92); అఱచేత నోరువ్రేసెస్ = మూసెను (ఉ. హరి. IV. 268).

(2) పలుకుబడులు.

ఎట్టెటూ చెప్పుము (కళా. IV. 4); నీయుదయంబరయ రెండునెల లయ్యెనో కాదో యెట్టువలికితిమ్మోయి = అయినదో లేదో (కళా. V. 8); అది యటుండనిమ్ము (కళా. I. 180); అరఁటిపం డొలిచి చేతికి నిచ్చిన రీతి (కళా. I. 7); అవురుసవురు (కాశీ. VII. 87, 180); ఈవిపట్టునఁ గొంచె మెఱుఁగడు (కళా. I. 95); కయ్యమునకుం గాల్ద్రాచులాగు (కళా. I. 147); కానుక కప్పము వెట్టరు (శకుం. పరి. I. పు. 19); దండుగదర్శనంబులు (శకుం. పరి. I. పు. 19); కొంగుముడివేసికొని = తప్పకుండ (ప్రభా. V. 84); చుట్టుపట్టున = ఆధు. చుట్టుపట్ల (కళా. III. 85, 178; ప్రభా. III. 146); తగ్గుమొగ్గులేక (కళా. III. 267); తెకతేరఁగ నీ కెగవిడిచిపోయె; ప్రావగ నాకాణాచియైన వలపులపంటవ (కళా. III. 192); నిన్ను అసత్యవాదినిగాఁ దలంప నంత వింతవాఁడనే (కళా. IV. 26); పొక్కిటి తమ్మికడుపు చల్లనై (కళా. V. 42); వింజమూకిడినట్లు (కళా. V. 10); కుడితొడపై వామపాదం బిడి యితరముమీఁద నితరమునిడి నిశ్చలతం గడుఁగుదురు (కళా. V. 154); (వాని) రెండవుజన్మంబుఁ గనిపెట్టికొనియుండె (కళా. VI. 70); పడ్డదిపాటుగఁ దీరమునింగిపోయిరే (కళా. VI. 75); నేఁటికి ఱేఁపటంతటన్ (ఉ. రా. పు. 112); బట్టతలలు మోకాళ్లు ముళ్లువెట్టు (కళా. VI. 75); రాయిరప్ప (కళా. VI.. 80); బంటుబానిస, చేలుచెట్లు (కళా. VI. 80); బైరముపెయ్యలు (కళా. VI. 80); నీపండెమాడుకొమ్ము (కళా. VI. 115); నీయాట యోడ వచ్చినది (కళా. VI. 115), నామాటకేమి (కళా. I. 181); నీకు నాతోడు సుమ్ము (కళా. I. 190); గ్రుచ్చిగ్రుచ్చియడుగు (కళా. I. 198); గరిడిముచ్చు (కళా. II. 45); వచ్చెనో రాదో యా కమలవాసిని = వచ్చీరావడముతోనే (కళా. II. 70); అందుకుఁదోడు (భోజరా. VI. 142); పంచముపాడుసేసె (వరాహ. I. 30); చూ. పటాపంచలు, పంచబంగాళము; లోఁతుపాఁతు (వరాహ. I. 32); పిసవెట్టీ! (వరాహ. II. 18); ఎంగిలిచేతఁ గాకినేయఁజాలవు (వరాహ. II. 146); చెల్లాచెదరైరి—చూ. పంచముపాడు, పంచబంగాళము (వరాహ. III. 58); పెడబొబ్బలు (వరాహ. V. 21); షష్టాష్టకమెట్లుపట్టె (వరాహ. V. 15); వేఁటవెంబడి (వరాహ. VIII. 67); సందిగొంది (వరాహ. V. 116); పంతంబులు సంతఁబెట్టు (వరాహ. VI. 65); మనను

ఛివుకురనన్ (వరాహ VI. 71); ముచ్చెమురియబలిసి (వరాహ. V. 33); ప్రియములపుట్టలు, వినయమణిపెట్టెలు (వరాహ. IV. 37); అదనంబుగా ధనంబుఁగూడఁబెట్టి, యీఁగకుంగాటీక, పామునకుం బలివెట్టక, రట్టునకుం దిట్టునకు నోడిగట్టికొని, కట్టిడులై పొట్టలు పోసికొందురు(వరాహ. IV. 123) వాయివడ్డతామర (మను. III. 60), తామరతంపము (మను. VI. 118)—తామరదంపము' అనవచ్చునా? "తామరతంపర" తప్పా?—మల్లెవట్టినచేను (మను. V. 26); జాడుబేడు (శకుం. పరి. I. పు. 6); కసిగాటులుగా (శకుం. పరి. II. పు. 48). నిప్పచ్చరంబైనభాషణంబులు (హరవి. VII. 148); నాలోడు=ఒట్టు (అహ. సం. పు. 13); విద్యలవ్రురగల్లు (రాధామా. I. పు. 11); అడ్డాదిడ్డులు (కువల. II. 24); ఏటావలగిలిగింతలు (సారం. II. పు. 28) పచ్చితురక (సాం. II. పు. 32); వేటాఉతున్నియలు (పాండు. II. 116) గొంటు గుంటునులేక (పాండు. II. 55); నిజాలతోడవు, చుట్టాల సురభి (పాండు. I. 67); ఆప్రొద్దు ప్రొయిరాజనట్టినిర్వేద (పాండు. I. 101); పుండువంటి చీలి (పాండు. II. 29); చదువు సంధ్యలు (పాండు. II. 55) కంపలఁ బడ్డకాకి (పాండు. III. 84); గొంతెమ గోరికలు(పాండు. IV. 197); ఊయివంటి హృదయంబులు (పాండు. V. 212); కోనాలగొంది (పాండు. V. 296); సడిసన్న (హరవి. IV. 23); తెరువుపెసర (కవిక. IV. 121) సరిక్రొత్త (కవిక. III. 212); లోఁబడక పోయి రగుటన్ = లోఁబడక పోవుట చేత (కవిక. II. 146); వెనుచక్కి పింజవదలం జేపట్లకువచ్చు (ఉ. రా. పు. 121); ఇంచుక వెలితిచావు (ఉ. హరి. III. 77); తోలితొప్పలు వెట్టు (ఉ. హరి. I. 43); వతు మదరంట వ్రేసెను (ఉ. హరి. I. 46); తలపువ్వు వాడదు (ఉ. హరి. I. 21); తలపూ వాడక (విక్ర. VI. 98); బీరపుఁ బొత్తము గట్టుకొనిపోయె బోయిన పోకై (ఉ. హరి. I. 32); లేమికి బొమ్మ గట్టఁడే (విక్ర. I. 78); అయోధ్యకు బొమ్మవెట్టి (విక్ర. VI. 41); గట్టె పుణ్యంబు (విక్ర. I. 197); ఎక్కడ కొట్టునో (సమీ. VI. 179); కడుపు చల్లంగ వేదాలఁ గన్నతల్లి (కాశీ. III. 186); కడుపు చల్లంగ శ్రుతి విద్యఁ గన్నతల్లి (కాశీ. V. 110); కడుపు చల్లంగఁ గాంచె (కాశీ. V. 174); పంచకర వాట్లు (కాశీ. IV. 18); చెడ్డయింటి చెదారము (కాశీ. IV. 65); చీటికి మాటికి (కాశీ. IV. 270); ఎవ్వనితో నెచ్చోటం జివ్వకుఁ జేసాచవలదు (కాశీ. I. 109); పట్టి పాలార్పంగ (కాశీ. IV. 266); మట్టి మల్లాడి (ప్రభులిం. పు. 152); కనుగలిగి యుండు (శకుం. పరి. పు. 51); చెవులు వట్టియాడించు (నిర్వ. IX. 22); లోకములోడి వానిఁగా (నిర్వ. VII. 56); మగువల నొక్కయెడం

గూడబెట్టుఁడు (ఉ. హరి. I. 53); దానవులమీఁద నడచెన్ (ఉ. హరి. I. 24); కసిగొను (నిర్వ. III. 43) -మొదలయినవి.

(3) సామెతలు.

ఆలినొల్లని వాఁడు దా నీలకూర, కుప్పు చాలలేదన్నట్లు (వరాహ. VII. 47).

వేల్పు లేనుఁగునకు వీఁపు గూనుపోయె (వరాహ. X. 15).

పేద కోపంబెల్ల పెదవులచేటు (ప్రభులిం. పు. 102).

కానని వానిచేఁ గన్నడియున్నఁ గానంగ రానట్లు (ప్రభులిం. పు. 147) మొదలయినవి.

మీరె వచించినారు (చెన్నబ. పు. 111); మీరున్నారు (సమీ. IV. 5); మీరు ... ఏతెంచినారు (పాండు. IV. 96); మీరు ... అంతటి వారె(హరి. పూ. IV. పు. 204); మీరు పెరిగినారు (హరి. పూ. IX. పు. 205); మీరు శ్రమ మొందినారు (కళా. IV. 111); మీరు పెద్దలగుటన్ (వరాహ. IX. 132); మీరు ... అరుదెంచినారు (వేంక. మహా. శిష్టు. పు. 5, 21); మీరలసినారు (శకుం. పరి. II. పు. 33); మీరు సూచినారు (మను. I. 68); మీరు చేసినారు (వరాహ. III. 95); మీరేఁగుదెంచినారు (వరాహ. I. 133); విన్నారుగదమ్మ (ప్రభా. III. 120).

కట్టినాఁడు (కాశీ. II.101; II. 51; VI.255); ఎఱిఁగినాఁడు (కాశీ.VI). 45);తిన్నాఁడు (కాశీ.VII. 45; చుట్టినాఁడు (ఉ.హరి.II.180); కూడుకొన్నాఁడు (ఉ. రా. పు. 34); పట్టినాఁడు (వరాహ. III. 65); నిలిచినాఁడు (వరాహ. I. 52); తలంచినాఁడు (కళా. V. 186).

ఉన్నారు (పాండు. I. 110); నిలిపినారు (కాశీ. IV. 66); వచ్చినారు (కాశీ. VIII. 63); దిద్దినారు (ప్రభులిం. పు. 46).

చిక్కఁగలాను (దశావ. పు. 50). గలాను (సమీ. II. 254); గలావు (దశావ. పు. 100; సమీ. VI. 48. 148); గలాఁడు (సమీ. IV. 40. పాండు. IV. 110); గలారు (సమీ. IV. 79. ఉరా. పు. 63); (అవి) గలావు (సమీ. II. 171).

వాక్యాన్వయము.

ఈ క్రిందివాక్యముల యన్వయమును గమనింప నగును:—

ఆర్గురు నొక్కొక భూమి పతులగుదురు (నిర్వ. I. X. 64).

నీవుఁ గొడుకును గృహముఁ బాడు సేసితివి (కాశీ. IV. 107).

(నీకు) జోడు లేరు (విక్ర. I. 47).
వాఁడును నీవు నేమవుదురో (ఉ. హరి. II. 133).
ప్రజలెల్లన్ ... పల్కెఁడున్ (హరవి. II. 97).
అడవులు దున్నక విత్తక ఫలించును (విష్ణుపు. II. 147).
సఖీజనంబును దానుఁ దద్కైకంబునకు భార్యయయ్యె (పాండు. V. 311).

ఇవి యొక్కొక్క వేగంబున కొక్కొక్క నది యేర్పడినవి (వరాహ. X. 157).

నెచ్చెలులుఁ దాను నచ్చెలువ ప్రయాణమయ్యె (కళా. III. 175).

అవధారణము.

అవధారణార్థక 'అ' కార 'ఏ'కారముల వాడుక యందును, నర్థములందును గొన్ని విశేషములు కానవచ్చుచున్నవి:

కమలాప్తుఁ డుదయింపకయ మున్న బుటుకున మునుఁగు (పాండు. V. 286).

పోవుచు + అ = పోవుచ (కుమా. భా. II. 66).
ఇప్పనికి + అ = ఇప్పనిక (హరి. పూ. VIII. పు. 193).
ఇంతతోన (హరి. పూ. VI. పు. 171); = దీనితోనే (సరి).
ఇంతన మేమియయ్యె = ఇంతమాత్రము చేత (హరి. పూ. VII. పు. 170.)
తనుదానే ... అంటెఁ=తనకు తానే అంటుకొన్నది (వరాహ. VIII. 26).
తనుదానె కీల్కొన్నవిధము (వరాహ. XII. 29).

కొన్ని సమస్యలు.

భాషలోనున్న వ్యాకరణాదిరూపములను యథాసంభవముగానే గ్రహింపవలెను గాని, సామ్యమునుబట్టి క్రొత్తరూపములను గల్పింపఁ గూడదు. సామ్యముండి వ్యవహారమునఁ గానవచ్చు వానిని నిరాకరింపఁ గూడదు.

ఇన్ని+నాళ్లు = ఇన్నాళ్లు; ఇది గ్రాంథికము. ఇన్ని+నీళ్లు = ఇన్నీళ్లు, అని వ్యవహారమున నున్నది. దీనిని నిషేధింపఁగూడదు.

ఇంత+తనుక = ఇందనుక; గ్రాంథికము; కాని, ఇంత+త్రాడు=ఇంద్రాడు అనురూపము తప్పు; వ్యవహారమున లేదు గనుక.

పెద్ద + తనము = పెత్తనము; గ్రాంథికము; కాని, పెద్ద +త్రాచు = పెత్త్రాచు, అనునది తప్పు; పెద్ద+తండ్రి = పెత్తండ్రి, ఇది ఒప్పు, వ్యవహారమున నున్నది గనుక.

చెతి + ఒక = చెతియొక, ఇది గ్రాంథికరూపము; 'చెతొక' అనునది వ్యావహారికము, ఒప్పు.

నాదు + ఇల్లు, అక్క, ఊరు—ఇట్టిచోట్ల సంధి యెట్లు గలుగును ?

కుంచము + ఎడు = కుంచెడు; కంచము + ఎడు = కంచెడు, అగును.

కాని, పళ్లెము + ఎడు + పళ్లెడు అనికాని, గజము + ఎడు = గజెడు, అనికాని కావు; వ్యవహారమున నివి లేవుకావున నవి తప్పు.

'అంతటితో' అనురూపము వ్యవహారముననున్నది; ఇది అర్వాచీన రూపము. ఇందలి 'టి' వర్ణస్వరూపమేమి? అంతటి, ఇంతటి, ఎంతటి, అను రూపములు కన్నడమునందలి అన్తుటు, ఇన్తుటు, ఎన్తుటు, ల నుండికలిగిన వేమో. 'ఎన్నటికి' అనుదానిలో 'కి' చేరినది; 'ఎన్నటిని' అని 'ని'వర్ణమును జేర్పఁగూడదు.

'నిన్నుండి, నీనుండి' అనురెండు పంచమీవిభక్త్యంత రూపములు వ్యవహారమున నున్నవి. వీనిలో నేది గ్రాంథికము ?

నీవెందుకు వచ్చినావు = ఏమికారణమున వచ్చినావు, అని నేఁటి గ్రంథకర్తలు వాడుచున్నారు. 'ఎందులకు' అనుదానికి గ్రంథములలో 'ఏస్థలమునకు' అని కానవచ్చుచున్నది. హేత్వర్థమునందు గ్రంథస్థ ప్రయోగము లున్నవా? వ్యవహారమున 'ఎందులకు' లేదు. 'అందులకు' అని నేఁడు హేత్వర్థమున దస్తావేజులలో వ్రాయుచున్నారు.

'అడవికివేఁటమైనరిగె' (పాండు. V. ) అని ప్రయోగమున్నది. దీని సామ్యమున 'వాఁడిట సదువుమై వచ్చె', 'తిండిమైవచ్చెను తిరుమలయ్య' అను నట్లుపయోగింపవచ్చునా ?

'వారెల్లరు' అనునట్లు 'అవియెల్లవి', 'మేమెల్లము' అని అనవచ్చునా? 'ఎల్లజనులు' అనునట్లు 'ఎల్లరుజనులు' అనవచ్చునా ? ప్రయోగములు కలవా? వ్యవహారమునలేవు.

'ఎవరికివారేపెద్దలు' అన్నట్లు 'ఎవరికంటెవారేపెద్దలు' అనవచ్చునా; 'నేఁ డేనాళ్లనుండియుఁ దిండిలేకయున్నాను' ఇది గ్రాంథికమా? చూ. పాండు. IV. 153.

జైమినీభారతమున 'అనపత్యమువంక నీ కూర్ధ్వలోకములులేవు' అను ప్రయోగ మున్నది. దానిసామ్యమున 'అనావృష్టివంకఁ బంటలు వండవు' అనవచ్చునా ?

'నన్నువ్రతము నోమించుము', 'దేవునికినన్నుఁ బూజసేయించుము,' అనువాక్యములు సాధువులా? చూ. కాశీ. VII. 60.

'పిల్లనుబోధించుటకొక కథసెప్పెదను', ఈ వాక్యముసాధువా ? చూ. శాంతి. IV. 418.

'వారినధ్యయనంబు సేయింపుము,' 'వారినిబనిసేయింపుము' అనురూపములు సాధువులా ? చూ. శాంతి. VI. 140.

'నీ మనస్సు నర్థమునకుం గామమునకుం దొలఁగించి ధర్మమునకును మోక్షమునకును గుదురుసేయుము' అని వ్రాయవచ్చునా ? చూ. శాంతి. VI. 78.

'ఏము నలుగురము' (నైష.) VII.—ఇట్లు 'ఇవినాలుగందు నిదుత్తమము' అనవచ్చునా?

'పదియింటికి, పదింటికి' అనునట్లు 'రెంటియింటికి, మూఁటియింటికి' అనవచ్చునా? రెండింటికి, మూఁడింటికి, అనున వర్వాచీన గ్రాంథికరూపములు.

'పద్నొకండు' అని వరాహ. IX. 84; పన్నిద్దఱు, పన్నెండు, పన్నిరువురు, అనునట్లు, పన్నొకండు అనఁగూడదు; వ్యవహారమున లేదు గావున—

ఈ క్రిందిరూపములు సాధువులా ? పదునొక్కపుస్తకములు, పదియొక-, పదునొకఁడు-, పదొకొండు-, పదునొకటి-, పుస్తకములు; ఇరువదియొకటి వంకాయలు, ఇరువదియునొకఁడు— మొద. వంకాయలు; ఇరువదియొకటవు, పదునొకటవ, ఒకటవునాఁడు.

నలువదుండ్రుగురు, నలువదుగుండ్రు, నలువదుగుండ్రురు, నల్వదుగురు, నలుబదుగురు, నలుబదువురు, నల్బదుగురు—ఇట్లు 'నలువదిమంది' అనుటకు రూపములు సాధువులా ?

ఇరువండ్రిద్దఱు, ఇరువదుగురు, ఇరువదిగురు, ఇరువదురు, ఇరువదుండ్రు, ఇర్వదుండ్రుగురు; నలువదుగురు, నలువదువురు, నలువదిగురు, నలువదివురు, నలువదురు, నలువదుండ్రు, నలువదుండ్రురు—ఈ రూపముల మాటయేమి ?

మా వాఁడు, మా వాండ్రు, మా వారు—వీని యర్థభేదమేమి ?

'పెక్కంటికి' అనునట్లు 'అనేకింటికి' అనవచ్చునా ? వ్యవహారమున నున్నది. నేఁటి గ్రంథకర్తలు వాడుచున్నారు.

'పెక్కురు' అన్నట్లు ఎక్కురు, పలురు, తక్కురు; పలువురు, పలుగురు, అన్నట్లు ఎక్కువురు, ఎక్కుగురు, పెనుగురు, పెనువురు, కొలఁదిగురు, కొలఁదివురు; పెక్కండ్రు అన్నట్లు 'తక్కండ్రు, ఎక్కండ్రు' అనవచ్చునా ?

ఎనమన్నూఱు, ఎనమనూఱు, అనవచ్చును; ఎనమనూట యొకటి, అనవచ్చునా ?

నూటొకటి, నూటయొకటి, నూటాయొకటి, అనునవి సాధువులా ?

'అయిదువేలమంది' అనుటకు 'అయిదువేవురు', 'ఏనువేవురు'; 'మూఁడు వందలమంది' అనుటకు 'మూఁడు నూఱుగురు, మూఁడునూర్వురు' అన వచ్చునా ?

'ఇన్నూఱు' అన్నట్లు 'ఇనువంద, ఇరువంద, రెండువంద, రెండునూఱు, ఇరువేయి, ముచ్వేయి, మువ్వేలు, మూఁడువేయి' అనురూపములు సాధువులు కావు; వ్యవహారమున లేవు గనుక.

గోర్వెచ్చచముగ (పాండు. III. 74)-ఇట్లు, 'వెచ్చనే గరిటెండువేయ వమ్మ' అనవచ్చునా ?

'అమ్మేయిచ్చినది' అనుటకు 'అమ్మయ యిచ్చినది' అనవచ్చునా ?

'నీవేచెప్పితి; నీవచెప్పితి; నీవుచెప్పితివే, ఆమాట.' 'కాని, నీవుచెప్పితివ యా మాట, నీవుచెప్పిత యామాట' అనురూపములు సాధువులా ?
వాఁడు రాకమునుపే (వాఁడురాకమునుప); ఇదేనాడి (ఇదనాడి); ఇదినాదే (ఇదినాద); అంతకుముందే (అంతకుముంద); ముందుగానే (ముందుగాన); ముందరే (ముందర)-కుండలీకరించిన రూపములు సాధువులా ?

'ఈ పనిచేసిన దెవరు ?' ఈ వాక్యము నన్వయమెట్లు ?

'రాజా, రమ్ము, నీవు, నీ మంత్రులును' ఇది సాధువా ? చూ. హరి. ఉ. II. 137.

'మీ రడిగినప్పుడు వా రిచ్చారా? మరి, వా రిచ్చినప్పుడు మీ రివ్వ వద్దూ? - దీనికి గ్రాంథికభాషయేమి ? ఇచ్చిరా ? ఇచ్చిరే ? వలదా ?

'వాఁడు లేనే లేఁడు; రానే రాఁడు; ఎత్తనేలేఁడు' - వీనికి 'లేనలేఁడు, రానరాఁడు, ఎత్తనలేఁడు, - వీనిని రూపాంతరములుగ గ్రహింపవచ్చునా ?

'నీవు వచ్చితివేని మేలు', 'నీవు వచ్చితివయితివేని మేలు', ఏది సాధువు ? రెండును. 'నీ విట్లచెప్పవయితివే' - ఇది సాధువే.

'నీవు వచ్చితివేనిమేలు, కాదేని నష్టము కలుగును.' - 'కావేని' అన వలెనా ?

'మీనాన్ననూరిచ్చారా ? నేను నూరిచ్చానా ? ఆ రెండువందలుపెట్టి ఏదయినా కొనుక్కో.' - దీనికి గ్రాంథికాంధ్రమేమి ?

చరింపుట (వరా. III. 125) - ఇట్లు, 'వధింపుట' అనవచ్చునా ?

'చెప్పుమా' అనుటకు 'చెపుమా' అనునది గ్రాంథికరూపాంతరము. కప్పుమా, విప్పుమా, అనువానికి కపుమా, విపుమా, అనునవి రూపాంతరము లనవచ్చునా ?

'కావుట' అనునట్లు 'ఈవుట', 'కావుడున్' అనునట్లు 'ఈవుడున్' - అనవచ్చునా ?

వేఁగు, వేఁగుదెంచు, అనునట్లు, చేరొను, చేరొనుదెంచు, అనవచ్చునా? 'ఏఁగించు' అనునట్లు 'చనించు' అనవచ్చునా ? 'చనుదెంచు' నకు ప్రేరణ రూపము 'చనుదెంపించు' అగునా ?

'గూనుగిల్లు' అనునట్లు 'కుంటుగిల్లు, చెవుడుగిల్లు, గ్రుడ్డిగిల్లు' అనవచ్చునా ?

'అదిగో' సాధువు. 'దానిని గో' అనవచ్చునా ? కూడదు. వ్యవహారమున లేదు గనుక.

'కోపగించు' నకు 'కోపించు' అని రూపాంతర మున్నది.

చిత్తగించు, పంతగించు, లకు మాఱుగ 'చిత్తించు, పంతించు' లను వాడవచ్చునా ?

తల్లక్రిందులు, తలక్రిందులు, తల్లక్రిందలు, తలక్రిందలు;- ఈ జంటలలో నేదిసాధువు ? 'తలక్రిందయినది' అనుటకు రూపాంతరముగ 'తల్లక్రిందయినది' అని వాడవచ్చునా ?

'కొంపోవు' అనునట్లు 'తింపోవు, కొంతెమ్ము' అనకూడదు; వ్యవహార విరుద్ధము గనుక.

'పినవీరన', 'చినసీతారామస్వామి' అనునట్లు చిననాఁడు, పిననాఁడు, అనవచ్చునా ?

'ముక్కునఁ బంటి' అనునట్లు 'ఱొమ్మునఁ బంటి' అనవచ్చునా ?

'నీ మయము, తన మయము' -ఇవి గ్రాంథిక రూపములు. 'నెత్తురు మయము' తప్పందురు. ఏల ?

'నాఁడు నాఁటికి' అనునట్లు 'మాఱుమాటికి,' 'అప్పు డప్పటికి' అనవచ్చునా ?

తొల్లి = మొదలు = ఆరంభము = ఆది = ప్రథమము. 'మొదలు పెట్టు' అనునట్లు 'తొల్లి పెట్టు, ఆరంభ పెట్టు, ఆదిపెట్టు, ప్రథమపెట్టు', అనకూడదు. వ్యవహారమున నట్లనరు గనుక.

మఱునాఁడు, మఱుసనాఁడు, మఱుసునాఁడు, మఱునటి నాఁడు—ఇవి గ్రాంథిక రూపములు; కాని, 'మఱునేఁడు' మొదలగు రూపములు లేవు.

'ఇంటిల్లిపాది' -ఇది వ్యవహారమున నున్నది. గ్రంథములలో నున్నదా? ఒప్పా ? తప్పా ?

'ఇదివఱలో', ఆయూరివఱకు, ఇదివఱకు' ఈ రూపములు గ్రాంథిక ములా ? 'ఇదివఱకటిదాఁకా' -ఈ రూపము తప్పా ? వ్యవహారమున వినఁబడుచున్నది.

తుచ్ఛము, తద్భవరూపములు, తొచ్చెము, తొచ్చియము. అట్లే, 'గుచ్ఛము' నకు 'గొచ్చెము, గొచ్చియము' తద్భవరూపములు కావు. 'శపించు'నకు తద్భవ రూపము 'సెపించు'; కాని, 'శాపము'నకు 'శేపము' తద్భవము కాదు.

'చెలియ'—దీనికి బహువచన రూప మేమి ?

'పదండి', 'పదుండి'—ఏది సాధువు ?

అర్వాచీన కృతులందును, వ్యవహారమునందును క్రియల తుమున్నంత రూపములపై సంపూర్ణక్రియలు చేరకయే సంపూర్ణ క్రియలుగ నా రూపములు వాడఁబడుచున్నవి.

ఏమిచెప్ప (కాశీ. VI. 256; కాశీ. VII. 234; మను. III. 41; మను. IV. 21; ప్రభా. III. 63; ప్రభా. IV. 65; ప్రభులిం. పు. 112; కళా. II. 128; కళా. IV. 16; కళా. V. 6).

ఏమని చెప్ప (కాశీ. VII. 234, శకుం. పరి. II. పు. 25. వరాహ. VII. 90; ప్రభా. V. 110; కళా. III. 215).

భూతార్థమునఁ బ్రథమ పురుషైకవచనమున 'ఎన్' లోని ఎ - కారమును 'అ'గా నుచ్చరించుట వ్యవహారమున నున్నది. దీని ననుసరించియే యీ క్రింది కవిప్రయోగ మున్నది: 'అయ్యో నీసుతు గ్రద్ద దన్నుకొని పో-యన్ భీతి వాపోవఁగన్' (వేం. పంచ. I. 76).

నన్నయకాలపు భాషయందు 'ఉండు' ధాతువునకుఁ గల రూపములు తరువాతి కాలమున నెట్లు మాఱినవో ఈక్రింద నాయా రూపముల ప్రక్క చూపఁబడియున్నది:—

ఉన్నవాఁడను (ఉన్నాఁడను, ఉన్నాను); ఉన్నవారము (ఉన్నారము, ఉన్నాము); ఉన్నవాఁడవు (ఉన్నాఁడవు, ఉన్నావు); *ఉన్నవారలు (ఉన్నారు); ఉన్నవాఁడు (ఉన్నాఁడు); ఉన్నవారు (ఉన్నారు).

ఉండితిని (ఉంటిని -కళా. IV. 143); ఉండితిమి (ఉంటిమి); ఉండితివి (ఉంటివి); ఉండితిరి (ఉంటిరి).

ఉండుదును (ఉందును కాశీ. V. 10); ఉండుదుము (ఉందుము, ప్రభులిం. పు. 85); ఉండుదువు (ఉందువు); ఉండుదురు (ఉందురు, ఉ. రా. పు. 85).

వ్యతిరేకార్థక క్రియపై 'ఆ, ఏ'లు చేరి ప్రశ్నార్థకములై నిశ్చయార్థమును దెలుపును. 'కాదు' అనునది 'కదు' అగును. వానిపై ప్రశ్నార్థక

ఆకారైకారములు చేరి 'కాదా, కాదే, కదా, కదే,' అగును. వీని తుది దీర్ఘములు హ్రస్వములై 'కాద, కాదె, కద, కదె' అగును. ఇట్లే 'కాను + ఏ (ఎ) = కానే, కానె; కాము + ఏ (ఎ) = కామే, కామె; కాఁడు + ఏ (ఎ) = కాఁడే, కాఁడె; కారు + ఏ (ఎ) = కారే, కారె; అగును. కాని, యీరూపములందలి మొదటి దీర్ఘము హ్రస్వమయి, కనె; కమె, కవె, కరె, కఁడె మొదలగు రూపములు సిద్ధింపవు. మధ్యమపురుషమునందు కాదే, కాదె, కదే, కదె, కదవే, కదవె, కదరే, కదరె, అను రూపములును, ప్రథమ పురుషమునందు కాదే, కాదె, కదే, కదె, కాదా, కాద, కదా, కద, అను రూపములును కలుగును. ఈ యర్థమునందే వ్యతిరేకార్థక క్రియలపై 'అటవే' అనునదియు మహాత్యర్థమునందు చేరును. తుది '-వే' తోడి రూపములు రానురాను మధ్యమ పురుషమున మహాత్యర్థమున నెలకొనినవి. 'మీరు చూచితిరి గదా, నేను చెప్పితిని గదా, అను రూపములం దన్వయము కుదురదు. నేను చెప్పితిని కానా, చెప్పితిఁగానె, చెప్పితిఁగదె, అనువాని కాధారము కావ్యములందు కానరాదు. నిల్పంగదవయ్యా (దశావ. పు. 21); వినుపింపంగదయ్యా (దశావ. పు. 22)-అను రెండు రూపములును గలవు.

మూఁడేకాదా రాత్రులు (కళా. II. 129); పోవంగలేనేకదా (మను. III. 104); తెల్పఁగదవే (మను. II. 39); కావఁగదవే (మను. II. 75); మేళవింపఁ గదవే (మను. III. 75); రాగదవమ్మ (విష్ణుపు. IV. 114); విడువంగదే మహాత్మ (విష్ణుపు. IV. 339); కరుణించఁగదె (విష్ణుపు. V. 38); మన్నించఁగదే (విష్ణుపు. V. 47); ప్రోవఁగదరయ్యా (ఉ. రా. V. పు. 88); నీవేకదయ్యా (సమీ. V. 214); హరింపఁగదయ్యా (సమీ. VII 62); -మాన్పవయ్యా (సమీ. VII 62); కావ్యముకాదె కద (సమీ. VII. 95).

'వలయు' ధాతువు పూర్వాంధ్రమున సాధారణముగ ఉపక్రియగా నుండు సందర్భములలో నుత్తరాంధ్రమున నది స్వతంత్రక్రియగాఁ గూడ నుపయోగింపఁబడినది. 'వలయును' అనుదానికి 'వలెన్' అనునది యుత్తరాంధ్రరూపము:- వలెన్ (వరాహ. I. 98); వినఁగవలె (వరాహ. II. 81); చూడంగవలె (వరాహ. II. 145); దేవా, వలె మాకునొక్క దళవాయి (వరాహ. VI. 80); కావలె (వరాహ. IV. 108); ఏమివలె (వరాహ. VI. 136); పతిగావలె (వరాహ. VI. 15); చేర్పఁగావలెన్ (శకుం. పరి. II. పు. 28); వలెను (విక్ర. I. 110); కావలె మనకు (ప్రభులిం. II. పు. 47); 'నేఁగావలె నన్ననాఁడు' (పాండు. II. 210); 'వలయును' అనుటకు 'కావలెను' అనువాడుక చాల నర్వాచీనము. పూర్వాంధ్రమున 'నేవలసినయప్పుడు' అని యుండును.

ప్రార్థనార్థక క్రియలలో 'చెప్పుమా' అను క్రియయందలి 'ప్పు'లోని ద్విత్వముపోవును: చెపుమా, చెపుము, మొద. కాని, అట్టిరూపములనే కలిగిన తప్పుము, విప్పుము, మొదలగువానియందుగాని, కొట్టుము, తిట్టుము; మొదలగు వానియందుగాని ద్విత్వలోపముకలుగదు. '-ఇమ్ము' నకు 'ఈ' యగును; నవ్వీనన్నువ్వనీ, పోయినం బోవనీ (కాళ. III. 29); పార్వతీ, గిరి కలంగానీ, రమావిష్ణులంగానీ (వరాహ. IX. 62); కానీ (దశావ. పు. 31, 128); కానీర (రాధికా. III. 161).

'చూడుము' అనుటకు 'చూడనవధరింపుము' (వరాహ. XI. 105) అని గౌరవార్థమున వాడఁబడినది.

'తల ! తల ! మంచివాఁడవు' (భోజరా. IV. 226)- 'తలఁగుము=వెడలి పొమ్ము' అనుటకు 'తల' అనునది ప్రార్థనార్థకరూపము. నష్టధాతువగు 'తలు' నుండి పుట్టినది.

'పాయు, తొలంగు, మొసరిలు, పాపదమంచు' (కనిక. I. 62); ఇందు 'పాయుము' లోని ము-వర్ణములోపించుట విశేషము. యు-కారాంతధాతువుల మీఁది ప్రార్థనార్థక మువర్ణము వ్యవహారమున తొలఁగును. తొలఁగినప్పుడు ధాతువుపై ఇత్వము చేరును. 'పోయి (పొయ్యి), మోయి(మొయ్యి),' మొద. గ్రంథములందును నిట్టి మువర్ణము తొలఁగుట పూర్వాంధ్రమునఁ గానరాదు.

ఉభయప్రార్థనమునను 'పోవు' ధాతువునకు 'పద' అని వ్యవహారము; కావ్యములందును నీ రూపము గలదు. 'పద,పై 'ము'వర్ణమును చేర్చి శ్రీనాథుఁడును ప్రయోగించినాఁడు. 'పదమా షట్పదమాలికాపరిలసత్పాథోధునీ సంపదాస్పద నానాసలిలప్రవాహ లహరీ సంభార గోదావరీ. భీమ. చూ. మను. III. 84, 94 పదమా; 'పదము' అనుటకు'పొదము' అని రూపాంతరము. ఇది ఏకవచనము; బహువచనము 'పొదఁడు.' 'పద' కు 'పా' కూడ రూపాంతరమే. 'పొదమని' (పద్మపు. X. 27).

'కానీర, రారా, పోరా'- (చూ. రాధికా. III. 161) అనువానిలోని 'ర, రా'లు మహద్వాచకము, మధ్యమపురుషము ఏకవచనమునందు వచ్చును. ఇట్టి రూపములు ఉత్తరాంధ్ర కావ్యములందుఁ గలవు. వీనికిబహువచనమందు రూపములు కావ్యములందు లేవు కాని, వ్యవహారమున 'కానీయర్రా, కానియ్యర్రా, రార్రా, పోర్రా, తేర్రా' అని కలవు.

'లేవే' (సారం. I. పు. 5)- ఇది మహత్యర్థకము, మధ్యమపురుషము, ఏకవచనమున ఉత్తరాంధ్రవ్యవహారమున నెలకొన్నది. 'వే' తోడిరూపములుత్తరాంధ్ర కావ్యములందు మహన్మహత్యర్థములందు కానవచ్చుచున్నవి.

'కలపముసొందకువే' (ఉ. హరి. V. 87); అంత మదింపకువే (కళా. III 195); ఇట్టి నిషేధార్థక ప్రార్థనార్థకరూపములు కొన్ని కావ్యములందు కానవచ్చుచున్నవి. ఇట్టి రూపములు మాండలికములు. గతిశతాదిని పుట్టిన పాటలలో తఱచుగ నీరూపములు కాన్పించును.

'విడెము శాయవే, నను విడనాడకువే' మొద.

"ఆదేతౌ ప్రశ్నలక్షణౌ భవతః" అను నాంధ్రశబ్దచింతామణి సూత్రము చొప్పున 'తెలియఁడే, తెలియఁడా' అను రెండు రూపములును ప్రశ్నార్థకములు. నన్నయకృత భారతభాగమున నీరెండు రూపములును లేవు. తరువాతి కవులలో 'ఏ' దంతములగు ప్రశ్నార్థకక్రియలు కానవచ్చుచున్నవి. ఆదంత ప్రశ్నార్థకములు మధ్యయుగము నాఁటనుండియు కనఁబడుచున్నవి.— తెలియఁడా (కాశీ. III. 101); పుచ్చుకొనవా = పుచ్చుకొన్నావు కావా (కాశీ. IV. 104); తానేమి బిడ్డలఁగానదా = కనలేదా (కాశీ. IV. 266).

ప్రశ్నార్థమున 'ఏఁడీ, ఏఁడి, ఏరీ, ఏరి' అనురూపములు మధ్యయుగమునుండియుఁ గానవచ్చుచున్నవి: ఏరి (రామాభ్యు. VII. 192).

'కాకేమి' అనుదానికి 'తప్పక యగును' అనునర్థము మొదటనుండియు నున్నది. మధ్యయుగమునుండియు కవు లారూపమును 'కానిమ్ము' అనునర్థమునను వాడిరి. —ఐనదయ్యెడుఁ గాకేమి (పాండు. IV. 167).

'ఈవుత, కావుత' మొదలగు ఆశీరూపములు రెండువచనములందును వచ్చును. బహువచనమునఁ బూర్వాంధ్రమందు ప్రయోగములు మృగ్యములు.-'ఈవుత సుపర్వులందఱు' (విష్ణుపు. V. 350).

శాపార్థమున 'తనబుద్ధికాటఁ గలియ' (హరవి. III. 99); వలరాయా ...నీతలరాయా (యయా. పు. 74); నీవాంఛపాడుగాను (హరవి. III. 22)- అను నిట్టి తుమున్నర్థక క్రియారూపములు మధ్యయుగమునుండియుఁ గావ్యములందును వ్యవహారమునందును గాన్పించుచున్నవి.

ఈ క్రిందిరూపములు నేటి వ్యవహారమున నంతగాఁ గానరావు.-తీఁడిరించె (కాశీ. III. 231); పాపములను డంచెను (కాశీ. III. 108); ఉఱిఁదు బృహస్పతి మీఁదెడ (ఉ. హరి. III 101); చూ. ఉఱఁదు సురేంద్రునైన; తలంత్రు (భీమ. III. 84); ఎంతటికీనోపదు = సమర్థముకాదు (పాండు. III. 42); తిగిచెన్=తీసెన్ (పాండు. III. 30); ఉక్కెన్ (హరవి. VI. 38). ఈ పదము శ. ర. లోలేదు.-తివిసెన్ (వరాహ. XII. 7); గోమేధయజ్ఞ ఫలంబు ప్రాపింతురు వరాహ. V. 69- 'వారికి ఫలంబు ప్రాపించును' అని 'ప్రాపించు' అను ధాతువును సకర్మకముగా నేఁడు వాడవచ్చునా ?- వినను=నేను వినలేదు (వరాహ. III .138); ఇంకనెయ్యది పనిచెదవు పనుపుము (హరి. పూ. VII.

169- 'పనిచెదవ్రూ' అని నేఁటిరూపము); ఏమిసెప్పంగఁగలదు=చెప్పగఁనేమి గలదు (కాశీ. III. 107); ఒక్క విస్మయంబు వినఁగల దవధరింపుము= వినుటకుఁగలదు (ఉ. హ. III. 108); ఏమనంగ నేర్చువాఁడను (కాశీ. IV. 113); ఆలింగనము సేయ నగపడరాదు (ప్రభులిం. I. 39); అల్లమ మాయల కగపడరాదు (ప్రభులిం. II. పు. 45); శాస్త్రముల కగపడువాఁడు గాఁడు (ప్రభులిం. పు. 49);నను బోఁటివారికెన్నటి కగ్గమగును (ప్రభులిం. II. పు. 87); నన్నుఁ బనిచిపనిగొనుము (వరాహ. VII. 90); పనివినె=పోయెను (వరాహ. VI. 77); మీమామలు వుత్తెంచినం బనివింటిని= ఆజ్ఞననుసరించితిని (వరాహ. V. 25); మెలఁపుకొనుండు = మెలఁగించుకొనుండు (ప్రభులిం. పు. 105); నీవుగుణశీలురఁ దెచ్చెదునుమ్మ = తేవలదు; ఉత్తరాంధ్రము 'తెచ్చేవు నుమా' విష్ణుపు. IV. 112); తోలివఁగలము = తోలియఁ గలము (వరాహ. IV. 75); మోవలేను = మోయలేను (వరాహ. VIII. 57); వినుపింతు (కవిక. I. 76) పిలుపించెన్ (కళా. II. 22); చూచెదుగాని = చూతువుగాని (ప్రభా. III. 134); ఏమి పనికినై తలంచితివి=ఎందుకు (వరాహ. V. 40). ఏమి గార్యంబుఁ దలంచి విచ్చేసితిరి (వరాహ. V. 40, ఎందుకు). పవరించె = పవ్వళించె (వరాహ. III. 157); వెఱపించుకొనదె=తన్నుజూచి భయపడునట్లు చేయదా (-వరాహ. VI. 31); వెదకం బోవలదయ్యె (కవిక. II. 100); రాయనేర్తురె (ఉ. హరి. I.7); ఎఱసె; ఏఁపె (ఉ. హరి. I. 8); చాలెన్ (ఉ. హరి. I. 14, సమర్థుఁడయ్యెను); చాలవేన్ = సమర్థుఁడవు కాకపోతే (ఉ. హరి. I. 17); తిరుగఁబడఁ జొచ్చె = మఱలఁ జొచ్చెను (ఉ. హరి. I. 19) (నేఁటి వాడుక=ఎదిరించు); సంకుల సమరంబు చెల్లు సమయంబున (ఉ. హరి. I. 27); ఎఱుంగరాదు(కాశీ. II. 43); కూడదంతఃపూజ గురుకృపలేక = చేకూరదు (ప్రభులిం. పు. 137).

ఈ క్రింది రూపములు మధ్యయుగమునాఁటనుండియు వచ్చుచున్నవి:-

ఈ రక్కసు నెట్లుసేసెదనో చూడుండు (హరి. పూ. VIII. 192); నిజ పాపంబ కాదు, ఉభయ వంశముల పాపములుఁ బోఁగొట్టునది (కళా. IV. 138). చూ. నేఁటివ్యవహారము 'ఒక్క నిన్నే కాదు, ఈ లోకములో నెవ్వనినైనఁ గెలువఁగలను; ఇచట'కాదు' న కన్వయమేమి ? తెలిసికొనుము (ఉ. హరి. I. 10) పూర్వాంధ్రము 'ఎఱిఁగికొనుము') వారువీరనక యందఱు (కళా. I. 126. 'అనక' కన్వయమేమి ?); అందితో=అందితివ్రూ (కళా. I. 143); గయ్యాళించు (కళా. III. 223); కాఁబోలు=పూర్వాంధ్రము 'కావలయు' (కళా. IV. 186); నగిపించెన్ (కళా. V. 60); ఇవ్వనిత నీకేమియగును (కళా. V. 114); పోల్చ

(కళా. I. 194, అకర్మకక్రియ); పోయెంబో (కళా. II. 79); చూడఁబట్టెదె (హరి. పూ. VIII. పు. 208); పొందుము విజయంబు (వరాహ. III. 27-పూర్వాంధ్రము 'విజయంబునం బొందుము'); నిండించె (వరాహ. II. 168-పూర్వాంధ్రము 'నించె'); వేసికొంటి (వరాహ. VIII. 25); నేఁడెల్ల వెళ్లఁ బడుదుము (వరాహ. VII. 35); తిరిగినచ్చినది = మఱలివచ్చినది (వరాహ. V. 167); అడ్డవెట్టరాదు (వరాహ. II. 15, పూర్వాంధ్రము 'అడ్డవెట్టఁ గాదు = సాధ్యముకాదు); దాఁటరాదు = దాఁట సాధ్యముకాదు (వరాహ. IV. 123; పూర్వాంధ్రము, దాఁటఁగాదు); కావంబోలును (మను. III. 47. పూర్వాంధ్రము, కాచెంగావలయు); ఏను దుర్వ్యసనంబున మృగయా విహారంబునకుఁ గడంగినదిలేదు (శకుం. పరి. II. పు. 26); నా కీపుస్తకములు అక్కఱలేదు; ఈ కుండ నాలుగుకుంచాలు పట్టుతుంది. ఈ పని నాలుగురోజులు పడుతుంది; ఇట్టి ప్రయోగములు శకుంతలాపరిణయమునఁ గలవు;—మల్లెను తుమ్మెద (సత్య. కృ. సం. I. పు. 27); మోసెన్ (పాండు. III. 21-పూర్వాంధ్రము 'మోచెన్'); మొల్వాదు (పాండు. V. 193); సూర్యుఁ డెండఁగాయును, చంద్రుఁడు వెన్నెలఁగాయును (విష్ణుపు. III. 94-'కాయు' సకర్మకముగా ప్రయోగము); వెన్నెలల్ గాయఁదొడంగె (కవిక. III. 100-అకర్మకప్రయోగము); ఎల్లుండికిని బ్రాణములు గానిపింతున్ (విష్ణుపు. VII. 117 - 'కొను' ధాతువునకుఁ బ్రేరణార్థకరూపము); వర్షములు వెలిచె (కవిక. II. 60 మాండలికము); ధీశాలికాక కాదు (నమీ. VII. 14); మీవంటి దాంపత్యంబు మాకుఁ గలుగ వరంబు దయసేయుండు=మీ దాంపత్యము వంటిది (వరాహ. III. 108); తల్లురు (కళా. II. 101).

'అగు' ధాతువు.

పూర్వాంధ్రమున 'కాక' అని ప్రయోగించుచోట్ల నుత్తరాంధ్రమున 'కాని' అనుపదము వాడుకలోనికి వచ్చినది. ఉత్తరాంధ్రకవులు 'కాక', 'కాని' అను రెండురూపములను దమగ్రంథములందు వాడిరి.

అంజెదవుగాక (ఉ. హరి. I. 75); చేసెఁగావలయుఁగాక (ప్రభా. III. 160); ఎక్కుడేకాక (కళా. I. 179); మాటలాడింతముగాక (కళా. V. 7); నీవారిని నీవు సన్నుతి గావింపవుగాని (ఉ. రా. పు. 97); ఇనుక మొన్న వచ్చుఁగాని మాయలీలలెఱుఁగరాదు (వరాహ. VII. 54); ఇతండకాని (కళా. II. 74); వెంగళరాయఁ డెంతరణవీరుఁడో కాని (రంగారా. III. 206); మ్రొక్కెదఁగాని (దశావ. పు. 155); నిలుచునో యేమోకాని (కళా. I. 157); ఏగతినిబట్టతలలు మోకాళ్లు ముళ్లువెట్టఁగలదో కాని (కళా. IV. 75); లేఁజిగురుకెప్పుడొకజిగిలేదుగాని (శుకచ. పు. 8,84); పలుకంగఁదగునెవే

మైతఁగాని (శంక. విజ. పు. 19); ఎవ్వఁడో కాని వీఁడు (విష్ణుపు. III. 285); మీా రారగింతురుగాని (పాండు. IV. 158); నీచరిత్రంబు వినికాని మోహంబు విడువరాదు (వరాహ. V. 68); చూచుకొందము గాని (భోజరా. IV. 185).

పూర్వాంధ్రమున 'కూడని' యనునర్థమున 'కాని'యని యనుచుండిరి; నేటి వాడుకలో 'రాని' అని యున్నది.

తలఁపఁగాని తలంపు = తలఁపరాని (హరవి. IV. 56).

కావున, కాన, అను పదములు 'అగు' ధాతువునుంచి కలిగినవని యందురు. కాని, యెట్లు కలిగినవో తెలియదు. 'కృత్వా' అను సంస్కృత క్రియారూపము ప్రాకృతమున 'కాఊణ'అని యగును. అది తెనుఁగు నందలి 'కావున' వలెనే యుపయోగింపఁబడును. ప్రాకృతములోని 'కాఊణ' పదమే తెనుఁగున 'కావున' అను రూపమునఁ బ్రవేశించినదేమో. అదియే 'కాన' అను రూపమును బొందియుండును. వీనిలో 'కావున' ద్రుతప్రకృతికముగాను కళగానుగూడ నుపయోగింపఁబడుచున్నది. 'కాన' పూర్వాంధ్రమున కళ. 'కావునన్' ద్రుతాంతము గావునఁ 'గాన'ను గూడ దాని సామ్యమున ద్రుతాంతముగానే యర్వాచీనకవులు వాడిరి.

కావున (కళ) (కళా; I. 194; II. 63). కాన (కళ) (నిర్వ; IV. 42. పాండు. II. 228; IV. 96); - కానన్ (ద్రుతాంతము) (వరాహ. II. 146.) కానం జక్రాంకితమునఁ గార్యము గలదే (శంక. విజ. పు. 13).

'అగు' బంధుత్వమును గూడఁ దెలుపును: అయినవారి కాకులలోను, కానివారికి కంచాలలోను; అతడు నీ కే మవుతాడు; వనితా ! వారు నీకేమి కావలయు ?

. అయినన్ - అయినా: ఇవి ముందు చెప్పినదానికి విరుద్ధముగా చెప్పఁబోవుదానిని సూచించును.

'అగు', 'అవు', 'అవును' - ఇవి యంగీకారార్థములుగూడ నగును. వీనిపై 'ర, రా' లు చేర్చిన నాశ్చర్యమును దెలుపును.

అవుఁగాక - ఇది చెప్పినదాని నంగీకరించుచు, దానికిఁగల యాక్షేపణ మును సూచించును. 'కానిమ్ము' అను నర్థమునను దీనికి వాడుక కలదు.

'కా' అనునది 'కాదా' అను నర్థమున గ్రంథములం దున్నది.

"అవుగా ! మీా రిట మున్ను గన్గొననితావు - ల్లేవుగా" (విజయ.) ఇది నేడు మాండలికముగ వాడుకలో నున్నవి.

'కదా' అనురూపము 'కావా' లోని తొలిస్వరమునకు హ్రస్వము కలుగుట వలనఁ గలిగినది.

'కాకేమి' అనునది పూర్వాంధ్రమున 'అయ్యెంగాకేమి', 'చేసెంగాకేమి' అను రీతిని సంపూర్ణక్రియలమీఁదనే ప్రయోగములందుఁ గానవచ్చుచున్నది. నేఁడు దానిని వ్యస్తముగా వాడుచున్నాము. 'ఎందుకుకాదు, అగుటలో సందేహమే మున్నది?' అని యర్థము.

కావున, కాన లకు నేఁటి వ్యవహారమున 'కాఁబట్టి' అని యున్నది. 'కాఁబోలు' అనుదానికి పూర్వాంధ్రమున 'అగుఁబోలు' ననియు రూప ముండెను. 'పోలు' ధాతు వితర ధాతువులమీఁదను బూర్వాంధ్రమునఁ జేరుచుండెను. చేయంబోలు, కొట్టంబోలు మొద. నేఁ డిట్టి వ్యవహారము లేదు.

కావుట, కావుత, కాత, కదరె మున్నగు 'నగు' ధాతుజములగు రూపములు నేఁటి వ్యవహారమునుండి లోపించినవి.

నేఁటి వ్యవహారమున 'కదరా' అనునది మహద్వాచకముల మీఁదను, 'కదే, కాదే' అనునవి మహతీవాచకముల మీఁదను వచ్చును. 'కదవే', 'పదవే' అనురూపములును మహత్యర్థమున వాడుకలో నున్నవి. "వస్తాను పదవే, వడ్డించమనవే."

---